## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఎంపిక చేసిన
# మహాత్మాగాంధీ రచనలు

## సంపుటము - 1
## సత్యశోధన లేక ఆత్మకథ

సంపాదకులు

**శ్రీమన్నారాయణ్**



నవజీవన్ పబ్లిషింగ్ హౌస్
అహమదాబాద్ - 380 014

# ముందుమాట

సత్యాహింసలు మూర్తీభవించి ప్రభవించిన వ్యక్తిగా విశ్వమంతటా ఖ్యాతినొందిన మహాత్మాగాంధీ శతజయంతి ఈ అక్టోబరు, రెండవ (2-వ) తేదీనాడు జరుపుకుంటున్నాం. గాంధీజీ శాంతియుతంగా, ఒక బొట్టు నెత్తురు ఎక్కడా చిందకుండా పోరాడి పరాయి పరిపాలనను అంతమొందించిన జాతీయవీరుడు మాత్రమే కాక, విశ్వమంతటా మానవ సంబంధాలను, అంతర్జాతీయ సహకారాన్ని వ్యాపింపచేసేందుకు శాశ్వత సూత్రాల్ని ప్రవచించిన ధీరుడు. ఉన్నత ఆదర్శాలను పాటించి, ఫలితం పొందేందుకు అనుసరించవలసిన మార్గాలకు ఎక్కువ ప్రాధాన్యత ఉందని చాటి చెప్పారు. "ఫలితం వృక్షమైతే, సాధనామార్గం విత్తు. విత్తుకూ వృక్షా నికి ఉన్న సంబంధమే, సాధనా మార్గానికి, సాధ్య ఫలితానికీ ఉంది."[1]

దేశ "స్వరాజ్య" సిద్ధికొరకై, మహాత్ముడు, తన సిద్ధాంతాల పట్టును వదలలేదు. సత్యపథమే "చివరికి అతిదగ్గర దారి" అయినా చాల దూరంగా ఉన్నట్లు అనిపిస్తుంది. అని గాఢంగా[2] నమ్మారు మహాత్మాగాంధీ.

ఆయన దృష్టిలో నాగరికతకు సరియైన అర్థం "స్వేచ్ఛగా కోరికలను తగ్గించుకోడమే - వాటిని పెంపు చేసుకొనుట కాదు"[3] "సామాన్య జీవితం, ఉన్నత భావన" అనే ఆదర్శమే ఆయనకు సమ్మతం. కోట్లాది అన్నార్తులకు నిర్మాణాత్మకమైన కార్యక్రమాలతో ఉపాధి కల్పన గురించి ఆయన నొక్కి వక్కాణిస్తూ, ప్రజానీకం యొక్క జీవన స్థాయిని నైతికరంగంతో సహా పెంచడం యింకా ముఖ్యమని ఎప్పుడూ చెప్పేవారు. ఆయన దృష్టిలో "ధనమూ, దానివల్ల అనుభవంలోకి వచ్చే ప్రాపంచిక సుఖాలు కేవలం "ముళ్లమార్గమై", సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అవినీతికి దారితీస్తాయి." "నిజమైన ఆర్థిక ప్రగతి, అత్యున్నతమైన నైతికతకు ఎప్పుడూ విరోధి కాదు." అనేవారు గాంధీజీ. "బలహీనులను ఎరపెట్టి బలవంతులను పెంచే ధన దాహం సరియైన ఆర్థిక శాస్త్రం కాదు. అది అసత్యం - కుహనాయుతం" అభివృద్ధి చెందిన దేశాలు "ధన మద దుఃఖ జీవనంతో సతమతమవుతున్న రోజుల్లో, క్రొత్త ప్రపంచ నిర్మాణానికి పిలుపునిచ్చి, ఉన్నత ప్రమాణాలే దీనికి దగ్గర దారి అని ఎలుగెత్తి చెప్పడం ఆయన ప్రత్యేకత. లండన్ "న్యూస్టేట్స్‌మన్" పత్రిక సంపాదకీయంలో - "రొట్టెతో మాత్రమే కాదు" - అంటూ, "ప్రపంచంలో నైతిక మార్గాన్ని అనుసరించే దేశాలు ఆకలితో కొట్టుమిట్టాడుతూ

---

1 హింద్ స్వరాజ్ - నవజీవన్ - 1962, పుట 71

2. అమృతబజారు పత్రిక, 17-9-33

3 యరవాడ మందిరం, నవజీవన్ 1957, పుట 24

ఉండవచ్చు. అయినా అక్కడి నిర్ణయాలు నీతిబద్ధమైనవి. సరియైన సత్యమైన పద్ధతులను అనుసరించేవి - ఏదో తాత్కాలికమైన, నేతి బీర వంటి వృద్ధి కొరకు ఉద్దేశించినవి కావు"[4] అని వ్రాశారు.

గాంధీజీ ఆధునిక సాంకేతిక విజ్ఞాన మార్గాలను ఏదో ఆధ్యాత్మిక అభిరుచి వల్ల వ్యతిరేకిస్తారు అనే ఊహ శుద్ధ తప్పు. "ప్రతి సాంకేతిక అన్వేషణను అందరికీ ఉపయోగించాలి. చేయవలసిన పని పెద్దది - చేసేవారు తక్కువగా ఉన్నారు - ఆ సందర్భంలో యాంత్రిక సౌలభ్యానికి స్వాగతం. కాని భారతదేశంలో వలె, ఆ పనికి మించిన పని వారు ఉన్నప్పుడు, అది తగినది కాదు"[5] అని అంటారు గాంధీజీ. కనుక యాంత్రికీకరణకు గాంధీజీ వ్యతిరేకులు కారు. కాని యంత్రాల యెడల "ఉన్మాద ప్రేమ" ను "విచక్షణా రహితమైన యంత్రవృద్ధి" ని ఆయన ఒప్పుకోరు. "లెక్కకు మించిన ఉత్పత్తికి" బదులు లెక్కకు మించిన శ్రామికుల ద్వారా ఉత్పత్తిని" గాంధీజీ కోరుకుంటారు. భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశంలో, పెట్టుబడి తక్కువ, అనంతమైన శ్రామికశక్తి ఉన్న సందర్భంలో, ప్రజాస్వామ్య పద్ధతుల్లో శ్రామికుల శక్తిని నిర్మాణాత్మకంగా వృద్ధి చేయడం సాధ్యం అంటారు ఆయన. దీనినే ఇంకోమాటగా "మెగా (బృహత్) యంత్రం" అన్నారు ప్రొఫెసర్ మంఫర్డ్.[6]

వస్తూత్పత్తి ప్రగతి, దాని ఫలితంగా సంభవించే మదమత్త సత్తా ఒక చీకటిదారి. పద్మవ్యూహం. ఆధునిక పారిశ్రామిక వ్యవస్థ బలిసిన వాణిజ్య సంస్థలకు జన్మనిచ్చి, దేశాన్ని ప్రొఫెసర్ గాల్‌బ్రైత్ మాటల్లో "నిపుణులు, ప్రణేతలు, సాంకేతిక నిపుణులు ఉన్న ఒక సాంకేతిక భూత బంగ్లా" ను సృష్టిస్తుంది. ఇటువంటి పారిశ్రామిక వ్యవస్థలోని దుష్టశక్తిని నిరోధించేందుకు, అమెరికన్ ఆర్థికవేత్తలు "ఇతర ధ్యేయాల ఉద్ఘోషణ" ను గురించి నొక్కి చెప్పి. ఇందువలన క్రొత్త పారిశ్రామిక దేశం "సమాజానికి అవసరమైన విస్తృత విషయాలకు స్పందిస్తుంది అంటారు.[7] ఈ ధ్యేయాలు గాంధీజీ ప్రవచించిన ఆదర్శ కార్యక్రమాలకు అనుగుణంగా ఉంటాయి కూడా.

మహాత్మాగాంధీ. మన దేశంలోనూ. విశ్వవ్యాప్తంగానూ ఉన్నటువంటి "అదృష్టహీనుల" ఎడల శ్రద్ధ చూపిస్తారు. సర్వోదయ సమాజంలో అందరూ పైకి రావాలి అంటూనే. ప్రప్రథమ ప్రయత్నం బడుగు వర్గాల ఉద్ధరణ అంటారు. "అన్ టూ

---

4. న్యూ స్టేట్స్‌మన్, లండన్ 31-5-1968

5. హరిజన్, 16-11-1934

6. "ది న్యూ ఇండస్ట్రియల్ స్టేట్" ప్రొఫెసర్ జె.కె. గాల్‌బ్రైత్, 1967, పు. 399

7. "ది న్యూ ఇండస్ట్రియల్ స్టేట్" ప్రొఫెసర్ జె.కె. గాల్‌బ్రైత్, 1967 పు. 399

దిస్ లాస్ట్" అనే గ్రంథంలో రస్కిన్ మహాశయుడి సిద్ధాంతం ఆయన జీవితమంతటా ప్రయోగాలు, ప్రయత్నాలు సామాజిక ఉద్ధరణ మొదలైనవాటికి ఎంతో స్ఫూర్తినిచ్చింది. ఈ సర్వోదయ మార్గమే వలస రాజ్యతత్త్వానికి, వర్ణభేద భావనకి వ్యతిరేకంగా ఆయన జీవన పోరాటం చేసేటట్లు చేసింది. "నీ ఆత్మశక్తి తగ్గి, సందేహం కలిగినప్పుడు, ఆ దరిద్ర నారాయణుడి దీనవదనం గుర్తుకు తెచ్చుకొని, నీవు చేసే పని అతడికి ఏవిధంగా పనికి వస్తుంది? అని ప్రశ్నించుకో. ఈ పరీక్షతో నీ సంశయాలన్నీ మంచులా విడిపోతాయి" అన్నారు గాంధీజీ. [8]

ప్రజాస్వామ్య వ్యవస్థపై గాంధీజీకి ప్రగాఢ విశ్వాసం. అహింస, స్వేచ్ఛాయుత సహకారం వల్లనే నిజమైన ప్రజాస్వామ్యం ఏర్పడుతుందనే వారు ప్రజాస్వామ్యం బయటినుంచి చొప్పించడం సాధ్యం కాదు. అది అంతరంగంలోంచి మాత్రమే రావాలి అంటారు గాంధీజీ. [9] అంతర్జాతీయ వ్యవహారాల్లో 'పరస్పర గౌరవం, నిజాయితీ' అనే పునాదుల మీద నిర్మితమైన "విశ్వ సమాఖ్య" ను గురించి ఆయన కలలు కన్నారు. భారతదేశ స్వాతంత్ర్యం పునరుత్థానం కోసం నిరంతరం శ్రమిస్తూ కూడా, "ఏకదేశ పరిమిత స్వాతంత్ర్యం" అంటే అయిష్టంగా ఉండేది ఆయనకు. తమ ప్రత్యేకత నిలుపుకుంటూనే ప్రతీదేశం, ఇతర దేశం యొక్క మంచి గుణాలను ఆకళింపు చేసు కోవాలి అంటారు గాంధీజీ. ఆయన ఆదర్శసూక్తం ఇది. నా ఇంటికి నలువైపులా గోడలు కట్టడం గాని, నాకిటికీలు మూసి ఉంచడం గాని నాకు సమ్మతం కాదు. స్వచ్ఛందంగా అన్ని దేశాల సంస్కృతులు నా ఇంటిలో ప్రసరిస్తూ ఉండాలి. అయితే, ఏ శక్తీ, నా కాళ్ళమీద దృఢంగా నిలిచిన నన్ను చలింప చేయడం, నేను అంగీకరించను. [10]

జీవన పర్యంతం, మానవ ప్రగతికి, ఆ ప్రగతికి తీసుకుపోయే మార్గదర్శక సూత్రాల ప్రవచనానికి, ప్రయోగానికి శ్రమించిన ఆ మహనీయుని శతజయంతిని ఆదర్శయుతంగా జరపడం అవసరం. పండిత నెహ్రూ మాటలలో (అనన్య ప్రస్తుతిలో) "ఇన్ని సంవత్సరాలు ఈ దేశాన్ని కాంతిమయం గావించి, ముమ్ముందు వేలాది ఏండ్లు తన ఉజ్జ్వల దీధితులతో, విశ్వాన్ని ప్రకాశవంతం జేస్తూ లెక్కకు అందని మానవ హృదయాల బాధలకు సేద చేకూర్చగలిగిన ఈ జ్యోతి - ఈ క్షణానికి చెందినది మాత్రమే కాక, సర్వకాల సర్వావస్థలకు సంబంధించిన శాశ్వత జీవత్సూత్రాలను ప్రవచిస్తూ, తప్పుదారి నుంచి మనలను మళ్ళిస్తూ, సరియైన దారిలో పోయేందుకు

---

8. మహాత్మాగాంధీ - ది లాస్ట్ ఫేజ్, సంపుటం 2, ప్యారేలాల్ 1958, పుట 65

9. ది హిస్టరీ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, డా పి. సీతారామయ్య 1935, పుట 982

10. యంగ్ ఇండియా, 1-6-1921

విశ్వమానవ సంతతికి మార్గదర్శకమై ఉంటుంది. డా॥ ఆల్బర్ట్ ఐన్‌స్టైయిన్ ఉద్వేగభరితంగా అన్న మాటలు ఇవి; ముందుతరాల వారు ఇటువంటి మహనీయుడు, భౌతిక శరీరంతో ఈ భూమిని పావనం చేశాడు - అనుమాట విశ్వసిస్తారో - లేదో - అట్టివాడు ఆ మహాత్ముడు".

అర్ధ శతాబ్ది క్రితం, మహాత్మాగాంధీ స్థాపించిన నవజీవన ట్రస్టు వారు గాంధీ జయంత్యుత్సవాలలో భాగంగా, ఆరు సంపుటాలలో "ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలు" ప్రచురించ నిర్ణయించారు. భారతదేశ ప్రజానీకానికి, విశ్వవ్యాప్త మానవాళికి "సత్యం, కారుణ్యం" శాశ్వతత్వాన్ని తిరిగి ఒకసారి ప్రబోధింపజేయడమే ఈ ప్రచురణల ధ్యేయం. ఈ సంపుటాల ప్రధాన సంపాదకుడుగా నేను - విశ్వమంతా ఉపయుక్తమయ్యే శాశ్వత విలువలతో ప్రోది చేసిన మహాత్ముని రచనల అంశాలను ఏర్చి కూర్చడానికి యథాశక్తి ప్రయత్నం చేశాను. మొదటి రెండు సంపుటాలలో "సత్యాన్వేషణకై, నా ప్రయోగాల కథ" అనే పేరుతో ప్రసిద్ధమైన గాంధీ ఆత్మకథ మూడవ దానిలో "దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం" నాల్గవ సంపుటంలో గాంధీజీ మూలసిద్ధాంత రచనలు "నైతికమతం" "ఈ చివరికి" "హింద్ స్వరాజ్" "యరవాడ మందిరం నుంచి" "నిర్మాణాత్మక కార్యక్రమాలు" "ఆరోగ్యదీపిక" అనే రచనలనూ అయిదవ సంపుటంలో వివిధములైన ప్రధాన విషయాలపై గాంధీజీ అభిప్రాయాలనూ, చారిత్రిక ఉత్సుకతను పెంపొందించే గాంధీజీ ఉత్తరాలనూ-

ఆరవ సంపుటంలో ఆధ్యాత్మికత, మతం, సంస్కృతి, ఆర్థిక ప్రయోగాలు, రాజకీయాలు, సామాజిక సంబంధాలు, విద్య మొదలైన వాటిపై గాంధీజీకి గల గట్టి నమ్మకాలనూ క్రోడీకరించి సంపుటీకరించాను. ఎంపిక చేసిన ఈ రచనలు - జీవితంలో వివిధ విషయాలపై గాంధీ అభిప్రాయాలను తెలియగోరిన వారికి ఉపయుక్తంగా ఉంటాయని ఆశిస్తున్నాను.

ఈ సందర్భంగా, ఈ సంపుటాలను దేశ, విదేశాల పాఠకులకు అందించే అవకాశం నాకు కలిగించిన నవజీవన ట్రస్టు వారికి నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాల కూర్పులో నాకు సహకరించిన శ్రీ హెచ్. ఎమ్. వ్యాస్ గార్కి, డా. రమ్ మోడి గార్కి నా అభినందనలు తెలియజేస్తున్నాను.

రాజ్‌భవన్
అహమదాబాదు
ఆగస్టు 15, 1968 శ్రీమన్నారాయణ్

# ప్రకాశకుల విజ్ఞప్తి

*మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంలో వారు స్థాపించిన నవజీవన ట్రస్టు పక్షాన వారి ఆత్మకథను భారతీయ భాషలన్నిటి పక్షాన వారి ఆత్మకథను భారతీయ భాషలన్నిటిలోను ప్రచురించాలని నిర్ణయించాం. ఆ ప్రకారం శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి తెలుగులోనికి అనువదించిన మహాత్ముని ఆత్మకథను ప్రచురించాం. తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించారు. ఇప్పటికీ 40,000 ప్రతులు కొని చదివి మమ్ము ప్రోత్సహించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ న్యాయ నిర్ణేతలు మహాత్ముని ఆత్మకథ తెలుగు సేతను 1995 వ సంవత్సరం ఉత్తమ తెలుగు అనువాదంగా నిర్ణయించి 5000/- రూపాయల పురస్కారం యిచ్చి శ్రీ రాధాకృష్ణమూర్తిని సత్కరించడం ముదావహం. గాంధీజీ ఆత్మకథను భారతీయ భాషలన్నింటిలోను ప్రచురించాం.*

మహాత్ముని ఆత్మకథ యెడ భారతదేశ ప్రజల ఆదరాభిమానాలు చూచి నవజీవన ట్రస్టు మరో ప్రణాళికను చేపట్టింది. మహాత్ముడు రచించిన రచనలో నుంచి విషయాన్ని బట్టి కొన్నింటిని ఎంపికచేసి సంపుటముల సెట్టు రూపంలో ప్రచురించి. తక్కువ ధరకు దేశ ప్రజలకు అందజేయాలనునదే ఆ ప్రణాళిక. ప్రప్రథమంగా ఇంగ్లీషు భాషలో నవజీవనట్రస్టు పక్షాన ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలను ఆరు సంపుటముల సెట్టుగా ప్రచురించాము. ఆ గ్రంథాలు అపరిమితంగా ప్రజల ఆదరణను చూరగొనడం వల్ల పెద్ద సంఖ్యలో అనేకసార్లు ప్రచురించి ప్రజానీకానికి అందజేశాము. భారతీయ భాషల్లో కూడా ఈ ప్రణాళికను అమలుపరచుటకు నిర్ణయించి గత సంవత్సరం మళయాళం భాషలో అయిదు సంపుటముల సెట్టుగా ప్రచురించి కేరళ ప్రదేశ్ ప్రజల మన్ననలు పొందామని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఇప్పుడు తెలుగులో 5 సంపుటాల సెట్టును నవజీవన ట్రస్టు పక్షాన సబ్సిడీ రేటుకు ప్రచురిస్తున్నాము. మహాత్మాగాంధీ సిద్ధాంతాల యెడ మక్కువ చూపే తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము. ఈ అయిదు సంపుటాలను తెలుగులో ప్రచురించుటకు అయ్యే ఆర్థిక వ్యయాన్ని పూర్తిగా నవజీవన ట్రస్టు, అహమదాబాద్ భరిస్తున్నది. ట్రస్టుకు సంబంధించిన యితర శాఖల ఆదాయాన్ని

యీ ప్రణాళికను వినియోగించి తక్కువ ధరకు యీ సంపుటాల సెట్టును తెలుగు ప్రజలకు అందజేస్తున్నాము. యీ ప్రణాళికను తెలుగులో అమలుబరచుటకు శ్రీ బిరిధీచంద్ చౌధరి, శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారలు సంపూర్తిగా సహకరిస్తున్నారు. వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాం. అనువాదం, టైపుసెట్టింగ్, ప్రూపురీడింగ్, కెమెరా ప్రతులు తయారు చేయించు కృషికి శ్రీ బిరిధీ చంద్ చౌధరి సహకరించారు. యీ సంపుటముల తెలుగుసేతతోబాటు, యితర పెద్దలు చేసిన తెలుగు అనువాదాన్ని, ప్రూపుల్ని సరిచూచి శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి సహకరించారు.

ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనల అయిదు సంపుటముల సెట్టు ప్రచురణకు సంబంధించిన మా యీ ప్రణాళికను ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు హర్షించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము.

| | |
|---|---|
| ది. 28-10-98 | **జితేంద్ర టి. దేశాయి** |
| అహమదాబాద్ | మేనేజింగ్ ట్రస్టీ |

# సత్యశోధన లేక ఆత్మకథ

సంపుటము - 1

మూలం

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ

తెలుగు సేత

వేమూరి రాధాకృష్ణమూర్తి

# విషయసూచి



## మొదటిభాగం

## రెండవ భాగం

## మూడవభాగం

## నాల్గవభాగం

## ఐదవభాగం

★ ★ ★

# ప్రస్తావన

నాలుగు లేక అయిదు సంవత్సరాల క్రితం తోటి అనుచరుల పట్టుదల వల్ల నేను ఆత్మకథ వ్రాయుటకు అంగీకరించాను. వ్రాయటం ప్రారంభించి ఒక ఫుల్ స్కేప్ పేజీ పూర్తి చేశానో లేదో ఇంతలో బొంబాయిలో రగడ ప్రారంభమైంది. దానితో నా ఆత్మకథ ఆగిపోయింది. తరువాత పనుల్లో నిమగ్నమయ్యాను. చివరికి యరవాడ జైల్లో నాకు సమయం దొరికింది. జయదాస్‌రామ్ భాయి కూడా అక్కడ వున్నారు. మిగతా పనులన్నీ ఆపి ఆత్మకథ పూర్తి చేయమని ఆయన నన్ను కోరారు. అప్పటికే నా నిత్యకార్యక్రమాలు నిర్ణయమైపోయాయి. అట్టి స్థితిలో ఆత్మకథ వ్రాయడం కుదరదని చెప్పాను. అయితే శిక్షాకాలం పూర్తి అయ్యేంతవరకు యరవాడ జైల్లో వుండే అవకాశం లభిస్తే మాత్రం ఆత్మకథ వ్రాయవచ్చని అనుకున్నాను. అందుకు యింకా ఒక సంవత్సరం మిగిలివుంది. అంతకు పూర్వం ప్రారంభించిన ఆత్మకథ ముందుకు సాగలేదు. ఆరంభించగానే ఆగిపోయింది. ఇప్పుడు స్వామి ఆనంద్ ఆత్మకథ వ్రాయడం తిరిగి ప్రారంభించమని కోరారు. ఈలోపున నేను దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర పూర్తిచేశాను. అందువల్ల యిక ఆత్మకథ ప్రారంభించవచ్చునని భావించాను. నేను ఆత్మకథను త్వరగా వ్రాసి గ్రంథరూపంలో ప్రకటించాలని స్వామీ ఆనంద్ కోరిక. అయితే త్వరగా వ్రాయడానికి అవసరమైన సమయం నా వద్ద లేదు. అందుకు ఒకటే మార్గం. నవజీవన్ పత్రికకు ఏదో కొంత వ్రాయక తప్పడం లేదు. అట్టి స్థితిలో నవజీవన్ కోసం ఆత్మకథనే వ్రాయవచ్చు కదా అని అభిప్రాయపడ్డాను. స్వామిఆనంద్ నా అభిప్రాయాన్ని అంగీకరించారు ఇక ఆత్మకథ వ్రాయడం ప్రారంభించాను.

ఆనాడు సోమవారం. నాకు మౌనదినం. ఒక మంచి మనస్సుగల అనుచరుడు నా దగ్గరకు వచ్చాడు 'మీరు ఆత్మకథ వ్రాయాలని ఎందుకు అనుకుంటున్నారు? యిది పాశ్చాత్య విధానం. ప్రాచ్యదేశాల్లో ఎవరూ ఆత్మకథ వ్రాసినట్లు కనబడదు. అయినా మీరు ఏం వ్రాస్తారు? ఈనాడు మీరు అంగీకరిస్తున్న సిద్ధాంతాన్ని రేపు అంగీకరించక పోవచ్చుకదా! ఇవాళ మీరు చేస్తున్న పనుల్లో రేపు మార్పు చేయాల్సి వస్తే? మీ రచనను ప్రామాణికమని భావించి కొందరు తమ ఆచరణను రూపొందించుకొంటారు గదా! వాళ్ళు తప్పుదోవనపడితే? అందువల్ల మీరు ఆత్మకథ వ్రాయకుండా వుండటం మంచిదేమో కొంచెం ఆలోచించండి' అని అన్నాడు.

అతని మాటలు నా మనస్సుమీద కొంత పనిచేశాయి. ఈ విషయమై బాగా యోచించాను. నేను ఆత్మ చరిత్ర వ్రాయాలని అనుకోలేదు. అయితే అనేక సమయాల్లో ఎన్నో సత్యప్రయోగాలు చేశాను. ఆ ప్రయోగాల్ని ఆత్మచరిత్రగా రూపొందించాలని మాత్రం అనుకున్నాను. నా జీవితం అట్టి ప్రయోగాలతో నిండివుంది. వాటన్నింటిని లిపిబద్ధం చేస్తే అది ఒక జీవన చరిత్ర అవుతుంది. అందలి ప్రతిపుట సత్యప్రయోగాలతో నిండి వుంటే నా యీ చరిత్ర నిర్దుష్టమైనదని భావించవచ్చు. నేను చేసిన సత్యప్రయోగాలన్నింటిని ప్రజల ముందుంచగలిగితే ఎంతో ప్రయోజనం చేకూరుతుంది. ఇది నాకు కలిగిన మోహమే కావచ్చు. నేను రాజకీయరంగంలో చేసిన ప్రయోగాలు భారతదేశానికి తెలుసు. నా దృష్టిలో వాటివిలువ స్వల్పమే. ఈ ప్రయోగాల వల్లనే నాకు "మహాత్మ" అను బిరుదు వచ్చింది. నా దృష్టిలో ఆ బిరుదుకు గల విలువ స్వల్పమే. ఆ బిరుదువల్ల అనేక పర్యాయాలు నాకు విచారం కూడా కలిగింది. ఆ బిరుదును తలుచుకొని ఉబ్బితబ్బిబ్బు అయిన క్షణం నా జీవితంలో ఒక్కటి కూడా వున్నట్లు గుర్తులేదు రాజకీయరంగంలో నాకు శక్తి చేకూర్చిన, నాకు మాత్రమే తెలిసిన నా అధ్యాత్మిక ప్రయోగాలను యితరులకు కూడా తెలపడం నాకు యిష్టం. అవి నిజంగా ఆధ్యాత్మికాలైతే అందు గర్వానికి తావులేదు. పెరిగితే వినమ్రతే పెరగవచ్చు. నాగతజీవితాన్ని పరిశీలించి చూస్తే అందునాకు లఘుత్వమే గోచరిస్తుంది.

గత ముప్పది సంవత్సరాలనుండి జీవితంలో నేను చేసిన కార్యాలన్నీ ఆత్మదర్శనం కోసమే. ఈశ్వర సాక్షాత్కారం కోసమే. మోక్షం కోసమే. నా రచనా వ్యాసాంగమంతా అందుకోసమే. రాజకీయరంగంలో నా ప్రవేశం కూడా అందు కోసమే. ఒకరికి శక్యమైంది అందరికీ శక్యం కాగలదనే నా విశ్వాసం. అందువల్ల నా ప్రయోగాలు నా వరకే సీమితం కావు. కానేరవు. ఆ ప్రయోగాలను అందరికీ తెలిపినందువల్ల వాటి ఆధ్యాత్మికత తగ్గుతుందని నాకు అనిపించడంలేదు. అయితే ఆత్మకే తెలిసినట్టి, ఆత్మలోనే శాంతించునట్టి విషయాలు కొన్ని వుంటాయి. అట్టి విషయాలను వివరించడం నా శక్తికి మించినపని. నా ప్రయోగాలు ఆధ్యాత్మికాలు, అనగా నైతికాలు. ధర్మం అంటే నీతి. ఆత్మదృష్టితో పిన్నలు, పెద్దలు, యువకులు, వృద్ధులు నిర్ధారించగల విషయాలు ఈ కథలో వుంటాయి. ఈ నా కథను తటస్థుడనై, అభిమానరహితుడనై వ్రాయగలిగితే సత్యాన్వేషణా మార్గాన పయనించి ప్రయోగాలుచేసేవారందరికీ కొంత సామగ్రి లభిస్తుందని నా విశ్వాసం.

నా ప్రయోగాలు పూర్ణత్వం పొందాయని నేను సమర్థించుకోవడం లేదు. వైజ్ఞానికుడు బుద్ధి కుశలతతో యోచించి పరిశోధనలు చేస్తాడు. అయితే వాటి ఫలితాలే చివరివని భావించడు. వాటమీద నమ్మకం ఏర్పడినా తాను మాత్రం తటస్థంగా వుంటాడు. నా ప్రయోగాలు కూడా అటువంటివే. నేను ఆత్మనిరీక్షణకూడా చేసుకున్నాను. ప్రతి విషయాన్ని పరీక్షించి చూచాను విశ్లేషించి చూచాను. వాటి పరిణామాలే అందరికీ అంగీకారయోగ్యాలని, అవే సరియైనవని నేను ఎన్నడూ చెప్పదలచలేదు. అయితే యివి నా దృష్టిలో సరియైనవని, యీనాటికీ యివి చివరివని మాత్రం చెప్పగలను. అలా విశ్వసించకపోతే వీటి పునాదిమీద ఏవిధమైన భవనం నిర్మించలేము. చూచిన వస్తువులను అడుగడుగునా పరిశీలించి ఇవి త్యాజ్యాలు, ఇవి గ్రాహ్యాలు అని రెండు రకాలుగా విభజిస్తాను. గ్రాహ్యాలనుబట్టి నా ఆచరణను మలుచుకుంటాను ఆ విధంగా మలుచుకున్న ఆచరణ ఎప్పటివరకు నాకు, నా బుద్ధికి, నా ఆత్మకు తృప్తి, సంతోషం కలిగిస్తూవుంటుందో అంతవరకు దాని శుభపరిణామాలను విశ్వసిస్తూవుంటాను.

కేవలం సిద్ధాంతాలను అనగా తత్వాలను గురించిన వర్ణనే ముఖ్యమని భావిస్తే ఈ ఆత్మకథ వ్రాయవలసిన అవసరం లేదు. కాని ఆప్రయోగాలపై చేసిన కృషిని పేర్కొనాలి. అందువల్లనే నేను నా యీ కృషికి ప్రథమంగా సత్యశోధన అని పేరు పెట్టాను. ఇందు సత్యానికి భిన్నమని భావించబడే అహింస, బ్రహ్మచర్యం మొదలుగాగలవాటిని గురించిన ప్రయోగాలు కూడా చోటుచేసు కున్నాయి. అయితే నా అభిప్రాయం ప్రకారం సత్యమే అన్నింటిలోను గొప్పది. అందు పలువిషయాలు నిహితమై వుంటాయి. ఈ సత్యం స్థూలంగా వుండే వాక్సత్యం కాదు. ఇది వాక్కుకు సంబంధించినదేగాక భావానికి సంబంధించిన సత్యం కూడా. ఇది కల్పిత సత్యంగాక సుస్థిరత కలిగిన స్వతంత్రమైన ఆస్తిత్వంగల సత్యం అంటే సాక్షాత్ పరబ్రహ్మమన్నమాట.

పరమేశ్వరునికి వ్యాఖ్యలు అనేకం. గొప్పతనాలుకూడా అనేకం. ఆ గొప్పతనాలు నన్ను ఆశ్చర్యపరుస్తాయి. కొద్దిసేపు నన్ను మోహింపచేస్తాయి. నేను సత్యస్వరూపుడగు పరమేశ్వరుని పూజారిని. అతడొక్కడే సత్యం. మిగిలిందంతా మిధ్యయే. ఆ శోధన కోసం నాకు ఎంతో ప్రీతికరమైన వస్తువును సైతం త్యజించివేయుటకు నేను సిద్ధమే. ఈ శోధనాయజ్ఞంలో శరీరాన్ని సైతం హోమం చేయడానికి నేను సిద్ధమే. అట్టి శక్తి నాకు కలదనే నమ్మకం వున్నది. ఆసత్యసాక్షాత్కారం కలుగనంతవరకు నాఅంతరాత్మదేన్ని

సత్యమని నమ్ముతుందో ఆకాల్పనిక సత్యాన్ని ఆధారం చేసుకొని, దాన్ని దీపంగా భావించి దాని ఆశ్రయంలో జీవితం గడుపుతాను. నిజానికి ఇది కత్తిమీద సాము వంటిది. అయినా నాకు సులువు అనిపించింది. ఈ మార్గాన నడుస్తున్నప్పుడు భయంకరమైన పొరపాట్లు కూడా నాకు తుచ్ఛమైనవిగా కనబడతాయి. అట్టి పొరపాట్లు చేసికూడా రక్షణ పొందాను. నాకు తెలిసినంతవరకు ముందుకేసాగాను. విశుద్ధ సత్యపు వెలుగురేఖ దూరాన లీలగా కనబడుతూ వుంది.

ఈ జగత్తులో సత్యం దప్ప మరొకటి ఏమీ లేదనునమ్మకం రోజురోజుకు నాలో పెరుగుతూవున్నది. ఎలా పెరుగుతూవున్నదో నా ప్రపంచపు అనగా నవజీవన్ మొదలుగాగల పత్రికల పాఠకులు తెలుసుకొని యిష్టమైతే నా ప్రయోగాలలో భాగస్వాములు అవుదురుగాక. అంతేగాక నాకు శక్యమైన వస్తువు ఒక బాలునికి సైతం శక్యం కాగలదని నా నమ్మకం. అందుకు బలవత్తరమైన కారణాలు అనేకం వున్నాయి. సత్య శోధనకు సంబంధించిన సాధనాలు ఎంత కఠినమైనవో అంతసరళమైనవికూడా. అవి అహంకారికి అశక్యాలు, కాని కల్లాకపటం ఎరుగని బాలునికి శక్యాలు. సత్యాన్వేషకుడు ధూళికణం కంటే చిన్నగా వుండాలి. ప్రపంచంఅంతా ధూళికణాన్ని కాలిక్రింద త్రొక్కి వేస్తుంది. అయితే సత్యాన్వేషకుడు ధూళికణం కూడా త్రొక్కి వేయలేనంత సూక్ష్మంగా వుండాలి. అప్పుడే అతనికి సత్యం లీలగా గోచరిస్తుంది. ఈ విషయం విశిష్ఠ విశ్వామిత్రులకథలో స్పష్టంగా చెప్పబడింది. క్రైస్తవ, ఇస్లాంమతాలుకూడా ఈ విషయాన్ని బలపరుస్తున్నాయి.

నేను వ్రాస్తున్న ప్రకరణాల్లో పాఠకులకు అహంభావపు వాసన తగిలితే నా అన్వేషణలో ఏదో పెద్ద పొరపాటు వున్నదనీ నేను కనుగొంటున్ను వెలుగు రేఖ ఎండమావియేనని గ్రహించాలి. నా వంటి పలువురు శోధకులు మ్రగ్గిపోయినా సత్యం మాత్రం సదా జయించాలి. అల్పమైన ఆత్మను కొలుచుటకు సత్యమనే కొలబద్ద ఎన్నటికీ తరిగిపోకూడదు. నా ప్రకరణాలను ప్రామాణికమని భావించవద్దని అందరినీ ప్రార్థిస్తున్నాను. నేను పేర్కొన్న ప్రయోగాలను దృష్టాంతాలుగా భావించి అంతా తమతమ ప్రయోగాలు శక్త్యానుసారం, తమకు తోచిన విధంగా చేయాలని కోరుతున్నాను. నా ఆత్మకథవల్ల ఏదో కొంత ప్రజలకు లభించగలదని విశ్వసిస్తున్నాను. ప్రకటించుటకు అనుకూలమైన ఏ ఒక్క విషయాన్ని కూడా నేను దాచలేదని మనవి చేస్తున్నాను. నా దోషాలన్నింటిని పూర్తిగా పాఠకులముందు వుంచానని విశ్వసిస్తున్నాను. సత్యపు

ప్రయోగాలను వివరించడమే నా లక్ష్యం. నా గుణగణాలను వర్ణించుకోవాలనే కోరిక నాకు తిలమాత్రమైనా లేదు. ఏ కొలబద్దతో నన్ను నేను కొలుచుకోవాలని భావిస్తున్నానో, ఏ కొలబద్దను మనమంతా ఉపయోగించవలసిన అవసరం వున్నదని నమ్ముతున్నానో ఆ కొలబద్ధ ప్రకారం క్రింది సూక్తిని ఉటంకిస్తున్నాను.

మో సమ్ కౌన్ కుటిల్ ఖల్ కామీ?

జిన్ తన్ దియో తాహి బిసరాయో

ఐసో సమక్ హరామీ. (సూరదాసు)

(నావంటి కుటిలుడు, ఖలుడు, కాముకుడు మరొకడెవ్వడుగలడు? ఏ ప్రభువు ఈ తనువును యిచ్చాడో అతనినే మరిచాను. నేను అంతటి కృతఘ్నుణ్ణి) నేను ఎవరిని నా శ్వాసోచ్ఛ్వాసలకు ప్రభువని భావిస్తున్నానో, ఎవరి ఉప్పు తిని బ్రతుకుతున్నానో, ఆ ప్రభువుకు యింకా దూరంగా వున్నాననే బాధ ప్రతిక్షణం నన్ను వేధిస్తూవున్నది. అందుకు కారణాలైన నాయందలి వికారాలను చూడగలుగుతూవున్నానే కాని ఇంకా తొలగించుకోలేకపోతున్నాను.

ఇక ముగిస్తున్నాను. ప్రస్తావనయందు సత్యశోధనలకథ లో ప్రవేశించను. ఆ కథంతా ముందు ప్రకరణాల్లో వివరిస్తాను.

ఆశ్రమం, సబర్మతి

ది. 26 నవంబరు 1925 మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ

# మొదటి భాగం

## 1. జననం

గాంధీ కుటుంబం వారు మొదట పచారు దినుసులు అమ్ముకునేవారని ప్రతీతి. కాని మా తాతగారి పూర్వపు ముగ్గురు పురుషులు కాఠియావాడ్‌కు చెందిన కొన్ని సంస్థానాల్లో మంత్రులుగా పని చేశారు మా తాతగారి పేరు ఉత్తమచంద్ గాంధీ. ఆయనకు ఓతాగాంధీ అని మరో పేరు కూడా ఉండేది. ఆయన గట్టి నియమ పాలకుడని ప్రతీతి. తత్ఫలితంగా కొన్ని రాజకీయ కుట్రలకు గురై పోరుబందరు దివాన్‌గిరీ విడిచిపెట్టి జునాగఢ్ అను సంస్థానాన్ని ఆశ్రయించవలసి వచ్చింది. అక్కడ ఆయన నవాబుకు ఎడమ చేత్తో సలాం చేశాడట. యీ అవిధేయతకు కారణం ఏమిటని ప్రశ్నించగా కుడిచేయి యిదివరకే పోరుబందరుకు అర్పితమై పోయిందని సమాధానం యిచ్చాడట.

భార్య చనిపోగా ఓతాగాంధీ రెండో పెండ్లి చేసుకున్నాడు. మొదటి భార్యకు నలుగురు కొడుకులు, రెండవ భార్యకు యిద్దరు కొడుకులు పుట్టారు. ఓతాగాంధీ కొడుకులంతా ఏక గర్భ సంజాతులు కారని బాల్యంలో నాకు తెలియదు. ఆ విషయం యితరుల వల్ల బాల్యంలో తెలుసుకున్నానని కూడా చెప్పలేను ఆ ఆరుగురు అన్నదమ్ముల్లో అయిదవవాడు కరంచంద్ గాంధీ. ఆయనకు కబాగాంధీ అని మరో పేరు కూడా వున్నది. ఆరవవాడు తులసీదాసు గాంధీ యీ అన్నదమ్ములిద్దరూ ఒకరి తరువాత ఒకరు పోరుబందరుకు దివానులుగా పనిచేశారు. కబాగాంధీ మా తండ్రి. పోరుబందరు ప్రధానామాత్య పదవిని త్యజించిన తరువాత ఆయన స్థానిక కోర్టులో సభ్యుడుగా పనిచేశారు తరువాత రాజకోట దివానుగాను, ఆ తరువాత బికానేరుకు దివానుగాను పనిచేశారు. యావజ్జీవితం రాజకోట సంస్థానంలో పింఛను పుచ్చుకున్నారు.

కబాగాంధీకి నాలుగు పెళ్ళిళ్ళు జరిగాయి. మొదటి భార్యకు, రెండో భార్యకు యిద్దరు కూతుళ్ళు పుట్టారు. నాలుగో భార్య పుత్తలీబాయి. ఆమెకు ఒక కుమార్తె, ముగ్గురు కుమారులు పుట్టారు. వారిలో నేను చివరివాణ్ణి. నా తండ్రి కులాభిమాని, సత్యప్రియుడు, శూరుడు, ఉదారుడు. కాని కోపిష్టి. కొంచెం విషయలోలుడని చెప్పవచ్చు. ఎందుకంటే నలభై ఏళ్ళు గడిచాక నాలుగో పెళ్ళి చేసుకున్నారు కదా! ఆయన లంచగొండికాదనీ, ఇంటాబయటా కూడా పక్షపాతం లేకుండా వ్యవహరించే న్యాయశీలి అని ఖ్యాతి గడించారు. ఆయన సంస్థానాభిమానం సర్వవిదితం. ఆయన

ప్రభువగు రాజకోటరాజును అసిస్టెంట్ పొలిటికల్ ఏజెంటు ఒకనాడు తూలనాడే సరికి కబాగాంధీ ఆయన్ని ఎదిరించాడు. ఆ ఏజెంటుకు కోపం వచ్చింది. పొరపాటు చేశానని ఒప్పుకొని శరణువేడితే క్షమిస్తానని అన్నాడు. కాని కబాగాంధీ అందుకు అంగీకరించలేదు. తత్ఫలితంగా ఆయన్ని కొన్ని గంటలపాటు నిర్బంధించి ఉంచారు. అయినా ఆయన భయపడలేదు. ఆ తరువాత ఆయనను విడిచిపెట్టారు.

మా తండ్రికి డబ్బు నిల్వ చేద్దామనే తలంపు లేదు. అందువల్లనే మాకు బహు తక్కువ ఆస్థి మిగిలింది. మా తండ్రి చదివింది అయిదవ తరగతి వరకే. చరిత్ర భూగోళం ఆయన ఎరగడు. కాని ఆయన గొప్ప అనుభవజ్ఞుడు. వ్యవహారజ్ఞానంలో దిట్ట. చిక్కు సమస్యల్ని తేలికగా పరిష్కరించడంలో మేటి. కనుకనే వేలాదిమంది జనాన్ని పరిపాలించగల సామర్థ్యం ఆయన గడించాడు. మత సంబంధమైన వాదాలు వినడం వల్ల చాలా మంది హిందువుల వలెనే ఆయనకు ధర్మ పరిజ్ఞానం కలిగింది మా కుటుంబానికి ఆప్తుడైన ఒక బ్రాహ్మణునిచే ప్రేరణ పొంది చివరి రోజుల్లో గీతా పారాయణం ప్రారంభించారు. ప్రతిరోజూ శ్లోకాలు పఠిస్తూ వుండేవారు.

మా అమ్మ పరమసాధ్వి. ఆ విషయం బాల్యం నుంచే నా హృదయంలో నాటుకుంది ఆమెకు దైవచింతన అధికం. ప్రతిరోజు పూజ చేయకుండా భోజనం చేసేది కాదు. వైష్ణవ దేవాలయం వెళ్లి రావడం ఆమె నిత్య కార్యక్రమం. ఆమె చాతుర్మాస్య వ్రతం (వర్ష రుతువునందు నాలుగు మాసాలు ఒక పూట భోజనం చేయు వ్రతం) మానడం నేను ఎన్నడూ చూడలేదు. ఎన్నో కఠినమైన నోములు నోచి వాటిని నిర్విఘ్నంగా నెరవేరుస్తూవుండేది. జబ్బు చేసినప్పుడు దానిని సాకుగా తీసుకొని నోములు మానడం ఎరుగదు. ఒక పర్యాయం ఆమె చాంద్రాయణం చంద్రుని పెరుగుదలను బట్టి భోజన పరిమాణం పెంచడం, తగ్గించడం అనువ్రతం ప్రారంభించి మధ్యలో జబ్బు పడింది. జబ్బు ఏమాత్రం తగ్గలేదని నాకు గుర్తు. రెండు మూడు రోజుల ఉపవాసమంటే ఆమెకు లెక్కలేదు. చాతుర్మాస్య వ్రతపురోజుల్లో ఒక పూట మాత్రమే భుజించడం ఆమెకు అలవాటు. అంతటితో ఆగక ఒక పర్యాయం చాతుర్మాస్య వ్రతం పట్టి ఒక రోజు ఉపవాసం ప్రారంభించింది. మరొక పర్యాయం చాతుర్మాస్య వ్రతం పట్టి రోజు విడిచి రోజు ఉపవాసం ప్రారంభించింది. మరొక పర్యాయం చాతుర్మాస్య వ్రతం పట్టి సూర్యుని చూచిగాని భోజనం చేయనని నిర్ణయించుకుంది. ఆ రోజుల్లో సూర్యదర్శనం అయిందని మా అమ్మకు చెప్పేందుకై పిల్లలమంతా సూర్యుని కోసం నిరీక్షిస్తూ డాబా మీద నిలబడి హఠాత్తుగా సూర్యుడు

కనిపించినప్పుడు గబగబా మా అమ్మ దగ్గరికి పరిగెత్తుకుని వెళ్ళి "అమ్మా, అమ్మా! సూర్యుడు వచ్చాడు" అని చెప్పిన రోజులూ నాకు గుర్తు వున్నాయి. సూర్య దర్శనం కోసం ఆమె పరుగు పరుగున బయటకు వచ్చేది. అంతలో మాయదారి సూర్యుడు మబ్బుల చాటున దాక్కునేవాడు. "ఇవాళ నేను భోజనం చేయడం ఈశ్వరునికి యిష్టం లేదు కాబోలు" అని అంటూ ఆమె సంతోషంగా వెళ్ళి ఇంటి పనుల్లో లీనమైపోయేది.

మా అమ్మకు వ్యవహారజ్ఞానం అధికం. సంస్థానానికి సంబంధించిన విషయాలు ఆమెకు బాగా తెలుసు. రాణివాసంలో గల స్త్రీలు మా అమ్మ తెలివితేటల్ని మెచ్చుకునేవారు. బాల్యం తెచ్చిన వెసులుబాటును ఉపయోగించుకుని నేను కూడా మా అమ్మ వెంట తరచు రాణివాసానికి వెళుతూ వుండేవాణ్ణి. రాజమాతకు, మా అమ్మకు మధ్య జరుగుతూ వుండే సరస సంభాషణలు ఇప్పటికీ నాకు గుర్తువున్నాయి. కబాగాంధీ పుత్తలీబాయి దంపతులకు సుదామాపురి అను పోరుబందరులో 1869 అక్టోబరు 2వ తేదీన (శుక్ల సంవత్సరం భాద్రపద బహుళ ద్వాదశి శనివారం) నేను జన్మించాను. పోరుబందర్‌లో నా శైశవం గడిచింది. నన్ను బడిలో చేర్చడం నాకు గుర్తు ఉంది. ఎక్కాలు వల్లించాలంటే నాకు ఇబ్బందిగా వుండేది. అప్పుడు తోటి పిల్లలతో బాటు మా పంతుల్ని తిట్టడం తప్ప నేను నేర్చిందేమీ గుర్తులేక పోవడాన్ని తలచుకుంటే నా బుద్ధి మందమైనదనీ, నాకు జ్ఞాపకశక్తి తక్కువనీ స్పష్టంగా చెప్పవచ్చు. పిల్లలమంతా అప్పడం పాట పాడేవాళ్ళం. ఆ పాటను ఇక్కడ ఉటంకిస్తున్నాను.

ఒకటే ఒకటి అప్పడం ఒకటి
అప్పడం పచ్చి .... కొట్టో కొట్టు ....

మొదటి ఖాళీ చోట పంతులు పేరు, రెండవ ఖాళీ చోట తిట్టు వుండేవి. వాటిని వ్రాయను.

## 2. బాల్యం

నా తండ్రి పోరుబందరు వదిలి ప్రభుత్వం వారి స్థానిక కోర్టు సభ్యునిగా రాజకోటకు వెళ్ళినప్పుడు నాకు ఏడేండ్ల వయస్సు. నన్ను అక్కడ ఒక ప్రైమరీ స్కూల్లో చేర్చారు. అక్కడ నాకు చదువు చెప్పిన ఉపాధ్యాయుల పేర్లు, ఇతర విషయాలు నాకు గుర్తు వున్నాయి. పోరుబందరు వలె ఇక్కడ కూడా నా చదువును గురించి వ్రాయవలసిన విషయాలేమీ లేవు. నేను ఒక సామాన్య విద్యార్థిగా వున్నాను. ఈ స్కూలు నుండి సబర్బను స్కూల్లోను, అక్కడ నుండి హైస్కూల్లోను చేరాను. అప్పటికి నాకు పన్నెండేళ్ళు. ఈ కాలంలో అటు ఉపాధ్యాయులతో కాని, ఇటు తోటి విద్యార్థులతో

కాని అబద్ధాలాడిన గుర్తు లేదు. నాకు సిగ్గు ఎక్కువ. అందువల్ల సమాజాన్ని తప్పించుకు తిరిగేవాణ్ణి. నా పుస్తకాలు, నా పాఠాలు, నా జతగాళ్ళు, వేళకు బడికి పోవడం, బడి మూసివేయగానే పరిగెత్తుకుని ఇంటికి చేరడం ఇదే నా నిత్య కార్యక్రమం. నిజంగా నేను పరిగెత్తేవాణ్ణి. ఇతరులతో మాట్లాడటం అంటే కష్టంగా వుండేది. ఎవరన్నా ఎగతాళి చేస్తారేమో అని భయంగా వుండేది. హైస్కూల్లో చేరిన మొదటి సంవత్సరం పరీక్షా సమయమప్పుడు జరిగిన ఒక విషయం వ్రాయడం అవసరం. విద్యాశాఖకు చెందిన జైయిల్స్ అను పేరుగల ఒక ఇన్‌స్పెక్టరు మా స్కూలుకు ఇన్‌స్పెక్షన్‌కై వచ్చాడు. అతడు మా పిల్లల అక్షరజ్ఞానాన్ని పరీక్షించేందుకై ఐదు శబ్దాలు ఇచ్చాడు. వాటిల్లో కేటిల్ (Kettle) అను శబ్దం ఒకటి. నేను దాన్ని తప్పుగా వ్రాశాను. ఇది గమనించి ఉపాధ్యాయుడు తన బూటుకాలుతో నొక్కి తప్పు దిద్దుకోమన్నట్లు సైగ చేశాడు. కాని నేను దిద్దలేదు. ఎదురుగా వున్న పిల్లవాడి పలక చూచి తప్పుదిద్దుకోమని సైగ చేశాడు. కాని నేను దిద్దలేదు. ఎదురుగా వున్న పిల్లవాడి పలక చూచి తప్పు దిద్దుకోమని మాష్టారు సైగ చేస్తున్నారన్న విషయం తెలుసుకోలేక పోయాను. ఒకరి పలక మరొకరు చూచి వ్రాయకుండా వుండేందుకే మాష్టారు అక్కడ వున్నారని నా భావం. మిగతా పిల్లలంతా వ్రాసిన ఐదు శబ్దాలు సరిగా వున్నాయి. నేను ఒక్కణ్ణే మాత్రం దద్దమ్మనైనాను. తరువాత మాస్టారు నా మూర్ఖత్వాన్ని నాకు తెలియజేశారు. కాని ఆయన మాటలు నా మీద పని చేయలేదు. ఇతరుల్ని చూచి వ్రాయడం నేను ఎప్పుడూ నేర్చుకోలేకపోయాను. అయితే ఈ ఘట్టం ఉపాధ్యాయుని పట్ల నాకు గల వినయాన్ని ఏమాత్రం తగ్గించలేదు. పెద్దల దోషాల్ని చూచి కళ్ళు మూసుకోవడం నా స్వభావం. తరువాత కూడా ఆ ఉపాధ్యాయుణ్ణి గురించిన దోషాలు నా దృష్టికి వచ్చాయి. కాని ఆయన ఎడ నాకు వినయం తగ్గలేదు. నేను పెద్దల ఆజ్ఞ పాలించడమే నేర్చాను గాని వారి పనుల్ని గురించి తర్కించడం నేర్చుకోలేదు. అప్పటి మరో రెండు విషయాలు నా మనస్సుకు హత్తుకుని వుండిపోయాయి. బడి పుస్తకాలు తప్ప యితర పుస్తకాలు చదువుదామనే కోరిక నాకు వుండేది కాదు. రోజువారి పాఠాలు చదవాలి గదా! ఉపాధ్యాయుణ్ణి మోసగించడమంటే నాకు యిష్టం వుండేదికాదు. ఆయనచే మాట పడడం నాకు యిష్టం లేక పాఠాలు బాగా వల్లించేవాణ్ణి. అయితే నా మనస్సు మాత్రం పాఠాల మీద నిలిచేది కాదు. యీ విధంగా నా పాఠాలే నాకు సరిగా రానప్పుడు పుస్తకాలు చదవడం సాధ్యమా ? ఒకసారి మా తండ్రిగారు కొని తెచ్చిన ఒక పుస్తకం నా కంటపడింది. అది శ్రవణ పితృభక్తి నాటకం. శ్రద్ధగా ఆ పుస్తకం చదివాను. ఆ

రోజుల్లో చెక్కల బాక్సుకు అమర్చిన అద్దంలో చిత్రాలు చూపిస్తూ కొందరు ఇంటింటికి తిరుగుతూ వుండేవారు. వాళ్ళు చూపించిన చిత్రాల్లో అంధులగు తన తల్లిదండ్రుల్ని కావడిలో కూర్చోబెట్టుకొని యాత్రకు వారిని మోసుకుపోతున్న శ్రవణుని బొమ్మ నా హృదయం మీద చెరగని ముద్ర వేసింది. అతణ్ణి లక్ష్యంగా పెట్టుకున్నాను. శ్రవణుడు చనిపోయినప్పుడు అతని తల్లిదండ్రుల కరుణవిలాపం యిప్పటికీ నాకు జ్ఞాపకం వున్నది. ఆ లలిత గీతం నన్ను ద్రవింప చేసింది. నా తండ్రిగారు కొని ఇచ్చిన వాద్యం మీద ఆ గీతాన్ని ఆలపించాను కూడా. అప్పుడే ఒక నాటక కంపెనీ అక్కడికి వచ్చింది. వాళ్ళ నాటకం చూచేందుకు నాకు అనుమతి లభించింది. అది హరిశ్చంద్ర నాటకం. ఆ నాటకం నాకు బాగా నచ్చింది. కాని ఎక్కువ సార్లు ఎవరు చూడనిస్తారు! అయినా నా మనస్సులో ఆ నాటకం ప్రదర్శితం అవుతూ వుండేది. కలలో హరిశ్చంద్రుడు కనపడుతూ వుండేవాడు అందరూ సత్య హరిశ్చంద్రులు ఎందుకు కాకూడదు అని అనుకునేవాణ్ణి. హరిశ్చంద్రుడు పడ్డ కష్టాలు తలచుకుని ఎన్ని ఆపదలు వచ్చినా అంతా సత్యం పలకవలసిందేనని అనుకునేవాణ్ణి. నాటకంలో హరిశ్చంద్రుడు అనుభవించిన కష్టాలన్నీ యదార్థమైనవేనని అనుకొని, హరిశ్చంద్రుని దుఃఖం చూచి, దాన్ని జ్ఞాపకం పెట్టుకుని నేను బాగా ఏడ్చేవాణ్ణి. అతడు ఐతిహాసిక పురుషుడు కాడని యిప్పటికీ నాకు అనిపిస్తుంది. నా హృదయంలో యిప్పటికీ శ్రవణుడు, హరిశ్చంద్రుడు జీవించే వున్నారు. ఆ నాటకం చదివితే యిప్పటికీ నా కండ్లు చమరిస్తాయనే నా నమ్మకం.

## 3. బాల్య వివాహం

ఈ ప్రకరణం వ్రాయకుండా వుండటం నా కెంతో యిష్టం. కాని కథాక్రమంలో యిట్టి చేదు మాత్రలు ఎన్నో మింగవలసి వచ్చింది సత్యపూజారిని కదా! వేరే మార్గం లేదు. వ్రాయక తప్పదు సుమారు పదమూడోయేట నాకు పెండ్లి అయింది. యీ విషయాలు గ్రంథస్థం చేయవలసి వచ్చినందుకు విచారంగా వుంది. అయినా విధి అని భావించి వ్రాస్తున్నాను. నా రక్షణలో వున్న పన్నెండు లేక పదమూడు ఏండ్ల బాలబాలికల్ని చూస్తూ వుంటే నా పెండ్లి సంగతి జ్ఞాపకం వచ్చి నా మీద నాకే జాలికలుగుతూ వుంటుంది. నాకు పట్టిన దౌర్భాగ్యం వాళ్ళకు పట్టలేదు. కనుక వాళ్ళను అభినందించాలని వుంటుంది. పదమూడేళ్ళ వయస్సులో జరిగిన నా పెళ్ళిని సమర్థించుకునేందుకు నైతిక కారణం ఒక్కటి కూడా లేదు.

ప్రధానం గురించి వ్రాస్తున్నానని పాఠకులు గ్రహించాలి. కాఠియావాడ్‌లో

వివాహమంటే ప్రధానం కాదు. ఇద్దరు బాలబాలికలకు పెండ్లి జరపాలని వాళ్ళ తల్లిదండ్రులు చేసుకునే నిర్ణయాన్ని లేక ఒడంబడికను ప్రధానం అని అంటారు. ప్రధానం అనుల్లంఘనీయం కాదు ప్రధానం అయిన తరువాత పెండ్లికి పూర్వం పిల్లవాడు చనిపోతే ఆ బాలిక వితంతువైపోదు. ప్రధానానికి సంబంధించినంతవరకు వరుడికి, వధువుకి మధ్య సంబంధం ఉండదు. అసలు తమకిరువురికీ ప్రధానం జరిగిందను విషయం కూడా వాళ్ళకు తెలియదు. ఈ విధమైన ప్రధానాలు నాకు వరుసగా మూడు జరిగాయని విన్నాను. అవి ఎప్పుడు జరిగాయో నాకు తెలియదు ప్రధానం జరిగిన తరువాత ఇద్దరు కన్యలు చనిపోయారని నాకు చెప్పారు. మూడో ప్రధానం ఏడేండ్ల వయస్సులో జరిగినట్లు నాకు గుర్తు అయితే ప్రధానం జరిగినప్పుడు నాకు ఎవరైనా ఏమైనా చెప్పారో లేదో గుర్తులేదు. పెండ్లి జరిగినప్పుడు వరుడు, వధువు అవసరం అవుతారు కొన్ని విధులు వారు నిర్వర్తించవలసి వుంటుంది. అట్టి వివాహాన్ని గురించే వ్రాస్తున్నాను. నా పెండ్లికి సంబంధించిన కొన్ని వివరాలు నాకు గుర్తు వున్నాయి.

మేము ముగ్గురం అన్నదమ్ములమని పాఠకులకు గతంలో తెలియజేశాను. మాలో అందరికంటే పెద్దవాడికి పెండ్లి అయిపోయింది. రెండవవాడు నా కంటే రెండు మూడు సంవత్సరాలు పెద్ద. అతడికీ, వయస్సులో నా కంటే ఒకటి లేక ఒకటిన్నర సంవత్సరం పెద్దవాడైన మా పినతండ్రి చివరికొడుక్కి నాకు ముగ్గురికీ ఒకేసారి పెండ్లి జరపాలని పెద్దలు నిర్ణయించారు. ఈ విషయంలో మా మేలును ఎవ్వరూ ఆలోచించలేదు. మా యిష్టాయిష్టాలను గురించి యోచించే అవకాశమే లేదు. పెద్దవాళ్ళు తమ సౌకర్యం గురించి, పెండ్లి ఖర్చులు తగ్గించడాన్ని గురించి మాత్రమే యోచించారు.

హిందూ సమాజంలో వివాహమంటే సామాన్య విషయం కాదు. వరుడు, వధువుల తల్లిదండ్రులు ఆర్థికంగా తరచు కూలిపోతూ వుంటారు. డబ్బును, సమయాన్ని వ్యర్థం చేస్తారు. పెరిడ్లి ఏర్పాట్లు ఎన్నో నెలల ముందునుంచే ప్రారంభిస్తారు. నూతన వస్త్రాలు, ఆభరణాలు సమకూరుస్తారు. విందులు వినోదాలు ఏర్పాటు చేస్తారు. పిండి వంటల విషయంలో పోటాపోటీలు ప్రారంభమవుతాయి. కంఠం సరిగా వున్నా లేకపోయినా లెక్క చేయకుండా స్త్రీలు పాటలు పాడి పాడి గొంతు పోగొట్టుకుంటారు. జబ్బు కూడా పడతారు. ఇరుగుపొరుగువాళ్ళ శాంతికి భంగం కలిగిస్తారు. అయితే ఇరుగుపొరుగువాళ్ళు కూడా తమ ఇళ్ళలో శుభకార్యాలు జరిగినప్పుడు ఇలాగే చేస్తారు.

అందువల్ల గందరగోళం జరిగినా, ఎంగిలిమంగలం అయినా, మురికి పేర్కొన్నా పట్టించుకోరు. సహించి వూరుకుంటారు. ఇంత గొడవ, గందరగోళం మూడుసార్లు జరిపేకంటే ఒక్క పర్యాయమే జరిపితే సౌకర్యం కదా! డబ్బు ఖర్చు తగ్గినా దర్జాకు లోటు వుండదు. మూడు వివాహాలు ఒకే పర్యాయం జరపడం వల్ల డబ్బు విచ్చలవిడిగా ఖర్చు చేయవచ్చు. మా తండ్రి, పినతండ్రి ఇద్దరూ వృద్ధులు. మేము వారి చివరి బిడ్డలం. అందువల్ల మా వివాహాలను పురస్కరించుకొని హాయిగా ఆనందించి తమ వాంఛల్ని నెరవేర్చుకోవాలని వారు అనుకోవడం సహజం. ఈ విషయాలన్నిటినీ దృష్టిలో పెట్టుకుని ముగ్గురి వివాహాలు ఒకేసారి చేయాలనే నిర్ణయానికి మా పెద్దలు వచ్చారు. ఇంతకు ముందు వివరించినట్లు కొన్ని మాసాల ముందునుంచే ఏర్పాట్లు ప్రారంభమైనాయి

వాటిని చూచి మా వివాహాలు జరుగుతాయను విషయం ముగ్గురు సోదరులం తెలుసుకున్నాం. క్రొత్త బట్టలు ధరించడం, మేళతాళాలు మ్రోగడం గుర్రం మీద ఎక్కడం, రకరకాల పిండివంటలు తినటం, ఆటలకు, వినోదాలకు ఒక క్రొత్త పిల్ల దొరకడం ఇవి తప్ప మరోరకమైన వాంఛ మాకు వున్నట్లు నాకు గుర్తులేదు భోగవిలాసాన్ని గురించిన భావం తరువాత కలిగింది. ఎలా కలిగిందో సవివరంగా తరువాత చెబుతాను. కాని అట్టి జిజ్ఞాస పాఠకులు తగ్గించుకొందురు గాక. నాకు కలిగిన బిడియాన్ని కొంతవరకు దాచుకుంటాను. చెప్పదగిన కొన్ని విషయాలు చెబుతాను. అయితే ఆ వివరాలు వ్రాస్తున్నప్పుడు నా అభిప్రాయాన్ని గమనిస్తే అందు విషయవాసనలు తక్కువేనని తేలుతుంది.

మా అన్నదమ్ములిద్దరినీ రాజకోట నుంచి పోరుబందరు తీసుకువెళ్ళారు. అక్కడ మా ఒంటికి నూనె రాశారు. పసుపు మొదలుగా గలవి పూశారు. నలుగు పెట్టారు. మనోరంజకంగా వున్నా అవి వదిలివేయదగినవి. మా తండ్రి దివాను అయినప్పటికీ నౌకరే గదా! రాజుగారికి విశ్వాసపాత్రుడు. అందువల్ల మరింత పరాధీనుడన్నమాట. చివరి నిమిషం వరకు రాజుగారు మా తండ్రికి వెళ్ళడానికి అనుమతి నీయలేదు. రెండు రోజుల తరువాత అనుమతించారు. మా ప్రయాణానికి ప్రత్యేక ఏర్పాట్లు చేశారు. కాని విధి నిర్ణయం మరో విధంగా వుంది. రాజకోట పోరుబందరుకు మధ్య 60 క్రోసుల దూరం. ఎడ్లబండి మీద అయిదురోజుల ప్రయాణం. రాజుగారు గుర్రపు బగ్గి ఏర్పాటు చేశారు. అందువల్ల ప్రయాణం మూడురోజుల్లో ముగుస్తుంది. కాని చివరి మజిలీ దగ్గర గుర్రం బగ్గీ బోర్లపడిపోయింది.

మా నాన్నగారికి గట్టి దెబ్బలు తగిలాయి. చేతులకు కట్లు, వీపుకు కట్లు కట్టించుకుని పోరుబందరు చేరారు. దానితో పెండ్లి ఆనందం సగం తగ్గిపోయింది. అయినా వివాహాలు జరిగాయి. పెండ్లి ముహూర్తాన్ని ఆపడం ఎవరితరం? నేను పెండ్లి సంతోషంలో మా తండ్రిగారికి తగిలిన దెబ్బల దుఃఖం మరిచిపోయాను. చిన్నతనం కదా! నేను పితృభక్తికలవాణ్ణి. దానితోపాటు విషయవాంఛలకు కూడా భక్తుణ్ణి అయ్యాను. విషయాలంటే ఇంద్రియాలకు సంబంధించినవని కూడా గ్రహించాలి. తల్లిదండ్రుల యెడ గల భక్తికోసం సర్వమూ త్యజించాలను జ్ఞానం తరువాత నాకు కలిగింది. నా భోగాభిలాషకు దండన విధించడం కోసమేనేమో అప్పుడు ఒక ఘట్టం జరిగింది. అప్పటినుండి ఆ ఘట్టం నన్ను బాధిస్తూనే వుంది. ఆ వివరం ముందు తెలుపుతాను. నిష్కులానందుడు చెప్పిన "త్యాగ్ న టకేరే వైరాగవినా, కరీయే కోటి ఉపాయ్‌జీ" "కోటి ఉపాయాలు పన్నినా, విషయవాంఛల యెడ వైరాగ్యం కలుగనిచో త్యాగభావం అలవడదు సుమా" అను గీతం చదివినప్పుడు ఆ గీతం ఎవరైనా చదువగా విన్నప్పుడు కటువైన ఆ ఘట్టం చప్పున జ్ఞాపకం వచ్చి నన్ను సిగ్గులో ముంచేస్తుంది.

మా తండ్రి గాయాలతో బాధపడుతూ కూడా నవ్వు ముఖంతో వివాహ కార్యాలు నిర్వహించారు. మా తండ్రి ఏఏ సమయంలో ఎక్కడెక్కడ కూర్చున్నదీ యిప్పటికీ నాకు బాగా గుర్తు. నాకు బాల్య వివాహం చేసినందుకు తరువాత నా తండ్రిని తీవ్రంగా విమర్శించాను. కాని పెండ్లి సమయంలో ఆ విషయం నాకు తోచలేదు. అప్పుడు సంతోషంగా, ఆనందంగా ఉన్నాను. అంతా మనోహరంగా కనిపించింది. పెండ్లి ఉబలాటంలో అప్పుడు నా తండ్రి చేసినదంతా మంచే అని అనిపించింది. ఆ విషయాలు యిప్పటికీ నాకు గుర్తు వున్నాయి.

పెండ్లి పీటల మీద కూర్చున్నాం. సప్తపది పూర్తి అయింది. ఒకే పళ్ళెంలో కంసారు అనగా గోధుమరవ్వ, చక్కెర, కిస్‌మిస్, ఎండుద్రాక్షలతో తయారు చేసే జావ తాగాం. ఒకరికొకరం తినిపించుకున్నాం. ఇద్దరం కలిసిమెలిసి వున్నాం. ఆ విషయాలన్నీ కండ్లకు కట్టినట్లు యిప్పటికీ నాకు కనబడుతున్నాయి. ఆహా! మొదటి రాత్రి. అభం శుభం తెలియని యిద్దరు పిల్లలం. సంసార సాగరంలోకి ఉరికాము. మొదటి రాత్రి ఏం చేయాలో, కొత్త అడపిల్లతో ఎలా వ్యవహరించాలో మా వదిన బోధించింది. నీ వెవరి దగ్గర నేర్చుకున్నావని ఆ రాత్రి నా ధర్మపత్నిని అడిగినట్లు గుర్తులేదు. యిప్పటికీ అడుగవచ్చు. కాని నాకు అట్టి ఇచ్ఛలేదు. ఒకరిని చూచి ఒకరం భయం భయంగ వున్నామని పాఠకులు గ్రహించవచ్చు. బాగా సిగ్గుపడ్డాం. ఎట్లా మాట్లాడాలో నాకేం

తెలుసు? నేర్చుకున్న పాఠాలు జ్ఞాపకం వుంటాయా? అసలు అవి ఒకరి దగ్గర నేర్చుకునే విషయాలా? సంస్కారాలు బలంగా వున్నచోట పాఠాలు పనిచేయవు. మెల్లమెల్లగా ఒకరినొకరం అర్థం చేసుకోసాగాం. మాట్లాడుకోసాగాం. మేమిద్దరం సమవయస్కులం. అయినా భర్తగా అధికారం చలాయించడం ప్రారంభించాను.

## 4. భర్తగా

నాకు పెండ్లి అయిన రోజుల్లో దమ్మిడీకో, కాణీకో, చిన్న చిన్న పత్రికలు అమ్ముతూ వుండేవారు. వాటిలో భార్యభర్తల ప్రేమ, పొదుపు, బాల్యవివాహాలు మొదలుగా గల విషయాలను గురించి వ్రాస్తూ వుండేవారు. చేతికందినప్పుడు వాటిని పూర్తిగా చదివేవాణ్ణి నచ్చని విషయాల్ని మరిచిపోవడం, నచ్చిన విషయాల్ని ఆచరణలో పెట్టడం నాకు అలవాటు. ఒకసారి ఒక పత్రికలో ఏకపత్నీవ్రతం ధర్మం అను వ్యాసం ప్రకటించారు. శ్రద్ధగా చదివాను. ఆ విషయం నా మనస్సులో నాటుకుపోయింది. సత్యమంటే నాకు మక్కువ. అట్టి స్థితిలో భార్యను మోసగించడం నావల్ల సాధ్యం కానిపని. అందువల్ల మరో స్త్రీ యెడ మక్కువ కూడదని నాకు బోధపడింది. చిన్న వయస్సులో ఏకపత్నీవ్రతం భంగం అయ్యే అవకాశం తక్కువేనని చెప్పవచ్చు.

కాని ఒక ముప్పు కూడా కలిగింది. నేను ఏకపత్నీవ్రతం అవలంబించితే ఆమె కూడా పాతివ్రత్యాన్ని పాటించాలి. యీ రకమైన యోచన నన్ను ఈర్ష్యపడే భర్తగా మార్చివేసింది. పాటించాలి అని అనుకున్న నేను "పాటింపచేయాలి" అనే నిర్ణయానికి వచ్చాను. ఆమెచే పాటింపచేయాలంటే నేను జాగ్రత్త పడాలి అని భావించాను. నిజానికి నా భార్యను శంకించవలసిన అవసరం లేనేలేదు. కాని అనుమానం పెనుభూతం వంటిది కదా. నా భార్య ఎక్కడికి పోతున్నదీ నేను తెలుసుకోకపోతే ఎలా? నా అనుమతి లేనిదే ఆమె ఎక్కడికీ వెళ్ళకూడదు. దానితో మా మధ్య ఎడమొహం పెడమొహం ప్రారంభమైంది. అనుమతి లేకుండా ఎక్కడికీ పోకూడదంటే ఒక విధమైన జైలేకదా! అయితే కస్తూరిబాకి యిలాంటి జైలు బంధాలు గిట్టవని తేలిపోయింది. నేను వెళ్ళొద్దని వత్తిడి తెచ్చిన కొద్దీ వెళ్ళసాగింది. దానితో నాకు చిరచిర ఎక్కువైంది. పిల్లలమైన మా మధ్య మాటలు కూడా ఆగిపోయాయి. కస్తూరిబా తీసుకున్న స్వాతంత్ర్యం నిజానికి దోషరహితం. మనస్సులో ఏ విధమైన దోషం లేని బాలిక దైవదర్శనానికో, మరెవరినైనా కలుసుకోవడానికో వెళ్ళడాన్ని అంగీకరించక అధికారం చెలాయిస్తే సహిస్తుందా? నేను ఆమె మీద దర్పం చూపిస్తే ఆమె కూడా నా మీద దర్పం చూపించవచ్చుకదా! అయితే యీ విషయం కాలం గడిచాక బోధపడింది కాని అప్పుడో! భర్తగా అధికారం చలాయించడమే నా పని.

నా గృహ జీవితంలో మాధుర్యం లోపించిందని పాఠకులు అనుకోవద్దు. నా వక్రపోకడకు మూలం ప్రేమయే. నా భార్యను ఆదర్శ స్త్రీగా తీర్చిదిద్దాలని నా భావం. ఆమె స్వచ్ఛంగా, శుద్ధంగా వుండాలనీ, నేను నేర్చుకున్న దాన్ని ఆమె నేర్చుకోవాలనీ, నేను చదివిందాన్ని ఆమె చదవాలనీ. యిద్దరం ఒకరిలో ఒకరం ఏకం అయిపోవాలన్న యోచన తప్ప మరో యోచన నాకు లేదు.

కస్తూరిబాకి కూడా నా మాదిరి యోచన వున్నదో లేదో నాకు తెలియదు. ఆమెకు చదువురాదు. స్వభావం మంచిది. స్వతంత్రురాలు. కష్టజీవి. నాతో తక్కువగా మాట్లాడేది. చదువుకోలేదను చింత ఆమెకు లేదు. చదువుకోవాలనే స్పందన ఆమెలో చిన్నతనంలో నాకు కనబడలేదు. అందువల్ల నా యోచన ఏకపక్షమైనదని అంగీకరిస్తున్నాను. నేను ఆమెను అమితంగా ప్రేమించాను. అలాగే ఆమె కూడా నన్ను ప్రేమించాలని కోరాను. ఆ విధంగా అన్యోన్య ప్రేమ లేకపోయినా, ప్రేమ ఏకపక్షంగా వుండిపోయినా అది మాకు బాధాకరం కాలేదు. నా భార్య మీద నాకు మక్కువ ఎక్కువగా వుండేది. స్కూల్లో కూడా ఆమెను గురించిన ధ్యాసే. ఎప్పుడెప్పుడు చీకటి పడుతుందా, ఎప్పుడెప్పుడు యిద్దరం కలుస్తామా అని ఆరాటపడుతూ వుండేవాణ్ణి వియోగాన్ని సహించలేని స్థితి. రాత్రిళ్ళు నిరర్ధకమైన మాటలతో నేను కస్తూరిని నిద్రపోనిచ్చేవాణ్ణి కాదు. యింతటి ఆసక్తితో బాటు కర్తవ్యనిష్ఠ లేకపోతే నేను అప్పుడు రోగగ్రస్థుడనై మృత్యువు కోరల్లో చిక్కుకుపోయేవాణ్ణి. ప్రపంచానికి భారమైపోయేవాణ్ణి. తెల్లవారగానే నిత్య కార్యక్రమాలు నిర్వర్తిస్తూ వుండేవాణ్ణి. మరొకరిని మోసగించడం ఎరగనివాణ్ణి. కనుకనే అనేక పర్యాయాలు చిక్కుల్లో పడకుండా రక్షణ పొందాను.

కస్తూరిబా చదువుకోలేదని మొదటే వ్రాశాను. ఆమెకు చదువు చెప్పాలనే కోరిక నాకు వుండేది. కాని విషయవాంఛ అందుకు అడ్డుపడేది. ఆమెకు బలవంతంగా చదువు చెప్పవలసిన పరిస్థితి, అది కూడా రాత్రిపూట ఏకాంతంగా వున్న సమయంలోనే సాధ్యపడేది. గురుజనుల ఎదుట భార్యవంక చూడటానికి కూడా వీలు లేని రోజులు అట్టి స్థితిలో ఆమెతో మాట్లాడటం సాధ్యమా? కాఠియావాడ్‌లో పనికిమాలిన మేలిముసుగు అనగా పర్దా రివాజు అమలులో వుండేది. యిప్పటికీ ఆ రివాజు అక్కడక్కడా అమలులో వుంది. ఈ కారణాలవల్ల కస్తూరిబాకు చదువు చెప్పేందుకు అవకాశం చిక్కలేదు. యౌవ్వన సమయంలో భార్యకు చదువు చెప్పడానికి నేను చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయని అంగీకరిస్తున్నాను. విషయవాంఛల నుంచి మేల్కొని బయటపడేసరికి ప్రజాజీవితంలో బాగా లీనమైపోయాను. ఇక ఆమెకు చదువు

చెప్పేందుకు సమయం దొరకనేలేదు. ఉపాధ్యాయుణ్ణి పెట్టి చదువు చెప్పిద్దామని చేసిన ప్రయత్నం కూడా ఫలించలేదు. ఏతావాతా కస్తూరిబా చదువరి కాలేదు. ఆమె కొద్దిగా జాబులు వ్రాయగలదు. సామాన్యమైన గుజరాతీ అర్థం చేసుకోగలదు. ఆమె యెడ నాకుగల ప్రేమ వాంఛామయం కాకుండా వుండివుంటే యీనాడు ఆమె విదుషీమణి అయివుండేదని నా అభిప్రాయం. చదువు యెడ ఆమెకు గల నిర్లిప్తతను జయించి వుండేవాణ్ణి. శుద్ధమైన ప్రేమవల్ల జరగని పని అంటూ ఏదీ వుండదని నాకు తెలుసు.

భార్య మీద భోగవాంఛ అమితంగా పెంచుకున్నప్పటికీ నన్ను కాపాడిన విషయాల్ని గురించి వ్రాశాను కదా! మరో విషయం కూడా చెప్పవలసిన అవసరం వుంది. ఎవరి నిష్ఠ పవిత్రంగా వుంటుందో వారిని పరమేశ్వరుడు రక్షిస్తూ వుంటాడను సూక్తి మీద అనేక కారణాల వల్ల నాకు విశ్వాసం కలిగింది. అతి బాల్య వివాహం పెద్ద దురాచారం. దానితోబాటు అందలి చెడుగుల్ని కొంత తగ్గించడానికా అన్నట్లు హిందువుల్లో ఒక ఆచారం వుంది. తల్లిదండ్రులు నూతన దంపతుల్ని ఎక్కువ కాలం కలిసి ఒక చోట వుండనీయరు. నూతన వధువు సగం కాలం పుట్టింట్లో వుంటుంది. మా విషయంలో అలాగే జరిగింది. మాకు పెండ్లి అయిన అయిదేళ్ళ కాలంలో (13వ ఏట నుండి 18 వరకు) మేము కలిసియున్న కాలం మొత్తం మూడేండ్లకు మించదు. ఆరె నెలలు గడవకుండానే పుట్టింటినుండి కస్తూరిబాకి పిలుపు వచ్చింది. ఆ విధంగా పిలుపు రావడం నాకు యిష్టం వుండేది కాదు. అయితే ఆ పిలుపులే మమ్మ్మ రక్షించాయి. 18వ ఏట నేను ఇంగ్లాండు వెళ్లాను. అది మాకు వియోగకాలం. ఇంగ్లాండు నుండి తిరిగి వచ్చాక కూడా మేము ఆరు నెలల కంటే ఎక్కువ కాలం కాపురం చేయలేదు. అప్పుడు నేను రాజకోట నుండి బొంబాయికి, బొంబాయినుండి రాజకోటకు పరుగులు తీస్తూ వుండేవాణ్ణి. తరువాత నేను దక్షిణ ఆఫ్రికా వెళ్ళవలసివచ్చింది. ఈ లోపున నేను పూర్తిగా మేల్కొన్నాను.

## 5. హైస్కూల్లో

పెండ్లి జరిగినప్పుడు నేను హైస్కూల్లో చదువుతూ వున్నానని ముందే వ్రాశాను. మేము ముగ్గురు సోదరులం ఒకే హైస్కూల్లో చేరి చదువుతున్నాము. మా పెద్దన్నయ్య పెద్ద తరగతిలో వున్నాడు. పెండ్లి వల్ల ఒక సంవత్సరం పాటు మా చదువు ఆగిపోయింది. మా అన్న పని మరీ అన్యాయం. ఆయన బడి మానివేశాడు. మా అన్నవలె ఎంతమంది పిన్న వయస్సులో యీ విధంగా చదువు మానివేశారో ఆ భగవంతునికే ఎరుక. ఈనాటి మన హిందూ సమాజంలో విద్య, వివాహం రెండూ వెంట వెంట నడుస్తున్నాయి.

నా చదువు మాత్రం ఆగిపోలేదు. హైస్కూల్లో నాకు మొద్దబ్బాయి అని పేరు రాలేదు. ఉపాధ్యాయులకు నా యెడ వాత్సల్యం మెండు. పిల్లవాడి నడతను గురించి, అతని చదువును గురించి ప్రతి సంవత్సరం స్కూలు నుండి ఒక సర్టిఫికెట్ తల్లిదండ్రులకు పంపుతూ వుంటారు. వాళ్లు ఎప్పుడూ నా నడతను గురించిగానీ, నా చదువును గురించి గానీ వ్యతిరేకంగా వ్రాయలేదు. రెండో తరగతి తరువాత నేను బహుమతులు కూడా కొన్ని సంపాదించాను. అయిదవ, ఆరవ తరగతుల్లో నెలకు నాలుగు రూపాయలు ఆ తరువాత పది రూపాయల చొప్పున విద్యార్థి వేతనం కూడా పొందాను. యిందు నా తెలివితేటల కంటే నా అదృష్టం ఎక్కువగా పనిచేసిందని నా అభిప్రాయం. యీ వేతనాలు విద్యార్థులందరికీ లభించేవి కావు. సౌరాష్ట్ర ప్రాంతం మొత్తంలో ఫస్టు వచ్చిన వాళ్ళకు యిట్టి వేతనం లభించేది. 40 లేక 50 మంది గల తరగతిలో అప్పుడు సౌరాష్ట్ర ప్రాంతానికి చెందిన విద్యార్థులు బహు తక్కువ.

నాకు తెలిసినంతవరకు తెలివితేటల్ని గురించిన గర్వం నాకు వుండేదికాదు. బహుమతులు లేక స్కాలర్‌షిప్పులు లభించినప్పుడు ఆశ్చర్యం కలిగేది. కాని నడతను గురించి మాత్రం జాగ్రత్తగా వుండేవాణ్ణి. ఆచరణలో దోషం కనబడితే ఏడుపు వస్తూ వుండేది. ఉపాధ్యాయులు నన్ను మందలించటం గానీ, అట్టి పరిస్థితి ఏర్పడటం గానీ నేను సహించలేకపోయేవాణ్ణి. నాకు బాగా జ్ఞాపకం. ఒక పర్యాయం నేను దెబ్బలు తినవలసి వచ్చింది. దెబ్బలు తగిలినందుకు నేను విచారించలేదు. దండనకు గురి అయినాననే బాధ అమితంగా కలిగింది. బాగా ఏడ్చాను. మొదటి తరగతిలోనో లేక రెండో తరగతిలోనో ఇలా జరిగింది. అప్పుడు దొరాబ్జీ ఎదల్జీగిమీ హెడ్‌మాష్టరు. ఆయన విద్యార్థులకు యిష్టుడు. తాను నియమబద్ధంగా పనిచేస్తూ ఇతరులచేత పనిచేయించేవాడు. చదువు బాగా చెప్పేవాడు. పెద్ద తరగతి విద్యార్థులకు వ్యాయామం, క్రికెట్టు అనివార్యం చేశాడు. నాకు అవి యిష్టంలేదు. నేను వాటిలో పాల్గొనేవాణ్ణి కాదు. నా అయిష్టం సరికాదని యిప్పుడు నాకు అనిపిస్తుంది. ఆ రోజుల్లో చదువుకు, వ్యాయామానికి ఏ మాత్రం సంబంధం లేదని నేను అనుకునేవాణ్ణి. విద్యార్జనతో బాటు అనగా మానసిక శిక్షణతోబాటు వ్యాయామం శారీరక శిక్షణ కూడా, విద్యార్థికి అవసరమని తరువాత బోధపడింది. అయినా వ్యాయామంలో పాల్గొనక పోవడం వల్ల నాకేమీ నష్టం కలుగలేదని చెప్పగలను. తెరపగాలిలో వాహ్యాళి ఎంతో ప్రయోజనకర మైనదని చదివాను. ఆ సలహా నాకు నచ్చింది. దానితో పెద్ద తరగతుల్లో చదువుకునేటప్పటి నుండి నాకు కాలినడకన వాహ్యాళికి వెళ్ళడం అలవాటైపోయింది. చివరివరకు ఈ

అలవాటు నన్ను వదలలేదు. కాలినడకన తిరగడం కూడా మంచి వ్యాయామమే. అందువల్ల నా శరీరంలో కొంచెం బిగువు వచ్చింది. నా తండ్రికి సేవ చేయాలనే తలంపు కూడా వ్యాయామంలో పాల్గొనకపోవడానికి మరో కారణం. స్కూలు మూసివేయగానే యింటికి చేరి తండ్రికి సేవ చేసేవాణ్ణి. స్కూల్లో వ్యాయామాన్ని అనివార్యం చేయడం వల్ల తండ్రిగారి సేవకు విఘ్నం ఏర్పడింది. గనుక స్కూలు వ్యాయామంలో పాల్గొనకుండా వుండుటకు అనుమతి నొసంగమని అర్జీ పెట్టుకున్నాను. కాని గీమీగారు అంగీకరిస్తారా? ఒక శనివారం నాడు స్కూలు ఉదయం పూట నడిపారు. సాయంకాలం మేఘాలు క్రమ్మాయి. అందువల్ల టైము ఎంత అయిందో తెలియలేదు. మేఘాలవల్ల మోసపోయాను. క్లాసుకు వెళ్ళాను. ఎవ్వరూ లేరు. రెండో రోజున గీమీగారు హాజరు పట్టిక చూచారు. నేను పాల్గొనలేదని తేలింది. కారణం అడిగారు నేను నిజం చెప్పాను. నేను చెప్పింది నిజం కాదని ఆయన భావించారు. ఒకటో లేక రెండో అణాల (ఎంతో సరిగా జ్ఞాపకం లేదు) జుర్మానా వేశారు. నేను అబద్ధం చెప్పలేదని రుజువు చేయడం ఎలా? ఉపాయం ఏమీ కనబడలేదు. వూరుకున్నాను. బాగా ఏడ్చాను. నిజం మాట్లాడేవారు, నిజాయితీగా వ్యవహరించేవారు ఏమరచి వుండకూడదని గ్రహించాను. చదువుకునే రోజుల్లో అజాగ్రత్తగా వుండటం అదే ప్రథమం. అదే అంతిమం కూడా. చివరికి అజుర్మానాను మాఫీ చేయించుకోగలిగానని జ్ఞాపకం. స్కూలు మూసివేయగానే నా సేవకు మా అబ్బాయి అవసరం అని మా తండ్రి హెడ్‌మాష్టరుకు జాబు వ్రాశారు. దానితో నాకు ముక్తి లభించింది.

వ్యాయామానికి బదులు వాహ్యాళికి వెళ్ళడం అలవాటు చేసుకున్నందువల్ల అనారోగ్యం బారినుండి తప్పించుకోగలిగాను. కాని మరో పొరపాటు వల్ల కలిగిన ఫలితం నేను ఈనాటికీ అనుభవిస్తున్నాను. చదువుకునేటప్పుడు అందంగా వ్రాయడం నేర్చుకోవలసిన అవసరం లేదనే తప్పు అభిప్రాయం నా బుర్రలో ఎలా దూరిందో తెలియదు దూరిపోయింది. విదేశానికి బయలుదేరేంతవరకు ఆ అభిప్రాయం మారలేదు. కాని దక్షిణాఫ్రికాకు వెళ్ళిన తరువాత, అక్కడి వకీళ్ళు అక్కడి ప్రజలు ముత్యాల్లాంటి అందమైన అక్షరాలు వ్రాస్తూ వుంటే చూచి సిగ్గుపడ్డాను. వంకరటింకర అక్షరాలు అసంపూర్ణ విద్యకు చిహ్నంగా భావించాలనే భావం అప్పుడు నాకు కలిగింది. తరువాత నా అక్షరాల్ని అందంగా వ్రాద్దామని ఎంతో ప్రయత్నించాను, కాని వ్యవహారం చేయి దాటి పోయింది. దస్తూరి మార్చుకోలేకపోయాను. నన్ను చూచి ప్రతి బాలుడు, బాలిక జాగ్రత్తపడాలని కోరుతున్నాను. మంచి దస్తూరి విద్యలో భాగమని అందరూ గుర్తించాలి.

అక్షరాలు దిద్దించుటకు ముందు బాలురకు చిత్రలేఖనం నేర్పటం అవసరమని నాకు అనిపించింది. పూవులు, పిట్టలు మొదలుగా గల వాటిని పరిశీలించి చిత్రించినట్లే అక్షరాల్ని కూడా పరిశీలించి వ్రాయడం అవసరం. వస్తువుల్ని చూచి గీయడం నేర్చుకున్న తరవాతే వ్రాత నేర్పడం మంచిది. అప్పుడు అక్షరాలు అందంగా వుంటాయి. ఆనాటి మా బడిని గురించిన రెండు విషయాలు చెప్పవలసినవి వున్నాయి. వివాహం వల్ల నా ఒక సంవత్సర కాలం వ్యర్థమైపోయింది. దాన్ని సరిచేసేందుకు ఉపాధ్యాయుడు నన్ను పై క్లాసులో చేర్పించాడు. కష్టపడి చదివే వాళ్ళకు అట్టి అవకాశం లభిస్తూ వుండేది. అందువల్ల నేను మూడో తరగతిలో ఆరు నెలలు మాత్రమే వుండి ఎండాకాలపు సెలవులకు పూర్వం జరిగే పరీక్షలు పూర్తి అయిన తరువాత నాలుగో తరగతిలో చేర్చబడ్డాను. నాలుగో తరగతి నుండి పాఠ్య విషయాలు ఎక్కువభాగం ఇంగ్లీషులో బోధించబడేవి. నాకు నడిసముద్రంలో వున్నట్లు అనిపించేది. రేఖాగణితం నాకు క్రొత్త. ఇంగ్లీషులో రేఖాగణితం బోధించడం వల్ల నా పాలిట అది గుదిబండ అయింది. ఉపాధ్యాయుడు పాఠం బాగా చెప్పేవాడు. కాని ఏమీ బోధపడేది కాదు. పాఠాలు కష్టంగా వుండటం వలన నా మనస్సు కలత చెంది తిరిగి మూడో తరగతిలోనే చేరదామని భావించాను. రెండేండ్ల చదువు ఒక సంవత్సరంలో పూర్తి చేయడం కష్టమనిపించింది. కాని నాకంటే కూడా నా ఉపాధ్యాయునికి యిలా తిరిగి నేను మూడో తరగతిలో చేరడం అవమానమనిపించింది. నా చదువు మీద గల విశ్వాసంతో ఆయన నన్ను నాలుగో తరగతిలో చేర్పించాడు. యింతగా శ్రమపడిన తరువాత తిరిగి మూడో తరగతిలో నేను చేరడం సబబా? అందువల్ల నేను నాలుగో తరగతిలోనే ఉండిపోయాను. బాగా కష్టపడి చదవడం ప్రారంభించాను. యూక్లిడ్‌లో 13వ ప్రొపొజిషన్ వరకు రాగా అక్కడి నుండి రేఖాగణితం సులభంగా బోధపడిపోయింది. తెలివితేటల్ని ఉపయోగించి సరళప్రయోగాలు చేస్తూ కృషి చేస్తే ఏ విషయమైనా తప్పక బోధపడుతుంది. అప్పటినుండి నాకు రేఖాగణితం యెడ అభిరుచి పెరిగింది.

సంస్కృతం బాగా కష్టమనిపించింది. రేఖాగణితంలో బట్టీ పట్టవలసిన అవసరం వుండేది కాదు. కాని సంస్కృతం అంతా బట్టీపట్టడమే. అందుకు ధారణాశక్తి అవసరమనిపించింది. నాలుగోతరగతికి చేరేసరికి సంస్కృత పాఠాలు మరీ కష్టమనిపించాయి. సంస్కృత ఉపాధ్యాయుడు పిల్లలకు సంస్కృతాన్ని నూరిపోద్దామని అనుకునేవాడు. సంస్కృత ఉపాధ్యాయుడికీ, ఫారసీ ఉపాధ్యాయుడికీ పడేది కాదు. ఫారసీ మౌల్వీ సౌమ్యుడు. ఫారసీ తేలిక అని ఫారసీ మౌల్వీ పిల్లల్ని ప్రేమగా చూస్తాడని

పిల్లలు చెప్పుకునేవారు. ఆ మాటలు నన్ను ఆకర్షించాయి. ఒకసారి ఫారసీ క్లాసులో కూర్చున్నాను అది చూచి సంస్కృత ఉపాధ్యాయుడు చాలా బాధపడ్డాడు. నన్ను పిలిచి "అబ్బాయీ! నీవు ఎవరికొడుకువో ఆలోచించుకో. నీ ధార్మిక భాష సంస్కృతం. దాన్ని నీవు నేర్చుకోవా? సంస్కృతం రాకపోతే నా దగ్గరికి రావచ్చుకదా? శక్తి కొద్దీ పిల్లలకు సంస్కృతం నేర్పడం నా లక్ష్యం. ముందు ముందు సంస్కృతం తేలిక అవుతుంది. అధైర్యపడవద్దు వచ్చి సంస్కృత క్లాసులో కూర్చో" అని మంచిగా చెప్పాడు.

ఆయన చూపిన మంచితనాన్ని కాదనలేకపోయాను. గురుప్రేమను తిరస్కరించలేకపోయాను. ఆయన పేరు కృష్ణశంకర పాండ్యా. యిప్పుడు వారిని, వారు చెప్పిన పాఠాల్ని గుర్తు చేసుకుంటే నా హృదయం వారి ఉపకారాన్ని మర్చిపోలేక కృతజ్ఞతతో నిండిపోతుంది. ఆనాడు వారిదగ్గర ఆ కొద్దిపాటి సంస్కృతం నేర్చుకొని వుండకపోతే ఆనందించలేకపోయేవాణ్ణి. నిజానికి నేను సంస్కృతం ఇంకా ఎక్కువ నేర్చుకోలేకపోయాననే బాధ యిప్పుడు నాకు కలుగుతూ వుంటుంది. ప్రతి హిందూ బాలుడు, బాలిక సంస్కృతం చక్కగా నేర్చుకోవడం అవసరమని తరువాత గ్రహించాను.

నా అభిప్రాయం ప్రకారం భారతదేశపు ఉన్నత విద్యా ప్రణాళికలో మాతృభాషతోపాటు హిందీ, సంస్కృతం, ఫారసీ, అరబ్బీ, ఇంగ్లీషు భాషలను పాఠ్యాంశాలుగా చేర్చాలి. ఈ సంఖ్యను చూచి భయపడవలసిన అవసరంలేదు. మనకు బోధించబడుతున్న విద్యను క్రమబద్ధం చేసి పరాయి భాషలో పాఠ్యాంశాలు నేర్చుకోవలసిన అవసరం లేకుండా చేసి, ఆ భారం తగ్గించితే పిల్లలు తేలికగా ఈ భాషలు నేర్చుకోగలుగుతారని, వాళ్ళకు ఆనందం కలుగుతుందని నా అభిప్రాయం. ఒక భాషను శాస్త్రీయంగా అభ్యసిస్తే మిగతా భాషలు సులభతరం అవుతాయి. అసలు హిందీ, గుజరాతీ, సంస్కృత భాషలు ఏకభాషలేనని చెప్పవచ్చు. అదే విధంగా ఫారసీ, అరబ్బీ భాషలు ఏకభాషలే. ఫారసీ భాష ఆర్యభాషకు చెందినది. అరబ్బీ భాష హీబ్రూకు చెందినది. అయినా ఈ రెండింటికీ దగ్గరి చుట్టరికం వుంది. ఈ రెండు భాషలు ఇస్లాంమతంతోబాటు అభివృద్ధి చెందాయి. ఉర్దూ భాష వేరు అని నేను అంగీకరించను. హిందీ వ్యాకరణాంశాలు అందు వుండటం, ఫారసీ, అరబ్బీ పదాలు అందు వుండటం అందుకు కారణం. గుజరాతీ, హిందీ, బెంగాలీ, మరాఠీ, మొదలుగా గల మన భాషల్లో మంచి ప్రవేశం కలగాలంటే సంస్కృతం నేర్చుకోవడం చాలా అవసరం. అలాగే ఉర్దూలో మంచి ప్రవేశం కలగాలంటే ఫారసీ, అరబ్బీ భాషలు అభ్యసించాలి.

# 6. దుఃఖకరమైన ప్రకరణం - 1

హైస్కూల్లో వేరు వేరు సమయాల్లో నాకు యిద్దరు స్నేహితులు వుండేవారు. వారిలో ఒకడితో మైత్రి ఎక్కువకాలం సాగలేదు. నేను మాత్రం ఆ మిత్రుణ్ణి పరిత్యజించ లేదు. మరొకనితో నేను స్నేహంగా వుండటం యిష్టం లేక అతడు నన్ను వదిలివేశాడు. యిక రెండోవానితో స్నేహం చాలా కాలం సాగింది. అది ఎంతో దుఃఖకరమైన ప్రకరణంగా మారింది. అతణ్ణి సంస్కరించాలనే భావంతో నేను అతనితో స్నేహం చేశాను

అతడు మొదట మా రెండో అన్నయ్యకు మిత్రుడు. వాళ్ళిద్దరూ సహాధ్యాయులు. అతనిలో కొన్ని దోషాలు వున్నాయి అని నాకు తెలుసు. అయినా అతడు విశ్వసనీయుడనే భావించాను. మా అమ్మ, పెద్దన్నయ్య, నా భార్య కూడా యీ చెడుసహవాసం వద్దని హెచ్చరించారు. అభిమానం గల భర్తనైన నేను భార్య మాటల్ని పాటిస్తానా? కాని మా అమ్మ, పెద్దన్నయ్య మాటల్ని వినడం తప్పనిసరి. "మీరు చెప్పిన దోషాలు అతనిలో వున్నమాట నిజమే. కాని అతనిలోగల సుగుణాలు మీకు తెలియవు. అతడు నన్ను చెడగొట్టలేడు. మంచిదారికి తీసుకొని వచ్చేందుకే అతనితో స్నేహం చేస్తున్నాను. తన దోషాల్ని సరిచేసుకుంటే అతడు ఉత్తముడవుతాడు అందుకే అతనితో చేతులు కలిపాను. నన్ను గురించి మీరు విచారపడవద్దు" అని అమ్మకు, పెద్దన్నయ్యకు నచ్చజెప్పాను. నా మాటలు మా వాళ్ళకు నచ్చాయని అనలేను కాని యిక వాళ్ళు నన్నేమీ అనలేదు. నాదారిన నన్ను పోనిచ్చారు.

తరువాత నాదే పొరపాటని తేలింది. యితరుల్ని సంస్కరించడం కోసం మరీ లోతుకు పోకూడదని గ్రహించాను. స్నేహంలో అద్వైత భావం వుంటుంది. సమాన గుణాలు కలిగిన వారి స్నేహమే శోభిస్తుంది, నిలుస్తుంది. మిత్రుల ప్రభావం ఒకరిపై మరొకరిది తప్పక పడుతుంది. అందువల్ల స్నేహితుల్ని సంస్కరించడం కష్టం. అసలు అతి స్నేహం పనికిరాదని నా అభిప్రాయం. సామాన్యంగా మనిషి సుగుణాల కంటే దుర్గుణాల్నే త్వరగా గ్రహిస్తాడు. ఆత్మీయమైత్రిని, భగవంతుని మైత్రిని కోరుకునేవాడు ఏకాకిగా వుండాలి. లేదా ప్రపంచమంతటితో స్నేహంగా వుండాలి. యీ నా అభిప్రాయాలు సరైనవో, కావో తెలియదు. కాని నా ఆ స్నేహప్రయత్నం మాత్రం ఫలించలేదు.

ఆ వ్యక్తితో స్నేహం చేసినప్పుడు రాజకోటలో సంస్కరణోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. మా ఉపాధ్యాయుల్లో చాలామంది చాటుగా మద్యమాంసాలు సేవిస్తున్నారని ఆ స్నేహితుడు నాకు చెప్పాడు. సుప్రసిద్ధులైన రాజకోటకు చెందిన

కొందరు ప్రముఖుల పేర్లు కూడా చెప్పాడు. అట్టివారిలో హైస్కూలు వాళ్ళు కూడా కొంతమంది వున్నారని చెప్పాడు.

ఇదంతా నాకు వింతగా తోచింది. తరువాత బాధ కూడా కలిగింది. వాళ్ళు అలా ఎందుకు చేస్తున్నారని అడిగాను. "మనం మాంసం తినం. అందువల్ల మనజాతి దుర్బలమై పోయింది. తెల్లవాళ్ళు మాంసభోజులు. అందువల్లనే వాళ్ళు మనల్ని పరిపాలించగలుగుతున్నారు. నన్నుచూడు. బలశాలిని. చాలా దూరం పరిగెత్తగలను. ఈ విషయం నీకు తెలుసు. నేను మాంసాహారి కావడమే అందుకు కారణం. మాంసాహారులకు కురుపులు లేవవు. గ్రంధులు ఏర్పడవు. ఒకవేళ ఏర్పడినా వెంటనే మానిపోతాయి. మన ఉపాధ్యాయులు, రాజకోట ప్రముఖులు వెర్రివాళ్ళు కాదు. వాళ్ళు మాంసం ఎందుకు తింటున్నారనుకుంటున్నావు? మాంసం వల్ల కలిగే ప్రయోజనాలేమిటో వాళ్ళకు బాగా తెలుసు. నువ్వుకూడా వారిలాగే మాంసం తిను. కృషితో సాధించలేనిదంటూ ఏమీ ఉండదు. మాంసం తిని చూడు నీకే తెలుస్తుంది. ఎంత బలం వస్తుందో అని నన్ను ప్రోత్సహించాడు.

ఇవి అతడు ఒక్క పర్యాయం చెప్పిన మాటలు కావు అనేక పర్యాయాలు సమయాన్ని, సందర్భాన్ని బట్టి అతడు చెప్పిన మాటల సారం. మా రెండో అన్నయ్య యిదివరకే అతని మాటల్లో పడిపోయాడు. పైగా ఆ స్నేహితుని వాదనను సమర్థించాడు కూడా. ఆ మిత్రుని ముందు, మా రెండో అన్నయ్య ముందు నేను దోమ వంటివాణ్ణి. వాళ్ళిద్దరూ బలిష్ఠులు. దృఢగాత్రులు. నా స్నేహితుని పరాక్రమం చూచి నివ్వెరపోయాను. ఎంత దూరమైనా సరే రివ్వున పరుగెత్తగలడు. ఎత్తు మరియు దూరం దూకడంలో అతడు మేటి. ఎన్ని దెబ్బలు కొట్టినా కిమ్మన్నడు. సహిస్తాడు. తరచుగా తన పరాక్రమాన్ని నా ముందు ప్రదర్శిస్తూ వుండేవాడు. తనకు లేని శక్తులు యితరుల్లో చూచి మనిషి ఆశ్చర్యపడడం సహజం. అందువల్ల నేను అతగాణ్ణి చూచి ఆశ్చర్యపోయేవాణ్ణి. అతని వలె బలశాలి కావాలని ఆశ నాకు కలిగింది. నేను దూకలేను. పరిగెత్తలేను. అతనిలా దూకాలి, పరిగెత్తాలి అనుకోరిక నాకు కలిగింది.

నేను పిరికివాణ్ణి. దొంగలన్నా, దయ్యాలన్నా తేళ్ళన్నా పాములన్నా నాకు భయం. రాత్రిళ్ళు గడపదాటాలంటే భయం. చీకట్లో ఎక్కడికీ పోలేను. ఒక దిక్కునుండి దయ్యాలు వచ్చి మ్రింగివేస్తాయని, మరోదిక్కు నుండి పాములు వచ్చి కరిచి వేస్తాయని భయం వేసేది. గదిలో దీపం లేకుండా పడుకోలేను. నా ప్రక్కనే పడుకొని నిద్రిస్తున్న యౌవనదశలోనున్న నా భార్యకు నా భయం గురించి ఎలా చెప్పను? నా

కంటే ఆమెకు ధైర్యం ఎక్కువ అని నాకు తెలుసు. నాలో నేను సిగ్గుపడ్డాను. ఆమెకు పాములన్నా, దయ్యాలన్నా భయం లేదు. చీకట్లో ఎక్కడికైనా నిర్భయంగా వెళుతుంది. ఈ విషయాలన్నీ నా స్నేహితునికి తెలుసు. "పాముల్ని చేత్తో పట్టుకుని ఆడిస్తా. దొంగల్ని తరిమికొడతా, దయ్యాల్ని లెక్క చెయ్యను" అంటూ వుండేవాడు. అది అంతా మాంసాహార ప్రతాపమేనని తేల్చేవాడు.

ఆ రోజుల్లో నర్మదకవి వ్రాసిన క్రింది గుజరాతీ పాట పిల్లలంతా పాడుతూ వుండేవారు.

"అంగ్రేజో రాజ్యకరే, దేశీరహే దబాయీ
దేశీరహేదబాయీ జోనే బేనాం శరీర్ భాయీ
పేలో పాంచ్ హాథ్ పూరో, పూరో పాంచ్‌సే నే

(దేశీయులను దద్దమ్మలుగా చేసి ఆంగ్లేయులు రాజ్యం చేస్తున్నారు. యిద్దరి శరీరాల్ని పరికించి చూడు. మన అయిదువందల మందికి అయిదు అడుగుల ఆంగ్లేయుడొక్కడు చాలు)

వీటన్నిటి ప్రభావం నా మీద బాగా పడింది. మాంసాహారం మంచిదని అది నాకు బలం చేకూర్చి, వీరుణ్ణి చేస్తుందని, దేశ ప్రజలంతా మాంసం తింటే తెల్లవాళ్ళను జయించవచ్చుననే విశ్వాసం నాకు కలిగింది. మాంసభక్షణకు ముహూర్తం నిర్ణయమైంది. అది రహస్యంగా జరగాలి అనే నిర్ణయానికి వచ్చాం. గాంధీ కుటుంబాలవారిది వైష్ణవ సంప్రదాయం. మా తల్లిదండ్రులు పరమవైష్ణవులు. వాళ్ళు ప్రతిరోజు దేవాలయం వెళతారు. మా కుటుంబంలో ప్రత్యేకించి ప్రతి విషయంలో ఆ సంప్రదాయ ఆధిక్యత మెండు. జైనులు, వైష్ణవులు మాంసభక్షణకు పూర్తిగా వ్యతిరేకులు. అంతటి మాంస వ్యతిరేకత హిందూదేశంలో గాని, మరో దేశంలోగాని గల యితర సంప్రదాయాల వాళ్ళకు లేదని చెప్పవచ్చు. యిది పుట్టుకతో వచ్చిన సంప్రదాయ సంస్కారం.

నేను నా తల్లిదండ్రుల పరమభక్తుణ్ణి. నేను మాంసం తిన్నానని తెలిస్తే వాళ్ళ స్థితి ఏమవుతుందో నాకు తెలుసు. అప్పటికే సత్యనిరతి నాలో అధికంగా వుంది. నేను మాంసభక్షణ ప్రారంభిస్తే నా తల్లిదండ్రుల్ని మోసం చేయవలసి వస్తుందను విషయం నాకు తెలుసు. అట్టి స్థితిలో మాంసం తినడం ఎంత భయంకరమైన విషయమో వేరే చెప్పనక్కరలేదు. కాని నా మనస్సంతా సంస్కారదీక్ష మీద కేంద్రీకృతమైంది. నేను మాంసం తింటున్నది రుచి కోసం కాదు. మాంసం రుచిగా వుంటుందని నాకు తెలియదు. నాకు బలం కావాలి. పరాక్రమం కావాలి. నా దేశ ప్రజలంతా పరాక్రమ

వంతులు కావాలి. అప్పుడు తెల్లవాళ్ళను జయించి హిందూ దేశాన్ని స్వతంత్ర్యం చేయవచ్చు. ఇదే నా కోరిక. స్వరాజ్యం అను శబ్దం అప్పటికి నా చెవిన పడలేదు. కాని స్వతంత్ర్యం అంటే ఏమిటో నాకు తెలుసు. సంస్కారపు పిచ్చి నన్ను అంధుణ్ణి చేసింది. రహస్యంగా మాంసభక్షణం చేసి, తల్లిదండ్రులకు యీ విషయం తెలియనీయకుండా రహస్యంగా వుంచాలి. యిలా చేయడం సత్యపథాన్నుండి తొలగడం కాదనే నమ్మకం నాకు కలిగింది.

## 7. దుఃఖకరమైన ప్రకరణం - 2

నిర్ణయించిన రోజు రానే వచ్చింది. ఆనాటి నా స్థితిని గురించి వర్ణించలేను. ఒకవైపు సంస్కరణాభిలాష. మరోవైపు జీవితంలో గొప్ప మార్పు వస్తుందనే భావం. యింకోవైపు దొంగలా చాటుగా యీ పని చేస్తున్నాననే బిడియం, బాధ. వీటిలో ప్రాధాన్యం దేనిదో చెప్పలేను. ఏకాంత ప్రదేశం దొరికింది. అక్కడ జీవితంలో మొదటిసారి మాంసం చూచాను. నాన్‌రొట్టె కూడా తెచ్చాం. రెండిటిలో ఒక్కటి కూడా రుచించలేదు. మాంసం తోలులా బిరుసుగా వుంది. మింగడం సాధ్యం కాలేదు. కక్కు వచ్చినంత పని అయింది. మాంసం పరిత్యజించవలసి వచ్చింది.

ఆ రాత్రి కష్టమైపోయింది. ఏవేవో పీడకలలు రాసాగాయి. కన్నుమూతబడేసరికి నా కడుపులో బ్రతికియున్న మేక 'మే మే' అని అరిచినట్లనిపించడం, త్రుళ్ళిపడి లేవడం, ఇష్టపడే మాంసం తిన్నాను గదా అని ఊరట చెందడం, యిదీ వరస.

నా మిత్రుడు అంతటితో నన్ను వదలలేదు మాంసంతో రకరకాల పాకాలు వండి తేవడం ప్రారంభించాడు. నదీతీరాన తినడం మాని గొప్ప భవనంలో తినడం ప్రారంభించాము. భోజనశాలలో మేజా బల్లలు, కుర్చీలు, అన్నీ వున్నాయి. అక్కడి వంటవాణ్ణి మంచి చేసుకుని మిత్రుడు ఆ దివ్య భవనంలో స్థానం సంపాదించాడు.

మిత్రుని ప్లాను బాగా పనిచేసింది. నాన్‌రొట్టెమీద నాకు రోత పోయింది. మేకల మీద జాలి గూడా తగ్గిపోయింది. వట్టి మాంసం కాకుండ, మాంసంతో తయారుచేసిన రకరకాల పాకాలు తినసాగాను. యీ విధంగా ఒక సంవత్సరం గడిచింది. మొత్తం ఆరు మాంసపు విందులు ఆరగించాను. తక్కువసార్లు తినడానికి కారణం ఆ రాజభవనం మాటిమాటికీ దొరక్కపోవడమే. రుచిగల మాంసపు వంటకాలు మాటిమాటికీ సిద్ధం చేయడం కూడా కష్టమే. పైగా యీ సంస్కరణ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు అవసరమైన సొమ్ము నా దగ్గర లేదు. మిత్రుడే డబ్బు తెచ్చి ఖర్చు పెట్టవలసి వచ్చేది. ఎక్కడనుండి అంత డబ్బు తెచ్చేవాడో తెలియదు. నన్ను మాంసాహారిగా మార్చాలని,

భ్రష్టుణ్ణి చేయాలని దీక్ష వహించినందున మిత్రుడే డబ్బు ఖర్చుపెడుతూ వుండేవాడు. అతనికి మాత్రం మాటిమాటికీ అంత డబ్బు ఎట్లా లభిస్తుంది? అందవల్ల మా మాంసాహార విందుల సంఖ్య తగ్గిపోయింది.

దొంగతనంగా విందులు అరగించిన తరువాత నాకు ఆకలి వేసేది కాదు. యింటికి వచ్చి ఆకలి లేదని చెప్పవలసి వచ్చేది. మా అమ్మ అన్నానికి పిలిచేది. ఆకలి లేదంటే కారణం అడగకుండా వూరుకునేది కాదు "అన్నం అరగలేదు అందువల్ల ఆకలి కావడం లేదని" అబద్ధం చెప్పవలసి వచ్చేది. ఈ విధంగా అబద్ధాలు చెబుతున్నప్పుడు బాధగా వుండేది. అమ్మకు అబద్ధం చెబుతున్నాను అని కుమిలిపోయేవాణ్ణి మా బిడ్డలు మాంసాహారులైనారని తెలిస్తే మా తల్లిదండ్రుల గుండెలు బ్రద్దలైపోతాయని నాకు తెలుసు. ఈ విషయాలన్నీ తలుచుకుని బాధపడుతూ వుండేవాణ్ణి.

మాంసభక్షణను గురించి హిందూదేశంలో ప్రచారం చేయడం ఎంతో అవసరం అన్నమాట నిజమే. కాని తల్లిదండ్రుల్ని మోసగించడం, వారికి అబద్ధం చెప్పడం సబబా? అందువల్ల వారు జీవించియున్నంతవరకు ఇక మాంసం తినకూడదు. నేను పెద్దవాణ్ణి అయిన తరువాత బహిరంగంగా తింటాను ఈ లోపల మాంసభక్షణ విరమించి వేస్తాను అను నిర్ణయానికి వచ్చాను.

నా యీ నిర్ణయాన్ని మిత్రునికి తెలియజేశాను తమ కొడుకులిద్దరూ మాంసాహారులైనారను విషయం మా తల్లిదండ్రులకు తెలియదు. మా తల్లిదండ్రుల ముందు అబద్ధాలాడకూడదని నిర్ణయించుకొని మాంసభక్షణ మానివేశానే కాని నా ఆ మిత్రుని సావాసం మాత్రం నేను మానలేదు. యితరుల్ని సంస్కరించాలనే కోరిక నన్ను నిలువునా ముంచి వేసింది. చివరకు ఆ సావాస ఫలితం యింతగా హానికారి అవుతుందని నేను అప్పుడు ఊహించలేదు.

అతని స్నేహం నన్ను వ్యభిచార రంగంలోకి కూడా దింపేదే. కాని తృటిలో ఆ ప్రమాదం తప్పిపోయింది. ఒకరోజున అతడు నన్ను ఒక వేశ్య యింటికి తీసుకొనివెళ్ళాడు. కొన్ని వివరాలు చెప్పి నన్ను వేశ్య గదిలోకి పంపాడు. అవసరమైన ఏర్పాట్లు అదివరకే అతడు చేశాడు. యివ్వవలసిన సొమ్ము అదివరకే యిచ్చివేశాడు. నేను పాపపు కోరల్లో చిక్కుకుపోయాను. కాని భగవంతుడు నన్ను రక్షించాడు. ఆ పాపపు గుహలో నాకు కండ్లు కనబడలేదు. నోటమాట రాలేదు. పరుపు మీద నేను ఆమె ప్రక్కన కూర్చున్నాను. నా నోరు మూసుకుపోయింది. ఆమె చాలాసేపు ఓపిక పట్టింది. యిక పట్టలేక తిట్టడం ప్రారంభించింది. ద్వారం చూపించి వెళ్ళిపొమ్మంది. నా మగతనానికి అవమానం

కలిగినట్లనిపించింది. సిగ్గుపడిపోయాను. భూమి తనలో నన్ను ఇముడ్చుకోకూడదా అని అనిపించింది. అయితే ఆ ఆపద నుండి నన్ను రక్షించినందుకు భగవంతుణ్ణి ప్రార్థిస్తూవున్నాను. నా జీవితంలో యిటువంటి ఘట్టాలు నాలుగు పర్యాయాలు జరిగాయి. అదృష్టం వల్ల వాటి నుండి బయటపడ్డాను. నా ప్రయత్నం కంటే నా అదృష్టమే తోడ్పడిందని చెప్పవచ్చు. యివన్నీ తప్పుడు పనులే. నా పతనానికి కారణం విషయవాంఛలే. ఈ వ్యవహారంలో అవే ఎక్కువగా పనిచేశాయి. నేను వాటికి లొంగిపోయాను. నిజానికి క్రియ ఎట్టిదో, అందుకు తోడ్పడే భావం కూడా అట్టిదే. కాని లౌకిక దృష్టితో చూస్తే నేను నిర్దోషిని. దేవుని అనుగ్రహం వల్ల కర్తకు, అతనికి సంబంధించిన వారికి తప్పిపోయే కర్మలు కొన్ని వుంటాయి. ఆ విధంగా ఆపద తప్పిపోయిన తరువాత జ్ఞానం కలిగిన వెంటనే దేవుని అనుగ్రహాన్ని గురించి మానవుడు యోచిస్తాడు. మనిషి వికారాలకు లోనవడం అందరికీ తెలిసిన విషయమే. అదే విధంగా భగవంతుడు అడ్డుపడి ఆ వికారాల్ని తొలగించి మనిషిని రక్షిస్తూ వుండటం కూడా అందరికీ తెలిసిన విషయమే. ఇదంతా ఎలా జరుగుతున్నది? మానవుడు ఎంతవరకు స్వతంత్రుడు? ఎంతవరకు పరతంత్రుడు? పురుష ప్రయత్నం ఎంతవరకు పనిచేస్తుంది? భగవదేచ్ఛ ఎప్పుడు రంగంలో ప్రవేశిస్తుంది? యిది పెద్ద వ్యవహారం.

ఇక విషయానికి వద్దాం. యింత జరిగినా నా స్నేహితుని దుస్సాంగత్యాన్ని గురించి నా కండ్లు మూసుకొనే వున్నాయి. ఊహించి యెరుగని అతని దోషాలు ప్రత్యక్షంగా యింకా నేను చూడలేదు. అతని దోషాల్ని కండ్లారా చూచినప్పుడు కాని నా కండ్లు తెరువుడుపడలేదు. అప్పటివరకు ఆ దోషాలు అతనిలో లేవనే భావించాను. వాటిని గురించి తరువాత వివరిస్తాను.

అప్పటి మరో విషయం వ్రాయడం అవసరమని భావిస్తున్నాను. మా దంపతుల మధ్య ఏర్పడిన విభేదాలకు జరిగిన కలహాలకు కారణం కూడా అతడి స్నేహమే. మొదటే వ్రాశాను నేను నా భార్య యెడ మిక్కిలి ప్రేమ కలవాణ్ణని. దానితోపాటు ఆమె యెడల నాకు అనుమానం కూడా ఏర్పడింది. యిందుకు కారణం ఆ స్నేహమే. మిత్రుడు చెప్పిన మాటల్ని నిజాలని పూర్తిగా నమ్మాను. మిత్రుని మాటలు నమ్మి నా భార్యను కష్టాలపాలు చేశాను. నేను ఆమెను హింస పెట్టాను. అందుకు నన్ను నేను క్షమించుకోలేను. యిలాంటి కష్టాలు హిందూస్త్రీయే సహిస్తుంది. అందువల్లనే స్త్రీని నేను ఓర్పుకు, సహనశక్తికి ప్రతీక అని భావిస్తాను. నౌకరును అపోహతో అనుమానిస్తే అతడు ఉద్యోగం మానుకొని వెళ్ళిపోతాడు. కన్నకొడుకుని అవమానిస్తే ఇల్లు వదలి

వెళ్ళిపోతాడు. స్నేహితులలో అనుమానం పెరిగితే స్నేహం దెబ్బతింటుంది. భర్త మీద అనుమానం కలిగితే లోలోన భార్య కుమిలిపోవలసిందే. కాని భార్య మీద భర్తకు అనుమానం కలిగితే పాపం ఆమె ఏం చేస్తుంది? ఆమె ఎక్కడికి వెళుతుంది? పెద్ద కులాలకు చెందిన హిందూ స్త్రీ కోర్టుకెక్కి విడాకులు కోరగల స్థితిలో కూడా లేదు. యీ విధంగా స్త్రీ విషయంలో న్యాయం ఏకపక్షంగా వున్నది. నేను కూడా అట్టి న్యాయాన్నే అనుసరించాను. అందువల్ల కలిగిన దుఃఖం ఎన్నటికీ పోదు అహింసను గురించి పూర్తి జ్ఞానం కలిగిన తరువాతే అనుమాన ప్రవృత్తి నాలో తగ్గింది. అంటే బ్రహ్మచర్య మహత్తు నేను తెలుసుకున్న తరువాత, భార్య, భర్తకు దాసి కాదనీ, అతడి సహచారిణి అనీ, సహధర్మచారిణి అనీ యిద్దరూ సుఖదుఃఖాలలో సమాన భాగస్వాములనీ, మంచి చెడులు చూచే స్వాతంత్ర్యం భర్తకు వున్నట్లే భార్యకు కూడా వున్నదనీ నేను తెలుసుకోగలిగాను. తరువాతనే అనుమాన ప్రవృత్తి తొలగిపోయింది. అనుమానంతో నేను వ్యవహరించిన కాలం జ్ఞాపకం వచ్చినప్పుడు నా మూర్ఖత్వం, విషయవాంఛల ప్రభావం వల్ల కలిగిన నిర్దాక్షిణ్యం మీద నాకు కోపం వస్తుంది. మిత్రుని మీద కలిగిన మోహాన్ని తలుచుకున్నప్పుడు నా మీద నాకే జాలి కలుగుతుంది.

## 8. దొంగతనం - ప్రాయశ్చిత్తం

మాంసభక్షణ ప్రారంభించిన కాలంనాటి మరికొన్ని దోషాలు కూడా వివరించవలసినవి వున్నాయి. అవి నా వివాహం కాకపూర్వం నాటివి, ఆ తరువాతవి కూడా.

నా ఒక బంధువు సావాసంలోపడి సిగరెట్టు తాగాలని నాకు సరదా కలిగింది. మా దగ్గర డబ్బులు లేవు. సిగరెట్టు త్రాగితే కలిగే ప్రయోజనం ఏమిటో, దాని వాసనలో గల మజా ఏమిటో మా యిద్దరిలో ఎవ్వరికీ తెలియదు. కాని పొగ ఊదుతూ వుంటే మజాగా వుండేది. మా పినతండ్రికి ఆ అలవాటు వున్నది. ఆయన, మరో కొంతమంది పొగపీల్చి సుతారంగా బయటికి వదులుతూ వుండటం చూచి మాకు కూడా ఒక దమ్ము లాగుదామనే కోరిక కలిగింది. మా దగ్గర డబ్బులు లేవు. అందువల్ల మా పినతండ్రి కాల్చిపారేసిన సిగరెట్టు ముక్కలు ఏరి కాల్చడం ప్రారంభించాము. అయితే అవి అనుకున్నప్పుడల్లా దొరికేవి కావు. దొరికినా ఎక్కువ పొగ వచ్చేది కాదు. అందువల్ల నౌకర్ల డబ్బు దొంగిలించి బీడీలు కొనడం ప్రారంభించాము. అయితే వాటిని ఎక్కడ దాచడమా అను సమస్య వచ్చింది. పెద్దవాళ్ళ ముందు ఎలా కాల్చడం? అందువల్ల దొంగిలించిన డబ్బుతో దేశవాళీ సిగరెట్లు కొని రహస్యంగా త్రాగడం ప్రారంభించాం.

కొన్ని మొక్కల కాడలకు (పేరు జ్ఞాపకం లేదు) సన్నని బెజ్జాలు వుంటాయనీ, వాటిని సిగరెట్ల మాదిరిగా కాల్చవచ్చనీ విన్నాము. దీనితో మాకు తృప్తి కలుగలేదు. మా పారతంత్ర్యాన్ని గురించి యోచించి చాలా దుఃఖించాము. పెద్దల అనుమతి లేకుండా ఏమీ చేయలేకపోతున్నందుకు విచారించాము. చివరికి విసిగిపోయి ఆత్మహత్యకు పూనుకున్నాము. అయితే ఆత్మహత్య ఎలా చేసుకోవడం? విషం ఎలా దొరుకుతుంది? ఉమ్మెత్త గింజలు విషం అని తెలుసుకున్నాము. వాటి కోసం వెతుక్కుంటూ అడవికి వెళ్ళి వాటిని తెచ్చాము. సాయంకాలం వాటిని తినాలని ముహూర్తం నిర్ణయించుకున్నాం. కేదారేశ్వరుని దేవాలయానికి వెళ్ళి, దీపం ప్రమిదలో నెయ్యి పోశాం. దైవదర్శనం చేసుకున్నాం. మారుమూల వున్న చోటుకోసం వెతికాం. అయితే వెంటనే ప్రాణం పోకపోతే? చస్తే ఏమి లాభం? ఏమి సాధించినట్లు? స్వాతంత్ర్యం లేకుండా బ్రతకకూడదా? ఈ రకమైన ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది. ధైర్యం తగ్గిపోసాగింది. అప్పటికి రెండు మూడు ఉమ్మెత్త గింజలు మ్రింగివేశాము. తరువాత సాహసించలేకపోయాము. మా యిద్దరికీ చావంటే భయం వేసింది. కుదుటపడేందుకు, ప్రాణాలు నిలుపుకునేందుకు రామమందిరం వెళ్ళాలని నిర్ణయించుకున్నాం. ఆత్మహత్య చేసుకోవడం తేలిక వ్యవహారం కాదని అప్పుడు నాకు బోధపడింది. అప్పటినుండి ఎవరైనా ఆత్మహత్య చేసుకుంటానని అంటే నాకు వాళ్ళ మాటమీద విశ్వాసం కలుగకుండా పోయింది.

ఈ ఆత్మహత్యా సంకల్పం మాకు మరో విధంగా తోడ్పడింది. సిగరెట్టు పీకలకు ఒక సలాం చేసేందుకు, సిగరెట్ల కోసం నౌకర్ల డబ్బులు దొంగిలించకుండా వుండేందుకు ఎంతగానో సహకరించింది.

పెరిగి పెద్దవాడినైన తరువాత సిగరెట్లు తాగాలనే వాంఛ ఎన్నడూ నాకు కలుగలేదు. అది చాలా అనాగరికం, హానికరం, రోత వ్యవహారం అను నిశ్చయానికి వచ్చాను.

ప్రపంచంలో సిగరెట్ల కోసం యింత మోజెందుకో నాకు అర్థం కాదు. పొగ త్రాగేవాళ్ళతో రైలు ప్రయాణం నేను చేయలేను. నాకు ఊపిరాడదు.

అంతకంటే మరో పెద్ద తప్పు చేశాను. నాకు 13 ఏండ్ల వయస్సులో (అంతకంటే తక్కువ వుండవచ్చు) మొదట సిగరెట్లకోసం డబ్బులు దొంగిలించాను. తరువాత 15వ ఏట పెద్ద దొంగతనం చేశాను. మాంసం భక్షించే మా అన్న చేతికి వుండే బంగారుమురుగు నుండి కొంచెం బంగారం దొంగిలించాము. మా అన్న ఇరవై రూపాయలు అప్పుబడ్డాడు. ఈ అప్పు ఎలా తీర్చడమా అని మేమిద్దరం ఆలోచించాము. అతని చేతికి బంగారు

మురుగు వుంది. దానిలో ఒక తులం ముక్క తీయించడం తేలిక అని నిర్ణయించాం ఆ పని చేశాం. అప్పు తీర్చాం. కాని ఈ చర్యను నేను సహించలేకపోయాను. ఇక దొంగతనం చేయకూడదని నిశ్చయించుకున్నాను. అయితే నా మనస్సు శాంతించలేదు తండ్రిగారికి చెప్పవలెనని అనిపించింది. కాని ఆయన ముందు నోరు విప్పి ఈ విషయం చెప్పేందుకు సాహసం కలుగలేదు. వారు కొడతారనే భయం కలుగలేదు. తన బిడ్డలనెవ్వరినీ మా తండ్రి కొట్టరు. బంగారు మురుగు విషయం చెబితే మనస్తాపంతో క్రుంగిపోతారనే భయం నన్ను పట్టుకుంది ఏది ఏమైనా దోషం అంగీకరిస్తేనే బుద్ధి కలుగుతుందని విశ్వాసం కలిగింది. తండ్రికి మనస్తాపం కలిగించినా పరవాలేదని భావించాను.

చివరికి ఒక చీటీ మీద చేసిన తప్పంతా వ్రాసి క్షమించమని ప్రార్థించాలి అను నిర్ణయానికి వచ్చాను. ఒక కాగితం మీద జరిగినదంతా వ్రాశాను వెళ్ళి మా తండ్రిగారికి యిచ్చాను. ఇంతటి తప్పు చేసినందుకు తగినవిధంగా శిక్షించమని, యిక ముందు దొంగతనం చేయనని శపథం చేశాను ఇదంతా వ్రాసిన చీటీ వారి చేతికి యిస్తున్నప్పుడు వణికిపోయాను. మా తండ్రి భగందర రోగంతో బాధపడుతూ మంచం పట్టి వున్నారు ఆయన బల్లమీద పడుకుని వున్నారు. చీటీ వారిచేతికి యిచ్చి ఎదురుగా నిలబడ్డాను

వారు చీటీ అంతా చదివారు. వారి కండ్ల నుండి ముత్యాలవలె కన్నీరు కారసాగింది. ఆ కన్నీటితో చీటీ తడిసిపోయింది. ఒక్క నిమిషము సేపు కండ్లు మూసుకుని ఏమో యోచించారు. తరువాత చీటీని చింపివేశారు. మొదట చీటీ చదివేందుకు ఆయన పడకమీద నుంచి లేచారు. ఆ తరువాత తిరిగి పడుకున్నారు. నాకు కూడ ఏడుపు వచ్చింది. తండ్రికి కలిగిన వేదనను గ్రహించాను. చిత్రకారుడనైతే ఈ రోజున కూడా ఆ దృశ్యాన్ని చిత్రించగలను ఆ దృశ్యం యిప్పటికీ నా కండ్లకు కట్టినట్లు కనబడుతున్నది. వారి ప్రేమాశ్రువులు నా హృదయాన్ని కడిగివేశాయి అనుభవించిన వారికే ఆ ప్రేమ బోధపడుతుంది.

"రామబాణ్ వాగ్యాంరే హోయ్ తే జేణే" రామబాణం మహిమ ఆ బాణం తగిలిన వాడికే తెలుస్తుంది అని దాని అర్థం. ఆ ఘట్టం నాకు మొదటి అహింసా పాఠం అయింది. పితృవాత్సల్యం అంటే ఏమిటో అప్పుడు నాకు బోధపడలేదు. కాని ఈనాడు ఆలోచిస్తే అదంతా అహింస మహిమేనని అనిపిస్తుంది. అట్టి అహింస అంతటా వ్యాప్తమైనప్పుడు దాని స్పర్శ తగలకుండా వుండదు. అహింసా శక్తి అమోఘం.

అంతటి శాంతం ఓర్పు వాస్తవానికి మా తండ్రి స్వభావానికి విరుద్ధం. ఆయన కోప్పడతారనీ, దూషిస్తారనీ లేక తల బ్రద్దలు కొట్టుకుంటారనీ భావించాను. కాని ఆయన ప్రదర్శించిన శాంతితత్వం అద్భుతం. అందుకు కారణం దోషాన్ని అంగీకరించడమేనని నా విశ్వాసం. మళ్లీ యీ విధమైన దోషం చేయను అని శపథం చేశాను. దాని అర్థం గ్రహించగలవారి ముందు వుంచాను. అదే సరియైన ప్రాయశ్చిత్తమని నా అభిప్రాయం. నేను దోషం అంగీకరించి యిక చేయనని శపథం చేసినందువల్ల మా తండ్రి నన్ను విశ్వసించారు. వారికి నా మీద వాత్సల్యం ఇనుమడించిందని నాకు బోధపడింది.

## 9. పితృ నిర్యాణం - నా వల్ల జరిగిన మహాపరాధం

అప్పుడు నాకు పదహారో ఏడు. మా తండ్రిగారు రాచకురుపుతో బాధపడుతూ మంచం పట్టారని పాఠకులకు తెలుసు. మా అమ్మగారు, ఒక పాత నౌకరు, నేను మా తండ్రిగారికి ముఖ్య పరిచారకులం. నర్సుపని, అనగా కట్టు విప్పి తిరిగి కట్టు కట్టడం, మందులు ఇవ్వడం, అవసరమైనప్పుడు మందులు నూరడం, మందులు కలపడం మొదలగు పనులు నాకు అప్పగించారు ప్రతి రాత్రి వారి కాళ్ళు పిసికి, వారు చాలు అన్నప్పుడు విరమించేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు వారు నిద్రించేంతవరకు కాళ్ళు పిసుకుతూ వుండేవాణ్ణి. ఈ విధంగా తండ్రికి సేవ చేయడం నాకు ఎంతో ఇష్టంగా వుండేది. ఈ విషయంలో నేను ఎప్పుడూ ఏమరచి వుండలేదని గుర్తు. నిత్యకృత్యాలు తీర్చుకునేందుకు అవసరమైన సమయం మినహా, మిగతా సమయమంతా బడికి వెళ్ళిరావడం, తండ్రికి సేవ చేయడంలో గడుపుతూ వుండేవాణ్ణి. నాకు మా తండ్రి సెలవు యిచ్చినప్పుడు వారికి కొంచెం నయంగా వున్నప్పుడు మాత్రమే నేను సాయంత్రం వాహ్యాళికి వెళుతూ వుండేవాణ్ణి. ఆ ఏడే నా భార్యకు నెల తప్పింది యిప్పుడు ఆ విషయం తలచుకుంటే సిగ్గు వేస్తుంది. నేను విద్యార్థి దశలో వుండికూడా బ్రహ్మచర్యాన్ని పాటించలేదు. నాకు కలిగిన సిగ్గుకు అదొక కారణం. విద్యా వ్యాసంగం నా విధి. పైగా చిన్నప్పటి నుంచి శ్రవణుడంటే నాకు గురి. పితృసేవ అంటే నాకు ఆసక్తి. అయినా నా భోగవాంఛ వీటన్నింటినీ మించిపోయిందన్నమాట. నా సిగ్గుకు యిది రెండో కారణం. ప్రతిరోజు రాత్రిపూట నా చేతులు మా తండ్రి పాదాలు వత్తుతూ వున్నా నా మనస్సు మాత్రం పడకగది మీద కేంద్రీకరించి యుండేది. ధర్మశాస్త్రం, వైద్యశాస్త్రం, లోకజ్ఞానం మూడింటి దృష్ట్యా స్త్రీ సంగమం నిషేధించబడిన సమయంలో నా మనఃస్థితి యిలా వుండేది. వదిలి పెడితే చాలు వెళదామని తొందరగా వుండేది. అనుమతి లభించగానే మా తండ్రి గారికి నమస్కరించి తిన్నగా పడకగదికి వడివడిగా వెళ్ళేవాణ్ణి.

సరిగ్గా ఆ రోజుల్లోనే మా తండ్రిగారికి క్రమక్రమంగా వ్యాధి ఎక్కువ కాసాగింది. ఆయుర్వేద వైద్యుల పూతలు, హకీముల పట్టీలు, నాటు వైద్యుల ఔషధాలు అన్నీ పూర్తి అయ్యాయి. ఒక అలోపతీ డాక్టరు కూడా వచ్చి తన శక్తిని వినియోగించి చూచాడు. శస్త్ర చికిత్స తప్ప వేరే మార్గం లేదని డాక్టరు చెప్పివేశాడు. కాని అందుకు మా కుటుంబ వైద్యుడు అంగీకరించలేదు. మా వైద్యుడు సమర్థుడు, సుప్రసిద్ధుడు కూడా. అందువల్ల ఆయన మాట నెగ్గింది. శస్త్రచికిత్స జరుగలేదు. అందుకోసం కొన్న మందులన్నీ మూలబడ్డాయి. కుటుంబవైద్యుడు శస్త్రచికిత్సకు అంగీకరించియుంటే వ్రణం నయమైపోయేదని నా తలంపు. ఆ శస్త్రచికిత్స బొంబాయిలో ప్రసిద్ధుడైన ఒక గొప్ప డాక్టరు చేత చేయించాలని భావించాం. కాని ఈశ్వరేచ్ఛ అనుకూలం కాలేదు. మృత్యువు నెత్తిమీదకు వచ్చిపడినప్పుడు మంచి ఉపాయం ఎవ్వరికీ తోచదుకదా! తరువాత శస్త్రచికిత్స పరికరాలన్నింటిని వెంటపెట్టుకుని మా తండ్రిగారు బొంబాయి నుండి ఇంటికి వచ్చేశారు. ఆయనకు యిక జీవించననే విశ్వాసం కలిగింది. క్రమంగా ఆయన నీరసించిపోయారు. మంచంమీదనే అన్ని పనులు జరగవలసిన స్థితి ఏర్పడింది. కాని మా తండ్రిగారు అందుకు అంగీకరించలేదు. పట్టుపట్టి చివరివరకు ఏదో విధంగా లేచి అవతలకి వెళుతూ వుండేవారు. బహిర్శుద్ధి విషయంలో వైష్ణవ ధర్మంలో విధులు అంత కఠినంగా వుండేవి. అట్టి శుద్ధి అవసరమే, కాని రోగికి బాధ కలగకుండా, మంచం మీద మైలపడకుండ, పరిశుభ్రంగా నిత్యకృత్యాలు, మంచం మీదనే ఎలా జరపవచ్చునో పాశ్చాత్య వైద్యశాస్త్రం మనకు నేర్పింది. ఈ విధమైన పారిశుధ్యాన్నే నేను వైష్ణవ ధర్మమని అంటాను. కాని రోగతీవ్రతలో సైతం మా తండ్రిగారు స్నానాదుల కోసం మంచం దిగవలసిందేనని పట్టుబట్టడం నాకు ఆశ్చర్యం కలిగించింది. లోలోపల వారిని మెచ్చుకునేవాణ్ణి. ఒకనాడు ఆ కాళరాత్రి రానే వచ్చింది. మా పినతండ్రి రాజకోటలో వుండేవారు. మా తండ్రి అపాయస్థితిలో వున్నారని తెలిసి ఆయన రాజకోటకు వచ్చారని నాకు కొద్దిగా గుర్తు. వారిరువురి మధ్య సోదర ప్రేమ అధికంగా వుండేది. మా పినతండ్రి పగలంతా మా తండ్రిపడక దగ్గరే కూర్చుండి, రాత్రిపూట మమ్మల్నందరినీ నిద్రపొమ్మని పంపివేసేవాడు. తాను మా తండ్రి మంచం ప్రక్కనే పడుకునేవాడు. అది చివరిరాత్రి అని ఎవ్వరం ఊహించలేదు. అయితే ఎప్పుడూ భయం భయంగా వుండేది. ఆ రాత్రి 10.30 లేదా 11 గంటలైంది. నేను మా తండ్రిగారి కాళ్ళు పిసుకుతూ వున్నాను. "నువు వెళ్ళు నేను కూర్చుంటాను" అని మా పినతండ్రి అన్నారు. ఆ మాటలు విని నేను సంతోషించాను. తిన్నగా పడకగదిలోకి వెళ్ళిపోయాను.

పాపం నా భార్య గాఢనిద్రలో వుంది. నేను ఆమెను నిద్రపోనిస్తానా? ఆమెను లేపాను. అయిదు ఆరు నిమిషాల తరువాత మా నౌకరు వచ్చి దబదబ తలుపు తట్టాడు. కంగారు పడిపోయాను. నాన్నగారికి జబ్బు పెరిగిందని బిగ్గరగా అన్నాడు. బాగా జబ్బులో వున్నారను విషయం నాకు తెలుసు అందువల్ల జబ్బు పెరిగిందనేసరికి విషయం నాకు బోధపడింది. పక్క మీద నుంచి క్రిందికి దూకాను.

"సరిగా చెప్పు ఏమైంది?"

"తండ్రిగారు చనిపోయారు" అని సమాధానం వచ్చింది. ఆ మాట విని క్రుంగిపోయాను. పశ్చాత్తాపపడితే ప్రయోజనం ఏమిటి? చింతతో విచారం కలిగింది. తండ్రిగారి దగ్గరికి పరుగెత్తాను. భోగవాంఛ నన్ను అంధుణ్ణి చేసింది. అందువల్ల చివరి క్షణంలో మా తండ్రిగారి శాశ్వత ప్రయాణ సమయంలో నేను వారి దగ్గర వుండలేకపోయాను. వారి వేదనలో పాలుపంచుకోలేకపోయాను. ఆ అదృష్టం మా పినతండ్రి గారికి దక్కింది. మా పినతండ్రి తన అన్నగారికి పరమ భక్తుడు. అందువల్ల ఆయనకే అంత్యకాలంలో సేవ చేసే అదృష్టం లభించింది. మరణం ఆసన్నమైందని మా తండ్రి గ్రహించారు. సైగ చేసి కలం, కాగితం తెప్పించి దాని మీద ఏర్పాటు చేయండి అని వ్రాశారు. తరువాత తన దండకు కట్టియున్న తాయెత్తును, మెడలో వున్న బంగారపు తులసి తావళాన్ని తీసి క్రింద పెట్టారు. వెంటనే కన్నుమూశారు. కన్న తండ్రి ప్రాణం పోతున్నప్పుడు కూడా నా భార్యపై కలిగిన మోహం నాకు మాయరోగం వచ్చి తెచ్చింది. నాకు తల్లి, తండ్రి యెడగల భక్తి అపారం. వారికోసం నా సర్వస్వం ధారపోయగలను. కాని అందు యింకా కొరత వుందని ఈ ఘట్టం వల్ల తెలిసింది. ఆ సమయంలో నేను మేల్కొని వుండాలి. ఆ సమయంలో నా మనస్సు భోగవాంఛలతో [illegible] అందువల్ల ఎన్నటికీ క్షమించరాని దోషం చేశాను. ఏకపత్నీవ్రతుణ్ణి అయినా కామాంధుణ్ణి అని భావించక తప్పదు. కామవాంఛను అదుపులో పెట్టడానికి చాలా కాలం పట్టింది. దాన్ని అదుపులో పెట్టుకునేలోపున అనేక గండాలు గడిచాయి. [illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]

# 10. మతంతో పరిచయం

ఆరవ ఏట నుంచి ప్రారంభించి పదహారు సంవత్సరాల వయస్సు వచ్చేదాక విద్యాధ్యయనం కావించాను. కాని పాఠశాలలో అప్పటిదాకా మతాన్ని గురించిన బోధ జరుగలేదు. కాని అక్కడి వాతావరణం వల్ల అట్టి కొత్త శిక్షణ లభించింది. ఇక్కడ ధర్మం అంటే ఆత్మ బోధ లేక ఆత్మ జ్ఞానమను విశాల అర్థాన్ని పాఠకులు గ్రహించుదురు గాక. వైష్ణవ సంప్రదాయంలో జన్మించడం వల్ల దేవాలయం వెళ్ళే అవకాశం నాకు తరచుగా లభిస్తూ ఉండేది. కాని ఆ కోవెల అంటే నాకు శ్రద్ధ కలుగలేదు. దాని వైభవం నాకు బోధపడలేదు. అచట కొంత అవినీతి జరుగుతున్నదని విని దాని యెడ ఉదాసీనత ఏర్పడింది.

అయితే నాకు అక్కడ అబ్బని విశేషం ఒకటి మా కుటుంబమందలి దాసివల్ల అబ్బింది. ఆమె నా యెడ చూపించిన వాత్సల్యం ఇప్పటికీ నాకు గుర్తు వున్నది. భూత ప్రేతాదులంటే నాకు భయం అని మొదట వ్రాశాను. మా కుటుంబదాసి పేరు రంభ. ఆమె భూత ప్రేతాదుల భయానికి రామ నామ స్మరణం మంచి మందు అని చెప్పింది ఆమె చెప్పిన మందు మీద కంటే ఆమె మీద నాకు అమిత నమ్మకం ఏర్పడింది. దానితో అప్పటినుండి భూత ప్రేతాదుల భయం పోయేందుకై రామనామ జపం ప్రారంభించాను. ఆ జపం ఎక్కువ కాలం చేయలేకపోయినా చిన్ననాట హృదయంలో నాటుకున్న రామనామమను బీజం తరువాత కూడా చెక్కు చెదరకుండా అలాగే హృదయంలో వుండిపోయింది. ఈనాడు రామనామం నా పాలిట దివ్యౌషధం. ఆనాడు అది రంభ నాటిన విత్తనమే.

ఆ రోజుల్లో మా పినతండ్రి కొడుకు యొక్క సాహచర్యం మాకు లభించింది. అతడు రామభక్తుడు. మా అన్నదమ్ములిద్దరికీ అతడు రామరక్షాస్తోత్రం నేర్పే ఏర్పాటు చేశాడు. ఆ స్తోత్రం మేము కంఠోపాఠం చేశాము. ప్రతిరోజు ప్రాతఃకాలం స్నానం చేసిన తరువాత రామనామ స్తోత్ర జపం చేయడం అలవాటు చేసుకున్నాం. పోరుబందరులో వున్నంత కాలం మా జపం నిర్విఘ్నంగా సాగింది. రాజకోట వాతావరణం వల్ల కొంత సడలిపోయింది. ఈ జపం మీద నాకు శ్రద్ధ కలుగలేదు. మా పినతండ్రి కుమారుని యెడగల ఆదరభావం వల్ల రామరక్షా స్తోత్రం శుద్ధమైన ఉచ్చారణతో సాగుతూవుండేది.

రామాయణ పారాయణం ప్రభావం నా మీద అమితంగా పడింది. మా తండ్రి గారు జబ్బు పడ్డప్పుడు కొంతకాలం పోరుబందరులో ఉన్నాం. అక్కడ గల రామాలయంలో రోజూ రాత్రిపూట రామాయణం వింటూ వుండేవాణ్ణి. రామభద్రుని

పరమభక్తుడు భీలేశ్వర్‌కు చెందిన లాధామహారాజ్ రామాయణం వినిపిస్తూ వుండేవాడు. ఆయనను కుష్ఠురోగం పట్టుకుందట. ఆ రోగానికి ఆయన ఏ మందూ వాడలేదు భీలేశ్వర్‌లో గల మహా శివునికి బిల్వ పత్రాలతో భక్తులు పూజ చేస్తూ వుండేవారు. ఆ విధంగా శివుని స్పర్శ పొందిన బిల్వపత్రాల్ని ఆయన కుష్ఠు సోకిన అవయవాలకు కట్టుకునేవాడు. రామనామ జపం చేస్తూ వుండేవాడు. దానితో అతని కుష్ఠురోగం పూర్తిగా నయమైపోయిందని ఆబాలగోపాలం చెప్పుకునేవారు. అది నిజమో కాదో మాకైతే తెలియదు. కాని ఆయన నోట రామాయణం వినేవారమంతా అది నిజమేనని నమ్ముతూ వుండేవారం. రామాయణగానం ప్రారంభించినప్పుడు ఆయన ఆరోగ్యంగా వున్నాడు. ఆయన కంఠం మధురంగా ఉన్నది. ఆయన రామాయణానికి సంబంధించిన దోహాచౌపాయిలు పాడుతూ వాటి అర్థం చెపుతూ అందులో తను లీనమైపోయేవాడు. శ్రోతలు తన్మయత్వంతో ఆయన గానం వింటూ వుండేవారు. అప్పుడు నాకు పదమూడు సంవత్సరాల వయస్సు. ఆయన రామకథ వినిపిస్తూ వుంటే ఆనందంతో వింటూ వుండేవాణ్ణి. యిప్పటికీ నాకు ఆ విషయం గుర్తు వుంది. ఆనాటి రామాయణ శ్రవణం వల్ల నాకు రామాయణం యెడ ప్రేమ అంకురించిన మాట నిజం. తులసీదాసు రామాయణం సర్వోత్తమమైన గ్రంథం.

కొద్దినెలల తరువాత మేము రాజకోటకు వచ్చాము. అక్కడ రామాయణ కాలక్షేపానికి అవకాశం చిక్కలేదు. కాని ప్రతి ఏకాదశి నాడు భాగవతపారాయణం జరుగుతూ వుండేది. నేను అప్పుడప్పుడు భాగవతం విందామని వెళ్ళేవాణ్ణి. ఆ పౌరాణికుడు జనాన్ని ఆకర్షించలేకపోయాడు. భాగవతం భక్తి ప్రధానమైనదని తెలుసుకున్నాను. నేను దాన్ని గుజరాతీ భాషలో తన్మయుడనై చదివాను. మూడు వారాలపాటు నేను ఉపవాసదీక్ష వహించిన సమయంలో పండిత మదన మోహన మాలవ్యాగారు మూలంలోని కొన్ని ఘట్టాలు చదివి వినిపించారు. మాలవ్యావంటి మహాభక్తుని నోట భాగవతం వినే అదృష్టం నాకు కలిగింది. అట్టి అదృష్టం బాల్యంలోనే కలిగియుంటే దానిపై గాఢమైన ప్రీతి కలిగియుండేది కదా అని అనుకున్నాను. బాల్యంలో శుభాశుభ సంస్కారాల ప్రభావం అమితంగా హృదయం మీద పడుతుంది. అందువల్ల బాల్యకాలంలో అటువంటి గ్రంథాలు ఎక్కువగా వినలేక పోతినను విచారం నాకు కలుగుతూ వుంటుంది.

రాజకోటలో వున్నప్పుడు సర్వమత సంప్రదాయాలయెడ సమత్వభావం సునాయాసంగా ఏర్పడింది. హిందూమతమందలి అన్ని సంప్రదాయాల యెడ నాకు ఆదరభావం కలిగింది. మా తల్లిదండ్రులు అక్కడ రామాలయానికి శివాలయానికి

వెళుతూవుండేవారు. మమ్మల్ని కూడా తమతోపాటు అక్కడికి తీసుకుని వెళుతూవుండేవారు. అప్పుడప్పుడు మమ్మల్ని పంపుతూ వుండేవారు. జైన ధర్మాచార్యులు తరచుగా మా తండ్రిగారి దగ్గరకు వస్తూవుండేవారు. వారు మా తండ్రిగారితో ధర్మాన్ని గురించి, తదితర విషయాల్ని గురించి చర్చిస్తూవుండేవారు. ఇంతేగాక మా తండ్రికి మహమ్మదీయులు, పారశీకులు చాలామంది మిత్రులు వుండేవారు. వారు తమ తమ మతాల్ని గురించి చెపుతూ వుండేవారు. మా తండ్రి వారి మాటలు శ్రద్ధతో వింటూ వుండేవారు మా తండ్రిగారికి 'నర్సు' గా వున్నందువల్ల వాళ్ళ మాటలు వినే అవకాశం నాకు లభిస్తూ వుండేది ఈ విధంగా వివిధ మతాలను గురించిన విషయాలు వింటూ ఉండడం వలన వాటన్నిటియెడ సమత్వభావం నాకు కలిగింది. అందుకు ఆ చర్చలు దోహదం చేశాయి.

ఇక క్రైస్తవ మతం మాత్రమే మిగిలింది. దానియెడ నాకు అభిరుచి కలుగలేదు. పైగా అరుచి ఏర్పడింది. ఆ రోజుల్లో క్రైస్తవమత బోధకులు కొందరు మా హైస్కూలు దగ్గర ఒక మూల నిలబడి హిందువుల్ని వారి దేవుళ్ళను నిందిస్తూ ఉపన్యాసాలు చేస్తూ వుండేవారు నేను ఆ నిందను సహించలేకపోయేవాణ్ణి. వాళ్ళను వినడానికి నేను ఒక పర్యాయం మాత్రమే అక్కడ నిలబడ్డాన్నూ. ఇక నిలబడి వినవలసిన అవసరం లేకుండా పోయింది. ఆ రోజుల్లోనే సుప్రసిద్ధుడగు ఒక హిందువు క్రైస్తవమతంలో కలిసిపోయాడనీ, అతడు గోమాంసం తినవలసి వచ్చిందనీ మద్యం సేవించవలసి వచ్చిందనీ, వేషం కూడా మార్చవలసి వచ్చిందనీ తరువాత హ్యాటు, బూటు, కోటు వగైరా పాశ్చాత్య దుస్తులు ధరించి తిరగవలసి వచ్చిందనీ ఊరూ వాడా మారుమ్రోగిపోయింది. ఈ విషయం విని నేను బాధపడ్డాను. గోమాంస భక్షణం, మద్యసేవనం, పాశ్చాత్య వేషధారణం ఇట్టి విధులు విధించు మతం మతమనిపించుకోదను భావం నాకు కలిగింది. క్రొత్తగా మతం పుచ్చుకున్న ఆ వ్యక్తి అప్పుడే హిందూమతాన్ని, హిందూ

ఇట్టి విషయాలన్నీ క్రైస్తవ మతమంటే నాకు అరుచి కలిగించాయి.

దింత ఇతర మతాలయెడ సమభావం కలిగినంత మాత్రాన నాకు దేవుని మీద పూర్తిగా శ్రద్ధ ఏర్పడిందని అనుకోకూడదు. ఇదే సమయంలో మా తండ్రిగారి దగ్గర గల గ్రంథ సముదాయంలో మనుస్మృతి అను గ్రంథం కనబడింది. అందు వివరించబడిన విషయాలవల్ల నాకు శ్రద్ధ కలిగించలేదు. కొద్దిగా నాస్తికత్వం కలిగించాయి. మా రెండవ పినతల్లి కుమారుని తెలివితేటల మీద నాకు విశ్వాసం కలిగింది. నా సందేహాల్ని

అతనికి తెలియజేశాను. అతడు నా సందేహనివృత్తి చేయలేకపోయాడు. "పెద్దవాడనైన తరువాత సందేహ నివృత్తి నీవే చేసుకోగలుగుతావు. చిన్నపిల్లలు ఇటువంటి ప్రశ్నలు వేయకూడదు". అని అతడు అన్నాడు. మనస్సుకు శాంతి లభించలేదు. మనుస్మృతి అందలి ఖాద్యాఖాద్య ప్రకరణం, తదితర ప్రకరణాలలో ప్రచలిత విధానాలకు విరుద్ధమైన కొన్ని విషయాలు వ్రాసి వున్నాయి. యీ విషయమై కలిగిన సందేహానికి సమాధానం కూడా అదే పద్ధతిలో లభించింది. పెద్దవాడనైన తరువాత చదివి తెలుసుకుంటానని మనస్సుకు నచ్చచెప్పుకున్నాను.

మనుస్మృతి చదివిన ఆ సమయంలో నాకు అహింసా బోధ కలుగలేదు. మనుస్మృతిలో మాంసాహారానికి సమర్థన లభించింది. పాములు, నల్లులు మొదలుగా గల వాటిని చంపడం నీతి బాహ్యం కాదని తోచింది. ఆ రోజుల్లో ధర్మమని భావించి నల్లుల్ని నేను చంపాను. ఆ విషయం యిప్పటికీ నాకు జ్ఞాపకం వున్నది.

ఒక్క విషయం మాత్రం గాఢంగా నా హృదయంలో నాటుకున్నది. ఈ ప్రపంచం నీతిమీద నిలబడి వున్నది. నీతి అనేది సత్యంతో కూడివుంది కనుక సత్యాన్వేషణ జరిపితీరాలి అను భావం నాలో గట్టిపడింది. రోజురోజుకి సత్యం యొక్క మహత్తు నా దృష్టిలో పెరిగిపోసాగింది. సత్యాన్ని గురించిన వ్యాఖ్య నా దృష్టిలో విస్తరించింది. యిప్పటికీ విస్తరిస్తూ ఉంది.

నీతికి సంబంధించిన ఒక ఛప్పయ్ ఛందం నా హృదయంలో చోటు చేసుకున్నది. ఆ పద్యంలో చెప్పబడిన అపకారానికి ప్రతీకారం అపకారం కాదు, ఉపకారం సుమా! అను సూత్రం నా జీవితానికి మూలమైంది ఆ సూత్రం నా మనస్సుపై రాజ్యం చేసింది. అపకారికి మేలుకోరడం, మేలు చేయడం అంటే అనురాగం పెరిగింది. ఈ విషయమై ఎన్నో ఎన్నెన్నో ప్రయోగాలు చేశాను. ఆ మహత్తరమైన ఛప్పయ్ ఛందస్సు క్రింద ఉటంకిస్తున్నాను.

పాణీ ఆపనే పాయ్, భలుం భోజన్ తో దీజే
ఆనీ నమానే శీశ్, దండవత్ కోడే కీజే
ఆపణ ఘూసే దామ్, కామ్ మహోరో నుం కరిఏ
గుణ కేడేతో గుణ దశగణో, మన వాచా కర్మేకరీ
అవగుణ కేడేజే గుణకరే, తేజగమాంజీత్యో సహీ.

"జలమును మీకీయగలవాని కెందేని నొసగుమీ కడుపార నోగిరంబు
వందనంబును జేయువానికిజేయుమీ భుక్తిమై సాష్టాంగవందనంబు

దమ్మిడినీకిచ్చు ధన్యాత్మునకు మాఱుగా నిమ్ము నీ నెమ్మేనినేని కోసి
ఒకటియొసగిన బదిరెట్టులొసగవలయు
చెట్టు చేసిన మేలును జేయవలయు
ప్రాతఃకాలము నాటి యీ చేతలెల్ల
అనుపూర్విగ సత్యరహస్యమరయ"
(తెలుగుసేత - శతావధాని వేలూరి శివరామశాస్త్రి)

## 11. సీమకు ప్రయాణ సన్నాహం

1887 వ సంవత్సరంలో నేను మెట్రిక్యులేషన్ పరీక్షకు కూర్చున్నాను. అప్పుడు అహ్మదాబాదు, బొంబాయి పరీక్షాకేంద్రాలు. దేశంలో దారిద్ర్యం ఎక్కువగా వుండటంవల్ల కారియావాడ్ విద్యార్థులు తమకు దగ్గరలో వున్న కొద్ది ఖర్చుతో పని జరిగే అహ్మదాబాదు కేంద్రానికి వెళ్ళేందుకు ఇష్టపడేవారు. మా కుటుంబ ఆర్థికస్థితి కూడా అంతంతమాత్రంగానే వుంది. అందువల్ల నేను ఆ కేంద్రానికే వెళ్ళవలసి వచ్చింది. రాజకోట నుండి అహ్మదాబాదు ఒంటరిగా మొదటిసారి ప్రయాణం చేశాను

మెట్రిక్యులేషన్ పూర్తి అయిన తరువాత కాలేజీలో చదవమని మా పెద్దలు ప్రోత్సహించారు. భావనగర్ మరియు బొంబాయిలో కాలేజీలు వున్నాయి భావనగర్‌లో ఖర్చు తక్కువ అందువల్ల అక్కడి శ్యామలదాస్ కాలేజీలో చేరాను. కాని అక్కడంతా అడవి గొడవ. ఉపాధ్యాయులు చెప్పేది నాకు బోధపడలేదు. అది వారి లోటు కాదు. నా లోటే. ఆరు నెలలు గడిచాయి. ఇంటికి వెళ్ళాను. "మావుజీదవే" అనువారు మా కుటుంబానికి పాత మిత్రులు. మాకు మంచి చెడులు చెబుతూ వుండేవారు. ఆయన బ్రాహ్మణులు. విద్వాంసులు. వ్యవహారదక్షులు. మా తండ్రిగారు గతించిన తరువాత కూడా మా కుటుంబ కష్టసుఖాల్ని గురించి తెలుసుకుంటూ వుండేవారు. సెలవుదినాల్లో వారు మా ఇంటికి వచ్చారు. మా అమ్మగారితోను, మా పెద్దన్నగారితోనూ మాట్లాడుతూ నా చదువును గురించి అడిగారు. నేను శ్యామలదాసు కాలేజీలో చేరి చదువుతున్నానని తెలుసుకున్నారు. కొంతసేపు యోచించి వారు ఈ విధంగా అన్నారు. "ఇప్పుడు కాలం మారింది. తగిన చదువు లేందే మీలో ఎవ్వరూ ఇప్పుడు మీ నాన్నగారు పొందిన పదవి, హోదా పొందలేరు. ఈ పిల్లవాడు చదువులో ముందడుగు వేస్తున్నాడు. కనుక ఇతడు ఈ హోదాను నిలుపుకునేలా చూడండి. బి.ఏ. ప్యాసు కావాలంటే ఇంకా నాలుగేళ్ళ సమయం పడుతుంది. ఎంత తంటాలుపడ్డా నెలకు 50 లేదా 60 రూపాయలు మాత్రమే సంపాదించగలుగుతాడు. దివాను మాత్రం కాలేడు. మా కుమారుని వలె

లాయరు కావాలంటే చాలా కాలం పడుతుంది. ఈ పిల్లవాడు లాయరు అయ్యేనాటికి దివాన్ పదవి కోసం చాలామంది లాయర్లు తయారవుతారు. అందువల్ల మీ పిల్లవాణ్ణి ఇంగ్లాండు పంపడం మంచిదని నా అభిప్రాయం. అక్కడ బారిష్టరు కావడం తేలిక అని మా అబ్బాయి కేవలరామ్ చెప్పాడు. మూడేళ్ళలో తిరిగి రావచ్చు. నాలుగైదు వేల రూపాయలు ఖర్చు అవుతాయి. బారిష్టరై తిరిగివచ్చిన ఆ క్రొత్తవాణ్ణి చూడండి ఎంత దర్జాగా వుంటాడో, అతడు అడిగితే చాలు దివాన్‌గిరీ ఇచ్చేలా వున్నారు. కనుక ఈ సంవత్సరమే మోహనదాస్‌ను ఇంగ్లాండు పంపడం మంచిది. మా అబ్బాయి కేవల్‌రామ్‌కు ఇంగ్లాండులో మిత్రులున్నారు. వారికి పరిచయ పత్రాలిస్తాడు. అందువల్ల పిల్లవాడికి అక్కడ యిబ్బంది కలుగదు'' ఈ విధంగా మా వాళ్ళకు చెప్పి జోషీగారు (దవేగారిని మా కుటుంబీకులు జోషీగారని అనేవారు) మేము అంగీకరించినట్లు భావించి నా వంకకు తిరిగి "నీవు ఇక్కడ చదవడం కంటే ఇంగ్లాండులో చదువుకునేందుకు అభిలషింపవా?'' అని అడిగారు. వారి మాటలు విన్న నాకు సంతోషం కలిగింది. కాలేజీలో సాగుతున్న కఠినమైన విద్యాబోధన వల్ల నేను విసిగిపోయివున్నాను. అందువల్ల వారి ఈ మాట వినగానే ఆనందపడి "ఎంత త్వరగా నన్ను పంపితే అంత మంచిది'' అని అనివేశాను. పరీక్షలు త్వరగా ప్యాసు కావడం కష్టం. అందువల్ల నన్ను వైద్య చదువుకు పంపకూడదా అని అడిగాను.

మా అన్నగారు నా మాటకు అడ్డువచ్చి "నాన్నకు వైద్యమంటే ఇష్టం లేదు. మనం వైష్ణవులం. పీనుగుల్ని కోయడం మనకు పాడికాదు అని నాన్నగారు నిన్ను దృష్టిలో పెట్టుకుని అనేవారు. నీవు వకీలు కావడం నాన్నగారికి ఇష్టం'' అని అన్నాడు.

వెంటనే జోషీ మా అన్నగారి మాటల్ని సమర్థిస్తూ ఇలా అన్నారు. "నేను మీ నాన్నగారిలా వైద్యవృత్తిని ద్వేషించను. వైద్యవృత్తిని శాస్త్రం కూడా నిషేధించలేదు నీవు వైద్యపరీక్ష ప్యాసైనా దివాన్ పదవి పొందలేవు. నీవు దివాన్ కావాలి. చేతనైతే అంత కంటే పెద్ద పదవి సంపాదించాలి. అప్పుడే ఈ పెద్ద కుటుంబాన్ని పోషించగలుగుతావు. రోజులు త్వరగా మారిపోతున్నాయి. రోజులు గడిచేకొద్దీ కష్టాలు పెరుగుతాయి. అందువల్ల బారిష్టరు కావడమే అన్నివిధాలా మంచిది'' అని చెప్పి మా అమ్మగారి వంక తిరిగి "ఇక నాకు సెలవీయండి. నేను చెప్పిన విషయాన్ని గురించి యోచించండి. మళ్ళీ నేను వచ్చేసరికి ఇంగ్లాండు ప్రయాణానికి సన్నాహాలు జరుపుతూ వుండండి. నేను చేయగల సాయం ఏమైనా వుంటే తప్పక చేస్తా'' అంటూ జోషీ లేచి వెళ్ళిపోయారు. నేను ఆకాశ సౌధాలు నిర్మించసాగాను.

మా అన్నగారు ఆలోచనా సాగరంలో మునిగిపోయారు. నన్ను ఇంగ్లాండు పంపడానికి డబ్బు ఎక్కడినుంచి తేవడం? ఒంటరిగా చిన్నవాణ్ణి ఇంగ్లాండుకు ఎలా పంపడం? ఈ మథనలో అన్నగారు పడ్డారు

మా అమ్మగారు కూడా చింతలో పడిపోయింది. నన్ను విడిచి వుండలేదు. నా ఎడబాటు ఆమె సహించలేదు. అందువల్ల ఒక ఉపాయం ఆమెకు తట్టింది. "మన కుటుంబ పెద్దలు మీ పినతండ్రిగారున్నారు కదా! మొదట వారితో సంప్రదిద్దాం. వారు అంగీకరిస్తే తరువాత ఆలోచిద్దాం" అని ఆమె అన్నది.

మా అన్నగారికి మరో ఊహ కలిగింది. "పోరుబందరుపై మనకు కొంత హక్కు వున్నది. అక్కడ లేలీగారు పెద్ద అధికారి. మన కుటుంబమంటే వారికి గౌరవం. మన పినతండ్రిగారంటే వారికి ప్రత్యేక అభిమానం. నీ విద్యా వ్యయానికి సంస్థానం పక్షాన కొంత సహాయం అందజేసి వారు తోడ్పడవచ్చు" అని నాతో అన్నారు.

వారి మాటలు నాకు నచ్చాయి. పోరుబందరుకు ప్రయాణమైనాను. ఆ రోజుల్లో రైళ్ళు లేవు. ఎద్దుబండిమీద ప్రయాణం చేయాలి. నాకు పిరికితనం ఎక్కువ అని ముందు వ్రాశాను. అయితే ఇంగ్లాండుకు వెళ్ళాలనే ఉత్సాహం కలగడం వల్ల దాని ముందు నా పిరికితనం పటాపంచలైపోయింది. ధోరాజీ వరకు ఎడ్లబండిలో వెళ్ళాను. ఒంటెమీద ప్రయాణం సాగించాను. ఒంటె ప్రయాణం మొట్టమొదటిసారి చేశాను.

పోరుబందరు చేరాను. మా పినతండ్రిగారికి సాష్టాంగప్రణామం చేశాను. విషయమంతా వారికి చెప్పాను. వారు అంతా విని కొంచెం సేపు ఆలోచించి యిలా అన్నారు. "ఇంగ్లాండులో స్వధర్మ రక్షణ సాధ్యపడుతుందని నాకు అనిపించడంలేదు. నేను విన్న విషయాల్ని బట్టి అక్కడ స్వధర్మరక్షణ అసంభవమని భావిస్తున్నాను. అక్కడికి వెళ్ళివచ్చిన బారిష్టర్లను చూస్తున్నాను. వీళ్ళకు ఆ తెల్లవాళ్ళకు భేదం కనబడటం లేదు. ఆహారం విషయంలో వారికి నిషేధాలు లేవు. చుట్ట ఎప్పుడూ వారి నోట్లో ఉండవలసిందే. ఇంగ్లీషువాళ్ళ దుస్తులు సిగ్గులేకుండా ధరిస్తారు. అది మన కుటుంబ సంప్రదాయం కాదు. నేను కొద్దిరోజుల్లో తీర్థయాత్రకు బయలుదేరుతున్నాను. నేను యిక ఎన్నాళ్ళో బ్రతకను. కాటికి కాళ్ళు చాచుకొని ఉన్న నేను సముద్రయానానికి అంగీకరించలేను. కాని నేను నీ దారికి అడ్డం రాను. ఈ విషయంలో నిజంగా కావలసింది మీ అమ్మగారి అనుమతి. ఆమె అంగీకరిస్తే బయలుదేరు. నేను అడ్డురానని ఆమెకు చెప్పు. నేనూ ఆశీర్వదిస్తాను.

"నాకు కావలసింది అదే. మా అమ్మగారి అనుమతి కోసం ప్రయత్నిస్తాను. మీరు లేలీగారికి సిఫారసు చేయండి" అని అడిగాను "నేను ఎలా చేస్తాను? అయితే

అతను మంచివాడు. నీవే ఉత్తరం వ్రాయి. మన కుటుంబాన్ని గురించి తెలిస్తే తప్పక అనుమతిస్తాడు. సహాయం కూడా చేయవచ్చు." అని అన్నారు

నేను సిఫారసు చేయమని అడిగితే మా పినతండ్రి ఎందుకు అంగీకరించలేదో నాకు బోధపడలేదు. సముద్రయానానికి ప్రత్యక్షంగా సాయం చేయడం ఆయనకు ఇష్టం లేదని నాకు గుర్తు.

లేలీగారికి జాబు వ్రాశాను. వారి అనుమతి తీసుకుని కలుద్దామని వెళ్ళాను. మేడమీద ఎక్కుతూ ఆయన నన్ను చూచాడు. బి.ఏ. పూర్తిచేయి. తరువాత వచ్చి కలు. నీకు ఇప్పుడు ఏమీ సాయం లభించదు. అని చెప్పి పైకి వెళ్ళిపోయాడు. నేను ఆయనను చూడడానికి బాగా తయారైవచ్చాను వారికి చెప్పాలని కొన్ని మాటలు కూడా వ్రాసుకుని బాగా వల్లించాను. వంగి వంగి రెండు చేతులతో సలాం చేశాను. కాని అంతా వృధా అయిపోయింది.

తరువాత ఆలోచించాను. నా భార్య నగలపై నా దృష్టి పడింది మా అన్నగారిమీద నాకు అపరిమిత విశ్వాసం. ఆయన ఉదార హృదయుడు. ఆయనకు నాపై పుత్రవాత్సల్యం. నేను పోరుబందర్ నుండి రాజకోటకు వచ్చాను. జరిగినదంతా చెప్పాను. జోషీగారితో కూడా మాట్లాడాను అవసరమైతే అప్పు చేసైనా ఇంగ్లాండు వెళ్ళమని ఆయన సలహా ఇచ్చాడు. నా భార్య నగలు అమ్మితే రెండు మూడు వేల రూపాయలు వస్తాయనీ, వాటిని అమ్మి ఇంగ్లాండుకు వెళతానని అన్నాను. మా అన్నగారు ఏదో విధంగా డబ్బు ఏర్పాటు చేస్తానని వాగ్దానం చేశారు.

కాని మా అమ్మకు ఇష్టం లేదు. ఆమె ఏవో వంకలు చెప్పడం మొదలుపెట్టింది. ఇంగ్లాండు వెళ్ళే యువకులు చెడిపోతారని ఎవరో ఆమెకు చెప్పారు. అక్కడి వాళ్ళు గోమాంసం తింటారని, మద్యం త్రాగందే బ్రతకలేరని కూడా చెప్పారు. "ఇదంతా ఏమిటి?" అని ఆమె నన్ను అడిగింది. "అమ్మా! నన్ను నమ్మవా? నేను నీకు అబద్ధం చెబుతానా? నేను వాటిని ముట్టుకోను. ఒట్టు పెట్టుకుంటాను. నిజానికి అటువంటి అపాయమేవుంటే జోషీగారు వెళ్ళమని చెబుతారా?" అని అన్నాను. 'నాయనా! నాకు నీమీద నమ్మకం ఉన్నది. కానీ దూరదేశం కదా! ఎట్లా నమ్మడం? నాకు ఏమీ తోచడం లేదు. బేచర్జీ స్వామిని అడిగిచూస్తాను" అని ఆమె అన్నది.

బేచర్జీ స్వామి మోఢ్ వైశ్యులు. మధ్యలో ఆయన జైన సాధువుగా మారారు. జోషీగారివలెనే వారు కూడా మా కుటుంబహితైషి వారిని కలిశాము. "ఇతని చేత మూడు వాగ్దానాలు చేయించి ఇంగ్లాండుకు పంపవచ్చు" అని చెప్పి "మద్యం,

మాంసం, మహిళ`` లను ముట్టనని నా చేత ప్రమాణం చేయించారు. అప్పుడు మా అమ్మ అంగీకారం తెలిపింది.

హైస్కూల్లో నాకు వీడ్కోలు సభ జరిగింది. రాజకోటకు చెందిన ఒక పిన్న వయస్కుడు ఇంగ్లాండు వెళ్ళడం అక్కడ అసాధారణ విషయమైపోయింది. నేను నా కృతజ్ఞతలు తెలిపేందుకు మూడు నాలుగు వాక్యాలు ముందుగా వ్రాసి పెట్టుకున్నాను. వాటిని చదివేసరికి నాకు చెమటలు పట్టాయి. శరీరం వణికింది. ఆనాటి ఆ విషయం యిప్పటికీ నాకు బాగా గుర్తు ఉన్నది.

పెద్దల దీవెనలతో బొంబాయికి బయలుదేరాను బొంబాయికి ఇదే నా ప్రథమ యాత్ర. మా అన్న నా వెంట బొంబాయి వచ్చారు. కాని ఇల్లు అలకగానే పండుగ అవుతుందా? బొంబాయిలో కొన్ని గండాలు దాటవలసి వచ్చింది.

## 12. కుల బహిష్కరణ

మా అమ్మ ఆజ్ఞను, ఆశీస్సులను పొంది పసిపాపను, భార్యను విడిచి అమితోత్సాహంతో బొంబాయికి బయలుదేరాను జూన్, జూలై మాసాల్లో హిందూ మహాసముద్రం సామాన్యంగా ఒడిదుడుకులుగా ఉంటుంది. "మీ తమ్ముడికి ఇది మొదటి ప్రయాణం కదా! నవంబరు వరకు సముద్రప్రయాణం ఆపుకోండి. ఈ మధ్యనే తుఫాను వల్ల ఒక స్టీమరు కూడా మునిగిపోయింది." అని కొందరు మిత్రులు మా అన్నగారికి చెప్పారు. దానితో ఆయన కంగారుపడి సముద్ర ప్రయాణానికి అంగీకరించలేదు. అక్కడే ఒక మిత్రుని ఇంట్లో నాకు బస ఏర్పాటు చేసి తాను రాజకోటకు వెళ్ళి ఉద్యోగంలో చేరారు. నాకు కావలసిన ప్రయాణ వ్యయం మా బావ దగ్గర వుంచారు. వెళ్ళేప్పుడు ఇమ్మని చెప్పడమే గాక, అవసరమైన సహాయం చెయ్యమని మిత్రులకు కూడా చెప్పి మా అన్న ఇంటికి వెళ్ళిపోయారు.

బొంబాయిలో ప్రొద్దుపోవడం లేదు. రాత్రింబవళ్ళు ఎప్పుడూ ఇంగ్లాండుకు వెళ్ళే కలవరింతలే. ఇంతలో మా కులంవారిలో కలవరం బయలుదేరింది. అంతవరకు మా కులంవారైన మోఢ్‌వైశ్యులెవ్వరూ సీమ ప్రయాణం చేయలేదు. నేను సీమ వెళుతున్నాను గనుక నన్ను కులాన్నుంచి బహిష్కరించాలని కొందరికి ఆవేశం కలిగింది. అందుకోసం ఒక సభ ఏర్పాటు చేశారు. కులస్థులు చాలామంది వచ్చారు నన్ను పిలిపించారు. నాకు అంత సాహసం ఎలా వచ్చిందో నాకే తెలియదు. నేనాసభకు నిర్భయంగ వెళ్ళాను. ఆ కులం పెద్ద అయిన సేఠ్‌కు మా తండ్రిగారికి పరిచయం వున్నదట. ఆయన మాకు దూరబంధువుకూడానట

"కులధర్మాన్ని బట్టి నీవు సీమకు వెళ్ళడం సరిగాదు. సముద్రయానం మనకు నిషిద్ధం. అక్కడ ధర్మపాలనం సాధ్యంకాదు" అని సేఠ్ అన్నాడు. "సీమకు వెళ్ళడం ఎంతమాత్రం ధర్మేతరం కాదు. నేను అక్కడికి విద్య కోసం వెళుతున్నాను. మీరు భయపడుతున్న వస్తువుల్ని తాకనని మా అమ్మ దగ్గర ప్రతిజ్ఞ చేశాను. అది నన్ను కాపాడుతుంది" అని సమాధానం చెప్పాను.

"నీవు అక్కడికి వెళితే ధర్మపాలన జరగదు. మీ తండ్రిగారికి నాకు ఎంతటి స్నేహమో నీకు తెలుసా? కావున నా మాటవిను. సీమ ప్రయాణం విరమించుకో" అని సేఠ్ చెప్పగా, "అయ్యా నాకు తెలుసును. మీరు నా తండ్రివంటి వారు. సీమకు వెళ్ళాలనే నా నిర్ణయం మార్చుకోను. మా తండ్రిగారికి మిత్రులు, విద్వాంసులు అగు బ్రాహ్మణులు సీమకు వెళ్ళమని ప్రోత్సహించారు. వారికి దోషం ఏమీ కనబడలేదు. మా అమ్మగారు, మా అన్నగారు కూడా అంగీకరించారు. అందువల్ల నేను వెళతాను" అని సమాధానం ఇచ్చాను.

"అయితే కులం పెద్దల ఆజ్ఞను మన్నించవా?"

నాకు వేరే మార్గం లేదు. కులం పెద్దలు ఈ విషయంలో కల్పించుకోకూడదని స్పష్టంగా చెప్పివేశాను. దానితో సేఠ్‌గారికి కోపం వచ్చింది. చివాట్లు పెట్టాడు. నేను నిబ్బరంగా కూర్చున్నాను.

"నేను ఇతణ్ణి కులం నుంచి వెలివేస్తున్నాను. ఇతనికి సహాయం చేసేవారికి ఇతణ్ణి సాగనంపేందుకు హార్బరు దగ్గరకు వెళ్ళేవారికి ఒక రూపాయి పావలా (సాలి గ్రామదానం) జరిమానా విధిస్తున్నాను." అని సేఠ్ తన నిర్ణయం ప్రకటించాడు. నేను ఏమీ చలించలేదు. సేఠ్ దగ్గర సెలవు తీసుకొని తిరిగి వచ్చేశాను. మా అన్నగారికి ఈ విషయం తెలిస్తే వెళ్ళవద్దు తిరిగి వచ్చేయమంటారేమోనని భయపడ్డాను. కాని మా అన్నగారు ఆ విధంగా అనలేదు సరికదా, కులంవారు వెలివేసినా భయపడనవసరం లేదు నీవు నిర్భయంగా సీమకు వెళ్ళు అని జాబు వ్రాశారు. అది నా అదృష్టం. ఇదంతా జరిగిన తరువాత నాకు తొందర ఎక్కువైంది. ఇలాంటి వారి వత్తిడివల్ల మా అన్నగారి మనస్సు మారుతుందేమోనన్న భయం నన్ను పట్టుకున్నది. ఇంతలో జునాగఢ్ వకీలు ఒకరు ఇంగ్లాండుకు బారిష్టరు పరీక్ష కోసం సెప్టెంబరు నాలుగోతేదీన వెళుతున్నారని తెలిసింది. నేను ఈ వార్తను మా అన్నగారి మిత్రులకు తెలియజేశాను. ఇట్టి అవకాశం పోగొట్టుకోకూడదని వారంతా భావించారు. సమయం తక్కువగా వున్నందున తంతి ద్వారా ఈ విషయం మా అన్నగారికి తెలియజేశాను. ఆయన అందుకు అంగీకరించాడు.

మా బావగారికి తెలిపి పైకం అడిగాను. ఆయన "సేఠ్ ఆజ్ఞను గురించి చెప్పి నేను నీకు డబ్బు ఇవ్వను" అని అన్నాడు. అప్పుడు నేను మా కుటుంబమిత్రులు ఒకరి దగ్గరకు వెళ్ళి విషయం అంతా చెప్పి నా ప్రయాణానికి అవసరమైన సొమ్ము ఇచ్చి సాయం చేయమనీ, మా అన్నగారిదగ్గర ఆ పైకం తీసుకోవచ్చుననీ విన్నవించాను. ఆయన నా విన్నపం అంగీకరించడమే కాక నన్నెంతో ప్రోత్సహించారు. వారికి కృతజ్ఞతలు తెలిపి అవసరమైన డబ్బు తీసుకొని వెళ్ళి ఓడ టిక్కెట్టు కొన్నాను. ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లు చేసుకోవాలి. అక్కడి మిత్రులు అనుభవజ్ఞులు. నాకు అవసరమయ్యే దుస్తులు తయారు చేయించారు. ఆ దుస్తులు విచిత్రంగా ఉన్నాయి. వాటిలో కొన్ని నాకు బాగున్నాయి. కొన్ని బాగాలేవు. ఇప్పుడు నేను ధరించేందుకు అంగీకరించిన నెక్‌టైని ఆనాడు అసహ్యించుకున్నాను. పొట్టి చొక్కా (జాకెట్) ధరిస్తుంటే సిగ్గు వేసింది అయితే ఇంగ్లాండు వెళ్ళాలనే ఉత్సాహం ముందు ఈ చిన్న వ్యవహారాలు నిలువలేదు. ప్రయాణానికి అవసరమైన తినుబండారాలు అధికంగా సమకూర్చుకున్నాను. జునాగఢ్ వకీలు త్ర్యంబకరాయ్ మజుందార్‌గారు కేబిన్‌లోనే నా మిత్రులు నాకు ఒక బెర్తు తీసుకున్నారు. వారికి నన్ను పరిచయం చేశారు. ఆయన పెద్దవాడు, లోకానుభవం గలవాడు నాకు అంత లోకానుభవం లేదు పద్దెనిమిదేండ్లవాణ్ణి. ఇతణ్ణి గూర్చి మీరేమీ భయపడవద్దని నన్ను సాగనంపడానికి వచ్చినవారందరికీ మజుందార్ చెప్పాడు ఈ విధంగా 1888 సెప్టెంబరు 4వ తేదీనాడు బొంబాయినుండి ఓడలో ఇంగ్లాండుకు బయలుదేరాను.

## 13. చివరికి సీమ చేరాను

సముద్రయానం వల్ల అందరికీ సామాన్యంగా వచ్చే వాంతులు మొదలగు వ్యాధులు నాకు రాలేదు. కాని రోజులు గడుస్తున్న కొద్దీ నాకు ఆరాటం పెరుగుతూ ఉంది. స్టుఅర్డు అనగా నౌకరుతో మాట్లాడటానికి కూడా నాకు సంకోచంగా ఉండేది. నాకు ఇంగ్లీషులో మాట్లాడే అలవాటు లేదు. రెండవ సెలూన్‌లో ఒక్క మజుందారు తప్ప తక్కిన వారంతా ఆంగ్లేయులే. వారితో నేను మాట్లాడలేను. వారు ఇంగ్లీషులో ఏమి మాట్లాడారో నాకు తెలిసేది కాదు. తెలిసినప్పుడు బదులు చెప్పలేకపోయేవాణ్ణి. సమాధానం చెప్పదలిస్తే ముందు ప్రతివాక్యం లోపల కూడబలుక్కోవలసి వచ్చేది భోజన సమయంలో ముల్లు గరిటెలు వాడటం నాకు చేతకాదు. ఆహార పదార్థాలలో మాంసం కలవని వస్తువులేమిటి అని అడగడానికి ధైర్యం చాలేది కాదు. అందువల్ల భోజనశాలలకు వెళ్ళి పదిమందితో కలిసి కూర్చొని నేనెప్పుడూ భోజనం చేయలేదు. నా

గదిలోనే వుండి నేను వెంట తెచ్చుకున్న చిరుతిండ్లు, పండ్లు తింటూ ఉన్నాను. మజుందారుగారికి ఇట్టి బాధలేదు. ఆయన అందరితోను కలిసి స్టీమరు పైభాగాన తిరుగుతూ వుండేవారు. కాని నేను పగలంతా నా గదిలోనే వుండి సాయంత్రం జనం తక్కువగా వున్నప్పుడు ఓడ పైకి వెళ్ళి తిరుగుతూ వుండేవాణ్ణి. మజుందారు నీవు కూడా ప్రయాణీకులందరితో కలసిమెలసి వుండమనీ, సిగ్గుపడవద్దనీ చెబుతూ వుండేవాడు. లాయర్లు బాగా మాట్లాడుతూ వుండాలని కూడా చెప్పి తన అనుభవాలు వినిపిస్తూ వుండేవాడు. అవకాశం దొరికినప్పుడు ఇంగ్లీషులో మాట్లాడుతూ వుండమనీ, తప్పులు వచ్చినా భయపడవద్దని కూడా చెప్పేవాడు. కాని నాకు మాత్రం ధైర్యం చాలలేదు.

ఒక ఆంగ్లేయుడు దయతో నన్ను మాటల్లోకి దింపాడు. అతడు నాకంటే పెద్దవాడు నీవు ఏమి తిన్నావు? నీకేం పని? నీవెక్కడికి వెళుతున్నావు? నీకీ మొగమాటం ఎందుకు? ఈ రకమైన ప్రశ్నలు వేశాడు. అందరితోబాటు భోజనానికి రమ్మని ప్రోత్సహించాడు. మాంసం ముట్టకూడదన్న నా దీక్షను గురించి విని నవ్వాడు. ఓడ ఎర్ర సముద్రంలో ప్రవేశించినప్పుడు స్నేహితుడిలా సలహా యిస్తూ "బిస్కే సముద్రం చేరేటంతవరకు నీవు చెప్పిన విధంగా శాకాహారం తీసుకోవచ్చు. కాని తరువాత నీ ఆహార నియమాన్ని మార్చుకోక తప్పదు. ఇంగ్లాండులో చలి అధికం. అందువల్ల మాంసం తినక తప్పదు" అని చెప్పాడు.

"అక్కడ మాంసం తినకుండా కూడా జనం ఉండవచ్చని విన్నానే" అని అన్నాను "అసంభవం నాకు తెలిసినంతవరకు ఆ విధంగా వుండే వారెవ్వరూ లేరు. నేను మద్యం తాగుతున్నాను. నన్ను తాగమనీ చెప్పానా? కాని మాంసం తినక తప్పదు. మాంసం తినకపోతే అక్కడ బ్రతకడం కష్టం" అని అన్నాడు.

'మీ ఉపదేశానికి ధన్యవాదాలు. నేను మా అమ్మగారి ఎదుట మాంసం ముట్టనని ప్రమాణం చేశాను. అందువల్ల ఏది ఏమైనా సరే, నేను మాంసం తినను. ఒక వేళ కుదరకపోతే తిరిగి మా దేశానికి వచ్చేస్తాను. అది మంచిదని నా అభిప్రాయం' అని చెప్పాను.

ఓడ బిస్కే సముద్రంలో ప్రవేశించింది. కాని అక్కడ మద్య మాంసాల జోరు కనబడలేదు. నేను బయలుదేరేటప్పుడు నీవు మాంసం ముట్టలేదని తెలిపి వారి దగ్గర సర్టిఫికెట్టు తీసుకోమని మిత్రులు నాకు చెప్పారు. ఆ విషయం నాకు జ్ఞాపకం వున్నది. నాకు ఒక సర్టిఫికెట్టు ఇమ్మని వారిని కోరాను. అతడు సంతోషంతో ఇచ్చాడు. నేను కొంతకాలం ఆ సర్టిఫికెట్టును జాగ్రత్తగా కాపాడాను. కాని ఆ తర్వాత మాంసం

తినేవాళ్ళు కూడా మాంసం తినడం లేదని సర్టిఫికెట్టు పుచ్చుకోవడం చూచాను. దానితో ఈ విధమైన సర్టిఫికెట్ల మోజు తగ్గిపోయింది మాటకు విలువ వుండాలే గాని ఈ విధమైన సర్టిఫికెట్ల వల్ల ప్రయోజనం ఏముంటుందని అనిపించింది.

ప్రయాణం ముగించుకొని మేము సౌదెంప్టన్ చేరాం. ఆనాడు శనివారం అని గుర్తు. నా మిత్రులు తెల్లని ఉన్ని సూటు (ఫాంటు, కోటు, వెస్టుకోటు) తయారు చేయించి ఇచ్చారు ఓడలో నల్ల సూటు ధరించాను. రేవులో దిగినప్పుడు తెల్ల సూటు బాగుంటుందని భావించి దాన్ని ధరించాను. అవి సెప్టెంబరు మాసం చివరి రోజులు నేను తప్ప మరెవ్వరూ అటువంటి సూటు ధరించలేదు. చాలామంది తమ సామాను. తాళం చెవుల్తో సహా గ్రిండ్లే కంపెనీ ఏజంటుకు అప్పగించడం చూచి నేను కూడా అలాగే నా సామాను వారికి అప్పగించాను

డాక్టర్ ప్రాణ్ జీవన్ మెహతా, దలపత్‌రాం శుక్ల, రణజిత్ సింగ్ మహారాజ్, దాదాభాయి నౌరోజీ గార్ల పేరిట మిత్రులు ఇచ్చిన సిఫారసు పత్రాలు నా దగ్గర వున్నాయి. లండనులో విక్టోరియా హోటలులో బస చేయమని ఒకరు ఓడలో మాకు సలహా ఇచ్చారు ఆ ప్రకారం నేను, మజుందారు యిద్దరం విక్టోరియా హోటలుకు వెళ్ళాం. తెల్ల దుస్తుల్లో వెలివేసినట్లు నేనొక్కణ్ణే అక్కడ కనబడుతూ వుండటం వల్ల బాధపడ్డాను. మర్నాడు ఆదివారం. అందువల్ల గ్రిండ్లే కంపెనీ వారు సామాను ఇవ్వరని తెలిసి చిరాకు పడ్డాను.

సౌదెంప్టన్ నుంచి డాక్టర్ మెహతాగారికి నేను తంతి పంపాను. అది వారికి అందింది. ఆదివారం రాత్రి ఎనిమిది గంటలకు హోటలుకు వచ్చి నన్ను కలిశారు. నన్ను ఎంతో ఆదరంగా చూచారు. నా ఉన్ని దుస్తుల్ని చూచి ఆయన నవ్వారు. మాటల సందర్భంలో అయాచితంగా వారి హేట్‌ను చేతిలోకి తీసుకున్నాను. దాని మృదుత్వాన్ని పరిశీలిద్దామని చేతితో దాన్ని అటూ ఇటూ త్రిప్పి దానిమీద గల రోమాల్ని నిమరడం ప్రారంభించాను. మెహతాగారు కొంచెం చిరాకు పడి నన్ను వారించారు. కాని అప్పటికే నా వల్ల పొరపాటు జరిగిపోయింది. ఇది మొదటి మందలింపు. పాశ్చాత్య దేశంలో యిది నేను నేర్చుకున్న మొదటి పాఠం. ఆ దేశ విశేషాల్ని గురించి మెహతాగారు చెబుతూ "ఇతరుల వస్తువుల్ని తాకకూడదు. హిందూ దేశంలో వలె ఇక్కడ ప్రథమ పరిచయం కాగానే ఎవ్వరినీ ప్రశ్నలు వేయకూడదు. హిందూ దేశంలో ఎదుటవారిని మనం అయ్యా అని సంబోధిస్తాం. ఇక్కడ ఆవిధంగా సంబోధించకూడదు. ఇక్కడ

యజమానుల్ని నౌకర్లు మాత్రమే అయ్యా అని సంబోధిస్తారు. హోటల్లో ఉంటే ధనం బాగా ఖర్చువుతుంది. కావున ఏదో కుటుంబంలో చేరడం మంచిది." అని చెప్పాడు. సోమవారం నాడు ఒక నిర్ణయానికి వద్దామని భావించాం.

శ్రీ మజుందారు గారికీ, నాకూ కూడ హోటలు ఖర్చు అధికమనిపించింది. ఓడలో ప్రయాణం చేస్తున్నప్పుడు ఒక సింధు మిత్రుడు మాతోబాటు ప్రయాణించాడు. ఆయనకీ మజుందారుగారికీ స్నేహం కలిసింది. ఆయనకు లండను కొత్త కాదు లండనులో మీకు అద్దె గదులు యిప్పిస్తానని ఆయన మాకు చెప్పాడు. మేము అంగీకరించాము. సోమవారంనాడు గ్రిండ్లే కంపెనీ వారు మా సామాన్లు మాకు అందజేశారు. హోటలు వాళ్ళకు ఇవ్వాల్సిన సొమ్ము ఇచ్చి వేశాము. మా సింధు మిత్రుడు మా కోసం చూచి పెట్టిన గదుల్లో ప్రవేశించాం. హోటలు గదికి చెల్లించాల్సిన అద్దె క్రింద నా వంతు సొమ్ము మూడు పౌండ్లు చెల్లించివేశాను. నేను బిల్లు చూచి నివ్వెరపోయాను. ఇంత సొమ్ము చెల్లించి కూడా ఆకలితోనే వున్నాను. హోటలు భోజనం రుచించలేదు. ఒక వస్తువు తీసుకొని రుచి చూచాను. అది రుచించలేదు. మరో వస్తువు తీశాను. రెండిటికీ సొమ్ము చెల్లించవలసి వచ్చింది. బొంబాయి నుండి వెంట తెచ్చుకున్న తినుబండారాల మీదనే ఆధారపడవలసి వచ్చింది.

ఈ క్రొత్తగదుల్లో కూడా నాకు ఏమీ తోచలేదు. నా మనస్సు ఎప్పుడూ దేశం మీద, ఇంటిమీద, అమ్మమీద కేంద్రితమై వుండేది. బెంగగా వుండేది. రాత్రి ఇంటి సంగతులు జ్ఞాపకం వచ్చేవి. ఒకటే ఏడుపు. రాత్రిళ్ళు నిద్రలేదు. నా కష్టం ఇంకొకరితో చెప్పుకునేది కాదు. చెప్పి ఏం ప్రయోజనం? అంతా క్రొత్త. పాశ్చాత్య దేశాచారాలు నాకు క్రొత్త. ఎంతో జాగ్రత్తగా వుండాలని భావించాను. పైగా శాకాహారం గురించి నేను చేసిన ప్రతిజ్ఞ ఒకటి. అక్కడి ఆహార పదార్థాలు రుచిగా లేవు. ముందుకు పోతే నుయ్యి, వెనక్కు పోతే గొయ్యిగా మారింది నా పని. ఇంగ్లాండులో వుండలేను. తిరిగి ఇండియాకు వెళ్ళలేను. మధనలో పడిపోయాను. చివరకు ఈ మూడు సంవత్సరాలు ఇక్కడ గడపవలసిందే అని ఒక నిర్ణయానికి వచ్చాను. ఇది నాకు కలిగిన అంతరాత్మ ప్రబోధం.

## 14. నా అభిరుచి

**డాక్టర్ మెహతా నన్ను కలుసుకునేందుకు ఎక్టోరియా హోటలు వెళ్ళారు. అక్కడ మా అడ్రసు తెలుసుకుని మా బసకు వచ్చారు**

ఓడ మీద ప్రయాణిస్తున్నప్పుడు మూర్ఖంగా వ్యవహరించి ఒంటికి తామర తగిలించుకొన్నాను. అక్కడ ఉప్పు నీళ్లలో స్నానం చేయవలసి వచ్చింది. ఆ నీళ్లలో సబ్బు కరగదు. నేను సబ్బు రుద్దుకోవడం సభ్యతా లక్షణమని భావించాను. తత్ఫలితంగా శరీరం శుభ్రపడటానికి బదులు జిగటలు సాగింది. దానితో తామర అంటుకున్నది. డాక్టరు మెహతాగారికి చూపించాను. ఆయన మంటలు రేగే యాసిటిక్ యాసిడ్ అను మందు ఇచ్చారు. ఆ మందు నన్ను బాగా ఏడిపించింది.

డాక్టరు మెహతా మా గదులు వగైరా చూచారు. తల త్రిప్పుతూ "ఇలా నడవదు. చదువుకంటే ముందు ఇక్కడి జీవనసరళి తెలుసుకోవడం ముఖ్యం" అందుకోసం ఏదేని కుటుంబంతో కలిసి వుండటం అవసరం. అయితే అందాకా కొంచెం నేర్చుకొనేందుకు, ఫలానా వారి దగ్గర నిన్ను ఉంచాలని అనుకొన్నాను. ఆయన వచ్చి నిన్ను తీసుకొని వెళతాడు అని చెప్పారు. వారి మాటను కృతజ్ఞతా భావంతో శిరసావహించాను. ఆ మిత్రుని దగ్గరకు వెళ్ళాను. ఆయన నన్ను ఆదరించాడు. తన తమ్ముడిలా నన్ను చూచాడు. ఆంగ్ల పద్ధతులు, అలవాట్లు నేర్పాడు. ఇంగ్లీషు మాట్లాడే విధానం కూడా నేర్పాడు.

నా భోజన వ్యవహారం సమస్యగా మారింది. ఉప్పు, మసాలాలు లేని కూరలు రుచించలేదు. ఇంటి యజమానురాలు పాపం నా కోసం ఏమి వండి పెడుతుంది? ఉదయం వరిగల పిండితో జావ చేసేది. దానితో కడుపు కొద్దిగా నిండేది. కాని మధ్యాహ్నం, సాయంత్రం తినడానికి ఏమీ ఉండేది కాదు. పొట్ట ఖాళీ. మాంసం తినమని రోజూ స్నేహితుల ఒత్తిడి పెరిగింది. ప్రతిజ్ఞ సంగతి చెప్పి మౌనం వహించేవాణ్ణి. వాళ్ళ తర్కానికి సమాధానం చెప్పటం కష్టంగా ఉండేది. మధ్యాహ్నం రొట్టె, కూర, మురబ్బాతో పొట్ట నింపుకొనేవాణ్ణి. సాయంత్రం కూడా అదే. రెండు మూడు రొట్టె ముక్కలతో తృప్తి పడేవాణ్ణి. మళ్ళీ అడగాలంటే సిగ్గు. బాగా కడుపునిండా తినే అలవాటు గలవాణ్ణి. ఆకలి బాగా వేస్తూ వుండేది. పాలు ఇచ్చేవారు కాదు. మధ్యాహ్నం సాయంత్రం పాలు లభించేవి కావు. [illegible] ఈ పద్ధతి చూచి మిత్రుడు చికాకుపడ్డాడు "నీవు నా సోదరుడివే అయి వుంటే ఈ పాటికి మూటాముల్లె కట్టించి పంపివేసి వుండేవాణ్ణి. ఇక్కడి పరిస్థితులు తెలియక, చదువురాని నీ తల్లి దగ్గర చేసిన ప్రమాణానికి విలువ ఏమిటి చెప్పు! అది లా ప్రకారం అసలు ప్రమాణమే కాదు. అట్టి ప్రమాణానికి బద్ధుడవైయుండటం అజ్ఞానం. ఇదిగో చెబుతున్నా. ఈ పట్టుదల వల్ల నీకు ఇక్కడ ఏమీ జరగదు. [illegible] గతంలో మాంసం తిన్నానని. అది

రుచించిందని కూడా చెప్పావు. అవసరం లేని చోట మాంసం తిని, అవసరమైన చోట తిననంటున్నావు. ఇది దురదృష్టకరం" అని గట్టిగా అన్నాడు.

ఇట్టి తర్కం రోజూ జరుగుతూ వుండేది. వంద రోగాలకు "తినను" అనే మందు నా దగ్గర వుంది. మిత్రుడు వత్తిడి చేసే కొద్దీ నా పట్టుదల పెరగసాగింది. రోజూ రక్షించమని దేవుణ్ణి ప్రార్థిస్తూ వుండేవాణ్ణి. ఆ రోజు రక్షణ జరుగుతూ వుండేది. దేవుడంటే ఏమిటో, ఎవరో నాకు తెలియదు. కాని ఆనాడు "రంభ" చేసిన బోధ నాకు ఎంతో మేలు చేసింది. చేస్తూ ఉన్నది.

ఒకనాడు మిత్రుడు 'బెంథమ్' వ్రాసిన పుస్తకం నా ఎదుట చదవడం ప్రారంభించాడు. ఉపయోగాన్ని గురించిన అధ్యాయం అది. భాష, విషయం రెండూ గంభీరంగా వున్నాయి. అర్థం గ్రహించడం కష్టం. ఆయన వివరించి చెప్పడం ప్రారంభించాడు. అప్పుడు "క్షమించండి. యింతటి సూక్ష్మ విషయాలు నాకు బోధపడవు. మాంసాహారం ఆవశ్యకమని అంగీకరిస్తాను. కాని నేను చేసిన ప్రమాణాన్ని జవదాటను. దాన్ని గురించి వాదించను. నేను మీతో వాదించి జయం పొందలేనని ఒప్పుకుంటున్నాను. అజ్ఞానిననో, పెంకి వాడననో భావించి నన్ను వదలి వేయండి. మీ ప్రేమకు కృతజ్ఞుణ్ణి. మీరు నా హితైషులని నాకు తెలుసు. మీరు నా మంచి కోరి మళ్ళీ మళ్ళీ చెబుతున్నారని తెలుసు. కాని నేను నా నియమాన్ని ఉల్లంఘించలేను. ప్రతిజ్ఞ ప్రతిజ్ఞయే. అది అనుల్లంఘనీయం" అని స్పష్టంగా చెప్పివేశాను.

నా మాటలు విని మిత్రుడు నిర్ఘాంతపోయాడు. అతడు ఆ పుస్తకం మూసి "మంచిది, యిక వాదించను" అని అన్నాడు. నేను సంతోషించాను. అతడు మళ్ళీ ఎన్నడూ ఆ విషయమై వాదించలేదు. అయితే నన్ను గురించి బాధపడుతూ వుండేవాడు. అతడు పొగత్రాగే వాడు. మద్యం సేవించేవాడు. నాకు అవి గిట్టవని చెప్పివేశాను. అతడు ఎన్నడూ వాటిని త్రాగమని నాకు చెప్పలేదు. అయితే మాంసం తినకపోతే మూలబడతావని, ఈ విధంగా వుంటే ఇంగ్లాండులో వుండలేవని, వచ్చిన పని పూర్తి చేసుకోలేవని ఆయన చెబుతూ వుండేవాడు.

ఒక నెల ఈ విధంగా గడిచింది. ఆయన ఇల్లు రిచ్‌మండ్‌లో ఉంది. అందువల్ల వారానికి రెండు మూరుసార్ల కంటే లండను వెళ్ళడం కష్టంగా వుండేది. ఇది చూచి డా॥ మెహతాగారు, దలపత్‌రాం శుక్లాగారు మరో కుటుంబం చూచారు. నేను అక్కడ వుండడం మంచిదని భావించారు. వెస్టు కెన్సింగ్టన్‌లో వున్న ఒక ఆంగ్లో ఇండియన్ కుటుంబంతో కలిసి వుండటానికి శ్రీ శుక్లాగారు ఏర్పాటు చేశారు. ఆ ఇంటి

యజమానురాలు వితంతువు. ఆమెకు నా ప్రమాణాన్ని గురించి తెలియజేశాను. ఆమె నన్ను జాగ్రత్తగా చూస్తానని మాట ఇచ్చింది. నేను అక్కడ ప్రవేశించాను. కాని అక్కడ కూడా మాకు కటిక ఉపవాసమే. తినుబండారాలు కొద్దిగా పంపమని ఇంటికి వ్రాశాను. అవి యింకా రాలేదు. ఏ వస్తువు తినడానికి రుచిగా వుండేదికాదు. ఆమె పదార్థం వడ్డించి యిది బాగుందా అని అడుగుతూ వుండేది. కాని ఆ పదార్థం గొంతు దిగేది కాదు. ఆమె చేయగలిగింది మాత్రం ఏముంటుంది? నాకు బిడియం తగ్గలేదు. వడ్డించిన దానికంటే మించి యింకా వడ్డించమని అడగటానికి బిడియంగా వుండేది. ఆమెకు ఇద్దరు కూతుళ్ళు. వాళ్ళు చెరొక రొట్టెముక్క బలవంతాన నా ప్లేటులో వుంచేవారు. అయితే అంతకు రెండింతలైతే గాని నా ఆకలి తీరదని పాపం వాళ్ళకు తెలియదు.

కొంతకాలానికి నాకు నిలకడ చిక్కింది. ఇంకా నేను, చదువు ప్రారంభించలేదు. శుక్లా గారి ధర్మమా అని వారిచ్చిన వార్తాపత్రికలు చదవడం ప్రారంభించాను. ఇండియాలో ఎప్పుడూ అట్టి పని చేయలేదు. ఇక్కడ ప్రతిరోజూ వార్తా పత్రికలు చదివి వాటి యందు అభిరుచి కలిగించుకున్నాను. డైలీ న్యూస్, డైలీ టెలిగ్రాఫ్, పాల్‌మాల్ గెజెట్ రోజూ చూడసాగాను. వాటిని చదవడానికి గంట కంటె ఎక్కువ సమయం పట్టేది కాదు.

ఇక ఊరు తిరగడం ప్రారంభించాను. మాంసం లేని హోటల్ళు ఎక్కడ వుంటాయా అని అన్వేషణ ప్రారంభించాను. మా ఇంటి యజమానురాలు అట్టివి కొన్ని వున్నాయని చెప్పింది. రోజూ పది, పన్నెండు మైళ్ళు తిరిగి చవుక రకం దుకాణాల్లో కడుపు నిండ రొట్టె తినడం ప్రారంభించాను. అయినా తృప్తి కలుగలేదు. ఇలా తిరుగుతూ వుంటే ఒక రోజున ఫారింగ్‌డన్ వీధిలో శాకాహారశాల (vegetarian restaurant) ఒకటి కనబడింది. తనకు కావలసిన వస్తువు దొరికినపుడు పిల్లవాడికి ఎంత ఆనందం కలుగుతుందో నాకు అంత ఆనందం కలిగింది. లోపలికి అడుగు పెట్టే పూర్వం ద్వారం దగ్గర గాజు కిటికీలో అమ్మకానికి పెట్టిన పుస్తకం ఒకటి కనబడింది. అది సాల్ట్ రచించిన "అన్నాహారసమర్థన" అను పుస్తకం. ఒక షిల్లింగు ఇచ్చి ఆ పుస్తకం కొన్నాను. తరువాత భోజనానికి కూర్చున్నాను. ఇంగ్లాండు వచ్చాక ఇవాళ కడుపు నిండా మొదటిసారి హాయిగా భోజనం చేశాను. దేవుడు నా ఆకలి తీర్చాడు.

సాల్ట్ రచించిన ఆ పుస్తకం చదివాను. నా మీద ఆ పుస్తక ప్రభావం బాగా పడింది. ఆ పుస్తకం చదివిన తరువాత అన్నాహారం మంచిదనే నిర్ణయానికి వచ్చాను.

మా అమ్మగారి దగ్గర నేను చేసిన ప్రతిజ్ఞ నాకు ఎంతో ఆనందం కలిగించింది. జనమంతా మాంసాహారులైతే మంచిదని ఒకప్పుడు భావించేవాణ్ణి. తరువాత కేవలం ప్రతిజ్ఞ నెరవేర్చడం కోసం మాంసం త్యజించాను. భవిష్యత్తులో బహిరంగంగా మాంసం తిని ఇతరులను కూడా మాంసం తినమని చెప్పి ప్రోత్సహించాలని భావించాను. కాని ఇప్పుడు శాకాహారిగా ఇతరులను కూడా శాకాహారులుగా మార్చాలనే కోరిక నాకు అమితంగా కలిగింది.

## 15. ఆంగ్ల వేషం

రోజురోజుకి నాకు శాకాహారం మీద నమ్మకం పెరగసాగింది. సాల్ట్‌గారి పుస్తకం చదివిన తరువాత ఆహార విషయాలను గురించిన పుస్తకాలు చదవాలనే కాంక్ష పెరిగింది. దొరికిన పుస్తకాలన్నీ చదివాను. హోవర్డు విలియమ్స్‌గారు వ్రాసిన "ఎతిక్స్ ఆఫ్ డైట్" అను గ్రంథం వాటిలో ఒకటి. అందు ఆదికాలం నుండి నేటివరకు మనుష్యుల ఆహారాన్ని గురించిన చర్చ విస్తారంగా వుంది. పైథాగరస్, జీసస్ మొదలుకొని నేటి వరకు వున్న మతకర్తలు, ప్రవక్తలు అంతా ఆకులు, కూరలు, అన్నం తినేవారని రుజువు చేయబడింది. డాక్టర్ ఎల్లిన్‌సన్ గారు ఆరోగ్యాన్ని గురించి వ్రాసిన రచనలు ఉపయోకరమైనవి. ఆయన రోగుల ఆహార పద్ధతులను నిర్ధారించి తద్వారా రోగాల్ని కుదిర్చే ప్రణాళికను ఒక దానిని రూపొందించాడు. అతడు శాకం, అన్నం తినేవాడు. తన దగ్గరికి వచ్చిన వారందరికీ ఆ ఆహారమే నిర్ధారించేవాడు. ఈ గ్రంథాలన్నీ చదవడం వల్ల ఆహార పరీక్ష నా జీవితంలో ప్రధాన స్థానం ఆక్రమించింది. ప్రారంభంలో ఆరోగ్యమే ఆహార పరీక్షకు ప్రధాన కారణం అయినా తరువాత ఈ శాకాహార విధానానికి ధర్మ దృష్టియే ప్రధాన లక్ష్యం అయింది.

అయినా నా మిత్రునికి నా ఆహారాన్ని గురించి బెంగపోలేదు. మాంసం తినకపోతే చిక్కిపోయే ప్రమాదం వుందనీ, ఇంగ్లీషువారితో కలిసి వుండలేకపోవచ్చుననీ భావించి నన్ను మాంసం తినమని వత్తిడి చేయడం ప్రారంభించాడు. నాయందు గల ప్రేమాధిక్యం వల్లనే ఆయన ఈ విధంగా చేశాడు. శాకాహార గ్రంథాలు విస్తారంగా చదవడం వల్ల నాకు చెడు జగుగుతుందేమోనని భయపడ్డాడు. ముఖ్యమైన అసలు చదువు మాని ఆహార పదార్థాలను గురించిన గ్రంథాలు చదువుతూ కాలమంతా వ్యర్థం చేసుకొంటాడేమోనను భావం ఆయనకు కలిగింది. దానితో చివరి ప్రయత్నం గట్టిగా చేయాలని నిర్ణయించుకొన్నాడు. ఒకనాడు నన్ను నాటకానికి రమ్మంటే వెళ్ళాను. నాటకం చూడబోయే ముందు హాల్‌బర్న్ రెస్టారెంటులో భోజనం ఏర్పాటు

చేశాడు. అది నాకు ఒక నగరంలా కనబడింది. విక్టోరియా హోటలును ఖాళీ చేసిన తరువాత ఇంత పెద్ద హోటలును నేను చూడలేదు. విక్టోరియా హోటల్లో నేను ఏవిధమైన ప్రయోగమూ చేయలేదు. అచ్చట ఉన్నన్ని రోజులు ఏమి చేయడానికీ తోచలేదు. కాని ఈ హోటలుకు నన్ను తీసుకురావడానికి ఆయన ఒక ఎత్తు ఎత్తాడని తరువాత బోధపడింది. ఈ హోటలులో చాలామంది భోజనం చేస్తూ ఉంటారు. మధ్యలో మాట్లాడటానికి వీలు ఉండదు. కిక్కురుమనకుండా పెట్టింది తినవలసి వస్తుందనే భావం ఆయనకు కలిగిందన్న మాట. మేము చాలామందిమి ఒక బల్ల దగ్గర కూర్చున్నాము. మొదటి వాయిసూప్, అది దేనితో చేశారా అని నాకు సందేహం కలిగింది. మిత్రుణ్ణి అడగటానికి వీలు లేదు. వడ్డించేవాణ్ణి పిలిచాను. అతణ్ణి ఎందుకు పిలుస్తున్నావని మిత్రుడు గట్టిగా నన్ను అడిగాడు. అంతటితో ఆగక "నీవు ఈ సమాజంలో ఉండగలవు. ఎలా మెలగాలో తెలియకపోతే ఇంకొక హోటలుకు వెళ్ళి భుజించు. నేను వచ్చేదాకా హోటలు బయట వేచి ఉండు" అని కోపంగా అన్నాడు.

ఆయన మాటలు వినగానే నాకు లోలోవ సంతోషం కలిగింది. వెంటనే లేచి బయటికి వచ్చేశాను. దగ్గరలోనే ఒక శాకాహారశాల ఉంది. ప్రొద్దుపోయినందున దాన్ని మూసివేశారు. ఆపూట నాకు తిండిలేదు. తరువాత ఇద్దరం నాటకం చూచేందుకు వెళ్ళాము. ఈ ఘట్టాన్ని గురించి ఆయన ఎన్నడూ నా దగ్గర ఎత్తలేదు. ఎత్తవలసిన అవసరం నాకు లేదు గదా! మా మిత్రకలహం చివరిది ఇదే. అయితే దానివల్ల మా స్నేహానికి ఆటంకం కలగలేదు. ఆయన పడ్డ తపనకు మూలం ప్రేమే. ఆచరణలోను, ఆలోచనలోను వ్యత్యాసం ఉన్నప్పటికీ ఆయనంటే నాకు అమిత గౌరవం ఏర్పడింది

మాంసం తినకపోయినా మిగతా విషయాల్లో ఆంగ్లసమాజంలో సరిగా మసల గలనని ఆయనకు తెలియజేయాలని భావించాను. అందుకోసం అశక్యం అనుకొన్న ఆంగ్ల పద్ధతుల్ని అవలంబించ ప్రారంభించాను.

నేను ధరించే దుస్తులు బొంబాయిలో తయారైనవి. అవి ఇంగ్లీషు వారి సమాజానికి పనికిరావని తెలుసుకొని, ఆర్మీ అండ్ నేవి స్టోర్సులో తయారుచేయించాను. పందొమ్మిది షిల్లింగులు పెట్టి చిమ్నీ పాట్‌హాటు కొన్నాను. ఆ రోజుల్లో నేను ఆ హాట్ కోసం ఎక్కువ ధర చెల్లించాను. అంతటితో ఆగక నాగరికతకు నడిగడ్డ అయిన బాండ్ వీధిలో ఒక ఈవెనింగ్ సూటు కోసం పది పౌండ్లు వెచ్చించాను. మా అన్నగారికి జేబులో వ్రేలాడే రెండు పేటల బంగారు గొలుసు పంపమని వ్రాస్తే ఆయన వెంటనే ఎంతో దయతో పంపించారు. టై కట్టుకోవడం నేర్చుకొన్నాను. మనదేశంలో క్షవరం నాడే అద్దం

చూచే అలవాటు వుండేది. కాని ఇక్కడ నిలువెత్తు అద్దం ముందు నిలబడి టై సరిచేసుకోవడం మొదలుగాగల పనులకు ప్రతిరోజూ పది పదిహేను నిమిషాలు వ్యర్థం అవుతూ ఉండేవి. నా జుట్టు మృదువుగా వుండేది కాదు. అందువల్ల దాన్ని సరిగా దువ్వుకోవడానికి బ్రష్‌తో నిత్యము కుస్తీ పట్టాల్సి వచ్చేది. హేటు ధరించినప్పుడు, తొలగించినప్పుడూ పాపిట చెడిపోకుండా చెయ్యి దానిమీదనే వుంటూ వుండేది. అంతేగాక సభ్యుల మధ్య కూర్చున్నప్పుడు ఎప్పుడూ చెయ్యి పాపిట మీదనే వుంటూ వుండేది.

ఈ టిప్పుటాప్పులు అంతటితో ఆగలేదు. ఆంగ్లేయుల వేషం వేసుకున్నంత మాత్రాన సభ్యుడవటం సాధ్యమా? ఇంకా సభ్య లక్షణాలు నేర్చుకోవలసినవి చాలా వున్నాయి. డాన్సు చేయడం నేర్చుకోవాలి. ఫ్రెంచి భాష బాగా నేర్చుకోవాలి. ఇంగ్లాండుకు పొరుగున వున్న ఫ్రాంసు దేశపు భాష ఫ్రెంచి. యూరప్ పర్యటించాలనే కోరిక నాకు ఉండేది. అంతేగాక సభ్య పురుషుడు ధారాళంగా ఉపన్యసించడం కూడా నేర్చుకోవాలి. నేను డాన్సు నేర్చుకోవాలని నిర్ణయించుకున్నాను. ఒక క్లాసులో చేరాను. ఒక టరముకు మూడు పౌండ్లు ఫీజుగా చెల్లించాను. మూడు వారాలలో ఆరు తరగతులు జరిగి వుంటాయి. తాళానికి అనుగుణ్యంగా అడుగుపడలేదు. పియానో మోగుతూ ఉండేది. కాని అదిఏమి చెబుతున్నదో బోధపడేది కాదు. ఒకటి, రెండు, మూడు అంటూ వాయిద్యం ప్రారంభమయ్యేది. కాని వాటి మధ్య గల అంతరాళం అర్థం అయ్యేది కాదు. ఇక ఏం చేయాలి? చివరికి నా వ్యవహారం కౌపీన సంరక్షణార్థం అయంపటాటోపః అన్న చందానికి దిగింది. వెనకటికి ఒక సన్యాసి తన గోచీని కొరకకుండ ఎలుకల్ని ఆపడానికి ఒక పిల్లిని పెంచాడట. పిల్లిని పెంచడానికి ఒక ఆవు. ఆవును కాచేందుకు ఒక కాపరి. ఈ విధంగా గోచీని రక్షించుకోవడం కోసం సంసారం ఏర్పడిందట.

పాశ్చాత్య సంగీతం నేర్చుకునేందుకై ఫిడేలు నేర్చుకోవాలని నిర్ణయించాను. ఫిడేలుకు మూడు పౌండ్ల సొమ్ము ఖర్చయింది. ఫిడేల్ నేర్చుకోడానికి కొంత ఖర్చు పెట్టక తప్పలేదు. ఉపన్యాస ధోరణి నేర్చుకొనేందుకు మరో గురువుకు ఒక గిన్నీ ప్రవేశ రుసుం క్రింద చెల్లించాను. అందుకోసం బెల్ రచించిన స్టాండర్డ్ ఎలోక్యూషనిస్ట్ అను గ్రంథం కొన్నాను. అందలి పిట్‌గారి ఉపన్యాసంతో అభ్యాసం ప్రారంభించాను.

కాని ఆ బెల్ అను ఆయన నా చెవిలో (బెల్ అనగా) గంట వాయించడంతో మేల్కొన్నాను.

నేను ఇంగ్లాండులో ఎల్లకాలం వుంటానా? ధారాళంగా ఉపన్యసించడం నేర్చుకొని ఏం చేయాలి? డాన్సులు చేసి సభ్యుడినవుతానా? ఫిడేల్ మనదేశంలో లేదా? అక్కడ నేర్చుకోవచ్చుకదా! నేను విద్యార్థిని, విద్యాధనం సేకరించేందుకు నేను వచ్చాను. వృత్తి కోసం నేను సిద్ధం కావాలి. సదాచారాల ద్వారా సభ్యుడనని గుర్తించబడితే చాలు. అంతేకదా కావలసింది? ఇంక ఎందుకీ వ్యామోహం?

ఈ విధమైన భావాలను వెల్లడిస్తూ ఒక జాబు ఉపన్యాస కళను నేర్పే గురువు గారికి వ్రాసి పంపాను. ఆయన దగ్గర రెండు మూడు పాఠాలు మాత్రమే నేను నేర్చుకున్నాను. డాన్సు మాష్టరుకు కూడా అదేవిధమైన జాబు వ్రాశాను. ఫిడేల్ నేర్పే గురువుగారి దగ్గరికి ఫిడేలు పుచ్చుకొని వెళ్ళాను. ఎంత వస్తే అంతకు దీన్ని అమ్మివేయమని చెప్పాను. ఆయనతో అప్పటికే కొద్దిగా స్నేహం ఏర్పడింది. అందువల్ల నాకు కలిగిన మోహభ్రమల్ని గురించి ఆయనకు చెప్పాను. డాన్సుల జంజాటం నుండి నేను బయటపడటానికి ఆయన ఇష్టపడ్డాడు.

సభ్యుడు కావాలనే వ్యామోహం సుమారు మూడు మాసాల పాటు నన్ను వదలలేదు. అయితే ఆంగ్ల వేషానికి సంబంధించిన పటాటోపం మాత్రం కొన్ని సంవత్సరాల వరకు సాగింది. అయినా విద్యార్థిగా మారానని చెప్పవచ్చు.

## 16. మార్పులు

ఆట పాటల్లో పడి నేను ఇష్టం వచ్చినట్లు కాలం గడిపానని ఎవ్వరూ తలంచ వద్దు. అప్పుడు కూడా ఒళ్ళు తెలిసే వ్యవహరించానను విషయం పాఠకులు గ్రహించియే యుందురని భావిస్తున్నాను. కొంత ఆత్మశోధన జరిగిన తరువాతనే ఆ వ్యామోహం తొలగిపోయింది. నేను ఖర్చు పెట్టిన ప్రతి పైసా లెక్క వ్రాశాను. ప్రతి చిన్న వ్యయం అనగా కారు ఖర్చు, తపాలా ఖర్చు, వార్తా పత్రికల నిమిత్తం వెచ్చించే ఒకటి రెండ పెండ్లు మొదలుగా గల వాటినన్నింటిని, పుస్తకంలో వ్రాసి పడుకునే ముందు వాటిని సరిచూచుకునే వాణ్ణి. ఆ అలవాటు యిప్పటికీ నాకు వున్నది. దీనివల్ల అనేక ప్రయోజనాలు కలిగాయి. లక్షలాది రూపాయల ధర్మాదాయం నా చేతుల మీదుగా ఖర్చవుతూ వుండేది. శాఖోపశాఖలుగా అనేక విషయాలకు ధనం ఖర్చు పెడుతున్నా మితంగాను, సరిగాను ఖర్చు చేశాను. ప్రతిరోజు మిగులు చూపానే గాని, తగులు చూపలేదు.

ఈ విషయం ప్రతివారు శ్రద్ధతో గమనించి తనకు వచ్చే ప్రతి పైసకి, తాను ఇచ్చే ప్రతి పైసకి లెక్క వ్రాసి పెడితే చివరికి నావలెనే తప్పక మేలు పొందగలరు. ఇది తథ్యం. ఎంతో జాగ్రత్తగా ఆదాయ వ్యయాలు వ్రాస్తూ వున్నందున ఖర్చు తగ్గించుకోవడం అవసరమని తెలుసుకోగలిగాను. పద్దు పుస్తకం చూచుకుంటే అందు బాడుగలు ఎక్కువగా కనిపించాయి. నేను ఒక కుటుంబంతో కలిసి వుంటున్నందున, వారికి ప్రతి వారం కొంత డబ్బు ఇవ్వవలసి వచ్చింది. మర్యాద కోసం ఆ కుటుంబం వారితో కలిసి డిన్నర్లకు వెళ్ళవలసి వచ్చేది. అప్పుడు ఖర్చు నేను భరించవవలసి వచ్చేది. అందుకు కారణం ఆ దేశంలో డిన్నర్లకు పిలిచిన ఆమె స్త్రీ అయితే పురుషుడే వ్యయం భరించాలి. ఆ కుటుంబం వారికి ప్రతివారం ఇచ్చే సొమ్ములో ఆ డిన్నరు ఖర్చు తగ్గించుకోరు. అదనంగా ఆ ఖర్చు భరించవలసిందే. లెక్కలు చూచాక ఈ ఖర్చు తగ్గించవచ్చునని తోచింది. ఈ విధంగా దుబారా ఖర్చు చేస్తున్నందున నేను ధనికుడననే అపోహ కూడా జనానికి కలుగుతున్నదని తోచింది.

ఈ కుటుంబంతో పాటు ఇక వుండకుండా ప్రత్యేకంగా గదులు అద్దెకు తీసుకొని వుండాలని నిర్ణయించుకున్నాను. నేను చేయవలసిన పనులకు అనుకూలంగాను, సమీపంలోను వుండే చోటుకు మారాలని భావించాను. దానివల్ల అనుభవం గడించవచ్చునని అనుకున్నాను. పనివున్న చోటుకు తేలికగా గంటలో నడిచి వెళ్ళేందుకు వీలుగా దగ్గరలో గదులను అద్దెకు తీసుకున్నాను. అందువల్ల కార్ల బాడుగ వగైరా వ్యయం తగ్గింది. ఇదివరకు ఎక్కడికి వెళ్ళినా కారులో వెళ్ళేవాణ్ణి. అందుకు బాడుగ క్రింద కొంత సొమ్ము ఖర్చు పెట్టవలసి వచ్చేది. ఇప్పుడు అది తగ్గింది. కాని నడిచి వెళ్ళాలంటే కొంత కాలం పడుతున్నది. ఈ విధంగా ప్రతిరోజు చాలా దూరం నడుస్తుండటం వల్ల నాకు జబ్బులు రాకపోవడమే గాక చాలావరకు శరీర దారుఢ్యత కూడా కలిగింది. నేను రెండుగదులు కిరాయికి తీసుకున్నాను. ఒకటి కూర్చునేందుకు, రెండవది పడుకునేందుకు, నేను చేసిన మార్పుల్లో ఇది రెండవ దశ అని చెప్పవచ్చు. మూడో మార్పు కూడా త్వరలోనే వస్తుంది. ఈ విధంగా ఖర్చు సగం తగ్గిపోయింది. కాని సమయమో! బారిష్టరు పట్టాకోసం ఎక్కువగా చదవవలసింది ఏమీ వుండదని తెలిసి ధైర్యం కలిగింది. కాని నా ఇంగ్లీషు భాషాజ్ఞానం సరిగాలేదు. అందుకు బాధగా ఉండేది. "బి.ఏ. పూర్తి చేసుకో, ఆ తరువాత రా" అని శ్రీ లేలీగారు అన్న మాటలు గ్రుచ్చుకుంటున్నాయి. బారిష్టరు కావడం కోసం ఇంకా అదనంగా చదవాలి. ఆక్స్‌ఫర్డు కేంబ్రిడ్జి కోర్సులను గురించి తెలుసుకున్నాను. చాలామంది మిత్రుల్ని కలిశాను.

అక్కడికి వెళితే ఖర్చు చాలా అవుతుందనీ, పైగా కోర్సు చాలా పెద్దదనీ, కాలం బాగా లాగుతుందని తెలిసింది. మూడు సంవత్సరాలకంటే మించి నేను ఇంగ్లాండులో వుండటానికి వీలులేదు. "నీవు పెద్ద పరీక్ష ప్యాసవాలనుకుంటే లండను మెట్రిక్యులేషన్‌కు కూర్చో. అయితే బాగా కష్టపడవలసి వస్తుంది. సామాన్యజ్ఞానం బాగా పెరుగుతుంది. ఖర్చు ఏమీ వుండదు" అని ఒక మిత్రుడు చెప్పాడు. ఈ సలహా నాకు నచ్చింది. కాని కోర్సు చూచేసరికి భయం వేసింది. లాటిన్ మరియు మరో భాషా జ్ఞానం చాలా అవసరం. లాటిన్ తెలిసినవాడు లా గ్రంథాల్ని తేలికగా అర్థం చేసుకుంటాడు. అంతేగాక 'రోమన్ లా' పరీక్షయందు ఒక ప్రశ్న పత్రంపూర్తిగా లాటిన్ భాషలోనే వుంటుంది. లాటిన్ నేర్చుకున్నందువల్ల ఇంగ్లీషు భాష మీద మంచి పట్టు లభిస్తుంది.' అని కూడా ఆ మిత్రుడు చెప్పాడు. ఆయన మాటల ప్రభావం నా మీద బాగా పడింది. కష్టమైనా, సులభమైనా లాటిన్ నేర్చుకోవలసిందేనని నిర్ణయానికి వచ్చాను. ఫ్రెంచి నేర్చుకోవడం అదివరకే ప్రారంభించాను. దాన్ని పూర్తి చేయాలి. అందువల్ల రెండో భాషగా ఫ్రెంచి తీసుకోవాలని నిర్ణయానికి వచ్చాను. ప్రైవేటుగా నడుస్తున్న ఒక మెట్రిక్యులేషన్ క్లాసులో చేరాను. ఆరు నెలలకు ఒక్క పర్యాయం పరీక్ష నడుస్తుంది. అయిదు మాసాల గడువు వున్నది. శక్తికి మించిన పని అని అనిపించింది. సభ్యుడు కావాలని కృషి చేస్తున్న నేను చివరికి కష్టపడి చదివే విద్యార్థిగా మారిపోయాను. టైంటేబులు తయారు చేసుకున్నాను. ఒక్కొక్క నిమిషం మిగుల్చుకోసాగాను. అయితే ఇతర విషయాలతో బాటు లాటిన్ మరియు ఫ్రెంచి భాషల్లో సైతం నైపుణ్యం సంపాదించగలంతటి బుద్ధి వికాసం నాకు కలగలేదు. పరీక్షకు కూర్చున్నాను. లాటిన్‌లో తప్పిపోయాను. విచారం కలిగింది. కాని అధైర్యపడలేదు. లాటిన్ విషయంలో ఆస క్తి పెరిగింది. సైన్సులో మరో విషయం తీసుకుందామని నిర్ణయించాను. రసాయన శాస్త్రం ఒకటి ఉంది. ఆ సబ్జక్టు మీద ఆసక్తి బాగా పెంచుకోవాలని భావించాను. కాని ప్రయోగాలకు అవకాశం లేనందున అది కుదరలేదు. ఇండియాలో రసాయన శాస్త్రం కూడా నేను చదివాను. అందువల్ల లండను మెట్రిక్ కోసం రసాయన శాస్త్రం చదవాలని భావించాను. ఈ పర్యాయం 'వెలుగు, వేడి' అను విషయాలు ఎన్నుకున్నాను. అది తేలికేనని అనిపించింది.

పరీక్ష కోసం తయారీ ప్రారంభించాను. దానితోపాటు జీవితంలో సరళత్వం తేవడం ఇంకా అవసరమని భావించాను. నా కుటుంబ బీద పరిస్థితులకు ఇక్కడి నా జీవనసరళి అనుగుణ్యంగా లేదని తెలుసుకున్నాను. మా అన్నయ్య బీదతనాన్ని

ఆర్థికంగా అతడు పడుతున్న బాధను గురించి తెలుసుకునేసరికి విచారం కలిగింది. కొందరికి విద్యార్థి వేతనం లభిస్తూ ఉండేది. నా కంటే సాదాగా జీవనం గడుపుతున్న విద్యార్థులు కూడా నాకు తటస్థపడ్డారు. అటువంటి చాలా మంది బీద విద్యార్థులతో నాకు పరిచయం ఏర్పడింది. ఒక బీద విద్యార్థి లండన్ నగరంలో "బీదమహల్" లో వారానికి రెండు షిల్లింగుల చొప్పున సొమ్ము చెల్లించి ఒక గదిలో ఉండేవాడు. లోకార్టులో వున్న చవుక కోకో దుకాణంలో రెండు పెన్నీలకు "కోకో, రొట్టె" తీసుకొని పొట్ట నింపుకునేవాడు. అతడితో పోటీపడగల శక్తి నాకు లేదు. అయితే రెండు గదులు ఎందుకు? ఒక్క గదిలో వుండవచ్చుకదా! ఒక పూట భోజనం స్వయంగా తయారు చేసుకుంటే నెలకు అయిదు లేక ఆరు పౌండ్లు మిగులుతాయి. సాదా జీవనసరళిని గురించి పుస్తకాలు చదివాను. రెండు గదులు వదిలి ఒక గది మాత్రమే అద్దెకు తీసుకున్నాను. వారానికి ఎనిమిది షిల్లింగులు చెల్లించాలి. ఒక కుంపటి కొన్నాను. ఉదయం భోజనం స్వయంగా చేసుకోసాగాను. ఇరవై నిమిషాల సమయం వంటకు పట్టేది. వరిగల సంకటికి, కోకో కోసం నీళ్లు వెచ్చ పెట్టడానికి అంతకంటే ఎక్కువ సమయం అనవసరం కదా! మధ్యాహ్నం పూట బయట భోజనం చేసేవాణ్ణి. సాయంత్రం మళ్ళీ కోకో తయారు చేసుకొని రొట్టెతో బాటు పుచ్చుకునేవాణ్ణి. ఈ విధంగా ఒకటి లేక ఒకటిం పావు షిల్లింగ్‌తో రోజూ పొట్టనింపుకోవడం నేర్చుకున్నాను. ఇప్పుడు ఎక్కువ సమయం చదువుకు ఉపయోగించసాగాను. జీవనం సరళం అయిపోయినందున సమయం ఎక్కువ మిగిలింది. రెండో పర్యాయం పరీక్షకు కూర్చొని ప్యాసయ్యాను.

సాదాతనం వల్ల నా జీవితంలో నీరసం వచ్చిందని పాఠకులు భావించకుందురు గాక. ఈ విధమైన మార్పుల వల్ల నా అసలు జీవితానికీ, బాహ్య జీవితానికీ సరియైన సమన్వయం కుదిరింది. కుటుంబ పరిస్థితులకు అనుగుణ్యంగా నా నడవడికలో నా నిత్య వ్యవహారాలలో మార్పు వచ్చింది. జీవితం సత్యమయం అయింది. నాకు ఆత్మ తృప్తి కలిగింది.

## 17. ఆహారంలో మార్పులు - ప్రయోగాలు

నేను లోతుగా పరిశీలించసాగాను. బాహ్యాంభ్యంతరాలైన ఆచారాలు మార్చుకోవలసిన అవశ్యకత గోచరించింది. నిత్య వ్యవహారాలలోను, వ్యయం విషయంలోను మార్పు చేయడంతోపాటు ఆహారంలో కూడా మార్పులు ప్రారంభించాను. శాకాహారం గురించి పుస్తకాలు వ్రాసిన ఆంగ్ల రచయితలు నిశితంగా శోధన చేశారు. మత వైద్య ప్రకృతి శాస్త్రాల కనుగుణ్యంగా ఆచరణకు అనుకూలంగా లోతుగా

పరిశీలించి వ్రాశారు. "మానవుడు జంతువులకంటే అధికుడు. అందువల్ల వాటిని కాపాడటం అవసరం. ఒక మనిషి మరో మనిషికి ఏవిధంగా సహాయం చేస్తాడో అదే విధంగా మిగతా ప్రాణులకు కూడా సహాయం చేయాలి" అని వ్రాసి అది మానవుని నైతిక ధర్మమని నిర్ధారించారు. మనిషి తినడానికి రుచే ప్రధానం కాదని, బ్రతకడానికేనని ప్రకటించి ఇది సత్యమని నిర్ధారించారు. ఆ గ్రంథ రచయితల్లో చాలామంది మాంసాన్నేగాక, గ్రుడ్లను పాలను కూడా నిషేధించారు. వారు స్వయంగా ఆ విధంగా నడుచుకున్నారు. కొందరు మానవశరీర నిర్మాణాన్ని బట్టి వండిన పదార్థాలు సరిపడవనీ, పళ్ళు వచ్చేవరకు పిల్లలకు తల్లిపాలు త్రాగించాలనీ, తరువాత పండ్లు ఫలాలు తినిపించాలని వ్రాశారు. వైద్యశాస్త్ర ప్రకారం ఊరగాయలు, పచ్చళ్ళు, పోపులు, మసాలాలు మొదలగు వాటిని పరిత్యజించాలని చెప్పారు. శాకాహారం అందరికీ అందుబాటులో వుంటుందనీ, ఖర్చు కూడా తక్కువ అవుతుందని నిర్ణయించారు. ఈ నాలుగు విషయాలు నా అనుభవంలోకి కూడా వచ్చాయి. శాకాహార భోజనశాలల్లో ఈ నియమాల్ని పాటించేవారిని చాలామందిని కలుసుకున్నాను. ఆంగ్లదేశంలో శాకాహార ప్రచార సంఘాలు కూడా చాలా ఉన్నాయి. వారు ఒక వారపత్రికను ప్రకటిస్తున్నారు. నేను ఆ సంఘంలో చేరాను. ఆ పత్రికకు చందాదారుణ్ణి అయ్యాను. కొద్ది రోజులకే ఆ సంఘ కార్యనిర్వాహక వర్గ సభ్యునిగా ఎన్నికైనాను. శాకాహార నియమాన్ని నిష్ఠతో అమలుపరిచే చాలామంది ప్రముఖులతో నాకు పరిచయం కలిగింది. ఆహారం విషయంలో ప్రయోగాలు మొదలుపెట్టాను.

ఇంటి నుండి తెప్పించిన చిరుతిండ్లు, ఊరగాయలు తినడం మానివేశాను. మనస్సు మారినందున వాటిపై నాకు విరక్తి కలిగింది. వెనక రిచ్‌మండులో వున్నప్పుడు నా జిహ్వకు చప్పగా వున్న మసాలా లేని స్పినక్ (బచ్చలి) ఇప్పుడు రుచిగా ఉంది. ఈ విధమైన ప్రయోగాలవల్ల ఆహార పదార్థాల రుచి విషయంలో మనస్సు ప్రధానం గాని, జిహ్వ కాదని తేలింది. ఆర్థిక దృష్టి కూడా నా విషయంలో బాగా పనిచేసింది. ఆ రోజుల్లో కొందరు కాఫీ, టీలు ఆరోగ్యానికి హాని కలిగిస్తాయని భావించి కోకో పుచ్చుకోవడం ప్రారంభించారు. నేను కూడా తిండి శరీర నిర్వహణకేనని నిశ్చయించి టీ, కాఫీలు మానివేసి కోకో పుచ్చుకోసాగాను.

శాకాహార భోజనశాలలో రెండు విభాగాలు ఉండేవి. ఒక విభాగంలో కావలసిన పదార్థాలు తిని, తిన్న పదార్థాలకు మూల్యం చెల్లించాలి. పూటకు మనిషికి రెండు షిల్లింగులు దాకా ఖర్చు అవుతుంది. ఈ విభాగానికి డబ్బు గలవాళ్ళు వెళతారు. రెండో

విభాగంలో తొమ్మిది పెన్నీలకు ఒక రొట్టెముక్క. మరో మూడు పదార్థాలు పెడతారు. నేను ఖర్చు తగ్గించుకోవాలని ప్రయత్నం ప్రారంభించినప్పటి నుండి రెండో విభాగంలోకే వెళ్ళి ఆహారం పుచ్చుకోవడం ప్రారంభించాను. ఈ ప్రయోగాలతో పాటు కొన్ని చిన్న ప్రయోగాలు కూడా ప్రారంభించాను. కొంత కాలం గంజి పదార్థాలు మానివేశాను. కొంతకాలం రొట్టె, పండ్లు మాత్రమే తింటూ వున్నాను. కొంతకాలం జున్ను, పాలు, గ్రుడ్లు పుచ్చుకుంటూ వున్నాను. ఈ చివరి ప్రయోగం పదిహేనురోజులకంటే మించి సాగలేదు. గంజిలేని పదార్థాలు తినాలని బోధించిన సంస్కర్త గ్రుడ్లు తినడం మంచిదని, అది మాంసాహారం కాదని సమర్థించాడు. గ్రుడ్లు తింటే జీవ జంతువులకు హానికలుగదు అని మొదట భావించాను. అందువల్ల కొంచెం కక్కుర్తి పడ్డాను. అయితే ఈ విధానం ఎక్కువ కాలం సాగలేదు. నా ప్రమాణానికి క్రొత్త వ్యాఖ్యానం ఎలా చెప్పను? ప్రమాణం చేయించిన మా అమ్మగారి ఉద్దేశ్యం నాకు తెలియదా? గ్రుడ్లు కూడా మాంసమనే మా అమ్మ ఉద్దేశ్యం. ఈ ప్రమాణంలో దాగియున్న సత్యం గ్రహించి వెంటనే గ్రుడ్లను, వాటికి సంబంధించిన ప్రయోగాల్ని విరమించుకున్నాను.

ఇంగ్లాండులో మాంసాన్ని గురించిన మూడు లక్షణాలు తెలుసుకున్నాను. మొదటి లక్షణం ప్రకారం పశు, పక్షుల మాంసమే మాంసం. ఈ లక్షణాన్ని గుర్తించిన శాకాహారులు అట్టి మాంసం త్యజించి చేపల్ని తినడం ప్రారంభించారు. ఇక గ్రుడ్లు కూడా పుచ్చుకునే వారిని గురించి చెప్పనవసరం లేదనకుంటాను. రెండవ లక్షణం ప్రకారం చేపల్ని కూడా తినకూడదు. కాని గ్రుడ్లు తినవచ్చు. ఇక మూడవ లక్షణం ప్రకారం సమస్త జీవజంతువుల మాంసం, వానివల్ల ప్రభవించే పదార్థాలు అంటే గ్రుడ్లు, పాలు మొదలైనవి కూడా మాంసం క్రింద లెక్కే. ఇందు మొదటి లక్షణం అంగీకరిస్తే నేను చేపలు కూడా తినవచ్చు. అయితే మా అమ్మ అభిప్రాయమే సరియైనదని నిర్ణయానికి వచ్చాను. ఆమె ఎదుట చేసిన ప్రమాణం ప్రకారం నేను గ్రుడ్లు కూడా తినకూడదు. అందువల్ల గ్రుడ్లు తినడం మానివేశాను. దీనివల్ల నాకు బాగా శ్రమ కలిగింది. సూక్ష్మంగా లోతుకు దిగి పరిశీలించి చూస్తే శాకాహారశాలల్లో లభించే చాలా ఆహార పదార్థాలలో గ్రుడ్లు కలుస్తాయని తేలింది. అందువల్ల గ్రుడ్లు వాడిందీ లేనిదీ తెలుసుకోవడం కోసం వడ్డన చేసేవాణ్ణి పిలిచి అడగలవలసిన అవసరం కలిగింది. కేకుల్లోను, పుడ్డింగుల్లోను గ్రుడ్లు కలుస్తూ ఉండటం వల్ల అలా అడిగి తెలుసుకోవలసి వచ్చింది. దానితో ఇంకా కొన్ని చిక్కులు తొలిగాయి. సాదా పదార్థాలు మాత్రమే తినవలసిన అవశ్యకత ఏర్పడింది. నాలుక రుచి మరిగిన అనేక

ఆహార పదార్థాలను మానుకోవలసి వచ్చింది. కష్టమనిపించింది. అయితే ఈ కష్టం క్షణికమేనని తేలింది. ప్రతిజ్ఞను నెరవేర్చాలనే స్వచ్ఛమైన, సూక్ష్మమైన, స్థిరమైన రుచి, నాలుక మరిగిన క్షణిక రుచి కంటే గొప్పదని తోచింది. అయితే అసలు పరీక్ష మరొకటి వుంది. చేసిన ప్రతిజ్ఞలో అదీ ఒక భాగమే. భగవంతుని రక్షణ పొందిన వాడికి ఎవ్వరూ చెరుపు చేయలేరు కదా!

ఈ ప్రకరణం ముగించేముందు ప్రతిజ్ఞ యొక్క అర్థాన్ని గురించి చెప్పడం అవసరమని భావిస్తున్నాను. మా అమ్మ ఎదుట నేను చేసిన ప్రతిజ్ఞ అలా నిలబడే ఉంది. చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకోకపోవడం వల్లనే ప్రపంచంలో చాలా అనర్థాలు కలుగుతూ ఉంటాయి. ప్రమాణ పత్రం ఎంత స్పష్టంగా వ్రాసుకోబడ్డా తమకు నప్పే విధంగా మాటలకు అర్థం చెబుతూనే ఉంటారు. స్వార్థం మనిషిని గ్రుడ్డివాణ్ణి చేస్తుంది. గోడమీద పిల్లివాటంగా మూలానికి అర్థాలు చెప్పి, ఆత్మ వంచన చేసుకుని, లోకాన్ని దైవాన్ని మోసగించే ప్రయత్నం చేస్తూ వుంటారు. అసలు ప్రమాణం చేసినవారు ప్రమాణం చేయించినవారు చెప్పిన ప్రకారం నడుచుకోవాలి. ఇది ఉత్తమ విధానం. రెండు అర్థాలు చెప్పుటకు వీలున్నచోట దుర్బలుడిమాట అంగీకరించడం మంచిది. ఈ రెండు పద్ధతుల్ని అనుసరించకపోతే కలహాలు, అనర్థాలు తప్పవు. సత్యపథం అనుసరించేవాడు ఉత్తమ పద్ధతినే అవలంబించాలి. క్రొత్త అర్థాలు తీసే విద్యావంతులతో అతనికి పని ఉండకూడదు. మాంసానికి సంబంధించినంతవరకు మా అమ్మ ఉద్దేశ్యమే నాకు ప్రధానం. ఇందు నా అనుభవానికిగాని, పాండిత్య గర్వానికిగాని తావులేదు.

ఇంగ్లాండులో ఆర్థిక దృష్టితోను, ఆరోగ్య దృష్టితోను నా పరిశోధనలు జరిగాయి. దక్షిణాఫ్రికాకు వెళ్ళక పూర్వం ఈ విషయమై పరిశోధించలేదు. కాని ఆ తరువాత బాగా పరిశోధనలు చేశాను. ఆ వివరాలు రాబోయే ప్రకరణాల్లో తెలుపుతాను. ఏది ఏమైనా ఆహారం విషయమై ప్రయోగాల బీజం ఇంగ్లాండులోనే నా హృదయంలో పడింది. అసలు మొదటినుండీ మతంలో వున్న వాళ్ళకంటే క్రొత్తగా మతంలో చేరినవాళ్ళకు ఆరాటం ఎక్కువగా ఉంటుంది. ఇంగ్లాండులో శాకాహార విధానం సరిక్రొత్త. నాకూ అది అంతే. మొదట మాంసాహారం మంచిదని నేను నమ్మేవాణ్ణి. కాని తరువాత శాకాహారంలోనికి మారాను. నాకు అబ్బిన ఈ క్రొత్త శాకాహార ప్రవేశానుభవంతో నేను నివసిస్తున్న బేసువాటర్‌పేటలో ఒక శాకాహార క్లబ్బు పెట్టదలచి, అక్కడ కాపురం వున్న సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారిని ఉపాధ్యాక్షునిగా వుండమని కోరాను. వెజిటేరియన్ పత్రికా సంపాదకుడు ఓల్డ్ ఫీల్డు గారు అధ్యక్షులు. నేను కార్యదర్శిని. కొంతకాలం ఆ క్లబ్బు

బాగా నడిచింది. కాని ఆ తరువాత కొద్దినెలలకు మూతబడింది. నేను కొద్దికాలం తరువాత మరో చోటుకి బస మార్చుకుంటూ వుండేవాణ్ణి. ఆ ప్రకారం ఆ ప్రదేశాన్నుండి నా నివాసాన్ని మార్చాను. కాని ఈ కొద్ది అనుభవం కొన్ని సంస్థలు స్థాపించి ప్రచారంలోకి తేగల శక్తి నాకు ప్రసాదించింది.

## 18. బిడియం డాలుగా పనిచేసింది.

అన్నాహారమండల కార్యనిర్వాహక సమితికి మెంబరుగా ఎన్నుకోబడి ప్రతి మీటింగుకి హాజరవుతూ వుండేవాణ్ణి. కాని మాట్లాడటానికి నోరు తెరుపుడు పడేదికాదు డాక్టర్ ఓల్డ్‌ఫీల్డు ఈ విషయం గమనించి "నీవు నాతో బాగా మాట్లాడతావు కాని సమావేశంలో ఎన్నడూ నోరు తెరవవు. అందువల్ల నీకు మొగతేనెటీగ అను పేరు పెట్టవచ్చు" అని అన్నాడు. నాకు ఆయన వ్యంగ్యం అర్థమైంది. ఆడతేనెటీగలు ఎప్పుడూ శ్రమపడుతూ ఉంటాయి. కాని మొగతేనెటీగ తినడం తాగడమే కాని పనిచేయదు. సోమరిపోతన్నమాట. కమిటీ మీటింగులో అంతా తమ తమ అభిప్రాయాలు చెబుతూ వుండేవారు. కాని నేను మాత్రం నోరు తెరిచేవాణ్ణి కాదు. మాట్లాడాలనే కాంక్ష లేక కాదు. నోరు తెరిస్తే ఏం మాట్లాడాలి? నాకంటే మిగతా మెంబర్లంతా ఎక్కువ తెలిసిన వారుగా కనపడేవారు. ఒక్కొక్కప్పుడు విషయం మీద మాట్లాడాలని సిద్ధపడేవాణ్ణి కాని ఇంతలో మరో విషయం మీద చర్చ ప్రారంభమయ్యేది.

ఈ పద్ధతి కొంతకాలం దాకా నడిచింది. ఒక పర్యాయం గంభీరమైన సమస్య కమిటీ ముందుకు వచ్చింది. ఆ సభకు వెళ్ళకపోవడం అనుచితం, ఏమీ మాట్లాడకుండా వోటు ఇవ్వడం పిరికితనం. థేమ్సు ఐరన్ వర్క్సు కంపెనీ అధ్యక్షుడు హిల్స్‌గారు ఆ సభకు అధ్యక్షులు. అతడు నీతివాది. ఆయన ఇచ్చే ధనసహాయంతోనే ఆ సంఘం నిలచియున్నదని చెప్పవచ్చు. సభ్యుల్లో చాలామంది ఆయన గొడుగు నీడలో వుండునట్టివారే. శాకాహార విషయంలో ప్రసిద్ధికెక్కిన అల్లిన్సన్ గారు కూడా కార్యవర్గ సభ్యులు. డాక్టర్ అల్లిన్సన్ గారికి సంతాన నిరోధం ఇష్టం. దాన్ని గురించి జనానికి ప్రబోధిస్తూ వుండేవాడు. ఈ పద్ధతులు నీతివంతమైనవి కావని హిల్స్‌గారి అభిమతం. ఈ శాకాహార సంఘం కేవలం శాకాహారాన్ని గురించియే గాక నీతిని గురించి కూడా ప్రచారం చేయాలని ఆయన ఉద్దేశ్యం. విపరీత భావాలుగల అల్లిన్సన్‌గారి వంటి వారి నీతి బాహ్యాలైన ఉద్దేశ్యాలు కలవారు సంఘంలో వుండరాదని హిల్స్‌గారి తలంపు. కావున అల్సిన్సన్‌గారిని ఆ సంఘాన్నుంచి తొలగించాలని ఒక ప్రతిపాదన తెచ్చారు. ఈ చర్చ నా హృదయాన్ని ఆకర్షించింది. సంతానం కలగకుండ ఉపాయాలు చేయాలని

అల్లిన్సన్‌గారి ఉద్దేశ్యం భయంకరమైనదని నేను భావించాను. అయితే హిల్స్‌గారు నీతివాదియగుట వలన అల్లిన్సన్‌గారికి వ్యతిరేకం కావడం కూడా సరియేయని భావించాను. హిల్స్‌గారి ఔదార్యం చూచి వారియెడ నేను ఆదరణ కలిగి యుండేవాణ్ణి. అయితే నీతి విషయంలో అభిప్రాయ భేదం ఏర్పడినంత మాత్రాన ఒక పెద్ద మనిషిని శాకాహార సంఘాన్నుంచి తొలగించడం మంచిది కాదని అభిప్రాయపడ్డాను. హిల్స్‌గారు నీతివాది కావడం వల్ల ఇటువంటి అభిప్రాయాన్ని వ్యతిరేకించవచ్చు. కాని దానికీ, శాకాహార సంఘ ఉద్దేశ్యానికి సంబంధం లేదని నా అభిప్రాయం. శాకాహార సంఘ లక్ష్యం శాకాహార విధానాన్ని ముమ్మరం చేయడమే కాని నీతివాదాన్ని ప్రచారం చేయడం కాదు. అందువల్ల నీతికి సంబంధించిన అభిప్రాయాలు ఎలా వున్నప్పటికీ శాకాహార సంఘాన్నుంచి ఒకరిని తొలగించకూడదనే నిర్ణయానికి నేను వచ్చాను.

ఈ విషయంలో సంఘ సభ్యుల్లో ఎక్కువమంది నాతో ఏకీభవించారు. అయితే ఈ విషయం నేనే సమావేశంలో మాట్లాడాలని భావించాను. అది ఎలా సాధ్యం? నాకు సాహసం లేదు. అందువల్ల కాగితం మీద వ్రాసుకొని వెళ్లాను. దాన్ని చదవడానికి కూడా సాహసం చాలక అధ్యక్షుడికి ఆ కాగితం అందజేశాను ఆయన నా కాగితం ఇంకొకరిచేత చదివించాడు. డా॥ అల్లిన్సన్‌గారి పక్షం ఓడిపోయింది. ప్రథమ ప్రయత్నంలో నాకు అపజయం కలిగింది. అయినా నా అభిప్రాయం సరియైనదేనను అభిప్రాయం కలిగి నాకు తృప్తి కలిగింది. తరువాత నాకు ఆ సమితిలో సభ్యత్వం వద్దని కోరినట్లు గుర్తు. ఆంగ్లదేశంలో వున్నంతకాలం నన్ను సిగ్గు బిడియం వదలలేదు. మిత్రుల ఇళ్ళకు వెళ్ళినప్పుడు కూడా పదిమంది చేరితే నోరు మెదపలేకపోయేవాడిని.

నేను ఒకసారి వెంటసన్ అను ఊరు వెళ్ళాను. నా వెంట మజుందార్ కూడా వున్నాడు. ఒక శాకాహారి ఇంట్లో బసచేశాం "ది ఎతిక్స్ ఆఫ్ డైట్" అను గ్రంథం రచించిన హోవర్డు గారు కూడ అక్కడే నివసిస్తున్నారు. ఇది రేవు పట్టణం. ఆరోగ్యవంతమైన ప్రదేశం. మేము హోవర్డుగారిని కలిసి మాట్లాడాము. ఆయన శాకాహార ప్రవర్తక సభలో ఉపన్యసించమని మమ్మల్ని ఆహ్వానించారు. అట్టి సభలో వ్రాసుకొని వెళ్ళి చదవడం తప్పుకాదని తెలుసుకున్నాను. పరస్పర సంబంధం పోకుండా వుండేందుకు, ప్రసంగం క్లుప్తంగా వుండేందుకుగాను చాలామంది అట్లా చేస్తారని తెలిసింది. అశువుగా ఉపన్యసించడం అసంభవం. అందువల్ల అనుకున్న విషయమంతా వ్రాసి తీసుకువెళ్లాను. ఒక ఫుల్‌స్కేపు టావు కంటే అది ఎక్కువగా లేదు. కాని లేచి నుంచునేసరికి కళ్ళు తిరిగాయి. వణుకు పట్టుకుంది. అప్పుడు మజుందార్ నా కాగితం తీసుకొని చదివారు.

ఆయన ప్రత్యేకించి ఉపన్యాసం కూడా చేశారు. అపుడు శ్రోతలు కరతాళ ధ్వనులు చేశారు. నాకు బాగా సిగ్గువేసింది. నా అసమర్థతకు విచారం కూడా కలిగింది. ఆంగ్ల దేశం విడిచి వచ్చేటప్పుడు చివరి ప్రయత్నం కూడా చేశాను. అప్పుడు కూడా అంతా అస్తవ్యస్తం అయింది. శాకాహారులగు మిత్రులకు హర్‌బర్న్ రెస్టారెంటులో డిన్నరు ఏర్పాటు చేశాను. అది శాకాహార రెస్టారెంటు కాదు. అయినా దాని యజమానికి చెప్పి శాకాహారమే తయారుచేయించాను. నా మిత్రులీ క్రొత్త పద్ధతికి చాలా సంతోషించారు. డిన్నర్లు చాలా వైభవంగాను, సంగీతాలతోను, ఉపన్యాసాలతోను జరుగుతాయి. నేను ఏర్పాటు చేసిన ఆ చిన్న డిన్నరులో కూడా అట్టి కార్యక్రమాలు కొన్నింటిని ఏర్పాటు చేశాను. కొన్ని ఉపన్యాసాలు జరిగాయి. నా వంతు రాగానే నేను లేచి నిలబడ్డాను. ఆలోచించి ఆలోచించి మాట్లాడదలచిన విషయాన్ని కొన్ని వాక్యాల్లో ఇముడ్చుకొని మాట్లాడడం ప్రారంభించాను. మొదటి వాక్యంతో ప్రసంగం ఆగిపోయింది. గతంలో అడిసన్‌గారిలా అయింది. హౌస్ ఆఫ్ కామర్సులో ఆయన ఉపన్యసించాలని లేచి నిలబడ్డారు. "నేను కనుచున్నాను, నేను కనుచున్నాను, నేను కనుచున్నాను" అంటూ ఆగిపోయారు. ఇక మాటలు పెగలలేదు. అది చూచి ఒక వినోదప్రియుడు లేచి నిలబడి "వీరు మూడుసార్లు కన్నారుగాని ఏం పుట్టిందో కనబడటం లేదు?" అని అన్నాడు. ఆ ఘట్టం నాకు జ్ఞాపకం వచ్చింది. హాస్య పద్ధతిలో మాట్లాడాలని భావించాను. అందుకు శ్రీకారం చుట్టాను కూడా. కాని వెంటనే ఉపన్యాసం ఆగిపోయింది. రెండో వాక్యం నోట వెలువడలేదు. అంతా మరిచిపోయాను. అందర్నీ నవ్వించాలని భావించి నేను నవ్వుల పాలైనాను. చివరికి తమరు దయతో విచ్చేసినందుకు వందనాలు అంటూ ముగించివేశాను.

నన్ను ఈ బిడియం చాలా కాలం వదలలేదు. దక్షిణాఫ్రికా వెళ్ళిన తరువాత అక్కడ చాలావరకు తగ్గిపోయింది. అశువుగా నేను మాట్లాడలేను. కొత్తవారిని చూస్తే నాకు సంకోచం కలుగుతుంది. మాట్లాడకుండా తప్పించుకొనేందుకు ప్రయత్నించేవాణ్ణి. ఇప్పటికి కూడా గాలి పోగుచేసి మాట్లాడటం నాకు చేతగాదు.

అప్పుడప్పుడు పరిహాసానికి పాల్పడటమే గాని దానివల్ల నాకు కలిగిన హాని ఏమీ లేదని చెప్పగలను. అప్పుడు విచారం కలిగించిన ఆ పద్ధతి తరువాత ఆనందం కలిగించింది. మితంగా మాట్లాడటం, అంటే తక్కువ పదాల్ని ప్రయోగించడం జరిగిందన్నమాట. నా నోటినుండి కాని, నా కలాన్నుండిగాని పొల్లుమాట ఒక్కటి కూడా వెలువడలేదని నాకు నేను సర్టిఫికెట్టు ఇచ్చుకోగలను. నా మాటలోగాని, నా వ్రాతలో

గాని తప్పు దొర్లడం జరగలేదని గుర్తు. సత్యారాధకునికి మౌనం అవసరమని నాకు కలిగిన అనుభవం. సామాన్యంగా అబద్ధం చెప్పడం, తెలిసో తెలియకో అతిశయోక్తులు పలకడం, సత్యాల్ని మరుగుపరచడం మనిషికి కలిగే సహజ దౌర్బల్యం. అయితే మితభాషి అర్థం లేని మాటలు మాట్లాడడు. ప్రతి మాట ఆచి తూచి మాట్లాడతాడు. మాట్లాడటానికి ఆరాటపడేవారిని మనం చూస్తుంటాము. మేమంటే మేము అని ఉపన్యాసాలిచ్చేందుకై అధ్యక్షుణ్ణి వత్తిడి చేస్తుంటారు. అనుమతి ఇవ్వగానే వక్త సామాన్యంగా సమయాన్ని అతిక్రమించడం జరుగుతుంది. ఇంకా సమయం కావాలని కోరుతూ ఉంటారు. అనుమతి ఇవ్వకపోయినా ఉపన్యసిస్తూనే ఉంటారు. ఇలా మాట్లాడేవారివల్ల మేలేమీ జరగదు. పైగా కాలహరణం జరుగుతుంది. అందువల్ల బిడియం నాకు డాలుగా పనిచేసింది. సత్యశోధనకు అది ఎంతగానో సహకరించింది.

## 19. అసత్యవ్రణం

నలభై ఏండ్ల క్రితం ఆంగ్ల దేశంలో హిందూ దేశ విద్యార్థుల సంఖ్య ఈ కాలాన్ని బట్టి చూస్తే చాలా తక్కువ. వారు వివాహితులై యుండి కూడా అక్కడ అవివాహితులమని చెప్పేవారు. అందుకు ఒక కారణం ఉంది. ఇంగ్లాండులో ప్రతి విద్యార్థి బ్రహ్మచారియే. వివాహో విద్యనాశాయ అను సూక్తి ననుసరించి అక్కడి వాళ్ళు విద్యార్థి దశలో పెండ్లి చేసుకోరు. పూర్వం మనదేశంలో కూడా మనం బ్రతికి యున్న కాలంలో విద్యార్థికి బ్రహ్మచారి అనే పేరు ఉండేది. మనకు బాల్య వివాహాలు వచ్చిపడ్డాయి. కాని ఇంగ్లాండులో బాల్య వివాహం ఏమిటో ఎవ్వరికీ తెలియదు. భారతీయ విద్యార్థులు ఇంగ్లాండు వెళ్లిన తరువాత తమకు పెండ్లి అయిందని సిగ్గువల్ల అక్కడ చెప్పకోరు ఇందుకు మరో కారణం కూడా ఉంది. ఆ దేశంలో పెండ్లి అయిన మొగవాళ్ళు పెండ్లి కాని ఆడపిల్లలతో కలిసి మెలిసి తిరగకూడదు. తాము బసచేస్తున్న ఇళ్లవారికి తమకు పెండ్లి అయిందని తెలిస్తే వాళ్ళు తమ ఆడపిల్లలతో కలిసి మెలిసి తిరగనీయరు. కులాసాగా కబుర్లు చెప్పుకునేందుకు అవకాశం లభించదు. ఆ ఆమోద ప్రమోదాలు చాలావరకు దోషరహితంగా వుంటాయి. తల్లిదండ్రులకు కూడా ఈ విధమైన ఆమోద ప్రమోదాలు సమ్మతాలే. అక్కడ వరుడే తగిన వధువును వెతుక్కుంటాడు. అందువల్ల కన్యలు, యువకులు కూడా కలిసి మెలిసి ఉంటారు. అది అక్కడ స్వాభావికం. ఇంగ్లాండుకు వెళ్ళగానే హిందూదేశం యువకులు అక్కడి కన్యల మోహంలో పడి పెండ్లి కాలేదని చెబితే దాని పరిణామం భయంకరంగ ఉంటుంది. అట్టి గొడవలు అక్కడ అనేకం విన్నాను. భారతీయ యువకులు అసత్యం పలికి అక్కడి కన్య

వెంటబడి అసత్య జీవితం గడిపేందుకు సిద్ధపడతారు. ఆంగ్లేయులు అందుకు అంగీకరించరు. భారతీయులు ఇలా చేయడానికి సాహసిస్తారు. నేనూ ఇలాంటి వలలో పడ్డాను. నాకు పెండ్లి అయ్యింది. ఒక బిడ్డకూడా పుట్టాడు. అయినా అక్కడ బ్రహ్మచారిగా వున్నాను. అట్టి నటన వల్ల నాకేమీ అనందం కలుగలేదు. అయితే సిగ్గు, బిడియాలు నన్ను కాపాడాయి. నేను మాట్లాడకుండా వుంటే నాతో ఎవతె మాట్లాడుతుంది? మొగవాడు ముందుడుగు వేస్తేనే గదా ఆడమనిషి కూడా ముందుకు వచ్చేది.

నాకు పిరికితనంతో బాటు బిడియం కూడా అధికంగా వుండేది. వెంటనర్‌లో నేను వున్న కుటుంబంలో ఇంటి యజమానురాలి కూతురు, తమ అతిథుల్ని షికారుకు తీసుకువెళుతూ వుండేది. అది అక్కడి ఆచారం. ఆమె ఒకనాడు నన్ను దగ్గరలోనే వున్న గుట్టల మీదకు తీసుకువెళ్ళింది. అసలు నాది వడిగల నడక. ఆమెది నా కన్నా ఎక్కువ వడిగల నడక. ఆ మాటలు యీ మాటలు చెబుతూ నన్ను వడివడిగా లాక్కు వెళ్ళసాగింది. నేనూ కబుర్లు చెబుతూనే ఉన్నాను. ఒకప్పుడు ఔను అని, మరొకప్పుడు కాదు అని, ఇంకొకప్పుడు ఆహా! ఎంత బాగా ఉంది? అంటూ ఆమె వెంట నడుస్తున్నాను. ఆమె పిట్టలా తుర్రున పోతూ ఉంది. ఇంటికి పోయేసరికి ఎంత సేపవుతుందోనని ఆలోచనలో పడ్డాను. అయినా నేను వారించకుండా ఆమె వెంటపడి పోతూనే ఉన్నాను. ఒక పర్వత శృంగం మీదకు ఎక్కాం. మడమల జోడు తొడుక్కుని ఇరవై లేక ఇరవై అయిదేళ్ళు వయస్సులో నున్న ఆ యువతి రివ్వున క్రిందికి దిగసాగింది. క్రిందికి దిగడానికి నేను క్రిందుమీదులవుతూ వున్నాను. నా బాధ ఆమె కంట బడుతుందేమోనని నాకు సిగ్గు. ఆమె వెనక్కి తిరిగి నవ్వుతూ ఇటు దిగు, అటు దిగు అంటూ ఊతం ఇచ్చి దింపనా అంటూ రెచ్చగొట్టసాగింది. అసలే ఎక్కడపడతానో అని భయం. అయినా ఆమె పట్టుకుంటే నేను ఆమె ఊతంతో దిగటమా? చివరికి అతికష్టం మీద కొన్నిచోట్ల పాకి, కొన్నిచోట్ల కూర్చొని ఏదో విధంగా క్రిందికి ఊడిపడ్డాను. ఆమె శభాష్ శభాష్ అంటూ బిగ్గరగా నవ్వి నన్ను బాగా సిగ్గుపడేలా చేసింది.

అయితే అన్ని చోట్ల ఇలా ఆమె బాహువుల్లో పడకుండా తప్పించుకోవడం సాధ్యమా? అయితే భగవంతుడు నా అసత్య వ్రణాన్ని మాన్పాలని భావించాడు. నన్ను రక్షించాడు. బ్రైటన్ అను గ్రామం వెంటనర్ గ్రామం మాదిరిగ సముద్రం ఒడ్డున గల పర్యటనా కేంద్రం. అక్కడికి ఒక పర్యాయం నేను వెళ్ళాను. ఇది వెంటనర్ వెళ్ళడానికి ముందు జరిగిన ఘట్టం. నేను బ్రైటన్‌లో గల ఒక చిన్న హోటలుకు వెళ్ళాను. అక్క

సామాన్య స్థితిగతులు కలిగిన వృద్ధ వితంతువు కనబడింది. ఇంగ్లాండులో ఇది నాకు మొదటి సంవత్సరం. అక్కడ ఆహారపదార్థాల వివరమంతా ఫ్రెంచి భాషలో వున్నది. నాకు బోధపడలేదు. ఆ వృద్ధురాలి బల్ల దగ్గరే నేనూ కూర్చున్నాను. ఇతడు క్రొత్తవాడు. గాబరా పడుతున్నాడని ఆమె గ్రహించింది. ఆమె మాటలు ప్రారంభించింది.

"నీవు క్రొత్తవాడిలా వున్నావు. సంకోచిస్తున్నట్లున్నావు. తినేందుకు ఇంత వరకు నీవు ఆర్డరు ఇవ్వలేదు. కారణం?" అని అడిగింది. నేను ఆహారపదార్థాల పట్టిక చూస్తున్నాను. వడ్డన చేసేవాణ్ణి పిలిచి మాట్లాడదామని అనుకొంటున్నప్పుడు ఆమె మాట్లాడింది. ఆమెకు ధన్యవాదాలు సమర్పించి "ఈ పట్టికలో ఆహారపదార్థాలను గురించి వివరం తెలుసుకోలేకపోతున్నాను. నేను శాకాహారిని. అందువల్ల వీటిలో ఏమేమి మాంసం కలవనివో తెలుసుకో కోరుతున్నాను" అని అన్నాను.

"ఇదా విషయం! నేను నీకు సహాయం చేస్తాను. పదార్థాల వివరం చెబుతాను. నీవు తీసుకోగల పదార్థాలు చెబుతాను." అని అన్నది. నేను అందుకు అంగీకరించాను. అప్పటినుండి మాకు దగ్గర సంబంధం ఏర్పడింది. నేను ఆంగ్లదేశంలో వున్నంతవరకే గాక, అక్కడ నుండి వచ్చిన తరువాత కూడా మా సంబంధం చాలాకాలం వరకు చెక్కు చెదరలేదు. ఆమెది లండను. అక్కడి తన అడ్రసు నాకు ఇచ్చింది. ప్రతి ఆదివారం భోజనానికి తనింటికి రమ్మని ఆహ్వానించింది. ఇతర సమయాల్లో కూడా నన్ను భోజనానికి ఆహ్వానిస్తూ ఉండేది. నాకు గల సిగ్గును బిడియాన్ని పోగొట్టేందుకు బాగా సహకరించింది. యువతులను పరిచయం చేసింది. వాళ్ళతో మాట్లాడమని నన్ను ప్రోత్సహించింది. ఒక స్త్రీ ఆమె దగ్గరే ఉండేది. ఆమెను నా దగ్గరకు పంపి ఆమెతో మాట్లాడమని నన్ను ప్రోత్సహించింది. అప్పుడప్పుడు మమ్మల్ని ఇద్దరినీ ఒంటరిగా ఉండనిచ్చేది.

ప్రారంభంలో ఈ తతంగం నాకు నచ్చలేదు. ఏం మాట్లాడాలో తోచేది కాదు. ఎగతాళి మాటలు ఏం మాట్లాడను? ధైర్యం చెబుతూ ఉండేది. అంటే నేను స్త్రీ సాంగత్యానికి "సిద్ధం" చేయబడుతున్నానన్నమాట. ఆదివారం కోసం ఎదురు చూడటం ప్రారంభించేవాణ్ణి. ఆ స్త్రీతో మాట్లాడటం ఎంతో ఇష్టంగా వుండేది.

వృద్ధురాలు కూడా నన్ను స్త్రీ వ్యామోహంలోకి నెట్టసాగింది. మా యీ సాంగత్యం ఆమెకు కూడా ఇష్టమేనన్నమాట. మా ఇద్దరి మేలు ఆమె కూడా కోరియుంటుంది. ఇక నేను ఏం చేయాలి? నాకు పెండ్లి అయిందని ఇదివరకే చెప్పివుంటే బాగుండేది కదా! అప్పుడు ఆమె నా వంటివాడి పెండ్లి విషయం యోచించేదా? ఇప్పటికీ సమయం మించిపోలేదు. నిజం తెలియజేస్తే ముప్పు తప్పిపోతుంది గదా! ఈ విధంగా యోచించి

పూర్తి వివరాలు తెలుపుతూ ఆమెకు ఒక జాబు వ్రాశాను. జ్ఞాపకం వున్నంతవరకు నేను రాసిన జాబు సారాంశం క్రింద తెలుపుతున్నాను.

"బ్రైటన్‌లో కలిసినప్పటి నుండి మీరు నన్ను ప్రేమగా చూస్తున్నారు. తల్లి తన బిడ్డను చూచే విధంగా మీరు నన్ను చూస్తున్నారు. నాకు పెళ్ళి అవడం మంచిదనే భావంతోనే యువతుల్ని నాకు పరిచయం చేస్తున్నారు. ఈ వ్యవహారం ముదరక ముందే మీ ఈ ప్రేమకు నేను తగనని తెలియజేయడం నా కర్తవ్యమని భావిస్తున్నాను. నాకు ఇదివరకే పెళ్ళి అయిపోయిందని నేను మీతో పరిచయం అయినప్పుడే చెప్పి వుండవలసింది. హిందూ దేశంలో పెండ్లి అయి ఇక్కడ చదువుకునేందుకు వచ్చే విద్యార్థులు తమకు పెళ్ళి అయిందని చెప్పరనే విషయం నాకు తెలుసు. నేను కూడా ఆ విధానాన్ని పాటించాను. అయితే ఇప్పుడు ఆ విషయం చెప్పి వుండవలసిందని నాకు బోధపడింది. బాల్యంలోనే నాకు వివాహం అయిపోయిందనీ, నాకు ఒక కొడుకు కూడా కలిగాడనీ ముందుగానే చెప్పియుంటే బాగుండేది. మీకు చెప్పకుండా దాచి ఉంచినందుకు నేను విచారిస్తున్నాను. అయితే ఇప్పటికైనా మీకు నిజం తెలియజేయాలనే ధైర్యం భగవంతుడు నాకు ప్రసాదించాడు. అందుకు సంతోషిస్తున్నాను. మీరు నన్ను క్షమించండి. మీరు నాకు పరిచయం చేసిన యువతితో ఏ విధమైన అక్రమసంబంధం నేను పెట్టుకోలేదని మీకు తెలుపుతున్నాను. మీరు నా యీ మాటను నమ్మవచ్చు. హద్దు దాటగూడదను విషయం నాకు తెలుసు నాకు మూడుముళ్ళు పడాలనే భావం మీకు కలదని నాకు తెలుసు. ఈ భావం ఇంకా మీ మనస్సులో వ్రేళ్ళూనగూడదనే భావంతో నిజాన్ని ఈ జాబు ద్వారా తెలియజేస్తున్నాను.

ఈ జాబు అందిన తరువాత నేను మీ దగ్గరకు రా తగనివాడినని మీరు భావిస్తే నేను బాధపడను మీరు చూపిన స్నేహానికి సదా కృతజ్ఞుణ్ణి. మీరు నన్ను వదలి వేయకుంటే చాలా సంతోషిస్తాను. ఇంత జరిగినా మీరు నన్ను మీ దగ్గరకు రానిస్తే, అందుకు నేను తగుదునని మీరు భావిస్తే నాకు క్రొత్త స్ఫూర్తి లభిస్తుంది. మీ ప్రేమకు పాత్రుడనయ్యేందుకు సదా ప్రయత్నిస్తూ వుంటాను.

ఇంత పెద్ద జాబు త్వరగా వ్రాశానని పాఠకులు గ్రహించకుందురుగాక. ఎన్ని చిత్తులు వ్రాశానో పాఠకులు ఊహించుకోవచ్చు. ఈ జాబు ఆమెకు పంపి పుట్టెడు బరువు తీరిపోయినట్లు భావించాను. ఈ చర్య నాకు హాయి కలిగించింది. మరు టపాలో ఆ వృద్ధ మహిళ వ్రాసిన జాబు అందింది. అందులో ఈ విధంగా వుంది. "నీవు నిర్మల హృదయంతో రాసిన జాబు అందింది. మా ఇద్దరికీ సంతోషం కలిగింది. ఇద్దరం

బాగా నవ్వుకున్నాం. నీవు అసత్యానికి పాల్పడ్డావు. అది క్షమించడానికి అర్హమైన తప్పిదమే. నీవు నిజం తెలుపడమే ఆ అర్హతకు కారణం. నీకు స్వాగతం. నా ఆహ్వానం నీకు ఎప్పుడూ వుంటుంది. వచ్చే ఆదివారంనాడు నీ కోసం మేమిద్దరం ఎదురు చూస్తూ ఉంటాము. నీ బాల్య వివాహం గురించి వివరాలు వింటాము. నిన్ను ఎగతాళి చేసి ఆనందం పొందుతాము. మన స్నేహం ఎప్పటిలాగానే స్థిరంగా ఉంటుంది. పూర్తిగా నమ్మవచ్చు.

నాలో ముదిరిన అసత్యమనే ఈ వ్రణాన్ని తొలగించుకుని నయం చేసుకో గలిగాను. తరువాత ఇలాంటి వ్యవహారం జరిగినప్పుడు నా వివాహం సంగతి ముందే చెప్పివేయగల ధైర్యం నాకు కలిగింది.

## 20. మతాలతో పరిచయం

ఆంగ్లదేశంలో వున్న రెండవ ఏడు చివరిభాగంలో ఇద్దరు దివ్యజ్ఞాన సామాజికులతో నాకు పరిచయం కలిగింది. వారు సోదరులు, అవివాహితులు. భగవద్గీత చదవమని వారు నన్ను ప్రోత్సహించారు. వారు సర్ ఎడ్విన్ అర్నాల్డుగారు గీతకు చేసిన ఆంగ్లాను వాదం చదువుతున్నారు. తమతో కలిసి సంస్కృతం గీత చదువుదాము రమ్మని నన్ను ఆహ్వానించారు. నేను సిగ్గుపడ్డాను. దాన్ని అంతవరకు చదవకపోవడం, కనీసం గుజరాతీ అనువాదాన్ని అయినా చదవకపోవడమే అందుకు కారణం. ఈ విషయం సంకోచిస్తూనే వారికి చెప్పాను. నాకు సంస్కృతం ఎక్కువగా రాదు. అయితే మూలానికి అనువాదానికి తేడా వస్తే ఆ వివరం చెప్పగలను అని చెప్పి వారితో బాటు గీత చదవడం ప్రారంభించాను. ద్వితీయ అధ్యాయంలో రెండు శ్లోకాలున్నాయి.

"ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే!
సంగాత్సంజాయతేకామః కామాత్ క్రోధోభిజాయతే

సాంఖ్యయోగం - శ్లోకసంఖ్య 62

క్రోధాద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధి నాశాత్ ప్రణశ్యతి

సాంఖ్యయోగం. శ్లోక సంఖ్య 63

(శబ్దాది విషయాలను సదా ధ్యానిస్తూ వుంటే మనిషికి వాటియందు ఆకర్షణ కలుగును. దానివలన కోరిక పుట్టును. కోరిక ద్వారా కోపము కలుగును.

కోపం వల్ల అవివేకమావహించును. అవివేకం వల్ల మతి భ్రమ కలుగును దాని వల్ల బుద్ధి నశించును. బుద్ధి నశించినచో సమస్తము హతమగును.)

ఈ రెండు శ్లోకాలు నా మనస్సునందు నాటుకున్నాయి. ఇప్పటికీ వాటి ధ్వని నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నది. భగవద్గీత అమూల్యమైన గ్రంథమను విశ్వాసం రోజురోజుకు నాలో పెరగసాగింది. తత్వజ్ఞానంలో దానితో సమానమైన గ్రంథం మరొకటి లేదను నమ్మకం నాకు కలిగింది. నా మనస్సు చెదిరినప్పుడు భగవద్గీత నాకు ఎంతో సహాయం చేసింది. ఆంగ్లగీతానువాదాలన్నింటిని దరిదాపుగా నేను చదివాను. ఆర్నాల్డుగారి ఆంగ్లగీతానువాదమే ఉత్తమమైనదని నా అభిప్రాయం. అతడు మూలానుయాయి. అది అనువాదంలా వుండదు. ఆ మిత్రులతో కలిసి గీత చదివానే గాని క్షుణ్ణంగా అర్థం చేసుకొని చదివానని చెప్పలేను. ఆ తరువాత కొంతకాలానికి నాకు అది నిత్యపారాయణ గ్రంథం అయింది.

ఆర్నాల్డుగారు "లైట్ ఆఫ్ ఏషియా" (బుద్ధచరితం) చదవమని చెప్పారు. అంతకు ముందు ఆర్నాల్డుగారు ఒక్క గీతనే ఆంగ్లంలోకి అనువదించారని అనుకున్నాను. కాని బుద్ధ చరిత్రను మాత్రం క్రింద పెట్టడానికి మనస్సు అంగీకరించేది కాదు. వారు ఒకనాడు నన్ను బ్లానట్స్కీగారికి, అనిబిసెంట్ సతిగారికి పరిచయం చేశారు. బిసెంట్‌గారు అప్పుడు దివ్య జ్ఞానసమాజంలో చేరారు. అప్పుడు ఆమెను గురించి పత్రికల్లో చమత్కారంగా చర్చలు జరుగుతూ ఉండేవి. నేను ప్రతిచర్చను ఆసక్తితో చదువుతూ వున్నాను. వారు నన్ను దివ్యజ్ఞాన సమాజంలో చేరమని ఆహ్వానించారు. "నా మతాన్ని గురించే నాకు సరిగా తెలియదు. అట్టి స్థితిలో ఇతర మతాలలో ఎలా చేరడం? అని చెప్పి వినమ్రంగా ఆమె ఆహ్వానాన్ని నిరాకరించాను. వారు చెప్పినమీదట నేను "కీ టు థియాసఫీ" అను మదాం బ్లానట్ స్కీ రచించిన గ్రంథాన్ని చదివినట్లు గుర్తు. ఆ గ్రంథం చదివిన తరువాత హిందూ మతగ్రంథాలు చదవాలనే కోరిక నాకు కలిగింది. మూఢ నమ్మకాలమయం హిందూ మతం అని క్రైస్తవ మతబోధకులు చేసే ప్రచారం తప్పు అను నమ్మకం కూడా నాకు కలిగింది.

ఆ రోజుల్లోనే మాంచెస్టరు నుండి వచ్చిన ఒక మంచి క్రైస్తవుడు శాకాహారశాలలో నన్ను కలిసి క్రైస్తవమత ప్రాశస్త్యాన్ని గురించి వివరించాడు. రాజకోటలో నేనెరిగిన క్రైస్తవ పాదరీల బోధల్ని గురించి ఆయనకు చెప్పాను. అది విని ఆయన దుఃఖపడి "నేను శాకాహారిని. నేను మద్యం త్రాగను. నాతోటి క్రైస్తవులు మద్యం త్రాగుతున్నారు. మాంసం తింటున్నారు. కాని ఈ రెండింటిని తినమని బైబిలు చెప్పలేదు. బైబిలు చదివితే మీకే తెలుస్తుంది."అని అన్నాడు. అందుకు నేను అంగీకరించాను. ఆయన నాకు ఒక బైబిలు గ్రంథం ఇచ్చాడు. ఆయనే బైబిలు అమ్మినట్లు, పటాలు,

అనుక్రమణిక మొదలగునవి కల బైబిలు ప్రతి ఆయన దగ్గర నేను కొన్నట్లు గుర్తు. దాన్ని చదవడం ప్రారంభించాను. కాని ఓల్డ్ టెస్టామెంట్ (పాత నిబంధన) ముందుకు సాగలేదు. సృష్టిని గురించిన అధ్యాయాలు, తరువాతి అధ్యాయాలు చదువుతుంటే నిద్ర వచ్చింది. చదివాను అని అనిపించడం కోసం ఏదో విధంగా మొత్తం చదివాను. కాని ఏమీ రుచించలేదు. నంబర్స్ అను భాగం వెగటుగా వుంది.

న్యూటెస్టామెంట్ బాగా ఆకర్షించింది. ముఖ్యంగా అందలి "సెర్మన్ ఆన్ ది మౌంట్" (గిరి - ప్రవచనము) గీతకు ఇది సాటి అని అనుకున్నాను. "ఎవరు ఎట్లు చేయుదురో వారు అట్టి ఫలముననుభవింతురు. కాని అన్యాయంతో అన్యాయాన్ని పారద్రోలలేరు. ఎవరేని నీ కుడిచెంప మీద చెంపదెబ్బ కొడితే నీవు నీ ఎడమ చెంప కూడా వానికేసి త్రిప్పు. ఎవరేని నీ ఉత్తరీయం లాగుకుంటే నీ అంతర్యం కూడా యిచ్చివేయి." అను వాక్యాలు నన్ను బాగా ఆకర్షించాయి. నాకు ఎంతో ఆనందం కలిగింది. శ్యామలభట్టు రచించిన ఛప్పయ్‌ఛందం జ్ఞాపకం వచ్చింది. నా బాలమనస్సు గీత, ఆర్నాల్డు రచించిన బుద్ధ చరితం, ఏసుక్రీస్తు ప్రవచనాలు ఈ మూడింటినీ ఏకీకృతం చేసింది. త్యాగమే ఉత్తమ మతమని నాకు తోచింది. ఈ గ్రంథపఠనం మెల్లగా ఇతర మతాచార్యుల జీవితాలు చదువుటకు నన్ను ప్రోత్సహించింది. కార్లయిల్ వ్రాసిన హీరోస్ అండ్ హీరో వర్షిప్ అను గ్రంథం చదవమని ఒక మిత్రుడు సలహా ఇచ్చాడు. అందు మహమ్మద్ జీవితం చదివి అతడి మహత్యాన్ని, వీరత్వాన్ని తపశ్చర్యను తెలుసుకున్నాను.

పరీక్షలు దగ్గర పడటం వల్ల ఇక ఏమీ చదవలేకపోయాను. కాని వివిధ మతాల్ని గురించి తెలుసుకోవాలని మాత్రం మనస్సులో నిర్ణయించుకున్నాను. నాస్తిక మతాన్ని గురించి కూడా తెలుసుకోవడం మంచిదని భావించాను. బ్రాడ్లాగారి పేరు, పేరుతోపాటు అతని మతాన్ని ప్రతి హిందువు ఎరుగును. నాస్తికతను గురించి నేనొక పుస్తకం చదివాను. దాని పేరు మాత్రం గుర్తులేదు. నాకది రుచించలేదు. అప్పటికే నేను నాస్తిక మరుభూమిని దాటాను. అప్పుడే బిసెంటుగారు నాస్తిక మతాన్నుండి ఆస్తిక మతంలోకి ప్రవేశించారు.

నాస్తికమతం యెడ నాకు కలిగిన అరుచికి అది కూడా ఒక కారణం. బిసెంటుగారు వ్రాసిన "హౌ ఐ బి కేమ్ ఎ థియాసఫిస్ట్" (నేను ఎటుల దివ్యజ్ఞాన సమాజంలో చేరితిని) అను గ్రంథం నేను చదివాను. ఆరోజుల్లోనే బ్రాడ్లా గారు చనిపోయారు. వోకింగ్ సెమిట్రీలో ఆయనకు అంత్యక్రియలు జరిగాయి. అప్పుడు

లండనులోని భారతీయులంతా ఆయన శవపేటికతో పాటు వెళ్ళారు. అంత్యక్రియలు చూద్దామని నేను, మరికొందరు పాదరీలతోబాటు వెళ్ళాను. తిరిగి వచ్చేటప్పుడు రైలు కోసం స్టేషనులో వేచి వున్నాము. అక్కడ ఒక నాస్తిక భావాలుగల వ్యక్తి, ప్రక్కనే వున్న పాదరీని చూచి దేవుడున్నాడా? అని ప్రశ్నించాడు. ఉన్నారు అని పాదరీ జవాబిచ్చాడు. "భూమి చుట్టుకొలత 78,000 మైళ్లు అని మీరు అంగీకరిస్తారా" అని నాస్తికుడు పాదరీని పరాజయం పాలుచేయాలనే భావంతో అడిగాడు.

"అంగీకరిస్తాను" అని పాదరీ అన్నాడు.

అయితే అయ్యా చెప్పండి. భగవంతుని కొలత ఎంత? ఆయన ఎక్కడ ఉన్నాడు.

"ఆయన మనిద్దరి హృదయాల్లోనూ వున్నాడు. అయితే ఆయనను తెలుసుకోగలగాలి అంతే"

"ఏమండీ! యింకా పసివాణ్ణనే భావిస్తున్నారా? అంటూ తాను విజయం పొందినట్లు ఫోజు పెట్టి తలపంకించి చూచాడు. పాదరీ వినమ్రతతో మౌనం వహించి ఊరుకున్నాడు.

ఈ సంభాషణ కూడా నాకు నాస్తికమతం యెడగల అరుచిని పెంచింది.

## 21. నిర్బలుడికి బలం రాముడే

నాకు హిందూ మతంతోను, ప్రపంచమందలి ఇతర మతాలతోను కొంచెం పరిచయం కలిగింది. కాని విషమ సమయంలో అజ్ఞానం ఉపయోగపడదని నేను గ్రహించలేదు. ఆపత్సమయంలో ఏ వస్తువు మనిషిని రక్షిస్తుందో ఆ వస్తువు మనిషికి కనబడదు. ఆపద తొలగడానికి అతని స్వభావమే కారణం అని కొందరు భావిస్తారు. ఈ విధంగా ఎవరికి తోచిన విధంగా వారు యోచిస్తున్నారు. కాని రక్షణ పొందినపుడు మాత్రం తనను తన సాధనయే రక్షించిందో లేక మరొకడెవడైనా రక్షించాడో తెలుసుకోలేరు. కొందరు తమ నిష్ఠాబలం గొప్పదని భావిస్తారు. కాని నిష్ఠాబలం ఆపత్సమయంలో ఎందుకూ కొరరాదు. అట్టి సమయంలో అనుభవం లేని శాస్త్రజ్ఞానం వృథా అవుతుంది.

కేవలం శాస్త్రజ్ఞాన ప్రయోజనం నాకు కొంతవరకు అర్థమైంది. ఆంగ్లదేశంలో అంతకుముందు జరిగిన విషయాలలో నాకు రక్షణ ఎలా కలిగిందో చెప్పలేను. అప్పటికి నేను చిన్నవాణ్ణి. కాని ఇప్పుడు నాకు ఇరవైఏళ్ళు. గృహస్థాశ్రమ అనుభవం కూడా కలిగింది. పెళ్ళాం వున్నది. పిల్లవాడు కూడా పుట్టాడు.

నాకు బాగా గుర్తు. ఆంగ్లదేశంలో నేనున్న చివరి సంవత్సరం అది. 1890 పోర్టు

సుమత్‌లో శాకాహారసభ జరిగింది. నేను నా మిత్రుడు ఆ సభకు ఆహ్వానింపబడ్డాం. పోర్టు సుమతు సముద్రపు రేవు. ఆ ఊళ్ళో నావికజనం ఎక్కువగా వున్నారు. అచట చెడునడత గల స్త్రీలు వున్నారు. అయితే వాళ్ళు వేశ్యలు కారు. కాని వాళ్ళకు నీతి నియమం ఏమీలేవు. అట్టి వాళ్ళ యింట్లో మేము బస చేశాము. సన్మానసంఘం వారికి ఆ విషయం తెలియదు. ఎప్పుడో ఒకసారి పోర్టు సుమతు వంటి పట్టణానికి వచ్చి వెళ్లే మావంటి బాటసార్లకు అక్కడ ఏది మంచి బసయో, ఏది చెడు బసయో తెలుసుకోవడం కష్టం. సభలో పాల్గొని రాత్రి మేము ఇంటికి చేరాము. భోజనం అయిన తరువాత మేము పేకాట ప్రారంభించాము. ఆంగ్లదేశంలో గొప్పగొప్పవారి ఇళ్ళల్లో కూడా గృహిణిలు అతిథులతో పేకాట ఆడటం ఆచారం. సామాన్యంగా పేకాటలో అంతా ఛలోక్తులు విసురుకుంటూ వుంటారు. అయితే అందు దోషం ఉండదు. కాని మా పేకాటలో బీభత్స వినోదం ప్రారంభమైంది.

నా స్నేహితుడు ఇట్టి వ్యవహారంలో ఆరితేరినవాడని నాకు తెలియదు. నాకు కూడా ఈ వినోదంలో ఆనందం కలిగింది. నేను కూడా అందులో దిగాను. మాటలు దాటి వ్యవహారం చేతల్లోకి దిగింది. పేక ప్రక్కన పెట్టివేశాం. ఇంతలో భగవంతుడు నా స్నేహితుని హృదయంలో ప్రవేశించాడు. "నీవా! ఈ ఘోరకలిలోనా? ఈ పాపకూపంలోనా! నీకు ఇక్కడ చోటులేదు. పో! లేచిపో!" అని అరిచాడు. సిగ్గుతో నా తల వంగిపోయింది. అతడి ఆదేశాన్ని శిరసావహించాను. హృదయంలో అతడికి కృతజ్ఞతలు తెలుపుకున్నాను. మా అమ్మగారి ముందు చేసిన ప్రమాణం జ్ఞాపకం వచ్చింది. నేను లేచి బయటికి పరుగెత్తాను. నా గదిలోకి దూరాను. వేటగాని బారినుండి తప్పించుకున్న లేడిలా గుండె గజగజ వణికిపోయింది.

పరాయి ఆడదాని విషయంలో ఈ విధంగా ప్రధమ పర్యాయం నాకు వికారం కలిగింది. ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. అనేక ఆలోచనలు సన్నావహించాయి. ఈ ఇంటి నుంచి పారిపోనా? ఈ పట్టణం వదలి వెళ్ళిపోనా? నేనున్నదెక్కడ? నేను జాగ్రత్తగా వుండకపోతే నా గతి ఏమవుతుంది? ఈ రకమైన ఆలోచనలతో సతమతం అయి, తరువాత నుండి అతి జాగ్రత్తగా మసలుకోసాగాను. ఆ ఇంటినేగాక.వెంటనే పోర్టు సుమతును వదలి వెళ్ళిపోవడం మంచిదని భావించాను. సభలు ఇంకా రెండు రోజులు జరుగుతాయని తెలిసింది. ఆ మర్నాడు సాయంత్రమే నేను పోర్టుసుమతును వదిలివేసినట్లు నామిత్రుడు మరికొంత కాలం అక్కడే ఉన్నట్లు గుర్తు.

ఆ సమయంలో నాకు మతాన్ని గురించి గాని, దేవుణ్ణి గురించిగాని,

దైవసహాయాన్ని గురించిగాని తెలియదు. నన్ను అప్పుడు దేవుడే రక్షించాడని అనుకోవడం తెలిసీ తెలియని స్థితే. నిజానికి ఇక్కట్ల సమయంలో ఎన్నో పర్యాయాలు నన్ను భగవంతుడే రక్షిచాడు. జీవితంలో అనేక రంగాల్లో ఇట్టి అనుభవం నాకు కలిగింది. "భగవంతుడు నన్ను రక్షించాడు" అను మాటకు సరియైన అర్థం ఇప్పుడు నాకు బాగా బోధపడింది. అయినా యింకా పూర్తిగా తెలుసుకోలేక పోతున్నానని కూడా నేను ఎరుగుదును. అనుభవం ద్వారా ఆ విషయం తెలుసుకోవడం అవసరం. ఎన్నో ఆధ్యాత్మిక ప్రయత్నాల యందును, లాయరు పనియందును, సంస్థల్ని నడపడంలోను రాజకీయ వ్యవహారాల్లోను అనేక విషమ ఘట్టాలలోను భగవంతుడు నన్ను రక్షించాడని చెప్పగలను. ఉపాయాలు అడుగంటినప్పుడు, సహాయకులు వదిలివేసినప్పుడు, ఆశలుడిగినప్పుడు ఎటునుండో ఆ సహాయం అందుతుందని నా అనుభవం. స్తుతి, ఉపాసన, ప్రార్థన ఇవి గ్రుడ్డి నమ్మకాలు కావు. అవి ఆహార విహారాదుల కంటే కూడా అధిక సత్యాలు. అవే సత్యాలు, మిగతావన్నీ అసత్యాలే అని కూడా అనవచ్చు. అది అతిశయోక్తి కాజాలదు.

ఈ ఉపాసన, ఈ ప్రార్థన కేవలం వాక్ ప్రతాపం కాదు. దీనికి మూలం జిహ్వకాదు. హృదయం. అందువల్ల భక్తితో నింపి హృదయాన్ని నిర్మలం చేసుకుంటే మనం అనంతంలోకి ఎగిరిపోగలం, ప్రార్థనకు జిహ్వతో పనిలేదు. అది స్వభావానికి సంబంధించినది. అదొక అద్భుతమైన వస్తువు. విశాల రూపాలలో నున్న మలాన్ని, అనగా కామాది గుణాల్ని శుద్ధి చేయుటకు హృదయపూర్వకమైన ఉపాసన ఉత్తమ సాధనమని చెప్పుటకు నేను సందేహించను. అయితే అట్టి ఉపాసన అమిత వినమ్రతా భావంతో చేయాలి.

## 22. నారాయణ హేమచంద్రుడు

ఆరోజుల్లో నారాయణ హేమచంద్రుడు సీమకు వచ్చారని తెలిసింది. ఆయన మంచి రచయిత అని విన్నాను. నేషనల్ ఇండియన్ అసోసియేషన్‌కు సంబంధించిన మానింగ్ కన్యాగృహంలో వారిని కలిశాను. నేను ఇతరులతో కలిసి వుండలేనని మానింగ్ కన్యకు తెలుసు. నేను ఆమె ఇంటికి వెళ్ళినప్పుడు, ఎవరైనా మాట్లాడించితే తప్ప మౌనంగా వుండేవాణ్ణి. ఆమె ఆయనకు నన్ను పరిచయం చేసింది. ఆయనకు ఇంగ్లీషురాదు. ఆయనది వింతవాలకం. వికారంగా వుండే ఫాంటు అట్టిదే మడతలు బడిన మురికి బూడిదరంగు పార్సీ పద్ధతి కోటు ధరించివున్నాడు. నెక్‌టైగాని, కాలరుగాని లేదు. కుచ్చులు గల ఉన్ని టోపీ పెట్టుకున్నాడు. పొడుగుపాటి గడ్డం.

బక్కపలుచని శరీరం. మనిషి పొట్టి. గుండ్రని ఆయన ముఖం మీద మశూచి మచ్చలు, ముక్కుకొన తెలిలేదు, మొద్దుబారీ లేదు. మాటిమాటికీ ఆయన చేత్తో గడ్డం నిమురుకుంటూ వుండేవారు.

నాగరిక సంఘం ఆయనను అంగీకరిస్తుందా? తప్పక వేలుపెట్టి చూపిస్తుంది.

"మిమ్మల్ని గురించి నేను విన్నాను. మీ గ్రంథాలు కొన్ని చదివాను. మీరు మా యింటికి దయచేయరా!" అని అడిగాను. ఆయన కంఠం కొంచెం బండబారి వుంది. నవ్వుతూ మీ బస ఎక్కడ? అని ప్రశ్నించారు.

"స్టారువీధిలో"

"అయితే మనం ఒక గూటివాళ్ళమే. ఇంగ్లీషు చదువుకోవాలని వుంది. నేర్పుతారా?" "నాకు తెలిసినంతవరకు మీకు నేర్పడం ఇష్టమే. నా శక్తికొద్దీ నేర్పుతాను. మీరు సరేనంటే నేనే మీ దగ్గరకు వస్తాను." అని అన్నాను. సమయం నిర్ణయించాం. త్వరలోనే మామధ్య మంచి స్నేహం కుదిరింది.

నారాయణ హేమచంద్రునికి వ్యాకరణం రాదు. ఆయన దృష్టిలో గుర్రం క్రియ, పరుగెత్తడం విశేష్యం. ఇట్టి ఉదాహరణలు చాలా వున్నాయి. ఆయన అజ్ఞానం నాకు బోధపడలేదు. నా స్వల్ప వ్యాకరణ జ్ఞానం ఆయన మీద పారలేదు. వ్యాకరణం రాలేదనే బాధ ఆయనకు లేదు. "నేనెన్నడూ మీ వలె స్కూలుకు వెళ్ళలేదు. నా అభిప్రాయం వెల్లడించవలసివచ్చినప్పుడు వ్యాకరణం ఆవశ్యకత నాకు కలుగులేదు' '. సరే గాని మీకు బెంగాలీ వచ్చా?"నాకు వచ్చు. నేను బెంగాలుదేశంలో తిరిగాను. మహర్షి దేవేంద్రనాథఠాకూరు గ్రంథాలు గుజరాతీ వారికి అనువదించి నేను ఇచ్చాను. ఇతర భాషల్లో వున్న మహద్గ్రంథాల్ని గుజరాతీలోకి అనువదించి ఇవ్వాలి. నేను చేసే అనువాదం మక్కికి మక్కి వుండదు. భావానువాదం మాత్రం చేస్తాను. నాకు అదే తృప్తి. నా తరువాతి వాళ్ళు యింకా సవివరంగా చేస్తారు. వ్యాకరణసాయం లేకుండా గ్రహించింది నాకు చాలు. తృప్తోస్మి. నాకు మరాఠీ, హిందీ, బెంగాలీ వచ్చు. ఇప్పుడు ఇంగ్లీషు నేర్చుకుంటున్నాను. నాకు కావలసింది శబ్దాల పట్టిక. అంతటితో నాకు తృప్తి లేదు. నేను ఫ్రాన్సు వెళ్ళాలి. ఫ్రెంచి నేర్చుకోవాలి. ఫ్రెంచి భాషలో మహద్గ్రంథాలు చాలా ఉన్నాయని విన్నాను. వీలైతే జర్మనీ వెళ్ళాలి. ఆ భాష నేర్చుకోవాలి." ఇదీ ఆయన ధోరణి. భాషలన్నింటిని చుట్టబెట్టి మ్రింగివేయాలని ఆయన ఆశ. ఇతర దేశాలు తిరగాలనే ఆశ కూడా అధికంగా వుంది.

"అయితే మీరు అమెరికా కూడా వెళతారా?"

"తప్పక వెళతాను. ఆ క్రొత్త ప్రపంచం చూడకుండా ఇండియాకు తిరిగి వెళతానా?" "అయితే డబ్బు?" "నాకు డబ్బుతో పనిలేదు. నాకు మీవలె అవసరాలు ఉండవు. నేను తినేదెంత?" నా పుస్తకాలిచ్చే డబ్బు నాకు చాలు. మిత్రులిచ్చేది చాలు. నేను మూడవ తరగతిలోనే ప్రయాణం చేస్తాను. అమెరికా వెళితే డెకమీదే వెళతాను.

ఇదీ నారాయణ హేమచంద్రుని విధానం. ఆ విధానం ఆయన సొంతం. అందుకు తగిన మంచి మనస్సు ఆయనకుంది. గర్వం ఏమాత్రము లేదు. అయితే ఆయనకు తన శక్తిమీద మోతాదుకు మించిన విశ్వాసం ఉందని నా అభిప్రాయం.

మేము రోజూ కలిసేవాళ్ళం. మా పనుల్లో కొంత పోలిక ఉంది. మేమిద్దరం శాకాహారులం. తరచు మేమిద్దరం ఒకేచోట భోజనం చేసేవాళ్ళం. ఇంట్లో సొంతంగా వండుకొని నేను కాలం గడుపుతున్న రోజులవి. వారానికి 17 షిల్లింగులు మాత్రమే ఖర్చు అవుతున్నది. ఆయన గదికి నేను, నా గదికి ఆయన అప్పుడప్పుడు వస్తూపోతూ వుండేవారం. నా వంటకం ఇంగ్లీషువారి మాదిరిది. ఆయనకు ఇది నచ్చదు. ఆయనకు హిందూ మాదిరి వంటకాలు కావాలి. పప్పులేందే ఆయనకు ముద్ద దిగదు. నేను ముల్లంగితో సూపు తయారు చేస్తే ఆయనకు గుటక దిగేది కాదు. ఒకనాడు ఎలా సంపాదించారో ఏమో వేరుశెనగ పప్పు తెచ్చి నాకు వండిపెట్టడానికి సిద్ధపడ్డారు. నేను లొట్టలు వేస్తూ ఆయన వంటకం తిన్నాను. ఈ విధంగా నాకు ఆయన, ఆయనకు నేను వంటచేసి పెట్టడం అలవాటు అయిపోయింది. ఆ రోజుల్లో కార్డినల్ మానింగ్ వారి పేరు ప్రతివారి నోటిమీద ఆడుతూ వుంది. నౌకాశ్రయంలో పనివాళ్ళు సమ్మెకట్టారు. జాన్ బరన్సు గారు, కార్డినల్ మానింగ్‌గారు పూనుకొని ఆ సమ్మెని ఆపివేశారు. మానింగ్‌గారి నిరాడంబర జీవితాన్ని గురించి డిజరాలీ మంత్రిగారి అభినందనల్ని గురించి నేను హేమచంద్రునికి చెప్పాను. "నేనా సాధు పురుషుణ్ణి చూచితీరాలి". అని అన్నారు. హేమచంద్రుడు.

"అతడు చాలా గొప్పవాడు. మీరెట్లా చూడగలరు?"

"తెలిగ్గా చూస్తా. దానికి మార్గం చెబుతా. నేనొక రచయితను. రచయితగా ఆయన పరోపకార పారీణతకు స్వయంగా కలిసి ధన్యవాదాలు చెబుతాననడం ఒక పద్ధతి. నాకు ఇంగ్లీరాదు గనుక నిన్ను దుబాసీగా తీసుకు వస్తున్నట్లు కబురుచేద్దాం. నేను చెప్పినదంతా చేర్చి ఆయనకు నీవు ఒక జాబు వ్రాయి. తెలిసిందా?"

నేను ఆయన చెప్పినట్లు జాబు వ్రాశాను. రెండుమూడు రోజుల్లో సమయం నిర్ణయించి కలుసుకోవడానికి అంగీకారం తెలుపుతూ కార్డినల్ మానింగ్‌గారు మాకు

జాబు వ్రాశారు. మేమిద్దరం వెళ్ళాం. నేను పెద్దలను చూచేందుకు వెళ్ళేటప్పుడు ధరించాల్సిన దుస్తులు ధరించాను. నారాయణ హేమచంద్రుడు మాత్రం తన మామూలు దుస్తులే వేసుకున్నారు. మామూలు కోటు, మామూలు లాగు. నేను కొంచెం పరిహాసం చేశాను. ఆయన నా పరిహాసాన్ని చిటికెలో పరాస్తం చేస్తూ "మీరంతా నాగరికతా లక్షణాల కోసం అర్రులు చాచే పిల్లకాయలు, పిరికిపందలు. మహాపురుషులు హృదయాన్ని చూస్తారు గాని పైపై మెరుగులు చూడరు." అని అన్నారు.

మేము కార్డినల్ గారి మహల్లో ప్రవేశించాం. అదొక పెద్దనగరంగా వుంది. మేము కూర్చోగానే ఒక బక్కపలుచగా వున్న పొడుగుపాటి వృద్ధుడొకడు వచ్చి కరస్పర్శ కావించాడు. ఆయనే కార్డినల్‌గారని తెలిసిపోయింది.

వెంటనే నారాయణ హేమచంద్రుడు అభివందనాలు సమర్పించి "నేను మీ సమయం అపహరించను. నేను మీ కీర్తిని గురించి చాలా విన్నాను. మీరు సమ్మె కట్టిన పనివాళ్ళకు ఉపకారం చేశారు. ఇక్కడకు వచ్చి మిమ్మల్ని అభినందించాలని బుద్ధి పుట్టింది. ప్రపంచంలో సాధు సజ్జనుల దర్శనం చేసుకోవడం నాకు అలవాటు. అందువల్ల మీకీ శ్రమ కలిగించాను." అని గబగబా అన్నాడు.

ఆయన గుజరాతీ మాటల్ని నేను ఇంగ్లీషులోకి మార్చాను. "మీ రాకకు సంతోషిస్తున్నాను. మీకు ఇచట నివాసం సుకరం అవుగాక, భగవంతుడు మీకు మేలు చేయుగాక." అని ఆయన వెంటనే వెళ్లిపోయాడు.

ఒకరోజున నారాయణ హేమచంద్రుడు ధోవతి కట్టుకొని, షర్టు తొడుగుకొని నా బసకు విచ్చేశాడు. ఆ యింటి యజమానురాలు తలుపు తీసి చూడగానే దడుచుకున్నది. (నేను మాటిమాటికీ మకాం మారుస్తూ వుంటానని వ్రాశానుగదా! ఆ క్రమంలో ఈ మధ్యనే ఈ ఇంటికి వచ్చాను. ఈ ఇంటి యజమానురాలు నారాయణ హేమచంద్రుణ్ణి అదివరకు చూడలేదు) ఆమె తత్తరపడుతూ వచ్చి "ఎవరో పిచ్చివాడిలా వున్నాడు మీ కోసం వేచివున్నాడు" అని చెప్పింది. నేను ద్వారం దగ్గరికి వెళ్ళాను. నారాయణ హేమచంద్రుడు నిలబడివున్నాడు. నివ్వెరపోయాను. ఆయన ఎప్పటిలాగానే నవ్వుతూ వున్నాడు.

"బజార్లో పిల్లలు మిమ్మల్ని చూచి అల్లరి చేయలేదా?"

"వాళ్ళు నావెంటబడ్డారు. కాని నేను వారివంక కన్నెత్తి చూడలేదు. దానితో వాళ్ళు వెళ్ళిపోయారు."

లండనులో కొంతకాలం వుండి నారాయణ హేమచంద్రుడు తరువాత పారిస్

వెళ్ళిపోయారు. ఆయన ఫ్రెంచి భాష కొంచెం నేర్చుకున్నారు. కొన్ని ఫ్రెంచి గ్రంథాల్ని అనువదించడానికి పూనుకున్నారు కూడా. ఆయన అనువాదం సరిచూడగలిగినంత ఫ్రెంచి భాష నాకూ వచ్చు. అందువల్ల అనువాదం ఎలా వుందో చూడమని ఆయన నాకు ఇచ్చారు. అది నిజానికి అనువాదం కాదు. భావార్థం మాత్రమే.

అమెరికా వెళ్ళాలనే తన కోరికను కూడా తీర్చుకున్నారు. తంటాలుపడి చివరకు డెక్ టిక్కెట్టు సంపాదించారు. షర్టు, ధోవతి కట్టుకొని వెళ్ళడం అమెరికాలో అసభ్యతా లక్షణమట. ఆయన అవి ధరించి బజారుకు వెళ్ళగా ఆయన్ని అమెరికాలో ప్రాసిక్యూట్ చేశారట. తరువాత ఆయనను విడిచి వేసినట్లు గుర్తు.

## 23. పెద్ద సంత

1890వ సంవత్సరంలో పారిస్‌లో గొప్ప సంత జరిగింది. అందుకోసం పెద్ద ఏర్పాట్లు చేయబడుతున్నాయని పత్రికల్లో చదివాను. నాకు పారిస్ నగరం చూడాలనే కోరిక కలిగింది. రెండు పనులు కలిసి వస్తాయని భావించి పారిస్ వెళ్ళాలని నిర్ణయించాను. ఆ సంతలో ఏఫిల్ టవర్ (గోపురం) అనునది గొప్ప వింత. దాని పొడవు వేయి అడుగులు. కేవలం ఇనుముతో కట్టబడింది. ఇంకా అనేక వింతలు అక్కడ వున్నాయి. కాని ఆ గోపురం మాత్రం గొప్ప వింత. అంత ఎత్తుగల కట్టడం స్థిరంగా వుండదని అక్కడ అంతా అనుకుంటూ వుంటారు.

పారిస్‌లో శాకాహారశాల ఒకటి వున్నదని విన్నాను. అందొక గది నా కోసం ఏర్పాటు చేసుకున్నాను. ఏడురోజులు అక్కడ ఉన్నాను. తక్కువ ఖర్చుతో పారిస్ వెళ్ళడానికి, అక్కడ ఉండడానికి ఏర్పాటు చేసుకున్నాను. పారిస్ నగర పటం ఒకటి, సంతకు సంబంధించిన వివరాలు తెలిపే పుస్తకం ఒకటి సంపాదించి దగ్గర పెట్టుకున్నాను. చాలా ప్రదేశాలకు నడిచే వెళ్ళాను. మ్యాపు సహాయంతో రాజవీధులకు, దర్శనీయ స్థానాలకు వెళ్ళడం తేలిక అయింది.

ఆ ప్రదర్శనశాల అంతగా గుర్తులేదు. దాని వైశాల్యం, వైవిధ్యం మాత్రం జ్ఞాపకం వున్నాయి. రెండు మూడు సార్లు ఎక్కడం వల్ల ఏఫిల్ టవర్ నాకు చక్కగా గుర్తు ఉంది. దాని మీద మొదటి మజిలీలో భోజనశాల ఉంది. అంత ఎత్తున భోజనం చేశానని చెప్పుకునేందుకుగాను దాని మొహాన ఏడు షిల్లింగులు పారవేశాను.

పారిస్ నగరంలో గల చర్చి గృహాలు జ్ఞాపకం వున్నాయి. వాటి భవ్యస్వరూపం, వాటిలోపల లభించే శాంతి మరిచిపోదామన్నా వీలులేనివి. నోటర్ డామ్ కట్టడపు పని, లోపలి చిత్తరువులు, అక్కడి చెక్కడపు పని చిరకాలం జ్ఞాపకం వుంటాయి. అట్టి

విశాలమైన చర్చి దేవళాన్ని లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టి కట్టించిన వారి హృదయాంతరాళాలలో ఈశ్వర భక్తి ఎంతగా నిండి ఉందో వాటిని చూస్తే బోధపడుతుంది.

పారిస్ నగరపు ఫాషన్లను గురించి అక్కడి భోగవిలాసాల్ని గురించి చాలా చాలా చదివాను. ఇది ప్రతి వీధిలో మనకు కనబడుతుంది. కాని చర్చి దేవళాలు మాత్రం అద్భుతం. వాటిలోపల అడుగు పెట్టేసరికి బయట గొడవంతా మరిచిపోవలసిందే. మన ప్రవర్తన మారిపోతుంది. వర్జిన్ మేరీ దగ్గర మోకరించి యున్న వాళ్ళ దగ్గరగా నడిచి వెళుతున్నప్పుడు భయభక్తులు ఉత్పన్నమవుతాయి. మోకరిల్లుట, ప్రార్థించుట ఇవి గ్రుడ్డి నమ్మకాలు కావు అని ఆనాడు నాకు బోధపడింది. ఆ భావం నాలో రోజురోజుకు పెరుగుతూ వున్నది. వర్జిన్ మేరీ విగ్రహం ముందు భక్తి ప్రపత్తులతో మోకరిల్లుట రాతికి రప్పకు మోకరిల్లుట అని అనగలమా? వారు భక్తిచే తన్మయులై రాతినిగాక, దానియందలి దేవుణ్ణి కొలుస్తున్నారని చెప్పవచ్చు. వాళ్ళు ఈ విధంగా దేవుని మహిమను తగ్గించకుండా హెచ్చించుచున్నారని నేను భావించినట్లు గుర్తు.

ఏఫిల్ టవరును గురించి రెండు మూడు మాటలు వ్రాయడం అవసరం. దాని ఉపయోగం ఏమిటో నాకు బోధపడలేదు. కొందరు దాన్ని దూషించినట్లు, కొందరు భూషించినట్లు విన్నాను. దాన్ని నిందించిన వారిలో ప్రముఖుడు టాల్‌స్టాయ్ అని గుర్తు. అతడు ఏఫిల్ టవరు మానవుని విజ్ఞానానికి గాక అజ్ఞానానికి చిహ్నం అని పేర్కొన్నాడు.

"మాదక ద్రవ్యాలలో పొగాకు కడు నీచం. దానికి అలవాటు పడినవాడు త్రాగుడుకు అలవాటు పడిన వాళ్ళకంటే మించి నేరాలు చేస్తాడు. తాగుడువల్ల ఉన్మాదం కలుగుతుంది. కాని పొగాకువల్ల బుద్ధి తమస్సులో పడిపోతుంది." "పొగాకును ఉపయోగించేవాడు ఇలాంటి ఆకాశ సౌధాలు కట్టజూస్తాడని" టాల్‌స్టాయి చెప్పినట్లు గుర్తు. ఏఫిల్‌టవరు అట్టి వ్యసన పరిణామమే. ఏఫిల్ టవరు నందు శిల్పం లేదు అది పారిస్‌లో ఏర్పాటు చేయబడిన గొప్ప సంతకు ఏవిధంగానూ అందం సమకూర్చి పెట్టలేదు. దాని క్రొత్తదనాన్ని, వింతకొలతల్ని చూచి జనం దాన్ని చూడటం కోసం మూగుతూ ఉంటారు. దాని మీదకు ఎక్కుతూ ఉంటారు. అది సంతలో ప్రదర్శన కోసం పెట్టబడ్డ బొమ్మ. బాలురమై వున్నంతవరకు బొమ్మలపై మోహం ఉంటుంది. ఎంతవరకు అట్టి మోహం ఉంటుందో అంతవరకు మనం బాలురమేనని ఈ ఏఫిల్ టవరు స్పష్టంగా చెబుతూ ఉంటుంది. అందుకు ఈ ఏఫిల్ టవరు ఉపయోగపడు తున్నదని చెప్పవచ్చును.

## 24. పట్టా పుచ్చుకున్నాను - కాని ఆ తరువాత?

బారిష్టరు పట్టాకోసం గదా నేను ఆంగ్లదేశం వెళ్ళింది? దాన్ని గురించి కొంచెం వ్రాస్తాను. అందుకు ఇది మంచి తరుణం.

బారిష్టరు పరీక్షకు రెండు నియమాలు ఉన్నాయి. ఒకటి నిశ్చిత సమయపాలన. రెండవది - పరీక్షలు వ్రాయడం. నిశ్చిత సమయపాలనకు పట్టే సమయాన్ని పన్నెండు భాగాలుగా విభజించాలి. ఆ సమయపు ఒక్కొక్క భాగంలో జరిగే ఇరవై నాలుగు డిన్నర్లలో కనీసం ఆరు డిన్నర్లలోనైనా పాల్గొనాలి. (అంటే మూడు సంవత్సరాలకు పన్నెండు టరములు. సంవత్సరానికి నాలుగు టరములు డిన్నర్లు తొంభై ఆరు అన్నమాట) విందుల్లో పాల్గొనడమంటే భోజనం చేయడం అని అర్థం కాదు. నిర్ణీత సమయంలో హాజరై విందు జరిగినంత సేపు ఉండటం అని అర్థం. సామాన్యంగా అంతా పక్వాన్నాలు భుజిస్తారు. కోరిన మద్యం సేవిస్తారు. ఒక్కొక్క విందు వెల రెండు మూడు పౌండ్లు. అది తక్కువే. హోటల్లో అయితే ఒక మద్యానికే అంత వెల చెల్లించవలసి వస్తుంది. నవనాగరికులు కాని హిందువులకు భోజనం కంటే, అందులో ఒక భాగమైన మద్యానికి అంత ధర వుంటుందని అంటే ఆశ్చర్యం కలుగుతుంది.

లండనులో నాకీ విషయం తెలిసినప్పుడు త్రాగుడుకు ఇంత డబ్బు పాడుచేస్తున్నారేమిటా అని బాధ కలిగింది. తరువాత అక్కడి డిన్నర్ల విషయం అర్థమైంది. నేను ఆ డిన్నర్లలో పాల్గొని తిన్నది ఏమీ లేదు. అయితే రొట్టె, బంగాళాదుంపలు, క్యాబేజీ కూర మాత్రం తినేవాణ్ణి. ప్రారంభంలో ఇష్టం లేక వాటినీ తినలేదు. రుచి మరిగిన తరువాత యింకా వడ్డించమని అడగడానికి కూడా సాహసించాను.

అక్కడ విద్యార్థులకు పెట్టే ఆహారం కంటే ఉపాధ్యాయులకు పెట్టే ఆహారం మేలుగా వుండేది. నాతోబాటు శాకాహారి అయిన పార్సీ యువకుడు మరొకడు వుండేవాడు. మేము శాకాహారులం అందువల్ల ఉపాధ్యాయులకు పెట్టే శాకాహార పదార్థాలో కొన్ని మాకు పెట్టమని విన్నవించుకున్నాం. మా విన్నపం అంగీకరించబడింది. మాకు కూడా శాకాలు, పండ్లు లభించసాగాయి.

నలుగురు విద్యార్థుల బృందానికి రెండు మద్యం సీసాలు ఇస్తారు. నేను మద్యం త్రాగను. అందువల్ల ప్రతివారు తమ బృందంలోకి రమ్మని నన్ను ఆహ్వానించేవారు. నేను వాళ్ళ బృందంలో కలిస్తే నా భాగం కూడా వారే త్రాగొచ్చు. ప్రతి ఇరవైనాలుగు డిన్నర్లకు ఒకటి చొప్పున పెద్ద డిన్నరు ఏర్పాటు చేసేవారు. దానికి

గ్రాండ్‌నైట్ అని పేరు. అప్పుడు మామూలు మద్యాలతో బాటు షాంపేన్, పోర్ట్‌వైన్, షెర్రీ మొదలుగాగల మద్యాలు కూడా ఇచ్చేవారు. ఆనాడు నాకు ప్రత్యేక ఆహ్వానాలు బ్రహ్మాండంగా లభిస్తూ ఉండేవి.

అసలు ఈ రకం డిన్నర్ల వల్ల బారిష్టరగుటకు ఏవిధంగా అర్హత చేకూరుతుందో అప్పటికీ, ఇప్పటికీ నాకు బోధపడలేదు. విద్యార్థులు వెళుతూ వుండేవారనీ, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు సంభాషణకు చర్చకు అవకాశం లభించేదనీ, అక్కడ ఉపన్యాసాలు జరిగేవనీ, వాటివల్ల కొంత లోకజ్ఞానం, కొంత నాగరికత, ఉపన్యాస సమర్థత విద్యార్థులకు కలుగుతూ వుండేదనీ వినికిడి. నా టైము వచ్చేసరికి అవన్నీ పోయాయి. ఉపాధ్యాయులు, విద్యార్థులు దూరం దూరంగా కూర్చోసాగారు. అసలు ప్రయోజనం మృగ్యమైపోయి ఆచారం మాత్రం మిగిలింది. పూర్వాచారాల మీద ఆసక్తి కలిగియుండే ఇంగ్లాండు ఆ ఆచారాన్ని వదలలేదు.

బారిష్టరు పరీక్షకు అవసరమైన పుస్తకాలు తేలిక. అందుకే బారిష్టర్లకు అక్కడ డిన్నర్ బారిష్టర్లని పేరు వచ్చింది. డిన్నర్ బారిష్టర్లంటే తిండిపోతు బారిష్టర్లని అర్థం. పరీక్షలు పేరుకు మాత్రమేనని అందరికీ తెలుసు. ఆ రోజుల్లో రెండు పరీక్షలు జరిగేవి. అవి రోమన్ లా, కామన్ లా పరీక్షలు. ఈ పరీక్షలకు పాఠ్యగ్రంథాలు ఉండేవి. విడివిడిగా చదివి విడివిడిగా పరీక్షలు వ్రాయవచ్చు. కాని ఎవ్వరూ పాఠ్యపుస్తకాలు చదివిన పాపాన పోరు. రెండు వారాలు రోమన్‌లాటీను బట్టీవేసి పరీక్షకు కూర్చుంటారు. రెండు మూడు నెలలు కామన్‌లాటీనును బట్టీ వేసి పరీక్షకు కూర్చుంటారు. అటువంటి వాళ్ళను చాలామందిని చూచాను. ప్రశ్నలు తేలిక, పరీక్షకులు ఉదార స్వభావులు. రోమన్‌లా పరీక్షార్థుల్లో నూటికి 95 నుండి 99 మంది ప్యాసయ్యేవారు. పెద్ద పరీక్షలో నూటికి 75 మంది, అంతకంటే ఎక్కువమంది ప్యాస్. అందువల్ల పరీక్షా భయంలేదు. సంవత్సరానికి పరీక్షలు నాలుగుసార్లు జరుగుతూ ఉండేవి. ఇంత అనువుగా వున్న పరీక్షలు కష్టమనిపించవు.

నేను మాత్రం పుస్తకాలన్నీ చదవాలని నిర్ణయించుకున్నాను. పాఠ్యగ్రంథాలు చదవకపోవడం మోసమని నాకు అభిప్రాయం కలిగింది. నేను ఆ పుస్తకాల కోసం డబ్బు బాగా ఖర్చు చేశాను. రోమన్ లా ను లాటిన్ భాషలో చదవదలిచాను. నేను లండన్ మెట్రిక్యులేషన్ పరీక్ష కోసం లాటిన్ భాష అభ్యసించాను. అది ఇప్పుడు బాగా ఉపకరించింది. నేను చదివిన చదువుకు విలువ లేకుండా పోలేదు. దక్షిణాఫ్రికాలో అది నాకు బాగా ఉపయోగపడింది. దక్షిణాఫ్రికాలో రోమన్ డచ్చి భాషలు ప్రామాణికం.

ఈ విధంగా లాటిన్ చదువు దక్షిణాఫ్రికా దేశపు చట్టాలను తెలుసుకోవడానికి బాగా ఉపయోగపడింది.

ఇంగ్లాండు దేశపు కామన్‌లాను రాత్రింబవళ్ళు చదవడానికి నాకు తొమ్మిది నెలలు పట్టింది. బ్రూముగారి "కామన్‌లా" పెద్దది. కాని చదవడానికి బాగుండేది. కాలం మాత్రం చాలా పట్టింది. స్నెల్ గారి "ఈక్విటీ" అర్థం చేసుకోవడం కొంచెం కష్టం వైట్ ట్యూడర్ రచించిన "లీడింగ్ కేసెస్" అను గ్రంథంలో కొన్ని కేసులు తప్పనిసరిగా చదువతగ్గవి. ఆ గ్రంథం హృదయరంజకం, జ్ఞానదాయకం. విలియం ఎడ్వర్డ్‌గార్ల "రియల్ ప్రాపర్టీ" గుడ్వీగారి "పర్సనల్ ప్రాపర్టీ" అని గ్రంథాలు సంతోషంతో చదివాను. విలియంగారి పుస్తకం చదవడానికి నవలగా వుంటుంది మెయిన్‌గారి 'హిందూ లా' ఎంతో అభిరుచితో చదివాను. హిందూదేశానికి తిరిగి వస్తున్నప్పుడు ఓడలో దాన్ని చదివినట్లు గుర్తు. హిందూ లా గ్రంథాన్ని గురించి విశ్లేషించడానికి ఇది తరుణం కాదు.

నేను పరీక్ష ప్యాసయ్యాను. ది 10 జూన్ 1891లో పట్టా చేతికందింది. 11వ తేదీన ఇంగ్లాండు హైకోర్టులో రెండున్నర షిల్లింగులు చెల్లించి పేరు రిజిష్టరు చేయించుకున్నాను. 12వ తేదీన ఇంటికి బయలుదేరాను.

ఇంత చదివిన తరువాత కూడా నన్ను పెద్ద బెంగ పట్టుకుంది. కోర్టులో వాదించడానికి నేను తగనని భయం వేసింది.

ఆ క్షోభను గురించి వర్ణించేందుకు మరో ప్రకరణం అవసరం.

## 25. నన్ను పట్టుకున్న పెద్ద బెంగ

బారిష్టరు అని అనిపించుకోవడం తేలికే గాని బారిష్టరీ చేయడం మాత్రం కష్టమని తోచింది. లా చదివాను గాని, వకీలు వృత్తి నేర్చుకోలేదు. లా లో అనేక ధర్మ సిద్ధాంతాలు చదివాను. అవి నాకు నచ్చాయి. కాని వాటిని వృత్తిలో ఎలా అమలుబరచాలో బోధపడలేదు. "ఇతరుల ఆస్థికి నష్టం కలుగకుండా నీ సర్వస్వాన్ని వినియోగించు" అనునది ధర్మవచనం. కాని వకీలు వృత్తికి పూనుకొని వాది విషయంలో ఈ సిద్ధాంతాన్ని ఎలా అమలుబరచగలమో బోధపడలేదు. ఈ సిద్ధాంతం అమలుబరచబడిన కేసుల వివరం చదివాను. కాని ఆ వివరంలో ఈ సిద్ధాంతాల్ని అమలుబరచిన ఉపాయాలు లభించలేదు.

నేను చదివిన చట్టాలలో హిందూదేశానికి సంబంధించిన చట్టాలు ఏమీ లేవు. హిందూ చట్టాలు ఇస్లాం చట్టాలు ఎలా వుంటాయో నేను తెలుసుకోలేకపోయాను. దావాలు ఎలా వేయాలో తెలియదు. పెద్ద బెంగ పట్టుకున్నది. ఫిరోజ్ షా మెహతాగారి

పేరు విన్నాను. ఆయన కోర్టుల్లో సింహంలా గర్జిస్తాడని విన్నాను. ఆంగ్ల దేశంలో ఆయన ఏ విధంగా చదివారో తెలియదు. ఆయన లాంటి తెలివి ఈ జీవితంలో నాకు అబ్బదు అని అనిపించింది. ఒక వకీలుగా వృత్తి చేసుకుంటూ జీవనం గడుపుకునేందుకు అవసరమైన భృతి సంపాదించగలనా అని అనుమానం కూడా నన్ను పట్టుకుంది.

లా చదువుతున్న రోజుల్లోనే ఈ సంశయం కలిగి బాధపడ్డాను. మిత్రులతో ఈ విషయం చెప్పాను. దాదాభాయి నౌరోజీగారి సలహా తీసుకోమని ఒక మిత్రుడు చెప్పాడు. నేను ఇంగ్లాండుకు వెళ్ళేటప్పుడు శ్రీ దాదాభాయి నౌరోజీగారి పేరిట కూడా ఒక సిఫార్సు పత్రం తీసుకువెళ్ళానని గతంలో వ్రాశాను. చాలాకాలం తరువాత నేనా ఉత్తరాన్ని బయటికి తీశాను. ఆ మహా పురుషుని దర్శించటానికి నాకు గల అధికారం ఏమిటా అని యోచించాను. వారి ఉపన్యాసం జరుగుతుందని తెలియగానే నేను ఆ సభకు వెళ్ళి ఒక మూల కూర్చొని వారిని కండ్లారా చూచి వారి ఉపన్యాసం శ్రద్ధగా చెవులారా వినేవాణ్ణి. విద్యార్థుల బాగోగులను గురించి తెలుసుకునేందుకు ఆయన ఒక సంఘం స్థాపించారు. ఆ సభలకు నేను విధిగా వెళుతూ ఉన్నాను. నౌరోజీగారు విద్యార్థుల పట్ల చూపే ప్రేమ, వాత్సల్యం విద్యార్థులు వారి యెడ చూపే శ్రద్ధాభక్తులు చూచి ఎంతో ఆనందించాను. ఒకరోజు ధైర్యం తెచ్చుకొని సిఫార్సు ఉత్తరం పుచ్చుకొని వారి దగ్గరకు వెళ్ళాను. "నీ కిష్టమైనప్పుడల్లా వచ్చి నన్ను కలవవచ్చు" అని ఆయన అన్నారు. అయితే ఆ అవకాశం నేను ఉపయోగించుకోలేదు. అవసరం లేనప్పుడు వెళ్ళి వారిని ఇబ్బంది పెట్టడం నాకు ఇష్టంలేక ఆ సలహాను నేను అమలుచేయలేదు.

ఫెడరిక్ పిన్‌కట్ గారిని దర్శించమని ఆ మిత్రుడే సలహా యిచ్చాడో లేక మరో మిత్రుడే ఇచ్చాడో గుర్తులేదు. పిన్‌కట్‌గారు మితవాది. పూర్వాచారపరాయణుడు. భారతీయ విద్యార్థుల మీద ఆయన చూపే ప్రేమ నిర్మలం, నిస్వార్థమయం. విద్యార్థులు సలహా కోసం వారి దగ్గరకు వెళుతూ వుండేవారు. నేను కూడా వారి దర్శనం కోసం వెళ్ళాను. ఆ సంభాషణను నేను మరిచిపోలేను. ఒక మిత్రునితో సంభాషించినట్లు ఆయన నాతో మాట్లాడారు. నన్ను పట్టుకున్న బెంగను నవ్వుతూ పోగొట్టారు. "ఏమిటి? అంతా ఫిరోజ్ షా మెహతాలు అవుతారా? ఫిరోజ్‌షాలు, బదురుద్దీనులు కొద్దిమందే ఉంటారు. లాయరవడానికి గొప్ప తెలివితేటలు ఉండాలని భావించకు. ప్రామాణికత్వం, శ్రద్ధ ఉంటే చాలు. తద్వారా అవసరమైనంత డబ్బు సంపాదించవచ్చు. దావాలన్నీ చిక్కులమయంగా ఉండవు అని చెప్పి సరే, పాఠ్యపుస్తకాలు కాక ఇంకా ఇతర పుస్తకాలు ఏమేమి చదివావో చెప్పు!" అని అడిగారు.

నేను చదివిన కొద్ది గ్రంథాల పేర్లు చెప్పాను. అయన కొంచెం నిరాశపడ్డారు. ఒక్క క్షణం సేపు అలా ఉండి చిరునవ్వు నవ్వుతూ "నీ క్షోభ నాకు అర్థం అయింది. నీకు ఇతర గ్రంథాల వల్ల కలిగిన జ్ఞానం కొద్దే. నీకు గల ప్రపంచజ్ఞానం కొద్దే. నీవు కనీసం హిందూ దేశచరిత్ర అయినా చదవాలి. మనిషి స్వభావం తెలుసుకోవాలి. మనిషి మొహం చూచి అతడెట్టివాడో తెలుసుకొనగలిగివుండాలి. ప్రతి హిందువు హిందూ దేశ చరిత్ర చదివి తీరాలి. లాయరుకు దానితో సంబంధం లేకపోయినా దాన్ని చదవాలి. విషయం తెలుసుకోవాలి. కే మరియు మాలెసన్‌గారు కలిసి వ్రాసిన 1857 సంవత్సరపు విప్లవ చరిత్ర కూడా నీవు చదవలేదు. వెంటనే ఆ పుస్తకం చదువు. మానవ స్వభావాన్ని గురించి తెలియజెప్పే ముఖ సాముద్రికాన్ని గురించి లావేటరు గారు, షెమ్మెల్ పెన్నిక్ గారు వ్రాసిన గ్రంథాలు సంపాదించు" అని చెప్పి ఆ గ్రంథాల పేర్లు కాగితం మీద వ్రాసి నాకు ఇచ్చారు.

వారికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. ఆయన ఎదుట నా భయం ఎగిరిపోయింది. కాని కాలు బయటపెట్టగానే మళ్ళీ బెంగ మొదలైంది. ముఖం చూచి మనిషి స్వభావం తెలుసుకోవడం ఎట్లా అని దారి పొడుగునా అనుకుంటూ ఆ రెండు పుస్తకాలను గురించి యోచిస్తూ ఇంటికి చేరాను. దుకాణంలో షెమ్మెల్ పెన్నిక్ గారి పుస్తకం దొరకలేదు. మర్నాడు లావేటరు గారి పుస్తకం చదివాను. అది స్నెల్‌గారి "ఈక్విటీ" కంటే కష్టంగా ఉంది. షేక్స్పియర్‌గారి ముఖసాముద్రికం చదివాను. కాని లండను వీధుల్లో క్రింది నుండి పైకి, పైనుండి క్రిందికి ఎంత తిరిగినా షేక్స్పియర్‌గారు చెప్పినట్లు ముఖసాముద్రికాన్ని గురించి తెలుసుకునే ప్రావీణ్యం నాకు కలుగలేదు.

లావేటరు గారి పుస్తకం నాకు ఉపయోగపడలేదు. కాని వారి స్నేహం నాకు ఎంతో ఉపయోగపడింది. వారి నవ్వుముఖం, ఉదారాకృతి నా హృదయానికి హత్తుకున్నాయి. మంచి లాయరు అయ్యేందుకు ఫిరోజ్‌షా మెహతా గారి నైపుణ్యం, ధారణాశక్తి అవసరంలేదు. కాని ప్రామాణికత శ్రద్ధ, కష్టపడి పనిచేసే మనస్తత్వం అవసరమని వారిచ్చిన సలహా మీద నాకు విశ్వాసం ఏర్పడింది. ఆ ప్రకారం నడుచుకోవాలని నిర్ణయించుకున్నాను. దానితో కొంచెం ఆశ చిగురించింది.

కే మరియు మాలెసన్ గారు కలిసి వ్రాసిన గ్రంథాల్ని చదవలేకపోయాను. సమయం దొరికితే ముందు ముందు వారి గ్రంథాల్ని చదవాలని నిర్ణయించుకున్నాను. ఆ నా కోరిక దక్షిణాఫ్రికాలో తీరింది. నన్ను పట్టుకున్న బెంగలో కొంత ఆశారేఖ గోచరించింది. దానితో అస్సాము అను స్టీమరు ఎక్కి బొంబాయి చేరాను. సముద్రం అల్లకల్లోలంగా ఉంది. లాంచీలో ఒడ్డుకు చేరాను.

★ ★ ★

# రెండవ భాగం

## 1. రాయచంద్ భాయి

బొంబాయి రేవు దగ్గర సముద్రం అల్లకల్లోలంగా వున్నదని గత ప్రకరణంలో వ్రాశాను. జూన్, జూలై మాసాల్లో అరేబియా సముద్రం అల్లకల్లోలంగా వుండటం సహజం. ఓడలో వాళ్ళంతా జబ్బుపడ్డారు. నేను మాత్రం జబ్బు పడలేదు డెక్ మీద వుండి సముద్రంలో రేగిన తుఫానును చూస్తూ వున్నాను. ప్రొద్దుటి భోజనంలో నాతోబాటు యిద్దరు ముగ్గురు పాల్గొన్నారు. పళ్లాలు జాగ్రత్తగా పట్టుకొని వరిగల పిండితో తయారైన గంజి త్రాగుతున్నాము పళ్లెం జాగ్రత్తగా పట్టుకోకపోతే అది తన దారి తాను చూచుకొనే స్థితిలో వుంది. తుఫాను అంత తీవ్రంగా వుందన్నమాట

బయటి తుఫానుకు, నాలో వీస్తున్న తుఫానుకు భయపడని నేను లోపలి తుఫానుకు చలించనని పాఠకులకు బోధపడేవుంటుందని భావిస్తున్నాను. బొంబాయి చేరి ఇంటికి వెళ్లగానే కుల బహిష్కారం సిద్ధంగా వున్నది. ప్లీడరు వృత్తికి నేను తగనని గతంలో వ్రాశాను. నేను సంస్కర్తను. కనుక ఏఏ విషయాలు ఏఏ విధంగా సంస్కరించాలా అని ఆలోచించసాగాను. కాని తర్కానికి కొరుకుడు పడని కొన్ని సమస్యలు నాకోసం ఎదురుచూస్తున్నాయి.

నన్ను కలుసుకునేందుకు మా పెద్దన్నగారు బొంబాయి రేవు దగ్గరకు వచ్చారు. డా. మెహతాగారితోను, వారి పెద్దన్నగారితోను ఆయనకు అదివరకే పరిచయం ఏర్పడింది. డా. మెహతాగారు తమ ఇంటికి రమ్మని గట్టిగా పట్టు పట్టడం వల్ల మేమంతా వారి ఇంటికి వెళ్ళాము. ఆంగ్లదేశంలో ఏర్పడిన మా పరిచయం వృద్ధి అయింది. ఇక్కడ గల వారి కుటుంబానికీ, మా కుటుంబానికీ సంబంధాలు బాగా పెరిగాయి.

మా "అమ్మ"ను త్వరగా చూడాలని తహతహ ప్రారంభమైంది. కాని ఆమె యీ లోకాన్ని వీడిపోయిందను వార్త మా అన్నగారు ముందు నాకు తెలియచేయలేదు ఓడ దిగిన తరువాత చెప్పారు. నేను సూతక స్నానం చేశాను. నేను ఇంగ్లాండులో వున్నప్పుడే ఆమె చనిపోయింది. యీ సంగతి తెలిస్తే బాధపడిపోతానని మా అన్నగారు నాకు తెలియజేయలేదు. యీ వార్త విన్నప్పుడు నాకు అపరిమితమైన దుఃఖం కలిగింది.

ఏడుపు పెల్లుబికింది. కాని యిప్పుడు యిక ఆ గాథ అప్రస్తుతమే కదా ! మా తండ్రిగారు గతించినప్పుడు కలిగిన వ్యధకంటే యిది అత్యధికం. నా కోరికలన్నీ గొంతెమ్మ కోరికలే అయ్యాయి. కాని అప్పుడు దుఃఖానికి కళ్ళెం వేసుకున్నట్లు గుర్తు. నేను కంట తడిబెట్టలేదు. మా అమ్మగారు చనిపోనట్లే వ్యవహరించి, నా వ్యవహారాలు నేను చక్కదిద్దుకోసాగాను. డా. మెహతాగారు చాలామందిని నాకు పరిచయం చేశారు. వారిలో దేవాశంకర్ జగజీవన్‌గారు ఒకరు. వారి మైత్రి యావజ్జీవిత మైత్రిగా మారింది. అప్పుడే మెహతాగారు నాకు రాయచంద్ కవి లేక రాజచంద్ర కవిగారిని పరిచయం చేశారు. వీరు డా. మెహతాగారి పెద్దన్న గారి అల్లుడు. దేవా శంకర్ జగజీవన్ గారి నగల దుకాణంలో భాగస్వామి. నాకు వారితో పరిచయం కలగడం పెద్ద విశేషం. వారికి అప్పుడు ఇరవై అయిదేండ్లు. చూడగానే వారు నిర్మల చరిత్రులని, విద్వాంసులని తెలుసుకోగలిగాను. వారు శతావధానులు. డా. మెహతా గారు రాజచంద్ర కవిగారి ధారణా పటిమను కొంచెం చూడమని చెప్పారు నాకు వచ్చిన పాశ్చాత్య భాషాపాండిత్యాన్ని అధికంగా ఆయన ముందు ఉపయోగించాను. నేనెట్లా చదివితే రాజచంద్ర కవిగారు అట్లా చదివారు. ఆయన సామర్థ్యం చూచి నేను తట్టుకోలేకపోయాను. ధారణ, శతావధానం, అను శక్తులకు నేను ముగ్ధుడిని కాలేదు. నన్ను ముగ్ధుణ్ణి చేసిన విశేషం తరువాత బోధపడింది. అది వారి విశాల శాస్త్రజ్ఞానం. నిర్మలమైన వారి నడత. ఆత్మజ్ఞానం యెడ వారికి గల తీవ్రమైన తపన. యీ చివరి దానికోసమే వారు తన జీవితాన్ని వినియోగించారని తరువాత తెలిసింది. శ్రీముక్తానందుడు రచించిన క్రింది ఛందం ఆయన సదా స్మరిస్తూ వుండేవారు. వారి హృదయంలో యీ గేయం అంకితమై పోయింది.

హసుతాం రమతాం ప్రగట హరి దేఖుంరే, మారుం జీవ్యూం సఫల తవ లేఖుంరే,

ముక్తానందనో, నాథ విహారీరే, ఓధా జీవనదోరీ అమారీరే.

(నవ్వుతూ ఆడుతూ పాడుతూ ప్రతిపనిలో హరిని దర్శించితేనే నా జీవితం ధన్యమని భావిస్తాను. నా ప్రభువు భగవంతుడే. ఆయనే నా జీవితానికి సూత్రం. యిది ముక్తానందుని కథనం). ఆయన వ్యాపారం లక్షలమీద సాగుతున్నది. ముత్యాల, వజ్రాల, రత్నాల వ్యాపారమందతని ప్రజ్ఞ అసామాన్యం. ఎంతటి చిక్కు సమస్యనైనా యిట్టే పరిష్కరించగల శక్తి ఆయనకు వుంది. కాని నిజానికి బుద్ధి లౌకిక వ్యవహారాల్లో చిక్కుకొని వుండిపోలేదు.

ఆయన ఎప్పుడూ పురుషార్థం, ఆత్మ సాక్షాత్కారం హరిదర్శనం అంటూ ఆ భావనలో లీనమైయుండేవాడు. ఆయన వ్రాత బల్లమీద చిఠ్ఠాలతో పాటు ఏదో ఒక వేదాంత గ్రంథం, దినచర్య (డైరీ) వ్రాసుకొనే పుస్తకం వుండేవి. వ్యవహారం ముగియగానే ఆ రెండిటిలో ఒక పుస్తకం తీసుకొనేవారు. యీ డైరీ నుంచి సమీకరించి ఆయన పలు గ్రంథాలు ప్రకటించారు. ఆయన లక్షల కొద్ది వ్యాపారస్థులతో లావాదేవీలు జరిపిన తరువాత ఆత్మజ్ఞానానికి సంబంధించిన గూఢ విషయాలు వ్రాస్తూ వుండేవారు. ఆయన సామాన్య వర్తకుడు కాడు. జ్ఞానకోటి లోనివాడు. దుకాణంలో వ్యాపారం సాగుతూ వుండగా ఆయన ధ్యానమగ్నుడై వుండటం అనేక పర్యాయాలు నేను చూచాను. ఆయన అందరితోను సమానంగా వ్యవహరించేవాడు. ఆయనకు నా విషయంలో స్వార్థం ఏమీలేదు. వారితో గాఢ పరిచయం కలిగింది. నేను అప్పటికి పనిపాటలు లేని బారిస్టరును. నేను వారి దుకాణానికి వెళ్ళినప్పుడు వేదాంత చర్చ దప్ప మరో చర్చ జరిగేదికాదు. నాకు అప్పటికి వేదాంత విషయాల్లో అంతగా ప్రవేశం లేదు. అయినా వారి మాటలే నాకు మంత్రాలుగా వుండేవి. తరువాత నేను అనేకమంది మతాచార్యుల్ని దర్శించాను. ప్రత్యేకించి విశేష ప్రజ్ఞ కలిగిన ఆచార్యుని కోసం అన్వేషించాను. కాని రాయచంద్‌భాయి యిచ్చే ఉపదేశాల వంటివి ఎక్కడా లభించలేదు. వారి ఉపదేశం సూటిగా హృదయంలో నాటుకునేది. వారి బుద్ధి యెడ, వారి ప్రామాణికత్వం యెడ నాకు అపారమైన ఆదరణ ఏర్పడింది. ఆయన నన్ను అన్యమార్గానికి తీసుకుపోడనే నమ్మకం నాకు కలిగింది. తన హృదయంలో వుండే భావాలు కొన్ని నాకు ఆయన చెబుతూ వుండేవాడు. భగవంతుణ్ణి గురించి తెలిసీ తెలియక కొట్టుమిట్టాడుతున్నప్పుడు ఆయన అండగా కనిపించేవాడు. రాయచంద్‌భాయి యెడ నాకు యింత గౌరవం వున్నా ఆయనను ఆధ్యాత్మిక గురువుగా నేను భావించలేకపోయాను. నా హృదయమందలి ఆ సింహాసనం యింకా ఖాళీగానే వున్నది. నా అన్వేషణ యింకా సాగుతూనే వున్నది.

హిందూ వేదాంతం గురువు అను పదానికి ఎంతో మహత్తు కల్పించింది. దాన్ని నేను అంగీకరిస్తాను. గురువు లేనిదే ముక్తిలేదన్న విషయం సత్యం. అక్షర జ్ఞానం కలిగించే గురువు అజ్ఞాని అయినా ఫరవాలేదు. కాని ఆధ్యాత్మిక గురువు అసమర్థుడైతే సాగదు. గురువు పదవికి పూర్ణ జ్ఞానియే అర్హుడు. జ్ఞానప్రాప్తి కోసం సదా సర్వదా శోధన అవసరం. శిష్యుని యోగ్యతననుసరించి గురువు లభిస్తాడు. తన తన యోగ్యతను బట్టి ప్రతి సాధకుడు ప్రయత్నించవచ్చు. అట్టి అధికారం అతనికి వుంటుంది. ఫలితం ఈశ్వరాధీనం.

నేను రాయచంద్‌భాయిని నా ఆధ్యాత్మిక గురువుగా భావించక పోయినప్పటికీ ఎన్నోసార్లు ఆయన నాకు మార్గదర్శకుడుగాను, సహాయకుడుగాను తోడ్పడి సహకరించాడు. ఆ వివరం రాబోయే ప్రకరణాల్లో మీకు తెలుస్తుంది. నా జీవితంలో తమ గాఢముద్రను హత్తిన వారు ముగ్గురు వ్యక్తులు. ఆ ముగ్గురు ఆధునిక యుగానికి చెందినవారే. రాయచంద్‌భాయి ప్రత్యక్షసాంగత్యం వల్ల నా హృదయంలో నాటుకుపోయారు. రెండవవారు టాల్‌స్టాయి. వారు రచించిన "వైకుంఠం నీ హృదయంలోనే" (the kingdom of God is within you) అను గ్రంథం ద్వారాను, మూడవవారు రస్కిన్. తాము రచించిన 'సర్వోదయం' (unto this last) అను పుస్తకం ద్వారాను నా హృదయంలో నిలిచిపోయారు. సమయ, సందర్భాలను బట్టి వివరాలు తరువాత చెబుతాను.

## 2. జీవనయాత్ర

మా అన్నగారు నా మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. ఆయనకు ధనం, కీర్తి, పదవి, మూడూ కావాలి. ఆయన దోషాల్ని క్షమించగల విశాల హృదయుడు. దానికి తోడు నిరాడంబరమైన ప్రవర్తన కలవాడు. అందువల్ల ఆయనకు మిత్రులు ఎక్కువగా వుండేవారు. తన యీ మిత్రుల సహాయంతో నాకు కేసులు తెప్పించాలని ఆయన భావించాడు. నా ప్లీడరు వృత్తి బాగా సాగుతుందని భావించి ఇంటి ఖర్చులు బాగా పెంచివేశాడు. నా ప్రాక్టీసు కోసం ఆయన ఎంతో కృషి చేశాడు.

నా సముద్రయానపు తుఫాను యింకా వీస్తూనే వుంది. మా కులంలో రెండు పక్షాలు బయలుదేరాయి. ఒక పక్షంవారు నన్ను వెంటనే కులంలో కలుపుకున్నారు. రెండో పక్షం వారు యింకా కుల బహిష్కారం మీద పట్టిన పట్టు విడువలేదు. మమ్మల్ని కులంలో కలుపుకున్న వారిని సంతోష పెట్టడం కోసం మా అన్న నన్ను నాసికకు తీసుకుపోయి అక్కడ నదీస్నానం చేయించాడు. రాజకోట చేరగానే మా కులం వారికి భోజనాలు ఏర్పాటు చేశాడు. అందుకు నా మనస్సు అంగీకరించలేదు. కాని మా అన్నగారికి నామీదగల ప్రేమ అపారం. వారి యెడ నాకు భక్తి అపారం. అందువల్ల ఆయన చెప్పింది మంత్రంగా భావించి ఏం చేయమంటే అది చేశాను. యీ విధంగా జరిగిన తరువాత వెలిని గురించి యిక ఎవ్వరూ మాట్లాడలేదు. వారిమీద ఈర్ష్య ద్వేషం పెంచుకోలేదు. వారిలో కొందరు నన్ను ఏవగించుకునేవారు. కాని నేను వారి జోలికి పోకుండా జాగ్రత్తగా వుండేవాణ్ణి. వెలికి సంబంధించిన కొన్ని కట్టుబాట్లను నేను

పాటించేవాణ్ణి. మా అత్తమామలుగాని, అక్కబావలుకాని నన్ను భోజనానికి పిలిస్తే వాళ్లను వెలివేయవచ్చు. అందువల్ల నేను వాళ్ళ యిళ్ళలో మంచి నీళ్ళు కూడా పుచ్చుకొనేవాణ్ణి కాదు. మావాళ్లు చాటుమాటుగా మాతో కలుద్దామని చూచేవారు కాని నేను అంగీకరించేవాణ్ణి కాను. ఏది చేసినా బహిరంగంగా చేయాలిగాని చాటుమాటుగా చేయకూడదని నా అభిప్రాయం.

నేను జాగ్రత్తగా వున్నందువల్ల కులం వాళ్లు నా జోలికి రాలేదు. నన్ను వెలివేసిన వారిలో చాలామందికి నేనంటే అమిత ప్రేమ. మా కులానికి ఏదో చేస్తానని భావించకుండానే వారు నా ప్రయత్నానికి ఎంతగానో సహకరించారు. నా పనుల వల్ల యిట్టి సత్ఫలితం కలిగిందని నా విశ్వాసం. వెలివేసిన వారికి వ్యతిరేకంగా నేను వ్యహరించినా, స్వపక్షీయుల్ని కలుపుకొని రగడ ప్రారంభించినా వ్యవహారం ముదిరేదే. ఆంగ్ల దేశాన్నుంచి రాగానే యీ గొడవల్లో పడివుంటే నేను ఏదో కపటవేషం వేయక తప్పేదికాదు.

మా దాంపత్యం యింకా నేననుకున్నట్లు కుదుడపడలేదు. నేను ఆంగ్లదేశం వెళ్లిన తరువాత కూడా నా ద్వేష దుష్ట స్వభావం నన్ను విడిచిపెట్టలేదు. అడుగడుగునా తప్పులెన్నో జరిగాయి. నా స్వభావం యథాప్రకారంగానే వున్నది. అందువల్ల నా కోరిక నెరవేరలేదు. నా భార్యకు చదువు గరపాలి. కాని నా కామోద్రేకం అందుకు అడ్డుగా వున్నది. లోపం నాది. కాని కష్టం అనుభవించింది ఆమె. ఒకసారి ఆమెను పుట్టింటికి పంపివేయడానికి కూడా సిద్ధపడ్డాను. అనేక కష్టాలపాలు చేసిన తరువాతనే ఆమెను దగ్గరకు రానిచ్చాను. కొంత కాలానికి తప్పంతా నాదేనని గ్రహించాను.

మా బాలుర విద్యాభ్యాసాన్ని సంస్కరించాలని పూనుకున్నాను. మా అన్నగారికి పిల్లలు వున్నారు. ఆంగ్లదేశం వెళ్లక పూర్వం నాకు పిల్లవాడు పుట్టాడు. వాడికి యిప్పుడు నాలుగేండ్లు. వీళ్ల చేత కసరతు చేయించి వీళ్లను వజ్రకాయుల్ని చేయాలని, ఎప్పుడూ నా కనుసన్నల్లో వాళ్లను వుంచుకొని పెంచాలని భావించాను. మా అన్నగారు అందుకు అంగీకరించారు. అందువల్ల యీ విషయంలో నాకు సాఫల్యం లభించింది. పిల్లలతో కలసి వుండటం నాకు యిష్టం. పిల్లలతో ఆడుకోవడం, పిల్లలతో నవ్వులాడటం అంటే నాకు యిప్పటికీ యిష్టమే. నేను పిల్లలకు మంచి ఉపాధ్యాయుణ్ణి కాగలిగానని నా విశ్వాసం.

అన్నపానీయాల విషయంలో సంస్కరణ అవసరమని భావించాను. మా యింట్లో కాఫీ, టీలు ప్రవేశించాయి. నేను ఇంగ్లాండు నుండి తిరిగి వచ్చేసరికి మా

ఇంటికి ఆంగ్ల దొరల గృహ పోలికలు ఏర్పడేలా చూడాలని మా అన్నగారు భావించారు. అందుకోసం ఇంట్లో పింగాణీ సామాను పెరిగిపోయింది. కాఫీ, టీలకు బదులు కోకో, వరిగ పిండి జావల్నీ ప్రవేశపెట్టాను. పేరుకు మాత్రమే యీ మార్పుగాని, యివి కూడా కాఫీ టీలకు తోడయ్యాయి. మేజోళ్లు ముందే ప్రవేశించాయి. యిక నేను కోటు, ఫాంటు ధరించి మా ఇంటిని పావనం చేశాను.

దానితో ఇంటి ఖర్చు పెరిగిపోయింది. ప్రతిరోజూ ఏవేవో క్రొత్త వస్తువులు రాసాగాయి. తెల్ల ఏనుగు చందాన మా పరిస్థితి మారింది. కాని ఆ తెల్ల ఏనుగుకు మేత కావాలి కదా ? అది ఏదీ ? రాజకోటలో వృత్తి ప్రారంభించడం నాకు యిష్టం లేదు. వకీలుకు వుండవలసిన జ్ఞానం నాకు లేదని తెలుసు. ఫీజు మాత్రం పెద్ద వకీళ్లంతగా లాగాలని ఉబలాటం. వ్యాజ్యానికి నన్ను కుదుర్చుకునే మూర్ఖుడెవడు? ఒకవేళ ఎవడైనా వున్నా నా తెలివి తక్కువకు తోడు, నా అహంకారాన్ని కూడా కలిపి మొత్తం భారం నెత్తిన వేసుకోవాలిగదా !

బొంబాయి వెళ్లి అక్కడ హైకోర్టులో కొంత అనుభవం గడిస్తూ, హిందూలా చదువుతూ, వ్యాజ్యాలతో, కొంతకాలం గడపడం మంచిదని మిత్రులు సలహా యిచ్చారు. ఆ ప్రకారం నేను బొంబాయి వెళ్లాను.

ఇల్లు తీసుకున్నాను. వంటవాణ్ణి పెట్టుకున్నాను. నాకు అతడు తగినవాడే. బ్రాహ్మణుడు. అతణ్ణి నేను నౌకరుగా భావించలేదు. కుటుంబంలో ఒకడిగా భావించాను. అతడు లింగం మీద నీళ్లు పోసినట్లు ఒంటిమీద నీళ్లు పోసుకునేవాడు. ఒళ్లు తోముకోడు. మడిపంచె మురికిగా వుండేది. జందెం మడ్డిగా వుండేది. శాస్త్రజ్ఞానం శూన్యం. నాకు యింతకంటే మంచి వంటవాడు ఎట్లా దొరుకుతాడు?

"ఏమండీ రవిశంకర్‌గారూ ! మీకు వంట చేతకాకపోతే మానె. రెండు సంధ్యావందనం ముక్కలైనా రాకపోతే ఎలాగండీ !"

"అయ్యో ! సంధ్యావందనమా ! నాకు నాగలే సంధ్య. పారే నిత్యకర్మ. ఏదో మాదిరి బ్రాహ్మణ్ణి. మీ అనుగ్రహం వల్ల బ్రతుకుతున్నాను. మీరు కాదంటే నాచేతి ముల్లుకర్ర మళ్లీ పుచ్చుకుంటాను."

నేను రవిశంకర్‌కు గురుత్వం వహించాను. నాకు అంతా తీరికేగదా ! సగం వంట నేనే చేసేవాణ్ణి. శాకాహారం తయారుచేయడంలో దొరల పద్ధతిని ప్రవేశపెట్టాను. ఒక స్టౌ కొన్నాను. ఎవరితోనైనా సరే సహపంక్తి భోజనానికి నేను సిద్ధమే. రవిశంకర్‌కూ యిబ్బంది లేదు. మా యిద్దరికీ జోడు కుదిరింది. అయితే ఒక చిక్కు వచ్చిపడింది.

మడ్డి గుడ్డలు విడవననీ, అన్నం పరిశుభ్రంగా వుంచననీ రవిశంకరుని ప్రతిజ్ఞ. దాన్ని మాత్రం జాగ్రత్తగా కాపాడుకొంటూ వున్నాడు. బొంబాయిలో నాలుగైదు మాసాల కంటే ఎక్కువకాలం వుండటానికి వీలుపడలేదు. అక్కడ ఖర్చు ఎక్కువ, రాబడి తక్కువ.

ఈ విధంగా సంసార సాగరంలో ఈత ప్రారంభించి వకీలు వృత్తి మంచిది కాదనే నిర్ణయానికివచ్చాను. యిది కేవలం చూపుడు గుర్రమే. పైన పటారం, లోన లొటారం. ఇక నా కర్తవ్యం ఏమిటా అని ఆలోచనలో పడ్డాను.

## 3. మొదటి కేసు

నేను బొంబాయిలో ఒక వంక హిందూ లా చదవడం, మరోవంక భోజనం విషయంలో ప్రయోగాలు చేయడం ప్రారంభించాను. మిత్రుడు వీరచంద్‌గాంధీ నాకు సహకరించాడు. మా అన్నగారు నాకోసం కేసుల్ని తీసుకువచ్చేందుకు కృషి చేయసాగారు.

హిందూ లా చదవడం విసుగు పని. సివిల్ ప్రొసీజరు కోడ్ నాకు నడవలేదు. ఎవిడెన్సు ఆక్టు విషయం వేరు. వీరచంద్ గాంధీ సొలిసిటర్ పరీక్షకు చదువుతూ వున్నాడు. అతడు బారిస్టర్ వృత్తిని గురించీ, వకీళ్లను గురించీ రకరకాల గాధలు చెబుతూ వుండేవారు. లా శాస్త్రంలో అగాధమైన జ్ఞానమే ఫిరోజ్ షా గారి యోగ్యతకు నిపుణతకు కారణం. ఆయనకు ఎవిడెన్సు ఆక్టు పూర్తిగా బట్టీ. 32వ సెక్షనులోని ప్రతి కేసు ఆయనకు కంఠోపాఠం. బదరుద్దీన్ తయాబ్జీగారి వాదనా పటిమ చూచి జడ్జీలు నివ్వెరబోయేవారు. యిట్టి అతిరధుల మహారథుల గాధలు విని నా గుండె నీరైపోతూ వుండేది.

ఇంకా "కొత్త బార్టిస్టర్లకు అయిదారు మాసాల పాటు పని ఏమీ వుండదు. యిదిఅందరికీ తెలిసిన విషయం. అందువల్లనే నేను సొలిసిటర్ జనరల్ కోర్సు చదువుతున్నాను. నీవు యింకా మూడు నాలుగు మాసాలలో డబ్బు సంపాదించగలిగితే అదృష్టమే." అని అన్నాడు. నెలనెలకు ఇంటి ఖర్చు పెరిగిపోతున్నది. ఇంటి బయట బారిష్టరు అని బోర్డు కట్టి, ఇంటి లోపల కూర్చొని బారిష్టరు వృత్తికి కృషిచేయడం నాకు నచ్చలేదు. యీ విధమైన పరిస్థితి వల్ల గ్రంథపఠనంలో మనస్సు లీనంకాలేదు. ఎవిడెన్సు ఆక్టుమీద బలవంతాన ఆసక్తి పెంచుకున్నాను. మైన్‌గారు రచించిన "హిందూలా" ను ఉత్సాహంతో చదివాను. కాని కోర్టులో వాదించేందుకు గుండె చాలలేదు. యిక నా కష్టం ఆ దేవుడికే ఎరుక. అత్తగారింటికి వచ్చిన క్రొత్త కోడలికంటే నా పని కనాకష్టమైపోయింది.

ఈ వయసులోనే మమీబాయి అను ఆమె కేసు ఒకటి తీసుకున్నాను. అది స్మాల్ కాజుకు సంబంధించినది. మధ్య దళారి కొంత సొమ్ము కమీషను యిమ్మని అడిగాడు. నేను పైస కూడా యివ్వనన్నాను. "ఫలానా పెద్ద లాయరు నెలకు మూడు నాలుగు వేల రూపాయలు సంపాదిస్తున్నాడు ఆయనే కమీషను సొమ్ము యిస్తాడు కదా!" "ఆయనతో నాకు పోటీ లేదు. నాకు మూడు వందల రూపాయలు చాలు. మా నాయన అంతకంటే ఎక్కువ సంపాదించలేదు." 'అది ఇక్ష్వాకుల కాలం. బొంబాయిలో ఆహార పదార్థాల ధరలు పెరిగాయి. ప్రపంచాన్ని అర్థం చేసుకొనిమెలగడం మంచిది.' కాని నేను మెత్తబడలేదు. అయినా ఆమె కేసు నాకే వచ్చింది. అది చాలా తేలిక వ్యవహారం. ముప్పది రూపాయల ఫీజు తీసుకున్నాను. ఒకరోజు కన్న ఆ కేసుకు ఎక్కువ సమయం పట్టదు.

స్మాల్ కాజ్ కోర్టులో ఇదే నాకు మొదటి కేసు. 'హరి: ఓమ్' అన్న మాట. నేను ప్రతివాది పక్షం. అందువల్ల వాది తరపు సాక్షుల్ని క్రాస్ చేయాల్సి వచ్చింది. కోర్టులో లేచి నుంచున్నాను. గుండె దడదడలాడింది. తల తిరిగిపోయింది. కోర్టంతా తిరిగిపోతున్నట్లనిపించింది. ప్రశ్నలు అడుగుదామంటే నోరు తెరుపుడు పడలేదు. జడ్జి నవ్వి వుంటాడు. తోటి వకీళ్లకు కూడా నవ్వు వచ్చి వుంటుంది. కాని నేను యిదంతా పట్టించుకునే స్థితిలో లేను. నేను కుర్చీలో కూర్చుండిపోయాను. ఏజంటును పిలిచి "ఈ కేసును వదిలేస్తున్నాను. మరొక పటేలును పెట్టుకొండి. నాకిచ్చిన రుసుం ముప్పది రూపాయలు తిరిగి యిచ్చివేస్తాను" అని చెప్పి సొమ్ము యిచ్చి వేశాను. వాళ్లు యాభై రూపాయలకు పటేలును కుదుర్చుకున్నారు. ఆ కేసు ఆయనకు బహు సులభం.

నేను గబగబా యింటికి వెళ్లాను. ఆ కేసు ఏమైందో నాకు తెలియదు. నాకు మాత్రం చాలా సిగ్గువేసింది. యిక కేసులు తీసుకోకూడదని నిర్ణయానికి వచ్చాను. దక్షిణ ఆఫ్రికా పోనంతవరకు ఆ కేసుల వైపు చూడలేదు. యీ విధమైన నిర్ణయం మంచిదికాదు కాని ఆ సమయంలో అది మంచిదే అయింది. ఓడిపోయేందుకై నాకు ఎవ్వడూ కేసులు యివ్వడుకదా !

బొంబాయిలో నా దగ్గరికి మరో కేసు వచ్చింది. అయితే అందు కేవలం అర్జీ మాత్రమే వ్రాయాలి. పోరుబందరులో నిరుపేదయగు ఒక తురకవాని భూమిని సంస్థానం వారు జప్తు చేశారు. మా తండ్రి గారి గౌరవాన్ని బట్టి అతడు నా సాయం కోరాడు. అతని వాదంలో బలం లేదు. అయినా అర్జీ వ్రాసి యిచ్చేందుకు అంగీకరించాను.

దానికి అయ్యే ఖర్చు అతడే భరించాడు. చిత్తు వ్రాసి మిత్రులకు వినిపించాను బాగున్నదని వారంతా అన్నారు. దానితో యిట్టి అర్జీలనైనా వ్రాయగలననే ధైర్యం కలిగింది. అది నిజం కూడా.

డబ్బు పుచ్చుకోకుండా యీ విధంగా అర్జీలు వ్రాసి పెట్టడానికి సమయం బాగా పట్టేది. కాని బండి సాగాలికదా ! అందువల్ల ఉపాధ్యాయ వృత్తి ఏదైనా దొరుకుతుందేమోనని చూచాను. నాకు ఇంగ్లీషు భాష వచ్చు. అందువల్ల మెట్రిక్యులేషన్ పిల్లలకు ఇంగ్లీషు నేర్పే ఉపాధ్యాయ పదవి లభిస్తే మంచిదని యింటి ఖర్చులకు కొంత సరిపోతుందని భావించాను. పత్రికలలో ఒక విజ్ఞాపన "ఒక ఆంగ్ల ఉపాధ్యాయుడు కావాలి. ఒక గంట ఇంగ్లీషు బోధించాలి. జీతం నెలకు 75 రూపాయలు" అని వెలువడింది అది అక్కడి ఒక ప్రసిద్ధ హైస్కూలు వారి విజ్ఞాపన. వారికి అప్లికేషన్ పంపాను. వారు వచ్చి కలవమని జాబు వ్రాశారు. నేను సంతోషంతో వెళ్లాను. బి ఏ ప్యాసు కాలేదు. గనుక నీవు మాకు పనికిరావని ఆ స్కూలు హెడ్‌మాస్టరు చెప్పివేశాడు.

'నేను లాటిన్ ద్వితీయ భాషగా ఇంగ్లాండులో మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైనాను.' "నిజమే కాని మాకు కావలసింది బి.ఏ.". ఆ ఉద్యోగం దొరకలేదు, బాధపడ్డాను. మా అన్నగారుకూడా చాలా బాధపడ్డారు. యిక బొంబాయిలో వుండటం అనవసరమని నిర్ణయానికి వచ్చాను. నేను రాజకోటలో వుండటం మంచిది. అక్కడ మా అన్నగారు చిన్న వకీలు. ఆయన అర్జీలు వ్రాసేపని నాకు అప్పగించగలడు. రాజకోటలో సంసారం వున్నది. బొంబాయిలో సంసారం ఎత్తివేస్తే ఖర్చులు తగ్గిపోతాయి కనుక బొంబాయిలో ఆరు నెలల నివాసానికి స్వస్తి చెప్పాను.

బొంబాయిలో నేను ప్రతిరోజు హైకోర్టుకు వెళుతూ వుండేవాణ్ణి. కాని అక్కడ నాకేమీ ప్రయోజనం కలుగలేదు. ఎక్కువ నేర్చుకుందామనే ఆసక్తి కూడా కలుగలేదు. అక్కడ నడిచే కేసులు అర్థం కాక చాలాసార్లు నిద్ర వచ్చేది. నాతోబాటు యింకా కొంతమంది నిద్రబోయే వకీళ్ళు కూడా వున్నందున నేను సిగ్గుపడలేదు. తరువాత హైకోర్టులో కూర్చొని నిద్రపోవడం కూడా దర్జాయే అని భావించి సిగ్గుపడటం పూర్తిగా మానివేశాను.

నడిచి వెళ్లడం, యింటికి రావడం అలవాటు చేసుకున్నాను. నడిచి వెళ్లడానికి నలభై అయిదు నిమిషాలు పట్టేది. వచ్చేటప్పుడూ అంతే. ఎండకు తట్టుకునేవాణ్ణి. అందువల్ల ఖర్చు బాగా తగ్గింది. నా మిత్రులు చాలామంది జబ్బుపడుతూ వుండేవారు.

కాని నేను మాత్రం జబ్బు పడలేదు. డబ్బు రావడం ప్రారంభమైన తరువాత కూడా నేను నడిచే వెళుతూ వున్నాను. ఆనాటి ఆ అలవాటు యొక్క సత్ఫలితం నేను యీనాటికీ పొందుతున్నాను.

## 4. మొదటి ఎదురుదెబ్బ

బొంబాయి వదిలి రాజకోట చేరాను. ఒక ఆఫీసు పెట్టుకున్నాను. యిక్కడ పని బాగానే సాగింది. అర్జీలు, దరఖాస్తులు వగైరాలు వ్రాసి పెట్టడం వల్ల నెలకు మూడొందల రూపాయలు రాసాగాయి. అయితే యీ పని దొరకటానికి కారణం నా యోగ్యత కాదు. మా అన్నగారు, మరో వకీలు ఉమ్మడిగా పనిచేస్తున్నారు. ఆ వకీలుకు ప్రాక్టీసు ఖాయం అయిపోయింది. అవసరమైనవీ, ముఖ్యమైనవీ అని తాను భావించిన అర్జీలు పెద్ద బారిష్టర్ల దగ్గరికి అతడు పంపేవాడు. బీద క్లైంట్ల అర్జీలు మాత్రం నేను వ్రాసేవాణ్ణి.

"ఎవ్వరికీ సొమ్ము యివ్వను అని బొంబాయిలో నేను పట్టుబట్టానే కాని, రాజకోటలో మాత్రం ఆ విషయమై కొంత మెత్తబడవలసి వచ్చింది. యీ రెండు చోట్ల వ్యవహారం వేరని విన్నాను బొంబాయిలో దళారులకు సొమ్ము చెల్లించాలి. యిక్కడ వకీళ్లకు సొమ్ము చెల్లించాలి. రాజకోటలో ప్రతి వకీలు, యిలా చెప్పారు! చూడు ! నేను మరో వకీలుతో భాగస్వామిని కదా ! నీవు చేయగల పనులు నీకు వచ్చేలా నేను చూడగలను. అట్టి మనిద్దరం అవిభక్తులం. కనుక నీకు వచ్చిన ఫీజంతా మన ఉమ్మడి సొమ్ము ! అంటే అందులో నాకు భాగం వున్నట్లే ! మరి నా భాగస్వామి అయిన వకీలు విషయం యోచించు యీ కేసులు మరో వకీలుకిస్తే అతడికి రావలసిన సొమ్ము రాదా?

మా అన్నగారి మాటలకు నేను లొంగిపోయాను. బారిష్టరు వృత్తిలో వుంటూ యిట్టి పట్టుపట్టరాదని భావించాను. నాకు నేను సరిపుచ్చుకున్నానే గాని యిది ఆత్మవంచనే. అయితే ఏ కేసుల్లోను ఎవ్వరికీ రుసుం యివ్వలేదనే గుర్తు.

ఈ విధంగా జీవితం సాఫీగా వెళ్లబారుతూ వుండగా నా జీవితానికి మొదటి గట్టి ఎదురు దెబ్బ తగిలింది. తెల్ల అధికారుల ప్రవర్తనను గురించి విన్నానే గాని అట్టి అనుభవం నాకు అప్పటివరకు కలుగలేదు.

చనిపోయిన పోరుబందరు రాణాగారు గద్దె ఎక్కే పూర్వం నాటి మాట. ఆయనకు మా అన్నగారు మంత్రిగాను, సలహాదారుగాను వుండేవారు. ఉద్యోగంలో

వుంటూ రాణాగారికి కుట్ర సలహా యిచ్చారని మా అన్నగారి మీద నేరం మోపబడింది. అది పొలిటికల్ ఏజంటుదాకా వెళ్లింది. ఆయన మా అన్నగారి మీద కక్ష కట్టారు. నేను ఇంగ్లాండులో వున్నప్పుడు అతనికి నాకు పరిచయం వుండేది. స్నేహం కూడా వుండేది. ఆ స్నేహాన్ని ఉపయోగించి అతనికి తనపై గల కక్షను పోగొట్టేలా చేయమని మా అన్నగారు నన్ను కోరారు. నాకు యిట్టి వ్యవహారం నచ్చదు. ఎక్కడో ఇంగ్లాండులో యాదృచ్ఛికంగా ఏర్పడిన పరిచయాన్ని, స్నేహాన్ని యీవిధంగా ఉపయోగించడం నాకు యిష్టం లేదు. నిజంగా మా అన్న దోషం చేసియుంటే యీ నా ప్రయత్నం వల్ల ఫలితం ఏముంటుంది ? దోషం చేయకపోతే నిర్భయంగా రాచబాటన అర్జీ పంపి విజయం సాధించవచ్చు కదా ! మా అన్నగారు యిందుకు అంగీకరించలేదు. "నీకు కఠియావాడు తెలియదు. నీకు ప్రపంచ జ్ఞానం తక్కువ. యిక్కడ పలుకుబడికే ప్రాధాన్యం. నేను నీకు సోదరుణ్ణి. ఆ తెల్లదొర నీకు స్నేహితుడు. అతడికి నచ్చచెప్పి నాపై గల అతని కక్షను తొలగింపచేయడం నీ ధర్మం" అంటూ ఆయన వత్తిడి చేశారు

ఇక నేను కాదనలేక ఆ దొరను కలవడానికి నిర్ణయించుకున్నాను. అతని దగ్గరకు వెళ్లి, యీ విషయం చెప్పడం నాకు తగినపని కాదని తోచింది. అయినా తప్పలేదు. ఆయన దగ్గరకు జాబు పంపి కలుసుకునేందుకు సమయం కోరాను. ఆయన యిచ్చిన సమయానికి వెళ్లి ఆయనను కలిసి గతంలో యిరువురి స్నేహాన్ని గురించి జ్ఞాపకం చేశాను. కాని కఠియావాడుకు, ఇంగ్లాండుకు ఎంతో భేదం కనబడింది. సెలవులో వున్న ఉద్యోగి వేరు, పనిలో వున్న ఉద్యోగి వేరు. ఆ పొలిటికల్ ఏజంటు మా స్నేహాన్ని అంగీకరించాడు. కాని మా అన్నగారి విషయం ఎత్తేసరికి అతడు కరుకు బారాడు. అదా విషయం ! ఆ స్నేహాన్ని పురస్కరించుకొని అనుచిత లాభం పొందాలని చూస్తున్నావా ? అన్న భావం ఆయన కండ్లలో నాకు గోచరించింది. అయినా నా పాట నేను మొదలుపెట్టాను. దానితో ఆ దొర చిరాకుపడి" మీ అన్న చాలా కుట్రదారు. నేనేమీ వినను. నాకు అవకాశం తక్కువ. ఏమైనా చెప్పకోవాలనుకుంటే మీ అన్ననే వచ్చి చెప్పకోమను అని అన్నాడు. నిజానికి ఆ సమాధానం నాకు చాలు. నేను చెప్పిన దానికి సరియైన సమాధానం యిచ్చినట్లే గదా ! కాని నా అవసరం నాది. నేను మానకుండా యింకా చెబుతూనే వున్నాను. ఆయన లేచి "ఇక వెళ్లు" అని అన్నాడు.

నా మాటలు పూర్తిగా వినమని పట్టుబట్టాను. దానితో అతనికి కోపం వచ్చింది. నౌకరును పిలిచి "వీనికి త్రోవ చూపించు" అని ఆదేశించాడు. నేను గొణుగుతూ

వున్నాను. నౌకరు నా రెండు భుజాలు పట్టుకొని బైటకి పంపివేశాడు. రొప్పుతూ రొప్పుతూ లోనికి వెళ్లి ఒక జాబు వ్రాశాను. "మీరు నన్ను అవమానించారు. నౌకరు ద్వారా నన్ను బయటకి నెట్టించారు. యిందుకు సముజాయిషీ చెప్పుకోకపోతే మీమీద కోర్టులో మాననష్టం దావా వేస్తాను" అని ఆ జాబులో వ్రాశాను. ఆ దొర వెంటనే ఒక గుర్రపు రౌతు ద్వారా పత్రం పంపించాడు. "మీరు నా దగ్గర అసభ్యంగా వ్యవహరించారు. నేను వెళ్లమని చెప్పినా మీరు వెళ్లలేదు. గత్యంతరం లేక మిమ్మల్ని నౌకరు ద్వారా బయటికి పంపక తప్పలేదు. నౌకరు పొమ్మన్నా మీరు పోలేదు. అందువల్ల మిమ్ము బైటకి పంపించుటకు బలం ఉపయోగించక తప్పలేదు. మీరేం చేసుకున్నా సరే" అని ఆ పత్రంలో వ్రాశాడు.

ఆ పత్రం జేబులో పెట్టుకొని తలవంచుకొని యింటికి చేరాను. జరిగిందంతా మా అన్నగారికి తెలియజేశాను. ఆయన చాలా బాధపడ్డాడు. నన్ను ఎలా శాంతపరచాలో ఆయనకు బోధపడలేదు. ఆ దొర మీద కేసు పెట్టాలని నా భావం. ఆ విషయమై మా అన్న కొందరు వకీళ్ల సలహా తీసుకున్నాడు. సరిగా ఆ సమయానికి సర్ ఫిరోజ్ వచ్చారు. వారిని క్రొత్త బారిష్టరు కలవడం సాధ్యం కాదు గదా ! అందువల్ల వారిని తీసుకొని వచ్చిన వకీలుకు యీ వివరమంతా వ్రాసిన పత్రం యిచ్చి మెహతా గారి సలహా అర్థించాను. వకీలు నా పత్రం మెహతా గారికి అందజేశారు.

"ఇప్పుడు చాలామంది బారిష్టర్లకు, వకీళ్లకు యిట్టి అనుభవాలే కలుగుతున్నాయి. అతడు ఆంగ్ల దేశం నుండి యిప్పుడే వచ్చాడు కదా ! అందువల్ల ఉడుకుపాలు ఎక్కువగా వుంది. ఆంగ్ల దొరల స్వభావం యింకా అతనికి తెలియదు. ధనం బాగా సంపాదించ కోరితే, జీవితం సుఖంగా గడపాలని భావిస్తే యిటువంటి అవమానాల్ని దిగమ్రింగవలసిందే. యీ తెల్లదొరతో కలహం పెట్టుకుంటే నష్టమేగాని లాభం కలుగదు. గాంధీజీకి యింకా లోకజ్ఞానం అవసరం." అని ఫిరోజ్‌గారు ఆ వకీలు ద్వారా నాకు సలహా పంపారు.

వారి సలహా నాకు విషప్రాయంగా తోచింది. కాని మ్రింగక తప్పలేదు. అందువల్ల కొంత ప్రయోజనం కూడా కలిగింది. ఇక భవిష్యత్తులో యిలాంటి పనులు చేయకూడదని, స్నేహాన్ని యీ విధంగా వినియోగించుకోకూడదని ఒక నిర్ణయానికి వచ్చాను. అప్పటి నుండి ఆ నిర్ణయాన్ని అతిక్రమించలేదు. తత్ఫలితంగా నా జీవితంలో ఎంతో మార్పు వచ్చింది.

# 5. దక్షిణ ఆఫ్రికాకు ప్రయాణం

నేను ఆ అధికారి దగ్గరికి వెళ్ళడం పూర్తిగా తప్పు. అయితే అతడి తొందరపాటు, అతి ఔద్ధత్యం ముందు నా తప్పు చిన్నదైపోయింది. నన్ను గెంటించనవసరం లేదు. అతని సమయాన్ని అయిదు నిమిషాల కంటే నేను వ్యర్థం చేయలేదు అతడు నా మాటలు వినడానికే సిద్ధం కాలేదు. నన్ను మంచిగా వెళ్లమని చెప్పవచ్చు. కాని అతనికి అధికార దర్పం పెచ్చు పెరిగిపోయింది. అసలు సహనం తక్కువ అని కూడా ఆ తరువాత తెలిసింది వచ్చిన వాళ్లనందరినీ తృణీకరించి పంపుతూ వుంటాడని, కొంచెం కష్టం తోస్తే మండిపడుతూ వుంటాడని తెలిసింది.

అయితే నా పని అంతా అతగాడి ముందే అతడిని త్రోవకు తేవడం కష్టం ఆశ్రయించడం నాకు యిష్టం లేదు. మానసష్టం దావా వేస్తానని వ్రాసి ఆ తరువాత వూరుకోవడం నాకు యిష్టం లేదు.

ఈ సమయంలో మా రాష్ట్రమందలి చిన్న చిన్న రాజకీయాలు నాకు తెలిశాయి. కారియావాడు చిన్న చిన్న రాజ్యాల కూటమి. అందువల్ల రాజకీయవేత్తలు అక్కడ అధికం. సంస్థానానికి సంస్థానానికి పడదు. అనేక కుట్రలు, పలుకుబడి కోసం ఉద్యోగుల్లో ఉగ్యోగులికి మధ్య కుట్రలు. సంస్థానాధిపతులు సులభులు వాళ్ల దొరగారి నౌకర్లకు కూడా సులభులే. ఇక శిరస్తాదారు. ఆయన దొరగారికంటే ఎక్కువ శిరస్తాదారే దొరగారికి కన్ను, చెవి. అతడే దొరగారికి దుబాసి. అందువల్ల శిరస్తాదారు మాటే మాట. అతడి రాబడి దొరగారి రాబడికంటే అధికం. అతడికి వచ్చే జీతం కంటే అతడికి అయ్యే ఖర్చు చాలా అధికం. యిందు అతిశయోక్తి ఏ మాత్రమూ లేదు

ఈ దేశమంతా విషవాయుమయం అని అనిపించింది యీ విషవాయువు తగలకుండా స్వాతంత్ర్యాన్ని రక్షించుకుంటూ ఉండటం ఎలా అనే దిగులు నన్ను పట్టుకుంది

నాకు ఉత్సాహం తగ్గిపోయింది యీ విషయం మా అన్నగారు గ్రహించారు ఎక్కడైనా ఉద్యోగం దొరికితే కుట్ర నుండి బయట పడవచ్చునని తోచింది. కుట్ర చేయకపోతే మంత్రి పదవిగాని, జడ్జి పదవిగాని లభించదు. పైగా ఆ దొరకు నాకు ఏర్పడ్డ వైమనస్యం మా యిద్దరి మధ్య పెద్ద అగాధం సృష్టించింది. అప్పుడు పోరుబందరు సంస్థానం తెల్లవారి ప్రభుత్వాధికారానికి లోబడి వుంది ఆ సంస్థానాధిపతికి

కొన్ని అధికారాలు సంపాదించి పెట్టే ఉద్యోగం ఒకటి ఉంది. ఇది కాక మేరులు అను ఒక జాతివారి మీద విధించబడ్డ హెచ్చు పన్నులను గురించి కూడా ఆ రాష్ట్రాధికారిని కలవవలసిన అవసరం ఏర్పడింది. అతడు హిందువే. కాని దురహంకారంలో తెల్లదొరల తాత అని తెలిసింది. అతడు సమర్థుడు. కాని అతడివల్ల రైతులకు ప్రయోజనం ఏమీ కలుగలేదు. నేను సంస్థానాధిపతికి కొన్ని కొత్త అధికారాలు సంపాదించి పెట్టగలిగానే గాని మేరులకు మేలు చేయలేకపోయాను. వారి విషయమై పూర్తిగా శ్రద్ధ వహించలేదని అనిపించింది.

అందువల్ల యీ వ్యవహారంలో కూడా నిరాశపడ్డాను. నా క్లయింట్లకు న్యాయం జరగలేదు. న్యాయం కలిగించగల సాధనం నా దగ్గర లేదు. చివరికి పొలిటికల్ ఏజంటుకో లేక గవర్నరుకో అర్జీ పెట్టుకోవాలి. అలా చేస్తే దీనితో మాకేమీ సంబంధం లేదని వాళ్లు త్రోసి పుచ్చేవాళ్లు. చట్టం ఏమైనా వుంటే అవకాశం వుండేది. కాని యిక్కడ దొరగారి మాటే చట్టం, అదే శాసనం.

ఈ విధంగా నేను ఉక్కిరి బిక్కిరికావలసి వచ్చింది. ఇంతలో పోరుబందరు నుండి మేమన్ దుకాణం వారు మా అన్నగారికి జాబు వ్రాశారు. "మాకు అక్కడి కోర్టులో పెద్ద దావా వున్నది. అది నలభైవేల పౌండ్ల దావా. చాలా కాలాన్నుండి నడుస్తున్నది. మేము అందుకు పెద్ద వకీళ్లను, బారిష్టర్లను పెట్టాము. మీ తమ్ముణ్ణి పంపితే అతడు మాకు ఉపయోగపడతాడు. అతడికీ ఉపయోగం కలుగుతుంది. అతడు క్రొత్త దేశం చూస్తాడు. క్రొత్త అనుభవాలు పొందుతాడు' అని ఆ జాబులో వారు వ్రాశారు.

ఈ విషయం మా అన్నగారు నాకు చెప్పారు. అక్కడ నేను చేయాల్సిన పనేమిటో తెలియదు. అయితే వెళ్లాలనే కోరిక కలిగింది. "దాదా అబ్దుల్లా అండ్ కో లో భాగస్వామియగు సేఠ్ అబ్దుల్ కరీం జావేరీ గారికి (తరువాత గతించారు) మా అన్న నన్ను చూపించారు. ఆయన యిదేమి కష్టం కాదు అని నచ్చచెప్పి "అక్కడ మాకు పెద్ద పెద్ద తెల్లవాళ్లు మిత్రులుగా వున్నారు. వారితో మీకు పరిచయం కలుగుతుంది. దుకాణంలో మీరు మాకు ఉపయోగపడతారు. మా వ్యవహారమంతా ఇంగ్లీషులో వుంటుంది. దానికి మీరు పనికి వస్తారు. ఆ దేశంలో వున్నంత కాలం మీరు మాకు అతిధులు. అందువల్ల విడిగా మీకు ఖర్చు ఏమీ ఉండదు" అని చెప్పాడు.

"ఒక్క సంవత్సరం కంటే ఎక్కువ పట్టదు. రాకపోకలకు మీకు ఫస్టు క్లాసు టిక్కెట్టు యిస్తాం. నూట అయిదు పౌండ్ల సొమ్ము యిస్తాం" అని అన్నాడు. ఇంత కొద్ది సొమ్ము కోసం దక్షిణ ఆఫ్రికా వెళ్లడం బారిస్టరు చేయవలసిన పని కాదు. పైగా దాస్యం చేయాలి. అయినా ఏదో విధంగా యీ దేశాన్ని విడిచి వెళదామనే కోరిక ఎక్కువైపోయింది. క్రొత్త దేశం చూద్దామని, క్రొత్త అనుభవం పొందుదామని అభిలాష కలిగింది. యిదిగాక ఆ నూట అయిదు పౌండ్లు మా అన్నగారికి పంపవచ్చు. కుటుంబ ఖర్చులకు ఆ సొమ్ము వినియోగపడుతుంది. యీ రకమైన అభిప్రాయాలతో యిక మారు మాటాడకుండా సరేనని చెప్పి దక్షిణ ఆఫ్రికా ప్రయాణానికి సిద్ధపడ్డాను.

## 6. నేటాల్

ఆంగ్ల దేశానికి వెళ్లినప్పుడు కలిగిన వియోగ దు:ఖం దక్షిణ ఆఫ్రికాకు వెళ్లుతున్నప్పుడు నాకు కలుగలేదు. మా అమ్మగారు యిప్పుడు లేరు. నాకు లోకానుభవంతో బాటు సముద్రయానానుభవం కూడా కలిగింది. బొంబాయి రాజకోటలకు తరచుగా రాకపోకలు సాగిస్తూ వున్నాను.

ఈసారి భార్యను విడిచి వెళ్లడానికి కొంచెం కష్టం కలిగింది. ఇంగ్లాండు నుండి వచ్చిన తరువాత ఒక పిల్లవాడు పుట్టాడు. మా ప్రేమ యింకా కామవాంఛ నుండి విడివడలేదు. కాని మెల్లమెల్లగా మెరుగుపడసాగింది. ఇంగ్లాండు నుండి వచ్చిన తరువాత మేము కలిసి కొద్ది కాలం వున్నాము. ఆమెకు ఉపాధ్యాయుడనై ఏదో విధంగా కొన్ని సంస్కారాలు నేర్పడానికి పూనుకున్నాను. ఆ శిక్షణ పూర్తికావాలంటే యిద్దరం కలిసి వుండటం అవసరం అని అనుకున్నాము. కాని దక్షిణ ఆఫ్రికాకు వెళ్లే మహోత్సాహంలో వియోగ దు:ఖం అంతగా బాధించలేదు. ఒక సంవత్సరంలో మళ్లీ కలుద్దామని చెప్పి భార్యను ఊరడించి రాజకోట నుండి బొంబాయికి బయలుదేరాను.

దాదా అబ్దుల్లా కంపెనీ వారి ఏజంటు ద్వారా టిక్కెట్టు రావాలి. ఓడలో కాబిన్ ఖాళీగా లేదు. యిప్పుడు బయలుదేరి వెళ్లకపోతే ఒక మాసం రోజులు బొంబాయిలోనే వుండాలి. మేము మొదటి తరగతి టిక్కెట్టు కోసం చాలా ప్రయత్నం చేశాము. కాని లాభం లేకపోయింది. మీరు వెళ్లదలచుకుంటే డెక్ మీదనే వెళ్లాలి. మొదటి తరగతి భోజనం మాత్రం ఏర్పాటు చేశాము. అని ఏజంటు చెప్పాడు. అవి నా మొదటి తరగతి ప్రయాణం రోజులు. బారిస్టరు డెక్ మీద ప్రయాణం చేయడమా ? అందుకు నేను అంగీకరించలేదు. మొదటి తరగతి టిక్కెట్టు సంపాదించాలని నేను నిర్ణయించుకున్నాను.

నేను ఓడ మీదకు వెళ్లి ముఖ్యాధికారిని కలిసి మాట్లాడాను. అతడు దాపరికం లేకుండా యిలా చెప్పాడు. "మా ఓడలో యిదివరకెన్నడూ యింత వత్తిడి లేదు. మొజాంబిక్ గవర్నరు గారు యీ ఓడలో వస్తున్నారు. బెర్తులన్నీ వారే పుచ్చుకున్నారు." "ఏదో విధంగా నాకు ఒక్కడికి చోటు చేయలేరా" అని అడిగాను. అతడు నన్ను ఎగాదిగా చూచాడు. చిరునవ్వు నవ్వి "ఒక్క ఉపాయం ఉంది. నాగదిలో మరొక బెర్తు ఉంది. అది ప్రయాణీకులకిచ్చేది కాదు. అయినా నీకిస్తాను." అని అన్నాడు. నేనందుకు కృతజ్ఞతలు చెప్పి వెళ్ళి ఏజంటును వెంట తీసుకొని వచ్చాను. 1893 ఏప్రిల్ నెలలో దక్షిణ ఆఫ్రికాలో నా అదృష్టం ఎలా వుంటుందో అని యోచిస్తూ మహోత్సాహంతో బయలుదేరాను.

మొదటి రేవు లామూ. అక్కడికి వెళ్లడానికి 13 రోజులు పట్టింది. త్రోవలో నేను, ఓడ కెప్టెను మంచి స్నేహితులమైనాము. అతనికి చదరంగమంటే యిష్టం. క్రొత్తగా నేర్చుకున్నాడు అందువల్ల అతనితో ఆడటానికి మరొక సరిక్రొత్త వాడు కావాలి నన్ను పిలిచాడు. నేను చదరంగాన్ని గురించి చాలా విన్నాను. కాని ఆట ఎరుగను. చదరంగంలో తెలివితేటలు చాలా అవసరం అని నేర్పరులు చెప్పగా విన్నాను. ఆ కెప్టెను నాకు నేర్పుతానన్నాడు. నాకు ఓర్పు వుండటం వల్ల మంచి శిష్యుడు దొరికాడని అతడు చాలా సంతోషించాడు. ప్రతి ఆటలోను నేనే ఓడిపోతూ వున్నాను. ఓడిన కొద్దీ నాకు బోధించేందుకు అతనికి ఎక్కువగా ఉత్సాహం కలుగుతూ వున్నది. నాకు ఆ ఆట యెడ అభిరుచి కలిగింది. కాని ఆ ఓడ దిగిన తరువాత ఆ అభిరుచి నిలవలేదు. చదరంగంలో నా ప్రవేశం రాజును, మంత్రిని నడుపుట కంటే మించలేదు. లామూ రేవులో ఓడ మూడు లేక నాలుగు గంటలు ఆగింది. నేను రేవు చూద్దామని దిగాను. కెప్టెను కూడా దిగాడు. "యిక్కడి ఈ సముద్రం దగాకోరు. ఎప్పుడు ఏమవుతుందో తెలియదు. మీరు వెంటనే తిరిగి వచ్చివేయండి" అని కెప్టెను గట్టిగా చెప్పాడు.

ఆ రేవు చాలా చిన్నది. నేను పోస్టాఫీసుకు వెళ్లి అక్కడ గుమాస్తాలుగా పనిచేస్తున్న హిందూదేశం వాళ్లను చూచాను. నాకు సంతోషం కలిగింది. వాళ్లతో మాట్లాడాను. ఆఫ్రికా వాసులు కొంతమంది కనబడగా వారి యోగక్షేమాల్ని గురించి అడిగి తెలుసుకున్నాను. యీ పనులకు కొంత సమయం పట్టింది.

డెక్.మీద ప్రయాణం చేస్తున్న కొందరితో అక్కడ పరిచయం కలిగింది. వారు ఒడ్డున తీరికగా వంట చేసుకొని భోజనాలకు కూర్చున్నారు. వారు ఓడ దాకా పోవడానికి ఒక నావ కుదుర్చుకొనగా నేను కూడా దానిలోకి ఎక్కాను. యింతలో హఠాత్తుగా

సముద్రంలో పోటు హెచ్చింది. రేవు అల్లకల్లోలం అయింది. మేమెక్కిన నావ మీద బరువు పెరిగింది. ఓడ నిచ్చెనకు మా నావను కట్టి నిలపడానికి వీలు లేనంత బలంగా నీరు పొంగుతూ వుంది. నావ నిచ్చెన దగ్గరకు వెళ్లేసరికి నీటి ప్రవాహం వచ్చి నావను దూరంగా నెట్టివేస్తూ వుంది. ఓడ బయలుదేరుటకు మొదటి ఈల అప్పుడే మోగింది. నాకు తొందర పెరిగింది. కెప్టెను పైనుండి మా అవస్థ చూచాడు. మరో అయిదు నిమిషాలు ఓడను ఆపమని ఆదేశించాడు. నా మిత్రుడొకడు ఓడ దగ్గరగా వున్న ఒక నావవాడికి పదిరూపాయలిచ్చి నన్ను తీసుకురమ్మనగా ఆ నావవాడు దగ్గరకు వచ్చి నన్ను బలవంతాన తన నావలోకి లాక్కున్నాడు. అప్పటికి ఓడ పైకి ఎక్కి వెళ్లే నిచ్చెనను తొలగించి వేశారు. దానితో ఒక మోకు పట్టుకొని నేను పైకి ప్రాకవలసి వచ్చింది. ఓడ వెంటనే బయలుదేరింది.

మొదటి నావలో వున్న సహ యాత్రీకులంతా అక్కడే దిగబడిపోయారు. కెప్టెను మాటలకు గల విలువ ఏమిటో అప్పుడు బోధపడింది.

లామూ దాటిన తరువాత మొంబాసా చేరాము. తరువాత జాంజిబారు. అక్కడ ఓడ పదిరోజులు వరకు వుంటుందని, అక్కడ మరో ఓడలోకి మారాలని తెలిసింది.

కెప్టెనుకు నాపై గల ప్రేమ వర్ణనాతీతం అయితే ఆ ప్రేమ మరో వికృత కార్యానికి కారణభూతమైంది. తన వెంట ఆయన నన్ను, మరో తెల్లవాడిని రమ్మన్నాడు. మేము ముగ్గురం ఆయన నావ మీద తీరానికి చేరాం. విహారానికి వెళదాం అన్నాడు. విహారమంటే వాళ్ల భావం ఏమిటో నాకు బోధపడలేదు. ఆ విషయంలో నేనెంత తెలివితక్కువవాడినో ఆయనకు తెలియదు. ఒక తార్పుడుగాడు మా ముగ్గురినీ నీగ్రో స్త్రీల పేటకు తీసుకు వెళ్లాడు. ముగ్గురికి మూడు గదులు చూపించాడు. నేను గదిలో స్త్రీని చూచి సిగ్గుతో కుంచించుకుపోయాను. పాపం, ఆమె నన్ను గురించి ఏమనుకొన్నదో ఆ దేవునికి తెలియాలి. కెప్టెను కొంతసేపైన తరువాత నన్ను పిలిచాడు. నేను వెళ్లిన వాణ్ణి వెళ్లినట్లు బయటకి వచ్చాను. నా చేతగానితనాన్ని అతడు పసిగట్టాడు. మొదట కొంచెం నాకు చిన్నతనంగా వుంది కాని ఆ తర్వాత ఆ విషయం తలచుకుంటేనే భయం వేసింది. ఆడది ఎదురుగా వుంటే జారిపోకుండా వుంచమని భగవంతుణ్ణి ప్రార్థించాను. హృదయ దౌర్బల్యాన్ని తలచుకొని బాధపడ్డాను. ముందే గదిలోకి వెళ్లనని ధైర్యంగా చెప్పి యుంటే బాగుండేది కదా'' అని అనుకున్నాను

నా జీవితంలో యిది మూడో అనుభవం. కల్లాకపటం ఎరుగని చిన్నవాళ్లు పాపలిప్తులవుతారు. అయినా నేను లోపలికి వెళ్లడం తప్పుగదా ! లోపలికి వెళ్లి ఊరుకోవడం పురుషార్థం కాదు. ముందే వెళ్లనని చెప్పి బయటనే వుండి వుంటే అది నిజంగా పురుషార్థం. యీ ఘట్టం భగవంతుని మీద గల నా విశ్వాసాన్ని బాగా పెంచిందని చెప్పగలను. ఈ రేవులో ఏడు రోజులకు పైగా వుండవలసి రావడం వల్ల నేను పట్టణంలో బసచేసి చుట్టుప్రక్కల చూచి వచ్చాను. జాంజిబారు వృక్షాలకు నిలయం. మలబారులా వుంటుంది. అక్కడి చెట్ల ఎత్తును, ఆ చెట్లకు కాచే పండ్ల నిగనిగల్ని చూచి ఆశ్చర్యపడ్డాను.

తరువాత మా ఓడ మొంజాంబిక్‌లో ఆగింది. మే నెలాఖరుకు నేటాలు చేరుకున్నాము.

## 7. కొన్ని అనుభవాలు

నేటాలు దేశానికి రేవు పట్టణం దర్బన్. దానికి పోర్టు నేటాల్ అని కూడా పేరు వుంది. అబ్దుల్లా సేఠ్‌గారు నన్ను తీసుకు వెళ్లేందుకు అక్కడికి వచ్చారు. నేటాలు వాళ్లు చాలామంది తమవాళ్లను తీసుకొని వెళ్లేందుకు వచ్చారు. హిందూదేశస్థుల ఎడ అక్కడి వాళ్లకు ఆదరం వున్నట్లు కనిపించలేదు. అబ్దుల్లా సేఠ్‌ను అంతా తేలికగా చూడటం గమనించాను. ఆ స్థితి చూచి నా ప్రాణం చివుక్కుమన్నది. కాని అబ్దుల్లా సేఠ్‌కు యీ విషయంలో బాగా అనుభవం వున్నట్లనిపించింది. అంతా నా వంక వికారంగా చూచారు. తతిమ్మా హిందూదేశస్థుల కంటే నా వేషం వేరుగాను వింతగాను వుంది. ఫ్రాంక్ కోటు బెంగాలీల పగడీ వంటి తలపాగా ధరించాను.

అబ్దుల్లా గారు నన్ను ఇంటికి తీసుకువెళ్లాడు. తన గదికి ప్రక్కనే వున్న గదిని నా కోసం ఏర్పాటు చేశాడు. నా సంగతి వారికి, వారి సంగతి నాకు తెలియదు. తన తమ్ముడు నా చేతికిచ్చి పంపిన కాగితాలు చదివి కొంత గడబిడ పడ్డాడు. తన తమ్ముడు హిందూ దేశాన్నుండి ఒక తెల్ల ఏనుగును తన వద్దకు పంపించాడని ఆయన భావించాడు. నా వేషభాషలు చూచి దొరలకయ్యేటంత వ్యయం నాకోసం అవుతుందని భావించాడు. అప్పుడు ప్రత్యేకించి నాకు అప్పగించడానికి సరియైన పని కూడా లేదు. వారి వ్యవహారం ట్రాన్సువాలులో సాగుతున్నది. వెంటనే నన్నక్కడికి పంపడంలో అర్థం లేదు. పైగా నా శక్తిని, సామర్థ్యాన్ని, యోగ్యతను గురించి ఆయనకు ఏమీ తెలియదు!

నాకోసం తాను ఎప్పుడూ ప్రిటోరియాలో వుండవలసి వస్తుంది. అది అయనకు వీలుపడని పని. ప్రతివాదులు ప్రిటోరియాలోనే వున్నారు. వాళ్లు నన్ను తమవైపుకు త్రిప్పుకుంటారేమోనని ఆయనకు భయం. అయితే ఆ దావా కాకపోతే నాకు అప్పగించే పని యింకేముంది.

మిగతా పనులన్ని నాకంటే ఆయన గుమాస్తాలే బాగా చేయగలరు. ఆ గుమాస్తాలు తప్పు చేస్తే వాళ్లను దండించవచ్చు. కాని నేను తప్పు చేస్తే దడించేదెలా? ఆ దావాలో ఏదో పని అప్పగించకపోతే ఊరికే కూర్చోబెట్టి మేపవలసి వస్తుంది.

అబ్దుల్లా గారికి అక్షర జ్ఞానం తక్కువే కాని జ్ఞానం ఎక్కువ. ఆయన బుద్ధి చాలా చురుకైనది. బ్యాంకు మేనేజర్లతో వ్యవహారం నడుపుకొనుటకు తెల్ల వర్తకులతో వ్యవహారం గడుపుకొనుటకు, వకీళ్లకు తన వ్యవహారాలు చెప్పుటకు తగినంత ఇంగ్లీషు ఆయనకు వచ్చు. భారతీయులకు ఆయనంటే గౌరవం. వారి వ్యాపార సంస్థ అక్కడి వ్యాపార సంఘాలన్నింటిలోకి పెద్దది. హిందూ దేశస్థుల వ్యాపార సంఘాలన్నింటిలోకి పెద్దది. అన్నీ వున్నాయిగాని ఒక లోటు మాత్రం ఆయనలో వుంది. ఆయనది అనుమాన స్వభావం.

ఆయనకు ఇస్లాం మతమంటే అమిత అభిమానం. తత్వ జ్ఞానాన్ని గురించి మాట్లాడాలనే తపన ఆయనకు వుంది. ఖురాన్ షరీపు మరియు తదితర ఇస్లాం మత గ్రంధాలలో ఆయనకు కొద్దిగా ప్రవేశం వుంది. మాట్లాడేప్పుడు అనేక ప్రమాణ వాక్యాలు అమితంగా ఉపయోగిస్తూ వుంటాడు. ఆయనను కలియడం వల్ల ఇస్లాం మతం విషయమై నాకు కొంత పరిజ్ఞానం కలిగింది. మా మనస్సులు కలిసిన కొద్దీ ఇస్లాం తత్వ విషయాలను గురించి చర్చించడం ప్రారంభించాడు.

నేనచ్చటికి వెళ్లిన రెండవరోజునో, మూడవరోజునో అబ్దుల్లా సేర్ నన్ను దర్బను కోర్టుకు తీసుకువెళ్లాడు. తమ మిత్రులను నాకు పరిచయం చేశాడు. కోర్టులో తన వకీలు ప్రక్కనే నన్ను కూర్చోబెట్టాడు. మొదటినుండి మెజిస్ట్రేటు నావంక మిర్రి మిర్రిగా చూడటం ప్రారంభించాడు. చివరకు తలపాగాను తీసి వేయమని ఆదేశించాడు. తలపాగా తీయను అని చెప్పి కోర్టునుంచి బయటకు వచ్చివేశాను.

ఇక్కడ కూడా తగవు మొదలైందని భావించాను. భారతీయులచే తలపాగాలు తీసివేయించుటకు గల కారణాలు అబ్దుల్లా వివరించి చెప్పారు. మహమ్మదీయ ఆచారాలు కలవారు తలపాగాలు పెట్టుకోవచ్చు. కాని కోర్టుకు వచ్చే మిగతా హిందూ దేశం వాళ్లు మాత్రం తలపాగా ధరించరాదని శాసనం. యీ సూక్ష్మ భేదం

తెలుసుకునేందుకు ఇంకొంచెం లోతుకు వెళ్లాలి. అక్కడికి చేరిన మూడు నాలుగు రోజుల్లోనే అక్కడి భారతీయులు రకరకాలుగా విభాజితులై వున్నారని బోధపడింది. ఒకరు తురక వర్తకులు. వీరు తాము అరబ్బులమని చెప్పుకుంటున్నారు. మరొకరు హిందూ గుమాస్తాలు లేక పారసీ గుమాస్తాలు. పారసీ గుమాస్తాలు మేము పారశీకులం అని చెప్పుకుంటారు. యి హిందూ గుమాస్తాలు అటూగాక, ఇటూగాక వుండిపోయారు. యీ మూడురకాల వారికీ సాంఘిక సంబంధాలు వున్నాయి. వీళ్లందరినీ మించిన మరో తెగ వున్నది. ఆ తెగలో అరవవారు, తెలుగువారు, ఉత్తర హిందూ స్థానమునుండి ఇన్‌డెన్‌చెర్డు కూలికి వచ్చినవారు వున్నారు. ఇన్‌డెన్‌చెర్డు కూలీలంటే అయిదేండ్లు నేటాలు దేశంలో పనిచేసేందుకు అంగీకారం కుదుర్చుకున్న కూలివారన్నమాట. వీరికి గిర్మిటియాలని పేరు. యీ శబ్దం అగ్రిమెంట్ అను పదానికి అపభ్రంశమగు గిర్మిట్ అను పదము నుండి ఉత్పన్నమైనది. పై మూడు తెగలవారు కూడా యీ గిర్మిటియాలతో కూలిపని విషయమైదప్ప వేరు సంబంధం పెట్టుకోరు. దొరలంతా వీళ్లను కూలీలు అని అంటారు. భారతీయులలో ఎక్కువ మంది కూలి చేసుకొనేవారే. 'సామీ' అని మరో పేరు కూడా వీళ్లకు వున్నది. సామి అను పదం సామాన్యంగా అరవవారి పేర్లకు చివర వుంటుంది. స్వామిన్ అను సంస్కృత పదానికి యిది వికృతి. సామి అని పిలుస్తున్నావు సరేకాని సామి అంటే అధికారి అని అర్థం, నేను నీకు అధికారిని కాదు కదా ! అందువల్ల ఆ శబ్దం నాకు వాడకు అని చెబుతారు. కొందరు ఏమీ మాట్లాడకుండా వుండిపోతారు. మొత్తంమీద సామి శబ్దం నీచార్థకంగా ప్రచలితం అయిపోయింది.

నాకు కూలి బారిస్టరు అని పేరు వచ్చింది. వర్తకులకు కూలి వర్తకులని పేరు. ఈ విధంగా కూలీ అంటే అసలు అర్థంపోయి కూలీలంటే భారతీయులు అను అర్థం రూఢి అయిపోయింది. తురక వర్తకులకిది గిట్టదు. వాళ్లు మేము అరబ్బులం అనో, లేక మేము బేహారులం అనో చెప్పుకుంటూ వుంటారు. తెల్లవాడు మంచి వాడైతే కూలీ అన్నందుకు క్షమాపణ కోరతాడు.

ఇట్టి పరిస్థితుల్లో నేను తలపాగా పెట్టుకోవడం తప్పుగా భావించబడిందన్న మాట. అందువల్ల ఎందుకొచ్చిన గోల అని భావించి తలపాగా తీసివేసి ఇంగ్లీషు వాళ్ల హేటు పెట్టుకొందామనే నిర్ణయానికి వచ్చాను. దానితో యీ తగాదా పోతుందని అనుకున్నాను.

కాని అబ్దుల్లా సేఠ్‌గారు ఒప్పుకోలేదు. "నీవు యీ పని చేస్తే మరీ ప్రమాదం. నీవు యిట్లా చేస్తే తలపాగా ధరించాలని భావించే వారందరినీ మోసగించినట్లవుతుంది.

అదీగాక మనదేశం తలపాగా మీకు బాగుంటుంది. ఇంగ్లీషు వాళ్ల హేటు పెట్టుకుంటే ఇంగ్లీషు వాళ్ల హోటళ్లలో పనిచేసే నౌకరని అంతా అనుకుంటారు." అని అబ్దుల్లా నన్ను హెచ్చరించాడు.

ఆయన బోధలో తెలివి, దేశభక్తి వున్నాయి. అందలి తెలివి స్పష్టం. దేశభక్తి లేందే అటువంటి మాటలు నోట రావు. హోటల్లో పనిచేసే వారి యెడ నైచ్యభావం వుండటం వల్ల తేలికభావం వ్యక్తమవుతూ వుంది. గిర్మిటియాలలో హిందువులు, తురకలు, క్రైస్తవులంతా మతం పుచ్చుకున్న గిర్మిటియాల సంతతివారే. 1893 నాటికే వారి సంఖ్య బాగా పెరిగింది. వాళ్లలో చాలామంది దొరల వేషం ధరించి హోటళ్లలో పనిచేస్తున్నారు. అబ్దుల్లాగారు హేటు విషయంలో తేలికగా మాట్లాడింది వీళ్ళను గురించే. హోటళ్లలో చేసే సేవకత్వం ఎంతో దైన్యంగా వున్నదన్నమాట. నేటికీ చాలామందికి అట్టి చులకన భావం పోలేదు.

మొత్తం మీద అబ్దుల్లా గారి సలహా నాకు నచ్చింది. యీ తలపాగా వ్యవహారం మొదలైన తరువాత నేను నా పక్షాన్ని సమర్థిస్తూ పత్రికల్లో వ్యాసం వ్రాశాను. దానితో తలపాగాను గురించి పత్రికల్లో బాగా రగడ జరిగింది. "అన్‌వెల్‌కం విజిటర్" పిలువని పేరంటగాడు అని నాకు పత్రికల్లో పేరు వచ్చింది. తత్ఫలితంగా మూడు నాలుగు రోజుల్లో నా పేరు బాగా ప్రచారంలోకి వచ్చింది. కొందరు నా పక్షాన్ని సమర్థించారు. కొందరు నా పొగరుబోతుతనాన్ని నోరార తిట్టారు.

నేను దక్షిణ ఆఫ్రికాలో కొంత కాలం తలపాగా తొలగించలేదు. అది నా తల పైనే వున్నది. అయితే తరువాత ఎందుకు తొలగించవలసి వచ్చిందో, నేను ఎందుకు తొలగించానో రాబోయే ప్రకరణాల్లో పాఠకులకు తెలియజేస్తాను.

## 8. ప్రిటోరియా వెళ్ళేదారిలో

దర్బనులో నివసిస్తున్న భారతీయ క్రైస్తవులతో నాకు పరిచయం ఏర్పడింది. కోర్టులో దుబాసిగా వున్న పాల్ గారు రోమన్ కేథలిక్. మాయిద్దరికీ స్నేహం కుదిరింది. ప్రొటెస్టెంట్ మిషన్‌లో బోధకుడుగా వున్న సుభాన్‌గ్రాండ్‌ఫ్రే గారితో స్నేహం ఏర్పడింది. వీరు యిటీవలే గతించారు. దక్షిణ ఆఫ్రికా భారతీయ ప్రతినిధి సంఘ సభ్యులుగా నిరుడు ఇండియాకు వచ్చిన జేమ్సుగాడ్‌ఫ్రే గారికి వీరు జనకులు. ఇదే విధంగా పార్సీ రుస్తుం గారితోను, ఆదంజీ మియాఖాన్ గారితోను మైత్రి ఏర్పడింది. వీరిద్దరూ యిటీవలే గతించారు. వ్యాపార వ్యవహారంలో దప్ప యిక ఎన్నడూఒకరి ముఖం మరొకరు చూచుకోని వీరంతా ఏవిధంగా గాఢ మిత్రులైనారో తరువాత వివరిస్తాను.

ఈ విధంగా నా పరిచితుల సంఖ్య పెరిగిపోసాగింది. యింతలో అబ్దుల్లాగారి వకీలు నుంచి వారికి ఒక సమాచారం అందింది. ఇక కేసుకు సిద్ధం కావాలి. అందువల్ల అబ్దుల్లాగారే రావడమో, లేక వారి తరపున మరొకరినెవరినైనా పంపడమో చేయమని ఆ సమాచార సారాంశం. అబ్దుల్లాగారు నాకా లేఖను చదవమని యిచ్చి ప్రిటోరియాకు వెళతారా అని అడిగారు. " నేను ఆ వ్యవహారమంతా క్షుణ్ణంగా తెలుసుకొని వెళతాను. అక్కడ ఏం చేయాలో నాకిప్పటికి తెలియదు." అని నేను చెప్పాను. అప్పుడు ఆయన ఆ విషయం నాకు బోధపరచమని కొందరు గుమాస్తాలను ఆదేశించాడు.

ఆ కేసును కొంత ఆకళింపు చేసుకున్న తరువాత అసలు యీ కేసును ఓం నమఃశ్శివాయతో ప్రారంభించవలసియున్నదని అర్థం చేసుకున్నాను. జాంజిబారులో వున్న కొద్ది రోజులు అక్కడి కోర్టుకు వెళ్ళి వివరాలు తెలుసుకున్నాను. పార్శీ వకీలొకడు ఒక సాక్షి ఖాతాలోగల జమా ఖర్చులను గురించి అడుగుతూ వుండటం గమనించాను. జమాఖర్చులంటే నాకు అంతా అడవి గొడవ. నేను హిందూదేశపు స్కూళ్ళలోగాని, ఆంగ్లదేశంలో గాని జమా ఖర్చులను గురించి నేర్చుకోలేదు.

దక్షిణ ఆఫ్రికాకు ఏకేసును గురించి నేను వచ్చానో అదంతా ఖాతాలకు సంబంధించిందే. జమా ఖర్చుల లెక్కలలో నిపుణుడైన వాడే వాటి వివరాలు తెలుసుకోగలడు, ఇతరులకు తెలుపగలడు. గుమాస్తా యిది జమ, ఇది ఖర్చు అని చెప్పుకుపోతూ వుంటే నాకంతా గందరగోళంగా వుంది. పి.నోటు అంటే ఏమిటో నాకు బోధపడలేదు. ఇంగ్లీషు నిఘంటువును తిరగవేశాను. ఆశబ్దం ఎక్కడా కనబడలేదు. నా యిబ్బంది ఆగుమాస్తాకు తెలియజేశాను. ఆ గుమాస్తా వెంటనే పి. నోటు అంటే ప్రాంశరీ నోటు అని చెప్పాడు. అప్పుడూ జమా ఖర్చులకు సంబంధించిన పుస్తకం ఒకటి కొని చదివాను. దానితో కొంత ధైర్యం వచ్చింది. ఆదావా నాకు అర్థమైంది. అబ్దుల్లా సేఠ్ జమా ఖర్చులు ఎలా వ్రాయాలో ఎరుగడు అయినా ఎంత చిక్కులెక్కనైనా చిటికెలో విడదీసి చెప్పగల అనుభవం ఆయన గడించాడని నేను తెలుసుకున్నాను. "ప్రిటోరియా వెళ్ళడానికి యిప్పుడు నేను సిద్ధం" అని అన్నాను.

"మీరెక్కడ బస చేస్తారు?" "మీరు ఎక్కడ బస చేయమంటారో చెప్పండి." "నేను మన వకీలుకు జాబు వ్రాస్తాను. ఆయన మీకు విడిది ఏర్పాటు చేస్తాడు. ప్రిటోరియాలో నాకు మేమన్ మిత్రులున్నారు. వాళ్ళకి కూడా వ్రాస్తాను. అయితే మీరు వారి ఇంట్లో బసపెట్టవద్దు. మన ప్రతిపక్షులకు అక్కడ మంచి పలుకుబడి వుంది. మన రహస్య పత్రాలు వారిలో ఎవరైనా చూచారో, కొంప మునుగుతుంది. వారికి మీరు ఎంత దూరంగా వుంటే అంత మంచిది.

"మీ వకీలు ఎక్కడ వుండమంటే అక్కడే వుంటాను. లేకపోతే నేను వేరే బస ఏర్పాటు చేసుకుంటాను. దాన్ని గురించి మీరు విచార పడవద్దు. మన రహస్యం పిట్టకైనా తెలియనీయనని పూర్తిగా నమ్మండి. అయితే నేను వాళ్లతో కలిసిమెలిసి వుంటాను. ప్రతివాదులతో స్నేహం చేసుకోవడం మంచిదని నా అభిప్రాయం. ఏమాత్రం అవకాశం వున్నా కోర్టుకు పోకుండా చూస్తాను. ఇంతకూ తయబ్‌సేఠ్ చుట్టమే కదా?' '. నిజానికి ప్రతివాది స్వర్గీయ సేఠ్ తైయబ్హాజీ ఖాన్ మహమ్మద్‌గారు కూడా అబ్దుల్లా సేఠ్‌గారికి దగ్గరి చుట్టమే.

రాజీ మాట వినగానే అబ్దుల్లాగారు కలవరపడటం గమనించాను. అయితే దర్బాను చేరి ఆరే రోజులైనప్పటికీ మేమొకరి హృదయం మరొకరం అర్థం చేసుకున్నాం. నన్ను తెల్ల ఏనుగుగా భావించిన రోజులు గడిచిపోయాయి. అందువల్ల వెంటనే అందుకొని "మేము రక్తబంధువులం. రాజీద్వారా వివాదం పరిష్కారం అయితే మంచిదే. మేమిద్దరం ఒకరి నొకరం బాగా ఎరుగుదుము. తైయబ్ సేఠ్ త్వరగా పరిష్కారం కానీయడు. ఆయనతో జాగ్రత్తగా వ్యవహరించాలి. ఏమాత్రం రహస్యం పసిగట్టినా మనల్ని అధఃపాతాళానికి తొక్కివేస్తాడు. అందువల్ల ఏమరచకుండా తెలివిగా వ్యవహరించండి." అని చెప్పారు అబ్దుల్లా సేఠ్.

"ఈ విషయంలో తొట్రుబాటు బడను. దావా విషయమై తైయబ్ సేఠ్‌తోగాని, మరొకరితోగాని మనకేంపని? ఎప్పుడైనా కలిస్తే మాత్రం డొంక తిరుగుడు గొడవలు మాని ఏదో ఒక దారికి రమ్మని చెబుతాను" అని అన్నాను. వచ్చిన ఏడో రోజునో, ఎనిమిదో రోజునో నేను దర్బాను నుంచి బయలుదేరాను. నాకు మొదటి తరగతి టిక్కెట్టు కొనియిచ్చారు. పరుపు కావాలంటే అదనంగా అయిదు షిల్లింగులు అక్కడ చెల్లించాలి. పరుపు తీసుకోమని అబ్దుల్లాగారు మరీమరీ చెప్పారు. కాని అనవసరంగా పట్టుదలకు పోయి, పరుపు తీసుకోకూడదని అనుకున్నాను. అయిదు షిల్లింగులు మిగల్చాలనే భావం. కూడా నాలో అప్పుడు పని చేసింది. అయినా అబ్దుల్లా సేఠ్ నన్ను సమదాయిస్తూ "చూడండి! ఇది హిందూ దేశం కాదు. అల్లా అనుగ్రహంవల్ల మనకు తినడానికి కట్టడానికి, ఇతరులకు సాయం చేయడానికి తగినంత సిరిసంపదలు లభించాయి. మీరు సంకోచించకండి. అవసరమైన ఖర్చు చేయండి." అని నచ్చచెప్పాడు.

నేను ధన్యవాదాలు పలికి పరవాలేదని చెప్పాను. రైలు నేటాలు ముఖ్య పట్టణం మారిట్జుబర్గుకు రాత్రి తొమ్మిది గంటలకు చేరింది. పడుకునే వాళ్ళకు యిక్కడే పరుపులిస్తారు. రైలు జవాను వచ్చి పరుపు కావాలా అని అడిగాడు. నాదగ్గర

వుంది. పరుపు అక్కర్లేదని చెప్పాను. అతడు వెళ్లిపోయాడు. ఇంతలో ఒక ప్రయాణీకుడు లోనికి వచ్చి నన్ను ఎగాదిగా చూచాడు. నేను నల్లవాణ్ణి. అతడు సహించలేక పోయాడు. పెట్టెదిగి వెళ్లి ఒకరిద్దరు ఉద్యోగుల్ని తీసుకువచ్చాడు. వారు వెటకారంగా నిలబడ్డారు. ఇంతలో మరో ఉద్యోగి వచ్చి "లేవయ్యా, లే, నీవు వెనుక పెట్టెలో కూర్చోవాలి. లే" అని గద్దించాడు.

"నా దగ్గర మొదటి తరగతి టిక్కెట్టు ఉన్నది. నా మాట మీరు వినండి. దర్బనులో నన్ను యిక్కడ కూర్చోనిచ్చారు. నేనిక్కడే వుంటాను."

"అయితే పోవా? నీవు వెళ్లకపోతే పోలీసును పిలిచి నెట్టించి వేస్తాను."

"సరే! అతడు వచ్చి నెట్టితే నెట్టనీ! నేను మాత్రం పోను."

పోలీసువాడు వచ్చి నా చెయ్యి పుచ్చుకొని బయటికి దించివేశాడు. నా సామాను కూడా బయటికి విసరి వేశాడు. నేను మాత్రం వెనక పెట్టెలోకి పోనని భీష్మించాను. రైలు వెళ్లిపోయింది. నేను చేతిసంచి పుచ్చుకొని వైటింగు రూములోకి వెళ్లి కూర్చున్నాను. సామాను పడిపోయిన చోటనే వుంది. రైల్వేవారు దాన్ని కాపాడుతూ వున్నారు.

అది చలికాలం. దక్షిణ ఆఫ్రికాలోని పర్వత ప్రాంతాలలో చలి అధికం. మారిట్జుబర్గు మరీ ఎత్తు మీద వున్నందున చలి మరీ ఎక్కువగా వుంది. నా ఓవర్‌కోటు సామానులో వుంది. దాన్ని యిమ్మని కోరితే మళ్లీ అవమానిస్తారేమోనను భయంతో అడగలేకపోయాను. వణుకు పట్టుకున్నది. ఆగదిలో దీపంలేదు. అర్ధరాత్రి ఒక ప్రయాణీకుడు అక్కడికి వచ్చాడు. అతడు నన్ను పలకరించాలని భావించాడేమో కాని నేను మాట్లాడే స్థితిలో లేను.

ఇక ఏం చేయాలి అని ఆలోచించాను. నా హక్కుకోసం పోరాడాలా? లేక నోరుమూసుకొని ఇండియా దారి పట్టాలా? వచ్చిన పని పూర్తి చేయకుండా వెళితే అవమానం కదా! పిరికితనం కూడా. యిప్పుడు నేను పడ్డ కష్టం కొద్దే. ఇది మహారోగానికి బాహ్యచిహ్నం మాత్రమే. యీ మహారోగం వర్ణానికి అంటే రంగుకు సంబంధించింది. సామర్థ్యం వుంటే యీ రోగమూలాన్ని పెరికి పారవేస్తాను. ఎన్ని కష్టాలైనా యిందు కోసం సహిస్తాను. వర్ణద్వేషానికి సంబంధించిన యీ జాడ్యాన్ని తొలగించేందుకై ఎంత కృషి అయినా సరే చేస్తాను. యీ విధంగా ఆలోచించి తరువాత వచ్చే రైల్లో ప్రిటోరియాకు వెళ్లాలని నిర్ణయించుకున్నాను. మర్నాడు రైల్వే జనరల్ మేనేజరుకు ఒక పెద్ద టెలిగ్రాం పంపాను. అబ్దుల్లా సేఠ్ వెంటనే జనరల్ మేనేజర్ని కలిసి మాట్లాడాడు.

యీవిషయం నాకు తెలిసింది. "యిందు రైల్వేవారి దోషం ఏమీలేదు. అయినా వెంటనే గాంధీకి సాయం చేయమని స్టేషను మాష్టరుకు తంతి పంపాను" అని ఆయన అబ్దుల్లాగారికి చెప్పాడు. అబ్దుల్లాగారు వెంటనే మారిట్జుబర్గులోని హిందూదేశపు వర్తకులకు మరికొందరికి తంతి పంపి రైలు స్టేషనులో వున్న గాంధీకి సాయం చేయమని కోరాడు. వారంతా రైలు స్టేషనుకు వచ్చి నన్ను కలిశారు. తమకు జరిగిన యిలాంటి అవమానాల్ని గురించి వారు నాకు చెప్పడం మొదలు పెట్టారు.

ఈ దేశంలో యిది క్రొత్తకాదని చెప్పి నన్ను ఓదార్చడానికి ప్రయత్నించారు. ఫస్టు, సెకండు క్లాసుల్లో ప్రయాణం చేసే భారతీయ ప్రయాణీకులు ఏ రైలు ఉద్యోగుల చేతుల్లోనో, ఏ తెల్లవారి చేతుల్లోనో యిట్టి కష్టాలు పడేందుకు సిద్ధపడి వుండాలన్నమాట. ఆ రోజంతా మనవాళ్ల కష్టగాధలు వినడంతో సరిపోయింది. రాత్రి రైలు వచ్చింది. అందులో నా కోసం ఒక బెర్తు రిజర్వు చేయబడివుంది. దర్బానులో వద్దన్న పరుపు టికెట్టును మాత్రం యీ రోజున మారిట్జుబర్గులో కొన్నాను. ఆ రైలు నన్ను చార్లెస్ టౌనుకు తీసుకు వెళ్లింది.

## 9. నేను పడిన కష్టాలు

ప్రొద్దుటికి రైలు చార్లెస్ టౌను చేరింది. ఆ రోజుల్లో చార్లెస్ టౌనుకు, జోహాన్సుబర్గుకు మధ్య రైలు లేదు. రాక పోకలకు గుర్రపు బండ్లు వున్నాయి. గుర్రపు బండి త్రోవలో స్టాండర్టన్ అను ఊళ్లో రాత్రి పూట ఆగుతుంది. నా దగ్గర గుర్రపు బండి టిక్కెట్టు వుంది. మారిట్జుబర్గులో ఒక రోజు నేను వుండిపోయాను. ఆ టిక్కెట్టు రద్దుకాలేదు. అబ్దుల్లాసేఠ్ చార్లెస్ టౌనులోగల గుర్రపు బండ్ల ఏజంటుకు తంతి కూడా పంపాడు.

కాని ఆ ఏజంటు సరియైన వాడుకాడు. వాడు నన్ను దండుకోవాలని భావించాడు. నీ టిక్కెట్టు చెల్లదని అన్నాడు. నేను అందుకు తగిన సమాధానం చెప్పాను. బాటసార్లకు బండిలో చోటు యివ్వాలి. లోపల చోటువున్నా వాడు నన్ను బాధించాలనే భావంతో వ్యవహరించాడు. లీడర్ అను గుర్రపు బండ్ల అధికారి నన్ను తెల్లవారితోబాటు బండిలో కూర్చోనీయకూడదని అనుకున్నాడు. ఆ బండికి ముందుభాగాన రెండు వైపుల రెండు సీట్లు వున్నాయి. లీడరు ఆ రెండు సీట్లలో ఒకదాని మీద కూర్చుంటాడు. కాని యివాళ అతడు లోపలి సీట్లో కూర్చొని నాకు బయట తన సీటును చూపించాడు. అది శుద్ధ అన్యాయమనీ, అవమానకరమనీ నాకు

బోధపడింది. కాని అవమానం మ్రింగడమే మంచిదని భావించాను. బలవంతం చేసి లోపల దూరడానికి వీలు వుండదు. నేను అక్కడ కూర్చోను అని అంటే అతడు నన్ను అక్కడే వదలి బండి తోలుకుపోతాడు. అక్కడ నేను వుండిపోతే ఆ రోజంతా వృథాయే. మర్నాడు ఏమవుతుందో ఆ భగవంతుడికే ఎరుక. కాబట్టి మనసులో ఎంత గుంజాటన పడుతూవున్నా నోరుమూసుకొని బండితోలేవాడి ప్రక్కన కూర్చున్నాను.

సుమారు మూడు గంటలకు బండి పార్డీకోవుకు చేరింది. అక్కడ ఆ గుర్రపు బండి అధికారికి నేను కూర్చున్నచోటున కుర్చోవాలని బుద్ధి పుట్టింది. అతడు సిగరెట్ కాల్చుకోవాలి. అతడికి తెరపగాలి కావాలి. అతడు బండి తోలేవాడి దగ్గర ఒక మైల గోనె సంచి తీసుకున్నాడు. దాన్ని నేను కూర్చున్న సీటు ముందు క్రింద పరిచాడు. "సామీ! నీవు దీని మీద కూర్చో. నేను బండి తోలు వాడి సీటు ప్రక్కన కూర్చుంటా" అని అన్నాడు. నేను ఆ అవమానం భరించలేక పోయాను. భయపడుతు భయపడుతు "లోపల కూర్చోవలసిన నన్ను యిక్కడ కూర్చోబెట్టావు. నేనెట్లో సహించాను. నీవు యిక్కడ కూర్చొని సిగరెట్ కాల్చుకునేందుకు నన్ను నీ కాళ్ల దగ్గర కూర్చోమంటున్నావు. నేను యిక్కడ కూర్చోను. బండి లోపలికి వెళ్లి కూర్చుంటాను." అని అన్నాను.

ఈ మాటలు నానోటి నుండి బయటికి వచ్చాయో లేదో వాడు వెంటనే నా గూబ పగల కొట్టసాగాడు. నాచేయి పట్టుకుని క్రిందికి ఈడ్చి వేయడానికి ప్రయత్నించాడు. నేను ఆ బండి చువ్వల్ని గట్టిగా పట్టుకున్నాను. మణికట్లు విరిగినా సరే చువ్వల్ని వదలకూడదని నిర్ణయించుకున్నాను. వాడు బండబూతులు తిట్టాడు. క్రిందకి పడత్రోసేందుకు ప్రయత్నించాడు. నేను మాత్రం బండి చువ్వల్ని వదలలేదు. అతడు బలిష్టుడు. నేను దుర్బలుణ్ణి. నా బాధ చూచి ప్రయాణీకులకు దయ కలిగింది. వారు కల్పించుకొని "పాపం, అతడిని విడిచిపెట్టు. అతడు చెప్పింది నిజం. అతని తప్పులేదు. అక్కడ కాకపోతే మాదగ్గరికి లోపలికి పంపు. మాకేమీ యిబ్బంది లేదు. లోపల సీట్లో కూర్చుంటాడు.' అని గట్టిగా అన్నారు. దానితో అతనికి అవమానమైంది. నన్ను కొట్టడం మానివేశాడు. "ముందున్నది ముసళ్ల పండగ, పద నీ అంతు తేలుస్తా" అంటూ అప్పుడు నన్ను వదిలి పెట్టాడు. బండికి ఆవలి ప్రక్కన కూర్చున్న సేవకుణ్ణి ఆ గోనెమీద కూర్చోబెట్టి అతని చోట తాను కూర్చున్నాడు.

ఎవరి సీట్లలో వాళ్లు కూర్చున్నారు. ఈల మ్రోగింది బండి కదిలింది. నా గుండె దడదడ కొట్టుకున్నది. ప్రాణాలతో ఆ ఊరు చేరగలనా అని సంశయం కలిగింది. నడుమ వాడు నావంక కొరకొర చూస్తూ స్టాండర్టన్‌లో దిగు! అక్కడ నిన్నేమి చేస్తానో

చూద్దుగాని, అని చిర్రు బుర్రు లాడుతూ వున్నాడు. నేను మౌనం వహించి కూర్చున్నాను. దైవమా! సాయపడు అని లోలోన భగవంతుణ్ణి ప్రార్థించసాగాను.

చీకటి పడింది. బండి స్టాండర్టన్ చేరింది. అక్కడ హిందూదేశస్థుల ముఖాలు కొన్ని కనబడ్డాయి. నా గుండె దడ కొద్దిగా తగ్గింది. నేను బండి దిగగానే వాళ్లు నాదగ్గరికి వచ్చి "మేము మీకోసమే వచ్చాము ఈసా సేఠ్‌గారి దుకాణానికి వెళదాం. అబ్దుల్లా సేఠ్ గారు మాకు తంతి పంపారు." అని అన్నారు. నాకు ఎంతో సంతోషం కలిగింది. సేఠ్ ఈసా హాజీసుమర్‌గారి దుకాణానికి వెళ్లాము. ఆ సేఠ్, ఆయన గుమాస్తాలు నాచుట్టూ మూగారు. నేను జరిగిందంతా చెప్పాను. వాళ్లు విచారం వెలిబుచ్చారు. తాము పడ్డ కష్టాలన్నీ చెప్పి నన్ను ఓదార్చ ప్రయత్నించారు.

గుఱ్ఱపు బండ్ల కంపెనీ ఏజంటుకు జరిగిందంతా వ్రాసి పెద్దజాబు పంపించాను. లీడరు చేసిన దురాగతాన్ని గురించి, వాడి బెదిరింపును గురించి కూడా వ్రాశాను. మరుసటి రోజు బండిలో సరియైన ఏర్పాటు చేయమని వ్రాశాను. అందుకు వెంటనే ఆ ఏజంటు సమాధానం పంపాడు. "ఇక్కడి నుండి మీరు బయలుదేరిన బండి కంటే పెద్దబండి రేపు వస్తుంది. దాన్ని నడుపువాడు క్రొత్తవాడు. మిమ్ము బెదిరించినవాడు రేపు రాడు. మీరు బండి లోపలే కూర్చోవచ్చు." అని అతడు పంపిన సమాధానంలో వుంది. నాకు బెంగ సగం తీరిపోయింది. నన్ను కొట్టిన వాడి మీద కేసు పెట్టాలనే ఉద్దేశ్యం నాకు లేదు. అందువల్ల యీ వ్యవహారం అంతటితో ముగిసిపోయింది.

మర్నాడు ప్రొద్దున్నే ఈసా సేఠ్ గారి నౌకరు వచ్చి నన్ను గుఱ్ఱపు బండి ఎక్కించాడు. లోపల మంచి సీటు లభించింది. ఆ రాత్రికి సుఖంగా జోహాన్సుబర్గు చేరాను.

స్టాండర్టన్ చిన్న వూరు. జోహాన్సుబర్గుకు నారాకను గురించి తంతి యిచ్చారు. అచ్చట మహమ్మద్ కాసిం కమరుద్దీన్ గారి నౌకరు నన్ను తీసుకు పోయేందుకు వచ్చాడు. కాని నేను అతడిని చూడలేదు. అతడు నన్ను పోల్చలేదు. కమరుద్దీన్ గారి దుకాణం చిరునామా వివరం అబ్దుల్లాగారు నాకు తెలియజేశారు. యిక ఏదైనా హోటలుకు వెళదామని భావించాను. ఆ పట్టణంలోని కొన్ని హోటళ్ల పేర్లు నాకు తెలుసు. బండి కుదుర్చుకొని గ్రాండ్ నేషనల్ హోటలుకు వెళ్లాను. హోటలు మేనేజర్ని కలిసి ఒక గది యిమ్మని కోరాను. అతడు కొద్ది సేపు నన్ను ఎగాదిగా చూచి వినమ్రంగా గదులు ఖాళీలేవు అని చెప్పి సలాం కొట్టి వెళ్లిపోయాడు. అప్పుడు కాసింకమరుద్దీన్ గారి దుకాణానికి వెళ్లాను. అచ్చట నా కోసం ఎదురు చూస్తున్న అబ్దుల్‌గనీ సేఠ్ గారిని

కలుసుకున్నాను. వారు నన్నెంతో ఆదరించారు. నాకు హోటల్లో జరిగిన మర్యాదను గురించి చెప్పాను. ఆయన పకపకనవ్వి 'హోటల్లో మీకు ప్రవేశం ఎలా లభిస్తుందని అనుకున్నారు?'అని ప్రశ్నించారు.

"అదేమిటి?"

"ఇక్కడ కొన్నాళ్ళుంటే మీకే అర్థమవుతుంది. మేము యీ దేశంలో గతిలేక వుంటున్నాము. కేవలం డబ్బు మీదగల ఆశచే ఎన్ని అవమానాలైనా సహించి యిక్కడ పడివుంటున్నాం." అని దక్షిణ - ఆఫ్రికాలో భారత దేశస్థులు పడుతున్న కష్టాల్ని గురించి వివరించారు.

అబ్దుల్ గనీ గారిని గురించి ముందు యింకా వివరంగా వ్రాస్తాను.

ఆయన మళ్లీ ఇట్లన్నారు - "ఈ దేశం మీబోటి వారు వుండడానికి తగిందికాదు. రేపు మీరు ప్రిటోరియాకు బయలుదేరుతారు కదా ! ఇక మూడో తరగతి బండిలోనే వెళ్లవలసి వుంటుంది. నేటాలులోను యింతే. ట్రాన్సువాలులో మరీ అధ్వాన్నం. యిక్కడ ఒకటి రెండు తరగతుల టిక్కెట్లు హిందూ దేశస్థులకి యివ్వరు."

"మీరు అందుకు వ్యతిరేకంగా తగిన ప్రయత్నం చేయలేదా ?" "చేయకేం చేశాము. ఎన్నో అర్జీలు పెట్టాం. కాని మనవాళ్లే ఆ తరగతుల్లో ప్రయాణించేందుకు ఒప్పుకోరు."

నేను రైల్వే నినబంధనలు చదివి చూచాను అందొక లోపం వుంది. ట్రాన్సువాలు శాసనాల భాష సరిఅయింది కాదు. స్పష్టంగా వుండదు. ముఖ్యంగా రైల్వే నిబంధనలు "నాకు మొదటి తరగతిలోనే ప్రయాణం చేద్దామని వుంది. వీలుకాకపోతే ప్రిటోరియాకు సరాసరి గుర్రపు బండి కుదుర్చుకుంటాను. ముప్పది ఏడు మైళ్ళే కదా !" అని సేఠ్ గారితో అన్నాను.

బండి మీద వెళితే ఎంత సమయం, ధనం వ్యర్థమవుతుందో ఆయన వివరంగా చెప్పారు. మొదటి తరగతిలోనే వెళ్లమని చెప్పారు. వెంటనే స్టేషను మాష్టరుకు నేను బారిష్టరును ఎప్పుడూ మొదటి తరగతిలోనే ప్రయాణం చేస్తాను. రేపు ప్రిటోరియాకు మొదటి తరగతిలో ప్రయాణం చేయదలిచాను. నేను వచ్చి మిమ్మును కలుస్తాను, టిక్కెట్టు సిద్ధం చేసి వుంచండి. అని వ్రాశాను "క్షమించండి" అని సమాధానం వ్రాస్తాడని భయం పట్టుకున్నది. నేను బారిష్టరు వేషంలో టిప్‌టాప్‌గా వెళ్లి ఇంగ్లండు ఇంగ్లీషులో మాట్లాడితే టిక్కెట్టు తప్పక యిచ్చేస్తాడని భావించాను. ఫ్రాంక్ కోటు

తొడుక్కున్నాను. నెక్ టై కట్టుకున్నాను. టీకుటాకుగా వెళ్లి బల్లమీద "కాసు" పెట్టి టిక్కెట్టు యిమ్మని కోరాను. నా వ్యవహారం గమనించి ఆయన జాలిపడ్డాడు. "అయ్యా! నేను ట్రాన్సువాల్ నివాసిని కాను. హాలండు నివాసిని. నాకు మీరు చెప్పిన మాటలు అర్థమైనాయి. మీ ఎడ మాకు సానుభూతి వుంది. మీకు ఫస్టుక్లాసు టిక్కెట్టు యిస్తాను. కాని త్రోవలో గార్డు వచ్చి దిగిపొమ్మంటే మీరు దిగి మూడో తరగతిలో కూర్చోవాలి. అలా అయితేనే టిక్కెట్టు యిస్తాను. ఆ తరువాత మీరు రైల్వే వారి మీద దావా వేయకూడదు." అని చెప్పి మొదటి తరగతి టిక్కెట్టు నాచేతిలో వుంచాడు. నేను ఆయనకు ధన్యావాదాలు తెలిపి మీ మాటకు బద్ధుణ్ణి అని కూడా చెప్పాను. సేర్ అబ్దుల్‌గనీ గారు నన్ను పంపడానికి స్వయంగా స్టేషనుకు వచ్చారు. జరిగినదంతా విని ఆశ్చర్యపడ్డారు. యిలా అన్నారు. "ఇంత వరకు బాగానే వుంది. కాని త్రోవలో గార్డు మిమ్ము చూచి దించివేస్తాడు. ఒకవేళ గార్డు దించకపోతే తోటి తెల్లజాతి ప్రయాణీకులు ఊరుకోరు. దించివేస్తారు."

నేను మొదటి తరగతి పెట్టె ఎక్కాను. రైలు బయలుదేరింది. జర్మిస్టన్ స్టేషనులో గార్డు టిక్కెట్టు పరిశీలించేందుకై వచ్చాడు నన్ను చూడగానే మండిపడ్డాడు. వెంటనే లేచి మూడో తరగతి పెట్టెలోకి పొమ్మని వ్రేలితో సౌంజ్ఞ చేశాడు. నేను నా టిక్కెట్టు చూపించాను. "అయితే ఏం? మూడో తరగతి పెట్టెలోకి పో" అంటూ గద్దించాడు.

ఆ పెట్టెలో ఒక్క తెల్లవాడే వున్నాడు. ఆయన గార్డును ప్రతిఘటించి "ఎందుకు పెద్ద మనిషిని బాధిస్తావు? మొదటి తరగతి టిక్కెట్టు కొన్నాడు. కనబడటం లేదా? వారి ప్రక్కన కూర్చునేందుకు నాకు యిబ్బందేమీ లేదు." అని నావంక చూచి "అక్కడే హాయిగా కూర్చోండి" అని అన్నాడు. "కూలీతో కూర్చునేందుకు మీకే యిబ్బంది లేకపోతే నాకా యిబ్బంది!" అంటూ గొణుగుతూ గార్డు వెళ్లిపోయాడు.

రాత్రి ఎనిమిది గంటలకు రైలు ప్రిటోరియా చేరింది.

## 10. ప్రిటోరియాలో మొదటి రోజు

దాదా అబ్దుల్లా గారి వకీలు ప్రిటోరియా స్టేషనుకు ఎవరినైనా పంపి నన్ను తీసుకు వెళతారని భావించాను. నన్ను కలుసుకునేందుకు యితర భారతీయులెవ్వరూ రారని నాకు తెలుసు. ఎందుకనగా ప్రిటోరియాలో భారతీయుల యింట్లో బస

చేయనని నేను అబ్దుల్లా గారికి వాగ్దానం చేసి వచ్చాను. ఆదివారం గనుక ఎవ్వరినీ స్టేషనుకు పంపడానికి వీలుపడలేదని వకీలు ఆ తరువాత చెప్పాడు. అప్పుడు మాత్రం నాకేమీ తోచలేదు. ఎక్కడికి వెళ్లడం ? హోటళ్లలో నన్ను ఉండనీయరు.

1893 నాటి ప్రిటోరియా స్టేషను 1914 నాటి ప్రిటోరియా స్టేషను కాదు. దీపాలు మసక మసకగా వున్నాయి. ప్రయాణీకులు కూడా ఎక్కువమంది లేరు. అందరూ వెళ్లాక టిక్కెట్టు కలెక్టరు దగ్గరకు వెళ్లి టిక్కెట్టు యిచ్చి ఎక్కడ బసచేయవచ్చునో అడుగుదామని ఆగాను. ఎక్కడా కుదరకపోతే ఆ రాత్రి రైలు స్టేషనులోనే వుందామని భావించాను. యీ విషయం అడిగితే అవమానిస్తాడేమో నని భయం పట్టుకున్నది. స్టేషను శూన్యం అయింది. చివరికి నా టిక్కెట్టు యిచ్చి అదీ యిదీ మాట్లాడసాగాను. అతడు వినయంతో సమాధానం యిచ్చాడు కాని ప్రయోజనం శూన్యం. యింతలో మా ప్రక్కనే నిలబడియున్న ఒక అమెరికా నీగ్రో మా మాటలు విని యిలా అన్నాడు - "మీరీ వూరికి క్రొత్తవారిలా వున్నారు. యిక్కడ మీకు మిత్రులెవ్వరూ లేనట్లుంది. నాతో రండి. మిమ్ము ఒక చిన్న హోటలుకు తీసుకువెళతాను. హోటలు యజమాని అమెరికావాడు. వారిని నేను బాగా ఎరుగుదును. అతడు మీకు వసతి కల్పిస్తాడు రండి".

ఈ పిలవని పేరంటం చూచి మొదట నేను సందేహించాను. కాని తరువాత అతనికి ధన్యవాదాలు చెప్పి అంగీకరించాను. అతడు నన్ను జాన్సటన్ గారి హోటలుకు తీసుకువెళ్లాడు. అతణ్ణి చాటుకు తీసుకుపోయి నా సంగతి చెప్పాడు. జాన్‌స్టన్ అంగీకరించాడు. కాని ఒక్క నియమం పెట్టాడు. అందరితో గాక నా భోజనం నా గదిలోనే చేయాలన్నది అతడు పెట్టిన నియమం. "నలుపు తెలుపు భేదాలు నేను పాటించను. కాని మా హోటలుకు వచ్చే వాళ్లంతా తెల్లవాళ్లే. మిమ్మల్ని వాళ్లతోబాటు కూచోబెడితే వాళ్లు అవమానంగా భావిస్తారేమో. వాళ్లు లేచిపోతారేమో. అది ప్రమాదం. అందుకని యిలా అంటున్నాను." అని జాన్‌స్టన్ స్పష్టం చేశాడు.

"ఈ రాత్రి ఉండనిచ్చినందుకు ధన్యవాదాలు. యీదేశ పరిస్థితులు కొద్ది కొద్దిగా తెలిశాయి. మీ కష్టం ఏమిటో బోధపడింది. నాగదిలో భోజనం చేసేందుకు నాకు యిబ్బంది లేదు. రేపు మరోచోట ఏర్పాటు చేసుకుంటాను" అని అన్నాను. గది చూపించాడు. లోపలికి వెళ్లాను. ఒక్కడినే వున్నాను. ఏదో ఆలోచిస్తున్నాను. భోజనం కోసం ఎదురు చూస్తుంటే జాన్‌స్టన్ స్వయంగా వచ్చి "మిమ్మల్ని గదిలోనే భోజనం చేయమని చెప్పినందుకు విచారిస్తున్నాను. భోజనశాలకు అంతా వచ్చారు. వారితో మీ విషయం చెప్పాను. మాకేమీ అభ్యంతరం లేదని వారంతా చెప్పారు. రండి భోజనశాలలో

అందరి సరసన కూర్చొని భోజనం చేయండి. హోటల్లో మీరెన్నాళ్లున్నా ఎవ్వరికీ ఏమీ యిబ్బంది లేదు.'' అని అన్నాడు. ఆయనకు మళ్లీ ధన్యవాదాలు చెప్పి భోజనశాలకు వెళ్లి తృప్తిగా కడుపు నిండా భోజనం చేశాను.

మరునాడు ప్రొద్దునే వెళ్లి వకీలు శ్రీ బేరుగారిని దర్శించాను. అబ్దుల్లా సేఠ్ ఆయనను గురించి అదివరకు కొద్దిగా చెప్పాడు. అందువల్ల ఆయన నాకు చేసిన ఆదరణ చూచి నేను ఆశ్చర్యపడలేదు. ఎన్నో కుశల ప్రశ్నలు వేశారు. అమితంగా ఆదరించారు. నా సంగతంతా ఆయనకు సవివరంగా చెప్పాను. అంతా విని ఆయన ''బారిష్టరుగా మీరు చేయవలసింది యిక్కడ ఏమీలేదు. లోగడనే మేము మంచి వకీళ్లను నియమించి వుంచాము. యీ దావా చాలా కాలాన్నుంచి నడుస్తున్నది. యిది చిక్కుల మారి దావా. అందువల్ల అవసరమైనచోట్ల మీ సాయం తీసుకొంటాను. మా క్లయింటుకు మాకు ఉత్తర ప్రత్యుత్తరాలలో జరుగుతున్న కష్టాలు మీరు తొలగించవచ్చు. వారి దగ్గరనుండి రావలసిన వివరాలు నేను మీనుండి పొందుతాను. యిది చాలా ప్రయోజనకరమైన విషయం. మీ బసను గురించి యింతవరకు నేను అడగలేదు. పరిచయం అయిన తరువాత అడుగుదామని అనుకున్నాను. యిక్కడ వర్ణ వైషమ్యం విపరీతంగా వుంది. అందువల్ల మీ బోటి వారికి తేలికగా బస దొరకదు. అయితే నేనొక పేదరాలిని ఎరుగుదును. ఆమె రొట్టెలు అమ్ముకొని జీవించు యిల్లాలు. ఆమె మీకు అవకాశం కల్పిస్తుంది. కొద్దిగా డబ్బు తీసుకుంటుంది. అక్కడికి పోదాం. దయచేయండి' అని అంటూ లేచి నిలబడ్డాడు.

ఇద్దరం ఆమె ఇంటికి వెళ్లాం, ఆమెతో చాటుగా ఏదో మాట్లాడాడు. వారానికి 35 షిల్లింగులు తీసుకొని భోజనం పెట్టడానికి ఆమె అంగీకరించింది.

బేకరు మంచి వకీలే గాక మతబోధకుడు కూడా. ఆయన యిప్పటికీ జీవించే యున్నాడు. ఆయన పని యిప్పుడు మత ప్రచారం చేయడమే. వకీలు వృత్తి మానివేశాడు. సిరిసంపదలు బాగా వున్నాయి. యిప్పటికీ మాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వున్నాయి. ఆయన విశ్వాసం, వాదన ఒకటే. క్రైస్తవ మతమే ప్రశస్తమైనది. జీసను ఈశ్వరుని ఏకైక పుత్రుడు. మనుష్యుల్ని తరింపచేసే తారకుడు. యిట్టి విశ్వాసం వల్ల పరమ ప్రశాంతి లభిస్తుంది. యిదే ఆయన బోధకు సారం.

ప్రథమ దర్శనమప్పుడే ఆయనకు తత్వబోధన గురించిన నా భావాలు చెప్పివేశాను. నేను చెప్పిన దానికి సారం - ''నేను పుట్టుకచే హిందువును. అయినా నాకు హిందూ మతమంటే ఎక్కువగా తెలియదు. ఇతర మతాలను గురించి అసలే తెలియదు. నిజానికి నా స్థితి ఏమిటో నాకు తెలియదు. ఎలా వుండాలో కూడా తెలియదు. మా

మతాన్ని గురించి చదవాలని అనుకుంటున్నాను. యథాశక్తి యితర మతాలను కూడా పరిస్తాను."

దాపరికం లేని నా మాటలు విని బేకరు చాలా సంతోషించాడు. "దక్షిణ - ఆఫ్రికాయందలి జనరల్ మిషనుకు నేనొక డైరెక్టరును. నేను స్వయంగా ఒక చర్చి కట్టించాను. అక్కడ నియమిత సమయాన మత విషయాలను గురించి ప్రస్తావిస్తూ వుంటాను. నాకు రంగు తెగులు లేదు. నాతోబాటు యింకా మత ప్రచారకులు వున్నారు. మేము ప్రతిరోజు ఒంటిగంటకు అక్కడ చేరి శాంతి మరియు జ్ఞానోదయం కోసం ప్రార్థన చేస్తూ వుంటాము. మీరు అక్కడికి వస్తే సంతోషిస్తాను. మా వారందరకీ మిమ్ము పరిచయం చేస్తాను. వాళ్లు మీ పరిచయం పొంది సంతోషిస్తారు. మీకు చదవడం కోసం కొన్ని పుస్తకాలు యిస్తాను. క్రైస్తవ మత గ్రంథాలలో కెల్లా గొప్పది బైబిలే, దాన్ని చదవమని సిఫారసు చేస్తున్నాను." అని అన్నాడు.

బేకరు గారికి ధన్యవాదాలు చెప్పి ఒంటి గంట ప్రార్థనకు తప్పక వస్తానని చెప్పాను. "అయితే రేపు మీకోసం యిక్కడనే వేచి వుంటాను. యిక్కడి నుండి మనిద్దరం ప్రార్థనా మందిరానికి కలిసే వెళదాం." అని అన్నాడు. నేను సెలవు తీసుకున్నాను.

ఆలోచించేందుకు యిప్పటి దాకా నాకు అవకాశం చిక్కలేదు. జాన్‌స్టన్ గారి దగ్గరకు వెళ్లాను. వారికి డబ్బు చెల్లించి క్రొత్త యింటికి వెళ్లాను. అక్కడే భోజనం చేశాను. ఆమె మంచి యిల్లాలు. ఆమె నాకోసం శాకాహారం సిద్ధం చేసింది. వారి కుటుంబంతో కలిసి పోవడానికి నాకు ఎక్కువ కాలం పట్టలేదు.

తరువాత నేను అక్కడి నుండి అబ్దుల్లా గారి స్నేహితుణ్ణి చూచేందుకు వెళ్లాను. అబ్దుల్లా వారికి చీటీ వ్రాసి యిచ్చాడు. నేను వెళ్లి ఆ చీటీ యిచ్చాను. మాకు పరిచయం అయింది. ఆయన అక్కడ హిందూ దేశస్థులు పడుతున్న కష్టాలు చెప్పారు. తన యింట్లో వుండమని ఆయన నన్ను బలవంతం చేశారు. నేను ధన్యవాదాలు చెప్పి యిదివరకే బస ఏర్పాటు చేసుకున్నానని మనవి చేశాను. "మీకేమి కావాలన్నా అడగండి. సంకోచించకండి" అని ఆయన మరీ మరీ చెప్పారు.

సంధ్యాసమయం దాటింది. యింటికి చేరి భోజనం చేశాను. విశ్రమించి దీర్ఘాలోచనలో మునిగిపోయాను. ప్రస్తుతం చేయడానికి పనేమీ లేదు. ఈ విషయం అబ్దుల్లా గారికి తెలియజేశాను. బేకరుగారు నాతో యింత స్నేహం చేయడానికి కారణం ఏమిటి ? వారి సహచరుల పరిచయం వల్ల ఒనగూడేదేమిటి? క్రైస్తవ మతాన్ని గురించి ఎంతని చదవగలను? హిందూమతానికి సంబంధించిన గ్రంథాలు ఎక్కడ

దొరుకుతాయి ! నా మతాన్ని గురించి తెలుసుకోలేకపోతే క్రైస్తవ మతాన్ని గురించి ఏం తెలుసుకోగలను? యోచించి యోచించి చివరకు ఒక నిర్ణయానికి వచ్చాను.

" నా చదువంతా నిష్ప్రాక్షికంగా వుండాలి. ఈశ్వరుడు చూపించిన త్రోవన బేకర్ మిత్రుల బృందంతో బాటు సంచరించాలి. నా మతాన్ని గురించి పూర్తిగా తెలుసుకోనిదే యితర మతాన్ని అంగీకరించను. అట్టి ఆలోచనే పెట్టుకోను." ఈ విధంగా ఆలోచిస్తూ వుండగా నిద్ర వచ్చేసింది.

## 11. క్రైస్తవులతో పరిచయం

మర్నాడు ఒంటి గంటకు బేకరుగారి చర్చికి వెళ్లాను. హారిస్ కుమారితోను, గాబ్ కుమారితోను, కోట్సు మొదలగు వారితోను పరిచయం అయింది. అంతా ప్రార్థన కోసం మోకరిల్లారు. నేనూ వారిని అనుకరించాను. తమ కోరికలను గురించి ఈశ్వరుని వేడుకోవడం అక్కడి ప్రార్ధనా విశేషం. "ఈ దినం శాంతంగా గడుచుగాక అనిగాని, ఓ పరమేశ్వరా! నా హృదయద్వారాన్ని తట్టుదువుగాక" అనిగాని ప్రార్థించడం అక్కడ మామూలు. కాని ఆ రోజున మాత్రం వారంతా 'క్రొత్తగా వచ్చిన మా మిత్రునకు మార్గం చూపుము ఓ ప్రభూ! మాకు కలిగించిన శాంతినే యితనికి కూడా కలిగింపుము. మమ్ము రక్షించిన ఏసు రక్షకుడే ఇతనిని కూడా రక్షించుగాక. ఏసునాథుని పేరనే మేము యీ ప్రార్థనలు చేస్తున్నాము.' అని వారంతా పరమేశ్వరుణ్ణి వేడుకున్నారు. ఈ సమాజంలో భజన కీర్తనలు లేవు. సంగీతం లేదు. ప్రతిదినం ప్రార్థన కాగానే అంతా వెళ్లిపోయేవారం. సరిగ్గా అది భోజనాల సమయం. ప్రార్థనకు అయిదు నిమిషాల కంటే ఎక్కువ సమయం పట్టేది కాదు.

హారిస్, గాబ్ అను యిద్దరూ పెండ్లికాని ప్రౌఢలు. కోట్సుగారు క్వేకరు తెగవారు. పై స్త్రీలిద్దరూ ఒకేచోట నివసిస్తూ వుండేవారు. ప్రతి ఆదివారం నాలుగు గంటలకు తమ యింట టీ త్రాగడానికి నన్ను ఆహ్వానించారు. ఆదివారాలందు కోట్సుగారూ, నేనూ కలిసినప్పుడు ఆవారం నేను చదివిన గ్రంథాల జాబితా తెలుపుతూ వుండేవాణ్ణి. వాటిని గురించి నా అభిప్రాయాలు కూడా తెలుపుతూ వుండేవాణ్ణి. కోట్సు హృదయం పరిశుద్ధమైనది. అతడు బోళావాడు. పట్టుదల గలవాడు. ఈయనకు నాకు స్నేహం కలిసింది. తరుచు మేమిద్దరం కలిసి షికారుకు వెళుతూ వుండేవారం. ఆయన ద్వారా నాకు చాలామంది క్రైస్తవులతో పరిచయం కలిగింది. మా పరిచయం పెరిగిన కొద్దీ నా అల్మారాలో ఆయనిచ్చిన గ్రంథాల సంఖ్య పెరగసాగింది. ఆయన ఎడ గల శ్రద్ధ వల్ల

వాటి నన్నింటినీ చదువుతూ వున్నాను. చదివి అందలి విషయాన్ని గురించి ఆయనతో చర్చిస్తూ వుండేవాణ్ణి. 1893లో అట్టి గ్రంథాలు చాలా చదివాను. వాటి పేర్లన్నీ యిప్పుడు నాకు గుర్తు లేవు. 'సిటీ టెంపుల్' అను గ్రంథాన్ని గురించి పార్కరుగారు వ్రాసిన వ్యాఖ్యానం, పియర్సన్ గారు వ్రాసిన "ఇన్‌ఫాలిబిల్ ప్రూఫ్స్" బట్లరుగారు వ్రాసిన 'అనాలజీ' మొదలగునవి కొన్ని గుర్తువున్నాయి. ఈ గ్రంథాల్లో కొన్ని భాగాలు నాకు అర్థం కాలేదు. కొన్ని నచ్చాయి. కొన్ని నచ్చలేదు. నా ఉద్దేశ్యాలు కోట్సుగారికి తెలుపుతూ వుండేవాడిని. బైబిల్ మతం పరమ ప్రమాణం అనడమే ఇన్‌ఫాల్‌బిల్ ప్రూఫ్స్ గ్రంథకర్త ఉద్దేశ్యం. యీ పుస్తకం నాకు నచ్చలేదు. పార్కరుగారి టీక నీతి వర్ధకమే గాని ప్రచారంలో నున్న ఏసు మతం మీద విశ్వాసం లేని వారికది నిష్ప్రయోజనం. బట్లరుగారి అనాలజీ క్లిష్టమైన గంభీరమైన గ్రంథం. దీన్ని అయిదారుసార్లు చదవాలి. నాస్తికులను ఆస్తికులుగా మార్చడం యీ గ్రంథోద్దేశ్యం అని అనుకుంటాను. దేవుడు కలడు అని చెప్పే గ్రంథాలు నాకు లాభకారి కావు. నేను నాస్తికావస్థలో లేను. ఏసు ఒక్కడే అద్వితీయమైన అవతార పురుషుడనీ, అతడే మానవులకు, ఈశ్వరునకు సంధానకర్తయనీ చెప్పే సిద్ధాంతాలు నాకు హృదయంగమం కాలేదు.

కోట్సుగారు అంత మాత్రాన అపజయం అంగీకరించే రకం కాదు. ఆయనకు నాపై అమిత ప్రేమ ఏర్పడింది. ఒకనాడు ఆయన నా మెడలో తులసి దండ చూచాడు. చూచి ఖిన్నుడయ్యాడు. "ఈ గ్రుడ్డి నమ్మకం నీకు తగదు. దండ త్రెంపి ఇలా యివ్వండి" అని అన్నాడు.

"చూడండి యిది మా అమ్మగారి ప్రసాదం. అందు నమ్మకం వుందా లేదా నాకు అనవసరం. అందలి రహస్యం నాకు తెలియదు. దాన్ని ధరించకపోతే కీడు కలుగుతుందని నేను భావించను. ఆమె నా శ్రేయస్సు కోరి ప్రేమతో వేసిన యీ దండను ప్రబలమగు కారణం లేనిదే తీసివేయను. కాలం పక్వమై, అది జీర్ణమై తనంతటతాను తెగిపోతే మరోతులసిదండ వేసుకుందామనే లోభం నాకు లేదు. కాని దీన్ని మాత్రం తెంచడానికి వీలు లేదు." అని చెప్పివేశాను. ఆయనకు నా వాదం నచ్చలేదు. నన్ను అజ్ఞాన కూపాన్నుండి బయటకు తీయటానికి ప్రయత్నిస్తూనే వున్నాడు. మతాంతరములందు కొంత సత్యం వున్నా పూర్ణ సత్యం ఏసు మతమందే కలదనీ, ఆ మతం స్వీకరించనిచో మోక్షం చేకూరదనీ, ఏసునాధుడు మధ్యవర్తియై అడ్డుపడకపోతే పాపప్రక్షాళనం జరగదనీ, పుణ్యకర్మలతో ఏమీ ప్రయోజనం లేదనీ అతడు వాదించి నన్ను ఒప్పించాలని ప్రయత్నిస్తూనేవున్నాడు.

గ్రంథాలతో బాటు అతడు ఏసుభక్తుల్ని కూడా చాలామందిని నాకు పరిచయం చేశాడు. ఇట్టి పరిచయస్థులలో ప్లీమత్ బ్రదరన్ కుటుంబం కూడా ఒకటి.

ప్లీమత్ బ్రదరన్ అనునది ఒక ఏసు సంప్రదాయం. కోట్సుగారి ద్వారా నాకు పరిచయమైన వారంతా బాగా చదువుకున్నవారు. పాపభీరువులు. కాని యీ కుటుంబంలో ఒకరు యీ క్రింది విధంగా వాదించారు.

"మా మత సౌందర్యం నీవెరుగవు. మానవుడు తన పాపాలకు ఎప్పటికప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని నీ వాదన అయితే జీవితమంతా ప్రాయశ్చిత్తాలతోనే గడిచిపోతుంది. ఎడతెగని యీ కర్మకాండ నుంచి ఎలా ముక్తి లభిస్తుంది? ఎన్నటికీ శాంతి లభించదు. మనమందరం పాపులం అని నీవూ అంటున్నావు. చూడు మాకెంత విశ్వాసమో! మన ప్రయత్నాల వల్ల ముక్తి వ్యర్థం కాకూడదు. యీ పాపభారం ఎలా మోయగలం? దానిని ఏసుమీద వేయాలి. అతడొక్కడే పాపరహితుడు. అతడొక్కడే భగవానుని కుమారుడు. ఎవరు తనను నమ్ముదురో వారి పాపాలు పటాపంచలయిపోతాయని ఆయన వరం యిచ్చాడు. అది దేవుని అగాధమగు ఉదారతత్వం, ఏసు ముక్తి నీయగలడని నమ్ముదుమేని పాపాలు మనకంటవు. మనం పాపం చేయక తప్పదు. యీ ప్రపంచంలో పాపస్పర్శ తగలకుండా వుండేదెలా ? కావున ఏసు ఒక్కడే రక్షకుడు అని నమ్మిన వానికే పరిపూర్ణ శాంతి లభిస్తుంది. కావున శాంతి మీకా! మాకా?"

ఈ వాదం నీకు నచ్చలేదు. నేను యీ ఏసు మతాన్ని అంగీకరించలేను. పాపాలు చేసి తత్ఫలం నాకంటరాదని నేనెన్నడూ ప్రార్థించను. పాపకర్మ నుండి, పాప ప్రవృత్తినుండి విముక్తుడనగుటకు ప్రయత్నిస్తాను. అట్టి స్థితి చేకూరేదాకా నాకు అశాంతియే ప్రీతికరం" అని అన్నాను. అతడు బదులు చెబుతూ - "ఇదంతా నిష్ప్రయోజనం. మళ్లీ నేను చెప్పిన మాటల్ని బాగా ఆలోచించు." అని అన్నాడు. పాపం అతడు బుద్ధిపూర్వకంగా పాపాల్ని అనుష్ఠించాడు. అంతటితో ఆగక వాటివల్ల తన మనస్సునకేమీ చింత లేదని మరీ మరీ చెప్పాడు.

ఇట్టి సిద్ధాంతాలు క్రైస్తవులందరికీ సమ్మతం కాదని వీరితో పరిచయం కాక పూర్వం నుండే నాకు తెలుసు. కోట్సు పాపభీరుడు. నిర్మలుడు. సాధనచే హృదయం శుద్ధమగునని అతని నమ్మకం. ఆ కుమారికల నమ్మకం కూడా అదే. నేను చదివిన గ్రంథాల్లో కొన్ని భక్తిపరమైనవి. ప్లీమత్ సోదరుని ప్రసంగం వల్ల నా బుద్ధి ఎలా మారునోయని కోట్సు భయపడ్డాడు. కాని అట్టి భయానికి అవకాశం లేదనీ, అతడేదో

అన్నాడని ఏసు మతం మీద నాకు ఈర్ష్యాద్వేషాలు కలుగవని నచ్చచెప్పాను. నాకు గల తపన బైబిలును గురించియే, దాని తత్వార్థాన్ని గురించియే.

## 12. భారతీయులతో పరిచయం

క్రైస్తవులను గురించి వ్రాసే పూర్వం అప్పటి నా యితర అనుభవాల్ని గురించి కూడా కొంచెం వివరిస్తాను.

నేపాలు రాష్ట్రంలో దాదా అబ్దుల్లా గారెంతో ప్రిటోరియాలో సేర్ తైయబ్ హాజీ ఖాన్‌గారంత. అందరికీ ఉపయోగపడే ఏ ధర్మ కార్యమైనా ఆయన లేకుండా జరుగదు. నేను అక్కడికి వెళ్లిన మొదటి వారంలోనే వారిని పరిచయం చేసుకున్నాను. "నాకు ప్రిటోరియా యందలి భారతీయులందరితోను పరిచయం పెంచుకోవాలని వున్నది యిక్కడి హిందూదేశస్థుల ఆనుపానులు నాకు తెలుసుకోవాలని వుంది. అందుకు మీ సాయం కావాలి." అని నేను అనగానే అన్ని విధాల సహకరిస్తానని మాట యిచ్చాడు

భారతీయులందరినీ ఒకచోట సమావేశపరిచి వారి స్థితిగతులు వారికి అవగతం చేయడం అవసరమని నాకు తోచింది. సేర్ హాజీ మహమ్మద్ అను వారి పేరట కూడా నా దగ్గర పరిచయ పత్రం వున్నది. సభను సేర్‌గారి ఇంట్లో ఏర్పాటు చేశాం సభికులంతా మేమన్ వర్తకులు. హిందువుల సంఖ్య బహు స్వల్పం ప్రిటోరియాలో స్థాయి గల హిందువులు మాత్రం వచ్చారు.

నా జీవితంలో యిదే మొదటి ఉపన్యాసం. ఆ ఉపన్యాసం కోసం నేను చాలా కష్టపడ్డాను ఉపన్యాసంలోని విషయం సత్యం. కాని వాణిజ్యంలో సత్యం నడవదు. అసంభవం అని కొందరు వర్తకులు నాతో వాదించారు. నేను అప్పుడు వారి వాదాన్ని విశ్వసించలేదు యిప్పుడూ విశ్వసించలేదు. సత్యం, వ్యాపారం రెంటికీ పొంతన కుదరదు. అనే వర్తకులు యిప్పటికీ వున్నారు. వ్యవహారం వేరు, ధర్మం వేరు యిదీ వారి వాదన. వ్యవహారమందు శుద్ధ సత్యం అశక్యం, యధాశక్తి సత్యమాడటం శక్యం అని వారి అభిప్రాయం. నేను నా ఉపన్యాసంలో యీ విషయాన్ని గురించి కూలంకషంగా చర్చించి వాణిజ్య వేత్తలు రెండింతలు సత్య ప్రవర్తన గలిగి వుండాలని చెప్పాను. స్వదేశంలో కంటే విదేశంలో సత్య నిష్ఠ ఎక్కువగా వుండాలనీ, అందుకు విశేషకారణం వుందనీ, విదేశంలో కొద్దిమంది భారతీయుల అసత్య ప్రవర్తనను చూచి భారతదేశంలో గల కోటాను కోట్ల భారతీయులంతా యిదే రకమని యిక్కడి జనం భావిస్తారనీ, నొక్కి వక్కాణించాను.

నేను తెల్లవారిని ఉదాహరణగా చెప్పి నల్లవారు ఎంత అశుచిగా వుంటారో, ఎంత దుష్టంగా ప్రవర్తిస్తారో వివరించాను. పారశీకులు, క్రైస్తవులు, మరాఠీ, గుజరాతీ, మదరాసీ, పంజాబీ, సింధీ, కచ్ఛీ, సూరతీ మొదలుగా గల భేదాలు మరిచిపొమ్మని ఉద్బోధించాను. ఒక సంఘాన్ని స్థాపించి, భారతీయులు పడుతున్న కష్టాల గురించి అర్జీలు పంపవలసిన అవసరం ఎంతైనా వుందని చెప్పి అట్టి సంఘంలో జీతం తీసుకోకుండా నేను పని చేస్తానని చెప్పి నా ప్రసంగాన్ని ముగించాను. నా ఉపన్యాసం సభను ఆకట్టుకొని ప్రభావితం చేసిందని గ్రహించాను. దానిపై చర్చలు జరిగాయి.

తమ తమ కష్టాల్ని చెప్పడానికి కొందరు ముందుకు వచ్చారు. నాకు కూడా ఉత్సాహం కలిగింది. వారిలో ఇంగ్లీషు వచ్చిన వారు కొద్దిమందే. యీ పరదేశంలో ఇంగ్లీషు రావడం అవసరమనీ, ప్రయోజనకరమనీ వారికి చెప్పాను. పెద్దవారైనా సరే చదువుకోవచ్చునని చెప్పి కొందరి పేర్లు ఉదాహరణగా పేర్కొన్నాను. మీరు ఇంగ్లీషు నేర్చుకొంటామంటే నేను బోధిస్తాను. మీకు తీరిక వున్న సమయం తెలిపితే నేనే స్వయంగా వచ్చి మీకు ఇంగ్లీషు నేర్పుతానని చెప్పాను. కొందరు నేర్చుకునేందుకు ముందుకు వచ్చారు. వారిలో యిద్దరు మహమ్మదీయులు. ఒకరు మంగలి, ఒకరు గుమాస్తా, మూడవ వాడు హిందువు. ఒక చిన్న దుకాణదారు. నేనందరికీ అనుకూలుడనైనాను. బోధన చేయగలిగాను. కాని నా శిష్యుల్లో కొందరు ఏమరుపాటు చూపించారు. కాని నేను మాత్రం ఓర్పుతో వ్యవహరించాను. వారి గృహాలకు వెళ్లాను. కాని వారికి సమయం చిక్కలేదు. ఇంగ్లీషులో పండితులు కావాలని వాళ్లకు కోరిక లేదు. అయినా యిద్దరు మాత్రం ఎనిమిది నెలలకు కొంత తేలారు జమా ఖర్చులు వ్రాయడం, రాతకోతలు నేర్చారు. తన ఖాతాదారులతో కొంచెం ఇంగ్లీషుతో మాట్లాడగలిగితే చాలని మంగలి ఉద్దేశ్యం. వారిలో యిద్దరు ఇంగ్లీషు నేర్చుకొని ధనార్జన చేయసాగారు కూడా.

సభ వల్ల కలిగిన యీ ప్రయోజనం చూచి నాకు సంతోషం కలిగింది. అట్టి సభలు ప్రతి వారమూ ప్రతినెలా జరపాలని నిర్ణయం చేశాం. మొత్తం మీద మేమనుకున్నట్లుగా సభలు జరుగుతూ వున్నాయి. యీ సభలలో ఒకరి అభిప్రాయం మరొకరు తెలుసుకోగలిగేవారు. యీ కారణం వల్ల ప్రిటోరియాలో గల ప్రతి భారతీయునితో నాకు పరిచయం ఏర్పడింది. తెలియని వారంటూ ఎవ్వరూ లేరు. అందువల్ల యిక అక్కడ వున్న బ్రిటిష్ ఏజంటుతో పరిచయం పెంచుకోవాలని భావించాను. వారిని దర్శించాను. ఆయన పేరు జాకోబ్స్ డివెట్. హిందూ దేశస్థులపై

ఆయనకు మంచి అభిప్రాయం వున్నది. కాని అతనికి అక్కడ తగిన పరపతి లేదు. సమయం వచ్చినప్పుడు సాయపడతాను, అవసరం అయినప్పుడు వచ్చి నన్ను కలవమని ఆయన చెప్పాడు.

ఇక రైల్వే వారితో చర్చలు ప్రారంభించాను. మీ నియమాల ప్రకారం హిందువులకు కష్టాలు కలుగకుండ చూడమని వాళ్లను కోరాను. సరియైన వేష భాషలుంటేనే పెద్ద తరగతి టిక్కెట్లు యివ్వబడతాయని రైల్వే వారినుండి సమాధానం వచ్చింది. అయితే వీని వల్ల ప్రయోజనం చేకూరదు. వేష భాషలు సరిగా వున్నాయా లేదా అని నిర్ణయించే అధికారి ఎవరు ? స్టేషను మాస్టరే అట్టి అధికారి. అందువల్ల ప్రయోజనం శూన్యం అని ప్రకటించాను.

హిందువులకు సంబంధించిన కొన్ని పత్రాలు బ్రిటిష్ ఏజంటు చదవమని నాకు యిచ్చాడు. ఇట్టివి కొన్ని తైయబ్జీ గారి దగ్గర కూడా నాకు లభించాయి. ఆరెంజి ఫ్రీస్టేటు నుండి భారతీయులు ఎంత నిర్దయగా వెళ్లగొట్టబడ్డారో ఆ కాగితాలు చదవడం వల్ల నాకు తెలిసింది.

ట్రాన్సువాలు ఫ్రీస్టేటుల్లోని భారతీయుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులు సమస్తం నాకు బోధపడ్డాయి. వీటిని చదవడం వల్ల భవిష్యత్తులో ఎంతో ప్రయోజనం కలుగుతుందని అప్పుడు నేను ఊహించలేదు.

ఆ ఏడు గడిచిన తరువాత, దావా వ్యవహారం తేలిపోగానే ఇంటికి వెళ్లాలని నా భావన. కాని దైవేచ్ఛ వేరుగా వుంది.

## 13. కూలి వృత్తి

ట్రాన్సువాలు ఆరెంజి ఫ్రీస్టేటులోని భారతీయుల స్థితిగతులను గూర్చి పూర్తిగా వ్రాయడానికిది తావు కాదు. తెలుసుకోదలచినవారు దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ చరిత్ర చదవడం మంచిది. ఆరెంజి ఫ్రీస్టేటుయందు 1988వ సంవత్సరంలోనో లేక అంతకు ముందో పుట్టిన ఒక శాసనం వల్ల భారతీయుల స్వాతంత్ర్యమంతా హరించిపోయింది. ఒకవేళ భారతీయులెవరైనా అచ్చట వుండదలిస్తే హోటళ్లలో సేవకులుగానో లేక మరేదైనా బానిస వృత్తియో చేస్తే వుండవలసిందే. పేరుకు మాత్రం కొద్దిగా ముదరా యిచ్చి భారతీయ వ్యాపారస్థుల్ని వెళ్లగొట్టారు. వారు అర్జీలు పెట్టుకున్నారు. ప్రార్థనా పత్రాలు పంపుకున్నారు. కాని వినిపించుకునే నాథుడు లేదు.

1885వ సంవత్సరంలో ఒక కఠిన శాసనం అమలుచేశారు. 1886లో అందులో కొద్దిగా మార్పు చేశారు. ఆ శాసనం ప్రకారం భారతీయులు ట్రాన్సువాలులో ప్రవేశించాలంటే మూడు పౌండ్లు టాక్సు చెల్లించాలి. ప్రత్యేకించిన స్థలాల్లో తప్ప మరెక్కడా వారికి భూములు వుండకూడదు. భూములున్నా వాటిమీద హక్కు ఉండదు. వారికి వోటు హక్కు లేదు. ఆసియా ఖండ వాసుల కోసం యిట్టి శాసనం చేయబడింది. తదితర శ్వేతేతర జాతుల వారి కోసం నిర్మించబడ్డ శాసనాలు కూడా ఆసియా ఖండవాసులపై ప్రయోగించసాగారు. యీ శాసనం ప్రకారం భారతీయులు రోడ్డు మీద నడవకూడదు. రాత్రి తొమ్మిది గంటల తరువాత భారతీయులెవ్వరూ బయటకి పోకూడదు. తిరగకూడదు. భారతీయులపై ఒక్కొక్కప్పుడు యీ శాసనం ప్రయోగించ బడుతూ వుండటం, ఒక్కొక్కప్పుడు ప్రయోగించకుండా వుండటం కూడా కద్దు. యీ పరిస్థితిలో కొందరు భారతీయ మహమ్మదీయులు తాము అరబ్బులమని చెప్పుకొని తప్పించుకునేవారు. భారతీయులకు అనుమతి కావలసివస్తే పోలీసుల దయాధర్మం మీద ఆధారపడవలసిందే.

ఈ శాసనాల్ని చదవవలసిన అవసరం కలిగింది. నేను రాత్రులందు కోట్సుగారితో కలిసి షికారుకు పోతూ వుండేవాణ్ణి. నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి రాత్రి పదిగంటలయ్యేది. పోలీసులు పట్టుకుంటే యిక నాగతి ఏమిటి ? యీ విషయంలో నాకంటే కోట్సుగారే ఎక్కువ విచారపడుతూ వుండేవారు. ఆయన తన దగ్గర పనిచేసే నీగ్రో సేవకులకు పాసు యివ్వగలడు. అది చెల్లుతుంది. కాని నాకు యివ్వలేడు. వాస్తవానికి అతడు సేవచేసే వారికి అనుజ్ఞా పత్రం యివ్వవచ్చు. కాని అది నా విషయంలో చెల్లదు.

అందువల్ల కోట్సుగారో, వారి మిత్రులో నన్ను క్రౌజ్‌గారి దగ్గరకు తీసుకువెళ్లారు ఆయన ప్రభుత్వ వకీలు. మేము సహాధ్యాయులం. ఒకరి ముఖం మరొకరం ఎరుగుదుము. ఒక్క "ఇగ్" కు సంబంధించిన బారిస్టర్లం తొమ్మిది గంటలు దాటితే నాకు పాసు అవసరం అని విని ఆయన బాధపడ్డాడు. నా బాధలో కొంత తానూ పంచుకున్నాడు. నాకు పాసు యివ్వడానికి బదులు ఒక చేఉత్తరం వ్రాసి యిచ్చాడు దానితో నాకు తిరిగేందుకు స్వేచ్ఛ లభించింది. పోలీసుల బెడద తగ్గింది ఆ ఉత్తరం నా దగ్గర వుంచుకున్నాను. అయితే దాని అవసరం కలుగలేదు. ఆ విధంగా అవసరం కలుగకపోవడం కేవలం దైవికమే.

డాక్టర్ క్రౌజు తన యింటికి నన్ను ఆహ్వానించాడు. మాకు స్నేహం కుదిరింది. నేను తరచు వారి యింటికి వెళుతూ వుండేవాణ్ణి. వారి ద్వారా ప్రసిద్ధికెక్కిన వారి

సోదరుని పరిచయం కలిగింది. వారి సోదరుడు జోహాన్స్‌బర్గ్‌లో పబ్లిక్ ప్రాసిక్యూటరు. బోయర్ యుద్ధంలో ఒక ఉద్యోగిని ఖూనీ చేయుటకు కుట్ర పన్నాడని నేరం మోపి ఆయనకు ఏడేండ్ల కారాగార శిక్ష విధించారు. ఆయన పట్టా కూడా రద్దు చేశారు. యుద్ధం ముగిసిన తరువాత ఆయనను విడుదల చేశారు. తిరిగి ఆదరించి ఆయనను కోర్టులో చేర్చుకున్నారు. ఆయన మళ్లీ ప్లీడరు పని చేయసాగారు.

ఈ పరిచయాలు తరువాత ప్రజాసేవ చేయడానికి పూనుకున్నప్పుడు నాకు ఉపయోగపడ్డాయి.

రోడ్డు మీద నడుచుటకు సంబంధించిన శాసనం కూడా ఎంతో యిబ్బంది కలిగించింది. నేనెప్పుడూ ప్రెసిడెంటు వీధికి ఆవలనున్న మైదానానికి షికారుకు పోతూ వుండేవాణ్ణి. యీ వీధిలోనే ప్రెసిడెంట్ క్రూగరు గారి గృహం ఉంది. ఆ గృహం నిరాడంబరంగా వుండేది. దాని చుట్టు తోటగాని, దొడ్డిగాని లేదు. సామాన్య గృహంలా వుండేది. ప్రిటోరియాలో కోటీశ్వరుల యిండ్లు దివ్య భవనాలు. వాటియందు నందనవనాలు అధికంగా వుండేవి. కాని ప్రెసిడెంటుగారు నిరాడంబరులు. ఆ యింటి ముందు పోలీసుల కాపలా వుండటం వల్ల అది రాజ్యాధికారి గృహమని తెలుస్తుంది. నేనెప్పుడూ ఆ పోలీసుల ప్రక్కగా వెళుతూ వుండేవాణ్ణి. అయితే ఆ పోలీసులు ఎప్పుడూ నా జోలికి రాలేదు.

అక్కడ వంతుల ప్రకారం పోలీసులు మారుతూ వుంటారు. ఒకనాడు ఒక పోలీసు నన్ను చూచాడు. కనీసం ముందుగా హెచ్చరిక అయినా చేయకుండా తిన్నగా మీదికి వచ్చి కొట్టి నన్ను నెట్టివేశాడు. నేను నివ్వెరబోయాను. దెబ్బలు తగిలాయి. నేను ఆ పోలీసును ఏమీ అనలేదు. ఇంతలో గుర్రం మీద అటుగా వెళుతున్న కోట్సు దొర అక్కడకు వచ్చి "గాంధీ! నేనంతా చూచాను . నీవు వీనిపై కేసు పెట్టు. నేను సాక్ష్యం యిస్తాను. నీమీద యితడు చెయ్యి చేసుకున్నందుకు విచారిస్తున్నాను" అని అన్నాడు.

"ఇందు విచారించనవసరం లేదు. పాపం ఆ పోలీసు వాడికేమి తెలుసు? అతడికి నల్లవాళ్ళంతా సమానులే. అతడు నామీద చెయ్యి చేసుకున్నట్లే నీగ్రోల మీద కూడా తప్పక చెయ్యి చేసుకుంటాడు. నాకు ఏ అపాయం కలిగినా కోర్టుకు వెళ్లకూడదని నిర్ణయించుకున్నాను. అందువల్ల యితని మీద కేసు పెట్టను" అని అన్నాను.

"నీ పద్ధతి నీదే. ఆలోచించుకో. ఇట్టివాడికి ఒక్క పర్యాయం శాస్తి చేయడం అవసరం" అని కోట్సుగారన్నాడు. ఆ తరువాత ఆయన పోలీసువాణ్ణి కోప్పడ్డాడు.

పోలీసు డచ్చివాడు. వారిద్దరు డచ్చి భాషలో మాట్లాడుకున్నారు. నాకు వారి మాటలు అర్థంకాలేదు. చిట్ట చివరికి ఆ పోలీసు నన్ను క్షమాపణ కోరాడు. కాని అతడు క్షమాపణ కోరనవసరమే లేదు. నేను అతణ్ణి మొదటనే క్షమించి వేశాను.

అటు తరువాత నేనా వీధికి పోలేదు. అయినా మిగతా పోలీసులకు యీ విషయం తెలియదు కదా! వాళ్ల చేతుల్లో నేను దెబ్బలు తినడం ఎందుకు అని భావించి యితర వీధులగుండా షికారుకు పోవడం ప్రారంభించాను.

ఈ విషయమై భారతీయులను గురించి లోతుగా ఆలోచించడం ప్రారంభించాను. ఈ శాసనాన్ని గురించి బ్రిటిష్ ఏజంటుతో మాట్లాడదామనీ, అవకాశం చిక్కితే ఒక దావా వేసి చూద్దామనీ భారతీయులతో చర్చించాను. యీ విధంగా భారతీయుల బాధల్ని గురించి వినడం చదవడమే గాక స్వయంగా కూడా నేను వాటిని అనుభవించాను. ఆత్మగౌరవం నిలుపుకోవాలని భావించే భారతీయులకు దక్షిణ ఆఫ్రికా అనువైన చోటు కాదనే నిర్ణయానికి వచ్చాను. ఈ పరిస్థితిని ఎలా మార్చడం?

అయితే ప్రస్తుతం నా కర్తవ్యం ఏమిటి? దాదా అబ్దుల్లాగారి దావా వ్యవహారం చూడటమేకదా! కనుక అందుకు పూనుకున్నాను.

## 14. దావా వేయుటకు ఏర్పాట్లు

ప్రిటోరియాలో నేను ఒక సంవత్సరం వున్నాను. నా జీవితంలో ఆ సమయం అమూల్యమైనది. ప్రజాసేవ చేయాలనే తలంపు నాకు కలిగింది. అందుకు అక్కడే శక్తి చేకూరింది. నాకు మతం విషయమై ఆసక్తి అక్కడే కలిగింది. ప్లీడరు పనిని గురించి సరియైన జ్ఞానం అక్కడే కలిగింది. క్రొత్త బారిస్టర్లు పాత బారిస్టర్ల దగ్గర నేర్చుకోగలిగినది నేను అక్కడే నేర్చుకున్నాను. ప్లీడరు పనికి కొంచెం పనికి వస్తానని నేను అక్కడే తెలుసుకున్నాను. ప్లీడరు పనికి తాళంచెవి అక్కడే నాకు దొరికింది.

దాదా అబ్దుల్లా గారి దావా చిన్నదికాదు. నలభై వేల పౌండ్లకు, అంటే ఆరు లక్షల రూపాయలకు సంబంధించిన దావా అది. యిది వ్యాపారానికి సంబంధించిన దావా. అందువల్ల లెక్కల చిక్కులు అపరిమితంగా వున్నాయి. ప్రాంశరీ నోట్లకు, నోటు వ్రాసి యిస్తామన్న నోటి మాటలకు కూడా యీ దావాతో సంబంధం వుంది. యీ దావాకు యిదే ఆధారం. ప్రాంశరీ నోట్లు మోసం చేసి వ్రాయించుకోబడ్డాయనీ, వాటికి తగిన ఆధారాలు లేవని ప్రతివాదుల వాదన. మొత్తం మీద దావా పూర్తిగా చిక్కుల మయం.

వాది ప్రతివాదులు సమర్థులైన సొలిసిటర్లను, బారిస్టర్లను ఏర్పాటు చేసుకున్నారు. వారి దగ్గర పని తెలుసుకొనేందుకు నాకు మంచి అవకాశం లభించింది. వాది యొక్క వాదమంతా సిద్ధం చేయడం, సొలిసిటరుకు పరిశీలన కోసం అందజేయడం దావాకు అనుకూలమైన విషయాల్ని వెతకడం నా పని. నేను తయారుచేసిన వివరాలలో సొలిసిటరు ఎంత స్వీకరిస్తున్నాడో, ఎంత త్రోసివేస్తున్నాడో, ఆ సొలిసిటరు తయారుచేసిన వివరాలలో బారిస్టరు ఎంత స్వీకరిస్తున్నాడో తెలుసుకోవడం వల్ల గొప్ప పాఠం నేను నేర్చుకున్నట్లయింది. దావా వేయడం కోసం అవసరమైన శక్తి పెరిగిందని చెప్పవచ్చు.

ఈ దావాలో నాకు అభిరుచి కలిగింది. నేను అందు నిమగ్నమైనాను. సంబంధించిన కాగితాలన్నీ చదివాను. నాక్లయింటు చాలా తెలివిగలవాడు. నామీద అతనికి అపరిమితమైన విశ్వాసం. అందువల్ల నా పని సులువైంది. నేను బుక్‌కీపింగు అంటే ఖాతా లెక్కలకు సంబంధించిన సూక్ష్మాంశాలు కూడా బాగా తెలుసుకున్నాను. అందు గుజరాతీ పత్రాలు ఎక్కువగా వున్నాయి. వాటికి అనువాదకుణ్ణి నేనే. అందువల్ల అనువాదం చేయగల శక్తి కూడా పెరిగింది.

ఈ దావా వ్యవహారంలో పూర్తిగా మునిగిపోయాను. మత సంబంధమైన చర్చలన్నా, ధర్మకార్యాలన్నా నాకు యిష్టం. అయినా అప్పుడు అవి దావా వ్యవహారాల ముందు ప్రధానమైనవిగా తోచలేదు. దావా వ్యవహారమే నాకు ముఖ్యం. అవసరమైనప్పుడల్లా లా చదవడం, కేసును పఠించడం నా పని. వాది ప్రతివాదుల కాగితాలు నా దగ్గర వుండటం వల్ల వారికి కూడా తెలియని విషయాలు కొన్ని నాకు తెలుసునని చెప్పగలను.

కీ.శే. పిన్‌కట్‌గారు చెప్పిన ఒకమాట అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. దక్షిణ ఆఫ్రికాలో గొప్ప బారిస్టరు, కీర్తిశేషులు అయిన లియోనార్డ్ అనువారు దాన్ని సమర్థించారు. "యదార్థాలే, ముప్పాతిక భాగం" అని వారన్నారు. అప్పుడు నాదగ్గర ఒక కేసు వుంది. ఆ కేసులో యదార్థాలననుసరించి న్యాయం మాకు అనుకూలంగా వుంది. కాని 'లా' మాకు వ్యతిరేకంగా వుంది. చివరికి నిరాశపడి నేను లియోనార్డ్ గారి సాయం కోరాను. వారికి కూడా దావా యందలి విషయాలన్నీ అనుకూలంగా వున్నాయని తోచింది. "గాంధీ! నాకు ఒక్క విషయం తోస్తున్నది. కేసులో గల యదార్థ విషయాలను గురించి మనం జాగ్రత్తగా వుందాం. అప్పుడు న్యాయం దానంతట అదే జరుగవచ్చు. యీ

కేసుకు సంబంధించిన విషయాలన్నీ తిరిగి మీరు క్షుణ్ణంగా పరిశీలించండి. అప్పుడు నా దగ్గరకి రండి" అని లియోనార్డ్ అన్నారు. వారి మాట ప్రకారం తిరిగి ఆ కేసంతా నేను నిశితంగా పరిశీలించాను. అది ఎంతో అపూర్వంగా వుంది. అటువంటిదే దక్షిణ ఆఫ్రికా కేసు మరొకటి నా మనస్సులో నాటుకుంది. ఆ విషయం లియోనార్డ్ గారికి తెలియజేశాను. ఇక మనం యీ కేసు గెలవగలం. అయితే బెంచీ మీదకు ఏ జడ్జీ వస్తాడో చూడాలి." అని ఆయన అన్నాడు.

దాదా అబ్దుల్లా కేసులో పని చేస్తున్నప్పుడు యదార్థ విషయాలకు యింత మహత్తు వుంటుందని తెలియదు. యదార్థ విషయం అంటే సత్యమన్నమాట సత్యాన్ని మనం గ్రహించినప్పుడు న్యాయం దానంతట అదే మనకు అనుకూలిస్తుందన్నమాట. మా వాది దావాలో యదార్థ విషయాలు బలవత్తరంగా వున్నాయి. అందువల్ల 'లా' మా వాది పక్షం అయి తీరుతుందని భావించాం.

ఈ కేసును యిలాగే సాగనిస్తే బంధువులు మరియు ఒకే పట్టణంలో నివశిస్తున్న వాది ప్రతివాదులు యిద్దరూ పూర్తిగా నష్టపడిపోతారను విషయం బోధపడింది. చివరికి దావా ఎవరి పక్షం అవుతుందో తెలియదు. కోర్టులో దీన్ని సాగనిస్తే ఎంతకాలం సాగుతుందో కూడా తెలియదు. అందువల్ల ఉభయ పార్టీలకు ప్రయోజనం కలుగదు. కనుక వీలైతే త్వరగా దీన్ని తేల్చి వేసుకోవడం మంచిదని అనిపించింది.

నేను తైయబ్ సేఠ్‌కు వివరమంతా చెప్పి రాజీ పడమనీ, అందుకు మీ వకీలును సంప్రతించమనీ, వాది ప్రతివాదులు ఒక నమ్మకస్తుడగు మధ్యవర్తి చెప్పినట్లు నడుచుకుంటే కేసు తేలికగా పరిష్కారం అవుతుందనీ చెప్పాను. యీ కేసులో నిజానికి వాది ప్రతివాదులిద్దరూ వర్తక ప్రముఖులే. కాని ప్లీడర్ల కోసం వారిరువురు పెడుతున్న ఖర్చును చూస్తే త్వరలోనే వారి ధనం విపరీతంగా ఖర్చయ్యే ప్రమాదం వున్నది. యీ కేసు గొడవలో పడినందున మరో పని చేసుకొనే అవకాశం కూడా వారికి దొరకడం లేదు. దీనితోనే సరిపోతున్నది. మరో వైపున ఒకరిమీద మరొకరికి వైమనస్యం విపరీతంగా పెరిగిపోతూ వుంది. వకీలు వృత్తిని గురించి యోచించిన కొద్దీ నాకు ఆ వృత్తి యెడ ఏవగింపు పెరిగిపోసాగింది. ఒకరి నొకరు ఓడించుకోవడం కోసం లా పాయింట్లు వెతుక్కోవడం లాయర్ల పని. పెట్టిన ఖర్చులన్నీ గెలిచిన వాడికి వస్తాయా

అంటే అదీ లేదు. ఒకరు మరొకరికి ఖర్చు చెల్లించాలంటే దానికి "కోర్టు ఫీజు రెగ్యులేషన్" ప్రకారం ఒక పద్ధతి వుంది. అయితే లాయర్ల కిచ్చే ఫీజు ఆ ప్రకారం లభించే సొమ్ము కంటే ఎంతో అధికం. యీ విషయాలన్నీ మొట్ట మొదటి సారి తెలుసుకున్నాను.

ఇక సహించలేకపోయాను. ఈ దావాను పరిష్కరించడం నా కర్తవ్యమని భావించాను. రాజీ వ్యవహారం ముందుకు సాగిస్తున్నప్పుడు నా ప్రాణాలు పోయినంత పని అయింది. చివరికి తైయబ్ సేర్ రాజీకి అంగీకరించాడు. ఒక మధ్యవర్తి నియమించబడ్డాడు. దావా ఆ మధ్యవర్తి ముందు నడిచింది. దాదా అబ్దుల్లా గెలిచాడు.

అయినా నాకు తృప్తి కలుగలేదు. మధ్యవర్తి తీర్పును దాదా అబ్దుల్లా వెంటనే అమలుబరిస్తే తైయబ్ హాజీఖాన్ మహమ్మద్ అన్ని రూపాయలు ఒక్కసారిగా తెచ్చి కుమ్మరించలేడు. దక్షిణ - ఆఫ్రికాలో నివసిస్తున్న పోరుబందర్ వర్తకుల్లో వ్రాయబడని శాసనం ఒకటి వుంది. దివాళా కంటే చావు మేలు అనేదే ఆ శాసనం. తైయబ్ సేర్‌గారు ఒక్కసారిగా 37వేల పౌండ్లు ఖర్చుల క్రింద చెల్లించలేడు. ఆయన పైసలతో సహా బాకీ తీర్చివేసేందుకు సిద్ధమే. కాని దివాళా తీశాడనే అపవాదు రాకూడదు. ఇందుకు ఒక్కటే ఉపాయం. వాయిదాల మీద సొమ్ము తీసుకొనేందుకు దాదా అబ్దుల్లా ఒప్పుకోవాలి. ఆ ప్రకారం దీర్ఘకాలపు వాయిదాల మీద సొమ్ము పుచ్చుకోవడానికి ఉదారబుద్ధితో దాదా అంగీకరించాడు. రాజీకి ఉభయుల్ని ఒప్పించడానికి పడ్డ శ్రమ కంటే వాయిదాల మీద సొమ్ము చెల్లింపుకు అంగీకరింపచేయడానికి నేను పడ్డ శ్రమ ఆ భగవంతుడికే ఎరుక. అయితే ఇదంతా జరిగాక ఇద్దరూ సంతోషించారు. యిద్దరికీ గౌరవం పెరిగింది. నాకు అపరిమితంగా ఆనందం కలిగింది. వకీలు పని ఏమిటో, దాని సత్యస్వరూపం ఏమిటో అప్పుడు నాకు బోధపడింది. మనిషిలోని గుణాల్ని, వారి సత్పక్షాన్ని తెలుసుకోగలగటం ఎలాగో తెలుసుకోగలిగాను. విడిపోయిన వాది ప్రతివాదుల్ని కలవడమే వకీలు యొక్క పరమ ధర్మమని గ్రహించాను. ఈ సత్యం నాలో బాగా నాటుకుపోయింది. అందువల్ల తరువాత 20 ఏండ్ల బాటు నేను సాగించిన ప్లీడరు వృత్తిలో వందలాది కేసుల్ని కోర్టుకు ఎక్కకుండానే పరిష్కరించగలిగాను. అందువల్ల నాకు నష్టమేమీ కలగలేదు. రాబడిని కోల్పోలేదు. ఆత్మతృప్తి కలిగింది. అంతకంటే యింకేమి కావాలి?

# 15. నేను పడ్డ మథన

క్రైస్తవ మిత్రుల వల్ల నాకు కలిగిన అనుభవాల్ని వివరిస్తాను.

బేకరు గారికి నా భవిష్యత్తును గురించి ఆతురత ఎక్కువైంది. ఆయన నన్ను వెల్లింగ్టన్ పట్టణంలో జరిగిన సభకు తీసుకువెళ్లారు. ప్రొటెస్టెంట్ తెగవారు ధర్మ ప్రబోధానికి, ఆత్మ పరిశుద్ధికి, కొన్ని సంవత్సరాలకు ఒక్కో పర్యాయం అట్టి సమ్మేళనాలు జరుపుతూ వుంటారు. ఇవి ధర్మపునరుద్ధరణకు, ధర్మ పున: ప్రతిష్టకు నిర్దేశింపబడిన సమ్మేళనాలు. దానికి అధ్యక్షుడు రివరెండు ఆండ్రూముర్రే. ఆయన ఆ పట్టణంలో ప్రధాన మతాచార్యుడు. ప్రఖ్యాతి చెందిన వ్యక్తి. ఆ సమ్మేళనంలో జరిగే మతప్రబోధం, అచ్చటికి వచ్చేవారి మహోత్సాహం, దాని పవిత్రత మొదలగు వాటిని చూచి నేను ఏసుమతంలో తప్పక కలిసిపోతానని బేకరుగారు భావించారు.

బేకురుగారికి ప్రార్ధనా బలమే మహాబలం. ప్రార్ధనపై ఆయనకు అమిత విశ్వాసం. హృదయ పూర్తిగా చేయబడే ప్రార్ధనను భగవంతుడు తప్పక వింటాడని ఆయన విశ్వాసం. ఐహిక సంబంధమైన కోరికలు కూడా ప్రార్ధన వల్ల నెరవేరుతాయని నమ్మే బ్రిస్టల్ నివాసి జార్జి ముల్లర్ వంటి వారిని ఆయన ప్రమాణంగా పేర్కొంటారు. ప్రార్ధనా మహిమను గురించి ఆయన చెబుతూ వుంటే నేను తటస్థభావంతో వినేవాణ్ణి. అంతరాత్మ గనుక ప్రబోధిస్తే నేను తప్పక ఏసు మతంలో చేరతాననీ, అట్టి స్థితిలో ప్రపంచమందలి ఏ శక్తీ నన్ను ఆపలేదని బేకరు గారికి చెప్పాను. యీ విధమైన వాగ్దానం చేయుటకు నేను సందేహించలేదు. అప్పటికే నేను అంతరాత్మ ప్రబోధం ప్రకారం నడుచుకోవడం ప్రారంభించాను. అంతరాత్మ చెప్పిన రీతిగా నడుచుకోవడమంటే నాకు ఆనందంగా వుండేది. వాస్తవానికి విరుద్ధాచరణ కష్టదాయకం. దు:ఖప్రదం కూడా.

మేము వెల్లింగ్టన్ పట్టణం వెళ్లాము. నా వంటి నల్లవాడిని వెంటబెట్టుకు వెళ్లడం వలన బేకరు గారికి చాలా కష్టాలు కలిగాయి. దారిలో ఆయనకు ఎన్నో ఇబ్బందులు కలిగాయి. మధ్యలో ఆదివారం వచ్చినందున మా ప్రయాణం ఆగిపోయింది. బేకరు గారు, వారి బృందంలోని వారు ఆదివారం నాడు ప్రయాణం చేయరు. మేము ఒక స్టేషనులో ఆగాము. అక్కడి హోటలు యజమాని వాద ప్రతివాదాలు జరిగిన తరువాత నాకు భోజనం పెట్టేందుకు అంగీకరించాడు. అయితే భోజనశాలలో అందరి సరసన

కూర్చోనిచ్చేందుకు అతడు అంగీకరించలేదు. బేకరుగారు సామాన్యంగా మెత్తబడే రకంకాదు. హోటలుకు వచ్చే అతిధుల హక్కుల్ని గురించి ఆయనను నిలదీశాడు. బేకరు గారికి కలిగిన కష్టం నాకు బోధపడింది. వెల్లింగ్టన్ పట్టణంలో కూడా నేను బేకరుగారితోనే వున్నాను. నా వల్ల తను పడుతున్న కష్టాలు నాకు తెలియకుండా వుంచాలని ఆయన తపన. కాని నాకు అవన్నీ తెలుస్తూనే వున్నాయి.

ఈ సభలో పాల్గొన్న క్రైస్తవులందరూ చాలా శ్రద్ధాళువులు. వారి భక్తి నాకు ఎంతో ఆనందం కలిగించింది. నేను రివరెండు ముర్రే గారి దర్శనం చేసుకున్నాను. అక్కడ చాలామంది నా కోసం భగవంతుణ్ణి ప్రార్థించడం చూచాను. వారి భజనలు కొన్ని మధురాతి మధురంగా ఉన్నాయి.

వెల్లింగ్టన్‌లో సభ మూడు రోజులపాటు జరిగింది. అచ్చటికి వచ్చిన వారి మతవిశ్వాసం నేను బాగా గమనించాను. కాని అంతమాత్రాన నా మత విశ్వాసాన్ని నేనెందుకు పరిత్యజించాలి? ఏసు మతంలో కలియకపోతే స్వర్గం గాని, ముక్తిగాని కలుగవు అని అనడం, దాన్ని నమ్మడం సరికాదు. క్రైస్తవ మిత్రులకు నేనీ విషయం చెప్పేసరికి వారి ప్రాణాలు ఎగిరిపోయినంత పని అయింది. కాని అందుకు నేనేం చేయగలను?

నా కష్టాలు యింకా పెరిగాయి. జీససు దేవుని ఏకైక పుత్రుడని అనడం, వారిని నమ్మిన వారికే అమృతత్వం కలుగుతుందని అనడం నా విశ్వాసానికి మించిన మాటలు. నిజానికి దేవునికి పుత్రులే గనుక వుంటే మనమంతా ఆయనకు పుత్రులమే గదా! జీససు భగవత్సముడు గాని లేక సాక్షాత్తు భగవంతుడే అయితే మనమంతా భగవత్సములమే లేక భగవంతులమే కదా! జీససు తన మృతిచేత, మరియు తన రక్తము చేత జగత్తు నందలి పాపాల్ని కడిగివేశాడను వాక్యాల అర్థం నాకు బోధపడలేదు. వ్యంగ్యార్థం కొంత సత్యం కావచ్చును. క్రైస్తవ మత ప్రకారం మనుష్యునికే ఆత్మ వుంటుంది. జంతువులు మొదలుగా గల వాటికి ఆత్మ వుండదు. వాటికి చావుతో సరి. యీ విషయం నాకు నచ్చలేదు.

జీససు త్యాగి. మహాత్ముడు, మహాగురువు. అంగీకరిస్తాను. కాని అతడొక అద్వితీయ పురుషుడు కాడు. సిలువపై ఆయన ప్రపంచానికి ఒక మహా దృష్టాంతం. కాని ఆయన మృతి యందు ఏదో రహస్యం లేక చమత్కారం లేక ప్రభావం వున్నదని చెబితే నా హృదయం అంగీకరించదు. ఇతరులీయజాలని ఏ మహాప్రసాదము

క్రైస్తవుల పవిత్ర జీవితాలు నాకు ప్రసాదించలేదు. ఇతర ధర్మాలలో కూడా నాకు క్రైస్తవ సంస్కారాలు కనబడ్డాయి. సిద్ధాంత దృష్టితో పరిశీలిస్తే ఏసు సిద్ధాంతాలలో అలౌకికత నాకు కనబడలేదు. త్యాగంలో హిందువులు క్రైస్తవులను ఎన్నో రెట్లు మించిపోతారని నాకు విశ్వాసం కలిగింది. క్రైస్తవ మతమే సంపూర్ణమని ఇతర మతాల కంటే శ్రేష్ఠమైనదని నాకు నమ్మకం కలుగలేదు.

సమయం దొరికినప్పుడల్లా క్రైస్తవ మిత్రులకు నా హృదయంలో సాగిన యీ మధనను గురించి వివరించాను. వారిచ్చిన సమాధానాలు నాకు సంతోషం కలిగించలేదు.

ఈ విధంగా క్రైస్తవ మతం శ్రేష్ఠమైనదని కూడా నాకు నమ్మకం కలగలేదు. హిందూమత మందలి దోషాలు నా కండ్లకు కనబడసాగాయి. అస్పృశ్యత హిందూమతంలో ఒక భాగమైతే, అది జీర్ణమై పోయిన భాగం లేక అత్యాధునిక దురాచారం. ఇన్ని వర్ణాలు, ఇన్ని శాఖలు ఎందుకోనాకు బోధపడలేదు. వేదాలు అపౌరుషేయాలు అయితే బైబిలు, ఖురానులు అపౌరుషేయాలుకావా ?

క్రైస్తవ మిత్రులు నన్ను ఏసు మతంలో కలపాలని ఎలా ప్రయత్నించారో, అలాగే మహమ్మదీయులు తమ మతంలో కలుపుకునేందుకు ప్రయత్నించారు. అబ్దుల్లా సేర్ మాటిమాటికీ ఇస్లాం మత గ్రంధాలు చదవమని మరిమరీ చెబుతూ వుండేవాడు. ఆయన ఎప్పుడూ ఇస్లాం మత ప్రాశస్త్యాన్ని గురించి చెబుతూ వుండేవాడు.

ఈ విషయాలన్నీ కవిరాయచంద్ భాయీకి జాబు ద్వారా తెలియజేశాను భారత దేశమందున్న యితర విద్వాంసులకు కూడా జాబులు వ్రాశాను. సమాధానాలు కూడా చాలా వచ్చాయి. రాయచంద్‌భాయి వ్రాసిన జాబు నాకు కొంత సంతృప్తిని కలిగించింది. "ఇంకా లోతుగా హిందూమతాన్ని తెలుసుకో" అని రాయచంద్ వ్రాశారు. "పక్షపాతం మాని పరిశీలిస్తే హిందూమత సిద్ధాంతాల యందున్న సూక్ష్మత, గాంభీర్యం, ఆత్మ వివేకం, దయ, ధర్మ నిర్ణయం వంటి విశేషాలు ఇతర మతాల్లో కనబడవు" అని కూడా ఆయన వ్రాశారు.

సెల్‌గారి 'ఖురాను' అనువాదం చదివాను. మరికొన్ని ఇస్లాం మత గ్రంథాలు కూడా సంపాదించాను. ఇంగ్లాండు నందలి క్రైస్తవ మిత్రులకు ఉత్తరాలు వ్రాయసాగాను. ఆ మిత్రులలో ఒకరు నాకు ఎడ్వర్డు మెయిట్లండుగారిని పరిచయం చేశారు. వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించాను. అన్నా కింగ్స్‌ఫోర్డు గారును, తానును కలిసి

వ్రాసిన " ది పర్‌ఫెక్ట్ వే" అను గ్రంథం ఆయన నాకు పంపించారు. ఇప్పుడు ప్రచారంలో వున్న క్రైస్తవ మత ఖండన ఆ గ్రంథంలో వుంది. మెయిట్లండు గారు 'ది న్యూ ఇంటర్ ప్రెటేషన్ ఆఫ్ బైబిల్'అను గ్రంథం హిందూమత విధానంలో వుంది. టాల్‌స్టాయి గారి "ది కింగ్‌డమ్ ఆఫ్ గాడ్ ఆజ్ విథిన్ యు" అను గ్రంథం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆ గ్రంథం నా మనస్సులో అంకితమై పోయింది. అందలి స్వతంత్ర్య యోచనా విధానం, ప్రౌఢ విధానం, శుద్ధ సత్యం వీటిని బట్టి పరిశీలించి చూస్తే యీ గ్రంథం ఎదుట కోట్సుగారిచ్చిన గ్రంథాలన్నీ దండుగేనని అనిపించింది.

ఆ గ్రంథ పఠనం వల్ల నేను క్రైస్తవ మిత్రులెన్నడును ఊహించని దారిలో పడ్డాను. మెయిట్లండుగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు చాలాకాలం నడిచాయి. శాశ్వతంగా కన్ను మూయనంతవరకు రాయచంద్‌భాయి గారికి నాకు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే ఉన్నాయి. వారు పంపిన గ్రంథాలు చదివాను వాటిలో పంచీకరణం. మణిరత్నమాల, యోగవాసిష్ఠమునందలి "ముముక్షు ప్రకరణం" హరిభద్రసూరి విరచిత "షడ్దర్శన సముచ్చయం" మొదలగు గ్రంథాలు పేర్కొనదగినవి.

నేను నా క్రైస్తవ మిత్రులు ఉహించని దారిని పడినప్పటికీ వారి సాంగత్యం వల్ల నాకు కలిగిన ధర్మ జిజ్ఞాస అధికం. అందుకు నేను వారికి ఋణపడ్డానని చెప్పగలను. వారి పరిచయం నాకు సదా గుర్తుంటుంది. మధురం, పవిత్రం అయిన యిట్టి స్నేహ బంధాలు క్రమంగా పెరుగుతూ వున్నాయే కాని తరగలేదు.

## 16. రేపు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు ?

అబ్దుల్లా సేర్‌గారి కేసు పరిష్కారం అయింది. ఇక నాకు ప్రిటోరియాతో ఏం పని? దర్బనుకు వెళ్లి ఇంటికి ప్రయాణం అవుదామనే ప్రయత్నం ప్రారంభించాను. కాని అబ్దుల్లా సేర్ వీడ్కోలు విందు చేయకుండా నన్ను విడిచి పెడతాడా ? నన్ను గౌరవించేందుకూ ఆయన సిడెన్ హోములో ఒక విందు ఏర్పాడు చేశాడు.

ఆ రోజంతా విందుతో కాలక్షేపం చేయాలని నిర్ణయం. నా దగ్గర కొన్ని వార్తా పత్రికలు వున్నాయి. వాటిని తిరగవేస్తూ కూర్చున్నాను. ఒక పత్రికలో ఒక మూల "ఇండియన్ ఫ్రాంచైజ్" అను శీర్షికతో కొన్ని వాక్యాలు నా కంటబడ్డాయి. నేటాల్ శాసన సభలో సభ్యుల్ని ఎన్నుకొనుటకు భారతీయులకు హక్కు లేకుండా చేసేందుకు ఒక

బిల్లును గురించి చర్చలు సాగుతున్నాయి ఈ కొద్ది వాక్యాలు, ఆ చర్చకు సంబంధించినవే. నాకు ఆ చట్టాన్ని గురించి ఏమీ తెలియదు విందుకు వచ్చిన అతిధులెవ్వరికీ తెలియదు. దాన్ని గురించి అబ్దుల్లా సేర్‌తో ప్రస్తావించాను. "ఈ వ్యవహారాలు మాకేం తెలుస్తాయి ? వ్యాపారానికి సంబంధించినవైతే మాకు తెలుస్తాయి. ఆరెంజి ఫ్రీస్టేటులో మా వ్యాపారమంతా నీట కలసిన విషయం నీకు తెలుసు ఆ విషయమై మేము కొంత కలకలం రేపాము. కాని ఏం లాభం ? చదువురాదు గనుక మేము అసమర్థులం. బజారు ధరలు తెలుసుకోవడానికి మాత్రం మేము పత్రికలు చదువుతాము. చట్టాల గొడవ మాకేం తెలుస్తుంది? ఆ తెల్ల వకీళ్లే మాకు కండ్లు, చెవులూను" అని అబ్దుల్లా సేర్ అన్నాడు. భారతీయ క్రైస్తవులను గురించి వివరంగా అబ్దుల్లా సేర్ చెబుతూ "వారా? వారికి మేమంటే అలుసు. వారంటే నిజానికి మాకూ అలుసే. క్రైస్తవులు కనుక వారు తెల్లవారికి బానిసలు. ఆ తెల్లఫాదరీలు ప్రభుత్వానికి బానిసలు" అని అన్నాడు. వారి మాటలు నా కండ్లు తెరిచాయి. ఈ శాఖ మనకు సంబంధించింది. వారూ మనమూ ఒకటే అని తెలియజేయడం అవసరం అని అనిపించింది ఏసు మతానికి యిదా అర్థం ? వారి మతం మార్చుకున్నంత మాత్రాన భారతీయులు కాక విదేశీయులైపోతారా?

అయితే నేను మన దేశానికి రాబోతూ వున్నాను అందువల్ల నా ఈ అభిప్రాయం వారికి చెప్పలేదు అబ్దుల్లా సేర్‌గారితో "ఈ బిల్లు శాసనం అయితే మనవాళ్ల కష్టాలకు అంతే వుండదు. ఇది భారతీయులకు ప్రధమ ఉచ్చాటన మంత్రం మన ఆత్మగౌరవానికి వేరు పురుగు" అని చెప్పాను. "కావచ్చును. కాని ఫ్రాంచైజుకు మూలం ఏమిటో చెబుతాను మాకు మొదటిదాన్ని గురించి ఏమీ తెలియదు. ఎస్కాంబీగారిని మీరు ఎరుగుదురు కదా! అతడు మనకు పెద్ద వకీలు. ధీరుడు. అతడే మొదట ఈ విషయం మా బుర్రల కెక్కించాడు. అప్పుడు ఏం జరిగిందో తెలుసా ? ఎస్కాంబీ పెద్ద యోధుడుకూడా. అయనకు మరియు వారుద్ ఇంజనీరుకు మధ్య పడేది కాదు. అందువల్ల ఆ ఇంజనీయరు తన వోట్లన్ని పుచ్చుకొని ఎన్నికల్లో ఎక్కడ ఓడిస్తాడో అని ఎస్కాంబీ దిగులు పడ్డాడు. అప్పుడాయన ఆ విషయం మాకు చెప్పాడు. ఆయన ప్రోత్సాహంతో మేమంతా మా పేర్లు ఓటర్ల జాబితాలో చేర్చాము. ఎన్నికల్లో ఎస్కాంబీ గారికిమా ఓట్లు యిచ్చాం. అంతేగాని మా ఓట్లకు మేమే విలువ ఇవ్వడం లేదు. యిది స్పష్టం. అయితే మీ మాటలు మాకు అర్థం అవుతాయి. మీ సలహా ఏమిటో చెప్పండి' అని అబ్దుల్లా సేర్ అన్నాడు.

ఇతర అతిథులంతా మా మాటలు శ్రద్ధగా విన్నారు వారిలో ఒకరు అందుకొని "ఏమండీ! మీరు ఈ స్టీమరుకు బయలుదేరకండి, ఒకటి రెండుమాసాలు యిక్కడే వుండిపోండి. మీరు ఎలా చెబితే అలా చేస్తాం" అని అన్నాడు. "నిజం నిజం! అబ్దుల్లా సేర్! మీరు గాంధీ భాయిని ఆపివేయండి" అని మిగతా వారంతా గట్టిగా అన్నారు.

అబ్దుల్లా సేర్ మంచి అనుభవజ్ఞుడు. "ఇక గాంధీని ఆపగల అధికారం నాకు లేదు. ఇప్పుడు నాకెంత అధికారం వుందో మీకూ అంతే అధికారం వుంది మీరు చెబుతున్నదంతా సత్యం. మనమంతా కలసి వారిని ఆపుదాం. కాని ఆయన బారిస్టరు. వీరి ఫీజు మాటేమిటి?" అని అన్నాడు. ఫీజు మాట ఎత్తేసరికి నాకు మనస్సు చివుక్కుమంది. నేను వెంటనే "సేర్‌గారూ! దీనికి ఫీజుకూ సంబంధం లేదు ప్రజాసేవకు ఫీజా? అసలు నేను వుంటే ప్రజా సేవకుడిగానే వుంటాను వీరందరితో నాకు యిదివరకు పరిచయం లేదు. వీరంతా నాకు సాయం చేస్తారనే నమ్మకం మీకు వుంటే నేను ఒక్కమాసం యిక్కడ వుంటాను. కాని ఒక్కమాట. మీరు నాకేమి యివ్వనవసరం లేదు అయితే మనం చేయదలచుకున్న పనికి కొంత మూలధనం అవసరం. టెలిగ్రాములు పంపాల్సి వస్తుంది అక్కడికి ఇక్కడికీ తిరగవలసివస్తుంది. ఆయా వకీళ్ళతో సంప్రదింపులు జరపవలసి వస్తుంది నాకు మీ "లా" రాదు కనుక కొన్ని 'లా' గ్రంధాలు నాకు కావాలి. అందుకు ధనం అవసరమవుతుంది. యీ పనికి ఒక్క మనిషి సరిపోడు, పలువురి సాయం కావాలి." అని అన్నాను నా మాటలు వారందరినీ ప్రభావితం చేశాయి. "అల్లా దయవల్ల ధనం దానంతట అదే సమకూరుతుంది. జనం కావలసినంత మందిమి వున్నాం మీరు మాత్రం "వుండిపోతాను, అని అనండి. చాలు' ' అని ఒక్కసారిగా అంతా అన్నారు. నాకు వీడ్కోలు యివ్వడానికి వచ్చిన అతిథి బృందం కార్యనిర్వాహక బృందం అయింది. తొందరగా విందు ముగించి ఇళ్ళకు వెళదామని అన్నాను నేను నా మనస్సులో యిక ముందు చేయవలసిన సమరానికి రేఖలు గీచుకున్నాను. వోటరు జాబితాలలో చేరియున్నవారి పేర్లను తెలుసుకున్నాను. మరో నెలరోజులపాటు అక్కడ వుండటానికి నిశ్చయించు కున్నాను.

ఈ విధంగా భగవంతుడు దక్షిణ ఆఫ్రికాలో నా జీవితానికి పునాది వేసి ఆత్మ సన్మాన సంగ్రామానికి నాంది పలికాడు.

# 17. అక్కడే ఉన్నాను

1893వ సంవత్సరంలో హాజీ మహమ్మద్ సేర్ నేటాల్ రాష్ట్రంలో నివసించే భారతీయులలో ప్రముఖుడుగా భావించబడి వారికి నాయకుడుగా ఎన్నుకోబడ్డాడు సంపదలో హాజీ మహమ్మద్ సేర్‌గారికే అంతా ప్రధమ స్థానం యిస్తూ ఉండేవారు. అందువల్ల వారి ఆధిపత్యాన ఒక సభ అబ్దుల్లా సేర్‌గారి ఇంట్లో ఏర్పాటుచేశారు. ఆ సభలో ఫ్రాంచైజు బిల్లును ప్రతిఘటించాలని తీర్మానం చేయబడింది

స్వచ్ఛంద సేవకుల దళం ఏర్పాటు చేయబడింది. నేటాలులో పుట్టి పెరిగిన భారతీయులు, భారతీయులగు క్రైస్తవులలో పిన్నవారినందరినీ యీ సభకు ఆహ్వానించారు. దర్బను కోర్టులో దుబాసీగా వున్న పాల్‌గారు, మిషన్ హైస్కూలు హెడ్‌మాష్టరు సుభాన్ గాడ్‌ఫ్రేగారు కూడా వచ్చి ఆ సభలో పాల్గొన్నారు. ఆ సభకు భారతీయ క్రైస్తవులు ఎక్కువగా వచ్చి పాల్గొనుటకు వీరే కారకులు అయ్యారు వారంతా స్వచ్ఛంద సేవకుల దళంలో చేరారు

ఆ చుట్టుప్రక్కల గల వర్తకులలో చాలామంది స్వచ్ఛంద సేవకుల బృందంలో చేరారు. అట్టివారు చిరస్మరణీయులు. దావూద్ మహమ్మద్, మహమ్మద్ కాసిం, కమర్‌ఉద్దీన్, ఆదంజీమియాఖాన్, ఏ.కొలందవేలు పిళ్ళై, సి.లచ్చీరాం, రంగస్వామి, పడియాచి, ఆమోదజీవ మొదలుగువారు వారిలో ముఖ్యులు. పార్సీ రుస్తుంజీ వుండనే వున్నారు. జోషీ, నరసీరాం మరియు దాదా అబ్దుల్లా కంపెనీ మొదలగు కంపెనీల గుమాస్తాలు స్వయం సేవకులుగా చేరారు. అందరికీ ఉపయోగపడే యిట్టి కార్యక్రమం వారికి క్రొత్త అందువల్ల అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఈ విధంగా సభకు ఆహ్వానింపబడటం, సభలో అంతా వచ్చి పాల్గొనడం, వారికి నూతనానుభవం ఈ మహావిపత్తులో పెద్దలు, పిన్నలు, ధనికులు, పేదలు, సేవ్యులు, సేవకులు, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పారశీకులు, గుజరాతీలు, మద్రాసీలు, సింధీలు మొదలుగాగల భేదాలు, తరతమ భేదాలు అన్నీ తొలగిపోయాయి. అందరూ భారత దేశ బిడ్డలే. అందరూ సేవకులే. "బిల్లు రెండవసారి ప్యాసు అయిందోలేదో మరి కాబోతున్నదో కూడా భారతీయులు తెలుసుకోవడం లేదనీ, యిందువల్ల భారతీయులు వోటుహక్కు అక్కర్లేదని తామే ప్రకటించుకుంటున్నారనీ" నేటాలు అధికారులు ప్రసంగాలు చేయడం ప్రారంభించారు.

నేను సభలో యీ విషయం చెప్పాను. వెంటనే బిల్లు చర్చ ఆపవలసిందని అసెంబ్లీ ప్రెసిడెంటుకు తంతి పంపించాము ప్రధానమంత్రి సర్‌జాన్ రాబిన్సన్ గారికి

కూడా ఇట్టి తంతినే మరొకదాన్ని పంపాము. మరో తంతి అబ్దుల్లా సేర్‌గారి మిత్రుడు ఎస్కాంబీగారికి పంపాము. అసెంబ్లీ ప్రెసిడెంటు మా తంతికి జవాబు పంపుతూ బిల్లుపై చర్చ రెండురోజులు ఆపబడిందని తెలియజేశాడు. అది చూచి మాకందరికీ ఆనందం కలిగింది.

శాసనసభకు పంపవలసిన పిటీషను వెంటనే తయారుచేశాము. దానికి మూడు నకళ్లు అవసరమైనాయి. పత్రికలకు పంపడానికి మరో ప్రతి కావలసి వచ్చింది. ఈ ప్రతులన్నిటిపైన వీలైనన్ని సంతకాలు చేయించాలని నిర్ణయించాం. ఇదంతా ఒక్క రాత్రిలో జరగాలి. ఇంగ్లీషు తెలిసిన స్వయం సేవకులు రాత్రంతా కూర్చొని నకళ్ళు వ్రాయసాగారు. నకళ్ళు వ్రాయడంలో మంచి నేర్పరియగు ఆర్థర్ అను వృద్ధుడు మొదటి పిటీషన్ ప్రతి సిద్ధం చేశాడు. దాన్ని ఒకరు చదువుతూ వుంటే ఒకేసారి అయిదుగురు అయిదు ప్రతులు వ్రాశారు. ఇలా అయిదు ప్రతులు తయారయ్యాయి. ఈ అర్జీ మీద అందరి సంతకాలు చేయించేందుకై చాలామంది తమ స్వంత బండ్లలోను, కిరాయిబండ్లలోను బయలుదేరి వెళ్లారు. త్వరగా యీ పని పూర్తి అయింది. వెంటనే అర్జీలు బట్వాడా చేయబడ్డాయి. పత్రికలలో సాభిప్రాయాలతో సహా అర్జీ ప్రకటించబడింది. శాసన సభలో చర్చ జరిగింది శాసనాన్ని సమర్థిస్తున్న వాళ్లు అర్జీ యందలి విషయాలకు సమాధానాలు యిచ్చారు. అవి కుంటి సమాధానాలు. ఏమి చెబితే ఏం? చివరికి బిల్లు ప్యాసయింది

ఇట్లా జరుగుతుందని మేము ముందే అనుకున్నాం. కాని యీఆందోళన వల్ల భారతీయుల్లో ఒక నూతన జీవం ఆవిర్భవించింది. మనమంతా ఒక్కటే వ్యాపార విషయాలలో కొద్ది హక్కులు సాధించి రాజకీయంగా కూడా కొన్ని హక్కులు సాధించాలనే తహతహ భారతీయుల్లో బయలుదేరింది.

ఆ కాలంలో రిప్పన్‌గారు కాలనీల సెక్రటరీ. ఒక పెద్ద అర్జీ ఆయనకు పంపవలెనని నిర్ణయం గైకొనబడింది. అది అంత తేలికైన పనికాదు. ఒక్క రోజులో జరిగే పని కూడా కాదు. స్వచ్ఛంద సేవకులు మా దళంలో చేర్చుకోబడ్డారు. అందరూ తమకు చేతనైనంత సహాయం చేశారు.

అర్జీని తయారు చేయుటకు నేను చాలా శ్రమ పడవలసి వచ్చింది. అందుకు సంబంధించిన కాగితాలు, పుస్తకాలు పూర్తిగా చదివాను. హిందూ దేశంలో మాకు ఒక విధమైన ఓటు హక్కు వుంది. కనుక నేటాలులో కూడా వోటు హక్కు ఉండితీరాలని నా వాదం. ఈ ఓటు హక్కును ఉపయోగించగల భారతీయుల జనాభా తక్కువేగనుక దాని నివ్వడం తేలికయే అని కూడా నా వాదం. ఈ విషయాన్ని మధ్య బిందువు చేశాను.

పదిహేను రోజుల్లో పదివేల సంతకాలు చేయించాము. ఈ విధంగా జనం చేత సంతకాలు చేయించడం స్వయం సేవకులకు క్రొత్త. వాళ్లు రాష్ట్రమంతట తిరిగి యింతమంది చేత సంతకాలు చేయించడం చిన్న విషయం కాదు "అర్జీలో గల విషయం తెలుసుకోకుండా సంతకం చేయకూడదు" అను నిబంధన మేము పెట్టినందున అర్జీలో గల విషయాన్ని విడమర్చి చెప్పగల స్వయం సేవకులనే యీ కార్యానికి ఎన్నిక చేసి పంపవలసి వచ్చింది. అక్కడ గ్రామాలు దూర దూరాన వున్నాయి. వెళ్లి సంతకాలు చేయించాలంటే ఎంతో శ్రమపడాలి. అట్టి శ్రమకు పూనుకునే స్వయం సేవకులు లభించారు. వారంతా తమకు అప్పగించిన కార్యాన్ని ఉత్సాహంతో పూర్తిచేశారు. ఈ పంక్తులు వ్రాస్తున్నప్పుడు నా కండ్ల ఎదుట దావూద్ మహమ్మద్, సేర్ రుస్తుంజీ, ఆదంజీమియాఖాన్, ఆమోదజీవ మొదలగువారు కనబడుతున్నారు. అందరి కన్న ఎక్కువ సంతకాలు చేయించుకొని వచ్చిన దావూద్ సేర్ రోజంతా సంతకాల కోసం బండిలోనే ప్రయాణం చేశారు. ఇది అమూల్యమైన సేవ. దీనికోసం ఒక్కరు కూడా దమ్మిడీ పుచ్చుకోలేదు. అంతా తమ ఖర్చులు తామే భరించారు. దాదా అబ్దుల్లా గారి గృహం కార్యస్థానమే గాక ధర్మసత్రం కూడా అయింది. నాకు సహకరించిన మిత్రులందరి భోజనం వారి యింట్లోనే. మొత్తం మీద అందరూ ఎన్నో వ్యయప్రయాసలకు వోర్చి కార్యాన్ని సాధించారు.

చివరికి అర్జీ దాఖలు చేశాం. వెయ్యి ప్రతులు ముద్రించి పంచి పెట్టాం. భారత దేశ ప్రజలకు యీ దరఖాస్తు వల్ల నేటాలుతో ప్రథమ పరిచయం కలిగింది. నాకు తెలిసిన పత్రికలకు, ప్రసిద్ధులకు పత్రికా విలేఖరులకు కూడా ఆ అర్జీ ప్రతులు పంపించాను.

టైమ్సు ఆఫ్ ఇండియా పత్రిక భారతీయుల కోరికలను సమర్థిస్తూ సంపాదకీయ వ్యాసం వ్రాసింది. ఇంగ్లాండులో అన్ని తెగల పత్రికలకు నకళ్లు పంపాం. లండన్ టైమ్సు పత్రిక కూడా మా వాదాన్ని సమర్థిస్తూ వ్రాసింది. ఇక బిల్లు మంజూరు కాదని మాకు ఆశ కలిగింది.

నేను నేటాలు నుండి కదలడానికి వీలు లేకపోయింది. భారతీయ మిత్రులంతా మీరు యిక్కడే వుండమని ప్రార్థించారు. నాకు గల కష్టాలు వారికి వివరించి చెప్పాను. ఇతరుల ఖర్చుల మీద ఆధారపడి వుండకూడదని నిర్ణయానికి వచ్చాను. ప్రత్యేకంగా వుండడానికి ఇల్లు అవసరమని భావించాను. మంచి చోట ఒక ఇల్లు తీసుకోవాలని, బారిష్టరు హోదాకు తగినట్లుగా ఇల్లు వుండాలనీ, అప్పుడే నా సంఘానికి గౌరవం

తేగలుగుతాననీ నిర్ణయానికి వచ్చాను. అయితే అట్టి గృహానికి సాలీనా మూడు వందల పౌండ్లు ఖర్చువుతుందని తేలింది అంత రాబడికి అవసరమయ్యే కేసులిచ్చేందుకు హామీ పడితేనే అక్కడ వుంటానని వాళ్లకు తెలియజేశాను. "ప్రజాహిత కార్యాలకు మీరు చెప్పినంత పైకం యిస్తాం అంత సొమ్ము మేము తేలికగా వసూలు చేయగలం. మీ ప్రాక్టీసుకు, దీనికి సంబంధం పెట్టవద్దు." అని వాళ్లు అన్నారు. "అట్లా వీల్లేదు. నేను ప్రజాహిత కార్యాలు నిర్వహిస్తూ అందు నిమిత్తం మీ దగ్గర డబ్బు తీసుకోను. ఇందుకు బారిస్టరు తెలివితేటలు పనిచేయనవసరం లేదు మీ చేత పనిచేయించుతూ, నాకోసం మీదగ్గర డబ్బు తీసుకోవడమా? సార్వజనిక కార్యాలకు జనం దగ్గర చందాలు పుచ్చుకోవలసి వస్తుంది. అట్టి ధర్మ నిధి నుండి నేను జీతం పుచ్చుకుంటూ, మిమ్మల్ని చందాలు ఎలా కోరగలను? అలా చేస్తే చివరికి బండి ఆగిపోతుంది. ధర్మకార్యాలకు సాలుకు మూడు వందల పౌండ్ల కంటే ఎక్కువ కావలసి వస్తుంది" అని చెప్పాను.

"కొంతకాలం నుండి మిమ్మల్ని చూస్తున్నాం. మీ సంగతి మాకు తెలిసింది. కావలసిన దానికంటే ఒక్క కానీ కూడా మీరు ఎక్కువ పుచ్చుకోరు. మేము మిమ్మల్ని యిక్కడ ఆపినప్పుడు మీకు అవసరమయ్యే ధనం యివ్వవద్దా?"

"ప్రేమతోను, ఉత్సాహంతోను మీరు యిలా అంటున్నారు. ఈ ప్రేమ, యీ ఉత్సాహం స్థిరంగా వుంటాయని భావించగలమా? మిత్రుని వలె, సేవకుని వలె కొన్ని సమయాల్లో నేను కఠినంగా వ్యవహరించవలసి వస్తుంది. అప్పుడు మీ ఆదరణకు ఎంతగా పాత్రుడనవగలనో ఆ భగవంతునికే ఎరుక. ధర్మకార్యాలకు మీ దగ్గర భృతి తీసుకోవడం కల్ల. అందువల్ల మీ కోర్టు వ్యవహారాలు నాకు అప్పగించండి చాలు. దీనివల్ల మీకు యిబ్బంది కలుగునని నాకు తెలుసు నేను తెల్ల బారిస్టరును కాను! కోర్టు నన్నెంత వరకు ఆదరిస్తుందో కూడా తెలియదు పైగా లాయరుగా నేను ఎంత వరకు పనికివస్తానో కూడా తెలియదు. నాకు రిటైనర్లు (ఇంకొకరి కేసు పుచ్చుకోకుండా తమకేసుకోసం పని చేయించుకొనుటకు బారిస్టర్లు మొదలగు వారికి ముందుగా యిచ్చే ఫీజు) ఇచ్చినందున మీకు ఇబ్బందులు కలగవచ్చు. అయినా ఆ కొద్ది సొమ్ము కూడ ప్రజా సేవకు ప్రతిఫలమే అవుతుంది." అని అన్నాను.

ఈ చర్చానంతరం 20 మంది వర్తకులు ఒక సంవత్సరం వరకు నాకు రిటైనర్లు యిచ్చేందుకు సిద్ధపడ్డారు. నేటాలు విడిచి వెళ్లేటప్పుడు దాదా అబ్దుల్లా సేఠ్ నాకు కానుకగా కొంత సొమ్ము యివ్వదలిచాడు. ఆ సొమ్ముతో నాకు కావలసిన కుర్చీలు. బెంచీలు మొదలగునవి కొనిపెట్టాడు. ఈ విధంగా నేను నేటాలులో వుండిపోయాను.

# 18. వర్ణద్వేషం

కోర్టు ఒక త్రాసు వంటిది. ఆ త్రాసును సమానంగా ఒక వృద్ధ వనిత పట్టుకుంటుంది. ఆమెకు పక్షపాతం ఉండదు. ఆమె గ్రుడ్డిది కూడా. ఆమెది కుశాగ్రబుద్ధి. బ్రహ్మ ఆమెను గ్రుడ్డిదాన్నిగా చేసినందువల్ల ముఖం చూచి ఆమె ఎవ్వరికీ బొట్టుపెట్టదు. యోగ్యతను బట్టి మాత్రమే బొట్టుపెడుతుంది. కాని నేటాలు నందలి వకీళ్ల సభ అందుకు విరుద్ధంగా ముఖం చూచి బొట్టు పెట్టమని సుప్రీంకోర్టును ఉసి కొల్పింది. కాని కోర్టు మాత్రం ఈ సందర్భంలో తన త్రాసుకు సరిపోవు పనే చేసింది.

సుప్రీం కోర్టులో అడ్వకేటుగా చేరేందుకై అర్జీ పంపాను. బొంబాయి హైకోర్టు వారి అనుజ్ఞా పత్రం నా దగ్గర వున్నది. నేను బొంబాయి హైకోర్టులో ప్రవేశించినప్పుడు నా ఇంగ్లీషు సర్టిఫికెట్టు మూలప్రతి దాఖలు చేయవలసి వచ్చింది. నేటాలు సుప్రీంకోర్టులో ప్రవేశానికి యోగ్యతకు సంబంధించిన రెండు ప్రమాణ పత్రాలు దాఖలు చేయాలి. తెల్లవారి ప్రమాణ పత్రాలకు ఎక్కువ విలువ వుంటుందని భావించాను. అబ్దుల్లా సేఠ్‌గారి ద్వారా పరిచితులు, ప్రసిద్ధులు అయిన ఇద్దరు తెల్లవారి దగ్గర ప్రమాణ పత్రాలు తీసుకొని అర్జీ దాఖలు చేశాను. ఒక వకీలు ద్వారా అర్జీ దాఖలు చేయడం కోర్టు విధి. సామాన్యంగా యీ అర్జీలను అటార్నీ జనరల్ ఫీజు పుచ్చుకోకుండానే దాఖలు చేసుకోవడం పరిపాటి. అబ్దుల్లా సేఠ్‌గారి కంపెనీకి సలహాలిచ్చే ఎస్కాంబిగారే అటార్నీ జనరల్. నేను వారి దర్శనం చేసుకున్నాను. ఆయన సంతోషంతో నా దరఖాస్తును మంజూరుచేశారు.

ఇంతలో హఠాత్తుగా వకీళ్ల సభవారు నాకు నోటీసు పంపారు. నా దరఖాస్తుతో బాటు ఇంగ్లీషు సర్టిఫికెట్ మూలప్రతి జత పరచకపోవడం లోపమని వ్రాశారు అడ్వకేట్లను చేర్చుకొనుటకు నియమావళి తయారుచేసినప్పుడు నల్లవారిని చేర్చుకో వచ్చునా చేర్చుకోకూడదా అని వారు విచారించలేదు. ఇదే వారి వ్యతిరేకతకు ప్రధాన కారణం నేటాలు దేశపు అభివృద్ధికి తెల్లవారే ముఖ్య కారణం. అందువల్ల వకీళ్లలో తెల్లవారి ఆధిక్యతను సంరక్షించడం తమ కర్తవ్యమని వారు భావించారు. నల్లవాళ్లను చేర్చుకుంటే వారి సంఖ్య పెరిగిపోయి తెల్లవారి సంఖ్య తరిగిపోతుందని, తెల్లవారి ఆధిక్యత తగ్గిపోతుందని వారి తపన.

నా అర్జీ మంజూరు కాకుండా చూచేందుకై వాళ్లు ఒక ప్రసిద్ధుడైన వకీలును నియమించారు అతనికి అబ్దుల్లా సేఠ్‌గారి కంపెనీతో సంబంధం వుంది. అందువల్ల

తనను ఒకసారి కలుసుకోమని ఆయన నాకు కబురు పంపాడు. నేను వెళ్లి ఆయనను కలిశాను. ఆయన నిష్కపటంగా నాతో మాట్లాడి నా వృత్తాంతం తెలుసుకున్నాడు. "మీకు వ్యతిరేకంగా నేనేమీ చేయను. మీరు కాలనీలో పుట్టిన రకమేమోనని భయపడ్డాను. మీ అర్జీతో బాటు ఇంగ్లీషు సర్టిఫికెట్టు లేకపోవడం వల్ల నా అనుమానం పెరిగింది. మరింకొకరి సర్టిఫికెట్టు చూపించేవాళ్లు కూడా వుంటారు. మీరు యిక్కడ తెల్ల దొరల దగ్గర ప్రమాణ పత్రాలు తీసుకున్నారు. అవి నాలుక గీచుకోడానికి కూడా పనికిరావు. మీ యోగ్యతను గురించి వారేం ఎరుగుదురు? వారెంత కాలం నుండి మిమ్మల్ని ఎరుగుదురో చెప్పండి" అని ఆయన అడిగాడు.

"ఇక్కడి వాళ్లంతా నాకు క్రొత్తవాళ్లే. ఇచ్చటికి రాక ముందు అబ్దుల్లా సేఠ్‌గారు కూడా నన్నెరుగరు" అని జవాబిచ్చాను.

"అబ్దుల్లా సేఠ్ గారిది మీ ఊరే అని అన్నారుగదా! మీ తండ్రిగారు దివాను గారు గదా! సేఠ్ వారిని బాగా ఎరిగే వుంటారు. కనుక అబ్దుల్లా సేఠ్ గారి నుండి ఒక అఫిడవిటు తీసుకురండి. ఇక మిమ్మల్ని ఏమీ అడగవలసిన పని వుండదు." అని ఆయన అన్నాడు. ఆ మాటలు వినగానే నాకు చాలా కోపం వచ్చింది. కాని కోపాన్ని అణుచుకున్నాను. నేను మొదటగానే అబ్దుల్లా సేఠ్ గారి దగ్గర ప్రమాణ పత్రం తీసుకొని దాఖలు చేసి యుంటే, యిది పనికి రాదు, తెల్లవారి ప్రమాణ పత్రం కావాలని అనేవారు. అయినా నన్ను అడ్వకేటుగా అంగీకరించేందుకు నా పుట్టుపూర్వోత్తరాలతో పనేమిటి? నా తల్లిదండ్రులు చెడువారు కావచ్చు లేక మంచివారు కావచ్చు. వారి మంచిచెడులతో నా అడ్వకేట్ వృత్తికి సంబంధం ఏమిటి? ఈ విధంగా లోలోన మధన పడి యోచనల్ని అదుపులో పెట్టుకొని యిలా అన్నాను. "నా వకీలు వృత్తి కోసం వకీళ్ల సభవారి యిట్టి భావాల్ని నేను అంగీకరించను. అయినా మీరు చెప్పిన ప్రకారం అఫిడివిట్ తప్పక దాఖలు చేస్తాను" అని అన్నాను.

అబ్దుల్లా సేఠ్ గారి దగ్గర అఫిడవిట్ తీసుకొని తెల్ల వకీలుకు అందజేశాను. ఆయన తాను సంతృప్తిపడ్డానని చెప్పాడు కాని వకీళ్ల సభ వాళ్లు తృప్తిపడలేదు. వారు నా దరఖాస్తును వ్యతిరేకించారు. కాని కోర్టు వారు అటార్నీ జనరల్ పని లేకుండానే వకీలు సభవారి ఆక్షేపణల్ని త్రోసిపుచ్చారు. ప్రధాన న్యాయాధీశుడు కల్పించుకొని "అర్జీదారు ఇంగ్లీషు సర్టిఫికెట్టు చూపలేదను ఆక్షేపణ యుక్తిపరమైంది కాదు. అతడు అబద్ధపు సర్టిఫికెట్టు పంపియుంటే అతనిపై నేరం మోపవచ్చు. ఆ నేరం నిజమని రుజువైతే అతని పేరు వకీలు పట్టిక నుండి తొలగించవచ్చు. శాసనాలకు నలుపు

తెలుపు అను భేదం లేదు. కావున గాంధీ గారిని చేర్చుకొనకుండా వుండుటకు కోర్టుకు హక్కు లేదు. అందువల్ల అతని దరఖాస్తును మేము మంజూరు చేస్తున్నాము. గాంధీ గారూ! మీరు ప్రమాణం చేసి అడ్వొకేటుగా చేరండి". అని అన్నాడు. నేను లేచి రిజిస్ట్రారు దగ్గరకు వెళ్లి ప్రమాణం చేశాను. నేను ప్రమాణం చేయగానే ప్రధాన న్యాయాధీశుడు నన్ను సంబోధించి "గాంధీగారూ! మీరు యిక తలపాగా తీసివేయాలి. ప్రాక్టీసు చేయు బారిస్టర్లు కోర్టు వారు నిర్ణయించే వేష నియమాలను పాటించాలి కోర్టు నియమాలకు మీరు లోబడాలి." అని అన్నాడు. నాకు నా మర్యాద తెలుసు. జిల్లా మేజిస్ట్రేటు కోర్టులో పాగా తీసేయమంటే నేను నిరాకరించాను ఇప్పుడు సుప్రీం కోర్టువారి ఆదేశం ప్రకారం పాగా తీసివేశాను. నేను వారి ఆదేశాన్ని నిరాకరించవచ్చు. అట్లా చేయడం సమ్మతం కూడా. కాని నేను చేయాల్సిన పోరాటాలు చాలా వున్నాయి వాటికోసం నా శక్తిని అదుపులో వుంచుకోవాలని భావించాను. తలపాగా తొలగించ కూడదనే పట్టుదల బట్టితే ప్రయోజనం? ఇంతకంటే పెద్ద కార్యాలు నేను ఎన్నో చేయాల్సిన అవసరం వుందికదా !

నేనిట్లా లోబడినందుకు (ఇది లోబడటమా?) అబ్దుల్లా సేఠ్‌గారు, తదితర మిత్రులు ఆక్షేపించారు. కోర్టులో ప్రాక్టీసు చేసేటప్పుడు తలపాగా ధరించాలనే ధైర్యం వహించితే బాగా వుండేదని వారి భావం. వారికి నచ్చ చెప్పాలని ప్రయత్నించాను. "దేశాన్ని బట్టి ఆచారాలు" మారాలని వారికి తెలియజేసేందుకు ప్రయత్నించాను "హిందూ దేశంలో తెల్ల అధికారి తలపాగా తీసివేయమని ఆదేశిస్తే దానికి లోబటడం సిగ్గుచేటు. కాని నేటాలు కోర్టులో ఆ కోర్టు ఆచారాల్ని నియమాల్ని నిరాకరించకూడదు' ' అని చెప్పాను.

నేను చెప్పిన కారణాలు వారికి నచ్చలేదు. అయినా కొద్దిగా శాంతించారు. ఒక విషయాన్ని వివిధ సందర్భాలను బట్టి వివిధ రకాలుగా చూడవలసి వస్తుందన్న సంగతిని వారిచే ఒప్పించలేకపోయాను. నా జీవితమందంతట సత్యము యెడగల పట్టుదలయే రాజీ యొక్క సౌందర్యాన్ని నా చేత ఆస్వాదింప చేయగలిగింది ఈ పద్ధతి సత్యాగ్రహము నందు అనివార్యమని నా తరువాతి జీవితంలో తెలుసుకోగలిగాను. ఆ పద్ధతి నా ప్రాణాలకు ముప్పుగా కూడా పరిణమించేది. అంతేగాక మిత్రుల అసంతోషానికి మూలమయ్యేది. దాన్ని కూడా సహించవలసి వచ్చేది. సత్యం వజ్రం వలె కఠోరం కుసుమం వలె కోమలం గదా!

నేటాలు నందలి వకీళ్ల సభవారి ప్రతిఘటన వల్ల దక్షిణ ఆఫ్రికాలో మరో మారు నా పేరు మారు మ్రోగింది. చాలా పత్రికల వాళ్లు ఆక్షేపణల్ని ఖండించారు. వారి వ్యతిరేకతకు కారణం ఈర్ష్యయే అని ప్రకటించారు. ఈ ప్రసిద్ధి వల్ల నా కార్యక్రమాల్లో కొన్ని అంశాలు సరళమయ్యాయి.

## 19. నేటాలు ఇండియన్ కాంగ్రెస్

న్యాయవాద వృత్తి నిజంగా నాకు అప్రధానం. చివరివరకూ అప్రధానంగానే వుండిపోయింది. నేటాలు రాష్ట్రంలో నా నివాసం సార్థకం కావాలంటే నేను ప్రజాసేవలో లీనం కావాలి. అర్జీలు పంపినంత మాత్రాన ఫ్రాంచైజు పని పూర్తికాదు. ఇల్లలుకగానే పండగ కాదు గదా! ఎప్పుడూ అలజడి జరుపుతూ వుండాలి. అప్పుడు యీ విషయం వలన రాజ్యాల కార్యదర్శికి తెలుస్తుంది. అలా జరగాలంటే అందుకు ఒక శాశ్వతమైన సంస్థ అసవరమని అనిపించింది అబ్దుల్లా సేఠ్ గారితోను, మిగతా మిత్రులతోను సంప్రదించి ఒక శాశ్వత సంస్థను స్థాపించాలని నిర్ణయించుకున్నాను.

ఈ సంస్థకు పేరు ఏమని పెట్టడం ? చాలా ధర్మ సందేహాలు కలిగాయి. అది ఏ పక్షం వైపుకు మొగ్గకూడదు. కాంగ్రెస్ అను పేరు ఇంగ్లాండు నందలి కన్సర్వేటివు పార్టీ వారికి రుచించదని నాకు తెలుసు. కాని హిందూ దేశానికి కాంగ్రెస్ ప్రాణం. నేటాలులో శక్తిని వృద్ధిచేయాలని భావించాను. ఆ పేరుకు భయపడటం పిరికితనం అని తోచింది. ఈ కారణాలన్నీ తెలియజేసి ఈ సంస్థకు ''నేటాలు ఇండియన్ కాంగ్రెస్'' అని పేరు సూచించాను. అంతా అంగీకరించారు. 1894 వ సంవత్సరం మే 22వ తేదీన నేటాలు ఇండియన్ కాంగ్రెస్ ఆవిర్భవించింది.

ఆనాడు విశాలమైన అబ్దుల్లా సేఠ్‌గారి గది క్రిక్కిరిసి పోయింది. సభ్యులంతా కాంగ్రెసుకు స్వాగతం చెప్పారు. కాంగ్రెసు నియమాలు తక్కువే కాని చందా మాత్రం ఎక్కువ. నెలకు అయిదు షిల్లింగులు చెల్లిస్తేనే సభ్యులవుతారు. శక్తివంచన లేకుండా ధనికులు చందాలు యిమ్మని ప్రోత్సహించాము అబ్దుల్లాగారు మొదటి పద్దుగా రెండు పౌండ్ల విరాళం ప్రకటించారు. తరువాత యిద్దరు మిత్రులు అంత పద్దు వేశారు. ''నేను ఏం చేయడమా?'' అని ఆలోచించి ఆ తరువాత ఒక పౌను విరాళం నేను వ్రాశాను. యిది నా శక్తికి మించిన పని. అయితే సంపాదన ప్రారంభమైతే యీ మాత్రం యివ్వగలనని నేను సాహసించాను. ఈశ్వరుడు అందుకు సహకరించాడు.

ఈ విధంగా నెలకు ఒక్క పౌను చొప్పున యిచ్చే సభ్యులు ఎక్కువగా చేరారు. నెలకు పది షిల్లింగుల చొప్పున యిచ్చేవారి సంఖ్య బాగా పెరిగింది. ఇదిగాక విరాళాలు చాలా మంది తమ శక్తిని బట్టి ప్రకటించారు.

ఈ వ్యవహారం చూచాక అడిగినంత ఎవ్వరూ విరాళం యివ్వరని నాకు బోధపడింది. దర్బానుకు ఆవలి ప్రాంతాల్లో వున్న వారిని మాటిమాటికీ చందా అడగటం కష్టం. ఆరంభశూరత్వం ఎలా వుంటుందో కూడా బోధపడింది. దర్బను వాళ్లు ఎన్నిసార్లు తిరిగినా చందాలు యిచ్చేవారు కాదు.

నేను కార్యదర్శిని. అందువల్ల చందాలు పోగుచేసే పని నాది. వసూళ్లకై నాలుగు మాసాలు రోజంతా తిరగవలసి వచ్చేది. ఈ అనుభవం వల్ల నెల చందాలకు బదులు వార్షిక చందాలు, ముందుగానే వసూలు చేసేలా ఏర్పాటుచేయడం మంచిదని భావించాను. అందుకోసం సభ ఏర్పాటు చేశాను. నెలకు బదులు ఏడాదికి ఒక్కసారి చందా వసూలుచేయాలని, మూడు పౌండ్లు కనీసపు పద్దుగా వుండాలని అంతా నిర్ణయించారు. ఈ విధంగా నిర్ణయించినందున చందాల వసూలు పని సులభమైపోయింది.

అప్పు తెచ్చి ప్రజల కార్యాలు చేయకూడదని మొదటి నుండి నా అభిప్రాయం డబ్బు తప్ప మిగతా ఏ విషయాల్ని గురించి, ఏ వాగ్దానాలనైనా అంగీకరించవచ్చునని అనుభవం మీద తెలిసింది. వాగ్దానం చేసిన వాళ్లు తిరిగి దాన్ని అదేవిధంగా బాధ్యతగా నెరవేర్చడం తక్కువ. నేటాలు భారతీయులు కూడా అంతే. డబ్బు చూచుకొని గాని కార్యక్రమాలకు నేను పూనుకోలేదు. అందువల్ల నేటాల్ కాంగ్రెస్ అప్పులపాలు కాలేదు.

నా సహచరులు క్రొత్త సభ్యుల్ని చేర్చాలని ఉత్సాహపడ్డారు. దానితో వారికి కూడా చాలా అనుభవాలు కలిగాయి. చాలామంది సంతోషంతో ధనం యివ్వడం ప్రారంభించారు. దూర ప్రదేశాలకు గ్రామాలకు ఉద్యమాన్ని వ్యాప్తం చేయడం కష్టమైపోయింది. ప్రజా సేవ అంటే ఏమిటో అక్కడి వాళ్లకు ముందు తెలియదు చాలామంది ధనికులు మమ్మల్ని పిలిచి విరాళాలు యివ్వడం ప్రారంభించారు.

ఈ యాత్రలో ఒకసారి పెద్ద కష్టం ముంచుకు వచ్చింది. ఒక దాత ఆరు పౌండ్లు యిస్తాడని అనుకున్నాం. కాని అతడు మూడు పౌండ్లు కంటే మించి యివ్వనని భీష్మించాడు. మేము ఆ కొద్ది సొమ్ము ఆయన దగ్గర తీసుకుంటే మిగతా వారంతా అంతే యిస్తారు. అందువల్ల సొమ్ము ఎక్కువ వసూలు కాదు. ఆ రోజు రాత్రి

ప్రొద్దుపోయింది. మాకందరికీ బాగా ఆకలివేస్తూ వున్నది. అనుకున్న మొత్తం రానిదే భోజనం ఎలా చేయడం? ఎంత బ్రతిమిలాడినా ప్రయోజనం కలగలేదు. దాత పట్టిన పట్టు విడవలేదు. పట్టణంలో వుండే వర్తకులంతా చెప్పి చూచారు. మేమంతా రాత్రంతా ఆయనతో గడిపాము. అయినా ఆయన లొంగలేదు. మేము కూడా మెత్తబడలేదు. నా సహచరులలో చాలామందికి కోపం వచ్చింది. అయినా సౌజన్యాన్ని వదలలేదు. తూర్పున ఉషోదయ కిరణాలు తొంగి చూడసాగాయి. అప్పుడు ఆయన ఆరు పౌండ్లు యిచ్చాడు. మాకందరికీ విందు కూడా చేశాడు. ఇది టోంగాటా పట్టణంలో జరిగిన ఘట్టం. అయితే ఈ వార్త ఉత్తర దిక్కున గల స్టేంగర్ పట్టణం మొదలుకొని దేశం మధ్యన చార్లెస్ టౌను వరకు ప్రతిధ్వనించింది. దీని వల్ల చందా వసూళ్ల పని మాకు తేలిక అయింది.

కాని మా పని ధనం వసూలు చేయడమేకాదు. అవసరాన్ని మించి ధనం మన దగ్గర వుంచవద్దని నేను నా సహచరులందరికీ ముందే చెప్పి వుంచాను. అవసరాన్ని బట్టి వారానికి ఒకసారి, నెలకొకసారి సభలు జరుపుతూ వచ్చాం. ప్రతి సభలోను వెనుక జరిగిన కార్యక్రమ వివరమంతా చెప్పడం జరుగుతూ వుండేది. ఇట్టి చర్చల్లో డొంక తిరుగుడు లేకుండా మాట్లాడటం అక్కడి వారికి తెలియదు. సభల్లో ప్రసగించడానికి అంతా సంకోచించసాగారు. అయితే మాట్లాడవలసిన తీరు, చర్చల సరళి గురించి వారికి వివరిస్తూ వుండేవాణ్ణి. వారు ఆ ప్రకారం ప్రసంగించడం ప్రారంభించారు. వారు ఉపన్యసించడం ఒక విద్య అని తెలుసుకున్నారు. ఉపన్యాసం అంటే ఏమిటో తెలియని వారు కూడా ఆలోచించి ఉపన్యసించసాగారు.

ప్రజల కార్యక్రమాల్లో చిల్లర ఖర్చులు మితిమీరి పోవడం నేనెరుగుదును. మొదట రసీదు పుస్తకాలు అచ్చు వేయవద్దనుకున్నాను. నా దగ్గర సైక్లోస్టయిలు మిషను వుంది. దానిమీద రశీదుల, రిపోర్టుల ప్రతులు తీయించసాగాను. కాంగ్రెస్‌లో డబ్బు ఎక్కువగా వుండి, సభ్యుల సంఖ్య అధికమైనప్పుడు మాత్రమే యిట్టి వాటిని అచ్చు వేయించేవాణ్ణి. పొదుపు చేయాలను తలంపే అందుకు కారణం. అయినా చాలా చోట్ల యిలా జరగలేదు. సంస్థ చిన్నదైనా పెద్దదైనా అందరికీ యీ విషయాలు తెలియాలనే తలంపుతో వివరంగా యిక్కడ వ్రాశాను.

జనం డబ్బు యిచ్చి రసీదులడిగే వారు కారు. కాని మేము మాత్రం రసీదులివ్వడం అవసరమని భావించాం. ఆవిధంగా ప్రతి దమ్మిడీకి రసీదులు యిచ్చాం. పైసపైసకు

లెక్క వ్రాస్తూ వున్నాం. ఆ విధంగా వ్యవహరించడం వల్ల యీనాడు పరీక్షించి చూచినా 1894 నాటి నేటాలు ఇండియన్ కాంగ్రెస్ లెక్కలు కరెక్టుగా వుంటాయి. ఆ విషయం యీ నాటికీ గట్టిగా నొక్కి వక్కాణించగలను. ఏ సంఘానికైనా తప్పులు లేని లెక్కలే ప్రాణం. లెక్కలు సరిగా లేకపోతే సంఘానికి పెద్ద అపకీర్తి వస్తుంది. లెక్కల్ని సరిగాను శుద్ధంగాను ఉంచకపోతే సత్యాన్ని సరిగాను, శుద్ధంగాను రక్షించలేము.

ఆ దేశంలో పుట్టి పెరిగి విద్యావంతులైన భారతీయులకు సేవ చేయడం ఈ కాంగ్రెస్ యొక్క రెండవ పని. అందుకోసం "కలోనియల్ బారన్ ఇండియన్ ఎడ్యుకేషనల్ అసోసియేషన్" అను ఒక సంఘాన్ని స్థాపించాము ఇందలి సభ్యులంతా విద్యాధికులైన పిన్నవారే. వారు కొద్దిగా చందాలు యిస్తూ వుండేవారు. వారి కష్టాల్ని ప్రజలకు చెప్పడం, వారి తెలివి తేటల్ని పైకి తీయడం వారికి హిందూ దేశపు వర్తకులకు సత్సంబంధం కల్పించడం, వారికి సేవచేసే విధానం తెలపడం, ఇవీ ఈ సంఘం పని. ఇది ఒక విధంగా చర్చలు జరుపు సమితి అన్నమాట. అందలి సభ్యులు అనేక విషయాలపై తప్పనిసరిగా చర్చలు చేస్తూ వుండేవారు. ఈ సంఘం కోసం చిన్న గ్రంధాలయం కూడా ఏర్పాటు చేశాం.

ప్రచారం చేయడం కాంగ్రెస్ మూడో పని. దక్షిణ ఆఫ్రికాలోను, ఇంగ్లాండులోను ఉన్న ఆంగ్లేయులకు, భారతీయులకు నేటాలులో జరుగుతున్న వాస్తవ పరిస్థితులు తెలుపడం అవసరం. ఈ దృష్టితో రెండు కర పత్రాలు తయారుచేశాను. "దక్షిణ ఆఫ్రికాలోని బ్రిటీష్ వారికి ఒక విన్నపం" (An appeal the every Briton in South Africa) అను కరపత్రం ఒకటి. యిందు నేటాలు నందలి భారతీయుల స్థితిగతుల్ని గురించి సవివరంగా వ్రాశాను. "భారతీయుల ఓటు హక్కును గురించి ఒక విన్నపం" The Indian Franchise An Appeal అనునది రెండో కరపత్రం. ఇందు భారతీయుల ఓటు హక్కును గురించి కూలంకషంగా వివరించి వ్రాశాను. ఈ రెండు కర పత్రాలు తయారుచేయటానికి నేను ఎంతో శ్రమించాను. అంత శ్రమ పడినందుకు ఫలితం ఊహించనంతగా లభించడం గొప్ప విశేషం. వాటికి ఎంతో ప్రచారం లభించింది.

ఈ అలజడి వల్ల దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు నాకు మంచి మిత్రులైనారు. ఇంగ్లాండునందు, హిందూ దేశమునందును గల అన్ని పార్టీల వారి ఆదరము మాకు లభించింది. ఇక ముందు చేయాల్సిన పనికి రాజమార్గం ఏర్పడింది.

# 20. బాలసుందరం

'యాదృశీ భావనీ యత్ర సిద్ధిర్భవతితాదృశీ" (ఎవరికిఎటువంటి తలంపు కలుగునో అతనికి అటువంటి ఫలం కలుగును) అనునది అనేక విషయాలలో నాకు అనుభవం అయింది. పేదలకు సాయపడటం నాకు ఎంతో యిష్టం. ఆ అభిలాష నన్ను ఆ పేదలతో కలిపి వాళ్లతో మంచి సంబంధం కలిగించింది.

నేటాలు కాంగ్రెస్‌లో అక్కడి భారతీయులు, ఉద్యోగులు సభ్యులుగా చేరారు. కాని గిరిమిటియాలు మాత్రం అందు చేరలేదు. "కాంగ్రెస్ యింకావారి పరం కాలేదు. వాళ్లు చందాలు చెల్లించి మెంబర్లుగా చేరలేదు. మరి కాంగ్రెసు అట్టి వాళ్లకు సాయం చేయాలి! అప్పుడు వాళ్లంతా దాంట్లో తప్పక చేరతారు" అని అనుకుంటూ వుండగా ఒక ఘట్టం అనుకోకుండా ఒక పర్యాయం జరిగింది. ఆ ఘట్టం అప్పుడే జరుగుతుందని నేను గాని, కాంగ్రెస్ వాళ్లు గాని ఎవ్వరం ఊహించలేదు. నేను ప్లీడరు వృత్తి చేపట్టి అప్పటికి మూడు నాలుగు నెలల కాలం గడిచింది. అప్పటికి కాంగ్రెసుకు యింకా శైశవం తీరలేదు. ఒకనాడు ఒక తమిళుడు తలగుడ్డ తీసి చేతబుచ్చుకొని ఏడుస్తూ వచ్చి నా ముందు నిలబడ్డాడు. అతడు చినిగిపోయిన బట్టలు ధరించి యున్నాడు. అతని శరీరం వణుకుతున్నది. ఎదటి రెండు పళ్లు ఊడిపోయాయి. ఆ పళ్ల చిగుళ్ల నుండి రక్తం కారుతున్నది. యజమాని అతణ్ణి చావబాదాడన్నమాట. నా గుమాస్తా తమిళుడు. అతని ద్వారా ఆ వచ్చిన వ్యక్తి కథంతా తెలుసుకున్నాను. అతని పేరు బాలసుందరం. దర్బులులో ప్రసిద్ధుడైన ఒక తెల్ల యజమాని దగ్గర యితడు ఇండెంచెర్డు కూలి అన్నమాట. యజమానికి ఏదో మాట మీద కోపం వచ్చింది. ఒళ్లు తెలియకుండా బాలసుందరాన్ని బాదాడు. ఆ దెబ్బలకు బాలసుందరం ఎదుటి రెండు పళ్లు ఊడిపోయాయి.

బాలసుందరాన్ని వెంటనే డాక్టరు దగ్గరకు పంపించాను. అప్పుడక్కడ తెల్ల డాక్టరు వున్నారు. బాలసుందరానికి తగిలిన దెబ్బల్ని గురించి డాక్టరు సర్టిఫికెట్టు తీసుకొని మేజిస్ట్రేటు వద్ద అఫిడవిట్టు దాఖలు చేయించాను. మేజిస్ట్రేటు అఫిడవిట్టు చదివి కోపంతో వెంటనే ఆ యజమానికి సమన్లు పంపించాడు.

యజమానికి శిక్ష వేయించడం నా లక్ష్యం కాదు. ఎలాగైనా బాలసుందరాన్ని ఆ యజమాని బారినుండి తప్పించాలన్నదే నా లక్ష్యం. ఇండించెర్డ కూలీలను గురించి చట్టమంతా క్షుణంగా చదివాను. ఏ కూలివాడైనా చెప్పకుండా లేచి వెళ్లిపోతే యజమాని

సివిల్ కోర్టులో దావా వేయవచ్చు. ఇండించెర్డు కూలివాడు అలా లేచి వెళ్లిపోతే యజమాని పూర్తిగా మరో చర్య గైకొనవచ్చు. వానిమీద క్రిమినల్ కేసు పెట్టవచ్చు. నేరం రుజూ అయితే కూలీకి శిక్ష కూడా పడవచ్చు. సర్ విలియం హంటరుగారు "ఇండించెర్డు కూలిపని, బానిసత్వం ఒక్కటే" అని అన్నారు. యజమానికి బానిస ఏవిధంగా ఆస్థిగా పరిగణింపబడతాడో అదే విధంగా ఇండించెర్డు కూలివాడు కూడా యజమాని ఆస్థిగా పరిగణింపబడతాడని దాని అర్థం.

బాలసుందరం విడుదలకు రెండే రెండు మార్గాలు వున్నాయి. ఇండెంచెర్డు కూలివాళ్ళకు ప్రొటెక్టరు అనగా రక్షకుడు ఒకడు వుంటాడు. అతనితో చెప్పి కట్టడినుండి తప్పించవచ్చు. లేదా మరొక యజమాని దగ్గరకు బదలీ చేయించవచ్చు. ఒప్పుదల మీద బాలసుందరాన్ని యజమాని చేతనే విడుదల చేయించవచ్చు. ఇదంతా ఆలోచించి ఆ యజమానితో "మీ మీద నేరం మోపి మిమ్ము శిక్షింపచేయడం నా లక్ష్యం కాదు. మీరు అతణ్ణి క్రూరంగా కొట్టారు. మీరు ఆ విషయం గ్రహించేయుండవచ్చు. మీరు కరారునామాను మరొకరికి మార్చండి చాలు" అని అన్నాను.

నా మాటలు వినిన వెంటనే అతడు అందుకు అంగీకరించాడు. తరువాత నేను ప్రొటెక్టరును చూచాను. అతడు కూడా అంగీకరించాడు. కాని క్రొత్త యజమాని కావాలి కదా!

ఒక తెల్ల యజమాని కోసం వెతికాము. అప్పుడు భారతీయులు ఇండెంచెర్డు కూలీలను భరించే స్థితిలో లేరు. అప్పటికి నాకు కొద్దిమంది తెల్లవారితో పరిచయం ఏర్పడింది. ఒకరికి యీ సంగతి తెలియజేశాను. అతడు దయతో ఒప్పుకున్నాడు. నేనాతనికి కృతజ్ఞతలు తెలియజేశాను. మేజిస్ట్రేటు బాలసుందరం అను కూలీ తన యజమానిపై నేరం మోపి తన కరారునామాను మరొకరికి బదలీ చేయుటకు అంగీకరించాడని రికార్డు చేశాడు.

బాలసుందరం కేసు సంగతి కూలీలందరికీ తెలిసింది. నాకు "గిరిమిటియా బంధువు" అని పేరు వచ్చింది. నాకీ సంబంధం వల్ల ఎంతో ఆనందం కలిగింది. ఇక ప్రతిరోజు మా ఆఫీసుకు గిరిమిటియాలు అపరిమితంగా రాసాగారు. వారి కష్టసుఖాలు తెలుసుకునేందుకు నాకు మంచి అవకాశం లభించింది.

ఈ కేసు విషయం దూరాన ఉన్న మద్రాసు రాష్ట్రంలో కూడా ప్రతిధ్వనించింది. మద్రాసు నుంచి నేటాలు వచ్చిన గిరిమిటియాలు తమ గిరిమిటియా సోదరుల వల్ల యీ విషయం తెలుసుకున్నారు.

ఈ కేసు గొప్పదేమీకాదు. కాని నేటాలులో తమకు న్యాయం సాధించగల వాడొకడు బయల్దేరాడను వార్త గిరిమిటియాలకు ఉత్సాహం కలిగించింది.

బాలసుందరం నా దగ్గరకు వచ్చినప్పుడు తలపాగా తీసి చేత పట్టుకొని వున్నాడని నేను ముందే తెలియజేశాను అసలు ఈ దృశ్యంలో ఒక విచిత్రమైన కరుణరసం మరియు నైచ్యం నిండి వున్నాయి. జడ్జి నా తలపాగాను తీసివేయమన్నప్పటి ఘట్టాన్ని గురించి మొదట వ్రాశాను. తెల్లవాణ్ణి చూడటానికి వెళ్లినప్పుడు గిరిమిటియా గాని, క్రొత్త భారతీయుడు గాని తన తలపాగా తీసి చేతులతో పట్టుకోవాలి. రెండు చేతులు జోడించి నమస్కరించినా అది తక్కువే. బాలసుందరం నా దగ్గరకు వచ్చినప్పుడు కూడా అలాగే చేయాలని అనుకున్నాడు. ఈ రకమైన చర్యను చూడటం నాకు యిదే ప్రథమం. ఈ చర్య నాకు చిన్నతనం అనిపించింది. నేను బాలసుందరాన్ని తలపాగా చుట్టుకోమని చెప్పాను. అతడు ఎంతో సంకోచిస్తూ పాగాను తలకు చుట్టుకున్నాడు. అయితే అప్పుడు అతడి ముఖంమీద సంతోషం తొంగిచూచింది.

తమ తోటి మానవులను నీచపరచడం వల్ల తమకేదో గౌరవం చేకూరుతుందని భావించేవారి ఉద్దేశం ఏమిటో నాకు బోధపడదు. అట్టి తత్వం సరికాదని నా నిశ్చితాభిప్రాయం.

## 21. మూడు పౌండ్ల పన్ను

బాలసుందరం కేసుతో గిరిమిటియాలతో నాకు సంబంధం పెరిగింది. అటు ప్రభుత్వం కూడా ఎక్కువ పన్నులు వసూలుచేసి వారిని బాధించడం ప్రారంభించింది. అందువల్ల వారిని గురించి చదువవలసి వచ్చింది.

1894వ సంవత్సరంలో నేటాలు ప్రభుత్వం వారు గిరిమిటియాలు సాలీనా తలకు 25 పౌండ్ల చొప్పున అంటే 375 రూపాయలు పన్ను కట్టాలని బిల్లు తయారుచేశారు. దీన్ని చూచి నిర్విణ్ణుడనయ్యాను. ఈ విషయం కాంగ్రెస్ సమావేశంలో చర్చకు ప్రవేశపెట్టాను. అందు యీ బిల్లుకు వ్యతిరేకంగా గట్టి ప్రయత్నం చేయాలని ఏకగ్రీవంగా తీర్మానం ఆమోదించబడింది.

ఈ పన్నుకు అసలు కారణం ఏమిటో యిక్కడ కొద్దిగా వివరిస్తాను. 1860లో నేటాలు నందలి తెల్లవారు అక్కడి భూములు కొన్నారు. అక్కడి భూములు చక్కెర తోటల పెంపకానికి అనుకూలంగా ఉన్నాయని తెలుసుకున్నారు. అయితే కూలీలు

దొరకడం కష్టమైంది. ఆ దేశంలో కూలివాళ్లను రప్పించడం అవసరమని భావించారు. అందువల్ల నేటాలు ప్రభుత్వం వారు బ్రిటిష్ ప్రభుత్వం వారితో సంప్రదింపులు జరిపి భారత దేశాన్నుండి కూలివారిని వలస తీసుకొనిపోయేందుకు అనుమతి సంపాదించారు. ఈ కూలి జనం నేటాలులో అయిదేండ్లు పని చేయుటకు అంగీకరిస్తూ గిరిమిటు మీద (కరారునామా) సంకతం చేయాలి. గడువు దాటిన తరువాత వారి యిష్టం. అంటే అక్కడే నివసించదలిస్తే నివసించవచ్చు. శక్తి వుంటే భూమి కొనుక్కోవచ్చు. ఈ విధంగా తెల్లవాళ్లు గిరిమిటీలకు ఆశ పెట్టారు అయిదు సంవత్సరాల తరువాత కూడా భారతదేశ కూలీలు కాయకష్టంచేసి ప్రయోజనం పొందవచ్చునని తెల్లవాళ్లు ప్రకటించారు.

అయితే భారతీయులు తెల్లవారనుకున్న దానికంటే ఎక్కువ లాభం పొందారు. వారు రకరకాలైన కూరగాయలు విరివిగా పండించసాగారు. ఇండియా నుండి మంచి కూరగాయల విత్తనాలు వెంటతీసుకొని వెళ్లి తద్వారా బాగా కూరగాయలు పండించి అక్కడ చవుకగా జనానికి అందచేశారు. మామిడితోటలు పెంచారు. వర్తకం కూడా చేయడం ప్రారంభించారు. ఇళ్లు కట్టుకునేందుకు స్థలాలు కొన్నారు. కొందరు కూలీలు భూస్వాములైనారు. భారతదేశపు వర్తకులు కొందరు వీరితోబాటు వెళ్లి అచ్చట పాతుకుపోయారు. ఇట్టివారిలో కీ.శే, సేఠ్ అబుబకర్ అమద్ గారు ప్రధములు. వారు కొద్ది కాలంలోనే తమ వ్యాపారాన్ని వృద్ధికి తెచ్చారు.

ఇదంతా చూచి తెల్ల వ్యాపారస్థులు కంగారుపడిపోయారు. నల్లవాళ్లను పిలుచుకు వెళ్లినప్పుడు తెల్లవాళ్లకు వీళ్ల వ్యాపార రహస్యాలు తెలియవు. భారతీయులు వ్యవసాయదారులైతే ఫరవాలేదుగాని వ్యాపారంలో సైతం పోటీకి దిగేసరికి తెల్లవాళ్లు సహించలేకపోయారు. భారతీయుల యెడ అసూయ కలగడానికి ఇదే ముఖ్య కారణం. దీనికి మరిన్ని ఇతర కారణాలు కూడా తోడు అయ్యాయి. నల్లవారి రకరకాల జీవన పద్ధతులు, కొంచెం వ్యయమైనా మప్పితంగా గృహ నిర్వహణ కావించుకోగల స్థితి, అల్ప లాభ సంతోషం, ఆరోగ్య నియమాలను గురించిన ఉదాసీనత. చుట్టుప్రక్కల్ని శుచిగా వుంచుకోవడంలో అశ్రద్ధ, ఇండ్లను మరమ్మత్తు చేయించి బాగా వుంచుకొనడంలో పిసినారితనం మొదలుగా గల వ్యవహారాలన్నింటి వల్ల వర్ణ ద్వేషమనే చిచ్చు బాగా రేగింది. ఈ ద్వేషం తరువాత వోటు హక్కు తొలగించే బిల్లు రూపంలోను, ఆ తరువాత గిరిమిటియాలు మూడు పౌండ్ల తలసరి పన్ను చెల్లించే బిల్లు రూపంలోను ప్రత్యక్షమైంది ఈ శాసనాలే గాక అనేక చిక్కులు అదివరకే ఏర్పడి వున్నాయి. గిరిమిటియాలను, గిరిమిటియా కాలం అయిదేండ్లు ముగియక మునుపే, ఆ గడువు ముగిసినట్లు

భావించి బలవంతంగా పంపివేయడానికి పూనుకున్నారు. కాని అందుకు ఇండియా ప్రభుత్వంవారు అంగీకరించలేదు. తరువాత కొన్ని షరతులు ప్రవేశ పెట్టబడ్డాయి.

(1) గిరిమిటియాలు తమ నియమిత కాలం పూర్తికాగానే ఇండియాకు వెళ్లిపోవాలి. అలా వెళ్లని యెడల

(2) రెండేండ్లకు ఒక్కసారి క్రొత్త ఒడంబడిక వ్రాస్తూ వుండాలి. ఒడంబడిక వ్రాయబడినపుడు జీతం కొంచెం కొంచెం పెంచబడుతూ వుంటుంది.

(3) క్రొత్త ఒడంబడిక వ్రాయక, ఇండియాకు తిరిగిపోకుండా నేటాలులోనే వుంటే సాలుకు 25 పౌండ్లు అనగా 375 రూపాయలు పన్ను రూపంలో చెల్లిస్తూ వుండాలి.

ఈ షరతుల్ని ఇండియా ప్రభుత్వం వారిచే అంగీకరింపచేయుటకు సర్ హెన్రీ బిన్, మిస్టర్ మేసను అనువారు ఇండియాకు వచ్చారు. అప్పుడు లార్డ్ ఎల్గిన్ ఇండియా వైస్రాయిగా వున్నారు. అతడు 25 పౌండ్ల పన్ను అంగీకరించాడు. ఇది వైస్రాయి చేసిన పెద్ద తప్పిదం. అప్పుడూ యిప్పుడూ కూడా నా అభిప్రాయం ఇదే. ఈ విధంగా నిర్ణయించి అతడు ఇండియాకు ఈషణ్మాత్రమైనా మేలు చేయలేదు. నేటాలు తెల్లవాళ్లకు ఆ విధంగా లాభం చేకూర్చడం వైస్రాయికి పాడిగాదు. మూడు నాలుగేండ్లలో ప్రతి గిరిమిటియా తనకు, తన భార్యకు, పదహారేండ్ల కొడుక్కు, పదమూడేండ్ల కుమార్తెకు మూడు మూడు పౌండ్ల చొప్పున పన్ను చెల్లించాలి. నెలకు వారి ఆదాయం 14 షిల్లింగులు మాత్రమే. అంతకంటే మించి సంపాదించని భార్యాభర్తలకు, వారిద్దరి పిల్లలకు కలపి కుటుంబానికి సాలుకు 12 పౌండ్లు అంటే 180 రూపాయల పన్ను వేయడం ఏ దేశంలోను కనీవినీ ఎరుగని అత్యాచారమే.

ఈ పన్నును ప్రతిఘటిస్తూ మేము ఉద్యమం ప్రారంభించాము. ఈ విషయంలో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ మౌనం వహించియుంటే ఇండియా వైస్రాయి 25 పౌండ్లు మంజూరు చేసియుండేవాడే. 25 పౌండ్లు 2 పౌండ్లకు తగ్గడం కూడా నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ వారు జరిపిన ఉద్యమ ప్రభావమే కావచ్చు లేక నా భావం పొరపాటే కావచ్చు. కాంగ్రెసువారు ఉద్యమం నడిపినా నడపకపోయినా ఇండియా ప్రభుత్వం వారు 3 పౌండ్ల పన్ను మంజూరు చేసియుందురని అనవచ్చు. ఏది ఏమైనా ఇది భారతీయుల యెడ అనుచిత చర్యయే. భారతదేశ యోగక్షేమాలను పరిరక్షించవలసిన వైస్రాయి అమానుషమైన యిట్టి పన్నును మంజూరు చేసి యుండకూడదు.

ఈ పన్ను 25 పౌండ్ల నుండి అనగా 375 రూపాయల నుండి 3 పౌండ్లకు అనగా 45 రూపాయలకు తగ్గింపబడినా అది నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ వారికి గౌరవప్రదం కాదు! గిరిమిటియాలకు ఏమీ మేలు జరగలేదను విషయం స్పష్టం. అది నిర్వివాదాంశం. ఈ పన్నును రద్దు చేయించి ముదరా యిప్పించాలని కాంగ్రెసు వారి నిర్ణయం. ఆ నిర్ణయాన్ని వారు ఎన్నడూ విడిచిపెట్టలేదు. అయితే యీ నిర్ణయం నెరవేరడానికి ఇరవై సంవత్సరాల కాలం పట్టింది. ఒక్క నేటాలు నందలి భారతీయులేగాక దక్షిణ - ఆఫ్రికాలో నివసిస్తున్న భారతీయులంతా కలిసి ఏకోన్ముఖంగా పెద్ద ఉద్యమం నడిపితేనే గాని ఆ పన్ను రద్దుకాలేదు. గోఖలే గారికి రద్దు చేస్తామని మాట యిచ్చి కూడా చివరికి నెరవేర్చక పోయేసరికి తుది సమరం ప్రారంభించవలసి వచ్చింది. ఆ సమరంలో గిరిమిటియాలంతా పూర్తిగా పాల్గొన్నారు. ప్రభుత్వం వారు తుపాకులు కాల్చినందున చాలామంది గిరిమిటియా భారతీయులు ప్రాణాలు అర్పించారు. పదివేల మందికి పైగా నిర్బంధింపబడి జైళ్లకు వెళ్లారు.

అయితే చివరికి సత్యమే జయించింది. భారతీయుల బాధల రూపంలో సత్యం అక్కడ ప్రత్యక్షమైంది. అచంచలమైన ఓర్పు, నమ్మకం, విసుగు విరామం లేని పట్టుదల, పూనిక వల్ల ఆ యుద్ధంలో జయం లభించింది. లేకపోతే జయం లభించియుండేది కాదు. ఆ పోరాటం జరుపకుండా మానివేసివున్నా, లేక నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ వారు ఆ విషయం మరిచిపోయినా తల పన్ను గిరిమిటియాల మీద పడియుండేదే. ఆనాటి నుండి ఈనాటి వరకు భారతీయ గిరిమిటియాలు చెల్లిస్తూ వుండేవారే. ఆ అపయశస్సు దక్షిణ - ఆఫ్రికా యందు నివసిస్తున్న భారతీయులకే గాక భారతదేశంలో నివసిస్తున్న సమస్త భారతీయులకు కూడా ఆపాదించి యండేది.

## 22. ధర్మ నిరీక్షణ

ఈ విధంగా నేను పూర్తిగా ప్రజాసేవలో లీనమైపోయాను.అందుకు కారణం ఆత్మ సాక్షాత్కారాభిలాషయే. ప్రజాసేవ వల్ల ఈశ్వర సాక్షాత్కారం కలుగుతుందనే విశ్వాసంతోనే నేను సేవా ధర్మాన్ని స్వీకరించాను. భారతసేవ నాకు సహజంగా లభించింది. నాకిది ఎంతో యిష్టం. కోరుకోకుండా యిది నాకు లభ్యమైంది. నేను పర్యటనా కాంక్షతోను, కాఠియావాడులో జరుగుతున్న కుట్రల బారి నుండి తప్పించుకోవాలనే కోరికతోను జీవిక కోసం దక్షిణ-ఆఫ్రికా చేరాను. కాని నేను యిక్కడి ప్రజాసేవలో లీనమై ఈశ్వరాన్వేషణ మరియు ఆత్మదర్శనమునందు నిమగ్నమై పోయాను.

ఏసు మిత్రులు నా ధర్మ జిజ్ఞాసను తీవ్రం చేశారు. అది ఏవిధంగాను శాంతించలేదు. నేను దాన్ని శాంతింపచేయాలని ప్రయత్నించాను. కాని ఏసు మిత్రులు శాంతపడనీయలేదు. అప్పుడు దర్బనులో దక్షిణ ఆఫ్రికా జనరల్ మిషనుకు అధ్యక్షులు స్పెన్సరు వాలటన్‌గారు. వారు నన్ను పసికట్టారు. దాదాపు నేను వారి కుటుంబంలో ఒకడినైపోయాను. ఈ సంబధానికి కారణం ప్రిటోరియా పరిచయం. వాల్టన్‌గారి స్వభావం విచిత్రమైంది. ఆయన నన్నెన్నడు ఏసు మతంలో చేరమని చెప్పినట్లు గుర్తులేదు. కాని అతడు తన జీవితం సమస్తం నా ముందు ఉంచి తన మంచి చెడ్డల్ని నిరీక్షించు అవకాశం నాకు కల్పించాడు. అతని సతీమణి ఎంతో వినయవంతురాలు, వివేకవంతురాలు.

ఆ దంపతులు ప్రవర్తన నాకు సంతోషం కలిగించింది. మా యిద్దరికీ గల అభిప్రాయభేదం యిద్దరికీ తెలుసు. ఎటువంటి తీవ్రచర్చ కూడా మా యిద్దరి అభిప్రాయాల్ని ఏకం చేయలేదు. అయినను ఎచట ఉదారత, సహిష్ణుత, సత్యం ఉంటాయో అచట భేదాలు కూడా లాభదాయకాలే అవుతాయి. ఆ దంపతుల వినమ్రత, ఉద్యమశీలత, కార్యపరాయణత నాకు సంతోషం కలిగించాయి. అందువల్ల ఇద్దరం తరుచు ఒకచోట కలుస్తూ వుండేవాళ్లం

ఈ సంబంధం నన్ను మత విషయంలో జాగ్రత్తపడేలా చేసింది. మతాన్ని గురించి చింతన చేసేందుకు ప్రిటోరియాలో నాకు లభించిన అవకాశం యిక్కడ లభించలేదు. అయినా లభించిన స్వల్ప సమయాన్ని గ్రంథ పఠానానికి వినియోగించ సాగాను. ఈ విషయమై మళ్ళీ ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభమైనాయి. రాయచంద్ భాయి నాకు యీ విషయంలో త్రోవ చూపుతూ వున్నారు. నర్మదా శంకరుని (గుజరాతుకు చెందిన ఒక ప్రసిద్ధి కవి) 'ధర్మ విచార్' అను గ్రంథం ఒక మిత్రుడు పంపగా దాని పీఠిక నాకు ఎంతో ఉపయోగపడింది. నర్మదా శంకరుని విశృంఖల జీవితాన్ని గురించి వినియున్నాను. ఈ పీఠికలో అతడు తన శీలాన్ని ఎలా దిద్దుకోగలిగాడో వివరించాడు. అది నాకు ఆశ్చర్యం కలిగించింది. నాకు ఆ గ్రంథం యెడ ఆదరం పెరిగింది. దాన్ని అతిశ్రద్ధగా చదివాను. మాక్సు ముల్లర్ గారి 'India, what can it teach us' అను గ్రంథాన్ని , దివ్యజ్ఞాన సమాజం ప్రకటించిన ఉపనిషత్తుల అనువాదాన్ని శ్రద్ధగా చదివాను. వీటన్నింటివల్ల నాకు హిందూమతంపై ఆదరణ పెరిగి, నానాటికి దాని గొప్పతనం అమితంగా కనబడసాగింది. అయితే అందువల్ల యితర మతాల యెడ వైముఖ్యం కలుగలేదు. వాషింగటన్ ఇర్వింగ్ గారి "Life of

Mahamd and His successars" అను గ్రంధాన్ని, కార్లయిలుగారి మహమ్మదు స్తుతిని చదివాను. దీనిచే నాకా మత ప్రవక్త యెడ ఆదరం పెరిగింది. "the sayings of zarthustra" అను గ్రంథం కూడా చదివాను. ఈ విధంగా వివిధ మతాల్ని గురించి కొద్దిగానో గొప్పగానో తెలుసుకున్నాను. దీనివల్ల ఆత్మ నిరీక్షణ పెరిగింది. చదివిన దానిలో మంచిదని తోచిన అనుభవాన్ని ఆచరణలో పెట్టసాగాను. యిదేవిధంగా యోగ సంబంధమైన గ్రంథాల్ని కూడా చదివి సాధన ప్రారంభించాను. కాని ఎక్కువ కాలం ఆ సాధన సాగించలేకపోయాను. భారతదేశం వెళ్లిన తరువాత ఒక గురువు దగ్గర అభ్యసించాలని భావించాను. కాని ఆ కోరిక ఈనాటి వరకు నెరవేరలేదు.

టాల్‌స్టాయి పుస్తకాలు అధికంగా చదివాను. వారి "The Gaspels in Brief, What to do?" మొదలగు గ్రంథాలు నా హృదయానికి హత్తుకున్నాయి. విశ్వ ప్రేమ మనిషిని ఎంత పైకి తీసుకొని వెళ్లగలదో తెలుసుకోగలిగాను. ఈ సమయంలోనే నాకు మరో ఏసు కుటుంబంతో పరిచయం కలిగింది. వారి మాట ప్రకారం ప్రతి ఆదివారం వెస్లియన్ చర్చికి వెళ్లసాగాను. అచ్చటికి వెళ్లినప్పుడల్లా వారింట్లోనే విందు తీసుకోమని ఒక్కసారే నాకు వారు చెప్పివేశారు. ఆ చర్చిలో ప్రవచనం నిస్సారంగా వుండేది. అచటి మండలి భక్త మండలి కాదు. వారంతా ఐహిక చింతకులు. లోకాచారం కోసం, విశ్రాంతి కోసం వారు చర్చికి వెళ్లేవారు. నాకు అక్కడ నిద్ర వస్తూ వుండేది. అలా నిద్రపోవడం నాకు చిన్నతనంగా వుండేది. కాని నాతోబాటు కునుకు తీసే మిత్రులు కొందరుండటంవల్ల నా చిన్నతనం తగ్గిపోయింది. ఈ స్థితి నాకు నచ్చలేదు. చివరికి అక్కడికి వెళ్లడం మానుకున్నాను.

నడుస్తు నడుస్తూ వున్న ఆ కుటుంబం పొత్తు అంతటితో ఆగిపోయింది. యిక రావద్దని ఆ కుటుంబం వారు చెప్పినట్లు భావించవచ్చు. ఆ ఇల్లాలు చాలా మంచిది. రుజువర్తన కలది. అయితే ఆమెది సంకుచిత స్వభావం. మా పని ఎప్పుడూ మత చర్చయే. నేనప్పుడు ఆర్నాల్డుగారి "Light of Asia" చదువుతూ వున్నాను. అప్పుడు ఒక పర్యాయం బుద్ధునికి, ఏసుకు గల తారతమ్యాన్ని గురించి చర్చ వచ్చింది. నేను యిలా అన్నాను.

"అమ్మా! చూడు బుద్ధునిదయ! అది మనుష్యులతో ఆగక సకల భూతముల దాకా వ్యాపించింది. అతని భుజం మీద సంతోషంతో కూర్చున్న మేకపిల్ల చిత్తరువు కండ్ల యెదుట కనబడితే హృదయం ప్రేమతో నిండిపోతుంది. కాని ఏసులో యీ విధమైన సర్వభూత వ్యాప్తమగు దయ కనబడదు."

ఆమె మనస్సు చివుక్కుమంది. నేను యిది గ్రహించాను. ప్రసంగం అంతటితో ఆపివేశాను. భోజనానికి లేచాము. ఆమె కుమారుడు ఐదేండ్లవాడు. నవ్వు ముఖం గలవాడు. అట్టి పిల్లవాడు దగ్గరవుంటే నాకు మరొకరితో మాట్లాడనవసరం ఉండదు. మేమిద్దరం చిరకాల మిత్రులం. పిల్లవాడి పళ్ళెంలో మాంసం ముక్క వుంది. దాన్ని చూచి నేను అతణ్ణి ఎగతాళి పట్టించాను. నా చేతిలో వున్న రేగుపండు అతనికి చూపించి "చూడు యిది దానికంటే ఎంత బాగుందో" అని అన్నాను. ఆ బాలుడు అమాయకుడు. అతడు నాతో కలిసిపోయాడు నీ పండే బాగుంది అని అంటూ నాతో అనడం, యిద్దరం నవ్వుకోవడం ప్రారంభించాం.

ఇది చూచి ఆ పసివాడి తల్లి నొచ్చుకుంది. నాకు హెచ్చరిక లభించినట్లనిపించింది. వెంటనే ప్రసంగం మార్చివేశాను. మరుసటి ఆదివారం కూడా జంకుతూ జంకుతూనే వారింటికి వెళ్ళాను. నేను అక్కడికి పోవడం మానుకోదలచలేదు. అది మంచిదని నేననుకోలేదు. కాని ఆమె నా పనిని తేలికచేసింది. ఆమె యిలా అన్నది "గాంధీ! నేనొక్క మాట చెబుతాను. వేరే విధంగా భావించవద్దు నీ స్నేహం మా పిల్లవాడికి కూడదు. యిప్పుడు వీడు ప్రతిరోజూ మాంసం తిననని మారాం చేస్తున్నాడు. నీ వాదాన్ని ప్రతిసారి చెప్పి పండ్లు తెచ్చిపెట్టమని అంటున్నాడు. దీన్ని నేను సహించలేకపోతున్నాను. మాంసం తినకపోతే జబ్బు చేయదు కాని చిక్కి శల్యమైపోతాడు. నేను అట్టి స్థితిని భరించగలనా? నీవు యిట్టి చర్చలు పెద్దవాళ్లమైన మాతో చేయడం మంచిది కాని పిల్లవాడితో చేయవద్దు. దీనివల్ల పిల్లలు పాడైపోతారు"

ఆమె మాటలు వినేసరికి నాకు బాధ కలిగింది. యిలా అన్నాను - "అమ్మా! నాకు చాలా విచారంగా వుంది. నాకూ పిల్లలున్నారు. తల్లిదండ్రుల భావాలు నాకు తెలియవా? యిక మీకు యిట్టి కష్టం కలుగనీయను. ఇది చాలా సులభం కూడా. నేను చెప్పిన మాటల కంటే నేను తినే వస్తువులు తినకుండా వదిలివేసే పదార్థాలు చూచినప్పుడు పిల్లవాని మనస్సుకు అవి హత్తుకుంటాయి. అందువల్ల యీనాటి నుండి నేను మీ యింటికి రావడం మానుకుంటాను. అదే యిందుకు తగిన చికిత్స అని అనిపిస్తూ వుంది. అయితే దీనివల్ల మన స్నేహానికి భంగం రాదు, రాకూడదు"

"మీ మాటలు చాలా బాగున్నాయి" అలాగే చేయండి అని ఆ గృహిణి అమిత సంతోషంతో అన్నది.

# 23. ఇంటి వ్యవస్థ

ఇంటి వ్యవస్థ చక్కదిద్దడం ఇంటి భారం వహించడం నాకు క్రొత్త కాదు. అయితే బొంబాయి, లండను యందలి కాపురానికీ, నేటాలు యందలి నా కాపురానికి వ్యత్యాసం వుంది. నేటాలులో గృహవ్యయం పూర్తిగా ప్రతిష్టకోసం ఇండియన్ బారిస్టరు ప్రతిష్టకు తగినట్లు, భారతీయుల ప్రతినిధికి తగినట్లు చేయవలసి వచ్చింది. అందువల్ల పట్టణంలో మంచి చోట ఒక అందమైన చిన్న గృహం అద్దెకు తీసుకున్నాను. అవసరమైన ఉపకరణాలన్నీ అందులో వున్నాయి. భోజన వ్యయం మితం చేయాలని భావించాను. కాని అపుడపుడు ఆంగ్ల మిత్రుల్ని, నాతో బాటు పనిచేసే భారతీయుల్ని విందుకు పిలుస్తూ వుండటం వల్ల ఖర్చు అధికంగా జరుగుతూ వుండేది.

ప్రతి సంసారంలోను ఒక పనివాణ్ణి నియమించుకోక తప్పదు. అయితే ఎవరినైనా ఒక వ్యక్తిని సేవకునిలా ఎలా వుంచాలో నాకు యిప్పటికీ తెలియదు. నాతోబాటు ఒక మిత్రుడు వుండేవాడు. మరో వంటవాడు ఇంటివానివలె వుండేవాడు. ఆఫీసులో గుమాస్తాలు మా గృహంలో భోజనం చేసి నివసిస్తూ వుండేవారు.

మా సంసారం యీ విధంగా బాగానే సాగిందని చెప్పగలను. అయినా మా సంసారంలో కొన్ని కటు అనుభవాలు కూడా కలిగాయి. నా మిత్రుడు మంచి తెలివి గలవాడు. నా యెడ విశ్వాసం కలవాడని నేను అతణ్ణి పూర్తిగా నమ్మాను. కాని నేనే మోసపోయాను. ఆఫీసు గుమాస్తా ఒకడు నా గృహంలో వుండేవాడు. నా మిత్రునికి అతనిపై అసూయ పుట్టింది. నా గుమాస్తా మీద నాకు అనుమానం కలిగేలా మిత్రుడు ఒక పన్నాగం పన్నాడు. ఆ గుమాస్తాది విచిత్రమైన స్వభావం. నేను తనను అనుమానిస్తున్నానని అతడు గ్రహించి పని మానటమే గాక నా యింటికి రావడం కూడా మానుకున్నాడు. నాకు అతని విషయమై విచారం కలిగింది. అతనికి అన్యాయం చేశానేమోనన్న భావం నాకు కలిగింది.

ఇంతలో మా వంటవాడు ఏకారణం చేతనో సెలవు తీసుకున్నాడు. మిత్రుల సేవా శుశ్రూషల కోసం నేను మరో వంటవాణ్ణి నియమించాను. అతడు సెలవులో వెళ్లినందున మరొకణ్ణి నియమించవలసి వచ్చింది. ఈ క్రొత్తవాడు అల్లరివాడు అని తరువాత తెలిసింది. కాని నా దృష్టిలో అతడు దేవుడు పంపిన దూతయే.

నా యింట్లో నాకు తెలియకుండా జరుగుతున్న దుష్కార్యాలను వచ్చిన రెండు మూడు రోజుల్లోనే గ్రహించి క్రొత్త వంటవాడు నన్ను హెచ్చరించడానికి పూనుకొన్నాడు.

మంచివాడనని, ఎవరేం చెబితే అది నమ్ముతానని నాకు పేరు వచ్చింది. అట్టి నా యింట్లోనే దుర్గంధం వ్యాప్తి కావడం చూచి మా వంటవాడు ఆశ్చర్యపడిపోయాడు. ప్రతిరోజూ మధ్యాహ్నం ఒంటిగంటకు నా భోజనం ఆఫీసు నుండి ఆ సమయానికి యింటికి వెళ్లడం నాకు అలవాటు.

ఒకనాడు పన్నెండుగంటల వేళ ఆ వంటవాడు ఆఫీసుకు రొప్పుకుంటూ వచ్చి "ఒక తొందర పని వుంది. మీరు వెంటనే యింటికి రావాలి" అని అన్నాడు "ఇప్పుడెట్లా? పనేమిటో చెప్పు. ఆఫీసు వదలి యింటికి రావలసిన అవసం ఏం వచ్చిందో చెప్పు" అని అన్నాను.

"మీరిప్పుడు యింటికి రాకపోతే తరువాత ఎందుకు వెళ్లకపోతినా అని విచారపడతారు. ఇంత కంటే ఎక్కువ చెప్పలేను".

అతడంత గట్టిగా చెప్పేసరికి ఇంటికి బయలుదేరాను. వంటవాడు ముందు నడిచి నన్ను మేడ మీదకు తీసుకువెళ్లాడు. నా మిత్రుని గదిని చూపించి తలుపులు తెరచి మీరే చూడండి ఏం జరుగుతున్నదో అని అన్నాడు.

నాకు అంతా బోధపడిపోయింది. తలుపుతట్టాను. సమాధానం ఎలా వస్తుంది? గట్టిగా తలుపు మీద బాదాను. గోడలు కూడా కదలిపోయినంత పని అయింది. తలుపులు తెరచుకున్నాయి. లోపల ఒక వేశ్య. వెళ్లిపో యిక ఎప్పుడూ యీ గుమ్మం తొక్కవద్దు అని చెప్పి ఆమెను పంపించివేశాను.

" ఈ క్షణాన్నుండి నీతో నా కెట్టి సంబంధం లేదు. నేను బుద్ధి మాంద్యం వల్ల మోసపోయాను. నా విశ్వాసాన్ని యిలా పటాపంచలు చేశావు" అని అరిచాను. నాయీ మాటలకు పశ్చాత్తాప పడవలసిన మిత్రుడు తద్విరుద్ధంగా వ్యవహరించి చూడు! నీ రహస్యాలన్నీ బయటపెడతా అని బెదిరించాడు. "నాకు రహస్యమేమీ లేదు. నా సంగతంతా చాటిచెప్పు. నీవు తక్షణం ఇల్లు విడిచి వెళ్లిపో" అని గద్దించాను.

అతడు యింకా కొంచెం బిరుసెక్కాడు. అతణ్ణి సంబాళించడం కష్టమని భావించాను. క్రింద వున్న గుమాస్తాను పిలిచాను. నీవు వెంటనే పోలీసు సూపరింటెండెంటు గారి దగ్గరకి వెళ్లి నా నమస్కారం తెలియజేయి. నా యింట్లో నివసిస్తున్న ఒక వ్యక్తి విశ్వాసఘాతుకం చేశాడు. అతడు నా యింట్లో వుండటం నాకు యిష్టంలేదు కాని అతడు యిక్కడి నుండి కదలడం లేదు. తమ మద్దతు కోరుతున్నాను అని నా ప్రార్థనగా చెప్పు అని అన్నాను.

అంతవరకు లొంగని అపరాధి యిక తనను పోలీసులకు అప్పగిస్తానని గ్రహించాడు. తప్పు అతణ్ణి భయపెట్టింది. అతడు శరణు జొచ్చి పోలీసులకు చెప్పవద్దని బ్రతిమిలాడడమే గాక, ఇల్లు వదిలి వెళతానని అన్నాడు. తరువాత ఇల్లు వదిలి వెళ్లిపోయాడు.

ఈ ఘట్టం నన్ను మేల్కొలిపింది. ఆ దుష్ట మిత్రునివల్ల మోసపోయానను విషయం అప్పటికి గాని నాకు బోధపడలేదు. మంచికి పోయి చెడ్డను కొని తెచ్చుకున్నట్లయింది. తుమ్మ కొమ్మన గులాబీ పూలు పూస్తాయని భావించానన్న మాట. అతని నడవడి మంచిది కాదని నాకు తెలుసు. అయినా నా దగ్గర తప్పు చేయడని భావించాను. అతని నడవడిని బాగు చేద్దామని భావించి నేను చెడులో పడిపోయాను. ఈ విషయమై నా శ్రేయోభిలాషులు చెప్పినా నేను వినలేదు మోహంలో పడి గ్రుడ్డి వాడినయ్యాను.

ఈ దుర్ఘటన నా కళ్లు తెరిపించింది. లేకపోతే నాకు సత్యం బోధపడేది కాదు. నేనతని వలలో పడిపోయివుంటే నేనిప్పుడు తలపెట్టిన ఏకాంత జీవనం ప్రారంభించి యుండేవాణ్ణి కాదు. నా సమయమంతా అతని కోసం ఖర్చు చేసేవాణ్ణి. నన్ను అంధకారంలోకి నెట్టి చెడ్డ మార్గం పట్టించగల శక్తి అతనికి వుంది. కాని దేవుడు రక్షించిన వాణ్ణి ఎవడేమి చేయగలడు? నా మనస్సు పరిశుద్ధం కావున తప్పు చేసినప్పటికీ రక్షణ పొందాను. మొట్టమొదటనే కలిగిన యీ అనుభవం భవిష్యద్విషయాలలో నన్ను జాగరూకుణ్ణి చేసింది.

భగవంతుడే యీ వంటవానిని ప్రేరేపించి యుండవచ్చు. అతడు నిజానికి వంట చేయలేదు. అతడెంతో కాలం నా యింట్లో వుండలేదు. అతడు దప్ప మరొక రెవ్వరూ నా కండ్లు తెరవలేరు. ఆ వేశ్య యిక్కడికి రావడం యిది మొదటిసారి కాదట. అంత ధైర్యం ఆ వంటవానికి తప్ప మరెవ్వరికీ లేదు. ఆ మిత్రునిపై నాకు అపరిమిత విశ్వాసమనీ, ఆ నా విశ్వాసానికి అవధులు లేవని అందరికీ తెలుసు. వంటవాడు యీ విషయం తెలుపుటకే కాబోలు నా దగ్గరకు వచ్చి "అయ్యా నేను మీ యింట్లో వుండలేను. మీరు సులభంగా మోసపోతారు. యిది నాకు తగిన చోటుకాదు." అని చెప్పి వెంటనే వెళ్లిపోయాడు.

నేను కూడా అతణ్ణి వుండమని పట్టుపట్టలేదు. వెనక వెళ్ళిపోయిన గుమాస్తా మనస్సును విరిచింది కూడా ఈ మిత్రుడే అని నాకు అప్పుడు తెలిసింది. ఆ గుమాస్తాకు నేను చేసిన అన్యాయాన్ని తొలగించుటకు చాలా ప్రయత్నించాను. అతని విషయంలో నేను చేసిన దానికి ఇప్పటికీ నాకు విచారమే. నేను గుమాస్తాను సంతృప్తిపరచలేక పోయాను. ఎంత సరిచేద్దామన్నా అతుకు అతుకేగదా!

# 24. తిరుగు ప్రయాణం

నేను దక్షిణ ఆఫ్రికాకు వచ్చి మూడేండ్లు గడిచిపోయాయి. నాకు అక్కడి ప్రజల సంగతులు బాగా తెలిశాయి. 1896వ సంవత్సరంలో ఆరు నెలల సెలవు కావాలని కోరాను. అక్కడ చాలా కాలం నేను ఉండవలసియున్నది. నాకు అక్కడ మంచి ప్రాక్టీసు కూడా వున్నది. అక్కడి వాళ్లకు నాతో చాలా పని పడింది. అందువల్ల నేను ఒక పర్యాయం యింటికి వెళ్లి భార్యాపిల్లల్ని చూడాలి. దక్షిణ - ఆఫ్రికా భారతీయుల స్థితిగతులను గురించి బాగా ప్రచారం చెయ్యాలి. అందువల్ల భారతీయుల అభిమానం సంపాదించడానికి వీలు చిక్కుతుంది. మూడు పౌన్ల పన్ను వ్యవహారం పెద్ద వ్రణం వంటిది. అది మానేదాకా శాంతించుటకు వీలులేదు. అయితే యిక్కడ నేను లేని సమయంలో కాంగ్రెస్ వ్యవహారాలు, విద్యాసంఘం పని ఎవరు చూస్తారు? నా దృష్టిలో ఇద్దరు వ్యక్తులు వున్నారు ఒకరు ఆదంజీ మియాఖాన్, రెండవవారు పార్సీ రుస్తుంజీ. అప్పటికి వర్తకుల్లో చాలామంది కార్యకర్తలు బయలుదేవారు. కాని కార్యదర్శి భారం నియమ పూర్వకంగా నిర్వహించువారు, దక్షిణ - ఆఫ్రికా భారతీయుల అభిమానానికి పాత్రులైనవారు వీరిద్దరే. కార్యదర్శికి ఆంగ్ల భాషాజ్ఞానం అవసరం. నేను ఆదంజీ మియాఖాన్ గారి పేరు కాంగ్రెస్ వారికి సూచించాను. వారు అతణ్ణి కార్యదర్శిగా అంగీకరించారు. అతణ్ణి కార్యదర్శిగా ఎన్నుకోవటం అత్యుత్తమమైన విషయమని అనుభవం వల్ల తేలింది. ఆదంజమియాఖాన్ గారి ఉద్యోగదక్షత, వారి ఉదార హృదయం, వారి మంచితనం, వారి వివేకం కార్యదర్శి పదవికి వారిని అర్హునిగా చేశాయి. ఆ పదవికి ఏ బారిష్టరో లేక ఇంగ్లీషు వచ్చిన ఏ గొప్పవాడో అవసరమన్న భావాన్ని కూడా వారి నియామకం తొలగించి వేసింది. 1896 వ సంవత్సరంలో నేను కలకత్తాకు బయలుదేరిన పొన్‌గోలా స్టీమరెక్కి ఇండియాకు బయలుదేరాను.

ఆ స్టీమరులో ఎక్కువమంది ప్రయాణీకులు లేరు. వారిలో ఇద్దరు ఇంగ్లీషు యాత్రికులు వున్నారు. వారితో నాకు మైత్రి ఏర్పడింది. ఒకనితో రోజూ నేను ఒక గంట సేపు చదరంగం ఆడుతూ వున్నాను. ఆ స్టీమరులోని డాక్టరు తమిళ భాషా శిక్షణ అను పుస్తకం యిచ్చాడు. దానిని చదవడం ప్రారంభించాను.

నేటాలులో వుండగా మహమ్మదీయులతో పరిచయం ఏర్పరచుకొని ఉర్దూ భాష, మదరాసు వారితో పరిచయం చేసుకొని తమిళ భాష నేర్చుకోవాలని భావించాను. ఉర్దూ నేర్చుకోవాలని భావించి డెక్కుమీద నున్న యాత్రికుల్లో ఉర్దూ మున్షీ ఎవరైనా

వున్నారేమోనని విచారించాను. ఒక మున్షీ దొరకగా ఆయన వద్ద మా ఉర్దూ చదువు బాగానే సాగింది. నాతోబాటు ఒక ఆంగ్ల ఉద్యోగి కూడా ఉర్దూ నేర్చుకోవడం ప్రారంభించాడు. అతడి జ్ఞాపకశక్తి గొప్పది. ఉర్దూ అక్షరాలు గుర్తించటం నాకు కష్టమైంది. కాని అతడు ఒక్కసారి అక్షరం చూచాడో యిక దాన్ని మరచిపోడు. నేను చాలా కష్టపడ్డాను. కాని అతణ్ణి మించలేకపోయాను.

అరవం నాకు బాగానే వచ్చింది. గురువులేడు. అయినను గురువు అవసరం లేనంతగా ఆ తమిళ భాషా శిక్షణ వ్రాయబడింది. ఇండియాకు వచ్చినతరువాత తమిళం బాగా నేర్చుకోవాలని భావించాను. కాని సాధ్యం కాలేదు.

1893వ సంవత్సరం దాటిన తరువాత నేను పనులన్నీ జైళ్లలోనే చేశాను. అరవం దక్షిణ ఆఫ్రికా జైల్లో నేర్చుకున్నాను. ఉర్దూ యరవాడ జైల్లో నేర్చుకున్నాను. అరవం మాత్రం మాట్లాడే అభ్యాసం నాకు కలుగలేదు. చదవడం వచ్చినా వాడకం లేనందున అది తుప్పు పట్టినట్లు అయింది. ఇందుకు కడు విచారంగా వుంది. దక్షిణ ఆఫ్రికాయందలి మద్రాసు సోదరులకు నేనంటే ప్రాణం. నాకు వారెల్లప్పుడూ గుర్తుకు వస్తూ వుంటారు. ఎక్కడైనా తమిళుడుగాని, తెలుగువాడు కాని కనిపించితే వారిశ్రద్ధ, వారి స్వార్థ త్యాగం గుర్తుకు రాకుండా వుండవు. వారంతా నిరక్షరులు. అక్షరం రానివారే అక్కడి పోరాటంలో పాల్గొన్నారు. ఆ పోరాటం బీదల కోసం సాగింది. పోరాటం జరిపినవారు పూర్తిగా బీదవారే.

అమాయకులు, యోగ్యులగు భారతీయుల హృదయాన్ని చూరగొనడానికి నాకు వారి భాష రాకపోవడం అడ్డంకి కాలేదు. వారికి హిందుస్తానీ, ఇంగ్లీషు కొద్దికొద్దిగా వచ్చు. అందువల్ల మా పనికి అడ్డంకి కలుగలేదు. వారి ప్రేమకు బదులుగా అరవం నేర్చుకోవాలని భావించాను. నాకు అరవం కొంత కొంత అర్థం అవుతుంది. ఇండియాలో తెలుగు నేర్చుకుందామని ప్రయత్నించాను. కాని తెలుగులో అక్షరాలు దాటి చదువు ముందుకు సాగలేదు.

ఈ విధంగా అరవం, ఆంధ్రం చక్కగావచ్చే భాగ్యం నాకు కలుగలేదు. బహుశా యిక నేర్చుకోలేనుకూడా. కనుక ద్రావిడులు హిందుస్తానీ, నేర్చుకోగలరని ఆశ పెట్టుకున్నాను. దక్షిణ ఆఫ్రికాలోని మద్రాసు ద్రావిడులు కొద్దిగానో, గొప్పగానో హిందీ మాట్లాడతారు. అయితే దేశభాషాపఠనం వల్ల తమ ఆంగ్ల భాషా జ్ఞానానికి ఇబ్బంది కలుగుతుందేమోనని ఇంగ్లీషు వచ్చినవాళ్లు మాత్రమే భావిస్తున్నారు. దేశ భాషల్ని వారే ఆదరించడం లేదు.

శాఖాచంక్రమణం చేశాను. సింహావలోకనం చేసి నా ప్రయాణ కథను ముగిస్తాను. పాంగోలా స్టీమరు కెప్టెనును గురించి చెప్పడం మిగిలివుంది. మేము మిత్రులం అయ్యాము. అతడు ప్లీమత్ సోదర సంప్రదాయం వాడు. సముద్రయానాన్ని గురించిన ప్రసంగం కంటే ఆధ్యాత్మిక ప్రసంగమే మా మధ్య జరుగుతూ వుండేది. అతడు నీతికి, జ్ఞానానికి (ధర్మానికీ) భేదం కల్పించేవాడు. అతని దృష్టిలో బైబిలు బోధ శిశుక్రీడ వంటిది. భాషా సౌలభ్యాన్ని బట్టి దాని గొప్పతనం అపారం. బాలురుగాని, స్త్రీలుగాని, పురుషులు గాని జీససునందును, అతని బలిదానము నందును విశ్వాసం వుంచితే వారి పాపాలు నశించిపోతాయి. యిది ఆయన మాటల సారం. అతని పరిచయం ప్రెటోరియాలోని ప్లీమత్ సోదరుణ్ణి గుర్తుకుతెచ్చింది. నీతి యెడ విధి నిషేధాలు గల ఏమతమైనా అతని దృష్టిలో పనికిమాలినదే. ఇంత చర్చకు కారణం శాకాహారమే. మాంసం, ముఖ్యంగా గోమాంసం నేనెందుకు తినకూడదు? భగవంతుడు శాకాల వలెనే పశు పక్షుల్ని కూడా మనుష్యుని ఆనందం కోసం, ఆహారం కోసం సృజించలేదా? ఇట్టి ప్రశ్నల వల్ల మేము ఆధ్యాత్మిక ప్రసంగంలోకి దిగక తప్పలేదు.

ఈ విధంగా 24 రోజులు నా ఆనందయాత్ర సాగింది. హుగ్లీనది సౌందర్యం చూచుటకు కలకత్తా రేవులో ఓడదిగాను. ఆనాడే రైల్లో బొంబాయి బయలుదేరాను.

## 25. హిందూదేశంలో

కలకత్తా నుండి బొంబాయికి వెళ్లేదారిలో మధ్య ప్రయాగ ఉంది. అక్కడ రైలు 45 నిమిషాలు ఆగుతుంది. ఆ సమయంలో పట్నం చూడాలని కోరిక కలిగింది. అదీ గాక ఒక మందు కావలసి వచ్చింది. మందులు అమ్మే కెమిస్టు అర్ధ నిద్రావస్థలో వున్నాడు. మందివ్వడానికి బాగా ఆలస్యం చేశాడు. నేను స్టేషను చేరేసరికి రైలు బయలుదేరింది. ఆ స్టేషను మాష్టరు మంచివాడు. నాకోసం ఒక్క నిమిషం సేపు రైలును ఆపివుంచాడు. అయితే నేను రాకపోవడం చూచి నా సామాను క్రిందికి దింపించివేశాడు.

కెల్‌నర్ హోటల్లో ఒక గది తీసుకొని ఆ పట్నంలో వెంటనే నా పని ప్రారంభించాను. ప్రయాగయందలి "పయోనీర్" అను పత్రిక యొక్క ఖ్యాతిని గురించి వినియున్నాను. భారతీయుల కోరికలకు వ్యతిరేకంగా ఆ పత్రిక వ్రాస్తూ వుంటుందని విన్నాను. అప్పుడు డాక్టరు చేజనీగారు ఆ పత్రికకు ఉపసంపాదకులని గుర్తు. అన్ని పక్షాల వారి సాయం నాకు అవసరమని భావించి ఆయనకు ఒక చీటీ పంపించాను. రైలు బండి

యివాళ తప్పిపోయిందనీ, రేపు వెళ్లడం అవసరమనీ, అందువల్ల యీ రోజు అవకాశం యిస్తే తప్పక మీ దర్శనం చేసుకుంటానని ఆ చీటీలో వ్రాశాను. మంచిది రండి అని వెంటనే సమాధానం వచ్చింది. నాకు సంతోషం కలిగింది. ఆ ఆంగ్లేయుడు నా మాటలన్నీ విన్నాడు. "మీరు వ్రాసినదంతా చదివి నేను నా పత్రికలో టిప్పణి వ్రాస్తాను, అయితే మీ విధానాన్నంతటినీ నేనంగీకరించలేను. ఎందువల్లననగా నేటాలులోని భారతీయుల కోరికలను గురించి, అక్కడి తెల్లవారి అభిప్రాయాలను కూడా నేను పూర్తిగా తెలుసుకోవాలిగదా!" అని అన్నాడు.

'మీరు విషయాలన్నింటిని సంపూర్తిగా చదివి మీ పత్రికలో చర్చిస్తే చాలు. న్యాయం తప్ప నాకు మరొకటి అవసరం లేదు" అని నేను అన్నాను. మిగిలిన సమయం త్రివేణీ సంగమం సౌందర్యం గురించి యోచించుటకు గడిచిపోయింది. పయోనీరు అధికారితో నా యీ ఆకస్మిక కలయికయే నేటాలు రాష్ట్రంలో నేను పడిన యాతనలకు బీజారోపణం చేసిందని తరువాత తెలిసింది.

అక్కడినుండి బొంబాయిలో దిగకుండా తిన్నగా రాజకోటకు వెళ్లాను. దక్షిణ - ఆఫ్రికాయందు నివసిస్తున్న భారతీయుల్ని గురించి ఒక చిన్న పుస్తకం వ్రాయాలని నిర్ణయించుకున్నాను. ఆ పుస్తకం వ్రాయడానికి, ప్రచురించడానికి ఒక మాసం పట్టింది. దానిపైన పచ్చరంగు అట్ట వుండటం వల్ల దానికి పచ్చ పుస్తకం అని పేరు వచ్చింది. అందు దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితిగతులన్నీ వర్ణించాను. కావాలని చాలా విషయాలు తగ్గించి వ్రాశాను. గతంలో వ్రాసి ప్రకటించిన రెండు కరపత్రాల కంటే యిందు సరళభాషను ఉపయోగించాను.

పదివేల ప్రతులు ప్రకటించాను. హిందూదేశంలోని అన్ని పత్రికలకు, అన్ని పక్షాల నాయకులకు పంపించాను. అందరికంటే ముందు పయోనీరు పత్రికాధిపతి తన సంపాదకీయ వ్యాసంలో దీన్ని గురించి చర్చించాడు. ఆ వ్యాస సారాంశం రూటరు ద్వారా ఇంగ్లాండు చేరింది. అక్కడ నుండి ఆ సారాంశానికి సారాంశం నేటాలు కూడా చేరింది. అందు మూడు పంక్తుల కంటే ఎక్కువలేదు. నేటాలులోని భారత ప్రజలు పడుతున్న బాధలను గురించి నేను వ్రాసిన వ్యాసానికి అది కొద్ది సంస్కరణ అన్నమాట. అందలి శబ్దాలు నావికావు. ఈ వార్త నేటాల్లో ఎంతపని చేసిందో తరువాత మీకు బోధ పడుతుంది. పేరున్న పత్రికలన్నింటిలో నా వ్యాసాన్ని గురించి టీకలు, టిప్పణీలు ప్రకటితమయ్యాయి.

ఈ పుస్తకాలన్నింటికి కాగితాలు చుట్టి పోస్టులో పంపడం శ్రమతో కూడిన పని. ధనవ్యయం కూడా అధికం. అందుకు ఒక ఉపాయం కనిపెట్టాను. చుట్టుప్రక్కల గల పిల్లల్ని పిలిచాను. బడిలేని ప్రొద్దుటి పూట నాకు సాయం చేయమని వారిని కోరాను. వారు అంగీకరించారు. వారి శ్రమకు బదులుగా ముద్ర కొట్టిన తపాళా బిళ్లలు, ఆశీర్వాదాలు అందజేస్తానని చెప్పాను. పిల్లలు ఆడుతూ పాడుతూ ఆ పని పూర్తిచేశారు. చిన్న చిన్న పిల్లల్ని స్వయం సేవకులుగా తయారుచేయడం నా జీవితంలో యిదే ప్రథమం. ఆనాటి బాలమిత్రులలో ఇద్దరు నాతోబాటు యిప్పటికీ పనిచేస్తున్నారు.

ఆ రోజుల్లో బొంబాయిలో విపరీతంగా ప్లేగు వ్యాధి వ్యాపించింది. ఎటు చూచినా గగ్గోలే. రాజకోటలో కూడా యిది ప్రవేశించిందని భయం పట్టుకున్నది ఆరోగ్య విషయంలో మంచి నిపుణుణ్ణి అని నా భావం. నేను స్వచ్ఛందసేవ చేస్తానని తెలియజేశాను. ప్రభుత్వం వారు వెంటనే అంగీకరించి నన్ను రోగపరీక్షా సంఘంలో ఒక సభ్యునిగా నియమించారు. పాకీ దొడ్లు పరిశుభ్రంగా ఉంచాలని నేను గట్టిగా చెప్పాను. బీదవాళ్ళు తమ పాకీ దొడ్లు పరీక్షించుటకు వ్యతిరేకంగాలేరు. మేము సూచించిన సంస్కరణలన్నింటినీ జనం అమలులోకి తెచ్చారు. యిక ధనవంతుల విషయం. మేము వారి దొడ్లు పరీక్షిస్తామంటే వాళ్లు అంగీకరించలేదు. యిక సంస్కరణలు ఎలా జరుగుతాయి? ధనికుల పాకీదొడ్లు పాడుగా వున్నాయని అనుభవంవల్ల తెలిసింది. అంతా చీకటిమయం. తేమ ఊరుతూ వుంటుంది. దుర్గంధం విపరీతం. కూర్చునేచోట లుకలుకలాడుతూ పురుగులు. జీవితంలో యిదే నరకం అని అనిపించింది. అమిత బాధ కలిగింది. మేము చెప్పిన సంస్కరణలు బహుసులభం. మలం నేల మీద పడకుండా బొక్కెనలు వుంచమని చెప్పాం. నేల మీద పడి తేమ పుట్టించకుండా మూత్రం మరో బొక్కెనలో నింపమని చెప్పాం. పాకీ దొడ్లకు బయటి గోడలకు మధ్యగల కట్టడాలను కూల్చించివేశాము. గాలి, వెలుగు పాకీ దొడ్లలోకి బాగా వచ్చేలా చేసి శుభ్రం చేసేందుకు పాకీ వారికి సౌలభ్యం కలిగించాం. అయితే చాలామంది ధనికులు చివరి సలహాను అంగీకరించలేదు. కొంతమంది ధనికులు అసలు సంస్కరణలు అమలు చేయుటకు సిద్ధ పడలేదు.

ఈ సంఘం మాల పల్లెలకు కూడా వెళ్లి వాళ్ల దొడ్లను చూడాలని నిర్ణయించింది. ఎవ్వరూ మావెంట రావటానికి సిద్ధం కాలేదు. ఒక్కడు మాత్రం నాతోబాటు రావడానికి అంగీకరించాడు. మాలపల్లెకు వెళ్లడం, అక్కడి పాకీదొడ్లు చూడటం అంటే అందరికీ ఒక విధమైన ఆశ్చర్యం కలిగించింది. ఈ విషయం ఎవ్వరూ కలలోనైనా ఊహించి

యుండరన్నంత పని అయింది. మాలవాడకు వెళ్లడం నాకు అదే మొదలు. వాళ్ల యిళ్లు చూచి నేను నివ్వెరబోయాను. వాళ్లు కూడా మమ్మల్ని చూచి ఆశ్చర్యంతో చకితులైనారు. మీ పాకీ దొడ్లు చూచేందుకు వచ్చాం అని నేను అన్నాను. "మాకేమిటి పాకీ దొడ్లేమిటి. మేము బయటకి పోతాం. మీ వంటి గొప్పవారికేనండీ పాకీ దొడ్లు" అని వాళ్లన్నారు. "మేము మీ ఇళ్లు చూడవచ్చునా?" "అయ్యా, తప్పక చూడవచ్చు. అడ్డులేదు. మీకిష్టమొచ్చిన చోట చూడండి. అయ్యా, మా ఇళ్లా? యివన్నీ బొరియలండీ బొరియలు" అని అన్నారు.

నేను లోపలికి వెళ్లి వాళ్ల యిళ్లు ముంగిళ్లు చూచాను. ఇళ్లు ఆవుపేడతో అలికి వున్నాయి. కుండలు, చట్లు అన్నీ శుభ్రంగా వుండి నిగనిగలాడుతూ వున్నాయి. ఈ ప్రదేశంలో ప్లేగు భయం లేదు. ఇక గొప్పవారి పాకీ దొడ్లను గురించి వర్ణించడం అవసరం. అది ఒక భాగ్యశాలిది. ప్రతి గదికి తూములు వున్నాయి. నీటి తూములు, మూత్రపు తూములు కూడా అవే. అందువల్ల దుర్గంధం అపరిమితంగా ఉన్నది. ఇంట్లో మేడ మీద పడక గది వుంది. దానికి ఒక తూము వుంది. మల మూత్రాలకు అది ఒక్కటే మార్గం. ఆ తూము నుండి నేలకు ఒక గొట్టం అమర్చబడింది. అక్కడ నిలబడితే ముక్కు పగిలిపోవలసిందే. ఆ యింట్లో వాళ్లు అక్కడ ఎలా వుంటున్నారో ఎలా నిద్రిస్తున్నారో పాఠకులే ఊహించుకొందురుగాక.

మా బృందంవారు వైష్ణవాలయం కూడా చూచేందుకు వెళ్ళారు. అక్కడి పెద్ద పూజారికి, గాంధీ కుటుంబానికి చాలా కాలం నుండి స్నేహ సంబంధాలు వున్నాయి. దేవాలయమంతా చూపించడానికి, సంస్కరణల్ని అమలుబరచడానికి ఆయన అంగీకరించాడు. ఆ దేవళంలో ఆయన కూడా ఎన్నడూ చూడని ఒక చోటు మా కంటబడింది. పుల్లాకులు, ఊడ్చిన పెంట అక్కడ పడవేస్తారు. కాకులకు, గ్రద్దలకు అది నిలయం. పాకీ దొడ్లు పాడుగా వున్నాయని చెప్పనక్కరలేదు. రాజకోటలో ఎంతోకాలం నేను వుండలేదు. అందువల్ల ఆయన దాన్ని ఎంత వరకు బాగుచేయించాడో నాకు తెలియదు.

దేవాలయంలో దుర్గంధం చూచి చాలా బాధపడ్డాను. దేవాలయం పవిత్రమైనదని మనం భావిస్తాం. అక్కడ ఆరోగ్య విధులు పాటింపబడాలని ఆశిస్తాం. స్మృతి కర్తలు బాహ్యాంభ్యంతర శుద్ధి అత్యావశ్యకమని ఎంతగానో ఉద్ఘోషించారు. ఆ విషయం పన్వాలకు తెలియడం ఎంత అవసరమో అప్పుడు బోధపడింది.

# 26. రాజభక్తి

నాకు రాజభక్తి అధికం. అంతటి రాజభక్తి మరొకరికి వుందని నేను అనుకోను. సత్యం మీద నాకు గల స్వాభావికమగు ప్రేమయే యిట్టి రాజభక్తికి కారణమని భావిస్తున్నాను. ఇట్టి రాజభక్తి విషయంలోగాని, మరే విషయంలో గాని నటన అనునది నాకు చేతకాదు. నేటాలులో నేను పాల్గొనే ప్రతి సభలోను జనం గాడ్ సేవ్ ది కింగ్ అను పాట పాడి వెళ్లిపోతూ వుండేవారు. వారితో కలిసి పాడటం నా విధియని భావించేవాణ్ణి. బ్రిటిష్ పరిపాలనా దోషాలు నాకు తెలుసు. బ్రిటిష్ పరిపాలకుల యొక్క నీతి మొత్తం మీద మేలైనదని భావించేవాణ్ణి

దక్షిణ - ఆఫ్రికాలో గల వర్ణద్వేషం బ్రిటిష్ వారి సంప్రదాయిం కాదని నా భావం. అందువల్ల రాజభక్తిలో తెల్లవారిని కూడా మించిపోయాను. గాడ్ సేవ్ ది కింగ్ అను పాట కూడా నేర్చుకున్నాను. అందరూ లేచిపాడుతూ వున్నప్పుడు నేను కూడా లేచి నిలబడి ఆ పాట పాడుతూ వుండేవాణ్ణి. రాజభక్తి అవసరమని ప్రతి సమయంలోను నేను స్పష్టంగా ప్రకటిస్తూ వున్నాను.

జీవితంలో నేను ఎన్నడూ నా రాజభక్తిని అమ్ముకోలేదు. దాని ద్వారా ఎన్నడూ స్వప్రయోజనం సాధించాలని భావించలేదు. రాజభక్తి ఒక విధియని భావించాను. దానివల్ల ప్రతిఫలం నేనెన్నడూ ఆశించలేదు. పొందలేదు. నేను ఇండియాకు వచ్చిన రోజుల్లో విక్టోరియా రాణి "డైమండ్ జూబ్లీ" మహోత్సవం ఆరంభమైంది. రాజకోటలో ఏర్పాటుచేయబడ్డ ఒక సంఘంలో చేరమని నాకు పిలుపు వచ్చింది. నేను అంగీకరించాను. ఆ ఉత్సవం కూడా పైన పటారం లోన లొటారమే. అంతా మోసం. చాలా బాధపడ్డాను ఆ సంఘంలో సభ్యునిగా వుండటమా, మానడమా అను ప్రశ్న బయలుదేరింది. చివరికి యోచించి యోచించి 'పనిలో మాత్రం సత్యంగా వ్యవహరిద్దాం' అను నిర్ణయానికి వచ్చాను.

ఆ ఉత్సవాల్లో చెట్లు నాటటం ఒక కార్యక్రమం. చాలా మంది డాబు కోసం, పై అధికారుల మెప్పుకోసం, మొక్కలు నాటుతూ వున్నారని తెలిసింది. చెట్లు నాటడం ఒక విధి కాదు, అందువల్ల దీనికి బదులు మరో కార్యక్రమం చేపట్టమని వారికి మరీ మరీ చెప్పి చూచాను. కాని వాళ్ళు నా మాటను పట్టించుకోలేదు. నా పాలబడిన మొక్కను మాత్రం జాగ్రత్తగా నాటి, నీరు పోసి పెంచినట్లు గుర్తు.

మా పిల్లలకు కూడా గాడ్ సేవ్ ది కింగ్ అను పాటను నేర్పాను రాజకోట యందలి ట్రైనింగ్ కళాశాల విద్యార్థులకు కూడా యీ పాట నేర్పినట్లు గుర్తు. కాని అది జూబిలీలోనో లేక ఎడ్వర్డు పట్టాభిషేక సమయంలోనో సరిగా చెప్పలేను. కాని తరువాత ఆ పాటను నేను వ్యతిరేకించాను. నా మనస్సునందు ఆ హింసను గురించి చర్చ అధికమైన కొద్దీ నేను జాగ్రత్తపడ్డాను.

"రాజ శత్రువులను చంపుము ఆ మోసగాండ్ర మోసాలను ద్రుంపుము" అను పాటయందలి వాక్యాలు నాకు గిట్టలేదు నా మిత్రుడు డాక్టరు బూధ్‌గారికి నాయీ సంశయం తెలియజేశాను. ఆయన కూడా అంగీకరించి అహింసావాది ఎవ్వరూ ఇందుకు అంగీకరించరని, అట్టివారు దీన్ని పాడటం కష్టమని అన్నారు. ఈ పాటలో శత్రువులని ఊహించబడిన వారు మోసగాండ్రని ఎలా అనగలం? శత్రువులైనంత మాత్రాన తప్పంతా వారిదేనా? పరమేశ్వరుని వద్ద మనకు న్యాయం లభించును కదా! డాక్టరు బూధుగారు నా వాదాన్ని సమర్థించడమే గాక వారి సమాజంలో ఈ పాటకు బదులు మరో పాటను రచించి గానం చేయసాగారు.

రాజభక్తితో బాటు రోగులకు ఉపచారం చేయడం నాకు అలవాటు అయిపోయింది మిత్రులైనా, పరులెవరైనా వారికి ఉపయోగపడటమంటే నాకు ఎంతో ప్రీతి.

రాజకోటలో దక్షిణ - ఆఫ్రికాను గురించి కరపత్రం వ్రాస్తున్నప్పుడు నేను ఒక పర్యాయం బొంబాయి వెళ్లవలసి వచ్చింది. పెద్ద పెద్ద పట్టణాల్లో సభలు ఏర్పాటు చేసి యీ విషయమై ప్రజాభిప్రాయం సేకరించాలని నా అభిలాష అందుకు ముందుగా బొంబాయిని ఎన్నుకొన్నాను. జడ్జీ రేవడేగారిని కలసి మాట్లాడాను. నేను చెప్పిందంతా విని, చివరికి ఫిరోజ్‌షా మెహతాగారిని చూడమని చెప్పారు.

తరువాత జడ్జీ బదురుద్దీన్ తైయబ్జీగారిని చూచాను. వారు కూడా అదే విధంగా చెప్పి 'రేనడేగారు, నేనూ ఏమీ చేయలేము. మా స్థితి నీకు తెలుసు. ప్రజా వ్యవహారాల్లో మేము కల్పించుకోకూడదు నీ పనికి మేము అనుకూలురం. యీ విషయంలో నీకు సాయం చేయగల వారు ఫిరోజ్ షా మెహతాగారొక్కరే" అని చెప్పారు.

నేను ఫిరోజ్ షా మెహతా గారి దర్శనం చేసుకోవాలని మొదటనే భావించాను. ఈ పెద్దలు వారి సాయం పొందమని చెప్పడం వల్ల ప్రజల్లో వారికి ఎంత పలుకుబడి వున్నదో బోధపడింది.

నేను వారి దగ్గరికి వెళ్లి వారిని కలిశాను. వారిని చూచేసరికి కళ్లు మిరిమిట్లుగొన్నంత పని అయింది. వారి పేరుతో బాటు ప్రచారంలో వున్న బిరుదులు చాలా విన్నాను. బొంబాయి కేసరి అని, మకుటంలేని బొంబాయి పాదుషా అని బిరుదులు వారికి వున్నాయి. కాని బొంబాయి పాదుషా అనుకున్నంత భయంకరంగా లేడు. పితృవాత్సల్య భావంతో ఎదిగిన కుమారుణ్ణి ఆదరించినట్లు ఆయన నన్ను ఆదరించాడు. మేమిద్దరం వారి గదిలో కూర్చున్నాం. మిత్రులు, అనుయాయులు ఆయన చుట్టూ ఉన్నారు. వారిలో డి ఇ వాచాగారొకరు. కామాగారు మరింకొకరు. ఆ యిద్దరికీ నేను పరిచయం చేయబడ్డాను. లోగడ వాచాగారిని గూర్చి విని వున్నాను. అతడు మెహతాగారికి కుడిభుజం. ఆయన లెక్కల్లో గట్టివాడని వీరచంద్ గాంధీ చెప్పారు. మనిద్దరం కలిసి మాట్లాడాలి అని వాచాగారన్నారు.

రెండు నిమిషాల్లో యిదంతా జరిగింది. మెహతాగారు నేను చెప్పిందంతా శ్రద్ధగా విన్నారు. నేను రనడే గారిని, తైయబ్జీగారిని చూచానని వారికి చెప్పాను. "గాంధీ! ముందుగా ఒక పని జరగాలి. నీ పనికి నేను తప్పక సహాయం చేస్తాను" అని మెహతాగారు వెంటనే తన కార్యదర్శి మున్షీగారిని పిలిచి సభాదినం నిర్ణయించమని అన్నారు. సభాదినం నిశ్చితమైంది. "సభ రేపు జరుగుతుందనగా నీవు నాకొక్కసారి కనపడు" అని మెహతాగారు నన్ను పంపివేశారు. వారి సంభాషణ విన్న తరువాత నాకు భయం పోయింది. సంతోషంతో ఇంటికి చేరాను.

మా బావ బొంబాయిలోనే వున్నాడు. ఆయనను చూచేందుకు వెళ్లాను. ఆయన జబ్బుపడి వున్నాడు. బీదవాడు. నా సోదరి వల్ల ఆయనకు ఉపచారం జరగడం కష్టంగా వుంది. నాతో రాజకోటకు రమ్మని అన్నాను. అతడు అంగీకరించాడు. నా సోదరిని, బావను తీసుకొని రాజకోట చేరాను. వ్యాధి ఎక్కువైంది. రాత్రింబవళ్ళు ఆయనకు ఉపచారం చేశాను. రాత్రిళ్లు మేలుకొని వుండవలసి వచ్చింది. ఆయనకు ఉపచారం చేస్తూనే దక్షిణ ఆఫ్రికాను గురించి వ్రాస్తూ వున్నాను. చివరికి ఆయన కన్నుమూశాడు. తుదికాలంలో ఆయనకు ఉపచారం చేసే అవకాశం లభించినందున నా మనస్సుకు శాంతి లభించింది.

ఈ విధంగా రోగులకు ఉపకరించాలనే కోరిక ముందు ముందు బాగా ఎక్కువైంది. రోగుల సేవలో వున్నప్పుడు నా మిగతా పనుల విషయంలో జాగ్రత్తపడుతూ వుండేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు నా భార్యనేగాక యింటివారందరినీ ఆ పనులకు వినియోగిస్తూ వుండేవాణ్ణి.

ఈ ప్రవృత్తిని నేను కోరిక అని అంటాను. ఏ మంచిపని అయినా సకాలంలో ఉపయోగపడితే అది తక్షణం ఆనందం కలిగిస్తుంది. అది నా అనుభవం. దంభంతో లేక పరభీతితో చేసే పని చివరికి అతణ్ణే అణచివేస్తుంది. అట్టివాళ్లు మాసిపోతారు. ఏ సేవ హృదయానికి ఆనందం కలిగించదో అది సేవచేసేవానికీ, సేవ చేయించుకొనే వానికి కూడా ఆహ్లాదం కలిగించదు. సేవ ముందు భోగాలు, ధనోపార్జన మొదలుగా గల కోరికలన్నీ తుచ్ఛమైనవిగా తోస్తాయి.

## 27. బొంబాయిలో

మా బావ కన్నుమూసిన మరునాడే నేను బొంబాయి వెళ్లవలసి వచ్చింది. ఉపన్యాసం సిద్ధం చేసేందుకు తగినంత వ్యవధి దొరకలేదు. రాత్రింబవళ్ళు నిద్రలేకపోవడం వల్ల నాకు ఒంట్లో బాగుండలేదు. గొంతు బొంగురుపోయింది. అయినా దేవుడి మీద భారం వేసి బొంబాయికి బయలుదేరాను. ఉపన్యాసం వ్రాసుకు వెళ్లాలని నేను కలలోనైనా ఊహించలేదు.

సర్ ఫిరోజ్‌షా మెహతాగారి ఆదేశానుసారం సభకు ఒకరోజు ముందు అయిదు గంటలకు ఆఫీసులో వారి దర్శనం చేసుకున్నాను.

"గాంధీ! నీ ఉపన్యాసం వ్రాసి సిద్ధం చేశావా?" అని అడిగారు "లేదు ఆశువుగా ఉపన్యసిస్తాను"అని బెదురుతూ జవాబిచ్చాను. "బొంబాయిలో యిది చెల్లదు. పత్రికలకు, దేశ దేశాంతరాలకు ఉపన్యాస విషయం పంపేవారు వారి యిష్టానుసారం మార్చి పంపుతారు. మన సభవల్ల ప్రయోజనం జరగాలంటే ఉపన్యాసం వ్రాసి సిద్ధం చేసుకోవడం అవసరం. ఆ ఉపన్యాసాన్ని తెల్లవారే లోగా ముద్రించాలి. అయితే యీ రాత్రికి ఉపన్యాసం సిద్ధం కాదా?" అని అడిగారు. నేను కంగారుపడ్డాను. తరువాత చిత్తం అని అన్నాను.

"వ్రాత ప్రతి కోసం మున్షీగారిని మీ దగ్గరకి ఎన్ని గంటలకు పంపమంటారో చెప్పండి" అని బొంబాయి కేసరి అడిగారు "రాత్రి 11 గంటలకు" అని సమాధానం యిచ్చాను. మెహతాగారు మున్షీని పిలిచి రాత్రి 11 గంటలకు గాంధీ దగ్గరకు వెళ్లి ఉపన్యాస ప్రతి తీసుకో, ప్రెస్సులో ముద్రణకు యిచ్చి తెల్లవారేసరికి ముద్రిత ప్రతులు మన చేతుల్లో ఉండేలా చూడు అని ఆజ్ఞాపించి నన్ను యింటికి పంపించివేశారు.

మర్నాడు సభకు వెళ్ళాను. ఫిరోజ్‌షా మెహతాగారు ఉపన్యాసం వ్రాసి చదువమని ఎంత దూరదృష్టితో చెప్పారో నాకు బోధపడింది. ఫ్రాంజీకావస్‌జీ ఇన్‌స్టిట్యూట్

హాలులో సభ జరిగింది. ఫిరోజ్‌షా మెహతాగారి సభ జరిగితే నిలబడడానికి కూడా హాలులో చోటు దొరకదని విన్నాను. వారి ఉపన్యాసం అంటే విద్యార్థులు చెవి కోసుకుంటారు.

అంతమంది జనంతో కిటకిటలాడిన సభను చూడటం నాకు అదే మొదటిసారి. నా కంఠధ్వని ఎవ్వరికీ వినబడలేదు. భయపడుతూ భయపడుతూ కంఠం పెద్దది చేశాను. ఫిరోజ్‌షాగారు బిగ్గరగా, ఇంకా బిగ్గరగా అని అంటూ నన్ను మధ్య మధ్య ప్రోత్సహించారు. వారు ప్రోత్సహించిన కొద్దీ నా కంఠం కుంచించుకుపోసాగింది.

ఇంతలో నా పాత మిత్రుడు కేశవరావు దేశపాండే గారు వచ్చి ఆదుకున్నారు. నా ఉపన్యాసం వారి చేతుల్లో వుంచాను. అతని కంఠం సభకు సరిపోయే రకంగా లేదు. సభ్యులెవరు వింటారు ? "వాచా, వాచా" అని కేకలు సభలో వినబడ్డాయి. అప్పుడు వాచాగారు లేచి దేశపాండేగారి చేతిలోని కాగితాలు తీసుకొని నా పని పూర్తిచేశారు. సభ నిశ్శబ్దం అయింది. శ్రోతలు చివరివరకు శ్రద్ధగా విన్నారు. విషయాన్ని బట్టి 'సిగ్గు, సిగ్గు' అని అరిచారు. కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. నాకు ఎంతో సంతోషం కలిగింది.

సర్ ఫిరోజ్‌షా మెహతాగారు నా ఉపన్యాసాన్ని ప్రశంసించారు. నాకు గంగాస్నానం చేసినట్లనిపించింది. దేశ పాండేగారు, మరో పారసీ గృహస్థుడు నాకు పూర్తిగా సాయం చేయటానికి సిద్ధపడ్డారు. ఆ పారసీ మిత్రుడు పెద్ద ప్రభుత్వ ఉద్యోగి. అందువల్ల ఆయన పేరు వ్రాయడానికి జంకుతున్నాను. యీ యిద్దరూ దక్షిణ - ఆఫ్రికాకు వస్తామని మాట యిచ్చారు. కాని అప్పుడు స్మాల్ కాజ్ కోర్టు జడ్జీయగు సి.ఎం ఖరోసేర్‌జీ వీరి మాటల్ని బూటకం చేశారు. దీనికి కారణం ఒక పారసీ మహిళ. అతడు ఆమెను పెండ్లి చేసుకోవడమే మంచిదని భావించాడు. యీ మిత్రుని వాగ్దాన భంగానికి నేటాలులోని పారసీ రుస్తుంజీ ప్రాయశ్చిత్తం చేసుకున్నారు. యిప్పుడు అనేకమంది పారసీ మహిళలు ఖద్దరు ప్రచారానికి పూనుకొని ఆ పారసీకుని దోషానికి తాము ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నారు. నేనా దంపతుల్ని సంతోషంతో అభినందించాను. యిక దేశపాండే గారికి పెండ్లి ఆశలేదు. కాని అతడు కూడా రాలేకపోయాడు. నేడు అతడు కూడా అందుకు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నాడు.

నేను దక్షిణ - ఆఫ్రికాకు బయలుదేరినప్పుడు జింజాబిరులో ఒక తైయబ్జీ వంశజుడు కనబడ్డాడు. అతడు కూడా నాకు సాయపడతానని అన్నాడు. కాని అలా చేయలేదు. అందుకు అబ్బాస్ తైయబ్జీగారు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నారు. యీ విధంగా బారిస్టరు మిత్రులను దక్షిణ - ఆఫ్రికాకు తీసుకొని వెళ్లాలని నేను చేసిన మూడు ప్రయత్నాలు ఫలించలేదు.

ఈ సందర్భంలో పేస్తన్‌జీ పాదుషాగారు నాకు బాగా గుర్తు వస్తున్నారు. నేను ఇంగ్లాండులో వున్నప్పటి నుండి మా యిద్దరికీ స్నేహం. మేము మొదట లండనులో ఒక శాకాహారశాలలో కలుసుకున్నాము. యితని తమ్ముడు బరజో-రజీపాదుషా గారిని నేను ఎరుగుదును. అతనికి వెర్రివాడని పేరు వచ్చింది. మేమెన్నడూ ఒకచోట ఉండలేదు. మిత్రులు అతనికి చక్రం (నిలకడలేక గిర్రున తిరిగే చక్రం వంటివాడు) అని పేరు పెట్టారు. గుర్రాల బగ్గీ ఎక్కడం తప్పని భావించి, ఇతడు ట్రాము బండి ఎక్కడం కూడా మానుకున్న రకం. శతావధానికి అవసరమైన ధారణాశక్తి వున్నప్పటికీ ఏ డిగ్రీ అతడు పుచ్చుకోలేదు. స్వయంకృషితో స్వాతంత్ర్యం అలవరచుకున్నాడు. పుట్టింది పారసీకుల్లోనైనా, పేరులేదు ఇతని బుద్ధి వైభవం ప్రఖ్యాతం. ఇంగ్లాండులో కూడా ఇతనికి మంచి ప్రఖ్యాతి ఉండేది. మా ఇద్దరి మైత్రికి మూలకారణం శాకాహారమే. అతనితో బుద్ధి వైభవంలో పోటీ పడటం నా తరం కాదు.

అతని చిరునామా బొంబాయిలో వెతికి సంపాదించాను పేస్తన్జీ హైకోర్టులో ఉద్యోగం చేస్తూ వున్నాడు. అప్పుడతడు పెద్ద గుజరాతీ నిఘంటువు తయారుచేస్తున్నాడు. దక్షిణ - ఆఫ్రికాలోని ఉద్యమానికి సహాయపడమని ఎంతో మందిని కోరాను. పేస్తవన్జీ పాదుషా తాను ఎట్టి సాయం చేయనని చెప్పడమేగాక, నీవు కూడా తిరిగి దక్షిణ - ఆఫ్రికాకు వెళ్లవద్దని గట్టిగా చెప్పాడు.

"నేను నీకు సాయం చేయలేను. నీవు తిరిగి దక్షిణ - ఆఫ్రికా వెళ్లడం మంచిది కాదని నా అభిప్రాయం మనదేశంలో చేయవలసిన పని కరువైందా ? మనం మాతృభాషకు చేయవలసిన పని తక్కువగా వున్నదా ? నేనిప్పుడు విజ్ఞాన శాస్త్రానికి భాష వెతుకుతున్నాను. మనం చేయవలసింది ఎంతో వుంది. దాని ముందు దక్షిణ - ఆఫ్రికా వ్యవహారం ఎంత ? లొడితెడు. దేశ దారిద్ర్యం చూడు. దక్షిణ ఆఫ్రికాలో భారతీయులు చిక్కుల పాలై వుండటం యదార్థమే, కాని నీ వంటివాడు దానికి బలి కావడం నాకు ఇష్టంలేదు. మనం స్వరాజ్యం సంపాదిద్దాం. అప్పుడు దక్షిణ - ఆఫ్రికాలో వున్న భారతీయులకు తేలికగా సహాయపడవచ్చు. నిన్ను మార్చలేనని నాకు తెలుసు. కాని నీతోపాటు మరొకరిని తీసుకొనిపోవడం నాకు సమ్మతం కాదు" అని స్పష్టంగా చెప్పివేశాడు.

నాకీ ఉపదేశం రుచించలేదు. కాని యీ సంభాషణ వల్ల ఆయన యెడ నాకు ఆదరం పెరిగింది. అతని దేశ ప్రేమ మరియు భాషా ప్రేమను చూచి ముగ్ధుడనయ్యాను. ఈ ప్రసంగం వల్ల మా మైత్రి యింకా సుదృఢమైంది. ఆయన ఉద్దేశ్యం నేను

గ్రహించాను. కాని నేను దక్షిణ - ఆఫ్రికా ఉద్యమం మానుకోవడానికి బదులు మరికొంచెం ఉధృతం చేశాను. ఏ దేశభక్తుడూ దేశసేవలో ఏ దేశాన్ని మరువలేడు కనుకనే నాకు క్రింది గీతాశ్లోకం సదా జ్ఞాపకం వస్తూ వుండేది.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః"

(గీత. 3వ అధ్యాయం 35వ శ్లోకం)

"పరధర్మాన్ని అనుష్టించడం కంటే గుణములేనిదైనను స్వధర్మాన్నే అనుష్టించడం మంచిది. స్వధర్మం నిర్వహిస్తూ చచ్చినా మేలే, పరధర్మం భయావహం"

## 28. పూనాలో

సర్ ఫిరోజ్‌షా మెహతా గారు నా పనిని సులభం చేశారు. బొంబాయి నుండి నేను పూనా వెళ్లాను. పూనాలో రెండు పక్షాలున్నాయని నాకు తెలుసు. నాకు అన్ని పక్షాలవారి సాయం అవసరం. లోకమాన్యుని దర్శించాను. "అన్ని పక్షాల సాయం కావాలని నీవు భావించడం మంచిది. ఈ విషయంలో ఎవ్వరికీ అభిప్రాయ భేదం వుండదు. కాని యిందుకు సభాపతిగా తటస్థుడు కావాలి. మీరు ప్రొఫెసర్ భండార్కరు గారిని దర్శించండి. వారు యిప్పుడు సభలకు రావడం మానుకున్నారు. ఏ సభలకూ రావడం లేదు. కాని మీ సభకు అంగీకరిస్తారని భావిస్తున్నాను. వారిని కలిసాక పర్యవసానం ఏమైందో నాకు తెలుపండి. నేను సంపూర్తిగా మీకు సాయం చేయాలని కోరుతున్నాను. మీరు ప్రొఫెసరు గోఖలేగారి దర్శనం చేయండి. నన్ను చూడటం అవసరం అయితే మీకు వీలు అయినప్పుడల్లా తప్పక వచ్చి నన్ను కలవండి" అని లోకమాన్యుడు అన్నారు. లోకమాన్యుని చూడటం నాకు అదే ప్రథమం. వారు యింత లోకప్రియులెట్లా అయినారో అప్పుడు నాకు తెలిసింది.

అక్కడ నుండి నేను గోఖలేగారి దగ్గరకి వెళ్లాను వారు ఫెర్గుజన్ కాలేజీలో వున్నారు. నన్ను అమిత అప్యాయంగా చూచారు. ఆత్మీయుణ్ణి చేసుకున్నారు. వారితో పరిచయం కూడా ప్రథమ పర్యాయమే. నాకు ప్రథమ పర్యాయమే పరిచయం అయినా అది ప్రథమ పరిచయం అనిపించలేదు. ఎప్పటినుండో పరిచయం ఉన్నట్లు అనిపించింది. సర్‌ఫిరోజ్ షా మెహతాగారు హిమాలయం, లోకమాన్యుడు సముద్రం, గోఖలే గంగ. ఇందు స్నానం చేయడం సులభం. హిమాలయంపై ఎక్కడం కష్టం. సముద్రంలో దిగాలంటే భయం కాని గంగ ఒడిలో ఆడుకోవచ్చు. దానిలో నావమీద

పయనించవచ్చు. బడిలో చేర్చుకునేప్పుడు పిల్లవాణ్ణి పరీక్షించినట్లు గోఖలేగారు నన్ను పట్టి పట్టి పరీక్షించారు. ఎవరెవరి దర్శనం చేయాలో, ఎట్లా చేయాలో వివరంగా చెప్పారు. నా ఉపన్యాసం ఒకసారి చూస్తాననిఅన్నారు. కాలేజీ అంతా చూపించారు. "మీరు యిష్టం వచ్చినప్పుడు వచ్చి నన్ను కలవండి. ప్రొఫెసరు భండార్కరు గారిని కలసిన తరువాత ఏమైందో నాకు చెప్పండి అని సెలవిచ్చారు. గోఖలేగారు జీవించియున్నంత కాలం రాజనీతి విషయాల్లో నా హృదయాన్ని పూర్తిగా ఆక్రమించారు. కన్నుమూసిన తరువాత కూడా వారు ఆ విధంగా నా హృదయాన్ని ఆక్రమించేవున్నారు. మరెవ్వరూ అంతగా నా హృదయాన్ని ఆక్రమించలేదు. కుమారుణ్ణి తండ్రి ఏవిధంగా ఆదరిస్తాడో ఆవిధంగా ప్రొఫెసర్ భండార్కరు గారు నన్ను ఆదరించారు. రెండు జాములప్పుడు నేను వెళ్లి వారిని కలిశాను. శాస్త్రాలలో పరిశ్రమ చేసిన ఆ పండితునికి నేను ఆ సమయంలో కూడా పని చేయడం ఆనందం కలిగించింది. తటస్థుడైన సభాధ్యక్షుడు కావలయునను నా పట్టుదలను విని అది మంచిది మంచిది అను మాటలు వారి నోట సహజంగా వెలువడ్డాయి.

నా మాటలు పూర్తి అయ్యాక వారు యిట్లా అన్నారు. "నేను రాజకీయాల్లోకి అడుగుపెట్టడం లేదని ఎవర్ని అడిగినా చెబుతారు. కాని మిమ్మల్ని విముఖుణ్ణి చేయలేను. మీ వాదం న్యాయమైనది. మీ ఉద్యమం స్తుత్యం. మీ సభకు నేను రాను అని అనలేను. శ్రీయుతులు తిలక్‌గారిని, గోఖలే గారిని దర్శించారు. మంచిపని చేశారు. ఈ యిరుపక్షాలవారూ నన్ను ఆహ్వానిస్తే వస్తాను. సమయ నిర్ణయానికి నన్ను అడగవలసిన పని లేదు. వారికెప్పుడు అనుకూలమో నాకు అప్పుడే అనుకూలం. మీకు ధన్యవాదాలు, ఆశీర్వాదాలు"

చడీచప్పుడు గాకుండా ఆడంబరం లేకుండా ఆ విద్యాంసులు, ఆ మహాత్యాగులు సభ జరిపి నన్ను ప్రోత్సహించి పంపారు.

నేనక్కడి నుండి మద్రాసు వెళ్లాను. మద్రాసు ప్రజలు నా రాక విషయం తెలిసి ఎంతో సంతోషించారు. బాల సుందరం కథ సభను ఆకట్టుకుంది. నా ఉపన్యాసం పెద్దదైంది. అంతా ముద్రిత ఉపన్యాసమే. సభ ఒక్కొక్క శబ్దాన్ని మనస్సుకు పట్టించుకొని విన్నది. సభ ముగిసిన తరువాత పచ్చ పుస్తకం కోసం జనం ఎగబడ్డారు. మద్రాసులో అవసరం అవుతుందని భావించి కొన్ని మార్పులు చేసి మరో 10 వేల ప్రతులు ముద్రింపచేశాను. అవన్నీ వేడి వేడి రొట్టెల్లా అమ్మకం అయ్యాయి. పదివేల ప్రతులు అవసరం లేదనిపించింది. ప్రజల ఉత్సాహం మీదనే నేను ఎక్కువగా ఆధారపడ్డాను. నా ఉపన్యాసం ఇంగ్లీషు వచ్చిన వారికోసం గదా! వారికిన్ని ప్రతులు అక్కరలేదని నా అభిప్రాయం.

మద్రాసులో స్టాండర్డు పత్రికా సంపాదకులు, కీర్తి శేషులునగు పరమేశ్వరన్ పిళ్లెగారు నాకు అక్కడ ఎంతగానో సాయం చేశారు. వారు విషయాన్ని చక్కగా చదివారు. అనేకసార్లు తమ ఆఫీసుకు నన్ను తీసుకువెళ్లారు. సలహాలు యిచ్చారు. హిందూ పత్రికాధిపతులు జి. సుబ్రహ్మణ్యంగారి దర్శనం చేసుకున్నారు. డాక్టరు సుబ్రహ్మణ్యం గారి దర్శనం, సానుభూతి లభించింది. పరమేశ్వరన్ పిళ్లెగారు తమ పత్రికల్లో వెంటనే రమ్మని పిలుపు. ఈ విషయాన్ని గురించి నా యిష్ట ప్రకారం వ్రాయుటకు అంగీకరించారు. నేను కూడా వారొసంగిన సౌకర్యాన్ని బాగానే వినియోగించుకున్నాను. సభ పచ్చయప్ప హాల్లో జరిగినట్లు డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించినట్లు గుర్తు.

ఉపన్యాసం ఎక్కువగా ఇంగ్లీషులో జరిగినా, స్వగృహంలో లభించే ప్రేమ, ఉత్సాహం మద్రాసులో నాకు లభించాయి. ప్రేమ, ఛేదించలేని బంధం ఏమీ ఉండదు గదా!

## 29. వెంటనే బయలుదేరిరమ్మని పిలుపు

మద్రాసు నుండి కలకత్తా వెళ్లాను. కలకత్తాలో నా కష్టాలకు అంతు లేదంటే నమ్మండి. అచట గ్రేట్ ఈస్టరన్ హోటల్లో దిగాను. నేనక్కడ ఎవర్నీ ఎరగను. హోటల్లో డెయిలీ టెలిగ్రాఫ్ పత్రికా ప్రతినిధి మిస్టర్ ఎల్లర్ థార్ప్తో పరిచయం కలిగింది. వారి బస బెంగాల్ క్లబ్బులో. వారు నన్ను అచ్చటికి రమ్మని చెప్పారు. అచటి డ్రాయింగ్ రూములో భారతీయులకు ప్రవేశం లేదను సంగతి వారికి తెలియదు. అప్పుడే వారికి ఆ నిషేధం విషయం తెలిసింది. నన్ను వారు తమ గదిలోకి తీసుకువెళ్లారు. అక్కడ నల్లవారి మీద తెల్లవారు చూపే ఈర్ష్యకు వారు విచారం వ్యక్తం చేశారు. నన్ను లోపలికి తీసుకొని వెళ్లజాలనందుకు క్షమించమని అన్నారు.

వంగ దైవం సురేంద్రనాథ బెనర్జీగారిని దర్శించాలి. వారి దర్శనానికి వెళ్లాను అప్పుడు వారి చుట్టూ చాలామంది ఉన్నారు. వారు యిట్లా అన్నారు. ''మీ మాట యిక్కడ ఎవ్వరూ వినరని నా భయం. మా పాట్లన్నీ మీరు చూస్తున్నారు గదా! అయినా కొద్దో గొప్పో ప్రయత్నించి చూడాలి. యిందుకు మీకు మహారాజుల మద్దతు అవసరం. బ్రిటిష్ ఇండియా అస్సోసియేషన్ ప్రతినిధిని చూడండి రాజాసర్ ప్యారమోహన్ ముఖర్జీగారిని, మహారాజా టాగోరు గారిని కలవండి. వీరిరువురు ఉదారులు. సార్వజనిక కార్యాల్లో ఎక్కువగా పాల్గొంటూ వుంటారు.'' అని అన్నారు.

నేను అసజ్జనుల్ని సందర్శించాను. కాని అక్కడ పప్పులుడకలేదు. యిద్దరూ కలకత్తాలో సభ చేయడం సులభసాధ్యం కాదనీ, ఏమైనా చేయగలిగితే శ్రీ సురేంద్రనాధ బెనర్జీ గారే చేయగలరని చెప్పారు. నా పని కష్టతరం కాసాగింది. అమృత బజార్ పత్రిక ఆఫీసుకు వెళ్లాను అక్కడ నన్ను చూచిన సజ్జనులంతా నేనొక దేశ దిమ్మరినని భావించారు. వంగవాసి ప్రతికాధిపతి ఇంకో మెట్టు పైకెక్కాడు. అక్కడ ఒక గంట సేపు వేచి వుండవలసి వచ్చింది. ఆయనతో మాట్లాడటానికి చాలామంది వచ్చారు. వాళ్లనందరినీ పంపించిన తరువాత కూడా వారు నన్ను కన్నెత్తి చూడలేదు. ఒక గంటసేపు ఆవిధంగా గడిపాను. చివరికి గత్యంతరం కనబడక నా విషయం చెప్పివేద్దామని ఉద్యుక్తుడనయ్యాను. వెంటనే ఆయన అందుకొని "నాకు ఎన్ని పనులున్నాయో మీకు కనిపించడం లేదా? మీవంటి వాళ్లు యిక్కడ వేలకు వేలు. మీరిక్కడ నుండి వెళ్లిపోవడం చాలా మంచిది. మీ మాట నేను వినదలుచుకోలేదు" అని అన్నాడు. నాకు కొంచెం కోపం వచ్చింది. కాని ఆ సంపాదకుని అవస్థ అర్థం చేసుకున్నాను వంగవాసి పత్రికా ఖ్యాతిని గురించి విన్నాను. అక్కడికి వచ్చి పోయే జన ప్రవాహాన్ని కూడా చూచాను. ఆ వచ్చిపోయేవారంతా ఆయనకు పరిచితులు. వారి పత్రికకు వార్తల లోపం లేదు. ఆరోజుల్లో దక్షిణ ఆఫ్రికాను గురించి చాలామంది వినియుండలేదు కూడా. ప్రతిరోజు చాలామంది వచ్చి తమ తమ కష్టాల్ని వారికి వినిపిస్తూ వుండేవారు. ఎవరి కష్టం వారికి ముఖ్యంగదా! వచ్చిన వారంతా సంపాదకునికి ఎదురూగా కూర్చుంటారు వాళ్లందరినీ ఊరడించడం ఎలా ? వారు పత్రికా సంపాదకుని మాటకు గొప్పశక్తి కలదని భావిస్తారు. కాని గడపదాటితే తన మాట చలామణీ కాదని ఆ పత్రికా సంపాదకునికి బాగా తెలుసు.

నేను అధైర్యపడలేదు. యితర పత్రికా సంపాదకుల్ని వెళ్లి కలిశాను. నా అలవాటు ప్రకారం ఆంగ్లో ఇండియన్ పత్రికా సంపాదకుల్ని కూడా కలిశాను. నేను వారితో చాలాసేపు మాట్లాడాను. నేను మాట్లాడిందంతా వారు తమ పత్రికలలో ప్రకటించారు. ఇంగ్లీషుమన్ పత్రికా సంపాదకుడు సాండర్సు గారు నన్ను తన మనిషిగా చూచుకున్నారు తన ఆఫీసును, తన పత్రికను నా వశం చేశారు. దక్షిణ - ఆఫ్రికాను గూర్చి ప్రధాన వ్యాసాల్లో నా యిష్టం వచ్చినట్లు మార్పులు చేయుటకు అంగీకరించారు. వారికి నాకు గొప్ప స్నేహం కుదిరిందని చెప్పడం అతిశయోక్తి

కానేరదు. వారు తమ శక్తి కొద్దీ నాకు సాయం చేస్తామని మాట యిచ్చారు. దక్షిణ - ఆఫ్రికాకు వెళ్ళిన తరువాత కూడా తమకు జాబు వ్రాయమని చెప్పారు. నాకు చేతనైనంత చేస్తాను. అని వారు మాట యిచ్చారు. తమ మాటను తుచ తప్పకుండా పాటించారు. ఆరోగ్యం చెడిపోనంతవరకు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే వున్నారు. నా జీవితంలో అనుకోకుండా ఏర్పడిన ఇటువంటి తీయని స్నేహాలు ఎన్నో వున్నాయి. నా మాటల్లో అతిశయోక్తులు లేకపోవడం, సత్యపరాయణత్వం నిండివుండటం సాండర్సు గారి స్నేహానికి కారణం. వారు నన్ను శల్య పరీక్ష చేశారు. దక్షిణ - ఆఫ్రికాలోని తెల్లవారి దోషాలు ఖండించడంలోను, సుగుణాలు చెప్పడంలోను కూడా నేను వెనుకాడలేదని వారికి బోధపడింది.

ప్రతి పక్షికి న్యాయం చేయడం వల్ల మనం త్వరగా న్యాయం పొందగలమని నా అనుభవం చెబుతూ వున్నది. ఇట్లా తలవని తలంపుగా సాయం చేకూరడం వల్ల కలకత్తాలో కూడా సభ జరుపవచ్చుననే ఆశ కలిగింది. అందుకోసం కృషి చేస్తుండగా దర్బను నుండి ఒక టెలిగ్రాం వచ్చింది. "జనవరిలో పార్లమెంటు సమావేశం జరుగుతున్నది వెంటనే బయలుదేరి రండి" అని ఆ టెలిగ్రాంలో వుంది. ఆ కారణం వల్ల వెంటనే దక్షిణ - ఆఫ్రికా వెళ్లవలసి వున్నదని పత్రికలో ప్రకటించి కలకత్తా విడిచిపెట్టాను. మొదటి స్టీమరులో నాకు ప్రయాణ సౌకర్యం కల్పించమని దాదా అబ్దుల్లా గారి ఏజంటుకు బొంబాయికి తంతి యిచ్చాను. దాదా అబ్దుల్లా గారు "కుర్‌లేండ్" అను స్టీమరు కొన్నారు. దానిలో కిరాయి లేకుండా నన్ను నా కుటుంబ సభ్యుల్ని తీసుకుపోతామని పట్టుపట్టారు. నేను ధన్యవాదాలు చెప్పి అందుకు అంగీకరించాను. కుర్‌లేండ్‌లో నా ధర్మపత్నిని, నాయిద్దరు పిల్లల్ని కీర్తిశేషుడగు మా బావగారి కుమారుణ్ణి తీసుకొని రెండవసారి దక్షిణ-ఆఫ్రికాకు బయలుదేరాను. యీ స్టీమరుతో బాటు "నాదరీ" అను మరో స్టీమరు దక్షిణ -ఆఫ్రికాకు బయలుదేరింది. దీనికి కూడా ఏజంటు దాదా అబ్దుల్లాయే. ఈ రెండు స్టీమర్లలో మొత్తం ఎనిమిది వందల మంది యాత్రికులు వున్నారు. అంతా ట్రాన్సువాలు వెళ్లేవారే.

★ ★ ★

# మూడవభాగం

## 1. తుపాను చిహ్నాలు

కుటుంబ సభ్యులతో బాటు నేను ఓడమీద ప్రయాణం చేయడం యిదే ప్రథమం. మధ్యతరగతి హిందూ కుటుంబాలల్లో బాల్యవివాహాలు జరుగుతూ వుంటాయని, భర్త చదువుకున్నవాడు గాను- భార్య నిరక్షర కుక్షిగాను వుంటుందని అనేక చోట్ల వ్రాశాను. భార్యాభర్తల జీవితంలో సముద్రమంత అంతరం వుంటుంది. భర్త భార్యకు ఉపాధ్యాయుడు అవుతాడు. నేను నా భార్యాబిడ్డల వేష భాషల మీద, ఆహార విహారాదులమీద దృష్టి సారించాను. వాళ్ళకు ఎట్లా నడుచుకోవాలో బోధించడం అవసరమని భావించాను. అప్పటి సంగతులు జ్ఞాపకం తెచ్చుకుంటే యిప్పుడునాకు నవ్వు వస్తుంది. హిందూ స్త్రీ పతిభక్తియే తన ధర్మమని భావిస్తుంది. భర్త దేవుడని భావిస్తుంది. ఆ కారణం వల్ల భర్త ఎలా ఆడిస్తే అలా భార్య ఆడవలసి వస్తుంది.

మనం నాగరికులం అని అనిపించుకోవాలంటే తెల్లవారిని అనుకరించాలి, అలా అనుకరిస్తేనే మన పలుకుబడి పెరుగుతుంది, అలా చేయకపోతే లాభం లేదని ఆ రోజుల్లో గట్టిగా నమ్మేవాణ్ణి. యీ కారణాలవల్ల నా భార్యాబిడ్డలకు నేనే దుస్తుల్ని నిర్ణయించాను. నా పిల్లల్ని చూచి లోకులు కారియావాడు కోమట్లండోయ్ అని అంటే ఓర్వగలనా? పార్సీ వాళ్ళు అందరి కంటే నాగరికంగా వుంటారని ప్రతీతి. అది గమనించి నా భార్యకు, పిల్లలకు తెల్లవాళ్ల డ్రస్సు వేయకుండా పార్సీ డ్రస్సు వేయాలని నిర్ణయించాను. నా భార్యకు పారసీ పద్ధతి చీర, పిల్లలకి పారసీలకోటు, పాంట్లు, అందరికి బూట్లు, మేజోళ్ళు కొన్నాను. నాభార్యకు, పిల్లలకి కొంతకాలం దాకా ఇవి నచ్చలేదు. బూట్లు వేసుకుంటే కాళ్లు కరిచాయి. మేజోళ్ళు వేసుకుంటే చెమట. బొటనవ్రేళ్ళు బిగదీసుకు పోయాయి. వాళ్ళు వద్దన్నా నేను అంగీకరించలేదు. నామాటల్లో అధికార భావం ఎక్కువగా పనిచేసింది. అందువల్ల పాపం ఏం చేస్తారు? నా భార్య, పిల్లలు ఆ దుస్తులే ధరించారు. అదే విధంగా యిష్టం లేకపోయినా భోజనం ఇంగ్లీషువాళ్ళ విధానంలో చేయడం ప్రారంభించారు. నాకు వ్యామోహం తొలగినప్పుడు వాళ్ళు డ్రస్సు, ఫోర్కులు, ముళ్ళగరిటెలు వగైరాలు విడనాడి మామూలు పద్ధతికి

వచ్చారు. ముందు వాటికి అలవాటు పడడం ఎంత కష్టమైందో, అలవాటు అయిన తరువాత వాటివి విడనాడటం కూడా అంతే కష్టమైంది. ఈ నాగరికతా వ్యామోహమనే కుబుసాన్నుండి బయటపడ్డ తరువాత ఎంతో బరువు తగ్గినట్లు అంతా భావించాము.

ఓడమీద ఎక్కడికైనా నేను వెళ్ళవచ్చు. అట్టి స్వేచ్ఛ నాకు లభించింది. ఓడ ఏ రేవులోనూ ఆగకుండా తిన్నగా నేటాలు పోతున్నది. కనుక ప్రయాణం 18 రోజులేనని తెలిసింది. మూడు నాలుగు రోజుల్లో మేము ఒడ్డుకు చేరబోతుండగా రాబోయే తుపానుకు చిహ్నంగా, ముందుగా సముద్రంలో పెద్ద తుపాను ప్రారంభమైంది. ఈ ప్రాంతంలో డిసెంబరు నందు వేసవి కాలం వస్తుంది. వానలు కూడా కురుస్తూవుంటాయి. ఆ కారణం వల్ల చిన్న, పెద్ద తుపాన్లు, వానలు తప్పవన్నమాట. కాని ఈ తుపాను ఎక్కువ రోజులు వీచడం వల్ల యాత్రికులకు చాలా యిబ్బందులు కలిగాయి.

అదొక విచిత్ర మైన దృశ్యం. ఆపద సమయంలో జనం ఏకమైనారు. భేదబుద్ధి నశించింది. ఒక్క భగవంతుణ్ణే అంతా స్మరించడం ప్రారంభించారు. హిందువులు, మహమ్మదీయులు అంతా హృదయ పూర్తిగా దేవుణ్ణి స్మరించసాగారు. కొందరు ముడుపులు కట్టారు. కెప్టెను యాత్రికుల మధ్యకు వచ్చి "ఈ తుపాను పెద్దదే అయినా పరవాలేదు. నేను యింత కంటే పెద్ద తుపాన్లు చూచాను. ఓడ గట్టిదే. మునిగిపోదు. భయపడవద్దు" అని చెప్పాడు. కాని దాని వల్ల ఎవ్వరికీ ధైర్యం కలగలేదు. త్వరలోనే ఓడ చిన్నాభిన్నమైపోతున్నట్లు పెద్దగా ధ్వనులు వినబడసాగాయి. ఓడ తిరగబడిపోతున్నట్లుగా సముద్రపు కెరటాల్లో ఊగసాగింది. డెక్కుమీద ఎంతో భీభత్సంగా వున్నది. ఎవరినోట విన్నా 'దైవస్మరణే'

ఈ స్థితి 24 గంటల సేపు వున్నదని గుర్తు. ఆ తరువాత కారు మబ్బులు విడిపోయాయి. సూర్యదర్శనం అయింది. తుపాను తొలగిపోయిందని కెప్టెను ప్రకటించాడు. యాత్రికుల ముఖాలు సంతోషంతో విప్పారాయి. అపాయం తగ్గిపోయినట్లే భగవన్నామస్మరణ కూడా తగ్గిపోయింది. మృత్యుభయం తొలగిపోయింది కదా! తిరిగి మాయ అందరినీ ఆవరించిందన్నమాట. నమాజులు ప్రారంభమైనాయి. భజనలు కూడా జరుగుతూ వున్నాయి. కానీ వీటిలో తుపాను సమయంలో గల ఏకాగ్రత లేదు.

ఈ తుపాను కారణంగా యాత్రికులందరితో నాకు పరిచయ భాగ్యం కలిగింది. నాకు తుపానంటే భయం కలగలేదు. భయం కలిగినా అది బహుతక్కువే. అటువంటి తుపాన్లు అదివరకు చాలా చూచాను. సముద్రయానంలో జబ్బుపడను. అందువల్ల

ధైర్యం వహించి ఓడలో అటుయిటు తిరుగుతూ యాత్రీకులను ఓదారుస్తూ వున్నాను. ఈ స్నేహబంధం నాకు ఎంతో ఉపయోగ పడిందని చెప్పగలను.

ఓడ డిసెంబరు పద్ధెనిమిదో తేదీనో, లేక పందొమ్మిదవ తేదీనో డర్బను రేవులో లంగరు వేసింది. నాదరీ ఓడకూడా ఆరోజే చేరుకున్నది. కాని నిజమైన తుపాను యిక ముందు రాబోతున్నదని అప్పటికి నాకు తెలియదు.

## 2. తుపాను

డిసెంబరు పద్ధెనిమిదవ తేదీనాడు టోయిటోలో రెండు ఓడలు లంగరు వేశాయి. దక్షిణ ఆఫ్రికా రేవుల్లో డాక్టరు వచ్చి ప్రతి యాత్రికుణ్ణి జాగ్రత్తగా పరీక్ష చేస్తాడు. దారిలో ఎవరికైనా అంటురోగం పట్టుకుంటే వాళ్ళను ఓడ యొక్క క్వారంటీనులో ఉంచుతారు. మేము బొంబాయి నుండి బయలుదేరినప్పుడు అక్కడ ప్లేగు వ్యాధి వున్నది. అందువల్ల మాకు క్వారంటీను బాధ తప్పదని కొంచెం భయపడ్డాము. రేవులో లంగరు వేశాక ప్రప్రథమంగా ఓడ మీద పచ్చ జండా ఎగురవేస్తారు. డాక్టరు పరీక్షించి చీటీ యిచ్చేదాక పచ్చజండా ఎగురుతూ వుంటుంది. పచ్చ జండాను దింపి వేసిన తరువాతనే బయటివాళ్ళను ఓడ మీదికి రానిస్తారు. ఆ నియమం ప్రకారం మా ఓడమీద కూడా పచ్చజండా ఎగరవేశారు డాక్టరు వచ్చి అయిదు రోజులు క్వారంటీను అని ఆదేశించాడు. ప్లేగుక్రిములు ఇరవైమూడు దినాలు జీవించి వుంటాయని వారి ఉద్దేశ్యం. మేము బొంబాయి నుండి బయలు దేరి పద్ధెనిమిది రోజులు గడిచాయి. కనుక యింకా అయిదు రోజులు ఓడ మీద వుంటే ఇరవై మూడు రోజులు పూర్తి అవుతాయని వాళ్ల అభిప్రాయం.

కానీ మమ్మల్ని క్వారంటీనులో వుంచటానికి మరోకారణం కూడా వున్నది. డర్బనులోని తెల్లవాళ్ళు మమ్మల్ని తిరిగి ఇండియాకు పంపివేసేందుకై పాతాళహోమం ప్రారంభించారు. ఈ ఆదేశానికి అదికూడా ఒక కారణం.

దాదా అబ్దుల్లా కంపెనీ వారు పట్టణంలో జరుగుతున్న వ్యవహారాలను గురించి ఎప్పటికప్పుడు మాకు తెలియజేస్తూవున్నారు. తెల్లవాళ్ళు ఒకనాటి కంటే మరొకనాడు పెద్దపెద్ద సభలు జరుపుతూ జనాన్ని రెచ్చగొడుతూ వున్నారని తెలిసింది. అబ్దుల్లా గారిని ఒకవంక భయపెడుతూ, మరోవంక లాలిస్తూ వున్నారట. ఈ రెండు ఓడల్ని తిరిగి ఇండియాకు పంపివేస్తే నష్టమంతా చెల్లించివేస్తామని కూడా చెప్పారట దాదా అబ్దుల్లా యిట్టి బెదిరింపులకు బెదిరే రకం కాదు. అప్పుడు భాగస్వాములైన సేఠ్

అబ్దుల్ కరీం హాజీ ఆదం గారు కంపెనీ తరపున వ్యవహర్తలు. ఎన్ని కష్టాలు వచ్చినా ఎన్ని నష్టాలు కలిగినా, ఓడలను రేవుకు చేర్చి యాత్రికులనందరినీ దింపి తీరతానని ఆయన ప్రతిజ్ఞ చేశాడు. ఏనాటికానాడు జరుగుతున్న వ్యవహారాలను ఆయన పూసగుచ్చినట్లు నాకు తెలియచేస్తూ వున్నాడు కీర్తి శేషులు మన సుఖలాల్ హీరాలాల్ నాజరుగారు నన్ను చూచేందుకు అదృష్టవశాత్తు డర్బను విచ్చేశారు. వారు చాలా చతురులు, వీరులు కూడా. జనం వారి సలహాలను పాటిస్తూవుంటారు, వారి వకీలు మిస్టర్ లాటిన్. వారుకూడా అంతటి వారే. వారు తెల్లవారి చేష్టల్ని ఖండించారు. కేవలం డబ్బు పుచ్చుకునే వకీలువలె గాక నిజమైన మిత్రునివలె వారికి సహాయం చేస్తున్నారు

ఈ విధంగా డర్బనులో ద్వంద్వయుద్ధం ప్రారంభమైందన్నమాట. ఒకవంక కూటికి లేని నల్లవాళ్లు, మరొకవంక వీరికి మిత్రులైన కొందరు తెల్లవాళ్ళు వేరొకవంక ధనబలం, కండబలం, అక్షరబలం, సంఖ్యాబలం కలిగిన తెల్లవాళ్లు. అంతటి బలవంతులైన తెల్లవారికి ప్రభుత్వబలం కూడా తోడుగా వున్నది నేటాలు ప్రభుత్వం వీరికి బహిరంగంగా తోడ్పడుతూ వున్నది. స్వయంగా హారీ ఎస్కాంబీగారు వారి సభలో పాల్గొని బహిరంగంగా వత్తాసు పలకడంతో వాళ్లు హద్దు దాటిపోయారు.

కావున మా క్వారంటీను కేవలం ఆరోగ్యానికి సంబంధించింది కాదని తేలిపోయింది యాత్రీకుల్ని ఏజంటును భయపెట్టి ఏదో విధంగా ఓడల్ని తిరిగి, పంపివేయడమే వాళ్ల ముఖ్యోద్దేశం. "మీరు తిరిగి వెళ్ళిపొండి. లేకపోతే సముద్రంలో ముంచి వేస్తాం. తిరిగి వెళ్లిపోతే మీకు అయిన ఖర్చులన్నీ యిచ్చివేస్తాం" అని మమ్మ హెచ్చరించడం ప్రారంభించారు.

నేను యాత్రికుల మధ్యకు వెళ్ళి వారికి ధైర్యం చెప్పసాగాను. నాదరీ ఓడయందలి యాత్రికులకు కూడా ధైర్యంగా వుండమని, భయపడవద్దని సమాచారం పంపించాను.

యాత్రీకుల వినోదం కోసం ఓడల్లో రకరకాల ఆటలు ఏర్పాటు చేశాం. కిస్‌మస్ పండుగ కూడా వచ్చింది. కెప్టెను యాత్రికులందరికీ డిన్నరు యిచ్చాడు. అందు మేము, మా పిల్లలం ముఖ్యులం. భోజనాశాల తరువాత ఉపన్యాసాలు సాగాయి. నేను పాశ్చాత్య నాగరికతను గురించి ప్రసంగించాను. అది గంభీరోపన్యాసానికి తగిన సమయం కాదని నాకు తెలుసు. కాని మరో విధంగా ప్రసంగించడం నా వల్లకాని పని. నేను వినోదంగాను, ప్రమోదంగాను మాట్లాడాను. కాని నా మనస్సంతా డర్బనులో జరుగుతున్న సంగ్రామం మీద కేంద్రీకరించి యున్నది.

అందుకు ముఖ్య కారణం, యీ సంగ్రామానికి కేంద్రబిందువును నేనే. నామీద క్రింద తెలిసిన రెండు నేరాలు మోపారు.

1. నేను భారతదేశంలో పర్యటించి నేటాలులోగల తెల్లవారిని అనుచితంగా నిందించాను
2. నేను నేటాలును భారతీయులతో నింపివేయాలని చూస్తున్నాను. అందుకోసం కురలేండు, నాదరీ ఓడలనిండా ఎంతోమందిని తీసుకు వస్తున్నాను.

నాకు విషయం బోధపడింది. నావల్ల దాదా అబ్దుల్లా గారికి పెద్ద అపాయం కలుగనున్నదని స్పష్టంగా తేలిపోయింది. నేను ఒంటరిగా రాక నా భార్యను, పిల్లల్ని కూడా వెంట తీసుకొని వచ్చి వాళ్ళను ప్రమాదంలో పడవేశాను.

నిజానికి నేను నిర్దోషిని. నేను ఎవ్వరనీ నేటాలు రమ్మని ప్రోత్సహించలేదు నాదరీయందలి యాత్రికుల్ని అప్పటివరకు నేను ఎరుగను. కురలేండు యందలి యిద్దరి ముగ్గురి పేర్లు తప్ప మిగతావారి పేర్లు కూడా నేను ఎరగను. నేటాలులో చెప్పిన మాటలే భారతదేశంలో కూడా చెప్పాను. అంతకంటే మించి ఒక్క మాటకూడా నేను అనలేదు నేను చెప్పిన ప్రతి విషయానికి నా దగ్గర సాక్ష్యం వున్నది.

ఏ సంస్కారానికి నేటాలు యందలి తెల్లవారు ప్రాతినిధ్యం వహిస్తున్నారో, ఏ స్థాయిలో వారు వ్యవహరిస్తున్నారో ఆ వివరం తెలుసుకొన్న మీదట విచారం కలిగింది. దాన్ని గురించి బాగా యోచించాను ఆ విషయం నలుగురి ముందు ప్రసంగించాను. మిగతా వారికి నా అభిప్రాయం తెలియకపోయినా, కెప్టెన్‌గారికీ, తదితరులకు నా అభిప్రాయం బోధపడింది. అందువల్ల వారి జీవితంలో ఏమైనా మార్పు కలిగిందో లేదో తెలియదు. ఆ తరువాత తెల్లవారి సంస్కారాల్ని గురించి కెప్టెను మొదలగు వారితో చాలాసేపు చర్చ జరిగింది నేను పాశ్చాత్య సంస్కారం హింసాపూరితం అని చెప్పాను నా మాటలకు తెల్లవారు కొందరు ఆవేశపడ్డారు కూడా.

"తెల్లవారి బెదిరింపులు కార్యరూపం దాలిస్తే మీరు అహింసా సిద్ధాంతాన్ని ఎలా అనుసరిస్తారు" అని కెప్టెను ప్రశ్నించాడు. "వీరిని క్షమించుటకు, వీరిపై చర్చ గైకొనకుండుటకు అవసరమైన శక్తిని పరమేశ్వరుడు నాకు ప్రసాదించుననే ఆశ నాకున్నది. ఇప్పటికీ వీరి మీద నాకు రోషం లేదు. వారి అజ్ఞానం వారి సంకుచిత దృష్టి చూస్తే నాకు జాలి కలుగుతున్నది. తాము చేస్తున్నదంతా సముచితమే అని వారు భావిస్తున్నారని నేను అనుకుంటున్నాను. అందువల్ల కోపం తెచ్చుకునేందుకు కారణం

నాకు కనబడటం లేదు" అని జవాబిచ్చాను. అక్కడి వారంతా నవ్వారు. వారికి నా మాటలమీద విశ్వాసం కలగలేదన్నమాట.

ఈ విధంగా రోజులు కష్టంగా గడిచాయి. క్వారంటీను నుండి ఎప్పుడు విడుదల చేస్తారో తెలియదు. ఆఫీసరును అడిగితే " ఈ విషయం నా చేతులు దాటింది. ప్రభుత్వం ఆదేశించగానే మిమ్ము దింపివేస్తాం" అని సమాధానం యిచ్చాడు. ఇంతలో కడపటిసారిగా "మీరు ప్రాణాలు దక్కించుకోదలిస్తే మాకు లొంగిపోండి" అని తెల్లవారు హెచ్చరిక పంపారు. అందుకు సమాధానంగా "నేటాలు రేవులో దిగుటకు మాకు హక్కు వున్నది. ఎన్ని అపాయాలు వచ్చినా మా హక్కును కాపాడుకొంటాం" అని నేను, సహయాత్రికులం సమాధానం పంపించాం. ఇరవై మూడు రోజులు గడిచిపోయాయి. జనవరి 13 వతేదీనాడు ఓడలు రేవులోకి ప్రవేశించవచ్చని ఆదేశం యివ్వబడింది. యాత్రికులు రేవులో దిగవచ్చని కూడా ఆ ఆదేశంలో పేర్కొనబడింది.

## 3. ఒరిపిడి

ఓడలు రేవుకి చేరాయి. యాత్రికులంతా దిగిపోయారు. "తెల్లవాళ్ళు గాంధీమీద మండిపడుతున్నారు. వారి ప్రాణాలకు అపాయం కలుగవచ్చు కనుక గాంధీని, వారి కుటుంబ సభ్యుల్ని రాత్రిపూట ఓడనుండి దింపండి. రేవు సూపరింటెంట్ టేటమ్ గారు రాత్రిపూట వాళ్ళను ఇంటికి భద్రంగా తీసుకు వెళతారు" అని ఎస్కాంబీగారు ఓడ కెప్టెనుకు కబురు పంపారు.

కెప్టెను నాకీ సందేశం అందజేశారు. నేను అందుకు అంగీకరించాను. ఈ సందేశం అంది అరగంట గడిచిందో లేదో లాటన్ గారు వచ్చి కెప్టెనుతో ఇలా అన్నాడు "గాంధీగారు నాతో రాదలచుకుంటే నా జవాబుదారీమీద వారిని తీసుకువెళతాను. గాంధీ గారిని గూర్చి ఎస్కాంబీగారు పంపిన సందేశాన్ని మీరు పాటించనవసరం లేదు. ఈ ఓడల యజమాని యొక్క వకీలు హోదాతో నేను చెబుతున్నాను" ఆ తరువాత ఆయన నా దగ్గరికి వచ్చి " మీకు ప్రాణాలంటే భయం లేకపోతే మీ భార్యాపిల్లల్ని బండిమీద రుస్తుంగారింటికి పంపించి, మనమిద్దరం కాలినడకన నడిచి వెళదాం. మీ మీద ఈగ కూడా వాలదని నా విశ్వాసం. ఇప్పుడు అంతటా శాంతి నెలకొని వుంది. తెల్లవారంతా వెళ్ళి పోయారు. మీరు దొంగవాడిలా చాటుగా వెళ్ళడం నాకిష్టంలేదు" అని అన్నాడు.

నేను అందుకు సమ్మతించాను. నా భార్యాపిల్లలు ఏ బాధలేకుండా రుస్తుంజీ సేర్ గారింటికి చేరారు నేను కెప్టెన్‌గారి దగ్గర సెలవు తీసుకొని లాటన్ గారితో పాటు ఓడదిగి రుస్తుంజీసేఠ్ గారి ఇంటికి బయలుదేరాను. వారి ఇల్లు అక్కడికి రెండు మైళ్ళ దూరాన వున్నది.

మేము ఓడనించి దిగేసరికి కొంతమంది తెల్లదొరల పిల్లలు గాంధీ గాంధీ అంటూ అరుస్తూ చప్పట్లు కొట్టడం ప్రారంభించారు. అయిదారుగురు చుట్టూ మూగి గాంధీ గాంధీ అని పెద్దగా అరవడం ప్రారంభించారు. లాటన్‌గారు గుంపు పెరుగుతుందేమోనని భావించి రిక్షావాణ్ణి పిలిచారు. రిక్షా ఎక్కడం నాకు యిష్టం లేకపోయినా రిక్షా ఎక్కడానికి సిద్ధపడ్డాను. కాని తెల్లవాళ్లు రిక్షావాణ్ణి చంపివేస్తామని బెదిరించేసరికి అతడు పారిపోయాడు. మేము ముందుకు సాగుతూ వుంటే గుంపు పెరిగి పోసాగింది. నడవడానికి చోటు లేదు. ముందుగా వాళ్ళు నన్ను, లాటన్ గారిని విడగొట్టి వేరుచేశారు. తరువాత నామీద రాళ్ళు, మురిగిపోయిన గ్రుడ్లు విసరడం ప్రారంభించారు. ఎవడో నా తలపాగాను ఎగరగొట్టాడు కొందరు నన్ను కొట్టడం ప్రారంభించారు. నన్ను క్రిందికి పడత్రోశారు. నాకు స్మృతి తప్పింది. దగ్గరలోనేగల ఇంటి చువ్వలు పట్టుకొని నిలబడ్డాను. అలా నిలవడం కూడా కష్టమైపోయింది. ఇంకా దెబ్బలు తగులుతూనే వున్నాయి.

ఇంతలో అటు పోలీసు సూపరిండెంట్ గారి భార్య హఠాత్తుగా వచ్చింది. ఆమె నన్ను ఎరుగును. ఆమె ధైర్యవంతురాలు. త్వరగా వచ్చి నా దగ్గర నిలబడింది. అప్పుడు ఎండలేదు. అయినా ఆమె గొడుగు తెరిచి నాపై పట్టింది. దానితో గుంపు కొంచెం ఆగింది. నన్ను కొట్టాలంటే ముందు ఆమెను కొట్టవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆవిధంగా నన్ను ఆమె కమ్మి వేసింది.

ఇంతలో ఒక భారతీయుడు యిదంతా చూచి పరుగెత్తుకొని పోలీసు ఠాణాకు వెళ్లి సమాచారం అందజేశాడు. పోలీసు సూపరింటెండెంటు నన్ను రక్షించడంకోసం కొంతమంది పోలీసుల్ని పంపించాడు. వారు త్వరగా అక్కడికి చేరుకున్నారు దారిలోనే పోలాసురాణా వున్నది. నన్ను ఠాణాలో ఆశ్రయం పొందమని సూపరింటెండెంటు అన్నాడు. నేను అందుకు అంగీకరించలేదు. "వారి తప్పు తెలుసుకొని వారే మౌనం వహిస్తారు. వారికి న్యాయబుద్ధికలుగగలదను విశ్వాసం నాకు వున్నది." అని కృతజ్ఞతతో బదులు చెప్పాను.

పోలీసులు నా వెంట వచ్చారు. వారి రక్షణ వల్ల మరేమీ హాని కలుగలేదు. రుస్తుంజీ గారి ఇంటికి చేరాను. నిజంగా నాకు పెద్ద దెబ్బలు తగిలాయి. ఒక చోట పెద్ద గాయం అయింది. ఓడ వైద్యులు దాదీ బరజోర్ గారు అక్కడే వున్నారు. వారు ఓపికతో నాకు సేవ చేశారు.

లోపల శాంతిగానే వున్నది. కాని బయట గొడవ ఎక్కువైంది. తెల్లవాళ్ళు ఇంటి ముందు ప్రోగై "గాంధీని మాకు అప్పగించండి" అని గొడవ చేయడం ప్రారంభించారు. పోలీసు సూపరింటెండెంటు అక్కడికి వచ్చాడు. ఇదంతా చూచి గొడవ చేస్తున్న వాళ్లనెవ్వరినీ ఏమీ అనకుండా వాళ్లందరికీ తలా ఒక మాట చెబుతూ వాళ్ళను అక్కడే నిలబెట్టివేశాడు.

అయినా ఆయన చింతాముక్తుడు కాలేదు. లోపలికి తన మనిషిని పంపి "గాంధీ! నీ మిత్రుని ధనం, ప్రాణం, గృహం, నీ భార్య, నీ బిడ్డలు మరియు నీ ప్రాణం దక్కాలంటే వెంటనే మారువేషంతో ఇల్లు విడిచి వెళ్ళిపొండి" అని వార్త పంపాడు

ఒకే రోజున పరస్పర విరుద్ధమైన రెండు పరిస్థితులు నాకు తటస్థపడ్డాయి. ప్రాణభయం కేవలం కల్పితం అని భావించి లాటనుగారు నన్ను బహిరంగంగా రమ్మన్నారు. అందుకు నేను అంగీకరించాను. కాని యిప్పుడు ప్రాణభయం ఎదురుగా కనబడుతున్నది. మరో మిత్రుడు అందుకు విరుద్ధంగా సలహా యిస్తున్నాడు. దీనికీ నేను సమ్మతించాను. నా ప్రాణాలకు ముప్పు వాటిల్లు నను భయంతో, మిత్రునికి అపాయం కలుగునను భయంతో, నా భార్యా బిడ్డలకు ప్రమాదం కలుగునను భయంతో నేను సమ్మతించానని ఎవరు అనగలరు? మొదట నేను ధైర్యంతో ఓడ దిగి గుంపును ఎదుర్కోవడం, తరువాత మారు వేషంలో తప్పించుకొని వెళ్ళిపోవడం రెండూ ఒప్పిదాలే అని ఎవరు అనగలరు? అయితే ఆయా విషయాల యోగ్యతలను నిర్ణయించడం అనవసరం. ఈ విషయాలను పరిశీలించి, యిందువల్ల నేర్చుకోవలసింది ఏమైనా వుంటే నేర్చుకోవడమే మంచిది. ఒకడు ఒక్కొక్క సమయంలో ఎలా ప్రవర్తిస్తాడో చెప్పడం కష్టం. మానవుని బాహ్యాచరణను మాత్రం గమనించి అతని గుణగణాల్ని నిర్ణయించడం సరికాదని, అది అసమగ్రమని మనం గ్రహించాలి.

ఇక నేను పలాయనానికి పూనుకొన్నాను. దెబ్బల బాధ మరచిపోయాను. నల్లపోలీసు వేషం వేశాను. తలపై దెబ్బలు తగులకుండా ఇత్తడి సిబ్బి పెట్టుకొని దాని మీద మద్రాసు ఉత్తరీయం తలపాగాగా చుట్టి బయలుదేరాను. నావెంట యిద్దరు పోలీసు గూఢచారులు వున్నారు. అందొకడు భారతీయ వర్తకుని వేషం వేశాడు లేక

భారతీయుడుగా కనబడేందుకు ముఖాన రంగుపులుముకున్నాడని చెప్పవచ్చు మరొకడు ఏం వేషం వేశాడో నాకు గుర్తులేదు. ప్రక్క సందుగుండా వెళ్లి ఒక దుకాణం చేరుకున్నాం. ఆ దుకాణం గిడ్డంగిలో గల బస్తాల మధ్యగా దారి చేసుకొని వెళ్లి దుకాణం ద్వారం దాటి గుంపుకు దొరక్కుండా బయట పడ్డాం. వీధి చివర నాకోసం బండి సిద్ధంగా వున్నది. ఆ బండి ఎక్కి పోలీసు ఠాణా చేరుకున్నాము. నేను సూపరింటెంటుగారికి, పోలీసు గూఢచారులికి ధన్యవాదాలు అర్పించాను.

ఒక వంక నేను గుంపును తప్పించుకు పోతూవుంటే మరోవంక సూపరింటెంట్ అలెగ్జాండరుగారు. "పదండి ముందుకు పట్టుకువద్దాం చెట్టు కొమ్మకు వేలాడతీద్దాం' 'అని పాట పాడుతూ జనాన్ని ఆపుతూ వున్నాడు నేను పోలీసు స్టేషనుకు సురక్షితంగా చేరానను వార్త అందగానే అలెగ్జాండర్ స్వరం మార్చి "ఏమండోయ్! లేడిపారిపోయింది యిక పదండి మీమీ ఇండ్లకు" అని జనాన్ని నిరుత్సాహపరచడం ప్రారంభించాడు. దానితో కొందరికి కోపంవచ్చింది. కొందరికి నవ్వు వచ్చింది. చాలామంది ఆయన మాటల్ని నమ్మలేదు. "అయితే మీలో కొందరు లోపలికి వెళ్ళి చూచి రండి. గాంధీ వుంటే మీకు అప్పగిస్తాను. లేకపోతే ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోవాలి. మీరెవ్వరు రుస్తుంజీ గృహానికి నష్టం కలిగించరనీ, గాంధీ భార్యా బిడ్డల జోలికి పోరని నాకు తెలుసు" అని అన్నాడు.

జనంలో నుండి యిద్దరు ముగ్గురు లోపలికి వెళ్ళి చూచి బయటికి వచ్చి గాంధీ లేడని జనానికి చెప్పారు. కొందరు అలెగ్జాండరును భూషించారు కొందరు దూషించారు ఇక చేసేదేమీ లేక అంతా ఎవరి దోవన వాళ్ళు వెళ్ళిపోయారు. కీ.శే. చేంబర్లేను గారు గాంధీని కొట్టిన వాళ్ళను శిక్షించమని నేటాలు ప్రభుత్వానికి తంతి పంపారు. ఎస్కాంబీగారు నన్ను పిలిపించారు. నాకు తగిలిన దెబ్బలకు విచారం ప్రకటించారు. మీ వెంట్రుకకు హాని కలిగినా నేను సహించను. లాటనుగారు చెప్పిన ప్రకారం నడుచుకోక, నేను చెప్పిన ప్రకారం నడుచుకొనియుంటే అసలు ఈ దుఃఖకరమైన ఘట్టం జరిగేదేకాదు ఘాతకుల్ని మీరు గుర్తించితే వాళ్ళను నిర్బంధించి శిక్షిస్తాం. చేంబర్లేనుగారు కూడా అలాంటి తంతి పంపించారు. అని అన్నారు.

"ఎవ్వరిమీద కేసు పెట్టడం నాకు యిష్టం లేదు. ఆ జనంలో ఇద్దరు ముగ్గురిని గుర్తు పట్టగలను. కాని వారిని శిక్షిస్తే నాకేమి లాభం? వారిని దోషులని నేను అనను. హిందూ దేశంలో నేను తెల్లవారిని నోటికి వచ్చినట్లు నిందించానని, లేనిపోని మాటలు చెప్పి ఎవరో వారిని రెచ్చకొట్టారు. అట్టి వారి మాటలు నమ్మి వారు

రెచ్చిపోయారు. ఇందు వారి తప్పు ఏమీ లేదని భావిస్తున్నాను అసలు దీనికంతటికీ కారకులు మీ నాయకులు, మన్నించండి. మీరే యిందుకు బాధ్యులు, మీరు ప్రజలను సరియైన మార్గాన నడిపించాలి. అట్టిమీరే రూటరు మాట నమ్మి నాకు వ్యతిరేకంగా వ్యవహరించారు. నేనేదో ఇండియాలో చేశానని విచారించకుండా మీరు వ్యవహరించారు. తత్ఫలితమే యీ కాండ. అందువల్ల నేనెవ్వరినీ శిక్షించతలచలేదు. నిజం తెలిసినప్పుడు వారు తప్పక పశ్చాత్తాప పడతారనే విశ్వాసం నాకు వున్నది." అని నేను అన్నాను.

'అయితే ఈ మాటలే వ్రాసి యివ్వండి. మీరు వ్రాసి యిచ్చే మాటలు చేంబర్లేను గారికి తంతిద్వారా తెలియజేస్తాను. తొందరపడి వ్రాసిమ్మని నేను కోరాను లాటనుగారితోను, తదితర మిత్రులతోను సంప్రదించి ఏది ఉచితమో అదే చేయండి. మీరు ఘాతకులపై కేసు పెట్టని ఎడల అందరినీ సులువుగా శాంతింప చేయవచ్చు. ఆ విధంగా చేస్తే మీ గౌరవ ప్రతిష్టలు తప్పక పెరుగుతాయి' అని ఎస్కాంబీగారు అన్నారు.

" ఈ విషయంలో నా మాట ఖాయం. మీ దగ్గరకు రాకముందే నేను యిట్టి నిర్ణయానికి వచ్చాను. నన్ను కొట్టిన వారిమీద కేసు పెట్టడం నాకు ఇష్టం లేదు. మీరు కోరిన ప్రకారం ఇప్పుడే వ్రాసి యిస్తాను" అని చెప్పి అవసరమైన పత్రం వ్రాసి వారికి యిచ్చి వేశాను

## 4. శాంతి

ఆ రోజున నా మీద దాడి జరిగిన తరువాత నేను పోలీసు స్టేషను చేరాను. అక్కడ రెండు రోజులు వున్నాను. నా వెంట యిద్దరు పోలీసులు రక్షణ కోసం వున్నారు. తరువాత ఎస్కాంబీగారిని కలుసుకునేందుకు వెళ్ళాను అప్పటికి పోలీసుల కాపలా అవసరం లేకుండా పోయింది.

నేను ఓడ దిగిన రోజున అనగా పచ్చ జండా దింపిన రోజున నేటాల్ అడ్వర్‌టైజర్ పత్రికా ప్రతినిధి వడివడిగా వచ్చి నన్ను కలిసి మాట్లాడాడు. అనేక ప్రశ్నలు వేశాడు. అడిగిన ప్రతి ప్రశ్నకు సమాధానం యిచ్చాను. సర్ ఫిరోజ్ షా మెహతాగారి సలహా ప్రకారం హిందూ దేశంలో నేను యిచ్చిన ఉపన్యాసాలన్నీ ముద్రింపబడి వున్నాయి. వాటన్నింటిని నేను అతనికి యిచ్చాను. దక్షిణ - ఆఫ్రికాలో నేను అదివరకు చెప్పిన మాటలే హిందూదేశంలో కూడా చెప్పాను. అంతకు మించి ఒక్కమాట అయినా

అదనంగా చెప్పలేదని రుజూచేశాను. కురలేండ్, నాదరి ఓడల్లో వచ్చిన వారితో నాకు ఏవిధమైన సంబంధం లేదని స్పష్టం చేశాను. వారిలో చాలామంది నేటాలులో నివసిస్తున్న వారే మిగిలిన వారు నేటాల్లో ఆగరు. వారు ట్రాన్సువాలు వెళతారు. ఆ సమయంలో నేటాల్లో పనులు తక్కువ. ట్రాన్సువాల్లో పనులు ఎక్కువ. అక్కడ ఆదాయం అధికంగా లభిస్తున్నది. అందువల్ల ఎక్కువ మంది భారతీయులు అక్కడికి వెళ్ళుతూ వున్నారు.

పత్రికా ప్రతినిధితో జరిగిన నా సంభాషణంతా పత్రికల్లో ప్రకటింపబడింది. నన్ను కొట్టినవారి మీద కేసు పెట్టనని సవివరంగా చెప్పిన మాటలు కూడా పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. దానితో తెల్లవారు తలలు వంచుకున్నారు. పత్రికలు నన్ను నిర్దోషి అని ప్రకటించాయి. దుండగుల దుందుడుకుతనాన్ని ఖండించాయి. చివరికి ఈ విధంగా ఆ ఘట్టం వల్ల నాకు లాభం కలిగిందన్నమాట దీనివల్ల భారతీయుల గౌరవ ప్రతిష్టలు పెరిగాయి నా మార్గం సుగమం అయింది. మూడు నాలుగు రోజులకు ఇంటికి చేరాను నా కార్యక్రమాలు ప్రారంభించాను ఈ ఘట్టం వల్ల నా వకాలతు కూడా పెరిగింది.

ఒకవైపున భారతీయుల ప్రతిష్ట పెరిగిందే కాని మరో వైపున వారి యెడ తెల్లవారిలో ద్వేషం కూడా పెరిగింది భారతీయుడు పౌరుషవంతుడని తెల్లవారికి తెలిసింది. దానితో భారతీయులంటే తెల్లవారికి భయం ప్రారంభమైంది నేటాలు లెజిస్లేటివ్ కౌన్సిల్లో రెండు చట్టాలు ప్యాసయ్యాయి భారతీయులకు కష్టాలు కలిగించేవిగా అవి వున్నాయి. ఒక చట్టం భారతీయుల వ్యాపారానికి హాని కలిగిస్తుంది. రెండోది వలస వచ్చే వారికి హాని కలిగిస్తుంది. వోటు హక్కు కోసం మేము చేసిన కృషి దేవుని దయవల్ల కొంత ఫలించింది. "భారతీయులకు వ్యతిరేకంగా, అనగా భారతీయుడైనంత మాత్రాన వానికి ఏ చట్టమూ వర్తించబడకూడదు" అంటే "చట్టానికి జాతి భేదం వర్ణభేదం ఉండరాదు" అని నిర్ణయం చేశారు యీ నిర్ణయం భారతీయులకు కొంత ఊరట కలిగించిందని చెప్పవచ్చు. అయితే పై రెండు చట్టాల్లోను ఉపయోగించబడిన భాష పైకి మెత్తగా వున్నా, లోపల మాత్రం భారతీయుల హక్కుల్ని కుంచింపజేసే విధంగా కరుకుగా వున్నది.

ఈ రెండు చట్టాలు నా పనిని పెంచి వేశాయి. భారతీయుల్లో జాగృతి కలిగించాయి. భారతీయులందరకీ యీ చట్టాల ఉద్దేశ్యం స్పష్టంగా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో వాటిని అన్ని భాషల్లోకి అనువదించాము. ఇంగ్లాండుకు అర్జీలు పంపించాము. కాని చట్టాలు మాత్రం మంజూరయ్యాయి.

నా సమయమంతా సార్వజనిక కార్యక్రమాలకే సరిపోతున్నది. మన్‌సుఖలాల్ నాజర్ గారు నేటాల్లో వున్నారని గతంలో తెలియజేశాను. వారు మా ఇంట్లో ఉండేందుకై వచ్చి ఆ పనుల్ని చూడటం ప్రారంభించారు. అందువల్ల నా పని భారం కొద్దిగా తగ్గినది.

నేను దక్షిణ - ఆఫ్రికాలో లేనప్పుడు ఆదంజీ మియాఖాన్ గారు తమ విధిని సక్రమంగా నిర్వహించారు. వారి సమయంలో కాంగ్రెస్ సభ్యుల సంఖ్య బాగా పెరిగింది. యాత్రీకుల్ని రానీయకుండా చేసే యత్నాన్ని, భారతీయుల వ్యతిరేక చట్టాల్ని ఎదుర్కొనేందుకు ఎక్కువ ధనం సమకూర్చాలని నిర్ణయించాం. తత్ఫలితంగా 5000 పౌండ్ల ధనం వసూలైంది. కాంగ్రెస్ కోశానికి స్థిరత్వం చేకూరితే ఆ సొమ్ముతో కొంత ఆస్థి కొని, దాని వల్ల వచ్చే ఆదాయంతో కాంగ్రెస్‌ను ఆర్థికంగా తీర్చిదిద్దాలని నాకు లోభం కలిగింది. సార్వజనిక సంస్థల్ని నడిపే వ్యవహారంలో నాకు కలిగిన మొదటి అనుభవం యిది. నా అభిప్రాయం తోటి మెంబర్లకు చెప్పాను వారంతా అందుకు అంగీకరించారు. కొంత ఆస్థి కొన్నాం. అద్దెకిచ్చాం. దానితో కాంగ్రెస్ వ్యయం సరిపోసాగింది. అందు నిమిత్తం ధర్మకర్తల్ని ఏర్పాటు చేశాం. ఆ ఆస్తి యిప్పటికీ వున్నది. కాని తరువాత అది అంతః కలహాలకు దారితీసింది అద్దె సొమ్ము కోర్టులో జమచేయబడుతూ వున్నది. నేను దక్షిణ - ఆఫ్రికా వదలి వచ్చేసిన తరువాత అలా జరిగింది.

అసలు సార్వజనిక సంస్థలకు మూలధనం ఏర్పాటు చేయడం విషయంలో నా అభిప్రాయంలో చాలా మార్పు వచ్చింది. నేను అక్కడ వున్నప్పుడు చాలా సార్వజనిక సంస్థల్ని స్థాపించాను. వాటిని నడిపించాను వాటికి అండగా వున్నాను. వాటివల్ల కలిగిన అనుభవాన్ని పురస్కరించుకొని ఏ సార్వజనిక సంస్థకూ మూలధనం సమకూర్చి పెట్టే ప్రయత్నం చేయకూడదనే దృఢ నిర్ణయానికి వచ్చాను. మూలధనం సమకూర్చి పెట్టగానే దానికి నైతికంగా అధోగతి ప్రారంభం అవుతుంది. అందుకు అవసరమైన బీజాలు మూలధనంలోనే వున్నాయి

సార్వజనిక సంస్థ అంటే ఏమిటి? సర్వజనుల అనుమతితో, సర్వజనుల ధనంతో, నడుపబడు సంస్థ అని అర్థం. ప్రజల సహకారం అట్టి సంస్థకు లేకుండా పోయినప్పుడు యిక ఆ సంస్థ అనవసరం. మూలధనంతో నడపబడే సంస్థలు ప్రజల అభిప్రాయాలకంటే స్వతంత్రంగాను, అనేకసార్లు ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగాను కూడా నడుస్తూ వుంటాయి. మన దేశంలో యిట్టి సంస్థల్ని ప్రతిచోట చూస్తున్నాం.

ధార్మిక సంస్థలుగా చలామణీ అవుతున్న అనేక సంస్థలకు లెక్కాడొక్కా ఏమీ ఉండదు. ధర్మకర్తలే వాటికి అధికారులుగా తయారవుతున్నారు. వారు ఎవ్వరికీ జవాబుదారీ వహించక అధికారం చలాయిస్తున్నారు. యిది సరికాదని నా అభిప్రాయం. ప్రకృతివలె యిట్టి సంస్థలు వాటంతట అవే పెరగాలని నా అభిప్రాయం. అది నా మతం. ఏ సంస్థకు ప్రజలు సాయం చేసేందుకు సిద్ధంకారో ఆ సంస్థ సార్వజనిక సంస్థయను పేరట నడపడానికి వీలు వుండకూడదు. ఏ సార్వజనిక సంస్థకైనా ప్రజల సహకారం లభిస్తున్నదని ఎవరైనా చెబితే దానికి ప్రజల వల్ల లభించే చందాల పట్టికను చూడాలి. అదే ఆసంస్థ యొక్క ధర్మకర్తల యోగ్యతకు, ఆ సంస్థయొక్క ప్రజాపరపతికి ఒరిపిడిరాయి అన్నమాట. ప్రతి సంస్థ ఈ ఒరిపిడి రాయి మీద తన రాతను గీచి చూచుకోవాలని నా మతం దీనికి ఎవ్వరూ దురర్థం చెప్పకుందురు గాక. శాశ్వత భవనాలు లేక పోతే కొన్ని సంస్థలు నడవవు. అట్టి సంస్థల్ని గురించి నేను యిక్కడ పేర్కొనడంలేదు. నేను చెప్పదలుచుకున్నది ఒక్క విషయమే. ప్రతి సంవత్సరం తమ యిష్ట ప్రకారం జనం యిచ్చే చందాలతో సంస్థ వార్షిక వ్యయం చేయబడాలి. అలా జరిగితే ఆ సంస్థకు నైతిక స్ఫూర్తి చేకూరుతుంది.

దక్షిణ - ఆఫ్రికాలో సత్యాగ్రహ సమరం ముమ్మరంగా సాగినప్పుడు నా ఈ ఉద్దేశ్యాలు దృఢపడ్డాయి లక్షలాదిరూపాయలు వ్యయం చేయాల్సి వచ్చింది. అయినా మూలధనం లేకుండా ఆరు సంవత్సరాలపాటు ఆ మహా సంగ్రామం జరిపాము. చందాలు రాకపోతే రేపు యీ సంగ్రామం గతి ఏమవుతుందోనని మేము భయపడ్డ రోజులు కూడా వున్నాయి. అయితే భవిష్యత్తులో ఏం జరుగుతుందో చెప్పలేము కదా' నాకు కలిగిన నిశ్చితాభిప్రాయాల్ని గురించి సందర్భాన్ని బట్టి ముందు వివరిస్తాను

## 5. పిల్లల చదువు

1897 వ సంవత్సరం జనవరి నెల్లో దర్బనులో దిగాను. అప్పుడు నాతో మా ముగ్గురు పిల్లలు కూడా వున్నారు. ఒకడు నా మేనల్లుడు. వాడికి పదేండ్ల వయస్సు. మిగిలిన యిద్దరూ నా కుమారులు. పెద్దవాడికి తొమ్మిదేండ్లు, చిన్నవాడికి అయిదేండ్లు. వీళ్ళకు చదువెట్లా అన్న సమస్య బయలుదేరింది.

నా పిల్లల్ని తెల్లవారి బడికి పంపగలను. అందుకు బాగా శ్రమపడాలి. నా పిల్లలకు మాత్రమే అట్టి వీలు కలుగుతుంది. కాని యితర భారతీయుల పిల్లలకు అట్టి వీలు దొరకదు. భారతీయ బాలుర కోసం మిషన్ వాళ్లు పెట్టిన బడులు వున్నాయి. కాని

అందలి శిక్ష దీక్షలు బాగుండనందున నా పిల్లల్ని అక్కడికి పంపదలుచుకోలేదు. గుజరాతీ భాషలో బోధన కావాలంటే ఎలా సాధ్యం? ఇంగ్లీషు భాషలో అయితే వీలు వున్నది. ఎంతో కష్టంమీద వచ్చీరాని అరవంలోగాని లేక హిందీలోగాని పిల్లల చదువుకు వీలున్నది. కానీ యీవిషయంలో ఎదురైన అభ్యంతరాల్ని తొలగించలేక పోయాను. పిల్లలకు నేను చదువు చెబుదామని ప్రయత్నించాను. కాని అది నియమంగా సాగలేదు. అనుకూలమైన గుజరాతీ ఉపాధ్యాయుడెవ్వడూ దొరకలేదు.

నాకేమీ తోచలేదు. "నా ఉద్దేశ్యాల ప్రకారం పిల్లలకు విద్యగరపే ఆంగ్ల భాషా బోధకుడు ఒకరు కావాలి" అని పత్రికల్లో ప్రకటన చేశాను. ఆ ఉపాధ్యాయుడు నియమబద్ధంగా పిల్లలకు పాఠం చెబుతాడనీ, తీరిక దొరికినప్పుడు నేను కొంత చెప్పవచ్చునని భావించాను. నెలకు ఏడు పౌండ్ల జీతంమీద ఒక ఆంగ్ల వనిత పాఠం చెప్పడానికి అంగీకరించింది. యీ విధంగా పిల్లల చదువు ప్రారంభమైంది.

నేను పిల్లలతో గుజరాతీలోనే మాట్లాడుతూ వుండేవాణ్ణి. దానితో వాళ్ళకు కొద్దిగా గుజరాతీ భాషతో పరిచయం ఏర్పడింది. వాళ్ళను వెంటనే ఇండియాకు పంపాలనే ఉద్దేశ్యం నాకు లేదు. చిన్నపిల్లల్ని తల్లి దండ్రులకు దూరంగా వుంచకూడదను విషయం అప్పటికే నాకు బోధపడింది. మంచి ఏర్పాట్లుగల గృహాల్లో పిల్లలకు విద్య అప్రయత్నంగా అబ్బినట్లు, హాస్టల్లో ఉంచి చదివిస్తే అబ్బదు. ఆ కారణం వల్ల వాళ్ళు చాలాకాలం నాదగ్గరే వున్నారు. నా మేనల్లుణ్ణి, పెద్దకుమారుణ్ణి కొన్ని నెలల పాటు ఇండియాలో వసతి గృహాలు కల స్కూళ్లకు పంపించాను. కాని వాళ్ళను వెంటనే అక్కడనుండి తిరిగి తీసుకువచ్చాను. ఈడు వచ్చాక మా పెద్దకుమారుడు తనంతటతాను అహమ్మదాబాదు హైస్కూల్‌లో చదవ తలచి దక్షిణ - ఆఫ్రికా వదిలి వెళ్ళిపోయాడు నా మేనల్లుడు నేను చెప్పే చదువుకు తృప్తిపడి నాదగ్గరే వున్నట్లు గుర్తు. దురదృష్టవశాత్తు అతడు కొన్నాళ్ళు జబ్బుపడి నడియౌవనంలోనే యీ లోకాన్ని వీడి వెళ్ళిపోయాడు. మిగిలిన నా ముగ్గురు పిల్లలు బడికి వెళ్లలేదు. సత్యాగ్రహ సమయంలో నేను స్థాపించిన పాఠశాలలో మాత్రమే వాళ్ళు నియమబద్ధంగా కొంచెం చదువుకున్నారు.

నా ఈ ప్రయోగాలన్నీ అపూర్ణాలే. వారికి విద్య బోధించుటకు కావలసినంత సమయం నాకు దొరకలేదు. ఇంకా అనేక ఆటంకాల వల్ల వాళ్లకు అవసరమైనంత శిక్షణ నేను గరపలేకపోయాను. ఈ విషయంలో వారి అసంతృప్తికి నేను కొద్దో గొప్పో గురికాక తప్పలేదు. ఎప్పుడైనా వారి ఎదుట ఎవరైనా మేము బి.ఏ. మేము ఎం.ఏ అని చెబుతూ వుంటే మేము కనీసం మెట్రిక్యులేషన్ అయినా ప్యాసుకాలేకపోతిమే అను భావం నా పిల్లల ముఖాన కనబడుతూ వుంటుంది.

వాళ్ళు ఏమనుకున్నా, తల్లి దండ్రుల సహవాసం వల్ల కలిగే అనుభవజ్ఞానం వారికి కలిగిందని చెప్పగలను. స్వాతంత్ర్య సముపార్జనా పాఠం వాళ్ళు బాగా నేర్చుకున్నారని నా అభిప్రాయం. వాళ్ళ అభిరుచి ప్రకారం వాళ్ళను స్కూలుకు పంపించి యుంటే యిట్టి జ్ఞానంవారికి కలిగి యుండేది కాదు. వీళ్లను ఇంగ్లాండుకు పంపించో, లేక దక్షిణ-ఆఫ్రికాలో ఉంచో చదివించి కృత్రిమ శిక్షణ గరిపించియుంటే వీరి విషయమై నేను యీనాడు వున్నంత నిశ్చింతంగా వుండలేకపోయేవాణ్ణి. వాళ్ళు రుజూజీవితం అంటే ఏమిటో, త్యాగం అంటే ఏమిటో గ్రహించలేకపోయేవాళ్ళు. వారి కృత్రిమ చదువులు నేను చేస్తున్న దేశారాధనా కార్యక్రమానికి అడ్డంకులుగా పరిణమించి యుండేవి.

మొత్తంమీద నేననుకున్నంతగాను, వాళ్లు అనుకున్నంతగాను భాషా జ్ఞానం వాళ్లకు లభించకపోయినా, బాగా యోచిస్తే వారి విషయంలో నా ధర్మాన్ని శక్తివంచన లేకుండా నిర్వర్తించాననే భావిస్తున్నాను. ఆ విషయమై నేను పశ్చాత్తాపపడటంలేదు ఈనాడు నా పెద్ద కుమారుని యందు చింతించవలసిన ఏ దోషాలు నేను చూస్తున్నానో, అవి అశిక్షితాలు, అమూర్తాలునగు నా ప్రథమ జీవితాంశాల ప్రతిధ్వనులని మాటిమాటికి నాకు అనిపిస్తూ వున్నది నా ఆ ప్రథమ జీవితాంశం ఒక మాదిరి మూర్ఛాకాలం లేక వైభవకాలం. అప్పటి వయస్సు ననుసరించి అది అటువంటిది కాదని మా పెద్ద పిల్లవాడి ఊహ నా జీవితంలో అదే రాజమార్గమనీ, తరువాత నాలో వచ్చిన మార్పులన్నీ వివేకమను పేరట మోహరాహిత్యం వల్ల నాలో కలిగాయని అతడి విశ్వాసం. ఆ విధంగా నా ప్రథమ జీవితమే రాజమార్గమనీ, తరువాత కలిగిన మార్పులు సూక్ష్మాభిమానవకృతాలనీ, అజ్ఞానజనితాలనీ అతడు ఎందుకు భావించ కూడదు? కొందరు మిత్రులు నాతో యీ విషయమై వాదించారు కూడా. నీ కుమారులు బారిష్టరులైతే వచ్చిన నష్టం ఏమిటి? వారిరెక్కలు విరగ గొట్టే అధికారం మీకెవరిచ్చారు? వాళ్లను వాళ్ల యిష్ట ప్రకారం పోనీయకుండా యిలా అడ్డు పడటం ఏమిటి? యిదీ మిత్రుల తర్కం.

అయితే యీ ప్రశ్నల్లో నాకు విశేషం కనబడలేదు. అనేక మంది విద్యార్థుల్ని గురించి నాకు తెలుసు. యితర బాలుర విషయమై కూడా యిట్టి ప్రయోగం చేసి చూచాను లేక అందుకు సహకరించాను. ఫలితాన్ని కూడా చూచాను. ఆ పిల్లలు, మా పిల్లలు యిప్పుడు ఒకే ఈడులో వున్నారు. వారు మానవత్వం విషయంలో నా పిల్లలకంటే మించలేదని చెప్పగలను. వారి దగ్గర నా పిల్లలు నేర్చుకోవలసింది ఏమీ లేదని నా అభిప్రాయం.

నా యీ ప్రయోగాల ప్రయోజనాన్ని గురించి నిర్ణయించవలసింది భవిష్యత్తే. మనుష్యజాతి అభివృద్ధిని పరిశీలించే శోధకుడు గృహ శిక్షణకు, స్కూలు శిక్షణకు గల భేదాన్ని, తెలుసుకోవాలని, తల్లిదండ్రుల జీవితంలో కలిగే పరివర్తనల ప్రభావం పిల్లలపై ఏవిధంగా పడుతుందో గమనించాలని భావించి యీ వివరం యిక్కడ తెలియచేశాను.

ఈ నా ప్రకరణానికి మరో ఉద్దేశ్యం కూడా వున్నది. సత్యారాధకుడు ఎంతవరకు సత్యారాధన చేయగలడో తెలుసుకోవాలనేది కూడా ఒక ఉద్దేశ్యం. స్వతంత్రతా దేవిని ఉపాసించే వాడిని. ఆ దేవి ఎంత బలిదానం కోరుతుందో తెలియజేయడం మరో ఉద్దేశ్యం. ఆత్మ గౌరవాన్ని త్యజించివేసి, యితర పిల్లలకు అలభ్యమైన విద్యను నా పిల్లలకు గరపి, నేను తృప్తి పడియుంటే వారికి వాఙ్మయ జ్ఞానం బాగా కలిగించి యుండేవాణ్ణే. కాని స్వాతంత్ర్యాన్ని గురించి, ఆత్మాభిమానాన్ని గురించి ఈనాడు వారికి కలిగిన జ్ఞానం అప్పుడు కలిగి యుండేదికాదు స్వాతంత్ర్యం గొప్పదా లేక పాండిత్యం గొప్పదా అని ఎవరైనా ప్రశ్నిస్తే పాండిత్యం కన్న స్వాతంత్ర్యమే వెయ్యి రెట్లు మిన్నయని అనకుండా ఎవరైనా ఉండగలరా?

1920వ సంవత్సరంలో యిప్పటి స్కూళ్లు, కాలేజీలు స్వాతంత్ర్యానికి ఘాతుకాలు గనుక వాటిని విడిచి పెట్టమని బాలురకు ఉద్బోధించాను. అక్షరజ్ఞానం కోసం బంధితులై, గులాములై పడియుండేకంటే, స్వాతంత్ర్యం కోసం నిరక్షరులై యుండి రాళ్లను పగులగొట్టి బ్రతకడం మేలని ఉద్ఘోషించాను. దీనివల్ల నా ఉద్దేశ్యం ఏమిటో అందరికీ బోధపడియుంటుందని భావిస్తున్నాను.

## 6. సేవా ప్రవృత్తి

నా వృత్తి బాగా సాగుతున్నది. కాని దానివల్ల నాకు సంతోషం కలగలేదు జీవితాన్ని యింకా రుజూ మార్గాన నడిపించాలనే మధన నాలో ఎక్కువగా సాగింది

ఆ సమయంలో మా యింటికి ఒక కుష్ఠురోగి వచ్చాడు అన్నం పెట్టి పంపి వేయడానికి మనస్సు అంగీకరించలేదు. అతణ్ణి ఒక గదిలో వుంచి పుండ్లు కడిగి శుభ్రం చేసి కట్లు కట్టాను. సేవ చేశాను.

అయితే ఆ విధంగా ఎక్కువ రోజులు చేయలేకపోయాను. ఎల్లప్పుడు అతణ్ణి యింట్లో వుంచుకోవడానికి శక్తి చాలలేదు. ఇచ్ఛా బలం చాలలేదు. అందువల్ల గిరిమిటియాల కోసం ప్రభుత్వం వారు పెట్టిన ఆసుపత్రికి అతణ్ణి పంపించివేశాను.

నాకు తృప్తి కలుగలేదు. ఎల్లప్పుడూ చేయతగిన శుశ్రూషాకార్యం ఏదైనా దొరికితే బాగుండునని ఆశపడ్డాను. డా. బూత్‌గారు సెయింట్ ఏయిడాన్స్ మిషన్‌కు అధికారులు. ఎవరు వచ్చినా వారు ఉచితంగా మందులిస్తూ వుంటారు. ఆయన ఎంతో మంచివాడు వారి హృదయం స్నేహమయం. డా. బూత్ గారి అధిపత్యాన పారసీ రుస్తుంజీ ధర్మంతో ఒక ఆసుపత్రి పెట్టబడింది. అందు నర్సుపని చేద్దామని నాకు ప్రబలంగా కోరిక కలిగింది. అక్కడ రెండు గంటల సేపు మందులిచ్చే పని ఒకటి వున్నది. డబ్బు తీసుకోకుండా ఆ పని చేయగల స్వచ్ఛంద సేవకుడు కావలసి వచ్చింది ఆ పని నేను చేయాలని, ఇతర పనుల నుండి ఏదో విధంగా రెండు గంటల సమయం మిగిల్చి యీ పనికి వినియోగించాలని నిర్ణయించుకున్నాను ఆఫీసులో కూర్చొని సలహాలివ్వడం, దస్తావేజులకు ముసాయిదా తయారుచేయడం తగాదాలు పరిష్కరించడం, నా పనులు నాకు మేజిస్ట్రేటు కోర్టులో కూడా పనులు వుండేవి కాని అవి అంత వివాదాస్పదాలు కావు. యీ కేసుల్లో నాకు ఖానుగారు సాయం చేస్తున్నారు. వీరు నాతోబాటు దక్షిణ - ఆఫ్రికాకు వచ్చారు. మా యింట్లోనే వుండేవారు. వారి సాయంవల్ల ఆ చిన్న ఆసుపత్రిలో పనిచేసేందుకు నాకు అవకాశం అభించింది. అక్కడ ప్రతిరోజూ ఉదయం పూట పని. రాకపోకలకు, అక్కడ పని చేయడానికి రోజూ రెండు గంటలు పట్టేది యీ పని వల్ల నా మనస్సుకు కొంచెం శాంతి లభించింది. రోగుల రోగాల్ని, బాధల్ని అడిగి తెలుసుకొని డాక్టరుకు చెప్పడం, డాక్టరు చెప్పిన మందు తయారుచేసి రోగులకు యివ్వడం యిదీ నా పని. దీనివల్ల రోగపీడితులైన హిందూదేశవాసులతో నాకు మంచి పరిచయం ఏర్పడింది. వారిలో చాలామంది అరవవారు, తెలుగువారు, ఉత్తరాదివారు. అంతా గిరిమిటియాలు.

ఆ చికిత్సా జ్ఞానం తరువాత నాకు ఎంతో ఉపయోగపడింది. బోయరు యుద్ధ సమయంలో దెబ్బలు తిన్నవారికీ, రోగులకు సేవ చేయడానికి ఆ అనుభవం బాగా ఉపయోగపడింది.

పిల్లల పోషణను గురించిన సమస్య ఎప్పుడూ నన్ను వేధిస్తూ వుండేది. దక్షిణ ఆఫ్రికాలో నాకు యిద్దరు కుమారులు కలిగారు. వారి పోషణకు కూడా ఆసుపత్రిలో కలిగిన అనుభవం బాగా ఉపయోగపడింది. నా స్వతంత్ర ప్రవృత్తి నాకు ఎప్పుడూ కష్టం కలిగిస్తూ వుండేది. యిప్పటికీ కలిగిస్తున్నది. ప్రసవం శాస్త్రీయంగా జరపాలని దంపతులం అనుకున్నాం. అయితే డాక్టరుగాని, మంత్రసానిగాని సమయానికి రాకపోతే ఏంచేయాలి? చదువుకున్న మంత్రసాని హిందూ దేశంలోనే దొరకనప్పుడు దక్షిణ - ఆఫ్రికాలో

దొరకడం సాధ్యమా? అందుకని నేను సుఖ ప్రసవాన్ని గురించి పుస్తకం కొని చదివాను. డా॥ త్రిభువన దాసు గారు రచించిన మానేశిఖావణ తల్లులకు ఉపదేశము అను పుస్తకం అది. ఆ పుస్తకం ప్రకారం మరియు యితరత్ర నాకు లభించిన అనుభవం ప్రకారం ఇద్దరు పిల్లలకి లాలన పాలన నేనే చేశాను. రెండుసార్లు మంత్రసానుల సాయం పొందాను. కాని రెండు రెండు మాసాల కంటే మించి వారి సాయం లభించలేదు వారి సహాయం నా భార్య వరకే సీమితమైంది. పిల్లలకు తలంటువంటి సమస్త పనులు నేనే చేశాను. మా చివరివాడి పుట్టుక నన్ను కఠిన పరీక్షకు లోను చేసింది. ప్రసవ వేదన హఠాత్తుగా ప్రారంభమై ఎక్కువైంది. డాక్టరు సమయానికి దొరకలేదు. మంత్రసానిని పిలవాలి. మంత్రసాని దగ్గరలో వుంటే ఆ సమయంలో పిలవవచ్చు. కాని అందుకు అవకాశం లేదు. నొప్పులు ఎక్కువైనాయి. దానితో నేనే పురుడు పోయాల్సి వచ్చింది అదృష్టవశాత్తు త్రిభువనదాసు పుస్తకం చదివాను గనుక నాకు భయం కలుగలేదు. ఆ గ్రంధ పఠనం నాకు అమితంగా సహాయపడింది.

పిల్లల పోషణను గురించి జ్ఞానం సంపాదించి నేను మా పిల్లల్ని పెంచి యుండకపోతే వాళ్ళ ఆరోగ్యం విషయంలో వెనుకబడి యుండేవారే సామాన్యంగా మొదటి అయిదేండ్ల వరకు పిల్లలు నేర్చుకునేది ఏమీ వుండదని జనం అనుకుంటూ వుంటారు కాని అది సరికాదు. అసలు మొదటి అయిదేండ్ల సమయంలో పిల్లలు గ్రహించినంతగా ఆ తరువాత గ్రహించరు. శిశువుకు విద్యారంభం తల్లి గర్భంలోనే ఆరంభం అవుతుంది. గర్భ ధారణ సమయంలో తల్లి దండ్రుల శారీరిక మానసిక ప్రవృత్తుల ప్రభావం శిశువునందు ప్రసరిస్తుంది. తల్లి గర్భం మోస్తున్నప్పుడు ఆమె ప్రకృతిని, ఆహార విహారాల్ని, గుణ దోషాల్ని స్వీకరించి శిశువుకు జన్మనిస్తుంది. జన్మించిన తరువాత తల్లిదండ్రుల్ని అనుకరిస్తుంది. తరువాత కొన్ని సంత్సరాల దాకా తన వికాసానికి పూర్తిగా తల్లి దండ్రులమీద అధారపడుతుంది.

ఈ సంగతులు తెలిసిన దంపతులు కేవలం కామ తృప్తి కోసం తంటాలు పడరు. సంతానం కోసం వాళ్ళు కాపురం చేస్తారు. నిద్రవలె, ఆహారంవలె సంయోగం అవసరం అని అనుకోకుండా పూర్తిగా అజ్ఞానమని నా అభిప్రాయం. అసలు ఈ జగత్తు యొక్క అస్తిత్వం జనన క్రియపై ఆధారపడి వున్నది. ఈ లోకం భగవంతుని లీలాభూమి. అతని మహిమకు ప్రతిబింబం. స్త్రీ పురుష సంయోగం సంతానం యొక్క సక్రమాభివృద్ధికి నిర్మితమని తెలుసుకుంటే భగీరధ ప్రయత్నం చేసి అయినా మనిషి రస లాలసత్వాన్ని పోగొట్టుకొనగలడు. ఆ విధంగా జరగాలని నా అభిలాష. సంయోగం

వల్ల తాము పొందే సంతతి యొక్క శారీరిక, మానసిక, ఆధ్యాత్మిక రక్షణకు పూనుకొనడం అవసరమను జ్ఞానం తల్లిదండ్రులు పొందుదురుగాక. ఆ విధంగా తన సంతతికి లాభం చేకూర్చెదరుగాక.

# 7. బ్రహ్మచర్యం - 1

ఇది నా బ్రహ్మచర్య వ్రతాన్ని గురించి వ్రాయతగిన సమయం. పెండ్లి రోజునే నా మనస్సునందు ఏకపత్నీవ్రతమను భావం నాటుకుంది. అది నా సత్యవ్రతంలో ఒక భాగం కూడా అయింది. గార్హ్యస్థ్య జీవితం గడుపుతున్నప్పటికీ బ్రహ్మచర్యం యొక్క ఆవశ్యకత దక్షిణ - ఆఫ్రికాలో నాకు బోధపడింది. ఏ సందర్భంలో ఏ పుస్తక ప్రభావం చేత యిట్టి ఆవశ్యకత బోధపడిందో నాకు గుర్తులేదు. రాయచంద్‌భాయి యిందుకు ప్రధాన కారణం అయివుండవచ్చని మాత్రం గుర్తు

మా ఇద్దరి మధ్య జరిగిన సంభాషణ ఒకటి యిప్పటికీ గుర్తు వున్నది. ఒకసారి నేను గ్లాడ్‌స్టన్ గారి యెడ వారి భార్యకు గల ప్రేమను గురించి ప్రస్తావించాను. హౌస్ ఆఫ్ కామన్సులో వున్నప్పుడు కూడా ఆమె తన భర్తకు తేనీరు కాచి ఇస్తూ వుండేదని ఎక్కడో చదివాను. నియమనిష్ఠలతో జీవితం గడిపే ఆ దంపతుల జీవితంలో ఇది గొప్ప విశేషం ఈ విషయం ఆ కవికి చెప్పి దాంపత్య ప్రేమను స్తుతించాను. రాయ్‌చంద్ భాయి నా మాటలు విని "గ్లాడ్‌స్టన్ గారి భార్య గ్లాడ్‌స్టన్ గారికి పరిచర్య చేసిందనీ, అది గొప్ప విషయమనీ మీరు అంటున్నారు. సరే, ఆమె గ్లాడ్‌స్టన్‌గారి సోదరిగాని, పనిమనిషిగాని అని అనుకోండి. అట్టి ప్రేమతో తేనీరు కాచి ఇచ్చారనుకోండి. అట్టి స్థితిలో భార్య పరిచర్య గొప్పదా? సోదరి పరిచర్య గొప్పదా? పనిమనిషి పరిచర్య గొప్పదా? ఇట్టి సోదరి లేక పనిమనిషి యొక్క ఉదాహరణలు మనకు లేవా? ఈ ప్రేమ స్త్రీ జాతిలో గాక పురుష జాతిలో కనబడితే మీకు ఆనందాశ్చర్యాలు కలుగవా? ఈ విషయాన్ని గురించి కొంచెం ఆలోచించి చూడండి" అని అన్నాడు.

రాయచంద్ భాయి వివాహితుడే. ఆ సమయాన వారి మాటలు నాకు కఠోరంగా ఉన్నాయి. కాని వారి మాటలు సూదంటురాయిలా నన్ను ఆకర్షించాయి. భార్యకుగల స్వామిభక్తి యొక్క విలువకంటే పరిచారకుని స్వామిభక్తి యొక్క విలువ ఎక్కువ కాదా? భార్యాభర్తల మధ్య ప్రేమ వుండటంలో ఆశ్చర్యం ఏముంది? స్వామి సేవకుల మధ్య యిట్టి ప్రేమ అభిలషణీయం. రాయచంద్‌భాయి మాటల సారం యిదే కదా? వారి మాటలు నన్ను బాగా వశపరచుకున్నాయి.

"నేను నా భార్యతో ఎట్ట సంబంధం ఏర్పరుచుకోవాలి?" అను ఆలోచన నాలో ప్రారంభమైంది. భార్యను భోగ సాధనంగా భావించడం సబబా? అప్పుడు ఏకపత్నీ వ్రతానికి విలువలేదు. యిది గమనించతగిన విషయం. నా భార్య నన్ను ఎన్నడైనా మోహవశుణ్ణి చేసిందా? లేదే! ఈ దృష్టితో నేను యిప్పుడు బ్రహ్మచర్య వ్రతాన్ని తేలికగా పాలించగలనని నిర్ణయించుకున్నాను. అయితే అందుకు అడ్డంకి కామాసక్తియే. కామం విషయంలో జాగ్రత్తగా వుందామని ప్రయత్నించాను. అయినా రెండు పర్యాయాలు పొరపాటు చేశాను. ప్రయత్నం చేస్తున్నానే గాని ఓడిపోతున్నాను. ఈ ప్రయత్నానికి ముఖ్యమైన హేతువు అంత గొప్పదికాదు. సంతానం కలుగకుండుటకు సంతానం కలుగకుండ చేసుకునేందుకు బాహ్యోపకరణాలు వున్నాయని ఇంగ్లాండులో వున్నప్పుడు చదివాను. డాక్టరు ఆలిన్సనుగారి అభిప్రాయాల్ని గురించి, వారు తెలిపిన ఉపాయాల్ని గురించి గతంలో కొద్దిగా వ్రాశాను. కొంతకాలం అది మంచిదేనని అనుకున్నాను. కాని డాక్టర్ హిల్స్ గారు దాన్ని ఖండించి సంయమమే మంచిదని చెప్పారు. ఆ విషయం నా మనస్సులో అప్పుడే నాటుకున్నది. కాని అప్పుడు ఆ విషయాన్ని గురించి ఎక్కువగా యోచించలేదు. ఇప్పుడు యిక సంతానం వద్దనే నిర్ణయానికి వచ్చాను. దానితో ఇంద్రియ నిగ్రహాన్ని గురించి ఆలోచించసాగాను.

ఇందుకు నేను పడిన పాట్లు చాలా వున్నాయి. మా మంచాలు దూరం అయ్యాయి. పని చేసి బాగా అలసి పోయిన తరువాత నిద్రించడం ప్రారంభించాను. ఎంతగా ప్రయత్నించినా విశేష ఫలితం ఏమీ అప్పుడు కనబడలేదు కాని భూతకాలపు ఘట్టాల్ని పరిశీలించి చూచుకుంటే చేసిన ప్రయత్నాలు ప్రారంభంలో సఫలం కాక పోయినా చివరికి బలం పుంజుకొని సఫలం కావడం గుర్తుకొచ్చింది.

గట్టి నిర్ణయం 1906వ సంవత్సరంలో చేసుకున్నాను. అప్పటికి సత్యాగ్రహ సమరానికి విఘ్నేశ్వర పూజ కాలేదు. బోయరు యుద్ధం ముగిసిన తరువాత నేటాలులో జూలూ తిరుగుబాటు జరిగింది. అప్పుడు నేను జోహాన్సుబర్గులో వకీలుగా వున్నాను. ఆ తిరుగుబాటు సమయంలో నేటాలు ప్రభుత్వానికి సహకరించాలని భావించాను. నేనీ విషయం విన్నవించుకోగా ప్రభుత్వం వారు అందుకు అంగీకరించారు. ఆ విషయం ముందు వ్రాస్తాను. అయితే యీ సేవకు ఫలితం ఏమిటా అని తీవ్రంగా ఆలోచించాను. నా స్వభావాన్ని బట్టి మిత్రులతో యీ విషయం చర్చించాను. బిడ్డల్ని కనడం, వారిని పోషించుకోవడం యీ రెండు పనులకి మరి ప్రజా సేవకు సంబంధం లేదని అభిప్రాయపడ్డాను. యీ తిరుగుబాటు సమయంలో జోహాన్సుబర్గు నుండి

మకాం ఎత్తి వేయాల్సి వచ్చింది. అలంకరించుకున్న ఇంటిని, అమర్చుకున్న గృహోపకరణాల్ని ఒక నెల అయినా పూర్తికాక ముందే వదలివేయవలసి వచ్చింది. భార్యా బిడ్డల్ని ఫినిక్సులో ఉంచాను. తరువాత నేను గాయపడ్డవారికి శుశ్రూష ప్రారంభించాను. సైన్యంలో చేరి యిట్టి దళాన్ని నడిపించాను. ఆ యుద్ధంలో అసిధారా వ్రతానికి పూనుకో వలసి వచ్చింది.

అప్పుడు లోక సేవా పరాయణుడనైతే యిక పుత్రేషణ, ధనేషణ విరమించుకొని వానప్రస్థాశ్రమం స్వీకరిద్దామన్న సంకల్పం కూడా నాకు కలిగింది.

తిరుగుబాటు సమయంలో మాసంవ్సర రోజుల కంటే ఎక్కువ కాలం పట్టలేదు. ఆ ఆరువారాల కాలం నా జీవితంలో ఎంతో అమూల్యమైనది. అదివరకటి కంటే శపథానికి గల విలువ ఏమిటో నాకు బాగా బోధపడింది. శపధం చేసినంత మాత్రాన ప్రయోజనం ఏమిటి అని ఆలోచన బయలుదేరింది యింత వరకు చేసిన ప్రయత్నాలకు కలిగిన ఫలితం ఏమిటా అని యోచించాను. ఏమీ కనబడలేదు. అసలు నాకు నిశ్చలత కుదరలేదని తేల్చుకున్నాను. ఒక నిర్ణయం మీద నిలబడతాననే విశ్వాసం కలుగలేదు. అందువల్లనే నా మనస్సు అనేక వికారాలకు, అనేక యోచనా తరంగాలకు లోనవుతూ వున్నదని తేల్చుకున్నాను. ఈశ్వరుడు కరుణిస్తాడనే నమ్మకం కూడా లేదు. శపథం చేయకుండా వుండేవాడు మోహంలో పడిపోతాడని తెలుసుకున్నాను. శపధంచే తనను తాను బంధించుకుంటే అది వ్యభిచారంలో పడకుండా మనిషిని ఏకపత్నీవ్రతంలో నిలిపి వుంచుతుందని అనుభవంవల్ల తెలుసుకున్నాను. ప్రయత్నం మంచిదే, కాని శపథ బంధనం మంచిది కాదనుకోవడం దౌర్భల్య సూచకమని తేల్చుకున్నాను. అందు కొద్దిగా భోగేచ్ఛ వుంటుంది. చేయరాని పనిని విడనాడితే కలిగే నష్టం ఏమిటి? పాము కాటు వేయబోతున్నదని తెలిస్తే తప్పక పరుగెత్తుతాము. పరుగెత్తేందుకు ప్రయత్నం మాత్రమే చేస్తూ కూర్చుంటే చావు తధ్యం. అయితే ఆ నిజం తెలుసుకోనప్పుడు ప్రయత్నం చేస్తూ వుంటాం. అందువల్ల ఫలానా అలవాటు మానుకోవాలని నిర్ణయించుకొని అందు నిమిత్తం ప్రయత్నం మాత్రమే చేస్తూవుంటే, దాన్ని మానుకోవలసిన అవశ్యకతను మనం గుర్తించనట్లే. అసలు మన ఊహలు మారిపోతాయేమో అని శంకించి అనేక సార్లు శపథం చేయడానికి మనం వెనకాడుతూ వుంటాం. ఇదంతా స్పష్టమైన దృక్పధం లేకపోవడం వల్ల జరుగుతూ వుంటుంది. నిష్కులానందుడు దీన్ని గురించి యిలా అన్నాడు. "త్యాగనటకేరేవైరాగవినా" "ఎన్ని ఉపాయాలు చేసినా విషయవాసనలను విడనాడనిదే నీకు త్యాగం అలవడదు సుమా". అందువల్ల

ఎప్పుడు ఏ విషయం యెడ పూర్ణ వైరాగ్యం కలుగుతుందో అప్పుడు శపథం పూనడం మంచిదని, అది దానంతటదే అనివార్యం అవుతుందని ఒక నిర్ణయానికి వచ్చాను.

## 8. బ్రహ్మచర్యం - 2

ఎంతో చర్చించి, ఎంతో ఆలోచించి 1909వ సంవత్సరంలో నేను బ్రహ్మచర్య వ్రతం చేపట్టాను. వ్రతం ప్రారంభించేవరకు నా భార్యకు యీ విషయం చెప్పలేదు. వ్రత సమయంలో చెప్పి ఆమె అనుమతి తీసుకున్నాను. ఇందుకు ఆమె అభ్యంతరం తెలుపలేదు.

ఈ వ్రతానికి పూనుకోవడం చాలా కష్టం అయింది. వికారాల్ని అణుచుకోవడం తేలిక విషయం కాదు కదా! భార్య విషయంలో వికారం కలుగకుండ వుండటం సామాన్య విషయమా? అయినా తక్షణ కర్తవ్యంగా భావించి నా లక్ష్యం శుద్ధమైనది గనుక పరమాత్ముడు కరుణించి నాకు శక్తి సామర్థ్యాలు ప్రసాదించవలెనని ప్రార్థించి యిందుకు పూనుకున్నాను. నేటికి 20 ఏళ్ళు గడిచాయి. ఇప్పుడు యీ వ్రతాన్ని గురించి యోచిస్తే నాకు ఆనందమేగాక ఆశ్చర్యం కూడా కలుగుతున్నది. నిగ్రహం అవసరమను భావం, తత్పరిపాలన మును గురించిన పట్టుదల 1901వ సంవత్సరంలో ప్రబలంగా వుండేది. ఇప్పుడు నాకు గల స్వాతంత్ర్యం, ఆనందం 1909వ సంవత్సరానికి పూర్వం వున్నట్లు గుర్తులేదు. ఆ సమయంలో నాకింకా వాంఛ తొలగలేదు. ఏ సమయంలోనైనా చ్యుతి కలుగవచ్చునని భయంగా వుండేది. ఇప్పుడు అట్టి స్థితిలేదు. వాంఛను అణుచుకోగలిగానను విశ్వాసం నాకు కలిగింది. బ్రహ్మచర్యం మహిమ రోజురోజుకు పెరిగిపోవడమేకాక, దాని అనుభవం నాకు కలుగసాగింది. ఫినిక్సు నందు బ్రహ్మచర్యవ్రతం ప్రారంభించాను. సైన్యాన్నుండి సెలవు పుచ్చుకొని ఫినిక్సు వెళ్లాను. అక్కడి నుండి వెంటనే జోహాన్సుబర్గు వెళ్లవలసి వచ్చింది. అక్కడే ఒక నెల లోపున సత్యాగ్రహ సమరానికి అంకురార్పణ జరిగింది. బ్రహ్మచర్య వ్రతమే నన్ను సత్యాగ్రహ సంగ్రామ ప్రారంభానికి పూనుకునేలా చేసిందని భావిస్తున్నాను. ముందు ఆలోచించుకొని నేను సత్యాగ్రహ సంగ్రామం ప్రారంభించలేదు. అనుకోకుండా అతి సహజంగా ప్రారంభమైంది. కాని దీనికి పూర్వం నేను చేసిన పనులు అనగా ఫినిక్సు వెళ్లడం, జోహాన్సుబర్గులో ఇంటి ఖర్చులు తగ్గించడం, బ్రహ్మచర్య వ్రతానికి పూనుకోవడం మొదలగునవి, సత్యాగ్రహ సంగ్రామం ప్రారంభించేందుకు దోహదం చేశాయని భావిస్తున్నాను.

బ్రహ్మచర్యాన్ని సరిగా పాటించడం అంటే బ్రహ్మదర్శనం చేసుకోవడమే నన్నమాట. ఈ జ్ఞానం నాకు శాస్త్రాలు చదవడంవల్ల కలుగలేదు. నాకీ విషయం మెల్ల మెల్లగా అర్థం కాసాగింది. తరువాత శాస్త్రాలు చదివాను. బ్రహ్మచర్య వ్రతధారణం వల్ల శరీర రక్షణ, బుద్ధి రక్షణ, ఆత్మ రక్షణ కలుగునను సంగతి బ్రహ్మచర్య వ్రతం ప్రారంభించిన తరువాత రోజురోజుకు అధికంగా అనుభవంలోకి రాసాగింది. ప్రారంభంలో బ్రహ్మచర్యవ్రతమంటే ఘోరతపశ్చర్య యని భావించేవాణ్ణి. కాని ప్రారంభించిన తరువాత యిప్పుడు ఎంతో రసమయం గాను, ఆనందమయంగాను వున్నది. యిప్పుడు దీని బలం వల్లనే పనులు జరుగుతున్నాయి. దీని సౌందర్యం రోజురోజుకు అధికంగా పెరుగుతూ వున్నది.

ఈ వ్రతానికి పూనుకున్న తరువాత ఆనందం పొందుతున్నప్పటికీ దీని వేడి నాకు తగలలేదని భావించవద్దు. నేటితో నాకు యాభై ఆరేండ్లు నిండాయి. అయినా దీని కాఠిన్యం నాకు గోచరమవుతూనే వుంది. ఇది నిజంగా అసిధారా వ్రతమే ఎల్లప్పుడూ యీ విషయమై కడు జాగ్రత్తగా వుండటం అవసరం అని గ్రహించాను

బ్రహ్మచర్య వ్రతం సాఫీగా సాగాలంటే ముందు జిహ్వను వశంలో పెట్టుకోవాలి నాలుకను జయించితే బ్రహ్మచర్య వ్రతానుష్ఠానం తేలిక అని అనుభవం వల్ల గ్రహించాను అందుకుగాను భోజనంలో మార్పులు చేశాను శాకాహార దృష్టితోగాక, బ్రహ్మచర్య దృష్టితో భోజనంలో మార్పుచేశాను. మితంగా తినడం. వీలైనంత వరకు వండని పదార్థం తినడం, అనగా స్వాభావికమైన భోజనం అవసరమని అనుభవం వల్ల తెలుసుకొన్నాను. బ్రహ్మచారికి అడవిలో పండిన పండ్లు సరియైన ఆహారమని ఆరేళ్ళు కృషిచేసి తెలుసుకున్నాను. పండ్లు తినే సమయంలో నాకు కలిగిన నిర్వికారభావం, సుఖం, పండ్లు తినడం మానివేసి మరో పదార్థం తిన్నప్పుడు కలుగలేదు. పండ్లు తింటూ వున్నప్పుడు బ్రహ్మచర్యం సులభమైంది. పాలు పుచ్చుకుంటూ వున్నప్పుడు ఆ వ్రతాన్ని పాలించడం కష్టమనిపించింది. పండ్లు తినడం మాని పాలు ఎందుకు త్రాగవలసి వచ్చిందో తరువాత తెలియజేస్తాను. బ్రహ్మచారికి పాలు పనికిరావని, అవి బ్రహ్మచర్యానికి విఘ్నకారకమని చెప్పక తప్పదు. అయితే బ్రహ్మచారికి పాలు నిషిద్ధమని భావించవద్దు. బ్రహ్మచర్యానికి ఆహార ప్రాముఖ్యం ఏపాటిది? ఎంత? ఈ విషయంలో, యింకా ప్రయోగాలు చేసి చూడటం అవసరం. పాలు ఎంతో జీర్ణకరం, స్నాయువర్ధకం. అలాంటి ఆహారం మరొకటి యింతవరకు లభించలేదు. అట్టిది మరొక్కటి వున్నదని ఏ వైద్యుడు, ఏ హకీము, ఏ డాక్టరు కూడా చెప్పలేదు. పాలు కామవికారం కలిగిస్తాయి. అయినా పైన తెలిపిన కారణం వల్ల పాలు త్యాజ్యమని కూడా అనలేను.

ఆహార విధానం, ఆహార నియమం వలె ఉపవాసం కూడా ఒక బాహ్యోపచారమే. ఇంద్రియ సముదాయానికి రాక్షసబలం ఎక్కువ నలు ప్రక్కల, పది దిక్కుల క్రింద, పైన కాపలా పెడితేగాని అది లొంగదు. కడుపు మాడిస్తే ఇంద్రియాలు దుర్బలం అవుతాయి. అయితే ఇచ్ఛాపూర్వకంగా చేసే ఉపవాసాలు ఇంద్రియ దమనానికి తోడ్పడతాయి. కావున ఉపవాసాలు చేసే వారిలో చాలామంది సఫలురు కావడంలేదు. ఉపవాసం చేస్తే సమస్తం లభ్యమవుతుందని వారు భావిస్తూ వుంటారు. బాహ్యోపవాసం చేస్తూ వుంటారేకాని మనస్సులో మాత్రం భోగాలన్నింటిని భోగిస్తూనే వుంటారు. ఉపవాసం పూర్తయిన తరువాత ఏమి తినాలో యోచించుకొని ఆ పదార్థాల రుచుల్ని గురించి ఉపవాస సమయంలో యోచిస్తూ వాటి రుచుల్ని ఆస్వాదిస్తూ వుంటారు. అయ్యో, నాలుక మీద సంయమం ఉండటంలేదు, జననేంద్రియం మీద సంయమం ఉండటంలేదు అని అంటూ వుంటారు. మనస్సు కూడా ఇంద్రియ సంయమనానికి తోడ్పడినప్పుడే ఉపవాసం వల్ల ప్రయోజనం కలుగుతుంది. అంటే అసలు మనస్సులో విషయ భోగాల యెడ వైరాగ్యం జనించడం అవసరం. విషయ వాసనలకు మూలం మనస్సు. అది వశంలో వుంటే ఉపవాసాది సాధనాలు ఎక్కువగా ఉపకరిస్తాయి. కానియెడల ఉపకరించవు. ఉపవాసాలు చేసినా మనిషి విషయాసక్తుడుగా ఉండవచ్చు కనుక మనస్సును అదుపులో పెట్టుకొని ఉపవాసం చేయాలి. అప్పుడది బ్రహ్మచర్యానికి అమితంగా తోడ్పడుతుంది

బ్రహ్మచర్యం విషయంలో చాలా మంది విఫలత్వం పొందుతూ వున్నారు. ఆహార విహారాదుల విషయంలో వాళ్ళు అబ్రహ్మచారులుగా వ్యవహరిస్తూ బ్రహ్మచర్యాన్ని రక్షించుకోవాలని భావిస్తూ వుంటారు. ఇది గ్రీష్మకాలంలో హేమంతాన్ని కోరడం వంటిది. స్వచ్ఛంద వర్తనుడి జీవితంలోను, సంయమం కలవాడి జీవితంలోను వ్యత్యాసం వుండాలి. ఇరువురికీ పైపైని సామ్యమే కాని లోలోన భేదం వుంటుంది. యిద్దరూ చూస్తూనే వుంటారు కాని బ్రహ్మచారి పరమేశ్వరుణ్ణి చూస్తూ వుంటే భోగి నాటకాలు, సినిమాలు చూస్తూ వుంటాడు. ఇద్దరూ వింటూ వుంటారు. కాని బ్రహ్మచారి భజన గీతాల్ని, భక్తి గీతాల్ని వింటూ వుంటే భోగి విలాసగీతాన్ని వింటూవుంటాడు. ఇద్దరూ జాగరణ చేస్తూ వుంటారు కాని బ్రహ్మచారి హృదయ మందిరంలో రాముడు ఆరాధింపబడితే, భోగి హృదయం నాట్యరంగంలో తేలి ఆడుతూ వుంటుంది. ఇద్దరూ భుజిస్తారు. కాని బ్రహ్మచారి శరీర రూపంలో నున్న తీర్థక్షేత్ర రక్షణ కోసం మాత్రమే భుజిస్తాడు. భోగి రుచులకోసం రకరకాల పదార్థాలు సేవించి ఉదరాన్ని దుర్గంధమయం

చేస్తాడు. ఈ విధంగా ఇద్దరి ఆచార విచారాలలో భేదం వుంటుంది. రోజు రోజుకు ఇది పెరుగుతూ వుంటుందే కాని తరగదు.

బ్రహ్మచర్యం అంటే ఏమిటి? మనోవాక్కాయాలతో సర్వేంద్రియాలను నిగ్రహించడమన్నమాట. ఇందుకోసం పూర్వపు విషయవాసనలన్నిటిని త్యజించడం అవసరమని భావిస్తున్నాను. త్యాగక్షేత్రానికి ఎల్లలు లేనట్లే బ్రహ్మచర్య మహిమకు కూడా ఎల్లలు లేవు. యిట్టి బ్రహ్మచర్యం సులభంగా లభ్యమవుతుందని భావింపకూడదు. చాలామందికి యిది ఆదర్శం మాత్రమే. కాని ప్రయత్నశీలుడగు బ్రహ్మచారికి తన లోట్లు తెలుస్తూ వుంటాయి. తద్వారా తన హృదయ కుహరంలో దాగియున్న వికారాల్ని తొలగించుకుంటూ వుంటాడు. ప్రవృత్తుల్ని జయించనంతవరకు బ్రహ్మచర్యవ్రతం సఫలం కాదు. ప్రవృత్తులు, వృత్తులు ఎన్ని రకాలుగా వున్నా అవి వికారాలతో నిండి వుంటాయి. వాటిని వశపరుచు కోవడమంటే మనస్సును వశపరుచుకోవడమే. వాస్తవానికి మనస్సును నిగ్రహించడం, వాయువును నిగ్రహించడం కంటే కష్టం. అయితే మనస్సులో పరమేశ్వరుడు తిష్ఠవేస్తే వ్రతం అంతా సులభమే అవుతుంది. కాని ఆ మార్గాన చిక్కులు అధికంగా వుంటాయి. అయినా అది అసాధ్యమని అనుకోనక్కరలేదని నా అభిప్రాయం. అది పరమార్థం. అట్టి పరమార్థానికి గట్టి ప్రయత్నం అవసరం. అందుకు బాగా కృషిచేయాలి.

ఇట్టి బ్రహ్మచర్యం సులభంకాదని హిందూ దేశానికి తిరిగి వచ్చిన తరువాత తెలుసుకున్నాను. అంతవరకు ఫలహారాల వల్ల వికారాలు సమూలం నశించిపోతాయని, అందుకు యింత ప్రయత్నం చేయనవసరం లేదని భావించే వాణ్ణి. అది కేవలం మోహంలోపడి యుండుటయేయని తరువాత తెలిసుకో గలిగాను. అయితే అందుకు నేను చేసిన ప్రయత్నాలను గురించి తెలియజేయాలి కదా! అందుకు కొంత సమయం కావాలి. ఈ సందర్భంలో మరో విషయం చెప్పడం అవసరం. ఈశ్వర సాక్షాత్కారం కోసం నేను చెప్పిన బ్రహ్మచర్య వ్రతాన్ని అనుష్ఠించాలని భావించేవారు, తమ ప్రయత్నంతో బాటు పరమేశ్వరునిపై శ్రద్ధ వహించగలిగితే, నిరాశపడవలసిన అవసరం వుండదని గట్టిగా చెప్పవచ్చు.

విషయావినివర్తంతే నిరాహారస్యదేహినః
రసవర్జం రసో ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.
(గీత. 2వ అధ్యాయం. 59వ శ్లోకం)

ఆహారం మానివేసిన వాడికి విషయములు శాంతించును. కాని అందుండు అభిరుచి శాంతించదు. ఈశ్వర దర్శనం వల్లనే అట్టి అభిరుచి శమించును. కావున ఆత్మ దర్శనం కావలసిన వారికి రామనామం, రామకృప సాధనాలు అవసరం. నేను భారతదేశానికి వచ్చిన తరువాతనే ఈ విషయం తెలుసుకున్నాను. అది నాకు కలిగిన అనుభవం.

## 9. మితవ్యయం

నేను సుఖాలు అనుభవించసాగాను. కాని ఎంతోకాలం సాగలేదు. గృహాలంకరణకు అవసరమనుకున్న సామాగ్రిని సమకూర్చాను. కాని ఆ వ్యామోహం కూడా నిలవలేదు. దానితో వ్యయం తగ్గించాలన్న నిర్ణయానికి వచ్చాను. చాకలి ఖర్చు ఎక్కువగా వుందని అనిపించింది. అంతేగాక అతడు బట్టలు త్వరగా తీసుకురాడు. అందువల్ల రెండుమూడు డజన్ల కమీజులు, అన్ని కాలర్లు వున్నా చాలేవి కావు. ఒక్కొక్క రోజుకు ఒక్కొక్క కాలరు. రోజూ కాక పోయినా మూడురోజులకొక కమీజు చొప్పున మారుస్తూ వుండేవాణ్ణి. యిందుకు వ్యయం పెరిగింది. ఈ వ్యయం అవసరమని అనిపించింది. నేను యింట్లో బట్టలుతకడం ఎలా అను పుస్తకాలు తెప్పించి చదివాను. నా భార్యకు కూడా నేర్పాను. పని పెరిగింది. కాని యిది క్రొత్తపని కావడంవల్ల మనోవినోదం కూడా కలిగింది.

మొట్టమొదటిసారి నేను ఉతికి ఇస్త్రీ చేసిన కాలరు మరచిపోవడానికి వీలు లేనంతగా పనిచేసింది. పిండి ఎక్కువైంది. ఇస్త్రీ పెట్టె వేడెక్కలేదు. కాలరు కాలిపోతుందేమోనని భయంతో ఇస్త్రీ పెట్టెను అణిచి రుద్దలేదు. అందువల్ల కాలరు గట్టిపడింది. పిండి రాలుతూ వుంది. ఆ కాలరుతో కోర్టుకు వెళ్ళి తోటి బారిష్టర్ల హాస్యానికి గురి అయ్యాను. అయితే యిట్టి హాస్యాన్ని సహించగలశక్తి నాకు చేకూరేవుంది. కాలరు ఇస్త్రీ చేసుకోవడం యిదే ప్రథమం. కనుక కాలరు నుండి పిండి రాలితే ఏం? మీకందరికి వినోదం కల్పించింది . ఇది గొప్ప విశేషం కదా! అంటూ స్పష్టంగా చెప్పాను. "ఇక్కడ చాకళ్ళకు కరువు లేదు కదా"? అని ఒక మిత్రుడు అన్నాడు.

"చాకలి ఖర్చు అత్యధికంగా పెరిగిపోయింది. కాలరు ధర ఎంతో దానిని ఉతికించడానికి అంత ఖర్చు అవుతున్నది. అంతేకాక చాకలివాని కోసం పడిగాపులు కాయవలసి వస్తున్నది. ఈ కష్టాలు పడేకంటే నా బట్టలు నేనే ఉతుక్కోవడం మంచిదని భావించాను."

అయితే ఎవరిపని వారు చేసుకోవడం మంచిదని వాళ్ళకు చెప్పలేక పోయాను నా పని మాత్రం నేను చేసుకోసాగాను క్రమంగా ఈ విద్యలో పాండిత్యం సంపాదించాను నా ఇస్త్రీ, చాకలి ఇస్త్రీ కంటే ఏ మాత్రమూ తీసిపోలేదు. చాకలి ఇస్త్రీ చేసిన కాలరు కంటే నేను ఇస్త్రీ చేసిన కాలరు నిగనిగలాడుతూ శుభ్రంగా ఉంది. కీ.శే. మహదేవ గోవిందరానడేగారు గోఖలేగారికి ఒక శాలువ ప్రసాదించారు. గోఖలేగారు దాన్ని ప్రాణప్రదంగా చూసుకుంటూ ప్రత్యేక సమయాల్లో దాన్ని వాడుతూ ఉండేవారు. జోహన్సుబర్గులో గోఖలేగారికి ఘనంగా మేము విందు చేశాము. అది గొప్పసభ. అప్పుడు వారిచ్చిన ఉపన్యాసం దక్షిణ ఆఫ్రికాలో వారిచ్చిన ఉపన్యాసాలన్నిటి కంటే గొప్పగా ఉంది అప్పుడువారు ఆశాలువా వేసుకోవాలని అనుకున్నారు. ఆ శాలువా మడతపడి ఉన్నది. దాన్ని ఇస్త్రీ చేయించాలి. సమయం తక్కువ. చాకలి చేత ఇస్త్రీ చేయించి తేవడం కష్టం "నా విద్యను కొద్దిగా పరీక్షించండి" అని వారిని కోరాను.

'నీ లాయరు విద్యను విశ్వసించవచ్చుగాని చాకలి విద్యను ఎలా విశ్వసించడం? నీవు దీని మీద మరకలు వేస్తే ఎలా? దీని వెల ఎంతో తెలుసా' అని అంటూ ఆ శాలువా కథ చెప్పారు

మరకలు పడకుండా శాలువా సరిచేస్తానని వారికి విన్నవించాను తత్ఫలితంగా ఆ శాలువా ఇస్త్రీ చేసే గౌరవం నాకు దక్కింది. వారు నాకు "మంచి చాకలి" అని బిరుదు ఇచ్చారు. ఇక చాలు లోకమంతా ఇవ్వకపోయినా పర్వాలేదని అనిపించి సంబరపడ్డాను. చాకలి దాస్యం నుండి బయట పడినట్లుగానే మంగలి దాస్యం నుండి బయటపడవలసిన అవసరం ఏర్పడింది. ఇంగ్లాండు వెళ్ళినవారంతా కనీసం తన గడ్డమైనా చేసుకోవడం నేర్చుకుంటారు. కాని తల వెంట్రుకలు కత్తిరించుకోవటం నేర్చుకోరు. ప్రిటోరియాలో ఒకసారి నేను మంగలి దుకాణానికి వెళ్ళాను. అక్కడ మంగలి "నాకు క్షవరం చేయను, పో" అని అన్నాడు. చేయనంటే పరవాలేదు. కాని ఆ తిరస్కారం భరించలేకపోయాను బజారుకు వెళ్లి కత్తెర ఒకటి కొన్నాను. అద్దం ఎదుట నిలబడి నేనే జుట్టు కత్తిరించుకున్నాను. ముందరి వెంట్రుకలు ఏదో విధంగా కత్తిరపడ్డాయి. కాని వెనుక వెంట్రుకలు కత్తిరించుకోవడం కష్టమైంది. నేను కోరుకున్నట్లు కత్తెర పడలేదు. ఆ విధంగా జుట్టు కత్తెర వేసుకుని కోర్టుకు హాజరయ్యాను. కోర్టులో కలవరం బయలుదేరినది.

" నీ మీద ఎలుకలు తిరుగుతున్నాయా ఏమి" అని ఒకడు ప్రశ్నించాడు. 'లేదు నా నల్లవాడి తలను తెల్లమంగలి అంటడు కదా! అందుకని నేను వెంట్రుకల్ని ఏదో విధంగ కత్తిరించుకున్నాను. యిది నాకు ఎంతో హాయినిచ్చింది.' అని చెప్పాను.

నా సమాధానం విని వాళ్లు ఆశ్చర్యపడలేదు. నిజానికి యిందు మంగలి అపరాధం ఏమీ లేదు. నల్లవాడికి క్షవరం చేస్తే అతడి కూట్లో రాయిపడుతుంది. మనం మాత్రం మన మంగళ్లను మాదిగలకు క్షవరం చేయనిస్తామా? దక్షిణ - ఆఫ్రికాలో యిట్టి అనుభవం ఒక్కసారి కాదు, అనేకసార్లు నాకు కలిగింది. ఇది మన పాపఫలమే అని నిర్ణయానికి వచ్చాను. అందువల్ల నాకు ఈ విషయమై ఎన్నడు రోషం కలుగలేదు.

నా పనులన్నీ నేనే చేసుకోవాలి, వ్యయం తగ్గించుకోవాలి, అని కోరికలు బయలుదేరి తీవ్రరూపం ధరించాయి. ఆ వివరం తరువాత పలుచోట్ల తెలియజేస్తాను. కాని దీనికి మూలం చాలా పురాతనమైనది. పూచేందుకు, కాచేందుకు, మూలానికి నీరు పోయవలసిన అగత్యం ఏర్పడింది. అందుకు దక్షిణ - ఆఫ్రికా పరిస్థితులు బాగా తోడ్పడ్డాయి.

## 10. బోయరు యుద్ధం

1897 నుండి 1899 వరకు నా జీవితంలో కలిగిన యితర అనుభవాల్ని వదిలి బోయరు యుద్ధాన్ని గురించి తెలియజేస్తాను. యుద్ధం ప్రారంభమైనప్పుడు నేను పూర్తిగా బోయర్లకు అనుకూలంగా వున్నాను. ఇటువంటి విషయాల్లో వ్యక్తిగతమైన అభిప్రాయాల ప్రకారం పని చేసే అధికారం నాకు లేదని అనుకున్నాను. ఈ విషయమై నా హృదయంలో అపరిమితంగా మధనం సాగింది. ఆ వివరం దక్షిణ - ఆఫ్రికా సత్యాగ్రహచరిత్రలో వివరించాను. అందువల్ల దీన్ని యిక్కడ వ్రాయను. తెలుసుకోదలచిన వారు ఆ చరిత్ర చదివి తెలుసుకోవచ్చును. తెల్ల ప్రభుత్వం వారి ప్రజలం కనుక ఆ యోగ్యత ప్రకారం మనకు వుండవలసిన హక్కుల్ని మనం పుచ్చుకోవలసియున్నట్లే, తెల్ల ప్రభుత్వం వారియెడ గల విశ్వాసం ఈ యుద్ధంలో వారికి సాయపడమని నన్ను ముందుకు త్రోసింది తెల్ల ప్రభుత్వం వారి ప్రజలం కనుక ఆయోగ్యత ననుసరించి బ్రిటిష్ రాజ్య రక్షణకు సాయపడటం మన ధర్మం అని భావించాను. భారతీయుల వికాసానికి బ్రిటిష్ సామ్రాజ్యమే శరణ్యమని ఆ రోజుల్లో నాకు అభిప్రాయం ఏర్పడింది.

ఆ కారణం వల్ల దొరికినంతమంది మిత్రుల్ని చేరదీసి, యుద్ధంలో గాయపడిన వారికి సేవ చేసేందుకై ఎంతో కష్టపడి ఒక దళాన్ని ప్రోగుచేశాను. నల్లవారంతా పిరికివారనీ, అపాయాల్ని ఎదుర్కోలేరనీ, తమ పనుల్ని తప్ప మిగతాపనుల్ని పట్టించు కోరనీ, స్వార్థపరులనీ అప్పుడు ఇంగ్లీష్‌వాళ్ళు భావిస్తూ వుండేవారు. అందువల్ల నా

ఆంగ్ల మిత్రులు నా యీ ప్రయత్నాన్ని చూచి చప్పరించారు. డాక్టర్ బూత్‌గారొక్కరు మాత్రం ఏ ఏ విధంగా చేయాలో నేర్పారు. మేము యీ పనికి తగిన వారమని డాక్టర్ సర్టిఫికెట్లు సంపాదించాము. లాటనుగారు, ఎస్కాంబిగారు మా ఉద్దేశ్యాన్ని మెచ్చుకొన్నారు. యుద్ధంలో మా సేవల్ని అంగీకరించమని ప్రభుత్వానికి దరఖాస్తు పంపాము. ప్రభుత్వం వారు మమ్మల్ని అభినందించారు. అయితే యిప్పుడు అవసరం లేదని మాకు తెలియజేశారు.

నేను "అవసరంలేదు" అని వచ్చిన సమాధానంతో వూరుకోలేదు. డాక్టర్ బూత్ గారి సహాయంతో నేటాలు బిషప్పుగారిని దర్శించాను. బిషప్‌గారికి మా ఉద్యమం ఆనందం కలిగించింది. ఆయన తప్పక సాయం చేస్తానని మాట యిచ్చాడు.

ఇంతలో ఘటనా చక్రంలో కొంత మార్పు వచ్చింది. తెల్లవాళ్ళు బోయర్ల సన్నాహాన్ని, దార్ఢ్యతను, పరాక్రమాన్ని గుర్తించసాగారు. దానితో తెల్ల ప్రభుత్వం కదిలింది. క్రొత్తవారిని ప్రోగు చేసుకోవలసిన అవసరం కలిగింది. చివరికి మా ప్రార్థన అంగీకరించబడినది.

మా దళంలో సుమారు 1100 మందిమి వున్నాం. యిందు నాయకులు నాలుగు వందల మంది. సుమారు మూడు వందల మంది స్వతంత్రులగు భారతీయులు, మిగిలిన వారంతా గిరిమిటియాలు. డాక్టర్ బూత్ గారు కూడా మాతో వున్నారు. దళం చక్కగా పని చేసింది. మా దళం పని సైన్యానికి బయటనే. దీనికి రెడ్‌క్రాస్ అనగా లోహిత స్వస్తికం యిచ్చారు. అది యుద్ధంలో పడిపోయిన వారికి ఉపచారం చేసేవారు ఎడమచేతి మీద పెట్టుకునే ఎర్రగుర్తు. ఈ గుర్తు కలవారిని శత్రువులు కాల్చరు. ఇంకా ఎక్కువ వివరం తెలుసుకోదలచిన వారు దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహచరిత్ర చదువవచ్చును. ఆ గుర్తు మా రక్షణ కోసం మంజూరు చేశారు.

ఒకానొక సమయంలో మా దళం యుద్ధరంగంలోకి కూడా పోవలసి వచ్చింది. లోగడ ప్రభుత్వం వారు వారి యిష్ట ప్రకారమే అపాయస్థలంలోకి వెళ్ళుటకు మాకు అనుమతి యివ్వలేదు. కాని స్కియాంకోపు చెయ్యి జారి పోయేసరికి పరిస్థితులు మారిపోయాయి. అప్పుడు జనరల్ బులర్‌గారు యుద్ధరంగంలో పనిచేయాలనే నిర్బంధం మీకు లేదు, అయినా అపాయానికి సిద్ధపడి పడిపోయిన సైనికుల్ని, ఆఫీసర్లను యుద్ధరంగంలోకి వెళ్ళి ఎత్తుకుని డోలీలలో తీసుకొనివచ్చేందుకు సిద్ధపడితే ప్రభుత్వం వారు మీ ఉపకారాన్ని మరచిపోరని వార్త పంపాడు. మేమందుకు సంసిద్ధంగా వున్నామని సమాధానం పంపాము. తత్ఫలితంగా స్పియాంకోప్ యుద్ధం

అయిపోయిన తరువాత మేము ఫిరంగి గుండ్లు, తుపాకీ గుండ్లు పడే చోట పనిచేయుటకు పూనుకున్నాము. అప్పుడు రోజుకు 20 లేక 25 మైళ్ళ వరకు తిరిగి పనిచేయాల్సి వచ్చింది. ఒక్కొక్క సారి దెబ్బలు తిని గాయపడిన వారిని డోలీల్లో మోసుకొని అంతదూరం నడిచి రావలసి వస్తూ వుండేది. ఆవిధంగా గాయపడిన వారిలో జనరల్ వుడ్‌గేట్ వంటివారున్నారు. అట్టి యోధుల్ని చేరవేసే అదృష్టం మాకు కలిగింది.

ఆరువారాలు విశ్రాంతి లేకుండ పని చేసిన పిమ్మట మాదళాన్ని విడుదల చేశారు. స్పియాంకోపును, వాల్ క్రాంజును చేజార్చుకున్న పిమ్మట లేడీస్మిత్ మొదలగు స్థావరాలను బోయర్లు ముట్టడించేసరికి, వారి పట్టు నుండి వాటిని విడిపించడం కోసం పూనుకోకుండా ఇంగ్లాండు నుండి, ఇండియా నుండి సైన్యాలను రప్పించాలని నిర్ణయించుకొని, అంత వరకు మెల్లమెల్లగా పని చేయాలని బ్రిటీష్ సేనాపతి నిశ్చయించుకున్నాడు.

మేము చేసిన ఆ స్వల్ప కార్యానికి ఆ సమయంలో మమ్మల్ని అంతా ఘనంగా మెచ్చుకున్నారు. దీనివల్ల భారతీయుల ప్రతిష్ట పెరిగింది. "ఆహా! భారతీయులనెవరో కాదు ఈ రాజ్యపు వారసులే," అను మకుటంతో పద్యాలు పత్రికల్లో వెలువడ్డాయి. జనరల్ బులర్ మాసేవల్ని ప్రశంసించాడు. మా దళపు నాయకులకు మెడల్సు కూడా లభించాయి.

ఇందువల్ల భారతీయుల్లో ఐక్యత పెరిగింది. నాకు గిరిమిటియాలతో సంబంధం పెరిగింది. వారిలో కూడా వివేకం పెరిగింది. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు, మద్రాసీ, గుజరాతీ, సింధూ, అంతా హిందూ దేశస్థులేనను భావం ప్రబలింది. ఇక భారతీయుల కష్టాలు తొలగిపోతాయని అంతా భావించారు అప్పటి నుండి తెల్లవారి నడతలో మార్పు వచ్చింది.

యుద్ధ సమయంలో తెల్లవారికి, మాకు మధురమైన సంబంధం ఏర్పడింది వేలాదిమంది తెల్లసోల్జర్లతో మాకు సంబంధం ఏర్పడింది. వారు మాతో ఎంతో స్నేహంగా వ్యవహరించారు. మేము తమకు చేసిన సేవా శుశ్రూషలకు వారు ఎంతో కృతజ్ఞత తెలియజేశారు.

దుఃఖ సమయంలో మనిషి హృదయం ఎంత ద్రవిస్తుందో ఒక్క ఉదాహరణ పేర్కొంటాను. మేము చీవలీ శిబిర ప్రాంతంలో సంచరిస్తున్నాము. రాబర్ట్సు ప్రభువు పుత్రుడు లెఫ్టినెంట్ రాబర్ట్సుగారికి ప్రాణాంతకమగు గుండు దెబ్బ తగిలింది. ఆయన

ప్రాణాలు విడిచాడు. వారిని మోసుకొని వెళ్ళే అదృష్టం మా దళానికి కలిగింది. వచ్చేటప్పుడు ఎండ మాడిపోతుంది. అందరి నాలుకలు దాహంతో పిడచకట్టుకు పోయాయి. దారిలో ఒక చిన్న సెలయేరు కనబడింది. ముందెవరు మంచినీళ్ళు త్రాగాలన్న ప్రశ్న బయలుదేరింది. ముందు తెల్ల సోల్జర్లు త్రాగాలి. ఆ తరువాత మేము త్రాగుతాము అని చెప్పాము. వెంటనే ముందు మీరు త్రాగండి అని తెల్ల సోల్జర్లు అన్నారు. ముందు మీరు త్రాగండని మేము వారిని కోరాం. ఈ విధంగా చాలా సేపటి వరకు మీరు త్రాగండంటే మీరు త్రాగండని ప్రేమతో పోటీపడ్డాం.

## 11. నగర పారిశుద్ధ్యం – క్షామనిధి

సంఘమను శరీరంలో ఏ అవయవం చెడినా ప్రమాదమే. అది నాకు యిష్టం వుండదు. లోకులు దోషాల్ని కప్పి పుచ్చడం, వాటిని చూచీ చూడనట్లు ఊరకుండి మా హక్కుల్ని మాకిమ్మని ప్రభుత్వాన్ని కోరడం నాకు యిష్టం వుండదు. దక్షిణ – ఆఫ్రికా యందలి భారతీయుల మీద ఒక ఆక్షేపణ వుండేది. "భారతీయులు మడ్డి రకం. వారి యిండ్లు చెత్త చెదారంతో నిండి మైలగా వుంటాయి " అని మాటిమాటికీ తెల్లవాళ్ళు ఆక్షేపిస్తూ వుండేవారు అందులో కొంత సత్యం వున్నది నేను అక్కడికి వెళ్ళినప్పటినుండి ఈ ఆక్షేపణ ఎలా తొలగించడమా అని యోచిస్తూ వున్నాను. కొంచెం ప్రయత్నించగా పేరు పడియున్న పెద్ద ఇండ్లన్నీ పరిశుభ్రమైనాయి. కాని డర్బనులో ప్లేగు ప్రవేశించి ప్రకోపిస్తుందనే వార్త పుట్టింది. ప్రతి ఇల్లు తిరిగి ప్రచారం చేయడం పడలేదు. అందుకు మునిసిపాలిటీ సమ్మతి కావాలి. అది మాకు లభించింది మేము పని చేయడానికి పూనుకున్నాం అందువల్ల మునిసిపాలిటీ వారి పని తేలిక అయింది. భారతీయుల కష్టాలు కూడా తగ్గాయి. ప్లేగు మొదలుగా గల జబ్బులు వ్యాప్తి చెందినప్పుడు అధికారులు జనం మీద విరుచుకుపడేవారు. ఇష్టులు కాని వారి మీద వత్తిడి ఎక్కువయ్యేది భారతీయులు శుచిగా వుండటం ప్రారంభించిన తరువాత అట్టి కష్టాలు బాధలు తగ్గిపోయాయి

ఈ విషయంలో నేను కూడా చాలా కష్టాలు చవిచూచాను. హక్కుల కోసం నేటాలు ప్రభుత్వంతో పోరాటం నడుపుటకు వారి వల్ల ఎంత సాయం పొందగలిగానో, అంత సాయం వారి చేత వారి విధుల్ని అమలుచేయించుటకు కృషిచేసి వారి సాయం పొందలేకపోయాను. కొందరు నన్ను అవమానించారు. కొందరు వినయపూర్వకంగా ఫరవాలేదు ఫరవాలేదు అంటూ కాలం గడిపారు. చాలామంది తమ మురికిని తాము

తొలగించుకొనేందుకు సిద్ధం కాలేదు. అలా చేసుకోవడం పెద్ద తప్పని భావించారు. అందుకోసం డబ్బు ఖర్చు పెట్టమంటే యింకా కష్టం "యీ రంగంలో జనంచే ఏమైనా పనిచేయించాలి. అంటే ముందు మనకు ఎంతో ఓర్పు సహనం వుండాలి" అను పాఠం నేను నేర్చుకొన్నాను. సంస్కర్తకు కావలసింది కేవలం సంస్కరణం. ఏ సంఘంలో సంస్కారం చేయాలని కోరతామో ఆ సంఘంలో వ్యతిరేకత, తిరస్కారం, చివరకు ప్రాణాపాయం సైతం కలుగవచ్చునని భావించి అందుకు సిద్ధపడాలి. సంస్కర్త దేన్ని సంస్కారం అని భావిస్తాడో ప్రజలు దాన్ని వికారం అని భావించవచ్చు. వికారం అనుకున్నా సరేకాని, వారు నిర్లక్ష్యం వహిస్తే మాత్రం సంస్కరణం జరగదు.

ఇక మా పారిశుధ్యానికి సంబంధించిన ఉద్యమం వల్ల భారతీయులకు ఇళ్ళు పరిశుభ్రంగా వుంచుకోవాలి అన్న విషయం కొద్దిగానో గొప్పగానో బోధపడింది. తెల్ల అధికారుల్లో మాయెడ కొంచెం గౌరవం పెరిగింది. భారతీయుల హక్కుల కోసం, అధికారాల కోసం ఎంత గట్టిగా ఉద్యమిస్తానో వారిని సంస్కరించడానికి అంతగా కృషిచేస్తూ వుంటానని వారికి బోధపడింది.

సంఘ మనోవికాసానికి మరొక పని చేయవలసి వచ్చింది. భారత దేశం ఎడ తమ కర్తవ్య నిర్వహణకు దక్షిణ - ఆఫ్రికా యందలి భారతీయుల్ని తయారుచేయవలసిన అవసరం వుందని గ్రహించాను. భారతదేశం పేద దేశం అచటి వారు డబ్బు సంపాదన కోసం విదేశాలకు తరలి వెళ్లారు భారత దేశానికి ఆపత్సమయంలో తాము సంపాదించిన డబ్బులో కొద్దిగా యివ్వడం ధర్మం కదా! 1897 వ సంవత్సరంలో ఇండియాలో క్షామం వచ్చింది. 1899వ సంవత్సరంలో దానికంటే పెద్ద క్షామం వచ్చింది. ఈ రెండు సమయాల్లోను దక్షిణ - ఆఫ్రికా నుండి పెద్ద సహాయం ఇండియాకు పంపించాము. మొదటి సారి చాలా సొమ్ము పంపాము. రెండవసారి మరింత సొమ్ము పంపాము. మేము తెల్లవారిని కూడా సాయం అడిగాము. వారు కూడా చాలా సహాయం చేశారు. గిరిమిటియాలు కూడా సొమ్ము విరాళంగా యిచ్చారు.

ఈ విధంగా రెండు క్షామాలు భారత దేశంలో సంభవించినప్పుడు సాయం చేసినట్లే ఆ తరువాత కూడా అనేక పర్యాయాలు సాయం చేశారు. అది వారికి అలవాటు అయిపోయిందన్నమాట.

ఈ విధంగా దక్షిణ - ఆఫ్రికాలో భారతీయులకు సేవచేస్తూ ఒకటి తరువాత మరొకటి అనేక విషయాలు నేర్చుకున్నాను. సత్యం అనేది మహావృక్షం. మనం దాన్ని ఎంత అధికంగా పోషిస్తే అది అంతగా ఫలాలు అందిస్తుంది. దానికి అంతం ఉండదు. దాన్ని తెలుసుకొని లోతుకు దిగిన కొద్దీ సేవారూపంలో రత్నాలు చేతికి దొరుకుతూ వుంటాయి.

# 12. స్వదేశాగమనం

యుద్ధం ముగిసిన తరువాత దక్షిణ - ఆఫ్రికాలో యిక నా పని పూర్తి అయిందని స్వదేశంలో చేయవలసిన పని చాలా వున్నదని గ్రహించాను. దక్షిణ ఆఫ్రికాలోనే వుంటే ఏదో కొంత సేవాకార్యం దొరకకపోదు. కాని అక్కడ వుండిపోతే డబ్బు సంపాదనే ప్రధాన లక్ష్యంగా మారుతుందనే సందేహం నాకు కలిగింది. దేశమునందలి మిత్రులు దేశం రమ్మని వత్తిడి చేయసాగారు. దేశం వెళితే ఎక్కువ ఉపయోగం వుంటుందని అనుకున్నాను. నేటాలులో ఖాన్‌గారు మన సుఖలాలుగారు వుండనే వున్నారు.

నాకు యిక సెలవు యిమ్మని మిత్రుల్ని కోరాను. అతికష్టం మీద ఒక షరతు పెట్టి సెలవు మంజూరు చేశారు "ఒక్క సంవత్సరంలో తిరిగి పనిబడితే మీరు యిక్కడికి రావాలి." అనేది వారి షరతు. నాకది విషమ షరతు అనిపించింది. కాని ప్రేమపాశంచే బద్ధుడనైనాను.

"కాచేరే తాంతణే మన్ హరజీఏ బాందీ,
జేమ తాణే తేమ తేమనీరీ,
మనేలాగీ కటారీ ప్రేమనీ"

(ఆ నారాయణుడు నా మెడకు ప్రేమ బంధం వేశాడు దాన్ని పుచ్చుకొని అతడు లాగిన కొద్దీ ఆహాహా, నేను అతని దానినయిపోతున్నాను.)

మీరాబాయి గానం చేసిన యీ గీతం నాకు బాగా వర్తించింది. జనతా జనార్ధనుని మాట కాదనలేక పోయాను. వారికి మాటయిచ్చి సెలవు తీసుకున్నాను. ఈ పర్యాయం నేటాలుతో నాకు సంబంధం అధికంగా ఏర్పడింది. నేటాలు నందలి భారతీయులు, నామీద ప్రేమామృతం అపరిమితంగా కురిపించారు. ఊరూర అభినందన పత్రాలు, ఊరూర కానుకలు అందజేశారు. 1899 వ సంవత్సరంలో దేశానికి వస్తున్నప్పుడు కూడా కానుకలు లభించాయి. యీ సారి ఆ కానుకల్ని, ఆ సభల్ని చూచి బెదిరిపోయాను. బంగారు, వెండియేగాక వజ్రాలు కూడా లభించాయి.

నేను యీ కానుకల్ని స్వీకరించవచ్చునా? నేను యీ కానుకల్ని తీసుకుంటే డబ్బు తీసుకోకుండా ప్రజల సేవ చేసినట్లవుతుందా? నాక్లయింటు యిచ్చినవి కొన్ని మాత్రం కాక మిగతావన్నీ ప్రజాసేవకుగాను యివ్వబడినవే గదా! అయితే యీ రెండింటికీ నా దృష్టిలో తేడా లేదు. పెద్ద పెద్ద క్లయింట్లందరు ప్రజా కార్యక్రమాలకు సాయపడ్డవారే.

ఒక రోజున రెండు గొప్ప కానుకలు వచ్చాయి. ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. పిచ్చివానివలె అటుయిటు తిరుగుతూ జాగారం చేశాను. ఏమి చేయాలో పాలుబోలేదు. వేల కొద్ది రూపాయలు తీసుకోకుండా వుందామంటే కష్టంగానే వుంది. తీసుకుందామంటే అంతకంటే కష్టంగా వుంది.

ఈ కానుకలు నేను జీర్ణం చేసుకోవచ్చు. కాని నా భార్యా బిడ్డల పరిస్థితి ఏమిటి? వాళ్ళు కూడా ప్రజాసేవకు అలవాటు పడుతున్నారు. సేవకు విలువ కట్టకూడదని రోజూ వారికి నూరి పోస్తున్నాను. ఇంట్లో ఖరీదైన నగలు వుంచడం మానుకున్నాను. ఇంటిలో మితంగా ఖర్చు పెట్టడం అలవాటు అవుతున్నది. అట్టి స్థితిలో బంగారు గడియారాలు, బంగారు గొలుసులు యింట్లో ఎలా ఉంచడం? వజ్రాల ఉంగరాలు ఎలా పెట్టుకోవడం? అప్పటికే నగల వ్యామోహం కూడదని అందరికీ చెబుతూ వున్నాను. అందువల్ల ఈ నగలు, ఉంగరాలు తీసుకొని ఏం చేయను? చివరికి వీటిని ఇంట్లో వుంచకూడదనే నిర్ణయానికి వచ్చాను. పారసీ రుస్తుంజీ మొదలగు వారిని ధర్మ కర్తలుగా ఏర్పాటు చేసి పత్రం వ్రాసి పెట్టుకొని ప్రొద్దున్నే భార్యాబిడ్డలతో సంప్రదించి బరువు దించుకుందామని నిర్ణయించుకున్నాను.

నా భార్యను ఒప్పించడం తేలికపని కాదని తోచింది. అందుకని నా పక్షాన వాదించుటకు నా పిల్లల్ని వకీళ్లుగా నియమించాను. పిల్లలతో మాట్లాడాను.

వాళ్ళు వెంటనే ఒప్పుకున్నారు. "మాకీ నగలతో పనిలేదు. వాటి ఉపయోగం లేదు. ఎవరివి వారికిచ్చి వేయడం మంచిదని మాఉద్దేశ్యం. మనకు కావలసివస్తే మనం చేయించుకోలేమా?" అని వాళ్ళు అన్నారు.

నాకు సంతోషం కలిగింది. "అయితే మీ అమ్మను ఒప్పించగలరని అనుకుంటున్నాను" అని వాళ్ళతో అన్నాను.

"తప్పక, అది మాపని. ఈ నగలు మా అమ్మ కెందుకు? ఆమె కావాలనేది ఎవరికోసం? మా కోసమే కదా? మేము వద్దంటే ఆమె ఇక ముట్టదు" అని అన్నారు. అయితే అది అనుకున్నంత తేలిక కాదని నాకు తెలుసు.

"ఇవి మీకు అక్కర లేకపోవచ్చును. మీ పిల్లలకు అక్కరలేక పోవచ్చును. పిల్లలదేముంది? మనం ఎలా ఆడిస్తే అలా ఆడతారు. నాకు పెట్టుకోవాలని వున్నదనుకోవద్దు. రేపు ఏం జరుగుతుందో ఎవరికి తెలుసు? జనం ఎంతో ప్రేమతో యీ అభరణాలు యిచ్చారు. వాటిని తిరిగి వారికివ్వడం సరికాదు." అంటూ కస్తూరిబాయి వాగ్ధార జోరుగా ప్రారంభించింది. దానితో అశ్రుధార కూడా కలిసింది. అయితే పిలలు చలించలేదు. నేనూ చలించలేదు.

మెల్లమెల్లగా ప్రారంభించాను. "మన పిల్లలికి అప్పుడే పెళ్ళా! చిన్నతనంలో వాళ్ళకు పెళ్ళి చేయముకదా! పెద్దవాళ్ళు అయిన తరువాత వాళ్ళ పెళ్ళిళ్లు వాళ్లే చేసుకుంటారు. నగలు కావాలనే కోడళ్లు మనకెందుకు? అయినా నగలే అవసరమైతే నేను లేనా? నేను ఎక్కడి పోతాను?" అని అన్నాను.

"ఆ సంగతి నాకు తెలియదా? నా ఒంటిమీద వున్న నగలన్నీ ఒలిచి తీసుకొన్నవారు కదూ మీరు? నన్నే పెట్టుకోనీయనివారు రేపు నా కోడళ్ళని పెట్టుకోనిస్తారా? నా పిల్లల్ని యిప్పటి నుండే బైరాగుల్ని చేసి పెడుతున్నారు. ఈ నగలు నేనెవ్వరికీ యివ్వను. పైగా అవి నావి. నాకు యిచ్చారు వాటిమీద మీకు హక్కుఎక్కడుంది?" 'ఆ బంగారు హారం నీవు చేసిన సేవను చూచి యిచ్చారా చెప్పు! నేను చేసిన సేవకే గదా యిచ్చారు?' "పోనియ్యండి మీరు చేస్తే నేను చేసినట్లు కాదా? మీకు రాత్రింబవళ్ళు నేను సేవచేయడం లేదా? అది సేవ కాదా? ఇంటికి తీసికొని వచ్చిన అడ్డమైన వాళ్లందరికీ ఎముకలు విరిగేలా సేవచేయడం లేదా? దీన్ని ఏమంటారు? యిది సేవకాదా?" ఆమె వదిలిన బాణాలన్నీ వాడిగలవే. ఎన్నో నాకు గ్రుచ్చుకున్నాయి. కాని నేను నగలు తిరిగి యిచ్చి వేయాలని నిర్ణయించుకున్నాను. తరువాత చివరికి ఏదో విధంగా కానుకలు తిరిగి యిచ్చి వేసేందుకు ఆమెను ఒప్పించాను. 1896, 1901వ సంవత్సరాలలో వచ్చిన కానుకలన్నింటిని తిరిగి ఇచ్చివేశాను. దానపత్రం వ్రాశాను. నా అనుమతితో కాని ధర్మకర్తల అనుమతితో కాని ప్రజాసేవకు యివి ఉపయోగించబడాలనే షరతుతో సొమ్మంతా బాంకులో జమ చేశాను.

ప్రజాసేవకు సంబంధించిన కార్యాలకు ఈ సొమ్ము ఉపయోగించాలని భావించాను. కాని అందుకు అవసరమైన సొమ్ము ఎప్పటికప్పుడు వస్తూ వుండటం వల్ల ఆ సొమ్మును ముట్టుకోలేదు. ఆ సొమ్ము సురక్షితంగా వుండిపోయింది. పైగా అది పెరుగుతూవున్నది.

ఇలా చేసినందుకు నాకు ఎన్నడూ పశ్చాత్తాపం కలుగలేదు. కాలం గడిచిన కొద్దీ కస్తూరిబాయి కూడా నేను చేసిన పని యొక్క ఔచిత్యాన్ని అర్థం చేసుకోసాగింది. ఈ విధంగా నేను ప్రలోభాల నుండి తప్పించుకోగలిగాను. ప్రజల సేవ చేసేవారికి ఎన్నో కానుకలు వస్తాయి. కాని అవి వారి సొంతం కాజాలవని నా నిశ్చితాభిప్రాయం.

# 13. భారతదేశానికి ప్రయాణం

ఈ విధంగా నేను ఏర్పాట్లు పూర్తిచేసుకొని భారత దేశానికి ప్రయాణమయ్యాను. దారిలో మారిషస్ రేవు తగిలింది. అక్కడ ఓడ కొద్ది రోజులు ఆగుతుంది. నేనక్కడ దిగి అక్కడ వారి స్థితిగతుల్ని తెలుసుకున్నాను. అక్కడ గవర్నరుగా వున్న చార్లెస్‌బ్రూన్ గారికి అతిధిగా ఒక రాత్రి వున్నాను.

దేశానికి వచ్చిన తరువాత కొంత కాలం అటుయిటు తిరుగుతూ పర్యటిస్తూ వున్నాను. 1901 నాటి విషయం. కలకత్తాలో ఆ ఏడు కాంగ్రెస్ జరుగుతున్నది. అధ్యక్షులు దిన్షా ఎడల్జీ వాచాగారు. నేను ఆ కాంగ్రెస్‌కు వెళ్లాలని నిర్ణయించుకున్నాను. కాంగ్రెస్‌ను చూడటం నాకు అదే మొదటిసారి.

బొంబాయి నుండి సర్‌ఫిరోజ్‌షాగారు కలకత్తా వెళుతున్న రైల్లోనే నేను కూడా ఎక్కాను. దక్షిణ – ఆఫ్రికా విషయాలు వాదితో మాట్లాడవలసి వున్నది. వారి పెట్టెలో కూర్చొని ఒక స్టేషను దాకా ప్రయాణించవచ్చని నాకు అనుమతి లభించింది. వారు ఒక పెట్టెను పూర్తిగా తీసుకున్నారు. వారి రాజ వైభవం, ఠీవి, అందుకుగాను అయ్యేఖర్చుల వ్యవహారమంతా నాకు కొంత తెలుసు. నిర్ణయించబడిన స్టేషనులో వారి పెట్టె ఎక్కాను. అప్పుడా పెట్టెలో దిన్షావాచాగారు, చిమన్‌లాల్ సెతల్వాడు గారు వున్నారు. వారంతా రాజకీయాల్ని గురించి మాట్లాడుతూ వున్నారు. నన్ను చూచి ఫిరోజ్ షా మెహతా గారు "' గాంధీ! నీ పని అనుకూలంగా లేదు. నీ తీర్మానం కాంగ్రెస్సులో ఆమోదించినా ప్రయోజనం ఏముంటుంది? అసలు మనకు మనదేశాల్లో వున్న హక్కులేమిటి? మనదేశంలో మనకు సత్తా లేనంత కాలం పరాయి దేశాల్లో మన స్థితి ఎలా బాగు పడుతుంది?" అని అన్నారు. నేను నివ్వెరబోయాను. చిమన్‌లాల్‌గారు కూడా వారితో ఏకీభవించారు. కాని దిన్షాగారు మాత్రం దయా దృష్టితో నావంక చూచారు.

ఫిరోజ్‌షాగారిని ఒప్పించాలని ప్రయత్నించాను. వారు బొంబాయికి మకుటంలేని మహీపతి. అట్టివారిని నాబోటివాడు ఒప్పించడం సాధ్యమా? అయితే కాంగ్రెస్‌లో దక్షిణ – ఆఫ్రికాకు సంబంధించిన తీర్మానం ఆమోదం పొందుతుందని సంతోషించాను.

వారికి ధన్యవాదాలు తెలిపి రైలు ఆగగానే పెట్టె దిగి నా పెట్టె ఎక్కి నా స్థానంలో కూర్చున్నాను. షాగారి దగ్గర నుండి వచ్చేసేముందు లేవగానే నాకు ఉత్సాహం కలిగించేందుకు వాచాగారు "తీర్మానం తయారు చేసి నాకు చూపించండి" అని చెప్పారు.

రైలు కలకత్తా చేరింది. నగరవాసులు అధ్యక్షుల వారిని మహా వైభవంగా తీసుకు వెళ్ళారు. అక్కడ అనేక మంది ప్రతినిధులు వున్నారు. అదృష్టవశాత్తు నేనున్న విభాగానికి లోకమాన్యులు విచ్చేశారు. వారు ఒక రోజు ఆలస్యంగా వచ్చినట్లు గుర్తు. లోకమాన్యులు ఎక్కడ వుంటే అక్కడ ఒక చిన్న దర్బారు జరుగుతూ వుంటుంది. లోకమాన్యులు శయ్యపై కూర్చుంటారు. చిత్రకారుణ్ణి అయితే శయ్యపై కూర్చున్నవారి చిత్రం గీసేవాణ్ణి. ఆ దృశ్యం అంత స్పష్టంగా నాకు గుర్తువుంది. వారి దర్శనం కోసం వచ్చేవారి సంఖ్య అపరిమితంగా వుంటుంది. పెద్ద సంఖ్యలో వుంటుందంటే అతిశయోక్తికానేరాదు. వారిలో అమృత బజారు పత్రికాధిపతి మోతీబాబుగారు నాకు బాగా గుర్తు. వారిద్దరి నవ్వు, పరిపాలకుల అన్యాయాల్ని గురించి వారనుకున్న మాటలు యిప్పటికీ నాకు గుర్తు. ఇక అచటి కాంగ్రెస్ వారి నివాసాలను ఒక్కసారి పరిశీలిద్దాం.

వాలంటీర్లలో ఒకరికొకరికి పడదు. ఎవనికైనా ఒకపని అప్పగించితే అతడు ఆ పని చేయడు. అతడు వెంటనే మరొకడికి చెబుతాడు. అతడు యింకొకడికి పురమాయిస్తాడు. యిక పాపం ప్రతినిధులపని హుళక్కే.

కొంతమంది స్వచ్ఛంద సేవకులతో నేను మాట్లాడాను. దక్షిణ - ఆఫ్రికాలో జరిగే పద్ధతి కొద్దిగా చెప్పాను. వాళ్ళు కొంచెం సిగ్గు పడ్డారు. వారికి సేవాధర్మం అంటే ఏమిటో చెబుదామని ప్రయత్నించాను. వారికి కొంచెం కొంచెం బోధపడింది. కాని సేవాభావం, ప్రేమభావం ఎప్పటికప్పుడు ఎక్కడ బడితే అక్కడ పుట్టుకురావడానికి అవి పుట్టకొక్కులు కావుగదా! అవి లోపలి నుండి పుట్టుకురావాలి. దానికి అభ్యాసం కూడా అవసరం. అమాయకులు, సరళ స్వభావులు అయిన ఈ వాలంటీర్లకు సేవ చేద్దామని వుంది, కాని చేసి ఎరగరు. అలవాటు లేదు. ఇప్పుడు రమ్మంటే ఎలా వస్తుంది? అందుకు కారణం కూడ వున్నది. కాంగ్రెస్ జరిగేది సంవత్సరానికి ఒక్కసారి, అదికూడా మూన్నాళ్ల ముచ్చట. తరువాత కథ కంచికి అది ఇంటికి. అట్టి స్థితిలో ఏడాదికి మూడు రోజులు మాత్రం జరిగే తతంగంలో వాలంటీర్లు సవ్యంగా పనిచేయాలంటే సాధ్యమా?

ప్రతినిధులు కూడా స్వచ్ఛంద సేవకుల వంటివారే. వారికి కూడా అది మూన్నాళ్ళ ముచ్చటే. ఈ ప్రతినిధులు తమ పని తాము చేసుకోరు. హుకుములిచ్చి

పనులు చేయించుకుంటూ వుంటారు. 'ఏయ్! వాలంటీరూ! అది తే, ఇది తే' యిదీ వాళ్ల వరస. ఇక్కడ అంటరానితనం జాస్తి. అరవవారికోసం వంట యిల్లు స్పెషల్‌గా ఏర్పాటుచేయబడింది. వాళ్లు భోజనం చేస్తుంటే ఎవ్వరూ చూడకూడదు. అందువల్ల వారికోసం కాలేజీ ఆవరణలో వేరే ఏర్పాట్లు చేశారు. దిష్టి తగలకుండా చుట్టూ దడికట్టారు. లోపల ఊపిరి సలపనంత పొగ అది వంట గదిలా లేదు. సందూకు పెట్టెలా వుంది. అన్ని వైపుల దాన్ని మూసివేశారు.

ఇది వర్ణాశ్రమ ధర్మానికి విరుద్ధం కాంగ్రెసు ప్రతినిధుల్లోనే అంటరానితనం యింత అధికంగా వుంటే వాళ్లను ఎన్నుకునే జనంలో ఎంత అంటరానితనం వుంటుందో ఊహించుకోవచ్చు. ఈ వ్యవహారమంతా చూసేసరికి నాకు అమితంగా నిరాశ కలిగింది.

ఇక అక్కడ దుర్గంధం విపరీతం. ఎక్కడ చూచినా నీళ్లు, నీళ్లు, నీళ్లు. మరుగు దొడ్లు తక్కువగా వున్నాయి. ఒకటే కంపు. తలుచుకుంటేనే డోకు వస్తుంది. ఒక వాలంటీరుని పిలిచి యీ విషయం చెప్పాను అది పాకీ వాళ్లు చేయాల్సిన పని అని అతడు రపీమని సమాధానం యిచ్చాడు. 'నాకు ఒక చీపురు కట్ట తెచ్చి పెట్టగలరా' అని అడిగాను. అతడు తెల్లబోయాడు. నా ముఖం ఎగాదిగా చూడసాగాడు. చివరికి నేనే వెతికి తెచ్చుకున్నాను. మరుగుదొడ్డి బాగు చేశాను. కాని అది నాకు ఉపయోగపడే మరుగుదొడ్డి ఇదెక్కడి లోకం? ఇవెక్కడి మరుగుదొడ్లు? ఎన్ని సార్లు బాగుచేసినా ప్రయోజనం శూన్యం. వాటిని బాగుచేయాలంటే నా శక్తికి మించినపని. అందువల్ల నాపని మాత్రం చేసుకొని సంతోషపడ్డాను. మిగతావాళ్లకు కంపు కొట్టినట్లులేదు. ఈ వ్యవహారం యింతటితో ఆగలేదు. కొందరు రాత్రిపూట తాము వుంటున్న గది వరండాలోనే మలవిసర్జనం, మూత్ర విసర్జనం చేశారు. వాలంటీర్లకు ప్రొద్దున్నే ఆ దృశ్యం చూపించాను. కాని బాగుచేసే నాథుడెవరు? చివరికి నాకే ఆ గౌరవం దక్కింది.

తరువాత మొదటి కంటే కొద్దిగా మార్పు వచ్చింది. కాని పరిశుభ్రతను గురించి పట్టించుకునేవారు తక్కువ. ప్రతినిధులు తమ చెడ్డ అలవాటును మార్చుకోరు. వాలంటీర్లు అసలు పట్టించుకోరు.

కాంగ్రెస్ మరికొన్ని రోజులు యిలాగే జరిగితే అంటురోగాలు తప్పవు అని అనిపించింది.

# 14. క్లర్కు - బేరా

బేరర్ అనే ఇంగ్లీషు శబ్దానికి బేరా అపభ్రంశం. కలకత్తాలో ఇంట్లో పనిచేసే వాణ్ణి బేరా అని అనడం అలవాటు. కాంగ్రెసు ప్రారంభం కావడానికి యింకా రెండు రోజుల వ్యవధి వుంది. కాంగ్రెసు ఆఫీసులో నాకేమైనా పని దొరికితే కొంత అనుభవం గడించవచ్చని అనిపించింది.

కలకత్తాలో దిగిన రోజే కాలకృత్యాలు ముగించుకొని కాంగ్రెస్ ఆఫీసుకు వెళ్లాను. శ్రీ భూపేంద్రనాధ బోసుగారు, శ్రీ ఘోషాలుగారు కార్యదర్శులు. భూపేంద్ర బాబుగారి దగ్గరికి వెళ్లి ఏమైనా పనివుంటే యిమ్మని అడిగాను. వారు నన్ను పరిశీలించి చూచి " నాదగ్గర పనేమీ లేదు. బహుశ ఘోషాలుగారి దగ్గర పనివుంటే చెబుతారు. వారిని చూడు" అని అన్నారు.

ఘోషాలు బాబు గారి దగ్గరికి వెళ్లాను. వారు నన్ను క్రింది నుండి పైదాకా ఎగాదిగా చూచి కొంచెం చిరునవ్వునవ్వి ' నాదగ్గర క్లర్కు పని వుంది చేస్తావా?' అని అడిగారు.

"తప్పక చేస్తా. చేతనైన పని చేయడానికే మీదగ్గరకు వచ్చా"

"అబ్బాయీ! నిజమైన సేవాభావమంటే యిదే"

వారి దగ్గరే కొందరు వాలంటీర్లు వున్నారు. వారికేసి చూచి "చూచారా! యీ అబ్బాయి ఏమన్నాడో!" అని అన్నారు. మళ్లీ నాకేసి తిరిగి "అదిగో, ఉత్తరాలగుట్ట, దాన్ని తీసుకో. ఇదుగో కుర్చీ దీనిమీద కూర్చొని పని మొదలుబెట్టు. నా కోసం వందలాది ఉత్తరాలు వస్తుంటాయి. చాలామంది జనం వస్తుంటారు. వీళ్లతోనే మాట్లాడనా లేక ఈ ఉత్తరాలు చూస్తూ కూర్చోనా? ఈ పని చూడడానికి క్లర్కు లేడు. వీటిలో చాలావరకు పనికిమాలినవి. అయితే అన్నింటినీ చదువు. అవసరమైన ఉత్తరాలకు సమాధానం వ్రాయి. అవసరమనుకుంటే నన్ను సంప్రదించు. అని అన్నారు. నన్ను వారు నమ్మినందుకు సంతోషించాను.

ఘోషాలుగారు నన్నెరుగరు. తరువాత నీ పేరేమిటి అని అడిగి తెలుసుకున్నారు. నాకు అప్పగించినది తేలికపని. ఆ పని త్వరగా ముగించాను. ఘోషాలు బాబుగారు సంతోషించారు. ఆయనకు మాట్లాడుతూ వుండటం అలవాటు. మాటలతో కాలం గడిపే మనిషి. తరువాత నీ అంతవాడికి యీ చిన్న పని అప్పగించానే అని

నొచ్చుకున్నారు. "అయ్యా! నేనెక్కడ! మీరెక్కడ! కాంగ్రెసు సేవలో మీ జుట్టు పండిపోయింది. నాకంటే మీరు పెద్దలు. వృద్ధులు. నేను అనుభవంలేని కుర్రవాణ్ణి. మీరీ పని యిచ్చినందుకు కృతజ్ఞుణ్ణి. యిక ముందు ముందు కాంగ్రెసులో నేను పనిచేయాల్సి వుంది. పని తెలుసుకునేందుకు దుర్లభమైన అవకాశం మీరు నాకు యిచ్చారు" అని ఆయనను సముదాయించాను.

"నిజంగా నువ్వు భలేవాడివి. ఈ కాలపు కుర్రవాళ్లు నీలా వుండరు. కాంగ్రెసు పుట్టినప్పటినుండి నాకంతా తెలుసు. కాంగ్రెసు స్థాపనలో హ్యూమ్‌గారితో బాటు నాకు కూడా పాలువుంది" అని ఘోషాలుగారన్నారు.

మా కీవిధంగా బాగా పరిచయం అయింది. మధ్యాహ్నభోజనం మేమిద్దరం కలిసి చేశాం. ఘోషాలు బాబుగారి చొక్కాకు గుండీ "బేరా" వచ్చి తగిలించేవాడు. అది చూచి ఆ పని నేనే చేస్తానని చెప్పాను. అలా చేయడం నాకు యిష్టం. పెద్దలంటే నాకు గౌరవం. వారికి నా మనస్సు బాగా తెలిసిపోయింది. అప్పటి నుండి వారు తన పనులన్నీ నాచేత చేయించుకోసాగారు. గుండీలు పెడుతూ వుంటే మూతి బిగించి "చూచావా? కాంగ్రెసు సెక్రటరీకి బొత్తాములు పెట్టుకునేందుకు కూడా తీరిక వుండదు. అప్పుడు కూడా అతనికి అనేక పనులు వుంటాయి" అని అన్నారు.

ఆయన అమాయకత్వానికి నాలో నేను నవ్వుకున్నాను. అయితే ఆయనకు శుశ్రూషచేయడమంటే నాకు అయిష్టత ఏర్పడలేదు. అందువల్ల నాకు ఎంతో లాభం కలిగింది.

కొద్ది కాలానికే కాంగ్రెసు వ్యవహారం అంతా తెలుసుకున్నాను. పెద్దలతో పరిచయం అయింది. గోఖ్లే, సురేంద్రనాథ్ బెనర్జీ మొదలగు యోధులు వస్తూ పోతూ వుండేవారు. వారి వైఖరి తెలుసుకునేందుకు అవకాశం లభించింది. కాంగ్రెస్‌లో కాలం ఎంతగా వృథా అవుతున్నదో బోధ పడింది. ఇంగ్లీషు భాషకు అక్కడగల ఆధిపత్యం గమనించారు. అది చూచి నాకు దుఃఖం కలిగింది. ఒక్కరు చేసే పనికి పదిమంది పరుగెత్తడం, అవసరమైన పనికి ఒక్కరు కూడా రాకపోవడం గమనించాను.

ఈ విషయాలన్నింటిని గురించి నా మనస్సు పనిచేయసాగింది. అయితే యింత కంటే ఎక్కువ సంస్కరణ సాధ్యం కాదేమో అని మనస్సు సమాధానం చెప్పింది. అందువల్ల మనస్సులో దుర్భావన కలుగలేదు.

# 15. కాంగ్రెసులో

మహాసభ ప్రారంభమైంది. ఆ మంటపం యొక్క భవ్యత, ఆ వాలంటీర్ల విధానం, వేదిక మీద ఆసీనులైన ఆ పెద్దల సముదాయం చూచి నివ్వెరబోయాను. యీ సభలో నాకు చోటు ఎక్కడ అని తికమకపడ్డాను. అధ్యక్షుని ఉపన్యాసం ఒక బృహత్ గ్రంథం. దాని నంతటిని చదవడం అసంభవం. అందువల్ల కొన్ని కొన్ని అంశాలే చదువబడ్డాయి.

తరువాత విషయనిర్ణయ సభకు ఎన్నికలు జరిగాయి. గోఖ్లే గారు నన్ను అక్కడికి తీసుకువెళ్లారు.

సర్ ఫిరోజ్‌షా గారు నా తీర్మానాన్ని అంగీకరిస్తామని యిదివరకే చెప్పారు. కాని వారు ఎప్పుడు దీన్ని ప్రతిపాదిస్తారో అని ఎదురు చూస్తూ కూర్చున్నాను. ప్రతి తీర్మానం మీద సుదీర్ఘ ఉపన్యాసాలు సాగుతూ వున్నాయి. అవన్నీ ఇంగ్లీషులోనే తీర్మానాల్ని సమర్థించే వారంతా ఉద్దండులే, ఈ నగారాఖానాలో నా తూతూ వినేవారెవ్వరు? రాత్రి ప్రొద్దు పోతున్నది. నా గుండె దడదడ లాగసాగింది. చివరికి మిగిలిన తీర్మానాలన్నీ వాయు వేగంతో పరుగెత్తసాగాయి. అందరూ ఇంటికి పోవాలని తొందరపడుతున్నారు.

రాత్రి పదకొండుదాటింది. నాకు మాట్లాడదామంటే సాహసం చాలడం లేదు. గోఖ్లేగారికి గతంలోనే తీర్మానం చూపించాను. వారి కుర్చీదగ్గరికి వెళ్లి మెల్లిగా "నా మాట మరిచి పోవద్దు" అని అన్నాను. "నాకు గుర్తున్నది. వాళ్ల వేగం చూస్తున్నారు కదా! ఏది ఏమైనా సరే తప్పి పోనీయను" అని వారు సమాధానం యిచ్చారు.

"ఏం, అంతా ముగిసింది కదూ!" అని ఫిరోజ్‌షాగారి ప్రశ్న.

ఇంకా దక్షిణ - ఆఫ్రికాను గురించిన తీర్మానం మిగిలివుంది. గాంధీగారు చాలా సేపటి నుండి ఎదురు చూస్తున్నారు." అని గోఖ్లే గారు బిగ్గరగా చెప్పారు. "మీరు ఆ తీర్మానం చూచారా?" అని ఫిరోజ్‌షాగారు అడిగారు.

"చూచాను"

"మీకు బాగుందా?"

"ఆ, బాగుంది"

"అయితే గాంధీ! చదువు"

నేను వణుకుతు తీర్మానం చదివి వినిపించాను గోఖ్లేగారు నా తీర్మానాన్ని సమర్థించారు.

"ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నాం" అని అంతా అరిచారు. గాంధీ! నీవు అయిదు నిమిషాలు మాట్లాడు అని వాచా గారు ఆదేశించారు. నాకు అక్కడ జరుగుతున్న పద్ధతి ఏమీ నచ్చలేదు. తీర్మానాన్ని అర్థం చేసుకునేందుకు ఎవ్వరూ ప్రయత్నించడంలేదు. ఎప్పుడు వెళ్లిపోదామా అని అంతా తొందర పడుతున్నారు. గోఖ్లేగారు ముందే తీర్మానం చూచారు గనుక యింకెవ్వరూ చూడదలుచుకోలేదు.

తెల్లవారింది. ఉపన్యాసం ఎలా యివ్వడమా అని యోచించసాగాను. అయిదు నిమిషాల్లో ఏం చెప్పగలను? నేను విషయం మీద మాట్లాడేందుకు సిద్ధపడే వచ్చాను. కాని సమయం బహుకొద్ది. శబ్దాలు తోచడం లేదు. ఏది ఏమైనా ఏదో మాట్లాడాలి. యింటి దగ్గర తయారు చేసుకోవచ్చుని ఉపన్యాసం చదవకూడదని నిర్ణయించుకున్నాను. దక్షిణ - ఆఫ్రికాలో ఉపన్యాసాలు బాగానే యిచ్చాను. కాని యిప్పుడు ఎందుకో గాని మళ్లీ గొంతు పట్టుకుంది.

నా తీర్మానం రాగానే ఫిరోజ్‌షాగారు నాపేరు పెద్దగా పిలిచారు. నేను నిలబడ్డాను. తల తిరగసాగింది. తీర్మానం ఏదోవిధంగా చదివాను. ఇంతలో ఎవరో ఒక కవి తమ కవిత్వం ముద్రించి ప్రతినిధులకు పంచుతూ వున్నాడు. అందు విదేశ యాత్రను గురించి, సముద్రయాత్రను గురించి ప్రశంసించాడు. నేను దాన్ని వినిపించి దక్షిణ - ఆఫ్రికాలో భారతీయులు పడుతున్న కష్టాలు కొద్దిగా పేర్కొన్నాను. యింతలో దిన్షావాచాగారు గంట బజాయించారు. అప్పటికి ఇంకా అయిదు నిమిషాలు పూర్తి కాలేదని నాకు తెలుసు. అయితే రెండు నిమిషాలు వుండనగా ఆవిధంగా గంట కొడతారట. ఆవిషయం నాకు తెలియదు. కొందరు అరగంట కంటే మించి మాట్లాడారు. అప్పుడు యీ ఈవిధంగా గంట కొట్టలేదు. అందువల్ల నాకు కష్టమనిపించింది. గంట మ్రోగగానే ప్రసంగం ఆపి కూర్చున్నాను. అయితే నేను చదివిన కవిత్వాలు ఫిరోజ్‌షాగారికి సమాధానం అని బాల్య చాపల్యం వల్ల అనుకున్నాను.

తీర్మానం ఆమోదించబడిందా లేదా అని అడగనవసరం లేదు. ఆ రోజుల్లో ప్రజలకు ప్రతినిధులకు భేదం లేదు. ఏ తీర్మానానికీ వ్యతిరేకత లేదు. అందరు చేతులెత్తడమే. ప్రతి తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడటమే. నా తీర్మానం స్థితి అంతే. అందువల్ల నా తీర్మానం వల్ల ప్రయోజనం కలుగుతుందని నాకు అనిపించలేదు. కాని కాంగ్రెసులో తీర్మానం జరిగింది. అదే ఆనందం. నా తీర్మానానికి కాంగ్రెసు ముద్ర పడింది. ఇది సమస్త భారత దేశం వేసిన ముద్ర అన్నమాట. ఈ జ్ఞానం, ఈ సంతోషం ఎవరికైనా తృప్తి కలిగిస్తుంది కదా!

# 16. లార్డు కర్జన్ దర్బారు

కాంగ్రెసు ముగిసింది. కాని దక్షిణ - ఆఫ్రికాకు సంబంధించి పని చేంబర్ ఆఫ్ కామర్సు మొదలగు వానితో వుండటం వల్ల నేను కలకత్తాలోనే వున్నాను. ఇందుకు ఒక నెల పట్టింది. ఈ సారి హోటల్లో వుండకుండా ఇండియన్ క్లబ్బులో వుండుటకు ఏర్పాటుచేసుకున్నాను. అందుకు అవసరమైన పరిచయం సంపాదించాను. అక్కడ గొప్ప గొప్ప వారు వుంటూ వుంటారు. వారందరితో పరిచయం కలుగుతుందనీ, దక్షిణ - ఆఫ్రికా వ్యవహారాలు చెప్పి వారికి అభిరుచి కలిగించవచ్చునని నా ఆశ. గోఖ్లేగారు ఎల్లప్పుడూ కాకపోయినా అప్పుడప్పుడూ బిలియర్డ్సు ఆడటానికి వచ్చేవారు. నేను కలకత్తాలో వున్నానని వారికి తెలిసి తనతో వుండమని అన్నారు. నేను సగౌరవంగా అంగీకరించాను. రెండు మూడు రోజులు గడిచాయి. తరువాత గోఖ్లేగారు వచ్చి నన్ను స్వయంగా తీసుకు వెళ్లారు. నా ముఖం చూచి వారు "గాంధీ! నీవు యీ దేశంలో వుండాలి అంటే బిడియం పెట్టుకుంటే పని జరగదు. ఎంత మందితో పరిచయం పెంచుకుంటే అంత మంచిది. నీచేత కాంగ్రెసు పనులు చేయించాలి" అని అన్నారు. గోఖ్లేగారి దగ్గరికి వెళ్లక ముందు ఇండియన్ క్లబ్బులోనే వున్నప్పుడు జరిగిన కొన్ని విషయాలు తెలుపుతాను. ఆ రోజుల్లో లార్డుకర్జన్ ఒక దర్బారు తీర్చారు. అచటికి ఆహూతులైన రాజులు, మహారాజులు కొందరు అక్కడే బస చేశారు. వారిక్కడ బెంగాలీ ధోవతులు కట్టి కుర్తా తొడిగి ఉత్తరీయాలు వేసుకుంటూ వుండేవారు. కాని ఒకనాడు వారు తమ దగ్గర వుండే కాసాల (వర్దన చేసేవాళ్లు) ఫాంటు తొడిగి గౌన్లు ధరించారు. తళతళలాడే బూట్లు తొడిగారు. నాకు వారి ఈ చర్య విచారం కలిగించింది. ఈ క్రొత్త వేషానికి కారణం ఏమిటని ప్రశ్నించాను.

"మా బాధలు మాకే తెలుసు. మా ధనసంపదలు, మా బిరుదులు ఖాయంగా వుంచుకునేందుకు మేము భరించే అవమానాలు మీకు ఎలా తెలుస్తాయి?" అని జవాబు ఇచ్చారు.

"పోనీండి, ఈ కాసాతలపాగా లేమిటి? ఈ కాసాబూట్లేమిటి?" "మాకూ వర్దన చేసే కాసాలకు అసలు తేడా ఏముందో చెప్పండి!, వాళ్లు మాకు కాసాలు. మేము లార్డుకర్జనుకు కాసాలం. అంతే తేడా. మేమీ దర్బారుకు హాజరుకాకపోతే అది మా అపరాధంగా పరిగణింపబడుతుంది. మా సహజ వేషాలతో దర్బారుకు పోతే అదికూడా పెద్ద అపరాధమే. సరే, కర్జను దర్బారుకు వెళ్లామనుకోండి కర్జనుతో మాట్లాడటం

మాతరమా? రామరామ, ఒక్కమాటైనా మాట్లాడటానికి వీలు పడదు." ఆమాటలు పలికిన ఆ నిర్మల హృదయుని మీద నాకు జాలి కలిగింది.

ఇటువంటి దర్బారు మరొకటి నాకు బాగా గుర్తు వుంది. లార్డ్ హార్డింజ్ బెనారస్ హిందూ విశ్వ విద్యాలయానికి శంకుస్థాపన కావించిన చోట ఒక దర్బారు ఏర్పాటు చేశారు. అందు రాజులు, మహారాజులు పాల్గొన్నారు. భారత భూషణ మాలవ్యాగారు నన్ను అక్కడికి రమ్మని పట్టుబట్టారు. నేను అక్కడికి వెళ్లాను. కేవలం స్త్రీలకు శోభ చేకూర్చే వారి వస్త్రాలు, ఆభరణాలు చూచి నాకు ఎంతో విచారం కలిగింది. పట్టు పాజామాలు, పట్టు అంగరఖాలు, మెడలో ముత్యాలు, వజ్రాల హారాలు, బాహువులకు బాజా బందులు, తలపాగాకు వజ్రాలు, ముత్యాలు పొదిగిన తురాయిలు, వీటన్నిటితో బాటు నడుముకు బంగారు పిడిగల కరవాలాలు. ఇవన్నీ ఏమిటి? రాజ చిహ్నాలా? లేక దాస్య చిహ్నాలా? యిట్టి నామర్దాకలిగించే నగలు వారే తమ యిష్ట ప్రకారం వేసుకున్నారని అనుకున్నాను. కాని యిట్టి దర్బారులకు యిట్టి వేష భూషాదులు వేసుకురావడం వారి విధి అని తెలిసింది. కొందరు రాజులకైతే యిట్టి వస్త్రాలు, నగలు అంటే అసహ్యమనీ, యిట్టి దర్బారుల్లో తప్ప మరెప్పుడూ వాటిని తాకరని కూడా తెలిసింది. యీ మాట ఎంతవరకు నిజమో నాకు తెలియదు. యితర సమయాల్లో వారు వాటిని ధరిస్తారో లేదో తెలియదు. ఏది ఏమైనా వైస్రాయి దర్బారైతేనేమి మరే దర్బారైతేనేమి ఆడవాళ్లలా వీళ్లు నగలు ధరిస్తారని తెలిసి విచారం కలిగింది. ధనం, బలం, మానం, యివి మనుష్యులచేత ఎట్టి పాపాలనైనా ఎట్టి అనర్థాలనైనా చేయిస్తాయి కదా!

## 17. గోఖ్లేగారితో ఒక మాసం - 1

మొదటి రోజునే గోఖ్లేగారు నాకుగల మొహమాటాన్ని పోగొట్టారు. నన్ను తమ్ముడిలా చూచారు. నా అవసరాలేమిటో తెలుసుకొని వాటిని పూర్తిచేశారు. అదృష్టవశాత్తు నాకు కావలసినవి కడు స్వల్పం. నా పనులన్నీ స్వయంగా చేసుకోవడం నాకు అలవాటు. కనుక నా కోసం చేయవలసిందేమీ లేదు. నా పనులు నేను చేసుకోవడం, నియమబద్ధమైన నడవడి, నా దుస్తులతీరు యివన్నీ చూచి ఆయన విస్తుపోయారు. నన్ను అమితంగా స్తుతించడం ప్రారంభించారు.

వారు నాదగ్గర ఏమీ దాచేవారు కారు. తమను చూడవచ్చిన వారందరినీ నాకు పరిచయం చేసేవారు. అట్టి పరిచితుల్లో డాక్టరు ప్రఫుల్ల చంద్రరాయ్‌గారు ముఖ్యులు. వారు పొరుగునే వుండేవారు. తరుచు వస్తూ వుండేవారు.

"ఈ ప్రొఫెసరు రాయ్‌గారికి నెలకు 800 రూపాయలు జీతం. అందు 40 రూపాయలు మాత్రం ఖర్చులకు వుంచుకొని మిగతాదంతా ప్రజాసేవకు యిచ్చివేస్తారు. వీరింతవరకు పెండ్లి చేసుకోలేదు. ఇక ముందు పెండ్లి చేసుకునే తలంపు కూడా వీరికి లేదు." అని చెప్పి గోఖ్లేగారు రాయ్ గారిని పరిచయం చేశారు. ఆనాటి రాయ్‌గారికీ, యీ నాటి రాయ్‌గారికి నాకు అట్టే తేడా కనబడలేదు. యిప్పుడెట్టి వస్త్రాలు ధరిస్తున్నారో అప్పుడూ అట్టి వస్త్రాలు ధరించేవారు. యిప్పుడు ఖాదీ వచ్చిపడింది. అప్పటికింకా అది రాలేదు. స్వదేశపు మిల్లు బట్టలు వుండేవి. వారిద్దరి సంభాషణ వింటున్నప్పుడు నాకు విసుగు పుట్టేదికాదు. వారి సంభాషణంతా దేశహితానికి సంబంధించిందే లేక జ్ఞానచర్చయే. వారి మాటలు కొన్ని విన్నప్పుడు కష్టం కూడా కలుగుతూ వుండేది. వారు కొందరు నాయకుల్ని తీవ్రంగా విమర్శిస్తూ వుండేవారు. వారి మాటలవల్ల నేను పర్వతాలని అనుకున్న వారంతా పరమాణువులేనని తేలింది.

గోఖ్లేగారు పనిచేసే తీరు ఆనందదాయకమేగాక జ్ఞానవర్ధకం కూడా. వారు ఒక్క నిమిషం కూడా వృధాగా పోనిచ్చేవారు కాదు. వారు చేసే ప్రతిపని దేశం కోసమే. మాట్లాడటం దేశంకోసమే. వారి మాటల్లో మాలిన్యంగాని, దంభంకాని, అసత్యంకాని లేదు. భారతదేశ దారిద్ర్యం, పారతంత్ర్యం. ఈ రెండూ ఎప్పుడూ వారి మనస్సును వేధిస్తూ వుండేవి. చాలామంది వారిని రకరకాలుగా ఆకర్షించేందుకు వస్తూ వుండేవారు. అందరికీ జవాబు చెబుతూ "మీరు మీ పని చేయండి. నన్ను నా పనిచేసుకోనీయండి. నాకు కావలసింది దేశ స్వాతంత్ర్యం. అది లభించిన తరువాతే మరొకటి. యిప్పటికి యీ పనిలో నాకు ఒక్క క్షణం తీరికలేదు." అని అనేవారు. గోఖ్లేగారి ప్రతిమాటలోనూ రానడేగారి యెడ గౌరవం నిండి యుండేది. రానడేగారు ఇలా చెప్పేవారు అని అనడం వారికి ఊత పదం. నేనక్కడ వుండగా రానడేగారి జయంత్యుత్సవమో, వార్షికోత్సవమో (సరిగా గుర్తులేదు) జరిగింది. గోఖ్లేగారు దాన్ని ప్రతి ఏటా జరుపుతూ వుంటారట. అప్పుడు నేను గాక వారి మిత్రులు ప్రొఫెసర్ కాథనేట్ గారు మరియొక సబ్ జడ్జి వున్నారు. రానడే గారిని గురించి కొన్ని వివరాలు గోఖ్లేగారు తెలియజేశారు. రానడేగారికి, మరియు తైలంగీ భాషా పండితులు మాండలికుగారికీ గల వ్యత్యాసం చెప్పారు. మాండలికుగారికి క్లయింటు పని అంటే కడు శ్రద్ధట, ఒకనాడు వారికి రైలు అందలేదు. స్పెషల్ రైలు తెప్పించుకొని మరీ కోర్టుకు వెళ్లారట. ఇక ఆనాటి గొప్పవారందరిలో రానడే గొప్పవారు. ఆయన కేవలం న్యాయమూర్తే గాక చరిత్రకారుడు కూడా. ఆర్థిక శాస్త్రవేత్త. గొప్ప సంస్కర్త. ప్రభుత్వ జడ్జి అయి యుండికూడా నిర్భయంగా

కాంగ్రెసులో ప్రేక్షకునిగా పాల్గొనేవారు. జనానికి వారి నిర్ణయం ప్రమాణంగా వుండేది. ఈ విధంగా రానడేగారి గుణగణాలను వర్ణిస్తున్నప్పుడు గోఖ్లేగారు పరవశత్వం చెందేవారు.

గోఖ్లేగారి దగ్గర ఒక గుర్రపు బండి వుండేది. నేను దాన్ని గురించి ప్రశ్నించాను. దాని అవసరం ఏమిటో నాకు బోధపడనందున "మీరు ట్రాముబండి మీద పోతే సరిపోదా? అది నాయకుల ప్రతిష్టకు భంగమా?" అని అడిగాను.

ఈ మాటలు విని కొంచెం బాధపడి యిలా అన్నారు. "నీవు కూడా నా సంగతి తెలుసుకోలేకపోయావు. నాకు కౌన్సిలువల్ల వచ్చే సొమ్మును నా సొంతానికి ఉపయోగించను. మీరంతా ట్రాముబండ్లలో వెళుతూ వుంటే నాకు అసూయ కలుగుతుంది. నేనలా చేయలేను. ఎంతమందితో నాకు పరిచయం వున్నదో అంతమందితో నీకు కూడా పరిచయం వుంటే ట్రాములలో వెళ్లడం అసంభవం కాకపోయినా దుష్కరమని తెలిసేది. నాయకులు చేసేదంతా సౌఖ్యంకోసమేనని అనుకోవడం సరికాదు. నీ మితవ్యయవిధానం నాకు సంతోషదాయకం. వీలైనంత వరకు నేనూ అట్టి వాడినే. కాని నావంటి వానికి కొంత ఎక్కువ వ్యయం కావడం తప్పనిసరి. దానితో నా ఆక్షేపణ ఒకటి పూర్తిగా రద్దు అయిపోయింది. కాని మరొకటి వుంది. దానికి వారు తప్పక తృప్తికరమైన సమాధానం యివ్వలేక పోయారు.

"అయితే మీరు షికారుకైనా పోరుకదా! యిక ఎప్పుడూ అస్వస్థులై వుండటం సరియేనా? దేశ కార్యాల్లో వ్యాయామానికి అవకాశం దొరకదా?" అని అడిగాను. 'షికారుకు పోవుటకు ఎప్పుడైనా నాకు అవకాశం కలదని కనుగొన్నారా?' అని నన్ను అడిగారు.

వారి యెడగల ఆదరం వల్ల వారి యీ మాటకు నేను సమాధానం చెప్పలేదు. వారి ఈ మాటవల్ల నాకు తృప్తి కలుగలేదు. కాని నేను మారుమాటాడలేదు. భోజనానికి మనకు సమయం దొరకడం లేదా? అదేవిధంగా వ్యాయామానికి సమయం దొరుకుతుందని నాటికీ, నేటికి కూడా నా విశ్వాసం. దీని వల్ల దేశ సేవ తగ్గిపోదని ఎక్కువవుతుందని నా అభిప్రాయం.

## 18. గోఖ్లేగారితో ఒక మాసం - 2

గోఖ్లేగారి గొడుగు నీడలో వున్న నేను కాలవ్యవధిని గమనించలేదు. హిందూ దేశమందలి క్రైస్తవుల స్థితిగతులను గురించి సవివరంగా తెలుసుకొని మీకు

తెలియచేస్తానని దక్షిణ ఆఫ్రికా యందలి క్రైస్తవ మిత్రులకు చెప్పి వచ్చాను. కాళీచరణ బెనర్జీగారి పేరు విన్నాను. వారు కాంగ్రెస్‌లో ఎక్కువగా పని చేస్తున్నారు. అందువల్ల వారంటే నాకు ఆదరం పెరిగింది. సామాన్యంగా భారతదేశ క్రైస్తవులు కాంగ్రెస్ సభల్లో, పాల్గొనరు. హిందువులతో, ముసల్మానులతో కలవరు. అందువల్ల క్రైస్తవుల యెడ కలిగిన ఆ విశ్వాసం కాళీచరణ బెనర్జీ గారి యెడ నాకు కలగలేదు. నేను వారిని దర్శిస్తానని గోఖ్లేగారితో అన్నాను. వారిని చూచి ఏం చేస్తావు? వారు చాలా యోగ్యులే. కాని వారిని దర్శించినందున నీకు సంతృప్తి కలుగదని భావిస్తున్నాను. నీవు చూడదలుచుకుంటే తప్పక చూడు అని గోఖ్లే అన్నారు. నేను కాళీబాబు దర్శనం కోసం జాబు పంపాను. వారు వెంటనే అనుమతి యిచ్చారు. వెళ్ళి వారి దర్శనం చేసుకున్నాను. ఇంట్లో వారి ధర్మపత్ని మృత్యుశయ్యమీద పడివున్నది. ఇల్లంతా నిరాడంబరంగావుంది. కాంగ్రెస్‌లో వారు కోటు, ఫాంటు ధరించి పాల్గొనేవారు. కాని యింట్లో బెంగాలీ ధోవతి కట్టుకొని వున్నారు. వారి నిరాడంబరత్వం చూచి ముగ్ధుడనయ్యాను. వారి సమయం వ్యర్థం చేయకుండా నా గొడవ చెప్పుకున్నాను. "పాపాలతో బాటు మనకు పునర్జన్మ కలదను సిద్ధాంతం మీరు నమ్ముతారా?" అని వారు ప్రశ్నించారు.

"తప్పక నమ్ముతాను."

అయితే ఈ పాప నివారణోపాయం హిందూ ధర్మంలో ఎక్కడా లేదు. కాని క్రైస్తవ ధర్మంలో వుంది" అని చెప్పి "పాపాలకు ఫలం మృత్యువు. యీ మృత్యువును తప్పించుకొనుటకు ఏసుక్రీస్తే శరణ్యం" అని అన్నారు.

నేను వారికి గీతలో చెప్పబడిన భక్తి యోగాన్ని గురించి చెప్పడానికి ప్రయత్నించాను. కాని నా ప్రయత్నం వృధా అయింది. నేను వారి సౌజన్యానికి ధన్యవాదాలు సమర్పించాను. మా సంభాషణ వల్ల నాకు తృప్తి కలుగలేదు. కాని లాభం చేకూరింది. నేను కలకత్తాలో గల వీధివీధిన బాగా తిరిగాను. చాలా దూరం నడిచాను. అప్పుడే న్యాయమూర్తి మిత్రగారిని, సర్‌గురుదాసబెనర్జీ గారిని దర్శించాను. దక్షిణ ఆఫ్రికా పనులకు వారి సాయం అవసరం. రాజాసర్‌ప్యారీ మోహన్‌ముఖర్జీగారి దర్శన భాగ్యం కూడా కలిగింది.

కాళీ చరణ బెనర్జీగారు కాళికాలయాన్ని గురించి నాకు చెప్పారు. ఒక పుస్తకంలో దాని వర్ణన చదివాను. న్యాయమూర్తి మిత్రగారి గృహం ఆ ప్రాంతంలోనే వున్నది. వారి దర్శనం చేసుకొని ఆ దారినే వస్తూ కాళికాలయం దగ్గరకి వెళ్ళాను. కాళీకాదేవికి బలికాబోతున్న గొర్రెల మందను త్రోవలో చూచాను. ఆలయం సందుల్లో బిచ్చగాళ్లు గుంపులు గుంపులుగా వున్నారు. బైరాగి బాబులు సరేసరి సంతలు, బజార్లు

మొదలుగాగల చోట్ల బిచ్చగాళ్లకు కాణీకూడా యివ్వకూడదని అప్పటికే నేను నిర్ణయించుకొన్నాను. చాలామంది బిచ్చగాళ్లు నా వెంటబడ్డారు. ఒక బాబాజీ ఎత్తగు నలుచదరపు రాతికట్టడం మీద కూర్చొని వున్నాడు. ఆయన నన్ను దగ్గరికి రమ్మని పిలిచాడు. నేను, ఒక మిత్రుడు ఆయన దగ్గరకు వెళ్లాము. "నాయనా! ఎక్కడికి పోతున్నావు. అని ఆయన నన్ను అడుగగా, తగిన సమాధానం చెప్పాను. ఆయన నన్ను, నామిత్రుణ్ణి కూర్చోమని చెప్పగా మేము కూర్చున్నాము "అయ్యా! ఇన్ని గొర్రెల్ని బలియివ్వడం ధర్మమని మీరు భావిస్తున్నారా?" అని అడిగాను. "జీవహత్య ధర్మమని ఎవరంటారు?"అని ఆయన అన్నాడు.

"మీరిక్కడ కూర్చున్నారు గదా? జనానికి బోధించకూడదా?"

"అది నా పనికాదు. భగవత్సేవయే నా పని"

"అందుకు మీకు యీ చోటే దొరికిందా? వేరే చోటుదొరకలేదా?"

"ఎక్కడ బడితే అక్కడ కూర్చుంటాను. నాకన్ని చోట్లు ఒక్కటే, లోకులగోల నాకెందుకు? వాళ్లొక గొర్రెల మంద. ఎక్కడికి పిలిస్తే అక్కడికి పోతారు. వారితో మాకేమిపని?"

నేనిక సంభాషణను పెరగనీయలేదు. తరువాత నేను దేవాలయంలోకి వెళ్లాను. ఎదురుగా రక్తపుమడి చూచి బిత్తరపోయాను. నిలబడలేకపోయాను. పెద్ద క్షోభ కలిగింది. తలక్రిందులయ్యాను. ఆ దృశ్యం ఈనాటికీ మరువలేను. ఆ సమయాన ఒక బెంగాలీ సంఘం వారు నన్ను విందుకు పిలిచారు. అక్కడ ఒక సజ్జనునితో ఘాతుకమగు జంతుబలిని గూర్చి ముచ్చటించాను. "అక్కడ బలియిచ్చే సమయంలో చెవులు రింగుమంటూ నౌబత్‌ఖానాలు మోగుతూ వుంటాయి. ఈ గందర గోళంలో గొర్రెలకు మృత్యుబాధ తెలియదు" అన్నాఆ సజ్జనుడు అన్నాడు. వారి మాటలు నాకు రుచించలేదు. 'ఆ గొర్రెలకి నోరుంటే ఊరుకోవు. ఘోరమైన ఈ ఆచారాన్ని ఆపివేయాలి.' అని అన్నాను. నాకు బుద్ధుని కథ జ్ఞాపకం వచ్చింది. కాని దానిని ఆపడం మాత్రం నా శక్తికి మించిన పనియని అనిపించింది.

ఈ విషయంలో అప్పుడు ఏవిధంగా భావించానో ఇప్పుడు కూడా ఆ విధంగానే భావిస్తునాను. గొర్రె ప్రాణం విలువ మనుష్యుని ప్రాణం కంటే తక్కువ కాదు. మనిషి శరీరాన్ని పోషించేందుకు గొర్రెను చంపడం ఎన్నటికీ అంగీకరించలేను. జంతువు కడు నిస్సహాయమగు ప్రాణి. మనుష్యుని సాయం పొందుటకు అది అధికారి. అయితే దానికి సాయం చేయాలంటే మనిషికి ఎంతో యోగ్యత, అధికార విచక్షణ వుండటం

అవసరం. అప్పుడే ప్రాణదానం చేయగల శక్తి మనిషికి చేకూరుతుంది. గొర్రెలను ఇంతటి క్రూరమైన హోమం నుండి రక్షించాలంటే నాకు యింకా ఆత్మశుద్ధి, త్యాగం అవసరం. ఇట్టి శుద్ధిని, త్యాగాన్ని గురించి ఘోషిస్తూ ఘోషిస్తూ నే ఈ దేహాన్ని విడవలసి వస్తుందేమోనని తోస్తున్నది. మనిషిని ఈ మహా పాతకాన్నుండి రక్షించుటకు, నిర్దోషులగు ఈ జీవులను కాపాడుటకు, ఈ ఆలయాన్ని పవిత్రం చేయిటకు ఆ పరమేశ్వరుడు ఏ మహాపురుషుణ్ణి లేక ఏ మహాశక్తిని సృష్టిస్తాడో తెలియదు. కాని నేను అలా సృష్టించమని సదా దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. జ్ఞానవంతులు, బుద్ధిమంతులు, త్యాగధనులు, భావుకులునగు బెంగాల్ ప్రజలు ఇట్టి వధను ఎట్లు సహించి వూరుకుంటున్నారో తెలియదు

# 19. గోఖ్లేగారితో ఒక మాసం – 3

కాళీ మాత నుద్దేశించి చేయబడుతున్న భయంకరమగు ఈ యజ్ఞాన్ని చూచిన తరువాత బెంగాలీ ప్రజల జీవిత విధానాన్ని గురించి తెలుసుకోవాలనే కోరిక కలిగింది. బ్రహ్మసమాజ మత గ్రంథాలు బాగా చదివాను. వారి ఉపన్యాసాలు విన్నాను. వారు వ్రాసిన కేశవ చంద్రసేన్ గారి జీవిత చరిత్రను ఆసక్తితో చదివాను. సాధారణంగా బ్రహ్మసమాజానికి, అసలు బ్రహ్మసమాజానికి గల భేదం తెలుసుకున్నాను. పండితశివనాథశాస్త్రిగారిని దర్శించాను. ప్రొఫెసర్ కాథవటేగారితో కలిసి మహర్షి దేవేంద్రనాథ టాగూరు గారిని దర్శించుటకు వెళ్ళాను. కాని ఆ సమయంలో వారు ఎవ్వరికీ దర్శనం యివ్వడంలేదని తెలిసింది. అందువల్ల వారి దర్శనం కాలేదు. కాని వారి ఇంట్లో జరిగే బ్రహ్మసమాజోత్సవానికి ఆహ్వానింపబడి వెళ్ళి ఆ ఉత్సవాల్లో పాల్గొన్నాను. అక్కడ శ్రేష్ఠమైన బెంగాలీ సంగీతం విన్నాను. అప్పటినుండి బెంగాలీ సంగీతం అంటే నాకు ఆసక్తి బాగా పెరిగింది.

బ్రహ్మసమాజాన్ని గురించి తెలుసుకున్న తరువాత శ్రీ వివేకానందస్వామి వారి దర్శనం చేసుకోకుండా ఎలా ఉండగలను? అత్యుత్సాహంతో బేలూరు మఠం నడిచి వెళ్ళాను. ఎంతదూరం నడిచానో నాకు ఇప్పుడు గుర్తు లేదు. ఏకాంత స్థలం వున్న ఆ మఠం చూచి నేను చాలా ఆనందపడ్డాను. అక్కడికి వెళ్ళిన తరువాత స్వాముల వారు జబ్బుపడి కలకత్తాలో వున్నారని తెలిసింది. ఈ సమాచారం విని నిరాశపడ్డాను. తరువాత సోదరి నివేదిత గారి ఇంటి జాడ తెలుసుకొని వెళ్ళి ఆమెను దర్శించాను. ఆమె వైభవం చూచి నిలువునా నీరైపోయాను. మాటలోను పలుకులోను కూడా మా

ఇద్దరికి పొంతన కుదర్లేదు. నేను ఈ విషయం గోఖ్లేగారికి చెప్పాను "ఆమె" తేజస్సుగల వనిత. మీ ఇద్దరికి కుదరదు అని గోఖ్లేగారు అన్నారు.

మరోసారి పేస్తన్‌జీ గారి యింట్లో మేమిద్దరం సమావేశమయ్యాము. ఆమె అక్కడ వుండగా నేను వెళ్లాను. ఆమె పేస్తన్‌జీ వృద్ధమాతకు ఉపదేశం ఇస్తున్న సమయం అది. అనుకోకుండా నేను ఇద్దరికి మధ్య దుబాసి అయినాను. సోదరి నివేదితకు నాకు భావైక్యత లేకపోయినా, ఆమెకు హిందూ మతం యెడ గల అగాధ ప్రేమను గమనించాను. ఆమె రచించిన గ్రంథాలు ఆ తరువాత దక్షిణ ఆఫ్రికా కార్యాలయంకోసం కొన్నాను. కలకత్తా లోని నాయకుల్ని దర్శించడానికి మిగతా అర్థదినం ధార్మిక సంస్థల్ని, ఇతర సార్వజనిక సంస్థల్ని దర్శించేందుకు వెచ్చించాలని నిర్ధారించుకున్నాను.

నేనొక రోజున డాక్టరు మల్లిక్ గారి అధ్యక్షతన జరిగిన సభలో బోయర్ యుద్ధంలో భారతీయుల సేవాబృందం చేసిన పనిని గురించి ఉపన్యసించాను. "ఇంగ్లీష్‌మన్" పత్రికాధిపతి పరిచయం ఇప్పుడు కూడ నాకు ఉపయోగపడింది. సాండర్సుగారికి ఇప్పటికీ సుస్తీగానే వుంది. అయితే 1896 లో నాకు ఏవిధంగా సాయం చేశారో ఇప్పుడు కూడా అదేవిధంగా సాయం చేశారు. నా ఈ ఉపన్యాసానికి గోఖ్లేగారు సంతోషించారు. డాక్టరు రాయ్‌గారు నా ఉపన్యాసాన్ని ప్రశంసించే సరికి యింకా సంబరపడ్డాను. నేనీ విధంగా గోఖ్లేగారికి గొడుగు నీడన వుండటం వల్ల బెంగాల్ ప్రాంతంలో నా పని తేలిక అయింది బెంగాల్‌నందు గొప్ప గొప్ప కుటుంబాల వారితో నాకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. చిరస్మరణీయాలైన సంగతులు ఈ కాలానికి సంబంధించినవి చాలా వున్నాయి. కాని వాటిని ఇక్కడ వివరించడం లేదు. ఈ సమయంలో బ్రహ్మ దేశ (బర్మా) వెళ్లి వచ్చాను. అక్కడి ఫూంగీలను (సన్యాసుల్ని) కలిశాను. వాళ్ల సోమరితనం చూచి నాకు నవ్వు వచ్చింది. బంగారు పెగోడాలు (గోపురాలు) చూచాను దేవళంలో లెక్కలేనన్ని కొవ్వొత్తులు వెలుగుతూ వున్నాయి. అవి నాకు నచ్చలేదు. గర్భాలయంలో పరుగెత్తుతున్న ఎలుకల్ని చూచేసరికి దయానందస్వామి వారి అనుభవం గుర్తుకు వచ్చింది. బ్రహ్మదేశంలో స్త్రీ ఉత్సాహాన్ని చూచి సంతోషించాను. కాని పురుషుల మాంద్యం చూచి విచారించాను. బొంబాయి ఎట్లా హిందూ దేశం కాదో, అట్లే రంగూను బ్రహ్మదేశం కాదని చూచి తెలుసుకున్నాను. హిందూ దేశంలో మనం ఇంగ్లీషు వర్తకులకు కమీషన్ ఏజంట్లుగా భావించి వ్యవహరిస్తున్నట్లే, ఇంగ్లీషు వాళ్లు అక్కడి వర్తకులతో కలిసి బ్రహ్మదేశం వాళ్ళను కమీషన్ ఏజంట్లుగా చేసుకొన్నారని నాకు బోధపడింది.

బ్రహ్మ దేశాన్నుండి తిరిగి వచ్చిన తరువాత గోఖ్లేగారి దగ్గర సెలవు తీసుకున్నాను. వారిని విడిచిపెట్టడం ఎంతో కష్టమనిపించింది. అయితే నాకు బెంగాలుతో లేక కలకత్తాతో పని అయిపోయింది. అన్ని పనుల కంటే ముందు హిందూ దేశంలో మూడో తరగతి రైలుబండ్లలో ప్రయాణం చేసి ఆ తరగతిలో ప్రయాణించేవారి కష్టాలు తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఈ విషయం గోఖ్లేగారికి విన్నవించాను. వారు వెంటనే నవ్వారు కాని నా అభిప్రాయాలు తెలుసుకొని సంతోషించారు. ముందు కాశీకి వెళ్ళి అనిబిసెంట్ గారి దర్శనం చేసుకొందామని నిర్ణయించుకున్నాను. అప్పుడు ఆమె జబ్బుపడి మంచం పట్టి వున్నది.

మూడోతరగతి రైలుబండి ప్రయాణానికి తగిన సరంజామా సిద్ధం చేసుకోవలసి వచ్చింది. లడ్లు, పూరీలు నింపిన టిఫిన్‌బాక్సు ఒకటి గోఖ్లేగారు బహూకరించారు. పన్నెండు అణాలు పెట్టి ఒక సంచి కొన్నాను. ఒక రకమైన చాయగల ఉన్నికోటు (పోరుబందరు ప్రాంతంవారు ధరిస్తారు), ఒక తువాలు, ఒక ధోవతి ఒక చొక్కా దాన్లో వుంచాను. కప్పుకునేందుకు ఒక కంబళీ తీసుకున్నాను. ఒక లోటా కూడా తీసుకుని ప్రయాణమైనాను.

గోఖ్లేగారు, రాయ్‌గారు నన్ను సాగనంపడానికి రైలు స్టేషనుకు వచ్చారు. రావద్దని బ్రతిమిలాడాను. కాని వారు నా మాట వినలేదు. "నీవు ఒకటో తరగతిలో ప్రయాణిస్తూవుంటే నేను రాను. కాని ఇప్పుడు రాక తప్పదు" అని గోఖ్లేగారు అన్నారు.

ప్లాటుఫారం మీదకు వస్తూ వున్నపుడు గోఖ్లేగారిని ఎవ్వరూ ఆపలేదు. వారు పట్టు పాగా చుట్టుకున్నారు. కోటు తొడుక్కున్నారు. డాక్టర్‌రాయ్ గారు బెంగాలీ దుస్తుల్లో వున్నారు. ఆ కారణంవల్ల టిక్కెట్టు కలెక్టరు వారిని మొదట ఆపి వేశాడు. కాని గోఖ్లేగారు "నా మిత్రులు" అని చెప్పిన మీదట రానిచ్చారు. ఈ విధంగా వారిద్దరు వచ్చి నన్ను సాగనంపారు.

## 20. కాశీలో

కలకత్తా నుండి రాజకోట వెళ్ళే దోవలో గల కాశీ, ఆగ్రా, జయపూర్, పాలన్పూర్ చూచుకుంటు రాజకోట చేరుకోవాలని నిర్ణయించుకున్నాను. ప్రతిచోట ఒక్కొక్క రోజు వున్నాను. పాలన్‌పూరులో తప్ప మిగతా అన్ని చోట్ల సత్రాల్లోను పండాల ఇళ్ళల్లోను వున్నాను. ఈ ప్రయాణానికంతకు రైలు చార్జీతో సహా మొత్తం ముప్పది ఒక్క రూపాయలు మాత్రం ఖర్చు అయిందని గుర్తు. మూడవ తరగతిలో ప్రయాణం

చేస్తున్నప్పటికి మైలు బండ్లు ఎక్కలేదు. వాటిలో జనం క్రిక్కిరిసి వుండటం గమనించాను. మిగతా రైళ్ళ కంటే మైలుబండ్లలో మూడవ తరగతి చార్జీకూడా ఎక్కువే. నాకది కష్టమనిపించింది.

మూడోతరగతి పెట్టెలో చెత్త చెదారం, మరుగుదొడ్ల కంపు ఇప్పుడెట్లా వున్నాయో అప్పుడు కూడా అట్లాగే వున్నాయి. కొద్దిగా మార్పులు జరిగితే జరిగియుండవచ్చు. మూడో తరగతికి మొదటి తరగతికి చార్జీల్లో తేడావుండటమే గాక సౌకర్యాల్లో కూడా తేడా వుంది. మూడో తరగతి ప్రయాణీకులకి, గొర్రెలకి తేడా ఏమీ లేదు. ఇక్కడి బండ్లు కూడా గొర్రెలకు అనుకూలమైనవని చెప్పవచ్చును.

యూరపులో మూడోతరగతిలో ప్రయాణం చేయటమే నాకు అలవాటు. ఎట్లా వుంటాయో చూద్దామని ఒకసారి మొదటి తరగతి పెట్టె ఎక్కాను. మూడోతరగతికి మొదటి తరగతికి పెద్ద తేడా నాకు కనబడలేదు. దక్షిణ ఆఫ్రికాలో మూడో తరగతి ప్రయాణీకులంటే నీగ్రోలన్న మాట. కొన్ని పెట్టెల్లో మూడోతరగతి ప్రయాణీకులకు సౌకర్యాలు వుంటాయి. కొన్ని బండ్లలో మూడో తరగతి ప్రయాణీకులకు పడుకొనేందుకు ఏర్పాట్లు వుంటాయి. కూర్చునే చోట దిండ్లు వుంటాయి. పెట్టెల్లో సీట్లను మించి జనం ఎక్కరు. మనదేశంలో అసలే రైల్వేవారిలోట్లు ఎక్కువ. వాటితో బాటు యిటు ప్రయాణీకులు కూడా చాలా అపరిశుభ్రంగా వుంటారు. వాళ్ళ ప్రక్కన కూర్చొని ప్రయాణించడం శుచిగా వుండేవారికి చాలా కష్టం. అట్టి ప్రయాణం వాళ్లకు శిక్షయే. చాలామంది పెట్టెలోనే ఉమ్మి వేస్తూ వుంటారు. మురికి చేస్తూ వుంటారు. బీడీల పొగ సరేసరి. తమలపాకులు, పొగాకు నమిలి పిచికారీ చేస్తూ వుంటారు. బిగ్గరగా మాట్లాడుతూ వుంటారు. ప్రక్క వారికి యిబ్బందిని లెక్కచేయకుండా దుర్భాషలాడుతూ వుంటారు. ఈ విధమైన మూడోతరగతి పెట్టెల్లో ప్రయాణం చేసి చాలాసార్లు పైన తెలిపిన యాతనలన్నింటిని అనుభవించాను.

నేను 1920 లో మూడో తరగతి పెట్టెలో ప్రయాణించాను. 1915 నుండి సంవత్సరం పాటు విడవకుండా మూడోతరగతిలో ప్రయాణం చేశాను. అప్పటికి యిప్పటికి పెద్ద భేదం నాకు కనబడలేదు. ఈ మహావ్యాధికి ఒక్కటే మందు. చదువుకున్న వాళ్లంతా మూడోతరగతిలో ప్రయాణం చేసి ప్రయాణీకుల దురభ్యాసాలను తొలగింప చేసేందుకు కృషిచేయాలి. అవసరమైన మార్పుల్ని గురించి అర్జీలు పంపించి రైలు అధికారుల్ని నిద్రపోనీయకూడదు. తమతమ సౌఖ్యాలకోసం లంచాలు యివ్వకూడదు. ఇతర అన్యాయమార్గాలను త్రొక్కకూడదు. రైలు నియమాలను

అతిక్రమించకూడదు. ఈ విధంగా చేస్తే జనానికి కొద్దో గొప్పో సంస్కారం కలుగుతుందని అనుభవం వల్ల చెబుతున్నాను. నేను జబ్బు పడినందువల్ల 1920 నుండి మూడోతరగతి ప్రయాణం మానుకున్నాను. ఇందుకు నాకు సిగ్గు వేసింది. విచారం కలిగింది. మూడో తరగతి ప్రయాణీకుల ఇక్కట్లు కొద్దికొద్దిగా తగ్గి దారికి వస్తున్న తరుణంలో నాకు జబ్బు చేసి అట్టి అదృష్టం తప్పిపోయింది. రైళ్లలోను, ఓడల్లోను ప్రయాణం చేసే బీదవాళ్ళకు కలిగే చిక్కుల్ని, అసౌకర్యాలను తొలగించేందుకు అంతా కృషి చేయాలి. యిది అందరికీ సంబంధించిన ఒక స్వతంత్ర విషయం. అందుకు ఒకరిద్దరు సమర్థులు పూనుకుంటే మేలు జరుగుతుంది.

ఇక యీ విషయం మాని కాశీ కథ చెబుతాను. ప్రాతః కాలసమయంలో కాశీలో కాలు పెట్టాను. పండా ఇంట దిగుదామని అనుకున్నాను. చాలామంది బ్రాహ్మణులు నా చుట్టూ మూగారు. వారందరిలో శుచిగా యున్న పండా యింటికి వెళదామని అనుకున్నాను. అట్టి పండాను చూచి వారి యింటికి వెళ్ళాను. ఆ పండా ఇల్లు శుచిగా వుంది. ముంగిట్లో గోవు కట్టివేయబడి వుంది. యిల్లు పరిశుభ్రంగా వుంది. మేడ మీద నా బస. యథావిధిగా గంగా స్నానం చేయాలని భావించాను. అంతవరకు అన్నం తినకుండా వుండాలని అనుకున్నాను. అవసరమైన ప్రయత్నమంతా పండా చేశాడు. ఒక రూపాయి పావలా కంటే ఎక్కువ దక్షిణ యివ్వలేనని మొదటనే పండాకు చెప్పాను. దానికి తగినట్లే చేయమని చెప్పాను. అతడు ఏమాత్రం జగడం పెట్టుకొలేదు. "ఫకీర్లకైనా పాదుషాలకైనా పూజ ఒకే రీతిగా చేయిస్తాను. యాత్రికులు వారి వారి శక్త్యానుసారం యిస్తారు. దాని కేమిటి? అని పండా అన్నాడు. పూజా సమయంలో అతడు మంత్రాలు మింగినట్లు అనిపించలేదు. పన్నెండు గంటలకు పూజా స్నానాదులు ముగించుకొని కాశీ విశ్వనాథుని దర్శనం కోసం వెళ్ళాను. అక్కడ చూచిన విషయాలు నాకు ఎంతో దుఃఖం కలిగించాయి."

1891వ ఏట నేను బొంబాయిలో బారిస్టరీ చేస్తున్నప్పుడు ప్రార్థనా సమాజ మందిరంలో కాశీ యాత్రను గురించి ఒక ఉపన్యాసం విన్నాను. ఆ ప్రసంగం విని నిరాశ పడ్డాను. కాశీ వెళ్ళాను. కాని ప్రత్యక్ష దర్శనం చేసుకొని అనుకున్న దాని కంటే అధికంగా నిరాశపడ్డాను.

జారుడుగా వున్న ఒక ఇరుకు సందులో నుండి ఆలయం లోపలికి వెళ్లాలి. అక్కడ శాంతి అనే మాటకు తావులేదు. ఎక్కడ చూచినా ఈగలు గుయ్ అంటున్నాయి. యాత్రికుల రొదకు, దుకాణాల వాళ్ల రగడకు అంతేలేదు.

ధ్యానానికి, భగవచ్చింతనకు అది నిలయం. అలాంటి చోట వాటికే తావు లేదు. అయితే తమ చుట్టుప్రక్కల ఏమి జరుగుతున్నా పట్టించుకోకుండా ధ్యానంలో లీనమైయున్న కొంతమంది స్త్రీలను నేను చూచాను. అందుకు ఆలయ అధికారుల్ని ప్రశ్నించవలసిన అవసరం లేదు. ఆలయ ప్రాంతం శాంతంగా నిర్మలంగా, సుగంధితంగా ఉంచడం ఆలయ అధికారుల విధి. నేనక్కడ మోసపువర్తకులు రెండోరకం మిఠాయి అమ్ముతూ వుండటం చూచాను.

ఆలయంలో అడుగు పెట్టేసరికి గుమ్మంలో కుళ్ళిన పూలు కనబడ్డాయి. వాటినుండి దుర్గంధం వస్తూవుంది. లోపల నేలమీద చలువ రాళ్ళు పరచబడి వున్నాయి. ఆ చలవరాళ్ల మీద అంధభక్తుడొకడు రూపాయలు తాపింపచేశాడు. దానిలోకి మురికి దూరి స్థావరం ఏర్పరుచుకుంది.

'జ్ఞానవాపి' దగ్గరకు వెళ్ళాను. అక్కడ ఈశ్వరుడి కోసం వెతికాను. కాని వృధా. అక్కడ నా మనస్సు బాగుండలేదు. జ్ఞానవాసి దగ్గరకూడా అంతా చెడుగే. దక్షిణ యిచ్చేందుకు బుద్ధిపుట్టలేదు. అందువల్ల ఒక్క దమ్మిడీ మాత్రం అక్కడ వేశాను. ఒక పండా తిట్లుతిట్టి "నీవు ఈ విధంగా అవమానం చేస్తే నరకంలో పడతావు" అని శపించాడు. "అయ్యా, నా కర్మ ఎలా కానున్నదో కానీయండి. మీరు యిట్టి దుర్భాష నోటితో పలుకకూడదు. ఈ దమ్మిడీ తీసుకుంటే తీసుకోండి. లేకపోతే యిది కూడా మీకు దక్కదు" అని నేనన్నాను. "పో, నీ దమ్మిడీనాకు కావాలనుకున్నావా? పో, పో' 'అని పండా యింకో నాలుగు తిట్లు వడ్డించాడు. ఆ దమ్మిడీని తీసుకొని బయటపడ్డాను. "పండా మహాశయుడికి దమ్మిడీ నష్టం, నాకు దమ్మిడి లాభం..." అని నేను అనుకున్నాను. కాని ఆయన దమ్మిడి కూడా పోనిచ్చేరకం కాదు. అతడు నన్ను వెనక్కి పిలిచి "మంచిది, అక్కడ వుంచు, నేను నీ మాదిరిగా చేయకూడదు. నేను తీసుకోకపోతే నీకు అమంగళం కలుగుతుంది" అని అన్నాడు.

నేను మాట్లాడకుండా దమ్మిడీ అక్కడ బెట్టి తిరుగుముఖం పట్టాను.

తరువాత ఒకటి రెండు సార్లు కాశీ విశ్వనాధుని దగ్గరకు వెళ్ళాను. కాని అప్పటికి నాకు మహాత్మ బిరుదు లభించింది. కావున 1902 వ ఏట కలిగిన అనుభవం ఇప్పుడు ఎలా కలుగుతుంది? ఇప్పుడు నేనే దర్శన పాత్రుణ్ణి అయిపోయాను. యిక నాకు అప్పటిలాంటి దృశ్య దర్శన భాగ్యం ఎలా కలుగుతుంది? మహాత్ముల కష్టాలు మహాత్ములకే ఎరుక. యిక ఆలయం విషయం. అక్కడ ఒకటే కమురుకంపు. గతంలో ఆలయం లోపల ఎలా వున్నదో ఇప్పుడూ అలాగే వుంది.

ఎవరికైనా దేవుని దయ మీద సందేహం వుంటే వాళ్లిటువంటి తీర్థ క్షేత్రాల్ని చూతురుగాక. ఆ మహాయోగి పరమేశ్వరుడు తన పేరిట జరుగుతున్న మోసం అధర్మం దుర్మార్గం అలా ఎందుకు సహిస్తున్నాడో తెలియదు.

'యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవభజామ్యహమ్' ఎవరు ఎట్లా నన్ను కొలుస్తారో వారికి అట్టి ఫలం యిస్తాను. అని భగవానుడు చెప్పాడు. కర్మను ఎవడు మార్చగలడు? మధ్యన భగవానుడు తానెందుకు కల్పించుకోవాలి? ధర్మాన్ని యిలా నిర్ధారించి ఆయన అంటే భగవంతుడు అంతర్హితుడైనాడు.

నేనీ అనుభవాలు వెంట బెట్టుకొని మిసెస్ బిసెంటు దర్శనానికి వెళ్ళాను. ఆమె అప్పుడు జబ్బుపడి లేచింది నేను వచ్చానని తెలియగానే ఆమె లోపలినుండి నన్ను చూచేందుకు బయటికి వచ్చింది నేను కేవలం దర్శనం కోసం వచ్చాను. "మీకు ఒంట్లో బాగాలేదని విన్నాను. అందువల్ల మిమ్మల్ని చూచి వెళదామని వచ్చాను. మీకు జబ్బుగా వున్నా దర్శనం యిచ్చారు. చాలు. సంతృప్తి కలిగింది. ఇంతకంటే ఎక్కువ కష్టం మీకు కలిగించను" అని చెప్పి ఆమె దగ్గర సెలవు తీసుకున్నాను.

## 21. బొంబాయిలో నివాసం

నేను బొంబాయిలో వుండి బారిస్టరీ చేస్తూ దానితో బాటు ప్రజాసేవ చేస్తూ వుండాలని గోఖ్లేగారి కోరిక. ఆ రోజుల్లో లోకసేవ అంటే కాంగ్రెస్ సేవ అన్నమాట. అప్పుడు గోఖ్లేగారు ఒక సంస్థను స్థాపించారు. దాని పని కేవలం కాంగ్రెస్ పనులు చేయడమే.

నా కోరిక కూడా అదే. కాని బారిస్టరీలో ఆత్మ విశ్వాసం తక్కువ. పూర్వానుభవాల్ని నేను మరచిపోలేదు. కేసుల కోసం వాళ్ళను వీళ్ళను ప్రాధేయపడటం నాకు నచ్చదు.

అందువల్ల మొదట నేను రాజకోటలోనే మకాం పెట్టాను. అక్కడ నా హితైషులు, నన్ను ఇంగ్లాండుకు పంపిన వారు నగు కేవల్‌రాం మావజీదవే గారు మూడు కేసులు తెచ్చి యున్నారు. అందు రెండు అప్పీళ్ళు. కాఠియావాడ్ జుడిషియల్ అసిస్టెంట్ దగ్గర వాటి విచారణ జరుగుతున్నది. మిగిలినది అసలు దావా. అది జామ్ నగర్‌లో జరుగుతున్నది. అది పెద్ద దావా. ఈ దావాలో గెలిపిస్తానని పూచీ పడలేనని చెప్పాను. 'ఓడిపోయేది మేము కదా! నీవు శక్తి కొద్దీ పనిచేయి. నేను నీతో వుంటాను!' అని కేవలరాం గారు అన్నారు. ప్రతిపక్షాల వకీలు కీ.శే సమర్థ్. నేను కేసు క్షుణ్ణంగా చదివాను. నాకు ఇండియన్‌లా బాగారాదు. కేవలరాంగారు నాకు నూరి పోశారు.

"ఎవిడెన్సు అక్టు విధానమంతా ఫిరోజ్‌గారికి కరతలామలకం. ఆయన గొప్పవాడు కావడానికి అదే కారణమని నా మిత్రులు, దక్షిణ ఆఫ్రికాకు వెళ్లక పూర్వం నాకు చెబుతూ వుండేవారు. ఈ సంగతి నేను గుర్తుంచుకొని దక్షిణ ఆఫ్రికాకు వెళ్లేటప్పుడు టీకాలతో సహా దాన్ని బాగా పఠించాను. ఇంతేగాక నాకు దక్షిణ ఆఫ్రికాలో మంచి అనుభవం కలిగింది.

నేను దావా గెలిచాను. అందువల్ల నా విశ్వాసం దృఢపడింది. అప్పీళ్ళ విషయంలో నాకు భయం లేదు. వాటిలో కూడా గెలిచాను. ఇక బొంబాయి వెళ్ళినా భయం లేదని ధైర్యం కలిగింది.

ఈ విషయం ఎక్కువగా చెప్పేముందు తెల్ల అధికారుల అత్యాచారం, అజ్ఞానం గురించి కలిగిన అనుభవం చెబుతాను. ఈ జ్యుడిషియల్ అసిస్టెంటుగా వున్న ఒక దొర ఎప్పుడూ ఒక చోట వుండడు. ఈయన త్రిపాదిలా ఎక్కడెక్కడికి తిరుగుతూ వుంటాడో వకీళ్ళు, క్లయింట్లు కూడా అక్కడక్కడికి తిరుగుతూ వుండాలి. తమ చోటు విడిచి వచ్చే వకీళ్లకు ఫీజు ఎక్కువ యివ్వవలసివున్నందున క్లయింట్లకు ఖర్చు అధికమైపోతున్నది. ఇదంతా విచారించవలసిన అవసరం జడ్జీకి లేదు కదా!

వేరావల్ అను గ్రామంలో అప్పీలు విచారణ జరుగనున్నది. అక్కడ ప్లేగు ముమ్మరంగా వుంది. రోజుకి 50 మందికి ప్లేగు తాకుతూ వున్నదని గుర్తు. జనాభా దరిదాపు 5,500. దాదాపు గ్రామమంతా శూన్యం. నేను ఒక శూన్యంగా వున్న సత్రంలో విడిది చేశాను. అది గ్రామానికి కొంచెం సమీపాన వుంది. కాని పాపం పార్టీలు ఎక్కడ వుంటాయి ? బీదవారైతే ఇక వాళ్ల రక్షకుడు భగవంతుడే

"అక్కడ ప్లేగు వుండటం వలన విచారణను మరోచోటుకి మార్చమని దొర గారిని కోరవచ్చును." అని ఒక వకీలు మిత్రుడు నాకు తంతి పంపాడు. నేనా విధంగా కోరగా ప్లేగుకు భయపడుతున్నారా అని దొర అడిగాడు.

"ఈ విషయంలో మీరు మా భయాన్ని గురించి యోచించవద్దు. మా సంరక్షణోపాయం మాకు తెలుసు. కాని క్లయింట్ల గతి ఏమిటి?" అడిగాను.

హిందూ దేశంలో ప్లేగు స్థిరనివాసం ఏర్పాటు చేసుకుంది. దీనికి భయమెందుకు? వేరావల్ ఎంతో మంచిది (దొర గ్రామానికి దూరంగా రాజభవనం లాంటి డేరాలో వున్నాడు) ఈ విధంగా బయట వుండటం అందరికీ నేర్పాలని యిలా చేస్తున్నాను.'

ఇది ఆయన వేదాంతం. దీని ముందు యిక నా మాట చలామణి ఎలా అవుతుంది. "గాంధీగారు చెప్పింది గుర్తు పెట్టుకొని వకీళ్ళకు, పార్టీలకు నిజంగా కష్టం కలుగుతూ వుంటే నాకు చెప్పండి" అని దొర శిరస్తాదారుకు చెప్పాడు.

దొర తాను చేస్తున్నది ఒప్పే అనుకొని అలా చేస్తున్నాడను విషయం నిజం. కాని నల్లవాళ్లు పడుతున్న ఇబ్బందుల ముందు అది ఏపాటిది? ఆయనకు బీదవారగు నల్లవారి అవసరాలు, అలవాట్లు, స్వభావాలు, ఆచారాలు ఎట్లా తెలుస్తాయి? రూపాయల మీద నడిచే వాడికి పైసల సంగతి ఎలా తెలుస్తుంది? ఎంత ప్రయత్నించినా ఏనుగు చీమను గురించి తెలుసుకోలేదు. అదే విధంగా ఏనుగులవంటి తెల్లవాళ్ళు చీమలాంటి నల్లవాళ్లను తెలుసుకోవాలన్నా వాళ్ళను తీర్చిదిద్దాలన్నా సాధ్యం కాదు.

ఇక స్వవిషయం. పైన తెలిపిన విధంగా నామీద నాకు విశ్వాసం కలిగింది. కొంతకాలం రాజకోటలోనే వుందామని భావించాను. ఇంతలో కేవలరాంగారు నా దగ్గరకు వచ్చి "నిన్నిక్కడ వుండనీయను. నీవు యిక బొంబాయిలో వుండవలసి వస్తుంది. "అని అన్నాడు.

"అయితే అక్కడ కేసులేవీ? నా ఖర్చు మీరు భరిస్తారా!"

"ఆహా, నీ ఖర్చులు నేను భరిస్తాను. అవసరమైనప్పుడు పెద్ద పెద్ద బారిస్టర్లను ఇక్కడికి తీసుకువచ్చినట్లు నిన్ను తీసుకు వస్తాను. వ్రాతకోతల పనులన్నీ అక్కడికి పంపిస్తాను. బారిస్టర్లను పెద్దవాళ్ళను చేయడం, చిన్నవాళ్ళను చేయడం ప్లీడర్ల చేతిలో పని కాదా! జాంనగర్‌లోను, వేరావలులోను నీ పనిని సరిగ్గా నిర్వహించావు. ఇక మాకు చింత లేదు. లోకారాధన చేయవలసిన వాడవు. ఇక నిన్ను కాఠియావాడులో వుండనీయం. ప్రయాణం ఎప్పుడో చెప్పు.

"నేటాలునుండి నాకు కొంత పైకం రావాలి. అది రాగానే నేను బొంబాయి వెళతాను"

పైకం రెండు వారాల్లో వచ్చింది. నేను బొంబాయి వెళ్ళాను "పేయిన్ గిల్ బర్టు అండ్ సయానీస్" అను ఆఫీసులో చేంబరు అద్దెకు తీసుకొని అక్కడే బసచేశాను.

## 22. ధర్మసంకటం

నేను ఆఫీసుతో పాటు గిరిగాములో ఇల్లు అద్దెకు తీసుకున్నాను. కాని ఈశ్వరుడు నన్ను స్థిరంగా వుండనీయలేదు. ఇల్లు తీసుకున్న కొద్దిరోజులకే మా రెండో పిల్లవాడికి బాగా జబ్బు చేసింది. టైఫాయిడ్ జ్వరం. ఎంతకీ తగ్గలేదు. మాటలు తడబడడం ప్రారంభమైంది. రాత్రి సన్నిపాత లక్షణాలు. ఈ వ్యాధికి ముందు అతనికి మశూచి ముమ్మరంగా పోసింది.

డాక్టరును పిలిపించాను. "ఇందుకు మందు పనిచేయదు. కోడిగుడ్లరసం, కోళ్ళరసం ఇవ్వాలి" అని డాక్టరు చెప్పాడు.

మణిలాలు వయస్సు పదిఏళ్ళు. పిల్లవాణ్ణి ఏమని అడగను? సంరక్షకుణ్ణి నేను. నేనే ఏదో ఒక నిర్ణయం చేయాలి. డాక్టరు సజ్జనుడు. పారసీకుడు "అయ్యా, మేము మాంసాహారులం కాము. మీరు చెప్పిన ఈ రెండు వస్తువుల్లో దేన్నీ ముట్టము. ఇందుకు బదులు మరొకటి చెప్పండి." అని అన్నాను.

"మీ పిల్లవాడి జీవితాశలేదు. పాలలో నీళ్ళు కలిపి ఇవ్వవచ్చు. కాని ఆ ఆహారం చాలదు. నేను చాలామంది హిందువుల ఇళ్ళల్లో వైద్యం చేస్తున్నాను. మీకు తెలుసు. వాళ్ళంతా నే చెప్పినట్లు చేస్తారు. నేను చెప్పిన వస్తువులు వాళ్ళు తీసుకుంటున్నారు. నేను చెప్పినట్లు మీరు కూడా విని ఈ పిల్లవాడి విషయంలో కాఠిన్యం వహించకుండా వుంటే మేలు జరుగుతుంది.

మీరన్నది నిజమే. కాని ఒక్క విషయం చెప్పక తప్పదు. ఈ విషయంలో నా బాధ్యత చాలా ఎక్కువ. అతడు పెద్ద వాడైయుంటే అతడి ఇష్టానుసారం వ్యవహరించి వుండేవాణ్ణి. కాని ఆ భారం నా మీద పడింది. మనిషికి ధర్మసంకటం ఏర్పడేది ఇలాంటి సమయాల్లోనేనని భావిస్తున్నాను. తప్పో ఒప్పో మనుష్యుడు మాంసం తినకూడదని నా నిర్ణయం. జీవన సాధనానికి ఒక హద్దు అనేది ఉంటుంది. ప్రాణం నిలుపుకోడం కోసమైనా ఈ వస్తువుల్ని తినరాదని నా అభిప్రాయం. అందువల్ల నాకు గాని నావారికి గాని ఇట్టి సమయంలో కూడా మాంసం మొదలగు వాటిని తినిపించకూడదని నా ధర్మమర్యాద బోధిస్తున్నది. మీరు ఈ పిల్లవాడి జీవితానికి ప్రమాదం అని చెప్పినా లేక నిజంగా ప్రమాదం సంభవించినా నేను వాటిని ముట్టను. కాని ఒక్కటి మాత్రం యాచిస్తున్నాను. మీ మందులు నేను వాడను. నాకు నాడి, హృదయ పరీక్ష తెలియదు. నాకు కొంచెం కొంచెం జల చికిత్స తెలుసు. నేనా చికిత్స చేస్తాను. మీరు నియమప్రకారం మణిలాలును చూచి శరీరంలో కలిగే మార్పుల్ని నాకు తెలిపితే మీ మేలు మరువలేను అని అన్నాను. సజ్జనుడగు అతనికి నా ఇబ్బంది తెలిసింది. నేను కోరిన ప్రకారం వచ్చి మణిలాలును చూచి వెళతానని అన్నాడు.

మణిలాలు తన ఉద్దేశ్యం నిర్ధారించి చెప్పగలవాడు కాకపోయినా, నాకు డాక్టరుకు జరిగిన సంభాషణంతా చెప్పి నీ ఉద్దేశ్యం ఏమిటి అని అడిగాను.

"నీవు మామూలుగా జలవైద్యం చేయి. నాకు కోళ్ళు వద్దు, కోడిగ్రుడ్లరసమూ వద్దు" అని మణిలాలు అన్నాడు.

బాబూ, వాటిని తిను అని నేను చెబితే పిల్లవాడు తింటాడని నాకు తెలుసు. అయినా అతని మాటలవల్ల నాకు సంతోషం కలిగింది. నాకు కూనే వైద్యం కొద్దిగా తెలుసు. లోగడ నుండి ఈ వైద్యం నేను చేస్తున్నాను. రోగానికి లంకణం పరమౌషధం అని నా భావం. కూనే వైద్యం ప్రకారం మణిలాలుకు కటిస్నానం మూడు నిమిషాలు మాత్రం చేయించాను. మూడు రోజుల వరకు నీరు కలిపిన నారింజ పండ్ల రసం ఇచ్చాను. కాని ఉష్ణం తగ్గలేదు. రాత్రిళ్ళు కొంచెం కొంచెం పెరుగుతూ వున్నది. 104 డిగ్రీల దాక జ్వరం వుంటున్నది. నాకు కంగారు పుట్టింది. "పిల్లవాడికి ఏమైనా అయితే లోకులేమంటారు? మా అన్నగారేమంటారు? మరో డాక్టరును పిలిపించకూడదా? ఆయుర్వేద వైద్యుణ్ణి పిలిపించకూడదా? అపక్వమైన తమ బుద్ధిని పిల్లలపై ప్రయోగించే హక్కు తల్లిదండ్రుల కెక్కడిది.? ఈ రకమైన ఊహలతో మనస్సు బరువెక్కింది 'జీవుడా! నీవు నీకోసం ఏంచేస్తున్నావో నీ పిల్లవాడి కోసం కూడా అదే చేయి. పరమేశ్వరుడు సంతోషిస్తాడు. నీకు జలచికిత్స అంటే గురి. మందు మీద అట్టి గురి లేదు. డాక్టరు ప్రాణం పోయలేడు. అతడిచ్చేది మందు. ప్రాణతంతువు దేవుడి చేతుల్లో వుంది. అందువల్ల దైవనామం స్మరించు. దానిని నమ్ము. నీ మార్గం విడవకు' అను ఊహ మనస్సులో జనించింది.

మనస్సులో ఎంతో మధనపడుతూ వున్నాను. చీకటి పడింది. రాత్రి మణిలాలును దగ్గరకు తీసుకొని పడుకున్నాను. తడిగుడ్డ కప్పవచ్చని అనుకున్నాను. లేచి బట్ట తెచ్చి చన్నీటిలో తడిపి పిడిచి తలవరకు కప్పాను. పైన రెండు కంబళ్ళు కప్పాను. తలకు తడితువాలు చుట్టాను. ఒళ్ళు పెనంలా కాలుతున్నది. వంటి మీద చెమట బొట్టు లేదు.

నాకు దడ పుట్టింది. మణిలాలును తల్లికి అప్పగించాను. ఒక్క అరగంట సేపు తెరపగాలిలో తిరిగి శ్రమ తీర్చుకొని శాంతి పొందుదామని తలచి చౌపాటి వైపుకు వెళ్ళాను. పదోగంట కొట్టారు. మనుష్యుల రాక పోకలు తగ్గాయి. కాని నాకు అదేమీ తెలియదు. నేను దుఃఖ సాగరంలో మునిగి వున్నాను. "ఓ ఈశ్వరా! ఈ ధర్మ సంకటంలో నా ప్రార్థన అంగీకరించు" అని అంటూ నిలబడ్డాను. నా నాలుక మీద రామనామం ఆడుతూ వుంది. కొంతసేపటికి ఇంటికి బయలుదేరాను. నా గుండెలు దడదడలాడుతూ వున్నాయి. ఇంట్లో ప్రవేశించాను. "నాన్నా! వచ్చావా?" అని మణిలాలు అన్నాడు.

"ఆ నాయనా!"

"నన్ను బయటికి తీయండి. చచ్చిపోతున్నాను."

"చెమట పోస్తున్నదా!"

"చెమటతో స్నానం చేశాను వెంటనే తీసివేయినాన్నా?"

నేను మణిలాలు తల తాకి చూచాను! చెమట చేతికి తగిలింది. జ్వరం దిగజారింది. ఈశ్వరునికి చేతులెత్తి నమస్కరించాను.

"నాయనా! మణిలాలూ! భయంలేదు. యిక జ్వరం పోతుంది. ఇంకొంచెం చెమట పోయనీయి"

"ఇక ఆగలేను. యిప్పుడే నన్ను బయటికి తీయండి. అవసరమైతే యింకోసారి కప్పవచ్చు"

నాకు ధైర్యం వచ్చింది. మాటల్లో కొద్ది నిమిషాలు గడిచాయి. చెమట ధారగా కారసాగింది. కప్పిన బట్టలన్నీ తొలగించాను. ఒళ్ళంతా తుడిచి ఆరనిచ్చాను. తరువాత తండ్రీ బిడ్డలం ఆ మంచం మీదనే నిద్రించాం. మా యిద్దరికీ గాఢంగా నిద్రపట్టింది. తెల్లవారింది. లేచి చూచాను. మణిలాలుకు వేడి చాలా వరకు తగ్గి పోయింది. నలభైరోజులు పాలు, నీళ్ళు, పండ్లు వీటితో నడిపాను. నాకు భయం పోయింది. జ్వరం మొండిదే కాని లొంగిపోయింది. నేడు నా పిల్లలందరిలో మణిలాలు ఆరోగ్య వంతుడు. బలిష్టుడు కూడా.

దీనికి కారణం ? రాముడి కృపయా? జలచికిత్సయా? అల్పాహారమా? లేక ఏదేని ఉపాయమా? నిర్ణయం ఎవరు చేయగలరు? ఎవరి విశ్వాసం ప్రకారం వాళ్ళు భావించవచ్చును. కానీ ఆ సమయంలో ఈశ్వరుడే నా ప్రార్థనను ఆలకించాడని నా నమ్మకం. ఆనాటికీ, యీనాటికీ అదే నా నమ్మకం.

## 23. మళ్లీ దక్షిణ-ఆఫ్రికా

మణిలాలుకు పూర్తిగా నెమ్మదించింది. గిరిగాము నందలి గృహం వాసయోగ్యంగా లేదని అనుకున్నాను. ఇల్లంతా తేమ. తగిన వెలుగులేదు. అందువల్ల నేను రేవాశంకరుగారితో మాట్లాడి మంచి చోట గాలివచ్చే ఇల్లు తీసుకోవాలని నిశ్చయించుకున్నాను. బాంద్రా, శాంతాక్రుజ్ వగైరాలన్నీ తిరిగాము. బాంద్రాలో కసాయి దుకాణం వుండటం వల్ల అక్కడ నివసించడానికి నాకు బుద్ధి పుట్టలేదు. ఘట్‌కోపర్

వగైరాలు సముద్రానికి దూరమని అనిపించింది. శాంతాక్రూజ్‌లో ఒక అందమైన బంగళా దొరికింది. అక్కడ కాపురం పెట్టాను. ఆరోగ్యదృష్ట్యా సురక్షితం అని భావించాను. చర్చిగేటు వరకు వెళ్లడానికి ఒక మొదటి తరగతి రైలు పాసు తెప్పించుకున్నాను. మొదటి తరగతి బండిలో అనేక పర్యాయాలు నేనొక్కడినే ప్రయాణించినట్లు గుర్తు. అందువల్ల నాకు కొంచెం గర్వంకూడా కలిగింది. చాలాసార్లు బాంద్రానుండి చర్చిగేటుకు సరాసరి వెళ్లే బండిని అందుకోవడం కోసం శాంతాక్రజ్ నుండి బాంద్రాకు నడిచి పోతూ వుండేవాణ్ణి. నాకు రాబడి బాగానే ఉంది. దక్షిణ-ఆఫ్రికా క్లయింట్లు కూడా కొంచెం పని ఇస్తూ వున్నారు. అందువల్ల నా ఖర్చులకు సొమ్ము సరిపోతున్నది.

ఇంతవరకు నాకు హైకోర్టుతో పనిపడలేదు. కాని ఆ రోజుల్లో అక్కడ 'మూట్' (చర్య) జరుగుతూ వుండేది. దానికి వెళుతూ వుండేవాణ్ణి. అందులో పాల్గొందామంటే ధైర్యం చాలదు. అందు జమీయత్‌రామ్ నానా భాయిగారు ప్రధాన స్థానం ఆక్రమించుతూ వుండేవారని గుర్తు. క్రొత్త బారిస్టర్లందరివలె నేను కూడా హైకోర్టుకు కేసులు వినడానికి వెళుతూ వుండేవాణ్ణి. అచ్చట ఏదో ఒకటి వినడానికి బదులు సముద్రం మీద నుండి మెల్లమెల్లగా వచ్చే చల్లగాలికి కునికిపాట్లు పడి ఆనందం అనుభవిస్తూ వుండేవాణ్ణి. నా వలెనే కునికిపాట్లు పడే ఇతరుల్ని కూడా అక్కడ చూచి సిగ్గు పోగొట్టుకున్నాను. అక్కడ అలా నిద్రించడం కూడా ఒక ఫాషనేనని తలపోశాను. హైకోర్టులో గల గ్రంథాలయాన్ని ఉపయో గించడం ప్రారంభించాను. అక్కడ కొందరితో పరిచయం చేసుకోసాగాను. ఇక కొద్ది కాలంలోనే హైకోర్టులో పని ప్రారంభించగలనని భావించాను.

ఈ మధ్య వృత్తి నిర్వహణను గురించిన చింత కొంచెం కొంచెం తగ్గసాగింది. మరోవైపున గోఖ్లేగారి కండ్లు నా మీద వున్నాయి. వారానికి రెండు మూడుసార్లు నా ఛేంబరులోకి వచ్చి నా యోగక్షేమం తెలుసుకొని వెళ్ళసాగారు. అప్పుడప్పుడు తన మిత్రుల్ని కూడా తీసుకొని వస్తూ ఉండేవారు. పనిచేసే విధానం నాకు తెలుపుతూ ఉండేవారు.

అయితే నా భవిష్యద్విషయాన్ని గురించి ఒక్క సంగతి చెప్పడం మంచిదని భావిస్తున్నాను. నేను మొదట ఏమి చేయదలచుకొనేవాడినో ఈశ్వరుడు దాన్ని సాగనిచ్చేవాడు కాదు. తానొకటి తలిస్తే దైవమింకొకటి తలచినట్లు నా విషయంలో జరుగుతూ ఉంది. నేను స్థిరపడాలని నిశ్చయించుకున్నాను. కొంచెం స్వస్థుణ్ణి కూడా

అయ్యాను. ఇంతలో హఠాత్తుగా దక్షిణ ఆఫ్రికా నుండి తంతి వచ్చింది. "చేంబర్లేనుగారు ఇచటికి రానున్నారు. నీవు వెంటనే రావాలి" ఇది ఆ తంతి సారం. నేను వారికి చెప్పిన మాటలు గుర్తున్నాయి. నేను మళ్ళీ తంతి పంపాను. "నా ఖర్చులు సిద్ధం చేయండి బయలు దేరి వస్తాను" అని. వెంటనే డబ్బు వచ్చింది. అక్కడ ఒక ఏడాది పడుతుందని అనుకున్నాను. బంగళా నా క్రిందనే వుంచుకొని భార్యాబిడ్డల్ని అందు వుంచి వెళదామని నిర్ణయించుకున్నాను. ఈ దేశంలో పని దొరకని చిన్నవాళ్ళు విదేశాలకు వెళ్ళేందుకు సాహసించడం మంచిదని అప్పుడు నాకు తోస్తూవుండేది. అందువల్ల నా వెంట నలుగురైదుగురిని తీసుకువెళ్లాను. వారిలో మగన్‌లాల్‌గాంధీ కూడా ఒకరు.

గాంధీ కుటుంబం పెద్దది. ఇంకను వృద్ధి అవుతూ ఉంది. వీరిలో స్వాతంత్ర్యం కోరేవారిని స్వతంత్రుల్ని చేయాలని నా భావన. మా తండ్రిగారు వారినందరినీ జమీందారీ నౌకరీలో బెట్టి ఏదో విధంగా పోషిస్తూ వుండేవారు వాళ్ళు తమంతట తాము సంపాదించకోగల స్వతంత్రులు కావాలని నా కోరిక. మగన్‌లాల్ గాంధీని సిద్ధం చేయగలిగాను. ఈ విషయం ముందు వివరిస్తాను.

భార్యాబిడ్డల వియోగం, స్థిరపడిన వకీలు పనిని త్రెంచి వేయడం, నిశ్చిత వస్తువు నుండి అనిశ్చిత వస్తువునందు ప్రవేశించడం, ఇదంతా ఒక నిమిషం పాటు బాధాకరం అనిపించింది. కాని నాకు అనిశ్చిత జీవనం అలవాటు అయిపోయింది. ఈ ప్రపంచంలో భగవంతుడొక్కడే సత్యం. మిగిలినదంతా అనిశ్చితం. మన చుట్టుప్రక్కల కనిపించేదీ జరిగేదీ అంతా అనిశ్చితం. క్షణికం. దీనియందు నిశ్చిత రూపమైన ఏ పరమతత్వం విలీనమై ఉన్నదో దాని ప్రదర్శనం ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఈ విషయం మీద నమ్మకం వుంచితే మన జీవనం సార్థకం కాగలదు. ఈ అన్వేషణే పరమ పురుషార్థం అని అంటారు

నేను డర్బనుకు ఒకరోజు ముందుగా వెళ్ళలేకపోయాను. నేను చేయవలసిన పని అంతా తయారు చేసి ఉంచారు. చేంబర్లేనుగారిని చూచుటకు తేదీ నిర్ణయించబడింది. వారికి అందజేయవలసిన అర్జీ వ్రాసి నేను డెప్యుటేషనుతో వెళ్ళాలి.

★ ★ ★

# నాలుగవ భాగం

## 1. చేసిన కృషి వ్యర్థం

మి.చేంబర్లేన్ మూడున్నర కోట్ల పౌండ్లు దక్షిణ ఆఫ్రికా దగ్గర తీసుకుందామని వచ్చాడు. ఇంగ్లీషువాళ్ళ, సాధ్యమైతే బోయర్ల మనస్సును కూడా జయించాలని ఆయన భావం. అందువల్ల భారతీయ ప్రతినిధులకు వ్యతిరేక సమాధానం వచ్చింది.

"స్వరాజ్యం అనుభవిస్తున్న అధినివేశరాజ్యాల మీద ఆంగ్ల సామ్రాజ్య ప్రభుత్వానికి గల అధికారం బహు స్వల్పమను విషయం మీరు ఎరుగుదురు. మీ ఆరోపణలు యదార్థమైనవనే తోస్తున్నది. నా చేతనైనంతవరకు మీకు సాయం చేస్తాను. మీరు మాత్రం అక్కడి తెల్లవారికి తృప్తి కలిగించాలి. వాళ్ళను సంతోషపరచాలి." ఇదీ వారి సమాధానం.

ఈ సమాధానం వల్ల భారత ప్రతినిధి వర్గం మీద పిడుగు పడినంతపని అయింది. నాకు గల ఆశ పూర్తిగా తగ్గిపోయింది. ఇక ఇప్పుడే తెల్లవారిందని భావించి "ఏమండీ! ఆశీర్వదించండి" అంటూ పని ప్రారంభించాలన్న మాట. అనుచరులందరికీ ఈ విషయం నచ్చ చెప్పాను.

అయితే చేంబర్లేన్ సమాధానం అనుచితమైనదా? తారుమారు చేసి మాట్లాడకుండా ఆయన సూటిగా స్పష్టంగా చెప్పాడు. నోరు ఉన్న వాడిదే రాజ్యమని ఆయన తీయని మాటల్లో చెప్పాడన్నమాట. అసలు మా దగ్గర నోరనేది వుంటే గదా! నోటి తూటాల తాకిడికి తట్టుకోగల శరీరాలు కూడా మాకు లేవు. మి. చేంబర్లేన్ కొద్ది వారాలు మాత్రమే ఉంటారని తెలిసింది. దక్షిణాఫ్రికా చిన్న ప్రాంతం కాదు. ఇదొక దేశం. ఇదొక ఖండం. ఆఫ్రికాలో అనేక ఉపఖండాలు వున్నాయి. కన్యాకుమారి నుండి శ్రీనగర్ వరకు 1800 మైళ్ళు ఉంటే, డర్బన్ నుండి కేప్‌టౌన్ వరకు 1100 మైళ్ళకు తక్కువ లేదు. ఈ ఖండంలో మి. చేంబర్లేన్ తుపాను పర్యటన జరపాలి. ఆయన ట్రాన్సువాలుకు బయలుదేరాడు. హిందూ దేశస్థుల కేసును తయారు చేసి నేను వారికి అందజేయాలి. ప్రిటోరియా ఎలా చేరడం? నేను సమయానికి చేరాలి, అనుమతి తీసుకోవాలి అంటే మనవాళ్ళ వల్ల అయ్యే పనికాదు.

యుద్ధం ముగిశాక ట్రాన్సువాలు శిథిలమైపోయింది. అక్కడ తినడానికి తిండిగాని కట్టడానికి బట్టగాని లేదు. ఖాళీగా మూసిపడివున్న దుకాణాలను తెరిపించాలి. నింపాలి. ఇది నెమ్మదిగా జరుగవలసిన కార్యక్రమం. సామాను లభించేదాన్ని బట్టి ఇళ్ళు వదలిపారిపోయిన వాళ్ళనందరినీ తిరిగివచ్చేలా చూడాలి. అందు నిమిత్తం ప్రతి టాన్సువాలు నివాసి, అనుమతి పత్రం తీసుకోవాలి. తెల్లవాళ్ళకు అడగంగానే అనుమతి పత్రం లభిస్తుంది. కాని హిందూ దేశస్థులకు లభించదు. యుద్ధ సమయంలో హిందూ దేశాన్నుండి, లంకనుండి చాలామంది ఆఫీసర్లు, సైనికులు దక్షిణాఫ్రికా వచ్చారు. వారిలో అక్కడ ఉండదలచిన వారికి సౌకర్యాలు కల్పించవలసిన బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వ అధికారులది. అది వారి కర్తవ్యంగా భావించబడింది. క్రొత్త అధికారుల కమిటీలు ఏర్పాటు చేయాలి. అందు అనుభవం కలిగిన అధికారులకు తేలికగా స్థానం లభించింది. ఈ అధికారుల తీవ్ర బుద్ధి మరో క్రొత్త విభాగాన్ని నెలకొల్పింది. దానివల్ల వారికే ఎక్కువ స్తోమతు లభించడం సహజం. హబ్షీలకోసం వేరే విభాగం ఏర్పాటు చేశారు. ఇక ఆసియా వాసుల కోసం ఏర్పాటు చేయరా? తర్కం సరిగా వున్నందున అంగీకారం లభించింది. అయితే నేను అక్కడకు చేరేసరికి ఈ ఏర్పాటు జరిగిపోయింది. మెల్లమెల్లగా వల పన్నారు. పారిపోయిన వాళ్ళకు అనుమతి పత్రం ఇస్తున్న అధికారి ఇష్టపడితే అందరికీ ఇవ్వవచ్చు. కాని ఫలానా వాడు ఆసియా వాసి అని అతడికి తెలియడం ఎలా? ఈ క్రొత్త విభాగం సిఫారసు చేస్తే ఆసియా వారికి అనుమతి పత్రం లభించితే ఆ అధికారి బాధ్యత తగ్గుతుంది. అతడి మీద పని బరువు కూడా తగ్గుతుంది. ఈ తర్కం క్రొత్త విభాగం తెరిచే ముందు అందరి ఎదుట ప్రవేశపెట్టబడింది. కాని క్రొత్త విభాగం తెరిచే ముందు అందరి ఏదుట ప్రవేశపెట్టబడింది. కాని క్రొత్త విభాగం వారికి పనితోబాటు సొమ్ముకూడ కావలసి వచ్చింది పనిలేకపోతే ఈ విభాగం అవసరం లేదని చెప్పి దాన్ని మూసివేస్తారు. అందువల్ల ఆ విభాగానికి పని అప్పజెప్పబడింది.

ఆ విభాగానికి వెళ్ళి హిందూ దేశస్థులు దరఖాస్తు పెట్టుకోవాలి. చాలారోజుల తరువాత జవాబు వస్తుంది. ట్రాన్సువాలు వెళ్ళగోరే వారి సంఖ్య ఎక్కువగా వుంది. అందువల్ల దళారులు బయలుదేరారు. ఈ దళారులకు అధికారులకు మధ్య బీద హిందూదేశస్థుల వేలాది రూపాయలు స్వాహా అవుతున్నాయి. సొమ్ము ఇచ్చి గట్టి ప్రయత్నం చేయకపోతే అనుమతి పత్రం లభించడం లేదని చాలా మంది నాకు చెప్పారు. అవకాశం ఉన్నప్పటికీ ఒక్కొక్క మనిషి అనుమతి పత్రం కోసం వంద పౌండ్లు కూడా చెల్లించవలసిన స్థితి ఏర్పడింది. ఈ వ్యవహారంలో నా కర్తవ్యం ఏమిటి?

నా చిరకాల మిత్రుడగు డర్బన్ పోలీసు సూపరింటెండెంటు దగ్గరకు వెళ్ళాను. "మీరు అధికార పత్రం ఇచ్చే అధికారికి నన్ను పరిచయం చేయండి. నాకు అనుమతి పత్రం ఇప్పించండి. నేను ట్రాన్సువాలులో వున్నానని మీరు ఎరుగుదురు." అని చెప్పాను. ఆయన వెంటనే నెత్తిన హాట్ పెట్టుకొని నా వెంట బయలుదేరారు. నాకు అనుమతి పత్రం ఇప్పించాడు. నా రైలు బయలుదేరడానికి ఒక గంట టైము మాత్రమే వున్నది. నేను మొదటనే సామాను సిద్ధం చేసి పెట్టుకున్నాను. సూరింటెండెంట్ అలెగ్జాండరుకు ధన్యవాదాలు చెప్పి ప్రిటోరియాకు బయలుదేరాను. పడవలసిన కష్టాలు నాకు బోధపడ్డాయి. నేను ప్రిటోరియా చేరాను. దరఖాస్తు సిద్ధం చేశాను. డర్బనులో ప్రతినిధుల పేర్లు ఎవరినైనా అడిగారేమో నాకు గుర్తులేదు. ఇక్కడ క్రొత్త విభాగం పనిచేస్తున్నది. వాళ్ళు భారతీయ ప్రతినిధుల పేర్లు ముందుగానే అడిగి తెలుసుకున్నారట. అంటే నన్ను ప్రతినిధి వర్గానికి దూరంగా వుంచడమే దాని అర్థమన్నమాట. ఈ వార్త ప్రిటోరియాలో గల హిందూ దేశస్థులకు తెలిసింది.

ఇది దుఃఖకరమైన కథ. మనో వినోదం కల్పించే కథ కూడా. వివరాలు తరువాత వ్రాస్తాను.

## 2. ఆసియా నవాబ్ గిరి

అసలు నేను ట్రాన్సువాలులో అడుగు ఎలా పెట్టగలిగానో క్రొత్త విభాగం అధికారులు తెలుసుకోలేకపోయారు. తమ దగ్గరకు వచ్చిన హిందూ దేశస్థుల్ని ఈ విషయం అడిగారు. కాని పాపం వాళ్ళకు ఏం తెలుసు? నాకు గతంలో గల పరిచయాల వల్ల అధికార పత్రం లేకుండా ట్రాన్సువాలులో ప్రవేశించి వుంటానని భావించారు. అప్పుడు నన్ను అరెస్టు చేయవచ్చునని అనుకున్నారు.

యుద్ధం ముగిసిన తరువాత పెద్ద పెద్ద అధికారులకు ప్రత్యేక అధికారాలు అన్నిచోట్ల ఇవ్వబడతాయి. దక్షిణాఫ్రికాలో కూడా అలాగే జరిగింది. అక్కడ శాంతి పరిరక్షణ పేరిట ఒక ప్రత్యేక చట్టం చేయబడింది. ఆ చట్టమందలి ఒక నిబంధన ప్రకారం అనుమతి పత్రం లేకుండా ట్రాన్సువాలులో ప్రవేశించే వారిని అరెస్టు చేయవచ్చు. జైల్లో పెట్టవచ్చు. ఈ నిబంధన ప్రకారం నన్ను అరెస్టు చేయాలని అధికారులు చెవులు కొరుక్కోవడం ప్రారంభించారు. అయితే నన్ను అనుమతి పత్రం చూపించమని అడిగేందుకు ఎవ్వరికీ ధైర్యం చాలలేదు. అధికారుల దర్బనుకు తంతి పంపారు. అనుమతి పత్రం తీసుకొనే వచ్చానని అక్కడి వాళ్ళు చెప్పేసరికి వాళ్ళ కాళ్ళు

చేతులు చల్లబడ్డాయి. అయితే ఆ విభాగం అధికారులు అంతటితో ఊరుకోలేదు. నేను ట్రాన్సువాలు చేరుకోగలిగాను కాని చేంబర్లేనును కలువకుండా చేయగల సత్తా వాళ్ళకు ఉంది.

అందుకే ముందుగానే పేర్లు అడిగారన్నమాట. దక్షిణాఫ్రికాలో వర్ణ ద్వేషం వల్ల కలిగే కటు అనుభవాలు అధికం. దానితోబాటు హిందూ దేశంలో వలె తారుమారు చేయడం, టక్కరితనం చేయడం వంటి దుర్వాసన ఇక్కడ కూడా మొదలైంది. దక్షిణాఫ్రికాలో ప్రభుత్వ శాఖలు ప్రజలహితం కోసం పనిచేస్తూ ఉంటాయి. అందువల్ల అధికారులు వినమ్రంగాను, సరళంగాను వ్యవహరించే వారు. దాని ప్రయోజనం అప్పుడప్పుడు నల్ల తెల్ల పచ్చ చర్మాల వాళ్ళు కూడా సహజంగా పొందుతూ వుండేవారు. ఆసియా దేశపు వాతావరణం ఏర్పడేసరికి అక్కడి మాదిరిగానే కాళ్ళకు మొక్కుతా వంటి ప్రవృత్తి, అంతా తారుమారు చేసే పద్ధతి, తదితర చెడ్డ మురికి అలవాట్లు చోటు చేసుకున్నాయి. దక్షిణాఫ్రికాలో ఒకరకమైన ప్రజాస్వామ్యం నడుస్తున్నది. కాని ఆసియా నుండి మాత్రం నవాబ్‌గిరీ వచ్చిపడింది. అక్కడ ప్రజాప్రభుత్వం లేకపోవడం, కేవలం ప్రజల మీద అధికారం చలాయించే ప్రభుత్వం మాత్రమే వుండటం అందుకు కారణం. దక్షిణాఫ్రికాలో తెల్లవాళ్ళు గృహాలు నిర్మించుకొని స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు. అంటే వాళ్ళే అక్కడి ప్రజలన్నమాట. అందువల్ల అక్కడి అధికార్ల మీద వాళ్ల అంకుశం పని చేస్తున్నదన్నమాట. ఆసియా నుండి వచ్చిన నిరంకుశ అధికారులు కూడా వాళ్ళతో చేతులు కలిపి హిందూ దేశస్థుల్ని అడకత్తెర మధ్య ఇరుక్కున్న పోకచెక్కలా చేశారు.

నాకు కూడా ఇట్టి నవాబ్‌గిరీ ఎలా ఉంటుందో బోధపడింది. నన్ను మొదట ఈ విభాగం ప్రధాన అధికారి దగ్గరకు పిలిపించారు. ఈ ఆఫీసరు లంక నుండి వచ్చాడు. పిలిపించారనీ, పిలిపించబడ్డాననీ అనడం సబబు కాదు. కొంచెం వివరం తెలియజేస్తాను. నా దగ్గరికి లిఖితంగా ఏవిధమైన ఆర్డరు రాలేదు. కాని ముఖ్యులగు హిందూ దేశస్థులు అక్కడికి తప్పనిసరిగా వెళ్ళవలసి వస్తుంది. అటువంటి ముఖ్యుల్లో కీ.శే. సేర్ తయ్యబ్ హాజీ ఖాన్ మహ్మద్ కూడా ఒకరు. ఆయన్ని అధికారి "గాంధీ ఎవరు? అతడు ఎందుకోసం వచ్చాడు?" అని ప్రశ్నించాడు.

తయ్యబ్ సేర్ 'ఆయన మాకు సలహాదారు. వారిని మేము పిలిపించాము' అని చెప్పాడు. 'అయితే మేమంతా ఇక్కడ ఎందుకున్నాం? మీ రక్షణ కోసం మేము ఇక్కడ నియమించబడలేదా? గాంధీకి ఇక్కడి విషయం ఏం తెలుసు?' అని గద్దించాడు.

తయ్యబ్ సేఠ్ తన తెలివితేటల్ని ఉపయోగించి "మీరు వున్నారు. కాని గాంధీ గారు మా మనిషి గదా! ఆయనకు మా భాష వచ్చు. ఆయన మమ్మల్ని ఎరుగును. పైగా మీరు అధికారులు" అని అన్నాడు.

"గాంధీని నా దగ్గరకు తీసుకురండి" అని ఆదేశించాడు ఆ అధికారి.

తయ్యబ్‌సేఠ్ మొదలగువారితో బాటు నేను అక్కడికి వెళ్ళాను. కూర్చోవడానికి కుర్చీ లభించలేదు. మేమంతా నిలబడే ఉన్నాము. దొర నావంక చూచాడు. చెప్పండి! మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? అని ప్రశ్నించాడు.

"నా సోదరులు పిలిచినందున వారికి సలహా ఇచ్చేందుకు వచ్చాను" అని జవాబిచ్చాను.

"ఇక్కడకు రావడానికి మీకు అధికారంలేదని తెలియదా? పొరపాటున మీకు అనుమతి పత్రం లభించింది. మీరు ఇక్కడి నివాసస్థులుగా పరిగణించబడరు. మీరు తిరిగి వెళ్ళిపోవలసి ఉంటుంది. మీరు మి. చేంబర్లేన్ దగ్గరకు వెళ్ళడానికి వీలు లేదు. ఇక్కడి హిందూ దేశస్థుల రక్షణ కోసం మా విభాగం ప్రత్యేకించి ఏర్పాటు చేయబడింది మంచిది. ఇక వెళ్ళండి" అని దొర నన్ను పంపించి వేశాడు సమాధానం చెప్పడానికి నాకు అవకాశం ఇవ్వలేదు.

ఇతర అనుచరులను ఆపి ఉంచాడు. వారిని బెదిరించాడు. నన్ను తక్షణం ట్రాన్సువాలు నుండి పంపివేయమని వాళ్ళకు సలహా ఇచ్చాడు.

అనుచరులు ముఖం వ్రేలాడేసుకొని వచ్చారు. ఊహించని ఒక క్రొత్త సమస్యను ఎదుర్కొని దాన్ని పరిష్కరించవలసిన అవసరం ఏర్పడింది.

## 3. చేదు గుటకలు

ఈ అవమానం వల్ల నాకు దుఃఖం కలిగింది. అయితే ఇంతకు పూర్వం ఇటువంటి అనేక అవమానాలు భరించివున్నాను. అందువల్ల నాకు అవి అలవాటయ్యాయి. కనుక అవమానాన్ని లక్ష్యం చేయకుండా తటస్థభావంతో వుండి కర్తవ్యాన్ని నిర్వహించాలని నిర్ణయించుకున్నాను.

ఆ అధికారి సంతకంతో ఒక పత్రం వచ్చింది. మి. చేంబర్లేన్ దర్బనులో మి. గాంధీని కలుసుకున్నారు. అందువల్ల ఆయన పేరు ప్రతినిధుల పట్టికనుంచి తొలగించవలసివచ్చింది అని ఆ పత్రంలో వ్రాసి ఉన్నది.

అనుచరులకు ఈ పత్రం వల్ల భరించలేనంత బాధ కలిగింది. "అయితే అసలు మేము డెపుటేషనే తీసుకువెళ్ళం" అని అన్నారు. నేను వారికి నచ్చచెప్పాను. మనవాళ్ళ

స్థితి దుర్భరంగా ఉంది. మీరు మి. చేంబర్లేను దగ్గరికి వెళ్ళకపోతే ఇక్కడ మనవాళ్ళకేమీ కష్టం లేదని ప్రకటిస్తారు. అందువల్ల ఏది ఏమైనా చెప్పదలచుకున్నది లిఖితంగా చెప్పవలసిందే. అది వ్రాసి సిద్ధంగా ఉన్నది. నేను చదివినా, మరెవరు చదివినా ఒకటే. మి. చేంబర్లేన్ దీన్ని గురించి చర్చించడు. నాకు జరిగిన అవమానాన్ని మనం సహించవలసిందే అని నేను చెబుతూ వుండగా తయ్యబ్ సేఠ్ అందుకొని 'మీ అవమానం జాతికే అవమానం. మీరు మా ప్రతినిధులు. దీన్ని ఎలా మరచిపోవడం?' అని అన్నాడు.

"నిజమే. కాని జాతికూడా ఇటువంటి అవమానాల్ని సహించవలసిందే. మరో ఉపాయం ఏమీ లేదు" అని నేను అన్నాను. తయ్యబ్‌సేఠ్ "అయిందేదో అయింది కావలసింది అయి తీరుతుంది. మేము చేతులారా మరో అవమానానికి గురికాము. మన పనులు ఎలాగూ చెడుతున్నాయి. మనకేమైనా హక్కులు లభించనున్నాయా? లేదే!" అని అన్నాడు.

ఈ ఆవేశం నా దృష్టిలో సరియైనదే. కాని దానివల్ల లాభం లేదని నాకు తెలుసు. జాతికి అవమానం జరుగుతున్నదని నాకు తెలియదా? అందువల్ల వారందరినీ శాంతపరిచాను. నా పక్షాన హిందూ దేశపు బారిష్టర్ కీ.శే. జార్జిగాడ్‌ఫ్రేను వెళ్ళమని చెప్పాను. అంతా అంగీకరించారు. ఈ విధంగా మి. గాడ్‌ఫ్రే డెపుటేషన్‌కు నాయకత్వం వహించారు. మాటల సందర్భంలో చేంబర్లేన్ నా విషయం కొద్దిగా పేర్కొన్నాడట. "ఒకే మనిషిని మాటిమాటికి వినేకంటే క్రొత్తవారిని వినడం ఎక్కువ మంచిది" మొదలుగా గల మాటలు పలికి తగిలిన గాయాన్ని కొద్దిగా మాన్పడానికి ప్రయత్నించాడట.

దీనివల్ల జాతిపని, నా పని కూడా బాగా పెరిగిపోయింది. మళ్ళీ మొదటినుండి ప్రారంభించవలసి వచ్చింది. "మీరు చెప్పినందువల్ల జాతి అంతా యుద్ధంలో పాల్గొన్నది. కాని ఫలితం ఇదేగదా?" అని ఎత్తిపొడిచేవాళ్ళు కూడా బయలుదేరారు. అయితే ఇలాంటి ఎత్తిపొడుపు మాటలు నా మీద పనిచేయలేదు. "నేను అట్టి సలహా ఇచ్చినందుకు పశ్చాత్తాపపడటం లేదు. యుద్ధంలో పాల్గొని మనం మంచి పనే చేశాము. ఇవాళ కూడా నా అభిప్రాయం అదే. ఆ విధంగా చేసి మనం మన కర్తవ్యాన్ని నిర్వర్తించాం. దాని సత్ఫలితం మనం చూడలేకపోతే పోవచ్చు. కాని మంచి పనికి ఎప్పుడూ మంచి ఫలితమే కలుగుతుంది. ఇది నా దృఢ విశ్వాసం. గతంలో ఏం జరిగింది అని ఆలోచించకుండా ఇక భవిష్యత్తులో ఏం చేయాలి అని మనం యోచించాలి. ఇది మన కర్తవ్యం" అని చెప్పాను. నా మాటలు విని అందరూ నన్ను సమర్థించారు.

తరువాత ఇలా అన్నాను. "నిజానికి నన్ను మీరు ఏ పని కోసం పిలిపించారో, ఆ పని అయిపోయిందని భావించవచ్చు. కాని మీరు వెళ్ళమన్నా వెళ్ళకూడదని, సాధ్యమైనంతకాలం ట్రాన్సువాలులో వుండాలని భావిస్తున్నాను. నా పని నేటాలులో కాక, ఇక్కడ జరగాలని భావిస్తున్నాను. ఒక్క సంవత్సరంలో తిరిగి వెళ్ళిపోదామనే అభిప్రాయం నేను విరమించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇక్కడ వకీలు వృత్తి ప్రారంభిస్తాను అనుమతి తీసుకుంటాను. ఈ క్రొత్త విభాగాన్ని నడిపించగల శక్తి నాకు వున్నది. ఈ దుర్మార్గాన్ని ఎదుర్కోకపోతే జాతి దెబ్బ తింటుంది. ఇక్కడి నుండి అంతా మూట ముల్లె కట్టుకొని పారిపోవలసిన స్థితి దాపురిస్తుంది. మి. చేంబర్లేను నన్ను కలవలేదు. ఆ అధికారి నా విషయంలో తుచ్ఛంగా వ్యవహరించాడు. అయితే జాతి మొత్తానికి జరుగుతున్న అవమానం ముందు ఇది అంత పెద్దది కాదు. కుక్కలవలె మనం ఇక్కడ వుండటం సహించరాని విషయం" అంటూ యదార్థ విషయాన్ని వాళ్ళందరి ముందు వుంచాను. ప్రిటోరియా మరియు జోహన్సుబర్గులో నివసిస్తున్న హిందూ దేశనాయకులతో చర్చించాను. చివరికి జోహన్సుబర్గులో ఆఫీసు నెలకొల్పాలని నిర్ణయించాము.

ట్రాన్సువాలులో నాకు వకీలు వృత్తికి అనుమతి పత్రం లభించే విషయం సందేహాస్పదమే అయితే వకీళ్ల సముదాయం మాత్రం నన్ను వ్యతిరేకించలేదు పెద్ద కోర్టు వారు వకీలు వృత్తి కోసం నేను పెట్టుకొన్న దరఖాస్తును అంగీకరించారు.

హిందూ దేశవాసులకు తగినచోట ఆఫీసు నెలకొల్పడం కోసం ఇల్లు దొరకడం కూడా అక్కడ కష్టమే మి. రీచ్‌గారితో నాకు బాగా పరిచయం ఉంది. అప్పుడు వారు వ్యాపారవర్గంలో వున్నారు. వారికి పరిచితుడైన హౌస్ ఏజంటు ద్వారా ఆఫీసు కోసం నాకు మంచి చోట ఇల్లు దొరికింది. నేను వకీలు వృత్తి ప్రారంభించాను.

## 4. నాలో పెరిగిన త్యాగ ప్రవృత్తి

ట్రాన్సువాలులో హిందూ దేశవాసుల హక్కులకోసం ఏ విధంగా పోరు సలపవలసివచ్చిందో, ఆసియా విభాగానికి చెందిన అధికారులతో ఏవిధంగా తలపడవలసి వచ్చిందో వివరించే ముందు నా జీవితంలో జరుగుతున్న మరో ముఖ్యమైన మార్పును గురించి తెలియజేయడం అవసరమని భావిస్తున్నాను.

ఇప్పటివరకు కొంత డబ్బు ప్రోగు చేయాలనే కోరిక నాకు వున్నది. పారమార్థికంతో బాటు స్వార్థం కూడా అందు చోటు చేసుకున్నది. బొంబాయిలో నా ఆఫీసు

ప్రారంభించినప్పుడు ఒక అమెరికాకు చెందిన భీమా ఏజంటు నన్ను కలుసుకునేందుకు వచ్చాడు. అతని ముఖం ఆకర్షణీయంగా వుంది. మాటలు మధురంగా వున్నాయి. మేము పాత మిత్రులమా అనే భావం కలిగేలా అతడు నా భావి జీవితహితానికి సంబంధించి మాట్లాడాడు. అమెరికాలో మీ స్థాయిలో వుండే వ్యక్తులంతా తమ జీవితాన్ని భీమా చేస్తారు మీరు కూడా చేయించుకొని మీ భవిష్యత్తుని గురించి నిశ్చింతపడండి. అది ఎంతో అవసరం. జీవితంలో స్థిరత్వం కోసం. అమెరికాలో భీమా చేయించుకోవడం కర్తవ్యమని భావిస్తాం. ఒక చిన్న పాలసీ తీసుకునేందుకు నేను మిమ్ము ఒప్పించలేనా?'' అని అన్నాడు.

దక్షిణ ఆఫ్రికాలోను, హిందూదేశంలోను, చాలామంది భీమా ఏజంట్లను త్రిప్పి పంపించివేశాను. భీమా చేయించడంలో కొంచెం పిరికితనం, ఈశ్వరునిపై అపనమ్మకం పనిచేస్తుందని నా అభిప్రాయం. కాని ఈ పర్యాయం నేను కొంచెం ఆకర్షితుడనయ్యాను. అతడి మాటలు వింటున్న కొద్దీ నా భార్యా బిడ్డల భవిష్యత్తును గురించిన చిత్తరువు కండ్ల ఎదుట కనబడసాగింది ''ఓ పెద్దమనిషీ! నీవు దరిద్రాపుగా నీ భార్య ఆభరణాలన్నీ అమ్మివేశావు. రేపు నీకేమైనా అయితే, భార్యాబిడ్డల భారం పాపం బీదవాడైన నీ అన్నగారి మీద పడుతుంది. ఆ సోదరుడే తండ్రిగా నీ బాధ్యత వహించాడు. ఆయన మీదే మొత్తం భారం పడదా? ఇది ఏమంత మంచిపని కాదు!'' ఈ రకమైన తర్కం నా మనస్సులో ప్రారంభమైంది. అప్పుడు 10వేల రూపాయలకు భీమా చేయించాను కాని దక్షిణ ఆఫ్రికాలో తలెత్తిన క్రొత్త ఆపదను పురస్కరించుకొని నేను చేసిన పనులన్నీ భగవంతుణ్ణి సాక్షిగా పెట్టుకొని చేసినవే దక్షిణ ఆఫ్రికాలో ఎంతకాలం పడుతుందో నాకు తెలియదు. ఇక హిందూ దేశానికి తిరిగి వెళ్ళలేను. అందువల్ల నా భార్యాబిడ్డల్ని నా దగ్గరే ఉంచుకోవాలి. వాళ్ళను ఇక వదలకూడదు. వాళ్ళపోషణ దక్షిణ ఆఫ్రికాలోనే జరగాలి అని అనుకున్నాను. దానితో ఆ పాలసీ దుఃఖానికి హేతువు అయింది. భీమా ఏజంటు వలలో చిక్కుకున్నందుకు సిగ్గుపడ్డాను. మా అన్న తండ్రి బాధ్యత వహించినప్పుడు, తమ్ముని భార్య వితంతువైతే ఆమె బాధ్యత వహించదని నీవు ఎట్లా అనుకున్నావు? నీవే ముందు చనిపోతావని ఎందుకు భావించావు? పాలకుడు ఆ ఈశ్వరుడే. నీవూ కాదు, నీ అన్నా కాదు. భీమా చేయించి భార్యాబిడ్డల్ని కూడా పరాధీనుల్ని చేశావు. వాళ్ళు స్వయం పోషకులు కాలేరా? ఎంతోమంది బీదల బిడ్డలు లేరా? వారి సంగతేమిటి? నీ వాళ్ళుకూడా అట్టివారేనని ఎందుకు భావించవు?

ఈ విధమైన భావనాస్రవంతి ప్రారంభమైంది. వెంటనే ఆచరణలో పెట్టలేకపోయాను. భీమాకు చెల్లించవలసిన సొమ్ము ఒక్క పర్యాయం దక్షిణ ఆఫ్రికా నుండి పంపించినట్లు గుర్తు. ఈ విధమైన భావానికి బయటినుండి కూడా ఉత్తేజం లభించింది. మొదటిసారి దక్షిణ ఆఫ్రికాకు వచ్చినప్పుడు క్రైస్తవ వాతావరణ ప్రభావం వల్ల మత విషయలో జాగరూకుడనయ్యాను. ఈసారి దివ్య జ్ఞాన సమాజ ప్రభావంలో పడ్డాను. మి.రీచ్ థియాసొఫిస్టు. జోహాన్సుబర్గునందున్న ఆయన సొసైటీతో నాకు సంబంధం కల్పించాడు. అయితే నేను అందు మెంబరుగా చేరలేదు. దివ్యజ్ఞాన సమాజ సిద్ధాంతాల విషయంలో నాకు అభిప్రాయభేదం ఉంది. అయినా సదరు సొసైటీ సభ్యులందరితో నాకు గాఢంగా పరిచయం ఏర్పడింది. వారితో నిత్యము మతపరంగా చర్చ జరుగుతూ వుండేది. వారి పుస్తకాలు చదివేవాణ్ణి. వారి సభల్లో మాట్లాడే అవకాశం కూడా లభిస్తూ ఉండేది. దివ్యజ్ఞాన సమాజంలో భ్రాతృభావానికి, దాని పెంపుదలకు అధిక ప్రాధాన్యం ఇస్తారు. ఈ విషయమై మేము బాగా చర్చ చేస్తూ వుండేవాళ్ళం. వారి సిద్ధాంతానికి, సొసైటీ సభ్యుల ఆచరణకీ పొంతన కనపడకపోతే తీవ్రంగా విమర్శించేవాణ్ణి. ఈ విమర్శ యొక్క ప్రభావం నా మీద కూడా బాగా పడింది. నేను ఆత్మ నిరీక్షణ చేసుకోవడం నేర్చుకున్నాను.

## 5. నిరీక్షణకు ఫలితం

క్రీస్తుశకం 1893లో క్రైస్తవ మిత్రులతో పరిచయం పెరిగిన సమయంలో నేను జిజ్ఞాసువు స్థాయిలో వున్నాను. క్రైస్తవ మిత్రులు బైబిలు సందేశం నాకు వినిపించి వివరించి చెప్పి నా చేత అంగీకరింపచేయాలని ప్రయత్నిస్తూ వుండేవారు. నేను వినమ్రతతో తటస్థభావం వహించి వారి ఉపదేశాలను వింటూ వుండేవాణ్ణి. ఆ సందర్భంలో నేను హిందూ మతాన్ని గురించి శక్త్యానుసారం అధ్యయనం చేశాను. ఇతర మతాల్ని గురించి తెలుసుకునేందుకు ప్రయత్నించాను. ఇప్పుడు అనగా 1903లో పరిస్థితి మారింది. దివ్యజ్ఞాన సమాజం మిత్రులు నన్ను తమ సమాజంలో చేర్చుకుందామని ఉవ్విళ్లూరుతున్నారు. హిందువుగా నా ద్వారా ఏదో కొంత చేయించాలని వాళ్ళ అభిలాష. దివ్యజ్ఞాన పుస్తకాల్లో హిందూ మతచ్ఛాయలే ఎక్కువ. అందువల్ల నేను ఎక్కువగా సహకరిస్తానని అనుకున్నారు. సంస్కృత అధ్యయనం నేను చేయలేదు. ప్రాచీన హిందూమత గ్రంథాలు సంస్కృతంలో నేను చదవలేదు. అనువాదాలు కూడా చదివింది తక్కువే అని చెప్పాను. అయినా వాళ్ళు సంస్కారాల్ని, పునర్జన్మను అంగీకరిస్తారు.

అందువల్ల నా వల్ల కొద్ది సాయం పొందాలని వారి అభిలాష. "నిరస్తపాదపే దేశే ఎరండోపి ద్రుమాయతే" చెట్టులేని చోట ఆముదం మొక్కే మహావృక్షం అను సామెత వలె నా పరిస్థితి వున్నది ఒక మిత్రునితో కలిసి వివేకానందుని గ్రంధాలు, మరొకరితో కలిసి మణిలాల్ భాయీ రచించిన రాజయోగం చదవడం ప్రారంభించాను. జిజ్ఞాస మండలి అను పేరిట ఒక సమితిని స్థాపించి నియమబద్ధంగా అధ్యయన కార్యక్రమం ప్రారంభించాం. భగవద్గీత అంటే మొదటినుండి నాకు ఎంతో ప్రేమ, శ్రద్ధ. లోతుకుపోయి గీతాధ్యయనం చేయాలనే కోరిక కలిగింది. నా దగ్గర గీతానువాదాలు రెండు మూడు వున్నాయి.

వాటి ద్వారా సంస్కృత గీతను అర్థం చేసుకునేందుకు ప్రయత్నం మొదలు పెట్టి ప్రతిరోజు ఒకటి రెండు శ్లోకాలు కంఠస్థం చేయాలని నిశ్చయించుకున్నాను.

ఉదయం ముఖం కడుక్కునేటప్పుడు స్నానం చేసేటప్పుడు గీతాశ్లోకాలు కంఠస్థం చేయసాగాను. దంతధావనకు 15 నిమిషాలు, స్నానానికి 20 నిమిషాలు పట్టేది. దంతధావనం ఆంగ్లేయుల పద్ధతిలో నిలబడి చేసేవాణ్ణి. ఎదురుగా వున్న గోడమీద గీతాశ్లోకాలు వ్రాసి అంటించి సమయం దొరికినప్పుడల్లా వాటిని బట్టీవేయసాగాను. బట్టీ వేసిన సంస్కృత శ్లోకాలు స్నానం చేసేసరికి నోటికి వచ్చేసేవి. ఈ సమయంలోనే మొదటి నుండీ బట్టీ బట్టిన శ్లోకాల్ని తిరిగి పఠించి నెమరవేసుకునేవాణ్ణి ఈ విధంగా 13 అధ్యాయాలు కంఠస్థం చేసిన సంగతి నాకు గుర్తు ఉంది. తరువాత నాకు ఇతర పని పెరిగింది సత్యాగ్రహ కార్యక్రమం ప్రారంభించిన తరువాత ఆ బిడ్డ పెంపకం, పోషణలో పడిపోయి ఆలోచించడానికి కూడా సమయం చిక్కడం దుర్లభం అయింది.

ఇప్పటికీ అదే స్థితి అని చెప్పవచ్చు గీతాధ్యయనం వల్ల నాతో కలిసి చదువుతున్నవారి మీద ఏం ప్రభావం పడిందో తెలియదు కాని నాకు మాత్రం ఆ పుస్తకం ఆచారానికి సంబంధించిన ప్రౌఢ మార్గసూచిక అయిందని చెప్పగలను. అది నాకు ధార్మిక నిఘంటువు అయింది క్రొత్త ఇంగ్లీషు శబ్దాల స్పెల్లింగు లేక వాటి అర్థం తెలుసుకునేందుకు ఇంగ్లీషు నిఘంటువును చూచినట్లే ఆచరణకు సంబంధించిన కష్టాలు, కొరుకుడుపడని సమస్యలు వచ్చినప్పుడు గీతద్వారా వాటి పరిష్కారం చేసుకునేవాణ్ణి. అపరిగ్రహం, సమభావం మొదలైన అందలి శబ్దాలు నన్ను ఆకట్టుకున్నాయి. సమభావాన్ని ఎలా సాధించాలి? దాన్ని ఎలా సంరక్షించాలి? అవమానించే అధికారులు, లంచాలు పుచ్చుకునే అధికారులు, అనవసరంగా

వ్యతిరేకించేవారు, భూతకాలపు అనుచరులు మొదలగువారు ఎక్కువ ఉపకారాలు చేసిన సజ్జనులు వీరి మధ్య భేదం చూపవద్దు అని అంటే ఏమిటి? అది ఎలా సాధ్యం? అపరిగ్రహాన్ని పాలించడం ఎలా? దేహం వున్నదిగదా! ఇది తక్కువ పరిగ్రహమా? భార్యాబిడ్డలు పరిగ్రహాలు కాదా? గ్రంధాలతో నిండియున్న అల్మారాలను తగులబెట్టనా? ఇల్లు తగులబెట్టి తీర్థాలకు వెళ్ళనా? ఇల్లు తగులబెట్టందే తీర్థాలు సాధ్యం కావు అని వెంటనే సమాధానం వచ్చింది. ఇక్కడ ఇంగ్లీషు చట్టం సహాయం చేసింది. స్నెల్ యొక్క చట్టపరమైన సిద్ధాంతాల వివరం జ్ఞాపకం వచ్చింది. ట్రస్టీ అను శబ్దానికి అర్థం ఏమిటో గీత చదివిన తరువాత బాగా బోధపడింది. లా శాస్త్రం ఎడ ఆదరణ పెరిగింది. దానిలో కూడా నాకు ధర్మ దర్శనం లభించింది. ట్రస్టీ దగ్గర కోట్లాది రూపాయలు వున్నా వాటిలో ఒక్క దమ్మిడీ కూడా అతనిది కాదు. ముముక్షువు యొక్క స్థితి కూడా ఇంతేనని గీతాధ్యయనం వల్ల నాకు బోధపడింది. అపరిగ్రహికావడానికి, సమభావి కావడానికి హేతువుయొక్క మార్పు, హృదయము యొక్క మార్పు అవసరమను విషయం గీతాధ్యయనం వల్ల దీపపు కాంతిలా నాకు స్పష్టంగా కనబడింది. భీమా పాలసీ ఆపివేయమనీ, ఏమైనా తిరిగి వచ్చేది వుంటే తీసుకోమనీ, తిరిగి వచ్చేది ఏమీ లేకపోతే ఆ సొమ్ము పోయినట్లుగా భావించమనీ, భార్యాబిడ్డల సంరక్షణ వాళ్ళను, నన్ను పుట్టించినవాడే చేస్తాడనీ, దేవాశంకరభాయికి జాబు వ్రాశాను. ఈనాటి వరకు నా దగ్గర మిగిలిన సొమ్మంతా మీకు అర్పించాను. ఇక నా ఆశమానుకోండి ఇకనుండి నా దగ్గర మిగిలేదంతా జాతికి ఉపయోగపడుతుంది అని పితృతుల్యులగు నా అన్నగారికి వ్రాశాను

అయితే ఈ విషయం అన్నగారికి వెంటనే వివరించలేకపోయాను. మొదట వారు కఠినమైన భాషలో తన విషయమై నా కర్తవ్యం ఏమిటో వివరించి నీవు మన తండ్రిగారిని మించి తెలివితేటలు ప్రదర్శించవద్దు మన తండ్రి ఎలా కుటుంబపోషణ చేశారో నీవు కూడా అదే విధంగా కుటుంబపోషణ చేయాలి అంటూ ఏమేమో వ్రాశారు. వినమ్రంగా సమాధానం వ్రాస్తూ "తండ్రిగారు చేసిన పనే నేను చేస్తున్నాను. కుటుంబం యొక్క అర్థాన్ని విస్తృతం చేసి చూచుకుంటే నా నిర్ణయమందలి ఔచిత్యం మీకు బోధపడుతుంది" అని తెలియజేశాను.

అన్నగారు ఇక నా ఆశవదులుకున్నారు. మాట్లాడటం కూడా విరమించుకున్నారు. నాకు దుఃఖం కలిగింది. కాని ధర్మమని భావించిన విషయాన్ని వదలమంటే మరీ దుఃఖం కలిగింది. నేను పెద్ద దుఃఖాన్ని సహించాలని నిర్ణయించుకున్నాను. అయినా

దుఃఖానికి కారణం నా యెడ వారికి గల ప్రేమయే. నా సొమ్ముకంటే నా సదాచరణ వారికి ముఖ్యం. చివరి రోజుల్లో అన్నగారు కరిగిపోయి తాను మృత్యుశయ్యమీద వున్నప్పుడు "నీ ఆచరణయే సరియైనది, ధర్మబద్ధమైనది అని నాకు తెలియజేశారు. కరుణరసంతో నిండిన వారి జాబు నాకు అందింది. తండ్రి కుమారుని క్షమాపణ కోరగలిగితే వారు నన్ను క్షమాభిక్ష కోరినట్లే. నా బిడ్డలను నీ విధానంలోనే పెంచి పోషించమని వ్రాశారు. నన్ను కలుసుకోవాలని ఆతురతను వ్యక్తం చేశారు. నాకు తంతి పంపారు. వెంటనే తంతి ద్వారా నా దగ్గరకు రమ్మని వారికి తెలియజేశాను. కాని మా ఇరువురి కలయిక సాధ్యపడలేదు. వారి బిడ్డలకు సంబంధించిన వారి కోరిక కూడా నెరవేరలేదు. అన్నగారు భారతదేశంలోనే శరీరం త్యజించారు. వారి పిల్లలపై తండ్రి యొక్క పాత జీవన ప్రభావం బాగా పడింది. వాళ్ళు మారలేకపోయారు. నేను వారిని నా దగ్గరకు తెచ్చుకోలేకపోయాను. ఇందు వారి దోషం ఏమీ లేదు. స్వభావాన్ని ఎవరు మార్చగలరు? బలమైన సంస్కారాల్ని ఎవరు పోగొట్టగలరు? మనలో మార్పు వచ్చిన విధంగా మన ఆశ్రితుల్లో, బంధువుల్లో, కుటుంబీకుల్లో మార్పు రావాలని భావించడం వ్యర్థమే"

ఈ దృష్టాంతం వల్ల తల్లిదండ్రుల బాధ్యత ఎంత భయంకరమైనదో అంచనా వేయవచ్చు.

## 6. మాంసరహిత ఆహారం కోసం బలిదానం

జీవితంలో త్యాగనిరతి, నిరాడంబరత, ధర్మ జాగృతితో బాటు మాంసరహిత ఆహారాన్ని గురించి, అట్టి ఆహార ప్రచారాన్ని గురించి శ్రద్ధ పెరగసాగింది. ఆచరణ ద్వారాను, జిజ్ఞాసువులతో చర్చల ద్వారాను ప్రచారం చేయడం ప్రారంభించాను.

జోహన్సుబర్గులో ఒక మాంసరహిత భోజనశాల వున్నది. కూనేగారి జల చికిత్స తెలిసిన ఒక జర్మనీ వాడు దాన్ని నడుపుతూ ఉన్నాడు. నేను అక్కడికి వెళ్ళడం ప్రారంభించాను. వెంట తీసుకొని వెళ్ళగలిగినంత మంది ఇంగ్లీషు వాళ్ళను అక్కడికి తీసుకువెళ్ళసాగాను. ఈ భోజనశాల ఎక్కువ రోజులు నడవదని గ్రహించాను. ఎప్పుడూ డబ్బుకు ఇబ్బందే. అవసరమని భావించి చేతనైనంత ఆర్థిక సాయం చేశాను. కొంత డబ్బు పోగొట్టుకున్నాను కూడా. చివరికి ఆ భోజనశాల మూతబడింది. థియాసాఫిస్టుల్లో ఎక్కువ మంది శాకాహారులు. కొందరు పూర్తిగా, కొందరు సగం శాకాహారులు. ఆ మండలిలో సాహసోపేతురాలైన ఒక మహిళ వుంది. ఆమెది పెద్ద

స్థాయి. ఒక శాకాహార భోజనశాల ప్రారంభించింది. ఆమె కళాభిమాని. రసికురాలు. ఖర్చు బాగా పెడుతుంది. లెక్కాడొక్కా ఎక్కువగా ఆమెకు తెలియదు. ఆమెకు మిత్రమండలి అధికం. ప్రారంభంలో తక్కువ స్థాయిలో ప్రారంభించింది. కాని త్వరలోనే పెంచి, పెద్ద స్థాయిలో నడపాలని నిర్ణయానికి వచ్చింది. అందుకు నా సాయం కోరింది. అప్పుడు నాకు ఆమె లెక్కల వ్యవహారం తెలియదు. ఆమె లెక్కలు సరిగా ఉన్నాయని అనుకున్నాను. నా దగ్గర డబ్బుకు కొదువలేదు. చాలామంది కక్షిదారుల సొమ్ము నా దగ్గర ఉన్నది. వారిలో ఒకనితో మాట్లాడి అతని సొమ్ము 100 పౌండ్లు ఆమెకు ఇచ్చాను. ఆ వ్యక్తి విశాలహృదయుడు. నా మీద అతనికి అపరిమితమైన విశ్వాసం. అతడు మొదటి కూలీల జట్టులో దక్షిణ ఆఫ్రికా వచ్చినవాడు. "అన్నా! మీ మనస్సు సరేనంటే ఇవ్వండి. నాకేమీ తెలియదు. నాకు తెలిసినవారు మీరే" అని అన్నాడు. అతని పేరు బద్రీ. సత్యాగ్రహంలో పాల్గొన్నాడు. జైలుశిక్ష కూడా అనుభవించాడు. అతడి మాట తీసుకొని సొమ్ము ఆమెకు అప్పుగా ఇచ్చాను. రెండు మూడు మాసాలు గడిచాయి. ఇక డబ్బు తిరిగి రాదని నాకు బోధపడింది. యింత సొమ్ము మునిగితే తట్టుకోగలశక్తి నాకు లేదు. ఆ సొమ్ముతో చేయాలంటే చాలా పనులు ఉన్నాయి. ఇక ఆ సొమ్ము వాపసు రాలేదు. నా మీద అంత నమ్మకంతో వున్న బద్రీని నేను ముంచగలనా? అతనికి తెలిసినవాణ్ణి నేనేగదా? అందువల్ల ఆ సొమ్ము నేనే చెల్లించివేశాను.

ఒక కక్షిదారునికి ఈ విషయం చెప్పాను. అతడు తియ్యగా మందలించి నన్ను జాగ్రత్తపడమని హెచ్చరించాడు. "అన్నా! (దక్షిణ ఆఫ్రికాలో నేను అప్పటికి మహాత్ముణ్ణి కాలేదు."బాపూ" కూడా కాలేదు. కక్షిదారులంతా నన్ను అన్నా అని పిలుస్తూ ఉండేవారు) ఇది మీ పనికాదు. మీమీద గల నమ్మకంతో మేము నడుచుకుంటాం. ఆ సొమ్ము ఇక మీకు రాదు. మీరు బద్రీని నష్టపరచరు. సరే మీరు మునిగినట్లేకదా! ఈ విధంగా పరుల మేలు కోసం కక్షిదారుల సొమ్ము ఇవ్వడం ప్రారంభిస్తే కక్షిదార్లు చచ్చిపోతారు. బిచ్చగాళ్ళు అయి ఇంట్లో కూర్చుంటారు. మీరు చేస్తున్న ప్రజాసేవా కార్యక్రమాలు దెబ్బతింటాయి." అని అన్నాడు.

అదృష్టవశాత్తు ఆ మిత్రుడు ఇంకా జీవించే వున్నాడు. దక్షిణ ఆఫ్రికాలోను, ఇతరత్రాను అతడి కంటే మించిన స్పష్టవాది మరొకడు నాకు తగలలేదు. ఎవరిని గురించి అయినా అనుమానం కలిగితే, వెంటనే ముఖం మీద అడిగి తేల్చుకోవడం, అది అబద్ధమని తేలితే వెంటనే వారిని క్షమాపణ కోరి మనస్సును తేలిక పరుచుకోవడం

అతనికి అలవాటు. అతని మాటలు సబబుగా వున్నాయి. బద్రీసొమ్ము తీర్చివేశాను. కాని మరో వంద పౌండ్లు నేను మునిగి వుంటే తట్టుకోగల శక్తి నాకు లేదు. అప్పు చేయవలసి వచ్చేది. జీవితంలో ఇట్టి పని ఇక ఎన్నడూ నేను చేయలేదు. ఇటువంటి పని నాకు అసలు గిట్టదు. సంస్కరణకు సంబంధించిన పనుల్లో కూడా శక్తికి మించి పాల్గొనడం మంచిది కాదు. అప్పులు ఇవ్వడం, తీసుకోవడం గీత బోధించిన తటస్థ నిష్కామకర్మ విధానానికి విరుద్ధమని, ఆ విధంగా గీతను తృణీకరించినట్లయిందని తెలుసుకున్నాను. మాంసరహిత ఆహార ప్రచారం కోసం ఈ విధమైన బలిదానం అవసరమవుతుందని కలలోనైనా ఊహించలేదు ఇది బలవంతగా లభించిన పుణ్యమని భావించవచ్చు.

# 7. మట్టితో, నీటితో ప్రయోగాలు

నా జీవితంలో నిరాడంబరత పెరిగినకొద్దీ, రోగాలకు మందు పుచ్చుకోవడమంటే అయిష్టత కూడా పెరిగింది. డర్బనులో వకీలుగా పనిచేస్తున్నపుడు డాక్టర్ ప్రాణజీవనదాసు మెహతా నన్ను చూచేందుకు వచ్చేవారు అప్పుడు నాకు నీరసంగా వుండేది. అప్పుడప్పుడు వాపు కూడా వస్తూ ఉండేది. ఆయన చికిత్స చేయగా ఆ నలత తగ్గిపోయింది. ఆ తరువాత భారతదేశానికి తిరిగి వచ్చేవరకు చెప్పుకోదగ్గ జబ్బు చేసినట్లు నాకు గుర్తు లేదు.

జోహన్సుబర్గులో నన్ను విరోచనాలు పట్టుకున్నాయి తలనొప్పి కూడా వుండేది. విరోచనాలకు మందు పుచ్చుకుంటూ ఉండేవాణ్ణి. పత్యంగా వుండేవాణ్ణి. అయినా పూర్తిగా వ్యాధి తగ్గలేదు. విరోచనాలు కట్టుకుంటే బాగుంటుందని మనస్సు సదా కోరుకుంటూ ఉండేది.

ఇదే సమయాన నేను మాంచెస్టరు పత్రికలో "నో బ్రేక్‌ఫాస్టు అసోసియేషన్ (టిఫెన్ల త్యాగ సంఘం) స్థాపనకు సంబంధించిన వార్త చదివాను. ఆ వార్తా రచయిత ఇంగ్లీషు వాళ్ళు చాలాసార్లు చాలా ఆహారం భుజిస్తారనీ, రాత్రి పన్నెండు గంటలదాకా తింటూనే వుంటారనీ, తత్ఫలితంగా డాక్టర్ల చుట్టూ తిరుగుతూ వుంటారనీ, ఈ బాధ తొలగాలంటే ఉదయం తీసుకునే టిఫెను (బ్రేక్‌ఫాస్టు) మానివేయాలని వ్రాశాడు. ఈ ఆరోపణ పూర్తిగా కాకపోయినా కొంతవరకు నాకూ వర్తిస్తుందని భావించాను. నేను మూడు పర్యాయాలు కడుపు నిండా తినేవాణ్ణి. మధ్యాహ్నం పూట టీ కూడా త్రాగేవాణ్ణి. శాకాహారం, మసాలాలు లేని ఆహార పదార్థాలు భుజించేవాణ్ణి. ఆరు లేక ఏడు

గంటలకు ముందు లేచేవాణ్ణి కాదు. నేను కూడా ఉదయం టిఫెను మానేస్తే మంచిదనీ, తలనొప్పి తగ్గవచ్చుననీ నిర్ణయానికి వచ్చాను. ఉదయం టిఫెను మానివేశాను. కొద్దిరోజులు బాధ కలిగింది. కాని తత్ఫలితంగా తలనొప్పి తగ్గిపోయింది. దానితో నేను అవసరమైన దానికంటే ఎక్కువగా తింటున్నానని తేలిపోయింది.

విరోచనాలు తగ్గలేదు. కూనే తెలిపిన ప్రకారం కటిస్నానం మొదలుపెట్టాను బాధ కొద్దిగా తగ్గింది. కాని పూర్తిగా తగ్గలేదు. ఈ లోపున ఆ జర్మనీ హోటలువాడో మరో మిత్రుడో, జుస్ట్ ఁచించిన "రిటర్న్ టు నేచర్ (ప్రకృతి వైపు మరలుము) అను పుస్తకం నా చేతికి ఇచ్చారు. అందు మట్టి చికిత్సను గురించిన వివరం చదివాను. ఎండుద్రాక్ష వగైరా పండ్లు ఆకుపచ్చని పండ్లు మనిషికి ప్రాకృతిక ఆహారమని కూడా వ్రాసి ఉన్నది పండ్లను గురించిన ప్రయోగం అప్పుడు నేను చేయలేదు కాని మట్టి చికిత్స వెంటనే ప్రారంభించాను ప్రయోజనం కలిగింది. పరిశుభ్రమైన, పొలంలో దొరికే ఎర్రని లేక నల్లని మట్టి తెచ్చి అందు సరిపోయేలా నీళ్ళుపోసి కలిపి, పల్చటి తడి బట్టమీద దాన్నివేసి చుట్టి పొట్టమీద ఉంచాను. దాని మీద పట్టీ కట్టాను. ఆ విధంగా మట్టిపట్టి రాత్రి నిద్రపోయే ముందు కట్టి, ప్రొద్దునగాని లేక రాత్రి మెలకువ వచ్చినప్పుడు గాని విప్పదీసేవాణ్ణి. దానివల్ల విరోచనాలు కట్టుకున్నాయి. ఈ విధమైన మట్టి చికిత్స నా అనుచరులకు కూడ చాలాసార్లు చేశాను. అది ఎంతో ప్రయోజనం చేకూర్చిందని నాకు ఇప్పటికీ జ్ఞాపకం

భారతదేశం వచ్చాక ఇలాంటి చికిత్సలను గురించిన ఆత్మ విశ్వాసం తగ్గిపోయింది. ప్రయోగాలు చేసేందుకు ఒకచోట కూర్చునేందుకు సమయమే దొరకలేదు. అయితే ఇట్టి చికిత్స యెడ నాకు గల శ్రద్ధాసక్తులు ఇప్పటికీ నిలిచే ఉన్నాయి. సమయాన్ని బట్టి అప్పుడప్పుడు మట్టి చికిత్స నేను చేసుకోవడమేగాక నా అనుచరులకు కూడా చేస్తున్నాను. రెండు పర్యాయాలు నేను బాగా జబ్బు పడ్డాను. అయినా మందులు పుచ్చుకోవలసిన అవసరం లేదనే భావించాను. పత్యం, నీరు, మట్టి మొదలుగాగల చికిత్సతో వెయ్యికి తొమ్మిది వందల తొంభై తొమ్మిది జబ్బులు నయం చేయవచ్చునని నా విశ్వాసం.

క్షణక్షణం డాక్టర్ల దగ్గరికీ, వైద్యుల దగ్గరికీ, హకీములదగ్గరికీ పరుగెత్తుతూ, ఉదరంలో రకరకాల బెరుళ్ళు, ఆకులు మొదలగువాటి రసాయనం పోసి పోసి మనిషి తన జీవితాన్ని తానే కుంచించుకుంటూ ఉన్నాడు. అంతేగాక మనస్సుమీద అతనికి గల పట్టు తప్పుతున్నది. దానితో అతడు మానవత్వం పోగొట్టుకుంటున్నాడు. శరీరానికి బానిస అయిపోతున్నాడు.

రోగ శయ్యమీద పడుకొని నేను వ్రాస్తున్నాను. అందువలన నా భావాల్ని తేలికగా తీసుకొని త్రోసివేయవద్దు. నా జబ్బుకు కారణం ఏమిటో నాకు తెలుసు. నా దోషాల వల్లనే నేను జబ్బుపడ్డాను. కనుకనే నేను అధైర్యపడలేదు. ఈ జబ్బు భగవంతుని అనుగ్రహంవల్ల వచ్చిందని భావిస్తున్నాను. మందులు వాడాలనే కోరికకు దూరంగా ఉన్నాను. పట్టుదలతో డాక్టర్లను ఇబ్బంది పెడుతూ ఉన్నాను. అయినా వాళ్ళు ఉదార స్వభావంతో నా మొండిపట్టును చూచి నన్ను వదిలివేయరు నా ఈనాటి స్థితిని గురించి ఇక వ్రాయను. మనం 1904 పూర్వం నుండి 05కి వద్దాం.

ముందుకు సాగే పాఠకుల్ని ఒక్క విషయమై హెచ్చరించడం అవసరమని భావిస్తున్నాను. నా వర్ణన చదివి జుస్టు పుస్తకం తెప్పించి ఆయన వ్రాసినదంతా వేద వాక్యమని భావించకుందురుగాక ప్రతి రచనయందు సామాన్యంగా రచయిత భావం ఒక్కటే చోటుచేసుకుంటూ ఉంటుంది. కాని ప్రతి విషయాన్ని పలు రకాలుగా పరిశీలించవచ్చు. ఆయా దృక్పధాల ప్రకారం అది సరిగానే ఉంటుంది. అయితే అన్ని దృక్పధాలు, అన్ని విషయాలు ఒకే సమయాన సత్యాలు కానేరవు. ఇంతేగాక చాలా పుస్తకాలు అమ్మకం కావాలనే భావంతోను, పేరు రావాలనే తాపత్రయంతోను వ్రాయబడుతూ ఉంటాయి. అందువల్ల ఆ పుస్తకం చదవదలచిన సోదరులు జాగ్రత్తగా చదవమనీ, ప్రయోగాలు చేయతలుచుకుంటే అనుభవజ్ఞుల సలహా సహకారాలు పొందమనీ ఎంతో ఓర్పుతో, ధైర్యంతో ఇట్టి ప్రయోగాలకు పూనుకోమనీ మనవి చేస్తున్నాను.

## 8. ఒక జాగరూకత

నా వివిధ ప్రయోగాల గాధను గురించి చెప్పడం తరువాతి ప్రకరణం వరకు ఆపుతాను గత ప్రకరణంలో మట్టి చికిత్సను గురించి వ్రాసిన విధంగానే ఆహారం విషయంలో కూడా పలు ప్రయోగాలు చేశాను. అందువల్ల అందుకు సంబంధించిన వివరాలు ఇక్కడ చెప్పివేయడం అవసరమని భావిస్తున్నాను. ఆహారం విషయంలో నేను చేసిన ప్రయోగాలను గురించి, అందుకు సంబంధించిన యోచనలను గురించి పూర్తిగా ఈ ప్రకరణంలో వివరించడం సాధ్యం కాదు. ఆ విషయాలు "దక్షిణాఫ్రికాలో ఇండియన్ ఒపీనియన్ పత్రిక కోసం నేను వ్రాసిన వ్యాసాలు తరువాత పుస్తక రూపంలో ప్రకటించబడ్డాయి. నేను వ్రాసిన చిన్నచిన్న పుస్తకాలలో ఈ పుస్తకం పాశ్చాత్యదేశాల్లోను, మనదేశంలోను బాగా ప్రసిద్ధికెక్కింది. అందుకు కారణం ఏమిటో

ఈనాటివరకు నేను తెలుసుకోలేకపోయాను. ఆ పుస్తకం ఇండియన్ ఒపీనియన్ పత్రిక కోసం వ్రాయబడింది. అయితే దాన్ని ఆధారంగా తీసుకుని చాలామంది సోదర సోదరీమణులు తమ జీవనంలో ఎన్నో మార్పులు చేసుకున్నారు. నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరిపారు.

అందువల్ల ఆ విషయాన్ని గురించి ఇక్కడ కొద్దిగా వ్రాయవలసిన అవసరం ఏర్పడింది. ఆ పుస్తకంలో వ్రాసిన నా భావాలలో మార్పు చేయవలసిన అవసరం ఏమీ కలుగకపోయినా, నేను జీవితంలో చేసిన అత్యవసరమైన కొన్ని మార్పుల్ని గురించి ఆ పుస్తకం చదివిన పాఠకులకు తెలియదు. వారు ఆ వివరం తెలుసుకోవడం చాలా అవసరం.

మిగతా పుస్తకాలవలెనే నేను ఈ పుస్తకం కూడా కేవలం ధార్మిక భావంతో వ్రాశాను. ఇప్పటికీ నేను చేసే ప్రతి పనిలో ఆ భావమే నిండి ఉంటుంది. అందువల్ల అందలి అనేక విషయాల్ని నేను అమలు చేయలేకపోయాను. ఇది నాకు విచారం, సిగ్గు కలిగించే విషయం.

బాల్యంలో బిడ్డ తల్లి పాలు త్రాగుతాడు. ఆ తరువాత మరో పాలు త్రాగవలసిన అవసరం లేదని నా అభిప్రాయం. పండిన వన్య ఫలాలతో బాటు ఆకుపచ్చని పండ్లు, ఎండు ఫలాలు మనిషికి మంచి ఆహారం. వాటికి మించినది మరొకటి లేదు బాదంపప్పు, ద్రాక్ష మొదలుగాగలపండ్ల వల్ల మనిషి శరీరానికి, మెదడుకు అవసరమైన పోషణ లభిస్తుంది. ఇట్టి ఆహారం మీద ఆధారపడి వుండగల వారు బ్రహ్మచర్యం మొదలగు ఆత్మ సంయమగుణాల్ని అలవరచుకోవచ్చు. తిండిని బట్టి త్రేపులు ఉంటాయి. తినే తిండిని బట్టి మనిషి తయారవుతాడు. అను సామెత యందు సత్యం ఇమిడి ఉంది. నేను, నా అనుచరులు అట్టి అనుభవం పొందాం.

ఈ భావాలను సమర్థిస్తూ విస్తారంగా నా ఆ పుస్తకంలో వ్రాయడం జరిగింది. కాని హిందూదేశంలో నా ప్రయోగాలు పూర్తి సాఫల్యం పొందే అదృష్టం నాకు కలగలేదు. ఖేడా జిల్లాలో సైనికుల్ని భర్తీ చేసుకుంటూ నా పొరపాటు వల్ల మృత్యుశయ్య మీదకు చేరాను. పాలు లేకుండా జీవించాలని ఎంతో ప్రయాసపడ్డాను. తెలిసిన వైద్యుల, డాక్టర్ల, రసాయన శాస్త్రజ్ఞుల సహాయం కోరాను. పెసరనీళ్ళు తీసుకోమని ఒకరు, విప్పనూనె తీసుకోమని ఒకరు, బాదంపాలు తీసుకోమని ఒకరు సలహా ఇచ్చారు. వాటినన్నింటి ప్రయోగాలు చేసి చేసి నా శరీరాన్ని పిండివేశాను. తత్ఫలితంగా

పక్క మీద నుండి లేవలేని స్థితికి చేరుకున్నాను. చరకుని శ్లోకాలు వినిపించి వైద్యులు కొందరు రోగం నయం కావడానికి ఖాద్యాఖాద్యములను గురించి బాధపడవద్దని మాంసాదులు కూడా తినవచ్చునని చెప్పారు. ఈ వైద్యులు పాలు త్రాగకుండా గట్టిగా వుండమని చెప్పలేరని తేలిపోయింది. బీఫ్ టీ (గోమాంసపు టీ), బ్రాంది పుచ్చుకోవచ్చునని చెప్పేవారున్న చోట పాలు త్రాగడం మానమని చెప్పేవారు ఎలా దొరుకుతారు? ఆవుపాలు, గేదెపాలు నేను త్రాగను. అది నా వ్రతం నా వ్రత ఉద్దేశ్యం పాలు మానడమే. అయితే అట్టి వ్రతం గైకొన్నప్పుడు నా దృష్టిలో వున్నది గోమాత, గేదెమాత మాత్రమే. నేను వ్రతం అనే పదాన్ని పాటించాను. మేకపాలు తీసుకొనేందుకు అంగీకరించాను. మేకమాత పాలు త్రాగుతున్నప్పుడు వ్రతాత్మకు విఘాతం కలిగిందని నాకు అనిపించింది.

అయితే నేను రౌలట్ ఆక్టును ఎదుర్కోవాలి! ఆ మోహం నన్ను వదలలేదు. అందువల్ల జీవించి వుండాలనే కాంక్ష కలిగింది. జీవితంలో మహత్తర ప్రయోగమని దేన్ని భావిస్తూ వున్నానో అది ఆగిపోయింది.

ఆహారంతో జలంతో ఆత్మకు సంబంధం లేదు. ఆత్మ తినదు, తాగదు. ఉదరంలోకి పోయే పదార్థాలతో దానికి సంబంధం లేదు. లోనుండి వెలువడే మాటలే లాభనష్టాలు కలిగిస్తాయని నాకు తెలుసు. అందు నిజం కూడా కొంత వున్నది. తర్కం జోలికి పోకుండా ఇక్కడ నా దృఢ నిశ్చయం ప్రకటిస్తున్నాను భగవంతునికి వెరచి నడుచుకోవాలని, భగవంతుణ్ణి ప్రత్యక్షం చేసుకోవాలని భావించే సాధకునకు మరియు ముముక్షువునకు ఆహారపదార్థాల ఎన్నికను గురించి, వాటిని త్యజించడాన్ని గురించి శ్రద్ధ చాలా అవసరం. భావాన్ని, వాక్కును ఎన్నుకోవడం ఎంత అవసరమో నిర్ణయం యెడ శ్రద్ధ వహించడం అంత అవసరం అన్నమాట.

అయితే స్వయంగా నేను చేయని దాన్ని ఆచరించమని ఎవ్వరికీ సలహా ఇవ్వను. అలా ఎవరైనా చేయదలుచుకుంటే వారిని వారిస్తాను. అందువల్ల ఆరోగ్యవిషయమై నేను వ్రాసిన పుస్తకం సాయంతో ప్రయోగాలు చేయదలచిన చాలామందిని హెచ్చరిస్తున్నాను. పాలు మానడం పూర్తిగా లాభకారి. అయితే, అనుభవజ్ఞులగు వైద్యులు డాక్టర్లు పాలుమానమని సలహాయిస్తేనే పాలుమానడం మంచిది. నా పుస్తకాన్ని ఆధారం చేసుకొని మాత్రం పాలు మానవద్దు. నాకు ఇప్పటివరకు కలిగిన అనుభవం వల్ల నేను ఒక నిర్ణయానికి వచ్చాను. జీర్ణశక్తి మందగించిన వారికీ, జబ్బుతో పక్కమీద నుండి లేవలేనివారికి, పాలకంటే మించిన

తేలిక అయిన పోషక పదార్థం మరొకటి లేదు. అందువల్ల పుస్తకంలో పాలను గురించి నేను వ్రాసిన మార్గాన నడుస్తామని పట్టుపట్టవద్దని పాఠకులకు మనవి చేస్తున్నాను.

ఈ ప్రకరణం చదివిన వైద్యులు, డాక్టర్లు, హకీములు, అనుభవజ్ఞులు తదితరులెవరైనా సరే పాలకు బదులుగా పోషక పదార్థం మరియు తేలికగా జీర్ణం కాగలిగిన వనస్పతి ఏదైనా ఉంటే చదివిన పుస్తకాల ఆధారంతోగాక, ఆచరించి పొందిన అనుభవంతో ఆ వివరం తెలిపి నన్ను ధన్యుణ్ణి చేయమని ప్రార్థిస్తున్నాను.

## 9. బలవంతులతో పోరు

ఇక ఆసియా విభాగపు అధికారుల వైపు మళ్ళుదాం ఆ ఆసియా విభాగపు బహుదొడ్డ కార్యాలయం జోహన్సుబర్గులో వుంది. అక్కడ హిందూ దేశస్థులతో బాటు, చైనీయులు మొదలుగాగల వారి రక్షణకు బదులు భక్షణ జరుగుతున్నది. నా దగ్గరికి రోజూ అందుకు సంబంధించి పితూరీలు వస్తూ ఉండేవి. అధికారుల దయవల్ల నిజమైన హక్కుదారులు దక్షిణ ఆఫ్రికా రాలేకపోతున్నారు. కాని హక్కులేని వాళ్ళు వంద వంద పౌండ్లు లంచం ఇచ్చి వస్తున్నారనీ, ఇందుకు తగిన చికిత్స మీరు చేయకపోతే ఇక చేసేదెవరు? అని నా దగ్గర ఒకటే గొడవ అది నిజమని నాకు అనిపించింది. ఈ దుర్గంధాన్ని పూర్తిగా తొలగించివేయకపోతే ట్రాన్సువాలులో నా నివాసం వ్యర్థం అన్నమాట.

ప్రమాణాలు సేకరించడం ప్రారంభించాను. నా దగ్గర చాలా గట్టి ప్రమాణాలు చేరిన తరువాత నేను తిన్నగా పోలీసు కమీషనరు దగ్గరికి వెళ్ళాను అతడు దయాగుణం, న్యాయప్రవృత్తి కలవాడని నాకు అనిపించింది. నా మాటలు అసలు విననని భీష్మించకుండా, ఓపికతో నా మాటలు ఆయన విన్నాడు. ప్రమాణాలు చూపించమని అన్నాడు. సాక్షుల సాక్ష్యాలు ఆయన స్వయంగా సేకరించాడు. అతనికి నమ్మకం కలిగింది. అయితే నాకు తెలిసినట్లుగానే దక్షిణ ఆఫ్రికాలో తెల్ల న్యాయనిర్ణేతల ఎదుట తెల్ల దోషులకు శిక్ష పడేలా చూడటం కష్టమని ఆయనకూ తెలుసు. "అయినా ప్రయత్నిద్దాం. అసలు న్యాయనిర్ణేతలు ఇట్టి దోషుల్ని వదిలివేస్తారని భావించి ఆ భయంతో వాళ్ళను పట్టించుకోకపోవడం కూడా సరికాదు. అందువల్ల నేను వాళ్ళను పట్టిస్తాను. అందుకు అవసరమైన శ్రమపడతానని మీరు నమ్మవచ్చు" అని ఆయన అన్నాడు.

నాకు వారి మాట మీద విశ్వాసం కలిగింది. అనేకమంది అధికారుల మీద కూడా ఆరోపణలు వున్నాయి. కాని వాటికి గట్టి ప్రమాణాలు లేవు. ఇద్దరు అధికారులు గట్టి ప్రమాణాలతో దొరికారు వాళ్ళపేరిట వారంట్లు వెళ్ళాయి

నా రాకపోకలు గోప్యంగా వుంచడం సాధ్యం కాని పని నేను ప్రతిరోజూ పోలీసు కమీషనరు దగ్గరకు వచ్చి వెళ్ళడం చాలామంది చూస్తూనే ఉన్నారు. ఆ ఇద్దరు ఆఫీసర్లకు గూఢచారులు వున్నారు వాళ్ళు నామీద కన్ను వేసి వుంచారు. నా రాకపోకలను గురించిన వివరాలు కొందరు ఆ ఆఫీసర్ల దగ్గరికి చేరవేయడం ప్రారంభించారు. అయితే ఆ ఆఫీసర్లిద్దరూ కడు క్రూరులు అందువల్ల వాళ్ళకు గూఢచారులు ఎక్కువమంది లభించలేదు. హిందూ దేశస్థులు, చైనా వాళ్ళు నాకు సహకరించి ఉండకపోతే వాళ్ళు దొరికియుండేవాళ్ళు కాదు.

వారిద్దరిలో ఒకడు పారిపోయాడు. పోలీసు కమీషనరు బైటినుండి వారంటు జారీ చేసి అతణ్ణి నిర్బంధించి తిరిగి రప్పించాడు. కేసు నడిచింది ప్రమాణాలు బలవత్తరంగా వున్నాయి. అధికారి పారిపోయిన విషయం కూడా జ్యూరీకి తెలిసింది. అయినా ఇద్దరూ విడుదల అయ్యారు.

నేను బాగా నిరాశపడ్డాను. పోలీసు కమీషనరుకు కూడా దుఃఖం కలిగింది. వకీలు వృత్తి యెడ నాకు ఏవగింపు కలిగింది దోషాల్ని కప్పిపుచ్చడానికి బుద్ధి ఉపయోడపడుతుండటం చూచి అట్టి బుద్ధి మీదనే నాకు విరక్తి కలుగసాగింది.

శిక్షపడలేదు గాని ఇద్దరు అధికారులకు చాలా చెడ్డపేరు వచ్చింది. ఇక వాళ్ళను ప్రభుత్వం భరించలేకపోయింది. ఇద్దరూ డిస్మిస్ అయ్యారు. ఆసియా విభాగం కొంచెం శుభ్రపడింది. హిందూ దేశస్థులకు ధైర్యం చేకూరింది.

నా ప్రతిష్ఠ కూడా పెరిగింది. నా వృత్తి కూడా వృద్ధికి వచ్చింది ప్రతినెల లంచాల క్రింద పోతున్న హిందూ దేశస్థుల వందలాది పౌండ్ల సొమ్ము మిగిలింది. అయితే సొమ్మంతా మిగిలిందని చెప్పలేను. కొంతమంది లంచగొండులు లంచాలు తింటూనే ఉన్నారు. అయితే నిజాయితీపరులు మాత్రం తమ నిజాయితీని నిలబెట్టుకోగల పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఆ అధికారులు అధములు. అయినప్పటికీ వారియెడల నా మనస్సులో ద్వేషం అనేది లేదు. ఈ విషయం వాళ్ళకు కూడా తెలుసు తరువాత వాళ్ళు దయనీయ స్థితిలో పడిపోగా నేను వాళ్ళకు ఎంతగానో సహాయం చేశాను. నేను అడ్డు చెప్పియుంటే జోహన్సుబర్గు మునిసిపాలిటీలో వాళ్ళకు ఉద్యోగం లభించియుండేది కాదు వాళ్ళ

మిత్రుడొకడు నా దగ్గరకు వచ్చి మాట్లాడగా వారికి ఉద్యోగం ఇప్పించేందుకు సహాయం చేస్తానని మాట ఇచ్చాను. వాళ్ళకు ఉద్యోగం దొరికింది కూడా. అప్పటినుండి ఇంగ్లీషు వాళ్ళకు కూడా నా మీద విశ్వాసం ఏర్పడి నేనంటే భయపడటం మానివేశారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తీవ్రమైన పదజాలం వాడవలసి వచ్చేది. అయినా వాళ్ళంతా నాతో మధుర సంబంధం కలిగి ఉండేవారు. అట్టి స్వభావం, అట్టి ఆచరణ నాకు బాగా అలవాటు అయ్యాయి. అయితే అప్పటికి ఈ విషయం నేను గ్రహించలేదు. తరువాత అర్థం చేసుకున్నాను.

## 10. ఒక పావన స్మృతి - ప్రాయశ్చిత్తం

నా జీవితంలో ఎన్నో ఘట్టాలు జరిగాయి. వాటివల్ల అనేక మతాల వారితోను, జాతుల వారితోను నాకు గాఢ పరిచయం ఏర్పడింది. వీటన్నిటివల్ల కలిగిన అనుభవాల వల్ల స్వ-పరభేదాలు, దేశీయులు, విదేశీయులు, తెల్లవారు-నల్లవారు, హిందువులు-ముస్లిములు, క్రైస్తవులు-పారశీకులు, యూదులు మొదలుగా గల వారి మధ్య వుండే భేదాలను అధిగమించగలిగాను. నా హృదయం అట్టి భేదాలను గుర్తించలేదని చెప్పగలను. నా విషయంలో ఇది గొప్ప సుగుణమేమీ కాదని నేను భావిస్తున్నాను. అహింస, బ్రహ్మచర్యం, అపరిగ్రహం మొదలుగాగల గుణాలను అలవరచుకొని, వాటి ఆధారంతో ఇప్పటివరకు నడుస్తున్నట్లే మతాల, జాతుల, రంగుల భేదాన్ని అలవరచుకోవడం కూడా సహజంగానే జరిగిందని నా భావన. డర్బనులో వకీలుగా పనిచేస్తున్నప్పుడు నా దగ్గర పనిచేసే గుమాస్తాలు నాతోబాటే వుండేవారు. వారిలో హిందువులు, క్రైస్తవులు వున్నారు. ప్రాంతాలవారీగా గుజరాతీలు, మద్రాసీలు వున్నారు. వారి విషయంలో నా మనస్సులో ఎన్నడూ వేరు భావం కలిగినట్లు గుర్తులేదు. వాళ్ళందరినీ నా కుటుంబీకులుగానే భావించేవాణ్ణి. నా భార్య ఎప్పుడైనా ఈ విషయం ఎత్తితే ఆమెతో తగాదాకు దిగేవాణ్ణి. ఒక గుమాస్తా క్రైస్తవుడు. అతని తల్లిదండ్రులు పంచమకులంవారు. నా గృహవ్యవస్థ పాశ్చాత్య విధానంతో కూడినది. అతని గదిలో పాయిఖానా లేదు. నా అభిప్రాయ ప్రకారం వుండకూడదు. అందువల్ల పాయిఖానాకు బదులు ప్రతిగదిలోను మూత్రం పోసుకునేందుకు ప్రత్యేక పాత్రలు వుంచాము. ఆ పాత్రలను తీసి బాగుచేసే కార్యక్రమం నౌకర్లది కాదు. ఇంటి యజమానిది, యజమానురాలిది. తాను కూడా మా కుటుంబంలో ఒకడినని భావించుకున్నవాడు తన పాత్రలు తానే కడిగి బాగుచేసుకునేవాడు..పంచమకులానికి చెందిన ఈ గుమాస్తా

క్రొత్తవాడు. అతని పాత్ర మేమే తీసి బాగు చేయాలి. పాత్రలు కస్తూరిబాయి తీస్తూ ఉండేది. కాని అతని విషయం ఆమెకు మిక్కుటమైపోయింది. మా ఇద్దరికి జగడం జరిగింది. తాను ఎత్తదు. నేను ఎత్తుదామంటే అందుకు ఆమె ఇష్టపడదు. ఆమె కండ్ల నుండి కన్నీటి బిందువులు ముత్యాల్లా కారసాగాయి. చేతులో పాత్ర పట్టుకొని నావంక చురచుర చూస్తూ తిరస్కార భావం వ్యక్తం చేస్తూ మెట్లమీద నుండి గబగబ క్రిందకు దిగుతున్న కస్తూరిబాయి బొమ్మని చిత్రకారుడనైతే ఈనాడు కూడా చిత్రించియుండేవాణ్ణి.

కాని నేను ఎంతగా ప్రేమించేవాడినో అంతగా ప్రాణాలు తీసే భర్తను కూడా. ఆమెకు నేను శిక్షకుణ్ణని భావించేవాణ్ణి. అందువల్ల అంధప్రేమకులోనై ఆమెను బా.గా సతాయిస్తూ ఉండేవాణ్ణి.

ఈ విధంగా ఆమె కోపంతో పాత్ర తీసుకొని వెళ్ళడానికి నేను ఇష్టపడలేదు. ఆమె పకపక నవ్వుతూ మూత్రపు పాత్ర తీసుకువెళ్ళాలి. అప్పుడే మనకు తృప్తి అన్నమాట. కంఠం పెద్దది చేసి "ఈ కలహం నా ఇంట్లో నడవదు" అని అరిచాను.

నా మాటలు కస్తూరిబాయి గుండెల్లో గునపాల్లా గుచ్చుకున్నాయి. ఆమె రెచ్చిపోయి "అయితే నీ ఇల్లు నీ దగ్గరే ఉంచుకో నేను వెళ్లిపోతున్నా" అని అన్నది. అప్పుడు దేవుణ్ణి మరిచిపోయాను. దయ అనేది నా హృదయంలో కొంచెం కూడా మిగలలేదు. నేను ఆమె చెయ్యి పట్టుకున్నాను. మెట్ల ఎదురుగా బయటికి వెళ్ళడానికి ద్వారం ఉన్నది. నేను ఆ నిస్సహాయురాలగు అబలను పట్టుకొని ద్వారం దాకా లాక్కెళ్ళాను. ద్వారం సగం తెరిచాను. కస్తూరిబాయి కండ్లనుండి గంగా, యమునలు ప్రవహిస్తున్నాయి. ఆమె ఇలా అన్నది "నీకు సిగ్గులేదు కాని నాకున్నది. కొంచెమైనా సిగ్గుపడు. నేను బయటికి ఎక్కడికి వెళ్ళను? ఇక్కడ మా అమ్మ నాన్నలు లేరు. వుంటేవాళ్ళ దగ్గరికి వెళ్ళేదాన్ని. ఆడదాన్ని, అందువల్ల నీ దౌర్జన్యం సహించక తప్పదు. ఇకనైనా సిగ్గుతెచ్చుకో. ద్వారం మూసివేయి. ఎవరైనా చూస్తే ఇద్దరి ముఖాలకు మచ్చ అంటుకుంటుంది.'ఆమె మాటలు విని పైకి ధుమ ధుమలాడుతూ వున్నాను. కాని లోలోన సిగ్గుపడిపోయాను. తలుపులు మూసివేశాను. భార్య నన్ను వదలలేనప్పుడు నేను మాత్రం ఆమెను వదిలి ఎక్కడికి వెళ్ళగలను? మా ఇద్దరికి చాలాసార్లు తగాదా జరిగింది. కాని ఫలితం చివరికి మంచిగానే ఉండేది. భార్య తన అత్యద్భుత సహనశక్తితో విజయం సాధించిందన్నమాట.

ఈ విషయం ఈనాడు తటస్థ భావంతో వర్ణించగలను. కారణం ఇది మా గడిచిన యుగపు జీవితానికి సంబంధించిన గాథ. ఇప్పుడు నేను మోహాంధుడనగు

భర్తను కాను. శిక్షకుణ్ణీ కాను. ఇప్పుడు కస్తూరిబాయి తలుచుకుంటే నన్ను బెదిరించగలదు. ఇప్పుడు మేము అనుభవం గడించిన మిత్రులం. నిర్వికార భావంతో కలిసి వుంటున్నాం. యీనాడు ఆమె నేను జబ్బు పడితే ప్రయోజనం పొందాలనే కోరిక లేకుండ చాకిరీ చేసే సేవిక అన్నమాట.

పైన తెలిపిన ఘట్టం 1898 నాటిది. అప్పుడు బ్రహ్మచర్యాన్ని గురించి నాకేమీ తెలియదు. ఆరోజులెలాంటివో తెలుసా? భార్య అంటే కేవలం సహధర్మిణి, సహచారిణి, సుఖదుఃఖాలలో సహభాగిని అను విషయం నాకు తెలియని రోజులవి. విషయవాంఛల తృప్తికి భార్య సాధనమని, భర్త ఆజ్ఞను నోరు మెదపకుండ శిరసావహించునట్టి స్త్రీయే భార్య అని నేను భర్తగా భావించిన రోజులవి.

1900 నుండి నా యోచనా సరళిలో అపరిమితమైన మార్పు వచ్చింది. 1906 లో ఫలితం కనబడింది. ఈ వివరం మరో సందర్భంలో మనవి చేస్తాను. ఇక్కడ ఒక్క విషయం మాత్రం పేర్కొంటున్నాను. నేను నిర్వకారుణ్ణి అయిన కొద్దీ నాగార్హ్యస్థ్య జీవితంలో సుఖ శాంతులు నిర్మలత్వం నెలకొన్నాయి.

ఈ పావన స్మృతిని గురించి చదువుతూ ఉన్నప్పుడు మేము ఆదర్శ దంపతులమని, నా ధర్మపత్ని యందు దోషాలేమీ లేవని లేక మా ఆదర్శాలు సమానంగా వున్నాయని భావించకుందురుగాక. కస్తూరిబాయికి ఆదర్శమంటూ ఒకటుందని పాపం ఆమెకే తెలిసియుండదు. నా ఆచరణలన్నీ ఈనాడు కూడా ఆమెకు రుచిస్తాయని అనుకోను. ఈ విషయమై మేము ఎన్నడూ చర్చించలేదు. చర్చించినా ప్రయోజనం వుండదు. ఆమెకు తల్లిదండ్రులు చదువు చెప్పించలేదు. నా దగ్గరకు వచ్చిన తరువాత సరియైన సమయంలో నేను చదువు నేర్పలేదు. ఇతర హిందూ స్త్రీలవలెనే ఆమెలో కూడా ఒక ప్రత్యేక గుణం ఉంది. ఇష్టం వున్నా లేకపోయినా, జ్ఞానంవల్ల గానీ, అజ్ఞానంవల్లగానీ నా వెంట నడచి నన్ను అనుసరించడమే తన జీవితానికి సార్థకత అని విశ్వసించింది. స్వచ్ఛజీవితం గడపవలెనని భావించి నా మార్గానికి ఎన్నడూ అడ్డు తగలలేదు. మా ఇద్దరి బౌద్ధిక శక్తులు వేరువేరుగా వున్నా మా జీవితం సంతోషంగా సుఖంగా ఊర్ధ్వపథాన ముందుకు సాగిందని చెప్పగలను.

## 11. ఇంగ్లీషు వారితో గాఢ పరిచయం

ఈ ప్రకరణం వ్రాస్తున్నప్పుడు "సత్యశోధన" అను నా ఈ గ్రంథ రచనకు గల కారణాలను, సందర్భాలను పాఠకులకు తెలియజేయడం అవసరమని భావిస్తున్నాను.

ఈ కథ వ్రాసే సమయంలో నా దగ్గర ప్లాను అంటూ ఏమీ లేదు. ఎదురుగా పుస్తకాలు గాని, డైరీలు గాని, ఇతర పత్రాలు గాని పెట్టుకొని నేను ఈ ప్రకరణాలు వ్రాయలేదు. అంతరంగం చూపిన మార్గంలో వ్రాస్తున్నానని చెప్పగలను. నాలో సాగుతున్న క్రియను, అంతర్యామి యొక్క క్రియ అని అనవచ్చునో లేదో నిశ్చయంగా చెప్పలేను. కాని ఒక విషయం మాత్రం నిజం. ఎన్నో సంవత్సరాలనుండి నేను చేస్తున్న అతిపెద్ద పనిని అతి చిన్న పనిని పరిగణింపతగిన కార్యాలనన్నింటిని జాగ్రత్తగా పరిశీలించిన పిమ్మట అవన్నీ అంతర్యామి ప్రేరణవల్లనే జరిగాయని చెప్పగలను.

అంతర్యామిని నేను చూడలేదు. తెలుసుకోలేదు. ప్రపంచమంతటికీ భగవంతుని యెడ గల శ్రద్ధనే నేను కూడా శ్రద్ధగా మలుచుకున్నాను. ఆ శ్రద్ధ తొలగించుటకు వీలులేనిది. అందువల్ల శ్రద్ధగా దాన్ని గుర్తించడం మానుకొని దానిని అనుభవ రూపంలో గుర్తిస్తున్నాను. అయినా ఈ విధంగా అనుభవరూపంలో దాన్ని పరిచయం చేయడం కూడా సత్యం మీద పడుతున్న దెబ్బ అనే గ్రహించాలి. అసలు శుద్ధ రూపంలో దాన్ని పరిచయం చేయగల శబ్దాలు నా దగ్గర లేవని చెప్పడమే మంచిదని భావిస్తున్నాను.

కంటికి కనబడని అంతర్యామికి వశవర్తినై నేను ఈ కథ వ్రాస్తున్నానని నా విశ్వాసం. వెనుకటి ప్రకరణం ప్రారంభించినప్పుడు 'ఇంగ్లీషు వారితో పరిచయం' అని శీర్షిక పెట్టాను. కాని ప్రకరణం వ్రాస్తున్నప్పుడు ఈ పరిచయాల్ని వివరించే ముందు "పావనస్మృతి" ని గురించి వ్రాయాలని అనుకొని ఆ ప్రకరణం వ్రాశాను. దాన్ని వ్రాసిన తరువాత మొదటి శీర్షికను మార్చవలసి వచ్చింది.

ఇప్పుడు ఈ ప్రకరణం వ్రాస్తున్నప్పుడు మరో ధర్మసంకటం వచ్చిపడింది. ఇంగ్లీషు వారిని పరిచయం చేస్తున్నప్పుడు ఏమి చెప్పాలి, ఏమి చెప్పకూడదు. అను మహత్తరమైన ప్రశ్న ఉదయించింది. విషయం చెప్పకపోయినా సత్యానికి దెబ్బతగులుతుంది. అసలు ఈ కథ వ్రాయవలసిన అవసరమే లేదేమో. ఇట్టి స్థితిలో అప్రస్తుతమైన వివాదాన్ని పరిష్కరించేందుకు పూనుకోవడం కష్టం గదా!

చరిత్ర రూపంలో ఆత్మకథ అపూర్ణం. అందుకు సంబంధించిన ఇబ్బందుల్ని ఇప్పుడు నేను బాగా అర్థం చేసుకోగలుగుతున్నాను. 'సత్యశోధన' యను ఈ ఆత్మకథలో నాకు జ్ఞాపకం వున్న విషయాలన్నింటిని వ్రాయడం లేదని నాకు తెలుసు. సత్యాన్ని దర్శింప చేయుటకు నేను ఎంత వ్రాయాలో ఎవరికి తెలుసు? ఒకే మార్గాన నడిచే అసంపూర్ణ ఆధారాలకు న్యాయ మందిరంలో ఎంత విలువ కట్టబడుతుందో మరి?

వ్రాసిన ప్రకరణలను గురించి తీరికగా వున్న వ్యక్తి ఎవరైనా నాతో తర్కానికి దిగితే నా ఈ ప్రకరణాలపై ఎంత వెలుగు ప్రసరింపచేస్తాడోగదా! అతడు విమర్శకుని దృష్టితో దీన్ని అన్వేషించి ఎటువంటి డొల్లు విషయాలు బయటబెట్టి ప్రపంచాన్ని నవ్విస్తాడో కదా? తాను కూడా ఉబ్బి తబ్బిబ్బు అవుతాడో కదా!

ఈ విధంగా ఆలోచించడం ప్రారంభించినప్పుడు ఈ ప్రకరణాలు వ్రాయడం ఆపివేయడమే మంచిదని అనిపిస్తూ ఉంటుంది. కాని ప్రారంభించిన కార్యం అవినీతిమయమని స్పష్టంగా గోచరించనంతవరకు దాన్ని ఆపివేయకూడదు కదా! అందువల్ల అంతర్యామి నన్ను ఆపివేయమని ఆదేశించనంతవరకు ప్రకరణాలు వ్రాస్తూ ఉండాలనే నిర్ణయానికి వచ్చాను.

ఈ కథ టీకాకారుల్ని తృప్తి పరచడం కోసం వ్రాయడం లేదు. ఇది సత్యశోధనకు సంబంధించిన ఒక ప్రయోగం. దీనివల్ల అనుచరులకు కొంత ఊరట కలుగుతుందను భావం కూడా ఈ రచన మూలంలో పనిచేస్తున్నది. దీని ఆరంభం కూడా వారి తృప్తి కోసమే జరిగింది. స్వామీ ఆనంద్, జయరామదాసులు నా వెంటపడి యుండకపోతే బహుశ ఈ కథ ఆరంభమై ఉండేది కాదు. అందువల్ల ఈ కథారచనలో ఏమైనా దోషాలు దొర్లితే అందుకు వారు కూడా భాగస్వాములే.

ఇక నేను శీర్షికకు వస్తాను. నేను హిందూ దేశస్థుల్ని గుమాస్తాలుగా ఇంట్లో పెట్టుకున్నట్లుగానే, ఇంగ్లీషు వాళ్ళను కూడా పెట్టుకోసాగాను. నా ఈ చర్య నా వెంట వుండే వారందరికీ పొసగేది కాదు. అయినా పట్టుబట్టి వారిని నా యింట్లో ఉంచాను. అందరినీ వుంచి నేను తెలివిగలపని చేశానని గట్టిగా చెప్పలేను. కొందరి విషయంలో చేదు అనుభవాలు కూడా కలిగాయి. అయితే ఇట్టి అనుభవాలు దేశవాసులవల్ల మరియు విదేశీయులవల్ల కలిగాయి. చేదు అనుభవాలు కలిగినందుకు నాకు పశ్చాత్తాపం కలుగలేదు. చేదు అనుభవాలు కలుగుతూ వున్నా మిత్రులకు అసౌకర్యం కలుగుతుందని తెలిసి కూడా కష్టాలు పడవలసి వస్తుందని భావించే నా అలవాటును మార్చుకోలేదు. ఉదారస్వభావంతో మిత్రులు సహించారు కూడా. క్రొత్త క్రొత్త మనుష్యుల వెంట వుండటం వల్ల, అట్టి సంబంధాల వల్ల అనుచరులకు విచారం కలిగింది. అప్పుడు వారి వారి దోషాలు వివరించి చెప్పడానికి నేను సంకోచించలేదు. ఆస్తికులగు మనుష్యులు తమలో గల భగవంతుణ్ణి సర్వులలో చూడగలిగి అందరితోను నిర్లిప్తంగా వుండగల శక్తిని అలవర్చుకొని వుండాలని నా అభిప్రాయం. ఎక్కడ వెతకకుండా అవకాశాలు లభిస్తాయో, అక్కడ వాటికి దూరంగా పారిపోకుండా క్రొత్త క్రొత్త సంబంధాలు

ఏర్పరుచుకున్నప్పుడు, అలా చేస్తూ రాగద్వేషాలకు దూరంగా వుండగలిగినప్పుడు శక్తిని వికసింపచేసుకోగలుగుతాము.

బోయర్లకు బ్రిటీష్‌వారికి యుద్ధం ప్రారంభమైనప్పుడు నా ఇల్లు పూర్తిగా నిండిపోయి వున్నప్పటికీ జోహన్సుబర్గు నుండి వచ్చిన ఇద్దరు ఇంగ్లీషు వారికి నా ఇంట్లో బస ఏర్పాటు చేశాను. ఇద్దరూ థియాసాఫిస్టులు. ఒకని పేరు కిచన్. ఆయనను గురించి ముందు కూడా పేర్కొనడం జరుగుతుంది. ఈ మిత్రుల సహవాసం కూడా నా ధర్మపత్నిని బాగా ఏడిపించింది. నా మూలాన ఆమె ఏడ్వవలసిన సందర్భాలు అనేకసార్లు ఏర్పడ్డాయి. ఏవిధమైన పర్దాగాని, అరమరికలు గాని లేకుండా ఇంగ్లీషువారికి బస ఏర్పాటు చేయడం ఇదే మొదటిసారి. ఇది క్రొత్త అనుభవం. ఇంగ్లాండులో నేను వాళ్ళ ఇళ్ళలో వున్నమాట నిజం. అయితే వారి విధానానికి, ప్రవర్తనకు లోబడి నేను వున్నాను. ఆ నా నివాసం హోటలు నివాసం వంటిది. కాని ఈ వ్యవహారం అలాంటిది కాదు. పూర్తిగా అందుకు విరుద్ధం. ఈ మిత్రులు నా కుటుంబసభ్యులుగా వున్నారు. వాళ్ళు భారతీయ అలవాట్లను, నడవడిని అనుసరించారు. ఇంట్లోను, బయటకూడా వ్యవహారమంతా ఆంగ్లేయుల పద్ధతిలోనే ఉన్నాయి. ఈ మిత్రుల్ని మాతోబాటు మా ఇంట్లో వుంచినప్పుడు ఎన్నో ఇబ్బందులు కలిగిన విషయం నాకు జ్ఞాపకం వున్నది. కాని వారిద్దరు మా కుటుంబ సభ్యులందరితో పూర్తిగా కలిసిపోయారని చెప్పగలను. జోహన్సుబర్గులో ఈ సంబంధాలు దర్బనును మించిపోయాయి.

## 12. ఇంగ్లీషువారితో పరిచయం

ఒక పర్యాయం జోహన్సుబర్గులో నా దగ్గర నలుగురు హిందూ దేశపు గుమాస్తాలు ఉండేవారు. వారిని గుమాస్తాలు అనాలో లేక బిడ్డలు అని అనాలో చెప్పలేను. వారితో నా పనిసాగలేదు. టైపు లేనిదే నా పని సాగదు. టైపింగు జ్ఞానం కొద్దో గొప్పో నా ఒక్కడికే ఉంది. ఈ నలుగురు యువకుల్లో యిద్దరికి టైపింగు చేయడం నేర్పాను. కాని వాళ్ళకు ఇంగ్లీషు బాగా రాకపోవడం వల్ల వారిటైపు బాగుండలేదు. వారిలో లెక్కలు వ్రాయగలవారిని కూడా తయారు చేసుకోవాలి. నేటాలు నుండి నా ఇష్టమైన వాళ్ళను పిలిపించుకునేందుకు వీలులేదు. పర్మిట్ లేకుండా ఏ హిందూ దేశస్థుడూ ప్రవేశించడానికి వీలులేదు. నా సౌకర్యం కోసం అధికారుల మెహర్బానీ కోసం బిచ్చం అడిగేందుకు నేను సిద్ధపడలేదు. నేను ఇబ్బందుల్లో పడ్డాను. ఎంత శ్రమపడ్డా, వకీలువృత్తి, సార్వజనిక సేవాకార్యం రెండూ సాగించడం కష్టమైపోయింది.

గుమస్తా పనికి ఇంగ్లీషు వాళ్ళు దొరికితే వారిని నియమించకుండా ఎలా వుండగలను? నల్లవారి దగ్గర తెల్లవాళ్ళు ఉద్యోగం చేస్తారా అని నాకు అనుమానంగా వుండేది. ప్రయత్నం చేసి చూద్దామని నిర్ణయించుకున్నాను. టైపు రైటింగు ఏజంట్లతో నాకు పరిచయం ఉంది. ఒక ఏజెంటు దగ్గరకు వెళ్లాను. టైపు చేయగల తెల్లవారు స్త్రీ అయినా పురుషుడైనా నల్లవారి దగ్గర నౌకరీ చేయడానికి అంగీకరిస్తే పంపండి అని ఆయనకు చెప్పాను. దక్షిణ ఆఫ్రికాలో షార్టుహేండు, టైపురైటింగు పని సామాన్యంగా స్త్రీలే చేస్తూ ఉంటారు. అటువంటి వ్యక్తిని వెతికి పంపిస్తానని ఆయన మాట ఇచ్చాడు. ఆయనకు మిస్‌డిక్ అను పేరుగల ఒక స్కాచ్‌కుమారి తటస్థపడింది. ఆ మహిళ ఈ మధ్యనే స్కాంట్లండు నుండి వచ్చింది. ప్రామాణికమైన నౌకరీ ఎవరి దగ్గరనైనా సరే చేయడానికి ఆమెకు అభ్యంతరం లేదు. ఆమె వెంటనే పనిలో చేరాలని అనుకున్నది. ఆ ఏజంటు ఆమెను నా దగ్గరకు పంపించాడు. చూడగానే ఆమె మీద నా దృష్టి నిలబడిపోయింది.

'హిందూ దేశవాసి దగ్గర పనిచేయడానికి మీకు అభ్యంతరం ఏమీ లేదు కదా!' అని అడిగాను. "ఏమాత్రం లేదు" దృఢమైన స్వరంతో ఆమె అన్నది.

"జీతం ఎంత కావాలి?"

"పదిహేడున్నర పొండ్లు. మీరు ఎక్కువ అనుకుంటున్నారా? అని ఆమె అడిగింది

"నేను ఆశించినంత పని మీరు చేసిన యెడల ఆ సొమ్ము నాకు అధికం కాదు. మీరు ఎప్పటి నుండి పనిలో చేరతారు?"

"మీరు సరేనంటే ఈ క్షణం నుంచే పని ప్రారంభిస్తాను".

నేను ఎంతో సంతోషించాను. ఆ సోదరిని వెంటనే ఎదుట కూర్చోబెట్టుకుని జాబులు వ్రాయించడం ప్రారంభించాను.

ఆమె ఒక గుమాస్తాగా గాక, ఒక బిడ్డగా, ఒక సోదరిగా బాధ్యత వహించి పనిచేయడం ప్రారంభించింది. ఆమెకు ఎన్నడూ బిగ్గరగా చెప్పవలసిన అవసరం కలుగలేదు. ఆమె చేసిన పనిలో తప్పులెన్నవలసిన అవసరం ఎన్నడూ కలుగలేదు. వేలాది పొండ్ల సొమ్ము ఆమె చేతిలో వున్న రోజులు కూడా వున్నాయి. ఆమె డబ్బు లెక్క కూడా సంబాళించసాగింది. సంపూర్తిగా ఆమె నా విశ్వాసాన్ని చూరగొన్నది. ఆమె వ్యక్తిగత రహస్యాలు కూడా నాకు చెప్పే స్థితికి రావడం ఎంతో గౌరవంగా భావించాను. తనకు తోడుగా వుండే వ్యక్తిని గురించిన సలహా అడగడమే గాక నా సాయం కూడా

కోరింది. కన్యాదానం చేసే గౌరవం కూడా నాకే లభించింది. మిస్‌డిక్ మిస్ మెకడనల్డ్ అయింది. అప్పుడు ఆమెకు మేము దూరం కావలసి వచ్చింది. వివాహం అయిన తరువాత కూడా పని ఎక్కువైనప్పుడు కబురు చేస్తే ఆమె వచ్చి సహకరిస్తూ ఉండేది.

ఆఫీసులో షార్టుహాండు తెలిసినవారు కావలసి వచ్చింది. ఒక మహిళ దొరికింది. ఆమె పేరు శ్లేశిన్. ఆమెను నాదగ్గరకు మి.కేలన్‌బక్ తీసుకువచ్చారు. శ్రీ కేలన్‌బక్ గారిని గురించి పాఠకులు ఇక ముందు తెలుసుకుంటారు. ఆ మహిళ ఒక హైస్కూల్లో ఉపాధ్యాయురాలుగా పనిచేస్తున్నది. నా దగ్గరకు వచ్చినప్పుడు ఆమెకు 17 సంవత్సరాల వయస్సు. ఆమె ప్రత్యేకతలు కొన్ని చూచి నేను, మి.కేలన్‌బక్ ఆశ్చర్యపడేవాళ్ళం. ఆమె నౌకరీ చేయాలనే ఉద్దేశ్యంతో మా దగ్గరకు రాలేదు. ఆమె అనుభవం కోసం వచ్చిందన్నమాట. ఆమెకు వర్ణద్వేషం లేదు. ఆమె ఎవ్వరినీ లక్ష్యపెట్టేది కాదు. ఎవరినైనా సరే అవమానించడానికి సంకోచించేదికాదు. ఒకరిని గురించి ఆమెకు కలిగిన భావాన్ని స్పష్టంగా ప్రకటించేది. తన భావాన్ని వెల్లడించడానికి వెనుకాడేదికాదు. ఇట్టి స్వభావం వల్ల అప్పుడప్పుడు అందరికీ బరువు దిగినట్లుండేది. ఆమెకు ఇంగ్లీషు భాషమీదగల అధికారం నాకంటే అధికం. ఈ కారణాలన్నిటివల్ల ఆమె తయారు చేసిన జాబులను తిరిగి చదవకుండా సంతకం పెడుతూ వుండేవాణ్ణి.

ఆమెకు గల త్యాగ ప్రవృత్తి ఎంతో గొప్పది ఆమె చాలా కాలం వరకు నా దగ్గర కేవలం ఆరు పౌండ్లు మాత్రమే తీసుకుంటూ ఉండేది. అంతకంటే జీతం తీసుకునేందుకు చివరి వరకు ఆమె అంగీకరించలేదు. జీతం ఎక్కువ తీసుకోమని నేను అంటే ఆమె నన్ను బెదిరిస్తూ "జీతం తీసుకునేందుకు నేను ఇక్కడ వుండటం లేదు. మీ దగ్గర పనిచేయడం నాకు ఇష్టం. మీ ఆదర్శాలంటే నాకు ఇష్టం అందుకే మీ దగ్గర పనిచేస్తున్నాను" అని స్పష్టంగా అంటూ ఉండేది.

ఒకసారి అవసరంపడి నా దగ్గర ఆమె 40 పౌండ్లు తీసుకున్నది. అది కూడా అప్పుగానే. గత సంవత్సరం ఆమె ఆ డబ్బంతా తిరిగి ఇచ్చివేసింది. ఆమె త్యాగభావం ఎంత తీవ్రంగా వుండేదో ధైర్యం కూడా అంత ఎక్కువగా ఉండేది. స్ఫటికమణి వంటి పవిత్రత, క్షత్రియుల్ని కూడా నివ్వెరపడేలా చేయగల ప్రతాపం కలిగిన కొందరు మహిళామణులు నాకు తెలుసు. అట్టివారిలో ఈమె ఒకరని నా అభిప్రాయం. ఆమె వయస్సులో ఉన్న ప్రౌఢ అవివాహిత. ఇప్పుడు ఆమె మానసికస్థితి ఎలా ఉన్నదో నాకు తెలియదు. అయినా నాకు కలిగిన అనుభవం వల్ల ఆమెను ఈనాటికి పవిత్రంగా స్మరిస్తాను. తెలిసిన సత్యాన్ని వ్రాయకపోతే సత్యానికి ద్రోహం చేసినవాణ్ణి అవుతానుకదా!

పని వున్నప్పుడు రాత్రనక పగలనక అమితంగా శ్రమపడేది. అర్థరాత్రి సమయంలో కూడా పనిబడితే ఒంటరిగా వెళుతూ వుండేది. ఎవరినైనా వెంట పంపాలని ప్రయత్నిస్తే నన్ను కోపంగా చూచేది. వేలాదిమంది హిందూదేశస్థులు ఆమెను గౌరవభావంతో చూచేవారు. అంతా ఆమె మాట వినేవారు. మేమంతా జైల్లో వున్నప్పుడు, బాధ్యత గలవార్వెరూ బయటలేనప్పుడు ఆమె ఒక్కతే సత్యాగ్రహ సంగ్రామం నడిపించింది. లక్షలాది రూపాయల లెక్కలు ఆమె వ్రాసింది. ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఆమే జరిపింది. ఇండియన్ ఒపీనియన్ పత్రికను కూడా ఆమె నడిపింది. అలసట అంటే ఏమిటో ఆమె ఎరుగదు.

మిస్ శ్లేశిన్ గురించి ఎంత వ్రాసినా తనివి తీరదు. గోఖ్లేగారి సర్టిఫికెట్టు గురించి చెప్పి ఈ ప్రకరణం ముగిస్తాను. గోఖ్లేగారు నా అనుచరులందరిని పరిచయం చేసుకున్నారు. పరిచయం అయిన తరువాత చాలామంది విషయంలో వారు సంతోషించారు. ప్రతి ఒక్కరి చరిత్రను వారి విలువలను అంచనా వేశారు. హిందూ దేశానికి చెందిన నా అనుచరులు, యూరోపుకు చెందిన నా అనుచరులు అందరిలో వారు మిస్ శ్లేశిన్‌కు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. "ఇంతటి త్యాగం, ఇంతటి పవిత్రత, ఇంతటి నిర్భీకత ఇంతటి కార్యకుశలత బహు కొద్దిమంది లోనే నేను చూచాను. మిస్ శ్లేశిన్ మీ అనుచరులందరిలోను ప్రథమ స్థానం పొందుటకు అర్హురాలు" అని వారు ప్రకటించారు.

## 13. ఇండియన్ ఒపీనియన్

ఇంకా కొంతమంది యూరోపియన్లను గురించి వ్రాయవలసిన అవసరం ఉన్నది. అంతకు ముందు మరో రెండు మూడు మహత్తరమైన విషయాలను గురించి వ్రాయడం అవసరం. ఇప్పుడే ఒకరిని గురించి వ్రాస్తాను. మిస్ డిక్‌ను నియమించి నా పని పూర్తి చేయగలిగానని అనుకోవడం సరికాదు. మి.రీచ్‌ని గురించి నేను మొదటనే వ్రాశాను. ఆయనతో నాకు బాగా పరిచయం వున్నది. ఆయన ఒక వ్యాపార సంస్థ సంచాలకులు. అక్కడి నుండి తప్పుకొని నా దగ్గర ఆర్టికల్ క్లర్కుగా పని చేయమని వారిని కోరాను. నా సలహా వారికి నచ్చింది. వారు నా ఆఫీసులో చేరారు. నా పనిభారం కొంత తగ్గించారు.

ఇదే సమయంలో శ్రీ మదనజీత్ "ఇండియన్ ఒపీనియన్" అను పత్రికను వెలువరించాలని నిర్ణయించుకున్నాడు. నన్ను సలహా సహకారాలు యిమ్మని కోరాడు.

ప్రెస్సు ఆయన నడుపుతూ వున్నాడు. పత్రిక వెలువరించాలనే కోరికను సమర్థించాను. 1904లో ఈ పత్రిక ప్రారంభించబడింది మనసుఖలాల్ నాజరు ఆ పత్రికకు ఎడిటరుగా ఉన్నారు. కాని సంపాదకత్వపు నిజమైన భారమంతా నా మీదే పడింది. మొదటనుండే నాకు దూరాన ఉండి పత్రికలు నడిపించే యోగం కలుగుతూ వచ్చింది.

మన సుఖలాల్ నాజరు సంపాదకులుగా లేరని కాదు. వారు దేశమందలి చాలా పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ వుండేవారు. దక్షిణ ఆఫ్రికాలోగల చిక్కులతోకూడిన పలు సమస్యలను గురించి నేనుండగా స్వతంత్రంగా వ్యాసాలు వ్రాయడానికి ఆయన సాహసించలేదు. నా యోచనా శక్తిమీద ఆయనకు అమిత విశ్వాసం. అందువల్ల ఏమైనా ప్రధాన విషయాలపై వ్రాయవలసి వస్తే ఆ భారం నా మీద మోపుతూ వుండేవాడు.

ఇండియన్ ఒపీనియన్ వారపత్రిక ప్రారంభంలో గుజరాతీ, హిందీ, తమిళం , ఇంగ్లీషుల్లో వెలువడుతూ ఉండేది. తమిళం, హిందీ శాఖలు పేరుకు మాత్రమే ఉండటం చూచాను. వాటివల్ల సమాజానికి సేవ జరిగే స్థితి కలుగకపోవడం వల్ల అందు నాకు అసత్యం గోచరించింది. వెంటనే వాటిని మూసివేయించాను. ఆ తరువాతనే నాకు శాంతి లభించింది.

ఈ పత్రిక కోసం డబ్బు నేను ఖర్చు పెట్టవలసి వస్తుందని ఊహించలేదు. కొద్ది రోజులకే డబ్బు ఖర్చు పెట్టకపోతే పత్రిక నడవదని తెలిసిపోయింది. నేను పత్రికకు సంపాదకుణ్ణి కాదు. అయినా వ్యాసాల విషయమైన బాధ్యత వహించాను. ఈ విషయం హిందూ దేశస్థులు, యూరోపియన్లు కూడా గ్రహించారు. అసలు పత్రిక ప్రకటించబడిన తరువాత మూత బడితే నా దృష్టిలో జాతికే అవమానం, నష్టం కూడా.

నేను పత్రిక కోసం డబ్బు ఖర్చు పెట్టడం ప్రారంభించాను. నా దగ్గర మిగిలిందంతా దానికి ఖర్చు పెడుతూనే వున్నాను. ప్రతి మాసం 75 పౌండ్లు ఇవ్వవలసి వస్తుండేది.

ఇన్ని సంవత్సరాల తరువాత పరిశీలించి చూస్తే ఈ పత్రిక జాతికి చాలా సేవ చేసిందని చెప్పగలను. ఆ పత్రిక ద్వారా ధనం గడించాలని ఎవ్వరం అసలు అనుకోలేదు.

పత్రిక నా చేతిలో వున్నంత కాలం దానిలో జరిగిన మార్పులు నా జీవితంలో కలిగిన మార్పులకు ప్రతీకలే. నేడు యంగ్ ఇండియా, నవజీవన్ నా జీవితమందలి కొంత భాగానికి ప్రతీకలు అయినట్లే ఇండియన్ ఒపీనియన్ కూడా అయింది.

దానియందు నేను ప్రతివారం నా ఆత్మను క్రుమ్మరించేవాణ్ణి. నేను దేన్ని సత్యాగ్రహం అని అనుకునే వాడినో దాన్ని గురించి తెలియజెప్పడానికి ప్రయత్నించేవాణ్ణి. నేను జైల్లో వున్నప్పుడు తప్ప మిగతా కాలం 10 సంవత్సరాల పాటు అనగా 1914 వరకు నడిచిన ఇండియన్ ఒపీనియన్ పత్రిక యొక్క ప్రతి సంచికలోను నా వ్యాసాలు ప్రచురితం అవుతూనే వున్నాయి. ఆలోచించకుండా తూకం వేసుకోకుండా వ్రాసిన ఒక్క శబ్దం కూడా ఆ పత్రికలో వెలువడలేదని చెప్పగలను. ఒకరిని సంతోష పెట్టడానికో లేక తెలిసి వుండి అతిశయోక్తులో వ్రాసినట్లు నాకు గుర్తులేదు. ఆ పత్రిక నా సంయమనానికి ఒక దృష్టాంతంగా రూపొందింది నా భావాలకు వాహకం అయింది. నా వ్యాసాల్లో విమర్శకు ఏమీ లభించేది కాదు. ఇందు ప్రకటించబడిన వ్యాసాలు విమర్శకుల చేతుల్లో గల కలాలను చాలా వరకు అదుపులో ఉంచేవి. ఈ పత్రిక లేనిదే సత్యాగ్రహ సమరం సాగని స్థితి ఏర్పడింది. పాఠకులు ఈ పత్రికను తమదిగా భావించేవారు. సత్యాగ్రహ సంగ్రామానికి, దక్షిణ ఆఫ్రికాలో గల హిందూ దేశస్థుల పరిస్థితులకు నిజమైన చిత్తరువుగా దాన్ని భావించేవారు.

ఈ పత్రిక వల్ల రంగురంగుల మానవ స్వభావాన్ని గుర్తించేందుకు నాకు మంచి అవకాశం లభించింది. సంపాదకుడు చందాదారులు వీరిద్దరి మధ్య స్వచ్ఛమైన సంబంధం ఏర్పరచడమే మా ఉద్దేశ్యం గనుక నా దగ్గరకు హృదయం విప్పి చెప్పే పాఠకుల జాబులు కుప్పలు కుప్పలుగా వచ్చిపడేవి. తీపివి, చేదువి, కారంగా ఉండేవి, కటువుగా ఉండేవి రకరకాల జాబులు వాటిలో ఉండేవి వాటినన్నింటినీ చదివి, వాటిలోగల భావాలను తెలుసుకొని వాటికి సమాధానాలు రాస్తూ వుండేవాణ్ణి. అది నాకు గొప్ప పాఠం అయింది. వాటిద్వారా జాతియొక్క భావాల్ని వింటున్నానా అని అనిపించేది. సంపాదకుని బాధ్యత ఏమిటో నేను బాగా తెలుసుకోసాగాను. ప్రజలమీద నాకు మంచి పట్టు లభించింది. దానివల్ల భవిష్యత్తులో ప్రారంభం కాబోతున్న పోరాటానికి శోభ చేకూరింది. శక్తి లభించింది.

ఇండియన్ ఒపీనియన్ పత్రిక వెలువడసాగిన మొదటి మాసంలోనే సమాచార పత్రిక సేవాభావంతోనే నడపబడాలని బోధపడింది. సమాచార పత్రికకు గొప్పశక్తి కలదని, స్వేచ్ఛగా, నిరంకుశంగా ప్రవహించే నీటి ప్రవాహం పొలాల్ని ముంచివేసినట్లు, పంటల్ని నాశనం చేసినట్లు కలాన్నుండి బయల్వెడలే నిరంకుశ ప్రవాహం నాశనానికి హేతువవుతుందని గ్రహించాను. ఆ అంకుశం బయటినుండి వస్తే నిరంకుశత్వం కంటే ఎక్కువ విషాక్తం అవుతుందని, లోపలి అంకుశమే లాభదాయకం అవుతుందని గ్రహించాను.

నా యీ యోచనా సరళి సరియైనదైతే ప్రపంచంలో నడుస్తున్న ఈనాటి పత్రికల్లో ఎన్ని నిలుస్తాయి? అయితే పనికిమాలిన వాటిని ఆపగల వార్వెరు? ఏవి పనికిమాలినవో ఎలా తేల్చడం? పనికివచ్చేవి, పనికిరానివీ రెండూ ప్రక్కప్రక్కన నడుస్తూనే ఉంటాయి. అయితే మనిషి వాటిలో తనకు ఏది గ్రాహ్యమో ఏది అగ్రాహ్యమో నిర్ణయించుకోవాలి

## 14. కూలి లొకేషనా లేక పాకీవాళ్ళ పల్లెయా?

హిందూ దేశంలో మనకి అపరిమితంగా సేవ చేసే పాకీ మొదలుగాగల వారిని అసభ్యులుగా భావించి వాళ్ళను ఊరి బయట విడిగా వుంచుతాము. గుజరాతీ భాషలో వారి పల్లెను ఢేడ్‌వాడ అని అంటారు. ఆ పేరును ఉచ్చరించడానికి కూడా జనం అసహ్యించుకొంటారు. యిదేవిధంగా యూరపులో క్రైస్తవ సమాజంలో ఒకానొక కాలంలో యూదులు అస్పృశ్యులుగా భావించబడేవారు. వాళ్ళ కోసం ఏర్పాటు చేయబడిన ఢేడ్‌వాడాను ఘేటో అని అనేవారు. దుర్గుణాలకు చిహ్నంగా దాన్ని పరిగణించేవారు. దక్షిణ ఆఫ్రికాలో అదే విధంగా హిందూ దేశస్థులమంతా పాకీవారుగా పరిగణింపబడేవారం. ఎండ్రూస్ చేసిన ఆత్మ త్యాగం వల్ల, శాస్త్రిగారి మంత్రదండం వల్ల మాకు శుద్ధి జరుగుతుందో లేదో మేము పాకీవారుగా పరిగణించబడక సభ్యులుగా పరిగణింపబడతామో లేదో ముందు ముందు చూడాలి.

హిందువుల మాదిరిగా యూదులు కూడా తాము దేవునికి ప్రీతిపాత్రుల మని, యితరులంతా ప్రీతిపాత్రులు కారని భావించి ఎన్నో అపరాధాలు చేశారు. అందుకు విచిత్రమైన పద్ధతిలో క్రూరంగా వారికి శిక్ష పడింది. దరిదాపు అదే విధంగా హిందువులు కూడా తాము సభ్యులమని, సుసంస్కృతులమని లేక ఆర్యులమని భావించి తమకు సంబంధించిన అవయవాల వంటివారిని అసభ్యులని అనార్యులని పాకీవాళ్ళని భావించారు. తాము చేసిన ఆ అపరాధానికి తగిన శిక్ష విచిత్రమైన పద్ధతిన క్రూరంగా దక్షిణ ఆఫ్రికా వంటి అధినివేశ దేశాలలో అనుభవిస్తున్నారు. ఈ శిక్షను హిందువుల ఇరుగుపొరుగున ఉండే మహ్మదీయులు, పారశీకులు కూడా అనుభవిస్తున్నారని నా అభిప్రాయం.

జోహన్సుబర్గులో కూలీల లొకేషనుకు యీ ప్రకరణంలో ప్రాధాన్యం ఎందుకిస్తున్నానో పాఠకులకు బోధపడి వుంటుంది. దక్షిణ ఆఫ్రికాలో మా అందరికి

"కూలీ" అని పేరు. కూలీ అనే పదం మన దేశంలో కూలీ నాలీ చేసుకొనేవారికే వర్తిస్తుంది. కాని దక్షిణ ఆఫ్రికాలో యీ పదం పాకీలు, మాదిగలు మొదలుగాగల వారి కందరికి తిరస్కార సూచకంగా వాడతారు. దక్షిణ ఆఫ్రికాలో యిట్టి కూలీలందరి కోసం కేటాయించబడ్డ చోటును కూలీ లొకేషన్ అని అంటారు. అలాంటి లొకేషన్ ఒకటి జోహాన్సుబర్గులో వున్నది. ఆ లొకేషన్‌లో గాని, యితర చోట్ల అదే విధంగా వున్న కూలీ లొకేషన్లలో గాని నివసిస్తున్న హిందూ దేశస్థులకు అక్కడ యాజమాన్యం హక్కు లేదు. జోహాన్సుబర్గులో గల ఈ లొకేషన్‌కు మాత్రం 99 సంవత్సరాల పట్టా యివ్వబడింది. యిందు హిందూ దేశస్థులు కిటకిటలాడుతూ వుండేవారు. జనసంఖ్య పెరిగిపోసాగిందేకాని లొకేషన్ విస్తీర్ణం మాత్రం పెరగలేదు. పాయిఖానా దొడ్లు శుభ్రం చేయించడందప్ప అంతకుమించి మునిసిపాలిటీ వాళ్ళు లొకేషనును గురించి పట్టించుకోలేదు. అక్కడ రోడ్లమీద దీపాలు ఎందుకు వుంటాయి? అసలు పాయిఖానా పరిశుభ్రతను గురించి కూడా ఏ మాత్రం పట్టించుకోని ఆ లొకేషన్‌లో యితర పారిశుధ్యాల్ని గురించి అడిగేనాథుడెవరు? అక్కడ నివసిస్తున్న హిందూ దేశస్తులు పట్టణ పారిశుద్ధ్యం ఆరోగ్యం మొదలుగాగల వాటిని గురించి వాటి నియమాలను గురించి తెలిసిన ఆదర్శ భారతీయులు కారు. మునిసిపాలిటీ వారికి సాయం చేయాలని గాని, తమ నడవడిక, ప్రవర్తనను గురించి పట్టించుకోవడం అవసరం అని గాని భావించేవారు కాదు.

సూక్ష్మంలో మోక్షం చూపించగల, మట్టి నుంచి తిండి గింజల్ని పండించగల హిందూ దేశస్థులు అక్కడికి వెళ్ళి స్థిరపడివుంటే అక్కడి చరిత్ర మరో విధంగా మారి వుండేది. అసలు ప్రపంచంలో ఎక్కడా యీ విధంగా వేలాది, లక్షలాది మంది జనం యితర దేశాలకు వెళ్ళి స్థిరపడలేదు. సామాన్యంగా జనం డబ్బు కోసం, వృత్తి కోసం విదేశాలలో కష్టాలు పడుతూ వుంటారు. హిందూదేశంలో అధిక శాతం మంది నిరక్షర కుక్షులు, దీనులు, దుఃఖితులు, శ్రామికులు. వాళ్ళే ఆ విధంగా వెళ్ళడం జరిగింది. అడుగడుగునా వారికి రక్షణ అవసరం. వారి తరువాత అక్కడకు వెళ్ళిన వ్యాపారస్తులు, తదితర స్వతంత్ర భారతీయులు సంఖ్యలో బహుకొద్దిమందే వున్నారు.

ఈ విధంగా పారిశుధ్య కార్యక్రమాల్ని నిర్వహించవలసిన శాఖవారి క్షమించరాని నిర్లక్ష్యంవల్ల, ప్రవాస భారతీయుల అజ్ఞానం వల్ల ఆరోగ్యదృష్ట్యా లొకేషన్ స్థితి నాసి అయిపోయింది. దాన్ని బాగుచేయడానికి మునిసిపాలిటీవాళ్ళు సరికాదా పైపెచ్చు యీ వంకమీద ఆ లొకేషనునంతా దగ్ధం చేసివేయాలని నిర్ణయించారు. అక్కడి భూమిని అధీనం చేసుకునే హక్కును కౌన్సిలు నుండి సంపాదించుకున్నారు. ఇదీ నేను జోహాన్సుబర్గు చేరుకున్నప్పటి పరిస్థితి.

అక్కడ నివాసం వున్నవారు భూమిమీద హక్కు కలిగి వున్నారు. అందువల్ల వాళ్ళకు నష్టపరిహారంగా ఏదో కొంత లభించాలి. పరిహారంగా ఎంతసొమ్ము చెల్లించాలో నిర్ణయించేందుకు కోర్టు ఏర్పాటు అయింది. మునిసిపాలిటీ వాళ్ళు యిస్తానన్న సొమ్ము తీసుకోకపోతే కేసు ఆ కోర్టు ముందుకు వెళుతుంది. ఆ కోర్టువారు ఎంత నిర్ధారిస్తే అంత కూలీలు తీసుకోవాలి. యిదీ విధానం మునిసిపాలిటీ వారిచ్చే దానికంటే ఎక్కువ నష్టపరిహారం కోర్టు నిర్ణయిస్తే వకీలుకు అయిన ఖర్చు మునిసిపాలిటీ వారే భరిస్తారు.

ఈ వ్యవహారంలో ఎక్కువ మంది కూలీలు తమ తమ తరుపున నన్ను వకీలుగా నియమించారు. డబ్బు చేసుకుందామనే కోరిక నాకు లేదు. "మీరు గెలిస్తే మునిసిపాలిటీ వాళ్ళు యిచ్చే సొమ్ముతో తృప్తిపడతా. మీరు గెలిచినా, ఓడినా పట్టాకు 10 పౌండ్లు చొప్పున యివ్వండి చాలు." అని వారికి చెప్పాను అంతేగాక ఆవిధంగా వచ్చిన సొమ్ములో సగభాగం బీదవారి కోసం ఆసుపత్రి నిర్మాణానికో లేక అలాంటిదే మరో ప్రజాసేవా కార్యానికో వినియోగిస్తానని కూడా వారికి చెప్పాను. నామాటలు విని వాళ్ళు సంతోషించారు. సుమారు 70 దావాలు జరిగాయి. నాకు ఒక్క దానిలో మాత్రం పరాజయం కలిగింది. అందువల్ల పెద్ద మొత్తం నాకు లభించింది. ఇండియన్ ఒపీనియన్ పత్రికా ఖర్చు భారం నా మీద బాగా పడటం వల్ల ఆ మొత్తంలో 1600 పౌండ్ల సొమ్ము ఆ ఖాతాకు వెళ్ళి పోయిందని గుర్తు.

ఈ దావాలకై నేను చాలా కృషిచేశాను. కక్షిదారులు గుంపులు గుంపులుగా నా దగ్గర వుండేవారు. వారిలో చాలామంది ఉత్తర బీహారుకు, దక్షిణాదికి చెందిన తమిళ, తెలుగు ప్రాంతాలనుండి గిరిమిట్లుగా వచ్చిన భారతీయులు. ఆ తరువాత వారంతా గిరిమిట్ ప్రథ నుండి విముక్తి పొంది స్వతంత్రంగా వృత్తి చేసుకోసాగారు.

వీళ్ళంతా కలిసి తమ కష్టాలు తొలగించుకొనేందుకు భారతీయ వ్యాపారస్థులకు సంబంధించిన మండలి నుండి విడివడి మరో మండలిని సొంతంగా స్థాపించుకున్నారు. నిర్మలహృదయులు, నిజాయితీపరులు, శీలవంతులు అయిన ఆ మండలి అధ్యక్షుని పేరు శ్రీ జయరాం సింహ్. అధ్యక్షుడు కాకపోయినా అధ్యక్షుని వంటి మరొకరి పేరు శ్రీ బ్రదీ. ఇద్దరూ ఇప్పుడు కీర్తిశేషులే. వారిద్దరి వల్ల నాకు ఎంతో సహకారం లభించింది. శ్రీ బద్రీతో చాలా పని నాకు పడింది. ఆయన సత్యాగ్రహంలో ప్రముఖంగా పాల్గొన్నాడు. వీరివంటి వారి వల్ల దక్షిణ భారతావనికి, ఉత్తర భారతావనికి చెందిన పలువురితో నాకు దగ్గర సంబంధం ఏర్పడింది. నేను వారి వకీలునేగాక ఒక సోదరునిగా వున్నాను. వారి దుఃఖాలలో భాగస్వామిగా వున్నాను. సేర్ అబ్దుల్లా నన్ను గాంధీ అని పిలవడానికి అంగీకరించలేదు. నన్ను దొర అని అక్కడ ఎవరు అంటారు?

అన్నా అని అంగీకరించేది ఎవరు? అందువల్ల ఆయన ఎంతో ప్రీతికరమైన పదం ఒకటి వెతికి బయటికి తీశారు. భాయీ అంటే సోదరా అనేదే ఆ పదం. ఆ పదం దక్షిణ ఆఫ్రికాలో చివరిదాకా నాకు స్థిరపడిపోయింది. గిరిమిట్ ప్రథమం నుండి విముక్తులైన హిందూ దేశస్థులు నన్ను "భాయీ" అని పిలుస్తున్నప్పుడు వారి పిలుపులో నాకు తీయదనం గోచరిస్తూ వుండేది.

## 15. మహమ్మారి - 1

మునిసిపాలిటీ వారు ఈ లొకేషను యాజమాన్యం పట్టా పుచ్చుకొని అక్కడ వుండే హిందూదేశస్థుల్ని వెంటనే తొలగించలేదు. వారికి అనుకూలమైన మరోచోటు చూపించాలి. వారు స్థలం నిర్ణయించనందున వెళ్ళమని చెప్పలేదు. తత్ఫలితంగా హిందూ దేశస్థులు ఆ 'మురికి' లొకేషన్‌లోనే వున్నారు. కాని రెండు మార్పులు జరిగాయి. హిందూ దేశస్థులు గృహయజమానులుగా వుండక, మునిసిపాలిటీ వారికి బాడుగ చెల్లించేవారుగా మారారు. దానితో లొకేషనులో మురికి బాగా పెరిగిపోయింది. మొదట హిందూ దేశస్థులకు యాజమాన్యం హక్కు లభించియున్నప్పుడు, ఇష్టం వున్నా లేకపోయినా భయం వల్ల పరిసరాలను కొద్దిగా శుభ్రంగా ఉంచుకొనేవారు. ఇప్పుడు మునిసిపాలిటీ వ్యవహారం కదా! ఎవరికీ ఎవరన్నా ఏమీ భయం లేదు. ఇండ్లలో కిరాయిదారులు పెరిగిపోయారు. వారితోపాటు మురికి, అవ్యవస్థ పెరిగి పోయింది.

ఇలా వ్యవహారం నడువసాగింది. ఇది చూచి హిందూ దేశస్థులకు భయం పట్టుకుంది. ఇంతలో భయంకరంగా ప్లేగు అంటుకుంది. అది ప్రాణాంతకమైన మహమ్మారి. ఊపిరితిత్తులకు సంబంధించిన ప్లేగు. నల్లప్లేగుకంటే ఇది ప్రమాదకరమైంది. అదృష్టవశాత్తు మహమ్మారికి కారణం లొకేషను కాదని అందుకు కారణం జోహన్సుబర్గు సమీపంలోనున్న బంగారుగనుల్లో గల ఒక గని అని తేలింది. అక్కడ హబ్షీ శ్రామికులు ఉన్నారు. అక్కడి పారిశుధ్య బాధ్యత తెల్ల యజమానులది. ఈ గనిలో కొందరు హిందూ దేశస్థులు కూడా పనిచేస్తున్నారు. వారిలో 23 మందికి అంటురోగం సోకింది. ఒకనాటి సాయంత్రం భయంకరమైన ప్లేగు రోగంతో వారంతా లొకేషనులోగల తమ చోటుకు చేరుకున్నారు.

అప్పుడే భాయిమదనజీత్ ఇండియన్ పత్రికకు చందాదారుల్ని చేర్చడానికి చందాలు వసూలు చేయడానికి అక్కడ తిరుగుతూ ఉన్నాడు. ఆయన భయపడలేదు.

ఆ రోగుల్ని చూచాడు. ఆయన గుండె దడదడలాడింది. పెన్సిలుతో వ్రాసి ఒక చీటీ నా దగ్గరికి పంపించాడు. అందులో ఇలా వ్రాశాడు. "ఇక్కడ హఠాత్తుగా నల్లప్లేగు అంటుకుంది. మీరు వెంటనే వచ్చి ఏమైనా చేయాలి. లేకపోతే భయంకరమైన పరిణామం ఏర్పడుతుంది. త్వరగా రండి" మదనజీత్ ఒక ఖాళీగా ఉన్న ఇంటిని నిర్భయంగా ఆక్రమించి ఆ రోగుల్ని అందులో చేర్చాడు. సైకిలుమీద నేను వెంటనే లొకేషను చేరాను. అక్కడినుండి టౌన్‌క్లర్కుకు జాబు పంపి ఏ పరిస్థితుల్లో ఆ గృహాన్ని ఉపయోగించవలసి వచ్చిందో వ్రాశాను

డాక్టర్ విలియం గాడ్‌ఫ్రే జోహన్సుబర్గులో డాక్టరుగా వున్నారు సమాచారం అందగానే పరుగెత్తుకుంటూ వచ్చాడు. రోగులకు తానే డాక్టరు, నర్సు అయిపోయాడు. కాని 23 మంది రోగులకు మేము ముగ్గురం ఏం సరిపోతాం? ఇలాంటి సమయంలో మన విధానం సరిగా ఉంటే కష్టాల్ని ఎదుర్కొనేందుకు సేవకులు తప్పక లభించి తీరతారని అనుభవం మీద తెలుసుకున్నాను నా ఆఫీసులో కళ్యాణదాసు, మాణిక్‌లాల్ మరియు మరో ఇద్దరు హిందూ దేశస్థులు వున్నారు. చివరి ఇద్దరి పేర్లు ఇప్పుడు నాకు జ్ఞాపకం లేవు. కళ్యాణదాసును అతని తండ్రి నాకు అప్పగించాడు. అతని వంటి పరోపకారి కేవలం ఆజ్ఞను పాలించునట్టి వారు బహు కొద్దిమందే ఉంటారు. అదృష్టవశాత్తు కళ్యాణదాసు బ్రహ్మచారి. ఎంతటి ప్రమాదకరమైన పని అయినా అతనికి అప్పగించే స్థితిలో నేను ఉన్నాను. రెండో సజ్జనుడు మాణిక్‌లాల్. అతడు నాకు జోహాన్సుబర్గులో లభించాడు. అతడికి కూడా పెండ్లి కాలేదనే అనుకుంటాను. నాకు గుమాస్తాలు, అనుచరులు, బిడ్డలు అన్నీవారే. ఆ నలుగురినీ హోమం చేసేందుకు సిద్ధపడ్డాను. కళ్యాణదాసును అడగనక్కరలేదు. మిగతావారు అడగగానే సిద్ధపడ్డారు. "ఎక్కడ మీరు వుంటే అక్కడ మేము ఉంటాం" ఇది వారు క్లుప్తంగా ఇచ్చిన సమాధానం.

మి. రీచ్ కుటుంబం పెద్దది. ఆయన స్వయంగా రావడానికి సిద్ధపడ్డాడు. కాని నేనే వారిని ఆపాను. వారిని ఈ ప్రమాదంలోకి నెట్టడానికి నేను సిద్ధం కాలేదు. నాకు ధైర్యం చాలలేదు. అయితే ఆయన బయటి కార్యమంతా చేసేందుకు నడుం బిగించాడు. ఆ రాత్రి సేవా శుశ్రూషల్లో గడిచింది. అది నిజంగా కాళరాత్రే. నేను చాలా మంది రోగులకు శుశ్రూష చేశాను. కాని ప్లేగు వాతపడిన రోగులకు శుశ్రూష నేనెన్నడూ చేసి యుండలేదు. డాక్టర్ గాడ్‌ఫ్రే ప్రదర్శించిన ధైర్యం మమ్మల్ని నిర్భయుల్ని చేసింది. రోగులకు సేవ ఎక్కువ చేయనక్కరలేదు. వాళ్ళకు మందు ఇవ్వాలి. ధైర్యం చెప్పాలి

పత్యపానాలు చూడాలి. వారు దొడ్డికి వెళితే ఆ మలం ఎత్తివేయాలి. ఇంతకంటే మించి పని లేదు. నలుగురు యువకులు నడుం వంచి చేసిన శ్రమ, వారి నిర్భీకత చూచి నా ఆనందానికి అవధులు లేకుండా పోయాయి.

డాక్టరు గాడ్‌ఫ్రే, మదన్‌జీత్‌ల ధైర్యం మాట సరే. ఈ నలుగురు యువకుల ధైర్యం అద్భుతం. ఏదో విధంగా ఆ రాత్రి గడిచింది. నాకు జ్ఞాపకం వున్నంతవరకు ఆ రాత్రి మేము ఒక్క రోగిని కూడా పోగొట్టుకోలేదు. కాని ఈ ఘట్టం ఎంత కరుణరసార్ద్రమైనదో, అంత మనోరంజకమైనది. నా దృష్టిలో ఇది ధార్మికమైనది కూడా.

# 16. మహమ్మారి - 2

ముందుగా అనుమతి తీసుకోకుండా ఇంటి తాళం బద్దలు కొట్టి అందు రోగులను చేర్చి వారికి సేవా శుశ్రూష చేసినందుకు టౌన్‌క్లర్కు మమ్మల్ని అభినందించాడు. "ఇటువంటి సమయంలో ధైర్యం చేసి మీరు చేసిన విధంగా ఏర్పాట్లు చేసే చొరవ మాకు లేదు. మీకు ఏవిధమైన సాయం కావలసివచ్చినా చెప్పండి. టౌన్‌కౌన్సిలు చేతనైన సాయం చేస్తుంది." అని మనస్ఫూర్తిగా చెప్పాడు. మున్సిపాలిటీ వారు అవసరమైన సదుపాయాలు కల్పించేందుకు ముందుకు వచ్చారు. రోగుల సేవ విషయంలో వాళ్ళు ఆలస్యం చేయలేదు

రెండో రోజున ఖాళీగా వున్న పెద్ద గొడౌను మాకు అప్పగించారు. అందు రోగులనందరినీ చేర్చమని చెప్పారు. దాన్ని శుభ్రం చేసే బాధ్యత మునిసిపాలిటీ వహించలేదు. ఆ గొడౌను మురికిగాను, అపరిశుభ్రంగాను ఉంది. మేమంతా కలిసి దాన్ని శుభ్రం చేశాము. ఉదార హృదయులగు భారతీయులు మంచాలు వగైరా ఇచ్చారు. అక్కడ ఒక ఆసుపత్రి వాతావరణం ఏర్పడింది. మునిసిపాలిటీ వారు ఒక నర్సును పరిచారికను పంపించారు. బ్రాందీ సీసాలు, మందులు వగైరా వారికిచ్చి పంపారు. డాక్టర్ గాడ్‌ఫ్రే మొదటివలెనే మాతోబాటు వుండి చికిత్స చేస్తున్నారు. నర్సును మేము రోగుల దగ్గరికి పోనీయలేదు. ఆమెకు ఏమీ ఇబ్బంది కలుగలేదు. ఆమె స్వభావం మంచిది. అయితే ఎవ్వరికీ ప్రమాదం కలుగకూడదని మా అభిప్రాయం. రోగులకు బ్రాందీ పట్టమని సలహా ఇచ్చింది. వ్యాధి సోకకుండా మీరు కూడా కొద్ది కొద్దిగా బ్రాందీ తాగమని నర్సు మాకు సలహా ఇచ్చింది. ఆమె బ్రాందీ త్రాగుతూనే వున్నది. రోగులకు బ్రాందీ పట్టడానికి నా మనస్సు అంగీకరించలేదు. ముగ్గురు రోగులు బ్రాందీ త్రాగకుండా వుండటానికి అంగీకరించారు. డా. గాడ్‌ఫ్రే గారి

అనుమతితో వారికి మట్టిపట్టీల చికిత్స చేశాను. గుండెలో నొప్పిగా వున్నచోట మట్టి పట్టీలు వేశాను. వారిలో ఇద్దరు మాత్రం బ్రతికారు. మిగతావారంతా చనిపోయారు. ఇరవై మంది రోగులు ఆ గొడౌనులోనే చనిపోయారు.

మునిసిపాలిటీ వారు మరో ఏర్పాటు చేశారు. జోహన్సుబర్గుకు ఏడు మైళ్ళ దూరాన అంటురోగాలు తగిలిన వారి కోసం ప్రత్యేక ఆసుపత్రి వున్నది. అక్కడ డేరా వేసి ముగ్గురు రోగుల్ని తీసుకువెళ్ళారు. ప్లేగు తగిలిన మిగతా రోగుల్ని కూడా అక్కడకు తీసుకొని వెళ్ళేందుకు ఏర్పాట్లు చేశారు. దానితో మాకు ముక్తి లభించింది. పాపం ఆ నర్సు కూడా ప్లేగు వ్యాధి సోకి చనిపోయిందని కొద్దిరోజుల తరువాత మాకు తెలిసింది. కొద్దిమంది రోగులు బ్రతకడం, మేముప్లేగువాత బడకుండా మిగలడం విచిత్రమే. ఇలా ఎందుకు జరిగిందో చెప్పలేము. అయితే మట్టి చికిత్స మీద నాకు శ్రద్ధ ఔషధ రూపంలో బ్రాందీ మొదలగువాటి ఎడ అశ్రద్ధ పెరిగింది. ఈ శ్రద్ధకు, అశ్రద్ధకు ఆధారం ఏమీ లేదని అనవచ్చు. నాకు ఆ విషయం తెలుసు. కాని ఆనాడు నా మనస్సుపైబడిన ముద్రను తొలగించలేను. ఈనాటికీ ఆ ముద్ర అలాగే ఉన్నది. అందువల్లనే ఇక్కడ ఆ విషయాన్ని వ్రాయడం అవసరమని భావించాను.

ఈ నల్లప్లేగు వంటి భయంకర వ్యాధి ప్రబలగానే నేను పత్రికల్లో మునిసిపాలిటీ వారు లోకేషను తమ అధీనంలోకి తీసుకున్న తరువాత చూపిన అశ్రద్ధను గురించి వివరంగా వ్రాసి ఇట్టి వ్యాధి రావడానికి వారి బాధ్యతను నొక్కి వక్కాణిస్తూ జాబు ప్రకటించాను. నా ఆ జాబు మి. హెనరీ పోలక్‌ను నాకు పరిచయం చేసింది. కీ.శే. జోసఫ్‌డోక్‌తో పరిచయం కావడానికి సాధనంగా ఉపయోగపడింది.

గత ప్రకరణంలో నేను భోజనం నిమిత్తం ఒక మాంసాహార రహిత భోజనశాలకు వెళుతూ వుండేవాడినని వ్రాశాను. అక్కడ మి. అల్బర్టువెస్ట్‌తో పరిచయం కలిగింది. మేము సాయంత్రం పూట ఆ భోజనశాలలో కలుస్తూ వుండేవారం. అక్కడ ఆహారం తీసుకొని షికారుకు వెళ్ళేవారం. అయన ఒక చిన్న ప్రెస్సులో భాగస్వామిగా వుండేవాడు. పత్రికల్లో మహమ్మారిని గురించిన నా జాబు చదివి, భోజనశాలలో నేను కనబడక పోయేసరికి కంగారు పడిపోయాడు. నేనూ, నాతోటి అనుచరులు రోగులకు సేవచేస్తున్నప్పుడు భోజనం పూర్తిగా తగ్గించివేశాం. ప్లేగువంటి వ్యాధులు ప్రబలినప్పుడు పొట్ట ఎంత తేలికగా వుంటే అంత మంచిదని అనుభవం వల్ల తెలుసుకున్నాము. అందువల్ల సాయంకాల భోజనం మానివేశాను. మధ్యాహ్నం పూట భోజనం చేసి వచ్చేవాణ్ణి. భోజనశాలలో భోనం మానివేశాను. మధ్యాహ్నం పూట భోజనం చేసి

వచ్చేవాణ్ణి. భోజనశాల యజమాని నన్ను బాగా ఎరుగును. ఆయనకు ముందుగానే నేను ప్లేగు సోకిన రోగుల సేవ చేస్తున్నాను. నా వల్ల ఎవ్వరికీ ఏ విధమైన యిబ్బంది కలుగకూడదు అని చెప్పాను. అందువల్ల నేను భోజనశాలలో వెస్టుగారికి కనబడలేదు. రెండోరోజునో లేక మూడో రోజునో ఉదయం పూట నేను బయటకు వెళ్ళబోతున్నప్పుడు నేనుండే గది దగ్గరికి వచ్చి తలుపుకొట్టగా నేను తలుపు తెరిచాను. నన్ను చూచీ చూడగానే "మీరు భోజనశాలలో కనబడనందున మీకేమైనా అయిందేమోనని గాబరాపడ్డాను. ఈ సమయంలో తప్పక దొరుకుతారనే భావంతో వచ్చాను. అవసరమైతే చెప్పండి. రోగులకు సేవ శుశ్రూషలు చేసేందుకు సిద్ధంగా ఉన్నాను. నా పొట్ట నింపుకోవడం మినహా నాకు మరో బాధ్యత అంటూ ఏమీ లేదని మీకు తెలుసుగదా! అని అన్నాడు.

నేను వెస్టుగారికి ధన్యవాదాలు సమర్పించాను. నేను ఆలోచించేందుకు ఒక్క నిమిషం సేపు కూడా వృధా చేయలేదు. "మిమ్మల్ని నర్సుగా తీసుకోను. మేము జబ్బు పడకపోతే రెండుమూడు రోజుల్లో మా పని పూర్తి అవుతుంది. ఒక్క పని మాత్రం ఉన్నది" అని అన్నాను. "ఏమిటది" "దర్బను వెళ్ళి ఇండియన్ ఒపీనియన్ ప్రెస్సుపని మీ చేతుల్లోకి తీసుకోగలరా? మదనజీత్ ప్రస్తుతం ఇక్కడ పనిలో మునిగి ఉన్నాడు. అక్కడికి ఎవరైనా వెళ్ళడం అవసరం. మీరు వెళితే ఆ చింత నాకు తొలగుతుంది" "నా దగ్గర ప్రెస్సు వున్నదని మీకు తెలుసు. ఏ సంగతీ సాయంకాలం చెబుతా. సరేనా! సాయంత్రం వాహ్యాళికి వెళదాం మాట్లాడుకోవచ్చు" నాకు ఆనందం కలిగింది. ఆ రోజు సాయంత్రం మాట్లాడాం. ప్రతిమాసం వెస్టుకు పది పౌండ్ల జీతం మరియు ప్రెస్సులో డబ్బు మిగిలితే దానిలో భాగం ఇవ్వడానికి అంగీకరించాను. నిజానికి వెస్టుదొర జీతానికి ఒప్పుకునే వ్యక్తికాదు. అందువల్ల జీతాన్ని గురించి ఆయన పట్టించుకోలేదు. రెండో రోజు రాత్రి మెయిలుకి వెస్ట్ బయలుదేరి వెళ్ళాడు.

అప్పటినుండి నేను దక్షిణ ఆఫ్రికా వదిలి వచ్చేవరకు కష్టసుఖాల్లో నాతోబాటు వుండి ఆయన పనిచేశాడు. వెస్టుదొర ఇంగ్లాండులో లౌథ్ అను గ్రామంలో ఒక రైతు కుటుంబంలో జన్మించిన వ్యక్తి. స్కూల్లో సామాన్య శిక్షణ పొంది, కష్టపడి పైకి వచ్చి అనుభవం అనే పాఠశాలలో శిక్షణ పొందినవాడు. పొందికగల సంయమశీలి, భగవంతునికి భయపడేమనిషి ధైర్యశాలి, పరోపకారి. ఆయనను గురించి, ఆయన కుటుంబాన్ని గురించి రాబోయే ప్రకరణాల్లో వ్రాస్తాను.

# 17. లొకేషను దగ్ధం

ప్లేగుకు సంబంధించిన పనుల నుండి ముక్తి పొందామేకాని అందుకు సంబంధించిన మిగతా వ్యవహారాలు యింకా మమ్మల్ని వదలలేదు. లొకేషను పరిస్థితిని గురించి మునిసిపాలిటీ పట్టించుకోలేదు. నిర్లక్ష్యంగా వ్యవహరించింది. కాని తెల్లవారి ఆరోగ్యం విషయంలో మాత్రం పూర్తిగా పట్టించుకొని ఇరవైనాలుగు గంటలు జాగ్రత్త వహించింది. తెల్లవారి ప్రాంతాలకు వ్యాధి ప్రాకకుండా వుండేందుకు డబ్బు నీళ్ళలా ఖర్చు పెట్టింది. హిందూ దేశస్థులను గురించి గాని, వాళ్ల ఆరోగ్యాన్ని గురించి గాని పట్టించుకోని దోషాలు మునిసిపాలిటీ వారిలో చూచాను. అయితే తెల్లవారి ఆరోగ్యం విషయమై వారు చూపిన శ్రద్ధను అభినందించకుండా వుండలేకపోయాను. ఈ విషయమై చేయగలిగినంత సాయం నేను చేశాను. నేను ఆ సాయం చేసియుండకపోతే మునిసిపాలిటీ వారు ఎంతో ఇబ్బంది పడేవాళ్ళే. గుండ్లవర్షం కురిపించో, తుపాకుల సాయం పొందో తమ నిర్ణయాలను అమలుచేసి యుండేవారు.

అయితే అలా జరగలేదు. హిందూదేశస్థులు వ్యవహరించిన తీరుకు వాళ్ళు ఎంతో సంతోషించారు. తత్ఫలితంగా తరువాత పనులు సవ్యంగా జరిగాయి. మునిసిపాలిటీ వారి పనులు హిందూ దేశస్థుల ద్వారా చేయించడానికి నా పలుకుబడి ఉపయోగపడింది. నా వత్తిడి లేకపోతే హిందూ దేశస్థులు ఆ పనులు చేసేవారు కాదు.

లొకేషనుకు నలువైపుల కాపలా పెట్టారు. అనుమతి లేకుండా లోపలికి ఎవ్వరూ పోగూడదు. బయటికి రాకూడదు. నాకు, నా అనుచరులకు లోపలికి వెళ్ళడానికి, బయటకు రావడానికి పర్మిట్ ఇచ్చారు. లొకేషనులో నివసిస్తున్న హిందూ దేశస్థులనందరినీ జోహన్సుబర్గుకు 13 మైళ్ళ దూరాన మైదానంలో డేరాలు వేసి వాటిలో వుంచాలని, ఆ తరువాత లొకేషనును దగ్ధం చేయాలని మునిసిపాలిటీవారు నిర్ణయించారు. అక్కడకు వెళ్ళి డేరాల్లో కుదుటపడటానికి కొంత సమయం పట్టింది. అందాకా కాపలా ఏర్పాటు అలాగే ఉంచారు.

జనం భయపడ్డారు. అయితే నేను వాళ్ళవెంట వున్నాననే ధైర్యం వాళ్ళకు వున్నది. చాలామంది తమ డబ్బు భూమిలో గుంట తవ్వి దాచుకున్నారు. ఇప్పుడు ఆ డబ్బు బయటకి తీయవలసి వచ్చింది. వాళ్ళకు బ్యాంకుల విషయం తెలియదు. నేను వారికి బ్యాంకు అయ్యాను. నా దగ్గర వాళ్ళందరి సొమ్ము కుప్పలుగా చేరింది. ఆ సొమ్ములో నేను కమీషను తీసుకునే సమస్యే లేదు. వాళ్ళ డబ్బు సమస్యను

పరిష్కరించాను. బ్యాంకు మేనేజరుతో నాకు పరిచయం ఉన్నది. మీ దగ్గర డబ్బు నిల్వ చేస్తానని ఆయనకు చెప్పాను. బ్యాంకు వెండి, రాగి వస్తువుల్ని తమ వద్ద ఉంచేందుకు అంగీకరించలేదు. ప్లేగు సోకిన ప్రదేశానికి సంబంధించిన వస్తువులని తెలిస్తే బ్యాంకులో పని చేస్తున్న వారు వాటిని తాకేందుకు కూడా సిద్ధపడేవారు కారు. అయితే బ్యాంకు మేనేజరు తెలిసినవాడు కావడం వల్ల అన్ని సౌకర్యాలు కల్పించాడు. డబ్బును క్రిమినాశక మందులచే కడిగి బ్యాంకులో వుంచడానికి నిర్ణయించాము. ఈ విధంగా 60 వేల పౌండ్లు బ్యాంకులో జమ చేసినట్లు గుర్తు.

కొంతకాలం పాటు ఫిక్సెడ్ డిపాజిటులో డబ్బు జమ చేసుకోమని బాగా డబ్బు గల కక్షిదారులకు చెప్పాను. ఆ విధంగా వారి డబ్బు బ్యాంకులో అమితంగా జమపడింది. దానితో బ్యాంకులో సొమ్ము జమ చేయడం, అవసరమైనప్పుడు తీసుకోవడం వాళ్ళకు తెలిసింది. లొకేషను వాసులందరినీ క్లిపస్ప్రుట్ అను ఫారానికి ప్రత్యేక రైల్లో తీసుకువెళ్ళారు. వాళ్ళకు నీరు మునిసిపాలిటీ వారు తమ ఖర్చుతో అందజేశారు. ఆ పేటను చూస్తే సైనికుల బస్తీగా కనబడుతూ ఉన్నది. జనానికి అలా ఉండటం అలవాటు లేదు. వారికి మానసిక శ్రమ కలిగింది. అంతా క్రొత్తగా ఉన్నది. అయితే వాళ్ళకు ఇబ్బందులేమీ కలుగలేదు. నేను రోజూ సైకిలు మీద ఒకసారి వెళ్ళి అంతా తిరిగి చూచివస్తూ వుండేవాణ్ణి. మూడు వారాలపాటు ఈ విధంగా తెరపగాలిలో వుండటం వల్ల వాళ్ళ ఆరోగ్యం బాగు పడింది. మానసిక కష్టం మొదటి 24 గంటలు మాత్రమే ఉన్నది. తరువాత అంతా సంతోషంగా వుండసాగారు. నేను వెళ్ళినప్పుడు అంతా భజనలు చేస్తూ, కీర్తనలు పాడుతూ ఆటలు ఆడుతూ వుండేవారు.

లొకేషను ఖాళీ చేసిన తరువాత రెండవ రోజున లొకేషనును తగులబెట్టారు. అక్కడి వస్తువుల్లో ఒక్క దానిని కూడా మిగిల్చి వుంచాలనే కోరిక మునిసిపాలిటీ వారికి కలుగలేదు. ఈ నెపంతో తమ మార్కెట్టులో గల కలపనంతటినీ కూడా తగులబెట్టారు. అంతా కలిసి పదివేల పౌండ్ల సొమ్ము నష్టమైంది. మార్కెట్టులో చచ్చిన ఎలుకలు పడివున్నాయి. అందువల్లనే అంత భయంకరంగా లొకేషనును తగులబెట్టారు. ఖర్చు బాగా అయింది కాని వ్యాధి మాత్రం అంతటితో ఆగిపోయింది. నగర ప్రజల భయం తొలగిపోయింది.

## 18. ఒక పుస్తకపు అద్భుత ప్రభావం

ఈ ప్లేగు వ్యాధి బీదవారైన హిందూదేశస్థుల్ని గురించి నా పనిని, నా వృత్తిని, నా బాధ్యతను బాగా పెంచివేసింది. యూరోపియన్లతో నాకు పరిచయం బాగా

పెరగడమే గాక వారి యెడ నా నైతిక బాధ్యత కూడా బాగా పెరిగింది. మాంసరహిత భోజనశాలలో వెస్టుదొరతో నాకు పరిచయం అయినట్లే పోలక్‌తో కూడా పరిచయం అయింది. ఒకరోజు నేను బల్ల దగ్గర కూర్చొని భోజనం చేస్తున్నాను. దూరంగా వున్న ఒక బల్ల దగ్గర కూర్చొని ఒక యువకుడు భోజనం చేస్తున్నాడు. "మిమ్ము కలుసుకోవాలని అనుకుంటున్నాను. అనుమతి ఇస్తారా" అని చీటీ వ్రాసి పంపించాడు. ఆయనను నా బల్లదగ్గరకు రమ్మన్నాను ఆయన వచ్చాడు.

"నేను క్రిటిక్ అను పత్రికకు ఉపసంపాదకుణ్ణి. ప్లేగును గురించి మీరు ప్రకటించిన జాబు చదివాను. అప్పటి నుండి మిమ్ము కలుసుకోవాలని అనుకుంటున్నాను. నా ఆ కోరిక ఈనాడు నెరవేరింది." అని అన్నాడు.

మి. పోలక్ యొక్క నిష్కపట భావాలవల్ల నేను ఆయన యెడ ఆకర్షితుడనయ్యాను. ఆ రాత్రి మేమిద్దరం ఒకరికొకరం బాగా పరిచితులమయ్యాం. మా జీవిత విధానాల్లో సామ్యం కనబడింది. సాదా జీవనం వారికి ఇష్టం. బుద్ధి అంగీకరించిన విషయాల్ని వెంటనే అమలు పరచాలన్న తపన ఆయనలో అధికంగా కనబడింది. తన జీవనంలో చాలా మార్పులు వెంటనే చేసిన వ్యక్తి మి. పోలక్.

"ఇండియన్ ఒపీనియన్" ఖర్చు పెరిగిపోతున్నది. వెస్టు పంపిన మొదటి రిపోర్టు చదివి నివ్వెరపోయాను. "మీరు చెప్పినంత లాభం యిక్కడ కనబడలేదు. నష్టం కనబడుతున్నది. లెక్కలు కూడా అస్తవ్యస్తంగా వున్నాయి. పని అయితే బాగానే వున్నది. కాని దానికి తలా తోకా కనబడటం లేదు. మార్పు చేయవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఈ రిపోర్టు చూచి గాబరా పడకండి. నాకు చేతనైనంత వరకు వ్యవస్థను సరిచేస్తాను. లాభం లేదని నేను పని మానను" అని జాబు వ్రాశాడు.

లాభం లేనందున వెస్టు తలుచుకుంటే పని మానివేసేవాడే. ఆయనను తప్పు పట్టడానికి కూడా వీలులేదు. సరియైన వివరాలు తెలుసుకోకుండా లాభం వస్తున్నదని చెప్పినందుకు నన్ను తప్పు పట్టవచ్చు కూడా. అయినా ఆయన నన్ను ఎన్నడూ ఒక కటువైన మాటకూడా అనలేదు. చెప్పుడు మాటలు నమ్మేవాడినని నన్ను గురించి వెస్టు భావించి వుంటాడని అనుకున్నాను. మదనజీత్ మాట ప్రకారం నేను లాభం వస్తున్నదని వెస్టుకు చెప్పాను. సార్వజనిక పనులు చేసేవారు స్వయంగా పరిశీలించి చూడనిదే ఒకరిని నమ్మి వెంటనే నిర్ణయానికి రాకూడదని పాఠం నేర్చుకున్నాను. సత్యపూజారి ఇంకా జాగ్రత్తగా వుండాలి. పూర్తిగా నిర్ణయానికి రానిదే ఏదో మాట చెప్పి ఒకరి మనస్సును నమ్మేలా చేయడం సత్యాన్ని మరుగుపరచడమే. ఈ విషయం తెలిసియుండి

కూడా త్వరగా నమ్మి పనిచేసే నా స్వభావాన్ని పూర్తిగా మార్చుకోజాలనందుకు విచారపడ్డాను. ఇందుకు కారణం శక్తి సామర్థ్యం కంటే మించి పని చేద్దామనే లోభమే. ఈ లోభం వల్ల నేను కష్టపడవలసి వచ్చింది. అంతేగాక నా సహచరులు ఎంతో ఇబ్బందులకు లోనుకావలసి వచ్చింది.

వెస్ట్ వ్రాసిన జాబు చూచి నేను నేటాలుకు బయలుదేరాను. పోలక్ నా విషయాలన్నీ గ్రహించాడు. నన్ను సాగనంపుటకు స్టేషనుకు వచ్చాడు. ఒక పుస్తకం నాకిచ్చి "ఈ పుస్తకం చదువతగింది చదవండి. మీకు నచ్చుతుంది" అని అన్నాడు. పుస్తకం పేరు "అంటు దిస్ లాస్ట్" రస్కిన్ రాసిన పుస్తకం. ఆ పుస్తకం చదవడం ప్రారంభించాను. చివరివరకు దాన్ని వదలలేకపోయాను. నన్ను ఆ పుస్తకం ఆకట్టివేసింది. జోహన్సుబర్గు నుండి నేటాలుకు 24 గంటల ప్రయాణం. సాయంత్రం రైలు డర్బను చేరుకుంది. స్థావరం చేరిన తరువాత ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. పుస్తకంలో చదివిన విషయాల్ని ఆచరణలో పెట్టాలనే నిర్ణయానికి వచ్చాను.

ఇంతకు ముందు రస్కిన్ పుస్తకాలు ఏవీ నేను చదవలేదు. స్కూల్లో చదువుకునే రోజుల్లో పాఠ్య పుస్తకాలు తప్ప ఇతర పుస్తకాలు నేను అసలు చదవలేదనే చెప్పవచ్చు. కర్మభూమి మీద అడుగుపెట్టిన తరువాత సమయం చిక్కలేదు. అందువల్ల ఈనాటి వరకు నాకుగల పుస్తక జ్ఞానం తక్కువేనని చెప్పక తప్పదు. అయాచితంగా తప్పనిసరి అయి ఏర్పడిన ఈ సంయమం వల్ల నష్టం కలగలేదని చెప్పలేను. కాని చదివిన కొద్ది పుస్తకాలను ఒంట పట్టించుకున్నానని మాత్రం చెప్పగలను. నా జీవితంలో చదివిన తక్షణం మహత్తరమైన నిర్మాణాత్మక మైన మార్పు తెచ్చిన పుస్తకం ఇదేనని మాత్రం చెప్పగలను. తరువాత దాన్ని నేను అనువదించాను. సర్వోదయం అను పేరట ఆ పుస్తకం అచ్చు అయింది.

నాలో లోతుగా పాతుకుపోయిన విషయాల ప్రతిబింబం స్పష్టంగా రస్కిన్ రచించిన ఈ గ్రంథరత్నంలో నాకు కనబడింది. అందువల్ల ఈ పుస్తక ప్రభావం నా హృదయం మీద అపరిమితంగా పడింది. ఆ పుస్తకమందలి విషయాల్ని ఆచరణలో పెట్టాలని ప్రేరణ కలిగింది. మనలో నిద్రావస్థలో వున్న మంచి భావాలను, గుణాలను మేల్కొలపగల శక్తి కలవాడే కవి. కవుల ప్రభావం సర్వుల మీద పడదు. సర్వులలో మంచి భావాలు సమాన పరిమాణంలో వుండకపోవడమే అందుకు కారణం. నేను తెలుసుకున్న సర్వోదయ సిద్ధాంతాలు ఇవి.

1. సర్వుల మంచి యందే తన మంచి ఇమిడి ఉన్నది.
2. వకీలు, క్షురకుడు ఇద్దరి వృత్తికి విలువ ఒకటిగానే ఉండాలి. జీవనోపాధి హక్కు అందరికీ సమానమే.
3. నిరాడంబరంగా వుంటూ కష్టపడి పనిచేసే రైతు జీవనమే నిజమైన జీవనం.

మొదటి విషయం నాకు తెలుసు. రెండో విషయం కొంచెం తెలుసుకుంటున్నాను. మూడో విషయాన్ని నేను ఎన్నడూ ఊహించలేదు. మొదటి దానిలో మిగతా రెండూ ఇమిడి వున్నాయి. ఈ విషయం దీపం వలె వెలుగు ప్రసారం చేసి సర్వోదయాన్ని నాకు బోధ చేసింది. తెల్లవారింది. ఇక ఆచరణకు పూనుకున్నాను.

## 19. ఫినిక్సు స్థాపన

మరునాడు ఉదయం నేను వెస్ట్‌తో మాట్లాడాను. సర్వోదయ వివరమంతా ఆయనకు తెలియజేశాను. ఇండియన్ ఒపీనియన్ పత్రికను ఏదైనా పొలానికి తీసుకుపోదామని చెప్పాను. అక్కడ అంతా కలిసి వుందాం. భోజనానికి అయ్యే ఖర్చు మాత్రం అంతా తీసుకుందాం. సంపాదన కోసం వ్యవసాయం చేద్దాం. మిగతా సమయంలో ఇండియన్ ఒపీనియన్ పని చేద్దాం అని చెప్పాను. వెస్ట్ అందుకు అంగీకరించాడు. ఒక్కొక్కరికి భోజనం ఖర్చు కనీసం మూడు పౌండ్లు అవుతుందని అంచనా వేశాం. తెల్లవారు నల్లవారు అని భేదం చూపలేదు.

అయితే ప్రెస్సులో ఇప్పుడు పదిమందిదాకా కార్యకర్తలు పని చేస్తున్నారు. అడవిలో వుండటానికి అంతా అంగీకరిస్తారా? అంతా సమానంగా భోజనానికి బట్టలకు అయ్యే ఖర్చు మాత్రమే తీసుకోవడానికి సిద్ధపడతారా? ఈ రెండు ప్రశ్నలు బయలుదేరాయి. ఈ విధంగా పని చేయడానికి అంగీకరించని వారు జీతం తీసుకోవచ్చు. కాని త్వరలోనే వారు కూడా సంస్థలో చేరిపోవాలి. ఈ ఆదర్శంతో అంతా పనిచేయాలి అని మేమిద్దరం నిర్ణయానికి వచ్చాం. ఈ దృష్టితో కార్యకర్తలను పిలిచి మాట్లాడాను. మదనజీత్‌కు మా నిర్ణయం మింగుడు పడలేదు. ఎంతో కాలం కష్టపడి తాను నెలకొల్పిన వ్యవస్థ నా మూర్ఖత్వం వల్ల మట్టిలో కలిసిపోతుందని, ఇండియన్ ఒపీనియన్ ఆగిపోతుందని ప్రెస్సు నడవదని, పనిచేసేవాళ్ళంతా పారిపోతారని అభిప్రాయపడ్డాడు.

నా అన్నగారి కుమారుడు ఛగన్‌లాలు ప్రెస్సులో పనిచేస్తున్నాడు. అతనితో కూడా నేను వెస్ట్‌ను వెంటబెట్టుకునే మాట్లాడాను. అతనికి కుటుంబ భారం జాస్తి.

అయితే బాల్యం నుండి అతడు నేను చెప్పిన ప్రకారం శిక్షణ పొందడానికి నేను చెప్పిన ప్రకారం నడుచుకోవడానికి ఇష్టపడ్డాడు. నా మీద అతడికి అపరిమితమైన విశ్వాసం. మారు మాటాడకుండా మేము చెప్పిన ప్రకారం చేయడానికి అంగీకరించాడు. ఇప్పటివరకూ నా దగ్గరే ఉన్నాడు.

గోవిందసామి అని మెషిన్‌మెన్ వున్నాడు. అతడు కూడా సంస్థలో చేరిపోయాడు మిగతావాళ్ళు సంస్థలో చేరేందుకు అంగీకరించలేదు. కాని ప్రెస్సును ఎక్కడికి తీసుకువెళితే అక్కడకు రావడానికి సిద్ధపడ్డారు.

ఈ విధంగా కార్యకర్తలతో మాట్లాడేందుకు రెండు రోజుల కంటే ఎక్కువ కాలం పట్టలేదని గుర్తు. వెంటనే నేను డర్బనుకు సమీపంలో స్టేషను దగ్గరగా భూమి కావాలని, పత్రికల్లో ప్రకటన చేశాను. ఫినిక్స్ యందలి చోటు వున్నది ఇస్తామని సమాధానం వచ్చింది. నేను, వెస్ట్ ఇద్దరం ఆ చోటు చూచేందుకు వెళ్ళాం. ఏడు రోజుల్లోపల 20 ఎకరాలు భూమి కొన్నాం. అందు ఒక చిన్ని నీటి కాలువ ఉన్నది. నారింజ చెట్లు, మామిడిచెట్లు కూడా ఉన్నాయి. దాని ప్రక్కన మరో 80 ఎకరాల భూమి కూడా ఉన్నది. అందు పండ్ల చెట్లు ఎక్కువగా ఉన్నాయి. ఒక కుటీరం కూడా ఉన్నది. దాన్ని కూడా కొద్ది రోజుల తరువాత కొనివేశాం. రెండిటికీ కలిపి 10 వేల పౌండ్లు ఇచ్చాం.

సేఠ్ పారసీరుస్తుంగారు నేను పూనుకొనే సాహసోపేతమైన కార్యక్రమా లన్నింటికీ అండగా వుండేవారు. నా ప్రణాళిక వారికి నచ్చింది. ఒక పెద్ద గొడౌనుకు చెందిన టిన్ను రేకులు మొదలుగాగలవి వారి దగ్గరపడి ఉన్నాయి. వాటినన్నింటినీ ఉచితంగా మాకు ఇచ్చివేశారు. వాటితో గృహ నిర్మాణం ప్రారంభించాం. కొంతమంది హిందూ దేశానికి సంబంధించిన వడ్రంగులు, తాపీవాళ్ళు దొరికారు. వారిలో చాలామంది యుద్ధరంగంలో నాతోబాటు పనిచేసినవారే. వారి సాయంతో కార్ఖానా నిర్మాణం ప్రారంభమైంది. ఒక మాసం రోజుల్లో 75 అడుగుల పొడవు, 50 అడుగుల వెడల్పుగల ఇంటి నిర్మాణం పూర్తి అయింది. వెస్ట్ మొదలగు వారు ప్రాణాలకు తెగించి వడ్రంగులు తాపీవాళ్ళతో బాటు పనిచేశారు. ఫినిక్సులో గడ్డి ఎక్కువగా ఉంది. అక్కడ జనసంఖ్య బహు తక్కువ. పాములు మాత్రం ఎక్కువ. ఇదే అక్కడ ప్రమాదం. ప్రారంభంలో అంతా డేరాలు వేసుకొని వున్నారు. ఇంట యందలి ముఖ్యభాగం తయారవగానే ఎద్దుల బండ్లలో సామాను అక్కడికి చేర్చాం. డర్బనుకు, ఫినిక్సు పదమూడు మైళ్ళ దూరాన ఉన్నది. స్టేషనుకు మా భూమి రెండున్నర మైళ్ళ దూరాన ఉన్నది. ఒక్క వారం మాత్రమే ఇండియన్ ఒపీనియన్ పత్రికను మర్క్యూరీ ప్రెస్సులో ముద్రించవలసి వచ్చింది.

నా వెంట మా బంధువులు చాలా మంది దక్షిణ ఆఫ్రికా వచ్చారు. వాళ్ళంతా వ్యాపారం చేసుకుంటున్నారు. వారిని అంగీకరింపచేసి ఫినిక్సులో చేరుద్దామని ప్రయత్నం చేశాను. డబ్బు సంపాదించుకోవాలనే తాపత్రయంతో వాళ్ళు దక్షిణ ఆఫ్రికా వచ్చారు. వారికి నచ్చచెప్పడం కష్టం. కొద్దిమంది మాత్రమే నా మాటల్ని అర్థం చేసుకున్నారు. అట్టివారిలో మగన్‌లాల్ గాంధీ పేరు ఎన్నిక చేసి మరీ పేర్కొంటున్నాను. నా మాటలు అర్థం చేసుకున్న వారిలో కొంతమంది కొద్దిరోజులు ఫినిక్సులో వుండి తరువాత డబ్బు సంపాదనలో పడిపోయారు. కాని మగన్‌లాల్ గాంధీ మాత్రం అలా చేయలేదు. తమ వ్యాపారం మానుకొని నా వెంట రావడమే గాక చివరవరకూ నాతోబాటు వుండిపోయాడు. తన బుద్ధిబలం, త్యాగనిరతి, అపరిమితమైన భక్తి భావంతో నేను ప్రారంభించిన శోధనా కార్యక్రమాలన్నింటిలో అండగా నిలబడి పనిచేశాడు. నా అనుచరుల్లో ఇప్పుడు మొదటిస్థానంలో మగన్‌లాల్ వున్నాడు. సుశిక్షితుడైన పనివాడుగా సాటిలేని మేటిగా నా దృష్టిలో ఆదరం పొందాడు.

ఈ విధంగా 1904 లో ఫినిక్సు స్థాపన జరిగింది. ఎన్నో కష్టనష్టాల్ని ఎదుర్కోవలసివచ్చినా తట్టుకొని ఫినిక్సు సంస్థ, ఇండియన్ ఒపీనియన్ పత్రిక రెండూ ఇప్పటికీ జీవించి వున్నాయి. అయితే ఈ సంస్థను ప్రారంభించినప్పుడు మేము పొందిన సాఫల్యాలు, వైఫల్యాలు తెలుసుకోతగినవి. వాటిని గురించి మరో ప్రకరణంలో వ్రాస్తాను.

## 20. మొదటి రాత్రి

ఫినిక్సులో ఇండియన్ ఒపీనియన్ పత్రిక ప్రథమ ప్రతిని వెలువరించడం కష్టమైంది. రెండు జాగ్రత్తలు పడియుండకపోతే ఒక వారం సంచిక వెలువడియుండేది కాదు లేక ఆలస్యంగా వెలువడియుండేది. ఈ సంస్థలో ఇంజను సాయంతో నడిచే మిషన్లు ఏర్పాటు చేయడం నాకు ఇష్టం లేదు. వ్యవసాయం చేతులతో చేస్తున్నప్పుడు ముద్రణా కార్యక్రమం కూడా చేతులతో నడిచే మిషన్లతో సాగించడం మంచిదని భావించాను. అయితే అది కష్టమని ఆ తరువాత తెలిసింది. దానితో అక్కడికి ఆయిలు ఇంజను తీసుకువెళ్ళాం. ఈ ఆయిలు ఇంజను దగా చేస్తే ముద్రణ సాగించేందుకు మరో పరికరం సిద్ధం చేసి వుంచుకోవడం అవసరమని వెస్ట్‌కు చెప్పాను. అతడు చేతితో త్రిప్పితే తిరిగే చక్రం ఒకటి సిద్ధం చేశాడు. దానితో ముద్రణ యంత్రం నడిచే ఏర్పాటు చేశాడు. మా పత్రిక దినపత్రిక ఆకారంలో ఉన్నది. పెద్దమిషను పాడైతే వెంటనే దాన్ని

బాగు చేసే ఏర్పాటు మా దగ్గర లేదు. అందువల్ల పత్రిక ఆగిపోయే పరిస్థితి ఏర్పడింది. ఈ ఇబ్బంది నుండి తప్పించుకునేందుకై పత్రిక ఆకారాన్ని వారపత్రిక రూపంలోకి మార్చాం. కాలితో ట్రెడిల్ నడిపి కొన్ని పేజీలైనా ముద్రించవచ్చునని భావించాం. ఆరంభపు రోజుల్లో ఇండియన్ ఒపీనియన్ పత్రిక వెలువడే రోజు రాత్రి అంతా జాగరణ చేయాల్సి వచ్చింది. కాగితం సరిచేయడం, దాన్ని అమర్చడం మొదలగు పనులు అంతా కలిసి చేసేవాళ్ళం. రాత్రి 12 గంటలకు పనిపూర్తి అయ్యేది. అయితే ఫినిక్సులో ఆ మొదటి రాత్రి మరిచిపోవడానికి వీలులేనిది. ఫారం మిషను మీద ఎక్కించాం. అప్పుడు ఇంజన్ససేమిరా నడవనని భీష్మించింది. ఇంజనీరును పిలిపించాం. ఆయన, వెస్ట్ ఎంతో శ్రమ పడ్డారు. కాని ఇంజను మాత్రం నడవలేదు. అందరూ చింతాక్రాంతులైనారు. చివరికి వెస్ట్ నిరాశపడి పోయాడు. కన్నీరు కారుస్తూ నా దగ్గరకు వచ్చాడు. "ఇక మిషను ఇవాళ నడవదు. ఈ వారం సమయానికి మనం పత్రికను ప్రచురించలేము" అని అన్నాడు.

"అయితే ఏం చేస్తాం? కన్నీరు కార్చవలసిన అవసరం ఏముంది? ఇంకా ఏమైనా ప్రయత్నం చేయవలసి ఉంటే చేద్దాం. సరే కాని మీరు సిద్ధం చేసిన చక్రం సంగతి ఏమిటి?" అని అడిగాను. "ఆ చక్రం నడవడానికి జనం కావాలి. అంతమంది మన దగ్గర లేరు. మా వల్ల ఆ చక్రం నడవదు. వంతులవారీగా నలుగురు నలుగురు చొప్పున జనం కావాలి. మేమంతా బాగా అలిసిపోయాం' అని అన్నాడు వెస్ట్.

అప్పటికి వడ్రంగుల పని ఇంకా పూర్తికాలేదు. అందువల్ల వాళ్ళు వెళ్ళిపోలేదు. ముద్రణాలయంలోనే వారంతా నిద్రపోతున్నారు. వారిని చూపించి ఈ మేస్త్రీ లంతా వున్నారుగదా! వీరి సాయం పొందవచ్చుగదా! ఈ రాత్రి మనమంతా అఖండ జాగరణం చేద్దాం. అదే మంచిదని నా అభిప్రాయం అని అన్నాను. "మేస్త్రీలను మేల్కొలపాలన్నా, వారి చేత పనిచేయించాలన్నా నాకు ధైర్యం చాలడంలేదు. అలసిపోయిన వాళ్ళకు కూడా పని చేయమని ఎలా చెప్పడం?" 'ఆ పని నేను చేస్తాను" అని అన్నాను "అయితే పని పూర్తి కావచ్చు' నేను మేస్త్రీలను మేల్కొలిపాను. సాయం చేయమని కోరాను. వారిని బ్రతిమలాడవలసిన అవసరం కలుగలేదు. "ఇలాంటి కష్టసమయంలో ఆదుకోకపోతే మేము మనుష్యలం ఎలా అవుతాం? మీరు విశ్రాంత తీసుకోండి. మేము చక్రం త్రిప్పుతాం మాకు అది పెద్ద పనికాదు" అని వాళ్ళు అన్నారు.

ముద్రణ చేసే కార్యకర్తలు సిద్ధంగా ఉన్నారు. అంతా పనిచేస్తూ కీర్తనలు పాడటం ప్రారంభించారు. చక్రం త్రిప్పడానికి మేస్త్రీలకు సాయపడ్డాం. వంతులవారీగా

వాళ్ళు చక్రం త్రిప్పసాగారు. పని అయిపోతూ ఉన్నది. తెల్లవారింది. ఏడో గంట కొట్టారు. ఇంకా పని మిగిలి ఉండటం గమనించాను. వెస్ట్‌వైపు చూచి ఏమండీ ఇంజనీరును మేల్కొలపకూడదా? పగటిపూట బాగు చేస్తే ఇంజను నడుస్తుందేమో, పని సమయానికి పూర్తి అవుతుంది కదా! అని అన్నాను.

వెస్ట్ వెంటనే వెళ్ళి ఇంజనీరును మేల్కొలిపాడు. అతడు ఇంజను వున్న చోటకు వెళ్ళాడు. మీట నొక్కేసరికి ఇంజను పనిచేయడం ప్రారంభించింది. ప్రెస్సు అంతా సంతోషపు నినాదాలతో మార్మోగింది. "ఏమిటిది? ఇంజను రాత్రి నడవనంది కదా! మరి ఇప్పుడు మీటనొక్కగానే ఏమీ తెలియనట్లు ఠపీమని ఎలా నడిచింది?" ఈ ప్రశ్నలకు వెస్ట్, ఇంజనీరు సమాధానం ఇచ్చేందుకు ప్రయత్నించారు. "ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడం కష్టం. మిషన్లకు కూడా మన మాదిరిగా విశ్రాంతి అవసరం అయివుండవచ్చు. అప్పుడప్పుడు అవి ఇలా వ్యవహరిస్తూ వుండటం కద్దు" అని అన్నారు.

"ఇంజను మనందరికీ మంచి పరీక్ష పెట్టింది మనమంతా కష్టపడ్డాం సమయానికి అది నడవడం మన నిజమైన శ్రమకు శుభప్రదమైన ఫలితం అయివుండవచ్చు" అని అన్నాను. సమయానికి పత్రిక స్టేషను చేరుకుంది. అంతా నిశ్చింతగా శ్వాస పీల్చారు. పత్రిక సమయానికి వెలువడుతుందనే భావం జనానికి కలిగింది. ఫినిక్సులో కాయకష్టం చేయాలనే వాతావరణం నెలకొన్నది. ఒక పర్యాయం ఇంజనును నడపడం మాని, చక్రం త్రిప్పి ముద్రణా కార్యక్రమం సాగించిన రోజులు కూడా వున్నాయి. అవి నైతికంగా ఫినిక్సు చరిత్రలో ఉన్నతమైన రోజులని నా అభిప్రాయం.

## 21. పోలక్

ఫినిక్సు వంటి సంస్థ స్థాపించబడిన తరువాత నేను అక్కడ కొద్ది రోజులు మాత్రమే వుండగలిగాను. అందుకు ఎంతో విచారపడ్డాను. దాన్ని స్థాపించినప్పుడు నేను కూడా అక్కడే ఉండాలని, అక్కడే జీవితం గడపాలని నెమ్మదిగా వకీలు వృత్తి మానివేయాలని, ఫినిక్సు విజయాన్ని నిజమైన సేవగా భావించాలని అనుకున్నాను. కాని అనుకున్నట్లుగా పనులు జరగలేదు. మనం అనుకునేది ఒకటి, జరిగేది మరొకటి అను విషయాన్ని జీవితంలో అనుభవం వల్ల తెలుసుకున్నాను. దానితోబాటు సత్యశోధన ఉపాసన సాగినప్పుడు, మనం కోరుకున్న ఫలితం కలుగక, ఊహించని ఫలితం కలిగితే దానివల్ల నష్టం కలుగదని, ఒక్కొక్కప్పుడు మనం ఊహించిన దానికంటే మించిన

సత్ఫలితం కలుగుతుందనే అనుభూతి నాకు కలిగింది. ఫినిక్సులో కలిగిన ఊహించని ఫలితాలు, అక్కడ రూపొందిన ఊహించని కార్యక్రమాలు నష్టదాయకమైనవి కావని నా నిశ్చితాభిప్రాయం. ఊహించిన ఫలితాలకంటే మించినవి అవునో కాదో నిశ్చితంగా చెప్పలేను.

అంతా కాయకష్టం చేసి బ్రతకాలనే ఉద్దేశ్యంతో ముద్రణాలయ సమీపంలో సంస్థ యందలి ప్రతి వ్యక్తికి మూడు మూడు ఎకరాల చొప్పున భూమి కేటాయించాం. వాటిలో ఒక ముక్క నా కోసం ఉంచారు. ఆయా చోట్ల అందరికోసం, వారు కోరకపోయినా రేకులతో ఇళ్ళు నిర్మించాం. రైతుకు నప్పే విధంగా గడ్డి, మట్టి, పచ్చి ఇటుకలతో గోడలు కట్టి చొప్పతో పైకప్పు నిర్మించి కుటీరాలు ఏర్పాటు చేయాలని అనుకున్నాం. కాని సాధ్యపడలేదు అందుకు ధనం, సమయం అధికంగా కావలసి వచ్చింది. అందరూ ఇంటి వాళ్ళే, కనుక వెంటనే కాయకష్టం చేయాలని తహతహలాడారు.

"ఇండియన్ ఒపీనియన్" పత్రికకు సంపాదకుడు మన్ సుఖలాల్. ఆయన ఈ వ్యవస్థలో చేరలేదు. డర్బనులోనే ఆయన బస. డర్బనులో ఇండియన్ ఒపీనియన్‌కు చిన్న శాఖ కూడా ఉన్నది.

కంపోజు పని చేసేందుకు మనుషులు అదనంగా ఉన్నారు. నిజానికి ముద్రణా కార్యక్రమంలో ఎక్కువ సమయం కంపోజు చేయడానికి పడుతుంది. అయితే అది తేలిక పనే. సంస్థలో వుండేవారంతా కంపోజు పని నేర్చుకోవాలని నిర్ణయించారు. దానితో ఆ పని తెలియని వారంతా నేర్చుకోవడానికి సిద్ధపడ్డారు. నేను మాత్రం ఈ వ్యవహారంలో వెనుకబడ్డాను. మగన్‌లాల్ గాంధీ మొదటి స్థానం సంపాదించాడు.

అసలు మగన్‌లాల్‌కు అతని శక్తి ఏమిటో తెలియదని అనుకునేవాణ్ణి. అతడు ఎన్నడూ ప్రెస్సు పని చేయలేదు. అయినా నేర్పరియగు కంపోజిటరు అయ్యాడు. వేగంలో కూడా బాగా పుంజుకున్నాడు. కొద్దిరోజుల్లోనే ప్రెస్సు పనంతా క్షుణ్ణంగా తెలుసుకొని అతడు విజయవంతంగా ప్రెస్సు పని నిర్వహించడం చూచి నేను నివ్వెరబోయాను. ఇంకా ఫినిక్సు వ్యవహారం ఒక ఒడ్డుకు చేరలేదు. ఇంతలో ఈ క్రొత్త కుటుంబాన్ని వదిలి నేను జోహన్సుబర్గు పరుగెత్తవలసి వచ్చింది. అక్కడి పనిని ఎక్కువ కాలం వదలి వుండగల స్థితిలో నేను లేను.

జోహన్సుబర్గు చేరి పోలక్‌తో ఈ పెద్దమార్పును గురించిన వ్యవహారమంతా చెప్పాను. తానిచ్చిన పుస్తకం ఇంతటి మార్పుకు కారణం అయిందని తెలిసి పోలక్ పొంగిపోయాడు. అతని హృదయం ఆనందంతో నిండిపోయింది. "నేను కూడా ఈ

వ్యవస్థలో పాలుపంచుకోవచ్చా!" అని గద్గద కంఠంతో అడిగాడు. "తప్పక పాలుపంచుకోవచ్చు. అంతేకాదు మీరు అందులో చేరాలి" అని అన్నాను. "చేర్చుకుంటానంటే సిద్ధంగా ఉన్నాను." అని అన్నాడు. ఆయన నిర్ణయానికి సంతోషించాను. 'క్రిటిక్' పత్రిక నుండి తప్పుకుంటున్నానని ఒక నెల రోజుల ముందే నోటీసు పత్రికాధిపతికి పంపి, నెలరోజుల వ్యవధి గడచిపోగానే ఫినిక్సు చేరుకున్నాడు. తన సహృదయతతో అందరినీ ఆకట్టుకున్నాడు. వారందరికీ తల్లో నాలుక అయిపోయాడు. నిరాడంబరతకు ఆయన ప్రతిమూర్తి. అందువల్ల ఫినిక్సు జీవనం ఆయనకు ఎబ్బెట్టు అనిపించలేదు. ఆయన స్వభావానికి అది సరిపోయింది.

కాని నేను ఆయనను అక్కడ ఎక్కువ రోజులు ఉండనీయలేకపోయాను మి. రీచ్ లా చదువు ఇంగ్లాండులో పూర్తి చేయాలని నిర్ణయించుకున్నందున, ఆఫీసు పని నేను ఒక్కణ్ణి సంబాళించలేకపోయాను అందువల్ల పోలక్‌ను ఆఫీసులో చేరమని. వకీలు వృత్తి చేపట్టమని ప్రోత్సహించాను. ఆయన వకీలు అయితే చివరకు అంతా వదిలివేసి ఇద్దరం ఫినిక్సు వెళ్ళవచ్చునని భావించాను.

ఆ తరువాత నా కలలన్నీ కల్లలేనని తేలిపోయింది. పోలక్‌లో ఒక గొప్ప సుగుణం వున్నది. ఎవరిమీదనైనా నమ్మకం కుదిరితే మారు మాట్లాడకుండా చెప్పినట్లు చేయడం తన కర్తవ్యంగా భావించే వ్యక్తి. నా జాబుకు సమాధానం వ్రాస్తూ "నాకు ఇక్కడి జీవనం హాయిగా వున్నది. ఇక్కడ సుఖంగా ఉన్నాను. ఈ సంస్థను ఇంకా అభివృద్ధికి తీసుకురావచ్చు. అయినా నేను అక్కడకు రావడం అవసరమని మన ఆదర్శాలు త్వరగా నెరవేరతాయని మీరు భావిస్తే నేను వస్తాను" అని వ్రాశాడు. నేను ఆ జాబుకు స్వాగతం పలికాను. పోలక్ ఫినిక్సు వదిలి జోహన్సుబర్గు వచ్చేశాడు. నా ఆఫీసులో సహాయకుడిగా చేరి వకీలు వృత్తి ప్రారంభించాడు.

ఇంతలో ఒక స్కాచ్ థియోసాఫిస్టు వచ్చాడు. పోలక్‌ను అనుసరించమని ఆయనను ప్రోత్సహించాను. ఇంతకు పూర్వం ఆయనకు లా చదువు విషయంలో సాయం చేస్తూ వుండేవాణ్ణి. ఆయన పేరు మేకిన్‌టయర్.

ఈ విధంగా ఫినిక్సు ఆదర్శాలను వెంటనే ఆచరణలో పెట్టాలనే భావంతో, వాటికి విరుద్ధమైన జీవితపు లోతుల్లోకి ప్రవేశిస్తున్నట్లు నాకు అనిపించింది. భగవదేచ్ఛ మరోరకంగా వుండియుండకపోతే నిరాడంబర జీవనం అనే నెపంతో పరుచుకున్న మోహజాలంలో స్వయంగా చిక్కుకుపోయేవాణ్ణే. ఎవ్వరూ ఊహించని రీతిలో నేను, నా ఆదర్శాలు ఎలా రక్షింపబడ్డాయో రాబోయే ప్రకరణాల్లో వ్రాస్తాను.

# 22. ఎవరిని దేవుడు రక్షిస్తాడో

త్వరగా హిందూదేశం వెళ్ళి స్థిరపడాలనే కాంక్ష వదులుకున్నాను. ఒక్క సంవత్సరంలో తిరిగి వస్తానని భార్యకు నచ్చచెప్పి దక్షిణ ఆఫ్రికా వచ్చాను. సంవత్సరం గడిచిపోయింది. తిరిగి దేశం వెళ్ళడం పడలేదు. అందువల్ల భార్యాబిడ్డల్ని పిలిపించాలని నిర్ణయించుకున్నాను.

పిల్లలు వచ్చారు మా మూడో పిల్లవాడు రామదాసు. త్రోవలో మా వాడు కెప్టెనుతో స్నేహం పట్టాడు. ఆయనతో ఆడుతూ వుండగా మా వాడి చేయి విరిగింది. కెప్టెను పిల్లవాణ్ణి జాగ్రత్తగా చూచాడు. డాక్టరు ఎముకను సరిచేశాడు. జోహన్సుబర్గు చేరినప్పుడు కర్రచెక్కల మధ్య మెడలో వేసినపట్టీలో చెయ్యి కట్టివేసివున్నది. చేతికి తగిలిన గాయాన్ని డాక్టరుకు చూపించి నయం చేయించడం అవసరమని ఓడ డాక్టరు సలహా ఇచ్చాడు. కాని ఆ రోజుల్లో నా మట్టి పట్టీల చికిత్స జోరుగా సాగుతున్నది. నా దేశవాళీ చికిత్స మీద విశ్వాసం గల కక్షిదారులకు నేను మట్టితోను, నీటితోను చికిత్స చేస్తున్నాను. రామదాసును మరో వైద్యుని దగ్గరికి ఎలా పంపుతాను? వాడి వయస్సు ఎనిమిది సంవత్సరాలు. "నీ గాయానికి పట్టీలు వగైరా కట్టి చికిత్స చేస్తే భయపడతావా' ' అని మావాణ్ణి అడిగాను. రామదాసు నవ్వుతూ నాకు అనుమతి ఇచ్చాడు. ఈ వయస్సులో మంచిచెడ్డల పరిజ్ఞానం వాడికి లేకపోయినా డాక్టరీకి, దేశవాళీ వైద్యానికి గల తేడా వాడికి తెలుసు నా ప్రయోగాలను గురించి వాడికి తెలుసు. నా మీద గల విశ్వాసంతో వాడు నా చేత చికిత్స చేయించుకునేందుకు భయపడలేదు.

వణుకుతున్న చేతులతో వాడి పట్టీ ఊడతీశాను. గాయం కడిగి శుభ్రం చేశాను. మట్టి పట్టీ గాయం మీద వేసి మొదటిలాగానే తిరిగి మెడకు పట్టీ కట్టివేశాను. డాక్టరు కట్టే పట్టీలకు కూడా ఇంత సమయం పడుతుందని ఓడ డాక్టరు చెప్పడం జరిగింది. మట్టి చికిత్సపై నాకు విశ్వాసం ఏర్పడింది. ఆ తరువాత ప్రయోగాలు చేయసాగాను. గాయాలు, జ్వరం, అజీర్ణం, పాండురోగం మొదలుగాగల వ్యాధులకు మట్టితోను, నీటితోను మరియు ఉపవాసాలు చేయించి చాలామందికి చికిత్స చేశాను. రోగుల్లో చిన్న పెద్ద అంతా వుండేవారు. చాలామందికి నా చికిత్స వల్ల రోగాలు నయమయ్యాయి. ఈ చికిత్సపై దక్షిణ ఆఫ్రికాలో నాకు గట్టి విశ్వాసం వుండేది. అంత విశ్వాసం ఇక్కడకు వచ్చాక తగ్గిపోయింది. ఈ ప్రయోగాలలో ప్రమాదం అధికమని అందువల్ల జాగరూకత అవసరమని అనుభవం వల్ల తేల్చుకున్నాను.

ఇన్ని వివరాలు వ్రాస్తున్న కారణం నా ప్రయోగాలు సఫలమయ్యాయని చెప్పడానికి కాదు. ఏ ప్రయోగం కూడా పూర్తిగా సఫలం అని చెప్పడానికి వీలులేదు. డాక్టర్లు కూడా అలా చెప్పలేరు. అయితే క్రొత్త ప్రయోగాలు చేయదలచిన వారు మొదట తమతోనే ప్రారంభించాలని నా అభిప్రాయం. ఆ విధంగా చేస్తే నిజం త్వరగా బయటబడుతుంది. ఇట్టి ప్రయోగాలు చేసేవారిని భగవంతుడు రక్షిస్తాడు కూడా.

మట్టి ప్రయోగాలు ఎంత ప్రమాదకరమైనవో, యూరోపియన్లతో సంబంధం పెట్టుకోవడం కూడా అంత ప్రమాదకరమైన వ్యవహారమే. రంగులో తేడాయేగాని, అందరి వ్యవహారం ఒకటే. ఈ విషయం ముందుగా నేను గ్రహించలేదు. మిస్టర్ పోలక్‌ను నాతోబాటు వుండమని ఆహ్వానించాను. మేమిద్దరం సొంత సోదరుల్లా వుండేవారం. పోలక్ ఒక అమ్మాయిని వివాహం చేసుకోవాలని అనుకున్నాడు. ఆ అమ్మాయితో చాలాకాలం నుండి అతనికి స్నేహం ఉన్నది. అయితే కొంత డబ్బు సమకూర్చుకున్న తరువాత వివాహం చేసుకుందామని ఎదురు చూడసాగాడు. రస్కిన్ రచనలు నాకంటే ఎక్కువగా అధ్యయనం చేశాడు కాని పాశ్చాత్యదేశాలలో రస్కిన్ భావాలను పూర్తిగా అమలు చేయడాన్ని గురించి ఆయనకు ఆశలేదు.

"మనస్సులు కలిసిన తరువాత డబ్బు కోసం ఎదురు చూస్తూ కూర్చోవడం సరికాదు. ఈ ప్రకారంగా అయితే బీదవాడెవడూ పెండ్లి చేసుకోవడానికి వీలు వుండదు. ఇప్పుడు మీరు నాతోబాటు ఉన్నారు. అందువల్ల ఇంటి ఖర్చును గురించిన సమస్య ఉండదు. మీరు త్వరగా పెండ్లి చేసుకోండి" అని నేను చెప్పాను.

నేనెప్పుడూ పోలక్‌తో రెండుసార్లు ఏ విషయమూ చర్చించలేదు. నా సలహాను వెంటనే అంగీకరించాడు. మిసెస్ పోలక్ ఇంగ్లాండులో ఉన్నది. ఆమెతో ఉత్తరాలు నడిచాయి. ఆమె అంగీకరించింది. కొద్ది మాసాలలోనే ఆమె పెండ్లి కోసం జోహన్సుబరు వచ్చింది. మేము పెండ్లికి ఖర్చు ఏమీ చేయలేదు. బట్టలు కూడా కొనలేదు. మత విధానాలతో కూడా వారికి పనిలేదు. మిసెస్ పోలక్‌ది క్రైస్తవమతం. మిస్టర్ పోలక్ యూదుడు. వారిద్దరి మధ్య ఉన్నది కేవలం నీతికి సంబంధించిన ధర్మం మాత్రమే.

ఈ వివాహానికి సంబంధించిన విచిత్ర విషయం వ్రాస్తను. ట్రాన్సువాలులో తెల్లవారి పెళ్ళిళ్ళను రిజిష్టరు చేసే అధికారి నల్లవాళ్ళ పెళ్ళిళ్ళను రిజిష్టరు చేయడు. ఈ వివాహంలో నేను సాక్షిని. వెతికితే మాకు ఒక తెల్లవాడు దొరికేవాడే కాని పోలక్ అందుకు అంగీకరించలేదు. మేము ముగ్గురం అధికారి దగ్గరికి వెళ్ళాం. నేను సాక్షిగా వున్నాను గనుక వరుడు వధువు ఇద్దరూ తెల్లవారేనని ఎలా నమ్ముతాడు. వివరాలు

తెలుసుకోవడానికి వాయిదా వేద్దామని చూచాడు. మరునాడు నేటాలులో పండుగ దినం. పెండ్లికి అన్ని ఏర్పాట్లు చేసుకున్న మీదట ఈ విధమైన కారణాలతో ముహూర్తాన్ని వాయిదా వేయడం ఎవ్వరూ సహించలేకపోయారు. పెద్ద మేజిస్ట్రేటును నేను ఎరుగుదును. ఆయన ఈ శాఖకు పెద్ద అధికారి. దంపతులిద్దరినీ వెంటబెట్టుకొని వెళ్ళి ఆయనను కలిశాను. ఆయన నవ్వుతూ, నాకు జాబు వ్రాసి ఇచ్చాడు. ఈ విధంగా పెండ్లి రిజిస్టరు అయిపోయింది.

ఇప్పటివరకు కొంతమంది తెల్లవాళ్ళు మాతోబాటు వున్నారు. వారితో పరిచయం ఏర్పడింది. ఇప్పుడు ఒక అపరిచితురాలు మా ఇంట్లో ప్రవేశించిందన్నమాట. ఎన్నడూ ఏ విధమైన తంటా ఆమె వల్ల వచ్చినట్లు నాకు గుర్తులేదు. కాని అనేక జాతులవాళ్ళు, అనేక స్వభావాల వాళ్ళు హిందూ దేశస్థులు వచ్చి వెళ్ళేచోట, అనుభవం లేని నా భార్యవంటి వారు ఉన్న చోట, వారిద్దరికీ (శ్రీ, శ్రీమతి పోలక్) ఏమైనా ఇబ్బంది కలిగితే కలిగి యుండవచ్చు. ఒకే జాతివాళ్ళు వుండే కుటుంబాలలో కూడా వివాదాలు బయలుదేరుతూ ఉంటాయి. ఆ దృష్టితో చూస్తే విజాతీయులు వున్న మా గృహంలో వివాదాలు బాగా తక్కువేనని చెప్పవచ్చు. అసలు అట్టివి లేవనే చెప్పవచ్చు. నిజానికి సజాతీయులు, విజాతీయులు అను భావం మనస్సులో బయలుదేరే నీటితరంగం వంటిది. మేమంతా ఒకే కుటుంబీకులంగా వున్నాం.

వెస్ట్ వివాహం కూడా ఇక్కడే చేయాలని భావించాను. ఆ సమయంలో బ్రహ్మచర్యాన్ని గురించిన భావాలు యింకా నాకు కలుగలేదు. అందువల్ల పెండ్లి కాని స్నేహితులకు పెండ్లి చేయడం నా పని అయింది. వెస్ట్ తన తల్లి తండ్రుల్ని చూచేందుకు ఇంగ్లాండు బయలుదేరినప్పుడు పెండ్లి చేసుకురమ్మని అతనికి సలహా ఇచ్చాను. ఫినిక్సు ఇప్పుడు వారందరికి స్థావరం అయింది. అంతా రైతులుగా మారిపోయారు. అందువల్ల వివాహానికి వంశవృద్ధికి భయపడనవసరం లేకుండా పోయింది.

లెస్టర్‌కు చెందిన ఒక అందమైన అమ్మాయిని పెండ్లిచేసుకొని వెస్ట్ వెంట తీసుకువచ్చాడు. ఆ సోదరి కుటుంబం వారు లెస్టర్‌లో చెప్పుల పరిశ్రమ యందు పనిచేస్తున్నారు. మిసెస్ వెస్ట్ కూడా కొంత కాలం చెప్పుల కార్ఖానాలో పనిచేసింది. ఆమెను 'సుందరి' అని పిలిచాను. ఆమె గుణాలు బహు సుందరమైనవి కావడమే అందుకు కారణం. వెస్ట్ తన అత్తగారిని కూడా వెంట తీసుకువచ్చాడు. ఆమె సుగుణాలు గల వృద్ధ వనిత. ఆమె ఇంకా జీవించే యున్నది. శ్రమ చేసే స్వభావంతో, నవ్వుముఖంతో మమ్మల్నందరినీ సిగ్గుపడేలాచేస్తూ ఉన్నది.

నేను తెల్లవాళ్ళ పెళ్ళిళ్ళు చేయించినట్లే హిందూ దేశపు పురుషుల్ని కూడా పెళ్ళాం బిడ్డల్ని పిలిపించమని ప్రోత్సహించాను. దానితో ఫినిక్సు చిన్న ఊరుగా మారింది. అక్కడ అయిదారు హిందీ కుటుంబాలవారు కూడా స్థిరపడి అభివృద్ధికి రాసాగారు.

## 23. ఇంట్లో పెద్దమార్పులు - పిల్లలకు శిక్షణ

దర్బనులో వుంటున్నప్పుడు ఇంట్లో మార్పులు చేశాను. ఖర్చు విపరీతం అయినా నిరాడంబరంగా వుండాలని ప్రయత్నం చేశాను. జోహన్సుబర్గులో సర్వోదయ భావాలు నాచేత ఎక్కువ మార్పులు చేయించాయి.

బారిష్టరు ఇల్లు సాధ్యమైనంత నిరాడంబరంగా వుండాలని కృషి ప్రారంభించాను. కాని కొంత గృహాలంకరణ అవసరమనిపించింది. మనస్సులో మాత్రం నిరాడంబరత్వం మొదలైంది. ప్రతి పని స్వయంగా చేసుకోవాలని నిర్ణయించుకున్నాను. ఇందు పిల్లలను కూడా చేర్చుకున్నాను.

బజారు నుండి రొట్టె కొని తేవడం మానివేశాము. ఇంట్లో కూనే సూచించిన ప్రకారం రొట్టె స్వయంగా తయారు చేసుకోవడం ప్రారంభించాము. మిల్లులో తయారైన పిండి వాడకం తగ్గిపోయింది. మిల్లులో పట్టిన పిండి కంటే చేతితో విసిరిన పిండిని ఉపయోగిస్తే ఆరోగ్యరీత్యాను, నిరాండబరత్వరీత్యాను మంచిదని, డబ్బు కూడా మిగులుతుందని తేలింది. అందుకోసం ఆరు పౌండ్లు పెట్టి తిరగలి కొన్నాం. తిరగలి రాళ్ళు పెద్దవిగా వున్నాయి. ఇద్దరు మనుష్యులు ఆ తిరగలితో తేలికగా పిండి విసరవచ్చు. ఒక మనిషి తిరగలి విసరడం కష్టం. ఈ తిరగలితో నేను, పోలక్ మరియు మా అబ్బాయిలు పిండి విసిరే వాళ్ళం. అప్పుడప్పుడు కస్తూరిబాయి కూడా విసిరేది. అయితే ఆమెకు భోజనం తయారు చేసేపని అప్పగించాం. పోలక్ భార్య వచ్చిన తరువాత ఆమె కూడా సహకరించింది. ఆ కసరత్తు పిల్లలకు ఎంతో ప్రయోజనకారి అయింది. నేను బలవంతంగా వాళ్ళ చేత ఆ పని చేయించలేదు. వాళ్ళే ఆటగా భావించి తిరగలితో పిండి విసరడం ప్రారంభించారు. అలసిపోతే మానవచ్చునని వారికి అనుమతి ఇచ్చాం. కాని మా పిల్లలు ఇంకా చాలా మంది ఇట్టి పనులు బాగా ఉత్సాహంతో చేశారు. వాళ్ళను గురించిన వివరం ముందు ముందు వ్రాస్తాను. కొంతమంది ఇతర పిల్లలు కూడా పని చేయసాగారు. అయితే వాళ్ళంతా కూడా ఉత్సాహంగా పనిచేస్తుండేవారు. అలిసిపోయాం అని చెప్పిన పిల్లలు బహు తక్కువగా వుండేవారు. ఇంటిని పరిశుభ్రంగా ఉంచేందుకు ఒక నౌకరు ఉండేవారు. అతడు

కూడా ఒక కుటుంబ సభ్యుడుగా ఉండేవాడు. అతడు చేసే పనికి పిల్లలు బాగా సహకరించేవారు. పాయిఖానా ఎత్తుకు పోయేందుకు మునిసిపాలిటీ వాళ్ళు వస్తూ ఉండేవారు. కాని పాయిఖానా గది శుభ్రం చేయడం, కూర్చునే స్థానాలు కడగడం మొదలుగాగల పనులు నౌకరు చేత చేయించేవారం కాదు. నౌకరు ఆ పని చేయాలని ఆశించడం కూడా సరికాదని మా అభిప్రాయం. ఆ పని మేము స్వయంగా చేస్తూ ఉండేవారం. మా పిల్లలకు కూడా అట్టి శిక్షణ లభిస్తూ ఉండేది. అందువల్ల మా పుత్రులందరు మొదటి నుండి పాయిఖానా ఎత్తి వేయాలన్నా, పాయిఖానా దొడ్డి బాగు చేయాలన్నా అసహ్యించుకోలేదు. సాధారణమైన ఆరోగ్య నియమాలు వాళ్ళు తేలికగా తెలుసుకున్నారు. జోహన్సుబర్గులో మా అబ్బాయిలెవ్వరూ జబ్బు పడలేదు. సేవా కార్యక్రమాల్లో సంతోషంతో పాల్గొంటూ ఉండేవారు.

వారి అక్షరజ్ఞానం విషయమై నేను నిర్లక్ష్యంగా వ్యవహరించానని అనను, కాని దాన్ని హోమం చేయడానికి నేను వెనుకాడలేదు. నా యీ పొరపాటును గురించి నన్ను మాట అనడానికి మా అబ్బాయిలకు అవకాశం ఉన్నదని చెప్పగలను. వాళ్ళు అనేక పర్యాయాలు తమ అసంతృప్తిని వెల్లడించారు కూడా. ఈ వ్యవహారంలో కొంత దోషం నాదేనని ఒప్పుకోక తప్పదు. వాళ్ళకు అక్షర జ్ఞానం కలిగించాలనే కోరిక మిక్కుటంగా నాకు ఉండేది. అందుకు కృషి కూడా చేశాను. కాని ఆ పనికి ఎప్పుడూ ఆటంకాలు కలుగుతూ ఉండేవి. ఇంటి దగ్గర విద్యాభ్యాసానికి మరో ఏర్పాటు చేయలేదు. అందువల్ల వాళ్ళను నా వెంట ఆఫీసుకు తీసుకువెళుతూ ఉండేవాణ్ణి. ఆఫీసు రెండున్నర మైళ్ళ దూరాన ఉండేది. ప్రతిరోజూ రానుపోను ఉదయం సాయంత్రం కలిపి వాళ్ళకు నాకు అయిదు మైళ్ళ నడక కసరత్తుగా సాగుతూ ఉండేది. నడుస్తున్నప్పుడు త్రోవలో పాఠం చెబుదామని ప్రయత్నం చేసేవాణ్ణి. నా వెంట మరొకరెవ్వరూ లేనప్పుడు అది సాగేది. ఆఫీసులో కక్షిదారులతోను, గుమాస్తాలతోను నాకు సరిపోయేది. ఆ సమయంలో ఏదో ఒకటి వ్రాయమనో, చదవమనో వాళ్ళకు పని అప్పగిస్తూ ఉండేవాణ్ణి. ఆ కాసేపు చదివి తిరుగుతూ, ఇంటికి సామాన్లు తెచ్చి ఇస్తూ ఉండేవాళ్లు. పెద్దవాడు హరిలాలు మినహా మిగతా పిల్లల చదువు ఇలాగే సాగేది. హరిలాలు దేశంలో ఉండిపోయాడు. మా పిల్లల చదువుకై ప్రతిరోజూ ఒక గంటసేపైనా నేను సమయం కేటాయించి ఉంటే వాళ్ళకు ఆదర్శ విద్య గరిపి ఉండేవాడినే. ఆ పట్టుదల నేను చూపలేదు. అందుకు నాకు, వాళ్ళకు విచారం కలిగింది. మా పెద్ద కుమారుడు నాకు వ్యతిరేకంగా మారాడు. అందువల్ల తన అభిప్రాయం వెల్లడించాడు. జనం మధ్యన

కూడా ప్రకటించాడు. ఇతరులు ఉదారహృదయంతో ఈ దోషాన్ని అనివార్యమని భావించి ఊరుకున్నారు. ఈ దోషానికి నేను పశ్చాత్తాపపడలేదు అయినా ఆదర్శ తండ్రి కాజాలకపోవడం వరకే అది సీమితం అజ్ఞానం వల్ల జరిగినా వాళ్ళ చదువును హోమం చేసిన మాట నిజమే. సద్భావంతో వాళ్ళను సేవారంగంలో ప్రవేశపెడదామనే ఉద్దేశ్యంతోనే అలా చేశాను. అయితే వాళ్ళ శీలనిర్మాణం కోసం చేయవలసిందంతా చేశాను. లోటు ఏమీ చేయలేదు. ఇలా చేయడం ప్రతి తల్లి తండ్రి కర్తవ్యమని భావిస్తున్నాను.

అయినా నా పిల్లల శీలంలో ఎక్కడైనా దోషం ఉంటే అది మా దంపతుల దోషమని భావిస్తున్నాను. బిడ్డలకు తల్లిదండ్రుల రూపురేఖలు వారసత్వంగా లభించినట్లే వారి గుణదోషాలు కూడా తప్పక లభిస్తాయి. పరిసరాల ప్రభావం వల్ల వారిలో రకరకాల గుణదోషాలు చోటు చేసుకుంటాయి. అయితే అసలు ఆస్థి మాత్రం తండ్రి తాతల ద్వారానే వాళ్లకు లభిస్తుంది గదా! అట్టి దోషాలనుండి కొంతమంది పిల్లలు తమను తాము రక్షించుకుంటూ ఉంటారు. అది ఆత్మ స్వభావం. అట్టివారికి అభినందనలు.

నా పిల్లలకు జరిపిన ఇంగ్లీషు శిక్షణను గురించి పోలక్‌కు నాకు అప్పుడప్పుడు వేడివేడిగా చర్చలు జరిగాయి. బాల్యంనుండే తమ పిల్లల చేత ఇంగ్లీషు మాట్లాడించేందుకు తంటాలుపడే తల్లితండ్రులు తమకు, తమ దేశానికి ద్రోహం చేస్తున్నారని నా నిశ్చితాభిప్రాయం. ఇందువల్ల పిల్లలు తమ దేశ ధార్మిక, సాంఘిక వారసత్వం నుండి వంచితులవుతారని నా అభిప్రాయం. వాళ్ళు దేశానికి, ప్రజలకు సేవ చేసేందుకు యోగ్యత తక్కువగా పొందుతారని నా భావన. ఈ కారణాల వల్లనే నేను నా పిల్లలతో కావాలనే గుజరాతీ భాషలో మాట్లాడుతూ ఉండేవాడిని. పోలక్‌కు నా ఈ పద్ధతి నచ్చలేదు. నేను పిల్లల భవిష్యత్తును పాడుచేస్తున్నానని పోలక్ భావించాడు. ఇంగ్లీషు వంటి వ్యాప్తి చెందిన భాషను పిల్లలు చిన్నప్పటినుండే నేర్చుకుంటే ప్రపంచంలో సాగే పరుగుపందెంలో పెద్ద అడుగు సహజంగా వేయగలుగుతారని ప్రేమతోను, పట్టుదలతోను నాకు నచ్చచెబుతూ ఉండేవాడు. ఆయన సలహా నాకు నచ్చలేదు. నా భావం నచ్చక చివరకు మౌనం వహించాడో లేదో నాకు ఇప్పుడు గుర్తులేదు. ఆ చర్చలు జరిగి సుమారు 20 సంవత్సరాలు గడిచిపోయాయి. ఆనాడు నాకు కలిగిన భావాలు కాలం గడిచినకొద్దీ గట్టిపడ్డాయి. నా బిడ్డలు అక్షరజ్ఞానంలో వెనుకబడ్డారేమో కాని జ్ఞానం సులభంగా పొందగలిగారని చెప్పగలను. దానివల్ల వాళ్ళకు, దేశానికి మేలు జరిగిందని చెప్పగలను. ఇవాళ వాళ్ళు విదేశస్థుల వలె లేరు. రెండు భాషలు వారికి

సుపరిచితాలు. గొప్ప గొప్ప ఆంగ్లేయుల మధ్య వుండటం వల్ల, ఇంగ్లీషు ఎక్కువగా మాట్లాడబడే దేశంలో నివసించడం వల్ల వాళ్ళు ఇంగ్లీషులో మాట్లాడటం, వ్రాయడం బాగా నేర్చుకున్నారు.

## 24. జూలూల తిరుగుబాటు

దక్షిణ ఆఫ్రికాలో కాపురం పెట్టిన తరువాత స్థిరంగా కూర్చునే అదృష్టం నా నొసట రాసి లేదు. జోహన్సుబర్గులో కొంచెం స్థిరపడుతూ ఉండగా ఒక ఊహించని ఘట్టం జరిగింది. నేటాలులో జూలూలు తిరుగుబాటు చేశారని వార్త చదివాను. నాకు జూలూలతో శతృత్వం లేదు వాళ్ళు ఒక్క హిందూ దేశస్థుడి జోలికి కూడా పోలేదు. తిరుగుబాటని, విద్రోహమని అనడం విషయంలో నాకు సందేహం ఉన్నది. అయితే ఆరోజుల్లో ఆంగ్ల సామ్రాజ్యం జగద్రక్షణకు అవసరమని నా అభిప్రాయం. హృదయపూర్తిగా ఆంగ్ల ప్రభుత్వం యెడ నాకు విశ్వాసం ఉంది. ఆ సామ్రాజ్యం నష్టపడటం నాకు ఇష్టం లేదు. అందువల్ల బలప్రయోగాన్ని గురించి గాని నీతి అవినీతి అను విషయమై గాని నాకు పట్టింపు లేదు. నేను చేయబోయే చర్యను అది ఆపలేదు. నేటాలుకు కష్టం కలిగినప్పుడు రక్షణకోసం వాలంటీర్ల సైన్యం ఉన్నది. పని పడ్డప్పుడు ఆ సైన్యంలో క్రొత్తవాళ్ళను కొద్దిగా చేర్చుకునేవారు. వాలంటీర్ల సైన్యం ఈ తిరుగుబాటును శాంతింపచేసేందుకు బయలుదేరిందని చదివాను.

నేను నేటాలు వాసినేనని భావించాను. నేటాలుతో నాకు దగ్గర సంబంధం కూడా ఉంది. అందువల్ల నేను అక్కడి గవర్నరుకు జాబు వ్రాశాను. అవసరమైతే హిందూ దేశస్థుల దళాన్ని వెంటబెట్టుకొని యుద్ధరంగంలోకి వెళతానని, క్షతగాత్రులకు సేవచేస్తానని ఆ జాబులో వ్రాశాను. గవర్నరు వెంటనే సరేనంటూ సమాధానం పంపాడు. ఇంత త్వరగా అనుకూలంగా సమాధానం వస్తుందని ఊహించలేదు. అయితే జాబు వ్రాసేముందు ఏర్పాట్లు అన్నీ చేసుకున్నాను. గవర్నరు నుండి అనుకూలంగా సమాధానం వస్తే ఇప్పటి ఇల్లు వదిలివేయాలని, మి. పోలక్ చిన్న ఇల్లు తీసుకొని అందులో ఉండాలని నిర్ణయం గైకొన్నాము. ఇందుకు కస్తూరిబాయి అంగీకరించింది. ఇలాంటి నా నిర్ణయాలను ఆమె ఎప్పుడూ ఎదిరించలేదని నాకు బాగా గుర్తు. గవర్నరు నుండి సమాధానం రాగానే ఇంటి యజమానికి ఒక మాసం ముందుగా నోటీసు పంపి ఇల్లు ఖాళీ చేస్తామని తెలియజేశాము. కొంత సామాను ఫినిక్సుకు పంపాము. కొద్ది సామాను పోలక్ దగ్గర ఉంచాము.

డర్బను చేరగానే మనుష్యులు కావాలని ప్రకటించాను. పెద్ద దళం అవసరం లేదని తెలిసి 24 మందిమి కలిపి దళంగా ఏర్పడ్డాం. వారిలో నేను గాక నలుగురు గుజరాతీలు ఉన్నారు. మిగతావారు మద్రాసుకు చెందిన గిర్‌మిటియా ప్రథ నుండి విముక్తి పొందినవారు. ఒకరు పఠాను. ఛీఫ్ మెడికల్ ఆఫీసరు నాకు "సార్జంట్ మేజర్" అను హోదా తాత్కాలికంగా ఇచ్చాడు. అది మా ఆత్మసన్మానానికి గుర్తుగా, పని సౌలభ్యం కోసం, అట్టి రివాజు వుండటం వల్ల ఆ ఆఫీసరు ఆ హోదా ఇచ్చాడు. నేను చెప్పిన ముగ్గురికి సార్జంటు హోదా మరియు కార్పోరల్ హోదా ఇచ్చాడు. డ్రస్సు కూడా ప్రభుత్వమే మాకు ఇచ్చింది. మా దళ సభ్యులు ఆరువారాల పాటు సేవ చేశారు.

తిరుగుబాటు స్థావరం చేరి అక్కడ తిరుగుబాటు అనేదే లేదని తెలుసుకున్నాము. తిరుగుబాటు చేస్తూ ఎవ్వరూ కనబడలేదు. ఒక జూలూ సర్దారు క్రొత్తగా జూలూలపై విధించబడ్డ పన్ను చెల్లించవద్దని సలహా ఇచ్చాడట. పన్ను వసూలు చేసేందుకు వెళ్ళిన ఒక సార్జెంటును వాళ్ళు చంపివేశారట. అందువల్ల దీన్ని తిరుగుబాటు అని అన్నారు. ఏది ఏమైనా నా హృదయం మాత్రం జూలూలకు అనుకూలంగా ఉన్నది. ముఖ్య స్థావరం చేరిన తరువాత సంగ్రామంలో గాయపడిన జూలూలకు మేము సేవ శుశ్రూష చేయవలసి వచ్చింది. అందుకు నేను ఎంతో సంతోషించాను.

మెడికల్ ఆఫీసరు మాకు స్వాగతం పలికాడు. "తెల్లవాళ్ళెవళ్ళూ గాయపడ్డ జూలూలకు సేవ చేసేందుకు సిద్ధపడటం లేదు. నేను ఒక్కణ్ణి ఎంతమందికి సేవ చేయగలను? వాళ్ల గాయాలు మురుగుతున్నాయి. సమయానికి మీరు రావడం వాళ్ళ ఎడ దేవుడు చూపిన కృపయేయని నేను భావిస్తున్నాను" అని అన్నాడు. వెంటనే అతడు మాకు పట్టీలు, క్రిమినాశక మందులు, లోషన్లు వగైరాలు ఇచ్చి క్షతగాత్రులైన జూలూల దగ్గరికి తీసుకువెళ్ళాడు. మమ్మల్ని చూచి జూలూలు ఎంతో సంతోషించారు. తెల్ల సిపాయిలు తెరల వెనుకనుండి తొంగి చూస్తూ గాయాలకు మందులు రాయవద్దని, పట్టీలు కట్టవద్దని మాకు సైగ చేయసాగారు. మేము వాళ్ళ మాట పట్టించుకోనందున కోప్పడసాగారు. చెవులకు పట్టిన తుప్పు వదిలిపోయేలా గాయపడిన జూలూలను బండ బూతులు తిట్టడం ప్రారంభించారు.

తరువాత ఆ సిపాయిలతో కూడా నాకు పరిచయం ఏర్పడింది. వాళ్ళు నన్ను ఆదరించారు. 1896లో నన్ను తీవ్రంగా వ్యతిరేకించిన కర్నల్ సార్క్స్, కర్నల్ వాయిలీలు అక్కడే ఉన్నారు. వాళ్ళు నేను చేస్తున్నపని చూచి నివ్వెరపోయారు. నన్ను ప్రత్యేకించి పిలిచి కృతజ్ఞతలు తెలిపారు. నన్ను జనరల్ మెకంజీ దగ్గరికి కూడా తీసుకువెళ్ళారు.

వారికి నన్ను పరిచయం చేశారు. వీరంతా వృత్తిరీత్యా స్వార్ప్స్. ఒక కసాయివాడకు యజమాని. కర్నల్ మెకంజీ నేటాలుకు చెందిన ప్రసిద్ధ రైతు. వారంతా వాలంటీర్లు. వాలంటీర్ల రూపంలో సైనిక శిక్షణ పొంది అనుభవం సంపాదించారు. మేము సేవ చేస్తున్న జూలూ క్షతగాత్రులంతా యుద్ధంలో గాయపడ్డ వారని పాఠకులు భావించవద్దు. వారిలో చాలామంది సందేహించి నిర్బంధించబడ్డ ఖైదీలు. వారిని కొరడాతో కొట్టమని జనరల్ ఆదేశించాడు. కొరడా దెబ్బలు తగిలిన చోట బాగా కమిలిపోయింది. మరి కొంతమంది మిత్రులుగా భావించబడ్డ జూలూ జాతివాళ్ళు. ఈ మిత్రులు స్నేహాన్ని సూచించే గుర్తులు ధరించి ఉన్నారు. అయినా సైనికులు పొరపాటున వాళ్ళను కూడా గాయపరిచారు.

తెల్ల సిపాయిలకు కూడా మందులిచ్చే పని నాకు అప్పగించారు. డాక్టర్ బూథ్‌గారి చిన్న ఆసుపత్రిలో నేను ఒక సంవత్సరంపాటు ఈ పని నేర్చుకున్నాను. ఇది నాకు బహు తేలిక పని. ఈ పనివల్ల నాకు చాలా మంది ఆంగ్ల సైనికులతో మంచి పరిచయం ఏర్పడింది. యుద్ధంలో పాల్గొంటున్న సైన్యం ఒకే చోట ఉండదు. సంకటం ఏర్పడిందన్న చోటుకు పరిగెత్తాలి. వారిలో చాలామంది గుర్రపు రౌతులు. మా దళం ప్రధాన స్థావరాలనుండి తప్పుకొని వాళ్ళ వెంట వెళ్ళవలసి వచ్చింది. మా సరంజామా మేమే మోసుకెళ్ళాలి. ఒక్కొక్కసారి పగటిపూట 40 మైళ్ళ దూరం కాలి నడకన పయనం సాగించవలసి వచ్చేది. ఇక్కడ కూడా మాకు భగవంతుని కార్యమే లభించింది. పొరపాటువల్ల గాయపడ్డ జూలూలను కూడా డోలీలలో ఎత్తుకొని ఆసుపత్రికి చేర్చి అక్కడ వారికి సేవ శుశ్రూష చేయాలి. ఇదీ మా కార్యక్రమం.

## 25. హృదయ మథనం

జూలూ తిరుగుబాటు సమయంలో నాకు అనేక అనుభవాలు కలిగాయి. ఆలోచించడానికి చాలా సామగ్రి లభించింది. బోయరు యుద్ధంలో కనబడిన భయంకర రూపం ఇక్కడ కనబడలేదు. ఇక్కడ జరుగుతున్నది యుద్ధం కాదు. మనుష్యుల వేట జరుగుతున్నదన్నమాట. నాతో మాట్లాడిన చాలామంది ఆంగ్లేయుల అభిప్రాయం కూడా ఇదే. ప్రొద్దున్నే సైనికులు లేవడం. వెంటనే గ్రామాలకు వెళ్ళడం, టపాకాయలు పేల్చినట్లు తుపాకులు పేల్చడం, ఆ ధ్వనులు దూరాన వున్న మాకు వినబడటం ఇదీ వరస. నేను ఈ వ్యవహారం సహించలేకపోయాను. అయినా చేదు గుటకలు మ్రింగవలసి వచ్చింది. నాకు లభించిన పని క్షతగాత్రులైన జూలూలకు సేవ

చేయడం మాత్రమే. మేము ఆ పనికి పూనుకొని వుండకపోతే మరొకరెవ్వరూ ఆ పని చేసి ఉండేవారు కాదు. ఈ విధంగా చెప్పుకొని నా అంతరాత్మను శాంతపరచుకున్నాను.

ఇక్కడ జనసంఖ్య చాలా తక్కువ. పర్వతాలమీద, కొండచరియల్లోను, అమాయకులు, మంచివాళ్ళు, అడివి మనుష్యులుగా భావించబడే జూలూల గుండ్రంగా గోపురాల రూపంలో ఉండే కొద్ది గుడిసెలు తప్ప మరేమీ లేవు. అక్కడి దృశ్యాలు భవ్యంగా ఉన్నవి. ఇలాంటి జనసంచారం లేని చోట క్షతగాత్రుల్ని మోసుకొని తీసుకువెళ్ళవలసి వచ్చినప్పుడు నేను విచార సాగరంలో మునిగిపోతూ ఉండేవాణ్ణి.

ఇక్కడే బ్రహ్మచర్యాన్ని గురించిన భావాలు నాలో పరిపక్వమయ్యాయి. నా అనుచరులతో కూడా కొద్దిగా ఈ విషయం చర్చించాను. ఈశ్వర సాక్షాత్కారానికి బ్రహ్మచర్యం అవసరమని నాకు అనుభూతి కలగలేదు. కాని సేవ చేయటానికి అవసరమని నాకు స్పష్టంగా బోధపడింది. ఈ విధమైన సేవ చేయవలసిన సందర్భాలు విస్తారంగా వస్తాయని, నేను భోగవిలాసాల్లో పడి, పిల్లల్ని కంటూ వాళ్ళ పోషణలో లీనమై ఉంటే సేవాకార్యం సరిగా చేయలేనని గ్రహించాను. బ్రహ్మచర్య వ్రతానుష్ఠానం కావించకుండా జనాన్ని పెంచుకుపోతే సాంఘిక ప్రగతికోసం చేసే మానవ కృషి క్రుంగిపోతుందని తెలుసుకున్నాను. వివాహం చేసుకొని కూడా బ్రహ్మచర్య వ్రతం సాగించితే కుటుంబసేవ, సమాజసేవ కుంటుబడదని భావించాను. ఈ రకమైన భావతరంగాల్లో తేలియాడుతూ ఎప్పుడెప్పుడు బ్రహ్మచర్యవ్రతానికి పూనుకుందామా అని తపన పడిపోయాను. ఈ రకంగా ఆలోచించడం వల్ల నాకు ఆనందం కలిగింది. ఉత్సాహం పెరిగింది. ఈ కల్పన నా సేవారంగాన్ని విశాలం చేసింది.

ఈ భావాలకు మనస్సులో రూపకల్పన చేస్తూ ఉండగా, ఇంతలో ఒకరు తిరుగుబాటు శాంతించిందని, ఇక మనం వెళ్ళవచ్చునని వార్త అందజేశారు. మర్నాడు మీరు ఇళ్ళకు వెళ్ళిపోవచ్చునని మాకు ఆదేశం అందింది. కొద్దిరోజులకు ఎవరి ఇండ్లకు వారు చేరుకున్నారు. మా సేవాకార్యాన్ని అభినందిస్తూ గవర్నరు నాకు కృతజ్ఞతా పత్రం పంపించాడు.

ఫినిక్సు చేరుకొని బ్రహ్మచర్యాన్ని గురించి మగన్‌లాలుకు, ఛగన్‌లాలుకు, వెస్ట్ మొదలుగాగల వారికి ఉత్సాహంతో వివరించి చెప్పాను. అందరికీ నా అభిప్రాయం నచ్చింది. అంతా అందుకు అంగీకరించారు. అయితే ఆచరణకు సంబంధించిన ఇబ్బంది అందరి దృష్టికి వచ్చింది. అందరూ ఈ విషయమైన కృషి ప్రారంభించారు. చాలావరకు విజయం సాధించారు. ఇప్పటి నుండి జీవించి వున్నంత వరకు బ్రహ్మచర్య

వ్రతాన్ని పాటిస్తానని నిర్ణయించుకున్నాను. అయితే ఈ వ్రత శక్తి, ఆచరణలో కలిగే కష్టాలు పూర్తిగా నా దృష్టికి రాలేదు. అందలి ఇబ్బందులను ఇప్పటికీ ఎదుర్కొంటున్నాను. బ్రహ్మచర్యవ్రతం యొక్క గొప్పతనం తరువాత బోధపడసాగింది. బ్రహ్మచర్య వ్రత రహిత జీవనం శుష్కమైనదిగాను, పశుజీవనం వలె నాకు కనబడసాగింది. సహజంగా పశువు నిరంకుశమైనది. మనిషి యందలి మానవత్వం అంకుశానికి లోబడి ఉండటం చూస్తున్నాం. ధార్మిక గ్రంథాల్లో బ్రహ్మచర్యాన్ని గురించి వ్రాయబడిన రాతలు అతిశయోక్తులు అని అనిపించేవి. కాని ఆ వ్రతాన్ని ఆచరణలో పెట్టిన తరువాత బ్రహ్మచర్యం శక్తి ఎంత మహత్తరమైనదో బోధపడింది. ఆ రాతలు అతిశయోక్తులు కావని అనుభవం పొంది రాసినవని గ్రహించాను.

జీవనంలో ఎంతో మార్పుతేగల బ్రహ్మచర్యవ్రతానుష్ఠానం అంత సులభమైనది కాదు. ఇది కేవలం శరీరానికి సంబంధించినదికాదు. శరీరాన్ని అంకుశంలో వుంచడంతో బ్రహ్మచర్యం ప్రారంభం అవుతుంది. శుద్ధ బ్రహ్మచర్యపాలన యందు యోచనా సరళి నిర్మలంగా ఉండాలి. పూర్ణ బ్రహ్మచారి మనస్సునందు కలలో సైతం వికారాలు కలుగకూడదు. కలల్లో వికారాలకు సంబంధించిన యోచనలు వస్తూ ఉంటే బ్రహ్మచర్యం అపూర్ణమని భావించాలి.

నాకు బ్రహ్మచర్యవ్రతం అవలంబించినప్పుడు శారీరక సంబంధమైన ఇబ్బందులు బాగా కలిగాయి. ఇప్పుడు ఆ మహాకష్టాలు పూర్తిగా తొలగిపోయాయని గట్టిగా చెప్పగలను. కాని యోచనలమీద అవసరమైనంత విజయం లభించలేదు. ప్రయత్నంలో లోటు చేయలేదు. కాని ఎక్కడి నుండి వస్తాయో, ఎలా వస్తాయో తెలియదు. యోచనలు వచ్చి బుర్రలో జొరబడతాయి. వాటి రాకను గురించి ఈనాటి వరకు తెలుసుకోలేకపోయాను. యోచనల్ని ఆపివేయగల తాళంచెవి మనిషి దగ్గర ఉంటుంది. ఈ విషయమై నాకు సందేహం లేదు. అయితే ప్రతి వ్యక్తి ఈ తాళం చెవి తనదగ్గరే వెతుక్కోవలసి ఉంటుందని ఈనాడు చెప్పగలను. మహా పురుషులు తెలిపిన అనుభవాలు మనకు మార్గం చూపుతాయి. అవి సంపూర్ణం కావు. సంపూర్ణత్వం కేవలం ప్రభువు ప్రసాదంవల్లే లభిస్తుంది. అందువల్లే భక్తులు తమ తపశ్చర్యల ద్వారా పునీతము, పావనకరము అయిన రామనామాది మంత్రాలు మనకు అందించి వెళ్ళారు. పూర్తిగా ఈశ్వరార్పణ కానిదే యోచనలమీద విజయం లభించదు. ధర్మ గ్రంథాలన్నింటి యందు ఇట్టి వచనాలు నేను చదివాను. వాటి యందలి సత్యం ఈ బ్రహ్మచర్యానుష్ఠాన మందలి సూక్ష్మపాలనా ప్రయత్నాల యందు నాకు గోచరిస్తుంది. నా ఈ మహాప్రయత్నానికి

సంబంధించిన కొద్ది చరిత్ర వచ్చే ప్రకరణంలో వివరిస్తాను. ప్రస్తుత ప్రకరణం ముగింపునందు వ్రతపాలన తేలికేనని అనిపించింది. వ్రతం ప్రారంభించగానే కొన్ని మార్పులు చేశాను. భార్యతో బాటు ఒకే పక్కమీద శయనించడం, ఆమెను ఒంటరిగా కలుసుకోవడం మానివేశాను. ఈ విధంగా ఏ బ్రహ్మచర్య వ్రతాన్ని ఇష్టంగానో, అయిష్టంగానో 1900 నుండి ప్రారంభించానో ఆ వ్రతారంభం నిజానికి 1906 మధ్య కాలంలో జరిగిందని చెప్పవచ్చు.

## 26. సత్యాగ్రహం పుట్టుక

జోహన్సుబర్గులో ఏదో ఒక ఘట్టం నా కోసం జరుగుతూ ఉంటున్నదని అనిపించసాగింది. ఆత్మశుద్ధి కోసం నేను చేసిందంతా సత్యాగ్రహానికి ముందు జరిగిన ఏర్పాటు అనిపించింది. బ్రహ్మచర్య వ్రతానికి పూనుకొనేవరకు నా జీవనంలో జరిగిన ముఖ్య ఘట్టాలన్నీ అప్రత్యక్షరూపంలో నన్ను సత్యాగ్రహానికి సిద్ధం చేసాయని ఇప్పుడు నాకు తోస్తున్నది. 'సత్యాగ్రహం' అను శబ్ద ఆవిర్భావానికి ముందే ఆ వస్తువు పుట్టుక జరిగిందన్నమాట. ఆ సమయంలో అది ఏమిటో నాకు తెలియదు. కాని పాసివ్‌రెజిస్టెన్స్ అను ఆంగ్లశబ్దం ద్వారా దాన్ని తెలుసుకోసాగాను. ఇంగ్లీషువాళ్ళ ఒక సభలో ఈ శబ్దానికి వాళ్ళు తీసుకుంటున్న సంకుచిత అర్థం ఏమిటో గ్రహించాను. అది బలహీనుల ఆయుధం అని వారు భావించారు. అందు ద్వేషానికి అవకాశం ఉన్నది. దాని చివరి అంశం హింసారూపంలో బహిర్గతం కావచ్చు. ఈ విధమైన వారి భావాన్ని నేను ఖండించవలసి వచ్చింది. హిందూ దేశస్థుల సంగ్రామం యొక్క యదార్థ స్వరూపాన్ని వారికి తెలియజేయవలసి వచ్చింది. హిందూ దేశస్థులికి ఈ సంగ్రామ స్వరూపం బోధపరిచేందుకు క్రొత్త శబ్దాన్ని సృష్టించవలసి వచ్చింది

అందుకు తగిన మంచి శబ్దం స్ఫురణకు రాలేదు. తగిన శబ్దం కోసం బహుమతి నిర్ణయించి ఇండియన్ ఒపీనియన్ పత్రికలో ప్రకటించి పాఠకులకు పోటీ పెట్టాము. ఈ పోటీ ఫలితంగా మగన్‌లాల్ గాంధీ సత్ - ఆగ్రహం రెండింటికీ సంధి కలిపి 'సదాగ్రహం' అను శబ్దం వ్రాసి పంపాడు. బహుమతి అతనికి లభించింది. కాని సదా గ్రహం అను శబ్దం ఇంకా స్పష్టంగా లేదని భావించి నేను సత్యాగ్రహం అని మార్చాను. గుజరాతీలో ఇది పోరు అను అర్థంలో ప్రచలితం అయింది.

ఈ సంగ్రామ చరిత్రయే దక్షిణ ఆఫ్రికాలో సాగిన నా జీవనంలో నేను కావించిన సత్యశోధన లేక సత్య ప్రయోగాల చరిత్ర అని చెప్పవచ్చు. ఈ చరిత్ర (ఎక్కువ భాగం)

నేను యరవాడ జైల్లో వున్నప్పుడు వ్రాశాను. అదంతా నవజీవన్ పత్రికలో ప్రకటించబడింది. తరువాత అది దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ చరిత్ర అను పేరిట విడిగా పుస్తకరూపంలో ప్రచురించబడింది. దాని ఆంగ్లానువాదం శ్రీ బాల్‌జీ గోవింద్‌జీ దేసాయి "కరెంట్ థాట్' లో ప్రచురించడం కోసం చేస్తున్నారు. దాన్ని త్వరగా ఇంగ్లీషులో పుస్తక రూపంలో ప్రకటించాలని నేను సూచించాను. దక్షిణ ఆఫ్రికాలో నేను చేసిన పెద్ద ప్రయోగాలను గురించి తెలుసుకోదలచిన వారికి అది అందాలని నా ఉద్దేశ్యం.

గుజరాతీ పాఠకులు ఆ పుస్తకం చదివియుండకపోతే తప్పక చదవమని సిఫారసు చేస్తున్నాను. ఆ చరిత్రలో పేర్కొనబడ్డ ప్రధాన కథా భాగాన్ని వదిలి దక్షిణ ఆఫ్రికాలో నేను చేసిన మిగతా చిన్న పెద్ద నా వ్యక్తిగత ప్రయోగాలను గురించి వచ్చే ప్రకరణాల్లో వ్రాస్తాను. అవి పూర్తికాగానే హిందూ దేశంలో చేసిన ప్రయోగాలను తెలియజేయాలని భావిస్తున్నాను. అందువల్ల ప్రయోగాల సందర్భక్రమాన్ని సరిగా ఉంచుకోవాలని భావించేవారు. దక్షిణ ఆఫ్రికా చరిత్రకు సంబంధించిన ప్రకరణాలను ఎదురుగా ఉంచుకోవడం అవసరం.

## 27. ఆహారంలో వివిధ ప్రయోగాలు

మనోవాక్కాయాల ద్వారా బ్రహ్మచర్యవ్రతం ఎలా సాగించాలి అనేది ఒక యోచన అయితే సత్యాగ్రహ సమరానికి ఎక్కువ సమయం ఎలా మిగలాలి, హృదయ శుద్ధి అధికంగా ఎలా జరగాలి అనునది మరో యోచన. ఈ రెండు చింతలు లేక యోచనలు నన్ను ఆహారంలో ఎక్కువ మార్పులు చేయమని సంయమానికి అవి అవసరమని ప్రోత్సహించాయి. మొదట నేను ఆరోగ్యదృష్ట్యా ఆహారంలో మార్పులు చేసేవాణ్ణి. ఇప్పుడు ధార్మిక దృష్టితో చేయడం ప్రారంభించాను.

ఈసారి మార్పుల్లో ఉపవాసాలు, అల్పాహారాలు ఎక్కువగా చోటు చేసుకున్నాయి. రుచులు మరిగిన జిహ్వ వాంఛల్ని రెచ్చగొడుతుంది. నా స్థితి కూడా అంతే. జననేంద్రియం మరియు స్వాదేంద్రియం మీద అధికారం సంపాదించుటకు నేను నానా అవస్థ పడవలసి వచ్చింది. ఈనాటికీ ఆ రెండిటిని పూర్తిగా జయించానని చెప్పలేను. నేను మొదటి నుండి అధికాహారిని. మిత్రులు నీవు సంయమంగా వున్నావని అనేవారు. దాన్ని నేను సంయమమని భావించలేదు. నామీద విధించుకున్న ఆ కొద్దిపాటి అంకుశాన్ని సడలనిచ్చి ఉంటే పశువుకంటే హీనంగా మారిపోయి వుండేవాణ్ణి. నష్టపడిపోయేవాణ్ణి. నా బలహీనతలు బాగా తెలుసుకున్నందువల్ల వాటి విషయమై

చాలా జాగ్రత్తపడ్డాను. అందువల్లనే ఈ శరీరాన్ని ఇన్ని సంవత్సరాలనుండి నిలబెట్టి ఉంచగలిగాను. దానిచేత పని చేయించగలిగాను.

ఈ విధమైన జ్ఞానం సంపాదించి అట్టి వారి సాంగత్యం కూడా పొంది ఏకాదశి నాడు పండ్లు తిని ఉండటం, ఉపవాసం చేయడం ప్రారంభించాను. కృష్ణ జన్మాష్టమి మొదలుగా గల వ్రతాలు ప్రారంభించాను. అయితే పండ్లు తినడం, భోజనం చేయడం రెండిటిలో ఎక్కువ తేడా నాకు కనబడలేదు. పండ్లు తిండిగింజలు రెండిటి ద్వారా మనం పొందే ఆనందం ఒకే రకంగా ఉంటుంది. పండ్లు తినడం అలవాటు అయితే ఆనందం అధికంగా లభిస్తుంది. అందువల్ల రోజంతా ఉపవాసం చేయడమో లేక ఒక పూట భోజనం చేయడమో చేసి చూచాను. ప్రాయశ్చిత్తం నెపంతో కొన్ని పూటలు భోజనం మాని కూడా చూచాను.

దీనితో కొన్ని అనుభవాలు కలిగాయి. శరీరం ఎంత శుభ్రంగా ఉంటుందో అంతగా రుచియందు కోరిక, ఆకలి పెరుగుతాయి. ఉపవాసాలు సంయమనానికేగాక, భోగాధిక్యతకు కూడా ఉపయోగపడతాయని తెలుసుకున్నాను. నాకేగాక నాతోబాటు ప్రయోగాలు చేసిన వారికి కూడా ఇదే విధమైన అనుభవం కలిగింది. శరీరాన్ని పుష్టిగా, తుష్టిగా వుంచుకోవడం సంయమం అలవరుచుకోవడం, రుచుల వాంఛను జయించడం ఇవే నా లక్ష్యాలు. అందుకోసం తినే పదార్థాల్లో చాలా మార్పులు చేశాను. అసలు రసాస్వాదనం నీడలా మనిషిని సదా వెంబడిస్తూ ఉంటుంది. ఒక పదార్థం తినడం మానుకొని మరో పదార్థం పుచ్చుకోవడం ప్రారంభిస్తే అది ఎక్కువగా అలవాటవుతూ ఉంటుంది.

నా ప్రయోగాలలో కొంత మంది మిత్రులు కూడా పాల్గొంటూ ఉండేవారు. అట్టివారిలో హర్మన్ కేలన్ బెక్ ముఖ్యుడు. దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో ఆయనను పాఠకులకు పరిచయం చేశాను. అందువల్ల ఈ ప్రకరణంలో ఆ విషయం మళ్లీ వ్రాయను. ఆయన కూడా నాతో బాటు అన్ని ప్రయోగాలు చేశాడు. ఏకాదశి ఉపవాస్నం, రోజంతా ఉపవాసం, ఒక పూట ఉపవాసం మొదలుగాగలవన్నీ చేశాడు. యుద్ధం తీవ్రంగా సాగుతూ ఉన్నప్పుడు నేను వారి ఇంట్లో ఉండేవాణ్ణి. మేము చేసిన ప్రయోగాలను గురించి చర్చించుకొనేవారం. మార్పు చేసినప్పుడు ఆయన అధికంగా సంతోషం పొందేవాడు. అప్పుడు మా సంభాషణ తీయగా సాగుతూ ఉండేది. తప్పు అని అనిపించేది కాదు. కాని తరువాత అనుభవం గడిచినకొద్దీ ఆ విధమైన రసవత్తర సంభాషణ కూడా తగదని తెలుసుకున్నాను. మనిషి రసానందం కోసం ఏమీ

తినకూడదనీ కేవలం శరీర పోషణ కోసమే తినాలనీ తెల్సుకున్నాను. ప్రతి ఇంద్రియం కేవలం శరీరం కోసం, శరీరం ద్వారా ఆత్మ సాక్షాత్కారం కోసం పనిచేస్తుంది. అప్పుడు అందలి రసానుభూతి తగ్గిపోతుంది. అప్పుడే ఇంద్రియాలు సహజంగా పనిచేస్తున్నాయని గ్రహించాలి. ఇట్టి సహజత్వం కోసం ఎన్ని ప్రయోగాలు చేసినా తక్కువేనని మనం తెలుసుకోవాలి. ఆ కృషిలో శరీరాల్ని ఆహుతి చేయవలసి వచ్చినా వెనుకాడకూడదని గ్రహించాలి. ఇప్పుడు అంతా ఉల్టా వ్యవహారమే నడుస్తున్నది. నాశనమై పోయే శరీరం యొక్క శోభను పెంచడానికి, దాని వయస్సును పెంచడానికి ఇతర ప్రాణుల్ని బలిచేస్తున్నాం. అందువల్ల శరీరం, ఆత్మ రెండూ హీనమైపోతాయి. ఒక వ్యాధి వస్తే దాన్ని నయం చేసుకునేందుకు ప్రయత్నించి రుచులు మరిగి, క్రొత్త రోగాల్ని కొని తెచ్చుకుంటూ ఉంటాం. భోగశక్తిని కూడా పోగొట్టుకుంటాం. ఇదంతా మన కండ్ల ఎదుట జరుగుతూ ఉన్నది. మనం చూచి కూడా చూడనట్లు వ్యవహరిస్తున్నాం. కండ్లు మూసుకుంటున్నామన్నమాట.

ఆహార పదార్థాల మార్పును గురించి వివరించాను. అందలి అర్థాన్ని పాఠకులు గమనించాలి. ఆ దృష్టితో వాటి ఉద్దేశ్యం, వాటి వెనుక గల యోచనా సరళిని వివరించడం అవసరం కదా! అందుకే ఇంత వివరం వ్రాశాను.

## 28. నా భార్య యొక్క దృఢచిత్తత

కస్తూరిబాయి మీద జబ్బులు మూడుసార్లు దాడి చేశాయి. ఆ మూడింటిబారి నుండి ఆమె గృహ చికిత్సల ద్వారా తప్పించుకున్నది. మొదటి దాడి సత్యాగ్రహ సమరం సాగుతున్నప్పుడు జరిగింది. ఆమెకు మాటిమాటికి రక్తస్రావం జరుగుతూ ఉండేది. మిత్రుడగు ఒక డాక్టరు ఆపరేషన్ చేయడం అవసరమని చెప్పాడు. ఎంతో చెప్పిన మీదట ఆమె అందుకు అంగీకరించింది. శరీరం బాగా క్షీణించింది. మత్తుమందు ఇవ్వకుండానే డాక్టరు ఆపరేషన్ చేశాడు. కత్తులు పనిచేస్తున్నప్పుడు అపరిమితంగా బాధ కలిగింది. కాని ఎంతో సహనం, ధైర్యంతో ఆమె ఆ బాధను సహించింది. అది చూచి నేను నివ్వెరపోయాను. ఆపరేషన్ విజయవంతంగా జరిగింది. డాక్టరు, ఆయన భార్య ఇద్దరూ కస్తూరిబాయికి మంచి సేవ చేశారు.

ఇదంతా డర్బనులో జరిగింది. రెండు మూడు రోజుల తరువాత, నిశ్చింతగా జోహన్సుబర్గు వెళ్లమని డాక్టరు నాకు సలహా ఇచ్చాడు. నేను వెళ్లిపోయాను. కొద్దిరోజులు గడిచాయి. కస్తూరిబాయి శరీరం పూర్తిగా బలహీనమైపోయిందనీ లేవలేని స్థితిలో

ఉన్నదనీ ఒక పర్యాయం మూర్ఛపోయిందని వార్త అందింది. నా అనుమతి లేకుండా కస్తూరిబాయికి మందుల్లో కలిపి మద్యం కాని, మాంసం కాని ఇవ్వవద్దని డాక్టరుకు తెలిపాను. డాక్టరు జోహన్సుబర్గుకు ఫోను చేశాడు. ఫోను అందుకున్నాను. "మీ భార్యకు మాంసం కలిపిన చారుగాని లేక బీఫ్ టీగాని ఇవ్వడం అవసరమని భావిస్తున్నాను. దయయుంచి అనుమతించండి" అని డాక్టరు అన్నాడు.

"నేను అందుకు అనుమతి ఇవ్వలేదు. అయితే కస్తూరిబాయి స్వతంత్రురాలు. అపస్మారక స్థితిలో లేకపోతే ఆమెను అడగండి. ఆమె అంగీకరిస్తే తప్పక ఇవ్వండి" అని సమాధానం ఇచ్చాను. "ఇలాంటి సమయాల్లో నేను రోగిని అడగను. మీరు ఇక్కడికి రావడం అవసరం. నాకు ఇష్టమైన పదార్థం రోగికి ఇచ్చే స్వాతంత్ర్యం మీరు నాకు ఇవ్వకపోతే నేను మీ భార్య ప్రాణాలకు బాధ్యత వహించను" అని డాక్టరు అన్నాడు. నేను ఆ రోజునే రైలు ఎక్కాను. డర్బను చేరాను. "మాంసం కలిపిన చారు పట్టిన తరువాతనే మీకు ఫోను చేశాను" అని డాక్టరు చెప్పాడు. "డాక్టరుగారూ! ఇది పూర్తిగా దగా" అని భావిస్తున్నాను అని అన్నాను. డాక్టరు దృఢమైన స్వరంతో ఇలా సమాధానం ఇచ్చాడు. మందులు ఇచ్చే సమయంలో నేను దగాల్ని పట్టించుకోను. మేము డాక్టర్లం. మందులు ఇచ్చేటప్పుడు రోగుల్ని, వారి సంబంధీకుల్ని మోసం చేయడం పుణ్యమని భావిస్తాం అని ఆయన అన్నాడు. ఆ మాటలు విని నాకు విచారం కలిగింది. అయినా శాంతించాను. డాక్టరు నాకు మంచి మిత్రుడు, సజ్జనుడు కూడా. ఆయన, ఆయన భార్య నాకు ఎంతో ఉపకారం చేశారు. కాని ఈ వ్యవహారం నేను సహించలేకపోయాను.

"డాక్టర్‌గారూ! ఇక ఏం చేయదలుచుకున్నారో స్పష్టంగా చెప్పండి. ఇష్టం లేకుండా ఆమెకు మాంసం పెట్టడానికి నేను సుతరాము అంగీకరించను. మాంసం తినకపోతే ఆమె చనిపోతే అందుకు నేను సిద్ధంగా ఉన్నాను" "మీ వేదాంతం నా ఇంట్లో నడవదు. మీరు మీ భార్యను నా ఇంట్లో ఉంచదలచుకుంటే నా ఇష్టం వచ్చిన ఆహారం పెడతాను. అవసరమైతే మాంసం పెడతాను. మీరు ఇందుకు ఇష్టపడకపోతే ఆమె నా ఇంట్లో మరణించడానికి నేను అంగీకరించను" అని డాక్టరు స్పష్టంగా చెప్పివేశాడు.

అయితే ఆమెను తక్షణం తీసుకువెళ్ళమంటారా? అని అడిగాను. తక్షణం తీసుకువెళ్ళమని నేను అనలేదు. బంధనాలతో నన్ను బంధించవద్దని అంటున్నాను. అలా అయితే మేమిద్దరం రోగికి చేతనైనంతగా సేవ చేయగలం. మీరు నిశ్చింతగా వెళ్ళవచ్చు. ఇంత స్పష్టంగా చెబుతున్నా మీరు అర్థం చేసుకోకపోతే ఇక చెబుతున్నా వినండి, మీరు మీ భార్యను తీసుకువెళ్ళండి" అని డాక్టరుగారు చెప్పివేశాడు.

అప్పుడు నా వెంట మా ఒక పిల్లవాడు కూడా ఉన్నాడు. వాణ్ణి అడిగాను 'మీ మాటే నా దృష్టిలో సరైనది. అమ్మను అడిగితే ఆమె మాంసం తినడానికి ఒప్పుకోదు' అని మా అబ్బాయి అన్నాడు. నేను కస్తూరిబాయి దగ్గరికి వెళ్ళాను. ఆమె చాలా బలహీనంగా ఉన్నది. ఆమెను మాట్లాడించడానికి మనస్సు ఇష్టపడలేదు. అయినా ధర్మమని భావించి ఆమెకు విషయమంతా క్లుప్తంగా చెప్పాను. ఆమె దృఢనిశ్చయంతో ఇలా అన్నది "నేను ఏది ఏమైనా సరే మాంసం కలిపిన చారు పుచ్చుకోను. మానవజన్మ దుర్లభం. అది మాటిమాటికి లభించదు. అయినా మీ ఒళ్ళో చనిపోవడానికి ఇష్టపడతాను. కాని ఈ దేహాన్ని భ్రష్టం కానీయను" అని అన్నది. ఎన్నో విధాల ఆమెకు నచ్చచెప్పి చూచాను. "నా ఇష్ట ప్రకారం నడుచుకోవాలని నీకు నిర్బంధం లేదు. మనకు తెలిసిన ఫలానా హిందువులు మాంసం, మద్యం పుచుకున్నారు అని కూడా చెప్పాను. కాని ఆమె మాత్రం సరే అని అనలేదు. నన్ను ఇక్కడి నుండి తీసుకువెళ్ళండి" అని అన్నది.

ఆమె మాటలునాకు సంతోషం కలిగించాయి. ఆమెను తీసుకువెళ్ళడానికి భయం వేసింది. కాని గట్టి నిర్ణయానికి వచ్చి కస్తూరిబా అభిప్రాయం డాక్టరుకు చెప్పివేశాను. ఆయన మండిపడ్డాడు. "మీరు కసాయి భర్తగా కనబడుతున్నారు. ఇంత జబ్బుతో ఉన్న ఆమెకు ఈ విషయం చెప్పడానికి మనస్సు ఎలా ఒప్పింది? మీరు చేసింది సిగ్గుచేటు కాదా? ఇక చెబుతున్నా వినండి ఇక్కడి నుండి తీసుకువెళ్ళడానికి ఆమె అనుకూల స్థితిలో లేదు. ఆమె శరీరం ఏమాత్రం వత్తిడి తగిలినా తట్టుకోదు. త్రోవలోనే ఆమె ప్రాణం పోవచ్చు. అయినా మీ మొండిపట్టు వదలకుండా ఆమెను తీసుకువెళతాను అని అంటే మీరు సర్వతంత్ర స్వతంత్రులు. నేను ఆమెకు మాంసం కలిపిన చారు పట్టకుండా ఒక్కరాత్రి అయినా నా ఇంట్లో వుండనీయను. మీ ఇష్టం అని అన్నాడు. అప్పుడు చిటపట చిటపట చినుకులు పడుతున్నాయి. స్టేషను దూరాన ఉన్నది. డర్బను నుండి ఫినిక్సుకు రైల్లో వెళ్ళాలి. స్టేషను నుండి ఆశ్రమానికి సుమారు రెండున్నర మైళ్ళు నడిచి వెళ్ళాలి. ప్రమాదం పొంచి ఉన్నది. దేవుడి మీద భారం వేశాను. ఒక మనిషిని ఫినిక్సుకు ముందుగా పంపించాను. ఫినిక్సులో మా దగ్గర 'హమక్' ఉన్నది. హమక్ అంటే చిన్న రంధ్రాలు గల బట్టతో తయారు చేయబడ్డ ఉయ్యాల లేక డోలీ అన్నమాట. హమక్ చివరికొసలు వెదురు బద్దలతో కట్టి వేస్తే రోగి హాయిగా అందు ఊగుతూ పడుకోవచ్చు. ఆ హమక్, ఒక సీసా వేడిపాలు, ఒక సీసా వేడినీళ్ళు ఆరుగురు మనుష్యులను స్టేషనుకు పంపమని వెస్ట్‌కు కబురు పంపాను.

రైలు కదిలే సమయం సమీపిస్తున్నందున రిక్షా తెమ్మని మనిషిని పంపాను. భయంకరమైన స్థితిలో ఉన్న కస్తూరిబాయిని ఆ రిక్షాలో ఎక్కించుకొని బయలుదేరాను. భార్యకు ధైర్యం చెప్పవలసిన అవసరం నాకు కలగలేదు. నాకు ఆమె ధైర్యం చెప్పడమే గాక "ఏం ఫరవాలేదు. మీరు భయపడకండి" అని ప్రోత్సహించింది. ఆమె అస్థిపంజరం అసలు బరువే లేదు. ఆమె ఏమీ తినలేదు. గుటక దిగడం లేదు. రైలు పెట్టెదాకా వెళ్ళాలంటే ప్లాటుఫారం మీద చాలా దూరం నడిచి వెళ్లాలి. లోపలికి రిక్షా పోనీయరు. నేను ఆమెను ఎత్తుకొని పెట్టెదాకా తీసుకువెళ్ళాను. ఫినిక్సుకు ఉయ్యాల తీసుకువచ్చారు. దానిలో రోగిని పడుకోబెట్టాము. వత్తిడి తగలకుండా ఆమెను ఫినిక్సు చేర్చాం. జలచికిత్స ప్రారంభించాను. నెమ్మదిగా ఆమె శరీరం పుంజుకోసాగింది.

ఫినిక్సు చేరుకున్న రెండు మూడు రోజులకు ఒక స్వామీజీ వచ్చాడు. నా పట్టుదలను గురించి ఆయన విన్నాడు. మా ఇద్దరికీ నచ్చచెప్పడం ప్రారంభించాడు. మణిలాలు, రామదాసులు ఇద్దరూ స్వామీజీ వచ్చినప్పుడు అక్కడే ఉన్నారని నాకు గుర్తు. మాంసాహారం తప్పుకాదని స్వామీజీ లెక్చరు ప్రారంభించాడు. మనస్మృతి యందలి కొన్ని శ్లోకాలు వినిపించాడు. జబ్బులో వున్న భార్య ముందు ఈ రకమైన మాటలు మాట్లాడటం నాకు నచ్చలేదు. అయినా సభ్యతను దృష్టిలో పెట్టుకుని పూరుకున్నాను. మాంసాహారం సరియైనదేనని చెప్పడానికి మనుస్మృతి యందలి శ్లోకాలు వల్లించవలసిన అవసరం లేదు. ఆ శ్లోకాలు నాకు తెలుసు. అవి ప్రక్షిప్తాలు అనే వాదనను గురించి కూడా నాకు తెలుసు. అవి ప్రక్షిప్తాలు అయినా కాకపోయినా మాంసరహిత ఆహారం విషయమై నేను దృఢమైన నిర్ణయానికి వచ్చేశాను. దానికి తిరుగులేదు. పైగా కస్తూరిబాయి దృఢచిత్తత నాకు స్ఫూర్తినిచ్చింది. పాపం ఆమెకు శాస్త్రాల గొడవ ఏం తెలుసు? ఆమె దృష్టిలో తండ్రి తాతల ప్రవర్తనే ధర్మం. అదే ఆమెకు ప్రమాణం. మా పిల్లలకు తన తండ్రి అభిప్రాయాలు బాగా తెలుసు. అందువల్ల వాళ్ళు స్వామీజీని ఆటలు పట్టించసాగారు. చివరికి కస్తూరిబాయి అందుకొని "స్వామీజీ! మీరు ఏం చెప్పినా సరే, నేను మాత్రం మాంసం ముట్టను. మాంసం తిని జబ్బు నయం చేసుకోవడానికి ఇష్టపడను. ఇక నా మెదడు కొరక్కండి. దయయుంచి నన్ను వదలండి. మిగతా విషయం నా బిడ్డల తండ్రితో తరువాత మాట్లాడండి" అని ఖరాఖండిగా చెప్పేసింది.

## 29. ఇంట్లో సత్యాగ్రహం

మొదటిసారి 1908లో నాకు జైలు ప్రాప్తి కలిగింది. జైల్లో ఖైదీల చేత అనేక నియమాల్ని పాటింపచేసేవారు. ఆ నియమాల్ని సంయమం కలిగిన వ్యక్తి లేక బ్రహ్మచారి స్వేచ్ఛగా పాటించాలని భావించేవాణ్ణి. ఉదాహరణకు సాయంత్రం సూర్యాస్తమయానికి ముందు అనగా అయిదు గంటలకు భోజనం చేయడం, హిందూ దేశస్థులకు హబ్షీ ఖైదీలకు టీ ఇవ్వకపోవడం, మొదలుగాగలవి. అక్కడి నియమాల ప్రకారం రుచి కోసం తినవలసిన పరిస్థితి లేనేలేదు. జైలు డాక్టరుకు హిందూ దేశస్థుల కోసం నూరిన మసాలాలు వాడమని, ఉడుకుతూ వున్నప్పుడే ఆహారపదార్థంలో ఉప్పు కలపమని చెప్పాను. "ఇక్కడికి మీరు జిహ్వ చాపల్యం తీర్చుకునేందుకు రాలేదు. ఆరోగ్య దృష్ట్యా కావాలంటే ఉప్పు విడిగా తీసుకున్నా లేక ఉడుకుతూ వున్నప్పుడు పదార్థాల్లో వేసినా రెండూ ఒకటే" అని ఆయన సమాధానం ఇచ్చాడు. ఎంతో ప్రయత్నించిన తరువాత అక్కడ కొద్ది మార్పులు చేయగలిగాము. కాని సంయమం దృష్ట్యా రెండు నిబంధనలు సరి అయినవే. ఇలాంటి నిబంధనలు బలవంతంగా విధించకపోతే అమలుకావు. స్వేచ్ఛగా పాటిస్తే మాత్రం అవి ఎంతో ప్రయోజనకరమైనవి. జైలునుండి విడుదల అయిన తరువాత ఆ మార్పులు వెంటనే చేశాను. టీ తీసుకోవడం మానివేశాను. సాయంత్రం త్వరగా భోజనం చేయడం అలవాటు చేసుకున్నాను. ఈనాటివరకు ఆ అలవాటు అలాగే ఉండిపోయింది.

ఒకసారి ఉప్పును కూడా మానవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ నియమం పది సంవత్సరాల వరకు నిరాటంకంగా సాగింది. ఆహారానికి సంబంధించిన అనేక పుస్తకాల్లో ఆరోగ్యదృష్ట్యా ఉప్పు తినవలసిన అవసరం లేదనీ, ఉప్పు వాడకపోతే ఆరోగ్యం ఎంతో బాగా ఉంటుందని చదివాను. బ్రహ్మచారులకు ఇందువల్ల లాభం కలుగుతుందని నేను అనుకుంటున్నాను. శరీరం దుర్బలంగా ఉంటే పప్పు తినడం మానాలని కూడా చదివాను. అనుభవం మీద ఈ విషయం తెలుసుకున్నాను. కాని నేను వాటిని అప్పుడు మానలేకపోయాను. ఆపరేషను అయిన తరువాత కస్తూరి బాయికి రక్తస్రావం తగ్గిపోయింది. తరువాత అది మళ్ళీ ప్రారంభమైంది. తగ్గలేదు. జల చికిత్స వల్ల ప్రయోజనం చేకూరలేదు. నా చికిత్సల మీద ఆమెకు విశ్వాసం తక్కువే కాని ఆమెకు అవిశ్వాసం కూడా లేదు. ఇతర చికిత్సలు చేయించుకోవాలనే కోరిక కూడా ఆమెకు లేదు. చివరికి పప్పు ఉప్పు రెండూ వదలివేయమని సలహా ఇచ్చాను. ఎన్నో విధాల నచ్చచెప్పాను. అనేక గ్రంథాల నుండి ప్రమాణాలు కూడా చదివి

వినిపించాను. అయినా ఆమె అంగీకరించలేదు. పప్పు ఉప్పు మానమని ఎవరైనా మీకు చెబితే మీరు మానతారా అని గట్టిగా అన్నది.

నాకు విచారం కలిగింది. సంతోషం కూడా కలిగింది. నా ప్రేమ ఎలాంటిదో పరిచయం చేసేందుకు అవకాశం దొరికింది. నీవు తప్పుగా యోచిస్తున్నావు. నాకు జబ్బు చేసి వైద్యుడు ఏ వస్తువైనా తినవద్దని చెబితే తప్పక వదిలివేస్తాను. అయినా, ఇదిగో, ఇప్పటినుండి ఒక్క సంవత్సరం కాలం పప్పు ఉప్పు వదిలి వేస్తున్నాను. నీవు మానినా సరే మానకపోయినా సరే నీ ఇష్టం. నేను మాత్రం వదిలివేస్తున్నాను అని అన్నాను. కస్తూరి బాయి గిలగిలలాడిపోయింది. "నన్ను క్షమించండి. మీ స్వభావం తెలిసి కూడా మామూలుగా అనేశాను. మీ మాట ప్రకారం నేను పప్పు ఉప్పు మానివేస్తాను. మీరు మాత్రం మానకండి నాకు పెద్ద శిక్ష పడుతుంది" అని అంటూ బ్రతిమలాడింది. "నీవు పప్పు ఉప్పు మానితే మంచిదే. దానివల్ల నీకు లాభం కలుగుతుందనే నమ్మకం నాకున్నది. కాని చేసిన ప్రతిజ్ఞను విరమించుకోవడం నా వల్ల కానిపని. ఆ విధంగా వాటిని మానడం వల్ల నాకు లాభం కలుగుతుంది. అందువల్ల ఒత్తిడి చేయవద్దు. నాకు కూడా పరీక్ష జరగాలికదా! నేను మానడం వల్ల నీ వ్రతానికి బలం చేకూరుతుంది." అని ఆమెకు చెప్పాను. ఇక ఏం చేస్తుంది? "మీరు జగమొండి. ఎవ్వరి మాటా వినరు?" అంటూ కాసేపు కన్నీరు కార్చి తరువాత శాంతించింది

దీన్ని నేను సత్యాగ్రహం అని అంటాను. నా జీవనపు కొన్ని మధురక్షణాల్లో ఇది కూడా ఒకటి అని భావిస్తున్నాను.

తరువాత కస్తూరిబాయి ఆరోగ్యం త్వరత్వరగా కుదుటపడసాగింది. పప్పు ఉప్పు రెండూ మానడం ఆమె జబ్బు నయం కావడానికి ప్రధాన కారణం అయి ఉండవచ్చు లేక ఆ రెండూ మానడం వల్ల ఆహారంలో జరిగిన తదితర మార్పులు కారణం అయివుండవచ్చు లేక ఇటువంటి మార్పు చేయించటానికి నేను చూపిన జాగరూకత, తత్ఫలితంగా మానసికంగా వచ్చిన మార్పు కూడా కారణం అయిఉండవచ్చు. ఏది ఏమైనా చిక్కిపోయిన కస్తూరిబాయి శరీరం తిరిగి పుంజుకోసాగింది. దానితో వైద్యరాజ్‌గా నా పరపతి కూడా బాగా పెరిగిపోయింది. ఉప్పు, పప్పు రెండిటినీ త్యజించడం వల్ల నామీద మంచి ప్రభావం పడింది. వదలివేసిన తరువాత పప్పు, ఉప్పు తినాలనే కోరిక కూడా ఎన్నడూ కలగలేదు. చూస్తుండగానే ఏడాది గడిచిపోయింది. ఇంద్రియాలు శాంతించినట్లు నాకు అనుభూతి కలిగింది. సంయమం వైపుకు మనస్సు పరుగెత్తసాగింది. ఏడాది గడిచిన తరువాత కూడా నేను వాటిని పుచ్చుకోలేదు. హిందూ

దేశం వచ్చిన కొంతకాలం తరువాతనే వాటిని పుచ్చుకున్నాను. ఒక పర్యాయం ఇంగ్లాండులో 1914లో ఉప్పు, పప్పు తిన్నాను. దేశం వచ్చాక ఎందుకు తినవలసి వచ్చిందో ఆ కథ మరో ప్రకరణంలో చెబుతాను.

ఇతరుల మీద కూడా పప్పు ఉప్పును గురించిన ప్రయోగం చేశాను. దక్షిణ ఆఫ్రికాలో మంచి ఫలితం చేకూరింది. ఆయుర్వేద వైద్యం దృష్ట్యా వాటిని వదలడం వల్ల లాభం చేకూరుతుందని చెప్పగలను. ఈ విషయంలో నాకు ఎట్టి సందేహమూ లేదు. భోగికి, సంయమం కలిగిన వ్యక్తికి మధ్య ఆహారం విషయంలోను, అలవాట్ల విషయంలోను వ్యత్యాసం వుండవలసిందే. బ్రహ్మచర్య వ్రతపాలనను గురించి కోరిక గల వ్యక్తి భోగిగా జీవనం గడిపి తిరిగి బ్రహ్మచర్యం గడపాలంటే చాలా కష్టం. అది అసంభవం కూడా.

## 30. సంయమం

కస్తూరి బాయి జబ్బు పడినప్పుడు ఆ కారణంగా నా ఆహారంలో ఎన్నో మార్పులు జరిగాయని గత ప్రకరణంలో వ్రాశాను. ఇక ఇప్పుడు బ్రహ్మచర్యం దృష్ట్యా నా ఆహారంలో మార్పులు ప్రారంభమైనాయి.

పాలు విరమించడం మొదటి మార్పు. పాలు ఇంద్రియ వికారం కలిగించే పదార్థం. ఈ విషయం మొదట నేను శ్రీ రాయచంద్‌భాయి వల్ల తెలుసుకున్నాను అన్నాహారాన్ని గురించి ఇంగ్లీషు పుస్తకాలు చదవనప్పుడు ఈ భావం బాగా బలపడింది. కాని బ్రహ్మచర్య వ్రతం పట్టిన తరువాతనే పాలు తాగడం విరమించగలిగాను శరీర పోషణకు పాలు అనవసరమని చాలాకాలం క్రితమే గ్రహించాను. అయితే వెంటనే పోయే అలవాటు కాదుగదా! ఇంద్రియదమనం కోసం పాలు త్రాగడం మానాలి అను విషయం తెలుసుకోగలిగాను. ఇంతలో గోవుల్ని, గేదెల్ని కసాయివాళ్లు ఎంతగా హింసిస్తున్నారో తెలిపే కరపత్రాలు, వివరాలు కలకత్తా నుండి నాకు చేరాయి. ఆ సాహిత్య ప్రభావం నా మీద అపరిమితంగా పడింది. ఈ విషయమై నేను కేలన్‌బెక్‌తో చర్చించాను.

కేలన్‌బెక్‌ను గురించి దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో వ్రాశాను. గత ప్రకరణంలో కూడా కొద్దిగా వ్రాశాను. ఇక్కడ రెండు మాటలు వ్రాయడం అవసరమని భావిస్తున్నాను. ఆయన మి. ఖాన్ స్నేహితుడు. తనలో వైరాగ్య ప్రవృత్తి నిండి ఉన్నదని ఆయన గ్రహించాడు. అందువల్లనే ఖాను ఆయనను నాకు పరిచయం చేశాడని నా అభిప్రాయం.

పరిచయం అయినప్పుడు ఆయన పెట్టే ఖర్చుల్ని చూచి, ఆయన హంగులు, దర్పం చూచి నేను బెదిరిపోయాను. అయితే మొదటి కలయికలోనే ఆయన ధర్మాన్ని గురించి ప్రశ్నలు వేశాడు. మాటల్లో బుద్ధ భగవానుని త్యాగాన్ని గురించి చర్చ జరిగింది. ఆ తరువాత మా పరిచయం ఎక్కువైంది. దానితో మా సంబంధం గాఢమైపోయింది. నేను చేసే ప్రతి ప్రయోగం తాను కూడా చేయాలనే స్థితికి ఆయన వచ్చాడు. ఆయన ఒంటరివాడు. తన ఒక్కడి కోసం ఇంటి అద్దె వగైరాలు గాక నెలకు 1200 రూపాయలు దాకా ఖర్చు పెడుతుండేవాడు తరువాత నిరాడంబరత్వం వైపుకు మ్రొగ్గి చివరికి నెలకు 120 రూపాయల ఖర్చుకు చేరుకున్నాడు. నా కాపురం ఎత్తివేశాక, మొదటిసారి జైలుకు వెళ్ళి వచ్చిన తరువాత నుండి ఇద్దరం కలిసి వుండసాగాం. అప్పుడు మా ఇద్దరి జీవనం మొదటి కంటే కఠోరంగా వుండేది. మేము కలిసి ఉంటున్నప్పుడే పాలు మానాలని చర్చ జరిగింది. మి. కేలన్‌బెక్ ఈ విషయాన్ని గురించి మాట్లాడుతూ "పాల దోషాలను గురించి మనం తరుచు చర్చిస్తున్నాం. పాలు తాగడం విరమించి వేయకూడదా? పాల అవసరం లేదు కదా!" అని అన్నాడు. ఆయన మాటలు విని నాకు ఆనందంతో బాటు ఆశ్చర్యం కూడా కలిగింది. ఆయన సలహాను సమర్థించాను. మేమిద్దరం ఆ క్షణాన టాల్‌స్టాయ్ ఫారంలో పాలు తాగడం మానివేశాం 1912లో ఈ ఘట్టం జరిగింది.

అంతటితో శాంతి లభించలేదు. పాలు విరమించిన తరువాత కొద్దిరోజులకు కేవలం పండ్లు మాత్రమే భుజించి ఉందామని నిర్ణయానికి వచ్చాం. కారు చవుకగా దొరికే పండ్లు మాత్రమే తీసుకోవాలని నిర్ణయించాం. కడు నిరుపేద జీవించే పద్ధతిన జీవించాలని మా ఇద్దరి ఆకాంక్ష. ఫలాహారంలో ఉండే సౌకర్యాలను ప్రత్యక్షంగా పొందాము పొయ్యి వెలిగించవలసిన అవసరం లేకుండా పోయింది. పచ్చి వేరుసెనగపప్పు, అరటిపండ్లు, ఖర్జూరం పండ్లు, నిమ్మపండ్లు, పప్పునూనె ఇవే నా ఆహారం. బ్రహ్మచర్య వ్రతం అవలంబించాలని భావించేవారికి ఒక హెచ్చరిక చేయడం అవసరం. బ్రహ్మచర్యానికి, ఆహార పదార్థాలకు దగ్గర సంబంధం ఉన్నదని చెప్పానేగాని అసలు రహస్యం మనస్సుకు సంబంధించిందే మైలపడ్డ మనస్సు ఉపవాసాలు చేసినా శుభ్రపడదు. ఆహారం దానిమీద ఏమీ పనిచేయదు. ఆలోచనలవల్ల, భగవన్నామస్మరణవల్ల, భగవంతుని దయవల్ల మనోమాలిన్యం తొలగుతుంది. అయితే మనస్సుకు, శరీరానికి దగ్గర సంబంధం ఉంటుంది. వికారంతో నిండిన మనస్సు వికారం కలిగించే ఆహారాన్ని వెతుకుతుంది. వికారంతో నిండిన మనస్సు రకరకాల

రుచుల్ని, భోగాల్ని వెతుకుతుంది. ఆ రుచుల ఆ భాగాల ప్రభావం మనస్సు మీద పడుతుంది. అందువల్ల ఆ పరిస్థితుల్లో ఆహార పదార్థాల మీద అంకుశం తప్పదు.

వికారంతో నిండిన మనస్సు శరీరంమీద, ఇంద్రియాల మీద విజయం సాధించకపోవడమే గాక, వాటికి లోబడి పనిచేస్తుంది. అందువల్ల శరీరానికి విశుద్ధమైన ఆహారం, తక్కువగా వికారం కలిగించే పదార్థాలు, అప్పుడప్పుడు ఉపవాసాలు, నిరాహారాలు అవసరం. కొందరు సంయమం గలవారు ఆహారాన్ని గురించి ఉపవాసాలను గురించి పట్టించుకోనవసరం లేదని భావిస్తారు. మరికొందరు ఆహారం, నిరాహారం ఇవే సంయమానికి మూలాధారాలని భావిస్తారు. ఇద్దరూ భ్రమలో పడి ఉన్నారని నా అభిప్రాయం. నాకు కలిగిన అనుభవంతో చెబుతున్నాను. సంయమం వైపుకు మరలుతున్న మనస్సుకు ఆహారం విషయమై వహించే జాగరూకతతోబాటు, నిరాహారం మొదలగునవి ఎంతో ఉపయోగపడతాయి. వీటి సహాయం లేనిదే మనస్సు నిర్వికార స్థితిని పొందలేదు.

## 31. ఉపవాసాలు

పాలు, భోజనం మాని పండ్లు తినడం ప్రారంభించాము. సంయమం కోసం ఉపవాసాలు కూడా ప్రారంభించాను. మి. కేలన్‌బెక్ తాను కూడా నాతో బాటు వీటిని ప్రారంభించాడు. ఇంతకు పూర్వం నేను ఆరోగ్య దృష్ట్యా ఉపవాసాలు చేసేవాణ్ణి. ఇంద్రియదమనానికి ఉపవాసాలు బాగా పనిచేస్తాయని ఒక మిత్రుడు సలహా ఇచ్చాడు. వైష్ణవ కుటుంబంలో జన్మించాను. మా అమ్మ కఠోరవ్రతాల్ని అనుష్ఠించేది. ఆ ప్రభావం వల్ల నేను మన దేశంలో వున్నప్పుడు ఏకాదశి వ్రతాన్ని అనుష్ఠించాను. అయితే అప్పుడు మా తల్లితండ్రుల్ని సంతోషపరిచేందుకు చేస్తూ వుండేవాణ్ణి. ఇట్టి వ్రతాలవల్ల ప్రయోజనం ఉంటుందో, ఉండదో ఆ రోజుల్లో నాకు తెలియదు. తరువాత ఒక మిత్రుణ్ణి చూచి, ఆ ప్రకారం బ్రహ్మచర్య వ్రతపాలన కోసం నేను కూడా ఏకాదశి ఉపవాసాలు ప్రారంభించాను. సామాన్యంగా జనం ఏకాదశినాడు పండ్లు పాలు తీసుకొని వ్రతపాలన చేశామని అనుకుంటూ వుంటారు. కాని పండ్లమీద ఆధారపడి నేను ఉపవాసాలు ఇప్పుడు ప్రతిరోజూ చేయసాగాను. మంచినీళ్ళు త్రాగుతూ ఉండేవాణ్ణి. అది శ్రావణమాసం. రంజాను, శ్రావణమాసం రెండూ ఒకేసారి వచ్చాయి. వైష్ణవ కుటుంబాల్లో వైష్ణవ వ్రతాలతో బాటు శైవ వ్రతాల్ని కూడా పాటిస్తూ ఉండేవారు. మా ఇంట్లో వాళ్లు వైష్ణవ దేవాలయాలకు వెళ్ళినట్లే శైవ దేవాలయాలకు

కూడా వెళుతూ ఉండేవారు. శ్రావణమాసంలో ప్రతివారూ ఏదో వ్రతానుష్ఠానం చేస్తూ ఉండేవారు. అది చూచి నేను కూడ శ్రావణమాసాన్ని ఎంచుకున్నాను.

ఈ ప్రయోగం టాల్‌స్టాయి ఆశ్రమంలో ప్రారంభించాను. సత్యాగ్రహుల కుటుంబాల వారిని పిలిపించి వారిని అక్కడ వుంచి నేను, కేలన్‌బెక్ వారితో బాటు ఉన్నాం. వారిలో పిల్లలు, నవయువకులు కూడా ఉన్నారు. వాళ్ళ కోసం పాఠశాల స్థాపించాం. నవయువకుల్లో అయిదారుగురు మహ్మదీయులు ఉన్నారు. ఇస్లాం మత విధుల్ని నిర్వహించుటకు నేను వారికి సహాయం చేశాను. నమాజు చేసుకునేందుకు వాళ్ళకు సౌకర్యం కల్పించాను. ఆశ్రమంలో పారశీకులు, క్రైస్తవులు కూడా ఉన్నారు. వారందరినీ మీమీ మత విధుల్ని పాటించమని ప్రోత్సహించాను. ముస్లిం యువకుల్ని ఉపవాసాలు చేయమని ప్రోత్సహించాను. నేను ఉపవాసాలు చేస్తున్నాను. హిందువులు, క్రైస్తవులు, పారశీకులను కూడా మహమ్మదీయ యువకులతోబాటు ఉపవాసాలు చేయమని ప్రోత్సహించాను. సంయమంతో అందరికీ తోడ్పడవలెనని నచ్చ చెప్పాను. చాలామంది ఆశ్రమవాసులు నా సలహాను పాటించారు. అయితే హిందువులు, పారశీకులు మాత్రం పూర్తిగా మహ్మదీయులకు సహకరించలేదు. వాస్తవానికి అట్టి అవసరం కూడా లేదు. మహ్మదీయులు సూర్యాస్తమయం కోసం ఎదురు చూస్తుండేవారు. కాని మిగతావారు ముందే భోజనం చేసి మహ్మదీయులకు వడ్డన చేసేవారు. వీరికోసం ప్రత్యేకించి పదార్థాలు తయారు చేసేవారు. మహ్మదీయులు సహరీ అంటే ఒకపూట భోజనం చేస్తూండేవారు. ఆ విధంగా ఇతరులు చేయవలసిన అవసరం లేదు. మహ్మదీయులు పగలు మంచినీళ్ళు త్రాగేవారు కాదు. ఇతరులు మంచినీళ్ళు త్రాగవచ్చు.

ఈ ప్రయోగం వల్ల ఉపవాసాల, ఒక పూట నిరాహారదీక్ష యొక్క మహత్తు అందరికీ బోధపడింది. ప్రేమ, ఆదరాభిమానాలు ఒకరికొకరికి కలిగాయి. ఆశ్రమంలో ఆహారం విషయమై నియమాలు ఏర్పాటు చేశాం. ఈ విషయంలో నా మాటను అంతా అంగీకరించారు. అందుకు నేను కృతజ్ఞత తెలుపవలసిన అవసరం ఉన్నది. ఉపవాసం నాడు మాంసాహార నిషేధం మహ్మదీయులకు ఇబ్బంది కలిగించి ఉండవచ్చు. కాని నాకు ఎవ్వరూ ఈ విషయం తెలియనీయలేదు. అంతా కలిసి మెలిసి ఆనందంగా ఉన్నారు. హిందూ యువకులు ఆశ్రమ నియమాలకు అనుకూలంగా కొన్ని రుచికరమైన వంటకాలు చేసి అందరికీ తినిపిస్తూండేవారు.

నా ఉపవాసాలను గురించి వ్రాస్తూ ఇతర విషయాలు కావాలనే ఇక్కడ పేర్కొన్నాను. ఇంతటి తీయని విషయాలు తెలిపేందుకు మరోచోట అవకాశం లభించకపోవడమే అందుకు కారణం. నాకు ఇది సబబు అని తోచిన విషయాలపై అనుచరుల సమ్మతి కూడా పొందుతూ వుండేవాణ్ణి. ఇది నా ప్రవృత్తిగా మారింది. ఉపవాసాలు, ఒకపూట భోజనాలు అందరికీ క్రొత్త. అయినా నేను ఆ విధుల్ని అమలుపరచగలగడం విశేషం.

ఈవిధంగా ఆశ్రమంలో సంయమ వాతావరణం సహజంగా ఏర్పడింది. ఉపవాసాల వల్ల ఒక పూట భోజనాలవల్ల సత్ఫలితాలు కలిగాయి. ఆశ్రమవాసులందరి మీద వీటి ప్రభావం ఏ పరిమాణంలో పడింది అని అడిగితే స్పష్టంగా చెప్పడం కష్టం. అయితే ఆరోగ్యరీత్యానేగాక, విషయవాంఛల రీత్యా కూడా నాలో పెద్ద మార్పు వచ్చిందని చెప్పగలను. ఇట్టి ప్రభావం అందరి మీద పడిందా అని అడిగితే చెప్పడం కష్టం. విషయవాంఛలు అణగి ఇంద్రియ నిగ్రహం కలగాలంటే అందుకు ప్రత్యేకించిన ఉపవాసాలు అవసరం. అయితే ఇలాంటి ప్రయోగం చేస్తున్నప్పుడు కోరికలు తీవ్రం అవుతాయని కొందరికి కలిగిన అనుభవం. అసలు అన్నిటికీ మూలం మనస్సు. ఆ మనస్సును కంట్రోలులో పెట్టుకోకుండా శారీరకంగా ఎన్ని ఉపవాసాలు చేసినా, వ్రతాలు ఆచరించినా ఫలితం ఉండదు. గీతయందలి ద్వితీయ అధ్యాయమందు గల క్రింది శ్లోకం పరిశీలించదగినది.

"విషయావినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జరస్యోప్యస్యపరం దృష్ట్వా నిర్తతే."

అనగా నిరాహారియైనవానికి శబ్దాది విషయముల ఒత్తిడి తగ్గును. కాని విషయవాసన మిగిలియే ఉండును. అది పరమాత్మ దర్శనమువల్ల తొలగును.

సారాంశమేమనగా ఉపవాసాదులు సంయమానికి సాధనాల రూపంలో అవసరం. కాని అదే సర్వస్వం మాత్రం కాదు. శరీరరీత్యా ఉపవాసాలతోబాటు మనస్సు రీత్యా ఉపవాసాలు చేయకపోతే అది దంభానికి కారణభూతం అవుతుంది. అది హాని కూడా కలిగించవచ్చు.

## 32. గురువుగా

దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో విస్తారంగా వ్రాయకుండా కొద్దిగా వ్రాసిన విషయం యిక్కడ పేర్కొంటున్నందున రెండింటి సంబంధం పాఠకులు గ్రహింతురుగాక.

టాల్‌స్టాయి ఆశ్రమంలో బాలురకు బాలికలకు శిక్షణ యిచ్చేందుకై ఏర్పాటు చేయవలసి వచ్చింది. హిందూ ముస్లిం క్రైస్తవ యువకులతో బాటు కొంతమంది బాలికలు కూడా మాతో ఉన్నారు. వారి శిక్షణ కోసం వేరే ఉపాధ్యాయుణ్ణి నియమించడం కష్టమని తేలింది. దక్షిణ ఆఫ్రికాలో భారతీయ ఉపాధ్యాయులు బహుతక్కువ. వున్నా పెద్ద జీతం యివ్వందే దర్బనుకు 21 మైళ్ళ దూరాన వున్న ఆశ్రమానికి ఎవరు వస్తారు. అంత డబ్బు నాదగ్గర లేదు. పైగా యిప్పటి విద్యావిధానం నాకు యిష్టం లేదు. సరియైన పద్ధతిని నేను ప్రయోగించి చూడలేదు. తల్లి దండ్రుల దగ్గర గరపబడే విద్య సరియైనదని నా భావం. అందువల్ల బయటి వారి సాయం తక్కువగా వుండాలని భావించాను. టాల్ స్టాయి ఆశ్రమం ఒక కుటుంబం వంటిదని, దానికి నేను తండ్రి వంటివాడినని అందువల్ల నేనే పిల్లల శిక్షణకు బాధ్యత వహించాలని నిర్ణయించాను. అయితే అందు పలు దోషాలు వున్నాయి. ఈ యువకులు జన్మించినప్పటినుండి నాదగ్గర లేరు. వేరు వేరు వాతావరణాల్లో పెరిగినవారు. వేరు వేరు మతాలకు చెందినవారు. ఇట్టి స్థితిలో తండ్రిగా బాధ్యతను ఎలా నిర్వహించగలనా అని అనుమానం కలిగింది. అయితే నేను హృదయ శిక్షణ అనగా మంచి నడతకు సంబంధించిన శిక్షణకు ప్రాముఖ్యం యిచ్చాను. ఏ వాతావరణంలో పెరిగినా, ఏ వయస్సువారికైనా, ఏమతాలవారి కైనా అట్టి శిక్షణ యివ్వవచ్చునని నా భావం. ఆ భావంతో రాత్రింబవళ్ళు ఆ పిల్లలతో బాటు తండ్రిగా వుండసాగాను. మంచి నడత అనగా శీలం ప్రధానమైనదని భావించాను. పునాది గట్టిగా వుంటే తరువాత విషయాలు పిల్లలు ఇతరుల ద్వారానో లేక తమంత తాముగానో నేర్చుకోగలరని నా అభిప్రాయం. అయినా అక్షర జ్ఞానం కొద్దో గొప్పో వారికి కల్పించాలని భావించి క్లాసులు ప్రారంభించాను. మి. కేలన్‌బెక్ ప్రాగ్జీ దేశాయిగారల సాయం పొందాను. శారీరక శిక్షణను గురించి నాకు తెలుసు. అది ఆశ్రమంలో వారికి సహజంగానే లభిస్తూవుంది.

ఆశ్రమంలో నౌకర్లు లేరు. పాయిఖానా దొడ్లు బాగుచేసుకోవడం నుండి వంటపని వరకు ఆశ్రమవాసులే చేసుకోవాలి. పండ్ల చెట్లు చాలా వున్నాయి. క్రొత్తగా నాట్లు వేయాలి. మి. కేలన్‌బెక్‌కు వ్యవసాయం అంటే ఇష్టం. ప్రభుత్వ ఆదర్శతోటలకు వెళ్ళి అభ్యసించి వచ్చారు. వంటపని చేస్తున్న వారిని మినహాయించి మిగతా పిన్నలు, పెద్దలు మొదలుగాగల ఆశ్రమవాసులందరూ ఏదో ఒక సమయంలో తోటలో కాయకష్టం చేసి తీరాలి. పిల్లలు ఈ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేవారు. పెద్ద పెద్ద గుంటలు త్రవ్వడం, చెట్లు నరకడం, బరువుమోయడం మొదలగుగాగల

పనులుచేయడం వల్ల వాళ్ళ శరీరాలు గట్టి పడ్డాయి. ఈ పనులు అంతా సంతోషంతో చేస్తూ వుండేవారు. అందువల్ల వేరే వ్యాయామం అనవసరం అని తేలింది. ఈ పనులు చేయమంటే అప్పుడప్పుడు కొందరు పిల్లలు నఖరాలు చేస్తూ భీష్మిస్తూవుండేవారు వారిని గురించి పెద్దగా పట్టించుకునేవాణ్ణికాదు. కఠినంగా వ్యవహరించి వాళ్ళ చేత పనిచేయిస్తూ వుండేవాణ్ణి. అప్పుడు సరేనని వెంటనే మరచిపోతూ వుండేవారు. ఈ విధంగా మా బండి సాగుతూ వున్నది. అయితే వాళ్ళ శరీరాలకు పుష్టి చేకూరింది.

ఆశ్రమంలో ఎవ్వరూ జబ్బు పడలేదు. గాలి, నీరు పుష్టికరమైన ఆహారం యిందుకు కారణమని చెప్పవచ్చు. శారీరక శిక్షణతో బాటు వృత్తి విద్య కూడా గరపడం అవసరమని భావించాను. మి.కేలన్‌బెక్ ట్రేపిస్ట్ మఠం వెళ్ళి అక్కడ చెప్పులు కుట్టడం నేర్చుకువచ్చారు. వారి దగ్గర చెప్పులు కుట్టడం నేర్చుకొని యిష్టపడిన పిల్లలకు నేర్పాను. వడ్రంగం పని మి.కేలన్‌బెక్‌కు కొంతవచ్చు. అది వచ్చిన మరో వ్యక్తి కూడా ఆశ్రమంలో వున్నాడు. అందువల్ల ఆ పని కూడా కొందరికి నేర్పుతూ వున్నాం. వంటచేయడం పిల్లలంతా నేర్చుకొన్నారు. ఈ పనులన్నీ పిల్లలకు క్రొత్తే. కలలోనైనా యిట్టి పనులు నేర్చుకోవాలని వారు భావించలేదు. దక్షిణ ఆఫ్రికాలో భారతదేశ పిల్లలు కేవలం ప్రారంభవిద్య మాత్రమే పొందేవారు. ఉపాధ్యాయులు తాము చేసిన పనులే పిల్లలకు నేర్పాలని, తాము చేయని పనులు పిల్లలచేత చేయించకూడదని టాల్‌స్టాయి ఆశ్రమంలో నియమం అమలు చేశాం. పిల్లల చేత పని చేయిస్తూ వున్నప్పుడు ఉపాధ్యాయుడు కూడా వారి వెంట వుండి పని చేస్తూ చేయిస్తూ వుండేవాడు. అందువల్ల పిల్లలు సంతోషంగా పనులు చేస్తూ వుండేవారు. శీలం గురించి, అక్షరజ్ఞానం గురించి తరువాత వ్రాస్తాను.

## 33. అక్షరజ్ఞానం

శారీరక శిక్షణతో బాటు కొన్ని చేతి పనులు పిల్లలకు నేర్పుటకు టాల్‌స్టాయి ఆశ్రమంలో చేసిన ఏర్పాట్లను గురించి ప్రకరణంలో వివరించాను. పూర్తిగా నాకు తృప్తికలగనప్పటికి అందుకొంత సాఫల్యం లభించిందని చెప్పగలను. అక్షరజ్ఞానం కల్పించడం కష్టమని అనిపించింది. అందుకు అవసరమైన సామాగ్రి నా దగ్గర లేదు. అవసరమని నేను భావించినంత సమయం కూడా యివ్వలేకపోయాను. అంతజ్ఞానం కూడా నాకు లేదు. రోజంతా కాయకష్టం చేశాక అలసి పోయేవాణ్ణి. విశ్రాంతి తీసుకోవాలని భావించినప్పుడు క్లాసులో పాఠం చెప్పలేక బలవంతాన పాఠం చెప్పవలసి

వస్తూ వుండేది. ఉదయం పూట వ్యవసాయం, గృహకృత్యాలు, మధ్యాహ్నం భోజనం కాగానే క్లాసులు ఇంతకంటే అనుకూలమైన సమయం లభించలేదు.

అక్షరజ్ఞానం కల్పించేందుకు మూడుగంటల సమయం నిర్ణయించారు. క్లాసులో హిందీ, తమిళం, గుజరాతీ ఉర్దూ నేర్పవలసి వచ్చింది. పిల్లలకు వాళ్ళ మాతృభాషలో చదువు నేర్పాలని మా నిర్ణయం. ఇంగ్లీషు కూడా అందరికీ నేర్పుతూ వున్నాం. గుజరాతీ తెలిసిన హిందూ పిల్లలకు కొద్దిగా సంస్కృతం నేర్పే వాళ్ళం. ఈ పిల్లలందరికీ హిందీ నేర్పే వాళ్ళం. చరిత్ర, భూగోళం, గణితం అందరికీ నేర్పేవాళ్ళం. తమిళం, ఉర్దూ నేను నేర్పేవాణ్ణి.

స్టీమరుమీద, జైల్లో నేర్చుకున్న నా తమిళజ్ఞానం అంతటితో ఆగింది. ముందుకు సాగలేదు. పోప్ రచించిన "తమిళ స్వయంశిక్షక్" ద్వారా నేర్చుకున్న దానితో సరి. ఫారసీ అరబ్బీ శబ్దావలి సంగతి కూడా అంతే ముస్లిం సోదరుల సహవాసం వల్ల నేర్చుకున్న ఉర్దూ, అరబ్బీ, ఫారసీ ఓడమీద నేర్చుకున్న దానితో సరి. హైస్కూల్లో నేర్చుకున్న సంస్కృతం, గుజరాతీ యీ మాత్రం పెట్టుబడితో పని నడపవలసి వచ్చింది. అందుకు సహకరించదలచి వచ్చిన వారికి నాకు వచ్చినంత కూడా రాదు. అయితే దేశభాషల యెడ నాకు గల ప్రేమ, శిక్షణా శక్తి మీద నాకు గల శ్రద్ధ, విద్యార్థుల అజ్ఞానం, వారి ఉదార హృదయం నా పనికి అమితంగా తోడ్పడ్డాయి.

తమిళ విద్యార్థులు దక్షిణ ఆఫ్రికాలో జన్మించినట్టివారే. అందువల్ల వాళ్ళకు తమిళం చాలా తక్కువగా వచ్చు. వాళ్ళకు లిపి అసలురాదు. అందువల్ల నేను తమిళ లిపి నేర్పవలసి వచ్చింది. పని తేలికగానే సాగింది. తమిళం మాట్లాడవలసి వస్తే తాము నన్ను ఓడించగలమని విద్యార్థులకు తెలుసు. కేవలం తమిళం మాత్రమే తెలిసిన వాళ్ళు నా దగ్గరకు వస్తే ఆ తమిళ పిల్లలు దూబాసీలుగా ఉపయోగపడుతూ వుండేవారు. ఈ విధంగా బండి నడిచింది. అయితే విద్యార్థుల ఎదుట నా అజ్ఞానాన్ని దాచడానికి నేను ఎన్నడూ ప్రయత్నించలేదు. మిగతా విషయాలవలెనే యీ విషయంలో కూడా వాళ్ళు నన్ను బాగా అర్థం చేసుకున్నారు. అక్షరజ్ఞానంలో వెనకబడినప్పటికి వారి ప్రేమ, ఆదరణ బాగా పొందగలిగాను. ముస్లిం పిల్లలకు ఉర్దూ నేర్పడం తేలిక. వాళ్ళకు లిపివచ్చు. వాళ్ళను చదువులో ప్రోత్సహించడం, అక్కడక్కడ వారికి సహకరించడం నా పని.

దరిదాపు పిల్లలంతా చదువురానివాళ్ళే. స్కూల్లో చదువుకోని వారే. నేను నేర్పేది తక్కువ. వాళ్ళ సోమరితనం పోగొట్టి, చదవడానికి వాళ్ళను ప్రోత్సహించడం, వాళ్ళ

చదువును గురించి శ్రద్ధ వహించడం నా పని. దానితో నేను తృప్తిపడేవాణ్ణి. అందువల్లనే వేరు వేరు వయస్సుల్లో గల పిల్లల్ని సైతం ఒకే గదిలో కూర్చొబెట్టి పనిచేయిస్తూ వుండేవాణ్ణి.

పాఠ్యపుస్తకాలను గురించి ప్రతిచోట గొడవ చేస్తూ వుంటారు. కాని పాఠ్యపుస్తకాల అవసరం నాకు కలుగలేదు. ప్రతి పిల్లవాడికి ఎక్కువ పుస్తకాలు యివ్వడం అవసరమని అనిపించలేదు. వాస్తవానికి పిల్లవాడికి నిజమైన పాఠ్యపుస్తకం ఉపాధ్యాయుడే. పాఠ్యపుస్తకాల ద్వారా నేను నేర్పిన పాఠ్యాంశాలు జ్ఞాపకం వున్నవి బహుతక్కువే. కంఠస్థం చేయించిన పాఠాలు మాత్రం నాకు యిప్పటికీ జ్ఞాపకం వున్నాయి. కంటితో గ్రహించిన దానికంటే చెవితో విని తక్కువ శ్రమతో ఎక్కువ గ్రహిస్తాడు. పిల్లలచేత ఒక్క పుస్తకం కూడా పూర్తిగా చదివించినట్లు నాకు గుర్తులేదు.

నేను చాలా పుస్తకాలు చదివాను. నేను జీర్ణం చేసుకున్న విషయాన్నంతా పిల్లలకు బోధించాను. అది వాళ్ళకు యిప్పటికీ జ్ఞాపకం వుండి వుంటుందని నా విశ్వాసం. చదివించింది జ్ఞాపకం పెట్టుకోవడం వారికి కష్టంగా వుండేది. నేను వినిపించిన పాఠం వాళ్ళు వెంటనే నాకు తిరిగి వినిపించేవారు. చదవమంటే కష్టపడేవారు. వినిపిస్తూ నేను అలసిపోయినప్పుడు లేక నేను నీరసపడినప్పుడు వాళ్ళు రసవత్తరంగా నాకు వినిపిస్తూ వుండేవారు. వాళ్లకు కలిగే సందేహాలు వాటి నివృత్తికై వాళ్ళు చేసే కృషి వాళ్ళ గ్రహణ శక్తి అద్భుతం.

## 34. ఆత్మ శిక్షణ

విద్యార్థులకు శారీరక, మానసిక శిక్షణ గరపడం కంటే వారికి ఆత్మ శిక్షణ గరపడం కష్టమనిపించింది. ఆత్మశిక్షణకు మత గ్రంథాల సాయం నేను పొందలేదు. పిల్లలు తమతమ మతాల మూలతత్వం తెలుసుకోవడం, తమ మత గ్రంథాలను గురించి కొద్దిగా నైనా వాళ్ళు తెలుసుకోవడం అవసరమని భావించాను. అందుకోసం నేను చేతనైనంతవరకు సౌకర్యం కలిగించాను. బుద్ధి వికాసానికి అది అవసరమని నా భావం. ఆత్మ శిక్షణ విద్యాభ్యాసంలో ఒక భాగమని టాల్‌స్టాయి ఆశ్రమంలో పిల్లలకు శిక్షణ గరిపే సమయంలో నేను తెలుసుకున్నాను. ఆత్మ వికాసం అంటే శీలనిర్మాణం, ఈశ్వరసాక్షాత్కారం పొందడం అన్నమాట. ఆత్మజ్ఞానం పొందునప్పుడు పిల్లలకు సరియైన బోధ అవసరం. మరో రకమైన జ్ఞానం వ్యర్థం, హానికరం కూడా కావచ్చునని తెలుసుకున్నాను.

ఆత్మ జ్ఞానం నాల్గవ ఆశ్రమంలో అవసరమను దుర్భ్రమ చాలామందికి వుంటుంది. కాని నాకు కలిగిన అనుభవం ప్రకారం ఆత్మజ్ఞానాన్ని వాయిదా వేసే వ్యక్తులు ఆత్మజ్ఞానం పొందలేరని, వృద్ధాప్యం వచ్చినప్పుడు దయకు పాత్రులై, దీనావస్థను పొంది భువికి భారంగా జీవిస్తూ వుంటారని నేను గ్రహించిన సత్యం నా యీ భావాలను 1911-12 మధ్య ప్రకటించియుండలేదు. అప్పుడు యీ విషయమై నాకు గల అభిప్రాయాలు యివేనని జ్ఞాపకం.

ఆత్మశిక్షణ ఎలా గరపాలి? అందుకోసం పిల్లల చేత భజనలు చేయించేవాణ్ణి. నీతి పుస్తకాలు చదివి వినిపించేవాణ్ణి. అయినా తృప్తి కలిగేది కాదు. వాళ్లతో సంబంధం పెరిగిన కొద్దీ గ్రంథాలద్వారా వాళ్లకు ఆత్మజ్ఞానం కలిగించడం కష్టమని గ్రహించాను. శరీర సంబంధమైన శిక్షణ యివ్వాలంటే వ్యాయామం ద్వారా యివ్వాలి. బుద్ధికి పదును పట్టాలంటే బుద్ధిచేత వ్యాయామం చేయించాలి. అలాగే ఆత్మజ్ఞానం కలగాలంటే ఆత్మవ్యాయామం అవసరం. ఆత్మశిక్షణ ఉపాధ్యాయుని నడత, శీలం వల్లనే విద్యార్థులకు అలవడుతుంది. అందువల్ల ఉపాధ్యాయులు కడు జాగరూకులై వ్యవహరించడం అవసరం. ఉపాధ్యాయుడు తన ఆచరణ ద్వారా విద్యార్థుల హృదయాలను కదిలించగలడు. తాను అబద్ధాలాడుతూ తన విద్యార్థుల్ని మాత్రం సత్యసంధులుగా తీర్చిదిద్దాలను కోవడం సరికాదు. పిరికిపందయగు ఉపాధ్యాయుడు తన శిష్యుల్ని నిర్భీకుల్ని చేయలేడు. వ్యభిచారియగు ఉపాధ్యాయుడు తన శిష్యులకు సంయమం నేర్పలేడు. నా ఎదుట వున్న బాలబాలికలకు నేను ఆదర్శ పాఠ్యవస్తువుగా వుండాలి. అందువల్ల నా విద్యార్థులు నాకు గురువులు అవుతారు. నా కోసం కాకపోయినా వారి కోసమైనా నేను మంచిగా వుండితీరాలి. యీ విషయం నేను బాగా తెలుసుకున్నాను. టాల్‌స్టాయ్ ఆశ్రమంలో నేను అలవరుచుకున్న సంయమనానికి కారకులు యీ బాలబాలికలేనని నా అభిప్రాయం. వారికి నా కృతజ్ఞతలు చెప్పాలి. ఆశ్రమంలో ఒక యువకుడు ఎప్పుడూ గొడవ చేస్తూ వుండేవాడు. అబద్ధాలాడేవాడు. ఇతరులతో తగాదా పెట్టుకునేవాడు. ఒక రోజున పెద్ద తుఫాను సృష్టించాడు. నేను గాబరా పడ్డాను. విద్యార్థుల్ని ఎప్పుడూ నేను దండించలేదు.ఆ రోజున నాకు చాలా కోపం వచ్చింది. నేను అతని దగ్గరకు వెళ్ళాను. ఎంత చెప్పినా అతడు వినిపించుకోలేదు. నన్ను మోసగించాలని కూడా ప్రయత్నించాడు. దగ్గరే పడియున్న రూళ్ల కర్ర ఎత్తి అతడి భుజంమీద గట్టిగా వడ్డించాను. కొట్టే సమయంలో నన్ను వణుకు పట్టుకుంది. అతడు దాన్ని గ్రహించి యుండవచ్చు. అంతవరకు ఆవిధంగా ఏ విద్యార్థి విషయంలోను నేను

వ్యవహరించి యుండలేదు. అతడు భోరున ఏడ్చాడు. క్షమించమని వేడుకున్నాడు. రూళ్ల కర్ర తగిలి బాధ కలిగినందున అతడు ఏడ్వలేదు. ఎదిరించ తలుచుకుంటే నన్ను ఎదుర్కోగల శక్తి అతడికి వుంది. అతడి వయస్సు 17 సంవత్సరాలు వుండి వుంటుంది. శరీరం బలంగా కుదిమట్టంగా వుంటుంది. రూళ్ల కర్రతో కొట్టినప్పుడు నేను పడ్డ బాధను అతడు గ్రహించి యుంటాడు. తరువాత అతడు ఎవ్వరినీ వ్యతిరేకించలేదు. కాని రూళ్ల కర్రతో కొట్టినందుకు కలిగిన పశ్చాత్తాపాన్ని ఈనాటి వరకు నేను మరచిపోలేను. నేను అతడిని కొట్టి నా ఆత్మను గాక నా పశుత్వాన్ని ప్రదర్శించానను భయం నాకు కలిగింది.

పిల్లలను కొట్టి వారికి పాఠాలు చెప్పడానికి నేను వ్యతిరేకిని. నా విద్యార్థుల్లో ఒక్కణ్ణి మాత్రమే ఒక్కసారి మాత్రమే కొట్టినట్లు నాకు బాగా గుర్తు. రూళ్ల కర్రతో కొట్టి నేను మంచిపనిచేశానో లేక చెడుపనిచేశానో ఈనాటి వరకు నేను తేల్చుకోలేదు. అయితే ఆ దండన యందుగల ఔచిత్యం విషయమై నాకు సందేహం వున్నది. ఆనాటి దండనకు మూలం కోపం మరియు దండించాలనే కాంక్ష. నాకు కలిగిన దుఃఖం ఆ దండనలో వ్యక్తం అయితే సంతోషించి వుండేవాణ్ణి. ఈ ఘట్టం జరిగాక విద్యార్థులను దండించే క్రొత్త విధానం నేర్చుకున్నాను. అప్పుడు ఈ క్రొత్తవిధానాన్ని అనుసరించి యుంటే ఏమై యుండేదో చెప్పలేను. ఆవిషయం ఆ యువకుడు అప్పుడే మరచిపోయాడు. అతనిలో పెద్ద మార్పు వచ్చిందని కూడా నేను చెప్పలేను. అయితే ఈ ఘట్టం విద్యార్థుల విషయంలో ఎలా వ్యవహరించాలో నాకు బోధపరిచింది. జాగ్రత్తపడేలా చేసింది. తరువాత కూడా కొందరు యువకులు తప్పులు చేశారు. అయితే వారిని దండనా విధానంతో దండించలేదు. ఈ విధంగా యితరులకు ఆత్మశిక్షణ గరపాలనే ఉద్దేశ్యంతో కృషి చేసిన నేను ఆత్మ సుగుణాన్ని గురించి తెలుసుకోసాగాను.

## 35. మంచి చెడుల మిశ్రమం

టాల్‌స్టాయ్ ఆశ్రమంలో మి. కేలన్ బెక్ మరో సమస్యను నా దృష్టికి తెచ్చారు. వారు చెప్పనంతవరకు ఆ విషయాన్ని గురించి నేను యోచించలేదు. ఆశ్రమంలో గల కొందరు పిల్లలు ఉపద్రవాలు చేసే రకం. చెడ్డవాళ్లు రౌడీలు కూడా వాళ్లతోబాటు నా ముగ్గురు పిల్లలు ఇంకా కొంతమంది పిల్లలు వుండేవారు. అట్టి చెడ్డ పిల్లలతోబాటు మీ పిల్లలు వుండటం సబబా అని ప్రశ్న మి. కేలన్‌బెక్ వేశారు. ఒకనాడు ఆయన

స్పష్టంగా మాట్లాడుతూ "మీ ఈ విధానం నాకు నచ్చలేదు, ఆ రౌడీ పిల్లల సాంగత్యం వల్ల మీ పిల్లలు చెడిపోకుండా ఎలా వుండగలరు" అని అన్నారు.

కొంచెం సేపు ఆలోచనలో పడ్డానో లేదో నాకు గుర్తులేదు. కాని నేను ఇచ్చిన సమాధానం ఇప్పటికీ నాకు గుర్తు వున్నది. "నా పిల్లలకు ఆ రౌడీ పిల్లలకు మధ్య వ్యత్యాసం ఎలా చూపగలను? ఇపుడు వారందరికీ నేనే సంరక్షకుణ్ణి కదా? ఆ యువకులు నా పిలుపుకి వచ్చారు ఖర్చులు ఇస్తే ఇవాళే వాళ్లు జోహన్సుబర్గు వెళ్లి ఎప్పటిలా వుండిపోతారు. ఇక్కడికి రావడమంటే నామీద దయచూపించినట్లేనని, వాళ్లు వాళ్ల తల్లిదండ్రులు భావిస్తే ఆశ్చర్యపడనవసరం లేదు. ఇక్కడికి వచ్చి వాళ్లు యిబ్బందులు పడుతున్నారు. మీకూ నాకూ యీ విషయం తెలుసు. నాకు ఇది ధర్మ సంకటం. వాళ్లను ఇక్కడే వుంచాలి. అందువల్ల నా పిల్లలు కూడా వాళ్లతో బాటు వుండాలి. ఇతరుల కంటే తాము గొప్పవారమనే భావం నా పిల్లలకు ఇప్పటినుండే నేర్పటం తగునా? యిట్టి భావం వారి బుర్రలో కలిగించడమంటే వాళ్లను చెడ్డమార్గంలో ప్రవేశపెట్టడమేకదా! వాళ్లు యిప్పుడు వున్న పరిస్థితిలో వుంటేనే మంచిది. మంచి చెడుల వ్యత్యాసం గ్రహించగలుగుతారు. వీరి గుణగణాల ప్రభావం తోటి వారి మీద పడదని మాత్రం ఎలా అనగలం? ఏదిఏమైనా వారిని యిక్కడ వుంచక తప్పదు. అందువల్ల ఏదైనా ప్రమాదం కలిగితే అనుభవించక తప్పదు" అని వారికి సమాధానం ఇచ్చాను. మి. కేలన్‌బెక్ తలవూపి మౌనం వహించారు. యీ ప్రయోగం వల్ల చెడు కలిగిందనిగాని, వారి సహవాసం వల్ల నా పిల్లలకు కీడు వాటిల్లిందనిగాని చెప్పలేను. లాభం కలిగిందని మాత్రం స్వయంగా గ్రహించాను. నా పిల్లలలో గొప్పవాళ్లమను భావం ఏ కొంచెం వున్నా అది తగ్గిపోయిందని చెప్పవచ్చు. అందరితో బాటు వుండటం నేర్చుకున్నారు.

తల్లిదండ్రులు జాగ్రత్త పడితే పిల్లలు చెడ్డ వారి సహవాసం చేసికూడా చెడిపోరని, మంచివారిమీద చెడుయొక్క ప్రభావం పడదని నా అభిప్రాయం. మన పిల్లల్ని పెట్టెలో మూసిపెడితే శుద్ధంగా వుంటారని, బయటికి తీస్తే అపవిత్రులైపోతారని అనుకోవడం సరికాదు. అట్టి నియమమేమీ లేదు. అయితే బాలురు, బాలికలు అధిక సంఖ్యలో కలిసిమెలిసి వున్నప్పుడు, చదువు కుంటున్నప్పుడు తల్లి దండ్రుల మీద ఉపాధ్యాయుల మీద బరువు పడటం ఖాయం. అప్పుడే ఉపాధ్యాయులకు కఠిన పరీక్ష జరుగుతుంది. వాళ్లు జాగ్రత్తగా వుండక తప్పదు.

# 36. ఉపవాసం

బాలురు, బాలికలు యిద్దరినీ నిజాయితీగా పో. . .పడం, వారికి విద్య గరపడం ఎంత కష్టమైన పనో నాకు రోజురోజుకూ బోధపడసాగింది. ఉపాధ్యాయుడుగా, సంరక్షకుడుగా వారి హృదయాల్లోకి ప్రవేశించాలి. వారి కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలి. వారి జీవిత సమస్యల్ని పరిష్కరించాలి. వారి యౌవ్వనవికాస తరంగాల్ని సరియైన మార్గానికి తరలించాలి. జైళ్లలో ఉన్న ఖైదీలు కొందరు విడుదలైనందున ఆశ్రమంలో కొద్దిమంది మాత్రమే మిగిలారు. వారంతా ఫినిక్స్‌వాసులు. అందువల్ల ఆశ్రమాన్ని ఫినిక్సుకు తీసుకుని వెళ్లాను. ఫినిక్సులో నాకు కఠినపరీక్ష జరిగింది. టాల్‌స్టాయ్ ఆశ్రమంలో మిగిలిన వారిని ఫినిక్సుకు జేర్చి నేను జోహాన్సుబర్గు వెళ్లాను. జోహాన్సుబర్గులో కొద్దిరోజులు ఉన్నానో లేదో ఇంతలో ఇద్దరు వ్యక్తులు భయంకరంగా పతనం చెందారను వార్త నాకు చేరింది. సత్యాగ్రహ సంగ్రామంలో ఎక్కడైనా వైఫల్యం కలిగితే నాకు అంత బాధకలిగించదు కాని యీ వార్త వినగానే నా మీద పిడుగు పడినట్లనిపించింది. నా మనస్సుకు గట్టి దెబ్బ తగిలింది. ఫినిక్సుకు బయలుదేరాను. మి.కెలెన్‌బెక్ వెంటవస్తానని పట్టుబట్టారు. వారు నా దయనీయస్థితిని గ్రహించారు. ఒంటరిగా వెళ్ళనీయనని పట్టుబట్టారు. పతనవార్త వారి ద్వారానే నాకు అందింది.

త్రోవలో నా కర్తవ్యం ఏమిటా అని యోచించాను. ఎవరి సంరక్షణలో వుంటూ వ్యక్తులు చెడిపోతారో ఆ సంరక్షకులుకూడా కొంతవరకు అందుకు బాధ్యులే అని భావించాను. నా బాధ్యత కూడా నాకు బోధపడింది. గతంలో నా భార్య నన్ను హెచ్చరించింది కూడా. కాని సహజంగా అందరినీ నమ్మే మనిషిని గనుక ఆమె మాటల్ని నేను పట్టించుకోలేదు. అందుకు గాను నేను ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అని నిర్ణయానికి వచ్చాను నా నిర్ణయాన్ని అమలుపరిస్తే తప్పుజేసినవారు తమ తప్పేమిటో తెలుసుకుంటారని భావించాను. ఆ ప్రకారం నేను ఏడురోజులు ఉపవాసం చేయాలని నాలుగున్నర మాసాలు ఒక పూట భోజనం చేయాలని నిర్ణయించుకున్నాను. మి. కేలన్‌బెక్ నన్ను ఆపాలని ప్రయత్నించారు. కాని నేను ఒప్పుకోలేదు. చివరికి ఆయన నా నిర్ణయాన్ని ఒప్పుకుని తానుకూడా అలాగే చేస్తానని అన్నారు. నిర్మలమైన వారి ప్రేమను నేను కాదనలేక పోయాను. ఈ విధంగా నిర్ణయానికి వచ్చిన తరువాత నాకు బరువు తగ్గినట్లనిపించింది. మనస్సు కుదుటపడింది. దోషుల మీద కోపం తగ్గిపోయింది. వారిమీద కేవలం దయ మాత్రమే మిగిలింది.

ఈ విధంగా రైల్లో మనస్సును శాంతపరచుకుని నేను ఫినిక్సు చేరాను. వివరాలన్నీ తెలుసుకున్నాను. నా ఉపవాసంవల్ల అందరికీ కష్టం కలిగినా వాతావరణం మాత్రం శుద్ధి పడిందని చెప్పగలను. పాపపు భయంకర స్వరూపం ఏమిటో అందరికీ బోధపడింది. విద్యార్థులకు, విద్యార్థినులకు, నాకు మధ్యగల సంబంధం గట్టిపడింది. కొంతకాలం తరువాత మరోసారి నేను 14 రోజులు ఉపవాసం చేయవలసి వచ్చింది. అందుకు ఊహించిన దానికంటే ఎక్కువ సత్ఫలితం చేకూరింది.

ఈ వ్యవహారం దృష్ట్యా ప్రతి ఉపాధ్యాయుడు, ప్రతి సంరక్షకుడు ఇలాగే చేయాలని మాత్రం నేను అనను. కొన్ని కొన్ని సందర్భాలలో యిట్టి ఉపవాసాదులకు అవకాశం కలదని చెప్పగలను. అయితే అందుకు వివేకం, అర్హత అవసరం. ఉపాధ్యాయునికి విద్యార్థికీ మధ్య శుద్ధమైన ప్రేమలేనప్పుడు, విద్యార్థి చర్యవల్ల ఉపాధ్యాయుని హృదయానికి నిజమైన దెబ్బతగలనప్పుడు, విద్యార్థికి ఉపాధ్యాయుని గౌరవభావం లేనప్పుడు ఇట్టి ఉపవాసాదులు వ్యర్థం. నష్టం కూడా కలిగించవచ్చు. ఏది ఏమైనా ఉపవాసాదులు వహించినా వహించకపోయినా ఇట్టి విషయాలలో ఉపాధ్యాయునికి బాధ్యత ఉండి తీరుతుందని నా నిశ్చితాభిప్రాయం. ఏడురోజుల ఉపవాసం, నాలుగున్నరమాసాల ఒంటిపూట భోజనవ్రతంవల్ల మాకెవ్వరికీ యిబ్బంది కలుగలేదు. నా పనియేదీ ఆగలేదు. మందగించలేదు. అప్పుడు నేను పండ్లు మాత్రమే ఆహారంగా తీసుకున్నాను. అయితే ఆ తరువాత చేసిన 14 రోజుల ఉపవాస సమయంలో చివరి రోజుల్లో మాత్రం కష్టం కలిగింది. అప్పటికి రామనామస్మరణ యందలి మహిమను పూర్తిగా నేను గ్రహించలేదు కాబోలు, సహనశక్తి తగ్గింది. ఉపవాస సమయంలో నీరు బాగా త్రాగాలి అను విషయం నాకు తెలియదు. అందువల్ల కూడా ఉపవాస సమయంలో బాధకలిగింది. అంతకు పూర్వం చేసిన ఉపవాసాలు ప్రశాంతంగా సాగటంవల్ల 14 రోజుల ఉపవాసం గురించి తేలికగా వ్యవహరించాను. మొదటి ఉపవాససమయంలో కూనేగారి కటిస్నానం చేస్తూవున్నాను 14రోజుల ఉపవాసం చేసినప్పుడు రెండుమూడు రోజుల తరువాత దానిని ఆపివేశాను. నీరు రుచించేదికాదు. నీళ్ళు త్రాగితే డోకు వచ్చినట్లుండేది. అందువల్ల నీళ్ళు త్రాగటం తగ్గించాను. దానితో గొంతు ఎండిపోయింది. జలహీనమైపోయాను. చివరిరోజుల్లో మాటకూడా మెల్లగా మాట్లాడవలసి వచ్చింది. కాని రాతపని మాత్రం చివరిరోజువరకు చేస్తూవున్నాను. రామాయణాదులు చివరివరకూ వింటున్నాను. అన్ని విషయాల్లోను సలహాలు యిస్తూవున్నాను.

# 37. గోఖలేగారిని కలుసుకునేందుకై ప్రయాణం

దక్షిణ ఆఫ్రికాకు సంబంధించిన అనేక స్మృతుల్ని వదిలివేయక తప్పడం లేదు. 1914 సత్యాగ్రహ సమరం ఆగిన తరువాత గోఖలేగారి కోరిక ప్రకారం నేను ఇంగ్లాండు వెళ్ళి అక్కడినుండి హిందూదేశం చేరవలసి వుంది. అందువల్ల జూలై మాసంలో కస్తూరిబాయి, కేలన్‌బెక్, నేను ముగ్గురం ఇంగ్లాండుకు బయలుదేరాం. సత్యాగ్రహ సమరం జరిగిన తరువాత నేను రైళ్ళలో మూడో తరగతిలో ప్రయాణం చేయడం ప్రారంభించాను. అందువల్ల ఓడలో కూడా మూడో తరగతి టిక్కెట్లే కొన్నాను. అయితే ఇక్కడి మూడో తరగతికి మనదేశంలో మూడో తరగతికి చాలా తేడా వున్నది. మనదేశంలో కూర్చునేందుకు, పడుకునేందుకు, అతి కష్టంమీద చోటు దొరుకుతుంది. పారిశుధ్యం అను విషయాన్ని గురించి యోచించడం అనవసరం. కాని యిక్కడ మూడో తరగతి యందు చోటు బాగానే దొరుకుతుంది. పారిశుధ్యం కూడా ఎక్కువగా జరుగుతుంది. మరొకరు మమ్మల్ని యిబ్బంది పెట్టకుండా వుండేందుకై ఒక పాయిఖానా దొడ్డికి తాళంబెట్టి తాళం చెవి మాకు యిచ్చారు. మేము ముగ్గురం పలావు భుజించేవారం కావడం వల్ల మాకు ఎండు ద్రాక్ష, కిస్‌మిస్, తాజా పండ్లు యిమ్మని స్టీమరు కేషియరుకు ఆర్డరు అందింది. సామాన్యంగా మూడోతరగతి ప్రయాణీకులకు పండ్లు కొద్దిగా లభిస్తాయేగాని ఎండు ద్రాక్ష వగైరాలు లభించవు. ఇట్టి సౌకర్యం లభించడం వల్ల మేము ముగ్గురం ఓడమీద 18 రోజులు ఎంతో ప్రశాంతంగా ప్రయాణం చేశాం.

ఈ యాత్రకు సంబంధించిన కొన్ని విషయాలు తెలుసుకోవలసిన అవసరం వున్నది.మి. కేలన్‌బెక్‌కు దుర్భిణీ యంత్రం అంటే సర్దా. ఆయన దగ్గర ఒకటి రెండు ఖరీదైన దుర్భిణీ యంత్రాలున్నాయి. వాటిని గురించి రోజూ చర్చిస్తూవుండేవారం. ఆదర్శంగా వుండాలని, సాదా జీవితం గడపాలని భావించే మనబోటివారికి అంత ఖరీదైన వస్తువులు తగవని నచ్చచెబుతూ వుండేవాణ్ణి. ఒకరోజున యీ విషయం మీద మా యిద్దరి మధ్య తీవ్రమైన వాదోపవాదాలు జరిగాయి. మేమిద్దరం మా కేబిన్ కిటికీల దగ్గర నిలబడి వున్నాం. "మన యిద్దరి మధ్య తకరారు ఎందుకు? ఈ దుర్భిణీ యంత్రం సముద్రంలో పారేస్తే ఆ ఊసే ఎత్తం కదా!" అని అన్నాను. మి.కేలన్‌బెక్ వెంటనే మనిద్దరి మధ్య పొరపొచ్చాలు కలిగిస్తున్న ఈ వస్తువును పారేయండి అని

అన్నాడు. "నేను పారేయనా?" అని అడిగాను. 'పారేయండి' అని అన్నారు. నేను దుర్భిణీ యంత్రాన్ని సముద్రంలో విసిరి వేశాను. దాని ఖరీదు సుమారు ఏడు పౌండ్లు. అయితే దాని విలువ దాని ఖరీదులో లేదు. దాని యెడ కేలన్‌బెక్‌కుగల వ్యామోహంలో వుంది. అయినా కేలన్‌బేక్‌కు ఎన్నడూ దుఃఖం కలగలేదు. ఆయనకు నాకు మధ్య యిలాంటి వ్యవహారాలు చాలా జరుగుతూ వుండేవి. వాటిలో యిది ఒకటి. నమూనాగా పాఠకులకు యీ విషయం తెలియజేశాను.

పరస్పర సంబంధాల వల్ల ప్రతిరోజు ఏదో క్రొత్త విషయం నేర్చుకొనేవారం. ఇద్దరం సత్యాన్వేషణకు కృషిచేస్తున్నాం. సత్యాన్ని పాటించడం వల్ల క్రోధం, స్వార్థం, ద్వేషం మొదలుగాగలవి సహజంగా తగ్గిపోయాయి. అవి తగ్గకపోతే సత్యం గోచరించదు. రాగద్వేషాలతో నిండియున్న మనిషి, సరళ హృదయుడు. అయినప్పటికీ సత్యవాక్కులే పలుకుతూ వున్నప్పటికీ శుద్ధ సత్యాన్ని దర్శించలేడు. శుద్ధమైన సత్యశోధన జరపడమంటే రాగద్వేషాదుల నుండి విముక్తి పొందడమే. యాత్రకు బయలుదేరినప్పుడు నేను చేసిన ఉపవాసం ముగిసి ఎన్నోరోజులు దాటలేదు. అందువల్ల నాకు పూర్తి శక్తి చేకూరలేదు.రోజూ డెక్ మీద పచార్లు చేసి ఆకలి పెంచుకోవడానికి, ఎక్కువ ఆహారం తీసుకోవడానికి, తిన్న ఆహారం జీర్ణం చేసుకోవడానికి ప్రయత్నం చేయసాగాను. ఇంతలో నా పిక్కల్లో నొప్పి ప్రారంభమైంది. ఇంగ్లాండు చేరిన తరువాత కూడా నొప్పి తగ్గలేదు. యింకా పెరిగింది. ఇంగ్లాండులో డాక్టర్ జీవరాజ్ మెహతాతో పరిచయం కలిగింది. ఉపవాసాన్ని, పిక్కలనొప్పిని గురించి వివరించి చెప్పాను. అంతా విని "మీరు కొద్ది రోజులు పూర్తిగా విశ్రాంతి తీసుకొనలేకపోతే కాళ్ళు పనిచేయలేని స్థితి ఏర్పడవచ్చు" అని ఆయన చెప్పాడు. ఉపవాసాలు చేసిన వ్యక్తి పోయిన శక్తిని త్వరగా పొందాలనే కోరికతో ఎక్కువ ఆహారం భుజించకూడదను విషయం అప్పుడు నాకు బోధపడింది. ఉపవాసం విరమించినప్పుడు ఎంతో జాగ్రత్తగా వుండి, సంయమం అలవర్చుకోవలసి వుంటుంది. మదిరా స్థావరం చేరినప్పుడు మహాయుద్ధం కొద్ది గంటల్లో ప్రారంభం కాబోతున్నదని మాకు సమాచారం అందింది. మమ్మల్ని అక్కడ ఆపి వేశారు. పలుచోట్ల సముద్రంలో మందు పాతరలు పాతి పెట్టారని తెలిసింది. వాటిని తప్పించుకొని సౌదెంప్టన్ చేరడానికి రెండు రోజులు పట్టింది. ఆగష్టు నాల్గవ తేదీన యుద్ధ ప్రకటన వెలువడింది ఆరవ తేదీన మేము ఇంగ్లాండుకు చేరాము.

# 38. యుద్ధరంగంలో

ఇంగ్లాడు చేరిన తరువాత గోఖలేగారు పారిస్‌లో చిక్కుకు పోయారని తెలిసింది. పారిసుతో రాకపోకలు ఆగిపోయాయి. ఆయన ఎప్పుడు వస్తారో తెలియదు. ఆరోగ్యం కోసం గోఖలేగారు ఫ్రాన్సు వెళ్ళారు. యుద్ధం కారణంగా వారు అక్కడ చిక్కుబడిపోయారు. వారిని కలవకుండా దేశం వెళ్ళడం సాధ్యం కాని పని. అయితే ఆయన ఎప్పుడు రాగలిగేది చెప్పగల వారెవ్వరూ లేరు.

ఈ లోపున నేను ఏం చేయాలి? యుద్ధంలో నా పాత్ర ఏమిటి? దక్షిణ ఆఫ్రికా జైల్లో నా అనుచరుడు, సత్యాగ్రహి అయిన సోరాబ్‌జీ అడాజనియా ఇంగ్లాండులో బారిస్టరీ చదువుతూ వున్నాడు. ఉత్తమోత్తమ సత్యాగ్రహిగా ఆయనను బారెట్లా చదవమని అక్కడి వాళ్ళు పంపించారు. ఆయన నా స్థానాన్ని భర్తీచేస్తారన్నమాట. ఆయన ఖర్చు డాక్టర్ ప్రాణ జీవరాజ్ మెహతా గారు భరిస్తున్నారు. నేను వారిని సంప్రదించాను. ఇంగ్లాండులో నివసిస్తున్న హిందూ దేశస్థుల సమావేశం ఏర్పాటు చేయించి వారికి నా అభిప్రాయాలు తెలియజేశాను. ఇంగ్లాండులో నివసిస్తున్న హిందూ దేశస్థులంతా యుద్ధంలో బ్రిటిష్ వారికి సహకరించాలని నాకు తోచింది. ఆంగ్ల విద్యార్థులు యద్ధంలో పాల్గొని సేవ చేస్తామని ప్రకటించారు. హిందూ దేశస్థులు ఎందుకు వెనకబడాలి. ఈ అభిప్రాయానికి వ్యతిరేకంగా చాలా కారణాలు పేర్కొనబడ్డాయి. మనకు ఆంగ్లేయులకు మధ్య ఎంతో తేడా వున్నదని, ఒకరు బానిసలైతే మరొకరు ప్రభువులని, అట్టి స్థితిలో బానిసలు ప్రభువుకు ఆపదసమయంలో స్వేచ్ఛగా ఎలా సాయం చేయగలరని కొందరు ప్రశ్నించారు. బానిసత్వం నుండి విముక్తి పొందాలని భావిస్తున్న బానిస యజమాని ఆపదల్లో చిక్కుకున్నప్పుడు ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటే తప్పేమిటి అని కూడా అన్నారు. ఈ తర్కం అప్పుడు నాకు మింగుడు పడలేదు. మనం పూర్తిగా బానిసత్వంలో లేమనే అభిప్రాయంతో అప్పుడు నేను వున్నాను. అసలు ఆంగ్ల ప్రభుత్వ విధానంలో లేదని, దాన్ని అమలుపరుస్తున్న ఆంగ్ల అధికారుల్లో దోషం అధికంగా వున్నదని ప్రేమద్వారా ఆదోషాన్ని తొలగించుకోవచ్చని భావించాను. ఆంగ్లేయుల సాయంతో మనస్థితిని చక్క దిద్దుకోవాలని మనం భావిస్తూ వుంటే ఆపద సమయంలో వారికి సాయం చేసి తద్వారా పరిస్థితి చక్కదిద్దుకోవాలని అభిప్రాయపడ్డాను. రాజ్యవిధానం దోషమయంగా వున్నప్పటికీ ఆ రోజుల్లో అది యిప్పటివలెనే నాకు పెద్దదిగా కనబడలేదు. అయితే ఇప్పుడు ఆంగ్ల

రాజ్య విధానం మీద విశ్వాసం నాకు పూర్తిగా సడలిపోయింది. అందువల్ల ఇప్పుడు నన్ను సాయం చేయమంటే చేయలేను. అదేవిధంగా ఆంగ్ల రాజ్య విధానం మీద, ఆంగ్ల అధికారులుమీద పూర్తిగా విశ్వాసం సన్నగిల్లిపోయినవారిని సాయం చేయమంటే చేస్తారా? సాధ్యమా?

ఆంగ్ల రాజ్య విధానంలో మార్పు కోరడానికి యిది మంచి తరుణమని వారు భావించారు. కాని నేను అందుకు అంగీకరించలేదు. యుద్ధ సమయంలో హక్కులు కోరకూడదని, ఆ విషయమై సంయమం పాటించడం మంచిదని, అది దూరదృష్టితో కూడిన పని అని భావించాను. నా అభిప్రాయం మీద గట్టిగా నిలబడినవారి పేర్లు నమోదు అయ్యాయి. అన్ని మతాల, అన్ని ప్రాంతాల వారి పేర్లు ఆ పట్టికలో వున్నాయి.

లార్డ్ క్రూ పేరట జాబు వ్రాశాను. హిందూ దేశస్థుల పేర్లు మీరు మంజూరు చేస్తే యుద్ధరంగంలో గాయపడ్డ వారికి సేవ చేసేందుకు, అందుకు అవసరమైన శిక్షణ పొందేందుకు సిద్ధంగా వున్నామని ఆ జాబులో తెలియజేశాను. కొద్దిగా చర్చలు జరిగిన తదుపరి లార్డ్ క్రూ అందుకు అంగీకరించాడు. కష్టసమయంలో ఆంగ్ల ప్రభుత్వానికి సాయం చేస్తున్నందుకు కృతజ్ఞతలు తెలియజేశాడు. పేర్లు యిచ్చిన వారంతా ప్రసిద్ధ డాక్టరు కేంటలీ గారి అజమాయిషీలో గాయపడ్డవారికి సేవ చేసే ప్రాధమిక శిక్షణ పొందసాగారు. మా దళానికి ఆరువారాలపాటు చిన్న శిక్షణా కార్యక్రమంలో గాయపడ్డ వారికి సేవాశుశ్రూషలు చేసే ప్రాధమిక విధానం పూర్తిగా నేర్పారు. సుమారు 80 మందిమి ఆ క్యాంపులో చేరాము. ఆరువారాల తరువాత పరీక్ష పెట్టారు. ఒక్కడు మాత్రమే ఫేలయ్యాడు. ప్యాసైనవారందరికీ ప్రభుత్వం పక్షాన కవాతు గరిపేందుకు ఏర్పాటు చేశారు. కర్నల్ బెకర్‌కు యీ కవాతు కార్యక్రమం అప్పగించారు. ఆయనను మా గ్రూపుకు నాయకునిగా నియమించారు. అప్పటి ఇంగ్లాండు పరిస్థితులు తెలుసుకోతగినవి. ప్రజలు భయపడలేదు. అంతా యుద్ధానికి ఏదో విధంగా సాయం చేసేందుకు పూనుకున్నారు. శరీరదార్ఢ్యత గలిగిన యువకులు సైన్యంలో చేరారు. అశక్తులు, వృద్ధులు, స్త్రీలు ఏం చేయాలి. వారికి కూడా పనులు అప్పగించవచ్చు. యుద్ధంలో గాయపడ్డ వారికోసం చాలామంది దుస్తులు కుట్టడం ప్రారంభించారు. అక్కడ లైసియమ్ అను స్త్రీ క్లబ్బు ఒకటి వున్నది. ఆ క్లబ్బుకు చెందిన స్త్రీలు యుద్ధశాఖకు అవసరమైన బట్టలు అందజేసేందుకు పూనుకున్నారు. సరోజినీ దేవి కూడా ఆ క్లబ్బు సభ్యురాలు. ఆమె యీ పనికి గట్టిగా పూనుకున్నారు. నాకు అక్కడే

ఆమెతో మొదటి పర్యాయం పరిచయం ఏర్పడింది. ఆమె బోలెడన్ని బట్టలు నా ఎదుట కుప్పలుగా పడవేసి, వాటిలో సాధ్యమైనన్ని బట్టలు కుట్టించి తనకు అప్పగించమని చెప్పింది. నేను ఆమె కోరికను పాటించి సాధ్యమైనన్ని గుడ్డలు కుట్టించి ఆమెకు అప్పగించాను.

## 39. కర్తవ్యం ఏమిటి?

యుద్ధంలో పని చేస్తానని మేము కొంతమందిమి కలిసి ప్రభుత్వానికి పేర్లు పంపించాము. ఈ వార్త అందగానే దక్షిణ ఆఫ్రికా నుండి నాకు రెండు టెలిగ్రాములు అందాయి అందు ఒకటి పోలక్‌ది. " మీరు చేస్తున్న యీ పని మీ అహింసా సిద్ధాంతానికి విరుద్ధంగా లేదా?" అని ఆయన ప్రశ్నించాడు. ఇలాంటి తంతి వస్తుందని నేను మొదటే వూహించాను. అందుకు కారణం వున్నది. యీ విషయాన్ని గురించి నేను "హిందు స్వరాజ్య" లో చర్చించాను. దక్షిణ ఆఫ్రికాలో గల మిత్రులతోయీ విషయమై తరుచు చర్చ జరుగుతూ వుండేది. యుద్ధంలో జరిగే అవినీతి మనందరికీ తెలుసు. నా మీద దౌర్జన్యం చేసిన వారిమీదనే కేసు పెట్టడానికి అంగీకరించని నేను రెండు రాజ్యాల మధ్య యుద్ధం జరుగుతూ వుంటే, అందలి గుణ దోషాల్ని గురించి తెలియనప్పుడు అందు పాల్గొనడం సబబా. యుద్ధంలో నేను పాల్గొన్న విషయం. మిత్రులందరికీ తెలిసినప్పటికీ, ఆతరువాత నా భావాల్లో చాలా మార్పు వచ్చి వుంటుందని వారు అనుకున్నారు. నిజానికి ఏ యోచనా సరళితో నేను బోయర్ యుద్ధంలో పాల్గొన్నానో సరిగా అదే యోచనా సరళితో యీ యుద్ధంలో కూడా పాల్గొనాలని భావించాను. యుద్ధంలో పాల్గొనడానికి, అహింసకు పొంతనకుదరదని తెలుసుకున్నాను. కాని కర్తవ్యబోధ దీపం వెలుగులా స్పష్టంగా వుండదు కదా! సత్య పూజారి అనేక సార్లు మునిగి తేలవలసి వస్తుంది.

అహింస వ్యాపకమైన వస్తువు. హింసావలయంలో చిక్కుకు పోయిన పామర ప్రాణులం మనం. తోటి జీవులపై ఆధారపడిజీవించాలన్న సూక్తి సరియైనదే. మనిషి బాహ్య హింస చేయకుండా ఒక్క క్షణమైనా జీవించలేడు. లేస్తూ కూర్చుంటూ, తింటూ తిరుగుతూ తెలిసో తెలియకో హింస చేస్తూనే వుంటాడు. అట్టి హింసనుండి బయటపడేందుకు కృషి చేయడం, మనస్సు పూర్తిగా కరుణతో నిండి వుండటం, బహు చిన్న ప్రాణికి సైతం హాని కలిగించకుండా వుండటం, అహింసా పూజారి లక్షణం. అట్టి వాని ప్రవృత్తి సంయమం వైపు పయనిస్తుంది. అతనిలో సదా కరుణ నిండి

వుంటుంది. అయినా దేహధారి ఎవ్వడూ కూడా బాహ్యహింస నుండి పూర్తిగా విముక్తి పొందజాలడు.

ఆహింసలో అద్వైత్వ భావం నిండి వుంటుంది. ప్రాణులన్నింటిలో భేదం లేనప్పుడు ఒకదాని పాపప్రభావం మరొకదానిమీద తప్పక పడుతుంది. అందువల్ల మనిషి హింసనుండి తప్పించుకోలేడు. సమాజంలో నివసించేవ్యక్తి సమాజంలో సాగే హింసలో యిష్టం లేకపోయినా భాగస్వామి కాక తప్పదు. రెండు దేశాల మధ్య యుద్ధం ప్రారంభమైనప్పుడు, ఆ యుద్ధాన్ని ఆపడం అహింసా వాదుల కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని, ధర్మాన్ని నిర్వర్తించలేకపోయినపుడు, యుద్ధాన్ని వ్యతిరేకించగల శక్తి లేనప్పుడు, అట్టి హక్కుకూడా కలిగివుండనప్పుడు వ్యక్తి యుద్ధకార్యాల్లో చేరిపోవాలి. చేరినప్పటికీ తనను, తన దేశాన్ని , జగత్తును రక్షించేందుకు హృదయపూర్తిగా కృషిచేయాలి.

నేను ఆంగ్ల రాజ్యం ద్వారా నా దేశ ప్రజల స్థితిని సరిదిద్దవలెనని భావించాను. నేను ఇంగ్లాండులో కూర్చొని బ్రిటీష్ యుద్ధ ఓడల ద్వారా రక్షణ పొందివున్నాను. అంటే ఆ బలాన్ని యీ విధంగా ఉపయోగించుకొని, అందు నిహితమైయున్న హింసలో తిన్నగా నేను పాల్గొంటూ వున్నానన్నమాట. ఈ ప్రభుత్వంతో సంబంధం పెట్టుకొని వ్యవహారాలు జరపాలన్నా, ప్రభుత్వ పతాక క్రింద వుండాలన్నా, నేను రెండు మార్గాలలో ఏదో ఒక దాన్ని అనుసరించాలి. యుద్ధాన్ని బాహటంగా వ్యతిరేకించాలి. ఆ ప్రభుత్వ విధానం యుద్ధానికి వ్యతిరేకంగా మారనంతవరకు సత్యాగ్రహశాస్త్ర ప్రకారం దాన్ని బహిష్కరించాలి లేక ఆ ప్రభుత్వ చట్టాలను ధిక్కరించి జైలుకు వెళ్ళాలి. అలా చేయలేనప్పుడు యుద్ధకార్యాలలో పాల్గొని ఆ ప్రభుత్వానికి సహకరించి, అవసరమైనప్పుడు దాన్ని ధిక్కరించగల శక్తిని, హక్కును సమకూర్చుకోవాలి. అట్టి శక్తి యిప్పుడు నాకు లేదు. అందువల్ల యుద్ధంలో చేరి సహకరించాలనే నిర్ణయానికి వచ్చాను.

అయితే తుపాకి పట్టుకొన్న వాడికి, వాడికి సహకరించేవారికి మధ్య హింసదృష్ట్యా తేడా లేదని నాకు తెలుసు. దోపిడీ దొంగలకు అవసరమైన సేవ చేయటానికి, అతడి మూటలు మోయడానికి, గాయపడినప్పుడు అతడికి సేవాశుశ్రూషలు చేయడానికి సిద్ధపడిన మనిషి కూడా దోపిడి వ్యవహారంలో దొంగతో సమానంగా బాధ్యత వహించవలసిందే. ఈ దృష్టితో పరిశీలిస్తే సైన్యంలో చేరి గాయపడ్డ సైనికులకు సేవా శుశ్రూషలు చేసేవాడు కూడా యుద్ధానికి సంబంధించిన దోషాన్నుండి తప్పించుకోలేడు.

ఈ విషయాన్ని పొలక్ తంతి చేరకపూర్వమే నేను యోచించాను. ఆయన తంతి అందిన తరువాత ఆ విషయమై కొంతమంది మిత్రులను సంప్రదించాను. యుద్ధంలో చేరడం ధర్మమని నేను భావించాను. ఈనాడు కూడా ఆ భావానికి కట్టుబడి వున్నాను. అందు దోషం కనబడలేదు. బ్రిటీష్ సామ్రాజ్యాన్ని గురించి అనాడు నాకు గల భావాలననుసరించి, వాటిని పాటించే నేను యుద్ధకార్యాలకు సహకరించాను. అలా చేసినందుకు నేను పశ్చాత్తాపపడలేదు.

అయితే నా అభిప్రాయ ఔచిత్యాన్ని ఆనాడు కూడా నా మిత్రుల ఎదుట వుంచి సమర్థించుకోలేక పోయినమాట నిజం. ఇది కడు సున్నితమైన విషయం. అభిప్రాయ భేదానికి అందుతావున్నది. అందువల్ల అహింసా ధర్మాన్ని అంగీకరించి దానిని పాలించేవారి కోసం శక్త్యానుసారం నా అభిప్రాయాన్ని యిక్కడ వ్యక్తం చేశాను. సత్యనిష్ఠ గలవారు, నియమాలమీదనే ఆధారపడి పనిచేయకూడదు. తన భావాల్ని మాత్రమే అంటిపెట్టుకొని వుండకూడదు. అందు దోషం వుండవచ్చని అంగీకరించాలి. ఆ దోషాన్ని గురించి పరిజ్ఞానం కలిగినవాడు ఎంత పెద్ద ప్రమాదం సంభవించినా ఎదుర్కొనాలి. దాని ఫలితం అనుభవించాలి. ప్రాయశ్చిత్తం కూడా చేసుకొనేందుకు సిద్ధపడాలి.

## 40. చిన్న సత్యాగ్రహం

ధర్మమని భావించి నేను యద్ధంలో చేరాను. కాని అందుతిన్నగా పాల్గొనే అదృష్టం కలుగలేదు. అలాంటి సున్నితమైన సమయంలో సత్యాగ్రహం చేయవలసి వచ్చింది. మా పేర్లు మంజూరై నమోదు అయిన తరువాత మాకు కవాతు గరపడానికి ఒక అధికారి నియమింపబడిన విషయం పేర్కొన్నాను. యీ ఆఫీసరు యుద్ధ శిక్షణ యివ్వడం వరకే సీమితమై వుంటాడని మిగతా అన్ని విషయాలలో నేను మా ట్రూపుకు నాయకుణ్ణని అంతా అనుకున్నాం. నా అనుచరుల విషయమై బాధ్యత నాదని, నా విషయమై బాధ్యత మావాళ్లదని భావించాను. కాని ఆదిలోనే హంసపాదన్నట్లు ఆ ఆఫీసరుగారి మొదటి చూపులోనే అనుమానం కలిగింది. సొహరాబ్ చాలా తెలివిగలవాడు. నన్ను వెంటనే "అన్నా! జాగ్రత్త. యీ మనిషి మనమీద నవాబ్ గిరీ చలాయించాలని చూస్తున్నట్లుంది. వాడి ఆజ్ఞ మాకు అనవసరం. వాడు కవాతు నేర్పే శిక్షకుడు. అంతే. అరుగో ఆవచ్చిన యువకులు కూడా మనమీద అధికారం చలాయించాలని భావిస్తున్నట్లుంది" అని నన్ను హెచ్చరించాడు. ఆ యువకులు ఆక్సుఫర్డు విద్యార్థులు. శిక్షణకోసం వచ్చారు.పెద్ద ఆఫీసరు వాళ్లను మామీద డిప్యూటీ

అధికారులుగా నియమించాడు. సొహరాబ్ చెప్పిన విషయం నేనూ గమనించాను. సొహరాబుకు శాంతంగా వుండమని చెప్పేందుకు ప్రయత్నించాను. కాని సొహరాబ్ అంత తేలికగా అంగీకరించే మనిషికాడు.

మీరు సాధుపుంగవులు. తియ్యగా మాట్లాడి వీళ్ళు మిమ్ము మోసం చేస్తారు. మీరు తరువాత తేరుకొని "పదండి, సత్యాగ్రహం చేద్దాం అని మమ్మల్ని హైరానా పెడతారు" అని నవ్వుతూ అన్నాడు సొహరాబ్. "నా వెంట వుండి హైరానా తప్ప మరింకొకటి ఎప్పుడైనా మీరు పొందారా మిత్రమా? సత్యాగ్రహి మోసగింపబడటానికేగదా పుట్టింది. వాళ్ళు నన్ను మోసం చేస్తే చేయనీయండి చూద్దాం. ఒకరిని మోసం చేయాలనుకునేవాడే చివరికి మోసంలో పడిపోతాడని ఎన్నో సార్లు మీకు చెప్పాను గదా అని అన్నాను.

సొహరాబ్ పకపక నవ్వుతూ 'మంచిది అలాగే మోసంలో పడండి. ఏదో ఒకరోజున సత్యాగ్రహంలో మీరు చచ్చిపోతే మా బొంట్లను కూడా వెంట తీసుకెళ్ళండి' అని అన్నాడు. కీర్తిశేషురాలు మిస్. హోబోహౌస్ నిరాకరణోద్యమాన్ని గురించి వ్రాసిన క్రింది మాటలు నాకు జ్ఞాపకం రాసాగాయి. "సత్యం కోసం మీరు ఒకానొక రోజున ఉరికంబం ఎక్కవలసివస్తుందనడంలో నాకు సందేహం లేదు. భగవంతుడు మిమ్ము సరియైన మార్గాన తీసుకువెళ్లుగాక. మిమ్ము రక్షించుగాక" సొహరాబ్‌తో నా యీ మాటలు ఆఫీసరు గద్దెక్కిన ఆరంభపు రోజుల్లో జరిగాయి. ఆరంభం, అంతం రెండింటి మధ్య ఎంతో కాలం పట్టలేదు. ఇంతలో నరం వాచి నాకు బాధకలిగింది. 14 రోజుల ఉపవాసానంతరం నా శరీరం పూర్తిగా కోలుకోలేదు. కాని కవాతులో తప్పనిసరిగా పాల్గొనసాగాను. ఇంటినుండి కవాతు చేసే చోటుకు కాలినడకన రెండు మైళ్ళు దూరం వెళుతూ వున్నాను. తత్ఫలితంగా మంచం ఎక్కవలసి వచ్చింది.

ఇట్టి స్థితిలో సైతం నేను ఇతరులతో బాటు క్యాంపుకు వెళ్ళవలసి వచ్చింది. మిగతా వారంతా అక్కడ వుండేవారు. నేను సాయంకాలం ఇంటికి తిరిగి వచ్చేవాణ్ణి. ఇక్కడే సత్యాగ్రహానికి బీజారోపణం జరిగిందన్నమాట. ఆఫీసరు తన దర్జా చూపించసాగాడు. తను అన్ని విషయాల్లోను మాకు ఆఫీసరు అన్నట్లు వ్యవహరించసాగాడు. ఆఫీసరు అట్టి పాఠాలు రెండు మూడు నాకు నేర్పాడు కూడా. సొహరాబ్ నా దగ్గరకు వచ్చాడు. నవాబ్‌గిరీ సహించే స్థితిలో లేదు. "ఏ అజ్ఞ అయినా మీ ద్వారానే రావాలి. ఇప్పుడు ఇంకా మనం శిక్షణా శిబిరంలోనే వున్నాం. ప్రతి విషయంలో అర్థంలేని హుకుములు జారీ అవుతున్నాయి. ఆయువకులకు మనకు

చాలా వ్యత్యాసం చూపబడుతున్నది. దీన్ని సహించడం కష్టం. ఈ వ్యవహారం త్వరగా తేల్చుకోవడం మంచిది. లేకపోతే మనం యిబ్బందుల్లో పడతాం. మనవాళ్లెవరు కూడా అర్థం పర్థం లేని హుకుములను పాటంచేస్థితిలో లేరు. ఆత్మాభిమాన రక్షణ కోసం ప్రారంభించిన పనిలో అవమానాలు కావడం సరికాదు." అని అన్నాడు.

నేను ఆఫీసరు దగ్గరకు వెళ్ళాను. విషయాలన్నీ ఆయనకు చెప్పివేశాను. ఒక పత్రంలో వాటన్నింటిని వ్రాసి యిమ్మని అంటూ తన అధికారాన్ని గురించి కూడా చెపుతూ "మీద్వారా యిట్టి ఆరోపణలు రాకూడదు. డిప్యూటీ ఆఫీసరుద్వారా తిన్నగా నాదగ్గరకు రావాలి"అని అన్నాడు. "నాకు అధికారాలేమీ అక్కరలేదు. సైనికరీత్యా నేను సామాన్య సిపాయిని మాత్రమే. కాని మా ట్రూపునాయకుని హోదాలో మీరు నన్ను వారి ప్రతినిధిగా అంగీకరించక తప్పదు. నాకు అందిన ఆరోపణలు చెప్పాను. అదీకాక ఉపనాయకుల నియామకం మమ్మల్ని అడిగి చేయలేదు. వాళ్ళ విషయమై అంతా అసంతృప్తిగా వున్నారు. అందువల్ల వాళ్లను వెంటనే తొలగించివేయండి. ట్రూపు మెంబర్లకు తమ నాయకుణ్ణి ఎన్నుకొనే అధికారం యివ్వండి." అని స్పష్టంగా చెప్పివేశాను. నా మాటలు అతనికి మింగుడు పడలేదు. అసలు ఉపనాయకుణ్ణి ఎన్నుకొనే ప్రశ్న లేదు. ఇప్పుడు వాళ్ళను తొలగించితే ఆజ్ఞాపాలనను సైనిక నియమాలకు తావే వుండదు అని అన్నాడు. మేము సభ జరిపాం. చిన్న సత్యాగ్రహానికి పూనుకోవాలి అని ప్రతిజ్ఞచేశారు. ఇప్పటినాయకుల్ని తొలగించక పోతే, క్రొత్త నాయకుణ్ణి ఎన్నుకొనే అధికారం ట్రూపు మెంబర్లకు యివ్వకపోతే మా ట్రూపు కవాతులో పాల్గొనదు, క్యాంపుకు వెళ్ళడం మానివేస్తుంది. అంటూ తీర్మానం చేశాం.

నేను ఆఫీసరుకు మా అసంతృప్తిని వెల్లడిస్తూ జాబు వ్రాశాను. నాకు అధికారం ఏమీ వద్దు. సేవ చేయడానికి వచ్చాం. అపని పూర్తి చేయాలి. బోయర్ల సంగ్రామంలో నేను ఎట్టి అధికారం పొందలేదు. అయినా కర్నల్ గేలబ్‌కు మా ట్రూపుకు మధ్య ఎన్నడు ఏ విధమైన పొరపొచ్చము ఏర్పడలేదు. నా ద్వారా మా ట్రూపు అభిప్రాయాలు తెలుసుకొని ఆయన వ్యవహరించేవాడు. అని పత్రంలో వ్రాసి తీర్మానం ప్రతి కూడా దానితోపాటు పంపించాను. అయితే ఆఫీసరు నా పత్రాన్ని ఖాతరు చేయలేరు. మేము మీటింగు జరిపి తీర్మానం ప్యాసు చేయడం కూడా మిలటరీ నియమాలకు వ్యతిరేకమనే నిర్ధారణకు వచ్చాడు. తరువాత నేను భారతమంత్రికి ఈ వ్యవహారమంతా తెలియజేస్తూ జాబు పంపాను. తీర్మానం ప్రతి కూడా దానితో జత చేశాను. భారత మంత్రి వెంటనే సమాధానం వ్రాస్తూ ట్రూపుకు నాయకుని ఉపనాయకుని ఎన్నుకునే అధికారం

వున్నది. భవిష్యత్తులో ఆ నాయకుడు మీ సిఫారసులను పాటిస్తాడు అని జాబు పంపాడు. ఆ తరువాత మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు బాగా జరిగాయి. ఆచేదు అనుభవాలన్నింటినీ పేర్కొని ఈ ప్రకరణాన్ని పెంచ దలుచుకోలేదు. అయితే హిందూ దేశంలో ప్రతిరోజు మనకు కలుగుతూ వుండే కటు అనుభవాలవంటివే అవి అని చెప్పక తప్పదు.

ఆఫీసరు బెదిరించి మాలో మాకు వైరుధ్యం వచ్చేలా చేశాడు. ప్రతిజ్ఞ చేసిన మాలో కొందరు సామదండభేదాలకు లోబడిపోయారు ఇంతలో నేటలీ ఆసుపత్రికి అసంఖ్యాకంగా గాయపడ్డ సైనికులు వచ్చారు. వారికి సేవ చేసేందుకు మా ట్రూపు మెంబర్లమంతా అవసరమైనాము. మా వాళ్ళు కొంతమంది నేటలీ వెళ్ళారు. కాని మిగతావాళ్ళు వెళ్ళలేదు. ఇండియా ఆఫీసువారికి ఇలా వెళ్ళకపోవడం నచ్చలేదు. నేను మంచం పట్టినప్పటికి మెంబర్లను కలుసుకుంటూనే వున్నాను. మి.రాబర్ట్సు తో బాగా పరిచయం ఏర్పడింది. ఆయన నన్ను కలుసుకునేందుకు వచ్చి మిగతా వారిని కూడా పంపమని పట్టుబట్టాడు. వాళ్ళంతా వేరే ట్రూపుగా వెళ్ళవచ్చని, అయితే నేటలీ ఆసుపత్రిలో అక్కడి నాయకుని ఆధీనంలో వుండి ఈ ట్రూపు సభ్యులు పనిచేయాలని, అందువల్ల పరువు నష్టం జరగదని ప్రభుత్వం ఎంతో సంతోషిస్తుందని, గాయపడ్డ సైనికులకు సేవాశుశ్రూషలు లభిస్తాయని మరీ మరీ చెప్పాడు.

నాకు, నా అనుచరులకు వారి సలహా నచ్చింది. దానితో మిగతా వారు కూడా నేటలీ వెళ్ళారు. నేను ఒక్కణ్ణి మాత్రం చేతులు నలుపుకుంటూ పక్కమీదపడి ఆగిపోయాను.

## 41. గోఖలేగారి ఔదార్యం

ఇంగ్లాండులో నరం వాపును గురించి వ్రాశాను. నన్ను యీ జబ్బు పట్టుకున్నప్పుడు గోఖలేగారు ఇంగ్లాండు వచ్చారు. వారి దగ్గరికి నేను, కేలన్‌బెక్ తరుచు వెళుతూ వున్నాం. ఎక్కువగా యుద్ధాన్ని గురించిన చర్చ జరుగుతూ వుండేది. జర్మనీ భూగోళం కేలన్‌బెక్‌కు కరతలామలకం. ఆయన యూరపంతా పర్యటించిన వ్యక్తి. అందువల్ల మ్యాపువేసి యుద్ధస్థావరాలను గోఖలేగారికి చూపుతూ వుండేవాడు. నా జబ్బు కూడా చర్చనీయాంశం అయింది. ఆహారాన్ని గురించిన నా ప్రయోగాలు సాగుతూనే వున్నాయి. ఆ సమయంలో వేరుశెనగపప్పు, పచ్చి మరియు పండిన అరటిపండ్లు, టమోటాలు, ద్రాక్షపండ్లు మొదలగు వాటిని భుజిస్తున్నాను. పాలు, ధాన్యం పప్పు పూర్తిగా మానివేశాను.

డా. జీవరాజ్‌మెహతా వైద్యం చేస్తున్నారు. ఆయన గోధుమ తినమని పాలు త్రాగమని బలవంతం చేశారు. గోఖలేగారికి యీవిషయమై నామీద పితూరీ వెళ్ళింది. పండ్లు మాత్రమే ఆహారంగా తీసుకోవాలని నేను చేసుకున్న నిర్ణయాన్ని గోఖలేగారు అంతగా ఆదరించలేదు. ఆరోగ్యదృష్ట్యా డాక్టర్ల సలహాలను పాటించాలని వారి అభిప్రాయం. గోఖలేగారి మాటను ఉల్లంఘించలేను వారు గట్టిగా పట్టుబడ్డారు. 24 గంటల వ్యవధి కోరాను. నేను మరియు కేలన్‌బెక్ యింటికి వచ్చాము. త్రోవలో నా కర్తవ్యాన్ని గురించి చర్చించాం. నేను చేస్తున్న ప్రయోగాలు ఆయనకూడా చేస్తున్నాడు. ఆరోగ్యదృష్ట్యా యీ ప్రయోగాలలో మార్పు చేయడం మంచిదని ఆయన అభిప్రాయపడ్డాడు. ఇక అంతర్వాణిపై ఆధారపడ్డాను. రాత్రంతా ఆలోచించాను. నా ప్రయోగాలన్ని మానుకుంటే నా కృషి అంతా నిరర్థకం అయిపోతుంది. నా అభిప్రాయాల్లో నాకు ఏవిధమైన దోషమూ కనబడలేదు. అయితే గోఖలేగారి ప్రేమకు లొంగిపోవడమా లేక నా శోధనల ప్రకారం ముందుకు సాగడమా తేల్చుకోవలసి వున్నది. బాగా యోచించి ధర్మ బద్ధమైన ప్రయోగాలను సాగిస్తూ మిగతా ప్రయోగాల విషయమై డాక్టర్ల సలహాను పాటించాలనే నిర్ణయానికి వచ్చాను. పాల విషయం ధర్మబద్ధం కనుక పాలు త్రాగకూడదు. మిగతా వాటి విషయంలో డాక్టరు సలహా పాటించాలి. అని భావించాను. కలకత్తాలో ఆవులను, గేదెలను చిత్రహింసకు గురిచేస్తున్న దృశ్యాలు నాకండ్లకు కనబడసాగాయి. పశువుల మాంసం ఎంత త్యాజ్యమో, పశువుల పాలుకూడా అంత త్యాజ్యమే. అందువల్ల పాలు మాత్రం త్రాగకూడదని నిర్ణయించుకొని ప్రొద్దున్నే లేచాను. నా మనస్సు తేటపడింది. కాని గోఖలేగారు ఏమంటారోనని భయం పట్టుకున్నది. వారు నా నిర్ణయాన్ని కాదనలేరులే అను ధైర్యం కూడా కలిగింది.

సాయంత్రం నేషనల్ లిబరల్ క్లబ్బులో వారిని కలుసుకునేందుకు వెళ్ళాము. డాక్టరు సలహా పాటించాలని నిర్ణయించారా? అని నన్ను చూడగానే గోఖలే ప్రశ్నించారు. "అన్నీ పాటిస్తాను. కాని ఒక్క విషయంలో మాత్రం మీరు పట్టు పట్టకండి. పాలు, పాలతో తయారైన వస్తువులు, మాంసం వీటిని తీసుకోను. అందువల్ల ప్రాణం పోయినా సరే సిద్ధపడమని నా మనస్సు ఆదేశం" అని మెల్లగా అన్నాను.

"ఇది మీ చివరి నిర్ణయమా"

"మరో సమాధానం యివ్వడం సాధ్యంకాదు. మీకు విచారం కలుగుతుందని నాకు తెలుసు. మన్నించండి" "మీ నిర్ణయం సరికాదు. అందు ధర్మ బద్ధం అంటూ ఏమి లేదు. అయినా మీ నిర్ణయాన్ని అంగీకరిస్తున్నాను" అని అన్నారు. గోఖలే

మాటల్లో విచారం నిండి వున్నా ప్రేమమాత్రం అపరిమితంగా వెల్లడి అయింది. జీవరాజ్ మెహతా వైపు చూచి "ఇక గాంధీని బాధించకండి. ఆయన నిర్ణయానికి కట్టుబడి చేయగలిగిన చికిత్స చేయండి"అని అన్నారు.

డాక్టరు తన అసంతృప్తిని వెల్లడించారు. కాని తప్పనిసరికదా! పెసరనీళ్ళు త్రాగమని సలహా యిచ్చారు. అందు కొద్దిగా ఇంగువ కలపమని చెప్పారు. నేను అంగీకరించాను. ఒకటి రెండు రోజుల ఆ విధంగా చేశాను. నా బాధ యింకా పెరిగింది. పెసరనీళ్ళు పడలేదు. అందువల్ల నేను తిరిగి పండ్లు తినడం ప్రారంభించాను. డాక్టరు కొంత వైద్యం చేశారు. బాధ కొద్దిగా తగ్గింది. నా నియమాలు, నిబంధనలు చూచి డాక్టరు భయపడ్డారు. ఈ లోపున అక్టోబరు నవంబరు మాసాలలో ఇంగ్లాండులో ముమ్మరంగా ప్రారంభమయ్యే మంచును తట్టుకోలేక గోఖలేగారు ఇండియాకు బయలుదేరి వెళ్ళారు.

# 42. నొప్పి తగ్గేందుకు

నరాల నొప్పి తగ్గలేదు. కొంచెం కంగారు పడ్డాను. మందులవల్ల నొప్పి తగ్గదని, ఆహారంలో మార్పు వల్ల బయటి ఉపచారాలవల్ల నొప్పి తగ్గుతుందని భావించాను. 1890 లో అన్నాహారం మరియు యితర ఉపచారాల ద్వారా చికిత్స చేసే డాక్టర్ ఎలిన్సన్ గారిని పిలిపించాను. ఆయన వచ్చాడు. నా శరీరం వారికి చూపించాను. పాలను గురించిన నా నిర్ణయం తెలియజేశాను. ఆయన నాకు ధైర్యం చెప్పాడు పాలు అక్కర్లేదు. కొద్దిరోజులపాటు జిగురుపదార్థాలు తినవద్దు అని చెప్పాడు. ఒట్టి రొట్టె, పచ్చికూరలు, ఉల్లిపాయలు, పచ్చకూర, నారింజపండు తినమని చెప్పాడు. ఈ కూరలతో పాటు సొరకాయపచ్చడి తినవలసి వచ్చింది. మూడు రోజుల గడిచాయి. పచ్చికూరలు పడలేదు. ఈ ప్రయోగం పూర్తిగా చేసే స్థితిలో నా శరీరం లేదు. పైగా అట్టి శ్రద్ధ కూడా కలుగలేదు. 24 గంటలు కిటికీలు తెరిచివుంచమని, గోరువెచ్చని నీటితో స్నానం చేయమని,నొప్పిగా వున్న చోట తైలంతో మర్దన చేయమని, అరగంట సేపు తెరపగాలిలో తిరగమని సలహాయిచ్చాడు. ఈ సలహా నాకు నచ్చింది. నేను వున్న యింటి కిటికీలు ఫ్రెంచి పద్ధతిలో వున్నాయి. వాటిని పూర్తిగా తెరిస్తే వర్షపునీరు ఇంట్లోకి రాసాగింది. వెంటిలేటర్లు తెరుచుకోవు. అందువల్ల వాటి అద్దాలను తొలగించి వేసి 24 గంటలు గాలివచ్చేలా ఏర్పాటు చేయించాను. వర్షం జల్లులు లోపలికి రాకుండా వుండేలా కిటికీ తలుపులు కొంచెంగా మూసి వుంచాను. దానితో ఆరోగ్యం

కొద్దిగా కుదుటపడింది. అయితే పూర్తిగా కుదుటపడలేదు. అప్పుడప్పుడు లేడీ సిసిలియా రాబర్ట్స్ నన్ను చూచేందుకు వస్తూ వుండేది. నా చేత పాలు త్రాగించాలని ఆమె భావించింది. నేను త్రాగనని తెలుసుకొని అట్టి గుణాలు గల పదార్థాలు మరేమైనా వున్నాయా అని అన్వేషణ ప్రారంభించింది. మాల్టెడ్‌మిల్కును గురించి మిత్రుడు తెలిపి అందుపాలు కలవవని సరిగా తెలుసుకోకుండానే ఆమెకు చెప్పాడు. అది రసాయన పదార్థంతో తయారు చేయబడ్డ పాలగుణం కలిగిన గుజ్జు. ఆమెకు నా నిర్ణయం యెడ అపరిమితమైన ఆదరం కలదని నాకు తెలుసు. అందువల్ల ఆమె తెచ్చిన ఆ గుజ్జును నీళ్ళలో కలిపి పుచ్చుకున్నాను. పాలరుచి పూర్తిగా అందువున్నది. ఎడం చేతికి బదులు పుర్ర చెయ్యి పెట్టు అన్నట్లున్నది యీ తతంగం. సీసామీదగల చీటి చదివాను. పాలతో తయారుచేయబడిన వస్తువు అని స్పష్టంగా అందు వ్రాసివున్నది. అందువల్ల ఒక్కసారి వాడి దాన్ని మానవలసి వచ్చింది ఈ విషయం లేడీ రాబర్ట్సునకు జాబుద్వారా తెలిపి ఏమీ అనుకోవద్దని వ్రాశాను. ఆమె వెంటనే పరుగెత్తుకు వచ్చి జరిగిన దానికి మన్నించమని కోరింది. ఆమె మిత్రుడు అసలు లేబులు చదవనేలేదన్నమాట. మీ వంటి మంచి మనస్సు గల సోదరి ఆప్యాయతతో అందజేసిన వస్తువును వదిలినందుకు క్షమించమని ఆమెను వేడుకున్నాను. తెలియక ఒక్క పర్యాయం పుచ్చుకున్నందుకు పశ్చాత్తాపపడమని, ప్రాయశ్చిత్తం చేసుకోనని కూడా ఆమెకు తెలియజేశాను.

ఆమె వల్ల కలిగిన మధురస్మృతులు యింకా వున్నాయి. కాని వాటిని వదిలి వేస్తున్నాను. ఆపదలో సాయపడ్డ యిటువంటిస్మృతులు అనేకం వున్నాయి. భగవంతుడు దుఃఖమనే చేదు మందులు త్రాగించి వాటితో పాటు తీయని స్నేహమనే పథ్యం కూడా రుచి చూపుతాడని శ్రద్ధాళువులు గ్రహింతురుగాక. డాక్టర్ ఎలిన్సన్ నన్ను చూచేందుకు రెండోసారి వచ్చారు. యీ సారి ఎక్కువ స్వాతంత్ర్యం యిచ్చారు. నునుపుతనంగల ఎండు ద్రాక్ష, వేరుశెనగపప్పుతో తయారయ్యే వెన్న తీసుకోమని చెప్పారు. పచ్చికూరలు రుచించకపోతే ఉడకబెట్టి అన్నంలో కలిపి తినమని చెప్పారు. ఆహారంలో ఈ మార్పు నా ఒంటికి బాగా పనిచేసింది.

కానీ నొప్పి మాత్రం పూర్తిగా తగ్గలేదు. డాక్టర్ మెహతా అప్పుడప్పుడు వచ్చి చూచి వెళుతూ వున్నారు. "నేను చెప్పిన ప్రకారం చికిత్స చేయించుకుంటే తక్షణం నయం చేస్తా" అని ఆయన ఎప్పుడూ అంటూ వుండేవాడు. ఒకనాడు మి..రాబర్ట్స్ వచ్చి ఇండియా వెళ్ళమని సలహా ఇచ్చాడు. ఈ పరిస్థితిలో మీరు నేటలీ వెళ్లడం కష్టం.

ముందు ముందు చలి మరీ తీవ్రం అవుతుంది. యిక మీరు మీ దేశం వెళ్ళండి. జబ్బు నయం అవుతుంది. అని గట్టిగా చెప్పాడు. అప్పటి వరకు యుద్ధం సాగుతూ వుంటే మీకు అందు పాల్గొనే అవకాశం లభిస్తుంది ఇక్కడ మీరు చేసిన సహకారం తక్కువైంది కాదు" అని అన్నాడు. ఆయన సలహా అంగీకరించి హిందూ దేశానికి బయలుదేరాను.

## 43. ప్రయాణం

కేలెన్‌బెక్ నాతోబాటు హిందూ దేశానికి బయలుదేరారు. ఇంగ్లాండులో మేము కలిసే వున్నాం. కాని యుద్ధం కారణంగా జర్మను దేశస్థుల మీద నిఘా ఎక్కువైంది అందువల్ల కేలన్‌బెక్ రాకను గురించి మాకు సందేహం కలిగింది వారికి పాస్‌పోర్టు సంపాదించేందుకు నేను చాలా ప్రయత్నం చేశాను. మి రాబర్ట్స్ ఆయనకు పాస్‌పోర్టు యిప్పించేందుకు సిద్ధపడ్డారు. ఆయన యీ వివరమంతా తంతి ద్వారా వైస్రాయికి తెలియజేశారు. కాని లార్డ్‌హార్డింగ్ దగ్గర నుంచి "ఈ సమయంలో నేను ప్రమాదకరమైన పనికి సహకరించలేనని తెలుపుటకు చింతిస్తున్నాను." అంటూ రపిమని సమాధానం వచ్చింది. ఈ సమాధానమందలి ఔచిత్యాన్ని మేమంతా గ్రహించాము కేలన్‌బెక్‌ను వదులుతున్నప్పుడు నాకు వియోగ బాధ అమితంగా కలిగింది. కేలన్‌బెక్‌కు కలిగిన దుఃఖం వర్ణనాతీతం. ఆయన హిందూ దేశం వచ్చి వుంటే మంచి రైతుగా, మంచి నేతవానిగా సాదాజీవితం గడుపుతూ ఉండేవారు. ఇప్పుడు ఆయన దక్షిణాఫ్రికాలో శేషజీవితం గడుపుతూ వున్నారు. గృహనిర్మాణానికి సంబంధించిన వృత్తిని చేపట్టి దాన్ని బాగా సాగిస్తున్నారు. మూడోతరగతి టిక్కెట్టుపై ప్రయత్నించాము.

మేము ఓడ ప్రయాణానికి పి. అండ్ ఓ. ఓడలో మూడోతరగతి టిక్కెట్టు తీసుకున్నాము. దక్షిణ ఆఫ్రికానుంచి తెచ్చుకున్న కొన్ని ఆహార పదార్థాలు వెంటపెట్టుకున్నాం. మరో పదార్థాలు దొరుకుతాయి కాని అవి ఓడలో దొరకవు. డా.మెహతా నాశరీరాన్ని మీడ్జ్ ప్లాస్టరుతో కట్టివేశాడు. దాన్ని అలాగే వుంచమని సలహా యిచ్చాడు. రెండు రోజులు దాన్ని భరించాను, కాని యిక తట్టుకోలేక పోయాను. కొద్దిగా శ్రమపడి దాన్ని ఊడదీసి స్నానం చేశాను. ఎండు ద్రాక్ష, తాజా పండ్లు మాత్రం తీసుకుంటూ వున్నాను ఆరోగ్యం మెల్లమెల్లగా కుదుట పడసాగింది. ఓడ సూయజ్ కాలువలోకి ప్రవేశించునప్పటికి నా ఆరోగ్యం పూర్తిగా కుదుటపడింది. నీరసంగా వున్నప్పటికీ నన్ను పట్టుకున్న భయం వదిలింది రోజురోజుకీ వ్యాయామం పెంచుతూ వున్నాను ఈ మార్పుకు కారణం పరిశుద్ధమైన శీతోష్ణస్థితియేయని నాకు బోధపడింది

ఎందువల్లనో గాని మాకూ అక్కడవున్న ఆంగ్ల యాత్రికులకు మధ్య ఎంతో వ్యత్యాసం కనబడింది. ఇంత వ్యత్యాసం దక్షిణ ఆఫ్రికాలో నాకు కనబడలేదు. అక్కడ కూడా తేడా వుందికాని, యింత తేడా మాత్రం లేదని చెప్పవచ్చు. అప్పుడప్పుడు ఆంగ్ల యాత్రికుల్ని కలిసినా "క్షేమంగా వున్నారా? వున్నాము" అంతటితో సంభాషణ ఆగిపోతూ వున్నది. మనస్సులు కలపలేదు స్టీమరులోను దక్షిణ ఆఫ్రికాలోను మనస్సులు కలిసేవి. మేము పరిపాలకులం అని ఆంగ్లేయులు, మేము పాలితులం అని హిందూ దేశస్థులు తెలిసో తెలియకో భావించడం యిందుకు కారణమని గ్రహించాను. ఇటువంటి వాతావరణా న్నుండి త్వరగా బయటపడి దేశం చేరుకోవాలని తహతహలాడాను. ఆదన్ చేరాక యింటికి చేరినట్లనిపించింది. దక్షిణాఫ్రికాలో అదన్ ప్రజలతో నాకు సంబంధం ఏర్పడింది. అక్కడ భాయికైకోబాద్‌కావస్ దీన్షా దర్శను విచ్చేసినప్పుడు ఆయనతోను, ఆయన భార్యతోను నాకు బాగా పరిచయం ఏర్పడింది. తరువాత కొద్ది రోజులకు మేము బొంబాయి చేరాం. 1905 కే తిరిగి వద్దామనుకున్న దేశానికి పదిసంవత్సరాల తరువాత వచ్చానన్నమాట. ఎంతో ఆనందం కలిగింది. బొంబాయిలో గోఖలేగారు స్వాగత సత్కారాల నిమిత్తం ఏర్పాట్లు చేశారు. వారి ఆరోగ్యం సరిగా లేదు. అయినా వారు బొంబాయి వచ్చారు. వారిని కలుసుకొని, వారిజీవితంతో కలిసిపోయి నా బరువును తగ్గించుకోవాలనే కోరికతో బొంబాయి చేరాను. కాని సృష్టికర్త నా నొసట మరో విధంగా లిఖించాడు.

## 44. వకీలు వృత్తి కొన్ని జ్ఞాపకాలు

హిందూ దేశం వచ్చిన తరువాత నా జీవనస్రవంతి ఎలా ముందుకు సాగిందో వివరించే ముందు దక్షిణ ఆఫ్రికాలో జరిగిన కొన్ని ఘట్టాలు యిక్కడ తెలియజేయడం అవసరమని భావిస్తున్నాను. వాటిని నేను గతంలో కావాలనే వదిలి వేశాను. కొంత మంది మిత్రులు నా వకీలు జీవితపు అనుభవాలు తెలుపమని కోరారు. అట్టి జ్ఞాపకాలు కోకొల్లలు . వాటిని వ్రాయడం ప్రారంభిస్తే పెద్ద గ్రంథం అవుతుంది. కొన్ని జ్ఞాపకాల్ని మాత్రం యిక్కడ తెలుపుతాను. వకీలు వృత్తిలో నేను ఆధారం చేసుకోలేదని మొదటనే తెలియజేశాను. నిజానికి నా వకీలు వృత్తితో ఎక్కువ భాగం సేవకే సమర్పించాను. జేబు ఖర్చుకు సరిపడే సొమ్ము మినహా మరింకేమీ తీసుకోలేదు. ఎన్నో పర్యాయాలు ఆ సొమ్ముకూడా వదిలివేస్తూ వుండేవాణ్ణి. యింతటితో అపుదామంటే సత్యపాలనకోసం మీరు చేసిన వకీలు వృత్తిని గురించి ఏమి రాసినా ప్రయోజనం

కలుగుతుందని మిత్రులు అభిప్రాయపడ్డారు. వకీలు వృత్తియందు అబద్ధాలు తప్పవని నా చిన్నతనం నుండి వింటూ వచ్చాను. అబద్ధాలాడి నేను ఏమైనా పదవినిగాని, ధనాన్నిగాని ఆశించలేదు. అందువల్ల అటువంటిమాటల ప్రభావం నామీద ఏమీ పడలేదు. దక్షిణ ఆఫ్రికాలో ఎన్నో పర్యాయాలు నాకు పరీక్ష జరిగింది. ఎదురు పార్టీ వాళ్ళు సాక్షులకు పాఠం నూరిపోస్తారని నాకు తెలుసు. నేను కూడా అలా చేస్తే, కక్షిదారును అబద్ధాలాడమని ప్రోత్సహిస్తే కేసు డిక్రీ కావడం ఖాయమే. కాని నేను అట్టి లోభంలో పడలేదు. ఒక్క కేసు విషయం నాకు బాగా జ్ఞాపకం వున్నది. కేసు గెలిచిన తరువాత కక్షిదారు నన్ను మోసగించాడని తెలుసుకున్నాను. అసలు కేసులో నిజం వుంటే గెలవాలని లేకపోతే ఓడాలని భావించేవాణ్ణి. గెలుపు ఓటమిని బట్టి సొమ్ము తీసుకునే వాణ్ణి కాదు. కక్షిదారు గెలిచినా లేక ఓడినా చేసిన శ్రమకు సరిపోయే సొమ్ము మాత్రమే తీసుకునేవాణ్ణి "నీ కేసులో నిజం లేకపోతే నా దగ్గరికి రావద్దు. సాక్షులకు అబద్ధాలు నూరి పోయడం వంటి పనులు నేను చేయను." అని ముందే చెప్పినవాణ్ణి. అందువల్ల అబద్ధం కేసులు నా దగ్గరకు వచ్చేవి కావు. నా పరపతి ఆ విధంగా పెరిగింది. నిజం వున్న కేసులు నాకు అప్పగించి అబద్ధం కేసులు మరో వకీలుకు అప్పగించే కక్షిదారులు కూడా వున్నారు.

ఒక పర్యాయం నాకు కఠిన పరీక్ష జరిగింది. అది నమ్మకమైన నా కక్షిదారుకు సంబంధించిన కేసు. అందు ఖాతాలెక్కల చిక్కులు అనేకం వున్నాయి. కేసు చాలా కాలం నడిచింది. ఆ కేసుకు సంబంధించిన విషయాలమీద వివిధ కోర్టుల్లో విచారణ జరిగింది. చివరికి కోర్టుకు సంబంధించిన లెక్కల్లో నిష్ణాతులైన కొందరిని పంచాయతీదారులుగా నిర్ణయించి వారికి లెక్కల వ్యవహారం అప్పగించారు. పంచాయతీదారుల తీర్పు ప్రకారం నా కక్షిదారు గెలవడం ఖాయమని తేలింది. కాని అతని లెక్కలో ఒక పెద్ద పొరపాటు దొర్లిపోయింది. జమా ఖర్చులో పంచాయతీదారుల దృక్పథం ప్రకారం ఇటు అంకెలు అటు చేర్చబడ్డాయి. ఎదుటి పక్షం వకీలు పంచాయితీ దారుల పొరపాటును గ్రహించాడు. అయితే పంచాయితీదారుల పొరపాటును అంగీకరించడం కక్షిదారు పనికాదని ఆయన అభిప్రాయపడ్డాడు. ఎదురు పార్టీ వారి మాటల్ని అంగీకరించవలసిన అవసరం మనకు లేదని ఆయన అన్నాడు. జరిగిన పొరపాటును అంగీకరించడం మంచిదని నేను అన్నాను. పెద్ద వకీలు అంగీకరించలేదు. "అలా అంగీకరిస్తే కోర్టు మొత్తం తీర్పునే రద్దుచేసే ప్రమాదం వున్నదని అట్టి ప్రమాదంలో తెలివిగల ఏ వకీలు తన కక్షిదారును పడవేయడని, నేను

మాత్రం యిట్టి ప్రమాదానికి పూనుకోనని, కేసు విచారణ మళ్ళీ ప్రారంభమైతే కక్షిదారు డబ్బు బాగా ఖర్చు పెట్టవలసి వస్తుందని చివరకి తీర్పు ఎలా యిస్తారో చెప్పడం కష్టమని స్పష్టంగా చెప్పివేశాడు.

ఈ సంభాషణ జరుగుతున్నప్పుడు కక్షిదారు అక్కడే వున్నాడు. "ఇట్టి ప్రమాదానికి సిద్ధపడక తప్పదు. మనం అంగీకరించకపోయినా పొరపాటు జరిగిందని తెలిసిన తరువాత, ఆ తీర్పు మీద కోర్టు నిలబడి వుంటుందని భావించడం సరికాదు కదా! పొరపాటును సరిదిద్దుకుంటున్నప్పుడు కక్షిదారు నష్టపడినా తప్పేమిటి" అని ప్రశ్నించాను.

"కాని మనం పొరపాటున అంగీకరించినప్పుడు గదా ఇదంతా?" అని అన్నాడు పెద్దవకీలు. 'మనం అంగీకరించకపోయినా, కోర్టు జరిగిన పొరపాటును గ్రహించదని లేక ప్రతివాదులు యీ పొరపాటును కోర్టు దృష్టికి తీసుకురారని భావించడం సబబా?' అని అడిగాను. పెద్ద వకీలు యిక ఒక నిర్ణయానికి వచ్చి "అయితే యీ కేసులో మీరు వాదించండి. పొరపాటును అంగీకరించే షరతుమీద అయితే నేను రాను. వాదనలో పాల్గొనను" అని చెప్పి వేశాడు.

"మీరు రాకపోయినా కక్షిదారుకోరితే నేను యీ కేసులో వాదిస్తాను. జరిగిన పొరపాటును అంగీకరించే షరతులమీదనే నేను వాదిస్తాను. అంగీకరించవద్దంటే మాత్రం నేను వాదించను." అని చెప్పి వేశాను. ఆవిధంగా చెప్పి నేను కక్షిదారు వంక చూచాను. కక్షిదారు పెద్దచిక్కులో పడ్డాడు. ఈ కేసు విషయమై మొదటి నుండి శ్రద్ధ వహించియున్నందున, కక్షిదారుకు నా మీద అమిత విశ్వాసం కలిగింది. నా స్వభావం కూడా అతడికి పూర్తిగా తెలుసు. కొద్దిసేపు ఆలోచించి అతడు ఒక నిర్ణయానికి వచ్చి "సరేనండి. మీరే కోర్టులో వాదించండి. జరిగిన పొరపాటును అంగీకరించండి. ఓటమి నొసటన వ్రాసివుంటే ఓడిపోతాను. అన్నింటికీ సత్యరక్షకుడు ఆ రాముడే" అని అన్నాడు. నాకు పరమానందం కలిగింది. మరో విధంగా అతడు జవాబిస్తాడని నేను భావించలేదు. పెద్ద వకీలు నన్ను మరీమరీ హెచ్చరించాడు. మొండి పట్టుపడుతున్నందున నామీద జాలి కూడా పడ్డాడు. చివరికి ధన్యవాదాలు తెలిపాడు. ఇక కోర్టులో ఏమి జరిగిందో తరువాత వివరిస్తాను.

## 45. గడుసుతనం

నా సలహా యందలి ఔచిత్యాన్ని గురించి నాకు కొంచెం కూడా సందేహం కలుగలేదు. కాని ఆ కేసు విషయంలో వాదన సాగించాలంటే నాకు సందేహం కలిగింది యిలాంటి ప్రమాదకరమైన కేసులో పెద్ద కోర్టులో వాదించడం ప్రమాదమని

తోచింది. అందువల్ల భయపడుతూనే నేను జడ్జిగారి యెదుటలేచి నిలబడ్డాను. ఆ పొరపాటును గురించిన మాట ఎత్తగానే ఒక న్యాయాధిపతి "ఇది గడుసుతనం అని అనిపించుకోదా" అని అన్నాడు.

నేను లోలోన మండి పడ్డాను. అసలు గడుసుతనానికి తావే లేనప్పుడు 'మొదటనే జడ్జీ వ్యతిరేకమైతే కఠినమైన యీ కేసులో విజయం పొందడం సాధ్యంకాదు' అని అనిపించింది. కోపాన్ని అణుచుకొని 'అయ్యా! మీరు పూర్తి విషయం వినకుండానే గడుసుతనం అని దోషారోపణ చేయడం ఆశ్చర్యకరం'అని ప్రశాంతంగా అన్నాను. "నేను దోషారోపణ చేయడం లేదు. సందేహం వ్యక్తం చేశాను." అని అన్నాడు జడ్జీ. "మీ సందేహం నాకు దోషారోపణగా భాసించింది. నిజమేమిటో మనవి చేశాక సందేహానికి తావుంటే మీరు సందేహించవచ్చు" అని అన్నాను. దానితో జడ్జీ శాంతించాడు. మిమ్మల్ని మధ్యలో ఆపినందుకు విచారిస్తున్నాను. మీరు మీ విషయం విశదంగా చెప్పండి. అని అన్నాడు. జడ్జీ దగ్గర బలవత్తరమైన ఆధారాలు వున్నాయి. ప్రారంభంలోనే ఆయన సందేహించడం, జడ్జీ దృష్టిని నా వాదన మీదకు ఆకర్షించగలగడం వల్ల నాకు ధైర్యం చేకూరింది సవివరంగా కేసును గురించి చెప్పాను. జడ్జీలు ఓపికగా నావాదనంతా విన్నారు అజాగ్రత్తవల్ల పొరపాటు జరిగిపోయిందనే నమ్మకం నా వాదన విన్న మీదట వారికి కలిగింది. ఎంతో కష్టపడి తయారు చేసిన లెక్కను రద్దుచేయడం ఉచితం కాదని వారికి తోచింది. ఎదుటి పక్షపు వకీలుకు పొరపాటు జరిగిందని నేను చెప్పిన మీదట యిక తాను వాదించవలసింది ఏమీవుండదని తెలుసు. అయితే యింత స్పష్టంగా సవరించుటకు వీలుగా వున్న పొరపాటు కోసం పంచాయతీ దారుల తీర్పును రద్దుచేసేందుకు జడ్జీలు సిద్ధపడలేదు. పాపం ఆ వకీలు బుర్ర బద్దలు కొట్టుకున్నాడు. ప్రారంభంలో సందేహం వ్యక్తం చేసిన జడ్జీయే నా వాదనను గట్టిగా సమర్థించాడు. గాంధీ పొరపాటును అంగీకరించి యుండకపోతే మీరు ఏం చేసేవారు అని జడ్జీ ఆ వకీలును ప్రశ్నించాడు. లెక్కల నిపుణులను మేము నియమించాము. అంతకంటే మించిన నిపుణులను ఎక్కడి నుంచి తీసుకురమ్మంటారు? అని అంటూ "ఈ కేసును గురించిన వ్యవహారంలో బాగా తెలుసుకున్నారని భావిస్తున్నాం. లెక్కలనిపుణులు కూడా పొరపాటు పడవచ్చు. మరో పొరపాటు ఏదీ మీరు చూపించలేదు. అట్టి స్థితిలో నియమాలకు సంబంధించిన కొద్ది పొరపాటుకు ఉభయ పార్టీలచేత క్రొత్తగా మళ్ళీ ఖర్చు చేయించడానికి కోర్టు సిద్ధంకాజాలదు. కేసును తిరిగి విచారించమని మీరు కోరితే అది సాధ్యం కాని పని అని జడ్జీలు అన్నారు.

ఈ విధమైన తర్కంతో ప్రతి పక్షానికి చెందిన వకీలును శాంతపరిచి పొరపాటును సరిచేసి లేక యీ చిన్న పొరపాటును సరిదిద్ది మళ్ళీ తీర్పు యిమ్మని పంచాయితీ దారుల్ని ఆదేశించి, కోర్టు సరిదిద్దబడిన తీర్పును ఖాయం చేసింది. నేను ఎంతో సంతోషించాను. క్షక్షిదారు మరియు పెద్ద వకీలుకూడా సంతోషించారు. వకీలు వృత్తిలో కూడా సత్యరక్షణ కావిస్తూ పని చేయవచ్చుననే నా అభిప్రాయం దృఢపడింది.

వృత్తి కోసం చేసే వకాల్తాలో దోషం వుంటే, దాన్ని సత్యం కప్పి వుంచలేదని పాఠకులు గ్రహింతురుగాక.

## 46. కక్షిదారులు అనుచరులుగా మారారు

నేటాలు మరియు ట్రాన్సువాలుల వకాల్తాలో ఒక తేడా వున్నది. నేటాలులో అడ్వొకేట్‌కు మరియు అటార్నీకి తేడా వున్నప్పటికి యిద్దరూ కోర్టులన్నింటియందు సమానంగా వకాల్తాకు పూనుకోవచ్చు. ట్రాన్సువాలులో బొంబాయి వలెనే వ్యవహారం సాగుతున్నది. అక్కడ కక్షిదారుకు సంబంధించిన వ్యవహారాలన్నీ అడ్వొకేట్ అటర్నీ ద్వారానే జరుగుతాయి. నేటాలులో నేను అడ్వకేట్‌గా ధృవీకరణ పత్రం తీసుకున్నాను. ట్రాన్సువాలులో అటార్నీ పత్రం పుచ్చుకున్నాను. అడ్వొకేట్‌గా వుంటూ హిందు దేశస్థులతో నాకు తిన్నగా సంబంధం వుండదు. తెల్లవాడైన అటార్నీ నాకు కేసులు అప్పగించే స్థితి దక్షిణ ఆఫ్రికాలో లేదు. ట్రాన్సువాలులో వకాల్తా చేస్తూ మేజిస్ట్రేటు కోర్టుకు నేను చాలా సార్లు వెళ్ళాను. ఒక పర్యాయం విచారణలో వున్న ఒక కేసులో నా కక్షిదారు నన్ను మోసం చేశాడని తేలింది. అతని కేసు అబద్ధాలపుట్ట. అతడు బోనులో నిలబడి వణికిపోయాడు. పడిపోయే స్థితిలో వున్నాడు. నేను మేజిస్ట్రేటును "అయ్యా, నా కక్షిదారుకు కఠిన శిక్ష విధించండి' అని కోరి కూర్చున్నాను. ప్రతిపక్షానికి చెందిన వకీలు నివ్వెరబోయాడు. మేజిస్ట్రేటు సంతోషించాడు. కక్షిదారును నేను బాగా కోప్పడ్డాను. ముందుగనే అబద్ధం కేసుతీసుకోనని అతడికి గట్టిగా చెప్పాను. అతడు అందుకు అంగీకరించాడు కూడా. అందువల్ల అతడికి శిక్షవిధించమని కోరినందున అతడు కోపం తెచ్చుకోలేదు. ఏదిఏమైనా నా యీ వ్యవహార ప్రభావం నా వృత్తిమీద పడలేదు. కోర్టులో నా పని సులభమైపోయింది. సత్యనిష్ఠవల్ల వకీలు మిత్రుల దృష్టిలో నాకు గౌరవం పెరిగింది. వారందరి ఆదరణ పొందగలిగాను. వకీలు వృత్తి సాగిస్తున్నప్పుడు కక్షిదారు దగ్గర గాని, వకీలు దగ్గర గాని నా అజ్ఞానాన్ని దాచేవాణ్ణికాదు. నాకు బోధపడనప్పుడు మరో వకీలు దగ్గరకు వెళ్ళమని కక్షిదారుకు నేనే సలహా యిచ్చేవాణ్ణి.

అతడు నన్నే పనిచేయమంటే మరో అనుభవజ్ఞుడైన వకీలు సలహా పొందుతానని చెప్పేవాణ్ణి. ఈ విధంగా వ్యవహరించడంవల్ల కక్షిదారులు నన్ను విశ్వసించేవారు. పెద్ద వకీలు దగ్గరకు వెళ్ళి సలహా తీసుకునేందుకు అయ్యే వ్యయం కూడా వారే సంతోషంగా భరించేవారు. అట్టి వారి ప్రేమ, విశ్వాసాలు నా ప్రజాసేవకు బాగా ఉపకరించాయి. గత ప్రకరణంలో దక్షిణ ఆఫ్రికాలో నా వకీలు వృత్తి లక్ష్యం ప్రజాసేవయేనని తెలియజేశాను. ప్రజాసేవ చేయడానికి కూడా ప్రజల విశ్వాసం పొందడం చాలా అవసరం. డబ్బు తీసుకొని నేను వకీలు పని చేసినా ఉదార హృదయంతో ప్రజలు నా పనిని సేవా కార్యంగానే భావించారు. జైళ్ళకు వెళ్లవలసి వచ్చినప్పుడు చాలా మంది వ్యక్తులు ఆ విషయం ఏమిటో తెలుసుకోకుండానే నామీద గల ప్రేమ విశ్వాసాల కారణంగా సిద్ధపడ్డారు. ఈ విషయాలు వ్రాస్తున్నప్పుడు వకీలు వృత్తికి సంబంధించిన ఎన్నో మధుర స్మృతులు నా కలాన్ని ఆవహిస్తున్నాయి. చాలామంది కక్షిదారులు నాకు మిత్రులుగా మారిపోయారు. ప్రజాసేవలో నాకు నిజమైన అనుచరులుగా వుండి నా కఠోర జీవితాన్ని సరళం చేశారు.

## 47. అపరాధి జైలుశిక్ష పడకుండా తప్పించుకున్న విధానం

పారశీ రుస్తుంగారి పేరుతో ఈ ప్రకరణాల పాఠకులు సుపరిచితులే. ఆయన ఒకే సమయంలో నాకు కక్షిదారు, ప్రజాకార్యరంగంలో అనుచరుడు అయ్యాడు. మరో విధంగా చెప్పాలంటే ముందు అనుచరుడు తరువాత కక్షిదారు అయ్యాడన్నమాట. ఆయన విశ్వాసాన్ని నేను అపరిమితంగా చూరగొన్నాను. తన స్వంతవిషయాలేగాక తన ఇంటి విషయాల్లో సహితంగా నా సలహాలు తీసుకొని ఆ ప్రకారం నడుచుకునేవాడు. ఆయనకు జబ్బు చేసినా నా సలహా అవసరమని భావించేవాడు. మా ప్రవర్తనా తీరులో ఎంతో వ్యత్యాసం వుండేది. ఆయన తన జబ్బులకు నా చికిత్సను వాడి చూచేవాడు. ఒక పర్యాయం పెద్ద ఆపద విరుచుకుపడింది. తన వ్యాపార రహస్యాలు నాకు చెపుతూ వుండేవాడు. అయినా ఒక రహస్యాన్ని దాచివుంచాడు. పారసీ రుస్తుంజీ చెల్లించవలసిన పన్ను చెల్లించేవాడు కాదు. దొంగ వ్యాపారం సాగించేవాడన్నమాట. బొంబాయి కలకత్తా నుండి వస్తువులు తెప్పించేవాడు. ఇక్కడే దొంగ వ్యాపారం జరుగుతూ వుండేది. అధికారులందరితో ఆయనకు మంచి సంబంధాలు వుండటం వల్ల ఆయనను ఎవ్వరూ సందేహించేవారు కాదు. ఆయన చూపించిన రశీదుల్ని, పట్టీలను బట్టి పన్ను వసూలు చేస్తూవుండేవారు. అప్పుడప్పుడు కొద్దిగా అనుమానం

కలిగినా ఆఫీసర్లు చాలామంది కళ్ళు మూసుకునేవారన్నమాట. కాచో పారో ఖవో అన్, తేవుం ఛే చోరీ సుందన్ (పాదరసం తినడం, దొంగసొత్తు తినడం రెండూ సమానం సుమా) అని ఆ భగవంతుని సూక్తికదా! ఒకసారి పారసీ రుస్తుంగారి దొంగసొత్తు పట్టుబడింది. నా దగ్గరకు పరుగులు తీసాడు. ఆయన కండ్ల నుండి కన్నీరు కారుతున్నది. 'అన్నా! నేను మోసం చేశాను. నా పాపం ఈనాడు బ్రద్దలయింది. నేను పన్ను ఎగ్గొట్టాను. నాకు జైలుశిక్ష తప్పదు. నాశనం తప్పదు. ఈ ఆపదనుండి నీవే రక్షించాలి. నేను నీదగ్గర ఏమీ దాచలేదు. కాని వ్యాపారంలో చేసే దొంగతనాన్ని గురించి చెప్పడం ఎందుకులే అని భావించి చెప్పలేదు. ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను.' అని ఘోషపెట్టాడు. ధైర్యం చెబుతూ "నాపద్ధతి మీకు తెలుసు కదా! విడిపించగలగడం, విడిపించలేకపోవడం భగవంతునిమీద ఆధారపడ్డ విషయం. చేసిన అపరాధాన్ని అంగీకరించే షరతులమీద అయితే నేను ప్రయత్నిస్తాను" అని అన్నాను.

పాపం ఆ పెద్ద మనిషి ముఖం పాలిపోయింది. "మీదగ్గర ఒప్పుకున్నాను కదా! సరిపోదా!" అని అన్నాడు చేసిన అపరాధం ప్రభుత్వానికి సంబంధించినది. నా యెదుట అంగీకరిస్తే ప్రయోజనం ఏముంటుంది?" అని మెల్లగా అన్నాను. "మీరు చెప్పిన ప్రకారం చేయక తప్పదు. నాకు ఒక పాత వకీలు వున్నాడు. ఆయన సలహా తీసుకోండి. ఆయన నాకు మంచి మిత్రుడు." అని అన్నాడు. రుస్తుంజీ వ్యవహారమంతా పరిశీలించి చూశాను. ఈ దొంగ వ్యాపారం చాలా కాలం నుండి సాగుతున్నదని స్పష్టంగా తెలిసిపోయింది. పట్టుబడ్డ సామగ్రి స్వల్పమే. వకీలును కలిశాం. ఆయన కేసును పరిశీలించాడు. "ఈ వ్యవహారమంతా జ్యూరీ ఎదుటకు వెళుతుంది. ఇక్కడి జ్యూరీ హిందూ దేశస్థుల్ని తేలికగా వదిలే రకం కాదు, అయినా వదలను" అని అన్నాడు. ఆయనతో నాకు పరిచయం తక్కువ. పారసీ రుస్తుంజీ ఆయన మాటను విని "మీకు ధన్యవాదాలు. అయితే ఈ వ్యవహారంలో నేను గాంధీగారి సలహా ప్రకారం నడుచుకుంటాను. ఆయన నన్ను బాగా ఎరుగును. మీరు వీరికి అవసరమైన సలహాలు యిస్తూవుండండి" అని అన్నాడు. ఈ వ్యవహారం అక్కడ ముగించి మేము రుస్తుంజీ కొట్టు దగ్గరకు వచ్చాం. "అసలు ఈ విషయాన్ని కోర్టుదాక పోనీయకూడదని అలా పోవడం మనకు మంచి పని కాదని అభిప్రాయపడ్డాను. కోర్టుకు వెళ్లడమా లేదా అని నిర్ణయించేవాడు టాక్సు వసూలు చేసే అధికారి. అతడు కూడా ప్రభుత్వ వకీలు సలహా ప్రకారం నడుచుకోవలసి వుంటుంది. నేను ఆ యిద్దరినీ కలుస్తాను. అయితే ఒక్క విషయం వాళ్లకు తెలియని అనగా వాళ్లకు పట్టుబడని దొంగతనాలు కూడా నేను వారికి చెప్పవలసివుంటుంది. వారు విధించే శిక్షను అనుభవించేందుకు సిద్ధపడదాం.

జైలుకు వెళ్లడం కంటే చేసిన దొంగ పని సిగ్గు చేటు అని నా అభిప్రాయం . సిగ్గుచేటు అయిన పని జరిగిపోయింది. జైలుకు వెళ్ళవలసి వస్తే ప్రాయశ్చిత్తమని భావిద్దాం. అయితే నిజమైన ప్రాయశ్చిత్తం ఒకటి వున్నది. ఇక భవిష్యత్తులో యిటువంటి దొంగపని చేయనని ప్రతిజ్ఞ గైకొనడమే ఆ ప్రాయశ్చిత్తం" అని స్పష్టంగా చెప్పివేశాను.

నా మాటను సరిగా రుస్తుంజీ అర్థం చేసుకోగలిగాడని చెప్పలేను ఆయన మంచి వీరుడు. అయితే అప్పుడు నీరు కారి పోయాడు. ఆయన పరువు పోయే ప్రమాదం సంభవించింది. ఎంతో కష్టపడి చెమటోడ్చి కట్టిన భవనం కుప్ప కూలిపోతుందేమోనన్న భయం ఆయన్ను పట్టుకున్నది. "నా మెడ మీ చేతుల్లో వుంచాను. ఇక మీయిష్టం" అని ఆయన అన్నాడు. వ్యవహారాలలో నాకుగల వినమ్రతా శక్తినంతటినీ వినియోగించాను. అధికారిని కలిశాను. దొంగ వ్యవహారమంతా నిర్భయంగా చెప్పి వేశాను. కాగితాలన్నీ చూపిస్తానని మాట యిచ్చాను. పారసీ రుస్తుంజీ పడుతన్న బాధను, ఆయన వెల్లడించిన పశ్చాత్తాపాన్ని వివరించాను. "ఈ వృద్ధ పారశీకుడు మంచివాడని తోస్తున్నది. ఆయన మూర్ఖపు పని చేశాడు. నా కర్తవ్యం ఏమిటో మీకు తెలుసా పెద్ద వకీలు ఎలా చెబితే అలా నేను చేయాలి. అందువల్ల మీరు పెద్ద వకీలుకు మీ శక్తినంతా వుపయోగించి నచ్చచెప్పండి." అని ఆఫీసరు చెప్పాడు."పారసీ రుస్తుంజీని కోర్టుకు యీడ్వకుండా వుంటే సంతోషిస్తాను." అని అన్నాను. ఆ అధికారి దగ్గర అభయదానం పొంది ప్రభుత్వ వకీలుతో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించాను ఆయనను కలిశాను. నా సత్యనిష్ట ఆయన గ్రహించాడని తెలుసుకున్నాను. నేను ఏమీ దాచడం లేదని ఆయన ఎదుట ఋజువు చేశాను. ఈ వ్యవహారంలోనో మరో వ్యవహరంలోనో ఆయన దగ్గరకు వెళ్ళినప్పుడు ఆయన "మీరు లేదు కాదు చూద్దాం అను సమాధానం పొందే వ్యక్తి కాదు" అని నాకు సర్టిఫికెట్ యిచ్చాడు. పారసీ రుస్తుంజీ మీద కేసు మోపబడలేదు. ఆయన అంగీకరించిన టాక్సు సొమ్ము రెట్టింపు వసూలు చేసి కేసును ఉపహరించవలెనని ఆర్డరు వెలువడింది. రుస్తుంజీ తాను చేసిన పన్నుల ఎగవేతకు సంబంధించిన ఈ దొంగతనం గురించిన కథ వ్రాసి అద్దాల బీరువాలో భద్రపరిచాడు. ఆ కాగితాలు తన ఆఫీసులో తన వారసులకు, తోటి వ్యాపారస్తులకు హెచ్చరికగా వుంచాడు. రుస్తుంజీ సేఠ్ గారి మిత్రులు వ్యాపారస్తులు "ఇది నిజమైన వైరాగ్యం కాదు. స్మశాన వైరాగ్యం సుమా" అని నాకు చెప్పారు. వారి మాటల్లో సత్యం ఎంతవుందో నాకు తెలియదు. ఆ మాట కూడా రుస్తుంజీ సేఠ్‌కు నేను చెప్పాను."మిమ్మల్ని మోసం చేసి నేను ఎక్కడికి వెళ్ళగలను?" అని ఆయన సమాధానం యిచ్చాడు.

★ ★ ★

# ఐదవ భాగం

## 1. మొదటి అనుభవం

నేను దేశం చేరక ముందే ఫినిక్సు నుండి భారతదేశానికి రాదల్చుకున్న వాళ్లు వచ్చివేశారు. నిర్ణయం ప్రకారం వాళ్ల కంటె ముందుగా నేను రావాలి. కాని యుద్ధం కారణంగా నేను లండనులో ఆగిపోయాను. అయితే ఫినిక్సు నుండి వచ్చిన వారిని ఎక్కడ వుంచడమా అని ప్రశ్న బయలుదేరింది. అంతా కలిసి ఫినిక్సు ఆశ్రమంలో వుంటే మంచిదని భావించాను. ఫలానా చోటుకు వెళ్లమని చెబుదామంటే నాకు ఏ ఆశ్రమమూ తెలియదు. ఆండ్రూసును కలిసి వారు ఎలా చెబితే అలా చేయమని వ్రాశాను. వాళ్లను ముందు కాంగడీ గురుకులంలో వుంచారు. అక్కడ కీ.శే. శ్రద్ధానంద్ వాళ్లను తమ బిడ్డల్లా చూచుకున్నారు. తరువాత వారిని శాంతినికేతనంలో వుంచారు. అక్కడ కవివర్యులు, వారి అనుచరులు వారి మీద ప్రేమామృతం కురిపించారు. ఆ రెండు చోట్ల వాళ్లకు కలిగిన అనుభవం వాళ్లకు నాకు చాలా ఉపయోగపడింది.

"కవివర్యులు, శ్రద్ధానంద్‌జీ, శ్రీసుశీలరుద్ర" యీ ముగ్గురిని ఆండ్రూసుగారు చెప్పే త్రిమూర్తులు అని అనేవాణ్ణి. దక్షిణాఫ్రికాలో ఆయన ఆ ముగ్గురిని అమితంగా పొగుడుతూ వుండేవారు. దక్షిణాఫ్రికాలో జరిగిన అనేక సమావేశాలలో, అనేక సందర్భాలలో ఆండ్రూసు యీ ముగ్గురిని స్మరిస్తూ వుండేవారు. సుశీలరుద్ర గారి దగ్గర మా ముగ్గురు బిడ్డల్ని వుంచారు. రుద్రగారికి ఆశ్రమం లేదు. అందువల్ల వారి ఇంట్లోనే పిల్లల్ని వుంచారు. ఆ యింటిని నా బిడ్డలకు అప్పగించివేశారని చెప్పవచ్చు. రుద్రగారి పిల్లలు, నా పిల్లలు మొదటిరోజునే మమేకం అయిపోయారు. దానితో నా పిల్లలు, ఫినిక్సు నుండి వచ్చిన వాళ్లు శాంతినికేతనంలో వున్నారని తెలుసుకొని, గోఖలేగారిని కలుసుకొని వెంటనే శాంతినికేతనం వెళ్లాలని తొందరపడ్డాను.

బొంబాయిలో అభినందనలు స్వీకరించునప్పుడు నేను కొద్దిగా సత్యాగ్రహం చేయవలసి వచ్చింది. మి.పేటిట్ గారి వద్ద నాకు స్వాగతోత్సవం ఏర్పాటు చేశారు. అక్కడ గుజరాతీలో సమాధానం యిచ్చుటకు నాకు ధైర్యం చాలలేదు. బ్రహ్మాండమైన భవనం, కండ్లకు మిరిమిట్లుగొలిపే లైట్లు. వైభవోపేతంగా వున్న ఆ ప్రదేశంలో గిర్మిట్‌కూలీల వెంట వున్న నాబోటి పల్లెటూరివాడికి స్థానం లేదని అనిపించింది. యీనాటి నా దుస్తుల కంటే ఆనాటి నా దుస్తులు కొంచెం బాగా వున్నాయని

చెప్పవచ్చు. అప్పుడు చొక్కా, తలపాగా వగైరా దుస్తులు మంచివే ధరించాను. అయినా టిప్‌టాప్‌గా దుస్తులు ధరించియున్న అక్కడి వాళ్లమధ్య నేను విడిగా కనబడుతూ వున్నాను. ఏదో విధంగా అక్కడ పని ముగించుకొని నేను ఫిరోజ్‌మెహతాగారి ఒడిలో ఆశ్రయం పొందాను.

గుజరాతీ సోదరులు ఉత్సవం చేయకుండా వూరుకుంటారా? కీ.శే. ఉత్తమలాల్ త్రివేది ఆసభను ఏర్పాటు చేశారు. ఆ ఉత్సవ కార్యక్రమం గురించి ముందుగానే కొద్దిగా తెలుసుకున్నాను. ఆయన అధ్యక్షత వహించారో లేక ప్రధాన వక్తగా వున్నారో నాకు యిప్పుడు సరిగా గుర్తులేదు. కాని ఆయన క్లుప్తంగా మధురంగా ఇంగ్లీషులో ప్రసంగించారు. మిగతా ఉపన్యాసాలు కూడా ఇంగ్లీషులోనే జరిగినట్లు గుర్తు నా వంతు వచ్చినప్పుడు నేను గుజరాతీలోనే ప్రసంగించాను. గుజరాతీ, హిందుస్తానీ భాషలయెడ నాకుగల పక్షపాత భావాన్ని కొద్దిగా వెల్లడించి గుజరాతీల సభలో ఇంగ్లీషు వాడకాన్ని వినమ్రతతో వ్యతిరేకిం చాను. అలాంటి భావం వ్యక్తం చేస్తున్నప్పుడు కొంచెం తటపటాయించాను. చాలాకాలం తరువాత దేశం వచ్చిన యితడు అవివేకంగా ప్రవాహానికి ఎదురీత ఈదుతూ వున్నాడే అని అనుకుంటారేమోనని భావించాను. ఏదిఏమైనా గుజరాతీ భాషలోనే మాట్లాడాను. ఎవ్వరూ నా మాటల్ని ఖండించలేదు. సహించారు. అందుకు నేను సంతోషించాను. యీ సభలో కలిగిన అనుభవంవల్ల యిప్పుడు ప్రజలు అనుకుంటున్న దానికి విరుద్ధంగా మాట్లాడినా యిబ్బంది కలుగదు అని గ్రహించాను. ఈ విధంగా రెండురోజులు బొంబాయిలో వుండి గోఖలేగారి అనుమతి పొంది పూనాకు బయలుదేరాను.

## 2. గోఖలే గారితో

నేను బొంబాయి చేరగానే గోఖలేగారు "గవర్నరు మిమ్ము కలుసుకోవాలని అనుకుంటున్నారు. పూనాకు వెళ్లే ముందు మీరు వారిని కలవడం మంచిది" అని వార్త పంపారు. ఆ ప్రకారం నేను బొంబాయి గవర్నరు గారిని కలుసుకునేందుకు వెళ్లాను. మామూలు మాటల తరువాత "మీరు నాకు మాట యివ్వండి. ప్రభుత్వం విషయమై మీరేదైనా అడుగు వేయాలనుకుంటే ముందుగా నాతో మాట్లాడుతూ వుండండి" అని ఆయన అన్నాడు.

"ఆవిధంగా మాట యివ్వడం నాకు సులభమే. ఎవరికైనా వ్యతిరేకంగా వ్యవహరించదలుచుకున్నప్పుడు ఆవిషయం వారికి తెలిపి వారి అభిప్రాయం తెలుసుకోవడం, సాధ్యమైనంతవరకు వారికి అనుకూలంగా వ్యవహరించడం సత్యాగ్రహి

ధర్మం. దక్షిణ ఆఫ్రికాలో నేను సదా యీ నియమాన్ని పాటించాను. యిక్కడకూడా అలాగే పాటిస్తాను అని సమాధానం యిచ్చాను. లార్డ్ విల్లింగ్టన్ ధన్యవాదాలు తెలిపి మీరు అవసరమని భావించినప్పుడు నన్ను కలుసుకోవచ్చు. ప్రభుత్వం కావాలని ఏ చెడ్డ పని చేయదలచదని మీరే గ్రహిస్తారు అని అన్నాడు. "ఈ విశ్వాసమే నాకు ఆధారం అని అన్నాను.

నేను పూనా చేరాను. అక్కడి వివరాలన్నింటిని వ్రాయడం సాధ్యంగాదు. గోఖలేగారు, వారి సొసైటీ (భారత్ సేవక్ సమాజ్) సభ్యులు అంతా ప్రేమామృతంతో నన్ను తడిపివేశారు. నాకు జ్ఞాపకం వున్నంత వరకు గోఖలేగారు తమ సొసైటీ సభ్యులనందరినీ పూనా పిలిపించారు. వారితో అనేక విషయాలను గురించి అరమరికలు లేకుండా చర్చించాను. సొసైటీలో చేరమని గోఖలేగారు నన్ను గట్టిగా కోరారు. నాకూ అట్టి కోరిక కలిగింది. కాని సొసైటీ సభ్యులకు ఒక ధర్మ సందేహం కలిగింది. సొసైటీ ఆదర్శాలకు గాంధీ ఆదర్శాలకు, యిరువురి పని చేసే తీరుకు గల వ్యత్యాసం వారు గ్రహించారు. అందువల్ల నన్ను సొసైటీలో సభ్యునిగా చేర్చుకోవచ్చా లేదా అని వారు సందేహించారు. కాని గోఖలేగారి భావం వేరుగా వుంది. నేను నా ఆదర్శాల మీద ఎంత దృఢంగా వుంటానో యితరుల ఆదర్శాలను అంత దృఢంగా గౌరవిస్తానని, యితరులతో బాగా కలిసి పోగలనని గోఖలేగారికి తెలుసు."మా సభ్యులు యింకా యితరులతో కలిసి పోగల మీ స్వభావాన్ని గ్రహించలేదు. వారు తమ ఆదర్శాల విషయమై దీక్ష కలవారు. స్వతంత్ర భావాలు కలవారు. వారు మిమ్ము స్వీకరిస్తారని ఆశిస్తున్నాను. ఒక వేళ వారు స్వీకరించకపోయినా మీ యెడ వారికి ఆదరణ, ప్రేమ లేవని మాత్రం మీరు భావించవద్దు. ఈ ప్రేమాదరణల రక్షణ కోసమే వారు ఏ విధమైన ప్రమాదాన్ని కొనితెచ్చుకునేందుకు యిష్టపడటం లేదు. మీరు నియమ ప్రకారం సొసైటీ సభ్యులైనా కాకపోయినా నేను మాత్రం మిమ్ము సొసైటీ సభ్యులుగా భావిస్తున్నాను అని అన్నారు. నా అభిప్రాయాలను స్పష్టంగా గోఖలేగారికి చెబుతూ "నేను సొసైటీ సభ్యుడనైనా, కాకపోయినా నేను ఒక ఆశ్రమం స్థాపించి అందు ఫినిక్సులో వున్న నా అనుచరులను వుంచుతాను. నేను కూడా అక్కడ వుంటాను. నేను గుజరాతీ వాణ్ణి. కనుక, గుజరాత్ ప్రాంతానికి సేవచేస్తూ తద్వారా దేశానికి అత్యధిక సేవచేయాలని భావిస్తున్నాను. అందువల్ల నేను గుజరాత్ ప్రాంతంలో ఎక్కడైనా వుంటాను" అని ప్రకటించాను. నా అభిప్రాయం గోఖలేగారికి నచ్చింది. "మీరు అలాగే చేయండి. మా సభ్యులతో జరిగిన చర్చల పరిణామం ఎలా వున్నప్పటికీ మీరు మాత్రం ఆశ్రమానికి అవసరమైన డబ్బు నావద్ద స్వీకరించాలి. మీ ఆశ్రమాన్ని మా ఆశ్రమంగా భావిస్తాను అని గోఖలే అన్నారు.

నా హృదయం పొంగిపోయింది. ఆశ్రమం కోసం డబ్బు వసూలు చేయవలసిన అవసరం లేకుండా పోయినందుకు ఆనందం కలిగింది. అంతేగాక ఏ సమస్య వచ్చినా నేనొక్కడినేగాక, నాకు మార్గం చూపించగలవారు మరొకరున్నారనే భావం కూడా కలిగింది. దానితో నెత్తిమీద వున్న బరువు దిగిపోయినట్లనిపించింది. కీ.శే. డాక్టర్ దేవ్‌ను పిలిచి "గాంధీ గారి పేరట ఖాతా ప్రారంభించండి, ఆశ్రమ స్థాపనకు ప్రజాసేవా కార్యక్రమాలకు అవసరమైన డబ్బు గాంధీ కోరినంత యివ్వండి అని గోఖలేగారు ఆదేశించారు. ఇక నేను పూనా నుండి శాంతినికేతన్ వెళ్లే ఏర్పాటులో వున్నాను. చివరిరోజు రాత్రి గోఖలే నాకు నచ్చే విధంగా విందు ఏర్పాటు చేశారు. ప్రత్యేకించి కొందరు మిత్రులను ఆ విందుకు ఆయన ఆహ్వానించారు. నేను భుజించే పదార్థాలు అనగా ఎండు ద్రాక్ష వగైరా మరియు తాజా పండ్లు మాత్రమే వడ్డన చేయించారు. విందు ఏర్పాటు చేసిన చోటు వారి గది అతి సమీపంలో వుంది. వారి ఆరోగ్యం సరిగాలేదు. వారు విందులో పాల్గొనుటకు వీలులేని స్థితి. అయినా నాయందుగల ప్రేమ వారిని ఆగనిస్తుందా? ఏదో విధంగా వారు వచ్చి విందులో పాల్గొన్నారు. యింతలో మూర్ఛవచ్చి సొమ్మసిల్లిపోయారు. వారిని గదిలోకి చేర్చారు. అప్పుడప్పుడు వారు యీ విధంగా మూర్ఛపోతూ వుండటం జరుగుతూ వుంటుందట. విందు సాగించమని సందేశం పంపారు. సొసైటీ అనే ఆశ్రమం ముంగిట అతిథులు, ఇంటివాళ్లు, దగ్గరివాళ్లు అంతా కలిసి పెద్ద జంబుఖానా పరిచి దానిమీద కూర్చొని వేరుసెనగపప్పు, ఖర్జూరం మొదలగు వాటిని తింటూ ప్రేమతో చర్చలు జరుపుతూ, ఒకరి హృదయాలను మరొకరు తెలుసుకొనేందుకు ప్రయత్నించడం ఆ విందు యొక్క లక్ష్యం. అయితే గోఖలే గారికి వచ్చిన యీ మూర్ఛ మాత్రం నా జీవితంలో అసాధారణమైన ఘట్టంగా చోటుచేసుకున్నది.

## 3. అది బెదరింపా?

మా అన్నగారు చనిపోయారు. వితంతువు అయిన మా వదినగారు తదితర కుటుంబీకులను కలుసుకునేందుకు రాజకోట మరియు పోర్‌బందర్ వెళ్లాను. దక్షిణ ఆఫ్రికాలో జరిగిన సత్యాగ్రహ సంగ్రామ సమయమప్పుడు నేను నా దుస్తుల్ని గిరిమిటియా కూలీల కనుగుణ్యంగా సాధ్యమైనంత వరకు మార్చుకున్నాను. విదేశాలలో కూడా ఇంట్లో ఆ డ్రస్సే వేసుకునేవాణ్ణి. మన దేశం వచ్చిన తరువాత కాఠియావాడ్ దుస్తులు ధరించాలని భావించాను. కాఠియావాడ్ డ్రస్సు నా దగ్గర వున్నది. ఆ

డ్రస్సుతోనే బొంబాయిలో దిగాను. చొక్కా, అంగరఖా, ధోవతి తెల్లని తలపాగా, యిదీ ఆ డ్రస్సు. స్వదేశపు మిల్లుల యందు తయారైన బట్టతో ఆ దుస్తులు తయారయ్యాయి. మూడో తరగతిలో బొంబాయినుండి కాఠియావాడుకు వెళ్లాలి. తలపాగా అంగరఖా రెండూ జంజాటంగా వున్నాయి. అందువల్ల చొక్కా, ధోవతి, పది అణాలకు లభించిన కాశ్మీరు టోపీ ధరించాను. యిట్టి దుస్తులు ధరించే వాణ్ణి బీదవాడనే అంతా భావిస్తారు. అప్పుడు బీరంగావ్, బఢవాఫణ్‌లో ప్లేగువ్యాధి వ్యాపించివుంది. ఆరోగ్యాధికారి నా చెయ్యి పట్టుకు చూచాడు. వేడిగా వుంది. అందువల్ల రాజకోటలో డాక్టరును కలవమని ఆదేశించి నా పేరు రాసుకున్నాడు.

బొంబాయి నుండి ఎవరో తంతి పంపగా బఢవాణ్ స్టేషనుకు అక్కడి ప్రసిద్ధ ప్రజాసేవకుడు దర్జీ మోతీలాల్ నన్ను కలుసుకునేందుకు వచ్చాడు. ఆయన బీరంగావ్‌లో టోల్‌గేటు దగ్గర జరుగుతున్న పన్నుల వసూళ్లను గురించి, ప్రజలకు కలుగుతున్న యిబ్బందుల్ని గురించి నాకు చెప్పాడు. జ్వర తీవ్రతవల్ల నాకు మాట్లాడాలనే కోరిక కలుగలేదు. క్లుప్తంగా "మీరు జైలుకు వెళ్లేందుకు సిద్ధంగా వున్నారా?" అని అడిగాను.

ఆలోచించకుండా ఠపీమని వెంటనే జవాబిచ్చే పలువురు యువకులవలె ఆయన కూడా వెళతానంటాడని అనుకున్నాను. కాని ఆ విధంగా ఆయన అనలేదు. స్థిరమైన నిర్ణయం వెల్లడించే వ్యక్తిలా "మేము తప్పక జైలుకు వెళతాము. మీరు మాకు మార్గం చూపించాలి. కాఠియావాడ్ వాసులం గనుక మీ మీద మాకు అధికారం వున్నది. యివాళ మిమ్మల్ని మేము ఆపం. తిరిగి వెళుతున్నప్పుడు బఢవాణ్‌లో ఆగండి. యిక్కడి యువకుల కార్యక్రమాలు, వాళ్ల ఉత్సాహం చూచి మీరు ఆనందిస్తారు. మీరు మీ సైన్యంలో మమ్మల్ని స్వేచ్ఛగా చేర్చుకోవచ్చు" అని అన్నాడు.

మోతీలాలును పరిశీలించి చూచాను. అతని అనుచరులు అతణ్ణి గురించి "ఈ సోదరుడు దర్జీ వృత్తి చేపట్టినా ఎంతో నేర్పరి. రోజూ ఒక గంట సేపు కష్టపడి పనిచేసి ప్రతి నెల తన ఖర్చుల కోసం 15రూపాయలు మాత్రం సంపాదించుకుంటాడు. మిగతా సమయమంతా ప్రజల సేవకు వినియోగిస్తాడు. చదువుకున్న మా బోంట్లకు మార్గం చూపించి మా చేత పని చేయిస్తున్నాడు" అని చెప్పారు.

ఆ తరువాత మోతీలాలును దగ్గరగా చూచే అవకాశం నాకు లభించింది. ఆయనను గురించి వాళ్లు చెప్పిన మాటలన్నీ నిజమేనని అందు అతిశయోక్తి లేదని గ్రహించాను. సత్యాగ్రహ ఆశ్రమం స్థాపించినప్పుడు ప్రతినెల కొద్దిరోజులు ఆయన అక్కడ వుండేవారు. బీరం గ్రామాన్ని గురించి నాకు రోజూ చెబుతూ వుండేవాడు.

ప్రయాణీకులకు కలిగే అసౌకర్యాలు సహించలేకపోయేవాడు. యీ మోతీలాలును నిండు యౌవ్వనంలో జబ్బు ఎత్తుకు పోయింది. బఢవాణ్ శూన్యమైపోయింది.

రాజకోటచేరి మరునాడు ఉదయం ఆరోగ్యశాఖ అధికారి ఆదేశం ప్రకారం ఆసుపత్రికి వెళ్లాను. అక్కడి వారికి నేను పరిచితుణ్ణే. అందువల్ల నన్ను చూచి డాక్టర్లు సిగ్గుపడ్డారు. ఆవిధంగా ఆదేశించిన అధికారి మీద కోపం తెచ్చుకోసాగారు. నాకు మాత్రం దోషం కనబడలేదు. అతడు తన కర్తవ్యాన్ని నెరవేర్చాడు. అతడు నన్ను ఎరుగడు. ఒక వేళ నేనెవరినో తెలుసుకున్నా తనకు యివ్వబడ్డ ఆజ్ఞను పాలించడం అతని కర్తవ్యమేకదా! అంతా పరిచితులు కావడం వలన రాజకోటలో నన్ను ఆసుపత్రిలో వుంచకుండా యింటికి పంపి మా యింటిదగ్గరే నన్ను పరీక్షించారు. మూడో తరగతి ప్రయాణీకుల్ని యీ విధంగా పరీక్షిస్తూ వుండటం వలన ఆ తరగతిలో ప్రయాణించే గొప్ప వాళ్లకు కూడా అట్టి పరీక్ష జరుగవలసిందే. అధికారులు కూడా పక్షపాతం వహించకూడదని నా అభిప్రాయం. అయితే అధికారులు మూడో తరగతి ప్రయాణీకుల్ని మనుష్యులుగా పరిగణించక జంతువులుగా పరిగణిస్తుంటారు. సంబోధించే తీరు చాలా అసభ్యంగా వుంటుంది. మూడో తరగతి ప్రయాణీకులు మాట్లాడేందుకు వీలులేదు. తర్కించేందుకు వీలు లేదు. అధికారులు చప్రాసీల్లా వాళ్లను చూస్తూవుంటారు. వాళ్లను నిలబెట్టి వేధిస్తారు. టిక్కట్టు తీసుకొని తిరిగి యివ్వక బాధిస్తారు? యీ బాధలన్నీ నేను స్వయంగా అనుభవించాను. యీ పరిస్థితుల్లో మార్పురావాలంటే చదువుకున్న వాళ్లు బీదవాళ్లుగా మారి, మూడో తరగతిలో ప్రయాణిస్తూ, ఆ ప్రయాణీకులకు చేకూరని ఏ సౌకర్యమూ తాముకూడా పొందకుండా అక్కడ కలిగే యిబ్బందుల్ని, అన్యాయాల్ని, బీభత్సాన్ని గట్టిగా ఎదిరించి వాటిని తొలగించాలి.

కాఠియావాడ్‌లో పర్యటించిన ప్రతిచోట జనం బీరం గ్రామంలో పన్ను వసూలు చేస్తున్న తీరు పట్ల అసమ్మతి తెలియజేశారు. వివరమంతా తెలుసుకొని లార్డ్ విల్లింగ్టన్ లోగడ నాకు యిచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకున్నాను. కాగితాలన్నీ చదివాను. సత్యం గ్రహించాను. బొంబాయి ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రారంభించాను. సెక్రటరీని కలిశాను. ఆయన అంతా విని విచారం వెల్లడించి ఢిల్లీ ప్రభుత్వం యీ విషయమై చూపుతున్న తీరును వివరించాడు. "మా చేతుల్లో వుంటే యీటోలుగేటును ఎప్పుడో ఎత్తి వేసే వాళ్లం. కాని యిది తిన్నగా భారత ప్రభుత్వానికి సంబంధించినది కనుక మీరు వారి దగ్గరకు వెళ్లడం మంచిది" అని సెక్రటరీ చెప్పాడు.

నేను భారత ప్రభుత్వానికి జాబు వ్రాశాను. ఉత్తరం అందినట్లు తెలియజేయటమే తప్ప వారేమీ చర్యగైకొనలేదు. లార్డ్ చేమ్స్‌ఫర్డును కలుసుకునే అవకాశం లభించినప్పుడు అనగా రెండు సంవత్సరాల తరువాత యీ వ్యవహారం మీద చర్య తీసుకున్నాడు. నేను యీ విషయం చెప్పగా లార్డ్‌చేమ్స్‌ఫర్డు నివ్వెరబోయాడు. ఆయనకు బీరం గ్రామాన్ని గురించి ఏమీ తెలియదు. నా మాటలు ఓపికగా విని ఫోను చేసి అందుకు సంబంధించిన కాగితాలు వెంటనే తెప్పించుకున్నాడు. మీరు చెప్పిన విషయాలపై అధికారులు వ్యతిరేకించకపోతే తప్పక పన్నుల వసూళ్లను నిలిపి వేస్తానని మాట యిచ్చాడు. తరువాత కొద్ది రోజులకే పన్ను వసూళ్లు రద్దుచేశారని పత్రికల్లో చదివాను.

ఈ విజయం సత్యాగ్రహ విజయానికి పునాది అని భావించాను. అందుకు కారణం వున్నది. బొంబాయి ప్రభుత్వ సెక్రటరీ బీరం గ్రామ పన్నును గురించి మాట్లాడుతూ మీరు యీ విషయమై బగ్‌సరాలో చేసిన ప్రసంగపాఠం నాదగ్గర వున్నది అందు మీరు సత్యాగ్రహం విషయం కూడా ఎత్తారు అని అంటూ "మీరు చేసింది బెదిరింపు కాదా? శక్తి సామర్థ్యాలుగల ఏ ప్రభుత్వమైనా యిలాంటి బెదిరింపులకు తలవంచుతుందా?" అని ఆయన నన్ను ప్రశ్నించాడు.

ఆయన ప్రశ్నకు సమాధానం యిస్తూ "ఇది బెదిరింపు కాదు ప్రజాశిక్షణ. ప్రజలకు వారి కష్టాల్ని తొలగించుకునేందుకు అవలంబించవలసిన చర్యలను గురించి చెప్పడం నా ధర్మం. స్వాతంత్ర్యం కోరే ప్రజల దగ్గర తమ రక్షణకు అవసరమైన సాధనాలు కూడా వుండటం అవసరం. సాధారణంగా యిట్టి సాధనాలు హింసాపూరితంగా వుంటాయి. కాని సత్యాగ్రహం పూర్తిగా అహింసతో కూడిన సాధనం. దాని ఉపయోగాన్ని గురించి, దాని ప్రయోగాన్ని గురించి తెలియజేయడం నా కర్తవ్యం. ఆంగ్ల ప్రభుత్వం శక్తివంతమైనది. అందు నాకు సందేహం లేదు. అయితే సత్యాగ్రహం సర్వోన్నతమైన ఆయుధం. యీ విషయమై నాకెట్టి సందేహమూ లేదు" అని చెప్పాడు. ఆ సెక్రటరీ చతురుడు. "మంచిది చూద్దాం" అని అంటూ తల ఊపాడు.

## 4. శాంతినికేతనం

రాజకోటనుండి శాంతినికేతనం వెళ్లాను. అక్కడి ఉపాధ్యాయులు, విద్యార్థులు ప్రేమ జల్లులతో నన్ను తడిపివేశారు. స్వాగత విధానంలో సాదాతనం, కళ, ప్రేమ మూడింటి సుందర సమన్వయం కనబడింది. అక్కడే కాకాసాహెబ్ కాలేల్కర్‌ను మొదటిసారి కలుసుకున్నాను. అందరూ కాలేల్కరును 'కాకాసాహెబ్' అని ఎందుకంటారో

నాకప్పుడు తెలియదు. కాని తరువాత తెలిసింది. ఇంగ్లాండులో నేను వున్నప్పుడు అక్కడ వున్న కేశవరావు దేశాపాండే బరోడా ప్రాంతంలో గంగానాథ విద్యాలయం నడుపుతూ వుండేవారు. వారికి గల భావాల్లో విద్యాలయంలో పనిచేసేవారంతా ఒకే కుటుంబీకులుగా వుండాలన్నది ఒకటి. ఆ ఆఉద్దేశ్యంతో అక్కడి ఉపాధ్యాయులందరికీ ఒక్కొక్క పేరు పెట్టారు. ఆ పద్ధతిలో కాలేల్కరు కాకా (పెదతండ్రి), అయ్యారు. ఫడకే మామ అయ్యాడు. హరిహరశర్మ అన్న అయ్యాడు. తదితరులకు కూడా తగిన పేర్లు లభించాయి. కాలేల్కర్ అనుచరుడు ఆనందనాథ్ (స్వామి), మామ మిత్రుడు పట్వర్ధన్ (అప్ప) పేర్లతో యీ కుటుంబంలో తరువాత చేరారు. యీ కుటుంబానికి చెందిన ఆ అయిదుగురు నా అనుచరులైనారు. దేశపాండే "సాహబ్" పేరట ప్రసిద్ధికెక్కారు. సాహబ్ గారి విద్యాలయం మూతబడగానే ఆ అయిదుగురు చెల్లాచెదురయ్యారు. అయినా తమ మధ్య నెలకొన్న ఆధ్యాత్మిక సంబంధాన్ని వీరు వదులుకోలేదు. కాకా సాహబ్ పలుచోట్లకు వెళ్ళి అనుభవం గడిస్తూ శాంతినికేతనంలో చేరారు. ఆ కోవకు చెందిన చింతామణి శాస్త్రి అను మరొకరు కూడా అక్కడే వున్నారు. వీరిద్దరు సంస్కృతం బోధిస్తూ వుండేవారు.

శాంతినికేతనంలో మా అనుచరులకు బస విడిగా ఏర్పాటుచేశారు. అక్కడ మగన్‌లాల్ గాంధీ వారి మంచి చెడ్డలు చూస్తూ వున్నాడు. ఫినిక్సు ఆశ్రమంలో పాటించిన నియమనిబంధనల్ని తాను పాటిస్తూ యితరుల చేత పాటింప చేస్తూ వున్నాడు. తన జ్ఞానం, ప్రేమ, కష్టపడి పనిచేసే మనస్తత్వంతో శాంతినికేతనంలో సువాసనలు ఆయన విరజిమ్మటం గమనించాను. యిక్కడ ఆండ్రూస్ వున్నారు. పియర్సన్ వున్నారు. జగదానందబాబు, నేపాల్ బాబు, సంతోషబాబు, క్షితిమోహనబాబు, నగేన్‌బాబు, శరద్‌బాబు, కాళీబాబు మొదలగువారితో నాకు పరిచయం ఏర్పడింది.

నా స్వభావం ప్రకారం నేను విద్యార్థులతోను, ఉపాధ్యాయులతోను కలిసిపోయి కాయకష్టం గురించి చర్చ ప్రారంభించాను. జీతం తీసుకొని పనిచేసే వంటవానికి బదులు ఉపాధ్యాయులు, విద్యార్థులు కలిసి వంటపని చేసుకుంటే మంచిది గదా అని నాకు అనిపించింది. అప్పుడు భోజనశాల ఆరోగ్యకరంగాను, పరిశుభ్రంగాను, ఆదర్శవంతంగాను వుంటుంది. విద్యార్థులు స్వయంపాకాన్ని గురించి ప్రత్యక్ష పాఠం నేర్చుకోగలుగుతారు. యీ విషయం ఉపాధ్యాయులకు చెప్పాను. యిద్దరు ముగ్గురు ఉపాధ్యాయులు తల ఊపారు. కొంతమందికి యీ ప్రయోగం నచ్చింది. విద్యార్థులకు క్రొత్త విషయం సహజంగానే నచ్చుతుంది. వెంటనే వారంతా ఉత్సాహంతో ముందుకు

వచ్చారు. గురుదేవుని దాకా యీ విషయం వెళ్లింది. వారు కొద్దిసేపు యోచించి ఉపాధ్యాయులు అంగీకరిస్తే అమలు పరచడం మంచిదేనని అన్నారు. ఇది క్రొత్త ప్రయోగం. స్వరాజ్యప్రాప్తికి తాళంచెవి యిందు నిహితమై వున్నది అని గురుదేవులు విద్యార్థులకు చెప్పారు.

పియర్సన్ యీ ప్రయోగాన్ని విజయవంతం చేయుటకు అపరిమితంగా కృషి చేశారు. వారికి యీ పని బాగా నచ్చింది. కూరలు తరిగేందుకు ఒక బృందం ఏర్పడితే తిండిగింజలు శుభ్రం చేసేందుకు మరో బృందం ఏర్పడింది. వంట యింటి పారిశుద్ధ్యానికి నగేన్ బాబు ఆధ్వర్యంలో కొందరు పూనుకున్నారు. పారలు పుచ్చుకొని వారంతా వంటి యింటిని పరిసరాల్ని బాగుచేస్తుంటే నా హృదయం సంతోషంతో పొంగిపోయింది. ఇది దరిదాపు వందమందికి పైగా ఉపాధ్యాయులు, విద్యార్థులు ఒక్కసారిగా రపీమని చేసేపని కాదు. కొందరికి అలసట కలిగింది. కాని చేసే పనికి ఆయన పూనుకున్నారు. అంట్లు తోముతున్న వారి అలసటను పోగొట్టి వారికి ఆహ్లాదం కలిగించేందుకై కొందరు సితారు వాయిస్తూ వుండేవారు. మొత్తం పనులన్నీ స్వయంగా చేసేందుకు విద్యార్థులు పూనుకున్నారు.

శాంతినికేతం తేనెటీగల తుట్టెలా తళతళ మెరిసిపోయింది. ఇటువంటి మార్పులు ఆగిపోకూడదు. ఫినిక్సు ఆశ్రమంలో మేము ప్రారంభించిన భోజనశాల స్వయంపోషకమై మంచిగా సాగింది. అందు సాదా భోజనం లభిస్తూ వుండేది. మసాలాల వాడకం తగ్గించి వేశాము. ఆవిరితో అన్నం, పప్పు, కూరలు గోధుమతో తయారయ్యే వస్తువులు తయారయ్యేవి.

తరువాత శాంతినికేతనంలో కొన్ని కారణాల వల్ల యీ ప్రయోగం ఆగిపోయింది. ప్రపంచ ఖ్యాతి బడసిన యీ సంస్థలో కొద్దిరోజుల పాటు యీ ప్రయోగం సాగినా సంస్థకు ఎంతో మేలే చేకూరిందని చెప్పవచ్చు. ఇంకా కొద్దిరోజులు శాంతినికేతనంలో వుందామని అనుకున్నాను. కాని సృష్టికర్త నన్ను అక్కడ వుండనీయలేదు. వారం రోజులు మాత్రమే వున్నాను. యింతలో పూనాలో గోఖలేగారు పరమపదించారని సమాచారం అందింది. శాంతినికేతనం విచారసాగరంలో మునిగిపోయింది. తమ విచారం ప్రకటించేందుకు అంతా నా దగ్గరకు రాసాగారు. దేవళంలో ప్రత్యేక సభ జరిగింది. వాతావరణం గంభీరంగా వుంది. ఆనాడు సాయంత్రమే నేను పూనాకు బయలుదేరాను. నా భార్య మరియు మగన్‌లు నాతోబాటు వున్నారు. మిగతావారంతా శాంతినికేతనంలో వుండిపోయారు.

ఆండ్రూస్ బర్ద్వాను దాకా వచ్చారు. "హిందూ దేశంలో సత్యాగ్రహం చేయవలసి వస్తుందని మీరు భావిస్తున్నారా ? అలా భావించితే ఎప్పుడు జరుగుతుందో ఊహిస్తున్నారా?" అని నన్ను ప్రశ్నించారు. "ఈ ప్రశ్నకు జవాబివ్వడం కష్టం. ఒక్క ఏడాదిపాటు దేశమందంతట పర్యటించమని, ప్రజా సమస్యలను గురించి స్వయంగా తెలుసుకొని యోచించమని, నిర్ణయాలను మాత్రం వెంటనే ప్రకటించవద్దని గోఖలే చెప్పారు. సరేనని వారికి మాట యిచ్చాను. ఆ మాట మీద నిలబడి వుంటాను. ఆ తరువాత అవసరమైతేనే నా అభిప్రాయం వెల్లడిస్తాను. అందువల్ల అయిదు సంవత్సరాల వరకు సత్యాగ్రహం చేయవలసిన అవసరం కలగదని భావిస్తున్నాను" అని చెప్పాను.

ఇక్కడ మరో విషయం పేర్కొనడం మంచిది "హింద్‌స్వరాజ్" లో నేను ప్రకటించిన విషయాలను గోఖలేగారు ఎగతాళిచేస్తూ ఒక్క ఏడాదిపాటు దేశమంతా తిరిగిచూస్తే మీభావాలు వాటంతట అవే త్రోవకు వస్తాయి అనిఅన్నారు.

## 5. బాధాకరమైన మూడోతరగతి ప్రయాణం

బర్ద్వాన్ చేరిన తరువాత మేము మూడో తరగతి టికెట్లు తీసుకోవాలి. చాలా యిబ్బంది కలిగింది. 'మూడో తరగతి ప్రయాణీకులకు ముందుగా టికెట్లు యివ్వం' అని అన్నారు. స్టేషను మాస్టరును కలుద్దామని వెళ్లాను. ఆయనను కలుసుకోనిస్తారా? ఎవరో దయతో స్టేషన్ మాస్టరును చూపించారు. ఆయన దగ్గరకు వెళ్ళాను. ఆయన కూడా ఆ సమాధానమే యిచ్చాడు. కిటికీ తెరిచిన తరువాత టికెట్లు తీసుకుందామని వెళ్ళాను. బలంగా వున్నవారంతా తోసుకొని ముందుకు వెళ్లి టికెట్లు తీసుకుంటున్నారు. నాబోటి వాళ్లను వెనక్కి నెట్టివేస్తున్నారు. చివరికి టికెట్లు దొరికాయి. బండి వచ్చింది. అక్కడ కూడా ఇదే తంతు. బలిష్టులు ఎక్కుతున్నారు. కూర్చున్నవారికీ, ఎక్కినవారికి ద్వంద్వయుద్ధం సాగుతున్నది. తోపుళ్లు నెట్టుళ్లు అమోఘంగా సాగుతున్నాయి నాబోటివాడు తట్టుకోగలడా? మేము ముగ్గురం అటుయిటు పరుగులు ప్రారంభించాం. ప్రతిచోట "జాగాలేదు" అన్నమాటే వినబడుతున్నది. నేను గార్డు దగ్గరికి వెళ్లాను. "జాగా దొరికితే ఎక్కు లేకపోతే తరువాత బండిలోరా" అని ఆయన అన్నారు. ఏం చేయాలో తోచలేదు. మగన్‌లాలును ఏదోవిధంగా బండి ఎక్కమని చెప్పాను. భార్యతో సహా నేను మూడో తరగతి టిక్కెట్లతో ఇంటరు పెట్టెలోకి ఎక్కాను. గార్డు నన్ను చూచాడు. ఆసన్‌సోల్ స్టేషనులో బండి ఆగింది. గార్డు అదనపు రేటు వసూలు చేసేందుకై నా దగ్గరకు వచ్చాడు. 'నాకు చోటు చూపించడం మీ కర్తవ్యం. చోటు

దొరక్క నేను యిక్కడ కూర్చున్నాను. మూడో తరగతిలో చోటు చూపించండి వెళతాను' అని అన్నాను. 'నీతో తర్కం నాకు అనవసరం నీకు చోటు చూపించడం నా పని కాదు. డబ్బు లేకపోతే బండి దిగు' అని గద్దించాడు గార్డు. నేను పూనా వెళ్లాలి. గార్డుతో తగాదా పడటం అనవసరమనిపించి డబ్బు చెల్లించివేశాను. అతడు పూర్తిగా పూనాదాకా ఇంటరు చార్జీ వసూలుచేశాడు. నాకు యిది అన్యాయమనిపించింది. ఉదయానికి మొగల్‌సరాయి చేరాము. మగన్‌లాలు మూడోతరగతిలో చోటు సంపాదించాడు. మొగల్‌సరాయిలో నేను కూడా మూడో తరగతిలోకి మారాను. టికెట్టు కలెక్టరుకు విషయమంతా చెప్పాను. అతణ్ణి ఒక ధృవీకరణ పత్రం వ్రాసి యిమ్మని కోరాను. అతడు యివ్వనని భీష్మించాడు. నేను రైల్వే అధికారికి జాబు వ్రాశాను. "ధృవీకరణ పత్రం లేనిదే అదనంగా వసూలుచేసిన సొమ్ము తిరిగి చెల్లించడానికి వీలులేదు. అయినా మీకు సొమ్ము చెల్లిస్తున్నాము. బర్ద్వాన్ నుండి మొగల్‌సరాయి వరుకు మాత్రం ఇంటరు తరగతి సొమ్ము చెల్లించబడదు" అంటూ సమాధానం అందింది.

ఆ తరువాత మూడో తరగతి ప్రయాణానికి సంబంధించి నాకు కలిగిన అనుభవాలు కోకొల్లలు. అన్నీ రాస్తే పెద్ద గ్రంథం అవుతుంది. అవకాశం చిక్కినప్పుడు వేరు వేరు ప్రకరణాల్లో కొన్ని అనుభవాలను సందర్భాన్ని బట్టి వివరిస్తాను. శారీరకంగా శక్తిలేనందున నా మూడో తరగతి ప్రయాణం చేస్తున్నప్పుడు రైల్వే అధికారుల దౌర్జన్యం, అవమానకరమైన వారి ప్రవర్తనా తీరు వర్ణనాతీతం. యిటు ప్రయాణీకుల ప్రవర్తన కూడా అంతకంటే ఘోరమని చెప్పక తప్పదు. ప్రయాణీకుల మూర్ఖత్వం, మురికి, స్వార్థం, అజ్ఞానం అత్యధికం. తమ తప్పుల్ని వారు గ్రహించరు. తాము చేస్తున్న పని రైటేనని వారు భావిస్తారు. సంస్కారం కలిగిన చదువుకున్న వాళ్లు వారి చర్యల్ని సరిదిద్దేందుకు ప్రయత్నించరు. అలసి సొలసిన మేము కళ్యాణ్ జంక్షను చేరాం. స్నానం చేద్దామని వెళ్లి స్టేషనులో గల పంపు నీళ్లతో మేమిద్దరం స్నానం చేశాం. భార్య స్నానం ఎట్లాగా అను యోచిస్తూ వుండగా భారత్ సేవక్ సమాజ కార్యకర్త శ్రీకాల్ మమ్మల్ని గుర్తించాడు. ఆయన కూడా పూనా వస్తున్నాడు. సెకండ్ క్లాసులో గల స్నానాల గదిలో ఆమెకు స్నానం ఏర్పాటుచేస్తానని చెప్పాడు. అట్టి సౌకర్యం పొందుటకు నేను సంకోచించాను. నిజానికి సెకండు క్లాసు ప్రయాణీకుల స్నానాల గదిలో స్నానం చేసే హక్కు నా భార్యకు లేదు కదా! అయినా నేను వద్దనకుండా మౌనం వహించాను. సత్యపూజారి యిలా చేయకూడదు. స్నానం కోసం అక్కడికి వెళతానని ఆమె కోరలేదు. భర్త అనే మోహంతో కూడిన స్వర్ణపాత్ర సత్యాన్ని మరుగున పడవేసిందన్నమాట.

# 6. నా ప్రయత్నం

పూనా చేరాం. దహన కర్మలన్నీ పూర్తి అయ్యాయి. అంతా సొసైటీని గురించి ఏం చేయడమా అని ఆలోచనలో పడ్డాం. నేను సొసైటీలో చేరాలా వద్దా అను మీమాంసలో పడ్డాను. నామీద పెద్ద బరువు పడినట్లనిపించింది. గోఖలేగారు జీవించియుంటే నేను సొసైటీలో చేరవలసిన అవసరం లేదు. నేను గోఖలేగారి ఆదేశానుసారం నడపవలసినవాణ్ణి. ఆవిధంగా చేయడం నాకు యిష్టం. భారతదేశమనే తుపానుతో నిండిన సముద్రంలో దూకిప్పుడు నాకు సహాయం చేసేవారు అవసరం. గోఖలేవంటి సహాయకుని నీడన సురక్షితంగా వున్నాను. అట్టి గోఖలే యికలేరు. అందువల్ల వారి సొసైటీలో చేరడం అవసరమని అనిపించింది. గోఖలే ఆత్మ కూడా దీన్నే కోరుతున్నదని అనిపించింది. నేను గట్టిగా అందుకు పూనుకున్నాను. అప్పుడు సొసైటీ మెంబర్లంతా పూనాలోనే ఉన్నారు. వారికి నచ్చచెప్పి నా విషయంలో వారికి గల సందేహాల్ని తొలగించేందుకు ప్రయత్నం చేయసాగాను. మెంబర్లలో అభిప్రాయ భేదం కనబడింది. ఒక వర్గంవారు చేర్చుకోవాలని, మరోవర్గం వారు చేర్చుకోవద్దని భావిస్తున్నారు. యిరువర్గాలవారికీ నా యెడ ప్రేమ వున్నది. అయితే నామీదగల ప్రేమ కంటే కొందరికి సొసైటీ మీద మక్కువ ఎక్కువగా వున్నదని అనిపించింది. మా చర్చలు సిద్ధాంతపరంగా సాగినా ఎంతో మధురంగా వున్నాయి. వ్యతిరేకించిన వారి తర్కం ప్రకారం నా దృక్పధానికి సొసైటీ దృక్పథానికి తూర్పు పడమరలంత వ్యత్యాసం వున్నదని తేలింది. గోఖలేగారు ఏ లక్ష్యాలతో సొసైటీని స్థాపించారో, నేను అందు చేరితే ఆ లక్ష్యాలు దెబ్బతింటాయని వారి భావమని తేలింది. చాలాసేపు చర్చించి మేము విడిపోయాము. నిర్ణయం మరో సమావేశంలో చేయాలని నిర్ణయించారు.

ఇంటికి చేరి ఆలోచనా సాగరంలో పడ్డాను. మెజారిటీ ఓట్లతో నేను సొసైటీలో చేరడం సబబా ? అది గోఖలేగారి యెడ నాకు గల నిజాయితీ అని అనిపించుకుంటుందా? నాకు వ్యతిరేకంగా ఓట్లు పడితే సొసైటీ చీలికకు నేను కారణభూతుడను కానా? బాగా యోచించిన మీదట, నన్ను సొసైటీలో చేర్చుకునేందుకు అందరూ అంగీకరిస్తేనే అందు చేరడం మంచిదని, కొందరు వ్యతిరేకించినా అందు చేరడం సొసైటీ క్షేమం దృష్ట్యా మంచిది కాదని భావించాను. గోఖలేగారి యెడ సొసైటీ సభ్యుల యెడ నేను చూపవలసిన విధానం అదేనను నిర్ణయానికి వచ్చాను. అంతర్వాణి యీ విధంగా చెప్పిన వెంటనే నేను శాస్త్రిగారికి జాబు వ్రాసి నాకోసం మళ్లీ సమావేశం ఏర్పాటు చేయవద్దని కోరాను. నా నిర్ణయం వ్యతిరేకులకు నచ్చింది.

ధర్మసంకటంలో పడవలసిన అవసరం వారికి కలుగకుండా పోయింది. వారికి నా యెడగల ప్రేమ యింకా అధికమైంది. సొసైటీలో చేరుటకు పంపిన దరఖాస్తు తిరిగి తీసుకోవడం వల్ల నేను సొసైటీ సభ్యునిగా చేరినట్లే అయింది.

తరువాత నేను సొసైటీలో చేరకపోవడమే మంచిదని అనుభవంలో తేలింది. కొందరు నన్ను చేర్చుకోవద్దని తెలిపిన విషయాలు యదార్థమైనవే. వారికి నాకు సిద్ధాంతరీత్యా తేడా వున్నమాట నిజం. అభిప్రాయ భేదం ఏర్పడినప్పటికీ మాకు గల ఆత్మ సంబంధం ఎన్నడూ చెక్కుచెదరలేదు. మేము మిత్రులంగానే వున్నాము. సొసైటీ స్థలం నా దృష్టిలో తీర్థక్షేత్రమే. లౌకిక దృష్ట్యా నేను సొసైటీ మెంబరుగా చేరలేదు కాని ఆధ్యాత్మిక దృష్ట్యా నేను మెంబరుగా చేరినట్లే. వాస్తవానికి లౌకిక సంబంధం కంటె ఆధ్యాత్మిక సంబంధం గొప్పది కదా! ఆధ్యాత్మికత్వం లేని లౌకిక సంబంధం ప్రాణం లేని దేహంతో సమానమేకదా!

## 7. కుంభయాత్ర

డాక్టర్ ప్రాణజీవనదాస్ గారిని కలుసుకునేందుకు రంగూన్ వెళ్లవలసి వచ్చింది. త్రోవలో శ్రీ భూపేంద్రనాథ బోసుగారి ఆహ్వానం మీద కలకత్తాలో ఆగాను. అక్కడ బెంగాలీల సౌజన్యాన్ని అపరిమితంగా చవి చూచాను. అప్పుడు నేను ఫలాలు మాత్రమే తీసుకుంటూ వున్నాను. నాతోబాటు మా అబ్బాయి రామదాసు వున్నాడు. కలకత్తాలో దొరికే పండ్లు మొదలుగా గల వన్నీ కొని మా కోసం సిద్ధంగా వుంచారు. స్త్రీలు రాత్రంతా జాగరణచేసి పిస్తా మొదలగు వాటి బెరుళ్లు వలిచారు. తాజా పండ్లను ఎంతో అందంగా అమర్చారు. నా అనుచరులం కోసం రకరకాల పిండివంటలు సిద్ధం చేశారు, ఆ ప్రేమ ఆ అతిథి సత్కారం నాకు బోధపడింది కాని ఒకరిద్దరు అతిథుల కోసం కుటుంబసభ్యులంతా యీవిధంగా శ్రమపడటం నాకు నచ్చలేదు. అయితే యీ కష్టాన్నుండి బయటపడే మార్గం నాకు కనబడలేదు.

రంగూన్ వెళ్లేటప్పుడు నేను ఓడలో డెక్‌మీద ప్రయాణించే యాత్రీకుణ్ణి. శ్రీ బోసుగారింటి వద్ద ప్రేమాధిక్యత. స్టీమరు మీద దారిద్ర్యపు అధిక్యత. డెక్ మీద ప్రయాణం చేస్తున్నప్పుడు ఎన్నో కష్టాలు పడ్డాను. స్నానం చేసే చోటు మురికి కూపం, నిలబడేందుకు కూడా వీలులేని స్థితి. పాయిఖానా నిజంగా నరకమే. మలమూత్రాలు తొక్కుకుంటూ నడవడం లేక మలమూత్రాల మీదుగా దూకుతూ వాటిని దాటడం నావల్లకాలేదు. ఓడ అధికారి దగ్గరికి వెళ్లాను. కాని వినిపించుకునే నాధుడే లేడు.

యాత్రీకులు తమ మురికిచే ఓడను పాడుచేశారు. కూర్చున్నచోటనే ఉమ్మివేయడం అక్కడే జర్దా వగైరా నోట్లో పెట్టుకుని పిచికారీ గొట్టంలా ఉమ్మివేయడం, అబ్బ! అక్కడి దృశ్యం వర్ణనాతీతం. ఒకటే గోల. ప్రతివాడు ఎక్కువ చోటును ఆక్రమించుకోడానికి ప్రయత్నించటమే. ప్రక్కవాడిని గురించి పట్టించుకునే స్థితిలో ఎవ్వరూ లేరు. వాళ్లు, వాళ్ల సామాను. అంతే, రెండు రోజుల ఆ యాత్ర నా పాలిట నరకయాత్ర అయిపోయింది.

రంగూను చేరిన తరువాత ఏజంటుకు వివరమంతా వ్రాశాను. తిరుగు ప్రయాణంలో కూడా డెక్‌మీదనే ప్రయాణం చేశాను. అయితే యీసారి నా జాబు వల్ల మరియు డాక్టర్ మెహతాగారి ప్రయత్నం వల్ల సౌకర్యాలు లభించాయి. అయితే నా ఫలాహారం గొడవ అక్కడ కూడా అవసరం కంటే మించి వ్యధ కలిగించింది. డాక్టర్ మెహతాగారి ఇంటిని నా యింటిలాగానే చూచుకునేవాణ్ణి. అట్టి సంబంధం వారితో నాకు వున్నది. తినే పదార్థాల సంఖ్యను తగ్గించినా రకరకాలు పండ్లు లభించాయి. వాటిని వ్యతిరేకించేవాణ్ణి కాదు. ఆ పండ్లు కంటికి యింపుగాను, నోటికి రుచిగాను వుండేవి. అయితే రాత్రిపూట ఎనిమిది తొమ్మిది గంటలవుతూ వుండేది.

ఈ సంవత్సరం 1951లో హరిద్వారంలో కుంభమేళా జరుగబోతున్నది. అందు పాల్గొనాలని కోరిక నిజానికి నాకు కలుగలేదు. అయితే మహాత్మా మున్షీగారి దర్శనానికి వెళ్లవలసిన అవసరం వున్నది. కుంభమేళా సమయంలో గోఖలేగారి భారత సేవక సమాజం ఒక పెద్ద బృందాన్ని పంపింది. అందుకు సంబంధించిన ఏర్పాట్లు హృదయనాధ్ కుంజ్రూ చూస్తున్నారు కీ.శే డాక్టర్ దేవ్‌కూడా ఆ బృందంలో వున్నారు. మా అనుచరులు కూడా మేళాలో వాలంటీర్లుగా పనిచేయాలని భావించారు. నేను హరిద్వార్ చేరకునేసరికి మగన్‌లాలు ఆశ్రమవాసులను వెంటబెట్టుకొని అక్కడికి చేరుకున్నారు. నేను రంగూను నుండి తిరిగి రాగానే వెళ్లి ఆ బృందంతో కలిశాను. కలకత్తా నుండి హరిద్వార్ చేరడానికి రైల్లో నానా అవస్థ పడవలసి వచ్చింది. రైలు పెట్టెలో దీపాలు లేవు. అంతా చీకటి. సహరాన్‌పూర్ నుండి గూడ్సు పెట్టెలో జనాన్ని పశువుల్ని నింపినట్లు నింపివేశారు రైలు పెట్టెలకు పైకప్పు లేనందున సూర్యుని ఎండ ప్రయాణీకుల్ని బాగా మాడ్చివేసింది. క్రింద ఇనుపరేకులు. యిక ప్రయణీకుల బాధ వర్ణణాతీతం. ఎండకు తట్టుకోలేక జనం దాహం దాహం అని కేకలు వేయసాగారు. హిందువులు భావుకులు కదా! మహమ్మదీయుడు మంచినీళ్లు యిస్తే త్రాగరు. యిట్టి భావుకులగు హిందువులు మందు అని చెప్పి డాక్టరు మద్యం యిచ్చినా, మహమ్మదీయ, క్రైస్తవ డాక్టర్లు నీళ్లు యిచ్చినా, మాంసం పుచ్చుకోమన్నా కిమ్మనకుండా పుచ్చుకుంటారు. పుచ్చుకోవచ్చునా లేదా అని కూడా యోచించరు.

శాంతినికేతనంలో చూచాను పాకీపని చేయడం మనదేశంలో ఒక వృత్తిగా మారిపోతున్నది. మా వాలంటీర్ల కోసం ఏదో సత్రం ఆవరణలో డేరాలు వేశారు. మలమూత్ర విసర్జన కోసం డాక్టర్ దేవ్ కొన్ని గుంటలు త్రవ్వించారు అయితే ఆ గుంటల పారిశుద్ధ్యం విషయంలో డాక్టర్ దేవ్ జీతాలు తీసుకొని పనిచేసే పాకీవారి మీద ఆధారపడ్డారు. యీ విషయం నాకు తెలిసింది. గుంటల్లో పడే మలాన్ని మట్టితో కప్పివేయడం, పారిశుద్ధ్య కార్యక్రమం గుంటల దగ్గర కొనసాగించడం మా బృందంవారు చేయగలరనీ, ఫినిక్సులో యిట్టిపనివారు చేశారనీ, మావారికి అనుమతి యిమ్మని డాక్టర్ దేవ్‌గారిని కోరాను. ఆయన సంతోషంతో అంగీకరించారు. అనుమతించమని కోరింది నేను అయినా భాధ్యత వహించవలసిన వ్యక్తి మదన్‌లాలు గాంధీయే. డేరాలో కూర్చొని జనానికి దర్శనం యివ్వడం, వచ్చేపోయే జనంతో ధర్మాన్ని గురించి, తదితర విషయాలను గురించి చర్చిస్తూ వుండటం నా పని అయింది. ఇట్టి దర్శనం యిచ్చే కార్యక్రమంతో విసిగిపోయాను. ఒక్క నిమిషం కూడా సమయం చిక్కలేదు. స్నానానికి వెళ్లినా నన్ను చూచేందుకు జనమే జనం., పండ్లు తినేటప్పుడు కూడా జనమే జనం. ఒక్క నిమిషం కూడా నన్ను జనం వదలలేదు. దక్షిణ ఆఫ్రికాలో నేను చేసిన కొద్దిపాటి సేవా కార్యక్రమాల ప్రభావం యావద్భారతావనిపై అపరిమితంగా పడిందను విషయం హరిద్వార్‌లో బయటపడింది. నేను రెండు తిరగలి రాళ్ల మధ్య పడి నలిగిపోసాగాను. గుర్తించబడనిచోట మూడో తరగతి రైలు ప్రయాణీకుడిగా నరకయాతన అనుభవించాను గుర్తింపబడిన చోట విపరీతమైన జనసమర్దంతో నానా యాతన పడ్డాను రెండింటిలో ఏది మేలైనదీ అని అడిగితే చెప్పటం కష్టం. రెండూ రెండే. దర్శనం కోసం ఎగబడే జనాన్ని చూచి ఒక్కొక్కప్పుడు నాకు కోపం బాగా వచ్చిన ఘట్టాలు వున్నాయి. ఆ తాకిడికి తట్టుకోలేక లోలోన బాధపడిన క్షణాలు అనేకం వున్నాయి. కాని మూడో తరగతి ప్రయాణం చేస్తున్నప్పుడు యమయాతన పడ్డానేకాని ఎప్పుడూ కోపం రాలేదు. పైగా మూడవ తరగతి ప్రయాణం వల్ల పలు అనుభవాలు పొంది ఔన్నత్యం పొందాను.

అప్పుడు బాగా తిరగగల శక్తి నాకు వున్నది. అందువల్ల కాలినడకన బాగా తిరిగాను. రోడ్డుమీద నడవడం కూడా కష్టమయ్యేటంతగా నాకు అప్పటికి ప్రశస్తి రాలేదు. ప్రయాణాలలో ధార్మిక భావనకంటే ప్రజల్లో అజ్ఞానం, నిలకడలేకపోవడం, మొండితనం, పెంకితనం ఎక్కువగా కనబడ్డాయి. సాధువులు తండాలు తండాలుగా వచ్చిపడ్డారు. వాళ్లు పరమాణ్ణం, మాల్‌పూరీలు తినడానికే పుట్టారా అని అనిపించేలా వ్యవహరించారు. యిక్కడ అయిదుకాళ్ల ఆవును చూచి ఆశ్చర్యపడ్డాను. కాని తెలిసినవారు

దాని రహస్యం చెప్పగా నివ్వెరబోయాను. పాపం ఆ అయిదు కాళ్ళ ఆవు, దుష్టులు దుర్మార్గులు అయిన లోభులుదుర్మార్గానికి తార్కాణమని తెలిసింది. దూడ బ్రతికి వున్నప్పుడు దాని కాలు ఒకటి నరికి, ఆవు మెడను కత్తితో చీల్చి అందు దూడ కాలును అమర్చి మెడను సరిచేస్తారట. యింతటి కిరాతకం అజ్ఞానుల కండ్లలో కారం కొట్టి డబ్బులు గుంజేందుకై చేస్తారట. అయిదు కాళ్లుగల గోమాతను చూచేందుకు ముందుకురకని హిందువు వుంటాడా? అట్టి గోమాతకు ఎంత డబ్బైనా యివ్వకుండా హిందువు వుండగలడా?

కుంభోత్సవం రోజు వచ్చింది. నాకు అదిపావనదినం. నేను యాత్రకోసం హరిద్వార్ వెళ్లలేదు. తీర్థస్థలాల్లో పవిత్రతను అన్వేషించేందుకై వెళ్లాలనే మోహం నాకు కలుగలేదు కాని 17 లక్షలమంది జనంలో అంతా పాఖండులు కారుకదా! ఆ మేళాలో 17 లక్షలమంది పాల్గొంటారని అంచనా వేశారు. వారిలో చాలామంది పుణ్యంకోసం, శుద్ధికోసం వచ్చారనడంలో నాకెట్టి సందేహమూ లేదు. ఈ విధమైన శ్రద్ధ ఆత్మను ఎంతటి ఉన్నత స్థాయికి తీసుకువెళుతుందో చెప్పడం కష్టమే. పక్కమీద పడుకొని ఆలోచనా సాగరంలో తేలిపోసాగాను. నాలుగు వైపుల ముసిరియున్న పాఖండుల మధ్య పవిత్రాత్మలు కూడా కొన్ని వున్నాయి. ఆ ఆత్మలు దేవుని దర్బారులో దండనకు గురికావు. అసలు యిటువంటి చోటుకు రాకూడదనుకుంటే అసమ్మతిని తెలియజేసి ఆనాడే నేను తిరిగి వెళ్లిపోతే బాగుండేది. వచ్చాను గనుక కుంభం రోజున క్రొత్త వ్రతాన్ని ప్రారంభించి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని భావించాను. వ్రతాలనే కోడులమీద నిలబడి వున్న జీవితం నాది. అందువల్ల కఠోరమైన వ్రతానికి పూనుకోవాలనే నిర్ణయానికి వచ్చాను. కలకతాలోను, రంగూన్‌లోను నావల్ల యింటి యజమానులు పడ్డ శ్రమ జ్ఞప్తికి వచ్చింది. దానితో నేను తినే పదార్థాల సంఖ్యను బాగా తగ్గించి వేయాలని, చీకటి పడకముందే ఫలాహారం చేసివేయాలని నిర్ణయానికి వచ్చాను. నేను చేపట్టే వ్రతం యిదే యీ విధంగా నన్ను నేను హద్దులో పెట్టుకోకపోతే యింటి యజమానులు పడే శ్రమ ఎక్కువైపోతుంది. నా సేవచేయడానికే వారికాలం చెల్లిపోతుంది. అందువల్ల 24గంటల్లో 5 పదార్థాలు మాత్రమే పుచ్చుకుంటాననీ, చీకటి పడకముందే భోజన కార్యక్రమం ముగించివేస్తానని వ్రతం పట్టాను. జబ్బు పడినప్పుడు మందు రూపంలో పదార్థాలు పుచ్చుకోవలసివస్తే ఏం చేయాలి అని కూడా యోచించి, అట్టి స్థితిలోకూడా 5 పదార్థాలు మాత్రమే తీసుకోవాలని నిర్ణయించాను. యీ రెండు వ్రతాలు ప్రారంభించి 13 సంవత్సరాలు గడిచాయి. ఎన్నో గడ్డు పరీక్షలను ఎదుర్కొన్నాను. అయితే పరీక్షా

సమయంలో యీ వ్రతాలు నా జీవితకాలాన్ని పెంచాయనే విశ్వాసం నాకు కలిగింది. అనేక పర్యాయాలు జబ్బుల పాలిట పడకుండా యీ వ్రతాల వల్ల రక్షణ కూడా పొందాను.

## 8. లక్ష్మణ ఊయల

పర్వతమంత విశాల హృదయులు మహాత్మా మున్షీరామ్. వారి దర్శనం చేసుకొని, వారి గురుకులం చూచి ఎంతో శాంతి పొందాను. హరిద్వారమందలి రొదకు, గురుకులమందలి శాంతికి మధ్యగల భేదం స్పష్టంగా కనబడుతూ వుంది. ఆమహాత్ముడు నామీద ప్రేమ వర్షం కురిపించారు. అక్కడి బ్రహ్మచారులు నన్ను వదలలేదు. రామదేవన్‌ను అక్కడే కలిశాను. వారి శక్తి ఏమిటో వెంటనే గ్రహించాను. మా మధ్య కొద్దిగా అభిప్రాయభేదం వున్నట్లు కనబడినా మా యిరువురిని ప్రేమబంధం బిగించివేసింది. గురుకులంలో పరిశ్రమల స్థాపన మరియు వాటిశిక్షణను గురించి రామదేవ్‌గారితోను, యితర ఉపాధ్యాయులతోను చర్చించాను. గురుకులం త్వరగా వదిలి రావలసి వచ్చినందుకు బాధపడ్డాను.

లక్ష్మణ ఊయలను గురించి చాలామంది చెప్పగా విన్నాను. ఋషీకేశం వెళ్లకుండా హరిద్వారం వదలి రావద్దని చాలామంది సలహా యిచ్చారు. నేను అక్కడికి నడిచి వెళ్లాలి. ఒక మజిలీ ఋషీకేశంలో, రెండవ మజిలీ లక్ష్మణ ఉయ్యాలలో గడపాలి. ఋషీకేశంలో చాలామంది సన్యాసులు వచ్చి నన్ను కలిశారు. వారిలో ఒకనికి నాయందు అమితంగా మక్కువ కలిగింది. నాలో ధర్మాన్ని గురించి తపన తీవ్రంగా వుండటం అతడు గ్రహించాడు. అప్పుడే గంగలో స్నానం చేసి వచ్చాను. అందువల్ల ఒంటినిండా బట్ట కప్పుకోలేదు. సిరస్సు మీద పిలక, మెడలో జందెం కనబడనందున అంతనికి అమితంగా విచారం కలిగింది. మీరు యింత ఆస్తికులై యుండి కూడా పిలక పెట్టుకోలేదు. జందెం వేసుకోలేదు. నాకు చాలా విచారం కలుగుతున్నది. యీ రెండూ హిందూ మత బాహ్యచిహ్నాలు. ప్రతి హిందువు యీ రెండిటినీ ధరించాలి అని అన్నాడు.

పది సంవత్సరాల వయస్సులో నేను పోరుబందరు నందు బ్రాహ్మణులు వేసుకున్న జందాలకు కట్టియున్న తాళం చెవుల గలగలలు విని ఈర్ష్యపడుతూ వుండేవాణ్ణి. నేను కూడా జందెం వేసుకొని దానికి తాళం చెవులు కట్టి గలగలలాడిస్తూ తిరిగితే ఎంత బాగుంటుందో అని అనుకునేవాణ్ణి. కాఠియావాడ్ నందలి వైశ్యకులంలో

అప్పుడు జందెం వేసుకునే పద్ధతి అమలులో లేదు. అయితే పై మూడు కులాలవారు జందెం ధరించాలని ప్రచారం సాగుతూ వున్న రోజులవి. తత్ఫలితంగా గాంధీ కుటుంబీకులు కొందరు జందెం వేసుకున్నారు. మా ముగ్గురు అన్నదమ్ములకు రామరక్షాస్తోత్రం నేర్పిన బ్రాహ్మణుడు జందాలు వేశాడు. నిజానికి తాళం చెవుల అవసరం లేనప్పటికీ నేను రెండు మూడు తాళం చెవులు తెచ్చి నా జందానికి కట్టుకున్నాను. జందెం తెగిపోయింది. దానితోపాటు మోహమనే దారం కూడా నాలో తెగిపోయిందో లేదో గుర్తులేదు. కాని నేను ఆ తరువాత యిక క్రొత్త జందెం వేసుకోలేదు. పెద్దవాడైన తరువాత నాకు జందెం వేయాలని భారతదేశంలోనేగాక దక్షిణ ఆఫ్రికాలో కూడా కొందరు ప్రయత్నించారు. కాని వారి తర్కం నామీద పనిచేయలేదు. శూద్రులు జందెం ధరించనప్పుడు యితరులు ఎందుకు ధరించాలి? మా కుటుంబంలో మొదటి నుండి అమలులో లేని యీ జంద్యాన్ని మధ్యలో ఎందుకు ప్రవేశపెట్టాలి అను ప్రశ్నలకు సరియైన సమాధానం లభించలేదు. కావాలంటే జందెం దొరుకుతుంది. కాని దాన్ని ధరించడానికి తృప్తికరమైన కారణాలు కనబడలేదు. వైష్ణవుణ్ణి గనుక నేను పూసల దండ ధరించేవాణ్ణి. మా అన్నదమ్ములందరికీ పిలకజుట్టు వుంది. ఇంగ్లాండు వెళ్లినప్పుడు శిరస్సు ఉత్తగా వుండవలసి వచ్చింది. తెల్లవాళ్లు పిలక చూచి నవ్వుతారని, నన్ను అడివి మనిషి అని అనుకుంటారని భావించి పిలక తీసివేయించాను. నాతోబాటు దక్షిణ ఆఫ్రికాలో వున్న మా అన్నగారి కుమారుడు ఛగన్‌లాలు గాంధీ కడు శ్రద్ధతో పిలక వుంచుకున్నాడు. ప్రజా సేవకు సంబంధించిన కార్యక్రమాల్లో పాల్గొనేటప్పుడు ఆ పిలక యిబ్బంది కలిగిస్తుందని చెప్పి నేను బలవంతాన పిలక తీసివేయించాను. స్వామికి యీ విషయమంతా చెప్పి "జందెం మాత్రం నేను వేసుకోను. ఎక్కువమంది హిందువులు జందెం వేసుకోరు. అయినా వారంతా హిందువులుగానే పరిగణింపబడుతూ వున్నారు. అందువల్ల జందెం వేసుకోవలసిన అవసరం లేదని నా అభిప్రాయం. అదీగాక యజ్ఞోపవీతం ధరించడం అంటే మరో జన్మ ఎత్తడమే. అనగా సంకల్పశుద్ధిగా పరిశుద్ధికావడం, అంటే ఉర్ధ్వగాములం కావడమన్నమాట: యిప్పుడు హిందువులందరూ పూర్తిగా పతనావస్థలో వున్నారు. అట్టి వీరికి జందెం వేసుకునే అధికారం లేదు. అస్పృశ్యత అనే మురికిని కడిగివేయాలి. హెచ్చులొచ్చులను మరిచిపోవాలి. మనలో చోటు చేసుకున్న చెడును తొలగించి వేయాలి. అధర్మాన్ని, పాఖండత్వాన్ని దూరం చేయాలి. అప్పుడే యజ్ఞోపవీతం ధరించే హక్కు హిందూ సమాజానికి కలుగుతుందని నా అభిప్రాయం. అందువల్ల జందెం

విషయమై మీ మాటలు నాకు మింగుడుపడవు. కాని పిలక విషయమై మీరు చెప్పిన మాటల్ని గురించి యోచిస్తాను. మొదట పిలక నాకు వుండేది. కాని సిగ్గువల్ల అంతా నవ్వుతారేమోననే భావంతో నేనే తొలగించి వేశాను. దాన్ని తిరిగి పెట్టుకోవడం మంచిదని నాకు తోస్తున్నది. నా అనుచరులతో యీ విషయమై నేను మాట్లాడుతాను' అని చెప్పాను. స్వామికి జందెం గురించి నేను అన్న మాటలు నచ్చలేదు. నేను ధరించకూడదు అని చెబుతూ చెప్పిన కారణాలు, ధరించవచ్చును అని చెప్పుటకు అనుకూలమని ఆయనకు తోచాయి. అయితే ఋషీకేశంలో జందాన్ని గురించి నేను చెప్పిన మాటలపై యిప్పటికీ నేను నిలబడివున్నాను. వేరు వేరు మతాలు వున్నంతవరకు ఆ మతాలవారికి బాహ్యచిహ్నాలు బహుశా అవసరం అవుతాయి. కాని ఆ బాహ్యచిహ్నాలు ఆడంబరంగా మారినప్పుడు, తన మతమే యితర మతాల కంటే గొప్పదని చెప్పుటకు సాధనాలుగా మారినప్పుడు వాటిని త్యజించడం మంచిది. యిప్పుడు జందెం హిందూ సమాజాన్ని ఉన్నత స్థాయికి గొంపోవుటకు సాదనమను విశ్వాసం నాకు కలుగలేదు. అందువల్ల దాని విషయంలో తటస్థంగా వున్నాను. కాని పిలక జుట్టు తీసివేసిన కారణాలను తలచుకుంటే నాకే సిగ్గువేస్తున్నది. అందువల్ల అనుచరులతో చర్చించి పిలక పెట్టుకోవాలనే నిర్ణయానికి వచ్చాను.

ఇక మనం లక్ష్మణ ఉయ్యాల దగ్గరకు వెళదాం. ఋషికేశం మరియు లక్ష్మణ ఝూలా దగ్గరి ప్రకృతి దృశ్యాలు ఎంతో రమణీయంగా వున్నాయి. ప్రకృతి శోభను, ప్రకృతి యొక్క శక్తిని గుర్తించగల మన పూర్వీకుల సామర్థ్యాన్ని, ఆ శోభకు ధార్మిక స్థాయి కల్పించగల స్తోమతను వారి దూరదృష్టిని చూచి నా హృదయం శ్రద్ధాభక్తితో నిండిపోయింది. కాని అక్కడ మనిషి చేసిన నిర్మాణ వ్యవహారం చూచి నా మనస్సుకు అశాంతి కూడా కలిగింది. హరిద్వారంలోనే గాక, ఋషికేశంలో కూడా జనం పరిశుద్ధమైన నదీ తీరాన్ని మలమూత్రాదులతో పాడు చేస్తున్నారు. తప్పు చేస్తున్నామనే భావం కూడా వారికి లేదు. దొడ్డికి వెళ్లదలచినవారు దూరం పోవచ్చుగదా! జనం తిరిగే చోటనే మలమూత్రాదులు విసర్జిస్తున్నారు. యిది చూచి మనస్సుకు బాధ కలిగింది. లక్ష్మణ ఉయ్యాల దగ్గరకు వెళ్లగా ఇనుప ఉయ్యాల కంటపడింది. మొదట యీ వంతెన త్రాళ్లతో కట్టబడి వుండేదని, దాన్ని తెగగొట్టి ఒక ఉదార హృదయుడగు మార్వాడీ ఎంతో ధనం వెచ్చించి ఇనుముతో వంతెన తయారుచేయించి దాని తాళం చెవి ప్రభుత్వం వారికి అప్పగించాడని జనం చెప్పారు. త్రాళ్ళ వంతెనను గురించి నేను ఊహించలేదు కాని యీ ఇనుప వంతెన మాత్రం యిక్కడి సమాజ శోభను కలుషితం చేస్తున్నదని

చెప్పగలను చూడటానికి అసహ్యంగా వున్నది. జనం నడిచే మార్గపు తాళం చెవి ప్రభుత్వానికి అప్పగించారని విని బాధపడ్డాను. ప్రభుత్వం యెడ విశ్వాసం కలిగియున్న ఆనాటి నా మనస్తత్వానికి కూడా ఆ విషయం తెలిసినప్పుడు బాధ కలిగింది.

కొంచెం ముందుకు వెళ్లగా అక్కడ స్వర్గాశ్రమం కనబడింది. దాని పరిస్థితి ఘోరంగా వున్నది. టిన్ను రేకులతో కప్పబడి వున్న పందిరి గుడిశల్లాంటి గదులకు స్వర్గాశ్రమం అని పేరు పెట్టారు యీ గదులు సాధన చేసేవారి కోసం నిర్మించబడ్డాయని చెప్పారు. ఇప్పుడు ఆ గదుల్లో ఒక్క సాధకుడు కూడా లేడు. వాటిని అంటిపెటుకొని కొన్ని మేడలు వున్నాయి. వాటిలో వుండేవారిని చూచాక వారి ప్రభావం కూడ నా మీద ఏమీ పడలేదు.

మొత్తం మీద హరిద్వార్‌లో కలిగిన అనుభవాలు నా దృష్టిలో అమూల్యాలు వాటి ప్రభావం నా మీద బాగా పడింది. నేను ఎక్కడ వుండాలో, ఏం చేయాలో నిర్ణయించుకునేందుకు హరిద్వార్‌లో కలిగిన అనుభవాలు నాకు అమితంగా తోడ్పడ్డాయి.

## 9. ఆశ్రమ స్థాపన

ది. 25 మే 1915 నాడు సత్యాగ్రహ ఆశ్రమ స్థాపన జరిగింది. హరిద్వార్‌లో వుండమని శ్రద్ధానందగారు చెప్పారు. వైద్యనాదధామంలో వుండమని కలకత్తాకు చెందిన కొందరు మిత్రులు సలహా యిచ్చారు. రాజకోటలో వుండమని కొందరు మిత్రులు కోరారు. ఒకసారి అహమదాబాదు వెళ్లాను చాలామంది మిత్రులు అహమదాబాదులో వుండమని చెప్పారు ఆశ్రమానికి అయ్యే ఖర్చంతా భరిస్తామని చెప్పి ఇల్లు వెతికి పెట్టే బాధ్యత కూడా వహిస్తామని మాట యిచ్చారు.

అహమదాబాదు మీద మొదటి నుండి నాకు చూపు వున్నది. నేను గుజరాతీ వాడిని, గుజరాతీ భాష ద్వారా దేశానికి ఎక్కువ సేవ చేయగలుగుతానని గ్రహించాను. చేనేతకు అహమదాబాదు కేంద్రం కావడం వల్ల అక్కడ చరఖా పని బాగా సాగుతుందనే భావం కూడా నాకు కలిగింది గుజరాత్‌లో పెద్ద పట్టణం గనుక, యిక్కడ ధనవంతులు ఎక్కువగా వుండటంవల్ల వారి సాయం లభిస్తుందనే ఆశ కూడా కలిగింది. అహమదాబాదుకు చెందిన మిత్రులతో మాట్లాడుతూ వున్నప్పుడు అస్పృశ్యతను గురించి కూడా చర్చ జరిగింది. ఎవరైనా అంత్యజ సోదరుడు ఆశ్రమంలో చేరదలచుకుంటే

నేను తప్పక చేర్చుకుంటానని స్పష్టంగా చెప్పాను. "మీ షరతుల ప్రకారం నడుచుకునే అంత్యజుడు మీకెక్కడ దొరుకుతాడు?" అంటూ ఒక వైష్ణవ మిత్రుడు తన మనస్సును శాంతపరచుకున్నాడు. చివరికి అహమదాబాదులో వుండాలని నిర్ణయం చేశాము.

ఇంటి కోసం అన్వేషణ ప్రారంభమైంది. అహమదాబాదులో నన్ను వుంచడానికి ప్రముఖంగా కృషి చేసిన శ్రీ జీవన్‌లాల్ బారిష్టరుగారి కొచరబ్‌లో గల గృహం అద్దెకు తీసుకోవాలని నిర్ణయించాం. ఆశ్రమానికి ఏం పేరు పెట్టాలి అని చర్చ జరిగింది. ఎన్నో పేర్లు దృష్టికి వచ్చాయి. సేవాశ్రమం, తపోవనం అంటూ చాలా పేర్లు చర్చకు వచ్చాయి. సేవాశ్రమం పేరు బాగున్నదే కాని ఏరకమైన సేవయో బోధపడలేదు. మేము చేసేది తపస్సే అయినా ఆ పేరు చాలా బరువుగా వున్నది. మేము చేయవలసింది సత్యశోధన. సత్యం కోసమే మా కృషి, మా ప్రయత్నం. దక్షిణ ఆఫ్రికాలో నేను అమలు చేసిన పద్ధతిని భారతదేశానికి తెలియజేయాలి. ఆ శక్తి ఎంత వ్యాప్తం కాగలదో చూడాలి. అందువల్ల నేను, నా అనుచరులు కూడా సత్యాగ్రహ ఆశ్రమం అను పేరుకు యిష్టపడ్డాం. అందు సేవ, సేవావిధానం రెండూ సహజంగా యిమిడి వుంటాయని భావించాం. ఆశ్రమ నియమావళి ముసాయిదా ఒకటి తయారుచేసి అందరికీ పంపి మీ అభిప్రాయం తెలియజేయమని కోరాం. చాలామందికి నియమావళి నచ్చింది. కాని నియమావళి యందు వినమ్రతకు ప్రముఖ స్థానం లభించాలని వారు సూచించారు. అంటే మన యువకుల్లో వినమ్రత తక్కువగా వున్నదని వారి భావం అన్నమాట. నేను కూడా యీ సత్యాన్ని గ్రహించాను. కాని వినమ్రతను వ్రతంగా భావించి దానికి ప్రాముఖ్యం యిస్తే వినమ్రత తక్కువగా మిగిలిపోతుందేమో నను అనుమానం కలిగింది. వినమ్రతకు పూర్తి అర్థం శూన్యత్వం. శూన్యత్వాన్ని పొందడం కోసం యితర వ్రతాల్ని అనుష్ఠించాలి. వాస్తవానికి శూన్యత్వం మోక్షస్థితియే. ముముక్షువు లేక సేవకుడు చేసే ప్రతి పని యందు నమ్రత, అభిమానరాహిత్యం వుండితీరాలి. అవి లేకపోతే అతడు ముముక్షువు కాలేడు. సేవకుడు కాలేడు. స్వార్థపరుడవుతాడు. అహంకారి అవుతాడు.

ఆశ్రమంలో యిప్పుడు సుమారు 13 మంది తమిళులున్నారు. నాతోబాటు దక్షిణ ఆఫ్రికానుండి అయిదుమంది తమిళబాలురు వచ్చారు. వారితోబాటు, యిక్కడి సుమారు 25 మంది స్త్రీ పురుషులతో ఆశ్రమం ప్రారంభించాం. ఒకే వంటశాలలో అందరికీ భోజనం. అంతా ఒకే కుటుంబానికి చెందినవారుగా ఉండేవారం.

# 10. పరీక్ష

ఆశ్రమ స్థాపన జరిగిన కొద్ది కాలానికే అగ్ని పరీక్షను ఎదుర్కోవలసి వచ్చింది. యిలా జరుగుతుందని నేను ఊహించలేదు. భాయీ అమృత్‌లాల్ టక్కర్ జాబు వ్రాస్తూ "ఒక బీద అంత్యజుని కుటుంబం వాళ్లు మీ ఆశ్రమంలో చేరాలని భావిస్తున్నారు. వారు ఎంతో నిజాయితీపరులు" అని సూచించారు.

నేను కొంచెం నివ్వెరబోయాను. ఠక్కర్ బాపాగారి సిఫారసుతో యింత త్వరగా ఆశ్రమంలో చేరడానికి అంత్యజుని కుటుంబం సిద్ధపడుతుందని నేను ఊహించలేదు. జాబును అనుచరులకు చూపించాను. అంతా అందుకు స్వాగతం పలికారు. ఆశ్రమ నియమావళి ప్రకారం నడుచుకునేందుకు సిద్ధపడితే మీరు సూచించిన అంత్యజుని కుటుంబీకుల్ని ఆశ్రమంలో చేర్చుకుంటామని బాపాకు జాబు వ్రాశాను. దూదాభాయి, అతనిభార్య దానీబెన్, చిలక పలుకులు పలికే చంటిబిడ్డ లక్ష్మి ముగ్గురూ వచ్చారు. దూదాభాయి బొంబాయిలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడు. నియమాల్ని పాటిస్తామని తెలిపిన మీదట ఆశ్రమంలో చేర్చుకున్నాం. దానితో మాకు సహాయం చేస్తున్న మిత్రబృందంలో గొడవ బయలుదేరింది. ఆ బంగళాకు సంబంధించిన బావి నుండి నీరు తోడుకోవాలంటే చిక్కులు ఏర్పడ్డాయి. గంజాయి వాడు ఒకడు సమీపంలో వున్నాడు. అతని మీద నీటిచుక్కలు పడ్డాయని అతడు దూదాభాయి మీద విరుచుకుపడ్డాడు. తిట్టడం ప్రారంభించాడు. తిట్టినా ఎదురు చెప్పవద్దని నీళ్ళు మాత్రం తోడుకురమ్మని నేను ఆశ్రమవాసులకు చెప్పాను. ఎన్ని తిట్లు తిట్టినా మారు పలకనందున గంజాయివాడు సిగ్గుపడి తిట్టడం మానివేశాడు. అయితే మాకు వచ్చే ఆర్థికసాయం తగ్గిపోసాగింది. సహాయకుల్లో ఒకరికి అంత్యజుల విషయమై సందేహం వున్నప్పటికీ యింత త్వరగా అంత్యజులు ఆశ్రమంలో చేరతారని వారు ఊహించలేదు. ధనం యివ్వడం మానుకున్నారు. అత్యంజులు త్వరలోనే ఆశ్రమాన్ని బహిష్కరిస్తారని నాకు వార్త అందింది. నేను అనుచరులతో చర్చించాను. " మనల్ని బహిష్కరించినా, ధనసహాయం చేయకపోయినా యీ పరిస్థితుల్లో మనం అహమదాబాదు వదలకూడదని, పాకీవాళ్లు వున్న వాడకు వెళ్లి వుందామని, కాయకష్టం చేసి బ్రతుకుదామని నిర్ణయానికి వచ్చాం. "వచ్చే నెలకు సరిపడ సొమ్ము లేదని" మగన్‌లాలు హెచ్చరించాడు. ఏం పరవాలేదు. పాకీవారున్న వాడకు వెళ్లి వుందామని చెప్పాను.

ఇలాంటి ఇబ్బందులకు నేను అలవాటు పడిపోయాను. ప్రతిసారి చివరి నిమిషంలో దేవుడే ఆదుకునేవాడు. మగన్‌లాలు డబ్బు లేదని చెప్పిన కొద్ది రోజులకు

ఒకనాడు ఉదయం ఎవరో పిల్లవాడు వచ్చి "బయట కారు నిలబడి వున్నది. సేర్ మిమ్మల్ని పిలుస్తున్నాడు" అని చెప్పాడు. నేను కారు దగ్గరకివెళ్లాను. "ఆశ్రమానికి సాయం చేద్దామని వున్నది. సాయం స్వీకరిస్తారా?" అని సేర్ నన్ను అడిగాడు. "ఏమియిచ్చినా తప్పక తీసుకుంటాను. ప్రస్తుతం యిబ్బందిగా కూడా వున్నది" అని అన్నాను. " రేపు యిదే సమయానికివస్తాను. మీరు ఆశ్రమంలో వుంటారా?" అని అడిగాడు. వుంటాను అని చెప్పాను. సేర్ వెళ్లిపోయాడు. మరునాడు సరిగా అనుకున్న సమయానికి బయట కారు హారను వినబడింది. పిల్లలు వచ్చి చెప్పారు. సేర్ లోనికి రాలేదు. నేను వారిని కలుద్దామని వెళ్లాను. ఆయన నా చేతుల్లో 13 వేల రూపాయల నోట్లు వుంచి వెళ్లిపోయాడు. ఈ విధంగా సహాయం అందుతుందని నేను కలలో కూడా ఊహించలేదు. సాయం చేసే యీ పద్ధతి కూడా నాకు క్రొత్తే ఆయన అదివరకు ఆశ్రమానికి రాలేదు. ఆయనను ఒకసారి కలుసుకున్నట్లు గుర్తు. ఆయన ఇప్పుడూ ఆశ్రమంలోకి రాలేదు. ఏమీ చూడలేదు చేతుల్లో 13 వేల రూపాయల నోట్లు వుంచి వెళ్లిపోయాడు. ఇలాంటి అనుభవం నాకు మొదటిసారి కలిగింది యీ డబ్బు అందడంవల్ల పాకీవారుండే పల్లెకు వెళ్లవలసిన అవసరం కలగలేదు. సుమారు ఒక ఏడాది వరకు సరిపోయే ఖర్చు నాకు లభించింది.

బయట గొడవ జరిగినట్లే ఆశ్రమం లోపల కూడా జరిగింది. దక్షిణ ఆఫ్రికాలో వున్నప్పుడు అంత్యజులు నా యింటికి వచ్చేవారు. భోజనం చేసేవారు నాభార్య అందుకు యిష్టపడిందా లేదా అను సమస్య బయలుదేరలేదు ఆశ్రమంలో దానీబెన్‌ను తోటి స్త్రీలు తేలికగా చూడటం నేను గమనించాను. కొన్ని మాటలు కూడా నా చెవిన పడ్డాయి. బయటివారు ధన సహాయం చేయరనే భయం నాకు ఎప్పుడూ కలుగలేదు. కాని ఆశ్రమంలో ప్రారంభమైన యీ వ్యహారం మాత్రం నన్ను క్షోభకు గురిచేసింది. దానీబెన్ సామాన్య స్త్రీ. దాదూభాయికి వచ్చిన చదువు కూడా తక్కువే. కానీవారు తెలివిగలవారు వారి ధైర్యం చూచి సంతోషించాను. వారికి అప్పుడప్పుడు కోపం వస్తూ వుండేది. అయితే మొత్తం మీద వారి సహనశక్తి గొప్పది. చిన్న చిన్న అవమానాలను సహించమని నేను దాదూభాయికి చెబుతూ వుండేవాణ్ణి. అతడు విషయం గ్రహించేవాడు దానీబెన్ కూడా అతడు సముదాయించి చెబుతూ వుండేవాడు

ఈ కుటుంబాన్ని ఆశ్రమంలో వుంచుకోవడం వల్ల ఆశ్రమానికి ఎన్నో అనుభవాలు కలిగాయి. అస్పృశ్యతను ఆశ్రమంలో పాటించకూడదు అని మొదటనే నిర్ణయం అయిపోవడం వల్ల పని తేలిక అయిపోయింది. యింత జరుగుతూ వున్నా, ఆశ్రమం

ఖర్చులు పెరిగిపోతూ వున్నా ఆర్థిక సాయం సనాతనుల వల్లే లభిస్తూ వుండేది. అస్పృశ్యత యొక్క మూలం కదిలిపోయిందని అనడానికి అదే నిదర్శనం. యింకా నిదర్శనాలు అనేకం వున్నాయి. అయినా ఒక్క విషయం. అంత్యజులతోబాటు కూర్చొని భోజనాలు చేస్తున్నారని తెలిసి కూడా సనాతనులు ఆశ్రమానికి ఆర్థిక సాయం చేశారు.

ఈ సమస్య మీద ఆశ్రమంలో జరిగిన మరో ఘట్టంతో బాటు ఆ సందర్భంలో బయలుదేరిన సున్నితమైన సమస్యలు, ఊహించని యిబ్బందులు, అన్నీ సత్యశోధన కోసం చేసిన ప్రయోగాలే. వాటినన్నింటిని యిక్కడ ఉదహరించకుండా వదిలి వేస్తున్నందుకు విచారపడుతున్నాను. రాబోయే ప్రకరణాల్లో కూడా యీ విధంగా చేయక తప్పదు. అవసరమైన సత్యాలు వదలవలసి రావచ్చు అందుకు సంబంధించిన వ్యక్తులు చాలామంది జీవించేయున్నారు. వారి పేర్లు వ్రాస్తే యిబ్బందులు కలుగవచ్చు. అయితే వారి విషయంలో జరిగిన ఘట్టాలు వ్రాసి వారికి పంపడం, వారు అందుకు సమ్మతించి ప్రకటించవచ్చునని అనుమతి యివ్వడం జరిగే పనికాదు. అది ఆత్మకథకు మించినపని. అందువల్ల సత్యశోధనకు సంబంధించినవే అయినా చాలా ఘట్టాల్ని వివరించి వ్రాయడం సాధ్యం కాదని భావిస్తున్నాను. అయినప్పటికీ సహాయ నిరాకరణోద్యమ చరిత్ర దాకా భగవంతుడు అనుమతిస్తే వ్రాయాలని నా ఆకాంక్ష.

## 11. గిరిమిట్ ప్రథ

కొత్తగా స్థాపించబడిన ఆశ్రమం లోపల బయట ఎదుర్కొంటూ వున్న తుపానుల తీరును గురించి వ్రాయడం ఆపి, గిర్‌మిట్ ప్రథను గురించి వ్రాస్తాను. అయిదు సంవత్సరాలు లేక అంతకంటే తక్కువ కాలం మజూరీ తీసుకొని పని చేస్తానని అంగీకరించి పత్రం మీద సంతకంచేసి భారతదేశాన్ని వదిలి దక్షిణ ఆఫ్రికా వెళ్లిన వారిని గిరిమిటియాలని అంటారు. 1914లో అట్టి గిర్‌మిటియాలకు విధించబడ్డ మూడు పౌండ్ల పన్ను రద్దుచేయబడిందే కాని ఆ విధానం యింకా పూర్తిగా రద్దు కాలేదు. 1916లో భారత భూషణ పండిత మదన మోహన మాలవ్యాగారు పెద్ద కౌన్సిలులో యీ విషయం ఎత్తారు. అందుకు సమాధానం యిస్తూ లార్డ్‌హార్డింగ్ ప్రభువు వారి ప్రశ్నను అంగీకరించారు. సమయం వచ్చినప్పుడు దీన్ని ఆపుతామని ఆయన అన్నాడు. యీ విధానాన్ని భారతదేశం చాలా కాలం సాగనిచ్చిందని నా అభిప్రాయం. ప్రజల్లో కూడా చైతన్యం వచ్చింది కనుక తక్షణం యీ విధానం రద్దు చేయబడాలని నిర్ణయానికి వచ్చి

చాలామంది నాయకుల్ని ప్రముఖుల్ని కలిశాను. ప్రజాభిప్రాయం అందుకు అనుకూలంగా వున్నదని గ్రహించాను. యీ విషయంలో సత్యాగ్రహాన్ని ఉపయోగించవచ్చని భావించాను. కాని ఎలా ఎప్పుడు అను విషయమై నేను యింకా నిర్ణయానికి రాలేదు. "సమయం వచ్చినప్పుడు" అంటే ఏమిటో చెప్పడానికి వైస్రాయి ప్రయత్నించి "మరో వ్యవస్థ చేయుటకు ఎంత సమయం పడుతుందో అంతవరకు" అని అన్నాడు. ఫిబ్రవరి 1917లో భారత భూషణ పండిత మదన మోహన మాలవ్యా గిర్‌మిట్ ప్రథను వెంటనే రద్దుచేయాలని బిల్లు కౌన్సిలులో ప్రవేశపెట్టగా వైస్రాయి అందుకు అంగీకరించలేదు. దానితో యీ సమస్యపై నేను దేశమందంతట ప్రచారం చేసేందుకై పర్యటన ప్రారంభించాను. పర్యటన ప్రారంభించే పూర్వం వైస్రాయిని కలవడం మంచిదని భావించాను. ఆయన వెంటనే తనను కలుసుకునేందుకు తేదీ నిర్ణయించాడు. అప్పుడు మి.మేఫీ (యిప్పుడు సర్‌జాన్ మేఫీ) వైస్రాయికి సెక్రటరీగా వున్నాడు. ఆయనతో నాకు మంచి సంబంధం ఏర్పడింది. లార్డ్ చేమ్స్‌ఫర్డుతో కూడా మాట్లాడాను నిశ్చింతగా ఏమీ చెప్పకపోయినా తప్పక నిర్ణయం గైకొంటానని తాను సహకరిస్తానని చెప్పి అతడు ఆశ కల్పించాడు.

నేను బొంబాయి నుండి నా పర్యటన ప్రారంభించాను. బొంబాయిలో సభ ఏర్పాటుచేసే బాధ్యత బిష్టర్ జహంగీర్ పేటీట్ వహించారు. ఇంపీరియల్ సిటీజన్‌షిప్ అసోసియేషన్ ఆధ్వర్యాన సభ జరిగింది. అందు ప్రవేశ పెట్టవలసిన తీర్మానం తయారుచేసేందుకు ఒక కమెటీ ఏర్పడింది. అందు డా. రీడ్ సర్ లల్లూభాయి శ్యామల్ దాస్, మి. నటరాజన్ మొదలగువారు వున్నారు. మి.పేటిట్ అందు ప్రముఖులు, వెంటనే గిర్‌మిట్ ప్రథను రద్దుచేయమని ప్రభుత్వాన్ని తీర్మానంలో కోరారు. ఎప్పుడు రద్దుచేయాలి అన్నదే ముఖ్యమైన సమస్య. (1) రద్దు బహు త్వరగా జరగాలి. (2) జులై 31వ తేదీనాటికి రద్దు జరగాలి (3) వెంటనే రద్దు జరగాలి అని మూడు సూచనలు వచ్చాయి. జూలై 31వ తేదీనాటికి రద్దు కావాలన్న సూచన నేను చేశాను. నేను తేదీ నిర్ణయించబడాలని కోరాను. అలా తీర్మానిస్తే ఆ తేదీనాటికి రద్దు చేయకపోతే ఏం చేయాలో నిర్ణయించవచ్చునని నా ఉద్దేశ్యం. కాని లల్లూభాయి తక్షణం రద్దుచేయాలని అభిప్రాయపడ్డారు. తక్షణం అంటే జనానికి అర్థం కాదని ప్రజల ద్వారా పని చేయించాలంటే నిశ్చితంగా తేదీవాళ్ల ముందు వుంచడం అవసరమని తక్షణం అంటే ప్రతివారు తమ యిష్టప్రకారం అంచనా వేస్తారని అందువల్ల జూలై 31వ తేదీ వరకు గడువు యిద్దామని నచ్చచెప్పాను. నా తర్కం రీడ్‌కు

నచ్చింది. లల్లూభాయికి కూడా నా తర్కం నచ్చింది. జూలై 31వ తేదీ వరకు గడువు యిస్తూ బహిరంగసభలో తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది. శ్రీజయజీ పేటిట్ గారి కృషివల్ల బొంబాయి నుండి కొందరు మహిళలు వెళ్లి వైస్రాయిని కలుసుకున్నారు. వారిలో లేడీ తాతా, కీ.శే దిల్‌ఫాద్ బేగం మొదలగు మహిళలు వున్నారు. యింకా ఎవరెవరు వున్నారో నాకు గుర్తులేదు. కాని యీ రాయబారం వల్ల సత్ఫలితం కలిగింది. వైస్రాయి ఉత్సాహవర్ధకమైన సమాధానం యిచ్చాడు. నేను కరాచీ, కలకత్తా మొదలగు స్థలాలకు కూడా వెళ్లి వచ్చాను. అన్ని చోట్ల సభలు జరిగాయి. ప్రజల్లో ఉత్సాహం వెల్లివిరిసింది. పర్యటనకు పూనుకొనే ముందు సభల్లో యింత అధిక సంఖ్యలో జనం పాల్గొంటారని నేను ఊహించలేదు.

అప్పుడు నేనొక్కడినే ప్రయాణం చేస్తూవుండేవాణ్ణి. అందువల్ల ఊహించని అనుభవాలు కలుగుతూ వుండేవి. గూఢచారులు నావెంట వుండేవారు. వారితో జగడానికి అవకాశం లేదు. నేను ఏమీ దాచేవాణ్ణి కాదు. అందువల్ల వాళ్లు నన్ను బాధించేవారు కాదు. నేను వారిని బాధించేవాణ్ణి కాను. అదృష్టవశాత్తు అప్పటికి నాకు యింకా మహాత్మ అను బిరుదు లభించలేదు. నన్ను గుర్తించిన చోట మాత్రం జనం యీ బిరుదును ఉపయోగించి నినాదాలు చేస్తూ వుండేవారు. ఒక సారి రైల్లో వెళుతున్నప్పుడు గూఢచారులు నా దగ్గరకి వచ్చి టిక్కెట్టు అడిగి తీసికొని నెంబరు నోట్ చేసుకోసాగారు. వారడిగిన ప్రశ్నలకు నేను వెంటనే సమాధానం యిచ్చాను. నేనేదో అమాయకుడైన సాధువునని తోటి ప్రయాణీకులు భావించారు. రెండు మూడు స్టేషన్ల వరకు వరుసగా గూఢచారి పోలీసులు రావడం, నన్నేవేవో ప్రశ్నలు అడగడం చూచి తోటి ప్రయాణీకులకు కోపం వచ్చి వాళ్లను బెదిరించి "ఎందుకయ్యా అమాయకుడైన యీ సాధుపుంగవుణ్ణి బాధపెతడారు వెళ్లండి" అని అరవడం ప్రారంభించారు. "ఇదుగో! యిక టిక్కెట్టు చూపించకండి చూద్దాం ఏం చేస్తారో!" అని నాతో అన్నారు.

"వాళ్లు చూస్తే నష్టం ఏముంది? వాళ్లు తమ కర్తవ్యాన్ని పాలిస్తున్నారు. నాకేమీ బాధ కలగడం లేదు" అని చెప్పాను. యాత్రీకులకు నా యెడ సానుభూతి పెరిగి పాపం, నిరపరాధుల్ని యింతగా బాధిస్తారేమిటి? అని తమలో తాము అనుకున్నారు. గూఢచారులగు పోలీసుల వల్ల నాకేమీ బాధ కలుగలేదు. కాని లాహోరు ఢిల్లీల మధ్య రైల్లో ప్రయాణించినప్పుడు జనం గుంపులు గుంపులుగా విరుచుకుపడ్డప్పుడు నాకు చాలా యిబ్బంది కలిగింది. కరాచీ నుండి కలకత్తాకు లాహోరు మీదుగా వెళ్లాలి. లాహోరులో రైలు మారాలి. అక్కడి రైల్లో నా పప్పులేమీ ఉడకలేదు. యాత్రీకులు

బలవంతంగా లోపలికి దూరుతున్నారు. నేను నిశ్చిత సమయానికి కలకత్తా చేరాలి ఆ ట్రైను అందకపోతే కలకత్తా సమయానికి చేరలేను. చోటు దొరుకుతుందనే ఆశ పోయింది. నన్ను తమ పెట్టెలో ఎవ్వరూ ఎక్కనీయలేదు. ఒక్క కూలీ నన్ను చూచి 12 అణాలు యిస్తే చోటు చూపిస్తానని అన్నాడు. చోటు చూపించు, 12 అణాలు తప్పక యిస్తాను అని అన్నాను. పాపం ఆ కూలీ ప్రయాణీకుల్ని బ్రతిమిలాడినా ఒక్కరు కూడా వినిపించుకోలేదు. బండి కదలబోతుండగా కొందరు యాత్రికులు లోపల చోటు లేదు కాని, జొరబడేలా చేయగలిగితే ఎక్కించు అని అన్నారు. కూలీ ఏమండీ ఎక్కుతారా అని అడిగాడు. ఆ అన్నాను. వెంటనే కూలీ నన్ను ఎత్తి కిటికీలో నుండి లోనికి వేశాడు. నేను లోపల పడ్డాను. కూలీ 12 అణాలు సంపాదించాడు. ఆ రాత్రి అతి కష్టంగా గడిచింది. మిగతా యాత్రికులు ఏదో విధంగా చోటు చేసుకొని కూర్చున్నారు. నేను పై బెంచి గొలుసు పట్టుకొని రెండు గంటలపాటు నిలబడే వున్నాను. ఈలోపున కూర్చోవేమయ్యా అని కొందరు గద్దించి అడగసాగారు. చోటు వుంటే కదా కూర్చోవడానికి అని నేను అన్నాను. వాళ్లకు నేను నుంచోవడం కూడా యిష్టం లేదు. పైగా వాళ్లు బెంచీల మీద హాయిగా పడుకున్నారు. తప్పుకోమని నన్ను మాటిమాటికి సతాయిస్తూ వున్నారు. వారు బాధించినప్పుడు నేను ప్రశాంతంగా వుండేసరికి నీ పేరేమిటి అని నన్ను అడిగారు. నేను పేరు చెప్పవలసి వచ్చింది. పేరు వినగానే వాళ్లు సిగ్గుపడ్డారు. క్షమించమని అని తమ ప్రక్కన చోటు యిచ్చి కూర్చోబెట్టారు. కష్టే ఫలే అను సూక్తి జ్ఞాపకం వచ్చింది. అప్పటికి అలసిపోయాను. తల తిరుగుతూ వుంది. కూర్చోవలసిన అవసరం కలిగినప్పుడు దేవుడు వెంటనే చోటు చూపించాడన్నమాట.

ఈ విధంగా నానాయాతన పడి సమయానికి కలకత్తా చేరాను. అక్కడ కౌసిన్ బజారు మహారాజా తన దగ్గర వుండమని ఆహ్వానించాడు. ఆయనే కలకత్తా సభకు అధ్యక్షుడు. కరాచీ వలెనే కలకత్తాలో కూడా జనం ఉత్సాహంతో సభలో పాల్గొన్నారు. కొద్దిమంది ఆంగ్లేయులు కూడా సభలో పాల్గొన్నారు. జూలై 31 వ తేదీ లోపునే గిరిమిటి ప్రథను రద్దు చేస్తున్నట్లు ప్రభుత్వ ప్రకటన వెలువడింది. 1895లో మొట్టమొదటి దరఖాస్తు ఈ విధానాన్ని రద్దు చేయమని వ్రాసి పంపాను. అప్పుడు ఏదో రోజున ఈ అర్ధ బానిసత్వం తొలగిపోతుందని నమ్మాను. అయితే దీని వెనుక పరిశుద్ధమైన సత్యాగ్రహ ప్రవృత్తి పనిచేసిందని చెప్పక తప్పదు.

దీన్ని గురించిన పూర్తి వివరం, అందు పాల్గొన్న వారి పేర్లు తెలుసుకోవాలను కొన్నవారు దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ చరిత్ర అను నా గ్రంథం చదువవచ్చు.

# 12. నీలి మందు మచ్చ

చంపారన్ రాజర్షి జనకుని భూమి చంపారన్ మామిడితోటలు వున్నట్లే నీలిమందు ఉత్పత్తి చేస్తూ వుండేవారు. చంపారన్ రైతులు తమ భూమిలో 3/20 భాగంలో తప్పనిసరిగా తమతెల్ల యజమాని కోసం నీలి మందు చట్టరీత్యా ఉత్పత్తి చేయవలసి వచ్చేది. దీన్ని తిన్‌కఠియా రివాజు అని అనేవారు. 20 కుంట (ఐదుమూరల నాలుగు అంగుళాల భూమి) లు అక్కడ ఒక ఎకరం, అందు 3 కుంటల్లో నీలిమందు ఉత్పత్తి చేయడాన్ని తిన్‌కఠియా రివాజు అని అనేవారు. అక్కడికి వెళ్లక పూర్వం నాకు చంపారన్ అను పేరు కూడా తెలియదు. అక్కడ నీలి మందు ఉత్పత్తి అవుతుందని కూడా నాకు తెలియదు. నీలిమందు బిళ్లలు చూచాను. కాని, అవి చంపారన్‌లో ఉత్పత్తి చేయబడతాయిని , అందువల్ల అక్కడి రైతులు విపరీతంగా నష్టపడుతున్నారనినాకు తెలియదు.

రాజకుమార్ శుక్లా చంపారన్‌కు చెందిన రైతు. ఆయన దాని వల్ల బాధపడ్డాడు. అయితే ఆ నీలి మచ్చను రైతులందరి హృదయాల నుండితొలగించి వేయాలనే అగ్ని అతని హృదయంలో రగుల్కొంది. లక్నో కాంగ్రెసుకు నేను వెళ్ళాను అక్కడే ఆ రైతు నన్ను పట్టుకున్నాడు. వకీలు బాబు నీకు అన్ని విషయాలు చెబుతారు. మీరు ఒకసారి చంపారన్ రండి అని ఆహ్వానించాడు. వకీలు అంటే చంపారన్‌లో గల నా అనుంగు అనుచరుడు, బీహారులో సేవాజీవులకు ప్రాణం వంటివాడునగు ప్రజ కిషోర్‌బాబు. రాజకుమార్ శుక్లా ఆయనను నా డేరాకు తీసుకొని వచ్చాడు. ఆయన నల్లని జుబ్బా, ప్యాంటు మొదలగునవి ధరించి వున్నాడు. చూడగానే ఆయన ప్రభావం నా మీద పడలేదు. అమాయకులైన రైతులను పీల్చే వకీలు అయివుంటాడని అప్పుడు అనిపించింది.

నేను చంపారన్ కథ ఆయన ద్వారా కొద్దిగా విన్నాను. నా సహజ పద్ధతిలో "స్వయంగా చూడందే నేను నిర్ణయం ప్రకటించను. మీరు కాంగ్రెసులో యీ విషయం మీద మాట్లాడండి. ప్రస్తుతం నన్ను వదలండి" అని అన్నాను. రాజకుమార్ శుక్లాకు కాంగ్రెసుతో అవసరం ఎలాగూ ఉన్నది. చంపారన్ పరిస్థితిని గురించి మహాసభలో ప్రజకిషోర్ బాబు ప్రసంగించారు. అందు సానుభూతి తీర్మానం కూడా ప్యాసైంది.

రాజకుమార్ శుక్లాకు సంతోషం కలిగింది కానీ తృప్తి కలుగలేదు. నాకు చంపారన్ రైతుల కష్టాలు స్వయంగా చూపించాలని భావించాడు. నా యాత్రలో భాగంగా చంపారన్ చేరుతాను. ఒకటి రెండు రోజులు అక్కడ వుంటాను అని చెప్పాను.

ఒక్క రోజు చాలు, మీ కండ్లతో అక్కడి రైతుల కడగండ్లు చూడండి అని శుక్లా అన్నాడు. నేను లక్నో నుండి కాన్పూర్ వెళ్ళాను. అక్కడికి కూడా రాజకుమార్ శుక్లా వచ్చాడు. యిక్కడికి చంపారన్ బాగా దగ్గర. ఇప్పుడే వచ్చి అక్కడ ఒక్కరోజు ఉండండి అన్నాడు. ఇప్పుడు నన్ను మన్నించండి నేను తప్పక వస్తాను. మాట యిస్తున్నాను అని ఇంకా ఎక్కువగా పట్టుబట్టాను. నేను ఆశ్రమం చేరుకున్నాను. రాజకుమార్ శుక్లా అక్కడికి కూడా వచ్చాడు. ఎప్పుడు వచ్చేది నిర్ణయించండి అని అన్నాడు. మీరు వెళ్ళండి. నేను ఫలానా తేదీన కలకత్తా వస్తాను. అక్కడికి వచ్చి నన్ను తీసుకువెళ్లండి అని చెప్పాను. అక్కడ ఎవరి దగ్గర వుండాలో, ఎవరిని చూడాలో కూడా నాకు తెలియదు. కలకత్తాలో భూపేన్ బాబుగారి ఇంట్లో బస చేద్దామని వెళ్ళాను. అక్కడ రాజకుమార్ శుక్లా ప్రత్యక్షమయ్యాడు. చదువురాని అమాయకంగా వున్న యీ పల్లెటూరి రైతు తన నిర్ణయాత్మక శక్తి ద్వారా నా హృదయం జయించాడు. 1917 ప్రారంభంలో మేమిద్దరం కలకత్తా నుండి బయలుదేరాం. మా యిద్దరి జోడా ఒకటిగా వున్నది. ఇద్దరం రైతుల్లా వున్నాం. ఇది నా మొదటి పాట్నా యాత్ర. తిన్నగా ఎవరి ఇంటికైనా వెళ్ళి బస చేద్దామంటే నాకు తెలిసినవారు అక్కడ ఎవ్వరూ లేదు. రాజకుమార్ శుక్లా చదువురాని రైతు. అయినప్పటికీ ఆయనకు తెలిసినవారు అక్కడ వుంటారనే అనుకున్నాను. రైల్లో ఆయనను కొంచెం ఎక్కువగా తెలుసుకొనే అవకాశం చిక్కింది. పాట్నాలో ఆయన రహస్యం బయటపడింది. రాజకుమార్ పూర్తిగా అమాయకుడు. ఆయన తన మిత్రుడని భావించిన వకీలు నిజానికి ఆయన మిత్రుడు కాడు. రాజకుమార్ శుక్లా ఆయనను ఆశ్రయించుకొని వున్నాడని తేలింది. కక్షిదారులగు రైతులకు, వకీళ్ళకు వుండే సంబంధం వర్షఋతువులో గంగానది ప్రవాహం వంటిది గదా! నన్ను ఆయన తిన్నగా రాజేన్‌బాబుగారింటికి తీసుకువెళ్ళాడు. రాజేన్‌బాబు పూరీ నగరమో లేక మరో చోటికో వెళ్ళారు. వారి బంగళాలో యిద్దరు నౌకర్లు ఉన్నారు. తినడానికి నాదగ్గర కొంత ఆహారపదార్థం ఉన్నది. కర్జూరం అవసం అయింది. పాపం రాజకుమార్ శుక్లా బజారుకు వెళ్ళి తెచ్చిపెట్టాడు.

బీహారులో అంటరానితనం అపరిమితంగా వున్నది. నా బాల్టీయందలి నీటి బొట్లు పడితే మైలపడతామని అక్కడి నౌకర్లు భావించారు. నా కులం ఏమిటో ఆ నౌకర్లకు తెలియదు! రాజకుమార్ లోపలి పాయిఖానా దొడ్డి ఉపయోగించమని నాకు చెప్పాడు. కానీ నౌకరు బయట ఉన్న పాయిఖానా దొడ్డిని వ్రేలితో చూపించాడు. నాకు బాధ కలుగలేదు. కోపం రాలేదు. ఇలాంటి అనుభవాలు చాలా కలిగినందున నేను

రాటు తేలిపోయాను. నౌకరు తన కర్తవ్యాన్ని పాలిస్తున్నాడు. రాజేంద్రబాబు యెడ తన కర్తవ్యాన్ని అతడు పాలిస్తున్నాడు అంతే. ఇట్టి వినోదం కలిగించే అనుభవాల వల్ల రాజ్‌కుమార్ శుక్లా యెడ నాకు గల గౌరవం పెరిగింది. వారిని గురించిన జ్ఞానం కూడా బాగా పెరిగింది. పాట్నా నుండి ఇక పగ్గాలు నా చేతికి తీసుకున్నాను.

## 13. బీహారీల అమాయకత్వం

మౌలానా మజహరుల్ హక్ మరియు నేను లండనులో కలిసి వున్నాం. తరువాత మేము 1915లో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ యందు కలుసుకున్నాం అప్పుడు ఆయన ముస్లింలీగ్ అధ్యక్షుడు. పాత పరిచయాన్ని తిరగవేసి ఈ మారు పాట్నా వచ్చినప్పుడు మా యింటికి దయచేయండి అని చెప్పాడు. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకొని నా రాకకు కారణం తెలుపుతూ వారికి జాబు వ్రాసాను. వెంటనే ఆయన కారు తీసుకొని వచ్చి తన ఇంటికి రమ్మని పట్టుపట్టారు. ఆయనకు ధన్యవాదాలు తెలిపి నేను ఫలానా చోటుకు వెళ్లాలి, యిప్పుడు ఏ రైలు వుంటే దానిలో నన్ను ఎక్కించండి అని అన్నాను. రైల్వే గైడు చూస్తే నాకు ఏమీ బోధ పడలేదు. రాజకుమార్ శుక్లాతో మాట్లాడి, మీరు ముందు ముజప్ఫర్ పూరు వెళ్లాలి అని చెప్పి ఆరోజు సాయంత్రం ముజప్ఫర్ పూరుకు వెళ్ళే రైలు ఎక్కించారు. ఆచార్య కృపలానీ అప్పుడు ముజప్ఫర్ పూర్‌లో వున్నారు. వారిని నేను ఎరుగుదును. ఆయన ముజప్ఫర్‌పూర్ కాలేజీలో ప్రొఫెసరుగా వున్నారు. ప్రస్తుతం ఆ పనికూడా మానుకున్నారు. నేను వారికి తంతి పంపాను. రైలు ముజప్ఫర్ పూరుకు అర్ధరాత్రి చేరింది. ఆయన తన శిష్యమండలితో రైలు స్టేషనులో సిద్ధంగా వున్నారు. ఆయనకు అక్కడ ఇల్లు లేదు. ప్రొఫెసరు మల్కానీ గారి యింట్లో వుంటున్నారు. నన్ను వారింటికి తీసుకొని వెళ్లారు. ఆనాటి పరిస్థితుల దృష్ట్యా గవర్నమెంటు కాలేజీలో ప్రొఫెసరుగా పనిచేస్తున్న వ్యక్తి నా వంటివాణ్ణి తన గృహంలో ఉండనీయడం గొప్ప విశేషమే.

కృపలానీ బీహారు స్థితిని గురించి, ముఖ్యంగా తిరహుత్ ప్రాంతపు దీనగాథను గురించి చెప్పారు. నేను పూనుకోబోతున్న పని ఎంత కష్టమైనదో కూడా చెప్పారు. గయాబాబు యిక్కడ పేరుగల వకీలు. వారి పక్షాన వారింటికి రమ్మని నేను ఆహ్వానిస్తున్నాను. మేమంతా గవర్నమెంటుకు భయపడేవాళ్లమే. అయినా చేతనైనంత సహాయం మీకు చేస్తాం. రాజకుమార్ శుక్లా చెప్పిన మాటలు చాలా వరకు నిజమే. అయితే ఆయన నాయకుడు. యివాళ యిక్కడ లేడు. బాబూ ప్రజకిషోర్ మరియు

బాబూ రాజేంద్ర ప్రసాదుకు తంతి పంపాము. వాళ్లిద్దరూ వస్తారు మీకు విషయమంతా చెబుతారు. సాయం చేస్తారు. దయయుంచి మీరు గయాబాబు గారింటికి బయలుదేరండి'' అని అన్నారు. ఈ మాటలు విని నేను మెత్తబడ్డాను. నేను బసచేస్తే గయాబాబుగారికి యిబ్బంది కలుగుతుందేమోనని సంకోచించాను. కాని గయాబాబు సంకోచించవద్దని నాకు చెప్పారు. నేను గయాబాబు గారింటికి వెళ్లాను వారు, వారి కుటుంబంలోని వారు నన్ను ప్రేమ జల్లుతో తడిపివేశారు

ప్రజకిషోర్ బాబు దర్భంగా నుండి వచ్చారు. రాజేంద్రబాబు పూరీ నుండి వచ్చారు. లక్నోలో నేను చూచిన ప్రజకిషోర్ బాబు సామాన్యుడు కాదని తేలింది. బీహారు ప్రజలకుండే సహజ వినమ్రత, సాదాతనం, మంచి మనస్సు, అసాధారణమైన శ్రద్ధ వారిలో చూచి నా హృదయం ఆనందంతో నిండిపోయింది. బీహారు వకీళ్లు వారి యెడ చూపించిన అదరం నాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆ మండలి సభ్యులకు నాకు మధ్య ఏర్పడ్డ ప్రేమబంధం జీవితాంతం విడిపోకుండా నిలిచిపోయింది. ప్రజకిషోర్‌బాబు అక్కడ విషయాలన్నీ నాకు వివరంగా చెప్పారు. ఆయన బీదరైతుల పక్షాన కోర్టుల్లో వాదిస్తున్నారని, రెండు మూడు కేసులు అట్టివి నడుస్తున్నాయని, ఆ కేసుల్లో వాదించి వ్యక్తిగతంగా కొంత ఊరట చెందుతూ వున్నారని తెలుసుకున్నాను. అప్పుడప్పుడు అందు ఓడిపోతూ వుంటారట. అమాయకులైన ఆ రైతుల దగ్గర సొమ్ము తీసుకుంటూ వుంటారట. త్యాగులే అయినా ప్రజ కిషోర్‌బాబు, రాజేంద్రప్రసాద్‌లు కక్షిదారులగు రైతుల దగ్గర ధనం తీసుకుంటూ వుంటారని, అందుకు సంకోచించరనీ తెలిసింది. వృత్తిపరంగా డబ్బు తీసుకోకపోతే మా ఇంటి ఖర్చులకు డబ్బు ఎలా వస్తుందని వారి తర్కం. అట్టి డబ్బుతోనే సమాజ సేవ కూడా చేయగలుగుతున్నామని చెప్పారు. వారికి లభించే సొమ్ముకు, బెంగాల్ బీహారుకు చెందిన మిగతా బారిష్టర్లకు లభించే సొమ్ముకు గల ఊహకైనా అందని వ్యత్యాసాన్ని అంకెల రూపంలో బారిష్టర్లకు లభించే సొమ్ముకు గల ఊహకైనా అందని వ్యత్యాసాన్ని అంకెల రూపంలో తెలుసుకుని నివ్వెరబోయాను.

"బాబు గారికి మేము ఒపీనియన్ (అభిప్రాయం) కోసం పదివేలు యిచ్చాం.' ' అని జనం చెబుతూ వుంటే ఆశ్చర్యం వేసింది. వెయ్యికి తక్కువ మాట నాకు వినబడలేదు. ఈ విషయంలో నేను తియ్యగా ఆ మిత్రమండలిని మందలించాను. ఓర్పుతో నా మందలింపును వారు సహించారు. విపరీతార్థాలు తియ్యలేదు. అంతా విన్న తరువాత "ఇక యిట్టి కేసులు మనం విరమించుకోవాలి. యీ విధమైన కేసుల

వల్ల ప్రయోజనం శూన్యం. అణగారిపోయి భయభ్రాంతులై వున్న రైతు సోదరుల్ని కచ్చేరీల చుట్టూ త్రిప్పితే లాభం లేదు. అది సరియైన చికిత్స కాదు. వాళ్లకుగల భయాన్ని పోగొట్టాలి. అదే సరియైన చికిత్స. తిన్‌కఠియా రివాజు రద్దుకావాలి. అప్పటివరకు మనం విశ్రమించకూడదు. రెండు రోజుల్లో సాధ్యమైనంతగా చూచి తెలుసుకుందామని వచ్చాను. అయితే యీ పనికి రెండు సంవత్సరాలు పట్టవచ్చని తోస్తున్నది. అంత సమయం యివ్వడానికి సిద్ధంగా వున్నాను. యిందుకు ఏంచేయాలో నిర్ణయిస్తాను, కాని మీ సాయం కావాలి" అని స్పష్టంగా చెప్పాను.

వ్రజ కిషోర్‌బాబు అసలు విషయం అర్థం చేసుకున్నారు. అయితే నాతోను మిగతా వారితోను తర్కం చేయసాగారు. నామాటల్లో గర్భితమైయున్న భావాన్ని గురించి ప్రశ్నించాను మీ అభిప్రాయంలో వకీళ్లు చేయాల్సిన త్యాగం ఏమిటి? ఎంతవరకు ? ఎంతమంది వకీళ్లు కావాలి ? కొద్దిమంది కొద్దికాలం పనిచేస్తే సరిపోతుందా లేదా ? మొదలగు ప్రశ్నలు వేశారు. మీరంతా ఎంత త్యాగం చేస్తారో చెప్పండి అని ఆయన మిగతా వకీళ్లను అడిగారు. ఈ విధమైన చర్చ సాగించి చివరికి "మేము యింత మందిమి మీరు అప్పగించిన పని చేయడానికి సిద్ధంగా వుంటాము. వారిలో ఎవరిని మీరు ఎప్పుడు రమ్మంటే అప్పుడు మీ దగ్గరకు వస్తాము. జైలుకు వెళ్లాలంటే మరి అది మాకు క్రొత్త అందుకు అవసరమైన శక్తి చేకూర్చుకునేందుకు ప్రయత్నిస్తాం" అని తమ నిర్ణయాన్ని ఆయన ప్రకటించారు.

## 14. అహింసాదేవి సాక్షాత్కారం

నేను రైతుల పరిస్థితిని పరీక్షించాలి నీలిమందు కొఠార్ల యజమానులగు తెల్లదొరలకు వ్యతిరేకంగా వచ్చిన ఆరోపణల్లో ఎంత నిజం వున్నదో తెలుసుకోవాలి. యీ విషయమై వేలాది రైతుల్ని కలవాలి. వారిని కలుసుకునే ముందు నీలిమందు కొఠారుల యజమానుల్ని కలిసి వాళ్ళు చెప్పేది కూడా వినాలి. కమీషనరుకు జాబులు వ్రాశాను. యజమానుల సంఘ కార్యదర్శి ఒకడు వున్నాడు. వెళ్లి కలిశాను. "నీవు పరదేశివి. మాకు, రైతులకు మధ్య నీవు కల్పించుకోవద్దు. ఏమైనా చెప్పదలచుకుంటే లిఖితంగా వ్రాసి పంపు". అని ఆయన అన్నాడు ఆయన మాటకు వినమ్రంగా జవాబిస్తూ "నేను పరదేశిని కాను రైతులు కోరినందువల్ల వారి యీ వ్యవహారం క్షుణ్ణంగా తెలుసుకొనే అధికారం నాకు వున్నది." అని చెప్పాను. కమీషనరును కలిశాను, ఆయన నన్ను చూడగానే మండిపడ్డాడు. బెదిరించాడు, తిరహుత్ నుండి

తిరుగుముఖం పట్టమని చెప్పివేశాడు. అనుచరులకు ఈ విషయమంతా చెప్పి ఇక వ్యవహారం తీవ్రరూపం దాలుస్తుంది. రైతుల పరిస్థితుల్ని పరీక్షించేందుకు ప్రభుత్వం నన్ను వెళ్ళనీయదు. నేను ఊహించినదాని కంటే ముందే నేను జైలుకు వెళ్లక తప్పదు. మోతీహారీలోగాని లేక అవకాశం దొరికితే బేతియాలోగాని నేను అరెస్టు కావడం మంచిది. నేను త్వరగా అక్కడికి చేరుకోవాలి అని అన్నాను.

చంపారన్ తిరహత్ కమీషను యందలి ఒక జిల్లా. దానికి మోతీహారీ ప్రధాన కేంద్రం. బేతియాకు దగ్గరలో రాజకుమార్ శుక్లాగారి ఇల్లు వున్నది. అక్కడి కొఠార్లకు సంబంధించిన రైతులు కడు నిరుపేదలు. వారి పరిస్థితుల్ని చూపించాలని శుక్లాకు ఆరాటం ఎక్కువగా వున్నది నేను అక్కడికి వెళ్లి వారిని చూడాలి అని భావించాను. వెంటనే అనుచరులందరినీ వెంటబెట్టుకొని మోతిహారీకి బయలుదేరాను. మోతిహారీలో గోరఖ్‌బాబు ఆశ్రయం. వారిల్లు సత్రంగా మారిపోయింది. మేము వారింటినంతటిని ఆక్రమించాం. మేము చేరిననాడే అక్కడికి దగ్గరలో అయిదు మైళ్ల దూరాన వున్న గ్రామంలో ఒక రైతు మీద దుర్మార్గం జరిగిందను వార్త మాకు అందింది. అతణ్ణి చూచేందుకు ధరణీధర బాబు అను వకీలును వెంటబెట్టుకొని నేను ఉదయాన వెళ్ళాలని నిర్ణయించాను. ఆ ప్రకారం ఏనుగు మీద ఎక్కి మేము ఆ గ్రామానికి బయలుదేరాం. గుజరాత్‌లో ఎడ్లబండిని ఉపయోగించిన విధంగా చంపారన్‌లో ఏనుగుల్ని ఉపయోగిస్తారు. సగం దూరం చేరామో లేదో ఇంతలో పోలీసు సూపరింటెండెంటు దూత అక్కడికి వచ్చి "సూపరింటెండెంట్ గారు మీకు సలాము చెప్పమన్నారు" అని అన్నాడు. వెంటనే విషయం గ్రహించాను ధరణీధరబాబును ముందుకు వెళ్లమని చెప్పి వార్తాహరునితో బాటు అతను తెచ్చిన కిరాయి బండి ఎక్కాను. అతడు చంపారన్ వదలి వెళ్లిపొమ్మని నోటీసు నాకు యిచ్చి కాగితం చూపి సంతకం చేయమని అన్నాడు. "నేను చంపారన్ వదలి వెళ్ళను. నేను యిక్కడి పరిస్థితుల్ని పరీక్షించాల్సి వున్నది" అని సమాధానం వ్రాసి అతనికి యిచ్చాను. మరుసటి రోజున చంపారన్ వదలి వెళ్ళనందువల్ల కోర్టులో హాజరుకమ్మని సమను నాకు అందింది. ఆ రాత్రంతా మేలుకొని నేను వ్రాయవలసిన జాబులన్నీ వ్రాశాను. అవసరమైన సూచనలన్నీ వ్రాసి ప్రజకిషోర్‌బాబుకు యిచ్చాను.

కోర్టువాళ్లు సమను పంపారను వార్త క్షణంలో జనానికి తెలిసిపోయింది. మోతిహారీలో ఎన్నడూ కనీవినీ ఎరుగని ఘట్టం జరిగిందని ప్రజలు గోలపెట్టారు. గోరఖ్‌బాబుగారి యింటిదగ్గర, కోర్టు దగ్గర గుంపులు గుంపులుగా జనం చేరారు.

అదృష్టవశాత్తూ ఆ రాత్రే పనులన్నీ పూర్తిచేయడం వల్ల ఆ జనాన్ని శాంతింపచేసేందుకు నాకు అవకాశం చిక్కింది. నా అనుచరుల వల్ల కలిగే ఉపయోగమేమిటో నాకు బోధపడింది. వాళ్లు జనాన్ని వరసగా నిలబెట్టడం ప్రారంభించారు. కోర్టులో ఎక్కడికి వెళితే అక్కడ నా వెంట ఒకటే జనం. కలెక్టరు, మేజిస్ట్రేట్, సూపరింటెండెంటుతో కూడా నాకు సంబంధం ఏర్పడింది. గవర్నమెంటువారి నోటీసుల్ని ఒప్పుకున్నాను. అధికారులతో ఎంతో మంచిగా వ్యవహరించాను. దానితో వారందరికీ నా విషయమై భయం పోయింది. వారిని మంచిగానే వ్యతిరేకిస్తానని వాళ్లకు బోధపడింది. నన్ను అదుపులో పెట్టడానికి బదులు జనాన్ని అదుపులో పెట్టడానికి నా అనుచరులకు సంతోషంతో వాళ్లు సహకరించడం ప్రారంభించారు. దానితోబాటు తమ అధికార ప్రాబల్యం ఆనాటితో తగ్గిపోయిందని వాళ్లు గ్రహించారు. ప్రజలు ఆ క్షణం గవర్నమెంటు అధికారుల దండన, శిక్షల భయం మరచిపోయి తమ క్రొత్త మిత్రుని యెడ గల ప్రేమ యొక్క ఆధిపత్యానికి లోబడిపోయారని అందరికీ స్పష్టంగా తెలిసిపోయింది.

నిజానికి చంపారన్‌లో నన్ను ఎవ్వరూ ఎరుగరు. రైతులు నిరక్షరకుక్షులు. చంపారన్ గంగానదికి ఆవలి ఒడ్డున హిమాలయ పర్వత చరియల్లో నేపాలుకు దగ్గరగా వున్న ప్రాంతం. అంటే అది ఒక క్రొత్త ప్రపంచమన్నమాట. అక్కడ కాంగ్రెస్ అంటే ఏమిటో ఎవ్వరికీ తెలియదు. కాంగ్రెస్ మెంబరు ఒక్కడు కూడా అక్కడ లేడు. కొందరి పేర్లు వినపడ్డా వారు భయంతో నక్కి కూర్చున్నారు. కాంగ్రెస్ పేరు తెలియకపోయినా యీనాడు కాంగ్రెస్ జరిగినంతపని అయింది. అనేకమంది సేవకులు కాంగ్రెసులో చేరినట్లయింది. అక్కడ కాంగ్రెస్ ప్రారంభమైందని అనిపించింది. అనుచరులతో సంప్రదించిన పిమ్మట కాంగ్రెస్ పేరట ఏ పనీ చేయకూడదని నిర్ణయించాం. పేరుతో అవసరం లేదు. పనిముఖ్యం అని భావించాం. మాటలు కాదు చేతలు ముఖ్యం అని నిర్ణయించాం. కాంగ్రెస్ పేరు ఎవ్వరికీ ఇష్టం కాలేదు. యీ పరగణాలో కాంగ్రెసంటే ప్లీడర్ల వాద ప్రతివాదాలు, చట్ట సంబంధమైన ఛిద్రాలతో తలపడటం అని ప్రచారం అయింది. కాంగ్రెస్ అంటే బాంబులనీ, మాటలే కాని చేతలు లేనిదని యిక్కడి గవర్నమెంటు, మరియు దానికి దన్నుగా నిలబడియున్న తెల్లదొరల అభిప్రాయం. అట్టి కాంగ్రెస్‌కు, యిక్కడి కాంగ్రెస్‌కు తేడావున్నదని మేము రుజువు చేయవలసిన అవసరం ఏర్పడింది. అందువల్ల కాంగ్రెస్ ఊసే ఎత్తకుండా పనిచేయాలని భావించాం. కాంగ్రెస్ పేరుతో గాక, దాని లక్ష్యాలను ప్రజలు తెలుసుకుంటే చాలునను నిర్ణయానికి వచ్చాం.

అందువల్ల కాంగ్రెస్ పేరట రహస్యంగాని, బహిరంగంగా గాని ఏ పనీ చేయలేదు. రాజకుమార్ శుక్లాకు వేలాదిజనంతో కలిసిపోయే శక్తిలేదు. రాజకీయంగా అక్కడ యింతవరకు ఎవ్వరూ పనిచేసి యుండలేదు. చంపారన్ బయటగల ప్రపంచాన్ని ఆయన ఎరుగడు. అయితే మా యిరువురి కలయిక పాతమిత్రుల కలయికగా పరిణమించింది. ఆ రూపంలో నేను దేవుణ్ణి, అహింసను, సత్యాన్నీ దర్శించాను. ఇది అక్షరాలా నిజం. ఈ విషయమై నాకు గల అధికారం ఏమిటి అని ఆలోచిస్తే ప్రేమ తప్ప వేరే ఏమీలేదని ప్రేమ, అహింసల ఎడ నాకు గల నిశ్చలమైన శ్రద్ధ తప్ప మరేమీ లేదని తేలింది.

చంపారన్‌లో జరిగిన ఈ వ్యవహారం నా జీవితంలో మరిచిపోవడానికి వీలులేనిది. అది నాకు, రైతులకు ఉత్సవదినం. ప్రభుత్వ నిర్ణయ ప్రకారం నామీద కేసు నడపబోతున్నది. ఆ కేసు నామీద కాక ప్రభుత్వం మీదనే నడవబోతున్నదన్న మాట. నా కోసం కమీషనరు పరిచిన వలలో ఆంగ్ల ప్రభుత్వమే చిక్కుకోబోతున్నదని వాళ్లు అప్పుడు గ్రహించలేదు.

## 15. కేసు ఉపసంహరణ

నా మీద కేసు నడిచింది. గవర్నమెంటు వకీలు, మరియు మేజిస్ట్రేటు కంగారుపడ్డారు. ఏం చేయాలో వారికి పాలుపోలేదు. గవర్నమెంటు వకీలు విచారణను వాయిదా వేయమని ప్రార్థించాడు. నేను చంపారన్ వదిలివెళ్లమని యిచ్చిన నోటీసుని ఖాతరు చేయలేదు. అపరాధం అంగీకరిస్తున్నాను అని అంటూ నేను వ్రాసుకొచ్చిన క్రింది పారాన్ని కోర్టులో చదివి వినిపించాను

"చట్టప్రకారం సెక్షను 144 క్రింద విధించబడ్డ ఆదేశాన్ని ఉల్లంఘించవలసి వచ్చిన కారణాల్ని మీ అనుమతితో క్లుప్తంగా వివరించదలచుకున్నాను. అది నిరాదరణకు సూచకం కాదని మనవి చేస్తున్నాను. యిక్కడి ప్రభుత్వానికి నాకు మధ్య గల అభిప్రాయ భేదమే ఇందుకు కారణం. ప్రజాసేవ ద్వారానే దేశసేవ చేయడానికి నేను యిక్కడికి వచ్చాను. ఇక్కడి రైతులను యజమానులు సరిగా చూడటం లేదు. అందు నిమిత్తం నన్ను గట్టిగా కోరినందున వారి స్థితిని చూచి సరిచేద్దామనే ఉద్దేశ్యంతో వివరాలన్నీ తెలుసుకుందామని వచ్చాను. నా రాకవలన శాంతి భంగం వాటిల్లుతుందని గాని, రక్తపాతం జరుగుతుందనిగాని నేను భావించడం లేదు. యిట్టి విషయాలలో నాకు మంచి అనుభవం వున్నదని మనవి చేస్తున్నాను. కాని గవర్నమెంటు మరోవిధంగా తలుస్తున్నది. ప్రభుత్వానికి గల యిబ్బంది కూడా నేనెరుగుదును.

తనకు అందిన సమాచారం మీదనే ప్రభుత్వం ఆధారపడవలసి వస్తుంది. నేను ప్రజాహితం చేస్తూ అందుకు సంబంధించిన చట్టాల్ని ఆమోదించి ఆ ప్రకారం నడుచుకోవాలని భావించేవాణ్ణి. కాని నాకిచ్చిన ప్రభుత్వ ఆదేశాన్ని పాటించితే ప్రజలకు నేను న్యాయం చేయలేనని భావిస్తున్నాను. వారి మధ్యన వుండి మాత్రమే నేను యిక్కడి ప్రజలకు సేవ చేయగలనని నమ్ముతున్నాను. అందువల్ల నేను యిప్పుడు చంపారన్ విడిచి వెళ్లలేను నాకిది ధర్మసంకటం. అందువల్ల చంపారన్ వదిలి వెళ్లమని ప్రభుత్వం యిచ్చిన ఆ దేశపు బాధ్యత ప్రభుత్వానిదేనని సూచించవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను." "భారతదేశంలో ప్రజాజీవనమునందు నా వంటి గౌరవ ప్రతిష్టలు గల వ్యక్తి ఒక చర్యకు పూనుకొన్నప్పుడు ఎంతో జాగ్రత్త వహించవలసియున్నదని నాకు తెలుసును. కాని నాకు యిక్కడ కల్పించబడిన పరిస్థితిని ఆత్మాభిమానం గల వ్యక్తి ఎవ్వడూ అంగీకరించలేదని చెప్పవలసిన అవసరం కలగడం దురదృష్టకరం. ప్రభుత్వ స్థానిక అధికారుల ఆదేశం కంటే, నా అంతర్వాణి పెద్దదని, దాని ఆదేశాన్ని పాలించడం నా కర్తవ్యమని భావిస్తున్నాను."

నా ప్రకటనతో కేసును వాయిదా వేయవలసిన అవసరం లేకుండాపోయింది. యిలా జరుగుతుందని వకీలుగాని, మేజిస్ట్రేటుగాని ఊహించలేదు. అందువల్ల శిక్ష విధించేందుకు కోర్టువారు కేసును ఆపి వుంచారు. నేను యీ వివరమంతా తంతి ద్వారా వైస్రాయికి తెలియజేశాను పాట్నాకు కూడా తంతి పంపాను. భారత భూషణ్ పండిత మదనమోహన మాలవ్యా వంటి పెద్దలకు కూడా తంతి పంపాను నేను కోర్టుకు బయలుదేరబోతూ వుండగా వైస్రాయి గారి ఆదేశం ప్రకారం కేసును ఉపసంహరించుకోవడమైనదని మేజిస్ట్రేటు నాకు సమాచారం అందజేశాడు. మీరు చేయదలచిన పరీక్షలు చేయండి అని కలెక్టరు నుండి జాబు అందింది. అధికారుల సహాయం పొందవచ్చునని ఆ జాబులో ఆయన సూచించాడు. మా చర్యకు యింత త్వరగా శుభ పరిణామం కలుగుతుందని కలలో కూడా మేము ఊహించియుండలేదు.

నేను కలెక్టరు మి. హెకోసును కలిశాను. అతడు మంచివాడుగా కనబడ్డాడు. మీరు అవసరమనుకున్న పత్రాలన్నీ చూడవచ్చు. అవసరమని అనుకున్నప్పుడు మీరు తిన్నగా వచ్చి నన్ను కలుసుకోవచ్చు. ఏ సాయం కావాలనాన్న మీకు అందిస్తాను అని ఆయన చెప్పాడు.

మరో వైపున భారతదేశానికి సత్యాగ్రహం అంటే ఏమిటో, చట్టాన్ని సవినయంగా ఉల్లంఘించడం అంటే ఏమిటో పాఠం నేర్పినట్లయింది. పత్రికల ద్వారా నా యీ

వ్యవహారానికి పెద్ద ప్రచారం లభించింది. చంపారన్‌లో, నాయీ కార్యక్రమానికి ప్రఖ్యాతి లభించింది. నేను అక్కడి పరిస్థితుల్ని పరీక్షిస్తున్నప్పుడు ప్రభుత్వం దృష్టిలో కూడా నేను నిష్పక్షంగా వ్యవహరించడం అవసరమని అయితే అందుకు పత్రికా విలేఖరులను తీసుకొని వెళ్లి వాళ్ల ప్రకటనలు వెలువరించవలసిన అవసరం లేదని నిర్ణయించాను. వాళ్లు పెద్ద పెద్ద రిపోర్టులు పత్రికల్లో ప్రకటిస్తే అపకారం కూడా జరుగవచ్చు. అందువల్ల చాలామంది పత్రికా సంపాదకులకి మీ విలేఖర్లను పంపవద్దని అవసరమైన వివరాలు నేనే మీ విలేఖర్లకు అందజేస్తూ వుంటానని జాబులో వ్రాశాను. చంపారన్‌లో గల తెల్ల ఖామందులు బాగా కోపంగా వున్నారని నాకు తెలుసు. అధికారులు కూడా లోపల సంతోషంగా వుండరని తెలుసు. వాళ్లకు కోపం వస్తే నన్నేమీ చేయలేరు కాని పాపం అక్కడి నిరుపేదలగు రైతుల్ని యమబాధలు పెడతారని, అందువల్ల నేను చేయదలచుకున్న విచారణ సరిగా జరుగదని గ్రహించాను. తెల్లదొరలు అప్పుడే విషప్రచారం ప్రారంభించారు. వాళ్లు నాకు, నా అనుచరులకు వ్యతిరేకంగా అబద్ధపు ప్రకటనలు పత్రికల్లో ప్రకటించడం ప్రారంభించారు. నేను ఎంతో జాగ్రత్తగా వున్నందున, బహు చిన్న విషయాలలో సైతం సత్యం మీద ఆధారపడియున్నందున తెల్లదొరలు ప్రయోగించిన బాణాలు గురి తప్పిపోయాయి. ప్రజకిషోర్‌బాబును బాగా దుమ్మెత్తి పోశారు. తెల్లదొరలు వారిని నిందించిన కొద్దీ వారి గౌరవ ప్రతిష్టలు బాగా పెరిగిపోయాయి.

ఇట్టి సున్నితమైన వాతావరణంలో రిపోర్టర్లను వెంటవుండమని నేను ప్రోత్సహించలేదు. నాయకుల్ని కూడా ఆహ్వానించలేదు. "అవసరమైనప్పుడు తనను పిలవమని, తాను సిద్ధంగా వున్నానని" పండిత మదనమోహన మాలవ్యాగారు మనిషి ద్వారా వార్త పంపారు. అయినా వారికి కూడా నేను శ్రమ కలిగించలేదు. యీ సమస్యను నేను రాజకీయం చేయదలచలేదు. ఎప్పటికప్పుడు జరిగిన వివరాలు పత్రికలకు పంపుతూ వున్నాను. రాజకీయ సంబంధమైన వ్యవహారాలకు కూడా, రాజకీయ అవసరం లేనప్పుడు రాజకీయ రూపం కల్పించితే రెంటికీ చెడిన రేవడి చందమవుతుంది. యీ విధంగా అసలు విషయాన్ని స్థలం మారకుండా అక్కడే వుండనిస్తే అంతా సర్దుకుంటుందని నా విశ్వాసం. ఎన్నో పర్యాయాలు కలిగిన అనుభవం వల్ల నేను యీ విషయం గ్రహించాను. పరిశుద్ధమైన ప్రజాసేవయందు ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా రాజకీయం తప్పక పనిచేస్తుంది. చంపారన్‌లో జరిగిన పోరాటం యీ విషయాన్ని రుజూ చేసింది.

# 16. కార్య విధానం

చంపారన్ పరిస్థితుల్ని వివరించడమంటే చంపారన్ రైతుల చరిత్రను వివరించడమే. ఆ వివరాలన్నీ యీ ప్రకరణాలలో పేర్కొనడం సాధ్యం కాదు. చంపారన్‌లో జరిపిన పరిశీలనంతా అహింసా ప్రయోగమే. అందుకు సంబంధించిన వివరాలు అవసరమైనంత వరకే వివరించాను. మొత్తం వివరాలు తెలుసుకోదలచిన పాఠకులు బాబూ రాజేంద్ర ప్రసాద్ యీ సంగ్రామాన్ని గురించి వ్రాసిన గ్రంథం చదవవచ్చును లేక యుగధర్మ్ ప్రెస్ ద్వారా ప్రకటించబడ్డ ఆ గ్రంథపు గుజరాతీ అనువాదం చదవవచ్చు.

ఇక అసలు విషయానికి వద్దాం. గోరఖ్‌బాబుగారి యింటి దగ్గర వుండి నేను యీ పరిశీలనా కార్యక్రమం నిర్వహించియుంటే వారు యిల్లు వదిలి పెట్టి వెళ్లవలసి వచ్చేదే. మోతీహారీలో కిరాయి చెల్లించినా యిల్లు యిచ్చే పరిస్థితిలో ఎవ్వరూ లేరు. అందుకు భయమే కారణం కాని బ్రజకిషోర్‌బాబు వ్యవహారదక్షులు. ఆయన అద్దెకు ఒక పెద్ద భవనం సంపాదించారు. మేమంతా ఆ యింటికి వెళ్లాం. అక్కడ డబ్బు లేకుండా పని జరిగే పరిస్థితి లేదు యిటువంటి ప్రజాకార్యక్రమాలకు ప్రజల దగ్గర విరాళాలు తీసుకునే పద్ధతి ప్రారంభం కాలేదు. బ్రజకిషోర్‌బాబు, వారితో బాటు వున్న మిత్రమండలి వారంతా వకీళ్లే. వాళ్లు తమ ఖర్చులు తామే భరిస్తూ, అవసరమైతే మిత్రుల దగ్గర డబ్బు తీసుకోకూడదని నా దృఢనిర్ణయం. వాళ్ల దగ్గర డబ్బు తీసుకుంటే ఉద్యమ అర్థం మారిపోతుందని నా అభిప్రాయం. యీ కార్యక్రమం కోసం దేశప్రజల్ని కూడా డబ్బు అడగకూడదని నా నిర్ణయం. అలా తీసుకుంటే వ్యవహారానికి రాజకీయరంగు పులిమే ప్రమాదం వున్నది. బొంబాయి మిత్రుల నుండి 15 వేల రూపాయలు ఇస్తామని ఒక తంతి వచ్చింది. కృతజ్ఞతలు తెలిపి వాళ్ల కోరికను నిరాకరించాం. బాగా ఆలోచించి చంపారన్ బయటవుండే బీహారుకు చెందిన ధనికుల దగ్గర బ్రజకిషోర్‌బాబు బృందం సాధ్యమైనంత డబ్బు ప్రోగుచేయాలని, లోటుపడితే డాక్టర్ ప్రాణజీవన్‌దాస్ మెహతాగారి దగ్గర డబ్బు తీసుకొని భర్తీ చేస్తానని నేను చెప్పాను. అవసరమైనంత డబ్బు వ్రాసి తెప్పించుకోమని డాక్టర్ మెహతాగారు మొదటే నాకు వ్రాశారు. దానితో డబ్బును గురించి చింత తొలగిపోయింది. తక్కువ డబ్బు ఖర్చు పెట్టి యీ సమస్యను పరిష్కరించాలని మా నిర్ణయం. అందువల్ల ఎక్కువ డబ్బు అవసరం పడలేదు. రెండు లేక మూడు వేల రూపాయల కంటే ఎక్కువ డబ్బు అవసరం లేదని భావించాను. వసూలుచేసిన డబ్బులో అయిదు వందలో లేక వెయ్యి రూపాయలో మిగిలినట్లు నాకు గుర్తు.

ఆ రోజుల్లో మా సహచరుల అలవాట్లు విచిత్రంగా వుండేవి. నేను రాజీవారి ప్రవర్తనను గురించి ఛలోక్తులు విసురుతూ వుండేవాణ్ణి. వకీళ్ళ మండలికి వంట విడివిడిగా తయారవుతూ వుండేది. రాత్రిపూట 12 గంటల వరకు భోజనం చేస్తూ వుండేవారు. ఎవరి ఖర్చు వారు భరించినా నాకు వాళ్ల పద్ధతి నచ్చలేదు. మా అందరి మధ్య స్నేహబంధం గట్టిగా బిగుసుకున్నందున ఎవరెన్ని చెప్పినా, ఎవరేమన్నా మా బంధనం వదులుకాలేదు. నేను విసిరే మాటల బాణాల బాధను నవ్వుతూ వారు సహించేవారు. చివరికి నౌకర్లందరినీ పంపించివేయాలని, భోజన నియమాల్ని అంతా పాటించాలని నిర్ణయం చేశాం అందరూ శాకాహారులు కారు. రెండు కుంపట్లు ప్రారంభిస్తే ఖర్చు పెరుగుతుంది. అందువల్ల ఒకే కుంపటి వెలగాలని, శాకాహార భోజనం తయారుచేయాలని, భోజనం బహుసాదాగా వుండాలని నిర్ణయించాం. దానితో ఖర్చు బాగా తగ్గిపోయింది. కార్యశక్తి పెరిగింది. సమయం కూడా బాగా కలిసివచ్చింది.

మా పని బాగా పెరిగిపోయింది రైతులు గుంపులు గుంపులుగా వచ్చి తమ గాధలు వ్రాయించసాగారు. వ్రాసుకునేవారి దగ్గర గుంపులుగా జనం పెరిగిపోయారు. ఇల్లంతా జనంతో నిండిపోయింది. చూడడానికి వచ్చే జనాన్నుంచి నన్ను రక్షించడం కోసం నా సహచరులు ఎంతో శ్రమపడ్డారు. యిక గత్యంతరం లేక సమయం నిర్ధారించి నన్ను బయటకి తీసుకురాసాగారు. ఆరు లేక ఏడుగురు వకీళ్లు రైతులు చెప్పే కథలు రాసుకుంటూ వుండేవారు. అయినా సాయంకాలానికి రాతపని పూర్తి అయ్యేది కాదు. యింతమంది వాఙ్మూలాలు అనవసరం కాని వారు చెప్పింది రాసుకుంటే రైతులు తృప్తిపడతారు. కథలు వ్రాసేవారు కొన్ని నియమాల్ని పాటిస్తూ వుండేవారు. ప్రతి రైతును ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టేవారు. సమాధానం సరిగా చెప్పలేని వారి వాఙ్మూలం రాసుకోకూడదనీ నిరాధారమైన కథలు కూడా రాసుకోకూడదనీ నిర్ణయించాం. అందువల్ల యదార్థమైన గాధలు, ఆధారాలు గల కథలే రాసుకోవడం జరిగింది.

ఈ వాఙ్మూలాలు రాసుకునేటప్పుడు గూఢచారి పోలీసులు తప్పక వుండేవారు. మేము కావాలంటే వాళ్లు ఆగిపోయేవారే. కాని మేము వాళ్లను రానియ్యాలని, వారి విషయంలో వినమ్రంగా వ్యవహరించాలని, అవసరమైన సమాచారం వాళ్ళకు అందజేయాలని నిర్ణయించాం. వాళ్ల కండ్ల ఎదుట రైతులు కథలు చెబుతూ వుండేవారు. యిందువల్ల రైతులకు ధైర్యం వచ్చింది. గూఢచారి పోలీసులంటే జనం

విపరీతంగా భయపడుతూ వుండేవారు. వారి భయం పోయింది. వాళ్లు చెప్పే కథల్లో అతిశయోక్తులు తగ్గిపోయాయి. అబద్ధాలు చెబితే పోలీసులు పట్టుకుంటారనే భయంతో రైతులు నిజం చెబుతూవుండేవారు. తెల్లదొరల్ని భయపెట్టి వారిని పారద్రోలడం నా లక్ష్యం కాదు వారి హృదయాలను జయించాలనే ఉద్దేశ్యంతో నా యీ సంగ్రామం సాగింది. ఫలానా దొరకు వ్యతిరేకంగా వాఙ్మూలాలు వచ్చాయని తెలియగానే జాబులు వ్రాసి వారికి తెలియజేయడమేగాక, వారిని కలిసి మాట్లాడుతూ వుండేవాణ్ణి. తెల్లదొరల బృందాన్ని కలసి వారి సాక్ష్యాలు కూడా సేకరించడం ప్రారంభించాను. వారిలో కొందరు నన్ను అసహ్యించుకునేవారు. కొందరు తటస్థంగా వుండేవారు. కొందరు మంచిగా వ్యవహరించేవారు.

## 17. అనుచరులు

బ్రజకిషోర్‌బాబు మరియు రాజేంద్రబాబుగారలది గొప్ప జోడి. వారిద్దరూ తమ అమితప్రేమచే నన్ను, తాము లేకపోతే ముందుకు సాగలేనంతగా నిర్వీర్యుణ్ణి చేసివేశారు. వారి శిష్యులు లేక అనుచరులు శంభూబాబు, అనుగ్రహబాబు, ధరనీబాబు, రామనవమీ బాబు మొదలగు వకీళ్లు దరివాపు నా వెంటనే వుండేవారు. యిది బీహారీ సంఘం. రైతుల వాఙ్మూలాలు రాయడం వారి పని. ఆచార్య కృపలానీ మాతో కలవకుండా వుండగలరా? వారు స్వయంగా సింధీలే అయినా బీహారులో వుంటూ బీహారీగా మారిపోయారు. వారి వలె ఒక ప్రాంతానికి సంబంధించిన వారు మరో ప్రాంతానికి వెళ్లి అక్కడివారితో కలిసిపోయి, తాము ఆ ప్రాంతంవారిలా మారిపోగలవారు బహుతక్కువ. ఆయన నాకు ద్వారపాలకుని వలె వ్యవహరించారు. చూడటానికి అసంఖ్యాకంగా వస్తున్నవారినుండి నన్ను రక్షించే బాధ్యత వారు వహించారు. అదే తమ జీవన సార్థకత అని భావించారు. ఆయన పరిహాసం చేస్తూ కొందరిని నా దగ్గరకు రాకుండా ఆపివేసేవారు. కొందరిని అహింసాత్మకంగా బెదిరించి ఆపేవారు. రాత్రిపూట ఉపాధ్యాయవృత్తి ప్రారంభించి అక్కడివారినందరిని నవ్విస్తూ, గుండెదిటవు లేనివారికి ధైర్యం చెబుతూ వుండేవారు.

మౌలానా మజహరుల్ హక్ నాకు సహాయకులుగా పేరు నమోదు చేయించుకున్నారు. నెలకు రెండు మూడుసార్లు వచ్చిపోతుండేవారు. వెనుకటి రోజుల్లోగల వారి దర్జాకు, ఆడంబరానికి యిప్పటి సాదా జీవనానికి ఎంతో వ్యత్యాసం వున్నది. మా దగ్గరకు వచ్చి మాలో కలిసిపోతూ వుండేవారు. చంపారన్‌లో పనిచేయడం

ప్రారంభించిన తరువాత ఈ గ్రామాలలో విద్యాప్రచారం జరిగితే తప్ప ఇవి బాగుపడవనే నిర్ణయానికి వచ్చాము. ఎవరికీ చదువురాదు. పిల్లలు చదువులేక తిరుగుతుండేవారు. తల్లిదండ్రులు రెండు మూడు కాసుల కోసం నీలిమందు పొలాల్లో చచ్చేలా పనిచేస్తూ వుండేవారు. పురుషులకు రోజంతా పనిచేస్తే పదిపైసల కూలి, స్త్రీలకు ఆరు పైసల కూలి, పిల్లలకు మూడు పైసల కూలి. నాలుగణాలు తెచ్చుకునే కూలీవాడు గొప్ప అదృష్టవంతుడుగా లెక్కింపబడేవాడు. సహచరులతో చర్చించి మొదట ఆరుగ్రామాల్లో పాఠశాలలు తెరిపించాను. గ్రామ పెద్ద యిల్లు యివ్వాలి మాష్టారుకు అన్నం పెట్టాలి. మిగతా ఖర్చులు మేము భరించాలి. డబ్బు యివ్వలేదు కాని గ్రామస్తులు ధాన్యం యివ్వగల స్థితిలో వున్నారు. కనుక గింజలు ఇచ్చేందుకు గ్రామస్తులు సిద్ధపడ్డారు. యీ ఉపధ్యాయులు ఎక్కడి నుండి వస్తారా అని ప్రశ్న బయలుదేరింది. బీహారులో జీతాలు లేకుండా పనిచేసే ఉపాధ్యాయులు లేరు, వున్నా తక్కువే. సామాన్యులైన ఉపాధ్యాయులకు పిల్లల్ని అప్పగించకూడదని నా అభిప్రాయం. ఉపాధ్యాయునికి చదువు రాకపోయినా ఫరవాలేదు గాని శీలవంతుడై వుండాలని గట్టిగా చెప్పాను.

ఇందుకోసం వాలంటీర్లు కావాలని ప్రకటించాను. గంగాధరరావు దేశపాండే నా ప్రకటనకు స్పందించి బాబా సాహెబ్ సామణ్ మరియు పుండలీక్‌ని పంపారు. బొంబాయి నుండి అవంతికాబాయి గోఖలే వచ్చారు. దక్షిణాది నుండి ఆనందీబాయి వచ్చింది. నేను ఛోటేలాలు, సురేంద్రనాథ్, నా చిన్న పిల్లవాడు దేవదాసును పిలిపించాను. మహదేవదేశాయి, నరహరిపారీఖ్ గారలు వచ్చి కలిశారు. మహా దేవదేశాయి భార్య దుర్గాబెన్, నరహరిపారిఖ్ భార్య మణిబెన్ కూడా వచ్చారు. కస్తూరిబాయిని కూడా పిలిపించాను. యింతమంది ఉపాధ్యాయులు ఉపాధ్యాయురాండ్రు సరిపోతారని భావించాను. శ్రీమతి అవంతికాబాయి,ఆనందీబాయి, చదువుకున్నవారే కానీ మణిబెన్ పారీఖ్, దుర్గాబెన్ దేశాయి గార్లకు కొద్దిగా గుజరాతీ వచ్చు. కస్తూరీబాయికి చదువురానట్లే లెక్క. వీరు పిల్లలకు హిందీ ఎలా నేర్పగలరు? వీరు పిల్లలకు వ్యాకరణం చెప్పనవసరం లేదు, నడవడిక నేర్పితే చాలు, అని వారికి చెప్పాను. వ్రాయడం, చదవడం కంటే వాళ్లకు పారిశుద్ధ్యాన్ని గురించి చెప్పాలి. హిందీ, గుజరాతీ, మరాఠీ భాషల్లో పెద్ద తేడా లేదని మొదటి తరగతిలో అంకెలు నేర్పమని అందువల్ల నీకు కష్టం ఉండదని చెప్పాను. తత్ఫలితంగా మహిళల క్లాసులు బాగా నడిచాయి. మహిళలకు ఆత్మ విశ్వాసం పెరిగింది. వాళ్లు తమ క్లాసులకు ప్రాణం పోశారు. వాళ్లు బాగా పాఠాలు చెప్పారు. యీ సోదరీమణుల ద్వారా గ్రామ మహిళలతో కూడా మాకు బాగా

పరిచయం పెరిగింది. నాకు చదువుతో తృప్తి కలుగలేదు. గ్రామాలలో మురికి అధికంగా వున్నది. గ్రామం వీధుల్లో పెంటకుప్పలూ, బావుల దగ్గర బురద, దుర్వాసన యిళ్లముందు భరించలేని పరిస్థితులు, పెద్దలు కూడా పారిశుద్ధ్యాన్ని గరపడం అవసరమని భావించాను. చంపారన్ జనం రోగాలతో బాధపడుతున్నారు. సాధ్యమైనంతవరకు గ్రామ ప్రజలను సరియైన త్రోవకు తేవాలనీ, పారిశుద్ధ్యం నేర్పాలనీ, వారి జీవితంలో ప్రవేశించి కార్యకర్తలు వారికి సేవ చేయాలని నా అభిప్రాయం. యిందుకు డాక్టర్ సహాయం అవసరం. గోఖలేగారి సొసైటీకి చెందిన డాక్టర్ దేవ్ గారిని పంపమని కోరాను. వారికీ నాకూ ప్రేమ సంబంధం ఏర్పడింది. ఆరుమాసాల పాటు వారి సేవ లభించింది. వారి పర్యవేక్షణలో ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు పనిచేయవలసి వచ్చింది. తెల్లదొరలకు వ్యతిరేకంగా ఉపాధ్యాయులు పనిచేయవలసి వచ్చింది. తెల్లదొరలకు వ్యతిరేకంగా చేయబడుతున్న ఆరోపణల్లో పాల్గొనవద్దని, రాజకీయాల్లో పడవద్దని ఎవరైనా ఆరోపణలు చేసేవారు వస్తే నా దగ్గరకి పంపమని, మీ క్షేత్రం దాటి వెళ్లవద్దని అందరికీ చెప్పాను. చంపారన్‌లో యిట్టి అనుచరుల నియమబద్ధత అత్యద్భుతం. సూచనలను ఉల్లంఘించిన ఉదాహరణ ఒక్కటికూడా లేదు.

## 18. గ్రామాలలో

ప్రతి పాఠశాలలో ఒక పురుషుణ్ణి ఒక మహిళను నియమించే ఏర్పాటుచేశాము. వారి ద్వారానే మందులు యిప్పించడం పారిశుద్ధ్య కార్యక్రమం నిర్వహింపచేయడం, మహిళల ద్వారా స్త్రీ సమాజంలో ప్రవేశించడం, మందులు యిచ్చే పనిని తేలికగా నిర్వహించేలా చేయడం జరిగింది. క్వినైన్, పట్టీలు, ఆముదం ప్రతి స్కూల్లో వుంచాము. నాలుక మురికిగా వున్నా, అజీర్ణం చేసినా ఆముదం తాగించాలి. జ్వరం తగిలితే ఆముదం త్రాగించిన తరువాత క్వినైన్ యివ్వాలి. కురుపులు, గడ్డలు లేస్తే వాటిని కడిగి మలాం పట్టీ వేయాలి అని ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చాం. జబ్బు పెద్దదైతే డా. దేవ్‌గారికి చూపించి వారిచేత వైద్యం చేయించాలి. డా.దేవ్ వేరు వేరు సమయాల్లో వేరు వేరు గ్రామాలకు వెళ్లి రోగుల్ని పరీక్షిస్తూ వుండేవారు. యీ ఏర్పాటు వల్ల అధికసంఖ్యలో గ్రామ ప్రజలు ప్రయోజనం పొందసాగారు. సామాన్యంగా వచ్చే జబ్బులు కొద్దే. వాటికి పెద్ద పెద్ద డాక్టర్ల అవసరం వుండదు. యీ విషయాల్ని గ్రహిస్తే మేము చేసిన ఏర్పాటు ఎంతో ప్రయోజనకరమైనదని చెప్పవచ్చు. జనం మురికిని

తొలగించేందుకు సిద్ధపడలేదు. డా. దేవ్ అంత త్వరగా ఓటమిని అంగీకరించే వ్యక్తి కాదు. ఆయన, మిగతా వాలంటీర్లు కలిసి ఒక గ్రామంలో వీధులు శుభ్రం చేశారు. యిళ్ల మందరపడియున్న పెంటకుప్పలు ఎత్తివేశారు. బావుల దగ్గర పడిన గుంటల్ని మట్టితో పూడ్చారు. పారిశుద్ధ్యం యీ విధంగా కొనసాగించమని జనానికి బోధించారు. కొన్ని చోట్ల జనం సిగ్గుపడి పారిశుద్ధ్యం పనులు చేశారు. కొన్ని గ్రామాలకు కారు వెళ్లుటకు మట్టి రోడ్ల వల్ల కటు అనుభవాలు కూడా కలిగాయి. పారిశుద్ధ్యం మాట విని కొన్ని చోట్ల జనం అసహ్యించుకున్నారు. ఒక అనుభవాన్ని గురించి యిక్కడ వ్రాస్తాను. స్త్రీల సభల్లో అనేకసార్లు ఆ అనుభవాన్ని గురించి చెప్పాను. భీతిమరవా ఒక చిన్న గ్రామం. దాని సమీపంలో దానికంటే చిన్న పల్లె ఒకటి వున్నది. అక్కడి స్త్రీల బట్టలు చాలా మురికిగా వున్నాయి. ఆ మహిళలకు బట్టలు ఉతుక్కోమని, బట్టలు మార్చుకోమని చెప్పమని కస్తూరిబాకు చెప్పాను. ఆమె మహిళలతో మాట్లాడింది. వారిలో ఒక సోదరి ఆమెను తన గుడిసెలోకి తీసుకెళ్ళి " మీరే చూడండి,. బట్టలు పెట్టుకునేందుకు మా గుడిసెలో పెట్టె బేడ ఏమీ లేదు. నేను కట్టుకున్న చీర దప్ప మరో చీర లేదు. దీన్ని ఎలా ఉతుక్కోవాలో చెప్పండి. మహాత్మునికి చెప్పి మాకు బట్టలిప్పించండి. రోజూ చీర ఉతుక్కుంటాను. చీర మార్చుకుంటాను" అని చెప్పింది. భారతదేశంలో ఇటువంటి గుడిసెలు అసంఖ్యాకంగా వున్నాయి. ఎన్నో గుడిసెల్లో సామానుగాని, పెట్టెగాని, బట్టలుగాని ఏమీ వుండవు. ఎంతోమంది జనం కట్టుబట్టలతో జీవిస్తున్నారు.

మరో అనుభవం కూడా చెబుతాను. చంపారన్‌లో వెదురుగడలు, గడ్డి ఎక్కువ, భితిహరవా గ్రామంలో నిర్మించిన పాఠశాలపైకప్పు వెదురుగడలతోనూ, గడ్డితోనూ తయారు చేయబడింది. ఎవరో ఒకనాటి రాత్రి దానికి నిప్పు అంటించారు. దగ్గరలో వున్న నీలిమందు తొట్టెల యజమానుల మనుష్యులు ఈ పనిచేశారని అనుమానం కలిగింది. దానితో వెదురు గడలతోనూ గడ్డితోనూ ఇల్లు కట్టడం విరమించాం. ఈ పాఠశాల శ్రీ సోమణ్ మరియు కస్తూరిబా నడుపుతూ వున్నారు. ఇటుకలతో పక్కా ఇళ్లు కట్టాలని సోమణ్ నిశ్చయించాడు. అతని శ్రమవల్ల ఇటుకలతో ఇల్లు తయారైంది. ఇల్లు తగులబడుతుందేమోనను భయం పోయింది.

ఈ పని బాగా జరగాలని నేను భావించాను. కాని మనోరథం నెరవేరలేదు. దొరికిన వాలంటీర్లు కొంత వ్యవధి వరకే వుండి పనిచేశారు. క్రొత్త కార్యకర్తలు దొరకడం కష్టం. చంపారన్‌లో పని పూర్తి అయిందో లేదో మరో పని నన్ను లాక్కువెళ్లింది. ఏది ఏమైనా ఆరు నెలల పాటు అక్కడ సాగిన కార్యక్రమాలు వ్రేళ్ళూని, ఆ రూపంలోనే కాకపోయినా మరో రూపంలో తన ప్రభావం చూపుతూనే వున్నాయి.

## 19. ఉజ్వల పక్షం

గత ప్రకరణంలో నేను వివరించినట్లు ఒక వైపు సమాజసేవ సాగుతూ వున్నది. రెండోవైపున బాధితుల కష్టగాథలు వ్రాయడం జరుగుతున్నది. రోజురోజుకు అలా పని పెరిగిపోతున్నది. వేలాదిమంది చెప్పిన కథలు లిపిబద్ధం చేయబడ్డాయి. తెల్లదొరల కోపం కట్టలు తెంచుకున్నది. దానితో నా పరిశీలనా కార్యక్రమం ఆపివేయించుటకు ప్రయత్నం చేశారు.

ఒక రోజున బీహారు ప్రభుత్వం నుండి నాకు ఒక జాబు వచ్చింది. "మీ పరిశీలనా కార్యక్రమం చాలాకాలం పాటు సాగింది. యిక ఆ కార్యక్రమం విరమించి బీహారు వదలి వెళ్లిపొండి" అని ఆ జాబులో వున్నది. జాబు మెత్తగా వున్నా భావం స్పష్టంగా వున్నది. అందుకు సమాధానం యిస్తూ "నా పరిశీలనా కార్యం పూర్తికాలేదు. యింకా చేయవలసి వున్నది. ఆ పని పూర్తి అయిన తరువాత కూడా ప్రజల కష్టాలు తొలగనంతవరకు నేను బీహారు వదలి వెళ్లను" అని స్పష్టంగా వ్రాశాను.

నా నిరీక్షణ కార్యక్రమాన్ని ఆపాలంటే ప్రభుత్వం ప్రజల కష్టాల్ని తొలగించాలి. కమిటీని నియమించాలి. గవర్నరు సర్ ఎడ్వర్డ్ గేట్ నన్ను పిలిచి, తామే విచారణ కమిటీ వేస్తామని, అందు మెంబరుగా వుండమని కోరాడు. మిగతా కమెటీ మెంబర్ల పేర్లు చూచి, సహచరులతో చర్చించి కొన్ని షరతుల మీద అంగీకారం తెలిపాను. కమిటీలో చేరినా, నా అనుచరులతో చర్చలు జరిపేందుకు స్వాతంత్ర్యం నాకు వుండాలని, కమిటీలో మెంబరుగా వుంటూ రైతుల్ని సమర్థించడం మానుకోమని నాకు చెప్పకూడదని, విచారణ జరిగాక రైతులికి న్యాయం జరగలేదని తోస్తే నేను రైతుల పక్షం వహించే స్వాతంత్ర్యం వుండాలని కోరాను.

సర్ ఎడ్వర్డ్ గేట్ నా షరతులు న్యాయమైనవని భావించి అంగీకరించాడు. కీ.శే సర్ ఫ్రేంక్ స్లై యీ కమిటీ అధ్యక్షులుగా ఎన్నుకోడ్డారు. విచారణ కమిటీ, రైతులు చేసిన ఆరోపణలన్నీ నిజమేనని ప్రకటించింది. అన్యాయంగా తెల్లదొరలు తీసుకున్న సొమ్ము నుండి కొంత భాగం రైతులకు చెల్లించాలని, తిన్‌కఠియా రివాజును రద్దు చేయాలని సిఫారసు చేస్తూ తీర్మానించింది. యీ రిపోర్టు అంగీకరింపబడటానికి, ఆ ప్రకారం చట్టం ప్యాసు చేయటానికి సర్ ఎడ్వర్డ్ గేట్ మహత్తరమైన కృషి చేశాడు. ఆయన గట్టిగా వ్యవహరించి యుండకపోతే మా రిపోర్టు ఏకగ్రీవంగా వుండేదికాదు. చట్టం కూడా ప్యాసు అయి వుండేది కాదు. తెల్లదొరలు చాలా శక్తివంతులు. రిపోర్టు

వెల్లడించబడిన తరువాత కూడా చట్టం కానీయకుండా నిరోధించేందుకు తీవ్రంగా ప్రయత్నించారు. కాని సర్ ఎడ్వర్డ్ గేట్ ధైర్యంగా వ్యవహరించి చట్టం చేయించాడు. దాన్ని అమలులోకి తెచ్చాడు కూడా. ఈ విధంగా 100 సంవత్సరాల నుండి అమల్లో వున్న తిన్‌కఠియా విధానం రద్దు అయింది. తెల్లదొరల రాజ్యం కూడా అస్తమించింది. అణగిపోయి పడివున్న రైతులు తమ శక్తిని గుర్తించారు. నీలిమందు మచ్చ కడిగినా పోదు అను భ్రమ తొలగిపోయింది.

## 20. కార్మికులతో సంబంధం

నేను చంపారన్‌లో కమెటీలో చేరి పనిచేస్తూ వుండగా ఖేడానుండి మోహన్‌లాల్ పాండ్యా, శంకర్‌లాల్ పారిఖ్‌ల జాబు వచ్చింది. ఖేడా జిల్లాలో పంటలు దెబ్బతిన్నాయి, కనుక పన్నులు రద్దు చేయడం అవసరం, అక్కడికి వెళ్ళి ప్రజలకు మార్గం చూపించమని వాళ్లు ఆ జాబులో కోరారు. ఖేడా వెళ్లి అక్కడి పరిస్థితులు స్వయంగా తెలుసుకోకుండా సలహాలివ్వాలనే కోరిక నాకు కలుగలేదు.

మరో జాబు కార్మిక సంఘం విషయమై శ్రీమతి అనసూయాబాయి వ్రాసింది. వేతనాలు పెంచమని చాలా కాలాన్నుండి కార్మికులు కోరుతున్న విషయం నాకు తెలుసు. అది చిన్న విషయమే, అయినా దూరాన్నుండి సలహాయిచ్చే స్థితిలో నేనులేను. అవకాశం చిక్కగానే నేను అహమదాబాదు వెళ్లాను. అక్కడి వ్యవహారాలు సరిచేసి చంపారన్ వెళ్లి నిర్మాణ కార్యక్రమాలు సాగిద్దామని భావించాను. కాని అహమదాబాదు చేరిన తరువాత పనుల వత్తిడివల్ల అనుకున్న ప్రకారం నేను చంపారన్ వెంటనే వెళ్లలేకపోయాను. అక్కడ నడుస్తున్న పాఠశాలలు ఒక్కొక్కటే మూతబడ్డాయని తెలిసింది. నేను, నా అనుచరులు అంతా ఏమేమో చేద్దామని ఆకాశంలో మేడలు కట్టాం. అవన్నీ కూలిపోయాయి. చంపారన్‌లో గ్రామ్యపాఠశాలతో బాటు గోసంరక్షణ కార్యక్రమం కూడా ప్రారంభించాము. గోశాల, హిందీ ప్రచారం రెండు కార్యక్రమాలు ఇజారామార్వాడీ సోదరులు నిర్వహిస్తామని చెప్పారు. బేతియాలో ఒక మార్వాడీ సజ్జనుడు తన ధర్మసత్రంలో నాకు ఆశ్రయం ఇచ్చాడు. బేతియాలోగల మార్వాడీ సోదరులు తమ గోశాల విషయంలో నన్ను ఒప్పించారు. గోసంరక్షణను గురించి ఇప్పుడు గల భావాలే ఆనాడు కూడా నాకు వున్నాయి. గోసంరక్షణ అంటే గోవంశవృద్ధి, గోజాతి సంస్కరణ, ఎద్దులచేత తగినంత పనినే చేయించడం, గోశాలను ఆదర్శవంతమైన క్షీరశాలగా రూపొందించడమన్నమాట. ఇందుకు పూర్తిగా సహరిస్తామని

మార్వాడీ సోదరులు మాట ఇచ్చారు. అయితే నేను చంపారన్ వెళ్లలేక పోయినందున ఆ పని అసంపూర్తిగా వుండిపోయింది. బేతియాలో గోశాల నడుస్తున్నదేగాని అది ఆదర్శవంతమైన క్షీరశాలగా రూపొందలేదు. చంపారన్‌లో ఎద్దుల చేత అపరిమితంగా పని చేయిస్తున్నారు. హిందువులు ఎద్దుల్ని చావకొట్టి ధర్మానికి హాని కలిగిస్తున్నారు. ఆ ముల్లు నా హృదయంలో గుచ్చుకొని అలాగే వుండిపోయింది. చంపారన్ వెళ్లినప్పుడు అసంపూర్తిగా మిగిలిపోయిన ఈ పనులను గురించి తలచుకొని నిట్టూర్పువిడుస్తూ వున్నాను. వాటిని అసంపూర్తిగా వదిలినందుకు మార్వాడీ సోదరుల్ని, బీహారీల్ని మందలిస్తూ వున్నాను. పాఠశాలలు అనుకున్న విధానంలో కాకపోయినా ఏదో విధంగా నడుస్తున్నాయి. కాని గోసంరక్షణ కార్యక్రమం అసలు ప్రారంభమేకాలేదు. అనుకున్నట్లు సాగలేదు. అహమదాబాదులో ఖేడాను గురించి చర్చలు జరుగుతూ వున్నప్పుడే నేను కార్మికుల పనికి పూనుకున్నాను.

నా స్థితి కడు సున్నితంగా వున్నది. కార్మికుల పక్షం బలంగా వున్నది. శ్రీ అనసూయాబెన్ తన సొంత అన్నతో పోరాటం సాగించవలసివచ్చింది. కార్మికులకు, యజమానులకు మధ్య ప్రారంభమైన ఈ దారుణపోరాటంలో శ్రీ అంబాలాల్ సారాభాయి ముఖ్యులు. మిల్లు యజమానులతో నాకు ప్రేమ సంబంధం వున్నది. వారితో పోరాటం జరపడం యిబ్బందికరమైన విషయం కార్మికుల విషయమై వారిని కలిసి పంచాయితీ పెద్దలు చెప్పినట్లు వినమని ప్రార్థించాను. కాని యజమానులు తమకు, తమ కార్మికులకు మధ్య నా మధ్యవర్తిత్వం అంగీకరించము అని స్పష్టంగా చెప్పివేశారు. కార్మికులకు సమ్మె చేయమని సలహా ఇచ్చాను. ఈ సలహా యిచ్చుటకు పూర్వం కార్మికులతోను, వారి నాయకులతోను, బాగా కలిసిపోయాను. వాళ్లకు సమ్మె షరతులు తెలియజేశాను. ఆ షరతులు ఇవి.

1. ఎట్టి పరిస్థితుల్లోను శాంతికి భంగం కలిగించకూడదు.
2. పనికి వెళ్లదలచిన వారిని బాధించకూడదు.
3. బిచ్చం మీద కార్మికులు ఆధారపడకూడదు.
4. సమ్మె ఎంతకాలం నడిచినా గట్టిగా నిలబడాలి. దగ్గర డబ్బులేకపోతే మరోపని చేసుకొని పొట్టపోసుకోవాలి.

ఈ షరతులు నాయకులు తెలుసుకొని అందుకు అంగీకరించారు. కార్మికుల సభ జరిగింది. కోరికలు సబబైనవా కావా అని నిర్ణయించుటకు పంచాయతీ పెద్దల నియామకం జరగనంత వరకు పనిలోకి వెళ్లకూడదని కార్మికులు నిర్ణయించారు. ఈ సమ్మెకాలంలోనే శ్రీ వల్లభాయి మరియు శంకర్‌లాల్ బాంకరుగారలను, దగ్గరగా

చూచి అర్థం చేసుకొనే అవకాశం లభించింది. శ్రీ అనసూయాబెన్‌ను గురించి అదివరకే నాకు తెలుసు. సమ్మె చేస్తున్న కార్మికుల సభలు నదీతీరాన ఒక చెట్టు క్రింద జరుగుతూ వుండేవి. వందల సంఖ్యలో కార్మికులు పాల్గొంటూ వుండేవారు. వారుచేసిన ప్రతిజ్ఞను వారికి నేను రోజూ జ్ఞాపకం చేస్తూ వుండేవాణ్ణి. శాంతి సంరక్షణ, వారి కుటుంబపోషణను గురించి రోజూ వారికి చెబుతూ వుండేవాణ్ణి. వాళ్లు తమ జండా పుచ్చుకొని పట్టణంలో రోజూ తిరుగుతూ వుండేవారు. ఊరేగింపుగా వచ్చి సభలో పాల్గొంటూ వుండేవారు.

ఈ సమ్మె 21 రోజులు సాగింది. మధ్య మధ్య యజమానులతో నేను మాట్లాడుతూ వుండేవాణ్ణి. న్యాయం చేయమని కోరుతూ వుండేవాణ్ణి. "మాకు మాత్రం పట్టుదల లేదా? మాకు మా కార్మికులకు మధ్య తండ్రికొడుకుల వంటి సంబంధం వున్నది. మా యిద్దరి మధ్య మరొకరు కాలు యిరికించితే మేము ఎలా సహిస్తాం? యిందు పంచాయితీ పెద్దల ప్రమేయం ఎందుకు? " అని యజమానులు అంటూ వుండేవారు.

## 21. ఆశ్రమం

కార్మికుల ప్రకరణానికి ముందు ఆశ్రమాన్ని గురించి కొద్దిగా వ్రాయడం అవసరం. చంపారన్‌లో వున్నా నేను ఆశ్రమాన్ని మరిచిపోలేదు. అప్పుడప్పుడు నేను అక్కడికి వెళ్లి వస్తూ వుండేవాణ్ణి. కొచరబ్ అహమదాబాదు సమీపంలో గల చిన్న గ్రామం. ఆశ్రమం యీ గ్రామంలోనే వున్నది. కొచరబ్‌లో ప్లేగు ఆరంభమైంది. పిల్లల్ని ఆశ్రమంలో సురక్షితంగా వుంచలేని పరిస్థితి ఏర్పడింది. ఆశ్రమంలో పారిశుద్ధ్య నియమాన్ని ఎంతగా పాటించినా చుట్టుప్రక్కలగల మురికిని పోగొట్టడం సాధ్యంకాలేదు. కొచరబ్‌లో గల ప్రజలకు నచ్చచెప్పడానికి, వారికి సేవ చేయడానికి మా శక్తి చాలలేదు. పట్టణానికి, ఆశ్రమాన్ని దూరంగా వుంచాలనేది మా ఆదర్శం. కాని రాకపోకలకు యిబ్బంది కలిగేలా వుండడం కూడా మాకు యిష్టంలేదు. ఆశ్రమం సొంతచోటులో తెరపగాలిలో, ఆశ్రమరూపంలో ఏదో ఒక రోజున నిర్మాణం కావాలి.

ప్లేగు వ్యాపించినప్పుడు కొచరబ్‌ను వదిలివేయమని ఆదేశం అందినట్లు భావించాను. శ్రీ పూంజాభాయి హీరాచంద్‌గారికి మా ఆశ్రమంతో దగ్గర సంబంధం వుంది. ఆశ్రమానికి సంబంధించిన సేవా కార్యాలు శ్రద్ధగా ఆయన చేస్తూ వుండేవాడు. అహమదాబాదు ప్రజాజీవితం ఆయనకు బాగా తెలుసు. ఆశ్రమం కోసం భూమి బాధ్యత ఆయన వహించాడు. కొచరబ్‌కు ఉత్తర దిశయందు భూమికోసం

ఆయనతోబాటు నేనూ తిరిగాను. అక్కడికి మూడునాలుగు మైళ్లదూరాన భూమి దొరికితే వెతకమని ఆయనకు చెప్పాను. యిప్పుడు ఆశ్రమం వున్నచోటును కూడా వెతికింది ఆయనే. చోటు జైలుకు సమీపంలో వుండటం వల్ల నాకు కొంచెం మోహంకలిగింది. సత్యాగ్రహి నొసట జైలు వ్రాసి వుంటుంది గనుక జైలు సమీపంలో ఆశ్రమం వుంటే మంచిదని అభిప్రాయపడ్డాను. సామాన్యంగా చుట్టుప్రక్కల పరిశుభ్రంగా వున్నచోటే జైలు వుంటుందని నాకు తెలుసు. ఎనిమిది రోజుల్లోపలే భూమి కొనుగోలు వ్యవహారం పూర్తి అయింది. అక్కడ ఒక్క చెట్టుకూడాలేదు. నదీతీరం, ఏకాంత ప్రదేశం యిది ఆ చోటుయొక్క ప్రత్యేకత. డేరాలు వేసుకొని వుందామని నిర్ణయానికి వచ్చాం. వంటనిమిత్తం తాత్కాలికంగా రేకుల షెడ్డు వేద్దామని, తరువాత నెమ్మదిగా యిల్లు కట్టిద్దామని నిర్ణయించాం. ఆశ్రమవాసుల సంఖ్య పెరిగింది. చిన్నాపెద్దా అంతా కలిపి మొత్తం 40 మంది అయ్యారు. అంతా ఒకేచోట భోజనాలు చేస్తారు. అది మంచి సౌకర్యం. ప్లానంతా నాది . దాన్ని అమలు పరచడం కీ.శే. మగన్‌లాల్ గాంధీ బాధ్యత. పక్కా ఇళ్లు తయారయ్యే లోపల చాలా ఇబ్బందులు పడ్డాం. వర్షాకాలం సమీపిస్తున్నది. నాలుగుమైళ్ల దూరానవున్న పట్టణాన్నుండి వస్తువులు తెచ్చుకోవాలి. అది బంజరు భూమి. పాములకు లోటు లేదు. వాటినుండి పిల్లలను రక్షించడం పెద్దపని అయింది. పాములు మొదలుగాగల వాటిని చంపకూడదని మా నియమం. కాని వాటి భయం మాలో ఒక్కరినీ వదలలేదు. యిప్పటికీ అదే స్థితి. సాధ్యమైనంత వరకు హింసా ప్రవృత్తి గల ప్రాణులను చంపకూడదని ఫినిక్సులోను, టాల్‌స్టాయ్ ఫారమ్‌లోను సాబర్మతిలోను మూడుచోట్ల నిర్ణయం చేశాం. మూడుచోట్ల బంజరుభూమి. మూడుచోట్ల పాములు మొదలుగాగలవి జాస్తిగా వుండేవి. అయినా ఒక్క ప్రాణిని కూడా మేము చంపలేదని చెప్పగలను. నావంటివాడు ప్రతిప్రాణి యందు దేవుణ్ణి చూస్తాడు. దేవుడు పక్షపాతం చూపించడు. మనిషి ప్రతిరోజు చేసేపనుల్లో దేవుడు ఎందుకు కల్పించుకుంటాడు? ఆయనకు అంత సమయం ఎక్కడ దొరుకుతుంది? సందేహాల్లో మనిషి పడకూడదు. ఈ నా అనుభవాన్ని మరో భాషలో చెప్పలేను. లౌకిక భాషలో దేవుని లీలల్ని చూస్తూవుంటే ఆయన కార్యాలు అమోఘం, అవర్ణనీయం అని చెప్పవచ్చు. యిది నా అనుభవం. పామరుడు వర్ణించాలంటే చిలకపలుకులే పలుకుతాడు కదా! సర్పాలవంటి పురుగుపుట్రను చంపకుండా సమాజంలో 25 సంవత్సరాలు బ్రతికి వున్నామంటే అదృష్టమని భావించకుండా, దేవుని దయ అంటే అది తప్పు అయితే అట్టి తప్పు అంగీకారయోగ్యమేనని నా భావం. కార్మికులు సమ్మె కట్టినప్పుడు ఆశ్రమనిర్మాణం

జరుగుతున్నది. ఆశ్రమంలో నేతపని ముఖ్యం. వడుకుపని గురించి యింకా మేము ఆలోచించలేదు. అందువల్ల నేతకోసం గృహం నిర్మించాలని నిర్ణయించాం. దానికి పునాది వేశాం.

## 22. ఉపవాసం

కార్మికులు మొదటి రెండువారాలు ధైర్యంగాను శాంతంగాను వున్నారు. రోజూ జరిగే సభకు వస్తూ వున్నారు. నేను రోజూ వారికి వారు చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకం చేస్తూవున్నాను. మేము ప్రాణమైనా వదులుతాం, ప్రతిజ్ఞను మాత్రం నెరవేరుస్తాం అని బిగ్గరగా అరుస్తూ వున్నారు. కాని చివరికి వారు జారిపోతున్నారని అనిపించింది. మిల్లులోకి వెళుతున్న కార్మికులను చూచి వాళ్లు హింసకు దిగారు. ఎవరిమీదనైనా చెయ్యి చేసుకుంటారేమోనని భయం కలిగింది. రోజూ సభకు వచ్చేవారి సంఖ్య తగ్గిపోయింది. కొద్దిమంది వచ్చినా నిరుత్సాహంతో వుండేవారు. కార్మికుల్లో స్థిరత్వం తగ్గిందని తెలిసి విచారించాను. దక్షిణాఫ్రికాలో కార్మికుల సమ్మెకు సంబంధించిన అనుభవం నాకున్నది. కాని యిక్కడ క్రొత్త అనుభవం కలిగింది. రోజూ ప్రతిజ్ఞ చేయిస్తూ సాక్షిగా వున్న నా ఎదుటే యిలా జరిగితే నేనేం చేయాలా అని ఆలోచించాను. యిది నాకు కలిగిన అభిమానం అనుకున్నా సరే, కార్మికుల యెడ, సత్యం యెడ నాకు గల ప్రేమ అనుకున్నా సరే తీవ్రంగా యోచించాను.

ఉదయం సభ ప్రారంభమైంది. ఏం చేయాలో తోచలేదు. స్థిరంగా ధైర్యంగా వుండక పోతే సమస్య పరిష్కారం కాకపోతే అంతవరకు నేను ఉపవాసం చేస్తాను అని ప్రకటించివేశాను. కార్మికులు నివ్వెరపోయారు. అనసూయాబెన్ కండ్లనుండి నీరు కారింది. మీరు ఉపవాసం చేయొద్దు. మేము చేస్తాం ప్రతిజ్ఞ మీద నిలబడివుంటాం. క్షమించండి అని కార్మికులు అన్నారు. మీరు ఉపవాసం చేయనవసరంలేదు. మీరు మీ ప్రతిజ్ఞ నెరవేర్చండి చాలు. మా దగ్గర డబ్బులేదు. అయినా కార్మికులకు బిచ్చం తినిపించి సమ్మె చేయించడం నాకు యిష్టంలేదు. మీరు కాయకష్టం చేసి పొట్టపోసుకోండి. ఎన్నాళ్లు సాగినా సరే నిశ్చింతగా సమ్మె చేయండి. నిర్ణయం జరగనంతవరకు నా ఉపవాసం సాగుతుంది అని చెప్పివేశాను. వల్లభభాయి కార్మికులకు మునిసిపాలిటీలో పని యిప్పించాలని ప్రయత్నించారు. కాని ప్రయోజనం కలుగలేదు. ఆశ్రమంలో నేత గృహం దగ్గర గల గొయ్యిని పూడ్చాలి. కార్మికులను అందుకు వినియోగించవచ్చునని మగన్‌లాలు సలహా యిచ్చారు. అందుకు కార్మికులు అంగీకరించారు. అనసూయాబెన్

ఇసుకతో నిండిన మొదటి తట్టను నెత్తికి ఎత్తుకున్నది. నది నుండి ఇసుక తట్టలను ఎత్తుకు వచ్చి గొయ్యిపూడ్చడానికి కార్మికులు పూనుకున్నారు. చూసేందుకు ఆ దృశ్యం ముచ్చటగా వున్నది. కార్మికులకు నూతనోత్తేజం కలిగింది. వారికి మజూరీ చెల్లించిన ఆశ్రమం వారికి నిజంగా అలసట కలిగిందని చెప్పవచ్చు. పని ముమ్మరంగా సాగింది. అయితే నా యీ ఉపవాసంలో ఒక దోషం వున్నది.

యజమానులతో నాకు మధుర సంబంధం వున్నదని మొదటనే వ్రాశాను. అందువల్ల నా ఉపవాసం వారిని కదిలించి తీరుతుంది. ఒక సత్యాగ్రహిగా యజమానులకు వ్యతిరేకంగా నేను ఉపవాసం చేయకూడదు. నిజానికి కార్మికుల సమ్మె ప్రభావం మాత్రమే వాళ్ళ మీద పడాలి. నేను పూనుకున్న ప్రాయశ్చిత్తం యజమానులు చేసిన దోషానికి సంబంధించినది కాదు. కార్మికులకు ప్రాతినిధ్యం వహిస్తూ వున్నందున వాళ్ల దోషాలకు నేను బాధ్యుణ్ణే. యజమానులను ప్రార్థించగలను. వారికి వ్యతిరేకంగా ఉపవాసం చేయటం వారిని ఘెరావు చేయడమే అయినా నా ఉపవాస ప్రభావం యజమానుల మీద పడుతుందని నాకు తెలుసు. పడింది కూడా. కాని నా ఉపవాసాన్ని వారెవరూ ఆపలేని పరిస్థితి ఏర్పడింది.

దోషభూయిష్ఠమైన ఉపవాసం చేస్తున్నానని నేను గ్రహించాను. నా ఉపవాసం వల్ల మీరు మీ మార్గాన్ని వదలవద్దని నేను యజమానులకు చెప్పాను. వాళ్లు కటువుగాను, తియ్యగాను, నన్ను ఎన్నో మాటలు అన్నారు అట్టి హక్కు వారికి వుంది. సేర్ అంబాలాలు యీ సమ్మెకు వ్యతిరేకంగా యాజమాన్యానికి నాయకత్వం వహించాడు. ఆయన గుండెదిటవు చూచి ఆశ్చర్యం కలిగింది. ఆయన నిష్కపటి కూడా. ఆయనతో వివాదపడటం నాకు యిష్టం. అయినా ఉపవాస ప్రభావం ఆయన మీద పడకుండా వుండటం సాధ్యమా? మరో రూపంలో ఆయన మీద వత్తిడి తీసుకురావడమేగదా! ఆయన భార్య సరళాదేవి నన్ను సొంత సోదరునిగా చూసుకుంటుంది. ఆమెకు నా యెడ అమిత అనురాగం. నేను ఉపవాసం చేస్తుంటే ఆ దంపతులకు కలిగే బాధ నాకు తెలుసు.

ఉపవాస సమయంలో అనసూయా బెన్, యితర మిత్రులు, కార్మికులు నాతో బాటు ఉపవాసం చేశారు. వారిని నేను వారించాను. కాని వింటారా? యీ విధంగా వాతావరణం ప్రేమతో నిండిపోయింది. యజమానులు దయాభావంతో రాజీపడేందుకు సిద్ధపడ్డారు. అనసూయాబెన్‌తో వారి చర్చలు ప్రారంభమయ్యాయి. శ్రీ ఆనందశంకర్ ధ్రువగారు కూడా రంగంలోకి దిగారు. చివరికి వారినే పెద్దగా నిర్ణయించారు. సమ్మె

విరమణ జరిగింది. మూడురోజులు మాత్రం నేను ఉపవాసం చేయవలసి వచ్చింది. యజమానులు కార్మికులకు మిఠాయిలు పంచారు. 21వ రోజున ఒడంబడిక కుదిరింది. ఒక ఉత్సవం జరిపారు. అందు యజమానులు, కమీషనరు కూడా పాల్గొన్నారు. మీరు గాంధీ చెప్పిన ప్రకారం నడుచుకోండి అని కమీషనరు వారికి చెప్పాడు. ఆ కమీషనరుతోనే జగడం పెట్టుకోవలసి వచ్చింది. అతడూ మారాడు. ఖేడాలో పార్టీవాళ్లను నా మాట వినవద్దని అతడే చెప్పాడు.

ఒక కరుణాజనకమైన విషయం యిక్కడ పేర్కొనడం అవసరమని భావిస్తున్నాను. యజమానులు తయారుచేయించిన మిఠాయిలు ఎక్కువగా వున్నందున వేలాదిమంది కార్మికులకు వాటిని ఎలా పంచాలా అని మీమాంస బయలుదేరింది. ఏ చెట్టు క్రింద కార్మికులు ప్రతిజ్ఞ చేశారో, అక్కడ 21 రోజులు నియమాన్ని పాటించిన కార్మికులంతా వరుసగా క్యూలో నిలబడి మిఠాయి తీసుకోవాలన్న నిర్ణయాన్ని అమాయకంగా నేను ఒప్పుకున్నాను. కార్మికులు ఒక్కుమ్మడిగా మిఠాయిల మీద విరుచుకుపడకుండా పంపిణీ జరుగుతుందని భావించాను. కాని పంపిణీ సరిగా జరగలేదు. రెండు మూడు నిమిషాలకే వరుసక్రమం పోయింది. కార్మిక నాయకులు ప్రయత్నించినా ప్రయోజనం కలుగలేదు. కార్మికులు తండాలు తండాలుగా విరుచుకుపడినందువల్ల కొంత మిఠాయి పాడైపోయింది. మిగిలిన మిఠాయి జాగ్రత్తగా సేఠ్ మిర్జాపూర్‌లోగల అంబాలాల్ గారి బంగాళాకు చేర్చారు. మరునాడు ఆ బంగాళా మైదానంలో మిఠాయి పంచవలసి వచ్చింది. చెట్టు దగ్గర మిఠాయి పంచుతున్నారని విని అహమదాబాదులో గల బిచ్చగాళ్లంతా వచ్చి మిఠాయి కోసం విరుచుకు పడినందున ఏర్పాట్లన్నీ చెల్లాచెదురయ్యాయని తరువాత తెలిసింది. ఇందు కరుణరసం ఇమిడి వున్నది.

ఆకలి అను రోగంతో బాధపడుతున్న దేశం మనది. తత్ఫలితంగా దేశంలో బిచ్చగాళ్ళ సంఖ్య రోజురోజుకు పెరిగిపోతున్నది. భోజనం దొరుకుతుంది అంటే అన్నార్తులు నియమాల్ని, నిబంధనల్ని పాటించవలసిన విధుల్ని మరిచిపోతారు. ధనవంతులు యిట్టి బిచ్చగాళ్లకు పని అప్పగించకుండా వాళ్లకు బిచ్చం యిచ్చి వాళ్ల సంఖ్యను బాగా పెంచుతున్నారు.

## 23. ఖేడా సత్యాగ్రహం

కార్మికుల సమ్మె ముగిసింది. యిక నాకు ఒక్క నిమిషమైనా తీరిక చిక్కలేదు. వెంటనే ఖేడా జిల్లాలో సత్యాగ్రహం ప్రారంభించవలసి వచ్చింది. ఖేడా జిల్లాలో కరువు

పరిస్థితులు ఏర్పడినందున పన్నుల వసూళ్లు రద్దు చేయమని అక్కడ రైతులు కోరుతున్నారు. యీ విషయం శ్రీ అమృతలాల్ ఠక్కర్ పరిశీలించి రిపోర్టు యిచ్చారు. నేను వెళ్లి కమీషనరును కలిశాను. శ్రీ మోహనలాల్ పాండ్యా, శ్రీ శంకర్‌లాల్ పారిఖ్, శ్రీ విఠ్ఠల్‌భాయి పటేల్ ల ద్వారా వాళ్లు కౌన్సిలులో ఉద్యమం సాగిస్తున్నారు. ప్రభుత్వం దగ్గరికి రాయబారాలు చాలాసార్లు సాగించారు.

అప్పుడు నేను గుజరాత్ కాంగ్రెస్‌కు అధ్యక్షుణ్ణి. కాంగ్రెస్ పక్షాన కమీషనరుకు, గవర్నరుకు ప్రార్థనా పత్రాలు పంపాను. టెలిగ్రాములు యిచ్చాను. అవమానాలు సహించాను. వాళ్ల బెదిరింపుల్ని మ్రింగాను. ఆనాడు అధికారులు వ్యవహరించిన తీరును యీనాడు తలచుకుంటే హాస్యాస్పదంగా వుంటుంది.

ప్రజల కోరిక న్యాయం. సమంజసం. దాన్ని అంగీకరింప చేయడం కోసం నిజానికి ఉద్యమం అనవసరం. ప్రభుత్వ నియమం ప్రకారం రూపాయికి నాలుగు అణాలకు పంట తక్కువగా పండితే పన్నుల వసూళ్లు వెంటనే ఆపివేయాలి. కాని అక్కడి ఆఫీసర్ల అంచనా ప్రకారం రాబడి నాలుగు అణాలకు పైగా వున్నది ప్రజలు అది తప్పని రుజువు చేయసాగారు. కాని ప్రభుత్వం అంగీకరిస్తుందా? పంచాయతీ పెద్దల్ని నియమించి నిర్ణయించమని ప్రజలు కోరారు ప్రభుత్వం అంగీకరించలేదు. ఎన్నో పర్యాయాలు ప్రార్థనా పత్రాలు పంపి విసిగి వేసారి అనుచరులతో చర్చలు జరిపి చివరికి సత్యాగ్రహం ప్రారంభించారు. వారిలో ఖేడా జిల్లా సేవకులే కాక ప్రత్యేకించి శ్రీ వల్లభ భాయి పటేల్, శ్రీ శంకర్‌లాల్ బాంకరు, శ్రీ అనసూయా బెన్, శ్రీ ఇందూలాల్ యాజ్ఞిక్, శ్రీ మహాదేవ దేశాయి మొదలుగా గలవారు కూడా వున్నారు. 'వల్లభభాయి ముమ్మరంగా సాగుతున్న వకీలు వృత్తి మానుకొని వచ్చారు. ఆ తరువాత వారు వకీలు వృత్తి సాగించలేకపోయారు.

మేము నడియాద్ అనాథాశ్రమంలో మకాం బెట్టాం. అందుకు ప్రత్యేకించిన కారణం ఏమీ లేదు. నడియాద్‌లో యింత మంది వుండటానికి మరో ఖాళీగృహం దొరకలేదు. అక్కడి జనం చేత క్రింద తెలిపిన మతలబు వ్రాసిన పత్రం మీద సంతకాలు చేయించి తీసుకున్నాం. "మా గ్రామంలో పంట రాబడి రూపాయికి నాలుగు అణాల కంటే తక్కువని మాకు తెలుసు. అందువల్ల పన్నుల వసూళ్లు ఒక సంవత్సరం వరకు ఆపమని ప్రార్థించాం. కాని పన్నుల వసూళ్లు ఆపలేదు. అందువల్ల యీ పత్రం మీద సంతకం చేసిన మేము యీ ఏడు పన్నులు చెల్లించలేమని మనవి చేస్తున్నాం. పన్నుల వసూళ్లకు పూనుకొని ప్రభుత్వం చర్యలు తీసుకుంటే మేము

వ్యతిరేకించం. ఎన్ని కష్టాలైనా సహిస్తాం. మా పొలాలు జప్తు చేసినా ఊరుకుంటాం. మా చేతులతో పన్నులు చెల్లించి అబద్ధాల కోరులం అయి ఆత్మాభిమానం చంపుకోము. ప్రభుత్వం పన్నుల వసూళ్ళు అన్ని చోట్ల ఆపి వేస్తే మాలోశక్తి కలిగినవాళ్లం పూర్తిగానో లేక కొంత భాగమో తప్పక చెల్లిస్తామని మాట యివ్వలేము. మాలో శక్తిగలవారం పన్నులు చెల్లించి వేస్తే, శక్తిలేనివారు భయపడి తమ కొంపాగోడూ తెగనమ్మి పన్నులు చెల్లించి నానా యాతనలు పడతారు. అందువల్ల శక్తిగలవారం కూడా పన్ను చెల్లించం. యిలా చెల్లించకపోవడం శక్తివంతుల కర్తవ్యమని భావిస్తున్నాము.

ఈ పోరాట వివరాలు తెలుపుటకు ప్రకరణాన్ని పొడిగించదలుచుకోలేదు అందువల్ల యిందుకు సంబంధించిన మధురస్మృతులు అనేకం యిక్కడ వివరించడం లేదు. మహత్తరమైన ఖేడా సత్యాగ్రహ పోరాట చరిత్రను వివరంగా తెలుసుకోవాలని భావించినవారు శ్రీ శంకర్‌లాల్ పారిఖ్ వ్రాసిన ఖేడా పోరాట విస్తృత ప్రామాణిక చరిత్ర' అను పుస్తకం చదవమని సిఫారసు చేస్తున్నాను.

## 24. ఉల్లిపాయల దొంగ

చంపారన్ భారతావనియందు ఒక మూల వున్నది. అక్కడ సాగిన పోరాటం పత్రికలకు ఎక్కలేదు. అక్కడి పరిస్థితుల్ని చూచేందుకై బయటివారు రాకుండా ప్రభుత్వం చర్య గైకొన్నది. అయినా ఖేడా సత్యాగ్రహాన్ని గురించి పత్రికల్లో వార్తలు వెలువడ్డాయి. గుజరాతీ వారికి ఈ విషయం తెలిసింది. వారు శ్రద్ధ తీసుకోవడం ప్రారంభించారు. వాళ్లు ఎంత డబ్బు అయినా సరే యివ్వడానికి సిద్ధపడ్డారు. కాని ఈ పోరాటం కేవలం డబ్బుతో నడవదు. డబ్బు అవసరం బహు తక్కువేనని ఎంత చెప్పినా వారికి బోధపడలేదు వద్దని ఎంత చెప్పినా వినకుండా బొంబాయి పౌరులు చాలా ధనం ఇచ్చి వెళ్లారు. అవసరాన్ని మించి ధనం ఇచ్చినందున పోరాటం ముగిసిన తరువాత కొద్దిగా ధనం మిగిలింది. సత్యాగ్రహులనే సైనికులు సాదా జీవనం నేర్చుకోవలసిన అవసరం వున్నది. వారు పూర్తిగా పాఠం నేర్చుకున్నారని చెప్పలేను, కానీ చాలావరకు తమ జీవనంలో మార్పు తెచ్చుకున్నారని మాత్రం చెప్పగలను.

అక్కడి రైతులు మొదలగు వారికి కూడా పోరాటం క్రొత్తదే. ఊరూరా తిరిగి యీ పోరాటం గురించి ప్రచారం చేయవలసి వచ్చింది. అధికారులు ప్రజల యజమానులు కారు. వారు సేవకులు. ప్రజలిచ్చే డబ్బునే వాళ్లు జీతాలుగా తీసుకుంటున్నారు అని చెప్పి అధికారులంటే గల భయం పోగొట్టవలసిన అవసరం ఏర్పడింది. నిర్భయంతోబాటు

వినమ్రతకూడా వాళ్లకు నేర్పవలసి వచ్చింది. ఇది చాలా కష్టమైన పని. భయం పోయిన తరువాత అధికారులు చేసిన అవమానాలకు, వాళ్లు పెట్టిన కష్టాలకు పగతీర్చుకోవద్దంటే జనం ఊరుకుంటారా? కాని అది సత్యాగ్రహి లక్షణం కాదు. పాలలో విషం కలపడమేకదా? అక్కడి జనం వినమ్రతా పారం అర్థం చేసుకోలేదను విషయం ఆ తరువాత తెలుసుకున్నాను. వినయం సత్యాగ్రహికి వుండవలసిన ప్రధాన గుణమని అనుభవంవల్ల తెలుసుకున్నాను. వినయమంటే మాటల్లోనేకాక, వ్యతిరేకులను కూడా ఆదరించాలి. సరళస్వభావం కలిగివుండాలి. అందరి మంచిని కాంక్షించి వ్యవహరించాలి. ఆరంభంలో ప్రజల్లో ధైర్యం అమితంగా కనబడింది. ప్రారంభంలో ప్రభుత్వం కూడా మెత్తగా వ్యవహరించింది. ప్రజల్లో చైతన్యం పెరిగి వాళ్లకు ధైర్యం వచ్చిన కొద్దీ ప్రభుత్వం యొక్క కరుకుదనం కూడా అమితంగా పెరిగిపోయింది. జప్తు చేసేవాళ్లు రైతుల పశువుల్ని అమ్మివేశారు. ఇళ్లలో దొరికిన వస్తువులు ఎత్తుకెళ్లారు. భూములను గురించి కూడా నోటీసులు ఇచ్చారు. కొన్ని గ్రామాల్లో పండిన పంటల్ని పూర్తిగా జప్తు చేశారు. దానితో జనం భయపడ్డారు. చాలామంది పన్ను చెల్లించి వేశారు. కొంత మంది అధికారులు వచ్చి జప్తు చేయాలని పొంచివున్నారు. అక్కడి జనంలో చివరి శ్వాస వరకు పోరాటం సాగించినవారు కొందరున్నారు. ఈ లోపున శ్రీ శంకర్‌లాల్ పారిఖ్ గారి పొలానికి చెల్లించవలసిన పన్ను అక్కడ పని చేస్తున్న వాడు చెల్లించివేశారు. దానితో గందరగోళం జరిగింది. వెంటనే శంకరలాల్ తన భూమినంతటిని జనానికి దానం చేసి తన మనిషి చేసిన దోషానికి ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు. దానితో ఆయన ప్రతిష్ఠ ఇనుమడించింది. అది యితరులకు మంచి ఉదాహరణ అయింది.

తప్పుగా జప్తు చేయబడిన ఒక పొలంలో ఉల్లిగడ్డల పంటవున్నది. భయపడిన జనానికి ధైర్యం కలిగించాలనే భావంతో నేను మోహన్‌లాల్ పాండ్యాగారి నాయకత్వాన ఉల్లిగడ్డల్ని పెకిలించమని చెప్పాను. నా దృష్టిలో అది చట్టాన్ని వ్యతిరేకించడం కాదు. చెల్లించవలసిన కొద్దిపన్ను కోసం పంటనంతటినీ జప్తు చేస్తున్నారు. అది మరీ నీతి బాహ్యమైన చర్య. బహిరంగంగా చేస్తున్న దోపిడీయే. అందువల్ల యిటువంటి జప్తుల్ని ఎండగట్టడం అవసరమని చెప్పాను. ఆ విధంగా చేసినందుకు జైలుకు పంపుతారు సిద్ధపడాలి అని కూడా చెప్పాను. మోహన్‌లాల్ పాండ్యా అందుకు సిద్ధపడ్డాడు. కష్టాలు పడకుండా వ్యతిరేకతను ఎదుర్కోకుండా సత్యాగ్రహం విజయం సాధించడం ఆయనకు యిష్టంలేదు. పొలంలో వున్న ఉల్లిగడ్డల్ని పెకిలించేందుకు సిద్ధపడ్డాడు. ఏడెనిమిదిమంది ఆయనకు సాయం చేశారు.

ప్రభుత్వం వారిని పట్టుకోకుండా ఎలా వూరుకుంటుంది? పాండ్యాను, ఆయన అనుచరులను ప్రభుత్వం నిర్బంధంలోకి తీసుకున్నది. దానితో ప్రజల్లో ఉత్సాహం పెరిగింది. జైళ్లకు వెళ్లడానికి జనం సిద్ధపడినప్పుడు రాజదండనకు ఎవ్వరూ భయపడరు. ఆ కేసు విచారణను చూచేందుకు జనం విరుచుకుపడ్డారు. పాండ్యాకు, వారి అనుచరులకు కొద్దిగా కారాగార శిక్ష విధించబడింది. కోర్టువారిచ్చిన తీర్పు తప్పులతడక. అసలు ఉల్లిగడ్డల పెకిలింపు దొంగతనం క్రిందకు రాదు. అయినా అప్పీలు చేయాలని తలంపు ఎవ్వరికీ కలుగలేదు. జైలుకు వెళుతున్నవారిని సాగనంపుటకు ఉల్లిపాయల దొంగ అను గౌరవం ప్రజల పక్షాన పాండ్యా పొందాడు. యిప్పటికీ ఆయన ఆ శబ్దాన్ని తన పేరుతో బాటు ఉపయోగిస్తూ వున్నాడు.

ఈ పోరాటం ఎలా ముగిసిందో వివరించి ఖేడా ప్రకరణం ముగించివేస్తాను.

## 25. ఖేడా సంగ్రామం ముగింపు

ఖేడాలో జరిగిన సంగ్రామం విచిత్రంగా ముగిసింది. దృఢదీక్షతో చివరివరకు వున్నవారు నష్టపడిపోవడం నాకు యిష్టంలేదు. సత్యాగ్రహం విజయం కోసం అన్వేషించసాగారు. ఊహించని అట్టి మార్గం ఒకటి దొరికింది. చెల్లించగల పార్టీలు పన్ను చెల్లించితే బీదవారి దగ్గర పన్నుల వసూళ్లు వాయిదా వేస్తామని నడియాద్ తహసీల్దారు కబురు పంపాడు. తహసీల్దారు తన తాలూకా వరకే బాధ్యత వహించగలడు. జిల్లా బాధ్యత కలెక్టరు వహించాలి. అందువల్ల నేను కలెక్టరును అడిగాను. తహసీల్దారు అంగీకరించిన విధంగా ఆదేశం వెలువడింది అని కలెక్టరు చెప్పాడు. నాకీ ఆదేశం విషయం తెలియదు. అటువంటి ఆదేశం ప్రభుత్వం వెలువరిస్తే ప్రతిజ్ఞలో పేర్కొనబడ్డ విశేషం అదే. అందువల్ల మేము అట్టి ఆర్డరుతో తృప్తిపడ్డాం.

అయినా ఈ విధంగా జరిగిన ముగింపు వల్ల నాకు సంతోషం కలుగలేదు. సత్యాగ్రహం సమాప్తమైనప్పుడు ఏర్పడవలసిన మధుర వాతావరణం ఏర్పడలేదు. క్రొత్త నిర్ణయం తాను చేయలేదని కలెక్టరు భావించాడు. అయితే బీదవారిని మినహాయించే విషయమై అతడు అంగీకరించవలసి వచ్చింది. బీదవాళ్లంటే ఎవరో ఎలా తేల్చడం? ఆ విధంగా నిర్ణయించగల శక్తి జనానికి లేకపోవడం విచారించ తగ్గ విషయం. ముగింపు ఉత్సవం జరిపారు. కాని నాకు అంతగా ఉత్సాహం కలుగలేదు. సత్యాగ్రహం ప్రారంభించినప్పటికంటె ముగించినప్పుడు ప్రజల్లో ఎక్కువ ఉత్సాహం తేజస్సు కనబడినప్పుడే దాన్ని విజయంగా భావించాలి. అట్టి తేజస్సు ఖేడా సంగ్రామం సమాప్తమైనప్పుడు నాకు కనపడలేదు.

అయినా యీ ఉద్యమం వల్ల కలిగిన సత్ఫలితాలు అనూహ్యమైనవి. పరోక్షంగా ఆ సంగ్రామం ఎన్నో ప్రయోజనాలు చేకూర్చింది. ఖేడా సంగ్రామంవల్ల గుజరాత్‌కు చెందిన రైతుల్లో గొప్ప చైతన్యం వచ్చింది. వారికి రాజకీయంగా మంచి శిక్షణ లభించింది. విదుషీమణియగు డా. బిసెంట్ ప్రారంభించిన ఉద్యమంకంటే వారిలో నిజమైన చైతన్యం యీ ఉద్యమం వల్లనే వచ్చింది. వాలంటీర్లు రైతులతో కలిసిపోయారు. తమ శక్తిని తమ హద్దును తెలుసుకొని ఎంతో త్యాగదీక్షతో పనిచేశారు. వల్లభభాయికి తనశక్తి ఏమిటో తెలుసుకునే అవకాశం ఈ సంగ్రామం వల్ల లభించింది. యిటువంటి అనుభవాలు బార్డోలీలోను, తదితర సంగ్రామాల్లోను కూడా కలిగాయి. గుజరాత్ ప్రజల్లో నూతన తేజస్సు వెల్లివిరిసింది. రైతులు తమ శక్తి ఏమిటో తెలుసుకోగలగడం విశేషం. ప్రజలకు విముక్తి లభించాలంటే అది వారి త్యాగప్రవృత్తిపై ఆధారపడి వుంటుందని అంతా తెలుసుకున్నారు. ఖేడా పోరాటం ద్వారా గుజరాత్ ప్రాంతంలో సత్యాగ్రహం స్థిరమైన స్థానం సంపాదించుకుంది. ఖేడా సంగ్రామ ముగింపు విషయమై నాకు ఉత్సాహం కలుగకపోయినా అక్కడి ప్రజల్లో మాత్రం నూతనోత్సాహం నెలకొన్నది. తాము అనుకున్నది సాధించామనే విశ్వాసం వారికి కలిగింది. భవిష్యత్తులో యిలాంటి సమస్యలు ఎదురైనప్పుడు వాటిని ఎదుర్కొనే విధానం కూడా వారికి బోధపడింది. అయితే సత్యాగ్రహమంటే ఏమిటో ఖేడా ప్రజలు తెలుసుకోలేకపోయారు. అందుకు సంబంధించిన వివరాలు రాబోయే ప్రకరణాల్లో తెలియజేస్తాను.

## 26. సమైక్యత

ఖేడా వ్యవహారం సాగుతూ వున్నప్పుడు యూరపులో మహాయుద్ధం జరుగుతూవున్నది. యిందుకోసం ఒక సమావేశం ఏర్పాటుచేసి వైస్రాయి ఢిల్లీకి నాయకుల్ని ఆహ్వానించారు. లార్డ్‌చేమ్స్‌ఫర్డ్‌తో నాకు సత్సంబంధం ఏర్పడిందని ముందే వ్రాశాను. కాని ఆ సభలో ఎలా పాల్గొనడం? నాకు ఒక సంకోచం కలిగింది. యీ సభకు అలీ సోదరులను, లోకమాన్య తిలక్‌ను మరియు యింకా కొంతమంది నాయకుల్ని ఆహ్వానించలేదు. అదే నా సంకోచానికి కారణం. అప్పుడు అలీ సోదరులు జైల్లో వున్నారు. వారిని ఒకటి రెండు సార్లే కలిసాను. వారిని గురించి చాలా విన్నాను. వారి సేవానిరతిని గురించి వారి ధైర్యసాహసాలను గురించి అంతా పొగడటం గమనించాను. హకీం (కీ.శే. హకీం అజమల్ ఖాన్) గారితో ప్రత్యక్ష పరిచయం నాకు లేదు. వారి గొప్పతనాన్ని గురించి కీ.శే. రుద్ర్ మరియు దీనబంధు అండ్రూస్‌గారల నోట విన్నాను. కలకత్తాలో ముస్లిం లీగు సమావేశం జరిగినప్పుడు కురేషీ, బారిస్టర్

ఖ్వాజాగారిని కలుసుకున్నాను. డా. అన్సారీగారిని, డా. అబ్దుల్ రహమాన్ గారలను కూడా కలిశాను. ముస్లిం పెద్దమనుషుల్ని కలుసుకునేందుకు ప్రయత్నిస్తూ వున్నాను. దేశభక్తులు, పవిత్రులునగు వారిని కలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నాను. వారు పిలిచిన చోటుకు సందేహించకుండా వెళ్లుతున్నాను.

హిందువులు మహ్మదీయుల మధ్య ఐక్యతలేదని దక్షిణ ఆఫ్రికాలో వున్నప్పుడే గ్రహించాను. ఇరువురి మధ్య గల వివాదాల్ని తొలగించేందుకు అవకాశం చిక్కినప్పుడల్లా గట్టిగా ప్రయత్నిస్తూ వున్నాను. అబద్ధాల పొగడ్తలతో, ఆత్మాభిమానం చంపుకొని ఒకరిని సంతోష పెట్టడం నాకు గిట్టదు. నా అహింసా విధానం వీరిరువురి మధ్య సామరస్యం చేకూర్చునప్పుడు పరీక్షకు గురి అవుతుందని భావించాను. యిప్పటికీ నా అభిప్రాయం అదే. భగవంతుడు ప్రతిక్షణం నన్ను పరిశీలిస్తున్నాడు. నా సత్యశోధన సాగుతూనే వున్నది.

ఇట్టి భావాలతో నేను బొంబాయి రేవులో దిగాను. ఆలీ సోదరులను కలుసుకొని ఎంతో సంతోషించాను. మా స్నేహం పెరుగుతూ వున్నది. మాకు పరిచయం కలిగిన తరువాత ప్రభుత్వంవారు ఆలీ సోదరులను జీవించివుండగనే నిర్జీవులా అన్నంత పని చేశారు. జైలు అధికారుల అనుమతితో మౌలానా మహమ్మద్ ఆలీ పెద్ద పెద్ద ఉత్తరాలు బైతూల్ జైలునుండి, లేక ఛిందవాడానుండి నాకు వ్రాస్తూ వుండేవారు. నేను వారిని కలుస్తానని వ్రాసి అనుమతి కోరాను. నాకు అనుమతి లభించలేదు. ఆలీ సోదరులు నిర్బంధించబడిన తరువాత కలకత్తాలో జరిగిన ముస్లింలీగు సమావేశానికి నన్ను ముస్లిం సోదరులు తీసుకు వెళ్లారు. అక్కడ మాట్లాడమని నన్ను కోరారు. ఆలీ సోదరులను విడిపించడం ముస్లిం సోదరుల కర్తవ్యమని అక్కడ చెప్పాను.

తరువాత వాళ్లు నన్ను ఆలీగఢ్ కాలేజీకి తీసుకువెళ్లారు. అక్కడ ముస్లిం సోదరులను దేశం కోసం ఫకీర్లు కమ్మని ఆహ్వానించాను. ఆలీ సోదరుల విడుదలకై ప్రభుత్వంతో ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభించాను. యీ సందర్భంలో ఆలీ సోదరుల ఖిలాఫత్ ఉద్యమాన్ని గురించి అధ్యయనం చేశాను. ముస్లిం సోదరులతో చర్చించాను. ముస్లిములకు నిజమైన సోదరునిగా రూపొందదలిస్తే ఆలీ సోదరులను విడుదల చేయించాలని, ఖిలాఫత్ ఉద్యమం న్యాయబద్ధంగా సఫలం కావడానికి కృషి చేయాలని భావించాను.

ఖిలాఫత్ నాకు సులువైన వ్యవహారమే. అందు స్వతంత్రించి గుణదోషాలు చూడవలసిన అవసరంలేదు. ముస్లిం సోదరుల కోరిక నీతి విరుద్ధం కాకపోతే వారికి

సాయం చేయాలని భావించాను. మత విషయంలో శ్రద్ధకు మహత్తరమైన స్థానం వుంటుంది. అందరి శ్రద్ధ ఒకే వస్తువు యెడ, ఒకే విధంగా వుండి వుంటే ప్రపంచంలో ఒకే మతం వుండివుండేది. ఖిలాఫత్‌కు సంబంధించిన కోరిక నాకు నీతి విరుద్ధమని అనిపించలేదు. యీ కోరికను బ్రిటిష్ ప్రధానమంత్రి లాయడ్‌జార్జి అంగీకరించాడు కూడా. ఆయన అంగీకారాన్ని ఆచరణలో పెట్టించడమే నా కర్తవ్యమని భావించాను. ఆయన మాటలు స్పష్టంగా వున్నాయి. యిక గుణదోషాల్ని గురించి యోచించడం ఆత్మ తృప్తి కోసమేనని తేల్చుకున్నాను.

ఖిలాఫత్ వ్యవహారంలో నేను ముస్లిం సోదరులను సమర్థించాను. దానితో మిత్రులు, కొందరు విమర్శకులు నన్ను తీవ్రంగా విమర్శించారు. వారి విమర్శలను పరిశీలించి చూచిన తరువాత కూడా నేను చేసింది సరియైన పనియేనని నిర్ణయానికి వచ్చాను. ఈనాడు కూడ అటువంటి సమస్య వస్తే నా నిర్ణయం అలాగే వుంటుందని చెప్పగలను. ఈ భావాలతో నేను ఢిల్లీకి వెళ్లాను. మహమ్మదీయుల బాధను గురించి వైస్రాయితో మాట్లాడవలసి వున్నది. అప్పటికి యింకా ఖిలాఫత్ ఉద్యమం పూర్తి రూపం దాల్చలేదు.

ఢిల్లీ చేరగానే దీనబంధు ఆండ్రూస్ ఒక నైతిక ప్రశ్న లేవదీశారు. ఆంగ్లపత్రికల్లో ఇటలీ, ఇంగ్లాండుల మధ్య రహస్య ఒడంబడిక జరిగినట్లు వెలువడిన వార్తలు చూపించి అట్టిస్థితిలో మీరు యీ సమావేశంలో ఎలా పాల్గొంటారని ఆయన ప్రశ్నించారు. ఆ ఒడంబడికను గురించి నాకు ఏమీ తెలియదు. దీనబంధు మాటలు నాకు చాలు. దానితో మీ సమావేశంలో పాల్గొనుటకు నేను సంకోచిస్తున్నానని లార్డ్ చేమ్స్‌ఫర్డుకు జాబు వ్రాశాను. చర్చలకు రమ్మని ఆయన నన్ను ఆహ్వానించారు. వారితోను, మి. మేఫీతోను విస్తృతంగా చర్చించాను. చివరికి సమావేశంలో పాల్గొనుటకు నిర్ణయించుకున్నాను. "బ్రిటిష్ మంత్రివర్గం చేసిన నిర్ణయం వైస్రాయికి తెలియవలసిన అవసరం లేదు గదా? ప్రభుత్వం ఎన్నడూ తప్పుచేయదని నేను చెప్పలేను. ఎవరైనా పొరపాటు చేయవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వపు ఉనికి ప్రపంచ మనుగడకు మేలు కలిగిస్తుందని, దాని కృషివల్ల ఈ దేశానికి సామూహికంగా మేలు జరుగుతుందని మీరు భావిస్తే ఆపద సమయంలో దానికి సాయపడటం ప్రతిపౌరుని కర్తవ్యమని మీరు భావించరా? రహస్య ఒడంబడికను గురించి పత్రికల్లో మీరు చూచినట్లే నేను చూచాను. అంతకంటే మించి నాకేమీ తెలియదు. మీరు నామాట నమ్మండి. పత్రికల్లో ఏదో తలాతోక లేని వార్త వెలువడినందున మీరు యిలాంటి సమయంలో ప్రభుత్వానికి

సహకరించడం విరమిస్తారా? యుద్ధం ముగిసిన తరువాత మీ యిష్టం వచ్చినన్ని నైతిక ప్రశ్నలు వేయవచ్చు, యిష్టం వచ్చినట్లు చర్చలు జరపవచ్చు" యిదీ వైస్రాయి లార్డ్ చేమ్స్‌ఫర్డు మాటల సారాంశం.

ఈ తర్కం క్రొత్తది కాదు. అయితే సమయం, విధానం రెండిటి దృష్ట్యా కొత్తదనిపించింది. నేను సమావేశంలో పాల్గొనుటకు అంగీకరించాను. ఖిలాఫత్ విషయమై వైస్రాయికి నేను జాబు వ్రాయాలని నిర్ణయం జరిగింది.

## 27. సైన్యం కోసం యువకుల ఎంపిక

నేను సభలో పాల్గొన్నాను. సైనికుల్ని చేర్పించి ప్రభుత్వానికి నేను సాయం చేయాలని వైస్రాయి అభిప్రాయపడ్డారు. నేను సభలో హిందీ - హిందుస్తానీలో మాట్లాడతానని చెప్పాను. వైస్రాయి అంగీకరించారు. హిందీతో బాటు ఇంగ్లీషులో కూడా మాట్లాడమని కోరారు. నేను ఉపన్యాసం యివ్వదలచలేదు. "నా బాధ్యత ఏమిటో నాకు పూర్తిగా తెలుసు. తెలిసికూడా నేను యీ తీర్మానాన్ని సమర్థిస్తున్నాను' అని మాత్రం అన్నాను.

హిందుస్తానీలో మాట్లాడినందుకు చాలామంది నన్ను అభినందించారు. వైస్రాయి సభలో యీ రోజుల్లో హిందుస్తానీలో మాట్లాడటం యిదే ప్రథమం అనికూడా చెప్పారు. అభినందన, మొదటి పర్యాయం అను మాటలు రెండు నాకు గుచ్చుకున్నాయి. నేను సిగ్గుపడ్డాను. మన దేశంలో, దేశ సమస్యను గురించి దేశభాషలో మాట్లాడకపోవడం దేశభాషను అవమానించడం ఎంతో విచారకరమైన విషయం. నావంటివ్యక్తి రెండు వాక్యాలు హిందుస్తానీలో మాట్లాడితే అందుకు అభినందించడమా? మన పతనావస్థను యీ విషయం సూచిస్తున్నది. సభలో నేను అన్నమాటలకు నా దృష్టిలో మంచి తూకం వున్నది. దాన్ని మరిచిపోయే స్థితి యీ సభలో నాకు ఏమీ కనబడలేదు. నాకు గల ఒక బాధ్యతను ఢిల్లీలో నిర్వహించవలసియున్నది. వైస్రాయికి జాబు వ్రాయడం తేలికపనియని నాకనిపించలేదు. సభలో పాల్గొనేందుకు నా తడబాటు, అందుకు గల కారణాలు, భవిష్యత్తుపై నాకుగల ఆశ మొదలగు వాటిని స్పష్టంగా వెల్లడించడం అవసరమని భావించాను.

నేను వైస్రాయికి జాబు వ్రాసాను. అందు లోకమాన్య తిలక్, అలీ సోదరులు మొదలగువారిని సభకు ఆహ్వానించనందుకు విచారం వెల్లడించాను. ప్రజల రాజకీయ కోరికలను గురించి, యుద్ధంవల్ల మహమ్మదీయులకు కలిగిన కోరికలను గురించి ఆ

జాబులో పేర్కొన్నాను. జాబును ప్రకటించేందుకు అనుమతించమని వైస్రాయిని కోరాను. ఆయన సంతోషంతో అనుమతించారు. ఆ జాబు సిమ్లా పంపాల్సి వచ్చింది. సమావేశం ముగియగానే వైస్రాయి సిమ్లా వెళ్లిపోయారు. పోస్టులో జాబు పంపితే ఆలస్యం అవుతుంది. నా దృష్టిలో జాబుకు విలువ ఎక్కువ. సమయం ఎక్కువ పట్టకూడదు. ఎవరి చేతనో జాబు పంపడం మంచిదికాదు. పవిత్రుడగు వ్యక్తి ద్వారా జాబు పంపితే మంచిదని భావించాను. దీనబంధు మరియు సుశీల రుద్రగారలు సజ్జనులగు రెవరెండ్ ఐర్లండుగారి పేరు సూచించారు. జాబు చదివిన తరువాత తనకు నచ్చితే తీసుకువెళ్లేందుకు ఆయన అంగీకరించాడు. జాబు రహస్యమైనదికాదు. ఆయన చదివారు. ఆయనకు నచ్చింది. తీసుకొనివెళ్లేందుకు అంగీకరించారు. సెకండ్‌క్లాసు కిరాయి యిస్తానని చెప్పాను. కాని ఆయన కిరాయి తీసుకునేందుకు అంగీకరించలేదు. రాత్రిపూట ప్రయాణం అయినా ఆయన ఇంటర్ టిక్కట్టు తీసుకున్నాడు. ఆయన నిరాడంబరత, స్పష్టత చూచి ముగ్ధుడనయ్యాను. యింతటి పవిత్రవ్యక్తి ద్వారా పంపిన జాబుకు సత్ఫలితం చేకూరింది. దానితో నాకు మార్గం సులువైపోయింది. సైన్యంలో యువకుల్ని చేర్చడం యిక నా రెండో బాధ్యత. ప్రజల్ని సైన్యంలో చేరమని నేను విన్నపం చేయాలంటే అందుకు తగిన చోటు ఖేడాయే గదా? నా అనుచరుల్ని ఆహ్వానించకపోతే యింక ఎవర్ని ఆహ్వానించగలను? ఖేడా చేరగానే వల్లభాయి మొదలగు వారితో చర్చించాను. చాలామందికి నా మాటలు రుచించలేదు. రుచించినవారికి యిందు సాఫల్యం లభిస్తుందా అని సందేహం కలిగింది. ఏ వర్గం వారిని ఇందు చేర్చాలో ఆ వర్గం వారికి ప్రభుత్వం మీద విశ్వాసం లేదు. ప్రభుత్వ అధికారుల వల్ల కలిగిన అనుభవాలు వాళ్లు యింకా మరిచిపోలేదు. అయినా పని ప్రారంభిద్దామని అంతా నిర్ణయానికి వచ్చారు. పని ప్రారంభించినప్పుడు నా కండ్లు తెరుపుడు పడ్డాయి. నా ఆశావాదం తగ్గిపోయింది. ఖేడా సంగ్రామం జరిగినప్పుడు జనం తమ సొంత బండ్లను యిచ్చారు. ఒక్క వాలంటీరుతో పని జరిగేచోట నలుగురు వాలంటీర్లు పనిచేశారు. కాని యిప్పుడు డబ్బుయిచ్చినా బండి కట్టేవాళ్లు కనబడలేదు. అయితే మేము నిరాశపడే రకం కాదుగదా! బండ్లకు బదులు కాలినడకన తిరగాలని నిర్ణయించాం. రోజుకు 20 మైళ్లు నడవాల్సి వచ్చింది. బండిదొరకని చోట తిండి ఎలా దొరుకుతుంది? భోజనం పెట్టమని అడగటం మంచిది కాదుగదా! అందువల్ల ప్రతి వాలంటీరు బయలుదేరినప్పుడే ఆహారం వెంటతెచ్చుకోవాలని నిర్ణయించాం. వేసవికాలపు రోజులు. అందువల్ల కప్పుకొనేందుకు బట్టలు అవసరంలేదు. వెళ్లిన ప్రతి

గ్రామంలో సభ జరిపాం. జనం వచ్చేవారు కాని ఇద్దరు ముగ్గురు మాత్రమే తమ పేరు నమోదు చేయించుకునేవారు. "మీరు అహింసావాదులు కదా! మమ్మల్ని ఆయుధాలు పట్టమని ఎలా చెబుతున్నారు? ప్రభుత్వం యీ దేశప్రజలకు ఏమి మేలు చేసింది? దానికి సాయం చేయమని మీరు ఎలా కోరుతున్నారు?" ఈరకమైన ప్రశ్నలు జనం వేయసాగారు.

ఇట్టి స్థితిలో కూడా మెల్లమెల్లగా పని చేశాం. పేర్లు బాగానే నమోదు కాసాగాయి. మొదటి బృందం బయలుదేరి వెళ్లితే రెండో బృందానికి మార్గం సుగమం అవుతుందని భావించాం. జనం ఎక్కువగా చేరితే వాళ్లను ఎక్కడ వుంచాలా అను విషయాన్ని గురించి కమీషనరుతో మాట్లాడాను. కమీషనరు కూడా ఢిల్లీ పద్ధతిలో సభలు జరుపుతున్నారు. గుజరాత్‌లో కూడా అట్టిసభ జరిగింది. అందు నన్ను నాఅనుచరులను పాల్గొనమని ఆహ్వానించారు. అక్కడికి వెళ్లి సభలో పాల్గొన్నాను. ప్రతి మీటింగులోను పరిస్థితి మరో విధంగా వుంటూ వుంది. చిత్తం చిత్తం అను పద్ధతి ఎక్కువ కావడం వల్ల నేను అధికారుల మధ్య యిమడలేక పోయాను. సభలో నేను కొంచెం ఎక్కువగానే మాట్లాడాను. నా మాటల్లో ముఖస్తుతి అనునదిలేదు. రెండు కటువైన మాటలు కూడా అందు వున్నాయి. సైన్యంలో యువకుల్ని చేర్చుకునే విషయమై నేను ఒక కరపత్రం ప్రకటించాను. సైన్యంలో చేరే విషయమై వెలువరించిన విజ్ఞప్తిలో ఒక తర్కం వున్నది. అది కమీషనరుకు గుచ్చుకున్నది. "బ్రిటిష్ ప్రభుత్వం చేసిన అకృత్యాలు అపరిమితం. ప్రజలనందరినీ ఆయుధాలు లేకుండా చేసిన చట్టం దేశచరిత్రలో మాయనిమచ్చ అని చెప్పవచ్చు. చట్టాన్ని రద్దు చేయాలన్నా, ఆయుధాలను ప్రయోగించడం నేర్చుకోవాలన్నా ఇది మంచి తరుణం. రాజ్యం ఆపదలోవున్న సమయంలో మధ్య తరగతి ప్రజలు స్వచ్ఛందంగా సాయపడితే వారి మనస్సులో గల అపనమ్మకం తొలగిపోతుంది. ఆయుధాలు పట్టదలచినవారు సంతోషంగా పట్టవచ్చును' ఇది ఆ తర్కానికి సారాంశం. దీన్ని దృష్టిలో పెట్టుకుని కమీషనరు మీకు మాకు మధ్య అభిప్రాయబేధం వున్నప్పటికీ సభలో మీరు పాల్గొనడం నాకు ఇష్టం అని అన్నాడు. అందుకు నేనుకూడా నా అభిప్రాయాన్ని తీయని మాటలతో సభలో సమర్థించుకోవలసి వచ్చింది. వైస్రాయికి నేను పంపిన పత్రం యొక్క వివరం క్రింద ప్రకటిస్తున్నాను.

"యుద్ధ పరిషత్తులో పాల్గొనే విషయమై నాకు సంకోచం కలిగింది. కాని మిమ్ము కలసిన తరువాత ఆ సంకోచం తొలగిపోయింది. మీ యెడ నాకు గల అమిత ఆదరణ అందుకుగల ఒక పెద్దకారణం. ఆ సభలో పాల్గొనమని లోకమాన్యతిలక్

మిసెస్ బిసెంట్, ఆలీ సోదరులను మీరు ఆహ్వానించకపోవడం నా సంకోచానికి మరో పెద్ద కారణం. వారు గొప్ప ప్రజా నాయకులని నా విశ్వాసం. వారిని ఆహ్వానించకపోవడం ప్రభుత్వం చేసిన పెద్ద తప్పిదం. యిక ముందు జరిపే ప్రాంతీయ సభలకు వారిని తప్పక ఆహ్వానించమని నా సలహా. ఇంతటి ప్రౌఢనాయకుల్ని అభిప్రాయభేదాలెన్ని వున్నప్పటికీ ఏ ప్రభుత్వం నిర్లక్ష్యం చేయకూడదని నా నమ్రతతో కూడిన వినతి. అందువల్ల నేను సభయొక్క కార్యనిర్వాహక సమితి సమావేశాల్లో పాల్గొనలేకపోయాను. సభలో తీర్మానాన్ని సమర్థించి తృప్తిపడ్డాను. ప్రభుత్వం నా సలహాను అంగీకరిస్తే నేను వెంటనే నా సమర్థనకు కార్యరూపం ఇవ్వగలనని తెలియజేస్తున్నాను. ఏ ప్రభుత్వపు భవిష్యత్తులో మేము భాగస్వాములమని విశ్వసిస్తున్నామో ఆ ప్రభుత్వం ఆపదలో వున్నప్పుడు దానికి పూర్తిగా మద్దతు అందించడం మా కర్తవ్యం. యిట్టి మద్దతు ద్వారా మేము మా లక్ష్యం వరకు త్వరగా చేరుకోగలమని ఆశిస్తున్నామని చెప్పడం ఈ సందర్భంలో అవసరమని భావిస్తున్నాను. మీరు మీ ఉపన్యాసంలో పేర్కొన్న మార్పుల్లో కాంగ్రెస్, ముస్లిమ్‌లీగు కోరుతున్న కోరికలు కూడా చోటు చేసుకుంటాయని విశ్వసించే హక్కు ప్రజలకు వున్నది. నావల్ల నెరవేరగల పరిస్థితి వుండివుంటే ఇటువంటి సమయంలో హోమ్‌రూలు మొదలగు వాటిపేరు ఎత్తి వుండేవాణ్ణి కాదు. సామ్రాజ్యానికి సంభవించిన ఈ కష్టసమయంలో శక్తివంతులైన భారతీయులందరు దాని రక్షణార్థం మౌనంగా బలిదానం అయిపోవాలని ప్రోత్సహించేవాణ్ణి. ఈ విధంగా చేయడంవల్ల మేము సామ్రాజ్యంలో ఆదరణగల గొప్ప భాగస్వాములం అయివుండేవాళ్లం. వర్ణభేదం, దేశభేదం పటాపంచలైపోయేవి.

చదువుకున్న ప్రజలు యింతకంటే కొంచెం తక్కువ ప్రభావం కలిగించే మార్గం ఎన్నుకున్నారు. ప్రజాబాహుళ్యం మీద వారి ప్రభావం బాగా పడింది. భారతదేశం వచ్చినప్పటి నుండి సామాన్య ప్రజానీకంతో సంబంధం పెట్టుకున్నాను. వారి హృదయంలో కూడా హోంరూలును గురించిన ఆకాంక్ష నాటుకున్నదని మనవి చేయదలుచుకున్నాను. హోంరూలు లేకపోతే ప్రజానీకం సంతృప్తి చెందదు. హోంరూలు కోసం ఎంతటి త్యాగానికైనా ప్రజానీకం సిద్ధంగా వున్నది. రాజ్య రక్షణకు ఎంతమంది సైనికులైనా మేము యివ్వవలసిందే. కాని ఆర్థిక సాయం విషయమై నేను మాట యివ్వలేను. భారతదేశపు ప్రజానీకానికి యిది శక్తికి మించిన విషయం. ఇప్పటికి యిచ్చిందే చాలా ఎక్కువ. అయితే సభలో కొందరు చివరి శ్వాస వరకు సాయం చేయాలని నిర్ణయించారు. కాని అది మావల్ల కాని పని. మేము గద్దెల కోసం గాని మేడల కోసం గాని ఎగబడటం

లేదు. మా సాయం భవిష్యత్తు మీద గల ఆశల పునాది మీద ఆధారపడియున్నది. ఆ ఆశలు స్పష్టంగా చెప్పడం అవసరమని భావిస్తున్నాను. నేను బేరసారాలకు దిగను. కానీ ఈ విషయమై మా హృదయాలలో నిరాశ నెలకొంటే మాత్రం బ్రిటిష్ సామ్రాజ్యం మీద మాకు గల నమ్మకం అంతా నీరుగారిపోతుంది. గృహకల్లోలాలు మరిచిపొమ్మని అన్నారు. దానికి అర్థం అధికారుల అకృత్యాలను మరిచిపొమ్మనా? అలా అనుకుంటే అది సాధ్యం కాని పని. సుసంఘటితంగా సాగే దుర్మార్గాన్ని పూర్తి శక్తి సామర్థ్యాలతో ఎదుర్కోవడం ధర్మమని నా భావం. అందువల్ల అధికారులకు దుర్మార్గాలు ఆపివేయమని, ప్రజాభిప్రాయాన్ని ఆదరించమని చెప్పండి. చంపారన్‌లో శతాబ్దాల తరబడి సాగుతున్న దుర్మార్గాన్ని ఎదుర్కొని బ్రిటిష్ వారి న్యాయవ్యవస్థ ఎంత గొప్పదో నిరూపించి చూపించాను. సత్యం కోసం కష్టాల్ని సహించగల శక్తి తమకు వున్నదని తెలుసుకున్న ఖేడా ప్రజలు వాస్తవానికి ప్రభుత్వ శక్తి ఒక శక్తి కాదని, ప్రజా శక్తియే నిజమైన శక్తియని గ్రహించారు. ఆ తరువాత అక్కడి ప్రజలు అప్పటివరకు తాము శపిస్తున్న ప్రభుత్వం శక్తి యెడ తమకు గల వ్యతిరేకతను తగ్గించుకున్నారు. సహాయ నిరాకరణోద్యమాన్ని సహించిన ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని నిర్లక్ష్యం చేయదని విశ్వసించారు. అందువల్ల చంపారన్, ఖేడాలలో నేను జరిపిన చర్యలన్నీ యుద్ధానికి సహాయపడ్డాయని భావిస్తున్నాను. యిటువంటి చర్యలు చేయవద్దని మీరు నన్ను కోరితే శ్వాస పీల్చవద్దని మీరు చెబుతున్నారని భావిస్తాను. ఆయుధ బలం కంటే ఆత్మ బలం, అనగా ప్రేమ బలం గొప్పదను భావం ప్రజల హృదయాలలో నేను నాటగలిగితే భారతదేశం మొత్తం ప్రపంచానికే తలమానికం కాగలదని భావిస్తున్నాను. అందువల్ల ప్రతివ్యక్తి కష్టాలు దుఃఖాలు సంహించగల శక్తిని అలవరచుకునే పద్ధతిన సనాతన విధానాన్ని జీవితంలో అనుసరించడం కోసం నా ఆత్మశక్తిని వినియోగిస్తాను. ఈ విధానాన్ని అనుసరించమని యితరులను కూడా ఆహ్వానిస్తూ వుంటాను. యితర వ్యవహారాలలో తలదూర్చడం యీ విధానం యొక్క గొప్పదనాన్ని రుజూచేసేందుకేనని మనవి చేస్తున్నాను.

ముస్లిం రాజ్యాల విషయమై గట్టిగా మాట యిమ్మని బ్రిటిష్ మంత్రి వర్గానికి మీరు వ్రాయండి. ప్రతి మహమ్మదీయుడు యీ విషయమై చింతిస్తున్నాడని మీరు గ్రహించండి. నేను హిందువును అయినా వారి భావాన్ని విస్మరించలేదు. వాళ్ల దుఃఖం మా దుఃఖమే. ముస్లిం రాజ్యాల హక్కుల రక్షణ కోసం, వారి ధార్మిక స్థలాల విషయంలో, వారి భావాల్ని ఆదరించే విషయంలో భారతదేశానికి హోమ్‌రూలు మొదలగు వాటిని అంగీకరించడం బ్రిటిష్ సామ్రాజ్యానికే క్షేమం కలిగిస్తుందని

మనవి చేస్తున్నాను. ఇంగ్లీషు వారిలో గల విశ్వసనీయతను ప్రతి భారతీయుని హృదయంలో నెలకొల్పాలని కాంక్షిస్తున్నాను.'

## 28. మృత్యుశయ్య మీద

సైన్యంలో యువకుల్ని చేర్చడం కోసం నా శరీరం అరిగిపోయింది. అప్పుడు వేయించి దంచిన బెల్లం కలిపిన వేరుసెనగపప్పు నా ఆహారం. అరిటిపండ్లు, రెండు మూడు నిమ్మకాయల రసం. వేరుసెనగ పప్పు ఎక్కువగా తింటే హానిచేస్తుందని తెలుసు. అయినా దాన్ని ఎక్కువగా తిన్నాను. అందువల్ల విరోచనాలు పట్టుకున్నాయి. నేను తరచు ఆశ్రమం వెళ్లవలసి వస్తూ వుండేది. విరోచనాలు అంత బాధాకరమని అనిపించలేదు. రాత్రి ఆశ్రమం చేరాను. అప్పుడు మందులేమీ వాడేవాణ్ణి కాను. ఒక పూట ఆహారం మానివేస్తే విరోచనాలు తగ్గిపోతాయని భావించాను. మరునాడు ఉదయం ఏమీ తినలేదు. దానితో బాధ కొంత తగ్గింది. యింకా ఉపవాసం చేయడం అవసరమని, ఆహారం తీసుకోవలసివస్తే పండ్లరసం వంటి వస్తువేదైనా తీసుకోవాలని నాకు తెలుసు.

అది ఏదో పండగరోజు. మధ్యాహ్నం ఏమీ తిననని కస్తూరిబాయికి చెప్పినట్లు గుర్తు. కాని ఆమె పండగపూట కొంచెం తినమని ప్రోత్సహించింది. నేను కొంచెం ఉబలాటపడ్డాను. నేను పశువుల పాలు పుచ్చుకోవడం లేదు. అందువల్ల నెయ్యి, మజ్జిగ కూడ మానివేశాను. కస్తూరిబాయి నూనెతో వేయించిన గోధుమజావ, పెసరపప్పు పదార్థం నాకిష్టమైనవి చేసివుంచింది. వాటిని చూచేసరికి నాకు నోరు ఊరింది. కస్తూరిబాయికి తృప్తి కలిగించేందుకు కొద్దిగా తిందామని, రుచి చూడటంతోపాటు శరీర రక్షణ కూడా సాధ్యపడుతుందని భావించాను. కాని సైతాను రెడీగా పొంచివున్నాడు. తినడం ప్రారంభించిన తరువాత పూర్తిగా తినివేశాను. తినడానికి పసందుగా వున్నాయేగాని, యమధర్మరాజును చేతులారా కొని తెచ్చుకున్నానని తరువాత తేలింది. తిని ఒక గంట అయిందో లేదో కడుపులో నొప్పి ప్రారంభమైంది.

రాత్రికి నడియాద్ వెళ్లాలి. సాబర్మతి స్టేషను వరకు నడిచి వెళ్లాను. మైలున్నర దూరం నడవాలంటే కష్టమైపోయింది. అహమదాబాదు స్టేషనులో వల్లభభాయి కలిశారు. ఆయన నేను పడుతున్న బాధను గ్రహించారు. అయినా బాధ భరించలేకపోతున్నానని ఆయనకుగాని, యితర అనుచరులకుగాని నేను చెప్పలేదు. నడియాద్ చేరాం. అక్కడికి అనాథాశ్రమం అరమైలు దూరాన వుంది. పదిమైళ్ల దూరం

నడిచినంత శ్రమ కలిగింది. అతికష్టం మీద అక్కడికి చేరాను. మెలికలు తిరిగేటంతగా వుంది కడుపునొప్పి. పావుగంటకు ఒకసారి చొప్పున విరోచనాలు ప్రారంభమైనాయి. భరించలేక నేను పడుతున్న బాధను గురించి చెప్పివేశాను. మంచం ఎక్కాను. అక్కడి పాయిఖానా దొడ్డిని ఉపయోగించాను. కాని అంత దూరం కూడా వెళ్లలేక పక్కగదిలో కమోడ్ పెట్టమని చెప్పాను. సిగ్గుపడ్డాను కాని గత్యంతరం లేదు. ఫూల్‌చంద్ బాపూజీ పరుగెత్తుకొని వెళ్లి కమోడ్ తెచ్చాడు, చింతాక్రాంతులైన నలుగురూ చుట్టూ మూగారు. అంతా ప్రేమామృతం నామీద కురిపించారు కాని నా బాధను పంచుకోలేరు గదా! నా మొండిపట్టు కూడా యిబ్బందికరంగా వున్నది. డాక్టర్లను పిలుస్తామంటే వద్దని వారించాను. మందు తీసుకోను. చేసిన పాపానికి ఫలితం అనుభవిస్తాను అని చెప్పివేశాను. అనుచరులు ఓర్పు వహించారు. 24 గంటల్లో 30 లేక 40 సార్లు విరోచనాలు అయ్యాయి. ఆహారం పూర్తిగా మానివేశాను. తిందామనే వాంఛ పోయింది. రాతి వంటి శరీరం నాది అనుకునేవాణ్ణి. కాని బలం తగ్గిపోయింది. డాక్టర్లు వచ్చి మందు తీసుకోమని చెప్పారు. నేను తీసుకోనని చెప్పివేశాను. ఇంజక్షను గురించి అప్పటి అజ్ఞానాన్ని తలచుకుంటే నవ్వువస్తుంది. ఇంజక్షను గొట్టంలో ఒక విధమైన చెడు ఔషధం వుంటుందని అనుకునేవాణ్ణి. నా అభిప్రాయం సరికాదని తరువాత తెలిసింది. అయితే అప్పటికి సమయం దాటిపోయింది జిగట విరోచనాలు తగ్గలేదు. మాటిమాటికి లేవవలసిన పరిస్థితి ఏర్పడింది దానితో జ్వరం వచ్చింది. ఒళ్లు తెలియకుండా పడిపోయాను. మిత్రులు భయపడిపోయారు. చాలామంది డాక్టర్లు వచ్చారు. కాని రోగి అంగీకరించకపోతే వారేం చేస్తారు ?

సేఠ్ అంబాలాలు, ఆయన సతీమణి నడియాద్ వచ్చారు. అనుచరులతో మాట్లాడి నన్ను మీర్జాపూరులో వున్న తమ బంగళాకు కడు జాగ్రత్తగా తీసుకువెళ్ళారు. జబ్బుస్థితిలో నేను పొందిన నిర్మల, నిష్కామసేవ మరెవ్వరూ పొందియుండరని చెప్పగలను. జ్వరం తక్కువగా వున్నా శరీరం క్షీణించిపోయింది. జబ్బు చాలాకాలం లాగుతుందని మంచం మీద నుండి లేవలేనని అనుకున్నాను. అంబాలాలు గారి బంగళాలో ప్రేమామృతం వారు ఎంత కురిపిస్తున్నా నేను అక్కడ వుండలేకపోయాను. ఆశ్రమం చేర్చమని వారిని వేడుకున్నాను. నా పట్టుదలను చూచి వారు నన్ను ఆశ్రమం చేర్చారు. బాధపడుతున్న సమయంలో వల్లభభాయి వచ్చి యుద్ధంలో జర్మనీ ఓడిపోయిందని, సైన్యంలో యువకుల్ని చేర్చవలసిన అవసరం లేదని కమీషనరు చెప్పాడని అన్నారు. సంతోషం కలిగింది. బరువు తీరినట్లనిపించింది.

జల చికిత్స ప్రారంభించినందున నా శరీరం యింకా నిలిచివున్నది. బాధ తగ్గింది. కాని శరీరం కుదుటబడలేదు. వైద్యులు, డాక్టర్లు ఎన్నో సలహాలు యిచ్చారు కాని నేను అంగీకరించలేదు. పాలు తీసుకోకపోతే మాంసం పులుసు పుచ్చుకోమని, ఆయుర్వేద శాస్త్రంలో అందుకు అంగీకరించారని కొందరు వైద్యులు గ్రంథాలు తిరగవేసి మరీ చెప్పారు. ఒకరు గుడ్లు తీసుకోమని చెప్పారు. ఎవ్వరి మాటా నేను వినలేదు. ఆహారం విషయంలో గ్రంథాల మీద నేను ఎన్నడూ ఆధారపడలేదు. ఆహారంలో ప్రయోగాలు నా జీవితంలో భాగమై పోయాయి. ఏదో ఒకటి తినడం, ఏదో మందు పుచ్చుకోవడం నేనెరుగను. నా బిడ్డలకు, భార్యకు, మిత్రులకు వర్తించని ధర్మం నాకు మాత్రం ఎలా వర్తిస్తుంది? ఇది జీవితంలో నాకు చేసిన పెద్దజబ్బు, ఎక్కువకాలం మంచం పట్టిన జబ్బు కూడా యిదే. జబ్బు తీవ్రతను దగ్గరగా పరిశీలించే అవకాశం నాకు చిక్కింది. ఒకనాటి రాత్రి యిక బ్రతకనని అనిపించింది. మృత్యువుకు దగ్గరలో వున్నానని అనిపించింది. శ్రీమతి అనసూయాబెన్‌కు కబురు పంపాను. ఆమె వచ్చింది. వల్లభభాయి వచ్చారు. డాక్టర్ కానూగా వచ్చారు. డాక్టర్ కానూగా కూడా నాడిని జాగ్రత్తగా పరిశీలించి చూచి "మృత్యు లక్షణాలేమీ నాకు కనబడటం లేదు. నాడి శుభ్రంగా వున్నది. బలహీనత వల్ల మీరు మానసికంగా భయపడుతున్నారు" అని చెప్పారు. కాని నా మనస్సు అంగీకరించలేదు. ఆ రాత్రి అతికష్టం మీద గడిచింది. కన్ను మూతబడలేదు.

తెల్లవారింది. నేను చనిపోలేదు అయినా బ్రతుకు మీద ఆశ నాకు కలుగలేదు. మరణం దగ్గరలో వున్నదని భావించి గీతాపఠనం విడువకుండా సాగించమని చెప్పి, గీతాశ్లోకాలు వింటూ పడుకున్నాను. పనిచేసే శక్తి లేదు. చదివే ఓపిక అసలే లేదు. రెండు మూడు వాక్యాలు మాట్లాడేసరికి మెదడు అలిసిపోతున్నది. అందువల్ల ప్రాణం మీద ఆశపోయింది. బ్రతకడం కోసం బ్రతకడం నాకు యిష్టం లేదు. కాయకష్టం చేయకుండా అనుచరుల చేత చేయించుకుంటూ బ్రతకడం భారమనిపించింది. ఈవిధమైన స్థితిలో వుండగా డాక్టర్ తల్‌వల్కార్ ఒక విచిత్రమై వ్యక్తిని తీసుకువచ్చారు. ఆయన మహారాష్ట్రకు చెందినవాడు. భారతదేశంలో ఆయనకు ఖ్యాతి లేదు. ఆయనను చూడగానే నా మాదిరిగానే ఆయన కూడా పెంకిరకమని గ్రహించాను. ఆయన తన చికిత్సను నా మీద ప్రయోగించి చూచేందుకు వచ్చాడని తేల్చుకున్నాను. ఆయన గ్రేట్ మెడికల్ కాలేజీలో వైద్యశాస్త్రం అధ్యయనం చేశాడు. అయితే డిగ్రీ తీసుకోలేదు. బ్రహ్మ సమాజంలో చేరాడని తరువాత తెలిసింది. ఆయన పేరు కేల్కర్. పూర్తిగా

స్వతంత్ర స్వభావం గల వ్యక్తి. మంచు చికిత్స తప్పదని ఆయన భావం. నా జబ్బు విషయం తెలిసిమంచి చికిత్స చేయడానికి వచ్చాడన్నమాట. ఆయనకు ఐస్ డాక్టర్ అని పేరు పెట్టాము. తన చికిత్స అంటే ఆయనకు గట్టి నమ్మకం. డిగ్రీ హోల్డర్ల కంటే తను గొప్ప డాక్టరునని ఆయనకు అపరిమితమైన విశ్వాసం.

అయితే తనకెంత విశ్వాసంవుందో అంత విశ్వాసం నాకు కలిగించలేకపోయాడు. ఈ విషయం మా ఇరువురికీ విచారం కలిగించింది. కొన్ని విషయాలలో ఆయన తొందరపడ్డాడని నాకు అనిపించింది. ఏది ఏమైనా నాశరీరం మీద ఆయనను ప్రయోగాలు చేయనిచ్చాను. బాహ్య చికిత్సే గదా అని భావించాను. ఆయన శరీరమంతా మంచుగడ్డలతో రాయడం ప్రారంభించాడు. ఆయన చికిత్స వల్ల చెప్పినంత ప్రయోజనం కలుగకపోయినా మృత్యువు కోసం మొదట నిరీక్షించినట్లు యిప్పుడు నిరీక్షించడం మానివేశాను. జీవితంమీద ఆశ చిగురించింది. కొద్దిగా ఉత్సాహం కలిగింది. తినే ఆహారం కొద్దిగా పెరిగింది. 10 నిమిషాలపాటు రోజూ పచారు చేయసాగాను. ఆయన నా ఆహారంలో కొద్దిగా మార్పు చేయమని సూచించి "మీరు గ్రుడ్డురసం త్రాగండి. యిప్పటికంటే అత్యధికంగా మీకు ఉత్సాహం కలుగుతుంది. పాల వలెనే గ్రుడ్డు కూడా దోషంలేని వస్తువు. అది మాంసం కానేకాదు. ప్రతి గ్రుడ్డు నుండి పిల్ల పుట్టదు. పిల్లగా మారని గొడ్డుబోతు గ్రుడ్లు కూడా వుంటాయి. వాటిని వాడవచ్చును. నా మాటను రుజూ చేసి చూపిస్తాను" అని మాటల వర్షం కురిపించాడు. కాని అందుకు నేను యిష్టపడలేదు. అయినా నా బండి కొంచెం ముందుకు సాగింది. కొద్ది కొద్దిగా పనులు చేయసాగాను.

## 29. రౌలట్ ఆక్టు - ధర్మసంకటం

మథెరాన్ వెళితే శరీరానికి త్వరగా పుష్టి చేకూరుతుందని మిత్రులు సలహా యిచ్చారు. ఆ ప్రకారం నేను మథేరాన్ వెళ్లాను. అక్కడి నీళ్లు పడలేదు. అందువల్ల నా వంటిరోగిఅక్కడ వుండటం కష్టమైపోయింది. ఆమం ఎక్కువ కావడం వల్ల మలద్వారం మెత్తబడిపోయి అక్కడ బాగా గాట్లు పడ్డాయి. దొడ్డికి వెళితే యమబాధ ప్రారంభమైంది. అందువల్ల ఆహారం ఏమన్నా తీసుకుందామంటే భయం వేసింది. ఒక్క వారం రోజుల్లో మథెరాన్ నుండి తిరిగి వచ్చివేశాను. నా ఆరోగ్యాన్ని గురించి శంకరలాల్ శ్రద్ధ వహించాడు. డాక్టర్ దలాల్ సలహా తీసుకోమని వత్తిడి చేశాడు. డాక్టర్ దలాల్ వచ్చారు. వెంటనే నిర్ణయం చేసే ఆయన శక్తి నన్ను ఆకర్షించింది. 'మీరు పాలు తీసుకోనంత

వరకు నేను మీ శరీరాన్ని బాగుచేయలేను. మీ శరీరం బాగుపడాలంటే పాలు త్రాగక తప్పదు ఆర్సెనిక్ ఇంజెక్షన్లు చేయించుకోవాలి. మీరు సరేనంటే మీ శరీర బాధ్యత నాది' అని అన్నారు. "ఇంజెక్షన్లు తీసుకుంటాను కాని పాలు మాత్రం త్రాగను". "పాలను గురించిన మీ ప్రతిజ్ఞ ఏమిటి"? "ఆవులను గేదెలను నరకయాతనలకు గురిచేస్తారని తెలిసి పాలంటే నాకు ఏవగింపు కలిగింది. పాలను ఆహారంగా తీసుకోకూడదని నిర్ణయానికి వచ్చాను. అందువల్ల పాలు త్రాగడం మానివేశాను"."అయితే మేకపాలు తీసుకోవచ్చు గదా!" అని నా మంచం దగ్గరే నిలబడి వున్న కస్తూరిబాయి అన్నది. "మీరు మేకపాలు పుచ్చుకున్నా చాలు" అని అన్నాడు డాక్టరు. నేను ఓడిపోయాను. సత్యాగ్రహ సంగ్రామపు మోహం జీవించాలనే లోభాన్ని కలిగించిందన్న మాట. ప్రతిజ్ఞను అక్షరశః పాటిస్తున్నానని సంతోషపడి దాని ఆత్మకు హాని కలిగించాను. పాలు త్రాగను అని ప్రతిజ్ఞ చేసినప్పుడు నాదృష్టిలో వున్నది ఆవులు గేదెలు మాత్రమే. అయినా పాలు అంటే అన్నిరకాల పాలు అని అర్థం కదా! జంతువుల పాలు ఆహారంగా తీసుకోకూడదు అని నేను భావించాను గనుక ఏవిధమైన పాలు నేను పుచ్చుకోకూడదు కదా! యీ విషయం తెలిసి కూడా నేను మేకపాలు పుచ్చుకునేందుకు సిద్ధపడ్డాను. సత్యాన్ని పూజించే వ్యక్తి సత్యాగ్రహ సంగ్రామం జరపడం కోసం జీవించాలనే కాంక్షతో అసలు సత్యాన్ని అణచివేసి దానికి మచ్చ తెచ్చాడన్న మాట.

నేను చేసిన యీ పని నాకు బాధ కలిగించింది. ఆ బాధ ఆ గాయం యింకా మానలేదు. మేకపాలు మానివేయాలి అను యోచన నాకు కలుగలేదు. మేకపాలు రోజూ త్రాగుతూ వున్నప్పుడు లోలోన బాధపడసాగాను. అయితే సేవ చేయాలనే అతిసూక్ష్మమైన మోహం నన్ను పట్టుకున్నది. అది నన్ను వదలలేదు. అహింసా దృష్టితో ఆహార ప్రయోగాలు చేయడం నాకు యిష్టం. అందువల్ల నా మనస్సుకు ఆహ్లాదం చేకూరుతుంది. కాని మేకపాలు తాగడం మాత్రం సత్యశోధన దృష్ట్యా నాకు యిష్టంలేదు. అహింస కంటే కూడా సత్యాన్ని ఎక్కువగా తెలుసుకోగలిగానని నా భావం. సత్యాన్ని త్యజిస్తే అహింస ద్వారా సమస్యల్ని పరిష్కరించలేనని నా విశ్వాసం. సత్య పాలన అంటే మాటను పాటించడం, శరీరం, ఆత్మ రెండిటిని రక్షించడం. శబ్దార్థం మరియు భావార్థం రెండిటినీ దెబ్బ తీశానన్నమాట. ప్రతి క్షణం యీ బాధ నన్ను బాధిస్తూనే వుంది. విషయాలు అన్నీ తెలిసినప్పటికీ అసలు విషయం నేను పూర్తిగా తెలుసుకోలేదన్నమాట లేక దాన్ని పాటించే ధైర్యం నాకు చాలలేదని కూడా చెప్పవచ్చు. "ఓ భగవంతుడా! నాకు అట్టి ధైర్యం ప్రసాదించు!"

మేకపాలు తాగడం ప్రారంభించిన కొద్ది రోజుల తరువాత డా. దలాల్ మలద్వారం దగ్గర పడ్డ గాట్లకు శస్త్రచికిత్స చేశారు. దానితో గాట్లు సర్దుకున్నాయి. ఇప్పుడు లేవగలననే ఆశ కలిగింది. పత్రికలు చదవడం ప్రారంభించాను. ఇంతలో రౌలట్ కమిటీ రిపోర్టు నా చేతికి అందింది. అందు పేర్కొన్న సిఫారసులను చదివి నివ్వెరబోయాను. ఉమర్‌భాయి (సుభానీ), శంకర్‌లాల్ యీ విషయమై గట్టి చర్య తీసుకోవాలని అన్నారు. ఒక నెల రోజులు గడిచిన తరువాత నే అహమదాబాదు వెళ్లాను. వల్లభభాయి ప్రతి రోజు నన్ను చూచేందుకు వస్తూ వుండేవారు. వారితో మాట్లాడి దీన్ని గురించి ఏమైనా చేయాలి అని అన్నాను. "ఏం చేయాలి?" అని ప్రశ్నించారు వల్లభభాయి. కమిటీ చేసిన సిఫారసుల ప్రకారం చట్టం చేయబడితే వెంటనే సత్యాగ్రహం ప్రారంభించాలి. అలా చేస్తామని ప్రతిజ్ఞ గైకొనేవారు కొందరైనా అవసరం అని చెప్పాను. నేను మంచం పట్టి వుండకపోతే ఒంటరిగానే పోరాటానికి దిగేవాణ్ణి. తరువాత కొంతమంది అయినా పోరాటంలో చేరేవారు. శరీర దారుఢ్యత లేనందువలన ఒంటరిగా పోరాటానికి దిగగల శక్తి నాకు లేదు అని చెప్పాను.

ఈ సంభాషణ జరిగిన తరువాత నాతో బాటు పని చేస్తూ వున్న వారి సమావేశం ఒకటి ఏర్పాటు చేశాను. రౌలట్ కమిటీ చేసిన సిఫారసులు, వాటికి సంబంధించిన చట్టాలు అన్నీ అనవసరం అని నాకు తోచింది. అభిమానం గల ఏ దేశమూ యిట్టి చట్టాల్ని అంగీకరిచదని స్పష్టంగా తేలిపోయింది. సమావేశం జరిగింది. 20 మంది మాత్రమే ఆహ్వానించబడ్డారు. వల్లభభాయి గాక శ్రీమతి సరోజినీ నాయుడు, హార్నిమెన్, కీ.శే ఉమర్ సుభాని, శంకర్‌లాల్ బాంకరు, అనసూయా బెన్ వారిలో వున్నారని నాకు బాగా గుర్తు. ప్రతిజ్ఞాపత్రం తయారుచేయబడింది. అక్కడ వున్నవారంతా దాని మీద సంతకాలు చేశారని నాకు జ్ఞాపకం. అప్పటికి నేను పత్రికా ప్రచురణ ప్రారంభించలేదు. కాని పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూవుండేవాణ్ణి. శంకర్‌లాల్ బాంకరు ఉద్యమం ప్రారంభించాడు. ఆయన శక్తి సామర్థ్యాలు అప్పుడు నాకు బాగా బోధపడ్డాయి. సత్యాగ్రహాన్ని మించిన మరో క్రొత్త ఆయుధ ప్రయోగం ఎవరైనా ప్రారంభిస్తారనే నమ్మకం నాకు కలగలేదు. అందువల్ల సత్యాగ్రహ సభ ఏర్పాటు చేయబడింది. ముఖ్యమైన పేర్ల పట్టిక బొంబాయిలోనే తయారైంది. అందుకు కేంద్రం బొంబాయి నగరమే. ప్రతిజ్ఞాపత్రం మీద ఎక్కువమంది సంతకాలు చేయసాగారు. ఖేడా సంగ్రామంలో వలె యిక్కడ కూడా కరపత్రాలు వెలువడ్డాయి. అనేక చోట్ల సభలు జరిగాయి.

ఆ సంస్థకు నేనే అధ్యక్షుణ్ణి. చదువుకున్న వర్గం వారికి, నాకు అంతగా పొసగదని తేల్చుకున్నాను. కరపత్రాల్లో గుజరాతీ భాషనే వాడాలని చెప్పాను. యిలాంటివే మరికొన్ని విషయాలు వాళ్లను గొడవలో పడవేశాయి. అయినా చాలామంది నా పద్ధతి ప్రకార ం నడిచేందుకు సిద్ధపడి తమ ఉదారబుద్ధిని చాటుకున్నారు. అయితే యీ సభ ఎక్కువ రోజులు నడవదని ప్రారంభంలోనే గ్రహించాను. పని మాత్రం బాగా పెరిగిపోయింది.

## 30. అద్భుతమైన దృశ్యం

రౌలట్ కమిటీ రిపోర్టుకు వ్యతిరేకంగా ఒకవైపున ఉద్యమం సాగుతూ వుంటే మరోవైపున ప్రభుత్వం ఆ రిపోర్టును అమలుపరిచి తీరాలనే నిర్ణయానికి వచ్చింది. రౌలట్ బిల్లు వెలువడింది. నేను కౌన్సిలు మీటింగులో రౌలట్ బిల్లు మీద జరిగే చర్చ విందామని ఒకసారి వెళ్లాను. శాస్త్రిగారి ఉపన్యాసం మహావేడిగా సాగుతున్నది. ఆయన గవర్నమెంటును గట్టిగా హెచ్చరిస్తున్నారు. శాస్త్రిగారి మాటలు జోరుగా సాగుతూ వుంటే వైస్రాయి ఆయన ముఖం వంక శ్రద్ధగా చూస్తూ వున్నాడు. శాస్త్రిగారి మాటల ప్రభావం ఆయన మీద బాగా పడివుంటుందని అనుకున్నాను. శాస్త్రిగారి భావావేశం బాగా పొంగిపొర్లుతూ వుంది.

నిద్రపోతున్నవాణ్ణి మేల్కొల్పవచ్చు. కాని మేల్కొనివుండి నిద్రపోతున్నట్లు నటించేవాడి చెవి దగ్గర శంఖం ఊదినా ప్రయోజనం ఏముంటుంది? కౌన్సిల్లో బిల్లుల మీద చర్చ జరిగినట్లు పెద్దనాటకం ఆడాలికదా! ప్రభుత్వం ఆ పని చేసింది. అయితే తను అనుకున్నట్లే చేయడానికి ప్రభుత్వం పూనుకున్నది. అందువల్ల శాస్త్రిగారిది అంతా కంఠశోష అని తేలిపోయింది. ఇక ఆ సందట్లో నామాట వినేవాడెవరు? వైస్రాయిని కలిసి అనేక విధాల చెప్పాను. జాబులు వ్రాశాను. బహిరంగ లేఖలు కూడా వ్రాశాను. సత్యాగ్రహం తప్ప గత్యంతరం లేదని కూడా ప్రకటించాను. అంతా అడవిలో గాచిన వెన్నెల చందాన అయిపోయింది.

ఇంకా బిల్లు గెజట్‌లో ప్రకటించబడలేదు. నా శరీరం బలహీనంగావుంది. అయినా పెద్ద పోరాటానికి నడుం బిగించాను. పెద్ద ప్రసంగాలు చేసే శక్తి ఇంకా నాకు చేకూరలేదు. నిలబడి మాట్లాడగల శక్తి ఎప్పుడో పోయింది. ఆ శక్తి ఇక యీనాటివరకు నాకు చేకూరలేదు. నిలబడి కొద్దిసేపు మాట్లాడితే శరీరం వణికిపోవడం, గుండెలోనొప్పి యిదీ వరస. అయితే మద్రాసు నుండి అందిన ఆహ్వానం అంగీకరించాలని భావించాను.

దక్షిణాది ప్రాంతాలు నా స్వగృహాలు అని అనిపించేవి. దక్షిణాఫ్రికాలో ఏర్పడ్డ సంబంధం వల్ల తెలుగు, తమిళం భాషలవారిమీద నాకు హక్కు వున్నట్లు భావించేవాణ్ణి. ఆవిధంగా భావించడంలో పొరబడలేదనే విశ్వాసం ఇప్పటికీ నాకు వున్నది. కీ.శే. కస్తూరీ రంగస్వామి అయ్యంగారి ఆహ్వానం నాకు అందింది. ఆ ఆహ్వానం వెనుక శ్రీ రాజగోపాలాచార్యులు వున్నారు. ఆ విషయం మద్రాసు చేరిన తరువాత నాకు తెలిసింది. శ్రీ రాజగోపాలాచార్యులతో ఇది నాకు ప్రథమ పరిచయమని చెప్పవచ్చు. వారి రూపాన్ని మొదటిసారి చూచాను. ప్రజా కార్యక్రమాల్లో ఎక్కువగా పాల్గొనాలనే ఉద్దేశ్యంతో కస్తూరి రంగస్వామి అయ్యంగారి వంటి మిత్రుల ప్రోత్సాహంతో సేలం వదిలిపెట్టి మద్రాసులో వకీలు వృత్తి, ఆచార్యులు ప్రారంభించబోతున్నారని తెలిసింది. వారింటి దగ్గరే నాకు మకాం ఏర్పాటుచేశారు. అయితే యీ విషయం నాకు రెండురోజుల తరువాత తెలిసింది. కస్తూరి అయ్యంగారి బంగళాలో నేను అతిధిగా వున్నానని అనుకున్నాను. మహాదేవదేశాయి నా పొరపాటును సరిచేశాడు. రాజగోపాలచారి మా ఎదుట పడకుండా తప్పుకు తిరుగుతూ వున్నాడు. అయితే మహాదేవ్ ఆయనను పసిగట్టి "మీరు రాజగోపాలాచారితో పరిచయం చేసుకోవాలి" అని నాకు చెప్పాడు.

నేను పరిచయం చేసుకున్నాను. రోజూ యుద్ధ ప్రణాళికను గూర్చి సలహా సంప్రదింపులు జరుపవలసిన అవసరం ఏర్పడింది. సభలు తప్ప నాకు మరేమీ తోచడం లేదు. రౌలట్ బిల్లు చట్టరూపం దాలిస్తే దాన్ని సవినయంతో ఎలా ఎదుర్కొనడం? అట్టి అవకాశం ప్రభుత్వం కల్పిస్తేనే గదా? ఆ చట్టాన్ని సవినయంగా వ్యతిరేకిస్తే దానికి గల హద్దు ఏమిటి ? ఈ విషయాలపై మా మధ్య చర్చ జరుగుతూ వుండేది. శ్రీ కస్తూరి రంగస్వామి అయ్యంగారు కొద్దిమంది నాయకుల్ని పిలిచి సమావేశం ఏర్పాటుచేశారు. ఆ సమావేశంలో బాగా చర్చ జరిగింది. ఆ చర్చలో శ్రీ విజయ రాఘవాచార్యులు పాల్గొన్నారు. ఆయన సూక్ష్మంగా కొన్ని సూచనలు చేసి సత్యాగ్రహం మీద పుస్తకం వ్రాయమని సలహా యిచ్చారు. అది నా శక్తికి మించినపని అని చెప్పాను.

ఇంకా ఒక నిర్ణయానికి మేము రాలేదు. పొయ్యి మీద పులగం వుడుకుతూ వుంది. ఇంతలో బిల్లు చట్టం రూపంలో గెజెట్‌లో ప్రకటించబడిందను వార్త మాకు అందింది. ఈ వార్త అందిననాటి రాత్రి ఏం చేయాలి అని తీవ్రంగా ఆలోచిస్తూ నిద్రపోయాను. ప్రాతఃకాలం మెళుకువ వచ్చింది. అర్ధ నిద్రావస్థలో ఒక స్వప్నం వచ్చింది. అందు ఒక సలహా వినబడింది. 'ఈ చట్టానికి వ్యతిరేకంగా దేశమందంతటా హర్తాలు జరపమని ప్రకటన చెయ్యాలి. సత్యాగ్రహం ఆత్మశుద్ధికి సంబంధించిన

యుద్ధం. అది ధార్మిక యుద్ధం. ధర్మకార్యం. శుద్ధిగా ప్రారంభించాలి. అందువల్ల ఆ రోజున ఉపవాసం చేయాలి. పనులేవీ చేయకూడదు. ముస్లిం సోదరులు రోజా ఉపవాసం చేస్తారు గనుక 24 గంటలపాటు అంతా ఉపవాసం చేయాలి. అన్ని ప్రాంతాలవారు చేరుతారో లేదో తెలియదు. కనుక ముందుగా బొంబాయి, మద్రాసు, బీహారు, సింధ్‌లో జరపాలి. యీ ప్రాంతాల్లో సరిగా హర్తాళ్ జరిగితే దానితో తృప్తిపడాలి' యిదీ స్వప్నంలో నాకు వినబడిన సలహా.

ఈ సలహా రాజగోపాలచార్యులకు బాగా నచ్చింది. తరువాత యితర మిత్రులకు తెలియజేశాం. అందరూ హర్షం ప్రకటించారు. ఒక చిన్న నోటీసు తయారుచేశాను. ప్రారంభంలో ది. 30 మార్చి 1919 నాడు హర్తాళ్ జరపాలని నిర్ణయించారు. తరువాత అది ఏప్రిల్ 6వ తేదీకి మారింది. ప్రజలకు కొద్దిరోజుల ముందే యీ సమాచారం అందజేయబడింది. పని వెంటనే ప్రారంభించాలని నిర్ణయించాము. వ్యవధి ఎక్కువగా లేదు.

ఆశ్చర్యం! ఎలా జరిగాయో ఏమో ఏర్పాట్లు పకడ్బందీగా జరిగాయి. హిందూ దేశమంతట పట్టణాల్లో, పల్లెటూళ్లలో జయప్రదంగా హర్తాళ్ జరిగింది. అద్భుతమైన దృశ్యం అది.

## 31. ఆ వారం - 1

దక్షిణాదిన కొద్దిగా పర్యటించి ఏప్రిల్ 4వ తేదీ నాటికి బొంబాయి చేరాను. శంకర్‌లాల్ బాంకరు ఏప్రిల్ 6వతేదీ నాడు హర్తాళ్ జరిపేందుకై బొంబాయిరమ్మని తంతి పంపాడు. మార్చి 30వతేదీన ఢిల్లీలో హర్తాళ్ జరిగింది. కీ.శే. శ్రద్ధానందగారు, డా. హకీమ్ అజమల్ ఖాన్ సాహెబ్ అందుకు పూనుకున్నారు. ఏప్రిల్ 6వ తేదీన హర్తాళ్ జరపాలనే వార్త ఢిల్లీకి ఆలస్యంగా చేరింది. ఢిల్లీలో 30వ తేదీన జరిగిన హర్తాళ్ ఎంతో బాగా జరిగింది హిందువులు, మహమ్మదీయులు కలిసి హృదయపూర్తిగా చేసిన హర్తాళ్ అది. ముస్లిములు శ్రద్ధానంద్ గారిని జామా మసీదుకు ఆహ్వానించడమే కాక అక్కడ వారిచే ఉపన్యాసం కూడా చేయించారు. ప్రభుత్వాధికారులు యీ వ్యవహారాన్ని సహించలేకపోయారు. రైలు స్టేషను వైపు ఊరేగింపుగా వెలుతున్న జనాన్ని పోలీసులు ఆపి వారిని తుపాకీ గుండ్లకు గురిచేశారు. కొంతమంది చనిపోయారు. చాలామంది గాయపడ్డారు. అధికార్లు అణచివేత చర్యకు పూనుకున్నారు. శ్రద్ధానందగారు నన్ను వెంటనే డిల్లీ రమ్మని తంతి పంపారు. ఏప్రిల్ 6వ తేదీన బొంబాయిలో వుండి వెంటనే ఢిల్లీ వస్తానని శ్రద్ధానందగారికి తంతి ద్వారా తెలియజేశాను

ఢిల్లీలో జరిగినట్లుగానే లాహోరు, అమృతసర్‌లో కూడా హర్తాళ్ జరిగింది. వెంటనే అమృతసర్ రమ్మని డా॥ సత్యపాల్ మరియు కిచలూగారల తంతి అందింది. యీ యిద్దరు సోదరుల్ని నేను బొత్తిగా ఎరుగను. ముందు ఢిల్లీ వెళ్లి తరువాత అమృతసర్ వస్తానని వారికి తెలియజేశాను బొంబాయిలో ఆరవతేదీ ఉదయం వేలాదిమంది జనం చౌపాటీ దగ్గర స్నానం చేసి దేవాలయానికి వెళ్ళేందుకు ఊరేగింపుగా బయలుదేరారు. ఊరేగింపులో స్త్రీలు పిల్లలు కూడా వున్నారు. ముస్లిములు కూడా పెద్ద సంఖ్యలో అందు పాల్గొన్నారు. వారు త్రోవలో మమ్మల్ని మసీదుకు తీసుకువెళ్లారు. అక్కడ సరోజినీదేవిని మరియు నన్ను ఉపన్యాసం యిమ్మని కోరారు. మేము ఉపన్యాసాలు యిచ్చాము. శ్రీ విఠల్‌దాస్ జెరాజాణి స్వదేశీ మరియు హిందూ ముస్లిం సమైక్యతకు సంబంధించిన ప్రతిజ్ఞ చేయిద్దామని సూచించాడు. తొందరపాటుగా ప్రతిజ్ఞ చేయించడానికి నేను యిష్టపడలేదు. జరిగినదానితో తృప్తిపడమని సలహా యిచ్చాను. ప్రతిజ్ఞ చేసిన తరువాత ఉల్లంఘించకూడదు కదా! స్వదేశీ అంటే అర్థం ఏమిటో తెలుసుకోవాలని, హిందూ ముస్లిం సమైక్యతకు సంబంధించిన ప్రతిజ్ఞను అర్థం చేసుకోవాలని చెప్పి యిట్టి ప్రతిజ్ఞ చేయదలచినివారు రేపు ఉదయం చౌపాటి దగ్గరకు రమ్మని చెప్పారు.

బొంబాయిలో పూర్తిగా హర్తాళ్ జరిగింది. అక్కడ చట్టాల్ని ఉల్లంఘించే కార్యక్రమం నిర్ణయించబడింది. రద్దు చేయడానికి అనుకూలమైన చట్టాలను, ప్రతివారు తేలికగా ఉల్లంఘించుటకు వీలైన చట్టాలను ఉల్లంఘించాలని నిర్ణయం చేశాము. ఉప్పు పన్ను ఎవ్వరికీ ఇష్టం లేదని తేలింది. దాన్ని రద్దుచేయాలని ఎన్నో ప్రయత్నాలు జరుగుతున్నాయి. మీమీ ఇండ్లలో ఉప్పు తయారుచేసి తీసుకురమ్మని చెప్పాను. ప్రభుత్వం నిషేధించిన పుస్తకాల్ని అమ్మాలని చెప్పాను. అట్టి పుస్తకాలు నావే రెండు వున్నాయి (1) హింద్ స్వరాజ్ (2) సర్వోదయ్. యీ పుస్తకాలను అచ్చు వేయడం తేలిక. ఆ విధంగా చట్టాన్ని ఉల్లంఘించవచ్చు. వెంటనే ఆ పుస్తకాలు అచ్చువేయాలని మరునాడు సాయంత్రం చౌపాటీలో జరిగిన సభలో వాటి అమ్మకం జోరుగా జరపాలని నిర్ణయంగైకొన్నారి. ఒక కారులో నేను, మరో కారులో సరోజినీ నాయుడు బయలుదేరాం. ముద్రించబడిన పుస్తక ప్రతులన్నీ అమ్ముడుబోయాయి. వచ్చిన సొమ్మంతా యుద్ధ కార్యక్రమం నిమిత్తం ఖర్చు చేయాలని నిర్ణయం గైకొన్నాం. పుస్తకం ధర నాలుగు అణాలు. అయితే నా చేతికి, సరోజినీ దేవి చేతికి మూల్యం మాత్రమేగాక తమ జేబులో వున్న సొమ్మంతా యిచ్చి చాలామంది పుస్తకాలు కొన్నారు. కొందరు అయిదు, పది

రూపాయల నోట్లు కూడా యిచ్చారు. ఒక ప్రతికి 50 రూపాయలు ఒకరు యిచ్చినట్లు నాకు గుర్తు. యీ పుస్తకాలు కొన్న వారికి కూడా జైలు శిక్ష పడవచ్చునని ముందుగానే జనానికి చెప్పాం. కాని ఆ క్షణంలో జైలు భయం జనానికి పోయిందని చెప్పవచ్చు. అయితే ఏ పుస్తకాల్ని ముద్రించి మేము అమ్మకం చేశామో వాటికి నిషేధం లేదని ప్రభుత్వం భావించిందని ఏడవ తేదీన తెలిసింది. అమ్మకం జరిగిన పుస్తకాలు పునర్ముద్రణ పొందినట్టివి. నిషేధం ప్రథమ ముద్రణ వరకే సీమితం. కనుక పుస్తకాల అమ్మకం చట్టవిరుద్ధం కాదని ప్రభుత్వం భావించిందిట. యీ వార్త తెలిసినప్పుడు జనం కొద్దిగా నిరుత్సాహపడ్డారు.

ఏడవ తేదీన స్వదేశీ వ్రతం పట్టేందుకు హిందూ ముస్లిం సమైక్యత కోసం ప్రతిజ్ఞ చేసేందుకు చౌపాటీ దగ్గర సభ జరగాల్సి వున్నది. తెల్లగా కనబడేవన్నీ పాలు కాజాలవని తెలిసింది. అక్కడికి బహు కొద్దిమంది మాత్రమే వచ్చారు. వారిలో ఇద్దరు ముగ్గురు మహిళల పేర్లు నాకు గుర్తు వున్నాయి. పురుషులు కూడా బహు కొద్దిమందే వచ్చారు. నేను వ్రతాన్ని గురించిన ముసాయిదా తయారుచేసి వుంచాను. సభలో పాల్గొన్న వారందరికి వివరించి చెప్పి వ్రతాన్ని గురించిన శపథం చేయించాను కొద్దిమంది మాత్రమే హాజరవడం వల్ల నాకు ఆశ్చర్యంగాని, విచారంగాని కలగలేదు. తుపానుల వంటి కార్యాలకు, నిర్మాణాత్మక కార్యాలకు గల తేడా నాకు తెలుసు. తుపాను కార్యాలంటే సహజంగా జనానికి పక్షపాతం వుంటుంది. నెమ్మదిగా సాగే నిర్మాణ కార్యక్రమాలంటే అభిరుచి వుండదు. దీన్ని గురించి వ్రాయాలంటే మరో ప్రకరణం అవసరం.

9వ తేదీ రాత్రి ఢిల్లీ అమృత్‌సర్‌లకు బయలుదేరాను. ఎనిమిదవ తేదీన మధుర చేరాను. నన్ను అరెస్టు చేయవచ్చునను వార్త నా చెవినపడింది. మధుర తరువాత ఒక స్టేషను దగ్గర రైలు ఆగుతుంది. అక్కడ ఆచార్య గిద్వానీ వచ్చి కలిశారు. నన్ను అరెస్టు చేయబోతున్నారని ఆయన నమ్మకంగా చెప్పాడు. నా సేవలు అవసరమైతే చెప్పండి, సిద్ధంగా వున్నానని అన్నాడు. ధన్యవాదాలు చెప్పి అవసరమైతే మీ సేవల్ని ఉపయోగించుకుంటానని చెప్పాను.

రైలు పల్వల్ స్టేషనుకు చేరక పూర్వమే ఒక పోలీసు అధికారి నా చేతిలో ఒక ఆర్డరు పత్రం వుంచాడు. "మీరు పంజాబులో ప్రవేశిస్తే అశాంతి ప్రబలే ప్రమాదం వున్నది గనుక మీరు పంజాబు గడ్డమీద అడుగు పెట్టవద్దు" అని ఆ పత్రంలో వున్నది. ఆ ఆర్డరు పత్రం యిచ్చి ఈ బండి దిగిపొమ్మని ఆ పోలీసు అధికారి ఆదేశించాడు. బండి

దిగడానికి నేను అంగీకరించలేదు. "అశాంతి పెంచేందుకు గాక అశాంతిని తగ్గించేందుకై వెళ్లదలిచాను. అందువల్ల యీ ఆదేశాన్ని పాటించలేనని తెలుపుటకు విచారిస్తున్నాను' ' అని చెప్పివేశాను. పల్వాల్ స్టేషను వచ్చింది. మహాదేవ్ నాతోబాటు వున్నాడు. ఢిల్లీ వెళ్లి శ్రద్ధానంద గారికి యీ విషయంచెప్పి, జనాన్ని శాంతంగా వుండేలా చూడమని మహాదేవ్‌కి చెప్పాను. గవర్నమెంటు ఆర్డరును పాటించకుండా అరెస్టు కావడమే మంచిదని భావించానని, నన్ను అరెస్టు చేశాక కూడా ప్రజలు శాంతంగా వున్నారంటే అది మనకు విజయమని భావించాలని కూడా చెప్పమన్నాను.

పల్వాల్ స్టేషనులో దింపివేసి పోలీసులు నన్ను తమ కస్టడీలోకి తీసుకున్నారు. ఢిల్లీ నుండి వస్తున్న ఏదో రైల్లో మూడోతరగతి పెట్టె ఎక్కించారు. పోలీసుల బృందం నా వెంట వున్నది. మధుర చేరిన తరువాత నన్ను పోలీసుల బారెక్‌కు తీసుకువెళ్లారు. నన్ను ఎక్కడికి తీసుకువెళతారో ఏ అధికారీ చెప్పలేకపోయాడు. ప్రాత:కాలం నాలుగు గంటలకు నన్ను మేల్కొలిపి బొంబాయికి వెళ్లే ఒక గూడ్సు బండిలో కూర్చోబెట్టారు. మధ్యాహ్నం బండి సవాయి మాదొపూర్ చేరింది. అక్కడ నన్ను దింపివేశారు. బొంబాయి వెళ్లే బండిలో ఎక్కించారు. లాహోర్ నుండి వచ్చిన ఇన్స్‌పెక్టర్ బోరింగ్ అక్కడ నా బాధ్యత వహించాడు. ఫస్ట్‌క్లాస్ పెట్టెలో నన్ను కూర్చోబెట్టారు. నా వెంట బోరింగ్ దొర కూర్చున్నాడు. యిక నేను జెంటిల్‌మెన్ ఖైదీగా మారిపోయానన్నమాట. సర్ మైకాల్ ఓడయరును గురించి తెల్లదొర వచ్చి ప్రారంభించాడు. మాకు మీరంటే వ్యతిరేకత లేదు, కాని పంజాబులో మీరు అడుగుపెడితే అక్కడ అశాంతి ప్రబలుతుంది గనుక అక్కడికి వెళ్లవద్దని, తిరిగి వెళ్లిపొమ్మని నాకు చెప్పాడు. "నేను ఆ విధంగా వెళ్లనని, మీ ఆదేశాన్ని పాటించనని" చెప్పాను. అయితే చట్టరీత్యా చర్య తీసుకుంటామని అన్నాడు. ఏం చేయదలచుకున్నారో చెప్పమని దొరను అడిగాను. నాకేమీ తెలియదని, మిమ్మల్ని బొంబాయి తీసుకువెళుతున్నానని, మరో ఆదేశం కోసం ఎదురుచూస్తున్నానని అతడు అన్నాడు.

సూరత్ చేరాం. మరో అధికారి వచ్చాడు. నా బాధ్యతను తాను స్వీకరించాడు. బండి బయలుదేరింది. మిమ్మల్ని విడుదల చేశారు. మీ కోసం మెరీన్‌లైన్సు స్టేషనులో బండి ఆపిస్తాను. మీరు అక్కడ దిగిపోతే మంచిది. కొలాబా స్టేషనులో జనం విపరీతంగా వుంటారని భావిస్తున్నాము అని అన్నాడు. మీరు చెప్పిన ప్రకారం చేయడం నాకు సంతోషదాయకం అని అన్నాను. అతడు ఆనందించి ధన్యవాదాలు తెలిపాడు. నేను మెరీన్‌లైన్సులో బండి దిగిపోయాను. ఎవరో పరిచితుడి గుర్రం బండి కనబడింది.

అతడు నన్ను రేవాశంకర్ ఝుబేరీగారి ఇంటి దగ్గర దింపివెళ్లాడు. "మిమ్మల్ని అరెస్టు చేశారని తెలిసి జనంకోపంతో పేట్రేగిపోయారు. వాళ్లకు పిచ్చి ఎక్కినంత పని అయింది. పాయధునీ దగ్గర కొట్లాట జరిగేలా వుంది. మేజిస్ట్రేటు, పోలీసులు అక్కడికి హుటాహుటిన వెళ్లారు" అని నాకు చెప్పారు. నేను ఇంటికి చేరానో లేదో యింతలో ఉమర్ సుభానీ, అనసూయాబెన్ కారులో వచ్చి నన్ను పాయుధునీకి బయలుదేరమని అన్నారు. "ప్రజలు కోపంతో వున్నారు వాతావరణం ఉద్రిక్తంగా వుంది. జనం ఎవ్వరు చెప్పినా వినే స్థితిలో లేరు మిమ్మల్ని చూస్తే శాంతించవచ్చు" అని అన్నారు. నేను కారులో కూర్చున్నాను. పాయధునీ చేరాను. అక్కడ అంతా గందరగోళంగా వున్నది. నన్ను చూడగానే జనం సంతోషంతో ఊగిపోయారు. జనం పెద్ద ఊరేగింపు తీశారు. వందేమాతరం, అల్లా హో అక్బర్ అను నినాదాలతో ఆకాశం మార్మోగింది. పాయధునీ దగ్గర పోలీసులు గుర్రాల మీద ఎక్కి కనబడ్డారు. ఇటుక రాళ్ల వర్షం కురుస్తూ వున్నది.శాంతంగా వుండమని చేతులు జోడించి జనాన్ని ప్రార్థించాను. ఇటుకలు, రాళ్లు మాకు తప్పవని అనిపించింది.

ఊరేగింపు అబ్దుల్ రహమాన్ వీధి నుండి క్రాఫర్డ్ మార్కెట్టు వైపుకు మళ్లింది. ఇంతలో ఎదురూగా గుర్రపు రౌతుల పటాలం వచ్చి నిలబడింది ఫోర్టువైపు వెళ్లకుండా ఊరేగింపును ఆపేందుకు రౌతులు ప్రయత్నించసాగారు. క్రిక్కిరిసి వున్న జనం ఆగుతారా ? పోలీసు లైనును దాటి జనం ముందుకు దూసుకు వెళ్ళారు. నా మాటలు ఎవ్వరికీ వినబడలేదు. వెంటనే గుర్రపు రౌతుల దళాధికారి జనాన్ని చెదరగొట్టమని ఆర్డరు యిచ్చాడు. తళతళలాడే బల్లాలను త్రిప్పుతూ గుర్రపు రౌతులు హఠాత్తుగా జనం మీదకి గుర్రాల్ని తోలారు. నా ప్రక్కగా బల్లాలు బహువేగంగా తళ తళ మెరుస్తూ ముందుకు సాగుతూ వున్నాయి. జనం చెదిరిపోయారు. అక్కడ గుర్రాలు పరిగెత్తేందుకైనా చోటు లేదు. ఎటు పోదామన్నా త్రోవలేదు. దృశ్యం కడు భయానకంగా వుంది. అటు గుర్రపు రౌతులు, యిటు జనం. యిద్దరికీ పిచ్చి ఎక్కినట్లున్నది. గుర్రాలకు ఏమీ కనబడటం లేదు ఎటుబడితే అటు. ఎలా బడితే అలా దౌడు తీస్తున్నాయి. వేలాది జనాన్ని చెల్లాచెదురు చేయాలి. గుర్రపు రౌతులకు ఏమీ కనబడటం లేదని బోధపడుతూవుంది. మొత్తం మీద జనాన్ని చెల్లాచెదురు చేసి వాళ్లను ముందుకు సాగకుండా చేశారు. మా కారును మాత్రం ముందుకు పోనిచ్చారు పోలీసు కమీషనరు ఆఫీసు ముందు కారు ఆపించాను. పోలీసులు వ్యవహరించిన తీరుపై అసమ్మతి తెలుపుదామని కారు దిగాను.

# 32. ఆ వారం - 2

కమీషనరు గ్రిపిత్ గారి ఆఫీసులోకి వెళ్లాను. మెట్ల దగ్గర తుపాకులు పుచ్చుకొని సిద్ధంగా వున్న సైనికులు కనబడ్డారు. వారంతా యుద్ధానికి సిద్ధంగా వున్నట్లు బోధపడింది. వరండాలో కూడా గందరగోళంగా వున్నది. నేను కబురు పంపి ఆఫీసులోకి ప్రవేశించాను. అక్కడ కమీషనరు దగ్గర మి బోరింగు కూర్చొని వున్నాడు. నేను చూచిన దృశ్యాన్ని కమీషనరుకు వివరించి చెప్పాను. "ఊరేగింపును ఫోర్టు వైపుకు వెళ్లకుండా ఆపడం నా లక్ష్యం. జనం అక్కడికి చేరితే ఉపద్రవం జరిగి తీరేది. ఎంత చెప్పినా జనం వినే స్థితిలో లేనందున వాళ్లను తొలగించి వేయమని ఆదేశించక తప్పలేదు" అని అతడు క్లుప్తంగా జవాబు యిచ్చాడు.

"ఫలితం మీకు తెలుసుకదా! గుర్రాల కాళ్ల క్రింద జనం నలిగిపోవడం తప్ప జరిగిందేమిటి ? అసలు గుర్రపు రౌతుల్ని తీసుకురావడం అనవసరం కాదా!" అని నేను అన్నాను. ఆ విషయం మాకు తెలియదు. మీ బోధలు జనం మీద ఎలా పనిచేశాయో, చేస్తున్నాయో మీకంటే పోలీసువాళ్లం మాకు బాగా తెలుసు. ముందే మేము జాగ్రత్త వహించకపోతే కీడు అధికంగా జరిగివుండేది. స్పష్టంగా చెబుతున్నాను. జనం మీ మాట వినే స్థితిలోలేరు. చట్టాన్ని వ్యతిరేకించటమంటే జనం ముందుకు ఉరుకుతారు. కాని శాంతంగా వుండమని చెబితే వాళ్ల బుర్రకు ఎక్కదు. మీ విధానం మంచిదే కాని దాన్ని సరిగా అర్థం చేసుకునే వాళ్లేరీ? వాళ్ల ధోరణి వాళ్లదే ! అని అన్నాడు కమీషనరు. "మీకూ నాకూ మధ్య గల తేడా యిదే. ప్రజలు సహజంగా కొట్లాటలకు దిగరు. వాళ్లు శాంతిప్రియులు" అని అన్నాను. మా యిరువురికి మధ్య కొంత చర్చ జరిగిన తరువాత దొర "సరేనండి, మీ బోధన ప్రజలు అర్థం చేసుకోలేదని మీరు గ్రహించారనుకోండి. అప్పుడు మీరేం చేస్తారో చెప్పండి?" అని సూటిగా ప్రశ్నించాడు. "ఆ విషయం నాకు తెలిసిన మరుక్షణం ఉద్యమాన్ని ఆపివేస్తాను" అని అన్నాను. "ఆపివేయడమంటే ఏమిటి? మిమ్మల్ని విడుదల చేసిన మరుక్షణం పంజాబు వెళతానని మీరు బోరింగుకు చెప్పలేదా?" "అవును చెప్పాను. ఈ రైలుకే వెళదామని భావించాను కూడా. కాని యివాళ వెళ్లలేను." "కొంచెం ఓపికపడితే అన్ని విషయాలు మీకే తెలుస్తాయి. అహమదాబాదులో ఏం జరుగుతున్నదో, అమృత్‌సర్‌లో ఏం జరిగిందో మీకు తెలుసా? జనం బాగా పెట్రేగిపోయారు. నాకూ యింకా పూర్తి సమాచారం అందలేదు. ఎన్నోచోట్ల తంతితీగలు తెగగొట్టారు. యీ రగడకంతటికీ పూర్తిగా మీదే బాధ్యత" "నా బాధ్యత ఎంతవరకో అంతవరకు వహించేందుకు నేను

సిద్ధమే. అహమదాబాదులో జనం యిష్టం వచ్చినట్లు వ్యవహరించారు అంటే నాకు విచారం కలుగుతుంది. అమృతసర్‌ను గురించి నాకేమీ తెలియదు. అక్కడికి నేను ఎప్పుడూ వెళ్లలేదు. అక్కడ నన్ను ఎవ్వరూ ఎరుగరు. పంజాబు ప్రభుత్వం నన్ను ఆపి వుండకపోతే అక్కడ జనాన్ని శాంతింపచేసేందుకు గట్టి కృషి చేసి యుండేవాణ్ణి. నన్ను వెళ్ళకుండా ఆపి ప్రభుత్వమే జనాన్ని రెచ్చగొట్టింది" అని అన్నాను.

ఈ విధంగా మాటలు సాగుతూ వున్నాయి. మా ఇద్దరి అభిప్రాయాలు కలవడం లేదు. చౌపాటీ దగ్గర మీటింగు జరిపి ప్రజలకు శాంతంగా వుండమని చెబుతానని చెప్పి అక్కడినుండి వచ్చివేశాను.

చౌపాటీ దగ్గర సభ జరిగింది. ప్రజలకు శాంతిని గురించి, సత్యాగ్రహ ఆదర్శాల గురించి వివరించి చెప్పాను. "సత్యాగ్రహం అంటే సత్యపు క్రీడ. ప్రజలు శాంతంగా వుండకపోతే నేను సత్యాగ్రహ పోరాటం జరపలేను" అని చెప్పాను. అహమదాబాదులో కూడా దొమ్మీ జరిగిందని అనసూయాబెన్‌కు సమాచారం అందింది. ఆమెను అరెస్టు చేశారని ఎవరో పుకారు లేవదీశారు. దానితో కార్మికులు పెట్రేగిపోయారు. వాళ్ళు హర్తాళ్‌తోబాటు ఉపద్రవానికి పూనుకున్నారు. ఒక సైనికుణ్ణి ఖూనీ చేశారు. నేను అహమదాబాదు వెళ్లాను. నడియాద్ దగ్గర రైలు పట్టాలు పీకివేసేందుకు ప్రయత్నించారని అక్కడ నాకు తెలిసింది. వీరంగావ్‌లో ఒక గవర్నమెంటు కార్యకర్తను చంపివేశారు. అహమదాబాదు చేరాను. అక్కడ మార్షల్ లా అమలు చేశారు జనం జంకినట్లు కనబడింది. చేసిందానికి వడ్డీతో సహా జనానికి గవర్నమెంటు వారు సైన్య సాయంతో ముట్టచెబుతూ వున్నారన్నమాట. నన్ను స్టేషను నుండి కమీషనరు మిస్టర్ ప్రెట్ దగ్గరకి తీసుకుని వెళ్లేందుకు మనుష్యులు సిద్ధంగా వున్నారు. నేను వారి దగ్గరికి వెళ్లాను. ఆయన ఎంతో కోపంగా వున్నాడు. నేను ప్రశాంతంగా సమాధానాలిచ్చాను. జరిగిన హత్యలకు విచారం వ్యక్తం చేశాను. మార్షల్ లా అనవసరమని కూడా చెప్పాను. తిరిగి శాంతి నెలకొల్పేందుకు ఏం చేయమంటే అది చేస్తానని చెప్పాను. బహిరంగ సభ జరిపేందుకు అనుమతి కోరాను. ఆశ్రమ ప్రదేశంలో ఆ సభ జరుపుతానని చెప్పాను. నా అభిప్రాయం ఆయనకు నచ్చింది. ఏప్రిల్ 13వతేదీ ఆదివారం నాడు బహిరంగ సభ జరిపినట్లు నాకు గుర్తు. ఆ రోజునో లేక ఆ మరునాడో మార్షల్ లా ఎత్తివేశారు. సభలో ప్రసంగిస్తూ జనం చేసిన పొరపాటు ఏమిటో తెలియజేసేందుకు ప్రయత్నించాను. అందుకు ప్రాయశ్చిత్తంగా మూడు రోజులు ఉపవాసం చేయమని చెప్పాను. హత్యలు కావించి వారు తమ తప్పు అంగీకరించి ప్రభుత్వానికి లొంగిపొమ్మని సలహా

యిచ్చాను. నా కర్తవ్యం ఏమిటో స్పష్టంగా బోధపడింది. ఏ కార్మికుల మధ్య అధిక సమయం గడిపానో, ఏ కార్మికులకు నేను సేవ చేశానో, ఏ కార్మికులు సత్కార్యాలు చేస్తారని నేను ఆశించానో ఆ కార్మికులే కొట్లాటలలో పాల్గొనడం సహించలేకపోయాను. వారు చేసిన అపరాధంలో నేను కూడా భాగస్వామినేనని భావించాను.

ప్రభుత్వానికి లొంగిపొమ్మని జనానికి సలహా యిచ్చినట్లే జనం చేసిన తప్పుల్ని క్షమించమని ప్రభుత్వానికీ కూడా విజ్ఞప్తి చేశాను. కాని నా మాట యిరుపక్షాల వారిలో ఒక్క పక్షం వారు కూడా వినలేదు. ప్రజలు తమ తప్పును అంగీకరించలేదు, ప్రభుత్వం వారిని క్షమించేందుకు సిద్ధపడలేదు. కీ శే రమణభాయి మొదలుగాగల పౌరులు వచ్చి సత్యాగ్రహం ఆపివేయమని నన్ను కోరారు. ఆ విధంగా నన్ను కోరవలసిన అవసరమే లేదు. శాంతిని గురించి తెలుసుకొని జనం ఆ విధంగా నడుచుకోనంత వరకు సత్యాగ్రహ సమరాన్ని నిలిపివేయాలని నేను అప్పటికే నిర్ణయానికి వచ్చివున్నాను. అందుకు వాళ్లంతా సంతోషించారు. కొంతమంది మిత్రులకు కోపం కూడా వచ్చింది. దేశమందంతట శాంతంగా సంగ్రామం సాగాలని అనుకుంటే అది సాధ్యం కాదని వారు భావించారు. నా అభిప్రాయం స్పష్టంగా చెప్పాను. ఏ ప్రజలకు నేను సేవ చేశానో ఆ ప్రజలు కూడా సత్యాగ్రహ సమరాన్ని గురించి, శాంతిని గురించి సరిగా గ్రహించకపోతే యి సత్యాగ్రహ పోరాటం జరపడం సాధ్యం కాదని చెప్పివేశాను. సత్యాగ్రహులు తమ హద్దు వుండి శాంతియుతంగా పోరాటం సాగించాలని అది నా నిశ్చితాభిప్రాయమని చెప్పాను. యీ నాటికీ నా అభిప్రాయం అదే.

## 33. పర్వతమంత తప్పు

అహమదాబాదు సభ ముగించుకొని నేను నడియాద్ వెళ్లాను, పర్వతమంత తప్పు అని నేను అక్కడ అన్నమాట ఎంతో ప్రచారంలోకి వచ్చింది. అట్టి మాట అదివరకు నేను ఎప్పుడూ అనలేదు. అహమదాబాదులోనే నా తప్పు నాకు స్పష్టంగా కనబడింది. నడియాద్ వెళ్ళి అక్కడి పరిస్థితిని గురించి యోచించాను. ఖేడా జిల్లాకు చెందిన చాలామందిని అరెస్టు చేశారని విన్నాను. అక్కడి సభలో ప్రసంగిస్తూ ఖేడా జిల్లావాసులను, తదితరుల్ని సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని చట్టాల్ని ధిక్కరించమని నేను కోరాను. ఆ కోరికలో తొందరపాటు కలదని నా మనస్సుకు తోచి పైమాట అనేశాను. ఆ తప్పు పర్వతమంతగా నాకు కనిపించింది. ఆ విషయం బహిరంగంగా ప్రకటించేసరికి నన్ను చాలామంది ఎగతాళి చేసారు. అయినా తప్పును

ఒప్పుకున్నాను. కనుక నాకు పశ్చాత్తాపం కలుగలేదు. యితరులు చేసిన ఏనుగంత తప్పును ఆవగింజంత చిన్నదిగా చూడు. నీవు చేసిన తప్పును పర్వతమంతగా భావించు. అప్పుడే తప్పులెన్నువారు తమ తప్పులు తెలుసుకుంటారు అను మాట చెల్లుబాటు అవుతుంది. ప్రతి సత్యాగ్రహి యీ లక్షణాన్ని అలవరచుకోవాలని నా అభిప్రాయం. అసలు నాకు పర్వతమంతగా కనిపించిన ఆ తప్పేమిటో కొద్దిగా చెబుతాను చట్టాన్ని పూర్తిగా అమలుబరిచినట్టి వ్యక్తులు చట్టాన్ని సవినయంగా ఉల్లంఘించారు. భయం వల్లనే అలా చేస్తారని గ్రహించాలి. ఉల్లంఘించితే శిక్షపడుతుందనేదే ఆ భయం. నీతికి అవినీతికి సంబంధించని చట్టాల విషయంలోనే యిలా జరుగుతుంది. చట్టం వున్నా లేకపోయినా మంచివాడు ఎన్నడూ దొంగతనం చేయడు. కాని రాత్రిళ్ళు సైకిలు మీద వెళుతూ లైటు వెలుగుతున్నదా లేదా అని ఎవ్వడూ చూడడు. సామాన్యంగా చట్టవిరుద్ధమైన ఆ చర్యను గమనించడు. గమనించమని కోరినా మంచివాళ్లు కూడా అందుకు సిద్ధపడరు. కాని అలా చేస్తే శిక్ష పడుతుందని భయం కలిగినప్పుడు మాత్రం అతడు లైటు వెలిగించడానికి సిద్ధపడతాడు. యీ విధంగా జరిగే నియమపాలనను, స్వేచ్ఛగా జరిగే నియమపాలన అని అనడానికి వీలులేదు. నిజమైన సత్యాగ్రహి చట్టాల్ని స్వేచ్ఛగా పాటిస్తాడు. యీ విషయం తెలుసుకొని సమాజంలో చట్టాల్ని పాటించునట్టి వారే చట్టాల యొక్క నీతిని, అవినీతిని గురించి నిర్ణయించుటకు అర్హులు. అట్టివారికే చట్టాన్ని ఆయా పరిస్థితుల్లో, ఆయా పరిధికి లోబడి వ్యతిరేకించే అర్హత వుంటుంది. అట్టి అర్హత వున్నదా లేదా అని గమనించకుండా నేను చట్టాన్ని ఉల్లంఘించమని వారికి చెప్పాను. నాయీ తప్పు నాకు పర్వతమంతగా కనబడింది. ఖేడా జిల్లాలో ప్రవేశించిన తరువాత నాకు అక్కడి ఉద్యమం జ్ఞాపకం వచ్చింది. నేను బహిరంగంగా కనపడుతున్న ప్రమాదాన్ని గుర్తించలేదని నాకు బోధపడింది. సహాయ నిరాకరణోద్యమాన్ని కొనసాగించేందుకు ప్రజలు అర్హులు కావాలి. అందలి రహస్యాన్ని వారు గ్రహించాలి. తెలిసివుండి కూడా చట్టాల్ని రోజూ ఉల్లంఘించేవారు. రహస్యంగా చట్టాల్ని పలుసార్లు ఉల్లంఘించేవారు. హఠాత్తుగా సహకార నిరాకరణం అంటే ఏమిటో ఎలా తెలుసుకోగలరు ? దాని మర్యాదను ఎలా కాపాడగలరు?

వేలాదిమంది, లక్షలాదిమంది జనం యిట్టి ఆదర్శస్థితిని పొందలేరని అంతా అంగీకరిస్తారు. కాని ఆ విధమైన శిక్షణ ఉద్యమం ప్రారంభించుటకు పూర్వం జనానికి గరపాలి. అట్టి శిక్షణ నొసంగగల నిష్ఠాతులగు వాలంటీర్లను ముందు తయారుచేయాలి.

వాళ్లకు సహకార నిరాకరణోద్యమం అంటే ఏమిటో బోధించాలి. అప్పుడే యీ ఉద్యమం విజయవంతం అవుతుంది. ఈ విధంగా యోచించి నేను బొంబాయి చేరుకొని సత్యాగ్రహ సంస్థ ద్వారా సత్యాగ్రహుల వాలంటీర్ల దళాన్ని ఏర్పాటుచేసి, సత్యాగ్రహ విధానాల్ని వారికి బోధపరిచి, అందుకు అవసరమైన కరపత్రాలు ప్రకటించే ఏర్పాటు చేశాను. ఈ పని ప్రారంభించానే గాని జనాన్ని ఆకర్షించలేకపోయాను. వాలంటీర్లు అధికంగా దొరకలేదు. చేరినవారైనా పూర్తిగా గ్రహించారా అంటే సమాధానం చెప్పడం కష్టమే. రోజులు గడిచిన కొద్దీ వాళ్లు కూడా జారుకోవడం ప్రారంభించారు. దానితో సహకార నిరాకరణోద్యమం బండి నేను అనుకొన్నట్లు వేగంగా నడవడంలేదని, నెమ్మదిగా నడుస్తున్నదని గ్రహించాను.

## 34. నవజీవన్ మరియు యంగ్ ఇండియా

ఒకవైపున సహాయనిరాకరణోద్యమం (దాని నడక ఎంత సన్నగిల్లినా) నడుస్తూనే వున్నది. మరోవైపున ప్రభుత్వ పక్షాన ఆ ఉద్యమ అణచివేత కార్యక్రమం ముమ్మరంగా సాగుతున్నది. పంజాబులో ఈ దృశ్యం కనబడింది. అక్కడ మిలటరీ చట్టం అంటే నియంతృత్వం ప్రారంభమైంది. నాయకుల్ని నిర్బంధించారు. ప్రత్యేకించిన న్యాయస్థానాలు, న్యాయస్థానాలుగా వుండక, గవర్నరు ఆర్డరును పాలించే సాధనాలుగా మారిపోయాయి. విచారణ అనేదే లేకుండా అందరికీ శిక్షలు విధించారు. నిరపరాధుల్ని పురుగుల్లా బోర్లా పడుకోబెట్టి పాకించారు. యీ దుర్మార్గం ముందు జలియన్‌వాలాబాగ్‌లో జరిగిన ఘోరకృత్యం కూడా తలవంచుకుంది. అయితే బాగ్‌లో జరిగింది నరమేధం గనుక ప్రపంచాన్ని అది బాగా ఆకర్షించింది.

ఏ విధంగానైనా సరే మీరు పంజాబు వెళ్లాలి అని నా మీద వత్తిడి ఎక్కువైంది. నేను వైస్రాయికి జాబు వ్రాశాను. తంతి పంపాను. కాని అనుమతి లభించలేదు. అనుమతి లేకుండా వెళితే లోనికి అడుగుపెట్టనీయరు కదా! చట్టాన్ని సవినయంగా ఉల్లంఘించాననే గౌరవం తప్ప వేరే ప్రయోజనం చేకూరదు. ధర్మసంకటంలో పడ్డాను. ప్రభుత్వం వారి నిషేధాజ్ఞను ఉల్లంఘించితే అది సహకార నిరాకరణోద్యమం క్రిందకు రాదు. శాంతిని గురించి ఆశించిన విశ్వాసం యింకా నాకు కలుగలేదు. పంజాబులో జరుగుతున్న దుర్మార్గపు పాలన వల్ల దేశంలో ఉద్రిక్త వాతావరణం నెలకొన్నది యిట్టి స్థితిలో నేను చట్టాన్ని ఉల్లంఘించితే అగ్నిలో ఆజ్యం పోసినట్లవుతుందని అనిపించింది. అందువల్ల పంజాబులో ప్రవేశించడానికి నేను ఇష్టపడలేదు. ఇది చేదు నిర్ణయం,

రోజూ పంజాబులో జరుగుతున్న ఘోరకృత్యాలు తెలుస్తున్నాయి. వాటనివింటూ పండ్లు కొరుకుతూ వుండిపోవలసిన స్థితి ఏర్పడింది.

ఇదే సమయాన క్రానికల్ పత్రికను ప్రచండశక్తిగా రూపొందించిన మిస్టర్ హార్నిమెన్‌ను ప్రజలకు తెలియకుండా రహస్యంగా ప్రభుత్వం ఎత్తుకుపోయింది. ఈ దొంగతనంలో నిండివున్న దుర్వాసన యీనాటివరకు నాకు కొడుతూనేవున్నది. మి. హార్నిమెన్ అరాచకత్వాన్ని కోరలేదని నాకు తెలుసు. సత్యాగ్రహ సంస్థ సలహా తీసుకోకుండా పంజాబు ప్రభుత్వపు ఆదేశాన్ని నేను ధిక్కరించడం సరికాదని అయన భావించాడు. సహాయ నిరాకరణోద్యమాన్ని వాయిదా వేయడానికి ఆయన పూర్తిగా యిష్టపడ్డాడు. నేను వాయిదా వేస్తున్నానని ప్రకటించక పూర్వం వాయిదా వేయమని సలహాయిస్తూ ఆయన వ్రాసిన జాబు నాకు ఆలస్యంగా అందింది. అప్పటికి నా ప్రకటన వెలువడింది. ఆ ఆలస్యానికి కారణం అహమదాబాదుకు బొంబాయికి మధ్యన గల దూరమే. ఆయనను దేశాన్నుండి బహిష్కరించిన తీరు నాకు బాధ కలిగించింది. ఈ ఘట్టం జరిగిన తరువాత క్రానికల్ పత్రికను నడిపే బాధ్యత నాకు అప్పగించారు. మిస్టర్ బరేల్వీ అక్కడ వున్నారు. అందువల్ల నేను చేయవలసిన పని అంటూ ఏమీ మిగలలేదు. ఆ బాధ్యత కూడా ఎక్కువ రోజులు వహించవలసిన అవసరం లేకుండా పోయింది. ప్రభుత్వంవారి దయ వల్ల క్రానికల్ ప్రచురణ ఆగిపోయంది. క్రానికల్ వ్యవస్థను చూస్తున్న ఉమర్‌సుభానీ, శంకర్‌లాల్ బాంకర్‌గారలు "యంగ్ ఇండియా" వ్యవస్థ కూడా చూస్తున్నారు. వారిద్దరూ యంగ్ ఇండియా బాధ్యత వహించమని నన్ను కోరారు. క్రానికల్ లేని లోటు తీర్చడం కోసం యంగ్ ఇండియా పత్రికను వారానికి ఒకసారి గాకుండా రెండు సార్లు ప్రచురించాలని నిర్ణయించాం.

ప్రజానీకానికి సత్యాగ్రహ రహస్యాలు తెలియచేయాలనే కాంక్ష నాకు వున్నది. పంజాబును గురించి ఏమీ చేయలేకపోయాను. కనీసం విమర్శించవచ్చు కదా! దాని వెనుక సత్యాగ్రహస్ఫూర్తి వున్నదని గవర్నమెంటుకు తెలుసు. అందువల్ల ఆ మిత్రుల సలహాను అంగీకరించాను. కాని ఇంగ్లీషు ద్వారా ప్రజానీకానికి సత్యాగ్రహాన్ని గురించి శిక్షణ ఎలా గరపడం? నా కార్యక్షేత్రం ముఖ్యంగా గుజరాత్ ప్రాంతం. సోదరుడు ఇందూలాల్ యాజ్ఞిక్ అప్పుడు యీ మండలిలో ఉన్నారు. ఆయన చేతిలో మాసపత్రిక నవజీవన్ వున్నది. ఆ ఖర్చు కూడా పై మిత్రులే భరిస్తున్నారు. ఆ పత్రికను ఇందూలాల్ మరియు ఆ మిత్రులు నాకు అప్పగించారు. అయితే అందు పని చేయడానికి

ఇందూలాల్ అంగీకరించారు. ఆ మాసపత్రికను మేము వారపత్రికగా మార్చాము. ఇంతలో క్రానికల్‌కి మళ్లీ ప్రాణం వచ్చింది. అందువల్ల యంగ్ ఇండియా వారపత్రికగా మారింది. దాన్ని నా సలహా ప్రకారం అహమదాబాదకు మార్చారు. రెండు పత్రికల్ని వేరు వేరు చోట్ల నుండి వెలువరించాలంటే ఖర్చు పెరిగింది. శ్రమ కూడా హెచ్చింది. నవజీవన్ పత్రిక అహమ్మదాబాద్ నుండే వెలువడుతున్నది. అటువంటి పత్రికలు నడపాలంటే సొంత ప్రెస్సుఅవసరమను విషయం ఇండియన్ ఒపీనియన్ అను పత్రిక నడుపుతూ వున్నప్పుడు నాకు బోధపడింది. వ్యాపార దృక్పథంతో సొంత ప్రెస్సులో ముద్రించబడే పత్రికల్లో ఆయా పత్రికాధిపతులు నా అభిప్రాయాల్ని ప్రకటించడానికి భయపడుతూ వుండేవారు. ఇది కూడా సొంత ప్రెస్సు పెట్టడానికి ఒక కారణం. అహమదాబాదులోనే అది సాధ్యం గనుక యంగ్ ఇండియాను అహమదాబాదుకు మార్చారు.

ఈ పత్రికల ద్వారా సత్యాగ్రహాన్ని గురించిన వివరాలు ప్రజలకు తెలపడం ప్రారంభించాను. ప్రారంభంలో రెండు పత్రికల ప్రతులు కొద్దిగా ముద్రించబడుతూ వుండేవి. ఆ సంఖ్య పెరిగి 40 వేలకు చేరుకున్నది. నవజీవన్ పత్రిక చందాదారులు ఒక్కసారిగా పెరిగారు. యంగ్ ఇండియా చందదారులు నెమ్మదిగా పెరిగారు. నేను జైలుకు వెళ్లిన తరువాత యీ వెల్లువ తగ్గుముఖం పట్టింది. రెండు పత్రికల్లోను విజ్ఞాపనలు ప్రకటించకూడదని మొదటి నుండి నా నిర్ణయం. దానివల్ల నష్టం కలుగలేదని నా అభిప్రాయం. పత్రికల్లో భావనా ప్రకటనకు గల స్వాతంత్ర్య రక్షణకు యీ విధానం బాగా తోడ్పడింది. ఈ పత్రికలు వెలువడటంతో నాకు శాంతి లభించింది. సహాయ నిరాకరణోద్యమం వెంటనే ప్రారంభించలేకపోయినా నా అభిప్రాయాల్ని ప్రకటించ గల అవకాశం దొరికింది. సలహాల కోసం నా వంక చూస్తున్న వారికి ధైర్యం చేకూర్చగలిగాను. ఆ రెండు పత్రికలు గడ్డుసమయంలో ప్రజలకు అధికంగా సేవ చేయగలిగాయని నా అభిప్రాయం. మిలిటరీ చట్టాల దుర్మార్గాల్ని ఎండగట్టి వాటిని తగ్గించడానికి కూడా కృషి చేశాయి.

## 35. పంజాబులో

పంజాబులో జరిగిన ఘోరాలకన్నింటికీ అపరాధిని నేనేనని సర్ మైకేల్ ఓడయర్ నిర్ణయించాడు. ఇక అక్కడ కొందరు నవయువకులు మార్షల్ లాకు కారణం నేనేనని, నేను అపరాధిని అనడానికి కూడా వెనుకాడలేదు. కోపంతో

పెట్రేగిపోయిన ఆ నవయువకులు సహాయ నిరాకరణోద్యమాన్ని నేను మధ్యలో వాయిదావేసి యుండకపోతే జలియన్‌వాలా బాగ్ హత్యాకాండ జరిగియుండేది కాదని, మిలటరీచట్టం అమలులోకి వచ్చియుండేది కాదనే స్థితికి వెళ్లారు. గాంధీ గనుక పంజాబులో అడుగుపెడితే తుపాకీతో కాల్చి పారేస్తామని కూడా కొందరు బెదిరించారు. కాని నేను చేసిన పని సరియైనదేనని, తెలివిగల వాళ్లెవరూ అందుకు భిన్నంగా ఆలోచించరని నా నిశ్చితాభిప్రాయం. పంజాబు వెళ్లడానికి ఎంతో తొందరపడ్డాను. నేను పంజాబు చూడలేదు. చూడగలిగినంత వరకూ పంజాబును చూడాలని అభిలాష కలిగింది. నన్నక్కడికి ఆహ్వానించిన డా. సత్యపాల్, డా. కిచలూ, పండిత రామభజదత్త చౌధరిగారలను చూడాలని ఆరాటం ఎక్కువైంది. వారు జైల్లో ఉన్నారు. అయితే వాళ్లను ప్రభుత్వం ఎక్కువ కాలం జైల్లో వుంచలేదని నాకు తెలుసు. బొంబాయి వెళ్లినప్పుడే అనేకమంది పంజాబు సోదరులు వచ్చి నన్ను కలియడం ప్రారంభించారు. వారిని ప్రోత్సహించాను. వారంతా సంతోషంతో తిరిగి వెళుతూ వుండేవారు. నేను ఎంతో ఆత్మవిశ్వాసంతో వున్నా నా పంజాబు యాత్ర వాయిదా పడుతూనే వుంది. వైస్రాయి ప్రతిసారి "అప్పుడే కాదు" అంటూ నన్ను పంజాబుకు వెళ్లనీయలేదు.

ఈలోపున హంటర్ కమిటీ వచ్చింది. ఆ కమిటీ వాళ్లు పంజాబులో మిలటరీ పాలన యందు జరిగిన అధికారుల చర్యలను పరిశీలించవలసి వున్నది. దీనబంధు ఆండ్రూసు అక్కడకు వెళ్లారు. వారి జాబుల్లో హృదయాన్ని కదిలించే వర్ణనలు నిండివున్నాయి. పత్రికల్లో వెలువడిన వివరాల కంటే అక్కడ జరిగిన ఘోరాలు అధికంగా వున్నాయని వారి జాబుల వల్ల తెలిసింది. మీరు త్వరగా పంజాబు రావాలని వారు వ్రాశారు. వెంటనే పంజాబు చేరమని మాలవ్యాగారి టెలిగ్రాములు వస్తున్నాయి. అందువల్ల నేను మళ్లీ వైస్రాయికి తంతి పంపాను. ఫలానా తేదీన మీరు వెళ్లవచ్చునని ఆయన సమాధానం పంపాడు. అయితే ఆ తేదీ యిప్పుడు సరిగా జ్ఞాపకం లేదు. కాని అది అక్టోబరు 17వతేదీ అయి వుంటుంది.

నేను వెంటనే లాహోరుకు బయలుదేరాను. అక్కడి దృశ్యం ఎన్నటికీ మరచిపోలేను. స్టేషను దగ్గర జనం విపరీతంగా వున్నారు. ఎన్నో సంవత్సరాల నుండి విడిపోయి ఎక్కడో నివసిస్తున్న తమ కుటుంబీకుడు వస్తున్నట్లు వారి ప్రవర్తనా తీరు ప్రకటిస్తున్నది. అక్కడి జనం హర్షానందంతో ఉన్మత్తులైపోతున్నారు. పండిత రామభజదత్త చౌధరిగారింట్లో నాకు మకాం ఏర్పాటు చేశారు. నేను మొదటినుండి ఎరిగిన

సరళాదేవి చౌధరాణి మీద నా ఆతిధ్యపు భారం పడింది. భారమని ఎందుకు అంటున్నానంటే ఆనాటికి కూడా నేను ఏ ఇంటి యజమాని దగ్గర బసచేస్తానో ఆ ఇల్లు ధర్మసత్రంగా మారిపోతూవుంది. పంజాబులో చాలామంది నాయకుల్ని జైళ్లలో నిర్బంధించి వుంచారు. అందువలన వాళ్ల చోటును మాలవ్యాగారు, మోతీలాల్ గారు, స్వామీ శ్రద్ధానందగారు అధిష్టించారు. మాలవ్యాగారితోను, శ్రద్ధానందగారితోను నాకు అదివరకే పరిచయం వున్నది కాని మోతీలాలు గారితో దగ్గరి పరిచయం లాహోరులోనే నాకు కలిగింది. ఈ నాయకులతో బాటు జైళ్లలో పెట్టబడని పలువురు స్థానిక నాయకులు వచ్చి నన్ను కలిశారు. నన్ను ఎంతో ఆత్మీయంగా చూచారు. మేమంతా ఏకగ్రీవంగా హంటర్ కమిటీ ఎదుట సాక్ష్యాలుగాని, వాఙ్మూలాలు గాని యివ్వకూడదని నిర్ణయానికివచ్చాం. అందుకు గల కారణాలు అప్పుడే సవివరంగా ప్రకటించాం. వాటినన్నిటిని యిక్కడ తిరిగి ఏకరువు పెట్టను. కాని మేము చెప్పిన కారణాలు బలవత్తరమైనవని ఆ కమిటీని బహిష్కరించడం సబబైన పనేనని యీ నాటికీ నా నిశ్చితాభిప్రాయం. అయితే హంటర్ కమిటీని బహిష్కరించి వూరుకోకూడదని, ప్రజల పక్షాన అనగా కాంగ్రెస్ పక్షాన ఒక ఎంక్వైరీ కమిటీ ఏర్పాటుచేయాలని నిర్ణయం చేశాం. పండిత మాలవ్యాగారు నన్ను, పండిత మోతిలాల్ నెహ్రూ, కీ.శే చిరత్తరంజన్ దాస్, అబ్బాస్ తయాబ్జీ, జయకర్‌గారలను ఒక కమిటీగా నియమించారు. మేము పరిశీలన కోసం విడివిడిగా పర్యటన ప్రారంభించాం. యీ కమిటీ భారం ఎక్కువగా నా మీద పడింది. అత్యధిక గ్రామాలను దర్శించే పని నాకు అప్పగించడంవల్ల పంజాబునందలి గ్రామాల్ని స్వయంగా చూచే అవకాశం నాకు కలిగింది. యీ పర్యటన సందర్భంలో పంజాబు నందలి మహిళలతో నేను బాగా కలిసిపోయాను. యుగయుగాల నుండి వారిని నేను ఎరిగి వున్నంతగా సామీప్యం ఏర్పడింది. వెళ్లిన ప్రతిచోట స్త్రీలు అత్యధికంగా వచ్చి తాము వడకిన నూలు చిలపలు తెచ్చి నా ఎదుట పోగులు పోయసాగారు. ఈ యాత్రా సందర్భంలో పంజాబు ఖద్దరుకు గొప్ప కేంద్రం కాగలుగుతుందనే విశ్వాసం నాకు కలిగింది. అక్కడ జరిగిన ఘోరాలు అపరిమితం. లోతుకు వెళ్లిన కొద్దీ అధికారుల అరాచకత్వం, దుర్మార్గం, నియంతృత్వం విని, చూచి నివ్వెరబోయాను. ప్రభుత్వ సైన్యంలో ఎక్కువగా వున్నది పంజాబీలే. అట్టివారి మీద యిన్ని ఘోరాలు ఎలా చేయగలిగారు, వాళ్లు ఎలా సహించారా అని యోచించి విస్తుపోయాను.

మా కమిటీ రిపోర్టు తయారుచేసే బాధ్యత నా మీద పడింది. పంజాబ్‌లో జరిగిన దురంతాలను గురించి తెలుసుకోదలచిన వారు మా రిపోర్టు చదవమని

కోరుతున్నాను. మా ఆ రిపోర్టులో ఎక్కడా అతిశయోక్తులు చోటు చేసుకోలేదని చెప్పగలను. ప్రకటించిన దురంతాలకు సాక్ష్యాలు అక్కడే యివ్వబడ్డాయి. సందేహించవలసిన మాట ఒక్కటి కూడా రిపోర్టులో లేదని స్పష్టంగా చెప్పగలను. సత్యాన్ని మాత్రమే ఎదురుగా పెట్టుకొని తయారుచేయపబడ్డ మా రిపోర్టునందు బ్రిటిష్ ప్రభుత్వం వాళ్లు తమ ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు ఎంతటి ఘోరాలకైనా తెగించగలరని నిరూపించాము. మా రిపోర్టులో పేర్కొనబడిన ఒక్కమాట కూడా అసత్యమని ఎవ్వరూ అనలేకపోయారు.

## 36. ఖిలాఫత్‌కు బదులు గోసంరక్షణా?

పంజాబ్‌లో జరిగిన మారణకాండను కొంచెం సేపు వదిలివేద్దాం. పంజాబ్‌లో డయ్యర్ నియంతృత్వ దురంతాల పరిశీలన కాంగ్రెస్ పక్షాన జరుగుతూ వున్నది. యింతలో ఒక ప్రజావేదికకు సంబంధించిన ఆహ్వానం నాకు అందింది. దాని మీద కీ.శే. హకీం సాహబ్ మరియు భాయి ఆసఫ్ అలీగార్ల పేర్లు వున్నాయి శ్రద్ధానంద్‌గారు సభలో పాల్గొంటారని అందు వ్రాశారు. ఆయన ఆ సభకు అధ్యక్షుడు అని గుర్తు. ఢిల్లీలో ఖిలాఫత్ గురించి యోచించుటకు రాజీకి అంగీకరించాలా లేదా అని నిర్ణయించుటకు హిందూ ముస్లిములు కలిసి ఏర్పాటు చేసిన సమావేశం అది. నవంబరు మాసంలో ఆ సభ ఏర్పాటు చేయబడినట్లు నాకు గుర్తు. ఆ సమావేశంలో ఖిలాఫత్ విషయం మీదనే గాక గోసంరక్షణను గురించి చర్చ జరుగుతుందని, అందుకు యిది మంచి తరుణమని అందు వ్రాశారు. నాకు ఆ వాక్యం గుచ్చుకుంది. సమావేశంలో పాల్గొనుటకు ప్రయత్నిస్తానని వ్రాసి ఖిలాఫత్ సమస్యకు గోసంరక్షణ సమస్యకు ముడివేయడం బేరసారాలు సాగించడం మంచిది కాదని, ప్రతివిషయం మీద దాని గుణదోషాలను బట్టి చర్చించాలని వ్రాశాను. తరువాత సభ జరిగింది. నేను వెళ్లి అందు పాల్గొన్నాను. జనం బాగా వచ్చారు. అయితే యితర సమావేశాలవలె యిది హడావుడిగా జరగలేదు. శ్రద్ధానంద కూడా సభలో పాల్గొన్నారు. నేను యోచించిన విషయాన్ని గురించి వారితోకూడా మాట్లాడాను. నా మాట వారికి నచ్చి ఆ విషయం సమావేశంలో చెప్పమని అని ఆయన ఆ పని నాకే అప్పగించారు. డా. హకీంసాహెబ్‌తో కూడా మాట్లాడాను. ఇవి రెండు వేరువేరు విషయాలు. వాటి గుణదోషాలనుబట్టి యోచించాలని నా భావం. ఖిలాఫత్ వ్యవహారం నిజమైతే గవర్నమెంట్ సరిగా వ్యవహరించక అన్యాయంచేస్తే హిందువులు మహమ్మదీయులను సమర్థించాలి,

సహకరించాలి. అయితే దానితో గోసంరక్షణను జోడించకూడదు. హిందువులు అలా కోరడం మంచిదికాదు. ఖిలాఫత్ కోసం ముస్లిములు గోవధను ఆపుతామంటే అది సరికాదు. ఒకే గడ్డ మీద ఇరుగుపొరుగున ఉండటంవల్ల గోసంరక్షణకు ముస్లింలు పూనుకొంటే అది వారికి గౌరవం. ఈ విధంగా యోచించాలని నా భావం. ఈ సభలో ఖిలాఫత్‌ను గురించే చర్చించాలని నా అభిప్రాయమని స్పష్టంగా ప్రకటించాను. సమావేశంలో అంతా అందుకు అంగీకరించారు. గోసంరక్షణను గురించి సమావేశంలో చర్చ జరుగలేదు. అయితే మౌలానా అబ్దుల్ బారీ సాహబ్ "ఖిలాఫత్‌కు హిందువులు సహకరించినా, సహకరించకపోయినా మహమ్మదీయులు గోసంరక్షణకు పూనుకోవాలి అని అన్నాడు. ముస్లింలు గోవధను నిజంగా ఆపివేస్తారని అని అనిపించింది. కొందరు పంజాబు సమస్యను ఖిలాఫత్‌తోబాటు చర్చించాలని అన్నారు. నేను వ్యతిరేకించాను. పంజాబుది స్థానిక సమస్య. పంజాబులో జరిగిన దారుణాలవల్ల బ్రిటిషు సామ్రాజ్యానికి సంబంధించిన ఉత్సవాలకు దూరంగా ఉందాము ఖిలాఫత్‌తో బాటు పంజాబును కలిపితే మన తెలివితక్కువను వేలెత్తి చూపే అవకాశం వున్నదని చెప్పాను. అంతా నా వాదాన్ని అంగీకరించారు. యీ సభలో మౌలానా హసరత్ మొహానీ కూడా వున్నారు. వారితో నాకు పరిచయం కలిగింది. కాని ఆయన ఎలాంటి యోధుడో నాకు ఇక్కడే తెలిసింది. మాకు అభిప్రాయభేదం ప్రారంభమైంది. ఆ అభిప్రాయ భేదం ఇంకా అనేక విషయాలలో కూడా ఏర్పడింది. హిందూ మహమ్మదీయులు స్వదేశీవ్రతం పాలించాలని అందుకోసం విదేశీవస్త్రాలను బహిష్కరించాలని చర్చ జరిగింది. అప్పటికి ఇంకా ఖద్దరు యొక్క జననం కాలేదు. ఈ విషయం మౌలానా హసరత్ సాహబ్‌కు గొంతు దిగలేదు. ఖిలాఫత్ విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం సహకరించకపోతే పగతీర్చుకోవాలని ఆయన తపన. అందుకై బ్రిటిషువారి వస్తువులను సాధ్యమైనంతవరకు బహిష్కరించాలని ఆయన భావం. నేను బ్రిటిషు వారి వస్తువులను వెంటనే బహిష్కరించటం ఎంత అసాధ్యమో వివరించాను. నా అభిప్రాయాల ప్రభావం సభాసదులమీద బాగా పడటం నేను గమనించాను. అయితే మౌలానా హసరత్ సాహబ్ విపరీతంగా తర్కిస్తూవుంటే ఒకటే చప్పట్లు మోగాయి. దానితో నా పని హుళక్కేనని అనుకున్నాను. తరువాత ఎవరు అంగీకరించినా, అంగీకరించకపోయినా నా కర్తవ్యం నేను నిర్వహించడం అవసరమని భావించి మాట్లాడేందుకు లేచాను. నా ఉపన్యాసం శ్రద్ధగా జనం విన్నారు. నా భావాలకు బాగా సమర్థన లభించింది. తరువాత నన్ను సమర్థిస్తూ చాలామంది మాట్లాడారు. బ్రిటిషు వారి వస్తువులను బహిష్కరిస్తే లాభం లేదని ఎగతాళి తప్ప ప్రయోజనం కలగదని జనం గ్రహించారు. మొత్తం సభలో వున్న జనం

ఒంటిమీద ఏదో ఒక విదేశీ వస్తువు ఉన్నది. సభలో పాల్గొన్నవారే ఆదరించలేని విషయాన్ని గురించి యోచించడం అనవసరమని అంతా భావించారు. మౌలానా హసరత్ ప్రసంగిస్తూ "మీరు విదేశీ వస్త్రాలను బహిష్కరించమంటే ఎట్లా? అది మాకు ఇష్టం లేదు. మన అవసరాలకు కావలసిన బట్ట ఎప్పుడు తయారు చేసుకుంటాం? ఎప్పుడు విదేశీ వస్త్రాలను బహిష్కరిస్తాం అందువల్ల ఆంగ్లేయుల్ని వెంటనే దెబ్బతీసే వస్తువు ఏదైనా వుంటే చెప్పండి? బహిష్కారం తప్పదు కాని వెంటనే బ్రిటిషు వారిని దెబ్బతీయగల వస్తువు ఏమైనా వుంటే త్వరగా చెప్పండి" అని తొందర పెట్టాడు. విదేశీ వస్త్రాలను బహిష్కరించమనే గాక మరేదేమైనా క్రొత్త వస్తువును బహిష్కరించమని చెప్పడం అవసరమని భావించాను. అవసరమైనంత ఖాదీ వస్త్రం మనం తయారు చేసుకోవచ్చునని తరువాత నాకు బోధపడింది. అప్పటికి నాకీ విషయం తెలియదు. కేవలం విదేశీ బట్టల కోసం మిల్లులమీద ఆధారపడితే అవి సమయానికి మోసం చేస్తాయని అప్పటికి నేను గ్రహించాను. మౌలానా గారి ప్రసంగం పూర్తికాగానే నేను ప్రసంగించేందుకు లేచి నిలబడ్డాను.

నాకు తగిన ఉర్దూ, హిందీ శబ్దాలు స్ఫురించలేదు. మహమ్మదీయులు ఎక్కువగా వున్న ఇట్టి సభలో యుక్తిపరంగా ఉపన్యసించవలసి రావడం నాకు యిదే ప్రథమం. కలకత్తాలో జరిగిన ముస్లింలీగ్ సభలో కొద్ది నిమిషాలసేపు మాత్రమే మాట్లాడాను. అది హృదయాల్ని స్పృశించే ఉపన్యాసం. కాని ఇక్కడ వ్యతిరేక భావాలు గల వారి మధ్య ఉపన్యసించాలి. ఇక సంకోచం మానుకున్నాను. ఢిల్లీ ముస్లిముల ఎదుట మంచి ఉర్దూలో ప్రాసయుక్తంగా మాట్లాడవలసిన అవసరం వున్నది. కాని నా అభిప్రాయం అట్టి భాషలోకాక సూటిగా వచ్చీరాని హిందీలో తెలియచేయటమే మంచిదని భావించాను. ఆ పని బాగానే పూర్తి చేశాను. హిందీ ఉర్దూ యే దేశ భాష కాగలదనుటకు ఆ సభ ప్రత్యక్ష తార్కాణం. ఇంగ్లీషులో మాట్లాడియుంటే నా బండి ముందుకు సాగియుండేదికాదు. మౌలానాగారు సవాలు విసిరారు. అందుకు సమాధానం యిచ్చే అవకాశం నాకు సూటిగా లభించియుండేది కాదు.

ఉర్దూ లేక గుజరాతీ శబ్దాలు సమయానికి తోచనందుకు సిగ్గుపడ్డాను. అయినా సమాధానం యిచ్చాను. నాకు "నాన్ కో ఆపరేషన్" అను శబ్దం స్ఫురించింది. మౌలానా గారు ఉపన్యసిస్తున్నప్పుడు బాగా ఆలోచించాను. ఆయన స్వయంగా అనేక విషయాలలో గవర్నమెంటును సమర్థిస్తున్నాడు అట్టి గవర్నమెంటుకు వ్యతిరేకంగా మాట్లాడటం వ్యర్థమని అనుకున్నాను. కత్తితో సమాధానం యివ్వదలచనప్పుడు వారికి

సహకరించకపోవడమే నిజంగా వ్యతిరేకించడం అవుతుందని భావించాను. నేను "నాన్ కో ఆపరేషన్" అను శబ్దం ప్రప్రథమంగా యీ సభలోనే ప్రయోగించాను. దాన్ని సమర్థిస్తూ నా ఉపన్యాసంలో అనేక విషయాలు పేర్కొన్నాను. ఆ సమయంలో నాన్‌కో ఆపరేషన్ అను శబ్దానికి ఏఏ విషయాలు అనుకూలిస్తాయో నేను ఊహించలేదు. అందువల్ల నేను వివరాలలోకి పోలేదు. నేను ఆ సభలో చేసిన ఉపన్యాస సారాంశం యిక్కడ తెలుపుతున్నాను.

"మహమ్మదీయ సోదరులు మరొక మహత్తరమైన నిర్ణయం చేశారు. వారు చేస్తున్న ప్రయత్నానికి విధించబడే షరతులు వ్యతిరేకంగా వుంటే ప్రభుత్వానికి చేస్తున్న సహకారం వారు విరమిస్తారన్నమాట. అప్పుడు ప్రభుత్వ డిగ్రీలు స్వీకరించడం, ప్రభుత్వ పదవులు అంగీకరించడం మొదలగు పనులు చేయవలసిన అవసరం వుండదు. ప్రభుత్వం ఖిలాఫత్ వంటి ఎంతో మహత్తరమైన మత సంబంధమైన విషయాలకు నష్టం కలిగిస్తే మనం అట్టి ప్రభుత్వానికి సహాయం ఎలా చేస్తాం? అందువల్ల ఖిలాఫత్ వ్యవహారం మనకు వ్యతిరేకం అయితే ప్రభుత్వానికి చేస్తున్న సహకారాన్ని విరమించుకునే హక్కు మనకు వుంది" అ విషయాన్ని గురించి ప్రచారం చేయడానికి కొన్ని నెలల కాలం పట్టింది. ఆ విషయం కొద్ది మాసాల పాటు సంస్థలోనే పడి వుంది. ఒక నెల రోజుల తరువాత అమృతసర్‌లో కాంగ్రెసు మహాసభలు జరిగాయి. అక్కడ నేను సహాయ నిరాకరణోద్యమానికి సంబంధించిన తీర్మానాన్ని సమర్థించాను.అయితే హిందూ ముస్లిములు సహాయ నిరాకరణానికి పూనుకోవలసిన అవసరం కలుగుతుందని అప్పుడు నేను ఊహించలేదు.

## 37. అమృతసర్ కాంగ్రెస్

మార్షల్ లా సమయంలో వందలాది నిర్దోషులగు పంజాబీలను తెల్లప్రభుత్వం పేరుకు మాత్రమే స్థాపించబడ్డ కోర్టుల్లో, బూటకపు కేసులు బనాయించి శిక్షలు విధించి జైళ్లల్లోకి నెట్టివేసింది. ఆ దుర్మార్గాల్ని దుండగాల్ని ఖండిస్తూ ఉవ్వెత్తున వ్యతిరేకత వెల్లడి అయ్యేసరికి ఆ ఖైదీలను ఎక్కువ కాలం జైళ్లలో వుంచడం సాధ్యం కాలేదు. కాంగ్రెసు సభలు ప్రారంభం కాక ముందే చాలామంది ఖైదీలు విడుదల చేయబడ్డారు. లాలా హరకిషన్‌లాల్ మొదలగు నాయకులంతా విడుదల అయ్యారు. కాంగ్రెస్ మహాసభలప్పుడు అలీ సోదరులు కూడా విడుదల అయి వచ్చేశారు. దానితో ప్రజల ఆనందం అవధులు దాటిపోయింది. పండిత మోతీలాల్ నెహ్రూ తన వకీలు

వృత్తిని కాళ్లతోతన్నివేసి పంజాబులో తిష్ఠవేశారు. వారే అమృతసర్ ఉపన్యాసం యిచ్చి హిందీ భాషయొక్క ఆవశ్యకతను నొక్కి చెప్పడం, విదేశాలలో వుంటున్న హిందూ దేశస్థుల సమస్యలను గురించి చెప్పడం వరకే నా పని సీమితం అయింది. అమృతసర్ కాంగ్రెసులో కూడా అంతకంటే మించి నేను చేయవలసింది ఏమీవుండదని భావించాను. కాని అక్కడ ఎంతో బాధ్యత నా మీద పడింది. బ్రిటిష్ చక్రవర్తి తరపున క్రొత్త సంస్కరణలకు సంబంధించిన ప్రకటన వెలువడింది. నాకు అవి పూర్తి సంతృప్తిని కలిగించలేదు. యితరులకైతే అసలు తృప్తికరంగా లేవు. అయినా వాటిని ఆ సమయంలో అంగీకరించటమే మంచిదను నిర్ణయానికి నేను వచ్చాను. చక్రవర్తి ప్రకటనలో లార్డ్ సింహ్ చెయ్యి వుందని నాకు అనిపించింది. వారిభాషలో నాకు ఆశారేఖ గోచరించింది. కాని అనుభవజ్ఞులగు లోకమాన్యులు చిత్తరంజనదాసు మొదలగు యోధులు అంగీకరించలేదు. మాలవ్యా వంటి వారు తటస్థంగా వున్నారు.

మాలవ్యాగారింట్లో నా మకాం ఏర్పాటు చేశారు. కాశీ విశ్వవిద్యాలయం శంకుస్థాపన రోజున మాలవ్యాగారి నిరాడంబరత్వాన్ని చూచే అవకాశం నాకు లభించింది. కాని ఈ పర్యాయం వారు నన్ను తన గదిలోనే వుండమన్నారు. అందువల్ల వారి దినచర్యను కండ్లారా చూచే అవకాశం దొరికింది. నాకు ఆనందమేగాక ఆశ్చర్యం కూడా కలిగింది. వారున్న గది బీదలుండే ధర్మశాల అని చెప్పవచ్చు. అక్కడ కొద్దిగా కూడా ఖాళీగా వదిలిన చోటులేదు. అంతటా జనం వున్నారు. ఖాళీ చోటుగాని, ఏకాంత ప్రదేశంగాని అక్కడ లేదు. ఎవరైనా ఎప్పుడైనా సరే రావచ్చు. వారితో మాట్లాడవచ్చు. ఆ గదియందలి ఒక కొసన నా దర్బారు, అంటే నా మంచం వున్నది. అయితే మాలవ్యాగారి నడవడికను గురించి చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. గనుక అసలు విషయానికి వస్తాను. మాలవ్యాగారితో రోజూ మాట్లాడడానికి అవకాశం లభించింది. తన అభిప్రాయాలను పెద్దన్నగారు తమ్ముడికి చెప్పే పద్ధతిన నాకు ప్రేమతో చెబుతూ వుండేవారు. ప్రభుత్వ సంస్కరణలకు సంబంధించిన సభలో పాల్గొనడం అవసరమని భావించాను. పంజాబ్ కాంగ్రెస్ యొక్క రిపోర్టును గురించిన వ్యవహారంలో నాకూ పాలు వున్నది. పంజాబు విషయంలో ప్రభుత్వం చేత పని చేయించుకోవాలి. ఖిలాఫత్ సమస్య సరేసరి. మాంటెగ్యూ హిందూ దేశాన్ని మోసం చేయరను నమ్మకం నాకు వున్నది. ఖైదీలు ముఖ్యంగా ఆలీ సోదరుల విడుదల శుభ లక్షణమని భావించాను. అందువల్ల సంస్కరణలను అంగీకరిస్తూ తీర్మానం చేయాలని అభిప్రాయపడ్డాను. సంస్కరణలు అసంతృప్తికరంగా వున్నాయి. గనుక వాటిని తిరస్కరించాలనే దృఢ

దీక్షతో చిత్తరంజన్‌దాస్ వున్నారు. లోకమాన్యులు తటస్థంగా వున్నారు. అయితే చిత్తరంజన్ ప్రవేశపెట్టే తీర్మానానికే మొగ్గు చూపాలను నిర్ణయానికి వారు వచ్చారు.

ఇటువంటి పండి పోయిన సర్వమాన్యులగు పాత నాయకులతో అభిప్రాయ భేదం రావడం సహించలేక పోయాను. నా అంతర్వాణి నా కర్తవ్యాన్ని స్పష్టంగా సూచించింది. కాంగ్రెస్ సమావేశాల నుండి పారిపోదామని ప్రయత్నించాను. పండిత మోతీలాల్ నెహ్రూగారికి, పండిత మాలవ్యాగారికి నా అభిప్రాయం చెప్పివేశాను. నేను హాజరుకాకపోతే పని సాఫీగా జరుగుతుందని, మహానాయకులను వ్యతిరేకించవలసిన స్థితి నుండి నాకు ముక్తి లభిస్తుందని కూడా చెప్పాను. నా అభిప్రాయం ఆ పెద్దలిద్దరికీ రుచించలేదు. లాలా హరకిషన్‌లాల్ చెవిలో ఈ మాటపడేసరికి "అలా జరగడానికి వీలులేదు. పంజాబీలకు బాధకలుగుతంది" అని ఆయన అన్నారు. లోకమాన్యునితోను, దేశబంధుతోను మాట్లాడాను. మిష్టర్ జిన్నాను కలిసాను. ఏవిధంగానూ దారి దొరకలేదు. నా బాధను మాలవ్యాగారికి తెలిపి "రాజీపడే అవకాశం కనబడటం లేదు. నా తీర్మానం ప్రవేశపెడితే చివరికి ఓట్లు తీసుకోవలసి వస్తుంది. యిక్కడ ఓట్లు తీసుకునే పద్ధతి కూడా సరిగా వున్నట్లు నాకు తోచడంలేదు. మన మహాసభలో దర్శకులకు, ప్రతినిధులకు తేడా ఏమీ లేదు. యింత పెద్ద సభలో ఓట్లు తీసుకునే వ్యవస్థ మనకు లేదు. నా తీర్మానం మీద ఓట్లు తీసుకోమని కోరదామంటే అందుకు అవకాశమే లేదు" అని అన్నాను. అయితే లాలా హరకిషన్‌లాల్ అట్టి వ్యవస్థ చేయిస్తానని పూచీ పడ్డారు. ఓట్లు తీసుకునే రోజున దర్శకుల్ని రానివ్వం. ప్రతినిధుల్ని మాత్రమే రానిస్తాం. వారి ఓట్లు లెక్కింపచేసే బాధ్యత నాది. అందువల్ల మీరు కాంగ్రెస్‌కు హాజరు కాకపోవడం సరికాదు అని గట్టిగా అన్నారు.

చివరికి నేను తలవంచాను. నా తీర్మానాన్ని తయారు చేశాను. ఎంతో సంకోచిస్తూ నా తీర్మానాన్ని మహాసభలో ప్రవేశపెట్టుటకు సిద్ధపడ్డాను. మిష్టర్ జిన్నా మరియు పండిత మాలవ్యాగారలు నా తీర్మానాన్ని సమర్థిస్తామని చెప్పారు. ఉపన్యాసాలు పూర్తి అయ్యాయి. భావాలలో వ్యతిరేకత వున్నా కటుత్వానికి ఉపన్యాసాలలో చోటు లభించలేదు. ఉపన్యాసాలలో తర్కందప్ప మరేమీలేదు. అయినా మహాసభలో పాల్గొనే జనం నాయకుల అభిప్రాయభేదాల్ని సహించే స్థితిలో లేరు. సభలో అందరూ ఏకాభిప్రాయాన్ని కోరుతూ వున్నారు. ఉపన్యాసాలు జరుగుతూ వున్నప్పుడు కూడా అభిప్రాయభేదం తొలగించేందుకు వేదిక మీద ప్రయత్నాలు సాగుతూ వున్నాయి. నాయకుల మధ్య చీటీల రాకపోకలు జరుగసాగాయి. ఏది ఏమైనా రాజీ కోసం

మాలవ్యాగారు గట్టిగా కృషి చేస్తున్నారు. ఆయన నా చేతికి తన సలహా కాగితం అందించి అందు ఓట్లు తీసుకునే పరిస్థితి ఏర్పడకుండా చూడమని తీయని మాటలతో కోరారు. నాకు వారి సూచన నచ్చింది. మాలవ్యాగారి కండ్లు ఆమోదం కోసం వెతుకుతూ తిరుగుతున్నాయి. "ఈ విషయం రెండు పక్షాలకు యిష్టమయ్యేలా వున్నది" అని అన్నాను. లోకమాన్యునికి నేను ఆ కాగితం అందచేశాను. "దాసుకు యిష్టమైతే నాకు అభ్యంతరం లేదు" అని ఆయన అన్నారు. దేశబంధు కరిగి పోయారు. ఆయన బిపిన్ చంద్రపాల్ వంక చూచారు. మాలవ్యా గారి హృదయంలో ఆశ చిగురించింది. దేశబంధు నోటినుండి 'సరే' అనుమాట యింకా పూర్తిగా వెలువడకుండానే మాలవ్యాగారు లేచి నిలబడి "సజ్జనులారా! రాజీ కుదిరిందని చెప్పడానికి సంతోషిస్తున్నాను" అని ప్రకటించారు. సభాస్థలి అంతా కరతాళ ధ్వనులతో మార్మోగి పోయింది. జనం ముఖాన కనపడుతున్న గాంభీర్యరేఖలు తొలగిపోయాయి. అందరి ముఖాలు సంతోషంతో కళకళ లాడాయి. ఆ తీర్మానం ఏమిటో ఇక్కడ వివరించవలసిన అవసరం లేదు. ఆ తీర్మానం ఏవిధంగా జరిగిందో వివరించడమే నా యీ సత్య శోధన యొక్క లక్ష్యం. ఆ తీర్మానం వల్ల నా బాధ్యత పెరిగింది.

## 38. కాంగ్రెస్‌లో చేరిక

కాంగ్రెసులో నేను పాల్గొనవలసి వచ్చింది. అయితే దీన్ని నేను కాంగ్రెస్‌లో చేరిక అని అనను. జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశాలలో నిష్ఠగా పాల్గొంటూవున్నాను. అది అంతవరకే సీమితం. చిన్న సైనికుని పనివంటిదే అక్కడ నా పని. అంతకంటే మించి నాకు అక్కడ భాగస్వామ్యం వుంటుందని భావించలేదు. అట్టి కోరిక కూడా నాకు లేదు. నా శక్తి కాంగ్రెసుకు అవసరమని అమృతసర్ కాంగ్రెస్‌లో అనుభవం మీద తేలింది. పంజాబులో పరిశీలనాకమిటీ యిచ్చిన రిపోర్టు చూచి లోక మాన్యులు, మాలవ్యాగారు, మోతీలాల్‌గారు, దేశబంధు దాసుగారు మొదలుగు వారంతా ఎంతో సంతోషించారు. ఆ విషయం నాకు బోధపడింది. దానితో వారు తమ సమావేశాలకు, చర్చలకు నన్ను పిలవడం ప్రారంభించారు. విషయ నిర్ధారణ సభ నిర్ణయాలన్నీ యిట్టి సమావేశాల్లోనే జరుగుతున్నాయని గ్రహించాను. యీ సమావేశాలలో జరిగే చర్చల్లో ఆ నాయకుల విశ్వాసపాత్రులే పాల్గొంటూ వుండటం కూడా గమనించాను. కొంతమంది ఏదోవిధంగా సమావేశాల్లో జొరబడేవాళ్లు. వాళ్లను కూడా చూచాను. రాబోయే సంవత్సరం చేయవలసిన రెండు కార్యక్రమాలను గురించి నాకు ప్రమేయం ఉన్నది.

జలియావాలాబాగ్‌లో జరిగిన మారణకాండకు స్మారక చిహ్నం ఏర్పాటు చేయడం ఒక కార్యక్రమం దీన్ని గురించి మహాసభలో బ్రహ్మాండమైన తీర్మానం చేశారు. అందు నిమిత్తం అయిదు లక్షల రూపాయలు వసూలు చేయాలి. ట్రస్టీలలో నాపేరు కూడా చేర్చారు. దేశంలో ప్రజల కార్యక్రమాల నిమిత్తం బిచ్చమెత్తగల మహాశక్తిమంతుల్లో మొదటి పేరు పండిత మాలవ్యాగారిది. నా పేరు వారి పేరుకి చాలా క్రింద ఉంటుందని నాకు తెలుసు. నా శక్తి ఏమిటో దక్షిణ ఆఫ్రికాలో తెలుసుకున్నాను. రాజుల్ని మహారాజుల్ని గారడీచేసి లక్షలాది రూపాయలు తీసుకురాగల శక్తి నాకు అప్పటికి లేదు. యిప్పటికీ లేదు. యీ విషయంలో మాలవ్యాగారిని మించిపోగల వ్యక్తిని నేను చూడలేదు. జలియావాలాబాగ్ స్మారక చిహ్నం కోసం వారిని చందాలడగడానికి వీలులేదని నాకు తెలుసు. అందువల్ల యీ బాధ్యత నామీద పడుతుందని అప్పుడే గ్రహించాను. అదే జరిగింది కూడా. యీ కార్యక్రమం నిమిత్తం బొంబాయిపౌరులు హృదయపూర్వకంగా విరాళాలు యిచ్చారు. ప్రజలు యిటువంటి పనులకు కావలసినంత ధనం యిచ్చే స్థితిలో వున్నారు. అయితే జలియన్‌వాలాబాగ్ గడ్డ హిందూ ముస్లిం సిక్కుల రక్తంతో తడిసినది గనుక యిక్కడ ఎలాంటి స్మారకచిహ్నం ఏర్పాటు చేయాలి అని ప్రశ్న బయలుదేరింది. మరో మాటల్లో ప్రోగైన డబ్బును ఎలా ఉపయోగించాలా అనునది గడ్డు ప్రశ్న అయింది. ఆ బాధ్యత నా మీద పడినట్లే సామరస్యం లేకపోవడం వల్ల అది సమస్యగా మారిందని చెప్పవచ్చు.

గుమాస్తాగా పనిచేయడం నాకు గల రెండో శక్తి. దాన్ని కాంగ్రెస్ సంస్థ ఉపయోగించుకునే స్థితిలో వున్నది. చిరకాలం పనిచేసి గడించిన అనుభవం వల్ల ఎక్కడ, ఏ విధంగా తక్కువ మాటలను ఉపయోగించి వినయ విధేయతలతో కూడిన భాష వ్రాయాలో నాకు బాగా తెలుసునని అంతా గ్రహించారు. కాంగ్రెస్‌కు వున్న నియమావళి గోఖలేగారు ఒప్పగించి వెళ్లిన ఆస్థియే. ఆయన కొన్ని నియమాలు తయారుచేసి యిచ్చి వెళ్లారు. వాటి సాయంతో కాంగ్రెస్ నడుస్తున్నది. ఆ నియమాలు తయారుచేసిన విధానాన్ని గురించి వారి నోట నేను విన్నాను. ఆ కొద్ది నియమాలతో యిక కాంగ్రెస్ సంస్థ నడవదని అంతా తెలుసుకున్నారు. నియమావళి తయారుచేయాలని ప్రతి సంవత్సరం చర్చ జరిగేది. కాని సాలు పొడుగునా సంస్థ పనిచేయవలసిన వ్యవస్థగాని, అందుకు అవసరమైన ఏర్పాటుగాని జరుగలేదు. ముగ్గురు కార్యదర్శులు వుండేవారు. కాని కార్యనిర్వాహక సెక్రటరీ ఒక్కడే మొత్తం వ్యవహారమంతా చూస్తూ వుండేవాడు. ఒక్క కార్యదర్శి ఆఫీసును నడుపుతాడా ?

భవిష్యత్తును గురించి యోచిస్తాడా? భూతకాలంలో చేయబడ్డ నిర్ణయాలను అమలుబరిచి నడుస్తున్న సంవత్సరంలో పూర్తిచేయగలుగుతాడా? అందువల్ల అందరి దృష్టి యీ విషయం మీద కేంద్రీకృతం అయింది. వేలాదిమంది ప్రతినిధులుగా గల సభ మీద ఆధారపడి దేశానికి సంబంధించిన కార్యక్రమాలు ఎలా సాగుతాయి? ప్రతినిధుల సంఖ్యకు హద్దు అంటూ ఏమీలేదు. ప్రతి ప్రాంతాన్నుండి ఎంత మందైనా సరే ప్రతినిధులు రావచ్చు. ఎవరైనా సరే ప్రతినిధులు కావచ్చు. ఇందు కొంతమార్పు అవసరమని అంతా నిర్ణయానికి వచ్చాము. యిక నియమావళిని తయారుచేసే బాధ్యత నేను వహించాను. అయితే ఒక షరతు పెట్టాను. ప్రజల మీద యిద్దరు నాయకుల పట్టు నేను గమనించాను. అందువల్ల వారి ప్రతినిధులు నాతోబాటు వుండాలని కోరాను వాళ్లు హాయిగా కూర్చొని నియమావళి తయారుచేయలేరని నాకు తెలుసు. అందువల్ల లోకమాన్యునికి. దేశబంధువుకి విశ్వాసపాత్రులగు ఇద్దరు ప్రతినిధుల పేర్లు ఇమ్మని వారిని కోరాను. వారు తప్ప నియమావళి కమిటీలో మరెవ్వరూ వుండకూడదని చెప్పాను అందుకు అంతా అంగీకరించారు. లోకమాన్యులు శ్రీ కేల్కారు గారి పేరు. దేశబంధు శ్రీ ఐ.బి.సేన్ గారి పేరు సూచించారు. యీ కమిటీ సమావేశం ఒక్కరోజున కూడా జరగలేదు. అయినా మేము మా పని ఏకగ్రీవంగా పూర్తిచేశాం. ఇట్టి నియమావళి తయారు చేయగలిగామనే అభిమానం మాకు కలిగింది. ఈ విధానం ప్రకారం సంస్థను నడిపితే సంస్థ యొక్క పని సవ్యంగా సాగుతుందని నా విశ్వాసం అయితే నేను యీ బాధ్యత వహించి నిజంగా కాంగ్రెస్ సంస్థలో ప్రవేశించినట్లయిందని అభిప్రాయపడ్డాను.

## 39. ఖాదీ పుట్టుక

1908 వరకు నేను రాట్నాన్నిగాని. మగ్గాన్ని గాని చూచినట్లు జ్ఞాపకం లేదు. కాని రాట్నం ద్వారా హిందూదేశపు ఏ దారిద్ర్యాన్ని పారద్రోలవచ్చో ఆ ఉపాయంతోనే స్వరాజ్యం కూడా పొందవచ్చునను విషయం అందరూ గ్రహించారు. 1951 లో దక్షిణ ఆఫ్రికా నుండి భారతదేశం వచ్చాను. అప్పటికి నేను రాట్నం చూడలేదు. ఆశ్రమం తెరవగానే మగ్గం ఏర్పాటు చేశాం. మగ్గం వల్ల యిబ్బంది కలిగింది. మాకు దాన్ని గురించి ఏమీ తెలియదు. మగ్గం తెప్పించినంత మాత్రాన పని అవుతుందా? మేమంతా కలం వీరులం లేక బేరసారాలు చేసేవాళ్ళం. అలాంటి వాళ్ళం అక్కడ చేరాం. నేతపనివాడు ఒక్కడు లేడు. అందువల్ల మగ్గం తీసుకురాగానే నేత నేర్పడానికి

పనివాడు కావలసివచ్చాడు. కాఠియావాడ్ మరియు పాలన్‌పుర్ నుండి మగ్గాలు వచ్చాయి. నేర్పేవాడు కూడా ఒకడు వచ్చాడు. అతడు తన పనితనాన్ని వ్యక్తం చేయలేదు. అయితే మగన్‌లాల్‌గాంధీ చేబట్టిన పనిని తేలికగా వదిలిపెట్టే మనిషి కాదు. ఆయన పనిమంతుడు. ఆయన నేతపనిని క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. ఆశ్రమంలో ఒకరి తరువాత మరొకరు నేత పనివాళ్ళు తయారైనారు.

మేము మా బట్టలు స్వయంగా నేసుకొని ధరించాలి. అందువల్ల మిల్లు బట్టలు మానివేశాం ఆశ్రమవాసులు మిల్లు నూలుతో మగ్గం మీద నేసిన బట్ట కట్టుకోవడం ప్రారంభించారు. యీ వ్రతనిర్వహణలో చాలా విషయాలు తెలుసుకున్నాం. హిందూ దేశపు నేతపనివారి జీవనం, వారి రాబడి, నూలు సంపాదించాలంటే కలిగే కష్టాలు ఆ వ్యవహారంలో వారు మోసపోతున్న విధానం, రోజురోజుకు ఏవిధంగా అప్పుల పాలవుతున్నారో ఆ తీరు మొదలుగా గల వివరాలన్నీ బోధపడ్డాయి. అందరికి అవసరమైన బట్టంతా నేసుకునే స్థితిలో లేము. అందువల్ల బయట నేతవారిచేత బట్ట నేయించి అవసరమైనంత తెచ్చుకోవాలి. దేశపు మిల్లుల్లో తయారైన నూలుతో నేయబడ్డ నేతబట్ట తేలికగా దొరకదు. విదేశీనూలుతో నేత వాళ్ళు సన్నని బట్టలు నేసేవారు. దేశవాళీ మిల్లుల్లో తయారయ్యే నూలు సన్నగా వుండేదికాదు. మనమిల్లులు సన్నని నూలు తయారుచేసేవికాదు. దేశపు మిల్లుల నూలుతో బట్టనేసి యిచ్చే నేతవాళ్ళు అతికష్టం మీద బహుకొద్దిమంది దొరికారు. అయితే దేశపు మిల్లుల నూలుతో తయారుచేసే బట్ట మొత్తం కొంటామని ఆశ్రమం తరుపున మేము హామీ యివ్వవలసి వచ్చింది. ఈ విధంగా తయారుచేసి కట్టుకున్న బట్టను గురించి మిత్రుల్లో బాగా ప్రచారం చేశాము. ఈ విధంగా మేము నూలు మిల్లుల దమ్మిడీ ఖర్చులేని దళారులం అయిపోయాం. మిల్లుల్ని గురించి తెలుసుకున్నాం. వాటి వ్యవస్థ, అక్కడి వాళ్ళ బాధలు తెలిశాయి. స్వయంగా నూలు వడకడం, ఆ నూలుతో బట్టనేయడం మిల్లుల లక్ష్యం. మిల్లులు మగ్గాల వారికి సాయం చేయవు. చేసినా యిష్టం లేకుండా చేసేవన్నమాట. ఇదంతా చూచిన తరువాత వడుకుపని మనమే ఎందుకు చేయకూడదా అని ఆలోచించాము. మన చేతులతో నూలు వడకనంతవరకు మనం పరాయివారికి బానిసలమేనని తెలుసుకున్నాం. మిల్లు నూలుకు ఏజంట్లమై దేశసేవ చేస్తున్నామని అనుకోవచ్చునా? మాకు బోధపడలేదు. అయితే రాట్నమూ మాకు దొరకలేదు. రాట్నం మీద నూలు వడికే వారు దొరకలేదు. నారపీచుతో పురికొస తయారు చేసే రాట్నాలు మా దగ్గర వున్నాయిగాని వాటితో దారం తీయవచ్చని మాకు తెలియలేదు. ఒక పర్యాయం కాళీదాసువకీలు ఒక సోదరిని వెతుక్కొని తీసుకువచ్చాడు. ఈమె నూలు

వడికి చూపిస్తుందని చెప్పాడు. క్రొత్త పనులు నేర్చుకోవడంలో నిపుణుడైన ఒక ఆశ్రమవాసిని ఆమె దగ్గర వడకడం నేర్చుకొనేందుకై పంపాము. కాని ఆ కళ మా చేతికందలేదు.

రోజులు గడుస్తున్నాయి. నాకు తొందర ఎక్కువైంది. ఆశ్రమానికి వచ్చే ప్రతి మనిషినీ యీ విషయం గురించి అడగడం ప్రారంభించాను. అయితే వడుకు వ్యవహారమంతా స్త్రీ సొత్తేనని తేలింది. వడుకు తెలిసి ఏమూలనో పడియున్న స్త్రీలను స్త్రీలే పట్టుకోగలరని తేలింది. 1917లో గుజరాతీ సోదరుడు ఒకడు నన్ను భరోంచ్ శిక్షాపరిషత్తుకు తీసుకువెళ్ళాడు. అక్కడ మహాసాహసియగు మహిళ గంగాబాయి నాకు కనబడింది. ఆమెకు పెద్దగా చదువురాదు. కాని చదువుకున్న స్త్రీలకంటే మించిన తెలివి, ధైర్యం ఆమెకు వున్నాయి. ఆమె అస్పృశ్యతను కూకటి వ్రేళ్ళతో సహా పెకిలించి పారవేసింది. ఆమె దగ్గర డబ్బుకూడా వున్నది. ఆమె అవసరాలు చాలా తక్కువ. శరీరం బాగా బలంగా కుదిమట్టంగా వున్నది. ఎక్కడికైనా సరే నిర్భయంగా వెళ్లివస్తుంది. సంకోచించదు. గుర్రం స్వారీకి సిద్ధపడేది. ఈ సోదరితో గోధరా పరిషత్తులో నాకు పరిచయం ఏర్పడింది. నా బాధను ఆమెకు తెలిపాను. దమయంతి ఏవిధంగా నలుడి కోసం తెగ తిరిగిందో ఆ విధంగా రాట్నం కోసం తిరిగి దాన్ని తెస్తానని ప్రతిజ్ఞచేసి ఆమె నా నెత్తిన గల బరువును దించినంత పనిచేసింది.

## 40. రాట్నం దొరికింది

గుజరాత్ ప్రాంతంలో తెగతిరిగిన తరువాత గంగాబెన్‌కు గాయక్వాడ్‌కు చెందిన బీజాపూరులో రాట్నం దొరికింది. అక్కడ చాలా కుటుంబాల వారి దగ్గర రాట్నాలు వున్నాయి. కాని వాటిని వాళ్ళు అటకమీద పెట్టి వేశారు. వాళ్ళు వడికిన నూలు ఎవరైనా తీసుకొని, వాళ్లకు ఏకులు యిస్తే వాళ్ళు నూలు వడికేందుకు సిద్ధంగా వున్నారని గంగాబెన్ చెప్పింది. నాకు అమిత సంతోషం కలిగింది. అయితే దూదితో తయారు చేసిన ఏకులు పంపడం కష్టమైపోయింది. కీ.శే. ఉమర్‌సుభానీతో మాట్లాడగా ఆయన తన మిల్లునుండి ఏకులు పంపుతానని మాట యిచ్చాడు. ఏకులు గంగాబెన్ దగ్గరకు పంపాను. దానితో వడుకునూలు బహువేగంగా తయారవడం చూచి నివ్వెరబోయాను.

భాయి ఉమర్ సుభానీ ఉదార హృదయుడు కనుక ఉదార బుద్ధితో ఏకులు యిచ్చి సహకరించాడు. అయితే హద్దంటూ వుంటుంది కదా! డబ్బు యిచ్చి ఆయన దగ్గర ఏకులు కొనడానికి సంకోచించాను. అంతేగాక మిల్లులో తయారైన ఏకులతో

నూలు వడికించడమా? అది పెద్ద దోషమని మిల్లులో తయారయ్యే ఏకులు తీసుకుంటే మిల్లులో తయారయే నూలు తీసుకోవచ్చుగదా! అందు దోషం ఏముంటుంది? మన పూర్వీకుల దగ్గర మిల్లుల్లో తయారయే ఏకులు వుండేవికాదు గదా? మరి వాళ్ళు ఏకులు ఎలా తయారు చేసుకునేవారో? అయితే యిక ఏకులు తయారు చేసేవారిని కూడా వెతకమని గంగాబెన్‌కు చెప్పాను. ఆమె ఆ బాధ్యత కూడా వహించి ఒక దూది ఏకే వాడిని వెతికి తెచ్చింది. అతనికి నెలకు 35 లేక అంత కంటే కొంచెం ఎక్కువ జీతం యిచ్చి వుంచాం. ఏకులు తయారు చేయడం పిల్లలకు నేర్పించాం. ప్రత్తి కావాలని బిచ్చం అడిగాము సోదరుడు యశవంతప్రసాద్ దేశాయి ప్రత్తి మూటలు తెచ్చే బాధ్యత వహించారు. గంగాబెన్ ఖద్దరు పనిని బాగా నడిపించింది. వడికిన నూలుతో బట్టల నేత ప్రారంభమైంది. బీజాపూర్ ఖాదీ అని దానికి పేరు వచ్చింది.

ఆశ్రమంలో చరఖా వెంటనే ప్రవేశించింది. మగన్‌లాల్ యొక్క పరిశోధనాశక్తి రాట్నంలో చాలా మార్పులు చేసింది. రాట్నాలు, కదుళ్ళు ఆశ్రమంలో తయారయ్యాయి. ఆశ్రమంలో తయారైన మొదటి ఖద్దరు బట్ట గజం ఖరీదు 17 అణాలు పడింది. నేను లావుపాటి నూలుతో తయారైన ఖాదీ గజం 17 అణాలు చొప్పున మిత్రులకు అమ్మాను. బొంబాయిలో కనబడ్డ వాళ్ళందర్నీ అడుగుతూ వున్నాను. అక్కడ నూలువడికే మహిళలు యిద్దరు దొరికారు. వాళ్ళకు ఒక సేరు నూలు ఒక రూపాయి చొప్పున యిచ్చాను. నేను ఖాదీ శాస్త్రంలో యింకా పూర్తిగా అనుభవం లేనివాడను. నాకు చేతితో వడికిన నూలు కావాలి వడికే స్త్రీలు కావాలి. గంగా బెన్ వాళ్లకు యిస్తున్న ధరతో పోలిస్తే నేను మోసగింపబడ్డానని తేలింది. సోదరీమణులు తక్కువ సొమ్ము తీసుకొనేందుకు అంగీకరించలేదు. అందువల్ల వాళ్లను వదిలి పెట్టవలసి వచ్చింది. అయితే వాళ్ళ వల్ల ప్రయోజనం చేకూరింది. వాళ్ళు శ్రీ అవంతికాబాయికి, శ్రీ రమీబాయి కామదార్‌కు, శ్రీ శంకర్‌లాల్ బాంకరు గారి తల్లికి, శ్రీ వసుమతిబెన్‌కు నూలు వడకడం నేర్పారు. నాగదిలో రాట్నం మోత వినబడసాగింది. యీ యంత్రం జబ్బుపడ్డ నన్ను ఆరోగ్యవంతుణ్ణి చేసింది. ఇది మానసికం అన్న విషయం నిజం అయినా మనస్సు నందలి ఒక భాగం మనిషిని ఆరోగ్యవంతుణ్ణి చేసిందంటే చిన్న విషయం కాదు గదా? నేను కూడా రాట్నం చేతబట్టాను. అంతకంటే మించి ఈ రంగంలో ముందుకు పోలేకపోయాను.

ఇక ఏకులు ఎలా వస్తాయి.? శ్రీ రేవాశంకర్ ఝవేరీగారి బంగళా దగ్గరనుండి ప్రతి రోజూ ఒక దూదేకుల వాడు వెళుతూ వుండేవాడు. అతణ్ణి నేను పిలిచాను అతడు

పరుపుల కోసం దూదిని ఏకుతూ వుండేవాడు. అతడు ఏకులు తయారు చేసి యిస్తానని అంగీకరించాడు. అయితే మజూరీ ఎక్కువ అడిగాడు. నేను అంగీకరించాను యీ విధంగా తయారైన నూలుతో తయారైన హారాన్ని వైష్ణవులకు డబ్బు తీసుకుని దేవుడికి హారంగా వాడుటకు అమ్మాను. శివాజీ బొంబాయిలో చరాఖా క్లాసులు ప్రారంభించాడు. యీ ప్రయోగాలకు డబ్బు బాగా ఖర్చు అయింది. శ్రద్ధాళువులగు దేశభక్తులు డబ్బు ఇచ్చారు. నేను ఖర్చు చేశాను. ఆ ఖర్చు వ్యర్థం కాలేదని వినమ్రంగా మనవి చేస్తున్నాను. మేము చాలా నేర్చుకున్నాం. కొలతబద్ధ మాకు లభించింది. ఇక నేను ఖాదీమయం అయిపోవాలని తహతహలాడాను. నేను కట్టుకున్న బట్ట దేశపు మిల్లు నూలుతో తయారైంది. బీజాపూరులోను, ఆశ్రమంలోను తయారవుతున్న ఖద్దరు బట్ట బాగా లావుగా వుండి 30 అంగుళాలు పన్నా కలిగి ఉన్నది. ఒకనెల లోపల 45 అంగుళాల పన్నా గలిగిన ఖద్దరు ధోవతి తెచ్చి ఇవ్వకపోతే లావుపాటి ఖద్దరు తుండుగుడ్డ కట్టుకోక తప్పదని గంగాబెన్‌కు చెప్పాను. పాపం ఆమె కంగారు పడింది. సమయం తక్కువ. అయినా ఆమె అధైర్యపడలేదు నెలరోజులలోపల ఏభైఅంగుళాల పన్నా గల రెండు ఖాదీ ధోవతులు తెచ్చి నా ఎదుట వుంచింది. నా దారిద్ర్యం తొలగిపోయింది. ఈ లోపున లక్ష్మీదాస్‌భాయి, లాటీ అను గ్రామం నుండి రామ్‌జీభాయి మరియు ఆయన భార్యయగు గంగాబెన్ అను పేర్లు గల అంత్యజులను ఆశ్రమం తీసుకువచ్చాడు. వారిచేత పెద్ద పన్నా గల ఖద్దరు తయారు చేయించాడు. ఖద్దరు ప్రచారానికి ఈ భార్యాభర్తలు యిద్దరూ చేసిన సేవ అసామాన్యమైనది. వాళ్ళు గుజరాత్‌లోను, గుజరాత్ బయట చేతితో వడికిన నూలుతో బట్ట నేయడం చాలామందికి నేర్పారు. ఆమె చదువుకోలేదు. కాని మగ్గం ముందు కూర్చొని నేత పని ప్రారంభించినప్పటినుండి అందులీనమైపోయేది. ఎవ్వరితోను మాట్లాడటానికి యిష్టపడేదికాదు.

## 41. ఒక సంభాషణ

స్వదేశీ పేరుతో ఉద్యమం ప్రసిద్ధికెక్కేసరికి మిల్లు యజమానులు నన్ను తీవ్రంగా విమర్శించడం ప్రారంభించారు. భాయీ ఉమర్ సుభానీ ఒక తెలివిగల మిల్లు యజమాని. అందువల్ల అతడు తన తెలివి తేటలు నాకు బోధపరుస్తూ వుండేవాడు. ఇతరుల అభిప్రాయాలు కూడా నాకు తెలుపుతూ వుండేవాడు. అట్టివారిలో ఒక వ్యక్తి మాటల ప్రభావం సుభానీ మీద కూడా పడింది. నన్ను ఆయన దగ్గరకు తీసుకొని వెళతానని అన్నాడు. ఆయన సలహా ప్రకారం మేము ఆ వ్యక్తి దగ్గరకు

వెళ్ళాము. ఆయన యిలా సంభాషణ ప్రారంభించాడు. "మీ యీ స్వదేశీ ఉద్యమం ఆరంభమైంది. ఆ ఉద్యమం వల్ల మిల్లు యాజమానులం ఎంతో లాభం పొందాం. బట్టల ధర పెంచి వేశాం. ఎవ్వరూ ఏమీ అనలేని మాటలు మాట్లాడాం" అని అన్నాడు "నేను ఆ విషయాన్ని గురించి విన్నాను. కాని అలా జరిగినందుకు విచారిస్తున్నాను" "మీ విచారం ఏమిటో ఎందుకో నాకు తెలుసు. మేము పరోపకారం చేసేందుకు వ్యాపారం చేయడం లేదు. డబ్బు సంపాదించడమే మా లక్ష్యం. మా భాగస్వాములకు మేము సమాధానం చెప్పాలి. వస్తువుల ధర వాటి గిరాకీ మీద ఆధారపడి వుంటుంది. దీనికి విరుద్ధంగా ఎవ్వరూ వెళ్ళలేరు. యీ ఉద్యమం వల్ల స్వదేశీ బట్టల ధర పెరుగుతుందని బెంగాలీలు తెలుసుకోవాలి" అని అన్నాడు.

"పాపం వాళ్ళు నా మాదిరిగా తేలికగా అందరినీ నమ్ముతారు. కనుక మిల్లు యాజమానులు స్వార్థపరులు కారని మోసం చేయరని స్వదేశీవస్త్రాల పేరిట విదేశీ వస్త్రాలు అమ్మరని వాళ్ళు విశ్వసించారు." అని అన్నాను.

"మీరు అలా నమ్ముతారని నాకు తెలుసు. అందుకనే నేను మీకు హెచ్చరిక చేస్తున్నాను. ఇక్కడకు రావడానికి శ్రమపడ్డారు. అమాయకులైన బెంగాలీల వలె మోసంలో పడకండి " అని చెప్పి తన దగ్గర నేయబడుతున్న బట్టల నమూనాలు తెమ్మని ఒకరికి సైగ చేశాడు. మొదటి నమూనా రద్దీ అని పారవేసే దూదితో నేయబడ్డ కంబళీ. దాన్ని చూపిస్తూ "చూడండి మేము దీన్ని కొత్తగా నేయించాం. ఇది బాగా అమ్ముడుపోతున్నది. రద్దీగా భావించబడే దూదితో తయారు చేయబడింది గనుక చవుకగా ఉంటుంది. వీటిని ఉత్తరాదికి కూడా పంపుతాం. మా ఏజంట్లు దేశం నాలుగు చెరగులా ఉన్నారు. అందువల్ల మాకు మీవంటి ఏజంట్ల అవసరం వుండదు. మరోమాట, మీ కంఠస్వరం చేరుకోని దూర దూర ప్రదేశాల్లో సైతం మా ఏజంట్లు వున్నారు. సామగ్రి అక్కడికి చేరుతుంది. భారతదేశానికి కావలసినంత బట్ట మేము తయారు చేస్తాం. అసలు స్వదేశీ అంటే ఉత్పాదనకు సంబంధించిన విషయం. మనకు అవసరమైన బట్ట మనం తయారు చేసుకోగలిగినప్పుడు మేలురకం బట్ట తయారు చేసుకోగలిగినప్పుడు. విదేశీ బట్టల దిగుమతి దానంతట అదే తగ్గిపోతుంది. అందువల్ల మీరు నడుపుతూ ఉన్న స్వదేశీ ఉద్యమం నడపవద్దని సలహా ఇస్తున్నాను. క్రొత్త మిల్లులు తెరిచేందుకు ప్రయత్నం చేయండి. మన దేశంలో స్వదేశీ వస్తువులు అమ్మకం చేసే ఉద్యమం సాగించడం అనవసరం. మనకు కావలసింది స్వదేశీ వస్తువుల ఉత్పత్తి. ఆ విషయం అర్థం చేసుకోండి." అని అన్నాడు 'నేను ఆ పనే

చేస్తున్నాను. ఆశీర్వదిస్తారు కదూ!" "అదెలా! మీరు క్రొత్త మిల్లులు తెరవగలిగితే ధన్యవాదాలు పొందుటకు పాత్రులు కాగలుగుతారు" "ఆపని నేను చేయడం లేదు. నేను రాట్నం పనిలో లీనమైవున్నాను. "అదేమిటి? రాట్నం ఏమిటి" అని అడిగాడు. నేను రాట్నం గురించి వివరించి చెప్పి "మీ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాను, నేను మిల్లులకు ఏజంటుగా పనిచేయకూడదు. అందువల్ల లాభానికి బదులు నష్టం చేకూరుతుంది. మిల్లుల్లో తయారైన సామగ్రి నిల్వఉండదు. నేను ఉత్పత్తి అయిన సామగ్రిని అమ్మకం చేసేందుకు పూనుకోవాలి. ఇప్పుడు నేను ఉత్పత్తి కార్యక్రమానికి పూనుకున్నాను. ఇటువంటి స్వదేశీ వస్తువులంటే నాకు శ్రద్ధ. ఇట్టి సామగ్రి ద్వారా ఆకలితో అలమటిస్తున్న వారికి అన్నం పెట్టవచ్చు. సంవత్సరం పొడుగునా ఖాళీగా ఉండే స్త్రీలకు పని కల్పించవచ్చు. వాళ్ళు వడికిన నూలుతో బట్ట నేయించాలి. ఆ విధంగా తయారైన ఖద్దరును ప్రజలచేత ధరింపచేయాలి. ఇదే నా అభిలాష. ఇదే నా ఉద్యమం. రాట్నానికి సంబంధించిన ఈ ఉద్యమం ఎంతవరకు విజయం సాధిస్తుందో నాకు తెలియదు. ఇప్పుడు ఆరంభదశలో వుంది. కాని నాకు దానిమీద పూర్తి విశ్వాసం ఉన్నది. ఏది ఏమన్నాగానీ, నష్టం మాత్రం ఉండదు. హిందూ దేశంలో తయారయ్యే బట్ట ఎంత వృద్ధి అయితే ఈ ఉద్యమం వల్ల అంత లాభం చేకూరుతుంది. ఈ కృషిలో మీరు చెప్పిన దోషం లేదని అనుకుంటున్నాను" అని స్పష్టంగా చెప్పివేశాను.

"ఈ విధమైన ఉద్యమం మీరు సాగిస్తూ ఉంటే నేను చెప్పవలసింది ఇక ఏమీలేదు. ఈ యుగంలో రాట్నం నడుస్తుందా లేదా అనునది వేరు విషయం. నేను మాత్రం మీ కృషి సఫలం కావాలని కోరుతున్నాను.' అని సంభాషణను ముగించాడు. ఆ పెద్దమనిషి.

## 42. సహాయ నిరాకరణోద్యమ తీవ్రత

తరువాత ఖద్దరు అభివృద్ధి ఎలా జరిగిందో ఈ ప్రకరణంలో తెలపడం లేదు. ఆ వస్తువు ప్రజల ఎదుటకు ఎలా వచ్చిందో చెప్పిన తరువాత దాని చరిత్రలోకి దిగడం ఈ ప్రకరణాల లక్ష్యం కాదు. ఆవివరమంతా చెబితే పెద్ద గ్రంథం అవుతుంది. సత్యశోధన జరుపుతూ కొన్ని వస్తువులు ఒకటి తరువాత ఒకటిగా నా జీవితంలో సహజంగా ఎలా ప్రవేశించాయో తెలుపడమే నా ప్రధాన లక్ష్యం. ఇదే క్రమంలో యిక సహాయనిరాకరణోద్యమాన్ని గురించి తెలిపే సమయం ఆసన్నమైందని భావిస్తున్నాను. ఆలీ సోదరులు ప్రారంభించిన ఖిలాఫత్ ఉద్యమం ఒకవైపున తీవ్రంగా సాగుతూ

వున్నది. కీ.శే. మౌలానా అబ్దుల్ బారీ మొదలుగా గల ముస్లిం పండితులతో యీ విషయమై చర్చలు జరిపాను. మహమ్మదీయులు ఎంతవరకు శాంతిని, అహింసను పాటించగలరా అని యోచించాము. ఒక స్థాయి వరకు వాటిని పాటించడం సులువేనని నిర్ణయానికి వచ్చాము. ఒక్కసారి అహింసా విధానాన్ని పాటిస్తామని ప్రతిజ్ఞచేస్తే చివరివరకు దానిమీద నిలబడాల్సిందే. అంతా సరేనని అన్న తరువాత సహాయ నిరాకరణోద్యమం సాగించాలని ఖిలాఫత్ కాన్ఫరెన్స్‌లో తీర్మానం అంగీకరించబడింది. అందు నిమిత్తం అలహాబాదులో రాత్రంతా సభ జరిగిన విషయం నాకు జ్ఞాపకం వున్నది. హకీంఅజమల్ ఖాను గారిని శాంతియుతంగా ఉద్యమం సాగించాలా అని సందేహం పట్టుకుంది. సందేహనివృత్తి అయిన తరువాత ఆయన రంగంలోకి దిగాడు. ఆయన చేసిన సాయం అపారం. తరువాత గుజరాత్‌లో ప్రాంతీయ సభ జరిగింది. అందు నేను సహాయ నిరాకరణోద్యమ తీర్మానం ప్రవేశపెట్టాను. దాన్ని కొందరు వ్యతిరేకించారు. "జాతీయ కాంగ్రెస్ సహాయ నిరాకరణోద్యమాన్ని అంగీకరించనంతవరకు ప్రాంతీయ పరిషత్తులకు అట్టి విధాన నిర్ణయాన్ని చేసేహక్కు లేదని వారు తెలిపిన మొదటి అడ్డంకి. అయితే నేను వారి వాదనను అంగీకరించలేదు. ప్రాంతీయ పరిషత్తులకు బాధ్యత లేదని చెప్పి వెనక్కి తగ్గడానికి వీలులేదు. ముందుకు అడుగు వేసే హక్కు అధికారం ప్రాంతీయ పరిషత్తులకు వున్నదని చెప్పాను. అంతేగాక ధైర్యం వుంటే తమ కర్తవ్యమని భావించి యీ విధంగా చేస్తే ప్రధాన సంస్థయొక్క శోభ పెరుగుతుందని చెప్పాను. తీర్మానం యొక్క గుణదోషాలను గురించి కూడా మధురంగా చర్చ సాగింది. ఓట్లు తీసుకొని లెక్కపెట్టారు. అత్యధిక మెజారిటీతో తీర్మానం ఆమోదించబడింది. ఈ తీర్మానాన్ని ఆమోదింపజేయడానికి అబ్బాస్ తయబ్జీ మరియు వల్లభభాయి ఎంతో కృషి చేశారు. అబ్బాస్‌సాహబ్ ఆ సమావేశానికి అధ్యక్షులు. ఆయన సహాయనిరాకరణోద్యమానికి అనుకూలంగా మొగ్గు చూపారు. భారతీయ కాంగ్రెస్ యీ ప్రశ్నపై ఆలోచించుటకు ప్రత్యేక మహాసభను కలకత్తాలో సెప్టెంబరు 1920 నాడు ఏర్పాటు చేసింది. ఏర్పాట్లు పెద్ద స్థాయిలో జరిగాయి. లాలాలజపతిరాయ్ ఆ మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఖిలాఫత్ స్పెషల్ మరియు కాంగ్రెస్ స్పెషల్ అను రెండు రైళ్లు బొంబాయి నుండి కలకత్తాకు బయలుదేరాయి. కలకత్తాకు ప్రతినిధులు, దర్శకులు పెద్దసంఖ్యలో చేరారు. మౌలానా షౌకత్ ఆలీ కోరిక మేరకు సహాయనిరాకరణాన్ని గురించిన తీర్మానం ముసాయిదా రైల్లో తయారు చేశాను. నా తీర్మానాలలో యిప్పటివరకు శాంతియుతంగా అను శబ్ద ప్రయోగం చేయలేదు.

ఉపన్యాసాల్లో మాత్రం యీ శబ్దాన్ని ప్రయోగిస్తూ వుండేవాణ్ణి. మహమ్మదీయుల సమావేశాల్లో మాత్రం శాంతియుతం అను శబ్దార్థాన్ని సరిగ వివరించి చెప్పలేకపోతూ వుండేవాణ్ణి. మౌలానా అబుల్‌కలాం అజాదును శాంతియుతంగా అనుదానికి ఉర్దూ శబ్దం చెప్పమని అడిగాను. ఆయన "బా అమన్" శబ్దం సూచించారు. సహాయనిరాకరణం అను శబ్దానికి "తరకే మవాలత్" అను శబ్దం సూచించారు. ఈ విధంగా గుజరాతీలోను, హిందీలోను, హిందుస్తానీలోను సహాయనిరాకరణాన్ని గురించిన భాష నా బుర్రలో నిర్మాణం కాసాగింది. కాంగ్రెస్‌లో సహాయనిరాకరణోద్యమాన్ని గురించి ప్రవేశపెట్టవలసిన తీర్మానం తయారు చేసి రైల్లోనే తీర్మానం షౌకత్ ఆలీకి యిచ్చివేశాను. అయితే అందు "శాంతియుతంగా" అను ముఖ్యమైన శబ్దం లేదని ఆ రాత్రి గ్రహించాను. వెంటనే మహాదేవను పరిగెత్తించి శాంతియుతంగా అను శబ్దాన్ని తీర్మానంలో చేర్చమని చెప్పించాను. ఈ శబ్దం చేర్చక పూర్వమే తీర్మానం అచ్చు అయిందని నా అభిప్రాయం. విషయనిర్ధారణ సభ ఆ రాత్రికే జరుగుతున్నది. ఆ సభలో అందరికీ చెప్పి ఆ శబ్దం చేర్చవలసి వచ్చింది. నేను జాగ్రత్తగా తీర్మానాన్ని సరిచేసి యుండకపోతే చాలా యిబ్బంది కలిగియుండేది. ఎవరు తీర్మానాన్ని వ్యతిరేకిస్తారో, ఎవరు అనుకూలిస్తారో తెలియని స్థితిలో పడ్డాను. లాలాలజపతిరాయ్ గారి అభిప్రాయం ఏమిటో నాకు తెలుసు. అనుభవజ్ఞులగు కార్యకర్తలు పెద్ద సంఖ్యలో కలకత్తా సమావేశంలో పాల్గొన్నారు. విదుషీమణి ఎని బెసెంట్, పండిత మాలవ్యా, విజయరాఘవాచార్య, పండిత మోతీలాల్, దేశబంధు మొదలగు వారంతా అక్కడ వున్నారు. నా తీర్మానంలో ఖిలాఫత్ మరియు పంజాబులో జరిగిన దురంతాలకు సహకరించకూడదని పేర్కొన్నాను. శ్రీవిజయరాఘవాచార్యగారికి యీ విషయం రుచించలేదు. సహాయనిరాకరణం సాగించడానికి నిర్ణయించి అది ఫలానా అన్యాయమని కేసుని సీమితం ఎందుకు చేయాలి? స్వరాజ్యం లభించక పోవడం పెద్ద అన్యాయం కదా! దానికోసం సహాయనిరాకరణం అవసరం అని రాఘవాచార్యగారి వాదన. మోతీలాలుగారు కూడా తీర్మాన పరిధిని విస్తరింపచేయాలని భావించారు. నేను వెంటనే వారి సూచనను అంగీకరించాను. స్వరాజ్యం అని కూడా తీర్మానంలో చేర్చాను. విస్తారంగాను, గంభీరంగాను, తీవ్రంగాను చర్చలు సాగిన తదనంతరం సహాయనిరాకరణోద్యమ తీర్మానం ఆమోదింపబడింది.

శ్రీ మోతీలాల్ గారు ఈ విషయమై శ్రద్ధ వహించారు. నాతో జరిగిన వారి తీయని సంభాషణ యిప్పటికి నాకు జ్ఞాపకం వున్నది. కొన్ని మాటలు అటు యిటు మార్చమన్నవారి

సూచనను నేను అంగీకరించాను. దేశబంధును ఒప్పించే బాధ్యత వారు వహించారు. దేశబంధు హృదయం సహాయనిరాకరణోద్యమానికి అనుకూలమే, కాని ప్రజలు దాన్ని ఆచరణలో పెట్టలేరని ఆయన బుద్ధికి తోచింది. దేశబంధు మరియు లాలా లజపతిరాయ్ గారలు పూర్తిగా నాగపూరులో సహాయనిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఈ ప్రత్యేక సమావేశంలో లోకమాన్యుడు లేని లోటు నన్ను కలచివేసింది. వారు జీవించి యుంటే కలకత్తా నిర్ణయానికి తప్పక స్వాగతం చెప్పి యుండేవారని నా విశ్వాసం. అలా జరగక వారు వ్యతిరేకించినా నేను సంతోషించేవాణ్ణి. వారి దగ్గర నేను ఏదో కొంత నేర్చుకునేవాణ్ణి. వారితో నాకు అభిప్రాయభేదం వుండేది కాని అది తీయనిది. మా యిరువురి మధ్య మంచి సంబంధం వుండేది. దాన్ని వారు చెదరనీయలేదు. ఈ వాక్యలు వ్రాస్తున్నప్పుడు వారి చివరి గడియల దృశ్యం నా కండ్ల ముందు కనిపిస్తున్నది. అర్ధరాత్రి సమయంలో వారు తుదిశ్వాస విడిచే స్థితిలో వున్నారని ఫోనులో నా పరిచితులు శ్రీ పట్వర్ధన్ తెలిపారు. "ఆయన నాకు పెద్ద అండ. అది కాస్తా వాడిపోయింది" అని ఆ క్షణంలో నా నోటినుండి వెలువడింది. దేశంలో సహాయ నిరాకరణోద్యమం తీవ్రంగా సాగుతున్నది. లోకమాన్యుని ప్రోత్సాహం ఎక్కువగా లభిస్తుందని ఆశించిన తరుణంలో వారు కన్నుమూశారు. ఉద్యమం సరియైన రూపం దాల్చినప్పుడు వారి అభిప్రాయం ఎలావుండేదో భగవంతుని కెరుక. భారతదేశ చరిత్ర బహుసున్నిత స్థాయిలో నడుస్తున్న యీ సమయంలో లోకమాన్యుడు లేకపోవడం నిజంగా తీరని లోటే.

## 43. నాగ్‌పూర్‌లో

జాతీయ కాంగ్రెసు ప్రత్యేక సమావేశంలో అంగీకరించబడ్డ సహాయ నిరాకరణకు సంబంధించిన తీర్మానాన్ని నాగపూరులో జరుగనున్న వార్షిక మహాసభలో ఆమోదింపజేయాలి. కలకత్తాలో వలెనే నాగపూరులో కూడా అసంఖ్యాకంగా జనం వచ్చారు. ప్రతినిధుల సంఖ్య నిర్ధారణ కాలేదు. నాకు గుర్తు వున్నంతవరకు 14 వేలమంది ప్రతినిధులు సమావేశంలో పాల్గొన్నారు. లాలాలజపతిరాయ్ గారు కోరిన ప్రకారం విద్యాలయాలకు సంబంధించిన తీర్మానంలో ఒక చిన్న మార్పుకు అంగీకరించాను. దేశబంధు కూడా కొద్ది మార్పుచేర్పులు చేయించారు. చివరికి శాంతియుత సహాయనిరాకరణోద్యమ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది. ఈ సమావేశంలో కాంగ్రెస్ నియమావళికి సంబంధించిన తీర్మానం అంగీకరించాలి.

ప్రత్యేక కాంగ్రెసులో ఆ తీర్మానం ప్రవేశపెట్టాను. అది ప్రకటించబడి చర్చించబడింది కూడా. శ్రీ విజయరాఘవాచార్యులు యీ సమావేశానికి అధ్యక్షులు. నియమావళిలో విషయ నిర్ధారణ కమిటీ ఒక్క మార్పు చేసింది. నేను ప్రతినిధుల సంఖ్య 1500 వుండాలి అని పేర్కొన్నాను. యిన్ని సంవత్సరాల తరువాత యిప్పటికీ నా అభిప్రాయం అదే. ప్రతినిధుల సంఖ్య ఎక్కువగా వుండటంవల్ల ఎక్కువ మంచి జరుగుతుందనో లేక ప్రజాస్వామ్య విధానం ఎక్కువ పాటించబడుతుందనో భావించడం పూర్తిగా భ్రమయని నా అభిప్రాయం. ప్రజాస్వామ్య రక్షణకు ప్రజానీకంలో స్వాతంత్ర్యాభిలాష, ఆత్మాభిమానం, సమైక్యతా భావం గల నిజమైన మంచి ప్రతినిధుల ఎన్నిక జరగడం అవసరం. కాని సంఖ్యామోహంలో పడిపోయిన విషయ నిర్ధారణ సభ ఆరువేల కంటే ఎక్కువ మంది ప్రతినిధులు కావాలని కోరింది. అందువల్ల చివరికి ఆరువేల సంఖ్య అంగీకరించబడింది. జాతీయ కాంగ్రెసులో స్వరాజ్య లక్ష్యాన్ని గురించి చర్చ జరిగింది. నియమావళి యందలి ఒక నియమం ప్రకారం సామ్రాజ్యం లోపల, బయట ఎలా దొరికితే అలా సామ్రాజ్యంలో వుంటూనే స్వరాజ్యం సంపాదించాలనే వర్గం కూడా అక్కడ వున్నది. పం. మాలవ్యా, మి. జిన్నాగారలు యీ పక్షాన్ని సమర్థించారు. కాని వారికి ఎక్కువ ఓట్లు లభించలేదు. శాంతి సత్యం రెండిటిని ఆధారంగాగొనిమాత్రమే స్వరాజ్యం సాధించాలని నియమావళిలో వున్నది. ఈ షరతును కూడా కొందరు వ్యతిరేకించారు ఆ వ్యతిరేకతను కాంగ్రెసు అంగీకరించలేదు. చర్చ జరిగిన తరువాత యథాతథంగా తీర్మానం అంగీకరించబడింది. యీ తీర్మానాన్ని జనం నిజాయితీతో అమలుపరిచి వుంటే ప్రజానీకానికి మంచిశిక్షణ లభించి యుండేది. ఆ తీర్మానాన్ని సరిగా ఆచరణలో పెడితే స్వరాజ్యపు తాళం చెవి చేతికి అంది యుండేది. అయితే ఆ విషయం యిక్కడ అప్రస్తుతం.

ఈ సమావేశంలో హిందూ మహమ్మదీయ సమైక్యత, అస్పృశ్యత మరియు ఖద్దరును గురించిన తీర్మానాలు కూడా ఆమోదించబడ్డాయి. అస్పృశ్యతను తొలగించివేయాలనే గట్టి పట్టుదల సమావేశంలో పాల్గొన్న హిందువులందరి హృదయాల్లో నాటుకోవడం ముదావహం. ఖద్దరు ద్వారా జాతీయ కాంగ్రెసు దేశమందలి అస్థిపంజరాలతో సంబంధం పెట్టుకున్నది. ఖిలాఫత్‌ను గురించి సహాయ నిరాకరణోద్యమ తీర్మానం చేసి హిందూ మహమ్మదీయుల సమైక్యతను సాధించుటకు కాంగ్రెసు మహత్తరమైన ప్రయత్నం చేసిందని చెప్పవచ్చు.

# 44. పూర్ణాహుతి

ఇక యీ ప్రకరణాల్ని ముగించవలసిన సమయం ఆసన్నమైంది. ఆ తరువాత నా జీవితం పూర్తి ప్రజామయం అయిపోయింది. ప్రజలకు తెలియని అంశం అంటూ నా జీవనంలో ఏమీ మిగలలేదు. 1921 నుండి జాతీయ కాంగ్రెసు నాయకులందరితో అమితంగా మమేకం అయిపోయాను. ఏమి రాయాలన్నా నాయకులకు సంబంధించిన ఘట్టాలను వర్ణించకుండా వుండలేని స్థితి ఏర్పడింది. వారితో నాకు బహు దగ్గర సంబంధం ఏర్పడింది. శ్రద్ధానంద్, దేశబంధు, లాలాజీ. హకీం సాహెబ్ యిప్పుడు మన మధ్య లేరు. అదృష్టవశాత్తు యితర పలువురు నాయకులు మన మధ్య వున్నారు జాతీయ కాంగ్రెస్‌లో వచ్చిన మార్పును గురించిన చరిత్ర యిప్పుడు వ్రాయబడుతూ వున్నది. నా ప్రధాన ప్రయోగాలన్నీ కాంగ్రెస్ ద్వారానే జరిగాయి. ఆ ప్రయోగాలను గురించి వ్రాయ పూనుకుంటే ఆ నాయకుల్ని గురించి వ్రాయక తప్పదు. శిష్టత దృష్ట్యా కూడా ఆ విషయాలను యిప్పుడు వ్రాయలేను. యిప్పుడు నేను చేస్తున్న ప్రయోగాలను గురించిన నా నిర్ణయాలు నిర్ణయాత్మకాలుగా పరిగణింపబడవు. అందువల్ల ఈ ప్రకరణాలను తాత్కాలికంగా ఆపివేయడం అవసరమని భావిస్తున్నాను. నా కలం యిక ముందుకు సాగనంటున్నది అని చెప్పగలను. పాఠకుల దగ్గర సెలవు తీసుకోవలసి వచ్చినందుకు విచారంగా వుంది. నా ప్రయోగాలకు నా దృష్టిలో అమిత విలువ వుంది. వాటిని యథాతథంగా వర్ణించకలిగానో లేదో నాకు తెలియదు. యదార్థ చిత్రణ చేయాలని నా మటుకు నేను అమితంగా కృషిచేశాను. సత్యాన్ని నేను ఏవిధంగా చూచానో, ఏ రూపంలో చూచానో, ఆ రూపంలో దాన్ని వివరించడానికి సదా ప్రయత్నించాను. యీ ప్రయోగాల వల్ల పాఠకుల మనస్సులో సత్యము, అహింసల యెడ అధికంగా విశ్వాసం ఏర్పడుతుందని నా నమ్మకం. సత్యంకంటే మించి మరో భగవంతుడు వున్నాడనే అనుభవం నాకు కలుగలేదు. సత్యమయం కావడానికి అహింసయే ఏకైక మార్గం. ఈ విషయం ఈ ప్రకరణాల ప్రతి పేజీలో వెల్లడికాకపోతే నా కృషి అంతా వ్యర్థమైనదని భావిస్తున్నాను. ప్రయత్నాలు వ్యర్థం కావు కదా! నా అహింస సత్యమయం అయినా అది యింకా అపూర్ణమే. అపరిపక్వమే. వేలాది సూర్యుల్ని ప్రోగుచేసినా. సత్యమనే సూర్యుణ్ణి చూడలేము. అంత తీక్షణమైనది సత్యం. అయినా ఆ సూర్యుని కిరణాన్ని మాత్రం దర్శించవచ్చు. అహింస లేనిదే అట్టి దర్శనం లభించడం సాధ్యం కాదు. ఇప్పటివరకు జీవితంలో పొందిన అనేక అనుభవాల నాధారంగా చేసుకొని ఈ మాట చెబుతున్నాను. ఇట్టి వ్యాప్తి చెందిన సత్యనారాయణుని

సాక్షాత్కారం కోసం ప్రతిజీవిని, ప్రతిప్రాణిని ఆత్మ స్వరూపంలో ప్రేమించడం చాలా అవసరం. అట్టి అభిలాషగల మనిషి జీవన స్రవంతికి దూరంగా వుండలేడు. అందువల్ల సత్యారాధనయే నన్ను రాజనీతిలోకి దింపింది. ధర్మానికీ రాజనీతికీ సంబంధం లేదని చెప్పేవారికి ధర్మమంటే ఏమిటో తెలియదని గట్టిగా చెప్పగలను. అలా చెప్పడం అవిధేయత కానేరదు. ఆత్మశుద్ధి లేనిదే ప్రతి జీవితో సమైక్యత ఏర్పడదు. ఆత్మశుద్ధిలేనిదే అహింసా ధర్మపాలన సాధ్యపడదు. అశుద్ధాత్మ పరమేశ్వరుని దర్శనం పొందలేదు. అందువల్ల జీవన నగరంలో ప్రతిభాగము పరిశుద్ధంగా ఉండటం అవసరం. ఇట్టి శుద్ధి సర్వులకు సాధ్యమే. వ్యష్టికి సమిష్టికి మధ్య ఎంతో దగ్గర సంబంధం వున్నది. ఒక వ్యక్తి యొక్క శుద్ధి అనేకుల శుద్ధికి తోడ్పడుతుంది. వ్యక్తిగతంగా ప్రయత్నించగల శక్తి సామర్థ్యాలను సత్యనారాయణుడు సర్వులకు పుట్టుక నుండి ప్రసాదించాడు.

అయితే శుద్ధి యొక్క సాక్షాత్కారం భయంకరమైనది. అట్టి అనుభవం ప్రతిక్షణం నేను పొందుతూ వున్నాను శుద్ధి కావడమంటే మనోవాక్కాయ కర్మేణ నిర్వికారుడు కావడమే. రాగద్వేషరహితుడు కావడమే. యిట్టి నిర్వికార ప్రవృత్తిని అలవరచుకొనుటకు ప్రతిక్షణం ప్రయత్నిస్తున్నప్పటికీ నేను ఆ స్థితిని యింకా అందుకోలేదు. ప్రజలు నన్ను ఎంత పొగడినా, ఆ పొగడ్త నన్ను ఏమరుపాటులో పడవేయదు. అట్టి పొగడ్త నా మదిలో గుచ్చుకుంటూ వుంటుంది. మనస్సులో గల వికారాలను జయించడం ప్రపంచాన్ని శస్త్రాస్త్రాల యుద్ధంలో జయించడం కంటే కష్టమైనదని నాకు కలిగిన అనుభవం. హిందూ దేశానికి వచ్చిన తరువాత కూడా నా మనస్సులో గల వికారాలను చూచాను. చూచి సిగ్గుపడ్డాను. కాని ధైర్యం మాత్రం సడలనీయలేదు. సత్యశోధన కావించుతూ రసానందం పొందాను. యిప్పుడూ పొందుతూ వున్నాను. కంటకావృతమైన మార్గం దాటవలసియున్నదని నాకు తెలుసు. అందు నిమిత్తం నేను శూన్యుణ్ణి అయిపోవాలి మానవుడు తన యిష్టప్రకారం అందరికంటే వెనుక తనను నిలబెట్టుకోవాలి. అందరి కంటే తాను బహుతక్కువ వాడనని భావించాలి. ఆ స్థితికి చేరుకోనంతవరకు ముక్తి పొందలేడు. అహింస వినమ్రతకు పరాకాష్ఠ. వినమ్రతనుఅలవరచుకోనిదే ఏ కాలంలోను ముక్తి లభించదని అనుభవం మీద చెబుతున్నాను. అట్టి వినమ్రత కోసం ప్రార్థిస్తూ, అందుకు విశ్వసహాయాన్ని యాచిస్తూ ఈ ప్రకరణాలను ముగిస్తున్నాను.

★ సమాప్తం ★

# ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలు

## సంపుటము - 2

## దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర

సంపాదకులు

శ్రీమన్నారాయణ్



నవజీవన్ పబ్లిషింగ్ హౌస్

అహమదాబాద్ - 380 014

# విషయసూచిక

# 1

# భూగోళము

ఆఫ్రికా ప్రపంచమందుగల అతి పెద్ద మహాద్వీపాల్లో ఒకటి భారతదేశం కూడా ఒక మహాద్వీపం వంటిదే కాని ఆఫ్రికా యందలి భూభాగంలో నాలుగు లేక అయిదు భారత దేశాలు విస్తీర్ణత దృష్ట్యా పట్టే అవకాశం వున్నది ఇది ఆఫ్రికాకు తిన్నగా దక్షిణదిక్కున నెలకొని యున్నది భారత దేశంవలె ఆఫ్రికా కూడా ఒక ద్వీపమే దక్షిణాఫ్రికా యొక్కఅధిక భాగాన్ని సముద్రం అని యున్నది ఆఫ్రికాలో ఎండవేడిమి ఎక్కువ అని అంటారు ఒక విధంగా అది నిజమే భూమధ్య రేఖ ఆఫ్రికా మధ్యగా వెళ్లుతుంది ఆ రేఖకు అటునిటుగల దేశాలలో కాచే ఎండ ఎంత తీవ్రంగా వుంటుందో భారతీయులు ఊహించలేరు భారత దేశంలో దక్షిణాదిన కొన్ని చోట్ల కాచే ఎండలు భరిస్తున్నాం కనుక ఆఫ్రికా యందు కాచే ఎండల తీవ్రతను కొద్దిగా అంచనా వేయవచ్చు దక్షిణాఫ్రికాలో యిట్టి స్థితి లేదు అది భూమధ్య రేఖకు దూరంగా వున్నది అక్కడి శీతోష్ణస్థితి సమంగా ఎంతో హాయిగా వుంటుంది ఆ దేశం ఎంతో అందంగా వుంటుంది అందువల్ల యూరప్ దేశాల ప్రజలు అక్కడ హాయిగా నివసిస్తారు మన భారతదేశంలో ఆ విధంగా వాళ్లు వుండలేరు

దక్షిణాఫ్రికాలో టిబెట్, కాశ్మీరుల వంటి ఎత్తైన ప్రదేశాలు వున్నాయి కాని అవి టిబెట్ కాశ్మీరులవలె 14 లేక 15 వేల అడుగుల ఎత్తున లేవు అందువల్ల అక్కడి శీతోష్ణస్థితి సహించుటకు వీలుగా, చల్లగా హాయిగా వుంటుంది దక్షిణాఫ్రికాయందలి కొన్ని ప్రదేశాలు క్షయ రోగులకు అత్యుత్తమమైనవని ప్రతీతి అట్టివాటిల్లో ఒకటి దక్షిణాఫ్రికాకు చెందిన సువర్ణ పురి జోహన్సబర్గ్ ఏ భూభాగం మీద జోహన్స్ బర్గ్ నగరం వున్నదో, ఆ భూభాగంలో 50 ఏండ్ల క్రితం ఏమీ లేదు గడ్డి గాదం మొలిచే ప్రదేశంగా వుండేది అక్కడ బంగారు గనులు వున్నాయని తెలిసే సరికి పలు భవనాలు

వెలిశాయి యిప్పుడు అక్కడ విశాలమైన భవనాలే భవనాలు అక్కడి ధనవంతులు బాగా డబ్బు ఖర్చుచేసి దేశ దేశాలనుంచి మొక్క ఒకటింటికి 15 రూపాయల చొప్పున అనేకమొక్కలు తెప్పించి నాటారు గత చరిత్ర తెలియని వాళ్లు అక్కడకు వెళ్లితే ఆ చెట్లు శతాబ్దాలనుంచి అక్కడ వున్నాయని అనిపిస్తుంది

దక్షిణాఫ్రికా భూభాగాలన్నింటిని గురించి యిక్కడ వ్రాయతలచలేదు విషయానికి సంబంధించిన ప్రదేశాలను గురించి మాత్రం వ్రాస్తాను దక్షిణాఫ్రికాలో రెండు ప్రభుత్వాల వాళ్లు వున్నారు 1 బ్రిటిష్ వాళ్లు 2 పోర్చుగీజులు పోర్చుగీజుల భాగాన్ని డేలాగోవానే అని అంటారు భారతదేశాన్నుంచి వెళ్లే ఓడలకు మొదటి హార్బరు అదే అక్కడినుంచి దక్షిణ దిక్కుకు ముందుకు వెళ్లితే బ్రిటిష్ వారి ప్రాంతంనేటాల్ వస్తుంది అక్కడి హార్బరును పోర్ట్ నేటాల్ అని అంటారు అయితే మనందాన్ని డర్బన్ అని అంటాం దక్షిణాఫ్రికాలో కూడా దాన్ని డర్బన్ అని అంటారు అది నేటాల్ దేశమందలి పెద్ద నగరం పీటర్ మెరిట్స్ బర్గ్ నేటాలుకు రాజధానీ నగరం అది డర్బనుకు 60 మైళ్ల దూరాన, సముద్రం మట్టం నుంచి సుమారు రెండు వేల అడుగుల ఎత్తున వున్నది డర్బన్ శీతోష్ణస్థితి దరిదాపుగా బొంబాయి నగరపు శీతోష్ణస్థితిని పోలి వుంటుంది బొంబాయి కంటే అక్కడి గాలిలో చల్లదనం అధికంగా వుంటుంది నేటాలును వదిలి యింకా పైకి వెళ్లితే ట్రాన్స్‌వాల్ వస్తుంది ట్రాన్స్‌వాల్ భూభాగం యిప్పుడు ప్రపంచానికంతటికి అత్యధికంగా బంగారం అందజేస్తున్నది కొద్ది ఏండ్లకు పూర్వం అక్కడ వజ్రాల గనులు కూడా దొరికాయి అక్కడ ఒక గనియందు అతిపెద్ద వజ్రం ఒకటి దొరికింది ప్రపంచంలో కెల్లా అది పెద్దదైన యీ వజ్రం పేరు ఆ గని యజమాని పేరట క్లీనన్ అని పెట్టారు యీ వజ్రం బరువు 3000 కేరెట్లు వున్నది కోహినూర్ వజ్రం బరువు 100 కేరెట్లే రష్యా కిరీటమందలి ఆర్లెఫ్ వజ్రం బరువు 200 కేరెట్లు

జోహన్స్‌బర్గ్ బంగారు నగరమే బంగారం గనులు కూడా దానికి సమీపంలోనే వున్నాయి అయినా అది ట్రాన్స్‌వాలుకు రాజధాని కాదు

ట్రాన్స్‌వాలుకు రాజధాని ప్రిటోరియా అది జోహన్స్‌బర్గ్‌కు 36 మైళ్ల దూరాన వున్నది పరిపాలకులు, వాళ్లకు సంబంధించిన వాళ్లు అక్కడ వుంటారు అందువల్ల ప్రిటోరియాలో వాతావరణం ప్రశాంతంగా వుంటుంది జోహన్స్‌బర్గ్ వాతావరణం మాత్రం అశాంతిగా వుంటుంది భారతదేశంలో ఏదేని గ్రామాన్నుంచి గాని, చిన్న పట్టణాన్నుంచిగాని ఎవరైనా బొంబాయి వెళ్లితే అక్కడి హడావుడి, వాహనాల రద్దీ, జనసందడి చూచి అదిరిపోయినట్లే ట్రాన్స్‌వాల్‌నుంచి మనిషి జోహన్స్ బర్గ్ వెళ్లితే అదిరిపోతాడు జోహన్స్‌బర్గ్ ప్రజలు నడవరు పరుగెత్తుతారు అని చెప్పవచ్చు అందు అతిశయోక్తి ఏమాత్రమూ లేదు తక్కువ సమయంలో తక్కువ శ్రమతో ఎక్కువ డబ్బు ఎలా సంపాదించడమా అనే అక్కడి ప్రతివాడి తపన ట్రాన్స్‌వాల్ దాటి యింకా లోపలికి వెళ్లితే నారింజ పండ్లనిలయం అరంజియా వున్నది దాని రాజధాని పేరు బ్లూమ్‌ఫోంటిన్ అదిచిన్న ప్రశాంతమైన సుందర నగరం అక్కడ బంగారం, వజ్రాల గనులు లేవు అక్కడి నుంచి కొద్ది దూరం రైలు ప్రయాణం చేస్తే కేప్ కాలనీ సరిహద్దు దగ్గరకు చేరుతాం కేప్‌కాలనీ దక్షిణాఫ్రికా యందలి అతిపెద్ద అధినివేశరాజ్యం దాని రాజధాని పేరు కేప్‌టౌన్ అది కేప్ కాలనీ యందుగల పెద్దహార్బరు ఇది కేప్ ఆఫ్‌గుడ్‌హోప్ (మంచి ఆశాద్వీపం) అనుదీవియందు వున్నది యీ పేరు పోర్చుగీసు రాజు జాన్ పెట్టాడు వాస్కోడిగామా దీన్ని అన్వేషించాడు యిక్కడి నుంచి తమ వాళ్లు భారతావని చేరుటకు సులవైన దగ్గరిమార్గం దొరుకుతుందని రాజు భావించడమే అందుకు కారణం భారతావని చేరడం ఆకాలంలో సముద్రయాత్రలకు చివరి లక్ష్యం

ఈ నాలుగు బ్రిటిష్ వారి అధినివేశరాజ్యాలు యివిగాక బ్రిటిష్ వారి పరిపాలనలో మరికొన్ని ప్రదేశాలు కూడా వున్నాయి యూరోపియన్లు రాకపూర్వం దక్షిణాఫ్రికా దేశవాసులు అక్కడ వుంటూ వుండేవారు

దక్షిణాఫ్రికాలో ముఖ్యవృత్తి వ్యవసాయమే వ్యవసాయానికి అది అనువైన దేశం అక్కడి కొన్ని ప్రాంతాలు ఎంతో సారవంతమైనవి అక్కడ తేలికగా పండేపంట మొక్కజొన్న దక్షిణాఫ్రికా యందలి హబ్షీప్రజల ప్రధాన ఆహారం

మొక్కజొన్నయే కొన్ని చోట్ల గోధుమలు కూడా పండుతాయి దక్షిణాఫ్రికా పండ్లకు బహుప్రసిద్ధి నేటాలులో అరటి, బొప్పాయి, అనన్నాసపండ్లు అధికంగా లభిస్తాయి కడుపేదవారు సైతం ఆ పండ్లుకొని తినగలిగినంత చౌకగా వుంటాయి నేటాలు, మరియు తదితర రాజ్యాలలో నారింజ, బత్తాయిలు, ఎప్రికోట్ పండ్లు అత్యధికంగా లభిస్తాయి గ్రామాల్లో చాలామంది పేదవారు సైతం యీ పండ్లు తింటారు అక్కడ పండ్లు కారుచౌక కేప్ టౌన్ ద్రాక్ష పండ్లకు నిలయం అక్కడ దొరికినంతగా ద్రాక్ష మరో చోట దొరకదు ద్రాక్షపండ్లు అమిత చౌకగా లభిస్తున్నందున కటిక పేదవాళ్ళు సైతం ద్రాక్ష తినగలిగిన స్థితిలో వున్నారు భారతీయులు ప్రవేశించడం, మామిడిపండ్లు లభించడం సహజం భారతీయులు దక్షిణాఫ్రికాలో మామిడి మొక్కలు నాటారు యిప్పుడు దక్షిణాఫ్రికాలో మామిడిపండ్లు కూడా అధికంగా లభిస్తున్నాయి రకరకాలమేలు రకం మామిడిపండ్లు, బొంబాయి, మామిడిపండ్లతో పోటీ పడగలిగినంతగా దొరుకుతున్నాయి అక్కడ కూరలు బాగా లభిస్తాయి భారతీయులు రకరకాల కూరకాయలు అధికంగా కాయిస్తున్నారని చెప్పవచ్చు

పశువులు కూడా అక్కడ ఎక్కువే భారత దేశంలో దొరికే ఆవులు ఎద్దులు కంటే దక్షిణాఫ్రికా యందలి ఆవులు, ఎద్దులు మంచి రూపం కలిగి, అమితబలిష్టంగా వుంటాయి భారతదేశంలో గోరక్షణను గురించిన మాటలు ఎక్కువగా వింటూ వుంటాం కాని యిక్కడి ప్రజలవలెనే, యిక్కడి ఆవులు ఎద్దులు కూడా బక్క పలుచగా బలహీనంగా వుంటాయి వాటిని చూచి నా హృదయం ద్రవించి పోతుంది సిగ్గుతో నా తలవంగిపోతుంది దక్షిణాఫ్రికాలో బలహీనంగా వుండే ఆవుల్నిగాని, ఎద్దుల్ని గాని చూచిన జ్ఞాపకం లేదు దక్షిణాఫ్రికా యందలి ప్రాంతాలన్నిటి యందు కండ్లు తెరుచుకొని మరీ నేను పర్యటించాను కాని ఎక్కడా బక్కచిక్కిన గోవుల్ని వృషభాల్ని నేను చూడలేదు

ప్రకృతి యీ భూమికి ఎన్నో వరాలు ప్రసాదించింది వాటితో బాటు సహజసౌందర్యాన్ని అపారంగాప్రసాదించిందని చెప్పవచ్చు డర్బన్ ఎంతో అందంగా వుంటుంది అంతకంటే అందంగా వుంటుందికేప్ కాలనీ కేప్‌టౌన్,

టేబల్ మౌంటెన్స్ అను మెరకపల్లాలు లేని పర్వతచరియల్లో నిర్మితమై ప్రజల్ని బాగా ఆకర్షిస్తూ వుంటుంది దక్షిణాఫ్రికాను పూజిస్తూ వుండే ఒక విదుషీమణి ఆ పర్వతాన్ని గురించి వర్ణిస్తూ తన కవితలో నేను అలౌకికమైన అనుభూతిని ఆపర్వత చరియల్లో పొందాను అట్టి అనుభూతి మరే చరియల్లోను పొందలేదు అని వ్రాసింది యిది అతిశయోక్తి అని నా అభిప్రాయం అయితే ఆమె వ్రాసిన క్రింది కొన్ని పంక్తులు నాకు బాగానచ్చాయి 'కేప్‌టౌన్ ప్రజలకు టేబల్ మౌంటెన్ మిత్రుని వలె సహకరిస్తుంది ఎత్తైనది కానందున అది భయంకరంగా వుండదు దూరాన్నుంచే దాన్ని పూజించవలసిన అవసరం వుండదు. దగ్గరకు వెళ్ళి పర్వతం మీదనే ఇండ్లు కట్టుకొని నివసించవచ్చు సముద్రతీరాన వుండటం వల్ల సముద్రం తన స్వచ్ఛమైన జలంతో దాని పాదపూజ చేస్తుంది దాని చరణామృతాన్ని సేవిస్తుంది పిల్లలు, పెద్దలు,స్త్రీలు పురుషులు నిర్భయంగా పర్వతప్రాంతమంతా తిరుగుతూ వుంటారు వేలాది మంది పౌరుల కంఠస్వరాలతో పర్వత ప్రాంతమంతా ప్రతిధ్వనిస్తూ వుంటుంది పెద్దపెద్ద చెట్లు సువాసనలు విరజిమ్మే రంగురంగుల పూలు పర్వతప్రాంతాన్నంతటినీ సువాసనల మయం చేస్తాయి ఆ సౌందర్యం ఆశోభ, ఆ అందం చందం ఎంత చూచినా తనివితీరదు యిది ఆమె కవితల సారాంశం

మన గంగాయమునలతో పోల్చతగిన నదులు దక్షిణాఫ్రికాలో లేవు అక్కడవున్న కొద్దినదులు మనదేశ పునాదులతో పోలిస్తే చిన్నవే అని చెప్పవచ్చు అక్కడి చాలా ప్రాంతాలకు నదులనీరు చేరదు ఎత్తైన ప్రదేశాలకు క్రిందినుంచీ నీటిని కాలువలు త్రవ్వి ఎలా తీసుకువెళ్ళడం? సముద్రమంతటి నదులు లేని చోట కాలువలు ఎలా ఏర్పడతాయి? దక్షిణాఫ్రికాలో నీరు దొరకని చోట్ల పాతాళ బావులు త్రవ్వ బడివున్నాయి. ఆ బావుల నీటితో వ్యవసాయం సాగుతుంది ఆ బావుల నుంచినీరు, యంత్రాల ద్వారా నీరు తోడే చక్రాల ద్వారా బయటికి తోడుతారు వ్యవసాయానికి ప్రభుత్వం ఎంతో సహాయం చేస్తుంది. రైతులకు ఎప్పటికప్పుడు సరియైన సలహాలు యిచ్చి తోడ్పడుటకు వ్యవసాయ శాస్త్ర నిపుణుల్ని

ప్రభుత్వం నియమించి వారి దగ్గరికి పంపుతుంది ప్రభుత్వమే అక్కడ రైతులకు సహకరించుటకు వ్యవసాయ కేంద్రాల్ని నడుపుతుంది రైతులకు మంచి పశువుల్ని, మంచి విత్తనాల్ని అందజేస్తుంది కొద్ది ఖర్చుతో పాతాళ బావులు త్రవ్విస్తుంది వాయిదా పద్ధతిన అందుకైన వ్యయం చెల్లించుటకు వెసులు బాటు రైతులకు కల్పిస్తుంది పొలాల చుట్టూ ఇనుప కంచెల్ని సైతం ప్రభుత్వం ఏర్పాటు చేసి రైతుల్ని ఆదుకుంటుంది

దక్షిణాఫ్రికా భూమధ్యరేఖకు దక్షిణాన వున్నది భారతదేశం ఆరేఖకు ఉత్తరాన వున్నది అందువల్ల వాతావరణం, శీతోష్ణస్థితి రెండు దేశాల్లో వేరువేరుగా వుంటుంది అంతా తలక్రిందుల వ్యవహారమే ఋతువులూ అంతే. ఉదాహరణకు మనదేశంలో వేసవికాలం ప్రారంభమైతే, దక్షిణాఫ్రికాలో శీతాకాలం ప్రారంభమవుతుంది వర్షాకాలానికి నిశ్చితసమయమంటూ అక్కడ వుండదు ఏసమయంలోనైనా అక్కడ వర్షాలు కురవచ్చు సామాన్యంగా 20 అంగుళాల కంటే మించి అక్కడ వర్షపాతం వుండదు

★ ★ ★

## చరిత్ర

ఆఫ్రికా యొక్క భూగోళాన్ని వివరిస్తూ గతప్రకరణంలో నేను క్లుప్తంగా వర్ణించిన భూగోళ విశేషాలు ప్రాచీన కాలం నుంచి అక్కడ అమలులో వున్నాయని పాటకులు భావించకూడదు అతిప్రాచీన కాలంనుంచి దక్షిణాఫ్రికాలో ఎవరు నివసిస్తూ వుండేవారో యింతవరకు తేలలేదు యూరపియన్లు అక్కడికి వచ్చినప్పుడు అక్కడ హబ్షీవాళ్లు వున్నారు అమెరికాలో బానిసత్వం తాండవం చేస్తున్నప్పుడు అమెరికానుంచి పారిపోయి కొద్దిమంది హబ్షీలు దక్షిణాఫ్రికా వచ్చి వుండిపోయారని కొందరి అభిప్రాయం వాళ్లలో జూలూలు, స్వాజీలు బసూటోలు, బెక్వానాలు మొదలుగాగల వేరువేరు తెగల వాళ్లు వుండేవారు. యీ హబ్షీలే దక్షిణాఫ్రికా మూలనివాసులని చాలా మంది అంటున్నారు. అయితే దక్షిణాఫ్రికా చాలా విశాలమైన దేశం. అక్కడ

నివసిస్తున్న హబ్షీల జనాభా తక్కువేనని చెప్పవచ్చు అంతకంటే 20 లేక 30 రెట్లు మంది జనం వచ్చి వుండుటకు వీలైన విశాలమైన దేశం దక్షిణాఫ్రికా రైలు మీద డర్బన్ నుంచి కేప్‌టౌను వెళ్లుటకు సుమారు 1800 మైళ్లదూరం ప్రయాణం చేయవలసి వస్తుంది

సముద్రమార్గాన వెళ్లితే 1000 మైళ్ల దూరం వుంటుంది మొదటి ప్రకరణంలో పేర్కొన్న నాలుగు అధినివేశ రాజ్యాల వైశాల్యం 473000 చదరపు మైళ్ళు

ఇంతపెద్ద భూభాగం మీద 1914లో హబ్షీల జనాభా 50 లక్షలు వుంటే తెల్లవారి జనసంఖ్య 13లక్షలు వున్నది జూలూజాతి హబ్షీలు బలంగాను, అందంగాను వుంటారు అందం అను విశేషణాన్ని హబ్షీల విషయంలో కావాలనే ప్రయోగించాను ఎర్రగావున్న చర్మాన్ని, కొటేరు ముక్కును అందానికి లక్షణాలని భావిస్తాం యిది అంధ విశ్వాసమే దాన్ని మరిచిపోతే జూలూజాతి వారిని సృష్టించునప్పుడు బ్రహ్మఏమీలోటు చేయలేదని చెప్పవచ్చు స్త్రీలు పురుషులు బాగా ఎత్తుగా వుంటారు విశాలమైన ఛాతీ కలిగి వుంటారు వారి శరీరమందలి కండరాలు తీర్చిదిద్దినట్లు వుంటాయి బలంగా వుంటారు వారి పిక్కలు, బుజాలు మాంసపు కండలతో నిర్మించినట్లు వుంటాయి ఒక్కస్త్రీ గాని, పురుషుడుగాని, వంగి నడవరు గూనితో నడవరు వారి పెదవులు మాత్రం పెద్దవిగాను, లావుగాను వుంటాయి అయితే అవి మిగతా శరీరపరిమాణానికి అనువుగానే వుంటాయి అందువల్ల వాళ్ల ఒడ్డుపొడవును నేను సమర్థిస్తాను వాళ్లకండ్లు గుండ్రంగా తేజస్సుతో నిండి వుంటాయి చప్పిడిముక్కు పెద్ద ముఖానికి సరిపోయేలా వుంటుంది ఉంగరాల జుట్టు అవి వాళ్ళనిగనిగలాడే నల్లని శరీరం మీద అందంగా అమరివుంటుంది జూలూ తెగవారిని పలకరించి ఏమండీ మీ దక్షిణాఫ్రికాలో వుండే జాతులవారిలో అందమైన వారెవరని అడిగితే, వాళ్లు వెంటనే మేము అని సమాధానం చెబుతారు వాళ్ల మాటను నేను కాదనలేను యిప్పుడు మనం ప్రపంచంలో ఎంతోమంది శాండోలను చూస్తున్నాం అనేకమంది వస్తాదులను చూస్తున్నాం. వాళ్లు తమ శిష్యుల శరీరనిర్మాణానికై ఎన్నో ప్రయత్నాలు చేస్తూ

వుంటారు అలాంటి ప్రయత్నాలేమీ చేయకుండానే జూలూ జాతివారికి బలిష్టమైన అవయవాలు, సౌష్టవమైన శరీరం సహజంగానే లభించాయని చెప్పవచ్చు భూమధ్య రేఖకు సమీపంలో వుండే వారి శరీరం నల్లగా వుంటుంది యిది ప్రకృతినియమం ప్రకృతి తీర్చిదిద్దిన శరీరాలు, ఆకారాలు అన్నీ సహజంగా అందమైనవేనని మనం అంగీకారానికి వస్తే, సౌందర్యాన్ని గురించి మనం భావించే భావాలనుంచి విముక్తులమవుతాం అంతేగాక భారత దేశంలో నివసిస్తున్నమన శరీరంకొద్దిగా నల్లగా వుంటే సిగ్గుతో క్రుంగిపోతూ వుంటాం అసహ్యించుకుంటూ వుంటాం యిట్టి భావాలనుంచి కూడా మనం బయటపడతాం

ఈ హబ్షీలు మట్టితోను, గడ్డితోను నిర్మించిన గుండ్రని గుడిసెల్లో వుంటారు ప్రతిగుడిసెకు మట్టిగోడ గుండ్రంగా నిర్మించబడుతుంది దాని పైభాగం గడ్డితో కప్పబడుతుంది మధ్యలో నిలబెట్టబడిన స్తంభంపై పైకప్పు ఆధారపడి వుంటుంది ఒక చిన్న ద్వారం అమర్చి వుంటుంది వంగి జనంలోనికి వెళ్ళి వస్తూ వుంటారు యీ ద్వారమే గాలియొక్క రాక పోకలకు సాధనం యిందు కిటికీలు వుండవు మనవాళ్ల మాదిరిగానే హబ్షీలు కూడా మట్టిగోడల్ని పేడతోను మట్టితోను అలుకుతారు వాళ్లు నాలుగు పలకల వస్తువు నిర్మించలేరని, అందువల్లనే గుండ్రని వస్తువులు నిర్మిస్తారని బోధపడుతుంది అటువంటి శిక్షణయే వారికి లభించిందన్నమాట ప్రకృతిబడిలో పెరిగిన యీ నిర్దోషులగు మనుజుల జ్ఞానం, ప్రకృతిరీత్యా తమకు కలిగిన అనుభవం మీద ఆధారపడివుంటుంది

ఇట్టి మట్టి మేడలో సామాను కూడా అందుకు తగినట్లే వుంటుంది పాశ్చాత్య సభ్యత యిప్పుడు దక్షిణాఫ్రికాలో వ్యాప్తమై పోయింది అంతకు పూర్వం హబ్షీవాళ్లు చర్మం దుస్తులు ధరించేవారు పడుకోడానికి కూడా చర్మాలే ఉపయోగించేవారు కుర్చీలు, టేబుళ్లు, పెట్టెలు వగైరాలు వారి గుడిసెల్లో వుండేవి కావు యిప్పుడు కూడా చాలా వరకు యిదే స్థితి యిండ్లలో యిప్పుడు కంబళ్లను వాడుతున్నారు బ్రిటిష్ వాళ్ళ పరిపాలనకు పూర్వం హబ్షీజాతి స్త్రీ పురుషులు దరిదాపుగా నగ్నంగా తిరుగుతూ

వుండేవారు యిప్పటికీ గ్రామాల్లో జనం అలాగేవున్నారు వాళ్ళుతమ మర్మస్థలాల్ని చర్మంతో కప్పుకుంటారు కొందరైతే ఆపని కూడా చేయరు అంతమాత్రాన వాళ్లకు తమ ఇంద్రియాలపై అదుపు వుండదని భావించకూడదు ఒక తెగవాళ్ళ అలవాటు ఒక విధంగా వుండి, మరో తెగవాళ్ళ అలవాటు అలా వుండకపోతే, మొదటి తెగవాళ్లు తమ అలవాటు మానుకోరు ఒకరి నొకరు చూచుకొనుటకు కూడా వీళ్ళకు సమయం దొరకదు ఒకనాడు శుకుడు నగ్నంగాస్నానం చేస్తున్న స్త్రీల మధ్యగా వెళ్లవలసి వచ్చింది అయినా ఆయన మనస్సు గాని, ఆస్త్రీల మనస్సుగాని వికారానికి లోను కాలేదు అని భాగవతకారుడు వ్రాశాడు యిది నాకు అతిశయోక్తి యని అనిపించలేదు భారతదేశంలోయిలా జరిగితే యిప్పుడు జనం వూరుకుంటారా? వికారాలకు లోనుకాకుండా వుండగలరా అని ఎవరైనా అడిగితే అది మన పతనావస్థకు తార్కాణమని చెబుతాను మనం మనదృష్టితో హబ్షీవాళ్లు అడివిజాతి ప్రజలని భావిస్తుంటాం నిజానికి వాళ్లు అట్టిస్థితిలో లేరు

హబ్షీస్త్రీలు పట్టణాలకు వస్తే కంఠం దగ్గరనుంచి మోకాళ్ళవరకు వస్త్రం ధరించి తీరాలని నియమంవున్నది ఆ స్త్రీలకు యిష్టం లేకపోయినా బట్టలు ధరించక తప్పదు అందువల్ల దక్షిణాఫ్రికాలో యీ రకం దుస్తులకు గిరాకీ హెచ్చింది యూరపు నుంచి అట్టి దుస్తులు విపరీతంగా అక్కడికి దిగుమతి అవుతున్నాయి పురుషులు నడుంనుంచి మోకాళ్ల వరకు దుస్తులు ధరించి తీరాలి యూరపు నుంచి దిగే బట్టలు వాళ్లు ధరిస్తున్నారు అవికట్టని వాళ్లు డ్రాయరు లాంటి బట్ట ధరిస్తారు దక్షిణాఫ్రికా ప్రజలు వుపయోగించేబట్టంతా యూరపు నుంచే దిగుమతి అవుతున్నది

హబ్షీల ప్రధాన ఆహారం మొక్కజొన్న దొరికితే వాళ్లు మాంసం కూడా తింటారు కారం మసాలాలంటే వాళ్లకు తెలియదు అది అదృష్టమే మిర్చిమసాలాల వాసనగాని, పసుపురంగుగాని ఆహారంలో కనబడితేహబ్షీలు తినడానికి యిష్టపడరు. అడివిజాతి వారైతే అసలు అట్టి ఆహారాన్ని ముట్టరు ఉడకబెట్టిన మొక్కజొన్నలో కొద్దిగా వుప్పుకలిపి ఒక పౌండు మొక్కజొన్న ఆహారం తింటారు ప్రతిజూలూజాతివాడి పనియిదే కొందరు మొక్కజొన్న

పిండిగా విసిరి, దాన్ని నీటిలో ఉడకబెట్టి సంకటి తయారుచేసి దాన్ని భుజిస్తారు ఎప్పుడైనా మాంసం దొరికితే, పచ్చిదాన్నో లేక వండినదాన్నో, ఉప్పువేసుకొని తింటారు నిప్పుల మీద వేయించి కూడా తింటారు ఏ మాంసాన్నైనా సరే తింటారు ఏమాత్రం సంకోచించరు వాళ్ల భాషల పేర్లు వాళ్ల జాతులపేరట వుంటాయి తెల్ల వాళ్లు వచ్చిన తరువాతనే వ్రాత వ్యవహారం అక్కడ ప్రారంభమైంది హబ్షీలకు అక్షరక్రమం అ, ఆ, క, ఖ, గ రూపంలో లేదు హబ్షీల కోసం బైబిలు రోమన్ లిపిలో ప్రచురించారు జూలూ భాష మధురంగా వుంటుంది వారి శబ్దాలకు అర్థం కావ్యత్వం రెండూ వుంటాయని చదివాను విన్నాను నేను నేర్చిన కొన్ని హబ్షీ శబ్దాలవల్ల వారి భాషను గురించి పై నిర్ణయానికి వచ్చాను పట్టణాల్లోను, అధినిదేశ రాజ్యాల్లోను వాడిన యూరోపియన్ పేర్లన్నింటికి మధురమైన హబ్షీ పేర్లు వున్నాయి అవి జ్ఞాపకం లేనందున యిక్కడ వ్రాయలేదు క్రైస్తవ పాదరీల అభిప్రాయం ప్రకారం హబ్షీలకు మతమంటూ ఏమి లేదు ఆధ్యాత్మికంగా ఆలోచించితే హబ్షీలు ఏవో ఒక అర్థం కాని అలౌకికశక్తిని అంగీకరిస్తారని, దాన్ని పూజిస్తారని తెలుస్తుంది ఆశక్తికి వాళ్లు భయపడతారు శరీరం నాశనమైన తరువాత మనిషి పూర్తిగా నాశనం కాడని వాళ్ల విశ్వాసం నీతికి కట్టుబడి వుంటారు కనుక వారిని ధార్మిక పురుషులుగా భావించవచ్చు నిజమేదో, అబద్ధమేదో వాళ్ళకు బాగా తెలుసు సామాన్యంగా హబ్షీలు సత్యాన్ని పాలిస్తూ వుంటారు పాశ్చాత్యులతో బాటు మనం కూడా ఆవిధంగా పాలిస్తున్నామనడం సందేహాస్పదమే వాళ్లకు దేవాలయాలుగాని, అటువంటి స్థలాలు గాని లేవు యితర జాతుల వారి వలెనే వారిలో కూడా అనేక మూఢనమ్మకాలు ప్రచలితమై వున్నాయి ఆశ్చర్యకరమైన విషయం ప్రపంచంలో ఏ జాతి వారికీ తీసిపోని యీ హబ్షీజాతి వారు పిరికిపందలు ఇంగ్లీషు పిల్లవాణ్ణి చూచినా భయపడిపోతారు ఎవరైనా పిస్తోలు ఎక్కుబెట్టి చూపిస్తే చాలు హబ్షీ వాడు పారిపోతాడు పారిపోలేకపోతే మూర్ఛనివలె నీరసపడి పోతాడు. దీనికి ఒక కారణం వున్నది ఇంగ్లీషు వాళ్లు బహుకొద్ది మందే అట్టి కొద్దిమంది ఆంగ్లేయులు వచ్చి పెద్ద సంఖ్యలో వున్న తామందరినీ

వశం చేసుకున్నారంటే, వారిలో ఏదో గొప్పశక్తి నిండి యున్నదని వాళ్ళభావం వాళ్ళకు విలువిద్య బాగా తెలుసు కాని ఇంగ్లీషు వాళ్లు వాళ్లధనస్సుల్ని, బాణాల్ని లాగివేశారు తుపాకీని వాళ్లు ఎరుగరు ఎన్నడూ ప్రయోగించ లేదు తుపాకీ ఎలా పని చేస్తుందో వాళ్లకు తెలియదు అగ్గిపుల్ల అయినా వెలిగించనవసరంలేకుండా కేవలం వేలితో నొక్కగానే, అది ప్రేలడం, ఎదురుగా వున్న వారికిగుండు దెబ్బ తగలడం, వాడు నేల కూలటం అంతా విచిత్రంగా వాళ్లకు తోస్తుంది అందువల్ల తుపాకీని చూచినా, తుపాకీ పట్టుకున్న వాణ్ణి చూచినా హబ్షీలకు విపరీతమైన భయం వాళ్లు, వాళ్ల పూర్వీకులు తుపాకుల బీభత్సాన్ని చూచారు ఎంతో మంది తమ వారిని తుపాకులు పొట్టనపెట్టు కున్నాయని వాళ్లకు తెలుసు అయితే చాలామందికి దానివివరం తెలియదు

ఈ జాతిలో మెల్లమెల్లగా సభ్యత వ్యాప్తమవుతూ వున్నది పాదరీలు ఏసుక్రీస్తు సందేశాన్ని వారికి బోధిస్తున్నారు వాళ్లకోసం స్కూళ్లు తెరిచారు అక్షరాలు నేర్పుతున్నారు వారి కృషివల్ల మంచి నడతగల హబ్షీలు తయారైనారు వారితో బాటు అక్షరజ్ఞానం పొందని, సభ్యత అంటే ఏమిటో తెలియని కొందరు హబ్షీలు మోసగాళ్లు గాను, ప్రమాదకారులు గాను కూడా తయారైనారు సభ్యత నేర్చిన హబ్షీలంతా త్రాగుడుకు అలవాటు పడ్డారు వారి శక్తివంతమైన శరీరంలోకి మద్యం ప్రవేశించగానే యిక వాళ్లు పిచ్చివాళ్లైపోయి ఏంచేస్తారో వారికే తెలియదు రెండు రెండు కలిపితే నాలుగు అవడం ఎంత నిజమో, సభ్యత పొందినవారి అవసరాలు పెరగడం కూడా అంతనిజమే హబ్షీల అవసరాలను పెంచడానికని, కష్టం విలువవారికి అర్థమయ్యేలా చేయడానికని, హబ్షీల మీద తలపన్ను, గుడిసెపన్ను వేశారు యిట్టి పన్నుల్ని వేయకపోతే హబ్షీలు తమ తమ పొలాల్లోనే పడుకుంటారు బంగారు గనుల్ని వజ్రపు గనుల్ని త్రవ్వడానికి ముందుకు రారు వాళ్లు వచ్చి గనులు త్రవ్వకపోతే బంగారం, వజ్రాలు భూమిలోపలే పడి వుంటాయి యిట్టి పన్నులు విధించకపోతే పాశ్చాత్యులకి చాకిరీ చేయుటకు బానిసలు దొరకరు ఆంగ్లేయుల యీ పాచిక అక్కడ బాగా పారింది వేలసంఖ్యలో

హబ్షీలు చాకిరీకి దొరికారు గనుల్లో పని చేయడం వల్ల వాళ్లను క్షయరోగం పట్టుకుంది ఆజబ్బును అక్కడ మైనర్స్‌థైసిస్ అని అంటారు యిది ప్రాణానికి ముప్పు తెచ్చే జబ్బు ఇట్టి జబ్బు గలవాళ్లు గనుల దగ్గర కుటుంబాలతో సహా వుంటారు అక్కడ యీజాడ్యంతోబాటు యింకా ఎన్ని రోగాలు వ్యాప్తమయ్యాయో ఊహించలేము ఆరోగాలకు వాళ్లే బలిఅయిపోతూ వుండేవారు దక్షిణాఫ్రికాలో వుంటున్న ఇంగ్లీషు వాళ్లుకూడా యీ గంభీరమైన సమస్యను పట్టించుకొని పరిష్కారానికై కృషి ప్రారంభించారు చివరికి ఒక్క విషయం అందరికీ అర్థమైందని భావిస్తున్నాను పాశ్చాత్య సభ్యతా ప్రభావం వల్ల ఉపయోగంకంటే హబ్షీలకు అపకారమే అత్యధికంగా జరిగిందనే విషయం సత్యం యిది కావాలంటే ప్రతివారూ చూడవచ్చు

ఇట్టి నిర్దోషులైన జాతివారిపై 400 సంవత్సరాలకు పూర్వం డచ్ వారికన్ను పడింది దానితో అక్కడికి ప్రవేశించి వాళ్లు డేరా వేశారు కొంత మంది డచ్‌వారు తమ అధినివేశరాజ్యంగా వున్న జావానుంచి మలైజాతి బానిసల్ని తీసుకొని దక్షిణాఫ్రికా యందలి కేప్‌కాలనీ అనుచోటుకు వచ్చారు మలైజాతి ప్రజలు మహమ్మదీయులు వారిలో డచ్‌వారి రక్తంతో పాటు, వారి గుణాలు కూడా కొన్ని చొరబడ్డాయి వేరు వేరు ప్రదేశాలకు ప్రాకినా వారి ప్రధాన కేంద్రం కేప్‌టౌన్ మాత్రమే కొంతమంది మలై వాళ్లుతెల్లవాళ్ల దగ్గర చాకిరీ చేస్తున్నారు కొందరు స్వతంత్ర వృత్తుల్ని చేపట్టారు మలై స్త్రీలు బాగా శ్రమ పడతారు తెలివిగలవాళ్లు కూడా వాళ్ల నడవడి శుభ్రంగా వుంటుంది మలై స్త్రీలు చాకలి పని, కుట్టుపని బాగాచేస్తారు పురుషులు చిన్న చిన్న వ్యాపారాలు చేస్తారు చాలామంది జట్కాలు, టాంగాలు తోలిసంపాదిస్తూ వుంటారు కొంతమంది ఆంగ్లంలో ఉన్నత విద్య కూడా అభ్యసించారు వారిలో ఒకరు డా॥ అబ్దుల్ రహమాన్ వారు కేప్ టౌనులో సుప్రసిద్ధులు వారు కేప్‌టౌన్ అసెంబ్లీలో కూడా మెంబరు అయ్యారు తరువాత క్రొత్త మార్పులు తెచ్చి ముఖ్య అసెంబ్లీకి వెళ్లకుండా యిట్టి వారిని ప్రభుత్వం ఆపివేసింది

డచ్ వాళ్లను గురించి చెబుతూ వుండగా మధ్యన మలై వారిని గురించిన

విషయం వచ్చింది అసలు డచ్‌వాళ్లు ఎలా ముందుకు సాగారో చూద్దాం డచ్‌వాళ్లు పరాక్రమం గల యోధులు తెలివిగలరైతులు యిప్పటికీ వారి పరిస్థితియిదే తమ సమీపంలో నున్న దేశమందలి భూమి సారవంతమైనదని గ్రహించారు అక్కడి ప్రజలు ఏడాది పొడవునా పనిచేయకుండా కొద్ది రోజులు కష్టపడి, అసంపాదనతో హాయిగా జీవితం గడుపుకుంటున్నారని తెలుసుకున్నారు

తమ దగ్గర తుపాకీ వున్నది తెలివి వున్నది. శక్తి వున్నది యిక వీళ్లను లొంగదీసుకొని వీళ్ల చేత శ్రమ ఎందుకు చేయించకూడదు అనుభావం వారికి కలిగింది. పశుపక్ష్యాదుల మాదిరిగా యితర జనాన్ని కూడా లొంగదీసుకోగలమనే నిర్ణయానికి వాళ్లు వచ్చారు యీ పనికి మతం అడ్డురాదనే నిర్ణయానికి కూడా వచ్చి దక్షిణాఫ్రికాకు చెందిన హబ్షీవాళ్ల చేత వ్యవసాయంచేయించడం మొదలు పెట్టారు.

డచ్ వాళ్లు ప్రపంచమందలి మంచి ప్రదేశాల కోసం వెతకడం ప్రారంభించినట్లే, ఇంగ్లీషు వాళ్లు కూడా అట్టి ప్రయత్నం ప్రారంభించారు మెల్లమెల్లగా ఇంగ్లీషువాళ్లుకూడా దక్షిణాఫ్రికాలో ప్రవేశించారు డచ్‌వాళ్లు, ఇంగ్లీషువాళ్లు యిద్దరూ పెద్దతండ్రి పినతండ్రి కొడుకులే యిద్దరి స్వార్థం ఒకటే, యిద్దరి స్వభావం ఒకటే ఒకే కుమ్మరి వాడు తయారుచేసిన కుండలు ఒక చోట చేరితే కొన్ని ఒక దానికింకొటి తగిలిపగిలి పోవడం సహజమే కదా డచ్‌వాళ్లు, ఇంగ్లీషు వాళ్లు మెల్లిమెల్లిగా దక్షిణాఫ్రికాలో కాళ్లు చాచడం ప్రారంభించి హబ్షీవాళ్లపై పాలన సాగిస్తూ ముందుకు సాగిసాగి ఒకరినొకరు ఢీకొన్నారు యుద్ధాలు జరిగాయి మజూబా పర్వతం మీద ఇంగ్లీషు వాళ్లు ఓడిపోయారు కూడా యీ ఓటమి ఇంగ్లీషు వాళ్ల శరీరంపై పెద్ద పుండు అయిపోయి చివరికి 1899నుంచి 1902 వరకు ప్రపంచ ప్రసిద్ధ బోయర్ యుద్ధం రూపందాల్చి ముమ్మరంగా సాగింది జనరల్ క్రోన్జేని, లార్డ్ రాబర్ట్స్ ఓడించి, వెంటనే విక్టోరియా మహారాణికి మజూబా పగతీర్చుకున్నాం అని తంతి పంపించాడు. వీరిరువురికి యుద్ధం ప్రారంభం కాకపూర్వం డచ్ వాళ్లు ఇంగ్లీషువాళ్ల పొడను సైతం అంగీకరించలేదు. వాళ్లు దక్షిణాఫ్రికా యందలి లోపలి భాగాలకు వెళ్లిపోయారు దానితో ట్రాన్స్‌వాల్, ఆరెంజ్ రెండూ ఫ్రీస్టేట్లు అయ్యాయి.

ఈ డచ్ వాళ్లనే దక్షిణాఫ్రికాలో బోయర్లు అని అంటారు పసిపిల్ల వాడు తల్లిని కరుచుకున్నట్లు డచ్‌వాళ్లు కూడా తమ భాషను కరుచుక్కూర్చుంటారు దేశస్వాతంత్ర్యానికి, భాషకు అవినాభావ సంబంధం ఉన్నదని ఉంటుందని డచ్‌వారి మనస్సుల్లో గాఢంగా నాటుకున్నది దానితో వారి భాష అక్కడి వారందరికీ అందుబాటులోకి వచ్చింది బోయర్లు హాలెండు ప్రజలతో దగ్గరి సంబంధం పెట్టుకోలేకపోయారు అందువల్ల డచ్ వాళ్లు సంస్కృత భాషనుంచి వెలువడిన ప్రాకృత భాషల వలె, డచ్‌నుంచి వెలువడిన అపభ్రంశ డచ్ భాష మాట్లాడటం ప్రారంభించారు వాళ్లు తమ పిల్లల మీద మరొభాషాభారం మోపడం యిష్టంలేక ఆ డచ్ అపభ్రంశ భాషకే స్థిర రూపం కల్పించారు ఆ భాషను 'టాల్' అని అంటారు ఆ భాషలోనే పుస్తకాలు వ్రాశారు పిల్లలకు ఆ భాషలోనే విద్య నేర్పుతున్నారు అసెంబ్లీలో కూడా బోయర్లు ఆభాషలోనే మాట్లాడుతారు యూనియన్‌గా రూపొందిన తరువాత దక్షిణాఫ్రికా యందంతట రెండు భాషలు అనగా టాల్ లేక డచ్ మరియు ఇంగ్లీషు భాష సమాన హోదా అనుభవిస్తున్నాయి అక్కడి ప్రభుత్వ గెజెట్‌ను, అసెంబ్లీ వ్యవహారమంతటిని రెండు భాషల్లో ముద్రిస్తున్నారు

బోయర్లు అమాయకులు ధర్మ పరాయణులు వాళ్లు తమ విశాలమైన పొలాల్లో వుంటారు అక్కడి పొలాల వైశాల్యాన్ని మనం ఊహించలేము మన రైతుల దగ్గర రెండు లేక మూడు ఎకరాలోలేక అంతకంటే తక్కువో పొలం వుంటుంది కాని అక్కడి రైతుల దగ్గర వంద, రెండువందల ఎకరాల విస్తీర్ణం గలపొలం వుంటుంది యింత పెద్దపొలాన్ని వెంటనే దున్ని పంటపండించాలని డచ్ రైతులు భావించరు ఎవరైనా యిదేమిటి అని అడిగితే "పడివుండనీయండి లోటు ఏమిటి? మేము కాకపోతే మా బిడ్డలు వ్యవసాయం చేస్తారు" అని అంటారు

పోరాట పటిమ మాత్రం ప్రతి బోయర్ యందు కనబడుతుంది డచ్ వాళ్లు పరస్పరం కీచులాడుకుంటారు కాని పరాయివాడు దాడిచేస్తే మాత్రం తమదేశ స్వాతంత్ర్యం కోసం అంతా కలిసి ఐక్యంగా వుండి నిలబడిపోరాటం చేస్తారు. యుద్ధ శిక్షణ ప్రత్యేకించి వాళ్లకు యివ్వవలసిన అవసరం వుండదు

ప్రతిబోయర్‌లోను స్వతస్సిద్ధంగా యోధుని గుణాలు నిండివుంటాయి జనరల్ స్మట్స్, జనరల్ డివెట్, జనరల్ హర్జోగ్ ముగ్గురూ పెద్దవకీళ్లు ముగ్గురు పెద్దరైతులు ముగ్గురూ అంత పెద్దయోధులే జనరల్ బోథాదగ్గర 9000 ఎకరాల పొలం వుండేది వ్యవసాయానికి సంబంధించిన పేచీ వ్యవహారాలన్నీ ఆయనకు క్షుణ్ణంగా తెలుసు సంధివార్తల్లో పాల్గొనుటకు ఆయన యూరప్ వెళ్లాడు గొర్రెల విషయంలో బోథా అమిత నిపుణుడు అంతటి గొర్రెల నిపుణుడు యూరప్‌లో మరొకడు లేడు అని జనం అనుకునేవారు ఆ జనరల్ బోథాయే కీ॥శే॥ ప్రెసిడెంట్ క్రూగర్ గద్దెను అధిష్టించాడు ఆయన యొక్క ఆంగ్ల జ్ఞానం అమోఘం అయినా ఇంగ్లాండు వెళ్లి జార్జి చక్రవర్తి అక్కడి మంత్రి మండలికి సభ్యుల్ని కలిసినప్పుడు ఇంగ్లీషులో మాట్లాడలేదు తన మాతృభాషయగు డచ్‌లోనే మాట్లాడాడు అదీ తమ మాతృ భాషపై గల వారి మక్కువ తమ భావాల్ని ప్రకటించుటకు ఇంగ్లీషు మాట్లాడి తప్పు చేయడం వారికి యిష్టం వుండదు సరియైన శబ్దం కోసం భావాల్ని కుంచించుకోవడం వారికి యిష్టం వుండదు బ్రిటిష్ మంత్రి మండలి తెలియని ఇంగ్లీషు ఇడియము (వాక్యాంశం) ను వాడటం, దాని అర్థం తెలుసుకొనుటకు ప్రయత్నించి మరో సమాధానం చెప్పడం దానితో గాబరా పడటం, అసలు పనికి ఆటంకం కలగడం వారికి యిష్టం వుండదు అటువంటి పొరపాట్లు వాళ్లు చెయ్యరు

బోయర్ పురుషుల వలెనే స్త్రీలు కూడా నిరాడంబరంగా వుంటారు వారికి శౌర్య ప్రతాపాలు ఎక్కువ బోయర్ యుద్ధంలో పురుషులు వీరోచితంగా పోరాడారు అందుకు కారణం వారి స్త్రీలే బోయర్ స్త్రీలు వైధవ్యానికి భయపడలేదు తమ భవిష్యత్తును గురించి కూడా వారు భయపడలేదు

బోయర్లు ధర్మ పరాయణులని పైన వ్రాశాను వారు క్రైస్తవులు అయితే ఏసుక్రీస్తు యొక్క న్యూటెస్టామెంటు యెడ వారికి విశ్వాసమని చెప్పటకు వీలు లేదు నిజానికి యూరపు అంతా న్యూటెస్టామెంటను విశ్వసిస్తున్నదా? విశ్వసిస్తున్నామని అంతా అంటారు కాని ఏసుక్రీస్తు బోధించిన శాంతి

ధర్మాన్ని సరిగా పాటించే వారు క్రైస్తవుల్లో తక్కువే బోయర్లకు న్యూటెస్టామెంటు పేరు మాత్రం తెలుసు ఓల్డ్ టెస్టామెంటు మీద వారికి విశ్వాసం ఎక్కువ అందు ముద్రించబడిన యుద్ధాలను వారుశ్రద్ధాభక్తులతో చదువుతారు ఆ యుద్ధ వర్ణనలను బట్టీ వేస్తారు మూసా ప్రవక్త చెప్పిన కంటికి కన్ను, పంటికి పన్ను అను బోధను పూర్తిగా అంగీకరిస్తారు వాళ్ల వ్యవహార సరళికూడా అలాగే వుంటుంది

తమ మతబోధ ప్రకారం స్వాతంత్ర్య సముపార్జన కోసం ఎంతటి త్యాగాలకైనా సిద్ధంగా వుండాలని బోయర్ స్త్రీల నిర్ణయం కనుకనేవారు సంతోషంతో, ధైర్యంతో కష్టాలనన్నింటిని సహించారు బోయర్ స్త్రీలను లొంగదీయాలని, వాళ్ల ఆవేశం మీదనీళ్లు చల్లాలని లార్డ్‌కిచనర్ ఎంతో ప్రయత్నం చేశాడు వాళ్లను వేరువేరు క్యాంపుల్లో బంధించి వుంచాడు అక్కడ వాళ్లు అష్టకష్టాలు పడ్డారు తిండికి నీటికి కూడా శ్రమ పెట్టారు అపరిమిత చలిని, అపరిమితమైన ఎండను భరించారు చిత్తుగా తాగి మైమరిచిన సైనికులు, కామంతో కళ్లు మూసుకుపోయిన జవాన్లు ఆ అనాధలపై క్రూరంగా దూకేవారు పలురకాల ఉపద్రవాలు యీ కాంపుల్లో జరుగుతూ వుండేవి అయినా బోయర్‌స్త్రీల ధైర్యం చెదరలేదు వాళ్లు ఎవ్వరికీ లొంగలేదు యీ వ్యవహారమంతా తెలుసుకొని ఎడ్వర్డు చక్రవర్తి లార్డ్‌కిచనర్‌కు "నేను దీన్ని సహించలేకపోతున్నాను బోయర్లను వశంచేసుకునేందుకు యిదొక్కటే మార్గం అని అనుకుంటే అది సరికాదు వాళ్లతో ఏవిధమైన రాజీకైనా నేను సిద్ధంగా వున్నాను" అని స్పష్టంగా జాబు వ్రాశారు

ఈ కష్టాలగాధ ఇంగ్లాండు ప్రజలకు తెలిసే సరికి వారంతా ఎంతో బాధపడ్డారు బోయర్ల ప్రతాపాన్ని తెలుసుకొని ఆంగ్ల ప్రజలు ఆశ్చర్యపడిపోయారు జన సంఖ్యలో తక్కువగా వున్నబోయర్ ప్రజలు ప్రపంచమందంతట తమ సామ్రాజ్యాన్ని వ్యాప్తం చేసిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించి నిలిచారే అను బాధ మాత్రం ఆంగ్ల ప్రజలకు కలిగింది. అయితే బోయర్ స్త్రీల కష్టగాధలకు సంబంధించిన సమాచారం ఉదార హృదయులగు

కొందరు ఇంగ్లీషు మేధావుల ద్వారా ఇంగ్లాండుకు అందేసరికి అక్కడి జనం విచారసాగరంలో మునిగి పోయారు యీ సమాచారం బోయర్ పురుషుల ద్వారా ఇంగ్లాండు చేరలేదు వారంతా యుద్ధరంగాల్లో పోరాటం సాగిస్తున్నారు కాంపుల్లో అష్టకష్టాలు సహిస్తున్న బోయర్ స్త్రీల ద్వారా కూడా యీ సమాచారం ఇంగ్లాండు చేరలేదు ఆంగ్ల ప్రజల హృదయావేదనను తెలుసుకొని కీ॥శే॥ సర్‌హెనరీ కాంప్‌బెల్ బైనర్‌మెస్ బోయర్ యుద్ధానికి వ్యతిరేకంగా గర్జించారు కీ॥శే॥ స్టెడ్ అను వారు బహిరంగంగా బోయర్ యుద్ధంలో ఇంగ్లీషు ప్రభుత్వం ఓడిపోవాలని దేవుని ప్రార్థించడమేగాక ప్రజలందరినీ ఆ విధంగా ప్రార్థనలు చేయమని ప్రోత్సహించారు దానితో గొప్ప చమత్కారం జరిగిపోయింది సాహసంలో కష్టాల్ని సహించే శక్తిని చూచి రాళ్లైనా కరిగిపోతాయని అదే తపస్సు యొక్క మహిమయని, అదే సత్యాగ్రహశక్తి అనీ స్పష్టంగా తెలిపోయింది

దానితో ఫ్రీనిఖన ఒడంబడిక జరిగింది తద్వారా దక్షిణాఫ్రికా యందలి నాలుగు అధినివేశ రాజ్యాలు ఒక యూనియన్ క్రిందికి వచ్చాయి పత్రికలు చదివే భారతీయులకు ఆ సంధి వివరాలు తెలిసియే యుంటాయి అయినా రెండు మూడు విశేషాలు చెప్పడం అవసరం ఫినిఖన్ సంధి జరగగానే నాలుగు రాజ్యాలు వెంటనే ఏకంకాలేదు ప్రతి అధినివేశ రాజ్యానికి ఒక అసెంబ్లీ ఏర్పడింది అక్కడి మంత్రి మండలి మాత్రం ఆ అసెంబ్లీకి పూర్తిగా జవాబుదారీ వహించదు ట్రాన్స్‌వాల్ మరియు ఫ్రీస్టేట్ యొక్క పరిపాలనా పద్ధతి, క్రౌన్ కాలనీ యొక్క పరిపాలనా పద్ధతి వలె వున్నది యిలాంటి సంకుచిత అధికారం జనరల్ బోధాకు గాని, లేక జనరల్ స్మట్సుకు గాని సంతృప్తికలిగించలేదు అయినా లార్డ్ మిల్నర్ వరుడు మినహా కన్యాదానం పద్ధతిని అనుసరించడం మంచిదని భావించాడు జనరల్ బోధా, జనరల్ స్మట్సు యిద్దరూ అసెంబ్లీకి దూరంగా వుండిపోయారు వారు సహకరించలేదు అట్టి ప్రభుత్వంతో ఏ విధమైన సంబంధం పెట్టుకోడానికి వారు నిరాకరించారు లార్డ్ మిల్నర్ కటువైన ప్రసంగం చేశాడు లార్డ్ జనరల్ బోధా మొత్తం బాధ్యతంతా తనదేననీ, లేక తన మీదే ఉన్నదనీ భావించకూడదనీ, బోధా లేక పోయినా రాజ్యకార్యాలు జరుగుతాయని మిల్నర్ ప్రసంగ సారాంశం

నేను సంకోచించకుండా బోయర్ల ప్రతాపాన్ని, వాళ్ల స్వాతంత్ర్యేచ్ఛను. వాళ్ల ఆత్మత్యాగాన్ని గురించి వివరించాను అయితే కష్టకాలంలో సైతం వాళ్లలో వాళ్లకు అభిప్రాయభేదాలు కలుగలేదని గాని, వారిలో బలహీనమనస్కులు లేరని చెప్పడం గాని నా ఉద్దేశ్యం కాదు లార్డ్ మిల్నర్ బోయర్ల నుంచి తేలికగా తృప్తి పడే ఒక వర్గాన్ని తయారు చేసినిలబెట్టాడు వాళ్ల సహాయంతో అసెంబ్లీ వ్యవహారం చక్కబెట్టగలనని ఆయన భావించాడు ఎంత గొప్ప నాటక రచయిత అయినా. ప్రధాన పాత్ర లేకుండా నాటకాన్ని ఆడించి రక్తికట్టించలేడు అలాంటిది యీ కఠిన కఠోర ప్రపంచంలో రాచకార్యాలు చక్కదిద్దేరాజపురుషుడు ముఖ్యపాత్రని మరిచి అంతా తానే చేయగలనని అనుకుంటే పిచ్చితనం కాక మరేమవుతుంది? యిదే స్థితి లార్డ్ మిల్నర్‌కి పట్టింది లార్డ్‌మిల్నర్ తీవ్ర పదజాలంతో జనరల్ బోథాను తిరస్కరించాడే, కాని ఫ్రీస్టేట్ పరిపాలన జనరల్ బోథా సహకారం లేనిదే జరగడం సాధ్యం కాదని తేలేసరికి లార్డ్‌మిల్నర్ తనతోటలో కాలుగాలిన పిల్లిలా తిరిగేవాడని చెబుతారు జనరల్ బోథా తన అభిప్రాయాల్ని స్పష్టంగా ప్రకటించాడు ఫ్రీనిఖన్ సంధి వల్ల బోయర్ ప్రజలకు తమ పరిపాలన చేసుకొను పూర్తి హక్కు అధికారం వెంటనే లభిస్తుందని విశ్వసించాను లేకపోతే నేను ఆసంధి పత్రం మీద సంతకం చేసి యుండేవాణ్ణికాను అని స్పష్టంగా ప్రకటించేసరికి. లార్డ్ కిచనర్ అందుకు సమాధానం చెబుతూ నేను జనరల్ బోథాకు ఆవిధంగా చెప్పలేదు. బోయర్ ప్రజలు విశ్వాసపాత్రులని ఋజూ అయిన కొద్దీ వారికి స్వతంత్రం లభిస్తూ వుంటుంది అని మాత్రమేచెప్పాను అని ప్రకటించాడు వీరిద్దరి మధ్య న్యాయం చెప్పేది ఎవరు? మధ్యవర్తి ద్వారా పరిష్కారం చేద్దాం అని అంటే జనరల్ బోథా అంగీకరిస్తాడా? అయితే ఇంగ్లాండులో గల పెద్ద ప్రభుత్వం మాత్రం చేసిన న్యాయ నిర్ణయం దాని గౌరవప్రతిష్ఠల్ని ఎంతో పెంచిందని చెప్పవచ్చు ఆ ప్రభుత్వ నిర్ణయ ప్రకారం బలవత్తరంగా వున్న పక్షాన్ని మినహాయించి, బలహీనంగా వున్న పక్షం చెప్పిన దాన్ని అంగీకరించి తీరాలి

న్యాయము. సత్యము రెండిటి దృష్ట్యా వారు చెప్పిందే న్యాయ సమ్మతం

నేను వ్రాసిన విషయంపై నా అభిప్రాయం ఎలా వున్నప్పటికీ చదివినవాడి మనస్సు మీద, విన్నవాడి మనస్సు మీద ఏ ప్రభావం పడుతుందో, ఆ విధంగానే వ్రాశానని, లేక నా అభిప్రాయం వెల్లడించానని భావించాలి పలుసార్లు మనం బంగారం వంటి పైసూత్రాన్ని పాటించం అందువల్లనే కలహాలు, కార్పణ్యాలు ఏర్పడుతూ వుంటాయి సత్యం పేరట ముప్పావు అసత్యాన్ని పాటిస్తూ వుంటాము

ఈ విధంగా జనరల్ బోథాకు అనగా సత్యానికి సంపూర్తిగావిజయం లభించింది అప్పుడు అతడు పరిపాలనా బాధ్యతను స్వీకరించాడు తత్ఫలితంగా నాలుగు అధినివేశ రాజ్యాలు ఏకమయ్యాయి దక్షిణాఫ్రికాకు స్వాతంత్ర్యం లభించింది యూనియన్ జాక్ ఆదేశం పతాక అయింది మ్యాపుల్లో ఆ దేశం రంగు ఎరుపుగా చిత్రించారు ఏది ఏమైనా దక్షిణాఫ్రికా పూర్తిగా స్వతంత్ర దేశమని అనడంలో ఏమాత్రమూ అతిశయోక్తిలేదు దక్షిణాఫ్రికా ప్రభుత్వం అంగీకరించనిదే బ్రిటిష్ సామ్రాజ్యం ఒక్కపైసకూడా దక్షిణాఫ్రికా నుంచి తీసుకు వెళ్లడానికి వీల్లేదు

అంతేగాక దక్షిణాఫ్రికా కోరుకుంటే బ్రిటిష్ వారి పతాకను నిరాకరించవచ్చునని, పేరుకూడా మార్చుకోవచ్చునని కూడా బ్రిటిష్ మంత్రులు ప్రకటించారు అయినా దక్షిణాఫ్రికాయందలి తెల్లవారు అందుకు పూనుకోలేదు కారణాలు అనేకం వున్నాయి బోయర్ నేతలు చాలా తెలివిగల వారు నిపుణులు తమకు నష్టం కలుగకుండా వుంటే, బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధం పెట్టుకోవడానికి వారికి ఏమీ యిబ్బంది వుండదు మరో ముఖ్య కారణంకూడా వున్నది నేటాలులో ఇంగ్లీషు వారి సంఖ్య ఎక్కువ అయితే బోయర్ల కంటే తక్కువ జోహన్స్‌బర్గ్‌లో ఇంగ్లీషువాళ్లే ఎక్కువ అట్టిస్థితిలో బోయర్లు దక్షిణాఫ్రికాలో తమ సొంత రాజ్యాన్ని స్థాపించదలుచుకుంటే అంతర్యుద్ధం వచ్చే ప్రమాదం వున్నది అందువల్లనే దక్షిణాఫ్రికా యిప్పటికీ బ్రిటిష్ సామ్రాజ్యానికి డొమినియన్‌గా వున్నది

దక్షిణాఫ్రికా యూనియన్ రాజ్యాంగాన్ని ఎలా నిర్ధారించారో కూడా తెలుసుకోవడం అవసరం నాలుగు అధినివేశ రాజ్యాల అసెంబ్లీలమెంబర్లంతా

కలిసి ఆ రాజ్యాంగాన్ని అంగీకరించారు బ్రిటిష్ పార్లమెంటు వారు అందలి ప్రతి అక్షరాన్ని అంగీకరించక తప్పలేదు బ్రిటిష్ పార్లమెంటు మెంబరొకడు అందలి వ్యాకరణ సంబంధమైన ఒక తప్పును పేర్కొని ఆ తప్పును సరిచేయవలసిందని, రాజ్యాంగంలో వ్యాకరణ దోషం వుండకూడదని చెప్పగా, కీ॥శే॥ సర్‌హెనరీ కాంప్‌బెల్ బైనర్‌మెన్ ఆ ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ "ఒకరాజ్యపరిపాలన శుద్ధవ్యాకరణ సూత్రాల వల్ల నడవదు బ్రిటిష్ మంత్రిమండలి మరియు దక్షిణాఫ్రికా ప్రభుత్వమండలి సభ్యుల మధ్య ఎన్నో చర్చలు జరిగిన పిమ్మట వారంతా కలిసి యీ రాజ్యాంగాన్ని నిర్ధారణ చేసి అంగీకరించారు అందువల్ల వ్యాకరణదోష్యాన్ని సైతం సరిదిద్దు అధికారం బ్రిటిష్ పార్లమెంటుకు లేదు" అని గట్టిగా చెప్పాడు దానితో దక్షిణాఫ్రికా రాజ్యాంగాన్ని యదాతథంగా బ్రిటిష్ పార్లమెంటు, లార్డ్స్ సభ రెండూ అంగీకరించాయి ఇక్కడ గమనించవలసిన మరో మూడో విషయంకూడా ఒకటి వున్నది యూనియన్ రాజ్యాంగమందలి కొన్ని నిబంధనలు తలస్థులకు అనవసరమని అనిపించాయి వాటి వల్ల ఖర్చుకూడా పెరిగింది రాజ్యాంగ నిపుణులు యీ విషయాన్ని గమనించారుకూడా సర్వుల అంగీకారంతో, ఐక్యభావంతో, ఆచరణలో పెట్టటకు అనువుగా రాజ్యాంగాన్ని రూపొందించడమే వారందరి లక్ష్యం అందువల్లనే యూనియన్‌కు చెందిన నాలుగు రాజ్యాలకు నాలుగు రాజధానీ నగరాలు ఏర్పడ్డాయి ఏ రాజ్యమూ తన రాజధానీ నగరం యొక్క మహత్తును వదులుకొనుటకు సిద్ధపడకపోవడమే అందుకు కారణం నాలుగు అధినివేశరాజ్యాలకు నాలుగు అసెంబ్లీలు ఏర్పాటు చేశారు నాలుగు రాజ్యాలకు గవర్నర్లు వుండాలి కదా! కనుక గవర్నరువంటి ప్రాంతీయ అధికారులపదవుల్ని కూడా అంగీకరించారు నాలుగు అసెంబ్లీలు, నాలుగు రాజధానీ నగరాలు నలుగురు ప్రాంతీయ అధికారులు అనవసరం శుద్ధదండుగ అజాగళస్తనాలు అని చాలా మంది విమర్శించారు అందుకు దక్షిణాఫ్రికా పరిపాలనకు నడుం బిగించిన రాజకీయ అనుభవజ్ఞులు భయపడలేదు ఆడంబరం పాలు ఎక్కువగా వున్నా, డబ్బు అధికంగా ఖర్చు అయినా, వారు నాలుగు రాజ్యాల సమైక్యతకు

ఎక్కువ ప్రాధాన్యం యిచ్చారు ఆ విధంగా తమకు ఆమోదయోగ్యమైన రాజ్యాంగాన్ని దక్షిణాఫ్రికా రాజకీయ అనుభవజ్ఞులు ఏకగ్రీవంగా అంగీకరించడమే గాక బ్రిటిష్ పార్లమెంటు చేత కూడా అంగీకరింపచేసుకున్నారు

దక్షిణాఫ్రికా చరిత్రను అతిక్లుప్తంగా పాఠకులకు తెలియజేయుటకు యిక్కడ ప్రయత్నించాను యీ వివరం తెలుపకపోతే యికముందు జరుగనున్న సత్యాగ్రహ మహాసంగ్రామ రహస్యం తెలియచేయడం కష్టమవుతుంది అసలు విషయానికి వెళ్లక పూర్వం భారతీయులు దక్షిణాఫ్రికాకు ఎలా వచ్చారో, సత్యాగ్రహం ప్రారంభం కావడానికి పూర్వం వాళ్లు ఏఏ కష్టాలు పడ్డారో, మనం తెలుసుకోవడం అవసరం

★ ★ ★

# 3

## దక్షిణాఫ్రికాకు భారతీయుల రాక

ఆంగ్లేయులు నేటాలు చేరి అక్కడ వారు జూలూల దగ్గర కొన్ని సదుపాయాలు అధికారాలు పొందారు నేటాలులో చెరకు, కాఫీ, తేయాకు బాగా పండించవచ్చునని అనుభవంమీద వాళ్లు గ్రహించారు పెద్దస్థాయిలో వీటిని పండించాలంటే వేలాది మంది కార్మిక జనం అవసరం నూరు నూటయాభై ఇంగ్లీషు కుటుంబాల వాళ్లు యీ పంటలు పండించడం సాధ్యంకాని పని అందువల్ల వాళ్లు హబ్షీలను ప్రోత్సహించారు భయపెట్టారు కూడా అక్కడ బానిస చట్టం రద్దయింది అందువల్ల హబ్షీలపై వత్తిడి తెచ్చి వాళ్లను అంగీకరింపచేయలేక పోయారు హబ్షీలకు ఎక్కువగా కాయకష్టంచేసే అలవాటు లేదు ఆరు నెలలు శ్రమపడి, వచ్చిన ఆదాయంతో సంవత్సరమంతా గడుపుతూ వుంటారు అటువంటి స్థితిలో మరో యజమానులతో ఏండ్ల తరబడి ఒప్పందం చేసుకొని కాయకష్టం చేయుటకు వాళ్లు ఎందుకు సిద్ధపడతారు? దానితో వాళ్లపై గల ఆశవదులు కొని మరొకదేశపువారైనా దొరుకుతారేమోనని ఆంగ్లేయులు యోచించారు. వారి దృష్టి భారతీయుల మీద పడింది వెంటనే వాళ్లు భారత ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు

ప్రారంభించారు భారత ప్రభుత్వం అందుకు అనుకూలంగా స్పందించింది తత్ఫలితంగాది 16 నవంబరు 1860 నాడు భారతీయ కార్మికుల మొదటి జట్టు ఓడ ద్వారా నేటాలు చేరుకున్నది

దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో యీ తేదీకి ప్రముఖ స్థానం లభించింది ఆ తేదీ నాడు ఆ ఘట్టం జరిగి యుండక పోతే భారతీయులు దక్షిణాఫ్రికాలో అడుగుపెట్టేవారుకాదు సత్యాగ్రహ సమరం జరిగి యుండేది కాదు యీ దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర వ్రాయవలసిన అవసరం ఏర్పడి యుండేది కాదు

నేటాల్‌లో నివసించే ఆంగ్లేయుల కోరికను అంగీకరించినప్పుడు భారతప్రభుత్వం యీ విషయాన్ని నిశితంగా పరిశీలించలేదని నా అభిప్రాయం భారత దేశంలో పరిపాలన సాగిస్తున్న కొందరు ఆంగ్లేయులు నేటాలులో నివసిస్తున్న తమ ఆంగ్లేయుల పక్షం వహించారు అయితే కాగితాల మీద జరిగిన ఒప్పందంలో భారత దేశకార్మికుల రక్షణను గురించి షరతులు ఎక్కువగా చేర్చడమే గాక, వారి ఆహార పానీయాల విషయంలో కూడా ఎక్కువ షరతులు చేర్చడం జరిగిన మాట వాస్తవమే అయితే యింత దూరాన్నుంచి అక్కడికి వెళ్ళిన భారతీయులపై కష్టాలు, ఆపదలు, చిక్కులు విరుచుకు పడితే వాటి పరిష్కారం ఎలా చేయాలి అనువిషయాన్ని మాత్రం ఎవ్వరూ పట్టించుకోలేదు భారతీయుల మత రక్షణ ఎలా జరుగుతుందో, వారు తమ రీతుల్ని నీతుల్ని ఎలా రక్షించుకోగలరో కూడా ఎవ్వరూ పట్టించుకోలేదు చట్ట రీత్యా బానిస వృత్తి రద్దయిందేగాని, యజమానుల హృదయాలనుంచి ఆ ప్రవృత్తి తొలగలేదను విషయం కూడా భారత ప్రభుత్వంలో వున్న ఆంగ్ల అధికారులు పట్టించుకోలేదు అక్షరం జ్ఞానంలేని భారతీయ కార్మికులు అమితదూరాన వున్న పరాయి దేశానికి వెళ్ళి నిర్ధారించబడిన గడువు దాకా బానిసలైపోతారను విషయం వాళ్ళు గమనించలేదు సర్ విలియం విల్సన్ హంటర్ అను మహాశయుడు యీ కార్మికుల స్థితిగతులను గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు అక్కడి వారి పరిస్థితిని గురించి వర్ణిస్తూ, రెండు శబ్దాల్ని లేక రెండు శబ్దాల

సముదాయాన్ని ప్రయోగించాడు నేటాలునందలి భారతీయ కార్మికులు అర్ధ బానిసలుగా వున్నారు అని మొదటిసారి వ్రాశాడు రెండోసారి వ్రాసిన జాబులో నేటాలు నందలి భారతీయ కార్మికులు సంపూర్ణ బానిసత్వంలో పడిపోయారు అని వ్రాశాడు నేటాలులో ఏర్పడ్డ ఒక పెద్ద కమీషన్ ఎదుట సాక్ష్యం చెబుతూ గొప్ప యూరోపియన్ కీ॥శే॥ శ్రీ ఎస్కంబ్ కూడా యిదే విషయం చెప్పాడు యిలాంటి అనేక ఉదాహరణలు నేటాలు నందు నివశించే ప్రముఖ ఆంగ్లేయుల వాఙ్మాలాలనుంచి పేర్కొనవచ్చు యిలాంటి విషయాలు అర్జీల రూపంలో భారత ప్రభుత్వానికి పంపడం జరిగింది కాని జరగవలసిందేదో జరిగి పోయింది ఏ ఓడ అయితే భారతదేశ కార్మికుల జట్టును నేటాలుకు చేర్చిందో ఆ ఓడయే కూలీలతో బాటు సత్యాగ్రహమనే మహావృక్షపు విత్తనాల్ని కూడా నేటాలుకు చేర్చినట్లయింది

ఈ కార్మికుల్ని నేటాలుకు సంబంధించిన భారతీయ దళారులు ఎలా మోసగించారో, దళారుల మాటలు నమ్మి మనకార్మికులు నేటాలు ఎలా వెళ్లారో, నేటాలు చేరిన పిమ్మట వారి కండ్లు ఎలా తెరువుడు పడ్డాయో, కండ్లు తెరువుడు పడ్డా వీళ్లు నేటాలులోనే ఎందుకు వున్నారో, తరువాత కూడా భారతీయులు అక్కడికి ఎందుకు వెళ్లారో అక్కడకు వెళ్ళి నీతిమత వ్యవహారాల్ని బంధనాల్ని ఎలా తెంచి వేసుకున్నారో, లేక ఆ బంధనాలు ఎలా తెగిపోయాయో, నిర్భాగ్యులైన భారతీయ కార్మికుల పెండ్లి అయిన భార్యలకు వేశ్యలకు మధ్యన గల వ్యత్యాసం ఎలా తొలగిపోయిందో ఆ కధంతా యీ చిన్ని గ్రంధంలో వ్రాయడం సాధ్యం కాని పని

భారతీయ కార్మికులు, ఎగ్రిమెంటు ప్రకారం నేటాలు వెళ్లిన భారతీయులుగా నమోదయ్యారు దానితో భారతీయులు తాము గిరిమిటియాలమని (ఒప్పందంకుదుర్చుకొని వచ్చిన బానిస కార్మికులు) చెప్పుకొవడం ప్రారంభించారు అందువల్ల యిక ముందు ఎగ్రిమెంటును గిర్‌మిట్ అని అంటాను దాని ఆధారంగా వెళ్లిన కార్మికులను గిర్‌మిటియాలని అంటాను

భారత దేశాన్నుంచి గిర్‌మిటియాలు నేటాలు చేరారనే వార్తలు మారిషస్ దేశం చేరాయి అట్టి భారతీయులతో సంబంధాలు గల భారత వ్యాపారులు నేటాలు వెళ్లుటకు ఉవ్విళ్లూరారు మారిషస్ దేశం భారత దేశానికి దక్షిణాఫ్రికాకు మధ్యన వున్నది మారిషస్ ద్వీపంలో వేలాదిమంది భారతవ్యాపారులు, కార్మికులు ఉంటున్నారు వారిలో ఒక వ్యాపారి పేరు కీశే అబూబకర్ ఆమద్ అతడు నేటాలులో తనవృత్తి ప్రారంభించాలని భావించాడు భారత వ్యాపారులు ఏమేమి చేయగల శక్తివంతులో ఇంగ్లీషు వాళ్లకు తెలియదు వాళ్లంటే లెక్కకూడాలేదు భారతీయ కార్మికుల సహాయంతో ఆంగ్లేయులు నేటాలులో చెరుకు, తేయాకు, కాఫీ బాగా పండించడమేగాక బాగాలాభాలు గడించసాగారు కొద్ది సమయంలోనే యీ వస్తువుల్ని దక్షిణాఫ్రికా కంతటికీ సప్లై చేయసాగారు బాగా ధనం సంపాదించి త్వరత్వరగా విశాలమైన భవనాలు నిర్మాణం చేసుకున్నారు అడవిలో వైకుంఠాన్ని స్థాపించారు అట్టి వాతావరణంలోసేఠ్ అబూబకర్ వంటి సామాన్యుడు, నమ్మకస్తుడు, తెలివిగల వ్యాపారి తమ మధ్య నివసించడం వారికి యిష్టం కాలేదు ఒక ఇంగ్లీషు వాడు కూడా భాగస్వామిగా అబూబకర్‌తో కలిసి వ్యాపారం చేయసాగారు సేఠ్ అబూబకర్ వ్యాపారం ప్రారంభించి పొలం కొన్నాడు అతడు బాగా డబ్బు సంపాదించాడనే వార్తలు భారత దేశం ముఖ్యంగా అతని జన్మస్థలి యగు గుజరాత్ యందలి పోర్‌బందర్ వంటి చోట్లకు చేరాయి దానితో యితరమహమ్మదీయులు కూడా నేటాలు చేరారు వారితోబాటు సూరత్‌కు చెందిన బొహరాలు కూడా అక్కడికి చేరారు యీ వ్యాపారులకు గుమాస్తాలు అవసరమైనారు దానితో గుజరాత్, కాఠియావాడ్ (సౌరాష్ట్ర) కు చెందిన హిందూ గుమాస్తాలు కూడా నేటాలు చేరుకున్నారు

ఈ విధంగా నేటాలులో రెండురకాల భారతీయులు చేరారు 1 స్వతంత్ర వ్యాపారులు, వారి స్వతంత్ర నౌకర్లు 2 భారతీయ గిర్‌మిటియాలు, త్వరలోనే గిర్‌మిటియాలకు పిల్ల పాపలు పుట్టారు గిర్‌మిట్ విధానం ప్రకారం అట్టి సంతతిపై బానిసత్వపు చట్టం అమలు కాక పోయినా, ఆచరలో అమలు

కాకతప్పలేదు ఆచట్టనిబంధనలు అంతకరిసంగా వుండటమె అందుకు కారణం బానిసత్వపు మచ్చబానిసల సంతానానికి సైతం అంటకుండా ఎలా వుంటుంది? యీ విధంగా అక్కడికి వెళ్లే భారతీయ కార్మికులు అయిదు సంవత్సరాల పాటు ఒప్పందం కుదుర్చుకొని నేటాలు వెళ్లేవారు అయిదు సంవత్సరాలు గడిచాక వారు స్వతంత్రులే అప్పుడు వారు స్వతంత్రంగా బ్రతకవచ్చు వ్యాపారం గాని, వృత్తిగాని చేసుకోవచ్చు అక్కడ వుండాలని అనుకుంటే వుండవచ్చు కొందరు ఆ అధికారాన్ని ఉపయోగించుకొని అక్కడవుండి పోయారు కొందరు భారతావనికి తిరిగి వచ్చివేశారు ఆవిధంగా నేటాల్లో వుండిపోయిన భారతీయుల్ని ఫ్రీ ఇండియన్స్ అని అనేవారు నేను వారిని గిర్‌మిట్ ముక్తులు లేకముక్తి పొందిన భారతీయులు అని అంటాను యీ బేధాన్ని తెలుసుకోవడం చాలా అవసరం యిక్కడే మెలికవున్నది పూర్తి స్వతంత్రులైన భారతీయులకు గల అధికారాలకు, గిర్‌మిట్ ప్రధ నుంచి ముక్తులైన భారతీయులకు లేవు ఉదాహరణకు యిట్టివారు ఒక చోటు నుంచి మరో చోటుకి నివాసం మార్చదలుచుకుంటే అందుకు ఆర్డరు తీసుకోవాలి యిదీ నియమం వాళ్లు వివాహం చేసుకోవచ్చు అయితే చట్టరీత్యా ఆవివాహం చెల్లుతుందని ధృవీకరింపచేసుకోవడానికి, వారు గిర్‌మిటియాల రక్షణ కోసం నియమింపబడిన అధికారి కార్యాలయానికి వెళ్ళి సమోదు చేయించుకోవాలి యిదే కాక యిటు వంటి కఠోరమైన అంకుశాలు వాళ్ల మీద చాలా వుండేవి

1980-1990లో ట్రాన్స్‌వాల్ మరియు ఫ్రీస్టేటు నందు బోయర్ల ప్రజాతంత్ర రాజ్యాలు వున్నాయి ప్రజాతంత్ర రాజ్యమంటే ఏమిటో యిక్కడ చెప్పడం అవసరం యిక్కడ ప్రజాతంత్ర రాజ్యం అంటే తెల్ల ప్రజాతంత్రాధిక్యత కలిగిన రాజ్యం అని అర్థం హబ్షీ వాళ్లకు దానితో సంబంధమేమీ లేదు

భారతీయ వ్యాపారులు తాము కేవలం గిర్‌మిట్ భారతీయులతోనేగాక హబ్షీలతో కూడా వ్యాపారాలు చేయవచ్చునని గ్రహించారు భారతీయ వ్యాపారులు హబ్షీలకు బాగా అందుబాటులో వుండేవారు ఇంగ్లీషు

వ్యాపారులంటే హబ్షీలు భయపడుతూ వుండేవారు ఇంగ్లీషు వ్యాపారులు హబ్షీలతో వ్యాపారం సాగించాలని భావించేవారే. కాని హబ్షీలతో మంచిగా మాట్లాడటం వారికి సాధ్యపడలేదు హబ్షీలు వెళ్లి ఆంగ్లవ్యాపారులకు సొమ్ము చెల్లించి అందుకు రావలసిన వస్తువులు పూర్తిగా పొందలేక పోయేవారు అలాలభిస్తే గొప్ప అదృష్టంగా భావించేవారు ఉదాహరణకు ఒక హబ్షీ గ్రాహకుడు నాలుగు షిల్లింగుల ధరలుగల వస్తువుకోసం ఒక్కపొండు యిస్తే మిగతా పదహారు షిల్లింగులు తిరిగి యివ్వకుండా తెల్లవ్యాపారి నాలుగు షిల్లింగులే యిస్తాడు ఒక్కొక్కప్పుడు అవికూడా యివ్వడు మిగిలిన డబ్బులు యిమ్మని అడిగితే తిట్లు వినవలసి వచ్చేది అప్పుడప్పుడు తన్నులు తినవలసివచ్చేది తెల్లవ్యాపారులంతా హబ్షీలతో యిలా వ్యవహరించేవారని చెప్పడం నా ఉద్దేశ్యంకాదు కాని యిలాంటి ఉదాహరణలు విపరీతంగా వుండేవి భారతీయ వ్యాపారితియ్యగా మాట్లాడటమె కాక. హబ్షీలతో సర్దాగా కూడా మాట్లాడుతూ వుండేవాడు హబ్షీలు అమాయకులు దుకాణానికి వచ్చి వస్తువుల్ని చేతితో తాకి చూస్తూవుండేవారు. భారతీయ వ్యాపారి యిదంతా సహించేవాడు అతడు పారమార్థిక భావంతోకాక. స్వార్థంతోనే అలా చేసేవాడు అవకాశం చిక్కితే భారతీయ వ్యాపారి హబ్షీవాళ్లను మోసం చేయడానికి వెనుకాడేవాడు కాడు అయినా హబ్షీవాళ్లు భారతీయ వ్యాపారులదగ్గరకు వాళ్లమాటల యందలి తీయదనంవల్ల ఆకర్షితులై వెళ్లుతూవుండేవారు అంతేగాక హబ్షీలు భారతీయులంటే భయపడేవారుకాదు అప్పుడప్పుడు భారతీయ వ్యాపారులు తమను మోసగించారని తెలిస్తే హబ్షీవాళ్లు తిన్నగా వచ్చి తమను మోసం చేసినవాళ్లను తన్నేవారు వాళ్ల చేత తిట్లు కూడా భారతీయ వ్యాపారులు తినేవాళ్లు యీ విధంగా హబ్షీలంటే భారతీయులే భయపడుతూవుండేవారు దానితో హబ్షీలవల్ల భారతీయుల వ్యాపారం బాగా పెరిగిపోయింది హబ్షీలు దక్షిణాఫ్రికా యందంతట వ్యాప్తమై యుండటం అక్కడి విశేషం

ట్రాన్స్‌వాల్ మరియు ఫ్రీసేట్‌లో బోయర్లతో కూడా వ్యాపారం చేయవచ్చని భారతీయులు గ్రహించారు బోయర్లు అమాయకులు. మంచి

వాళ్లు భారతీయవ్యాపారులతోవ్యాపారం సాగించుటకు వారికి యిబ్బంది ఏమీ లేదని భారతీయులు తెలుసుకున్నారు దానితోకొంత మంది భారతీయవ్యాయపారులు ట్రాన్స్‌వాల్, ఫ్రీస్టేట్‌లకు ప్రాకారు అక్కడ దుకాణాలు తెరిచారు అప్పుడు అక్కడ రైలు ప్రయాణసౌకర్యం లేదు అందువల్ల వ్యాపారంలో లాభాలు బాగా గడించవచ్చన్న భారతీయుల ఆలోచనలు సత్యమని తేలాయి బోయర్లు, హబ్షీలు వారి దగ్గర వస్తువులు విపరీతంగా కొనడం ప్రారంభించారు యిక మిగిలింది ఒక్క కేప్‌కాలనీ మాత్రమే అక్కడికి కూడా కొందరు భారతీయ వ్యాపారులు చేరారు సంపాదన బాగా రాసాగింది యీ విధంగా కొద్ది సంఖ్యలోనైనా సరే భారతీయులు దక్షిణాఫ్రికా యొక్క నాలుగు రాజ్యాలలో ప్రవేశించారు

అప్పుడు పూర్ణ స్వతంత్రులైన భారతీయుల సంఖ్య 40 మరియు 50వేల మధ్య, గిర్‌మిట్ ముక్త భారతీయుల సంఖ్య, వాళ్ల సంతతితో కలుపుకొని ఒక లక్ష వరకు ఉన్నది

★ ★ ★

# 4

# కష్టాల సింహావలోకనం

## నేటాలు

నేటాలునందలి తెల్లదొరలకు బానిసలు అవసరమైనారు గిర్‌మిట్ గడువుపూర్తికాగానే స్వతంత్రులయ్యేవాళ్లు, ఏ విధంగానైనా తమతో సమంగా వుండగలిగినవాళ్లు తెల్లవారికిఅక్కరలేదు భారతదేశంలో వ్యవసాయం సరిగ్గాసాగక, రాబడి చాలక చాలామంది భారతీయులు గిర్‌మిట్లుగా నేటాల్ వెళ్లారు అయితే వాళ్లకు వ్యవసాయం అంటే ఏమిటో, పొలం అంటే ఏమిటో బాగా తెలుసు నేటాలువచ్చి అక్కడిభూములు చూచిన తరువాత కాయకూరలు పండించుకొని ఎంతో ధనం సంపాదించుకోవచ్చునని వాళ్లు గ్రహించారు ఏ కొంచెం పొలం సంపాదించుకున్నా బాగా పంటలు పండించుకోవచ్చని తెలుసుకున్నారు అందువల్ల చాలామంది గిర్‌మిటియాలు గడువు తీరిపోగానే

ముక్తులై వేరే వృత్తులు ప్రారంభించారు దీనివల్ల నేటాలు ప్రజలకు ప్రయోజనమే కలిగింది మంచి రైతులు లేనందున గతంలో అంచని కూరగాయలు జనానికి బాగా అందసాగాయి అందువల్ల కూరగాయల ధరలు బాగా తగ్గిపోయాయి ఈ వ్యవహారం డబ్బుగలతెల్ల దొరలకు నచ్చలేదు తమ ఒక్కరి పెత్తనమే సాగుతున్నదనుకున్న చోట మరొకరు ప్రవేశించేసరికి తెల్లవాళ్లు మండిపడ్డారు దానితో యిట్టి గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయులకు వ్యతిరేకంగా నేటాలులో ఒక ఉద్యమం ప్రారంభమైంది పాఠకులు గమనించవలసిన విషయం ఒకటున్నది తెల్లవాళ్లు బానిసలుగా పనిచేయుటకు భారతీయ కార్మికులు కావాలని ఒక వైపున కోరుతూ, గిర్‌మిట్ ప్రథనుంచి విముక్తి పొందిన భారతీయులపై ఆంక్షలు విధించాలని మరొకవైపున ఉద్యమం సాగించారు భారతదేశంనుంచి వచ్చే గిర్‌మిటియాలంతా నేటాలుకే సరిపోతూ వుండేవారు తెలివిగల భారతీయులు చేసిన కాయకష్టానికి తెల్లవాళ్లవల్ల లభించిన ప్రతిఫలం యిదే

ఆ ఉద్యమం అనేక రూపాలు దాల్చింది తెల్లవాళ్లు క్రొత్తపాట మొదలుపెట్టారు వాళ్లకు కావలసింది భారతీయగిర్‌మిటియాలు వాళ్లు స్వతంత్రులు కావడం తెల్లవాళ్లకు యిష్టం లేదు కావున క్రొత్త వాదన ప్రారంభించారు బారతదేశాన్నుంచి గిర్‌మిటియాలు నేటాలులో గడువుతీరిన తరువాత స్వతంత్రులుగా వుండకూడదని,వాళ్లుభారత దేశం తిరిగి వెళ్లిపోవాలని, నేటాలులో వుండదలుచుకుంటే తిరిగి గిర్‌మిటియాలుగానే వుండాలని అట్టి నిబంధనలు క్రొత్త ఎగ్రిమెంట్‌లో చేర్చాలనే ప్రచారం ప్రారంభించారు ఏది ఏమైనాగిర్‌మిటియా ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయులు స్వతంత్రంగా నేటాలులో వుండకూడదు ఇదీ వాళ్ల వాదన ఇందుకోసం ఉద్రిక్తంగా ఉద్యమం నడిపించారు చివరికినేటాలు ప్రభుత్వం దీనిమీద ఒక కమిషన్‌ను నియమించింది రెండువర్గాలవారి వాదనలు సరిగా లేవు అసలు గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయుల వల్ల నేటాల్ ప్రజలకు మేలు జరిగింది అందువల్ల కమిషన్ ముందు సాక్ష్యాలు యిచ్చినవారంతా రెండు వర్గాల తెల్లవాళ్లకు వ్యతిరేకంగా వాఙ్మూలం యిచ్చారు చివరకు తెల్లవాళ్ల

వాదనకు అనుకూలంగా కమిషన్ నిర్ణయం చేయలేకపోయింది నిప్పు ఆరిపోయినా యింకా వేడి తగ్గనట్లు నేటాల్ ప్రభుత్వం మీద తెల్లవాళ్ల ఉద్యమ ప్రభావం బాగా పడిందని చెప్పవచ్చు అక్కడి ప్రభుత్వం తెల్లవాళ్లది కనుకవాళ్లు తెల్లవాళ్లకు ప్రతికూలంగా ఎందుకు చర్య తీసుకుంటారు? అక్కడితెల్ల ప్రభుత్వం వారు రెండు పర్గాల వాదల్ని భారతప్రభుత్వానికి పంపించారు భారత ప్రభుత్వం మాత్రం భారతీయులుచిరకాలం ర్మిటియాలుగానే వుండిపోవాలనే నిర్ణయం ఎలా చేస్తుంది? అసలు ్ర్మిటియాలుగా పంపుతూ భారత ప్రభుత్వం చేసిన వాదన ఏమిటి? ప్రారంభంలో కొంత కాలంపాటు భారతీయులు గిర్మటియాలుగావుండి పనిచేస్తారని, ఆ తరువాత స్వతంత్రులై జీవన భృతికోసం వృత్తులు సొంతంగా ప్రారంభించుకుంటారని మొదటవారు అన్నారు అప్పుడు నేటాలు క్రౌన్ కాలనీగా వున్నది అందువల్ల కలోనియల్ ఆఫీసు అక్కడిపూర్తి బాధ్యత వహిస్తుందని భావిస్తూ వుండేవారు నేటాలు తెల్లవాళ్లకు ఆ ఆఫీసువల్ల తమ అన్యాయపు కోర్కెలు తీర్చుకోగలమని ఆశకలుగలేదు అందువల్ల, అటువంటివే మరికొన్ని కారణాలవల్ల నేటాలులో జవాబుదారీ ప్రభుత్వం ఏర్పడాలని మరో ఉద్యమం ప్రారంభించారు 1893లో అట్టి జవాబుదారీ ప్రభుత్వ నిర్మాణం అక్కడ జరిగింది దానితో నేటాలు ప్రభుత్వం తమ శక్తిని గుర్తించింది కలోనియల్ ఆఫీసుకూడా నేటాల్ తెల్లవాళ్ల కోరికల్ని తీర్చుటకు సిద్ధపడింది దానితో నేటాలు ప్రభుత్వం, భారత ప్రబుత్వంతో సంప్రదింపులు జరపటం కోసం ప్రతినిధి బృందాన్ని భారతావనికి పంపించింది గిర్మిట్ప్రథనుంచి ముక్తి పొంది నేటాలులో నివసించతలచిన ప్రతి భారతీయుడు 35 పౌండ్లు అనగా 375 రూపాయలు ప్రతి సంవత్సరం తల పన్ను చెల్లించాలని ప్రతినిధిబృందం భారతప్రభుత్వాన్ని కోరింది అంత భారీ పన్ను ఏ భారతీయుడూ చెల్లించగల స్థితిలో లేడు అందువల్ల స్వతంత్ర పౌరులుగా నేటాల్లో వుండలేరు ఆనాటి భారతవైస్రాయిగా వున్న లార్డ్ ఎల్గిన్కు 35 పౌండ్లు ఎక్కువ అని అనిపించింది అందువల్ల 3కు తగ్గించాడు ఈ పన్ను ఒక్క పురుషుడేగాక అతడి భార్యకు 3 పౌండ్లు, 13 ఏండ్ల వయస్సు గల కుమార్తె

3 పౌండ్లు, 16 ఏండ్ల కొడుకు వుంటే అతడు 3 పౌండ్ల తల పన్ను కట్టాలని కఠోర నిర్ణయం తెల్ల ప్రభుత్వం వారు గైకొన్నారు ఇదిఎంత బరువైనదో భారతీయులు గ్రహించవచ్చు ఒక కుటుంబం 12 పౌండ్లుపన్నుగా చెల్లించాలన్న మాట అనుభవించినవారికే ఆ బాధ తెలుస్తుంది వాళ్ల కష్టాలు ఎలాంటివో కండ్లారా చూచిన వారికి బోధపడుతుంది నేటాలు ప్రభుత్వం వారి యీ నిర్ణయాన్ని భారతదేశం తీవ్రంగా వ్యతిరేకించింది కాని వినేనాధుడెవరు? చివరికి 25 పౌండ్లు తగ్గి 3 పౌండ్లు అయ్యాయి గిర్‌మిటియాలు ఏం చేయగలరు? అయితే భారతీయ వ్యాపారులు మాత్రం దేశభక్తితోను, పారిమార్థిక భావంతోను ఉద్యమం నడిపించారు తెల్లవాళ్లు గిర్‌మిటియా కార్మికుల విషయంలో వ్యవహరించినట్లు గానే స్వతంత్ర భారతీయుల విషయంలో కూడా వ్యవహరించారు నేటాలులో గల స్వతంత్ర భారతపౌరులకు వ్యతిరేకంగా పైన చెప్పిన ఉద్దేశ్యాలతోనే మరో ఉద్యమం ప్రారంభించారు భారతీయ వ్యాపారులు నేటాలులో బాగా పాతుకుపోయారు వాళ్లు నగరంలో ముఖ్యమైన చోట్ల భూములు కూడా కొన్నారు గిర్‌మిటియా ప్రధనుంచి ముక్తి పొందిన స్వతంత్ర భారతీయుల సంఖ్య బాగా పెరిగిపోయిది అవసరమైన వస్తువులకు గిరాకీ కూడా పెరిగింది వేలాది బస్తాల బియ్యం భారతదేశాన్నుంచి దిగిమతి కాసాగింది వాటి అమ్మకం వల్ల భారతీయ వ్యాపారులకు మంచి లాభాలు రాసాగాయి హబ్షీలతో జరిగే వ్యాపారంలో కూడా వారికి లాభాలు బాగా రాసాగాయి దీన్ని చిన్న వ్యాపారస్తులైన తెల్లవాళ్లు సహించలేకపోయారు భారతీయ వ్యాపారస్తుల దగ్గరికి వెళ్లి, చట్టరీత్యా మీకు కూడా నేటాలు అసెంబ్లీ సభ్యులుగాఎన్నుకోబడుటకు అర్హులు అని ఇంగ్లీషు వాళ్లే చెప్పారు దానితో కొంతమంది భారతీయ వ్యాపారస్తులు తమ పేర్లు కూడా ఓటర్ల లిస్టులో చేర్పించుకున్నారు దీన్ని తెల్లదొరలు సహించలేకపోయారు యీ విధంగా భారతీయులస్థాయినేటాలులో పెరిగిపోతే వాళ్ల ముందు ఇంగ్లీషు వాళ్లు నిలవలేరనే నిర్ణయానికి వాళ్లు వచ్చారు. అందువల్ల అక్కడ ఏర్పడిన ;వాబుదారీ ప్రభుత్వం భారతీయుడెవ్వడికీ ఓటింగు హక్కు లేకుండా ;యుటకు పూనుకున్నది 1894లో యిటువంటి లక్ష్యంగల ఒక బిల్లు

నేటాలు అసెంబ్లీలో ప్రవేశపెట్టబడింది భారతీయులకు ఓటింగు హక్కు నిరాకరిస్తూ యీ బిల్లు ప్రవేశపెట్టారు. దాన్ని తెల్ల వాళ్ళంతా అంగీకరించారు రంగు భేదాన్ని పురస్కరించుకొని భారతీయులకు వ్యతిరేకంగా ప్యాసైన మొదటి చట్టం యిదే భారతీయులు దీన్ని వ్యతిరేకించారు. రాత్రికి రాత్రి ఒక అర్జీ తయారైంది దానిమీద 400 మంది సంతకాలుచేశారు యీ అర్జీ చేరగానే నేటాలు అసెంబ్లీ అదిరి పోయింది అయితే బిల్లు ప్యాసైంది కదా అప్పుడు లార్డ్ రిప్పన్ అనువాడు అధినివేశ దేశాలకు సంబంధించిన మంత్రిగా వున్నాడు అతడి దగ్గరికి 10 వేల మంది భారతీయుల సంతకాలతో మరో అర్జీ చేరింది 10 వేల మంది సంతకాలంటే నేటాలు నందు నివసిస్తున్న స్వతంత్ర భారతీయులందరూ దానిమీద సంతకాలు చేసినట్లే. దానితో లార్డ్ రిప్పన్ ప్రభువు నేటాల్ అసెంబ్లీ అంగీకరించిన బిల్లును నిరాకరించి వేశాడు బ్రిటిష్ సామ్రాజ్యం, చట్టప్రకారం రంగు భేదాన్ని అంగీకరించదు అని ప్రకటించాడు భారతీయులు సాధించిన యీ విజయం ఎంత ఘనమైనదో పాఠకులకు తరువాత బోధపడుతుంది అందుకు సమాధానంగా నేటాలు ప్రభుత్వం అసెంబ్లీలో మరో బిల్లు ప్రవేశపెట్టింది అందులో రంగు భేదాన్ని తొలగించారు కాని పరోక్షంగా భారతీయుల్ని దెబ్బకొట్టే ప్రయత్నమే ఆబిల్లులో జరిగింది భారతజాతి ఆ బిల్లును కూడా వ్యతిరేకించిందికాని విజయం సాధించలేకపోయింది యీ క్రొత్తబిల్లు రెండు అర్థాలు కలది భారతజాతి తలుచుకుంటే కోర్టుల్లో ఆ బిల్లును ఛాలెంజి చేసి వుంటే బాగుండేది ప్రీవీ కౌన్సిల్‌కు వెళ్లవలసి వచ్చినా సిద్ధపడవలసిందే కాని అలా జరగలేదు అయితే ప్రీవీ కౌన్సిలుకు పోకపోవడం సరియైన పని అని నా అభిప్రాయం. బిల్లులో రంగు భేదం అనుమాటకు తావులేకుండా జాగ్రత్తపడ్డారు. ఇంత చేసినా నేటాలు తెల్ల దొరలకు, అక్కడి తెల్లవారి ప్రభుత్వానికి తృప్తి కలగలేదు భారతీయులు రాజకీయంగా నేటాలులో బలపడకుండా వుండటం వాళ్లకు అవసరం దానితోపాటు భారతీయుల వ్యాపారాన్ని నేటాలులో దెబ్బతీయడం, స్వతంత్ర భారతీయుల్ని నేటాలులో నిలవనీయకుండా చేయడం వాళ్ల లక్ష్యం 30 కోట్ల మంది భారతీయులు నేటాలు మీద

ఏరుచుకుపడితే అక్కడి కొద్దిమంది తెల్లవాళ్ల గతి ఏమి కాను? సముద్రంలో దూకడమే కదా వారికి గల మార్గం క యీ భయమే అక్కడి తెల్ల వాళ్లను పట్టుకుంది అప్పుడు నేటాల్ యందుగల జనాభా వివరాలు క్రింది విధంగా వున్నాయి హబ్షీల సంఖ్య 4 లక్షలు తెల్లవారి సంఖ్య 40 వేలు గిర్మిటియా కార్మికుల సంఖ్య 60 వేలు గిర్మిట్ ప్రథ నుంచి ముక్తిపొందిన వారి సంఖ్య 10 వేలు స్వతంత్ర భారతీయుల సంఖ్య 10 వేలు నిజానికి నేటాల్‌లో గల తెల్లదొరలు భయపడవలసిన అవసరం ఏమీ లేదు కాని వాళ్లకు నచ్చ చెప్పడం సాధ్యం కాని పని భారత దేశపు దయనీయస్థితిని గురించి వాళ్ల ఆచార వ్యవహారాలను గురించి అక్కడి తెల్ల వాళ్లకు తెలియదు తమ మాదిరిగానే భారతీయులు కూడా శౌర్యవంతులు సాహస వంతులు అయి వుంటారని వాళ్లభావం జనాభాను పరిగణనకు తీసుకోవడంలో వారి దోషం కూడా ఏమీ లేదు భారతీయుల జనాభా ముందు తమ జనాభాను పోల్చి చూచుకొని వాళ్లు భయపడ్డారు ఏదిఏమైనా అందుకు మంచి పరిణామమే కలిగింది ఆ తరువాత నేటాల్ అసెంబ్లీలో రెండు బిల్లులు ప్రవేశ పెట్టారు వాటిలో ఎక్కడా రంగు భేదాన్ని గురించి పేర్కొన లేదు యిది భారతీయులు సాధించిన ఘనవిజయ ఫలితమేనని చెప్పవచ్చు వాళ్లు ఆ బిల్లులో ఉపయోగించిన భాష విషయమై ఎంతో జాగ్రత్త వహించారు. దీనివల్ల భారతీయుల గౌరవం పెరిగిందని చెప్పవచ్చు యీ సారి కూడా భారతీయులు వ్యతిరేకించారు. కాని రెండు బిల్లులు అసెంబ్లీలో ఆమోదించబడ్డాయి. అవి చట్టాలు అయ్యాయి. ఒక చట్టప్రకారం భారతీయ వ్యాపారస్తుల మీద ఆంక్షలు విధించబడ్డాయి. రెండో చట్టంద్వారా నేటాలులో భారతీయులు ప్రవేశించకుండా ఆంక్షలు విధించబడ్డాయి. మొదటిచట్టం ద్వారా నియమింప బడిన అధికారి యొక్క అనుమతిలేనిదే ఎవ్వరికీ వ్యాపారం చేసుకొనుటకు ఆర్డరు యివ్వడం జరగదు ఆంగ్ల వ్యాపారస్తులు తిన్నగా ఆ అధికారి దగ్గరకు వెళ్ళి ఆర్డరు తెచ్చుకున్నారు కాని భారతీయులు మాత్రం ఎన్నో అవరోధాల్ని ఎదుర్కోవలసి వచ్చింది అతి కష్టం మీద వారికి

ఆర్డరు లభించ సాగింది యిందుకోసం భారతీయులు వకీళ్లను నియమించుకోవలసి రావడమే కాక డబ్బు కూడా అమితంగా ఖర్చు చేయవలసి వచ్చింది సామాన్యులైన భారతీయులు ఆర్డరు లేకుండానే వుండసాగారు ఒక విచిత్రమైన నిబంధన కూడా అందుచేర్చారు భారతీయులు నేటాలులో ప్రవేశించదలిస్తే యూరప్‌కు చెందిన ఏదేని ఒక భాష అతడికి తెలిసి యుండాలి ఆ భాషలో అర్జీ దాఖలు చేసుకోవాలి యీ నిబంధన ద్వారా భారతీయులకు నేటాల్ తలుపులు పూర్తిగా మూసివేసినట్లే తెలిసోతెలియకో నేను నేటాల్ ప్రభుత్వానికి అన్యాయం చేయకూడదనే ఉద్దేశ్యంతో పాఠకులకు ఒక్క విషయం తెలుపుతున్నాను యీ చట్టం అంగీకరించబడక పూర్వం మూడు సంవత్సరాల నుంచి నేటాలులో ఏ భారతీయుడైనా ఉండివుంటే అతడు నేటాలు నుంచి భారత దేశంగాని మరే దేశంగాని వెళ్లవచ్చు నేటాలుకు తిరిగి రావచ్చు అతడు యూరప్ భాషనేర్వనక్కరలేదు అతడు తన భార్య, మైనరు తీరని బిడ్డలతో పాటు నేటాలులో ప్రవేశించవచ్చు

ఇదేగాక నేటాలులో వుండే గిర్‌మిట్ భారతీయుల మీద, స్వతంత్ర భారతీయుల మీద చట్టబద్ధమైన చట్ట బద్ధంకాని పలు ఆంక్షలు విధించారు వాటన్నింటిలోకి పాఠకుల్ని దింపడం నాకు యిష్టం లేదు యీ పుస్తక మందలి విషయాన్ని తెలుసుకునేందుకు అవసరమైన వివరాలనే యిక్కడ పేర్కొంటేచాలని నా అభిప్రాయం దక్షిణాఫ్రికాయందలి అధినివేశరాజ్యాలలో నివశించే భారతీయుల చరిత్రను విస్తారంగా వివరించవచ్చుకాని అందుకు నేను పూనుకోవడంలేదు అది యీ పుస్తకం ఉద్దేశ్యం కాదు



# 5

# కష్టాల సింహావలోకనం

*ట్రాన్స్‌వాల్ మరియు ఇతర అధినవేశ రాజ్యాలు*

1880 కి పూర్వం నుంచే నేటాలు వలెనే, దక్షిణాఫ్రికా యందలి యితర అధినివేశరాజ్యాల్లో కూడా భారతీయులంటే తెల్లవారికి ఏవగింపు బాగా పెరిగింది కేప్ కాలనీని మినహాయించి మిగతా రాజ్యాల తెల్లవారి హృదయాలలో గిర్‌మిట్ కార్మికుల రూపంలో భారతీయులు మంచివాళ్లేనని, కాని స్వతంత్ర పౌరులుగా మాత్రం భారతీయుల వల్ల దక్షిణాఫ్రికాకు ఎంతో నష్టం కలుగుతుందని భావం గట్టిగా నాటుకుపోయింది ట్రాన్స్‌వాల్ ప్రజాతంత్ర రాజ్యం అక్కడి ప్రెసిడెంటు దగ్గరికి వెళ్లి మేమూ బ్రిటిష్ సామ్రాజ్య పౌరులమేనని చెప్పుకోవడం హాస్యాస్పదమై పోయింది భారతీయులు చెప్పుకోవలసిందేమైనా వుంటే ప్రిటోరియాలో గల బ్రిటిష్ రాజమాత (ఏజంట్) దగ్గరకు వెళ్లి చెప్పుకోవాలి అయినా మరో విచిత్రం జరిగింది ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ సామ్రాజ్యాన్నుంచి పూర్తిగా విడిపోయిన తరువాత బ్రిటిష్ రాజదూత భారతీయులకు సహాయపడే వాడు కాని ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిపోయిన తరువాత ఆ స్థితి మారిపోయింది లార్డ్ మోర్లే భారత మంత్రిగా వున్నప్పుడు ట్రాన్స్‌వాల్ నందలి భారతీయుల తరుపున వాదించుటకు ఒక ప్రతినిధి బృందం వెళ్లి ఆయనను కలుసుకున్నది అప్పుడు లార్డ్ మోర్లే ఆప్రతినిధి బృంద సభ్యులకు ఒక్క విషయం స్పష్టంగా చెబుతూ జవాబు దారీ ప్రభుత్వాలు ఏర్పడ్డ అధినివేశ రాజ్యాలపై బ్రిటిష్ (సామ్రాజ్య) ప్రభుత్వ నియంత్రణ బహుస్వల్పంగా వుంటుంది అవి స్వతంత్ర రాజ్యాలు వాటిని యుద్ధానికి ఆహ్వానించగలము యుద్ధం చేస్తామని బెదిరించగలము యుద్ధం కూడా ప్రకటించగలము కాని వాటితో సలహా సంప్రదింపులు మాత్రమే చేయగలము బ్రిటిష్ సామ్రాజ్యానికి, అధినివేశ రాజ్యాలకు మధ్యన గల సంబంధం పట్టుదారంతో కట్టబడివున్నది ఆహారం బహుసున్నితం కొద్దిగా లాగినా ఆదారం తెగిపోతుంది వాటిపై బలాన్ని ప్రయోగించుటకు

అవకాశంలేదు అయితే (యుక్తిగా) రేపటినుంచి చేయగలిగినంత చేయుటకు ప్రయత్నిస్తాను నమ్మండి" అని చెప్పి వేశాడు ట్రాన్స్‌వాల్ మీద యుద్ధ భేరీ మ్రోగించినప్పుడు లార్డ్ లెన్స్ డౌన్, లార్డ్ సెల్‌బోర్న్ మొదలగు బ్రిటిష్ అధికారులు, యుద్ధానికి గల అనేక కారణాలలో ట్రాన్స్‌వాల్ నందలి భారతీయుల దుస్థితిని నివారించడం కూడా ఒకటి అని ప్రకటించారు. ఇక ట్రాన్స్‌వాల్‌లో గల భారతీయులస్థితిగతులను పరిశీలిద్దాం. 1881లో భారతీయులు మొదటిసారి ట్రాన్స్‌వాల్‌లో అడుగుపెట్టారు కీ॥శే॥ సేఠ్ అబూబకర్ ట్రాన్స్‌వాల్ రాజధాని యగు ప్రిటోరియాలో దుకాణం ప్రారంభించాడు అక్కడి ఒక ముఖ్యమైన చోట నివేశన స్థలం కొన్నాడు తరువాత అనేక మంది భారతీయ వ్యాపారులు కూడా ఒకరి తరువాత మరొకరు అక్కడికి చేరుకున్నారు వాళ్ల వ్యాపారం బాగా సాగడం చూచి తెల్లవాళ్ల కడుపు తరుక్కుపోయింది పత్రికల్లో భారతీయులకు వ్యతిరేకంగా జాబులు, వ్యాసాలు వ్రాయడం ప్రారంభించారు. అక్కడి అసెంబ్లీలో కూడా భారతీయుల్ని ట్రాన్స్‌వాల్ నుంచి వెళ్లగొట్టండి వాళ్లను వ్యాపారం చేసుకోనీయవద్దు" అని ప్రసంగాలు జరిగాయి అర్జీలు కూడా దాఖలు చేశారు ట్రాన్స్‌వాల్ వంటి క్రొత్త దేశంలో బ్రిటిష్ వారి ధనతృష్ణకు అంతు లేకుండా పోయింది నీతికి అవినీతికి మధ్య గల తేడా వాళ్లకు తెలియదు అసెంబ్లీకి దాఖలు చేసిన అర్జీలలో "వీళ్లు (భారతీయ వ్యాపారులు) మానవ సభ్యత అంటే ఏమిటో ఎరుగరు చెడునడత వల్ల సంక్రమించే రోగాలతో కుళ్లిపోతున్నారు ప్రతి ఆడదాన్ని తమ వేట జంతువని భావిస్తున్నారు. ఆడవాళ్లకు ఆత్మ లేదని వాళ్లు భావిస్తున్నారు" అని కూడా వ్రాశారు. యీ నాలుగు వాక్యాలలో నాలుగు అబద్ధాలు వున్నాయి యిటువంటి ఉదాహరణలు ఎన్నో యివ్వవచ్చు అక్కడి అసెంబ్లీ మెంబర్లు కూడా యిలా వ్రాసిన తెల్ల వారి వంటిరకమే తమకు వ్యతిరేకంగా అసహ్యాకరమైన వ్యతిరేక ఉద్యమం సాగుతున్నదని భారతీయ వ్యాపారులు గ్రహించలేదు. వాళ్లు పత్రికలు చదివే వారు కాదు. తెల్లవాళ్ల పత్రికల ప్రభావం, అసెంబ్లీకి దాఖలు చేసిన తెల్లవారి అర్జీల ప్రభావం బాగా పని చేసింది. తత్ఫలితంగా అసెంబ్లీలో

ఒక బిల్లు ప్రవేశపెట్టబడింది యీ విషయం అక్కడి భారతీయ పెద్దలకు తెలిసింది ఉలిక్కిపడ్డారు వాళ్లు కే॥శే॥ ప్రెసిడెంట్ క్రూగర్ దగ్గరికి వెళ్లారు ప్రెసిడెంటు భారతీయ నాయకుల్ని తన ఇంటిలోనికి రానీయలేదు ఇంటి ముంగిలిలో నేవాళ్లను నిలబెట్టాడు వాళ్ల మాటలు కొద్దిగా విని "మీరు ఇస్మాయిల్ సంతతివాళ్లు అందువల్ల మీరు ఈసో సంతతికి బానిసత్వం చేయుటకే పుట్టారు మేము ఈసో సంతతి వాళ్లం అందువల్ల మీకు మాతో సరిసమానమైన అధికారాలు యివ్వడానికి వీలులేదు మేమిచ్చిన అధికారాలతో మీరు తృప్తిపడక తప్పదు" అని చెప్పి వేశాడు అతడి మాటల్లో రోషం, కోపం లేవని చెప్పలేము కాని అతనికి అది చిన్నప్పటి నుంచి లభించిన విద్య బాల్యం నుంచి అతడికి బైబిలునందలి పాత టెస్టామెంట్ బోధించబడింది దాన్నే అతడు నమ్మాడన్నమాట తన విశ్వాసాన్ని బట్టి, శుద్ధ మనస్సుతో ప్రెసిడెంటు చెప్పాడు కనుక యిందు అతని దోషం ఏముంది? అయితే యింతటి అజ్ఞానంతో కూడిన మాటల ప్రభావం కూడా పడుతుంది కదా 1885 లో తొందర తొందరగా అసెంబ్లీలో ఒక కఠోరమైన బిల్లును ప్యాసు చేశారు వేలాది భారతీయులు ట్రాన్స్‌వాలును దోపిడీ చేయుటకు సిద్ధంగా వున్నారను భావం ఆ బిల్లులో తొంగిచూచింది భారతీయ నాయకుల ప్రేరణవల్ల బ్రిటిష్ రాజమాత ఆచట్టాన్ని వ్యతిరేకించవలసి వచ్చింది యీ వ్యవహారం అధినివేశ విభాగం మంత్రి దాకా వెళ్ళింది యీ చట్టం ప్రకారం ట్రాన్సువాల్‌లో వ్యాపారం చేసుకునేందుకై వచ్చి నివసించిన భారతీయుడు 25 పౌండ్లు చెల్లించి తన పేరు నమోదు చేయించుకోవాలి ఏ భారతీయుడు ట్రాన్స్‌వాలు నందు ఒక్క అంగుళం భూమికూడా కొనడానికి వీలు లేదు ఓటింగు హక్కు అతడికి లేనేలేదు యిది అనుచితం అన్యాయం కనుక ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం యీ వాదనను సమర్థించుకోలేకపోయింది చివరికి ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్య ఒక సంధి కుదిరింది దాన్ని లండన్ కన్వెన్షన్ అని అన్నారు అందలి 14వనిబంధన బ్రిటిష్ ప్రజల అధికారాలను రక్షించుటకు సంబంధించినది ఆ నిబంధన ప్రకారం పెద్ద (సామ్రాజ్యం) ప్రభుత్వం, యీ చట్టాన్ని వ్యతిరేకించింది దాని మీద

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం "తాము అంగీకరించిన చట్టానికి పెద్ద ప్రభుత్వమే ముందునుంచి స్పష్టంగా రహస్యంగా అంగీకరించింది" అని ప్రకటించింది.

ఈ విధంగా యిరుపక్షాలకు అభిప్రాయభేదం వచ్చినందున మధ్యవర్తుల ముందు యీ విషయాన్ని ప్రవేశపెట్టారు మధ్యవర్తుల నిర్ణయం తటపటాయింపులతో నిండిపోయింది వాళ్లు రెండు ప్రభుత్వాలను తృప్తి పరుచుటకు ప్రయత్నించారు దానివల్ల నష్టపడింది భారతీయులే దాన్ని లాభం అని అనుకుంటే ఎక్కువ నష్టానికి బదులు తక్కువ నష్టం కలగడమే కలిగిన లాభం అని భావించాలి మధ్యవర్తుల నిర్ణయ ప్రకారం బిల్లు నందు 1886 లో మార్పులు జరిగాయి 25 పౌండ్లకు బదులు 3 పౌండ్లుగా నిర్ణయం జరిగింది భూమి కొనుక్కునే విషయంలో కూడా మార్పు జరిగింది ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం నిర్ణయించిన చోటనే భారతీయులు భూమి కొనుక్కొనుటకు వీలు కల్పించబడింది యీ నిబంధనను అమలు బరుచునప్పుడు కూడా వక్రత వారి మనస్సుల్లో చోటు చేసుకున్నది ప్రభుత్వం నిర్ధారించిన వాడల్లో సైతం కొనుక్కున్న చోటు మీద కూడా భారతీయులకు స్థిరంగా హక్కు యివ్వలేదు. పట్టణాలకు దూరంగా మురికి చోట్ల భారతీయులకు వాడలు నిర్ధారించారు నీటికొరత, కరెంట్ కొరత, పాయిఖానాల శుభ్రత కొరత వున్న ప్రదేశాల్లో భారతీయులు వుండాలని తెల్లవాళ్ల నిర్ణయం యీ విధంగా ట్రాన్స్‌వాల్‌లో భారతీయులు పంచమజాతి వాళ్లుగా పరిగణించబడ్డారు మనదేశంలో గల అస్పృశ్యుల గూడెముల మాదిరి స్థితిలో ట్రాన్స్‌వాల్ గూడెములు వెలిశాయన్న మాట. భారతదేశంలో పాకీవాళ్లకు, మాలమాదిగల ప్రక్కన వున్నాలేక వారిని ముట్టుకున్నా తాము అపవిత్రమై పోతామని హిందువులు భావిస్తున్నట్లే ట్రాన్స్‌వాల్ యందలి తెల్లవాళ్లు భారతీయుల ప్రక్కన వుంటే తాము అపవిత్రులమై పోతామని భావించారు 1985 నాటి చట్టమునందలి 3వ నిబంధనకు, వేరే అర్థం తీసి అక్కడి ప్రభుత్వం భారతీయ వ్యాపారులు, ఆవాడల్లోనే ఆ లోకేషన్లలోనే వ్యాపారం చేసుకోవచ్చునని నిర్ణయించారు. యీ నిర్ణయం సరియైనదా కాదా అని నిర్ణయించు అధికారం కోర్టులకు ప్రభుత్వం అప్పగించింది. దానితో

భారతీయులకు ట్రాన్స్‌వాల్‌లో అధోగతి సంప్రాప్తించింది. అయినా భారతీయ వ్యాపారులు ఏదోవిధంగా చర్చల ద్వారానో, సలహా సంప్రదింపుల ద్వారానో, కోర్టులకెక్కి తమ స్థితిని రక్షించుకోసాగారు బోయర్ యుద్ధం ప్రారంభమయ్యే నాటికి అక్కడి భారతీయుల పరిస్థితి ఎంతో నాసిగాను అనిశ్చితంగాను వున్నది.

ఇక మనం ఫ్రీస్టేట్‌లో భారతీయుల స్థితి ఎలా వున్నదో చూద్దాం అతికష్టం మీద 10 లేక 11 దుకాణాలు భారతీయులు అక్కడ ప్రారంభించేసరికి వారికి వ్యతిరేకంగా తెల్లవాళ్లు ఉద్యమంలేవతీశారు అక్కడి అసెంబ్లీ పెద్దలు జాగ్రత్తగా వ్యవహరించి భారతీయుల ఉనికినే దెబ్బతీశారు ఒక కఠోరమైన చట్టం ప్యాసు చేసి తద్వారా భారతీయ వ్యాపారులకు పేరుకు నష్ట పరిహారం చెల్లించి వాళ్లను వెళ్లగొట్టివేశారు ఏ భారతీయుడు వారి చట్ట ప్రకారం భూమిని కొనకూడదు. రైతుగా ఫ్రీస్టేట్‌లో వుండకూడదు ఓటింగు హక్కు అనేది లేనేలేదు. ప్రత్యేక అనుమతి పొంది భారతీయులు కార్మికుని రూపంలోనో, లేక హోటలు వైటరు రూపంలోనో అక్కడ వుండవచ్చు అట్టి అనుమతి అందరికీ లభించదు. తత్ఫలితంగా ప్రముఖ భారతీయులు సైతం ప్రత్యేక అనుమతి పొంది ఫ్రీస్టేట్‌లో రెండు మూడు రోజుల కంటే మించి వుండటకు వీలు లేదు బోయర్ యుద్ధం నాటికి అక్కడ అంతా కలిపి 40 మంది భారతీయులు హోటళ్లలో వైటర్లుగా పని చేస్తూ వున్నారు

కేప్ కాలనీలో కూడా భారతీయులకు వ్యతిరేకంగా ఉద్యమం కొద్దోగొప్పో సాగుతూనే వున్నది. భారతీయ పిల్లలు ప్రభుత్వ స్కూళ్లలో చేరకూడదు అక్కడి హోటళ్లలో భారతీయ యాత్రికులు వుండకూడదు. అతికష్టంమీద చోటు దొరికితే వుండవచ్చు. యీ విధంగా కేప్ కాలనీలో కూడా భారతీయులకు అవమానం జరుగుతూ వున్నది. అయితే వ్యాపారం చేసుకొనుటకు, భూమి మీద హక్కు పొందుటకు చాలా కాలం వరకు వాళ్లకు యిబ్బంది కలుగలేదు. కేప్ కాలనీలో ఆ స్థితి ఎందుకు వున్నదో కొంచెం చెప్పడం అవసరం. ముఖ్యంగా కేప్ టౌనులోను, కేప్ కాలనీలోను మలై ప్రజల ఆధిక్యం వున్నది. మలై ప్రజలు మహమ్మదీయులు. అందువల్ల భారతీయ

మహమ్మదీయులతో వారికి త్వరగా మంచి సంబంధాలు ఏర్పడ్డాయి భారతీయ మహమ్మదీయుల ద్వారా, మిగతా భారతీయుల సంబంధం కూడా మలై వాసులతో మెరుగుపడిందని చెప్పవచ్చు భారతీయ మహమ్మదీయులు చాలా మంది మలై ముస్లింస్త్రీలతో వివాహ సంబంధాలు పెట్టుకున్నారు మలై ప్రజలకు వ్యతిరేకంగా కేప్ కాలనీ ప్రభుత్వం చర్యలు తీసుకునే స్థితిలో లేనేలేదు కేప్ కాలనీ వాళ్లకు అది జన్మభూమి వాళ్లది డచ్‌భాష. డచ్‌వాళ్లతో మొదటి నుంచి కలిసి మెలిసి వుండటం వల్ల మలై ప్రజలు చాలా వరకు డచ్ ప్రజలను అనుసరించారు అందువల్ల అక్కడ రంగు భేదం అతి తక్కువగా వున్నది

కేప్ కాలనీ అత్యంత ప్రాచీన అధినివేశ రాజ్యం దక్షిణాఫ్రికాకు చెందిన శిక్షణా సాంస్కృతిక కేంద్రం కూడా అందువల్ల ఉదార హృదయులు, వినయ సంపన్నులు, విద్యావంతులు అయిన ఆంగ్లేయులు అక్కడ జన్మించారు ప్రపంచంలో ఏమారుమూలనైనా సరే అనుకూల వాతావరణం వుండి, మంచి శిక్షణకు సంస్కారాల బోధనకు అవకాశం ఏర్పడితే అక్కడి వారు అత్యుత్తమమైన మానవ లక్షణాలు కలిగి వుంటారనీ ఎంతో అందమైన మానవ పుష్పాలు వికసించి తీరుతాయని నా ప్రగాఢ విశ్వాసం అదృష్టవశాత్తు దక్షిణాఫ్రికా యందలి పలుచోట్ల నేను అట్టి ఉత్తమ మానవుల్ని దర్శించాను. అయితే కేప్ కాలనీలో యిట్టివారి సంఖ్య అధికంగా వున్నది వారిలో గొప్ప ప్రసిద్ధులు శ్రీ మేరిమెన్ వారంటే అక్కడి జనానికి అమిత గౌరవం 1872లో కేప్ కాలనీలో జవాబుదారీ ప్రభుత్వం ఏర్పడింది అప్పటినుంచి వారు మంత్రివర్గ సభ్యుడుగా వున్నారు. 1910లో దక్షిణాఫ్రికా యూనియన్ ఏర్పడినప్పుడు వారి దాని చివరి మంత్రివర్గానికి ప్రధాన మంత్రిగా వున్నారు సంపూర్ణ శ్రాయినర్ కుటుంబం, మరియు మోల్టినో కుటుంబమని అక్కడి రెండుకుటుంబాల వారు వున్నారు యీ రెండు కుటుంబాలు శ్రీ మేరిమెన్ స్థాయిలో కాకపోయినా, రెండో స్థానంలో వున్నాయి. సర్‌జాన్ మోల్టినో 1872లో ప్రథమ మంత్రిమండలికి ప్రధానమంత్రిగా పని చేశారు. శ్రీ డబ్ల్యు. పి. శ్రాయినర్ ప్రసిద్ధ అడ్వొకేట్. కొంతకాలం పాటువారు అటార్నీ జనరల్‌గా వున్నారు

తరువాత మంత్రి మండలిలో ప్రధానమంత్రిగా కూడా పని చేశారు ప్రసిద్ధికెక్కిన ప్రతిభావంతురాలగు వారి సోదరి ఆలివ్ శ్రాయినర్ దక్షిణాఫ్రికాలో అమితంగా ప్రజాదరణ పొందిన మహిళ ఇంగ్లీషు మాట్లాడబడే ప్రాంతాలన్నిటి యందు ఆమె విదుషీమణిగా ప్రఖ్యాతి గడించింది మనుష్యుల యెడ ఆమెకు గల ప్రేమ అపారం ఎప్పుడు చూచినా ఆమె కండ్ల నుంచి ప్రేమ వర్షిస్తూ వుంటుంది ఆమె డ్రీమ్స్ అను పుస్తకం వ్రాసింది అప్పటినుంచి ఆమె డ్రీమ్స్ రచయిత్రిగా పేరుపొందింది ఆమె నిరాండబరత్వం అమోఘం ఇంట్లో గిన్నెలు సైతం ఆమెయే తోముకుంటుంది అది ఆమె గొప్పతనం ఈ మూడు కుటుంబాల వారు మొదటి నుంచి హబ్షీల పక్షం వహించారు తెల్లవాళ్లు హబ్షీల అధికారాల్ని తగ్గించుటకు ప్రయత్నించినప్పుడు యీ ముగ్గురు ప్రముఖులు ఆ ప్రయత్నాలను వ్యతిరేకించారు వాళ్ల యీ ప్రేమ భారతీయులపైకి కూడా మళ్ళింది అయితే ఆ ముగ్గురూ హబ్షీలు భారతీయులు యిరువురి మధ్య తేడాను పాటించే వారు వాళ్ల తర్కం ఒక్కటి ఇంగ్లీషు వాళ్లు రాక పూర్వమే యిక్కడ నివసించిన వాళ్లు హబ్షీలు వారు యిక్కడి మూలవాసులని అందువల్ల తెల్లవాళ్లు హబ్షీల సహజ హక్కుల్ని హరించుటకు వీలు లేదు భారతీయుల విషయంలో పోటీ పడతారనే భావంతో వారికి వ్యతిరేకంగా చేయబడుతున్న నిర్ణయాలలో సారళ్యం రావాలి అది న్యాయ సమ్మతం అని వారి అభిప్రాయం అయినా వారు భారతీయుల యెడ ఎంతో సానుభూతిగా వున్నారు శ్రీగోపాల కృష్ణ గోఖలే మొదటిసారి దక్షిణ ఆఫ్రికావిచ్చేసినప్పుడు వారి సమ్మానార్థం మొదటి సభ కేప్ టౌన్‌యందలి టౌన్‌హాలులో జరిగింది. దానికి శ్రీ శాయినర్ అధ్యక్షత వహించారు శ్రీ మేరిమెన్‌కూడా గోఖలే గారితో తీయగా ప్రేమగా మాట్లాడారు భారతీయుల ఎడ తమ సానుభూతిని ప్రకటించారు కేప్ టౌన్ నుంచి వెలువడే పత్రికలు కూడా యితర రాజ్యాల పత్రికల కంటే పక్షపాత రహితంగా వుంటాయి. అవి భారతీయులకు పూర్తి వ్యతిరేకంకాదు

శ్రీ మేరిమెన్. శ్రీ శాయినర్‌గారలను గురించి నేను పైన వ్రాసినట్లు యింకా అనేక మంది ఆంగ్లేయుల్ని గురించి వ్రాయవచ్చు యిక్కడ నేను

కేవలం ఉదాహరణకు మాత్రమే వారి పేర్లు వాళ్ల ప్రఖ్యాతిని గురించి పేర్కొన్నాను మిగతా మూడు రాజ్యాలకంటే కేప్ కాలనీలో రంగుద్వేషం, మరియు భారతీయుల యెడ వ్యతిరేకత తీవ్రంగా లేకపోయినప్పటికీ, మిగతా ప్రాంతాల ప్రభావం పడకుండా వుండటం సాధ్యం కాదుగదా! అందువల్ల అక్కడ కూడా నేటాలు వలెనే భారతీయుల ప్రవేశం, వ్యాపారం మీద ఆంక్షలు విధిస్తూ ఇమిగ్రేషన్ రెస్ట్రిక్షన్ ఆక్టు, మరియు డీలర్స్ లైసెన్సు ఆక్టు ప్యాసయ్యాయి

మొత్తం మీద దక్షిణాఫ్రికాలో భారతీయుల కోసం తెరిచియున్న ద్వారాలు బోయర్ యుద్ధం నాటికి పూర్తిగా మూసుకున్నాయని చెప్పవచ్చు ట్రాన్స్‌వాల్‌లో భారతీయుల ప్రవేశంపై విధించబడిన 3 పౌన్ల ఫీజు తప్ప మరే ఆంక్షలేదు కాని నేటాలు, కేప్ కాలనీల హార్బర్లు భారతీయులకు ప్రదేశాన్ని నిషేధించాయి యిక ట్రాన్స్‌వాల్ చేరాలంటే భారతదేశాన్నుంచి వెళ్లే భారతీయులు ఎక్కడా దిగడానికి వీలులేదు ఒక్కమార్గం వున్నది పోర్చుగీసు వారి హార్బరు డేలాగోవావేలో దిగి ట్రాన్స్‌వాల్ చేరవచ్చు అయితే అక్కడ కూడా తెల్లవారి రాజ్యాల వలెనే కొద్దో గొప్పో భారతీయులకు వ్యతిరేకంగా ఆంక్షలు విధించబడ్డాయి యీ పరిస్థితుల్లో కొద్ది మంది భారతీయులు మాత్రమే పలుకష్టాలు సహించి, లంచాలు యిచ్చి నేటాలు, మరియు డేలా గోవావే, హార్బర్లలో దిగి ట్రాన్స్‌వాల్‌కు చేరుతూవుండేవారు

★ ★ ★

## భారతీయులు ఏం చేశారు? -1

గత ప్రకరణాల్లో తమ మీద జరుగుతున్న దాడులను ఎదుర్కొంటూ భారతీయులు గైకొన్న చర్యలను గురించి కొంత తెలుసుకున్నాము అయితే సత్యాగ్రహప్రారంభాన్ని గురించి బాగా తెలుసుకొనుటకు, భారతీయుల రక్షణ కోసం చేసిన ప్రయత్నాలను గురించి వ్రాయడం అవసరమని భావిస్తున్నాను.

1893 వరకు దక్షిణాఫ్రికాలో స్వతంత్ర భారతీయుల్లో భారతదేశప్రజల హితాన్ని రక్షించగల చదువుకున్న వారి సంఖ్య చాలా తక్కువగా వున్నది

ఇంగ్లీషు తెలిసినవారిలో ఎక్కువ మంది క్లర్కులు తమ వృత్తి నెరవేర్చగలంతవరకే వారికి ఇంగ్లీషు తెలుసు అర్జీలు వ్రాయలేరు పూర్తి సమయం తమ యజమానుల కోసం వెచ్చిస్తూ వుండేవారు దక్షిణాఫ్రికాలో జన్మించిన, ఇంగ్లీషు తెలిసినవారు కొందరున్నారు వాళ్లు గిర్‌మిటియాల సంతతికి చెందినవారు. వాళ్లు కొద్దిగా యోగ్యత పెంచుకొని కోర్టుల్లో దుబాసీలుగా ప్రభుత్వ నౌకరీలు చేసుకుంటున్నారు భారతీయుల స్థితిచూచి సానుభూతిని మాత్రమే వెల్లడించి వూరుకునేవారు అదే వారు చేయగలిగిన గొప్ప సేవ

గిర్‌మిటియాలు, గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన వారు అధికంగా ఉత్తర ప్రదేశ్ మరియు మద్రాసుకు చెందిన వారు స్వతంత్ర భారతీయుల్లో గుజరాత్‌కు చెందిన మహమ్మదీయ వ్యాపారస్తులు హిందూ గుమాస్తాలు, మెహతాలు వున్నారు వీరు గాక కొద్దిమంది పారసీ వ్యాపారస్తులు, క్లర్కులు వున్నారు దక్షిణాఫ్రికా యందంతట వున్న పారసీకుల సంఖ్య 30 లేక 40 మందిని మించి లేదు స్వతంత్ర్య వ్యాపారుల్లో నాలుగోవర్గం సింధీలు సింధీలు భారతదేశం వదిలి బయటికి వెళ్లి ఫాన్సీ గూడ్సు వ్యాపారులుగా గుర్తింపు పొందారు పాన్సీ గూడ్సు షాపుల్లో వారు ప్రత్యేకించిపట్టు, జరీ సామాను, నగిషీ చెక్కిన అద్దాలు, చందనం, రకరకాల ఏనుగు దంతాల పెట్టెలు, యిటువంటివే గృహ సంబంధమైన వస్తువులు అమ్ముతూ వుంటారు వారి దగ్గర సామానుకొనే వారంతా అక్కడ సామాన్యంగా ఆంగ్లేయులే

గిరిమిటియా కార్మికుల్ని తెల్లవాళ్లు కూలీలని పిలిచేవారు కూలీ అంటే బరువులు మోసే కార్మికుడన్నమాట కూలీ శబ్దం బాగా ప్రచారం పొందింది గిరిమిటియా కార్మికులు సైతం మీరెవరు అని అడిగితే కూలీలం అని సమాధానం చెబుతూ వుండేవారు ఆ తరువాత మెల్లమెల్లగా భారతీయులందరికీ కూలీ అనే శబ్దం రూఢమై పోయింది. ఇంగ్లీషువాళ్లు భారతీయ వకీళ్లను కూలీవకీళ్లు అని, భారతీయ వ్యాపారస్తుల్ని కూలీ వ్యాపారస్తులని అనడం ప్రారంభించారు. యీ విశేషణం వాడటం తప్పని చాలా మంది ఇంగ్లీషు వాళ్లకు తెలియదు. అయితే చాలా మంది తిరస్కారభావం ప్రకటించడానికే

కూలీ అనే శబ్దం వాడుతూ వుండేవారు యిది చాలా మంది భారతీయులకు యిష్టం లేదు అందువల్ల స్వతంత్ర భారతీయులు తాము గిర్‌మిటియాలం కామని చెప్పి ప్రత్యేక గుర్తింపుకోసం ప్రయత్నిస్తూ వుండేవారు అందువల్ల స్వతంత్ర భారతీయులు, గిర్‌మిటియా కార్మికులు, గిర్‌మిటీయా ప్రథనుంచి ముక్తి పొందిన వారు అను తేడా దక్షిణాఫ్రికా భారతీయుల్లో బయలు దేరింది

దుఃఖ సముద్రాన్ని అరికట్టుటకు స్వతంత్ర భారతీయులు ముఖ్యంగా ముస్లిం వ్యాపారస్తులు పూనుకున్నారు గిర్‌మిటియా కార్మికుల సహాయంగాని, గిర్‌మిటియా ప్రథనుంచి ముక్తి చెందిన వారి సహాయంగాని వారు తీసుకోలేదు అలా చేయాలనే భావం కూడా అక్కడ ఎవ్వరికీ తట్టలేదు. తట్టినా వాళ్లను చేర్చుకుంటే కార్యం చెడిపోయే ప్రమాదం వున్నది అసలు దాడి జరుగుతున్నదంతా స్వతంత్ర భారతీయ వ్యాపార వర్గం మీదనే కనుక రక్షణ దృష్ట్యా కూడా యిలా భావించడం జరిగింది యిటువంటి కష్టాలు ఎన్ని వచ్చినా, ఇంగ్లీషురాకపోయినా, ప్రజాసేవా రంగంలో పని చేసిన అనుభవం పొందక పోయినా, స్వతంత్ర భారతీయ వ్యాపారస్తులు మాత్రం కష్టాల్ని గట్టిగా ఎదుర్కొన్నారని చెప్పక తప్పదు వాళ్లు ఆంగ్ల బారిష్టర్ల దగ్గరికి వెళ్లి వాళ్ల చేత అర్జీలు తయారు చేయించి ప్రభుత్వానికి పంపించారు ప్రతినిధి బృందాల్ని కూడా పంపించారు అవకాశం వున్న ప్రతిచోట వారు అన్యాయాల్ని తీవ్రంగా ప్రతిఘటించారు. 1893 వరకు స్థితి యిలాగే వున్నది

ఈ పుస్తకాన్ని అర్థం చేసుకొనుటకు పాఠకులు కొన్ని తేదీలు జ్ఞాపకం పెట్టుకోవడం అవసరం పుస్తకం చివర ముఖ్య ఘట్టాల అనుబంధంలో వాటి తేదీలతో బాటు యివ్వడం జరిగింది వాటిని అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటూ వుంటే అక్కడి సత్యాగ్రహ చరిత్ర తేలికగా బోధపడుతుంది 1893 నాటికి ఆరెంజ్ ఫ్రీ స్టేటులో భారతీయుల అతీగతీ లేకుండా పోయింది ట్రాన్స్‌వాల్‌లో 1885 నాటి బిల్లు యందలి 3వ నిబంధన అమలులోకి తేవడం జరిగింది. నేటాలులో కేవలం గిర్‌మిటియాలు మాత్రమే వుండుటకు వీలుగాను, మిగతా భారతీయులు వుండుటకు వీలులేని విధంగాను నిర్ణయాలు గైకొనుటకు జవాబుదారీ ప్రభుత్వ ఏర్పాటుజరిగింది.

1893 ఏప్రిల్ మాసంలో భారతదేశం వదిలి నేను దక్షిణాఫ్రికాకు బయలు దేరాను నాకు గిర్‌మిటియాల చరిత్ర తెలియదు నేను స్వార్థం కొసమే అక్కడికి వెళ్లాను డర్బన్‌లో పోర్‌బందరుకు చెందిన ముస్లిం దాదా అబ్దుల్లా పేరిట ఒక ప్రసిద్ధ వ్యాపార సంస్థవున్నది అంత ప్రసిద్ధిగల వ్యాపారసంస్థ మరొకటి వీరికి పోటీగా వున్నది అది పోర్‌బందర్‌కి చెందిన తయ్యబ్‌హాజీ ఖాన్ మహమ్మద్ గారి వ్యాపార సంస్థ అది ప్రిటోరియాలో వున్నది దురదృష్టవశాత్తు వీరిద్దరిమధ్య కోర్టులో వ్యాజ్యం నడుస్తున్నది దాదా అబ్దుల్లా గారి భాగస్వామి ఒకడు పోర్‌బందరులో వున్నాడు నావంటి క్రొత్త బారిష్టరు దక్షిణాఫ్రికా వెళితే తమ కేసు కొంత సులువుగా సాగుతుందని భావించాడు నావంటి అనుభవంలేని క్రొత్త బారిష్టరు ప్రవేశించడం వల్ల తమ వ్యాజ్యం దెబ్బతింటుందని ఆయన అనుకోలేదు అక్కడ కోర్టుకు వెళ్లి నేను వాదించనవసరం లేదు వారి పక్షాన వాదిస్తున్న ధురంధరులైన వకీళ్లకు, బారిష్టర్లకు దుబాసీగా వుండి కేసుల్ని గురించి వివరాలు చెబుతూ సహకరించాలి నాకు క్రొత్త అనుభవాలు గడించాలనే కోరిక వున్నది యాత్ర చేయడం నాకు యిష్టమే బారిష్టరుగా పని చేస్తూ నా దగ్గరికి కేసులు తీసుకు వచ్చే దళారులకు కమీషన్ యివ్వడం నాకు విషంతో సమానంగా వున్నది కాఠియావాడ్ (సౌరాష్ట్ర) యందలి గొడవలు, కుట్రలు చూచి నాకు చిరాకు వేసింది ఒక సంవత్సరం కాలం మాత్రమే ఒప్పందం చేసుకున్నాము యీ ఒప్పందం నాకు నచ్చింది యిందునాకు కలిగే నష్టమేమీ లేదు రాకపోకలకు, అక్కడ వుండుటకు అయ్యే ఖర్చంతా దాదా అబ్దుల్లాయే భరిస్తారు యిది గాక పని చేసినందుకు 105 పౌండ్లు ఫీజు విడిగా యిస్తారు యీ ఏర్పాటంతా కీర్తిశేషులు మా పెద్దన్నగారు చేశారు వారు నాకు పితృతుల్యులు వారి సౌకర్యమే నా సౌకర్యం నేను దక్షిణాఫ్రికా వెళ్లడం వారికి యిష్టం అందువల్ల నేను 1893 మేలో డర్బన్ చేరాను.

ఇక బారిష్టర్ దర్జాను గురించి నన్ను అడగాలా? నా లెక్క ప్రకారం ఫ్రాంక్ కోటు, నెక్‌టై మొదలగు వాటిని ధరించి దర్జాగా ఓడ నుంచి డర్బర్ హార్బరులో దిగాను దిగంగానే నా కండ్లు తెరుపుడు బడ్డాయి దాదా అబ్దుల్లా

గారి భాగస్వామి నేటాలును గురించి పోర్‌బందరులో నాకు చెప్పిన మాటలకు, యిక్కడ నాకు కనబడ్డ దృశ్యాలకు ఎంతో వ్యత్యాసం కనబడింది అయితే యిందులో అతని దోషం ఏమీ లేదు నిరాడంబరత్వం, అమాయకత్వం ఆయనకు వాస్తవపరిస్థితులు తెలియక పోవడం అందుకు కారణం నేటాలులో భారతీయులు అనుభవిస్తున్న కష్టాలు ఏమిటో ఆయనకు తెలియవు తెల్లవాళ్లు చేసే అవమానాలు వారికి అవమానాలని అనిపించలేదన్నమాట అక్కడ అడుగు పెట్టిన నాడే భారతీయుల ఎడ తెల్లవాళ్లు అవలంభించే అవమానకరమైన చేష్టలు ఏమిటో నాకు బోధపడ్డాయి

నేటాలు చేరిన పదిహేనురోజుల్లోనే నాకు ఎన్నో కటు అనుభవాలు కలిగాయి త్రోవలో దెబ్బలు తినవలసి వచ్చింది హోటళ్లలో వుండటానికి అక్కడచోటు సంపాదించడానికి ఎన్నో కష్టాలు పడవలసి వచ్చింది అక్కడ హోటళ్లలో చోటు దొరకడం అసంభవం ఆ ఘట్టాల వివరాల్లోకి నేను పోదలచలేదు ఆకటు అనుభవాలు నా రోమరోమానికి హత్తుకు పోయాయని మాత్రం చెప్పగలను నేను ఒక్క కేసు విషయంలో పని చేయుటకు అక్కడకు వెళ్లాను అందు నాకు స్వార్థం వున్నది అనుభవంగడించాలనే ఉత్సాహం వున్నది అందువల్ల ఆ సంవత్సరమంతా కటు అనుభవాలు అనుభవిస్తూ సాక్షిగా వుండిపోయాను నా కార్యక్రమ ప్రారంభం అప్పటినుంచి జరిగింది నా స్వార్థం కోసం దక్షిణాఫ్రికా రావడం నాకు విశేషమనిపించలేదు అవమానాలు, తిరస్కారాలు లభించే చోట వుండి ధనం సంపాదించడానికి నా దృష్టిలో విలువ పోయింది యాత్రలు చేయాలనే కోరికకూడా తగ్గిపోయింది అది నాకు సుతరామూ యిష్టం లేదు నేను ధర్మ సంకటంలో పడిపోయాను నా ఎదుట రెండు మార్గాలు వున్నాయి భారతదేశంలో వున్నప్పుడు ఏమాత్రమూ తెలియని దక్షిణాఫ్రికా పరిస్థితుల్ని కండ్లారా చూచి, అనుభవించి సంవత్సరంపాటు చేసుకున్న ఒప్పందం ప్రకారం వుండి, ఆ తరువాత తక్షణం భారత దేశానికి తిరిగి వెళ్లిపోవడం ఒక మార్గం. అక్కడ వుండి ఏది ఏమైనా సరే ప్రారంభించిన పని పూర్తి చేయడానికి పూనుకోవడం రెండవ మార్గం. నేను విపరీతమైనచలిలో, మెరిత్స్‌బర్గ్ రైలుస్టేషన్లో, రైల్వే పోలీసుల దెబ్బలు

తన్నులు తిని, యాత్రను ఆపి వేసుకొని రైలునుంచి దిగి, వైటింగ్ రూములో కూర్చొని వున్నాను నా సామాను ఎక్కడ వున్నదో నాకు తెలియదు ఎవరినైనా అడుగుదామంటే ధైర్యం చాల లేదు మళ్లీ అవమానం జరిగితే? మళ్లీ తన్నులు తినవలసి వస్తే? అట్టిస్థితిలో చలికి గజగజ వణుకుతూ కూర్చున్న వాడికి నిద్ర ఎలా పడుతుంది? మనస్సు ఆలోచనల సుడిగుండంలో చిక్కుకున్నది యోచిస్తూనే చాలా రాత్రి గడిచింది నేను ఒక నిర్ణయానికి వచ్చాను ఇక్కడ నుంచి పారిపోవడం పిరికితనం చేబట్టిన పనిని నేను పూర్తి చేసితీరాలి వ్యక్తిగతమైన అవమానాలు సహించి, తన్నులు తినవలసి వచ్చినా తిని నేను ప్రిటోరియా చేరి తీరాలి యిదే నా నిర్ణయం ప్రిటోరియా నా కేంద్రస్థలి అక్కడే దాదా అబ్దుల్లా వ్యాజ్యం నడుస్తున్నది నా పనులు చేసుకుంటూ భారతీయులు పడుతున్న కష్టాల్ని తొలగించుటకు చేతనైనంత సహాయం చేయాలి యిట్టి నిర్ణయానికి వచ్చిన తరువాత నాకు కొద్ది శాంతి లభించింది నాకు క్రొత్త శక్తి కూడా కలిగినట్లనిపించింది అయినా నాకు నిద్ర పట్టలేదు

తెల్లవారగానే నేను దాదా అబ్దుల్లా కొట్టుకి, రైల్వే జనరల్ మేనేజరుకు టెలిగ్రాములు పంపాను యిద్దరి నుంచి సమాధానం వచ్చింది దాదా అబ్దుల్లా, అప్పుడు నేటాలులోవున్న వారి భాగస్వామి సేఠ్ అబ్దుల్లా హాజీ ఆదమ్‌ఝబేరీ యిద్దరూ బాగా స్పందించారు వేరువేరు చోట్ల, మార్గంలో గల తమ భారతీయ ఏజంట్లకు నాకు ఏర్పాట్లు చేయమని టెలిగ్రాములు పంపించారు వారు జనరల్ మేనేజర్ని కూడా కలిశారు స్థానిక ఏజంటుకు యిచ్చిన వారి తంతి నందుకొని మెరిట్స్‌బర్గ్‌లో నివసిస్తున్న భారతీయ వ్యాపారస్తులు వచ్చి నన్ను కలిశారు వారు నాకు ధైర్యం చెప్పారు యిలాంటి కటు అనుభవాలు తమకు కూడా ఎన్నో కలిగాయనీ, అయితే మేము వీటికి అలవాటు పడిపోయాము కనుక మాకు ఏమీ బాధ అనిపించదు అని చెప్పారు. వ్యాపారానికి సున్నితమనస్సుకు పొంతన కుదరదని, అందువల్ల డబ్బును, డబ్బుతో పాటు యిట్టి అవమానాలను రెండిటినీ గల్లాపెట్టెలో పెట్టడం నేర్చుకున్నామని కూడా చెప్పారు. ఆ స్టేషనులోకి సింహద్వారం

నుంచి భారతీయుల్ని లోనికి రానీయరని, టిక్కట్లు తీసుకునే చోట కూడా యిబ్బందులు తప్పవని చెప్పారు ఆ రాత్రికి వచ్చిన రైల్లో నేను ప్రిటోరియాకు బయలు దేరాను నేను చేసుకున్న నిర్ణయం గట్టిదో ఓటిదో తెల్సుకోవాలని అంతర్యామి యగు పరమేశ్వరుడు పూర్తిగా నన్ను పరీక్షించాడు ప్రిటోరియా చేరే లోపున యింకా అవమానాలు సహించవలసి వచ్చింది దెబ్బలు, తన్నులు తినవలసివచ్చింది అయితే యివన్నీ నా నిర్ణయానికి బలం చేకూర్చాయి

ఈ విధంగా 1893 లో అనుకోకుండా నాకు దక్షిణాఫ్రికాలో నివసిస్తున్న భారతీయుల దుస్థితిని చూచి స్వయంగా అనుభవించి తెలుసుకునే అవకాశం లభించింది. అవకాశం దొరికినప్పుడు ప్రెటోరియాలో గల భారతీయులతో యీ విషయం చర్చించాను వారికి పరిస్థితిని తెలియజేశాను అంతకంటే మించి నేను ఏమీ చేయలేదు దాదా అబ్దుల్లా గారి కేసును గురించి పని చేయడం, దక్షిణాఫ్రికా యందలి భారతీయుల కష్టాలు తొలగించుపనిచేయడం యీ రెండూ ఒకేసారి చేయడం సాధ్యం కాదని నిర్ణయానికి వచ్చాను రెండుపనులు ఒకేసారి చేయడమంటే రెండిటినీ చెడగొట్టడమే అవుతుంది 1894వ సంవత్సరం వచ్చింది ఒక్క సంవత్సరం గడిచిపోయింది అబ్దుల్లా గారికేసుకూడా పూర్తి అయింది నేను దర్బన్ తిరిగి వచ్చాను భారత దేశం వచ్చి వేయుటకు సిద్ధమయ్యాను దాదా అబ్దుల్లా నా కోసం వీడ్కోలు సభ ఏర్పాటు చేశారు అక్కడ ఎవరో నా చేతికి "నేటాల్ మెర్క్యురీ" అను పత్రికను అందించారు ఆ పత్రికలో నేటాలు అసెంబ్లీలో జరిగిన చర్చల వివరమంతా ప్రకటించబడింది. భారతీయులకు ఓటింగు హక్కు ఇండియన్ ఫ్రేంచైజ్ అనుశీర్షికను వ్రాసి యున్న కొన్ని పంక్తులు చదివాను. అక్కడి ప్రభుత్వం అసెంబ్లీలో భారతీయులు అడుగుపెట్టేందుకు వీలులేకుండా చేస్తూ వారికి ఓటింగు హక్కును నిరాకరిస్తూ వెంటనే ఒక బిల్లును అసెంబ్లీలో ప్రవేశపెడుతున్నదని ఆపత్రిక వల్ల తెలిసింది. అంటే భారతీయుల ఉనికికే ప్రమాదం ఏర్పడిందన్నమాట ఆ వివరమంతా సన్మాన సభకు వచ్చిన వారికి చదివి వినిపించి, అందువల్ల కలిగే పరిణామాల్ని కూడా

విడమరిచి చెప్పాను యీ విషయమై యదార్థాలు నాకు సవివరంగా తెలియవు తెల్లవాళ్ల యీ ప్రయత్నాన్ని తీవ్రస్థాయిలో ఎదుర్కోవడం అవసరమని భారతీయులకు ఉద్బోధించాను వారంతా అందుకు అంగీకరించారు అయితే మేము తిన్నగా ఉద్యమం నడపలేము, దయయుంచి ఒక్కనెల రోజులు మీరు యిక్కడ వుండండి అని వారంతా నన్ను కోరారు యీ ఉద్యమం నడుపుటకు ఒకటి రెండు మాసాలు నేటాలులో వుండుటకు అంగీకరించాను ఆనాటి రాత్రి అసెంబ్లీకి పంపుటకు అర్జీ తయారు చేశాను బిల్లు ఆమోదాన్ని కొంత కాలం ఆపి వుంచమని తంతి అసెంబ్లీకి పంపించాము వెంటనే ఒక కమిటీ ఏర్పాటు చేశాము సేర్ అబ్దుల్లా హాజీ ఆదమ్‌ను ఆ కమిటీ అధ్యక్షులుగా ఎన్నుకున్నాము పైన తెలిపిన టెలిగ్రాం వారి పేరటనే పంపించాము అందువల్ల బిల్లు పరనం నేటాల్ అసెంబ్లీలో రెండు రోజులు ఆగిపోయింది ఆ అర్జీ దక్షిణాఫ్రికా అసెంబ్లీ అధికారులు నేటాలు అసెంబ్లీకి పంపించారు అది భారతీయులు దాఖలు చేసిన మొదటి అర్జీ దాని ప్రభావం బాగా పడింది అయినా అసెంబ్లీలో బిల్లు ప్యాసు అయిపోయింది ఆ వివరాలు నాలుగో ప్రకరణంలో వ్రాశాను ఇది దక్షిణాఫ్రియందలి భారతీయులందరికీ, ఉద్యమం నడుపుటకు కలిగిన ప్రథమ అనుభవం దానితో వారి ఉత్సాహం పెరిగింది ప్రతిరోజూ సభలే రోజురోజుకు జనం ఆ సభల్లో విపరీతంగా పాల్గొన సాగారు అవసరమైన దానికంటే అధికంగా ధనం వసూలు చేశారు నకళ్లు తయారు చేయుటకు, సంతకాలు చేయించుటకు వాలంటీర్లు పెద్ద సంఖ్యలో లభించారు వాళ్లు తమ సొంత డబ్బు ఖర్చు పెట్టి పని చేశారు యీ ఉద్యమంలో గిరమిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయులు కూడా పాల్గొన్నారు వారందరికీ ఇంగ్లీషు వచ్చు అంతా అందమైన అక్షరాలతో వ్రాయగలిగినవారే వారంతా రాత్రింబగళ్లు కష్టపడిపనిచేశారు ఒక్క నెలరోజుల్లో 10 వేల మందితో సంతకాలు చేయించి పెద్ద అర్జీ లార్డ్ రిప్పన్‌కు పంపించారు దానితో నా పని పూర్తి అయింది

ఇంటికి వెళ్లిపోతానని అందరికీ చెప్పాను ప్రారంభించిన ఉద్యమం భారతీయుల్లో క్రొత్త చైతన్యం తెచ్చింది వాళ్లు వెళ్లవద్దని, ఉద్యమం

విజయపంతం అయ్యేవరకు వుండమని నన్ను వత్తిడి చేయసాగారు నేటాలు ప్రభుత్వం భారతీయుల్ని వెళ్లగొట్టడానికి పూనుకున్నది మనం పంపిన మంత్రి ఏం సమాధానం పంపుతాడో ఎవరి కెరుక? మా ఉత్సాహం చూచారు కదా పని చేయడానికి మేము సిద్ధంగా వున్నాము కాని మాకు మార్గదర్శకుడు కావాలి లేకపోతే చేసిందంతా వ్యర్థమైపోతుంది అందువల్ల యిక్కడ వుండటం మీ ధర్మం అని వాళ్లు స్పష్టంగా చెప్పారు భారతీయుల హక్కుల రక్షణకై అక్కడ స్థిరంగా ఒక సంస్థ అవసరమని అందుకు నేను వుండటం అవసరమని నాకూ అనిపించింది కాని ఎక్కడ వుండాలి, ఎలా వుండాలి అనునది నాకు సమస్యగా మారింది జీతం యిస్తామని వాళ్లు అన్నారు కాని నేను జీతం తీసుకొని పని చేయనని స్పష్టంగా చెప్పివేశాను ప్రజాసేవా కార్యక్రమాలు జీతాలు తీసుకొని చేయకూడదని నా నిశ్చితాభిప్రాయం అందులో యీ ఉద్యమానికి పునాది వేసింది నేను ఆ రోజుల్లో భారతీయుల గౌరవమర్యాదలు యినుమడించేలా నేను దర్జాగా వుండాలని భావించేవాణ్ణి అయితే అలా వుండాలంటే బాగా డబ్బు కావాలి భారతీయులకు మేలు కలిగించు సంస్థలో పని చేయడం, ప్రజలపై వత్తిడి తెచ్చి వాళ్ల దగ్గర డబ్బు వసూలు చేయడం, రెండో వైపున జీవన భృతి కోసం వాళ్ల మీద ఆధారపడటం యీ రెండూ పొసగని విషయాలు యిలా చేస్తే పని చేసే నాశక్తి కూడా తగ్గిపోతుంది యీ కారణంవల్ల, మరికొన్ని కారణాల వల్ల ప్రజాహిత కార్యక్రమాలు నిర్వహించుటకు జీవన భృతికై ఎవ్వరి దగ్గర జీతం రూపంలోనైనాసరే డబ్బు తీసుకోను అని చెప్పి వేశాను అయితే ఒక మార్గం వారికి చెప్పాను "మీలో కొందరు ప్రముఖ వ్యాపారస్తులు మీవకాల్తా పనిని నాకు అప్పగించండి అందుకు అడ్వాన్సుగా (వకీలు ఫీజు) డబ్బు యివ్వండి అలా అయితేనేను యిక్కడ వుంటాను మీరు ఒక సంవత్సరానికి యివ్వవలసిన ఫీజును ముందుగా యివ్వండి ఒక సంవత్సరం యిలా పని చేద్దాం తరువాత జరిగిన పనుల్ని గురించి యోచిద్దాం సరిగా వున్నదనుకుంటే ఆ తరువాత కూడా యిలాగే చేద్దాం" అని చెప్పాను నేనిచ్చిన సలహాను సంతోషంగా అందరూ అంగీకరించారు

నేను నేటాల్ సుప్రీంకోర్టులో వకాల్తా సనదుపుచ్చుకొనుటకై అర్జీ దాఖలు చేశాను నేటాల్ లాసొసైటీ అంటే వకీళ్ల సంఘం నా అర్జీని వ్యతిరేకించింది నేటాలు చట్ట ప్రకారం నల్లరంగు గోధుమరంగు గల వాళ్లెవ్వరికీ వకీలు సనదు ఎట్టి పరిస్థితుల్లోను యివ్వడానికి వీలు లేదని వారు వాదించారు నా అర్జీని నేటాల్ యందలి ప్రసిద్ధ వకీలు కీ॥శే॥ శ్రీ ఎస్కంబ్ సమర్థించారు వారు అటార్నీ జనరల్ తరువాత నేటాలుకు ప్రధాన మంత్రిగా కూడా పని చేశారు వకీళ్ల సంఘానికి చెందిన ఏ బారిష్టరూ, ఫీజు తీసుకోకుండా వకీలు సనదు కోసం దాఖలు చేసుకునేవారి అర్జీని సమర్థించకూడదని అక్కడి రివాజు శ్రీ ఎస్కంబ్ దాదా అబ్దుల్లా గారి వకీలు కూడా వకీళ్ల సంఘంచేసిన వాదనను సీనియర్ కోర్టు నిరాకరించి నా అర్జీని అంగీకరించింది యీ విధంగా వకీళ్ల సంఘం నా అర్జీని తీవ్రంగా వ్యతిరేకించడం, వాళ్ల అంగీకారం లేకుండానే నా అర్జీకి అంగీకారం లభించడం వల్ల నా పేరు అక్కడి పత్రికల్లో ప్రముఖంగా చోటు చేసుకుంది నాకు మంచి ప్రచారం లభించింది దక్షిణాఫ్రికాకు చెందిన పలుపత్రికలు నేటాలు వకీళ్ల సంఘాన్ని ఎగతాళి చేశాయి. కొన్ని పత్రికలు నాకు అభినందనలు తెలిపాయి

సేఠ్ అబ్దుల్లా హాజీఆదమ్ అధ్యక్షతన ఏర్పడిన కమిటీకి స్థిరరూపం యివ్వబడింది నేను అప్పటి వరకు భారత జాతీయ కాంగ్రెస్‌కు సంబంధించిన ఏ సమావేశంలోను పాల్గొన లేదు కాని దాన్ని గురించి చాలా విన్నాను హింద్‌దాదా (తాత) దాదాభాయీనౌరోజీ గారి దర్శనం నేను చేసుకున్నాను నేను వారిని పూజించేవాణ్ణి అందువల్ల భారత జాతీయ కాంగ్రెసుకు నేను భక్తుణ్ణి అయిపోయాను యీ కాంగ్రెస్ పేరును ప్రచలితం చేయాలనే కోరిక కూడా నాకు కలిగింది నావంటి అనుభవంలేని వ్యక్తి క్రొత్త పేరు ఎక్కడి నుంచి తేగలడు? తప్పు జరుగుతుందేమోననే భయం కూడా నన్ను వెంటాడుతున్నది. అందువల్ల అక్కడి కమిటీ వారికి "నేటాల్ ఇండియన్ కాంగ్రెస్" అని పేరు పెట్టమని సలహా యిచ్చాను. భారత జాతీయ కాంగ్రెస్‌ను గురించిన నా అసంపూర్ణ జ్ఞానాన్ని, నేను అసంపూర్ణంగానే నేటాల్ యందలి భారతీయులకు అందజేశాను చివరికి 1894 మే లేక జూన్

మాసంలో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ స్థాపన జరిగింది భారత జాతీయ కాంగ్రెస్‌కు, నేటాల్ కాంగ్రెస్‌కు మధ్య ఒక తేడా వున్నది నేటాల్ కాంగ్రెస్ సంవత్సరానికి 365 రోజులూ పని చేస్తుంది సంవత్సరానికి 3 పౌండ్లు రుసుము చెల్లించిన వారు యీ కాంగ్రెస్ మెంబర్లు అవుతారు దాతలు ఎక్కువ సొమ్ము యిచ్చినా స్వీకరించి వారి పేర విరాళంగా జమ చేస్తారు ఎక్కువ సొమ్ము చెల్లించమని అందరినీ కోరడం జరిగింది ఆరు లేక ఏడు మంది మెంబర్లు సంవత్సరానికి 24 పౌండ్లు కూడా యివ్వడం ప్రారంభించారు 12 పౌండ్లు యిచ్చే వారి సంఖ్య ఎక్కువగా వున్నది ఒక నెల రోజుల్లో నేటాల్ కాంగ్రెస్‌లో 300 మంది మెంబర్లు చేరాయి వారిలో హిందువులు, మహమ్మదీయులు క్రైస్తవులు, పారసీకులు మొదలగు అన్ని మతాలవాళ్లు వున్నారు నేటాలునందు నివసించే వివిధ ప్రాంతాల వారు కూడా వున్నారు మొదటి సంవత్సరం పని బ్రహ్మాండంగా జరిగింది పెద్దపెద్ద వ్యాపారస్తులు, తమ తమ వాహనాల్లో కూర్చొని, దూరదూర గ్రామాలకు క్రొత్త మెంబర్లను చేర్చుటకు చందాలు వసూలు చేయుటకు వెళ్లేవారు అడగంగానే జనం చందాలు వెంటనే యిచ్చేవారు కాదు వారికి వివరమంతా చెప్పవలసి వచ్చేది ప్రజలకు చెప్పాలంటే చెప్పేవారికి రాజకీయ పరిజ్ఞానం అవసరం కదా అందువల్ల జనం విషయాన్ని అర్థం చేసుకునేవారు యిదిగాక నెలకొకసారి నేటాల్ కాంగ్రెస్ సమావేశం జరుగుతూ వుండేది ఆ సమావేశంలో జమాఖర్చుల వివరాలు ప్రతిపైసకు లెక్కలు తెలియజేయడం, మెంబర్లంతా అంగీకరించడం, ఆ నెలరోజుల్లో జరిగిన ఘట్టాలు వివరించడం, ఆ వివరమంతా మినిట్స్ బుక్కులో వ్రాయడం జరుగుతూ వుండేది మెంబర్లు రకరకాల ప్రశ్నలు అడగతూ వుండేవారు క్రొత్త కార్యక్రమాల్ని గురించి చర్చలు జరుగుతూ వుండేవి దీనివల్ల ఎన్నో లాభాలు కలిగాయి ఎప్పుడూ మాట్లాడి ఎరుగనివారు మాట్లాడటం నేర్చుకున్నారు ఉపన్యాసాలు కూడా జాగ్రత్తగా యివ్వసాగారు యిదంతా అక్కడి భారతీయులకు క్రొత్తగా వున్నా, కొద్ది కాలంలోనే అందుకు వారంతా అలవాటు పడిపోయారు యింతలో లార్డ్‌రిప్పన్ నేటాలు బిల్లును నిరాకరించాడని వార్త వచ్చింది దానితో

భారతీయుల మనోబలం పెరిగింది సంతోషం కలిగింది వాళ్లకు ఒక గట్టి నమ్మకం ఏర్పడింది

బయట ఉద్యమంతో పాటు, అంతరంగిక సంస్కరణలు జరపాలనే భావం కూడా భారతీయులకు కలిగింది భారతీయుల నడవడి, ఆచార వ్యవహారాలను గురించి దక్షిణాఫ్రికా యందంతట వ్యతిరేక ప్రచారం ముమ్మరంగా సాగుతూ వుండేది దానికి తెల్లవాళ్లే కారణం భారతీయులు మురికి వాళ్లు లోభులు వ్యాపారం చేసే ఇంట్లోనే వుంటారు వాళ్ల గృహాలు మురికి కూపాలు గాలి వెలుగు తొంగైనా చూడవు తమ సుఖాల కోసం, విశ్రాంతి కోసం కూడా డబ్బు ఖర్చుపెట్టరు యిలాంటి మురికివాళ్లతో అసహ్యించుకోవలసిన భారతీయులతో తెల్లవారు ఎలా సయోధ్యతగా వుండగలరు యిదీ తెల్లవాళ్లు భారతీయుల మీద చేసే ఆరోపణలు యీ ఆరోపణల నుంచి బయటపడవలసిన ఆవశ్యకతను గురించి అందుకు తీసుకోవలసిన చర్యలను గురించి భారతీయులు ఉపన్యాసాలు యివ్వడం ప్రారంభించారు యీ చర్చలన్నీ మాతృ భాష (గుజరాతీ)లోనే జరిగేవి

దీనివల్ల నేటాల్ జనానికి ఎంతటి రాజకీయ సాంఘిక జ్ఞానం కలిగిందో పాఠకులు ఊహించుకోవచ్చు నేటాల్ కాంగ్రెస్ ఆధ్వర్యాన గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయుల బిడ్డలకు అందులోను నేటాల్‌లో పుట్టి ఇంగ్లీషు నేర్చినా నవయువకులకు విద్యా బోధన జరుపుటకు ఒక విద్యా సంస్థ (నేటాల్ ఇండియన్ ఎడ్యుకేషనల్ అసోసియేషన్) స్థాపించారు పేరుకు మాత్రం దానికి కొద్ది చందా నిర్ణయించారు అలాంటి భారతీయ యువకుల్ని ఒకచోట చేర్చడం, పరస్పర పరిచయాల ద్వారా ప్రేమను పెంచుకోవడం, భారత దేశం అంటే ఏమిటో చెప్పి వారి హృదయాల్లో దేశభక్తిని పెంపొందింపచేయడం సంస్థ యొక్క ప్రధాన లక్ష్యం స్వతంత్ర భారతీయ వ్యాపారులు కూడా వారిని ప్రేమిస్తున్నారని, వారికి వ్యతిరేకులుకారని బోధ చేయడం, వ్యాపారుల హృదయాలలో కూడా అట్టి భావం నెలకొల్పడం ఆ సంస్థ యొక్క రెండవలక్ష్యం నేటాల్ కాంగ్రెస్ దగ్గర పెద్ద మొత్తాలు

చేరాయి ఆ డబ్బుతో సంస్థకోసం సొంతభూమిని కొన్నారు తద్వారా సంస్థకు మంచి ఆదాయం లభించింది

ఈ వివరాలన్నింటినీ కావాలనే నేను పేర్కొన్నాను యీ వివరాలన్నీ తెలియకపోతే దక్షిణాఫ్రికా భారతీయులు పెద్ద ఉద్యమానికి ఎలా సిద్ధమైనారో, ఎలా ఉద్యమం సాగించారో అర్థం కావడం కష్టం నేటాల్ కాంగ్రెస్‌కు కలిగిన కష్టాలు ఎన్నోవున్నాయి ప్రభుత్వాధికారులు ఎన్నిసార్లు ఎన్నోరూపాలలో దానిమీద దాడులు చేశారు వాటినుంచి అది సురక్షితంగా బయటపడింది ఇటువంటి విషయాలు చాలా వున్నాయి కాని వాటిని వివరణ తగ్గించవలసివచ్చింది అయితే ఒక్క విషయం యిక్కడ చెప్పకతప్పదు భారతజాతి సదా అతిశయోక్తులనుంచి రక్షణ పొందింది జాతియందలి దోషాల్ని, వాటిని తొలగించుకొనే విధానాల్ని గురించి కృషి జరుగుతూనే వున్నది తెల్లవాళ్ల ఆరోపణల యందలి సత్యాన్ని తక్షణం అంతా అంగీకరించేవారు స్వాభిమానాన్ని, స్వాతంత్ర్యాన్ని రక్షించుకుంటూ తెల్లవాళ్లకు అవసరమైన సహాయసహకారాలు అందించుటకు కూడా సంస్థ సిద్ధపడేది అవసరమైన సమాచారం మాత్రమే దక్షిణాఫ్రికా పత్రికలకు విడుదల చేసేవారు భారతీయుల మీద విచ్చలవిడిగా అనాలోచితంగా చేయబడే ఆరోపణలకు సమాధానాలు వెంటనే ఆయా పత్రికలకు పంపబడుతుండేవి

నెటాల్‌లో నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ వున్నట్లే, ట్రాన్స్‌వాల్‌లో కూడా భారతీయుల సంస్థ ఒకటి ప్రారంభమైంది ట్రాన్స్‌వాల్‌లోగల ఆ సంస్థ నేటాల్ కాంగ్రెస్‌కు లోబడి లేదు అది స్వతంత్రంగా పనిచేస్తున్నది రెండు సంస్థల అభిప్రాయాలలోకూడా కొద్ది తేడా వున్నది అయితే యిక్కడ ఆ వివరాల్లోకి పోను ఇలాంటిదే ఒక సంస్థ కేప్‌టౌనులో కూడావున్నది నేటాల్ ట్రాన్స్‌వాల్ సంస్థల నియమావళుల ననుసరించి దాని నియమావళిలేదు అయినా మూడు సంస్థల లక్ష్యం ఒక్కటే మూడింటి కార్యక్రమాల పరమావధి ఒక్కటే

1894వ సంవత్సరం గడిచిపోయింది నేటాల్ కాంగ్రెస్ చరిత్ర యొక్క ఒక సంవత్సరం 1895 మధ్యకాలంలో గడిచిపోయింది నా వకాల్తా పని

కక్షిదారులకు నచ్చింది అందువల్ల నేటాల్‌లో నేనుండవలసిన కాలం యింకా పొడిగించబడింది 1896లో అక్కడి భారతజాతి అనుమతిపొంది నేను ఆరుమాసాలపాటు భారతదేశం వచ్చాను ఆరుమాసాలు పూర్తికాకముందే నేటాలు నుంచి తంతివచ్చింది నేను వెంటనే నేటాలుకు వెళ్లక తప్పలేదు అక్కడ 1896-97లో జరిగిన ఘట్టాలను గురించి వేరే ప్రకరణంలో వివరిస్తాను

★ ★ ★

## 7

## భారతీయులు ఏం చేశారు? - 2

నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ యొక్క కార్యక్రమాలు స్థిరపడ్డాయి రెండున్నర సంవత్సరాలు నేను నేటాలులో గడిపాను దక్షిణాఫ్రికాలో నేను వుండాలనుకుంటే కుటుంబాన్ని భారతదేశాన్నుంచి తీసుకురావాలనే నిర్ణయానికి వచ్చాను భారతదేశం వెళ్లి రావాలని కూడా నాకు కోరిక కలిగింది భారతదేశంలో తిరిగి నేటాలు విషయాలే గాక, దక్షిణాఫ్రికాకు చెందిన మిగతా అధినివేశ రాజ్యాల్లో గల భారతీయుల స్థితిగతులను గురించి కూడా భారత ప్రజలకు తెలియజేయాలని భావించాను కాంగ్రెస్ నాకు ఆరు మాసాల సెలవు యిచ్చింది నాకు బదులుగా నేటాలుకు చెందిన ప్రసిద్ధ వ్యాపారి కీ॥శే॥ ఆదంజామియా ఖాన్ సెక్రటరీగ నియమితులైనారు వారు కాంగ్రెస్ కార్యక్రమాలు ఎంతో సమర్థవంతంగా నిర్వహించారు వారికి ఇంగ్లీషు బాగా వచ్చు అనుభవంద్వారా ఇంగ్లీషులో కార్యక్రమాలు నడపగల సామర్థ్యం గడించారు గుజరాతీ భాష మామూలుగా వారికి వచ్చు వారి వ్యాపారం హబ్షీల మధ్య జరుగుతూ వుంటుంది, గనుక జూలూభాష వారు నేర్చుకున్నారు హబ్షీవారి అలవాట్లు వారికి బాగా తెలుసు వారిది శాంత స్వభావం అందరితో కలుపుకోలుతనంగా వుండటం వారి విశేషం మితభాషి ఇదంతా ఎందుకు వ్రాస్తున్నానో చెబుతాను బాధ్యతాయుతమైన పదవిని నిర్వహించాలనే ఇంగ్లీషుభాషాజ్ఞానం విద్వత్తు ఎంత అవసరమో, అంతకంటే

నిజాయతీ, శాంతి, ఓర్పు, దృఢత్వం, సమయపాలన, సాహసం, వ్యావహారిక జ్ఞానం, అవసరం ఎంత విద్వత్తు వున్నా మిగతా విశేషాలు లేకపోతే ప్రయోజనం వుండదు ఇది స్వానుభవం వల్ల నేను తెలుసుకున్న విషయం

1896 మధ్య కాలంలో నేను భారతావనికి వచ్చాను నేను కలకత్తా చేరాను ఆ రోజుల్లో నేటాలునుంచి ఓడద్వారా కలకత్తా చేరడం సులభం గిర్‌మిటియా కార్మికులు కలకత్తా నుంచో లేక మద్రాసునుంచో నేటాలు చేరేవారు కలకత్తా నుంచి బొంబాయివస్తూ త్రోవలో రైలు తప్పిపోయినందున, ఒక్క రోజు అలహాబాదులో ఆగవలసి వచ్చింది అక్కడినుంచే నా పనిని ప్రారంభించాను పయోనీర్ పత్రికకు సంబంధించిన శ్రీ చేజనీని కలుసుకున్నాను ఆయన నాతో ఎంతో సుహృద్భావంతో మాట్లాడారు అధినివేశ రాజ్యాల్లో వుంటున్న తెల్లవారి యెడ తనకు సానుభూతి కలదని ఆయన స్పష్టంగా చెప్పారు అయితే అక్కడి పరిస్థితుల్ని గురించి వ్రాసి యిస్తే పయోనీర్ పత్రికలో ప్రచురించి, దానితో పాటు తన అభిప్రాయంను ప్రకటిస్తానని మాట యిచ్చాడు దానికి నేను తృప్తి పడ్డాను

భారత దేశంలో వున్నప్పుడు నేను దక్షిణాఫ్రికాలో వుంటున్న భారతీయుల పరిస్థితులను గురించి ఒక చిన్న పుస్తకం వ్రాశాను ఆ పుస్తకం మీద దేశంలో గల భారతీయ పత్రికలన్నీ సంపాదకీయాలు వ్రాశాయి రెండు సార్లు ఆ పుస్తకం ముద్రించ వలసివచ్చింది అయిదు వేల ప్రతులు నేను విడుదల చేశాను అనేక మంది దేశ నాయకుల్ని కలుసుకున్నాను బొంబాయిలో సర్‌ఫిరోజ్ షామెహతా, న్యాయమూర్తి బదరుద్దీన్ తయాబ్జీ, మహాదేవ గోవిందరానడే మొదలగువారిని, పూనాలో లోకమాన్య బాలగంగాధరతిలక్, వారికి సంబంధించిన పెద్దల్ని ప్రొఫెసర్ భండార్కర్, గోపాలకృష్ణ గోఖలే, వారికి సంబంధించిన పెద్దల్ని కలుసుకున్నాను బొంబాయి, పూనా, మద్రాసుల్లో నేను ఉపన్యాసాలు, యిచ్చాను వాటన్నిటివివరాల్లోకి నేను పోదలచలేదు

అయితే పూనాలో జరిగిన ఒక ఘట్టం పేర్కొనక తప్పదు దానికి మన సమస్యకు సంబంధం లేదు అక్కడ బహిరంగ సభ, లోకమాన్య తిలక్‌గారి సలహా ప్రకారం జరిగింది కీ॥శే॥ గోఖలేగారికి దక్కన్ సభతో సంబంధం

వున్నది అందరికంటే ముందు నేను తిలక్ మహారాజ్‌ని కలుసుకున్నాను పూనాలో జరుపవలసిన సభను గురించి తిలక్‌గారిని అడిగాను మీరు గొపాల రావును కలిశారా అని వారు నన్ను అడిగారు

మొదట వారు ఏ గోపాలరావును గురించి అడుగుతున్నారో నాకు అర్థం కాలేదు అప్పుడు వారు శ్రీ గోఖలేను కలిశారా? వారిని ఎరుగుదురా అని అడిగారు

నేను - వారిని యింత వరకు నేను కలవ లేదు వారి పేరు మాత్రం విన్నాను వారినికలుసుకుందామని అనుకుంటున్నాను

లోకమాన్యుడు - భారత దేశపు రాజకీయాలు మీకు తెలిసినట్లు లేదు

నేను - ఇంగ్లాండులో చదువు ముగించుకొని భారతావని వచ్చాను కాని యిక్కడ ఎక్కువకాలం వుండలేదు వున్న కాలంలో కూడా రాజకీయ రంగానికి దూరంగా వున్నాను అది నా శక్తికి మించినపని అని అనుకున్నాను

లోకమాన్యుడు - అయితే నేను కొద్దిగా మీకు చెప్పాలి పూనాలో రెండు పక్షాలు వున్నాయి ఒకటి సార్వజనిక సభకు సంబంధించినది రెండవది డక్కన్ సభకు సంబంధించినది

నేను-ఈ విషయం నాకు కొద్దిగా తెలుసు

లోకమాన్యుడు-ఇక్కడ సభజరపడం తేలికయే మీరు పార్టీలన్నిటికి అక్కడి సమస్యలు తెలియజేయాలనీ, అన్నిటి సమర్థన పొందాలని భావిస్తున్నారు యిది నాకు నచ్చింది అయితే సార్వజనిక సభకు చెందిన వ్యక్తి మీ సభకు అధ్యక్షత వహిస్తే డక్కన్ సభకు సబంధించిన వాళ్లెవ్వరూ రారు డక్కన్ సభకు సంబంధించిన వారెవరైనా అధ్యక్షత వహిస్తే సార్వజనిక సభకు చెందిన వారెవ్వరూ రారు అందువల్ల మీరు తటస్థవ్యక్తిని అధ్యక్షుణ్ణిగా ఎన్నుకోండి ఈ విషయయంలో నేను సలహామాత్రమే యివ్వగలను యింకే సహాయం చేయలేను మీరు ప్రొఫెసర్ భండార్కరును ఎరుగుదురా? ఎరుగకపోయినా మీరు వారిని కలవండి వారు తటస్థంగా వుండే వ్యక్తి వారు రాజకీయాల జోలికిపోరు వారిని కలిస్తే, వారినే మీ సభకు అధ్యక్షులుగా వుంచాలని మీరు అనుకుంటారు శ్రీ గోఖలేతో కూడా యీ

విషయం మాట్లాడండి వారుకూడా నామాదిరిగానే మీకు సలహా యివ్వవచ్చు ప్రొఫెసర్ భండార్కరు అధ్యక్షత వహిస్తే యిరుపక్షాలవారు పూనుకొని సభను జయప్రదం చేస్తారు నాసాయం మీకు పూర్తిగా లభిస్తుంది

లోకమాన్యుని సలహా గైకొని నేను శ్రీ గోఖలేగారిని కలిశాను మొదటి కలయికలోనే వారు నా హృదయం మీద చెక్కుచెదరని ముద్ర ఎంతగా వేశారో గతంలో వ్రాశాను తెలుసుకోవాలనుకుంటే పాఠకులు యంగ్ ఇండియా లేక నవజీవన్ పాతపత్రికల్ని చదవవచ్చు లోకమాన్యుని సలహా శ్రీ గోఖలేగారికి కూడా నచ్చింది వెంటనే నేను భండార్కర్‌గారి దగ్గరకు వెళ్ళాను నేటాల్ భారతీయుల పరిస్థితుల్ని గురించి శ్రద్ధగ విని శ్రీ భండార్కర్ "నేను బహిరంగసభలకు వెళ్లను నేను వృద్ధుణ్ణి మీ మాటలు నన్ను అమితంగా ప్రభావితం చేశాయి అన్ని పక్షాల సహాయం పొందాలని మీరు భావించడం ఎంతో సమంజసం అవసరం కూడా మీరు నవయువకులు భారతదేశపు రాజకీయాలు మీకు తెలియవు అందువల్ల యిరుపక్షాలవారికి చెప్పండి నేను బహిరంగసభకు అధ్యక్షత వహిస్తాను వారిలో ఎవరైనా సభ జరుగుతుందని నాకు తెలియజేస్తే చాలు, నేను వచ్చి సభకు అధ్యక్షత వహిస్తాను" అని చెప్పారు

పునాలో సభ జయప్రదంగా జరిగింది ఇరుపక్షాల నాయకులు అందు, పాల్గొన్నారు ఇరుపక్షాల నాయకులు సభలో ప్రసంగించారు ఆ తరువాత నేను మద్రాసు వెళ్లాను అక్కడనేను జస్టిస్ సుబ్రహ్మణ్య అయ్యర్, శ్రీ పి ఆనందాచార్యులు, హిందూ పత్రిక తాత్కాలిక సంపాదకుడు శ్రీజి సుబ్రమ్మణ్యం, మద్రాస్ స్టాండర్డ్ సంపాదకుడు శ్రీ పరమేశ్వరన్ పిళ్లె, ప్రసిద్ధ వకీలు శ్రీ భాష్యం అయ్యంగార్, శ్రీ నార్టన్ మొదలగు వారిని కలిశాను అక్కడ కూడా ఒక పెద్ద సభ జరిగింది మద్రాసు నుంచి నేను కలకత్తా వెళ్లాను అక్కడ నేను శ్రీసురేంద్రనాథ్‌బెనర్జీ, మహారాజా జ్యోతీంద్రనాథటాగూర్, ఇంగ్లీషుమెన్ సంపాదకుడు కీ॥శే॥ శ్రీసాండర్స్, తదితరులను కలిశాను కలకత్తాలో సభ జరుపుటకు ఏర్పాటు జరుగుతూవున్నాయి యింతలో నేటాలు నుంచి 1896 నవబంరులో నాకు వెంటనే రండి అని తంతి

అందింది అక్కడ ఏదో వ్యతిరేకవ్యవహారం జరుగుతున్నదని బోధపడింది దానితో కలకత్తా సభను విరమించుకొని నేటాలుకు బయలుదేరాను బొంబాయి నుంచి బయలుదేరే మొదటి ఓడ మీద నాకుటుంబ సభ్యులతో సహా బయలుదేరాను ఆఓడను దాదా అబ్దుల్లా గారి వ్యాపారసంస్థ వారు కొన్నారు వారు పలుసాహసకార్యాలు చేశారు అట్టి కార్యాల్లో నేటాలు, పోరుబందరు మధ్య ఓడ నడపడం నిజంగా సాహసకార్యమే ఆ ఓడ పేరు కుర్లాండ్ కుర్లాండుకు టిక్కట్టుకొన్నాను ఈ ఓడ బయలుదేరిన వెంటనే అదే రోజున పర్షియన్ కంపెనీ వారి ఒక ఓడ నాదరీ కూడా బొంబాయి నుంచి నేటాలుకు బయలుదేరింది ఈ రెండు ఓడల్లో కలిపి దక్షిణాఫ్రికాకు వెళ్లే వారు సుమారు 800మంది వున్నారు

భారతదేశంలో దక్షిణాఫ్రికా యందలి భారతీయుల స్థితిగతులను గురించి నేను చేసిన ప్రచారం తారస్థాయిని చేరుకున్నది భారతదేశమందలి పత్రికలన్నీ సంపాదకీయాలు, వ్యాఖ్యలు ప్రచురించాయి రాయిటర్ పంపిన తంతులద్వారా విదేశాలకు చాలా సమాచారం అందింది ఈ విషయం నేటాలు చేరిన తరువాత నాకు తెలిసింది విదేశాలకు చేరిన సమాచారాన్ని అందుకొని అక్కడి రూటర్ ప్రతినిధి క్లుప్తంగా ఒక తంతి దక్షిణాఫ్రికా కూడా పంపించాడు ఆ తంతి ద్వారా పంపిన సమాచారంలో నేను చెప్పిన దానికి అతిశయోక్తులు అతడు జోడించాడు ఇలాంటి అతిశయోక్తులు మనం అప్పుడప్పుడు చూస్తూనే వుంటాం అయితే కావాలని చేస్తారా అంటే చేయరు అనేక పనుల్లో మునిగివుండేవారు, తమకు గల ఉద్దేశ్యాలు, భావాలు లోపల పెట్టుకొని, పైపై విషయాన్ని చదివి దానిమీద వార్త వ్రాస్తారు ఒక్కొక్కప్పుడు అట్టి వార్త వ్రాసిన వాడి ఊహయే గాని అదిసత్యం కాదు ఆవార్తకు వేరు వేరు చోట్ల వేరు వేరు అర్థాలు తీస్తారు ఇదంతా సామాన్యంగా జరుగుతూనే వుంటుంది ప్రజారంగంలో యిటువంటివి తప్పవు అయితే వాటికి ఒక హద్దుకూడా వుంటుంది భారత దేశంలో వున్నప్పుడు నేను నేటాలుకు చెందిన తెల్ల వారిని విమర్శించాను వారిమీద ఆరోపణలు చేశాను గిరమిటియా కార్మికులపై విధించబడిన 3 పౌండ్ల తలపన్నును కఠినంగా విమర్శించాను

బాలసుందరం అను గిర్‌మిటియా కార్మికునిపై అతడి యజమాని చెయ్యిచేసుకున్నాడు అతడి శరీరానికి చాలా గాయాలయ్యాయి వాటిని నేను స్వయంగా చూచాను అతడికేసు నాచేతికి వచ్చింది అతడి కష్టాల్ని గురించి నాకు తెలిసిన సమాచారం ప్రకారం యిక్కడ బాగానే చెప్పాను రూటరు ప్రతినిధి ఆవార్తను తారుమారుచేశాడు అతడు పంపిన వార్త నేటాలు చేరేసరికి అక్కడ తెల్లవారు నామీద ఉగ్రులైపోయారు ఈ విషయంలో నేటాల్లో నేను వ్రాసిన వార్తలే భారతదేశంలో కంటే తీవ్రంగా వున్నాయి నేను భారతదేశంలో ఒక్కఅతిశయోక్తి కూడా చెప్పలేదు సామాన్యంగా మనం ఒక తెలియని వ్యక్తి ఎదుట, కొన్ని వివరాలు చెప్పినప్పుడు అతడు మనం ఉహించినదాని కంటే అధికంగా ఉహించికొంత కల్పించి వ్రాస్తాడు. వాస్తవానికి ఇండియయాలో వున్నప్పుడు తగ్గించే అక్కడి వివరాలు చెప్పాను నేటాలులోవున్నాప్పుడే కఠినంగా వ్రాశాను నేటాలులో నేను ప్రచురించిన వార్తలు అక్కడి తెల్లవాళ్లు చదివేవారు కాదు చదివినా లెక్కచేసే వారు కాదు కాని భారతదేశంలో నేను చెప్పినట్లు రాయిటర్ విదేశాలకు పంపబడిన వార్తలకు ఎక్కడలేని ప్రాధాన్యం సంతరించుకున్నది దానితో నేటాలు యందలి తెల్లవారిని పెద్ద భయం పట్టుకున్నది నా ప్రచారం వల్ల గిర్‌మిటియా కార్మికులు యిక రారని, వచ్చిన వాళ్లుకూడా వుండరని, యిప్పుడు తాముగడిస్తున్న లాభాలు తగ్గిపోతాయని అనుకున్నారు అంతేగాక భారతదేశంలో నేటాలుకు చెందిన తెల్లవారు అవమానం పాలు అయ్యారని కూడా ఉహించుకున్నారు

నామీద మండిపడిపోయారు యింతలో నేను కుటుంబంతో సహాకుర్లాండు ఓడలో నేటాలుకు, వస్తున్నానని వాళ్లకు సమాచారం అందింది ఆఓడలో 300లేక 400 మంది భారతీయులుకూడా వస్తున్నారని తెలుసుకున్నారు. కుర్లాండు ఓడ వెనక నాదరీ ఓడకూడా వస్తున్నదనీ, అందులో కూడా యింతమందే భారతీయులు వస్తున్నారని వాళ్లకు తెలిసింది. ఈ సమాచారం వల్ల నిప్పులో నెయ్యి పోసినట్లయింది. దానితో మరీ పెట్రేగి పోయారు పెద్ద సభలు చేశారు పెద్ద పెద్ద తెల్లజాతి వారంతా ఆ సభల్లో

పాల్గొన్నారు ఓడల్లో వస్తున్న భారతీయులకు వ్యతిరేకంగా ప్రసంగాలు జరిగాయి కుర్లాండు, నాదరీఓడల్లో భారతీయులు నేటాలు తెల్లవాళ్ల మీద దాడి చేయడానికి వస్తున్నారని తప్పుడు ప్రచారం చేశారు 800 మంది భారతీయుల్ని నేను రెండుఓడల్లో నేటాలకు తీసుకువస్తున్నాని నామీద ఆరోపణ చేశారు నేటాలును స్వతంత్ర భారతీయులతో నింపడానికి నేను చేస్తున్న ప్రథమ ప్రయత్నం యిది అని జనాన్ని రెచ్చకొట్టారు అసలు మమ్మల్ని నేటాలులో దిగనీయవద్దని ప్రభుత్వమే రెచ్చగొట్టింది ఈ జనాన్ని వాపసు పంపివేయాలని, అలాపంపకపోతే తెల్లవారే చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకొని మమ్మల్ని వెళ్లగొట్టాలని తీర్మానించుకున్నారు యింతలో రెండు ఓడలు నేటాలు హార్బరుకు చేరాయి

1996లో మొదటిసారి భారతదేశంలో ప్లేగు వ్యాధి వ్యాప్తమైన విషయం పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది నేటాలు ప్రభుత్వం దగ్గర మమ్మల్ని తిరిగి పంపించే అధికారం ఏమీలేదు అప్పటికి ప్రవేశపత్రాల చట్టం యింకా అమల్లోకి రాలేదు నేటాలు ప్రభుత్వం అక్కడి తెల్లవారికి బాగా అనుకూలం నేటాలు ప్రభుత్వంలో పనిచేస్తున్న ఒక మంత్రి కీ॥శే॥ శ్రీఎస్కంబ్ ఆ కమెటీకి పూర్తి సహాయకారాలు అందిస్తూవున్నాడు కమిటీని రెచ్చగొట్టేపనికూడా ఆయనే నిర్వహిస్తున్నాడు ఓడల్ని ఒక నిశ్చితమైన వ్యవధివరకు క్వారంటీన్‌లో వుంచుతారు అంటే ఓడతోగల సంబంధాలన్నీ ఆపివేస్తారన్నమాట యాత్రీకుల్ని, వారి సామానున ఓడలోనే వుంచివేస్తారు హార్బరులో దిగనీయరు ఈ నిర్ణయం హార్బర్‌కు సంబంధించిన ఆరోగ్యాధికారి ఆర్డరు ప్రకారం జరుగుతుంది ఈ అధికారాన్ని నేటాలు ప్రభుత్వం రాజకీయ కారణాలకు వుపయోగించుకున్నది అంటే అట్టి అధికారాన్ని దుర్వినియోగ పరిచిందన్న మాట ఏ యాత్రీకునికీ ఏ విధమైన జబ్బు లేకపోయినా రెండు ఓడల్నీ 23 రోజులవరకు హార్బరులో ఆపి వుంచారు ఈ లోగా తెల్లవాళ్ల కమెటీ తన పని సాగించింది దాదా అబ్దుల్లా కుర్లాండుకు యజమాని నాదరీ ఓడ కూడా వారి ఏజంటుదే ఆయనను తెల్లవాళ్లు బెదిరించారు భయపెట్టారు. రెండు ఓడల్ని తిరిగి ఇండియాకు పంపించి వేయమని ఆయన పై

రకరకాలుగా వత్తిడి తెచ్చారు ఆశ కూడా పెట్టారు తమ మాట వినకపోతే మీవ్యాపారాన్ని ఆపివేస్తామని కూడా భయపెట్టారు కాని ఆయన పిరికి రకంకాదు వాళ్లు తెల్లవాళ్లకు స్పష్టంగా చెప్పివేశారు "మావ్యాపారం పోయినా సరే, నష్టపడిపోయినా సరే తలవంచం చివరి వరకూ పోరాడుతాం అంతేగాని ఏదోషం చేసి ఎరుగని యీయాత్రీకుల్ని మాత్రం ఇండియాకు తిరిగి పంపం అట్టి పాపం మేము చేయం మీకు మీదేశమంటే ఎంత అభిమానమో, మాకు మాదేశమంటే అంతే అభిమానం అనికూడా చెప్పివేశారు ఈకంపెనీ వకీలు శ్రీ ఎఫ్॥ఏ॥ లాటన్ కూడా సాహసి యోధుడు

ఇదే సమయంలో అనుకోకుండా కీ॥శే॥ శ్రీ మనసుఖలాల్ హీరాలాల్ నాజర్(సూరత్ నగకాయస్థులు కీ॥శే॥శ్రీ నానాభాయి హరిదాస్ మేనల్లుడు) దక్షిణాఫ్రికా వచ్చారు నేను వారిని ఎరుగను వారు వచ్చారనికూడా నాకు తెలియదు కుర్లాండు, నాదరీ ఓడల్లో వచ్చిన భారతీయుల్ని నిజంగా,నేను తీసుకోరాలేదని చెప్పనవసరంలేదని భావిస్తున్నాను వారిలో ఎక్కువ మంది భారతీయులు దక్షిణాఫ్రికాలో నివసిస్తున్న పాతవారే కొంతమంది ట్రాన్స్‌వాల్ వెళ్లవలసినవాళ్లు ఉండగా యీ ఓడల్లో ఎక్కారు ఈ ప్రయాణీకులను కూడా బెదిరిస్తూ తెల్లవాళ్లు వార్తలు పంపారు కెప్టెన్ వాళ్లు పంపిన హెచ్చరికల్ని యాత్రీకులకు చదివి వినిపించారు "నేటాల్ యందలి తెల్లవారు ఉగ్రులైయున్నారు అయినా లెక్కచేయకుండా భారతీయ యాత్రీకులు ఓడలు దిగి హార్బరులో అడుగు పెడితే ఒక్కొక్కణ్ణి విసిరి సముద్రంలో పారేస్తాం" అంటూ తెల్లవాళ్లు పంపిన హెచ్చరకల్లో వ్రాసి వున్నది కుర్లాండులో వున్నయాత్రికులకు ఆహెచ్చరికను నేను అనువదించి చెప్పాను నాదరీ యందుగల యాత్రీకులకు మరొకరెవరో అనువదించి చెప్పారు అయితే రెండు ఓడలలో వున్న భారతీయ ప్రయాణీకులు తెల్లవాళ్ల యిట్టి హెచ్చరికను ఖాతరు చేయలేదు "మేము చాలామందిమి ట్రాన్స్‌వాల్ వెళ్లాలి మిగతవారంతా నేటాల్లో చాలాకాలం నుంచి నివసిస్తున్న వారే మాకందరికీ నేటాలు హార్బరులో దిగే అధికారం చట్టరీత్యా వున్నది మీరు బెదిరిస్తున్న తీరును మేము అంగీకరించడం లేదు మేమంతా యిక్కడ దిగుతాము

అని సమాధానం పంపించారు అప్పటికి నేటాల్ ప్రభుత్వం కూడా అలసిపోయింది అనుచితము, అన్యాయమూ అయిన ఆంక్షల్ని ఎంతకాలం అమలుచేస్తుంది? 23 రోజులు గడిచాయి దాదాఅబ్దుల్లా పట్టు వీడలేదు యాత్రీకులు భయపడలేదు అందువల్ల గతిలేక 23 రోజుల తరువాత ఓడలపై విధించిన ఆంక్షలను ప్రభుత్వం తొలగించి వేసింది హార్బరులోనికి ఓడలు ప్రవేశించవచ్చునని అనుమతి లభించింది ఈ లోపున శ్రీ ఎస్కంబ్ తెల్లవాళ్లను శాంతపరచుటకు ప్రయత్నించాడు " దర్బనులో శ్వేత జాతీయులు చూపించిన ఐకమత్యం అద్భుతంగా పనిచేసింది మీరు చేతనైనంత చేశారు 23 రోజులు భారతీయుల్ని ఓడలు దిగకుండా చేశారు ఇక శక్తి ప్రదర్శన విరమించడం మంచిది ఇంగ్లాండునందలి పెద్ద ప్రభుత్వంపై మంచి ప్రభావం పడుతుంది మీబల ప్రదర్శన వల్ల నేటాల్ ప్రభుత్వం పని తేలిక అయిపోయింది ఇక మీరు భారతీయ యాత్రీకుల జోలికి పోవద్దు పోతే మాత్రం చేసిందంతా వృధా అవుతుంది నేటాలు ప్రభుత్వం ఇరుకున పడిపోతుంది యింత చేసినా యాత్రీకుల్ని దిగకుండా మీరు ఆపలేరు భారతీయ యాత్రీకుల్లో చాలామంది పిల్లలు, మహిళలు వాళ్ల జోలికిపోతే ప్రపంచమంతా ఛీకొడుతుంది భవిష్యత్తులో యిక భారతీయులనెవ్వరినీ దక్షిణాఫ్రికాలోల అడుగుపెట్టనీయం ఆపని నేటాలుప్రభుత్వం చేస్తుంది మాటయిస్తున్నాను అసెంబ్లీలో బిల్లుపెట్టి ప్యాసుచేస్తాం" అంటూ శ్రీ ఎస్కంబ్ వాళ్లకు చెప్పాడు (అతడి మాటల సారాంశం మాత్రమే నేను యిక్కడ వ్రాశాను.) ఎస్కంబ్ ఉపన్యాసం విని శ్వేత జాతీయులు నిరాశ పడిపోయారు అయినా ఎస్కంబ్ అంటే వున్న గౌరవంతో వాళ్లంతా వెనక్కి తిరిగి వెళ్లిపోయారు ఓడలు హార్బరులోకి ప్రవేశించాయి.

"మీరు పగటిపూట ఓడదిగ వద్దని, సాయంత్రం తరువాత కెప్టెనును పంపుతానని, ఆయన వెంట యింటికి వెళ్లమని" ఎస్కంబ్ నాకు కబురు పంపాడు. నాకుటుంబ సభ్యులు ఎప్పుడైనా దిగవచ్చునని కూడా కబురు వచ్చింది. ఇది అతడి ఆ దేశంకాదు, నాక్షేమం కోరి యిచ్చిన సలహా మాత్రమే వాస్తవానికి నేను ఎప్పుడైనా దిగవచ్చు. అయితే మంచిని కోరిపంపిన కబురు

కనుక నేను వారి సలహాప్రకారం ఓడ మీద ఆగిపోయాను నా పిల్లల్ని, భార్యను డర్బను నందలి ప్రసిద్ధ వ్యాపారి, నా మిత్రుడు పారసీరుస్తుంజీ యింటికి పంపించివేశాను యాత్రీకులంతా దిగివెళ్లిపోయారు అప్పుడు దాదా అబ్దుల్లా వకీలు, నా మిత్రుడు శ్రీ లాటన్ అక్కడకు వచ్చి నన్ను చూచి "ఇదేమిటి? మీరు దిగలేదేమిటి? అని అడిగాడు నేను శ్రీ ఎస్కంబ్ ఒక జాబు ద్వారా పంపిన కబురును గురించి వారికి చెప్పాను మీరు యిలా చీకట్లో దొంగవలె, దోషివలె రహస్యంగా దిగి వెళ్లడం నాకు యిష్టంలేదు మీకు భయంలేకపోతే నాతోబాటురండి ఏమీ జరగనట్లే మనిద్దరం కలిసి కాలి నడకన పట్టణం వెళదాం" అని అన్నాడు వెంటనే అందుకొని నాకేమీ భయం లేదు ఎస్కంబ్ యిచ్చిన సలహాను పాటించాలా వద్దా అనే ఆలోచిస్తున్నాను ఇందు ఓడ కెప్టెన్ యొక్క బాధ్యతను గురించి కూడా యోచిస్తున్నాను అని చెప్పాను శ్రీ లాటన్ నవ్వుతూ శ్రీ ఎస్కంబ్ మీకు ఒరగపెట్టింది ఏమీ లేదు అతడిచ్చిన సలహాను పాటించవలసిన అవసరం ఏమీ లేదు అతడిచ్చిన సలహాలో కపటం లేదని నమ్ముటకు మీదగ్గర ఏ ఆధారమూలేదు అసలు పట్టణంలో జరిగిన దానికి అతడే కారణం యిక్కడ ఏమేమి జరిగిందో మీకంటే నాకు బాగా తెలుసు (నేనుమధ్యన తలఊపాను) పోనీ ఎస్కంబ్ యిచ్చిన సలహా మంచికోసమే అని అనుకుందాం దాన్ని పాటించినందున మీప్రతిష్ఠ పెరగదు తరుగుతుంది భయపడి చీకట్లో దిగిపారిపోయాడని అంతా అంటారు అందువల్ల మీరు సరే నంటే నాతోపాటు రండి ఓడ దిగి వెళదాం కెప్టెన్ మన మనిషే అందువల్ల ఆయన బాధ్యత మన బాధ్యతయే అతణ్ణి అడిగేదెవరు? దాదాఅబ్దుల్లాయే గదా!అబ్దుల్లా సాహసం అద్భుతం అని అన్నాడు లాటన్ పగడీ (తలపాగా) పెట్టుకున్నాను పోదాం, పదండి' అని అన్నాను కెప్టెనుకు చెప్పి యిద్దరం ఓడదిగాం

శ్రీ లాటన్ డర్బనుకు చెందిన పాత ప్రసిద్ధ వకీలు వారితో నాకు మంచి సబంధం వున్నది కష్టమైన వ్యాజ్యాలు వస్తేవారి సాయం తీసుకునే

వా-ళ్ల పెద్దవకీలుగా వారికే పని అప్పగించేవాణ్ణి ఆయన సాహసి మంచి ఒడ్డుపొడవుగలమనిషి

మేము నడుస్తున్న రోడ్డు డర్బను పట్టణానికి సంబంధించిన పెద్ద పేటలో నుంచి వెళుతుంది మేము సాయంత్రం 4 గంటలకు బయలు దేరాము ఆకాశంలో మేఘాలు క్రమ్మి వున్నాయి అవి సూర్యుణ్ణి కప్పివేశాయి కాలినడకన రుస్తుం గారింటికి చేరడానికి ఒక గంట సమయం పడుతుంది ఓడనుంచి దిగంగానే కొంతమంది తెల్లజాతి పిల్లలు మమ్మల్ని చూచారు పెద్ద వయస్సు వాళ్లు ఎవ్వరూలేదు ప్రత్యేకరకం తలపాగా ధరించాను. కనుక పిల్లలు నన్ను గుర్తు పట్టారు "గాంధీ" గాంధీ" పట్టుకోండి, పట్టుకోండి, తన్నండి, తన్నండి అంటూ మమ్మల్ని చుట్టి వేశారు కొంతమంది పిల్లలు రాళ్లు విసరడం ప్రారంభించారు యింతలో మధ్య వయస్కులు కూడా వచ్చారు మెల్లమెల్లగా దాడిచేసే జనం పెరిగిపోయారు నడిచివెళ్లితే ప్రమాదం తప్పదని గ్రహించి శ్రీ లాటిన్ రిక్షాను పిలిచాడు రిక్షా అంటే మనిషిలాగే చిన్న బండి అన్నమాట నేను ఎన్నడూ రిక్షా ఎక్కలేదు మనిషిలాగే రిక్షా ఎక్కడం సరికాదని నా అభిప్రాయం కాని యిప్పుడు తప్పదు రిక్షా ఎక్కడమే ధర్మమని భావించాను భగవంతుడు రక్షించదలిస్తే పిడుగులుపడ్డా పరవాలేదు అను సూక్తిజ్ఞాపకం వచ్చింది ఆరు ఏడు సార్లు నా జీవితంతో యిటువంటి ప్రాణాపాయం కలిగించే పరిస్థితులు వచ్చాయి అయినా రక్షణ పొందాను అది నా ప్రతాపం కాదు, భగవత్ప్రతాపమే దక్షిణాఫ్రికాలో రిక్షాలు లాగేవాళ్ళంతా హబ్షీలే తెల్లవాళ్లు ఆ రిక్షావాణ్ణి యీ మనిషిని రిక్షా ఎక్కించుకున్నావంటే చావకొడతాం, రిక్షా విరగకొడతాం అని భయపెట్టారు అందువల్ల రిక్షావాడు ఖా (వద్దు) అంటూ పారిపోయాడు నేనురిక్షా ఎక్కలేకపోయాను

ఇక నడిచివెళ్లాల్సిందే మరో మార్గం లేదు మేము ముందుకు సాగేకొద్దీ తెల్లవాళ్ల గుంపు పెరిగిపోసాగింది. మేమిద్దరం వెస్ట్ స్ట్రీటులో అడుగుపెట్టాం ఒక బలిష్టుడైన తెల్లవాడు శ్రీ లాటిన్‌ను చేతులతో ఎత్తుకు పోయాడు నేనొక్కడినే మిగిలాను రాళ్లు, రప్పలు ఏదిబడితే అది నాకు తగలసాగాయి తలపాగా తీసి ఎవరోవిసిరిపారేశారు ఇంతలో ఒక తెల్లజాతి బలిష్టుడు నా

దగ్గరికి వచ్చి గట్టిగా చెంపదెబ్బ కొట్టాడు కాళ్లతో తన్నాడు నా కళ్లు గిర్రున తిరిగిపోయాయి పడిపోతుండగా నాకు అక్కడేవున్న యింటిగేటు చువ్వ చేతి కందింది అక్కడ కొంచెం శ్వాస పీల్చుకున్నాను కొద్ది సేపటికి తెలివివచ్చింది బయలు దేరాను ప్రాణాలతో యింటికి చేరతాననే ఆశ పూర్తిగా పోయింది అయితే అప్పుడు కూడా నన్ను కొడుతున్న తెల్లవారు దోషులనే భావం నాకు కలగలేదు బాగా జ్ఞాపకం వున్నది

ఇట్టి ప్రమాదస్థితిలో నేను నడుస్తూ వుండగా యింతలో అటునుంచి వెళుతున్న పోలీసు సూపరింటెండెంట్ భార్య నా ఎదురుగా వచ్చింది మేమిద్దరం ఒకరినొకరు చూచుకున్నాం ఆమె బాగా పరిచితురాలే ఆమె ధైర్యవంతురాలు ఆకాశం మేఘావృతంగా వున్నది సూర్యుడు అస్తమిస్తున్న సమయం ఆమె వెంటనే తనగొడుగు విప్పి నాకు కప్పి తను నా ప్రక్కన నడవసాగింది ఒక మహిళను, అందులోను డర్బన్ పోలీసు సూపరింటెండెంటు భార్యను, తెల్లవాళ్లు అవమానించలేరు ఆమెను కొట్టలేరు అందువల్ల ఆమెను దాటి నాకు తగిలే దెబ్బలు తగ్గాయి ఈ విషయం పోలీసు సూపరింటెండెంటు గారికి తెలిసింది నా రక్షణ కోసం పోలీసుల దళాన్ని ఆయన వెంటనే పంపించాడు వాళ్లంతా వచ్చిరాగానే నన్ను చుట్టి వేశారు మా త్రోవ పోలీసు స్టేషను దగ్గరగా వెళుతుంది అక్కడికి చేరేసరికి పోలీసు సూపరింటెండెంటు మా కోసం ఎదురు చూస్తూ నిలబడియున్నారు పోలీసు స్టేషనులో నన్ను ఆగమన్నాడు ఆయనకు ధన్యవాదాలు తెలిపి నేను వెంటనే యింటికి చేరుకోవాలి డర్బన్ ప్రజలకయొక్క న్యాయప్రవృత్తి మీద, నా సత్యం మీద నాకు విశ్వాసం వున్నది మీరు నా రక్షణకోసం పోలీసు దళం పంపించారు అందుకు ధన్యవాదాలు సమర్పిస్తున్నాను శ్రీమతి ఎలెగ్జాండరు నన్ను రక్షించారు'' అని అన్నాను

అప్పటినుంచి నాకు ఎక్కువ శ్రమకలుగలేదు రుస్తుంగారి యింటికి చేరుకున్నాను ప్రొద్దుగూకింది మేర్‌లాండుఓడకు సంబంధించిన డాక్టరు దాజీ బర్‌జోర్ అక్కడ నాకోసం సిద్ధంగా వున్నారు నాకు చికిత్స ప్రారంభించారు నాకు తగిలిన గాయాల్ని పరీక్షించారు పెద్దగా గాయాలు తగలలేదు కాని

కనబడని గట్టి దెబ్బ తగలడం వల్ల నరాలు బాగా పీకుతున్నాయి ఇంకా నాకు విశ్రాంతి తీసుకునే అదృష్టం కలుగలేదు బయట రుస్తుంగారి యింటిని తెల్లవాళ్లు వేలాదిమంది చుట్టముట్టారు రాత్రి కావడంవల్ల లుచ్చాలు, లఫంగాలు కూడా వారిలో చేరిపోయారు నీవు వెంటనేగాంధీని మాకు అప్పగించు లేకపోతే అతడితోబాటు, నిన్ను, నీ యింటిని, నీ కొట్టును తగలేస్తాం అని తెల్లవాళ్లు రుస్తుంగారికి వార్త పంపించారు అయితె రుస్తుంజీ ఎవ్వరికీ భయపడేరకం కాదు ఈ విషయం తెలియగానే పోలీసు సూపరింటెండెంటు తమ సి ఐ డి విభాగం అనుచరులతో అక్కడికి వచ్చి జనంలో కలిసిపోయారు ఒక బెంచీ వేయించుకొని దాని మీద నిలబడి జనంతో మాట్లాడుతూ తెలివిగా రుస్తుంజీ యింటి ద్వారం వద్దకు చేరుకున్నారు ఆ విధంగా గేటు వారి ఆధీనంలోకి వచ్చింది లోపలికి ఎవర్నీ జొరబడనీయకుండా జాగ్రత్త పడ్డారు తన అనుచరుణ్ణి పిలిచి వెంటనే ముఖానికి రంగు వేసుకొని భారత వ్యాపారి దుస్తులు ధరించిలోనికి వెళ్లి గాంధీకి తను చెప్పిన సమాచారం అందజేయమనం చెప్పాడు అతడు లోనికివచ్చి నన్ను కలిశాడు "నీ ప్రాణం, నీ కుటుంబ సభ్యుల ప్రాణం, రుస్తుంజీ ఆస్తిని రక్షించతలుచుకుంటే తక్షణం వేషం మార్చుకొని కానిస్టేబుల్ దుస్తులు ధరించి మా మనిషితోబాటు క్రిందికి వచ్చి జనాన్నుంచి తప్పించుకొని బయటికి వెళ్లిపో రోడ్డు కొసన మీకోసం కారు రెడీగా వుంది దానిలో కూర్చొని పోలీసు స్టేషను చేరి సురక్షితంగా వుండండి లేని యెడల యిక్కడ కాల్పులు జరుగుతాయి ఈ జనాన్నిఆపడం కష్టం నా మాటవిని తక్షణం దుస్తులు మార్చుకొని బయటపడండి" అని సూపరింటెండెంట్ చెప్పమన్న సమాచారం ఆ అధికారి నాకు చెప్పాడు నేను స్థితిని గ్రహించాను భారతీయ కానిస్టేబుల్ దుస్తులు ధరించాను రుస్తుంజీ యింటినుండి బయటికి వచ్చి, ఆ పోలీసు ఆఫీసరు వెంట సురక్షితంగా పోలీసు స్టేషను చేరాను ఈ లోపున సూపరింటెండెంట్ అలెగ్జాండర్ పాటలు పాడి, హాస్యంగా మాట్లాడి జనాన్ని కొద్ది సేపు ఆపి వుంచాడు నేను పోలీసు స్టేషనుకు సురక్షితంగా చేరానని తెలియగానే జనాన్ని యిలా అడిగాడు

"మీకు ఎవరు కావాలి?

'మాకు గాంధీ కావాలి"

గాంధీ దొరికితే ఏం చేస్తారు?"

"తగల పెడతాం"

"ఆయన ఏం చేశాడని తగలపెడతారు?"

"మమ్మల్ని గురించి ఇండియాలో చాలా అబద్ధాలు చెప్పాడు భారతీయుల్ని తీసుకు వచ్చి నేటాలును నింపివెయాలని భావిస్తున్నాడు'

"గాంధీ బయటికి రాకపోతే ఏం చేస్తారు?'

ఈ యింటిని తగలబెడతాం"

ఇంట్లో స్త్రీలు, పిల్లలు వున్నారు (గాంధీ భార్య పిల్లలు వున్నారు) స్త్రీలను, పిల్లలను కూడా కాల్చి చంపుతారా? సిగ్గులేదా?"

"అందుకు మీరే బాధ్యులు అంతకంటే మరో మార్గం లేకుండా మీరు చేస్తున్నారు మరెవ్వరి మీద మేము చెయ్యి చేసుకోము గాంధీని మాకు అప్పగించండి చాలు గాంధీని మాకు అప్పజెప్పకుండా ఎవరినో చంపుతారా, సిగ్గులేదా? అని మీరు మమ్మల్ని అడగడం ఏమిటి?"

సూపరింటెండెంట్ చిరునవ్వు నవ్వుతూ మీ మధ్యనుంచి యిప్పుడే గాంధీ వెళ్ళిపోయారు గదా! ఇక ఏం చేస్తారు?' అని జనాన్ని అడిగాడు జనం ఎగతాళి చేస్తున్నాడని భావించి అబద్ధం, శుద్ధ అబద్ధం అని అరిచారు అలెగ్జాండరు- "మీరు మీ యీ వృద్ధ సూపరింటెండెంట్ మాటల్ని నమ్మకపోతే ఒక పనిచేయండి మీలో ముగ్గురు నలుగురు ఒక కమిటీగా ఏర్పడి లోనికి వెళ్లి వెతికిరండి మీ కమిటీ మెంబర్లకు యింట్లో గాంధీ దొరక్కపోతే మీరంతా యిక్కడినుంచి వెళ్ళిపోవాలి అలా అయితేనే మెంబర్లను లోనికి పంపుతాను మీరు యివాళ ఆవేశపడి పోలీసు శాఖ మాట వినలేదు దానివల్లపోలీసుల గౌరవం పోలేదు, కాని మీ గౌరవం పూర్తిగా పోయింది అందువల్ల పోలీసులు గాంధీని మీ మధ్యనుంచే తీసుకొని వెళ్లిపోయారు మీరే ఓడిపోయారు అందుకు పోలీసులు ఏం చేస్తారు? పోలీసుల్ని నియమించింది మీరేకదా! అందువల్ల పోలీసులు తమ కర్తవ్యం నెరవేర్చారు జరిగింది యిదీ"

అలెగ్జాండరు తీయగా, హాస్యంగా, తమాషాగా పై విషయాలు మెల్లమెల్లగా చెప్పేసరికి తెల్లవాళ్లంతా తెల్లబోయారు ఆయన చెప్పిన ప్రకారం ఒక కమిటీనిఎన్నికొని లోనికి పంపించారు వాళ్లులోపలికి వెళ్లి తిరిగివచ్చి గాంధీలేడని, చెప్పివేశారు తెల్లవారంతా ఎవరిదోవన వాళ్లు యిచ్చిన మాట ప్రకారం రుస్తుంజీ యింటికి హాని తలపెట్టకుండా వెళ్లిపోయారు ఇది ది 1 జనవరి 1897 నాడు జరిగిన ఘట్టం

ఆరోజున ఉదయమె, యాత్రికుల మీద విధించిన ఆంక్ష తొలగించిన తరువాత ఒక పత్రికా విలేఖరి నా దగ్గరికి వచ్చాడు అతడికి భారతదేశంలో జరిగినవిషయాల్ని, నా పత్రికా ప్రకటనల్ని, సవివరంగావివరించి, కాగితాల్ని కూడా అందజేశాను నేను చెప్పిన విషయాలలో అతిశయోక్తి లేదు సత్యాన్ని మాత్రమే చెప్పాను సత్యం చెప్పడం నా కర్తవ్యంగా భావించాను అనికూడా చెప్పాను మర్నాడు అక్కడి పత్రికలన్నింటిలోను నా వాంగ్మూలం సవివరంగా విస్తృతంగా వెలువడింది చదువుకున్న తెల్లవాళ్లంతా తృప్తిపడ్డారు అసలు విషయం అక్కడి వాళ్లకందరికీ తెలిసిపోయింది పత్రికల వారంతా అక్కడి తెల్లవారిని సమర్థిస్తూ, నన్ను ఏమీ తప్పుపట్టకుండా గాంధీచేసింది సరియైన పనే తప్పు వార్తలను నమ్మడం సరికాదని వ్యాఖ్యలు ప్రకటించారు దానితో అక్కడ నా ప్రతిష్ఠ పెరగడమే గాక, భారతజాతి గౌరవం కూడా ఇనుమడించింది అక్కడి భారతీయులు పిరికిపందలుకారని, భారతీయ వ్యాపారస్థులు గౌరవప్రదంగా తలయెత్తి వ్యాపారం చేసుకోవచ్చుననీ, చేసుకోగల సమర్థులని కూడా వారికి భావం కలిగింది

జరిగిన గొడవవల్ల జాతి ఎన్నో కష్టాలు సహించవలసి వచ్చింది దాదా అబ్దుల్లాకు కలిగిన నష్టం ఇంతింత కాదు అయితే దీనివల్ల చివరికి మేలే జరిగిందని నా భావం జాతికూడా తన శక్తి ఏమిటో తెలుసుకున్నది దాని ఆత్మ విశ్వాసం పెరిగింది శిక్షణ కూడా లభించింది ఆ విషయాల్ని గురించి యిప్పుడు యోచిస్తే భగవంతుడు నన్ను సత్యాగ్రహోద్యమం నడుపుటకు తయారుచేస్తున్న సమయం అది అని అనిపిస్తున్నది

నేటాలులో జరిగిన యీ ఘట్టాల తీవ్ర ప్రభావం ఇంగ్లాండుపై పడింది శ్రీ చేంబర్లెన్ వెంటనే నేటాల్ ప్రభుత్వానికి తంతి పంపించి గాంధీగారిమీద

దాడి చేసిన తెల్లజాతి వారందరి మీద కోర్టులో కేసు నడపమని. గాంధీగారికి న్యాయం జరపమని ఆదేశించారు శ్రీ ఎస్కంబ్ అప్పుడు నేటాల్ ప్రభుత్వ అటార్నీ జనరల్‌గా వున్నారు ఆయన నన్ను పిలిపించుకొని చేంబర్లెన్ పంపిన తంతి విషయం చెప్పాడు ప్రమాదం తొలగినందుకు నాకు శుభాకాంక్షలు అందజేశాడు మీకు గాని మీ జాతివారికి గాని దెబ్బలు తగలడం, బాధ కలగడం నాకు యిష్టంలేదు తెల్లవాళ్లు మిమ్మల్ని కొడతారేమోనని భయపడి నేను మీరు పగలు దిగవద్దు అని సలహా పంపాను నా సలహా మీకు నచ్చలేదు మీరు మి॥లాటన్ సలహా అంగీకరించారు అందుకు నేను మిమ్ము దోషంపట్టడం లేదు మీకు నచ్చినట్లు మీరు చేయవచ్చు తప్పులేదు చేంబర్లేన్ కోరిన విషయంతో నేటాలు ప్రభుత్వం ఏకీభవిస్తున్నది దోషులకు దండన విధించితీరాలి దాడిచేసిన వారిని మీరు గుర్తించగలరా? అని ప్రశ్నించాడు

ఇద్దరు ముగ్గుర్ని గుర్తించడం సాధ్యమే కాని ఒక విషయం స్పష్టంచేస్తున్నాను ఎవరో ఏదో అన్నాడని చెప్పేసరికి నమ్మి ఆవేశపడి నన్ను హింసించిన వారిపై ఏ మాత్రమూ నాకు కక్షలేదు కార్పణ్యం లేదు వాళ్లమీద కోర్టులో కేసు పెట్టను. నిజానికి యిందు వారి దోషం ఏమీ లేదు తమ నాయకులు ఏదో చెబితే వాళ్లు నమ్మారు నాయకులు చెప్పింది నిజమా అబద్ధమా అని ఆలోచించుటకు వారికి సమయం చిక్కలేదు నన్ను గురించి చెప్పడు మాటలు వినడం, వాటిని నమ్మడం, నా మీద వారు చేయి చేసుకొనడం సహజమే మందిని రెచ్చగొడితే సహజంగా యిదే జరుగుతుంది అసలు జరిగిన దానిలో తప్పంతా మీ తెల్లవారు ఎన్నుకున్న కమిటీది ఆ కమిటీకి బోధ చేసిన మీది మీ నేటాల్ ప్రభుత్వం వారిది నేను భారత దేశంలో ఏమేమో మిమ్మల్ని అన్నానని రూటరు ప్రతినిధి ఎవరో వార్త పంపాడు ఆ వార్త మీరు చదివారు మీకు కోపం వచ్చింది ఆ తరువాత నేను నేటాలు వస్తున్నానని మీకు తెలిసింది రాగానే మీరుగాని, మీ ప్రభుత్వం వారు గాని, మీ కమిటీవారుగాని నన్ను కలిసి వాస్తవం ఏమిటి అని అడిగి తెలుసుకోవద్దా? అట్టి అవసరమే లేదా? నా జవాబు విని మీరు ఒక నిర్ణయానికి వచ్చి యుంటే యింత రగడ జరిగి యుండేదేకాదు ఇదేమీ

చేయకుండా నా మీద మీరు తిన్నగా చర్యతీసుకున్నారు ఇందుకై మీమీద గాని, మీ కమిటీ మీద గాని నేను కేసు పెట్టదలచలేదు కేసు పెట్టడం ధర్మమే అయినా మీరు చేసిన దానికి కోర్టు ద్వారా మీపై చర్య తీసుకొనేలా చేయడం నాకు యిష్టం లేదు నేటాలు యందలి తెల్లవారి అధికారాల్ని రక్షించడం కోసం మీకు ధర్మమని తోచిన విధానాన్ని మీరు అనుసరించారు ఇది రాజకీయ వ్యవహారం నేను కూడా రాజకీయ రంగంలోనే మీతో పోరాటం సాగించవలసి యున్నది బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతదేశం పెద్ద భూభాగమని, తెల్లవారికంటే ఎక్కువ జనసంఖ్య గలిగిన దేశమని, కనుక తెల్లవారికెవరికీ ఏవిధమైన నష్టమూ కలిగించకుండా తన స్వాభిమానాన్ని, అధికారాల్ని మాత్రమే భారతజాతి రక్షించదలుస్తున్నదని స్పష్టం చేయవలసిన అవసరం ఎంతైనా వున్నది'' అని చెప్పాను

శ్రీ ఎస్కంబ్ - మీరు చెప్పిన విషయం నాకు అర్థమైంది నాకు నచ్చింది కూడా మీపై దాడిచేసిన వారిపై కేసు పెట్టడానికి మీరు సిద్ధపడరని నేనూహించి యుండలేదు మీరు కేసు పెట్టదలచి యుంటే నాకు ఏమాత్రము కోపం వచ్చి యుండేది కాదు మీరు మీ నిర్ణయం ప్రకటించారు కనుక మీ నిర్ణయం మంచిదని చెప్పడం నా కర్తవ్యమని భావిస్తున్నాను ఇంత సంయమం కలిగిన మీరు మీ జాతికి పెద్ద మేలు చేయగలుగుతారు మీరు యీ నిర్ణయం ద్వారా నేటాలు ప్రభుత్వాన్నికూడా పెద్ద యిబ్బందినుంచి తప్పించారని చెప్పకతప్పదు మీరు కోరియుంటే మేము తప్పక తెల్లవారిని నిర్బంధంలోకి తీసుకొని శిక్షించియుండేవాళ్లం దానితో వాళ్లు పేట్రేగిపోయి రభస చేసేవారు ఇలా జరిగితే ఏ ప్రభుత్వమూ అంగీకరించదుగదా! ఇది సామాన్య మైనవిషయం కాదు కనుక కేసు పెట్టను అని నిర్ణయానికి మీరు వచ్చి యుంటే ఒక కాగితం మీద ఆ విషయం వ్రాసి నాకు యివ్వండి మనిద్దరిమధ్య జరిగిన సంభాషణ వివరం మాత్రమే మి॥ చేంబర్లెన్‌కు వ్రాసి నేను నా ప్రభుత్వానికి రక్షణ కల్పించలేను మీరిచ్చిన పత్రమందలి విషయాన్ని తంతి ద్వారా వారికి తెలియజేస్తాను మీరు అటువంటి జాబు యిప్పుడే వ్రాసియిమ్మని నేను కోరను మీ మిత్రులతో చర్చించండి మి॥లాటిన్‌గారి సలహాకూడా తీసుకోండి ఆ తరువాతకూడా మీరు మీ

నిర్ణయం మీద స్థిరంగా వుండగలిగితే అట్టి జాబు వ్రాసి నాకు యివ్వండి ఒక్క విషయం మాత్రం స్పష్టగా చెబుతున్నాను మీ మీద దాడిచేసినవారి మీద కేసు నడపడం యిష్టం లేదని మీరు మీ బుద్ధిపూర్వకంగా వ్రాసి యివ్వాలి అందుకు బాధ్యత మీరే వహించాలి అప్పుడే నేను మీ జాబును ఉపయోగించగలుగుతాను "

"మీరు యీ విషయం మాట్లాడుటకు పిలిపించారని నేను ఊహించలేదు ఈ విషయమై ఎవ్వరితోను నేను చర్చించలేదు చర్చించాలనే ఉద్దేశ్యం కూడా నాకు లేదు నేను శ్రీ లాటిన్‌గారి వెంట బయలు దేరి ఓడదిగి ముందుకు సాగినప్పుడే తెల్లవారు ఎంతటి కష్టం కలిగించినా వారిని తప్పుపట్టను అని మనస్సులో నిర్ణయించుకున్నాను అందువల్ల నా మీద దాడిచేసినవారి మీద కేసు పెట్టడానికి ఆస్కారమే లేదు నా మనస్సులో ఒక ధార్మిక ప్రశ్న బయలుదేరింది మీరు అన్న ప్రకారం నా యీ ౦ంయమంవలన నాజాతితోబాటు నాకుకూడాలాభం కలుగుతుందని భావిస్తున్నాను అందువల్ల బాధ్యతంతా నా నెత్తిన వేసుకొని యిప్పుడే మీరు కోరిన పత్రం వ్రాసి యివ్వదలిచాను" అని చెప్పాను

నేను శ్రీ ఎస్కంబ్‌గారిని ఒక తెల్ల కాగితం అడిగి తీసుకొని, అక్కడే వ్రాసి, వారికి ఆ పత్రం యిచ్చివేశాను

★ ★ ★

# 8

# భారతీయులు ఏంచేశారు? - 3

## ఇంగ్లాండులో చేసిన పనులు

గతప్రకరణాల్లో భారతీయులు తమస్థితిగతులయందు మార్పులు తెచ్చుటకు చేసిన ప్రయత్నాలను గురించి, ప్రతిష్టను పెంచుకొన్న పద్ధతిని గురించి పాఠకులు తెలుసుకున్నారు దక్షిణాఫ్రికాలో భారతీయుల సర్వాంగీణ వికాసానికి ఇంగ్లాండు నుంచి లభించ గలిగినంత సాయం పొందడానికి అవిరళకృషి చేశారు భారతీయులు జరిపిన ప్రయత్నాల్ని గతంలో వివరించాను

యిక ఇంగ్లాండులో సాయం కోసం చేసిన కృషిని వివరిస్తాను జాతీయ కాంగ్రెస్ యొక్క బ్రిటిష్ కమిటీతో సంబంధం పెట్టుకోవలసిన అవసరం ఏర్పడింది అందునిమిత్తం భారతావనికి చెందిన శ్రీ దాదాభాయి నౌరోజీ గారికి, బ్రిటిష్ కమిటీ అధ్యక్షులు సర్ విలియం బెడర్ బర్న్ గారికి జరుగుతున్న ఘట్టాల వివరమంతా వారం వారం వ్రాసి పంపసాగాము అర్జీలు పంపుటకు పోస్టల్ ఖర్చులు పెట్టుటకు కనీసం 10 పౌండ్లు పంపుతూ వుండేవారం

ఇక్కడ దాదాభాయి నౌరోజీగారిని గురించిన పవిత్ర సంస్మరణను వివరిస్తాను దాదాభాయిగారు బ్రిటిష్ కమిటీకి అధ్యక్షులు కారు అయినా ఖర్చుల నిమిత్తం సొమ్ము వారికి పంపి, వారి ద్వారా బ్రిటిష్ కమిటీకి పంపే ఏర్పాటు చేయడం మంచిదని భావించాము ఆ విధంగా పంపిన సొమ్ము వాపసు చేసి, యీ సొమ్ము మీరు సర్ విలియం బెడ్ బర్న్ గారికే పంపండని మాకు తెలియజేశారు వారు మాకు సహాయం చేస్తూ వుండేవారు కాని బెడ్ బర్న్ గారి ద్వారా పని చేయిస్తే గౌరవ ప్రతిష్టలు పెరుగుతాయని వారి అభిప్రాయం అంత పెద్దవారై యుండి కూడా ఉత్తర ప్రత్యుత్తరాల విషయంలో ఎంతో మెలకువ వహించి యుండేవారు వివరాలు వ్రాయడానికి ఏమీ లేకపోతే జాబు అందిందని తెలిపి, ప్రోత్సహిస్తూ ఒక వాక్యం వ్రాసేవారు అట్టి జాబులు వారే వ్రాసేవారు ఆ జాబుల వివరం ఇష్యూబుక్కులో వ్రాసివుంచేవారు

మేము మా సంస్థకు కాంగ్రెస్ అని పేరు పెట్టామే కాని మా సమస్యలను మరో పార్టీ సమస్యలుగా చేయడం మా కోరిక కాదని గతంలో పేర్కొన్నాను అందువల్ల దాదాబాయి నౌరోజీ గారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినట్లే మిగతా పార్టీల వారితో కూడా జరుపుతూ వున్నాము వారిలో యిద్దరు ప్రముఖులపేర్లు పేర్కొనడం అవసరం ఒకరు సర్ మంచర్జీ భావనగరీ, రెండవ వారు సర్ విలియం విల్సన్ హంటర్ సర్‌మంచర్జీ భావనగరీ అప్పుడు బ్రిటిష్ పార్లమెంటు మెంబరుగా వుండేవారు వారి వల్ల మాకు మంచి

సాయం లభిస్తూ వుండేది మాకు ఎన్నో అమూల్యమైన సూచనలు యిస్తూ వుండేవాడు దక్షిణాఫ్రికా యందలి భారతీయుల సమస్యల్ని అర్థం చేసుకొని, అందుకు అవసరమైన సలహాలు సర్ విలియం ఎల్సన్ హంటర్ యిస్తూ వుండేవారు వారు "టైమ్సు" యందలి భారతీయ విభాగానికి సంపాదకులు మేము వారికి దక్షిణాఫ్రికా భారతీయుల స్థితిగతులను గురించి జాబు వ్రాశాము అప్పటినుంచి వారు టైమ్సు పత్రికలో భారతీయుల విషయమై శ్రద్ధ వహించి వ్రాయడం ఆరంభించారు మా కోరికల్ని తాము సమర్థించడమే గాక అనేక మంది పెద్దల అభిప్రాయాలు కూడా ప్రకటించి మా కృషికి సాయం చేశారు మహత్తరమైన విషయాలపై ప్రతివారం వారి జాబు మాకు అందుతూ వుండెది వారు తమ మొదటి జాబులో "మీరు మీ స్థితిని గురించి వ్రాసిన విషయాలు చదివి నాకు దుఃఖం కలిగింది మీరు వినమ్రతతో, శాంతిగా అతిశయోక్తులు లేకుండా పోరాటం జరుపుతున్నారు యీ విషయంలో నా సంపూర్ణ సానుభూతి మీ యెడ వున్నది మీకు న్యాయం జరగాలి అందుకోసం నేను వ్యక్తి గతంగానేగాక, బహిరంగంగా కూడా చేయవలసిందంతా చేస్తాను యీ విషయంలో మనం ఒక అంగుళమైనా వెనుకంజవేయుటకు వీలు లేదు తటస్థంగా వుండే ఏ వ్యక్తీ యీ విషయంలో తగ్గమని చెప్పడు చెప్పలేడు" అని వ్రాశారు టైమ్సులో ప్రచురించిన తమ వ్యాసంలో కూడా దరిదాపుగా పై విషమేవారు వ్రాశారు చివరి వరకు వారు మా విషయంలో అలాగే వ్యవహరించారు లేడీ హంటర్ వ్రాసిన ఒక జాబులో "తన మృత్యు సమయానికి పూర్వమే, దక్షిణాఫ్రికా భారతీయుల విషయంలో వ్రాయదలచుకున్న వ్యాసాల రూపురేఖలు తయారు చేశానని" పేర్కొన్నారు

శ్రీమాన్ నాజర్‌గారి పేరు గత ప్రకరణంలో పేర్కొన్నాను భారతీయుల అభిప్రాయాల్ని చక్కగా నివేదించుటకు వారిని దక్షిణాఫ్రికా భారతీయులందరి పక్షాన ఇంగ్లాండుకు పంపించాము వివిధ పార్టీల వారందరితో సంబంధం పెట్టుకొని యీ పని చేయమని వారికి చెప్పాము వారు ఇంగ్లాండులో వున్నంతకాలం కీ॥శే॥ సర్ విలయం విల్సన్ హంటర్, సర్‌మంచర్జీ భావనగరీ,

మరియు భారత జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ కమిటీ మెంబర్లతో సంబంధం పెట్టుకొని వున్నారు వారు బారత సివిల్ సర్వీస్‌కు సంబంధించి రిటైరైన అధికారి భారత మంత్రి కార్యాలయం అధినివేశమంత్రి కార్యాలయంతో కూడా మంచి సంబంధం పెట్టుకొని పని చేశారు తాను వెళ్ల గలిగినంత దూరం వెళ్లి భారతీయుల కొసం ఇంగ్లాండులో అవిరళకృషి చేశారు తత్ఫలితంగా, దక్షిణాఫ్రికా యందలి భారతీయుల స్థితి గతుల వ్యవహారం బ్రిటిష్ ప్రభుత్వం దృష్టిలో ప్రథమ స్థానం ఆక్రమించింది దానివల్ల మంచిలేక చెడు ప్రభావం మిగతా అధినివేశరాజ్యాల మీద పడింది ఏ ఏ అధినివేశ రాజ్యాల్లో భారతీయులు నివసించి యున్నారో వారందరిలో చైతన్యం వచ్చింది ఆ విషయం తెలుసుకున్న ఆయా రాజ్యాల యందలి శ్వేత జాతీయులు భారతీయులు తమ రాజ్యాలలో ఏఏ ప్రమాదాలు తమకు కలిగించగలరోనని జాగ్రత్త పడ్డారు

★ ★ ★

# 9

# బోయర్ యుద్ధం

గత ప్రకరణాలు శ్రద్ధగా చదివిన పాఠకులకు బోయర్ యుద్ధం జరిగినప్పుడు భారతీయుల స్థితిగతులు దక్షిణాఫ్రికాలో ఎలా వున్నాయో బోధపడియుండవచ్చు తమ స్థితిని సరిదిద్దుకునేందుకై వారు చేసిన ప్రయత్నాలు కూడా బోధపడివుంటాయి

డా॥ జెమిసన్ బంగారుగనుల యజమానులతో జరిపినచర్చల తరువాత ఆ ప్రకారం అతడు 1899లో జోహన్స్‌బర్గ్ మీద దాడి చేశాడు జోహన్స్‌బర్గు మీద అధికారం పొందిన తరువాతనే బోయర్ ప్రభుత్వానికి దాడి విషయం బోధపడుతుందని భావించాడు అలా అనుకొని డా॥ జెమిసన్, అతని అనుచరులు చాలా పొరపాటు చేశారు మరో తప్పు కూడా వాళ్లు చేశారు మన కుట్ర బయటపడినప్పటికీ రోడేషియాలో శిక్షణ పొందిన గురికాండ్ర

ఎదుట అనుభవంలేని బోయర్ రైతులు ఏమీ చేయలేరని అనుకున్నారు జోహన్సుబర్గునందలి ఎక్కువ మంది ప్రజలు తమకు స్వాగతం పలుకుతారని భావించి మూడో తప్పు చేశారు వాళ్ల ఆశలేమీ ఫలించలేదు ప్రెసిడెంట్ క్రూగరుకు జరుగుతున్న కుట్ర అంతా తెలిసిపోయింది కడు రహస్యంగా జాగ్రత్తగా లోలోపల అతడు సైన్యాన్ని అప్రమత్తం చేసి సిద్ధంగా వుంచాడు యీ కుట్రలో పాల్గొన్న వాళ్లందరినీ నిర్బంధించుటకు కూడా ఏర్పాట్లన్నీ చేసి వుంచాడు డా॥ జెమిసన్ మనుష్యులు జోహన్సుబర్గు చేరేలోపునే తుపాకులతో క్రూగర్ సైనికులు వాళ్లను ఎదుర్కొన్నారు అంత సైన్యం ఎదుట డా॥ జెమిసన్ దళం నిలవలేకపోయింది జోహన్సు బర్గులో ఎవ్వరూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయడానికి వీలులేకుండా కూడా క్రూగర్ ఏర్పాట్లు చేశాడు అందువల్ల ఒక్కడు కూడా ఎదుర్కొడానికి సాహసించలేదు క్రూగర్ చేసిన ఏర్పాట్లు చూచి జోహన్సబర్గ్ నందలి కోటీశ్వరులంతా నివ్వెరబోయారు యీ కారణాన్నంటివల్ల తిరుగుబాటును విఫలం చేయుటకు అధికంగా ధనం ఖర్చు చేయవలసిన అవసరం కలుగలేదు ప్రాణనష్టం కూడా బహుతక్కువగా జరిగింది

డా॥ జెమిసన్, అతని మిత్రులు, గనుల యజమానులు కొందరు నిర్బంధించబడ్డారు కేసులు నడిచాయి కొందరికి ఉరిశిక్షలు పడ్డాయి. అపరాధుల్లో ఎక్కువ మంది కోటీశ్వరులే అందువల్ల బ్రిటిష్ ప్రభుత్వం వారికి ఏ విధమైన సహాయం చేయలేక పోయింది పట్టపగలు వాళ్లు తిరుగుబాటుకు పూనుకోవడమే అందుకు కారణం దానితో ప్రెసిడెంట్ క్రూగర్ పేరు ప్రతిష్ఠలు పెరిగిపోయాయి అధినివేశాల రాజ్యాల మంత్రి శ్రీ ఛేంబర్లేన్ దీనాతిదీనంగా ఒక తంతిక్రూగరుకు పంపాడు శ్రీ క్రూగర్ యొక్క దయాగుణాన్ని ప్రశంసించి, బ్రిటిష్ కోటీశ్వరులను రక్షించమని ప్రార్థించాడు పందెంవేయడంలో క్రూగర్ ప్రజ్ఞాశాలి దక్షిణాఫ్రికాయందలి ఏ పక్షమూ తన అధికారం కాజేయలేదనే విశ్వాసం బాగా అతడి మనస్సులో నాటుకుంది డా॥ జెమిసన్ అతడి మిత్రులు గొప్ప పని చేశామని భావించారే కాని సరిగా వ్యవహరించక పోవడం వల్ల గట్టి దెబ్బతిన్నారు ఈ వ్యవహారంలో క్రూగర్

తెలివిగా వ్యవహరించడమే గాక చేంబర్లేన్ కోరికను మన్నించి కోటీశ్వరులందరికీ ఉరిశిక్ష రద్దుచేయడమే గాక వారందరినీ క్షమించి వదిలివేశాడు

ఉబ్బరం చేసిన ఉదరంలో తిన్నతిండి ఎంతసేపు యిముడుతుంది? కక్కు ద్వారా బయటికి పోవలసిందే కదా! డా॥ జెమిసన్ వ్యవహారాన్ని చక్కదిద్దినా యిది కేవలం ఒక ప్రయత్నం మాత్రమే, కాని దీని వెనుక తన ఎడ అసంతృప్తి అధికంగా ఉన్నదని క్రూగరుకు తెలుసు జోహన్స్‌బర్గు కోటీశ్వరులు తాత్కాలికంగా దెబ్బతిన్నా వూరుకోరని, సమయం చిక్కినప్పుడు చావు దెబ్బ తీస్తారని అతడికి తెలుసు డా జెమిసన్ ఏ సంస్కరణలకోసం యింత పనిచేశాడో వాటిలో ఒక్కటికూడా అమలు కాలేదు కనుక కోటీశ్వరులు శాంతి వహించడం సాధ్యమా? అదీగాక వాళ్ల కోరికలు నెరవేరాలనిజోహన్స్‌బర్గులో గల బ్రిటిష్ హైకమీషనరు డాల్డ్‌మిల్నిర్ కోరుతున్నాడు చేంబర్లేన్ డా॥జెమిసన్ మరియు బ్రిటిష్ కోటీశ్వరుల యెడ క్రూగర్‌చేసిన మేలును ప్రశంసిస్తూనే వాళ్లు కోరిన సంస్కరణలు అమలు చేయడం అవసరమని కూడా ప్రకటించారు యుద్ధం తప్ప యీ సమస్యను పరిష్కరించుటకు మరో మార్గం లేదని అందరూ అభిప్రాయపడ్డారు బ్రిటిష్ కోటీశ్వరుల కోరికలు నెరవేరిస్తే ట్రాన్స్‌వాల్‌నందలి బోయర్ల ప్రభుత్వం తొలిగిపోకతప్పదు దీనికి పరిష్కారం యుద్ధమే గనుక రెండు పక్షాలు యుద్ధానికి సిద్ధపడి పని ప్రారంభించాయి రెండు పక్షాల శబ్ద యుద్ధం బ్రహ్మాండంగా జరగసాగింది క్రూగరు యుద్ధ సామగ్రి తెప్పించగానే బ్రిటిష్ హైకమిషనరు ఆ ప్రయత్నాన్ని ఖండించి, బ్రిటిష్ ప్రభుత్వం కూడా యిట్టి పనిచేస్తుందని హెచ్చరిస్తూండేవాడు ఈ విధంగా యిద్దరి మధ్య ప్రచ్ఛన్నయుద్ధం ప్రారంభమైందనే చెప్పవచ్చు

ఇక క్రూగర్ ఆగలేకపోయాడు ఆగితే శత్రువుల వలలో బడినట్లేనని భావించాడు బ్రిటిష్ సామ్రాజ్యం దగ్గర సైన్యం బలం, అర్థబలం అన్నీ వున్నాయి అది క్రూగరును మాటిమాటికీ హెచ్చరిస్తూ బ్రిటిష్ కోటీశ్వరులకోరికలను నెరవేర్చమని ప్రకటిస్తూ,క్రూగరు లక్ష్యం చేయడంలేదనే భావం ప్రపంచ ప్రజలకు కలిగేలా చేసి చివరికి యుద్ధం ప్రకటిస్తుందని

క్రూగరు గ్రహించాడు తమ బలం అధికం కనుక క్రూగరు తలవంచి తీరతాడని బ్రిటిష్ వాళ్లకు తెలుసు అయితే బోయర్లు కూడా సామాన్యులుకారు 18 నుంచి 60 సంవత్సరాల వయస్సు గల ప్రతి బోయర్ పురుషుడు యుద్ధం చేయగలడు బోయర్ స్త్రీలు కూడా నిర్ణయానికి వస్తే యుద్ధంలో పాల్గొని పోరాటం సాగించగలరు అక్కడి ప్రజల దృష్టిలో జాతీయ స్వాతంత్ర్యం ఒక మత స్వాతంత్ర్యమే అట్టిబోయర్లు బ్రిటిష్ సామ్రాజ్యం ముందు తలవంచుతారా? ఇదీ అక్కడి పరిస్థితి

ఆరెంజ్‌ఫ్రీస్టేట్‌తో ప్రెసిడెంట్ క్రూగర్ అదివరకే రాజీపడ్డాడు ఈ రెండు బోయర్ ప్రభుత్వాల విధానం ఒక్కటే బ్రిటిష్ వారికోరికల్ని గని యజమానులైన బ్రిటిష్ కోటీశ్వరుల కోరికల్ని పూర్తిగా అంగీకరించడం ప్రెసిడెంట్ క్రూగరుకు యిష్టంలేదు కనుక యుద్ధం తప్పదు అయితే సమయం గడిచిన కొద్దీ బ్రిటిష్ సామ్రాజ్యానికి బలం పెరిగిపోతుంది కనుక అతడు తన అభిప్రాయాన్ని బ్రిటిష్ హైకమీషనరుకు తెలిపి ట్రాన్స్‌వాల్, ఫ్రీస్టేట్‌ల సరిహద్దుల దగ్గర సైన్యాన్ని మొహరించాడు ఇక యుద్ధ తప్ప మరోమార్గం లేని స్థితి ఏర్పడింది ఇట్టి బెదిరింపుకు బ్రిటిష్ సామ్రాజ్యం తలవంచడమా? క్రూగర్ అల్టిమేటమ్ గడువు పూర్తి కాగానే అతడి సైన్యాలు ముందుకు సాగాయి లేడీస్మిథ్, కింబర్లీ, మెఫేకింగ్‌లను చుట్టుముట్టాయి ఈ విధంగా 1899లో యుద్ధం ప్రారంభమైంది బోయర్ యుద్ధంలో బ్రిటిష్ వారి కోరికల్లో ఒకటి అక్కడ నివసిస్తున్న భారతీయుల స్థితిలో మార్పు అవసరమనునదీ ముఖ్యమైనదే

ఇక దక్షిణాఫ్రికా యందలి భారతీయులు మనం ఏం చేయాలనే సమస్యను ఎదుర్కోవలసిక వచ్చింది బోయర్ పురుషులంతా సంగ్రామంలో పాల్గొనుటకు వెళ్లిపోయారు వకీళ్లు వకీలు వృత్తిమానివేశారు రైతులు వ్యవసాయం మానివేశారు వ్యాపారులు వ్యాపారం మాని వేశారు నౌకర్లు నౌకరీ వదిలివేశారు ఇంగ్లీషు వాళ్ల పక్షాన అంతమంది లేకపోయినా కేప్ కాలనీ, నేటాలు, రొడీషియాలలో గల సైన్యంలో చేరని ప్రజలు పెద్ద సంఖ్యలో వాలంటీర్లుగా చేరారు నేను పని చేసే కోర్టులో వకీళ్లు బాగా

తగ్గిపోయారు ఆంగ్లబారిష్టర్లు, వకీళ్లు, వ్యాపారస్తులు అంతా వాలంటీర్లుగా చేరారు భారతీయుల్ని గురించి ఆంగ్లేయులు ఆక్షేపించడం ప్రారంభించారు ''వీళ్లు కేవలం డబ్బుకోసమే వున్నారు మనకు వాళ్లు బరువు చేటు కర్రకు చెదపట్టిదాన్ని బెండుగా చేసినట్లు యీ భారతీయులు యిక్కడ మనల్ని పట్టి పిప్పిచేస్తున్నారు మనకు కష్టం వస్తే వీళ్లు పట్టించుకోవడం లేదు ప్రమాద సమయంలో మనల్ని మనం రక్షించుకోవలసి రావడమే గాక, యీ భారతీయుల్ని కూడా రక్షించవలసి వస్తున్నది ''యిదీ భారతీయుల్ని గురించి ఆంగ్లేయులు చేసిన తీవ్రమైన ఆరోపణ దీన్ని గురించి భారతీయులం చర్చించాము యిది సరికాదని నిరూపిద్దామనే నిర్ణయానికి చాలా మందిమివచ్చాము అయితే కొందరు క్రింది అభిప్రాయాల్ని కూడా వెల్లడించారు

ఇంగ్లీషు వాళ్లు, బోయర్లు యిద్దరూ మనల్ని సమానంగా పీడిస్తున్నారు హింసిస్తున్నారు ఒక్క ట్రాన్స్‌వాల్‌లోనే గాక, నేటాలులోను, కేప్ కాలనీలో కూడా యమయాతనలు పడవలసి వస్తున్నది పరిమాణంలో తేడా తప్ప కష్టాలు అమితంగా పడుతున్నాము మనదిబానిస జాతి అని అంతా భావిస్తున్నారు బోయర్లవంటి చిన్నజాతి, తమ అస్తిత్వాన్ని రక్షించుకోవడం కోసం బ్రిటిష్ వారితో పోరాడుతున్న విషయం నిజమే యిది తెలిసిన తరువాత కూడా మనం దాని నాశనానికి కారణం కావడం సబబా? బోయర్లు యుద్ధంలో ఓడిపోతారని చెప్పలేము వాళ్లు గెలిస్తే మనల్ని వదులుతారా?''

ఈ వాదనను సమర్థవంతంగా మా ముందు వుంచగలిగిన దళం ఏర్పడింది నాకు యీ వాదననచ్చింది దాన్ని సమర్థించాలని భావించాను కాని చివరికి యిది సరికాదనే నిర్ణయానికి వచ్చాను నేను యీ వాదనను వ్యతిరేకించాను

"దక్షిణాఫ్రికాలో మనం బ్రిటిష్ ప్రజలంగా వుంటున్నాము ఏ అర్జీపంపినా అందు బ్రిటిష్ ప్రజలంగా మనల్ని గురించి మనం వ్రాసుకొని అధికారాలు కోరుతున్నాము బ్రిటిష్ ప్రజలరూపంలో గౌరవం మాకు కలదని ప్రపంచానికి తెలిసేలా చేసుకున్నాము బ్రిటిష్ ప్రజలంగా భావించి ప్రభుత్వం మనల్ని

ఆదరించింది యిప్పుడు వాళ్ల యిళ్లు వాకిళ్లు ధ్వంసమయ్యే పరిస్థితి వచ్చింది మనం చేతులు కట్టుకు కూర్చుంటే తమాషా చూస్తూ కూర్చుంటే మన మానవత్వానికే కళంకం యిట్టి ప్రవృత్తి మన కష్టాల్ని యింకా పెంచుతుంది మన మీద వారేమోమో ఆరోపణలు చేస్తున్నారని మనం భావిస్తున్నాం ఆంగ్లేయులు చేస్తున్న ఆరోపణలు తప్పని రుజూ చేసే సదవకాశం యిప్పుడు మనకు లభించింది. మనం యిప్పుడు ఏమీ చేయకపోతే వాళ్ల ఆరోపణలు నిజమేనని మనమే రుజూ చేసినవారమవుతాం తరువాత మన కష్టాలు పెరగవచ్చు ఆంగ్లేయులు గట్టిగా మనల్ని ఆక్షేపించవచ్చు మనం బ్రిటిష్ సామ్రాజ్య వాదులకు బానిసలంగా వున్నాము ఆ బానిస శృంఖలాల్ని తెగ గొట్టేందుకు ప్రయత్నిస్తున్నాం భారత దేశనాయకులు కూడా అందుకే కృషి చేస్తున్నారు బ్రిటిష్ సామ్రాజ్య పౌరులంగా అధికారాలు మనం కోరుతూ వుంటే, యీ యుద్ధ సమయంలో వాళ్లకు సంపూర్తిగా మనం సహకరించడం అవసరం బోయర్లది న్యాయ పక్షమని చాలా వరకు అంగీకరించినా, ఒక రాజ్య వ్యవస్థ ప్రకారం నడుచుకుంటూ, ఆవ్యవస్థను వ్యతిరేకించడం మంచిది కాదు ఆరాజ్యవ్యవస్థ అమలు పరిచే కార్యక్రమాలన్నీ సరియైనవేనని అనడానికి వీలులేదు అయినా ఏరాజ్యవ్యవస్థలో వుంటామో, ఆ రాజ్యానికి ముప్పు వచ్చినప్పుడు దానికి సాయంచేయడం అవసరం అదీగాక రాజ్యవ్యవస్థ యొక్క కొన్ని చర్యలు ధర్మ బద్ధంకాక పోతే, వారికి పలు విధాల వ్యతిరేకతను తెలియజెప్పాలి మనం భారతీయులం అట్టి పని ఏమీ చేయలేదు అటువంటి ధర్మ సంకటం యింతవరకు మనకు ఏర్పడ లేదు అందువల్ల మేము యీ యుద్ధంలో సహాయం చేయము అని చెప్పే పరిస్థితి యిప్పుడు లేదు సామ్రాజ్య పౌరులంగా యీ యుద్ధంలో బ్రిటిష్ ప్రభుత్వానికి అండగా నిలబడి మనం పని చేయాలి యిది మన కర్తవ్యం యుద్ధంలో ఎవరు గెలుస్తారు ఎవరు ఓడతారు అని యోచించవలసిన అవసరం లేదు అలా అనుకోవడం మొదలు పెడితే పొయ్యి నుంచి బయటపడి గాడిపొయ్యిలో పడినట్లవుతుంది. బోయర్లు గెలిస్తే మనల్ని గట్టి దెబ్బతీస్తారని అనుకోవడం కూడా వారికి అన్యాయం చేయడమే. మనకు మనం అన్యాయం చేసుకోవడమే.

అలా యోచించడం పిరికి వారి లక్షణం మన నిజాయితీకి కళంకం ఆంగ్లేయులు ఓడిపోతే, తమ గతి ఏమైపుతుందోనని ఒక్క తెల్లవాడైనా యోచిస్తున్నాడా? యుద్ధంలోకి దిగిన తరువాత యీ విధంగా ఎవ్వడూ ఆలోచించడు

1899లో యీ విధంగా భారతీయులకు చెప్పాను యీనాడు కూడా ఆ నా మాటల్లో మార్పు అవసరమని నేను భావించడం లేదు అనాడు బ్రిటిష్ సామ్రాజ్యమంటే నాకు గల మోహం, అనాడు బ్రిటిష్ సామ్రాజ్య పౌరులంగా వుంటూ స్వాతంత్ర్యం పొందాలనే నా కోరిక యీనాడూ వుండివుంటే యిప్పుడు కూడా అలాగే చెప్పి వుండే వాణ్ణి నా యీ వాదనకు వ్యతిరేకంగా బ్రిటన్‌లోను, దక్షిణాఫ్రికాలోను జరిగిన విమర్శలను నేను విన్నాను అయినా నా అభిప్రాయాల్ని మార్చు కోవలసిన అవసరం నాకు కలగలేదు యీనాటి నా భావాలకు, అనాడు దక్షిణాఫ్రికాలో జరిగిన ఆ వ్యవహారానికి ఏమీ సంబంధంలేదు అయినా రెండు బలవత్తరమైన కారణాల వల్ల యీ విషయం వ్రాశాను ఈ పుస్తకాన్ని త్వరత్వరగా చదివి ముగించాలని భావించే పాఠకులు ఓపికతో, శ్రద్ధతో చదివి అర్థం చేసుకుంటారనే ఆశ నాకు లేదు యిట్టి పాఠకులు యీనాటి నా పనులకు, అనాటి నా భావాలకు పొంతన కుదుర్చుకోలేరు యిది మొదటి కారణం ఆ నా భావనాసరళి కూడా సత్యం మీదనే ఆధారపడియున్నది మనస్సు లోపల ఒకటి, బయట మరొకటి వుండకూడదని, లోపల, బయట ఒకే విధంగా వుండి వ్యవహరించాలని, యిది ధార్మిక విధానానికి మొదటి మెట్టేనని, చివరిమెట్టు కాదని, యిట్టి పునాది లేనిదే ధార్మిక జీవన భవన నిర్మాణం చేయడం సాధ్యంకాదని నా నిర్ణయం యిది రెండవ కారణం

ఇక మనం మన చరిత్రవైపుకు మళ్లుదాం

నా వాదన చాలా మందికి నచ్చింది. అయితే యిది నా ఒక్కడి వాదనయేనని పాఠకులు గ్రహించకుందురు గాక. ముందు నుంచే చాలా మంది యీ అభిప్రాయాన్ని ప్రకటించారు అయితే యింతటి భయంకరమైన యుద్ధ ఫెళఫెళార్భటుల మధ్య భారతీయుల హీనస్వరం ఎవరికి వినపడుతుంది

అని వాళ్లు అనుకున్నారు అసలు మనమాటకు విలువయిస్తారా? అదీగాక మనం భారతీయులం ఎన్నడూ యుద్ధంలో పాల్గొన లేదు తుపాకీ చేత బట్టలేదు అని అంతా సందేహించారు అయితే ఆయుధాలు చేపట్టకపోయినా, యుద్ధ రంగంలో చేయవలసిన పనులు యింకా చాలా వుంటాయి వాటికి కూడా శిక్షణ అవసరం అడుగులో అడుగు వేస్తూ కదంత్రొక్కుతూ ఒక్క వరుసలో నడవడం కూడా మన వాళ్లకు తెలియదు అంతేగాక సైనికులతో బాటు, పెద్ద మజిలీలు దాటడం, ఎవరి సామాను వాళ్లు మోసుకొని నడవటం కూడా మనకు కష్టమైన పనియే యింతే గాక తెల్లవాళ్లు మనల్ని 'కూలీ' అని పిలుస్తారు అవమానిస్తారు మనల్ని హీనంగా చూస్తారు యిదంతా ఎలా సహించగలం? సైన్యంలో చేరతామని మనం కోరితే దాన్ని అంగీకరించేలా చేయడం సాధ్యమా? యీ పశ్నలన్నింటిని గురించి దీర్ఘంగా చర్చించి, ఏది ఏమైనా మన కృషి మనం తప్పక చేయవలసిందే అనునిర్ణయానికి వచ్చాము పనిచేయడం ప్రారంభిస్తే అదే యింకా పని చేయడాన్ని నేర్పుతుంది మనకు సేవ చేయాలనే కోరిక వుంటే భగవంతుడే ఆ పని చేసే శక్తి ప్రసాదిస్తాడు లభించినపని ఎలా పూర్తి చేయగలం అని ఆలోచించ కూడదు శక్తిని బట్టి శిక్షణ పొందాలి సేవాకార్యానికి పూనుకున్న తరువాత మానావమానాల్ని గురించి మనం పట్టించుకోకూడదు అవమానించిన వారికి కూడా మనం సేవ చేయవలసిందేనని అంతా నిర్ణయానికి వచ్చాం

మా కోరికను అంగీకరింప చేయుటకు అపరిమితంగా కష్టాలు పడవలసి వచ్చింది అది ఒకరసవత్తరమైన గాథ కాని యిక్కడ ఆ గాథ వివరాలు వ్రాయడం లేదు మేము కొందరం యుద్ధంలో గాయపడిన వారికి సేవ చేయడాన్ని గురించిన శిక్షణ పొందాము మా శారీరిక శక్తికి సంబంధించిన సర్టిఫికెట్లు డాక్టర్ల దగ్గర తీసుకున్నాము ఆ తరువాత యుద్ధ రంగంలోకి వెళ్లడానికి అనుమతి యిమ్మని ప్రభుత్వానికి జాబు పంపాము మా జాబు యొక్క ప్రభావం మంచిగా పడింది ప్రభుత్వం మాకు కృతజ్ఞత తెలుపుతూ, ప్రస్తుతం మీ కోరికను అంగీకరిరంచడం లేదని జాబు పంపింది యీ లోపున బోయర్ల శక్తి పెరిగిపోయింది వాళ్ల దాడిభయంకరంగా సాగింది వరదలా

ముందుకు ఉరికి వాళ్ల సైన్యాలు నేటాల్ రాజధానీ నగరంలోకి ప్రవేశించనున్నాయనే భయం ప్రభుత్వాన్ని పట్టుకున్నది గాయపడిన వారి దేహాలు చచ్చిపోయినవారి శవాలు కుప్పతిప్పలుగా పడి వున్నాయి మా కోరికను అంగీకరించమని అప్పటికీ మా ప్రయత్నం సాగుతూనే వున్నది చివరికి అంబులెన్స్‌కోర్ (గాయపడ్డవాళ్లను ఎత్తుకు రావడం, వాళ్లకు సేవ చేయడం పనిగాగలదళం) రూపంలో మాకు అనుమతి లభించింది మా జాబులో ఆసుపత్రుల యందలి పాయిఖానా దొడ్లను శుభ్రం చేస్తామని ఆసుప్రతుల్ని ఊడ్చి, కడిగి శుభ్రం చేస్తామని కూడా వ్రాశాము అందువల్ల అంబులెన్స్‌కోర్ మాకు నచ్చింది స్వతంత్ర భారతీయులు, గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయులు అందు చేరతామని జాబులో వ్రాశాము దానితో పాటు గిర్‌మిటియా కార్మికులను కూడా చేర్చుకొనుటకు అనుమతించమని కోరాము అప్పుడు ప్రభుత్వానికి ఎక్కువమంది జనం అవసరమైనారు కనుక ప్రభుత్వాధికారులు వెంటనే గిర్‌మిటియా కార్మికులు చాకిరీ చేస్తున్న తెల్లవారి భవనాలకు వెళ్లి గిర్‌మిటియా కూలీలను అప్పగించమని ప్రార్థించారు దానితో 1100 మంది భారతీయుల అంబులెన్స్ కోర్ ఏర్పడింది యుద్ధరంగానికి దర్జాగా బయలు దేరి వెళ్లాము వెళ్లేముందు పాఠకులకు పరిచితుడైన, నేటాలు యందలి తెల్లజాతి వాలంటీర్ల దళానికి నాయకుడైన శ్రీ ఎస్కంబ్ గారిని కలిసి వారి ఆశీస్సులు పొందాము కృతజ్ఞతలు కూడా వారు మాకు తెలియజేశారు ఆంగ్ల భాషా పత్రికల బుర్ర తిరిగిపోయింది యిది వాటికి గొప్ప చమత్కారమనిపించింది భారతీయులు యీ యుద్ధంలో పాల్గొంటారని వాళ్లు ఊహించలేదు

ఒక ఆంగ్లేయుడు భారతీయుల్ని ప్రశంసిస్తూ ఒక కవితకూడా ఘనంగా వ్రాసి పత్రికలో ప్రచురించారు "చివరికి మనమంతా ఒక సామ్రాజ్యం బాలకులమే" అనునది అతడి కవిత యొక్క పల్లవిభావం

ఈ దళంలో 300 లేక 400 మంది గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన భారతీయులు వున్నారు వీరంతా స్వతంత్ర భారతీయుల కృషివల్ల వచ్చి చేరారు అందు 37 మంది నాయకులు వున్నారు వారి సంతకాలతోనే

ప్రభుత్వానికి అనుమతి నొసంగమని జాబు వెళ్లింది యితర జనాన్ని ప్రోగుచేసింది కూడా వారే యీ నాయకుల్లో బారిస్టర్లు వున్నారు గుమాస్తాలు కూడా వున్నారు మిగతా వారిలో తాపీ పనివాళ్లు, నేతపని వాళ్లు, తదితర చేతివృత్తుల వాళ్లువున్నారు వారిలో హిందువులు మహమ్మదీయులు, మద్రాసీలు, ఉత్తర ప్రదేశ్ వాసులు, అన్ని మతాలవాళ్లు, అన్ని ప్రాంతాల వాళ్లు వున్నారు అయితే భారతీయ వ్యాపారస్థులు మాత్రం ఎవ్వరూ అందులో చేరలేదు కాని వారు ధనసహాయం బాగా చేశారు

ఇట్టి దళంలో చేరిన వారికి భత్తాలు లభిస్తాయి అయితే యితర అవసరాలు వాళ్లకు చాలా వుంటాయి ఆ అవసరాలు కూడా తీరితే కఠోరంగా సాగే క్యాంపు జీవితంలో కొద్ది సదుపాయాలు లభిస్తాయన్నమాట ఆ అవసరాలు తీర్చడానికి భారత వ్యాపారస్థులు పూనుకున్నారు గాయపడిన సైనికులకు మిఠాయిలు, సిగరెట్లు వగైరా మేము యివ్వవలసివుంటుంది ఆ బాధ్యత కూడా వ్యాపారస్థులు వహించారు పట్టణాల దగ్గర మాదళ సభ్యులు డేరాలు వేసుకొనవలసి వచ్చినప్పుడు అక్కడి భారత వ్యాపారులు తమ సహాయ సహకారాలు అందజేస్తూ వున్నారు ఈ అంబులెన్స్ కోర్‌లో గిర్‌మిటియా కార్మికులు కూడా చేరారని తెలియజేశాను కదా వారి పనులు సరిచూచేందుకై వారితోబాటు వారి తెల్లజాతి సర్దార్లు కూడా వచ్చారు అయితే చేయవలసిన పని అందరికీ సమానంగానే నిర్ణయించారు అందరూ కలిసి మెలిసి వుండాలి గిర్‌మిటియా కార్మికులు మమ్మల్ని చూచి ఆనందపడిపోయారు మొత్తం దళ వ్యవస్థ మాచేతికి వచ్చింది అందువల్ల యీ అంబులెన్స్ దళం భారతజాతి కంతటికి ప్రతీకయని అందరూ భావించారు వారిసేవాకార్యక్రమం వల్ల భారతజాతి గౌరవం ఇనుమడించింది కూడా అయితే నిజానికి గిర్‌మిటియా కార్మికుల చేరికకు సంబంధించిన గౌరవం భారత జాతికి లభించుటకు వీలులేదు ఆ గౌరవం ఆ యా కార్మికులు పనిచేస్తున్న స్థావరాల యజమానులగు ఆంగ్లేయులకే దక్కాలి అయితే దళం తయారై కార్యరంగంలోకి దూకిన తరువాత దాని సువ్యవస్థిత

సేవాకార్యక్రమం వల్ల ఎంతో గౌరవం భారతజాతికే లభించింది యీ విషయాన్ని జనరల్ బులర్ తన పత్రాల్లో పేర్కొన్నాడు

జబ్బు పడ్డవాళ్లకు, గాయపడిన వాళ్లకు ఎలా సేవచేయాలో నేర్పిన డా॥ బూథ్ కూడా మెడికల్ సూపరింటెండెంటుగా మా దళం వెంటవున్నారు వారు సహృదయులు మంచిపాదరీ వారు భారతీయ క్రైస్తవులతో బాటు పనిచేస్తూ వుండేవారు అందరితో కలిసిమెలిసి వుండేవారు నేను చెప్పిన 37 మంది భారతీయ నాయకుల్లో చాలా మంది వీరి శిష్యులే భారతీయుల అంబులెన్స్ దళం మాదిరిగా యూరోపియన్ల అంబులెన్స్ దళం కూడా తయారై కార్యరంగంలోకి దిగింది రెండుదళాల కార్యక్రమం ఒకే చోట సాగింది

యుద్ధంలో సాయం చేస్తామని పంపిన మా పత్రంలో షరతులేమీ పెట్టలేదు అయితే మా అనుమతి పత్రంలో ప్రభుత్వం, మీ దళంఫిరంగుల తుపాకుల గుండ్లు తగిలే స్థావరంలో పని చేయనక్కరలేదని పేర్కొన్నది అంటే అట్టి స్థావరంలో గాయపడి, పడిపోయిన సైనికుల శరీరాల్ని అక్కడ వుండి పనిచేసే అంబులెన్స్ దళం సభ్యులు వెంటనే ఎత్తుకొని కొంత దూరం వచ్చి వదిలి వెళితే మేము యిక ఆ శరీరాలను గురించి శ్రద్ధ వహిస్తామన్న మాట తాత్కాలికంగా ఏర్పడిన భారతీయులదళం, యూరోపియన్ల దళం రెండిటి సహకారం ప్రభుత్వానికి ఎందుకు అవసరమైందో తరువాత తెలిసింది లేడీస్మిథ్‌లో జరుగుతున్న సంగ్రామంలో జనరల్ హ్వైట్ చిక్కుకు పోయాడు అతణ్ణి రక్షించడానికి జనరల్ బులర్ పెద్ద ప్రయత్నం చేయవలసి వచ్చింది ఆ పోరులో యుద్ధస్థావరంలో పనిచేసే అంబులెన్స్ దళ సభ్యుల శక్తికి మించిన సైనికులు దెబ్బతినే ప్రమాదం ఏర్పడింది యుద్ధం జరుగుతున్న చోటుకు, ఆసుపత్రికి మధ్యన రోడ్లు కూడా లేవు దూరం కూడా ఎక్కువ గాయపడ్డ వాళ్లను గుర్రం బండ్ల మీద తీసుకుపోవడం అసంభవమై పోయింది పెద్ద ఆసుపత్రులు రైలుస్టేషను దగ్గర, యుద్ధస్థావరానికి 8 నుంచి 25 మైళ్ల దూరాన ఉంటాయి మేము వెంటనే పనికి దిగవలసి వచ్చింది అది మేము ఊహించిన దానికంటే కష్టమైన పని

గాయపడ్డ సైనికుల శరీరాల్ని ఎత్తుకొని 7 లేక 8 మైళ్ల దూరం నడిచివెళ్లడానికి మేము అలవాటు పడ్డాం కాని ప్రమాదకరంగా గాయపడ్డ సైనికులను ఆఫీసర్లను మోసుకొని 25 మైళ్ల దూరం నడవవలసిన పరిస్థితి ఏర్పడింది త్రోవలో వాళ్లకు మందులు యివ్వాలి మా పని ఉదయం 8 గంటలనుంచి సాయం కాలం 5 గంటల దాకా సాగుతుంది అప్పటికి ఆసుపత్రికి మేము చేరి తీరాలి యిది చాలా కష్టమైనపని ఒక రోజున మేము యీ విధంగా 25 మైళ్ల దూరం నడవవలసి వచ్చింది అదీగాక యుద్ధ ప్రారంభంలో ఓటములను బ్రిటిష్ వాళ్లు చవిచూడవలసి వచ్చింది పెద్ద సంఖ్యలో తెల్లజాతి సైనికులు గాయపడ్డారు అందువల్ల తుపాకీ ఫిరంగుల గుండ్లు వర్షించే చోట మమ్మల్ని వెళ్లవద్దని విధించిన తమ షరతును ఉపసంహరించుకోవలసి వచ్చింది అయితే ఒక్క విషయం వ్రాయడం అవసరం అట్టిస్థితి వచ్చినప్పుడు మీకిచ్చిన అనుమతి పత్రం ప్రకారం మిమ్మల్ని ప్రమాదకరమైన స్థావరానికి పంపుటకు వీలులేదు గుండ్ల వర్షం కురిసే చోటుకు మీరు వెళ్లడానికి యిష్టపడకపోతే జనరల్ బులర్ మిమ్మల్ని బలవంతపెట్టరు కాని మీరు స్వేచ్ఛగా అందుకు అంగీకరిస్తే ప్రభుత్వం మీ ఉపకారాన్ని మరిచిపోలేదు" అని మాకు చెప్పారు మేము ప్రమాదాలకు సిద్ధపడే వున్నాం ప్రమాద స్థావరానికి దూరంగా వుండాలనే కోరిక మాకు లేదు అందువల్ల మేమంతా అందుకు సిద్ధపడ్డాం వెళ్లాం కాని మాకెవ్వరికీ ఒక్క గుండు తగలలేదు చిన్న దెబ్బకూడా తగలలేదు

మా దళ సభ్యులకు ఎన్నో సుఖం కలిగించే అనుభవాలు కలిగాయి అయితే వాటన్నింటిని యిక్కడ వివరించను గిరిమిటియా కార్మికులు కూడా గలమా అంబులెన్స్ దళ సభ్యులు, ఆంగ్లేయుల అంబులెన్స్ దళ సభ్యులు కలిసిమెలిసి పని చేయవలసిన అవసరం ఎన్నోసార్లు కలిగింది యుద్ధస్థావరంలో సైతం అంతా కలిసి మెలిసి పనిచేశాం ఒక్కచోట కూడా ఆంగ్లేయులు మమ్మల్ని అవమానించలేదు హీనంగా చూడలేదు ఎంతో సఖ్యతతో అందరం కలిసి పనిచేశాం ఆంగ్లేయుల తాత్కాలిక అంబులెన్స్ దళంలో చేరిన వారంతా దక్షిణాఫ్రికాలో నివసిస్తున్న వారే తాము ప్రమాదంలో

చిక్కుకున్నప్పుడు కోపతాపాలు అసూయా ద్వేషాలు విస్మరించి భారతీయులు ప్రాణాలకు తెగించి తమ జాతికి చేస్తున్న సేవల్ని చూచి ఆ సమయంలో వాళ్లంతా ఆనందంతో పొంగిపోయారు జనరల్ బులర్ పత్రాల్లో మా సేవల్ని ప్రశంసించిన విషయం ముందే వ్రాశాను మా 37 మంది భారతీయ నాయకులకు పతకాలు కూడా బహూకరించారు

లేడీస్మిధ్ యందలి ఆంగ్లేయుల పటాలాల్ని, బోయర్ల దాడి నుంచి రక్షించిన తరువాత జనరల్ బులర్ యుద్ధకార్యక్రమం ముగిసింది అందుకు రెండునెలల సమయం పట్టింది అప్పుడు మా దళం, ఆంగ్లేయుల దళం రెండిటికీ ముక్తి లభించింది తరువాత కూడా యుద్ధం చాలా కాలం సాగింది మళ్లీ వెళ్లడానికి మేమంతా సిద్ధంగా వున్నాం అంతపెద్ద యుద్ధం మళ్లీ జరిగితే మీ సహకారం ప్రభుత్వానికి అవసరం అప్పుడు కబురు పంపుతామని అధికారులు మాకు జాబు పంపారు

దక్షిణాఫ్రికాలో జరిగిన యుద్ధంలో భారతీయులు పాల్గొని చేసిన పని సామాన్యమైనదే ప్రాణనష్టం కూడా ఏమీ జరగలేదు అయినా ప్రాణాలకు తెగించి చేసిన సేవా ప్రభావం మాత్రం అమితంగా తెల్ల వారి మీద పడిందని చెప్పవచ్చు. భారతీయులు యుద్ధంలో పాల్గొని ఆంగ్లేయులకు సహాయం చేస్తారని కలలో సైతం ఎవ్వరూ ఊహించని తరుణంలో, అలా జరగడం వల్ల మంచి ప్రభావం అమితంగా తెల్లవారి హృదయాలపై పడింది దాని విలువ కూడా బాగా పెరిగింది బోయర్ యుద్ధం ముగిసేంతవరకు తెల్లవారి హృదయాలలో భారతీయులయెడ కృతజ్ఞతాభావం నిండి యున్నదనుట యదార్థం

ఈ ప్రకరణాన్ని ముగించేముందు ఒక అవిస్మరణీయ ఘట్టాన్ని గురించి యిక్కడ చెప్పడం అవసరం లేడీస్మిధ్ బోయర్ల చేతుల్లో చిక్కినప్పుడు ఇంగ్లీషు వాళ్లతో బాటు కొద్దిమంది భారతీయులు కూడా అక్కడ వున్నారు వారిలో కొందరు వ్యాపారులు, మిగతావారు గిరమిటియా కార్మికులు. యిట్టి కార్మికులు కొందరు రైల్వేలో పని చేస్తున్నారు కొందరు ఆంగ్లేయుల యిండ్లలో నౌకర్లుగా వున్నారు ఒక గిరమిట్‌యా కార్మికుని పేరు పరభుసింగ్

శత్రుసైన్యాల ముట్టడిలో చిక్కుకున్న ప్రతివాడికి సైనిక అధికారులు కొన్ని పనులు అప్పగించారు అతి ప్రమాద కరము, అత్యంత సహాయకారి యగు పని పరభుసింగుకు అప్పగించారు లేడీస్మిథ్‌కు బహుసమీపంలో గల ఒక ఎత్తైన కొండ మీద బోయర్లు పాంపాం అను పేరుగల పెద్ద ఫిరంగిని నిలిపి వుంచారు ఆ ఫిరంగి నుంచి వెలువడిన అనేక గుండ్లకు లేడీస్మిథ్ యందలి చాలా భవనాలు కూలిపోయాయి చాలా మంది జనం ప్రాణాలు కూడా కోల్పోయారు ఫిరంగి నుంచి గుండు బయటికి వెలువడి, గురి చూచిన చోట పడడానికి ఒకటి రెండు నిమిషాల సమయం పడుతుంది గుండు వెలువడిందని తెలిస్తే ఆ కొద్ది సమయంలో అది పడే చోటున వున్న జనం రక్షణ స్థావరాలకు చేరి ప్రాణం కాపాడుకోవచ్చు పరభుసింగుకు అత్యంత ప్రమాదకరమైన ఆ పని అప్పగించారు అతడు ఫిరంగి పై దృష్టి నిలిపి ఒక్క చెట్టు క్రింద కూర్చొని వుండేవాడు ఫిరంగి గుండు మ్రోగగానే పెద్ద గంట మ్రోగించమని అతడికి ఆదేశం యివ్వబడింది ప్రాణాలకు ముప్పు కలిగించే ఫిరంగి గుండు వెలువడగానే హెచ్చరిక గంటగణగణ మ్రోగేది వెంటనే జనం తమ తమ రక్షణకేంద్రాలకు పరుగిడి అక్కడ దాక్కొని ప్రాణాలు కాపాడుకునే వారు పిల్లిని చూడగానే ఎలుకలు తెగబడి అటోయిటో పరుగెత్తి ప్రాణాలు రక్షించుకునేందుకు ప్రయత్నించినట్లుగా అక్కడి జనం గంట మ్రోతవినపడగానే వ్యవహరిస్తూ వుండేవారు పరభుసింగ్ చేసిన యీ అత్యద్భుత సేవా కార్యాన్ని ప్రశంసిస్తూ, లేడీస్మిథ్ యందలి సైనికాధికారి "పరభుసింగ్ నిష్ఠాగరిష్ఠుడు ఒక్క సారైనా అతడు తన కర్తవ్య నిర్వహణలో ఏమరుపాటు చూపలేదు " అని పొగిడి ఆదరించాడు పరభుసింగ్ ప్రాణాలకు అక్కడ అసలు రక్షణ లేదు అయినా ప్రాణాలకు తెగించి అతడు చేసిన యీ ఘనకార్య సమాచారం నేటాలునందేగాక, ఆనాటి భారత వైస్రాయ్ లార్డ్ కర్జన్ చెవులదాకా వెళ్లింది కర్జన్ పరభుసింగ్ గౌరవార్థం ఒక కాశ్మీరు అంగరఖా పంపించాడు పరభుసింగ్ సేవా కార్యాన్ని అత్యధికంగా ప్రచారం కావించి, కారణం ప్రకటించి, పరభుసింగ్‌కు యీ అంగరఖాను ప్రదానం చేయమని అంగరఖాతో బాటు పత్రం కూడా పంపించాడు. యీ

పని డర్బన్ నగర్ మేయరుకు అప్పగించబడింది అతడు డర్బన్ నగర మందలి టౌన్ హాలు కౌన్సిల్ ఛేంబరులో బహిరంగ సభ జరిపి పరభుసింగ్‌కు ఆ అంగరఖాను కానుకగా సమర్పించాడు యీ ఘట్టం వల్ల 'ఏమనిషిని తేలికగా చూడకూడదు తుచ్ఛుడని భావించ కూడదు మరియు ఎంత పిరికి పంద అయినా అవసరం వచ్చినప్పుడు వీరుడైపోగలడు' అను రెండు విషయాలు మనకు బోధపడతాయి

★ ★ ★

# 10

# యుద్ధం తరువాత

1900నాటికి బోయర్ యుద్ధం ముగిసింది లేడీస్మిథ్, కింబర్లీ, మెఫేకింగ్‌కీలను బోయర్ సైన్యాల చేతుల నుంచి బ్రిటిష్‌వాళ్ళు విడిపించారు జనరల్ క్రోన్జే పారడీబర్గ్‌లో ఓడిపోయాడు బోయర్లు జయించిన బ్రిటిష్‌వారి భూభాగమంతా తిరిగి బ్రిటిష్ సామ్రాజ్యం క్రిందకు వచ్చింది లార్డ్‌కిచనర్ ట్రాన్స్‌వాల్ ఫ్రీస్టేట్‌లను కూడా తమ అధినంలోకి తెచ్చుకున్నాడు యిక గొరిల్లా పోరాటాలు మాత్రమే మిగిలాయి

దక్షిణాఫ్రికాలో నా పనిపూర్తి అయిందనే నిర్ణయానికి వచ్చాను ఒకనెల రోజులు వుండాలని వెళ్లిన నేను ఆరుసంవత్సరాలు అక్కడ వుండిపోయాను కార్యక్రమ రూపురేఖలు స్థిరపడ్డాయి అక్కడి ప్రజల అంగీకారం లేకుండానే నేను భారతావనికి తిరిగి రావడం కష్టమైపోయింది నేను భారతదేశం వెళ్లి అక్కడ ప్రజానీకానికి సేవ చేస్తానని అనుచరులకు తెలియజేశాను దక్షిణాఫ్రికాలో నేను స్వార్థంవదిలి సేవాధర్మాన్ని నేర్చుకున్నాను సేవాధర్మంయెడ నాకుగల మక్కువ బాగా పెరిగింది శ్రీమనసుఖలాల్‌నాజర్ దక్షిణాఫ్రికాలో వున్నారు శ్రీఖాన్‌కూడా అక్కడ వున్నారు దక్షిణాఫ్రికానుంచి కొద్ది మంది యువకులు ఇంగ్లాండు వెళ్లి బారిష్టరుపట్టా పుచ్చుకొని వచ్చారు అట్టి స్థితిలో నేను అక్కడి నుంచి భారతీయులు ఒక్క షరతుపై భారతదేశానికి వెళ్లవచ్చునని చెప్పారు. అనుకోకుండా భారతజాతి ఆపదలో చిక్కుకుంటే మేము

తెలియజేస్తాము అప్పుడు మీరు వెంటనే దక్షిణాఫ్రికా వచ్చితీరాలి అట్టి షరతుపైమీరు భారతావని వెళ్లవచ్చుననీ వారంతా చెప్పారు ఓడ యాత్రకు అయ్యేఖర్చు, నాకుటుంబానికి అయ్యేఖర్చు భారతజాతి భరిస్తుందని వాళ్లు మాట యిచ్చారు వారి షరతును అంగీకరించి నేను ఇండియాకు తిరిగివచ్చాను

బొంబాయిలో బారిస్టరీ ప్రారంభించాలని అనుకున్నాను కీ॥శే॥గోఖలేగారి సలహా, సంప్రదింపులతో ప్రజాసేవా కార్యక్రమాలు నిర్వహించాలనేది అందుకుగల ఒకకారణం జీవన నిర్వహణ రెండవ కారణం అందుకై బొంబాయిలో నేను కొద్ది గదులు అద్దెకు తీసుకున్నాను నావకాల్తా కూడా కొద్దిగా పుంజుకున్నది దక్షిణాఫ్రికా యందలి భారతీయులతో నాకు విడదీయరాని సంబంధం ఏర్పడిపోయింది అందువల్ల అక్కడినుంచి భారతావనికి తిరిగివచ్చిన మిత్రులే అమితంగా కోర్టు వ్యవహారాలు నాకు అప్పగించారు వారివల్ల జీవన నిర్వహణకు తేలికగా ఏర్పాటు జరిగిపోయింది కాని నా జీవితంలో శాంతిసౌఖ్యాలు వ్రాసి లేవు మూడునాలుగు మాసాలు బొంబాయిలో గడిపానోలేదో, యింతలో దక్షిణాఫ్రికా నుంచి "ఇక్కడి పరిస్థితి తీవ్రంగా వున్నది శ్రీ ఛేంబర్లేన్ కొద్ది రోజుల్లో వస్తున్నారు మీరు యిక్కడ వుండటం అవసరం" అని తంతి వచ్చింది

వెంటనే నేను బొంబాయి యందలి ఆఫీసును, నివాసాన్ని వదిలివేశాను దక్షిణాఫ్రికాకు బయలుదేరాను 1902వ సంవత్సరం గడిచిపోతున్నది 1901 చివరిరోజుల్లో బొంబాయిలో ఆఫీసు తెరిచాను తంతిద్వారా అక్కడి వాస్తవ పరిస్థితిని నేను గ్రహించలేకపోయాను ట్రాన్స్‌వాల్‌లోనే ఏదో విపత్కర స్థితి ఏర్పడి వుంటుందని ఊహించాను కుటుంబాన్ని ఇండియాలోనే వుంచాను మూడు నాలుగుమాసాల్లో తిరిగి రావచ్చని అనుకోవడమే అందుకు కారణం కాని డర్బన్ చేరిన తరువాత అక్కడి సంగతులు విని నివ్వెరబోయాను బోయర్ యుద్ధం తరువాత దక్షిణాఫ్రికా యందలి భారతీయుల స్థితిగతుల్లో ఎంతో మార్పు వస్తుందని అంతా భావించాము ముఖ్యంగా ట్రాన్స్‌వాల్, ఆరంజ్‌ఫ్రీస్టేట్‌లో ఏ విధమైన ఆపదరాదని భావించాము, బోయర్ యుద్ధం ప్రారంభమైనప్పుడు లార్డ్ లెన్స్ డౌనన్, లార్డ్ సెల్‌బర్న్, బ్రిటన్‌కు చెందిన

ఉన్నతాధికారులు యీ యుద్ధానికి గల కారణాల్లో బోయర్లు భారతీయులయెడ ప్రవర్తిస్తున్న చెడ్డతీరు కూడా ఒకటని ప్రకటించారు ప్రిటోరియా యందలి బ్రిటిష్ ఏజంటు కూడా నాతో అనేక సార్లు ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ సామ్రాజ్యంలో అధినివేశ రాజ్యంగా మారితే అక్కడి భారతీయుల స్థితిగతులన్నీ మారిపోతాయని చెప్పాడు తెల్లవారుకూడా రాజ్యవ్యవస్థ మారగానే ట్రాన్స్‌వాల్ యందలి పాత ప్రభుత్వం భారతీయులపై పెట్టిన ఆంక్షలు, చట్టాలు అన్నీ రద్దు అయి పోతాయని భావించారు నిజానికి కొంత మంచి మార్పుకూడా కనబడింది భూముల్ని వేలంవేసే అధికారులు బోయర్ యుద్ధానికి పూర్వం భారతీయులు పాడిన పాటను అంగీకరించేవారుకాదు అట్టి వాళ్లు యిప్పుడు బహిరంగంగా అంగీకరిస్తున్నారు చాలా మంది భారతీయులు వేలంపాటలో భూముల్ని కొన్నారు కూడా పాటల్ని అంగీకరించిన తరువాత భూముల్ని రిజిష్టరు చేయించుకుందామని ఆఫీసులకి వెళ్లితే 1885 నాటిచట్ట మందలి 3వ నిబంధన ప్రకారం రిజిష్టరీ చేయుటకు నిరాకరించారు డర్బన్ హార్బరులో దిగగానేయీ విషయం తెలిసింది మీరుట్రాన్స్‌వాల్ వెళ్లడం అవసరమని భారతీయ నాయకులు నాకు చెప్పారు అయితే మి॥ ఛేంబర్లేన్ మొదట డర్బన్ వస్తాడని, యిక్కడి (నేటాల్) భారతీయుల స్థితిని గురించి వారికి చెప్పాలని, యిక్కడ పని పూర్తికాగానే ఆయనతో బాటు ట్రాన్స్‌వాల్ మీరు వెళ్ళమనికూడా వాళ్లు చెప్పారు

నేటాలులో భారతీయ ప్రతినిధి బృందం శ్రీఛేంబర్లేను కలిసింది బృంద సభ్యులు చెప్పిందంతా శాంతితోను, సహనంతోను విని ఛేంబర్లేను నేటాల్ మంత్రి మండలి సభ్యులతో మాట్లాడతానని మాట యిచ్చాడు బోయర్ యుద్ధానికి పూర్వం భారతీయులకు వ్యతిరేకంగా నేటాల్‌లో జరిగిన చట్టాల్లో వెంటనే మార్పు వస్తుందని నేను ఆశించలేదు ఆచట్టాల్నిగురించి గత ప్రకరణాల్లో నేను వివరించాను

బోయర్ యుద్ధానికి పూర్వం ఏభారతీయుడైనా, ఎప్పుడైనా ట్రాన్స్‌వాల్‌కు వెళ్లవచ్చు కాని యిప్పుడు ఆస్థితి మారిపోయిందని గ్రహించాను అప్పుడు

ఆంక్షలు తెల్లవారికి, భారతీయులకి ఒకేవిధంగా లేవు ఎక్కువమంది జనం ప్రవేశిస్తే వారికి ఆహారపానీయాలు కూడా లభించే పరిస్థితి యిప్పుడు అక్కడ లేదు యుద్ధం అయిపోయిన తరువాత కూడా అక్కడి దుకాణాలు పూర్తిగా తెరువబకపోవడమే అందుకు కారణం దుకాణాల్లో గల సామగ్రిని బోయర్ ప్రభుత్వం కాజేసింది అందువల్ల కొంత కాలం యీ ఆంక్ష వుంటే నష్టం లేదని అనుకున్నాను అయితే ట్రాన్స్‌వాల్ ప్రవేశించే తెల్లవారికి, భారతీయులకు గల నిబంధనల్లో చాలా మార్పులు చేశారు. అనుమతి పత్రం యిచ్చేవిధానం మారింది ఈ మార్పు సందేహాలకు, భయానికి తావు యిచ్చింది అనుమతిపత్రాలు యిచ్చే ఆఫీసులు హార్బర్ల దగ్గర ఏర్పాటు అయ్యాయి ఇంగ్లీషువాళ్లకు అడగగానే ఆ ఆఫీసుల్లో అనుమతి పత్రాలు యిస్తున్నారు కాని భారతీయులకోసంవేరే ఏషియాటిక్ శాఖను ప్రారంభించారు

ఈ విధంగా వేరే శాఖను మొదటిసారిప్రారంభించారన్నమాట ఆ ఆఫీసుల్లో భారతీయులు అర్జీ పెట్టుకోవాలి ఆ అర్జీ మంజూరు కాగానే డర్బన్‌లేక, మిగతా హార్బర్లలో సామాన్యంగా అనుమతి పత్రాలు లభిస్తూవుంటాయి నేను కూడా అనుమతి పత్రంతీసుకోవాలంటే, శ్రీఛేంబర్లేన్ ట్రాన్‌స్వాల్‌ను వదిలివెళ్లేంత వరకూ వేచివుండవలసిన స్థితి ఏర్పడింది ట్రాన్స్‌వాల్ యందలి భారతీయులు అటువంటి పత్రం నాకోసం సంపాదించలేకపోయారు యిదివారిశక్తికి మించిన పని అయిపోయింది నాకు యిచ్చే అనుమతి పత్రానికి ఆధారం డర్బన్‌తో గల నా పరిచయమే పత్రం యిచ్చే అధికారిని నేను ఎరుగను కాని డర్బన్ యందలి పోలీసు సూపరింటెండెంటును ఎరుగుదును అందువల్ల వారిని వెంటబెట్టుకొని వెళ్లి, ఆ అధికారికి నన్ను పరిచయంచేసుకోన్నాను 1893లో నేను ఒక సంవత్సరం ట్రాన్స్‌వాల్‌లో వున్నానని చెప్పి అనుమతి పత్రం తీసుకున్నాను ప్రిటోరియా చేరాను

ప్రిటోరియయాలో మరో వాతావరణం కనబడింది. ఏషియాటిక్ శాఖ భయంకరమైనదని, భారతీయుల్ని అణిచివేసేందుకే ఆశాఖ తెరవబడిందనీ అర్థం చేసుకున్నాను ఆశాఖలో పనిచేస్తున్న ఆఫీసర్లంతా బోయర్ యుద్ధ

సమయంలో సైన్యంతో బాటు భారతావని నుంచిదక్షిణాఫ్రికాకు వచ్చి తమ అదృష్టాన్ని పరీక్షించుకుందామని భావించి అక్కడ వుండిపోయిన వాళ్లే వారిలో కొందరు లంచాలు తినేరకం అట్టి యిద్దరు అధికారులపై లంచాలు తిన్నారని కోర్టులో కేసులు కూడా నడిచాయి జడ్జీలుయిద్దరినీ నిర్దోషులని ప్రకటించి వదిలివేశారు కాని లంచాలు తిన్నారని స్పష్టంగా బయట పడినందున ఆయిద్దరినీ ఉద్యోగాలనుంచి తొలగించివేశారు పక్షపాతానికి అక్కడ అంతే లేదు ఎక్కడైనా సరే కొత్త విభాగాన్ని ప్రారంభిస్తే, అది అమల్లోవున్న అధికారాల్ని తగ్గించడంకోసమే కొత్త కొత్త ఆంక్షల్ని యోచించడం మొదలు పెడుతుంది ఏషియాటిక్ విభాగం కూడా యిటువంటి రకమే

ఇక నాకార్యక్రమం మొదటి నుంచి ప్రారంభించక తప్పదనే నిర్ణయానికి వచ్చాను నేను ట్రాన్స్‌వాల్‌లోకి ఎలా ప్రవేశించానో ఏషియాటిక్ విభాగానికి బోధపడలేదు నన్ను తిన్నగా అడగడానికి అక్కడి వాళ్లకు ధైర్యం చాలలేదు అయితే నేను దొంగతనంగా ప్రవేశించే వ్యక్తిని కాదని వాళ్లకు తెలుసు నాకు ప్రవేశపత్రం ఎలా అందిందో వాళ్లు తెలుసుకున్నారు ప్రిటోరియాలో భారతీయుల ప్రతినిధి బృందం కూడా శ్రీఛేంబర్లేనును కలుసుకునేందుకు సిద్ధపడింది వారికి అందజేయవలసిన అర్జీని నేను తయారు చేశాను అయితే ఏషియాటిక్ విభాగం వాళ్లు నన్ను శ్రీచేంబర్లేను కలుసుకోనీయలేదు అట్టి స్థితిలో తాముకూడా శ్రీచేంబర్లేను కలుసుకో కూడదనే నిర్ణయానికి ప్రతినిది బృందసభ్యులు వచ్చారు కానినేను అందుకు అంగీకరించలేదు నాకు జరిగిన అవమానాన్ని నేను మింగుతాను మీరు లెక్కచేయవద్దని వారికి నచ్చ చెప్పాను అర్జీసిద్ధంగావున్నది దాన్ని శ్రీ ఛేంబర్లేనుకు వినిపించడం అవసరం భారతీయ బారిష్టరు శ్రీ జార్జ్‌గాడ్‌ఫ్రే అక్కడ వున్నారు శ్రీ ఛేంబర్లేనుకు అర్జీ వినిపించుటకు వారిని సిద్ధంచేశాను భారతీయ ప్రతినిధిబృందం ఛేంబర్లేనును కలిసింది అక్కడ నా విషయం వచ్చింది "నేను డర్బన్‌లో మిష్టర్ గాంధీని కలిశాను అందువల్ల యిక్కడవారిని కలవనని చెప్పాను ట్రాన్స్‌వాల్ విషయం ట్రాన్స్‌వాల్‌వారి ముఖతః వినాలని

నేను భావించాను" అని ఛేంబర్లేన్ వారికి చెప్పాడు ఆయన చెప్పిన యీ మాటలు అగ్నిలో ఆద్యంపోసినట్లైంది మి॥ఛేంబర్లేన్ ఏషియాటిక్ విభాగం చెప్పిన చిలకపలుకుల్ని వినిపించాడన్న మాట భారతదేశంలో వ్యాప్తమైయున్న గాలినే ఏపియయాటిక్ విభాగం వాళ్లు ట్రాన్స్‌వాల్‌లోవ్యాప్తం చేశారు గుజరాతీ (లేక భారతీయులు) వాళ్లకు తెలుసు ఇండియా యందు బొంబాయిలో వుండేవారిని ఆంగ్ల అధికారులు చంపారన్‌లో పరదేశీయులుగా భావిస్తూవుంటారు ఆసూత్రం ప్రకారం ఏషియాటిక్ శాఖ వాళ్లు డర్బన్‌లో వుండేవాడికి ట్రాన్స్‌వాల్‌లో వుండే భారతీయుల్ని గురించి ఏమీతెలియదని ఛేంబర్లేనుకు నూరిపోశారన్నమాట నాకు అక్కడి విషయాలు క్షుణ్ణంగా తెలుసునని ఏషియాటిక్ శాఖవారికి తెలిసియుండకపోవచ్చు అసలు ట్రాన్స్‌వాల్ పరిస్థితులు ఎవరికి ఎక్కువగా తెలుసు అని అడిగితే అక్కడి భారతీయులు నన్ను అక్కడికి పిలిపించి ఒక విధంగా సమాధానం యిచ్చివేశారు అధికారం చలాయిస్తున్న వారికి బుద్ధికి సంబంధించిన వాదనలు సరిపోవు అను విషయం క్రొత్తదేమీకాదు మి॥ ఛేంబర్లేన్ అప్పుడు అక్కడి ఆంగ్లేయుల ప్రభావంలో బాగా పడిపోవడమేగాక వాళ్లను తృప్తిపరచాలనే భావంతో వాళ్లు ఏంచెబితే అలా చేశాడని స్పష్టంగా తేలిపోయింది యిక న్యాయం ఎలా చేస్తాడు? అయినా మిగిలియున్న ఒక్క మార్గాన్నీ త్రోసి వేయకూడదనే భావంతో అక్కడి భారతీయ బృందం సభ్యులు వెళ్లి అతణ్ణి కలిశారు

నాకు 1894 నాటికంటే యిప్పుడు గడ్డుపరిస్థితి ఏర్పడింది ఛేంబర్లేన్ దక్షిణాఫ్రికానుంచి వెళ్లిపోగానే, నేను దక్షిణాఫ్రికా వదిలి ఇండియా వెళ్లవచ్చునని భావించాను కాని దక్షిణాఫ్రికాలో సేవాధర్మం అంటే ఏమిటో తెలుసుకున్న నేను అక్కడి భారతీయుల్ని వదలి ఇండియాకు వెళ్లి అక్కడి జనావళికి సేవచేస్తానని చెప్పడం ధర్మంకాదని అనిపించింది యిక ఏదిఏమైనా ట్రాన్స్‌వాల్ యందలి భారతీయులపై విరుచుకు పడుతున్న పిడుగుల్ని ఆపివేయుటకు నేను యిక్కడ వుండి తీరాలనే నిర్ణయానికి వచ్చాను అందుకు యావజ్జీవితం దక్షిణాఫ్రికాలో వుండవలసి వచ్చినా వుండి తీరాలని కూడా అనుకున్నాను ఈ విషయం జాతి సోదరులకు చెప్పాను 1894లో

వలెనే యీసారి కూడా అక్కడ వుండుటకు నా జీవన నిర్వహణను గురించి కూడా వారికి చెప్పాను అక్కడి వారంతా వెంటనే ఆనందంతో అంగీకరించారు

నేను వెంటనే ట్రాన్స్‌వాల్‌లో వకీలు వృత్తి ప్రారంభించడానికి అనుమతికోరుతూ అర్జీ పెట్టుకున్నాను నేటాలులో జరిగినట్లే యిక్కడి వకీళ్ల సంఘంకూడా నా అర్జీని వ్యతిరేకిస్తుందని భయపడ్డాను కాని అలా జరగలేదు వకీలు వృత్తి సాగించుటకు అనుమతి పత్రం లభించింది జోహన్స్‌బర్గులో ఆఫీసు తెరిచాను ట్రాన్స్‌వాల్ రాజ్యమందలి జోహన్స్‌బర్గులో భారతీయులసంఖ్య అధికంగా వున్నది అందువల్ల వ్యక్తిగత ఆదాయం, ప్రజాసేవ రెండిటి దృష్ట్యా జోహన్స్‌బర్గుయే అనుకూలంగా వుంటుందని భావించాను ఏషియాటిక్ విభాగపు కుళ్లుకంపు, విజృంభించింది వాళ్ల అవినీతికరమైన చర్యల చేదు అనుభవం అక్కడ రోజూ కలుగుతూవున్నది ట్రాన్స్‌వాల్ భారత మండలి ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ యొక్కశక్తి సామర్థ్యాలన్నీ ఆకుళ్లుకంపును ఆపుటకు సరిపోతున్నాయి యిట్టి స్థితిలో 1885 నాటి చట్టమందలి 3వ నిబంధన వ్యవహారం మరుగున పడిపోసాగింది ఏషియాటిక్ విభాగం రూపంలో ఉవ్వెత్తుగా ముంచుకొస్తున్న వరదతాకిడి నుంచి రక్షణ పొందడం మామొదటి లక్ష్యమైపోయింది భారతప్రతినిధి బృందం లార్డ్ మిల్నర్, అక్కడికి వచ్చిన లార్డ్ సెల్బర్న్, ట్రాన్స్‌వాల్ లెఫ్టినెంట్ గవర్నర్ సర్ ఆర్థర్‌లాలీ, (వీరు ఆ తరువాత మద్రాసు గవర్నరుగా పనిచేశారు), వారిక్రింది అధికారులనందరినీ కలిసి జరుగుతున్న అన్యాయాల్ని ఏకరువుపెట్టి అర్జీలు దాఖలు చేసింది నేను ప్రతిరోజూ చాలామందిని కలుస్తూనే వున్నాను అటనట కొద్దిగాఊపిరిపోసే మాటలు వినబడుతూ వుండేవి అయితే అవన్నీ చిరిగినబట్టకు కుట్లు వేసినట్టుగా వుండేవి. దోపిడీ దొంగలు యింట్లో జొరబడి మొత్తంకొల్లగొట్టి ఎత్తుకు పోతూ ఏడ్చి మొరపెట్టుకుంటే చివరికి దయతలిచి కొద్ది డబ్బు యజమాని ముఖానపారవేసి వెళ్లినట్లు, తెల్లదొరల వ్యవహారం వున్నది యిట్టి వ్యవహారాల వల్లనే గతంలో నేను వ్రాసిన యిద్దరు ఆఫీసర్ల మీద కోర్టులో కేసు నడిచింది భారతీయుల ప్రవేశం విషయమై మొదట నేను వెల్లడించిన

భయం నిజమేనని తేలింది తెల్ల వాళ్ల ప్రవేశానికి అనుమతి పత్రం అవసరంలేదని, భారతీయులు మాత్రం అనుమతిపత్రం తీసుకోవడం అవసరమని నిర్ణయించారు గతంలో ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం చేసిన చట్టం కఠోరంగా వున్నది కాని దాన్ని అమలు చేసే విషయంలో మెత్తగా అధికారులు వ్యవహరించారు అయితే అది బోయర్ ప్రభుత్వపు ఉదారతకు మంచితనానికి తార్కాణం కాదు ఆ ప్రభుత్వ అధికారుల అలసత్వమే అందుకు కారణం అవిభాగంలో పని చేసే అధికారులు మంచివారే అయినా, తమమంచితనాన్ని ప్రదర్శించుటకు బోయర్ ప్రభుత్వ హయాంలో వాళ్లకు లభించినంత అవకాశం, బ్రిటిష్ ప్రభుత్వహయాములో లభించలేదు బ్రిటిష్ ప్రభుత్వం పాతబడి రాటుతేలినందున, అందుపనిచేసే అధికారులు యంత్రంవలె పని చేయవలసివచ్చింది ఆ అధికారుల పనితీరుపై, ఒకటి తరువాత మరొకటి చొప్పున ఎగుడుదిగుడు అంకుశాలు అనేకం పనిచేస్తూ వుంటాయి అందువల్ల బ్రిటిష్ రాజ్యాంగపు పరిపాలనా పద్ధతి ఉదారంగా వుంటే ప్రజలకు ఉదారంగా లాభం చేకూరుతుంది కాని దాని పద్ధతి సంకుచితంగాను, దుర్మార్గంగాను వుంటే, దాని నియంత్రణ ఎక్కువైప్రజలు అణిచివేతకు గురి అవుతారు యిందుకు తలక్రిందులుగా ట్రాన్స్‌వాల్ యందలిగత ప్రభుత్వ పరిపాలనా పద్ధతి వుండేది వాళ్ల పద్ధతి ప్రకారం ప్రజలకు చట్టాలవల్ల కలిగే ప్రయోజనాలన్నీ, ప్రభుత్వాధికారుల యిష్టం ప్రకారం లభిస్తూవుండేవి, యీ పద్ధతి ప్రకారం ట్రాన్స్‌వాల్‌లో బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత భారతీయులకు సంబంధించిన చట్టాలు కఠినంగా అమలులోకి రాసాగాయి మొదట చట్టాలనుంచి తప్పించుకునేందుకు అనేకమార్గాలు వుండేవి అవన్నీ యిప్పుడు బందు అయ్యాయి ఏషియాటిక్ విభాగం వారు కఠినంగా వ్యవహతరించడం ప్రారంభించారు దానితో అసలు చట్టాల్ని రద్దుచేయిద్దామనే మా కృషి మరుగునపడి, వాటిని అమలుపరుస్తున్న కఠినవైఖరిని ఎలా సరిచేయడమూ అనే తపన ఎక్కువై పోయింది

ఇక ఒక సిద్ధాంతాన్ని గురించి త్వరగానో లేక ఆలశ్యంగానో యోచించడం అవసరం దానివల్ల భారతీయుల దృక్పథాన్ని, ఆతరువాత కలిగిన పరిణామాల

ఫలితాల పరిస్థితుల్ని తెలుసుకోవడం సులభమవుతుంది ట్రాన్స్‌వాల్, మరియు ఆరంజ్‌ఫ్రీస్టేటుల్లో బ్రిటిష్ జండా ఎగరసాగింది. అప్పుడు లార్డ్ మిల్నర్ ఒక కమిటీని ఏర్పాటు చేశాడు పాత చట్టాల్ని క్షుణ్ణంగా పరిశీలించడం, వాటి పట్టికను తయారు చేయడం, ప్రజలు అనుభవిస్తున్న స్వాతంత్ర్యం అంకుశంగా పనిచేసే చట్టాల్ని, బ్రిటిష్ రాజ్యాంగానికి వ్యతిరేకంగా వున్న చట్టాల్ని గురించి యోచించి వివరాలు తెలుపడం ఆ కమిటీ పని యిందు భారతీయుల స్వాతంత్ర్యాన్ని హరించివేస్తున్న చట్టాల్ని గురించికూడా చర్చించమని చెప్పి యుంటే బాగుండేది కాని లార్డ్‌మిల్నర్ భారతీయుల కష్టాల్ని గురించి ఏమాత్రం పట్టించుకోకుండా, తెల్లవారికష్టాల్ని తొలగించాలనే ఉద్దేశ్యంతోనే ఆకమిటీని నియమించాడు తెల్లవారికి యిబ్బందులు కలిగిస్తున్న చట్టాల్ని త్వరగా రద్దుచేయడమే ఆయనలక్ష్యం త్వరత్వరగాఆకమిటీ ఒక రిపోర్టు తయారుచేసింది ఆంగ్లేయులకు ఇబ్బందులు కలిగించే చిన్నపెద్ద చట్టాలన్నీ ఆరిపోర్టు ప్రకారం వెంటనే రద్దు అయిపోయాయి ఆకమిటీ భారతీయులకు వ్యతిరేకంగా వున్నచట్టాల లిస్టుకూడా తయారుచేసింది యిట్టి చట్టాలన్నింటినీ ప్రోగుచేసి ఒక పుస్తక రూపంలో ఆకమిటీ ప్రకటించింది దానితో ఏషియాటిక్ విభాగానికి సదవకాశం లభించినట్లయింది ఆ చట్టాల్ని యిష్టం వచ్చినట్లు అమలుపరచేందుకు అవిభాగం పూనుకున్నది

భారతీయుల పేరు పెట్టి వారికి వ్యతిరేకంగా చట్టాలు చేయకుండా ఆ చట్టాలు అందరికీ వర్తిస్తాయి అని చెప్పియున్నా, వాటిని అమలు పరచడమా లేదా అను విషయం అధికారులకు వదిలి వేసియున్నా, సామూహికంగా సర్వులకు వర్తిస్తాయి అనే అర్థం చెప్పియున్నా, తెల్లవాళ్లు మాత్రం వాటిని భారతీయులకే వర్తింపచేసి యుండేవాళ్లు అట్టి చట్టాలుచేసినవారి కోరిక సర్వుల కోసం అనే అర్థంతో నెరవేరియుండేది అందువల్ల ఎవ్వరికీ ప్రత్యేకించి అవమానం జరిగియుండేది కాదు కాలం గడిచినకొద్దీ వ్యతిరేకత తగ్గేది వాటిలో ఏమీమార్పులు చేయకుండానే, వాటిని ఉదారంగా అమలుపరచియుంటే, ఎవరిని అణిచివేయడానికి యిట్టి చట్టాలుచేశారో, వారికి కొంత ఊరట కలిగియుండేది. తరువాత చేసిన

చట్టాల్ని సర్వులకోసం అని అన్నట్లుగానే, ఒక్కొజాతిని దృష్టిలో పెట్టుకొని చేసిన వాటిని కూడా సర్వుల కొసం అనియుంటే బాగుండేది దక్షిణాఫ్రికాలో యీ చట్టాలు రంగుభేదచట్టాలని పేరు పొందాయి నల్లరంగు, గోధుమ రంగు చర్మం కలవారిపై తెల్లరంగు చర్మంగలవారి పెత్తనం పెరగడమే అందుకు కారణం అందుకే వీటిని రంగు భేదచట్టాలు అని అన్నారు ఉదాహరణకు ప్రచలితమైన చట్టాలలో ఒకదాన్ని పరిశీలించిచూద్దాం పాఠకులకు తెలిసిన విషయమే నేటాలులో ఓటింగు హక్కును గురించి ఒక చట్టం ప్యాసు చేశారు దాన్ని పెద్ద ప్రభుత్వం అంటే బ్రిటిష్ ప్రభుత్వం నిరాకరించింది భవిష్యత్తులో ఏ ఆసియావాసికీ ఓటింగు హక్కు ఉండదు అని అందులో ఒక నిబంధనలో వ్రాసి పెట్టారు దాన్ని యిప్పుడు మార్చవలసివస్తే, ఆసియావాసుల సంఖ్యబాగా పెరగటమే కాక, వారు సుశిక్షితులై గొప్పచైతన్యం పొందికూడా వుండటం అవసరం అయి వుండేది అటువంటి సదవకాశం కలిగినప్పుడే యీ రంగు విచక్షణా చట్టాలు రద్దవుతాయి కళంకం తొలిగిపోతుంది

ఇది ఏకపక్షానికి వర్తించిన రంగుభేదానికి సంబంధించిన ఉదాహరణ నేటాలులో ప్యాసు చేయబడిన చట్టాన్ని నిరాకరించిన తరువాత మరో చట్టం అమల్లోకి తెచ్చారు అందులోను రంగుభేదం కొట్టవచ్చినట్లు కనబడుతూనే వున్నది అయినా అందలి రంగుభేదమనే తేలుకొండిని కొద్దిగా తుంపివేసినందున దాన్ని సర్వులకూ వర్తించే చట్టం అని అన్నారు మరో చట్టం వున్నది అందలి ఒక నిబంధనలో "ఏదేశంలో పార్లమెంటరీ ఎన్నికల విధానం అనగా బ్రిటిష్ లోకసభ సభ్యులను ఎన్నుకునే ఓటింగ్‌హక్కువంటిది లేదో, ఆదేశప్రజలకు నేటాలులో ఓటింగ్ హక్కు వుండదు" అని వ్రాశారు ఈ నిబంధనలో భారతీయులు అని గాని ఆసియావాసులు అనిగాని ప్రత్యేకించి, పేర్కొనలేదు భారతదేశంలో ఇంగ్లాండు వంటి ఓటింగు హక్కు విధానం వున్నదా లేదా అను విషయంపై లా నిపుణుల అభిప్రాయాలు వేరువేరుగా వుంటాయి. అయినా వాదన కోసం అప్పుడు అనగా 1894లో, భారతదేశంలో అట్టి ఓటింగు హక్కు లేదు, యిప్పటికీ లేదు అని

అంగీకరించినా, నేటాలునందలి ఓటింగ్ హక్కును అంగీకరించే అధికారి, భారతీయుల పేర్లుకూడా ఓటర్ల లిష్టులో నమోదుచేస్తే అతడు చట్టవిరుద్ధంగా నిర్ణయంగైకొన్నాడని అనుటకు వీలులేదు సామాన్యంగా ప్రజల అధికారాలకు అనుకూలంగా ప్రజాభిప్రాయం వుంటుంది అందువల్ల ఆ అధికారి ఆ చట్టప్రకారం భారతీయులకు, తదితరులకు కూడా ఓటింగుహక్కు యివ్వవచ్చు కాలంగడిచిన కొద్దీ నేటాల్ ప్రభుత్వానికి భారతీయుల యెడల తేలికభావం తగ్గిపోయిందనుకోండి, భారతీయుల్ని వ్యతిరేకించ వలసిన అవసరంలేదనుకోండి. అప్పుడు చట్టాల్లో ఎట్టి మార్పు చేయవలసిన అవసరం వుండదు భారతీయుల పేర్లు ఓటర్ల లిస్టులో చేర్చవచ్చు సర్వులకు వర్తించే చట్టవిశేషం యిదే గతప్రకరణాల్లో నేను వివరించిన దక్షిణాఫ్రికాలో ప్యాసు చేయబడిన చట్టాల నుంచి కూడా యిట్టి ఉదాహరణలు యివ్వవచ్చు అందువల్ల ఏ ప్రభుత్వమైనాసరే, ఒక పక్షానికి వర్తించేచట్టాలు చేయకుండా, సర్వులకూ వర్తించే విధంగా చట్టాలు చేయాలి అదే ఉత్తమ విధానం ఒకసారి చట్టాన్ని అంగీకరించిన తరువాత దాన్ని మార్చాలంటే అనేక ఇబ్బందులు ఎదురువుతాయి చైతన్యంతో కూడిన ప్రజాభిప్రాయం ఏర్పడినప్పుడే చేసిన చట్టాలు రద్దు చేయడమో, లేక అందుమార్పులుచేయడమో తేలిక అవుతుంది ప్రజాస్వామ్యవ్యవస్థ ప్రకారం నడిచే పరిపాలనా విధానంలో మందు చీటికి మాటికి చట్టాలు రద్దుచేడం, లేక చేసిన చట్టాల్లో మార్పులు తేవడం మంచి పద్ధతి కాదు అది సువ్యవస్థకాదు

ఇక మనం ట్రాన్సువాల్ నందలి ఏషియాటిక్ చట్టాల్లో నిండియున్న విషాన్ని పూర్తిగా తెలుసుకోవచ్చు ఆచట్టాలన్నీ ఒక పక్షాన్ని దృష్టియందుంచుకొని చేసినవే ఆచట్టాల ప్రకారం ఆసియావాసులు అక్కడ ఓటు వేయడానికి వీలులేదు ప్రభుత్వం ప్రత్యేకించి నిర్ణయించినచోటదప్ప, మరో చోట వాళ్లు నివేశన స్థలం కొనుక్కొనుటకు వీలులేదు. అట్టిచట్టాలు రద్దుకానంత వరకు అధికారులు భారతీయులకు ఏ సాయమూచేయలేరు అవి సర్వులకు వర్తించే చట్టాలు కావు కనుకనే లార్డ్‌మిల్నర్ నియమించిన కమెటీ అట్టి చట్టాల్ని వెంటనే విడగొట్టి, లిస్టుతయారు చేసింది ఆచట్టాలు

ఒక పక్షానికి చెందియుండక సర్వులకూ వర్తించేవిగా వుండివుంటే, అవి ఒక పక్షానికి వర్తించినవే అయినా, తక్షణం రద్దు అయి వుండేవి "మేము ఏమీ చేయలేము క్రొత్త అసెంబ్లీ వీటిని రద్దుచేయందే మేము ఆప్రకారం నడుచుకోవలసిందే అని చెప్పేందుకు అధికారులకు అవకాశం లభించి యుండేది కాదు

ఇట్టి చట్టాలు ఏషియాటిక్ విభాగం చేతికి చిక్కాయి యిక వాళ్లు కఠినంగా వాటిని అమలుచేయడం ప్రారంభించారు వాళ్లు అంతటితో ఆగలేదు ఆచట్టాల్లో తమకు తోచిన లొసుగుల్ని కూడా బహిరంగంగా ఎకరువెపెట్టి, అట్టివాటిని సరిచేయాలని కూడా ప్రభుత్వానికి సూచించడం ప్రారంభించారు వాళ్ల తర్కం కూడా సబబుగానే వున్నది ఈ చట్టాలు మంచివి కావనుకుంటే వీటిని రద్దు చేయండి మంచివి అని అనుకుంటే అందలి లొసుగుల్ని, లోపాల్ని సరిచేయండి. వారి మాటలకు అర్థం యిదే గదా! అయితే అక్కడి మంత్రిమండలి చట్టాల్ని అమలు చేయాలని నిర్ణయించింది బోయర్ యుద్ధంలో భారతీయులు బ్రిటిష్‌వారికి అండగా నిలిచి ప్రాణాలకు తెగించి సాయంచేశారు అయితే యిది మూడు సంవత్సరాల పూర్వం జరిగింది కనుక పాతపడిపోయింది ట్రాన్స్‌వాల్‌లో వున్న బ్రిటిష్ ఏజంటు భారతీయులకు అధికారాలు యివ్వాలని ఉద్ఘోషించాడు అయితే అది పాతప్రభుత్వంలో జరిగిన విషయం బోయర్ యుద్ధకారణాల్లో వాళ్లు భారతీయులయెడ చూపుతున్న ద్వేషభావాన్ని తొలగించడంకూడా ఒకటి అని అప్పటి అనుభవంలేని తెల్లజాతి దొరలు ప్రకటించారు చివరికి బ్రిటిష్ ప్రభుత్వం ట్రాన్స్‌వాల్‌లో ఏర్పడిన తరువాత, బోయర్ ప్రభుత్వం భారతీయులకు వ్యతిరేకంగా చేసిన చట్టాలు సరిపోవని, వాటిలో మార్పులు తెచ్చి యింకా కఠినంగా వ్యవహరించాలనీ వాళ్లు తెలుసుకున్నారన్నమాట భారతీయులు ఎప్పుడుపడితే అప్పుడు ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించి, ఎక్కడ పడితే అక్కడ వ్యాపారం చేసుకోగలిగితే, బ్రిటిష్ వ్యాపారస్థులు దెబ్బతింటారని తెల్లవాళ్లు బాగా తెలుసుకున్నారు

ఇట్టి వాదనలు తెల్లజాతి మంత్రిమండలి సభ్యులపైన తెల్లజాతి జనంపైన బాగా పనిచేశాయి తక్కువ సమయంలో ఎక్కువ డబ్బు సంపాదించిడమే వాళ్ల లక్ష్యం యిందుకు భారతీయులు తోడైతే తమ లక్ష్యం ఎలా నెరవేరుతుంది? దక్షిణాఫ్రికా యందలి మేధావులకు వ్యాపారం, ధన సంపాదన అంటే నచ్చదు కనుక దీనితో బాటు కొంత తత్వజ్ఞానాన్ని కూడా వాళ్లు జోడించారు అన్యాయం చేయదలిచి దానికి అనువైన వాదనలు కూడా వెతికి బయటికి తీశారు జనరల్ స్మట్స్, తదితర తెల్లజాతి వారు పేర్కొన్నవాదనల సారాంశం యిక్కడ తెలుపుతున్నాను

దక్షిణాఫ్రికా పాశ్చాత్య సభ్యతకు ప్రతినిధికేంద్రం భారతదేశం తూర్పు సభ్యతకు కేంద్రం ఈ రెండు సభ్యతలకు సఖ్యత, కుదురుతుందని తత్వజ్ఞానులు కాని, యోచనా పరులు గానీ అంగీకరించరు అందువల్ల రెండు ఎరుద్ధ నాగకరికతల ప్రతినిధులు కొద్ది సంఖ్యలో కలిసినా ప్రమాదం తప్పదు రెండింటికి సంఘర్షణ తప్పదు పాశ్చాత్యదేశాలు నిరాడంబరతకు వ్యతిరేకం తూర్పుప్రజలు నిరాడంబరత్వానికి జీవితంలో ప్రాధాన్యం యిస్తారు అట్టిస్థితిలో యీరెండు నాగరికతలు కలపడం సాధ్యమా? అయితే యీరెండు నాగరికతల్లో ఏది శ్రేష్ఠమైనది అనువిషయం రాజకీయజ్ఞుల విషయం కాదు పాశ్చాత్య సభ్యత శ్రేష్ఠమైనదా కాదా అని పాశ్చాత్యప్రజలు ఆలోచించడంలేదు దాన్ని అనుసరించడమే మంచిదని వారందరి నిర్ణయం పాశ్చాత్య నాగకరికతను రక్షించుకోవడంకోసం పాశ్చాత్యులు ఎంతో కృషిచేశారు రక్తపుటేరులు పారించారు ఎన్నో కష్టాలు సహించారు అందువల్ల పాశ్చాత్యులకు మరోమార్గం కనబడటంలేదు యీ దృష్ట్యా దక్షిణాఫ్రికాలో తెల్లవారికి, భారతీయులకు జరుగుతున్న ఘర్షణ వ్యాపారానికి, డబ్బు సంపాదనకు, రాగద్వేషాలకు సంబంధించినది కాదు రంగుభేదానికి సంబంధించింది అసలే కాదు వాస్తవానికి యిది ఆత్మ రక్షణకోసం, నాగరికతా రక్షణ కోసం తమకు సహజంగా లభించిన అధికారాన్ని సద్వినియోగం చేసుకోవడం కోసం తమ కర్తవ్యపాలన కోసం జరుగుతున్న ఘర్షణ కొంతమంది వక్తలు భారతీయుల దోషాల్ని ఎత్తిచూపిస్తున్నారు కొందరు భారతీయుల సుగుణాలే దక్షిణాఫ్రికాలో

దోషాలుగా భావించ బడుతున్నాయని అంటున్నారు నిజానికి భారతీయులు నిరాడంబరత, ఎక్కువ కాలం కాయకష్టంచేయగలశక్తి సామర్థ్యాలు, మతప్యయం, పారలౌకిక దృక్పథం, సహనశక్తి, మొదలుగా గల తమగుణాలవల్లనే అప్రియులై ద్వేషానికి గురి అయ్యారు పాశ్చాత్యప్రజలు సాహసులు, జీవనానికి అవరసరమైన వాటిని పొందాలనే కోరిక కలవారు ఆహారపానీయాల యెడ మక్కువ కలవారు కాయకష్టం తగ్గించుకోవాలనే కోరిక కలవారు ఎగిరిపోవాలనే కాంక్ష కలవారు అందువల్ల తూర్పు నాగరికతకు చెందిన జనం దక్షిణాఫ్రిఖాలో పెరిగిపోతే తాము యిక్కడి నుంచి పారిపోవలసి వస్తుందని భయదుతున్నారు అది ఆత్మహత్యాసదృశం అందుకు పాశ్చాత్యులు ఎట్టిస్థితిలోను సిద్ధంగా లేరు వారిని సమర్థించే నాయకులు, మేధావులు యిట్టి ప్రమాదంలో వారిని పడనీయరు"

పైన నేను తెలిపిన వివరం దక్షిణాఫ్రికాకుకు చెందిన తెల్ల జాతివా.ు, మంచివారు, మంచినడత కలవారు వెల్లడించిన అభిప్రాయాల సారమే వాళ్లు తెలిపిన యీ వాదనలు తత్వజ్ఞానంతో కలిసిన పాఖండత్వానికి నిదర్శనాలని నా అభిప్రాయం అయితే వారి వాదనలో నిజంలేదని నేను అనను వ్యావహారిక దృష్టితోను, తాత్కాలికమైన సంకుచిత స్వార్థదృష్టితోను అందు సత్యం వున్నది కాని తత్వజ్ఞానం దృష్ట్యా అంతా అబద్ధం నాటకం తలస్డంగా వుండే ఏ బుద్ధిమంతుడూ తెల్లవాళ్లు తెలిపిన తర్కాన్ని అంగీకరించలేడని నాఅభిప్రాయం ఏయోచనా పరుడు తమ నాగరికతను యీ విధమైన విపత్కర పరిస్థితిలో వున్నట్లు చిత్రించడు నాకు తెలిసినంతవరకు పాశ్చాత్యదేశాలకు సంబంధించిన ఒక్క తత్వజ్ఞాని కూడా వాళ్ల తర్కాన్ని అంగీకరించడు పాశ్చాత్య నాగిరకతననుసరించే ప్రజలు స్వేచ్ఛగా తూర్పు ప్రజలచేరువకు వస్తారనిగాని, అలావస్తే పాశ్చాత్య నాగిరకతా వెల్లువలో తూర్పునాగరికత ఇసుకలా కరిగి కొట్లుకుపోతుందనిగాని తూర్పునాగరికతకు చెందిన ఏతత్వజ్ఞానీ భయపడడు తూర్పుసభ్యాతావికేషాల్ని నేను గ్రహించాను అది పాశ్చాత్య సభ్యతకు స్వాగతం పలుకుతుంది పాశ్చాత్య సభ్యతవల్లతనకు ముప్పు కలుగుతుందని భయపడదు యిందుకు విరుద్ధంగా ఉదాహరణలు

తూర్పుదేశాల్లో లభిస్తే, వాటివల్ల నేను తెలిపిన సిద్ధాంతానికి ఏమీ దెబ్బతగలదు నా సిద్ధాంతాన్ని సమర్థించే ఉదాహరణలు ఎన్నో వున్నాయి ఏది ఏమైనా పాశ్చాత్య తత్వజ్ఞానుల ప్రకారం పాశ్చాత్య నాగరికతయొక్క మూలసిద్ధాంతం అపరిమితమైన పశుబలం మీద ఆధారపడి వున్నది అందువల్లనే, ఆసభ్యతను రక్షించదలచిన వాళ్లు పశుబలాన్ని ఉపయోగిస్తున్నారు తమ అవసరాల్ని పెంచుకొని ప్రజలు చివరికి నాశనమైపోతారని కూడా వాళ్ల వాదన సాగుతున్నది యీ సిద్ధాంతాలననుసరిస్తున్న తెల్లజాతి ప్రజలు దక్షిణాఫ్రికాలో నివసిస్తున్నారు తమ సభ్యతకంటే ప్రాచీన సభ్యతగల, తమకంటే ఎక్కువ సంఖ్యలోనున్న హబ్షీలను తమ అధినంలోకి తెచ్చుకున్నారు అట్టిస్థితిలో భారతదేశమందలి బీదప్రజలకు వాళ్లు భయపడతారా? నిజానికి తూర్పు ప్రజల నాగరికతకు వాళ్లు భయపటంలేదు అందుకు పెద్ద తార్కాణం ఒకటి వున్నది భారతీయులు గిరమిట్ కార్మికులుగా ఎంతమంది దక్షిణాఫ్రికాకు వచ్చినా, తెల్లవాళ్లకు యిబ్బందిలేదు వారికి వ్యతిరేకంగా ఉద్యమం సాగించరు

అయితే వ్యతిరేకిస్తున్నది ఎందుకు? వ్యాపారంలో పోటీ వుంటుందనే కదా? ధనార్జన తగ్గుతుందనేకదా! రంగు భేదమే కదా! భారతీయులే చేసే వ్యాపారం వల్ల చిన్న చిన్న తెల్లజాతివ్యాపారులు దెబ్బతింటున్నారనీ, గోధుమరంగు చర్మం గలవారిని చూస్తే చాలు తెల్లరంగు చర్మం కలవాళ్లు మండిపడుతున్నారని, వాళ్లంటే అసహ్యం ద్వేషం తెల్లవాళ్లకు అధికంగా వున్నదని చాలామంది తెల్లవాళ్లు పత్రికల్లో స్పష్టంగా ప్రకటించారు. అమెరికాలో గల చట్టాలలో పేరుకు మాత్రం అందరికీ సమానహక్కులు కలిగించారు, కాని అక్కడకూడా బూకర్‌టి వాషింగ్టన్ వంటి ఉన్నతపాశ్చాత్య శిక్షణ పొందిన, సచ్చరిత్రుడైన క్రైస్తవుడు బూకరిటి పాశ్చాత్య సభ్యతను సంపూర్తిగా అలవరుచుకున్న పురుషుడు ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ దర్బారులో అడుగుపెట్టలేక పోయాడు యివాళకూడా పోలేదు అమెరికా యందలి హబ్షీలు పాశ్చాత్యనాగరికతను స్వీకరించి క్రైస్తవులుగా మారిపోయారు అయినా వాళ్ల చర్మపు నల్లరంగు వాళ్ల దోషంగా పరిగణింపబడుతూవున్నది. అమెరికావంటి

దేశంలోనే సాంఘికపరంగా ద్వేషం జడలు విరబోసుకొని వుంటే దక్షిణాఫ్రికావంటి దేశంలో తెల్లజాతివాళ్లు అనుమానం కలిగితే చాలు మిగతారంగుల వాళ్లను బ్రతికివుండగానే కాల్చి వేయరా? దక్షిణాఫ్రికాలో ప్రబలిన యీ దండించే విధానానికి గలపేరు ఒకొటి ఇంగ్లీషులో ప్రచారం పొందింది దాన్ని లించ్‌లా అంటారు లించ్‌లా అంటే శిక్షముందు విధిస్తారు,విచారణ తరువాత సాగిస్తారు అని అర్థం లించ్ అనే పేరుగల ఒక మనిషి పేరట యీ శబ్దం ప్రచారంలోకి వచ్చింది ఈ రకమైన పద్ధతిని అతడే ప్రారంభించాడు కనుక వాడిపేరట దాన్ని లించ్‌లా అని అన్నారు

ఈవిధంగా పైన తెల్లవాళ్లు తెలిపిన తర్కంలో సారమేమీ లేదని పాఠకులు గ్రహించియే యుంటారు అయితే విభిన్న అభిప్రాయాలుగల తెల్ల వారంతా యిటువంటి వాదనయే చేస్తున్నారని భావించకూడదు తమ యీతర్కం కేవలం తాత్త్వికపరమైనదని వారిలో చాలామంది ప్రకటించారు వాళ్ల స్థితిలో మనం కూడా వుండివుంటే వాళ్లలాగానే మనం కూడా భావించి వుండేవాళ్లమేమో చెప్పలేము యిలాంటి కారణాలవల్లనే "బుద్ధి కర్మాను సారిణీ" అను సామెత ప్రచారంలోకి వచ్చింది మనం మన అంతఃకరణంలో ఎలా భావిస్తామో, అలాంటి తర్కమే ప్రకటిస్తూ వుంటామని అందరికీ తెలిసు మన అట్టితర్కం యితరులు అంగీకరించపోతే మనం సహించలేము కోపం తెచ్చుకుంటాం

నేను కావాలనే యీ విషయాన్ని యింత వివరించి వ్రాశాను పాఠకులు విభిన్న దృక్పథాల్ని తెలుసుకోవాలని, యిప్పటివరకు ఆవిధంగా తెలుసుకోనివారు విభిన్న దృక్పథాల్ని తెలుసుకోవడమేగాక, వాటిని ఆదరించడం నేర్చుకోవాలని కోరుతున్నాను. సత్యాగ్రహం అంటే ఏమిటో తెలుసుకోవడానికి, దాన్ని ప్రయోగించడానికి ఉదారబుద్ధి, ఓర్పు చాల అవసరం యీగుణాలు లేకపోతే సత్యాగ్రహం సాధ్యంకాదు, యీ పుస్తకంలో, కేవలం వ్రాయాలని నేను యిదంతా వ్రాయడంలేదు దక్షిణాఫ్రికా సత్యాతగ్రహ చరిత్రను భారతదేశ ప్రజలకు తెలియజేయుటకే యిదంతా వ్రాయడంలేదు ఈపుస్తకాన్ని వ్రాయడానికి నా అసలు లక్ష్యం ఒక్కటే ఏ సత్యాగ్రహంకోసం బ్రతుకుతున్నానో,

బ్రతకాలని కోరుకుంటున్నానో ఏ సత్యాగ్రహంకోసం చావుకు సైతం సిద్ధపడివున్నానో, ఆ సత్యాగ్రహం పుట్టుక ఎలాజరిగిందో ప్రథమంగా సామూహికంగా సత్యాగ్రహప్రయోగం ఎలా జరిగిందో, ఆవివరాలన్నీ భారతదేశప్రజలు తెలుసుకోవాలి సాధ్యమైనంతవరకు ఆచరణలో పెట్టాలి ఈ లక్ష్యంతోనే యీ గ్రంథం వ్రాస్తున్నాను

ఇక మనం తిరిగి మన కథకు వద్దాం క్రొత్త వాళ్లను లోనికి రానీయకూడదని, వున్నవాళ్లను నఖశిఖపర్యంతం బిగించి దేశం వదిలి పారిపోయేలా చేయాలని ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం నిర్ణయించుకున్నది భారతీయుల్ని మేము కట్టెలుకొట్టి బ్రతికేవారుగాను, కావళ్లు మోసేవాళ్లు గాను మాత్రమే దక్షిణాఫ్రికాలో వుండనిస్తామని కొమ్ములుతిరిగిన తెల్లవాళ్లు ప్రకటనలు చేశారు కూడా ఏషియాటిక్ విభాగంలో అక్కడి తెల్లవాళ్లతోబాటు, ఇండియాలో వుండివచ్చిన శ్రీ లాయనల్ కర్టిస్ వంటి ప్రచారకులు కూడా వున్నారు వీళ్లంతా 1905, 1906లో నవయువకులే లార్డ్ మిల్నరుకు నమ్మకస్థులే ప్రతిపని వైజ్ఞానిక దృక్పథంతో చేస్తున్నామని వారి వాదన పెద్దపెద్ద తప్పులు కూడా చేస్తూ వున్నారు వాళ్లు పెద్ద తప్పుచేసి జోహన్స్‌బర్గ్ మునిసిపాలిటీకి ఎన్నో పౌండ్ల నష్టం కలిగించారు

దక్షిణాఫ్రికాలోకి క్రొత్త భారతీయులు ఎవ్వరూ రాకుండా ఆపాలంటే, తేలికమార్గం ఒక్కటే ఇప్పుడు దక్షిణాఫ్రికాలోగల భారతీయుల అనుమతి పత్రాలన్నీ సువ్యవస్థితంగా తిరిగి రిజిష్టరు చేయించాలి అప్పుడు ఒకడికి బదులు మరొకడు దూరడానికిఅవకాశం వుండదు ఒకవేళ దూరినా తప్పక దొరికిపోతాడు ట్రాన్స్‌వాల్‌లో బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పడిన తరువాత భారతీయులకు యిచ్చే అనుమతి పత్రాల మీద వాళ్ల సంతకాలు చేయించారు సంతకం చేయలేనివారి వేలిముద్రలు వేయించారు తరువాత ఎవడో ఒక ఆంగ్ల అధికారి వాళ్ల ఫోటో కూడా వుంటే యిక తిరుగువుండదని సూచించాడు దానితో ఫోటో, సంతకం, వేలిముద్రలు ప్రారంభమయ్యాయి ఇందుకు చట్టం అవసరమని వాళ్లు భావించలేదు ఈ విషయం భారతీయనాయకులు కూడా గమనించలేదు జాతి తరపున ప్రభుత్వానికి

అర్జీలు పంపారు ప్రతినిధి బృందాలు వెళ్లి కలిశాయి తెల్లజాతి అధికార్లు మాత్రం తమను కలిసిన వారందరికీ "ఎట్టి పరిస్థితుల్లోను, భారతీయులు ట్రాన్సువాల్‌లోకి దూరడానికి వీలులేదు అందుకు మేము అంగీకరించము అందువల్ల భారతీయులందరి దగ్గర ఒకే రకమైన అనుమతి పత్రాలు వుండాలి పత్రాలలో వున్న వివరాల ప్రకారం అట్టి పత్రం పొందిన అసలు సిసలు భారతీయుడే దక్షిణాఫ్రికాలో ప్రవేశించాలి' అని స్పష్టంగా చెప్పారు

నేను భారతీయులకు ఒక సలహా యిచ్చాను ఇటువంటి అనుమతి పత్రాలు తీసుకొని తీరాలి అనే చట్టం ఏమీలేదు కాని శాంతిరక్షణ చట్టం అమలులో వున్నంతకాలం అధికారులు మనల్ని ప్రవేశపత్రాలు చూపించమని అడుగవచ్చు భారతదేశంలో భారతరక్షణ చట్టం (డిఫెన్స్ ఆఫ్ ఇండియా ఆక్టు) అమల్లో వున్నట్లే, దక్షిణాఫ్రికాలో శాంతి రక్షణ చట్టం వున్నది భారతదేశంలో శాంతి రక్షణ ఆక్టు ఎలా భారతీయుల్ని ఇక్కట్లపాలు చేయుటకు ఉపయోగపడుతున్నదో, దక్షిణాఫ్రికాలో కూడా అలాగే తెల్లవాళ్లకు ఉపయోగపడుతున్నది ఈ చట్టం తెల్లవాళ్లకు వర్తించకపోవడం బహిరంగ రహస్యమే అనుమతి పత్రాలు తీసుకోవడం తప్పనిసరి అయితే, వాటి మీద సంతకం చేయాలని భారతీయులు వ్రేలిముద్రలు వేసితీరాల్సిందే ఇద్దరు మనుష్యుల చేతి గుర్తులు, ముద్రలే ఒకే విధంగా వుండవని పోలీసుశాఖ వారు బహుతెలివిగా కనిపెట్టారు చేతి రేఖల ఆకారాల్ని ముద్రల వ్యత్యాసాల్ని విభజించారు వేలిముద్రల నిపుణులు రెండు ముద్రల్నిపరిశీలించి చూచి క్షణంలో యివి ఒకడివా లేక వేరు వేరు మనుష్యులవా అను విషయం స్పష్టంగా చెప్పివేస్తారు అయితే ఫోటో యిమ్మనడం నాకు నచ్చలేదు మహమ్మదీయులు మతరీత్యాకూడా ఫోటోయివ్వరు వారి దృష్టిలో అది మత విరుద్ధం

ప్రభుత్వాధికారులు మరియు భారతజాతి ప్రతినిధులు కలిసి చర్చించారు తత్ఫలితంగా భారతీయులంతా తమ పాతపత్రాలను యిచ్చి క్రొత్త పత్రాల్ని తీసుకోవాలని, క్రొత్తగా వచ్చే భారతీయులు అనుమతి పత్రాలు తీసుకోవాలని నిర్ణయానికి వచ్చారు వాస్తవానికి భారతీయులు ఆ విధంగా తీసుకోవలసిన

అవసరం లేకపోయినా మళ్లీ క్రొత్త ఆంక్షలు ఎదుర్కోవలసిన అవసరం వస్తుందేమోనని ఊహించి పత్రాలు తీసుకొనుటకు అంగీకరించారు క్రొత్తగా వచ్చే భారతీయులు దొంగచాటుగా ప్రవేశించకూడదని భారతజాతి కోరుతున్నదని కూడా స్పష్టపడుతుందని భావించారు సుమారు భారతీయులంతా కొత్త అనుమతి పత్రాలు తీసుకున్నారు ఇది చిన్న విషయంకాదు చట్టరీత్యా అనివార్యం కాకపోయినా, పూర్తి ఐకమత్యంతో భారతీయులంతా త్వరగా చేసి చూపించారు ఇది భారతజాతియొక్క నిజాయితీకి, చాతుర్యానికి, తెలివితేటలకు, నమ్రతకు తార్కాణమని చెప్పవచ్చు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం చేసే చట్టాల్ని ఉల్లంఘించడం భారతీయుల స్వభావలక్షణం కాదని కూడా రుజూచేశారు ప్రభుత్వానికి యింతటి సుహృద్భావంతో సహకరిస్తున్న భారతీయుల విషయంలో ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం కూడా సుహృద్భావంతో వ్యవహరించాలని భారతీయుల ఆశ, అభిలాష ఆ ప్రభుత్వం తమను గౌరవిస్తుందని, అధికారాలు కూడా యిస్తుందని ఆశించారు అయితే ట్రాన్స్‌వాల్‌లో నెలకొన్న బ్రిటిష్ ప్రభుత్వం భారతీయుల సజ్జనత్వానికి ప్రతీకారం ఎలా తీర్చుకున్నదో తరువాతి ప్రకరణంలో తెలుసుకుందాం



## 11

## సజ్జనత్వానికి ప్రతీకారం

### ఖూనీ చట్టం

పాతకొత్త పత్రాల మార్పు జరిగింది 1906వ సంవత్సరంలో అడుగుపెట్టాం నేను 1903లో ట్రాన్స్‌వాల్‌నందు రెండవసారి అడుగుపెట్టాను ఆ ఏడాది జోహాన్స్‌బర్గులో ఆఫీసు తెరిచాను ఈ విధంగా నారెండు సంవత్సరాల కాలం ఏషియాటిక్ శాఖవారి ఆక్రమణల్నిఎదుర్కోవడానికి సరిపోయింది పత్రాల మార్పు జరిగాక ప్రభుత్వం శాంతిస్తుందని, వ్యవహారం చక్కబడుతుందని అంతా అనుకున్నారు కాని భారతజాతి ముఖాన శాంతిరాసి లేదు గత ప్రకరణంలో నేను శ్రీ లైనల్ కర్టిస్‌ను పరిచయం చేశాను భారతీయులు

క్రొత్త పత్రాలు తీసుకున్నంత మాత్రాన తెల్లవారి అభిలాష నెరవేరలేదనీ, పెద్దమనుషుల ఒడంబడికలద్వారా అది పూర్తి కాలేదనీ ఆయన భావించారు దానితోబాటు చట్టంకూడా వుంటే, ఒడంబడికకు బలం వస్తుందనీ, అప్పుడే షరతుల ఆంతర్యం నెరవేరుతుందనీ, భారతీయుల్ని అంకుశంలో వుంచాలనీ, అందుకోసం కఠినచట్టం అమలు చేయాలనీ, తత్ఫలితంగా దక్షిణాఫ్రికా యందంతట అది అమలులోకి వచ్చి తీరుతుందనీ ఆయన భావించాడు తాను చేసిన చర్యను మిగతా రాజ్యాలు కూడా అనుసరించాలనే నిర్ణయానికి వచ్చాడు దక్షిణాఫ్రికాకు చెందిన ఏ ఒక్కద్వారం భారతీయులకోసం తెరిచియుండకూడదని, అలా వుంటే ట్రాన్స్‌వాల్‌కు రక్షణ లేదని కూడా భావించాడు అసలు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి, భారతీయులకు జరిగిన ఒడంబడికవల్ల భారతీయుల గౌరవ ప్రతిష్ఠలు పెరిగిపోయాయని, కనుక గట్టి దెబ్బతీయాలని భావించడు అతడికి భారతీయులంటేవిలువలేదు లెక్కకూడాలేదు కఠోరచట్టం అమలు పరిచి భారతీయుల్ని గడగడవణికించి వేయాలని నిర్ణయానికి వచ్చాడు అందుకోసం అతడు ఏషియాటిక్ ఆక్టును తయారుచేశాడు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వాధినేతలికి ఏషియాటిక్ ఆక్టును ప్యాసుచేయాలని, భారతీయుల దొంగరాకను అరికట్టివేయాలని, అప్పుడే ట్రాన్స్‌వాల్ యందలి శ్వేతజాతీయులు నిశ్చింతగా, క్షేమంగా వుండగలరని బాగా ఎక్కబోశాడు శ్రీ కర్టిస్ చేసిన బోధ అతడు తయారు చేసిన ఏషియాటిక్ ఆక్టు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి నచ్చాయి ఆ ముసాయిదా ప్రకారం తయారుచేసి అసెంబ్లీలో పెట్టబోతున్న ఆక్టును ప్రభుత్వ గెజెట్‌లో ప్రభుత్వం వారు ప్రచురించారు

ఈబిల్లును గురించి వివరించేముందు మరో ఘట్టాన్ని గురించి వ్రాయడం అవసరమని భావిస్తున్నాను సత్యాగ్రహోద్యమానికి ప్రేరకుణ్ణి నేను కనుక నాజీవితాన్ని పాఠకులు తెలుసుకోవడం అవసరం భారతీయుల్ని దెబ్బతీయాలని ట్రాన్స్‌వాల్‌లో తెల్లవాళ్లు ప్రయత్నిస్తున్న అదే సమయంలో అక్కడి హబ్షీలలోను, జూలూలలోను ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలనే తలంపు చోటుచేసుకున్నది ఆ వ్యతిరేకతనుతిరుగుబాటుఅనవచ్చునా లేదా అని నాకు

అప్పుడూ సందేహం కలిగింది ఇప్పటికీ ఆ సందేహం అలాగే వున్నది అయినా నేటాలులో దీన్ని తిరుగుబాటు అని అంతా అన్నారు ఆ తిరుగుబాటును శాంతింపచేయాలనే బావంతో చాలామంది తెల్లవాళ్లు వాలంటీర్లుగా సైన్యంలో చేరారు

నేను కూడా నేటాల్ వాసినే కనుక సైన్యంలో చేరి యీ యుద్ధంలో శక్త్యానుసారం సాయం చేయాలని భావించాను భారతజాతి అనుమతి పొంది యీ విషయం నేటాలు ప్రభుత్వాన్ని జాబుద్వారా యుద్ధంలో గాయపడ్డవారికి సేవచేసే దళాన్ని ఏర్పాటు చేసేందుకు అనుమతి కోరాను నా ప్రతిపాదనను ప్రభుత్వం అనుమతించింది అందువల్ల జోహాన్స్‌బర్గు నందుగల నా యింటిని వదిలివేసి, నా కుటుంబసభ్యుల్ని ఫినిక్స్ ఆశ్రమం పంపివేశాను అక్కడినుండి ఇండియన్ ఒపీనియన్ అనువారపత్రిక వెలువడుతున్నది నా మిత్రులు అక్కడ వున్నారు ఆఫీసును మాత్రం నేను మూసివేయలేదు నేను పూనుకున్న సేవా కార్యం ఎంతో కాలం సాగదని నాకు తెలుసు

20, 25 మందితో దళం ఏర్పరిచి నేను నేటాలు సైన్యంతో సంబంధం పెట్టుకున్నాను ఇంతటి చిన్నదళంలో కూడా అన్ని జాతుల, అన్ని మతాల భారతీయులు చేరారు ఒక నెల రోజులు యీ దళం గాయపడ్డవారికి సేవ చేసింది మాకు అప్పగించబడిన పనికి నేను భగవంతునికి ధన్యవాదాలు సమర్పించాను యుద్ధంలో గాయపడిన హబ్షీలకు మేము దప్ప మరెవ్వరూ సేవ చేయలేదు మేము లేకపోతే హబ్షీలు చాలామంది చచ్చిపోయివుండేవాళ్లు వాళ్ల గాయాలకు మందులు రాసేటప్పుడు, పట్టీలు కట్టేటప్పుడు, చికిత్స చేసేటప్పుడు ఒక్క ఇంగ్లీషు వాడు కూడా మాకు సహకరించలేదు ఒక సర్జను క్రింద మేము పనిచేయాలి అతడి పేరు డా॥ సావెజ్ అతడు దయాహృదయుడు గాయపడ్డవాళ్లను ఆసుపత్రికి చేర్చడం వరకే మా పని ఆ తరువాత మేము వారికి ఏమీ సేవ చేయుటకు వీలులేదు మాకు అప్పగించిన ప్రతిపని చేయాలనే వుద్దేశ్యంతోనే మేము యీ దళం ఏర్పాటు చేశాం ఆ సర్జను వ్యవహారమంతా చూచి ఏమండీ! వీళ్లకు చికిత్స చేయాలంటే ఒక్క తెల్లవాడూ సహకరించడంలేదు మీరు ఆ పని కూడా చేస్తే కృతజ్ఞుడుగా వుంటాను

అని మమ్మల్ని కోరాడు మేము సంతోషంగా అంగీకరించాము జూలూలకు తగిలిన గాయాలకు చికిత్స లేక క్రుళ్లి దుర్వాసన వస్తున్నది వాళ్లందరిగాయాలు కడిగి చికిత్స చేసే సదవకాశం మాకు లభించింది పాపం ఆ హబ్షీలు మాతో ఏమీ మాట్లాడలేరు కాని వారి సైగలు, వేళ్లద్వారా వారు వెల్లడించే కృతజ్ఞతా భావం మాకు బోధపడుతూ వుండేది వాళ్లు మమ్మల్ని తమకోసం దేవుడు పంపిన దూతలుగా భావించారు ఇది కష్టమైనపని ఇందుకోసం రోజుకు 40 మైళ్ల దూరం మేము నడవవలసి వచ్చేది

ఒక నెలరోజుల్లో మా పని పూర్తి అయింది అధికారులు మా పనిని చూచి సంతోషించారు గవర్నరు మాకు కృతజ్ఞత తెలుపుతూ జాబు పంపారు ప్రత్యేకంగా తయారుచేసిన పతకం కూడా మా దళసభ్యులందరికీ యిచ్చి గౌరవించారు ఈ దళపు ముగ్గురు సార్జెంట్లు గుజరాతీలు వాళ్లపేర్లు శ్రీ ఉమియాశంకర్ షేలత్, శ్రీ సురేంద్రరాయ్ మేడ్, శ్రీహరిశంకర్ జోషి ఈ ముగ్గురూ బలిష్ఠులు గట్టివాళ్లు బాగా పనిచేశారు ఇతర భారతీయుల పేర్లన్నీ యిప్పుడు జ్ఞాపకం లేవు కాని వారిలో ఒక పఠాను కూడా వున్నాడు మేమంతా తనతో సమంగా బరువులు మోయడం, నడవడం చూచి పఠాను నివ్వెరబోయేవాడు

ఈ సేవా కార్యం చేస్తున్నప్పుడు నాలో రెండు భావాలు పరిపక్వమయ్యాయి సేవాధర్మం ఆచరించవలెనని కోరువారు జీవితంలో బ్రహ్మచర్యాన్ని పాటించితీరాలి ఇది మొదటి భావం సేవాధర్మం ఆచరించవలెనని భావించువారు బీదతనాన్ని అంగీకరించి పాటించితీరాలి ఇది రెండో భావం వృత్తులేమైనా చేపట్టి చేస్తూవుంటే సేవాధర్మానికి పూనుకున్నప్పుడు యిబ్బందులు కలుగుతాయి

ఈ దళంతో పనిచేస్తున్నప్పుడు ట్రాన్స్‌వాల్ రమ్మని జాబులు, తంతులు చాలా వచ్చాయి మా సేవాకార్యం పూర్తికాగానే వెంటనే ఫినిక్స్ వచ్చి మిత్రులందరినీ కలిసి జోహాన్స్‌బర్గు చేరుకున్నాను అక్కడ ఆఫీసులో ఏషియాటిక్ ఆక్టు ముసాయిదా పూర్తిగా చదివాను 1906లో ప్రచురించిన గెజెటును ఆఫీసునుంచి యింటికి తీసుకువెళ్లాను నా ఇంటిదగ్గర ఒక చిన్న

పర్వతం వున్నది అక్కడ ఒక మిత్రునితోబాటు కూర్చొని ఆ ఆక్టును గుజరాతీలోకి అనువదిస్తున్నాను ఆ బిల్లు నిబంధనలను అనువదించిన కొద్దీ నా శరీరం వణికిపోసాగింది భారతీయులంటే అసహ్యం. ఏహ్యత తప్ప నాకు అందు మరేమీ కనబడలేదు ఈ బిల్లు అసెంబ్లీలో ప్యాసై అమల్లోకి వస్తే దక్షిణాఫ్రికాలో గల భారతీయులకు అధోగతి తప్పదని నిర్ణయానికి వచ్చి దీన్ని ఎదుర్కొని తీరాలని భావించాను భారతజాతి జీవన్మరణసమస్య అని తెల్చుకున్నాను అర్జీలు పెట్టినా పనికాకపోతె చేతులు ముడుచుకొని కూర్చోకూడదనే నిర్ణయానికి వచ్చాను ఈ ఖూనీ చట్టానికి లోబడేకంటే ప్రాణాలు వదిలి చావడం మంచిదని భావించాను ఐతే ఎలా చావాలి? జయమో మృత్యువో రెండింటిలో ఏదో ఒకటి నిర్ణయం కావాలి నా కండ్ల ఎదుట పెద్దకోటగోడలా నిలబడిపోయింది నన్ను యింతగా కదిలించివేసిన ఆ బిల్లును గురించిన వివరం పాఠకులకోసం క్రింద వివరిస్తున్నాను

ట్రాన్స్‌వాల్‌లో నివసించుటకు అధికారం కావాలని కోరుకునే ప్రతి భారతీయుడు, స్త్రీగాని, పురుషుడుగాని, 8 సంవత్సరాలు, అంతకంటే పై యీడు గల బాలబాలికలు గాని అంతా ఏషియాటిక్‌శాఖ ఆఫీసుకు వెళ్లి పేరు వ్రాయించుకొని అనుమతి పత్రం పొందాలి యీ పత్రాలు తీసుకునేటప్పుడు తమ వద్ద గలపాత పత్రాలన్నీ అక్కడ యిచ్చివేయాలి అందుకు అర్జీ పెట్టుకోవాలి పేరు, అడ్రసు, జాతి, వయస్సు మొదలుగా గల వివరాలు అర్జీలో వ్రాయాలి ఆర్జీదారు తన పది వ్రేళ్ల ముద్రలు అందువేసి తీరాలి నిర్ణయించ బడిన గడువులోపున యిట్టి అర్జీదాఖలు చేయని భారతీయులు ట్రాన్స్‌వాలులో నివసించు హక్కు కోల్పోతారు తక్షణం వాళ్లు ట్రాన్స్‌వాల్ వదిలి వెళ్లిపోవాలి అర్జీదాఖలు చేయకపోతే చట్టరీత్యా అపరాధంగా భావించబడుతుంది అట్టి దోషికి శిక్ష పడవచ్చు జుర్మానా విధించవచ్చు కోర్టు అతణ్ణి దేశాన్నుంచి బహిష్కరించవచ్చు పిల్లల పక్షాన తల్లి తండ్రులే అర్జీ దాఖలు చేయాలి పిల్లల్ని తీసుకొని వెళ్లి ఆఫీసర్ల ఎదుట హాజరు పరచాలి తల్లితండ్రులు తమ యీ బాధ్యతను నిర్వహించకపోతే వారి 16 సంవత్సరాలు దాటిన పిల్లలు యీ బాధ్యత నిర్వహించాలి. అలా

చేయకపోతే తల్లితండ్రులు ఏఏ శిక్షలకు పాత్రులు అవుతారో, ఆయా శిక్షలకు 16 సంవత్సరాల పిల్లలు కూడా పాత్రులవుతారు పొందిన అనుమతి పత్రాన్ని ఏ పోలీసు అయినా ఎక్కడ, ఎప్పుడు చూపమన్నా చూపి తీరాలి చూపకపోతే అతడు అన్ని శిక్షలకు పాత్రుడే రోడ్డున నడిచే బాటసారిని కూడా పత్రం చూపించమని కోరవచ్చును పత్రాల్ని పరిరక్షించేందుకు పోలీసు అధికారులు భారతీయుల గృహాల్లోకి కూడా ప్రవేశించవచ్చు బయటినుంచి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించునప్పుడు యిట్టి ప్రవేశ పత్రాల్ని వాళ్లే సంబంధిత అధికారుల దగ్గరికి వెళ్లి చూపించాలి భారతీయులు ఏ పని మీద ఎక్కడికి వెళ్లినా అధికారులు అడగగానే పత్రం చూపించాల్సిందే అలా చూపించకపోయినా అధికారులు అడిగిన వివరం తెలుపకపోయినా శిక్షార్హులే అవుతారు

ఇలాంటి నిబంధనలుగల చట్టం ప్రపంచంలో ఏ దేశంలోను ఎవ్వరూ తయారు చేసి యుండరు భారతీయ గిర్‌మిటియాలకు యిచ్చే పత్రాల నిబంధనలు కఠోరంగా వున్నాయని నాకు తెలుసు కాని వాళ్లను స్వతంత్ర మనుష్యులుగా గుర్తింపలేదు కదా! అయినా వాళ్లకు విధించబడిన శిక్షలు యీ బిల్లులో విధించబడిన శిక్షలకంటే తక్కువే ఈ బిల్లు ప్రకారం లక్షలాది రూపాయలు వ్యాపారం చేసుకుంటున్న భారతీయుడకూడా దేశాన్నుంచి బహిష్కరించబడవచ్చు ఈ బిల్లునందు పేర్కొనబడిన నిబంధనల ప్రకారం అట్టివారి డబ్బంతా ప్రభుత్వం యీ పేరిట దోచుకోవచ్చునన్నమాట ఆ తరువాత యిలా జరిగిందికూడా అపరాధ ప్రవృత్తిగల వారికోసం విధించబడిన నిబంధనల కంటే గూడా యివి కఠోరంగా వున్నాయని చెప్పవచ్చు పదివ్రేళ్లముద్రలు వేయాలనే నిబంధన దక్షిణాఫ్రికాదేశంలో ఎక్కడా లేదు ఆ విషయం తెలుసుకుందామని ఒకపోలీసు అధికారియగు శ్రీ హెన్రీ వ్రాసిన ఫిగర్ ఇంప్రెషన్స్ (వ్రేళ్ల ముద్రలు) అను పుస్తకం తెప్పించి చదివాను అపరాధం చేసిన చట్టవ్యతిరేకుల చేతనె యిలా వేలిముద్రలు వేయిస్తారని తెలిసింది యిది భయంకర నిబంధన అని అనిపించింది పిల్లకు, స్త్రీలకు కూడా వర్తించె యీకరమైన బిల్లు మొట్టమొదటిసారి బయటికి వస్తున్నదని తేలిపోయింది

రెండో రోజున భారతీయ పెద్దలందరినీ పిలిపించి యీ బిల్లు విషయం తెలియజేశాను అంతావిన్న మీదట నాపైపడిన ప్రభావమే వారిపైన కూడా పడింది ఒకడు లేచి ఆవేశంగా నా భార్యను వేలి ముద్రలువేయమని ఎవడైనా అడిగిగే తక్షణంవాణ్ణి కాల్చిపారేస్తాను తరువాత నేనేమైనా సరే అని అరిచాడు అతణ్ణి శాంత పరిచాను

నేను అందరికీ స్పష్టంగా యీ బిల్లు ప్యాసైందీ అంటే యిక్కడ భారతీయులంతా పైగుడ్డలతో తిరుగుముఖం పట్టవలసిందే ట్రాన్స్‌వాల్‌లో యీ బిల్లు అమలులోకి వస్తే దక్షిణాఫ్రికా యందల అన్ని రాష్ట్రాల్లో వచ్చి తీరుతుంది అంటే భారతీయుల్ని వెళ్లగొట్టడానికి తెల్లవాళ్లు జరుపుతున్న కుట్రయిది దీన్ని సమూలంగా నాశనం చేయాలి చేసితీరాలి "అని చెప్పివేశాను యిది మనకే కాదు మన భారతదేశానికే అవమానకరమైన విషయం యిట్టి బిల్లులు మనకు వర్తించకూడదు కోపం తెచ్చుకున్నంతమాత్రాన, ఆవేశపడినంత మాత్రాన యీ బిల్లు ఆగదు మనం ఒక్కటిగా నిలబడాలి అన్నివిధాల యీ బిల్లును వ్యతిరేకించాలి భగవంతుడు మనల్ని తప్పక రక్షిస్తాడు" అని కూడా చెప్పాను జనానికి ముంచుకువస్తున్న ప్రమాదం బోధపడింది దీనికోసం చర్చించి నిర్ణయించడానికి యూదుల నాటకశాలను ఎన్నుకొని అక్కడ సభజరుపుటకు నిర్ణయం చేశాం

ఇప్పుడు యీబిల్లును " ఖూనీ చట్టం" అని ఎందుకు అన్నానో పాఠకులకు బోధపడిందికదూ? ఈ ప్రకరణానికి పెట్టిన ఖూనీ అను విశేషణం నాది కాదు ఈ చట్టానికి దక్షిణాఫ్రికాలో ఖూనీ శబ్దం తానంతట అదే ప్రచారంలోకి వచ్చింది.



# 12

# సత్యాగ్రహ పుట్టుక

యూదుల ఆనాటకశాలలో 1906 సెప్టెంబరు 11వ తేదిన భారతీయుల సమావేశం జరిగింది ట్రాన్స్‌వాల్ రాజ్యపు పలుపట్టణాలనుంచి ప్రతినిధుల్ని ఆహ్వానించాను అయితే అప్పుడు తయారుచేసిన తీర్మానాల భావం నేనుకూడా పూర్తిగా తెలుసుకోలేకపోయానని చెప్పవచ్చు ఆతీర్మానాల్ని అంగీకరిస్తే కలిగే పరిణామాల్ని కూడా నేను పూర్తిగా అర్థం చేసుకోలేకపోయాను సభ జరిగింది నాటకశాలలో అడుగుపెట్టడానికి చోటుదొరక లేదు అంతజనం వచ్చారు ఏదోక్రొత్త పనిచేయాలి, ఏదోక్రొత్త పనిజరుగుతుంది అనే భావం అందరి ముఖాన స్పష్టంగా నాకు కనబడింది ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ అబ్దుల్‌గనీ సభకు అధ్యక్షత వహించారు ట్రాన్స్‌వాల్‌లో నివసిస్తున్న భారతీయుల్లోవారు పాతవారు వారు మహమద్ కాసింకమరుద్దీన్ అనుపేరుగల ప్రసిద్ధవ్యాపారికి భాగస్వామి జోహన్స్‌బర్గ్‌లో గలవారి శాఖకు మేనేజరు చాలా తీర్మానాలు ప్యాసయ్యాయి కాని నిజమైన తీర్మానం ఒక్కటే "ఎన్ని ప్రయత్నాలుచేసినా యీ బిల్లు అసెంబ్లీలో ప్యాసైతే భారతీయులు ఓటమిని అంగీకరించకూడదు అందువల్ల కలిగే కష్టనష్టాల్ని ధైర్యసాహసాతో ఎదుర్కోవాలి" ఇది ఆతీర్మాన సారాంశం

ఈతీర్మానాన్ని నేను సభకు వినిపించిదాన్ని గురించి వివరించాను సభశాంతితో నా ప్రసంగం విన్నది హిందీలోను, గుజరాతీలోను సభాకార్యక్రమంతా నడిచింది కనుక భారతీయులకు అర్థం కాలేదనుటకు వీలులేదు హిందీ, గుజరాతీ రాని తెలుగు, తమిళభాషీయులకు ఆభాషలు తెలిసిన వారు పూర్తిగా వివరించి చెప్పారు నియమప్రకారం తీర్మానం సభలో ప్రవేశపెట్టాము అనేక మంది వక్తలు ఆ తీర్మానాన్ని సమర్థించారు వారిలో సేర్ హాజీహబీబ్ అనువారు ఒకరు వారు దక్షిణాఫ్రికాలో చాలకాలాన్నుంచి వుంటున్నారు వారి ప్రసంగం చాలా తీవ్రంగా సాగింది ఆవేశంతో వూగిపోతూ ఆయన "అల్లా సాక్షిగా మనం యీ తీర్మానాన్ని అంగీకరించాలి యీ బిల్లు

ముందు తలవంచడం నామర్దాపని అందువల్ల నేను ఖుదా పేరట ప్రమాణం చేసిచెబుతున్నాను ఈ చట్టం ముందు నేను తలవంచను ఈ సభకు వచ్చిన వారంతా ఖుదా పేరిట ఒట్టుపెట్టుకొని యీ తీర్మానాన్ని అంగీకరించాలి" అని ఉద్బోధించాడు

చాలామంది తీర్మానాన్ని సమర్థిస్తూ తీవ్రంగా మాట్లాడారు సేర్‌హాజీహబీబ్ మాట్లాడుతూ మాట్లాడుతూ ఖుదా పేరట ఒట్టు అనే సరికి నేను ఉలిక్కిపడి జాగ్రత్త పడ్డాను అప్పుడు నాకు నా బాధ్యత, భారత జాతి బాధ్యత ఏమిటో అర్థమైంది యిప్పటివరకు భారతీయులు చాలా తీర్మానాలు చేశారు అనుభవం గడించిన తరువాత వాటిలో మార్పులు కూడా చేశారు తీర్మానాలు అంగీకరించిన వాళ్లలో చాలామంది శ్రద్ధ వహించలేదు యివన్నీ ప్రపంచంలో సామాన్యంగా జరుగుతూ వుంటాయి అయితే యిలాంటి తీర్మానాలు వచ్చినప్పుడు ఎవ్వరూ దేవునిపేరు స్మరించరు నిజానికి సామాన్యంగా మనం అంగీకరించే తీర్మానాలకు, భగవంతునిపేరిట అంగీకరించే తీర్మానాలకు తేడా వుండకూడదు బుద్ధిమంతుడు లోచించి ఒకనిర్ణయం చేసినప్పుడు దానిమీద నిలబడుతాడు జారడు దేవుణ్ణి సాక్షిగాపెట్టి చేసిన ప్రతిజ్ఞకు సామాన్యంగా అంగీకరించి చేసే ప్రతిజ్ఞకు పెద్ద తేడా వుండదు అయితే ప్రపంచం సూక్ష్మ సిద్ధాంతం మీద ఆధారపడి నడవదుకదా! అది యీ రెండిటికీ మధ్య పెద్ద తేడావున్నా దని నమ్ముతుంది భగవంతుని పేరిట ప్రతిజ్ఞచేసి జారిపోయినవాణ్ణి ప్రపంచం హర్షించదు దీని ప్రభావం మనిషి మనస్సుపై అమితంగా పడుతుంది కోర్టుల్లో ప్రమాణంచేసి అబద్ధం చెబితే అతడికి శిక్ష పడుతుంది

ఇటువంటి ఎన్నో భావాలు నా బుర్రలో మెసిలాయి ఎన్నో అనుభవాలు పొందాను ప్రతిజ్ఞల తీయని ఫలితాన్ని కూడా జీవితంలో అనుభవించాను అట్టి నేను దేవుని పేరు వచ్చేసరికి ఉలిక్కిపడ్డాను అందువల్ల కలిగే పరిణామాల్ని ఉహించుకున్నాను నాకు ఉత్సాహం, ఆవేశం రెండూ కలిగాయి నేను ప్రతిజ్ఞ చేద్దామని యితరుల చేత చేయిద్దామని ఆసభకు వెళ్లలేదు కాని సేర్ చేసిన సూచన నాకు నచ్చింది అయితే అతడి మాటల్లో గల

గూడార్థం జనానికి చెప్పాలని నాకు అనిపించింది అర్థంచేసుకొని ప్రతిజ్ఞచేయమని అందరికీ చెప్పాలని అనిపించింది అందరము అట్టి ప్రతిజ్ఞచేయలేకపోతే భారత జాతి, యింకా చివరిమెట్టు చేరలేదని భావించవలసి వస్తుంది కదూ! నేను సభాధ్యక్షుణ్ణి హబీబ్ ప్రసంగంమీద మాట్లాడుటకు అనుమతికోరాను ఆయన అనుతి యిచ్చాడు లేచి నిలబడి మాట్లాడాను జ్ఞాపకం వున్నంతవరకు వివరం క్రింద తెలుపుతున్నాను

"ఇప్పటివరకు మనం అనేక తీర్మానాలు అంగీకరించాం కాని యివాళ అంగీకరించబోయే తీర్మానానికి గతంలో అంగీకరించిన తీర్మానాలకు విధానంలో పెద్ద తేడా వున్నది దీన్ని అంతాజాగ్రత్తగా గమనించాలి ఈ తీర్మానం ఎంతో గంభీరంగా వున్నది దీన్ని సంపూర్తిగా అమలుపరిస్తేనే దక్షిణాఫ్రికాలో మన వ్యక్తిత్వం లేక మన ఉనికి నిలచి వుంటుంది మన మిత్రుడు తీర్మానం చేయవలసిన విధానాన్ని క్రొత్త పద్ధతిలో సూచించాడు నిజానికి నేను యీ పద్ధతిలో తీర్మానం అంగీకరించాలనే భావంతో సభకు రాలేదు ఈ శ్రేయస్సంతా సేఠ్ హాజీహబీబ్‌కు లభించాలి దీని బాధ్యత కూడా వారి మీద వుంచాలి యిందుకు వారిని నేను అభినందిస్తున్నాను వారి సూచన నాకు బాగా నచ్చింది వారి సూచనను మీరంతా అంగీకరిస్తే తీర్మానం అమలుచేయుటకు మీరంతా బాధ్యత వహించాలి ఆ బాధ్యతను మీరంతా అర్థం చేసుకోవాలి జాతిసేవకుడుగా, కార్యకర్తగా ఆబాధ్యతను మీకు తెలియజేస్తున్నాను

'మనమంతా ఒకే సృష్టికర్తను విశ్వసిస్తున్నాము మహమ్మదీయులు అతణ్ణి ఖుదాఅని అంటున్నారు హిందువులు ఈశ్వరుడు అని అంటున్నారు ఈశ్వరుణ్ణి సాక్షిగా వుంచి మనం ప్రతిజ్ఞ చేస్తే అది సామాన్యమైన విషయంకాదు ఈ విధంగా ప్రతిజ్ఞచేసి దాన్ని ఆచరణలో పెట్టక పోతే జాతికి, ప్రపంచానికి, ఈశ్వరునికి ద్రోహం చేసిన వారమవుతాము ఆషామాషీగా ప్రతిజ్ఞ చేసిన దాన్ని అమలు చేయనివాడు జాతి, సమాజం, ఈశ్వరుని ముందు అపరాధి అవుతాడు సత్తురూపాయికి విలువలేకపోగా దాన్ని దగ్గర దాచినవాడు శిక్షకూడా పొందే అవకాశం అట్లే అబద్ధపు ప్రతిజ్ఞ చేసేవాడికి

విలువవుండదు ఇహలోకంలోను, పరలోకంలోను శిక్ష పొందుతాడు సేఠ్‌హాజిహబీబ్ అటువంటి గంభీరమైన ప్రతిజ్ఞ చేయమని సూచిస్తున్నారు ఈ సభలో అర్థంచేసుకోలేనివాడు, ఒక్కడుకూడా లేడు మీరంతా ప్రౌడులు అనుభవజ్ఞులు మీరు ప్రపంచాన్ని చూచారు మీలో చాలామంది జాతికి ప్రతినిధులు మీలో చాలామంది బాధ్యత గల పనులు నిర్వహించారు అందువల్ల తెలియక యిట్టి ప్రతిజ్ఞ చేశానని చెప్పి తప్పించుకునేందుకు వీలులేదు "ప్రతిజ్ఞలు, వ్రతాలు ఎంతో మహత్తరమైన సమయంలోనే చేస్తూవుంటాం ఆషామాషీగా ప్రతిజ్ఞలు చేసేవాడు వాటిమీద నిలబడలేడు దక్షిణాఫ్రికాయందలి భారతీయులకు మంచి పరీక్షా సమయం యిప్పుడే వచ్చింది యిప్పుడువేసే ప్రతి అడుగు స్థిరంగా, యోచించి గట్టిగా వేయాలి దానికి కూడా ఒక హద్దువున్నది ఆహద్దును మనంచేరుకున్నాం ప్రభుత్వం సభ్యత యొక్క హద్దును దాటింది యిప్పుడు మనం నోరు మూసుకొని కూర్చుంటే, త్యాగాలకు సిద్ధపడి దురన్యాయాన్ని ఎదుర్కోకపోతే పిరికివాళ్లం, పనికిమాలిన వాళ్లం అయిపోతాం యిప్పుడు ప్రతిజ్ఞను అర్థంచేసుకొని చేయాలి ప్రతివ్యక్తీ ఎవరికి వారు యిట్టి శక్తి నాకు వున్నదా లేదా అని స్వయంగా ఆలోచించుకోవాలి అమలుచేయగలమని ధైర్యంవుంటేనే ప్రతిజ్ఞచేయాలి ఆడంబరంకోసం యిలాంటి ప్రతిజ్ఞచేయకూడదు మనయీ ప్రతిజ్ఞయొక్క ప్రభావం స్థానిక ప్రభుత్వం, పెద్ద బ్రిటిష్ ప్రభుత్వం భారతప్రభుత్వం మీద ఏమిపడుతుంది అని ఆలోచించకూడదు ప్రతివ్యక్తి గుండెమీద చేయివేసుకొని తనను తాను పరీక్షించకోవాలి మనస్సాక్షిగా శక్తి వుందనితోస్తే ప్రతిజ్ఞ చేయాలి అప్పుడే ప్రతిజ్ఞ సత్ఫలితాలనిస్తుంది

"ఇక దీని పరిణామాల్ని గురించి కూడా రెండుమాటలు చెబుతాను ఈ తీర్మానం చిత్తశుద్ధిగా అంగీకరించే ధీశాలురైన భారతీయుల సంఖ్య అధికంగా వుంటే, అంతా తమమాట మీదగట్టిగా నిలబడి బిల్లును వ్యతిరేకిస్తే యీ బిల్లు ప్యాసుకాదు ప్యాసైనా వెంటనే రద్దు చేయబడుతుంది బిల్లును వ్యతిరేకించడం వల్ల మనం ఎక్కువకష్టాలు పడవలసిన అవసరం

కలుగకపోవచ్చు అయితే ఏదో జరుగుతుందని ఊహించి మనం ప్రతిజ్ఞ చేయకూడదు మనం సాగించేపోరాటాం వల్ల రెండు కటు పరిణామాలు కలుగవచ్చు వాటిని మీముందు చెప్పతలుస్తున్నాను మనందరం ప్రతిజ్ఞ చేశాం అనుకొండి అంతా కలిపి మనం 3000 మందిమి వున్నాం మిగతా 10వేల మంది భారతీయులు ప్రతిజ్ఞ చేయకపోవచ్చు అప్పుడు ప్రారంభంలో మనం నవ్వుల పాలవుతాం అంతేగాక ప్రతిజ్ఞ చేసిన వారిలో కూడా కొందరు పిరికితనంతో వెన్నుచూపవచ్చు జైళ్లకు వెళ్ల వలసి రావచ్చు అక్కడ అవమానాలు సహించడం అవసరం కావచ్చు ఆకలి, చలి, ఎండల్ని జైళ్లలో అనుభవించవచ్చు దౌర్జన్యాలకు అలవాటుపడ్డపోలీసు అధికారులు మనల్ని బాదవచ్చు జుల్మానాలు విధించవచ్చు మన ఆస్తిపాస్తులు వేలం కూడా వేయవచ్చు యివాళ మనదగ్గర డబ్బు పుష్కలంగా వున్నా రేపు దరిద్రులం కావచ్చు యీ దేశాన్నుంచి మనల్ని బహిష్కరించవచ్చు ఆకలిదప్పికలతో మనలో కొందరు జబ్బు పడవచ్చు కొందరు చనిపోవచ్చు అందువల్ల ఊహించ గలిగినన్ని కష్టాల్ని సహించడానికి మనం సిద్ధపడాలి అప్పుడే ప్రతిజ్ఞ చేయాలి ఈ పోరాటం వల్ల ఏమి జరుగుతుంది అని ఎవరైనానన్ను అడిగితే భారతీయులంతా ఏకమై యిందుకు నడంబిగించి పోరాడితే తక్షణం సత్ఫలితం లభించి తీరుతుందని చెబుతాను మనలో చాలామంది కష్టాలకు తట్టుకోలేక జారిపోతే పోరాటం చాలాకాలం సాగవచ్చు పిడికెడుమందైనా చివరివరకు త్యాగాలు చేయడానికి సిద్ధపడితే అంతిమ విజయం మనకు లభించి తీరుతుందని నానిశ్చితాభిప్రాయం

"ఇక నావ్యక్తి గత బాధ్యతనుగురించి రెండు మాటలు చెబుతాను ఒకవైపున ప్రమాదాల్ని గురించి హెచ్చరిస్తూ వున్నానంటే మరో వైపున ప్రతిజ్ఞ చేయమని ప్రోత్సాహిస్తున్నానన్నమాట నాబాధ్యతనుగుర్తిస్తున్నాను ఆవేశంలో యిక్కడఅంతా ప్రతిజ్ఞచేసి తరువాత నిర్బలులై జారుకొంటే, బహుకొద్దిమంది మాత్రమే అగ్నిపరీక్షకు సిద్ధపడవచ్చు అట్టిస్థితిలో సైతం నా లక్ష్యం ఒక్కటే " "ప్రాణాలుపోయినా సరే చట్టం ముందు తలవంచను" అలాజరగదు

అనే రంగంలోకి దిగుదాం కాని, అట్టి స్థితివచ్చిందనే అనుకోండి, అంతా తప్పుకున్నారనుకోండి నేనొక్కణ్ణే మిగిలానని అనుకోండి, అయినా నేను నాప్రతిజ్ఞమీద నిలబడతాను నాయీ మాటను మీరంతా తెలుసుకోండి యిది అభిమానంతో చెప్పేమాటకాదు ఈ సభలో కూర్చున్న భారతీయ నాయకులకు యిది నా హెచ్చరిక అని మనవి చేస్తున్నాను నన్ను ఉదాహరణగా పేర్కొని మీకు స్పష్టంగా చెబుతున్నాను మీకు స్థైర్యం లేకపోతే ప్రతిజ్ఞచేయకండి మరొక్క విషయం యిష్టంలేకపోతే దీన్ని వ్యతిరేకించండి కాని చేసే పనిమాత్రం త్రికరణశుద్ధిగా చేయండి "ఎవరు ఏంచేసినా సరే నేను మాత్రం చివరివరకు పోరాడుతాను" అనే దృఢనిర్ణయంతో యీ ప్రతిజ్ఞచేయండి

ఈ విధంగా చెప్పినేను కూర్చున్నాను ఎంతో శాంతివహించిజనం నామాటలు విన్నారు యితర నాయకులు కూడా మాట్లాడారు అందురూ తమ బాధ్యతను, శ్రోతల బాధ్యతను గురించి మాట్లాడారు తరువాత సభాధ్యక్షుడు లేచి నిలబడ్డారు వారు స్థితిని సమీక్షించారు చివరికి అంతాలేచి నిలబడి దేవుణ్ణి సాక్షిగా వుంచి క్రింది విధంగా ప్రతిజ్ఞ చేశారు "బిల్లు ప్యాసైచట్టం అయితే మేముదాని ముందు తలవంచము" అదీ ప్రతిజ్ఞ ఆదృశ్యాన్ని జీవితంలో మర్చిపోలేను జనంలో ఉత్సాహం ఉరకలేసింది రెండో రోజున ఏదో ప్రమాదంజరిగి యూదుల ఆ నాటకశాల తగులబడిపోయింది మూడో రోజున జనం యీ వార్తతో నా దగ్గరికి వచ్చారు యిదిశుభ శకునం అని అంతా అనడం ప్రారంభించారు నాటకశాల భస్మం అయినట్లే యీబిల్లు కూడా భస్మం అయిపోతుందని అంతా అన్నారు యిటువంటి వాటి ప్రభావం ఎన్నడూ నామీద పడదు అందువల్ల నేను ఏమీ మాట్లాడలేదు ప్రజల్లోగల భావాన్ని తెలుపడంకోసం యీ విషయం యిక్కడ వ్రాశాను భారతజాతి చూపిన ధైర్యసాహసాల్ని వచ్చే ప్రకరణాల్లో మీరు గ్రహిస్తారు

పైసభ జరిగిన తరువాత కార్యకర్తలు ఊరుకోలేదు ఎన్నో సభలు

జరిపారు ప్రతిసభలోను జనం చేత ప్రతిజ్ఞ చేయించారు ఇండియన్ ఒపీనియన్ పత్రికలలో ఖూనీ (రక్తపు) చట్టం చర్చకు ముఖ్య విషయం అయిపోయింది

రెండో వైపున స్థానిక ప్రభుత్వాన్ని కలియుటకు ఏర్పాట్లు జరిగాయి ఒక ప్రతినిధి బృందం అధినివేశ రాజ్యాల మంత్రి శ్రీ డంకల్‌ను కలుసుకునేందకు వెళ్లింది మిగతా విషయాలతోబాటు జాతి తీసుకున్న ప్రతిజ్ఞను గురించి కూడా వారికి చెప్పారు. ప్రతినిధిబృందంలో ఒక సభ్యుడైన సేఠ్ హాజీహబీబ్ "ఎవరైనా ప్రభుత్వాధికారి నాభార్య దగ్గరికి వచ్చి వ్రేళ్ల ముద్రలు వేయమని అంటే వాణ్ణి వెంటనే కాల్చి చంపివేస్తాను కాల్చుకొని నేను చస్తాను" అని అన్నాడు కొద్దిసేపు మంత్రి హబీబ్ ముఖం వంక చూచాడు అసలు యీ చట్టాన్ని స్త్రీలకు వర్తింపచేయాలా వద్దా అని ప్రభుత్వం ఆలోచిస్తున్నది యిప్పుడే నేను మాట యిస్తున్నాను స్త్రీలకు సంబంధించినంత వరకు చట్ట నింబంధనల్ని రద్దుచేస్తాము ఈ విషయమై మీ భావాల్ని ప్రభుత్వం అర్థం చేసుకున్నది మీ భావాన్ని గౌరవించితీరుతాం మిగతా నిబంధనల విషయమై ప్రభుత్వం గట్టిగా వున్నది వుంటుందికూడా జనరల్ బోథా జాగ్రత్తగా యోచించి యీ బిల్లును అంగీకరించమని కోరుతున్నారు తెల్లవాళ్ల కోసం ప్రభుత్వం యీ చట్టం అవసరమని భావిస్తున్నది నిబంధనల విషయంలో మీరేమైన సలహాలు యివ్వదలిస్తే యివ్వండి మీకు మంచిది" అని చెప్పాడు ప్రతినిధి బృంద సభ్యులు చట్టాన్ని వ్యతిరేకిస్తూ అనేక విషయాలు మంత్రి ఎదుట పేర్కొన్నారు వాటన్నింటిని గురించి నేను యిక్కడ వ్రాయడం లేదు గత ప్రకరణాల్లో వాటి వివరాలు వ్రాశాను స్త్రీలను చట్టాన్నుంచి మినహాయించి నందుకు కృతజ్ఞులం కాని చట్టాన్ని మేమెవ్వరం అంగీకరించేది లేదని చెప్పి అంతావచ్చి వేశారు భారతస్త్రీల మినహాయింపును గురించి చర్చ ప్రారంభమైంది పోరాటంవల్ల కలిగిన శుభపరిణామమని కొందరన్నారు కాని ప్రభుత్వం మాత్రం పోరాటానికి వెరిచి మినహాయించలేదు స్వతంత్రంగా యోచించి యీ నిర్ణయంగైకొన్నదని ప్రకటించింది కాకతీయంగా యిది

జరిగినా భారతీయులు మాత్రం యిది ఉద్యమ ఫలితమేనని భావించారు వారి ఉత్సాహం ఇనుమడించింది

ఈ జాతీయ ఉద్యమానికి ఏంపేరు పెట్టాలి. అని ఎవ్వరం అప్పుడు ఆలోచించలేదు అప్పుడు నేను "పాసివ్ రెసిస్టెన్స్" అని పేరుపెట్టాను పాసివ్‌రెసిస్టెన్స్‌కు గల గూఢార్థం ఏమిటో నేను యోచించలేదు అయితే నూతన సిద్ధాంతానికి యిది ప్రతీక అని అనుకున్నాను ఉద్యమం విజృంభించినప్పుడు పాసివ్ రెసిస్టెన్స్ శబ్దంవల్ల చిక్కులు పెరిగిపోయాయి ఇంతపెద్ద ఉద్యమానికి ఇంగ్లీషు పేరు పెట్టినందుకు సిగ్గుపడ్డాను యీ ఇంగ్లీషు శబ్దాలు భారతజాతి పెదవులపై ఆడలేవు అందువల్ల మంచి భారతీయ భాషా శబ్దం సూచించమని ఇండియన్ ఒపీనియన్‌లో ప్రకటించి అందుకు బహుమానం కూడా ప్రకటించాను కొన్నిపేర్లు నాదగ్గరకి వచ్చాయి ఉద్యమ స్వరూప వివరమంతా స్పష్టంగా ప్రకటించాను శ్రీమగన్‌లాల్ గాంధీ "సదాగ్రహం" అని పేరు సూచించారు వివరం వ్రాస్తూ భారతీయుల ఆగ్రహం అనగా పట్టుదల, సద్ అనగా శుభంకరమైనది. కనుకదీన్ని సదాగ్రహం అని వివరించారు యీ పేరునాకు నచ్చింది కాని నేను చేర్చాలనుకున్న విషయం యిందులో రాలేదని అనిపించింది అందువల్ల నేను 'ద'ను 'త' చేసి అందు'య' చేర్చాను అంటే అవిధంగా సత్యాగ్రహం అయిందన్నమాట సత్యంలో శాంతి యిమిడి వుంటుంది ఏ విషయం పైనా ఆగ్రహం అనగా పట్టుదలపట్టితే శక్తి ఆవిర్భవిస్తుంది అందువల్ల ఆగ్రహం అనుశబ్దానికి బలాన్ని యిచ్చి భారతీయుల యీ మహోద్యమానికి నేను సత్యాగ్రహం అని పేరుపెట్టాను అంటే సత్యము, శాంతికి రెండిటితో ఆవిర్భవించే బలం అన్నమాట యీ విధంగా సత్యాగ్రహశబ్దాన్ని గురించి వ్యాఖ్యానించాను పాసివ్ రెసిస్టెన్స్ అను ఇంగ్లీషు శబ్దాన్ని తొలగించివేశాను ఇంగ్లీషులో వ్రాసిన వ్యాసాల్లో సైతం పాసివ్ రెసిస్టెన్స్ అనుశబ్దాన్ని వాడుటం తగ్గించివేశాను సత్యాగ్రహశబ్దాన్ని వివరించే ఇంగ్లీషు శబ్దాన్ని ప్రయోగించడం ప్రారంభించాను ఈ విధంగా సత్యాగ్రహం అనుపేరు యొక్క పుట్టుక

జరిగింది ఈ చరిత్రను పొడిగించుటకు ముందు పాసివ్‌రెసిస్టెన్స్ మరియు సత్యాగ్రహం అను రెండు శబ్దాలకు మధ్యగల భేదాన్ని తెలుసుకోవడం అవసరం తరువాత ప్రకరణంలో యీ భేదాన్ని తెలుసుకుందాం

★ ★ ★

# 13

# సత్యాగ్రహం-పాసివ్‌రెసిస్టెన్స్

భారతీయుల జాతీయ ఉద్యమం తీవ్రరూపం దాల్చే కొద్దీ ఆంగ్లేయులకూడా ఆకర్షితులయ్యారు ట్రాన్స్‌వాల్ యందలి ఇంగ్లీషు పత్రికల వాళ్లంతా ఖూనీ చట్టాన్ని సమర్థిస్తూ, ఇంగ్లీషువాళ్ళంతా దాన్ని సమర్థిస్తూ వుండేవారు అయినా భారతీయులు ఏమైనా వ్రాసిపంపితే తమ పత్రికల్లో తప్పక ప్రకటిస్తూవుండేవారు ప్రభుత్వానికి భారతీయులు పంపే అర్జీలను పూర్తిగా ప్రచురిస్తూ వుండేవారు పూర్తిగా ప్రకటించనివాళ్లు సారాంశమైనా తప్పకప్రకటిస్తూ వుండేవారు భారతీయులు జరిపే మీటింగులకు తమ విలేకర్లను పంపుతూవుండేవారు విలేకర్లను పంపనివాళ్లు మనం సభావిశేషాలు వ్రాసిపంపితే ప్రకటించేవాళ్లు

ఇంగ్లీషు పత్రికల సౌహార్ధతతో కూడిన యీవ్యవస్థ భారతజాతీయ ఉద్యమానికి ఎంతో సహాయం చేసింది ఉద్యమం ప్రారంభించిన తరువాత ఆంగ్లేయులు కూడా అందుపాల్గొనసాగారు అట్టి అగ్రగణ్యుల్లో జోహన్స్‌బర్గుకు చెందిన ఆంగ్లలక్షాధికారి శ్రీ హాస్కిన్ ఒకరు వారిహృదయంలో రాగద్వేషాలు లేవు ఉద్యమం ఆరంభించిన తరువాత వారు నా దగ్గరకు రాసాగారు జోహన్స్‌బర్గ్‌లో జమిస్టన్ ఒక ఉపనగరం అక్కడి ఆంగ్లేయులు నాఉపన్యాసం వింటామని వార్త పంపారు ఒక సభ జరిగింది శ్రీ హాస్కిన్ ఆ సభకు అధ్యక్షత వహించారు నేను ఉపన్యాసం యిచ్చాను సభలో శ్రీ హాస్కిన్ భారతీయుల ఉద్యమాన్ని గురించి మాట్లాడుతూ నన్ను పరిచయం చేస్తూ ట్రాన్స్‌వాల్ భారతీయులు న్యాయంకోసం ప్రయత్నించి విఫలురైపాసివ్ రెసిస్టెన్స్‌ను ఆశ్రయించారు. వాళ్లకి ఓటింగు అధికారంలేద వారి సంఖ్య స్వల్పం (వాళ్లు బలహీనులు) వాళ్ల దగ్గర ఆయధాలులేవు అందువల్ల

బలహీనుల ఆయుధమైన పాసివ్‌రెసిస్టెన్సును చేతబట్టారు' అని అన్నారు వారిమాటలు విని నేను నివ్వెరబోయాను దానితో నా ఉపన్యాస విధానమే మారిపోయింది నేను శ్రీ హాస్కిన్ చెప్పిన వాదనను ఖండించాను పాసివ్ రెసిస్టెన్స్ అంటే సోల్‌ఫోర్స్ అనగా ఆత్మబలం అని చెప్పాను పాసివ్ రెసిస్టెన్స్ అను శబ్దంవల్ల భయంకరమైన అపోహలు తలఎత్తే ప్రమాదం వున్నదని గ్రహించాను నావాదనలను విస్తారింగా వివరించి పాసివ్ రెసిస్టెన్స్‌కు మరియు ఆత్మబలానికి మధ్యగల తేడాను సవివరంగా తెలియజేస్తానని చెప్పి అందుకు ప్రయత్నించాను పాసివ్‌రెసిస్టెన్స్ అను యీ రెండు శబ్దాల్ని ఇంగ్లీషులో ఎవరు ప్రారంభించారో నాకు తెలియదు (అధికసంఖ్యాకులు చట్టం చేస్తే అది అల్ప సంఖ్యాకులకు యిష్టంకాకపోతే. వాళ్లు ఆ చట్టానికి వ్యతిరేకంగా విప్లవం రెచ్చకొట్టకుండా దానిముందు తలవంచకుండా పాసివ్ అనగా మెతక వైఖరి అవలంబిస్తారు అందుకు విధించబడే శిక్షను అనుభవించుటకు సిద్ధపడతారు కొద్ది ఏండ్లక్రితం బ్రిటిష్ పార్లమెంటులో విద్యకు సంబంధించిన చట్టం ప్యాసుచేశారు అప్పుడు ఇంగ్లాండునందలి నాన్‌కానఫేమిష్ట అను పేరు గల క్రైస్తవ సంప్రదాయానికి చెందినవారు డా॥ క్లిఫర్డ్ నాయకత్వాన పాసివ్ రెసిస్టెన్స్‌ను ఆశ్రయించారు ఆంగ్లమహిళలు ఓటింగు హక్కుకోసం చేసిన ఉద్యమం కూడా పాసివ్‌రెసిస్టెన్స్ ఆ రెండు ఉద్యమాల్ని దృష్టియందుంచుకొనే శ్రీ హాస్కిన్ ఇంగ్లీషువాళ్ల సభలో "పాసివ్ రెసిస్టెన్స్" ఓటింగు హక్కులేని బలహీనుల ఆయుధం అని అన్నారు డా॥ క్లిఫర్డ్ పక్షం ఓటింగు హక్కుగల వారిది కాని బ్రిటిష్ పార్లమెంటులో వారి సంఖ్య తక్కువగా వున్నది అందువల్ల వారి శక్తి బిల్లును ప్యాసు చేయకుండా ఆపలేకపోయింది అంటే సంఖ్యా బలంలో బలహీనమని తేలింది అయితే నాన్‌కన్ఫామిస్ట్ పక్షం తమ లక్ష్యసాధనకు ఆయుధాల ప్రయోగాన్ని వ్యతిరేకించలేదు కాని యిటువంటి వ్యవహారంలో ఆయుధాల్ని ఉపయోగించితే జయం లభిస్తుందనే ఆశ దానికి లేదు యింతేగాక హఠాత్తుగా ఆయుధ ప్రయోగంచేసి అధికారం పొందే పద్ధతి పరిపాలనా వ్యవస్థయందు సరియైనదికాదు క్లిఫర్డ్‌పక్షంవారిలో కొందరు ఆయుధాలు ఉపయోగించుటకు

వ్యతిరేకులు. ఇంగ్లాండులో జరిగిన మహిళా ఉద్యమంలో పాల్గొన్న మహిళలకు ఓటింగ్ హక్కులేదు సంఖ్యలోనే గాక శారీరక శక్తిలో సైతం వాళ్లు బలహీనులే అందువల్ల యీ రెండువ ఉదాహరణ కూడా హాస్కిన వాదనా సమర్థనకు ఉపయోగపడింది స్త్రీలు సాగించిన ఉద్యమంలో ఆయుధ ప్రయోగాన్ని త్యజించలేదు స్త్రీల దళాలు కొన్ని యిళ్లు తగల బెట్టడమేగాక పురుషుల మీద దాడులకు కూడా చేశాయి అయితే వాళ్లు ఎవరినీ చంపుటకు ప్రయత్నించినట్లు నాకు కనబడలేదు సమయం చిక్కినప్పుడు జనాన్ని కొట్టడానికి, హింసించడానికి వాళ్లు సిద్ధపడిన మాటవాస్తవం

భారతీయుల జాతీయ ఉద్యమంలో ఎప్పుడు ఎక్కడా ఆయుధాలకు తావులేదు ఉద్యమం తీవ్రమైన కొద్దీ కష్టాలు సహించడమే గాని భారతీయ సత్యాగ్రహులు ఎప్పుడు ఎక్కడా హింసకు దిగలేదు శారీరిక బలాన్ని బాగా ఉపయోగించగల స్థితిలో వుండి కూడా వాళ్లు అందుకు పూనుకోలేదు అయితే భారతీయులకు ఓటింగు హక్కు లేకపోవడం వాళ్లు బలహీనులు కావడం రెండూ నిజమే అసలు సత్యాగ్రహ ఉద్యమానికి యీ రెండు విషయాలకు ఏమీ సంబంధలేదు భారతీయులకు ఓటింగ్ హక్కు వున్నప్పటికీ, ఆయుధశక్తి వున్నప్పటికీ వారు సత్యాగ్రహమే చేసి యుండేవారు ఓటింగ్‌హక్కు వుంటే అసలు సత్యాగ్రహం చేయవలసిన అవసరమే వుండేదికాదు భారతీయుల దగ్గర ఆయుధ శక్తియే వుండి వుంటే ప్రతిపక్షంవారు కడు జాగ్రత్తగా వ్యవహరించివుండే వారు ఆయుధ శక్తికలిగియున్నవారు సత్యాగ్రహప్రయోగానికి సామాన్యంగా పూనుకోరు దాన్ని గమనించడం అవసరం జాతీయ ఉద్యమం ప్రారంభించినప్పుడు ఆయుధాల ప్రయోగం సంభవమా, అసంభవమా అని నెను యోచించలేదు సత్యాగ్రహం కేవలం ఆత్మబలమే ఆయుధాల బలానికి అనగా శారీరిక బలానికి లేక పశుబలప్రయోగానికి తావు వున్నచోట అనగా దాని ఉనికికి అవకాశం వున్నచోటు యిక ఆత్మ బలానికి తావు వుండదు నా దృష్టిలో యీ రెండు పరస్పరం విరోధించే శక్తులు ఈ భావం సత్యాగ్రహ ఉద్యమ ఆరంభంనుంచే నా హృదయంలో పూర్తిగా నాటుకున్నది

ఈ భావాలు సరిమైనవా కాదా అని మనం యిక్కడ యోచించినవసరం లేదు మనం పాసివ్ రెసిస్టెన్స్ మరియు సత్యాగ్రహానికి మధ్యనగలతేడాను తెలుసుకోవాలి ఈ రెండు శక్తులు ఒకదానికొకటి వ్యతిరేకమైనవి ఆ తేడా తెలుసుకోకపోతే పాసివ్‌రెసిస్టెన్స్‌ను ఉపయోగించవాళ్లు మరియు సత్యగ్రహాన్ని అంగీకరించేవాళ్లు యిద్దరూ ఒకటే అనుకుంటే అన్యాయం జరుగుతుంది హానికరమైన పరిణామాలు ఏర్పడతాయి మేము స్వయంగా దక్షిణాఫ్రికాలో పాసివ్ రెసిస్టెన్స్ శబ్దాన్ని వాడాము ఓటింగ్ హక్కు కోసం పోరాటం జరిపినా బ్రిటిష్ స్త్రీల పరాక్రమాన్ని మరియు ఆత్మత్యాగాన్ని మాపై ఆరోపించి మమ్మల్ని పశంసించకూడదు చాలామంది ఆబ్రిటిష్ స్త్రీల మాదిరిగా మేము కూడాప్రజల ఆస్థిపాస్తులకు నష్టంకలిగించే వాళ్లమేనని భావించారు శ్రీ హాస్కిన్ వంటివారు సైతం మమ్మల్ని బలహీనులుగా భావించారు మనిషి యోచనలకు అమిత శక్తి వుంటుంది తను అనుకున్న ఆలోచనకు అనుగుణ్యంగా మనిషి అయిపోతాడు మమ్మల్ని గురించి అలా అనుకునే వారిని అనుకోనిస్తే చివరకి ఆ ఆయుధాన్ని సైతం వదిలివేడానికి మేము సిద్ధపడిపోవచ్చు అలాంటి పాసివ్‌రెసిస్టెన్స్‌ను ఉపయోగిస్తూమేము [illegible]లో బలవంతులం కాలేము మేము సత్యాగ్రహులమైయుండి, మమ్ము [illegible] బలవంతులమని భావించి సత్యాగ్రహశక్తిని ఉపయోగించితే రెండు పరిణామాలు కలుగుతాయి బలమనే భావాన్ని పోషిస్తూ రోజు రోజుకు మేము బలవంతులమవుతాము మా బలం పెరిగిన కొద్దీ మా సత్యాగ్రహ తేజస్సు పెరుగుతుంది పాసివ్‌రెసిస్టెన్స్‌లో ప్రేమకు తావు వుండదు కాని సత్యాగ్రహంలో వైరభావానికి తావు వుండదు అసలు సత్యాగ్రహికి వైరి అంటూ ఎవ్వడూ వుండడు పాసివ్‌రెసిస్టెన్స్‌లో అవకాశం చిక్కితే ఆయుధ బలానికి తావు వుంటుంది కాని సత్యాగ్రహ సమరంలో అత్యుత్తమైన అనుకూల పరిస్థితులు ఏర్పడినా ఆయుధ ప్రయోగానికి తావు వుండదు పాసివ్‌రెసిస్టెన్సు నందు ఆయుధశక్తికి అవకాశం వుంటుంది కాని సత్యాగ్రహంలో అట్టి యోచనకు సైతం తావు వుండదు ఆయుధశక్తితో బాటు పాసివ్‌రెసిస్టెన్సు నడుస్తుంది కాని సత్యాగ్రహంలో అలా నడవడానికి అవకాశమే వుండదు

అందువల్ల రెండింటికీ సంబంధం కుదరదు, కలవదు అంటే సత్యాగ్రహం, ఆయుధబలం రెండూ కలవడానికి వీలు లేదు సత్యాగ్రహాన్ని మన ప్రీతిపాత్రుల విషయంలో కూడా ఉపయోగించవచ్చు కాని పాసివ్‌రెసిస్టెన్సును ప్రీతిపాత్రులపట్ల ప్రయోగించడానికి వీలులేదు పాసివ్ రెసిస్టెన్సులో శత్రు పక్షంవారికి దుఃఖం కలిగించుటకు, కష్టం కలిగించుటకు అవకాశం వుంటుంది కాని సత్యాగ్రహంలో శత్రుపక్షంవారికి దుఃఖం కష్టం కలిగించాలనే భావమే వుండదు తాను కష్టపడి, తాను దుఃఖాలు సహించి శత్రు పక్షంవారి హృదయాలను జయించాలనే సాత్విక గుణం సత్యాగ్రహంలో పనిచేస్తుంది ఈ రెండింటికీ గల ప్రధాన భేదం వివరించాను అయితే పాసివ్ రెసిస్టెన్సు గుణగణాలను గురించి నేను వర్ణించి చెప్పినట్లు ప్రతి పాసివ్ రెసిస్టెన్సులోను జరుగుతుందని చెప్పలేము అయితే పాసివ్ రెసిస్టెన్సుకు యిచ్చే పలు ఉదాహరణాల్లో దోషాలు ఎక్కువగా కనబడతాయి

చాలా మంది క్రైస్తవులు ఏసుక్రీస్తు పాసివ్ రెసిస్టెన్సుకు ఆధినేతని అంటారు కాని అది సరికాదు వారిది సత్యాగ్రహం అని భావించాలి యిటువంటి ఉదాహరణలు చరిత్రలో పాసివ్‌రెసిస్టెన్సుకు లభించవు టాల్‌స్టాయి రష్యాకు చెందిన మఖోబోర్ ప్రజల ఉదాహరణ యిచ్చారు అది యిటువంటి పాసివ్‌రెసిస్టెన్స్ అనగా సత్యాగ్రహానికి ఉదాహరణయే ఏసుక్రీస్తు తరువాత వేలాది మంది క్రైస్తవులు ఎన్నో అత్యాచారాల్ని సహించారు పాసివ్ రెసిస్టెన్స్ అనుశబ్దం వారికి ఎవ్వరూ వాడలేదు అట్టి ఉత్తమ ఉదాహరణలన్నింటికి నేను సత్యాగ్రహమనే పేరు పెడతాను ఇదే పాసివ్ రెసిస్టెన్స్ అని అంటే, సత్యాగ్రహానికి, దానికీ తేడాయే యుండదు

పాసివ్ రెసిస్టెన్స్ యొక్క లక్షణాలను గురించి పైన తెలిపిన హెచ్చరిక ఆశక్తిని ఉపయోగించేవారికి అన్యాయం జరుగకూడదనే భావంతోనే చేయవలసి వచ్చిందనిమనవి చేస్తున్నాను అయితే నేను సత్యాగ్రహియొక్క లక్షణాలని పేర్కొన్నవన్నీ ప్రతి సత్యాగ్రహియందూ వున్నాయని చెప్పలేను అయితే నేను తెలిపిన గుణాలు చాలామంది సత్యాగ్రహులకు తెలియవని కూడా చెప్పటకు సందేహించను

సత్యాగ్రహం బలహీనుల ఆయుధమని చాలామంది అభిప్రాయ పడుతున్నారు అసలు సత్యాగ్రహం ఆయుధాల బలప్రయోగానికి ముందుయిచ్చే శిక్షణ అనికూడా కొందరు అంటున్నారని విన్నాను యిది సరికాదు మరోసారి స్పష్టంగా చెబుతున్నాను ఎటువంటి గుణాలు గల సత్యాగ్రహులు కనబడ్డారో నేను వివరించలేదు అసలు సత్యాగ్రహం అను భావంయొక్క గూఢార్థం ఏమిటో వివరించాను ఆవిధంగా సత్యాగ్రహి అంటే ఎలా వుండాలో స్పష్టంగా వివరించాను ఈ ప్రకరణం వ్రాయడానికి గల ఉద్దేశ్యం క్లుప్తంగా మరో మారు వివరిస్తాను ట్రాన్స్‌వాల్ యందలి భారతీయులు ఏశక్తిని ప్రదర్శించడానికి పూనుకున్నారో, ఆశక్తిని గురించి ప్రజలకు స్పష్టంగా బోధపరుచుటకు ప్రయత్నించాను ఆశక్తిని పాసివ్ రెసిస్టెన్స్ అని పిలిచే శక్తితో అపోహపడి కలిపి వేయకూడదనీ, అందువల్లనే జాగ్రత్తగా యీ శక్తిని ప్రకటించగల శబ్దం కోసం వెతకవలసి వచ్చిందనీ చెప్పాను దానితోబాటు సత్యాగ్రహంలో అప్పుడు ఏఏ సిద్ధాంతాల్ని చేర్చామో కూడా వివరించాను

★ ★ ★

## 14

## ఇంగ్లాండులో ప్రతినిధిబృందం

ట్రాన్స్‌వాల్‌లో ఖూనీ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ఎవరెవరకి అర్జీలు దాఖలు చేయాలో వారందరికీ దాఖలు చేశాము ట్రాన్స్‌వాల్ అసెంబ్లీ మాత్రం స్త్రీలకు సంబంధించిన నిబంధనము తొలగించింది కాని మిగతా బిల్లు గేజెట్‌లో ప్రకటించబడీనట్లుగా అంగీకరించబడింది అయినా అప్పుడు భారతజాతిలో గట్టితనం, ఉత్సాహం, ఆవేశం, శక్తి సామర్థ్యాలు వుండటం వల్ల దాన్ని ఎవ్వరూ లెక్కచేయలేదు దానితో ప్రభుత్వం అందుకు సంబంధించిన చరలన్నీ చట్టరీత్యా గైకొనాలని నిర్ణయించింది అప్పటివరకు ట్రాన్స్‌వాల్ రాజ్యం "క్రౌన్‌కాలనీ"గా వున్నది క్రౌన్‌కాలనీ అంటే సామ్రాజ్యంలో వున్న అధినివేశ రాజ్యం అన్నమాట అంటే బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యం

క్రిందవున్నబాధ్యత కలిగిన చిన్న ప్రభుత్వం అంటే చట్టరీత్యాను, పరిపాలన దృష్ట్యాను బ్రిటిష్ ప్రభుత్వానికి లోబడియున్న రాజ్యమన్నమాట అందువల్లనే అధినివేశ రాజ్య అసెంబ్లీ ప్యాసు చేసిన చట్టాల్ని సైతం బ్రిటిష్ సామ్రాజ్య చక్రవర్తి బ్రిటిష్ రాజ్యాంగం రీత్యా సరికాదని తోస్తే నిరాకరించవచ్చు కాని బాధ్యత కలిగిన పెద్ద దేశాలైతే అక్కడి అసెంబ్లీ ప్యాసుచేసిన చట్టాన్ని చక్రవర్తి అంగీకరించాల్సిందే ట్రాన్స్‌వాల్ చట్టం చక్రవర్తి సంతకం కోసం ఇంగ్లాండు వెళ్లుతుంది కనుక ఇంగ్లాండుకు ప్రతినిధి బృందం వెళ్లాలని అంతా భావించారు అయితే భారత జాతిప్రతినిధిబృందం ఇంగ్లాండుకు వెళ్లితే, అది తన బాధ్యతను పూర్తిగా నిర్వహించాలికదా! ఇక యీ బాధ్యత నాపైన పడింది నేను అసోసియేషన్‌కు మూడు సలహాలు యిచ్చాను

(1) మనం యూదుల నాటకశాలలో అందరిచేత ప్రతిజ్ఞ చేయించాము అయినా తిరిగి ప్రముఖ భారతీయుల చేత వ్యక్తి గత ప్రతిజ్ఞల్ని తీసుకోవాలి దానివల్ల వాళ్లకు కలిగే యిబ్బందులు వాళ్ల బలహీనతలు ఏమిటో మనకు తెలుస్తాయి ఇలా చేస్తే మనం నిర్భయంగా ఇంగ్లాండు వెళ్లగలుతాము అధినివేశాల రాజ్య మంత్రికి, భారతమంత్రికి యిక్కడి మన పరిస్థితుల్ని గురించి నిర్భయంగా చెప్పగలుగుతాము

(2) భారత ప్రతినిధి బృంద సభ్యులకు అయ్యే ఖర్చులకోసం ధనం సమకూర్చుకోవాలి

(3) ప్రతినిధి బృందంలో తక్కువమంది సభ్యులు వుండాలి

ఈ మూడువ సూచన చాలా ముఖ్యమైనది ఎక్కువమంది జనం వెళ్లితే ఎక్కువ పనిజరుగుతుందని, ఆ విధంగా వెళ్లడం వల్ల వ్యక్తిగతంగా గౌరవం పెరుగుతుందని సామాన్యంగా జనం భావిస్తూ వుంటారు అది తప్పని, జాతికి సేవ చేయడానికే గాని సన్మానం కోసం కాదని, తక్కువమంది వెళ్లితే ఖర్చులుకూడా తగ్గుతాయని స్పష్టంగా చెప్పాను నా యీ మూడు సలహాల్ని అంతా అంగీకరించారు ప్రజల సంతకాలు మళ్లీ తీసుకోవడం ప్రారంభించాము చాలా మంది ప్రతిజ్ఞ పత్రాల మీద సంతకాలు చేశారు నాటకశాలలో మౌఖికంగా ప్రతిజ్ఞచేసిన వారిలో కొందరు లిఖిత ప్రతిజ్ఞా పత్రం మీద

సంతకం చేయడానికి వెనుకంజ వేయడం నేను గమనించాను నిజానికి ఒకసారి ప్రతిజ్ఞచేస్తే దానికి కట్టుబడి వుండాలి కాని బాగా యోచించి ప్రతిజ్ఞచేసిన వాళ్లే సమయం వచ్చినప్పుడు వెనుకంజవేయడం, మౌఖికంగా చేసిన ప్రతిజ్ఞా పత్రం మీద లిఖితరూపంలో సంతకం చేయవలసి వచ్చినప్పుడు కొందరు జారుకోవడం కూడా జరిగింది వేము అనుకున్నంతధనం ఖర్చులకోసం అందింది అయితే ప్రతినిధిబృంద సభ్యుల్ని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు పెద్ద యిబ్బంది కలిగింది నా పేరు అందులో వున్నది నా వెంటయింకా ఎవరెవరు రావాలి? నిర్ణయించుటకు ఎక్కువ సమయం పట్టింది చర్చలతో చాలా రాత్రిళ్లు గడిచాయి సంస్థల్లోను, సంఘాల్లోనూ వుండే చెడు అంతామాకు బోధపడింది మీరు ఒక్కరే వెళితే సంతోషిస్తామని కొందరన్నారు అందుకు నేను అంగీకరించలేదు దక్షిణాఫ్రికాలో హిందూ ముస్లిముల సమస్య లేదు కాని యిద్దరికీ వైషమ్యం లేదని పూర్తిగా చెప్పలేము అయితే అక్కడ నెలకొనియున్న విచిత్రమైన పరిస్థితులవల్ల మతవైషమ్యం నిషాలేదని చెప్పవచ్చు అక్కడి భారతీయులందరూ అరమరికలు లేకుండా పరిశుద్ధ హృదయంతో జాతికే సేవచేశారు జాతికి నిష్ఠ, నిజాయితీలతో మార్గం చూపించారు నాతో బాటు యిద్దరు సభ్యులు వస్తే చాలనీ, ఒక మహమ్మదీయుడు వుంటే మంచిదని చెప్పాను వెంటనే కొందరు మీరు జాతికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు అందువల్ల మీతోబాటు ఒక హిందువు కూడా వుంటే మంచిదని అన్నారు ప్రతినిధి బృందంలో ఒక కొంకణీ, ఒక మేమన్ ముస్లిం వుండాలని కొందరు సూచించారు హిందువుల్లో ఒక పాటీదారు, ఒకఅనావిల్ తెగ వారు వుండాలని కొందరి సలహా అయితే చివరికి అంతా విషయాన్ని అర్థం చేసుకొని నాతో బాటు శ్రీ హజీ వజీరలీ గారిని పంపడానికి ఏక గ్రీవంగా నిర్ణయించారు

శ్రీ హజీ వజీరలీ సగం మలైవాసి ఆయన తండ్రి భారతీయ ముస్లిం, తల్లిమలై దేశస్థురాలు వారి మాతృభాష డచ్ ఇంగ్లీషుకూడా నేర్చుకున్నారు కనుక డచ్, ఇంగ్లీసు భాషలు బాగా మాట్లాడగలరు ఇంగ్లీషులో ఉపన్యాసం

చేస్తున్నప్పుడు ఎక్కడా ఆగవలసిన అవసరం వారికి వుండదు పత్రికలకు జాబులు వ్రాయడంలో కూడా దిట్ట ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ అసోసియేషన్ మెంబరు చాలాకాలాన్నుంచి ప్రజాకార్యక్రమాల్లో పాల్గొంటున్నారు హిందుస్తానీ భాషకూడా బాగా మాట్లాగలరు ఒకమలై స్త్రీని వివాహం చేసుకున్నారు చాలామంది బిడ్డలు కలిగారు మేమిద్దరం ఇంగ్లాండు చేరుకొని పనిప్రారంభించాము భారతమంత్రికి అందజేయవలసిన అర్జీని మేము ఓడలోనే తయారుచేశాము ఇంగ్లాండు చేరి దాన్ని అచ్చువేయించాము అప్పుడు అధినివేశ రాజ్యాల మంత్రిగా లార్డ్ ఎల్గిన్ వున్నారు భారతమంత్రి లార్డ్ మోర్లే మేమిద్దరం ముందు దాదా భాయి నౌరాజీగారిని కలిశాము తరువాత వారి ద్వారా భారత జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ కమెటీ వారిని కలిశాము వారికి మాకేసు వివరం చెప్పాము అన్ని పార్టీల సహకారంతో పని చేస్తామని వారికి చెప్పాము దాదాభాయి నౌరాజీ కూడా మాకు యిట్టి సలహాయే యిచ్చారు బ్రిటిష్ కమెటీకి మా అభిప్రాయం నచ్చింది మేము సర్ మంచెర్జీ భావన్‌గరీ గారిని కలిశాము వారు కూడా మాకు ఎంతో సహాయం చేశారు వారు, దాదాభాయినౌరోజీ గారు యిద్దరూ మీరు విభిన్న పార్టీల మెంబర్లను కూడా వెంట బెట్టుకొని లార్డ్ ఎల్గిన్‌ను కలవమని చెప్పి, ఒక ఆంగ్లో ఇండియన్ నాయకత్వాన వెళ్లి కలవడం మంచిదని కూడా చెప్పారు సర్ మంచేర్జీ కొన్ని పేర్లుకూడా చెప్పారు వారిలో సర్‌లెపల్ గ్రిఫిన్ గారి పేరు కూడా వున్నది యిక్కడ పాఠకులకు ఒక విషయం చెప్పడం అవసరం యిప్పుడు సర్ విలియం విల్సన్ హంటర్ జీవించి లేరు వారు జీవించి యుంటే దక్షిణాఫ్రికా యందలి భారతీయుల స్థితిగతులను గురించి బాగా తెలిసిన వారు గనుక వారే ప్రతినిధి బృందానికి నాయకత్వం వహించియుండే వారు అలా కాకపోతే వారే లార్డ్ సభకు చెందిన మంచి గట్టి నాయకుణ్ణి ప్రతినిధి బృందానికి నాయకునిగా నియమించి యుండేవారు మేమిద్దరం సర్‌లెపల్ గ్రిఫిన్‌గారిని కలిశాము వారు భారతదేశంలో నడుస్తున్న రాజకీయ ఉద్యమానికి వ్యతిరేకులు అయితే దక్షిణాఫ్రికాలో జరుగుతున్న మా వ్యవహారాల యెడ ఆయనకు అభిరుచి కలిగింది అందువల్ల

మొహమాటానికి కాకుండా హృదయపూర్తిగా మాకు సహకరించేందుకు అంగీకారం తెలిపారు వారు కాగితాలన్నీ చదివారు మా పరిస్థితుల్ని బాగా అర్థంచేసుకున్నారు ఇంకా యితర ఆంగ్లోఇండియన్లను యితర పెద్దల్ని కలిశాము సాధ్యమైనంత వరకు ఎవ్వరినీ వదల లేదు మా ప్రతినిధి బృందం స్వరూపం మారిపోయింది అంతా వెళ్లిలార్డ్ ఎల్గిన్‌ను కలిశాము మాటలన్నీ శ్రద్ధగా విన్నారు తన సానుభూతిని ప్రకటించారు తన యిబ్బందులు కూడా తెలియజేశారు దానితోబాటు శక్త్యాను సారం మాకు తప్పక సహకరిస్తానని మాట యిచ్చారు మా ప్రతినిధి బృందం లార్డ్ మోర్లేని కూడా కలిసింది వారు కూడా మా యెడ సానుభూతి చూపించారు వారి మాటల సారం ముందే తెలియజేశాను సర్ విలియం వెడ్‌బర్న్ గారి కృషి వల్ల భారత దేశ వ్యవహారాలతో సంబంధం వున్న బ్రిటిష్ లోకసభ సభ్యుల సమావేశం ఒకటి అక్కడి లోకసభ దర్బారు హాల్లో జరిపాము మేము వారందరికీ సభాముఖంగా మాగోడు వినిపించాము అప్పుడు ఐరిష్ పార్టీ నాయకుడుగా శ్రీ రెడ్‌మండ్ వున్నారు ప్రత్యేకించి వెళ్లివారిని కూడా కలిశాము బ్రిటిష్ లోక సభకు చెందిన అన్ని పార్టీల ముఖ్యమైన మెంబర్ల నందరినీ కలిశాము ఇంగ్లాండులో మాకు భారత జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ కమిటీ వారి సహాయం అమితంగా లభించింది అయితే అక్కడ ఒక యిబ్బంది కలిగింది ఆకమెటీ సమావేశాల్లో కొందరు, కొన్ని భావాలుకల వారు మాత్రమే పాల్గొంటూ వుంటారు ఆ సమావేశాల్లో పాల్గొనని వాళ్లు చాలా మంది మాకు అమితంగా సాయం చేశారు అట్టివారందరినీ ఒక చోట కలిపి, వారందరి సహకారంతో, ఐక్యతతో పనిచేస్తే మాకృషి ఫలిస్తుందని భావించాము అందుకు అంతా సంతోషంతో అంగీకరించారు ఒక స్థాయీ సమితి ఏర్పాటుకు పూనుకున్నాము

ఏ సంస్థకైనా ముఖ్యుడు కార్యదర్శి ఆసంస్థ లక్ష్యాల యెడ పూర్తిగా విశ్వాసంగల వ్యక్తియే ఆ సంస్థకు కార్యదర్శిగా వుండాలి అతడు పూర్తి సమయం ఆ సంస్థపనులకోసం వెచ్చించాలి సంస్థను నడపగలశక్తి కలిగి యుండాలి ఎ.ఎల్.హాచ్. రిచ్ యందు పైగుణాలన్నీ వున్నాయి వారు

దక్షిణాఫ్రికా వాసి, నా ఆఫీసులో క్లర్కుగా పని చేశారు యిప్పుడు వారు లండన్‌లో బారిష్టరీ పూర్తి చేస్తూ వున్నారు ఈ పని చేయాలనే కోరిక కూడా వారికి కలిగింది దానితో మేము యీ పనికోసం దక్షిణాఫ్రికా బ్రిటిష్ ఇండియన్ కమెటీ అనుపేర ఒక స్థాయీ సమితిని ఏర్పాటు చేయడానికి సాహసించాము ఇంగ్లాండు. తదితర పాశ్చాత్య దేశాలలో మంచి పనుల్ని విందుతో ప్రారంభించే (నాదృష్టిలో అసభ్యకరమైన) విధానం ఒకటి వున్నది బ్రిటిష్ ప్రధానమంత్రి ప్రతి సంవత్సరం నవంబరు 9వ తేదీన మెన్షన్ హౌస్ అని పేరుగల వ్యాపారస్థుల ఒక పెద్ద కేంద్రంలో ప్రపంచాన్నంతటిని ఆకర్షించగల ఒక ఉపన్యాసం యిస్తూ వుంటాడు తద్వారా సంవత్సరం పొడుగునా తాను చేయబోయే కార్యక్రమాల రూపురేఖల్ని వివరిస్తాడు భవిష్యత్తును గురించిన తన అంచనాలను ప్రకటిస్తాడు లండన్ నగర లార్డ్ మేయరు బ్రిటిష్ మంత్రి వర్గ సభ్యులకు, తదితరులకు ఆ భవనంలో పెద్ద విందు ఏర్పాటు చేస్తాడు విందు పూర్తికాగానే మద్యం సీసాలు బిర బిరా బైటికి వస్తాయి యజమానుల, అతిథుల ఆరోగ్యభివృద్ధి పేరట అంతా మద్యం తెగ తాగుతారు ఈ కార్యక్రమం శుభ, అశుభ (పాఠకులు తమకు యిష్టమైన శబ్దాన్ని గ్రహించవచ్చు) తతంగం బాగా సాగుతున్నప్పుడు కొందరు ఉపన్యాసాలిస్తూ వుంటారు అందు బ్రిటిష్ సామ్రాజ్య మంత్రి వర్గంటోస్టు (ఆరోగ్యాభివృద్ధి కోసం యిచ్చే ఆశీస్సు) కూడా చేరుస్తారు అందుకు సమాధానంగా బ్రిటిష్ ప్రధానమంత్రిగారి ఉపన్యాసం సాగుతుంది ప్రజాకార్యక్రమాలో యిట్టి విందుల ఏర్పాటు జరిపినట్లే, ఏ గొప్ప వ్యక్తితో మాట్లాడలన్నా కూడా యిదే విధంగా విందుకు ఆహ్వానిస్తారు భోజనం చేస్తున్నప్పుడో, లేక భోజనం అయిపోయిన తరువాతనో అసలు సంభాషణను ప్రారంభిస్తారు మేము కూడా అనేక సార్లు యీ విధానాన్ని పాటించవలసి వచ్చింది అయితే పాఠకులు ఒక్క విషయం తెలుసుకోవాలి భోజనాల సమయంలో త్రాగకూడని పానీయం మేము త్రాగలేదు తినకూడని (మాంసం) పదార్థం మేము తిన లేదు ఈ పద్ధతి ప్రకారం మేము ఒకసారి మధ్యాహ్నభోజనానికి మమ్ము సమర్థించిన వారందరినీ ఆహ్వానించాం ఒక

వందమంది మిత్రులకు విందు ఆహ్వానం పంపించాము వారందరికీ కృతజ్ఞతలు చెప్పడం, వారిదగ్గర సెలవు తీసుకోవడం, ఒక స్థాయీ సమితిని ఏర్పాటు చేయడం ఆ విందు ఏర్పాటుకు లక్ష్యం పద్ధతి ప్రకారమే భోజనానంతరం ఉపన్యాసాలు జరిగాయి స్థాయీ సమితికూడా ఏర్పడింది ఈ కార్యక్రమంవలన మా ఉద్యమానికి ప్రచారంతో బాటు బలం కూడా లభించింది

ఈ విధంగా ఆరువారాలు ఇంగ్లాండులో వుండి కార్యక్రమాలు నిర్వహించి, మేము దక్షిణాఫ్రికాకు తిరిగి వచ్చాము మదీరా చేరేసరికి మాకు శ్రీ రిచ్ పంపిన తంతి అందింది "బ్రిటిష్ మంత్రి వర్గం చక్రవర్తికి ట్రాన్స్వాల్ అసెంబ్లీ అంగీకరించిన ఏషియాటిక్ ఆక్టును నిరాకరించమని సిఫారసు చేసినట్లు లార్డ్ ఎల్గిన్ ప్రకటించారు" అని ఆతంతిలో వున్నది మాసంతోషానికి అంతు లేకుండా పోయింది మదీరానుంచి కేప్‌టౌను చేరుటకు 14 లేక 15 రోజులు పడతాయి ఈ రోజుల్ని అమితానందంతో గడిపాము భవిష్యత్తులో మిగతా బాధల్ని తొలగించుటకు ఏమేమి చేయాలో అనేక ఆకాశహర్మ్యాలను వెర్రివాళ్ల వలె నిర్మించాం మేము కట్టుకున్న గాలిమేడలు ఎలా కూలిపోయాయో తరువాత ప్రకరణంలో వివరిస్తాను

ఈ ప్రకరణాన్ని ముగించే ముందు ఒకటి రెండు స్మృతులను యిక్కడ వ్రాయడం అవసరం ఇంగ్లాండులో ఒక నిమిషం సమయాన్ని సైతం మేము వ్యర్థం చేయలేదు పెద్ద సంఖ్యలో సర్క్యులర్లు తయారుచేయడం, అచ్చు వేయడం, సరిదిద్దడం, వాటిని పంపడం మొదలగు పనులు ఒక్కచేతితో ఎలా జరుగుతాయి? అందుకు బయటివారి సాయం అవసరమైంది డబ్బు ఖర్చు చేస్తే యిట్టి సాయం సామాన్యంగా లభిస్తుంది కాని 40 సంవత్సరాల అనుభవంతో చెబుతున్నాను, వాలంటీర్ల ద్వారా అయితే యిట్టి పనులు విజయవంతం అవుతాయి అదృష్టం వల్ల అట్టి పరిశుద్ధ సహకారం ఇంగ్లాండులో మాకు లభించింది అక్కడ చదువుకుంటున్న అనేక మంది భారతీయ విద్యార్థులు మాకు అండగా నిలచారు వారిలో చాలామంది

ఉదయం, సాయంత్రం, సొమ్ము తీసుకోకుండా మాకు సాయం చేశారు వారిలో ఒక్కరు కూడా గౌరవ ప్రతిష్టల్ని ఆశించ లేదు పేర్లు, చిరునమాలు వ్రాయడం, నకళ్లు వ్రాయడం, పోస్టల్ బిళ్లలు అతికించడం, ఉత్తరాల్ని పోస్టు చేయడం మొదలుగా గల పనులన్నీ చేశారు అట్టి వారందరినీ మరిపించివేయగల నిష్కామ సేవి సిమండ్స్ అనుపేరుగల ఆంగ్లయువకుడు అతణ్ణి దక్షిణాఫ్రికాలో మొట్టమొదటిసారి కలిశాను భారత దేశంలో కొంతకాలం వుండి వచ్చిన మంచి మిత్రుడు భగవంతుడు ఎక్కువ ప్రేమించిన వాళ్లను త్వరగా తన దగ్గరికి పిలిపించుకుంటాడు అని ఇంగ్లీషులో ఒక సామెత వున్నది పరదుఃఖభంజకుడుగు యీ ఆంగ్లేయుణ్ణి కూడా యమదూతలు అతడు యౌవ్వనంలో వుండగానే తీసుకు వెళ్లారు పరదుఃఖభంజకుడు అను విశేషణ ప్రయోగానికి ఒక కారణం వున్నది ఈ ఆంగ్ల యువకుడు బొంబాయిలో వున్నప్పుడు 1897లో ప్లేగు జబ్బు సోకిన వారిమధ్య నిర్భయంగా తిరుగుతూ వాళ్లకు సాయం చేశాడు రోగంతో బాధపడుతున్న జనం మధ్య జంకకుండా తిరుగుతూ వాళ్లకు సేవచేసిన ఆతనికి మృత్యుభయం కలుగలేవు నిర్భయం అతనిరక్తంలో ప్రవేశించింది జాతి ద్వేషంకాని, రంగుద్వేషం కాని అతడికి లేదు అతడు స్వతంత్రమైన స్వభావం గల వ్యక్తి సత్యం ఎప్పుడూ అల్పపక్షం అనగా మైనారిటీ పక్షంవైపునే వుంటుందని అతని నమ్మకం నమ్మకంతోనే జోహన్స్ బర్గులో అతడు నా దగ్గరికి వచ్చాడు నవ్వుతూ "మీ పక్షం పెద్దదైపోతుంది అప్పుడు నేను మీకు దూరమైపోవడం ఖాయం మెజారిటీ పక్షం చేతుల్లోపడితే సత్యం కూడా అసత్యమైపోతుంది అందువల్ల నేను అప్పుడూ మీకు దూరమవుతాను" అని అంటూవుండేవాడు. అతడి మాటకు గొప్ప అర్థం వున్నది జోహన్స్‌బర్గు చెందిన ఒక కోటీశ్వరుడు సర్ జార్జిఫెర్రర్‌కు నమ్మకమైన సెక్రటరీగా పని చేసేవాడు షార్ట్‌హాండు నేర్చుకున్నాడు మేము ఇంగ్లాండులో వున్నప్పుడు హఠాత్తుగా అక్కడికి వచ్చాడు ఆయన నివాసగృహాన్ని నేను ఎరుగను మేము ప్రజాకార్యక్రమాలు నిర్వహిస్తూ వుంటాము కనుక మా పేర్లు పత్రికల్లో వస్తూ వుండేవి ఆ

ఆధారంతో సిమండ్స్ మమ్ము వెతికి పట్టుకున్నాడు శక్త్యాను సారం సాయం చేస్తానని మాట యిచ్చాడు "చపరాసీ పని యిచ్చినా చేస్తాను వ్రాత పని అవసరమైతే నావంటి నిపుణుడు మీకు దొరకడం దుర్లభం పిలవగానే వచ్చి వాల్తాను' అని చెప్పాడు మాకు పైరెండు పనులు చేయగల వ్యక్తి అవసరం ఈ ఆంగ్లయువకుడు రాత్రింబవళ్లు మాకోసం కష్టపడి పనిచేశాడని చెప్పగలను రాత్రి పన్నెండు లేక ఒంటిగంటవరకు టైపురైటరు దగ్గర కూర్చొని టైపు చేస్తూ వుండేవాడు సందేశాలు చేరవేయడమే కాక ఉత్తరాలు పోస్టు చేసే పనికూడా తానే నవ్వుతూ చేస్తూ వుండేవాడు అతడికి నెలకు 45 పౌండ్ల ఆదాయం వుండేది ఆ డబ్బంతా స్నేహితుల కోసం ఖర్చుపెడుతూ వుండేవాడు అప్పుడు అతడికి 30 సంవత్సరాల వయస్సు వుండి వుంటుంది పెండ్లిచేసుకోలేదు జీవితమంతా పెండ్లి చేసుకోకుండా వుండాలనే నిర్ణయానికి అతడు వచ్చాడు శ్రమకు ఫలితంగా కొద్దిగా సొమ్ముతీసుకోమని నేను మరీ మరీ చెప్పాను కాని అతడు అంగీకరించలేదు " నేను యీ సేవకు సొమ్ము తీసుకుంటే ధర్మచ్యుతుడనై పోతాను" అని అంటూ వుండేవాడు నాకు బాగా జ్ఞాపకం అది చివరిరాత్రి కాగితాలు సామాన్లు సర్దుకునేసరికి రాత్రి 3 గంటలైంది సిమండ్స్ కూడా రాత్రి 3 గంటల దాకా మాతో బాటే వున్నాడు రెండో రోజున మమ్మల్ని ఓడ ఎక్కించి మరీ వెళ్లాడు ఈ మా వియోగం ఎంత విషాదకరమైనదో వర్ణించలేను పరోపకారం కేవలం గోధుమ రంగు గల వారి సొత్తు మాత్రమే కాదని తెలుసుకున్నాను ఇక ప్రజల సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న వారికోసం ఒక్క ముఖ్య విషయం పేర్కొంటున్నాను ప్రతినిధి బృందానికి అయిన ఖర్చు విషయమై జాగ్రత్తగా వున్నాము సోడా తాగినా ఓచరు సంపాదించి జాగ్రత్తగా వుంచాము ప్రతి పైసకు లెక్క వ్రాశాము ఎన్నో టెలిగ్రాములు పంపాము వాటన్నిటి రశీదులు జాగ్రత్తగా వుంచాము ఆయాఖాతాలలో జ్ఞాపకం వున్నంత వరకు ఖర్చు వివరాలు వ్రాశాము చిల్లర ఖర్చులు అని వేరే ఖాతా పెట్టలేదు సామాన్యంగా ఏమో ఖర్చులు పెట్టి, జ్ఞాపకం లేక నాలుగైదు షిల్లింగుల ఖర్చును చిల్లర ఖాతాలో వ్రాస్తూ వుంటారు ఆపని మేము చేయలేదు

జీవితంలో ఒక్క విషయం స్పష్టంగా తెలుసుకున్నాను తెలివితేటలు పెరిగినప్పటి నుంచి ట్రస్టీలమని, బాధ్యత కలిగిన వాళ్లమని మనం భావిస్తూ వుంటాము తల్లితండ్రి వున్నంతకాలం వారిచ్చిన డబ్బుకు, వారు అప్పగించిన పనులకు సంబంధించిన వివరాలు వారికి తెలుపుతూ వుంటాము అలా చేయడం మన కర్తవ్యం మన మీద కల నమ్మకం వల్ల వాళ్లు మనల్ని లెక్క అడగరు అంత మాత్రాన మనం ఊరుకోకూడదు మనం గృహస్థులమైనప్పుడు భార్య, బిడ్డలకు మనం బాధ్యులం అవుతాము మన సంపాదనకు మనం ఒక్కరమే కాక, మన కుటుంబ సభ్యులు కూడా బాధ్యులు అవుతారు వాళ్ల కోసం ప్రతిదమ్మిడీకి లెక్క మనం వ్రాయాలి ప్రజా కార్యక్రమాల్లో పాల్గొనడం ప్రారంభిస్తే బాధ్యతలు బాగా పెరిగిపోతాయి సామాన్యంగా స్వయం సేవకులు కానీయండి, కార్యయకర్తలు కానీయండి, మనం పని చేస్తున్నాము, కదా! అందుకైనా లెక్కవ్రాసి అందరికీ చూపనక్కరలేదు అని భావిస్తూ వుంటారు మనం తప్పుపని చేయం కనుక అంతామనల్ని నమ్మితీరాలి అని కూడా భావిస్తూ వుంటారు అలా భావించడం శుద్ధ తప్పు లెక్క వ్రాసి వుంచడానికి, నమ్మకానికీ అపనమ్మకానికి సంబంధం లేదు అసలు లెక్క వ్రాసి వుంచడం ప్రతి వాడికర్తవ్యం అలా చేయకపోవడం పెద్ద తప్పే ఏ సంస్థలోనైనా మనం పని చేస్తున్నప్పుడు ఆ సంస్థ యొక్క పదాధికారులు ఏ కారణం వల్లనైనా మనల్ని లెక్క అడగపోతే అదివారి దోషమే అవుతుంది జీతం పుచ్చుకొని పనిచేస్తే వాళ్లు ఎలా లెక్కలు వ్రాసి వుంచాలో, అలాగే జీతం పుచ్చుకొని స్వయం సేవకులు కూడా లెక్కలు వ్రాయాలి అతడి పనియే అతనికి ముట్టే జీతమన్నమాట చాలామంది దీన్ని పట్టించుకోరు అందువల్ల యీవిషయాన్ని యిక్కడ వ్రాశాను యింత చోటు యీ విషయానికి యిచ్చుటకు సాహసించాను

★ ★ ★

# 15

# వక్ర రాజనీతి లేక క్షణిక సంతోషం

ఓడ నుంచి కేప్‌టౌన్‌లో దిగిన తరువాత, జోహన్స్ బర్గ్ చేరిన పిమ్మట మదీరాలో అందిన తంతికి నిజానికి మేమూహించినంత విలువలేదని తేలింది యిందులో తంతిపంపిన శ్రీ రిచ్ దోషం ఏమీ లేదు ఏషియాటిక్ ఆక్టును నిరాకరించే విషయమై తనకు తెలిసిన వివరం అతడు తంతిద్వారా మాకు తెలియజేశాడు 1906లో ట్రాన్స్‌వాల్ ఒక చక్రవర్తి అధీనంలో వున్న అధినివేశరాజ్యం అని ముందే వ్రాశాను ఇటువంటి రాజ్యాల రాయబారులు అధినివేశరాజ్యాల మంత్రికి తమతమ రాజ్యాల హితానికి సంబంధించిన వివరాలు తెలియజేయుటకు ఎప్పుడూ ఇంగ్లాండులోనే వుంటూ ఉండేవారు ట్రాన్స్‌వాల్ రాయబారి సర్‌రిచర్డ్ సాల్‌మన్ దక్షిణాఫ్రికాకు చెందిన ప్రసిద్ధ వకీలు అతడు లార్డ్ ఎల్గిన్, ట్రాన్స్‌వాల్ రాయబారియగు సాల్‌మాన్‌తో చర్చించిన తరువాతనే రక్తపు చట్టాన్ని నిరాకరిస్తూ నిర్ణయించాడు 1907 జనవరి 1వ తేదీ నుంచి ట్రాన్స్‌వాల్‌లో జవాబు దారీ ప్రభుత్వం ఏర్పడ నున్నది అందువల్ల లార్డ్ ఎల్గిన్ ట్రాన్స్‌వాల్ రాయబారితో "జవాబు దారీ ప్రభుత్వం ఏర్పడిన తరువాత యీ చట్టాన్ని అక్కడి అసెంబ్లీలో ప్యాసు చేయండి అప్పుడు పెద్ద ప్రభుత్వం దాన్ని నిరాకరించదు ఇప్పుడున్న స్థాయిలో మీ రాజ్యం వున్నంతవరకు మీరు చేసే చట్టాలకు పెద్ద ప్రభుత్వమే బాధ్యత వహించవలసి వుంటుంది పెద్ద ప్రభుత్వం రంగుభేదం లాంటి జాతీయ భేద భావాలకు సంబంధించిన రాజనీతిని అంగీకరించదు అందువల్ల ప్రస్తుతం నేను చక్రవర్తికి యీ రక్తపు చట్టాన్ని నిరాకరించాలని సలహా పంపుతాను" అని చెప్పాడు

ఈ విధంగా పేరుకు మాత్రం నిరాకరించినా, తెల్లవారి కోరిక నేరవేరితే చాలు రిచర్డ్ సాల్‌మన్‌కు అభ్యంతరం లేదు ఎందుకుంటుంది? ఈ రాజనీతిని నేను "వక్రం" అని అన్నాను ఇంత కంటే కటువైన విశేషణం

ప్రయోగించినా యిటు వంటి వక్రకుటిల రాజకీయజ్ఞులకు ఏ మాత్రం సరిపోదని నా విశ్వాసం చక్రవర్తి అధీనంలో వున్న అధినివేశరాజ్యాల పూర్తిబాధ్యత సామ్రాజ్య ప్రభుత్వానిదే దాని రాజ్యాంగంలో రంగు భేదానికి మరియు జాతి భేదానికి తావులేదు ఈ రెండు అందమైన మాటలు జవాబుదారీ ప్రభుత్వం చేసే చట్టాలను సామ్రాజ్య ప్రభుత్వం రద్దు చేయజాలదు అనునది కూడా అర్థమయ్యే విషయమే కాని అట్టి రాజ్యాల రాయబారుల్ని పిలిచి రహస్య చర్చలు జరపడం రాజ్యాంగానికి విరుద్ధంగా వుండే చట్టాల్ని ఫలానా పద్ధతిన నిరాకరిస్తామని చెప్పడం ఎవరి అధికారాలు హరిస్తున్నారో వారిని మోసం చేసి, వారికి తీరని అన్యాయం చేసినట్లు కాదా? నిజానికి లార్డ్ ఎల్గిన్ ఈ విధంగా వాగ్దానం చేసి ట్రాన్స్‌వాల్ యందలి శ్వేత జాతీయులను భారతీయులకు వ్యతిరేకంగా ఉద్యమం నడుపమని ప్రోత్సహించాడు ఈవిధంగా తాను చేయతలిచాడు కనుక, ఆ విషయం తనను కలసిన భారతీయుల ప్రతినిధి బృంద సభ్యులకు చెప్పవచ్చుగదా! ఎవరు ఏమి చెప్పినా తన అధీనంలోగల రాజ్యాలకు సామ్రాజ్య ప్రభుత్వమే బాధ్యత వహించాలి బ్రిటిష్ రాజ్యాంగ మందలి మూల సిద్ధాంతాల్ని జావాబుదారీ ప్రభుత్వాలు గల అధినివేశ రాజ్యాలు కూడా అంగీకరించవలసిందే ఉదాహరణకు జవాబుదారీ ప్రభుత్వం గల ఏ అధినివేశరాజ్యం కూడా చట్టబద్ధంగా బానిస విధానాన్ని అమలు చేయుటకు వీలు లేదు కనుక లార్డ్ ఎల్గిన్ రక్తపు చట్టం అనుచితమైనదని నిజంగా భావించి నిరాకరించియుంటే, రిచర్డ్ సాల్‌మన్‌ను ఒంటరిగా పిలిచి జావాబుదారీ ప్రభుత్వం ఏర్పడిన తరువాత కూడా యిట్టి చట్టం చేయవద్దని చెప్పి యుండవలసింది ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం అట్టి చట్టం చేయదలుచుకుంటే, జవాబుదారీ ప్రభుత్వ స్థాపన అక్కడ జరపాలా లేదా అని సామ్రాజ్య ప్రభుత్వం ఆలోచిస్తుందని చెప్పి యుండవలసింది భారతీయుల అధికారాలను సంపూర్తిగా రక్షిస్తామనే మాట తీసుకొని ట్రాన్స్‌వాల్‌లో జవాబుదారీ ప్రభుత్వ స్థాపన జరిపి యుండవలసింది అలా చేయకుండా లార్డ్ ఎల్గిన్ బయటికి

భారతీయుల యెడ సానుభూతి వున్నట్లు మొసలి కన్నీరు కార్చి, లోలోపున ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి అనుకూలంగా వ్యవహరించాడు తాను అంగీకరించని చట్టాన్ని ప్యాసుచేసి అమలు చేయమని వారిని ప్రోత్సహించాడు ఇటువంటి వక్ర రాజనీతికి సంబంధించిన ఉదాహరణ యిది ఒక్కటే కాదు బ్రిటిష్ సామ్రాజ్య చరిత్రను చదివిన సామాన్య పాఠకుడు సైతం ఎన్నో ఉదాహరణలు చూపవచ్చు జోహన్స్‌బర్గ్ చేరగానే లార్డ్ ఎల్గిన్ మరియు సామ్రాజ్య ప్రభుత్వాధినేతలు మమ్మల్ని మోసంచేశారని విన్నాము మదీనాలో మాకు ఎంత సంతోషం కలిగిందో దక్షిణాఫ్రికాలో అంత నిరాశకలిగింది ఇట్టి వక్రరాజనీతి వల్ల భారతీయుల్లో ఆవేశం పెల్లుబికింది "ఇకమనకు చింత ఎందుకు? ఏ సామ్రాజ్య ప్రభుత్వం సహాయం చేస్తుందని మనం పోరాడుతాం? ఇక మన బలం మీదనే, ప్రతిజ్ఞచేసిన ఈశ్వరుని బలం మీదనే ఆధారపడి పోరాడదాం మనం సత్యం మీద నిలబడితే వక్ర రాజనీతి కూడా తిన్నగా మారి సక్రమంగా నడుస్తుంది"అని అంతా అన్నారు

ట్రాన్స్‌వాల్‌లో జావాబుదారీ ప్రభుత్వం ఏర్పడింది అసెంబ్లీలో మొదటి చట్టం బడ్జెటుకు సంబంధించినది రెండవది రక్తపు చట్టం (ఏషియాటిక్ రిజిస్ట్రేషన్ ఆక్టు) మొదటసారి యీ ఆక్టును ఎలా ప్యాసుచేశారో యీసారికూడా అలాగే ప్యాసు చేశారు ఒకటి రెండు శబ్దాలు మాత్రమే మార్చారు ఆ మార్పు ప్రకారం చట్ట నిబంధనలో యివ్వబడిన తేదీలో మార్పు చేశారు అలా చేయక తప్పదు 1907 మార్చి 21వ తేదీన ఒకే ఒక్క రోజున రక్తపుచట్టం ట్రాన్స్‌వాల్ అసెంబ్లీలో ప్యాసై పోయింది పైన తెలిపిన మార్పుకు, చట్టమందలి కఠోరత్వానికి ఏ సంబంధమూ లేదు అంటే గతంలో యిట్టి చట్టాన్ని నిరాకరిస్తున్నామని చేసిన తతంగమంతా బట్టి బూటకమని స్పష్టంగా తేలిపోయింది భారతీయులు దానికి వ్యతిరేకంగా అర్జీలు పంపించారు కాని పట్టించుకునే నాథుడెవరు? 1907 జూలై 1వ తేదీనుంచి చట్టం అమలులోకి వచ్చిందని ప్రకటించారు జూలై 31వ తేదీలోపున భారతీయులందరు అనుమతి పత్రాలు తీసుకునేందుకు అర్జీలు దాఖలు

చేయాలని ప్రకటన వెలువడింది మధ్య యిన్ని రోజుల గడువు భారతీయులపై దయితో యివ్వబడలేదు ఆచట్టానికి సామ్రాజ్య ప్రభుత్వ ముద్ర అవసరం అందుకు సమయం కావాలి గదా! అంతేగాక అందు కోసం ఫారాలు, పుస్తకాలు, అనుమతి పత్రాలు తయారు చేయాలి వేరు వేరుచోట్ల ఆఫీసులు తెరవాలి దానికోసం కొద్ది గడువు యిచ్చారు

★ ★ ★

## 16

## అహమద్ ముహమ్మద్ కాఛలియా

మా భారతీయుల ప్రతినిధి బృందం సభ్యులం ఇంగ్లాండు వెళ్లుటకు బయలు దేరాం అప్పుడు దక్షిణాఫ్రికాలో నివసిస్తున్న ఒక ఆంగ్లేయ యాత్రీకుడు వచ్చి నన్ను కలిశాడు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం అమలు చేసిన ఖూనీ చట్టాన్ని గురించి మా ఇంగ్లాండు ప్రయాణాన్ని గురించి నావల్ల తెలుసుకొని "అయితే మీరు కుక్కబెల్టు (డాగ్ కాలర్) ధరించడాని వ్యతిరేకిస్తున్నారన్నమాట" అని అన్నాడు ఆ ఆంగ్లేయుడు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వపు చట్టాన్ని కుక్కబెల్టుతో పోల్చాడన్నమాట అతడు ఆ మాట ఖూనీ చట్టాన్ని సమర్థిస్తూ, భారతీయుల యెడ తనకు గల తిరస్కార భావాన్ని వెల్లడించడానికే అన్నాడో, లేక దక్షిణాఫ్రికా యందలి భారతీయుల విషయంలో ట్రాన్స్‌వాల్ ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, మా యెడ సానుభూతిని ప్రకటిస్తూ అన్నాడో అప్పుడు నేను నిర్ణయానికి రాలేకపోయాను ఇప్పుడూ రాలేకపోతున్నాను అయితే ఏ మనిషి మాట్లాడిన మాటకైనా అతడికి అన్యాయం జరిగేలా అర్థం తీయకూడదని నా అభిప్రాయం అట్టి నీతిసూత్రం ప్రకారం భారతీయుల యెడ సానుభూతిని ప్రకటించేందుకు వాస్తవ స్థితిని యీ మాటల్లో చిత్రించాడని భావిస్తున్నాను ఒక వైపున ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం భారతీయులకు కుక్క బెల్టు కట్టుటకు ప్రయతిస్తూ వుంటే, మరో వైపున యీ అన్యాయాన్ని ఎలా ఎదుర్కోవడమా, బెల్టు ధరించకుండా ప్రభుత్వ వక్రనీతిని ఎలా

ఎండగట్టడమా అని భారతజాతి కృషి చేస్తున్నది ఇంగ్లాండు, భారతావని యందలి సహాయకులగు మిత్రులందరికీ అక్కడి పరిస్థితిని తెలుపుతూ జాబులు వ్రాస్తూ వున్నాము అసలు సత్యాగ్రహ పోరాటానికి బయటి బలాలకంటే, ఆంతరంగిక బలమే రామబాణంలా పని చేస్తుంది కనుక జాతిని జాగృతం చేయుటకు, జనాన్ని క్రియాశూరులుగా తయారుచేయుటకు, జాతినాయకులు తమ సమయాన్ని వెచ్చించ సాగారు

సత్యాగ్రహపోరాటం జరుపుటకు ఏ సంస్థను ఉపయోగించాలా అను ప్రశ్న బయలుదేరింది ట్రాన్స్‌వాల్ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ సభ్యుల సంఖ్య చాలా ఎక్కువగా వున్నది దాన్ని స్థాపించి నప్పుడు సత్యాగ్రహ పుట్టుక జరగలేదు ఒకటి కాదు, రెండు కాదు, పలుచట్టాలకు వ్యతిరేకంగా సంస్థ పోరాడింది ఇంకా పోరాడవలసిన అవసరం వున్నది చట్టాలకు వ్యతిరేకంగా పోరాడటమే గాక, అనేక రాజకీయ సాంఘిక, తదితరరంగాలలో కూడా రకరకాల పనులు ఆ సంస్థ చేస్తున్నది ఆ సంస్థ మెంబర్లంతా సత్యాగ్రహపోరాటం ద్వారా ఖూనీ చట్టాన్ని ఎదర్కొంటామని యింకా ప్రతిజ్ఞ గైకొనలేదు బయటి ప్రమాదాలను గురించి కూడా యోచించవలసిన అవసరం వున్నది సత్యాగ్రహపోరాటాన్ని ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం రాజద్రోహంగా పరగణించి సత్యాగ్రహ పోరాటం సాగించే సంస్థల్ని నిషేధిస్తే? అట్టి స్థితిలో ఆ సంస్థలో పనిచేసే సత్యాగ్రహులు కాని మెంబర్లు ఏంచేయాలి? సత్యాగ్రహం ప్రారంభంకాక పూర్వం సంస్థకు దాతలు యిచ్చిన ధనాన్ని ఏంచేయాలి? వీటికి సమాధానం వెతకాలి సుదీర్ఘ చర్చలు జరిపి చివరికి అశ్రద్ధ, అశక్తి తదితర కారణంలవల్ల సత్యాగ్రహంలో పాల్గొనని వ్యక్తులను ద్వేషించకూడదని, వాళ్లతో స్నేహంగా వ్యవహరించాలని, సత్యాగ్రహం తప్ప తదితర కార్యక్రమాల్లో వాళ్లతో కలిసి పనిచేయాలని అంతా ఒక నిర్ణయానికి వచ్చారు

ఇటువంటి పలు సమస్యలను గురించి చర్చించి యిప్పుడున్న సంస్థల ద్వారా సత్యాగ్రహపోరాటం జరపకూడదని, అన్ని సంస్థలు సత్యాగ్రహ

పోరాటానికి శక్తినిబట్టి సహకరించాలని, సత్యాగ్రహాన్ని మినహాయించి మిగతా కార్యక్రమాలన్నింటికి సంస్థలు సహకరించాలని అంతా నిర్ణయానికి వచ్చారు తరువాత సత్యాగ్రహులంగా కలసి "పాసివ్ రెసిస్టెన్స్ అసోసియేషన్" లేక సత్యాగ్రహ మండల్ అను పేరట క్రొత్త సంస్థను స్థాపించారు ఇంగ్లీషు పేరువల్ల అప్పటికి సత్యాగ్రహం అనుపేరు యింకా నిర్ణయం కాలేదని పాఠకులు గ్రహించవచ్చు ఆ తరువాత జరిగిన కార్యక్రమాల వల్ల, యీ క్రొత్త సంస్థను స్థాపించినందువల్ల భారతజాతికి ఎంతో మేలు జరిగింది అలా జరిగియుండకపోతే సత్యాగ్రహ పోరాటానికి నష్టం కలిగి యుండేదే చాలా మంది యీ క్రొత్త సంస్థలో మెంబర్లుగా చేరడమే గాక డబ్బుకూడా బాగా యిచ్చి సహాయం చేశారు

డబ్బు లేని కారణంగా ప్రపంచంలో ఏ సంస్థ మూత పడదని, ఆగిపోదని, నిస్తేజపడదని అనుభవంవల్ల తెలుసుకున్నాను అయితే ప్రపంచంలో సంస్థలు డబ్బు లేకుండానే నడుస్తాయని భావించకూడదు నిజాయితీ కలిగిన సచ్చరిత్రులు నడిపే సంస్థలకు డబ్బులోటు వుండదు దానంతట అదే లభిస్తుంది దానితోబాటు డబ్బు వరదలా వచ్చిపడితే యిక ఆ సంస్థకు పతనం తప్పదని కూడా అనుభవం వల్ల తెలుసుకున్నాను ఈ అనుభవాలన్నిటి వల్ల నేను మూల ధనం బాగా పెంచి, దాన్ని నిల్వచేసి, తద్వారా వచ్చే వడ్డీతో సంస్థల్ని నడపడం మహాపాపమని అనలేనుగాని, అది అనుచిత చర్య అని మాత్రం అనగలను ప్రజాసంస్థలకు అసలు ప్రాణం ప్రజలే ప్రజలు కోరినంత వరకే యిట్టి సంస్థలు, పనిచేయాలి మూలధనం సంపాదించి దానివడ్డీతో నడిచే సంస్థలు ప్రజాసంస్థలుగా వుండవు అవి స్వేచ్ఛా సంస్థలుగానో, నియంత్రిత సంస్థలుగానో అయిపోతాయి ప్రజల విమర్శలనే అంకుశం దానికి వుండదు వడ్డీ సాయంతో నడుస్తున్న పలు ధార్మిక, సాంఘిక సంస్థలు ఎంతగా కుళ్లిపోయాయో చర్చించుటకు యిక్కడ తావు లేదు అయితే యిది అందరికీ తెలిసిన విషయమే

ఇక మనం అసలు విషయానికి వద్దాం సూక్ష్మాతిసూక్ష్మ వాదనలు చేసి

ఈకకు పీకలు పీకడం, మీనమేషాలు లెక్క పెట్టడం వంటి పనులు. కేవలం వకీళ్లు, ఆధునిక విద్య గడించిన వేత్తలేకాక, అక్షరం ముక్క రాని వాళ్లు అజ్ఞానులు అనుకున్న వాళ్లు కూడా చేస్తున్నారు దక్షిణాఫ్రికాలో యీ అనుభవం నాకు కలిగింది మొదటిసారి ప్యాసైన ఖూనీ చట్టం నిరాకరించబడింది కనుక యూదుల నాటకశాలలో చేసిన మన ప్రతిజ్ఞ నేరవేరింది అని కొందరు క్రొత్త వాదన లేవతీశారు ప్రతిజ్ఞాపాలన యందు వెనుకంజ వేసిన వాళ్లకు యీ వాదనసాకుగా దొరికింది అయితే వాళ్ల వాదనలో కొంత సత్యం వున్నది కాని దాన్ని చట్ట రూపంలోగాక, అందలి చెడును ఎదిరించిన వారికి మాత్రం, యీ వాదన నచ్చలేదు వీటన్నిటినీ గమనించి, రక్షణ దృష్ట్యానేగాక, జాతిలో యింకా జాగృతి కలిగించాలని, జనంలో వచ్చిన బలహీనతలను తొలగించాలని భావించి మళ్లీ క్రొత్తగా జనం ప్రతిజ్ఞ చేయడం మంచిదనే నిర్ణయానికి నేను వచ్చాను అందుకోసం పలుచోట్ల సభలు జరిపి ప్రజలకు బోధ చేశాము తిరిగి ప్రతిజ్ఞ కూడా చేయించాము ప్రజల ఉత్సాహంలోగాని, ఆవేశంలోగాని ఎట్టి మార్పు రాలేదని తేలింది

జూలై మాసంలో విధించబడిన గడువు దగ్గరికి వచ్చింది జూలైనెల చివరి తేదీన ట్రాన్స్‌వాల్ రాజధానీ నగరమైన ప్రిటోరియాలో భారతీయుల పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేయాలని నిర్ణయించాం ఇతర పట్టణాలనుంచి కూడా చాలామంది ప్రతినిధుల్ని ఆహ్వానించాం ప్రిటోరియా యందలి మసీదు ప్రాంగణంలో సభ కోసం ఏర్పాట్లు జరిగాయి సత్యాగ్రహం ప్రారంభమైన తరువాత జనం సభల్లో పెద్ద సంఖ్యలో పాల్గొన సాగారు అందువల్ల యిండ్లలో సభ జరపడం సాధ్యం కానందున మసీదుల విశాల ప్రాంగణాల్లో సభలు ఏర్పాటు చేయడం ప్రారంభించాం ప్రిటోరియా పట్టణంలో గల భారతీయుల సంఖ్య 1300 వరకు వున్నది. వారిలో 10000 మంది జోహన్స్‌బర్గు, ప్రిటోరియాల్లో వుంటున్నారు వారిలో 6000 మంది వచ్చి సభలో పాల్గొన్నారు అని అంటే ప్రపంచమందలి ఏదేశంలోనైనా యిది

పెద్ద సంఖ్యగా పరిగణింపబడుతుంది సామూహికంగా జరిగే సత్యాగ్రహాన్ని మరే షరతు మీద జరుపుటకు వీలు లేదు ఏ సత్యాగ్రహం కేవలం అందులో పాల్గొను సత్యాగ్రహుల శక్తిపై ఆధారపడి నడుస్తుందో, ఆసత్యాగ్రహాన్ని గురించిన శిక్షణ వారికి గరపకపోతే అది నడవదు అందువల్ల యింత పెద్ద సంఖ్యలో పాల్గొంటున్న జనాన్ని చూచి మేము ఆశ్చర్యపడ లేదు బహిరంగ సభలు విశాల మైదానాల్లోనే జరపాలని నిర్ణయించాము అందువల్ల డబ్బు అధికంగా ఖర్చు కాలేదు చోటు లేనందున ఎవ్వరూ తిరిగి వెళ్లిపోవలసిన అవసరం కలుగలేదు మరో విశేషాన్ని కూడా పేర్కొనడం అవసరం మా సభలన్నీ ప్రశాంతంగా నడిచాయి సభలో పాల్గొనే జనం ఉపన్యాసాలన్నింటిని శ్రద్ధగా విన్నారు సభ ప్రాంగణంలో చివర నిలబడి పున్న వాళ్లకు ఉపన్యాసం వినబడకపోతే బిగ్గరగా మాట్లాడమని వక్తల్ని కోరుతూ వుండేవారు ఇట్టి సభల్లో కుర్చీలు వుండేవి కావని పాఠకులు గ్రహింతురుగాక అంతా నేల మీదనే కూర్చొనేవారు చిన్న వేదిక మాత్రం ఏర్పాటు చేసేవాళ్లం దాని మీద సభకు అధ్యక్షత వహించే అధ్యక్షుడు, ఉపన్యాసం యిచ్చే వక్త, మరిద్దరు ముగ్గురు ముఖ్యులు వుండేవారు ఆ వేదిక మీద ఒక చిన్న టేబులు, రెండు మూడు కుర్చీలు, స్టూళ్లు వుండేవి

ప్రిటోరియాలో జరిగిన యీ సభకు అధ్యక్షత, బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ తాత్కాలిక అధ్యక్షుడు అయిన యూసఫ్ ఇస్మాయిల్‌మియా వహించారు ఖూనీ చట్ట ప్రకారం అనుమతి పత్రాలు తీసుకోవలసిన గడువు సమీపిస్తున్నది అందువల్ల ఆవేశం ఎంత వున్నా భారతీయులు మాత్రం చింతా క్రాంతులైనారు అదే విధంగా శక్తి సామర్థ్యాలు ఎన్ని వున్నా జనరల్ బోథా జనరల్ స్మట్సులు కూడాపైకి బుకాయిస్తున్నా లోలోపల అమిత చింతా క్రాంతులైనారు ఒక జాతినంతటినీ బలవంతంగా వంచి అణచడం ఎవ్వరికీ సాధ్యం కానిపని అందువల్ల జనరల్ బోథా యీ సభలో మాకు నచ్చచెప్పమని శ్రీ విలియం హాస్కిన్‌ను పంపించాడు శ్రీ హాస్కిన్‌ను పదమూడవ ప్రకరణంలో పాఠకులకు పరిచయం చేశాను సభ శ్రీవిలియం హాస్కిన్‌కు

ఘనంగా స్వాగతం పలికింది ఆయన ప్రసంగిస్తూ "నేను మీకు మిత్రుణ్ణి మీకందరికీ యీ విషయం తెలుసు నా సానుభూతి మీయెడ కలదని చెప్పనవసరం లేదని భావిస్తున్నాను నాకు శక్తి వుంటే మీ కోరికలన్నింటిని అంగీకరింప చేయాలని వున్నది అయితే యిక్కడి సామాన్య తెల్లవారి వ్యతిరేకతను గురించి వేరే మీకు చెప్పనవసరంలేదని అనుకుంటున్నాను ఇవాళ నేను మీ దగ్గరికి జనరల్ బోథా కోరినందున వచ్చాను వారి సందేశం మీకు వినిపిస్తున్నాను భారత జాతి అంటే ఆయనకు గౌరవం వున్నది భారత జాతి భావాలు ఆయనకు తెలుసు అయినా ఆయన నేను ఏమీ చేయలేని స్థితిలో వున్నాను ట్రాన్స్‌వాల్ యందలి తెల్లవారంతా యిట్టి చట్టం అవసరమని భావిస్తున్నారు భారత జాతి చేయవలసిందంతా చేసింది గౌరవాన్ని రక్షించుకున్నది అయినా భారతజాతి కోరిక నెరవేరలేదు చట్టం ప్యాసైంది ఇక భారత జాతి యీ చట్టాన్ని అంగీకరించి తమ విశ్వాసపాత్రతను, శాంతి స్వభావాన్ని వెల్లడించడం అవసరం ఇక యీ చట్టమందలి కొద్ది చిన్న పెద్ద నిబంధనల్లో మార్పు అవసరమని భావిస్తే స్మట్స్ వినడానికి సిద్ధంగా వున్నారు అని చెప్పాడు ఈ విధంగా, జనరల్ బోథా సందేశాన్ని చెప్పి శ్రీ హాస్కిన్ మీరు జనరల్ బోథా సలహాను విని పాటించమని నాపక్షాన చెబుతున్నాను ప్రభుత్వం యీ చట్టం మీద గట్టిగా నిలిచియుందని నాకు తెలుసు ప్రభుత్వాన్ని ఎదిరించడమంటే తలను గోడకు కొట్టుకున్నట్టే అవుతుంది భారత జాతి చట్టాన్ని వ్యతిరేకించి అనవసరంగా కష్టాల్నికొని తెచ్చుకోవద్దని, నాశనం కావద్దని సలహా యిస్తున్నాను అని చెప్పాడు వారిచ్చిన ఉపన్యాసాన్ని అక్షరం అక్షరం అనువదించి నేను జనానికి వినిపించాను నా పక్షాన కూడా జనాన్ని హెచ్చరించాను చప్పట్ల ధ్వని మధ్య శ్రీ హాస్కిన్ సభ నుంచి వెళ్లిపోయాడు

ఇక సభలో భారతీయుల ప్రసంగాలు ప్రారంభమయ్యాయి. ఈ ప్రకరణానికే గాక, నిజానికి ఈ చరిత్రకే నాయకత్వం వహించిన నాయకుణ్ణి ఇక పరిచయం చేస్తున్నాను సభలో ప్రసంగించిన వారిలో కీ॥శే॥ అహమద్

ముహమ్మద్ కాఛలియా ఒకరు వారిని ఒక కక్షిదారుడుగాను, రెండు భాషలు వచ్చిన దుబాసిగాను నేను ఎరుగుదును వారు ప్రజా కార్యక్రమాల్లో ప్రముఖంగా పాల్గొనలేదు వారికి ఇంగ్లీషుబాష కొద్దిగా వచ్చు అనుభవంద్వారా ఆభాషా జ్ఞానాన్ని బాగా పెంచుకున్నారు మమ్మల్ని తన ఆంగ్లవకీళ్ల దగ్గరికి తీసుకు వెళ్లినప్పుడు యిద్దరి మధ్య తానే దుబాసిగా వ్యవహరించే వారు అయితే వృత్తిగా గాక, ఒక మిత్రునిగా దుబాసిపని చేస్తూవుండే వారు బట్టలు అమ్మకం చేస్తూ తరువాత తన సోదరునితో కలిసి భాగస్వామిగా వుండి చిన్నస్థాయిలో వ్యాపారం ప్రారంభించారు ఆయన సూరత్‌కు చెందిన మేమన్‌జాతి వారు సూరత్ జిల్లాలో జన్మించారు సూరత్‌కి చెందిన మేమన్ తెగవారికి ఆయనంటే గౌరవం ఆయనకు గుజరాతీ కొద్దిగా వచ్చు కాని అనుభవం ద్వారా యీ భాషాజ్ఞానాన్ని కూడా బాగా పెంచుకున్నారు వారి బుద్ధిమాత్రం కడు చురుకైనది ఏ విషయాన్నైనా యిట్టే గ్రహించి వేసేవారు కోర్టు కేసుల యందలి చిక్కుముడుల్ని విప్పదీయడంలో ఆయన ప్రతిజ్ఞచూచి నేను చాలా సార్లు నివ్వెరబోయాను వకీళ్లతో సైతం చట్ట నిబంధనల్ని గురించి నిశితంగా చర్చిస్తూ వుండేవారు వకీళ్లుసైతం ఆయన వాదనల్ని విని వాటిని గురించి శ్రద్ధ వహించేవారు ప్రతాపంలోగాని, నిష్ఠవిషయంలో గాని ఆయనను మించిన వ్యక్తిని నేను దక్షిణాఫ్రికాలోగాని, భారతదేశంలో గాని చూడలేదు జాతి హితంకోసం ఆయన తన సర్వమూ త్యాగం చేశారు ఆయన సంభాషించిన ప్రతిసారి ఏకవచన ప్రయోగం చేస్తూ వుండేవారు ఆయన నిష్ఠకలిగిన మహమ్మదీయుడు సూరత్‌కు చెందిన మేమన్ల మసీదుకు సంబంధించిన ట్రస్టీలలో ఆయన కూడా ఒకరు అయితే హిందూ మహమ్మదీయుల్ని సమంగా చూచేవారు సమస్యలు వచ్చినప్పుడు మత మౌఢ్యంతో ముస్లిములను సమర్థించి ఆయన హిందువులను తెగడిన ఘట్టం ఒక్కటి కూడా లేదు నిర్భయుడు నిష్పక్షపాతి అందువల్ల అవసరమైనప్పుడు హిందువులకు, మహమ్మదీయులకు వారి వారి దోషాలు చెప్పడానికి వెనుకంజ వేసేవాడు కాడు ఆయన చూపించిన నిరాడంబరత్వం, అభిమాన

రాహిత్యం అనుసరించుటకు అనుకూలమైనవి ఎన్నో సంవత్సరాల గాఢ పరిచయం వల్ల కీ॥శే॥ అహమద్ కాఛలియా వంటి పురుషుడు భారత జాతికి లభించడం గొప్ప విశేషంగా నేను హృదయపూర్తిగా భావిస్తున్నాను ప్రిటోరియాలో ఉపన్యసించిన వారిలో ఆ నరపుంగవుడు కూడా వున్నాడు ఆయన క్లుప్తంగా ఉపన్యాసం యిచ్చాడు "ప్రతి భారతీయునికి యీ ఖూనీ చట్టం ఏమిటో తెలుసు దాని అర్థం మనందరికీ తెలుసు శ్రీ హాస్కిన్ ప్రసంగం శ్రద్ధగా విన్నాను మీరంతా కూడా విన్నారు నాపై ఒక్క ప్రభావం పడింది వారి ప్రసంగం విన్న తరువాత నేను చేసిన ప్రతిజ్ఞ యింకా గట్టి పడింది ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం ఎంత శక్తివంతమైనదో మనందరికీ తెలుసు అయితే యీ ఖూనీ చట్టం కంటే మించి యింక వాళ్లు చేసేది ఏమిటి ఈ ప్రభుత్వం మనల్ని జైళ్లలో పెడుతుంది మన ఆస్థుల్ని జప్తుచేసి అమ్మివేస్తుంది మనల్ని దేశాన్నుంచి బహిష్కరిస్తుంది ఉరితీస్తుంది వీటన్నింటినీ నవ్వుతూ మనం సహించగలం, కాని యీ ఖూనీ చట్టాన్ని మాత్రం సహించం సహించలేము అంటూ ప్రసంగం ముగించాడు ఆసమయంలో అతడు పొందిన ఉత్తేజాన్ని నేను జాగ్రత్తగా గమనించాను ఆయన ముఖం ఎర్రబడింది ఆయన సిరస్సు, ముఖమందలి నరాలు రక్త ప్రసారం వల్ల ఉబ్బాయి ఆయన శరీరం వణికింది తన కుడిచేతివ్రేళ్లను కంఠం మీద నిమురుతూ ఒక్కసారిగా గర్జించాడు "నేను ఖుదాను సాక్ష్యంగా పెట్టి ప్రతిజ్ఞ చేస్తున్నాను ఒటుఎ ట్టుకుంటున్నాను ప్రాణాలైనా అర్పించివేస్తాను కాని యీ ఖూనీ చట్టం ఎదుట తలవంచను ఈ సభకూడా యిట్టి నిర్ణయమే చేయాలని కోరుతున్నాను" అంటూ ఆయన కూర్చున్నాడు, తన కంఠం మీద కుడిచేతివ్రేళ్లను నిమురుతూ వున్నప్పుడు కొందరు చిరునవ్వు నవ్వడం నేను చూచాను నేను కూడా వారితో కలిసి చిరునవ్వు నవ్వాను మాటల్లో చూపినంతశక్తి చేతల్లో కాఛలియా చూపించగలడా అనే సందేహం నాకూ కలిగింది ఆ సందేహాన్ని గురించి వ్రాస్తున్నప్పుడు యిలా ఎందుకు వ్రాశానా అని నాకు సిగ్గువేస్తున్నది ఆమహాసంగ్రామంలో తమ ప్రతిజ్ఞను అక్షరశః పాలించిన భారతీయులందరిలో

కాఛలియా సేఠ్ సదా ముందు వున్నాడు ఏనాడూ ఆయన ముఖంలో రంగు మారడం నేను చూడలేదు బిగ్గరగా చప్పట్లుకొట్టి సభ ఆయన ఉపన్యాసాన్ని సమర్థించింది అప్పటికి కాఛలియాను గురించి నేను తెలుసుకున్న దానికంటే, జనం ఎక్కువ తెలుసుకున్నారని నాకు బోధపడింది వారిలో చాలామందికి చింపిరి గుడ్డల్లో గల అముత్యాన్ని గురించి బాగా తెలుసు శ్రీ కాఛలియా చెప్పింది చేస్తాడని, చేసిందే చెబుతాడని వాళ్లకు తెలుసు సభలో యింకా ఆవేశంతో నిండిన ఉపన్యాసాలు కొందరు యిచ్చారు నేను కాఛలియా ఉపన్యాసానికే అధికంగా ప్రాధాన్యం యిచ్చాను ఆయన ఉపన్యాసం భవిష్యద్వాణిగా రూపొందడమే, అందుకు కారణం ఆవేశంతో ఉపన్యాసాలు యిచ్చిన వారలో చాలా మంది తమ మాట మీద నిలబడలేక పోయారు ఆ పురుష సింహాన్ని మృత్యువు 1918లో అనగా సత్యాగ్రహ పోరాటం ముగిసిన నాలుగు సంవత్సరాల తరవాత భారతజాతికి సేవ చేస్తూ వున్నప్పుడు తన ఒడిలోకి తీసుకున్నది

కాఛలియా సేఠ్‌ను గురించిన ఒక సంస్మరణను మరో చోట వ్రాయడం సాధ్యం కాదు కనుక యిక్కడే వ్రాస్తున్నాను టాల్‌స్టాయి ఫారమును గురించి పాఠకులు యిక ముందు చదువుతారు అక్కడ సత్యాగ్రహుల కుటుంబాలు వుంటున్నాయి జాతి ప్రజలకు ఒక ఉదాహరణగా చూపాలని భావించి, తన కుమారుణ్ణి నిరాడంబరతను నేర్చుకోమని ప్రజాసేవ ఎలా చేయాలో తెలుసుకోమని చెప్పి ఫారంకు కాఛలియా పంపించాడు అది చూచి మిగతా మహమ్మదీయులు కూడా తమ బిడ్డల్ని చదువుకోసం ఫారంలో చేర్చారు కాఛలియా కుమారుడి పేరు అలీ అప్పుడు అతడికి 10 లేక 12 సంవత్సరాల వయస్సు వుంటుంది స్వభావరీత్యా అలీ వినమ్రుడు కొద్దిగా చంచలుడు, సత్యవాది సరళహృదయుడు అయితే కాఛలియా సేఠ్ గతించిన తరువాత, సత్యాగ్రహ పోరాటం ముగిసిన తరువాత ఆ బిడ్డను కూడా దూతలు దేవుని దర్బారుకు తీసుకు పోయారు ఆ పిల్లవాడు జీవించి యుంటే తన తండ్రికి నిజమైన ప్రతినిధి అయ్యేవాడని నా అభిప్రాయం

★ ★ ★

# 17
# ప్రథమ అంతఃకలహం

1907 జూలై1వ తేదీ వచ్చింది అనుమతి పత్రాల్ని యిచ్చే ప్రభుత్వ కార్యాలయాలు వెలిశాయి భారతజాతి పక్షాన అటువంటి ప్రతి ఆఫీసు ఎదుట పికెటింగు జరిపి, భారతీయుల్ని పత్రాలు తీసుకోకుండా ఆపాలని ఆదేశం యిచ్చాము తెల్ల ప్రభుత్వంవారి ఉచ్చులో చిక్కుకోవద్దని భారతీయుల్ని హెచ్చరించడం కూడా జరిగింది ప్రతి వాలంటీరు ఒక బిళ్లను గుర్తుగా తగిలించుకోవాలి అనుమతి పత్రం తీసుకునే భారతీయుల్ని మాత్రం అవమానించవద్దని వాలంటీర్లకు నచ్చ చెప్పాము అట్టివారిని పేరు అడగండి అతడు తన పేరు చెప్పకపోతే అతడితో అసభ్యతగా వ్యవహరించకండి అట్టివారికి మనం తయారుచేసిన కరపత్రం యివ్వండి రక్తపు చట్టానికి లోబడితే, కలిగే ప్రమాదాల్ని గురించి వారికి చెప్పండి పోలీసులతో మంచిగా మెలగండి వారి జోలికి పోవద్దు పోలీసులు తిట్టినా, కొట్టినా సహించండి, ఒక వేళ దెబ్బలు సహించలేకపోతే అక్కడి నుంచి తప్పుకోండి అరెస్టు చేస్తే సంతోషంగా జైలుకు వెళ్లండి జోహన్స్ బర్గ్‌లో ఏమైనా జరిగితే తిన్నగా నాకు తెలియజేయండి మిగతా చోట్ల అక్కడ నియమింపబడిన కార్యదర్శులకు తెలియజేయండి వాళ్లు చెప్పిన ప్రకారం నడుచుకోండి కొద్ది మంది పికెటర్లకు ఒక నాయకుడు వుంటాడు ఆనాయకుడి ఆదేశానుసారం అంతా నడుచుకోవాలి యిదంతా వాలంటీర్లకు నేర్పిన పాఠం

ఇలాంటి అనుభవం జాతికి మొదటిసారి కలిగింది 12 సంవత్సరాలు దాటిన వారిని పికెటర్లుగా ఎన్నుకున్నారు అందువల్ల 12 నుంచి 18 ఏండ్లవయస్సు గల యువకులు సైతం యీ దళాల్లో చేరారు స్థానికకారకర్తలకు అపరిచితులైన వారిని ఎవ్వరినీ చేర్చుకోలేదు అయినా ఎంతో జాగ్రత్తగా అంతావున్నారు ఎవరైనా పత్రాలు తీసుకోవాలని అనుకుంటే, పికెటర్ల భయం వారికి కలిగితే అట్టివారికి హాని జరగకుండా చూస్తామని, ఒక వాలంటీరును

కూడా వారికిచ్చి లోనికి పంపుతామని పత్రాలు తీసుకున్న తరువాత అట్టివారిని వాలంటీరు సురక్షితంగా బయటికి పంపుతాడని కూడా పలు పర్యాయాలు ప్రకటించాము కొందరు ఆ విధంగా ప్రయోజనం పొందారు కూడా।

వాలంటీర్లు ఎంతో ఉత్సాహంతో తమ పనులు నిర్వహించారు ఎంతో జాగ్రత్తగా వున్నారు వాలంటీర్లను పోలీసులు ఎక్కువగా బాధించ లేదని చెప్పవచ్చు కొన్ని చోట్ల పోలీసులు బాధించితే వాలంటీర్లు సహించారు ఈ కార్యక్రమాల్లో వాలంటీర్లు హస్యరసాన్ని కూడా మేళవించారు పోలీసులు కూడా అందుపాల్గొన్న ఘట్టాలు వున్నాయి వాలంటీర్లు ఎన్నో ఛలోక్తులు విసురుతూ జనాన్ని నవ్వించుతూ వున్నారు ఒకచోట రాకపోకలకు అడ్డు తగులుతున్నారని ఆరోపణ చేసి వాలంటీర్లను పోలీసులు అరెస్టు చేశారు ఆ విధంగా అరెస్టు అయిన వారి పక్షాన వకీళ్లను నియమించి ప్రజాధనాన్ని ఖర్చు చేయమని చెప్పడం కూడా జరిగింది అన్నిటికీ సిద్ధపడే వాలంటీర్లు రంగంలోకి దిగారు తరువాత కోర్టువారు అరెస్టు చేయబడిన వాలంటీర్లను నిర్దోషులుగా నిర్ణయించి వదిలి వేశారు దాని వల్ల వాలంటీర్ల ఉత్సాహం బాగా పెరిగింది

ఈ విధంగా ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా పత్రాలు తీసుకునే వారికి హాని కలుగకుండా కాపాడినా వాలంటీర్ల దళాలకు తెలియకుండా ఒక రహస్య దళంగా ఏర్పడి కొందరు పత్రాలు తీసుకుంటే ఖబర్దార్ అంటూ జనాన్ని బెదిరించడం ప్రారంభించారు ఈ విషయం తెలియగానే వాళ్లెవరో తెలుసుకొని, అట్టి అరాజకాన్ని అరికట్టుటకు ప్రయత్నాలు చేశాము దానితో బెదిరింపులు ఆగిపోయాయి కాని ఆ ప్రవృత్తి సమూలంగా మాత్రం వీడిపోలేదు దాని వల్ల భారత జాతీయ సత్యాగ్రహ సంగ్రామానికి కొంత నష్టం కూడా కలిగింది అలా భయపడ్డ వాళ్లు ప్రభుత్వ సంరక్షణ కోరగా. వారికి అది లభించింది ఈ విధంగా ఒక విషంకొందరి హృదయంలో బయలు దేరింది వాళ్లు బలహీనుల్ని బెదిరించారు వాళ్లను యింకా పిరికి

వాళ్లను చేశారు బయట పడకుండా రహస్యంగా యిట్టి పనులు చేసే వారంతా బలహీనులే బలహీనులు ఏదో విధంగా దెబ్బతీయాలని చూస్తూ వుంటారు

అయితే యిట్టి బెదిరింపులకు భారతీయులు భయపడలేదు కాని పత్రాలు తీసుకున్న వాళ్ల పేర్లు బయటపడక తప్పదనీ, మిగతా వారి దృష్టిలో దిగజారిపోతామని అట్టివారికి భయం పట్టుకుంది రక్తపు చట్టానికి తలవంచడం మంచిది అని అన్న ఒక్క భారతీయుడుకూడా నాకు కనబడలేదు కొంత మంది కొత్త పత్రాలు తీసుకుందామని వెళ్లారు గాని, తమ పిరికితనానికి వాళ్లే బాధ పడ్డారు ఇటువంటి ఘట్టాలు ఎన్నో జరిగాయి

ఒకవైపున సిగ్గు లజ్జ, మరోవైపున తమ వ్యాపారానికి దెబ్బతగలకుండా కాపాడుకోవడం యీ రెండిటి మధ్య వ్యాపారస్థులు కొందరు యిరుక్కుపోయి భాదపడ్డారు కాని చివరకు వాళ్లు ఒక ఉపాయం కనుక్కున్నారు అట్టివాళ్లు ఏషియాటిక్ శాఖాధికారి దగ్గరకు వెళ్లి మాట్లాడి, ఫలానా చోటఫలానా వారి సొంత యింట్లో రాత్రి 9 లేక 10 గంటల తరువాత అనుమతి పత్రాలు అందజేయండి. తీసుకుంటాం అని చెప్పి ఆయనను ఒప్పించారు ఇలా అయితే తాము రక్తపు చట్టానికి లొంగిపోయినట్లు బయటపడదని వారు భావించారు తామంతా జాతి నాయకులం గనుక, ఎవ్వరూ ఏమి చేయలేరు పని నడిచిపోతుందని వారు అనుకున్నారు అందరిముందు సిగ్గు పడవలసిన అవసరం వుండదని, తరువాత బండారం బైటపడ్డా పరవాలేదని ఉహించారు

కాని వాలంటీర్లు జాగ్రత్తగా వున్నారు ఎప్పటికప్పుడు సమాచారం జాతికి అందిపోతూవున్నది ఏషియాటిక్ ఆఫీసులో వున్న వాళ్లు కూడా అఖండులే ఇటువంటి రహస్య సమాచారం ఏమైనా వుంటే వాళ్లు సత్యాగ్రహులకు చేరవేస్తూ వుండేవారు మరో రకం బలహీనులు కొందరు వుండేవారు వాళ్లు తాము బలహీనులే అయినా నాయకులు బలహీనపడితే సహించ లేకపోయేవారు వాళ్లు తమకు తెలిసిన నాయకుల బలహీనతల్ని ఎప్పటికప్పుడు వాలంటీర్లకు తెలియజేస్తూ వుండేవారు ఇటువంటి ఘట్టం ఒకనాడు

జరిగిందికూడా ఫలానా రోజున, ఫలానరాత్రి, యిన్ని గంటలకు ఫలానా కొట్లో పత్రాలు ఫలానా ఫలానా వాళ్లు తీసుకోబోతున్నారు అని ఆఫీసుకు సమాచారం అందింది ఆ వార్త అందగానే అట్టి వాళ్ల దగ్గరకు వెళ్లి అలా చేయవద్దని నచ్చచెప్పారు ఆకొట్టు దగ్గర పికిటింగు కూడా చేశారు అయినా నాటిరాత్రి 11 గంటలకు భారతీయ నేతలు కొందరు రహస్యంగా పత్రాలు తీసుకున్నారు ఇలాంటి ఘట్టంవల్ల ఒక సిద్ధాంత ప్రకారం సాగుతున్న ఉద్యమానికి విఘాతం కలిగింది మర్నాడే ఆ పెద్ద మనుష్యులపేర్లు పత్రికల్లో ప్రకటించబడ్డాయి మనిషి పడే సిగ్గులజ్జలకు కూడా ఒక హద్దనేది వుంటుంది! దీనికంతటికీ కారణం స్వార్థమే స్వార్థం జడలు విరబోసుకునేసరికి మనిషి జారిపోతాడు సిగ్గులజ్జలు అతణ్ని ఏమీ చేయలేవు ఈ విధంగా అంతఃకలహాలకు లోనై సుమారు 500 మంది భారతీయులు పత్రాలు పుచ్చుకున్నారు కొద్ది రోజులు యీ తతంగం సొంత ఇళ్లలో జరిగింది మెల్ల మెల్లగా అట్టివారిని చలివదిలి వేసింది ఆ తరువాత బహిరంగంగానే ఏషియాటిక్ ఆఫీసుకు వెళ్లి అనుమతి పత్రాలు తీసుకోవడం ప్రారంభించారు

★ ★ ★

## 18

## ప్రథమ సత్యాగ్రహఖైదీ

ఎంత కష్టపడ్డా 500కి మించి భారతీయుల పేర్లు రాకపోయేసరికి ఏషియాటిక్ శాఖకు సంబంధించిన అధికారులు భారతీయులను అరెస్టు చేయడం అవసరమని నిర్ణయానికి వచ్చారు పాఠకులకు జర్మిస్టన్ పేరు తెలుసుకదా! అక్కడ భారతీయులు చాలామంది ఉంటున్నారు వారిలో ఒకని పేరు రామసుందర్ పండిత్ అతడు చూచుటకు శూరుడు వీరుడుగా కనబడేవాడు వాచాలుడు కొద్ది సంస్కృత శ్లోకాలు అతడినోటికి వచ్చు ఉత్తర ప్రదేశ్‌కి చెందినవాడు కనుక తులసీ రామాయణ మందలి కొన్ని దోహాలు, చౌపాయీలు కూడా అతనికి వచ్చు పండిత్ కనుక జనం అతణ్ని

గౌరవిస్తూ వుండేవారు ఉపన్యాసాలు యిస్తూ ఆవేశాన్ని కూడా నింపుతూ వుండేవాడు అక్కడ ప్రభుత్వానికి దాసోహం చేసిన కొందరు భారతీయ ప్రభుద్ధులు ఏషియాటిక్ శాఖ అధికారుల దగ్గరికి వెళ్లి యీ పండిత్‌ని అరెస్టు చేయండి. దానితో భయపడిపోయి జనం పత్రాలకోసం ఎగబడతారని రెచ్చగొట్టారు ఆ ఆఫీసు అధికారి పొంగిపోయి వెంటనే రామసుందర్ పండిత్‌ను అరెస్టు చేయించాడు ఈ రకమైన మొదటికేసు కావడం వల్ల పండిత్ అరెస్టు ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది భారతీయుల్లో పెద్ద అలజడి ప్రారంభమైంది జర్మిస్టన్ వరకే ప్రచలితమై యున్న పండిత్ పేరు ఒక్క క్షణంలో దక్షిణాఫ్రికా యందంతట వ్యాపించింది ఏ ఒక్క మహాపురుషుణ్ణి అరెస్టు చేసినా అతడిపేరు సర్వత్ర వ్యాపించునట్లు రామ సుందర్ పండిత్ పేరు అంతటా వ్యాపించింది అందరి దృష్టి ఆయన మీదకు మళ్లింది అతణ్ణి అరెస్టు చేస్తే శాంతికి ప్రమాధం ఏమీ కలుగకపోయినా ప్రభుత్వం అందుకు పూనుకొని పెద్ద ఏర్పాట్లు చేసింది ఒక పెద్ద భారతీయ నాయకుడి హోదా అతడికి కల్పించి ప్రభుత్వం పెద్ద అట్టహాసం చేసింది అతడికి గౌరవం కల్పించింది విచారణ జరిగిన రోజున కోర్టు అంతా జనంతో క్రిక్కిరిసి పోయింది అతడికి ఒక నెల రోజుల పాటు సాధారణఖైదు శిక్ష విధించారు అతణ్ణి జోహన్స్ బర్గ్ జైల్లో వుంచారు అక్కడ యూరోషియన్ వార్డులో అతడికి ప్రత్యేకించి ఒక గది కేటాయించారు జనం ఏమి యిబ్బంది లేకుండా అతణ్ణి కలుసుకొనే ఏర్పాట్లు చేయబడ్డాయి బయటి నుంచి భోజనం తెప్పించుకొనే ఏర్పాటు కూడా చేశారు దానితో భారతీయులు రోజూ రుచికరమైన భోజనం అతడికి పంపిస్తూ వున్నారు అతడికి జైలు శిక్ష విధించబడిన రోజున పెద్ద జాతీయ ఉత్సవం జరిగింది అతణ్ణి జైల్లో పెట్టినందు వల్ల జాతికి బలం, ఉత్సాహం అధికంగా లభించాయి వందలాది భారతీయులు జైలుకు వెళ్లుటకు సిద్ధపడ్డారు ఏషియాటిక్ శాఖ ఆశించిన ఆశ నెరవేరలేదు. జర్మిస్టన్ యందలి భారతీయులైనా అనుమతి పత్రాలు తీసుకొనుటకు ముందుకు రాలేదు అధికారులు చేసిన

యీ హడావుడి వల్ల జాతికే లాభం కలిగింది ఒక నెల గడిచిపోయింది రామసుందరపండిత్ జైలునుంచి విడుదల అయ్యాడు మేళాతాళాలతో ఆయనను సభాస్థలి వరకు ఉరేగింపుగా తీసుకువెళ్లారు కొందరు ఆ సభలో ఆవేశంతో ఉపన్యాసాలు యిచ్చారు రామసుందర్ పండిత్‌ను దండలతో ముంచెత్తి వేశారు ఆయన గౌరవార్థం కొందరు జనానికి పెద్ద విందు ఏర్పాటు చేశారు అతడికి దక్కిన గౌరవాన్ని చూచి కొందరికి తీయని అసూయ కూడా కలిగింది మనం కూడా జైలుకు వెళ్లి వుంటే మనకు కూడా యిట్టి గౌరవం దక్కి వుండేది కదా అని కొందరు తహతహలాడిపోయారు

కాని రామ సుందర్‌పండిత్ నిజానికి సత్తురూపాయి రకం అతడిదంతా కృత్రిమ వ్యవహారం అతణ్ణి హఠాత్తుగా అరెస్టు చేశారు కనుక ఒకనెల మాసం పాటు జైలు తప్పదని భావించారు జైల్లో అతడికి లభించి యుండలేదు స్వేచ్ఛగా తిరిగే మనిషి అందులోనూ వ్యసనాలకు అలవాటుపడ్డ వాడు ఎంత మంచి భోజనం లభించినా, జైల్లో గల ఏకాంతవాసాన్ని, సంయమనాన్ని సహించలేకపోయాడు రాజభోగాలు అనుభవించినా అతడికి కారాగారవాసం రుచించలేదు ట్రాన్స్‌వాల్‌ను, సత్యాగ్రహపోరాటాన్ని వదిలి రాత్రికి రాత్రే ఎక్కడికో పారిపోయాడు ప్రతిసమాజంలోను గడుసురకం జనం వుంటారు అదే విధంగా ప్రతి ఉద్యమంలోను గడుసురకం చేరతారు అతని వల్ల భారతీయులకు ఏమో ఒరుగుతుందని భావించి అతడికధ నాకు తెలియనీయకుండా గోప్యంగా వుంచారు తరువాత అసలు రామ సుందర్, గిర్‌మిటియాగా దక్షిణాఫ్రికా వచ్చి ఆ ఎగ్రిమెంటు పూర్తి కాకుండానే పారిపోయిన ఒక గిర్‌మిటియా కార్మికుడని నాకు చెప్పారు అతడు గిర్‌మిటియాకు చెందినవాడని నేను ఏహ్యభావంతో వ్రాయడం లేదు అతడు గిర్‌మిటియా అవడంలో దోషం ఏమీ లేదు నిజానికి భారతజాతీయ సత్యాగ్రహ పోరాటంలో పాల్గొని విజయపథాన నడిపించిన వారిలో గిర్‌మిటియా కార్మికులే ఎక్కువ అన్న విషయం పాఠకులు గ్రహింతురుగాక అయితే గిర్‌మిటియా కార్మికుడుగా వచ్చి, ఆ ఎగ్రిమెంటు పూర్తి కాకుండానే

పారిపోవడం రామసుందర్ చేసిన అపరాధమే ఇక్కడ రామసుందర్ పండిత్ కథ, అతనికి సంబంధించిన వివరం అతణ్ణి తప్పు పట్టాలనే ఉద్దేశ్యంతో నేను పేర్కొనలేదు ఇందు దాగియున్న గూఢరహస్యాన్ని తెలుపుటకే పేర్కొన్నాను పరిశుద్ధహృదయంతో ఆరంభించిన ఏ ఉద్యమంలోనైనా సరే పరిశుద్ధమైన ఆచరణ కలవారినే చేర్చుకోవాలి అయితే ఎంత జాగ్రత్తపడ్డా పరిశుద్ధంగా జరిగే ఉద్యమంలో అపరిశుద్ధ మనష్యులు కూడా చేరుతూ వుంటారు అయితే నాయకులు సదా జాగరూకులై వుండాలి సంచాలకుడు పరిశుద్ధుడై యుంటే యిలాంటి వాళ్ల వల్ల ఉద్యమం దెబ్బతినదని మనవి చేస్తున్నాను రామసుందర్‌పండిత్ నిజస్వరూపం బైటపడే సరికి జాతికి అతిని యెడ గలగౌరవం పూర్తిగా తగ్గిపోయింది పండిత్‌రూపం పోయి అతడు కేవలం రామసుందర్‌గా మిగిలిపోయాడు జాతి అతణ్ణి మరిచి పోయింది కాని దీనివల్ల పోరాటానికి బలం పెరిగింది సత్యాగ్రహిగా అతడు అనుభవించిన జైలు శిక్ష వృధాకాలేదు అతడు జైలుకు వెళ్లి నందున పెరిగిన జాతి బలం తరగలేదు అతడి బలహీనత వల్ల కలిగిన ఫలితాన్ని చూచి అటువంటి బలహీనులంతా పోరాటాన్ని వదిలి పారిపోయారు ఇటువంటి యింకా కొంతమంది బలహీనుల బలహీనతలు జాతికంటబడ్డాయి కాని నేను వారిని గురించి పేర్లు అడ్రసులతో సహా యిక్కడ వివరించదలచలేదు అందువల్ల కలిగే లాభమూ ఏమీ లేదు జాతి యొక్కశక్తిని మరియు జాతి యొక్క బలహీనతను పాఠకులు గ్రహించాలి రామసుందర్ వంటివాళ్లు ఎంతో మంది వస్తారు వెళ్తారు అయినా జాతి బలం చెక్కు చెదరదు అటువంటి వాళ్లవల్ల కూడా జాతికి బలమే చేకూరుతుందని నా అభిప్రాయం పాఠకులు రామసుందర్‌ను దోషిగా భావించకూడదు ఈ జగత్తు నందలి మనుష్యులంతా అపూర్ణులే ఒక వ్యక్తి యొక్క అపూర్ణత్వం స్పష్టంగా కనబడినప్పుడు మిగతా వారంతా అతడిని వ్రేలెత్తి చూపిస్తూవుంటారు కాని నిజానికి అది మన పొరపాటే అవుతుంది వాస్తవానికి రామసుందర్ తెలిసియుండి బలహీనుడు కాలేదు మనిషి తన స్వభావాన్ని మార్చుకోగలడు దాన్ని అధీనంలో

వుంచుకోగలడు కాని దాన్ని సమూలంగా పెకిలించి పారవేయలేడు సృష్టికర్త మనిసికి అంతశక్తి ప్రసాదించలేదు పెద్దపులి తన చర్మం చారలను మార్చుకోగలిగితే మనిషి తన విచిత్ర స్వభావాన్ని మార్చుకోగలుగుతాడు పారిపోయినప్పటికీ రామ్‌సుందర్ తన బలహీనతలకు ఎంత పశ్చాత్తాప పడివుంటాడో మనకు ఎలా తెలుస్తుంది? అతడు పారిపోవడాన్ని అతడి పశ్చాత్తాపానికి తార్కాణంగా భావించ వచ్చుకదా? అతడు సిగ్గులేనివాడైతే పారిపోవలసిన అవసరం వుండేది కాదు అనుమతి పత్రం తీసుకొని, రక్తపు చట్టాన్ని అంగీకరించి జైలుకు పోకుండా ముక్తి పొందియుండేవాడు ప్రభుత్వం చేరువకు చేరి యుండే వాడుకూడా ఏషియాటిక్ ఆఫీసుకు దళారిగా మారి యితర భారతీయుల్ని సైతం మార్చివేసేవాడు ఇదంతా ఏమీ చేయకుండా జాతికి తన దౌర్బల్యాన్ని చూపించుటకు సంకోచించి, సిగ్గుపడి, తన ముఖం దాచుకున్నాడు ఇలా చేసి భారతజాతికి అతడు మేలే చేశాడు అతడు పారిపోవడాన్ని యీ విధంగా అర్థం చేసుకుంటే మంచిది

★ ★ ★

# 19

# ఇండియన్ ఒపీనియన్

నేను పాఠకులకు సత్యాగ్రహానికి సంబంధించిన లోపలి మరియు బయటి సాధనాలన్నింటిని గురించి తెలియజేయాలని, భావిస్తున్నాను అందువల్ల ఇండియన్ ఒపీనియన్ అను వార పత్రికను గురించి వివరిస్తాను అది యిప్పటికీ దక్షిణాఫ్రికానుంచి వెలువడుతున్నది దక్షిణాఫ్రికాలో ప్రప్రథమంగా హిందుస్తానీ ప్రెస్ ప్రారంభించిన ఘనత శ్రీ మదనజీత్ వ్యావహారిక్ అను గుజరాతీ సజ్జనుడికి దక్కింది అనేక యిబ్బందులు పడి ప్రెస్ నడుపుతూ ఒక వారపత్రిక ప్రచురించాలనే నిర్ణయానికి అతడు వచ్చాడు ఈ విషయంలో అతడు కీ॥శే॥ మనసుఖలాల్ నాజర్ మరియు నా సలహా కోరాడు డర్బన్ నుంచి పత్రిక ప్రారంభమైంది శ్రీ మనసుఖలాల్

నాజర్ ఆ పత్రికకు గౌరవ సంపాదకుడుగా వున్నారు పత్రిక ప్రచురణ వల్ల నష్టం రాసాగింది అప్పుడు ప్రెస్సులో పనిచేసే వారందరినీ అందు భాగస్వాములుగా చేసి, ఒక పొలం తీసుకొని అక్కడ వారందరికీ నివాసం ఏర్పాటు చేసి పత్రిక నడపించాలని నిర్ణయానికి వచ్చారు ఆ పొలం డర్బనుకు 13 మైళ్ల దూరాన ఒక అందమైన పర్వతం మీద వున్నది దానికి అతి దగ్గరలో 3 మైళ్ల దూరాన రైలు స్టేషను వున్నది దాని పేరు ఫినిక్స్ పత్రిక పేరు మొదటి నుంచి ఇండియన్ ఒపీనియన్ అని పెట్టారు ఒకప్పుడు యిది ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ, తమిళభాషల్లో వెలువడింది తమిళం, హిందీ పత్రికల ప్రచురణ భారం బాగాపెరిగిపోయింది పొలానికి వచ్చి వుండే పని వాళ్లు దొరకలేదు తమిళ హిందీ భాషల్లో వ్రాసేవారు, వ్రాసిన వ్యాసాల్ని సరిదిద్దువారు లేకపోయినందున ఆ రెండు శాఖల్ని ఆపివేశారు ఇంగ్లీషు, గుజరాతీ భాషల్లో మాత్రం పత్రిక వెలువడసాగింది సత్యాగ్రహ సంగ్రామం ప్రారంభమైనప్పుడు యీ రెండు భాషల్లోనే పత్రిక వెలువడుతూ వున్నది పొలంలో వుంటూ సంస్థలో పనిచేసే వారిలో హిందీ (ఉత్తరప్రదేశ్), తమిళ్ (మద్రాసు), గుజరాతీ, ఇంగ్లీషు వాళ్లంతా వున్నారు శ్రీ మనసుఖలాల్ నాజర్ హఠాత్తుగా మృతి చెందారు అప్పుడు ఒక ఆంగ్ల మిత్రుడు హర్బర్ట్‌కిచన్ ఇండియన్ ఒపీనియన్ పత్రికకు సంపాదకులైనారు తరువాత శ్రీ హెనరీపోలక్ చాలా కాలం వరకు సంపాదకులుగా వున్నారు నేను, పోలక్ యిద్దరం జైల్లో వున్నప్పుడు ఫాదర్ కీ॥శే॥ జోసఫ్ డోక్ పత్రికకు సంపాదకులుగా వున్నారు ఈ పత్రిక ద్వారా భారతీయులందరికీ, జరుగుతున్న సమాచారం పూర్తిగా అందజేయుటకు అవకాశం లభించింది ఇంగ్లీషు విభాగం ద్వారా గుజరాతీ రానివారికి కూడా సత్యాగ్రహ విశేషాలు తెలిపి శిక్షణ యివ్వడం ప్రారంభమైంది ఇండియా, ఇంగ్లాండు, దక్షిణాఫ్రికా యందలి తెల్ల జాతీయులకు ఇండియన్ ఒపీనియన్ సాప్తాహిక పత్రికగా రూపొంది వారి అవసరాలు తీర్చసాగింది పత్రిక లేకుండా కూడా సత్యాగ్రహం వంటి సమరం సాగించవచ్చు కాని ఇండియన్ ఒపీయన్ పత్రికవల్ల మాకు

ఎన్నో సౌకర్యాలు కలిగాయి జాతికి తేలికగా సత్యాగ్రహ సమరాన్ని గురించిన శిక్షణ యివ్వగలిగాము, ప్రపంచంలో వున్న భారతీయులందరికీ సత్యాగ్రహ సంగ్రామ ఘట్టాల్ని గురించి సమాచారం ఎప్పటికప్పుడు అందించగలిగాము మరో సాధనం వల్ల యింత సౌకర్యం కలిగి యుండేది కాదు సత్యాగ్రహ సంగ్రామం సాగించుటకు ఎన్నో సాధనాలు ఉపయోగపడ్డాయి కాని వాటన్నింటిలోను ఇండియన్ ఒపీనియన్ గొప్ప సాధనంగా ఉపయోగపడిందని చెప్పకతప్పదు

సంగ్రామం జరిగిన రోజుల్లోను, సంగ్రామం జరిగిన తరువాత జాతిలో ఎన్నో మార్పులు వచ్చాయి అదే విధంగా ఇండియన్ ఒపీనియన్ పత్రికలోకూడా ఎన్నో మార్పులు వచ్చాయి మొదట, పత్రికకు విజ్ఞాపనలు తీసుకొనేవారు ప్రెస్సులో బయటివారి అచ్చు పనులు కూడా చేసేవారు ఈ రెండు పనులకు మంచిపని వాళ్లను వినియోగించవలసి వచ్చింది ఏరకమైన విజ్ఞాపనలు తీసుకోవాలి ఏ రకం విజ్ఞాపనలు తీసుకోకూడదు అను విషయంలో ధర్మసంకటం ఏర్పడింది అంతేగాక ప్రకటించకూడని విజ్ఞాపనలు అందినప్పుడు, ఆ విజ్ఞాపనలు యిచ్చిన వాడు అగ్రగణ్యుడగు భారతీయుడైనప్పుడు, అతణ్ణి సంతోషపెట్టుటకు పనికిమాలిన విజ్ఞాపనలు తేవడానికి, ప్రచురించిన విజ్ఞాపనల డబ్బు వసూలు చేసి తెచ్చుకోడానికి వ్యక్తిత్వం కలిగిన మాపనివాళ్లు చాలా సమయం వెచ్చించవలసిన అవసరం ఏర్పడింది విజ్ఞాపనలకోసం దాతల భజన చేయవలసి వచ్చేది అసలు పత్రికను ఎందుకు నడుపుతున్నాం? డబ్బు సంపాదించడానికా లేక జాతికి సేవచేయుటకా? సేవచేయడానికే అయితే ఎవ్వరినీ వత్తిడిచేయకూడదుకదా! జాతి కోరితేనే సేవ చేయాలి అయితే జాతి ఎలా కోరుతుంది? స్వయంగా చందా చెల్లించి చందాదారులుగా చేరడమే జాతికోరికకు తర్కాణం అవుతుంది విజ్ఞాపనలకోసం దాతల చుట్టూ తిరగడంమాని పత్రికా ప్రచురణకు అయ్యే ఖర్చు చందాదారులను చేర్చి తద్వారాభరించడం మంచిది దీనివల్ల ఆకర్షించేవారికి, ఆకర్షింపబడేవారికి యిరువురికీ పాఠం నేర్పినట్లవుతుంది ఈ విషయాలన్నింటినీ యోచించి

వెంటనే నిర్ణయాన్ని అమలు పరిచాము విజ్ఞాపనలకోసం తెగతిరిగేవారంతా శ్వాసపీల్చుకొని, పత్రికను ఉపయోగకరంగాను, అందంగాను తీర్చిదిద్దుటకు కృషి ప్రారంభించారు జాతి ప్రజలకు ఇండియన్ ఒపీనియన్ పత్రిక తమదేనని, దానిని నడపడం తమ బాధ్యతయేనని బోధపడింది కార్యక్తలమంతా ఆనందించాము జాతిప్రయోజాన్ని దృష్టియందుంచుకొని జనం పత్రికకోసం ఎదురుచూచే విధంగా పత్రికను రూపొందించే కృషికి అంతా పూనుకున్నాము ప్రతి భారతీయుణ్ణి నిలబెట్టి యీ పత్రికను కొనమని చెప్పడం కార్యకర్తలంతా తమ కర్తవ్యంగా భావించాము అచిరకాలంలోనే ఇండియన్ ఒపీనియన్పత్రిక ఆంతరిక శక్తి బాగా పెరిగింది పత్రికా స్వరూపంలో కూడా మంచి మార్పు వచ్చింది అది ఒక శక్తి అయిపోయింది ఆ పత్రిక చందాదారుల సంఖ్య సామాన్యంగా 1200 నుంచి 1500 వరకు వుండేది పత్రిక వార్షిక చందా పెంచవలసి వచ్చింది సత్యాగ్రహసంగ్రామం ఉగ్రరూపం దాల్చినప్పుడు వార్షికచందాదారుల సంఖ్య3500 దాకా పెరిగింది ఇండియన్ ఒపీనియన్ పత్రికా పాఠకుల సంఖ్య 20,000వరకు వుండేది ఇంతమంది పాఠకుల కోసం 3000 కంటే మించి విడి ప్రతులు అమ్మకం కావడం విశేషమే

ఇండియన్ ఒపీనియన్ పత్రికను భారతజాతి తమదిగా భావించింది పత్రికాప్రతులు జోహాన్సబర్గుకు కొంచెం ఆలస్యంగా చేరితే జనం ఊరుకునేవారుకాదు ఆదివారం ఉదయం పత్రికాప్రతులు జోహాన్సబర్గ్‌కు చేరుతూవుండేవి పత్రికలు చేరగానే జనం ముందుగా గుజరాతీ పత్రిక తీసుకొని గబగబా పత్రికనంతటనీ చదివేస్తూ వుండేవారు ఒకడు చదువుతూవుంటే, పది పదిహేనుమంది చుట్టూ నిలబడివింటూ వుండేవారు బీదవాళ్లు ముగ్గురు నలుగురు కలిసి పత్రిక కొని చదివేవారు

విజ్ఞాపనల్ని ఆపివేసినట్లే, ప్రెస్సులో బయటి అచ్చుపనులు తీసుకోవడంకూడా ఆపివేశాము విజ్ఞాపనలు తీసుకోకపోవడానికి ఏ కారణాలు పనిచేశాయో, అచ్చుపనులు తీసుకోకపోవడానికి కూడా అవే కారణాలు పనిచేశాయి అందువల్ల కంపోజిటర్లకు సమయం చిక్కినందున పుస్తక

ప్రచురణ ప్రారంభించాము పుస్తక ప్రచురణకు లక్ష్యం డబ్బు సంపాదనకాదు సత్యాగ్రహ సంగ్రామానికి ఉపయోగపడే విధంగా పుస్తకాలు ప్రచురించినందున వాటి అమ్మకంకూడా పెరిగింది ఈ విధంగా ఇండియన్ ఒపీనియన్ మరియు ప్రెస్సు రెండూ దక్షిణాఫ్రికాలో జరిగిన సత్యాగ్రహ పోరాటానికి ఎంతో సహకరించాయి సత్యాగ్రహం భారతీయుల హృదయాలలో వ్రేళ్లు పాతుకున్న కొద్దీ ఇండియన్ ఒపీనియన్ మరియు ప్రెస్సులు రెండూ ఎంతో ప్రగతిని సాధించాయి

★ ★ ★

# 20

# నిర్బంధాల వెల్లువ

రామసుందర్ పండిత్‌ను నిర్బంధించడంవల్ల ప్రభుత్వానికి ప్రయోజనం కలుగలేదని మనం చూచాం రెండో వైపున ప్రజల్లో ఉత్సాహం పెరిగిపోతున్న విషయం ప్రభుత్వం గ్రహించింది ఇండియన్ ఓపీనియన్‌లో ప్రచురించబడే వ్యాసాల్ని, ఇండియన్ ఏషియాటిక్ శాఖ వాళ్లు కూడా శ్రద్ధగా చదువుతున్నారు జాతీయ పోరాటమేదీ రహస్యంగా జరగలేదు జాతిబలాన్ని జాతిబలహీనతల్ని రెండిటినీ జనం ఇండియన్ ఓపీనియన్ ద్వారా మిత్రులైనా, శత్రువులైనా, తటస్థంగా వుండేవారైనా తెలుసుకుంటున్నారు తప్పుడుపని చేయనవసరంలేదు మోసానికి అతి తెలివికి చోటులేదు తమ ఆత్మబలంతోనే విజయం సాధించుటకు అవకాశం వున్నా సత్యాగ్రహ సంగ్రామంలో రహస్యానికి తావులేదని కార్యకర్తలంతా తెలుసుకున్నారు జాతి బలహీనతలనే రోగాల్ని తొలగించుకోవాలంటే వాటిని బయటపెట్టి, వాటిని బాగా అందరూ తెలుసుకో గలగాలని కార్యకర్తలు గ్రహించారు ఏషియాటిక్ శాఖవారు ఇండియన్ ఒపీనియన్ విధానం యిదేనని తెలుసుకున్నారు భారత జాతీయ సత్యాగ్రహ సంగ్రామ చరిత్రగా ఇండియన్ ఒపీనియన్ పత్రిక రూపొందడం గమనించిన ఏషియాటిక్ శాఖాధికారులు యీ సంగ్రామానికి సంబంధించిన నాయకుల్ని

నిర్బంధంలోకి తీసుకోవడం అవసరమనీ, లేకపోతే జాతిబలం పెరుగుతుందేగాని తరగదని భావించారు తత్ఫలితంగా 1907 డిసెంబరు మాసంలో కొంతమంది నాయకులకు కోర్టులో హాజరుకమ్మని నోటీసు పంపారు నోటీసు యిచ్చే విషయంలో అధికారులు సభ్యతగా వ్యవహరించారని చెప్పవచ్చు

వాళ్లు అనుకుంటే వారంట్లు జారీ చేసి నాయకుల్ని నిర్బంధంలోకి తీసుకోవచ్చు కాని అలా చేయకుండా హాజరుకమ్మని వాళ్లకు నోటీసు యిచ్చి అధికారులు సభ్యతతోబాటు, జాతి నాయకులు అరెస్టు కావడానికి సిద్ధంగా వున్నారనే సత్యాన్ని కూడా ప్రకటించారు హాజరు కావలసిన రోజు శనివారం ది 28-12-1907 ఆనాడు కోర్టులో హాజరైన నాయకులు "చట్ట ప్రకారం మీరు అనుమతి పత్రాలు తీసుకోవాలి కాని మీరు తీసుకోలేదు కనుక ఫలానా సమయంలోపున ట్రాన్స్‌వాల్ సరిహద్దుల్ని దాటి వెళ్లిపొండని మీకు ఆర్డరు ఎందుకుయివ్వకూడదో తెలుపండి" అని యిచ్చిన నోటీసుకు సమాధానం యివ్వాలి అట్టి నాయకుల్లో ఒక సజ్జనుడిపేరు క్విన్ అతడు జోహన్స్‌బర్గ్‌లో నివసిస్తున్న చైనీయులకు నాయకుడు జోహన్స్‌బర్గ్‌లో 300-400 మంది చైనావారు వుంటున్నారు వారంతా వ్యాపారాలు వ్యవసాయం చేస్తువుంటారు భారతదేశం వ్యవసాయ ప్రధాన దేశం అయితే వ్యవసాయాన్ని చైనా ప్రజలు అభివృద్ధి చేసినంతగా భారతీయులు చేయలేదని చెప్పక తప్పదు అమెరికా మొదలుగాగల దేశాల్లో ఆధునిక యుగంలో జరిగిన వ్యవసాయాభివృద్ధి అమోఘం అయితే పాశ్చాత్య దేశాలలో జరుగుతున్న వ్యవసాయం ప్రయోగస్థాయిలో వున్నదని భావిస్తున్నాను చైనా మన భారతావని వలెనే ప్రాచీన దేశం ప్రాచీన కాలాన్నుంచి అక్కడ వ్యవసాయ కార్యక్రమం జరుగుతున్నది అందువల్ల చైనాను భారతదేశాన్ని రెండిటినీ యీ విషయంలో పోల్చి చూచుకొని ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు జోహన్స్ బర్గ్‌లో నివసిస్తున్న చైనీయులు చేస్తున్న వ్యవసాయం చూచి, వారి వ్యవసాయానికి సంబంధించిన విశేషాలు విని వాళ్ల జ్ఞానం, కృషి మనకంటే గొప్పవని నాకు అనిపించింది పంటకు పనికి రాదు అని భావించి మనం ఏ భూమిని వదిలి

వేస్తామో. ఆ భూమిని చైనా వాళ్లు పరీక్షించి అక్కడి మట్టి యందలి వివిధ విశేషాల్ని గ్రహించి ఆ మట్టికి సరిపోయే విత్తనాలుచల్లి అందుపంటలు పండిస్తారు

కష్టపడి పని చేసే తెలివిగల చైనా ప్రజలకు కూడా రక్తపు చట్టం వర్తింపచేశారు అందువల్ల భారతీయులు ప్రారంభించిన సంగ్రామంలో చైనా వారు కూడా చేరాలని నిర్ణయించుకున్నారు అయితే యిరుదేశాల వారు అనుసరించిన విధానాలు మాత్రం విడివిడిగా వున్నాయి తమతమ సంస్థల ద్వారా రెండు జాతులవారు తెల్ల ప్రభుత్వంతో పోరాటం సాగిస్తున్నారు ఆవిధంగా పోరాడినంత కాలం రెండు జాతులవారు లాభం పొందారు యింతలో ఒక జాతి పడిపోయింది రెండో జాతి పడిపోలేదు ఆ పోరాటంలో చాలా మంది చైనా వారు ఓడిపోయారు వారి నాయకుడు వారిని మోసగించాడు చైనా నాయకుడు రక్తపు చట్టానికి లొంగిపోలేదు కాని ఆసంస్థకు సంబంధించిన డబ్బు, లెక్కల పుస్తకాలు అన్నీ తీసుకొని పారిపోయాడని నాకు మిత్రులు చెప్పారు నాయకుడు లేకపోతే జనం చెల్లాచెదురైపోవడం సహజమే కదా నాయకుడిలో మలినం కనబడితే, అనుచరులు నిరాశపడిపోతారు అరెస్టులు జరిగినప్పుడు చైనీయులు అమితోత్సాహంగా వున్నారు వారిలో ఎవ్వరూ అనుమతి పత్రాలు తీసుకోలేదు భారతీయులతో బాటు వారి నాయకుల్ని అరెస్టు చేసినట్లే చైనావారిని, క్విన్‌తో సహా వారి నాయకుల్ని అరెస్టు చేశారు కొంతకాలం శ్రీక్విన్ చక్కగా పనిచేశాడని చెప్పవచ్చు

అరెస్టు చేయబడిన భారతీయ నాయకుల్ని పరిచయం చేస్తాను శ్రీ తంబినాయుడు తమిళభాషీయుడు ఆయన మారిషస్‌లో జన్మించాడు ఆయన తల్లి తండ్రి పొట్టపోసుకోవడం కోసం మద్రాసు నుంచి మారిషస్ వెళ్లారు. తంబినాయుడు సామాన్య వ్యాపారస్తుడు ఆయనకు పాఠశాల విద్య అబ్బలేదు కాని అనుభవజ్ఞానం అధికంగా లభించింది ఇంగ్లీషు బాగా మాట్లాడగలరు వ్రాయగలరు. భాషాశాస్త్ర దృష్ట్యా వారి ఇంగ్లీషులో

దోషాలువుండేవి అనుభవం ద్వారానే వారు తమిళం నేర్చుకున్నారు హిందుస్తానీ భాషకూడా మాట్లాడగలరు తెలుగు కూడా వారికి వచ్చు హిందీ, తెలుగు లిపులు వారికి రావు కాని ఆ రెండు భాషలు వారికివచ్చు మారిషస్ భాషయగు క్రియోల్ కూడా వారికి బాగా వచ్చు క్రియోల్ భాష ఫ్రెంచి భాషయొక్క అపభ్రంశరూపం దక్షిణ భారత దేశానికి చెందిన వారికి సామాన్యంగా యిన్ని భాషలు తెలుసునని చెబితే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు దక్షిణాఫ్రికాలో వున్న పందలాది భారతీయులకు యీ భాషలన్నిటి సామాన్యపరిచయం వున్నది వాళ్లు తేలికగా యిన్ని భాషలు మాట్లాడుతారు నా దృష్టిలో యిందుకు ఒక కారణం వున్నది విదేశీ భాషా మాధ్యమం ద్వారా విద్య గడించి వారి బుర్రలు అలిసిపోవు వారిజ్ఞాపక శక్తి చురుగ్గా వుంటుంది యీ భాషలు మాట్లాడే వారితో ప్రత్యక్షంగా మాట్లాడి ఆయా భాషల తీరు తెన్నుల్ని పరిశీలించి ఆ భాషా జ్ఞానం వారు పొందుతూ వుంటారు మస్కిష్కానికి యిది చిన్ని వ్యాయామం దీని వల్ల వారి మస్కిష్కం అలసిపోదు వికాసం పొందుతుంది తంబినాయుడి విషయం కూడా యింతే ఆయనకు బుద్ధి తీవ్రత అధికం క్రొత్త ప్రశ్నల్ని తేలికగా అర్థం చేసుకుంటారు రక్కువగా జవాబిచ్చేవారి పద్ధతిని చూచి అంతా అశ్చర్య పడుతూ వుంటారు ఆయన భారత దేశాన్ని ఎన్నడూ చూడలేదు కాని భారత దేశమంటే ఆయనకు అపారమైన ప్రేమ స్వదేశాభిమానం ఆయనరోమరోమంలో హత్తుకుపోయింది వారి యందలి స్థిరత్వం వారిముఖంలో ప్రతిబింబిస్తూ వుంటుంది వారి శరీరం బలిష్టంగా వుంటుంది మంచి ఒడ్డుపొడవుగల మనిషి కాయకష్టం చేస్తున్నప్పుడు అలిసి పోయేవారు కాదు ఏ సభలోనైనా కుర్చీమీద కూర్చొని అధ్యక్ష పదవినలంకరించవలసి వచ్చినా లేక అవసరమైనప్పుడు హమాలీ పని చేయవలసివచ్చినా చేస్తూ వుండేవారు నడిరోడ్డున మూటలు మోయవలసి వచ్చినా తంబినాయుడు సిగ్గుపడేవాడు కాదు కష్టపడవలసివస్తే రాత్రి, పగలు అనే తేడాను గమనించేవాడు కాదు భారతజాతి కోసం సర్వమూ అర్పణ చేసే విషయంలో ఎవ్వరికీ తీసిపోని

త్యాగధని శ్రీతంబినాయుడు అవసరానికి మించిన సాహసి, సహజంగా ముక్కోపి కాకుండా వుంటే, అటువంటి వీర పురుషుడు ట్రాన్స్‌వాల్‌లో కాఛలియా స్థానాన్ని అలంకరించి జాతికి నేతృత్వం వహించియుండేవారు ట్రాన్స్‌వాల్‌లో సత్యాగ్రహసమరం ప్రారంభమైనంతవరకు ఆయన ముక్కోపం బయటపడలేదు ఆయన యందలి సుగుణాలు రత్నాలవలె ప్రకాశించాయి కాని ఆ తరువాత ఆయనకోపం, ఆయన సాహసం రెండూ ఆయనకు ప్రబల శత్రువులుగా మారాయని విన్నాను ఆ రెండు దుర్గుణాలు వారి సద్గుణాలనన్నింటిని కప్పి వేశాయి ఏదిఏమైనా దక్షిణాఫ్రికా సత్యాగ్రహ సంగ్రామ చరిత్రలో తంబినాయుడు పేరు ప్రథమ శ్రేణిలో వుండతగినది మేమందరం కోర్టులో ఒకేసారి హాజరు కావాలి కాని అందరి కేసులు విడివిడిగా నడిచాయి మేజస్ట్రేటు కొంతమందిని 48 గంటలలోపున, కొంతమందిని 7 లేక 14 రోజుల్లోపున ట్రాన్స్‌వాల్ వదిలివెళ్లమని ఆదేశించాడు ది 10 జనవరి 1908 నాటికి ఆ గడువు పూర్తి అవుతుంది ఆ రోజున విధించబడిన శిక్షను వినడం కోసం మేము కోర్టుకు తిరిగి రావాలని ఆర్డరు వేశాడు మేము మా రక్షణ కోసం వాదించవలసిందేమీ లేదు గడువుదాటేలోపున ట్రాన్స్‌వదిలి వెళ్లేదీ లేదు సవినయంగా మేజస్ట్రేటు ఆర్డరును ధిక్కరించి, ఆ అపరాధాన్ని అంగీకరించడానికి అంతాసిద్ధంగా వున్నాము

కోర్టులో చిన్న ప్రకటన చేయుటకు నేను అనుమతి కోరాను అందుకు అనుమతి లభించింది "నా కేసుకు, నాతరువాత వచ్చేవారి మీద మోపబడిన కేసులకు వ్యత్యాసం చూడం అవసరం ప్రిటోరియానుంచి యిప్పుడే నాకు సమాచారం అందింది నా దేశబంధువులకు అక్కడ మూడు మాసాలకైదుశిక్ష, మరియు పెద్ద జుర్మానా విధించబడ్డాయి జుర్మానా చెల్లించకపోతే యింకో మూడు మాసాల శిక్ష విధించారు వారంతా అపరాధంచేసియుంటే, వారందరి కంటే నేను పెద్ద అపరాధిని గనుక నాకు కఠినాతికఠిన శిక్ష విధించమని మేజస్ట్రేటు గారిని ప్రార్థిస్తున్నాను" అని ప్రకటించాను కాని మేజస్ట్రేట్ నా ప్రకటనను పట్టించుకోలేదు నాకు రెండు మాసాల సామాన్య కైదు శిక్ష

విధించాడు ఏకోర్టులో నేను వకీలుగా వందలాది సార్లు నిలబడ్డానో, వకీళ్ల మండలి సభ్యులతో కలిసి మెలిసి తిరిగానో అదే కోర్టులో యివాళ నేను ముద్దాయి రూపంతో బోనులో నిలబడ్డాను యీ స్థితి నాకు విచిత్రంగా తోచింది అయితే వకీళ్లతోబాటు వున్నప్పుడు ఎంతటి గౌరవప్రతిష్ఠల్ని నేను హృదయంలో పొందానో, అంతటి గౌరవ ప్రతిష్ఠల్ని ముద్దాయిగా బోనులో నిలబడ్డ యిప్పుడు కూడా పొందానని చెప్పగలను సంకొచమేమీ నాకు కలుగలేదు కోర్టులో వందలాది భారతీయ సోదరులు, వకీళ్లు, మిత్రులు మొదలైన వారి ఎదుట నిలబడి యున్నాను శిక్ష విధించ బడిన తరువాత ఒక రక్షక భటుడు ముందుకు వచ్చి జైలుకు తరలించే ముందు ఖైదీలను వుంచే చోటుకి నన్ను తీసుకువెళ్లాడు

అక్కడ నిశ్శబ్దంగా వున్నది ఖైదీలు కూర్చునేందుకై ఒక బెంచీవున్నది ఆ బెంచీ మీద కూర్చోమని చెప్పి ఆ రక్షక భటుడు బయట తలుపు బిగించి వెళ్లిపోయాడు యిక్కడ నాకు కొంచెం గాబరాకలిగింది నేను ఆలోచనల్లో మునిగిపోయాను నా యిల్లు వాకిలి ఎక్కడ? నా బారిష్టరీ ఎక్కడ? ఆ ప్రజాసభలు ఎక్కడ? అన్నీ స్వప్నాల్లా తెరమరుగైనాయి యిప్పుడు నేను ఖైదీగా యిక్కడకూర్చున్నాను రెండు మాసాల్లో ఏమవుతుందో? రెండు మాసాలపూర్తి ఖైదు శిక్ష నేను అనుభవించవలసి వస్తుందా? జాతి ప్రజలంతా అనుకున్న ప్రకారం పెద్ద సంఖ్యలో జైళ్లకు వెళ్లితే రెండు మాసాల పాటు శిక్ష అనుభవించనవసరం వుండదు కాని వారంతా అలా జైళ్లకు వెళ్లడానికి సాహసించకపోతే రెండు మాసాలు జైల్లో వుండక తప్పదు రెండు మాసాలంటే ఎక్కువ సమయమే యీ విధంగా కలిగిన భావాలను వ్రాయడానికి యిప్పుడు పట్టినంత సమయంలో వందో శాతం సమయంకూడా ఆ భావాలు కలగడానికి పట్టలేదు యిటువంటి భావాలు మనస్సులో మసలినందుకు సిగ్గుపడిపోయాను నేను ఎంత మిధ్యాభిమానిని జైలును పెద్దమహలుగా భావించమని జాతి ప్రజలకు చెప్పాను రక్తపు చట్టాన్ని వ్యతిరేకించె సమయంలో ఎన్ని దుఃఖాలు కలిగినా వాటిని సుఖాలుగా భావించాలని

బోధించాను ఆ చట్టాన్ని వ్యతిరేకిస్తూ సంపదలు చివరికి ప్రాణాలు సైతం అర్పించవలసి వచ్చినా, సత్యాగ్రహి ఆనందంగా అర్పించడానికి సిద్ధపడాలని కూడా చెప్పాను ఆ నా జ్ఞానమంతా యిప్పుడు ఏమైంది? ఎక్కడికి పోయింది? యిట్టి భావాలు నాలో క్రొత్త శక్తిని నింపాయి నా మూర్ఖత్వాన్ని తలుచుకొని నవ్వుకున్నాను యిక సామాన్యస్థితిలో ఆలోచించసాగాను మిగతామిత్రులకు ఏమి శిక్ష విధించబడిందో? వాళ్లను కూడా నాతో బాటు జైల్లో వుంచుతారో లేదో అని ఆలోచిస్తూ వుండగా యింతలో తలుపులు తెరుచుకున్నాయి పోలీసు అధికారి తన వెనుక రావలసిందని నన్ను ఆదేశించాడు అతడి వెనుక నడుస్తూ వుండగా నన్ను ముందు వుంచి తాను నా వెనుకకు జరిగాడు జైలుకు సంబంధించి పంజరం వంటి వాహనం దగ్గరకు తీసుకు వెళ్లి యిందులో కూర్చోమని చెప్పాడు నేను కూర్చున్నాను వెంటనే ఆ వాహనం జోహన్స్‌బర్గ్‌కు బయలు దేరింది

జైల్లో నా బట్టలు విప్పించివేశారు జైల్లో ఖైదీలను నగ్నంగా వుంచుతారని విన్నాను వ్యక్తిగతంగా అవమానం కలిగించనంతవరకు, మతరీత్యా వ్యతిరేకంకానంత వరకు జైలు నియమాల్ని పాటించాల్సిందేనని ముందుగా నిర్ణయించుకున్నాము అక్కడ ధరించుటకు నాకు యిచ్చిన దుస్తులు మురికిగా వున్నాయి వాటిని ధరించడానికి నా మనస్సు అంగీకరించలేదు కాని ఆ దుస్తులు ధరించాను మనస్సును ఒప్పించాను దుఃఖం కలిగినా, జైల్లో మురికిని సహించక తప్పదని నా మనస్సుకు నచ్చ చెప్పాను నా పేరు, అడ్రసు వ్రాసుకున్న తరువాత నన్ను ఒక పెద్ద కొట్లోకి తీసుకు వెళ్లారు కొద్ది సేపు నేను అందులో వున్నాను యింతలో నా అనుచరులు కూడా నవ్వుతూ మాట్లాడుకుంటూ అక్కడికి వచ్చారు నేను వచ్చిన తరువాత వాళ్లకేసులు ఎలా నడిచాయో ఏమేమి జరిగిందో సవివరంగా నాకు చెప్పారు నా కేసు పూర్తి అయి నాకు శిక్ష విధించబడిన తరువాత కొంతమంది భారతీయులు నల్లజండాలు పట్టుకొని ఊరేగింపు జరిపారనీ, కొంతమంది ఉత్తేజితులైనారని వారివల్ల తెలిసింది పోలీసులు ఊరేగింపును ఆపి యిద్దరు

ముగ్గురిని లారీలతో కొట్టారని కూడా తెలిసింది అయితే మమ్మలందరినీ ఒకే జైల్లో ఒకేచోట వుంచారు అందుకు చాలా సంతోషించాము

సాయంత్రం 6 గంటలకు మా కొట్టు తలుపులు మూసి వేశారు దక్షిణాఫ్రికాయందలి జైళ్ల తలుపులకు యినుపగడియలు, ఇనుప కడ్డీలు వుండవు గోడకు పై భాగాన ఒక చిన్న జాలీతో కప్పబడిన కిటికీ గాలి కోసం వుంది అందువల్ల తలుపులు మూసేసరికి గల్లాపెట్టెలో పెట్టిమూసి వేసినట్లు మాకు అనిపించింది జైలు అధికారులు రామసుందర్ పండితునికి చేసిన ఆదరసత్కారం మాకు చేయలేదని పాఠకులు గ్రహింతురుగాక యిందు ఆశ్చర్యం ఏమీ లేదు రామసుందరపండితుడు ప్రథమ సత్యాగ్రహఖైదీ అతడితో ఎలా వ్యవహరించాలో అధికారులకు బోధపడియుండదు మా సంఖ్య ఎక్కువగా వున్నది యింకా చాలా మందిని ప్రభుత్వం నిర్బంధంలోకి తీసుకోవాలి మమ్మల్ని హబ్షీల వార్డులో వుంచారు దక్షిణాఫ్రికాయందలి ఖైదీలలో రెండు వర్గాలు వుంటాయి తెల్లవాళ్లు, నల్లవాళ్లు (హబ్షీలు) భారతీయ ఖైదులను కూడా హబ్షీ వర్గంలో చేర్చారు నా అనుచరులందరికీ నా వలెనే రెండు మాసాల సామాన్య జైలు శిక్ష విధించబడింది

రెండో రోజు ఉదయం సామాన్య ఖైదు శిక్ష పొందిన ఖైదీలు తమ సొంత దుస్తుల్ని ధరించవచ్చునని, తమ బట్టలు ధరించడం వారికి యిష్టంలేక పోతే ఖైదీలకు యిచ్చే ప్రత్యేక దుస్తులు ధరించవచ్చునని తెలిసింది అయితే మేము సొంత దుస్తులు ధరించవద్దని, జైల్లో వున్నంత కాలం జైలు దుస్తులే ధరించాలని నిర్ణయానికి వచ్చాం మా నిర్ణయాన్ని జైలు అధికారులకు తెలియ చేశాం మాకు సామాన్య ఖైదీలు ధరించే హబ్షీవారి దుస్తులు అందాయి అసలు సామాన్య జైలు శిక్ష విధించబడిన ఖైదీలు పెద్ద సంఖ్యలో దక్షిణాఫ్రికాజైళ్లలో వుండరు అందువల్ల అట్టిదుస్తుల కొరత జైల్లో ఏర్పడింది తగాదా పడటం మాకు యిష్టంలేదు అందువల్ల పెద్దశిక్ష పడ్డ హబ్షీఖైదీలదుస్తులు ధరించడానికి మేము అంగీకరించాము ఆ తరువాత జైలుకు వచ్చిన భారతీయులు యిట్టి దుస్తులు ధరించకుండా తమ సొంత దుస్తులే

ధరించారు అది నాకు యిష్టంకాకపోయినా, యిట్టి విషయంలో పట్టుదల అనవసరమని భావించాను రెండు, మూడు రోజులకు సత్యాగ్రహఖైదీల సంఖ్య బాగా పెరిగిపోయింది వారు కావాలనే శిక్ష పొంది జైలుకు వచ్చారు వారిలో ఎక్కువ మంది కేకలు పెట్టి వస్తువులు అమ్ముకునే వారే దక్షిణాఫ్రికాలో యిలా వీధుల వెంట తిరిగికేకలు బెట్టి వస్తువులు అమ్ముకునే వారు తెల్లవారైనా సరే నల్లవారైనా సరే ప్రభుత్వం దగ్గర అనుమతి పత్రం తీసుకోవాలి దాన్ని తమ దగ్గర భద్రంగా వుంచుకోవాలి పోలీసులు అడిగినప్పుడు వాళ్లకు చూపిస్తూ వుండాలి రోజూ పోలీసులు అలా అడిగిచూపించని వారిని జైల్లో పెడుతూ వుంటారు మమ్మ నిర్బంధంలోకి తీసుకున్న తరువాత భారతీయులంతా జైళ్లకు వెళ్లాలని నిశ్చయించుకొన్నారు వారిలో అధిక సంఖ్యాకులు యిట్టి వ్యాపారస్థులే అరెస్టు కావడం వాళ్లకు తేలికే అనుమతి పత్రం చూపించకపోతే చాలు వాళ్లను వెంటనే జైలుకు పంపుతారు ఒక్కవారంలో యిట్టి ఖైదీల సంఖ్య 100కు పెరిగింది రోజూ ఖైదీలు వస్తూ వున్నారు కనుక పత్రికల అవసరం లేకుండా బయటి సమాచారం మాకు అందుతూనే వున్నది యీ విధంగా రోజురోజుకీ సత్యాగ్రహుల సంఖ్య పెరుగుతూ వుండే సరికి మేజిస్ట్రేటుకు క్రొత్త ఆదేశం అందింది యిక సత్యాగ్రహులకు సామాన్య ఖైదు శిక్షకు బదులు కఠోర శిక్ష విధించమనునదే ఆ ఆదేశం అప్పటినుంచి అందరికీ కఠోరశిక్ష విధించారు తరువాత జరిగిన పోరాటాల్లో పాల్గొన్న వందలాది భారతీయ సత్యాగ్రహులకు, వాళ్లు స్త్రీలైనా సరే, పురుషులైనా సరే సామాన్య ఖైదుకు బదులు కఠోర శిక్షయే విధించారు అయినా భారతీయులు అధిక సంఖ్యలో జైళ్లకు రావడం గొప్ప చమత్కారమే

జోహన్సు బర్గ్ జైల్లో వున్న ఖైదీలకు రోజూ ఉదయం మొక్కజొన్నల పిండితో తయారుచేసిన సంకటియో లేక గంజియో ఉప్పు కలపకుండా అందజేసే వారు ఉప్పు విడిగా అందజేసేవారు మధ్యాహ్నం 12 గంటలకు నాలుగు ఔన్సులు అన్నం, విడిగా కొద్ది ఉప్పు, ఒక ఔన్సు నెయ్యి, నాలుగు

జొన్నల డబల్ రొట్టె ఆహారంగా యిచ్చేవారు సాయంత్రం మొక్కజొన్నల పిండితో తయారైన సంకటి, లేక గంజి, కొద్దిగాకూర, ముఖ్యంగా బంగాళా దుంపలు యిచ్చే వారు పెద్దవైతే ఒక బంగాళా దుంప చిన్నవైతే రెండు దుంపలు యిచ్చేవారు యీ భోజనంతో ఎవ్వరికడుపూ నిండేదికాదు బియ్యం వండితే మెత్తబడేది జైలు డాక్టర్ని పిలిచి మసాలా దినుసులు యిమ్మని కోరాం భారతదేశంలో యిస్తారని చెప్పాం "ఇది భారత దేశం కాదు ఖైదీలకు నోటి రుచితో సంబంధం లేదు అందువల్ల మసాలా దినుసులు యివ్వడానికి వీలులేదు" అని గట్టిగా అరిచాడు డాక్టరును వ్యతిరేకించాము యిది రుచికి సంబంధించిన వ్యవహారం కాదు శరీరానికి కావలసిన అవసరమైన తత్వాలకు సంబంధించిన విషయం యీ భోజనం వల్లఅట్టి తత్వాలు లభించవు కదా డాక్టరు యీ విధంగా ఆలోచించలేదు నిరాకరించడమే అతడిపని జైలు సూపరింటెంటు మాకోరికను అంగీకరించి మీ భోజనం మీరే తయారు చేసుకోమని చెప్పాడు అందుకు అవసరమైన ఏర్పాట్లు చేశాడు అయితే వస్తువులు అందజేసే జైలు అధికారులకు, మనవాళ్లకు వస్తువుల ఎక్కువ తక్కువలను గురించి ఘర్షణ జరుగుతూ వుండేది వారానికి రెండు రోజులు కూరలు తయారు చేస్తారు అప్పుడు రెండుసార్లు వంటచేసేవాళ్లు మిగతా రోజుల్లో ఒక సారే వంట చేసేవాళ్లు మధ్యాహ్న భోజనమప్పుడే మరో పదార్థం చేసుకోడానికి అంగీకరించేవాళ్లు వంట పని మన వాళ్ల చేతుల్లోకి వచ్చాక అంతా సంతోషంగా భోజనం చేయసాగారు

ఇటువంటి సౌకర్యాలు లభించినా, లభించకపోయినా శిక్షను అనుభవించవలసిందే సత్యాగ్రహఖైదీల సంఖ్య 150 వరకు పెరిగింది మేమంతా సామాన్య ఖైదీలం కనుక గదులు శుభ్రంచేసుకోవడం మాత్రమే మా పని అందువల్ల మేము జైలు సూపరింటెండెంటును ఏమైనా పని యిమ్మని కోరాము అందుకు ఆయన అంగీకరించలేదు. నేను మీకు పని అప్పగించితే నాకు శిక్ష పడుతుంది కావున గదులు ఎక్కువ సేపు పరిశుభ్రం

చేసుకోండి అని ఆయన చెప్పాడు అయితే మా చేత కవాతు చేయించండి అని అన్నాము పెద్ద శిక్షపడ్డ హబ్షీలు కవాతు చేస్తూ వుండటం మేము చూచాము మీ కోరికను అంగీకరిస్తే నాకు మంచిదే మీఖైదీల సంఖ్య పెరిగినందున వార్డరుకు పనిభారం పెరిగింది నేను అతడికి ఆర్డరు వేయను అతడు కవాతు చేయిస్తానంటే నాకేమీ అభ్యంతరం లేదు అని సూపరింటెండెంటు అన్నాడు వార్డరు మంచివాడు సూపరింటెండెంటు అనుమతి అతడికి కావాలి ప్రతిరోజూ ఉదయం శ్రద్ధగా మా చేత కవాతు చేయించసాగాడు మా గదుల ముందు గల కొద్ది ప్రాంగణంలోనే మేము కవాతు చేయాలి అందువల్ల మేము గుండ్రంగా తిరుగుతూ వుండాల్సి వచ్చింది మా ఫరాన్ అనుచరుడు నవాబ్ ఖాన్ వార్డరు వెళ్లాక మాచేత కవాతు చేయిస్తూ వుండేవాడు కవాతుకు సంబంధించిన ఇంగ్లీషు శబ్దాల్ని ఉర్దూ ఉచ్చారణతో పలికి మమ్మల్ని బాగా నవ్విస్తూ వుండేవాడు "స్టాండ్ ఎట్ ఈజ్'ను 'టండలీస్' అని అనేవాడు టండలీస్ అంటే ఏమిటో ముందు మాకు అర్థం కాలేదు అయితే ఆ తరువాత యిది హిందూస్తానీ శబ్దం కాదని, నవాబ్ ఖాన్ ఇంగ్లీషు అని తెలుసుకొని నవ్వుకున్నాం

★ ★ ★

## 21

## మొదటి ఒడంబడిక

ఈ విధంగా మేము జైల్లో సుమారు 15 రోజుల పాటు వున్నాము యింతలో బైటినుంచి వచ్చిన క్రొత్తవాళ్లు ప్రభుత్వంతో ఏదో ఒడంబడిక జరుపుకొనుటకు ప్రయత్నం సాగుతున్నదని సమాచారం తెచ్చారు రెండు మూడు రోజుల తరువాత జోహన్స్‌బర్గ్ నుంచి వెలువడే ట్రాన్సువాల్ లీడర్ అను దిన పత్రికా సంపాదకుడు శ్రీ అలబర్ట్ కార్ట్రైట్ నన్ను కలుసుకోవాలని, జైలుకు వచ్చాడు ఆ రోజుల్లో జోహన్స్ బర్గ్ నుంచి వెలువడే దినపత్రికలన్నిటి యాజమాన్యం బంగారం గనుల ఏదో ఒక యజమాని చేతిలో వుండేది

ఆ యజమానులకు సంబంధించిన స్వార్థ వ్యవహారంలో దప్పమిగతా వ్యవహారాలన్నింటి విషయంలో ఆయా పత్రికా సంపాదకులు స్వతంత్రంగా సంపాదకీయాలు వ్రాస్తూ వుండేవారు యీ పత్రికా సంపాదకులు విద్వాంసులు ప్రఖ్యాతి చెందిన ప్రముఖులనుంచి ఎన్నుకోబడుతూ వుండేవారు ఉదాహరణకు ది డైలీస్టార్ అను దినపత్రికా సంపాదకుడు ఒకప్పుడు లార్డ్ మిల్నరుకు ఆంతరంగిక సెక్రటరీగా పని చేస్తూ వుండేవాడు తరువాత ఆయన టైమ్సు అనుపత్రికా సంపాదకుడుగా పని చేసిన శ్రీ బకల్‌కు బదులు, ఆ పత్రికా సంపాదకుడుగా పనిచేయుటకు ఇంగ్లాండు వెళ్లాడు శ్రీ ఆల్బర్ట్ కార్ట్‌రైట్ యోగ్యుండేగాక ఉదార హృదయుడు కూడా ఆయన వ్యాసాలు వ్రాసి భారతీయుల్ని సమర్థించాడు ఆయనకు, నాకు గాఢమైన స్నేహం ఏర్పడింది నేను జైలుకు వెళ్లిన తరువాత ఆయన జనరల్ స్మట్సును కలిశారు ఒడంబడిక నిమిత్తం వారి మధ్యవర్తిత్వాన్ని జనరల్ స్మట్స్ అంగీకరించాడు

భారతీయ నాయకుల్ని కూడా ఆయన కలుసుకోగా చట్టానికి సంబందించిన సూక్ష్మాలు మాకు తెలియవు గాంధీ జైల్లో వుండగా, మేము ఒడంబడికను గురించి మాట్లాడటం జరుగదు ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకోవడం మాకు యిష్టమే కాని మా వాళ్లను జైల్లో బంధించి ప్రభుత్వం ఒడంబడిక చేసుకోవాలని అనుకుంటే జైలుకు వెళ్లి గాంధీని కలువ వలసిందే" అని వాళ్లు స్పష్టంగా చెప్పారు

ఈ విధంగా శ్రీ కార్ట్‌రైట్ నన్ను కలుసుకొనేందుకు వచ్చారు వారు ఒడంబడికకు సంబంధించిన ముసాయిదా తెచ్చారు జనరల్ స్మట్స్ దాన్ని తయారు చేశారని లేక వారు ఆమోదించారని చెప్పవచ్చు ఆముసాయిదా నాకు నచ్చలేదు దానియందలి భాష అస్పష్టంగా వున్నది అయితే ఒక్క మార్పు చేస్తే నేను స్వయంగా దాని మీద సంతకం చేయడానికి సిద్ధపడ్డాను అయితే బైటి భారతీయుల అనుమతి లభించినా, జైల్లో వున్న నా అనుచరుల అభిప్రాయం తెలుసుకోకుండా నేను ఒడంబడిక ముసాయిదా మీద సంతకం చేయలేను అని వారికి చెప్పి వేశాను

భారతీయులు స్వేచ్ఛగా తమ అనుమతి పత్రాలు మార్చుకోవాలి యీ పనిని చట్టం ప్రకారం చేయడానికి వీలు లేదు ఆ పత్రంలో వ్రాసే విషయాన్ని భారతీయులతో చర్చించి ప్రభుత్వం తయారు చేస్తుంది భారతీయులు స్వేచ్ఛగా పత్రాలు తీసుకుంటే, ప్రభుత్వం రక్తపు చట్టాన్ని రద్దు చేస్తుంది స్వేచ్ఛగా తీసుకున్న అనుమతి పత్రాలకు చట్టబద్ధత కల్పించుటకు క్రొత్త చట్టాన్ని ప్యాసు చేస్తుంది యిదీ ఆ ముసాయిదా సారాంశం అయితే రక్తపు చట్టాన్ని రద్దు చేస్తుంది అని స్పష్టంగా వ్రాసి లేదు ఆ మాట స్పష్టంగా వ్రాయాలని చెప్పాను

శ్రీ ఆల్బర్ట్ కార్ట్ రైట్‌కు యీ మాత్రం మార్పు చేయడం కూడా యిష్టం కాలేదు "ఈ ముసాయిదాయే చివరిదని జనరల్ స్మట్స్ చెప్పారు నేను కూడా స్వయంగా దీన్ని అంగీకరించాను ఒక్క విషయం స్పష్టంగా చెబుతున్నాను మీరంతా స్వేచ్ఛగా పత్రాలు తీసుకుంటే రక్తపు చట్టం రద్దయినట్లేనని భావించండి" అని అన్నాడు

"ఒడంబడిక జరిగినా, జరుగక పోయినా, మీరు చూపిన సానుభూతికి, మీరు చేసిన సహాయానికి సదాకృతజ్ఞులంగా వుంటాము నేను ముసాయిదాలో అనవసరమైన మార్పు ఒక్కటికూడా కోరలేదు ఏ భాషవల్ల ప్రభుత్వ ప్రతిష్ఠ రక్షింపబడుతుందో దాన్ని నేను వ్యతిరేకించను కాని స్వయంగా నాకే అర్థాన్ని గురించి సందేహం కలిగితే ఆ భాషను మార్చమని సూచించవలసిందే కదా! ఒడంబడిక జరగాలంటే రెండు పక్షాలకు, ముసాయిదాలో మార్పు చేసే అధికారం వుండితీరాలి యీ ముసాయిదాయే చివరిది అని జనరల్ స్మట్సు మా ఎదుట పిస్తోలు ఎక్కుపెట్టకూడదు రక్తపు చట్ట రూపంలో మా వైపు పిస్తోలును ఎక్కు పెట్టి వుంచారు అట్టి స్థితిలో రెండోపిస్తోలును ఎక్కుపెడితే దానికి విలువ ఏముంటుంది అని నేను అన్నాను

శ్రీ కార్ట్‌రైట్ నాయీ మాటను కాదనలేక పోయారు నేను సూచించిన మార్పును జనరల్ స్మట్సుకు తెలియజేస్తానని అంగీకరించారు

జైల్లో నాతో బాటు వున్న వారినందరినీ పిలిచి వివరమంతా చెప్పాను వారికి కూడా ముసాయిదా యందలి భాష నచ్చ లేదు అయితే మీరు

సూచించిన మార్పును జనరల్ స్మట్సు అంగీకరిస్తే ఒడంబడిక చేసుకుందాం అని వారంతా చెప్పారు క్రొత్తగాజైలుకు వచ్చిన సత్యాగ్రహుల ద్వారా బయట వున్న భారతీయులు ఒడంబడిక మంచిగా వుంటే మీరు అంగీకరించండి మా కోసం ఆగవద్దు అని తమ సందేశం పంపించారు ఆ ముసాయిదా మీద నేను శ్రీ క్విన్, తంబి నాయుడు సంతకం చేశాము మా ముగ్గురి సంతకాలతో వున్న ముసాయిదాను శ్రీ కార్ట్ రైటుకు అందజేశాము

రెండో లేక మూడో రోజున 1908 జనవరి 30 వ తేదీనాడు జోహన్స్‌బర్గ్ పోలీసు సూపరింటెండెంట్ శ్రీ వర్మన్ నన్ను జనరల్ స్మట్సు దగ్గరికి ప్రిటోరియా తీసుకొని వెళ్లాడు మేమిద్దరం చాలా సేపు మాట్లాడాము శ్రీ కార్ట్ రైటు తనకు చెప్పిన వివరాలు స్మట్సు నాకు చెప్పాడు నేను జైలుకు వెళ్లిన తరువాత కూడా భారత జాతితమ పట్టు మీద నిలబడియున్నందుకు స్మట్సు నన్ను అభినందించాడు "నామనస్సులో మీ యెడ ఎన్నడూ కోపం గాని, ఏహ్యాభావంగాని వుండనే వుండదు నేను కూడా బారిష్టరు నని మీకు తెలుసు నాతోబాటు కొంత మంది భారతీయులు కూడా చదువుతూ వుండెవారు నేను నా కర్తవ్యాన్ని పాలిస్తున్నాను తెల్లవారు యీ చట్టాన్ని కొరుతున్నారు యీ చట్టాన్ని కోరుతున్నవారిలో బోయర్లు లేరని, తెల్లవారు మాత్రమే వున్నారని కూడా మీకు తెలుసు ముసాయిదాలో మీరు సూచించిన మార్పును నేను అంగీకరిస్తున్నాను యీ విషయం నేను జనరల్ బోథాతో కూడా మాట్లాడాను మీలో ఎక్కువ మంది పత్రాలను తీసుకుంటే నేను ఏషియాటిక్ చట్టాన్ని రద్దు చేస్తాను స్వేచ్ఛగా తీసుకున్న పత్రాలకు చట్టబద్ధత కల్పించే చట్టముసాయిదాను నేను తయారు చేస్తాను దాని ప్రతిమీకు పరిశీలనార్థం ముందుగా పంపుతాను యీ పోరాటం పునరావృతం కావడం నాకు యిష్టం లేదు మీ భావాలను ఆదరించాలని నేను భావిస్తున్నాను" అని స్మట్సు అన్నాడు

ఈవిధంగా సంభాషణ జరిగిన తరువాత జనరల్ స్మట్సు లేచాడు "ఇప్పుడు నేను ఎక్కడికి వెళ్లాలి? నాతో బాటు వున్న మిగతా ఖైదీల విషయం ఏమిటి?" అని నేను అడిగాను

జనరల్ స్మట్సు నవ్వుతూ "మీరు యిప్పటి నుంచే ముక్తులు మీ అనుచరుల్ని రేపు విడుదల చేయమని ఫోను చేసి చెబుతాను ఒక్క సలహా మీరు సభలు ప్రదర్శనలు చేయకండి అలా చేస్తే ప్రభుత్వం యిబ్బందుల్లో పడుతుంది" అని అన్నాడు

"కేవలం ఉత్సవం కోసం ఒక్క సభకూడా జరుగనీయను మీరు నమ్మండి అయితే ప్రభుత్వంతో ఒడంబడిక ఎలా జరిగిందో, దాని స్వరూపం ఏమిటో, ఒడంబడిక జరగడంవల్ల భారతీయుల బాధ్యత ఎంత పెరిగిందో జాతి ప్రజలకు సభలు చేసి నేను చెప్పాలి గదా" అని సమాధానం యిచ్చాను అటువంటి సభలు ఎన్నైనా చేసుకోండి నా అభిప్రాయాన్ని మీరు గ్రహించారు చాలు" అని స్మట్సు అన్నాడు

అప్పుడు సాయంత్రం 7 గంటలైంది నా దగ్గిర ఒక్క పైసా కూడా లేదు జనరల్ స్మట్సు గారి సెక్రటరీ జోహన్స్‌బర్గ్ వెళ్లుటకు అవసరమైన రైలు చార్జీ నాకు యిచ్చాడు ప్రిటోరియా యందలి భారతీయులను కలిసి వారికి ఒడంబడిక విషయం చెప్పవలసిన అవసరం అంతగాలేదు నాయకులంతా జోహన్స్ బర్గ్‌లో వున్నారు మా కేంద్ర కార్యాలయం కూడా అక్కడే వున్నది జోహన్స్ బర్గ్ వెళ్లే రైలు ఆరోజున యిక ఒక్కటే వున్నది నేను దాన్ని అందుకున్నాను

★ ★ ★

# 22

# ఒడంబడికకు వ్యతిరేకత

రాత్రి సుమారు 9 గంటలకు నేను జోహన్స్ బర్గ్ చేరాను తిన్నగా అధ్యక్షులు సేఠ్ ఈసప్‌మియాఁ గారింటికి వెళ్లాను నన్ను ప్రిటోరియా తీసుకు వెళ్లిన విషయం వారికి అప్పటికే తెలిసింది అందువల్ల వారు నా కోసం ఎదురు చూస్తున్నారు ఒంటరిగా నన్ను చూచి వారు ఆశ్చర్య పడ్డారు సంతోషించారు కూడా. సాధ్యమైనంత మందిని పిలిచి యిప్పుడే సభ జరపడం

మంచిదని చెప్పాను ఈసప్‌మియాం, మరియు యితర మిత్రులకు నా సలహానచ్చింది ఎక్కువమంది ఒకే పేటలో వుంటున్నారు అందువల్ల అందరికీ సమాచారం పంపడం తేలికయే అధ్యక్షుని యిల్లు మసీదుకు దగ్గరలో వున్నది మా సభలు సామాన్యంగా మసీదునందలి మైదానంలోనే జరుగుతూ వుంటాయి అందువల్ల సభ కోసం ప్రత్యేక ఏర్పాట్లు చేయనవసరం లేదు వేదిక మీద ఒక దీపం వుంచితే చాలు రాత్రి 11 లేక 12 గంటలకు సభజరిగింది అయినా సుమారు వెయ్యిమంది వచ్చి సభలో పాల్గొన్నారు

సభకు ముందుగా అక్కడ వున్న పెద్దలకు ఒడంబడికకు సంబంధించిన వివరాలు చెప్పాను కొంతమంది నాయకులు ఒడంబడికను వ్యతిరేకించారు అయితే పూర్తి వివరాలు చెప్పిన మీదట వారు అంగీకరించారు అయితే అందరినీ ఒక సందేహం పట్టుకున్నది "జనరల్ స్మట్సు మోసం చేస్తే ఏమి చేయడం? రక్తపు చట్టం అమలులోకి రాక పోయినా, మననెత్తి మీద కత్తిలా వ్రేలాడుతూ వున్నదిగదా! యీ లోపున స్వేచ్ఛగా అనుమతి పత్రాలు మనం తీసుకుంటే మన చేతులు మనం నరుక్కున్నట్లే అవుతుంది ఆ చట్టాన్ని వ్యతిరేకించే మహత్తరమైన ఒక్కగానొక్క ఆయుధం మన చేయి జారిపోతుంది యిది చూస్తూ చూస్తూ శతృవు పరిచిన వలలో చిక్కుకోవడమే అవుతుంది ముందు రక్తపు చట్టం రద్దు కావాలి తరువాత మనం పత్రాలు తీసుకోవాలి అని తమ అభిప్రాయం తెలియజేశారు వాళ్లు చెప్పిన మాట నాకు సరియైనదేనని అనిపించింది ఆ విధంగా చెప్పిన వారి తెలివి తేటలయెడ ఎంతో గౌరవంనాకు కలిగింది సత్యాగ్రహులు యిలా వుండాలని నాకు అనిపించింది

నాయకులు చెప్పిన మాటలకు సమాధానం యిలా యిచ్చాను "మీరు చెప్పింది నిజం దాన్ని గురించి గంభీరంగా యోచించ వలసిందే. రక్తపు చట్టం రద్దయిన తరువాతనే మనం పత్రాలు తీసుకోవాలి. యింతకంటే మంచి మాట మరొకటి లేదు. అయితే యిది ఒడంబడిక లక్షణం కాదని నా అభిప్రాయం సిద్ధాంత రీత్యా ఒప్పందం కుదిరినప్పుడు మిగతా విషయాల

విషయంలో యిచ్చి పుచ్చుకోవడం అనేది ఒకటి వుంటుంది రక్తపు చట్టం ముందు తలవంచి ఆ ప్రకారం మనం నడుచుకోము సిద్ధాంతాన్ని పాటించి తీరాలి రెండో వైపున ప్రభుత్వం కోరుతున్నదేమిటో యోచిద్దాం ట్రాన్స్‌వాల్‌లో భారతీయులు చట్ట విరుద్ధంగా ప్రవేశిస్తున్నారు దాన్ని అరికట్టుటకు స్వేచ్ఛగా భారతీయులు ప్రవేశ పత్రాల్ని తీసుకుంటే పని తేలిక అవుతుంది యిందువల్ల తెల్ల వాళ్ల అనుమానం తీరుతుంది ప్రభుత్వం తన యీ కోరికను విడనాడదు ఆచరణలో యీ ప్రభుత్వ కోరికను మనం అంగీకరిద్దాం అందుకు బలవత్తరమైన మరో కారణం ఏమీ దొరకనంత వరకు మనం దాన్ని ఉల్లంఘించలేము రక్తపు చట్టం మనకు కళంకం వంటిది దాన్ని తుడిచి వేయుటకు యీ పద్ధతిని సత్యాగ్రహంలంగా అంగీకరిద్దాం"

మరో విషయం రక్తపుచట్టం రద్దు కానంతవరకు మన చేతుల్ని మనమే ఎందుకు నరుక్కోవడం? మన ఆయుధాన్ని ఎందుకు వదలుకోవడం? దీనికి సమాధానం ఒక్కటే సత్యాగ్రహి భయాన్ని వదిలి వేయాలి 20 సార్లు శత్రువు నమ్మక ద్రోహం చేసినప్పటికీ 21 వసారి శత్రువును సత్యాగ్రహి విశ్వసిస్తాడు విశ్వాసమనేదే సత్యాగ్రహి ఆయుధం శత్రువును సైతం విశ్వసించడమంటే మన చేతుల్ని ననరుక్కోవడమేనని భావించడం సరికాదు మరో విషయం మనం స్వేచ్ఛగా పత్రాలు తీసుకుంటాం అయినా ప్రభుత్వం రక్తపు చట్టాన్ని రద్దు చేయదు అప్పుడు మనం వూరుకుంటామా? సత్యాగ్రహం చేయమా? పత్రాలు తీసుకున్న తరువాత కూడా అవసరమైనప్పుడు వాటిని మనం చూపించక పోతే ప్రభుత్వం కోరిక నెరవేరదు కదా మనం యిలా చేస్తే ప్రభుత్వం రహస్యంగాలోనికి దూరుతున్న భారతీయుల్ని గుర్తించలేదు. అందువల్ల చట్టం వున్నాలేకపోయినా మన సహకారం లేనిదే ప్రభుత్వం పని సాగదు చట్టం ప్రకారం నడుచుకోకపోతే ప్రభుత్వం శిక్షిస్తుంది శిక్ష అనుభవించుటకు మనం సిద్ధపడతాం. సామాన్యంగా మనిషి శిక్షపడుతుందనే భయంతో చట్టానికిలోబడి నడుచుకుంటాడు. అయితే సత్యాగ్రహి యిందుకు భిన్నంగా నడుచుకుంటాడు. అంకుశాన్ని చట్టభయంవల్లకాక, లోకానికి మేలు

జరుగుతుందనే భావంతో అంగీకరిస్తాడు యీ నాటి మనస్థితి యిదే ఎంత నమ్మకద్రోహం చేసినా ప్రభుత్వం యీ స్థితిని మార్చలేదు స్థితిని కల్పించేది మనం మార్చేదీమనమే మన చేతుల్లో సత్యాగ్రహ ఆయుధం వున్నంత వరకు మనం నిశ్చింతగాను నిర్భయంగాను వుండవచ్చు

ఇప్పుడు మన జాతికి లభించిన బలం యిక ముందు లభించదు అని ఎవరైనా అంటే అతడికి సత్యాగ్రహశక్తి ఏమిటో తెలియదని అనుకోవాలి యీనాటి జాతి బలం కృత్రిమమైనది అది నిలిచేది కాదు క్షణికం అనే గదా దాని అర్థం యిదే నిజమైతే జయం పొందే అధికారం మనకు లేనట్లే ఒక వేళ గెలిచినా ఆ జయాన్ని ఎంతో కాలం నిలబెట్టుకోలేము ప్రభుత్వం రక్తపు చట్టాన్ని రద్దు చేసిన తరువాత మనం పత్రాలు తీసుకున్నాం అని అనుకుందాం తీరా పత్రాలు తీసుకున్న తరువాత ప్రభుత్వం మళ్లీ రక్తపు చట్టాన్ని అమలు చేస్తే ఎవరు ఆపగలరు? మన శక్తి మీద మనకు నమ్మకంలేకపోతే రేపైనా అంతేగదా! అందువల్ల యీ ఒడంబడిక వల్ల మన జాతికి నష్టం లేదు లాభమే కలుగుతుంది మనం న్యాయంగాను, వినమ్రంగాను వ్యవహరిస్తే మన శతృవులు కూడా తగ్గుతారు తగ్గక తప్పదు"

ఇంత చెప్పినప్పటికీ ఒకరిద్దరిని ఒప్పించలేక పోయాను అర్ధరాత్రి సభలో పెద్ద ప్రమాదం ముంచుకురానున్నదని నేను గ్రహించ లేకపోయాను ఒడంబడికను గురించి, అందలి షరతులను గురించి చెప్పి యిలా అన్నాను "మనజాతి బాధ్యత యిప్పుడు బాగా పెరిగింది మనం రహస్యంగా ఒక్క భారతీయుణ్ణి కూడా ట్రాన్స్‌వాల్‌లోకి రానివ్వం అని తెలుపుటకు, అందరం అనుమతి పత్రాలు తీసుకుందాం ఎవరైనా తీసుకోకపోతే వారికి ఏ విధమైన శిక్షపడదు. పత్రాలు తీసుకోకపోతే మన జాతి ఒడంబడికను అంగీకరించడం లేదని తేలుతుంది అందువల్ల మీరు మీ చేతులెత్తి యీ ఒడంబడికకు అనుకూలాన్ని తెలుపండి. చేతులెత్తిన వారంతా పత్రాలు యివ్వడం ప్రారంభించగానే వెళ్లి తీసుకోవాలని కోరుతున్నాను యిప్పటి వరకు మీలో చాలా మంది వాలంటీర్లుగా వుండి పత్రాలు తీసుకోవద్దని ప్రచారం చేశారు

అదేవిధంగా యిప్పుడు పత్రాలు తీసుకోమని ప్రచారం చేయాలి మనం మనకర్తవ్యాన్ని నెరవేరుద్దాం జయం తప్పక లభిస్తుంది"

నా ప్రసంగాన్ని పూర్తి చేయగానే ఒక పఠాన్ మిత్రుడు (మీర్ ఆలం) లేచి నిలబడి నా మీద ప్రశ్నల వర్షం కురిపించాడు ఈ ఒడంబడిక ప్రకారం మనం పదివ్రేళ్ల ముద్రలు వేయడం అవసరమవుతుందా? అని సూటిగా ప్రశ్నించాడు

వున్నది అని లేదు అనీ చెప్పవచ్చు పదివ్రేళ్ల నిశానీ వేద్దామనే నా సలహా మతరీత్యా యిది తప్పని భావించినా, అవమానకరమని భావించినా అట్టివారు వేయనవసరం లేదు మానుకోవచ్చు" అని చెప్పాను

"మీరు స్వయంగా ఏం చేస్తారు?" పది వ్రేళ్లతో ముద్రవేయడానికి నిర్ణయించుకున్నాను నేను ముద్రవేయకుండా యితరుల్ని ముద్ర వేయమని చెప్పలేను" అని అన్నాను

మీరు పదివ్రేళ్ల ముద్రల్ని గురించి గతంలో తెగ వ్రాశారు. యిది అపరాధులు చేయవలసిన పని అని మీరే నేర్పారు మన జాతి పోరాటం పదివ్రేళ్ల నిషానీతోనే అని కూడా మీరే చెప్పారు అదంతా యివాళ ఏమైంది?"

"పదివ్రేళ్ల ముద్రల్ని గురించి గతంలో వ్రాసిన వ్రాతల మీద యీనాడూ నేను నిలుస్తున్నాను భారత దేశంలో యీ విధంగా అపరాధం చేసినవారిచేతనే ముద్రలు వేయిస్తూ వుంటారని చెప్పాను రక్తపు చట్టానికి అనుకూలంగా పదివ్రేళ్ల ముద్రలే కాదు, సంతకం చేయడం కూడా తప్పేనని యిప్పుడూ చెబుతున్నాను ఆ విషయాన్ని మన జాతి గుర్తించింది కాని యిప్పుడు పరిస్థితి మారింది నిన్నటి వరకు తప్పని అనిపించిన విషయం యిప్పుడు సజ్జనత్వానికి గుర్తు అని తేలింది మీరు నాకు సలాం చేసి, అందుకు బదులుగా సలాంచేయమని మీరు నన్ను వత్తిడి చేస్తే, నేను మీకు సలాం చేయడం సరికాదు అది భగవంతుని దృష్టిలో, నా దృష్టిలో సరి కాదు మిమ్మల్ని సోదరుడుగా భావించి, మనిషిగా గుర్తించి స్వేచ్ఛతో సలాంచేస్తే దానివల్ల నా గొప్పతనం వెల్లడి అవుతుంది దేవునిదర్బారులో అది

మంచితనంగా భావించబడుతుంది యీ కారణం వల్లనే నేను పదివ్రేళ్ల ముద్రవేయమని జాతికి సలహా యిస్తున్నాను"

"మీరు జాతిని మోసగించారని, జనరల్ స్మట్సు దగ్గర 15000 పౌండ్లు తీసుకొని జాతిని జనరల్ స్మట్సుకు అమ్మి వేశారని వింటున్నాము మేము పదివ్రేళ్ల ముద్రవేయం యింకొకరిని వేయనీయం దేవుడి ఒట్టు, ఏషియాటిక్ ఆఫీసులో అందరికంటే ముందు అడుగుపెట్టిన వాడి ప్రాణాలు తోడేస్తాను"

పరాన్ మిత్రుల భావాల్ని అర్థం చేసుకున్నాను లంచం తిని నేను నా జాతిని అమ్మివేస్తానని ఎవ్వరూ నమ్మరని విశ్వసిస్తున్నాను వేలిముద్రలు వేయడం యిష్టం లేని వాళ్లు వేయవద్దని ముందే చెప్పాను అట్టివారిని ఎవ్వరూ బలవంతం చేయరు వేలి ముద్రలు వేయకుండా పత్రాలు కావాలని అనుకుంటే, అట్టి వారు పత్రాలు తీసుకోవచ్చునని సభా ముఖంగా ప్రకటిస్తున్నాను కాని ప్రాణాలు తోడేస్తానని అన్న మాటను నేను అంగీకరించను దేవుని మీద ఒట్టు పెట్టి మరొకరిని చంపి వేస్తానని బెదిరించడం శుద్ధ తప్పు యీ మిత్రుడు క్షణిక ఆవేశంతో దేవుని మీద ఒట్టు పెట్టి యిటువంటి మాట అన్నాడని భావిస్తున్నాను యీ మిత్రుడు తన ఒట్టును అమలు బరిచినా, అమలు బరచక పోయినా, యీ ఒడంబడికకు అంగీకరించిన నేను అందరికంటే ముందు వేలిముద్రలు వేసి పత్రం తీసుకుంటానని ప్రకటిస్తున్నాను యిది నా కర్తవ్యమని భావిస్తున్నాను నన్నే మొట్టమొదట యీ పని చేయనీయమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను ఎవరైనా ఏదో ఒక రోజున చావవలసిందే కదా! రోగంతోగాని, మరింకే కారణం వల్లనైనాగాని చనిపోకుండా నా ఒక సోదరుని చేతిలో చనిపోవడం వల్ల నాకు దుఃఖం కలుగదు ఆ సమయంలో సైతం కోపం రాకుండా, అతని ఎడ శత్రుభావం లేకుండా వుంటే నా భవిష్యత్తు ఉజ్వలం అవుతుందని నమ్ముతున్నాను నేను పూర్తిగా నిర్దోషినని నన్ను చంపిన వాడు తరువాతనైనా తప్పక తెలుసుకుంటాడు" అని చెప్పాను

పరాను పై విధంగా ప్రశ్నించడానికి కారణం ఏమిటో పాఠకులు తెలుసుకోవాలి రక్తపు చట్టాన్ని భారతీయుల్లో కొందరు అంగీకరించారు. ఆ

చట్టాన్ని అంగీకరించిన వారిని ఎవ్వరూ ద్వేషించలేదు కాని వారి చర్యను ఖండించడం, ఇండియన్ ఒపీనియన్ పత్రికలో వ్రాయడం జరిగింది దాని వల్ల చట్టాన్ని అంగీకరించిన వారికి యిబ్బందులు కలిగిన మాట వాస్తవం ఎక్కువమంది భారతీయులు పట్టుమీద నిలబడియుండగలరని అట్టివారు భావించలేదు చివరికి యీ విషయమై ప్రభుత్వంలో ఒప్పందం జరుగుతుందని కూడా వాళ్లు అనుకోలేదు 160 మంది కంటే ఎక్కువమంది సత్యాగ్రహులు జైళ్లకు వెళ్లారు ప్రభుత్వానికి, జాతినాయకులకు మధ్య సంభాషణలు మొదలయ్యాయి ఆ చట్టానికి లొంగి వ్యవహరించిన వారికి యిదంతా నచ్చలేదు యీవిధంగా ఒప్పందానికి రావడం వాళ్లకు యిష్టం లేదు ఒక వేళ ఒప్పందం కుదిరినా దాన్ని చెడగొట్టి తీరాలనే నిర్ణయానికి వాళ్లు వచ్చారు

ట్రాన్స్‌వాల్‌లో వుండే పఠాన్ల సంఖ్య తక్కువే 50 మంది కంటే మించి యుండరు కొందరు బోయరు యుద్ధంలో సైనికులుగా చేరి పనిచేశారు యుద్ధ సమయంలో అక్కడికి వచ్చిన అనేక మంది తెల్లవారి వలెనే, సైనికులుగా వచ్చిన కొందరు పఠాన్లు తదితర భారతీయులు యుద్ధం తరువాత అక్కడే వుండిపోయారు వారిలో కొందరు పఠాన్లు నాకు వకాల్తా కూడా యిచ్చారు అందువల్ల వారితో నాకు మంచి సంబంధం ఏర్పడింది పఠాన్లు స్వతస్సిద్ధంగా అమాయకులు పరాక్రమవంతులు చంపడం, చావడం అంటే వాళ్లకు మంచి నీళ్ల ప్రాయం ఎవరి మీదనైనా వారికి కోపం వస్తే వాళ్లను బాదుతారు వాళ్ల బాషలో వారి వీపును వేడిచేస్తారన్న మాట అప్పుడప్పుడు ప్రాణాలు కూడా తీసివేస్తారు యిలాంటి విషయాల్లో నిష్పక్షపాతంగా వుంటారు సొంత అన్నదమ్ముల విషయంలో కూడా అలాగే వ్యవహరిస్తారు ట్రాన్స్‌వాల్‌లో వున్న పఠానులు సంఖ్యలో తక్కువగా వున్నా వారిలో వారికి కొట్లాటలు జరుగుతూ వుండేవి యిలాంటప్పుడు రెండు వర్గాల మధ్య శాంతిని నెలకొల్పవలసి వస్తూ వుండేది ఒక పఠాను మరో పఠానుకు నమ్మకద్రోహం చేస్తే యిక వారిని పట్టడం కష్టం అప్పుడు కొట్టుకు చావడమే వారికి తెలిసిన ఏకైక చట్టం

సత్యాగ్రహ పోరాటంలో పఠాన్లు బాగా పాల్గొనేవారు వారిలో ఒక్కరు కూడా రక్తపు చట్టానికి లొంగలేదు వాళ్లను మభ్యపెట్టడం తేలిక పదివ్రేళ్ల ముద్రల విషయంలో వాళ్లను కావాలని కొందరూ రెచ్చ గొట్టారు నేను లంచం తిననప్పుడు పదివ్రేళ్ల ముద్రల విషయం ఎందుకు ఎత్తినట్లు? కనుక యీవిధంగా పఠాన్ల హృదయంలో సందేహం కలిగించగలిగారన్న మాట

మరో వర్గం కూడా ట్రాన్స్‌వాల్‌లో వున్నది అసలు అనుమతి పత్రాలు లేకుండా రహస్యంగా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించిన భారతీయులు కొందరున్నారు వాళ్లు తమ మాదిరిగానే యితరుల్ని కూడా రహస్యంగా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించుటకు, దొంగపత్రాల ద్వారా ప్రవేశ పెట్టుటకు సహకరిస్తారన్నమాట ప్రభుత్వంతో రాజీ పడటం వాళ్లకు యిష్టం లేదు రాజీ పడితే వాళ్ల ఆదాయం పడిపోతుంది కదా పత్రాలకు వ్యతిరేకంగా సమరం సాగినంతకాలం వాళ్లకు చేతినిండాపనే అప్పుడు ఎవ్వరికీ పత్రం చూపించనవసరం లేదు నిర్భయంగా తమ తప్పుడు వ్యాపారం వాళ్లు చేసుకొనే వాళ్లు సత్యాగ్రహసమరం జరుగుతున్నది కనుక జైలుకు పోకుండా తప్పించుకునేవాళ్లు సత్యాగ్రహసమరం ఎంత కాలం సాగితే వాళ్లకు అంతమంచిది యీ రకం మనుష్యులు కూడా పఠాన్లను రెచ్చగొట్టారన్నమాట ఇక పఠాన్లు అకస్మాత్తుగా ఎందుకు రెచ్చిపోయారో పాఠకులు తేలికగా ఊహించుకోవచ్చు

అర్ధరాత్రి జరిగిన మీటింగులో పఠాన్ల ప్రశ్నల ప్రభావం ఎవ్వరి మీదా పడలేదు ఒడంబడికను గురించి అభిప్రాయం తెలుపమని జనాన్ని కోరాను అధ్యక్షుడు, తదితరులు గట్టిగా వున్నారు పఠానుతో నా సంభాషణ ముగిసిన తరువాత అధ్యక్షుడు ఒడంబడిక యందలి షరతులను గురించి, వాటిని అంగీకరించవలసిన అవసరాన్ని గురించి ఉపన్యసించి ప్రజాభిప్రాయాన్ని తెలుసుకున్నాడు ముగ్గురు నలుగురు పఠాన్లు మినహా మిగతా వారంతా ఒడంబడికకు అనుకూలంగా చేతులు ఎత్తి తమ అంగీకారాన్ని తెలియజేశారు ఆ రాత్రి రెండు లేక మూడు గంటలకు యింటికి చేరాను నిద్రపోయేందుకు సమయం చిక్కలేదు ప్రొద్దున్నే వెళ్లి జైల్లో వున్న వారిని విడిపించవలసి

యున్నందున, ఉదయం 7 గంటలకు అక్కడికి వెళ్లాను అప్పటికే జైలు సూపరింటెంటుకు ఫోనుద్వారా ఆర్డరు అందింది ఆయన నా కోసం ఎదురుచూస్తున్నాడు ఒక గంట లోపున సత్యాగ్రహ ఖైదీలందరూ విడుదల అయ్యారు అధ్యక్షుడు, మిగతా భారతీయులు కూడా వారికి స్వాగతం చెప్పుటకు అక్కడికి వచ్చారు జైలునుంచి కాలినడకన మేమంతా సభాస్థలి దగ్గరికి వెళ్లాము అక్కడ మళ్లీ సభ జరిగింది ఆరోజు, యింకా మూడు నాలుగురోజులు భోజనాలతోను సమావేశాల తోను గడిచిపోయాయి

రోజులు గడిచే కొద్దీ షరతుల వివరం స్పష్టం కావడంతోబాటు, వ్యతిరేకత కూడా పెరుగుతూనే వున్నది జనంలో ఉత్తేజం ఎందుకు కలిగిందో పైన వివరించాను యింతేగాక జాతి తరఫున జనరల్ స్మట్సుకు వ్రాసి ప్రకటించిన జాబు కూడా అపోహలకు ఆజ్యం పోసింది వీటన్నింటి వల్ల సత్యాగ్రహ పోరాటం జరిగినప్పుడు నాకు కలిగిన కష్టాల కంటే యీ సారి కష్టాలు ఎక్కువై పోయాయి పోరాటం సమయంలో మిత్రులని, శతృవులని కొందరిని భావిస్తూ వుంటాము వాళ్లతో వ్యవహరించే మనతీరులో యిబ్బందులు కలుగుతూ వుంటాయి యిటువంటి కష్టాల్ని త్వరగా తొలగించుకోవచ్చని అనుభవం వల్ల తెలుసుకున్నాను పోరాటం సమయంలో అపనమ్మకాలు, కలహాలు మొదలగునవి వుండవు వున్నా బహుతక్కువగా వుంటాయి కాని పోరాటం తరువాత పరస్పరం వుండే ఈర్ష్యా ద్వేషాలు, అపనమ్మకాలు, కలహాలు అణిగివున్నవన్నీ ఒక్కసారిగా బయట పడతాయి అప్పుడు ఒడంబడిక ఏమైనా జరిగితే అందు దోషాలు వెతుకుటకు జనం సిద్ధంగా వుంటారు ప్రజాస్వామ్య విధానంలో అడిగేవాడి ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పక తప్పదు వాళ్లకు తృప్తి కలిగించవలసి వస్తుంది యీ పద్ధతే మంచిది యిటువంటి సమయంలో మిత్రులతోపాటు వుండి మనిషి పొందగలిగినంత అనుభవం ప్రతిపక్షాల వారితో చేసే పోరాటంలో పొందలేడు ప్రతిపక్షాలవారితో జరిపే పోరాటంలో నిషా వుంటుంది మనిషికి ఉత్సాహం కలుగుతుంది కాని మిత్రుల్లో ఏర్పడే అపోహలకు, అపనమ్మకాలకు సమాధానం చెప్పినప్పుడు

పరిస్థితి అసామాన్యంగా వుంటుంది దుఃఖకరంగా వుంటుంది మనిషికి యిటువంటి సమయంలోనే పరీక్ష జరుగుతుంది యిది నాకు కలిగిన అనుభవం యిలాంటి సమయంలో ఉన్నతమైన ఆధ్యాత్మిక సంపదను పొందగలిగాను పోరాట సమయంలో సత్యాగ్రహ స్వరూపాన్ని అర్థాన్ని తెలుసుకోలేని వాళ్లు, పోరాటం ముగిసిన తరువాత ఒప్పందం జరిగినప్పుడు తెలుసుకోగలిగారని చెప్పవచ్చు ఒప్పందం గురించిన వ్యతిరేకత పఠాన్ల వరకే ఆగిపోయింది

రెండుమూడు మాసాలు గడిచాయి ఏషియాటిక్ ఆఫీసు ఐచ్ఛిక అనుమతి పత్రాల్ని యివ్వడానికి సిద్ధమైంది పత్ర స్వరూపం పూర్తిగా మారిపోయింది క్రొత్త రూపం తయారు చేసేటప్పుడు సత్యాగ్రహ మండలివారితో సలహా సంప్రదింపులు జరిపారు

ది 10 2 1908 నాటి ఉదయం మాలో కొందరం పత్రాలు తీసుకొనుటకు ఏషియాటిక్ ఆఫీసుకు బయలు దేరాము పత్రాలు తీసుకొనే పనిని త్వరగా ముగించాలని జనానికి ముందే బోధించడం జరిగింది సలహా సంప్రదింపుల తరువాత మొదటి రోజున పత్రాలు తీసుకునేందుకు నాయకులు వెళ్లాలని నిర్ణయం చేశారు ప్రజల సందేహాల్ని నివృత్తి చేయడం, ఏషియాటిక్ ఆఫీసు అధికారులు మర్యాదగా వ్యవహరిస్తున్నారో లేదో చూడటం, యితరత్రా కూడా ఆవ్యవహారాల్ని జాగ్రత్తగా పరిశీలించి చూడటం మన వాళ్లకు ముఖ్యం నా ఆఫీసు సత్యాగ్రహమండలి ఆఫీసే అక్కడికి వెళ్లాను ఆ ఆఫీసు బయట మీర్ ఆలం, అతని మనష్యులు నిలబడి వుండటం గమనించాను

మీర్ ఆలం నా పాత కక్షిదారే తన ప్రతిపనికీ నన్ను సలహా అడిగేవాడు పఠాన్లు ట్రాన్స్ వాలులో గడ్డి మరియు కొబ్బరి పీచులతో దిండ్లు, పరుపులు తయారు చేయించి అమ్ముతూ వుంటారు మంచి లాభాలు గడిస్తూ వుంటారు మీర్‌ఆలం వృత్తికూడా అదే అతడు ఆరు అడుగుల ఎత్తుగల, ఒడ్డూపొడవు గల మంచిబలిష్ఠుడు ఆఫీసులోకి రాకుండా బయటే నిలబడటం,

మేము ఒకరినొకరం చూచికూడా సలాము చేసుకోకపోవడం గమనించాను అయినా నేను అతడికి సలాము చేశాను అతడూ తిరిగి సలాం చేశాడు అలవాటు ప్రకారం ఎలా వున్నావని అడిగాను బాగున్నాను అని సమాధానం యిచ్చాడు అయితే యివాళ అతడి ముఖం మీద ఎప్పటి మాదిరిగా చిరునవ్వు కనబడలేదు అతడి కండ్లలో కోపం తొంగి చూస్తున్నది మనస్సులో యీ విషయం నమోదు చేసుకున్నాను యివాళ ఏదో జరుగుతుందని నాకు అనిపించింది నేను ఆఫీసులోకి అడుగు పెట్టాను అధ్యక్షుడు ఈసప్‌మియాం యితరమిత్రులు అంతా వచ్చారు మేమంతా ఏషియాటిక్ ఆఫీసువైపుకు బయలు దేరాము మీర్ ఆలం, అతడి అనుచరులు కూడా మా వెనుకనే బయలు దేరారు

ఏషియాటిక్ ఆఫీసు భవనం వాన్‌బ్రెన్డిస్ స్క్వేర్‌లో వున్నది. అది మా ఆఫీసుకు ఒకమైలు దూరంలో వున్నది అక్కడికి వెళ్లడానికి ప్రధాన రోడ్ల మీద నడవవలసి వచ్చింది వాన్ బ్రెన్డిస్ స్క్వేర్ వీధిలో నడుస్తూ మేము మెసర్స్ ఆర్‌నాట్, గిబ్సన్‌హద్దు వదిలాము అక్కడికి ఏషియాటిక్ ఆఫీసు మూడు నిమిషాల్లో చేరుకోవచ్చు యింతలో మీర్ ఆలం నా ప్రక్కకు వచ్చి ఎక్కడికి వెళుతున్నావు అని నన్ను అడిగాడు పదివ్రేళ్ల ముద్రలు వేసి పత్రం తీసుకోవడానికి వెళుతున్నాను నీవు కూడా వస్తే వేలిముద్రలు వేయనవసరం లేకుండా పత్రం యిస్తారు నీకు పత్రం యిచ్చిన తరువాత, వేలిముద్రలు వేసినేను పత్రం తీసుకుంటాను అని అన్నాను

చివరి వాక్యం పూర్తిగా పలికానో లేదో యింతలో నా తలకు వెనుకనుంచి లాఠీ దెబ్బ గట్టిగా తగిలింది హేరామ్ అంటూ నేను నేలమీద ఒరిగిపోయాను తరువాత ఏమి జరిగిందో నాకు తెలియదు మీర్‌ఆలం, అతడి అనుచరులు నన్ను లాఠీలతో బాదారు కాలితో తన్నారు వాటిలో కొన్ని ఈసప్‌మియాకు, తంబినాయుడుకు కూడా తగిలాయి యింతలో గందరగోళం జరిగింది తెల్లవాళ్లు చాలామంది అక్కడికి వచ్చారు పోలీసులు కూడా వచ్చారు పఠాన్లను కస్టడీలోకి తీసుకున్నారు

దగ్గరలోనే శ్రీ జె సి గిబ్సన్ గారి ఆఫీసు వున్నది నన్ను ఎత్తుకొని అక్కడికి తీసుకు వెళ్లారు కొద్ది సేపటికి నాకు ఒళ్లు తెలిసింది అప్పుడు నేను రివరెండ్ డోక్‌ను నా ముఖం దగ్గర వంగి వుండటం చూచాను మీకు ఎలా వున్నది అని ఆయన అడిగాడు

నేను నవ్వుతూ యిప్పుడు బాగానే వున్నాను పళ్లలోను, నరాల్లోను నొప్పిగా వున్నది అని చెప్పాను మీర్ ఆలం ఎక్కడ వున్నాడు? అని అడిగాను

అతణ్ణి, అతడి అనుచరుల్ని అరెస్టు చేశారు అని డోక్ చెప్పాడు

వాళ్లు విడుదల కావాలి అని డోక్‌తో అన్నాను డోక్ - ఇదంతా జరుగుతూనే వుంటుంది మీరు యిక్కడ ఒక అపరిచితుని గృహంలో పడివున్నారు మీ పెదిమ చీలిపోయింది పోలీసులు మిమ్ము ఆసుపత్రికి తీసుకువెళతామంటున్నారు మీరు మా దగ్గరికి వస్తే నేనూ, మిసెస్ డోక్ శక్త్యానుసారం మీకు సేవ చేస్తాం"

నేను - నన్ను మీ యింటికే తీసుకు వెళ్లండి పోలీసులకు నా ధన్యవాదాలు తెలుపండి మీ దగ్గరికి వెళ్లడమే నాకు ఎక్కువ యిష్టమని వారికి చెప్పండి

ఇంతలో ఏషియాటిక్ ఆఫీసు అధికారి శ్రీ చమనీ కూడా వచ్చారు నన్ను ఒక బండిలో పడుకోబెట్టి, స్మిట్ వీధిలో వున్న పాదరీ శ్రీ డోక్ గారి యింటికి తీసుకు వెళ్లారు నన్ను పరీక్షించేందుకు ఒక డాక్టర్ని పిలిపించారు నేను చమనీని, దగ్గరికి పిలిచి మీ ఆఫీసుకు వచ్చి యీ వ్రేళ్లతో ముద్రలు వేసి పత్రం తీసుకోవాలని అనుకున్నాను కాని ఈశ్వరునికి అది యిష్టం లేదు మీరు దయయుంచి వెంటనే వెళ్లి అవసరమైన కాగితాలు పట్టుకు రండి మొదటి పత్రం నాకు యివ్వండి నాకంటే ముందు ఎవ్వరికీ యివ్వరని విశ్వసిస్తున్నాను అని అన్నాను

తొందరేమున్నది? డాక్టరు వస్తారు మీరు విశ్రాంతి తీసుకోండి తరువాత అంతా చేద్దాం యితరులకు యిచ్చినా మీ పేరు మొదట వ్రాసి వుంచుతాను అని ఆయన అన్నాడు

నేను - "అలావద్దు జీవించియుంటే, ఈశ్వరుడు అంగీకరిస్తే అందరికంటే ముందు నేనే పత్రం తీసుకుంటానని ప్రతిజ్ఞ చేశాను అందువల్ల దయయుంచి మీరు కాగితాలు తీసుకురండి"

శ్రీ చమనీ అవసరమైన కాగితాలు తెచ్చుటకు తమ ఆఫీసుకు వెళ్లారు అటార్నీ జనరల్‌కు అనగా ప్రభుత్వ వకీలుకు తంతి పంపడం నా రెండో పని మీర్‌ఆలం, అతడి అనుచరులు నా మీద దాడిచేశారు యిందువారి దోషం ఏమీ లేదు ఏది ఏమైనా వారి మీద దొమ్మీకేసు పెట్టడం నాకు యిష్టం లేదు నా కోసం వాళ్లను వదిలివేస్తారని భావిస్తున్నాను నాయీ తంతి అందగానే మీర్‌ఆలం, అతడి అనుచరుల్ని వదిలివేశారు

అయితే జోహన్స్‌బర్గ్ యందలి తెల్లవారిలో అలజడి బయలు దేరింది వాళ్లు అటార్నీ జనరల్‌కు ఒక గట్టి జాబు పంపారు" అపరాధికి శిక్ష విధించు విషయంలో గాంధీ అభిప్రాయాలు ఎలా వున్నా, యీ దేశంలో దాన్ని అమలు చేయుటకు వీలులేదు గాంధీకి దెబ్బలు తగిలాయి అందుకు వారు ఏమీ చేయకపోతే చేయక పోనీయండి కాని దాడి చేసిన వాళ్లు ఎవరి యింటిలోపలనో వారిని కొట్టలేదు బహిరంగంగా నడిరోడ్డుమీద కొట్టారు అందువల్ల యిది బహిరంగ సామూహిక అపరాధం కొంతమంది ఆంగ్లేయులు కూడా సాక్ష్యం యివ్వడానికి సిద్ధంగా వున్నారు అందువల్ల దోషుల్ని అరెస్టు చేసి తీరాల్సిందే" యిదీ వారి జాబు యందలి విషయం యిది ఉద్యమ రూపందాల్చే సరికి పోలీసులు మీర్‌ఆలంను, అతడి ఒక అనుచరుణ్ణి మళ్లీ అరెస్టు చేశారు ఒక్కొక్కరికి మూడు మూడు మాసాలకఠోర శిక్ష విధించారు నన్ను మాత్రం సాక్ష్యానికి పిలవలేదు

ఇక మనం రోగి గదికి వెళదాం శ్రీ చమనీ కాగితాలు తెచ్చుటకు వెళ్లారు యింతలో డా॥ థ్వేట్స్ వచ్చారు వారు నన్ను పరీక్షించారు నా పై పెదిమ చీలిపోయింది ఒక బుగ్గకు దెబ్బతగిలింది అందువల్ల కుట్లు వేసిరెండిటినీ కలిపి వేశారు నరాలను పరీక్షించి మందు యిచ్చారు కుట్లు విప్పేనంతవరకు మాట్లాడవద్దని ఆంక్ష విధించారు తరళపదార్థం తప్ప యింకేమీ తీసుకోవద్దని

దగ్గరలోనే శ్రీ జె సి గిబ్సన్ గారి ఆఫీసు వున్నది నన్ను ఎత్తుకొని అక్కడికి తీసుకు వెళ్లారు కొద్ది సేపటికి నాకు ఒళ్లు తెలిసింది అప్పుడు నేను రివరెండ్ డోక్‌ను నా ముఖం దగ్గర వంగి వుండటం చూచాను మీకు ఎలా వున్నది అని ఆయన అడిగాడు

నేను నవ్వుతూ యిప్పుడు బాగానే వున్నాను పళ్లలోను, నరాల్లోను నొప్పిగా వున్నది అని చెప్పాను మీర్ ఆలం ఎక్కడ వున్నాడు? అని అడిగాను

అతణ్ణి, అతడి అనుచరుల్ని అరెస్టు చేశారు అని డోక్ చెప్పాడు

వాళ్లు విడుదల కావాలి అని డోక్‌తో అన్నాను డోక్ - ఇదంతా జరుగుతూనే వుంటుంది మీరు యిక్కడ ఒక అపరిచితుని గృహంలో పడివున్నారు మీ పెదిమ చీలిపోయింది పోలీసులు మిమ్మ్మ ఆసుపత్రికి తీసుకువెళతామంటున్నారు మీరు మా దగ్గరికి వస్తే నేనూ, మిసెస్ డోక్ శక్త్యానుసారం మీకు సేవ చేస్తాం"

నేను - నన్ను మీ యింటికే తీసుకు వెళ్లండి పోలీసులకు నా ధన్యవాదాలు తెలుపండి మీ దగ్గరికి వెళ్లడమే నాకు ఎక్కువ యిష్టమని వారికి చెప్పండి

ఇంతలో ఏషియాటిక్ ఆఫీసు అధికారి శ్రీ చమనీ కూడా వచ్చారు నన్ను ఒక బండిలో పడుకోబెట్టి, స్మిట్ వీధిలో వున్న పాదరీ శ్రీ డోక్ గారి యింటికి తీసుకు వెళ్లారు నన్ను పరీక్షించేందుకు ఒక డాక్టర్ని పిలిపించారు నేను చమనీని, దగ్గరికి పిలిచి మీ ఆఫీసుకు వచ్చి యీ వ్రేళ్లతో ముద్రలు వేసి పత్రం తీసుకోవాలని అనుకున్నాను కాని ఈశ్వరునికి అది యిష్టం లేదు మీరు దయయుంచి వెంటనే వెళ్లి అవసరమైన కాగితాలు పట్టుకు రండి మొదటి పత్రం నాకు యివ్వండి నాకంటే ముందు ఎవ్వరికీ యివ్వరని విశ్వసిస్తున్నాను అని అన్నాను

తొందరేమున్నది? డాక్టరు వస్తారు మీరు విశ్రాంతి తీసుకోండి తరువాత అంతా చేద్దాం యితరులకు యిచ్చినా మీ పేరు మొదట వ్రాసి వుంచుతాను అని ఆయన అన్నాడు

నేను - "అలావద్దు జీవించియుంటే, ఈశ్వరుడు అంగీకరిస్తే అందరికంటే ముందు నేనే పత్రం తీసుకుంటానని ప్రతిజ్ఞ చేశాను అందువల్ల దయయుంచి మీరు కాగితాలు తీసుకురండి "

శ్రీ చమనీ అవసరమైన కాగితాలు తెచ్చుటకు తమ ఆఫీసుకు వెళ్లారు అటార్నీ జనరల్‌కు అనగా ప్రభుత్వ వకీలుకు తంతి పంపడం నా రెండో పని మీర్‌ఆలం, అతడి అనుచరులు నా మీద దాడిచేశారు యిందువారి దోషం ఏమీ లేదు ఏది ఏమైనా వారి మీద దొమ్మీకేసు పెట్టడం నాకు యిష్టం లేదు నా కోసం వాళ్లను వదిలివేస్తారని భావిస్తున్నాను నాయీ తంతి అందగానే మీర్‌ఆలం, అతడి అనుచరుల్ని వదిలివేశారు

అయితే జోహన్సుబర్గ్ యందలి తెల్లవారిలో అలజడి బయలు దేరింది వాళ్లు అటార్నీ జనరల్‌కు ఒక గట్టి జాబు పంపారు" అపరాధికి శిక్ష విధించు విషయంలో గాంధీ అభిప్రాయాలు ఎలా వున్నా, యీ దేశంలో దాన్ని అమలు చేయుటకు వీలులేదు గాంధీకి దెబ్బలు తగిలాయి అందుకు వారు ఏమీ చేయకపోతే చేయక పోనీయండి కాని దాడి చేసిన వాళ్లు ఎవరి యింటిలోపలనో వారిని కొట్టలేదు బహిరంగంగా నడిరోడ్డుమీద కొట్టారు అందువల్ల యిది బహిరంగ సామూహిక అపరాధం కొంతమంది ఆంగ్లేయులు కూడా సాక్ష్యం యివ్వడానికి సిద్ధంగా వున్నారు అందువల్ల దోషుల్ని అరెస్టు చేసి తీరాల్సిందే " యిదీ వారి జాబు యందలి విషయం యిది ఉద్యమ రూపందాల్చే సరికి పోలీసులు మీర్‌ఆలంను, అతడి ఒక అనుచరుణ్ణి మళ్లీ అరెస్టు చేశారు ఒక్కొక్కరికి మూడు మూడు మాసాలకఠోర శిక్ష విధించారు నన్ను మాత్రం సాక్ష్యానికి పిలవలేదు

ఇక మనం రోగి గదికి వెళదాం శ్రీ చమనీ కాగితాలు తెచ్చుటకు వెళ్లారు యింతలో డా॥ థ్యేట్స్ వచ్చారు వారు నన్ను పరీక్షించారు నా పై పెదిమ చీలిపోయింది ఒక బుగ్గకు దెబ్బతగిలింది అందువల్ల కుట్లు వేసిరెండిటినీ కలిపి వేశారు నరాలను పరీక్షించి మందు యిచ్చారు కుట్లు విప్పేనంతవరకు మాట్లాడవద్దని ఆంక్ష విధించారు తరళపదార్థం తప్ప యింకేమీ తీసుకోవద్దని

చెప్పారు శరీరమందలి ఏ భాగానికీ పెద్ద దెబ్బతగలలేదని డాక్టరు నిర్ధారణ చేశారు ఒక వారంరోజుల్లో మంచం వదల వచ్చని, సామాన్య పనులు చేసుకోవచ్చని, రెండు మూడు మాసాల వరకు శరీరం పెద్ద పనుల బరువు భరించలేదని, అందుకు జాగ్రత్త అవసరమని చెప్పి డాక్టరు వెళ్లిపోయారు

ఇక మాట్లాడటం ఆగిపోయింది కాని చేతులు పనిచేస్తున్నాయి అధ్యక్షుని ద్వారా జాతి ప్రజలకు ఒక సందేశం వంటిది గుజరాతీలో వ్రాసి ప్రకటించమని, పంపాను అందలి వివరం యిలా వున్నది

"నా ఆరోగ్యం బాగున్నది శ్రీ డోక్, శ్రీమతి డోక్ యిరువురూ మనస్సు నందలి ప్రేమనంతా ఒలికించి నాకు సేవ చేస్తున్నారు కొద్దిరోజుల్లో పని ప్రారంభిస్తాను నన్ను కొట్టిన వారి మీద నాకు కొంచెమైనా కోపం లేదు వారు తెలియక యీ పని చేశారు వారి మీద కేసు నడపవలసిన అవసరం లేదు అంతా శాంతంగా వుంటే యీ ఘట్టం వల్ల మనందరికీ మేలు జరుగుతుంది

హిందువులు కోపం తెచ్చుకోవద్దు యీ ఘట్టం వల్ల హిందువులకు ముస్లిములకు మధ్య ఏహ్యతకు బదులు సయోధ్యత పెరగాలని కోరుతున్నాను ఖుదాను, ఈశ్వరుణ్ణి నేను యీ మంచిపని చేయమని ప్రార్థిస్తున్నాను

నాకు దెబ్బలు తగిలిన మాట నిజం యింతకంటే ఎక్కువ దెబ్బలు తగిలినా సరే, నేను ఒక్క సలహాయివ్వాలని భావిస్తున్నాను భారతీయులందరూ పదివ్రేళ్ల ముద్రలు వేయాల్సిందే మతరీత్యా ఎవరికైనా అభ్యంతరం వుంటే ప్రభుత్వం దాన్ని తొలిగించి సౌకర్యం కల్పిస్తుంది యిలా చేస్తేనే జాతికి, పేదలకు క్షేమం కలుగుతుంది మనం నిజమైన సత్యాగ్రహులం అయితే దెబ్బలకుగాని, భవిష్యత్తులో జరుగబోయేనమ్మక ద్రోహాలకుగాని భయపడకూడదు పదివ్రేళ్ల ముద్రలు వేయకూడదని అనుకునే వారిని అజ్ఞానులని భావిస్తున్నాను

జాతికి మేలు చేయమని, మనల్ని సత్యమార్గాన నడపమని, హిందూ మహమ్మదీయుల హృదయాలను నారక్తపు పట్టీతో కలుపమని ప్రార్థిస్తున్నాను

శ్రీ చమనీ కాగితాలు తీసుకువచ్చారు ఎంతో కష్టపడినా పదివ్రేళ్ల ముద్రలు వేసి వారికి యిచ్చాను అప్పుడు వారినేత్రాలనుండి అశ్రుబిందువులు కారుతూ వున్నాయి వారికి వ్యతిరేకంగా నేను కఠినంగా వ్రాస్తూ వుండేవాణ్ణి కాని యీనాటి ఘట్టం చూచిన తరువాత ఎంతకఠిన హృదయమైనా సమయం వచ్చినప్పుడు ఎంత కోమలం అవుతుందో కండ్లారా చూచాను ఈ పని పూర్తిచేయుటకు కొద్ది నిమిషాలు మాత్రమే పట్టి యుండునని పాఠకులు గ్రహించియే వుండవచ్చు శ్రీ డోక్, వారి శ్రీమతి యిరువురూ ఎంతో సహృదయులు నేను త్వరగా కోలుకోవాలని వారితపన దాడి జరిగిన తరువాత నా మానసిక స్థితిని చూచి వారు బాధపడ్డారు దీని చెడు ప్రభావం నా ఆరోగ్యం మీద పడుతుందేమోనని వారి భయం అందువల్ల నా మంచం దగ్గరికి ఎవ్వరినీ రానీయలేదు నన్ను ఏమీ వ్రాయనీయ లేదు ఏ పనీ చేయనీయలేదు నేను వారిని ప్రార్థిస్తూ (లిఖితంగా) నేను శాంతిగా, హాయిగా నిద్రపోవుటకు ముందు మీ కుమార్తె చిరంజీవి ఆలివ్ (అప్పుడు బాలిక) చేత నాకు యిష్టమైన ఇంగ్లీషు కీర్తన "లీడ్ కైండ్లీ లైట్"ను పాడించి వినిపించే ఏర్పాటు చేయండి అని కోరాను శ్రీ డోక్ ఆనందభరితుడైనారు సరేనని చెప్పి తమ బిడ్డను పిలిచి, తలుపుల బయటనిలబడి పై పాట మెల్లగా పాడమని చెప్పారు యీ వివరం వ్రాస్తున్నప్పుడు ఆ దృశ్యం నాకండ్ల ముందు కనబడుతున్నది ఆలివ్‌ది మధురమైన కంఠం ఆ కంఠస్వరం యీనాటికి నాకు వినబడుతూ వున్నది

ఈ ప్రకరణంలో ఎన్నో విషయాలు వ్రాశాను బహుశ పాఠకులు యింత వ్రాయడం అసంగతమని భావించ వచ్చు అయినా మరో సంస్మరణను జోడించకుండా యీ ప్రకరణాన్ని ముగించను. ఇప్పుడు జరిగిన ఘట్టాలన్నీ మరిచిపోవుటకు వీలులేని పవిత్రమైన సంస్మరణలే డోక్ కుటుంబంచేసిన సేవల్ని గురించి ఎంత వ్రాసినా తక్కువే

శ్రీ జోసఫ్ డోక్ బాప్టిస్టు సంప్రదాయానికి చెందిన పాదరీ దక్షిణాఫ్రికా రాకముందు వారు న్యూజిలెండులో వుండేవారు పరాన్లు నా మీద

దాడిచేయక పూర్వం అరు మాసాల క్రితం ఒకసారి వారు నా ఆఫీసు వచ్చారు నా దగ్గరకి తమ పేరు పంపించారు అందురెవరెండ్ అను విశేషణం వ్రాసి వున్నది అది చూచి పొరపాటుగా అభిప్రాయం నాకు కలిగింది కొందరు పాదరీలు నన్ను క్రైస్తవుణ్ణిగా మార్చాలని లేక సత్యాగ్రహ సమరం ఆపు చేయమని చెప్పడానికి ఆశ్రయ దాతల రూపంలో జాతిసాగిస్తున్న పోరాటం యెడ సానుభూతిని చూపడానికి వస్తూ వుండేవారు శ్రీ డోక్ కూడా అటువంటి వారేనేమోనని అనుకున్నాను శ్రీ డోక్ లోపలికి వచ్చారు కొద్దినిమిషాలు మాట్లాడాము దురభిప్రాయపడ్డానని తెలుసుకున్నాను లోలోపల వారిని క్షమించమని కోరాను ఆనాటి నుంచి గాఢ స్నేహితులం అయ్యాము భారతీయుల జాతీయ సమరాన్ని గురించి పత్రికల్లో వెలువడే విషయాలన్నీ వారికి తెలుసునని గ్రహించాను మీరు చేస్తున్నది జాతీయ సంగ్రామం నన్ను మీ మిత్రుడిగా భావించండి నేను చేయగలిగిన సేవ ఏమైనా వుంటే చెప్పండి కర్తవ్యంగా భావించి చేస్తాను ఏసుక్రీస్తు బోధనలవల్ల దుఃఖితుల దుఃఖాలలో మనిషి భాగం పంచుకోవాలి అన్న పాఠం నేను నేర్చుకున్నాను" అని వారు చెప్పారు ఆ విధంగా మా పరిచయం ప్రారంభమైంది మా పరిచయం రోజురోజుకూ పెరిగి గాఢమైపోయింది

ఇక ముందు యీ పుస్తకంలో శ్రీ డోక్ పేరు పాఠకులకు కనబడుతుంది శ్రీ డోక్ కుటుంబ సభ్యులు నాకు చేసిన సేవను గురించి చెప్పే ముందు వారిని గురించి యీ మాత్రం వ్రాయడం అవసరం అని తోచింది రాత్రిగానీయండి, పగలుకానీయండి శ్రీ డోక్ కుటుంబ సభ్యుల్లో ఎవరో ఒకరు నా వెంటవుండవలసిందే నేను వారి యింట్లో వున్నంతకాలం వారి యిల్లు ఒక ధర్మ సత్రమైపోయింది భారతీయుల్లో కేకలు పెట్టి సామాన్లు అమ్మేవారు కార్మికులవలె మురికి గుడ్డలు ధరించేవారు వాళ్ల చెప్పులు దుమ్ముకొట్టుకొని వుండేవి వాళ్లు అమ్మే సామాను మూట వారి దగ్గరే వుండేది. అటువంటి వాళ్లనుంచి అధ్యక్షుని వరకు రకరకాల జనంతో వారి యిల్లు కిటకిటలాడుతూ వుండేది నా ఆరోగ్యాన్ని గురించి తెలుసుకోవడానికి

నన్ను చూడడానికి డాక్టరు అనుమతి పొంది వారంతా వస్తూ వుండేవారు అందరినీ సమానంగా గౌరవించి శ్రీ డోక్ వాళ్లందరినీ హాల్లో కూర్చోబెడుతూ వుండేవారు నేను వారింట్లో వున్నంత కాలం నా సేవచేయడానికి నన్ను చూడటానికి వచ్చే వందలాది మందిని గౌరవించి పంపడానికి వారి సమయమంతా గడిచిపోతూ వుండేది రాత్రిళ్లు కూడా రెండు మూడు సార్లు శ్రీ డోక్ నా గదిలోనికి వచ్చి మౌనంగా నన్ను చూచి వెళ్లుతూ వుండేవారు వారింట్లో వున్నంత కాలం యిది నా యిల్లేనని అనిపించింది నాకు గల అత్యంత ప్రియపాత్రులు సైతం శ్రీ డోక్ కుటుంబ సభ్యుల కంటే ఎక్కువగా సేవచేయగలిగే వారని నేను అనుకోను

నన్ను నాతో బాటు భారతీయ జనాన్ని తన యింట్లో వుంచుకోవడం, సేవ చేయడం, సత్కారం చేయడంవల్ల శ్రీ డోక్‌కు, తమ తెల్లవారి వల్ల యిబ్బందులేమీ కలుగలేదని పాఠకులు భావించకూడదు తమ బాప్టిస్టు వారికోసం ఒక చర్చిని నడుపుతూ వుండేవారు ఆ సంప్రదాయుల వల్లనే వారి కుటుంబ పోషణ జరుగుతూ వుండేది వారందరూ ఉదార హృదయులని భావించకూడదు భారతీయులంటే అయిష్టత వారందరికీ వుండేది కాని శ్రీ డోక్ దాన్ని లెక్క చేయలేదు మా పరిచయం ప్రారంభంలోనే నేను యీ విషయం వారితో చర్చించాను వారిచ్చిన సమాధానం యిక్కడ వివరించడం అవసరం "నా ప్రియ మిత్రమా! మీరు ఏసుమతాన్ని ఏమని భావిస్తున్నారు? నేను తన ధర్మపాలన కోసం శిలువనెక్కిన మహాపురుషుని అనుచరుణ్ణి వారి ప్రేమ యీ విశ్వమంత విశాలమైనది తెల్లవారిని గురించి మీకు భయం వున్నది వారు నన్ను వదిలివేస్తారేమోననే కదా మీ భయం? ఏసుక్రీస్తు ప్రతినిధినని తెల్లవారి ముందు నన్ను నేను భావించుకున్నా, భారతీయులు సాగిస్తున్న పోరాటంలో పాల్గొంటున్నాను అప్పుడు నా మండలి సభ్యులు నన్ను త్యజించినా నేను బాధపడను నా కుటుంబం వారి సాయంతో నడుస్తున్నమాట నిజం అయినా అందుకే వారితో సంబంధం పెట్టుకున్నానని, లేక వారివల్ల నేను బ్రతుకుతున్నానని మీరు భావిస్తున్నారా? నాకు బ్రతుకు

తెరువు కల్పిస్తున్నది ఆ ఈశ్వరుడే వాళ్లంతా కేవలం నిమిత్త మాత్రులే వారిలో ఎవ్వరూ నా ధార్మిక స్వాతంత్ర్యంలో అడ్డు తగలడానికి వీలులేదు యిదీ వారికీ నాకు మధ్యగల ముఖ్య షరతు అందువల్ల మీరునన్ను గురించి ఏమీ చింతించకండి భారతీయుల మీద దయ చూపుటకు నేను మీ ఉద్యమంలో ప్రవేశించలేదు యిది నా ధర్మమని భావించి మీ సంగ్రామంలో ప్రవేశించాను నా చర్చి డీన్ (చర్చిపెద్ద) గారితో యీ విషయమై స్పష్టంగా మాట్లాడాను భారతీయులకు సేవాసహాయం చేయడం మీకు యిష్టం కాకపోతే చెప్పండి నేను వెళ్లి పోతాను మరో పాదరీని మీరు నియుక్తిచేసుకోండి అని వారికి వినమ్రంగా మనవి చేశాను కాని వారు యీ విషయంలో నిశ్చింతగా వుండమని నాకు చెప్పారు పైగా వారు నన్ను ఎంతో ప్రోత్సహించారు కూడా అంతేగాక తెల్లవారంతా భారతీయుల్ని అసహ్యించుకుంటున్నారని మీరు భావించకూడదు ఎంతమంది తెల్లవారు భారతీయుల దుస్థితిని చూచి బాధపడుతున్నారో, సానుభూతిని ప్రదర్శిస్తున్నారో మీరు వూహించలేరు అయితే ఆ విషయం అనుభవంలోకి రావాలని మీరు భావిస్తూ వుండవచ్చు"

ఇంత స్పష్టంగా చర్చ జరిగినందున యిక యీ విషయం నేనెన్నడూ వారి దగ్గర ఎత్తలేదు తరువాత జాతీయ ఉద్యమం సాగుతూ వున్నప్పుడు తమ ధర్మ కార్యం నిర్వహిస్తూ రొడీషియాలో శ్రీ డోక్ దైవలోకానికి వెళ్లిపోయారు అప్పుడు వారి సంప్రదాయానికి చెందిన వారంతా ఒక సభ చర్చిలో జరిపారు ఆ సభకు కీ॥శే॥ కాఛలియాగారితో బాటు నన్ను , యితర భారతీయుల్ని కూడా పిలిచారు ఆసభలో నన్ను కూడా మాట్లాడమని కోరారు

సుమారు 10 రోజుల్లో నా ఆరోగ్యం బాగుపడింది బాగా తిరగసాగాను ఆస్థితికి వచ్చినతరువాత మమత్వంతో నిండిన ఆ కుటుంబం వారి దగ్గర సెలవు తీసుకున్నాను యీ వియోగాన్ని మేమిరువురం భరించలేక పోయాము

# 23

## సహాయకులుగా వున్న తెల్లవారు

భారతజాతీయ సంగ్రామానికి చాలా మంది ప్రసిద్ధికెక్కిన తెల్లవారు అనేక విధాల సహాయపడ్డారు వారందరి పరిచయం చేయడం అవసరమని భావిస్తున్నాను యిందు వల్ల వారి పేరు వచ్చినప్పుడు విడిగా వారి పరిచయం చేయవలసిన అవసరం వుండదు ఒక క్రమంలో నేను వారిని పరిచయం చేస్తున్నాను పాఠకులు యీ క్రమాన్ని వారి గౌరవ ప్రతిష్టలకు, వారి సహాయ సహకారాల ప్రాధాన్యతకు వర్తించుకోవద్దని మనవి చేస్తున్నాను తెల్లమిత్రులు సహకరించిన సమయాన్ని బట్టి, సంగ్రామానికి సంబంధించిన వివిధ శాఖలకు వారందించిన సహాయాన్ని బట్టి పాఠకులు వారి క్రమ ప్రాధాన్యతను గ్రహించవచ్చు

వీరిలో మొట్టమొదటి వారు శ్రీ ఆల్బర్ట్ వెస్ట్ భారతీయులతో సంగ్రామానికి పూర్వం నుంచే వీరితో సంబంధం ఏర్పడింది వ్యక్తిగతంగా అంతకు పూర్వం నుంచే వీరు నాకు పరిచయం అయ్యారు జోహన్స్ బర్గ్‌లో నా ఆఫీసు తెరిచినప్పుడు నా కుటుంబసభ్యులు నాతో బాటు లేరు 1903లో దక్షిణాఫ్రికా భారతీయుల నుంచి తంతి అందగానే నేను భారతదేశాన్నుంచి దక్షిణాఫ్రికాకు బయలు దేరానని పాఠకులకు తెలుసు ఒక్క సంవత్సరం తరువాత ఇండియాకు తిరిగి రావాలని అనుకున్నాను జోహన్స్‌బర్గ్‌లో ఒక శాకాహార భోజనశాల వున్నది ఉదయం సాయంత్రం అక్కడికి నేను భోజనం చేయుటకు తప్పక వెళ్లుతూ వుండేవాణ్ణి వెస్ట్ కూడా అక్కడికి వస్తూ వుండే వారు అక్కడే మా యిద్దరికీ పరిచయం అయింది వారు మరో తెల్లవానితో కలిసి ఒక ప్రెస్సు నడుపుతూ వుండేవారు

1904లో జోహన్స్‌బర్గ్‌లో గల భారతీయుల్లో ప్లేగు వ్యాధి వ్యాపించింది నేను రోగులకు సేవచేయుటకు పూనుకున్నాను అందువల్ల ఆ భోజనశాలకు వెళ్లడం తగ్గించాను వెళ్లినా యితరులకంటే ముందే భోజనం చేసి వస్తూ

వుండేవాణ్ణి ప్లేగు వచ్చిన రోగులకు సేవ చేస్తున్న నా వల్ల యితరులకు ఆ రోగం రావచ్చునన్న భయం కలుగవచ్చు కనుక నేను అలా వ్యవహరించాను రెండు రోజులపాటు నేను భోజనశాలలో కనబడక పోయే సరికి వెస్ట్ భయపడిపోయారు నేను ప్లేగు వ్యాధి సోకిన రోగులకు సేవచేస్తున్నానని పత్రికలవల్ల వారికి తెలిసింది మూడో రోజు ఉదయం 6 గంటలకు నేను ముఖం కడుక్కుంటుండగా వెస్ట్ వచ్చి నా గది తలుపు తట్టాడు నేను తలుపు తెరిచేసరికి ఎదురుగా నవ్వుముఖంతో నిలబడియున్న వెస్ట్ కనిపించారు

"మిమ్మల్ని చూచిన తరువాత నాకు సంతోషం కలిగింది భోజనశాలలో మీరు కనబడనందున భయపడి పోయాను నా సాయం కావాలనుకుంటే చెప్పండి నేను సిద్ధంగా వున్నాను' అని అన్నారు వెస్ట్ నేను వినోద స్వరంతో "మీరు రోగులకు సేవచేయగలరా? అని అడిగాను

"తప్పక చేస్తాను"

నేను అదివరకే ఒక కార్యక్రమం తయారుచేశాను మరో రకం జవాబు మీనుండి వస్తుందని నేను అనుకోలేదు రోగులకు సేవ చేసే వాళ్లు చాలా మంది వున్నారు అంతకంటే కఠినమైన పని మరొకటి వున్నది మీ సాయం కావాలి మదన్‌జీత్ యిక్కడ ప్లేగు సేవా కార్యక్రమంలో లీనమైనాడు ఇండియన్ ఓపీనియన్ ప్రెస్ నడవడం లేదు మదనజీత్‌ను యిక్కడ ఆపివేశాను కనుక మీరు డర్బన్ వెళ్లి ప్రెస్సును నడిపితే గొప్ప సహాయం చేసిన వారవుతారు అయితే ఆ పని చేసినందుకు నేనేమీ పెద్ద మొత్తం యివ్వలేను కొద్దిగా డబ్బు అనగా నెలకు 10 పౌండ్లు మాత్రం యిస్తాను ప్రెస్సువల్ల లాభం వస్తే ఆ లాభంలో సగభాగం మీరు తీసుకోవచ్చు" అని చెప్పాను

"ఇది అంత మంచి పని కాదు అయినా నా భాగస్వామిని అడగాలి కదా. రావలసిన బాకీలు కూడా వున్నాయి. వసూలు చేసుకోవాలి యివాళ సాయంత్రం వరకు నాకు టైము యివ్వండి తేల్చి చెబుతాను అని అన్నారు వెస్ట్

"ఇస్తాను యివాళ సాయంత్రం పార్కులో కలుద్దాము"

పార్కులో కలిశాము వెస్ట్ తన భాగస్వామి దగ్గర అనుమతి తీసుకున్నారు మర్నాడు సాయంకాలం రైల్లో డర్బనుకు బయలు దేరారు ఒక్క నెల రోజులకు ఆయన దగ్గరినుంచి రిపోర్టు వచ్చింది "ఈ ప్రెస్సులో లాభం రాదు నష్టం తప్పదు ప్రెస్సు లెక్కలు సరిగా లేవు గ్రాహకులపేర్లు గాని, వారి అడ్రసులు గాని సరిగా వ్రాసుకోలేదు ప్రెస్సు వ్యవస్థకూడా సరిగా లేదు ఆరోపణగా గాక దీన్ని మంచిగా తీసుకోండి లాభాలు గడించకపోయినా ప్రెస్సు వ్యవస్థను సరిచేస్తానని మాట యిస్తున్నాను మీరు నిశ్చింతగా వుండండి అంగీకరించిన పనిని నేను వదలను అయితే ఒక్క విషయం, చాలా కాలం వరకు నష్టానికి మీరు సిద్ధపడవలసిందే" అని వారి రిపోర్టులో వున్నది

మనజిత్ "ఇండియన్ ఒపీనియన్" పత్రిక యొక్క చందాదారుల్ని గురించి ప్రెస్సును గురించి మాట్లాడుటకు జోహన్స్‌బర్గ్ వచ్చాడు ప్రతినెలకొద్దీ నష్టాన్ని నేను భరిస్తూ వుండేవాణ్ణి ఎంత డబ్బు నేను యివ్వాల్సి వుంటుందో స్పష్టంగా తెలుసుకోవాలని అనుకున్నాను మదన్ జీత్‌కు ప్రెస్సు వ్యవహారాలు తెలియవని ప్రెస్సు ప్రారంభించినప్పుడు వ్రాశాను అందువల్ల ప్రెస్సు అనుభవం గల వ్యక్తిని అతడికి సహాయం చేయుటకు నియమించాలని భావించాను యింతలో ప్లేగు వ్యాధి విరుచుకు పడింది ఆపద సమయంలో మదన్‌జీత్ చురుగ్గా పనిచేస్తాడని, భయపడడని తెలిసింది అందువల్ల అతణ్ణి జోహాన్స్‌బర్గ్‌లో ఆపివేశాను ఊహించని పద్ధతిలో వెస్ట్ సాయం అందిస్తానని అనగానే నేను అంగీకరించాను ప్లేగు సమయంలోనే గాక మిగతా రోజుల్లో కూడా మీరు డర్బన్‌లో వుండాలని వారిని కోరాను అందువల్లనే వారు అట్టి రిపోర్టు పంపించారు.

చివరికి ఇండియన్ ఒపీనియన్ పత్రికను ప్రెస్సును ఫినిక్స్ తీసుకు వెళ్లిన విషయం పాఠకులకు తెలుసు అక్కడ నెలకు 10 పౌండ్లకు బదులు 3 పౌండ్లు మాత్రమే వెస్ట్ తీసుకున్నారు యీ మార్పులన్నింటికి వెస్ట్

అంగీకరించారు తన జీవితం ఎలా గడుస్తుందా అని వెస్ట్ ఎన్నడూ యోచించలేదు ఆయన మతాన్ని గురించి చదవలేదు అయినా గొప్ప ధార్మిక వ్యక్తిగా ఆయనను గౌరవించాను ఆయన స్వతంత్ర ప్రవృత్తిగల మనిషి అనుకున్న విషయం చెప్పి వేసే వ్యక్తి నల్లగా వున్న దాన్ని కృష్ణవర్ణంగా వున్నదని చెప్పకుండా నల్లగా వున్నదనే చెప్పేవారన్నమాట నిరాండబరంగా జీవితం గడిపేవారు మా యిరువురికి పరిచయం కలిగినప్పుడు ఆయన బ్రహ్మచారి తరువాత తల్లి తండ్రిని కలుసుకొనేందుకు ఆయన ఇంగ్లాండు వెళ్లారు అక్కడ పెండ్లి చేసుకొని తిరిగి వచ్చారు నా సలహా ప్రకారం తన భార్యను, అత్తను, పెండ్లి కాని తన సోదరిని వెంట తీసుకు వచ్చారు వారంతా ఫినిక్స్‌లో నిరాడంబరంగా వుంటూ వుండే వారు అన్నివిధాల భారతీయులతో కలిసి పోయారు

కుమారి ఎడా వెస్ట్‌కు (మేము ఆమెను దేవీబెన్ అని పిలిచేవారం) అప్పుడు 35 సంవత్సరాల వయస్సు ఆమె యింత వరకు వివాహం చేసుకోలేదు పవిత్రంగా జీవితం గడుపుతున్న మహిళ ఆమె కూడా ఫినిక్స్ వాసులకు అపరిమితంగా సేవ చేసింది ఫినిక్సులో వుంటూ వున్న బాలశిష్యుల్ని సంబాళించడం, వారికి ఇంగ్లీషు నేర్పడం, సామూహిక వంటశాలలో వంట చేయడం, ఇండ్లను శుభ్రం చేయడం, లెక్కల పుస్తకాల్లో డబ్బు లెక్కలు వ్రాయడం, ప్రెస్సులో కంపోజు చేయడం, ఆమె పని ఏ పనైనా సరే ఆమె అందుకొని పూర్తి చేస్తూ వుండేది యిప్పుడు ఆమె ఫినిక్స్ ఆశ్రమంలో లేరు ఆమెకు అయ్యే మామూలు వ్యయం సైతం నేను ఇండియాకు తిరిగివచ్చిన తరువాత ఫినిక్స్ ఆశ్రమం యివ్వలేక పోయింది వెస్ట్ అత్తగారి వయస్సు 80 సంవత్సరాలు ఆమె కుట్టుపనిచక్కగా చేస్తూ వుండేది వృద్ధురాలు అయినా కుట్టుపని విషయంలో ఆశ్రమం అంతటికీ ఆమె సహాయం చేస్తూ వుండేది ఆశ్రమవాసులంతా ఆమెను దాదీమా (తాతమ్మ) అని పిలిచేవారు శ్రీమతి వెస్ట్‌ను గురించి యిక వ్రాయనవసరం లేదు ఆశ్రమవాసులంతా జైలుకు వెళ్లిపోయారు అప్పుడు వెస్ట్ కుంటుంబ సభ్యులే మగన్‌లాల్

గాంధీకి సహకరించి ఆశ్రమాన్ని నడిపించారు ఇండియన్ ఒపీనియన్ పత్రిక మరియు ప్రెస్సు పని వెస్ట్ చూస్తూ వుండేవాడు నేను లేని సమయాల్లో డర్బన్ నుంచి గోఖలేగారికి పంపవలసిన టెలిగ్రాములు వెస్ట్ పంపుతూ వుండేవారు చివరికి వెస్ట్ కూడా అరెస్ట్ చేయబడ్డారు (అయితే ఆయనను త్వరగా విడుదల చేశారు) అప్పుడు గోఖలే కంగారు పడిపోయారు వెంటనే వారు ఇండియానుంచి అండ్రూస్ మరియు పియర్సన్‌ను దక్షిణాఫ్రికా పంపించారు

మరో సహాయకుడు శ్రీరిచ్ వీరిని గురించి ముందే వ్రాశాను వారు సత్యాగ్రహసమరం ప్రారంభంకాక పూర్వం నుంచే నా ఆఫీసులో పని చేయడం ప్రారంభించారు నేను లేనప్పుడు నా పని సంభాళించాలనే ఉద్దేశ్యంతో బారిష్టరీ చదువుటకు ఆయన ఇంగ్లాండు వెళ్లాడు అక్కడ సౌత్ ఆఫ్రికన్ బ్రిటిష్ ఇండియన్ కమిటీ, లండన్ వ్యవహారబాధ్యతను కూడా ఆయనే స్వీకరించారు

మూడవ సహాయకులు శ్రీ పోలక్ వెస్ట్ వలెనే పోలక్‌తో పరిచయం కూడా భోజనశాలయందే కలిగింది వారు దిట్రాన్స్‌వాల్ క్రిటిక్ అనుపత్రికకు ఉపసంపాదకులుగా పనిచేస్తూ వుండేవారు దాన్ని హఠాత్తుగా వదిలివేసి ఇండియన్ ఒపీనియన్ పత్రికకోసం వచ్చి వేశారు వారు సత్యాగ్రహసమరం సాగుతున్నప్పుడు ఇంగ్లాండు, భారతదేశాల్లో విస్తారంగా పర్యటించారు రిచ్ ఇంగ్లాండు వెళ్లినందున, నేను పోలక్‌ను ఫినిక్స్ నుంచి జోహన్స్‌బర్గ్‌లో గల నా ఆఫీసుకు పిలిపించుకున్నాను అక్కడ మొదట ఆయన ఆర్టికల్డ్ క్లార్కుగా పని చేసి తరువాత పూర్తి వకీలు అయిపోయారు కొద్ది సమయం గడిచాక వారు వివాహం చేసుకున్నారు శ్రీమతి పోలక్ సేవలను గూడా భారతదేశం గుర్తించింది ఆమె సత్యాగ్రహసమరం సాగినప్పుడు తన భర్తకు ఎంతో సహాయం చేసింది ఒక్కరోజు కూడా విఘ్నం కలుగ నీయలేదు పోలక్ దంపతులు యిప్పటికీ భారతావనికి ఎంతో సేవ చేస్తున్నారు. అయితే భారతదేశంలో సాగిన సహాయ నిరాకరణోద్యమంలో వారు మాకు

అనుచరులుగాలేరు తరువాత పేర్కొనవలసిన వారు హర్మన్ కేలన్‌బెక్ జాతీయ సంగ్రామం జరుగక ముందే వారితో పరిచయం ఏర్పడింది వారు జర్మనీ వారు ఆంగ్లేయులకు, జర్మన్లకు మధ్య యుద్ధం జరిగి యుండకపోతే కేలన్ బెక్ ఇండియాలో వుండి వుండేవారు వారు విశాలహృదయులు సరళ హృదయులు గొప్ప అమాయకులు తీవ్ర భావాలు గల వ్యక్తి శిల్పిగా పని చేస్తూ వుండేవారు ఎంత చిన్న పని అయినా సంకోచించకుండా చేస్తూ వుండేవారు జోహన్స్ బర్గ్‌లో నేను వున్నయిల్లు పడగొట్టినప్పుడు యిద్దరం కలిసి వుండేవాళ్లం నా ఖర్చుకూడా వారే భరించేవారు వారికి యిల్లువుండేది భోజనం ఖర్చు యిస్తానని నేను వారితో అనగానే కోపపడి గాలికి తిరుగుతూ గాలి ఖర్చులు చేస్తూ వుండే నన్ను సరిదిద్దింది మీరేనండీ అని నా కోరికను నిరాకరిస్తూ వుండేవారు వారు అన్న మాట నిజమే అయితే తెల్లవారితో నాకు గల వ్యక్తిగత సంబంధాల్ని గురించి యిక్కడ వ్రాయను సత్యాగ్రహుల కుటుంబాల వారందరినీ జోహన్స్‌బర్గ్‌కు రప్పించి ఒకే చోట వుంచాలని నిర్ణయం చేయగానే కేలన్ బెక్ అద్దె తీసుకోకుండా తన 1100 బీఘాల (బీఘా అంటే 120 చదరపు అడుగుల స్థలం) భూమిని ఉపయోగించుకోమని యిచ్చి వేశారు గోఖలే గారు దక్షిణాఫ్రికా వచ్చినప్పుడు భారత జాతి పక్షాన, శ్రీ కేలన్ బెక్ గారి బంగళాలో వారికి నివాసం ఏర్పాటు చేశారు ఆ బంగళా గోఖలే గారికి ఎంతో నచ్చింది వారికి వీడ్కోలు చెప్పటకు కేలన్ బెక్ నాతోబాటు జాంజిబార్ దాకా వచ్చారు యుద్ధం ప్రారంభ కాగానే శ్రీ పోలక్‌తో బాటు కేలన్ బెక్‌ను కూడా అక్కడి ప్రభుత్వం వారు నిర్బంధంలోకి తీసుకున్నారు వారు కూడా జైలు శిక్ష అనుభవించవలసి వచ్చింది దక్షిణాఫ్రికా వదిలి గోఖలే గారిని కలుసుకునేందుకు నేను ఇంగ్లాండు వెళ్లినప్పుడు శ్రీ కేలన్ బెక్ నా వెంట వున్నారు ప్రథమ మహాయుద్ధం కారణంగా వారిని ఇంగ్లాండు నుంచి నాతో బాటు ఇండియాకు రానీయలేదు యితర జర్మనీ వారందరి మాదిరిగా కేలన్ బెక్ గారిని కూడా ఇంగ్లాండులో నిర్బంధంలో వుంచారు యుద్ధం ముగిసిన తరువాత వారు జోహన్స్‌బర్గ్ వెళ్లి పోయారు తన శిల్పం పనిని వారు తిరిగి ప్రారంభించారు

ఇక పాఠకులకు ఒక పవిత్ర మహిళను పరిచయం చేస్తాను గోఖలే ఆమెకిచ్చిన సర్టిఫికెట్టును గురించి పాఠకులకు చెప్పాలనే కుతూహలాన్ని ఆపుకోలేక పోతున్నాను ఆమె పేరు కుమారి సోనజాశ్లెసిన్ మనుష్యుల్ని గుర్తించే ఒక అద్భుతశక్తి గోఖలేగారికి వున్నది బేలాగోవావే, నుంచి జాంజిబార్ దాకా నేను వారి వెంట వెళ్లాను అప్పుడు నాకు ప్రశాంతంగా వారితో మాట్లాడుటకు అవకాశం దొరికింది దక్షిణాఫ్రికా యందలి భారతీయులతోను, తెల్లజాతినాయకులతోను కూడా వారికి సత్సంబంధం ఏర్పడింది వారిలో చాలా మంది వ్యక్తిత్వాన్ని గురించి వారు నాకు వివరించి చెప్పారు అప్పుడు వారు భారతీయులు, ఆంగ్లేయులు అందరిలోను ప్రథమస్థానం కుమారి శ్లెసిన్‌కు యిచ్చారు "శ్లెసిన్ వంటి నిర్మలమైన అంతఃకరణంగల ఏకాగ్రతగల, స్థిరనిర్ణయంగల శక్తిని బహుకొద్ది మందిలోనే చూచాను ఏ విధమైన ప్రయోజనాన్ని ఆశించకుండా భారతజాతీయ సంగ్రామంకోసం సర్వార్పణం ఆమె చేయడం చూచి నివ్వెరపోయాను. ఆమె దీక్ష ఆమెస్ఫూర్తి, ఆమె సామర్థ్యం మీ సత్యాగ్రహ సమరానికి ఎంతో ఉపకరిస్తాయి ఆమె మీకు మంచి సేవికగా ఉపయోగపడుతుంది నేను చెప్పవలసిన అవసరం లేకపోయినా చెబుతున్నాను మీరు ఆమెను మీ దగ్గరే నియమించుకోండి ' ' అని చెప్పారు

నా దగ్గర ఒక స్కాచ్ కుమారి మిస్‌డిక్ స్టెనో టైపిస్టుగా పని చేస్తువున్నది ఆమె నిజాయితీ, నైతిక శక్తి అమోఘం జీవితంలో చాలా కటు అనుభవాలు నాకు కలిగాయి అయినా నాకు పరిచయం అయిన భారతీయులు, ఆంగ్లేయులు, యితర దేశాలవారు మహాకోవకు చెందినవారని చెప్పగలను అది నా అదృష్టమే. ఆమెకు వివాహం జరిగినప్పుడు నన్ను వదిలి వెళ్లి పోయింది అప్పుడు శ్రీ కేల్‌బెక్ కుమారి శ్లెసిన్‌ను తీసుకు వచ్చి పరిచయం చేశారు "ఈమెను యీమె తల్లి నాకు అప్పగించింది యీమె తెలివిగలది. నమ్మతగిన అమ్మాయి అయితే కొంటెతనం ఎక్కువ. స్వతంత్ర భావాలుగల స్వభావం. అయినా పరవాలేదు. మీరు యీమెకు పని అప్పగించవచ్చు. జీతం కోసం యీమెను మీ దగ్గర వుంచడం లేదు అని చెప్పారు శ్రీకేల్‌బెక్.

కుమారి శ్లెసిన్ కొంటెతనం ఎలా వుంటుందో నాకు బోధపడింది అయితే ఒక్క నెల రోజుల్లో ఆమె నన్ను తనవశం చేసుకున్నది పగలుగాని, రాత్రిగాని ఎప్పుడైనా సరే పని చేయుటకు సిద్ధంగా వుండేది ఆమెకు కష్టమైన పని అంటూ ఏమీ వుండేది కాదు అప్పుడు ఆమె వయస్సు 16 సంవత్సరాలు పవిత్రత, స్పష్టత, సేవానిరతి ద్వారా ఆమె నన్నే గాక నా కక్షిదారుల్ని, సత్యాగ్రహుల్ని సైతం ప్రభావితం చేసింది. ఆ కుమారి నా ఆఫీసుకే గాక, జాతీయ సమరానికి కూడా రక్షకురాలుగా నిలిచింది ఏ విషయమైనా సరే, నైతికంగా తనకు నచ్చకపోతే నాతో చర్చకు దిగేది నేను అందలి నైతిక విలువలను గురించి ఆమెకు నచ్చ చెప్పనంత వరకు ఆమె తృప్తి పడేది కాదు

సేర్ కాఛలియా దప్ప మిగతా వారంతా జైళ్లకు వెళ్లిపోయారు అప్పుడు కుమారి శ్లెసిల్ లక్షలాది రూపాయలకు కాపలా కాయడమే కాక, జమా ఖర్చుల విషయమై కూడా శ్రద్ధ వహించి పని చేసింది కాఛలియా కూడా మె సహాయం పొందేవాడు ఆమె సలహా ప్రకారం పని చేసేవాడు మేమంతా జైలుకు వెళ్లినప్పుడు శ్రీ డోక్ ఇండియన్ ఒపీనియన్ పత్రికా భారం వహించారు జుట్టు తెల్లబడి పోయిన డోక్ వంటి అనుభవజ్ఞుడు కూడా ఇండియన్ ఒపీనియన్ పత్రిక కోసం తను వ్రాసిన వ్యాసాల్ని కుమారి శ్లెసిన్ చేత ఓకె చేయించుకొనేవాడు కుమారి శ్లెసిన్ లేక పోతే నా పని మీదనాకే విశ్వాసం పోయి వుండేది ఆమె యిచ్చే సలహాలు సూచనలు అమితంగా ఉపయోగపడేవి అనేక పర్యాయాలు ఆమె చేసిన మార్పులు బాగా వున్నాయని విశ్వాసం కలిగి నేను పత్రికకు ప్రచురణ నిమిత్తం పంపేవాణ్ణి" అని డోక్ నాకు చెప్పారు పఠాన్లు, పటేళ్లు, గిర్‌మిట్ ప్రధనుంచి ముక్తి పొందిన భారతీయులు ఎప్పుడూ కుమారి శ్లెసిన్ చుట్టూ మూగి వుండేవాళ్లు ఆమె సలహాలు తీసుకొని పని చేస్తూ వుండేవాళ్లు

దక్షిణాఫ్రికా యందలి రైళ్లలో తెల్లజాతి వారు భారతీయుల ప్రక్కన కూర్చొని ప్రయాణం చేసేవారు కాదు ట్రాన్స్‌వాల్‌లో తెల్లవాళ్లు దాన్ని నియమంగా పెట్టుకున్నారు సత్యాగ్రహులు నియమప్రకారం రైళ్లలో మూడో

తరగతిలోనే ప్రయాణం చేస్తూ వుండేవారు కుమారి శ్లెసిన్ మాత్రం భారతీయుల ప్రక్కన కూర్చొని ప్రయాణం చేస్తూ వుంటే, తెల్లజాతి గార్డులు ఆమెను అపుటకు ప్రయత్నించేవారు కాని ఆమె వాళ్లకు ఎదురుతిరుగుతూవుండేది ఆమె కూడా నామాదిరిగా రైల్లో కష్టాలు అనుభవిస్తుందేమోనని భయపడేవాణ్ణి కాని ఆమె అలా జరగాలని ఎదురు చూస్తూ వుండేది ఆమె శక్తి సామర్థ్యాలు, భారతీయుల సత్యాగ్రహసమరం మీద ఆమెకు గల పట్టు ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం గ్రహించింది అయితే ఆమెను ఎన్నడూ నిర్బంధించలేదు ఆమె జోలికి పోలేదు ఆ మర్యాదను ప్రభుత్వం కాపాడుకున్నది

ఆమెకు నెలకు 6 పౌండ్లు యిచ్చేవాళ్లం ఆమె ఎన్నడూ పెంచమని కోరలేదు ఆమె అవసరాలను తెలుసుకొని నేనే 10 పౌండ్లు చేశాను ఎంతో కష్టం మీద అందుకు ఆమె అంగీకరించింది అంతకంటే ఎక్కువ జీతం తీసుకోనని చెప్పి వేసింది "నాకు ఎక్కువ జీతం వద్దు నేను ఒక లక్ష్యంతో మీ దగ్గర పని చేయడానికి వచ్చాను జీతం ఎక్కువ తీసుకుంటే నా ధర్మాన్ని, నా లక్ష్యాన్ని మరిచిపోయిన దాన్నవుతాను" అని నాకు చెప్పింది ఆమె మాటలు నన్ను కట్టి వేశాయి ఆమె ఎంత వరకు చదువుకున్నదీ అని పాఠకులు అడగవచ్చు ఆమె కేప్ యూనివర్సిటీ వారి ఇంటర్ మీడియట్ పరీక్ష ప్యాసైంది పార్టు హెండు, టైపు పరీక్షల్లో ప్రథమ శ్రేణిలో ప్యాసైంది భారత జాతీయ సత్యాగ్రహ సమరం ముగిసిన తరువాత ఆమె యూనివర్సిటీలో డిగ్రీ చదువు పూర్తిచేసుకొని, యిప్పుడు ట్రాన్స్‌వాల్ యందలి ప్రభుత్వ బాలికాశాలలో ప్రధానోపాధ్యాయురాలుగా పని చేస్తున్నది

శ్రీ హర్బర్ట్‌కిచన్ ఒక మంచి సరళ హృదయుడు ఆంగ్లేయుడు విద్యుచ్ఛక్తి పని తెలిసినవాడు బోయర్ యుద్ధంలో ఆయన మాతో బాటు పని చేశాడు కొంత కాలంపాటు ఆయన ఇండియన్ ఒపీనియన్ పత్రికా సంపాదకుడుగా పని చేశాడు యావజ్జీవితం ఆయన బ్రహ్మచర్య వ్రతాన్ని పాలించాడు

ఇప్పటివరకు నేను పరిచయం చేసిన వారంతా నాకు అప్తులు గాఢస్నేహితులు అయితే వాళ్లను ట్రాన్స్‌వాల్‌కు చెందిన ప్రముఖ ఆంగ్లేయుల జాబితాలో చేర్చుటకు వీలు లేదు వారందరి సహాయం భారత జాతీయ సంగ్రామం సాగినప్పుడు మాకు అపారంగా లభించింద వారిలో గౌరవ ప్రతిష్ఠల దృష్ట్యా శ్రీ హాస్కిన్ గారు ప్రముఖులు వారు దక్షిణాఫ్రికా చేంబర్స్ ఆఫ్ కామర్సు సంఘానికి మాజీ అధ్యక్షులు ట్రాన్స్‌వాల్ అసెంబ్లీ మెంబరు వారిని గురించి యింతకు ముందే వ్రాశాను వారి అధ్యక్షతన సత్యాగ్రహసమరానికి సహాయం చేయుటకు తెల్లజాతీయుల సమితి ఒకటి స్థాపించబడింది ఆ సమితి సత్యాగ్రహ సమర సమయంలో భారతీయులకు అమితంగా సాయం చేసింది సంగ్రామం ఉధృత రూపందాల్చిన తరువాత ప్రభుత్వాధినేతలతో సంభాషించడం కుదరని పని గదా అక్కడి ప్రభుత్వం తన చట్టాల్ని ఉల్లంఘించేవారితో మంచిగా వ్యవహరిరంచకపోవడమే అందుకు కారణం అటువంటి సమయంలో తెల్లజాతీయుల సహాయ సమితి యిరువురికి మధ్య మధ్యవర్తిత్వం వహించి పనిచేసింది

శ్రీ ఆల్బర్ట్ కార్ట్‌రైట్‌గారిని గురించి ముందే వివరంగా వ్రాశాను రెవరెండ్ డోక్ మాదిరిగా మాకు బాగా సహకరించిన మరో పాదిరీ వున్నారు వారి పేరు రెవరెండ్ చార్ల్స్ ఫిలిప్స్ వారు ట్రాన్స్‌వాల్ యందు ఎన్నో ఏండ్ల నుంచి కాంగ్రిగేషనల్ మినిస్టరుగా వున్నారు ఆయన సతీమణి కూడా మాకు ఎంతో సహాయం చేశారు మూడో ప్రసిద్ధ పాదరీ రెవరెండ్ డుడినీడ్రూ వారు పాదిరీ పదవిని విరమించుకొని బ్లుంఫోన్టీన్ నుంచి వెలువడే దిఫ్రండ్ అనుదిన పత్రికకు సంపాదకులుగా పని చేశారు. వారు తెల్ల జాతి వారి అవమానాల్ని భరించి భారతీయుల సంగ్రామాన్ని సమర్థిస్తూ ఎన్నో వ్యాసాలు తమ పత్రికలో ప్రచురించారు దక్షిణాఫ్రికాకు చెందిన ప్రసిద్ధ వక్తల్లో ఒకరుగా వారికి ప్రఖ్యాతి లభించింది.

ఇదేవిధంగా మాకు సహకరించిన తెల్లజాతీయుడు ది ప్రిటోరియా న్యూస్ అను పత్రికా సంపాదకులు శ్రీ బేర్‌స్టెంట్ ఒక సారి ప్రిటోరియా టౌను

హాల్లో మేయరు అధ్యక్షతన తెల్లవారు ఒక సభ జరిపారు భారతీయుల సత్యాగ్రహ సంగ్రామాన్ని నిందించడం, రక్తపు చట్టాన్ని సమర్థించడం ఆ సభ లక్ష్యం శ్రీ బేర్‌స్టైంట్ ఒంటరిగా నిలబడి ఆ సభలో తెల్లవారి వాదనలను గట్టిగా ఖండించారు సభాధ్యక్షుడు వెంటనే కూర్చోమని గద్దించినా ఆయన కూర్చోలేదు తెల్లవాళ్లు కొడతామని బెదిరించినా ఆయన జంకలేదు సింహంలా గర్జిస్తూ టౌన్‌హాల్లో నిలబడి పోరాడిన ధీశాలి చివరికి తీర్మానమేమి అంగీకరించరకుండానే సభను ఆపి వేయవలసి వచ్చింది

ఇంకా ఎంతో మంది ఆంగ్లేయులు మనకు హృదయపూర్తిగా సహకరించారు ఏ సమితిలోను మెంబర్లుకాక పోయినా వారంతా భారత జాతీయ సత్యాగ్రహ సంగ్రామాన్ని సమర్థించారు యిక ముగ్గురు ఆంగ్ల మహిళలను గురించి మాత్రం వ్రాసి యీ ప్రకరణం ముగిస్తాను వారిలో ఒకరు కుమారి హబ్‌హౌస్. ఆమె లార్డ్ హబ్‌హౌస్‌గారి కుమార్తె బోయర్ యుద్ధ సమయంలో యీమె మహిళలార్డ్ మిల్నర్ వ్యతిరేకించినా లెక్క చేయకుండా ట్రాన్స్‌వాల్ చేరుకున్న ధైర్యవంతురాలు లార్డ్‌కిచనర్ ప్రపంచమందంతట ప్రశంసలు పొందిన లేక దూషణ పొందిన కాన్సేన్ట్రేషన్ కాంపులు, అనగా యుద్ధం చేస్తున్న బోయర్ సైనికుల భార్యలనందరినీ ప్రోగు చేసి నిర్బంధంలో వుంచుటకు క్యాంపులు, ట్రాన్స్‌వాల్ మరియు ఫ్రీస్టేట్‌లో తెరిచినప్పుడు యీ మహిళ ఒక్కతే ఒంటరిగా వెళ్లి బోయర్ స్త్రీల మధ్య తిరిగి వాళ్లకు ధైర్యం చెప్పడమేగాక వారిలో వీరత్వాన్ని ప్రకోపింపజేసింది బోయర్ యుద్ధంలో ఆంగ్లేయుల విధానం తప్పని ఎలుగెత్తి చాటిన కుమారి హబ్‌హౌస్, కీ॥శే॥ శ్రీ స్టేడ్‌వలె ఇంగ్లీషు వాళ్లు ఓడిపోవాలని దేవుని ప్రార్థనలు జరిపింది బోయర్లకు యింత సేవ చేసిన ఆమె, యుద్ధం ఆగిపోయిన తరువాత ఆంగ్లేయుల చేతుల్లో అవమానాలు పొందిన ఆ బోయర్లు భారతీయుల్ని వ్యతిరేకిస్తున్నారని తెలిసి అమితంగా బాధపడింది. ఆమె యెడ బోయర్ ప్రజలకు అపారమైన గౌరవం వుండేది జనరల్ బోధాతో ఆమెకు దగ్గర సంబంధం వుండేది. బోయర్లలో రక్తపు చట్టాన్ని రద్దు చేయడం అవసరమని ఆమె ప్రచారం చేసింది.

రెండవ మహిళ పేరు కుమారి ఆలివ్ ట్రాయినర్. యీ మహిళను గురించి అయిదవ ప్రకరణంలో వ్రాశాను ఆమె దక్షిణాఫ్రికాకు చెందిన ప్రసిద్ధ ట్రాయినర్ కుటుంబంలో జన్మించిన విదుషీమణి ట్రాయినర్ కుటుంబానికి దక్షిణాఫ్రికా యందంతట ఎంతో గౌరవ ప్రతిష్టలు లభించాయి కుమారి ట్రాయినర్ పెండ్లి జరిగిన తరువాత ఆమెను పెండ్లాడిన భర్త ఆమె పేరును అంగీకరిరంచ వలసి వచ్చింది అందుకు కారణం ఆమె మిధ్యాభిమానం కాదు ఆమె కుటుంబగౌరవమే ఆమె ఎంత గొప్ప విదుషీమణియో అంతనిరాడంబరురాలు వినతగల మహిళ వారితో నాకు మంచి పరిచయం వున్నదని బావిస్తున్నాను వారి దగ్గర పని చేసే హబ్షీ నౌకర్లకు తమకు తేడా వున్నదని వారు ఎన్నడూ భావించలేదు ఆమె రచించిన డ్రీమ్సు అను ఆంగ్ల పుస్తకం అందరూ చదువుతూ వుంటారు అది వచనంలో వ్రాయబడినా కావ్య గౌరవం ఆ పుస్తకానికి అంతా యిస్తారు యింకా పలు గ్రంధాలు ఆమె రచించారు ఆమెకు యింత గౌరవం వున్నా తనయింటి పనులు ఆమెయే చేసుకొనేది వంటపని తానే చేసుకునేది యింట్లో పాత్రలుకూడా తానేశుభ్రం చేసుకొనేది శారీరిక కష్టంవల్ల మానసిక శక్తి పెరుగుతుందని ఆమె అభిప్రాయం దక్షిణాఫ్రికాలో భారతీయుల సత్యాగ్రహ సంగ్రామానికి అనేక విధాల సహాయం అందజేసింది తెల్ల వారందరి పేర్లు యిక్కడ పేర్కొన లేదు అయితే పేర్కొన్న వారందరి ద్వారా పేర్కొనని వారందరికీ కృతజ్ఞత తెలిపినట్లే యీ కృతజ్ఞతా భావం భారతీయులందరి హృదయాలనుండి వెలువడినట్టిదే సత్యాగ్రహిగా పరిశుద్ధమైన మనస్సుతో చేసిన సంగ్రామానికి పరిశుద్ధమైన ఫలితమే కలుగుతుందని నా అభిమతం అది కనబడవచ్చు కనబడకపోవచ్చు కాని శుభపరిణామం తప్పదు సత్యాగ్రహ సమరం అనేక పరిశుద్ధ హృదయాలను ఆకర్షించకుండా వుండదు వాళ్లందరి శుభాకాంక్షల్ని, సహాయసంపదను అందుకుంటుంది అందుకు వేరే కారణాలు ఏమీ వుండవు సత్యాగ్రహమందలి పరిశుద్ధత, నైతిక శక్తి, సత్యనిష్ఠ, త్యాగనిరతి, సహన శక్తి సహృదయులనందరినీ

ఆకర్షించి తీరుతుంది యింతమంది ఆంగ్లేయుల, తదితర దేశీయుల అభిమానానికి పాత్రత పొందినది భారతీయుల సత్యాగ్రహ శక్తియేయని మనవి చేస్తున్నాను

మూడో మహిళ కుమారి మోల్టినో ఆమె దక్షిణాఫ్రికాకు చెందిన మోల్టినో కుటుంబానికి చెందిన గౌరవనీయురాలు ఆమెకూడా శక్తిని బట్టి భారతీయులకు సహాయం చేసింది ఈ తెల్లజాతి సహాయకులు చేసిన సహకారంవల్ల ఏం ఫలితం కలిగిందని పాఠకులు ప్రశ్నించవచ్చు కొంతమంది అట్టి మిత్రులు చేసిన పనులే వారి సహకారానికి సాక్ష్యంగా వున్నాయి వీరందరి సత్కృషి వల్ల కలిగిన ఫలితం ఏమిటి అనేది ముఖ్య ప్రశ్న అసలు సత్యాగ్రహం సంగ్రామంలోనే దాని పరిణామ ఫలితం గూడా యిమిడి వుంటుంది అసలు అది ఆత్మత్యాగం, ఆత్మ సహాయం మరియు, దైవశ్రద్ధకు సంబంధించిన సంగ్రామం దాన్ని ఆ రూపంలోనే గుర్తించాలి

దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్రలో అక్కడి తెల్లజాతి సహాయకులు అందించిన సహాయ సహకారాలకు ఎంతో ప్రాముఖ్యం వున్నది

★ ★ ★

# 24

# ఆంతరికమైన తీవ్రకలహాలు

ఇరువది రెండవ ప్రకరణంలో ఆంతరికమైన కష్టాల్ని గురించి కొద్దిగా తెలుసుకున్నాం జోహన్స్‌బర్గ్‌లో పఠాన్లు నాపై దాడి చేశారు అప్పుడు నాకుటుంబం ఫినిక్స్‌లో వున్నది దాడి విషయం తెలియగానే నా భార్యపిల్లలు బాధపడటం సహజమే కదా! నన్ను చూచుటకు అంత డబ్బు ఖర్చుచేసి ఫినిక్స్ నుంచి జోహన్స్ బర్గ్ రావడం వారికి సాధ్యంకాని పని అందువల్ల ఆరోగ్యం కుదుటబడిన తరువాత నేనే అక్కడికి వెళ్లడం అవసరమని భావించాను

పనుల కోసం నేటాలు - ట్రాన్స్‌వాలుకు మధ్య నారాక పోకలు

జరుగుతూ వున్నాయి నేటాలులో కూడా భారతజాతికీ అక్కడి ప్రభుత్వానికి జరిగిన ఒడంబడికను గురించి ఎన్నో అపోహలు ఉన్నాయని నాకు తెలిసింది నాకు, యితరులకు నేటాలునుంచి అందే ఉత్తరాల వల్ల యీ విషయం తెలుస్తూ వున్నది ఇండియన్ ఒపీనియన్‌లో ప్రకటించమని తీవ్ర పదజాలంతో నిండిన కటు వార్తలు, వ్యాసాలు కుప్పలు కుప్పలుగా పడి వున్నాయి యిప్పటి వరకు సత్యాగ్రహ పోరాటం ట్రాన్స్‌వాల్ యందలి భారతీయుల వరకే ఆగి యున్నది అయినా నేటాలు యందలి భారతీయుల అంగీకారం పొందడం, వాళ్ల భావాల్ని పరిగణనలోకి తీసుకోవడం కూడా అవసరమే ట్రాన్స్‌వాల్ యందలి భారతీయులు ట్రాన్స్‌వాల్ పేరట దక్షిణాఫ్రికా యందలి సమస్త భారతీయుల కోసం పోరాటం సాగిస్తున్నారు అందువల్ల నేటాల్‌లో అలుముకున్న అపోహల్ని తొలగించుటకు నేను డర్బన్ వెళ్లడం అవసరమని అనిపించింది వెంటనే అక్కడికి చేరుకున్నాను అక్కడ వాతావరణం నాకు వ్యతిరేకంగా వున్నదని సభ సరిగితే నాపై దాడి చేయుటకు కొందరు సిద్ధపడుతున్నారని, అందువల్ల జాగ్రత్తగా వుండమని కొందరు స్త్రీలు నన్ను ముందుగానే హెచ్చరించారు అయినా డర్బన్‌లో ఒక బహిరంగ సమావేశం ఏర్పాటు చేశారు అక్కడి మిత్రులు రెండు మార్గాలు సూచించారు సమావేశంలో పాల్గొనకపోవడం లేక స్వరక్షణకు తగిన ఏర్పాట్లు చేసుకోవడం అయితే రెండు ఉపాయాలూ నాకు నచ్చలేదు యజమాని, సేవకుణ్ణి పిలిస్తే అతడు రాకపోతే సేవాధర్మాన్ని ఉల్లంఘించినట్లే కదా స్వామి సేవకు భయపడేవాడు సేవకుడు ఎలా అవుతాడు? ప్రజలకు సేవ చేయడానికి సేవాభావంతో పూనుకోవడం నిజంగా కత్తి మీద సామువంటిదే ప్రశంసలు అందుకొనుటకు సిద్ధంగా వుండే ప్రజాసేవకుడు నిందలకు భయపడితే ఎలా? అన్నీ ఆలోచించి సరిగ్గా సమయానికి నేను సభలో పాల్గొన్నాను ప్రభుత్వంతో జరిగిన ఒడంబడిక వివరాలన్నీ అక్కడి వారికి చెప్పాను వారడిగిన ప్రశ్నలన్నింటికీ సమాధానాలు యిచ్చాను

ఆ సభ రాత్రి సుమారు 8 గంటలకు జరిగింది సభాకార్యక్రమం

ముగియబోతుండగా ఒక పఠాను, పెద్దదుడ్డు కర్రపుచ్చుకొని వేదిక మీదకు వచ్చాడు సరిగ్గా అదే సమయానికి అక్కడి లైట్లన్నీ ఆరిపోయాయి నేను వెంటనే పరిస్థితిని గ్రహించాను సభాధ్యక్షత వహించిన సేర్ దావూద్ మహమ్మద్ టేబుల్ పైకెక్కి జనానికి సర్ది చెప్పి శాంతింపచేయుటకు ప్రయత్నించసాగారు నన్ను రక్షించదలచిన వాళ్లు నన్ను చుట్టి వేశారు నా రక్షణ కోసం నేనేమీ ఏర్పాట్లు చేసుకోలేదు అయితే అప్పుడు నేను అక్కడివారిలో చాలామంది నా మీద దాడిజరుగుతుందని ముందుగానే ఊహించి రక్షణ ఏర్పాట్లు చేశారని అర్థం చేసుకున్నాను వారిలో ఒక మిత్రుడు జేబులో పిస్తోలు పెట్టుకొని వచ్చాడు ఆయన గాలిలోకి ఒక గుండు పేల్చాడు కూడా యింతలో అక్కడి విషయమంతా గ్రహించిన పారసీరుస్తుమ్‌గారు కరెంటు స్పీడులో వెంటనే పోలీసు స్టేషను చేరుకొని పోలీసు సూపరింటెండెంట్ అలెగ్జాండరుకు సంగతంతా తెలియచేశాడు వెంటనే ఆయన పోలీసుల దళాన్నో అక్కడికి పంపించాడు పోలీసులు నన్ను చుట్టివేసి తమ మధ్యన నిలిపి నన్ను పారసీ రుస్తుమ్ గారింటికి చేర్చారు

మరునాడు పారసీరుస్తుమ్ గారు డర్బనులో వున్న పఠాన్లందరినీ పిలిపించి గాంధీగారికి వ్యతిరేకమైన విషయాలన్నీ చెప్పమని కోరారు నేను వాళ్లందరినీ కలిశాను వారికి నచ్చచెప్పి శాంతింపచేయుటకు ప్రయత్నించాను అయితే వాళ్లను శాంతపరచగలిగానని నాకు అనిపించలేదు సందేహాలకు ఏమందూ పని చేయదు కదా! ఎంత చెప్పినా ఏం లాభం? నేను భారతజాతిని మోసగించాననే భావం వారి మనస్సులో నాటుకుంది సందేహపు యీవిషం వారి మనస్సులనుంచి దిగిపోనంత వరకు నేను ఏమి చెప్పినా ప్రయోజనం లేదని తేలిపోయింది.

ఆనాడే నేను డర్బను నుంచి ఫినిక్సుకు బయలుదేరాను. రాత్రి నన్ను రక్షించిన మిత్రులంతా నన్ను ఒంటరిగా వదులుటకు సుతారాము యిష్టపడలేదు. మేము ఫినిక్సు వచ్చి మకాం పెడతామని గట్టిగా చెప్పారు నేను వద్దన్నప్పటికీ మీరు ఫినిక్స్ వస్తామంటే నేను ఆపగలనా? అక్కడ అంతా

అడవి అక్కడ వుంటున్న మేము మీకు భోజనం పెట్టలేక పోతే మీరు ఏం చేస్తారు అని అడిగాను "మీరు మమ్మల్ని భయపెట్టవద్దు మా ఏర్పాట్లు మేము చేసుకోగలం మేము సిపాయిల్లా కాపలా కాచినంతకాలం మీ కొరారాన్ని లూటీ చేసినా మమ్మ్మ ఎవరు ఆపగలరు?" అని ఒక మిత్రుడు అన్నాడు

ఇలా సరసాలాడుకుంటూ మేము ఫినిక్స్ చేరాం యీ రక్షక దళానికి నాయకుడు జెక్‌ముడలీ అతడు భారతీయుల్లో ప్రసిద్ధి కెక్కిన వ్యక్తి అతడు నేటాలు తమిళులైన తల్లితండ్రికి జన్మించిన వాడు అతడు బాక్సింగులో ప్రత్యేక శిక్షణ పొందాడు నల్లవాళ్లలోగాని, తెల్లవాళ్లలోగాని ఎవ్వడూ బాక్సింగ్‌లో అతణ్ణి గెలవలేరని అతడి, అతడి అనుచరుల నిశ్చితాభిప్రాయం

దక్షిణాఫ్రికాలో రాత్రిళ్లు వర్షాలు పడనప్పుడు ఎన్నో సంవత్సరాల నుండి యింటి బయట ఆకాశం క్రిందపడుకొని నిద్రపోవడం నాకు అలవాటు యిప్పుడు అందు మార్పు చేయడం నాకు యిష్టం లేదు అయితే స్వనిర్మిత రక్షక దళ సభ్యులు రాత్రిళ్లు నేను పడుకునే చోటును పహరా కాయాలని నిర్ణయించుకున్నారు డర్బనులోనేను యీ రక్షకదళ సభ్యుల్ని ఎగతాళి చేశాను నా వెంటరావద్దని ఆపుటకు కూడా ప్రయత్నించాను కాని నాలో ఒక బలహీనత చోటు చేసుకున్నది ఆ నిజాన్ని అంగీకరిస్తున్నాను వాళ్లు కాపలా కాస్తున్నప్పుడు నేను నిర్భయంగా వున్నాను అనే అనుభవం నాకు కలిగింది వీళ్లు వచ్చి యుండకపోతే నేను యింత నిర్భయంగా నిద్రించి యుండలేక పోయేవాణ్ణి అని కూడా అనిపించింది చీమచిటుక్కుమన్నా ఉలిక్కిపడేవాణ్ణి

ఈశ్వరుని మీద నాకు అమిత శ్రద్ధ వున్నదని నాకు గట్టినమ్మకం మృత్యువు మనిషి జీవితంలో వచ్చే గొప్ప మార్పు అని, ఎప్పుడు వచ్చినా అది స్వాగతానికి యోగ్యమైనదని ఎన్నో ఏండ్ల నుంచి నా బుద్ధి అంగీకరించిన విషయం అందుకని మృత్యువంటే కలిగే భయాన్ని తొలిగించుకొనుటకు ఎంతో ప్రయత్నించాను కాని నా జీవితంలో అనేక విషమ సమయాల్లో

మృత్యువును ఆలింగనం చేసుకోబోతున్నానను భావం కలిగినప్పుడు సంతోషాన్ని పొందలేకపోయానని చెప్పక తప్పదు దీర్ఘకాలాన్నుంచి విడిపోయిన మిత్రుని కలుసుకోనున్నామని తెలిసినప్పుడు కలిగేటంత సంతోషం, మృత్యు విషయంలో కలుగలేదు ఎంత బలవంతుడు కావాలని మనిషి భావించినా మనిషి నిర్బలుడిగానే వుంటాడు బుద్ధి వరకే సీమితమై యున్న అతనిజ్ఞానం అనుభవం దగ్గరికి వచ్చే సరికి జీవితానికి అది సరిగా ఉపయోగపడదు అప్పుడు బైటి సహాయం లభిస్తే స్వీకరిస్తాడు అంటే తన అంతర్గత బలాన్ని పోగొట్టుకుంటాడన్నమాట సత్యాగ్రహి అయినవాడు యిట్టి భయాలను తన మనస్సునుంచి తొలిగించుకోవాలి

ఫినిక్సులో వుంటూ నేను ఒక పని తీవ్రంగా చేశాను నా జాతి జనానికి ఏర్పడ్డ అపోహల్ని తొలగించుటకు ఇండియన్ ఒపీనియన్‌లో బాగా వ్రాశాను సంపాదకునికి, సందేహాలతో నిండిన పాఠక వర్గానికి మధ్య జరిగిన సంభాషల రూపంలో కాల్పనిక సంభాషల్ని విపరీతంగా వ్రాశాను ఒడంబడికను గురించి నేను విన్న సందేహాల్ని, అపోహల్ని అనుమానాల్ని పోగొట్టుటకు నేను విన్నవాటినన్నింటినీ నేనే ప్రశ్నలుగా వ్రాసి వాటికి విస్తారంగా సమాధానాలిచ్చాను అందుకు మంచి ఫలితం కలిగిందని నమ్మకం నాకు కలిగింది ట్రాన్స్‌వాల్ యందలి భారతీయులు దీర్ఘకాలం ఒడంబడిక తప్పని భావించలేదు నిజంగా వాళ్లకు సందేహాలు కలిగియుంటే భయంకరమైన పరిణామాలు సంభవించియుండేవి ఒడంబడికను అంగీకరించడం, అంగీకరించక పోవడం కేవలం ట్రాన్స్‌వాల్ యందలి భారతీయుల పని మాత్రమే వాళ్ల పనుల వల్ల, వారికీ, వారి సేవకుడుగానున్న నాకు పరీక్ష తప్పక జరిగియుండేది చివరికి స్వేచ్ఛగా అనుమతి పత్రాలు తీసుకొనని భారతీయులు బహుకొద్దిమంది మాత్రమే మిగిలారు ఏషియాటిక్ ఆఫీసుకు పెద్ద సంఖ్యలో అనుమతి పత్రాలు తీసుకునేందుకు జనం బారులు తీరివుండేవారు పత్రాలు యిచ్చే అధికారులకు క్షణం తీరిక చిక్కేది కాదు భారత జాతి త్వరగా ఒడంబడికకు సంబంధించిన షరతులను పాలించి చూపించింది అలా పాలించడం

అవసరమే కదా యీ విషయాన్ని ప్రభుత్వాల కూడా అంగీకరించక తప్పలేదు అపోహలకు గల తావు నిజానికి బహుతక్కువ అయినా అది ఉగ్రరూపం దాల్చింది పఠాన్లు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకున్నప్పుడు, వారు హింసామార్గాన్ని అవలంభించినప్పుడు జాతి ప్రజల్లో అలజడి వ్యాపించింది నిజానికి అందు అపోహలకు తావే లేదు అందు అనుమానాలకు పునాదియే లేదు అటువంటి గొడవలు క్షణికంగానే జరుగుతాయి అయినా ప్రపంచంలో అట్టివాటికి కూడా శక్తి వుంటూనే వున్నది రక్తపాతం అన్నా, హింసఅన్నా మనం వణికి పోతూ వుంటాం ధైర్యం వహించి ఆలోచిస్తే యిట్టి హింసను చూచి భయపడనక్కరలేదు ఒక్క విషయం మీర్ఆలం, అతడి అనుచరులు చేసిన దాడికి గాయపడటానికి బదులు నా శరీరం నష్టపడిపోయివుంటే, భారతజాతి యీ విషయం గమనించి కూడా నిశ్చింతగా, ప్రశాంతంగా వుండివుంటే, మీర్ ఆలం తన బుద్ధి ద్వారా కేవలం హింసాపూరితంగా వ్యవహరించాడని భావించి, అతణ్ణి మిత్రభావంతో క్షమించియుంటే, జాతికి నష్టమేమీ కలిగి యుండేదికాదు అట్టి ఉదాత్తమైన ఉదారమైన ఆచరణవల్ల జాతి గొప్పతనం పెరిగిపోయి వుండేది జాతి అపోహలన్నీ పటాపంచలైపోయి వుండేవి అది ద్విగుణీకృత ఉత్సాహంతో తన ప్రతిజ్ఞపై నిలిచి యుండేది నాకు నిజంగా ఎంతో లాభం కలిగి యుండేది సత్యాగ్రహ విషయంలో సత్యానికి కట్టుబడి, సత్యనిష్ఠతో సునాయాసంగా అందునిమిత్తం సత్యాగ్రహి ప్రాణం పోగొట్టుకోవలసి వస్తే అంతకంటే మించిన మంగళకరమైన పరిణామం మరింకొకటి ఉండదు అది నిజంగా సత్యాగ్రహి యొక్క విజయమే

పైన తెలిపిన కారణాలు సమర్థనలు కేవలం సత్యాగ్రహం వంటి పోరాటానికే వర్తిస్తాయి అందువైరానికి, అసహ్యానికి తావు వుండదు ఆత్మశక్తి లేక స్వావలంబనమే దాని ఏకైక సాధనం అందు ఎవ్వరూ మరొకరి సాయం కోసం ఆశగా ఎదురు చూడరు అందు నాయకుడు వుండడు సేవకుడుగాని, అనుచరుడుగాని ఎవ్వడూ వుండడు అందు వుండేది అంతానాయకులే

అంతా సేవకులేనని చెప్పవచ్చు అందువల్ల ఎంతగొప్ప వ్యక్తి సత్యాగ్రహంలో మృతి చెందినా సత్యాగ్రహ సమరం శక్తిని కోల్పోదు సమర వేగాన్ని అమితంగా పెంచుతుంది

ఇదే సత్యాగ్రహం యొక్క శుద్ధమైన మూలస్వరూపం కాని మనం అనుభవంలో యిట్టి దానిని చూడటం లేదు అందరూ వైరాన్ని, అసహ్యాన్ని త్యజించలేక పోవడమే అందుకు కారణం ప్రత్యక్ష అనుభవం ద్వారాను, ఆచరణ రూపంలోను జనం సత్యాగ్రహ రహస్యాన్ని తెలుసుకోలేక పోతున్నారు కొందరి ఆచరణను చూచి చాలా మంది మూర్ఖంగా వాళ్లను అనుసరిస్తున్నారు అసలు ట్రాన్స్‌వాల్‌లో చేయబడ్డ సామూహిక, సాంఘిక సత్యాగ్రహం యొక్క ప్రయోగం, టాల్‌స్టాయి అభిప్రాయం ప్రకారం మొట్టమొదటిది నేను స్వయంగా చారిత్ర్యాత్మకంగా శుద్ధ సత్యాగ్రహానికి ఒక్క ఉదాహరణనైనా చూచియుండలేదు చరిత్రను గురించి నాకు తెలిసినది తక్కువే కనుక యీ విషయంలో నేను ఒక నిశ్చితాభిప్రాయానికి రాలేకపోతున్నాను అటువంటి ఉదాహరణలతో మనకు సంబంధం కూడా లేదు సత్యాగ్రహం యొక్క మూలసిద్ధాంతాల్ని అంగీకరిస్తే, నేను చెప్పిన ఫలితాలు లభించితీరుతాయి సత్యాగ్రహ ప్రయోగం సాధ్యం కాని పని అని, దాన్ని అమలు చేయడం కష్టమని చెప్పి సత్యాగ్రహం యొక్క అమూల్యమైన శక్తిని వదిలివేయకూడదు శస్త్రాస్త్రాల ప్రయోగం వందలాది సంవత్సరాల నుంచి జరుగుతూనే వున్నది దాని కటుఅనుభవాలు కండ్లారా మనం చూస్తూనే వున్నాం భవిష్యత్తులో సైతం దానివల్ల మధురఫలితాలు లభిస్తాయని అనుకోవడం సరికాదు అంధకారంలో నుంచి వెలుగును ఉత్పన్నం చేయకలిగితేనే, వైరభావాన్నుంచి ప్రేమ భావాన్ని ప్రకటింప చేయవచ్చు



# 25

# జనరల్ స్మట్స్ చేసిన నమ్మక ద్రోహం?

మా ఆంతరంగిక యిబ్బందులను గురించి పాఠకులు కొంతవరకు గ్రహించే వుంటారు వాటిని వర్ణించునప్పుడు ఎక్కువగా నా ఆత్మ కథనే చెప్పవలసి వచ్చింది సత్యాగ్రహానికి సంబంధించిన నా యిబ్బందులే నా తోటి సత్యాగ్రహులకీ ఎదురైనందున యిది అనివార్యమైంది ఇప్పుడు మళ్ళీ మనం బైటి యిబ్బందుల గురించి చర్చించుకుందాం

ఈ ప్రకరణానికి శీర్షిక పెట్టేటప్పుడు నాకు సిగ్గువేసింది ఈ ప్రకరణం వ్రాసేటప్పుడూ సిగ్గనిపించింది కారణం - దీనిలో మానవ స్వభావపు వక్రతను గురించిన వర్ణన వుంది 1908లో జనరల్ స్మట్స్ దక్షిణాఫ్రికాలో కల్లా తెలివైన నాయకుడిగా చలామణి అయ్యేవారు ఇప్పుడు కూడా ప్రపంచం మొత్తంమీద కాకపోయినా బ్రిటిష్ సామ్రాజ్యంలో ఉన్నత శ్రేణికి చెందిన కార్యకుశలునిగా పరిగణింప బడుతున్నారు వారి మహోన్నత శక్తి కుశలత పట్ల యోగ్యతల పట్లా నాకు సందేహం లేదు

వకీలుగా వారెంత కుశలురో సేనాపతి గానూ, శాసకులుగానూ అంతే నిపుణులు దక్షిణాఫ్రికాలో ఇతర అధికారులు ఎందరో వచ్చారు వెళ్ళారు కానీ 1907 మొదలుకొని యీనాటివరకూ దక్షిణాఫ్రికా ప్రభుత్వపు పగ్గాలు వీరి చేతుల్లోనే వున్నాయి ఈ రోజు వరకు కూడా వీరితో పోటీపడి నిలువగలిగే నాయకుడే దక్షిణాఫ్రికాలో లేడు ఈ ప్రకరణం వ్రాసే సమయానికి, నేను దక్షిణాఫ్రికాను వదలి తొమ్మిది సంవత్సరాలు దాటిపోయాయి ఇప్పుడు దక్షిణాఫ్రికా ప్రజలు జనరల్ స్మట్స్‌ను ఏ విశేషణాలతో సంబోధిస్తున్నారో నాకు తెలియదు జేన్ అన్నది వారి సొంత (క్రిస్టియన్) నామధేయం దక్షిణాఫ్రికా ప్రజలు వారిని స్లిమ్‌జేనీ అని సంబోధిస్తారు స్లిమ్ అంటే జారిపోయే లేక పట్టుబడని అని అర్థం గుజరాతీ భాషలో హిందీలోనూ దీనికి దగ్గరగా వున్నపదం ధూర్తుడు కాస్త తియ్యగా

చెప్పుకోవాలంటే చలాకీవాడు అనవచ్చు కొంతమంది ఆంగ్ల స్నేహితులు నాతో జనరల్ స్మట్‌తో కాస్త జాగ్రత్తగా వుండు చాలా చాతుర్యం గలవాడు నిముషాల్లో మారిపోయే మనస్తత్వ మతనిది అని చెప్పారు వారి మాటల అర్థం స్పష్టంగా వున్నది వారిది ఇరుపక్షాలవారికీ నచ్చేవిధంగా మాట్లాడే చాతుర్యం ఇదేకాక తమ మాటలకు మూడో అర్థం కూడా చెప్పి, దానికి అనుకూలంగా చర్యలు తీసుకోగలరు కూడా తమ మాటలను చక్కగా సమర్థించుకోగలరు అప్పుడిక యిరుపక్షాల వారూ వారి మాటలను తామే సరిగా అర్థం చేసుకోలేక పోయామని స్మట్స్ ఆడిన మాటలకు ఆయన చెప్పిన అర్థమే సరైనదనీ సమాధానపడి పోతారు అని కూడా చెప్పారు ఈ ప్రకరణంలో నేనువర్ణించబోతున్న సంఘటనను అప్పట్లో నమ్మకద్రోహం అని పరిగణించాము ఇప్పటికీ దేశభక్తి దృష్టితో చూస్తే దీన్ని నమ్మకద్రోహమనే నేను అంటాను ఇంతేకాకుండా యీ ప్రకరణ శీర్షికయందు ప్రశ్నార్థకాన్ని వుంచాను కారణం - వాస్తవానికి యీ పని జనరల్ స్మట్స్ కావాలని చేసిన విశ్వాస ఘాతుకం కాదేమోననే ఈ ఘాతుకం చేయాలన్న సంకల్పం లేనప్పుడు దాన్ని విశ్వాస భంగమని ఎలా అనగలం? 1913-14 మధ్యకాలంలో జనరల్ స్మట్స్ వల్ల కలిగిన అనుభవాన్ని అప్పట్లో నేను చేదైనదిగా భావించలేదు అప్పటికంటే ఎక్కువ తటస్థంగా ఆలోచించగలిగే యీనాడు కూడా, దాన్ని చేదు అనుభవమని అనుకోవటం లేదు 1908లో భారతీయుల పట్ల జనరల్ స్మట్స్ వ్యవహరించిన తీరు కూడా ఉద్దేశ్యపూర్వకంగా చేసిన విశ్వాస ఘాతుక చర్య కాదేమో అని అనిపిస్తుంది

ఈ వివరణ అంతా యివ్వటానికి ఒక కారణం వుంది జనరల్ స్మట్స్ పట్ల న్యాయంగా వ్యవహరించటానికీ, యీ ప్రకరణం శీర్షికలో అతని పేరుతోపాటు విశ్వాస నమ్మకద్రోహమనే పదం వాడటానికీ యీ ప్రకరణంలో నేను చెప్పదలచుకున్న విషయాన్ని సమర్థించుకోవటానికీ పై వివరణ యివ్వవలసి వచ్చింది

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి భారతీయులు స్వచ్ఛందంగా లొంగిపోయి తృప్తి

కలిగించిన వైనాన్ని గత ప్రకరణంలో చూశాం ఇక యిప్పుడు ప్రభుత్వం, ఖూనీ చట్టాన్ని రద్దు చేయవలసి వుంది అలా చేస్తే సత్యాగ్రహ యుద్ధం ఆగిపోతుంది అంటే ట్రాన్స్‌వాల్ ప్రభుత్వంలో భారతీయులకు వ్యతిరేకంగా వున్న అన్ని చట్టాలూ రద్దయిపోతాయనో లేదా భారతీయుల బాధలన్నీ దూరమైపోతాయనో అనుకోకూడదు ఆ పరిస్థితి రావాలంటే ముందులాగే చట్టపరమైన యుద్ధాన్ని కొనసాగించ వలసిందే నల్లటి భయంకరమైన మేఘాన్ని పోలిన ఖూనీ చట్టాన్ని రద్దు చేయించడమే యీ సత్యాగ్రహ ఉద్దేశ్యం ఈ చట్టాన్ని అంగీకరిస్తే అది దేశానికే కళంకమౌతుంది దీనివల్ల ముందు ట్రాన్స్‌వాల్ లోనూ, తరువాత దక్షిణాఫ్రికా మొత్తం నుంచే భారతీయుల ఉనికియే నశించవచ్చు కానీ యీ ఖూనీ చట్టాన్ని రద్దు చేసేందుకు బదులు, జనరల్ స్మట్స్ కొత్త ఎత్తుగడ వేశారు విధానసభలో కొత్తగా ప్రవేశపెట్టిన బిల్లు ద్వారా అటు హత్యానేర చట్టాన్ని యధాతధంగా వుంచి తమ యిష్టం మేరకు తీసుకున్న అనుమతి పత్రాలను చట్టబద్ధం చేశాడు దాంతోపాటు బిల్లులో ఓ కొత్త అంశం (సెక్షన్) చేర్చాడు యిచ్ఛాపూర్వకంగా ఆజ్ఞా పత్రాలను పొందిన భారతీయులపై ఖూనీ చట్టాన్ని అమలు పరచనవసరం లేదన్నదే ఆ అంశం ఒకే విషయానికి సంబంధించిన రెండు చట్టాలు అమలులో వుండటం యిందలి విశేషం ట్రాన్స్‌వాల్‌లోకి క్రొత్తగా ప్రవేశించే భారతీయులకి లేదా కొత్తగా ఆజ్ఞాపత్రాలను పొందగోరే భారతీయులకి యీ ఖూనీ చట్టం వర్తిస్తుందన్నమాట

ఈ కొత్త బిల్లును చదివి నేను బిత్తరపోయాను జాతికి నేనేం జవాబు చెప్పేది? జోహన్స్‌బర్గ్‌లో అర్ధరాత్రి జరిగిన సభలో నాపై భయంకరమైన ఆరోపణలు చేసిన పఠాన్ సోదరులకు ఎంతో మంచి విందు భోజనం దొరికింది కానీ యీ దెబ్బతో సత్యాగ్రహం పట్ల సడలిపోవలసిన నా విశ్వాసం మరింత దృఢమైందని చెప్పక తప్పదు మా కమిటీ సభ్యులను పిలిపించి, తాజా పరిస్థితిని వివరించాను నాపై కొందరు ఒక విసురు విసిరారు కూడా మీరు అమాయకులని మేము చెబుతూనే వున్నాం ఎవరేం చెప్పినా దాన్ని

పూర్తిగా నమ్మేస్తారు మీ స్వవిషయాల్లో, యిలా వుంటే మాకేమీ బాధలేదు కాని దేశం విషయాల్లోనూ మీరిలాగే అమాయకులై వుంటే యిబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది ఇప్పుడిక దేశప్రజల్లో మునుపటి ఆవేశమూ ఉత్సాహమూ మొలకెత్తడం కష్టమేమో అనిపిస్తున్నది మన దేశం గురించి మీకు బాగా తెలుసు అవి సోడాబుడ్డి వంటిది దాన్లో క్షణికంగా వచ్చే ఆ పొంగునే సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించుకోవాలి ఆ పొంగు చల్లారితే అంతా నీరుకారి పోయినట్లే

ఈ మాటల తూటాల్లో ఏ దురుద్దేశ్యమూ లేదు ఇతర సందర్భాల్లోనూ యీ మాటలు నేను విన్నాను అందుకే నవ్వుతూనే నేను సమాధానమిచ్చాను - "మీరు అమాయకత్వమనుకునే అంశం నా వ్యక్తిత్వంలో విడదీయరాని భాగమైపోయింది అది అమాయకత్వంకాదు విశ్వాసం మన తోటి మానవులపై విశ్వాసం వుంచటం మనందరి కర్తవ్యం కానీ దీన్ని మీరు నాలోపమనుకుంటే మరో విషయమూ యోచించాలి నా సేవవల్ల దేశానికి లాభం చేకూరుతుందని మీరు అనుకుంటే, నా యీ లోపంవల్ల జరిగే నష్టాన్ని కూడా భరించక తప్పదు ఇంతేకాక దేశం యొక్క ఆవేశం సోడాబుడ్డి లాంటి క్షణికమైన ఆవేశమని నేను, మీలా అనుకోను దేశంలో నేనూ మీరూ మనమంతా వున్నాం నా ఉత్సాహానికీ ఆవేశానికీ మీరీ విశేషణాన్ని జోడించారంటే అవమానంగా భావిస్తాను మీరూ దీన్ని అవమానంగానే భావిస్తారనుకుంటాను ఒకవేళ మీరు దీన్ని అవమానంగా భావించకపోతే మీ కొలబద్దతోనే దేశాన్ని కొలవాలనుకుంటే దేశాన్నే అవమానపరచినట్టు భావించవలసి వస్తుంది యిలాంటి పెద్దయుద్ధాల్లో ఎగుడు దిగుడులు ఎత్తుపల్లాలు తప్పవు మీ విరోధులతో మీరెంత స్పష్టంగా స్వచ్ఛంగా వున్నా, వాళ్ళు తమ నిజాయితీని వదులుకున్నప్పుడు మనమేం చేయగలం? దావావేసేందుకు ప్రామిసరీ నోట్లతో నావద్దకు చాలామంది వస్తుంటారు ప్రామిసరీ నోటుపై దస్తూరీ చేసి మనచేతిని మనమే నరుక్కోవటం కంటే మించిన అసందిగ్ధత మరెక్కడ వుంటుంది? కానీ యిలాంటి వారికి వ్యతిరేకంగా కూడా కోర్టులో వాదించవలసి

రావచ్చు ఇలాంటివారే చట్టాన్ని వ్యతిరేకిస్తారు అనేక విధాలుగా తమని తాము రక్షించుకోవాలని ప్రయత్నిస్తారు వారికి విరుద్ధంగా తీర్పులు వుంటాయి జప్తులు కూడా జరుగుతుంటాయి ఇలాంటి అనుచితమైన అసహ్యకరమైన సంఘటనలు రెండోసారి జరగవని గ్యారంటీ ఏమిటి? అందుకే మీకు నా సలహా ఒక్కటే మనముందున్న సమస్యను ధైర్యంగా శాంతితో పరిష్కరించుకునే ప్రయత్నం చేద్దాం మళ్ళీ పోరాటం మొదలెట్టాల్సివస్తే మనమేం చేయాలో ఆలోచిద్దాం అంటే యితరులు ఏం చేస్తారో అని ఆలోచిస్తూ కూర్చోకుండా సత్యాగ్రహంలో పాల్గొనే ప్రతి ఒక్కరూ నేనేం చేయాలి? నేనేమి చేయగలను అని ఆత్మ విమర్శ చేసుకోవాలి మనం సత్యనిష్ఠతో వుంటే ఎదుటివారూ అలాగే వుండగలరనిమనలో బలహీనత ప్రవేశిస్తే వారిలోను ఆ బలహీనత ప్రవేశిస్తుందని నా భావం

మళ్ళీ యుద్ధం మొదలయ్యే అవకాశాలను గురించి తమ సందేహాన్ని కుండబద్దలు కొట్టినట్లు బయట పెట్టిన వారికీపాటికి విషయం తెలిసిపోయే వుంటుందనుకుంటాను ఈ సందర్భంగా కాఛలియాసేఠ్ తమ బలాన్ని ప్రకటించడం మొదలెట్టారు ప్రతిప్రశ్నకు తక్కువ మాటల్లో తమ విశ్వాసాన్ని తెలియజెప్పటమే కాక, తమ మాటపై గట్టిగా నిలబడి వుండేవారు వారు తమ బలహీనతను బైటపెట్టి అంతిమ పరిణామం విషయంలో సందేహం ప్రకటించిన ఉదంతం ఒక్కటి కూడా నాకు గుర్తు లేదు ఒక సారి యూసుఫ్మియా తుఫాను రేగిన సముద్రంలో దేశాన్ని ముందుకు నడిపించే కర్ణధారునిగా వుండేందుకు నిరాకరించాడు అప్పుడు అందరూ ఏకగ్రీవంగా కాఛలియాను తమ కర్ణధారునిగా ఎన్నుకున్నారు అప్పటినుంచి యుద్ధ సమాప్తి వరకు చుక్కానిపైనుంచి ఆయన చేయి తొలగించలేదు ఇతరులెవ్వరూ భరించలేని కష్టాలను సైతం నిశ్చింతగా నిర్భయంగా ఆయన సహించారు యుద్ధం కొనసాగే కొద్దీ బైట వుండి అన్ని విషయాలనూ సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలించటం, ఏర్పాట్లు చేయటం రకరకాల మనుషులను ఒప్పించి వాళ్లతో వ్యవహరించటం కంటే, జైల్లో వుండటమే కొంతమందికి సులభమనిపించింది

తెల్లదొరలు కాఛలియాను తమ ఉచ్చులో బంధించారు దక్షిణాఫ్రికాలోని చాలా మంది భారతీయ వ్యాపారులు ఆంగ్లేయ వ్యాపారులపై ఎక్కువగా ఆధారపడి వున్నారు ఎలాంటి అమానతు పైకం తీసుకోకుండానే లక్షలాది రూపాయల వస్తువులు భారతీయ వ్యాపారులకు అప్పుడు వాళ్లు యిస్తుంటారు అంటే అంతటి విశ్వాసాన్ని భారతీయ వ్యాపారులు ఆంగ్లేయ వ్యాపారులవద్ద పొందగలిగారన్నమాట ఇది భారతీయ వ్యాపారుల విశ్వాస పాత్రతకు ఒక మంచి ఉదాహరణ। కాఛలియా పై కూడా ఎంతోమంది ఆంగ్లేయ వ్యాపారుల ఋణభారం వుంది ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం పక్షాన ప్రత్యక్షంగా లేక పరోక్షంగా బెదిరించే ఉద్దేశ్యంతో ఆంగ్లేయ వ్యాపారులు కాఛలియాను త్వరగా తమ అప్పు తీర్చమని పట్టుపట్టారు వాళ్ళు కాఛలియాను పిలిపించి సత్యాగ్రహం నుంచి మీరు తొలగిపోతే మేము అప్పు తీర్చమని వేధించం కానీ యీ యుద్ధం నుంచి తప్పుకోకపోతే ప్రభుత్వం మిమ్మల్ని అరెస్టు చేస్తుందేమోనని మా భయం అప్పుడిక మా డబ్బు సంగతేమౌతుంది? అందువల్ల యీ సత్యాగ్రహ యుద్ధం నుంచి మీరు తప్పుకోలేని పక్షంలో మా డబ్బు మాకు తక్షణం చెల్లించండి" అని చెప్పారు ధీరుడైన కాఛలియా ఏ మాత్రం చలించలేదు - భారతీయుల సత్యాగ్రహంలో పాల్గొనటం నా వ్యక్తిగత విషయం దానికీ నా వ్యాపారానికీ ఎలాంటి సంబంధమూ లేదు ఆ యుద్ధంతో నా ధర్మం నా దేశ గౌరవం నా స్వాభిమానం అన్నీ ముడిపడి వున్నాయి నాకు మీరంతా అప్పిచ్చారు అందుకు నేను నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను కానీ యీ విషయంలో నా వ్యాపారం గొప్పదని భావించడం లేదు బంగారు నాణేల్లా మీ డబ్బు నా దగ్గర భద్రంగా వుంది నా ఆఖరి నిముషంలోనైనా, నేను అమ్ముడుపోయైనా మీ డబ్బు మీకు యిస్తాను కాని ఒకవేళ నాకేమైనా జరిగితే, నా వద్ద ఉన్న స్టాకు నా యితర లావాదేవీలన్నీ మీ చేతుల్లోనే వున్నాయి కదా అందువల్ల ఇదివరకటి విశ్వాసం నాపై అలాగే కొనసాగించవలసిందిగా ప్రార్థిస్తున్నాను" అని అన్నాడు కాఛలియా ఈ మాటలన్నీ సముచితంగానే వున్నా, కాఛలియా విశ్వాసపాత్రతను

మరింత స్పష్టం చేసేవిగా వున్నా వీటి ప్రభావం ఆంగ్లేయవ్యాపారులపై పడలేదు నిద్రపోతున్న మనుషుల్ని మనం లేపగలంకానీ నిద్రపోతున్నట్టు నటించేవారిని లేపలేము కదా ఆంగ్లేయ వ్యాపారస్థుల ధోరణియిదే కాఛలియాపై ఒత్తిడి తేవటం ఎలాగైనా లొంగేలా చేయటమే వారి లక్ష్యం అయితే తమ డబ్బుకేమీ ధోకా లేదని వారికీ తెలుసు

1909 జనవరి 22న నా కార్యాలయంలో ఆంగ్లేయ అధికారుల సభ ఒకటి జరిగింది కాఛలియా పై వారు తెచ్చే ఒత్తిడి కేవలం రాజకీయాలకి సంబంధించినదే కాని వ్యాపారానికి సంబంధించింది కాదని వారికి నేను స్పష్టంగా చెప్పాను వ్యాపారస్థులకు రాజకీయ ఎత్తుగడలు శోభించవు కానీ వాళ్లు కోపోద్రిక్తులయ్యారు కాఛలియా సేర్ దగ్గరి వ్యాపారసంబంధమైన వస్తువుల లిస్టులు వున్నాయి వాటిని వారికి చూపించి, వారి డబ్బు పైసలతో సహా వారికి తిరిగి వస్తుందని నిరూపించాను కాఛలియా వ్యాపారాన్ని ఇతరులకు అమ్మాలనుకుంటే అతడు తన వద్దవున్న వ్యాపార సంబంధమైన అన్ని వస్తువులనూ, వచ్చిన లాభమంతటినీ కొనేవారికి యిచ్చేందుకు సిద్ధంగా వున్నారు ఒకవేళ తెల్లదొరలీ విధంగా చేయని పక్షంలో కాఛలియా దుకాణంలో వున్న వస్తువులను అసలు ధరకే కొనాల్సి వుంటుంది ఇలా చేసినప్పటికీ డబ్బు తక్కువైతే, దానికి బదులుగా లాభం వచ్చిన మొత్తంలో వారికి యిష్టం వచ్చినంత తీసుకోవచ్చు నా యీ సలహాను పాటించినట్లయితే తెల్లదొరలు నష్టపోయేదేమీ వుండదని పాఠకులీపాటికి గ్రహించి వుంటారు (నా క్లైంట్ల విషయంలో ఆర్థిక సంక్షోభం సమయంలో నేనీ ఏర్పాటు చాలాసార్లు చేశాను ) కానీ యిప్పుడు తెల్లవ్యాపారులకి కావలసింది న్యాయం కాదు కాఛలియాను ఎలాగైనా లొంగదీయాలన్నదే వారి ఆశయం కానీ కాఛలియా లొంగలేదు అందుకనే కాఛలియాను దివాళా తీసిన వ్యాపారస్థునిగా ప్రకటించారు

ఈ స్థితివల్ల కాఛలియా ప్రతిష్టకు భంగం కలుగలేదు పైగా ఇది వారికి మరో అలంకారమై పోయింది ఈ కారణంగా దేశ ప్రజల్లో వారి గౌరవం మరింత పెరిగింది వారి ధృఢవిశ్వాసం వీరత్వం ప్రజలందరి అభినందనలకు

పాత్రమయ్యాయి ఈ రకమైన వీరత్వం అలౌకికమనే చెప్పాలి సామాన్య మానవుడికీ ఔన్నత్యం అవగతం కాదు దివాళా తీయటం వల్ల అప్రతిష్ట పాలపటం అటుంచి గౌరవం యినుమడించటమన్నది సామాన్య మానవునికి అర్థంకాని విషయం కానీ కాఛలియాకిది చాలా స్వాభావికమైన అనుభవం చాలా మంది భారతీయ వ్యాపారులు దివాళా భయంతో దగుల్బాజీ చట్టం ముందు లొంగిపోయారు తలుచుకుంటే కాఛలియా దివాళా తీయకుండా తప్పించుకొనేవారే సత్యాగ్రహ యుద్ధం నుంచి తప్పుకొని యీ స్థితినుంచి వారు తప్పించుకోవచ్చు కానీ అందుకు వారు సిద్ధపడలేదు ఎంతోమంది భారతీయ స్నేహితులు యీ సంకటస్థితిలో వారికి అప్పుగా డబ్బు యివ్వడానికి సిద్ధపడ్డారు కాని యీ విధంగా తన వ్యాపారాన్ని కాపాడుకొని వుంటే వారి సాహసాలకు మచ్చ ఏర్పడి వుండేది జైలుకు వెళ్ళటమనే ఆపదకు అందరు సత్యాగ్రహులు సిద్ధమే ఏ సత్యాగ్రహుని వద్ద డబ్బుతీసుకొని తెల్ల వ్యాపారస్థులకు చెల్లించి వుండినా వారికది కళంకమే అయ్యేది కానీ సత్యాగ్రహం చేసే వ్యాపారులతో వారికి స్నేహం వున్నట్లే చట్టానికి తలవంచే వ్యాపారులతోనూ వారికి స్నేహం వుంది వారి సాయం కాఛలియాకు లభిస్తుందని నాకు తెలుసు ఒకరిద్దర్ని యీ విషయమై ఆయన పిలువనంపిన విషయం నేనెరుగుదును కానీ వారి సాయాన్ని పొందటం కంటే ఖూనీ చట్టానికి లొంగటమే మేలు అందువల్ల వాళ్ల సహాయాన్ని ఎప్పుడూ తీసుకొనకూడదని మేము నిర్ణయించుకున్నాం ఇంతే కాక కాఛలియా తాను దివాళా తీసినట్టుగా ప్రకటించటం వల్ల యితరులకది రక్షణ కవచంగా మారవచ్చు ఎందుకంటే ఇలాంటి 99 శాతం సందర్భాల్లో దివాళా దారునికి డబ్బులిచ్చిన వారు కొంతకు కొంతైనా నష్టపోవలసి వుంటుంది ఇచ్చిన డబ్బులో 50 శాతం దొరికితే చాలు సంతోషపడిపోతారు 75 శాతం దొరికితే పూర్తి డబ్బు అందివట్లే అనుకుంటారు కారణం - దక్షిణాఫ్రికాలోని పెద్దపెద్ద వ్యాపారస్థులు ఇలాంటి లావాదేవీల్లో 6 1/4 వంతు కాక 25 శాతం లాభం పొందుతుంటారు అందువల్ల 75 శాతం మొత్తం పొందగలిగితే దాన్ని వారు

నష్టం అనుకోరు కానీ దివాళా తీసినప్పుడు నూరుశాతం డబ్బు పొందలేరు కనుక, అప్పుయిచ్చేవాళ్ళు తమ వద్ద అప్పు తీసుకునే వాళ్ళని దివాళా తీయన్విరు

కాఛలియా దివాళా తీయటంవల్ల ఆంగ్లేయ వ్యాపారులు సత్యాగ్రహులైన వ్యాపారులను యిక బెదిరించే అవకాశం లేదనిపించింది అలా జరిగింది కూడా వారి ఉద్దేశ్యం కాఛలియాను సత్యాగ్రహం నుంచి తప్పించటమే అలా చేయలేని పక్షంలో అతని నుంచి నూటికి నూరు శాతం డబ్బు వసూలు చేయాలి కదా! కాని వారి ఆశలు రెండూ నెరవేరలేదు పైగా పరిస్థితి వారికి వ్యతిరేకం అయింది ఒక పేరొందిన భారతీయ వ్యాపారస్థుడు దివాళా తీయటాన్ని సంతోషంగా ఆహ్వానించటం ప్రప్రథమంగా చూసిన తెల్ల వ్యాపారులందరూ తెల్ల బోయారు శాశ్వతంగా మూగవోయారు కూడా ఒక సంవత్సరంలోపే కాఛలియాకు వస్తువులవల్ల నూటికి నూరుశాతం డబ్బూ తిరిగి ముట్టింది దివాళా దారుని వద్దనుంచి నూటికి నూరుశాతం డబ్బూ అప్పు యిచ్చిన వారికి అందటం దక్షిణాఫ్రికా చరిత్రలోనే మొదటి ఉదాహరణ ఈ కారణంగా మా సత్యాగ్రహ యుద్ధం ఓవైపు నడుస్తూ వుంటే మరో వైపు తెల్ల వ్యాపారస్థులకు కాఛలియాపై గౌరవం పెరిగిపోతూ వున్నది ఈ సత్యాగ్రహంలో పాలుపంచుకుంటున్న కాఛలియాకు కోరినంత డబ్బు అప్పుగా యిచ్చేందుకు వారు సన్నద్ధులయ్యారు కాఛలియా బలం కూడా రానురాను పెరిగిపోయింది సత్యాగ్రహ రహస్యాలు వారికి బాగా తెలిశాయి యీ సత్యాగ్రహం ఎప్పటిదాకా కొనసాగుతుందో ఎవ్వరూ చెప్పలేకపోతున్నారు అందువల్ల దివాళా తీసినట్టుగా ప్రకటించిన తరువాత ఎటువంటి పెద్ద వ్యాపారంలోనూ కాఛలియా తలదూర్చకూడదని నిర్ణయించుకున్నాం తన ఖర్చులు వెళ్లబుచ్చుకునేందుకు అవసరమైనంత మాత్రమే సంపాదించాలని, యుద్ధ సమయంలో ఎలాంటి వ్యాపారాలూ చేయకుండా ఉండాలని కాఛలియా నిర్ణయించుకున్నారు అందువల్ల తెల్లవ్యాపారులు యివ్వదలచిన అవకాశాన్ని ఆయన వినియోగించుకోలేదు

కాఛలియా సేఠ్ జీవితంలో జరిగిన పై సంఘటనలన్నీ యీ ప్రకరణంలో ఉటంకించిన కమిటీ సమావేశం జరిగిన తరువాతనే జరిగినవి కావని పాఠకులీపాటికి గ్రహించే వుండవచ్చు వాటన్నింటిని ఒకసారే వర్ణించటం మంచిదని తలచి యీ ప్రకరణంలో నేను వాటిని వ్రాశాను తేదీల ప్రకారం చూస్తే 1908, 10 సెప్టెంబరు నాటికి సత్యాగ్రహం తాలూకు రెండవ సంగ్రామం మొదలైంది దాని తరువాత కొన్ని రోజులకు కాఛలియా అధ్యక్షుడయ్యారు దాని తరువాత దాదాపు ఐదు నెలలకు ఆయన దివాళా తీసినట్టుగా ప్రకటించటం జరిగింది

ఇప్పుడు మనం కమిటీ సమావేశం తరువాతి పరిణామాల మీద దృష్టి సారిద్దాం దీని తరువాత నేను కొత్తబిల్లు ప్రభుత్వానికీ దేశ ప్రజలకు మధ్య ఒప్పందానికి భంగం కలిగిస్తున్నదని జనరల్ స్మట్స్‌కు లేఖ వ్రాశాను ఈ ఒప్పందం తరువాత వారం రోజులలోపే రిచ్‌మండ్‌లో వారు చేసిన ఉపన్యాసం మీద వారి దృష్టి మళ్లించే ప్రయత్నం చేశాను తమ ప్రసంగంలో వారు వీళ్లు (ఆసియా వాసులు) ఆసియా చట్టాన్ని రద్దు చేయమని నాతో చెబుతున్నారు కానీ యీ ప్రజలు స్వచ్ఛందంగా మా ఆజ్ఞలను పాటించనంతవరకూ నేనీ చట్టాన్ని రద్దు చేయను" అని చెప్పారు తమను ఇబ్బందుల్లో పడేసే విషయాలకు రాజకీయ నాయకులు సాధారణంగా జవాబివ్వరు ఒకవేళ యిచ్చినా అది తేలికగా వుంటుంది జనరల్ స్మట్స్ యీ కళలో పూర్తిగా ఆరితేరాడు మనం ఎంత వ్రాసినా ఎంత మాట్లాడినా జవాబు యివ్వాలని వారికి లేనప్పుడు వారిచేత జవాబు చెప్పించటం ఎవరి తరమూ కాదు కదా వచ్చిన ప్రతి ఉత్తరానికి జవాబు యిచ్చి తీరాలన్న నియమం వారికే మాత్రమూ లేదు అందువల్ల నేను రాసిన లేఖలకు వారి నుండి తృప్తి కలిగించే జవాబు ఒక్కటి కూడా రాలేదు

ఒప్పందం సమయంలో ప్రభుత్వానికీ మాకూ మధ్య మధ్యవర్తిగా వ్యవహరించిన శ్రీ అల్బర్ట్ కార్ట్‌రాయిట్‌ను నేను కలిశాను జనరల్ స్మట్స్ వెలువరించిన కొత్త బిల్లు వల్ల వారికీ పెద్ద దెబ్బే తగిలింది యీ మనిషిని నేను అర్థం చేసుకోలేకుండా వున్నాను ఆసియా చట్టాన్ని రద్దు చేస్తానని

ఇతను వాగ్దానం చేశాడు నాకు బాగా గుర్తు వున్నది నా శక్తి వంచన లేకుండా నేను చేయగలిగినంత వరకూ భారతీయులకు సహాయం చేస్తాను' అని అతడు చెప్పాడు

అయితే అతడు ఏమైనా చేయాలనుకుంటే ఎవ్వరు ఆపలేరు పత్రికల వ్రాతలని అతనే మాత్రమూ లెక్క పెట్టడు అందువల్ల నా సహాయం వల్ల మీకేమీ లాభం వుండదేమోనని నా భయం" అని కూడా ఆయన అన్నాడు శ్రీ హస్కిన్ మొదలైన వారిని కూడా నేను కలిశాను జనరల్ స్మట్స్‌కు వారూ లేఖలు వ్రాశారు వారికీ నిరాశాజనకమైన జవాబులు అందాయి విశ్వాసఘాతుకం అనే శీర్షికతో ఇండియన్ ఒపీనియన్‌లో నేను ఉత్తరాలు కూడా వ్రాశాను కానీ జనరల్ స్మట్స్ వాటిని లెక్కబెడితే కదా! తాత్వికుణ్ణి లేదా కౄరకర్కశ హృదయుణ్ణి మీరెంత విమర్శించినా లాభం ఏముంటుంది? తాననుకున్న పని చేయుటయందే అతడు నిమగ్నమై వుంటాడు ఈ రెండు విశేషణాల్లో దేన్ని జనరల్ స్మట్స్‌కు ఉపయోగించాలో నాకు తెలియదు అతని చేతుల్లో ఓ రకమైన దార్శనికత వున్నదన్న విషయం నేను అంగీకరించక తప్పదు మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేటప్పుడు నా లేఖలు పత్రికలలో ముద్రింపబడేటప్పుడు నేను అతణ్ణి నిర్దయునిగా భావించటం నాకిప్పటికీ గుర్తు వున్నది కానీ అప్పుడు సత్యాగ్రహయుద్ధం ప్రధమ దశలో వున్నది ఏడు సంవత్సరాల పాటు నడిచిన ఆ యుద్ధానికి అప్పటికి రెండేళ్ల ప్రాయమే ఈలోగా జనరల్ స్మట్స్‌ని నేను చాలా సార్లు కలిశాను తరువాతి మా సంభాషణలవల్ల జనరల్ స్మట్స్ వ్యక్తిత్వం గురించి దక్షిణాఫ్రికా ప్రజల అభిప్రాయం మారి వుండాలని నా కనిపించింది రెండు విషయాలు నాకు స్పష్టంగా తెలియ వచ్చాయి ఒకటి, రాజకీయాల్లో అతను కొన్ని సిద్ధాంతాలను నమ్మినవాడు రెండు అన్ని సందర్భాల్లోనూ అతడి ఆలోచనలు అవినీతిమయమైనవని అనుకోవటానికి వీలు లేదు కానీ ఆయన రాజకీయ నైపుణ్యం కనబరచేందుకు దానితో పాటు అభాసుపాలు కావటానికి కూడా అవకాశం యిస్తాడని తెలుసుకున్నాను

★ ★ ★

# 26

# యుద్ధం తిరిగి ప్రారంభం

ఓవైపు జనరల్ స్మట్స్‌కు ఒప్పందపు నియమాలను పాటించమని నచ్చజెపుతూనే మరోవైపు జాతిని జాగృతం చేసే పని కూడా ఉత్సాహంగా మేము చేస్తూ వున్నాము ప్రతి చోటా ప్రజలు మళ్ళీ యుద్ధ సన్నాహాలు చేయటానికి, సిద్ధంగా వున్నట్లు మాకు తోచింది అన్ని చోట్లా సభలు జరిగాయి ప్రభుత్వంతో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలను గురించి ప్రజలకు ప్రతిచోటా చెబుతూనే వున్నాము ఇండియన్ ఒపీనియన్ పత్రికలో ప్రతివారమూ ముద్రించబడే సమీక్ష వల్ల పరిస్థితులు ఎప్పటికప్పుడు దేశ ప్రజలకు అవగతమవుతూనే వున్నాయి స్వచ్ఛందంగా అంగీకరించే ఆజ్ఞలను మన్నించమనీ, లేకపోతే ప్రమాదం వున్నదని మేము వారికి నచ్చజెబుతూ ఆ విధంగా వారిని మేల్కొలుపుతూ వున్నాము ఈ దగుల్బాజీ చట్టాన్ని రద్దు చేయలేకపోతే, యీ ఆజ్ఞల నన్నింటినీ కాల్చి బూడిద చేయాల్సి వుంటుందని ప్రజలకు చెప్పేశాం దీనివల్ల ప్రజలు తమ మాటపై ధృఢంగా స్థిరంగా వున్నారనీ, జైళ్ళ పాలయేందుకు సైతం వెనుకాడబోరనీ ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి తెలుస్తుంది ఆజ్ఞాపత్రాలను తగులబెట్టేందుకై ప్రతిచోట వాటిని పెద్ద ఎత్తున సేకరించటం జరిగింది

గత ప్రకరణంలో ప్రస్తావించిన బిల్లును ప్రవేశపెట్టేందుకై ప్రభుత్వం సిద్ధపడింది ట్రాన్స్‌వాల్ పార్లమెంటుకు కూడా భారత ప్రజలు అర్జీలు పంపారు కాని దానివల్ల ఫలితం కలుగలేదు చివరికి సత్యాగ్రహులందరూ ప్రభుత్వానికి "అల్టిమేటం" పంపించారు యుద్ధానికి సిద్ధం కమ్మని ప్రభుత్వానికి పంపబడిన బెదిరింపు లేఖ అని దానికి అర్థం తీశారు భారత పౌరుల పక్షాన యీ అల్టిమేటం అన్న పదాన్ని వుపయోగించటం జరుగలేదు కానీ దేశప్రజల నిర్ణయాన్ని తెలియజేసేందుకై పంపబడిన యీ పత్రాన్ని అల్టిమేటంగా చిత్రించి జనరల్ స్మట్స్ పార్లమెంటులో ప్రసంగించాడు. ఇలా ప్రభుత్వాన్ని

బెదిరించే వారికి దాని శక్తి తెలియదన్నమాట స్మట్స్ నాకు బాధకలిగే మాట ఒకటి అన్నాడు కొంతమంది ఆందోళనకారులు, బీద భారతీయులను రెచ్చగొడుతున్నారు యిట్టి ప్రభావానికి లోనయ్యే వారు తామే నాశనమై పోతారు పాపం పార్లమెంటులోని పలువురు సభ్యులు యీ అల్టిమేటం అన్న మాటవిని కోపోద్రిక్తులయ్యారని పత్రికా విలేఖరులీ సందర్భంగా వ్రాశారు వారి నేత్రాలు అరుణారుణమయ్యాయనీ, పత్రికలు ప్రకటించాయి

"హిందూదేశ ప్రజలు స్వచ్ఛందంగా ఆజ్ఞాపత్రాలను స్వీకరిస్తే వాటిని చట్టపరమైనవిగా అంగీకరించేందుకై ఒక బిల్లును పార్లమెంటులో ప్రవేశపెడతామనీ, ఏషియాటిక్ చట్టాన్ని రద్దు చేస్తామనీ, హిందూదేశ ప్రజలకు జనరల్ స్మట్స్‌కూ జరిగిన ఒప్పందంలో స్పష్టంగా వ్రాసుకున్నారు ప్రభుత్వోద్యోగులను సంతోషపెట్టేందుకై, యీ విధంగా హిందూ దేశ ప్రజలు ఆజ్ఞా పత్రాలను తయారు చేసుకున్నారు అందువల్ల యిప్పుడిక ఆసియా చట్టాన్ని రద్దుచేయటం తప్పనిసరి అయింది ఈ విషయమై ఎన్నో లేఖలు జనరల్ స్మట్స్‌కు ప్రజలు వ్రాశారు న్యాయం పొందేందుకై అవసరమైన యితర చట్టపరమైన ఉపాయాల్ని కూడా అనుసరించారు కానీ, జాతి ప్రయత్నాలేవీ నెరవేరలేదు పార్లమెంటులో బిల్లు అనుమతిపొందే స్థితిలో వున్నపుడు హిందూ దేశ ప్రజలలో నేలకొన్న ఉత్కంఠత, ఉద్వేగం ప్రభుత్వానికి తెలియబరచటం, నాయకుల విద్యుక్త ధర్మంకదా! ఒకవేళ ఒప్పందం ప్రకారం ఆసియా చట్టాన్ని రద్దు చేయకపోతే, లేదా రద్దు చేసిన వార్త జాతి ప్రజలకు ఫలానా సమయం వరకూ తెలియ చేయకపోతే స్వచ్ఛందంగా ప్రజలు స్వీకరించిన అనుమతి పత్రాలను తగులబెట్టటం జరగుతుందని, అలా చేయటం వల్ల ఎదురయ్యే కష్టాలను వినయంతో, స్థిర చిత్తంతో ఎదుర్కొని సహించగలరని వేదనా భరిత హృదయాలలో చెప్పుకొనటం కూడా జరిగింది

ఈ విధంగా జవాబివ్వమని గడువు విధించటాన్ని అల్టిమేటంగా చిత్రించారు రెండోది తెల్లదొరలు హిందూదేశ ప్రజలను ఆటవిక ప్రజలుగా

పరిగణించటం, హిందూదేశ ప్రజలను తమ వంటివారుగా పరిగణించిన పక్షంలో యీ లేఖను వారు సంస్కార పూరితమైనదిగా భావించి, దానిపై దృష్టిని కేంద్రీకరించి యుండేవారు తమను ఆటవిక ప్రజలుగా ఆంగ్ల ప్రభుత్వం వారు పరిగణిస్తున్నారని తెలుసుకొని హిందూదేశ ప్రజలు యీ లేఖ ప్రభుత్వానికి వ్రాశారు రెండు పరిస్థితులలో నుంచి ఏదో ఒక స్థితిని వారు అంగీకరించవలసి వచ్చింది ఒకటి మేము ఆటవికజాతి ప్రజలము అని అంగీకరించి, తెల్లవాళ్ల కాళ్ల క్రింద పడి వుండటం - రెండు - ఆటవిక జాతిగా అంగీకరించము అని చెప్పి అడుగు ముందుకు వేయటం రెండవ అడుగే యీ ఉత్తరం యొక్క లక్ష్యం ఈ లేఖ వెనుక తమ నిర్ణయాన్ని అమలు చేస్తామనే దృఢ నిశ్చయం వెల్లడించి యుండకపోతే అది వారి తొందర పాటుచర్యగాను, యోచనా శూన్యమైన నిర్ణయంగాను తెల్లవాళ్లు పరిగణించేవారు

సత్యాగ్రహ సంకల్పం జరిగినప్పుడు భారతప్రజల ప్రతిజ్ఞ బూనటమే తమను ఆటవిక జాతిగా అంగీకరించము అని వేసిన మొదటి అడుగు కదా అని పాఠకుల మనసుల్లో సందేహం తలెత్తవచ్చు అదే నిజమైతే యింత ప్రాధాన్యత యివ్వవలసిన క్రొత్త విషయం యీ లేఖలో ఏముందని పాఠకులకు అనిపించవచ్చు ఒక విధంగా యీ తర్కమూ సత్యమైనదే! కానీ దీన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తే, జాతి నిర్ణయం ఆ పత్రంలోనే స్పష్టంగా వున్నదని తెలుస్తున్నది సత్యాగ్రహ ప్రతిజ్ఞ హఠాత్తుగా జరిగిన సంఘటనగా పాఠకులకు జ్ఞాపకం వుండే వుంటుంది తరువాత జైలు శిక్ష వంటివి దాని పరిణామరూపాలే! అందువల్ల అనుకోకుండానే జాతి ప్రతిష్ట పెరిగింది కానీ యీ లేఖ వ్రాసే సమయంలో జాతి చాలా అప్రమత్తంగా వున్నది పైగా తమ ప్రతిష్టకోసం చేయుటకు భారత జాతి నిర్ణయం తీసుకున్నది ఈ ఏసియాటిక్ చట్టాన్ని రద్దు చేయించటమే, దాని ధ్యేయం కానీ యీ లేఖలో ప్రయోగింపబడిన భాషాశైలిని, అవలంబించవలసిన పద్ధతిని నిర్ణయించడంలో జాగ్రత్త వహించాము యజమానికి నమస్కరిస్తాడు ఒక స్నేహితుడు తన

మిత్రునికి నమస్కరిస్తాడు - రెండూ ఎదుటి వ్యక్తిని గౌరవించే పద్ధతులే కానీ, ఆ నమస్కరించే విధానాన్ని బట్టి మూడవ వ్యక్తి నమస్కరించిన వారిలో ఒక వ్యక్తిని, స్నేహితునిగాను గుర్తిస్తాడు రెండిటికీగల తేడా యిదే ప్రభుత్వానికి యీ అల్టిమేటం పంపించే ముందు మామధ్య పెద్ద చర్చ జరిగింది గడువు నిర్ణయించాక, ప్రభుత్వం నుంచి, జవాబు పొందాలనుకోవడం అనాగరికం కాదా? అమర్యాదగా వుండదా, ప్రభుత్వం మన డిమాండును అంగీకరించాలనుకొని భావిస్తూ యీ విధంగా వ్రాయడం విపరీత పరిణామాలకు దారితీయదా? జాతి నిర్ణయాన్ని పరోక్షంగా తెలియజేస్తే చాలదా? ఇలాంటి అనేక సందేహాలపై చర్చించుకున్న తరువాతనే మేమంతా ఏకాభిప్రాయానికి వచ్చాము సత్యమైనది, న్యాయమైనదీ అనుకున్న పద్ధతినే మేము అనుసరించాలని భావించాం అనాగరిక చర్య అన్న ఆరోపణను మాపై ప్రభుత్వం చేస్తే దాన్ని సైతం మేము ఎదుర్కొన వలసి వుంటుందని గుర్తించాం ప్రభుత్వం యివ్వదలుచుకున్న సమాధానాన్ని ఉత్తుత్తికోపంతో మాకు పంపిన యెడల, ఆకష్టాల్ని ఎదర్కొనవలసి వుంటుందని గుర్తించాము మనిషిగా హీనత్వాన్ని అంగీకరించలేని పక్షంలో ఎన్ని కష్టాలు ఎదురైనా ఎదుర్కొనగలిగే శక్తి మనలో వున్నదని మనం నమ్మే పక్షంలో సరైన చక్కనైన మార్గాన్నే ఎన్నుకొనడం అవసరమని భావించాం

ఈసారి భారతజాతి వేసిన అడుగులో ఒక నవ్యత్వం వైశిష్ట్యం వున్నదన్న సంగతి పాఠకులీపాటికి గ్రహించే వుంటారు దీని ప్రతిధ్వని పార్లమెంటులోను బైట జరిగే తెల్లదొరల సభలల్లోనూ దద్ధరిల్లింది హిందూదేశ ప్రజల సాహసాన్ని కొందరు కొనియాడారు కొందరు ఆగ్రహం వెలిబుచ్చారు భారతజాతి చూపిన ఉధృతానికి వారికి తగిన శిక్షను విధించాలని కొందరు ఆవేశపడ్డారు కూడా రెండు పక్షాలవారూ, తమ పద్ధతుల్లో, హిందూదేశ ప్రజల క్రొత్త ఎత్తుగడను గుర్తించారు అంగీకరించారు సత్యాగ్రహ ప్రారంభంలో అది నిజానికి మొదటి అడుగే అయినా అప్పుడు ఆంగ్లేయ ప్రజల్లో ఏర్పడిన కల్లోలం అపరిమితం యీ లేఖవల్ల వారిలో అమితంగా

అలజడి బయలుదేరింది సత్యాగ్రహారంభం నాటికి ఎవ్వరికీ భారత జాతి యొక్క శక్తిని గురించిన అంచనా లేదు అప్పుడిలాంటి లేఖ యిలాంటి భాష అనుచితమైనదని తెల్లవాళ్లు భావించారు కానీ యిప్పుడు భారత జాతి కొన్ని అగ్ని పరీక్షలను ఎదర్కొన్నది సామూహికంగా కష్టాలను ఎదుర్కొనటంలో కలిగే దుఃఖాన్ని భరించింది అట్టి మహాశక్తి జాతికున్నదని అంతా అనుభవం మీద తెలుసుకున్నారు అందుకే యీ నిర్ణయాత్మకమైన లేఖ స్వాభవికంగానే స్ఫూర్తి కలిగి వున్నది పటిష్ఠమైన భాషలో జాతి దృఢత్వాన్ని, స్థిరత్వాన్ని వెల్లడించింది

★ ★ ★

## 27

## అనుమతి పత్రాల హోళీ

కొత్త ఏషియాటిక్ బిల్లు పార్లమెంటులో పాసయ్యే రోజున 'అల్టిమేటం' లేదా 'నిర్ణయపత్రం' యొక్క కాలవ్యవధి పూర్తికావలసి వుంది గడువు పూర్తయిన రెండు గంటల తరువాత అనుమతి పత్రాలను తగులబెట్టే కర్తవ్యాన్ని పూర్తిచేసేందుకు ఒక సమావేశం ఏర్పాటుచేస్తూ అందరికీ ఆహ్వానాలు పంపాము దీనికి వ్యతిరేకంగా ప్రభుత్వం స్పందించితే యీ సభ యీ పరిణామాన్ని జాతికి వినిపించేందుకు ఉపయోగ పడుతుందని సత్యాగ్రహ సమితి నిర్ణయించింది కానీ, జాతి పంపిన పత్రానికి ప్రభుత్వం ఎలాంటి జవాబూ యివ్వదనే విశ్వాసంతో మేమంతా సభాస్థలికి, అనుకున్న సమయంకంటే ముందే చేరుకున్నాము తంతిద్వారా ప్రభుత్వ నిర్ణయం ఏది తెలిసినా సభకు దాన్ని తెలిపేందుకు ఏర్పాట్లు మేము చేసుకున్నాము సాయంత్రం నాలుగు గంటలకు సభ నిర్ణయించాము అది జోహాన్స్‌బర్గ్‌లోని హమీదియా మసీదు మైదానంలో జరుగుతున్నది. 1908 ఆగస్ట్ 13వ తేది ఎటు చూచినా భారతీయులే ఇసుక వేస్తే రాలడం లేదని చెప్పవచ్చు దక్షిణాఫ్రికా యందలి హబ్షీలు వంట చేసుకునేందుకు నాలుగు కాళ్ళ ఇనుప

బాణీలను ఉపయోగిస్తారు అనుమతి పత్రాలను తగులబెట్టేందుకై, వీలైనంత పెద్ద బాణీలను ఓ హిందూ వ్యాపారి దుకాణం నుంచి తెప్పించారు వాటిని వేదికపై ఓ మూల పెట్టి వుంచారు

సభ ప్రారంభమవుతున్నది అంతలో ఓ స్వయం సేవకుడు సైకిల్‌పై సభాస్థలికి వచ్చాడు అతని చేతిలో ఓ టెలిగ్రాం వుంది అందులో ప్రభుత్వం యొక్క ప్రత్యుత్తరం వున్నది హిందూ దేశప్రజల నిర్ణయానికి ఖేదం వ్యక్తం చేస్తూ, తమ నిర్ణయాన్ని మార్చుకోలేమన్న అసహాయతను తెలియబరుస్తున్నట్లు ఆతంతిలో వున్నది దాన్ని సభలో వున్న అందరికీ చదివి వినిపించాము తమకు అనుకూలంగా ప్రభుత్వం స్పందిస్తే, యీ అనుమతి పత్రాలను తగులబెట్టే సువర్ణావకాశం తమ చేతుల్లోంచీ జారిపోతుందేమోనని అక్కడి ప్రజలు అనుమానించి అది వాస్తవం కాకపోయే సరికి, తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు ఇప్పుడు ఈ సంతోషం ఉచితమో, అనుచితమో చెప్పటం చాల కష్టం ఈ ప్రభుత్వ నిర్ణయాన్ని కరతాళధ్వనుల ద్వారా ఆహ్వానించిన ప్రజల ఉద్దేశ్యం ఏమిటో తెలుసుకోకుండా దానిపై ఉచితానుచిత నిర్ణయం తీసుకోవటం అసాధ్యం కానీ యీ ఆనందం సభలోని ప్రజల ఉత్సాహానికి మంచి చిహ్నమని మాత్రం చెప్పవచ్చు సభికులకు తమ శక్తి సామర్థ్యాలను గురించిన కొద్ది అనుభవం కలిగింది

సభాకార్యక్రమం మొదలైంది సభాధ్యక్షులు పరస్థితిని వివరించి, వాస్తవాన్ని ప్రజలకు తెలియబరిచారు అవసరానికి అనుగుణంగా తీర్మానాలు చేయబడ్డాయి ప్రభుత్వంతో జరిగిన సుదీర్ఘ సంభాషణల్లో ఎదురైన విభిన్న పరిస్థితులను ప్రస్తావిస్తూ నేను ప్రసంగించాను అనుమతి పత్రాలను కాల్చివేసేందుకు మాకు యిచ్చిన వారితో ఎవరైన తమ వాటిని వెనిక్కి తీసుకొన దలిస్తే, తీసుకోవచ్చుననీ, యిలా కాల్చివేసినంత మాత్రాన ఏదో గొప్ప పని జరగదని తెలియజేశాము ఈ పని చేసినంత మాత్రంచేత, జైలుకెళ్ళి రావచ్చునని ఉత్సాహపడే వారికి జైలు శిక్ష పడదు ఈ పనిచేసి, ప్రభుత్వపు దగుల్బాజీ చట్టం ముందు లొంగిపోయేది లేదన్న మన

నిర్ణయాన్ని యీ విధంగా తెలిజేస్తున్నాం ఒకవేళ యీనాటి కార్యక్రమంలో పాల్గొన్న వారెవరైనా రేపు వెళ్ళి కొత్త అనుమతి పత్రాల . తెచ్చుకోవాలన్న నిర్ణయం తీసుకున్నా, వారిని ఆపే వారెవరూ యిక్కడ లేరు ఈ చర్యయొక్క పరిణామాల్ని ఎదుర్కొనే శక్తి తమకు లేదేమోనని అనుమానించే వారికి యిప్పటికీ వెనక్కి మళ్ళే అవకాశం వున్నది ఇప్పుడీ నిర్ణయం తీసుకోదలచినవారు సిగ్గుపడాల్సిన అవసరమేమీ లేదు దీన్ని నేను ఓరకమైన సాహసమేనని అంటాను కానీ దీని తరువాత నిర్ణయాన్ని మార్చుకో తలిస్తే అది నిజంగా సిగ్గుపడవలసిన పరిస్థితి దానివల్ల జాతికి నష్టం కలుగవచ్చు ఇంతేకాక, యీ యుద్ధం సుదీర్ఘంగా సాగుతుందని జాతి తెలుసుకోవలసిన తరుణమిది మనలో కొంతమంది ప్రతిజ్ఞ నుంచి సడలిపోయారన్న విషయం తెలుసు ఇప్పుడిక యీ బండిని, మిగిలియున్న వారితోనే లాగించటానికి ఎక్కువ శ్రమ పడవలసి వుంటుందన్న సంగతి సుస్పష్టం ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా ఆలోచించిన తరువాతే యిప్పటి యీ సాహసాన్ని చేయటానికి పూనుకోమని సలహాయిస్తున్నాను

నా ప్రసంగం కొనసాగేటప్పుడే సభామధ్య నుంచీ, "మాకా అనుమతి పత్రాలు అవసరం లేదు మేము వాటిని కాల్చివేస్తాం" అన్న కేకలు వినవచ్చాయి నా ప్రసంగం చివర్లో ఈ నా తీర్మానాన్ని వ్యతిరేకించే వారు లేచి నిల్చోవచ్చునని ప్రజలకు తెలియజేశాను కానీ ఒక్కరూ నిలబడలేదు మీర్ ఆలమ్ కూడా సభలో వున్నాడు నాపై దాడి చేయటం తాను చేసిన పెద్ద తప్పని సభాముఖంగా కాల్చివేయమని అతడు నాకు యిచ్చాడు కొత్త ఆజ్ఞాపత్రాన్ని అతడు స్వచ్ఛందంగా తీసుకోలేదు మీర్ ఆలమ్ చేతిని నాచేతుల్లోకి తీసుకుని ఆనందంతో మెత్తగా నొక్కాను నా మనసులో అతనిపట్ల ఏ ఆవేశకావేశమూ లేదని మరోసారి స్పష్టం చేశాను తన తప్పు ఒప్పుకుని తన అనుమతి పత్రాన్ని కాల్చి వేసేందుకు అతను యివ్వగానే సభికుల ఆనందానికి అంతు లేకుండా పోయింది

2000లకు పైగా అనుమతి పత్రాలు కాల్చివేసేటందుకై కమిటీకి

అప్పగించబడ్డాయి పెద్ద బాణీలో వాటిని వుంచి, కిరోసిన్ కుమ్మరించి యూసుఫ్‌మియా నిప్పంటించారు సభికులందరూ లేచి నుంచకున్నారు అవన్నీ కాలిపోయే వరకూ సభాస్థలి కరతాళధ్వనులతో మారుమ్రోగిపోయింది ఇప్పటిదాకా తమ అనుమతి పత్రాలను తమ దగ్గరే వుంచుకున్న వారెంతోమంది వాటిని వేదికపైకి విసిరివేయటం మొదలెట్టారు వాటిని కూడా మంటలో వేయసాగారు ఎందుకిలా చేశారని వారిని ప్రశ్నిస్తే తగులబెట్టే సమయంలో సరిగ్గా వాటినలా వేస్తే తక్కినవారికి ఉత్తేజం కలుగుతుందని తలిచి తామిలా చేశామని వారన్నారు మరి కొంతమంది నిజం ఒప్పుకున్నారు మీలా చేయటానికి మాకు ధైర్యం చాల లేదు చివరి క్షణందాకా యీ కాల్చివేత కార్యక్రమం జరుగకపోవచ్చుననే నమ్మకం వున్నది కానీ కాలుతున్న ఆజ్ఞాపత్రాలను చూస్తూ మేము ఆగి వుండలేకపోయాము ఏళ్ళందరికీ ఏమైతే మనకూ అదే అవుతుందనుకుని నిర్ణయానికి వచ్చాము అని వాళ్లు అన్నారు సత్యాగ్రహ సమరంలో యీలాంటి సత్యభాషణల స్పష్ట వ్యక్తీ కరణ అనుభవాలు ఎన్నో కలిగాయి

ఆంగ్ల పత్రికా విలేఖరులు కొంతమంది యీ సభకు వచ్చారు ఆ సభాదృశ్యపు ప్రగాఢముద్ర వారిపై పడింది తమ పత్రికల్లో సభ గురించి వాస్తవ వర్ణనలు వారు చక్కగా ప్రకటించారు ఇంగ్లాండు నుంచి వెలువడే డైలీమైల్ అన్న పత్రికకు చెందని జోహాన్స్‌బర్గ్ ప్రతినిధి యీ సంఘటన గురించిన వివరాలన్ని తన పత్రికకు పంపాడు ఇంగ్లాండు నుంచి పంపబడిన తేయాకు పెట్టెలను అమెరికా వాసులు బోస్టన్ నౌకాశ్రయంలో సముద్రంలో ముంచి ఇంగ్లాండ్ అధీనంలో తాము వుండబోమని ప్రకటించిన తీరుతో యీనాటి సన్నివేశాన్ని పోల్చాడా విలేఖరి ఓవైపు 13 వేల మంది నిరాశ్రితులైన భారతీయులు, మరోవైపు శక్తివంతమైన ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం-యిదీ యిచ్చటి దక్షిణాఫ్రికా స్థితి అన్ని విధాలా నిపుణలైన లక్షలాది తెల్లజాతి ప్రజలు ఒకవైపు, మరోవైపు అత్యంత శక్తివంతమైన బ్రిటిష్ ప్రభుత్వం-ఇదీ అక్కడి స్థితి ఈ పరిస్థితులను పోల్చి చూపటంలో డైలీమైల్ పాత్రికేయుడు

అతిశయోక్తులు ప్రకటించినట్లు నాకు అనిపించలేదు సత్యనిష్ఠ, భగవంతునిపట్ల ప్రగాఢ విశ్వాసం, యివే భారతీయుల ఆయుధాలు ఈ ఆయుధాలు సర్వోన్నతమైనవి అయితే సామాన్య ప్రజానీకానికి యీ దృష్టి అలవడనంత వరకు, శ్వేత జాతీయుల ముందు నిరాయుధులైన భారతప్రజలు హీనస్థితిలో వున్నారని చెప్పకతప్పదుకాని నిర్భలులకు రాముడే దిక్కు అని సూక్తి కదా!

★ ★ ★

# 28

# భారతజాతిపై క్రొత్త ఆరోపణ

ట్రాన్స్‌వాల్ పార్లమెంటులో రెండవ ఆసియా చట్టాన్ని ప్రవేశపెట్టి ఆమోదం పొందినప్పుడే జనరల్ స్మట్స్ మరో బిల్లును కూడా ప్రవేశపెట్టాడు దానిపేరు ఇమిగ్రేన్ట్స్ రెస్ట్రిక్షన్ ఆక్ట్ (1905-రెండవ ఆక్ట్) అంటే క్రొత్తగా వచ్చేవారిపై ఆంక్షలు విధించే చట్టం అన్నమాట క్రొత్తగా వచ్చే ప్రజలపై యీ చట్టం విధించబడుతుంది ఇది ముఖ్యంగా హిందూదేశ ప్రజల నుద్దేశించి తయారు చేయబడింది నేటాల్‌కి చెందిన యిలాంటి చట్టాన్ని అనుకరించే యీ చట్టం రూపొందించబడింది ఏషియాటిక్ చట్టం అమలులోవున్న ప్రాంతాల నుంచి వలసవచ్చే ప్రజలందరినీ నిషేధించబడిన ఆగంతకులుగా పరిగణించే అవకాశం యీ చట్టంలో వుంది ట్రాన్స్‌వాల్‌లో కొత్తగా ఏ భారతీయుడూ అడుగుపెట్టే అవకాశం యివ్వని యుక్తి యీ చట్టంలో వుంది దీన్ని వ్యతిరేకించవలసిన అవసరం భారతీయులకెంతైనా వుంది కానీ యీ సత్యాగ్రహంలో యీ నూతన అంశాన్ని చేర్చాలా వద్దా అన్న ప్రశ్న యిప్పుడు ఎదురైంది మాటిమాటికీ సత్యాగ్రహం చేస్తే అది దురాగ్రహ మనిపించుకుంటుంది తమ శక్తిని గురించి సరైన అవగాహన లేకనే సత్యాగ్రహం, చేసి ఓడిపోయేవారు, తాము కళంకితులవటమే కాక, తమ అవివేకం వల్ల సత్యాగ్రహ శస్త్రాన్ని కూడా కళంకితం చేసిన వారవుతారు ఆ దగుల్బాజీ చట్టానికి విరుద్ధంగా మాత్రమే హిందూదేశ ప్రజలు జరుపుతున్న

పోరాటమే యీ సత్యాగ్రహమని సత్యాగ్రహ సమితికి స్పష్టంగా తెలుసు ఈ చట్టం రద్దయిపోతే వలస వచ్చేవారిపై ఆంక్షలు విధించే చట్టం లోని విషపూరితమైన అంశం కూడా దానంతటదే అంతమైపోతుంది ఖూనీ చట్టాన్ని రద్దు చేసేందుకు ప్రయత్నంచేస్తున్న నేపథ్యంలో యీ వలస వచ్చే వారిపై ఆంక్షలకు సంబంధించిన చట్టాన్ని ప్రత్యేకంగా వ్యతిరేకించవలసిన అవసరం లేదని భావించవచ్చు దీని వల్ల కొత్తగా ఆంక్షలనన్నింటినీ అంగీకరించినట్లేననే అర్థం వస్తుంది అందుకని ఇమిగ్రేషన్ ఆక్ట్‌ని కూడా ఎదిరించటం చాలా అవసరం సత్యాగ్రహ అంశాలలో దాన్ని సైతం చేర్చాలా లేదా అని మాత్రమే యిప్పుడు ఆలోచించాలి సత్యాగ్రహ సమయంలో భారతీయులకు విరుద్ధంగా విధించబడే కొత్త ఆంక్షలను సైతం సత్యాగ్రహ అంశాలలో చేర్చటం ధర్మం దాన్ని చేర్చకపోతే అది వేరే విషయం కానీ జాతి యొక్క శక్తి క్షీణతను దృష్టిలో వుంచుకుని, లేదా సాకుగా తీసుకుని యీ విషపూరితమైన చట్టాన్ని వదిలివేయటం ప్రమాదకరం అందుకే యీ అంశాన్ని సైతం సత్యాగ్రహ కారణాల్లో చేర్చాలని నాయకులకు విదితమైంది

అందుకై ట్రాన్స్‌వాల్ ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుప బడ్డాయి ఈ కారణంగా చట్టంలో మార్పు లేమీ కాకపోయినా భారత జాతిని ముఖ్యంగా నన్ను నిందించటానికి జనరల్ స్మట్స్‌కు మరో సాధనం లభించినట్లైంది బాహాటంగా ఎంతమంది ఆంగ్లేయపౌరులు భారతీయులకు తమ సహాయ సహకారానందిస్తున్నారో, అంతకు మించిన సంఖ్యలో అక్కడి ఆంగ్ల పౌరులకు భారతీయులపట్ల సానుభూతి ఉన్న విషయం స్మట్స్‌కి బాగా తెలుసు అందుకని యీ సానుభూతని వీలైతే అంతమొందించాలన్న ఆలోచన ఆయనకు కలగడం సహజం అందుకని ఆయన నాపై మరో కొత్త ఆరోపణ చేయటం మొదలెట్టాడు "గాంధీని నేనెరగినంతగా మీరెరుగరు? ఒక అంగుళం స్థలాన్నిస్తే ఒక గజం స్థలాన్ని యివ్వమని గొడవచేసే వ్యక్తి యీ గాంధీ ఇదంతా నాకు తెలుసు అందుకే నేనీ ఆసియాచట్టాన్ని రద్దు చేయను సత్యాగ్రహం మొదలెట్టిన సమయంలో, కొత్తగా వచ్చే

భారతీయుల ప్రస్తావనేదీ అందులో లేదు ట్రాన్స్‌వాల్‌ను రక్షించే దిశలో మనమీ చట్టాన్ని అమలులోకి తీసుకురావాలనుకుంటున్న యీ సమయంలో యిప్పుడు సత్యాగ్రహం చేస్తామని అతడు మనల్ని బెదిరిస్తున్నాడు ఈ గడసరితనాన్ని ఎప్పటిదాకా సహించగలం? అందుకే అతనేం చేస్తాడో చేసుకోనివ్వండి ప్రతి ఒక్క భారతీయుడూ నాశనమైపోయినా నేనీ ఆసియా చట్టాన్ని రద్దుచేయను రద్దు చేయను భారతీయులపట్ల ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం అనుసరించే పద్ధతిని నేనూ అనుసరిస్తాను న్యాయపూరితమైన నీతిదాయకమైన నాయీ అభ్యర్థనను ప్రతి శ్వేత జాతీయుడూ అంగీకరించాలి" అని తనతో యీ విషయమై చర్చించిన వారితోను ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన వారితోనూ ఆయన అంటూ వున్నాడు

కొంచెం ఆలోచిస్తే జనరల్ స్మట్స్ యొక్క యీ మోసపూరిత వ్యాఖ్య అనుచితమైనదని, నీతి బాహ్యామైనదని తోచక మానదు కొత్తగా వచ్చే భారతీయులను నియంత్రించే చట్టమింకా పుట్టనే పుట్టనప్పుడు, నేను కానీ నాదేశ వాసులుకానీ దాన్ని ఎలా వ్యతిరేకిస్తాము? నా చాతుర్యం గురించి వారు ప్రస్తావిస్తున్నారు కానీ దానికి సంబంధించిన ఒక్క ఉదాహరణ సైతం వారు యివ్వలేకపోయారు దక్షిణాఫ్రికాలో యిన్ని సంవత్సరాలుగా వుంటు నాకు గడసరి తనంతో పనులు చేసుకున్నట్లుగా గుర్తేలేదు మరీ చెప్పాలంటే జీవితంలో గడసరి తనాన్ని ఎప్పుడూ నేను పుపయోగించనేలేదని, ఎలాంటి సంకోచమూ లేకుండా చెప్పగలను ఇలాంటి గడసరి తనం నీతి బాహ్యామే కాకుండా రాజనీతి విరుద్ధమైనదని కూడా నావిశ్వాసం అందువల్ల నిత్యజీవనంలోకూడా యీ గడసరితనాన్ని వుపయోగించటానికి నేనెప్పుడూ యిష్టపడేవాణ్ణికాదు నన్ను నేను సమర్థించుకునేందుకు యిలా వ్రాయటం లేదు ఏ పాఠకుల కోసం నేనీ చరిత్ర వ్రాస్తున్నానో వారిముందు నానోటితో నా చర్యలను సమర్థించుకోవలసి రావటం సిగ్గుపడాల్సిన విషయంగా నేను భావిస్తాను ఇప్పటికీ పాఠకులకు నా స్వచ్ఛమైన స్వభావం గురించి, నిర్ధారణ కాకుండా వుంటే ఇక నేనెప్పటికీ యీ విషయాన్ని నిరూపించుకోలేననిపిస్తుంది.

పై విషయాలన్నీ వ్రాసినందుకొకటే కారణం ఎన్ని కష్టాల నడుమ మేమీ సత్యాగ్రహ సమరాన్ని నడిపామో పాఠకులు తెలుసుకోవాలి నీతి బాహ్యంగా ఏ చిన్నపని చేసినా మా సమరం ఎలాంటి ఆపదలో చిక్కుకునేదో కూడా వారికి తెలియాలి ఇరవై అడుగుల ఎత్తైన వెదురు కర్రలతో కట్టబడినతాడుపై నడిచే మనిషి ఆ తాడుపైనే దృష్టినంతా కేంద్రికరించి నడవాల్సి వస్తుంది ఈ పనిలో యిసుమంత అశ్రద్ధ చూపినా మృత్యువు నెదుర్కొనవలసి వుంటుంది దక్షిణాఫ్రికాలో ఎనిమిది సంవత్సరాల సుదీర్ఘసమరానుభవం వల్ల సత్యాగ్రహులు ఆ నటునికంటే ఎక్కువ ఏకాగ్రదృష్టితో నడచుకొనవలసిన అవసరం వుందని నాకు బోధపడింది ఏ ఆంగ్లేయ మిత్రుల ముందు జనరల్ స్మట్స్ ప్రస్తావన తెచ్చారో, వారందరూ నా గురించి బాగా ఎరుగుదురు అందుకే స్మట్స్ మాటల ప్రభావం వారిపై అందుకు వ్యతిరేకంగా పడింది నన్నూ, యీ సమరాన్నీ, వదిలించుకునే ప్రయత్నం చేయకుండా వారు యింకా వుత్సాహంతో మాకు సహాయం చేయటానికి ముందుకు కొచ్చారు వలస వచ్చేవారిని గురించిన చట్టాన్ని యీ సమరముసాయిదాలో కలపకపోతే మరిన్ని విపరీత పరిణామాలను ఎదర్కొనవలసి వస్తుందని సత్యాగ్రహులూ తెలుసుకున్నారు

ప్రతి సముచితమైన యుద్ధానికీ వృద్ధిచెందే నియమం వర్తిస్తుందని వ్యక్తీగత అనుభవం వల్ల నేను గ్రహించాను సత్యాగ్రహం విషయంలో ఇది సిద్ధాంతంగా మారుతుందని నా ఉద్దేశ్యం గంగానది ముందుకు సాగిన కొద్దీ అనేక నదులు దానితో కలుస్తున్నాయి పోనుపోను దాని వైశాల్యం చూస్తే అటూ యిటూ ఒడ్డే కనిపించదు నావలో కూర్చున్న వ్యక్తికి సముద్రానికీ గంగానదికీ తేడా కనిపించని స్థితి ఏర్పడుతుంది ఇదే విధంగా సత్యాగ్రహసమరం ముందుకు సాగిన కొద్దీ, దానిలో అనేక విషయాలు కలిసి, దానివల్ల ఎదురయ్యే పరిణామాలను మరింత ఎక్కువగా ఎదుర్కొనవలసి వస్తుంది నా ఉద్దేశ్యంలో సత్యాగ్రహంలో యీ పరిణామం అనివార్యం సత్యాగ్రహ మూల సిద్ధాంతంలోనే దీనికి కారణముంది సత్యాగ్రహంలో

అప్పటి పరిణామమే అధికంగా వుంటుంది దానిలో ఏరకమైన తగ్గింపూ చేయుటకు వీలువుండదు ఇందువల్ల వెనక్కి మళ్ళే అవకాశమే వుండదు స్వాభావికంగా, అది వృద్ధి చెందే తీరుతుంది ఇతర సమరాలు ఎంత సముచితమైనవైనా వాటిలో కొంతకు కొంతైనా తగ్గించే ప్రమాదాన్ని ముందునుంచీ వూహించుకుని అందుకు సిద్ధంగా వుంటారు అందువల్ల వాటిలో వృద్ధి యొక్క నియమం అమలులో వుంటుందని చెప్పటానికి సంకోచిస్తాను కానీ అల్పతమ విషయమే అధికతమంగా మారే అవకాశమున్న సత్యాగ్రహానికి వృద్ధి సూత్రం ఎలా వర్తిస్తుందన్న విషయమే అర్థంకావలసివుంది గంగానది తాను వృద్ధి చెందేందుకు సహాయక నదుల వేటలో పడి తన నడకను మరిచిపోని విధంగా సత్యాగ్రహుడు సైతం 'వృద్ధి' కోసం కత్తిపదును గల తన మార్గాన్ని వదలటం కుదరదు కానీ గంగానదీ ప్రవాహం ముందుకు సాగేకొద్దీ తక్కిన నదులన్నీ తమంత తామే ఆ ప్రవాహంలో కలిసిపోతాయి గంగా రూపమైన సత్యాగ్రహానిది అదే స్థితి ఈ వలస చట్టాన్ని సత్యాగ్రహ ముసాయిదాలో చేర్చిన తరువాత, ట్రాన్స్‌వాల్‌లోని భారతీయులకు విరుద్ధంగా వున్న అన్ని చట్టాలనూ యిలాగే చేర్చాలన్న అభిప్రాయాన్ని సత్యాగ్రహులు వెలిబుచ్చారు ట్రాన్స్‌వాల్‌లో భారతీయుల సమరం జరుగుతుండగానే నేటాల్ కేఫ్‌కాలనీ ఆరేంజ్ ఫ్రీస్టేట్ మొదలైన చోట్ల వుండే భారతీయులనందరినీ ఆహ్వానించి దక్షిణాఫ్రికాలోని భారతీయులకు విరుద్ధంగా రూపొందించిన అన్ని చట్టాలను వ్యతిరేకిస్తూ సత్యాగ్రహం చేయించాలని మరి కొంతమంది అన్నారు ఈ రెండు సందర్భాలలోనూ సత్యాగ్రహ సిద్ధాంతానికీ భంగం వాటిల్లుతుంది సత్యాగ్రహ ప్రారంభంలో మనము తలపెట్టిన విషయాలను అవకాశం చూసి యిప్పుడు పెంచడం, విశ్వాసపాత్రమనిపించుకోదని నేను స్పష్టంగా చెప్పాను మన శక్తియుక్తులెంత ఉన్నతమైనవైనా, మనం ఏ డిమాండ్ల కోసం సత్యాగ్రహం చేస్తున్నామో వాటిని సాధించుకున్న తరువాత సత్యాగ్రహాన్ని నిలిపి వేయటమే మంచిది మనమీ సిద్ధాంతంపై స్థిరంగా నిలువలేనప్పుడు విజయానికి బదులు అపజయాన్ని పొందగలమని నా దృఢ విశ్వాసం అంతేకాదు మనం పొందిన సానుభూతిని కూడా కోల్పోవలసి

వస్తుంది దీనికి వ్యతిరేకంగా సత్యాగ్రహం జరుగుతున్న సమయంలో మన విరోధులెవరైనా కొత్త అడ్డంకులు కలుగజేస్తే, అని సహజంగా సత్యాగ్రహంలో కలిసిపోతాయి సత్యాగ్రహులు తమ మార్గంలో పయనిస్తుండగా మార్గంలో వచ్చే కష్టాలను ఉపేక్షించలేదు ఎందుకంటే సత్యాగ్రహానికి విరుద్ధంగా మరో సత్యాగ్రహం జరపడం సంభవం కాదు అందువల్ల తక్కువ, ఎక్కువల సమస్యే దానిని భయపెట్టాలనుకుంటే భయపెట్టవచ్చు కానీ సత్యాగ్రహి అన్ని రకాల భయాలను త్యజిస్తాడు అందువల్ల విరోధి కొత్త యిబ్బందులను కలిగించనప్పుడు సైతం సత్యాగ్రహమంత్రాన్నే అతడు పఠిస్తాడు మార్గ మధ్యంలో ఎదురయ్యే సంకటాలను దూరం చేయుటకు, యీ మంత్రమే పనిచేస్తుందని పూర్తిగా విశ్వసిస్తాడు అందువల్ల సత్యాగ్రహమెంత సుదీర్ఘంగా జరిగినా విరోధి దానినెంతగా సాగదీసినా, విరోధికి నష్టం వాటిల్లుతుంది సత్యాగ్రహికి ఎంతో లాభం చేకూరుతుంది ఈ ప్రక్రియకు సంబంధించిన యితర ఉదాహరణలు యీ చరిత్రలోనే ముందు ముందు మనం చూడగలం ఈ విషయాలన్ని భారతీయులకు అర్థమయ్యేలా వివరించాను

★ ★ ★

# 29

## సొరాబ్జీ షాపుర్జీ అడాజణియా

ఇమిగ్రేషన్ ఆక్ట్ (వలస చట్టం) విషయాన్నీ సత్యాగ్రహ సమరంలో కలిపివేయటం వల్ల విద్యాధికులైన భారతీయులు ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించేవ అధికారానికి సంబంధించిన ఆటంకాన్ని ఎదుర్కోవలసిన అవసరం సత్యాగ్రహులకి ఏర్పడింది ఏ భారతీయుని ద్వారానైనా సరే యీ పని సాధించాలని సత్యాగ్రహ సమితి నిర్ణయించింది వలస చట్టంలో ప్రతిబంధకానికి సబంధించిన వ్యతిరేకత లేని యితర షరతులను పాటించే ఒక భారతీయుణ్ణి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశింపజేసి జైల్లో కూర్చోబెట్టేలా చేయాలి ఒక గౌరవ ప్రదమైన ధర్మాన్ని నిరూపించవలసిన అవసరం కలిగింది వలసచట్టంలోని ఒక అంశంలో ట్రాన్స్‌వాల్‌లో కొత్తగా ప్రవేశించే వ్యక్తికి యూరప్‌కి చెందిన

ఒక భాషాజ్ఞానం వుండాలన్న నియమం విధించబడింది అందువల్ల ఆంగ్ల భాషతో పరిచయం వుండి ఇదివరకు ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించని ఒక భారతీయుణ్ణి గుర్తించే నిర్ణయం సమితి తీసుకున్నది కొంతమంది భాతీయ యువకులను యీ సందర్భంగా పిలిపించటం జరిగింది కానీ వారిలో సొరాబ్జీ షాపుర్జీ అడాజణియాను ఎన్నుకున్నారు పేరును బట్టే సొరాబ్జీని పారసీకునిగా పాఠకులు గుర్తించి వుంటారు దక్షిణాఫ్రికా మొత్తమ్మీద పారసీకుల జనసంఖ్య వందకంటే ఎక్కువ వుండి వుండదు భారతదేశంలో వున్నప్పుడు పారసీకుల గురించి వున్న అభిప్రాయమే దక్షిణాఫ్రికాలో వున్నప్పుడూ నాకు వున్నది ప్రపంచం మొత్తం మీద లక్ష కంటే ఎక్కువ పారసీకులు వుండకపోవచ్చు ఇంత చిన్న జాతి అయివుండి కూడా తన ప్రతిష్టను కాపాడుకుంటూ ధర్మాన్ని పరిరక్షించుకుంటూ వస్తున్నదీ జాతి పైగా ఉదారత్వంలో మరే జాతి దీనికి సాటిరాదు ఈ జాతి ఔన్నత్యానికి యింతకంటే ప్రమాణాలు అవసరం లేదు సొరాబ్జీ అనుభవం మీద స్వచ్ఛమైన రత్నంగా తనను తాను నిరూపించుకొనగలిగారు సత్యాగ్రహ యుద్ధంలో ప్రవేశించినప్పుడు వారిని గురించి నాకు చాలా తక్కువగా తెలుసు సమరంలో ప్రవేశించిన తరువాత వారు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాల చక్కని ప్రభావం నాపై బాగా పడింది పారసీకుల సుగుణాలను నేనెంత అభిమానిస్తానో ఒక దేశవాసునిగా వారి లోపాలను గురించి కూడా నేను తెలుసుకుంటాను అందువల్ల సమర సమయంలో వారు నిలబడగలరా అని నాకు అనుమానంగా వుండేది కానీ ఎదుటిమనిషి నా అనుమానానికి విరుద్ధంగా మాట్లాడితే ఇక నా అనుమానాన్ని వదిలివేయాలన్నది నా నియమం అందువల్ల సొరాబ్జీ తన లేఖల్లో దృఢ నిశ్చయాన్ని వెలువరించిన పద్ధతిని బట్టి అతనినే యీ పనికై ఎన్నుకొన వచ్చునన్న నా అభిప్రాయాన్ని సమితికి తెలియజేశాను చివరికీ సొరాబ్జీ ప్రధమశ్రేణి సత్యాగ్రహిగా తనను తాను నిరూపించుకున్నారు ఎక్కువకాలం జైలుశిక్ష అనుభవించే సత్యాగ్రహుల్లో ఆయనా ఒకరు అంతేకాక, సత్యాగ్రహ సమరాన్ని గురించి వారికున్న లోతైన

పరిజ్ఞానం ద్వారా, సమరానికి సంబంధించి వారు యిచ్చే సలహాల నందరూ వినవలసి వచ్చేది వారి సలహాలలో ఎప్పుడూ దృఢత్వం, వివేకం, ఉదారత శాంతి మొదలైన విశిష్ట లక్షణాలు దర్శనమిచ్చేవి త్వరగా వారో నిర్ణయానికి వచ్చేవారు కాదు ఓసారి ఓ సిద్ధాంతాన్ని నమ్మటం మొదలెడితే యిక దాన్ని వదిలిపెట్టే వారు కారు వారిలో పారసీధర్మానుసరణం ఎంత వున్నదో భారతీయత కూడా అంతే వున్నది సంకుచిత జాత్యభిమానపు దుర్గంధం మచ్చుకైనా వారిలో వుండేది కాదు సత్యాగ్రహ సమరం పూర్తయిన తరువాత మంచి సత్యాగ్రహుల నొకరిని ఇంగ్లాండ్ పంపి బారిష్టరీ చదివించేందుకై డాక్టర్ మెహతా స్కాలర్ షిప్ యిస్తానని ప్రకటించారు అలాంటి యువకుణ్ణి నేనే ఎన్నుకొనవలసి వుంది ఇంగ్లాండ్ పంపే యోగ్యతలున్న యిద్దరు ముగ్గురు భారతీయులు వున్నారు కానీ ఆలోచనల్లో దృఢత్వం అర్థంచేసుకోవటం లోని పరిపూర్ణతలో సొరాబ్జీని మించిన వారెవరూ లేరని మా మిత్రులందరికీ అనిపించింది అందువల్ల వారినే ఎన్నుకోవటం జరిగింది ఇలాంటి ఓ భారతీయుణ్ణి ఎన్నుకోవాలనుకునేందుకు కారణం అతడు బారిష్టరీ చదివి, దక్షిణాఫ్రికా చేరుకొని నా స్థానాన్ని పూరించి జాతికి సేవ చేయగలగాలి భారతీయుల ఆశీర్వాదం, వారి గౌరవాలను అందుకొని, సొరాబ్జీ ఇంగ్లాండ్ వెళ్ళి బారిష్టరయ్యారు దక్షిణాఫ్రికాలోనే గోఖలేతో వారికి పరిచయమైంది ఇంగ్లాండులో గోఖలేగారి మనస్సును దోచుకున్నారు హిందూదేశానికి తిరిగి వచ్చినపుడు భారత సేవక్ సమాజ్‌లో చేరమని సొరాబ్‌జీని గోఖలే కోరారు కూడా తనతోటి విద్యార్థులకు సొరబ్జీ అత్యంత ప్రీతి పాత్రులయ్యారు ప్రతి విద్యార్థి దుఃఖంలోను వారు పాలుపంచుకునేవారు ఇంగ్లాండ్ యొక్క పైపై తళుకుల, వైభవాల ప్రభావం వారిమీద ఎంత మాత్రమూ పడలేదు ఇంగ్లాండుకు వెళ్ళినపుడు వారి వయసు ముప్పైకి పైగా వుంది ఆంగ్లంలో వారికిది గొప్ప విద్వత్తు లేదు వ్యాకరణ పరిజ్ఞానానికి కొంత ధూళి అంటింది కానీ ఓ పనిమీద మనం మనసు లగ్నం చేస్తే యిలాంటి అడ్డంకులు మనల్ని ఏమీ చేయలేవు నిజమైన విద్యార్థిగా జీవితం గడిపి సొరాబ్జీ తమ

పరీక్షల్లో ఉత్తీర్ణులవుతూ వున్నారు మా కాలంలో బారిష్టరు పరీక్ష యిప్పటితో పోలిస్తే తేలికైనదే ఇప్పుడు బారిష్టరు చదివే వారు అప్పటికంటే చాలా ఎక్కువగా చదవాల్సి వుంటుంది కానీ సోరాబ్జీ ఎక్కడా ఓటమి నంగీకరించలేదు ఇంగ్లాండులో అంబులెన్స్‌కోర్ ప్రారంభించబడినప్పుడు దాని ప్రారంభకులలో ఒకరుగా ఆయన వున్నారు చివరిదాకా దానిలోనే వున్నారు కూడా ఆదళం కూడా సత్యాగ్రహంలో పాల్గొనవలసి వచ్చింది చాలా మంది దానిలో వెనక బడ్డారు కానీ దానిలో స్థిరంగా నిలబడిన వారిలో అందరికంటే ముందు సోరాబ్జీయే వున్నారు ఆ అంబులెన్స్ దళానికే సత్యాగ్రహంలోనూ విజయం లభించినదని యిక్కడ చెప్పడం అవసరం

ఇంగ్లాండులో బారిష్టరీ అయిపోయిన తరువాత సోరాబ్జీ జోహాన్స్‌బర్గ్ తిరిగి వచ్చారు అక్కడ వారు దేశసేవతోపాటు వకాల్తా కూడా ప్రారంభించారు దక్షిణాఫ్రికా నుంచి నాకు వచ్చే ఉత్తరాలలో సోరాబ్జీ ప్రశంస వుండేది ఆయన యెంత సాదాసీదాగా వుండేవారో యిప్పుడూ అలాగే వున్నారు ఆడంబరమన్నది వారిలో మచ్చుకైనా లేదు చిన్నా పెద్ద అందరితో ఆయనెంతో చక్కగా కలిసిపోగలరు అని మిత్రులు వ్రాసేవారు కానీ భగవంతుడెంత కరుణామయుడో అంత నిర్ణయుడని కూడా అనిపిస్తుంది సోరాబ్జీకి తీవ్ర క్షయ రోగం అంటింది కొన్ని రోజులకే జాతి ప్రేమను పొంది, దాన్ని శోక సముద్రంలో ముంచి, సోరాబ్జీ చనిపోయారు యిలా కొద్ది సమయంలోనే భగవంతుడు యిద్దరు పురుషరత్నాలను లాక్కుని వెళ్ళాడు ఒకరు-కాఛలియాసేఠ్, రెండువారు సోరాబ్జీ

ఇరువురిలో ఒకరిని ఎన్నుకొమ్మంటే ప్రథమ స్థానం ఎవరికి యివ్వాలి? ఇరువురూ తమతమ పనుల్లో అద్వితీయులే కాఛలియా ఎంత పవిత్ర మహ్మదీయుడో అంతే పవిత్ర భారతీయుడుకూడా అలాగే సోరాబ్జీ ఎంత గొప్ప పరాసీకుడో అంత గొప్ప భారతీయుడు కూడా

సోరాబ్జీ ముందు ప్రభుత్వానికి నోటీసు యిచ్చి పరీక్షార్థం ట్రాన్స్‌వాల్‌లో అడుగుపెట్టాడు ప్రభుత్వం దీనికే మాత్రమూ తయారుగా లేదు అందు:

సొరాబ్జీతో ఎలా వ్యవహరించాలో ప్రభుత్వం నిర్ణయించుకోలేక పోయింది సొరాబ్జీ బాహాటంగానే ప్రవేశించాడు ఆజ్ఞాపత్రాలను పరిశీలించే సరిహద్దు అధికారికి అతనితో పరిచయం వుంది "నేను పరీక్షార్థం స్వయంగా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిస్తున్నాను నా ఆంగ్ల పరిజ్ఞానాన్ని పరీక్షించ దలచుకుంటే మీరు పరీక్షించుకోవచ్చు నన్ను అరెస్టు చేయదలచుకుంటే, చేయనూ వచ్చు'' అని సొరాబ్జీ అతనితో అన్నాడు మీకు ఆంగ్లం వచ్చునని నాకు తెలుసు అందువల్ల పరీక్షించాలన్న ప్రశ్నేరాదు మిమ్మల్ని అరెస్టు చేయమన్న ఆజ్ఞ నాకు లేదు కాబట్టి మీరు ఆనందంగా లోపలికి వెళ్ళవచ్చు మీరు ఎక్కడిక వెళ్ళినా, అరెస్టు చేయాలనుకున్నపుడు ప్రభుత్వమే మిమ్మల్ని అరెస్ట్ చేస్తుంది అని అతను జవాబిచ్చాడు

అలా మా ఆశకు విరుద్ధంగా సొరాబ్జీ జోహాన్స్‌బర్గు వరకూ వెళ్ళి పోయాడు మేమంతా ఆనందంగా అతణ్ణి ఆహ్వానించాం ట్రాన్స్‌వాల్ సరిహద్దు స్టేషనైన వాక్స్‌రస్ట్ నుండి అడుగు ముందుకు వేయనివ్వకుండా ప్రభుత్వం అతణ్ణి అరెస్టు చేస్తుందని వూహించాము మనమెంతో ముందు వెనుకలాలోచించి, నిర్భయంగా అడుగు ముందుకు వేసినప్పుడు ప్రభుత్వం దాన్ని నియంత్రించేందుకు సన్నద్ధంగా వుండకపోవటం తరచుగా జరుగుతూ వుంటుంది ఇది ప్రతి విషయంలోను తమ ఆలోచనలను మొదటినుంచి వ్యవస్థీకరించుకుని, విపరీత పరిణామాలను ఎదుర్కొనేందుకు వీలుగా ఏ ప్రభుత్వాధికారీ సిద్ధంగా వుండకపోవటం యిలాంటి సాధారణ ఉద్యమ సమయాలలో జరుగుతూ వుంటుంది అంతేగాక అధికారులకు ఒకటికి మించి అనేక పనులుంటాయి ఆ పనులపై వారిదృష్టి వుంటుంది పైగా అధికారులకు అధికార గర్వం కూడా వుంటుంది ఇలాంటి ఉద్యమాల నెన్నింటినైనా అణిచివేయటం ప్రభుత్వానికి ఆటతో సమానమని వారికి నమ్మకం వుంటుంది ఉద్యమం సాగించే కార్యకర్తలకు తమ లక్ష్యమేమిటో నిర్దిష్టంగా తెలిసి, దానికి అవసరమయ్యే సాధనాల గురించిన పరిజ్ఞానం వుంది, ఒక ప్రణాళిక సిద్ధం చేసుకొని దాన్ని గురించి నిశ్చితాభిప్రాయం

వున్నపుడు వారుపగలూ రాత్రీ దాన్ని గురించే ఆలోచిస్తు అన్ని విధాలా సన్నద్ధులైవుంటారు అందువల్ల ప్రతిభావంతంగా అడుగు ముందుకు వేసినపుడు ప్రభుత్వం కంటేవారు ఓ అడుగు ముందే వుంటారు ఎప్పుడూ అనేక ఉద్యమాలు సఫలం కాకుండా ఆగిపోయేందుకు కారణం ప్రభుత్వం యొక్క అసాధారణమైన శక్తి సంపన్నత కాదు ఉద్యమ సంచాలకుల్లో పైన చెప్పిన లక్షణాలు లేకపోటమే దానికి కారణం క్లుప్తంగా చెప్పాలంటే, ప్రభుత్వం యొక్క అజాగ్రత్తవల్ల లేదా, ఉద్దేశపూర్వకంగా రూపొందించిన ప్రణాళికవల్ల సొరాబ్జీ జోహన్స్ బర్గ్ వరకూ చేరుకోగలిగాడు అతని వంటి వారి పట్ల అధికారులెలా ప్రవర్తించాలో, పై అధికారుల నుండి ఎలాంటి సూచనలు స్థానీయ అదికారులకు లేక పోపటమూదీనికి కారణం ఈ విధంగా జోహన్స్ బర్గ్ వరకూ సొరాబ్జీ చేరుకోవటం వల్ల జాతిప్రజలల్లో ఉత్సాహం పెరిగి పోయింది ప్రభుత్వం ఓడిపోయిందనీ, కొద్ది సమయంలోనే భారతీయులతో ఒప్పందం కుదుర్చుకుంటుందనీ కొంత మంది యువకులు నిర్ధారణకు వచ్చారు కానీ తమ ఊహ నిజం కాదని త్వరలోనే వారికి తెలిసింది ఇంతేకాక యిలాంటి ఒప్పందం కుదరాలంటే తమ వంటి ఎందరో యువకులు బలి కావలసి వుంటుందని వారు తెలుసుకున్నారు

తాను జోహన్స్ బర్గ్‌కి వస్తున్నట్లూ వలస చట్టం ప్రకారం తనను తాను జోహన్స్ బర్గ్‌లో వుండేందుకు అర్హునిగా భావిస్తున్నట్లూ జోరాబ్జీ జోహన్స్‌బర్గ్ పోలీస్ సూపరిండెంట్‌కు తెలియచేశాడు తనకు ఆంగ్ల భాషతో పరిచయం వున్నట్లూ, అవసరమైతే దీనికి సంబంధించిన పరీక్షకు తాను హాజరయ్యేందుకు సన్నద్ధంగా వున్నట్లు కూడా తెలియచేశాడు దీనికి ప్రత్యుత్తరమేమీ రాలేదు కానీ దీనికి జవాబుగా కొద్ది రోజుల తరువాత సొరాబ్జీకి సమనొకటి అందింది. 8 జూలై, 1905 నాడు కోర్టులో అతనికి వ్యతిరేకంగా కేసు నడిచింది భారతీయ ప్రేక్షకులతో కోర్టు క్రిక్కిరిసి పోయింది వాదోపవాదాలు మొదలయ్యే ముందు కోర్టు ముంగిట అక్కడికి వచ్చిన భారతీయుల మీటింగ్ ఒకటి జరిగింది అందులో సొరాబ్జీ చాలా సాహసోపేతంగా

ఉపన్యసించారు జాతికి జయం చేకూరేంతవరకు ఎన్ని సార్లయినా జైలుకు వెళ్ళేందుకు తాను సిద్ధంగా వున్నాననీ, ఎంతపెద్ద కష్టమైన ఎదుర్కొనేందుకు సిద్ధంగా వున్నాననీ సొరాబ్జీ ప్రతిజ్ఞ చేశాడు ఈలోగా సొరాబ్జీతో నాకు చక్కటి పరిచయం ఏర్పడింది నిజంగా సొరాబ్జీ మంచి జాతిరత్నమన్న విషయం అర్థమైంది కోర్టులో కేసు మొదలైంది వకీలుగా నేను సొరాబ్‌జీని ఆదుకున్నాను సమన్‌లో వున్న దోషాలపై మేజిస్ట్రేటు దృష్టిని ఆకర్షించి వాటి ఆధారంగా సొరాబ్జీకి యిచ్చిన సమనును రద్దు చేయమని కోరాను ప్రభుత్వ వకీలు తన వాదనను వినిపించాడు కానీ జూలై తొమ్మిదిన నా ఆరోపణలను దృష్టిలో వుంచుకుని, కోర్టు సమన్ ను రద్దు చేసి సొరాబ్‌ను విడుదల చేసింది భారతీయులు ఆనందదంతో పిచ్చివాళ్లై పోయారు

కానీ సొరాబ్‌జీ యిలా విడుదల కావటం చాలా తాత్కాలిక నిర్ణయమే 1908, జూలై 10వ తేదీన మళ్ళీ కోర్టు ముందు హాజరు కావల్సిందిగా సొరాబ్‌కు నోటీసు అందింది జూలై 10 నుండి వారం రోజుల్లోగా ట్రాన్స్‌వాల్ వదిలి వెళ్ళమని ఆజ్ఞజారీ చేయటం జరిగింది ఈ ఆజ్ఞను అందుకొన్న సొరాబ్‌జీ ట్రాన్స్‌వాల్‌ను వదలివెళ్ళటం తన లక్ష్యం కాదని పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ వర్నాన్‌కు వర్తమానం పంపాడు అందుకని అతణ్ణి మరోసారి కోర్టుకు తీసుకువచ్చి 20 జూలైన మేజిస్ట్రేటు ఆజ్ఞను ఖాతరు చేయని కారణంగా ఒక మాసం పాటు కఠినకారాగార శిక్షను విధించారు

కానీ స్థానికులైన భారత ప్రజలను ప్రభుత్వం నిర్బంధించ లేదు ఎంత ఎక్కువ మందిని ఖైదుచేస్తే ప్రజలవుత్సాహం అంత ఎక్కువగా పెరుగుతుందనిప్రభుత్వం భావించింది ఇంతేకాక, చట్టంలోని చిన్న లోపం వల్లనైనా భారతీయులు శిక్షపడకుండా తప్పించుకుంటే వారిలో ఉత్సాహం రెట్టింపవుతుందని వారు తెలుసుకున్నారు. భారతీయులకు విరుద్ధంగా తేనున్న చట్టాలను ప్రభుత్వం వెనక్కి తీసుకుంది చాలా మంది తమ అనుజ్ఞా పత్రాలను కాల్చివేశారు ట్రాన్స్‌వాల్‌లో అవి లేకుండా వుండటం తమ హక్కుగా వారు ఋజువు చేసుకున్నారు అందువల్ల కేవలం వారిని జైలుకు

పంపేందుకు కేసు పెట్టటంలో ప్రభుత్వానికి లాభమేమీ కనిపించలేదు దానికి బదులు తాము శాంతంగా వుంటే ఉద్యమించేందుకు మరో మార్గం లేక ఆందోళన కారులుసైతం శాంతిస్తారని ప్రభుత్వం అభిప్రాయపడింది కాని ప్రభుత్వం యొక్క యీ ఆలోచన తప్పని ఋజువైంది ప్రభుత్వం యొక్క ధైర్యాన్ని పరీక్షించేందుకై ఆందోళనకారులు తీసుకున్న కొత్త ఎత్తుగడ వల్ల ప్రభుత్వం యొక్క ధైర్యం త్వరలోనే సడలింది



# 30

# సేఠ్ దావూద్ ముహమ్మద్ మొదలైనవారి సంగ్రామ ప్రవేశం

ప్రభుత్వం ఏ కొత్త నిర్ణయమూ తీసుకోకుండా, తమను అలిసిపోయేలా చేయాలని ప్రత్నించటం చూసిన భారతీయులు, తామే కొత్త పథకాన్ని వేయటం అనివార్యమని తెలుసుకున్నారు సత్యాగ్రహునిలో దుఃఖాన్ని భరించే వున్నంత వరకూ అతనెప్పుడూ అలిసిపోడు అందువల్ల ప్రభుత్వ నిర్ణయాన్ని తప్పని ఋజువు చేయుట సమర్థత జాతికి వున్నది నేటాల్‌లో వున్న చాలామంది భారతీయులకు ట్రాన్స్‌వాల్‌లో నివసించే అధికారం ఎప్పటినుంచో వుంది వ్యాపారం కోసం ట్రాన్స్‌వాలులో ప్రవేశించనవలసిన అవసరం వారికి లేదు కానీ భారతీయులు వచ్చిందని భావిస్తున్నారు ఇంతేకాకుండా ఆంగ్ల భాషా పరిజ్ఞానమూ వుంది సోరాబ్జీ ఉదాహరణలో తక్కిన భారతీయులను సైతం ట్రాన్స్‌వాల్లో ప్రవేశపెట్టటం వల్ల సత్యాగ్రహానికి భంగమేమీ వాటిల్లదు అందువల్ల మేము రెండు విధాలైన భారతీయులను ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశింప జేయటానికి నిశ్చయించు కున్నాము ఇది వరకే ట్రాన్స్‌వాల్‌లో వుండి వెళ్ళిన భారతీయులు రెండవ రకం- ఆంగ్ల భాషలో సుశిక్షితులైనందువల్ల విద్యాధికులుగా పరిగణింపబడే భారతీయులు వీరిలో దావూద్ ముహమ్మద్, పారసీ రుస్తమ్ గారు పెద్ద వ్యాపారస్థులైతే, సురేంద్రరామ్

మేధ్, ప్రాగ్‌జీ హందుభాయదేశాయ్, హరిలాల్ గాంధీ, రతన్ శీ సోధామొదలైనవారు సుశిక్షితులైన విద్యాధికులు దావూద్ సేర్‌గారి అర్ధాంగి తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నా వారూ యీ యుద్ధంలో పాలుపంచుకొనదలచారు

ఇప్పుడు నేను సేట్ దావూద్ మహమ్మద్ గారిని పాఠకులకు పరిచయం చేస్తాను వారు నేటాల్ ఇండియన్ కాంగ్రెస్ అధ్యక్షులు దక్షిణాఫ్రికాకు వచ్చిన భారతీయు వ్యాపారుల్లో చాలా పాత వ్యారస్థులు వారే సూరత్ లోని ఓ సున్నీ కుటుంబానికి చెందిన వారు హాస్యప్రియత్వంలో దావూద్ ముహమ్మద్ గారిని మించినవారు, దక్షిణాఫ్రికా భారతీయులలోనే చాలా తక్కువ మంది వుంటారని నా అభిప్రాయం ఏవిషయాన్నైనా అర్థంచేసుకునే గొప్పశక్తి వారికి వుంది వారు చదువుకున్నది చాలా కొంచెమే అయినా అనుభవం మీద ఆంగ్లం డచ్ భాషలు చక్కగా మాట్లాడేవారు ఆంగ్ల వ్యాపారస్తులతో తమ పనులను చక్కగా చేసుకొనగలిగేవారు వారి ఔదార్యం దానశీలత సుప్రసిద్ధాలు ప్రతిరోజు దాదాపు యాభై మంది అతిధులు వారియింట భోజనం చేసేవారు జాతికోసం సేకిరంచే విరాళాల క్రమంలో ఎప్పుడూ వారిపేరు ప్రముఖంగా కనిపిస్తూనే వుండేది వారి ఏకైక పుత్రుడు, తండ్రిని మించిన దాన కర్ణుడు అతని హృదయం స్పటికంలా స్వచ్ఛమైనది తన పుత్రుడి మనస్తత్వ వికాసంలో సేర్ ఎన్నడూ అడ్డంకి చెప్పలేదు సేర్ తన కుమారుణ్ణి ఆరాధిస్తుండేవారని చెబితే అది అతిశయోక్తి కాదేమో కూడా తనలోని ఏ చిన్న లోపమూ తనకుమారునిలో రాకూడదని వారి ఆకాంక్ష హసన్‌ని ఇంగ్లాండ్ పంపించి చక్కగా ఉన్నత విద్య యిప్పించారాయన కానీ దావూద్ సేర్ తన ఈ పుత్రరత్నాన్ని చాలా చిన్నవయస్సులోనే పోగొట్టుకున్నారు హసన్‌ని టి బి వ్యాధి కబళించి వేసింది ఈ గాయంవల్ల దావూద్‌సేర్ హృదయంలోగల ఆశారేఖలు అంతరించిపోయాయి హసన్ సచ్చరిత్రత లేజోవంతమైనది ఇప్పుడు దావూద్ సేర్ కూడా లేరు కాలం ఎప్పుడు ఎవరిని విడుస్తుంది కనుక

పారసీ రుస్తుంను యిది వరకే పరిచయం చేశాను సుశిక్షితులైన భారతీయుల్లో ఎక్కువ మందిని పాఠకులు ఎరుగుదురు నేనేదైనా సామగ్రి లేదా సాహిత్యం లాంటి ఆధారాలేమీ లేకుండానే యీ ప్రకరణాలను వ్రాయపూనుకున్నాను అందువల్ల యీ ఉద్యమంలో పాలు పంచుకున్న మరికొంతమంది పేర్లేవైనా మిగిలిపోయివుంటే, ఆ మిత్రులు నన్ను క్షమించాలి ఈ ప్రకరణాలు ఆయా పేర్లను చిరస్థాయిగా వుంచడానికి వ్రాయడం లేదు సత్యాగ్రహ విజయం ఎలా అందుకొనగలిగామో, అందులో మాకెదురైన అడ్డంకుల్ని ఎలా అధిగమించగలిగామో తెలియచేయటానికి యీ ప్రకరణాలను వ్రాస్తున్నాను పేర్లను, వ్యక్తుల గురించి నేను పరిచయం చేయటానికి కారణం నిరక్షరాస్యులుగా పరిగణింపబడే భారతీయులు సైతం దక్షిణాఫ్రికాలో చూపించిన పరాక్రమం వారు చేసిన అద్భుతాలను గురించి పాఠకులు తెలుసుకోవాలనే అంతేకాదు, యీ జాతీయ సమరంలో హిందూ ముస్లిం పారసీ, క్రైస్తవ సోదరు లెందరో చక్కగా కలిసి నడవగలిగారు హిందూ దేశీయులైన వ్యాపారులు, విద్యాధికులైన వారు అంతా తమ వంతు కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చిన వైనం పాఠకులకు తెలియచేయాలని నా ఉద్దేశ్యం నేను వ్యక్తులను గురించి చెప్పినప్పుడు వారి సుగుణాలను కీర్తించాను తప్ప వ్యక్తులను కాదని పాఠకులు గమనించాలి

దావూద్‌సేర్ తన సత్యాగ్రహులైన సైనికులను వెంట బెట్టుకుని ట్రాన్స్‌వాల్ సరిహద్దురేఖ దగ్గరికి చేరుకున్నపుడు ప్రభుత్వం వారికి స్వాగతం పలికేందుకు సన్నద్ధంగా వుంది ఇంత పెద్ద సైన్యాన్ని ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించటానికి అనుమతిస్తే దానికి అవమానమవుతుంది అందువల్ల అందరినీ పట్టుకున్నారు 18 ఆగస్ట్ 1908 నాడు వారిని మేజిస్ట్రేటు ముందు హాజరు పరిచారు ఏడు రోజులలోగా ట్రాన్స్‌వాల్ ను వదిలి వెళ్ళవలసిందిగా మేజిస్ట్రేటు వారిని ఆజ్ఞాపించాడు ఈ ఆజ్ఞను సత్యాగ్రహులు పాటించని కారణంగా మళ్ళీ 28 ఆగస్ట్ నాడు ప్రిటోరియలాలో వారిని అరెస్టు చేశారు మళ్ళీ కేసు పెట్టకుండానే ట్రాన్స్‌వాల్ నుండి వారిని తరిమివేశారు 31 ఆగస్టున మళ్ళీ

వారంతా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించారు చివరికి సెప్టెంబర్ 8 నాటికి సరిహద్దు నగరమైన వాక్స్‌రస్ట్‌లో వారిపై కేసు బనాయించి, 50 పౌండ్ల జుర్మానా లేక మూడు నెలల కఠిన కారాగారశిక్ష అనుభవించమని తీర్పు ప్రకటించారు సత్యాగ్రహులంతా సంతోషంగా జైలు శిక్షనే కోరుకున్నారు వాక్స్‌వరస్ట్ జైల్లో వారిని వుంచారు

దీనితో ట్రాన్స్‌వాల్ యందలి భారతీయుల ఉత్సాహం పెరిగింది నేటాల్ నుంచి మాకు సహాయం చేయటానకై వచ్చిన వారిని జైలునుంచి విడిపంచలేకపోయినా, కనీసం జైలు వెళ్లటానికి వారికి సాయం చేయాలన్న తలంపు ట్రాన్స్‌వాల్‌లోని భారతీయులకు కలిగింది దీనితో వారు జైలుకు వెళ్ళే మార్గాలను వెదుక సాగారు అరెస్ట్ కావటానికి అనేక అవకాశాలున్నాయి ట్రాన్స్‌వాల్‌లో వుండే భారతీయుడెవరైనా తన అనుజ్ఞా పత్రాన్ని చూపించకపోతే యిక అక్కడ వ్యాపారం చేసేందుకు అనుమతి వారికి లభించదు ఒకవేళ వ్యాపారానికి అనుమతి పొందకుండా వ్యాపారం చేస్తే అది అపరాధమవుతుంది నేటాల్ నుండి ట్రాన్స్‌వాల్ లోకి ప్రవేశించాలనుకునే భారతీయుడు సైతం అనుమతి పత్రాన్ని చూపించ వలసి వుంటుంది లేకపోతే వారిని అరెస్ట్ చేస్తారు కానీ అనుమతి పత్రాలు ముందే కాల్చి వేయబడ్డాయి కాబట్టి వారి మార్గం సుగమమైంది రెండు పద్ధతులనూ వారు ఆచరించారు కొంతమంది అనుమతి పత్రాలను చూపించకుండా, తిరగనారంభించారు మరికొందరు అనుమతి పత్రాలు లేకుండానే సరిహద్దును దాటనారంభించారు ఈ రెండు పద్ధతులను అనుసరించిన వారిని అరెస్టు చేయసాగారు

ఇప్పుడిక ఉద్యమం తీవ్రస్థాయి చేరుకున్నది ప్రతి సత్యాగ్రహునికీ కష్టాలు మొదలయ్యాయి నేటాల్ నుంచి తక్కిన భారతీయులు సైతం ట్రాన్స్‌వాల్‌లోకి ప్రవేశించసాగారు జోహన్స్‌బర్గ్‌లోను చాలామంది అరెస్ట్ అయ్యారు జైళ్ళు నిండిపోసాగాయి నేటాల్ నుంచి వచ్చిన వారికి మూడు నెలలు జైలు శిక్ష పడేది ట్రాన్స్‌వాల్‌లో అనుమతి పత్రం లేకుండా తిరిగేవారికి నాలుగు రోజుల నుంచీ మూడునెలలు వరకూ శిక్ష పడేది

ఇలా జైలు శిక్ష పడినవారిలో మాయిమామ్ సాహెబ్- ఇమామ్ అబ్దుల్ కాదిర్ బావ్ జీర్ కూడా వున్నారు వారు అనుమతి పత్రం లేని కారణంగా

అరెస్ట్ కాబడ్డారు 21 జూలై 1908 నాడు వారికి నాలుగురోజుల కఠిన జైలుశిక్ష పడింది జైలు వెళ్ళిరావాలన్న కోరిక ప్రకటించిన ఇమామ్‌గారి దుర్బల శరీరాన్ని చూసి లోకులు నవ్వసాగారు "భయ్యా, ఇమామ్‌ఖాన్ సాహెబ్ గారిని తీసుకుని వెళ్ళకుంటేనే మంచిది జాతి నవ్వుల పాలు అవుతుంది", అని నాతో కొంతమంది అన్నారు వారి మాటలను నేను పట్టించుకోలేదు ఇమామ్ సాహెబ్ గారి శక్తిని కొలవటానికి నేనెవరిని? ఇమామ్ సాహెబ్ చెప్పులు లేకుండా ఎప్పుడూ నడిచేవారే కాదు వారు మంచి విలాసపురుషులు వారి శ్రీమతి మలయా దేశానికి చెందినది తమ యింటిని అలంకరణ సామగ్రితో నింపి వుంచేవారు గుర్రపు బండిలో తప్ప యిల్లు వదిలి వెళ్ళే వారు కారు ఇది నిజం కానీ వారి మనసెలాంటిదో ఎవరికి తెలుసు? ఇలాంటి ఇమామ్ గారు నాలుగురోజుల కఠిన కారాగార శిక్ష అనుభవించి వచ్చారు మళ్ళీ ఒకసారి జైలుకెళ్ళారు జైల్లో ఒక ఆదర్శ ఖైదీగా, పరిశ్రమ చేసే ఖైదీగా కాలం గడిపేవారు పరిశ్రమ చేసిన తరువాతే భోజనం చేసేవారు వారికి రోజూ భోజనంలో కొత్త వంటకాలు తినే అలవాటుంది కానీ జైల్లో మొక్కజొన్నల లస్సీ తాగి సంతృప్తి పడవలసి వచ్చింది జైలు జీవనం చూచి ఏనాడూ వారు తలవంచ లేదు పైగా దాని వల్ల జీవితంలో సాదాతనాన్ని అలవరచుకున్నారు జైల్లో రాళ్లు కొట్టి, చెత్త వూడ్చి తోటి ఖైదీలలో వరుసన నిలబడ్డారాయన చివరికి ఫినిక్స్ ఆశ్రమంలో కుండలో నీళ్ళు నింపటం ప్రెసెలో కంపోజ్ చేసే విద్యను కూడా అభ్యసించారు ఫినిక్స్ ఆశ్రమంలో నివసించేవారికి, కంపోజ్ చేసే కళ నేర్వటం తప్పని సరి ఈ కళను యిమామ్ సాహెబ్ శక్తిమేరకు నేర్చుకున్నారు ఇప్పుడు వారు భారతదేశంలో సేవా కార్యంలో లీనమై వున్నారు ఇలా ఎంతో మంది జైళ్ళకు వెళ్ళి పరిశుద్ధులై వచ్చారు

జోసెఫ్ రాయ్‌పెన్ బారిష్టర్‌గా వుండేవారు వారు కేంబ్రిడ్జి యూనివర్సిటీ పట్టభద్రులు నేటాల్‌లో గిరమిటియా కుటుంబంలో జన్మించినా, దొరబాబు అయ్యారు ఇంట్లో కూడా బూట్లు లేకుండా నడిచేవారుకారు ఇమామ్ గారికి నమాజు చేసే సమయంలో కాళ్ళు కడగాల్సి వచ్చేది వట్టి కాళ్ళతో నమాజు

చదవలసి వచ్చేది కానీ పాపం రాయ్‌పేన్ యీ మాత్రం కూడా చేయలేకపోయేవారు ఇలాంటి వారు బారిష్టరీ పదవిని త్యాగం చేసి, అనుమతి పత్రం లేకుండా తిరిగి, జైలు కెళ్ళారు అక్కడి కష్టాలన్నీ అనుభవించారు "నేను రైల్లో మూడవ తరగతిలో ప్రయాణం చేయవలసి వస్తుందా' అని నన్నోసారి అడిగారు 'రైల్లో మొదటి తరగతి లేదా రెండవ తరగతిలో మీరు ప్రయాణిస్తే, చెప్పండి? అయినా మూడవ తరగతిలో మిమ్మల్ని బారిష్టర్‌గా ఎవరు గుర్తిస్తారో చెప్పండి అని తిరిగి వారినే అడిగాను జోసెఫ్ రాయ్‌సేన్‌కి యీ సమాధానం చాలు

పదహారు సంవత్సరాల పసివారెందరో జైళ్ళకు వెళారు మోహన్ లాల్ మాన్‌జీ ఘేలానీ అన్న అబ్బాయికి కేవలం పదునాలుగు సంవత్సరాలే

సత్యాగ్రహులైన వారిని తీవ్రంగా బాధించేందుకై ఏ ప్రయత్నాన్ని జైలు అధికారులు వదిలిపెట్టలేదు వారిచేత మరుగు దొడ్లు శుభ్రం చేయించారు ఖైదీలు నవ్వుతూ ఆ పని చేశారు

ఖైదీలచేత రాళ్ళు కొట్టించారు రాముడు లేదా ఖుదా పేరు ఉచ్చరిస్తూ వారా పని ఆనందంగా చేశారు వారి చేత చెరువులు త్రవ్వించారు రాళ్ళతో నిండిన భూములను త్రవ్వించారు వాళ్ళ చేతులకు బొబ్బలెక్కాయి కొంతమంది బాధకు తట్టుకోలేక నొప్పితో మూర్ఛపోయారు అయినా వారు ఓటమి నంగీకరించలేదు.

జైళ్ళలో ఖైదీల మధ్య పరస్పర బేదాభిప్రయాల వల్ల కీచులాటలు, ఈర్ష్యాద్వేషాలు వుండవని పాఠకులు అనుకోకూడదు చాలావరకు పెద్ద రగడలు, తిండి తిప్పల విషయంలోనే వస్తుంటాయి కానీ మేము వాటిని అధిగమించాము

నన్నుకూడా రెండవసారి అరెస్టు చేశారు ఓసారి వాక్స్‌రస్ట్ జైల్లో దాదాపు డెబ్బైయైదు మంది ఖైదీలు చేరాం వంట మేమే చేసుకునే వాళ్ళం నేను వంట వాణ్ణి అయ్యాను. కారణం తిండికి సంబంధించిన భేదాభిప్రాయాలను నేను సవ్యంగా సర్దగలిగాను నా తోటివారు నాపై ప్రేమతో నేను వండిన ఉడికీ ఉడకని పదార్థాలు చక్కెర లేని లస్సీని సైతం ఏ ఫిర్యాదూ లేకుండా తీసుకునేవారు.

నన్ను వారినుండి వేరు చేయటం వల్ల, నాకూ కాస్త యిబ్బంది కలిగించ వచ్చనీ, యితర సత్యాగ్రహ సోదరులు సైతం చల్లబడిపోతారనీ ప్రభుత్వం భావించింది కానీ యింత మంచి అవకాశం వారికి ఎప్పుడూ రాలేదు నన్ను ప్రిటోరియా జైలుకు తీసుకుని వెళ్ళారు ఉత్పాతం సృష్టించే ఖైదీలకోసం కేటాయించిన ఓ గదిలో నన్ను బంధించారు కేవలం కసరత్తుకోసం రెండు గంటలు నన్ను బైటికి అనుమతించేవారు వాక్సరస్ట్‌లో భోజనంతో పాటూ నెయ్యి యివ్వబడేది కానీ యిక్కడ యివ్వరు యిక్కడి చిన్నా చితకా యిబ్బందుల గురించి నేను చర్చించ దలచుకోలేదు తెలుసుకోదలచినవారు దక్షిణాఫ్రికా జైళ్ళలోని నా అనుభవాలు అన్న పుస్తకం చదివి తెలుసుకొనవచ్చు

ఎన్ని కష్టాలుపడినా భారతీయులు ఓడిపోలేదు ప్రభుత్వం సుదీర్ఘాలోచనలో మునిగిపోయింది ఆఖరికి ఎంతమంది భారతీయులను జైళ్ళలో ప్రభుత్వం నింపగలదు దానివల్ల ఖర్చెంత పెరుగుతుంది? అందుకే ప్రభుత్వం పరిస్థితిని ఎదుర్కొనటానికి యితర సాధనాలను, మార్గాలను అన్వేషించడం ప్రారంభించింది

★ ★ ★

## 31

## దేశ బహిష్కరణ

ఈ ఖూనీ చట్టంలో మూడు రకాల శిక్ష విధించేందుకు వీలుంది జుర్మానా, ఖైదు, దేశ బహిష్కరం ఈ మూడు శిక్షలూ ఒకేసారి విధించే అధికారం కూడా కోర్టుకున్నది. చిన్నమేజిస్ట్రేటు సైతం యీ శిక్షను విధించవచ్చు అట్టి అధికారాన్ని ప్రభుత్వం వారికిచ్చింది ముందు రోజుల్లో దేశ బహిష్కరణ అంటే, ట్రాన్స్‌వాల్ సరిహద్దును దాటి నేటాల్, లేదా ఫ్రీస్టేట్ సరిహద్దు లేదా డేలగోవా సరిహద్దు వరకూ అపరాధిని వదలి రావటం అనుకునేవారు ఉదాహరణకు, నేటాల్ వైపు నుంచీ వచ్చే భారతీయులను, వాక్సరస్ట్ స్టేషన్ సరిహద్దు రేఖ బైటికి తీసుకువెళ్ళి వదిలి వేసేవారు. ఇలాంటి దేశ

బహిష్కరణలో అసౌకర్యం తప్ప ప్రజలకే కష్టమూ వుండేది కాదు నిజంగా యిది నవ్వులాట వంటిదే దీనివల్ల హిందూదేశ ప్రజల పట్టుదల వుత్సాహము మరింతగా పెరిగాయి

అందుకోసం భారతీయులను అశాంతి పాటు చేయటానికి కొత్త యుక్తులను ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం వెదక వలసి వచ్చింది జైళ్ళల్లో స్థలమనేది లేకుండా పోయింది అందువల్ల భారతీయులకు, భారతదేశ సరిహద్దు వరకూ దేశ బహిష్కరణ శిక్షగా విధిస్తే వాళ్లప్పుడు నిజంగానే భయపడి, మనలను శరణుజొచ్చుతారని వారు వూహించారు ప్రభుత్వపు యీ ఆలోచనలో తప్పక కొంత నిజం వుంది హిందూస్తానీయుల గుంపునొకదానిని హిందూదేశానికి పంపించివేశారు మార్గమధ్యంలో వాళ్లు ఎన్నెన్నో కష్టాలుపడ వలసి వచ్చింది తినటానికి త్రాగటం అసౌకర్యం ఏర్పడింది ఓడలో తినుబండారాలు త్రాగేనీటి వ్యవస్థ కోసం చేసిన ఏర్పాట్లతోనే అవసరాలు తీర్చుకోవలసి వచ్చింది అందరినీ డెక్ పైకి పంపంటం జరిగింది వారిలో కొంతమందికి దక్షిణాఫ్రికాలో భూములు, ఆస్తిపాస్తులు వ్యాపారం అనీ వున్నాయి మరి కొంతమంది నెత్తిపైన అప్పులూ వున్నాయి శక్తి వుండికూడా, యిన్నీ పోగొట్టుకొని, దివాళా తీసేందుకై చాలా మంది సన్నద్ధులు కాలేరుకదా! ఇన్ని వున్నా, చాలామంది భారతీయులు దృఢంగా నిలిచారు మరికొంతమంది డీలా పడిపోయారు డీలా పడిపోయినవారు స్వచ్ఛందంగా అరెస్టు అవటం నుంచి తప్పించుకో జూచారు కానీ కాల్చివేసిన అనుమతి పత్రాల స్థానంలో కొత్త అనుమతి పత్రాలను పొందడం వంటి బలహీనతను చూపించలేదు కానీ కొంతమంది భయంకొద్దీ కొత్త అనుమతి పత్రాలు కూడా సంపాదించారు

అయినా దృఢంగా నిలిచినవారి సంఖ్య తక్కువేమీ కాదు వాళ్ళ సాహసానికి అంతేలేదు నా ఉద్దేశ్యంలో వారిలో కొంతమంది నవ్వుతూ నవ్వుతూనే ఉరికంబమెక్కేంత ధైర్యవంతులు కానీ భారతదేశానికి పంపించి వేయడినవారిలో చాలామంది బీదవారు అమాయకులు వారు కేవలం ఆసక్తితో సత్యాగ్రహ సమరంలో చేరారు వారిపై ప్రభుత్వం చేసిన దుర్మార్గాలు

తలచుకుంటేనే అసహ్యం వేస్తుంది కానీ వారికి సాయం ఎలా చేయాలో మాకు అర్థం కాలేదు డబ్బు మావద్ద కొద్దిగా వుంది ఇలాంటి సమరంలో పోరాడేవారికి డబ్బురూపంలో సహాయ మందివ్వటం మొదలెడితే, యుద్ధంలో ఓడిపోయే ప్రమాదం కలుగవచ్చు ఆశాపరులు అందులో ప్రవేశిస్తారు అందువల్ల డబ్బుపై ఆశపడ్డ ఒక్కరిని కూడా యీ సమరంలోకి అనుమతించలేదు అయినా యిలాంటి వారికి సానుభూతి రూపంలో సహాయం చేయటం మా ధర్మంగా భావించాం

అనుభవం మీద గ్రహించిన విషయం చెబుతున్నాను సానుభూతి, తియ్యటి మాటలు, చల్లని చూపువల్ల జరిగే పనులు, డబ్బు వల్ల జరగవు డబ్బును ఆశించే లోభికైనా డబ్బుతో పాటు సానుభూతి లభించకపోతే ఆ డబ్బును తిరిగి యివ్వటానికి సిద్ధపడతాడు దీనికి వ్యతిరేకంగా ప్రేమకు వశులైనవారు ప్రేమించే వారితో పాటు ఎన్ని కష్టాలనైనా భరించటానికి సిద్ధ పడతారు

అందువల్ల దేశ బహిష్కరణ శిక్ష పడిన వారికి ప్రేమ సానుభూతి వాక్యాలతో పాటు సాధ్యయమైనంత సాయం చేయటానికి నిశ్చయించాం హిందూదేశంలో వారికి అవసరమైన వ్యవస్థ ఏర్పాటు చేయగలమని మేము వారికి నచ్చచెప్పాము వీరిలో చాలా మంది గిరమిట్ ప్రథ నుంచి ముక్తి పొందిన భారతీయులన్న సంగతి పాఠకులు గుర్తుంచుకోవాలి వారి బంధువులు గాని రక్త సంబంధీలుగాని భారతదేశంలో లేరు కొంతమంది దక్షిణాఫ్రికాలోనే జన్మించినవారు వారందరికి భారతేశం విదేశం వంటిదే ఇలాంటి నిరాధారులైన మనష్యులను హిందూదేశపు సరిహద్దు వ్ద నిస్సహాయస్థితిలో వదలి రావటం, ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం చేసిన, ఘోరమైన క్రూరత్వం అమానుష చర్య అందువల్ల భారతదేశంలో వారికి అవసరమైన ఏర్పాటు చేయగలమని వారికి విశ్వాసం కలిగించాం

ఇన్ని చేసినా, వారి వెంట సాయానికెవరినైనా పంపకపోతే, వారికి శాంతి కలుగదు దేశ బహిష్కరణ శిక్షను పొందిన వారి మొట్టమెదటి దళమిది వారి ఓడ మరికొన్ని గంటల్లోనే ప్రయాణం కావటానికి సిద్ధంగా వుంది

ఎవరిని పంపాలో నిర్ణయించేందుకు తగినంత సమయం లేదు నా సహచరుల్లోని పి కె నాయుడుపై నా దృష్టిపడింది

మీరీ బీదసోదరులతో భారతదేశం వరకూ వెళ్ళగలరా? అని ప్రశ్నించాను

'ఎందుకు వెళ్ళలేను?'

కానీ ఓడ కొద్ది గంటల్లోనే బయలు దేరబోతోంది కదా!

"బయలుదేర నివ్వండి"

"కానీ మీ కట్టు బట్టల సంగతేమిటి? భోజనం సంగతేం చేస్తారు?"

"నేను వేసుకున్న బట్టలు చాలు భోజనం ఓడపై వుంటుంది కదా!

నా ఆశ్చర్యానికీ ఆనందానికీ అంతే లేకుండా పోయింది పారసీ రుస్తమ్‌జీ యింట్లో యీ సంభాషణ జరిగింది అక్కడే నాయుడు కోసం, దుస్తులు, కంబళి వగైరా అడిగి తీసుకుని ప్రమాణం చేయించాను

నాయుడితో అన్నాను- చూడండి! మార్గమధ్యంలో యీ సోదరులను జాగ్రత్తగా చూచుకోండి ముందు వీరి విశ్రాంతి సంగతి చూడండి తరువాత మీసంగతి చూచుకోండి నేను మద్రాసు నటేశన్‌గారికి తంతి పంపుతాను వారెలా చెబితే అలా చేయండి" అని చెప్పాను

'నేను నిజమైన సైనికునిగా వుండేందుకు ప్రయత్నిస్తాను' అని చెప్పి నాయుడు ప్రయాణమయ్యారు ఇలాంటి వీర పురుషులున్న చోట, అపజయం వుండనే వుండదని మనస్సులో అనుకున్నాను దక్షిణాఫ్రికాలోనే నాయుడుగారు జన్మించారు హిందూదేశాన్ని ఎన్నడూ వారు చూడలేదు నటేశన్ గారికి ఒక సిఫారసు పత్రం వ్రాసి నాయుడుగారికిచ్చాను శ్రీనటేశన్ గారికి తంతి కూడా యిచ్చాను

ప్రవాస భారతీయుల దుఃఖాలను గమనించే వారు వారికి సహాయాన్నందించేవారు వారిని గురించి పకడ్బందీగా వ్రాసేవారు ఒక్క నటేశన్ గారేనని చెప్పవచ్చు వారితో నియమబద్ధంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వుండేవి దేశ బహిష్కరణ శిక్షపొందిన భారతీయులు అక్కడికి చేరుకున్నప్పుడు వారికి నటేశన్ గారెంతో సాయం చేశారు శ్రీ నాయుడు వంటి యోగ్యమైన వ్యక్తి వెంటవుండటం వల్ల నటేశన్‌గారికి కూడా

చాలాసహాయం లభించింది మద్రాసు ప్రజల వద్ద విరాళాలు సేకరించి దక్షిణాఫ్రికా నుండి వచ్చిన హిందూదేశ ప్రజలను ఆదుకున్నారు వారికి చేదు అనుభవం కలుగకుండా చేశారు

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం చేసిన యీ పని నిర్దయతో కూడినదే కాక చట్టవిరుద్ధమైనది కూడా ప్రభుత్వానికీ సంగతి తెలుసు సాధారణంగా ప్రజలకు తెలియని విషయం ఒకటుంది ప్రభత్వం ఒక్కోసారి తన చట్టాలను తనే ఉల్లంఘిస్తూ వుంటుంది ఏదైనా కష్టం వచ్చినప్పుడు అప్పటికప్పుడు కొత్త చట్టం తయారుచేసే సమయం వుండదు, కాబట్టి వున్న చట్టాలను ఉల్లంఘించి యిష్టం వచ్చిన నిర్ణయాలు తీసుకోవటం ప్రభుత్వం చేసే పని తరువాత వీలైతే కొత్త చట్టాన్ని రూపొందిస్తుంది లేదా తాను చేసిన పనులను ప్రజలు మరిచపోయేందుకు వాళ్ళ దృష్టిని మళ్ళిస్తుంది

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు చాలా పెద్ద ఎత్తున ఆందోళనలు సాగించారు భారతదేశంలోనూ అలజడి మొదలైంది దీని పరిణామంగా బీద భారతీయులకు దేశ బహిష్కరణ శిక్షను యింత కఠినంగా విధించటం ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి కష్టమైపోయింది భారతీయులు ఈ ప్రభుత్వం చర్యకు వ్యతిరేకంగా చట్టపరమైన చర్యలు కూడా తీసుకున్నారు ఈ దేశ బహిష్కరణకు విరుద్ధంగా వారుచేసుకున్న అపీళ్ళకు విజయం లభించింది చివరికి దక్షిణాఫ్రికా భారతీయులకు భారతదేశం వరకు దేశ బహిష్కరణ విధించే పద్ధతి నిలిచిపోయింది

కానీ యీ దేశ బహిష్కరణ విధానం యొక్క ప్రభావం సత్యాగ్రహ సైనికులపై బాగా పడింది ఇప్పటిదాకా సమరంలో పాల్గొన్నవారు మంచి పోరాట పటిమకల వారే కానీ ప్రభుత్వం మళ్లీ దేశ బహిష్కరణ క్రింద భారతదేశం పంపిచివేస్తే ఎలా అన్న భయం మాత్రం కొందరిని పట్టుకున్నది జాతిని నిరుత్సాహపరచాలన్న ప్రయత్నాలు ప్రభుత్వం యిక చేయలేదు. సత్యాగ్రహ ఖైదీలను ఏడిపించటానికి అన్ని రకాల ప్రయత్నాలూ ప్రభుత్వం చేసిందని గత ప్రకరణంలో చెప్పానుకదా? రాళ్ళు కొట్టించే పని వారితో చేయించారు ఇది వరకు సత్యాగ్రహ ఖైదీలనందరినీ ఒకే చోట వుంచే

వారు ఇప్పుడు వారందరిని విడివిడిగా వుంచి అంతులేని కష్టాలకు గురిచేయటం మొదలెట్టారు ట్రాన్స్‌వాల్ లో చిక్కటి మంచువర్షం పడేది ఉదయం పనులు చేసిచేసి ఖైదీల చేతులు కొంకర్లు పోయేవి చలి కాలం వారికి కష్టకాలంగా వుండేది ఇలాంటి స్థితిలో కొంతమంది ఖైదీలను ఒక చిన్న జైల్లో వుంచారు ఇతరులెవరైనా వారిని కలిసేందకు వెళ్ళే వీలు వుండేది కాదు నాగప్పన్ స్వామి అన్న 118 ఏళ్ళ ఖైదీ వారిలో వుండేవాడు జైలు నియమాలన్నీ చక్కగా పాటించేవాడు తనకు అప్పగించిన పనులన్నీ మనస్ఫూర్తిగా చేసేవారు తెల్లవారు ఝామున రోడ్డుపై పనిచేయించేందుకు అతణ్ణి పట్టుకెళ్ళే వాళ్ళు దీనితో అతనికి డబుల్ న్యు... ..యా వచ్చి జైలునుంచి విడుదలైన తరువాత జూలై 7, 1909 నాడు కన్నుమూశాడు ఆఖరి శ్వాసవరణ సత్యాగ్రహ సమరాన్ని స్తుతించాడని, అతని స్నేహితులు చెబుతారు జైలుకు ఎందుకు వచ్చానన్న పశ్చాత్తాపం అతనికి వుండేది కాదు దేశం కోసం ప్రాప్తించిన మృత్యువును సైతం ఆనందంగా కౌగలించుకున్నాడు మన దృష్టిలో నాగప్పన్ చదువుకోని వాడు అనుభవంమీద ఆంగ్ల భాషను మాట్లాడే వాడు కానీ విద్వాంసుల పంక్తిలో కూర్చోబెట్టగలిగే స్థాయి అతనికి లేదు కానీ నాగప్పన్ ధైర్యం అతని దేశభక్తి శాంతి కాముకత, మృత్యు పర్యంతమూ అతనిలో నిలిచివున్న ధృఢత్వాలను దృష్టిలో వుంచుకుని చూస్తే యింతకన్నా యింకేం కావాలి అని అనిపించదూ! పెద్ద పెద్ద విద్వాంసులు యీ ట్రాన్స్‌వాల్ సమరంలో పాలు పంచుకోకపోయినా అది ఆగలేదు కానీ నాగప్పన్ వంటి సైనికులు రాకపోతే యిది అలా కొనసాగివుండేదా?

జైల్లో విధించిన కఠిన శిక్షలవల్ల నాగప్పన్ ఎలా మృత్యువు వాతపడ్డాడో, అలాగే దేశ బహిష్కరణ వల్ల కష్టాలు పడి నారాయణ స్వామి మృత్యువు వాతపడ్డాడు (16అక్టోబర్ 1910) ఈ పరిణామాలవల్ల దేశం ఓడిపోవటం కాక, సుదృఢమైందని చెప్పగలను కేవలం బలహీనులైనవారే యీ సమరంనుంచి తప్పుకున్నారు కానీ యీ బలహీనులు సైతం యధాశక్తి త్యాగం చేశారు అందువల్లే బలహీనులని వారిని అవహేళన చేయయకూడదు ముందుకు వెళ్ళే వాళ్ళు వెనుక పడ్డ వారిని ఎగతాళి చేయటం, తమని వీరులుగా

పరిగణించటం సాధారణంగా జరుగుతూ వుంటుంది కానీ సత్యం, దీనికి విరుద్ధంగా వుంటుంది 50 రూపాయలు యివ్వగలిగిన వారు 25 రూపాయలే యిచ్చి వూరుకోవటం, ఐదు రూపాయలు యివ్వగలిగేవారు, 5 రూపాయలు యిచ్చివేయటంలోని తేడా గమనిస్తే రెండవ వ్యక్తి ఎక్కువ త్యాగం చేశాడని అనుకోవాలి కానీ 25 రూపాయలు యిచ్చిన వ్యక్తి 5రూపాయలు యిచ్చిన వ్యక్తిని గర్వంగా చూస్తాడు కానీ గర్వపడవలసిన అవసరమతనికి లేదని మనకు తెలుసు అలాగే తన బలహీనత వల్ల ముందుకుత వెళ్ళలేనివారు, తమశక్తినంతా ఖర్చుచేశారని అనుకుందాం మనస్సులో సత్య నిష్ఠ లేకుండానే ఇది వరకటి వ్యక్తి కంటే ఎక్కువ శక్తిని ఖర్చుపెట్ట గలిగినా, సహజంగా మొదటి వ్యకియ్తే యెక్కువ యోగ్యుడని భావిస్తాం సమరం ముందుకు సాగటానికి అట్టివారు నిలచి ఉన్నారు

ఇలా భారతీయుల పరీక్ష, దినదినాకీ తీవ్రరూపం దాలుస్తూవుంది వారెంత ధైర్య స్థైర్యాలను చూపిస్తే, ప్రభుత్వం అంత కన్నా ఎక్కువ హింసాత్మక ధోరణిని పెంచుతూ వున్నది ఉత్పాతం సృష్టించే ఖైదీలకోసం, లేదా ప్రభుత్వం లొంగదీయదలచే ఖైదీలకోసం ప్రతిదేశంలో కొన్ని ప్రత్యేక కారాగారలు వుంటాయి ట్రాన్స్‌వాల్‌లోనూ యిలాంటి పద్ధతి వుంది అలాంటి ఓ జైలు పేరు ధాయ్‌క్లుఫ్ అక్కడి జైలరూ చాలా కఠినుడే ఖైదీలతో చేయించే పనికూడా కఠినమైనదే కానీ అక్కడున్న భారతీయ ఖైదీలు తమకు అప్పగించిన కఠినమైన పనులను సైతం సవ్యంగా పూర్తి చేసి చూపించారు కఠినంగా శ్రమించేందుకు వారు సిద్ధంగా వుండేవారు కానీ జైలరు చూసే అవమానాన్ని భరించలేకపోయేవారు అందుకై వారు ఉపవాసాన్ని ప్రారంభించారు 'మీరీ జైలరును మార్పించటమో లేదా మమ్మల్నే యిక్కడినుంచి మార్చటమో చేయనంతవరకు మేము ఆహారాన్ని తీసుకోము అన్నదే వారి షరతు. ఉపవాసమున్న ఖైదీలు దొంగతనంగా అవీయివీ తినడమంటూ చేయలేదు చాలా నిష్ఠగా ఉపవాసం చేశారు ఇలాంటి పరిస్థితుల్లో భారతదేశంలో అయితే ప్రజల ఆందోళనలు జరిగేవి కానీ ట్రాన్స్‌వాల్‌లో యిలాంటి అవకాశం లేదు అంతేకాక అక్కడి

నియమాలూ కఠినమైనవి ఇలాంటి సందర్భాలలోనూ ఖైదీలు కలుసుకునే వీలు లేదు సత్యాగ్రహులో ఓసారి జైల్లోకి వెళితే యిక అక్కడి విషయాలన్నీ జైల్లోనే చూచుకోవాలి నిజానికి ఈ సత్యాగ్రహం బీదరికానికి వ్యతిరేకంగా బీదలే చేసిన సమరం అందువల్ల యిలాంటి ప్రతిజ్ఞలతో పాటు పెద్ద ఆపదలు వెంటపడేవి అయినా ఖైదీలు స్థిరంగా వున్నారు వారి ఆనాటి సాహసం అత్యంత ప్రశంసనీయమైనది ప్రజలు యిలాంటి ఉపవాసాలాకు అలవాటు పడివుండలేదు కానీ సత్యాగ్రహులు తమ ప్రతిజ్ఞపై నిలిచినందువల్లే వారికి విజయం లభించింది ఏడు రోజుల ఉపవాసం తరువాత వారిని వేరే జైలుకు తరలించమని అధికారులు ఆజ్ఞను జారీ చేశారు

★ ★ ★

# 32

# రెండవ ప్రతినిధి సంఘం

ఇలా ప్రభుత్వం భారతీయ సత్యాగ్రహులను జైల్లో పెట్టించడం వారికి దేశ బహిష్కరణశిక్ష విధించటం వంటి పనులు చేస్తూనే వున్నది ఇందులో హెచ్చుతగ్గులు మాత్రం వుండేవి రెండు పక్షాలూ ఓ విధంగా చప్పబడి పోయాయి తమ ప్రతిజ్ఞపై దృఢంగా వుండే భారతీయులను జైళ్లకి పంపితే దానివల్ల వారు ఏమాత్రం ధైర్యం కోల్పోకపోవటం వారికి దేశ బహిష్కరణ శిక్షను విధిస్తే దానివల్ల తామే విమర్శల పాలవటం ప్రభుత్వం వారు గమనించారు. కోర్టుకెళ్ళేకొన్ని సందర్భాలలో ప్రభుత్వమే ఓడిపోవలసి వచ్చిది. భారతీయులు సైతం ఉద్రేకంతో ప్రభుత్వాన్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగా లేరు అంతపెద్ద సంఖ్యలో సత్యాగ్రహం చేసేవారు కూడా యిప్పుడు లేరు కొంతమంది పిరికి వారయ్యారు మరికొంతమంది అలిసిపోయారు కొందరు పూర్తిగా ఓడిపోయి యింకా సత్యాగ్రహంలో పాల్గొంటున్నవారిని మూర్ఖులుగా పరిగణించసాగారు మరి యీ మూర్ఖులు తమను బుద్ధిమంతులుగా భావించి భగవంతునిపైన పోరాటపు నిజాయితీపైన, తాము నమ్ముకున్న

సాధనాల సత్యనిష్ఠపైన సంపూర్ణ విశ్వాసాన్ని నిలిపారు. చివరికి సత్యమే గెలుస్తుందని వారి నమ్మకం.

ఈలోగా దక్షిణాఫ్రికా రాజకీయాలేమీ ఆగలేదు నిరంతర చలనం దానిది. దక్షిణాఫ్రికాలోని అన్ని అధినివేశరాజ్యాలను ఏకత్రితం చేసి బోయర్ మరియు ఆంగ్ల ప్రజలు అధిక స్వాతంత్ర్యాన్ని పొందాలనుకోసాగారు జనరల్ హర్జోగ్, బ్రిటన్‌తో సంబంధం తెంపుకోవాలని కోరుకోసాగారు ఇతరులు బ్రిటన్‌లో నామమాత్రపు సంబంధాన్ని కొనసాగించాలని అనుకోసాగారు బ్రిటిష్ సామ్రాజ్యంతో సంబంధ బాంధవ్యాలను పూర్తిగా త్రుంచేయటం తెల్లవారికి యిష్టంలేదు బోయర్లు మరియు తెల్లవారికి అవసరమయ్యేవన్నీ బ్రిటిష్ పార్లమెంటు ద్వారానే పొందాలి అందువల్ల దక్షిణాఫ్రికా విషయం బ్రిటిష్ మంత్రివర్గం ముందుంచేందుకు ఒక ప్రతినిధి బృందాన్ని పంపాలని ఇరుపక్షాలవారూ నిశ్చయించారు

అన్ని ప్రాంతాలూ కలిపి ఒకే సంఘంగా మారితే ఇప్పుడున్న స్థితి మరీ అధ్వాన్నమవుతుందని దక్షిణాఫ్రికా భారతీయులు గమనించారు అన్ని ప్రాంతాలవారూ భారతీయులనేదో రీతిగా అణచివేయాలని కోరుతుండేవారు అందువల్ల భారతీయులకు వ్యతిరేకమైన ప్రాంతాలన్నీ ఏకమైతే భారతీయ ప్రజలను మరింతగా నొక్కి వుంచాలని చూస్తారు అప్పుడిక భారత్ గోడు వినే నాధుడుండడు అయినా ఒక్క ప్రయత్నాన్నీ వదలకూడదన్న ఉద్దేశ్యంతో మళ్ళీ తమ వైపు నుంచి ఒక ప్రతినిధి బృందాన్ని ఇంగ్లాండు పంపాలని భారత ప్రజ నిర్ణయించింది ఈ సారి ప్రతినిధి బృందంలో నాతో పాటు పోరుబందర్‌కి చెందిన హాజీ హబీబ్ సేర్ గారిని నియమించటం జరిగింది చాలా రోజులనుంచి ట్రాన్స్‌వాల్‌లో వారి వ్యాపారమొకటి నడుస్తున్నది వారికి చాలా పెద్ద అనుభవంవున్నది ఆంగ్లేయ భాషలో సుశిక్షితులు కాకపోయినా డచ్, ఆంగ్లం జూలూ మొదలైన భాషలన్నీ చాలా సునాయాసంగా అర్థం చేసుకునే వారాయన సత్యాగ్రహుల పట్ల వారికి మంచి సానుభూతి వున్నా వారు మాత్రం సంపూర్ణ సత్యాగ్రహులు కారు 1909 జూన్ 23న ఏ నౌకలో (కినిల్ వర్తైసల్) మేము కేప్ టౌన్ నుంచి ప్రయాణమయ్యామో అందులోనే

దక్షిణాఫ్రికాకు చెందిన ప్రసిద్ధ రాజకీయవేత్త శ్రీ మేరీమైన్ కూడా వున్నారు దక్షిణాఫ్రికా ప్రాంతాలను కలిపి ఏకం చేసే ఉద్దేశ్యంతో వారు వెళ్తున్నారు. జనరల్ స్మట్స్ తదితరులు ముందే ఇంగ్లాండుకు చేరుకున్నారు నేటాల్‌లో వున్న భారతీయుల పక్షాన మరో ప్రతినిధి బృందం యీసారి ఇంగ్లాండు వెళ్ళింది. సత్యాగ్రహ సంబంధంగాకాక నేటాల్ భారతీయుల తీవ్ర యిబ్బందుల సంబంధంగా వారు వెళ్లారు.

అప్పుడు లార్డ్‌క్రూ అధినివేశరాజ్యాల మంత్రిగాను లార్డ్‌మోలే భారత మంత్రిగాను వున్నారు. వీరిద్దరితో పెద్ద ఎత్తున మా చర్చలు జరిగాయి ఏ మాత్రం వీలున్నా, మేము కలవని ప్రభుత్వ అధికారి అక్కడ మిగలలేదు లార్డ్ ఎంప్టహిల్ గారి సహాయానికి అంతేలేదు. శ్రీ మేరీమైన్, జనరల్ బోథా మొదలైన వారిని కలిసేవారు. చివరికి జనరల్ బోథా మా కోసం పంపిన ఒక సందేశాన్ని వినిపించారు. "జనరల్ బోథా మీ భావనను అర్థం చేసుకున్నారు. మీ చిన్న చిన్న అవసరాలను తీర్చేందుకు ఆయన అంగీకరించారు. కానీ ఆసియా చట్టాన్ని రద్దు చేసేందుకూ దక్షిణాఫ్రికాలోనికి కొత్తగా ప్రవేశించే వారిపై ఆంక్షలు విధించే చట్టాన్ని మార్చేందుకూ వారు అనుకూలంగా లేరు. చట్టంలో వర్ణభేదాలకు సంబంధించిన ఇప్పుడున్న అంశాలను మీరనుకుంటున్నట్టు మార్చేందుకూ వారు అంగీకరించే స్థితిలో లేరు ఈ వర్ణభేదం సిద్ధాంత పరమని వారు భావిస్తున్నారు కానీ మీ ఆశయం మేరకు దీన్ని మార్చాలని ప్రయత్నించినా దక్షిణాఫ్రికాలోని తెల్లవారు దీనిని సహించలేరు జనరల్ స్మట్స్ అభిప్రాయం కూడా ఇదే. ఇదే చివరి నిర్ణయమని వారిద్దరూ అంటున్నారు. ఇంతకు మించి మీరు ఏమాత్రం కోరినా అది మీకూ మీ దేశానికీ కూడా దుఃఖ కారణమవుతుంది. అందువల్లే మీరు ఏ నిర్ణయం తీసుకున్నా, బాగా ఆలోచించి తీసుకొనటం మంచిది ఈ సంగతి మీకు తెలియజేయటానికీ మీ బాధ్యతను మీకు స్పష్టం చేయటానికీ నన్నిక్కడికి పంపారు" అని చెప్పారు. లార్డ్ ఎంప్టహిల్

ఈ సందేశాన్ని వినిపించిన తరువాత లార్డ్ ఎంప్టహిల్ "చూడండి! జనరల్ బోథా మీ వ్యావహారిక అవసరాల నన్నింటినీ తీర్చేందుకు అంగీకరించారు

ఇచ్చిపుచ్చుకోవడమన్నది ప్రతిచోటా వుండనేవుంది మనకు కావలసినదంతా దొరకదు కదా అందువల్ల యీ ప్రస్తావనను అంగీకరించమని నా హృదయ పూర్వక అభ్యర్థన సిద్ధాంత రీత్యా ప్రభుత్వంతో మీరు వాదించదలచుకుంటే భవిష్యత్తులోనూ చేయవచ్చు ముందు యీ విషయమై మీరిరువురూ చక్కగా ఆలోచించుకుని నాకు జవాబివ్వండి" అని అన్నాడు

అంతావిని నేను హాజీహబీబ్ సేర్ వైపు చూచాను ఒప్పందం దృష్టితో నేను జనరల్ బోథా ప్రస్తావనను అంగీకరిస్తున్నట్టు మీరు నా పక్షాన చెప్పండి ఇప్పుడీ మాత్రమైనా అంగీకరిస్తే సిద్ధాంతాలకోసం తరువాత ప్రయత్నించవచ్చు జాతి మరింత నష్టపోవటం నాకు యిష్టం లేదు అన్నారాయన

సేర్ గారు తన మాటలను ఒక్కటీ పొల్లు పోకుండా లార్డ్ ఎంప్టహిల్ గారికి వినిపించిన తరువాత సత్యాగ్రహుల పక్షాన నేను మాట్లాడాను "మీరు తీసుకున్న చొరవకు మేము హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము వీరు నా మిత్రుడన్న మాట నిజమే కాని వారు ధనవంతుల పక్షాన మాట్లాడుతున్నారు నేను బీద ప్రజల పక్షాన తక్కువ సంఖ్యలో ఉన్నవారి పక్షాన మాట్లాడుతున్నాను కానీ నా ప్రజలు జీవితాన్ని పణంగా పెట్టగలరు వారి యీ సమరం వ్యావహారిక జీవనంకోసం, సిద్ధాంతాలకోసం - రెండింటి కోసమూ జరుగుతున్నది రెండింటిలో ఏదేని ఒక దానినే ఎన్నుకోవలసి వస్తే సిద్ధాంతాన్ని మాత్రమే ఎన్నుకుంటారు జనరల్ బోథా గారి శక్తేమిటో మాకు తెలుసు కానీ మా ప్రతిజ్ఞయే మాకు ముఖ్యం కనుక ప్రతిజ్ఞాపాలనకై నాశనమై పోవటానికి మేము సన్నద్ధంగానే వున్నాము మేము ధైర్యం వహిస్తాము మేము మా నిర్ణయంపై నిశ్చలంగా వుంటే మేము నమ్ముకున్న భగవంతుడే యీ కార్యాన్ని పూర్తి చేయగలడన్న విశ్వాసం మాకున్నది" అని అన్నాను ఇంకా యిలా నా అభిప్రాయాన్ని కొనసాగించాను - 'మీ స్థితి నాకు బాగా అర్థమైంది మా కోసం మీరెంతో చేశారు పిడికెడు సత్యాగ్రహుల కోసం మీరెక్కువ సాయం చేయలేక పోయినా మిమ్మల్ని మేము తప్పుపట్టము మీరు చేసిన ఉపకారాన్ని మరువ లేము కూడా. మీరిచ్చిన సలహాను అంగీకరించలేని మా అసమర్థతను తమరు క్షమిస్తారనే మా ఆశ. మా

యిరువురి మాటలను జనరల్ బోథా గారికి తప్పక వినిపించండి సంఖ్యలో మా సత్యాగ్రహులు తక్కువే అయినా మా ప్రతిజ్ఞను మేము పాటిస్తామనీ మా సహన శక్తి వారి హృదయాన్ని కరిగించి ఏషియాటిక్ చట్టాన్ని రద్దు చేసేలా చేయగలదన్న నమ్మకం మాకున్నదనీ వారికి తెలియజేయండి'' -

లార్డ్ ఎంప్టహిల్ అన్నారు - 'నేను మిమ్మల్ని ఇక వదిలిపెడతానని భావించకండి నా మంచి తనాన్ని రక్షించుకోవలసిన అవసరం నాకూ వుంది ఒక పనిని చేతికి తీసుకున్న తరువాత అలా మధ్యలోనే తెల్లవారు వదిలిపెట్టరు మీ సమరం పవిత్రమైనది న్యాయమైనది మంచి సాధనాల సమరం కొనసాగిస్తున్న మిమ్మల్ని నేనెలా వదిలిపెట్టగలను? కానీ నా స్థితి మీ కర్థమయ్యే వుంటుంది ఈ దుఃఖాన్ని మీరు భరించాల్సిందే అందుకే యిప్పటి పరిస్థితిలో ఏదైనా ఒప్పందం జరిగితే దాన్ని అంగీకరించమని సలహా యివ్వటం నా ధర్మంగా భావిస్తాను కానీ దుఃఖాన్ని యింతగా సహిస్తూ కూడా మీ ప్రతిజ్ఞను నిలుపుకునేందుకు మరింత పెద్ద దుఃఖాన్ని సహించేందుకు సన్నద్ధమవుతున్న మిమ్మల్ని ఎలా ఆపగలను? దీనికి నేను మీకు అభినందనలు తెలపుతున్నాను మీ కమిటీకి అధ్యక్షుడిగా నేను కొనసాగుతాను కూడా అలాగే యథాశక్తి మీకు సహాయం కూడా చేస్తాను కానీ ఒక్కటి, లార్డ్ సభలో నేను జూనియర్ సభ్యుణ్ణి మాత్రమేనని మీరు గుర్తుంచుకోవాలి నా ప్రభావం అంత ఎక్కువగా వుండకపోవచ్చును అయినా సాధ్యమైనంత మేరకు నా ప్రభావాన్ని మీ కోసం వినియోగిస్తూనే వుంటాను ఈ విషయంలో మీకే మాత్రమూ సందేహం అక్కరలేదు

ప్రోత్సాహకంగావున్న యీ మాటలతో మేము శాంతిని పొందాము

ఈ సంభాషణలోని ఓ తీయని సంగతిని బహుశా పాఠకులు గమనించి వుండకపోవచ్చు నాకూ సేర్ హాజీ హబీబ్‌కూ మధ్య బేదాభిప్రాయం వున్నా మా మధ్య చక్కని సంబంధాలున్నాయి నా అభిప్రాయానికి పూర్తిగా భిన్నంగా వున్న తన భావాలను కూడా ఎలాంటి సంకోచమూ లేకుండా నా ద్వారానే లార్డ్ ఎంప్టహిల్‌కు ఆయన చెప్ప గలిగారంటే పరస్పరం మాలో మాకు ఎంతటి విశ్వాసం వుందో పాఠకులకు తెలిసి వుండాలి వారి మాటలను

యధాతథంగా లార్డ్ ఎంప్టహిల్ ముందుంచగలనన్న నమ్మకం వారి కంతగా వుందన్న మాట

ఇక్కడ నేనో అప్రస్తుత విషయం కూడా చెప్పాల్సి వుంది నేను ఇంగ్లాండ్‌లో వున్న సమయంలో అనేక మంది భారతీయ తీవ్రవాదులతో మాట్లాడాను. వారి తర్కాలను ఖండించేందుకు దక్షిణాఫ్రికాలోని తీవ్రవాద భారతీయులను సమాధాన పరచేందుకు "హింద్ స్వరాజ్" అన్న పుస్తకాన్ని వ్రాశాను 1909లో ఇంగ్లాండు నుండీ దక్షిణాఫ్రికాకు తిరుగు ప్రయాణం చేసేటప్పుడే ఆ పుస్తకాన్ని వ్రాశాను వెంటనే ఇండియన్ ఒపీనియన్‌లో ఇది ముద్రింప బడింది కూడా లార్డ్ ఎంప్టహిల్‌తో యీ గ్రంథంలోని సిద్ధాంతాలను గురించి చర్చించాను వారి పేరు ప్రతిష్టలను సహాయసహకారాలను నా పని కోసం దురుపయోగం చేస్తున్నట్లు వారికి అనిపించకూడదన్నదే నా ఆశయం ఈ విషయమైవారితో జరిగిన నా సంభాషణ నాకిప్పటికీ జ్ఞాపకం వుంది వారి యింట్లో ఎవరికో అనారోగ్యంగా వున్నా, నన్ను వారు కలిశారు హింద్ స్వరాజ్ లో వ్యక్తికరించిన నా అభిప్రాయాలతో వారు ఏకీ భవించక పోయినా దక్షిణాఫ్రికాలో మా సమరంసాగిన చివరి దాకా మమ్మల్ని వారు పూర్తిగా సమర్థిస్తూనే వున్నారు వారితో చక్కని సంబంధం నాకు వుండేది

★ ★ ★

## 33

## టాల్‌స్టాయ్ క్షేత్రం - 1

ఇంగ్లాండు నుంచి యీసారి దక్షిణాఫ్రికాకు తిరిగి వచ్చిన ప్రతినిధి బృందం మంచి సమాచారాన్ని తీసుకుని రాలేదు లార్డ్ ఎంప్టహిల్ చెప్పిన మాటలకెలాంటి అర్థాన్ని కల్పిస్తారోనన్న చింత నాకు లేదు ఈ సత్యాగ్రహ సమరంలో చివరి దాకా ఎవరు నాతో వుండగలరో నేనెరుగుదును. ఇప్పుడు సత్యాగ్రహ విషయంలో నా అభిప్రాయాలు మరింత పరిపక్వత పొందాయి సత్యాగ్రహం యొక్క వ్యాపకత్వం అలౌకికత్వం గురించి నేను బాగా అర్థం చేసుకున్నాను అందుకే నేను ప్రశాంతంగా వున్నాను ఇంగ్లాండునుంచి తిరిగి

వచ్చేటప్పుడు హింద్ స్వరాజ్ అను పుస్తకం వ్రాశాను సత్యాగ్రహ వైశిష్ట్యం గురించి తెలియజెప్పటమే ఆ రచనోద్దేశ్యం సత్యాగ్రహ సాఫల్యంలో నిక్షిప్తమైవున్న నా శ్రద్ధకు సరైన కొలబద్ద ఆగ్రంధం అందువల్ల నా దృష్టిలో పోరాడే సత్యాగ్రహుల సంఖ్యకు యేరకమైన ప్రాముఖ్యతా లేదు

కానీ ఆర్థిక సంబంధమైన చింత నన్ను పీడిస్తూ వుండేది డబ్బులేని కారణంగా, చాలా సమయం వరకూ యుద్ధాన్ని కొనసాగించటం కష్టమైనపని డబ్బు లేకుండా సమరం నడుస్తుంది డబ్బువల్ల నిజమైన యుద్ధం కలుషితమవుతుంది సత్యాగ్రహులకూ ముముక్షువులకూ అవసరానికి మించిన సాధనాలు భగవంతుడెప్పుడూ యివ్వడని యిప్పుడు తెలిసినంత బాగా ఆరోజుల్లో నాకు తెలియదు కానీ నేను ఆస్తికుణ్ణి భగవంతుడు అప్పుడూ నాకు తోడుగా వున్నాడు నా కష్టాలను దూరం చేశాడు దక్షిణాఫ్రికా తీరంలో దిగి జాతిజనులకు మా ఓటమిని గుర్తించి తెలపవలసి వుండగా మరోవైపు భగవంతుడు నా ఆర్థిక యిబ్బందులను దూరం చేశాడు కేప్‌టౌన్ దగ్గర దిగగానే ఇంగ్లాండు నుంచి రతన్ టాటా సత్యాగ్రహానికై 25 వేల రూపాయల విరాళం యిచ్చారని తంతి వచ్చింది అప్పటి అవసరాలకు యీ మొత్తం చాలు మా పని ముందుకు సాగింది

ఇంత డబ్బు, లేదా యింతకన్నా యెక్కువ డబ్బుతో సైతం సత్యం, ఆత్మశుద్ధి ఆత్మబలం యొక్క సమరం ముందుకు నడువదు ఇలాంటి యుద్ధానికి సత్య సంపద యొక్క అవసరం ఎక్కువ యజమాని లేకపోతే మహలు శిథిలం అనిపించినట్లు, మనిషి దగ్గర ఎంత సంపదవున్నా శీలసంపద లేనిదే ఆ మనిషి శిథిలజీవిగా కనిపిస్తాడు

సత్యాగ్రహులు - సమరం ఎంత వరకు సాగుతుందో చెప్పలేమని గ్రహించారు అటు జనరల్ బోథా, జనరల్ స్మట్స్ ఒక్క అంగుళమైనా కూడా వెనక్కి తగ్గమని ప్రతిజ్ఞ చేసి కూర్చున్నారు. ఇటు మరణ పర్యంతమూ పోరాడతామని సత్యాగ్రహులు ప్రతిజ్ఞచేశారు ఇదిఏనుగు చీమల మధ్య జరుగుతున్న యుద్ధం కాలిక్రింద అణచి ఏనుగు చీమలను పచ్చడి చేయగలదు సత్యాగ్రహం ఎన్ని రోజుల వరకు సాగుతుందో సత్యాగ్రహులకే

తెలియదు ఒక సంవత్సరమా అనేక సంవత్సరాలా. సత్యాగ్రహులకైతే రెండూ సమానమే పోరాడటమే వారి దృష్టిలో విజయం. పోరాడటమంటే అర్థం. జైలుకు వెళ్లటం లేదా దేశ బహిష్కరణను పొందటం అంతే ఈలోగా సంసారం సంగతేం కావాలి? ఎప్పుడూ జైలుకు వెళ్ళే వారికి ఉద్యోగం ఎవరిస్తారు? జైలునుంచి విడుదలైన తరువాత తానేం తినగలడు? సంసారానికేం పెట్టగలడు? ఎక్కడ వుండటం? ఇంటి అద్దె ఎవరిస్తారు? జీవన భృతి లేకపోతే సత్యాగ్రహి కూడా ఆందోళన చెందుతాడు గదా తానూ పస్తుండి, తన పరివారాన్నీ పస్తులుంచి సత్యాగ్రహం చేసేవారు ప్రపంచంలో ఎక్కువమంది వుండరు

జైళ్ళకు వెళ్ళే సత్యాగ్రహుల పరివారాల పోషణ కోసం ప్రతినెలా వారికి డబ్బుయిచ్చే వాళ్ళం వారి వారి అవసరాలను బట్టి డబ్బు యివ్వటం జరిగేది. చీమలకు మెతుకులు ఏనుగుకు మణుగుల కొద్దీ ఆహారం. అందరికీ ఒకేలా డబ్బు యివ్వటం కుదిరేపని కాదు. పదిమంది పిల్లలున్న వారినీ ముందూ వెనుకా ఎవరూ లేని బ్రహ్మచారినీ ఒకే శ్రేణిలో ఎలా వుంచగలం? అలాగని కేవలం బ్రహ్మచారులనే సత్యాగ్రహుల సైన్యంలో చేర్చుకోవటం అసాధ్యం. అప్పుడు ఏ సిద్ధాంతం ప్రకారం డబ్బులివ్వాలి? వాళ్ల కుటుంబాన్ని దృష్టిలో వుంచుకుని విశ్వాసముంచి వారు అడిగిన దానిలో చాలా వరకూ తక్కువ చేసి ఖర్చుల నిమిత్తం యివ్వటం జరిగేది. ఇందులో మోసం చేసే అవకాశం బాగా వుండేది. మోసగాళ్ళు కొంతవరకూ యీ పద్ధతిని దురుపయోగపరచారు. ఇతర పరిశుద్ధ మనస్కులైన వారు సైతం ఒక తరహా జీవన స్థాయిని నిలుపుకునేందుకు ఆర్థిక సహాయం గురించి ఆశించేవారు. ఇలా సత్యాగ్రహులకు వారి పరివారాలకు ఆర్థిక సహాయం చేస్తూ సమరాన్ని ముందుకు నడపటం అసంభవమని తెలుసుకున్నాను. ఇందులో అర్హత గలిగిన వ్యక్తి అన్యాయం కావటానికీ దుశ్చరిత్రుడైన వ్యక్తి తన కుసంస్కారంతో సఫలుడవటానికీ అవకాశం వుండేది. అందరూ కలిసి పని చేయటం వల్ల యీ సమస్య ఒక విధంగా పరిష్కారమయ్యే అవకాశం వుంది. ఇందువల్ల ఏ కుటుంబానికీ అన్యాయమయ్యే భయం వుండదు. పాఖండులకు

అవకాశమసలే వుండదు. ఇందువల్ల సామాజిక ధనాన్ని మిగల్చవచ్చు సత్యాగ్రహుల పరివారాలకు కొత్త నిరాడంబర జీవితాలు గడపటానికీ, అనేక మందితో కలిసిమెలిసి వుండేందుకూ తగిన శిక్షణ లభిస్తుంది. ఈ వ్యవస్థవల్ల అనేక ప్రాంతాల అనేక ధర్మాలకు చెందిన భారతీయులంతా కలిసివుండే అవకాశమూ లభిస్తుంది.

కానీ దీనికి అనుకూలమైన స్థానం ఎక్కడినుంచి ఎలా ప్రాప్తిస్తుందన్నదే ప్రశ్న. నగరంలో వుండటమంటే పొయ్యిమీద నుంచి పెనం మీద పడటమే భోజనానికయ్యే నెల ఖర్చు. నగరంలో కేవలం యింటి అద్దెకీ యివ్వాల్సి వస్తుంది. నగరంలో వుంటూ నిరాడంబర జీవనం గడపాలంటే కుటుంబాలకు కష్టమే. ఇంతేకాక కుటుంబాలన్ని ఓ చోట కలిసి యేదైనా ఉపయోగకరమైన వృత్తి చేపట్టాలంటే తగిన చోటు లభించదు అందుకని నగరానికి మరీ దూరంగానూ లేక మరీ దగ్గరగానూ లేని ప్రదేశమేదైనా ఎంపిక చేస్తే మంచిదని మేము నిశ్చయించుకున్నాము ఫినిక్స్ ఆశ్రమం వుండనే వుంది ఇండియన్ ఓపినీయన్ అక్కడి నుంచే వెలువడుతున్నది కొంత వ్యవసాయం కూడా అక్కడ జరుగుతున్నది. తక్కిన సదుపాయాలు సైతం ఫినిక్స్‌లో వున్నాయి. కానీ జోహాన్స్‌బర్గ్ నుండి ఫినిక్స్ 300 మైళ్ల దూరంలో వుంది పైగా ప్రయాణానికి ముప్పై గంటల సమయం పడుతుంది. ఇంత దూరం కుటుంబాలను తీసుకుని వెళ్లడం చాలా కష్టమైన ఖర్చుతో కూడుకున్న పని ఇంతే కాక సత్యాగ్రహుల కుటుంబాలు తమ యిల్లూ వాకిలీ వదులుకుని యింత దూరం వెళ్లేందుకు సిద్ధంగా లేవు. ఒకవేళ సిద్ధమైనా వారినీ జైలునుంచి విడుదలయ్యే సత్యాగ్రహులనూ ఫినిక్స్ పంపేవని అసంభవమని తేలింది.

అందువల్ల కుటుంబాలను ట్రాన్స్‌వాల్‌లోనే పైగా జోహాన్స్‌బర్గ్‌కు దగ్గరగానే వుంచాలని నిర్ణయించాము. శ్రీ కైలన్ బెక్ గురించి ముందే నేను పరిచయం చేశాను. 1100 ఎకరాల భూమిని కొని ఒక్క పైసా తీసుకోకుండా సత్యాగ్రహుల ఉపయోగార్థం యిచ్చివేశారాయన (30 మే 1910) ఆ భూమిలో దాదాపు వెయిదాకా పళ్ళ చెట్లున్నాయి. అయిదారు మంది వుండేందుకు వీలైన చిన్న

యిల్లు వుంది. నీళ్ళకోసం రెండు బావులు ఒక చెరువు వున్నాయి. సమీపంలో ఉండే ఒక మైలు దూరంలోనే 'లాలే' అన్న రైల్వేస్టేషన్ వుంది జోహాన్స్ బర్గ్‌కు 21 మైళ్ళ దూరాన వుంది ఇక్కడే యిళ్ళు నిర్మించి సత్యాగ్రహుల కుటుంబాలను వుంచటానికి మేము నిశ్చయించాం

★ ★ ★

# 34

## టాల్‌స్టాయ్ క్షేత్రం 2

టాల్‌స్టాయ్ క్షేత్రంలో వేయి దాకా చెట్లువున్నాయి వాటిలో చాలావరకు నారింజ రేగు వృక్షాలు పళ్ళకాలంలో సత్యాగ్రహులు వారి కుటుంబాల వారు తినగలిగినన్ని తిన్నా యింకా పళ్ళు మిగిలిపోతాయి ఒక చిన్న చెరువు వుంది అది నివాస స్థానాలకు దాదాపు 500 గజాల దూరంలో వుంది అందువల్ల కడవలు నింపి నీరు యిళ్ళకు తీసుకుని వెళ్ళాలంటే కష్టపడాల్సి వస్తుంది

ఇక్కడ నౌకర్లతో యింటికి సంబంధించిన పనులను కానీ, వ్యవసాయానికీ లేదా యిళ్ళు కట్టించే పనికి సంబంధించిన పనులు చేయించకూడదని మా నిర్ణయం మరుగుదొడ్లు శుభ్రపరచటం మొదలుకొని వంట పని వరకూ అన్ని పనులూ స్వయంగా చేసుకోవాలి కుటుంబాల విషయానికి వస్తే స్త్రీ పురుషులను విడివిడిగా వుంచాలని ముందే నిశ్చయించాము అందువల్ల స్త్రీ పురుషుల యిళ్ళు విడివిడిగా దూరందూరంగా కట్టించాలని నిర్ణయమైంది కైలన్‌బెక్ వుండేందుకు సైతం యిల్లు కట్టించవలసి వుంది దానికి దగ్గరగా చెక్క పనికి, చెప్పులు కుట్టించే పనికి కార్ఖానా కూడా సిద్ధం చేయవలసి వుంది

ఇక్కడ వుండేందుకు గుజరాతీ, మద్రాస్, ఆంధ్ర, ఉత్తర ప్రదేశ్‌లకు చెందిన భారతీయులు రాబోతున్నారు వీరు హిందూ, ముస్లిమ్, పారసీ, క్రైస్తవ ధర్మాలకు చెందిన వారు నలభైమంది యువకులు, యిద్దరుముగ్గురు వయోవృద్ధులు ఐదుమంది స్త్రీలు యిరవై ముప్పైమంది బాలలు వున్నారు వీరిలో నలుగురైదుగురు బాలికలు

స్త్రీలలో క్రైస్తవ ధర్మానికి చెందినవారు మాంసాహారపుటలవాట్లు కలిగినవారూ వున్నారు యిచ్చట మాంసాహార భోజనం నిషేధిస్తే బాగుంటుందని కైలన్ బేక్ నేనూ తలచాము మాంసాహారానికి బాల్యం నుంచే అలవాటు పడినవారినీ కష్టకాలంలో యిక్కడ నివసించేందుకు రానన్ను వారినీ కొన్ని రోజులు మాంసాహారాన్ని మానివేయమని ఎలా చెప్పటం? ఒకవేళ చెప్పలేక పోతే, వారి భోజనం ఖర్చు ఎంతో పెరుగుతుంది? గోమాంసం తినే అలవాటున్న వారికి గోమాంసమూ యివ్వాలా? చివరికి వంట గదులెన్నో విడివిడిగా నడపాల్సి వస్తుంది ఇలాంటి పరిస్థితిలో నా ధర్మమేమిటి? ఖర్చు నిమిత్తం డబ్బు యివ్వాల్సిన వాణ్ణి నేనైయుండి మాంసాహారాన్ని వీటిని సమర్థించవలసి వుంటుంది ఒక వేళ మాంసాహారులకు ఆర్థిక సహాయం అందదని నియమం పెట్టానంటే యిక యీ సత్యాగ్రహ సమరం కేవలం శాకాహారుల సహాయంతోనే నడపాల్సి వుంటుంది ఇది ఎలా సంభవం? భారత దేశానికి చెందిన అన్ని వర్గాలనూ సంఘటితంచేసి నడుపబడుతున్న సమరం యిది ఈ పరిస్థితుల్లో నాకు నా ధర్మమేమిటో స్పష్టంగా అర్థమైంది ఒకవేళ క్రైస్తవులు ముసల్మానులు గోమాంసాన్నికోరినా వారికి నేను యివ్వవలసి వుంటుంది ఇక్కడికి వారు రావటాన్ని నేను ఆపలేను.

కానీ భగవంతుడు ఎప్పుడూ ప్రేమను కురిపిస్తూనే వుంటాడు నేనెంతో సరళంగా నా సమస్యను క్రైస్తవ సహోదరుల ముందుంచాను. ముస్లిమ్ పెద్దలు శుద్ధ సాత్త్విక భోజనం తయారు చేసుకునే వంటగదిని నడుపమంటూ ఎప్పుడో అనుమతి యిచ్చేశారు ఇప్పుడు వారి భర్తలూ జైళ్ళలో వున్నారు అట్టి క్రైస్తవ సోదరీమణులతో మాట్లాడవలసివుంది. వారు సైతం శాకాహార భోజనం విషయంలో నాతో ఏకీభవించారు. సోదరీమణులతో యింత దగ్గరగా మాట్లాడే అవకాశం నాకు యిప్పుడే కలిగింది. ఇంటిని గురించిన అసౌకర్యం డబ్బు గురించిన సమస్య, నా భావాలను గురించిన వివరణ అన్నీ వారితో చెప్పాను. వారికి అంతగా కావాలంటే గోమాంసం నేను ఏర్పాటు చేయగలనని కూడా చెప్పాను. సోదరీమణులు మాంసం అక్కర్లేదని చెప్పారు. వంటింటి బాధ్యతంతా వారిపైనే వుంచాము. మాలో నుండి ఒకరిద్దర్ని వాళ్లకు

సహాయంగా వుంటారు నేను వున్నాను చిన్న చిన్న తగాదాలు నా సమక్షంలో దూరమవుతాయి. భోజనం చాలా సాదాసీదాగా వుండాలని నిర్ణయించారు. భోజన సమయాలు నిర్ధారించబడ్డాయి వంటిల్లు ఒకటే అందరూ ఒకే పంక్తిలో కూర్చుని భోజనం చేసేవారు తమ కంచాలూ గ్లాసులూ తామే శుభ్రం చేసుకొనవలసి వుండేది వంటింటిలోని సామను వంతులు వంతులుగా శుభ్రపరచటం జరిగేది. టాల్‌స్టాయ్ క్షేత్రం చాలా దినాలు నడిచినా సోదరీ సోదరులెవ్వరూ మాంసాహారం కావాలని అడుగలేదు మద్యం పూర్తిగా నిషిద్ధం

ఇల్లు పూర్తేందుకు కూడా వీలైనంత వరకు మనపని మనమే చేసుకోవాలని మా కోరిక మా ముఖ్యుడు కైలనబైకీ నారాయణన్ దాస్ దామానియా అన్న గుజరాతీ వడ్రంగి ఒకరు. డబ్బు తీసుకోకుండానే రయీ పనిలో సాయం చేశారు కూలి తక్కువ తీసుకునే యిద్దరు కూలీలను కూడా తెచ్చాడు. పనితనం అవసరంలేని సామాన్య కార్యకలాపాలు మేమంతా చేశాం. మాలో చక్కని ఆరోగ్యవంతులైతే అద్భుతాలు చేశారు. వడ్రంగి పనిలోని అర్థభాగం పనంతా మాలోని ఓ చక్కని సత్యాగ్రహం చేశాడు. పరిశుభ్రం చేయటం నగరానికి వెళ్ళి అవసరమయ్యే వస్తువులను తెచ్చేపనంతా సింహంలాంటి నాయుడే చూసుకున్నాడు.

ప్రాగ్‌జీ ఖండుబాయి దేశాయ్ అన్న వ్యక్తి టాల్‌స్టాయ్ క్షేత్రంలో వుండేవాడు ఆయనైతే జీవితంలో కష్టమంటే ఏమిటో తెలియని విధంగా పెరిగాడు. కానీ గడగడ వణికించే చలినీ, సలసల కాల్చే ఎండలనూ ఆయన భరించవలసివచ్చింది. కుండపోతవంటి వర్షపు ధాటిని సైతం తట్టుకొన వలసి వచ్చింది. మొదట్లో డేరాల్లో వుండవలసి వచ్చింది. ఇల్లు తయారు కావటానికి రెండు నెలల సమయం పట్టింది. టిన్నురేకులతో తయారు చేయబడిన యిళ్ళు. కొలిచి వుంచిన చెక్క కూడా దొరికేది. అందువల్ల కొలత బద్దతో వాటిని అవసరానికి తగినట్టు ముక్కలు చేయటం జరిగేది కిటికీలు తలుపులు ఎక్కువ వుండేవి కావు. ఇన్ని కారణాలవల్ల కొద్దిసమయంలోనే చాలా యిళ్ళు నిలబెట్టగలిగాము. కానీ ప్రాగ్‌జీకైతే యిది పరీక్షా కాలమేనని

చెప్పక తప్పదు జైలుకంటేయీ క్షేత్రమందలి పనులు మరింత కఠినమైనవనే చెప్పాలి ఒకరోజైతే ఎండ అలసట వల్ల వారు స్పృహతప్పి క్రింద పడిపోయారు. కానీ వారు ఓడిపోయేమనిషి కాదు శరీరాన్ని పరీక్షా సాధనంగా భావించి ఇక్కడ తన పూర్తిగా నడుం కట్టి పని చేశాడు చివరికి కండబలంలో అందరికీ సమానంగా దీటుగా తయారయ్యారు జోసెఫ్ రాయ్‌సేన్ మరో స్నేహితుడు వున్నాడు బారిష్టరైనా, బారిష్టరునన్న గర్వం అతనికి వుండేది కాదు కఠిన పరిశ్రమ చేయలేని శరీరం వారిది రైల్లో నుంచి సామాను క్రిందికి దించటం, దాన్ని బండిలో పెట్టేయటం ఆయనకి కష్టం కలిగించే పనులు అయినా యథాశక్తి ఆ పని చేశారాయన టాల్‌స్టాయ్ క్షేత్రంలోకి వచ్చి నిర్బలులైన ప్రతివారూ బలవంతులయ్యారు పరిశ్రమ అందరికీ శక్తి నివ్వగలదన్న మాట ఋజువైంది.

క్షేత్రంలో వున్న వారు ఏదో ఒక పని మీద జోహన్స్ బర్గ్ వెళ్లవలసి వచ్చేది పిల్లలక్కడికి వాహ్యాళికై వెళ్లటానికి యిష్టపడేవాళ్లు పనికి సంబంధించి జోహన్స్‌బర్గ్ వెళ్లవలసి వచ్చేది. క్షేత్రానికి సంబంధించిన పనిమీద వెళ్ళే వాళ్ళకి రైల్లో అదీ మూడవ తరగతిలో మాత్రమే ప్రయాణించే అనుమతినివ్వాలని నిర్ణయించటం జరిగింది. వాహ్యాళి కోసం వెళ్ళే వాళ్ళు నడిచి వెళ్ళవలసివుంటుంది వారికి తినుబండారాలు కూడా యివ్వాల్సి వుంటుంది నగరానికి వెళ్ళి తినటానికీ తాగటానికీ డబ్బు ఖర్చు పెట్టరాదు ఇలాంటి నియమాలు పెట్టకపోతే అడవిలో సైతం వుండటానికి సిద్ధమై డబ్బు పొదుపు చేయటానికి ఎందుకు సిద్ధపడ్డామో, ఆడబ్బంతా నగరం వెళ్ళి బజార్లలో తినే ఉపాహారానికై ఖర్చయిపోతుంది. ఇంట్లో తయారు చేయబడిన ఉపాహారం సాదాసీదాగా వుండేది. ఇంటి దగ్గరే పిండి కొట్టించి బరకగా వున్న పిండితో చేసిన డబుల్ రొట్టె. దానిపై వేరు సెనగ పప్పుతో చేసిన వెన్న యింటి నారింజ కాంతులతో చేసిన జామ్ యిదీ ఆ ఉపాహారం. వేరు సెనగ పప్పుతో తయారు చేసిన యీ వెన్న బైట పాలవెన్న కంటే నాలుగింతలు తక్కువ ధరకే వస్తుంది. నారింజలు క్షేత్రంలోనే ఎక్కువగా లభిస్తాయి. క్షేత్రంలో ఆవుపాలకన్నా బైట నుంచి వచ్చే డబ్బాపాలనే ఎక్కువగా ఉపయోగించే వాళ్ళం.

కానీ మళ్ళీ ప్రయాణం గురించిన విషయానికే రావలసి వచ్చింది. సరదాగా జోహన్స్‌బర్గ్‌కు వెళ్ళాలను కునేవారు వారానికి ఒకటి రెండు సార్లు నడిచివెళ్ళి ఆ రోజే తిరిగి వచ్చేసేవాళ్ళు 21 మైళ్ళ దూరమని ముందే చెప్పాను నడిచి వెళ్ళవలసి రావటం వల్ల మా డబ్బు చాలా మిగులసాగింది పైగా నడిచివెళ్ళే వాళ్లకు లాభించింది కూడా కొంతమందికి నడక అలవాటై పోయింది ఇలా జోహన్స్‌బర్గ్ వెళ్ళాలనుకునే వారు తెల్ల వారగట్ల 2 గంటలకు లేచి 2-30 కల్లా బయలు దేరి 6, 7 గంటల్లోపల జోహన్స్‌బర్గ్ చేరుకునేవారు త్వరగా నడిచి నాలుగు గంటల 17 నిమిషాల్లో అక్కడికి చేరుకునేవారు

క్షేత్రంలో వుండేవాళ్ళు దీనిని భారంగా కాక ప్రేమగా పాటించేవారు కేవలం నియమాల మీదనే ఆధారపడి ఆశ్రమంలో ఏ ఒక్కరినీ వుంచలేము. పైగా నవయువకులు నవ్వుతూ త్రుళ్ళుతూ క్షేత్రానికి సంబంధించిన పనులు సైతం చేసేవారు కొంచెం శరీరకష్టంతో చేయాల్సిన పనులు అప్పగించినపుడు వారు చేసే హడావిడిని ఆపటం కష్టమయ్యేది. సంతోషంగా వారెంత వరకు పనిచేయగలరో అంత వరకే వారిచే పని చేయించటం జరిగేది ఈ నియమం వల్ల పని పూర్తికాకపోవటమన్నది నేనేనాడూ గమనించలేదు

శుచిశుభ్రత గురించిన సంగతైతే కథ లాగా వుండేది. ఇంతమంది పని చేసేవాళ్ళున్నా ఏనాడూ చెత్తా చెదారమూ ఎంగిలి పదార్థాలూ కనిపించేవి కావు ఈ చెత్తాచెదారమంతా త్రవ్వి వుంచిన మట్టి కింద పాతి పెట్టడం జరిగేది దారిలో నీళ్ళు చలటం నిషిద్ధం నీళ్ళను పాత్రలో సేకరించి వుంచి చెట్ల పాదుల్లో పోసేవారు తిండిలో మిగిలిపోయిన పదార్థాలను ఎంగిలి పదార్థాలను ఓ చోట నియమంగా పడవేసేవారు. మైల పదార్థాలను 11/2 అడుగులోతు గలిగిన ఓ గుంటలో వేసి వుంచి అది నిండిన తరువాత కప్పివేయటం జరిగేది. అందువల్ల దుర్గంధం వుండేది కాదు అక్కడ ఈగలు పారాడేవికావు చెత్తాచెదారాన్ని కప్పి వేశారన్న అనుమానమూ వచ్చేదికాదు దానికి తోడు క్షేత్రానికి అమూల్యమైన ఎరువు కూడా లభించేది నిజానికి యీ చెత్తాచెదారాన్ని సరిగా వుపయోగిస్తే లక్షలాది రూపాయల ఎరువు

తయారు చేసుకోవచ్చు. పైగా రకరకాల రోగాల నుంచి విముక్తి లభిస్తుంది నదీ తీరాల వద్ద మలమూత్రవిసర్జన చేసే అలవాటు వల్ల పవిత్ర నదీ తీరాలను మనం మలినం చేస్తున్నాం. ఈగలు అనేకం జన్మించడానికి మనమే కారణం భయంకరమైన మన అజాగ్రత్తవల్ల ఆ ఈగలు ఎక్కడ బడితే అక్కడున్న మలమూత్రాదులపై వాలి మళ్ళీ స్నానం చేసి శుభ్రమైన మన దేహాలపై వాలుతాయి ఒక చిన్న గుంట మనను యీ అపరిశుభ్రాన్నుంచి రక్షించగలదు నడిచే దారుల్లో చెత్తవేయటం ఉమ్మివేయటం చీదడం యివన్నీ చేయటం భగవంతుని పట్లా మనషుని పట్ల మనం పాపం చేస్తున్నట్లే ఇందులో దయారాహిత్యం వుంది 'ఇతరులకు అసౌకర్యం కలిగిస్తున్నామన్న భావనలేని దోషం వుంది అడవిలో వుంటూ కూడా తన మలాన్ని మట్టితో కప్పని వాడు శిక్షకు అర్హుడు

సత్యాగ్రహుల కుటుంబాల వారిని ఉద్యమ శీలురను చేయటం డబ్బును పొదుపు చేయటం స్వావలంబనం అలవాటు చేయటం మా పనులు ఈ ధ్యేయాన్ని పూర్తి చేసుకున్న తరువాత ట్రాన్స్‌వాల్ ప్రభుత్వంలో ఎన్ని రోజులైనా మేము పోరాడవచ్చు చెప్పులకోసం డబ్బు ఖర్చు పెట్టవలసి వచ్చేది బూట్లవల్ల ఎండ వేడిమితో నష్టపోవాల్సి వస్తుంది చెమట అంతా పాదాలవద్ద చేరి పాదాలు తడిసేవి ట్రాన్స్‌వాల్‌లో మన దేశంలో లాగా సాక్సుల అవసరం అంతగా వుండదు కానీ ముళ్ళూ రాళ్ళనుంచి రక్షణకై కాళ్ళకి ఏదో ఒకటి అవసరం అన్న విషయం మేమూ ఒప్పుకున్నాం అందువల్ల చెప్పులు తయారు చేసే వృత్తిని నేర్చుకోవాలని నిశ్చయించాం దక్షిణాఫ్రికాలో పాయిన్ టౌన్ వద్ద మేరియన్ హిల్‌లో ట్రేపిస్ట్ అన్న రోమన్ కాథలిక్ ఫాదరీల మఠం వున్నది అక్కడ యిలాంటి వృత్తులు నేర్పుతారు వాళ్ళు జర్మనులు. శ్రీ కేలన్ బెక్ అక్కడికి వెళ్ళి చెప్పులు తయారు చేసే కళ నేర్చుకుని వచ్చారు. వారి నుంచి నేను నా నుంచి తక్కిన వారూ నేర్చుకున్నారు. ఇలా చాలా మంది నవయువకులు చెప్పులు మా కోసం తయారు చేయటమే కాక బైటి వారికి కూడా అమ్మసాగారు నా శిష్యులు చాలా మంది యీ కళలో నన్ను మించి పోయారని వేరే చెప్పనవసరం లేదు ఇలాగే తోలుపని కూడా మొదలెట్టాం ఒక గ్రామంలా మేమంతా

అక్కడ వుండేవాళ్ళం. ప్రతి చిన్న వస్తువునూ మా చేతులతో మేమే తయారు చేసుకునే వాళ్ళం. పరోపకారులైన మా స్నేహితులు యీ విషయంలో కొన్ని నెలల వరకూ మాకు సహాయంచేశారు. శ్రీ కీలన్ బెక్ యీ విభాగానికి ముఖ్యులు. వారి జాగ్రత్త నియమ పాలన వంటి సుగుణాల అనుభవం మాకు అడుగడుగునా కలిగేది.

యువకులకోసం బాలబాలికల కోసం ఒక విశాలమైన గది అవసరమైంది ఇది అన్నింటికన్నా కఠినమైన పని చివరి దాకా యీ పని మేము చేయలేకపోయాం వాళ్ళను చదివించే బరువు బాధ్యత శ్రీ కెలన్ బెక్ మరియు నా మీద పడింది మధ్యాహ్నం సమయంలో వారికోసం యీ పాఠశాల పని చేస్తూ వుండేది ఉదయం శారీరిక శ్రమవల్ల మేమిరువురం బాగా అలిసి పోయే వారం విద్యార్థులు కూడా బాగా డస్సిపోయేవారు విద్యార్థులూ మేమూ తూగుతూ వుండేవాళ్ళం కళ్ళపై నీళ్ళు చల్లుకుని వాళ్ళతో ఆటలాడేవాళ్ళం మా అలసటనెలా దూరం చేసుకోవాలని ప్రయత్నించేవాళ్ళం కానీ అప్పుడప్పుడూ మా ప్రయత్నం విఫలమయ్యేది శరీరానికి అవసరమయ్యే విశ్రాంతి అది తీసుకునే తీరేది తూగుతూవున్నా తరగతులు జరుగుతూనే వుండేవి కానీ పై చెప్పిన విఘ్నాలకంటే భిన్నమైనది మరొకటి వుంది తెలుగు తమిళం గుజరాతీ మూడు భాషలు మాట్లాడే విద్యార్థులకు ఎలా పాఠాలు బోధించడం? మాతృభాష ద్వారా విద్యాబోధన చేయాలన్న కోరిక నాకు ఎప్పుడూ వుండేది తమిళం కాస్తంత తెలిసినా తెలుగు నాకు అసలు రాదు ఇలాంటి స్థితిలో ఒక ఉపాధ్యాయుడు ఏమి చేయగలడు? ఆశ్రమంలో వున్న కొందరు యువకులను ఉపాధ్యాయులుగా ఉపయోగించుకునే వాళ్ళం కానీ యీ ప్రయోగం సఫలమైందని చెప్పలేము భాయీ ప్రాగ్‌జీని యీ పనిలో వుపయోగించుకున్నాం కొంతమంది యువకులు కాస్త ఉద్రేకులు సోమరులు తమ పుస్తకాలతో వాళ్లకు ఎప్పుడూ యుద్ధమే ఇదికాక మేమిరువురమూ చదువు చెప్పే పని నియమానుసారం చేయలేకపోయే వాళ్లం. అవసరం వచ్చినప్పుడల్లా నేనూ లేదా కేలన్‌బెక్ జోహాన్స్‌బర్గ్‌కి వెళ్ళవలసి వచ్చేది.

రెండవ యిబ్బంది మత సంబంధమైన విద్యకు సంబంధించినది. మహమ్మదీయులకు ఖురాన్ పారసీయులకు అవేస్తా చెప్పించాలనే కోరిక నాకు వుండేది. ఒక మహమ్మదీయ బాలకుడు వుండేవాడు. అతనికి ఖోజా తెగకుచెందిన ఒక చిన్న పుస్తకం చెప్పించేబాధ్యతను ఆ అబ్బాయి వాళ్ళ నాన్న నాపై పెట్టాడు. ఇస్లాం పారసీ మత గ్రంథాలను నేను సేకరించాను. హిందూ మతానికి సంబంధించిన మూల సిద్ధాంతాలను నాకు అవగతమైన రీతిలో వ్రాసుకున్నాను నా పిల్లలకోసం యీ రకంగా రాశానో లేక ఆశ్రమ వాసుల పిల్లలకోసం రాశానో నాకిప్పుడు గుర్తులేదు. నావద్ద ఆ ప్రతి యీనాడు వుండివుండే నా ప్రగతిని కొలిచే కొలబద్దగా దాన్ని ముద్రించి వుండేవాడిని. ఇలాంటి ఎన్నో వస్తువులను పారవేయటమో కాల్చి వేయటమో చేసేశాను. వస్తువులను సేకరించే అవసరం తక్కువ. నా కార్యక్షేత్రం విస్తృతమై పోతూ వచ్చిన తరువాత యిలాంటి యెన్నో వస్తువులను నేను నాశనం చేస్తూ వచ్చాను. దీన్ని గురించి నాకు పశ్చాత్తాపం లేదు ఇలాంటి వస్తువుల సేకరణ నాకు ఎక్కువ ఖర్చు పెట్టించేలా తయారైంది. వాటిని రక్షించేందుకు సాధనాలు అవసరమయ్యాయి. అందువల్ల నా దనమోహరహిత ఆత్మకు అసహనం పెరిగింది.

ఆశ్రమంలో విద్యాబోధన గురించిన యీ ప్రయోగం వ్యర్థం కాలేదు దీని ఫలితంగా పిల్లలలో అసహనమన్న భావానికి చోటులేకుండా పోయింది. పరస్పర మతాల పట్ల సిద్ధాంత సంప్రదాయాల పట్ల అంతా ఉదారతను అలవరచు కున్నారు. అందరూ సొంత అన్నదమ్ముల్లా వుండటం నేర్చుకున్నారు. పరస్పరం సాయపడటం నేర్చారు సభ్యత నేర్చారు. ఉద్యమ స్ఫూర్తి పొందారు. ఇప్పటికీ ఆ బాలల పని తీరును గురించి తెలిసిన నేను అనాడు టాల్‌స్టాయ్ ఆశ్రమంలో వారు నేర్చుకున్నదంతా వృధా అవలేదని చెప్పగలను. ఆ ప్రయోగం అర్థాంతరమే అయినా అది ఒక అర్థవంతమైన ధార్మిక ప్రయోగమనే చెప్పాలి. టాల్‌స్టాయ్ క్షేత్రమందలి తీయని జ్ఞాపకాలలో యీ విద్యా బోధనకు సంబంధించిన జ్ఞాపకం కూడా తీయనిదే. కానీ యీ జ్ఞాపకాలకోసం వేరే ఒక ప్రకరణం వ్రాయడం అవసరం

★ ★ ★

# 35
# టాల్‌స్టాయ్ క్షేత్రం - 3

టాల్‌స్టాయ్ క్షేత్రానికి సంబంధించిన అనేక జ్ఞాపకాలను యీ ప్రకరణంలో వ్రాయదలచాను. అవి ఒకదానికొకటి సంబంధం లేనివిగా తోచవచ్చు. అందుకై నన్ను పాఠకులు క్షమింతురుగాక .

విద్యాబోధనకై నాకు అప్పగించిన పిల్లల సమూహం మరో ఉపాధ్యాయుడికి లభించి యుండదు. దాదాపు 7 సంవత్సరాల బాల బాలికలుమొదలుకొని 20 సంవత్సరాల యువకులు 12, 13 సంవత్సరాల బాలికలు ఆ సమూహంలో వుండేవాళ్ళు. కొంతమంది బాలకులు ఆటవికులుగా వుండేవాళ్ళు. వాళ్ళు విపరీతమైన అల్లరి వాళ్ళు దుష్టులు కూడా. ఇలాంటి వారున్న బృందానికి ఏం చెప్పను? ఎలా చెప్పను? అందం స్వభావాలకూ అనుకూలంగా నేను మరలేను. వారితో ఏ భాషలో మాట్లాడేది? ఈ ప్రశ్నలన్నీ నాముందుండేవి. తమిళం తెలుగు పిల్లలు తమ మాతృభాష లేదా ఆంగ్ల భాషను అర్థం చేసుకోగలరు. కొంచెం డచ్ భాష సైతం వారికి వచ్చు. కానీ నేను వారితో ఆంగ్లంలో మాత్రమే మాట్లాడగలను. విద్యార్థులను రెండు విభాగాలు చేశాను గుజరాతీ వారితో గుజరాతీలో మాట్లాడటం. తక్కిన వారితో ఆంగ్లంలో మాట్లాడం యిదీ నా పని ముఖ్యంగా వాళ్ళకు కొన్ని పసందైన కథలు చెప్పటం. పుస్తకాలనుంచి చదివి వినిపించటం వంటి ఏర్పాట్లు నేను చేశాను. వాళ్ళందరినీ ఒక చోట కూర్చోబెట్టటం వాళ్లలో స్నేహభావం సేవాభావాన్ని వికసింప జేయుటకు ప్రధానోద్దేశ్యంగా పెట్టుకున్నాను చరిత్ర భూగోళం వంటి వాటిలో సామాన్య జ్ఞానంతోపాటు కొంత వ్రాయటం కూడా నేర్పేవాడిని. కొందరికి అంకగణితం నేర్పేవాడిని. ఇలా నా పని చేసుకుపోయేవాడిని. ప్రార్థన కోసం కొన్ని పాటలుకూడా నేర్పుతూ తమిళ బాలురను కూడా అవి నేర్చుకోమని ప్రోత్సాహ పరచేవాణ్ణి.

బాలబాలికలందరూ స్వేచ్ఛగా కలిసి మెలిసి తిరిగేవారు. అక్కడ నా యీ ప్రయోగం నిర్భయంగా సాగింది. అప్పట్లో నేను వారికి నేర్పిన స్వేచ్ఛ

యిప్పుడు అందించే ధైర్యం నాకు లేదు. ఇది నా అజ్ఞానం కావచ్చు. నాకీ ప్రయోగంలో చాలా చేదు అనుభవాలు కలిగాయి. కొంత నష్టపోవలసి వచ్చింది కూడా. నేనుఎవరినైతే నిర్దోషులని తలచానో వారే దోషులుగా నిరూపించబడ్డారు. కొన్ని వికారాలను కనుగొన్నాను. అందువల్ల యీ విషయంలో నేను పిరికివాణ్ణయ్యాను.

నా యీ ప్రయోగం పట్ల నాకే విధమైన పశ్చాత్తాపమూ కలుగలేదు. ఈ ప్రయోగం కారణంగా నష్టపోవలసి వచ్చిందనటానికి నా ఆత్మ అంగీకరించదు. కానీ వేడిపాల వల్ల నోరు కాలినప్పుడు మీగడను సైతం వూదుకుని తినాల్సి వస్తుందికదా! అదే నా విషయంలో జరిగింది.

మనిషి, శ్రద్ధ సాహసాలను యితరుల నుంచి దొంగిలించలేడు. టాల్‌స్టాయ్ ఆశ్రమంలో నా శ్రద్ధ సాహసాలు పరాకాష్ఠ నందుకున్నాయి. మళ్ళీ వాటిని నాకందివ్వమని నేను భగవంతుని ప్రార్థిస్తున్నాను. కానీ నా ప్రార్థనను అతను ఆలకించేదెలా? అతని ముందు నాలాంటి బికార్లు అసంఖ్యాకంగా నిలబడివున్నారు. అసంఖ్యాకమైన బికారులకు మల్లే అతనికి అసంఖ్యాకమైన చెవులున్నాయి. అందువల్లే భగవంతునిపట్ల నాకు శ్రద్ధ పూర్తిగా వుంది. నేను యోగ్యుణ్ణి అయినపుడు నా ప్రార్థనను భగవంతుడు తప్పక వింటాడన్న నమ్మకమూ వుంది.

నా ప్రయోగం యిలా సాగింది.

అల్లరి చిల్లరగా తిరిగే మగపిల్లలనూ ఈడొచ్చిన మంచి అమ్మాయిలనూ ఒకేసారి ఒకే చోట స్నానం చేసేందుకు నేను పంపేవాణ్ణి. మగపిల్లలకు మర్యాద ఆత్మ సంయమనం గురించి మంచి బోధలు చేస్తుండేవాడిని వారంతా నా సత్యాగ్రహం గురించి ఎరిగిన వారే. వారి పట్ల నాకు మాతృ వాత్సల్యం వుండేది. ఆ పిల్లలు కూడా యిలాగే అనుకునేవారు. వంటయింటికి దూరంగా వున్న చెరువు గురించి పాఠకులకు గుర్తుండే వుంటుంది. అక్కడ ఆడపిల్లలు. మగపిల్లలు కలిసే అవకాశం యివ్వటమూ పైగా వారు నిర్దోషులుగా వుండాలని ఆశపడటం, అయితే ఒక తల్లి చూపులు తన కుమార్తె చుట్టూతా తిరుగుతున్నట్లుగా నా కళ్ళు కూడా వాళ్ళను

అంటిపెట్టుకునేవుండేవి స్నానం చేసే వేళలు నిర్దిష్టంగా వుండేవి బాలబాలికలంతా ఒకేసారి స్నానానికి వెళ్ళటం జరిగేది. సామూహిక కార్యక్రమాలలో రక్షణ వుండటం వల్ల, అది యిక్కడా వుండేది. ఏకాంతం వారికి దొరికేదే కాదు. అప్పుడే సాధారణంగా నేనూ చెరువు దగ్గరకి చేరుకునే వాణ్ణి.

మేమంతా వరండాలో నిద్రపోయే వాళ్ళం. అమ్మాయిలు నా చుట్టుపక్కల పడుకునేవాళ్ళు. రెండు పడకలమధ్య మూడు అడుగుల దూరం దాదాపుగా వుండేది. పడకల క్రమంలో జాగ్రత్త వుండేది. కానీ కలుషితమైన మనసున్న వారి మధ్య జాగ్రత్త ఏలాంటిదైనా ఎంతవరకు పని చేస్తుంది? ఆ బాల బాలికల విషయంలో నా గౌరవాన్ని ఆ భగవంతుడే కాపాడాడనుకుంటాను బాలబాలికలంతా ఏ దోష భావమూ లేకుండా కలిసి మెలిసి వుండగలరన్న విశ్వాసంతో నేనా ప్రయోగం అప్పట్లో చేయగలిగాను. వాళ్ళ తల్లిదండ్రులు నాపై వుంచిన అపారమైన విశ్వాసమే నన్ను యిలా ప్రేరేపించినదని చెప్పవచ్చు.

ఒకరోజు ఒక అబ్బాయి యిద్దరు అమ్మాయిలను ఆటపట్టించాడన్న విషయం ఆ అమ్మాయియో లేక వేరే అబ్బాయో వచ్చి నాకు చెప్పారు. నేను వణికిపోయాను దీనిపై విచారిస్తే నిజమేనని తెలిసింది నేను ఆ అబ్బాయిని కోప్పడ్డాను కానీ ఆ మాత్రం చాలదు. నేను ఆ అమ్మాయిల శరీరాలపై ఏదేని చిహ్నాలుంచాలనుకున్నాను. వాటిని చూచి యువకులలో వారిని దృష్టితో చూడకూడదన్న భావన కలగాలన్నది నా ఉద్దేశ్యం. ఈ చిహ్నాల వల్ల తమపై ఎవరూ ఆక్రమణ చేయటానికి సాహసించరని ఆ అమ్మాయిలూ ధైర్యంగా వుండగలరని నా ఆలోచన. రాముడు సీతకు చాలా దూరంగా వున్నా రావణుడు సీతను సమీపించలేకపోయాడు. ఈ అమ్మాయిల్లో కూడా అలాంటి పవిత్రతా చిహ్నాలు వుంటే వారిని ఎవరూ కుదృష్టితో చూడరనీ, అలాంటి చిహ్నాలు నేను వారికివ్వగలిగితే బాగుంటుందని నా అభిలాష. ఈ ఆలోచనలతో నాకు రాత్రంతా నిద్ర పట్టలేదు. ప్రొద్దున్న ఆ అమ్మాయిలను బుజ్జగించే ప్రయత్నం చేశాను. వాళ్ళను ఆశ్చర్యపోనివ్వకుండా నెమ్మదిగా మీ

పొడవాటి జుట్టును నేను కత్తిరించేందుకు అనుమతించండని అడిగాను ఆశ్రమంలో మేము ఒకరికొకరం క్షవరం చేసుకోవటంలోనూ గడ్డం గీసుకోవటంలోనూ సాయం చేసుకునే వాళ్ళం అందువల్ల వెంట్రుకలు కత్తిరించే కత్తెరలు వంటి సామాను మా వద్ద వున్నది ముందైతే ఆ అమ్మాయిలిద్దరూ తమ తల వెంట్రుకలు కత్తిరిరంచేందుకు అనుమతించలేదు కొందరు వయసులో పెద్దవారైన స్త్రీలకు నా ఉద్దేశ్యం చెప్పి వారిని ఒప్పించాను ముందు వారు కూడా నా సూచనను అంగీకరించలేదు కానీ దీని వెనుకనున్న నా ఆలోచనను వారు అంగీకరించి తమ అంగీకారం తెలిపారు అమ్మాయిలు అందంగా ఆకర్షణీయంగా వున్నారు అయితే వారిలో ఒకరు యీనాడు లేరు. ఆ అమ్మాయి ముఖంలో మంచి తేజస్సు వుండేది. రెండవ అమ్మాయి గృహిణి జీవితం గడుపుతోంది చివరికి యిరువురూ తలవెంట్రుకలు కత్తిరించుకునేందుకు సన్నద్ధమయ్యారు యీ ప్రకరణం వ్రాస్తున్న చేతితోనే వాళ్ళ వెంట్రుకలను కత్తిరించేశాను దీని తరువాత తరగతి గదిలో నేను చేసిన యీ పనిని విశ్లేషించి చెప్పి వాళ్ళను శాంతింప జేశాను. దీన పర్యవసానం మంచిగా వున్నది. తరువాత అమ్మాయిలను అబ్బాయిలు ఏడిపించడమన్న ఫిర్యాదు నేను వినలేదు వాళ్ళిద్దరూ పోగొట్టుకున్నది ఏమీ లేదు కానీ పొందినది ఎంత వున్నదో భగవంతునికే తెలుసు ఆ యువకులు యిప్పటికీ యీ సంఘటనను గుర్తుంచుకుని తమ ప్రవర్తనను మార్చుకుని వుంటారని నా ఆశ

ఇలాంటి ప్రయోగాలను ఏ అధ్యాపకుడైనా అనుకరిస్తే ఆపదలను ఎదుర్కొన వలసి వస్తుంది ఒక సందర్భంలో మనిషి ఎంతవరకు వెళ్ళగలడో తెలుపుతూ సత్యాగ్రహంలోని పరిశుద్ధతను సూచించటానికి యీ ప్రయోగాన్ని గురించి వ్రాశాను ఈ పరిశుద్ధత వల్లే మా సత్యాగ్రహానికి విజయం సమకూరింది. ఇలాంటి ప్రయోగం చేసేందుకు అధ్యాపకుడే పిల్లల తల్లిదండ్రిగా వ్యవహరించవలసి వుంటుంది ప్రాణాలను పణంగా పెట్టి యిలాంటి ప్రయోగాలు జరుగుతాయి పైగా కఠోర తపస్సు యొక్క బలం యిందు అవసరం

నేను చేసిన యీ పని ప్రభావం ఆశ్రమ వాసుల సంపూర్ణ జీవనం మీద పడింది. అతి తక్కువ ఖర్చుతో జీవితాన్ని గడపటమన్న లక్ష్యంతో దుస్తుల విషయంలో కూడా మార్పులు తీసుకుని వచ్చాం దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్తులు యూరోప్ వాసుల వలె వుంటాయి. సత్యాగ్రహుల దుస్తులు కూడా అలాగే వుండేవి. కాని టాల్‌స్టాయ్ ఆశ్రమంలో యీ వస్త్రాల అవసరం వుండేది కాదు. మేమంతా కూలీపని చేస్తున్నాం, కనుక కూలీల దుస్తులే మేము వేసుకోసాగాం అయితే విధానం మాత్రం యూరోపియన్లదే అంటే కూలీల లాగా పైజామా కమీజు ఇందులో ఖైదీల దుస్తుల విధానాన్ని కూడా అనుకరించాం లావు బట్టతో కట్టిన పైజామా, కమీజులు బజార్లో దొరికే వాటినే మేమంతా ఉపయోగించే వాళ్ళం. స్త్రీలలో చాలా మంది చక్కటి కుట్టుపని చేసేవాళ్ళు. వాళ్ళంతా యీ భారం వహించారు.

భోజనంలో సాధారణంగా అన్నం పప్పు, కూర, రొట్టె అప్పుడప్పుడూ వీటితో పాటు పాయసం వుండేవి. అన్నమంతా ఒకే గిన్నెలో వండబడేది. జైళ్ళలోలా పళ్ళానికి బదులు మట్టిప్లేటు వుండేది చేతితో తయారుచేసిన చెక్క స్పూన్లు వుండేవి రోజుకు మూడుసార్లు భోజనం. ప్రొద్దున ఆరింటికి డబుల్ రొట్టె, గోధుమకాఫీ 11 గంటలకు పప్పు అన్నం, కూర, సాయంత్రం 4 గంటలకు గంజి, పాలు లేదా డబుల్ రోటీ, గోధుమ కాఫీ. రాత్రి 9 గంటలకు నియమం ప్రకారం అందరూ నిద్రించాలి. సాయంత్రం భోజనం తరువాత 7.30 మధ్య ప్రార్థన వుండేది. అందులో భజనలు పాడేవారు. అప్పుడప్పుడూ రామాయణం. ఇస్లామ్ గ్రంథాల నుంచి కొన్ని భాగాలూ కూడా చదవబడేవి. భజనల్లో ఆంగ్లం, హిందీ గుజరాతీ మూడు భాషల్లోని రచనలూ వుండేవి మూడు భాషల్లోని భజనలూ ఒక్కోసారి ఒకే భాషలోనూ పాడేవారు.

ఆశ్రమంలో వుండేవారిలో ఎక్కువమంది ఏకాదశీ వ్రతం చేసుకునేవారు. ఉపవాసాల గురించి ఎక్కువ పరిజ్ఞానమున్న పి.కె. కొత్వాల్‌గారు అక్కడికి విచ్చేశారు వారి పర్యవేక్షణలో మాలో కొందరు చాతుర్మాసం కూడా చేశాం. అదే రోజుల్లో మహమ్మదీయుల రోజాలు కూడా వుండేవి. మా మధ్య ముస్లిం యువకులు వుండేవారు. వారిని రోజా వుండేందుకు ప్రోత్సహించటం మా

ధర్మమని మేము గుర్తించాము వారికోసం ఉదయపు ఆహారం, రాత్రి భోజనానికి ఏర్పాటు కూడా చేసేవాళ్ళం. వారికోసం రాత్రిపూట ఖీర్ మొదలైన పదార్థాలు కూడా చేయించేవాళ్ళం. మాంసాహారం వుండేదికాదు అసలు ఎవ్వరూ మాంసాహారం కావాలని అడగలేదు. వారికి తోడు వుండాలని ఒక్కోస్మారి మేముకూడా సాయంత్రమే భోజనం చేసేవాళ్ళం సూర్యాస్తమయానికి ముందే భోజనం చేయటం సాధారణ నియమం. ఒకరు సూర్యాస్తమయానికి ముందే భోజనం చేసి తయారైపోతున్నవారు మరి కొందరు సూర్యాస్తమయం తరవాత భోజనానికి ఉపక్రమించేవారు. ముస్లిమ్ యువకులు సైతం తమ ఉపవాసదినాలలో ఎవరికీ యిబ్బంది కలిగించే వాళ్ళు కాదు. కానీ ముస్లిములు కాని యువకులు భోజన విషయంలో తమ ముస్లిం సోదరులలాగా సంయమనం పాటించటం వల్ల ఆశ్రమవాసులపై చక్కటి ప్రభావం పడింది మతకారణంగా బాలుర మధ్య వివాదాలు చెలరేగిన సంఘటనలేవీ నాకు తెలియరాలేదు. తమ తమ మత ఆచారాలను బుద్ధిగా పాటిస్తూనే పరస్పరం అంతా ఆదరపూర్వకంగా వ్యవహరించే వాళ్ళు పైగా ధార్మిక వ్రత సమయాల్లో ఒకరికొకరు సాయంచేసుకునేవారు కూడా.

నగర జీవనానికి దూరంగా వుంటున్నాం ఆరోగ్య సదుపాయాలు సాధనాలు సైతం ఆశ్రమంలో మేము వుంచుకునే వాళ్ళం కాదు పిల్లల నిర్దోషిత్వం గురించిన నమ్మకం లాగే అనారోగ్య సమయంలో ప్రకృతి వైద్యం గురించిన నమ్మకమూ అప్పట్లో నాకుండేది. సాదాసీదా జీవనం గడిపేవారికి అనారోగ్యాలు రావనీ ఒక వేళ వచ్చినా నేనే వైద్యం చేసుకోగలనని నా గట్టి నమ్మకం. స్వస్థత గురించిన నా చిన్ని పుస్తకం నా ప్రయోగాలకూ అప్పటి నా శ్రద్ధకూ అద్దం పడుతుంది. నేనెప్పుడూ జబ్బుతో పడక వేయననీ, కేవలం నీరు, మట్టి, ఉపవాసం యిలాంటి ప్రయోగాలతో ఆహార మార్పిడితో అన్ని అనారోగ్యాలకూ చికిత్స చేయవచ్చునని నా ప్రగాఢ విశ్వాసం. ఆశ్రమంలో ఏ వ్యక్తికి జబ్బు చేసినా వైద్యం చేయించటం గానీ మందులు వేయటం గానీ నేను చేయలేదు. ఆశ్రమంలో డెబ్బైఏళ్ళ ఉత్తర భారతానికి చెందిన వృద్ధుడొకాయన వుండేవారు. అతనికి ఉబ్బసమూ దగ్గు వుండేవి. ఇవి కూడా

కేవలం ఆహారంలో మార్పులు నీటి ప్రయోగంతో నయమయ్యాయి. కానీ రెండుసార్లు నేనూ అనారోగ్యం పాలయ్యాక యిలాంటి చికిత్సలను చేయటంలో ధైర్యాన్ని కోల్పోయాను.

మా టాల్‌స్టాయ్ ఆశ్రమం నడుస్తున్నప్పుడే స్వర్గీయ గోఖలే దక్షిణాఫ్రికా వచ్చారు. వారి యాత్రను వర్ణించటానికో ప్రత్యేక ప్రకరణం కావాలి. కానీ ఒక చేదైన ఒక మధురమైన అనుభవాన్ని నేనిక్కడే చెబుతాను. ఆశ్రమంలో మేమెలాంటి జీవితాన్ని గడుపుతున్నమో యీ పాటికి పాఠకులకు కొంత అవగతమయ్యే వుంటుంది. అక్కడ బల్ల లేక పరుపు లాంటి వస్తువులేవీ వుండేవి కావు. కానీ గోఖలే గారి కోసం ఒక మంచం తెప్పించాం. వారికి పూర్తిగా ఏకాంతం కలిగేందుకు తగిన గదులు ఆశ్రమంలో లేవు. కూర్చునేందుకు విద్యాశాలలో వున్న బెంచీలు తప్ప వేరే సరంజామా మా వద్ద లేదు. ఇలాంటి స్థితిలోనూ గోఖలే వంటి వారిని ఆశ్రమానికి తీసుకురావాలన్న ఆశను చంపుకోవటం ఎలా? టాల్‌స్టాయ్ ఆశ్రమాన్ని చూడకుండా ఆయన వుండగలరా? గోఖలే గారి శరీరం ఒక్కరాత్రి కోసం అసౌకర్యాలను తట్టుకొనగలదనీ, స్టేషన్ నుండి ఆశ్రమం వరకూ దాదాపు 1 1/2 మైలు దూరం నడిచి రాగలరనీ నేను అనుకున్నాను. నేను ముందే వారినడిగాను. సహజమైన సరళ స్వభావం కారణంగా ముందువెనుకలాలోచించక వారూ నాపై గల విశ్వాసంతో ఏర్పాట్లకు సరేనన్నారు. నా అదృష్టం కొద్దీ ఆరోజు వర్షం కూడా పడింది. వున్నట్లుండి ఏర్పాట్లలో మార్పు చేయటం నాకు సాధ్యమయ్యే పని కాదు. అలా నా అజ్ఞానంతో కూడుకున్న ప్రేమ వల్ల వారికి నేను కలిగించిన కష్టాన్ని జీవిత పర్యంతమూ మరచిపోలేను. ఇంతపెద్ద శ్రమను వారి శరీరం భరించలేకపోయింది. వారికి జలుబు చేసింది. భోజనం చేసేందుకు వంటింటి దాకా కూడా వారిని తీసుకుని వెళ్ళటం కష్టమై పోయింది. కెలన్‌బెక్‌గారి గదిలో వారిని వుంచాము. అక్కడి దాకా భోజనం తీసుకుని వెళ్ళే వరకూ చల్లబడి పోవటం సహజం. నేను వారి కోసం ప్రత్యేకంగా సూప్ తయారు చేసేవాడిని. భాయీ కొత్వాల్ ప్రత్యేకమైన పిండితో వారికి డబుల్ రొట్టె తయారు చేసేవాడు. కానీ ఈ రెండూ వేడివేడిగా

వారి వద్దకు ఎలా చేర్చటం? ఎలాగో ఏర్పాటు చేశాం. ఆఖరికి గోఖలేగారు ఒక్కమాట కూడా నన్ననలేదు. కానీ వారి ముఖం చూచి అర్థం చేసుకున్నాను మేమంతా కింద నేలమీదే తివాచీ పరుచుకుని పడుకుంటామని తెలియగానే వారు కూడా చాపతీసి వేయించి నేలమీదే పరుపు వేయించుకున్నారు ఆ రాత్రి నేను చాలా పశ్చాత్తాపపడ్డాను. గోఖలే గారికి ఒక అలవాటుండేది దానిని నేను దురలవాటు అని అంటాను. వారు తమ నౌకరుతో సేవ చేయించుకునేవారు. కానీ యీ యాత్రలో ఏ నౌకరూ రాలేదు. శ్రీ కెలన్ బెక్ నేనూ వారి పాదాలు ఒత్తుతామని చాలాసార్లు అభ్యర్థించాము. కానీ వారు మమ్మల్ని తమ పాదాలు తాకేందుకు సైతం అనుమతించలేదు. పైగా సగం కోపం, సగం నవ్వు కలిపి "దుఃఖము అసౌకర్యము అనుభవించటానికి మీరు మాత్రమే పుట్టారనీ, మీ ద్వారా సుఖము సౌకర్యము పొందేందుకు మేము పుట్టామని మీరు అనుకుంటూ వుండవచ్చు. దీనికి శిక్ష యీ రోజు పూర్తిగా అనుభవించాలి. మీరు నన్ను తాకటం కూడా నా కిష్టం లేదు. మీరేమో శౌచ క్రియలకు యింటి నుంచి చాలా దూరంగా వెళ్తారా? నాకు మాత్రం యిక్కడే కమోడ్ ఏర్పాటు చేస్తారా? ఎందుకని? నేను ఎంత కష్టమైనా సహిస్తాను. మీ యీ గర్వాన్ని అణచి తీరుతాను" అని అన్నారు. వారి యీ మాటలు వజ్రకఠోరంగా మాకు అనిపించాయి కెలన్ బెక్ నేనూ యిద్దరమూ చాలా ఖిన్నమనస్కులయ్యాము. ఈ మాటలంటున్నప్పుడు వారి ముఖంపై చిరునవ్వు వుండటమే మాకు ఓదార్పు. తెలిసీ తెలియక అర్జునుడు కృష్ణునికి ఎన్నో యిబ్బందులు కలిగించి వుంటాడు. కానీ కృష్ణుడు అవన్నీ గుర్తుంచుకుని వుంటాడా? మాసేవా భావాన్ని గోఖలే గారు బాగా గుర్తుంచుకున్నారు. కానీ మా చేత సేవ చేయించుకునే అవకాశమే వారు మాకు యివ్వలేదు. మోంబాసా నుంచి వారు నాకు ప్రేమ పూర్వకమైన వుత్తరం వ్రాశారు. అది నా హృదయంపై అంకితమై పోయింది. మా ఆశ్రమానికి వచ్చి వారు చాలా కష్టపడ్డారు. కానీ వారి సేవ చేసుకునే భాగ్యం మాకు చివరి దాకా కలుగ జేయలేదు. తినుబండారాలు మేం చేసినవి తినకపోతే ఏం చేయగలిగే వారో? రెండవ రోజు వారు స్వయంగా విశ్రాంతి

తీసుకోలేదు. మమ్మల్ని విశ్రాంతి తీసుకోనివ్వలేదు. వారి ఉపన్యాసాలన్నీ మేము పుస్తకంగా అచ్చువేయబోతున్నాము. ఆ పుస్తకమంతా పరిజూశారు ఎప్పుడైనా ఏదైనా వ్రాయాలనుకుంటే అటూ యిటూ తిరుగుతూ ఆలోచించుకునే అలవాటు వారికుండేది వారు ఒక చిన్న ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. ఆ ఉత్తరం వెంటనే వ్రాసేస్తారాయన అనుకున్నాను. కానీ అలా జరుగలేదు. నేనా ప్రస్తావన తీసుకు వచ్చినపుడుక వారి ప్రసంగం వినాల్సి వచ్చింది - నా జీవన పద్ధతి గురించి నీకేం తెలుసు? చిన్న పని కూడా అంత తొందరగా చేయను తెలుసా? దానిపైన బాగా ఆలోచిస్తాను. దాని కేంద్ర బిందువేమిటో నిర్ధారణ చేస్తాను ఆ విషయానికి సంబంధించిన భాష గురించి ఆలోచిస్తాను ఆ తరువాతే రాస్తాను. అందరూ యిలాగే చేస్తే ఎంత సమయం ఆదా అవుతుంది? మరి యీ రోజుల్లో ప్రజల్లోనూ ఎన్నో నీచ నికృష్ట భావాలు చోటు చేసుకున్నాయి వాటి ఆక్రమణ నుంచి తప్పించుకోవచ్చుగదా? - యిదీ వారి మాటల సారాంశం. గోఖలేను కలవటం గురించి వ్రాయకపోతే టాల్‌స్టాయ్ ఆశ్రమం గురించిన అనుభవాలు ఎలా అసంపూర్ణంగా వుండిపోతాయో అలాగే కెలన్ బెక్ యొక్క జీవన పద్ధతుల గురించి వ్రాయకపోతే యీ జ్ఞాపకాలు అర్థాంతరాలుగా మిగిలిపోతాయి. ఈ పరిపూర్ణుడైన శుద్ధ మనస్కుణ్ణి ముందే పాఠకులకు పరిచయం చేశాను. టాల్‌స్టాయ్ క్షేత్రంలో మాతో కెలన్ బెక్ ఎంత బాగా కలిసిపోయారో అది ఒక ఆశ్చర్యకరమైన విషయం సాధారణ విషయాలు గోఖలేని ఏమాత్రం ఆకర్షించేవికావు కానీ కెలన్‌బెక్ జీవితంలో వచ్చిన పరివర్తనను గమనించి వారు కూడా ఆకర్షితులయ్యారు. వారికి ఎండ చలి ఎప్పుడూ అలవాటే లేదు. జీవితంలో ఎప్పుడూ వారికి ఎలాంటి అసౌకర్యమూ కలుగ లేదు. నిజం చెప్పాలంటే స్వచ్ఛంద జీవనాన్ని వారు తమ జీవనాదర్శంగా తీసుకున్నారు. ప్రపంచపు వైభవ విలాసాలను అనుభవించటంలో ఏ ఒక్కటీ వారి జీవితంలో అసంపూర్తిగా లేదు. తన సొంత ఆనందంకోసం వారు డబ్బు సంపాదించటానికి ఏనాడూ వెనుకడుగు వేయలేదు.

ఇలాంటి వారు టాల్‌స్టాయ్ ఆశ్రమంలో నివసించటం తిండి, నిద్రా, యింకా ఆశ్రమ వాసులతో పూర్తిగా కలిసిపోవటం - యిది సాధారణ విషయం కాదు. కొంతమంది తెల్లవారు అతనిని మూర్ఖుడనీ పిచ్చివాడనీ పిలిచేవారు. మరికొంతమందికి వారి త్యాగ నిరతిని చూచి గౌరవం పెరిగింది. తన త్యాగాన్ని దుఃఖం రూపంలో భావించుకొని వారు క్రుంగిపోయిన సందర్భాలేవీ లేవు. తన వైభవం వల్ల పొందిన ఆనందం కంటే త్యాగం వల్లే ఎక్కువ ఆనందాన్ని పొందారు శ్రీ బెక్. నిరాడంబరత్వంలోని సుఖాన్ని వర్ణిస్తూ వారందులో లీనమై పోయే విధానాన్ని గమనిస్తే వినేవారికి సైతం ఆ ఆనందాన్ని అనుభవించాలనిపించేది. చిన్నా పెద్దా అందరితో ఎంతో బాగా కలిసి పోయారు. వారు లేని ఒక్క క్షణం కూడా మాకు బాధాకరంగా వుండేది. కెలన్ బెక్‌కు పండ్ల చెట్లంటే చాలా ప్రీతి అందుకే వాటి భారాన్ని సైతం తనపైనే వేసుకున్నారు. రోజూ ఉదయం బాలబాలికలతో పెద్దలతో తోటపని చేయించేవారు. వారుకూడా చాలా శ్రమించేవారు. ఎప్పుడూ నవ్వుతూ వుండటం వారి లక్షణం. అందుకే వారితోబాటు పనిచేయటం ఆశ్రమవాసులకు యిష్టంగా వుండేది రాత్రి 2 గంటలకు లేచి జోహాన్స్‌బర్గ్ వెళ్ళటానికి తయారయ్యే బృందంలో బెక్ తప్పక వుండేవారు.

వారితో మత సంబంధమైన చర్చలు నేనెప్పుడూ చేసేవాణ్ణి. అహింస సత్యము మొదలైన నియమాలు. వ్రతాలు తప్ప మాట్లాడేందుకు నా వద్ద విషయాలేమీ లేవు పాములు మొదలైన వాటిని చంపటం పాపమని నేనన్నప్పుడు తక్కిన నా ఆంగ్లేయ మిత్రులలాగా బెక్ సైతం కంగు తిన్నారు. కానీ చివరికి తాత్విక దృష్టితో ఆలోచించి నాతో ఏకీభవించారు. మనబుద్ధి అంగీకరించిన విషయాన్ని ఆచరణలోకి తీసుకు రావటం మంచిదే. ధర్మంకూడా యీ విషయం మా పరిచయ ప్రారంభ దినాలలోనే వారంగీకరించారు. అందువల్లే ఎలాంటి సంకోచమూ లేకుండా ఒక్క క్షణంలో ఒక మహత్తరమైన పరివర్తనకు వారు శ్రీకారం చుట్టారు. పాములవంటి వాటిని చంపటం పాపమైతే వాటితో స్నేహం చేయటం. పెంచుకోవటం అవసరమని వారు అభిప్రాయపడి వివిధ జాతుల సర్పాలను గుర్తించటానికి అవసరమయ్యే

సూచనలున్న పుస్తకాలు సేకరించారు. అన్ని పాములూ విషపూరితాలు కావనీ, వ్యవసాయంలో సాయపడే పాములు కూడా వుంటాయనీ వారు చదివి తెలుసుకున్నారు పాములను గుర్తించే విధానాన్ని మేమే వారికి నేర్పాము. చివరికి మా క్షేత్రంలోనే దొరికిన కొండ చిలువను వారు పెంచుకున్నారు. కెలన్ బెక్ దానికి తన చేతితో ఆహారం తినిపించేవారు. ఇదంతా చూసి నేను వారితో ఓసారి - స్నేహభావంతో మీరు కొండ చిలువను పెంచుతున్నారు కానీ దానికి ఆ విషయం అర్థం కాదుగదా! మీ యీ ప్రేమతో పాటు భయం మిళితమై వుంది. ఈ కొండ చిలువను స్వేచ్ఛగా వదిలేసి కూడా దాని పట్ల ప్రేమ చూపించటం మీకూ నాకూ కూడా సాధ్యం కాని విషయం. మనం మనలో పెంపొందించుకోవాలనుకునే భావన కూడా యీ రకపు ధైర్యమే.

అందువల్ల యీ కొండచిలువను మీరు పెంచుకోవటంలో సుహృద్భావాన్ని చూడగలను కానీ అహింసను కాదు. ఈ పాముకూడా మనం వ్యవహరించేతీరును గమనించగలగాలి. భూమిపై పుట్టిన ప్రతిప్రాణీ భయాన్నీ, ప్రేమను కూడా అర్థం చేసుకోగలవు. ఇది మన పాత అనుభవమే. ఇంతేకాక యీ కొండ చిలువను విషపూరితమని మీరు ఒప్పుకోరు దీని జీవన విధానం అలవాట్లను గురించి అధ్యయనం చేసేందుకు దీనిని మీరు ఖైదు చేసి వుంచారు ఇది ఓ రకమైన స్వార్థం స్నేహంతో దీనికి స్థానం వుండదు. అని అన్నాను.

నా వాదనను బెక్ అర్థం చేసుకున్నా వెంటనే దాన్ని వదిలి పెట్టేందుకు వారి మనసు అంగీకరించలేదు. ఏరకమైన ఒత్తిడినీ వారిపై నేనుతీసుకు రాలేదు. కొండచిలువ విషయంలో నేనూ పిల్లలూ సైతం ఆనందానుభూతి పొందే వాళ్లం. దాన్ని ఏడిపించటం లేదా కలవరపెట్టడం వారికో ఆట. కానీ అది ఆ పంజరాన్నుంచి బైటపడే మార్గంకోసం ప్రయత్నించసాగింది. పంజరం తలుపు ఎవరి పొరపాటువల్లనైనా తెరుచుకుందో లేక కొండ చిలువే స్వయంగా ఏదో రీతిగా దాని తలుపు తెరిచిందో తెలియదు. కానీ రెండు మూడు రోజుల్లో బెక్ తన ఖైదీ మిత్రుని కలిసేందుకు వెళ్ళి వచ్చిన తరువాత చూస్తే పంజరం ఖాళీగా వుంది ఆయనా యిది చూచి ఆనందించారు.

నేనూ సంతోషించాను కానీ యీ ప్రయోగం వల్ల ఎప్పుడూ పాములను గురించి మాట్లాడుకోవటం మా సంభాషణల్లో భాగమైపోయింది. ఆల్‌బ్రేష్ట్ అనే ఒక బీద జర్మనీ వాణ్ణి బెక్ ఆశ్రమానికి తీసుకు వచ్చారు. అతడు బీదవాడు వికలాంగుడు కూడా. చేతి కర్ర లేకుండా నడవలేనంతగా అతని వెన్ను భాగం పూర్తిగా వంగిపోయింది. కానీ అతని ధైర్యానికి అంతులేదు విద్యావంతుడైనందువల్ల జీవితానికి సంబంధించిన సూక్ష్మ ప్రశ్నలల్లో శ్రద్ధ చూపేవాడు. ఆశ్రమంలో అతను కూడా భారతీయుల లాగే కలిసి మెలిసి వుండేవాడు పాములతో నిర్భయంగా వ్యవహరించటం ఆయనకిష్టం. చిన్న చిన్న పాములను చేతితో పట్టుకుని తీసుకు వచ్చేవాడు అరచేతిలో వుంచుకుని ఆడించేవాడు. ఆశ్రమం చాలా రోజులు నడిచివుంటే యీ జర్మనీ వాసి యొక్క ప్రయోగాల పరిణామాలు తెలిసియుండేవి

ఈ ప్రయోగాల వల్ల పాములంటే మాకున్న భయం తగ్గింది కానీ పాముల పట్ల భయం బొత్తిగా పోయిందని కానీ, వాటిని చంపటాన్ని నిరోధించేవాళ్ళమనీ దీని అర్థంకాదు. "ఫలానా పని హింసలేదా పాపము అని అనుకోవటం వేరు. దానికి అనుగుణంగా ఆచరించటం వేరు పాములంటే భయం వున్నప్పుడు మనం ప్రాణత్యాగం చేయటానికి తయారుగా లేనప్పుడు ప్రాణభీతి సమయంలో పామును చంపకుండా ఎవ్వరూ వుండరు ఆశ్రమంలో యిలాంటి సంఘటనొకటి జరగటం నాకు గుర్తుంది అక్కడ పాముల తాకిడి ఎక్కువగా వుండేదని పాఠకులీపాటికి అర్థం చేసుకునే వుంటారనుకుంటాను మేమా ప్రాంతానికి వెళ్ళినప్పుడు అక్కడెవ్వరూ వుండేవారు కాదు. చాలాకాలంగా అది నిర్జన ప్రదేశంగా వుండేది. కెలన్ బెక్ గదిలోనే ఓ రోజు ఒక పాము కనిపించింది. పైగా అది తరమటానికో లేదా పట్టుకోవటానికో వీలులేని స్థలంలో వుంది. ఆశ్రమంలోని విద్యార్థి ఒకడు దాన్ని చూచి నాకు చూపించాడు. దాన్ని చంపేందుకు అనుమతి నిమ్మని అడిగాడు. నా అనుమతి లేకుండానే అతనా పని చేయగలడు కానీ సాధారణంగా నన్ను అడగనిదే అక్కడి విద్యార్థులైనా పెద్దలైనా ఒక అడుగు ముందుకు వేసేవారు కాదు. పామును చంపేందుకు అనుమతించటం

ధర్మం అనిపించింది అందువల్ల అనుమతించాను నేను దాన్ని చంపటానికి అనుమతించి ఏదో పెద్ద పని చేశానని యీ సంఘటన గురించి వ్రాస్తున్నపుడు కూడా నేను అనుకోవటం లేదు పామును చేతితో పట్టుకొనేశక్తిగాని లేదా ఆశ్రమ వాసులను పాములపట్ల నిర్భయంగా వ్యవహరించేలా చేసే శక్తిగాని నాలో లేదు ఇప్పటికీ ఆ శక్తిని పెంపొందించుకోలేక పోయాను

టాల్‌స్టాయ్ ఆశ్రమంలో సత్యాగ్రహుల రాకపోకల వెల్లువ వుండేదని పాఠకులిప్పటికి చాలా సునాయాసంగా అర్థం చేసుకుని వుంటారు జైలుకు వెళ్ళేవారు గానీ జైలు నుంచీ వచ్చేవారు గానీ ఆశ్రమంలో వుంటూనే వుండేవారు ఒకసారి యిద్దరు సత్యాగ్రహులు స్వంత పూచీకత్తుపై ఆశ్రమానికి వచ్చారు రెండవ రోజు తీర్పు వినేందుకు కోర్టుకు వెళ్ళవలసి వున్నది వాళ్ళు మాట్లాడటంలో బహు నేర్పరులు ఇంతలో వారు పట్టుకోవలసిన ఆఖరిరైలుకి సమయం మించిపోయింది. ఇప్పుడిక వారారైలుకి వెళ్ళగలరా లేదా అన్నది ప్రశ్న. వారు యిద్దరూ యువకులు కసరత్తులో కుశలురు వాళ్ళు వాళ్ళకి వీడ్కోలు పలికేందుకు మాలో కొందరు స్టేషన్‌కి పరుగెత్త నారంభించారు రైలు వచ్చే ముందు రైలు బయలు దేరేముందు శబ్దాలను నేను విన్నాను. అప్పటికి స్టేషన్ ముఖద్వారం దగ్గర వున్నాము వారిరువురూ వేగంగా ముందుకు వెళ్ళి పోయారు నేను వెనుక బడ్డాను. రైలు బయలు దేరింది

కానీ యీ యువకులను గమనించిన స్టేషను మాస్టరు రైలును ఆపించి యీ యిద్దరినీ అందులో కూర్చోబెట్టించారు నేను స్టేషన్ చేరుకుని అతనికి ధన్యవాదాలు సమర్పించాను. ఈ సంఘటన వ్రాసేటప్పుడు నేను రెండు విషయాలపై దృష్టిని కేంద్రీకరించదలచాను ఒకటి సత్యాగ్రహులు జైలుకెళ్ళి, తిరిగి వచ్చినా తమ మాటనిలబెట్టుకునేందుకై తిరిగి వెళ్ళడంలో వారి ఉత్కంఠ. రెండుస్థానిక అధికారులతో సత్యాగ్రహులు పెంచుకున్న అనుబంధం ఆ యిరువురూ ఆ రోజు రైలు అందుకొనక పోయి వుంటే కోర్టుకు హాజరు కాలేక పోయేవారు. వారికెవరూ పూచీకత్తు యివ్వలేదు. కోర్టు వారు. వారి వద్ద జమానతు రూపంలో డబ్బు వసూలు చేయలేదు. కేవలం వారి నిజాయితీ పట్ల నమ్మకంతోనే వారిని వదలటం జరిగింది జైలు కెళ్ళేందుకు

సత్యాగ్రహులు సదా ఉత్సాహాన్ని చూపేవారు. అందుకని కోర్టు అధికారులు సైతం వారి వద్ద జమానతు సేకరించటం అవసరమనుకునేవారు కాదు అందువల్లనే రైలు తప్పిపోతుందనే భయంతో యీ నవయువకులిద్దరూ బాధపడ్డారు అందుకే వాయువేగంతో పరిగెత్తి రైలు స్టేషను చేరుకున్నారు సత్యాగ్రహ ప్రారంభ దినాల్లో జైలు అధికారులు వీరివి బాగా యిబ్బంది పెట్టిన సందర్భాలున్నాయి. కొన్ని చోట్ల జైలు అధికారులు వీరితో చాలా కఠినంగా వ్యవహరించేవారు కూడా కానీ మా సమరం నడిచే కొద్దీ జైలు అధికారుల్లో మా పట్ల కాఠిన్యం తగ్గటం కొందరిలో స్నేహమాధుర్యం పెరగటం కూడా మేము గమనించాం అధికారులు సత్యాగ్రహులతో చాలాకాలంగా కలిసివున్నచోట స్టేషన్ మాస్టర్ లాగా స్నేహంగా మెలగటం వారికి సాయం చేయటం కూడా వుండేది. కానీ అధికారులకి లంచం యిచ్చి సత్యాగ్రహులు సౌకర్యాలు పొందేవారని పాఠకులు అనుకోవచ్చు. యిలాంటి అనుచిత సౌకర్యాలు కొనుక్కోవటం గురించి సత్యాగ్రహులెప్పుడూ ఆలోచించి యుండలేదు. మంచితనం వల్ల యివ్వబడే సౌకర్యాలను అనుభవించాలన్న తపన యెవరికి వుండదు? ఇలాంటి సౌకర్యాలను సత్యాగ్రహులు చాలా చోట్ల పొందేవాళ్ళు స్టేషన్ మాస్టర్ వీరికి ప్రతికూలంగా వుంటే నియమానుసారం వీరిని యిబ్బంది పెట్టగలడు ఈ యిబ్బందుల పట్ల ఫిర్యాదులూ వుండవు ఒకవేళ స్టేషన్ మాస్టరు వీరికి అనుకూలంగా వుంటే నిమయానుసారం తాను నడుచుకుంటూనే వీరికి సౌకర్యాలు కల్పించగలడు. ఇలాంటి అన్ని సౌకర్యాలనూ ఆశ్రమానికి దగ్గరున్న లాల్‌స్టేషనులో వున్న స్టేషన్ మాస్టర్ వల్ల మేము పొందగలిగాము దీనికంతటికీ కారణం సత్యాగ్రహుల శిష్టవ్యవహారం వారి ధైర్యం, దుఃఖాన్ని సహించే శక్తియే.

ఒక అప్రస్తుత ప్రసంగాన్ని కూడా వర్ణించటం అనుచితం కాదని నాభావన. 35 సంవత్సరాల వయసునుంచీ నాకు ధార్మిక, ఆర్థిక ఆరోగ్య దృష్టితో ఆహార విషయంలో మార్పులు తీసుకురావాలనీ వాటిని ప్రయోగించి చూడాలనే కోరిక వుండేది. ఈ నాటికీ ఆ కోరిక ఏమాత్రమూ తగ్గలేదు. ఈ ప్రయోగాల ప్రభావం నా చుట్టుపట్ల వారిపై పడటం సహజం.

వీటితోపాటు మందులకు బదులు ప్రకృతి వైద్యం అంటే నీరు మట్టివంటి వాటి ఉపచారంలో జబ్బులు తగ్గించటానికి నేను ప్రయత్నించేవాడిని. దక్షిణాఫ్రికాలో నేను వకాలతు చేసేటప్పుడు అక్కడి వకీళ్ళ కుటుంబాలతో నాకు స్నేహ సంబంధాలు వుండేవి. అందువల్ల వారి సుఖదుఃఖాలలో నన్ను భాగస్థుణ్ణి చేసేవారు. ఆరోగ్య విషయంలో నా ప్రయోగాలను గురించి తెలిసిన వారు అందులోనూ నా సాయం పొందేవారు. వారితో లుటావన్ అన్న వకీలు ఒకరు ఉత్తర భారత దేశం నుంచి గిర్‌మిటియా కూలీగా ఆయన దక్షిణాఫ్రికా వచ్చాడు. ఆయనకు 70 ఏళ్లు. చాలా సంవత్సరాలుగా ఉబ్బసం, దగ్గూ వుండేవి. ఆయనకు వైద్యుల మందులు డాక్టర్ల టాబ్లెట్ల అనుభవం చాలా వుంది. వారికి అప్పట్లో నా ప్రకృతి వైద్యంపై విశ్వాసం చాలా వుండేది. నా షరతులను పాటిస్తూ ఆశ్రమంలో వుంటే నేను నా ప్రయోగాలను వారిపై చేస్తానని అంగీకరించాను. ఆయన నా షరతులు ఒప్పుకున్నారు. వారికి పొగాకు అలవాటు బాగా వుండేది నా అనేక షరతుల్లో పొగాకు వదిలి వేయాలన్న షరతు కూడా ఒకటి. రోజూ మధ్యాహ్నం 12 గంటలకు క్యూనే గారి కటిస్థానం చేయించటం మొదలెట్టాను. అది ఎండలో కూర్చునే వీలున్న ఋతువు భోజనంలో కొద్దిగా అన్నం నూనె, తేనె కొద్దిగా పాయసం తీయని నారింజ లేదా ద్రాక్ష, గోధుమ కాఫీ యివ్వటం జరిగేది ఉప్పు, మసాలాలు వుండేవి కావు. నేను పడుకునే చోటనే లోపలివైపు లుటావనీ పడక వుండేది. పడక కోసం ప్రతి ఒక్కరికీ రెండు కంబళ్ళు యిచ్చేవాళ్ళం. ఒకటి పరచుకోవటానికీ రెండోది కప్పుకోవటానికీ చెక్కతో చేసినతలగడ వుండేది. ఒక వారం రోజులు గడిచాయి. లుటావన్ శరీరంలో వేడి పుట్టుకొచ్చింది. ఉబ్బసం తగ్గింది దగ్గూ తగ్గింది. కానీ ఉదయం బదులు రాత్రిపూట ఉబ్బసం దగ్గూ ఆయన్ని సతాయించటం మొదలెట్టాయి అతను దొంగతనంగా పొగాకు తీసుకుంటున్నట్టు నాకు అనుమానం కలిగింది. నేను అడిగితే ఆయన లేదని సమాధానం యిచ్చాడు. రెండు మూడు రోజులు గడిచాయి. తేడా కనిపించకపోయే సరికి నేను అతణ్ణి చాటుగా పరీక్షించాలనుకున్నాను. అందరూ క్రింద పడుకునేవాళ్ళు. అందువల్ల పాముల భయం వుండనేవుంది. అందుకే కెలన్ బెక్ నాకు టార్చిలైటు

యిచ్చారు. తన దగ్గర ఒకటి వుంచుకున్నారు. దాన్ని దగ్గరుంచుకుని రాత్రిపూట పడుకునేవాణ్ణి. ఒకరోజు మెలుకువగా వుండాలని నిశ్చయించుకున్నాను. వాకిలి బయట వరండాలో నా పడక లోపల వాకిలికి దగ్గరగానే లుటావనీ పడుకునేవారు. అర్థరాత్రి అతనికి దగ్గు వచ్చింది. అతను అగ్గి పెట్టె వెలిగించి బీడీ తాగటం మొదలెట్టాడు నేను నెమ్మదిగా పడక మీద నుంచి లేచి అతని దగ్గరికి వెళ్ళి టార్చిలైటు వెలిగించాను లుటావన్ గాబరాపడ్డాడు. పరిస్థితి అర్థమైంది. బీడీ ఆర్పి, నా కాళ్ళు పట్టుకున్నాడు నేను చాలా తప్పు చేశాను. ఇక పొగాకు జోలికి వెళ్ళను. మిమ్మల్ని నేను మోసగించాను నన్ను క్షమించండి" అంటున్నపుడు లుటావన్ గొంతు పూడుకుంది. నేను అతణ్ని సముదాయించాను "బీడీ తాగకపోతే నీకు మంచిది నా అంచనా ప్రకారం నీకు దగ్గు తగ్గితీరాలి కానీ తగ్గకపోతే నీవు దొంగతనంగా బీడీ తాగుతున్నావేమోననిపించింది. అన్నాను లుటావన్ బీడీ అలవాటు మానిపోయింది. దానితో పాటు అతని ఉబ్బసమూ దగ్గూ కూడా తగ్గాయి ఒక నెలలో ఆరోగ్యవంతుడై లుటావన్ మంచి తేజస్సుతో బలం సమకూర్చుకుని మా దగ్గర సెలవు తీసుకున్నారు.

రెండు సంవత్సరాల స్టేషన్ మాస్టర్ కొడుకుకు టైఫాయిడ్ వచ్చినప్పుడు నా ప్రకృతి వైద్యం గురించి తెలిసి వుండటం వల్ల నా దగ్గరికొచ్చారు మొదటి రోజు ఆహారమేమీ యివ్వలేదు రెండవ రోజు బాగా పండిన అరటిపండు ఒక చెంచా నూనె, తియ్యని నారింజ పండ్ల రసపు చుక్కలు యిచ్చాను. రెండవ పూట భోజనం పెట్టలేదు రాత్రి ఆ అబ్బాయి కడుపుపైన మట్టి లేపనాన్ని రాశాను జబ్బు నయమైంది ఆ బాలునికి డాక్టరు యిచ్చిన మందులు సరైనవి కాకపోవటమో లేదా వారి నిర్ధారణ సరియైనది కాక పోవడమో జరిగిందన్న మాట. టాల్‌స్టాయ్ ఆశ్రమంలో యిలా నేను చేసిన ఎన్నో ప్రయోగాలలో కొన్నైనా విఫలమయ్యాయన్న ఫిర్యాదు వచ్చినట్టు నాకు గుర్తులేదు అదే ఉపచారాలు యీ రోజు ఎవరికైనా చేయటానికి నేను ముందు వెనుకాడతాను. టైఫాయిడ్ జ్వరానికి అరటిపండు నూనె యివ్వాలంటే యిప్పుడు నేను వణికి పోతాను. 1918లో భారత దేశంలో వున్నప్పుడు అజీర్తివల్ల బంక విరోచనాలు పట్టుకున్నాయి. దీనికి నేను వైద్యం చేసుకోలేక

పోయాను. దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు పని చేసిన ఉపచారాలు భారతదేశంలో సఫలమవలేదు. దీనికి కారణం నాలో ఆత్మవిశ్వాసం తక్కువవటం లేదా యిక్కడి వాతావరణంలో ఆ చికిత్సా విధానం అంత పని చేయక పోవటం కారణం కావచ్చు. కానీ ఒకటి ఇలాంటి వైద్యం వల్ల, టాల్‌స్టాయ్ క్షేత్రంలో అలవడిన నిరాడంబరత వల్ల ఎక్కువ కాకపోయినా కనీసం రెండు మూడు లక్షల రూపాయలు మిగిలి వుంటాయి. అక్కడున్న వారిలో కుటుంబ జీవన భావం పెంపొందింది. సత్యాగ్రహులకు నిజమైన ఆశ్రయం దొరికింది. అవినీతి, గర్వం వీటికి అవకాశం లేకుండా పోయింది. మంచీ చెడూ విడి పోయాయి. ఇవి ప్రత్యక్షంగా నాకు తెలిసినవిషయం.

పైన ఆహారపు ప్రయోగాలను గురించి చెప్పిన విషయాలన్నీ ఆరోగ్య దృష్టితో చేసినవే నేను నాపైనే ఒక్క అద్భుత ప్రయోగం చేసుకున్నాను. ఆధ్యాత్మిక దృష్టితో జరిగిన ప్రయోగమిది

శాకాహారులుగా మనకు పాలు తీసుకునే అధికారం వుందా లేదా అన్న ప్రశ్న గురించి నేను చాలా ఆలోచించాను. దీన్ని గురించి బాగా చదివినాను కూడా కానీ ఆశ్రమంలో వుండేటప్పుడు నేనో పుస్తకమో పేపరో చూచాను. కలకత్తాలో ఆవులు బర్రెలతో చాలా క్రూరంగా వ్యవహరించి ఒక్కో పాల బొట్టు వాటి స్తనాల నుంచి పిండుతున్నారని చదివాను వెదురు గొట్టాల్లో తీవ్ర ఔషధాలను నింపి, వాటి స్థనాలకు తగిలించి అందులోని పాలన్నింటినీ పిండివేసే భయంకరపద్ధతిని గురించిన వర్ణన కూడా చదివాను. కేలన్ బెక్‌తో పాలు తీసుకోవలసిన అవశ్యకత గురించి చర్చిస్తూ యీ ప్రక్రియ గురించి కూడా ప్రస్తావించాను పాలు తాగటాన్ని ఆపివేస్తే దానివల్ల ఒనగూడే ఆధ్యాత్మిక ప్రయోగాల గురించి చెబుతూ పాలు తాగటం మానేస్తే మంచిదని అన్నాను కెలన్ బెక్ చాలా సాహసి తక్షణం యీ ప్రయోగానికి వారు సిద్ధపడ్డారు వారికి నా మాటలు బాగా నచ్చాయి. అందువల్ల కేవలం తాజాపళ్ళు ఎండుద్రాక్ష ఖర్జూరం లాంటి వాటిపైనే కొద్ది రోజులు గడపాలని నిర్ణయించాం. వండిన పదార్థాలను తీసుకోవటం ఆపి వేశాం. ఈ ప్రయోగం వల్ల కలిగిన ఫలితం గురించి చర్చించటానికి యిది సరైన చోటు కాదు. కానీ కేవలం ఫలాహారం పైననే అయిదు సంవత్సరాలు గడిపిన నాకు

ఏనాడూ బలహీనత గానీ మరే విధమైన అనారోగ్యం కాని కలుగలేదని ఖచ్చితంగా చెప్పగలను. ఆ రోజుల్లో పని చేసేందుకు సంపూర్ణ శక్తి నాకు సదా లభించింది. ఆ రోజుల్లో రోజుకు 55 మైళ్ళ దూరం నడవగలిగేవాణ్ణి. 40 మైళ్ళ వరకూ యాత్ర చేయటం నాకు మామూలు విషయం. ఈ ప్రయోగంవల్ల నాలో జరిగిన ఆధ్యాత్మిక పరిణామాలు అద్భుతమని ఖచ్చితంగా చెప్పగలను. రాజకీయ కార్యక్రమాలనుంచి తీరిక కాస్త దొరికితే యీ వయసులో సైతం శరీరంతో యిబ్బందులు ఎదురైనా సరే ఆధ్యాత్మిక పరిణామాల పరీక్ష నిమిత్తం రెండవ సారి ఆ ప్రయత్నం చేయగలను డాక్టర్లలోను, వైద్యులలోను ఆధ్యాత్మిక దృష్టి లోపించటం కూడా నా ప్రయోగంలో బాధాకరం అయింది.

ఇప్పుడిక యీ మధురమైన ప్రతిభావంతమైన జ్ఞాపకాలకు తెరవేయాలి ఇలాంటి కఠిన ప్రయోగాలు ఆధ్యాత్మిక పరిశుద్ధతను గురించిన విషయాల్లోనే జరుగగలవు. అంతిమ సత్యాగ్రహ సమరానికై టాల్‌స్టాయ్ క్షేత్రం. ఆధ్యాత్మిక శుద్ధిని తపశ్చర్యలను పెంపొందించే కేంద్రంగా నిరూపితమైంది. ఇలాంటి స్థానమే దొరికి వుండకపోతే ఎనిమిది సంవత్సరాలపాటు సత్యాగ్రహం నడిచివుండేదో కాదో, అధికధనం సమకూరివుండేదో కాదో? చివరికి వేలాది భారతీయులు జాతి పోరాటంలో పాల్గొన గలిగే వారో కాదో నని నా అనుమానం. టాల్‌స్టాయ్ ఆశ్రమం గురించి గొప్పలు చెప్పుకోవాలన్న విషయమేమీ పెట్టుకోలేదు. కానీ, అప్పట్లో అక్కడి ప్రజల సానుభూతి పుష్కలంగా పొందింది. తాము ఏ పనులు చేయటానికి సిద్ధంగా లేరో. ఏ పనులు తమకి దుఃఖం కలిగించేవిగా కఠినమైనవిగాను తోస్తాయో ఆ పనులను ఆశ్రమవాసులు చేయగలరని ప్రజలు తెలుసుకున్నారు. 1913లో మళ్ళీ పెద్దఎత్తున సమరం చెలరేగినప్పుడు దానికి ప్రజల యీ విశ్వాసం అంతులేని పెట్టుబడిగా తోడ్పడింది. ఇలాంటి పెట్టుబడి వల్ల లాభం ఎప్పుడు వస్తుందో ఎవరూ చెప్పలేరు. నాకైతే యీ విషయంలో ఏ సందేహమూ లేదు. పాఠకులకూ వుండకూడదు.

★ ★ ★

# 36

# గోఖలే యాత్ర -1

ఇలా టాల్‌స్టాయ్ ఆశ్రమంలో సత్యాగ్రహులు తమ జీవితాలను గడిపేవారు తమ అదృష్టంలో ఏముంటే దాన్ని అనుభవించటానికి సిద్ధమయ్యేవారు ఈ సమరం ఎప్పుడు కొలిక్కి వస్తుందో వారికి తెలియదు దాన్ని గురించిన ఆలోచనా వారికి లేదు వారి ప్రతిజ్ఞ ఒక్కటే ఈ హత్యా సదృశమైన చట్టం ముందు తల వంచకూడదు ఇలా చేసేటప్పుడు యే దుఃఖం సహించవలసి వచ్చినా దాన్ని సంతోషంగా సహించడమే సత్యాగ్రహ యోధునికి యుద్ధంలో విజయం తప్పదు. అందులోనే అతనికి సుఖం వుంది అతడు దాన్నే సుఖమని తలుస్తాడు. యుద్ధం అతనే చేస్తున్నప్పుడు గెలుపు - ఓటమి సుఖదుఃఖాలు అతని చేతిలో వున్నట్లే కదా! దుఃఖమూ పరాజయమన్న మాటలు అతని శబ్దకోశంలో లేవని చెప్పవచ్చు గీత మాటల్లో చెప్పాలంటే సుఖదుఃఖాలు గెలుపు ఓటమి అతనికి సమానం

సత్యాగ్రహులు జైలుకు వెళ్తూ వస్తూ వుండేవారు ఆశ్రమంలో జరిగే కార్యకలాపాలను చూస్తూ అక్కడ సత్యాగ్రహులుంటారనీ యుద్ధ సన్నాహాలు కూడా చేస్తున్నారనీ ఎవరికీ సందేహం వచ్చేదికాదు నాస్తికుడు లేదా సందేహాలపుట్ట ఎవరైనా వచ్చాడంటే ఆ వచ్చిన వాడు మిత్రుడైతే మాపై జాలి చూపించేవాడు విశ్లేషకుడైతే మమ్మల్ని నిందించేవాడు మీరు సోమరులై పోయారు. అందుకే యీ అడవిలో పడి రొట్టెలు తింటున్నారు. నగర జంజాటంనుండి దూరంగా పండ్లతోటల్లో నియమబద్ధ జీవనాన్ని గడుపుతూన్నరంటే జైల్లో వుండి అలసి పోయారన్నమాట అని అనివుండేవాడు. అనుచిత రీతిలో నైతిక నియమాలను ఉల్లంఘించిన సత్యాగ్రహులు జైళ్ళకు వెళ్ళి వుండలేరని వీరికి ఎలా నచ్చజెప్పటం? సత్యాగ్రహులకు శాంతిలోనూ సంయమంలోనే సమరానికి సన్నద్ధమయ్యే సుగుణమున్నదని వారికి చెప్పటం ఎలా? సత్యాగ్రహులైన వారు ఎవరి సహాయంకోసమో వేచి చూడరనీ వారికి దైవ సహాయమే గొప్ప ఆశ్రయమనీ ఎలా తెలియజేయడం? ఇలాంటి

పరిణామమే జరిగింది ఎవరైనా కల్పనలోనైనా ఊహింపలేని పరిస్థితులు ఈశ్వరుడే కల్పించాడో లేదా అవంతటవే వచ్చాయో తెలీకుండా ఎదురయ్యాయి. ఎవరూ అనుకోని విధంగా సహాయమూ లభించింది సత్యాగ్రహులకు వూహాతీతమైన పరీక్ష ఎదురైంది. బైటి ప్రపంచానికి అర్థమయ్యే విధంగా బాహ్యవిజయమూ వారికి లభించింది

గోఖలే తదితర భారతీయ నాయకులకు దక్షిణాఫ్రికా వచ్చి అక్కడ భారతీయుల స్థితిని గమనించమని నేను కోరేవాడిని కానీ ఎవరైనా వస్తారా రారా అన్నదే నా సందేహం ఎవరైనా భారతీయ నాయకుణ్ణి దక్షిణాఫ్రికా పంపే ప్రయత్నం శ్రీ రిచ్ చేస్తున్నారు కానీ సత్యాగ్రహ సమరం పూర్తిగా మందగించినపుడు అక్కడికి వచ్చే ధైర్యం ఎవరికుంటుంది? 1911 లో గోఖలే ఇంగ్లాండులో వున్నారు. దక్షిణాఫ్రికాలో హిందూ దేశీయుల యీ సమరాన్ని ఆయన అధ్యయనం చేశారు కూడా. భారతదేశపు పార్లమెంటులో (25 ఫిబ్రవరి 1910) గిర్‌మిట్ కార్మికులను నేటాల్ పంపడం ఆపేయాలనీ సూచించారు గోఖలె గారితో నా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూనే వున్నాయి. భారతదేశ మంత్రితో యీ విషయమై వారుచర్చలు కూడా జరిపి దక్షిణాఫ్రికా వెళ్ళి యీ సమస్యను సంపూర్ణంగా అధ్యయనం చేసి రాగలనని తెలియజేశారు కూడా వారు గోఖలే గారి ప్రస్తావనను ఒప్పుకున్నారు. ఆరువారాల దక్షిణాఫ్రికా పర్యటనను రూపొందించమని, గోఖలే నాకు వ్రాస్తూ తన తిరుగు ప్రయాణం తేదీ కూడా తెలియజేశారు మా ఆనందానికి అవధులే లేవు అప్పటిదాకా ఏ భారత నాయకుడూ దక్షిణాఫ్రికా యాత్ర చేయలేదు దక్షిణాఫ్రికామాట అటుంచి హిందూ దేశం బైట ఉన్న ఏ ప్రాంతంలోని భారతీయులను కలవటం కానీ, వారి స్థితి గతులను కనుక్కొనే ప్రయత్నంగాని అసలెవ్వరూ చేయలేదు అందువల్ల గోఖలే వంటి గొప్ప నేతను కలవటం గొప్ప మహత్తరమైన అవకాశంగా భావించాం ఒక చక్రవర్తికి కూడా జరగని గౌరవాన్ని గోఖలే గారికివ్వాలని మేము నిశ్చయించుకున్నాం. దక్షిణాఫ్రికాలోని అన్ని ముఖ్యమైన నగరాలకూ వారిని తీసుకెళ్ళాలని మేము నిర్ణయించాం. సత్యాగ్రహులు ఇతర భారతీయులూ ఆనందంగా గోఖలేగారికి

స్వాగతసన్నాహాలు చేయసాగారు ఈ కార్యక్రమాలకు తెల్లవారిని సైతం ఆహ్వానించాం దాదాపు ప్రతి చోటా తెల్లవారు కూడా కార్యక్రమాల్లో పాలు పంచుకున్నారు ముఖ్యమైన సభలు జరిగినచోట అక్కడి మేయర్ మా ప్రార్థనను మన్నించితే వారినే సభాధ్యక్షునిగా వుంచాలనీ, వీలైతే అక్కడి టౌన్‌హాల్‌ను సభకు వినియోగించుకోవాలనీ నిర్ణయించాం రైల్వే విభాగం వారి అనుమతి తీసుకుని కొన్ని ముఖ్యమైన రైలుస్టేషన్లను అలంకరించే బాధ్యతను నెత్తిమీద వేసుకున్నాం. చాలా స్టేషన్ల నుంచీ మాకా అనుమతి లభించింది కూడా సాధారణంగా యిలా అనుమతించటం జరుగదు. కానీ స్వాగత సన్నాహాలు యింత పెద్ద ఎత్తున జరగటం చూసిన అధికారులు దీనితో ప్రభావితులై మా యెడ సానుభూతిని ప్రకటించారు ఉదాహరణకు జోహాన్స్‌బర్గ్ స్టేషన్‌ను అలంకరించటానికి మాకు 15 రోజులు పట్టింది అక్కడ శ్రీ కెలన్ బెక్ ద్వారా రూపొందించబడిన అందమైన చిత్రాల ద్వారాన్ని తయారు చేశాం

దక్షిణాఫ్రికా ఎలాంటి దేశమో గోఖలే గారికి ఇంగ్లాండులోనే అనుభవమైంది గోఖలే గౌరవ ప్రతిష్టల గురించీ దేశంలో వారి ఉన్నత స్థానం గురించీ భారత మంత్రి దక్షిణాఫ్రికా వారికి ముందుగా తెలియజేసినా ఓడలో వారికి ప్రత్యేక క్యాబిన్ కేటాయించాలన్న విషయం ఎవరికి స్ఫురిస్తుంది?

గోఖలే గారి ఆరోగ్యం చాలా సున్నితమైనది అందువల్ల వారికి విశ్రాంతి గది అవసరం ఏకాంతం కావలసి వుంది కానీ కంపెనీ నుంచి ఇలాంటి క్యాబిన్ ఏదీ ఖాళీగా లేదని స్పష్టంగా జవాబు వచ్చింది. ఇండియా ఆఫీసులో గోఖలే గారి మిత్రుడు ఎవరైనా యీ ఏర్పాట్లు చూచారో ఏమో, ఇండియా ఆఫీసునుంచి కంపెనీ డైరెక్టర్‌కు ఉత్తరం వచ్చింది దాని ఫలితంగా క్యాబిన్ లేదు అన్నచోటే వారి కోసం చాలా మంచి క్యాబిన్ తయారైంది. ఈ చేదు అనుభవం పరిణామం మంచిగా మారింది. ఓడ కెప్టెన్ కూడా గోఖలే గారిని గౌరవ పురస్సరంగా అద్భుతమైన రీతిలో ఆహ్వానించేందుకు సిఫారసు చేశారు అందువల్ల గోఖలేగారి సముద్ర ప్రయాణం రోజులు ఆనంద దాయకంగాను ఉత్సాహ పూరితంగాను గడిచాయి గోఖలే ఎంత గంభీరులో అంత ఆనంద

హృదయులు. వినోద ప్రియులు కూడా వారు ఓడలో జరుపబడే క్రీడల్లో పాల్గొన్నారు. తక్కిన ప్రయాణీకులకు ప్రీతి పాత్రులయ్యారు వారిని తమ అతిధిగా రమ్మనీ, ప్రభుత్వం పక్షాన రైల్వే యొక్క స్టేట్‌శాల్యూట్ స్వీకరించమని యూనియన్ ప్రభుత్వం కోరింది. నాతో సంప్రదించి ప్రిటోరియాలో ప్రభుత్వ అతిథిసత్కారాన్ని స్వీకరించేందుకు నిశ్చయించుకున్నారు. 1912 అక్టోబర్ 22నాడు గోఖలే కేప్‌టౌన్ నౌకాశ్రయంలో దిగారు వారి ఆరోగ్యం నా ఆశ కంటే కూడా సున్నితంగా వున్నది. ప్రత్యేకమైన ఆహారమే తీసుకునేవారు వారిది అధిక శ్రమను సహించే ఆరోగ్యం కాదు. నేను రూపొందించిన కార్యక్రమం వారి సహనశక్తికి పరీక్షలా పరిణమించింది. వీలైనంత వరకు మార్పులు దానిలో చేశాను. ఆరోగ్యం సంగతి అటుంచి మార్పు చేయవీలుకాని పక్షంలో అలాగే అన్ని కార్యక్రమాలలోనూ పాల్గొనేందుకు అంగీకరించాను. ఇంతపెద్ద కార్యక్రమం రూపొందించటంలో నా మూర్ఖత్వాన్ని నేనే తిట్టుకున్నానని వారితో అన్నాను నేను రూపొందించిన కార్యక్రమాల్లో మార్పు చేసేందుకు వీలుకానివి కూడా కొన్ని వున్నాయి. గోఖలే గారికి సంపూర్తిగా ఏకాంతం అవసరమని నేను వూహించలేదు. అందువల్ల యిబ్బందుల్ని ఎదుర్కోవలసి వచ్చింది. "రోగపీడితులు గురుజనులు వంటి వారి సేవ శుశ్రూషల అభ్యాసం ఆసక్తి వుండటం వల్ల వారి కార్యక్రమాలలో అవసరమైన మార్పులు చేసి ఏకాంతాన్ని వారికి సమకూర్చగలిగాను. పూర్తి యాత్రలో ఒక కార్యదర్శిగా వారికి నేను సహకరించాను. అర్ధరాత్రి సమయంలో కూడా మా స్వయం సేవకులు సిద్ధంగా వుండేవారు. ఇలాంటి సేవకుల వల్ల గోఖలే గారికి అసౌకర్యం కలిగిందని ఎవరైనా అంటే నేను అంగీకరించను.

కేప్‌టౌన్‌లో మంచి సభ జరగాలని మా నిర్ణయం. శ్రాయినర్ కుటుంబం గురించి మొదటి ఖండంలో నేను వ్రాశాను. ఆ కుటంబంలోని పెద్ద మనిషి శ్రీ డబ్ల్యు.పి. శ్రాయినర్ గారిని సభాధ్యక్షునిగా వుండమంటే - అయన అంగీకరించారు. చాలా పెద్ద సభ జరిగింది. అనేక మంది భారతీయులు ఆంగ్లేయులు కూడా వచ్చారు. గోఖలే గారికి మధుర వచనాల్లో స్వాగతం పలికి దక్షిణాఫ్రికా యందలి భారతీయులపట్ల తన సానుభూతిని శ్రాయినర్

చక్కగా వ్యక్తీకరించారు. గోఖలేగారి ప్రసంగం. సంక్షిప్తంగా పరిపక్వతతోకూడుకున్న ఆలోచనలతో వున్నది. భారతీయులు చాలా ప్రసన్నులయ్యారు. తన ప్రసంగంతో గోఖలే తెల్లవారి మనస్సులను దోచుకున్నారు. దక్షిణాఫ్రికాలో అడుగిడిన రోజే వివిధ రకాల ప్రజల మనస్సులను దోచుకున్నారని దీని అర్థం.

కేప్‌టౌన్ నుంచి గోఖలే గారు జోహన్స్‌బర్గ్ వెళ్ళ వలసి వుంది. రెండు రోజుల రైలు ప్రయాణం. సత్యాగ్రహసమర కురుక్షేత్రం ట్రాన్స్‌వాల్. కేప్‌టౌన్ నుండి జోహన్స్‌బర్గ్ వెళ్లేటప్పుడు ట్రాన్స్‌వాల్ సరిహద్దులో వున్న పెద్ద స్టేషన్ క్లార్క్స్ డార్ప్‌లో భారతీయులు పెద్ద సంఖ్యలో వున్నారు. ఈ రెండింటి మార్గమధ్యంలో వున్న పొచే ఫస్ట్రూమ్ క్రూగర్స్‌డార్ప్ అన్ని చోట్ల కూడా గోఖలే గారు సభలల్లో పాల్గొనవలసి వుండటంతో ప్రత్యేక రైలు ఏర్పాటు చేయబడింది. అన్ని పట్టణాల్లోనూ అక్కడి మేయర్లు సభాధ్యక్షులు. ఏ స్టేషన్లోనూ రైలు ఒక గంటకంటే ఎక్కువ సేపు ఆగలేదు. మారైలు సరైన సమయానికే జోహన్స్‌బర్గ్ చేరుకుంది. ఒక్క నిముషం కూడా ఆలస్యం కాలేదు. స్టేషన్లో ప్రత్యేకమైన కంబళ్ళు వేయించటం జరిగింది. ఒక వేదిక కూడా తయారు చేయించాం. జోహన్స్‌బర్గ్ మేయర్ శ్రీ ఎలిన్ ఇంకా యితర ఆంగ్లేయులు కూడా సభలో వున్నారు. గోఖలే అక్కడవున్నపుడు వారు తన కారును వారి ఉపయోగార్థం యిచ్చేశారు. సన్మాన పత్రం గోఖలేగారికి స్టేషన్లోనే యివ్వటం జరిగింది. అక్కడి గనుల నుండి తీసిన బంగారంతో చేసిన హృదయాకారపు ఫలకంపై సన్మాన పత్రం వ్రాసి వుంది. దాన్ని దక్షిణాఫ్రికాకు చెందిన ప్రత్యేకమైన చెక్క రోడేషియన్ టేకులో అమర్చటం జరిగింది. చెక్కపై భారతదేశంలో వున్న తాజ్‌మహల్ తక్కిన అందమైన ప్రదేశాల దృశ్యాలు చెక్కబడి వున్నాయి. గోఖలే గారిని పరిచయం చేయటం, సన్మానపత్రం చదవటం. దానికి సమాధానం చెప్పటం తక్కిన జ్ఞాపికలను స్వీకరించటం - అంతా యిరవై నిముషాలలోపలే జరిగింది. సన్మాన పత్రం బహు చిన్నది. అయిదు నిముషాలలోనే దాన్ని చదవటం పూర్తయింది. గోఖలే గారి సమాధానమూ అయిదు నిముషాల్లో ముగిసింది. స్వయం సేవకుల ఏర్పాటు

ఎంతో పకడ్బందీగా వుంది. ఎక్కువ మంది లేకపోయినా హుందాగా కార్యక్రమం జరిగింది. బైట ఎక్కువమంది చేరివున్నా, లోపలికి వచ్చేందుకు బైటికి వెళ్లేందుకూ ఎవరికీ యిబ్బంది కలుగలేదు.

శ్రీ కెలన్ బెక్‌కు చెందిన ఒక అందమైన కుటీరం జోహాన్స్‌బర్గ్ నుండి అయిదు మైళ్ళ దూరంలో ఒక గుట్టమీద వుంది. అందులో గోఖలేగారి బస ఏర్పాటు చేయబడింది. అక్కడి నుంచి కనిపించే దృశ్యాలు. అక్కడ నెలకొని వున్న ప్రశాంత వాతావరణం. నిరాడంబరంగా వున్నా కళాత్మకత వెల్లివిరిసే ఆ కుటీరం, యివన్నీ గోఖలే గారికి చాలా నచ్చాయి. అందరినీ కలిసేందుకు నగరంలో ఏర్పాట్లు జరిగాయి. దీని కోసం ఒక ప్రత్యేక కార్యాలయం అద్దెకు తీసుకున్నాం. అందులో ఒకటి గోఖలేగారి విశ్రాంతి గది. రెండవది ఆహ్వానితులతో మాట్లాడేందుకు మూడవ గది వచ్చినవారు కూర్చునేందుకై కేటాయించబడ్డాయి జోహాన్స్‌బర్గ్‌లోని కొందరు సుప్రసిద్ధులైన గౌరవనీయులైన పెద్దలతో వ్యక్తిగతంగా కలిసేందుకు సైతం గోఖలే గారిని మేము తీసుకొని వెళ్ళాం. అక్కడి ప్రముఖ ఆంగ్లేయుల ప్రత్యేక సభ కూడా ఒకటి ఏర్పాటు చేయబడింది. దీనివల్ల అక్కడి వారి దృక్కోణం గురించి గోఖలే గారికి అవగాహన అయ్యే అవకాశం కలిగింది. ఇంతే కాక జోహాన్స్‌బర్గ్‌లో వారి గౌరవార్థం ఒక పెద్ద విందు కూడా ఏర్పాటు చేయటం జరిగింది. దానికి నాలుగు వందల మందిని ఆహ్వానించాము. ఆహ్వానితులలో 150 మంది ఆంగ్లేయులు భారతీయులు ఒక గిన్నీ ఖరీదు చేసే టికెట్టు తీసుకుని రావలసి వుంటుంది. విందు ఏర్పాట్లు జరిగాయి. శాకాహార భోజనం. మత్తు పదార్థాలు పూర్తిగా నిషిద్ధం. వంటలు స్వయం సేవకులే తయారు చేశారు. ఈ విషయాలన్నింటినీ మాటల్లో వ్రాయాలంటే చాలా కష్టం. దక్షిణాఫ్రికాలోని మన హిందూ ముస్లిం సోదరులకు అస్పృశ్యత అంటే ఏమిటో తెలియదు. వారు ఒకేచోట కూర్చొని భోజనం చేస్తారు. శాకాహారులైన భారతీయులు వారు. ఆఅలవాటును రక్షించుకుంటున్నారు. భారతీయులలో కొందరు క్రైస్తవులు కూడా వుండేవాళ్ళు. తక్కిన భారతీయులలో లాగే హిందువులతో నాకు గాఢ పరిచయం వుండేది. వాళ్ళలో చాలా వరకు గిరమిటియా కార్మికులు

తల్లిదండ్రుల సంతానమే. వారిలో చాలామంది హోటళ్ళలో వంటవారుగానో, వడ్డించేవారిగానో పనిచేస్తున్నారు. వారి సహాయ సహకారాలవల్లే యింతమందికి వంట తయారు చేయటం సాధ్యమైంది. భోజనంలో దాదాపు పదిహేను వంటకాలు వుండి వుంటాయి దక్షిణాఫ్రికా వారికి యిది చాలా కొత్త అనుభవం ఇంతమంది భారతీయులు ఏకపంక్తిలో కూర్చొని భోజనం చేయటం. అదీ పూర్తి శాకాహార వంటకాలు కావటం మత్తు పదార్థాల మాట అసలు లేకపోవటం వంటివి చాలా మంది తెల్లవారికి క్రొత్త పైగా చివరి రెండు అనుభవాలు అందరికీ కొత్తగానే వున్నాయి

ఈ సమావేశంలో గోఖలే చేసిన ఉపన్యాసం మొత్తం దక్షిణాఫ్రికా పర్యటనలోనే దీర్ఘమైనది అన్నటికంటే మహత్తరమైనది 45 నిముషాల పాటు వారు ప్రసంగించారు ఆ ప్రసంగం తయారు చేసుకునేందుకు గోఖలే మమ్మల్ని కఠిన పరీక్షలకు గురి చేశారు స్థానిక ప్రజల దృష్టికోణాన్ని అవహేళన చేయక మన ఆలోచనాసరళిని దానితో మేళవించి చూడటం, తన జీవితనియమమని గోఖలే గారు నాతో అన్నారు. అందువల్ల వారి ప్రసంగంలో ఎలాంటి విషయాలు వుండాలని నేను ఆకాంక్షిస్తున్నానో చెప్పమన్నారు ఈ సంగతులన్నీ వ్రాసి యిమ్మని అడుగుతూ వాటిలోని అంశాలు తన ప్రసంగంలో ఏ ఒక్కటి కూడా లేకపోయినా నేను బాధపడనని మాట తీసుకున్నారు. దీనికి తోడు నా చిట్టా. అతి పెద్దదిగానూ అతి చిన్నది గానూ వుండకూడదు అయినా ముఖ్యమైన ఏ అంశమూ వదిలివేయకూడదు. ఇన్ని షరతులను పాటిస్తూ గోఖలేగారికి నా నోట్సు తయారు చేయవలసి వచ్చింది. నా భాషను వారే మాత్రమూ ఉపయోగించలేదనే చెప్పాలి. ఆంగ్ల భాషలో గొప్ప పాండిత్యం వున్న గోఖలే గారు నా భాషను ఉపయోగిస్తారని అసలెలా అనుకుంటాను? కానీ నా ఆలోచనలను పరిగణనలోకి తీసుకొనవచ్చునని వారు అనుకోవటం కూడా నా ఉద్దేశ్యాలను ఉపయోగించనట్లేనని నేను సమాధానపడ్డాను. వారి ప్రసంగ ధోరణి మా ఆలోచనలను ఉపయోగించారని గానీ, ఉపయోగించలేదని కాని తెలుసుకునే అవకాశం లేనిది. ఒక ఆలోచనను లేదా అంశాన్ని ఉటంకించకుంటే

భాగుండేదనో, ఒక్క ప్రత్యేకమైన విశేషణాన్ని తమ ప్రసంగంలో వాడకుంటే బాగుండేదనో నేను భావించినట్లు నాకు గుర్తులేదు. వారి భావాలలో స్పష్టత, దృఢత్వం వినయం ఉట్టిపడటానికి కారణం వారి పరిశ్రమ. సత్యనిష్ఠ.

జోహన్స్‌బర్గ్‌లో కేవలం భారతీయుల కోసం సభ జరుపవలసిన అవసరం వుంది. అందులో మాతృభాషలో మాట్లాడమనో లేక రాష్ట్ర భాష హిందీలో ప్రసంగించమనో కోరేవారు ఎక్కువ. ఈ కారణంగానే దక్షిణాఫ్రికాలోని భారతీయులలో నా స్నేహసంబంధాలు చక్కగా సన్నిహితంగా వుండేవి అందువల్లే గోఖలే గారు సైతం అక్కడ హిందూస్తానీలో మాట్లాడితే బాగుంటుందని నేను భావించాను. ఈ విషయంలో గోఖలే గారి అభిప్రాయం నాకు తెలుసు. వచ్చీరాని హిందీలోనే పని జరుపుకోవటం వారికి వచ్చేదికాదు అందువల్ల మరాఠీలో లేదా ఆంగ్లంలో మాట్లాడటం వారికి యిష్టం దక్షిణాఫ్రికాలో మరాఠీలో మాట్లాడటం వారికి ఎబ్బెట్టు అనిపించింది. ఒక వేళ మరాఠీలో మాట్లాడినా గుజరాతీయులకు ఉత్తర భారతీయులకు దానిని హిందూస్తానీలోకి తర్జుమా చేయవలసి వుంటుంది అందువల్ల ఆంగ్లంలోనే ఎందుకు ప్రసంగించకూడదు? అదృష్టం కొద్దీ వారిని మరాఠీలోనే ప్రసంగింపచేయటానికి ఒప్పించగలిగే తర్కం నా వద్ద వున్నది. జోహన్స్‌బర్గ్‌లో కొంకణ్ ప్రాంతపు మహమ్మదీయులు చాలా మంది వున్నారు. కొంతమంది మహారాష్ట్ర హిందువులూ వున్నారు. గోఖలే గారి మరాఠీ ప్రసంగం వినాలన్న కోరిక వారికుండేది. మరాఠీలో ప్రసంగించటానికి వారిని ప్రార్థించమని వారు నన్ను యిదివరకే కోరారు. నేను గోఖలేగారితో - మీరు మరాఠీలో ప్రసంగిస్తే ప్రజలు ఆనందిస్తారు. మీ ప్రసంగాన్ని హిందూస్తానీలోకి నేను తర్జుమా చేస్తాను" అని అన్నారు. నా మాటవిని గోఖలే పకపకా నవ్వారు. నీ హిందూస్తానీ భాషతో నాకు బాగా పరిచయం వున్నది. ఆ భాష నేర్చిన నీకు నా ధన్యవాదాలు. పైగా నా మరాఠీ ప్రసంగాన్ని హిందూస్తానీలోకి అనువదించాలని ఆశపడుతున్నావు. యింత మరాఠీ నీవెప్పుడు నేర్చావో చెప్పు కాస్త?" అని అన్నారు. "నా హిందూస్తానీవి గురించి మీరేమన్నారో మరాఠీ పరిజ్ఞానాన్ని గురించి కూడా అంతే అనుకోండి. మరాఠీ భాషలో ఒక పదం కూడా నేను మాట్లాడలేను. కానీ నాకు తెలిసిన విషయాల గురించి మీరు

మరాఠీలో ప్రసంగిస్తే దాని భావార్థం నేను అర్థం చేసుకోగలను. దాన్ని అనర్థం చేయనని మాత్రం మీరే తెలుసుకుంటారు అని అన్నాను, మరాఠీ చక్కగా తెలిసిన వారికే యీ పనిని నేను అప్పగించగలను. కానీ మీకది నచ్చదు. కాబట్టి నన్నీ పనికి అనుమతించండి. మరాఠీలోనే ప్రసంగించండి. కొంకణీ, మరాఠీ సోదరులలాగా నాకూ మీ మరాఠీ ప్రసంగాన్ని వినాలన్న అభిలాష వున్నది"- నీవెప్పుడూ నీ మనసులోని మాటే చెబుతుంటావు. నీ అవరాతో నేనిక్కడ వున్నాను, కాబట్టి మరాఠీలో మాట్లాడటం కంటే మరో దారిలేదు అని నన్ను వారు సంతోషపెట్టారు తరువాత యిలాంటి సభల్లో శుద్ధ మరాఠీలో వారు ప్రసంగిస్తే దానికోసమే నియమించబడిన అనువాదకునిలా నేను పని చేశాను. ఏలైనంత వరకూ మాతృభాషలో ప్రసంగించటం. వ్యాకరణశుద్ధమైన ఆంగ్ల భాషలో కంటే వ్యాకరణ రహితమైన వచ్చీరాని హిందూస్తానీలో మాట్లాడటమే చాలా మంచిదన్న సంగతి గోఖలే గారికి అవగతమయ్యేలా చేశానో లేదో నాకు తెలియదు. కానీ దక్షిణాఫ్రికాలో మాత్రం నన్ను సంతోష పెట్టటానికై వారు మరాఠీలో ప్రసంగించారని తెలుసుకున్నాను. అలా మన ప్రారనందుల్ల పరిణామం మంచిగానే వుండటాన్ని వారూ గమనించారని నాకు అర్థమైంది. సిద్ధాంతాల ప్రసక్తి లేనిచోట సేవకులను సంతోష పెంచటం మంచిదని గోఖలేగారు తన దక్షిణాఫ్రికా పర్యటనలో అనేక సందర్భాలలో తన ప్రవర్తన ద్వారా నిరూపించి చూపించారు.

* * *

## 37

## గోఖలే యాత్ర - 2

జోహాన్స్‌బర్గ్ నుంచి మేము ప్రిటోరియాకు వెళ్ళవలసివుంది. అక్కడికేంద్ర ప్రభుత్వం తరపున ప్రభుత్వ అతిధిగా వుండేందుకు ఆహ్వానం వచ్చింది. దాని ప్రకారం ట్రాన్స్‌వాల్ కోటలో వారు బస చేయవలసి వుంది. అక్కడ కేంద్ర ప్రభుత్వ మంత్రి వర్గంతో సమావేశ మవ్వాల్సివుంది. దానిలో జనరల్ బోథా, జనరల్ స్మట్స్ కూడా వున్నారు. ముందుచెప్పినట్టుగా ప్రతిరోజు కార్యక్రమాల

గురించి ఆరోజు ఉదయం గోఖలే గారికి చెప్పటమో లేక ముందు రోజు రాత్రి వారి అనుమతి కోసం తెలియజేయటమో జరిగేది మంత్రివర్గంతో కలిసేపని చాలా బాధ్యతతో కూడుకున్నది గోఖలే గారితో అక్కడికి కలిసి వెళ్ళటం కానీ కనీసం వెళ్లే ప్రస్తావన కూడా చేయకూడదని మేము ముందే నిర్ణయించుకున్నాము. నేను కూడా వుండటం వల్ల మంత్రి మండలికి గోఖలేగారికీ మధ్య సంభాషణల్లో కొంతైనా మొహమాటం వుండవచ్చును అది స్థానిక హిందువుల మరియు నాయొక్క తప్పిదమేనని భావించేవారు తమ ఆలోచనలను మనస్సు విప్పి చెప్పలేక పోవచ్చును కానీ దీనివల్ల గోఖలేగారి బాధ్యత ద్విగుణీకృతమవుతుంది ఒక వేళ గోఖలేగారి వల్ల సత్య సంబంధమైన ఏదేని తప్పు దొర్లితే, లేదా మంత్రి మండలి వారు గోఖలే గారి సమక్షంలో ఏదేని కొత్తవిషయాలను వెల్లడిచేస్తే గోఖలేగారి వద్ద దానికి తగిన సమాధానం లేకపోవచ్చు లేదా భారతీయుల పక్షాన ఏదేని విషయమై స్వీకృతి ప్రకటించే అవసరం వస్తే అప్పుడు నేనో లేదా దక్షిణాఫ్రికాకు చెందిన ఎవరో ఒక బాధ్యతాయుతమైన భారతనేత లేకపోవటం మంచిదేనా అని సమస్య వచ్చింది ఈ సమస్యకు గోఖలే వెంటనే పరిష్కారం చెప్పారు మొదటి నుంచీ చివరిదాకా భారతీయుల స్థితి గతులను గురించిన సంక్షిప్త వివరణం వ్రాసి యివ్వమన్నారాయన వారు ఎంత వరకూ వెళ్ళేందుకు సిద్ధంగా వున్నారో కూడా దానిలో వేనే వ్రాయాలి. దానికి సంబంధంలేని విషయమేదైనా సమావేశంలో తలెత్తితే అది తనకు తెలియదని వారే ఒప్పుకుంటారు. ఈ నిర్ణయం వారే చేశారు కనుక వారు నిశ్చింతగా వున్నారు ఇప్పుడిక దీని సారాంశం తయారు చేస్తే వారు దానిని చదువుకోవటమే మిగిలివుంది. కానీ చదువుకునేందుకు నేను వారికి సమయమే యివ్వలేదు నేను ఎంత చిన్నగా వ్రాద్దామన్నా నాలుగు ప్రాంతాలలోని భారతీయుల పద్దెనిమిది సంవత్సరాల ఇతిహాసాన్ని పది, యిరవై పేజీల దాకానైనా వ్రాయకుండా ఎలా వుండగలను? అంతేకాక దీన్ని చదవగానే వారి మనస్సులో సందేహాలు రావటం సహజం. కానీ గోఖలేగారి జ్ఞాపకశక్తి ఎంత తీక్షణమైనదో పరిశ్రమించే శక్తి కూడా అంతే తీవ్రమైనది. రాత్రంతా వారూ

మేల్కొనే వున్నారు. నన్నూ పొలక్‌నూ కూడా నిద్రపోనీయ లేదు. ప్రతి విషయాన్నీ సంపూర్తిగా తెలుసుకుని దాన్ని బాగా అవగతం చేసుకున్నారనటానికి నిదర్శనంగా ప్రతి ప్రశ్నకీ తన అభిప్రాయాలను నిర్దిష్టంగా మాముందు ప్రకటించారు కూడా. చివరికి వారు తృప్తి చెందారు. నేను మొదటినుంచీ నిర్భయంగానే వున్నాను.

రెండు గంటలు అంతకంటే మించియే మంత్రివర్గ సభ్యులతో గోఖలేగారు సమావేశమయ్యారు. అక్కడి నుండి వచ్చిన తరువాత వారు నాతో ఒక సంవత్సరం లోగా నీవు భారతదేశానికి తిరిగి రావాలి. అన్ని విషయాలూ నిర్ణయించబడ్డాయి హత్యా సదృశచట్టం అంతమొందుతుంది. వలస చట్టం క్రింద వర్ణభేదం రద్దవుతుంది. మూడు పౌండ్ల పన్ను రద్దవుతుంది. అని అన్నారు. నేను అంతావిని - మంత్రి వర్గం భావాలు నాకెంత తెలుసునో మీకు తెలియవు. మీ ఆశావాదం నాకూ నచ్చింది. కారణం నేనూ ఆశావాదినే. కానీ చాలాసార్లు నిరాశ పాలైన నేను మీలా యీ విషయంలో ఆశపెట్టుకోలేను. కానీ నాకు భయం లేదు మంత్రి వర్గపు వాగ్దానాన్ని మీరు మా కోసం పట్టుకొచ్చారు నాకు యిది చాలు. అవసరమైతే ప్రభుత్వంతో పోరాడటం మా పోరాటం న్యాయబద్ధమైనదని నిరూపించటం నాధర్మం. దీనిలో మీరిచ్చిన హామీ మాకు లాభదాయకమే అవుతుంది. ఒకవేళ మళ్ళీ కొట్లాడవలసి వస్తే అప్పుడు కూడా మీ హామీ మాకు రెండింతలు బలాన్నిస్తుంది కానీ మరింత ఎక్కువమంది భారతీయులు జైళ్ళకి వెళ్ళకుండానే నేనొక సంవత్సరం లోపున భారతదేశానికి తిరిగి రాగలనని అనిపించటం లేదు" అని అన్నాను.

తరువాత గోఖలే అంతమాత్రాన నేను నీతో అన్న మాటలలో తేడా రాదు. జనరల్ బోథా హత్యా సదృశ చట్టం రద్దవుతుందనీ, మూడు పౌండ్ల పన్ను రద్దవుతుందనీ మాట ఇచ్చారు. పన్నెండు నెలల్లో నీవు భారతదేశానికి తప్పక రావలసి వుంటుంది. యిక నీ మాటలు నేను వినను" - అని అన్నారు.

ట్రాన్స్‌వాల్ నుండి గోఖలే. డర్బన్ మేరిట్స్‌బర్గ్ మొదలైన నగరాలకు వెళ్ళారు. అక్కడ కూడా అనేక మంది తెల్లవారిని ఆయన కలిశారు. కింబరలీ

లోని వజ్రాల ఖజానా కూడా ఆయన చూచారు కింబరలీ డర్బన్‌లలోనూ స్వాగత సమితులు జోహన్స్‌బర్గ్‌లోలా విందులు ఏర్పాటు చేశాయి. వాటిలో చాలామంది ఆంగ్లేయులు పాల్గొన్నారు. ఇలా భారతీయుల ఆంగ్లేయుల హృదయాలు దోచి 17 నవంబర్ 1912న గోఖలే దక్షిణాఫ్రికా తీరాన్ని వదిలారు నేనూ కెలన్ బెక్ వారి కోరిక మేరకు ఝూంఝీబార్ దాకా వారికి వీడ్కోలు చెప్పేందుకై వెళ్ళాం. నౌకలో వారికి అనుకూలమైన ఆహార పదార్థాలు ఏర్పాటు చేశాము. మార్గమధ్యంలో డెలగోవాబే, ఇన్హామ్‌బేన్, ఝూంఝీ బార్ మొదలైన ఓడ రేవుల్లో వారికి గొప్ప సత్కారాలు జరిగాయి ఓడలో మా మధ్య కేవలం భారతదేశానికి సంబంధించిన విషయాలు దేశం పట్ల మా ధర్మానికి సంబంధించిన విషయాలు చోటు చేసుకున్నాయి వారి ప్రతిమాటలోనూ వారి కోమల భావాలు సత్యపరాయణత స్వదేశాభిమానం ఉట్టి పడేవి ఓడమీద వారు ఆడే ఆటల్లోనూ భారతదేశం పట్ల సేవాభావమే తొణికిసలాడేది ఆటల్లోనూ వారి ధ్యేయం పరిపూర్ణతను సాధించడమేనని మాకు బోధపడింది

ఓడపై తీరిగ్గా మాట్లాడుకునేందుకు మాకు చాలా సమయం దొరికింది నన్ను భారతదేశం తిరిగి రమ్మని చెప్పారు భారత దేశ నాయకులను గురించిన వివరాలన్నీ వారు నా ముందు వుంచారు తరువాత ఆ నాయకులతో నాకు కలిగిన అనుభవాలకూ గోఖలే గారు వారి గురించి వివరించిన తీరుకూ ఏమీ భేదం కనిపించలేదు.

గోఖలే గారి దక్షిణాఫ్రికా యాత్రలో నాకు ఎన్నో పవిత్రమైన అనుభవాలు కలిగాయి. వాటిని నేనిక్కడ వర్ణించగలను, కానీ సత్యాగ్రహ చరిత్రతో వాటికి సంబంధం లేదు కనుక వాటిని కూడా యిష్టంలేకపోయినా ఆపివేస్తున్నాను ఝూంజీ బార్‌లో గోఖలే గారితో మాకు జరిగిన వీడ్కోలు నాకూ కెలన్‌బెక్‌కూ చాలా దుఃఖాన్ని కలిగించింది. దేహధారులైన వారి మధ్య ఎంతో సన్నిహిత సంబంధాలు సైతం ఏనాడో ఒకనాడు అంతమవక తప్పదని మేమిరువురమూ సమాధానపడ్డాము. గోఖలేగారి భవిష్యద్వాణి నిజమై మేమిరువురమూ సంవత్సరం లోగా భారతదేశానికి వెళ్ళవలసి వస్తుందని ఆశపడ్డాము కానీ

వీలుకాలేదు. అయినా గోఖలేగారి దక్షిణాఫ్రికా యాత్ర మమ్మల్ని మరింత దృఢచిత్తులను చేసింది. మళ్ళీ మా సమరం తీవ్రరూపంలో ప్రారంభమైనపుడు, యీ యాత్రానుభవం దాని అవసరం మాకు బాగా అర్థమైంది. గోఖలేగారు దక్షిణాఫ్రికాకు వచ్చి వుండకపోతే మంత్రివర్గంతో సమావేశమై వుండకపోయివుంటే మూడు పౌండ్ల పన్ను రద్దు విషయం మేము మా సమర తీర్మానాల్లో చేర్చుకుని వుండకపోయేవాళ్ళం ఒకవేళ ఖూనీ చట్టం రద్దు అయివుంటే, సత్యాగ్రహ సమరం కూడా నిలిచిపోయివుండేది. అప్పుడు యీ మూడు పౌండ్ల పన్ను విషయమై మళ్ళీ కొత్తగా సత్యాగ్రహం మొదలెట్టవలసి వచ్చేది దాని ఫలితంగా మరింత ఎక్కువ దుఃఖాన్ని అనుభవించవలసి వచ్చేది. అంతేకాక ప్రజలు దానికోసం వెంటనే సంసిద్ధులవుతారా లేదా అన్న విషయం కూడా అనుమానమే. మూడు పౌండ్ల పన్ను రద్దు చేయించటం స్వతంత్ర భారతీయుల కర్తవ్యం. దాన్ని రద్దు చేయించటంకోసం అర్జీలు పెట్టటం, ప్రతినిధి బృందాలను పంపటం వంటి చట్టపరమైన ఉపాయాలన్నీ చేశాం. 1895 నుంచే యీ పన్ను చెల్లించటం జరుగుతున్నది కానీ ఘోరాతి ఘోరమైన దుఃఖాన్ని కూడా చాలా రోజుల వరకూ సహించవలసి వచ్చినప్పుడు ప్రజలు దానికీ అలవాటు పడిపోయారు. తరువాత దాన్ని అడ్డుకోమని వారికి నచ్చ చెప్పటం కూడా కష్టమై పోతుంది. ఆ దుఃఖం యొక్క తీవ్రతను గురించి ప్రపంచానికి తెలియ బరచటం కూడా కష్టం మంత్రి వర్గం గోఖలేకు మాటయిచ్చి సత్యాగ్రహుల మార్గాన్ని సుగమం చేసింది. ఇప్పుడిక ప్రభుత్వం యీ మూడు పౌండ్ల పన్నును రద్దు చేయకపోతే ప్రభుత్వం యిలా మాట తప్పటమే సమరానికి ప్రబల కారణమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఇదే జరిగింది. ప్రభుత్వం యీ పన్నును రద్దు చేయకపోవటమే కాక రద్దు చేయబోమని స్పష్టంగా ప్రకటించిందికూడా.

ఇలా గోఖలే యాత్ర వల్ల మూడు పౌండ్ల పన్ను రద్దును సత్యాగ్రహం ద్వారా సాధించుకోవటంలో మాకు సాయం లభించింది. తన యీ యాత్రవల్ల దక్షిణాఫ్రికా సమస్యలను ప్రత్యక్షంగా చూసిన వ్యక్తిగా, తెలిసిన వాడిగా గోఖలే గుర్తించబడ్డారు. వారి మాటలకు విలువ పెరిగింది. దక్షిణాఫ్రికాలోని

భారతీయులను గురించి వ్యక్తిగత అనుభవం వుండటం వల్ల తాము బాగా తెలుసుకోవటమే కాక భారతీయులకు తెలియజెప్పటంలోనూ భారత దేశపు ధర్మాన్ని వివరించటంలోనూ వారు సఫలులయ్యారు. మళ్లీ సమరం మొదలైనపుడు భారతదేశం నుంచి ధన వర్షం కురిసింది. లార్డ్ హార్డింగ్ సత్యాగ్రహులపట్ల తన సానుభూతిని చూపించి వారిని ప్రోత్సాహపరచాడు (డిసెంబర్ 1913) శ్రీ అండ్రూస్, పియర్సన్ దక్షిణాఫ్రికాకు వచ్చారు. ఇదంతా గోఖలే యాత్ర జరిగి వుండకపోతే జరిగియుండేది కాదు. ప్రభుత్వం తన మాటనెలా భంగపరచిందో దాని తరువాత ఏమైందో తదుపరి ప్రకరణంలో తెలుసుకుందాం

* * *

# 38

# వాగ్దాన భంగం

ప్రస్తుత నీతికి విరుద్ధంగా ఒక్క అడుగుకూడా ముందుకు వేయని విధంగా దక్షిణాఫ్రికా సత్యాగ్రహ సమర సమయంలో అధిక జాగరూకతతో నడుచుకోవటం జరిగింది అనుచిత రీతిలో ప్రభుత్వాన్ని వేధించకూడదన్న విషయాన్ని కూడా గుర్తుంచుకున్నాం. ఉదాహరణకు యీ ఖూనీ చట్టాన్ని కేవలం ట్రాన్స్‌వాల్‌లో వున్న భారతీయులకే వర్తించేలా ప్రభుత్వం చేస్తున్నందువల్ల సత్యాగ్రహ సమరంలోకి ట్రాన్స్‌వాల్‌లో వుండే భారతీయులనే భర్తీ చేసుకున్నాం నేటాల్ కేప్‌కాలని మొదలైన ప్రాంతాల నుండి భారతీయులను భర్తీ చేసుకోవటానికి ఎలాంటి ప్రయత్నమూ జరుగలేదు. దీనికి విరుద్ధంగా అక్కడున్న భారతీయులు తెచ్చిన ప్రస్తావనలను సైతం నిరాకరించటం జరిగింది పైగా యీ చట్టాన్ని రద్దు చేయించటమే తమ సదుద్దేశ్యమని నిర్ధారించబడింది. ఈ మర్యాదను అటు భారతీయులు గానీ యిటు తెల్లవారు గానీ అర్థం చేసుకోలేక పోయారు. సమర ప్రారంభం తరువాత ఒకవేళ యీ చట్టాన్ని రద్దు చేయించటమనే డిమాండ్‌తోపాటు తక్కిన సమస్యలనూ సమర కారణాలలో ఎందుకు చేర్చకూడదని -

భారతీయులు వాదించేవారు. నేను ధైర్యంగా వారికి నచ్చచెప్పాను. - "ఇలా చేస్తే సత్యానికి భంగం కలుగుతుంది. యుద్ధంలో సత్యమైనపట్టుదల యున్నప్పుడు అక్కడ సత్యం భంగమవుతుందని వూహించటానికి నిజమైన యుద్ధంలో పోరాడుతున్నప్పుడు సైనికుల సంఖ్య దిన దినానికీ పెరుగుతూ వుండవచ్చు. కానీ యుద్ధంకోసం ప్రారంభంలో వారు ఎన్నుకున్న కారణాలు పెంచి ముందుకు వెళ్ళటానికి వీలులేదని చెప్పాను దీనికి వ్యతిరేకంగా ఏ ఉద్దేశ్యంలో సమరాన్ని ప్రారంభించామో ఆ ఉద్దేశ్యంకోసం పోరాడే శక్తి కొన్ని దినాల తరువాత క్షీణించినా యుద్ధాన్ని ఆపివేయటానికి వీలులేదు ఈ రెండు సిద్ధాంతాలను దక్షిణాఫ్రికాలో సంపూర్ణంగా అమలు పరచటం జరిగింది యుద్ధ ప్రారంభసమయంలో ఏ బలాన్ని చూచి లక్ష్యాన్ని నిర్దేశించుకొని ముందుకు నడవటం జరిగిందో ఆ బలం తరువాత నిర్బలమైనదిగా ఋజువవటాన్ని మనం చూశాం కాబట్టి లక్ష్యాలను కూడా పెంచటం చాలా కష్టం. ఇందులో ఎంతో సంయమనం అవసరం దక్షిణాఫ్రికాలో చాలా చోట్ల, యిలాంటి ప్రలోభాలు మా ముందుకు వచ్చాయి. కానీ నేను ఖచ్చితంగా చెబుతున్నాను. మేమీ ప్రలోభాలద్వారా ప్రయోజనాన్ని ఎట్టి పరిస్థితులలోనూ పొందటానికి ప్రయత్నించలేదు. సత్యాగ్రహికి ఒక్కటే లక్ష్యం వుంటుందని ఎన్నో సార్లో చెప్పాను అతనా లక్ష్యాన్ని తగ్గించలేదు. పెంచలేదు. అందులో నష్టం కలుగుతుందనే అనుమానమూ లేదు. వృద్ధి కలుగుతుందన్న ఆశాలేదు. మనిషి తన కోసం ఏ కొలబద్దను నిర్ధారించుకుంటాడో ప్రపంచమూ అదే కొలబద్దతో అతణ్ణి అంచనా వేస్తుంది. ఇలాంటి సూక్ష్మమైన నీతిని సత్యాగ్రహులు అనుసరిస్తామని ఏ కొలబద్ధతో ప్రకటిస్తారో, అదే కొలబద్ధతో వారిని అంచనా వేయటం ప్రభుత్వం మొదలెట్టింది. కానీ నీతికి సంబంధించి యిలాంటి సిద్ధాంతాలు తనను బంధించలేవని దాని నమ్మకం. ఇంతేకాక ఒకటి రెండు సార్లు సత్యాగ్రహులు నీతిని ఉల్లంఘించారని ఆక్షేపించింది కూడా. ఖూనీ చట్టం తరువాత భారతీయులపై తీసుకువచ్చిన కొత్త చట్టాలను కూడా సత్యాగ్రహ ఉద్దేశ్యాలలో చేర్చుకొనవచ్చు. ఇది చిన్ని పిల్లలకు కూడా అర్థమయ్యే

విషయం కానీ ట్రాన్స్‌వాల్‌లో కొత్తగా ప్రవేశించిన భారతీయులపై కొత్తగా పెట్టిన ఆంక్షలను కూడా పోరాట ఉద్దేశ్యాలుగా చేర్చినప్పుడు ప్రభుత్వం సత్యాగ్రహంలో కొత్త విషయాలను కూడా చేర్చారని ఆక్షేపించింది ఇది నిజంగా అనుచితమే కొత్తగా వచ్చే భారతీయులపై యిది వరకు లేని ఆంక్షలను ప్రభుత్వం విధించినపుడు వాటిని పోరాట లక్ష్యాలలో చేర్చే అధికారం మాకున్నది సొరాబ్జీ వంటి వారు ట్రాన్స్‌వాల్‌కి రావటం మనం చూశాం ప్రభుత్వం దీన్ని భరించలేకపోయింది కానీ నిష్పక్షపాతులైన వారికి యీ చర్యలోని అనౌచిత్యాన్ని తెలియజెప్పటానికి నేను ఏ మాత్రమూ యిబ్బంది పడను

గోఖలే వెళ్ళిపోయిన తరువాత ఇలాంటి అవకాశం మళ్ళీ వచ్చింది సంవత్సరం లోగా మూడు పౌండ్ల పన్ను రద్దు జరుగుతుందని వారి అభిప్రాయం. యూనియన్ పార్లమెంటులో వచ్చే సమావేశంలో యీ పన్నును రద్దు చేసే చట్టాన్ని ప్రవేశపెడతారని వారి నమ్మకం. కానీ దీనికి బదులుగా జనరల్ స్మట్స్ - నేటాల్‌లోని ఆంగ్లేయులు యీ పన్నును రద్దు చేయటానికి ఒప్పుకోవడం లేదన్న కారణంతో దక్షిణాఫ్రికా ప్రభుత్వం దీన్ని రద్దు చేయలేదని సమావేశంలో ప్రకటించారు. నిజానికి అలాంటిదేమీ లేదు. కేంద్ర పార్లమెంటులో నాలుగు అధినివేశరాజ్యాల ప్రతినిధులున్నారు అందువల్ల నేటాల్ సభ్యుల సంగతి అక్కడ చెల్లుబాటు కాదు అంతే కాక మంత్రివర్గం ప్రస్తావించిన బిల్లు పార్లమెంటు తిరస్కరించేవరకూ దాని ముందుకు తీసుకు వెళ్లవలసిన బాధ్యత జనరల్ స్మట్స్‌ది కానీ అతడు అలా చేయలేదు అందువల్ల యీ క్రూరమైన చట్టాన్ని సైతం, యుద్ధ కారణాల్లో చేర్చటానికి అవకాశం సులభంగా దొరికింది. దీనికి రెండు కారణాలు మా వద్ద వున్నాయి. ఒకటి పోరాటం జరిగేటప్పుడు ప్రభుత్వం తాను యిచ్చిన వాగ్దానాన్ని తానే తప్పితే ఆ కారణాన్ని కూడా సత్యాగ్రహంతో కలుపవచ్చు. రెండు ఇలా మాట తప్పటం గోఖలే వంటి భారతదేశ ప్రతినిధిని అవమానపరచడమే. గోఖలేను అవమానపరిస్తే మొత్తం దేశాన్ని అవమానించినట్లే. ఈ అవమానాన్ని సహించటం అసాధ్యం. ఒకవేళ మొదటి కారణమొక్కటే వుండి వుంటే సత్యాగ్రహుల కింత

శక్తి వుండేది కాదు కేవలం మూడు పౌండ్ల పన్నును రద్దు చేయించటానికై సత్యాగ్రహం వంటి అస్త్రాన్ని వాడటానికి వారు ముందుకు వచ్చేవారు కారు కాని భారతదేశాన్నే అవమానించటమన్న మాట ఎవరికీ సహించరాని విషయమైంది. అందుకే మూడు పౌండ్ల పన్నును రద్దు చేయించటమన్న ఉద్దేశ్యాన్ని కూడా పోరాటపు ఉద్దేశ్యాలలో కలపటం సత్యాగ్రహుల ధర్మమని నమ్మాము ఇప్పుడిక గిర్‌మిటియా భారతీయులకు కూడా సత్యాగ్రహులలో పాలు పంచుకునే అవకాశం లభించింది గిర్‌మిటియా భారతీయులను పోరాటం నుంచి యిన్ని దినాలూ దూరంగానే వుంచటం జరిగిందన్న సంగతిని పాఠకులు గుర్తుంచుకోవాలి. ఈ విధంగా ఓ వైపు పోరాటంలో బాధ్యతా భారం పెరిగింది. మరోవైపు పోరాడే సైనికుల సంఖ్య కూడా పెరిగే అవకాశం కలిగింది

గిర్‌మిటియా భారతీయులతో యిప్పటి వరకు సత్యాగ్రహం గురించిన చర్చలే జరగలేదు ఇక సత్యాగ్రహ శిక్షణ యివ్వటం ఎలా? వాళ్లు నిరక్షరాస్యులు కావటం వల్ల ఇండియన్ ఒపీనియన్ లేదా యితర వార్తాపత్రికలను చదువలేరు. అయినా వారు సత్యాగ్రహాన్ని గమనిస్తూనే వుండటం, జరుగుతున్న విషయాలను అర్థం చేసుకోవటం గమనిస్తూనే వున్నాను. పైగా సత్యాగ్రహంలో పాలుపంచుకోలేక పోతున్నామన్న బాధ వారిలో కొందరికి కలిగింది. కాని జాతీయ మంత్రి వర్గం తన వాగ్దానాన్ని భంగపరచిన తరువాత మూడు పౌండ్ల పన్నును యుద్ధకారణాలలో చేర్చినప్పుడు వారిలో ఎంతమంది పోరాటంలో చేరతారో నాకు తెలియదు.

ప్రభుత్వం మాట తప్పటాన్ని గురించి గోఖలే గారికి వ్రాశాను వారికి అమిత విచారం కలిగింది నిర్భయంగా వుండి మేము ఆ మరణాంతమూ దీని కోసం పోరాడుతాము కానీ ఒక సంవత్సరంలోగా భారతదేశానికి నేను వచ్చే అవకాశం తప్పిపోయింది. మళ్ళీ ఎప్పుడు రాగలనో చెప్పటం అసంభవం అని వారికి వ్రాశాను. గోఖలేగారు గణిత శాస్త్రజ్ఞుడు సత్యాగ్రహంలో పాల్గొంటున్న సత్యాగ్రహుల కనిష్ఠ గరిష్ఠ సంఖ్యను తెలియజేయమని వారు వ్రాశారు. నాకిప్పుడు జ్ఞాపకం వున్నంత వరకూ 65-66 నుండి 16 పేర్ల

వరకూ వ్రాసి పంపినట్టు గుర్తు. ఇంత తక్కువ మందికోసం భారతదేశం నుండి ఆర్థిక సహాయం కోరను. ఈ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి మీ ఆరోగ్యానికి ఎలాంటి ఒత్తిడీ కలిగించవద్దని కూడా వ్రాశాను. దక్షిణాఫ్రికా నుండి బొంబాయి తిరిగి వెళ్ళిన తరువాత కేంద్ర ప్రభుత్వంతో జరిగిన సంభాషణల్లో నిశ్శబ్దం కనిపించినట్లు ఆక్షేపణలు చేయబడ్డాయని వార్తా పత్రికల ద్వారా తెలిసిన వ్యక్తుల ద్వారా నాకు వార్త వచ్చింది అందువల్ల డబ్బు పంపమని హడావిడి చేయటం నాకు యిష్టం లేదు. కానీ గోఖలే గారి నుండి ఘాటైన వుత్తరం వచ్చింది - దక్షిణాఫ్రికాలో మీ ధర్మాన్ని మీరెలా నిర్వర్తిస్తున్నారో, భారతదేశంలో మేమూ మా ధర్మాన్ని విలువైనదిగా భావిస్తాం మేము ఏంచేయటం ఉచితమో ఏమి చేయటం అనుచితమో చెప్పే అవకాశం మీకు యివ్వం నేను కేవలం అక్కడి పరిస్థితిని తెలుసుకోవాలనుకున్నాను మేమేమి చేయాలో మిమ్మల్ని చెప్పమని అడుగలేదు " గోఖలే గారి మాటలలో అంతరార్థం నాకు తెలిసింది తరువాత యీ విషయంలో ఒక్కమాట నేనూ వ్రాయలేదు వారూ వ్రాయలేదు అదే లేఖలో వారు నాకు సాంత్వనతో పాటు హెచ్చరికను కూడా పంపారు ప్రభుత్వమిలా మాట తప్పటం వల్ల పోరాటం ఎక్కువ రోజులు జరుగవచ్చునని అభిప్రాయపడ్డారు పిడికిలి నిండనంత మంది సత్యాగ్రహులు ఎన్నిరోజులు ప్రభుత్వంతో తలపడగలరు అని వారికి అనుమానం కలిగింది ఇక్కడ దక్షిణాఫ్రికాలో మేము సమర సన్నాహాలు ప్రారంభించాం

ఈ యుద్ధంలో శాంతిగా కూర్చోవటం సాధ్యం కాదు. సత్యాగ్రహులు చాలా కాలం జైల్లో కూర్చోవలసి వస్తుందని మాకు అర్థమైంది టాల్‌స్టాయ్ ఆశ్రమాన్ని మూసివేయాలని నిర్ణయించుకున్నాం. కొన్ని కుటుంబాలు తమ వాళ్లు జైలు నుండి విడుదలైన తరువాత తమ ప్రాంతాలకు వెళ్ళిపోయాయి. మిగిలిపోయిన వారిలో ఫినిక్స్ వాసులు మాత్రమే వున్నారు. అందువల్ల సత్యాగ్రహుల కేంద్రంగా ఫినిక్స్‌ను చేసేందుకై నిశ్చయించాము దానికి కారణం మూడు పౌండ్ల పోరాటంలో పాలుపంచుకుంటున్న గిరమిటియా కార్మికులతో కలవడానికి నేటాల్ నందలి ప్రాంతం కంటే యిదే సౌకర్యంగా

వుంటుందని భావించాము పోరాటాన్ని ప్రారంభించటానికి మేము సన్నాహాలు చేస్తుండగానే మరో కొత్త విఘ్నం వచ్చి పడింది. ఇక యిప్పుడు పోరాటంలో స్త్రీలకు కూడా అవకాశం లభించింది. కొంతమంది వీర నారీమణులు పోరాటంలో పాలుపంచుకునేందుకు వీలు కల్పించమని అరడిగారు. ప్రవేశ పత్రాలను చూపించకుండా జైలు కెళ్ళేందుకు తమ యిష్టాన్ని వ్యక్తం చేశారు. కానీఅప్పుడు విదేశాల్లో స్త్రీలను జైళ్లకి పంపటం అనుచితం అని మాకనిపించింది వాళ్ళని జైళ్లకి పంపేందుకు తగిన కారణమూ కనిపించలేదు. నా సంగతి చెప్పాలంటే స్త్రీలను జైళ్లకు పంపాలంటే నాకు భయంగా వుండేది పైగా పురుషులపైన మోపే చట్టాన్ని రద్దు చేయించటం కోసం స్త్రీలను ఆహుతి చేయటం పురుషులకు అవమానకర విషయమని కనిపించింది కానీ స్త్రీలను అవమాన పరచే సంఘటన ఒకటి జరిగి యీ అవమానాన్ని తొలగించుకోవాలంటే స్త్రీలను ఆహుతి చేయడం తప్పుకాదన్న అభిప్రాయం కూడా మాకు కలిగింది

★ ★ ★

# 39

# పెండ్లిని పెండ్లిగా గుర్తించకపోవుట

దక్షిణాఫ్రికాలో భారతీయులెవ్వరూ ఊహించడానికైనా వీలులేని ఘట్టం ఒకటి జరిగింది. బహుశ యిట్టి ఘట్టం ద్వారా భగవంతుడు భారతీయుల విజయానికి బాట వేసాడేమోనని భావిస్తున్నాను దేవుడు అంగ్లేయుల దుర్మార్గ ప్రవృత్తిని అదృశ్యంగా వుండి బహిరంగం చేయదలచాడేమోనని కూడా భావిస్తున్నాను. భారత దేశాన్నుంచి దక్షిణాఫ్రికా వచ్చిన వారిలో చాలామంది పెండ్లి అక్కడే చేసుకొని వచ్చిన వాళ్లు వున్నారు. కొందరు దక్షిణాఫ్రికా వచ్చిన తరువాత పెండ్లి చేసుకున్నారు. భారతదేశంలో సామాన్యంగా జరిగే చాలా పెండ్లిండ్లను రిజిష్టరు చేయించరు. ధార్మిక పద్ధతులు అక్కడ సరిపోతాయి. దక్షిణాఫ్రికాలో సైతం యీ పద్ధతినే అంగీకరించి యుంటే బాగుండేది. 40 సంవత్సరాల నుంచి అనేక మంది భారతీయులు దక్షిణాఫ్రికా వచ్చి

వుంటున్నారు. వాళ్ల పెండ్లిండ్ల విషయం ఎవ్వరూ పట్టించుకోలేదు అంతా సవ్యంగా భారత దేశంలో వలెనే సాగిపోతున్నది. కాని అక్కడి కోర్టులో ఒక పెండ్లి విషయం దాఖలు అయింది. కేస్ సుప్రీమ్ కోర్టు న్యాయమూర్తి శ్రీ సర్లదొర 1913 మార్చి 14 వ తేదీన ఒక తీర్పు యిచ్చాడు. దక్షిణాఫ్రికాలో అమల్లో వున్నచట్టం ప్రకారం క్రైస్తవమత పద్ధతిన జరిగిన వివాహాలు తప్ప, వివాహాల అధికారి ఆఫీసులో రిజిష్టరైన వివాహాలు తప్ప, మరేరకమైన పెండ్లిండ్లు చెల్లవు" అనునదే ఆయన యిచ్చిన తీర్పు సారాంశం అంటే ఏమిటి? భారతదేశపు హిందువులు, ముస్లిములు పారసీకులు తమ తమ మతాల ప్రకారం చేసుకున్న వివాహాలు దక్షిణాఫ్రికాలో చెల్లవన్నమాట యిది ఆ జడ్జి యిచ్చిన ఒక భయంకరమైన తీర్పు యీ తీర్పు ప్రకారం యిప్పుడు దక్షిణాఫ్రికాలో భార్యాభర్తలుగా చలామణీ అవుతున్న వారు యిక భార్యాభర్తలు కారన్నమాట యిప్పుడు భార్యల స్థాయిలో వున్న స్త్రీలకు అధికారం వుండదన్నమాట యిప్పుడు భార్యలుగా వున్న స్త్రీలు ఉపభార్యలుగా మాత్రమే పరిగణింప బడతారన్నమాట అట్టి భార్యలకు కలిగిన సంతానం అట్టి తండ్రులకు వారసులు కాజాలరన్నమాట యీ స్థితిని స్త్రీలు అంగీకరించరు. పురుషులు అంగీకరించరు. ఈ తీర్పువల్ల దక్షిణాఫ్రికాలో గల భారతీయుల్లో పెద్ద అలజడి బయలు దేరింది "ఈ తీర్పును ప్రభుత్వం అంగీకరిస్తున్నదా? అని నేను ప్రభుత్వాన్ని అడిగాను. యిట్టి తీర్పు ఒక జడ్జీ యిచ్చాడు కనుక, మరో చట్టాన్ని అంగీకరించి దాని ప్రకారం హిందూ ముస్లింపారసీకుల మత సంబంధమైన వివాహాలన్నీ సక్రమమైనవని అంగీకరించి యిట్టి అక్రమమై తీర్పును చెల్లకుండా చేస్తారా లేదా అని ప్రభుత్వాన్ని ప్రశ్నించాను. నా మాట వినే స్థాయిలో ప్రభుత్వం లేదు. అట్టి పెండ్లిళ్లు చెల్లవని ప్రభుత్వం నిర్ణయం తెలిపింది. జడ్జీ యిచ్చిన తీర్పును గురించి చర్చించుటకు భారతీయుల సభ జరిగింది యీ తీర్పుకు వ్యతిరేకంగా ప్రభుత్వం నిర్ణయించవలసిందే కాని భారతీయులు కల్పించుకోకూడదని నిర్ణయించాము. ప్రభుత్వ వకీలు ద్వారా బహిరంగంగా తీర్పుకు వ్యతిరేకంగా అపీలు చేయవలసిందే. ప్రభుత్వం భారతీయుల పక్షం వహించినప్పుడే

భారతీయులు అపీలు చేయవచ్చునని తేలింది అలా చేయకుండా వూరుకుంటే హిందూ, ముస్లిం, పారసీకుల జరిగిన పెండ్లిడ్లు చెల్లవని తేలిపోయింది ఇలాంటి విషయంలో కోర్టు నిర్ణయం భారతీయులకు వ్యతిరేకంగా వుంటే యిక సత్యాగ్రహం తప్ప మరో మార్గం లేదని స్పష్టంగా తేలిపోయింది. యిది అవమానకరమైన పరిస్థితి

ఇక శుభతిథికి, శుభముహూర్తానికి తావే లేకుండాపోయింది. స్త్రీలకు యింత అవమానం జరిగితే ఎవరు ఊరుకుంటారు? దొరికినంత మంది సత్యాగ్రహులతో పై తీర్పుకు వ్యతిరేకంగా సత్యాగ్రహం జరిపితీరాలని నిర్ణయం చేశాం. యిక స్త్రీలను సత్యాగ్రహంలో చేర్చక తప్పని స్థితి ఏర్పడింది స్త్రీలను సత్యాగ్రహంలో చేరమని కోరాము సత్యాగ్రహ సంగ్రామంలో చేరితే కలిగే ప్రమాదాల్ని వారికి తెలియచేశాను అరెస్టు అయిన తరువాత, ఆహారాన్ని గురించీ, జైల్లో కలిగే కష్టాలు మొదలుగాగల యిబ్బందులన్నింటిని గురించి స్త్రీలకు తెలియచేశాను. జైల్లో నానాయాతనలకు గురిచేస్తారని, బట్టలు ఉతికే పని అప్పగించ వచ్చునని, అవమానాల పాలు చేయవచ్చునని వగైరా వగైరా విషయాలన్నీ వారికి తెలియచేశాను. అయితే ఒక్క సోదరీమణికూడ భయపడలేదు. ఒకామె గర్భవతి. మరొకామెకు ఆరు మాసాల బిడ్డ . ఇటువంటి స్త్రీలుసైతం సత్యాగ్రహంలో పాల్గొనుటకు ముందుకు వచ్చారు. వారిని ఆపగల శక్తి నాకు లేదు వారిలో ఎక్కువ మంది తమిళసోదరీమణులు. వారిలో (1) శ్రీమతి తంబినాయుడు (2) శ్రీమతి ఎన్. పిళ్లె (3) శ్రీమతి కె. మరురగేసన్ పిళ్లె (4) శ్రీమతి ఎస్. పి. నాయుడు (5) శ్రీమతి పి.కె. నాయుడు (6) శ్రీమతి కె చిన్నసామిపిల్లె (7) ఎన్.ఎస్. పిళ్లె (8) శ్రీమతి ఆర్.ఏ. ముదలింగం (9) శ్రీమతి భవానీదయాల్ (10) కుమారి ఎం. పిళ్లె (11) కుమారి బి.ఎస్. పిళ్లె మొదలగు వారు వున్నారు. ఏదైనా తప్పుచేస్తే జైల్లో పెడతారు. కాని ఏ తప్పుచేయకుండా ఎలా అరెస్టు చేస్తారు అయినా ప్రభుత్వం స్త్రీలను అరెస్టు చేయలేదు. ట్రాన్స్‌వాల్‌కి చెందిన బెరీనిజింగ్‌లో ప్రవేశపత్రం లేకుండా ప్రవేశించారు. పెద్దగా నినాదాలు చేస్తూ తిరిగారు. ఆరెంజియా సరిహద్దుల్లోకి ప్రవేశించారు. అయినా వారిని ప్రభుత్వం అరెస్టు

చేయలేదు. ఎలా అరెస్టు కావడమో ఎవ్వరికీ బోధపడలేదు చాలామంది పురుషులు జైలుకు వెళ్లడానికి సిద్ధపడలేదు సిద్ధపడిన పురుషుల్ని ప్రభుత్వం అరెస్టు చేయలేదు

ఇక చివరి అడుగు వేయాలని నిర్ణయించాం అది అందరినీ ప్రభావితం చేస్తుంది ఫినిక్సులో వుండే వాళ్లందరినీ, ఇండియన్ ఒపీనియన్ పత్రికకు వినియోగపడే వారిని మినహాయించి, మిగితా వాళ్లంద్దరిని యీ సత్యాగ్రహోద్యమంలోకి దింపి వేయాలని నిర్ణయానికి వచ్చాను ఇంతకంటే మించి నా దగ్గర మరో అయుధమేమీ మిగలలేదు గోఖలే గారికి జాబు వ్రాసేటప్పుడు 16 మంది సత్యాగ్రహలు నా లిష్టులో వున్నారు అనుమతి పత్రం లేకుండా ట్రాన్సువాల్ ప్రవేశించి ముందు నేను అరెస్టు కావాలి ఈ విషయం ముందుగా ప్రకటిస్తే ప్రభుత్వం అరెస్టు చేయదని భావించాము ఇద్దరు ముగ్గురు స్నేహితులకు తప్ప యీ విషయం మరెవ్వరికీ నేను చెప్పలేదు. సరిహద్దు దాటినప్పుడు పేర్లు, చిరునామాలు పోలీసులు అడుగుతూ వుంటారు అవి తెలుపకూడదని నిర్ణయానికి వచ్చాము. అలా చెప్పకపోవడం కూడా నేరమే పేర్లు చిరునామాలు చెప్పి వేస్తే వారంతా నా బంధువులని తెలుసుకొని ప్రభుత్వం వారినెవ్వరినీ అరెస్టు చేయదని భావించాం. మేమంతా ట్రాన్సువాల్‌లో ప్రవేశిస్తాం. అరెస్టు కాకుండా వున్న సోదరీమణులు నేటాలులో ప్రవేశిస్తారు. అనుమతి పత్రాలు లేకుండా ట్రాన్సువాల్, నేటాల్లో ప్రవేశించడం అపరాధమే. అయినా స్త్రీలను అరెస్టు చేయకపోతే వారంతా ముందుకు సాగి న్యూకేసిల్, వెళ్లి గనుల్లో పనిచేస్తున్న గిరిమిటియా భారతీయ కార్మికుల్ని రెచ్చగొట్టి వారి చేత గనులలో పని మానిపించేలా చేయాలని నిర్ణయించాం. ఈ సోదరీమణుల మాతృభాష తమిళం. కొద్దిగా హిందూస్థానీ వాళ్లకు వచ్చు. అక్కడి గిరిమిటియా కార్మికుల్లో అధిక భాగం తమిళులు, తెలుగువాళ్లు. స్త్రీలతోబాటు, కార్మికుల్ని కూడా ప్రభుత్వం అరెస్టు చేయక తప్పదు. స్త్రీలను అరెస్టు చేస్తే భారతీయ కార్మికులల్ని ఆపడం కష్టం. ఈ రకమైన వ్యూహాన్ని రచించి నేను సోదరీమణులకు మంచి శిక్షణ యిచ్చాను. తరువాత నేను ఫినిక్సువెళ్లాను. అందరితో నా ప్రణాళికను గురించి చర్చించాను. మొదట

నేను ఫినిక్సులో వుంటున్నా సోదరీమణులతో మాట్లాడాను స్త్రీలను జెళ్లకు పంపే ఆలోచన చాలా ప్రమాదకరమైనదని నాకు తెలుసు. ఫినిక్సులో వుంటున్న స్త్రీలలో ఎక్కువ మంది గుజరాతీవారు మిగతా సోదరీమణుల వలె ఎక్కువగా శిక్షణ పొందిన వారు కారు ఇంతే గాక గుజరాతీ మహిళల్లో ఎక్కువ మంది నాకు బంధువులు కూడా నా ముందర మాట్లాడలేక సిగ్గు పడి సరేనని జైళ్లకు వెళ్లి, అక్కడి కష్టాలు సహించలేక క్షమాపణకోరితే నాకు దెబ్బ తగులుతుంది అంతేగాక సత్యాగ్రహోద్యమం దెబ్బతింటుంది నా భార్యను జైలుకు వెళ్లమని ప్రోత్సహించకూడదని నా నిర్ణయం ఆమె నలుగురిలో వెళ్లనని అన్నా లేక వెళతానని అన్నా దానికి ఎంతో విలువ వుంటుందో నాకు తెలుసు ఇలాంటి కఠిన విషయాలలో భార్య స్వయంగా తీసుకునే నిర్ణయానికే విలువ యివ్వాలని నా అభిప్రాయం. భార్య ఏ నిర్ణయమూ చేయలేకపోతే భర్త బాధపడకూడదు అందువల్ల యీ విషయమై నా భార్యతో ఏమీ మాట్లాడకూడదని నేను నిర్ణయించుకున్నాను. ట్రాన్స్‌వాల్‌కి చెందిన యితర సోదరీమణుల వలె వారు కూడా నడుం బిగించారు. ఎన్ని కష్టాలు కలిగినా సరే సహించి జైలు శిక్ష అనుభవిస్తామని వారంతా చెప్పారు. మా మాటల సారాన్ని నాభార్య కూడా గ్రహించింది ఈ విషయం మీరు నాకు చెప్పనందుకు బాధ పడుతున్నాను నేను జైలుకు వెళ్లనని మీరు ఎందుకు అనుకొన్నారు ఈ సోదరీమణులందరికీ మీరు ఏ మార్గాన నడవమని చెబుతున్నారో నేను కూడా అదే మార్గాన నడవాలని కోరుతున్నాను" అని అన్నది "నేను నీకు ఎన్నడూ దుఖంకలిగించాలని భావించను. ఇందు అవిశ్వాసానికి తావులేదు నీవు జైలుకు వెళ్లితే నేను సంతోషిస్తాను. అయితే నేను వెళ్లమంటే నీవు జైలుకు వెళ్లావనే భావం ఎవ్వరికీ కలుగకూడదు. ఇలాంటి పనులు తమకు గల ధైర్యంతోనే అందరూ చేయాలి. నేను చెబితే నీవు సరేనని తప్పక జైలుకు వెళతావు. నాకు తెలుసు. కాని తరువాత కోర్టులో నిలబడినప్పుడు నీరసపడిపోయినా జైళల్లో కలిగే కష్టాలకు బయటపడిపోయినా, అందు నీ దోషం వుందని భావించను. కాని అట్టి స్థితిలో నా పరిస్థితి ఏమవుతుందో ఒక్కసారి ఆలోచించు. అప్పుడు నేను

నిన్ను నా వెంట ఉండనీయగలనా? ప్రపంచం ఎదుట ఏముఖం పెట్టుకొని నిలబడగలను? ఆ భయం వల్లనే నేను నిన్ను ప్రోత్సహించలేదు" అని చెప్పాను. నా మాటలు విని "నేను ఓడిపోయి జైలునుంచి తిరిగి వస్తే నన్ను మీ వెంట వుండనీయవద్దు నా బిడ్డలు కష్టపడతారా? మీరంతా కష్టాలు పడతారా? నేనొక్కదాన్ని కష్టాలు పడలేనా? నన్ను గురించి మీరు యిలా ఎందుకు ఆలోచిస్తున్నారు. ఏది ఏమైనా నేను యీ యుద్ధంలో పాల్గొని తీరతాను" అని అన్నది కస్తూరిబా.

"అయితే నేను నిన్ను యీ సంగ్రామంలో చేర్చి తీరతాను. నా షరతులేమిటో పూర్తిగా విన్నావు నా స్వభావం ఎటువంటిదో నీకు బాగా తెలుసు. ఇంకా సమయం వున్నది. ఆలోచించ తలిస్తే మరోసారి ఆలోచించు. లోతుగా ఆలోచించిన పిమ్మట సంగ్రామంలో చేరవద్దని నీవు అనుకుంటే నేనేమీ బాధపడను నీ యిష్టం వచ్చినట్లు చేయవచ్చు. నిర్ణయాన్ని మార్చుకోవడానికి యిప్పుడు కూడా సిగ్గుపడవలసిన అవసరం లేదు" అని నేను చెప్పాను. ఇక ఆలోచించవలసిన అవసరమేమీ లేదు ఇది నా దృఢ నిర్ణయం అని ఆమె స్పష్టంగా చెప్పివేసింది. ఫినిక్సులో వుండే మిగతావారికి కూడా మీరు స్వతంత్రంగా నిర్ణయాలు చేయండని చెప్పాను సత్యాగ్రహసంగ్రామం కొద్దికాలంపాటు జరిగినా ఎక్కువ కాలం పాటు జరిగినా, ఫినిక్సు ఆశ్రమం నిలిచివున్నా లేక మట్టిలో కలిసిపోయినా, జైలుకు వెళ్లినా సత్యాగ్రహులు ఆరోగ్యంగా వున్నా లేక జబ్బుపడినా, ఒక్క సత్యాగ్రహికూడా ఓడిపోయి జైలునుంచి విడుదల కాకూడదు. ఈ షరతు ఎన్నో పర్యాయాలు వారికి తెలియజేశాను. అంతా సిద్ధపడ్డారు. ఫినిక్సుకు బయటగల వారిలో కేవలం రుస్తుమ్‌జీ జీవణ్‌జీ ఘోరఖోదు మాత్రమే వున్నారు. వారిని ప్రేమతో కాకాజీ (పెద్దనాన్నా) అని అనేవారం. వారికి తెలియకుండా ఫినిక్సులో చర్చలు ఎలా చేయడం? వారు వెనక వుండే మనిషికాదు. ఒకసారి జైలుకు వెళ్లవచ్చారు. మళ్లీ జైలుకు వెళతానని, వారి పట్టుదల.

ఆ దళంలో చేరిన సత్యాగ్రహుల పేర్లు యివి-

(1) సౌ కస్తూరిభాయి మోహనదాస్ గాంధీ (2) సౌ. జయాకువర్ మణిలాల్ డాక్టర్ (3) కాశీఛగనలాల్ గాంధీ (4) సంతోక్ మగనలాల్ గాంధీ, (5) శ్రీ పారసీరుస్తమ్‌జీ జీవన్జీ (6) శ్రీ ఛగన్ లాల్ ఖుశాల్‌చంద్ గాంధీ (7) శ్రీ రావజీభాయి మణిభాయి పటేల్ (8) శ్రీమగన్‌భాయి హరిభాయి పటేల్ (9) శ్రీ సోలోమన్ రాయపెన్ (10) భాయీ రామదాస్ మోహనదాస్ గాంధీ (11) భాయీ రాజుగోవింద్ (12) భాయీ శివపూజన్ బద్రీ (13) భాయిగోవిందరాజులు (14) కుప్పస్వామి ముదలియార్ (15) భాయి గోకులదాస్ హంసరాజ్ (16) భాయి రవిశంకర్ తరసీ సోఢా ఇక ఏమి జరిగిందో తరువాతి ప్రకరణంలో వివరిస్తాను

★ ★ ★

# 40

# జైల్లో స్త్రీలు

సత్యాగ్రహుల దళం సరిహద్దు దాటి ట్రాన్స్‌వాల్ లో ప్రవేశించిన అపరాధానికి జైలుకు వెళ్లుటకు సిద్ధపడింది గత ప్రకరణంలో ప్రకటించిన పేర్లలో కొన్ని పేర్లు గలవారిని పోలీసులు పట్టుకోవచ్చు. నా విషయమై అలాగే జరిగింది. రెండూ మూడు సార్లు పట్టుకున్న తరువాత సరిహద్దు దాటుతున్నప్పుడు పోలీసులు నన్ను పట్టుకొని వదిలివేశారు ఈ దళం బయలు దేరుతున్నదని ఎవ్వరికీ తెలియచేయలేదు ఇక అధికారులకు ఎందుకు తెలియచేస్తాం? పోలీసులకు కూడా మీ పేర్లు, చిరునామాలు చెప్పవద్దని యీ దళసభ్యులకు చెప్పాము. కోర్టులో మా పేర్లు చెబుతామని పోలీసులకు చెప్పమని వారికి చెప్పాము

పోలీసులు యిలాంటి వ్యవహారాలు చాలా చూచారు. భారతీయుల్ని అరెస్టు చేయడం అలవాటు అయిన తరువాత, పోలీసుల్ని కంగారు పెట్టుటకు వినోదంగా తమ పేర్లు వాళ్లకు సత్యాగ్రహులు చెప్పేవారు కాదు. అందువల్ల పోలీసులకు ఫీనక్సు దళం వారి వ్యవహారం విచిత్రమనిపించలేదు. ఈ దళాన్ని అరెస్టు చేశారు. వాళ్ల మీద కోర్టులో కేసునడిచింది ప్రతిసత్యాగ్రహికి

మూడు మూడు మసాల చొప్పున కఠిన కారాగారశిక్ష విధించారు (1913 సెప్టెంబరు 23) ట్రాన్స్‌వాల్‌లో అరెస్టుకాని సోదరీమణులు యిక నేటాలులో ప్రవేశించారు వాళ్లను అనుమతి పత్రాలు లేకుండా నేటాలులో ప్రవేశించినందుకు పోలీసులు అరెస్టు చేయలేదు. వాళ్లను అరెస్టు చేయకపోతే న్యూకేసల్‌లో మకాం చేసి బొగ్గు గనుల గిర్‌మిటియా కార్మికులను పనులకు పోవద్దని చెప్పవలసిందిగా కోరాము న్యూకేసల్ నేటాలునందలి బొగ్గు గనులకేంద్రం ఈ గనుల్లో భారతీయ కార్మికులు పనిచేస్తున్నారు సోదరీమణులు తమ పని ప్రారంభించారు వారి ప్రచారం కరెంటులా నలుదిసల ప్రాకింది మూడు పౌండ్ల తలపన్ను కథ భారతీయ కార్మికుల హృదయాలను కలిచి వేసింది వాళ్లు తమ పని మానివేశారు ఈ వార్త నాకు తంతి ద్వారా తెలియజేశారు సంతోషంతోపాటు గబరా పడ్డాను ఇక నేను ఏం చేయాలి? కార్మికుల్లో యింతటి మేల్కొలుపు వస్తుందని నేను ఊహించలేదు నా దగ్గర డబ్బు లేదు. ఈ పనిని సంభాళించేందుకు నా దగ్గర మనుష్యులు లేరు ఇక నా కర్తవ్యమేమిటో గ్రహించాను. నేను న్యూకేసల్ వెళ్లాలని నిర్ణయించుకున్నాను. అక్కడికి బయలుదేరాను.

ప్రభుత్వం యీ సోదరీమణుల్ని ఎలా వదులుతుంది? వారందరిని అరెస్టు చేశారు. ఫినిక్సు దళానికి విధించిన శిక్షయే వారికీ విధించారు ఫినిక్సు దళాన్ని వుంచిన జైల్లోనే వీరిని వుంచారు. (21 అక్టోబరు 1913) ఈ ఘట్టాల వల్ల దక్షిణాఫ్రికా యందలి భారతీయులు మేల్కొన్నారు. వారికి నూతనోత్సాహం కలిగించింది. సోదరీమణుల త్యాగాలు, బలిదానాలు భారత దేశాన్ని సైతం మేల్కొలిపాయి. సర్ ఫిరోజ్‌షా మెహతా తటస్థంగా వున్నారు. 1901లో నీవు దక్షిణాఫ్రికా వెళ్లవద్దని మందలిస్తూ నాకు చెప్పారు. భారతదేశం స్వాతంత్ర్యం పొందనంత వరకు విదేశాలలో వుండే భారతీయులకు ముక్తి లభించదని వారి అభిప్రాయం. దక్షిణాఫ్రికా సత్యాగ్రహం వారి మీద ప్రభావం చూపలేదు. కాని స్త్రీలు పడ్డయాతనలను గురించి తెలియగానే వారిలో పెద్దమార్పు వచ్చింది. బొంబాయి టౌన్‌హాలల్లో జరిగిన సభలో పాల్గొని "స్త్రీల( ) విధించిన కారాగారాశిక్ష వల్ల శాంతి ఎగిరిపోయింది. ఇక భారతదేశం శాంత

వహించి కూర్చేదు" అని ఉద్ఘాటించారు నిజంగా స్త్రీలు చేసిన త్యాగం సామాన్యమా? వాళ్లనందరినీ నేటాల్ రాజధాని మెరిత్స్‌బర్గ్ జైల్లో వుంచారు. అక్కడ వారిని అమితంగా కష్టపెట్టారు. వాళ్ల ఆహారాన్ని గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు. చాకలి పనిచేయమని వారిని ఆదేశించారు. శిక్షాకాలం పూర్తి కానంతవరకు బయటినుంచి భోజనం తెప్పించుకోకూడదని ఆంక్ష విధించారు

ఒక సోదరి వ్రతరీత్యా ప్రత్యే కఆహారం తీసుకుంటుంది ఎంతో ప్రయత్నం చేసిన తరువాత అట్టి ఆహారం అందచేయడానికి అధికారులు అంగీకరించారే కాని ఆ ఆహారాన్ని తినడం కష్టమైపోయి ఆమె ఆహారం మానుకోవలసి వచ్చింది. ఆమెకు నూనె అవసరం. తన డబ్బుతో తెప్పించుకుంటానంటే అధికారులు అంగీకరించలేదు. విడుదల అయినప్పుడు అస్థిపంజరంమై పోయింది. ఎంతో శ్రమ పడిన తరువాత ఆమె కోలుకున్నది.

మరొక సోదరి ప్రాణాంతకమైన జ్వరంతో బైటపడింది ఈ జ్వరంవల్ల జైలునుంచి విడుదల అయిన కొద్దిరోజులకే ఆమె పరమ పదించింది. (22 ఫిబ్రవరి 1914) ఆమెను నేను ఎలా మరిచిపోతాను? ఆమె పేరు వలియమ్మ ఆమెకు 16 సంవత్సరాల వయస్సు. ఆమెను చూడ్డానికి వెళ్లినప్పుడు ఆమె రోగగ్రస్తురాలై మంచం మీదపడి వున్నది. బాగా పొడుగు. అందువల్ల కృశించిన ఆమెశరీరం భయంకరంగా వున్నది.

"వలియమ్మా! జైలుకు వెళ్లినందుకు పశ్చాత్తాపంగా వున్నాదా?" అని అడిగాను.

· "పశ్చాత్తాపమా? లేదు. నన్ను అరెస్టు చేస్తే మళ్లీ జైలుకు వెళతాను" అని జవాబిచ్చింది.

"ప్రాణానికి ముప్పువస్తే?"

"రానీయండి . దేశంకోసం చావవలసి వస్తే మంచిదే గదా?" ఇదీ ఆమె సమాధానం

ఆ తరువాత కొద్ది రోజులకు ఆమె చనిపోయింది. ఆమె శరీరం లేదు కాని ఆమె పేరు చిరస్థాయిగా చరిత్రలోని నిలిచిపోయింది. ఆమె గతించిన తరువాత అనేకచోట్ల సంతాప సభలు జరిగాయి. వాలియమ్మ హాలు నిర్మాణం చేయాలని ఒక సభలో తీర్మానించారు. కాని ఆ ధర్మం భారతజాతి

నెరవేర్చలేదు. ఏవేవో విఘ్నాలు వచ్చాయని చెప్పారు పరస్పర కలహాలు బయలుదేరాయి ముఖ్యకార్యకర్తలు ఒకరి తరువాత మరొకరు చనిపోయారు రాళ్లతో భవనం తయారైనా కాకపోయినా వలియమ్మ బలిదానం అమోఘం, అద్భుతం ఆమె సేవాధర్మం, బలిదానం ఆమె కీర్తి ప్రతిష్టలు ప్రపంచంలో భారతదేశం జీవించి యున్నంతకాలం నిలిచి యుంటాయి

ఈ సోదరీ మణుల త్యాగం పవిత్రమైనది చట్టమందలి సూక్ష్మాలు వాళ్లకు తెలియవు. చాలా మంది సోదరీమణులకు దేశమంటే ఏమిటో తెలియదు. వాళ్ల దేశప్రేమకు ఆధారం కేవలం శ్రద్ధయే చాలామందికి చదువురాదు పత్రికలు ఏం చదువుతారు? కాని స్వాభిమానమనే వస్త్రాపహరణం జరుగుతున్నదని వాళ్లు తెలుసుకున్నారు. వాళ్ల జైలు యాత్ర పరిశుద్ధమైనది అది ఒక యజ్ఞం వంటిది పవిత్ర యజ్ఞం మంచిఫలితాలు యిస్తుంది హృదయ పూర్తిగా చేసిన ప్రార్థనను భగవంతుడు తప్పక వింటాడు. భక్తితో, నిస్వార్థ బుద్ధితో పత్రం, పుష్పం, ఫలం, తోయం, ఏది సమర్పించినా భగవంతడు స్వీకరిస్తాడు కుచేలుడు పేదవాడు గుప్పెడు అటుకులు తీసుకొని వెళ్లి కృష్ణునికి సమర్పించాడు. అతడి పేదరికం తొలిగిపోయింది అందువల్ల భక్తి శ్రద్ధలతో చేసిన త్యాగం ఎన్నటికీ వ్యర్థం కాదు కానేరదు ఒక్కటి మాత్రం నిజం వలియమ్మ ఆత్మబలిదానం ఫలితం సాధించింది ఇతర సోదరీమణుల త్యాగయజ్ఞం సఫలం అయింది

స్వదేశీయజ్ఞంలోను, విశ్వయజ్ఞంలోను ఎన్నో ఆత్మలు త్యాగం చేశాయి ఈనాటికీ చేస్తున్నాయి భవిష్యత్తులో కూడా చేస్తాయి ఇదే నిజమైన త్యాగం ఒక్క సత్యాగ్రహి ఆత్మపవిత్రంగా వున్నా చాలు మొత్తం ఉద్యమం విజయం సాధించి తీరుతుంది. పృథ్వి సత్యంపై ఆధారపడి వున్నది. అసత్ అనగా అసత్యం, అసత్యమంటే లేదు అని అర్థం సత్ అనగా సత్యం, అనగా ఉన్నది అని అర్థం.

అసత్యానికి తావే లేనప్పుడు అది ఎలా జయిస్తుంది? సత్ అనగా సత్యాన్ని అనగా ఉన్నదాన్ని ఎవడు లేకుండా చేయగలడు? ఇది సంపూర్ణ సత్యాగ్రహశాస్త్రం.

★ ★ ★

# 41

# కార్మికుల ప్రవాహం

న్యూకేసిల్ యందలి గనుల్లో పనిచేస్తున్న భారతీయ కార్మికులపై మహిళల త్యాగప్రభావం అపరిమితంగా పడింది. తమతమ పనిముట్లన్నీ, అక్కడే వదిలివేసి నగరంవైపుకు అంతా ప్రయాణమైనారు అదొక జనప్రవాహం వెంటనే నేను ఫినిక్సు వదిలి, న్యూకేసిల్ చేరుకున్నాను

ఆ బానిస కార్మికులకు యిండ్లు అంటూ వుండవు యజమానులు యిచ్చిన కొంపల్లో వుండాలి వాళ్లే నీళ్లు యిస్తారు లైట్లువేసి వెలిగిస్తారు అన్ని విధాల వారు బానిసలుగా వుంటారు తులసీదాసుకవి చెప్పినట్లు "పరాధీనులై యుండు బానిసలకు స్వప్నంలో కూడా సుఖం కలుగదు".

ఈ కార్మికులు యజమాన్లపై చేసే ఆరోపణలు అన్నీ యిన్నీ కావు వాళ్లవన్నీ పెద్ద కన్నీటి కష్టగాథలే సయ్యద్ ఇబ్రహీం అను పఠాను తన వీపు చూపించాడు. ఆయన వీపంతా చిట్లి పోయింది చూడండి ఎలా కొట్టారో. నీమాట వింటున్నానని కొట్టారు నేను పఠానును. ఇతరుల్ని కొట్టడమేగాని కొట్టించుకోవడం ఎరుగని పఠాను కాని నీ మాట ప్రకారం భరించాను. నీకోసం పని వదిలి వచ్చేశాను" అని అన్నాడు .

"సోదరా! మంచిపని చేశావు ఇదే నిజమైన శౌర్యం. మీ వంటి వారిశక్తి సామర్థ్యాలే మన విజయానికి సాధనాలు" అని జవాబిచ్చాను.

పైకి ధన్యావాదాలు సమర్పించానే కాని లోలోన బాధపడ్డాను. కార్మికుల సమ్మె యిలా అయితే ఎక్కువ కాలం సాగదని అనిపించింది. ధన, మాన, ప్రాణాలన్నీ యజమాన్ల చేతుల్లో వుంటే యీ కార్మికులు ఎక్కువ కాలం ఎలా నిలబడి వుంటారు? మధ్యలో అలిసిపోయి వెనుకంజ వేయడం కంటే ఉద్యమం విరమించి ఓటమిని అంగీకరించి వీళ్లంతా తిరిగి తమ పనులు ప్రారంభిస్తే మంచిదని అనిపించింది. కాని నా మాట వాళ్లు వింటారా? వినరు అట్టి స్థితిలో ఏం చేయాలి? యజమాన్ల కొంపల్ని వదిలివేయడమే ఉత్తమ మార్గం. అంటే హిజరత్ చేయాలన్నమాట.

పది, యాభై మంది కాదు, కార్మికులు వందలాది సంఖ్యలో వున్నారు వేల సంఖ్య అని కూడా చెప్పవచ్చు వాళ్లందరికీ ఇళ్లు ఎక్కడ నుండి తీసుకురావడం? వారందరికీ తిండి ఎలా పెట్టడం? భారతదేశాన్ని నేను యింత వరకు ఏమీ అడగలేదు. అక్కడి నుంచి డబ్బేమీ అందలేదు తరువాత ధనవర్షం కురిసిన మాటనిజమే దక్షిణాఫ్రికా యందలి వ్యాపారులు భయపడ్డారు బహిరంగంగా నాకు సాయం చేయడానికి వెనుకంజవేయ సాగారు వాళ్ల వ్యాపార లావాదేవీలు గనుల తెల్లజాతి యజమానులతోను, తెల్ల వ్యాపారులతోను వున్నాయి కనుక బహిరంగంగా నాకు అండగా నిలవలేరు కదా! న్యూకేసిల్ వెళ్లినప్పుడు యీ వ్యాపారుల గృహాల్లో వుండేవాడిని. కాని యీసారి నేను వాళ్లకు అశ్రమ కలిగించలేదు మరో చోట వుండటానికి ఏర్పాటు చేసుకున్నాను

ట్రాన్స్‌వాల్ వచ్చిన సత్యాగ్రహదళ మహిళలంతా ద్రావిడ ప్రదేశానికి సంబంధించిన వాళ్లు. వాళ్లు ఒక క్రైస్తవ కుటుంబంతో బాటు వున్నారు అది మధ్య తరగతి కుటుంబం కొద్ది వ్యవసాయ భూమి, మూడునాలుగు గదుల యిల్లు వారికి వున్నది వారి యింట్లో వుండాలని అనుకున్నాను ఇంటి యజమాని పేరు శ్రీ డా॥ లాజరస్ బీదవాడికి ఒకరి భయం ఎందుకు కుంటుంది? వారంతా గిర్‌మిటియా కార్మికుల కుటుంబానికి సంబంధించిన వారే మూడు పౌండ్ల పన్ను వారంతా ప్రభుత్వానికి చెల్లిస్తున్నారు పడేబాధ లేమిటో వాళ్లకు బాగా తెలుసు కనుకనే వాళ్లకు కార్మికులంటే సానుభూతి ఎక్కువ. నాకు స్వాగతం ఆ కుటుంబీకులంతా పలికారు. సామాన్యంగా నేను ఎవరి యింట్లో వున్నా ఆ యింటి వారికి ఏ మాత్రం తీరిక వుండదు. జనం తాకిడి ఎక్కువ కదా! అయితే యీ పర్యాయం నాకు స్వాగతం చెప్పిన వారికి అన్నీ కష్టాలే. ధన నష్టం, ఆస్తినష్టం. ఒకటేమిటి అంతా నష్టమే యిన్ని కష్టాలు ధనిక వ్యాపారులు పడలేరు కదా! ఈ విషయమంతా నాకు తెలుసును కనుక లాజరస్ కుటుంబీకుల్ని యిబ్బంది పెట్టడానికి నేను యిష్టపడలేదు. శ్రీ లాజరస్ జైలుకు వెళ్లగలడు. ధన నష్టం భరించగలడు. కాని తనకంటే బీదవారైన గిర్‌మిటియా కార్మికుల కష్టాలు చూచి ఎలా

భరించగలడు? తన కుటుంబ మందలి స్త్రీలు భారతీయ కార్మికుల మేలు కోసం జైలుకు వెళ్లడం కండ్లారా చూచాడు. తన కర్తవ్య నిర్వహణకోసం యీసారి లాజరస్ నన్ను తన యింటికి ఆహ్వానించాడు. వారింట్లో అడుగు పెట్టానో లేదో వారిల్లు ధర్మసత్రంగా మారిపోయింది. ఇల్లంతా జనమే. చుట్టు ప్రక్కలా జనమే. 24 గంటలు పొయ్యి మండుతూనే వున్నది. లాజరస్ భార్యకి వంటపని తప్ప మరో పనిచేయడానికి తీరిక చిక్కలేదు. అయినా భార్యా భర్తల ముఖంలో ఎప్పుడు చూచినా చిరునవ్వే వారి ముఖంలో కోపాన్ని నేను చూడలేదు.

పాపం లాజరస్ అంతమంది కార్మికులకు ఆహారం ఎలా అందజేస్తాడు. కార్మికులకు "మీ సమ్మె చాలా కాలం సాగుతుంది. యజమానులు యిచ్చిన కొంపలు వదిలివేయండి. అమ్మడానికి వీలైన సామాన్లు అమ్మివేయండి. మిగిలిన సామాను కొట్లలో దాచండి. యజమానులు ఆ సామాను ముట్టుకోరు. కాని విపరీతమైన ద్వేషంతో మీ సామాను బైటపారవేయవచ్చు. అందుకు సిద్ధపడండి. నేను బయట వున్నంత వరకు మీతో వుంటాను. మీతో బాటు తిండి తింటాను. కాని మీరు ఎన్ని త్యాగాలకైనా సిద్ధపడితేనే నిలబడి వుండండి. చాలా కాలం ఉద్యమం సాగినా చివరికి విజయం మనకు తప్పక లభిస్తుంది" అని చెప్పాను. "మీలో ఎవరైనా తట్టుకోలేక తిరిగి వెళ్లి పనిలో చేర తలిస్తే తప్పక చేరండి. అలా చేరిన వారిని మిగతా వారెవ్వరూ అవమానించకండి, హింసించకండి" అని కూడా చెప్పాను. ఎవ్వరూ అలా చేసినట్లు నాకు సమాచారం అందలేదు. కార్మికులంతా నేను చెప్పినట్లు చేసి భార్యాపిల్లలతో, కట్టుబట్టలతో, మూటాముల్లె నెత్తిన పెట్టుకొని నా దగ్గరికి రాసాగారు. నా దగ్గర నేల తప్ప మరేమీ లేదు. అయితే వర్షాకాలం, ఎండా కాలం కాకపోవడం నిజంగా అదృష్టమే. భోజనం విషయంలో వ్యాపారులు సాయం చేస్తారని భావించాము. న్యూకేసిల్‌కు చెందిన వ్యాపారులు వంట పాత్రలు, ధాన్యం బస్తాలు వగైరా పంపి సహాయం చేశారు. ఇతర పట్టణాలనుంచి పప్పు, కూరలు, పండ్లు, పంచదార, తేనె మొదలుగా గల వస్తువులన్నీ వర్షధారల్లా కురవసాగాయి. అవసరాన్ని మించిన వస్తువులు

చేశాయి. ఇక ఏమీ దిగులు పడలేదు. ఎక్కువ మంది జనం జైలుకు వెళ్లటకు సిద్ధంగా లేరు. అయితే అంతా జాతి సమస్య పరిష్కారానికై సహాయం చేయటకు సిద్ధంగా వున్నారు. చాలా మంది వాలంటీర్లుగా పని చేశారు. ఇంత మంది చదువురాని పేద భారతీయ కార్మిక స్త్రీ పురుషుల, బాలల సాయం కోసం ఎంతో మంది సుశిక్షితులైన స్వయం సేవకులు అవసరం అయ్యారు. అలాంటి వాళ్లు మాకు లభించడం విశేషమే. జనం తండోపతండాలుగా రాసాగారు. ఇంత మందిని పనిపాటలేకుండా ఒక్క చోట వుంచడం ఎంత ప్రమాదకరమో ఊహించవచ్చు. ఆ జనంలో రక రకాల వాళ్లు వున్నారు. దొంగతనం చేసి, హత్యలు చేసి, వ్యభిచారంచేసి, మలమూత్రాదులు ఎక్కడ బడితే అక్కడ విసర్జించి, ఇతర తప్పు పనులు చేసి శిక్షలు అనుభవించిన వాళ్లు కూడా వారిలో వున్నారు. అయితే నేనెవరినీ ఏమీ అడుగుటకు వీలులేని స్థితి. అడిగితే నిజం చెబుతారా? న్యాయనిర్ణేతను కాదు గదా! సమ్మె నడపడం వరకే నా పని. అందులో పాల్గొంటున్న వాళ్లు గతంలో ఎలాంటి వారో తెలుసుకోవడం నా పని కాదు. ఇలాంటి రకరకాల జనం పని ఏమీ లేకుండా ఒకచోట వుంటే ముప్పు కలగకుండా వుండటం సాధ్యం కాదు. అయితే భగవంతుని దయ అక్కడ వున్నన్ని రోజుల ప్రశాంతంగా గడిచాయి. అందరూ తమ తమ ధర్మాన్ని పాలించారు. శాంతికి సహకరించారు. అది గొప్ప చమత్కారమే.

ఇక నాకు నా సమస్యకు పరిష్కార మార్గం లభించింది. ఈ జనాన్ని ట్రాన్స్‌వాల్‌కి తీసుకు వెళ్లాలి. 16 మంది సత్యాగ్రహుల మాదిరిగా వీళ్లందరినీ అరెస్టు చేయించాలి. ఈ జనంతో ట్రాన్స్‌వాల్ యూనియన్ జైళ్లు నిండిపోవాలి. ఇంతకంటే మించిన ఉత్తమ మార్గం నాకు మరొకటి కనబడలేదు. చిన్న చిన్న గుంపులుగా పంపుదామని ముందు అనిపించింది. కాని లాభం లేదని గ్రహించాము. మొత్తం ఆరువేల మంది జనం. వీళ్లందరినీ రైల్లో తీసుకు వెళ్లడం కష్టం. అంత డబ్బు ఎక్కడి నుండి వస్తుంది? అక్కడికి ట్రాన్స్‌వాల్ 36 మైళ్ల దూరాన వున్నది. చివరికి యాత్రతో వెళ్లనెంచాం. కార్మికులతో మాట్లాడాను. వారితో వారి భార్యాబిడ్డలు కూడా వున్నారు. అంతా వీళ్ల

నమిలారు. కాని గుండెను రాయిచేసుకోక తప్పలేదు మీలో తిరిగి గనులకు వెళ్ల దలిచిన వెళ్లిపోవచ్చునని స్పష్టంగా చెప్పివేశాను. అందుకు ఎవ్వరూ యిష్టపడలేదు.

వికలాంగుల్ని రైల్లో పంపాలని నిర్ణయించాం. మిగతా జనమంతా కాలినడకను బయలుదేరుటకు సిద్ధపడ్డారు. రెండు రోజుల్లో చేరదామని చెప్పేసరికి అంతా సంతోషించారు. పాపం లాజరసుకు, వారి కుటుంబీకులకు కొద్దిగా విశ్రాంతి లభిస్తుందని అంతా భావించారు. న్యూకేసల్‌కు చెందిన తెల్లవాళ్లు అంటురోగాలు వ్యాపిస్తాయని హడలిపోయి, వాటి నివారణకు ప్రయత్నాలు ప్రారంభించారు. మా నిర్ణయం తెలియగానే వారందరికీ ఉరట చేకూరింది.

ప్రయాణానికి అంతా సిద్ధపడుతూ వుండగా గనుల యజమానులు నన్ను కలుసుకోడానికి సిద్ధంగా వున్నారని ఒక మనిషి నా దగ్గరకి వచ్చారు. అతని వెంట నేను దర్బను వెళ్లాను. అయితే ఆ కథకు కొత్త ప్రకరణం అవసరం

★ ★ ★

# 42

## గనుల యజమానులను కలుసుకున్న తరువాత

గనుల యజమానుల ఆహ్వానాన్ని అందుకొని నేను డర్బన్ వెళ్లాను. అక్కడ తెల్ల యజమానులపై కార్మికుల సమ్మె ప్రభావం పడిందని తెలుసుకున్నాను. అయితే తెల్ల యజమానులు నాతో మాట్లాడటం వల్ల ప్రయోజనం కలుగుతుందని నేను భావించలేదు. కాని సత్యాగ్రహికి వినమ్రత అవసరం. అవతల వాళ్లు ఎంత అవమానించినా భరించాలి. కోపం తెచ్చుకోకూడదు ఆత్మ శక్తి మీద నిలబడాలి. అవతలి వారికి కూడా నచ్చ చెప్పి వారి హృతయాల్ని మార్చుటకు ప్రయత్నించాలి.

కనుకనే నేను అంగీకరించి వెళ్లాను. అక్కడ వాతావరణం వేడిగా వున్నది. నా మాటలు వినకుండానే యజమానుల ప్రతినిధి చాలా ప్రశ్నలు వేశాడు అన్నింటికీ సమాధానం యిచ్చాను చివరికి "ఈ సమ్మెను ముగిరప చేయడం మీ చేతిలో పని" అని అన్నాను.

"మేము అధికారులంకాము" అని వాళ్ళు జవాబిచ్చారు.

'అధికారులు కాకపోయినా మీరు తలచుకుంటే ఎంతో చేయగలరు. కార్మికుల కోసం మీరు వాదించగలరు. మీరు మూడు పౌండ్ల తల పన్ను రద్దు చేయమని ప్రభుత్వాన్ని కోరితే తక్షణం అది రద్దు అయిపోతుంది. మిగతా శ్వేత జాతీయులకు కూడా మీరు చెప్పవచ్చు" అని అన్నాను.

"అసలు మూడు పౌండ్ల పన్నుకు, గనుల యజమానులమైన మాకు సంబంధం ఏమిటి? గనుల యజమానులు కార్మికులను యిక్కట్ల పాలు చేస్తూ వుంటే మాకు వ్యతిరేకంగా అర్జీ దాఖలు చేయండి"

"కార్మికులకు సమ్మె చేయడం తప్ప మరో మార్గం కనబడలేదని నా అభిప్రాయం. గనుల యజమానుల కోసమే మూడు పౌండ్ల పన్ను ప్రభుత్వం విధించింది. కార్మికుల సేవల్ని యజమానులు కోరుతున్నారు. కాని వారికి స్వాతంత్ర్యం యిద్దామని కోరడం లేదు. అట్టి అన్యాయపు పన్నును రద్దు చేయమని కార్మికులు కోరితే అందు నాకేమీ తప్పు కనబడటంల లేదు. అది యజమానులకు వాళ్లు చేస్తున్న అన్యాయం ఎంత మాత్రం కాదు అని నా అభిప్రాయం అని చెప్పాను.

"అయితే మీరు పనులలో చేరమని కార్మికులకు చెప్పరా?"

"నేను చెప్పలేను"

"అందుకు పరిణామం ఏమిటో మీకు తెలుసా?"

"తెలుసు, నా బాధ్యత నాకు తెలుసు."

"అవును, మీదేంపోతుంది? ఈ సమ్మె వల్ల కార్మికులకు కలిగిన నష్టాన్ని మీరు ఆరుస్తారా? తీరుస్తారా?"

"కార్మికులు బాగా ఆలోచించి, కష్టనష్టాల్ని బేరీజు వేసుకొని యిందుకు పూనుకున్నారు. స్వాభిమానానికి తగిలే దెబ్బకంటే పెద్ద నష్టం మరొకటి వుంటుందని నేను అనుకోవడం లేదు. అసలు ముఖ్యమైన యీ మూల విషయాన్ని కార్మికులు గ్రహించారు. అందుకు నేను సంతోషిస్తున్నాను."

మా సంభాషణ యీ విధంగా జరిగింది. ఆ సంభాషణంతా ఇప్పుడు జ్ఞాపకం లేదు. తమ వాదన బలంగా లేదని యజమానులు గ్రహించడం

నేను గమనించాను. ఈ విషయంలో వాళ్లు ప్రభుత్వంతో మంతనాలు చేస్తున్నారని నాకు తెలుసు. దర్బను వెళ్లేప్పుడు, వచ్చేప్పుడు రైళ్లలో మూడో తరగతిలోనే నా ప్రయాణం చేశాను. రైల్వే అధికారులు, గార్డులు, అంతా నాతో మంచిగా వ్యవహరించారు అంతా నా దగ్గరికి వచ్చి సమ్మెను గురించి వివరంగా, నమ్రంగా అడుగుతూ వున్నారు. వారంతా కార్మికులకు అనుకూలంగా వున్నారు నా మీద ప్రేమ చూపించారు. నాకు సౌకర్యాలు కల్పిస్తామని ముందుకు వచ్చారు కాని నేను మంచిగా, నమ్రంగా అన్నింటినీ నిరాకరించాను. వారు చూపించిన సుహృద్భావానికి కృతజ్ఞుణ్ణే కాని దాన్ని కొనడం నాకు యిష్టం వుండదు. చదువురాని, పేద కార్మికులు యింత ధైర్యంగా వున్నారంటే అందరికీ ఆశ్చర్యం కలిగింది. స్థిరత్వం, దృఢత్వం అనేవి సుగుణాలు, శత్రువులపై కూడా అవి తమ ప్రభావం చూపుతాయి.

న్యూకేసిల్‌కు తిరిగి వచ్చాను. కార్మికుల ప్రవాహం అపరిమితంగా యింకా వస్తూనే వున్నది. సమ్మె చేస్తున్నవారికి పరిస్థితిఅంతా సవివరంగా చెప్పాను. యజమానులు చేసిన బెదిరింపులు కూడా చెప్పాను. తిరిగి వెళ్లతలుచుకుంటే వెళ్లమని చెప్పి, భవిష్యత్తులో రాబోయే ప్రమాదాల్ని కూడా తెలియ చేశాను. జైళ్లను గురించి, తిండి, తిప్పల్ని గురించిన కష్టాలు కూడా వివరించి చెప్పాను. ఎన్నిసార్లు చెప్పినా కార్మికులంతా ఏకోన్ముఖంగా "ఎన్ని పిడుగులు మీద పడ్డా మేము భయపడం. మీరే మాకు అండ. మీరు మా ప్రక్కన వున్నంత వరకు మాకు భయం లేదు. విజయం మనదే" అని చెప్పి వేశారు.

ఇక మాకు వేరే మార్గం లేదు. ఒకనాటి సాయంత్రం, రేపు ఉదయమే యాత్ర బయలుదేరుతుందని చెప్పాను. (28 అక్టోబరు 1913) దారిన నడుస్తున్నప్పుడు పాటించవలసిన విధులు చదివి వినిపించాను. 5 లేక 6 వేలమందిని సంభాళించడం సులభమైన పని కాదు. వాళ్ల సంఖ్య మొత్తం ఎంతో నాకు తెలియదు. వాళ్ల పేర్లు, చిరునామాలు నా దగ్గర లేవు. ఎంత మంది వుంటే అంతే నాకు సంతోషమని చెప్పాను. ప్రతివ్యక్తికి యిచ్చే రొట్టె పంచదారను గురించి చెప్పి అంతకంటే ఎక్కువ యిచ్చుటకు శక్తి లేదని

కూడా చెప్పి వేశాను. జూలూల తిరుగుబాటు, బోయర్ల యుద్ధంలో నాకు కలిగిన అనుభవాలు యిప్పుడు నాకు బాగా సహకరించాయి. వెంట అవసరానికి మించిన బట్టలు తెచ్చుకోవద్దని, ఏ బరువూ వెంట పెట్టుకోవద్దని, త్రోవలో కలిసిన తెల్లవాడు మనల్ని తిట్టినా, కొట్టినా సహించాల్సిందేకాని వాడిమీద తిరగబడకూడదని, పోలీసులు అరెస్టు చేస్తే అరెస్టు అయిపోవాలని, నన్ను అరెస్టు చేసినా మీరు ముందుకు సాగితీరాలని, మొదలుగా గల విషయాలన్నీ వారికి చెప్పి వేశాను. నన్ను అరెస్టు చేస్తే తరువాత నాయకత్వం వహించేవారి పేరు, వారిని అరెస్టు చేస్తే తరువాతి నాయకుని పేరు వరుసగా ప్రకటించాను.

నా సూచనల్ని అంతా విన్నారు. మా యాత్రదళం క్షేమంగా చార్ల్సుటౌన్ చేరుకున్నది. అక్కడి భారతీయ వ్యాపారులు ఎంతో సహాయం చేశారు. తమ గృహాలను కూడా ఉపయోగించుకోమని అన్నారు. మసీదు యందలి మైదానాన్ని వంటలు చేసుకోమని యిచ్చారు. త్రోవలో యిచ్చే భోజనం వేరు, మజిలీలో యిచ్చే భోజనం వేరు కనుక వంట పాత్రలు అవసరమయ్యాయి. వ్యాపారులు పాత్ర లిచ్చారు. బియ్యం, పప్పు ఉప్పు అన్నీ యిచ్చారు.

చార్ల్సుటౌన్ చిన్న గ్రామం అక్కడి జనం సంఖ్య 1000. ఇన్ని వేల మంది ఎక్కడ వుంటారు? స్త్రీలను, పిల్లలను గృహాల్లో వుంచాము. ఇక మిగతా వాళ్లంతా మైదానంలోనే మకాం చేశారు.

అక్కడ తీయని సంస్మరణలతో బాటు చేదు అనుభవాలు కూడా మాకు కలిగాయి. అక్కడి ఆరోగ్యశాఖాధికారి డా॥బ్రిస్కో యింత జనాన్ని చూచి హడలిపోయాడు. అయితే అతడు కఠోర చర్యలేమీగైకొనలేదు. నన్ను కలిసి అవసరమైన సహాయం చేయమని కోరాడు. ఆంగ్లేయులు మూడు విషయాలను గురించి శ్రద్ధ వహిస్తారు. భారతీయులు ఆ విషయాల్ని పట్టించుకోరు. (1) నీటి స్వచ్ఛత (2) రోడ్ల పరిశుభ్రత (3) పాయిఖానా దొడ్ల పరిశుద్ధ్యం ఈ మూడింటిని గురించిన అనేక సూచనలు చేసి, జనానికి చెప్పి జాగ్రత్త పడమని మరీ మరీ చెప్పాడు. అన్నింటినీ అంగీకరించాను. వారికి శాంతి లభించింది.

ఆ నియమాల్ని మనవాళ్ల చేత పాటింప చేయడం సాధ్యమా? అయితే మనవాళ్లు ఆ పనుల్ని సులభం చేశారు. సేవ చేసేవాళ్లు జనం మీద అధికారం చలాయించకుండా వుంటే పని తేలికగా జరుగుతుంది. సేవకులు కాయకష్టం చేయాలి. ఊడ్చడం దగ్గరి నుంచి అన్ని పనులు చేయాలి. మనం పని చేయకుండా మీరు చేయమని చెబితే ఎవరు చేస్తారు. అంతా సర్దార్లే అయితే పని చేసే దెవరు? అందువల్ల అంతా సేవాధర్మం నిర్వహిస్తే పనులన్నీ సక్రమంగా జరుగుతాయి.

శ్రీ కెలెన్ బెక్ ముందే చార్ల్సటౌన్ చేరారు. కుమారి శేసిన్ కూడా వచ్చారు. ఆమె సేవ, జాగ్రత్త, తెలివితేటలు మొదలగువాటిని గురించి ఎంత వ్రాసినా చాలదు. కీ॥శే॥ పి.కె. నాయుడు క్రిష్టోఫర్ పేర్లు జ్ఞాపకం వచ్చాయి. ఇంకా చాలా మంది వున్నారు. అంతా కలిసి పనిని సులభం చేశారు. కూరలు బాగా లభించాయి. వాటిని వేరే ఉడికించకుండా పప్పులో వేసేవారు. రాత్రింబవళ్లు వంటపని సాగుతూనే వున్నది. వచ్చిన వారికి లేదు అనుమాట వినబడలేదు. న్యూకేసిల్‌లో ఎవరు ఉంటారు? అందువల్ల కార్మికులంతా తిన్నగా చార్ల్సటౌన్ చేరుకుంటున్నారు.

ప్రజల సహనం, ఓపిక చూస్తే సాక్షాత్తు ఆపరమేశ్వరుని స్వరూపమే వారిలో కనబడింది. వంటచేసే వారికి నేనే పెద్దను. పప్పులో నీళ్లు ఎక్కువ. బియ్యంలో నీళ్లు ఎక్కువ. ఏ వంటా సరిగా వుండేది కాదు. కాని ఎవ్వరూ మారుమాట్లాడకుండా సహించి వాటిని తిన్నారూ అంటే అంతా పరమేశ్వరుని కృపయే. వంట చేయడం తేలికేకాని, వడ్డించడం అమిత కష్టం. ఆ పని నేను చేసేవాణ్ణి. జనం నన్ను చూసి ఏమీ అనలేక పాపం ఊరుకునే వారు. స్త్రీలకు కొద్దిగా వడ్డిస్తే చురచుర నావంక చూచి, నా స్థితిని గమనించి వెళ్లి పోయేవారు. ఆ దృశ్యాల్ని జీవితంలో ఎన్నటికీ మరువ లేను. నా దగ్గర ఆహార పదార్థం తక్కువగా వున్నది. భోజనం చేసే వారి సంఖ్య ఎక్కువగా వున్నది. ఏం చేయను అని వారితో అనగానే మారుమాట్లాడకుండా వెళ్ళిపోతూ వుండేవారు. నేను చెప్పిన మాటలు విని 'సంతోషం' అని ముఖ్యంగా స్త్రీలు అనడం జీవితంలో మరిచిపోలేను.

ఇవన్నీ తీయని జ్ఞాపకాలు, కాని చేదు అనుభవాలు కూడా కలిగాయి. ఒక్క నిమిషం పాటు సమయం చిక్కితే తగాదాల వ్యవహారం ముమ్మరంగా సాగుతూ వుండేది. ఇది వెర్రి అలవాటు. అక్కడ వ్యభిచారం కూడా మొదలైంది. స్త్రీపురుషుల్ని విడిగా వుంచడానికి చోటు లేక కలిసి వుంచితే దానికి దుష్ఫలితంగా వ్యభిచారం సాగింది. వ్యభిచారికి సిగ్గు వుండదు. అలాంటి ఘట్టాలు జరుగుతున్నాయని తెలియగానే నేను వెళ్లేవాడిని. వ్యవభిచారులు సిగ్గుతో తలవంచుకునేవారు. విడివిడిగా వుంచినా నాకు తెలియని ఘట్టాలు ఎన్ని జరిగాయో ఎవరికెరుక? ఇక యీ చర్చను ఆపుతాను. ఇదంతా ఎందుకు వ్రాశానంటే అంతా సవ్యంగా జరగలేదని పాఠకులు తెలుసుకోవాలని నా కోరిక. అయితే ఎవ్వరూ నా మీద విరుచుకుపడలేదు. అడవి జాతి రకం వాళ్లే అయినా, నీతికి అవినీతికి తేడా తెలియని వాళ్లే అయినా, వాతావరణం మంచిగా వుంటే సరియైన మార్గం మీద అంతా నడుస్తారు. ఈ విషయం పలు ఘట్టాల వల్ల తెలుసుకున్నాను. ఈ సత్యాన్ని తెలుసుకోవడం అవసరం. ఎంతో ప్రయోజనకరం కూడా.

* * *

## 43

# ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశం - 1

1913 నవంబరు మాసం చివరికి చేరుకున్నాం. ముందుకు సాగే పూర్వం రెండు ఘట్టాలు వివరిస్తాను. న్యూకేసిల్‌లో తమిళ సోదరీమణులు జైలుకు వెళ్లారని తెలుసుకొని దర్బనుకు చెందిన భాయీ ఫాతిమా మెహతాబ్ ఆగలేక తన తల్లి హనీఫా బాయిని, ఏడు సంవత్సరాల వయస్సుగల బిడ్డని వెంటబెట్టుకొని జైలుకు వెళ్లాలని వాక్సరస్ట్‌కు బయలుదేరింది. తల్లీకూతుళ్లను అరెస్టు చేశారు. కాని బిడ్డని అరెస్టు చేయుటకు ప్రభుత్వం అంగీకరించలేదు. బాయీ ఫాతిమా వ్రేళ్ల ముద్రలు తీసుకోవాలని పోలీసులు చాలా ప్రయత్నం చేశారు కాని ఆమె నిర్భయంగా నిలబడి వ్రేలి ముద్రలు వేయనని భీష్మించింది.

అప్పుడు కార్మికుల సమ్మె తీవ్రంగా సాగుతున్నది. ఆ సమ్మెలో స్త్రీలు, పురుషులు యిరువురు పాల్గొంటున్నారు. స్త్రీలలో యిద్దరు తల్లుల వెంటవారి బిడ్డలు కూడా వున్నారు. ఒక బిడ్డ ఆ గుంపులో శీతలంకమ్మి చనిపోయింది. రెండోబిడ్డ, తల్లి కాలువ దాటుతూ వుండగా చెయ్యిజారి నీటిలో పడిపోయింది. చనిపోయింది. అయినా తల్లులు బయపడలేదు. సత్యాగ్రహ యాత్రలో యిద్దరూ పాల్గొని ముందుకు సాగారు. "చనిపోయిన బిడ్డల కోసం ఎందుకు శోకించడం? వాళ్లు తిరిగి రారు కదా! జీవించి యున్నా బిడ్డల కోసం త్యాగం చేద్దాం" అని ఆ యిరువురు తల్లులు అన్నారు. పేద స్త్రీలు సైతం యింతటి త్యాగం, యింతటి దీక్ష, యింతటి నిష్ఠ చూపడం సామాన్యమైన విషయమా? యిటువంటి ఎన్నో జ్ఞానోదయం కలిగించే ఘట్టాలు చూచాను.

చార్ల్సటౌన్‌లో స్త్రీలు పురుషులు దృఢమైన దీక్షతో ముందుకు అడుగు వేశారు. అయితే మేము అక్కడికి వేరే పనిమీద వచ్చాం. కాని అక్కడ ఎటు చూచినా "ఇక్కడ శాంతి లేదు" అని వ్రాసి యున్న అట్టలు కనబడ్డాయి. అలాంటి అశాంతిమయమైన చోటునందే, మీరాబాయి వంటి భక్తురాలు విషపాత్రను అధరాలతో తాకింది. సుకరాత్ విషపాత్రను పుచ్చుకొని చీకటికొట్టో కూర్చుని అనుచరులకు "శాంతి కావాలనుకంటే నీవు నీలోనే వెతికి చూచుకో" అంటూ జ్ఞానోపదేశం చేశాడు.

ఇలాంటి అశాంతిమయమైన చార్ల్సటౌనులో సత్యాగ్రహదళ సభ్యులు మకాం పెట్టి రేపే మవుతుందో తెలియని స్థితిలో పడి వున్నారు. నేను ట్రాన్స్‌వాల్ ప్రభుత్వానికి జాబువ్రాశాను. అందు "మేము ట్రాన్స్‌వాల్‌లో నివాసం కోసం రావటం లేదు. మీరు చేసిన వాగ్దాన భంగానికి వ్యతిరేకంగా మా అభిప్రాయం తెలుపుటకు మాత్రమే వస్తున్నాము. ఆ స్వాభిమానానికి మీరు కొట్టిన గట్టి దెబ్బను ప్రశాంతంగా ప్రకటించడమే మా యీ యాత్రాదళ ఉద్దేశ్యం, మీరు చార్ల్సటౌన్‌లోనే మమ్మల్ని అరెస్టు చేస్తే సంతోషిస్తాం, అట్టి స్థితిలో మాలో ఎవరైనా రహస్యంగా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిస్తే అందుకు మేము బాధ్యత వహించం, మా యీ పోరాటంలో రహస్యం ఏమీ లేదు, మాకేమీ వ్యక్తిగతస్వార్థం లేదు, మాలో రహస్యంగా ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించడం మాకు

యిష్టంలేదు. వేలాది మంది అపరిచితులతో నిండి సాగుతున్నా మాయీ సత్యాగ్రహ సమరంలో ఎవరైనా రహస్యంగా వస్తే మేమేమీ చేయలేము. మీరు మూడు పౌండ్ల తలపన్ను రద్దు చేస్తే మా యీ యాత్ర తక్షణం ఆగిపోతుంది. గిర్‌మిట్ కార్మికులు తిరిగి పనికి వెళ్లిపోతారు," అని స్పష్టంగా వ్రాశాను.

మా స్థితి అనిశ్చితంగా వున్నది. ప్రభుత్వం ఎప్పుడు మమ్మల్ని అరెస్టు చేస్తుందో తెలియదు. అట్టిస్థితిలో ప్రభుత్వం వారి జవాబుకోసం మేము వేచి వుండటం సాధ్యం కాని పని. అందువల్ల ప్రభుత్వం అరెస్టు చేయకపోతే మనం చార్ల్సటౌన్ వదలి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిద్దామని నిర్ణయానికి వచ్చాం. త్రోవలో ప్రభుత్వం అరెస్టు చేయకపోతే రోజుకు 20 లేక 24 మైళ్లు నడుస్తూ ఎనిమిది రోజుల పాటు యాత్ర సాగించాలని కూడా నిర్ణయానికి వచ్చాం ఎనిమిది రోజుల్లో టాల్‌స్టాయి క్షేత్రం చేరుకోవడం మా లక్ష్యం. సంగ్రామం పూర్తి అయ్యేదాకా సత్యాగ్రహులంతా అక్కడే వుండాలనీ, కాయకష్టం చేసి భోజనం ఏర్పాటుచేసుకోవాలని కూడా నిర్ణయానికి వచ్చాం శ్రీ కెలిన్‌బెక్ ఏర్పాటంతా చేసి వుంచారు. అక్కడ కార్మికుల చేత మట్టి యిళ్లు నిర్మించి వాటిలో సత్యాగ్రహులు వుండాలని, యిళ్లు తయారు కానంత వరకు డేరాలు వేసి అందు వృద్ధుల్ని పిల్లల్ని, స్త్రీలను వుంచాలని, పురుషులంతా మైదానంలో వుండాలని నిర్ణయించాం. అయితే వర్షాకాలం కనుక దాన్ని ఎలా తట్టుకోవాలి? శ్రీ కెల్బలెన్ బెక్ యిట్టి విషయాల్లో సమర్థుడు. ఆయన అందుకు అవసరమైన ఏర్పాట్లు చేస్తారు అని అనుకున్నాం.

యాత్రకు అవసరమైన ఏర్పాట్లు చేసుకున్నాం. చార్ల్సటౌనుకు చెందిన సజ్జనుడు డాక్టర్ బ్రిస్కో. ఆయన మాకు అత్యవసరంగా కావలసిన మందుల పెట్టె, అత్యవసరమైన వైద్యపరికరాలు మాకు యిచ్చారు. ఆ పరికరాల్ని నేను కూడా ఉపయోగించ్చు. ఆ పెట్టెను మేమే ఎత్తుకొని వెళ్లాలి. మా వెంట బండి ఏమీ లేదు. ఆ పెట్టెలో తక్కువ మందులున్నాయని, వందమందికి యిచ్చేందుకు అవసరమైన మందులు అందులేవని, పాఠకులు గ్రహించే వుంటారని భావిస్తున్నాను. త్రోవలో అనేకగ్రామాలు తగులుతాయి. తగ్గిన

ముందులు అక్కడ సేకరించుకోవచ్చునని భావించాం. రోగుల్ని వెంట తీసుకువెళ్లకుండా త్రోవ యందలి గ్రామాలల్లో వదిలి ముందుకు పోగాలని భావించాము.

డబల్‌రొట్టె, పంచదార తప్ప మాదగ్గర యింకేమీలేదు. ఎనిమిది రోజులకు సరిపడరొట్టె ఎలా సేకరించడం? యాత్రికులకు రోజూ రొట్టెల్ని అందజేయాలిగదా! ప్రతిమజిలీ దగ్గర మాకు రొట్టెలు అందించే బాధ్యత ఒకరు వహించారు. ఎవరు వహిస్తారు? అక్కడ గ్రామాలకు నగరాలనుంచే డబల్ రొట్టె చేరుతుంది. అట్టిస్థితిలో పట్టణాలనుంచి రైలు స్టేషనుకు డబల్ రొట్టె అందజేసే వ్యవస్థ చేయవలసి వచ్చింది. చార్ల్సటౌనులో తెల్లవాని పేదల రొట్టెల దుకాణం వున్నది. అతడు ప్రతి రైలు స్టేషను దగ్గర రొట్టె అందజేస్తానని మాట యిచ్చారు అతడు మమ్మల్ని మోసం చేయలేదు. ఎక్కువ ధర తీసుకోలేదు. మంచి పిండిని వినియోగించాడు. ఎంతో నిజాయితీగా రొట్టెల్ని రైలుస్టేషన్లకు పంపాడు. రైల్వే పనివాడు ఎంతో నిజాయతీగా రొట్టెల్ని మాకు అందజేశారు. మాకోసం ప్రత్యేక సౌకర్యాలు చేశారు. మేమెవ్వరికీ అపకారం చేయమనీ, కష్టాలు దుఃఖాలు సహించి బాధలు తీర్చుకోవడమే మా లక్ష్యమని అందరికీ బాగా తెలిసిపోయింది. అందువల్ల మా చుట్టు ప్రక్కల వాతావరణమంతా పరిశుద్ధమవడమేగాక, ప్రజలహృదయాలలో వుండే ప్రేమ అను సుగుణాన్ని జాగృతం చేసింది. హిందువులం, ముస్లిములం, క్రైస్తవులం, పారసీకులం అంతా అన్నదమ్ములుగా కలిసిమెలిసి వున్నామని కూడా అందిరికీ తెలిసిపోయింది.

మా యాత్రకు అవసరమైన ఏర్పాట్లు అన్నీ పూర్తి అయ్యాయి. అప్పుడు నేను మళ్లీ యింకోసారి ప్రభుత్వంతో రాజీపడదామని ప్రయత్నించాను. జాబులు, తంతులు పంపాను. వాళ్లు నన్ను అవమానించినా సరే, టెలిఫోనులో వారితో మాట్లాడదామని కూడా నిర్ణయించాను. చార్ల్సటౌను నుంచి ప్రిటోరియాకు ఫోను వ్యవస్థ వున్నది. నేను తిన్నగా జనరల్ స్మట్సుకు ఫోను చేశాను. అతని కార్యదర్శి పక్షమున దొరికారు. "జనరల్ స్మట్సుకు చెప్పండి. మా యాత్రకు ఏర్పాట్లన్నీ జరిగాయి. ఫోక్సరస్ట్ యందలి తెల్లవారు ఉత్తేజితులైనవారు. బహుశ వాళ్లు మా ప్రాణాలకు సైతం ముప్పు కలిగించవచ్చు.

ఆ విధంగా మే ... విరించారు. అటువంటి పరిణామం కలగాలని నేను కోరుకుంటున్నాను. ఈ విషయం జనరల్ స్మట్సుకు తప్పక చెప్పండి. వారు మూడు పౌండ్ల తలపన్ను చట్టాన్ని రద్దు చేస్తే యీ యాత్రను ఆపుచేస్తాం. కేవలం చట్టాన్ని వ్యతిరేకించడం మాకు యిష్టం లేదు. కాని తప్పనిసరి అయి ఆ పనిచేస్తున్నాము. జనరల్ నా యీ మాటను అంగీకరించరా? అని అడిగాను. మరుక్షణమే "జనరల్ స్మట్స్ మీతో ఏ విధమైన సంబంధం పెట్టుకోదలచలేదు మీరు ఏం చేస్తారో చేసుకోండి" అంటూ ఫోనును టక్కున పెట్టి వేశారు.

అట్టి సమాధానమే లభిస్తుందని అనుకున్నాను. అయితే శిష్టత చూపరేమోనని మాత్రం భావించాను. సత్యాగ్రహ ఏర్పాట్లు జరిగిన తరువాత జనరల్ స్మట్సుతో నాకు ఆరు సంవత్సరాల రాజకీయ పరిచయం ఏర్పడింది. అయితే శిష్టతగా అతడు వ్యవహరించినా ఉబ్బిపోయే స్థితిలో నేను లేను. కనుక అతడి యీ అశిష్ట ప్రవర్తనను చూచి నీరసపడిపోలేదు. నాకర్తవ్య మార్గం తిన్నగా కండ్ల ముందును నాకు కనబడుతూ వున్నది. మరునాడు (1913 నవంబరు 6) నిశ్చితసమయానికి (ప్రొద్దున ఆరున్నర గంటలకు) మేము ప్రార్థన చేశాం. దేవుని పేరట దేవుని మీద భారం వేసి యాత్ర ప్రారంభించాం. మా యాత్రాదళంలో 2037 మంది పురుషులు, 127 మంది స్త్రీలు, 57 మంది బాలలు వున్నారు.

* * *

## 44

# ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశం - 2

ఈ విధంగా దాన్ని ... అనండి, భక్త యాత్రాదళం అనండి, సరిగ్గా నిశ్చిత సమయానికి చార్ల్సటౌనుకు బయలుదేరింది. చార్ల్సటౌనుకు ఒక మైలు దూరాన వాక్సరస్టు అను ఒక చిన్న కాలువ వున్నది. ఆ కాలువను దాటడం అంటే వాక్సరస్టులో లేక ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించినట్లే. ఆ కాలువ ఒడ్డున దగ్గర గుర్రపు రౌతులు పోలీసు దళం వారి దగ్గరికి వెళ్లాము. వెళ్లే ముందు

నేను సైగ చేసిన తరువాత మీరు సరిహద్దు దాటమని మన వాళ్లకు చెప్పాను. నేను పోలీసులతో మాట్లాడుతూ వుండగానే మన వాళ్లు వేగంగా ముందుకు సాగారు. అంతా కాలువను దాటారు. వాళ్లు ట్రాన్స్‌వాల్ సరిహద్దులోకి ప్రవేశించారు. గుర్రపురౌతులు వారిని చుట్టి వేశారు. అయితే మన యాత్ర బృందం సభ్యులు పోలీసులు ఆపితే ఆగలేదు. నిజానికి మమ్మల్ని పట్టుకోవాలని పోలీసులు భావించలేదు. నేను వెంటనే మనవాళ్లందరికీ చెప్పి శాంత పరిచి వరుసగా పంక్తుల్లో నడవమని సర్దిచెప్పాను. అయిదారు నిమిషాల్లో అంతా సర్దుకున్నారు. మా ప్రయాణం ట్రాన్స్‌వాల్‌లో ఆరంభం అయింది.

వాక్స్‌రస్ట్ నందలి తెల్లవారంతా రెండు రోజుల క్రితమే ఒక సభజరిపి, మమ్మల్ని బాగా బెదిరిస్తూ మాట్లాడారు. భారతీయులు గనుక ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిస్తే గుండ్ల వర్షం కురిపిస్తామని కూడా కొందరు అన్నారు. ఆ సభకు శ్రీ కెలిన్ బెక్ తెల్లవారికి నచ్చ చెప్పటకు వెళ్లారు. కాని ఎవ్వరూ వారి మాట వినలేదు. కొందరు తెల్లవాళ్లు ఆయనను కొట్టడానికి లేచారు. శ్రీ కెలిన్‌బెక్ స్వయంగా పైల్మాను. ఆయన ఒక శాండో దగ్గర కసరత్తు నేర్చుకున్నారు. వారిని భయపెట్టడం సాధ్యంకానిపని ఒక తెల్లవాడు వారిని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. "నేను శాంతి ధర్మాన్ని స్వీకరించాను. అందువల్ల నేను నీతో యుద్ధం చేయను. నన్ను కొట్టదలుచుకుంటే కొట్టవచ్చు. నేను యీ సభలో మాట్లాడితీరతాను. మీరు తెల్లవారినందరినీ సభకు రమ్మని ఆహ్వానించారు. నేను ఒక్క విషయం చెప్పదలుచుకున్నాను. శ్వేత జాతీయులంతా నిర్దోషుల్ని కొట్టి హింసించాలని భావించడం లేదు. కనీసం నా వంటి ఒక శ్వేత జాతీయుడు మీరు భారతీయులపై చేస్తున్నవన్నీ అబద్ధపు ఆరోపణలేనని నొక్కి చెబుతున్నాడు. మీరు అనుకున్నట్లు భారతీయులు చేయదలుచుకోలేదు. మీ రాజ్యం వాళ్లకు అక్కరలేదు. మీతో యుద్ధం చేయదలుచడం లేదు. మీ దేశాన్ని భారతీయులతో నింపి వేయదలచటం లేదు. వాళ్లు న్యాయం చేయమని కోరుతున్నారు. ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిస్తున్న భారతీయులు తమ మీద విధించబడిన మూడు పౌండ్ల తల

పన్నును రద్దు చేయమని విన్నవించాలని మాత్రమే భావిస్తున్నారు వాళ్లు శౌర్యవంతులే. వాళ్లు ఏమీ గొడవ చేయరు మీతో యుద్ధం చేయరు మీరు గుండ్ల వర్షం కురిపించినా సహించి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశిస్తారు వారు మీ గుండ్లకు, బలాలకు వెరిచే మనుష్యులు కారు వాళ్లు స్వయంగా కష్టాలు సహించి మీ హృదయాలను కరిగించాలని భావిస్తున్నారు. వాళ్ల మాటలు వింటే మీ హృదయాలు కరిగి పోతాయనే విశ్వాసం నాకున్నది. ఈ విషయం చెప్పడానికే నేను మీ దగ్గరికి వచ్చాను. ఈ రెండు మాటలు చెప్పి మీకు సేవయే చేశాను. జాగ్రత్త పడండి. అన్యాయం చేయకండి," అని చెప్పి కెలన్‌బెక్ మౌనం వహించారు సభకు వచ్చిన జనం ఎక్కువ మంది సిగ్గుపడ్డారు. ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించిన తెల్లవాడు శ్రీ కెలన్‌బెక్‌కు మిత్రుడుగా మారిపోయారు.

ఈ సభను గురించిన వివరం మాకు ముందుగానే తెలిసినందుకు మా జాగ్రత్తలో మేము వున్నాం. పోలీసులు కూడా పెద్ద సంఖ్యలో మొహరించినందువల్ల తెల్లవాళ్లు అఘాయిత్యం ఏమీ చేయకుండా వుండుటకు ఏర్పాటు జరిగిందని భావించాం ఏది ఏమైన మా యాత్రా బృందం శాంతంగా ముందుకు సాగింది. ఒక్క తెల్లవాడు కూడా మా విషయంలో యిబ్బంది కరంగా ప్రవర్తించలేదని నాకు గుర్తు చాలామంది శ్వేత జాతీయులు బయటికి వచ్చి మమ్మ్ము చూడసాగారు. వారి నేత్రాల్లో స్నేహభావం కనబడసాగింది.

మొదటిరోజున బాక్సరస్టుకు సుమారు ఎనిమిది మైళ్ల దూరానగల ఒక స్టేషన్ పామ్ ఫోర్డ్ దగ్గర మేము ఆగాలి. సాయంత్రం 5-6 గంటలకు మేము అక్కడికి చేరాము. యాత్రికులు డబల్ రొట్టె, పంచదారతో తిని తెరప గాలిలో పడుకున్నారు. కొందరు భజనలు చేస్తుంటే, కొందరు మాట్లాడుకుంటూ వున్నారు. త్రోవలో కొందరు స్త్రీలు అలిసిపోయారు. తమ పిల్లల్ని ఎత్తుకొని నడుస్తామని వచ్చారు కాని అలసిపోయి యింకా ముందుకు నడవలేని స్థితిలో వున్నారు. అందువల్ల నన్ను చెప్పి వాళ్లను ఒక మంచి భారతీయ వ్యాపారస్తుని దగ్గర వదిలి పెట్టాను. పిల్లలందరినీ టాల్‌స్టాయి ఫారానికి పంపమని వారికి

చెప్పాను. భారతీయ వ్యాపారి నా ప్రార్థనను అంగీకరించాడు.

చీకటి పడినకొద్దీ గొడవ సద్దుమణిగింది. నేను కూడా పడుకుందామని అనుకుంటూ వుండగా యింతలో బూట్ల చప్పుడు వినబడింది. ఒక తెల్లవాడు చేత్తో లాంతరు పట్టుకొని వస్తూ వుండటం చూశాను. నేను జాగ్రత్తపడిపోయాను. అంతా అర్థమైంది. నేను సిద్ధంగానే వున్నాను. పోలీసు అధికారి దగ్గరికి వచ్చి "మీకు వారంటు తెచ్చాను. మిమ్మల్ని అరెస్టు చేయాలి" అని అన్నాడు.

"ఎప్పుడు?" అని అడిగాను

"ఇప్పుడే" అని అన్నాడు అధికారి.

"నన్ను ఎక్కడకి తీసుకువెళతారు?"

"ఇప్పుడు దగ్గరలోనే వున్న రైలు స్టేషనకు తీసుకువెళతాను. బండిరాగానే దాని బాక్సరస్ట్ తీసుకు వెళతాను.

"ఇయితే ఎవ్వరినీ మేల్కొలపకుండానే మీవెంట వస్తాను. అయితే నా అనుచరుడికి కొన్ని సూచనలు యిస్తాను."

"అలాగే యివ్వండి"

అక్కడే నిద్రపోతున్న శ్రీ పి.కె. నాయుడును మేల్కొలిపాను. నా అరెస్టును గురించి వారికి చెప్పాను. తెల్లవారకముందే ఎవ్వరినీ లేపవద్దని, ఆ తరువాత అందరినీ యాత్రకు బయలుదేరతీయమని, చెప్పాను. నాయుడు భయపడలేదు. తనను కూడా అరెస్టుచేస్తే ఏం చేయాలో కూడా చెప్పాను. శ్రీ కెలెన్‌బెక్ బాక్సరస్టులోనే వున్నారు. నేను పోలీసు అధికారి వెంట వెళ్లాను. తెల్లవారింది. మేమిద్దరం బాక్సరస్టు వెళ్లే రైలు ఎక్కాము. అక్కడి కోర్టులో నా మీద విచారణ జరిగింది. పబ్లిక్ ప్రాసిక్యూటరు నా దగ్గర తగిన ఆధారాలేమీలేవు. కనుక 1913 నవంబరు 14 వరకు కేసును వాయిదా వేయమని స్వయంగా కోరాడు. కేసు వాయిదాపడింది. జమానతు మీద విడుదల చేయమని అర్జీదాఖలు చేశాను. అందువా వెంట 122 మంది స్త్రీలు, 50 మంది బాలలు, 2000 మంది పురుషులు వున్నారు. ఈ లోపున వాళ్లందరినీ నిర్ణీత స్థలానికి చేర్చి విచారణ తేదీకి తిరిగి వస్తానని మనవి చేశాను. ప్రభుత్వ వకీలు నా అర్జీని వ్యతిరేకించారు. కాని మేజిస్ట్రేటు ఏమీ చేయలేక 50

పొంద్ల జమానతు చెల్లించిన మీదట విడుదల చేశారు. శ్రీ కెలన్‌బెక్ బయట కారుతో సిద్ధంగా వున్నారు. దానిమీద ఎక్కించుకొని యాత్రా బృందం దగ్గరికి చేర్చారు. 'దిట్రాన్స్‌వాల్ లీడర్' అను పత్రికా ప్రత్యేక ప్రతినిధి మాతోబాటు వస్తానని అన్నాడు. ఆయనను కారులో ఎక్కించుకున్నాము. నా విచారణ, కారు యాత్ర, యాత్రా బృందం వివరం అంతా ఎంతో చక్కగా వ్రాసి తమ పత్రికలో ప్రచురించాడు. దాని ప్రభావం మంచిగా జనం మీద పడింది. ప్రజలు నాకు స్వాగతం చెప్పారు. ప్రజల ఉత్సాహానికి అంతే లేదు. తరువాత శ్రీ కెలన్‌బెక్ బాక్సురస్టు వెళ్ళి పోయారు. చార్ల్సుటౌనులో ఆగియున్న, క్రొత్తగా రానున్న భారతీయుల ఏర్పాట్లు ఆయన చూడవలసి యున్నందున వారు వెంటనే వెళ్ళిపోయారు.

మా యాత్రాదళం ముందుకు సాగింది. నన్ను స్వతంత్రంగా వుంచడం ప్రభుత్వానికి యిష్టం లేదు. అందువల్ల మరునటి రోజున, నన్ను స్టాండర్టన్‌లో అరెస్టు చేశారు. అది పెద్ద ఊరు. అక్కడ నన్ను విచిత్రంగా అరెస్టు చేశారు. అక్కడ వ్యాపారులు డబుల్ రొట్టెలు, మురబ్బాడబ్బాలు అందజేశారు. వాటి పంపిణీకి సమయం పట్టింది. మేజిస్ట్రేటు నా దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. ఆహారం పంపిణీ చేసేదాక ఆగాడు. తరువాత నన్ను ప్రక్కకి పిలిచాడు. నేను వారిని ఎరుగుదును. ఆయన నవ్వుతూ "మీరు నాఖైదీ" అని అన్నాడు.

"అయితే నా స్థాయి పెరిగిందన్నమాట. పోలీసులకు బదులు మేజిస్ట్రేటు స్వయంగా వచ్చారన్న మాట. ఇప్పుడే కేసు నడుపుతారుకదా! అని అన్నాను.

"నాతోబాటురండి, కోర్టు తెరిచే వున్నది" అని అన్నాడు. యాత్రా దళాన్ని ముందుకు సాగమని చెప్పి నేను మేజిస్ట్రేటు వెంట వెళ్ళాను. కోర్టు దగ్గరికి చేరినప్పుడు అక్కడ అరెస్టు తీసుకొని వచ్చిన నా అనుచరుల్ని కొందరిని చూచాము. అయిదు మంది వున్నారు. పి.కె. నాయుడు, బిహారు లాల్ మహారాజ్, రామనారాయణసింహ్, రఘునారసు, రహింఖాన్.

నన్ను కోర్టులో నిలబెట్టారు. బాక్సురస్టు కోర్టులో చెప్పినట్లే చెప్పి జమానతుమీద విడుదల చేయమని కోరాను. యిక్కడ కూడా ప్రభుత్వ వకీలుగారు అర్జీని వ్యతిరేకించారు. అయినా మేజిస్ట్రేటు 1913 నవంబరు 21

వరకు కేసును వాయిదా వేసి 50 పౌండ్ల జమానతు మీద విడుదల చేశారు. భారతీయ వ్యాపారులు నాకోసం ఇక్కా బండి సిద్ధంగా వుంచారు. దానిమీద ఎక్కించి యాత్రా దళం దగ్గరికి చేర్చారు. అప్పటికి మూడు మైళ్ల దూరం యాత్రా దళం చేరింది. ఇక టాల్‌స్టాయి క్షేత్రం వరకు అంతా చేరతామని అనుకున్నాం. కాని మా యీ అభిప్రాయం తప్పని తేలింది. యాత్రా దళ సభ్యులు నా అరెస్టుకు అలవాటు పడ్డారు. ఇది పెద్ద పరిణామమే. నా అయిదు మంది అనుచరులు జైల్లోనే వున్నారు.

★ ★ ★

# 45

## జనమంతా జైళ్లలో

మేము యాత్రకావిస్తూ జోహన్స్‌బర్గు దగ్గరికి చేరుకున్నాము. సంపూర్ణ యాత్రను ఎనిమిది రోజులపాటు, ఎనిమిది మజిలీలుగా నిర్ణయించిన విషయం పాఠకులకు తెలుసు. ఇప్పటివరకు నిర్ణయించిన ప్రకారం మజిలీలు పూర్తిచేస్తూ వున్నాము. ఇక నాలుగు మజిలీలు దాటాలి. మా ఉత్సాహం పెరుగుతున్నకొద్దీ ప్రభుత్వంలో అలజడి ప్రారంభమైంది. మజిలీలు దాటేంతవరకు మౌనం వహించి ఆ తరువాత మమ్మల్ని అరెస్టు చేస్తే ప్రభుత్వం పరువు పోతుంది. కనుక మజిలీ చేరకముందే మమ్మల్ని ప్రభుత్వం అరెస్టుచేయాలి.

నన్ను అరెస్టు చేసినా మా బృందం వెనుకంజవేయలేదు. భయపడలేదు. ఏ రకమైన ఉపద్రవమూ చేయలేదు. ఏ మాత్రం ఉపద్రవం చేసినా తుపాకీ తూటాలతో మా బృందంమెంబర్ల నందరినీ ప్రభుత్వం కాల్చిచంపివేసేదే. జనరల్ స్మట్స్‌కు యీ యాత్రలో మేము చూపిన ధైర్యం, ప్రశాంతత దుఃఖం కలిగించాయి.

గోఖలే తంతిద్వారా శ్రీ పొలక్‌ను ఇండియాకు పంపమని, వారి సహాయంతో దక్షిణాఫ్రికా భారతీయుల పరిస్థితులను గురించి, భారత ప్రభుత్వానికి, బ్రిటిష్ సామ్రాజ్యప్రభుత్వానికి తెలియజేస్తానని తెలియజేశారు.

ఎక్కడికి వెళితే అక్కడ. పొలక్ అందరికీ సహాయకారి అయ్యే స్వభావం కలవారు. చేపట్టిన కార్యక్రమంలో పూర్తిగా లీనం కావడం వారికి అలవాటు. ఆయనను ఇండియా పంపుటకుఏర్పాట్లు జరిగాయి.నేను వారికి జాబు వ్రాశాను. మిమ్మల్ని కలిసి మాట్లాడి, మీ సలహాలు, ఆదేశాలు తీసుకొని ఇండియా వెళతానని శ్రీ పొలక్ నాకు వ్రాశారు. అది మా యాత్ర జరుగుతున్న సమయం. వారిని కూడాఅరెస్టు చేయవచ్చు. దాన్ని దృష్టి యందుంచుకొని వచ్చి కలవవచ్చునని తంతి పంపాను. పోరాటపటిమకల వాళ్లు కష్టాలకు వెరువరుకదా! ప్రభుత్వం అందరినీ అరెస్టుచేస్తే మంచిదని, అసలు అరెస్టు కావడానికే గదా సత్యాగ్రహం ప్రారంభించింది అని సత్యాగ్రహుల అభిప్రాయం శ్రీ పొలక్ అరెస్టుకు సిద్ధపడివచ్చి నన్ను కలిశారు.

మేము హెడల్‌బర్గ్ చేరాము. శ్రీ పొలక్ అక్కడకు దగ్గరలోనేవున్నరైలు స్టేషనులో దిగి కాలినడకన వచ్చి నన్ను కలిశారు. మా సంభాషణ పూర్తి అయింది. మధ్యాహ్నం సుమారు మూడు గంటలైంది. మేమిద్దరం యాత్రాదళానికి ముందు నడుస్తున్నాం. మిత్రులు దళంలో వుండి మావెనుక నడుస్తున్నారు. డర్బన్ వెళ్లే రైలు సాయంత్రం బయలుదేరుతుంది. శ్రీ పొలక్ ఆ బండి అందుకోవాలి. శ్రీరామచంద్రుని వంటివారికే వనవాసం తప్పలేదు. ఇక శ్రీ పొలక్‌కు మాత్రం తప్పుతుందా? మేము మాట్లాడుతూ వుండగా ఒక గుర్రంబండివచ్చి ఎదురుగా నిలబడింది. అందు ఏషియాటిక్ విభాగం అధికారి శ్రీ చిమనీ మరియు ఒక పోలీసు అధికారి వున్నారు. ఇద్దరూ బండి దిగారు. నా దగ్గరికి వచ్చి "మిమ్ము అరెస్టు చేస్తున్నాం" అని అన్నారు. నాలుగురోజుల్లో నాలుగోసారి నన్ను అరెస్టు చేస్తున్నారన్నమాట.

"యాత్రాదళం సంగతి ఏమిటి?" అని అడిగాను. "అంతా సరిగానే జరుగుతుంది." నేనేమీ మాట్లాడలేదు. మీ అరెస్టు విషయం అనుచరులకు చెప్పవచ్చునని అధికారి నాకు చెప్పారు. శ్రీ పొలక్‌ను దళాన్ని నడపమని చెప్పి, నేను యాత్రా దళ సభ్యులకు విషయమంతా చెప్పబోగాను. "మీరు యిప్పుడు ఖైదీ. ఉపన్యాసం యివ్వడానికి వీలులేదు" అని అన్నాడు అధికారి.

నా హద్దు నాకు తెలుసు. నేను మౌనం వహించాను యాత్రాదళసభ్యులకు ఏం చేయాలో, ఎలా చేయాలో తెలుసు. నన్ను బండి ఎక్కించి గుర్రాన్ని అదిలించారు. కొద్ది నిముషాల్లో యాత్రాదళానికి దూరమై పోయాను.

అధికారికి తెలుసు అది మాప్రదేశం మొత్తం 2000 మంది సత్యాగ్రహులంఅక్కడవున్నాం మేము అహింసాపద్ధతిన ముందుకు నడుస్తున్నాం అతడు సమన్లు పంపి అరెస్టు చేసినా మేము తిరుగుబాటు చేయము ఆ స్థితిలో మీరు ఖైదీ సుమా అని అతడు నాకు చెప్పవలసిన అవసరం లేదు నన్ను మాట్లాడనిస్తే ప్రభుత్వం పని కూడా తేలిక అయ్యేది. కాని ప్రభుత్వాధికారి నైజం మారుతుందా? మా అహింసా విధానాన్ని గురించి చాలా మందిప్రభుత్వ అధికారులకు తెలిసిపోయింది జైలు మాకు అంకుశంకాదని, మాకు దుఃఖ హేతువుకాదని,అది మాకు ముక్తి ద్వారమని అందరూ గ్రహించారు అసలు మమ్మల్ని అరెస్టు చేయడం వాళ్లకు సులభం కూడా. మమ్మల్ని అరెస్టు చేసేముందు మా సాయం కోరడం, వెంటనే మేము వారి ఆజ్ఞను శిరసావహించడం, అందుకు మాకు కృతజ్ఞత తెలపడంవారికి అలవాటు అయిపోయింది. పాఠకులకు పలురకాల అధికారుల వ్యవహారం యీ ప్రకరణాల్లో బోధపడుతుందని భావిస్తున్నాను

ఇద్దరు అధికారులు బండిమీద అటుదిప్పి యిటుదిప్పి చివరికి హెడల్‌బర్గ్ పోలీసుస్టేషన్‌కు నన్ను చేర్చారు. రాత్రి అక్కడే గడిచింది.

యాత్రా దళాన్ని తీసుకొని శ్రీ పోలక్ ముందుకు సాగారు. అంతా గ్రేలిగ్ స్టాండు చేరారు అక్కడ భారత వ్యాపారులు పెద్ద సంఖ్యలో నిలబడివున్నారు. త్రోవలో వారిని సేఠ్ అహమద్ మహమ్మద్ కాఛలియా మరియు సేఠ్ అమద్ ఖాయాత్‌గారలు కలిశారు. ఏమి జరుగనున్నదో వాళ్లకు తెలుసు. నా వెంట వచ్చిన యాత్రా దళ సభ్యుల నందరినీ అరెస్టు చేయుటకు ఏర్పాటు జరిగిపోయింది. శ్రీ పోలక్ ఆ తరువాత డర్బన్ చేరి ఓడ పట్టుకొని ఇండియా వెళదామని భావించారు. కాని మనం అనుకున్నట్లు అంతా జరగదుకదా!

1913 నవంబరు 10వ తేదీ సత్యాగ్రహుల దళం ఉదయం 9 గంటలకు బెల్‌ఫోర్ చేరింది. అక్కడ మూడు స్పెషల్ రైళ్లు సత్యాగ్రహుల్ని అరెస్టుచేసి నేటాలు చేర్చుటకు సిద్ధంగా నిలబడివున్నాయి. కాని జనం పట్టుబట్టారు. "గాంధీని పిలిపించండి. వారు సరేనంటే మేమంతా రైళ్లు ఎక్కుతాం. అంతవరకుఎక్కం" అని వాళ్లు చెప్పారు. అయితే వారి యీ పట్టు సరియైనది కాదు. వాళ్లు తమ పట్టువదలకపోతే మా పందెం దెబ్బ తినేది. సత్యాగ్రహుల తేజస్సు తగ్గిపోయేది. జైళ్లకు వెళ్లడానికి, గాంధీకి సంబంధం ఏమిటి? సైనికులు తమ సైన్యాధిపతిని ఎన్నుకోగలరా? ఒకే సైన్యాధికారి మాట వింటామని పట్టుపట్టడం సాధ్యమా? శ్రీ చమనీ యాత్రాదళసభ్యులకు నచ్చచెప్పుటకు శ్రీ పోలక్ మరియు కాఛలియా సహాయాన్ని కోరాడు. వాళ్లిద్దరూ ఎంతో కష్టంమీదయాత్రా దళలక్ష్యం జైలుకు వెళ్లడమేకదా! ప్రభుత్వం అరెస్టు చేసేందుకై ముందుకొచ్చింది కనుక సత్యాగ్రహులుఅరెస్టు అయిపోవాలి. అలా జరిగితే మన సజ్జనత్వం బయటపడుతుంది. విజయం ఖాయం అవుతుంది. గాంధీగారి కోరిక కూడా యిదే" అని చెప్పి వాళ్లను ఒప్పించారు. సత్యాగ్రహులంతా అంగీకరించి రైళ్లలో కూర్చున్నారు.

నన్ను మేజిస్ట్రేటు ఎదుట కోర్టులో హాజరుపరిచారు. మిగతా విషయాలు నాకు ఏమీ తెలియవు. నేను మరో పర్యాయం కేసు వ్యవధిని పెంచమని, జమానతు మీద విడుదల చేయమని కోరాను గతంలో రెండు కోర్టులు యిందుకు అంగీకరించి వ్యవధి యిచ్చాయని కూడా తెలియజేశాను. మా యాత్ర చివరిభాగంలో వున్నదని, అది పూర్తి అయ్యేంతవరకు గడువు యివ్వమని కోర్టును కోరాను. మా దళసభ్యుల్ని ప్రభుత్వం అరెస్టు చేసినాసరే, లేనియెడల వాళ్లందరినీ టాల్‌స్టాయ్ ఫారంలో వదిలి వచ్చుటకు గడువు యివ్వమని చెప్పాను. కాని కోర్టు నా వినతిని అంగీకరించలేదు. అయితే నా కోరికను ప్రభుత్వానికి వెంటనే తెలియజేయుటకు కోర్టు అంగీకరించింది. ఈ సారి నన్ను డండీ తీసుకువెళ్లాలి. అక్కడి కోర్టులో, నేను గిరమిటియా కార్మికుల్ని గనుల్లో పనిచేయడం మానమని ప్రోత్సహించాననే అభియోగం మోపబడింది. అందుకోసం నన్ను ఆ రోజునే రైల్లో డండీ చేర్చారు.

ఇటు శ్రీ పొలక్‌ను బెల్‌ఫోర్డ్‌లో అరెస్టు చేయలేదు. అయన చేసిన సహాయానికి అధికారులు కృతజ్ఞత తెలియజేశారు. శ్రీ పొలక్‌ను అరెస్టు చేయాలని ప్రభుత్వానికి తలంపే లేదని శ్రీ చిమనీ చెప్పాడు. అయితే యిది శ్రీచిమనీ వ్యక్తిగత అభిప్రాయం అయివుండవచ్చు లేక ఊహించి యిది ప్రభుత్వాభిప్రాయమని అనుకొని ఆయన చెప్పి యుండవచ్చు. ప్రభుత్వాభిప్రాయం మారవచ్చుకదా! శ్రీపొలక్‌ను, శ్రీకెలెన్‌బెక్‌లను ఇండియాకు వెళ్లనీయకూడదని, వాళ్లు భారతీయుల కోసం అత్యుత్సాహంగా పనిచేస్తున్నారని, వారికి అడ్డుకట్టవేసేందుకు అరెస్టు చేసి జైల్లో పెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది శ్రీపొలక్‌ను చార్లస్‌టౌనులో అరెస్టు చేశారు. కేలన్‌బెక్‌ను కూడా నిర్భంధంలోకి తీసుకున్నారు. ఇద్దరినీ వాక్సరస్ట్ జైల్లో వుంచారు.

1931 నబంబరు 11వ తేదీన డండీలోనా మీద విచారణ జరిపి 9 మాసాల కఠిన కారాగార శిక్ష నాకు విధించారు. నామీద మరో కేసుకూడా నడుస్తున్నది. నిషిద్ధవ్యక్తుల్ని ట్రాన్స్‌వాల్‌లోకి ప్రవేశించమని నేను ప్రోత్సాహించానని అకేసు సారం. అందుకై నన్ను డండీనుంచి నవంబరు 13వ తేదీన బాక్‌రస్ట్ తీసుకు వెళ్లారు. అక్కడ నేను శ్రీపొలక్, శ్రీకెలన్‌బెక్‌లను చూచాను. మేము ముగ్గురం బాక్‌రస్టు జైల్లో కలిశాము. పరమానంద భరితులం అయ్యాము.

నవంబరు 14వ తేదీన బాక్సరస్ట్ కోర్టులో నా మీద కేసు నడిపించింది. ఈ కోర్టులో ఒక విచిత్రం జరిగింది. కోర్టులో నాకు వ్యతిరేకంగా సాక్ష్యం యివ్వడానికి సాక్షుల్ని నేను తీసుకురావాలనడమే అచిత్రం. అట్టి సాక్షుల్ని పోలీసులు తీసుకురాగలరు. కాని అందుకైవారు శ్రమపడాలి. అందువల్ల యీ వ్యవహారంలో సాయం చేయమని పోలీసులు నన్ను కోరారు. దక్షిణాఫ్రికా యందలి కోర్టులు, అపరాధి నేనుదోషం చేశానని చెప్పినంత మాత్రాన శిక్షలు విధించవు.

నా విషయంలో యిట్టి ఏర్పాటు జరిగింది. కాని శ్రీపొలక్, శ్రీకేలన్ బెక్‌లకు వ్యతిరేకంగా ఎవరు సాక్ష్యం చెబుతారు? వాళ్లకు వ్యతిరేకంగా సాక్ష్యం లేకపోతే వారికి శిక్ష పడదు. శ్రీకేలన్‌బెక్ యాత్రా దళ పటాల వెంట

వుండాలనే ఉద్దేశ్యంతో అపరాధం చేశానని అంగీకరించారు. కాని ఇండియా వెళ్లడం శ్రీపోలక్ లక్ష్యం. అందువల్ల జైలుకు వెళ్లడం వారికి యిష్టం లేదు. అపరాధం చేశారా అని అడిగితే చేశామని కాని చేయలేదనికాని చెప్పకుండ మౌనం వహిద్దామని నిర్ణయానికి వచ్చాము.

కోర్టులో కేసునడిపింది. వాళ్లిద్దరికీ వ్యతిరేకంగా నేను సాక్ష్యం చెప్పాను. కేసును లాగాదీయడం మాకు యిష్టంలేక ఒక్కొక్క రోజున మాకేసులు పూర్తి అయ్యేలా మేము కోర్టుకు సహకరించాము. మా ముగ్గురికీ మూడు మూడు మాసాల జైలును శిక్ష విధించబడింది. కనీసం మూడు మాసాల పాటు బాక్సరస్ట్ జైల్లో కలిసి వుండవచ్చునని అనుకున్నాం. కాని అలా వుండనీయడం వల్ల ప్రభుత్వానికి లాభం కనబడలేదు.

కొద్ది రోజులు అక్కడ జైల్లో మేము సుఖంగా వున్నాము. అక్కడికి రోజూ కొత్త ఖైదీలు వస్తూవుండేవారు. బయట జరుగుతున్న వివరాలన్నీ మాకు చెబుతూవుండేవారు. ఇట్టి సత్యాగ్రహుల్లో హరబత్‌సింగ్ అను ఒక వృద్ధుడు వున్నాడు. అతడికి 75 సంవత్సరాల వయస్సు అతడు గనుల్లో పనిచేయడంలేదు. గిర్‌మిటియా ప్రథనుంచి ముక్తి ఎప్పుడో పొందాడు. నిజానికి అతడు అపరాధికాదు. కాని నన్ను అరెస్టు చేశాక ప్రజల్లో ఉద్రిక్తత పెరిగింది చాలామంది జనం నేటాలు దాటి ట్రాన్స్‌వాల్ సరిహద్దుల్లోకి ప్రవేశించి అరెస్టు కాసాగారు. హరబత్‌సింగ్ అటువంటి ఉత్సాహవంతుడైన సత్యాగ్రహి

జైల్లో హరబత్‌సింగ్‌ను చూచి "మీరు జైలుకు ఎందుకు వచ్చారు? మీవంటి వృద్ధుల్ని జైలుకు రమ్మని నేను కోరలేదుగదా!" అన్న అన్నాను.

"మాకోసం మీరు, సతీమణి, మీ బిడ్డలు కూడా జైలుకు వెళ్లితే, బైట వుండటం నాబోటివాడికి సాధ్యమా?" లని హరబత్‌సింగ్ జవాబిచ్చాడు.

"మీరు కష్టాలు పడలేరు. జైలు వదిలి వెళ్లండి. మీ విడుదలకు నేను ప్రయత్నం చేస్తాను" అని అన్నాను.

"నేను వెళ్లను. ఏదో ఒక రోజున నేను చనిపోవలసిందేగదా! ఇలాంటి చోట చనిపోవడం గొప్ప అదృష్టంగా భావిస్తాను" అని అన్నాడు హరబత్‌సింగ్. ఇంతటి స్థిరమైన అభిప్రాయాన్ని నేను మార్చగలనా? నేను ప్రయత్నించినా

అస్థిరత్వం మారదు. అక్షరం జ్ఞానంలేని అతడిముందు నాసిరస్సు వినమ్రతతో వంగి పోయింది. ఆయన కోరిక నెరవేరింది. 1914 జనవరి 5వ తేదీన ఆయన జైల్లోనే కన్ను మూశాడు. అతడి శవాన్ని బాక్సరస్టు నుంచి డర్బను తెచ్చారు. వేలాది మంది భారతీయుల సమక్షంలో సగౌరవంగా హరబత్‌సింగ్ శవానికి దహన సంస్కారాలు జరిగాయి. మా సత్యాగ్రహ సంగ్రామంలో యిలాంటి హరబత్‌సింగులు అనేక మంది పాల్గొన్నారు. అయితే జైల్లో మరణ పదించే గౌరవం మాత్రం ఒక్క హరబత్ సింగ్‌కే లభించింది. అందువల్లనే దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర యందు ఆతడిపేరు చిరస్థాయిగా నిలిచిపోయింది.

ఈ విధంగా జనం ఉత్సాహంతో జైళ్లకు రావడం ప్రభుత్వానికి నచ్చలేదు. జైల్లో నుంచి విడుదలై వచ్చిన సత్యాగ్రహులు నాసందేశాన్ని ప్రజలకు అందజేయడం కూడా ప్రభుత్వానికి నచ్చలేదు. అందువల్ల ప్రభుత్వం నన్ను, పోలక్‌ను, కేలన్‌బెక్‌ను కలిసి వుండనీయకూడదనీ, వేరువేరు జైళ్లలో వుంచాలనీ, ముఖ్యంగా నన్ను మాత్రం ఏకాకిగా ఎవ్వరికీ తెలియని చోట బంధించి వుంచాలనీ నిర్ణయానికి వచ్చింది. అందువల్ల నన్ను రెండియా రాజధాని బ్యూంఫోన్టేన్ జైలుకు పంపించారు. అక్కడ 50 మందికంటే ఎక్కువమంది భారతీయులు లేరు. వున్నావాళ్లు కూడా హోటళ్లలో వైటర్లుగా పనిచేస్తున్నారు. ఇలాంటి చోట జైల్లో భారతీయ ఖైదీలు వుండరు. ఇక ఆ జైల్లో వున్న భారతీయ ఖైదీని నేనొక్కడినే. మిగతా ఖైదీలు తెల్లవాళ్లు లేక హబ్షీలు. ఏకాకిగా వున్నా నేను బాధపడలేదు. నాకు మంచి జరిగిందని భావించాను. 1893 తరువాత అధ్యయనానికి నాకు అసలు అవకాశం చిక్కలేదు. ఇప్పుడు యీ రూపంలో చిక్కిందని భావించాను

బ్లూంఫోన్టేన్ జైల్లో నాకు విధించిన శిక్ష కఠోరమైనది. అక్కడ సౌకర్యాలు అపరిమితం. వాటి వివరాలన్నీ యిక్కడ వ్రాయతలచలేదు. కాని ఒక్క విషయం మాత్రం వ్రాయక తప్పదు. అక్కడి డాక్టరు నాకు స్నేహితుడయ్యాడు. కాని జైలరు మాత్రం కేవలం అధికారిగానే వుండిపోయాడు. డాక్టరు ఖైదీల అధికారాలను కాపాడుతూ వుండేవాడు. అప్పుడు నేను ఫలాలు మాత్రమే భుజించడం ప్రారంభించాను. పాలు, నెయ్యి, ధాన్యం అన్నీ వదిలివేశాను.

అరటిపండ్లు, టొమాటోలు, పచ్చి వేరుసెనగ పప్పు, నిమ్మపండ్లు, నూనె మాత్రం వాడుతూ వున్నాను. వాటిలో కుళ్లిన పదార్థం వుంటే యిక నాకు పస్తులే . కనుక డాక్టరు వాటిన్నింటిని జాగ్రత్తగా పరీక్షించేవాడు. బాదం, అఖరోట్, బ్రాజిల్‌నట్‌లను కూడా తినమని సలహా యిచ్చారు. జైల్లో నాకిచ్చిన గదిలోకి గాలిరాదు. తలుపు తీసివుంచమని డాక్టరు చెప్పినా జైలరు వినలేదు. తలుపు తెరిచి వుంచితే నా ఉద్యోగం ఊడిపోతుందని గొంతెత్తి అరిచాడు. అతడికి అటువంటి ఖైదీలు దొరికారన్నమాట. నేను మంచి ఖైదీనని తెలిసి నప్పటికీ, నాకు సదుపాయం కల్పిస్తే మిగతా ఖైదీలంతా నెత్తికెక్కుతారని అతడి భయం. పాపం, ఏంచేస్తాడు? నేను జైలరునే సమర్థిస్తూ వుండేవాడిని. నాకోసం డాక్టరు, జైలరు యిద్దరూ తగదా పడటం నాకు యిష్టంలేదు. జైలరు ముక్కుకు సూటిగా పోయేమనిషి.

శ్రీకేలన్ బెక్‌ను ప్రిటోరియా జైల్లోను, శ్రీపోలక్‌ను జర్మిస్టన్ జైల్లోను వుంచారు.

ప్రభుత్వం చేసిన యీ పనులన్నీ వ్యర్థమే. ఆకాశం వూడిపడితే అతుకులు వేయడం సాధ్యమా? నేటాల్ యందు నివసిస్తున్న గిరమిటియా భారతీయులు మేల్కొన్నారు. ప్రపంచ మందలి ఏ శక్తీ ఇక వాళ్లను ఆపలేదు.

* * *

## 46

## కఠిన పరీక్ష

బంగారం వన్నె తెలుసుకోవాలనుకునే వ్యాపారి లభించిన బంగారాన్ని ఒరిపిడి రాయి మీదగీచి పరీక్షించుకుంటాడు. ఇంకా ఎక్కువగా పరీక్షించాలనుకుంటే దాన్ని కుంపట్లో వేసి కాలుస్తాడు. దానితో అందలి మైల తొలగిపోతుంది. మేలిమి బంగారం లభిస్తుంది. ఇలాంటి ఒరిపిడి పరీక్షయే దక్షిణాఫ్రికాలో భారతీయులకు జరిగింది. తెల్లప్రభుత్వం వాళ్లని నానా బాధలు పెట్టారు. కుంపట్లో వేసి కాల్చారు. ఎన్నో అగ్ని పరీక్షలకు గురి అయిన తరువాతనే వారి విలువ ఏమిటో అంతా గ్రహించారు.

రైళ్లలో కూర్చోపెట్టుకొని యాత్రా దళ సభ్యుల్ని షికారు కోసం కాక, అగ్నిలో కాల్చడానికే తెల్లప్రభుత్వం వాళ్లు తీసుకు వెళ్లారు. త్రోవలో వాళ్లకు తిండి లేదు. మంచినీళ్లు లేవు. నేటాలు చేరిన తరువాత కేసు బెట్టి వాళ్లను తిన్నగా జైలుకు తీసుకువెళ్లారు. అలా జరుగుతుందని మాకు తెలుసు. అలా జరగాలని మేము ఆశించాము కూడా. వేలాది మందిని జైల్లో వుంచడమంటే ప్రభుత్వానికి ఖర్చు ఎక్కువ అవుతుంది. మేము కోరిందీ అదే. గనులు మూత పడతాయి. ఈ స్థితి ఎక్కువ కాలం సాగితే ప్రభుత్వం లొంగక తప్పదు. 3 పౌండ్ల పన్ను రద్దు చేయకతప్పదు. అందుకుగాను యూనియన్ ప్రభుత్వం కొత్త పన్నాగం పన్నింది. ఏ ఏ స్థావాలనుంచి గిరమిటియా కార్మికులు పని మానుకొని వచ్చారో ఆయా చోట్లను ప్రభుత్వం జైళ్లుగా ప్రకటించింది. అందుకోసం క్రొత్త చట్టాన్ని చేసింది. ఆయా చోట్ల గనుల్లో పనిచేస్తున్న తెల్లజాతి నౌకర్లను వార్డర్లుగా నియమించింది. ఈవిధంగా చేసి కార్మికులు స్వేచ్ఛగా వదిలి వేసిన పనిని, బలవంతంగా వాళ్ల చేత చేయించడానికి ప్రభుత్వం పూనుకొన్నది. మూతబడిన గనుల పనులు మళ్లీ ప్రారంభమయ్యాయి. బానిసత్వానికి, నౌకరీకి తేడా వున్నది. నౌకరు నౌకరీని వదిలివేస్తే అతడిమీద వ్యాజ్యం వేయవచ్చు. కాని బానిస గనుక నౌకరీని వదిలితే అతడిచేత బలవంతంగా మళ్లీ నౌకరీ చేయించవచ్చు. ఆ ప్రకారం యిప్పుడు అట్టి కార్మికులంతా పూర్తిగా బానిసలై పోయారన్నమాట.

అంతటితో ప్రభుత్వం ఆగలేదు. కార్మికులు పౌరుషవంతులు. వాళ్లు గనుల్లో పనిచేయటకు నిరాకరించారు. దానితో రెచ్చిపోయిన తెల్లవాళ్లు కొరడాలతో వాళ్లను కొట్టారు. ఒక్కసారిగా ఆఫీసర్లుగా మారిన తెల్లజాతి చపరాసీలు భారత కార్మికుల్ని కాళ్లతో తన్నారు. తిట్టారు. రకరకాలుగా అత్యాచారాలు చేశారు. అవన్నీ ఎక్కడా లిపి బద్ధం చేయబడలేదు. యీ దుర్మార్గాల్ని దౌర్జన్యాల్ని భారతీయ పేద కార్మికులు సహించారు. యీ దుర్మార్గాల్ని గురించి ఎన్నో టెలిగ్రాములు గోఖలేగారికి పంపబడ్డాయి. ఏ రోజున వివరాలతో కూడిన తంతిఅందదో, ఆరోజున గోఖలే గారే భారతావని నుంచి అడిగి తెలుసుకొనేవారు. అప్పుడు గోఖలే బాగాజబ్బు పడ్డారు.

మంచం మీది నుంచి లేవలేని స్థితి. అయినా వారు దక్షిణాఫ్రికా వ్యవహారాలు స్వయంగా పరిశీలించి చర్యలుగైకొంటూ వుండే వారు. రాత్రి అనక, పగలనక వారు యీ విషయమై ఎంతో శ్రమించారు తత్ఫలితంగా భారత దేశమంతా అట్టుడికినట్లు ఉడికి పోయింది. దక్షిణాఫ్రికా యందలి భారతీయుల ప్రశ్న భారతావనిలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది.

వైస్రాయి లార్డ్ హార్డింగ్ (డిశంబరు 1913) మద్రాసులో రెచ్చగొట్టే ప్రసంగం అప్పుడే చేశారు. ఆయన చేసిన ప్రసంగం ఇంగ్లాండులోను, దక్షిణాఫ్రికాలోను గొప్ప అలజడిని రేపింది. వైస్రాయి యితర అధినివేశ రాజ్యాలను గురించిగాని, బ్రిటిష్ సామ్రాజ్యంలో చేరిన యితర దేశాలను గురించిగాని విమర్శించుటకు వీలులేదు. అయినా లార్డ్ హార్డింగ్ యూనియన్ ప్రభుత్వాన్ని గట్టిగా విమర్శించడమే గాక దక్షిణాఫ్రికా యందలి భారత సత్యాగ్రహుల పక్షం వహించి గట్టిగా మాట్లాడారు. వారు చేస్తున్న సహాయ నిరాకరణోద్యమాన్ని గట్టిగా సమర్థించారు. లార్డ్ హార్డింగ్ చూపిన యీ ధైర్య సాహసాన్ని ఇంగ్లాండులో కొందరు విమర్శించారు. అందుకు ఏ మాత్రం వెరవకుండా, తన వాదనయందలి ఔచిత్యాన్ని వివరిస్తూ తన విమర్శను సమర్థించుకున్నారు వారు చూపిన యీ సాహసం వల్ల మంచి ప్రభావం ప్రపంచ ప్రజలపై పడింది.

నిర్బంధించబడిన, పౌరుషవంతులగు కార్మికులను వదిలి, ఒక్క క్షణం పేపు గనుల దగ్గరకు వెళ్లి నేటాలుకు చెందిన యితర ప్రదేశాల్ని చూద్దాం బొగ్గు గనులు నేటాలుకు ఉత్తర దిశన ఉన్నాయి అయితే కార్మికులు పెద్ద సంఖ్యలో నైఋతి, వాయువ్య దిక్కుల్లో వున్నారు. వాయువ్యదిక్కున ఫినిక్సు, బెరూలం, టొంగాట్ మొదలగు కేంద్రాలు వున్నాయి. నైఋతి దిక్కున ఇసిపింగో, అమ్జింటో మొదలగు కేంద్రాలు వున్నాయి. వాయువ్య దిక్కున వున్న భారతీయులతో నాకు సంబంధం ఏర్పడింది. వారిలో చాలా మంది కార్మికులు బోయర్ యుద్ధంలో నాతో బాటు పని చేశారు. నైఋతి దిక్కున వున్న కార్మికుల సమీపానికి నేను వెళ్ళి యుండలేదు. అక్కడ నా అనుచరులు లేరనే చెప్పవచ్చు. అయినా గనుల యందలి కార్మికుల

అరెస్టుల్ని గురించిన వార్తలు మెరుపులా దేశమంతటా వ్యాప్తమయ్యాయి. యీ రెండు దిక్కుల యందు గల వేలాదిమంది కార్మికులు తమ పనులు మాని బయటికి వచ్చేశారు వారిలో కొందరు యీ పోరాటం చాలా కాలం సాగుతుందని భావించి తమ ఆస్థిపాస్తులు అమ్ముకున్నారు. అట్టి పేద కార్మికులకు భోజనం ఎవరు పెడతారు? నేను జైలుకు వెళ్ళక పూర్వమే కార్మికుల్ని ఎక్కువ సంఖ్యలో పోరాటంలోకి చేరనీయవద్దని, వాళ్లు యిక్కట్ల పాలవుతారని అనుచరులకు చెప్పాను కూడా. గనుల కార్మికులు పాల్గొంటే పోరాటం త్వరగా విజయం సాధిస్తుందని నాకు తెలుసు. అయితే యిందు పెద్ద ప్రమాదం కూడా వున్నది. 60 వేల మంది కార్మికులు ఒక్కుమ్మడిగా పనులు మానివేస్తే వారిని పోషించడం సాధ్యమా? యింత మందిని సంగ్రామంలో ముందుకు నడపాలంటే మన దగ్గర సాధనాలు వున్నాయా? యింత మందిని అదుపులో వుంచగల దళనాయకులు మన దగ్గర వున్నారా? యింత మందిని పోషించడానికి మన దగ్గర డబ్బు వున్నదా? యింత మందిని ప్రోగు చేశాక జరిగే హింసాత్మక ఉపద్రవాల్ని అరికట్టగలమా? అందుకు అవసరమైన మంది మార్బలం మన దగ్గర వున్నదా? యీ ప్రశ్నలకు సమాధానం లేదు అనే. అయినా ముంచుకు వచ్చిన వరదను ఎవరు ఆపగలరు? కార్మికులంతా తామంత తామే పనులు మానివేశారు. అయితే ఆయా కార్మికులు వున్న చోట్ల స్వయంసేవకులు కూడా తమంత తామే ఆవిర్భవించారు. యిది గొప్ప విశేషం.

ఇక యూనియన్ ప్రభుత్వం తుపాకీ విధానాన్ని చేతబట్టింది. కార్మికుల్ని సమ్మె చేయకుండా అరికట్టడానికి పూనుకున్నది. సమ్మె చేస్తున్నవారి మీదకు గుర్రాల్ని పరుగెత్తించింది. వాళ్లు పని చేసే గనుల దగ్గరికి బలవంతంగా వాళ్లను చేర్చింది. కార్మికులు కొంచెం అల్లరికి దిగినా తుపాకుల తూటాలతో చంపి వేయడానికి సిద్ధపడింది. వారిలో కొందరు పని చేయం అని భీష్మించారు. కొందరు రాళ్లు రువ్వారు. కొన్ని చోట్ల పోలీసులు కాల్పులు జరిపారు. చాలా మంది గాయపడ్డారు. నలుగురైదుగురు చనిపోయారు కూడా. అయినా కార్మికుల ఆవేశం చల్లారలేదు. స్వయం సేవకులు ఎంతో

కష్టం మీద బెరూలం దగ్గర కార్మికులను సమ్మె చేయకుండా అపారు అయినా కార్మికులంతా పనికి పోలేదు. కొందరు భయపడి దాక్కున్నారు ఎవ్వరూ వెనుకంజవేయలేదు.

ఇక్కడ ఒక ఘట్టాన్ని గురించి వ్రాయాలి. బెరూలంలో చాలా మంది కార్మికులు పని విరమించి బైటికి వచ్చి వేశారు. అధికారులు ఎంత ప్రయత్నించినా వారిలో ఒక్కరు కూడా పనికి వెళ్లలేదు. జనరల్ ల్యుకిన్ తన సైన్యంతో అక్కడ సిద్ధంగా వున్నారు. కార్మికులపై కాల్పులు జరపమని అర్డరు యివ్వడానికి సన్నద్ధమైనాడు. యింతలో కీ.శే. పారసీ రుస్తుంగారి చిన్న కొడుకు బహాదుర్‌దసారాజ్జీ దర్బను నుంచి అక్కడికి వచ్చాడు ఆ పిల్లవాడికి 18 రేండ్ల వయస్సు. అతడు జనరల్ ఎక్కి కూర్చున్న గుర్రం కళ్లెం పట్టుకొని "మీరు యీ జనం మీద కాల్పులు జరపడానికి వీలు లేదు. నేను యిప్పుడే వీళ్లందరికీ నచ్చచెప్పి శాంతియుతంగా పనికి పంపించే బాధ్యత వహిస్తాను" అని బిగ్గరగా అరిచాడు. జనరల్ ల్యుకిన్ యీ యువకుణ్ణి చూచి, అతడి మాటలు విని ముగ్ధుడై పోయాడు. సరేనని ఆయువకుడికి అవకాశం యిచ్చాడు. సొరాజ్జీ కార్మికుల దగ్గరికి వెళ్ళి వాళ్ళకు ప్రశాంతంగా నచ్చ చెప్పాడు. కార్మికులు విషయం తెలుసుకొని మారుమాట్లాడకుండా పనులకు వెళ్లిపోయారు. యీ విధంగా ఒక నవయువకుడి సమయస్ఫూర్తి, నిర్భయత్వం ప్రేమభావం వల్ల వేలాదిమంది కార్మికుల హత్యలు ఆగిపోయాయి.

నిజానికి కార్మికుల మీద ప్రభుత్వం చేసిన దుర్మార్గాలు అత్యాచారాలు పూర్తిగా చట్టవిరుద్ధం. న్యూకేసల్‌కు చెందిన గనుల కార్మికుల మీద ప్రభుత్వం తీసుకున్న చర్యలు పైకి చట్టానికి అనుకూలంగా వున్నాయే గాని వాస్తవానికి అవి సరియైనవి కావు. ఆ కార్మికుల్ని సమ్మె చేసినందుకు కాక అనుమతి పత్రాలు లేకుండా ట్రాన్స్‌వాలులోకి ప్రవేశించారనే అపరాధం మోపి అరెస్టు చేశారు. కాని వేటాలుకు నైఋతి మరియు వాయువ్య దిక్కుల యందు సమ్మె చేయడం అపరాధంగా పరిగణించారు. అయితే చట్టరీత్యా కాక ప్రభుత్వం యొక్క సత్తాచూచుకొని అలా చేశారు. చివరికి ప్రభుత్వ

సత్తాయే చట్ట రూపం దాలుస్తుందన్న మాట. బ్రిటిష్ వారి చట్టంలో రాజు ఎన్నడూ తప్పు చేయడు. అను సామెత ఒకటి వున్నది. కాని వాస్తవానికి ప్రభుత్వం యొక్క శక్తియే చట్టమవుతుంది. యీ దోషం ప్రభుత్వాలన్నీ చేస్తాయి. వాస్తవానికి యీ విధంగా చట్టాన్ని మరిచిపోవడం దోషంగా భావించరు. అప్పుడప్పుడు చట్టాన్ని పట్టుకు కూర్చోవడమే దోషంగా భావించబడుతుంది. ఏ ప్రభుత్వమైనా ప్రజల హితంకోరి పని చేస్తూ వుంటే దాన్ని అలా చేయనీయకుండా ఆపివేసే చట్టాలు నష్టం కలిగిస్తాయి. అట్టి నియంత్రణను నిర్లక్ష్యం చేయడం ధర్మబద్ధం అవుతుంది. అది వివేకం అనిపించుకుంటుంది. నిరంకుశంగా వ్యవహరించే ప్రభుత్వం ప్రజలకు ఉపయోగకారి కాలేదు. దక్షిణాఫ్రికాలో ప్రభుత్వం నిరంకుశంగా వ్యవహరించుటకు అవకాశం లేదు. కార్మికులు అనాది నుంచి సమ్మె చేసే తమ అధికారాన్ని ఉపయోగించుతూనే ఉన్నారు. సమ్మె చేసే కార్మికులు ఉపద్రవాలు చేయరని తెలుసుకొనుటకు అనేకమార్గాలు వున్నాయి. వాళ్ల సమ్మె వల్ల చేయవలసిన పని మహా అయితే ప్రభుత్వం విధించిన మూడు పౌండ్ల తల పన్నును రద్దు చేయడమే. శాంతి ప్రియుల విషయంలో ప్రభుత్వం కూడా శాంతి యుతంగానే వ్యవహరించాలి. ఒక్క విషయం మాత్రం నిజం. దక్షిణాఫ్రికా యందలి రాజ్యశక్తి ప్రజలకు ఉపయోగకారికాదు. అక్కడి ప్రభుత్వం శ్వేత జాతీయుల అధికారాల్ని రక్షించడం కొరకే వున్నదని చెప్పవచ్చు. అది భారతీయులకు అనుకూలంకాదు. వ్యతిరేకం. అందువల్ల ఏకపక్షంగా వ్యవహరించే నిరంకుశ ప్రభుత్వం మంచిది కాదు. క్షమించతగినది కాదు.

అందువల్ల నా దృష్టిలో అధికారంలో వున్నవాళ్ళు యిక్కడ అధికార శక్తిని దుర్వినియోగ పరిచారు. యీ విధంగా ప్రభుత్వశక్తిని దేనికోసం దుర్వినియోగ పరుస్తారో అది ఎన్నటికీ విజయం పొందదు. అప్పుడప్పుడు క్షణిక సాఫల్యం లభించినట్లు అనిపించినా, అది స్థిరంగా వుండదు. దక్షిణాఫ్రికా యందలి కార్మికుల మీద విచ్చలవిడిగా కాల్పులు జరిపిన ప్రభుత్వం ఆరుమాసాల తరువాత మూడు పౌండ్ల తలపన్నును రద్దుచేయక తప్పలేదు. దాన్ని

రక్షించడం కోసమే చేయరాని అత్యాచారాలు అక్కడి ప్రభుత్వం చేసింది దుఃఖం ఎందుకు కలుగుతుంది అని అంటే సుఖం కోసమే అని చెప్పవలసి వస్తుంది. దక్షిణాఫ్రికాయందలి భారతీయుల కష్టగాథల సమాచారం ప్రపంచమందంతటా వ్యాప్తమైంది. ఒక యంత్రంలో వుండే చిన్న పరికరాలన్నింటికి ప్రత్యేక స్థానం వున్నట్లే, ఒక ఉద్యమం ప్రారంభించినప్పుడు అందలి ప్రతి క్రియకు స్థానం అంటూ ఒకటి వుంటుంది తుప్పు పట్టడంవంటి వాటివల్ల యంత్రం పని చేయకుండా పోయినట్లే, కొన్ని వ్యవహారాల వల్ల ఉద్యమం కూడా కుంటుపడుతూ వుంటుంది. సామాన్యంగా ఈశ్వరేచ్ఛ ప్రకారమేమనం పని చేస్తూ వుంటాం. అయితే ఏది అనుకూలమో, ఏది ప్రతికూలమో ఫలితాన్ని తెలుసుకోలేము. కాని సాధనాలను తెలుసుకొనే అధికారం మాత్రమే మనకి వున్నది. సాధనాలు పవిత్రంగా వుంటే, దాని పరిణామాల విషయమై మనం నిర్భయంగాను నిశ్చింతగాను వుండవచ్చు

ఈ సత్యాగ్రహ సమరంలో ఒక గొప్ప విశేషం నేను చూచాను సత్యాగ్రహుల కష్టాలు, దుఃఖాలు ఎక్కువై పోయినకొద్దీ, పోరాట సమాప్తి సమీపానికి రాసాగింది. అంతేగాక మరో విశేషం కూడా యీ సత్యాగ్రహ సంగ్రామంలో నేను చూచాను. దోషరహితమైన, అస్త్ర శస్త్రాలు లేని, పవిత్రమైన అహింసాత్మక సమరంలో కష్టం వచ్చినప్పుడు అవసరమైన సాధనాలు శ్రమ లేకుండా తమంతతామే సమకూడుతాయి. వారెవరో కూడా తెలియని స్వయం సేవకులు పెద్ద సంఖ్యలో తామంతటతాము వచ్చి యీ సంగ్రామ సమయంలో మాకు సహాయం చేశారు. సామాన్యంగా యిటువంటి సహాయకులు నిస్వార్థంతో పని చేయరు. అదృశ్యంగా వుండి తమ సేవల్ని అందజేస్తూ వుంటారు. వారి సేవల్ని ఎవ్వరూ గుర్తించరు. సేవలకుగాను వారికి ఎవ్వరి సర్టిఫికెట్టు అక్కర లేదు. అయితే అట్టివాళ్ళు చేసే సహాయ సహకారాలు భగవంతుడి చిట్టాలో తప్పక లిఖించబడతాయి. యీ విషయాన్ని చాలా మంది సేవకులు గమనించారు.

దక్షిణాఫ్రికా యందలి భారతీయులు యీ అగ్ని పరీక్షలో నెగ్గారు. వాళ్ళు అగ్నిగుండంలోకి ప్రవేశించారు. అందు సంపూర్తిగా పరిశుద్ధులై బయటికి

వచ్చారు. యిక యీ సంగ్రామ అంతం ఎలా ఆరంభమైందో తరువాతి ప్రకరణంలో చూద్దాం.

★ ★ ★

# 47

# అంతానికి ఆరంభం

భారత జాతి ఎంతటి శాంతి శక్తిని ఉపయోగించగలదో అంతశక్తిని, ఆశించిన దానికంటే అధికంగా ఉపయోగించిన వివరం పాఠకులు తెలుసుకొనే యుంటారని అంతటి శాంతిశక్తిని ఉపయోగించిన వారంతా పేదవారని, అణిచి వేయబడిన వారని కూడా పాఠకులు గ్రహించి యుంటారని భావిస్తున్నాను. ఫినిక్సులో యిద్దరు ముగ్గురు బాధ్యత గల కార్యకర్తలు తప్ప మిగతా వారంతా జైళ్లలో వున్న విషయం పాఠకులకు తెలుసు. ఫినిక్సుకు బయట వుండే కార్యకర్తల్లో కీ.శే సేఠ్ అహమద్ మహమ్మద్ కాఛలియా ముఖ్యులు. వారు జైలు బయటనే వున్నారు. ఫినిక్సు వాసుల్లో శ్రీ వెస్ట్, శ్రీమతి వెస్ట్ మగన్‌లాల్ గాంధీ గారలు జైలు బయటవున్నారు. కాఛలియా సేఠ్ సామాన్య పర్యవేక్షణ చేస్తూ వుండే వారు.

కుమారి శ్లేషిన్ ట్రాన్స్‌వాల్ యందు జరిగే ఆదాయ వ్యయాలు వ్రాస్తూ దేశ విదేశాలకు ప్రయాణించే వారి వ్యవహారాలు సంభాళిస్తూ వుండేది ఇండియన్ ఒపీనియన్ ఇంగ్లీషు పత్రికను నడపడం, శ్రీ గోఖలే గారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపటం మొదలగు పనులు శ్రీ వెస్ట్ చేస్తూ వుండేవారు. క్షణక్షణం మారిపోతున్న రాజకీయ పరిస్థితుల్లో ఉత్తరాలు వ్రాయడంకుదరక, పెద్దపెద్ద టెలిగ్రాముల రూపంలో సమాచారం పంపవలసి వస్తూ వుండేది. యిది కడుమున్నితమైన వ్యవహారం. శ్రీ వెస్ట్ యీ పనులన్నీ చేస్తూ వుండేవారు.

ఇప్పుడు ఫినిక్సు, న్యూకాసిల్ మాదిరిగా నేటాలుకు వాయువ్య దిక్కున గల సమ్మె చేస్తున్న కార్మికులకు కేంద్రమై పోయింది. వందలాది మంది కార్మికులు ఫినిక్సు ధావడం, సలహాలు తీసుకోవడం ప్రారంభించారు.

కొందరైతే అక్కడే నివాసం కూడా ఏర్పాటు చేసుకున్నారు. ఇట్టి స్థితిలో ప్రభుత్వం దృష్టి ఫినిక్సు ఆశ్రమం మీద పడకుండా వుంటుందా? సమీపంలో వుంటున్న శ్వేత జాతీయులనేత్రాలు ఎరుపెక్కాయి. ఫినిక్సులో వుండటం ప్రమాదకరంగా మారినా, అక్కడి పిల్లలు సైతం ధైర్యస్థైర్యాలతో పనులు చేస్తూనే వున్నారు. ఇంతలో శ్రీ వెస్ట్‌ను అరెస్టు చేశారు. నిజానికి శ్రీ వెస్టును అరెస్టు చేయడానికి కారణం ఏమీ లేదు. శ్రీ వెస్ట్, మగన్‌లాల్ గాంధీ యిరువురూ అరెస్టు కాకూడదనీ, అందుకు అనువైన పనులు ఏవీ చేయకూడదనీ ముందే నిర్ణయించాం. అందువల్ల శ్రీ వెస్ట్ అరెస్టు కావడానికి అనుకూలమైన పనులేమీ చేయలేదు. అయినా ప్రభుత్వం ఇవన్నీ ఎందుకు చూస్తుంది? అరెస్టు చేయడానికి కారణాలను వెతుకుతుందా? చేతిలో అధికారంవున్నది. దాన్ని ఎలా వినియోగించడమా అనే తపన దప్ప దానికింకేమీ లేదు. శ్రీ వెస్టును అరెస్టు చేశారని తెలియగానే శ్రీ గోఖలే భారతదేశాన్నుంచి, తెలివిగల చురుకైన వారిని కొందరిని దక్షిణాఫ్రికాకు పంపించే ఏర్పాటు చేశారు. లాహోరులో దక్షిణాఫ్రికా సత్యాగ్రహులకు సహాయం చేయాలని ఒక పెద్ద సభ జరిగింది. ఆ సభలో శ్రీ అండ్రూస్ తన దగ్గరగల ధనమంతాదక్షిణాఫ్రికా సత్యాగ్రహులకు సహాయం నిమిత్తం దానంగా యిచ్చివేశారు. అప్పటి నుంచి శ్రీ గోఖలే గారిదృష్టి వారిపై పడింది శ్రీ వెస్టును అరెస్టు చేశారని తెలియగానే శ్రీ గోఖలే శ్రీ అండ్రూస్ గారికి తంతి పంపి మీరు దక్షిణాఫ్రికా వెళతారా అని ప్రశ్నించారు. శ్రీఅండ్రూస్ వెళతానని సమాధానం పంపారు. శ్రీ అండ్రూస్‌తో బాటు వారి ముఖ్య స్నేహితుడు శ్రీ పియర్సన్ కూడా దక్షిణాఫ్రికాకు ఓడలో బయలు దేరారు. అయితే సత్యాగ్రహ సంగ్రామం చివరి అంచుకు వచ్చేసింది. వేలాది మంది నిర్దోషుల్ని జైళ్లలో పెట్టడం సాధ్యమా? దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి గలఅట్టి శక్తి తగ్గిపోయింది. భారత దేశ వైస్రాయి అందుకు అంగీకరించలేదు. జనరల్ స్మట్సు యిప్పుడు ఏం చేస్తాడోనని ప్రపంచమంతా ఎదురు చూడసాగింది. యితర ప్రభుత్వాలు చేయగల పనే దక్షిణాఫ్రికా కూడా చేసింది. భారతీయులకు బాగా అన్యాయం జరిగిందనే సత్యం ప్రపంచానికి స్పష్టంగా తెలిసిపోయింది.

జరిగిన అన్యాయాల్ని ఆపివేయాలని ప్రతివాడూ ఆశిస్తున్న సమయం వచ్చేసింది. జనరల్ స్మట్సుకు మాత్రం యీ విషయం తెలియదా? కాని అతడు పాము చుంచు ఎలుక స్థితిలో పడిపోయాడు. అతడు యిప్పుడు న్యాయం చేయాలి అయితే న్యాయం చేయగల శక్తి అతడు పోగొట్టుకున్నాడు నేను మూడు పౌండ్ల తలపన్నును రద్దు చేయను, మరే మార్పూ చేయను అని దక్షిణాఫ్రికా యందలి శ్వేత జాతీయులకు, జనరల్ స్మట్సు స్పష్టంగా చెప్పాడు కాని పరిస్థితి మారిపోయింది మార్చను అని అన్న వాటినన్నింటినీ మార్చక తప్పలేదు. ప్రజాభిప్రాయానికి భయపడే ప్రభుత్వాలు యిలాంటి సమయంలో సామాన్యంగా ఏదో ఒక కమీషన్ వేసి, అది యిచ్చే రిపోర్టు కోసం ఎదురు చూస్తాయని చెప్పడం సహజంగా జరుగుతూ వుంటుంది. జనరల్ స్మట్సు కూడా అదే పని చేశాడు. ముగ్గురు సభ్యులతో ఒక కమీషన్‌ను నియమించాడు. కాని భారతజాతి యీ కమిషన్ నియామకానికి గల ఉద్దేశ్యాలేమిటో ప్రకటించమనీ, అలా చేయకపోతే బహిష్కరిస్తామనీ ప్రకటించింది. యీ క్రింది షరతులు కూడా విధించింది. 1. జైళ్లలో మ్రగ్గుతున్న సత్యాగ్రహులనందరినీ తక్షణం విడుదల చేయాలి 2. కమీషన్‌లో కనీసం ఒక్క భారతీయుడినైనా సభ్యుడుగా నియమించాలి. యీ రెండు షరతులు ప్రభుత్వానికి తలనొప్పి కలిగించాయి. అయితే గత్యంతరం లేక కమీషనే శ్రీ కెలన్‌బెక్, శ్రీ పోలక్, శ్రీ గాంధీల్ని షరతులేమీ పెట్టకుండా తక్షణం విడుదల చేయమని ప్రభుత్వానికి సలహా యిచ్చింది. ఆ ప్రకారం ప్రభుత్వం మమ్మల్ని ముగ్గురినీ (1913 డిసెంబరు 18న) విడుదల చేసింది. మేము ఏడువారాలు జైల్లో వున్నాము.

శ్రీ వెస్టును అరెస్టు చేశారేగాని ఆయనపై కేసు పెట్టాలంటే ఆధారం ఏమీ దొరకలేదు. అందువల్ల వారిని కూడా ప్రభుత్వం విడుదల చేసింది. ఆండ్రూస్, పియర్సన్ దక్షిణాఫ్రికాకు రాక పూర్వమే యీ ఘట్టాలు జరిగాయి. అందువల్ల నేనే డర్బన్ వెళ్లి మిత్రులిద్దరికీ స్వాగతంచెప్పి తీసుకు వచ్చాను. యీ సమాచారమేమీ తెలియనందున నన్ను ఓడలో చూచి మిత్రులిద్దరూ ఆశ్చర్యపడ్డారు. ఆనందంతో పొంగిపోయారు. వారిరువురినీ మొదటిసారి కలిశాను.

జైలునుంచి విడుదల అయినందుకు మేము ముగ్గురము నిరాశ పడ్డాము బయట ఏమి జరిగిందో మాకు తెలియదు. కమీషన్ నియామకం గుర్చించి తెలుసుకొని ఆశ్చర్యపడ్డాము యీ కమీషన్‌కు మనం సహాయమేమీ చేయలేము అని నిర్ణయానికి వచ్చాము. అయితే కమీషనులో ఒక భారతీయుణ్ణి మెంబరుగా నియమించడం అవసరమని భావించాము మేము ముగ్గురం దర్బను చేరాము. 1913 డిసెంబరు 21 వ తేదీన జనరల్ స్మట్సుకు మేము ఒక జాబు వ్రాశాము.

మీ కమీషనుకు స్వాగతంచెబుతున్నాం. కాని అందలి యిద్దరు సభ్యులు శ్రీ ఎస్లన్, శ్రీ వైలీ గారల నియుక్తి జరిగిన తీరును మేము తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాము. వ్యక్తిగతంగా మాకు వారి యెడ వ్యతిరేకత లేదు వారు సుప్రసిద్ధులు. యోగ్యులైన పౌరులు కాని వారిరువురు అనేక సార్లు భారతీయులకు వ్యతిరేకంగా తమ అభిప్రాయం వెల్లడించారు అందువల్ల తెలిసో తెలియకయో వారు భారతీయులకు అన్యాయం చేసే ప్రమాదం వున్నది ఏమనిషి హఠాత్తుగా తన స్వభావాన్ని మార్చుకోలేడు. అందువల్ల యీ యిద్దరు పెద్దమనుషులు హఠాత్తుగా తమ స్వభావం మార్చుకుంటారని భావంచడం ప్రకృతి నియమానికే విరుద్ధం అయినా వాళ్ళను తొలగించమని మేము కోరము. కమీషనులో తటస్థంగా వుండే సభ్యుల సంఖ్య పెరగాలని కోరుతున్నాం. అందుకుగాను మేము సర్‌జేమ్స్ రోజయినిజ్, ఆనరబుల్ డబ్ల్యు.పి. ష్రైనర్‌గారల పేర్లు సభ్యులుగా నియమించమని మీకు సూచిస్తున్నాం వీరిద్దరూ ప్రముఖులు. న్యాయ ప్రవృత్తిలో ప్రసిద్ధులు. మరో వినతి సత్యాగ్రహులనందరినీ తక్షణం విడుదల చేయండి. అలా మీరు చేయకపోతే మేము జైలు బైట వుండటం కష్టం. యింకా వాళ్ళందరినీ జైళ్లలో వుంచడానికి అర్థంలేదు. యింతేగాక కమీషన్ ఎదుట సాక్ష్యం యివ్వాలంటే మేము గనుల దగ్గర పని చేస్తున్న గిరమిటియా కార్మికులనందరినీ కలవాలి. వారి అభిప్రాయం తెలుసుకోవాలి. అందుకు మాకు స్వాతంత్ర్యం లభించాలి. ప్రభుత్వం మా యీ ప్రార్థనను అంగీకరించకపోతే మేము తిరిగి జైలుకి వెళ్లుటకు చర్యలుగైకొనక తప్పదని విచారంతో తెలుపుతూ వున్నాము. యిదీ మా జాబు యందలి విషయం.

అయితే జనరల్ స్మట్సు కమీషన్ మెంబర్లను మార్చడానికి, క్రొత్తవారిని చేర్చడానికి అంగీకరించలేదు కమీషన్ నియామకం కేవలం తన తృప్తికోసం ప్రభుత్వం చేసింది అని స్మట్సు సమాధానం పంపాడు. డిసెంబరు 24వ తేదీన స్మట్సు జాబుమాకు అందింది యిక మాకు వేరే మార్గం మిగల లేదు మేము జైలుకు వెళుతున్నామని ప్రకటించాం 1914 జనవరి 1 వ తేదీన డర్బను నుంచి జైలుకు వెళ్లే భారతీయుల బృందం యాత్రాదళంగా బయలు దేరుతుందని కూడా ప్రకటించాం అయితే జనరల్ స్మట్సు వ్రాసిన ఉత్తరంలో ఒక వాక్యం వున్నది

"మేము పక్షపాతం లేకుండా, కోర్టు కమీషన్‌ను నియమించాము దాన్ని నియమిస్తున్నప్పుడు మేము భారతీయుల నెవ్వరితోను సలహా సంప్రతింపులు జరుప లేదు అదే విధంగా గనుల యజమానులతోను, పట్టణవాసులతోను కూడాసలహా సంప్రతింపులు జరపలేదు. అన్నదే ఆవాక్యం అది చదివి నేను వ్యక్తిగత హోదాలో యీ విషయమై మిమ్ము కలిసి మాట్లాడుతాము కొన్ని వివరాలు మీకు అందజేస్తాము తేదీ, సమయం నిర్ణయించి తెలియజేయండి. అని జాబు పంపాను జనరల్ స్మట్సు అందుకు అంగీకరించాడు అందువల్ల మా యాత్ర కొద్ది రోజులు వాయిదా పడింది మేము కాలినడకన యాత్రాదళంతో బయలుదేరనున్నామని తెలిసి శ్రీ గోఖలే నాకు ఒక పెద్ద తంతి పంపారు. మీరు యీ విధంగా చేస్తే యిక్కడ లార్డ్ హార్డింగ్ స్థితి, నా స్థితి కూడా గందరగోళంలో పడుతుంది కనుక మీరు యీ యాత్ర చేయకండి ఆ కమీషనుకు సహకరించండి." అని ఆ తంతియొక్క సారాంశం.

మేము ధర్మ సంకటంలో పడిపోయాము. కమీషన్ సభ్యుల సంఖ్య పెంచకపోతే కమీషనును బహిష్కరించాలని భారతజాతి తీర్మానించింది ప్రతిజ్ఞ కూడాచేసింది లార్డ్ హార్డింగ్‌కు కోపం వస్తుందనో, శ్రీ గోఖలే గారికి దుఃఖం కలుగుతుందనో భావించి చేసిన ప్రతిజ్ఞను ఉపసంహరించడం ఎలా సాధ్యం? శ్రీ ఆండ్రూస్ కల్పించుకొని గోఖలేగారి భావాల్ని అతి సున్నితంగా వున్న వారి అనారోగ్యాన్ని, మా యీ నిర్ణయం వల్ల గోఖలే గారి హృదయానికి

తగిలే దెబ్బను గురించి యోచించమని మాకు సూచించారు. నాకిదంతా తెలును. భారతీయులందరితో చర్చించాను. ఒక నిర్ణయానికి వచ్చాము. కమీషన్ సభ్యుల సంఖ్య పెంచకపోతే ఎంత పెద్ద ప్రమాదం సంభవించినా సరే ఎదుర్కొని కమీషన్ను బహిష్కరించి తీరాలి అనునదే మా ఆ నిర్ణయం. 100 పౌండ్లు ఖర్చు పెట్టి పెద్ద తంతి ద్వారా యీ వివరమంతా శ్రీ గోఖలేగారికి తెలియజేశాము. అందుకు శ్రీ ఎండ్రూస్ కూడా సమ్మతించారు ఆ తంతి సారాంశం - "మీ ఆవేదనను మేము అర్థం చేసుకున్నాం. ఎంతటి త్యాగానికైనా సిద్ధపడి మీ సలహాను అంగీకరించాలనే మా కోరిక. లార్డ్‌హార్డింగ్ మాకు ఎంతో విలువైన సహాయం చేశారు. వారి సాయంచివరి వరకు లభిస్తూ వుండాలని మేము కోరుకుంటున్నాం. అయితే మీరు మా స్థితిని తెలుసుకోవాలని కోరుతున్నాం. యిది వేలాది మంది ప్రజల ప్రతిజ్ఞకు సంబంధించిన విషయం.

మా ప్రతిజ్ఞ పరిశుద్ధమైనది. మేము చేస్తున్న సంగ్రామం పూర్తిగా పరిశుద్ధమైన ప్రతిజ్ఞల పునాదిపై నిర్మాణ మైంది. ప్రతిజ్ఞా బంధనమే లేకపోతే మాలో చాలా మందిమి క్రిందికి జారి పడిపోయి వుండేవారమే. వేలాది మంది ప్రజలు ముక్తకంఠంతో చేసిన ప్రతిజ్ఞను మేము ఉపసంహరిస్తే ఇక నైతిక బంధనమనే దానికి తావే వుండదు ప్రతిజ్ఞ చేసేముందు భారతజాతి ప్రజలు క్షుణ్ణంగా చర్చించారు. ఏవిధమైన అవినీతికి యిందు తావులేదు. కమీషన్ను బహిష్కరించాలని ప్రతిజ్ఞ చేసే అధికారం ప్రజలకున్నది. అందువల్ల ఎట్టి పరిస్థితుల్లోను, మిన్ను వచ్చిమీద విరిగిపడినా వెరువకుండా ప్రతిజ్ఞను పాలించమని మాకు సలహా యిమ్మని మిమ్ము కోరుతున్నాం. దయ యుంచి మా యీ తంతిని శ్రీ లార్డ్ హార్డింగ్ గారికి కూడా చూపించండి. మీ పరిస్థితి గందరగోళంలో పడకూడదని మేము కోరుతున్నాము. మేమీ సంగ్రామం భగవంతుని సాక్షిగా పెట్టుకొని ఆయన సహాయం మీద ఆధారపడి ప్రారంభించాము. పెద్దల గౌరవనీయుల సహాయం మేము కోరుతున్నాము. మీ సహాయం లభించగానే మేము సంతోషిస్తున్నాము. అయితే ఏది ఏమైనా సరే పరిశుద్ధ హృదయంతో చేసిన ప్రతిజ్ఞను పాలించాల్సిందేననునది మా

వినమ్ర నిర్ణయం. మా ప్రతిజ్ఞా పాలనకు మీ సహాయాన్నీ, మీ ఆశీర్వాదాల్నీ అభ్యర్థిస్తున్నాం."

ఈ తంతి శ్రీ గోఖలే గారికి అందింది దాని ప్రభావం వారి ఆరోగ్యం మీద చెడ్డగా పడింది. కాని మాకు వారి వల్ల లభించే సహాయానికి అది అడ్డంకి కాలేదు. సరికదా వారి సహాయం యింకా గట్టిపడి పెద్ద స్థాయిలో లభించసాగింది వారు లార్డ్ హార్డింగుకు యీ విషయం తంతి ద్వారా తెలియజేశారు మమ్మల్ని మాత్రం వదిలి వేయలేదు. మా నిర్ణయాన్ని శ్రీ గోఖలే గారు లార్డ్ హార్డింగ్ ఎదుట గట్టిగా బలపరిచారు లార్డ్ హార్డింగ్ కూడా తమ మాట మీద నిలబడి వున్నారు

నేను అండ్రూసు వెంట ప్రిటోరియా వెళ్లాను అప్పుడే యూనియన్ రైల్వే విభాగంలో శ్వేత జాతీయులైన కర్మచారులంతా కలిసి పెద్ద సమ్మె చేశారు. ఆ సమ్మె వల్ల యూనియన్ ప్రభుత్వం స్థితి బలహీన పడింది యిట్టి సమయంలోనే భారతీయులు యాత్ర ప్రారంభించాలని చాలా మంది నాకు సలహా యిచ్చారు కాని నేను సమ్మె చేస్తున్న శ్వేత జాతీయులకు యీ విధంగా సహాయం చేయలేనని ప్రకటించాను. ప్రభుత్వాన్ని యిరకాటంలో పెట్టడం మా లక్ష్యంకాదని, మా సంగ్రామం శ్వేత జాతీయులపోరాటం వంటిది కాదని, అందుకు భిన్నమైనదని, మేము శ్వేత జాతీయుల సమ్మె జరుగుతున్నప్పుడు యాత్ర ప్రారంభించక, వారి సమ్మె ముగిసిన తరువాత ప్రారంభిస్తామని ప్రకటించాను. మా యీ నిర్ణయం వల్ల మంచి ప్రభావం ప్రజాహృదయాలపై పడింది. రాయిటర్ ద్వారా నా యీ ప్రకటన ఇంగ్లాండు చేరింది. లార్డ్ ఎంప్ట్ హిల్ మాకు ధన్యవాదాలు చెబుతూ ఇంగ్లాండు నుంచి తంతి పంపించారు. దక్షిణాఫ్రికా యందలి ఆంగ్ల మిత్రులు కూడా ధన్యవాదాలు అందజేశారు. జనరల్ స్మట్సు గారి ఒక కార్యదర్శి హాస్యభాషలో ఏమందోయ్! నాకు మీ వ్యవహారం నచ్చడం లేదు. నేను మీ వారికి ఏమి సహాయం చేయదలచలేదు. అయినా మీతో ఎలా వేగడం? అరే! ఆపద సమయంలో మీరు ఆదుకుంటున్నారు. మిమ్మల్ని ఎలా చంపడం? మీరు కూడా యీ ఆంగ్ల సమ్మె దారుల్లా రగడ చేయమని కోరుతున్నాను. అలా

చేస్తే క్షణంలో మిమ్మల్ని త్రోవకు తీసుకురాగలం కాని మీదంతా మరో పద్ధతి మీరు దుఃఖం కలిగించే వారికి కూడా దుఃఖం కలిగించవద్దంటారు మీరు దుఃఖాలు, కష్టాలు స్వయంగా సహించి విజయం సాధించాలని చూస్తారు శిష్టతను సభ్యతను వదలనేవదలరు అందువల్ల మేము మిమ్మల్ని ఏమీ చేయలేకపోతున్నాం అని అన్నాడు

ఇలాంటి భావాలే జనరల్ స్మట్సు కూడా వెల్లడించారు

సత్యాగ్రహుల వినయం, సౌజన్యం వల్ల కలిగిన సత్ఫలితం యిది ఒక్కటే కాదని యింకా అనేకం వున్నాయని పాఠకులు గ్రహింతురుగాక. తెల్ల కార్మికులు సమ్మె చెస్తువిపరీతంగా చెరుకు పంటను నరికివేశారు వాళ్లు నరికి వేసిన ఆ చెరుకును భారతీయులు మిల్లులకు చేరవేసియుండకపోతే తెల్లవాళ్లు విపరీతంగా నష్టపడిపోయే వాళ్లే ఆ చెరుకును మిల్లుకు చేర్చాలంటే 1200 మంది భారతీయ కార్మికులు తిరిగి పనిలో చేరవలసి వచ్చింది. ఆ పని పూర్తి చేసిన తరువాతనే మన వాళ్లు తిరిగి సమ్మెలో చేరారు. ఇదేగాక డర్బన్ మ్యునిసిపాలిటీలో సమ్మె జరుగుతున్నప్పుడు పాకీ పని, ఆసుపత్రుల్లో పారిశుధ్యం పని చేయమని చెబితే సంతోషంగా వెళ్లి భారతీయులు చేశారు. పాకీ పని, ఆసుపత్రుల్లో పారిశుధ్యం పని మనవాళ్లు చేసి యుండకపోతే డర్బనులో రోగాలు వ్యాప్తమై, అంతా అస్తవ్యస్తమైపోయి వుండేది సత్యాగ్రహులు అటువంటి పరిస్థితికి అవకాశం యివ్వలేదు కనుకనే అట్టి పనులచేసే వారికి సమ్మె చేయవద్దని చెప్పాము. సత్యాగ్రహి వేసే ప్రతి అడుగు వ్యతిరేకుల స్థితి గతులను గురించి యోచించి మరీ వేస్తూ వుండాలి.

భారతీయులు చూపించిన యీ సౌజన్యానికి సహృదయతకు సత్ఫలితాలు కలిగాయి. ఈ విషయం నాకు బాగా తెలుసు. ఇట్టి సత్కార్యాల వల్ల భారతీయుల గౌరవప్రతిష్ఠలు పెరిగాయి. ఒడంబడికకు అనుకూల వాతావరణం ఏర్పడింది

★ ★ ★

# 48

# ప్రాథమిక ఒడంబడిక

ఈ విధంగా ఒడంబడికకు అనుకూల వాతావరణం నెలకొంటూవున్నది నేను, శ్రీ అండ్రూస్ యిద్దరం ప్రిటోరియా వెళ్లాం లార్డ్ హార్డింగ్ ప్రత్యేక ఓడలో పంపిన సర్ బెంజమన్ రాబర్ట్‌సన్ అప్పుడే దక్షిణాఫ్రికాకు చేరుకోనున్నారు అయితే జనరల్ స్మట్సు రమ్మన్న తేదీకి మేము ప్రిటోరియా చేరాము సర్‌రాబర్ట్‌సన్‌కోసం మేము ఆగ వలసిన అవసరం లేదు. భారత జాతి చేసిన త్యాగాలకు శుభ పరిణామం కలుగక తప్పని స్థితి ఏర్పడింది

మేమిద్దరం ప్రిటోరియా చేరాం అయితే జనరల్‌స్మట్సును నేను ఒక్కణ్ణే కలవాలి. ఆ మహాశయుడు రైల్వేలో పనిచేసే తెల్లజాతీయుల సమ్మె వ్యవహారంలో మునిగి వున్నాడు ఆ సమ్మె భయంకర రూపందాల్చింది దాన్ని అణచుటకు మార్షల్‌లా అమలు చేయవలసి వచ్చింది జీతాలు పెంచేలా చేసుకోడం సమ్మె చేస్తున్న వారి లక్ష్యం కాదని, అసలు యూనియన్ ప్రభుత్వాన్ని చేజిక్కించుకోవడం వారి ధ్యేయమని తేలింది

జనరల్ స్మట్సును కొద్దిసేపు మాత్రమే మొదటి సారికలిశాను. అప్పుడు జాగ్రత్తగా పరిశీలించి చూచాను మాయాత్రాదళం బయలు దేరినప్పటి జనరల్ స్మట్సు స్థితి యందు ఎంతో మార్పు కనబడింది అప్పుడు జనరల్ స్మట్సు నాతో మాట్లాడుటకు నిరాకరించిన విషయం పాఠకులకు తెలుసు. సత్యాగ్రహం అనే బెదిరింపు ఆనాడూ వున్నది, యీనాడూ వున్నది అయితే ఆనాడు నిరాకరించాడు, యీనాడు అంగీకరించాడు మీరు వేసే కమీషన్‌లో ఒక భారతీయుడు వుండి తీరాలని సత్యాగ్రహ సమితి కోరుతున్నది అని చెప్పాను కాని అందుకు జనరల్ స్మట్స్ అంగీకరించలేదు. "కమీషన్ సభ్యులను యిక పెంచడానికి వీలులేదు. అలా చేస్తే ప్రభుత్వం యొక్క గౌరవం తగ్గుతుంది. అలా చేస్తే నేను కోరుతున్న సంస్కరణలు చేయలేను. శ్రీ ఎస్లన్ మామనిషి. సంస్కరణలను అతడు వ్యతిరేకించలేదు. ప్రభుత్వానికి అనుకూలంగా వుంటాడు. కర్నల్ వైలీ నేటాలుకు చెందిన ప్రసిద్ధ వ్యక్తి.

వారు మీకు అనుకూలురు కాకపోయినా 3 పౌండ్ల పన్నును రద్దు చేయుటకు ఆయన అంగీకరిస్తే పని తేలిక అయిపోతుంది మా కష్టాలు మావి ఒక్క నిమిషం సమయం కూడా మాకు చిక్కడంలేదు మీ సమస్యల్ని త్వరగా పరిష్కరిస్తాం. మీ కోరికల్ని అంగీకరించాలనే నిర్ణయానికి వచ్చాం కాని కమీషన్ అంగీకరించకపోతే మేము వాటిని పూర్తి చేయలేము. మీ పరిస్థితి నాకు తెలుసు కమీషన్‌లో మీ ప్రతినిధిని నియమించకపోతే మీరెవ్వరూ కమీషను ముందు సాక్ష్యం యివ్వరు. యిష్టం లేకపోతే సాక్ష్యం యివ్వకండి కాని ఎవరైనా సాక్ష్యం యిస్తామని ముందుకువస్తే మీరు వాళ్ళను ఆపకండి. కమీషన్ పని సవ్యంగా సాగనివ్వండి. అందాకా సత్యాగ్రహాన్ని ఆపండి అలాచేస్తే మీకు లాభం కలుగుతుంది నాకు శాంతి లభిస్తుంది సమ్మె చేస్తున్న భారతీయ కార్మికులపై దౌర్జన్యాలు జరుగుతున్నాయని మీరు చెబుతున్నారు. మీరు కమీషన్ ఎదుట సాక్ష్యం యివ్వము అని అంటున్నారు కనుక యీ ఆరోపణను ఎలా రుజూ చేస్తారో చెప్పండి అయితే యిది మీరే ఆలోచించుకోవలసిన విషయం

ఇవీ స్మట్సు నోటవెలువడిన మాటలు. వారు చెప్పిన మాటలకు నామనస్సు అనుకూలంగా మారింది. సమ్మె చేస్తున్న కార్మికులపై రక్షకభటులు, వార్డర్లు కఠినంగా రౌర్జన్యం చేశారని పెద్దస్థాయిలో ప్రచారం చేశాం. కాని కమీషన్ను బహిష్కరిస్తున్నాం కనుక మా ఆరోపణను రుజూ చేయలేము గదా! ధర్మ సంకటం ఏర్పడింది. రక్షక భటులు, వార్డర్లు కలిసి భారతీయులపై చేసిన దౌర్జన్యాలను రుజూ చేయడం అవసరమని కొందరి అభిప్రాయం. కమీషన్ ఎదుట సాక్ష్యం యివ్వకపోయినా దౌర్జన్యం చేసిన వారిపై తీవ్రమైన ఆరోపణలు చేద్దాం యిక గతిలేక వాళ్లు మనమీద మాననష్టం దావా కోర్టులో వేస్తారు. అక్కడ వాళ్ల దౌర్జన్యాల్ని రుజూ చేద్దాం అని వారు అన్నారు. కాని యీ పద్ధతిని నేను అంగీకరించలేదు. కమీషను ప్రభుత్వం యొక్క భావాలను వ్యతిరేకిస్తుందని ఆశించకూడదు. మాననష్టపు దావా వరకు వ్యవహారాన్ని తీసుకువెళ్లితే దానితోనే వేగవలసి వస్తుంది. చివరికి కలిగే లాభం ఏమీ వుండదు. వకీలును గనుక పరువునష్టం దావాలో వుండే

తికమకలన్నీ నాకు బాగా తెలుసు. నా దగ్గరగల బలవత్తరమైన సాధనం సత్యాగ్రహుల సహనశక్తి, త్యాగనిరతి, నిజాయితీలే. సత్యాగ్రహం ప్రారంభించేముందే తాము ఎన్నో కష్టాలు పడాలని, మృత్యువుకు సైతం సిద్ధపడాలని సత్యాగ్రహులు తెలుసుకున్నారు అందుకు వారంతా సిద్ధపడ్డారు. అట్టిస్థితిలో పడ్డకష్టాల్ని రుజూ చేస్తే కలిగే లాభం ఏమిటి? పగ తీర్చుకుందామనే కోరిక సత్యాగ్రహికి అసలు కలుగకూడదు అట్టి పరిస్థితులు వచ్చినప్పుడు సత్యాగ్రహి ప్రశాంతంగా వుండాలి. ప్రధాన మైన సమస్య కోసం సత్యాగ్రహి ప్రయత్నం చేయాలి నల్ల చట్టాల్ని రద్దు చేయించడమే ప్రధాన విషయం. అవి రద్దు అయ్యే సూచనలు స్పష్టంగా కనబడుతున్నప్పుడు యిక మిగతా విషయాలలో పడటం అనవసరం పోరాటంలో రాజీపడుటకు రెండు పక్షాలు సిద్ధపడినప్పుడు, సత్యాగ్రహులు మౌనం వహిస్తే అది అమోఘంగా పని చేస్తుంది నాయీ తర్కంతో వ్యతిరేకిస్తున్నవారిలో ఎక్కువమందిని సంతృప్తి పరిచాను అందువల్ల చట్టం ద్వారా పడిన కష్టాలను రుజూ చేయాలనే పట్టును సడలించుటకు నిర్ణయించుకున్నాము

★ ★ ★

# 49

# ఉత్తర ప్రత్యుత్తరాలు

ప్రాథమిక ఒడంబడిక విషయమై జనరల్ స్మట్సుకు నాకు మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. 1914 జనవరి 21 వ తేదీ నాటి జాబులో క్రింది వివరం వ్రాశాను.

"మేము చేసిన ప్రతిజ్ఞ వల్ల మీరు చెప్పిన ప్రకారం కమీషన్ ఎదుట సాక్ష్యం యిచ్చి వారికి సహకరించలేము. మా ప్రతిజ్ఞను గురించి మీకు తెలుసు. మీరు దీన్ని గౌరవిస్తున్నారని మాకు తెలుసు సాక్ష్యం యిచ్చి సహకరించకపోయినా మరో విధంగా కమీషన్‌కు సహకరిద్దామని కనీసం కమీషన్ చేసేపనికి అడ్డంకులు కలిగించవద్దని నా దేశ ప్రజలకు చెబుతాను. మా జాతీయ సమస్యల్ని గురించి మాతో సలహా సంప్రతింపులు జరపాలనే

సిద్ధాంతాన్ని మీరు అంగీకరించారు కనుక మేము పై విధానం అవలంబిస్తాం యింతేగాక కమీషన్ పని సాఫీగా జరుగుటకు. క్రొత్త చట్టాలు ప్యాసు అయ్యే సమయంలో ప్రభుత్వానికి యిబ్బంది కలుగ చేయని పద్ధతిన సత్యాగ్రహాన్ని నిలుపదల చేయమని కూడా మా వాళ్లకు సలహా యిస్తాను వైస్రాయి పంపిన సర్ బెంజిమన్ రాబర్ట్‌సన్‌కు కూడా సహాయం చేయమని నా దేశబంధువులకు చెబుతాను

జైల్లలో వున్నప్పుడు, సమ్మె చేస్తున్నప్పుడు మేము అనుభవించిన కష్టాలు, దుఃఖాలను గురించి మా మీద జరిగిన దౌర్జన్యాలను, మేము చేసిన ప్రతిజ్ఞ కారణం వల్ల రుజూచేయుటకు సిద్ధపడటం లేదని తెలియజేస్తున్నాను సత్యాగ్రహ సిద్ధాంతం ప్రకారం మేము పడిన కష్టాలను, అనుభవించిన దుఃఖాలను గురించి ఆరోపణలు చేయము అందుకు ప్రతీకారం కూడా కోరము. యీ విషయమై మేము వహిస్తున్న మౌనానికి మా దగ్గర అందుకు సంబంధించిన ఆధారాలు లేవని మాత్రం భావించవద్దని మనవి చేస్తున్నాను మా స్థితిని కూడా గుర్తించి అర్థం చేసుకోమని మిమ్ము కోరుతున్నాను మేము సత్యాగ్రహాన్ని ఆపుతూ వున్నాము గనుక, యిప్పుడు జైల్లలో మ్రగ్గుతున్న సత్యాగ్రహులనందరినీ విడుదల చేయాలి యీ సందర్భంలో మా కోరికలు ఏమిటో మీకు స్పష్టంగా తెలియజేస్తున్నాను.

1. మూడు పౌండ్ల పన్ను రద్దు చేయాలి
2 హిందువులు మహమ్మదీయులు మొదలుగా గల మతాల ప్రకారం జరిగిన వివాహాలనన్నింటిని చట్టబద్ధ మని అంగీకరించాలని
3. విద్యావంతులైన భారతీయుల్ని యీ దేశంలోకి ప్రవేశించనీయాలి
4. ఆరెంజ్ ఫ్రీస్టేటు విషయమై జరిగిన నిర్ణయాలలో సంస్కరణలు జరగాలి.
5 భారతీయులకు యిప్పుడు కల అధికారాలకు ఏ విధమైన నష్టం వాటిల్లదని యిప్పటి చట్టాలు అమలు చేసే సమయంలో హామీ యివ్వాలి

పైన తెలిపిన మా కోరికలకు మీరు తృప్తికరంగా సమాధానం పంపితే నేను మా దేశ ప్రజలకు సత్యాగ్రహాన్ని ఆపమని సలహా యిస్తాను."

నేను వ్రాసిన యీ జాబుకు జనరల్ స్మట్స్ అదేరోజున సమాధానం పంపించాడు దాని సారం క్రింద తెలియజేస్తున్నాను

"మీరు కమీషన్ ఎదుట సాక్ష్యం యివ్వలేనందుకు ప్రభుత్వం చింతిస్తున్నది అయితే ప్రభుత్వం స్థితిని గ్రహించింది మీ స్వయం సేవకులపై జరిగిన దౌర్జన్యాలను రుజూ చేయు పనిని ఆపవలెనని చేసిన మీ నిర్ణయానికి వెనుక గల కారణాలను సైతం ప్రభుత్వం గ్రహించింది సత్యాగ్రహులపై క్రూరంగా వ్యవహరించారనే విషయాన్ని ప్రభుత్వం స్పష్టంగా నిరాకరిస్తున్నది అయితే మీరు కమీషన్ ఎదుట సాక్ష్యాధారాలు ప్రవేశపెట్టక పోతే ప్రభుత్వం యీ విషయంలో ఏమీ చర్యగైకొనలేదని తెలియజేస్తున్నాను సత్యాగ్రహుల్ని విడుదల చేయమని మీరు కోరక ముందే అందుకు సంబంధించిన ఆర్డరు ప్రభుత్వం పంపించి వేసింది భారత జాతికి కలిగిన దుఃఖాలను గురించి మీ జాబులో చివర వ్రాశారు ఆ విషయంలో కమీషన్ రిపోర్టు అందేంత వరకు ఏ చర్య ప్రభుత్వం తీసుకోదని తెలియజేస్తున్నాను.

మా యీ రెండు ఉత్త ప్రత్యుత్తరాలు జరుగక పూర్వం నేను, శ్రీ అంగ్రూస్ చాలాసార్లు జనరల్ స్మట్సును కలిసి మాట్లాడాము. సర్ బెంజిమన్ రాబర్ట్సన్ కూడా ప్రిటోరియా చేరారు సర్ బెంజిమన్ ప్రజలకు యిష్టుడైన అధికారిగా పేరు పొందిన వ్యక్తి గోఖలే గారి దగ్గరి నుంచి సిఫారసు పత్రం కూడా తన వెంట తీసుకు వచ్చారు కాని సామాన్య ఆంగ్లాధికారుల్లో వుండే బలహీనతలనుంచి ఆయన విముక్తుడు కాలేదని నాకు బోధపడింది ఆయన రాగానే భారత జాతి ప్రజల్లో తగాదాలు సృష్టించడానికీ, సత్యాగ్రహుల్ని భయపెట్టడానికి పూనుకున్నాడు ప్రిటోరియాలో మొదటి సారి ఆయనను కలిసినప్పుడు నాపై మంచి ప్రభావం పడలేదు. సత్యాగ్రహుల్ని భయపెడుతున్నాడని నాకు కొన్ని టెలిగ్రాములు అందాయి వాటిని గురించి సర్‌బెంజిమన్‌తో నేను చర్చించాను అందరితోను స్పష్టంగాను, నిజాయితీగాను వ్యవహరించడం నా ధర్మం తద్వారా మేమిద్దరం స్నేహితులమైనాము

అధికారులు భయపడే వాళ్లను భయపెడుతూ వుంటారని, నిర్భయంగా వుండేవాళ్ళ జోలికి పోరని అనేక పర్యాయాలు అనుభవం వల్ల తెలుసుకున్నాను.

ఈ విధంగా ప్రభుత్వంతో మా ప్రాధమిక ఒడంబడిక జరిగింది సత్యాగ్రహాన్ని ఆపుచేశాము అందువల్ల అనేక మంది ఆంగ్ల మిత్రులు ఆనందించారు. చివరి ఒడంబడికకు సంపూర్తిగా సహకరిస్తామని వాళ్లు మాటయిచ్చారు. అయితే జాతి ప్రజల్ని యీ ఒడంబడిక అంగీకరింప చేయడం కష్టమని తోచింది. జాతి ప్రజల్లో ఆవిర్భవించిన ఉత్సాహం చల్ల బడటం ఎవ్వరికీ యిష్టం లేదు. అసలు జనరల్‌స్మట్సు మీద ఎవ్వరికీ నమ్మకంలేదు. 1908లో జరిగిన ఒడంబడికనుక జ్ఞాపకం చేసి కొందరు "జనరల్ స్మట్సు ఒక్క పర్యాయం భారత జాతిని మోసం చేశాడు. అనేకసార్లు మీ మీద సత్యాగ్రహంలో కొత్తకొత్త విషయాలు చేరుస్తున్నాడని ఆరోపణలు చేశాడు. జాతి ప్రజలపై ఆత్యాచారాలు చేశాడు యింత జరిగినా జనరల్ స్మట్సును మీరు అర్థం చేసుకోలేదంటే ఎంతో విచారం కలుగుతున్నది. యీ మనిషి మళ్లీ మోసం చేస్తాడు అప్పుడు మీరు మళ్లీ సత్యాగ్రహం అని అంటారు అప్పుడు మిమ్మల్ని ఎవరు నమ్ముతారు? జనం మాటి మాటికీ జైళ్లకు వెళ్లడం కష్టనష్టాలు పడటం సంభవమా? జనరల్ స్మట్సు వంటి మనిషితో ఒకే ఒక ఒడంబడిక చేసుకోవాలి.

మన జాతి ప్రజలు కోరిన కోరికల్ని నెరవేరుస్తున్నట్లు ఆయనచేత వ్రాయించి పత్రంతీసుకోవాలి. అంతేగాని అతగాడి నోటి మాటలను నమ్మవద్దు. మాట యిచ్చి ఆ ప్రకారం నడుచుకోని మనిషిని ఎలా నమ్మడం?" అని మనస్ఫూర్తిగా చెప్పారు.

ఇలాంటి వాదనలు తప్పవని నేను ముందే ఊహించాను. అందువల్ల నాకు ఏమీ ఆశ్చర్యం కలుగలేదు. ఎవడు ఎన్నిసార్లు మోసం చేసినా సత్యాగ్రహి అతణ్ణి నమ్మవలసిందే. అతడు మోసం చేశాడనే విషయం స్పష్టంగా ధృవీకరించబడాలి కదా సత్యాగ్రహి దుఃఖాన్ని సుఖమని భావించి రంగంలోకి ప్రవేశిస్తాడు. అపనమ్మకానికి కారణమేమీ కనబడనప్పుడు, తరువాత దుఃఖం కలుగుతుందన్న భయంతో శత్రువును శంకించడు. తనశక్తి మీద

సత్యాగ్రహికి విశ్వాసం వుంటుంది అట్టిస్థితిలో శత్రుపక్షం చేసే మోసం విషయమై నిశ్చింతగా వుంటాడు. ఎన్నిసార్లు మోసపోయినా శత్రువును సత్యాగ్రహినమ్ముతాడు అందువల్ల సత్యానికి గల బలం పెరుగుతుందని, విజయం తప్పక లభించి తీరుతుందని భావిస్తాడు. ఆ విధంగా భావించి నేను పలు చోట్ల సభలు జరిపి భారత దేశ ప్రజలకు విషయమంతా వివరించి చెప్పాను. ఒడంబడికను అంగీకరించడం మంచిదని జనానికి నచ్చ చెప్పటకు ప్రయత్నించాను ప్రజలు కూడా సత్యాగ్రహ విశేషాల్ని అర్థం చేసుకో గలిగారు. యీ పర్యాయం జరిగిన రొడంబడికకు మధ్యవర్తిగాను, సాక్షిగాను శ్రీ అంద్రూస్ వున్నారు. వైస్రాయి ప్రతినిధిగా వచ్చిన సర్ బెంజమన్ రాబర్ట్సన్ కూడా వున్నారు అందువల్ల యీ ఒడంబడికను సైతంనిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. నిజానికి నేను ఒడంబడిక చేసుకోవద్దని వాదించి యుంటే అది భారత జాతి చేసిన తప్పిందంగా చరిత్రలో నిలిచిపోయి వుండేది. ఆరునెలల తరువాత జాతికి లభించిన విజయానికి అనేక విఘ్నాలు కలిగియుండేవి. సత్యాగ్రహి ఎన్నడూ తన వైపు మరొకరు వ్రేలెత్తి చూపించేస్థితిలో వుండడు. కనుకనే "క్షమావీరస్య భూషణం" ఓర్పువీరులకు భూషణం" అనుసూక్తి ప్రచారంలోకి వచ్చింది. అపనమ్మకం కూడా పిరికి తనానికి లక్షణమే. నిర్భయుడికి భయమెందుకు? సత్యాగ్రహంలో భయానికి తావులేదు. విరోధిగా వున్నవాడిని నాశనం చేయడం సత్యాగ్రహిలక్షణం కాదు. అతని హృదయాన్నుంచి శత్రు ప్రవృత్తిని తొలగించడమే అతని కర్తవ్యం. అట్టిస్థితిలో యిక అమ్మనమ్మకం అనవసరం.

భారతజాతి ఒడంబడికకు అంగీకారం తెలిపింది. యిక యూనియన్ పార్లమెంటుసమావేశం కోసం అంతా ఎదురు చూస్తూ వున్నారు. కమీషన్ తన పని చేస్తూ వున్నది. కమీషన్ ఎదుటకు భారతజాతి పక్షాన వెళ్ళిన సాక్షులు బహుతక్కువ. దీనివల్ల భారత దేశ ప్రజల మీద సత్యాగ్రహ సమితికి ఎంత పట్టువున్నదీ ప్రపంచానికి తెలిసి పోయింది. సర్ బెంజమన్ రాబర్ట్సన్ చాలా మంది భారతీయుల్ని కమీషన్ ఎదుట సాక్ష్యం యిమ్మని ప్రోత్సహించాడు. కాని అసలు సత్యాగ్రహోద్యమాన్ని వ్యతిరేకించిన బహుకొద్దిమంది తప్ప,

మరెవ్వరూ అతడి మాట వినలేదు కమీషన్ ఎదుట సాక్ష్యం చెప్పలేదు అయితే యిట్టి బహిష్కరణ వల్ల కమీషన్‌పై వ్యతిరేక ప్రభావం పడలేదు పైగా దానిపని సులభమైపోయింది. కమీషన్ సమర్పించిన రిపోర్టు ప్రచురించబడింది. రిపోర్టులో కమీషన్ సభ్యులు భారతజాతి ప్రజల సహకారం లభించనందుకు అసంతృప్తి ఎక్కువగా ప్రకటించారు రక్షక భటులు దుర్మార్గాలుచేశారనే ఆరోపణను తేలికగా కొట్టివేశారు అయితే భారత జాతి కోరిన కోరికల్ని తక్షణం నెరవేర్చమని సిఫారసు చేశారు ఉదాహరణకు మూడు పౌండ్ల పన్ను చట్టాన్ని వెంటనే రద్దు చేయాలి వివాహానికి సంబంధించిన భారతీయుల కోర్కెను వెంటనే అంగీకరించాలి యింకా యిటువంటి పెద్ద చిన్న కోరికల్ని ఉటంకించి వాటిని తక్షణం అంగీకరించి నేరవేర్చమని ప్రభుత్వానికి కమీషన్ సిఫారసు చేసింది జనరల్‌స్మట్సు చెప్పిన ప్రకారం కమీషన్ రిపోర్టు భారత జాతికి అనుకూలంగా గొప్పసహాయం చేసింది శ్రీ అండ్రూస్ ఇంగ్లాండుకు బయలు దేరారు. సర్ బెంజిమన్ రాబర్ట్‌సన్ ఇండియాకు బయలుదేరారు కమీషన్ సమర్పించిన రిపోర్టు ప్రకారం త్వరలోనే చట్టాలు తయారు చేయబడతాయని, మాకు నమ్మకం కలిగింది ఆ చట్టం ఏమిటో, అది ఎలా తయారు చేయబడిందో తరువాతి ప్రకరణంలో తెలుసుకుందాం

★ ★ ★

## 50

# పోరాటం సమాప్తం

కమీషన్ రిపోర్టు ప్రచురించబడిన కొద్ది రోజులకే, ఒడంబడికకు ప్రాతిపదికగా నున్న చట్టం యొక్క ముసాయిదాను యూనియన్ గెజెట్‌లో ప్రకటించారు యీ ముసాయిదాను ప్రకటించగానే నేను కేప్‌టౌను వెళ్ల వలసివచ్చింది యూనియన్ పార్లమెంటు సమావేశం అక్కడే జరుగుతున్నది. ఆ బిల్లులో తొమ్మిది నిబంధనలు ఉన్నాయి. ఆ బిల్లు అంతటిని నవజీవన్ పత్రికలో

రెండు కాలాల్లో ప్రకటించవచ్చు అందలి ఒక నిబంధన భారత దేశపు స్త్రీపురుషుల వివాహాలకు సంబంధించినది భారత దేశంలో చట్టరీత్యా చెల్లే వివాహాలన్ని దక్షిణాఫ్రికాలో కూడా చెల్లుబాటు అవుతాయి అయితే ఒక్కరికంటే మించి ఎక్కువ మందిభార్యలు వుంటే, వారంతా ఒకే సమయంలో చట్టరీత్యా భార్యలుగా అంగీకరింపబడరు యిది బిల్లు నందలి ఒక భాగం. తలకు మూడు పౌండ్ల పన్ను చెల్లింపును గురించి నిబంధన రెండవది గిర్‌మిట్ ప్రథనుంచి ముక్తి పొందిన తరువాత దక్షిణాఫ్రికా యందు నివసించ తలచిన స్వతంత్ర భారతీయుడు ప్రతిఒక్కడూ తలకు 3 పౌండ్లు చొప్పున ప్రతి సంవత్సరం చెల్లించవలసిన పన్ను యిక చెల్లించవలసిన అవసరం లేదు దక్షిణాఫ్రికాలో ప్రవేశించే భారతీయులకు యిచ్చే ప్రవేశ పత్రాలు, అనుమతిపత్రాలను గురించిన నిబంధన మూడవది. ఏ భారతీయుల దగ్గర యిట్టి పత్రాలు వున్నాయో, వారికి దక్షిణాఫ్రికాలో నివసించుటకు ఎటువంటి అధికారాలు వుండాలి అను విషయం యిందు వివరించబడింది ఈ విషయం మీద యూనియన్ పార్లమెంటులో సుదీర్ఘ చర్చ వాడిగా వేడిగా జరిగింది.

చట్టంలో పేర్కొనవలసిన అవసరం లేదని భావించిన విషయాలను గురించి జనరల్ స్మట్సుకు నాకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో పేర్కొనడం జరిగింది వాటిలో క్రింద తెలిపిన విషయాలు వున్నాయి కేప్‌టౌనులో విద్యావంతులైన భారతీయులు ప్రవేశించు హక్కును ధృవీకరించుట, ప్రత్యేక అనుమతి పొందిన విద్యావంతులైన భారతీయులను దక్షిణాఫ్రికాలోనికి ప్రవేశించ నిచ్చుట, గత మూడు సంవత్సరాల (1914 నకు పూర్వం) లో దక్షిణాఫ్రికాలోనికి ప్రవేశించిన విద్యావంతులైన భారతీయుల స్థాయిని అనగా తరగతిని నిర్ణయించుట. ఒకరికంటే ఎక్కువ మంది భార్యలు గల వ్యక్తికి, తన మిగతా భార్యలను కూడా దక్షిణాఫ్రికా తెచ్చుకొనుటకు అనుమతించుట. యీ విషయాలన్నీ జనరల్ స్మట్స్ వ్రాసిన జాబులో చోటు చేసుకోవడమే గాక మరో విషయం "ఇప్పుడు అమలులో వున్న చట్టాల విషయంపై

యూనియన్ ప్రభుత్వం కోరిన కోరుతున్న ప్రకారం యీ చట్టాల అమలు న్యాయ బద్ధంగా, వారు అనుభవిస్తున్న అధికారాలను పరిరక్షిస్తూ, జరగవలెను' ' అని కూడా పేర్కొనడం జరిగింది. యీ జాబు 1914 జూన్ 30 వ తేదీన నాకు వ్రాయబడింది. ఆదేరోజున జనరల్ స్మట్సుకు నేను సమాధానం వ్రాస్తూ "ఈనాటి తేదీతో గల మీ జాబు నాకు అందింది. మీరు ఓపికతోను, సుహృద్భావంతోను నా మాటలన్నీ విన్నందుకు మీకు కృతజ్ఞణ్ణి భారతీయులకు సంతృప్తి కలిగించే చట్టం (ఇండియన్ రిలీఫ్‌బిల్) ద్వారానే గాక, మన యిరువురి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలతో యిక సత్యాగ్రహ పోరాటం సమాప్త మైంది. 1906లో యీ సంగ్రామం ప్రారంభమైంది యీ సంగ్రామం కారణంగా భారతజాతికి పెద్ద దుఃఖం కలగడమే గాక ధనం కూడా అపారంగా నష్టపోవలసి వచ్చింది. యీ సంగ్రామం వల్ల ప్రభుత్వం కూడా చింతాక్రాంతం కావలసి వచ్చింది.

"నా కొంత మంది భారతీయ సోదరుల కోరికలను గురించి మీకు తెలుసు. వేరు వేరు ప్రాంతాలలో వ్యాపారానికి సంబంధించిన అనుమతి పత్రాల చట్టాల్లో మార్పులు కోరుతున్నారు. ఉదాహరణకు ట్రాన్స్ వాల్ యందలి గోల్డ్‌లా ట్రాన్స్‌వాల్ టౌన్‌షిప్ ఆక్టు, 1885 నాటి ట్రాన్స్‌వాల్ చట్టమందలి నిబంధన 3 నందు ఏమీ మార్పు జరగలేదు వాటిలో మార్పు అవసరం. భారతీయులకు అక్కడ నివసించుటకు సంపూర్ణమైన అధికారం లభించాలి. భూముల మీద యాజమాన్యం లభించాలి. వ్యాపారం చేసుకొనుటకు చట్టరీత్యా వీలు కల్పించాలి. వాటిని పేర్కొనకపోవడం వల్ల భారతీయులకు అసంతృప్తిగా వున్నది. ఒక ప్రాంతాన్నుంచి మరో ప్రాంతానికి వెళ్లడానికి కూడా అనుమతి లభించకపోవడంవల్ల అసంతృప్తి ఎక్కువగా వున్నది. యిప్పుడుచట్టంలో భారతీయుల వివాహం విషయమై కల్పించబడిన సదుపాయం యింకా ఎక్కువగా లభించాలని భారతీయులు కోరుతున్నారు. యీ విషయాలనన్నింటినీ సత్యాగ్రహ సంగ్రామ పత్రంలో చేర్చబడాలని అంతా కోరుతున్నారు. అయితే నేను వారి యీ కోరికను అంగీకరించలేదు.

వారి యీ కోరికలను సత్యాగ్రహ సమరంపత్రంలో చేర్చకపోయినప్పటికీ భవిషత్తులో భారతీయుల యీ కోరికల్ని విశాల హృదయంతో యోచించి ప్రభుత్వం వాటినన్నింటి అంగీకరించవలసి వుంటుందని యీ సందర్భంలో మీకు తెలియజేస్తున్నాను. యిక్కడ నివసిస్తున్న భారతీయులందరికీ పౌరహక్కులు సంపూర్తిగా లభించనంత వరకు భారతీయులకు సంతృప్తి కలుగదని కూడా మనవి చేస్తున్నాను.

"నాదేశ బంధుమిత్రులకు మీరంతా ధైర్యంతో ఓపిక పట్టండి. ప్రతి మంచి సాధనం సహాయంతో మీరంతా ప్రజాభిప్రాయాన్ని జాగృతం చేయండి అని విజ్ఞప్తిచేశాను. భవిష్యత్తులో రాబోయే ప్రభుత్వం మన మధ్య జరిగిన యీ ఉత్తర ప్రత్యుత్తరాలలో పేర్కొన్న విషయాలను షరతులను నెరవేర్చుటకు ముందడుగు వేయాలి. దక్షిణాఫ్రికా యందలి తెల్లజాతి వారు యిక గిరిమిటియా కార్మికుల ప్రథ రద్దు అయిపోయిందని గుర్తిస్తారని ఆశిస్తున్నాను. ఇమిగ్రేషన్ ఆక్టు వల్ల స్వతంత్ర భారతీయుల రాకడ కూడా ఆగిపోయినట్లేనని గ్రహింతురు గాక. యిక్కడి రాజకీయాలతోను, రాజకీయాధికారాల వ్యవహారాల తోను భారతీయులకు సంబంధం పెట్టుకోవాలనే మహాత్వాకాంక్షలేదని తెలుసుకోగానే, పైన నేను తెలిపిన భారతీయుల కోరికలన్నింటినీ అంగీకరించ గలరని విశ్వసిస్తున్నాను. అది న్యాయ సమ్మతమని గ్రహించాలి. ఈ మధ్య యీ సమస్యలను పరిష్కరించుటకు మీ ప్రభుత్వం చూపించిన శ్రద్ధ, ఉదార భావన మీరు మీ జాబుల్లో పేర్కొన్న విధంగా చట్టాల అమలు విషయంలో కూడా చూపించినచో, యూనియన్ యందంతట గల భారత జాతికి శాంతి లభిస్తుందని తద్వారా ప్రభుత్వానికి భారతజాతి ఏరకమైన యిబ్బందీ కలిగించదని యీ జాబు ద్వారా తెలియజేస్తున్నాను.

* * *

# 51

# ముగింపు

ఈ విధంగా ఎనిమిది సంవత్సరాల తరువాత సత్యాగ్రహ సంగ్రామం ముగిసింది. దక్షిణాఫ్రికా యందు నివసిస్తున్న భారతీయులందరికీ శాంతి లభించిందని అంతా అంగీకరించారు. 1914 జూలై 18వ తేదీన దుఃఖం, సంతోషం రెండూ హృదయంలో నింపుకొని నేను ఇంగ్లాండులో గోఖలే గారిని కలిసి భారత దేశం వెళ్లుటకు దక్షిణాఫ్రికా నుంచి బయలు దేరాను. దక్షిణాఫ్రికాలో 21సంవత్సరాలు గడిపాను. లెక్కలేనన్ని చేదు, తీయని అనుభవాలు పొందాను. నా జీవన లక్ష్యమేమిటో అర్థం చేసుకున్నాను ఆ దేశాన్ని వదలాలంటే అమిత బాధ అపారమైన దుఃఖం కలిగాయి.

సత్యాగ్రహసంగ్రామం దక్షిణాఫ్రికాలో విజయవంతంగా ముగిసింది. అక్కడి భారతీయుల యీనాటి పరిస్థితిని పరిశీలించి చూస్తే, వాళ్ళ యిన్ని కష్టాలు ఎందుకు పడ్డారను ప్రశ్న మనస్సులో బయలు దేరుతుంది. లేక మానవ జాతి సమస్యల్ని పరిష్కరించుటకు సత్యాగ్రహమను ఆయుధం ఉత్తమ పద్ధతిన ఎలా విజయం సాధించింది అను ప్రశ్న బయలు దేరుతుంది. యీ ప్రశ్నకు వచ్చే సమాధానాన్ని గురించి మనం యోచిద్దాం. సృష్టి నియమం ఒకటి వున్నది. ఏ సాధనంవల్ల ఏ వస్తువు లభిస్తుందో, ఆ సాధనం వల్లనే ఆ వస్తువు రక్షణ పొందుతుందనే నియమం అది. హింసవల్ల లభ్యమయ్యే వస్తువుకు హింస ద్వారానే రక్షణ కలుగుతుంది. సత్యంవల్ల లభ్యమయ్యే వస్తువుకు సత్యం వల్లనే రక్షణ కలుగుతుంది. యీ పద్ధతిన దక్షిణాఫ్రికా యందలి భారతీయులు యిప్పుడుకూడా సత్యాగ్రహమనే ఆయుధాన్ని ఉపయోగించితే వారు అక్కడ సురక్షితంగా వుండగలుగుతారు. సత్యం వల్ల లభించిన వస్తువును అసత్యం ద్వారా రక్షించుదామని అనుకుంటే సత్యాగ్రహంలో అందుకు తావు వుండదు. ఒక వేళ అలా సాధ్యపడితే అది వాంఛనీయం కాదు. యీనాడు దక్షిణాఫ్రికాయందలి భారతీయుల స్థితి

బలహీనంగా వున్నది అని అంటే వారిలో సత్యాగ్రహుల సంఖ్య బాగా తగ్గిపోయిందని చెప్పక తప్పదు. దక్షిణాఫ్రికా యందలి భారతీయుల్ని వేలెత్తి తప్పు పట్టడానికినేను యిలా వ్రాయడం లేదు. అక్కడి వాస్తవ పరిస్థితిని మాత్రమే సూచిస్తున్నాను. వ్యక్తికానీయండి, లేక వ్యక్తుల సముదాయం కానీయండి, తమలో లేని గుణాల్ని బైటినుంచి ఎలా తెచ్చుకోగలుగుతారు? అక్కడి అనేక మంది సత్యాగ్రహ సేవకులు ఒకరి తరువాత ఒకరు దేవుని సన్నిధికి వెళ్లి పోయారు. సొరాబ్జీ, కాఛలియా, తంబినాయుడు, పారసీరుస్తుంజీ మొదలైన వారంతా కన్ను మూశారు. అక్కడ తక్కువ మంది సత్యాగ్రహులు మాత్రమే మిగిలారు. బ్రతికి యున్న సత్యాగ్రహులు యీనాటికీ అక్కడి ప్రభుత్వంతో పోరాటం సాగిస్తున్నారు. సత్యం యెడ పట్టుదల వుంటే వాళ్లు భారత జాతిని కాపాడి తీరుతారనే విశ్వాసం నాకు వున్నది.

ఈ ప్రకరణాలు చదివిన పాఠకులు దక్షిణాఫ్రికాలో యీ సత్యాగ్రహ మహోద్యమం సాగియుండకపోతే, ఎంతో మంది భారతీయ సత్యాగ్రహులు అష్టకష్టాలు పడి యుండకపోతే యీ రోజున దక్షిణాఫ్రికాలో భారతీయులు పేరు వూరు లేకుండా పోయివుండేవారని, అంతేగాక బ్రిటిష్ సామ్రాజ్యానికి అధినివేశ రాజ్యాలుగా వున్న మిగతా ఎన్నో దేశాలలో గల భారతీయులు కూడా చాలా వరకు రక్షణ పొందగలిగారు అని అంటే అందుకు కారణం దక్షిణాఫ్రికాలో భారతీయులు సాగించిన పోరాటమేనని గ్రహించియుంటారు. కొందరు భారతీయులు రక్షణ పొందక పోవడానికి కారణం సత్యాగ్రహ సమరం మాత్రం కాదు. ఆయా దేశాలలో గల భారతీయులలో సత్యాగ్రహశక్తి లేదన్న మాట వాళ్లను రక్షించగలశక్తి భారతదేశానికి లేదన్నమాట. సత్యాగ్రహం ఒక అమోఘమైన ఆయుధం. అందు పరాజయానికీ, నిరాశకు తావు లేదు. యీ సత్యానికి నేను వ్రాసిన యీ దక్షిణాఫ్రికా సత్యాగ్రహ చరిత్ర వల్ల ఏ కొంచెం బలం చేకూరినా కృతార్థుణ్ణే

౧౦౮౯

# ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలు

## సంపుటము - 3
## మౌలిక రచనలు

సంపాదకులు

**శ్రీమన్నారాయణ్**




నవజీవన్ పబ్లిషింగ్ హౌస్

అహమదాబాద్ - 380 014

# ముందు మాట

ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలలో ఇది మూడవసంపుటము. ఆయన జీవితకాలంలో రచించిన మూలరచనలు దాదాపు అన్నీ ఇందులో ఉన్నాయి. వాటిని రచనా కాలక్రమానుసారం సమకూర్చాము.

"నైతికధర్మం అను రచన దక్షిణాఫ్రికాలో 1907వ సంవత్సరమందే వ్రాశారు. "ఇండియన్ ఒపీనియన్ అను పత్రికలో క్రమంగా వెలువడింది. నైతికత, ధార్మికతపై గాంధీజీ గారి మూల సిద్ధాంతాలు అందు ఉన్నాయి గాంధీగారి మౌలిక భావాల అవగాహనకు యివి ఎంతో ముఖ్యమైనవి.

ఆయన తమ జీవితచరిత్రలో, రస్కిన్‌గారి "అన్ టు దిస్ లాస్ట్" అను గ్రంథ ప్రభావము గురించి ఉటంకించారు. 1908 సంవత్సరంలో జోహన్స్ బర్గ్ నుంచి డర్బన్‌కు వెళ్లిన 24 గంటల్లో ఆయన దాన్ని అధ్యయనం చేశారు. యీ పుస్తకం గాంధీగారి జీవితంలో తదనంతర కృషిపై అమితమైన ప్రభావం చూపింది! దీనిని ఆయన "సర్వోదయ" అను పేరుతో గుజరాతీలోనికి అనువదించారు. "అన్ టు దిస్ లాస్ట్" గ్రంథమందలి విశేషాల్ని గాంధీజీ యీ విధంగా క్రోడీకరించారు.

1. సమష్టి మంచియందే వ్యక్తి మంచి ఉంటుంది.
2. క్షురకుని పని, వకీలు పనియెంతో విలువైనవి. ప్రతివాడికి కష్టించి జీవనం గడుపుకునేందుకు సమానమైన హక్కు ఉన్నది!
3. శ్రమ జీవనము - ఉదా: నేలదున్నుట, చేతి పని వృత్తిగా అవలంభించుట - ఎంతో విలువైనవి. జీవితమంటే అదే .

"హింద్ స్వరాజ్" లేక "ఇండియన్ హోంరూల్" అను రచనలు దక్షిణాఫ్రికాలో "ఇండియన్ ఒపీనియన్" పత్రికలో మొదట ప్రచురితమయ్యాయి.

భారతదేశంలో సాగిన హింసా ఉద్యమ భావాలకు జవాబుగా, 1908లో, లండను నుంచి దక్షిణాఫ్రికాకు చేసిన తిరుగు ప్రయాణ సమయంలో, దీన్ని

రచించారు. ఈ గ్రంథపు క్రొత్త కూర్పు 1938లో వెలువడింది. మొదటి కూర్పులోని భావాలు మూలతః అవే అయినా "అవసరమైన పరిణతి" చెందినవి అని "పరిచయం"లో గాంధీజీ వ్రాశారు. "దీనిని ఒక బాలలకు కూడ యివ్వవచ్చును. ఇందు ద్వేషం బదులు ప్రేమను గురించి వివరణ ఉన్నది. హింసకు బదులు ఆత్మత్యాగాన్ని గురించి వివరణ వున్నది. పశుబలాన్ని ఆత్మబలంతో ఎదుర్కోవాలని నిరూపించబడినది.

పూనానగరమందలి యరవాడ కేంద్ర కారాగారంలో యాతనలు పొందుతూ జైలుశిక్షగడిపినప్పుడు 1930లో సబర్మతి వద్ద నున్న సత్యాగ్రహ ఆశ్రమవాసులకు వ్రాసిన సాప్తాహిక పత్రాల కూర్పు "యరవాడ మందిరం నుంచి" అను రచన. మొదట గుజరాతీలో వ్రాశారు. ఆశ్రమవాసులు అనుసరించవలసిన పదునొకండు నైతిక నియమాలను గురించి గాంధీగారి సంపూర్ణ వివరణలు వీటిలో ఉన్నాయి. సత్యము, అహింస, పవిత్రత, నియమితాహారము (నాలుకను నియంత్రంచి వుంచుట) అస్తేయము, పరిశ్రమతో జీవికా సముపార్జన, అభయము, అస్పృశ్యతా నివారణ, సర్వధర్మ సమభావము, స్వదేశీ అనునవి ఇందలి విషయాలు.

1930లో యరవాడ కేంద్రకారాగారం నుంచి ఆశ్రమవాసులకు గాంధీజీ గుజరాతీలో వ్రాసిన ఉత్తరాలకు ఆంగ్ల అనువాదం "గీతా ప్రసంగాలు". 18 అధ్యాయాలను గురించి వ్రాసిన 13 ఉత్తరాలలో గాంధీజీ తన సులభశైలిలో "గీత" లోని ఆధ్యాత్మికతత్వాన్ని విడమరిచి చెప్పే ప్రయత్నం చేశారు. "గీత" గాంధీజీ జీవితానికి కేంద్రబిందువు. వారి దైనందిన ప్రార్థనలలో గీతాపఠనం నిత్యమూ ఉండేది.

"నిర్మాణ కార్యక్రమాలు . అర్థము, పరమార్థము" అను పుస్తక ప్రచురణ మొట్టమొదట 1941లో జరిగింది. సంశోధిత రూపం 1945లో వెలువడింది. దీనిప్రాక్కథనంలో గాంధీజీ "పూర్ణస్వాతంత్ర్యసముపార్జనకు నిర్మాణాత్మక కార్యక్రమాలే నిజమైన అహింసా మార్గాలు" అని నొక్కి చెప్పారు. "దేశాన్ని క్రిందనుంచి పైకి నిర్మించేవిధంగా, ఇది రూపొందింపబడింది". "సాయుధ సంఘర్షణకు శిక్షణ అంటే, ఆయుధాల ప్రయోగం నేర్చుకొనుట, అనగా

బహుశ అణుబాంబుతో అంతమగుట అని భావించవచ్చు. శాసనోల్లంఘనం అను ఉద్యమం కూడా నిర్మాణ కార్యక్రమమే.

1942 వ సంవత్సరంలో క్విట్ ఇండియా (భారతదేశాన్ని వదిలిపో) ఉద్యమ సమయాన ఆగాఖాన్ మహల్లో నిర్బంధించినప్పుడు "ఆరోగ్య దీపిక" (ఆరోగ్యం తాళపు చెవి) అను రచనను గాంధీజీ వ్రాశారు. ఆధునిక ఔషధాలను పరిహరించి ప్రకృతిచికిత్సా విధానంలో ఆరోగ్య అభివృద్ధికై తన మౌలిక భావాలను రాజకీయ రచనలతోబాటు గాంధీజీ వ్రాయడం గమనించదగిన విశేషం. 1906లో దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు మొట్టమొదట గాంధీజీ "ఇండియన్ ఒపీనియన్"లో ఆరోగ్య సమస్యలను గురించి వ్రాశారు. "ఆరోగ్యదీపిక" సరిక్రొత్త ప్రచురణ. - మూల భావాలు మాత్రం ఆనాటివే.

రాజ్‌భవన్

అహమదాబాద్ — శ్రీమన్నారాయణ్

అక్టోబరు 2, 1968

# ప్రకాశకుల విజ్ఞప్తి

మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంలో వారు స్థాపించిన నవజీవన ట్రస్టు పక్షాన వారి ఆత్మకథను భారతీయ భాషలన్నిటిలోను ప్రచురించాలని నిర్ణయించాం. ఆ ప్రకారం శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి తెలుగులోనికి అనువదించిన మహాత్ముని ఆత్మకథను ప్రచురించాం. తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించారు. ఇప్పటికి 40000 ప్రతులు కొని చదివి మమ్ము ప్రోత్సహించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ న్యాయ నిర్ణేతలు మహాత్ముని ఆత్మకథ తెలుగు సేతను 1995 వ సంవత్సరం ఉత్తమ తెలుగు అనువాదంగా నిర్ణయించి 5000/- రూపాయల పురస్కారం యిచ్చి శ్రీ రాధాకృష్ణమూర్తిని సత్కరించడం ముదావహం. గాంధీజీ ఆత్మ కథను భారతీయ భాషలన్నింటిలోను ప్రచురించాం.

మహాత్ముని ఆత్మ కథ యెడ భారత దేశ ప్రజల ఆదరాభిమానాలు చూచి నవజీవన ట్రస్టు మరో ప్రణాళికను చేపట్టింది. మహాత్ముడు రచించిన రచనల్లో నుంచి విషయాన్ని బట్టి కొన్నింటిని ఎంపిక చేసి సంపుటముల సెట్టు రూపంలో ప్రచురించి, తక్కువ ధరకు దేశ ప్రజలకు అందజేయాలనునదే ఆ ప్రణాళిక. ప్రప్రథమంగా ఇంగ్లీషు భాషలో నవజీవన ట్రస్టు పక్షాన ఎంపిక చేసిన మహ్మాత్మాగాంధీ రచనలను ఆరు సంపుటముల సెట్టుగా ప్రచురించాము. ఆ గ్రంథాలు అపరిమితంగా ప్రజల ఆదరణను చూరగొనడం వల్ల పెద్ద సంఖ్యలో అనేక సార్లు ప్రచురించి ప్రజానీకానికి అందించాము. భారతీయ భాషల్లో కూడా యీ ప్రణాళికను అమలు బరచుటకు నిర్ణయించి గత సంవత్సరం మళయాళం భాషలో అయిదు సంపుటముల సెట్టుగా ప్రచురించి కేరళ ప్రదేశ్ ప్రజల మన్ననలు పొందామని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఇప్పుడు తెలుగులో 5 సంపుటాల సెట్టును నవజీవన ట్రస్టు పక్షాన సబ్సిడీ రేటుకు ప్రచురిస్తున్నాము. మహాత్మాగాంధీ సిద్ధాంతాల యెడ మక్కువ చూపే తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించి

ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము. ఈ అయిదు సంపుటాలను తెలుగులో ప్రచురించుటకు అయ్యే ఆర్థిక వ్యయాన్ని పూర్తిగా నవజీవన ట్రస్టు, అహమదాబాద్ భరిస్తున్నది. ట్రస్టుకు సంబంధించిన యితర శాఖల ఆదాయాన్ని యీ ప్రణాళికకు వినియోగించి తక్కువ ధరకు యీ సంపుటాల సెట్టును తెలుగు ప్రజలకు అందజేస్తున్నాము. యీ ప్రణాళికను తెలుగులో అమలు బరచుటకు శ్రీ బిరిధీ చంద్ చౌధరి, శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తి గారలు సంపూర్తిగా సహకరించారు. వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాం. అనువాదం, టైపుసెట్టింగ్, ప్రూపురీడింగ్, కెమెరా ప్రతులు తయారు చేయించుకృషికి శ్రీ బిరిధీచంద్ చౌధరి సహకరించారు. యీ సంపుటముల తెలుగుసేతతో బాటు, ఇతర పెద్దలు చేసిన తెలుగు అనువాదాన్ని, మరియు ప్రూపుల్ని సరిచూచి శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి సహకరించారు.

ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనల అయిదు సంపుటముల సెట్టు ప్రచురణకు సంబంధించిన మా యీ ప్రణాళికను ఆంధ్రప్రదేశ్ ప్రజలు హర్షించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము.

| | |
|---|---|
| ది. 28-10-98 | **జితేంద్ర టి. దేశాయి** |
| అహమదాబాద్ | మేనేజింగ్ ట్రస్టీ |

# విషయానుక్రమణిక



## నైతికధర్మము



## ఈచివరికి

# హింద్ స్వరాజ్యం

# అనుబంధం



# యరవాడ మందిరం నుండి

## గీతాప్రసంగాలు

## నిర్మాణ కార్యక్రమాలు



## అనుబంధం-1

# ఆరోగ్య దీపిక (ఆరోగ్యం తాళంచెవి)



## ప్రథమభాగం



## ద్వితీయ భాగం

## (ప్రకృతి చికిత్స)

# నైతిక ధర్మము

తెలుగు సేత

టి.వి.ఆర్.కె. సుబ్బారావు
వేమూరి రాధాకృష్ణమూర్తి

# పరిచయం

5-1-1907 నుండి 23-2-1907 వరకు వెలువడిన "ఇండియన్ ఒపీనియన్" సంచికలయందు, గాంధీజీ, చికాగో నగరమందలి నైతిక సంస్కృతీ సంఘ స్థాపకుడు విలియం మెకాంటైర్‌సాల్టర్ యొక్క "నైతిక ధర్మ" ప్రసంగవ్యాసాలను గుజరాతీలో ప్రచురించారు

"తార్కిక ముద్రణ సంస్కృతి" వెలువరించిన శృంఖలా గ్రంథాలలో యిది ఒకటి. మార్చి 1889లో అమెరికానుండి, తదుపరి 1905లో ఇంగ్లాండు నుండి యిది ప్రచురితమైంది.

గుజరాతీలో పదునైదు ఎనిమిదింటిని మాత్రమే క్లుప్తంగా వ్రాశారు.

మహాత్మాగాంధీ రచనల నుండి, (మూల గుజరాతీకి ఆంగ్లసేత)నుండి సేకరించడమైనది

ఈనాడు ప్రంపచంలో మోసం ఎక్కువైంది మతమన్నది మాటలలోనే కాని ఆచరణలోమాత్రం శూన్యం. ధనంకోసం పిచ్చిగా తిరిగి, ఇతరులకు జరిగే హానిగురించి ఆలోచించం. శిశు జంతువులను చంపి తయారైన చేతి తొడుగుల మృదుత్వాన్ని యూరోపియన్ మహిళలు వదలలేరు. ప్రపంచంలో అందరికంటే ధనవంతుడు రాక్‌ఫెల్లర్. అతడు ధనసేకరణకై నీతిసిద్ధాంతాలకు నీళ్లు వదిలాడు. ఇట్టి పరిసరాల ప్రభావం వల్ల యూరోపు, అమెరికా ప్రజలు "ధర్మపాలన" ఎడల విముఖులయ్యారు. "మతమన్నది ఉంటే, ఇంత చెడు, ప్రపంచంలో నిండి ఉంటుందా"అనివారి ప్రశ్న. ఇది సరియైన దృక్పథంకాదు. పనితనంలేనివాడు పనిముట్లు సరిగాలేవు అన్నట్లు, తమ దోషంగురించి పట్టించుకోకుండా మతధర్మాలను చిన్న చూపుచూడడం భావ్యం కాదు.

ఇట్టి ధోరణి వలన, అన్ని ధర్మాలు నశిస్తాయి. నైతికత నిలువదు, కనుక జనాన్ని సరియైన దారికి తీసుకురావాలని చాలమంది యూరోపియన్లు అమెరికన్లు చూస్తున్నారు.

ఒకనైతిక ధర్మసమితి ఏర్పడి సర్వమత ధర్మాలను పరిశీలించి, అన్నీ

నైతికతను బోధిస్తాయని, సర్వసామాన్య విధులపై నిర్మితాలనీ నిర్ధారించింది. ఏ ధర్మాన్నీ నమ్మకున్నా, నైతికతను మాత్రం పాటించాలి. అట్లు చేయనివారు తమకు గాని, ఇతరులకుగాని, ఈ లోకంలో గాని, పరలోకంలోగాని మేలు చేయలేరు. దగా, మోసంవగైరాలవల్ల ఎట్టి ధర్మాన్నయినా తక్కువగా చూసేవారి తలతిక్కను తగ్గించడం యీ సమితి ఆశయం. అన్ని మతాల మౌలికతత్త్వాన్ని గురించి చర్చించి, అన్నిటిలోనూ ప్రవచించిన నైతిక సూత్రాలను వివరించి, ఆచరణలో పెట్టడం ఈ "నైతికధర్మ" సమితి ధ్యేయం. ఏ ధర్మాన్నీ విమర్శించరు. ఏ ధర్మాన్ని అనుసరించే వారైనా దీనిలో చేరవచ్చును. ఈ సమితి సదస్యులు తమ విశ్వాసం పెంచుకొని, దాని నైతికత యెడశ్రద్ధ వహిస్తారు. ఇలా చేయకపోతే ప్రపంచ వ్యవస్థ అంతరించి పోతుందని వారి గట్టి నమ్మకం.

శ్రీ సాల్టరు అను ఒక అమెరికను విద్వాంసుడు యీ విషయం మీద చేసిన రచన చాలా బాగుంది. ఏ ధర్మాన్ని గురించి చెప్పకపోయినా, అందరికీ పనికి వచ్చే ఉపదేశాలు యిందు ఉన్నాయి. యీ ఉపదేశాల సారాంశం ప్రచురిస్తాం. యీ రచయిత తాను చెప్పినదంతా చేస్తాడు. తనకు నచ్చిన అంశాలకనుగుణ్యంగా నడుచుకోమని ప్రతి పాఠకుడికీ మా మనవి. అప్పుడే మా యీ ప్రయత్నం ఫలప్రదమవుతుంది.



ప్రకరణం 1

# ప్రారంభం

ఉదాత్తాశయాలకు ఉపకరించేదిమానవుని నైతికప్రవృత్తి వివిధ శాస్త్రాలు ప్రపంచాన్ని ఉన్నదున్నట్టుగా చూపిస్తాయి. నైతికశాస్త్రం అది ఎట్టిదై వుండాలో తెలియజేస్తుంది. మనం శరీరాన్ని, మెదడును, మనస్సును వేరుగా విశ్లేషించాలి. అంతటితో ఆగితే ఉపయోగంలేదు అన్యాయం, దౌష్ట్యం, దంభం వలన, వాటి సమైక్యతతో సంభవించే చెడుఫలితాలను అర్థం చేసుకోవాలి. సరియైన పనిచేసి, మంచిఆలోచనను అనుసరించాలి. నైతికభావం విశ్వకర్మ రూపకల్పన వంటిది భవన నిర్మాణం జరుగకపోతే, రూపకల్పన వ్యర్థం.అదే విధంగా, చిలుకపలుకుల వంటి నీతి ప్రవచనాలు, ఆచరించనినాడు వ్యర్థం కొందరి అభిప్రాయం ప్రకారం "నీతివచనాలు భౌతికంగా, పారలౌకికంగా మరణానంతరం పనికివస్తాయి" అను భావన ఉంది ఉత్తమ కార్యం చేయుట యీ క్షణంనుంచీ మొదలయితేనే మంచి సిద్ధిస్తుంది. ఇవన్నీవిని గాభరా పడవద్దు మన భాధ్యతను నెరవేర్చుదాం పెంబ్రోకు ప్రభువు వచ్చి డెర్బీ ప్రభువుతో, అబర్‌కోష్‌కు పూర్వం, - యుద్ధం విజయం మాట విని "నన్ను పిలిచి కూడ, నాకోసం ఆగకుండ నా శత్రువులను ఎదుర్కొని ఓడించి తగు మర్యాద నాకు చూపలేదు" అని అన్నాడు. నైతిక బాధ్యత వహించే దృక్పథం ఉన్నప్పుడే సన్మార్గానుసరణ సాధ్యం.

దైవము సర్వశక్తి సంపన్నుడు. పరిపూర్ణుడు. ఆయన దయకు, మంచితనానికి, న్యాయానికి ఎల్లలులేవు. అటువంటప్పుడు ఆయన బానిసలం నైతిక పథంనుంచి మళ్లిపోతామా? పథానుగామి అపజయం పొందితే అది నైతికత. అపజయం కాదు. దారి తప్పు వారిదే ఆ బాధ్యత.

నీతిగా ఉన్నందుకు బహుమతి ఉండదు. మంచి చేయువాడు ప్రశంసకోసం చేయడు. ఆ విధంగా చేయాలి గనుక చేస్తాడు. మంచి అనునది వానికి మృష్టాన్నభోజనం. మంచి పని చేయునవకాశము కలిగితే అతడు మంచితిండి పెట్టిన వానికి చెప్పినట్టు కృతజ్ఞత చెబుతాడు.

నైతిక ధర్మం అంటే పెద్దమనిషి తరహా యొక్క పెంపుకాదు ఎక్కువ కష్టించాలి. ఎక్కువ అధ్యయనం చేయాలి ఎక్కువ స్వచ్ఛతను, శుభ్రతనూ పెంచుకోవాలి కాని ఇది స్పర్శ మాత్రమే ఈ దారిన పోయేవాడు ఇంకా ఎన్నిటినో చేయాలి. తన విధిగా, తన ప్రకృతి ధర్మంగా భావించాలి లాభాపేక్ష పనికిరాదు



ప్రకరణం 2

## ఆదర్శనైతిక సూత్రాలు

ప్రస్తుతం నైతికత అంటే ఉదాత్తమైన ఊహలు లేవు కొందరికి యిది అంతముఖ్యంకాదు. కొందరి భావనలో నీతి, ధర్మం - వీటికి ఏ సంబంధం లేదు. కాని ప్రపంచంలోని అన్ని ధర్మాలను పరిశీలిస్తే తెలినవిషయం ఒక్కటే - నీతి లేనిదే మతంగాని ధర్మంగాని మనలేదు నీతిమంతుణ్ణి ధార్మికుడనటంలో ఏ తప్పు లేదు రష్యాలో, తమ దేశోద్ధరణకు జీవితాన్నంకితం చేసిన వారున్నారు. వారు నిజంగా నీతిమంతులు. ఇంగ్లీషు చట్టాలలో అనేక మంచి విషయాలను వెలికితీసిన జెరిమీ బెంథం, ఇంగ్లీషు విద్యావ్యాప్తికి, ఖైదీల కష్టాలను దూరం చేయడానికి బాగా కృషి చేశాడు. - అతడు నిజంగా నీతిమంతుడు.

ఆదర్శవంతమైన నైతికతకు అందరూ వెళ్లిన దారిన వెళ్లనక్కరలేదు. సత్యపథం అపరిచితమైనా నిర్భయంగా అనుసరణీయం. అప్పుడే ప్రగతి, కనుకనే నిజమైన నీతి, నిజమైన నాగరికత, నిజమైన ప్రగతి కలిసి ఉంటాయి

మన కోరికలు, మనకున్న వాటిని అడుగవు. లేని వాటిని అడుగుతాయి కోరికలు రెండురకాలు. స్వార్థం మొదటిది. ఇది అనైతికం. ఇతరులకు సాయం చేసేందుకు మనం ఎదగాలి అనేది ఇంకొకటి ఎంతమంచి చేశాం అని లెక్కవద్దు. ఎదిగి, యితరులకు మంచి చేద్దాం. అట్టి కోరిక నైతికం.

ఇల్లులేదు, కుటుంబంలేదు అని సిగ్గుపడవద్దు. కుటుంబం వుండి

నిర్వహణ తప్పుదారి పట్టినా, వ్యాపారం మోసంతొ నిండివున్నా తప్పే. అది పథచ్యుతి, ముప్పు మోసం చేసిన వ్యక్తులు, దేశాలు నాశనమయ్యాయి. వాటి మూలంలో అనైక్యత, అసత్యం ఉన్నాయి. వ్యాపారస్తుల్లో కూడ, మోసం చేయుట సరిమైనదారి అని ఎవ్వరూ అనరు న్యాయం, సాత్వికత్వం యొక్క ఫలితాలు బాహ్యామైనవి కావు, అంతరంగికాలు. నాలుగువందల ఏండ్ల క్రితం యూరోపులో అన్యాయం, అసత్యం రాజ్యం చేశాయి. ప్రజలు ఒక్కక్షణం కూడా శాంతిగా ఉండలేకపోయారు. కారణం అనైతికత. పరోపకారం ప్రశస్తమైన నీతి ప్రధానం. ఈ తాళంచెవితో యీ నైతికధనాగారాన్ని తెరిస్తే, అందులో అన్ని నియమాలు దొరుకుతాయి

(గుజరాతీ కవి, సంస్కర్త శ్రీ మల్బారీ మూల లఘు కవితను తెలుగులో చేర్చలేదు )



ప్రకరణం 3

## ఏది నీతిమంతమైన పని?

ఏది నీతిమంతమైన కార్యం? ఈ ప్రశ్న ఉద్దేశం నీతి, అవినీతి వీటి వివరణ కాదు చాలమంది రోజూ సంప్రదాయ సిద్ధంగా నీతిమంతమైన పనులు అని అనుకునే వాటి విశ్లేషణ జరుపుకోవాలి. మనం చేసేవి చాలవరకు అనైతికమైనవే అందు “నీతి”కితావులేదు. సంప్రదాయాలే వున్నాయి. అట్టి నడవడిక అవసరమే. అది లేకపోతే, అవ్యవస్థ ఏర్పడుతుంది. సమాజం, ఆదానప్రదానం, అంతరిస్తాయి. అయినా సంప్రదాయాల అనుసరణను మాత్రమే “నీతి” అనలేము.

“నీతి” మన ఇచ్ఛాశక్తికి సంబంధించిన స్వకార్యం. యాంత్రిక అనుసరణలో “నీతి” ఎంత? మనము యాంత్రిక జీవనాన్ని ఆమోదిస్తే, అది “స్వకీయమైన నీతి”కాగలదు. కారణం? అందు మన విచక్షణ ఉన్నది. “యాంత్రికకార్యం’ “ఉద్దేశ్య పూర్వక కార్యం” రెండిటిలోతేడా ఏమిటి? “దోషిని క్షమించడం’

ప్రభునీతి క్షమాపత్ర వాహకుడు యాంత్రిక పాత్ర ధరిస్తున్నాడు. అతడు, ఆ ఆజ్ఞను అందించడం, తన విధిగా నిర్వహిస్తే అందులో నైతికత ఉన్నది. తన బుద్ధిని వుపయోగించక, ప్రవాహంలో కొట్టుకొనిపోయే దుంగలాపోయే వానికి "నీతి" అంటే ఏమి తెలుసు? ఎక్కడో ఒకడు సంప్రదాయాన్ని ఛేదించి "మంచి" చేసేందుకు, తనే ఆయత్తుడవుతాడు. అట్టివాడే "వెండల్ ఫిలిప్స్" (అమెరికన్ సంస్కర్త) అనే కార్యదక్షుడు. "మా ఆలోచనలు ఏర్పరచుకొని, చెప్పేవరకు, నన్ను గురించి మీరేమనుకున్నా ఫరవాలేదు" అని ఆయన నొక్కి వక్కాణించాడు. కనుక మన మనస్సు చెప్పినది పట్టించుకున్నప్పుడే, నైతిక పథాన నడిచే ప్రయత్నం మొదలుపెట్టాం అన్న మాట! మనలోదైవం, అందరిదైవం, మనపనులన్నిటికీ సర్వదా సాక్షి అని నమ్మి, ఆచరించినపుడే, అసలు మజిలీని చేరుకుంటాం.

మంచి చేయగానే చాలదు. మంచి చేయాలనే నిశ్చయం ఉండాలి. అంటే మనస్సు ప్రధానం. బీదల పోషణ అనే పనిని, "పేరుకోసం చేస్తే అనైతికత. కారుణ్యభావంతో చేస్తే నైతికత. "అనైతికత, "నైతికతారాహిత్యం" రెండూ భిన్నమైనవి. మంచి పని యొక్క ఫలితం ఎల్లప్పుడూ "మంచి" కాకపోవచ్చు. కాని ఉద్దేశ్యం ముఖ్యం. ఫలితం మనచేతిలోలేదు. దైవమే దాని భర్త చరిత్రకారులు "అలెగ్జాండరు"ను "గొప్ప" వాడన్నారు. తానువెళ్లిన ప్రదేశాలలో గ్రీకు భాష, సంస్కృతులను వ్యాప్తి చేశాడు. గ్రీకు నాగరికత మననుద్ధరించింది. కాని అలెగ్జాండరు మనస్సులో "తనకు విజయం" అనేది ప్రముఖం అయింది. అది నీతివంతమా? కాదు. గొప్పపని. కాని నీతివంతము కాదు.

నీతిగలపనిని మంచి ఉద్దేశ్యంతో చేసినా, ఇచ్ఛాపూర్వకంకూడా చేయాలి. సమయానికి లేచి, కార్యాలయం పోకపోతే, ఉద్యోగం ఊడుతుందని చేసే సేవలో "నైతికత" లేదు. ఇంకోదారిలేక సీదాసాదాగా బ్రతకడంలో "నీతి" ఏముంది? అన్ని సంపదలూ ఉండి, చుట్టూ ఉన్న బీదల పాట్లు చూసి స్పందించి వారివలెనే సామాన్య జీవనం గడపడంలో "నీతి" ఉన్నది. అదేవిధంగా, తన కొలువును వదలి వెళ్లిపోరేమో అను దిగులుతో, పనివారికి సానుభూతి వాక్యాలు చెప్పి, జీతాలు పెంచే పారిశ్రామికవేత్తలో "నీతి" శాతం

శూన్యం. తన ప్రగతికి దోహదమైన వారి మంచికోరడం "నీతి". భయం, ఒత్తిడికిలోనై చేసే మంచి "నీతి" కాదు. కర్షకులు రక్తనేత్రాలతో రెండవ రిఛర్డు ప్రభువును ఎదిరిస్తే, ఆయన సంతకం చేసి "హక్కులపత్రం" జారీ చేశాడు. ఆపదతొలగగానే, దానిని తిరిగి తీసుకున్నాడు. ఆ ప్రభువు మొదటిపని "నీతి", రెండవది "అవినీతి" అనడం సరికాదు. మొదటిది కూడా, భయ జనితంకనుక, యిసుమంతైనా అందు "నీతి" లేదు.

భయం, ఒత్తిడి ఉండకూడదు. స్వార్థం కూడా పనికిరాదు. స్వార్థపూరితమైన మంచిపనులు "విలువలేనివి" అని కాదు. వాటిలో "నీతి" ఉందనడం ఉదాత్తతారహితం. "నిజాయితీ సరియైన సిద్ధాంతం" అంటూ అనుసరిస్తే, అది చాలాకాలం నడువదు. షేక్స్‌పియర్ అన్నట్టు "లాభాపేక్షగల ప్రేమ", ప్రేమ" కాదు.1

ఇక్కడ సంచయన బుద్ధితో చేసిన పని "నీతి" కానట్టే, పరలోక సుఖప్రాప్తికి చేసేవి కూడా "నీతి బాహ్యాలే'. ఉపకారబుద్ధితో మాత్రమే చేసిన పని "నీతి" అవుతుంది. సెయింట్ ఫ్రాన్సిస్ క్షవియర్ అనుక్రైస్తవ సన్యాసి తన మనస్సు ఎల్లప్పుడూ పవిత్రంగా ఉండాలని ప్రార్థించాడు. మరణానంతరం తాను ఉన్నతపదవి నధిష్ఠించేందుకు ప్రార్థించలేదు. సెయింట్ మదర్ థెరిస్సా కుడి చేతిలో కాగడా, ఎడమచేతిలో నీళ్లనిండిన పాత్ర ఉండాలని ప్రార్థించారు. స్వర్గాన్ని భస్మంచేసి, నరకాగ్నిని చల్లార్చి మనిషి దైవాన్ని ప్రేమతో సేవించడం నేర్వాలని కోరారు. నరకభయం, స్వర్గసుఖ ప్రలోభం వద్దన్నారు. "నీతి"ని నిలిపేందుకు ధైర్యవంతుడు మృత్యువు నెదుర్కోవాలి. తద్వారా నీతిని నిలబెట్టాలి. స్నేహితులను చేరదీసి, శత్రువులను దూరం చేయడం పిరికితనం. భయంతో, ఆగి ఆగి ఉపకారం చేసేవారిలో "నీతి" గుణం ఉండదు. కరుణామయుడైనా, తన నమ్మకాలను, ఆశయసిద్ధికి హెన్రీక్లే త్యాగం చేశాడు. మహాబుద్ధిమంతుడు, ధీరోదాత్తుడు డేనియల్ వెబ్‌స్టర్ (అమెరికన్ రాజకీయవేత్త) ఒకసారి తననిజాయితీని అమ్ముకున్నాడు. ఈ ఒక్క నికృష్టపు పని వలన అతను చేసిన మంచి పనులన్నీ తుడిచి పెట్టుకుపోయాయి.

మనస్సు లోతులను గ్రహించడం అసాధ్యం కనుక ఒకరి పనిలో "నీతి" ని గురించి నిర్ధారణ చేయడం చాలకష్టం. ఈ ప్రకరణ ప్రారంభంలో ప్రశ్న : "నీతిమంతమైన కార్యము అంటే ఎటువంటిది" - అన్న దానికి సమాధానం తెలిసిందికదా! ఎట్టి వ్యక్తులు బాగా ఎదిగి అట్టి "నీతి" స్థాయిలో మనగలరో తెలుసుకో?'అని గుజరాతీకవి అన్నారు

★ ★ ★

ప్రకరణం 4

# ఇంతకుమించిన చట్టము గలదా?

పనుల విలువపై "నిర్ధారణలు" చేస్తుంటాం. కొన్ని సంతృప్తి కలిగిస్తాయి. కొన్ని కలిగించవు. ఏ పని అయినా ఉపయుక్తమా, కాదా అను విషయంపై ఆ నిర్ణయం ఉండదు. దీనికి గీటురాయి వేరుగా ఉంటుంది. మన అభిప్రాయాలను బట్టి, ఈ నిర్ణయాలు చేయడం జరుగుతుంది. ఒకరు ఇంకొకరికి హాని కలిగిస్తే అది తప్పు - ఆ నిర్ణయంతో ఆ పనివల్ల మనకేమి ఒరిగింది అనే ప్రశ్న ఉండదు. ఎప్పుడైనా దోషిమీద సానుభూతి ఉన్నా, ఆ పనిని "తప్పు" అనడంలో ఏ ద్వైధీభావమూ ఉండదు. అప్పుడప్పుడు మన నిర్ణయం "సరియైనది" కాకపోవచ్చు. దోషి ఆ పనిచేసేందుకు గల కారణాలను తెలుసుకోడం కష్టసాధ్యం గనుక, నిర్ణయం "తప్పు" కావచ్చు. తప్పుడు పనులతో మనకు స్వార్థలబ్ధికలిగినా, అంతరాంతాల్లో దానిని "దోషం" అనే భావిస్తాం.

ఒకపని "మంచీ", "చెడూ" తన స్వార్థంపై గాని, తన ఇచ్ఛపైగాని ఆధారపడదు. "నీతి" వేరు. "సానుభూతి" వేరు. శిశువుపై సానుభూతితో ఏదైనా వస్తువు నివ్వదలిచినా, అది శిశువుకు హాని కారకం అయితే, అలా ఇవ్వడం "నీతిబాహ్యం" అని అంగీకరిస్తాం. సానుభూతి సరియైనదే కాని నీతి సూత్రాలకతీతమైతే అది విషం అవుతుంది.

నీతిసూత్రాలు స్థిరమైనవి. అభిప్రాయాలు మారతాయి. "నీతి" మారదు.

కళ్లుతెరిచినపుడు సూర్యుని చూస్తాం, కళ్లుమూస్తే కనిపించడు. మార్పు మన దృష్టిలో ఉంది. సూర్యుని స్థితిలో లేదు. నీతిసూత్రాలు కూడ అట్టివే. ఏది "నీతి"యో తెలియనిస్థితి ఉండవచ్చు కాని కనువిప్పు కలిగిన తర్వాత "జ్ఞానము" కలుగుతుంది. వ్యక్తులు "సరి" "సరికాదు" అనువాటిని ఏకాగ్రతతో పరికించక, సామాన్యంగా స్వంత స్పందనతో "తప్పు"ను "ఒప్పు' ' అనుకుంటారు. బంధవిముక్తులై ఏకాగ్రత కలిగి ఉండే సమయం "తప్పొప్పుల" శైశవదశ గడచిన తర్వాత సాధ్యమేమో! "బేకన్" "డార్విన్' 'లు పుట్టకముందు ఉండినవిజ్ఞానశాస్త్రదశలో నున్న "నీతి సూత్రాల విశ్లేషణ' ' భూభ్రమణ సూత్రాలు మున్నగు ప్రకృతి సూత్రాల అధ్యయనంలా ఎదిగి, "నిజం" గురించి అన్వేషణ జరిగి, నిష్పాక్షిక విచారణ జరిగే రోజులు రావాలి. భ్రమలు తొలగాలి. ఆదర్శనీతి" నిర్వచనం ఏర్పడాలి. ఆనాడు "నీతి సూత్రాలు" పూర్తిగా అందరికీ అవగతమవుతాయి విజ్ఞానశాస్త్రంలో అభిప్రాయాలకు గల వైవిధ్యము "నీతి శాస్త్రం"లో ఉండదు. నేడు మాత్రము "ఏకరూపత" సాధ్యంకాదు. "తప్పు", "ఒప్పు"ల అంతరం కనుగొనటం అసాధ్యం అని దీని అర్థంకాదు.

వ్యక్తుల అభిప్రాయాలు, అభిరుచులు, వీటికి అతీతంగా "నీతిసూత్రం' అనే ఒక స్థాయీ భావం ఉన్నట్టు కనిపిస్తుంది. దేశంలో న్యాయసూత్రా లున్నాయి. నీతి సూత్రాలు ఉండవచ్చు! లిఖితపూర్వంగా లేవు. అదే సరియైన పద్ధతి. నీతి సూత్రాల అస్తిత్వం మనంఒప్పుకుంటే చాలు. ఇతర శాసనాల వలెనే వాటికీ మాన్యత ఉంటుంది. వాటిని అనుసరిస్తాం. ఈ సూత్రాలు న్యాయసూత్రాలు. ఇవి వ్యాపార సూత్రాలకంటె భిన్నమైనవి. మిన్నయైనవి. వ్యాపారసూత్రాల ననుసరించక దివాలా తీసినా, దేశ చట్టాల నతిక్రమించి జైలుకు వెళ్లినా పరవాలేదు. కాని ఎవరైనా "నేను నిజం చెబితే నేమి లేక అబద్ధమాడితే నేమి?" అంటే మాత్రం కుదరదు.

నీతి సూత్రాలు, ఇతర జీవిత రంగాలకు చెందిన సూత్రాలు పూర్తిగా భిన్నములు. నీతికి మన మనస్సులో ఆవాసం. "తప్పు"తో బ్రతికేవాడు కూడ

"తప్పు"ను ఒప్పుకుంటాడు. తప్పు ఎన్నటికీ ఒప్పు కానేరదు. కుటిలులయినా నీతి సూత్రాలననుసరిస్తున్నట్టు నటిస్తారు. అంటే ఈ కట్టుబడికి లొంగి ఉంటారన్నమాట. అలవాటు, ప్రజాభిప్రాయము, సంప్రదాయము వగైరాలు ఈ ఉత్కృష్ట సూత్రాలను మార్చలేవు నీతిమంతునికి పైవన్నీ నీతి సూత్రానుగుణమైతేనే యిష్టమవుతుంది.

ఈ నీతిసూత్రాలకు మూలమేది? ఇవి రాజ్యశాసనాలు కావు. - వివిధ రాజ్యశాసనాలు విభిన్నంగా ఉంటాయి! సోక్రటీసు అనుసరించిన నీతిని ఎందరో ఎదిరించారు. కాని ఆయన నిర్వచించిన నీతి విశ్వవ్యాప్తమై నిలిచింది. ఎల్లప్పటికీ నిలుస్తుంది. రాబర్ట్ బ్రౌనింగు మాటల్లో - "ఎన్నడైనా సైతాను అసత్య ద్వేషాలను ప్రపంచ శాసనాలుగా ప్రకటించినా, న్యాయం, మంచి, సత్యం - వీటి దివ్యత్వం నిలిచి ఉంటుంది.1 నీతి సూత్రాలు దివ్యమైనవి, ఉత్తమమైనవి, సర్వోపరి అయినవి అని రూఢి అయింది. ఎవ్వరూ ఎప్పటికీ దీనినిఅతిక్రమించలేరు. ప్రళయకాలము గతించడంతో, నీతిబాహ్యులు అంతమవుతారు.1

అస్సీరియా, బాబిలన్‌లలో పాపం బ్రద్దలయింది. రోము అవినీతిమయ మార్గాన్ని అనుసరించింది. ఎవ్వరూ రక్షింపలేకపోయారు. ప్రాచీన గ్రీకులు సర్వవిద్యలనూ సాధించారు కాని వారి కళలూ, వేదాంతం అక్కడి అవినీతిలో నిలవలేకపోయాయి. ఫ్రెంచి విప్లవం అవినీతిపై పోరాట పునరుద్ధరణ మాత్రమే. అమెరికాలో కూడ అదే జరిగింది. వెండెల్ ఫిలిప్స్ మహాశయుడు "అవినీతిని గద్దెనెక్కించినా నిలువదు" అన్నాడు. ఈ వింత భావము, తన్ననుసరించిన వారికి ప్రగతినందిస్తుంది. ఆ కుటుంబాన్ని పెంచిపోషిస్తుంది. ఆ జాతికి ప్రాణం పోస్తుంది. అత్యున్నతమైన ఈ చట్టాన్ని అనుసరించిన దేశానికి స్వాతంత్ర్యం, శాంతి, సంతోషం లభిస్తాయి.

★ ★ ★

ప్రకరణం - 5

# నైతికతయే ధర్మము

ఈ ప్రకరణంలోని విషయంవింతగా ఉంటుంది. "నీతి, మతం, ధర్మం వేరు వేరనిఅందరి అభిప్రాయం. కాని ఈ ప్రకరణం నీతినే ధర్మంగా దర్శించి పాలించే ప్రయత్నం చేస్తుంది. కొందరు పాఠకులు రచయిత "చపలచిత్తత"కు లోనయ్యాడని అనుకుంటారు. ధర్మం నీతిని మించినది అనే పక్షం వారు, నీతిగల చోట ధర్మం అవసరమే లేదనుకునేవారు - ఇరుపక్షాలవారు - అభిశంసిస్తారు. రచయిత వాటి దగ్గరితనాన్ని చూపదలుస్తాడు. నీతిధర్మం, ధర్మనీతి ప్రచారం చేసే సమితులు నీతిద్వారా ధర్మానుసరణను నమ్ముతాయి.

మతధర్మ రహిత నీతి మార్గమూ, నీతి సూత్రరహిత మత ధర్మమూ ఉండవచ్చునని సామాన్యుల ఊహ. పాపులెందరో ధార్మికులమని చెప్పుకుంటారు. బ్రాడ్లామహాశయుడి వంటి నీతిమంతులు తమను నాస్తికులమనుకుంటూ, మతధర్మాలనుంచి పారిపోతారు. ఇద్దరూ తప్పుదారిలోనే ఉన్నారు. మొదటివారు తప్పుదారిలో ఉండడమే కాక, ధర్మం ముసుగులో అవినీతి పనులనాచరిస్తారు. ఈ ప్రకరణంలో, వైజ్ఞానికంగా, బౌద్ధికంగా చూస్తే మతధర్మాలు, నీతిసూత్రాలు కలిసి ఉన్నాయనీ, అలాగే ఉండాలనీ నిరూపించుతాము. ఆదిలో సమాజ సంప్రదాయాలే, సహజీవన సూత్రాలే "నీతి" అనబడి, అనుసరింపబడ్డాయి. కాలగతిలో మంచివి నిలిచాయి. మంచి కానివి లుప్తమయ్యాయి. అట్టివి లుప్తంకాకపోతే, జాతి నిర్వీర్యమై అంతరిస్తుంది. ఈనాటికీ యీ విధానం నడుస్తున్నది. అనాలోచితంగా ఆచరించే మంచి సంప్రదాయాలు అటు నీతిగాని, ఇటు మతధర్మంగాని కాకున్నా, పై చెప్పిన విధంగా మంచి సంప్రదాయాలు నీతి సూత్రాలుగా చలామణి అవుతున్నాయి.

మత ధర్మాలంటే ఏదో పైపై ఊహలే చాలమందికి వున్నాయి. కొన్ని సమయాల్లో మత ధర్మమనేది తమను కష్టాలనుండి ఉద్ధరించి విముక్తులను చేయు మార్గమని నమ్మకం కద్దు. భయం నుంచి ఉత్పన్నమైన ధార్మిక

కార్యాలను గొప్పగా చెప్పడం పెద్ద తప్పు.

జనులు నీతిమార్గాన్ని బుద్ధిపూర్వకంగా స్థిరచిత్తంతో, లాభనష్టాలను, చావు బ్రతుకులను లెక్కచేయకుండా, వెనుకకు తిరిగి చూడకుండా అనుసరించి తమ్ముతాము త్యాగం చేయగలిగే రోజు వస్తుంది. అట్టివారు నిజమైన నీతిలో స్నానం చేసి పునీతులవుతారు.

అటువంటి నీతి, మతధర్మ ప్రసక్తి లేకుండా మనగలగదుకదా! "ఇంకొకరికి కొంచెం హాని చేయడంవల్ల నాకు లాభం కలుగుతుంది - కనుక ఎందుకు చేయకూడదు" అనిపించినపుడు,మానవత ఏమవుతుంది? వస్తుతః ఆ నికృష్టపు పనివలన అంతంలో అలాచేసినవానికే ముప్పుకలుగుతుంది బిస్మార్కు జర్మనీకోసం భయంకరమైన తప్పుడు పనులు చేసినప్పుడు అతని విద్య, నీతి, జ్ఞానము ఎక్కడికి పోయాయి? ప్రసంగాలకే పరిమితమయ్యాయి దీనికి కారణం అతని "నీతి" మత, ధర్మాలతో పునీతం కాలేదు. మత ధర్మాలలో తడవనిదే నీతిబీజం మొలకెత్తదు. అది ఎండిపోయి రాలిపోతుంది. అందువల్లనే నిజమైన నీతి, నిజమైన దర్మంతో సంయోగింపబడాలి - అదిలేనిదే ఇదిలేదు. కనుక "నీతి" మన "ధర్మం"గా రూపొందాలి.

ప్రపంచంలోని అన్ని మతాల నీతి సూత్రాలు దాదాపు ఒక్క విధమైనవే. ప్రవక్తలు అంతా "నీతి" యే "మత ధర్మా"లకు మూలమని తెలియజేశారు. పునాది కదిలితే భవనం కూలుతుంది. నీతిని నష్టపరిస్తే, మత ధర్మాలు ఆధారం లేక నశిస్తాయి.

"నీతి" ని "ధర్మం" అంటే తప్పులేదు. తన ప్రార్థనలో డా. కోయిట్ "నీతిని మించిన దైవము లేదు" అన్నాడు. చంకలో కత్తి పెట్టుకొని దేవుణ్ణి పిలిస్తే వస్తాడా? భగవంతుడున్నాడంటూ, ఆయన ఆదేశించిన నీతిసూత్రాల ననుసరించనివాడు, దేవుని ఆదేశాలైన నీతులన్నీ తూ.చ. తప్పక పాలిస్తూ, తన మంచి పనులతో దేవుని కొలిచి, అతని నామస్మరణ చేయువాడు - వీరిద్దరిలో ఎవరిని సద్ధర్మ నీతిననుసరించిన వాడని అంటాము? ఒక్క క్షణమైనా ఆలోచించకుండా రెండవ వ్యక్తినే ధర్మపరుడు నీతిపరుడు అని అంటాము.

ప్రకరణం-6

# ధార్మిక నైతికత లేక నైతికధర్మం

"నైతికత గురించి డార్విన్ అభిప్రాయాలు" అనే మకుటంతో గాంధీజీ ఈ ప్రకరణానికి పరిచయం వ్రాశారు.

(ఈ ప్రకరణ సారాంశాన్ని వివరించే ముందు, డార్విన్ గురించి కొంత చెప్పాలి. గత శతాబ్దిలో గొప్ప వైజ్ఞానిక విశేషాలు కనుగొన్న ఆంగ్లేయుడు డార్విన్. ఆయన స్మరణశక్తి, సూక్ష్మ పరిశీలన అపూర్వమైనవి. చదివి అర్థం చేసుకోవలసిన గ్రంథాలను ఆయన రచించాడు. మానవుని పరిణామ దశలను సాక్ష్యాధారాలతో సిద్ధాంతీకరించాడు. ఒకరకమైన వానరమే మానవుని మూలమని, శరీరాకృతి నిర్మాణంలో అనురూపత ఉందనీ నిరూపించాడు. ఈ సిద్ధాంతానికి నీతిశాస్త్రంతో సంబంధంలేదు. పైన చెప్పిన వైజ్ఞానికాంశాలేకాక, నీతి సూత్రాలకు మానవజాతిపై గల ప్రభావం గురించి కూడా వివరించారు. చాలమంది శాస్త్రజ్ఞులకు డార్విన్ అంటే ఆయన రచనలంటే గురి, నమ్మకం. కనుక ఈ ఆరవ ప్రకరణంలో ఆయన అభిప్రాయాలను గురించి చర్చించడం జరిగింది.)

స్వబుద్ధితో, స్వేచ్ఛగా సరియైన మంచిని, వాయువుచే ఎగురకొట్టబడు మేఘంలా కాకుండా, నిశ్చలంగా నిలబడి ఆచరించుట దొడ్డపద్ధతి.

కాని పరిసరాలు నైజగుణాన్ని ప్రభావితం చేస్తాయి. మనం స్వతంత్రులం కాము. పరిస్థితులబట్టి సర్దుకుపోవలసి ఉంటుంది. హిమాలయాల శీతల వాతావరణంలో, నచ్చినా, లేకున్నా, శరీరాన్ని వెచ్చగా వుంచేందుకు తగిన దుస్తులను ధరించాలి. విచక్షణతో మెలగాలి.

పరిసరాల ప్రభావం నైతికపథాన్ని చూపిస్తాయా? ఏదీ పట్టించుకోవా? ఈ సందర్భంలో డార్విన్ మహాశయుడు ఏమంటున్నాడు? అనాలోచితంగా, ఆయన పరిసరాలకీ నైతికతకీ దగ్గర సంబంధం వున్నదని నిరూపించాడు. నీతిమార్గంవదలి, శరీర, బుద్ధి బలాలనే ఎన్నుకునేవారు డార్విన్ సిద్ధాంతాలను గమనించాలి. ఆత్మరక్షణ జీవులకు సహజగుణము. జీవనసమరంలో గెలిచిన

వారికి అస్తిత్వం ఉంటుంది. కాని శరీరబలం మీద మాత్రమే అధారపడదు.

ఎలుగుబంటి, దున్నపోతు - వీటితో పోలిస్తే - శరీరబలంలో మనిషి ఓడిపోతాడు. అయితే బుద్ధిబలంతో వాటి కంటె పెద్దయై నిలిచాడు. యుద్ధంలో సమర్థసేనానుల వ్యూహమే విజయాన్ని తెచ్చిపెడుతుంది - సైనికుల సంఖ్య, బలమూ తక్కువైనా ఫరవాలేదు. కనుక బుద్ధిబలం శ్రేష్ఠం.

డార్విన్, శరీరబలం, బుద్ధిబలం కంటె నైతిక బలానికి పెద్దపీట వేస్తాడు. "నైతికత ప్రాణం పోస్తుంది." అంటాడు. బలవంతులే బ్రతికి బట్టకడతారన్నాడు డార్విన్ అని కొందరంటారు. ఇది సత్యంకాదు. చరిత్ర పుటల్లోకి తొంగిచూస్తే అన్యాయం చేసినవాళ్లు అంతమైపోడమే కనిపిస్తుంది. మానవ జాతి మనుగడకు కనీస నైతికత అవసరం. హింస హింసను రెచ్చగొట్టి అంతంచేస్తుంది. దురలవాట్లు లేకుండుట యింకో నైతికతత్త్వము త్రాగుబోతులు ఇంగ్లాడులో నలభై ఏండ్లకు మించి బ్రతకరట. ఆ వ్యసనంలేనివారు ఏడుపదులు చూస్తారట! పవిత్రత మరో నైతిక గుణం. వ్యసనపరులు పిల్లలులేకుండా ఉన్నా ఈసురోమని పిల్లలతో, అల్పాయుష్కులై ఉంటారు. మానసికంగా కూడా వ్యర్థులై జడులై ఉంటారు.

అన్ని జాతుల నైతిక ప్రమాణాలు ఒక్క రీతిగా ఉంటాయి. అండమాన్ వాసులలో మగవాడు శిశుజననమప్పుడు మాత్రమే ఆడుదానిని చేరదీస్తాడట. అటు తర్వాత వదిలివేస్తాడట. ఇది స్వార్థపరతకు పరాకాష్ఠ. అప్పుడు జాతి క్రమంగా లుప్తం అవుతుంది. పశు పక్ష్యాదులు తమ సంతానాన్ని పొదుగుతాయి అంటాడు డార్విన్. అట్టి ఉపకారబుద్ధిలేనినాడు ప్రపంచంలో గడ్డిగాదం తప్ప వేరే జీవులు ఉండవు. మనిషి పశువులకంటె మిన్నయైన స్వార్థరహిత జీవి. తన శక్తిమేరకు - తన సంతతి, తనకుటుంబం, తన జాతి, తన దేశం - వీటికోసం పాటుపడతాడు.

గ్రీకుల మేటిబుద్ధి నైతికరహితమైనపుడు వారు లుప్తమైపోయారు. దేశాలు ధనబలం, సైన్యబలం వల్ల నిలువవు. నైతికబలమే దేశాలను రక్షిస్తుంది. దీనిని తెలుసుకొని నిస్వార్థంగా బ్రతకాలి. అదే నైతికతకు తలమానికము.

★ ★ ★

ప్రకరణం - 7

# సమాజధ్యేయం

ఒక్కొక్కప్పుడు సమాజంలో గల సంబంధ బాంధవ్యాలు నైతికతను పెంచుతాయి. నిజమే. న్యాయాధికారికి న్యాయసత్యం బాగా తెలిసినప్పుడు, కోర్టులకు పోయేవారికి తృప్తి కలుగుతుంది. అదే విధంగా ప్రేమ, కరుణ, దానం, దయ మొదలైన గుణాలవ్యక్తీకరణానికి ఇతరులతో సంబంధమే ఆలంబనం. నమ్మకం అనేది పారస్పరికమే కదా. దేశభక్తి గురించి వేరే చెప్పవలెనా? నీతిమార్గపు ఏ అంశమైనా ఆ నీతివంతుడికి మాత్రమే మేలు చేయదు. సత్యం వంటి గుణాలు పూర్తిగా వైయక్తికాలు అని కొందరంటారు. ఇతరులకు వాటితో పనిలేదట. కాని నిజంచెప్పి ఇతరులకు కలిగే హానిని ఆపవచ్చు. అదేరీతిగా అసత్యంతో, మోసంచేసి, ఇంకొకరికి హాని కలిగిస్తామా?

ఒక వ్యక్తి సామాజిక న్యాయాలను, చట్టాలను పట్టించుకోకుండా, అసామాజిక తత్వాన్ని అనుసరించినా, అది సమాజానికి హానికరమే. అతడు ఆదర్శజీవికావచ్చు. కాని అట్టి ప్రపంచం ఇంకా ఏర్పడలేదనే విషయం పట్టించుకోకుండా, తన ప్రమాణాలకు నిలవని వాటిని ఎదిరిస్తూ ఉంటాడు. ఇతరులను తన మార్గానికి తెచ్చుకునే నిత్య ప్రయత్నశీలురు ప్రవక్తలు. వారు ప్రపంచాన్ని నడిపిస్తూ ఉంటారు.

స్వార్థపరుడు పశువుకంటె హీనుడు. తన సంతతి, తన జాతి, తన దేశంయొక్క మంచిని పెంచి, ఎదిగి మానవజాతి తన కుటుంబమే అనే స్థాయికి ఎదుగుతాడు. "నా భార్యకుగాని, నా జాతికి గాని కష్టం కలిగితే పట్టించుకుంటాను. తక్కిన వాటి మాట నాకు వద్దు" అనుకుంటే సరికాదు. పొరుగువాడంటే దాక్షిణ్యం లేనిదే, నీతి మార్గానుసరణ సాధ్యమా? అందరికీ పనికివచ్చేదే మంచి. పొరుగువాడికి సాయపడడంకర్తవ్యం. దీనికి ప్రత్యుపకారం కావాలని కోరవద్దు. ఇలాచేస్తే "త్రొక్కిడివల్ల ఉక్కిరిబిక్కిరి అవుతారు" అని అనుకోడం సరికాదు.

అందరూ సమానులే అంటే హోదా, ఉద్యోగం ఒక్కలాంటిది అని కాదు.

ఉన్నతపదవిలో ఉన్నప్పుడు దాని బాధ్యతలు స్వీకరించి, యితరులను నీచులని తలచకుండా, ఉంటేనే పెద్దరికం నిలబడుతుంది.

దీని ప్రకారం, ఒకదేశం నైతికంగా ఇంకో దేశం మీద "హుకుం చలాయించ"లేదు. అమెరికన్లు ఆదిమ జాతులవారిని తక్కువచూపు చూడరాదు నాగరిక జాతి ఉన్నతికి, తక్కువ అనబడువారే కారణమవుతారు. అదే కొలబద్దతో చూస్తే, రాజు ప్రజాసేవకుడు, అధికారులు ఉన్నది జనులను సంతోషపెట్టడానికి, కష్టపెట్టడానికి కాదు. ప్రజాస్వామ్య రాజ్యంలో స్వార్థం గూడుకట్టుకొని ఉంటే, ఆరాజ్యానికి అభివృద్ధి వుండదు. ధనికులు, బలవంతులు ధనంలేనివారిని, బలహీనుల్ని రక్షించాలి - వారికి సాయపడాలి. అప్పుడు ఆకలిచావులు గాని, అతిధనవంతుల మదాంధతలుగాని ఉండవు. పొరుగువాడు కడుపుకాలి చస్తుంటే, డబ్బు మూటకట్టి ఆనందించడం, ధర్మంకాదు. నీతిమంతుడికి తనతో వచ్చేవారు తక్కువ అనే దిగులు ఉండదు. తన నైతిక ఆదర్శాలకతడే స్వామి, ఫలితాలకుకాదు. అవినీతి ప్రవర్తన వల్ల సమాజానికి హాని కలుగనంతవరకూ, ఎవరూ పట్టించుకోరు. కాని "నీతి"యే "ఆదర్శంగా" గలవాడు, ఆదర్శం నుంచి దిగజారితే "తప్పు" చేసినట్టు భావించడం జరుగుతుంది.

★ ★ ★

ప్రకరణం - 8

## వ్యక్తిగత నైతికత

"నేను దీనికి బాధ్యుణ్ణి". "ఇది నా విధి" అనే ఆలోచన కలిగినప్పుడు ఏదో ఒక అంతశ్శక్తి "ఈ పనిని నీకు అప్పగించడమైంది. జయాపజయాలు నీవే. ప్రపంచంలో ఏ రెండూ ఒక్కలా ఉండవు. నీ ప్రత్యేకవిధినిర్వహణ యితరులకసాధ్యం. ఈ పని నీవు చేయకపోతే, ఆ నష్టం నీకు జమపడుతుంది.' అని అన్నట్లు అనిపిస్తుంది

నేనే చేయవలసినది ఏమి? అను ప్రశ్నకు జవాబు - "మనిషిని దేవుడు అని అనకు. మనిషి దేవుడు కాడు కనుక. అయినా దైవ కార్యం నుంచి

వేరు కూడా కాదు" "కనుక దైవకాంతికిరణాలలో నేను ఒక్కడిని అని భావించాలి. దానినే సౌహార్ద్రత అని అంటారు ఇంకొకరు. "పితృభక్తి, భార్య, పిల్లలు - వీరి సంరక్షణ, అన్నదమ్ములను, అక్కచెల్లెళ్లను, స్నేహితులను ఆదుకోడం" అవసరం అని మరికొందరు అంటారు దీనితోబాటు నన్ను నేను గౌరవించాలి. నన్ను గురించి నేను తెలుసుకొననినాడు, వేరు వారి గురించి తెలుసుకొనుట అసాధ్యము. తెలియనివారిని గౌరవించుట ఎలా? పారస్పరిక సంబంధము లేని చోట, యిష్టమున్నట్లు చేయవచ్చునని కొందరు అనుకుంటారు. కాని ఈ భావము తప్పు. ఎవ్వరూ విశృంఖలంగా దేన్నిపడితే దానిని చేయలేరు. చేయకూడదు.

మన ఎడల మన విధి ఏమిటి? మనకు తప్ప వేరొకరికి, తెలియని వ్యక్తిగత అలవాట్లు మన బాధ్యతే. వాటివలన మన వ్యక్తిత్వము ప్రభావితమవుతుంది. అంతేకాదు. ఇతరులపై పడే ఆ అలవాట్ల ప్రభావానికి కూడ మనదే బాధ్యత తన కోరికలను నియంత్రించి, శరీరాన్ని, ఆత్మను పరిశుద్ధంగా ఉంచాలి. ఒకరి అలవాట్లను బట్టి, వారి వ్యక్తిత్వం అర్థమవుతుంది. ఆకలి దప్పికలను తృప్తిపరచడంలో నియమపాలన లేకుంటే, బలహీనులమై చెడ్డపేరు తెచ్చుకుంటాము. ఇంద్రియసుఖాలను పరిహరించకపోతే, ఆ విధంగా ఆరోగ్యవంతమైన శరీరాన్ని బుద్ధిని, మనసును, ఆత్మలను కాపాడుకోకపోతే, విజయం లభ్యంకాదు. నైజత్వాన్ని పవిత్రంగా ఉంచగలిగినపుడు, దానిని ఉపయోగించడం గురించి ఆలోచించాలి. జీవితానికి స్థిరమైన ఆదర్శం ఉండాలి. అదిలేని రోజున, జీవితం చుక్కానిలేని నావయై భ్రమించి దారి తప్పుతుంది. మానవజాతి ఉద్ధరణ ప్రతివాని కర్తవ్యం కావాలి. దైవాన్ని కొలిచి, దర్శించి, చేరుకొనే తీరుయిదే. దేవుని పేరు చెప్పి మోసం చేసేవారు లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. చిలుక, దేవుని పలుకులు పలికితే దైవత్వం కలుగుతుందా? మానవ జీవితపు ఉన్నతాదర్శాలను అందుకునే ప్రయత్నం అందరూ చేయాలి. ఈ ధ్యేయంతోనే తల్లి పిల్లలను పెంచాలి. వకీలు తన వృత్తి సాగించాలి. వ్యాపారి తన పని చేసుకోవాలి. శ్రమజీవి

కష్టపడాలి. స్థిరమైన ఆదర్శంతో ముందుకు సాగినవాడు దారితప్పడు నీతిని తప్పితే మానవజాతి ఉద్ధరణ జరగదు.

మనము ఆచరించు ప్రతివిషయం మానవ జాతిని ముందుకు తీసుకుపోతుందా, లేదా అని పరీక్షిస్తూ వుండాలి. వ్యాపారి తాను తనను గాని, ఇతరులను గాని మోసగించడం లేదుకదా అని చూసుకోవాలి. వకీలు,, వైద్యుడు తమకు లభించిన ధన ప్రతిఫలంకంటె అది సమకూర్చే కక్షిదారుడు, రోగి - వీరిని గురించి ఎక్కువగా పట్టించుకోవాలి. పిల్లలను సాకే తల్లి - అనావశ్యకమైన మమత, స్వార్థపూరితమైన లాలింపు లేకుండా వారిని పెంచాలి. పనివారు ఈ దృష్టితోనే తమ విధులను నిర్వర్తించాలి. తనవిధిని సరిగా నిర్వహించని శ్రమజీవి, అనియమిత మార్గాలలో పోయి ధనవంతులైన, న్యాయవాది, వర్తకుడు, వైద్యుడు - వీరికంటె ఉత్తములు కారు. ఇతడు చెల్లుబాటు నాణెము - వారు చెల్లని నాణెములు. వ్యక్తి గత నీతి పరంగా ఏ స్థాయి వాడైన, తన ఆశయాన్ని అందుకోగలడు. ప్రతివాని జీవితమార్గము అతని ప్రాశస్త్యాన్ని నిలబెడుతుందేగాని సమాజంలో అతనికి ఉన్న బూటకస్థాయికాదు. ఎవరినైనా వారి అతరంగ ప్రవృత్తులనుబట్టి గుర్తించాలి, బాహ్య ప్రవర్తనను బట్టికాదు. దానంచేసిన యిద్దరిలో, భిక్షుకుని పీడ వదలించుకునేందుకు దానం చేసినవానికంటె, ఆర్తుని యెడల కారుణ్యంతో మనసారా దానం చేసినవాడు గొప్పవాడు. ఒకవిధంగా ఆలోచిస్తే, మొదటివాడు పాపి. రెండోవాడు నీతిమంతుడు. ఇద్దరూ చేసిన పనిమాత్రం ఒక్కటే.

మనస్ఫూర్తిగా, ద్వేషరహితంగా, ఎవరినీ శోషింపచేయక, శుద్ధమనస్కుడై ఎవడు ఆచరణ శుద్ధి కలిగి ఉంటాడో అతడే ధర్మపరుడు అయి సంతోషంగా ఉంటాడు. అతడే ధనవంతుడనిపించుకుంటాడు. అటువంటి వారికే మానవసేవచేయడం సాధ్యపడుతుంది. తడిగా వున్న అగ్గిపుల్ల నిప్పును ముట్టించగలదా? తాను ధర్మాచరణచేయనివాడు, ఇతరులకు ఏమి బోధించగలడు? నీట మునుగుతున్నవాడు వేరొకనిని మునుగకుండా రక్షించగలడా? మానవసేవ చేయాలని, ధర్మపరుడు ఎవ్వరినీ అడుగడు.

అతనికి సంశయమే కలుగదు. మాధ్యూ ఆర్నాల్డు అన్నట్టు - "శారీరకంగా సంచలనం చూశాను మానసిక నిర్బలత్వం అర్థమైంది. ఆరోగ్యం, జయం. ప్రతిష్ఠ ఉండాలని అన్నాను ఇప్పుడామాట అనను. కారణం - ఈ కానుకలు స్వయంగా లభించాలి వీటి వెనుక ఏమీ వుండకూడదు. అవి మనల్ని పరీక్షించి, గట్టిపరచి, పవిత్రపరచి మనలో వినయశీలతను, దయాగుణాన్ని పెంపొందిస్తాయి.

ఆర్నాల్డు తన మిత్రుడికి ఆరోగ్యం, విజయం, పేరు ఉండాలని కోరాడు అయితే ఆ మిత్రుడి సుఖదుఃఖాలు, పై వరాలమీద ఆధారపడి లేవని తెలుసుకున్నాడు కనుక ఆయన యొక్క ధర్మాచరణ శాశ్వతంగా ఉండాలని కాంక్షించాడు "గొప్పవారి ప్రగతికి మూలం కష్టాలే" అని అన్నాడు ఎమర్సన్ అందరూ గొప్పగా చెప్పుకునే మూలతత్వాలు డబ్బూ, దర్పం అయితే వారికి యీ ప్రపంచంలో అవి దుఃఖహేతువులు అవుతాయి అని అన్నాడు నాజిర్ అను ఉర్దూకవి.



# ఈ చివరికి

ఒక అభిప్రాయవివరణ

తెలుగుసేత

వేమూరి రాధాకృష్ణమూర్తి

# (ఆంగ్ల)అనువాదకుని విజ్ఞప్తి

తమ ఆత్మకథ యందలి ఒక అధ్యాయంలో తనను అపరిమితంగా ప్రభావితం చేసిన, రస్కిన్ రచించిన అన్ టు దిస్ లాస్ట్ అను పుస్తకాన్ని జోహాన్సుబర్గు నుంచి దర్బాన్ వరకు చేసిన రైలు ప్రయాణంలో విడవకుండా తాను చదివానని వ్రాసి "రైలు సాయంత్రానికి దర్బాన్ చేరింది. ఆ రోజు రాత్రి నాకు నిద్రపట్టలేదు. పుస్తకంలో పేర్కొన్న ఆదర్శాల కనుగుణంగా నా జీవితాన్ని మార్చుకోదలిచాను. ఆ పుస్తకాన్ని నేను గుజరీతీలోకి అనువదించాను సర్వోదయ అని దానికి పేరు పెట్టాను" అని గాంధీజీ వ్రాశారు.

ఇప్పుడు ఆ "సర్వోదయ" ఆంగ్లానువాదం వెలువడింది. రస్కిన్ రచించిన పదజాలమంతా సాధ్యమైనంతవరకు అలాగే ఉపయోగించడం జరిగింది. గాంధీజీ అన్ టు దిస్ లాస్ట్ అను పుస్తకం చదివి తాను అవగహన చేసుకున్న విషయాలను క్లుప్తంగా క్రింది విధంగా వివరించారు.

1. సర్వుల క్షేమంలోనే వ్యక్తి క్షేమం యిమిడియున్నది.

2. ఒక న్యాయవాది వృత్తికి ఎంత విలువ వున్నదో, ఒక మంగలివాని వృత్తికి కూడా అంతే విలువవున్నది. అందరికీతమ వృత్తిద్వారా జీవనోపాధి సంపాదించుకునే హక్కు సమానంగా వుండటమే అందుకు కారణం.

3. కార్మికుని జీవితం, కర్షకుని జీవితం చేతి పనివారి జీవితం అన్నీ జీవించయోగ్యమైనవే.

రస్కిన్ తన పుస్తకంలో పేర్కొన్న 4 అధ్యాయాల్ని గురించిన వివరణపై వేరే చెప్పవలసిందేమీలేదు. కాని భారత దేశానికి రాకపూర్వం, దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు 1915లో గాంధీజీ "ముగింపు" వ్రాసి అందు చేర్చారు. అది భవిష్యద్వాణిగా రూపుదాల్చింది. పలుకాలాల పాటు భద్రపరుచుకోవలసిన ఆణిముత్యం యీ పుస్తకమందలి చివరి వ్యాసం.

ఎ.జి.డి.

*2007, భద్రవేది.5.*

## (ద్వితీయముద్రణ)

ఇది నా ఆంగ్లానువాదానికిద్వితీయ ముద్రణ. ఇందు క్రియాశబ్దాలలో కొద్ది మార్పు చేయడం జరిగింది. నా కోరిక ప్రకారం నా మిత్రుడు శ్రీ వేరియర్ ఎల్విన్ నాఆంగ్లానువాదాన్ని చదివి దయతో సూచించిన మార్పులు మాత్రమే అవి.

**వి.జి.డి.**

*వసంత పంచమి. 2012*

# భూమిక

పాశ్చాత్యదేశాల ప్రజలల్లో అధికసంఖ్యాకులు సాధారణంగా జీవితంలో సుఖసంతోషాల్ని అనుభవించడమే తమ కర్తవ్యమని అనుకుంటారు. ఆర్థిక సంపద, భౌతిక సుఖాలే సుఖసంతోషాలకు సాధనాలని భావిస్తూ వుంటారు. యీ సుఖసౌఖ్యాలు పొందడంకోసం నీతినిజాయితీలు త్యజించవలసి వచ్చినా పట్టించుకోరు. వారు ఆశించేది సుఖసౌఖ్యాలు. కొద్దిమంది జనాన్ని వదలివేయవలసి వచ్చినా సరే లక్ష్యాన్ని సాధించడంలో తప్పులేదని వారు భావిస్తూ వుంటారు. ఇలాంటి ఆలోచనల్ని, వాటివల్ల కలిగే ఫలితాల్ని, వాటి పరిణామాల్ని పాశ్చాత్యుల ముఖాల్లో చూడవచ్చు.

నిజానికి యీ భావం సరికాదు. పాశ్చాత్యదేశాలకు చెందిన కొందరు విజ్ఞులు సూచించినట్లు, శారీరక సుఖసౌఖ్యాలకోసం ఆర్థిక పుష్టికోసం కృషి చేయడం, నీతి నియామాలను లెక్కపెట్టకపోవడం దైవనిర్ణయానికి విరుద్ధం.అలాంటి విజ్ఞుల్లో రస్కిన్ మహాశయుడు ఒకరు. వారు నైతిక విలువల్ని పాటిస్తేనే మనిషి సంతోషంగా జీవించగలడని తన రచన "అన్ టు దిస్ లాస్ట్"లో తన అభిప్రాయం వెల్లడించారు

భారతదేశంలో నివసించే మనం యిప్పుడు పాశ్చాత్యదేశాల్ని అనుకరించడానికి అలవాటుపడ్డాం. పాశ్చాత్యదేశాలయందలి మంచిని అనురించవలసిందే. కాని అక్కడి ప్రమాణాలు బాగాలేవు అని చెప్పకతప్పదు. కనుక చెడు విషయాల్ని తిరస్కరించాలి. ఇది అందరూ అంగీకరించే విషయం.

దక్షిణాఫ్రికాయందలి భారతీయులు కష దయనీయ స్థితిలోకి నెట్టివేయబడ్డారు. ధనవంతులు కావాలనే కాంక్షతో మనం విదేశాలకు వెళతాము. త్వరగా ధనవంతులు కావాలనే తపనలో బడి మనం నైతిక విలువల్ని మరిచిపోతాం. భగవంతుడు మనంచేసే పనుల్ని గమనిస్తున్నాడను విషయం కూడా మరిచిపోతాం. స్వార్థం మన శక్తినంతటినీ ఆవరిస్తుంది. అది మంచి చెడుల మధ్యనగల తేడాను విడమరిచి చూచే శక్తిని సైతం పోగొట్టి

మనల్ని నిస్తేజపరుస్తుంది. తత్ఫలితంగా విదేశాల్లో నివసిస్తూ ఫలితం ఏమీ సాధించలేకపోవడమేగాక, మనం మనశక్తి సామర్థ్యాలను సైతం పోగొట్టుకుంటాం. విదేశాలలో వుంటూ లాభం పొందలేము. ప్రపంచమందలి మతాలన్నింటియందు నైతిక విలువలు, నీతి నియమాలు చాలాముఖ్యం అవి వాటి అంతర్భాగాలుగా వున్నాయి మన సాధారణ జ్ఞానవిజ్ఞానాలు కూడా నైతిక నియమాల్ని పాటించాలని స్పష్టంగా చెబుతాయి. వాటిని సాధించి రస్కిన్ తన వ్యాసాల్లో సూచించినవిధంగా మనంసంతోషం పొందవచ్చు.

సోక్రటిస్, ప్లేటోస్ అపాలజీ అను గ్రంథంలో మానవుల కర్తవ్యాలను గురించి కొన్ని భావాలు వెల్లడించారు. వారు చెప్పిన ప్రకారం తాను మంచిగా నడుచుకున్నారు. రస్కిన్‌గారి "అన్ టు దిస్‌లాస్ట్" సోక్రటీస్‌గారి భావాలకు విస్తరణ రూపమని నేను భావిస్తున్నాను. వివిధ రంగాలకు, వివిధ పంథాలకు చెందిన మనుష్యులు, ఆచరణయందు యీ భావాలను ఎలా అమలు చేయాలో, ఆ ప్రకారం ఎలా నడుచుకోవాలో సూచించారు. ఇది అన్ టు దిస్ లాస్ట్"కు అనువాదం కాదు. దాన్ని గురించి ఒక అభిప్రాయ వివరణ మాత్రమే.

భారతీయులకు అనువాదం అంతగా ఉపయోగపడదు. పుస్తకం పేరుకూడా అనువాదంలో సర్వోదయం (సర్వజనుల శ్రేయస్సు) అని పెట్టడం జరిగింది. రస్కిన్ తన పుస్తకంలో కాంక్షించింది కూడా యిదే.



# వ్యాసం - 1
# సత్యానికి మూలాధారాలు

మానవ జగత్తును వివిధ దశల్లో భ్రమింపచేసిన విషయాల్లో గొప్పది నమ్మదగిన విషయాల్లో చిన్నది ఆధునిక ఆర్థిక శాస్త్రం ఈ శాస్త్రం సమాజమందలి అనోన్యతల్ని మానవుడు లెక్కచేయనవసరంలేదని, తనకు అనుకూలమైన కార్యక్రమాల్ని తాను నిర్ణయించుకోవచ్చునని తెలుపుతున్నది. హేతురహిత విషయాల వలెనే రాజకీయ ఆర్థిక స్థితి కూడా ఒక విషయాన్ని ఆధారంగా కలిగి వుంటుంది. ఆర్థికశాస్త్రవేత్త, సమాజంలో పరస్పర విశ్వాసాలు, మానవ ప్రవృత్తుల్లో హఠాత్తుగా సంచలనం సృష్టిస్తూ వుంటాయని అంటాడు. అత్యాశ, ప్రగతి పొందాలనే కాంక్ష రెండూ మనిషిలో వుండే స్థిరమైన ప్రవృత్తులు. వీటిని అలా వుంచుదాం. డబ్బును ఉత్పత్తి చేయునట్టి యంత్రంగా మనిషిని భావించి ఎక్కువ సంపదను సముపార్జించునట్లు చేయుటకు కార్మిక చట్టాలకు సంబంధించిన కొనుగోలు అమ్మకపు నియమాలద్వారా వీలున్నదో లేదో పరిశీలిద్దాం. ఈ చట్టాలు ఒకసారి నిర్ధారించబడిన తరువాత ప్రతి వ్యక్తీ తనకిష్టమొచ్చిన సంచలనం కలిగించే విధానాన్ని ప్రవేశపెట్టవచ్చు.

ప్రయోగాలు సాగిస్తూ అందుకు ఉపయోగించే అంశాలు మొదటివాటి లాగానే వుంటే, ఆ ప్రయోగ విధానం తార్కికంగా వుంటుంది. చలనంలో వున్న ఒక వస్తువు స్థిర అస్థిరశక్తులచే ప్రభావితం అవుతుందని భావిద్దాం. దానిచలన మార్గాన్ని నిర్ధారించడానికి ముందు దాన్ని నిరంతరం స్థిరమైన పరిస్థితులతో పరీక్షించాలి, తరువాత దానిలో వచ్చు తేడాలకు గల కారణాల్ని నిర్ధారించాలి. అయితే సమాజంలో ఒడిదుడుకుల్ని సృష్టించే కారకాలు, చలనం లేనివి కావు. అవి పరీక్షించబడు జీవియొక్క స్థూలరూపాన్నే మార్చివేస్తాయి. అవి గణాంక శాస్త్ర పద్ధతిలో పనిచేయవు. రసాయినిక సిద్ధాంతాన్ని అనుసరిస్తాయి. దానితో గతంలో గల మన విజ్ఞానం మనకందని పరిస్థితులు ఏర్పడతాయి.

విజ్ఞానం అనగా సైన్సు శాస్త్ర నియమాల్ని అంగీకరిస్తే, దాని చివరి ఫలితాల్ని సందేహించవలసిన అవసరం వుండదు. వాటియెడ నాకు కొంచెమైనా అభిరుచిలేదు. అందుకు కారణం వున్నది. మనిషికి అస్థిపంజరం లేదు అని చెప్పే వ్యాయామ శాస్త్రాన్ని నమ్మే వారిలో నేనూ ఒకణ్ణి కావాల్సి వస్తుంది. అట్టి నమ్మకంతో యితరులకు చూపవలసిన వస్తువుల్ని ముద్దలుగా చేసి దొర్లించడం, రొట్టెల్లా పలుచగా చేసి దాన్ని తట్టడం, తీగలా చేసి లాగడం, మొదలగు పనులు చేయాల్సివస్తుంది. ఇలా చేశాక పిల్లల అస్థిపంజరాల్ని యధాస్థానంలో వుంచడానికి, వారి శరీరాల్ని రకరకాల ఇబ్బందులకు గురి చేయవలసివస్తుంది. వాదన బాగానేవున్నా, ఫలితాలు సత్యాలైనా ఆచరణలో సౌలభ్యం వుండదు. అధునిక రాజకీయ ఆర్థిక స్థితిని దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు అది ఒక మనిషికి ఒక శరీరం వుందని గుర్తిస్తుందేకాని, అందులో ఆత్మవున్నదను విషయాన్ని గుర్తించదు. అందువల్ల అది రూపొందించే సూత్రాల్ని ఆత్మప్రధానమైన మనిషికి ఎలా అనువర్తింప చేయడం?

రాజకీయ ఆర్థిక శాస్త్రం ఒక విజ్ఞాన శాస్త్రం కానేకాదు. కార్మికులు సమ్మెకుదిగినప్పుడు అది నిష్ప్రయోజనకరమని తెలుస్తుంది. యజమానులు ఒక విధంగా భావిస్తే, పనిచేయు కార్మికులు మరో విధంగా భావిస్తారు. ఏ రాజకీయ శాస్త్రం వారిని ఒకటి చేయలేదు. తరువాత మధ్యవర్తులు బయలుదేరుతారు. యజమానుల శ్రేయస్సు, కార్మికల శ్రేయస్సులో వుందని చెప్పడానికి వృధా ప్రయత్నం చేస్తారు. నిజానికి వ్యక్తులు విరోధులైనంత మాత్రాన వారి భావాలు కూడా ఒక దానికొకటి విరుద్ధంగా వుంటాయని సదా బావించకూడదు. ఉదాహరణకు ఇంట్లో ఒక రొట్టెముక్క వున్నదనుకోండి. తల్లికి, పిల్లలకి ఆకలివేస్తూ వుంటే వారియిష్టాయిష్టాలు ఒకటిగా వుండవుకదా! తల్లి ఆ రొట్టె ముక్కను తినివేస్తే పిల్లలు దాన్ని కావాలని అంటారు. పిల్లలు దాన్నితినివేస్తే తల్లి ఆకలితోనే పనికి వెళ్లవలసివస్తుంది. అయినప్పటికి వారి మధ్య వైరుధ్యం వున్నదని, వారు రొట్టెముక్క కోసం పోట్లాడుకుంటారని, తల్లి బలవంతురాలు కనుక రొట్టెను తీసుకొని తినివేస్తుందని అనగలమా? అలాగే ఇద్దరువ్యక్తుల అభిరుచులు వేరువేరుగా వున్నంత మాత్రాన వారు

ఒకరినొకరు శత్రుత్వంతో చూచుకుంటారనీ, హింస ద్వారానో లేక మోసం చేసియో లాభం పొందచూస్తారని అనుకోవడం సరియేనా?

ఎలుకలు, పందులు ప్రభావితం అయ్యే నీతి నియమాలకంటే, వేరే నైతిక విలువల చేత మనిషి స్పందన పొందలేడు అని అనుకున్నా కూడా, సామాన్యంగా యజమాని, కార్మికుల అభిరుచులు ఒకటేనని చెప్పడం కష్టం. అలాగే వారి అభిరుచుల్లో వైరుధ్యం వుంటుందనీ చెప్పలేము. అయితే వారి అభిరుచులు వేరువేరుగా వున్న, సమయాన్ని, సందర్భాన్ని బట్టి పని సక్రమంగా చేయడం ఇద్దరి శ్రేయస్సుకు అవసరం. అలాగే ఉత్పత్తి చేసిన వస్తువులకు న్యాయమైన ధరను సంపాదించడం కూడా అవసరమే. వచ్చిన లాభాల పంపిణీలో ఒకరికి లాభం, మరొకరికి నష్టం చేకూరవచ్చు. చేకూరకపోవచ్చు. నిజానికి కార్మికునికి స్వల్పవేతనం యిచ్చి, అతణ్ణి రోగగ్రస్తుణ్ణి చేసి వదలడం లేక నిస్సహాయస్థితిలో అతణ్ణి వుంచడం యజమానికి శ్రేయస్కరం కాదు. అలాగే అందరికీ ఉదారంగా ఎక్కువ వేతనాలివ్వడానికి యజమాని దగ్గరగల డబ్బు చాలకపోతే, కార్మికులకు ఎక్కువ వేతనాలివ్వడం కూడా కార్మికులకు శ్రేయస్కరంకాదు. యంత్రాల చక్రాలు సవ్యంగా నడపలేనంత బీదతనంలో కంపెనీ వున్నప్పుడు పనివాళ్లు అధికవేతనాల్ని ఆశించకూడదు. అందువల్ల సమయం, సందర్భాన్నిబట్టి ఇరువురికీ అనుకూలంగా నియమావళిని తయారు చేసుకోవాలనుకోవడం కూడా సరికాదు. అట్టి ప్రయత్నాలు విఫలం అవుతాయి. అందువల్ల మనిషి యొక్క ప్రతిచర్య అవసరాల్నిబట్టి జరుగకూడదని, న్యాయాన్ని ఆధారంగా చేసుకొని జరగాలని మనుష్యులు సృష్టించిన దేవుని ఆశయం.

అందువల్ల దేవుడు అవసరాన్ని నిర్ణయించే ప్రతి ప్రయత్నాన్నివిఫలం చేస్తూవుంటాడు. తను చేసే ప్రతి పనికి ఫలితం ఏమిటో ఎవ్వరికీ తెలియదు. కాని ఏది న్యాయబద్ధమో, ఏది న్యాయబద్ధం కాదో ప్రతి మనిషికి తెలుస్తుంది.

మంచి చర్యఏది? అదిఎలా సంభవం? అను విషయం తెలియకపోయినా, న్యాయబద్ధమైన చర్యకు పరిణామం ఉత్తమంగా వుంటుందనునది అందరికీ తెలిసిన విషయమే.

న్యాయం అను శబ్దంలో వాత్సల్యం కూడా ఇమిడి ఉన్నదని నా అభిప్రాయం. వాత్సల్య మన్నది ఒక వ్యక్తి మరొకరిపట్ల చూపవలసిన ప్రవృత్తి. యజమాని, కార్మికుల మధ్య వుండవలసిన సత్సంబంధాలన్నీ వాత్సల్యం మీదనే ఆధారపడివుంటాయి.

ఉదాహరణకు ఒక ఇంటి పనివాడి విషయం చూద్దాం. ఇంటి యజమాని ఒక పనివాణ్ణి పెట్టుకుంటాడు. అతడికి కొంత పైకం యివ్వడానికి అంగీకరిస్తాడు. అందుకు బదులుగా అతడిచేత బాగా పనిచేయించుకుంటాడు. తన పనివాణ్ణి సోమరిగా వుండనీయడు వాడికి పుష్టికరమైన తిండి పెట్టడు. నివసించడానికి వీలులేని ప్రదేశంలో అతణ్ణి వుంచుతాడు.

పనిలో మాత్రం ఊపిరి ఆడనీయడు. యజమాని చేసింది సరికాదంటామా? ఆ యజమాని న్యాయాన్ని ధిక్కరించాడని అంటామా? మరి పనివాడిచేత పూర్తి పని చేస్తానని మాట తీసుకున్నాడు గదా! ఆ ప్రకారంఅతడి సేవలందుకుంటూ వున్నాడని చెప్పవచ్చు. ఆ యజమాని ప్రక్కన వుంటున్న వాళ్లు కూడా తమ పనివాళ్ల విషయమై అలాగే ప్రవర్తిస్తూ వుంటారు. యజమాని తాను కూడా అలాగే ప్రవర్తిస్తున్నానని అనుకుంటారు. ఆఁ ఊఁ అని అంటే ఇంతకంటే మెరుగైన చోట ఉద్యోగం దొరికితే పనివాడు వెళ్లవచ్చునని అంటాడు.

ఈ పద్ధతిన పనివాడి చేత ఎక్కువ పని చేయించవచ్చని లేక రాబట్టవచ్చని, అందువల్ల సమాజానికి అధికలాభం చేకూరుతుందని, అలాగే సమాజం ద్వారా పనివాడు లాభం పొందుతాడని ఆర్థిక శాస్త్ర నిపుణులు భావిస్తారు.

ఇది సరియైన పద్ధతా? వాస్తవ పరిస్థితి తద్భిన్నంగా వుంటుంది. పనిచేసేవాడు సదా పనిచేస్తూనే వుండాలని అంటే అతడు ఒక యంత్రమై వుండాలన్నమాట. యంత్రాన్ని ఉత్తేజపరచడానికి నీటి ఆవిరియో లేక అయస్కాంతమో లేక అలాంటిది ఏదో మరోశక్తియో అవసరం. కాని మనిషి చేత ఆ విధఃగా పనిచేయించాలంటే ఆత్మోత్తేజం అవసరం. ఆత్మోత్తేజం కలిగితే మనిషి బాగా పనిచేయగలుగుతాడు. ఎక్కువ జీతం యిచ్చి గాని

లేక ఒత్తిడి చేసిగాని మనిషి అనే యంత్రంతో ఎక్కువపని చేయించలేము. అందుకు సరియైన ఇంధనం ప్రేమ, వాత్సల్యాలే. వాటిని ఉపయోగిస్తే మనిషి యొక్క ఆత్మశక్తి పెరుగుతుంది. ఆ ఆత్మోత్తేజంతో మనిషి చేత అధికంగా పని చేయించవచ్చు. అయితే ఆర్థిక శాస్త్రవేత్తలు యీవిషయం అంగీకరిస్తారా? ఆత్మశక్తి యొక్క విశిష్టతను అంగీకరిస్తే, వారి యోచనా విధానం తప్పు అని నిర్ధారణ అవుతుంది కదా!

యజమాని శక్తివంతుడు, తెలివైనవాడు, అయితే భౌతికంగా ఒత్తిడి చేసి పనివాళ్ళచేత ఎక్కువగా పని చేయించవచ్చు. యజమాని సోమరియై, బలహీనుడైతే పనివాళ్లచేత కొంతపనినే, అందులోనూ నిజాయితీ లేనిదాన్ని మాత్రమే చేయించవచ్చు. ఈ విషయంలో అంతర్జాతీయంగా అంగీకరించిన విషయం ఒకటి వున్నది యజమాని, పనివాళ్లు యిద్దరికీ కావలసినంత శక్తి, తెలివి వుందనుకుంటే, వారి ద్వారా లభించే ఫలితం అధికంగా వుండాలని అనుకుంటే, వారిద్దరి మధ్య ద్వేషానికి తావు వుండకూడదు, ప్రేమాభిమానాలకే తావువుండాలనేది అందరూ అంగీకరించిన విషయం.

మరో విషయం. ఇందు కూడా సత్యం వున్నది .స్వేచ్ఛ యిచ్చామనుకోండి, అప్పుడు అది దుర్వినియోగం అవుతుంది. దయ చూపామనుకోండి అప్పుడు అది కృతఘ్నతగా మారుతుంది. దయ చూపిస్తే ఆ పనివాడు అవిశ్వాసాన్ని ప్రదర్శిస్తాడు. నిర్దయగా ప్రతీకారం తీర్చుకోడానికి సిద్ధపడతాడు. ఉదాత్తంగా వ్యవహరించే యజమానిపట్ల నిజాయతీ లేనివాడుగాను, అన్యాయంగా వ్యవహరించే యజమానిపట ప్రమాదకారిగాను వ్యవహరిస్తాడు.

అందువల్ల ఏ విషయంలోనైనా, ఎవ్వరి విషయంలోనైనా స్వార్థరహితంగా వ్యవహరిస్తే, అది శక్తివంతమైన సత్ఫలితాల్ని యివ్వగలదు. నేను ప్రేమ, వాత్సల్యాలను కేవలం మాటల రూపంలోకాక, ఉత్తేజకరశక్తిగా పరిగణిస్తాను, ఈ శక్తి వివరణకు స్పష్టీకరణకు అందుబాటులో వుండదు. సాధారణ ఆర్థిక శాస్త్రవేత్తల లెక్కల్ని, అంచనాల్ని తారుమారు చేస్తుంది. నిజానికి ఆర్థిక శాస్త్రానికి సంబంధించిన ఉత్తేజకరమైన యితరశక్తుల్ని తిరస్కరించినప్పుడే

ప్రేమ, వాత్సల్యాలు శక్తివంతమైన ఉత్తేజం కలిగించే అజేయశక్తులుగా రూపొందుతాయి.

తన పట్లపనివాడు కృతజ్ఞతతో ప్రవర్తించాలని భావించి యజమాని అతణ్ణి దయతోచూస్తే అతడు దానికి ఎలాటి విలువ యివ్వడు ఎంత విలువ యివ్వాలని అనుకుంటాడో అంతే యిస్తాడు పనివాడినుంచి ఏ విధమైన ఆర్థిక ప్రతిఫలాన్ని ఆశించకుండా అతణ్ణి దయతో చూస్తే అతడు యాజమాని యొక్క ఆర్థిక అవసరాల్ని తీరుస్తాడు. తన ప్రాణాల్ని ఎక్కడైనా కాపాడుకోవాలి అని తలంచినవాడు వాటిని పోగొట్టుకుంటాడు. పోగొట్టుకున్నవాడు దాన్ని తిరిగి పొందగలుగుతాడు.

యజమానికి, పనివాడికిమధ్య వుండే సంబంధానికి మంచి ఉదాహరణగా, సైన్యాధిపతికి, సైనికుడికి మధ్య వుండే సంబంధాన్ని పేర్కొనవచ్చు.

సైన్యాధిపతి తన కెలాంటి యిబ్బంది కలుగరాదని, తన సైనికదళం అత్యంత శక్తివంతమైనదై యుండాలని భావించి క్రమశిక్షణా నియమావళిని అమలు చేయదలిస్తే, అట్టి స్వార్థచింతనవల్ల తన క్రింది వారిలో శక్తిని నింపలేడు. అలాగాక తన క్రింది వారితో మంచి సంబంధాల్ని నేరుగా స్థాపించుకొని, వారి శ్రేయస్సు గురించి శ్రద్ధగా యోచిస్తూ, వారి ప్రాణాలపట్ల విలువ చూపిస్తూ వుంటే అతడి సైనిక దళం అతిశక్తివంతం అవుతుంది.

సైన్యాధిపతిపై ఆతని దళమందలి సైనికులకు కలుగు నమ్మకం వల్ల ప్రేమాభిమానాలవల్ల, యితర మార్గాలలో సాధ్యపడని రీతిన పని జరుగుతుంది. సైనికుల సంఖ్య అధికంగా వుంటే యీ సూత్రం యింకా బాగా పనిచేస్తుంది. అయితే అప్పుడప్పుడు సైన్యాధిపతిపై అయిష్టంగా వున్నప్పటికీ, అతని సైనికులు చేసిన దాడులు విజయం సాధించవచ్చు. కాని సామాన్యంగా యుద్ధంలో విజయం ఎప్పుడూ సైనికులకు తమ సైన్యాధిపతిపై ప్రేమ వున్నప్పుడే లభిస్తూ వుంటుంది. అట్టి ప్రేమ లేనప్పుడు లభించడం కష్టం అని గ్రహించాలి.

దారిదోపిడి చేయడానికి కొందరు మనుష్యులు కలిసి ముఠాగా ఏర్పడుతారు. (గతంలో దారిదోపిడి దొంగలు అలాగే ఉండేవారు.) వారు పరస్పరం ప్రేమ

వాత్సల్యాలతో ముడిపడివుంటారు. తమ నాయకుడి ప్రాణాలు కాపాడడానికి, ఆ మురాయందలి ప్రతిఒక్కడూ తన ప్రాణాల్ని అర్పించడానికి సిద్ధంగా వుంటాడు. కాని ఏదో అవసరం వుండి యిలా ప్రోగైన వారిలో అలాంటి ఉద్వేగాలు వుండవు. వారిలో ఎవ్వరూతమ నాయకుడి ప్రాణరక్షణకోసం తమ ప్రాణాల్ని త్యాగం చేయడానికి సిద్ధపడరు. ఉద్యోగిగాని లేక సైనికుడుగాని నిర్ధారించబడిన జీతానికి, నిర్దారించబడిన కాలానికి నియమింపబడతాడు. కాని పనివాళ్లు యజమాని యొక్క అవసరాన్నిబట్టి తరతమ భేదాలతో జీతాలు నిర్ణయించబడి నియమించబడతారు.

వ్యాపార అవసరాల్నిబట్టి అతడు ఆ ఉద్యోగాన్నుంచి ఎప్పుడైనా తొలిగించబడవచ్చు. అట్టి యిబ్బంది తప్పదు.అట్టి పరిస్థితుల్లో ప్రేమాభిమానాలకు తావువుండదు. అందు వైషమ్యాలు పెచ్చరిల్లేందుకు అవకాశం వుంటుంది. ఈ విషయంలో రెండు సంగతులు మనం యోచించాలి.

1. కార్మికుల అవసరాన్ని బట్టి గిరాకీని బట్టి వారికిచ్చు వేతనాల రేటుమీరకుండా చట్టబద్ధం చేయుటకు వీలువున్నదా? వుంటే ఎంతకాలం అలా చేయవచ్చు.
2. వెనుకటి కాలపు పాత కుటుంబంలోని పనివానివలె లేక హఠాత్తుగా దాడిచేయు సైనికశాఖయందలి సైనికుడి వలె, వారు పనిచేయువ్యవస్థ యందు వారికి అభిరుచి కల్గించుటకు వారి సంఖ్యను పెంచకుండా లేక తగ్గించకుండా (ఏ వ్యాపారంలోనైనా సరే) నిర్ణీత వేతనాలపై పని వాళ్లను నియమించిపోషించుటకు వీలువున్నదా?వుంటే ఎంతకాలం?

మానవుని తప్పిదాల చరిత్రలో ఆశ్చర్యం కలిగించే మరోవిషయం ఒకటి వున్నది. కార్మికుల గిరాకీతో పాటు వారివేతనాల రేటు మార్చకుండా నియమనిబంధనల్ని రూపొందించుటకు వీలులేదని ఆర్థిక శాస్త్రవేత్తలు చెపుతారు.

మన ప్రధానమంత్రిని వేలంపాటలో మనంఅమ్మివేస్తామా? జబ్బుగా వున్నప్పుడు ఒక గిన్నీ తక్కువగా పుచ్చుకునే వైద్యునికోసం మనంవెతుకుతూ కూర్చుంటామా? తగాదా పెట్టుకోవాలని కాంక్షించి ఆరు పెన్నీలను నాలుగుకు,

ఎనిమిది పెన్నీలను ఆరుకు తగ్గించమని తగాదా పెట్టుకుంటామా? వర్షంలో తడుస్తూ ఒక మైలు దూరం యాత్ర చేయుటకు ఆరు పెన్నీలకన్నా తక్కువ కిరాయితీసుకునే బండివాడు కావాలని తెగ తిరుగుతామా?

మంచి కృషి చేసినవారికి అప్పుడూ, యిప్పుడూ, ఎప్పుడూ కూడా తేడాలేకుండా ఒకే పరిమాణంలో డబ్బు చెల్లించాలి. అయితే మరోప్రశ్న. మంచిగా పనిచేసే వారికీ, చెడుగా పనిచేసేవారికీ సమానవేతనం యివ్వవలసిందేనా అనునదే ఆ ప్రశ్న. ఇవ్వవలసిందే అని అందుకు సమాధానం. మతబోధకులు (ఆత్మపై పనిచేయువారు) మంచివారైనా, చెడువారైనా సంతృప్తిగా సమాన రుసుం చెల్లిస్తూవుంటారుగదా! ఇల్లు నిర్మించే కార్మికులకు మంచి పనివారైనా, చెడ్డపనివారైనా సంతృప్తిగా సమానవేతనాలు యింకా ఎక్కువగా కూడా చెల్లిస్తూ వుంటారుగదా! అని పై ప్రశ్నకు సమాధానం లభిస్తూ వుంటుంది.

కాని నేను ఆ విధంగా యోచించను. నా వైద్యుల్ని వారి యోగ్యత మరియు స్థాయినిబట్టి విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించి ఎన్నుకుంటాను. మీరు కూడా అదేవిధంగా తాపీ పనివారిని ఎన్నుకోవచ్చు. ఎన్నుకోబడటమే మంచి పనివారికి బహుమతి అన్నమాట. మంచి కృషికి మంచి మర్యాద యిచ్చువిధానం, నిర్ధారించబడిన రేటు ప్రకారం వేతనాలివ్వడమే. అయితే యిలా చేయడంవల్ల మంచిపనివారికి పని లభ్యమైతే, పనిచేయనివారికి పనిదొరకదు. వారు నిరుద్యోగులవుతారు. సరిగా పనిచేయనివారిని అర్ధవేతనాలపై పనికి నియమించడం, వారిని మంచిపనివారి స్థానం ఆక్రమించమనడం లేకపోటీ కల్పించి తక్కువ డబ్బుకు వారి చేత బలవంతంగా పనిచేయించడం పూర్తిగా తప్పు పద్ధతి.

కార్మికులందరికీ సమానమైన వేతనాలు యివ్వడం ప్రధమ లక్ష్యం కావాలి. ఆ లక్ష్యసాధనకు మార్గం కనుగొనాలి. రెండవలక్ష్యం నిర్ణీతమైన తరగని, పెరగని సంఖ్యలో పనివాళ్లను పోషించడం. అప్పుడు వారు ఉత్పత్తి చేసే వస్తువుల ధరల్ని లెక్కలోకి తీసుకోకూడదు.

కార్మికుని ఉద్యోగం నిరంతరం కొనసాగుతుందనే హామీ లేకుండా,

అప్పుడప్పుడు మధ్యమధ్యన వారికి విరామం కల్పిస్తూ వుంటే, అప్పుడు అట్టి కార్మికుని జీతం బాగా పెరిగిపోతుంది. ఉద్యోగం మధ్యలో పోకుండా కొనసాగుతుందంటే కార్మికుడు జీతంతక్కువే అయినా తీసుకుంటాడు. దీర్ఘకాలం పాటు కొనసాగే క్రమబద్ధమైన ఉద్యోగం యజమానికీ, కార్మికునికీ ఇద్దరికీ మంచిది. అయితే యజమానికి ఎక్కువ లాభాలు రాకపోవచ్చు. అతడు తెగింపు చేయకపోవచ్చు స్వేచ్ఛగా ధనార్జన చేయుటకు ప్రయత్నం చేయకపోవచ్చు సైనికుడు తన సైన్యాధికారికోసం ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా వుంటాడు. కావున ఆతణ్ణి సాధారణ కార్మికునికంటే మిన్నగా గౌరవిస్తారు. నిజానికి సైనికుని కర్తవ్యం యితరుల్ని చంపడం కాదు. ఇతరుల రక్షణకోసం చంపబడటం. సైనికుడు దేశ సేవకు తన ప్రాణాలు సమర్పిస్తాడు కాబట్టి ప్రపంచం సైనికుణ్ణి గౌరవిస్తుంది.

మనం న్యాయవాదికి, వైద్యునికి, మత గురువుకు ఎంతో గౌరవం యిస్తాం. వారు చేసే ఆత్మత్యాగంపై ఆ గౌరవం ఆదారపడివుంటుంది. న్యాయాధిపతిస్థానంలో వున్న న్యాయవాది సైతం ఏది ఏమైనా న్యాయంగా తీర్పు యివ్వడానికి శ్రమపడతాడు. ఇబ్బందులు కలిగినా వైద్యుడు తన రోగులికి అతి శ్రద్ధగా చికిత్స చేయప్రయత్నిస్తాడు అలాగే మత గురువు తన శిష్యవర్గాన్ని మంచిమార్గాన నడిపించుటకు ప్రయత్నిస్తాడు.

పైన పేర్కొన్న వైజ్ఞానికుల వృత్తుల్లో పనిచేసే ప్రతిభావంతులు, ప్రజల దృష్టిలో, పెద్దవ్యాపారసంస్థల అధినేతలకన్నా గౌరవింపతగినవారు. వ్యాపారస్తులు ప్రధానంగా తమ స్వార్థం కోసమే పనిచేస్తారని ప్రజలు భావిస్తారు. సమాజానికి వ్యాపారస్తుని పని అవసరమైనదే. కాని అతడి వ్యాపారానికి వెనుక వున్న లక్ష్యం పూర్తిగా అతడి స్వలాభమే. వ్యాపారస్తుడు వ్యాపారంలో వచ్చిన ఆదాయంలో అధిక భాగం తాను తీసుకొని కొద్దిభాగం మిగిలితే దాన్ని వినియోగదారులకు వదులుతాడు. (యిదిప్రజల అభిప్రాయం) యీ సూత్రాన్ని వ్యాపారస్తులపై అమలు చేస్తూ, చట్టరీత్యా అది అతడు అనుసరించవలసిన కార్యక్రమమని సిఫారసు చేస్తూ, ప్రజలు కూడా దానికి అనుకూలంగా నడచుకుంటారు. వస్తువులు కొనుగోలు చేసేవారు ధరలు తక్కువగా

వుండాలని భావిస్తారు. అమ్మకం చేసేవారు కొనుగోలుదారుల్ని మోసం చేయాలని చూస్తారు ఇది ప్రపంచమందంతట జరిగే వ్యవహారమని, చట్టబద్ధమని చెబుతూ, సామాన్యంగా ప్రజలు వ్యాపారస్థుణ్ణి దూషిస్తూ వుంటారు మానవుల్లో అధమస్తుడని అతనిపై ముద్రవేస్తూ వుంటారు.

ఇది సరికాదు. ప్రజలు యీ పద్ధతిని మానుకోవాలి స్వార్థంలేకుండా చేసే వ్యాపారాన్ని గురించి తెలుసుకోవాలి. ఇప్పుడు ప్రజలు అనుకుంటున్న వ్యాపారం నిజమైన వ్యాపారం కాదని, అది మోసంతో కూడినదని ప్రజలు గ్రహించాలి యుద్ధాలు జరిగినప్పుడు అప్పుడప్పుడు వ్యక్తిగత నష్టాలు తప్పక జరుగుతూవుంటాయి. విధి నిర్వహిస్తున్నప్పుడు ఆరు పెన్నీలు పోవచ్చు. ప్రాణాలు కూడా పోవచ్చు. వ్యాపారరంగం, బోధనారంగం కావచ్చు. అమరత్వానికి దారితీయవచ్చు. వ్యాపారం శౌర్య సాహసాలకు, యుద్ధానికి కూడా కేంద్రం కావచ్చు.

ప్రతి నాగరిక దేశంలోను అయిదు వృత్తులుంటాయి

1. దేశరక్షణకు సైనిక వృత్తి.
2. బోధనకు మత బోధకవృత్తి.
3. ఆరోగ్యరక్షణకు వైద్యవృత్తి.
4. న్యాయ రక్షణకు న్యాయవాదవృత్తి.
5. జనానికి వస్తు సంపదను అందజేయుటకు వ్యాపారవృత్తి.

పై వృత్తులవారు తమవృత్తి నిర్వహణలో అవసరమైనప్పుడు చనిపోవడానికి సైతం సిద్ధంగా వుండాలి. తానెప్పుడు చనిపోవలసివస్తుందో మనిషికి తెలియనట్లే తాను జీవించడం ఎలా అను విషయం కూడా మనిషికి తెలియదు.

జాగ్రత్తగా పరిశీలించిచూస్తే వ్యాపారస్థుడి విద్యుక్తధర్మం దేశానికి అవసరమైన వస్తువుల్ని అందజేయడమని తేలుతుంది. మతగురువు కర్తవ్యం ఉపకారవేతనం పొందుతూ బోధచేయడం అలాగే వ్యాపారస్థుని విధి కూడా స్పష్టమే. ఇలా విధినిర్వహణకు వేతనం తీసుకోవడం తప్పుకాదు. అయితే అది విధి నిర్వహణచేస్తూ జీవితం గడపడానికి తీసుకునే వేతనం మాత్రమే గాని అదే జీవితలక్ష్యం కాదు. కారాదు. వైద్యుని విషయం కూడా యింతే. వ్యాపారస్థుడు,

మతబోధకుడు, వైద్యుడు ముగ్గురూ డబ్బు యిచ్చినా యివ్వకున్నా తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహించక తప్పదు నిర్వహించాలి. రుసుముకు విద్యుక్తదర్మానికి సంబంధం వుండకూడదు రుసుము యివ్వకపోయినా వైద్యుడు వైద్యం చేయాలి. మతబోధకుడు బోధచేయాలి వ్యాపారస్థుడు సరుకుల్ని సరఫరా చేయాలి. అంటే వ్యాపారస్థుడు తన వక్తి యుక్తులన్నింటిని వినియోగించి మంచి వస్తువుల్ని సేకరించి అందుబాటులో వుంచాలన్నమాట అవసరమైనచోట వాటిని వీలైనంత సరసమైన ధరకు అమ్ముటకు పంపిణీ చేయాలన్నమాట

ఏ వస్తువును ఉత్పత్తి చేయాలన్నా అందుకు సంస్థలు, వ్యక్తులు, కార్మికులు అవసరం. సైన్యాధిపతికన్నా, మతగురువుకన్నా, వ్యాపారి తన వ్యాపారంలో పనిచేయు కార్మికులకు నేరుగా అధిపతి అవుతాడు అందువల్ల వారి జీవిత విధానాల్ని తీర్చిదిద్దే బాధ్యత అతడిపై పడుతుంది శుచిగా వుండే, మంచి వస్తువుల్ని తయారుచేసే బాధ్యతతో బాటు తన దగ్గర ఆ రంగంలో పనిచేసే ఉద్యోగుల మంచిచెడులను సరిదిద్దుతూ వారి చేత పనిచేయించే బాధ్యత కూడా వ్యాపారస్థుడి పై పడుతుంది ఈ రెండు విధుల్ని నిర్వహించుటకు వ్యాపారస్థుడు అవసరమైన ఉత్తమ మేధస్సును, సహనశక్తిని, దయను, సర్దుబాటు చేసుకోగల సౌమ్యాన్ని సమకూర్చుకొని తద్వారా శక్తి సామర్థ్యాల్ని ఉపయోగిస్తాడు. సైనికుడు, వైద్యుడు తమ విధుల నిర్వహణలో లీనమై అవసరమైతే ప్రాణాల్ని సైతం అర్పించుటకు సిద్ధంగా వుండునట్లు, వ్యాపారస్థుడు కూడా అందుకు సిద్ధంగా వుంటాడు

రెండు ప్రధాన విషయాల్ని అతడు పాటించాలి. 1. తన దిన చర్య కార్యక్రమాల్ని సరిగా నిర్వహించాలి. 2. తన కార్యక్రమాల ఆచరణలో నిజాయితీగాను, నిష్కళంకంగాను వ్యవహరించాలి. అతడి కార్యక్రమాల్లో తప్పు జరుగకూడదు. తాను సరఫరా చేసే వస్తువుల్లో కల్తీకి, తక్కువరకం వస్తువులకు తావు యీయకూడదు. హెచ్చు కధరలకు వాటిని అమ్మేందుకు అనుమతించకూడదు. ఈ ధర్మాల్ని పాటిస్తున్నప్పుడు కలిగే కష్టనష్టాల్ని నిర్భయంగా ఎదుర్కొనేందుకు, పేదరికం అనుభవించవలసివచ్చినా దాన్ని అనుభవించేదుకు సిద్ధంగా వుండాలి.

తాను నియమించిన ఉద్యోగులమీద అజమాయిషీ జరుపు అధికారం వ్యాపారస్థుడికి అప్పగించబడింది. వ్యాపారసంస్థలో చేరే యువకుడు తన ఇంటి ప్రభావానికి దూరం అవుతాడు. అందువల్ల అతడి యజమానియే అతడికి తండ్రికావాలి. వాస్తవానికి అతడికి తగిన సలహాలిచ్చేతండ్రి అందుబాటులో వుండడు. అందువల్ల యజమాని తన దగ్గర పనిచేస్తున్న ఉద్యోగులకు తండ్రిగా రూపొందాలి. ఆ విధంగా వ్యవహరిస్తున్నానా లేదా అని అతడు తననుతాను ప్రశ్నించుకుంటూ వుండాలి

ఒక నావికాధికారి తన యుద్ధ నౌకలో తన కుమారుణ్ణి ఒక నావికుడిగా నియమించాడని అనుకుందాం. తన కుమారుణ్ణి తాను ఎలా చూచుకుంటాడో, మిగతా ఉద్యోగస్థులందర్నీ అలాగే చూచుకోవాలి. అలాగే ఒక కర్మాగారంలో యజమాని తన కుమారుణ్ణి ఒక సామాన్య కార్మికుడి స్థానంలో నియమించవలసి వచ్చిందనుకుందాం. అప్పుడు తన కుమారునితో అతడు ఎలా వ్యవహరిస్తాడో మిగతా కార్మికులతో కూడా అతడు అలాగే వ్యవహరించాలి. నియమావళి ఒక్కటే ఆర్థికశాస్త్రంలో మంచి ఫలితాన్ని అందించగల ఆచరణయోగ్యమైన సూత్రం. సముద్రంలో ఓడ మునిగిపోతున్నప్పుడు దాన్ని విడిచిపెట్టే చివరివాడు కెప్టెన్ చివరి రొట్టెముక్కను అతడు పుచ్చుకుంటాడు. అలాగే వ్యాపారంలో క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు యజమాని వ్యవహరించాలి. తన పనివారితో కలిసి అతడు బాధలు అనుభవించాలి. నావ అధికారి ఓడ మునిగి పోతున్నప్పుడు, సైన్యాధికారి యుద్ధరంగంలోను తమ కుమారుని కోసం ఎలా త్యాగం చేస్తాడో వ్యాపారస్థుడు కూడా తన కార్మికుల కోసం అలాగే త్యాగం చేయాలి.

ఏమిటిదంతా అని వింతగా తోచవచ్చు. కాని యిందు క్రొత్తదనం ఏమీ లేదు. ఇదే నిజమైన చిరకాల కర్తవ్య విధి. చిరకాలం మనగలిగినది, ఆచరణయోగ్యమైనది కూడా. మిగిలిన సిద్ధాంతాలు, విధానాలు జాతీయ జీవనంలో ప్రగతి సాధించుటకు ఉపయోగపడవు. ఇప్పుడు మనం గడుపుతున్న జాతీయ జీవనం, కొద్దిమంది మేధావులు అంగీకరించకపోయినా, గట్టి

నమ్మకంతో లక్షలాది ప్రజలకు బోధించబడుతూ ఆర్థిక సూత్రాల ద్వారా నడుపబడుతున్నది. ఆ సూత్రాలను అంగీకరించకపోతే వినాశనానికి మార్గం ఏర్పడుతుంది. వినాశనానికి దారితీసే పద్ధతుల్ని, స్వరూపాన్ని కొనసాగిస్తూ మరో వ్యాసంలో నా వాదాన్ని కొనసాగిస్తాను

★ ★ ★

## వ్యాసం - 2

# సంపద - ప్రవాహనాళికలు

మొదటివ్యాసంలో పేర్కొన్న సమస్యలకు సాధారణ ఆర్థిక శాస్త్రజ్ఞుడు యిచ్చే సమాధానం ఎలా వుంటుందో చూద్దాం

సామాజిక మమతలు పెంచుకోవడం వల్ల కొన్ని సాధారణ లాభాలు పొందవచ్చునన్న మాట నిజమే. కాని ఆర్థికశాస్త్రవేత్తలు ఆ లాభాల్ని లెక్కలోకి తీసుకోరు మన శాస్త్రం ధనవంతులగుటకు అనువగుశాస్త్రం ఇంతవరకు యీ శాస్త్రం నమ్మతగినది కాకపోయినా, ఆచరణలోను, అనుభవంలోను శక్తివంతమై కూర్చున్నది. యీ శాస్త్ర సూత్రాలు అనుసరించు వ్యక్తులు ధనవంతులు అవుతున్నారు ఆ సూత్రాల్ని పాటించనివారు బీదవాళ్లవుతున్నారు. ఈ శాస్త్ర నియమావళిని అనుసరించి యూరప్ యందలి పెట్టుబడిదారులు సంపదను సంపాదించారు. కూడబెట్టారు. ఇప్పటివరకు సాధించిన స్థితికి వెనుకగల శక్తిని ఎదురించుటకు ప్రయత్నించడం వల్ల ప్రయోజనంలేదు. వ్యాపారంలో వున్న ప్రతివ్యక్తికి అనుభవంద్వారా ధనం ఎలా సంపాదించాలో, ఎలా నష్టపడాలో తెలుసు.

వ్యాపారస్థులు నిజంగా డబ్బు చేసుకుంటారు. అయితే వాళ్లు మంచి పద్ధతులద్వారా డబ్బు చేసుకుంటున్నారా, ఆ డబ్బు సంపాదన దేశక్షేమానికి ఉపయోగపడుతున్నదా అను విషయం మాత్రం వారికి తెలియదు. ధనవంతుడు అన్న శబ్దానికి అర్థం ఏమిటో కూడావారికి తెలియదు. కనీసం దాని అర్థమన్నా తెలిసి యుంటే ఆ శబ్దం తారతమ్యం గలది అని గ్రహించగలుగుతారు.

దానికి ఎదురుగార బీదవాడు అను శబ్దం వుంటుంది ఈ రెండు శబ్దాలు ఒకటి ఉత్తరమైతే మరొకటి దక్షిణం మనుష్యులు శాస్త్రీయ సూత్రాల్ని ఉపయోగిస్తే ప్రతివాడు ధనవంతుడు కావచ్చునని విజ్ఞప్తి వ్రాస్తారు. విద్యుచ్ఛక్తిలా ధనంకూడా ఒక శక్తి దాని యందు అనేక అసమానతలు వుంటాయి అది లేమి అనేతత్వంద్వారా పనిచేస్తుంది. నీ జేబులో గల గిన్నీకి గల శక్తి నీ ప్రక్కవాడి జేబులో గిన్నీ లేకపోవడంమీద ఆధారపడివుంటుంది అది అతడికి అవసరంలేకపోతే నీకూ దాని అవసరం వుండదు. దాని శక్తి తరతమ భేదాలపై ఆధారపడి వుంటుంది. సాధారణవ్యాపారదృక్పథం గల ఆర్థికశాస్త్రవేత్త దృష్టిలో నిన్ను ధనవంతుణ్ణి చేయగల కళ ఏమిటి అని అంటే నీ పొరుగువాణ్ణి పేదవాడుగా వుంచడమే అని సమాధానం వస్తుంది నేను పాఠకుల్ని రెండు ఆర్థిక పద్ధతులు అనగా "రాజకీయ" మరియు "ఆర్థిక' ' పద్ధతుల మధ్య గల తేడాను బాగా అర్థంచేసుకోమని, వాటిని దేనితో చేర్చాలో తెలుసుకోమని కోరతాను.

ఖాళీగా వున్న స్థలంలో, అనుకున్న సమయంలో ఉపయోగపడే లేక విలాస వస్తువుల్ని ఉత్పత్తిచేసి, భద్రపరిచి పంపిణీ చేయడాన్ని రాజకీయ ఆర్థిక విధానం అని అనవచ్చు. సరియైన సమయంలో తన పంటను కోత కోయురైతు, మంచి సున్నంతో కలిపి యిటుకల్ని సరిగ్గా అమర్చి యిల్లు కట్టే తాపీవాడు, తనవంట గదిలో ఎలాంటి దానినీ వృధా చేయకుండా తన ముంగిట్లో వున్న కర్ర సామగ్రిని అతి జాగ్రత్తగా కాపాడుకొనే గృహిణి; నిజానికి రాజకీయ ఆర్థిక శాస్త్రవేత్తలే వీరు ఏ దేశస్థులో ఆ దేశ సంక్షేమాన్ని, సంపదను మరింత పెంచుతూ వుంటారు.

కాని వ్యాపార ఆర్థిక విధానం కొద్దిమంది చేతుల్లో సంపద అంతా ప్రోగవడాన్ని సూచిస్తుంది. ఆ సంపదవారికి న్యాయ సమ్మతంగానే అయినా, బలప్రయోగంద్వారా యితరుల శ్రమపై అధికారం పొందుటకు వీలు కల్గిస్తుంది. అలాంటి సంపదకల్గించే ప్రతిచర్య ఒక వైపున అప్పు, పేదరికంగా మారితే మరోవైపున సంపదగా మారుతుంది.

ఈనాటి నాగరిక దేశాల మనుష్యుల భావనలో సంపద అంటే పైన

తెలిపిన వ్యాపార సంపదను తమకుగల గుర్రాల్ని, గృహాల్ని, పొలాల్ని, వాటి వల్ల వచ్చే ఆదాయాన్నిబట్టి లెక్క గడతారు అంతేగాని ఆ డబ్బుతో ఎన్ని గుర్రాలు, ఎన్ని గృహాలు, ఎన్ని పొలాలు కొనుటకు వీలగునో లెక్క గట్టరు

నిజమైన సంపద కలిగిన వానికి దానితోపాటుతన పనివారిమీద, వారి కార్మికశక్తిమీద అధికారం వుంటేనే తప్ప ప్రయోజనంవుండదు ఒక వ్యక్తికి తన వ్యవసాయ క్షేత్రంలో సారవంతమైన భూములు, బంగారు ఖనిజాలు, గొప్ప పశుసంపద, ఇళ్లు, తోటలు, గిడ్డంగులు అన్నీ వున్నాయనుకోండి. ఇన్ని వున్నా అతడికి సేవకులుగాని, పనివారుగాని దొరకలేదనుకోండి అప్పుడేం చేయాలి అనునది ప్రశ్న అతడికి పనివాళ్లు దొరకాలంటే అతడి యిరుగుపొరుగువారు పేదవారైయుండాలన్నమాట అతడి బంగారం లేక అతడి ధాన్యం వాళ్లకు అవసరమై యుండాలి అప్పుడు అతడికి సేవకులు దొరుకుతారు. బంగారం, ధాన్యం రెండూ ఎవరికీ అవసరం లేదనుకోండి అప్పుడు అతడికి సేవకులు దొరకరు. ఎంత ధనం దగ్గర వున్నా తనరొట్టె తానె తయారుచేసుకోవాల్సి వస్తుంది. తన దుస్తులుతాను తయారుచేసుకోవాల్సి వస్తుంది. తన భూమిని తానే దున్నుకోవాల్సి వస్తుంది. తన పశువుల్ని తానే మేపుకోవాల్సివస్తుంది అంటే బంగారం మరియు ధాన్యంవల్ల అతడికి లభించే ప్రయోజనం ఏముంటుంది? అతడి గిడ్డంగి యందలి వస్తువులు అలాగే వుండి ముదిగి పోతాయి. వాటినన్నింటిని అతడు ఉపయోగించుకోలేడు. మనిషి తినే దానికంటే మించి అతడు ఎక్కువతినలేడు! ధరించే దుస్తులకు మించి ఎక్కువ ధరించలేడు! సాధారణ సౌకర్యాలు పొందాలన్నా శ్రమపడక తప్పదు. ధనికుడైయుండికూడా సామాన్య కార్మికుడి వలె జీవితం అతడు గడుపవలసివస్తుంది.

దురాశాపరుడైన మనిషి కొంత పొగడ్తతో యిలాంటి సంపదను, వాటి నియమానుసారం పొందుతాడు. సంపద వుందంటే అతడునిజంగా కోరేది యితర మనుష్యులపై అధికారమే. కొద్దిలో చెప్పాలంటే మన లాభానికి ఒక సేవకుని లేక వ్యాపారస్థుని లేక ఒక కళాకారుని సేవల్ని ఉపయోగించుకునే అధికారం పొందడమే.

ఈ సంపద యొక్క శక్తి ఎవరిమీద అధికారం చలాయిస్తుందో వారి పేదరికాన్ని బట్టి కొంత అటూ యిటూ సరియైన పేదరికం పాళ్లలో వుంటుంది దాన్ని మనవైపు త్రిప్పిచూద్దాం మనలాగా కొందరు ధనవంతులు వున్నారని అనుకుందాం. అరుదుగా లభ్యమయ్యే ఒక వస్తువునకు మనం ఎంత డబ్బు యివ్వగలమో, వారూ అంత డబ్బు యివ్వగలరని అనుకుందాం అట్టివారెందరు వుంటారో వారిమీద మన సంపద, శక్తి ఆధారపడి వుంటుంది. ఒక బీద సంగీత విద్వాంసుడు వున్నాడనుకోండి అతడు స్వల్పంగా సొమ్ము పుచ్చుకొని పాడుటకు సిద్ధపడతాడు అయితే యిక్కడ ఒక్క విషయం గమనించాలి. డబ్బిచ్చి పాడించుకునేవాడు ఒకడుంటేనే ఆ గాయకుడు తక్కువ సొమ్ము తీసుకుంటాడు. ఇద్దరు ముగ్గురు అట్టి వారుంటే, అతడు ఎక్కువ డబ్బు యిచ్చిన వారికే పాడుతాడన్నమాట. కావున సాధారణ పరిజ్ఞానం ప్రకారం ధనవంతుడయ్యే కళ అంతా మనంతట మనం డబ్బు ప్రోగుచేసుకోవడమే కాక, మన యిరుగుపొరుగువారు మనకంటే తక్కువ సంపద కలిగినవారుగా వుండుటకు పన్నాగంపన్నాలి. నిజం చెప్పాలంటే మనకు అనుకూలంగా ఇరువురి మధ్య ఎక్కువ అసమానత్వాన్ని సృష్టించాలన్న మాట.

ఆర్థిక శాస్త్ర విషయంలో ప్రచారంలో వున్న పలు తప్పుడు నమ్మకాల వెనుక వున్న కారణాలలో ఆర్థిక అసమానతలు లాభదాయకం అనే దుడుకుతో కూడిన హేతురహితమైన నమ్మకం ఒకటి వున్నది. ఈ నమ్మకం అది సాధించే పద్ధతి మీద ఆధారపడి వుంటుంది. ఏ ప్రయోజనానికి ఆ పద్ధతిని అవలంభించాలన్నది రెండవది. అన్యాయంగా నెలకొల్పబడిన అసమానతలు వున్నా దేశాల్ని, అవి స్థాపించబడినప్పుడే దెబ్బతీశాయి. కాని న్యాయపరంగా నెలకొన్న అసమానతలు ఆ దేశాలకు అవి రూపొందినప్పుడే లాభదాయకం అయ్యాయి. ఉత్తమ కారణాలకు ఉపయోగిస్తేఅవి మరింతగా సహాయపడతాయి.

దేశంలో సంపదను వ్యాప్తం చేయడం శరీరంలో రక్తప్రసారణను పోలియుంటుంది. శరీరంలో రక్త ప్రసారంవ్యాయామం వల్ల లేక సంతోషకరమైన

ఉద్వేగంవల్ల జరుగుతుంది. మరోరకమైన శక్తి ప్రసారం జ్వరంవల్ల లేక అవమానంవల్ల జరుగుతుంది. మొదటి దానిలో శరీర మంతా తేజస్సు పొంది చైతన్యవంతం అవుతుంది. రెండవ దానిలో శరీరం క్రుంగి కృశించిపోతుంది. రక్తం గడ్డ కట్టిన శరీరాన్ని అది దెబ్బతీసినట్లే ఎవ్వరికీ ఉపయోగపడని సంపద దేశ వైభవాన్ని దెబ్బతీస్తుంది

ఇద్దరు నావికులు ప్రవాహంలో కొట్టుకుపోయి ఒక నిర్జన తీరంమీద పడిపోయారు. అక్కడ నీరు వుండిపోవలసి వచ్చింది సొంత కృషిపై ఆధారపడి వరుసగా పలు సంవత్సరాలు తమ్ము తాము పోషించుకోవలసి వచ్చింది వారు తమ ఆరోగ్యం కాపాడుకుంటూ పరస్పరం సహకరించుకుంటూ విరామం లేకుండా కృషి చేశారు. నివసించడానికి ఒక యిల్లు కట్టుకున్నారు. కొద్దికాలానికి వ్యవసాయం చేసుకునేందుకు కొంత వ్యవసాయ క్షేత్రం సంపాదించుకోవచ్చు. భవిష్యత్తుకు కావాల్సిన సరుకులు నిల్వ చేసుకోవచ్చు ఇవన్నీ వారి నిజమైన ఆస్తులు కావు. సంపద మాత్రమే. వారిద్దరూ సమానంగా కష్టపడి వుంటే వారిలో ప్రతివాడు సమానభాగం పొందుటకు హక్కుకలిగి వుంటాడు. రాజకీయంగా వారి ఆర్థికస్థితి, తమ సంపదను కాపాడుకోవడంపైన, న్యాయంగా పంచుకోవడంపైన ఆధారపడివుంటుంది.

కొంత కాలం తరువాత బహుశ వారిలో ఒకరు లేక మరొకరు యీ ఉమ్మడి వ్యవసాయక్షేత్ర ఫలితాలపై అసంతృప్తి చెందవచ్చు దానివల్ల వారు ఆ భూమిని సమంగా విభజించుకోవచ్చు. ఎవరిపొలంలో వారు పనిచేసుకుంటూ బ్రతకవచ్చు. అంగీకారం కుదిరిన తరువాత వారిలో ఒకరు జబ్బు పడతాడనుకుందాం. అతడి పొలంలో అవసరమైనప్పుడు అనగా విత్తులు నాటేటప్పుడు, లేక కోతకోసేటప్పుడు అతడు పనిచేయలేక పోతాడనుకుందాం. అలాంటప్పుడుఅతడు రెండోవాణ్ణి తన పొలంలో కూడా తనకోసం గింజలు నాటమని, లేక కోత కోయమని సాధారణంగా కోరవలసివస్తుంది.

అప్పుడు అతడి సహచరుడు "నేను నీకు యీ పనిచేసిపెడతాను. నాకు అవసరమైనప్పుడు నీవు యిందుకు బదులుగా పనిచేసిపెట్టాలి" అని కోరతాడు. నేను ఎన్ని గంటలు నీ పొలంలో పనిచేస్తానో, అన్ని గంటలు

అవసరమైనప్పుడు నా పొలంలో పనిచేస్తానని వాగ్దానం చేస్తూ కాగితం వ్రాసి యిమ్మని కోరతాడు అది కూడా నేను కోరినప్పుడు, అవసరమైనప్పుడు నీవు పనిచేయగలిగినప్పుడు చేయాలి అని కోరతాడు.

కష్టపడలేని వాడి జబ్బు తగ్గలేదని అనుకుందాం. అనేక కారణాలవల్ల చాలా కాలంపాటు అతడికి పరుల సాయం అవసరం అవుతుంది

అయితే అతడు ప్రతిసారి తన సహచరుడు కోరిన ప్రకారం వాగ్దానం చేస్తూ కాగితం వ్రాసి యిస్తూనే వుంటాడు.

అశక్తుడైన వాడు కోలుకొని పనిచేయడం ప్రారంభిస్తే యిరువురి పరిస్థితి ఎలా వుంటుంది?

వారి వాస్తవ పరిస్థితిని పరిశీలిస్తే, వారు వుండవలసిన స్థితికన్నా, అంటే విరామ సమయంలో జబ్బుపడిన మనిషి కష్టపడి ఎంత ఉత్పత్తి చేయగలిగి యుంటాడో, అంత కొరత ఏర్పడింది గనుక వాళ్లు పేదవాళ్లు అయినారు, అతడి స్నేహితుని అవసరం పెరిగింది కనుక ఎక్కువ శక్తిని వినియోగించి కృషి చేయాల్సి వస్తుంది. అయితే అతడి సమయం చాలా వరకు తగ్గింది కనుక అతని భూమికూడా దెబ్బతిని వుంటుంది. ఇద్దరి సమైక్య సంపద, ఆరోగ్యంగా వుండి బాగా కష్టపడియుంటే ఎంత పెరిగివుంటుందో, అంతకన్నా యిప్పుడు తరిగి తగ్గిపోయివుండవచ్చు. వారిమధ్య పరస్పరం వుండవలసిన సంబంధాలు కూడా విస్తృతంగా మార్పు చెందుతాయి. జబ్బుపడిన మనిషి తన శ్రమశక్తిని కొద్ది సంవత్సరాల దాకా తాకట్టుపెట్టడమే గాక తన సొంత సరుకుల్ని కూడా వ్యయం చేసి వుంటాడు. అందువల్ల కొంతకాలం మరొకడిపై ఆహారం కోసం ఆధారపడవలసి వస్తుంది. అందుకు తాను మరింత శ్రమను తాకట్టుపెట్టిగాని బదులు తీర్చలేడు.

ఈ వ్రాతపూర్వకమైన వాగ్దానాలన్నీ అమలు చేయతగ్గవి అనుకుందాం. అప్పుడు యింతవరకు తన సహచరుడి కోసం పనిచేసినవాడు, యిద్దరి పనులు తానే చేశాడు కనుక యిప్పుడు విశ్రాంతి తీసుకోవచ్చు. తన కాలాన్ని సోమరిగా గడపవచ్చు. తన సహచరుణ్ణి ముందుచేసిన వాగ్దానాలు నెరవేర్చమని బలవంతం చేయవచ్చు. తాను అందించిన ఆహారానికి గాను నిరంకుశంగా

ఒక మొత్తాన్ని నిర్ణయించి దాన్ని తీర్చమని, ముందు ముందు మరింత శ్రమ చేయమని వాగ్దానాలు చేయించుకోవచ్చు

అయితే యీ ఏర్పాటు నందు (సామాన్యంగా చూస్తే) ఎలాంటి అన్యాయం కనబడదు. యీ పరిస్థితిలో ఆ తీరానికి యింకోవ్యక్తి వచ్చి చేరాడనుకుందాం. అతడు వీళ్లద్దరిలో ఒకడు వ్యాపార రీత్యా ధనవంతుడుగా వుండటం, మరొకడు బీదవాడుగా వుండటం గమనిస్తాడు మరో ఆశ్చర్యకరమైన విషయాన్ని అతడు గుర్తిస్తాడు ఇద్దరిలో ఒకడు తన రోజుల్ని సోమరితనంగా గడుపుతూవుంటే మరొకరు యిద్దరికోసం కష్టపడుతూ, భవిష్యత్తులోనైనా స్వేచ్ఛను పొందగలనన్న ఆశతో చాలా మితంగా జీవిస్తూ వుంటాడు ఈ వివరమంతా అతడు తెలుసుకుంటాడన్నమాట

నేను యిక్కడ పాఠకుల్ని ఒక్క విషయం ప్రత్యేకించి గుర్తించమని కోరుతున్నాను ఇతరుల శ్రమపై ఆధిపత్యం గల వ్యాపార సంపదని వ్యక్తి దగ్గరగల నిజమైన సంపదతో పోలిస్తే రాజకీయంగా తరుగుదల కనబడుతుంది.

సాధారణ వ్యాపారానికి సంబంధించిన మరో ఉదాహరణ చూద్దాం ఇద్దరికి బదులు ముగ్గురు ఒక చిన్న చోట నివాసం ఏర్పాటు చేసుకున్నారని అనుకుందాం. వారి ముగ్గురి వ్యవసాయ క్షేత్రాలు ఒకదాని కొకటి దూరంగా వున్నందువల్ల వారు విడిపోవలసి వచ్చింది వారి వారి భూముల్లో వారు వేరువేరు పంటల్ని పండిస్తారు. ఒకరు పండించిన పంట మరొకరికి అవసరం అవుతుంది. మూడోవ్యక్తి ముగ్గురి సమయాన్ని పొదుపు చేయాలనే ఉద్దేశ్యంతో ఒక పొలాన్నుంచి మరో పొలానికి పంటల్ని మార్పిడి చేయడాన్ని పర్యవేక్షిస్తూ వుంటాడు. అలా చేయడానికి మార్పిడి చేసిన పంటలో కొంతభాగం అతడు తీసుకుంటాడు

ఇలా మార్పిడి చేయువాడు ఒకరికి మరొకరికి సకాలంలో కావలసిన సామగ్రిని అందజేస్తే రైతులిద్దరి కార్యక్రమాలు లాభదాయకం అవుతాయి. అప్పుడు ఆ చిన్న ప్రదేశంలో పండించే పంటల్లో, సంపదలో మంచి ఫలితాలు వచ్చే అవకాశం వుంటుంది. మధ్యవర్తిద్వారా తప్ప రైతులిద్దరి మధ్య పరస్పరం కలయికకు వీలులేదనుకుందాం. కొంత కాలం తరువాత మార్పిడి

కోసం అతడికి యిచ్చిన వస్తువుల్ని ఒక వైపున, అత్యవసరమైన పరిస్థితులు ఏర్పడేంతవరకు మరో వైపున వాటిని అతడు తన దగ్గరే వుంచుకుంటాడని అనుకుందాము ఆ తరువాత యిబ్బందిలో వున్న రైతునుండి ఆ వస్తువులకు బదులుగా యితర వస్తువుల్ని గుంజుకుంటాడు. ఇలా అతడు యిద్దరి వ్యవసాయక్షేత్రాలయందలి ఎక్కువ శాతం మిగులు పంటను (సరియైన పద్ధతిలోనే) తన స్వాధీనం చేసుకోవచ్చు. చివరికి కరువు పరిస్థితులున్న సంవత్సరంలో రెండు వ్యవసాయ క్షేత్రాల్ని తానే కొనివేసి, అటు తరావాత యిద్దరు రైతుల్ని అప్పటినుంచి పనివాళ్లగాను, సేవకులుగాను నియమించుకోవచ్చు ఆధునిక రాజకీయ ఆర్థిక శాస్త్రసూత్రాల ప్రకారం సంపాదించిన సంపద అలాగే వుంటుంది. కాని ఒక్క విషయం మాత్రం స్పష్టం. దేశ సంపద లేక ఆ ముగ్గురు వ్యక్తులు ఒక సమాజం అని అనుకుంటే వారి సామూహిక సంపద, న్యాయంగా సంపాదించిన వ్యాపారి యొక్క సంపదకంటే తక్కువగా వుంటుంది. రైతులిరువురి కార్యకలాపాలు కుంటుబడతాయి. వారికి అవసరమైన వస్తువులు సమయానికి అందనందున, వారు కనీసం జీవనం సాగించడమే కష్టమై యిక్కట్లు పడవలసి వచ్చి వారి ధైర్యం లోపించి నందున, వారి కృషి ఫలితాలు తగ్గుముకం పడతాయి. వ్యాపారి సేకరించిన వస్తువుల విలువ అతని దగ్గర నిజాయితీతో వున్న వాటితో సమానం కానేరదు, అతడు నిజాయితీగా వుంటే అతడి ఖజానాయే గాక, రైతుల ఖజానాలు కూడా నిండి వుంటాయి.

ఇక్కడ గమనించవలసిన విషయం ఒకటి వున్నది. జాతీయ సంపదను, దానివల్ల కలిగే లాభాలను గౌవరించడమేగాక, అవి న్యాయం చుట్టూ స్థిరపడివుంటాయని గుర్తించాలి. సంపాదించిన మొత్తం దాన్ని సూచించే రేఖాగణితంపై ఎలా ఆధారపడివుంటుందో, అలాగే సంపాదన యొక్క నిజమైన విలువ- దానితో ముడిపడి యుండే నైతిక విధానంపై ఆధారపడివుంటుంది.

వ్యాపార సంపాదనలో ఆర్జించిన[1] సంపద ఒక వైపున లాభసాటి పరిశ్రమల్ని, పురోగమన శక్తుల్ని, ఉత్పత్తి పద్ధతుల్ని సూచించినా, మరో వైపున

అది భౌతిక భోగవస్తువుల్ని, దయలేని నిరంకుశత్వాన్ని, వినాశనకరమైన తప్పుడు మార్గాల్ని సూచిస్తుంది. ఇది సంపదయొక్క లక్షణం. ధనవంతుడు కావాలనుకుంటే వాటిని త్యజించవచ్చు అవి సంపదయొక్క భౌతిక లక్షణాలు. అవి డబ్బు యొక్క విలువలను, ప్రాముఖ్యతను హెచ్చిస్తూ తగ్గిస్తూ వుంటాయి. ఒక మొత్తం డబ్బుతో మరోమొత్తాన్ని సృష్టించవచ్చు. అయితే అట్టి చర్య పదిరెట్లు హెచ్చువినాశనానికి హేతువు అవుతుంది. తప్పుడు పనులు చేస్తూ, నైతిక ఆధారాలు లేక పోయినా ధనసముపార్జనకు సూచనలు చేయవచ్చు అని చెప్పే ముసుగు మనుష్యుల మాటలకు విలువ వుండదు. వాళ్ల మాటలు నిర్లక్ష్యానికి గురి అవుతాయి. ఆధునిక వ్యాపారదృక్పథం ప్రకారం "ధరసరసంగా వుంటే విపణి వీధిని కొను ధర అధికంగా వున్నచోట అమ్ము" అను సూత్రం ప్రచారంలో వున్నది. ఇది అవమానకరమైన సూత్రం. మానవుని చరిత్రలో యిటువంటిది మరొకటి కానరాదు. ఇప్పుడు వున్న ఆర్థిక పరిస్థితుల్లో యీసూత్రమే అమలులో వున్నది. ధర సరసంగా వున్న దుకాణంలో కొను అనుసూత్రాన్ని చూద్దాం. అసలు దుకాణంలో ధర ఎందుకు సరసమైంది? ఇల్లు కాలిపోయిందనుకోండి. తరువాత ఆ ఇంటి వాసాల బొగ్గు సరసధరకు లభ్యమవుతుంది. భూకంపం వచ్చాక వీధిలో ఇటుకలు సరసధరకు లభించవచ్చు. అంతమాత్రాన అగ్నిప్రమాదం, భూకంపం దేశానికి లాభదాయకం అవుతాయా? ధర ఎక్కువగా వున్న చోట అమ్ము అనునది మరో సూత్రం నీ రొట్టెల్ని నీవు యీనాడు మంచి ధరకు అమ్మావు. అయితే నీవు రొట్టెల్ని అమ్మిందెవరికో గమనించావా? చనిపోతూ తన దగ్గర వున్న ఆఖరి నాణెం యిచ్చి రొట్టె కొని, కన్నుమూసి, యిక ఎన్నడూ రొట్టె కొనని వాడికా? నీ సొమ్మంతా దాచుకున్న బ్యాంకును దోచుకోబోతున్న సైనికుడికా?

పై విషయాలేమీ నీకు తెలియవు. ఒకే ఒక్క విషయం నీకుతెలుసు. నీవు చేసిన వ్యాపారం నమ్మకమైనదేనా? న్యాయమైనదేనా? ఈ విషయాన్ని గురించే నీవు యోచించాలి. అలా చేయడంవల్ల యీ ప్రపంచంలో దోపిడీలకు. చావులకు దారితీయని పరిస్థితిని తెచ్చుటకు నీవు నీ పాత్రను సక్రమంగా పోషించినవాడవవుతావు

సంపదయొక్క విలువ యితరులపై అధికారం కలిగివుండటమే అని అంటున్నారు ఆ అధికారమే లేకపోతే వస్తుసంపద అంతా నిష్ప్రయోజనం అని అంటున్నారు. అట్టి శక్తి వుంటే మిగిలిన వస్తుసంపద అనవసరం అని అంటున్నారు. అయితే యితరులపై అధికారం కేవలం డబ్బువల్లనే కాక, ఇతరత్రా కూడా సంపాదించవచ్చు.

నిజానికి నైతిక శక్తి మీదే సంపదయొక్క వాస్తవిక విలువ ఆధారపడి వుంటుంది అది అధిక విలువకలిగి చలామణీలో వున్న నాణాలవంటిది. ఒక మనిషి చేతిలో కంటికి కనిపించని బంగారం వుంటుంది దాన్ని కదిపితే చాలు, ఎదురుగా వున్న జన బాహుళ్యంపై ఎక్కువ ప్రభావం పడుతుంది. దూరం ఆలోచిస్తే సంపద యొక్క అసలు శక్తి లేక సాధన యితరులపై అధికారం కలిగి యుండటమే గాక, సంపద ఆ శక్తిని కోల్పోయినప్పుడు అది సంపదయే కాదని తేలుతున్నది. ఇంగ్లాండులో జరిగింది యిదే. రానురాను అక్కడ యితర మనుష్యులపై ఆధిపత్యం సంపూర్ణమైనదిగా కనిపించలేదు.

సంపదయొక్క సారం మనుష్యులపై ఆధిపత్యం చలాయించడమే కదా! అట్టి స్థితిలో ఆ శక్తి లేక ఆధిపత్యం ఉత్తమమైనదై, ఎక్కువమందిపై నిలిచి యుంటే అది ఎక్కువ సంపదకాదా? దూరం ఆలోచిస్తే అసలు ప్రజలే సంపదగా కనబడవచ్చు. బంగారం, వెండి సంపద కాకపోవచ్చు. సంపదయొక్క రక్త నాళాలు ప్రజలే. రక్తనాళాలు రాళ్లలో వుండవు మనుష్యుల శరీరాల్లో వుంటాయి. అట్టి సంపదను దేనికోసం వెచ్చించాలి అని అడిగితే ఆరోగ్యవంతులైన, వెలుగుతో నిండిన కన్నులుగల ఆహ్లాదంతో నించిన హృదయాలుగల మనుష్యుల్ని తయారుచేయడానికే వెచ్చించాలి అని స్పష్టంగా చెప్పకతప్పదు.

ఇంగ్లాండును చూడండి. ఇంతవరకు కలలుగనని ఏదో క్షణంలో ఇంగ్లాండు తన బానిసల తలపాగాలపై గోల్కొండ వజ్రాలు అలంకరించి తద్వారా తన సంపదను ప్రదర్శించకుండా, ఒక క్రైస్తవమాతగా వెలుగొందాలని నా అభిప్రాయం క్రైస్తవేతరుల గుణగణాల్ని సంపదగా స్వీకరించి యిక

మీదటనైనా బిడ్డలందరినీ నాయనలారా అని పిలిచి మీరే నా ఆభరణాలు నా వైభవానికి చిహ్నాలు అని ఎలుగెత్తి పలికి తన బిడ్డల్ని ముందుకు నడిపించాలని నేను భావిస్తున్నాను.

★ ★ ★

## వ్యాసం - 3

# సమంగా అందించవలసిన న్యాయం

క్రీస్తు శకానికి కొన్ని శతాబ్దాలకు పూర్వం ఒక జ్యావర్తకుడు అందరికంటే ఎక్కువగా ధనాన్ని సంపదల్ని ఆర్జించాడు. ప్రజలు అతడి నిజాయితీని చూచి అతణ్ణి అమితంగా ఆదరించేవారు అతడు తన లెక్కల పుస్తకాల్లో యీనాటికీ భద్రపరచ తగినకొన్ని మూలసిద్ధాంతాల్ని వ్రాసిపెట్టి చనిపొయాడు. ఆ సిద్ధాంతాల్ని మెజీషియన్లు ఎంతో గౌరవించేవారు. వృద్ధుడగు ఆ జ్యా విగ్రహం అతని ప్రధానభవనంలో ఒక మూల ప్రతిష్ఠించారు. సంవత్సరాలు గడిచిన కొద్దీ ఆ సిద్ధాంతాలు ఆధునిక వ్యాపార సిద్ధాంతాలకు విరుద్ధంగా వుండటం వల్ల అనాదరణకు గురి అయ్యాయి ఉదాహరణకు అతడు వ్రాసిన ఒక సిద్ధాంతం "అబద్ధాలుచెప్పి ఆర్జించిన డబ్బు చావును కోరుకునేవారి మాటలకు, అహంకారానికి సూచకం" అని వుంది " అలాగే అతడు వ్రాసిన మరో సిద్ధాంతం ప్రకారం "మూర్ఖంగా సంపాదించిన సంపద ఎవరికీ లాభించదు. అయితే సత్యం అనునది మృత్యువునుంచి విముక్తి కలిగిస్తుంది"

అతడు వ్రాసిన పై రెండు సిద్ధాంతాల్లోను మరణమే నిజమైన సమస్యగా పేర్కొనడం జరిగింది. యిది గమనార్హం. అన్యాయంగా సంపాదించిన సంపద మరణానికి మూలమని స్పష్టంగా చెప్పాడు. అతడు "అబద్ధాలు చెప్పే నాలుక" అని అనకుండా ఆధునిక వ్యాపారంలో సాగుతున్న- అబద్ధాలతో కూడిన చిరునామాల్ని నటనతో కూడిన ప్రచారాల్ని ఆయన వ్రాసిన మాటలతో మేళవించి చూస్తే ఆయన మాటలు సత్యాలని స్పష్టంగా తెలుతుంది. అలాగే కొందరు విజ్ఞుల మాటప్రకారం "తన సంపదను పెంచకోపడానిక పేదవారిని హింసించినవాడు తానూ తప్పక పేదవాడు అవుతాడు" అంతకంటె ఘాటుగా

అన్న విజ్ఞులమాట ప్రకారం పేదవాడు కావున అతణ్ణి దోచుకోకూడదు వ్యాపారంలో దెబ్బతిన్న వాళ్లను బాధింపకూడదు. ఇతరుల ఆత్మలను క్షోభపెడితే, ఆవిధంగా క్షోభపెట్టిన వారి ఆత్మల్ని భగవవంతుడు క్షోభపెడతాడు. పేదవాడు అశక్తుడు కనుక అతణ్ణి దోచుకోవడం వ్యాపారసరళిలో నిజంగా దొంగతనమే. అతడి అవసరాలను ఆసరాగా తీసుకొని అతడి శ్రమను, కృషిని, అతడి ఆస్తుల్ని చవవుకగా కొనాలని చూడటం దొంగతనమే గదా! సామాన్యంగా దోపిడి దొంగలు ధనవంతుల్ని దారికాచి దోపిడీ చేస్తారు. అయితే వర్తకులు పేదవారిని దోచుకుంటారు. యీక్రింది వాక్యాలను గమనిద్దాం.

"కలవారు లేనివారు కలిశారు

వారిద్దరిని సృష్టించింది పరమాత్ముడే

కలవారు లేనివారు కలిశారు వారిద్దరికి వెలుగు ప్రసాదించింది పరమాత్ముడే."

'వారిద్దరు కలిశారు' అని అంటే ప్రపంచమున్నంత కాలం చర్య ప్రతిచర్య, సంపద, పేదరికం అనునవి, నదీ జలాలు సముద్ర జలంలో కలియుట ఎలా న్యాయమో, అలాగే కొనసాగుతూ వుంటాయి. వాటిని సృష్టించింది పరమాత్ముడు. అట్టి పరమాత్ముని చర్య మృదువుగాను, న్యాయసమ్మతంగాను వుండవచ్చు లేక ఒడిదుడుకులతో కూడి వినాశకారి కావచ్చు. ముంచెత్తుకువచ్చే వరద కావచ్చు లేక గతి తప్పిన కడలితరంగం కావచ్చు. సంపన్నులు, పేదవారు యిద్దరూ పరమాత్ముడే తమ పాలిటి వెలుగు అని తెలుసుకోవడం వల్ల ఆ చర్యఏమిటో స్పష్టంఅవుతుంది. ప్రవహించే నీటి ప్రవాహం సంపదప్రవాహానికి ప్రతిరూపం. పల్లంగావున్న చోటుకు నీరు చేరుతుంది. అలాగే సంపదకూడా అవసరమున్న చోటుకి చేరాలి. అయితే నదుల ప్రవాహగతిని మానవుడు ముందు చూపుతో మార్చపచ్చు. అవసరమైన దిశకు ప్రవహింప చేయవచ్చు.

నదీ ప్రవాహం శాపమా లేక ఆశీర్వాదమా అన్నది మానవుని శ్రమపైన, అతడి పరిపాలనా పరిజ్ఞానం పైన ఆధారపడి వుంటుంది. ప్రపంచంలో అనేక శతాబ్దాల నుంచి సారవంతంగా వున్న భూములు, నదుల రూక్షత వల్ల

ఎడారులై నిస్సారమై పోయాయి. ఆ నదుల ప్రవాహాన్ని సరియైన మార్గానికి మళ్లించి యుంటే భూమి నిస్సారమై పోయి వుండేదికాదు, పొలాలు సారవంతం అయ్యేవి గాలి శుభ్రపడి ప్రజలకు మేలు చేసేది, జంతువులకు ఆహారం లభించేది ప్రజలందరి బాధ్యతా తాను వహించి యుండేది. కాని అలా జరుగక పోవడం వల్ల సారవంతమైన భూములు బంజరు భూములు అయిపోయాయి అక్కడి గాలి కాలుష్యమయం అయిపోయింది తత్ఫలితంగా అంటురోగాలు ప్రబలిపోయాయి. అయితే మానవుడు చేసే చట్టాలు, కూడబెట్టే సంపద నదీ ప్రవాహాన్ని సరిమైన దారికి మళ్లించ వచ్చు.

సంపద అనే ప్రవాహం బుద్ధిమంతుల సూచనలనను సరించి ముందుకు సాగితే ఎత్తుపల్లాలు చదును అవుతాయి. గుంటలు, లోయలు పూడిపోతాయి నదీ ప్రవాహం జీవన స్రవంతి అవుతుంది. అలాగాక దాన్ని నియమరహిత పద్ధతిలో ప్రవహించనిస్తే చివరకి ప్రమాదకరం అవుతుంది. ప్లేగుగా, మహమ్మారిగా మారవచ్చు. కాలుష్యాలకు నిలయం కావచ్చు

సాధారణంగా ఆర్థిక శాస్త్రవేత్త తమ శాస్త్రంలో సంపద యొక్క సక్రమపంపిణీ లేక అదుపు చేసే విధానాలను గురించి అంతగా పట్టించుకోడు. అయితే దాన్ని అతడు ధనవంతుడు అయ్యే విధానం లేక శాస్త్రం అని అంటాడు. ఆ దృష్టితో చూస్తే ధనవంతుడు కావడానికి అనేక పద్ధతులు, కళలు వున్నాయి. మధ్య యుగంలో గ్రామ, వ్యవసాయక్షేత్రాల్లో వుండే జనాన్ని విషంతో చంపుతూ వుండేవారు. అదికూడా ఒక పద్ధతిగా చేసేవారు యిప్పుడు కూడా ఆహారం కలుషితం చేయడం, ఆహారాన్ని కల్తీ చేయడం వంటి చర్యలు అక్కడక్కడా జరుగుతూ వుండటం మనం చూస్తున్నాం. యిట్టి చర్యలు మనిషి ధనవంతుడు కావాలంటే అనుసరించవలసిన పద్ధతుల రూపంలోను, కళా రూపంలోను అనేకం వున్నాయి.

అందువల్ల ఆర్థిక శాస్త్రవేత్త తన శాస్త్రంలో ధనవంతుడగుటకు అవలంభించవలసిన విధానాల స్వరూపంలో కొన్ని భావాల్ని జోడించడం అవసరం. న్యాయసమ్మతమైన లేక చట్టబద్ధమైన పద్ధతిలో ధనవంతుడగుటకు అనుకూలమైన శాస్త్రం నాది అని అతడు అంటే న్యాయసమ్మతమైన లేక

చట్టబద్ధమైన అనుపదాలు వుండవచ్చా అను ప్రశ్న బయలుదేరుతుంది. నిజానికి కార్యక్రమాలన్నీ చట్టబద్ధంగానే వుంటాయి. కాని అవి న్యాయ సమ్మతం కాక పోవచ్చు.

అందువల్ల న్యాయసమ్మతమైన అను పదాన్ని వుంచుదాము, ఆ నిర్వచనం ప్రకారం మనం ధనవంతులం కావాలంటే న్యాయసమ్మతంగా ధనవంతులం కావాలన్నమాట, న్యాయసమ్మతం అంటే ఏమిటి అను ప్రశ్న బయలు దేరుతుంది. చేపలకు, ఎలుకలకు, తోడేళ్లకు వాటి అవసరాన్ని బట్టి, వాటికి వున్న విధానాలను బట్టి జీవించే హక్కువుంది. కాని న్యాయసమ్మతమైన చట్టాల ప్రకారం నివసించే ప్రత్యేకత మానవజాతికే వున్నది.

**కార్మికులకు యిచ్చే వేతనాలకు సంబంధించిన చట్టాలను పరీక్షిద్దాం.**

డబ్బు యిచ్చే విషయంలో వెనుకటి వ్యాసంలో **తెలిపినట్లు** మనకోసం ఒక వ్యక్తి చేసిన పనికి అతడు ఆ రోజున మనకోసం వెచ్చించిన సమయానికి, చేసిన కృషికి బదులుగా, అతడు కోరినప్పుడు భవిష్యత్తులో, అంతసమయాన్ని, అంత కృషిని అతనికి అందజేయగలమని వాగ్దానం చేయవలసి వుంటుంది.

అతడు మనకు చేసిన కృషి కన్నా తక్కువ కృషి చేస్తామని వాగ్దానం చేస్తే అతడికి తక్కువ వేతనం యిచ్చినట్లవుతుంది. అతడికృషికన్నా మనం ఎక్కువ కృషి చేస్తామని వాగ్దానం చేస్తే అతడికి మనం ఎక్కువ వేతనం యిచ్చినట్లవుతుంది. ఉదాహరణకు ఇద్దరు వ్యక్తులు ఒకపని చేయడానికి సిద్ధంగా వున్నారనుకోండి. ఆ పని కోసం మనకు కావలసింది ఒక వ్యక్తి సేవలే. వారిద్దరికీ పోటీ పెడితే వేతనం నేను తక్కువ తీసుకుంటానంటే, నేను తక్కువ తీసుకుంటానని యిద్దరూ పోటీ పడతారు. అలా పోటీ పడిన వాడికి తక్కువ వేతనమే యివ్వవచ్చు, కాని పని చేయించుకునే వాళ్లు యిద్దరు వుండి, పని చేసేవాడు ఒక్కడే వుంటే ఏమవుతుంది? నేను ఎక్కువ వేతనం యిస్తానంటే నేను ఎక్కువ వేతనం యిస్తానని పనిచేయించుకునే వాడికోసం వాళ్లిద్దరూ పోటీ పడతారు. అప్పుడు పనివాడికి ఎక్కువ వేతనం

యివ్వవలసి వస్తుంది. కావున యీరెండు పద్ధతులు సరియైనవి కావు. న్యాయమైన, సరియైన వేతనాలిచ్చుటకు కేంద్రబిందువు పైన తెలిపిన రెండు అన్యాయమైన, బిందువుల మధ్య వుంటుందన్నమాట. విత్తనాల్ని బాగా విత్తి ఎరువువేస్తే అవి మంచి ఫలితాల నిస్తాయి అలాగే నియమబద్ధంగా చేసిన కృషిలేక శ్రమ మంచి ఫలితాల నిస్తుంది. చేయించుకున్న కృషిని తిరిగి కృషి ద్వారానే చెల్లించవలసి వస్తే అదనంగా కృషి చేసి వడ్డీకి వడ్డీ చెల్లించవలసి వస్తుందన్నమాట. ఉదాహరణకు నాకోసం నీవు యివాళ ఒకగంటసేపు కృషి చేశావు అని అనుకుందాం. దానికి బదులుగా నేను నీకోసం, నీవు కోరినప్పుడు ఒక గంటా అయిదు నిమిషాలసేపు కృషి చేయాలన్నమాట. నీవు నాకు యివాళ 15 పౌన్లబరువు గల రొట్టెనిస్తే, నీవుకోరినప్పుడు నేను నీకు 17 పౌన్ల బరువుగల రొట్టె యివ్వాలన్నమాట. యిలాంటి ఉదాహరణలు చాలా యివ్వవచ్చు.

ఇద్దరు వ్యక్తులు పనిచేయడానికి సిద్ధంగా వున్నారని అనుకుందాం. వారిద్దరిలో ఒకరికి నేను సగం జీతానికి పనియిచ్చానని అనుకుందాం. అప్పుడు రెండో వాడు పనిలేకుండా నిరుద్యోగిగా పూర్తి ఆకలితో వుండిపోతాడు. నేను ఉద్యోగం యిస్తాను. యిచ్చిన వ్యక్తి కూడా తక్కువ జీతం గనుక అర్ధాకలితో వుండిపోతాడు. నేను ఉద్యోగం యిచ్చిన వాడికి పూర్తి జీతం యిస్తే అతడు అర్ధాకలితో వుండనవసరం లేదు, అప్పుడు నేను నా డబ్బును సద్వినియోగం చేసినవాడనవుతాను నా మనిషికి నేను పూర్తి వేతనం యిస్తే నేను డబ్బు వృధా చేసినట్లుకాదు, భోగవిలాసాలలో మునిగితేలినట్లుకాదు, ప్రపంచంలో పేదరికాన్ని పెంచినట్లుకాదు. అనవసరంగా సంపదను సముపార్జించినట్లుకాదు. నా దగ్గర పూర్తి వేతనం అందుకున్న పనివాడు, తన క్రిందపని చేసేవారి పట్ల న్యాయంగా ప్రవర్తిస్తాడు. కనుక న్యాయజలధార ఎండిపోదు. మరింత పుష్టి పొంది ముందుకు సాగుతుంది అలాంటి న్యాయ బుద్ధిగల దేశం సుభిక్షంగాను, సంతోషంగాను వుంటుంది. సకల సంపదలతోను నిండి వుంటుంది.

కనుక పోటీ తత్వం దేశానికి మంచిది అని పలికే. ఆర్థిక శాస్త్రవేత్తల

అభిప్రాయం తప్పు అని తెలుతుంది. పోటీ అన్నది, ఉత్పత్తిదారుడు, తన కార్మికుల సేవతో తక్కువ ఖర్చుతో అన్యాయంగా పొందడానికి వీలు కల్పిస్తుంది. తత్ఫలితంగా ధనవంతులు మరింతగా ధనవంతులవుతారు పేదవారు మరింత పేదవారవుతారు దీర్ఘకాలం యిలా సాగితే దేశం నాశనం కాక తప్పదు. కావున కార్మికుడు తన శక్తిననుసరించి న్యాయమైన వేతనం పొందాలి. ఎంత చేసినా ఏదో విధమైన పోటీ వుంటూనే వుంటుంది. అయినా ప్రజలు మాత్రం సంతోషంగా వుంటారు. నైపుణ్యం పెరుగుతుంది. అప్పుడు ఒకరికంటే తక్కువ వేతనం తీసుకొని పని చేస్తామని జనం పోటీ పడరు. ఉద్యోగ సంపాధన కోసం, క్రొత్త నైపుణ్యం కోసం కృషి చేస్తారు. ప్రభుత్వ ఉద్యోగులలో వుండే ప్రత్యేక ఆకర్షణయిదే. ఉద్యోగి యొక్క స్థాయినను సరించి జీతాలు నిర్ధారించబడతాయి. ఏ అభ్యర్థీ తక్కువ జీతానికి పని చేస్తానని ముందుకు రాడు అయితే తనతో పోటీ చేసే యితరుల కంటే తాను మెరుగైన శక్తి కలవాడినని నిరూపించాలని భావిస్తాడు. సైన్యంలోను, నావికుల్లోను లంచగొండితనం వుండదు, కనుక అక్కడ యిలాంటి పరిస్థితి వుంటుంది. కాని వ్యాపారంలో యిట్టి పరిస్థితి వుండదు. ఉత్పత్తిలో అణగద్రొక్కే పోటీ వుంటుంది. తత్ఫలితంగా కపటం, మోసం, దొంగతనం విజృంభిస్తాయి. నాసిరకం వస్తువులు ఉత్పత్తి అవుతాయి. ఉత్పత్తి దారుడు, కార్మికుడు, వినియోగదారుడు ముగ్గురూ తమ తమ శ్రేయస్సునే చూసుకుంటారు. అందువల్ల మనుష్యులు కలిసి మెలిసి వుండలేరు. కార్మికులు ఆకలితో సమ్మెలకు పూనుకుంటారు. ఉత్పత్తి ధారులు దొంగలవుతారు. వినియోగదారులు నైతిక ప్రవర్తనను మరిచిపోతారు. ఒక అన్యాయం మరో అన్యాయానికి దారి తీస్తుంది. చివరకు ఉత్పత్తి దారుడు, కార్మికుడు, వినియోగదారుడు అందరూ వినాశం వైపు పయనిస్తారు. వారి సంపదయే వారికి శాపంగా మారుతుంది. సాధారణ అర్థిక శాస్త్ర సిద్ధాంతాల్ని హేతుబద్ధమైన శాస్త్రాలుగా అంగీకరించడం సరియైన పని కాదు. మనిషి మేధస్సుకు అంతకంటే అవమానకరమైన విషయం మరొకటి లేదు. మతం భోధించే మొదటి సూత్రం పట్లకూడా అవిధేయుత ప్రకటించినట్లే అవుతుంది.

దైవ సూక్తుల్ని అనేక బోధల్ని మనం గౌరవిస్తాం. పలు చెడగులకు ధనాపేక్షయే కారణమని ప్రకటించడమే గాక అట్టి కాంక్షను గర్హిస్తాయి ధనాపేక్ష గలవాడు దేవుణ్ణి చూచి భయపడతాడు కాని ధనదేవత యొక్క సేవయే ఘనమైనదని భావిస్తాడు. దేవుని ఆరాధన పట్ల ఉపేక్షా భావం ప్రదర్శిస్తాడు. అయితే దేవుని సూక్తులు అనుబడే రచనలు సంపదను గురించి, పేదరికాన్ని గురించి మాట్లాడుతున్నప్పుడు సంపద దుఃఖాలకు హేతువని, పేదరికం దైవానుగ్రహానికి ప్రతీకయని పేర్కొంటాయి

నిజమైన ఆర్థిక శాస్త్రం, నిజమైన న్యాయ శాస్త్రం అనుసరణీయం అని భావించి, నిజాయితీగా రుజువర్తనతో ప్రజలు వున్నంత వరకు సంతోషంగా వుంటారు మిగతా మార్గాలన్నీ వ్యర్థమైనవే. వినాశానికి దారిచూపించేవే. ఏదో విధంగా ధనవంతులు కావాలి అని ప్రజలకు బోధించడం వల్ల వారికి అపకారం జరుగుతుంది.

★ ★ ★

## వ్యాసం - 4

# మూలధనంపై పన్ను

మనం వెనుకటి వ్యాసాల్లో రాజకీయ ఆర్థిక శాస్త్ర విధానాలు దేనిపై ఆధారపడి వున్నాయో, అవి తప్పుడు భావాల్ని ఎలా సూచిస్తున్నాయో తెలుసుకున్నాము. ఆ సూత్రాల్ని అమలు చేస్తే వ్యక్తిని దేశాన్ని దుఃఖపూరితం చేస్తాయి. అవి ధనవంతుణ్ణి ఎక్కువ ధనవంతుణ్ణి గాను, పేదవాణ్ణి ఎక్కువ పేదవాణ్ణిగాను చేస్తాయి. వాటిని అమలు పరిస్తే ఎవ్వరూ ఎక్కువగా సంతోషపడేందుకు వీలు పడదు.

ఆర్థిక శాస్త్రం మనుష్యుల మానసిక ప్రవర్తన లెక్కకు తీసుకోదు. సంపద చేకూరాలంటే అందుకు ధన సముపార్జన ముఖ్యం అని అంటుంది. దేశాల సంతోషం ఆదేశాల సంపద మీద ఆధారపడి వుంటుంది. ఎన్ని ఎక్కువ కర్మాగారాలుంటే ఆ దేశానికి అంత ఎక్కువ సంతోషం లభిస్తుందని భావిస్తారు. అందువల్ల ప్రజలు తమ గ్రామవ్యవసాయక్షేత్రుల్ని, చల్లని గాలిని.

పచ్చని వాతావరణాన్ని వదిలి పట్టణాలకు ఎగబడతారు. అక్కడ ధ్వని వాయుకాలుష్యం మధ్య విషవాయువుల్ని పీలుస్తూ తరిగిపోయిన జీవితాలు జీవిస్తారు. పట్టణవాసం జాతి ఆరోగ్యాన్ని దెబ్బ తీస్తుంది. అవినీతిపై అత్యాశను పెంచుతుంది.

ఈ చెడును తొలగించడం అవసరమని, అందుకు చర్యలు తీసుకోవడం అవసరమని ఎవరైనా అంటే, విజ్ఞాన ధనులనబడే పెద్దలు, బీదజనానికి విద్య బోధించడం వల్ల ప్రయోజనం శూన్యం అని అంటారు యీ విషయాల్ని అలా వదిలి వేయడం మంచిది అని అంటారు. పేదవారి అవినీతికి కారణం ధనవంతులే అనుయదార్థాన్ని గుర్తించరు. యీ పేదలు ధనవంతుల భోగావసరాల్ని తీర్చుటకు బానిసలై పని చేస్తారని, తమ బాగుకోసం పనిచేయుటకు వారికి ఒక్క నిమిషమైనా సమయం చిక్కదను విషయం గమనించరు. ధనవంతుల్ని చూస్తే పేదవారికి ఈర్ష్య కలుగుతుంది. తాము కూడా వాళ్లలాగే ధనవంతులు కావాలని కాంక్షిస్తారు.

వారి ప్రయత్నం సఫలం కాకపోతే కోపంతో మండిపోతారు. అప్పుడు వాళ్లు తమ విచక్షణా జ్ఞానం కోల్పోతారు. తప్పుడు దారిని నడిచో, బలవంతంగానో ఏదో రకంగా డబ్బు సంపాదించాలని చూస్తారు సంపద, శ్రమ రెండు ఫలించక, తప్పుడు పనులకు దారి ఏర్పడుతుంది.

శ్రమ లేక కృషి అంటే ఉపయోగకరమైన వస్తువులు తయారు చేసేది అని అనాలి. ఉపయోగకరమైన వస్తువులు అంటే మనిషి జీవితానికి ఉపయోగపడేవన్నమాట, ఉదాహరణకు ఆహారం, దుస్తులు, నివాసగృహాలు, యివి మూడు అవసరం కదా! మానవులు తమ జీవిత విధుల్ని సక్రమంగా నిర్వహించేందుకు యీ మూడు సహాయపడతాయి. ఇతరుల జీవితాల్ని కూడా ప్రభావితం చేస్తాయి. అవి ఉపయోగకరమైన వస్తువులు అయితే ధనవంతుడు పెద్ద పెద్ద కర్మాగారాల్ని స్థాపించుతారు. చాలా మంది సంపదను గడిస్తారు. అయితే దాన్ని, కొద్ది మందిమాత్రమే సద్వినియోగం చేస్తారు. దేశ వినాశనానికి ఉపయోగపడే సంపదవల్ల ఎలాంటి ప్రయోజనము వుండదు. యీనాటి యుగమందలి పెట్టుబడి దారులే దారుణమైన యుద్ధాలకు

బాధ్యులు. యుద్ధం అనేది ఇతరుల ధనంపై అత్యాశపెంచుకొనే వాళ్ల మనస్సునుంచి ఉత్పన్నమవుతుంది

ప్రపంచ పరిస్థితిని మెరుగుపరచడానికి అవసరమైన విజ్ఞానాన్ని యితర దేశాలనుంచి దిగుమతి చేసుకోవడం కుదరదని కొందరి అభిప్రాయం. అందువల్ల మనం మనకు మంచిదన్న పద్ధతిలో జీవిస్తూ ధనం సంపాదిద్దామని వారంటారు. అయితే యిది అవినీతి కరమైన దృక్పధం కావచ్చు. మంచి మనిషి నైతిక నియమాల్ని పాటిస్తాడు. అత్యాశకుపోడు. మానసిక క్రమశిక్షణ కలిగి వుంటాడు. తన పనుల ద్వారా యితరుల్ని ప్రభావితం చేస్తాడు. దేశమందలి పౌరులంతా అవినీతి పరులైతే దేశగతి అధోగతే. మనం మాత్రం మన యిష్టంవచ్చినట్లు వ్యవహరిస్తూ, మన పొరుగువారిని మాత్రం తప్పుచేసినందుకు నిలదీస్తే దాని ఫలితం మంచిగా ఎలా వుంటుంది? డబ్బు అనేది ఒక సాధన మాత్రమే.

అది దుఃఖానికి హేతువు కావచ్చు. లేక సంతోషదాయకమూ కావచ్చు. మంచి మనిషి చేతిలో పడి అది భూమిని సారవంతం చేసి పంటలు పండించడానికి ఉపయోగపడుతుంది. వ్యవసాయదారులు సంతృప్తితో పనిచేస్తారు. వారుండే దేశం సంతోషంగా వుంటుంది. ఒక చెడ్డ వాడి చేతిలోపడి డబ్బు తూటాలు తయారు చేసేందుకు ఉపయోగపడుతుంది. ఆ తూటాలు తయారుచేసిన వారికీ, వారికి వ్యతిరేకులనుకున్నవారికీ యిరువురికీ అపకారం చేస్తాయి. అందువల్ల మిగిలేది ఏమిటి అని అంటే జీవితమేననీ, ధనం కాదనీ చెప్పకతప్పదు. నిజానికి ధనిక దేశం ఏది అని అడిగితే, ఎక్కువ సంఖ్యలో సంతోషంగా వుండే ఉత్తమ పౌరులతో నిండిన దేశమని చెప్పక తప్పదు.

ధనవవంతుడు ఎవరు అని అడిగితే తన జీవిత విధుల్ని సక్రమంగా నియమ బద్ధంగా నిర్వహిస్తూ, తన సత్ప్రవర్తన ద్వారా, తన సంపదచే యితరుల జీవితాల్ని ప్రభావితం చేసిన వాడేనని చెప్పాలి.

ఇది ఆత్మ సుఖాల్ని, భోగవిలాసాల్ని కాంక్షించవలసిన తరుణంకాదు. ప్రతివ్యక్తి శక్తి కొద్దీ శ్రమించవలసిన సమయం, ఒక వ్యక్తి తన సమయాన్ని

సోమరితనంతో గడిపితే, మరోవ్యక్తి రెండింతలు పని చేయవలసి అవసరం కలుగుతుంది ఇంగ్లాండులో గల బీదవారి పరిస్థితియిదే. కొంతమంది పనికి రాని పనులు చేస్తూ వుంటారు. వజ్రాలు పగల గొట్టడం, యుద్ధాల్లో పని చేయడం, వంటి పనులన్నమాట ఇవి జాతీయ మూలధనాన్ని తగ్గించేపనులు పనిచేసేవారికి ఉపయోగపడవు. సామాన్యంగా పనివాళ్లు పనిచేస్తున్నట్లుగా వుంటేవారు సోమరులుగా వున్నట్లేలెక్క. ధనవంతులు తమ ధనంతో పేదవారిని అణచివేస్తారు యజమానులు, కార్మికులు కత్తులు దూసి ఎదురెదురుగా నిలబడతారు. మనుష్యులు జంతువుల స్థాయికి దిగజారుతారు.



## ముగింపు

పైన తెలిపిన విషయాలన్నిటిని పొందుపరచి రస్కిన్ రచించిన పుస్తకం ఆంగ్లేయుల్ని ఉద్దేశించి వ్రాసినదే అయినా అందు భారతీయులు కూడా నేర్చుకోవలసిన విషయాలు అనేకం వున్నాయి. భారతదేశంలో కూడా నూతన భావాలు గాలిలో విహరిస్తున్నాయి. పాశ్చాత్య విద్యనభ్యసించిన మన యువకులు ఉత్సాహంగా ఉన్నారు వారి ఉత్సాహం మంచి మార్గాలకు మళ్లించబడాలి. లేకపోతే అవి చెడు చేయవచ్చు. అందువల్ల ‘‘స్వరాజ్యం’ ’ అను పదాన్ని నినాదంగా తీసుకుందాం. అయితే దేశాన్ని పారిశ్రామికీకరణం చేయాలన్న మరో నినాదం కూడా వున్నది.

స్వరాజ్యం అంటే ఏమిటో, అది ఎలా వుండాలో మనకు పూర్తిగా అవగాహన కాలేదు. నేటాల్ స్వరాజ్యం కలిగియున్నదేశం. అయితే స్వరాజ్యం మన ముక్కులు భరించలేనంత దుర్గంధాన్ని వెదజల్లుతూ వున్నది. ఆ స్వరాజ్యం నీగ్రోలను పిండి పిప్పి చేస్తున్నది. భారతీయుల్ని కూడా అణిచివేస్తున్నది. ఏదో ఒక కారణంతో నీగ్రోలు, భారతీయులు, నేటాలును వదిలివెళ్లిన తెల్లవాళ్లు పరస్పరం పోరాడుకొని తమ సర్వనాశనం తామే కొని తెచ్చుకుంటున్నారు.

నేటాల్ వలె లేకపోయినా, జనరల్ స్మట్స్ నాయకత్వం వహిస్తున్నా

ట్రాన్సువాల్ యందలి స్వరాజ్యాన్ని చూద్దాం. జనరల్ స్మట్స్ చెప్పేది ఒకటి, చేసేది మరొకటి. అతడు ఆంగ్లేయులైన పోలీసు వారిని పెద్ద సంఖ్యలో తొలగించి, వా. స్థా..లో ఆఫ్రికన్లను నియమించాడు. యీ చర్య ఏజాతి వారికీ ఉపయోగపడదని నా అభిప్రాయం. దోపిడీ చేయడానికి బయటి దేశస్థులే అక్కర్లేదు స్వార్థపరులు తమ దేశం వారిని తామే దోపిడీ చేయగలరు.

అందువల్ల 'స్వరాజ్యం' అను పదం మాత్రమే ప్రజల్ని సంతోషపెట్టలేదు. ఒక దోపిడీ మురాకు స్వరాజ్యం యిస్తే ఫలితం ఏమవుతుంది? దోపిడీ చేయని ఒక మంచి వ్యక్తికి స్వరాజ్యాన్ని అప్పగించినా ప్రజలు సంతోషిస్తారు. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు చాలా శక్తివంతమైన దేశాలు, కాని ఆ దేశాలు నిజానికి సంతోషంగా వున్నాయని అనడానికి వీలు లేదు

స్వరాజ్యం అంటే ఆత్మ నిగ్రహం, నైతిక నియమాలను పాటించే రాజ్యం అన్నమాట. అట్టి రాజ్యంలో వుండే పౌరులు యితరులను మోసగించరు. సత్యాన్ని వదలరు. తల్లిదండ్రులు, భార్య బిడ్డలు, సేవకులు, యిరుగుపొరుగువారు మొదలైన వారియెడ తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తారు. ఎక్కడ నివసించినా అట్టివారు స్వరాజ్యాన్ని అనుభవిస్తారు. అటువంటి పౌరులు అధిక సంఖ్యలో వుంటే ఆ రాజ్యం లేక ఆ దేశం గర్వంగా స్వరాజ్యం అనుభవిస్తున్నానని చెప్పగలుగుతుంది.

ఒక మనిషి మరో మనిషిమీద పెత్తనం చేయడం సరియైన పద్ధతి కాదు. ఇండియాలో ఆంగ్లేయుల పరిపాలన సవ్యంగా లేదు కనుక వాళ్లు దేశాన్ని వదిలి వెళ్లిపోతే అంతా బాగుపడుతుందని అనుకోవడం కూడా సరికాదు.

మన అజ్ఞానం, అవినీతి, అనైక్యతల వల్లనే బ్రిటిష్‌వారి పరిపాలన మనదేశంలో సాగుతున్నది. ఈ లోపాల్ని తొలగించుకుంటే, ఒక్క తుపాకీ గుండునైనా పేల్చకుండా బ్రిటిష్ వాళ్లు మన దేశాన్ని వదిలివెళ్లిపోతారు. మనం నిజమైన స్వరాజ్యాన్ని అనుభవించగలుగుతాము.

కొద్ది మంది తెలివితక్కువ జనం తెల్ల వాళ్లమీద బాంబులు విసిరి ఆనందపడతారు. అలా చేయడం వల్ల మనదేశంలో వుంటున్న బ్రిటిష్ వాళ్లు

చనిపోతే, వాళ్లను చంపిన వాళ్లే భారతీయ పరిపాలకులవుతారు. పరిపాలనలో మాత్రమే మార్పు వస్తుందికాని ప్రవృత్తిలో మాత్రం మార్పురాదు. ఇప్పుడు బ్రిటిష్ వారిపై విసిరిన బాంబులు, వారు యికలేరని తెలినప్పుడు భారతీయుల పైనే విసరబడతాయి. యీ సత్యాన్ని ప్రజలు గ్రహించాలి.

ఫ్రెంచి రిపబ్లిక్ అధ్యక్షుణ్ణి చంపింది ఎవరు? ఫ్రెంచ్ వాళ్లేగదా? ప్రెసిండెంట్ క్లీన్‌లాండ్‌ను చంపింది ఎవరు? అమెరికా వాళ్లే గదా! అందువల్ల మనం పాశ్చాత్యుల్ని అనుకరించకూడదు.

ఆంగ్లేయుల్ని చంపడం ద్వారా స్వరాజ్యం రాకపోతే, పెద్ద పెద్ద కర్మాగారాల్ని స్థాపించినంతమాత్రాన స్వరాజ్యం వస్తుందా? రాదు బంగారం, వెండి నిల్వచేస్తే స్వరాజ్యం వస్తుందా?రాదు. రస్కిన్ యీ విషయాన్ని స్పష్టంగా చెప్పాడు. రుజూ చేశాడు. పాశ్చాత్య నాగరికత ఒక్క బుల్లి పాపవంటిది. దాని వయస్సు వందలేక యాభై సంవత్సరాలు మాత్రమే. అది యూరప్‌ను దుర్గతి పాలుచేసింది. యూరప్‌కు పట్టిన గతి భారతదేశానికి పట్టరాదని మనం ప్రార్థిద్దాం. యూరప్ దేశాలు ఒకదాని మీద మరొకటి కత్తులు నూరుకుంటున్నాయి. అయితే మారణయుధాలు ప్రతిచోట కుప్పలు కుప్పలుగా పడి వున్నందువల్ల, అన్నీ మౌనం వహిస్తున్నాయి. ఏదో ఒకరోజున యీ ఆయుధాలు ప్రేలక తప్పదు. అప్పుడు యూరప్ అంతా నరక కూపం అవుతుంది. యూరప్ దేశాలు యిప్పుడు తెల్లవాళ్లు కాని వారిని, జాతుల్ని పీడించడం తమ న్యాయమైన హక్కుగా భావిస్తున్నాయి. కనుక పరిపాలనా దురాశతో నిండి యున్న మనుష్యుల వల్ల ఏదో మంచి జరుగుతుందని ఆశించడం సరికాదు. మాంసం ముక్కను చూచి కాకులు దానిమీద ఎలా విరుచుకుపడతాయో అలాగే క్రొత్త ప్రదేశాలపై యూరోపియన్లు విరుచుకుపడతారు. ఆ దేశాల్ని ఆక్రమిస్తారు. భారీ ఎత్తున వారు నిర్మిస్తున్న కర్మాగారాల వల్లనే యిలా జరుగుతున్నదని నాఅభిప్రాయం.

ఇండియా స్వరాజ్యం పొందాలి, అయితే న్యాయ సమ్మతమైన పద్ధతుల ద్వారానే ఆ పని జరగాలి. మనం పొందే స్వరాజ్యం నిజమైన స్వరాజ్యం

కావాలి. అది హింస ద్వారాగాని, పెద్ద పెద్ద పరిశ్రమల సమీకరణ ద్వారాగాని రాకూడదు. ఇండియా ఒకప్పుడు స్వర్గధామంగా వెలుగొందింది. అందుకు కారణం అప్పటి ప్రజల బంగారు హృదయాలే. నిజానికి భూప్రదేశమంతా అటువంటిదే. కాని యీనాడు అది ఎడారిగా మారింది. అందుకు కారణం ఏమిటి? మనందరం లంచడొండులంగా మారాము. నీతి నియమాల్ని నైతిక విలువల్ని మరిచిపోయాము. మన జాతి ప్రవర్తనా స్వరూపం ఇనుము ముద్దగా మారింది. యీ ఇనుము బంగారంగా మారితే మరో సారి మనదేశం బంగారు దేశంగా మారుతుంది. యీ మార్పు తీసుకురాగల సత్తా తత్వవేత్తల మాటల్లో 'సత్యం' అను రెండే రెండు అక్షరాలలో నిండి వుంది. ప్రతిభారతీయుడు అట్టి సత్యానికి కట్టుబడి వుంటే స్వరాజ్యం దానంతట అదే లభిస్తుంది.

# ఉపోద్ఘాతం

లార్డ్ లోథియన్ సేవాగ్రాం వచ్చినప్పుడు హింద్ స్వరాజ్య పుస్తకం ప్రతి అడిగారు. గాంధీజీ యిప్పుడు చెబుతున్న విషయాలన్నింటికి బీజం హింద్ స్వరాజ్యలో లభిస్తున్నది. గాంధీజీని సరిగ్గా అర్థం చేసుకోవాలంటే హింద్ స్వరాజ్యను చదవడం చాలా అవసరం'' అని లోథియన్ అన్నారు.

అదే సమయంలో శ్రీమతి సోఫియావాడియా హింద్ స్వరాజ్యను గురించి ఒక వ్యాసం వ్రాయడం ఆశ్చర్యకరం. ఆమె తన ఆ వ్యాసంలో హింద్ స్వరాజ్య అను పుస్తకాన్ని మన మంత్రులు, శాసనసభల సభ్యులు, పార్లమెంటు సభ్యులు, అహింసను సమర్థించే వ్యక్తులు, అధికారులు, ప్రజలు అంతా జాగ్రత్తగా చదవడం అవసరమని పదే పదే నొక్కి చెప్పారు ''అహింసావాదినని, అహింసను సమర్థించేవాడినని చెప్పుకునే వాడు తన యింట్లో నియంతగా ఎలా వ్యవహరిస్తాడో మద్యపానీయాలు అమ్ముకుని డబ్బు ఎలా సంపాదిస్తాడో ఆమె వివరించారు. అతడు వకీలు అయితే తన కక్షిదారుల్ని కోర్టుకు పొమ్మని ఎలా ప్రోత్సహిస్తాడో వ్రాసి, పలు రాజకీయ సమస్యలను గురించి క్షుణ్ణంగా విశ్లేషణ చేయడం అవసరమని కూడా ఆమె వ్రాశారు. హింద్ స్వరాజ్యలో యిట్టి విషయాలన్నింటి మీద క్లుప్తంగా విశ్లేషణ జరిగింది. అందువల్ల యీ పుస్తకాన్ని జనం జాగ్రత్తగా చదవడమేగాక, గాంధీజీ ఇందు పేర్కొన్న విషయాలపై ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడం అవసరమని ఆమె పేర్కొన్నారు.

శ్రీమతి వాడియా మంచి సమయంలో హింద్ స్వరాజ్యపై మంచి వ్యాసం ప్రచురించారు. 1909లో గాంధీజీ ఇంగ్లాండు నుంచి తిరిగి వస్తూ ఓడలో యీ పుస్తకం యందలి వ్యాసాలు వ్రాశారు. హింసాత్మక సాధనాలపై విశ్వాసం కలిగి యున్న కొంతమంది భారతీయ విప్లవ కారులతో మాట్లాడిన పిమ్మట యీ వ్యాసాలు గాంధీజీ గుజరాతీ భాషలో వ్రాశారు. ఇండియన్ ఒపీనియన్ అనుపత్రికలో ధారావాహికంగా యీ వ్యాసాలు ప్రచురించారు. తరువాత ఆ వ్యాసాలన్నింటిని కలిపి పుస్తక రూపంలో ప్రచురించారు. బొంబాయి

ప్రభుత్వం ఆ పుస్తకాన్ని నిషేధించింది. మిష్టర్ కెలెన్‌బెక్‌గారికోసం గాంధీజీ యీ గుజరాతీ పుస్తకాన్ని ఇంగ్లీషులోకి అనువదించారు. బొంబాయి ప్రభుత్వ చర్యకు సమాధానంగా ఇంగ్లీషు పుస్తకం ప్రచురించారు 1912లో గోఖ్లేగారు దక్షిణ ఆఫ్రికా వెళ్ళారు. అక్కడ వారు యీ పుస్తక ఆంగ్ల అనువాదం చూశారు. వారికి అందలి విషయాలు నచ్చలేదు. ఆ వ్యాసాలు ఊహాజనితాలని హడావుడిగా బుర్రలో తిరిగిన భావాల సమీకరణ యని గోఖ్లేగారు అభిప్రాయపడ్డారు. గాంధీజీ ఇండియాకు వచ్చి ఒక్క సంవత్సరం పాటు వుంటే, తానే యీ పుస్తకాన్ని నాశనం చేస్తారని కూడా భవిష్యవాణి చెప్పారు అయితే గోఖ్లేగారి ఆ భవిష్యవాణి సత్యం కాలేదు. 1921లో గాంధీజీ ఆ పుస్తకాన్ని గురించి, అందలి తన భావాలను గురించి క్రింద విధంగా వ్రాసి ప్రకటించారు. ఇది ద్వేష ధర్మానికి బదులు ప్రేమధర్మాన్ని నేర్పుతుంది హింసకు బదులు ఆత్మ బలిదానాన్ని సూచిస్తుంది. పశుబలాన్ని ఎదుర్కొనుటకు ఆత్మ బలాన్ని నిలుపుతుంది. యిందు ఒకే ఒక శబ్దాన్ని - అదికూడా ఒక మహిళా స్నేహితురాలి మాటప్రకారం- రద్దు చేశాను. అంతకు మించి ఏమీ మార్పు చేయలేదు. యీ పుస్తకంలో ఆధునిక సభ్యతను గురించి కఠినంగా వ్యాఖ్యలు వున్నాయి. అందు నేను పేర్కొన్న మాన్యతలు, ఆనాటి కంటే కూడా యిప్పుడు యింకా గట్టి పడ్డాయి. అయితే పాఠకులకు ఒక హెచ్చరిక చేస్తున్నాను. యీ పుస్తకంలో నేను ఏ స్వరాజ్యపు చిత్తరువును చిత్రించి నిలబెట్టానో, అటువంటి స్వరాజ్యాన్ని స్థాపించుటకు నేను ప్రయత్నిస్తున్నానని భావించవద్దు. భారతదేశం అందుకు యింకా సిద్ధంగా లేదని నాకు తెలుసు. యిలా అనడంలో కొంచెం కొంటె తనం చోటు చేసుకుంటే చేసుకోవచ్చు గాక, కాని నావిశ్వాసం యిదే. యీ పుస్తకంలో నేను చిత్రించిన స్వరాజ్యాన్ని సాధించుటకు వ్యక్తి గతంగా నా కృషి సాగుతూనే వున్నది. అయినా సందేహించనవసరంలేని ఒక్క విషయం యీనాడు నేను సామూహిక ప్రవృత్తితో చేస్తున్న కృషికి లక్ష్యం, భారత దేశ ప్రజల కోరిక ప్రకారం పార్లమెంటరీ విధానపు స్వరాజ్యం సాధించడమే."

1938లో కూడా గాంధీగారికి కొన్ని చోట్ల భాషను మార్చడమే దప్ప

విషయంలో మార్పు చేయాలని అనిపించలేదు. అందువల్ల యీ పుస్తకం ఏవిధమైన మార్పులు లేకుండా యధాతథంగా తిరిగి ప్రచురించబడుతూ వున్నది.

ఇందు సూచించబడిన స్వరాజ్యాన్ని సాధించుటకు భారతదేశం తయారుగా వున్నా, లేకపోయినా యీ దేశప్రజలు యీ పుస్తకాన్ని తప్పక చదవాలి. సత్యం, అహింసల్ని అంగీరిస్తే చివరికి లభించే ఫలితం యొక్క చిత్తరువు యిందు వున్నది. దీన్ని చదివి యీ సిద్ధాంతాల్ని అంగీకరించడమా లేక త్యజించడమా అన్న విషయం పాఠకులే నిర్ణయించుకోవాలి.

వార్ధా- 2-2-38 మహదేవ దేశాయి

# భూమిక

ఇది హింద్ స్వరాజ్య అను ఆంగ్ల పుస్తకం మలి ప్రచురణ.

'హింద్ స్వరాజ్య' ప్రత్యేక సంచికగా వెలువడిన ఆర్యన్‌పాథ్ మాస పత్రికను సమీక్షిస్తూ ఆంగ్లహరిజన్ పత్రిక యందు ఒక వ్యాసం ప్రకటించాను. ఆ వ్యాసానికి అనువాదమే యీ పీఠిక. గాంధీజీ వ్రాసిన హింద్ స్వరాజ్య తొలి ప్రచురణ యందలి భావాలలో, మలిప్రచురణ యందు ఎట్టి మార్పు జరుగలేదు. అయితే వికాసమే జరిగిందని చెప్పవచ్చు. ఆ వికాసాన్ని గురించి యీ పీఠిక యందు కొంత వివరించాను. నా యీ పీఠిక ద్వారా గాంధీజీ భావాలను స్పష్టంగా తెలుసుకొనుటకు మంచి అవకాశం లభిస్తుందని భావిస్తున్నాను.

వార్ధా-11-12-38. **మహదేవ దేశాయి**

# మహత్తరమైన ప్రచురణ

ఆర్యన్‌పాథ్ అను మాసపత్రిక యీ మధ్యనే హింద్ స్వరాజ్య ప్రత్యేక సంచికగా వెలువడింది. యీ విధంగా ప్రత్యేక సంచికను ప్రచురించాలని అనుకోవడం గొప్ప విశేషం. యీ ప్రత్యేక సంచిక ఎంతో చక్కగా వున్నది.

శ్రీమతి సోఫియావాడియా యొక్క భక్తి ప్రపత్తులతో కూడిన శ్రమకు యీ ప్రత్యేక సంచిక మంచి తార్కాణం.

ఆమె హింద్ స్వరాజ్య పుస్తక ప్రతులు విదేశాలలో గల తన పలువురు మిత్రులకు పంపి వారిలో కొందరిని తమ అభిప్రాయాలు వ్రాసి పంపమని కోరారు. స్వయంగా శ్రీమతి వాడియా యీ పుస్తకాన్ని గురించి తన అభిప్రాయాలు వ్యాసరూపంలో ప్రచురిస్తూ యీ పుస్తకంలో భారత దేశపు ఉజ్వల భవిష్యత్తును గురించిన ఆశలు చోటు చేసుకున్నాయని వ్రాశారు యూరప్‌కి చెందిన ప్రముఖులచేత యీ పుస్తకంలో గాంధీజీ ప్రకటించినట్లు, నాగరికత పేరట యూరప్‌లో సాగుతున్న పొరపాట్లను ఖండింప చేయాలని ఆమె భావించారు. అందుకే ఆమె యీ ప్రణాళికను చేపట్టారు. అందుకు ఎంతో మంచి ఫలితం చేకూరింది. యీ ప్రత్యేక సంచికలో మాష్టర్ సాండీకోల్, డిలాయిల్ బర్న్స్, మిడల్టన్‌మరీ, బేరేస్‌ఫర్డ్ హబ్యాఫసిట్, క్లాడ్‌హూటన్, జిరాల్డ్‌హర్డ్, కుమారి రాథ్‌బోన్ మొదలగు ప్రసిద్ధ రచయితల, రచయిత్రుల వ్యాసాలు ప్రచురించబడ్డాయి. వారిలో కొందరు శాంతివాదులుగాను, సమాజవాదులుగాను ప్రసిద్ధికెక్కినవారు వున్నారు. అయితే శాంతివాదాన్ని, సమాజవాదాన్ని వ్యతిరేకించే వారి వ్యాసాలు కూడా యీ సంచికలో ప్రచురించి యుంటే, యీ సంచిక స్థాయి ఎలా ఉండేదో గదా!

ఇందు ప్రచురించబడిన వ్యాసాలు కూడా క్రమ పద్ధతిలో వున్నాయి. ప్రారంభంలో విమర్శలు, అభిప్రాయభేదాలతో కూడిన వ్యాసాలు వున్నాయి. ఆ తరువాత చోటుచేసుకున్న వ్యాసాల్లో వాటికి సమాధానాలు వున్నాయి రచయితలందరూ రెండు మూడు వ్యాఖ్యలు చేశారు. వాటిని గురించి యోచిద్దాం. వాటి యందు కొన్ని అంగీకరించవలసిన విషయాలు వున్నాయి. మాష్టర్ సాన్డీ "ఈ మధ్యనే తాను ఇండియా వచ్చినట్లు, దేశపరిస్థితుల్ని పైపైన పరిశీలించి చూచినట్లు, హింద్ స్వరాజ్యలో పేర్కొన్న సిద్ధాంతాలకు ఇండియాలో సాఫల్యం లభించినట్లు తనకు అనిపించలేదని" తన వ్యాసంలో స్పష్టంగా వ్రాశారు. వారు వ్రాసిన యీ యధార్థాన్ని మాష్టర్ కోల్ కూడా తన వ్యాసంలో పేర్కొంటూ "వ్యక్తిపరంగా పరిశీలించి చూస్తే గాంధీజీ చెప్పినట్లు స్వరాజ్యం

చేరువకు సామాన్య మనిషి సాధ్యమైనంతవరకు చేరాడనే చెప్పవచ్చు. అయితే వ్యక్తికి వ్యక్తికి మధ్య గల వ్యత్యాసాన్ని గమనించి వ్యక్తి పరంగా ఒక విషయాన్ని అమల్లోకి తేవడం ఆ విషయాన్ని అమల్లోకి తెమ్మని యితరుల బుద్ధిని గమనించి చెప్పి, వారు అలా చేయునట్లు సహకరించడం సాధ్యమా అను ప్రశ్న బయలుదేరుతుంది. యితరులచేత చేయించవలసివస్తే అందుకోసం వారితో కలిసిమెలిసి వుండటం అవసరం. వారితో తాదాత్మ్యం పొందాలి. ఐక్యతను సాధించాలి. అందుకు ప్రతివ్యక్తి రెండు రూపాల్ని అలవరచుకోవాలి. (1) తనయదార్థ రూపం (2) ఇతరులతో తాదాత్మ్యత పొందిన రూపం అనగా వ్యక్తిత్వం. (ఈరెండు రూపాల్ని తాను పరీక్షించగలిగి యుండాలి. వాటిని తాను వ్యాఖ్యానించగలిగి యుండాలి. దాని మూల్యాన్ని నిర్ధారించగలిగి యుండాలి). యిట్టి రెండు నడతల్ని రూపాల్ని అనుసరించవలసి వస్తుందన్నమాట. గాంధీజీ ఆచరణకు సంబంధించిన తన సాధనను చివరి హద్దు వరకూ తీసుకువెళ్ళిన మాట నిజం. కాని రెండో రూపానికి సంబంధించిన వ్యవహారాన్ని, తన అంతరాత్మకు తృప్తికలిగే విధంగా పరిష్కరించలేకపోయారు'' అని స్పష్టంగా వివరించారు జాన్‌మిడిల్టన్ తన వ్యాసంలో "రాజకీయ వత్తిడికి సాధనంగా అహింసను ఉపయోగిస్తే, దాని శక్తి త్వరగా సమాప్తమైపోతుంది. కనుక అటువంటి అహింసను నిజమైన అహింసయని అనవచ్చా?'' అని సందేహం వెలిబుచ్చారు.

కాని యీ క్రియ అంతా క్రమంగా సాగే వికాసప్రక్రియ ఆ ప్రక్రియను సాధించుటకు ప్రయత్నం చేస్తూ మనిషి సాధన యొక్క సంపూర్ణతకోసం కూడా ప్రయత్నిస్తూ వుంటాడు. వందలాది ఏండ్లక్రితం బుద్ధుడు, ఏసుక్రీస్తు అహింస, ప్రేమ సిద్ధాంతాలను ఉపదేశించారు, అయితే యిన్ని వందల ఏండ్లలో కొద్ది మంది వ్యక్తులు మాత్రమే చిన్న చిన్న సీమితమైన సమస్యల కోసం వాటిని ప్రయోగించారు. గాంధీజీ విషయంలో మాత్రం అందరూ ఏకగ్రీవంగా అంగీకరించి ప్రకటించడం విశేషం, దాన్ని ఉటంకిస్తూ జిరాల్డ్ హర్డ్ తన వ్యాసంలో "గాంధీజీ చేస్తున్న ప్రయోగాల్ని ప్రపంచమంతా శ్రద్ధగా చూస్తున్నది. వారి ప్రయోగాల మహత్తు యుగయుగాలవరకు నిలిచి

యుంటుంది. గాంధీజీ జనసమూహాల్ని వెంట బెట్టుకొని జాతీయ స్థాయిలో దాన్ని ప్రయోగించుటకు కృషి చేయడమే అందుకు కారణం" అని పేర్కొన్నారు.

ఆ ప్రయోగాలయందలి యిబ్బందులేమిటో అందరికీ తెలుసు. అయినా వాటిని అధిగమించడం అసంభవంకాదని గాంధీజీ విశ్వాసం 1921లో యీ ప్రయోగం సఫలం కావడం అసంభవమని భారతదేశంలో తేలింది. అందువల్ల ఆ ప్రయోగాన్ని ఆపివేయడం జరిగింది. 1921లో అసంభవం అని అనిపించిన ఆ ప్రయోగం 1930లో సంభవం అని తేలింది. అసలు అహింసాత్మక సాధన అని అంటే ఏమిటి అని అనేకసార్లు ప్రశ్నించడం జరిగింది. యీ శబ్దానికి అందరికీ ఆమోదయోగ్యమైన అర్థం తెలుపుట దాని హద్దుల్ని నిర్ధారించుటకు, దాన్ని అమలు చేయుటకు పూర్వం ఎక్కువకాలం దాన్ని ప్రయోగించుట దానిని ఆచరణలో పెట్టుట ఎంతో అవసరం. అహింసను ఆచరణలో పెట్టుటకు అత్యవసరమైనది, వదులుటకు వీలులేనిది ప్రేమ. శుద్ధమైన నిస్వార్థప్రేమ. మానసికంగాను, శారీరికంగాను మచ్చలేని నిష్కలంకమైన నిర్మలత్వంతో కూడిన ప్రేమ. అది లేనియెడల అహింసను ఆచరణలో పెట్టుట సాధ్యంకాని పని అను విషయం పాశ్చాత్య ప్రముఖులు మరిచిపోతూ వుంటారు.

## యంత్రాలను గురించి, నాగరికతను గురించిన విమర్శ

హింద్ స్వరాజ్యం యొక్క ప్రశంసతో కూడిన విమర్శలయందు రచయితలంతా ఒక్క విషయం మాత్రం అంగీకరించలేదు. యంత్రాల్ని వ్యతిరేకిస్తూ గాంధీజీ వెల్లడించిన అభిప్రాయాలు అనుచితమైనవని, అహేతుకమైనవని వారందరూ భావించారు. మిడల్టన్ యీ విషయాన్ని విపులీకరిస్తూ "గాంధీజీ తన భావాల ఆవేశంలో, తాము అమితంగా ప్రేమిస్తున్న రాట్నం కూడా ఒక యంత్రమే అను విషయం మరిచి పోతున్నారనీ, రాట్నం ప్రకృతిద్వారా నిర్మితమైనది కాదనీ, మనిషి నిర్మించిన అప్రాకృతమైన కృత్రిమ వస్తువేనని, అందువల్ల గాంధీజీ సిద్ధాంతం ప్రకారం

అదికూడా రద్దు చేయవలసిన వస్తువేనని పేర్కొన్నారు. డిలాయిల్ బర్న్స్ యీ విషయాన్ని గురించి వ్రాస్తూ " పునాది యందే భావదోషం వున్నది. ఏవస్తువువల్లనైనా సరే చెడ్డ ఉపయోగం కలిగితే దాన్ని మాత్రమే నైతిక దృష్ట్యా హీనమైనదిగా భావించాలని సూచించారు. చరఖా కూడా ఒక యంత్రమే! ముక్కు మీద ధరించే కండ్ల జోడు కూడా కండ్ల రక్షణ కోసం ధరించిన యంత్రమే. నాగలి కూడా యంత్రమే, నీరు బైటికి తోడుటకు ప్రాచీనకాలాన్నుంచి వాడుతున్న పరికరాలు సైతం ఏండ్ల తరబడి మనష్యులు చేసిన ప్రయత్నాలకు ఫలితంగా తయారు చేయబడిన యంత్రాలే. ఏ యంత్రం వల్లనైనా చెడు జరిగే అవకాశం కూడా వుంటుంది. ఏ యంత్రంవల్లనైనా చెడు జరిగితే అది యంత్ర దోషం కాదని, యంత్రాన్ని ఉపయోగించే వ్యక్తి దోషమని గ్రహించాలి' ' అని పేర్కొన్నారు.

గాంధీజీ తన భావాల అవేశంలో యంత్రాలను గురించి ఊహాజనితమైన భాషను ఉపయోగించారని యివాళ ఆ పుస్తకాన్ని సరిజేయడానికి కూర్చుంటే ఆ భాషను వారే మార్చివేస్తారని కూడా విమర్శకులు వ్రాశారు. వారి విమర్శల్ని గాంధీజీ అంగీకరించి, తమ భాషను విషయాన్ని మార్చివేస్తారేమో చెప్పలేను కాని విమర్శకులు పేర్కొన్న యంత్రాల్ని ఉపయోగించడంలో గల నైతిక విశేషాలను మాత్రం గాంధీజీ యంత్రాల సుగుణాలుగా అంగీకరించలేరని చెప్పగలను. ఉదాహరణకు 1924లో వారు ప్రయోగించిన భాష, పైన తెలిపిన అభిప్రాయాన్ని జ్ఞాపకం చేస్తున్నది అదే సంవత్సరంలో ఢిల్లీ యందు గాంధీజీకి మరో సోదరునికి మధ్య జరిగిన సంభాషణను యీ సందర్భాన పరిశీలించడం అవసరమని భావించి యిక్కడ ఆ సంభాషణను ప్రచురిస్తున్నాను. "అయితే మీరు యంత్రాలన్నింటికి వ్యతిరేకమా అని తిన్నగా ప్రశ్నించారు. గాంధీజీ చిరునవ్వు నవ్వుతూ యంత్రాలన్నింటిని ఎలా వ్యతిరేకిస్తాను; యీ శరీరంకూడా ఒక సున్నితమైన యంత్రమని నాకు తెలియదా? చరఖా కూడా ఒక యంత్రమే కదా! పన్ను కుట్టు పుల్ల కూడా యంత్రమే కదా! నేను వ్యతిరేకిస్తున్నది యంత్రాల్ని కాదు, యంత్రాల విషయంలో ప్రదర్శింపబడుతున్న వేలం వెర్రిని మాత్రమే. శరీరశ్రమను

తగ్గిస్తాయి అని చెప్పే యంత్రాల వెంట జనం వేలం వెర్రిగా పరుగిడుతున్నారు. శ్రమతగ్గుతున్నమాట నిజమే కాని యిట్టి యంత్రాల కారణంగా లక్షలాది జనం భృతి పోగొట్టుకొని ఆకలితో అలమటిస్తూ రోడ్ల వెంటబడి తిరుగుతున్న విషయం మరిచిపోకూడదు. సమయం, శ్రమ రెండూ తక్కువగా ఉపయోగపడటం నాకూ యిష్టమే. కాని ఆ పని ఒక వర్గానికి మాత్రమే వర్తించకూడదు. మానవజాతి అంతటికీ వర్తించాలి. కొంతమంది వ్యక్తుల దగ్గర మాత్రమే సంపద చేరడం సరికాదు.

అందరి దగ్గరికి సంపద చేరాలని కోరుతున్నాను. యిప్పుడు కోట్లాది జనంయొక్క మెడలపై ఎక్కి కొద్ది మంది పెత్తనం చలాయిస్తున్నారు. అందుకు యంత్రాలు ఉపయోగపడుతున్నాయి. యంత్రాల ప్రయోగాన్ని ప్రేరేపిస్తున్నది శ్రమను తగ్గించాలనే కోరిక కాదు, ధనం గడించాలనే లోభం మాత్రమే యీనాడు అమలులో వున్న ఆర్థిక వ్యవస్థకు వ్యతిరేకంగా నా శక్తి నంతటిని వినియోగించి యుద్ధం సాగిస్తున్నాను.

ప్రశ్న : మీకు యంత్రాలతో వివాదం లేదు. అయితే యీనాటి యంత్రాల చెడు ఉపయోగాన్ని మాత్రమే మీరు వ్యతిరేకిస్తున్నారు. అంతే కదూ! గాంధీజీ-కొంచెమైనా సంకోచించకుండా అవును అని సమాధానం యిస్తున్నాను. నేను మరొక విషయం కూడా దీనితో చేర్చాలని భావిస్తున్నాను. యంత్రాల అన్వేషణ, సైన్సు యివి లోభప్రవృత్తికి సాధనాలు కాకూడదు. అప్పుడు కార్మికుల చేత శక్తికి మించి ఎక్కువగా పనిచేయించడం జరగదు. అప్పుడు యంత్రాలు అడ్డంకులు కాజాలవు. సహాయ కారులవుతాయి. యంత్రాలనన్నింటిని నాశనం చేయమని నా ఉద్దేశ్యం కాదు. వాటి హద్దును నిర్ధారించడమే నాలక్ష్యం.

ప్రశ్న : మీ యీ అభిప్రాయం ప్రకారం పెద్దపెద్ద పేచీ కోరు యంత్రాలనన్నింటిని త్యజించాలి. అంతే కదూ! గాంధీజీ అవును అట్టివాటిని త్యజించివలసి వచ్చినా సరే తప్పదు. కాని ఒక్క విషయాన్ని స్పష్టం చేయతలుస్తున్నాను. మనం ఏం చేసినా దానికి ప్రధాన ఆధారం మనిషికి మేలు చేయడం కావాలి. పనిలేనందున మనిషి అవయవాలు జడమై, పనికి

రాకుండా పోతాయి. యంత్రాలు వుండకూడదు. యంత్రాల్ని మనం పరీక్షించి చూడాలి. ఉదాహరణకు కుట్టుమిషనుకు నేను సుస్వాగతం పలుకుతాను. యీనాడు ఆవిష్కరించబడిన ఉపయోగకరమైన యంత్ర సామగ్రిలో కుట్టుమిషను ఒకటి. దాని అన్వేషణ వెనుక ఒక అద్భుత చరిత్ర వున్నది. సింగరు అనువాడు తన భార్య బట్టలు కుడుతూ వున్నప్పుడు కొన్ని దృశ్యాలు చూశాడు. తన భార్యపై ఆతనికి గల ప్రేమ, అనవసరమైన శ్రమనుంచి ఆమెను రక్షించాలనే భావం అతనికి కలిగింది అందుకోసం కుట్టు మిషను కనిపెట్టమని సింగర్‌కు ప్రేరణ కలిగింది.

సింగర్ కనిపెట్టిన యీ కుట్టుమిషను, ఆతని భార్యనేగాక, చేతితో కుట్టుపని సాగిస్తున్న అనేక మందిని, అనవసరంగా శ్రమపడకుండా రక్షించింది. సమయం పొదుపును కూడా సాధించింది.

ప్రశ్న : బాపూజీ! సింగర్ కుట్టు మిషన్ల నిర్మాణం చేయుటుకు పెద్ద యంత్రశాల అవసరంకదా! అందు ప్రాపంచికశక్తితో నడిచే యంత్రాలను నెలకొల్పక తప్పదుకదా! అని ప్రశ్నించి యంత్రాల విషయంలో ఎక్కువ విషయాన్ని రాబట్టి, తెలుసుకోవాలని భావించారు ప్రశ్నకర్త. ఈ ప్రశ్నవిని గాంధీజీ చిరునవ్వు నవ్వి యిలా అన్నారు. "అవును తప్పదు, కాని యీ విషయంలో నేను సమాజవాదినే. యిటువంటి యంత్రశాలకు దేశం లేక ప్రజా ప్రభుత్వం యాజమాన్యం వహించాలి. ఇట్టి యంత్రశాలలు లాభం గడించాలనే దృష్టితో కాక ప్రజల మేలు కోసం నడుపబడాలి. లోభానికి బదులు ప్రేమకు ప్రాధాన్యం యివ్వాలి. కార్మికుల స్థితిగతులు మెరుగుపడాలి. డబ్బుకోసం పిచ్చిగా సాగుతున్న పరుగులు ఆగిపోవాలి. కార్మికులకు మంచి భృతి లభించడమే కాక, వారికి రోజూ పని లభించాలి. అప్పుడు యంత్రం ప్రభుత్వానికి లేక యాజమాన్యానికి ఎంత లాభం అందజేస్తుందో అంత లాభం కార్మికులకు కూడా అందజేస్తుంది. నా ఊహలో యంత్రాల విషయంలో వుండే మినహాయింపుల్లో యిది కూడా ఒకటి. సింగర్ కుట్టుమిషన్ విషయంలో ప్రేమకు ప్రాధాన్యం వున్నది. మనిషి సుఖానికి ప్రాధాన్యం వున్నది. మనిషి సమయాన్ని పొదుపు చేయడం ఆ యంత్రం

లక్ష్యం. ఆ యంత్రాన్ని ఉపయోగించుటకు ముఖ్య లక్ష్యం ధనార్జనకాకూడదు. దయకు ప్రాధాన్యం యివ్వాలి. ఉదాహరణకు వంకరగా వున్న కదురును తిన్నగా చేయగల యంత్రానికి స్వాగతం పలుకుతాను. అయితే అట్టి యంత్రం వల్ల కదుళ్ళు తయారుచేసే కమ్మరి వారి చేతి వృత్తికి దెబ్బ తగలడం నాకు యిష్టం లేదు. కాని నూలు వడుకుతూ వున్నప్పుడు కదురు వంకర పోతే, దాన్ని తిన్నగా సరిచేసుకోగల యంత్రం నూలు వడికే వారి దగ్గర వుండాలని మాత్రమే నాకోరిక. అందువల్ల లోభానికి బదులు ప్రేమకు చోటు కల్పిద్దాం. అప్పుడు అంతా మంచియే జరుగుతుంది.

ఈ సంభాషణ యందు గాంధీజీ వెలిబుచ్చిన అభిప్రాయాల విషయమై విమర్శకుల కెవ్వరికీ సిద్ధాంత రీత్యా వ్యతిరేకత ఉంటుందని నేను భావించడంలేదు. శరీరం వలె యంత్రం కూడా ఆత్మ వికాసానికి తోడ్పడితే, అది తోడ్పడినంత మేరకు ఉపయోగకారియే.

పాశ్చాత్య నాగరికత విషయం కూడా అంతే. "పాశ్చాత్య సభ్యత మనిషి యొక్క ఆత్మకు మహాశత్రువు" అని గాంధీజీ వ్రాశారు. ఈ వ్రాతను వ్యతిరేకిస్తూ కోల్ మహాశయుడు యిలా వ్రాశారు- "స్పైన్ మరియు అబిసీనియా మధ్య జరిగిన భయంకరమైన సంగ్రామం మన శిరస్సులపై సదా వ్రేళాడుతూవుండే భయానికి చిహ్నం. రకరకాల రిద్ధిసిద్ధికి అవసరమైన శక్తి మరియు అవకాశం వున్నా కోట్లాది ప్రజల కటిక దారిద్ర్యం పాశ్చాత్య సభ్యత యొక్క పెద్ద దోషం. అయితే యిది సహజమైనది. అనగా ప్రాకృతికమైనది కాదు. సభ్యతకు మూలం కాదు. మా యీ సభ్యతను సరిదిద్దుకుంటామని నేను అనడం లేదు. అంతమాత్రాన యిది సరికాదని కూడా నేను అనను. మనిషి యొక్క ఆత్మకు అవసరమైన విషయాల నిరాకరణపై ఆధారపడి యీ సభ్యత రూపొందినదని నేను అంగీకరించను.'

కోల్ మహాశయుడు చెప్పింది నిజం. గాంధీజీ పేర్కొన్న పాశ్చాత్య సభ్యత యందలి దోషాలు సహజ సిద్ధమైనవికావు. అసభ్యత యందలి ప్రవృత్తుల ద్వారా బయల్వెడలినవి మాత్రమే. యీ పుస్తకంలో భారతీయ సభ్యతకు,

పాశ్చాత్య సభ్యతకు గల వ్యత్యాసాన్ని, భిన్నత్వాన్ని చూపించడమే గాంధీజీ లక్ష్యం. పాశ్చాత్య సభ్యతను సరిదిద్దడం అసంభవం కానేరదని కోల్‌మహాశయుడు వెలిబుచ్చిన అభిప్రాయంతో గాంధీజీ పూర్తిగా ఏకీభవిస్తారు. పాశ్చాత్య దేశాలకు పాశ్చాత్య పద్ధతిలోగల స్వరాజ్యం అవసరం అని కూడా గాంధీజీ అంగీకరిస్తారు. అయితే ఆ స్వరాజ్యం గాంధీవంటి ఆత్మ నిగ్రహం కలిగిన పురుషుల భావాల ననుసరించి వుంటుంది కాని వారు పాశ్చాత్యులై వుంటారు. ఆ పద్దతి గాంధీ మరియు భారతదేశ పద్ధతిగా ఉండదు. అద్భుతమైన పాశ్చాత్య పద్ధతిగా ఉంటుంది. అను విషయాన్ని కూడా గాంధీజీ తేలికగా అంగీకరిస్తారని నేను భావిస్తున్నాను.

## సిద్ధాంతాలకు గల హద్దు

జి.డి.హెచ్ కోల్ మహాశయుడు మరో చిక్కు విషయాన్ని పేర్కొన్నారు. " జర్మనీ, ఇటలీ విమానాలు స్పైన్ దేశపు ప్రజల్ని సంహరిస్తున్నప్పుడు, జపాన్ విమానాలు చైనా దేశపు జనాన్ని సంహరిస్తున్నప్పుడు, జర్మనీ సైన్యాలు ఆస్ట్రియాలోకి చొచ్చుకుపోయినప్పుడు, చెకొస్లోవేకియాలోకి జొరపడతాయని బెదిరిస్తున్నప్పుడు, అబిసీనియాపై బాంబుల వర్షంకురిపించిదాన్ని ఆక్రమించకున్నప్పుడు, యీ (అహింసా) సిద్ధాంతం నిలువగలదా? రెండు మూడు సంవత్సరాక్రితం అవకాశం చిక్కినప్పుడు యుద్ధాన్ని, మారణహింసాకాండను వ్యతిరేకించాను. కాని యివాళ, యుద్ధాన్ని గురించి నాకు అసహ్యం, ఏహ్యాభావం వున్నపటికీ, యీ మృత్యుహేలను, హత్యాకాండను అరికట్టుటకు యుద్ధమనే ప్రమాదాన్ని భరించేందుకు సిద్ధంగా వున్నాను." అని వ్రాశారు.

వారి మనస్సు నందు పరస్పర విరుద్ధమైన భావాలు ఏ విధంగా ఘర్షణ పడుతున్నాయో వారి క్రింద వాక్యాల వల్ల బోధపడుతుంది.

"నేను యుద్ధమనే ప్రమాదాన్ని తప్పక భరిస్తాను. కాని యిప్పటికి కూడా, నా యందలి రెండో వ్యక్తిత్వం మనిషిని హత్య చేయాలనే యోచన కలుగగానే కంగారపడిపోయి, దెబ్బతిని వెనుకంజవేస్తున్నది. యితరుల

ప్రాణాలు తీయడానికి బదులు నా ప్రాణాలను సమర్పించడానికి సదా సిద్ధంగా వుంటాను. కాని ఫలానా సమయంలో, ఫలానా అవకాశం చిక్కినప్పుడు నా ప్రాణాలు ఎందుకు సమర్పించాలి. యితరుల ప్రాణాలు ఎందుకు తీయకూడదు అని కూడా అనిపిస్తుంది. వ్యక్తి గత స్వరాజ్యం పొందిన వ్యక్తి ఎదుట యిటువంటి ధర్మసంకటం కలుగదని బహుశ గాంధీ సమాధానం చెప్పవచ్చు. కాని అటువంటి వ్యక్తి స్వరాజ్యం పొందాడని నేను గట్టిగా చెప్పలేను అట్టివ్యక్తి స్వరాజ్యం పొందాడనే అనుకోండి, అయినా పశ్చిమ యూరపులో యీనాడు జరుగుతఃన్న ఘట్టాల మధ్య యుద్ధాన్ని ఆహ్వానించు భావం బలహీన పడుతుందని నాకు విశ్వాసం కలగడం లేదు"

కోల్ మహాశయుడు పేర్కొన్న అవకాశం, సమయం మనిషి యొక్క శ్రద్ధకు ఒరిపిడి రాయివంటిది. గాంధీజీ పై ప్రశ్నకు అనేకసార్లు సమాధానం చెప్పారు. దేశ ప్రజలంతా స్వరాజ్యం పొందనంతవరకు, తనకు లభించిన స్వరాజ్యం అసంపూర్ణమైనదేనని గాంధీజీ భావం. అయితే వారు శ్రద్ధతో జీవిస్తారు. అహింసయెడ వారికి గల శ్రద్ధ అపరిమితం. ఆ శ్రద్ధ ఇటలీ, జపాను దేశాలు చేసిన చిత్రవధల్ని గురించి వినగానే చలించిపోయి ఊగిసలాడదు. హింసవల్ల హింసయే ఆవిర్భవిస్తుంది. ఒక్కసారి ఆ మార్గాన ముందుకు సాగితే దానికి యిక అంతు వుండదు. చైనా పక్షం వహించి మీరు సమరం చేయాలి అని వ్రాసిన చైనా మిత్రుడికి సమాధానం వ్రాస్తూ వార్ రిజస్టర్ అను పత్రికలో ఫిలిప్‌మమ్‌ఫర్డ్ యిలా వ్రాశారు.

"మీ శత్రువు జపాన్ ప్రభుత్వం. అంతేగాని జపాను దేశపు రైతులు, సైనికులు మీకు శత్రువులు కారు. ఆ చదువురాని అభాగ్యులకు, అమాయకులకు యుద్ధం చేయమని ఎందుకు హుకుం జారీచేశారో తెలియనే తెలియదు. అయినా మీరు మీ దేశరక్షణ పేరిట సాయుధ సైన్య దళాల సహాయం పొందాలని అనుకుంటే మీరు చేసే పని ఏమిటి? ఏమీ తెలియని ఆ అమాయకులైన, మీకు శత్రువులు కాకపోయినా వారందరినీ చంపివేయడమేగదా! భారత దేశంలో గాంధీజీ పరీక్షించి అమలు చేసిన అహింసా విధానాన్ని చైనా ధర్మ గురువులంతా ఒక్క స్వరంతో బోధించిన అహింసా విధానాన్ని, చైనా తన రక్షణ కోసం అవలంబించితే, యూరప్

దేశాలు అవలంబిస్తున్న హింసాకాండ వల్ల పొందే ప్రయోజనం కంటె ఎక్కువ ప్రయోజనం పొందగలదని గట్టిగా చెప్పగలను. చైనా దేశప్రజలు మిగతా ప్రపంచ దేశాల ప్రజల కంటే ఎక్కువ శాంతిప్రియులు.

ప్రపంచమందలి యితర హింసాత్మకయోధులైన వారి కంటే మించి ఎక్కువ కాలం చైనా దేశప్రజలు తమను, తమ సంస్కృతిని రక్షించుకోగలిగారు. యీ సత్యమే మానవజాతికి గొప్ప పాఠం. ధీరులు, వీరులు, శూరులునగు చైనా దేశప్రజలు తమ దేశరక్షణ కోసం పోరాడుతువున్నారు వారి యెడ ఆదరణ మాకు లేదని భావించవద్దు. వారి త్యాగాల్ని వారి బలిదానాన్ని ఆదరిస్తున్నాం. అయితే వారు మేము అంగీకరించలేని మరో సిద్ధాంతాన్ని అనుసరిస్తున్నారని అనుకుంటాం. ఏది ఏమైనా హింస ఎట్టి పరిస్థితులలోనైనా సరే చెడ్డదనే మా అభిప్రాయం. దానివల్ల సత్ఫలితాలు కలగడం అసంభవం. అహింసా విధానాన్ని అనుసరిస్తే దుఃఖాలన్నీ తొలగిపోతాయని అనుకోకూడదు. మీ సమస్త ఆయుధాలు సైనిక పటాలాలు మీ శత్రువు మీద సాధించే విజయంకంటే, అహింసా విధానం శత్రువు మీద చిరస్థాయిగా నిలిచియుండే విజయాన్ని సాధించగలదని మా విశ్వాసం దీనివల్ల మీ ప్రజల ఆదర్శం ఎన్నటికీ చెరిగిపోదని మరీ మరీ విశ్వశిస్తున్నాం.

కుమారి రెథ్ బోన్ యిలాంటి మరో సమస్యను పేర్కొన్నారు "దుష్టుల ఎదుట తలవంచినా, తన అంతర్వాణికి వ్యతిరేకంగా నడుచుకొనవలసివచ్చినా అందుకు సిద్ధపడి పసి బిడ్డలను రక్షించు అవకాశం చిక్కితే యీ ప్రపంచంలో సామాన్యులైనా, సత్పురుషులులైనా అట్టి బిడ్డల్ని రక్షించరా? వారిని చనిపోనిస్తారా?" అని ఆమె ప్రశ్నించింది. ఆమె ప్రశ్నకు గాంధీజీ సమాధానం యివ్వరు. యిట్టి ప్రశ్నకు గాంధీజీ అవకాశం యివ్వరు. ఇందుకు ఏసుక్రీస్తు చేసిన బోధ ఎంతో స్పష్టంగా వున్నది. యీ విషయంలో వారి మాటలు స్పష్టంగా వున్నాయి. "నాయందు శ్రద్ధ చూపించేవారు పసిబిడ్డలకు వ్యతిరేకంగా ఎవరైనా చేయి ఎత్తితే అట్టి వారి మెడకు తిరగలి రాయికట్టి వారిని సముద్ర గర్భంలో పడ వేయాలి. ఇవి ఏసుక్రీస్తు చెప్పిన మాటలు. యీ విషయంలో మాకు గాంధీజీ మాటలకంటే ఏసుక్రీస్తు చెప్పిన మాటల వల్ల ఎక్కువ సహాయం లభిస్తున్నది."

ఏసుక్రీస్తు చెప్పిన మాటలు వారి పుణ్య ప్రతాపాన్ని వెల్లడిస్తున్నాయని నా అభిప్రాయం. వారు ఏ పని చేయమని చెప్పారో ఎవరికోసం చేయమని చెప్పారో గమనించాలి. పాపం చేసినవారికి మరొకరు యిట్టి శిక్ష విధించడమనే ఉద్దేశ్యంతో వారు యీ విధంగా చెప్పలేదని, పాపం చేసిన వాడు అనగా అపరాధి తనకు తాను యిట్టి శిక్ష విధించుకోవాలనే ఉద్దేశ్యంతో చెప్పారని భావిస్తున్నాను. ఏసుక్రీస్తు చెప్పిన ఉపాయం అని చెప్పి తాను చెప్పిన ఉపాయాన్ని ఆచరణలో పెట్టి పిల్లలను మృత్యుముఖాన్నుంచి రక్షించగలననే విశ్వాసం నిజంగా కుమారి రిథ్ బోన్‌కి వున్నదా? గాంధీజీ అసలు యీ విషయాన్ని ప్రస్తావించనే లేదని ఆమె వ్రాసిన మాట సరికాదు. వారు యీ విషయం ప్రస్తావించడమే గాక, దానికి స్పష్టంగా సమాధానం కూడా యిచ్చారు. 1300 సంవత్సరాల క్రితం ముస్లిం అమరజీవులు కూడా యీ ప్రశ్న లేవనెత్తి, అందుకు తమ చర్యల ద్వారా జవాబు యిచ్చారు. వారు దుర్మార్గుల ముందు తలవంచేకంటే, తమ భార్యా బిడ్డల్ని ఆకలి దప్పులతో గిలగిలకొట్టుకుంటూ చావనీయడమే మంచిదని భావించారు. అందుకు కారణం స్పష్టం. దుర్మార్గుల ముందు తలవంచినా, తమ అంతరాత్మను మోసగించినా, అందువల్లకలిగే ఫలితం ఏమిటి? దుర్మార్గులకు యింకా ఎన్నో, ఎన్నెన్నో దుర్మార్గాలు చేయుటకు ప్రోత్సాహం లభిస్తుంది. అంతే గదా!.

అయితే కుమారి రిథ్‌బోన్ కూడా "హింద్ స్వరాజ్యము" ఎంతో ప్రభావితంచేసే పుస్తకం అని వ్రాశారు. ఆ పుస్తకం చదివి, అందలి బరువైన ప్రామాణికత్వాన్ని చూచి, నా ప్రామాణికత్వాన్ని పరీక్షించుకోవలసిన అవసరం కలిగిందని పేర్కొని హింద్ స్వరాజ్యను ప్రతివ్యక్తి చదవమని ఆమె విజ్ఞప్తి చేశారు.

'ఆర్యన్‌పాథ్' మాసపత్రిక సంపాదకులు యీ "హింద్ స్వరాజ్య" అను ప్రత్యేక సంచికను ప్రచురించి శాంతి, అహింసా సిద్ధాంతానికి ఎనలేని సేవ చేశారని చెప్పక తప్పదు.

వార్ధా- 2- 2-33 **మహదేవ దేశాయి.**

# ప్రస్తావన

ఈ విషయంపై ఇరువది అధ్యాయాలు వ్రాశాను. వాటిని పాఠకుల ఎదుట వుంచుటకు సాహసిస్తున్నాను.

ఇక నన్ను నేను ఆపుకోలేకనే యిదంతా వ్రాశాను. చాలా చదివాను. ఎంతగానో ఆలోచించాను. ఇంగ్లాండులో ట్రాన్సువాల్ డెప్యుటేషన్‌తో బాటు నాలుగు మాసాలు నేను వున్నాను. ఆ సమయంలో సాధ్యమైనంతగా ఎక్కువ మంది భారతీయుల్ని కలిశాను, చర్చించాను. ఎక్కువమంది ఆంగ్లేయుల్ని కూడా కలసి చర్చించాను. చివరికి నిర్ణయానికి వచ్చిన నా అభిప్రాయాల్ని పాఠకులు ఎదుట వుంచడం నా కర్తవ్యమని భావించాను.

ఇండియన్ ఒపీనియన్ గుజరాతీ చందాదారులు దాదాపు ఎనిమిది వందల దాకా వున్నారు. ఒక్కొక్క చందాదారునితో పాటు కనీసం పదిమంది పాఠకులు ఇష్టపడి యీ పత్రిక చదువుతూ వున్నారని నాకు నమ్మకం కలిగింది. గుజరాతీ రాని వాళ్లు, వచ్చిన వారిచేత చదివించి తెలుసుకుంటున్నారట. అట్టి సోదరులు భారతదేశాన్ని గురించి నన్ను చాలా ప్రశ్నలు అడిగారు. అలాంటి ప్రశ్నలే ఇంగ్లాండులో కూడా చాలా మంది నన్ను అడిగారు. అందువల్ల విడివిడిగా వ్యక్తి గతంగా నేను వెలిబుచ్చిన భావాల్ని అందరి ఎదుట వుంచడంలో తప్పులేదని నాకు అనిపించింది.

ఇందు వెలువరించిన భావాలు నావే; అవి నావికావు కూడా. వాటి ప్రకారం నడుచుకుంటానని ఆశిస్తున్నాను కనుక అవినావే. అవి, నా ఆత్మలో నిలిచిపోయాయి. అవి నావి కావు. అవి నేనొక్కడినే యోచించినట్టివి కావు కనుక అవి నావి కావని భావిస్తున్నాను. కొన్ని పుస్తకాలు చదివిన తరువాత అవి నిర్మాణమయ్యాయి. హృదయంలో, లోలోపల నేను ఊహించిన ఊహల్ని, భావాల్ని ఆ పుస్తకాలు సమర్థించాయి.

నేను పాఠకుల ఎదుట వుంచిన భావాలు, ఆధునిక (పాశ్చాత్య) నాగరికతా ప్రభావం పడని ఎక్కువ మంది భారతీయుల భావాలేనని వేరే రుజూచేయవలసిన అవసరం లేదు. అయితే యివే భావాలు వేలాది

యూరప్ ప్రజలు కలిగి యున్నారని, యీ విషయాన్ని నా పాఠకులే తమ తమ ఆధారాలతో పరీక్షించిచూచుకోమని కోరుతున్నాను. ఎవరైనా అన్వేషించ తలుచుకుంటే, వారికి అవకాశం, వెసులుబాటు దొరికితే ఆ పుస్తకాల్ని చదవవచ్చు. అవకాశం లభించితే ఆ పుస్తకాల నుంచి ఏదో కొంత పాఠకుల ఎదుట వుంచాలనే అభిలాష నాకు వున్నది.

ఇండియన్ ఒపీనియన్ పాఠకులకు, తదితరులకు నా వ్యాసాలు చదవగా ఏ భావాలు కలిగాయో, నాకు తెలిపితే వారికి కృతజ్ఞుణ్ణి. దేశసేవచేయడం, సత్యాన్వేషణ కావించడం, ఆ ప్రకారం నడుచు కోవడమే నా లక్ష్యం. అందువల్ల నాభావాలు తప్పని తేలితేవాటిని పట్టుకు కూర్చోమని చెప్పను. అది నిజమని తేలితే యితరులు కూడా ఆ ప్రకారం నడుచుకోవాలని, దేశం యొక్క మేలును దృష్టి యందుంచుకోమని నేను కోరతాను.

సౌకర్యంగా వుండుటకై ఇందలి వ్యాసాల్ని పాఠకుడు, సంపాదకుడు వీరిరువురి మధ్య జరిగిన సంభాషణల రూపంలో పొందుపరచడం జరిగింది.
కిల్డోనన్ కాసీల్
22-11-1909 మో॥క॥గాంధీ

★ ★ ★

## హింద్ స్వరాజ్యను గురించి

నా యీ చిన్ని పుస్తకం చాలా మంది ప్రజల దృష్టిని ఆకర్షించడం నిజంగా నా అదృష్టం. అసలు యీ పుస్తకం గుజరాతీలో వ్రాయబడింది. దీని జీవన క్రమం విచిత్రం. యిది మొట్టమొదట దక్షిణ ఆఫ్రికాలో ప్రచురించబడే ఇండియన్ ఒపీనియన్ అను వార పత్రికలో ప్రకటించారు. దక్షిణ ఆఫ్రికాకు తిరిగి వస్తున్నప్పుడు ఓడమీద హింసావాదులైన భారతీయులకు అట్టి భావమే గల దక్షిణ ఆఫ్రికాకు చెందిన హింసావాదులకి యిచ్చిన సమాధానంగా యీ పుస్తకం వ్రాశాను. లండనులో నివశిస్తున్న పేరు గాంచిన అరాచక వాదులైన భారతీయులతో మాట్లాడాను. వారి శౌర్య ప్రతాపాల ప్రభావం నామీద పడింది. కాని వారి ఆవేశం తలక్రిందులుగా వుండే మార్గాన్ని పట్టిందని

అనిపించింది. హింస భారత దేశంలో గల దుఃఖాలకు సరిమైన చికిత్సకాదని తోచింది. దాని సంస్కృతిని గమనించి, ఆత్మరక్షణకు భారత దేశం మరో మార్గాన్ని ఉన్నత స్థాయికి చెందిన అస్త్రాన్ని ఉపయోగించాలని నాకు తోచింది. దక్షిణ ఆఫ్రికాలో ప్రారంభమైన సత్యాగ్రహమనే బిడ్డ రెండు సంవత్సరాల ప్రాయంలో వున్నది. అయినా అది ఎంతో వికాసావస్థకు చేరుకున్నది. అందువల్ల దాన్ని గురించి ఆత్మ విశ్వాసంతో వ్రాయుటకు ధైర్యం చేశాను. నా యీ వ్యాసహారం పాఠకులకు బాగా నచ్చింది. తత్ఫలితంగా ఆ వ్యాసాలు పుస్తక రూపంలో ప్రకటించబడ్డాయి. భారతదేశమందలి కొందరు ప్రజల దృష్టి కూడా దీని మీద పడింది. బొంబాయి ప్రభుత్వం దీని ప్రచారాన్ని ఆపివేసింది. అందుకు సమాధానంగా ఇంగ్లీషులోకి యీ పుస్తకాన్ని అనువదించి ప్రచురించాను. నా ఆంగ్ల మిత్రులకు యీ పుస్తకం వెలువరించి నా భావాలు తెలియజేయడం కర్తవ్యంగా భావించాను.

ఇది బాలునిచేతికి సైతం అందించ తగిన పుస్తకమని నా అభిప్రాయం. యిది ద్వేషధర్మానికి బదులు ప్రేమధర్మాన్ని నేర్పుతుంది. హింసకు బదులు ఆత్మ బలిదానాన్ని సూచిస్తుంది. పశు బలాన్ని ఎదుర్కొనుటకు ఆత్మబలాన్ని నిలుపుతుంది. దీని ప్రచురణలు అనేకం వెలువడ్డాయి. దీన్ని చదువుదామని భావించేవారికి తప్పక చదవమని సిఫారసు చేస్తున్నాను. దీనిలో నేను కేవలం ఒక శబ్దాన్ని మాత్రమే ఒక మహిళాస్నేహితురాలు కోరిక కోరికను అంగీకరించి, తొలిగించాను. అంతకుమించి యీ పుస్తకంలో నేను ఏ మార్పు చేయలేదు. ఈ పుస్తకంలో ఆధునిక నాగరికతపై తీవ్రంగా వ్యాఖ్య చేయడం జరిగింది. 1909లో యీ వ్యాఖ్య చేశాను. అప్పుడు నేను చేసిన వ్యాఖ్య యిప్పుడు యింకా బలం పుంజుకున్నది. ఆధునిక నాగరికతను భారత దేశం ఎంత త్వరగా త్యజిస్తే అంత ఎక్కువ లాభం పొందుతుందని నా అభిప్రాయం.

అయితే పాఠకులకు ఒక హెచ్చరిక చేయతలుస్తున్నాను. యీ పుస్తకంలో నేను చిత్రించిన స్వరాజ్య స్థాపనకు నేను ప్రయత్నిస్తున్నానని భావించవద్దు.

యిప్పుడు భారత దేశం యిట్టి స్వరాజ్య స్థాపనకు సిద్ధంగా లేదని నాకు తెలుసు. యిలా అనడం కొంటె తనం అయితే కావచ్చు. కాని నేను యీ పుస్తకంలో చిత్రించిన స్వరాజ్య స్థాపనకోసం వ్యక్తిగతంగా నా కృషి సాగుతున్నదనే గట్టి నమ్మకం నాకు వున్నది. యిప్పుడు సాగుతున్న నా సామూహిక ప్రవృత్తి యొక్క లక్ష్యం. భారత దేశ ప్రజల కోరిక ప్రకారం పార్లమెంటరీ పద్ధతిన సాగే స్వరాజ్యాన్ని సాధించడమే. రైళ్లను, ఆసుపత్రులను నాశనం చేయాలనే తలంపు నాకు లేదు. అయితే ప్రకృతి సహజంగా వాటి నాశనం జరిగితే మాత్రం అందుకు స్వాగతం పలుకుతాను. రైలు ఆసుపత్రి యీ రెండింటిలో ఒక్కటి కూడా ఉన్నత మైన శుద్ధ సంస్కృతికి సూచిక (చిహ్నం) కాదు. త్రోసివేయుటకు వీలులేని చెడ్డ సూచికయని మాత్రం ఎక్కువ కెక్కువగా చెప్పవచ్చు. యీ రెండింటిలో ఏ ఒక్కటి కూడా మన దేశపు నైతిక ఔన్నత్యానికి కొంచెమైనా తోడ్పడదు. అదేవిధంగా కోర్టులు శాశ్వతంగా నాశనం కావాలని కోరాను. అయితే అలా జరిగితే మాత్రం అమితంగా సంతోషిస్తాను. యంత్రాలు, మిల్లులు నాశనం కావాలని ప్రైవేటి కంటే తక్కువగా ప్రయత్నిస్తాను. అందుకు ప్రజల సంసిద్ధత యీనాటికంటే అధికంగా త్యాగంతోను సాదాతనంతోను కూడియుండాలి.

ఈ పుస్తకంలో తెలిపిన కార్యక్రమంలో ఒక భాగమే అమలులోకి వస్తున్నది. అది అహింస. అదైనా యీ పుస్తకంలో వివరించిన ప్రకారం అమలులోకి రావడం లేదని కడు విచారంతో అంగీకరిస్తున్నాను. పూర్తిస్థాయిలో అహింస అమలులోకి వస్తే ఒక్కరోజులో స్వరాజ్యం లభిస్తుంది. భారతావని, తన ధర్మానికి గల ఒక క్రియాత్మక అంశంగా ప్రేమ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే, దాన్ని తన రాజనీతిలో చేర్చుకుంటే స్వరాజ్యం స్వర్గాన్నుంచి దిగివచ్చి భారతావని భూమిపై నెలకొంటుంది. యిలా జరగడం దూరాతిదూరాన వున్న విషయమని దుఃఖంతో అంగీకరిస్తున్నాను.

ఈనాటి నా ఉద్యమానికి చెడ్డపేరు తెచ్చేందుకై యీ పుస్తకమందలి అనేక విషయాల్ని కొందరు ఉటంకించడం చూస్తున్నాను. నేనేదో పెద్దకుట్ర

చేస్తున్నానని తెలుపుతూ వ్రాయబడుతున్న వ్యాసాల్ని కూడా చూచాను. ఈనాటి గందరగోళ పరిస్థితులవల్ల లాభం పొందాలనే కాంక్షతో, విచిత్రమైన భావాల్ని భారతదేశం నెత్తిన నేను రుద్దుతున్నానని భారత దేశానికి నష్టంచేకూర్చే ధార్మిక ప్రయోగాలు నేను చేస్తున్నానని కూడా కొందరు వ్రాస్తున్నారు. అట్టి వారందరికీ ఒకే ఒక సమాధానం చెబుతున్నాను. సత్యాగ్రహం అంటే ఏదో ఉత్తుత్తి తతంగం కాదు. అందు దాపరికానికి తావులేదు. అందు హాస్యానికి తావులేదు. అయితే హింద్ స్వరాజ్యంలో సూచించిన సంపూర్ణజీవన సిద్ధాంతపు ఒక భాగాన్ని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నం జరగుతున్నది. అందు సందేహానికి తావులేదు. సంపూర్ణజీవన సిద్ధాంతాన్ని ఆచరణలో పెడితే ప్రమాదం సంభవిస్తుందని అనుకోవలసిన అవసరం లేదు.

ఈనాడు దేశం ఎదుట గల సమస్యలతో సంబంధంలేని అంశాల్ని, నా వ్యాసాలనుంచి తీసి వాటిని తమ వ్యాసాల్లో పేర్కొని ప్రజల్ని రెచ్చకొట్టేందుకు ప్రయత్నించడం న్యాయం కాదని తెలియజేస్తున్నాను.

యంగ్ ఇండియా జనవరి 1921 **ఎం.కె.గాంధీ**



## సందేశం

*(ఇంగ్లీషు మాసపత్రిక ఆర్యన్‌పాథ్ యొక్క 1938 సెప్టెంబరులో ప్రచురించబడిన హింద్ స్వరాజ్య ప్రత్యేక సంచికకు పంపబడిన సందేశం)*

ఏ సిద్ధాంతాల్ని సమర్థించుటకు హింద్ స్వరాజ్యం వ్రాయబడిందో ఆ సిద్ధాంతాల్ని మీరు ప్రకటించడం మంచి పని. అసలు పుస్తకం గుజరాతీలో వ్రాయబడింది. ఇంగ్లీషు ప్రతి ప్రచురణ గుజరాతీ నుంచి చేయబడిన తర్జుమా. యీ పుస్తకం తిరిగి వ్రాయవలసి వస్తే అక్కడక్కడ దాని భాష మారుస్తాను. యీ పుస్తకం వ్రాసిన తరువాత ముప్పది సంవత్సరాలు అనేక తుపాన్ల మధ్య గడిపాను. అయినా యీ పుస్తకంలో నేను పేర్కొన్న భావాల్లో మార్పు చేయవలసిన కారణం కనబడలేదు. పాఠకులు గమనించవలసిన

విషయం ఒకటి వున్నది. ఒక కరుడు గట్టిన అరాచకవాదితో సహా కొంతమంది కార్యకర్తలతో నేను చర్చించిన విషయాలను యథాతథంగా యీ పుస్తకంలో పేర్కొన్నాను. దక్షిణాఫ్రికా యందలి భారతీయులలో చోటు చేసుకోబోతున్న దుఃఖాన్ని బాధను సరియైన తరుణంలో యీ పుస్తకం తొలగించిందను విషయం కూడా పాఠకులు గ్రహించాలి. దానితో బాటు రెండోవైపున, కీర్తి శేషుడైన నా ఒక మిత్రుడు "ఇది ఒక మూర్ఖుడు వ్రాసిన రచన" అని వెలిబుచ్చిన అభిప్రాయాన్ని కూడా పాఠకులు గ్రహింతురుగాక.

సేవాగ్రాం. 14-7-38 **ఎం.కె.గాంధీ**

# 1

# కాంగ్రెస్ మరియు దాని పదాధికారులు

**పాఠకుడు** : ఇప్పుడు భారతదేశంలో స్వరాజ్యం గాలివీస్తున్నది. దేశప్రజలంతా స్వాతంత్ర్యం కోసం తహతహలాడుతున్నారు. దక్షిణాఫ్రికాలో కూడా యిట్టి ఆవేశమే కనబడుతున్నది.తమ అధికారాన్నిపొంది తీరాలనే ధైర్యం భారతీయులకు కలిగినట్లు తోస్తున్నది. ఈ విషయమై మీ అభిప్రాయం చెబుతారా?

**సంపాదకుడు** : మీరు అడిగింది మంచి ప్రశ్న. అయితే దీనికి సమాధానం చెప్పడం అంతతేలికకాదు. ప్రతి పత్రికకు కొన్ని విధులు ఉంటాయి. మొదటిది - ప్రజల భావాలుతెలుసుకొని వాటిని ప్రకటించడం. రెండవది - అవసరమైన భావాల్ని ప్రజలకు కలిగించడం. మూడవది - ప్రజల్లో దోషాలేమైనా కనబడితే ఎన్ని కష్టాలు వచ్చినా నిర్భయంగా వాటిని ప్రకటించడం. మీ ప్రశ్నకు యిచ్చే సమాధానంలో యీ మూడు పనులు యిమిడి వుంటాయి. ప్రజల భావాల్ని హద్దుల్లో వుండి, ప్రకటించాలి. అట్టి భావాలు వారికి కలుగకపోతే వారిలో కలితగించుటకు ప్రయత్నించాలి వారి దోషాల్ని ఎత్తి చూపించాలి. మీరు ప్రశ్నించారు కనుక సమాధానం యివ్వడం నా కర్తవ్యమని భావిస్తున్నాను.

**పాఠకుడు** : స్వరాజ్యం అవసరమను భావం భారతదేశానికి కలిగిందని మీరు భావిస్తున్నారా?

**సంపాదకుడు** : నేషనల్ కాంగ్రెస్ స్థాపన జరిగినప్పటినుంచీ అది కలిగిందని భావిస్తున్నాను. నేషనల్ అను శబ్దానికి అర్థం యిట్టి భావాన్ని ప్రకటించమే.

**పాఠకుడు** : మీరు చెప్పింది సరికాదు. భారతీయ నవయువకులు

యిప్పుడు కాంగ్రెసును లెక్కచేయడంలేదు. ఇంగ్లీషు వాళ్లు పరిపాలనను సాగించేందుకు సాధనం కాంగ్రెస్ అని భావిస్తున్నారు.

**సంపాదకుడు** : నవయువకులకు గల యీ భావం సరియైనదికాదు. భారతావనికి చెందిన దాదాభాయి నౌరోజీ అవసరమైన వాతావరణం కల్పించి యుండకపోతే, నవయువకులు యిప్పుడు మాట్లాడుతున్న మాటలు, మాట్లాడ కలిగియుండేవారేకాదు. మిస్టర్ హ్యూమ్వ్రాసిన వ్యాసాలు, వారు మనకు వినిపించిన విదిలింపులు, మనల్ని మేల్కొలిపిన వారి ఆదేశం, వాటిని మనం ఎలా మరిచిపోగలం? సర్ విలియం వేడర్బర్న్ కాంగ్రెస్ యొక్క లక్ష్యాన్ని సాధించుటకు తమ తనువు, మనస్సు, ధనం మూడింటిని వెచ్చించివేశారు. ఆంగ్ల పరిపాలనను గురించి వారు వ్రాసిన వ్యాసాలు ఈనాడు కూడా చదవవలసినవే. ప్రొఫెసర్ గోఖ్లే ప్రజల్ని తయారుచేయుటకు, తాను బీదవాడి స్థితిలో, ఇరువది సంవత్సరాలు జీవితం గడిపారు. ఇప్పుడు కూడా వారు బీదవాడి స్థితిలోనే వున్నారు. గౌరవనీయులు జస్టిస్ బదురుద్దీన్ కూడా కాంగ్రెసు ద్వారా స్వరాజ్యబీజాలు నాటారు. బెంగాల్ మద్రాసు, పంజాబ్, మొదలగు చోట్లకు చెందిన అనేక మంది భారతీయులు, ఆంగ్లేయులు కాంగ్రెస్ ద్వారా భారతదేశం మేలును ఆకాంక్షించి పనిచేశారు. ఇది సదా జ్ఞాపకం వుంచుకోవలసిన విషయాలు.

**పాఠకుడు** : ఆగండి, ఆగండి. మీరు చాలా ముందుకు వెళ్లిపోయారు. నా ప్రశ్న ఒకటి, మీరిచ్చిన సమాధానం మరొకటి. నేను స్వరాజ్యాన్ని గురించి అడిగితే మీరు పరాయిరాజ్యంవారిని గురించి చెబుతున్నారు. నాకు ఆంగ్లేయులపేర్లు అవసరం లేదు. కాని మీరు ఆంగ్లేయుల పేర్లు చెప్పడం ప్రారంభించారు. ఇలా అయితే బండి త్రోవకు వస్తుందని అనిపించడం లేదు. నాకు స్వరాజ్యాన్ని గురించిన మాటలు మాత్రమే రుచిస్తాయి. తెలివితో కూడిన తీయని యితర మాటలు నాకు రుచించవు.

**సంపాదకుడు** : మీరు తొందరపడుతున్నారు. తొందరపాటును నేను సహించలేను. కొంచెం ఓపికపడితే మీకు కావలసింది లభిస్తుంది. తొందరపడితే

పప్పులుడకవు. కాయలు పండవు అను సామెతను జ్ఞాపకం పెట్టుకోండి. మీరు నన్ను ఆపివేశారు. దేశానికి ఉపకారం చేసిన వారి పేర్లు వినడం కూడా మీకు రుచించలేదు. దీన్ని బట్టి స్వరాజ్యం మీకు దూరంగా వున్నదని తేలుతున్నది. మీ మాదిరాగానే చాలా మంది భారతీయులు వుంటే మనం (స్వరాజ్యానికి) దూరమై వెనకబడిపోతాం. ఇది యోచించవలసిన విషయం.

**పాఠకుడు** : గుడికి బెత్తెడు ఎడంగా మాట్లాడి మీరు నా ప్రశ్నకు యివ్వవలసిన సమాధానాన్ని ఎగరగొట్టాలని చూస్తున్నారని నాకు అనిపిస్తున్నది. మీరు ఫలానా వారు హిందూదేశానికి మేలు చేశారని చెబుతున్నారు. వారిని గురించి నాకు అట్టి అభిప్రాయం లేదు. అందువల్ల నేను వాళ్ళు చేసిన ఉపకారాల్ని గురించి ఎందుకు వినాలి? మీరు హిందూదేశానికి దాద (తాత) అని చెబుతున్న, వారు చేసిన ఉపకారం ఏమిటి? ఆంగ్లపరిపాలకులు న్యాయం చేస్తారని, వారితోమనం కలిసి మెలిసివుండాలనేగదా వారు చెప్పిన మాటల సారాంశం.

**సంపాదకుడు** : ఇక మీకు సవినయంగా గట్టిగా సమాధానం చెప్పకతప్పదు.ఆ పురుషుణ్ణిగురించి అగౌరవంగామీరు మాట్లాడిన తీరు మనకు సిగ్గుచేటు. వారు చేసిన పనుల్ని పరిశీలించి చూడండి. వారు తమ జీవితాన్ని హిందూదేశానికి అర్పించివేశారు. ఇదివారి దగ్గర మనం నేర్చుకున్న పాఠం. హిందూదేశం రక్తాన్నిపీల్చిన వాళ్లు ఆంగ్లేయులు అని మనకు నేర్పినవారు గౌరవనీయులు దాదాభాయి నౌరోజీ. ఇవాళ వారికిఆంగ్లేయుల మీద నమ్మకం కలుగవచ్చు. అయితే ఏం? మనం యౌవనపు ఆవేశంతో ఒక్క లడుగు ముందుకు వేసినంత మాత్రాన దాదాభాయి గారి పూజ్యత తగ్గుతుందా? అంతమాత్రాన మనం గొప్పజ్ఞానులం అయిపోతామా? ఏ మెట్టు ఎక్కి మనం పైకి చేరామో, ఆ మెట్టును కాలితో తన్నివేయకపోవడమే బుద్ధిమంతుల లక్షణమని మనం గ్రహించాలి. ఆ మెట్టును తొలిగించివేస్తే, పడ్డ శ్రమఅంతా వ్యర్థమైపోతుందని మనం గ్రహించాలి.

మనం బాల్యం నుంచి యౌవ్వనానికి చేరుకుంటాం. అంతమాత్రాన

బాల్యాన్ని అసహ్యించుకుంటామా? అలా అసహ్యించుకోము. ఎంతో ప్రేమతో బాల్యాన్ని జ్ఞాపకం చేసుకుంటాం సంవత్సరాల తరబడి పాఠంచెప్పిన ఉపాధ్యాయుని వల్ల నాజ్ఞానం పెరిగితే, ఆ ఉపాధ్యాయునికంటే నేను గొప్పజ్ఞానిని అని నేను అనుకోవడం సబబా? నా ఉపాధ్యాయుణ్ణి నేను ఆదరించవలసిందే. తప్పదు. అదే విధంగా హిందూ దేశంలో దాదాభాయి నౌరోజీని గురించి మనం యోచించాలి. వారి వెనుక (యావత్తు) హిందూ దేశపు ప్రజానీకం వున్నదని మనం చెప్పకతప్పదు.

**పాఠకుడు** : మీరు చెప్పింది నిజం. దాదాభాయి నౌరోజీని గౌరవించాలి అనుమాటను అర్థంచేసుకోగలను. వారితోబాటు వారివంటి కొందరు చేసిన కృషివల్లనే యిప్పటి ఆవేశం పెల్లుబికిందని అనడం సబబే. కాని ప్రొఫెసర్ గోఖ్లేగారిని గురించి యిలా భావించడం సాధ్యంకానిపని. ఆయన ఆంగ్లేయులకు పెద్దన్నగా తయారై మాట్లాడుతున్నారు. ఇంగ్లీషు వాళ్లదగ్గర మనం నేర్చుకోవలసింది ఎంతో వున్నదని, ఇంగ్లీషు వారి రాజనీతిని అర్థంచేసుకున్న తరువాతనే స్వరాజ్యాన్ని గురించి మనం మాట్లాడాలని సైతం ఆయన అంటున్నారు. ఆయన ఉపన్యాసాలతో విసిగెత్తిపోయాను.

**సంపాదకుడు** : విసిగెత్తడం మీతొందరపాటు అనారోగ్య లక్షణాన్ని సూచిస్తున్నది. ఈ వషయంలో నా అభిప్రాయం వేరుగా వున్నది. తమ తల్లితండ్రుల ప్రశాంత స్వభావాన్ని చూచి విసుగెత్తిన నవయువకులు, తమతోబాటు తమ తల్లితండ్రులు పరుగెత్తలేక పోతున్నారని కోపించేవాళ్లు, తమ తల్లితండ్రుల్ని ఆదరించడంలేదని నా నిశ్చితాభిప్రాయం. ప్రొఫెసర్ గోఖ్లే గారిని గురించి కూడా యిలాగే అనుకోవాలి. ప్రొఫెసర్ గోఖ్లే మనతోబాటు పరుగెత్తకపోతే ఏం? స్వరాజ్యాన్ని అనుభవించాలని కోరుకునే ప్రజానీకం తమ పూర్వీకులైన పెద్దల్ని తిరస్కరించకూడదు.

పెద్దల్ని గౌరవించాలనే విషయాన్ని మరిచిపోతే మనందరమ్మెలైపోతాం. ప్రౌఢులు, అనుభవజ్ఞులు మాత్రమే స్వరాజ్యాన్ని అనుభవించగలుగుతారు. కళ్లెంలేని జనం అనుభవించలేరు. ఒక్క విషయం చూడండి. ప్రొఫెసర్ గోఖ్లే

హిందూదేశపు విద్యారంగంలో పనిచేయుటకు త్యాగం చేసినప్పుడు అట్టివారు ఎంతమంది ముందుకు వచ్చారో చెప్పండి. గోఖ్లేగారు ఏమిచేసినా, పరిశుద్ధ హృదయంతో చేస్తారు. హిందూదేశానికి కలిగే మేలును గుర్తు పెట్టుకొని చేస్తారు. ఇది వారిని గురించిన నా అభిప్రాయం. హిందూదేశంకోసం ప్రాణాలు అర్పించవలసి వస్తే తక్షణం వారు అర్పించివేస్తారు. దేశం యెడల వారికి గల భక్తి అటువంటిది. వారు ముఖప్రీతికోసం మాట్లాడరు. సత్యమని తాను నమ్మిన విషయాన్నే చెబుతారు. అదువల్ల వారి ఎడ మనం పూజ్యభావం కలిగి వుండాలి.

**పాఠకుడు** : అయితే వారు చెప్పిన ప్రకారం మనం కూడా చేయాలా?

**సంపాదకుడు** : నేను అలా అనను. మనం పరిశుద్ధమైన బుద్ధితో వేరేగాఅభిప్రాయపడితే, ఆ ప్రకారం నడుచుకోమని ప్రొఫెసర్ గోఖ్లే స్వయంగా మనకు సలహా యిస్తారు. వారు చేస్తున్న పనుల్ని నిందించకుండా వుండటం, మనకంటే వారు గొప్పవారని భావించడం, వారు దేశానికి చేసినసేవలో కొంచెమైనా మనం చేయలేదను విషయాన్ని గుర్తించడం, యివీ మనం చేయవలసిన ముఖ్యమైన పనులు. కొన్ని పత్రికలవాళ్లు వారిని గురించి అసభ్యంగా వ్రాస్తున్నారు. అట్టి వారిని మనం నిందించాలి. ప్రొఫెసర్ గోఖ్లే వంటివారిని స్వరాజ్య స్తంభాలుగా మనం అంగీకరించాలి. వారి భావాలు తప్పని. మన భావాలే ఒప్పని, లేక మన అభిప్రాయాల ప్రకారం నడుచుకోనివారు దేశానికి శత్రువులని భావించడం చెడ్డ లక్షణం.

**పాఠకుడు** : మీరు చెప్పిన విషయాలు యిప్పుడు కొద్దిగా నా బుర్రకు ఎక్కుతున్నాయి. అయినా వాటిని గురించి నేను యోచించడం అవసరం. కాని మిస్టర్ హ్యూమ్, సర్‌విలియం బేడర్ బర్న్ మొదలగు వారిని గురించి మీరు చెప్పింది కొంచెం అతిగా వున్నది.

**సంపాదకుడు** : భారతీయులకు వర్తించే నియమాలే ఆంగ్లేయులకు కూడా వర్తిస్తాయని గ్రహించాలి. ఆంగ్లేయులంతా చెడ్డవారే అని నేను అంగీకరించను. హిందూ దేశానికి స్వరాజ్యం లభించాలి అని చాలా మంది

అంగ్లేయులు కోరుతున్నారు. తెల్లవారిలో స్వార్థం ఎక్కువగా ఉన్నమాట నిజమే కాని అంతమాత్రాన ప్రతి ఇంగ్లీషువాడు చెడ్డవాడు అని రుజూ కాదు తమకు హక్కులు, న్యాయం కావాలని కోరేవారు అందరికీ న్యాయం చేయాలి కదా! సర్ విలియం హిందూ దేశానికి చెడుకోరలేదు. మనకు అది చాలు, ముందుకు సాగిన కొద్దీ మనం న్యాయమైన భావంతో కృషిచేస్తే హిందూ, దేశానికి విముక్తి త్వరగా లభిస్తుందని స్పష్టంగా బోధపడుతుంది. ఇంగ్లీషువారి నందరినీ మనం ద్వేషించితే, అందువల్ల స్వరాజ్యం దూరమై పోతుందని కూడా బాధకలుగుతుంది. వారి విషయంలో కూడా మనం న్యాయంగా వ్యవహరిస్తే స్వరాజ్య సాధనకు వారి సహకారం కూడా మనకు లభిస్తుంది. ఈ విషయం మనం గ్రహించాలి.

**పాఠకుడు :** ఇవన్నీ పెద్ద పెద్ద అనవసరపు మాటలని యిప్పుడు నాకు అనిపిస్తున్నది. ఇంగ్లీషువాళ్ల సహకారం లభించాలని, అందువల్ల స్వరాజ్యం లభించవచ్చునని మీరు రెండు తలక్రిందులైన పలుకులు పలికారు. అయితే యీ సమస్యకు యిప్పుడే పరిష్కారం నాకు అవసరం లేదు. అందుకు మనం సమయం వెచ్చించడం వ్యర్థం. స్వరాజ్యం ఎలా లభిస్తుందో మీరు తెలుపండి. మీ భావాల్ని నేను తెలుసుకోగలిగితే అర్థంచేసుకుంటాను. ఇప్పుడు ఇంగ్లీషువాళ్ల సహకారం విషయమై మీరు చెప్పిన మాటలు నన్ను సందేహంలో పడవేశాయి. మీ భావాలకు వ్యతిరేకంగా అవి నన్ను మళ్లించాయి. అందువల్ల యీ విషయం మీరు యిక పొడిగించకుండా వుంటే మంచిదని భావిస్తున్నాను.

**సంపాదకుడు :** నేను ఇంగ్లీషువారిని గురించిన విషయాన్ని పొడిగించదలచడం లేదు. మీరు సందేహంలో పడితే నాకేమీ బాధ కలుగదు. నేను చెప్పవలసిన ప్రధాన విషయం మొదటే చెప్పి సరియైన పనే చేశాను. మీ సందేహాన్ని ఓపికతో తీర్చడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను.

**పాఠకుడు :** మీ యీ మాట నాకు నచ్చింది. దీనివల్ల మంచిగా తోచిన విషయాన్ని స్పష్టంగా చెప్పగలిగిన ధైర్యం నాకు కలిగింది. నాకుగల ఒక

సందేహం యింకా అలాగే వుండిపోయింది. కాంగ్రెస్ స్థాపన జరిగినప్పటినుంచే స్వరాజ్యానికి పునాది పడిందని ఎలా చెప్పగలరు?

**సంపాదకుడు** : చూడండి! కాంగ్రెస్, వేరు వేరు చోట్ల భారతీయుల్ని ప్రోగుచేసి "మనదంతా ఒకే దేశం" అను భావావేశాన్ని కలిగించింది. కాంగ్రెస్ మీద ప్రభుత్వం వారి కన్ను బాగా పడింది. కష్టానికి, శ్రమకు సరియైన ఫలితం ప్రజలకు దక్కాలని కాంగ్రెస్ సదానొక్కి వక్కాణించింది. కెనడాలో వున్న స్వరాజ్యం భారతావనికి కావాలని కాంగ్రెస్ కోరింది. అటువంటి స్వరాజ్యం మనకు లభిస్తుందా లేదా, అటువంటి స్వరాజ్యం మనకు కావాలా, అక్కరలేదా, యింతకంటే మించిన స్వరాజ్యం మరొకటి వున్నదా లేదా, అనునది వేరే విషయం. భారతదేశానికి స్వరాజ్య రసాన్ని రుచి చూపించింది కాంగ్రెసే అని చెప్పడం నా కర్తవ్యం. ఆ యశస్సును మరొకరు పొందాలని అనుకోవడం సరియైన పనికాదు. ఆ విధంగా మనం అనుకుంటే కృతఘ్నులం అనిపించు కుంటాం. అంతేగాక ఏ లక్ష్యాన్ని సాధించాలని మనం భావిస్తున్నామో దానికి పలు ఇక్కట్లు కలుగుతాయి. కాంగ్రెసు వేరని అనుకోవడంవల్ల, స్వరాజ్యానికి అది వ్యతిరేకమని అనుకోవడంవల్ల మనందాన్ని ఉపయోగించుకోలేకపోతాం.

★ ★ ★

# బెంగాల్ విభజన

**పాఠకుడు** : మీ మాటల ప్రకారం కాంగ్రెసే స్వరాజ్యమను బీజాన్ని ప్రజల హృదయంలో నాటిందని అనిపిస్తున్నది. కాని అది సరియైన జాగృతి కాదని మీరు అంగీకరిస్తారు కదా! నిజమైన జాగృతి ఎప్పుడు ప్రారంభమైందో చెప్పండి.

**సంపాదకుడు** : బీజం ఎప్పుడూ మనకు కనబడదు. అది భూమిలోపల

వుండి తనపనిచేస్తుంది. ఆ బీజం తను అర్పితం అయిపోయి భూమి మీద చెట్టురూపంలో వెలువడుతుంది. కాంగ్రెసును గురించి కూడా యిలాగే అనుకోవాలి. నిజమైన జాగృతి బెంగాలు విభజన జరిగిన తరువాతే ప్రారంభమైంది. అందుకు మనం లార్డ్ కర్జనుకు కృతజ్ఞత తెలపాలి. బెంగాలు విభజనకు పూర్వం బెంగాలీ ప్రజలు కర్జనును అలా చేయవద్దని ప్రార్థించారు కాని ఆ దొర తన అధికార మదాంధతతో నిర్లక్ష్యంగా వ్యవహరించాడు. భారతదేశ ప్రజలు కేవలం వాగుడుగాళ్లు మాత్రమేనని, వాళ్లు ఏమీ చేయలేరని ఆయన భావించాడు. అవమానకరమైన భాషను ఉపయోగించాడు బలవంతంగా బెంగాలు ప్రాంతాన్నిముక్కలు చేశాడు. ఆనాటి నుంచే ఆంగ్ల ప్రభుత్వం కూడా యిక్కడ ముక్కలైపోయిందని మనం భావించవచ్చు బెంగాలు విభజనవల్ల ఆంగ్లప్రభుత్వానికి తగిలినంత గట్టి దెబ్బ మరే ఘట్టంవల్ల తగలలేదని చెప్పవచ్చు. ఇంకా ఎన్నో అన్యాయాలు జరిగాయి. అవి బెంగాలు విభజన కంటే తక్కువైనవని భావించకూడదు, ఉప్పుకు వేసిన పన్ను తక్కువ అన్యాయమేమీ కాదు. ఇలాంటి వాటి నెన్నింటినో మనం ఆ తరువాత చూశాము. కాని బెంగాలువిభజనను వ్యతిరేకించుటకు ప్రజలు ముందుకు వచ్చారు. ప్రజావ్యతిరేకత బాగా పెరిగిపోయింది. అప్పుడుబెంగాల్ ప్రాంతపు అనేకమంది నాయకులు తమ సర్వము అర్పణ చేసి వేయుటకు సిద్ధపడ్డారు. తమ సత్తాఏమిటో, తమ శక్తి ఏమిటో వారు గుర్తించారు. దానితో నిప్పు వెంటనే భగ్గుమన్నది. ఇక అది ఆరిపోయే స్థితి ఏర్పడలేదు. ఆర్పవలసిన అవసరం కూడా కలుగలేదు. ఆంగ్ల ప్రభుత్వం చేసిన ఆ ముక్కలు స్థిరంగా ఉండవు, కలిసితీరతాయి. బెంగాలు ఒక్కటవుతుంది. కాని ఇంగ్లీషువారి ఓడకు పడ్డ పగుళ్లు చాలా పెద్దవి. వాటిని సరిచేయడం అస్సాధ్యం. అవి రోజురోజుకు పెరుగుతూనే వుంటాయి. మేల్కొన్న భారతావని యిక నిద్రపోదు. ఇది సాధ్యంమయ్యేవని కాదు. బెంగాలు విభజన నిర్ణయాన్ని రద్దు చేయమను ప్రజలకోరిక స్వరాజ్యం కావాలనే కోరిక వంటిదే. బెంగాలు నాయకులకు యీ విషయం బాగా తెలుసు. ఆంగ్ల ప్రభుత్వానికి కూడా యీవిషయం తెలుసు. అయినా విభజన నిర్ణయంరద్దు కాలేదు.

రోజులు గడిచిన కొద్దీ ప్రజలు నడుంబిగించడం ప్రారంభించారు. ప్రజలు ఒక్కసారిగా లేవరు. అందుకు ఎన్నో ఏండ్లు పడతాయి.

**పాఠకుడు** : బెంగాలు విభజన వల్ల కలిగిన పరిణామాలు మీరు ఏమేమి చూచారో చెప్పండి.

**సంపాదకుడు** : చక్రవర్తికి నివేదించాలనీ, నివేదిస్తూనే వుండాలనీ, అయినా వారు అంగీకరించకపోతే తలవంచి దుఃఖాన్ని, కష్టాన్ని సహించవలసిందేననీ అనుకుంటూ వుండేవాళ్లం. కాని బెంగాలు విభజింపబడిన తరువాత మన అర్జీతోబాటు, ఆ అర్జీకి శక్తి అవసరమనీ, ప్రజలకు కష్టాలు సహించేశక్తి అవసరమనీ అంతా గ్రహించారు. ఈ రకమైన భావచైతన్యం కలగడం బెంగాలు విభజనవల్ల కలిగిన పరిణామమే. యిట్టి భావం, యిట్టి ఆవేశం పత్రికల్లో వెలువడ్డ వ్యాసాలలో ప్రస్ఫుటం అయింది. వ్యాసాలు కఠినంగా వెలువడసాగాయి. చాటుమాటుగా అణగిమణిగి వెల్లడించబడుతూ వుండేభావాలు, బహిరంగంగా, స్పష్టంగా, గట్టిగా వెలువడసాగాయి. స్వదేశీ ఉద్యమం విజృంభించింది. అంతకుముందు ఇంగ్లీషు దొరల్ని చూచి పిన్నలు, పెద్దలు పారిపోతూ వుండేవారు. ఇప్పుడు పారిపోవడం మానివేశారు. వారికి భయపడటం లేదు, దెబ్బలకుకూడా వెరవడం లేదు. జైళ్లకు వెళ్లాలన్నా వెనుకంజవేయడంలేదు. భారతమాత ముద్దుబిడ్డలు, దేశబహిష్కరణకు గురి అయి విదేశాలలో ఉంటున్నారు. ఇది దేశ స్థితిలో వచ్చిన పెద్ద మార్పు. ప్రజల్లో అలజడి ప్రారంభమైంది. బెంగాలు గాలి ఉత్తరాన పంజాబు వరకు, దక్షిణాన మద్రాసు, కన్యాకుమారి వరకు వీచింది.

**పాఠకుడు** : ఇంతకంటే మించి తెలుసుకోతగిన విశేషం మీకు మరో దేమైనా గోచరిస్తున్నదా?

**సంపాదకుడు** : బెంగాలు విభజనవల్ల ఆంగ్లేయుల ఓడ పగుళ్లకు గురి అయినట్లే మనం కూడా పగుళ్లకు - వైరుధ్యానికి - గురి అయ్యాము. పెద్దఘట్టాలవల్ల కలిగే పరిణామాలు కూడా పెద్దవిగానే వుంటాయి. మన నాయకులు రెండు పక్షాలుగా చీలిపోయారు. ఒకపక్షం - మెదకతనంతో

ముందుకుసాగాలనే వాళ్లు - రెండవపక్షం - తీవ్రవాదంతో ముందుకు ఉరకాలనేవాళ్లు. (వీళ్లను మెతకపక్షం, కరుకుపక్షం అని కూడా అన్నారు.) కొందరు మెతకతనం వాళ్లను పిరికిపందలని, తీవ్రవాదుల్ని ధైర్యశాలురని అన్నారు. తమ తమ అభిప్రాయం ప్రకారం జనం భావించసాగారు. రెండు శబ్దాల్ని ప్రయోగించారు. ఈ రెండు పక్షాలవారి మధ్య కొంత విషం కూడా బయలుదేరిన మాటనిజం. ఒకరినొకరు నమ్మడంలేదు. ఒకరి మీద మరొకరు విసుర్లు కూడా విసురుకున్నారు. సూరత్ కాంగ్రెస్‌లో దరిదాపుగా వ్యవహారం ముదిరి కొట్లాటలకుకూడా దారితీసింది. నా అభిప్రాయప్రకారం యీవిధంగా రెండుపక్షాలుఏర్పడటం దేశానికిమంచిదికాదు. అయితే యీవిధంగా ఏర్పడ్డ పక్షాలు ఎక్కువకాలం మనజాలవనుట సత్యం. ఈ పక్షాలు ఎంతకాలం నిలిచియుంటాయను విషయం ఆయా పక్షాల నాయకులపై ఆధారపడివుంటుంది.



# అశాంతి - అసంతృప్తి

**పాఠకుడు** : మీరు బెంగాలు విభజన దేశ జాగృతికి కారణమని అంగీకరించారు. దానివల్ల ఏర్పడిన అశాంతి సరియైనదని భావించాలా, వద్దా?

**సంపాదకుడు** : మనిషి నిద్రనుంచి మేల్కొనగానే ఒళ్లు విరుచుకుంటాడు. అటుయిటు తిరుగుతాడు. అశాంతిగా వుంటాడు. పూర్తి చైతన్యం రావడానికి కొద్ది సమయంపడుతుంది. అదేవిధంగా బెంగాలు విభజనవల్ల జాగృతి ఏర్పడిన మాట నిజమే, కాని పట్టిన మగత పూర్తిగా వదలలేదు. ఇప్పుడు మనం ఒళ్లు విరుచుకునే స్థితిలో వున్నాం. అశాంతిగా వున్నదని మనందరికి తెలుసు. కనుక శాంతి ఏర్పడుతుందని భావించవచ్చు. నిద్రనుంచి మేల్కోగానే

ఒళ్లు విరుచుకుంటామేగాని, ఆ విధంగా ఎక్కువసేపు ఒళ్లు విరుచుకుంటూ వుండలేము. శక్త్యానుసారం కొద్ది సేపటికి పూర్తిగా మేల్కొని తీరతాం. అదేవిధంగా యీ అశాంతిలో నుంచి మనం తప్పక బయటపడతాం. అశాంతి ఎవ్వరికీ రుచించదుకూడా.

**పాఠకుడు** : అశాంతికి గలరెండోరూపం ఏమిటి?

**సంపాదకుడు** : అశాంతి అంటే నిజానికి అసంతృప్తి అన్నమాట. కాంగ్రెస్ కాలంలో దీన్ని డిస్కంటెంట్ అని అన్నారు. భారత దేశంలో అసంతృప్తిని వ్యాప్తం చేయవలసిన అవసరం వున్నదని మిష్టర్ హ్యూమ్ ఎప్పుడూ చెబుతూ వుండేవారు. యీ అసంతృప్తి ఎంతో ఉపయోగకరమైన సాధనం. మనిషితను గడుపుతున్న జీవన సరళివల్ల సంతోషంగావున్నంత వరకు అతణ్ణి మార్చడం చాలా కష్టం. సరళిమార్చుకోమని నచ్చ చెప్పడం కూడా కష్టమే. అందువల్ల సరళిలో మార్పు తేవాలీ అంటే అసంతృప్తి ఉండితీరాలి. వున్న సరళివల్ల అసంతృప్తి కలిగినప్పుడే దాన్ని వదిలించుకునేందుకు మనస్సు యిష్టపడుతుంది. అటువంటి అసంతృప్తి భారత దేశపు మహా పురుషులు ఆంగ్లేయులు వ్రాసిన పుస్తకాలు చదివి మనం అలవరుచుకున్నాం. అసంతృప్తివల్ల అశాంతి బయలుదేరింది. ఆ అశాంతికి చాలా మంది బలి అయిపోయారు. చాలా మంది నష్టపడ్డారు. చాలా మంది జైళ్లకు వెళ్లారు. చాలామంది దేశ బహిష్కరణకు గురి అయ్యారు. ఇక ముందుకూడా యిలా జరుగుతుంది. జరుగవలసిందే. యీ లక్షణాలు అన్నీ మంచివనే భావించవచ్చు. అయితే వాటి ఫలితం చెడుగా కూడా పరిణమించవచ్చు.

## 4

# స్వరాజ్యం అంటే ఏమిటి?

**పాఠకుడు** : భారతావనిని ఒక దేశంగా రూపొందించుటకు కాంగ్రెస్ ఏంచేసిందో, బెంగాలు విభజన వల్ల జాగృతి ఏవిధంగానెలకొన్నదో, అశాంతి మరియు అసంతృప్తి ఎలా వ్యాప్తమైందో, బోధపడింది. అయితే స్వరాజ్యాన్ని గురించి అసలు మీ భావాలు ఏమిటో నేను తెలుసుకో దలిచాను. యీ విషయంలో మన మధ్య అభిప్రాయభేదాలున్నాయేమోనని నా భయం.

**సంపాదకుడు** : అభిప్రాయ భేదాలు వుండటం సహజమే స్వరాజ్యం కావాలని మనందరం ఆరాటపడుతున్నాం. కాని యీ విషయమై మనం ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాం. ఇంగ్లీషు వాళ్లను దేశాన్నుంచి వెళ్లగొట్టాలి అని అందరినోట వింటున్నాం. అయితే వాళ్లను ఎందుకు వెళ్లగొట్టాలి అనే విషయంలో మాత్రం సరియైన అభిప్రాయానికి అంతావచ్చినట్లు లేదు. మిమ్మల్నే ఒక ప్రశ్న అడుగుతున్నాను. మనం అడిగిందంతా ఇంగ్లీషు వాళ్లు మనకు యిచ్చి వేశారనుకోండి. అప్పుడు కూడా వాళ్లను (ఇక్కడినుంచి) వెళ్లిపొమ్మనడం అవసరమని మీరు భావిస్తారా? చెప్పండి.

**పాఠకుడు** : దయయుంచి మీరు మా దేశాన్నుంచి వెళ్లిపొండి అని నేను వాళ్లను కోరతాను. యీ కోరికను అంగీకరించి వాళ్లు భారతావనినుంచి వెళ్లిపోతే సరే. లేక అర్థాలకు అనర్థాలు తీసి యిక్కడవుండి పోయినా నేను వాళ్లను లెక్క చేయను. అట్టిస్థితిలో మన భాషలోగల 'పో' అను శబ్దానికి "ఉండు" అని అర్థం తీశారని భావిస్తాను.

**సంపాదకుడు** : సరే, మనం కోరిన ప్రకారం ఇంగ్లీషు వాళ్లు యిక్కడి నుంచి వెళ్లిపోయారనుకోండి. అప్పుడు మీరు ఏంచేస్తారు?

**పాఠకుడు** : ఈ ప్రశ్నకు యిప్పటినుంచే జవాబు యివ్వలేము. వాళ్లు ఏవిధంగా వెళతారో, దాని మీద అంతా ఆధార పడివుంటుంది. మీరు

చెప్పినట్లు వాళ్లు వెళ్లిపోయారనుకోండి అప్పుడు వాళ్లు అమలు చేస్తున్న విధానాల్ని (చట్టాలు) అనుసరిస్తూ, పరిపాలన సాగిస్తాం. కోరినంతమాత్రాన వాళ్లు వెళ్లి పోతే మన దగ్గర సిబ్బంది తతంగమంతా సిద్ధంగా వుంటుంది. గనుక రాజ్యపరిపాలన విషయంలో యిబ్బందులేమీ మనకు కలుగవు.

**సంపాదకుడు** : మీరు అలా భావించినా, నేను దాన్ని అంగీకరించను. యీ విషయమై ఎక్కువగా నేను చర్చించ దలచడం లేదు. నేను మీ ప్రశ్నకు సమాధానం యివ్వాలి కదా! ఆ సమాధానం మిమ్మల్నే కొన్ని ప్రశ్నలడిగి తద్వారా యిస్తాను. అందువల్ల మిమ్మల్ని కొద్ది ప్రశ్నలు అడుగుతాను. ఇంగ్లీషు వాళ్లను మనం ఎందుకు వెళ్లిపొమ్మని అంటున్నాం.

**పాఠకుడు** : వాళ్ల రాజ్య పరిపాలన వల్ల దేశం దారిద్ర్యంతో తల్లడిల్లిపోతున్నది. వాళ్లు ప్రతిఏడు మన దేశాన్నుంచి ధనం తీసుకుపోతున్నారు. తెల్ల చర్మం వాళ్లకే పెద్ద పెద్ద పదవులు యిస్తున్నారు. మనల్నిపూర్తిగా బానిసత్వంలో వుంచుతున్నారు. మనతో అమర్యాదగా వ్యవహరిస్తున్నారు. మనల్ని వీసమాత్రమైనా లెక్క చేయడంలేదు.

**సంపాదకుడు** : ధనం బయటికి తీసుకుపోరు, వినమ్రంగా వ్యవహరిస్తారు. మనకు పెద్ద పదవులు యిస్తారు. అప్పుడు వాళ్లు యిక్కడ వుండటానికి మీకేమైనా అభ్యంతరమా?

**పాఠకుడు** : ఇది అనవసరమైన ప్రశ్న. పులి తన రూపం మారిస్తే దాని వల్ల ఏమైనా ప్రమాదం వుంటుందా అన్న విధంగా మీరు ప్రశ్నించారు. యిది సమయాన్ని వృధా చేయడమేగదా! పులి తన స్వభావాన్ని మార్చుకోగలిగితే, ఇంగ్లీషు వాళ్లు తమ స్వభావాన్ని మార్చుకోగలుగుతారు. జరగని విషయం జరుగుతుంది అని అనుకోవడం మనిషి పద్ధతికాదు.

**సంపాదకుడు** : కెనడాకు రాజ్యాధికారం లభించినట్లు, బోయర్లకు రాజ్యాధికారం లభించినట్లు మనకు కూడా అదేవిధంగా రాజ్యాధికారం లభిస్తే?

**పాఠకుడు** : ఇది కూడా అనవసరపు ప్రశ్నయే. వాళ్ల దగ్గర వున్నట్లుగా మన దగ్గర కూడా మందు గుండు సామగ్రి వుంటే ఆ విధంగా తప్పక జరుగవచ్చు. అయినా వాళ్లకు యిచ్చినంత రాజ్యాధికారం మనకు అప్పగించితే మనం మన జండానే వుంచుకుంటాం. జపాను ఎలా వుందో భారతావని అలాగే వుంటుంది. మన ఓడలసైన్యం, మన పదాతి దళాలు, మన సంపదలు మన ఆదాయాలు మనకు వుంటాయి. అప్పుడే భారతావనికి ప్రపంచ దేశాల్లో పలుకుబడి వస్తుంది.

**సంపాదకుడు** : మీరు మంచి చిత్రం గీశారు. అంటే ఏమిటి? మనకు ఆంగ్లేయుల రాజ్యం కావాలి. కాని ఆంగ్ల పరిపాలకులు అక్కర లేదు. అంటే మీరు పులి స్వభావాన్ని కోరుతున్నారు, కాని పులిని కోరడం లేదన్నమాట. అంటే మీరు భారతావనిని ఆంగ్లం చేయాలనుకుంటున్నారు. భారతావని ఆంగ్లమయం అయిపోయిన తరువాత అది భారతావని అని అనిపించుకోదు. నిజమైన ఆంగ్లస్థాన్ అని పించుకుంటుంది. ఇది నేను ఊహిస్తున్న స్వరాజ్యం కాదు.

**పాఠకుడు** : నాకుతోచిన ప్రకారం స్వరాజ్యాన్ని గురించి చెప్పాను. మనం యిప్పుడు గడిస్తున్న విద్య కొద్దిగానైనా ఉపయోగకారి అయితే మనం చదువుతున్న స్పెన్సర్, మిల్ మొదలగు గొప్ప రచయితల వ్యాసాలు కొంచెమైనా ఉపయోగకరమైనవైతే, ఇంగ్లీషు వాళ్ల పార్లమెంటు, పార్లమెంటులన్నింటికీ మాతృస్థానంలో వుంటే, సందేహించకుండా మనం వాళ్లను అనుకరించవచ్చునని అభిప్రాయపడుతున్నాను. వాళ్లు యితర దేశాల వారిని తమ దేశంలోకి రానీయనట్లే మనం కూడా యితర దేశాల వారిని మన దేశంలోకి రానీయకూడదు. అంత వరకు నేను వెళ్లగలను. అయితే వారు తమ దేశంలో అమలు చేస్తున్న వ్యవహారాలు యింతవరకు ఎక్కడా జరుగుతున్నట్లు కనబడటం లేదు. కనుక వారి విధానాన్ని మన దేశంలో అనుసరించవచ్చు. యిక మీరు మీ అభిప్రాయాలు చెప్పండి.

**సంపాదకుడు** : ఇంకా సమయం వున్నది. నా అభిప్రాయాలు మన

చర్చ ద్వారా మీకు తెలుస్తాయి. స్వరాజ్యాన్ని గురించి తెలుసుకోవడం మీకు అనిపిస్తున్నంతగా నాకు సులభం అనిపించడంలేదు. కఠినం అనిపిస్తున్నది. యిప్పుడు ఒక్క విషయం మీకు స్పష్టంగా చెబుతున్నాను. మీరు దేన్ని స్వరాజ్యమని అంటున్నారో, అది నిజానికి స్వరాజ్యం కాదు.

★ ★ ★

# ఇంగ్లాండు స్థితి

**పాఠకుడు** : మీరు చెబుతున్న దాన్ని బట్టి చూస్తే, నా దృష్టిలో ఇంగ్లాండులో సాగుతున్న రాజ్యపరిపాలన సరిగా లేదనీ, అది మన దేశానికి పనికిరాదనీ తేలుతున్నది.

**సంపాదకుడు** : మీ యీ అభిప్రాయం సరియైనదే. ఇంగ్లాండు స్థితి యిప్పుడు కడు దయనీయంగా వున్నది. భారతావనికి అట్టిస్థితి ఎన్నడూ దాపురించ కూడదని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. పార్లమెంట్లకు మాతృస్థానంలో వున్నదని అన్నారే, ఆ బ్రిటిష్ పార్లమెంటు ఒక గొడ్రాలుగా, ఒక వేశ్యగా మారి పోయింది. యీ రెండు శబ్దాలు కఠినంగా, కఠోరంగా వున్నాయి. అయినా అవి దానికి వర్తిస్తున్నాయి. దాన్ని నేను గొడ్రాలు అని అంటున్నాను. ఎందుకంటే ఆ పార్లమెంటు యిప్పటి వరకు ఒక్కమంచిపనైనా తానంతట తానుగా చేయలేదు. దాని మీద వత్తిడి తీసుకువచ్చే వాళ్లెవరూ లేనందున, అది ఏమీ చేయలేని స్థితికి చేరుకున్నది. యిది దాని సహజ ప్రాకృతిక స్థితి. అది ఒక వేశ్య. ఎందుకంటే ఏమంత్రివర్గం వుంటే, అది దానికి లోబడి వుంటుంది. యివాళదాని యజమాని ఎస్క్విత్. రేపు బాల్ఫర్, ఎల్లుండి మరో మూడో వాడెవడో కావచ్చు. యిదీ దాని స్థితి.

**పాఠకుడు** : మీ మాటల్లో కొంచెం వ్యంగ్యం వున్నది. గొడ్రాలు అన్నశబ్దాన్ని మీరు యింకా ప్రచలితం చేయలేదు. పార్లమెంటు ప్రజల

ద్వారా ఏర్పడింది. కనుక ప్రజల వత్తిడి వల్లనే అది పని చేస్తుంది. అదే దాని గుణం. అదే దానికి అంకుశం కూడా.

**సంపాదకుడు** : ఇది చాలా తప్పుమాట. పార్లమెంటు గొడ్రాలు కాకుండా వుండాలంటే ఎలా వుండాలో చెబుతాను వినండి. ప్రజలు ఉత్తములైన వ్యక్తుల్ని ఎన్నుకొని పంపుతారు. ఎన్నుకోబడిన మెంబర్లు జీతాలు తీసుకోరు. అందువల్ల వారు ప్రజలమేలు కోసం (పార్లమెంటుకు) వెళతారు. ప్రజలు సుశిక్షితులు సంస్కారవంతులు కనుక వారివల్ల పొరపాటు జరగదని మనం భావించాలి. అట్టి పార్లమెంటుకు అర్జీల అవసరంగాని, వత్తిళ్ల అవసరంగాని వుండకూడదు. ఆపార్లమెంటు పనితీరు సరళంగా వుండాలి. రోజు రోజుకు దాని వేగం పెరిగి ప్రజల మీద దాని ప్రభావం బాగా పడేలా దాని పని జరగాలి. కాని పరిస్థితి తద్విరుద్ధంగా వున్నది. పార్లమెంటు మెంబర్లు స్వార్థపరులుగాను, పటాటోపంతోను వ్యవహరిస్తున్నారని అంతా తమ సొంత స్వార్థాలు నెరవేర్చుకోవాలని యోచిస్తూ వున్నారని అంటున్నారు. కేవలం భయం వల్లనే పార్లమెంటు కొద్దిగా పనిచేస్తున్నది. యివాళ చేసిన నిర్ణయాన్ని రేపు రద్దు చేయవలసి వస్తున్నది. యివాళటి వరకు ఏ సమస్య పరిష్కారానికీ అది కృషి చేసిన దాఖలాలేదు. పార్లమెంటులో పెద్ద విషయాలపై చర్చ జరుగుతున్నప్పుడు మెంబర్లు కాళ్లు చాపుకొని పడుకుంటున్నారు లేక కూర్చునే కునుకు తీస్తున్నారు. పార్లమెంటులో మెంబర్ల అరుపులు కేకలు విని శ్రోతలు దద్దరిల్లుతున్నారు. నివ్వెరపోతున్నారు. పార్లమెంటుకు సంబంధించిన ఒక గొప్ప రచయిత దానికి "ప్రపంచంలో కెల్లా పెద్దవాగుడుకాయ" అని పేరు పెట్టాడు. మెంబర్లు ఏ పార్టీకి చెందిన వారైతే, ఆ పార్టీ నిర్ణయానికి అనుకూలంగా ఆలోచించకుండానే చేతులెత్తి వేస్తున్నారు. అది నిబంధనలేక కట్టుబాటట. ఏ మెంబరైనా అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తే అది అతడి దురదృష్టంగా భావించక తప్పదు. ఎంత సమయం పార్లమెంటుకు లభిస్తున్నదో, ఎంత ధనం పార్లమెంటు కోసం ఖర్చవుతున్నదో, అంత సమయం, అంతధనం, మంచి వారికి లభిస్తే ప్రజలకు ఎంతో క్షేమం

చేకూరుతుందనీ, బ్రిటిష్ పార్లమెంటు కేవలం ప్రజల పాలిటి ఆటబొమ్మయని, ఆ బొమ్మ ప్రజలను అమితంగా ఖర్చుల్లో పడవేస్తున్నదని చాలా మంది అభిప్రాయపడుతున్నారు యివి నా సొంత అభిప్రాయాలని మీరు భావించవద్దు. పెద్దలు, యోచనాపరులైన ఆంగ్లేయులు అలాభావిస్తున్నారు పార్లమెంటు ధర్మబద్ధులైన వారికి తగింది కాదని ఒక మెంబరు ప్రకటించాడు కూడా. మరో మెంబరు పార్లమెంటు పూర్తిగా బేబీ (పిల్ల) అని అన్నాడు. పిల్లలు ఎల్లప్పుడూ పిల్లల రూపంలోనే వుండటం మీరు ఎప్పుడైనా చూచారా? ఏడు వందల సంవత్సరాల తరువాత కూడా, పార్లమెంటు బేబీ (పిల్ల) స్థితిలో వున్నదీ అని అంటే యిక అది పెద్దదయ్యే దెప్పుడు?

**పాఠకుడు** : మీరు నన్ను పెద్ద ఆలోచనల్లో పడవేశారు. యిదంతా వెంటనే నేను అంగీకరించాలని మీరు అనరు. కాని మీరు ఒక విచిత్రమైన భావాల్ని నా హృదయంలో ప్రవేశపెడుతున్నారు. వాటిని నేను జీర్ణం చేసుకోవాలి. సరే, యిక వేశ్య అనుశబ్దాన్ని విశదీకరించండి.

**సంపాదకుడు** : నా భావాల్ని మీరు వెంటనే అంగీకరించలేరు. మంచిదే. అయితే అందుకు సంబంధించిన అవసరమైన సాహిత్యం చదివితే మీకు బోధపడుతుంది. పార్లమెంటును నేను వేశ్య అని అనడం కూడా సబబే. దానికి యజమాని అంటూ ఎవ్వడూ లేడు. దానికి ఏ ఒక్కడూ యజమానిగా ఉండలేడు. అంతటితో నా అభిప్రాయం పూర్తి కాలేదు. ఎవడైనా దానికి యజమాని అయినప్పటికీ, ప్రధానమంత్రి అని అనుకోండి - దాని నడక ఒకే సరళిలో ఉండదు. వేశ్యస్థితి ఎంత చెడ్డగా వుంటుందో, పార్లమెంటు స్థితి కూడా అంత చెడ్డగా వుంటుంది. ప్రధానమంత్రికి మాత్రం పార్లమెంటు యెడ కొద్ది బాధ్యత వుంటుంది. అతడు తన అధికార మత్తులో మునిగి వుంటాడు. నా పార్టీ ఎలా గెలుస్తుందా అనే అతని తపన, ఆలోచన. పార్లమెంటు సరిగా ఎలా పనిచేస్తుందా అని అతడు బహుతక్కువగా యోచిస్తాడు. తన పక్షానికి బలం చేకూర్చుకోవడంకోసం ప్రధాన మంత్రి పార్లమెంటు చేత ఎన్ని పనులు చేయించుతాడో లేక పార్లమెంటును ఎలా

ఉపయోగించుకుంటాడో, ఉదాహరణలు కోకొల్లలుగా దొరుకుతాయి యిదంతా ఆలోచించతగిన విషయం.

**పాఠకుడు** : అయితే యీ నాటి వరకు ఎవరిని నిజాయతీ పరులని, దేశాభిమానులని భావిస్తూ వున్నామో, వారి మీద కూడా మీరు విరుచుకు పడుతున్నారన్నమాట.

**సంపాదకుడు** : అవును, నిజం ప్రధాన మంత్రులంటే నాకు ద్వేషం లేదు కాని అనుభవం మీద వారు అంతటి దేశాభిమానులు అనుపించుకో జాలరని తెలుసుకున్నాను. మనం లంచం అని దేన్ని అంటున్నామో. అట్టి లంచాలన్ని వారు బహిరంగంగా తీసుకోరు, ఇవ్వరు, కనుక వారిని నిజాయతీ పరులని అంటే అనవచ్చునేమో. కాని వాళ్ల దగ్గర సిఫారసులు మాత్రం బాగా పనిచేయగలుగుతాయి. యితరుల చేత పనులు చేయించుకొనుటకై ఉపాధులు, డిగ్రీలు మొదలుగా గల వాటిని లంచం రూపంలో బాగా యిస్తూ వుంటారు. వారియందు పరిశుద్ధమైన భావంగాని, నిజమైన నిజాయతీగాని లేదని గట్టిగా చెప్పగలను.

**పాఠకుడు** : మీ అభిప్రాయాలు యిలా వున్నాయి. ఏ ఆంగ్లేయుల పేరట పార్లమెంటు రాజ్యం చేస్తున్నదో, వాళ్లను గురించి యిక కొంచెం చెప్పండి. తద్వారా వాళ్ల స్వరాజ్యాన్ని గురించి పూర్తిగా తెలుసుకుంటాను.

**సంపాదకుడు** : వోటర్లుగా (ఎన్నుకొనేవారు) వున్న ఇంగ్లీషువాళ్లకు, ధార్మిక గ్రంథం బైబిలు అని, పత్రికలని చెప్పవచ్చు. పత్రికలు చదివివాళ్ళు అభిప్రాయాలు ఏర్పాటు చేసుకుంటారు. నిజానికి పత్రికలు ప్రామాణికాలు కావు. అవి ఒకే విషయానికి రెండు రూపాలు యిస్తాయి. ఒక పార్టీ వాళ్లు ఒక రూపాన్ని పెద్దదిగా చిత్రించి చూపిస్తారు. ఒక పత్రికవాళ్లు ఒక ఆంగ్ల నాయకుణ్ణి ప్రామాణికంగా భావిస్తాడు. మరో పత్రికవాడు అతణ్ణి ప్రామాణికమైనవాడు కాడని అంటాడు. ఏ దేశంలో యిటువంటి పత్రికలు ఉంటాయో, ఆ దేశ ప్రజల దుర్దశను గురించి ఊహించడం కష్టమే.

**పాఠకుడు** : దాన్ని గురించి కూడా మీరే చెప్పండి.

**సంపాదకుడు** : వారి భావాలు ఘడియ ఘడియకు మారుతూ వుంటాయి. ఏడేడు సంవత్సరాలకు రంగుమారుతుందనే సామెత కూడా వారిలో ప్రచారంలో వున్నది. గడియార మందలి పరికరంవలె వారు అటుయిటు తిరుగుతూ వుంటారు. ఒక చోట గట్టిగా కూర్చొనలేరు. ఎవడైనా జోరు జబర్దస్తీ మనిషి వుండి, అతడు పెద్ద పెద్ద మాటలు మాట్లాడుతూ వున్నా, లేక డిన్నర్లు యిచ్చినా అంతా అతడికి డోలు లేక మద్దెల వాయిస్తూ వుంటారు. అలాంటివాళ్లే పార్లమెంటులో చేరితే దాని పరిస్థితి కూడా ఇలాగే వుంటుంది కదా! అయితే వారిలో ఒక్క విశేషం వున్నది. వాళ్లు తమ దేశాన్ని మాత్రం పోగొట్టుకోరు. అది నిజం. ఎవరైనా తమ దేశం వంక, వంకర చూపుచూస్తే మాత్రం వాళ్లు ఊరుకోరు. అలా చూచినవారి అంతు తేల్చి వేస్తారు. అయితే అంత మాత్రాన వారిలో సద్గుణాలన్నీ ఉన్నాయనిగాని, లేక వారిని అనుకరించవచ్చునని గాని, చెప్పలేము. ఇంగ్లీషు ప్రజల్ని అనుకరిస్తే మాత్రం భారత దేశం నష్టపడిపోతుందని నా నిశ్చితాభిప్రాయం.

**పాఠకుడు** : ఇంగ్లీషు ప్రజలు యిలా అయిపోవడానికి కారణాలు ఏమిటో చెప్పండి.

**సంపాదకుడు** : ఇందులో ఇంగ్లీషు వారిలో ప్రత్యేకించి చెప్పవలసిన దోషమేమీ లేదు. యిది ముఖ్యంగా యూరప్ యొక్క యీనాటి సభ్యతా దోషమేనని చెప్పక తప్పదు. ఆసభ్యత నష్టదాయకమైనది. దానివల్ల యూరప్ ప్రజలు నష్టపడి పోతున్నారు.

## సభ్యతా దర్శనము

**పాఠకుడు** : ఇక మీరు సభ్యతను గురించి కూడా చెప్పాలి. మీ లెక్క ప్రకారం యీ సభ్యత చెరుపు చేయునట్టిది.

**సంపాదకుడు** : నా లెక్క ప్రకారంగానే కాక, ఆంగ్ల రచయితల

లెక్కప్రకారంగా కూడా యీ సభ్యత చెరుపు చేయునట్టిదే. దీన్ని గురించి అనేక పుస్తకాలు ప్రచురించబడ్డాయి. అక్కడ యీ సభ్యతకు వ్యతిరేకంగా సంఘాలు కూడా ఏర్పడుతున్నాయి. ఒకరచయిత సభ్యత, వాటి కారణాలు అందుకు చికిత్స అను పుస్తకం రచించాడు. ఆ పుస్తకంలో యీ సభ్యత ఒక రకమైన రోగమని అతడు రుజువు చేశాడు.

**పాఠకుడు** : ఇదంతా మనం ఎందుకు తెలుసుకోలేదు.

**సంపాదకుడు** : కారణం స్పష్టమే. తనకు వ్యతిరేకం అవుతుందన్న విషయమై ఏ వ్యక్తీ మాట్లాడడు యీనాటి నాగరికతా మోహంలో చిక్కుకున్న వ్యక్తులు దానికి వ్యతిరేకంగా వ్రాయరు. దాన్ని సమర్థించేందుకు అవసరమైన విషయాల్ని వెతికి బయటికి తీసుకువస్తారు యిది బాగా తెలుసుకొని చేస్తారా అంటే అదీ చేయరు. తాము రాసింది సత్యమని భావిస్తారు. నిద్రలో స్వప్నాన్ని చూస్తూ అది నిజమేనని మనిషి భావిస్తూ వుంటాడు. నిద్ర నుంచి మేల్కొన్న తరువాత తన పొరపాటును గ్రహిస్తాడు. యిదే స్థితిలో యీ నాగరికతా వ్యామోహంలో చిక్కుకున్న మనిషి కూడా వున్నాడు. యీ సభ్యతను సమర్థించేవాళ్లు రాసిన విషయాలే వాళ్లు చదువుతూ వుంటారు. వారిలో తెలివిగల వాళ్లు మంచి వాళ్లు సైతం వున్నారు. అట్టి వ్యాసాలు చదివి ఆశ్చర్య పోతారు. అయినా ఒకరి తరువాత మరొకరు ఆ వ్యామోహంలో పడిపోతూ వుంటారు.

**సంపాదకుడు** : మీరు చెప్పింది నిజం. ఇక మీరు చదివిన యోచించిన విషయాలు తెలుపండి.

**సంపాదకుడు** : ముందు మనం సభ్యత అంటే ఏమిటో ఏ స్థితిని సభ్యత అంటారో తెలుసుకుందాం. సభ్యతకు నిజమైన గుర్తింపు ఏమిటో తెలుసుకుందాం. బయటి ప్రపంచపు అన్వేషణలోను, శారీరిక సుఖాల సాధనవల్ల ధన్యత చెందుతామని అదే సార్థకత లేక పురుషార్థమని జనం భావిస్తూ వుంటారు. అందుకు అనేక ఉదాహరణలు ఉన్నాయి. వంద సంవత్సరాలకు పూర్వం ఎలాంటి గృహాల్లో యూరప్ జనం నివసిస్తూ

వుండేవారో, యిప్పుడు అంత కంటె మంచి గృహాల్లో వుంటున్నారు యిది నాగరికతా లక్షణంగా భావిస్తున్నారు. యిందు శారీరక సౌఖ్యం యిమిడివున్నది ఇంతకు ముందు జనం చర్మపు దుస్తులు ధరించేవారు. శూలాలు వుపయోగిస్తూ వుండే వారు. యిప్పుడు వారు పొడుగు పాట్ ఫాంటు ధరిస్తున్నారు. శరీరాన్ని అలంకరించుకొనుటకు రంగురంగుల దుస్తులు తయారు చేయించు కుంటున్నారు. శూలాలకు బదులు, ఒకేసారి అయిదు తూటాలు పేల్చగలగిన తుపాకులు వాడుతున్నారు. దీన్ని నాగరికతాలక్షణంగా భావిస్తున్నారు కొన్ని దేశాల ప్రజలు కాళ్లకు చెప్పులు మొదలగువాటిని ధరించేవారు కారు. అట్టివారు యూరప్ దుస్తులు ధరించడం ప్రారంభించేసరికి, వన్యస్థితినుంచి నాగరికతా స్థితికి వచ్చినట్లు భావిస్తున్నారు. మొదట యూరప్‌లో జనం తేలిక పాటి నాగళ్లు ఉపయోగించి, శారీరిక శ్రమ చేసి పొలాలు దున్నుతూ ఉండేవారు యిప్పుడు ఆ స్థితి మారిపోయింది. ఆవిరి సాయంతో నడిచేనాగళ్లు నడిపి, ఒక మనిషి ఎక్కువ పొలాన్ని దున్నుతున్నాడు. ఆ విధంగా ఎక్కువ ధనాన్ని నిల్వ చేసుకుంటున్నారు దీన్ని సభ్యతా లక్షణంగా భావిస్తున్నారు. మొదట జనం కొద్ది పుస్తకాలు మాత్రమే వ్రాస్తూ వుండేవారు. అవి అమూల్య గ్రంధాలుగా పరిగణింపబడేవి. కాని యిప్పుడు ప్రతి వ్యక్తీ రాస్తున్నాడు. అచ్చు వేయిస్తున్నాడు. ప్రజల మనస్సుల్ని భ్రమింపచేస్తున్నాడు. యిది నాగరికతా లక్షణం. మొదట జనం ఎద్దులబండి మీద రోజూ పన్నెండు క్రోసుల దూరం ప్రయాణం చేస్తువుండేవారు. కాని యిప్పుడు రైల్లో నాలుగు వందల క్రోసుల దూరం పయనిస్తున్నారు. యిది సభ్యతా శిఖరమన్నమాట. యీ సభ్యతా పరిధి, ముందుకు సాగేకొద్దీ జనం విమానాలెక్కి ఆకాశంలోకి ఎగురుతారనీ, కొద్ది గంటల్లో ప్రపంచమందలి ఏ చోటుకైనా చేరుకుంటారని భావిస్తున్నారు. ప్రజలు తమ కాళ్లు చేతులు కదిలించనవసరంలేదని, మీట నొక్కగానే ధరించవలసిన దుస్తులు ఎదుట ప్రత్యక్షమవుతాయనీ, రెండో మీటనొక్కితే వార్తా పత్రికలు ఎదుటకు వచ్చి వేస్తాయనీ, మూడో మీట నొక్కితే వాహనం ఎదుటకు వస్తుందనీ ఎప్పుడూ క్రొత్త రుచుల భోజనం లభిస్తుందనీ, కాళ్లు చేతులు కదపకుండా యంత్రాల ద్వారా పనులన్నీ

జరుగుతూ వుంటాయని భావిస్తున్నారు. మొదట యుద్ధం చేయవలసివస్తే ఒకరు యింకొకరి శారీరికబలాన్ని పరీక్షించి చూచుకొని తలపడేవారు. కాని యిప్పుడు ఒక్క ఫిరంగి గుండుకు వేలాది మంది ప్రజల ప్రాణాలు తీయవచ్చు. యిది సభ్యతా లక్షణం. పూర్వం జనం తెరపగాలిలో తమకు నచ్చినంత పని స్వతంత్రంగా చేస్తూ వుండేవారు. యిప్పుడు వేలాదిమంది జనం తమపొట్ట నింపుకొనుటకు, కలిసి పెద్ద పెద్ద యంత్రాగారాల్లోను లేక గనుల్లోను పనిచేస్తున్నారు. వాళ్లస్థితి పశువులకంటే హీనంగా వున్నది. సీసం మొదలుగాగల యంత్రశాలల్లో ప్రాణాలకు తెగించి పని చేయవలసి వస్తున్నది. కాని దానివల్ల లాభం డబ్బుగల వాళ్లు పొందుతున్నారు. పూర్వం చావబాది జనాన్ని బానిసలుగా చేసుకొనేవారు. కాని యిప్పుడు డబ్బుయిచ్చి, భోగవిలాసాల ఆశలు చూపి జనాన్ని బానిసలుగా చేస్తున్నారు. పూర్వం ఎన్నడూ కనీవిని ఎరుగని రోగాలు యిప్పుడు బయలుదేరుతున్నాయి. ఆరోగాల్ని ఎలా నయం చేయాలి. అని డాక్టర్లు అన్వేషణలు కావిస్తున్నారు. అందువల్ల ఆసుపత్రులు తెగ పెరిగి పోయాయి. యివి నాగరికతా లక్షణంగా భావిస్తున్నారు. పూర్వం జాబు రాస్తే దాన్ని తీసుకొని వెళ్లుటకు ఒక ప్రత్యేక మనిషి ఉండేవాడు. అతడు చాలా ఖర్చుపెట్ట వలసి వచ్చేది. యిప్పుడు నేను ఎవళ్లనైనా తిట్టతలుచుకుంటే కాణీ ఖర్చుపెట్టి కార్డు కొని బాగా తిట్లు వ్రాసి అతడికి అందేలా చేయవచ్చు. ఎవరికైనా అభినందనలు పంపాలని అనుకున్నా అంత ఖర్చుతోనే పంపవచ్చు. యిది సభ్యతాలక్షణం. పూర్వం రోజుకు రెండు మూడుసార్లు చేతులతో వండుకున్న ఆహారం అనగా రొట్టె కొంచెం కూర భుజించేవారు. యిప్పుడు ప్రతి రెండు గంటలకు ఒక సారి తినాల్సిందే. యిక తినడమే పని. మధ్య విశ్రాంతి ఉండదు. యింకా యిలా ఎన్నో చెప్పవచ్చు. ఎందాకా చెప్పను? యీ విషయాలన్నీ ఏ పుస్తకంలోనైనా చదువవచ్చు. యివన్నీ నిజమైన సభ్యతా లక్షణాలుగా భావించబడుతున్నాయి. యిందుకు వ్యతిరేకంగా ఎవరైనా మాట్లాడితేవాళ్లు అమాయకులని నిర్ణయించి వేస్తున్నారు. నేను పైన తెలిపిన వివరాలే సభ్యతకు లక్షణాలుగా భావించబడుతున్నాయి. అందునీతిక, ధర్మానికి చోటులేదు. ధర్మాన్ని నేర్పడం

మా పనికాదు, ధర్మం అనేది బూటకం అని కొందరు అంటున్నారు. కొందరు ధర్మం పేరిట డాబు చేస్తున్నారు. నీతిని గురించి కూడా చెబుతున్నారు. ఇరవై ఏండ్ల నా అనుభవంతో చెబుతున్నాను, నీతి పేరట వాళ్లు నేర్పేదంతా అవినీతియే. పైపై మాటల్లో నీతి వుండదను విషయం పసివాడికి సైతం తెలుసు. శారీరిక సుఖం ఎలా పొందడమా అని వెతకడమే యీనాటి సభ్యత పని. కాని అట్టి సుఖం కూడా దొరకడం లేదు.

ఈ సభ్యత అధర్మమయం. ఇది యూరప్‌లో ఏ స్థాయికి వెళ్లిందంటే, అక్కడి జనం సగంమంది సగం పిచ్చివాళ్లుగా కనబడుతున్నారు. వారిలో నిజమైన శక్తిలేదు. అందువల్ల నిషాతో శక్తిని నిలబెట్టుకుంటున్నారు. ఏకాంతంగా వారు కూర్చోలేరు. గృహాలకు రాణులుగా రాణించవలసిన స్త్రీలు వీధినపడవలసి వస్తున్నది. లేక మజూరీ చేసుకోవలసి వస్తున్నది. ఒక్క ఇంగ్లాండులోనే నలుబది లక్షలమంది పేదస్త్రీలు పొట్టనింపుకోడం కోసం గట్టి శ్రమ పడవలసి వస్తున్నది. యిప్పుడు యిందుకు సంబంధించి సఫ్రుజెట్ అను ఉద్యమం సాగుతున్నది.

మనం ఓపిక వహించి కూర్చుంటే సభ్యతావ్యామోహంలో పడిపోయిన జనం, తామే రగిలించిన చిచ్చులోపడి భస్మమై మ్రగ్గిపోయే స్థితి ఏర్పడింది. యిదీ యీ సభ్యతారూపం. పైగంబరు (భగవంతుని దూత) హజరత్ ముహమ్మద్ సాహెబ్ చెప్పిన ప్రకారం యిది సైతాను సభ్యత. హిందూధర్మం దీన్ని పూర్తిగా కలియుగం అని అంటుంది. యీ సభ్యత యొక్క చిత్రాన్ని మీ ఎదుట ఉన్నదున్నట్లు చిత్రించలేను. యిది నా శక్తికి మించిన పని. అయితే యీ సభ్యతా కారణంగా ఆంగ్లేయుల సమాజంలో కుళ్లు ఏర్పడింది. యీ సభ్యత యితరులను నాశనం చేయునట్టిదేగాక, తాను కూడా నశించునట్టిదే. దీనికి దూరంగా ఉండాలి. అందువల్లనే బ్రిటిష్ పార్లమెంటు, ఇతర పార్లమెంట్లు వ్యర్థం అయిపోయాయి. బ్రిటిష్ పార్లమెంటు ఇంగ్లీషు వాళ్ల బానిసత్వానికి ప్రతీక అయిపోయినమాట యదార్థం. మీరు యీ విషయమై చదివినా, యోచించినా, మీకు కూడా అలాగే అనిపిస్తుంది. దీని ద్వారా మీరు ఇంగ్లీషు వారిని తప్పు పట్టవద్దు. వారి మీద మనకు దయ

కలగాలి. వాళ్లు సమర్థులు. ఏదో రోజున యీ స్థితి నుంచి బయట పడగలరని భావిస్తున్నాను. వారు సాహసవంతులు. కష్టపడి పనిచేసే మనుష్యులు. వాస్తవానికి మూలానికి వెళ్ళి చూస్తే వారు అవినీతిపరులు కారని తేలుతుంది. అందువల్ల వారిని గురించి నాకు ఉత్తమమైన భావం వున్నది. వారి హృదయం చెడ్డదికాదు. యీ సభ్యత వారి పాలిటి అసాధ్యమైన రోగం కాదు. అయితే వారు యిప్పుడు యీ రోగం పాలిటపడ్డారని మనం మరిచిపోకూడదు.



# భారతదేశం ఎలా పోయింది?

**పాఠకుడు** : మీరు సభ్యతను గురించి చాలా చాలా చెప్పారు. నన్ను ఆలోచనల్లో పడవేశారు. అయితే యూరప్ ప్రజల నుంచి ఏమి గ్రహించాలి. ఏమి గ్రహించకూడదు అనే సంకటంలో నేను యిప్పుడు పడిపోయాను. ఒక్క ప్రశ్న మాత్రం నామనస్సులో వెంటనే బయలు దేరుతున్నది. యీనాటి సభ్యత చెరుపు చేసేదీ, పెద్ద రోగం అని అన్నారు కదా. అట్టి రోగంలో చిక్కుఉ పోయిన ఇంగ్లీషు వాళ్లు భారతదేశాన్ని ఎలా వశం చేసుకోగలిగారు? ఇక్కడ ఎలా ఉండగలుగుతున్నారు. యిదే నన్ను వేధిస్తున్న ప్రశ్న.

**సంపాదకుడు:** మీ యీ పశ్నకు సమాధానం యిప్పుడు యివ్వడం తేలికయే. కొద్ది సేపటికి స్వరాజ్యాన్ని గురించి కూడా మనం యోచించవచ్చు. మీరు ముందు అడిగిన యీ ప్రశ్నకు సమాధానం యివ్వాలి అనే విషయం నేను మరిచి పోలేదు. ముందుగా మీరడిగిన చివరి ప్రశ్నకు సమాధానం యోచిద్దాం. ఇంగ్లీషువాళ్లు మన దేశాన్ని తీసుకోలేదు. మనమే వాళ్లకు యిచ్చివేశాం. వాళ్లు తమ బలంతో యిక్కడ స్థిరబడలేదు. మనమే వాళ్లను స్థిరపరిచి వుంచాం. ఎలాగో పరిశీలిద్దాం. అసలు ఇంగ్లీషు వాళ్లు మన దేశానికి వ్యాపారం నిమిత్తం వచ్చారనేవిషయం జ్ఞాపకం చేస్తున్నాను. కంపెనీ

బహాదుర్ (శక్తివంతుడు) ను గురించి జ్ఞాపకం చేసుకోండి. వాళ్లను శక్తివంతంచేసింది ఎవరు? పాపం వాళ్లకు యిక్కడ రాజ్యం చేయాలనే తలంపు లేదు. కంపెనీ వాళ్లకు సాయం చేసింది ఎవరు? వాళ్ల వెండిని చూచిమోహంలో పడిపోయిందెవరు? వాళ్ల వస్తువుల్ని అమ్మిందెవరు? అంతా మనమే చేశామనేందుకు చరిత్రయే సాక్ష్యం. త్వరగా డబ్బు సంపాదించాలని మనం వాళ్లకు స్వాగతం పలికాం. మనం వాళ్లకు సాయం చేశాం. నాకు బంగుత్రాగే అలవాటు వుందనుకోండి బంగు అమ్మేవాడు నాకు బంగు అమ్మితే తప్పెవరిది? బంగు అమ్మినవాడిదా లేక బంగుత్రాగే అలవాటు గల వాడిదా? అమ్మినవాడిదే దోషం అని అంటే, నా వ్యసనం తొలిగిపోదు కదా. బంగు అమ్మే వాణ్ణి ఒకణ్ణి వెళ్లగొట్టామనుకోండి. అప్పుడు మరొకడు వచ్చి అమ్మడా? అందువల్ల భారత దేశానికి సేవ చేసే సత్యవాది, బాగా పరిశీలించి మూలానికి చేరుకోవాలి. అధికంగా తినడంవల్ల నాకు అజీర్ణం కలిగితే, ఆ దోషాన్ని నీటి మీదకు నెట్టి అజీర్తిని తొలిగించుకో లేనుగదా! రోగానికి అసలు మూలం ఏమిటో తెలుసుకున్నవాడే నిజమైన డాక్టరు. భారత దేశాన్ని పట్టుకున్న జాడ్యం పోగొట్టి నయం చేయగలిగిన డాక్టరు కావాలనుకుంటే, అసలు రోగానికి గల మూలకారణం ఏమిటో తెలుసుకోవాలి.

**పాఠకుడు** : మీరు చెప్పింది నిజం. ఇకనాకు నచ్చ చెప్పుటకు మీరు కారణాలను పేర్కొనవలసిన అవసరం లేదు. మీ భావాలు తెలుసుకోవాలని నేను ఆరాటపడుతున్నాను. యిప్పుడు మనం కీలకమైన విషయానికి వచ్చాం. అందువల్ల మీరు నాకు మీ భావాలనే చెప్పండి. నాకు ఎక్కడైనా సందేహం కలిగితే మిమ్ము ఆపుతాను.

**సంపాదకుడు** : మంచిది. అలాగే చేద్దాం. కాని ముందు ముందు మనిద్దరికీ అభిప్రాయ భేదాలు వస్తాయని నాకు అనిపిస్తున్నది. అయితే మీరు నన్ను ఆపినప్పుడు, నేను కారణాలు పేర్కొంటాను. ఇంగ్లీషు వ్యాపారస్థులకు మనమే సహాయం చేశామని, అందువల్లనేవాళ్లు భారతావనిలో తమ కాళ్లు చాపగలిగారని మనం అనుకున్నాం. అలాగే మన దేశంలో వున్న రాజులు

పరస్పరం కలహించుకొని ఆంగ్ల బహాదురును సాయం కోరేవారు. బహాదుర్ ఆంగ్ల కంపెనీవాళ్లు వ్యాపారంలోను, పోరాటంలోను ఆరితేరినరకం. ఆ విషయాలలో నీతి, అనీతిని వాళ్లు పట్టించుకోలేదు. వ్యాపారం పెంచుకోవడం, డబ్బు సంపాదించడం యిదేవారి వృత్తి. అందుకుమనం సహాయం చేశాం. వాళ్లు మనసహాయం బాగా పొందారు. తమ కొట్లు, కొటలు పెంచుకుంటూ ముందుకు సాగారు. వాటిని రక్షించుకోవడం కోసం పటాలాల స్థావరాలు నెల కొల్పారు. అట్టివారి సైనిక స్థావరాలను మనం ఉపయోగించుకున్నాం. అందువల్ల యిప్పుడు తప్పు పట్టడం అనవసరం. అప్పుడు హిందువులు మహమ్మదీయుల మధ్య వైరం అధికంగా వుండేది. దానివల్ల వాళ్లకు మంచి అవకాశం దొరికింది. యీ విధంగా మనం ఆంగ్ల కంపెనీకి ఎన్నో మంచి అవకాశాలు కల్పించాం. దానితో భారత దేశం మీద వారికి అధికారం పట్టు లభించింది. అందువల్ల భారత దేశం మన చెయ్యి జారి పోయింది అని అనుటకు బదులు, మనమే భారత దేశాన్ని ఇంగ్లీషు వాళ్లకు యిచ్చి వేశామనడం సబబు.

**పాఠకుడు** : ఇప్పుడు ఆంగ్లేయులు భారత దేశాన్ని ఎలా తమ అధీనంల వుంచుకోగలరో చెప్పండి.

**సంపాదకుడు** : మనం ఇంగ్లీషు వాళ్లకు భారత దేశాన్ని ఎలా యిచ్చి వేశామో, అలాగే, దేశాన్ని వాళ్ల దగ్గర మనమే ఉండనిస్తున్నాం. వాళ్లలో కొందరు ఖడ్గ బలంతో భారతదేశాన్ని సాధించాం అని అంటున్నారు. ఖడ్గ సాయంతోనే భారత దేశాన్ని తమ అధీనంలో ఉంచుకోగలుగుతున్నామని కూడా వాళ్లు అంటున్నారు. యీ రెండు విషయాలు తప్పే. భారత దేశాన్ని అధీనంలో ఉంచుకొనేందుకు ఖడ్గం దేనికీ ఉపయోగపడ లేదు. మనమే స్వయంగా వాళ్లను యిక్కడ ఉండనిస్తున్నాం.

ఇంగ్లీషువాళ్లను నెపోలియన్, వ్యాపారులు అని అన్నాడు. ఆయన అన్నమాట సత్యం. వారు ఏ దేశాన్ని తమ అధీనంలో ఉంచుకున్నా, దాన్ని వ్యాపారం కోసమే వాడుకుంటారు. యిది గుర్తించవలసిన విషయం.

వారిసైన్యాలు వారి యుద్ధ నౌకలు కేవలం వారి వ్యాపారరక్షణార్థమే వుంటాయి. ట్రాన్సువాల్ వాళ్ల అధీనంలోకి వచ్చింది. అది వ్యాపారమనే పేరాశకు వినియోగించదని మిస్టర్ గ్లైడస్టనుకు బోధపడింది. వెంటనే ట్రాన్సువాలును ఆంగ్లేయులు తమ అధీనంలో వుంచుకోకూడదని అతడు భావించాడు. కాని ట్రాన్సువాల్‌లో వ్యాపార ఆకర్షణ కనిపించినప్పుడు యుద్ధం సాగించారు ట్రాన్సువాల్ మీద ఆంగ్లేయుల పరిపాలన ఉండాలని మిస్టర్ చేంబర్లైన్ కనుక్కున్నాడు. కీర్తిశేషుడైన ప్రెసిడెంటు క్రూగర్‌ని "చంద్రుని యందు సువర్ణం వున్నదా లేదా" అని ఎవరో ప్రశ్నించారు. "చంద్రుని యందు సువర్ణం వుండే అవకాశం లేదు. నిజంగా చంద్రుని యందు బంగారమే వుండి వుంటే ఇంగ్లీషువాళ్లు ఎప్పుడో తమ రాజ్యాన్ని అంతవరకు విస్తరించి యుండేవాళ్లు" అని సమాధానం యిచ్చాడు. డబ్బేవాళ్లకు దేవుడు అను విషయం గుర్తించితే విషయాలన్నీ స్పష్టపడుతాయి. ఇంగ్లీషు వాళ్లను మనం భారతదేశంలో కేవలం మన అవసరాల కోసం ఉంచుతున్నాం. మనకు వాళ్ల వ్యాపారం యిష్టం. జిత్తులతో మనల్ని వాళ్లు మురిపిస్తారు. మనం మురిసిపోతాం. మురిపించిమన చేత పని చేయించుకుంటారు. ఇందులో వారిని తప్పుపట్టడం వారి సత్తాను నిలపి వుంచడానికి వుపయోగిస్తుందని అనుకోవాలి. పరస్పరం మనం కలహించుకొని వాళ్లకు వత్తాసు పలుకుతున్నాం. ఈ విషయం సరియైనదేనని మీరు భావిస్తే, ఇంగ్లీషు వాళ్లు వ్యాపారం కోసం యిక్కడకు వచ్చారనీ, వ్యాపారంకోసం యిక్కడ వుంటున్నారనీ, వాళ్లు ఉండడానికి మనమే సహాయకులం అను విషయం బలపడినట్లే. వాళ్ల దగ్గరగల ఆయుధసామగ్రి పూర్తిగా వ్యర్థమేనని తేలుతున్నది.

ఈ సమయంలో మీకు ఒక్క విషయం జ్ఞాపకం చేస్తున్నాను. జపానులో ఆంగ్లేయుల జండా ఎగురుతున్నదని మీరు ఊహించండి. జపానుతో వాళ్లు చేసుకున్న ఒప్పందం తమ వ్యాపారం కోసమే. జపానుల్లో ఇంగ్లీషు వాళ్లు తమ వ్యాపారాన్ని బాగా నిలదొక్కుతారని మీరు గ్రహించాలి. ఇంగ్లీషువాళ్లు

తమ సామగ్రిని అమ్మడం కోసం ప్రపంచాన్నంతటిని మార్కెట్ చేసుకోవాలని కోరుతున్నారు. ఆ విధంగా వాళ్లు చేయలేరను విషయం సత్యం యీ విషయంలో వారిది తప్పు అని అనడానికి వీలు లేదు. అయితే తమ కృషిలో మాత్రం వాళ్లు ఎట్టి లోటు చేయరు

# 8

# భారతదేశ స్థితి -1

**పాఠకుడు** : భారతదేశం ఇంగ్లీషువాళ్ల చేతుల్లో పడి ఎందుకు వున్నదో బోధపడింది. యిప్పుడు భారతావని స్థితిని గురించి మీ భావాలు తెలుసుకోవాలని భావిస్తున్నాను.

**సంపాదకుడు** : ఈనాడు భారతావని కడుపేద స్థితిలో వున్నది. యీ మాట మీకు చెబుతున్నప్పుడు నా కండ్లలో కన్నీరు నిండుతున్నది. గొంతు ఎండిపోతున్నది. యీ విషయం మీకు పూర్తిగా విశదీకరించగలనో లేనో అని సందేహం కలుగుతున్నది. భారతావని ఇంగ్లీషువాళ్ల చేత త్రొక్కివేయబడటం లేదు. యీనాటి సభ్యత యొక్కకాళ్ల క్రింద పడి మన దేశం నలిగిపోతున్నది. దాని వలయంలో చిక్కుకున్నది. దాని బారినుంచి రక్షణ పొందాలంటే యిప్పటికీ ఉపాయం వున్నది. కాని రోజు రోజుకు సమయం గడిచిపోతున్నది. నాకు ధర్మం అంటే మక్కువ అధికం. అందువల్ల భారత దేశం ధర్మ భ్రష్టం అయిపోతున్నందుకు అమితంగా నాకు దుఃఖం కలుగుతున్నది. ధర్మం అంటే హిందూ, ముస్లిం, జురాష్ట్రియన్‌ల మతం అని అర్థం కాదు. మతాలన్నింటిలో యిమిడి యున్న ముఖ్యమైన ధర్మం మన భారతదేశాన్ని వదిలి వెళ్లి పోతున్నది. మనం భగవంతునికి దూరమై పోతున్నాం.

**పాఠకుడు** : ఏ విధంగా ?

**సంపాదకుడు** : సోమరులమనే ఆరోపణ భారతీయుల మీద వున్నది. తెల్లవాళ్లు కష్టపడి పనిచేస్తారనీ, ఉత్సాహవంతులనీ అంటారు. దాన్ని మనం

అంగీకరిద్దాం. అయితే యీ స్థితిని మార్చివేయాలని మన భావం. హిందూ, ముస్లిం, జూరాష్ట్రియన్ క్రైస్తవమతాలన్నీ ప్రాపంచిక విషయాలపై తక్కువగా శ్రద్ధ చూపించాలనీ, ధార్మికవిషయాలపై శ్రద్ధ అధికంగా చూపించాలని బోధిస్తున్నాయి. మనం ప్రాపంచిక విషయాలపై కలిగే లోభాన్ని తగ్గించుకోవాలి ధార్మిక లోభాన్ని పెంచుకోవాలి. ఉత్సాహం ధార్మికలోభం మీదనే అధికంగా కలిగి యుండాలి.

**పాఠకుడు** : అంటే మీరుమత ఛాందసత్వాన్ని బోధిస్తున్నారన్నమాట. మతాన్ని గురించి మోసగాళ్లు ఛాందసాన్ని బుర్రలకు ఎక్కించి ప్రపంచాన్ని మోసగించారు. యిప్పటికీ మోసగిస్తున్నారు.

**సంపాదకుడు** : మతాల మీద తప్పుడు ఆరోపణ చేస్తున్నారు. అన్ని మతాల్లోను ఛాందసత్వం వున్నది. సూర్యుడు వున్నచోట చీకటికూడా వుంటుంది. ప్రతివస్తువును నీడ అంటివుంటుంది. అయితే మతం పేరిట మోసగిస్తున్న వాళ్లు, మిగతా ప్రాపంచికమోసగాళ్ల కంటే మేలుగా వున్నారు. సభ్యతాఛాందసాన్ని గురించి యింతకు ముందు మీకు విశదీకరించాను. అంతటి ఛాందసం మతం విషయంలో నేను ఎన్నడూ చూడలేదు.

**పాఠకుడు** : అలా అనడం సబబా? మతం పేరట హిందువులు ముస్లిములు పోరాటాలు జరిపారు. మతం పేరట క్రైస్తవుల మధ్య పెద్ద పెద్దయుద్ధాలు జరిగాయి. మతం పేరట వేలాది నిరపరాధులు చంపివేయబడ్డారు. చాలామందిని తగుల బెట్టారు. అమాయక ప్రజలు కష్టాల పాలయ్యారు. యిదంతా సభ్యత యొక్క ఛాందసాన్ని మించిన హీనస్థితి కాదా?

**సంపాదకుడు** : ఒక్క విషయం. మతఛాందసత్వం, సభ్యత యొక్క ఛాందసత్వం కంటే సహించ తగిన స్థితిలో వున్నదని చెప్పవచ్చు. మీరు చెప్పిందంతా పాఖండత్వం క్రిందకు వస్తుంది. అయితే అట్టి పాఖండులంతా హతమైపోతే సమస్య పరిష్కారం అవుతుంది. కాని అమాయక ప్రజలు ఆ స్థితిలో వున్నంత కాలం అలా జరుగుతూనే వుంటుంది. అయితే అట్టి వాటి

ప్రభావం చిరస్థాయిగా వుండదు. సభ్యత పేరట జరిగిన మారణ హోమంలో భస్మమైపోయిన వారి సంఖ్యకు అంతు అనేదే లేదు. మంచి వాళ్లనుకున్నవారు కూడా అందు దుమకడం విశేషం. అయితే వాళ్లు రెంటికీ చెడిన రేవడులవుతున్నారు. యిటు దేముడికీ చెందరు, అటు ప్రపంచానికీ చెందరు అసలు సత్యాన్ని వాళ్లు మరిచి పోతున్నారు. సత్యమనునది ఎలుకవలె కరుస్తుంది. ఆకాటు ప్రభావం వంట్లోకి ఎక్కినప్పుడు పాతవైషమ్యాలే మనకు మధురం అనిపించుతాయి. అట్టి వైషమ్యాలు స్థిరంగా వుండాలని నా ఉద్దేశ్యం కాదు. వాటికి వ్యతిరేకంగా మనంతప్పక పోరాడుతాం. అయితే ఆపోరాటం ధర్మాన్ని మరిచిపోయి జరుపకూడదు. ధర్మాన్ని బాగా అర్థం చేసుకొని, దాన్ని రక్షిస్తూ పోరాటం జరపాలి

**పాఠకుడు** : అయితే ఆంగ్లేయులు భారతావనిలో శాంతిని నెలకొల్పి మనకు కల్పించిన సుఖం వ్యర్థమేనని మీ అభిప్రాయమా?

**సంపాదకుడు** : బహుశ మీరు అట్టి శాంతిని చూస్తున్నారేమో, కాని నేను అట్టి శాంతి సుఖాన్ని చూడటం లేదు.

**పాఠకుడు** : అయితే మోసగాళ్లు, పిండారీలు భిల్లజాతివాళ్లు ప్రజల్ని భయపెట్టి బ్రతికేవారు అట్టి వాళ్ల దోషం మీ దృష్టిలో ఏమీ లేనట్లేనా? సంపాదకుడు - నిశితంగా పరిశీలించి చూడండి. అట్టివారివల్ల కలిగే భయం తక్కువగా వుండేది. నిజంగా వాళ్లు భయంకరంగా వ్యవహరించి యుంటే ప్రజలు సమూలంగా నాశనమైపోయి వుండేవారు. యిప్పటి శాంతి నామమాత్రమే. యీ శాంతి వల్ల మనం మగటిమిలేనివాళ్లం. నపుంసకులం, పిరికివాళ్లం అయిపోయాం. భిల్లులు పిండారీల స్వభావాన్ని ఇంగ్లీషు వాళ్లు మార్చి వేశారని భావించకూడదు. వాళ్ల వల్ల అన్యాయాలు జరిగినా మనం వాటిని సహించాలి. కాని పరాయి వాళ్లెవరో వచ్చి అట్టివారి అన్యాయాలనుంచి మనల్ని రక్షించారని అనుకోవడం సహించరాని విషయం. బలహీనులం, పిరికిపందలం అయి పోయేకంటే, భిల్లుల బాణాలకు ఎరయై చనిపోవడం నాకు యిష్టం. ఆ నాటి భారతావని స్థితే వేరుగా వుండేది. మెకిలిన్

భారతీయులు మగటిమి లేని వారని అన్నాడు అది అతడి అధమ అజ్ఞాన స్థితిని సూచిస్తున్నది. భారతీయులు ఎన్నడూ మగటిమి కోల్పోలేదు. పర్వతప్రాంతాల్లో వుండే జనంతోపాటు అక్కడ పులులు, తోడేళ్లు కూడా వుంటాయి. అట్టి ప్రాంత ప్రజలతో కూడిన దేశం నిజంగా పిరికిపందే అయితే ఎప్పుడో నాశనం అయిపోయివుండేది. మీరు ఎప్పుడైనా మన పొలాలకు వెళ్ళారా? నేను చెబుతున్నాను నమ్మండి. మనరైతులు పొలాల్లో నిర్భయంగా పడుకొని నిద్రపోతారు. ఇంగ్లీషు వాళ్లుకాని, మీరు కాని ఆ విధంగా పడుకోవడానికి సిద్ధపడగలరా? నిజానికి బలం నిర్భయత్వంలోనే వున్నది. శరీరంలో మాంసం అమితంగా పెరగడం బలం అనిపించుకోదు. కొంచెం ఓపికతో ఆలోచిస్తే యీ విషయం తేలికగా బోధపడుతుంది.

స్వరాజ్యాన్ని కోరే మీవంటి వారికి ఒక్క విషయం చెప్పడం అవసరమని భావిస్తున్నాను. మోసగాళ్లూ భిల్లులు, పిండారీలు వీరంతా ఎవరు? మన దేశవాసులే. మనసోదరులే. వారిని జయించడం మీపని, నాపని. మీ సోదరుని గురించి మీకు భయం వున్నంతవరకు, మీరు మీ లక్ష్యాన్ని చేరలేరు.

★ ★ ★

# భారతదేశ స్థితి-2

# రైలుబండ్లు

**పాఠకుడు** : భారతదేశంలో శాంతి స్థాపనను గురించి నాకు కలిగిన మోహభావాన్ని మీరు తొలిగించివేశారు. నా దగ్గర యిక ఏమీ మిగలనీయలేదని అనుకుంటున్నాను.

**సంపాదకుడు** : ఇప్పటివరకు మీకు ధర్మం యొక్క స్థితి గురించి వివరించాను. ఇక భారతదేశం కడు దీనస్థితిలో ఎందుకు వున్నదో నా

అభిప్రాయాలు చెబితే మీరు నన్ను ఏవగించుకోవచ్చు ఈ నాటివరకు కొన్ని వస్తువులు దేశానికి మేలు చేశాయని మీరు, నేను అందరం భావిస్తూ వచ్చాం. కాని అది నిజం కాదని, అవి మేలుకు బదులు కీడు చేశాయిని, లాభానికి బదులు నష్టం కలిగించాయని చెప్పబోతున్నాను.

**పాఠకుడు** : చెప్పండి.

**సంపాదకుడు** : రైళ్లు, వకీళ్లు, డాక్టర్లు మన దేశాన్ని బిచ్చగాళ్లదేశంగా చేసి వేశారు. మనం జాగ్రత్తపడి వెంటనే మేల్కొనకపోతే మునిగిపోతాం ఇది యదార్థం.

**పాఠకుడు** : మీ అభిప్రాయం వింటూవుంటే యిక మన భావాల కలయిక అసాధ్యం అని అనిపిస్తున్నది. ఇప్పటివరకు వేటివల్ల మేలు జరుగుతుందని భావిస్తున్నామో, వాటి మీద ఒక్కసారిగా మీరు దాడి చేశారు. ఇక మిగిలేదేమిటో అర్థకావడం లేదు.

**సంపాదకుడు** : మీకు ఓపిక అవసరం. ఈనాటి నాగరికత ఎలా కీడుచేస్తున్నదో గ్రహించాలి. సత్యం అతి కష్టంమీద బోధపడుతుంది. క్షయరోగికి, అతడు చనిపోయేనాటివరకు నీవు తప్పక బ్రతుకుతావని డాక్టర్లు చెబుతారు. క్షయ బయటికి కనిపించని ప్రమాదకరమైన రోగం. రోగి ముఖంలో ఎరుపుదనం కూడా కన్పిస్తుంది. అందువల్ల బ్రతుకుతాననే ఆశ రోగికి కలుగుతుంది. చివరికి ఆ ఆశతోనే మునిగిపోతాడు. నాగరికతా వ్యవహారం కూడా యింతే. అది ఒక కనబడని జాడ్యం. దాన్ని జాగ్రత్తగా కనిపెట్టిఉండాలి.

**పాఠకుడు** : అయితే యిక రైలుపురాణం వినిపించండి.

**సంపాదకుడు** : రైళ్లే గనుకలేకపోతే ఆంగ్లేయులకు దేశంమీద యిప్పుడు లభించినంత పట్టు లభించి యుండేది కాదని వెంటనే మనకు అనిపిస్తుంది. కాని రైళ్లవల్ల దేశంలో మహామారివ్యాప్తం అయింది. రైళ్ళే గనుక లేకపోతే కొద్దిమందే ఒక చోటు నుండి మరో చోటుకి వెళ్లగలిగియుండేవారు.

అందువల్ల అంటురోగాలు ఒక చోటునుంచి మరో చోటుకి వ్యాప్తమయ్యేవి కావు. పూర్వం ప్రకృతి సహజంగా అక్కడక్కడ జబ్బులు వస్తూ వుండేవి. కాని రైళ్లురాగానే అంతటా వ్యాపించాయి. కరువు కాటకాలు ప్రారంభమయ్యాయి. రైళ్లద్వారా ఎగుమతులు ప్రారంభమయ్యాయి దానితో రైతులు తమ ధాన్యం అమ్మివేసుకోవడానికి అలవాటుపడ్డారు. ధర ఎక్కువ పలికే చోటుకు ఆ ధాన్యం చేరసాగింది. దానితో కరవు ప్రారంభమైంది. ప్రజల నిర్లక్ష్యంవల్ల కరువు దాపురిస్తుంది. రైళ్లవల్ల దుష్టత్వం పెరిగింది. దుష్టులు తేలికగా తమ దుష్టత్వాన్ని వ్యాప్తంచేయగలుగుతున్నారు. దేశంలోగల పుణ్యక్షేత్రాలు అపవిత్రం అయిపోయాయి. పూర్వం జనం ఎన్నో కష్టాలుపడి పుణ్యక్షేత్రాలు చేరుకునేవారు. వారి హృదయాలు దైవభక్తితో నిండి యుండేవి. కాని యిప్పుడు దొంగలు, మోసగాళ్లు పెద్ద సంఖ్యలో అక్కడకు చేరుతున్నారు. వాళ్లూ యాత్రీకుల్ని మోసం చేస్తున్నారు.

**పాఠకుడు** : మీ మాటలు ఏకపక్షంగా వున్నాయి. చెడ్డ వాళ్లవలె, మంచివాళ్లుకూడా వెళ్లవచ్చు. గదా! రైళ్లవల్ల ఎక్కువ ప్రయోజనం పొందవచ్చుగదా!

**సంపాదకులు** : మంచివాళ్లు ఆరుద్ర పురుగువలె మెల్లగా కదులుతారు. రైళ్లతో వాళ్లకు కుదరదు. మంచివాళ్ల హృదయంలో స్వార్థం వుండదు. వాళ్లు తొందరపడరు. మంచి తనం వ్యాప్తికి సమయం పడుతుంది. చెడుకు వేగం ఎక్కువ. ఇల్లు కట్టడం చాలా కష్టం. కాని కూల్చడం తేలిక. అదేవిధంగా రైళ్లు కీడు ఎక్కువగా చేశాయి. రైళ్లవల్ల కరువు వస్తుందా లేదా అను విషయంపై నిపుణులు నాకు కొద్దిసేపు సందేహం కలిగించవచ్చునేమో. కాని రైళ్ల వల్ల దుష్టత్వం పెరుగుతున్నదను నా భావంలో మాత్రం మార్పురాదు.

**పాఠకుడు** : రైళ్లవల్ల కలుగుతున్న ప్రయోజనాల ముందు, వాటివల్ల కలిగే నష్టాలు వెలవెలబోతున్నాయి కదా! దేశమంతా ఒక్కటి అను భావావేశం ప్రజలకు కలిగింది రైళ్లవల్లనే కదా! కనుక రైళ్లవల్ల కలిగిన నష్టం ఏమీ లేదని నా అభిప్రాయం.

**సంపాదకుడు** : మీది తప్పు అభిప్రాయం - "మీది ఒక దేశంకాదు. ఒకదేశంగా రూపొందాలంటే వందలాది సంవత్సరాల సమయం పడుతుంది' ' అని మీకు నేర్పింది ఇంగ్లీషువాళ్లే. ఇది తప్పుడు బోధ. దీనికి ఆధారం లేదు. ఇంగ్లీషు వాళ్లు రాకపూర్వం మనదేశం ఒక్కటి. మన భావం ఒక్కటి. మన ప్రవర్తన ఒక్కటి. కనుకనే ఒకే రాజ్యంగా దీన్ని ఇంగ్లీషు వాళ్లు మలుచుకోగలిగారు. మనలో మనకు విభేదాలు కల్పించింది కూడా ఇంగ్లీషువాళ్లే.

**పాఠకుడు** : ఇది జాగ్రత్తగా పరిశీలించి అర్థంచేసుకోవలసిన విషయం.

**సంపాదకుడు** : నేను యోచించి పరిశీలించి తెలుసు కోకుండా మాట్లాడను. పూర్వం మనమంతా ఏకదేశంగా వున్నాము అంటే మనలో మనకు అభిప్రాయభేదాలు వుండేవి కావని భావించకూడదు. మన పూర్వీకులు ఎద్దుబండ్లలో దేశమందంతట ప్రయాణం చేస్తూ వుండేవారు. ఒకరు మరొకరి భాషను నేర్చుకుంటూవుండేవారు. వారిలో తేడాలువుండేవి కావు. వారు ఎంతో దూరద్రష్టలు. సేతుబంధనంచోటు రామేశ్వరం, జగన్నాథపూరి, హరిద్వారం యీ మూడింటిని యాత్రాస్థలాలుగా నిర్ణయించినవారి ప్రజ్ఞ అమోఘం. వారు మూర్ఖులు కాదని మీరు అంగీకరిస్తారుకదూ! భగవంతుని భజన ఇళ్లలో కూర్చొని కూడా చేసుకోవచ్చుననివారికి తెలియదా! మనస్సు మంచిగా వుంటే అరచేతిలో వైకుంఠం వెలుస్తుందని వారు మనకు బోధించారు. ప్రకృతి యీదేశాన్ని ఒకటిగా చేసింది. కనుక యిది ఏకదేశంగా వుండాలని వారు భావించారు. అందువల్ల పైవిధంగా ఎక్కడెక్కడో వున్నచోట్లను నిర్ణయించి ప్రజలకు ఐక్యతాభావాన్ని నూరిపోశారు. ఇటువంటి ఉదాహరణ ప్రపంచంలో మనకు ఎక్కడా కనబడదు.

ఇద్దరు ఇంగ్లీషు వాళ్లు ఒకటి కాలేరు. కాని భారతీయులు ఒకటిగా వుంటారు. యిప్పటికీ ఒకటిగా వుంటున్నారు. నాలాంటివాళ్లు, మీలాంటివాళ్లు నాగరీకులమని అనుకొని భారతదేశంలో ఐక్యతలేదని, వేరు వేరు రాష్ట్రాలు వున్నాయని భావిస్తున్నాం. రైళ్లవల్ల వేరు వేరు రాష్ట్రాలవాళ్లం అనుభావం మనకు కలిగిందని, మీరు భావించగలిగితే, రైళ్లవల్ల తిరిగి మనలో ఐక్యతా భావం కలుగసాగిందని భావించినా యిబ్బంది వుండదు. నల్లమందు తినడం

వల్ల కలిగే నష్టమేమిటో, నల్లమందు తినడం వల్లనే నాకు బోధపడిందని నల్లమందుకు అలవాటుపడ్డవాడు చెప్పవచ్చు. వీటిని గురించి మీరు యోచించండి. మీ మనస్సులో ఇంకా పలు సందేహాలు బయలు దేరుతాయి. అయితే మీరే మీ సందేహాల్ని నివృత్తి చేసుకోవచ్చు.

**పాఠకుడు** : మీరు చెప్పిన విషయాల్ని గురించి నేను యోచిస్తాను. అయితే ఒక ప్రశ్న నా మనస్సులో యిప్పుడే బయలుదేరుతున్నది. మహమ్మదీయులు భారతావనికి రాకపూర్వపు దేశ స్థితిని గురించి మీరు చెప్పారు. సరే. కాని యిప్పుడు భారతదేశంలో మహమ్మదీయులు, పారశీకులు, క్రైస్తవులు పెద్ద సంఖ్యలో వున్నారు. వాళ్లు ఒకే దేశం కాజాలరు. హిందువులకు మహ్మాదీయులకు మధ్య వైరం ముదిరిపోయింది. "సాహెబుకు, స్వామికి పొసగదు" అను మాట సామెతగా ప్రచారంపొందింది. హిందువు తూర్పుకు తిరిగి దేవుణ్ణి పూజిస్తే, మహమ్మదీయుడు పశ్చిమానికి తిరిగి ప్రార్థిస్తాడు. హిందువు విగ్రహారాధకుడని మహమ్మదీయుడు అతణ్ణి అసహ్యించుకుంటాడు. హిందువు విగ్రహారాధకుడు, ముస్లిం విగ్రహ విధ్వంసకుడు. హిందువు గోవును పూజిస్తాడు. ముస్లిం గోవును వధిస్తాడు. హిందువు అహింసావాది. ముస్లిం హింసావాది. ఈ విధమైన వ్యతిరేక భావాలు ముమ్మరంగా వ్యాప్తమై వున్నాయి. ఇవి ఎలా పోతాయో, భారతదేశం ఎలా ఒకటవుతుందో వివరించండి.

★ ★ ★

# 10

# భారతదేశస్థితి - 3

# హిందువులు - మహమ్మదీయులు

**సంపాదకుడు** : మీ యీ ప్రశ్న గంభీరంగా వున్నది. కాని యోచించి చూస్తే సులభమైనదే. అసలు యీ ప్రశ్నకు కారకులు రైళ్లు, వకీళ్లు డాక్టర్లే. వకీళ్లను, డాక్టర్లను గురించి తరువాత యోచిద్దాం. రైళ్లను గురించి యోచిద్దాం "మనిషి జన్మను గురించి యోచిస్తే అతడు తన చేతులతో,

కాళ్లతో చేయగలిగినంత చేయాలి. తిరగగలిగినంతే తిరగాలి" అను విషయాన్ని నేను చెప్పదలిచాను. రైళ్లు మొదలగు సాధనాలద్వారా ఉరుకులు, పరుగులు పెట్టకుండావుంటే, వివాదాస్పదమైన ప్రశ్నలు బయలుదేరియుండేవి కావు. మనం కావాలని దుఃఖాల్ని కొని తెచ్చుకుంటున్నాం. భగవంతుడు మనిషి శరీరాన్ని సృష్టించి దానికి హద్దులు విధించాడు. కాని మనిషి ఆ హద్దుల్ని దాటి వేసే ఉపాయాలు వెతికి కనిపెట్టాడు. మనిషికి తెలివిని భగవంతుడు ఎందుకు ప్రసాదించాడు? దాని సాయంతో భగవంతుణ్ణి గుర్తించమని గదా! కాని మనిషి ఆ తెలివిని భగవంతుణ్ణి మరిచిపోయేందుకు ఉపయోగిస్తున్నాడు. నేను నా సహజ ప్రకృతిద్వారా నాచుట్టుప్రక్కల గలవారికేం సేవగలను అని యోచించకుండా అహంద్వారా ప్రపంచాన్నంతటికీ నా యీ శరీరంతో సేవ చేయాలనే స్థితికి వచ్చాను. ఆ విధంగా చేయాలంటే అనేక మతాలతోను, రకరకాల జనంతోను పనిపడుతుంది. ఇంతటి బరువును మనిషి మోయలేడు. అందువల్ల వ్యాకులపడతాడు. ఇట్టి యోచనలకు రైలు నిజంగా ఒక తుఫానువంటి సాధనం అవుతున్నది. మనిషి రైలు బండిని ఉపయోగించి భగవంతుణ్ణి మరిచిపోయాడు.

**పాఠకుడు** : నేను అడిగిన ప్రశ్నకు సమాధానం కావాలి. దానికోసం తహతహలాడుతున్నాను. మహమ్మదీయులు రావడం వల్ల మనదేశం ఒకటిగా వున్నదా లేక విడిపోయిందా?

**సంపాదకుడు** : భారతావని యందు ఎన్ని మతాల వాళ్లైనా వుండవచ్చు, వారివల్ల దేశం ఒక్కటే అను భావం చెక్కుచెదరదు. ప్రవేశించే క్రొత్తవాళ్లు యిక్కడ వున్న ప్రజానీకాన్ని విడగొట్టలేరు. వాళ్లతో కలిసిపోతారు. అలా అయితేనే ఏదేశమైనా ఒకటిగా వుండగలుగుతుంది. ఆ దేశం యితర దేశాలవారిని యిముడ్చుకోగల శక్తి కలిగియుండాలి. భారతదేశానికి అటువంటిశక్తి వున్నది. అది యీ నాటికి అట్టి శక్తి కలిగియున్నది. అసలు మనిషికొక్క మతం అని భావించవచ్చు. ఒకే దేశంగా రూపొంది అందు నివసించే ప్రజలు, ఒకరు మరొకరి మతాల జోలికిపోరు. అలాపోతే, వాళ్లు

ఒక దేశంలోవుండతగరు. భారతావని యందంతట హిందువులే వుండాలి అని హిందువులు భావించరు. మహ్మదీయులు, క్రైస్తవులు, పారసీకులు అంతా యీ దేశాన్ని తమ మాతృ దేశంగా భావించి యిక్కడే స్థిరపడిపోయారు. అంతా ఒకే దేశస్థులు. అంతా ఒకే దేశీయులు. అంతా ఒకే దేశపు సోదరులు. తమ తమ స్వార్థం కోసమైనా అంతా ఒక్కటై ఉండకతప్పదు. ప్రపంచమందలి ఏ భాగంలో చూచినా ఒక దేశమంటే ఒకమతం అని ఎవ్వరూ భావించడంలేదు. భారతావని ఆ విధంగా ఎన్నడూ లేనే లేదు.

**పాఠకుడు** : కాని రెండుజాతుల బద్ధవైరాన్ని గురించి ఏమంటారు?

**సంపాదకుడు** : "బద్దవైరం" అను శబ్దాన్ని శతృవులు సృష్టించారు. హిందూ ముస్లిములు తగాదా పడినప్పుడు యిలాంటి మాట అంటూ వుండేవారు. అసలు జగడం అనేది ఎప్పుడో పోయింది. ఇకబద్ధవైరం ఏమిటి? ఇంగ్లీషు వాళ్లువచ్చిన తరువాతనే మన వైరం తగ్గిందని అనుకోవడం సరికాదు. హిందువులు ముస్లిం పాదుషాల అధీనంలోను, ముస్లిములు హిందూ రాజుల అధీనంలోను వున్నారు. తగాదాలవల్ల కలిగే లాభం ఏమీలేదని, తగాదా పడటంవల్ల ఎవ్వరూ తమతమ మతం విడవరని, ఎవ్వరూ తమ వైఖరి మార్చుకోరని అంతా బాగా అర్థంచేసుకున్నారు. అందువల్ల యిరువులు కలిసి వుండాలని నిర్ణయించుకున్నారు. ఇంగ్లీషువాళ్లు యిరువురిమధ్య చిచ్చుపెట్టారు. సాహెబుకు స్వామికి పొసగదు అను సామెత విషయం కూడా యింతే. కొన్ని సామెతలు చిరస్థాయిగా నిలచిపోతాయి.అవి నష్టం కూడా కలిగిస్తూనే వుంటాయి. ఇట్టి సామెతల జాలంలోపడి యీనాటి చాలా మంది హిందూ మహమ్మదీయుల తాతముత్తాతలు ఒకరేనని, వారి రక్తం ఒకటేనని జ్ఞాపకం పెట్టుకోవడంలేదు. మతం మార్చుకున్నంత మాత్రాన మనం ఒకరికొకరం శతృవులమై పోతామా? మతాలు ఒకే గమ్యం చేరుటకు ఏర్పడ్డ వేరువేరు మార్గాలు, మనం వేరు వేరు మార్గాల్లో నడిస్తే ఏం? కొట్లాటలెందుకు?

ఇలాంటి సామెతలు శైవవైష్ణవుల మధ్యకూడా వున్నాయి. అంతమాత్రాన

వారంతా ఒక్క దేశంవారుకాదని అంటామా? వైదిక మతావలంబులకు, జైన మతావలంబులకు మధ్యవ్యత్యాసాలు వున్నాయి. అంతమాత్రాన వేరువేరు దేశీయులు కారుగదా! మనం బానిసలైపోయాం. అందువల్ల మన తగాదాల్ని మూడోవారి దగ్గరకు తీసుకుపోతున్నాం. మహమ్మదీయులు విగ్రహాల్ని ఖండిస్తున్నట్టే, హిందువుల్లో కూడా విగ్రహాల్ని ఖండించే వర్గం వున్నది. నిజమైన జ్ఞానం పెరిగే కొద్దీ, మనకు యిష్టం కాని మతాన్ని మరొకరు అనుష్ఠిస్తూ వున్నా వారితో వివాదాలు పడటం మంచిపని కాదని, వారిపై వత్తిడి తేకూడదని గ్రహిస్తాం. ఆ విధంగా నడుచుకుంటాం.

**పాఠకుడు** : ఇప్పుడు గోరక్షణను గురించి చెప్పండి.

**సంపాదకుడు** : నేను స్వయంగా గోవును పూజిస్తాను. గోవును ఆదరిస్తాను. గోవు భారతావనికి రక్షణ కల్పిస్తుంది. దానికి కలిగే సంతానానికి వ్యవసాయ ప్రధానమైన భారతావని ఋణపడి యున్నది. గోవు ఎన్నో విధాలుగా ఉపయోగపడే జంతువు. గోవు ఎంతో ఉపయోగకారి అనిముస్లిం సోదరులు కూడా అంగీకరిస్తారు.

అయితే నేను గోవును పూజిస్తున్నట్లే మనిషిని కూడా పూజిస్తాను. గోవు ఎంత ఉపయోగకారియో, మనిషికూడా అంత ఉపయోగకారియే. అతడుహిందువు కావచ్చు, లేక ముస్లిం కావచ్చు. ప్రతి మనిషి పూజ్యుడే. అట్టిస్థితిలోగోవు రక్షణార్థం నేను మహమ్మదీయుడితో పోరాడుతానా? మహమ్మదీయుణ్ణిచంపుతానా?అలా చేస్తే నేను గోవుకు, మహమ్మదీయుడికి శత్రువునే అవుతాను. అందువల్ల గోరక్షణార్థం మహమ్మదీయ సోదరుని ముందునేను చేతులు జోడించి, గోవు యొక్క ఉపయోగాల్నిగురించి నచ్చచెప్పి అతణ్ణి ఆపుతాను. ఇది నా ధర్మంగా భావిస్తాను. అతడు అర్థం చేసుకోకపోతే? ఇక అది నాచేతుల్లో లేని విషయం గనుక గోవును చచ్చిపోనిస్తాను. అలా కాని యెడల గోవుమీద అమిత దయ గలిగితేదాని కోసం నా ప్రాణాలు అర్పించివేస్తానే కాని మహమ్మదీయుని ప్రాణాలు తీయను. ఇదే సరియైన విధానం, మత చట్టం అని నా అభిప్రాయం.

"అవును" - "కాదు" మధ్య ఎప్పుడూ వైరం వుంటుంది. నేను వివాదానికి దిగితే మహ్మదీయుడు కూడా వివాదానికి దిగుతాడు నేను అడ్డం తిరిగితే, అతడు కూడా అడ్డం తిరుగుతాడు. నేను అంగుళం మేర మెత్తబడి తలవంచితే, అతడు అడుగు మేర మెత్తబడి తలవంచుతాడు. అతడు మెత్తపడకపోయినా సరే, నేను మెత్తబడితేఅది తప్పు కానేరదు. మనం మొండికెక్కేసరికి గో హత్యలు పెరిగిపోయాయి. నాదృష్టిలో గో రక్షా ప్రచారిణీ సభ, గోవధ ప్రచారిణీసభగా మారిపోవాలి. ఇలాంటి సభ వుండటం మనకు అవమానకరం. గోవును రక్షించడం మనం మరిచిపోయినప్పుడు ఇలాంటి సంస్థ యొక్క అవసరంఏర్పడి యుండవచ్చు.

నా సోదరుడు గోవును చంపుటకు ముందుకురుకితే నేను ఎలా వ్యవహరించాలి? వాడిని చంపాలా, లేక వాడి కాళ్లమీద పడాలా? వాడి కాళ్లమీదపడాలిఅని మీరంటే, నా మహమ్మదీయ సోదరుడి కాళ్లమీదకూడా పడవలసిందేకదా?

గోవును హింసించి హిందువు గోవును వధిస్తుంటే గోవును ఎవరు రక్షించగలరు? గో సంతానమైన దూడను బల్లెంతో పొడిచివేసే హిందువుకు ఎవరు నచ్చచెబుతారు? దీనివల్ల మన దేశ ఏకత్వానికి ఏవిధమైన అవరోధం ఏర్పడలేదు.

హిందువు అహింసకుడు, ముస్లిం హింసకుడు అనుమాట నిజమైతే అహింసకుడి కర్తవ్యం ఏమిటి? అహింసకుడు, మనిషిని హింసించకూడదు అని ఎక్కడా వ్రాయబడిలేదు. అహింసకుడి మార్గం స్పష్టంగా వుంటుంది. ఒక్కణ్ణి రక్షించడం కోసం, మరింకొకరిని హింసించకూడదు. అతడు పరుని చరణాలకు వందనం చేయాలి. నచ్చచెప్పుటకు ప్రయత్నించాలి. అదే అతని పురుషార్థమన్నమాట. అయితే హిందువులంతా అహింసకులా?ఈ ప్రశ్న మూలానికి వెళ్లి పరిశీలించి చూస్తే ఎవ్వడూ అహింసకుడు కాదని తేలుతుంది. జీవుల్ని అందరూ చంపుతూ వుండటమే అందుకు కారణం. ఇట్టి హింసనుండి ముక్తిపొందాలని భావిస్తున్నాం కనుక మనంమంతా

అహింసకులమన్న మాట. చాలామంది హిందువులు మాంసం తింటున్నారు. అందువల్ల వాళ్లను అహింసకులని ఎలా అనగలం. వేరే అర్థాలులాగి ఏమో చెప్పాలని అనుకుంటే నేను చెప్పేదేమీ యుండదు. ఇట్టి స్థితిలో హిందువులు అహింసకులు, ముస్లిములు హింసకులు, అందువల్ల యిద్దరికీ పొంతన కుదరదని అనడం శుద్ధతప్పు.

ఇటువంటి భావాల్ని స్వార్థపరులైన మతబోధకులు పురోహిత శాస్త్రుల్లు ముస్లిం ముల్లాలు మనకు బోధించారు. వాళ్లు చెప్పిన వాటిల్లో ఏర్పడిన లోటును ఇంగ్లీషువాళ్లు భర్తీచేశారు. వాళ్లకు చరిత్ర వ్రాసే అలవాటు వున్నది. వారు ప్రతి జాతియొక్క ఆచార వ్యవహారాల్ని గురించి తమకు తెలుసునని డంబాలు పలుకుతూ వుంటారు. భగవంతుడు మనకు చిన్న మనస్సును ప్రసాదించాడుకదా? అయినా వాళ్లుదేవుని మీద కూడాతమ మాటను చలాయిస్తూ వుంటారు. రకరకాల ప్రయోగాలుచేస్తూ వుంటారు. తమ డప్పులు తామే వాయించుకుంటూ వుంటారు. తమ మాటలు సరియైనవనే విశ్వాసం మనకు కలిగించుటకు ప్రయత్నంచేస్తూ వుంటారు. మనం ఆమోదుకులం కదా! వాళ్ల మాటల్ని నమ్ముతూ వుంటాము. అడ్డదిడ్డంగా చూడడానికి యిష్టపడనివారు, ఖురాన్ షరీఫ్‌లో హిందువులకు నచ్చే వందలాది వచనాల్ని చూడవచ్చు. భగవద్గీతలో వ్రాయబడిన అనేక విషయాలు మహమ్మదీయులకు నచ్చేవే వున్నాయి. అవి వాళ్లు కాదు అనడానికి వీలులేని వచనాలు. ఖురాన్ షరీఫ్ యందలి కొన్ని భాగాలు నాకు అర్థంకాకపోతే, లేక కొన్ని భాగాలు నాకు నచ్చకపోతే, వాటిని అంగీకరించేవారిని అసహ్యించుకోనా? తగాదా జరగాలంటే యిద్దరు వుండాలికదా? నేను తగాదాకు దిగకపోతే మహమ్మదీయుడు ఏం చేస్తాడు? మహమ్మదీయుడు తగాదాకు దిగకపోతే నేనేం చేస్తాను? గాలిలో చేయి ఎత్తి ఊపేవాడిచెయ్యి ఎగిరిపోతుంది. ఎవరికి వారు తమతమ మతాల యెడ విశ్వాసంతో వుండి, దాని స్వరూపాన్ని బాగా అర్థం చేసుకొని వుంటే పురోహిత శాస్త్రుల్లు, ముస్లిం ముల్లాలు యిరువురినీ దరికి రాకుండా చేస్తే అసలు వివాదమే వుండదు. ఉన్నా దాని ముఖం నల్లబడిపోతుంది.

**పాఠకుడు** : ఇంగ్లీషు వాళ్లు ఇరుజాతుల వారిని కలవనిస్తారా?

**సంపాదకుడు** : ఇది పిరికి వాళ్లు అడగవలసిన ప్రశ్న. ఈ ప్రశ్న మన హీనత్వాన్ని సూచిస్తుంది. ఇరువురు సోదరులు కలిసి మంచిగా వుండాలని నిర్ణయించుకుంటే వారి మధ్య కల్పించుకొనే సాహసం ఎవరికైనా కలుగుతుందా? మూడో వాడు వారిరువురి మధ్యకు రాగలిగితే, దాని అర్థం ఆ యిరువురు సోదరుల మనస్సు పచ్చిగా ఉన్నదన్న మాటేగదా! అదే విధంగా మనం అనగా హిందువులం, మహమ్మదీయులం పక్వంకాని మనస్సుతో వుంటే యిక ఇంగ్లీషువాళ్లను తప్పుపట్టడం అనవసరం. మట్టికుండ పచ్చిగావుంటే ఒక కంకరరాయితో పగలకపోతే మరోరాయికి తప్పక పగులుతుంది. కంకరరాయికి దూరంగా కుండను వుంచడం వల్ల దానికి రక్షణ కలుగదు. దాన్ని బాగా కాల్చి గట్టిచేయడమే అందుకు మార్గం. అప్పుడు కంకరరాయి భయం దానికివుండదు. అదేవిధంగా మన మనస్సును గట్టి చేసుకోవడం అవసరం. మనయిద్దరిలో ఒక్కడి మనస్సు గట్టిగా వున్నా మూడోవాడికి అవకాశం దొరకదు. ఈ పనిని హిందువులు తేలికగా చేయగలుగుతారు. వారి సంఖ్య అధికంగా వున్నది. బాగా చదువుకున్న వాళ్లమనే భావం హిందువులకు ఎక్కువగా వున్నది. అందువల్ల వాళ్లు తమ మనస్సును గట్టి చేసుకోవచ్చు.

ఇరు జాతులమధ్య అపనమ్మకం చోటుచేసుకొన్నది. కనుకనే మహమ్మదీయులు లార్డ్ మార్లే ద్వారా కొన్ని అధికారాలు కోరుతున్నారు. వాటిని హిందువులు ఎందుకు వ్యతిరేకించాలి? హిందువులు వ్యతిరేకించకపోతే ఇంగ్లీషువాళ్లు ఉలిక్కిపడతారు. మహమ్మదీయులు మెల్లమెల్లగా హిందువుల్ని నమ్మడం ప్రారంభిస్తారు. ఇరువురిమధ్య సోదరభావం పెరుగుతుంది. మన తగాదాలను ఇంగ్లీషువాళ్ల దగ్గరకు తీసుకువెళ్లకూడదు. అందుకు మనం సిగ్గు పడాలి. ఆ విధంగా వెళ్లనందువల్ల హిందువులకు పోయేదేమీ వుండదు. మీరు స్వయంగా అందువల్ల కలిగే మంచి ఫలితాల్ని యింతవరకు అంచనా వేసుకోవచ్చు. ఇతరులను నమ్మిన వాళ్లెవరూ ఏమీ పొగొట్టుకోలేదు.

హిందూ మహమ్మదీయులు ఎన్నడూ తగాదా పడరని నేను అనడం

లేదు. ఇద్దరు సోదరులు కలిసివుంటే వారిరువురి మధ్య కీచులాటలు జరుగుతూనే వుంటాయి. తలలుకూడా పగులుతూ వుంటాయి. అలా జరగవలసిన అవసరం లేదు. కాని అందరి తలంపులూ సమానంగా వుండవుగదా! ఇద్దరూ ఆవేశపడినప్పుడు తప్పు పనులుచేస్తూ వుంటారు. వాటిని మనం సహించాలి. ఈ జగడాల్ని పెద్ద వకీళ్లను పెట్టుకొని మనం ఇంగ్లీషు వాళ్ల కోర్టుకి తీసుకువెళ్లకూడదు. ఇద్దరు మనుష్యులు కొట్టుకున్నారనుకోండి. ఇద్దరి తలలు పగిలాయనుకోండి, లేక ఒక్కడి తలే పగిలిందనుకోండి. మూడో వాడు ఏం న్యాయం చేస్తాడో చెప్పండి! కొట్టుకున్న వాళ్లు గాయపడవలసిందే కదా! శరీరాన్ని శరీరం గట్టిగా రాచుకుంటే అందుకు గుర్తు ఏర్పడవలసిందేకదా! అప్పుడు చేసే న్యాయం ఏముంటుంది?

★ ★ ★

# 11

# భారతదేశ స్థితి - 4

## వకీళ్లు

**పాఠకుడు** : ఇద్దరు వ్యక్తులు జగడం పెట్టుకున్నప్పుడు, వకీళ్లు వాళ్లకు న్యాయం చేయకూడదని మీరు అంటున్నారు. ఇది విచిత్రంగా లేదూ?

**సంపాదకుడు** : దీన్ని విచిత్రం అని అనండి, లేక మరో విశేషణమేదైనా తగిలించండి ఫరవాలేదు. కాని సత్యం మాత్రం అదే. మీ సందేహం వకీళ్లను, డాక్టర్లను సామాన్య పరిచయంచేస్తుంది. అసలు యీ వకీళ్లు భారతదేశాన్ని బానిసదేశం చేసివేశారని నా అభిప్రాయం. హిందూ మహమ్మదీయుల వైరం పెంచారు. ఇంగ్లీషు వాళ్ల రాజ్యానికి పుష్టిచేకూర్చారు.

**పాఠకుడు** : ఇటువంటి ఆరోపణలు చేయడం తేలికయే, కాని దాన్ని సమర్థించుకోవడం కష్టం. వకీళ్లు లేకపోతే మనకు స్వాతంత్ర్యమార్గం చూపించేవాళ్లెవరు? బీదవాళ్ల పక్షం వహించిందంతా వాళ్లేకదా! వాళ్లు దప్ప

మనకు న్యాయం యిప్పించేదెవరు? కీ.శే. మన్‌మోహన్ ఘోష్ ఎంతోమందిని రక్షించారు. ఒక్క కాణీగూడ ఎవ్వరి దగ్గర ఆయన తీసుకోలేదు. మీరు పొగిడిన కాంగ్రెస్‌ను నిర్వహించిందీ, నిర్వహిస్తున్నదీ వకీళ్లేకదా! వారి శ్రమ వల్లనే కదా కాంగ్రెస్ పనులు సాగుతున్నాయి! వకీళ్లను నిందించడం న్యాయానికి అన్యాయం చేయడమేకదా! మీచేతికి పత్రికవచ్చింది కనుక యిష్టంవచ్చినట్లు మట్లాడుటకు అనుమతి మీరు పొందారనే భావం కలుగుతున్నది.

**సంపాదకుడు :** మీరు అనుకున్న విధంగానే కొంతకాలం క్రితం వరకు నేనూ అనుకున్నాను. వకీళ్లు మంచి పని ఏమీ చేయలేదని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు. మిస్టర్ మన్‌మోహన్ ఘోష్ గారిని ఎంతో గౌరవిస్తాను. వారు బీదవారికి సహాయం చేసినమాట నిజం. కాంగ్రెస్‌లో వకీళ్లు కొద్ది పనిచేశారు. దాన్నికూడా అంగీకరించవచ్చు. వకీళ్లుకూడా మనుష్యులేకదా! మానవ జాతియందు ఎంతో కొంత మంచి వున్నది. అయితే వకీళ్లు చేసిన మంచి నులను గురించి వినే కథలన్నీ, వారు తాము వకీళ్లమను విషయం మరిచిపోయిన తరువాత చేసినట్టివే. అసలు వాళ్ల వృత్తియే వాళ్లకు అవినీతిని నేర్పుతుందని మీకు చెబుతున్నాను. వారు మహాచెడ్డ పేరాశలో చిక్కుకుంటారు. దాని నుంచి ముక్తిపొందడం చాలా కష్టం.

హిందువులు, మహమ్మదీయులు కొట్లాడుకున్నారు. తటస్థుడైన మనిషి అయితే పనికిమాలిన వ్యవహారాల్ని మరిచిపొండి, యిరువురి దోషమూ వుంది, కనుక గతాన్ని మరిచిపోయి కలిసి వుండండి అని చెబుతాడు. కొట్లాడుకున్నవాళ్లు వకీళ్ల దగ్గరికి వెళతారు. తన దగ్గరికి వచ్చిన వారి పక్షం వహించి వాదించడం వకీలు కర్తవ్యం గదా! కక్షిదారుని బుర్రకుతోచని వాదనలు, యుక్తులు వెతికి చెప్పడం వకీళ్లపని.అలా చేయకపోతే ఆ వకీళ్లు తన వృత్తికే కళంకం తెచ్చినట్లు భావిస్తారు. అందువల్ల వకీళ్లు ఎప్పుడూ తగాదాన్ని పెంచుదామనే చూస్తారు గాని, తగాధా తీరుద్దామని భావించరు.

ఇతరుల దుఃఖాల్ని తొలగించుటకు గాక, ధనార్జనకోసమే వకీళ్లు పట్టా

పుచ్చుకుంటారు. ధనార్జనకు అది ఒక మార్గం. అందువల్ల వివాదాన్ని పెంచడానికే వకీలు చూస్తాడు, చూడాలికూడా. ఇది నాకు తెలిసిన విషయం. తగాదా జరిగిందీ అంటే వకీళ్లకు ఆనందం కలుగుతుంది. ముక్తార్లు అనగా ఏజంట్లు కొందరు వుంటారు. వాళ్లదికూడా వకీళ్ల జాతే. తగాదాయే లేని చోట వాళ్లు తగాదా సృష్టిస్తూవుంటారు. వాళ్ల దళార్లు జలగల్లా బీదవాళ్లను కరుచుక్కూర్చుంటారు. వాళ్ల రక్తాన్ని పీల్చివేస్తారు.ఆ వృత్తే అటువంటిది. తగాదాని పెంచడమే ఆవృత్తి పని. వకీళ్లు పనిలేని రకం. సోమరిపోతులు. విలాస విశ్రాంతి కోసం వకీళ్లు ప్రయత్నిస్తూ వుంటారు. ఇదివాస్తవం. వకీలు వృత్తి గొప్ప గౌరవనీయమైన వృత్తియని పనిగట్టుకొని ప్రచారం చేసుక్నది కూడా వకీళ్లే, చట్టాలు తయారుచేసేది వాళ్లు, దాన్ని పొగుడుతూ వుండేది కూడావాళ్లే. ప్రజల దగ్గర ఎంత సొమ్ము వసూలు చేయాలి అను విషయం కూడా వాళ్లే నిర్ణయిస్తారు. ఆకాశాన్నుండి ఊడిపడ్డ దేవదూతలు తామే అయినట్లు దర్జా వెలగబెట్టి ఆడంబరాలకు పోతారు.

వాళ్లు ఒక కార్మికుని కంటే మించి సొమ్ము ఎందుకు వసూలు చేస్తారో చెప్పండి.వాళ్ల అవసరాలు ఒక కార్మికుని కంటే మించి ఎందుకు వుంటాయి? వాళ్లు కార్మికుని కంటే మించి దేశానికి చేసిన మేలు ఏమిటి? మేలు చేసినవాడికి ఎక్కువ సొమ్ము వసూలు చేసే అధికారం వున్నదా? డబ్బుకోసమే అతడు మేలు చేసి యుంటే అది మేలు ఎలా అవుతుంది? ఇది ఆ వృత్తి లక్షణం. దాన్నే నేను, వివరించి చెప్పాను.

వకీళ్ల వల్లహిందూ ముస్లిముల మధ్య కొన్ని కొట్లాటలు జరిగాయను విషయం అట్టి అనుభవం వున్నవాళ్లకు తెలుసు. వాళ్లవల్ల కొన్ని వంశాలు నష్టపడిపోయాయి. వాళ్లవల్ల సోదరుల మధ్య విషం బయలుదేరింది. కొన్ని సంస్థానాలు వకీళ్లవలలో చిక్కుకొని ఋణాలపాలయ్యాయి. రాజవంశాలకు చెందిన చాలామంది జాగిర్దార్లు వకీళ్లజాలంలో చిక్కుకొని పూర్తిగా మునిగిపోయారు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నో యివ్వవచ్చు.

వకీళ్లవల్ల ఇంగ్లీషువాళ్ల ఉరిత్రాడు మన మెడలకు బాగా బిగుసుకున్నది.

ఇది వాళ్లవల్ల మన దేశానికి కలిగిన పెద్ద నష్టం. మీరే చెప్పండి. ఇంగ్లీషువాళ్ల కోర్టులు యిక్కడ లేకపోతే వాళ్లు మనదేశంలో రాజ్యం చేయకలిగేవాళ్లా? ఈ కోర్టులు ప్రజల మేలుకోసం నెలకొల్పబడినవి కావు. తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోదలచిన వారికి కోర్టులుమంచి సాధనాలుగా ఉపయోగపడ్డాయి. వాటిద్వారా వాళ్లు ప్రజల్ని అదుపులో వుంచుకో గలిగారు. జనంవారిలో వారే వివాదాల్ని పరిష్కరించుకుంటె యిక మూడోవాడి అవసరమే వుండదు కదా! జనం తమలోతాముకొట్లాడుకొని, బంధువుల్ని పంచాయతీ పెద్దలుగా పెట్టుకొని, తమ తగాదాల్నితీర్చుకున్న రోజుల్లో వాళ్లు పరాక్రమశాలురుగా వుండేవారు. కోర్టులు వచ్చాయి. అట్టి వారంతా పిరికిపందలై పోయారు. ప్రజలు కొట్టుకొని వాళ్లలో వాళ్లే సరిచేసుకోవడమా? ఇది వన్య వ్యవహారం అంటూ వాళ్లే ఎగతాళి చేశారు. నిజానికి మూడోవాడెవడో వచ్చి తగాదాలు తీర్చాననడం, వన్య వ్యవహారం కాదా? మూడోవ్యక్తి యిచ్చిన తీర్పు సరియైనదని ఎవరైనా అనగలరా? సత్యం ఏమిటో యిరుపక్షాల వారికీ తెలుసు. అయినా అమాయకంగా డబ్బు తీసుకొని తీర్పు చెబుతున్న మూడోవాడు న్యాయం చేస్తున్నాడని మనం అంగీకరిస్తున్నాం.

దాన్ని అటుంచండి. కోర్టు స్థాపించి, వాటిద్వారా ఇంగ్లీషు వాళ్లు మనల్ని అంకుశంతో అణచివేశారు. మనం పక్షాలం అయివుండకపోతే యీ కోర్టులు నడిచి యుండేవా? ఇంగ్లీషువాళ్లే జడ్జీలై, ఇంగ్లీషువాళ్లే వకీళ్లు అయి, ఇంగ్లీషు వాళ్లే భటులైయుండి యుంటేవాళ్లు ఇంగ్లీషు వాళ్లమీదనే రాజ్యం చేయగలిగి యుండేవారు. భారతీయ జడ్జీలు, భారతీయ వకీళ్లు లేకుండా వాళ్ల వ్యవహారం సాగేదికాదు. అసలు వకీళ్లు ఎలా బయలుదేరారో, వాళ్లు చేసిన తతంగం ఏమిటో, మీకు తెలిస్తే నావలెనే మీరు కూడాఆ వృత్తిని అసహ్యించుకొని యుండేవారు. ఇంగ్లీషువాళ్ల రాజ్యాధికారానికి ముఖ్యమైన ఒక కీలకం వారి కోర్టులు. కోర్టు నడవడానికి కీలకం వకీళ్లు. మన వకీళ్లంతా వకీలువృత్తి మానుకుంటే, వేశ్యావృత్తిని ఎంత హీనంగా చూస్తున్నామో, అంత హీనంగా వకీలు వృత్తిని చూస్తే, ఇంగ్లీషు వాళ్లరాజ్యం ఒక్కరోజున ఆగిపోతుంది.

వకీళ్లు భారతదేశ ప్రజానీకానికి పెద్ద కళంకం ఆపాదించారు. మన వాళ్లకు తగాదాలు యిష్టమనీ, మనమంతా కోర్టు పక్షులమని,కోర్టుకచ్చేరీల జలాశయాలయందలి చేపలమని ప్రచారంచేశారు.

వకీళ్లకు నేను వాడిన శబ్దాలన్నీ, మన జడ్జీలకు కూడా వర్తిస్తాయి. వీళ్లద్దరూ పెద్దమ్మ పిన్నమ్మ బిడ్డలే. ఇద్దరూ సహోదరులే.

★ ★ ★

# 12

# భారతదేశ స్థితి - 5

# డాక్టర్లు

**పాఠకుడు** : వకీళ్ల వ్యవహారం మనం అర్థంచేసుకోవచ్చు. వాళ్లు చేసిన మంచి పనులు వాళ్లు కావాలని చేసినవి కావని విశ్వాసం కలుగుతున్నది. వాళ్ల వృత్తిని పరిశీలించి చూస్తే కనాకష్టమైనదే. అయితే మీరు డాక్టర్లను కూడా వాళ్లతో జమచేస్తున్నారు. కారణం చెప్పండి.

**సంపాదకుడు** : నేను మీ ఎదుట వెల్లడిస్తున్న అభిప్రాయాలు ప్రస్తుతం నావే. అయితేయీ అభిప్రాయాలు నా వొక్కడివే కావు. పాశ్చాత్య సంస్కర్తలు స్వయంగా నాకంటే కఠినమైన భాషలో యీ వృత్తుల్ని విమర్శించారు. వాళ్లు వకీళ్లను, డాక్టర్లను తీవ్రపదాలతో నిందించారు. వారిలో ఒకరు ఒక విషవృక్షాన్ని చిత్రించి, వకీళ్లు, డాక్టర్లు మొదలగు పనికి మాలిన వృత్తుల వారిని ఆ చెట్టు కొమ్మలుగా చిత్రీకరించారు. ఆ వృక్షం మొదలు మీద నీతి, ధర్మం అనే గొడ్డలి వ్రేటువేస్తున్నట్లు చిత్రీకరించారు. ఈ వృత్తులన్నింటికి మూలం అవినీతియని పేర్కొన్నారు. అందువల్ల నేను ఒక్కడినే యిట్టి అభిప్రాయాలు వెల్లడిస్తున్నానని భావించకండి. ఎంతోమంది ప్రకటించిన భావాలను,అనుభవాలను, నా అనుభవాలను మీముందు వెల్లడిస్తున్నాను.

డాక్టర్లను గురించి మీకు యిప్పుడు మోహం వున్నట్లే ఒకప్పుడు నాకూ

ఉండేది. అసలు నేను డాక్టరు కావాలని కూడా కోరుకున్నాను. డాక్టరునై జాతికి సేవచేద్దామని భావించాను. నా ఆ మోహం ఇప్పుడు తొలిగిపోయింది. మన సమాజంలో వైద్యవృత్తి మంచిదని ఎవ్వరూ భావించడంలేదు. ఆ విషయం యిప్పుడు నాకు తెలిసింది. అట్టి భావానికి గలవిలువ ఏమిటో నేను తెలుసుకోగలిగాను.

డాక్టరువృత్తి ద్వారా కూడా ఇంగ్లీషు వాళ్లు మనమీద పట్టు సాధించారు. డాక్టర్లలో డాంబికానికి లోటు లేదు. ముగల్ పాదుషాను భ్రమింప చేసింది ఒక ఆంగ్ల డాక్టరే. అతడు పాదుషా మహల్లో కొన్ని జబ్బులు నయం చేశాడు. అందువల్ల అతడికి పలుకుబడి లభించింది. ధనికుల దగ్గరికి చేరింది కూడా డాక్టర్లే.

డాక్టర్లు మనల్ని పునాదినుంచే కదిలించి వేశారు. ఈ డాక్టర్ల కంటే మామూలు నాటు వైద్యులే నయమని నా మనస్సు అంటున్నది. ఈ విషయమై మనం యోచించడం అవసరం.

శరీరాన్ని సంబాళించడం డాక్టర్లపని. శరీరాన్ని సంబాళించకపోవడం కూడా డాక్టర్ల పనే. శరీరంలో బయలుదేరే రుగ్మతల్ని తొలగించడం డాక్టర్లపని. రోగాలు ఎందుకువస్తాయి? మనం చేసే పొరపాట్లవల్లనే! హద్దుమీరి భుజించడం, అందువల్ల తిన్నదిఅరగక అజీర్తి చేయడం, డాక్టరు దగ్గరకు వెళ్లడం, ఆయన మాత్ర యివ్వడం,ఆ మాత్ర మింగడం, రోగం నయం కావడం, మళ్లీ అతిగా తినడం, మళ్లీ మాత్ర వేసుకోవడం యిదీ వరుస.అసలు మాత్ర తీసుకోకపోతే అజీర్తితో బాధపడేవాణ్ణి. ఆ బాధవల్ల అతిగా తినడం మానివేసేవాణ్ణి. డాక్టరు మధ్యలో ప్రవేశించి అతిగా తినమని ప్రోత్సహించాడన్నమాట. ఆయన మాత్రలవల్ల నా శరీరం బాగైంది, కాని, నా మనస్సు మాత్రం బలహీనపడింది. తత్ఫలితంగా నా మనస్సుపై నా పట్టుతప్పిపోయింది.

విలాసాలు అనుభవించాను. జబ్బు పడ్డాను. డాక్టరు నాకు మందు యిచ్చాడు. నాకు నయం అయింది. నేను మళ్లీ విలాసాలు అనుభవించనా? తప్పక అనుభవిస్తాను. డాక్టరు మధ్యలో ప్రవేశించకపోతే ప్రకృతి తన పనిని

నిర్వహించి యుండేది. నా మనస్సు గట్టి పడియుండేది. వ్యసనాలకు దూరమై సుఖపడి వుండేవాణ్ణి.

ఆసుపత్రులు పాపాల కూపాలు. వాటి కారణంగా జనం తమ తమ శరీరాల విషయమై కొద్ది నిర్లక్ష్యంగా వుంటున్నారు. అవినీతిని పెంచుతున్నారు.

యూరపునందలి డాక్టర్లు మరీ అతిగా వ్యవహరిస్తున్నారు. శరీర చికిత్స చేస్తూ ప్రతిఏటా లక్షలాది జీవుల్ని చంపివేస్తున్నారు. జీవించియున్న ప్రాణాల మీద పలు ప్రయోగాలు చేస్తున్నారు. ఇలా చేయడానికి ఏ మతమూ అనుమతినీయదు. హిందు, ముస్లిం, క్రైస్తవ, పారసీ మొదలుగాగల వారి ఏ మతమూ కూడా మనిషి శరీరం కోసం యితర ప్రాణుల్ని అసంఖ్యాంగా సంహరించమని చెప్పదు.

డాక్టర్లు దీన్ని మతిభ్రష్టత అని అంటారు. డాక్టర్లు యిచ్చే ఎక్కువ మందుల్లో క్రొవ్వు. మద్యం కలిసి వుంటాయి. ఈ రెండు పదార్థాలు హిందూ, ముస్లిములకు ఎవ్వరికీ యిష్టం కానివే. మనం నాగరికులం అని దాంబికంగా చెప్పుకుంటూ, యితరులని అజ్ఞానులని భావించి, కళ్లెం అనేది లేకుండా ఏమైనా చేయవచ్చు ననుకోవడం వేరే విషయం. అయితే డాక్టర్లు మనల్ని ధర్మభ్రష్టుల్ని చేస్తున్నారనుమాట మాత్రం నిజం.

తత్ఫలితంగా చివరికిమనం నిస్సత్తువుతో బలహీనులమై పోతున్నాం. అట్టి స్థితిలో మనం ప్రజాసేవ ఏమీ చేయలేము. బుద్ధిహీనులమై, క్షీణదశకు చేరుతున్నాం. ఇంగ్లీషు వాళ్లకు లేక యూరప్‌కు సంబంధించిన డాక్టరీ నేర్చుకోవడం బానిసత్వమను పీటముడికి, యింకా బలం చేకూర్చడం వంటిదే.

మనంఎందుకు డాక్టర్ల మవుతున్నామో యోచించడం అవసరం. పటాటోపంగా వ్యవహరిస్తూ, దబ్బు సంపాదించడమే డాక్టరు కావడానికి ముఖ్యకారణం. ఇందులో పరోపకారానికి చోటులేనేలేదని నేను ముందే చెప్పాను. దీనివల్ల ప్రజలకు నష్టం కలుగుతుంది. డాక్టర్లు ఆడంబరంగావ్యవహరించి, ప్రజల దగ్గర పెద్ద పెద్దఫీజులు గుంజుతున్నారు. ఒక్క కాణీ ఖరీదు చేసే మందుకు ఎన్నో రూపాయలు వసూలు చేస్తున్నారు.

నమ్మకం వల్ల, నయమవుతుందనే ఆశవల్ల ప్రజలు డాక్టర్ల దగ్గరకువెళ్లి మోసంగింపబడుతున్నారు. అసలు బండారం యిదే ఇట్టి స్థితిలో మేలు చేస్తున్నామని డంబాలు పలుకుతూ పటాటోపం ప్రదర్శిస్తున్న యీ డాక్టర్లకంటే, బహిరంగ మోసకారులైన వైద్యులు మేలు కదా!

★ ★ ★

## 13

## ఏది నిజమైన నాగరికత?

**పాఠకుడు** : మీరు రైళ్లను రద్దుచేయాలన్నారు. వకీళ్లను నిందించారు. డాక్టర్లను అణచివేశారు. యంత్రాల పనులన్నింటిని కూడా నష్టదాయకం అని అంటారని నాకు అనిపిస్తున్నది. ఇక నాగరికత అని దేన్ని అనాలో చెప్పండి.

**సంపాదకుడు** : ఈప్రశ్నకు సమాధానం యివ్వడం కష్టమైన పనికాదు. భారతదేశం అందించిన నాగరికతను ప్రపంచమందలి ఏ దేశం అందుకోలేక పోయిందని నా అభిప్రాయం. మన పూర్వీకులు నాటిన విత్తనాలతో సమానంగా తులతూగతగినవి వేరే ఎక్కడా కనిపించవు. రోము దేశసామ్రాజ్యం మట్టిలో కలిసిపోయింది. గ్రీసు దేశం పేరు మాత్రమే మిగిలింది. మిశ్రదేశపు పాదుషాగిరీ అంతరించింది. జపాను పాశ్చాత్యపు ఒరిపిడి యంత్రంలో చిక్కుకుపోయింది. చైనాను గురించి ఏమని అనడానికి వీలులేని స్థితి. పడిపోయినా, విరిగిపోయినా ఏ స్థితిలో వున్నా భారతదేశం తనగట్టి పునాదులమీద యిప్పటికీ స్థిరంగావున్నది.

పడిపోయిన రోమ్ మరియు గ్రీస్ దేశాల పుస్తకాలు చదివి యూరప్ ప్రజలు కొంచెం నేర్చుకుంటున్నారు. ఆ దేశాల వాళ్లుచేసిన తప్పులు తాము చేయమని అనుకుంటూ వున్నారు. ఇదీ వారి దయనీయ స్థితి. కాని భారతావని అలా లేదు. అది స్థిరంగా వున్నది. ఇదే దాని విశేషం. దాని ఆభరణం. అయితే భారతదేశంమీద తీవ్రమైన ఆరోపణలు పాశ్చాత్యులు చేస్తూ వుంటారు. భారతావని అడవిరకం అనీ, అజ్ఞానంతో నిండి వున్నదనీ.

దాని జీవనంలో మార్పులు చేయుటకు వీలేలేదనీ ఆ ఆరోపణలసారం. అయితే యీ ఆరోపణ మన సుగుణాలకు తార్కాణమేకాని, దోషాలకి కాదు. అనుభవం మీద సరియైనదని మనం భావించిన దాన్ని మనం ఎందుకు మార్చుకోవాలి? తెలివిని గురించి బోధించేసేవారు చాలామంది వస్తుంటారు, పోతుంటారు. కాని భారతావని మాత్రం స్థిరంగా వుంటుంది. ఇదిదాని విశేషం.

సభ్యత ఆచరణకు సంబంధించినది. తద్వారా మనిషి తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూవుంటాడు. కర్తవ్యాన్ని నిర్వర్తించడం అంటేనీతిని పాలించడమన్న మాట. నీతిని పాలించడమంటే మనస్సును, ఇంద్రియాల్ని వశంలో వుంచడమన్నమాట. అలా చేస్తూ మనం మనల్ని (మనవాస్తవాన్ని) గుర్తిస్తామన్నమాట. నాగరికత అంటే యిదే. ఇందుకు తలక్రిందులుగా వుండేది చెరుపుచేసే నాగరికత అన్నమాట.

పై వ్యాఖ్య ప్రకారం భారతదేశం నేర్చుకోవలసింది యిక ఏమీలేదని చాలా మంది ఆంగ్లరచయితలు వ్రాశారు. ఇది సరియైన విషయమే. మనిషి యొక్క ప్రవృత్తులు ఎంత చంచలమైనవో మనం చూస్తున్నాం. మనిషి మనస్సు అనవసరంగా పరుగులు తీస్తూ వుంటుంది. మనిషి శరీరం, యిచ్చిన కొద్దీ యింకా ఎక్కువగా యిమ్మని కోరుతూ వుంటుంది. ఎంత అధికంగా యిచ్చినా అది తృప్తి పడదు. భోగాలు అనుభవించే కొద్దీ పెరుగుతూవుంటాయి. అందువల్ల మన పూర్వీకులు భోగాలకు హద్దు ఏర్పరిచారు. ఎంతో యోచించిన పిమ్మట సుఖదుఃఖాలకు కారణం మనస్సేనని నిర్ణయానికి వచ్చారు. ధనవంతుడుతన ధనంవల్ల సుఖపడటంలేదు. బీదవాడు తనబీదతనంవల్ల దుఃఖపడటం లేదు. దుఃఖితుడుగా ధనికులు, సుఖంగా బీదవాళ్లు ఉండటం చూస్తున్నాం. కోట్లాదిమంది జనం బీదవాళ్లుగానే వుంటారు. దీన్ని గమనించి భోగవాంఛను మనవాళ్లు తొలిగించారు. కనుకనే వేలాది సంవత్సరాలక్రితం ఉపయోగించబడిన నాగలిని మనం ఉపయోగిస్తున్నాం. వేలాది సంవత్సరాల క్రితం గుడిశెలు ఎలా వుండేవో, అలాగే వాటిని నిర్మించి ఉపయోగిస్తున్నాం. వేలాదిసంవత్సరాల క్రితం అమలులో వున్నవిద్యనే మనం నేర్చుకుంటూ వున్నాం. వినాశానికి దారితీసే

పోటీకి మనం సమాజంలో అవకాశం యివ్వలేదు. అంతా తమ తమ వృత్తులు నిర్వహించారు. అందుకు న్యాయబద్ధంగా మూల్యం తీసుకున్నారు. అంతమాత్రాన మనకు యంత్రాల నిర్మాణం చేతకాదని అనుకోకూడదు. జనం యంత్రాలజాలంలో పడితే బానిసలు అయిపోతారని, తమ నీతి నిజాయతీలు విడనాడతారని మన పూర్వీకులు గ్రహించారు. అందువల్ల బాగా ఆలోచించి, మనం మన చేతులతోను, కాళ్లతోను చేయగలిగినంత కాయకష్టం చేయాలని, అందులోనే నిజమైన సుఖం వున్నదని, అదే ఆరోగ్యానికి కూడా మూలమని బోధించారు.

పెద్ద పెద్ద పట్టణాల నిర్మాణం అనవసరమైన యిబ్బందులు కలిగిస్తుందని, జనానికి సుఖంవుండదని, ధూర్తుల ప్రాబల్యం పట్టణాల్లో పెరిగిపోతుందని, వేశ్యల వీధులు వెలుస్తాయని, పేదప్రజలు, ధనికులచే దోపిడీ చేయబడతారని వారు గ్రహించి, చిన్న చిన్న గ్రామాలతో తృప్తిపడ్డారు.

రాజులకంటె, రాజుల కత్తికంటె నీతి నిజాయతీలకు బలం అధికంగా వుంటుందని వాళ్లు గ్రహించారు. అందువల్ల నీతిమంతులు, ఋషులు, మునులు, ఫకీర్లు మొదలగు వారికంటె రాజులను తక్కువగా పరిగణించారు. ఈ విధమైన ఉన్నతభావాలతో నిర్మాణమైన దేశం యితరులకు నేర్పగల స్థితిలో వున్నది. ఇతరుల దగ్గర నేర్చుకునే స్థితిలోలేదు.

ఈ దేశంలో పూర్వం కోర్టులు వుండేవి. వకీళ్లు వుండేవారు. డాక్టర్లు వుండేవారు. అయితే వారంతా నియమబద్ధంగా నడుచుకునేవారు. వృత్తులు గొప్పవి కావని వారికి తెలుసు. వకీళ్లు, డాక్టర్లు జనాన్ని దోచుకునేవారు కారు. వాళ్లు జనానికి మిత్రులుగా వుండేవారు. జనానికి పెత్తందారులుగా వ్యవహరించేవారు కారు. న్యాయం చక్కగా జరిగేది. కోర్టులకు వెళ్లకూడదు అనేది ఆనాటి ప్రజల నిర్ణయం. జనాన్ని భ్రమల్లోపెట్టే స్వార్థపరులు వుండేవారుకాదు. కొద్దికుళ్లు వున్నా, అది రాజుల దగ్గర, రాజధానులదగ్గరే వుండేది. సామాన్య ప్రజలు ఆ స్వార్థాలకు దూరంగా వుండి తమ పొలాల యాజమాన్య హక్కును అనుభవిస్తూ వుండేవారు. వాళ్లు నిజమైన స్వరాజ్యాన్ని అనుభవిస్తూ వుండేవారు.

ఇప్పటి ఛండాలపు నాగరికత ప్రవేశించని చోట యీనాడు కూడా భారతదేశం ఆ స్థాయిలోనే వున్నది. అక్కడికి వెళ్లి మన క్రొత్త రకపు కపటం ప్రదర్శిస్తే వాళ్లు నవ్వుతారు. వాళ్లను ఇంగ్లీషువాళ్లు పరిపాలించలేదు.మీరు కూడా పరిపాలించలేరు. ఏ ప్రజల పేరు మనం ఉపయోగిస్తూ వుంటామో ఆ ప్రజలంటే ఏమిటో మనకు తెలియదు. వాళ్లకు మనమెవరిమో తెలియదు. రైళ్ల వరదతాకిడి యింకా తగలని ప్రాంతాలు దేశంలో చాలా వున్నాయి. ఆరుమాసాలపాటు అక్కడ తిరగమని, అక్కడి జనాన్ని చూచి అర్థం చెసుకోమని మీ వంటివారికి నేను సలహా యిస్తున్నాను. ఆ తరువాత దేశాన్ని గురించి యోచించమని, ఆ తరువాతనే స్వరాజ్యాన్ని గురించి మాట్లాడమని కూడా సలహాయిస్తున్నాను.

నిజమైన నాగరికత అని నేను దేన్ని అంటున్నానో మీకు బోధపడిందికదూ! నేను చిత్రించిన భారతదేశానికి వెళ్లి అక్కడ అల్లకల్లోలం చేయడానికి ప్రయత్నించే వాళ్లను దేశ శత్రువులుగా భావించండి. అట్టివాళ్లు పాపులన్నమాట.

**పాఠకుడు** : మీరు వివరించిన ప్రకారం భారతదేశం వుండి వుంటే బాగానే వుండేది. కాని పరిస్థితులు అలాలేవు. వేలాదిమంది బాల వితంతువులు ఏదేశంలో బాధపడుతున్నారో, ఏ దేశంలో రెండు సంవత్సరాల యీడుగల ఆడపిల్లలకు పెళ్లిళ్ళు జరిగిపోతున్నాయో, ఏ దేశంలో 12 సంవత్సరాల యీడుగల బాలబాలికలు సంసారం చేస్తున్నారో, ఏ దేశంలో ఒక స్త్రీ ఎక్కువమంది భర్తలతో కాపురం చేస్తున్నదో, ఏ దేశంలో ధర్మం పేరిట దేవుడిపేరిట కన్యలు దేవదాసీలుగా అనగా వేశ్యలుగా రూపొందించబడుతున్నారో, ఏ దేశంలో ధర్మం పేరట, మతం పేరటపోతుల్ని మేకల్ని బలి యిస్తున్నారో, ఏ దేశంలో నియోగ (రోగిష్టి, నపుంసకుడైన భర్తకు పిల్లలు పుట్టని స్థితిలో, మరిది లేక భర్తకు సంబంధించిన యితర పురుషులతో సంభోగించి పిల్లలు కనుట) పద్ధతి అమలులో వున్నదో, ఆ దేశం భారతావనియేకదా! ఇన్ని లొసుగులు, దోషాలువున్నా మీరు చెప్పిందంతా నాగరికతకు లక్షణమా?

**సంపాదకుడు** : మీరు పొరబడుతున్నారు. మీరు చెప్పినవన్నీ దోషాలే. వాటిని నాగరికతా లక్షణాలని ఎవరు అనగరు? నాగరికతగల మన దేశంలో అట్టి దోషాలు కూడా సాగాయి. వాటిని తొలగించుటకు ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. జరుగుతూనే వుంటాయి. మనకు కలిగిన నూతనోత్సాహంతో యిట్టి దోషాల్ని దూరం చేయుటకు మనం కష్టపడి కృషిచేయవచ్చు. నేను ఈనాటి నాగరికతా లక్షణాలుగా మీకు చెప్పిన విషయాల్ని, నాగరికతా లక్షణాల్ని సమర్థించే చాలామందిచెబుతూ వుంటారు. నేను భారతదేశ నాగరికతను గురించి చెప్పిన వివరం కేవలం వర్ణన మాత్రం కాదు. మన నాగరికతను సమర్థించిన పలువురు చెప్పినవివరమే.

ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ,ఆనాటి నాగరికతను సంపూర్తిగా అందరూ పాటించలేదు. అది సహజమే. భారతీయ నాగరికత యొక్క మొగ్గు నీతి నిజాయితీలవైపే వున్నది. పాశ్చాత్య నాగరికత యొక్క మొగ్గు అనీతి, అవినీతివైపు వున్నది. అందువల్లనే అది హానికరం అని చెప్పాను. ఈ విషయాల్ని అర్థం చేసుకొని, శ్రద్ధతో, పసిబిడ్డ తల్లిని కరుచుకొని ఉన్నట్లు, భారతదేశం యొక్క మేలును కోరేవారు భారతదేశ నాగరికతను కరుచుకొని ఉందురుగాక.



# 14

# భారతదేశం స్వతంత్రం ఎలా అవుతుంది?

**పాఠకుడు** : నాగరితను గురించిన మీ అభిప్రాయాలు తెలుసుకున్నాను. మీరు చెప్పిన విషయాలను నేను బాగా పరిశీలించడం అవసరం. మీరు చెప్పిందంతా వెంటనే అంగీకరించమని మీరు అనరని అనుకుంటున్నాను. ఆ విధంగా షరతు విధించరని కూడా భావిస్తున్నాను. మీ యీ విధమైన అభిప్రాయాలతో భారతదేశానికి స్వాతంత్ర్యం లభింపచేయుటకు మీ ఉపాయాలు ఏమిటో వివరించండి.

**సంపాదకుడు :** నా అభిప్రాయాల్ని ప్రజలంతా వెంటనే అంగీకరించాలని నేను ఆశించడంలేదు. నా అభిప్రాయాలు తెలుసుకుందామని భావించే మీవంటివారికి చెప్పడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. అవి ఎదుటివారికి నచ్చుతాయా లేదా అన్న విషయం భవిష్యత్తులో తేలుతుంది. భారతావనికి లభించే స్వాతంత్ర్యం యొక్క ఉపయోగాల్ని గురించి యోచించాం. అయితే మరో రూపంలో వాటిని గురించి యోచించడం జరిగింది వాటిని గురించి యిక సూటిగా చర్చిద్దాం.

ఒకవ్యక్తి జబ్బుపడినప్పుడు, అతడి జబ్బుకు కారణమేమిటో తెలుసుకొని, ఆ కారణాన్ని నయం చేస్తే జబ్బు నయమైపోతుందను మాట జగద్విదితం. అదే విధంగా ఏ కారణాలవల్ల భారతదేశం బానిసత్వంలో పడిపోయిందో, ఆ కారణాలను తొలిగిస్తే, బానిస శృంఖలాలు తెగిపోతాయి.

**పాఠకుడు :** మీఅభిప్రాయం ప్రకారం భారతీయ నాగరికత మిగతావాటికంటే మంచిది. అయితేఅట్టి భారతావని బానిసత్వంలో ఎందుకు పడిపోయిందో వివరించండి.

**సంపాదకుడు :** నాగరికత నేను చెప్పిన స్థాయిలోనే వున్నది. కాని ప్రతినాగరికత మీద కొన్ని ఆపదలు వచ్చిపడుతూ వుంటాయి. స్థిరమైన నాగరికత అట్టి ఆపదల్ని అధిగమిస్తుంది. భారతదేశంలో ఏదోదోషం వున్నది. అందువల్లనే యిక్కడి నాగరికత ఆపదల్లో చిక్కుకున్నది. అయితే యిట్టి చిక్కుల్లో నుంచి బయటపడగలిగిన శక్తి దానికి వున్నది. అందువల్లే దానికి గౌరవం అధికంగా లభించింది.

భారతదేశమంతా అందు (బానిసత్వం) చిక్కకోలేదు. పాశ్చాత్య శిక్షణపొంది, దానిపాశంలో చిక్కుకున్నవారే బానిసత్వానికి గురి అయ్యారు. మనం ప్రపంచాన్ని మన కొలతతో కొలుస్తాం. మనం బానిసలం, కనుక ప్రపంచాన్ని కూడా బానిసగా భావిస్తాం. మనం బిచ్చగాళ్లం అయితే భారతదేశమంతా అలాగే అయిపోయిందని అనుకుంటాం. నిజానికి అలాంటిదేమీ లేదు. అయితే యిప్పటి మన బానిసత్వం దేశమంతటికి బానిసత్వమేనని గ్రహించాలి.

దృష్టి కేంద్రీకరిస్తే, సమాధానం లభిస్తుంది. మన బానిసత్వం తొలిగిపోతే దేశ బానిసత్వం తొలిగిపోయినట్లుగా భావించాలి. ఇందు మీకు స్వరాజ్యాన్ని గురించిన వ్యాఖ్య కూడా దొరుకుతుంది. మనమీద మనం రాజ్యం చేయగలగడమే స్వరాజ్యం. అట్టి స్వరాజ్యం మన చేతుల్లోనే వున్నది.

ఈ స్వరాజ్యం ఒట్టి కల అని అనుకోవచ్చు. ఇది మనస్సు ద్వారా అంగీకరించి కూర్చునే స్వరాజ్యం కాదు. అయితే మీరు యీ స్వరాజ్యాన్ని ఒక్కసారి రుచిచూస్తే యితరులకు కూడా దాని రుచిని అందజేయాలని జీవితమంతా ప్రయత్నిస్తూవే వుంటారు. ప్రతివ్యక్తి స్వరాజ్యాన్ని అనుభవించగలగడమే ముఖ్యమైన విషయం. మునిగిపోతున్న మనిషి మరొకరిని రక్షించలేడు. కాని ఈదుతున్న మనిషి మరొకరిని రక్షించగలడు. మనం బానిసత్వంలో పడి మ్రగ్గుతూ మరొకరిని స్వతంత్రుల్నిగా చేస్తామని భావించడం సాధ్యంకానిపని.

ఇంతటితో ఆగిపోకూడదు. ఇంకా ముందుకువెళ్లి మనం యోచించాలి.

ఇంగ్లీషువాళ్లను దేశాన్నుంచి బయటికి పంపివేయడమే లక్ష్యంగా పెట్టుకొని కూర్చోనవసరంలేదు. ఈ విషయం మీరు గ్రహించాలి. ఇంగ్లీషువాళ్లు భారతీయులుగా యిక్కడ వుంటే మనకు అభ్యంతరం వుండకూడదు. వారిని ఆ విధంగా వుండనీయవచ్చు. అయితే ఇంగ్లీషువాళ్లు తమ నాగరికతతో సహా యిక్కడవుంటాము అని అంటే మాత్రం అంగీకరించము. అట్టి స్థితిని కల్పించడం మన చేతిలో పని.

**పాఠకుడు** : ఇంగ్లీషువాళ్లు భారతీయులుగా మారడం అసంభవం.

**సంపాదకుడు** : అంటే ఇంగ్లీషువాళ్లు మనుష్యులు కాదనడమేకదా! వాళ్లు మనలా అయినా, కాకపోయినా పరవాలేదు. మనం మన ఇంటిని శుభ్రం చేసుకుందాం. అప్పుడు వుండగలిగినవాళ్లే అందువుంటారు. మిగతావాళ్లు వెళ్లిపోతారు. ఇట్టి అనుభవం ప్రతిమనిషి పొందాలి.

**పాఠకుడు** : ఇలా జరిగినట్లు చరిత్రలో మనం చదివి యుండలేదు.

**సంపాదకుడు** : చరిత్రలో కనబడలేని విషయం, భవిష్యత్తులో

కనబడవచ్చుగదా! కనబడదు అని అనుకోవడం మనిషి ప్రతిష్ఠను శంకించడమే. మన బుద్ధికితొచిన విషయాన్ని మనం పరీక్షించి చూడాలి.

దేశాలన్నిటి స్థితి ఒకటిగా వుండదు. భారతావని స్థితి విచిత్రమైనది. దీని బలం అసాధారణం. అందువల్ల యితర దేశ చరిత్రలతో మనకు సంబంధం తక్కువ. ఇతర దేశాల నాగరికతలన్నీ మట్టిలో కలిసి పోయాయనీ, భారతదేశ నాగరికత మాత్రం చెక్కుచెదర లేదని ముందే మీకు చెప్పాను.

**పాఠకుడు** : మీరు చెబుతున్న విషయాలు నాకు సరియైనవని అనిపించడం లేదు. పోరాడి ఇంగ్లీషువాళ్లను వెళ్లగొట్టాలి. ఇందు సందేహానికి తావులేదు. వాళ్లు మన దేశంలో వున్నంతవరకు మనకు విశ్రాంతి లభించదు. "పరాధీనులకు కలలోనైనా సుఖం లభించుటకల్ల" అను వాస్తవాన్ని అనుభవంలో చూస్తున్నాం. ఇంగ్లీషువాళ్లు యిక్కడ వుండటంవల్లనే మనం బలహీనులం అవుతున్నాం. మన తేజస్సుపోయింది. మన వాళ్లు గాబరా బడుతున్నట్లు కనిపిస్తున్నారు. ఇంగ్లీషువాళ్లు మన దేశం పాలిటి యములు. అట్టి యముల్లను గట్టి కృషిచేసి వెళ్లగొట్టాలి.

**సంపాదకుడు** : మీరు ఆవేశంలో పడి నేను చెప్పిందంతా మరిచిపోయారు. అసలు ఇంగ్లీషువాళ్లను యిక్కడికి తెచ్చింది మనమేకదా! వాళ్లు యిక్కడ వుండేందుకు బాగా సహకరిస్తున్నది కూడా మనమే కదా! వాళ్ల నాగరికతను అంగీకరించాము అందువల్లనే వాళ్లు యిక్కడ వుండగలుగుతున్నారు. ఈవిషయం మీరు మరిచిపోతున్నారు. ఇంగ్లీషు వాళ్ళంటే మీకు అసహ్యం. నిజానికి అసహ్యించుకోవలసింది ఇంగ్లీషువాళ్లనుకాదు. ఇంగ్లీషువారి నాగరికతను. పోరాడి వాళ్లను వెళ్లగొడదామని అనుకుంటున్నాం. ఇది సాధ్యమా?

**పాఠకుడు** : ఇటలీ అలా చేసింది.మేజినీ, గేరిబాల్డీలు చేసిన పని మనం కూడా చేయవచ్చు. వాళ్లు మహావీరులని మీరు అంగీకరిస్తారా?

★ ★ ★

## 15

## ఇటలీ -

**సంపాదకుడు** : మీరు ఉదాహరణగా ఇటలీనిపేర్కొని సరియైన పనిచేశారు. మేజనీ మహాపురుషుడు. గేరీబాల్డీ గొప్ప యోధుడు. మనకు ఇరువురూ పూజ్యులే. వారిరువురివల్ల మనం నేర్చుకోవలసింది చాలా వున్నది. అయినా ఇటలీ స్థితికి, మన భారతదేశ స్థితికి తేడా వున్నది.

మొదట మేజినీ మరియు గేరీబాల్డీల మధ్యగల తేడాను తెలుసుకోవాలి. మేజనీకోరింది వేరు. ఇటలీలో మేజినీ కోరికల మేరకు ఏమీ జరగలేదు. మనిషి కర్తవ్యాలను తెలుపుతూ "ప్రతి ఒక్కరు స్వరాజ్యాన్ని అనుభవించడం నేర్చుకోవాలి." అని మేజినీ వ్రాశాడు. కాని అది ఆయనకున్న కలగానే మిగిలిపోయింది. గేరేబాల్డీ మరియు మేజినీలకు అభిప్రాయభేదం వచ్చిన విషయం మనం మరిచిపోకూడదు. గేరీ బాల్డీ ప్రతి ఇటలీ పౌరుడికి ఆయుధాలు యిచ్చాడు. ఇటలీ వాళ్లు ఆయుధాలు తీసుకున్నారు.

ఇటలీకి, ఆస్ట్రియాకు మధ్య నాగరికత విషయంలో వ్యత్యాసం లేదు. వారంతా పెద్ద తండ్రి, పినతండ్రి బిడ్డలుగా పరిగణింపబడతారు. "కుక్కకాటుకు చెప్పుదెబ్బ" అనునది ఇటలీ విధానం. ఇటలీని పరదేశీయుల (ఆస్ట్రియా వాసులు) జాలాన్నుంచి విడిపించాలని గేరీబాల్డీ కోరిక. అందు నిమిత్తం అతడు కావూర్ ద్వారా చేయించిన కుట్రలు అతడి శౌర్యానికి కళంకం తెచ్చాయి.

చివరికి లభించిన ఫలితం ఏమిటి? ఇటలీలో ఇటాలియన్లు రాజ్యం చేస్తున్నారు, కనుక ఇటలీ ప్రజలు సుఖంగా వున్నారు అని భావిస్తే మీరు చీకట్లో తడుముతూ వున్నారని చెప్పకతప్పదు. ఇటలీ స్వతంత్రం కాలేదని మేజినీ స్పష్టంగా ప్రకటించాడు. విక్టర్ ఇమాన్యుయల్ ఇటలీకి అర్థం ఒకటిచెబితే, మేజినీ మరొక అర్థం చెప్పాడు. ఇమాన్యుయల్, కావూర్, గేరీబాల్డీలు అభిప్రాయం ప్రకారం ఇటలీ అంటే అర్థం ఇమాన్యుయల్ లేక

ఇటలీ రాజు మరియుఅతడి జీహుజూరీ.(సేవ). మేజినీ చెప్పిన అర్థం ప్రకారం ఇటలీ అంటే ఇటలీప్రజలు మరియు అక్కడి రైతులు. ఇమాన్యుయల్ మొదలగువారు వారి (ప్రజల) సేవకులు. మేజినీ ఆశించిన ఇటలీ యింకా బానిసత్వంలోనే వున్నది. ఇద్దరు రాజులమధ్య చదరంగం పందెం సాగింది. ఇటలీ ప్రజలు పావులైనారు. ఇటలీ దేశపు కార్మికులు యిప్పటికీ దుఃఖంతో వున్నారు. ఆ కార్మికుల గోడు వినేవాడు లేడు. అందువల్ల వాళ్లు హత్యలు చేస్తున్నారు. వ్యతిరేకిస్తున్నారు. తలలు పగలుకొడుతున్నారు. అక్కడ ఎప్పుడు తిరుగుబాటు చెలరేగుతుందో చెప్పలేని స్థితిఏర్పడింది. ఇప్పటికీ అదే స్థితి. ఆస్ట్రియా విడిపోతే ఇటలీకి కలిగిన లాభం ఏమిటి అని అడిగితే అది నామమాత్రమేనని చెప్పకతప్పదు. ఏ మార్పులకోసం యుద్ధం జరిగిందో, ఆ మార్పులు రానే లేదు. ప్రజల స్థితిగతులు మెరుగుపడలేదు.

భారతదేశానికి కూడా అట్టి స్థితికలగాలని మీరు కోరరు. భారతావని యందలి కోట్లాది ప్రజలకు మేలు కల్గించాలనేదే మీ కోరిక అని మీరో లేక నేనో రాజ్యాధికారం పొందడం మీ కోరిక కాదని నాకు తెలుసు. అట్టి స్థితిలో ప్రజలు ఎలా స్వతంత్రులు కాగలరో మనం బాగా యోచించాలి.

మనదేశంలో కొన్ని సంస్థానాల్లో ప్రజలు అణిచివేయబడటం మనం చూస్తున్నాం. అక్కడిపరిపాలకులు ప్రజల్ని నీచంగా అణిచివేస్తున్నారు. ఇంగ్లీషువాళ్ల కంటే వాళ్ల దుర్మార్గాలు మిగతా భారతావనిలో కూడా జరగాలని మీరు భావిస్తే మన భావాలు ఎట్టి స్థితిలోను కలవవు.

సంస్థానాధిపతుల కాళ్లక్రింద అక్కడి జనం నలిగిపోవడాన్ని నా స్వదేశాభిమానం సుతరాము అంగీకరించదు. నాకు బలం వుంటే సంస్థానాధిపతుల దుర్మార్గాలకు, ఇంగ్లీషువాళ్ల దుర్మార్గాలకు వ్యతిరేకంగా పోరాడుతాను.

స్వదేశాభిమానం అంటే నా దృష్టిలో దేశహితం అని అర్థం. నిజంగా ఇంగ్లీషు వాళ్లవల్ల నా దేశానికి మేలు చేకూరుతూ వుంటే వాళ్లకు తలవంచి నమస్కరిస్తాను. దేశాన్ని స్వతంత్రం చేయాలి అనీ, దుర్మార్గాల్ని ఎదిరించి

తీరాలనీ, ప్రజలకు సేవచేయాలనీ ఏ ఇంగ్లీషువాడు ప్రకటించినా, అతణ్ణి భారతీయుడుగా నేను పరిగణించి అతడికి స్వాగతం పలుకుతాను.

ఇటలీవలె భారతావనికి కూడా ఆయుధాలు లభిస్తే పోరాడవచ్చు. అది భగీరథ ప్రయత్నం. అంత పెద్ద విషయాన్ని గురించి మీరు యోచించలేరు. ఇంగ్లీషు వాళ్లు మందుగుండు సామగ్రి పుష్కలంగా సంపాదించిపెట్టుకున్నారు. అందుకు నేను భయపడను. వాళ్ల ఆయుధాలతో వాళ్లను ఎదిరించాలంటే భారతావని కూడా ఆయుధాలు పుష్కలంగా సంపాదించుకోవాలి. అందుకు ఎన్ని సంవత్సరాలు పడతాయో చెప్పలేము. భారతీయులందరికీ ఆయుధాలు అందజేయాలంటే, భారతదేశాన్ని కూడా యూరప్‌లా చేయాలన్నమాట. అలా చేస్తే యీనాడు యూరపుకు పట్టిన గతే భారతావనికి కూడా పడుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే అందు నిమిత్తం భారతావని యూరప్ యొక్క నాగరికతను అలవర్చుకోవాలి. అలా జరుపుటకు ఏమాత్రం అవకాశం వున్నా, ఆ నాగరికతలో ఆరితేరిన ఇంగ్లీషువాళ్లనే యిక్కడ వుండనీయడం మంచిపని. వాళ్లతో పోట్లాడి కొద్దోగొప్పో అధికారాలు పొందుదాము. కొన్ని పొందకపోయినా పరవాలేదు. మనం రోజులు గడుపుకోవచ్చు.

భారతదేశ ప్రజలు ఆయుధాలు పట్టుకోరను విషయం ఖాయం. అదిసరియైన పనియే.

**పాఠకుడు** : మీరు చాలా ముందుకు సాగిపోయారు. అందరూ ఆయుధాలు పట్టుకోవలసిన అవసరం లేదు. మేము ముందుగా కొంతమంది తెల్లవాళ్లను చంపి అలజడి రేకెత్తిస్తాం. తరువాత ఆయుధాలు ధరించిన కొందరు బహిరంగంగా పోరాడుతారు. అట్టి యుద్ధంలో 20లేక 25 లక్షల మంది భారతీయులు తప్పక చనిపోతారు. అయితే చివరికి మనం తెల్లవాళ్ల సంకెళ్లనుంచి దేశాన్ని విడిపిస్తాం. మనం గొరిల్లా యుద్ధం చేసి తెల్లవాళ్లను ఓడించి వేస్తాం.

**సంపాదకుడు** : పవిత్ర భారతభూమిని రాక్షసిగా మార్చివేయాలనే తలంపు మీకు కలిగినట్లుంది. తెల్లవాళ్లను హత్య గావించి భారతదేశాన్ని

విడిపించుతామని భావించినప్పుడు మీకు భయం కలగలేదేమి? నిజానికి మనల్ని మనమే హత్య చేసుకోవాలి. మనం నపుంసకులం అయిపోవడమే అందుకు కారణం. కనుక నే హత్యల్ని గురించి యోచిస్తున్నాం. హత్యలు చేసి మీరుఎవరిని స్వతంత్రం చేస్తారు? భారత దేశ ప్రజలు అలా ఆలోచించరు అథమస్థాయి సభ్యతను అలవర్చుకున్న మనబోటివాళ్లు బంగుతాగి, ఆ నిషాతలకెక్కి యిలాంటి ఆలోచనలు చేస్తూవుంటాం. రక్తం ప్రవహింపచేసి రాజ్యం చేసేవాళ్లు ప్రజలకు సుఖం కలిగించలేరు. ధీంగరా ఒక హత్య చేశాడు (పంజాబీ యువకుడు మదనలాల్ ధీంగరా 1909 జూలైలో, లండనులో కర్నల్ సర్ కర్జన్ వైలీని గుండుకు బలిచేశాడు. ధీంగరాకు ఉరిశిక్ష వేశారు.) అట్టి హత్యలు కొన్ని మనదేశంలోను జరిగాయి. కాని ఆ హత్యలవల్ల దేశానికి ప్రయోజనం చేకూరిందని ఎవరైనా అనుకుంటే శుద్ధతప్పు. ధీంగరాను దేశాభిమానిగా అంగీకరిస్తాను. కాని ఆతని దేశ ప్రేమే పిచ్చితనంతో కూడినట్టిది. తన శరీరాన్ని ఆతడు తప్పు పద్ధతిన బలిదానం చేశాడు. అట్టి చర్యలవల్ల దేశానికి చివరికి నష్టమే కలుగుతుంది.

**పాఠకుడు** : ఇంగ్లీషువాళ్లు ఆ హత్యవల్ల భయపడ్డారన్న విషయం మీరు అంగీకరించక తప్పదు. లార్డ్‌మార్లే కొద్ది అధికారాలు భయపడే మనకిచ్చారు.

**సంపాదకుడు** : ఇంగ్లీషు వాళ్లు భయపడేరకమే. కాని దానితోపాటు వాళ్లు శూరులు కూడా. మందుగుండ్ల ప్రేలుళ్లకు వాళ్లు వెంటనే భయపడతారు. నిజమే. లార్డ్ మార్లే కొద్ది అధికారాలు భయంవల్ల యిచ్చి యుండవచ్చు. కాని భయంవల్ల లభించే వస్తువు, భయం వున్నంతవరకే నిలిచి యుంటుందను విషయం మనం గ్రహించాలి.

★ ★ ★

# 16

# మందుగుండు సామగ్రి

**పాఠకుడు** : భయంతో యిచ్చినది, భయంవల్ల లభించేది అభయం వున్నంతవరకే నిలబడి వుంటుంది" అని ఒక విచిత్రమైన మాట మీరు అన్నారు. ఇచ్చిందేదో యిచ్చారు. ఇక అయిపోయింది. అందు తిరిగి కూర్పుకు చేర్పుకు అవకాశం వుంటుందా?

**సంపాదకుడు** : అలా వుండదు. 1857లో తిరుగుబాటు జరిగిన తరువాత ప్రజల్లో శాంతి నెలకొల్పుటకు ఒక ప్రకటన చేయబడింది. శాంతి నెలకొన్నది. ప్రజలు అమాయక హృదయులు. తరువాత ఊరుకున్నారు. అప్పుడు ఆ ప్రకటనకు అర్థం మారిపోయింది. నేను శిక్షకు భయపడి దొంగతనం చేయను. భయం పోయిన తరువాత మళ్లీ దొంగతనం చేయాలనే కోరిక కలుగుతుంది. దొంగతనం చేస్తాను. ఇది సామాన్యమైన అనుభవం. దీన్ని కాదనుటకు వీలులేదు. బెదిరించి భయపెట్టి జనం చేత పనులు చేయించుకోవచ్చు. అలా చేస్తూ వచ్చాం.

**పాఠకుడు** : మీరు చెప్పిన యీ మాట మీకు వ్యతిరేకం అవుతుందని మీకు అనిపించడం లేదా? తెల్లవాళ్లు సంపాదించినదంతా, హత్యలు చేసి, నరుకుళ్లు సాగించి సంపాదించిందే గదా! మీరూ దీన్ని అంగీకరించకతప్పదు. హత్యలు, నరుకుళ్లు చేసి వాళ్లు సంపాదించినదంతా వ్యర్థం అని మీరు అన్నారు. నాకు జ్ఞాపకం వున్నది. దీనివల్ల నా మాటకు దెబ్బతగలదు. వాళ్లు వ్యర్థం (వస్తువు) గా వున్నదాన్ని పొందాలనుకున్నారు. పొందారు. అంటే వాళ్లు తమ కోరికను పూర్తి చేసుకున్నారన్నమాట. సాధనాలేమిటి. అను విషయాన్ని గురించి చింత మనకెందుకు? మనకోరిక మంచిదైతే ఏ సాధనంద్వారానైనా సరే, హత్యల ద్వారా అయినాసరే నెరవేర్చుకోమా? దొంగ నా యింట్లో జొరబడితే నేను సాధనాల్ని గురించి యోచిస్తూ కూర్చుంటానా? ఏదో విధంగా వాణ్ణి బైటికి వెళ్లగొట్టడం నా కర్తవ్యం కాదా?

ప్రభుత్వానికి అర్జీలు పంపుతూవున్నాం. ఫలితం ఏమీ లభించలేదనీ, యికముందు కూడా ఏమీ లభించబోదని మీరు అంగీకరించారు. అట్టి స్థితిలో వాళ్లను చంపి మనమెందుకు ఫలితం పొందకూడదో చెప్పండి అవసరమైనంత వరకు చంపుతామని భయపెడదాము. పిల్లవాడు నిప్పులమీద కాలుపెట్టాడనుకోండి, నిప్పునుంచి రక్షణ అతడు పొందుటకు ఆంక్షలు పెడితే అది తప్పని మీరు ఆక్షేపించరు కదా! ఏదో విధంగా మనం మన పనిని పూర్తిచేసుకోవాలి.

**సంపాదకుడు** : మీరు మంచి యుక్తిని ప్రతిపాదించారు. అయితే యిలా చేసి చాలామంది మోసపోయారు. నేనూ యిలాగే యుక్తి ప్రతిపాదించేవాణ్ణి. కాని యిప్పుడు నా కండ్లు తెరుపుడు బడ్డాయి. తప్పును యిప్పుడు గుర్తించగలిగాను. ఆ తప్పేమిటో వివరిస్తాను. ఇంగ్లీషువాళ్లు హత్యలు, నరుకుళ్లు కావించి ఆస్తులు సంపాదించారు. కనుక మనం కూడా అలాగే చేసి అనుకున్నది సాధిద్దాం అనునది మొదటి విషయం. తెల్లవాళ్లు హత్యలు చేశారు, మనం కూడా చేయవచ్చు అనుమాట బాగానే వున్నది. అయితే తద్వారా వాళ్లు పొందిందే మనం కూడా పొందవచ్చు. కాని అట్టి వస్తువు మనకు అక్కర్లేదని మీరూ అంగీకరిస్తారని భావిస్తున్నాను.

సాధనం, సాధ్యం, మధ్య ఏమీ సంబంధం లేదని మీరు భావిస్తున్నారు. ఇది పెద్ద పొరపాటు. ఇలా భావించడంవల్లనే ధార్మిక పురుషులు సైతం ఘోరమైన కర్మలు చేశారు. ఇది ఉమ్మెత్త మొక్కనాటి దానికి మోదుగపూవు పూయాలనుకోవడం వంటిదే. సముద్రం దాటాలంటే నాకు సాధనం ఓడయే. అలాగాక సముద్రం దాటాలని భావించి ఎడ్లబండిని అందువదిలితే నేను, ఎడ్లబండి యిద్దరం సముద్రం అట్టడుగుకుపోతాం. ఎంత దేవుడికి అంతపూజ అను సూక్తి యోచించతగినది. కాని దానికి తప్పుడు అర్థం చెప్పి జనం పొరపాట్లకు లోనయ్యారు. నాటే విత్తనం సాధనం. సాధ్యం అంటే పొందే వస్తువు అంటే చెట్లు. అందువల్ల విత్తనానికి చెట్టుకు మధ్య ఎటువంటి సంబంధం వుంటుందో, సాధనానికి సాధ్యానికి మధ్య అటువంటి సంబంధం వుంటుంది. దయ్యాన్ని ప్రార్థించి, దేవుణ్ణి ప్రార్థించినప్పుడు లభించే ఫలితం

పొందాలంటే సాధ్యమా? ఇది జరిగేపనికాదు. అందువల్ల సాధనం రాక్షసం అయినా సరే, సాధ్యంకోసం దేవుణ్ణే ప్రార్థిస్తాను అని అంటే అది పూర్తిగా అజ్ఞానమే అవుతుంది. చేసుకున్నవాడికి చేసుకున్నంత మహదేవ అని గదా సామెత.

1833లో ఇంగ్లీషువాళ్లు హత్యలు చేసి ప్రత్యేక ఓటు హక్కుపొందారు. ఆ విధంగా రక్తపాతం కావించి వాళ్లు తమ కర్తవ్యాన్ని తెలుగుక్కోగలిగారా? అధికారం పొందడమే వారి కోరిక. దాని పూర్తికోసం రక్తపాతం చేశారు. పొందారుకూడా. నిజమైన అధికారం కర్తవ్య నిర్వహణ వల్ల లభిస్తుంది. అట్టి అధికారం వాళ్లు పొందలేదు. ఫలితం ఏమైందో తెలుసా? అందరూ అధికారంకోసం అర్రులు చాచారు. దానితో కర్తవ్యం నిద్రపోయింది. అందరూ అధికారం కావాలనే వారే. అయితే ఎవరు ఎవరికి అధికారం యివ్వాలి? వాళ్లు తమ కర్తవవ్యాన్ని నిర్వహించడం లేదు అని అనడం మనలక్ష్యం కాదు. అయితే వాళ్లు ఏ అధికారాల్ని కోరారో వాటిని పొందిన తరువాత, తాము నిర్వర్తించవలసిన కర్తవ్యాల్ని నిర్వర్తించలేదు. వాళ్లు యోగ్యతను పొందలేదు, అందువల్లనే వాళ్ల అధికారాలు ఉచ్చులైవాళ్ల మెడకు బిగుసుకున్నాయి. అందువల్ల వాళ్ల సాధనకు ప్రతిఫలమే వాళ్లు పొందారని చెప్పవచ్చు ఎటువంటి వస్తువు వాళ్లకు కావాలో అటువంటి సాధనాలే వాళ్లు ఉపయోగించారు.

మీ దగ్గర గల గడియారం నేను కాజేయాలనుకుంటే మీతో కొట్లాడవలసిందేగదా! అలా గాక మీ గడియారం కొనాలి అనుకుంటే మూల్యం మీకు చెల్లించాలి. మీ గడియారం ఉచితంగా పొందాలి అని అనుకుంటే మిమ్ము్మ వినమ్రంగా ప్రార్థించాలి. గడియారం పొందాలనుకున్న నేను ప్రయోగించిన సాధనాల ప్రకారం గడియారం దొంగతనంవల్ల లభించిన వస్తువుగానో, కొనుక్కున్న వస్తువుగానో, లేక బహుమతిగా ఉచితంగా పొందిన వస్తువుగానో నేను పొందుతానన్నమాట. మూడు సాధనాల ప్రకారం మూడు పరిణామాలు కలుగుతాయన్నమాట. అట్టి స్థితిలో సాధానాల్ని గురించి పట్టించుకోనవసరంలేదని మీరు ఎలా అనగలరు?

ఇంట్లో దూరిన దొంగను వెళ్లగొట్టడాన్ని గురించి యోచిద్దాం. దొంగను వెళ్లగొట్టుటకు ఏ సాధనాన్నైనా సరే ఉపయోగించవచ్చును అన్న మీవాదనతో నేను ఏకీభవించను. నా ఇంట్లో నా తండ్రి దొంగతనం చేయడానికి వస్తే నేను వాడే సాధనం ఒకటి. పరిచితులైన పరాయివాడెవరైనా దొంగతనానికి వస్తే పై సాధనాన్ని వాడను. మరొకరెవరైనా దూరితే మరో సాధనం ఉపయోగిస్తాను. తెల్లవాడైతే ఒక సాధనం వాడండి, నల్లవాడైతే మరో సాధనం వాడండి అని మీరు అనవచ్చు. చచ్చురకం దూరితే వాడికి వేరే సాధనం వాడతాను. నాతో సమజట్టీగా వుంటే వాడికి తగిన సాధనం వాడతాను. కత్తులు కటార్లు పుచ్చుకొని పొగరుబోతుగా వాడువుంటే కదలకుండా నిద్రపోయినట్లు పడుకుంటాను. చూశారా తండ్రి నుంచి కత్తులవాడి దాకా వేరు వేరు సాధనాల్ని ఉపయోగిస్తానన్నమాట. తండ్రి అయితే నిద్రపోతున్నట్లు పడుకుంటాను, కత్తులవాడైనా అలాగే పడుకుంటాను. తండ్రికి బలంవున్నది, కత్తులవాడికీ బలం వున్నది. కనుక రెండు బలాలకు లోబడి నేను వస్తువును పోగొట్టుకుంటాను. తండ్రి బలం నన్ను దయతో అణుస్తుంది. కత్తులవాడిబలం నాకు కోపం తెప్పిస్తుంది. శతృవులం అయిపోతాం.. ఇదీ కఠిన స్థితి. ఇట్టి వాదనలతో మనం యిద్దరం సాధనాలను గురించి నిర్ధారణకు రాలేము. దొంగల విషయంలో ఎలా వ్యవహరించాలో నాకు తోచిన వివరం చెబుతాను. ఆ చికిత్సను గురించిన వివరం విని మీరు గాబరా పడిపోతారు. అందువల్ల ఆ వివరం మీకు చెప్పను. దాన్ని మీరే తెలుసుకోండి. తెలుసుకోకపోతే సమయాన్ని బట్టి పరిస్థితుల్ని బట్టి మీరు వేరు వేరు సాధనాలు ఉపయోగించకతప్పదు. అయితే దొంగను వెళ్లగొట్టడానికి ఏ సాధనమైనా సరే ఉపయోగించడం కుదరదని గ్రహించారు కదా! మీరు వాడే సాధనాన్ని బట్టి ఫలితం లేక పరిణామం వుంటుంది. దొరికిన ఏ సాధనంతోనైనా సరే దొంగను వెళ్లగొట్టడం ధర్మమైన పని కాదు.

ఇంకా కొంచెం ముందుకు వెళదాం. కత్తులతో వచ్చినవాడు మీ వస్తువును ఎత్తుకెళ్లాడు. మీకు వాడు గుర్తున్నాడు. వాడి మీద మీకు విపరీతమైన కోపం వున్నది. ఆ లుచ్చాకు మీకోసం కాకపోయినా, యితరుల

మేలుకోసం శిక్షవిధించేలా చేయాలని మీరు నిర్ణయానికి వచ్చారు. కొంతమంది మనుష్యుల్ని ప్రోగుచేశారు. వాడింటిమీద దాడిచేయాలని, నిర్ణయించారు. ఈ విషయం వాడికి తెలిసింది. వాడు పారిపోయాడు. కొంతమంది దొంగల్ని ప్రోగుచేశాడు. వాడిపై కోపంగా వున్నారు. మీ యింటిని పట్టపగలు దోచివేస్తానని కబురు పంపాడు. వాణ్ణి ఎదుర్కొనుటకు మీరు సిద్ధమై రెడీగా వున్నారు. వాడు యీ లోపున మీ యిరుగు పొరుగువారిని బాధపెట్టసాగాడు. వాళ్లు వచ్చి మీకు చెబుతారు. మీ కోసమే నేను యిదంతా చేస్తున్నాను. నా వస్తువేపోయింది, మీ లెక్కేమిటి అని మీరంటారు. "వాడు మా జోలికి రాలేదు. మీరు వాడితో కయ్యంపెట్టుకున్నారు, దానితో వాడు యిలా రెచ్చిపోయాడు" అని వాళ్లు అంటారు. మీరు ఆలోచనలో పడతారు. ఆ బీదలమీద మీకు దయ వున్నది. వాళ్లమాట నిజం కూడా. ఇక ఏంచేయాలి? ఆ దొంగను వదిలివేయడమా? వదిలివేస్తే మీ గౌరవంపోతుంది. గౌరవమర్యాదలు అందరికీ అవసరంకదా! "భయంవద్దు. రండి, నా ధనంతోనే కొని నేను మీకు ఆయుధాలు యిస్తాను. వాటిని ఎలా వాడాలో నేర్పుతాను. ఆ బద్మాష్‌ను చితకబాదండి. వదలవద్దు" అని మీరు చెబుతారు. దానితో పోరుపెరిగింది. దొంగలు పెరిగారు. జనం చేజేతుల కష్టం కొనుక్కుతెచ్చుకున్నారు. దొంగను ఎదుర్కొనేందుకు, వాడితో పగతీర్చుకొనేందుకు రాత్రిళ్లు జాగరణ చేయవలసివచ్చింది. శాంతిగావున్న చోట అశాంతి ప్రబలింది. మొదట మృత్యువు సమీపించినప్పుడే జనం చనిపోయేవారు. ఇప్పుడు రోజూ చావడమే. ఎప్పుడు చస్తామో తెలియదు. జనం నీరసపడ్డారు. ధైర్యం తగ్గింది. ఇదేదో నేను కల్పించి చెబుతున్నానని అనుకోవద్దు. ధైర్యంతో ఆలోచించండి, మీకే బోధపడుతుంది. ఇది ఒక సాధనం అన్నమాట.

ఇంకో సాధనాన్ని పరిశీలిద్దాం. దొంగ అజ్ఞాని అని మీరు అనుకున్నారు. అవకాశం దొరికితే వాడికి నచ్చచెప్పాలని భావించారు. అతడు మసలాంటి మనిషే కదా! అతడు ఎందుకు దొంగతనం చేశాడో మీకేం తెలుసు? అందువల్ల అవకాశం దొరికినప్పుడు అతడి మనస్సులో బయలుదేరిన ఆ చెడు బీజాన్ని నచ్చచెప్పి తొలిగించివేయాలని మీరు నిర్ణయానికి వచ్చారు.

ఒకనాడు ఆ దొంగ పెద్దమనిషి దొంగతనానికి మీ యింటికి రానేవచ్చాడు. మీకు కోపం రాలేదు. అతని మీద దయ కలిగింది. అతడు రోగి అని మీరు గ్రహించారు. తలుపులు, కిటికీలు తెరిచివేశారు. మీ పడకను కూడా మార్చుకున్నారు. వెంటనే తీసుకు వెళ్లడానికి వీలుగా వస్తువులను సర్దివుంచారు. దొంగవచ్చాడు. వాడు కంగారుపడ్డాడు. అంతా క్రొత్తగా వున్నది. వస్తువులు ఎత్తుకుపోయాడే కాని వాడి బుర్ర తిరిగిపోయింది. గ్రామంలో జనాన్ని విచారించాడు. మీ మంచితనాన్ని గురించి తెలుసుకున్నాడు. పశ్చాత్తాపపడి మిమ్ము క్షమాపణ కోరుకున్నాడు. మీ వస్తువులు తెచ్చి యిచ్చివేశాడు. ఆనాటినుండి దొంగతనాలు మానివేశాడు. మీకు సేవకుడైనాడు. మీరు అతడికి పని అప్పగించారు. ఇది మరో సాధనం.

వేరు వేరు సాధనాల వల్ల వేరు వేరు ఫలితాలు కలుగుతాయను విషయం మీరు గ్రహించారుకదా! దొంగలంతా యిలా వ్యవహరిస్తారని, అందరిలోను మీ వలెనే దయాభావం వుంటుందని నేను నిర్ధారణగా చెప్పలేను. కాని మంచి ఫలితాల్ని సాధించాలంటే మంచి సాధనాలను ఉపయోగించాలని చెప్పగలను. చాలా విషయాలలో ఆయుధబలంకంటే, దయాబలం బాగాపని చేస్తుంది ఆయుధాలవల్ల నష్టం కలుగుతుంది. దయవల్ల నష్టంకలుగదు.

ఇక అర్జీ విషయం చూద్దాం. బలంలేని అర్జీ నిర్జీవం అవుతుంది. ఇందు సందేహం లేదు. "అర్జీ అనునది జనానికి శిక్షణ గరిపే ఒక సాధనం. తద్వారా ప్రజలకు వారి స్థితి ఏమిటో" అర్థమయ్యేలా చేయవచ్చు. అధికారికి చైతన్యం కలిగించవచ్చు. అని కీ.శే. న్యాయమూర్తి రానడే చెప్పేవారు. ఈ దృష్టితో చూస్తే అర్జీ నిర్జీవమైనది కాదని తేలుతుంది. సమానస్థాయికి చెందినవాడు అర్జీపంపితే అది అతడి వినమ్రతకు గుర్తుగా భావిస్తారు. బానిస ఒకడు అర్జీపంపితే అది అతడి బానిసత్వానికి గుర్తుగా భావించబడుతుంది. బలంవున్న అర్జీ సమాన స్థాయి గల మనిషి పంపిన అర్జీ అన్నమాట. తన కోరికను అర్జీ రూపంలో తెలిపాడన్నమాట. అది అతడి వంశ ఔన్నత్యాన్ని తెలుపుతుంది.

అర్జీ వెనుక రెండు రకాల బలాలు వుంటాయి. "మీరు యివ్వకపోతే

చంపివేస్తాం'' ఇది ఒక అర్జీ బలం. ఇది మందుగుండు సామగ్రి దట్టిన అర్జీ అన్నమాట. దానివల్ల కలిగే నష్టమేమిటో మనం పరిశీలించి చూశాం.

''మీరు యివ్వకపోతే మేము మీకు అర్జీదారులంగా వుండము. మేము అర్జీదారులంగా వుంటే మీరు పాదుషాలుగా వుంటారు. మేము మీతో ఏ విధమైన వ్యవహారం నడపము.'' ఇది మరో అర్జీబలం. దీన్ని దయాబలం అనండి లేక ఆత్మబలం అనండి లేక సత్యాగ్రహబలం అనండి. ఇది ఒకరకమైన బలం. ఈ బలం నాశనం కాదు. ఈ బలాన్ని ఉపయోగించేవారికి తమ బలమేమిటో బాగా తెలుసు. దీనికి మన పూర్వీకులు సర్వరోగాలకు దివ్యౌషధం అని పేరు పెట్టారు. ఈ బలం ఉన్నవాళ్ళను ఆయుధబలం ఏమీ చేయలేదు.

పిల్లవాడు నిప్పుల మీద కాలుపెట్టాడనుకోండి. అతణ్ణి ఆపాలన్నా, అతణ్ణి పట్టుకొని ఆపాలన్నా, యిబ్బందులు కలుగుతాయి. పిల్లవాణ్ణి ఏంచేస్తారు? పిల్లవాడు మిమ్మల్ని కొట్టి వెళ్లి తొందరపడి నిప్పుల్లో పడితే. పడక తప్పదుకదా! అప్పుడు యిక రెండే పద్ధతులు మిగులుతాయి? నిప్పుల్లో పడకుండా ఆపుటకు మీరు అతడి ప్రాణాలు తీయాలి, లేక అతడు నిప్పుల్లో పడటం భరించలేక మీరు స్వయంగా నిప్పుల్లో పడి ప్రాణాలు అర్పించాలి. మీరు పిల్లవాడి ప్రాణాలు ఎలాగూ తీయలేరు. అలాగే మీలో దయాగుణం పూర్తిగా లేకపోతే మీరు మీ ప్రాణాలు అర్పించలేరు. అప్పుడు గత్యంతరం లేక పిల్లవాణ్ణి నిప్పుల్లో పడనిస్తారు. ఈ విధంగా మీరు పిల్లవాడి మీద ఆయుధబలాన్ని ఉపయోగించరు. మరోవిధంగా అవకాశం వుంటే పిల్లవాణ్ణి ఆపుతారు. ఈ బలం సామాన్య స్థాయికి చెందినది. ఆయుధబలం వంటిది కాదని గ్రహించాలి. ఇదొక రకం బలం. పిల్లవాణ్ణి ఆపునప్పుడు మీరు కేవలం పిల్లవాడి స్వార్థాన్నే చూస్తారు. ఎవరిమీద అంకుశం వుపయోగించాలని భావిస్తారో, అతడి స్వార్థంకోసమే దాన్ని ఉపయోగిస్తారు. ఈ ఉదాహరణ ఇంగ్లీషు వాళ్లకు సుతరాము వర్తించదు. ఇంగ్లీసు వాళ్లమీద మీరు ప్రయోగించదలచిన ఆయుధబలంతో మీరు కేవలం మీ స్వార్థం అనగా ప్రజల స్వార్థాన్నే చూస్తారు. ఇందు దయకు కొంచెంకూడా చోటులేదు.

ఇంగ్లీషు వాళ్లు అధములు, నీచపు పనులు చేస్తున్నారు. అది నిప్పు అని, అజ్ఞానం వల్ల వాళ్లు నిప్పుల్లో పడుతున్నారని భావించి మీరు దయతో అజ్ఞానిని, అనగా పిల్లవాణ్ణి నిప్పునుంచి రక్షించదలచారని అనుకుందాం. మీరు రక్షించతలుచుకుంటే యీ ప్రయోగాన్ని పరీక్షించడం కోసం నీచపుపనులు చేసేవారి చోటుకి వెళ్లవలసి వస్తుంది. ఎదుటివారి అనగా పిల్లవాడి ప్రాణాలకు బదులు మీ ప్రాణాల్ని ఆహుతిచేయవలసి వుంటుంది. ఈ పురుషార్థం చేయదలుచుకుంటే మీరు చేయవచ్చు. మీరు స్వతంత్రులు. అయితే యిది సాధ్యమయ్యే వ్యవహారం మాత్రం కాదు.

★ ★ ★

# 17

# సత్యాగ్రహము - ఆత్మబలము

**పాఠకుడు** : మీరు సత్యాగ్రహమనీ, ఆత్మబలమనీ అంటున్నారు. చరిత్రలో దానికి ఏమైనా ప్రమాణం వున్నదా? ప్రపంచంలో యిప్పటివరకు ఏదేశము, వీటిని ఆధారం చేసుకొని పైకి వచ్చినట్లు కనబడలేదు. చెడ్డవాళ్లు నరుకుడుకు భయపడతారేగాని, మరోవిధంగా దోవకురారని యిప్పటికీ నా విశ్వాసం.

**సంపాదకుడు** :

*"దయయే ధర్మానికి మూలం*
*పాపానికి మూలం అభిమానం*
*తనువులో ప్రాణం వున్నంతవరకు*
*దయనువదలకండి, ఇదే తులసిమాట"*

తులసీదాసుకవి చెప్పిన యీ మాట నా దృష్టిలో శాస్త్రవచనం. రెండు రెండు కలిపితే అయ్యేది నాలుగే కదా! అంతటి విశ్వాసం కవి చెప్పిన మాటపై నాకు వున్నది. దయాబలం ఆత్మబలం. అదే సత్యాగ్రహం ఈ

బలానికి ప్రమాణాలు అడుగడుగునా కనిపిస్తాయి. ఈ బలమే గనుక లేకపోతే యీ పాటికి భూమి రసాతలానికి పోయి వుండేది

అయితే మీరు చరిత్రలో గల ప్రమాణం కోరుతున్నారు. అందుకై మనం చరిత్ర అంటే ఏమిటో తెలుసుకోవాలి. చరిత్ర అను శబ్దానికి "ఇలా జరిగింది' ' అని అర్థం చెప్పుకుంటే మీకు ఎన్నో ప్రమాణాలు చరిత్రలో దొరుకుతాయి. హిస్టరీ అను ఇంగ్లీషు శబ్దానికి అనువాదం చరిత్ర. ఆ శబ్దానికి రాజులు, రాజుల చరిత్ర అని అర్థం చెప్పుకుంటే, అందు ప్రమాణాలు దొరకవు. ఇనుము దొరికే గనిలో వెండిని వెతికితే దొరుకుతుందా? హిస్టరీలో ప్రపంచం యొక్క కోలాహలంతో కూడిన కథ మాత్రమే దొరుకుతుంది. ఏ దేశానికి హిస్టరీ (కోలాహలం) లేదో ఆ దేశం సుఖి". అను సామెత తెల్లవాళ్లలో ప్రచారంలో వున్నది. రాజులు ఎలా ఆడుకునే వారో, ఎలా హత్యలు చేసేవారో, ఎలా వైరం వహించేవారో వివరం హిస్టరీలో దొరుకుతుంది. ఇదే చరిత్ర అయితే యీ ప్రపంచం ఎన్నడో మునిగిపోయి వుండేది. ప్రపంచ చరిత్ర యుద్ధాలతో ప్రారంభమై యుంటే భూమి మీద యిప్పుడు బ్రతికి యున్న మనిషి ఒక్కడు కూడా కనబడివుండేవాడు కాడు. యుద్ధాల వేటకు గురి అయిన దేశాల గతి అథోగతే అయింది. ఆస్ట్రేలియాకు చెందిన తెల్లవాళ్లు అక్కడ ఎవ్వరినీ బ్రతకనీయలేదు. సమూలంగా నశించినవారు సత్యాగ్రహులుకారు. ఆస్ట్రేలియాలోగల బ్రతికి యున్న తెల్లవాళ్లకు కూడా అదేగతి తప్పదు. కత్తులతో వ్యవహారం సాగించేవారు కత్తులకే ఎర అవుతారు. ఈదేవాడు నీటికే బలి అవుతాడను సామెత వున్నదికదా!

వేలాది లక్షలాది మంది ప్రేమతో కలిసి మెలసి వుండటం చూస్తున్నాం. కోట్లాది కుటుంబాలవాళ్లు ప్రేమవల్ల, తమ కష్టాలు మరిచిపోతున్నారు.. వందలాది దేశాలు కలిసివున్నాయి. దీన్ని హిస్టరీ పేర్కొనదు. దయ, ప్రేమ, సత్యధార ఆగిపోయినప్పుడే హిస్టరీ దాన్ని పేర్కొటుంది. ఒకే కుటుంబానికి చెందిన యిద్దరు సోదరులు పోట్లాడుకున్నారు. వారిలో ఒకడు రెండవవాడి మీద సత్యాగ్రహబలాన్ని ప్రయోగించాడు. దానితో వైరం సమసిపోయింది. ఇద్దరూ కలిసి పోయారు. దీన్ని గురించి వ్రాసేవారెవరు? అలా కలవకుండా

యిద్దరు సోదరులు, వకీళ్ల సాయంతోనో, యింకొకరి సాయంతోనో వైరం పెంచుకొని, కొట్టుకుంటే, లేకకోర్టుకు ఎక్కి (కోర్టులు కూడా ఆయుధబలమే) కొట్టుకుంటే వాళ్లపేర్లు పత్రికలకు ఎక్కుతాయి. ఇరుగుపొరుగువాళ్లు వాళ్లను చూస్తారు. చరిత్రకి కూడా బహుశ వాళ్ళు ఎక్కవచ్చు. కుటుంబాలకు, తెగలకు వర్తించే సత్యమైన విషయాలు, దేశాలకు కూడా వర్తిస్తాయి. కుటుంబానికి ఒక చట్టం, దేశానికి మరో చట్టం అని అనడానికి కారణం ఏమీ కనబడదు. హిస్టరీ అస్వాభావికమైన విషయాల్ని పేర్కొంటుంది. సత్యాగ్రహం స్వాభావికమైనది. అందువల్ల దాన్ని గురించి ఎవ్వరూ వ్రాయరు.

**పాఠకుడు** : మీ మాటలవల్ల సత్యాగ్రహబలానికి సంబంధించిన ఉదాహరణలు చరిత్రలో వ్రాయబడవు అని తేలుతున్నది. ఈ సత్యాగ్రహాన్ని గురించి ఎక్కువగా తెలుసుకోవవలసిన అవసరం వున్నది. మీరు చెప్పదలుచుకున్న విషయాన్ని స్పష్టమైన శబ్దాల్లో చెబితే మంచిదని అభిప్రాయపడుతున్నాను.

**సంపాదకుడు** : సత్యాగ్రహాన్ని లేక ఆత్మబలాన్ని ఇంగ్లీషులో "పాసివ్ రెసిస్టెన్స్" అని అంటారు. తమ అధికారాలు పొందుటకు దుఃఖాలు కష్టాలు స్వయంగా అనుభవించే వారి విధానాన్ని సూచించుటకు యీ శబ్దాన్ని వాడారు. దీని లక్ష్యం యుద్ధలక్ష్యానికి భిన్నమైనది. నాకు యిష్టం లేని పనిని నేను చేయకుండా అక్కడ సత్యాగ్రహాన్ని లేక ఆత్మబలాన్ని ఉపయోగిస్తానన్నమాట.

ఉదాహరణకు నాకు వర్తించే చట్టాన్నొకదాన్ని ప్రభుత్వం ప్యాసుచేసిందనుకోండి. ఆచట్టం నాకు యిష్టం కాదు కనుక దాన్ని వ్యతిరేకిస్తూ ప్రభుత్వంమీద పెద్ద దాడి చేసి ఆ చట్టాన్ని నేను రద్దు చేయిస్తే శరీర బలాన్ని ఉపయోగించానని అంటారు. అసలు ఆ చట్టాన్ని అంగీకరించను, అందువల్ల కలిగే కష్టనష్టాల్ని భరిస్తాను అని అంటే దాన్ని సత్యాగ్రహం లేక ఆత్మబలం అని అంటారు. సత్యాగ్రహంలో నా బలిదానం చోటుచేసుకుంటుందన్నమాట. ఇతరుల భోగాల్ని, బలిదానాన్ని తాను

కోరకుండా, తన భోగాల్ని బలిచేయడం ఉత్తమం అని అందరూ అంటారు. ఇంతే గాక సత్యాగ్రహంతో పోరాడుతున్నప్పుడు, ఆ పోరు తప్పుదోవపడితే పోరాటం సాగిస్తున్నవాడే దుఃఖాల్ని అనుభవిస్తాడు. అంటే అతడు చేసిన తప్పుకు శిక్ష అతడే అనుభవిస్తాడన్నమాట. పొరపాట్లు దొర్లిన యిలాంటి ఘట్టాలు చాలా వున్నాయి. ఫలానా పని తప్పు అని ఎవ్వడూ బల్లగుద్ది చెప్పలేడు. ఒకడికి తప్పని తోస్తే అతడు ఆ పని చేయకూడదు. దుఃఖాలు, కష్టాలు అతడే అనుభవించాలి.. ఇదే సత్యాగ్రహకీలకం.

**పాఠకుడు** : అయితే మీరు చట్టాన్ని ధిక్కరిస్తున్నారన్నమాట. ఇది విశ్వసనీయత అని అనిపించుకోదు. మనం చట్టాన్ని అంగీకరించే జనంలో చేరతాంగదా! కాని మీరు అతివాదుల్ని సైతం యీ విషయంలో అధిగమిస్తున్నట్లు కనబడతున్నది. అంగీకరించబడిన చట్టాల్ని పాటించవలసిందే. చట్టం సరిగా లేకపోతే దాన్ని రూపొందించిన వాణ్ణి చితకబాది వెళ్లగొట్టాలి. అని అతివాదులు అంటారు.

**సంపాదకుడు** : నేను ముందుకు వెళుతున్నానా లేక వెనక్కి వెళుతున్నానా అని మీరు యోచించకూడదు. నేను అలా యోచించకూడదు. ఏది మంచిదో వెతకడమే మన పని. దాని ప్రకారం నడుచుకోవాలన్నదే నా కోరిక.

మనం చట్టాల్ని అంగీకరించేవాళ్లం. అంటే మనం సత్యాగ్రహులం అనేకదా దాని అర్థం? మనకు చట్టం యిష్టం కాకపోతే ఆ చట్టాన్ని రూపొందించినవారి తల చితక్కొట్టకుండా ఆ చట్టాన్ని రద్దు చేయించుటకు మనం ఉపవాసం చేస్తాం. స్వయంగా కష్టాలు అనుభవిస్తాం. ఇదే సత్యాగ్రహి చేయవలసిన పని. మంచిదైనా, చెడ్డదైనా చట్టాల్ని పాటించవలసిందే అని యిప్పుడు అర్థం చెబుతున్నారు. మొదట ఇలా వుండేది కాదు. ఎలాటి చట్టాన్నైనా సరే, అది తప్పని తేలితే ఉల్లంఘించే వారు. అందుకోసం కష్టాలు సహించేవారు.

చట్టం మనకు యిష్టంకాకపోయినా దాన్ని పాటించవలసిందే అని

చెప్పడం మగటిమికి విరుద్ధం. ధర్మానికి విరుద్ధం. బానిసత్వానికి చిహ్నం. తన ఎదుట బట్టలు ఊడదీసుకొని జనం నాట్యం చేయాలని ప్రభుత్వం కోరుతుంది. మనం ఆ విధంగా నాట్యం చేస్తామా? "మీ చట్టాల్ని మీ యింట్లో పెట్టుకోండి. నేను బట్టలు ఊడదీసుకోను, మీ ఎదుటనాట్యం చేయను" అని ప్రభుత్వానికి సత్యాగ్రహినైన నేను చెబుతాను. అయితే యీనాడు మనమంతాకూడా అసత్యాగ్రహులం అయిపోయాం. ప్రభుత్వం చేసే దుర్మార్గాలముందు వంగి, బట్టలు ఊడదీసుకొని, నాట్యం చేయడమేగాక అంతకంటే హీనంగా వ్యవహరిస్తున్నాం.

మానవత్వం వున్న మనిషి, దేవుడికి మాత్రమే భయపడతాడు. మరొకరెవ్వరికీ భయపడడు. ఇతరులు చేసిన చట్టాలు అతణ్ణి బంధించలేవు. "మీరు యిలా చేసితీరాలి" అని పాపం ప్రభుత్వం కూడా అనదు. అయితే "ఇలా చేయకపోతే నీకు శిక్షపడుతుంది" అని మాత్రం అంటుంది. మనం అథమస్థితిలో వున్నాం గనక, "మనం అలా చేయాల్సింద, అదే మన కర్తవ్యం, అదే మన ధర్మం అని అనుకుంటున్నాం.

మనకు ఏ చట్టమైనా అన్యాయమైనదిగా అనిపించితే దాన్ని అంగీకరించడం మొగతనపు లక్షణంకాదని, ఎవ్వరి దుర్మార్గము మనల్ని బంధించలేదని ప్రజలు ఒక్కసారి నేర్చుకుంటే చాలు అంతా మార్గానికి వస్తుంది. అదే స్వరాజ్యానికి కీలకం. ఎక్కువమంది చెప్పిన మాటను, తక్కువగా వున్న జనం అంగీకరించాలి అనుమాట న్యాయబద్ధం కాదు. అది అపోహమాత్రమే. ఎక్కువమంది చెప్పింది తప్పని, తక్కువ మంది చెప్పింది ఒప్పని తేలిన ఎన్నో ఉదాహరణలు మనకు కనబడతాయి. ఎన్నో సంస్కరణలు అలా జరిగాయి. తక్కువ మంది జనం చెప్పిన విషయాల్ని ఎక్కువమంది అమలుపరిచారుకదా! మోసగాళ్ల గ్రామంలో ఎక్కువమంది జనం మోస విద్యను నేర్చుకోవాలి అని నిర్ణయిస్తే, అక్కడి సాధువ్యక్తి మోసగాడు కాగలడా? అన్యాయపు చట్టాన్ని అంగీకరించాలి అనే అపోహ తొలగనంతవరకు మన బానిసత్వం పోదు. ఇట్టి అపోహను కేవలం సత్యాగ్రహి మాత్రమే తొలగించగలడు.

శారీరకబలాన్ని ఉపయోగించడం, మందుగుండు సామగ్రిని ఉపయోగించడం సత్యాగ్రహ చట్టానికి విరుద్ధం. అంటే మనకు యిష్టమైనదాన్ని యితరులకు యిష్టంకాని దాన్ని, బలవంతంగా వారిమీద రుద్దుతున్నామన్నమాట. ఇదే సక్రమం అని అనుకుంటే ఎదుటి వాడు మనమీద మందుగుండు సామగ్రిని ప్రయోగించి మన చేత ఒప్పించవచ్చుగదా! ఈ విధంగా అయితే మనం ఏకాభిప్రాయానికి రాలేము. గానుగ ఎద్దులా కండ్లకు గంత కట్టుకొని మనం పురోగమిస్తున్నామని అనుకోవడం సరికాదు. నిజానికి గానుగ ఎద్దులా మనం గుండ్రంగా తిరుగుతూనే వుంటాం. తనకు యిష్టం కాని చట్టాన్ని అంగీకరించి ఆ ప్రకారం నడుచుకొనుటకు మనిషి కట్టుబడిలేడని అంగీకరించేవాళ్లు సత్యాగ్రహమను సాధనాన్ని అంగీకరిస్తారు. లేకపోతే భయంకరమైన ఫలితాలు కలుగుతాయి.

**పాఠకుడు** : మీరు చెప్పిందంతా వింటూవుంటే సత్యాగ్రహం బలహీనులకు బాగా ఉపయోగపడుతుందని నాకు అనిపిస్తున్నది. వాళ్లు బలవంతులైనప్పుడు ఫిరంగులు వాడవచ్చుకదా!

**సంపాదకుడు** : మీది అజ్ఞానంతో నిండిన మాట. సత్యాగ్రహం బలహీనుల అస్త్రం కాదు. అది సర్వోపరియైన బలం. అన్నిటిని మించిన శక్తి. ఫిరంగి గుండుకంటే మించిపనిచేసే సత్యాగ్రహశక్తి బలహీనుల ఆయుధం అని మీరు ఎలా అనుకుంటున్నారు? సత్యాగ్రహానికి అవసరమైన శక్తి సామర్థ్యాలు ఫిరంగి గుండ్ల శక్తి గలవాడి దగ్గర వుండనే వుండవు. పిరికివాళ్లు, బలహీనులు యిష్టం కాని చట్టాన్ని ఎదుర్కోగలరని మీరు భావిస్తున్నారా? అతివాదులు గుండ్ల బలాన్ని, పశుబలాన్ని సమర్థిస్తారు. అట్టి వాళ్లు చట్టాన్ని ఒప్పుకోమని ఎందుకు చెబుతున్నారు. వారిని తప్పుబట్టడం నా ఉద్దేశ్యం కాదు. వాళ్లు మరో మాటపలకలేరు. వాళ్లు ఆంగ్లేయుల్ని హతమార్చి రాజ్యం పొందితే మీచేత, నాచేత చట్టాన్ని (బలవంతంగా) అంగీకరించేలా చేస్తారు. వాళ్ల పద్ధతి అది. కాని సత్యాగ్రహి అలాచేయడు.. తనకు యిష్టంకాని చట్టాన్ని అతడు అంగీకరించడు. ఫిరంగి గుండుకు ఎరచేసి శరీరాన్ని నుజ్జు నుజ్జుచేసినా సరే అతడి విధానం మారదు.

ఫిరంగిపేల్చి వందలాది మందిని చంపేవాడికి ధైర్యం అవసరమని భావిస్తున్నారా లేక ఫిరంగి గుండుకు ఎరయై శరీరాన్ని ముక్కలుకానిచ్చే వాడికి ధైర్యం అవసరమని మీరు భావిస్తున్నారా? ప్రాణాల్ని అరిచేతలో పెట్టుకొని, తాను నమ్మిన సత్యంకోసం నిలబడగలిగిన వాడే రణ వీరుడా?

ఒక్కటిమాత్రం నిజం. కాపురుషుడు క్షణంసేపు కూడా సత్యాగ్రహికాడు. కాజాలడు.

ఒక్క మాట మాత్రం నిజం. శారీరికంగా బక్కగా వున్నవాడు సత్యాగ్రహి కావచ్చు. ఒక మనిషియే సత్యాగ్రహికావచ్చు. లక్షలాదిమందికూడా సత్యాగ్రహులు కావచ్చు. పురుషుడూ సత్యాగ్రహి కావచ్చు. స్త్రీ కూడా సత్యాగ్రహి కావచ్చు. అందుకోసం వారికి స్థావరం, మంది మార్బలం అవసరం లేదు. వస్తాదులవలె కుస్తీలు పట్టడం ఎలాగో నేర్చుకోనవసరం లేదు. తన మనస్సును వశం చేసుకోగలిగితేచాలు, అతడు అడివిరాజులా, సింహంలా గర్జించగలుగుతాడు. అతడి శతృవుల గుండెలు ఆ గర్జన విని పగిలిపోతాయి.

సత్యాగ్రహి రెండు వైపుల పదునుగల కత్తివంటివాడు. దాన్ని ఏ విధంగానైనా ఉపయోగించవచ్చు. దాన్ని వాడినవాడు, దానికి ఎర అయినవాడు యిద్దరూ క్షేమంగా వుంటారు. ఆ కత్తి రక్తాన్ని కార్చదు, కాని అంతకంటే బలంగా పనిచేస్తుంది. దానికి తుప్పుపట్టదు. దాన్ని ఎవ్వరూ దొంగిలించలేరు. ఒక సత్యాగ్రహి మరో సత్యాగ్రహితో పోటీకి దిగితే అతడికి అలసటకలుగదు. సత్యాగ్రహికత్తికి 'ఒర' అక్కరలేదు. ఎవ్వరూ దాన్ని కాజేయలేరు. మీరు సత్యాగ్రహాన్ని బలహీనుల సాధనం అని భావించడం పూర్తిగా తప్పు.

**పాఠకుడు** : అది భారతదేశము యొక్క విశిష్ట ఆయుధం అని మీరు అన్నారు. అయితే భారతదేశంలో ఫిరంగిబలం ఉపయోగించబడలేదా?

**సంపాదకుడు** : మీరు భారతదేశమంటే కొద్దిమంది రాజులని భావిస్తున్నారు. నా దృష్టిలో భారతదేశ మంటే కోట్లాదిమంది రైతులు మీదనే ఆధారపడి రాజులు, మనము అంతా జీవిస్తున్నాం. రాజులు ఆయుధాలు

తప్పక ఉపయోగిస్తారు. అది వారికి అలవాటు అయిపోయింది. అధికారం చలాయించాలి కదా! అయితే వారి అధికారాన్ని శిరసావహించేవారికి మాత్రం ఫిరంగిబలం అవసరంకాలేదు. ప్రపంచమందలి ప్రజల్లో ఎక్కువమంది ఆజ్ఞను పాలించేవారే. వారికి ఫిరంగిబలాన్నో లేక సత్యాగ్రహబలాన్నో నేర్పాలి. ఫిరంగిబలం నేర్చుకుంటే రాజులు, ప్రజలు యిద్దరూ పిచ్చివాళ్లు అయిపోతారు. ఆజ్ఞను శిరసావహించే జనం సత్యాగ్రహాన్ని నేర్చుకున్నవారైతే, అక్కడి రాజు చేసే దుర్మార్గం మూడు అడుగుల పొడవైన కత్తిని దాటి ముందుకు పోలేదు. ఆజ్ఞను పాటించేవారు అన్యాయపు ఆజ్ఞను లెక్కచేయరు. మన రైతులు ఎన్నడూ ఒకరికత్తి ముందు తలవంచలేదు. వంచరుకూడా. వాళ్లకు కత్తులు దూయడం తెలియదు. ఎవ్వరికత్తికీ వాళ్లు వెరువరు. వాళ్లు మృత్యువును దిండుగా పెట్టుకొని నిద్రపోయే మహాప్రజలు. అంటే మృత్యుభయాన్ని వదిలివేశారన్నమాట. నేను ఏదో పెంచి చెబుతున్నానుకదూ! నిజమే. అయితే కత్తి బలానికి చకితులై పోయిన వాళ్లకు యిది తక్కువే.

రైతులు, ప్రజాసంఘాలు, తమ వ్యవహారాలకు, రాజ్య వ్యవహారాలకు సత్యాగ్రహాన్ని ఉపయోగించారు. రాజులు దుర్మార్గాలు చేసినప్పుడు ప్రజలు ఎదురుతిరిగారు. సత్యాగ్రహం అంటే అదే. నాకు బాగా జ్ఞాపకం. ఒక సంస్థానం మందలి రైతులకు ఒక చట్టం యిష్టం కాలేదు. దానితో రైతులంతా గ్రామాన్ని వదిలివేసి మరోచోటుకి వెళ్లి పోసాగారు. రాజు కంగారు పడిపోయాడు, రైతుల్ని క్షమాపణ కోరాడు. చట్టాన్ని రద్దుచేశాడు. ఇలాంటి ఉదాహరణలు మన దేశంలో ఎన్నో వున్నాయి. అయితే యిది భారతభూమి యొక్క ప్రత్యేకత. స్వరాజ్యమంటే అదే.

**పాఠకుడు** : అయితే శరీరాన్ని బిగించవలసిన అవసరం లేదంటారా?

**సంపాదకుడు** : శరీరాన్ని బిగించకుండా సత్యాగ్రహం ఎలా సాగుతుంది? అయితే ఒక్క మాట. గారాబంగా పెంచబడటం వల్ల, తప్పులకు అలవాటుపడి బలహీనపడినందువల్ల కొందరు నీరసపడతారు. మరోబలంలేని చోట ఆత్మబలం పనిచేయదు. బాల్యవివాహాలనే చెడ్డ అలవాట్లను, భోగవిలాసాలనే

చెడుపద్ధతులను విడనాడి శరీరాన్ని బిగించాలి. అంటే నడుంబిగించాలన్నమాట. బలహీనుణ్ణి, పిరికివాణ్ణి అమాంతం ఫిరంగి గుండుకు గుండెను ఎరచేయమని చెబితే, అతడు ఆ పని చేయగలడా?

**పాఠకుడు** : మీ మాటలవల్ల సత్యాగ్రహి కావడం అంతతేలిక కాదని తెలుస్తున్నది. అట్టి స్థితిలో ఏ వ్యక్తి అయినా ఎలా సత్యాగ్రహి కాగలడు?

**సంపాదకుడు** : సత్యాగ్రహి కావడం తేలికయే. ఎంత తేలికయో అంత కష్టంకూడా. 14 సంవత్సరాల పిల్లవాడు సత్యాగ్రహి కావడం నేను చూశాను. రోగులు కూడా సత్యాగ్రహులు కావడం చూశాను. శారీరికంగా బలిష్ఠులైనప్పటికీ మిగతా విషయాల్లో సుఖంగా వున్నప్పటికీ, సత్యాగ్రహులు కాలేకపోయినప్పటికీ, సత్యాగ్రహులు కాలేకపోయినవారిని చూశాను.

అనుభవంమీద చెబుతున్నాను. దేశహితం కోసం సత్యాగ్రహులు కాదలచినవారు బ్రహ్మచర్యాన్ని అనుష్ఠించాలి. బీదతనాన్ని అనుభవించాలి. సత్యాన్ని తప్పక పాటించాలి. ఎట్టి పరిస్థితిల్లోనైనా సరే నిర్భయంగా వుండాలి.

బ్రహ్మచర్యం ఒక మహావ్రతం. అదిలేనిదే మనస్సుకు బలం కలుగదు. బ్రహ్మచర్యవ్రతాన్ని పాలించకపోతే మనిషి వీర్యవంతుడు కాలేడు. పిరికివాడు, బలహీనుడు అయిపోతాడు. విషయ వాంఛల్లో తారట్లాడే మనస్సుగల మనిషి సింహాన్ని జయించగలడా? ఎన్నో ఉదాహరణల ద్వారా యీ విషయాన్ని ఋజూచేయవచ్చు. అయితే ఇల్లు వాకిళ్లు వుండి కాపురం చేస్తున్న వాళ్లు ఏంచేయాలి అని ప్రశ్న బయదేరవచ్చు. ఇట్టి ప్రశ్న అనవసరం. కాపురం చేస్తూ స్త్రీతో బాటు ఉంటూ విషయవాంఛలకు దూరంగా వున్నాడని అనడం అంతతేలికకాదు. సంతానం పొందుటకు మాత్రమే స్త్రీ సాంగత్యం చేయమని చెప్పడం జరిగింది. సత్యాగ్రహికి సంతానేచ్ఛ వుండకూడదు. సత్యాగ్రహి సంసారిగా వుంటూకూడా బ్రహ్మచర్యాన్ని పాటించవచ్చు. ఈ విషయం ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదు. స్త్రీ అభిప్రాయం ఏమిటి? ఇదంతా సాధ్యమా? అను ప్రశ్నలు అనేకం బయలుదేరుతాయి. అయితే మహత్కార్యాలు నిర్వర్తించుటకు నడుంబిగించిన వారు యిటువంటి ప్రశ్నలకు పరిష్కారాలు కనుగొనక తప్పదు.

అలాగే బీదతనాన్ని సత్యాగ్రహి అనుభవించాలి. ధన వ్యామోహం, సత్యాగ్రహపాలనం రెండూ కలిసి ముందుకు సాగవు. అంతమాత్రాన డబ్బు వున్నవాళ్లు ఆ డబ్బును పారవేయమని చెప్పను. అయినా డబ్బు విషయంలో సత్యాగ్రహి ఉదాసీనంగా వుండాలి. సత్యాగ్రహి దగ్గర గల డబ్బు పోయినా చింతించకూడదు.

సత్యపాలన చేయనివాడు సత్యశక్తిని, ప్రదర్శించలేడు. అందువల్ల సత్యపాలన పూర్తిగా అవసరం. ఎంత పెద్దనష్టం కలిగినా సరే సత్యానుష్ఠానం అవసరం. సత్యవాది ఏమీదాచకూడదు. రహస్యమంటూ ఏమీ వుంచకూడదు. ప్రాణరక్షణార్థం అబద్ధం ఆడవచ్చునా లేదా అని యోచించకూడదు. అబద్ధాలు ఆడాలనే తలంపు కలవారేయిట్టి ప్రశ్నలు వేస్తూవుంటారు. సత్యవాక్పరిపాలకుడు యిట్టి ధర్మసంకటాల్లో ఎన్నడూ పడడు. ఎటువంటి యిబ్బందికర పరిస్థితులనైనా సరే సత్యవాది తేలికగా ఎదుర్కొని బయటపడగలుగుతాడు. నిర్భయంగా లేకపోతే సత్యాగ్రహి వాహనం అంగుళమైనా ముందుకు సాగదు. అన్ని విషయాల్లోనూ నిర్భయం అవసరం. ఆస్తి అంతస్తులు, కృత్రిమ గౌరవ మర్యాదలు, చుట్టాలు పక్కాలు, రాజదర్బార్లు, శరీరానికి తగిలే దెబ్బలు, మృత్యువు మొదలుగాగల వాటన్నింటి భయాలు త్యజించివేయాలి. అప్పుడే సత్యాగ్రహధర్మాన్ని పాటించగలం అబ్బో! ఇవన్నీ సాధ్యమా అని భావించి విరమించుకోకూడదు. నెత్తిమీద విరుచుకుపడే ఆపదల్ని సహించగల శక్తి ప్రకృతి ప్రతి మనిషికి ప్రసాదించింది. దేశ సేవచేయాలనే తలంపులేని వారు సైతం యిట్టి గుణాల్ని తప్పక అలవరుచుకోవాలి.

ఇంతేగాక ఆయుధబలం పొందాలనుకునేవారుకూడా యీ గుర్రాల్ని పొందడం అవసరం యుద్ధవీరుడుకావడం అంత తేలికగాదు అనుకోగానే ఎవ్వడూ వీరుడు కాలేడు. వీరుడు కావాలంటే బ్రహ్మచర్యం అవసరం. బికారి అయిపోవడం అవసరం. నిర్భయం అలవరుచుకోవాలి. సత్యవ్రతాన్ని పాలించడం అవసరమా అని ఎవరైనా అనుకుంటే అది సరికాదు. భయంలేనిచోట సత్యం ఉండితీరుతుంది. సత్యాన్ని మరిచాడంటే దాని అర్థం దేనికో భయపడతున్నాడన్న మాట.

అందువల్ల పైన తెలిపిన నాలుగు గుణాలు సత్యాగ్రహి అలవరచుకోవాలి. సత్యాగ్రహికి అవసరం లేని కొన్ని బలహీనతలు కత్తి బలప్రియులకు ఉంటాయి. అందుకు కారణం భయమే. మనిషిని భయం వదిలిందీ అంటే అతడిచేతి యందలి కత్తి జారిపడిపోయినట్లే. ఇక కత్తి పట్టవలసిన అవసరమే వుండదు. సింహం ఎదురుగా వస్తున్నాడు మనిషి. సింహాన్ని చూడగానే అతని చేతిలోని కఱ్ఱతనంతట తానే ఠక్కున లేచింది. అంటే భయం అతణ్ణి వదలనట్లేకదా! నిర్భయంగా ఉండాలని అతడు బట్టీబట్టిన పాఠాలు అక్కడే ఆగిపోయాయన్నమాట. వెంటనే కఱ్ఱను పారవేశాడు. నిర్భయుడై నిర్భీకుడై నిలబడ్డాడు. అతడే నిజమైన సత్యాగ్రహి.

★ ★ ★

# 18

# విద్య

**పాఠకుడు** : మీరు యిన్ని విషయాలు చెప్పారు. కాని ఎక్కడా విద్య యొక్క ఆవశ్యకతను గురించి చెప్పలేదు. విద్యావ్యాప్తి జరగడం లేదని గట్టిగా ఆరోపిస్తూవుంటాం. నిర్బంధ విద్యా విధానాన్ని గురించి దేశమందంతటా జరుగుతున్న ఉద్యమాన్నిచూస్తున్నాం. గాయక్వాడ్ మహారాజు తన రాజ్యంలో అనివార్య విద్యావిధానాన్ని అమలుజరిపారు. అందరి దృష్టినీ ఆ కార్యక్రమం ఆకర్షించింది. వారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాం. ఈ ప్రయత్నాలన్నింటినీ వ్యర్థమని భావించాలా?

**సంపాదకుడు** : మన సభ్యత ఉత్తమమైనది అని మనం భావిస్తున్నప్పుడు, యిలాంటి ప్రయత్నాలన్నీ చాలావరకు వ్యర్థమేనని నా అభిప్రాయం. గాయక్వాడ్ మహారాజు, తదితర ధురంధురులైన నాయకులందరి మనస్సుల్లో విద్యను గురించి నిర్మలమైన ఉద్దేశ్యం పనిచేస్తున్నది. అందువల్ల వారికి ధన్యవాదాలు సమర్పించవలసిందే. కాని అందువల్ల కలిగే ఫలితాల్ని గురించి యోచించాలి. విద్య, శిక్షణ అంటే అర్థం ఏమిటి? కేవలం జనానికి

అక్షరజ్ఞానం కల్పించడమే అయితే అది ఒక సాధనం మాత్రమే అవుతుంది. దానివల్ల మంచీ జరుగవచ్చు. చెడూ జరగవచ్చు. ఒక శస్త్రంతో ఆపరేషను చేసి జబ్బును నయం చేయవచ్చు. ఆ శస్త్రమే ఒకరి ప్రాణం తీయడానికి కూడా ఉపయోగపడవచ్చు. అక్షరజ్ఞానం విషయం కూడా యిలాంటిదే. చాలామంది దీన్ని చెడుగా ఉపయోగించడం మనం చూస్తున్నాం.దాన్ని మంచిగా ఉపయోగించడం మాత్రం తక్కువ పరిమాణంలో జరుగుతున్నది. ఇదే గనుక యదార్థమైతే అక్షరజ్ఞానంవల్ల ప్రపంచానికి మేలుకు బదులు కీడే జరిగిందని చెప్పవచ్చు.

విద్య అంటే సామాన్యఅర్థం అక్షర జ్ఞానం. జనానికి వ్రాయడం, చదవడం, లెక్కలు వేయడం దీన్ని ప్రారంభిక విద్య అని అంటారు. ఒక రైతు నిజాయతీగా పనిచేసి ఆహారం సంపాదించుకుంటున్నాడు. అతడికి ప్రపంచజ్ఞానం వున్నది. తన తల్లితండ్రులతో ఎలావ్యవహరించాలో, తనభార్యతో ఎలా వ్యవహరించాలో, తన పిల్లలతో ఎలా వ్యవహరించాలో, తను నివసిస్తున్న గ్రామంలో తాను ఎలా నడుచుకోవాలో, అతడికి బాగా తెలుసు. నీతిని గురించి అతడికీ తెలుసు. అయితే చేవ్రాలు చేయడం అతనికి రాదు. అతనికి అక్షరజ్ఞానం కల్పించి ఏమి చేయాలని భావిస్తున్నారు? అతడి సుఖాల్లోమీరు చేసే పెంపుదల ఏమిటి? అతడి గుడిసెను గురించి,అతడి స్థితిని గురించి అతడి మనస్సులో అసంతృప్తి కలిగించాలని భావిస్తున్నారా? అలా చేయదలుచుకుంటే అక్షరజ్ఞానం కల్పించవలసినవసరం లేదు. పాశ్చాత్య నాగరికతా వ్యామోహంలో పడిపోయి మనం జనానికి విద్య నేర్పాలని ప్రచారం ప్రారంభించాం. కాని దాని వెనుక ముందుగల విషయాల్ని గురించి మనం యోచించడం లేదు.

ఇక ఉన్నత విద్యను గురించి యోచిద్దాం. నేను భూగోళవిద్య నేర్చాను. ఖగోళ విద్యనేర్చాను. ఆల్‌జీబ్రాలోను, జ్యామెట్రీలోను నిధిని. భూగర్భ శాస్త్రాన్ని ఔపోసన పట్టాను. అయితే అందువల్ల ఒరిగిందేమిటి? తద్వారా నాకు నేను చేసుకున్న మేలు ఏమిటి? ఇరుగుపొరుగు వారికి నేను చేసిన మేలు ఏమిటి? ఇంతటి జ్ఞాన సంపాదనకు ఉద్దేశ్యం ఏమిటి? నాకు కలిగిన

లాభం ఏమిటి?విద్యను గురించి చెబుతూ ఒక ఆంగ్ల విద్వాంసుడు "అతడు నిజమైన విద్యగడించాడు. తద్వారా తన శరీరాన్నివశమునందు వుంచుకోగలిగాడు. అతడు నిజమైన విద్య ఆర్జించాడు తద్వారా తన బుద్ధిని శుచిగాను, శాంతంగాను, న్యాయబద్ధంగాను వుంచుకోగలిగాడు. అతడు నిజమైన విద్య నేర్చాడు. తద్వారా అతని మనస్సు ప్రకృతి సహజ నియమాల ప్రకారం నడుస్తున్నది. ఇంద్రియాలు అతడి ఆధీనంలోవున్నాయి చెడ్డపనులంటే అతడికి అసహ్యం. ఇతరుల్నితనవలె చూచుకుంటున్నాడు. ఇలాంటి వ్యక్తియే నిజమైన విద్యార్జన కావించిన సుశిక్షితుడు అతడు ప్రకృతి నియమాల ప్రకారం జీవిస్తున్నాడు. ప్రకృతి అతణ్ణి చక్కగా ఉపయోగించుకుంటున్నది. అతడు ప్రకృతిని చక్కగా ఉపయోగించుకుంటున్నాడు" అని పేర్కొన్నాడు.

ఇదే నిజమైన విద్య అయితే నేను నేర్చిన ఉన్నత విద్య, నేను సంపాదించిన డిగ్రీలు మనస్సును, ఇంద్రియాలను జయించుటకు ఉపయోగపడలేదని ఒట్టుపెట్టుకొని మరీ చెప్పగలను. కనుక యీనాటి ప్రారంభిక విద్యగానీ, ఉన్నత విద్యగానీ మనిషిని మనిషిగా తీర్చిదిద్దుటకు ఉపయోగపడటం లేదు. ఈనాటి విద్యవల్ల మనం మన కర్తవ్యాన్ని గుర్తించడం లేదు.

**పాఠకుడు** : ఇదే నిజమైతే మిమ్ము ఒక ప్రశ్న అడుగుతాను. ఇట్టి శక్తి మీరు దేనిద్వారా గడించి యీ విధంగా మాట్లాడగలిగారో చెప్పండి? అక్షరజ్ఞానం పొంది, ఉన్నత విద్య గడించియుండకపోతే యిన్ని విషయాలు మీరు నాకు చెప్పగలిగి యుండేవారా?

**సంపాదకుడు** : మంచి ప్రశ్న. మీకు నేనిచ్చే సమాధానం కూడా తిన్నగానే వుంటుంది. ఉన్నతవిద్యయో, నిమ్న విద్యయో పొందియుండక పోతే నేను దద్దమ్మనై వుండేవాడనని అనుకోవడం సరికాదు. ఇప్పుడు యిట్టి విషయాలు చెప్పి నలుగురికి ఉపయోగపడాలని భావిస్తున్నాను. చదివినదాన్ని ఉపయోగంలోకి తెస్తున్నాను. నిజంగా నేను చేస్తున్నది ఉపయోగకారి అయితే, దాన్ని కోట్లాదిమంది సోదరుల కోసం కాక, మీ వంటి

చదువుకున్నవారికోసం వినియోగించాలని భావిస్తున్నాను. దీని వల్ల నేను చెప్పిన విషయానికి బలం చేకూరుతుంది. నేను, మీరు యిద్దరం తప్పుడు విద్యాజాలంలో చిక్కుకుపోయాం. ఇప్పుడు నేను ఆ జాలాన్నుంచి ముక్తిపొందానని భావిస్తున్నాను. ఆ నా అనుభవాన్ని మీకు అందిస్తున్నాను. పొందిన అనుభవంవల్ల పాఠం నేర్చుకొని, అందలి కుళ్లును మీకు చూపిస్తున్నాను.

మీరు నన్ను అడిగిన ప్రశ్నలో ఒక పొరపాటుచేశారు. నేను అక్షరజ్ఞానాన్ని ఎన్నడూ చెడ్డదని అనలేదు. అట్టి జ్ఞానానికి, మనం విగ్రహంలా పూజచేయకూడదని చెప్పాను. అది మనకు కామధేనువు వంటిదికాదు. అది తన చోట వుండవచ్చు. ఆ చోటు ఏమిటి? నేను, మీరు తద్వారా మన ఇంద్రియాల్ని వశంలో వుంచుకోగలగాలి. నీతి నిజాయతీకి స్ఫూర్తి చేకూర్చగలగాలి. అప్పుడు అక్షరజ్ఞానం వల్ల ఉపయోగం పొందగలం. అట్టి విద్య మనకు మంచి ఆభూషణం అవుతుంది. అయితే విద్య కేవలం ఆభూషణంగానే ఉపయోగపడితే దాన్ని నిర్బంధం చేయనవసరం లేదు. అందుకు మన పాత స్కూళ్లు చాలు. అందే నీతికి ప్రాధాన్యం యిచ్చారు. ఆ పునాది మీద కట్టే భవనం గట్టిగా వుంటుంది.

**పాఠకుడు** : అసలు ఇంగ్లీషు విద్య స్వరాజ్యానికి ఉపయోగపడదని మీరు భావిస్తున్నారు కదూ!

**సంపాదకుడు** : అందుకు "అవును, కాదు" అని నా సమాధానం. కోట్లాదిమంది జనానికి ఆంగ్ల విద్య నేర్పడం వాళ్లను బానిస శృంఖలాల్లో యింకా బంధించడమే. లార్డ్ మెకాలే విద్యకు వేసిన పునాది నిజంగా బానిసత్వానికి ఉపయోగపడేదే. ఇట్టి తలంపుతోనే అతడు తన ప్రణాళికను రూపొందించాడని నేను అనను. కాని అది మనకు ఉపయోగపడలేదు. ఇప్పుడు మనం మన స్వరాజ్యాన్ని గురించి పరాయిభాషలో మాట్లాడుతున్నాం. ఇది విచారకరమైన విషయం. ఇంగ్లీషువాళ్లు ఏ విద్యను వదిలివేశారో, దాన్ని మనం పుచ్చుకుంటున్నాం. ఇది గమనించవలసిన విషయం. ఇందలి ఫలానా విషయం మంచిదిగాదు, అని ఆంగ్ల విద్యాంసులే చెబుతున్నారు. అసలు

యీ విద్యను ఇంగ్లీషువాళ్లు మరిచిపోయారు. దాన్ని మనం అజ్ఞానంవల్ల కరుచుక్కూర్చుంటున్నాం. అక్కడ తమ తమ భాషల్ని అభివృద్ధి చేసుకునేందుకు ప్రయత్నం చేసుకుంటున్నారు. వెల్స్ ఇంగ్లాండ్ నందలి ఒక చిన్న కేంద్రం. అక్కడిభాష ధూళితో సమానం. ఎవ్వరూ దాన్ని లెక్క చెయ్యరు. అటువంటి జీర్ణమైన భాషోద్ధరణకు అక్కడివాళ్లు పూనుకున్నారు.

వెల్స్ బాలురు వెల్స్ భాషలోనే మాట్లాడాలని కృషి చేస్తున్నారు. ఈ కార్యక్రమంలో ఇంగ్లాండు కోశాధిపతి లాయడ్ జార్జి ప్రముఖంగా పాల్గొంటున్నాడు. ఇక మన స్థితి ఎలా వున్నది? మనం ఒకళ్లకొకరం ఉత్తరాలు తప్పులతో కూడిన ఇంగ్లీషులో వ్రాసుకుంటున్నాం. ఎం.ఏ. పరీక్షలో ప్యాసైనవాడు కూడా తప్పు ఇంగ్లీషు వ్రాస్తున్నాడు మన ఉన్నత భావాల్ని సైతం ఇంగ్లీషు భాషలో వెల్లడిస్తున్నాం. మన కాంగ్రెస్ వ్యవహారాలన్నీ ఇంగ్లీషులోనే సాగుతున్నాయి. ఈ పద్ధతి యిలాగే కొనసాగితే రాబోయే తరంవారు మనల్ని తిరస్కరిస్తారు. వాళ్ల శాపం మన ఆత్మలకు తగులుతుంది.

ఆంగ్ల విద్యాబోధనద్వారా మన దేశం బానిస అయిపోయిందను విషయం మనం గ్రహించాలి. ఆంగ్ల విద్యాబోధనవల్ల డాబుసరీలు, మమత్వాలు, దుర్మార్గాలు పెరిగాయి. ఇంగ్లీషు నేర్చిన వ్యక్తులు ప్రజల్ని మోసగించడానికి, వాళ్లను బాధపెట్టడానికి వెనుకంజవేయడంలేదు. ఇంగ్లీషువిద్య నేర్చిన మనం యిప్పుడు అట్టి స్థితిని తగ్గించుటకు ప్రయత్నించితే, ఋణంలో కొద్ది భాగమైనా తీర్చినవాళ్లమవుతాము.

ఏమండీ! మన దేశంలో నేను న్యాయం కావాలనుకుంటే ఇంగ్లీషుభాషను ఉపయోగించాలా? బారిష్టరు అయిన తరువాత నా భాషలో నేను మాట్లాడడానికే వీలులేదా? మరొకడు తర్జుమా చేయాలా? ఇదేమి డాంబికం? ఇది బానిసత్వానికి పరాకాష్ఠ కాదా? ఈ విషయంలో అసలు తప్పు ఇంగ్లీషు వాళ్లదా లేక మనదా? అసలు భారతదేశాన్ని బానిసదేశంగా మార్చింది ఇంగ్లీషువచ్చిన మనమే కదా? అందువల్ల అందుకు బాధ్యులం మనమే. తాకిడి మనకే తగలాలి. తప్పదు. అవును, కాదు అని సమాధానం చెబుతానని

చెప్పాను. అవునును గురించిన వివరం తెలియజేశాను. ఇక "కాదు" ఎలాగో చెబుతాను. మనం ఇంగ్లీషు విద్యావిధానం అనే రోగానికి బాగా గురి అయ్యాం. ఆ రోగం బాగా ముదిరి పోయింది. ఆ విద్యను నేర్చుకోకుండా దూరంగా వుండలేని స్థితి సంప్రాప్తించింది. అయితే యీ విద్య నేర్చిన వాళ్లు దాన్ని సక్రమంగా వినియోగించాలి. ఇంగ్లీషువాళ్లతో వ్యవహరించేటప్పుడు ఇంగ్లీషును వాడాలి. భారతీయులు మాట్లాడే భాషను మనం అర్థం చేసుకోలేని స్థితిలో ఇంగ్లీషును వాడాలి. ఇంగ్లీషు వాళ్లు తమ సభ్యతవల్ల ఎంత విసుగెత్తి పోయారో తెలుసుకొనుటకు ఇంగ్లీషును వాడాలి. ఇంగ్లీషునేర్చినవాళ్ల బిడ్డలకు ముందుగా నీతిని గురించి బోధించాలి. వాళ్ల మాతృభాషను వాళ్లకు నేర్పాలి. మరో భారతీయభాషను వాళ్లకు నేర్పాలి. ఆ పిల్లవాడికి వయస్సు వచ్చిన తరువాత, డబ్బు సంపాదించాలనే ఉద్దేశ్యంతోగాక, ఇంగ్లీషు ఉధృతాన్ని తగ్గించాలనే ఉద్దేశ్యంతో వాళ్లు ఇంగ్లీషు నేర్చుకున్నా పరవాలేదు. దానితోపాటు ఇంగ్లీషులో ఏమి నేర్చుకోవాలో, ఏమి నేర్చుకోకూడదో కూడ మనం యోచించాలి. ఏఏ శాస్త్రాలు చదవాలో కూడా నిర్ణయించాలి. అసలు ఇంగ్లీషు డిగ్రీలు తీసుకోవడం మనం తగ్గించివేస్తే ఆంగ్ల అధికారుల బుర్ర తిరిగిపోతుందనే విషయం కొద్దిగా యోచిస్తే మనకు బోధపడుతుంది.

**పాఠకుడు** : అయితే ఎటువంటి విద్య గరపాలో చెప్పండి?

**సంపాదకుడు** : అందుకు సమాధానం పై వివరంలో కొద్దిగా లభించిందిగదా! అయినా యీ విషయమై యింకా యోచిద్దాం. మనం మన బాషలన్నింటి భవిష్యత్తును ఉజ్వలంగాను, దర్జాగాను వుండేలా తీర్చి దిద్దాలి. మన భాషలోనే విద్యార్జన కావించాలి అను విషయాన్ని గురించి ఎక్కువగా వివరించుటకు యిక్కడ ప్రయత్నించను. ఉపయోగకరమైన ఇంగ్లీషు పుస్తకాల్ని మన భాషలోకి అనువదించాలి. ఎన్నో శాస్త్రాలు నేర్చుకోవాలనే డాంబికాన్ని, భ్రమను మనం తొలగించుకోవాలి. అన్నిటికంటె ముందు ధర్మాల్ని గురించిన, నీతిని గురించిన విద్య నేర్పాలి. చదువుకున్న ప్రతి భారతీయుడికి తన

భాషవచ్చి తీరాలి. అంటే హిందువుకు సంస్కృతం, మహమ్మదీయులకు అరబీ, పారసీకులకు ఫారసీ, అందరికీ హిందీ వచ్చి తీరాలి. కొంతమంది హిందువులు అరబీ, కొంతమంది మహమ్మదీయులు, పారసీకులు సంస్కృతం నేర్చుకోవాలి. ఉత్తరాది, పశ్చిమ భారతావని ప్రజలు తమిళం నేర్చుకోవాలి. యావద్భారతావనికి ఒక భాషగా హిందీయే ఉండాలి. దాన్ని ఉర్దూ లేక నాగరీ లిపిలో వ్రాయుటకు వీలుకల్పించాలి. హిందూ మహమ్మదీయుల సంబంధం బలపడుటకు ఎక్కువమంది భారతీయులు రెండు లిపుల్ని నేర్చుకోవడం అవసరం. ఇలా జరిగితే మనం పరస్పర వ్యవహారాల్లో ఇంగ్లీషు వాడకాన్ని తగ్గించి వేయగలుగుతాం.

ఇదంతా ఎవరికోసం? బానిసలమైపోయిన మనందరికోసమే. మనం బానిసలమైనందున దేశ ప్రజలు బానిసలై పోయారు. మనం బానిసత్వాన్నుంచి విముక్తి పొందితే, ప్రజలు తప్పక విముక్తి పొందుతారు.

**పాఠకుడు** : మీరు ధర్మాన్ని గురించిన విద్యా బోధన అని అన్నారు. అది చాలా కష్టం కదా!

**సంపాదకుడు** : అయినా అదిలేకుండా మన పని జరగదు. భారతావని ఎన్నడూ నాస్తిక దేశం కాజాలదు. భారతావని యొక్క భూమిలో నాస్తికులు వృద్ధిచెందలేరు. నిజంగా యిది కష్టమైనపనే. ధర్మ శిక్షణ అనే సరికి బుర్ర తిరిగిపోతుంది. ధర్మాచార్యులు స్వార్థులని, డాంబికులని అనిపిస్తుంది. వాళ్ల దగ్గరకు వెళ్లి వాళ్లకు వినమ్రంగా మనం నచ్చచెప్పాలి. ధర్మంయొక్క తాళం చెవి ముల్లాల చేతుల్లోను, బ్రాహ్మణులచేతుల్లోను వున్నది. వాళ్లకు సద్బుద్ధి కలుగకపోతే, - ఇంగ్లీషు నేర్చుకోవడంవల్ల మనకు కలిగిన భావావేశంతో ప్రజలకు నీతిని బోధించాలి. ఇదేమంత కష్టమైన పనికాదు. హిందూదేశపు సముద్రం ఒడ్డున మురికి పేరుకుపోయింది. దానితో మురికెత్తినవాళ్లు శుభ్రం కావాలి. మనంకూడా శుభ్రపడాలి. నా యీ వ్యాఖ్య కోట్లాది భారతీయులకు వర్తించదు. భారతదేశ ప్రజల్ని మంచి మార్గానికి తేవాలంటే, మనం కూడా మంచి మార్గాన నడవాలి. కోట్లాది మంది దేశ ప్రజలు మంచి మార్గంలోనే

వున్నారు. వారిలో సంస్కరణ, చెడు, ఔన్నత్యం, పతనం సమయాన్ని బట్టి వస్తూనే వున్నాయి. పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని మనం పారద్రోలుటకు ప్రయత్నించాలి అప్పుడు మిగతావన్నీ తేలికగా సర్దుకుంటాయి.

★ ★ ★

# 19
# యంత్రములు

**పాఠకుడు** : మీరు పాశ్చాత్య సభ్యత పనికిరానిది, దాన్ని బయటికి గెంటివేయాలి అని చెబుతున్నారు. మనకు ఏ యంత్రమూ అక్కరలేదని కూడా అంటారని అనుకోవచ్చునా?

**సంపాదకుడు** : నాకు తగిలిన దెబ్బను యీ ప్రశ్న అడిగి మీరు మళ్లీ మొదటికి తెచ్చారు. మిష్టర్ రమేశ చంద్ర దత్త్ వ్రాసిన "భారతదేశపు ఆర్థిక చరిత్ర" అను పుస్తకం చదివినప్పుడు కూడా యిట్టి స్థితే నాకు కలిగింది. ఆ విషయాల్ని తిరిగి జ్ఞాపకం చేసుకుంటే నా హృదయం బరువెక్కుతుంది. యంత్రాల తాకిడి తగలగానే భారతదేశం పనికిమాలినది అయిపోయింది. మాంచస్టరు మనకు చేసిన నష్టానికి హద్దులేదు. భారతావని యొక్క పనితనమంతా మాంచస్టరు వల్లనే అంతరించిపోయింది.

నేను పొరపడుతున్నాను. మాంచస్టరును తప్పు ఎలా పట్టడం? మాంచస్టరు బట్ట మనం కట్టడం ఆరంభించాం. దానితో అక్కడ బట్ట తయారు కాసాగింది. బెంగాలు ప్రదర్శించిన పరాక్రమాన్ని గురించి విని ఎంతో సంతోషించాను. బెంగాలునందు బట్టల మిల్లులు లేవు. అందువల్ల అక్కడిజనం తమ వృత్తిని ప్రారంభించారు. బెంగాలు ప్రాంతం బొంబాయి మిల్లుల్ని ప్రోత్సహిస్తున్న మాటనిజమే. కాని బెంగాలు ప్రాంతం మిషన్లనన్నింటిని బహిష్కరించియుంటే, బాయకాట్ చేసి యుంటే యింకా మంచి పని జరిగి వుండేది.

యంత్రాలు యూరపును కుదిపివేశాయి. ఇప్పుడు వాటిగాలి భారతదేశంలో వీస్తున్నది. యంత్రాలు నేటి నాగరికతకు ముఖ్య ప్రతీకలైనాయి. అది మహాపాపం. దాన్ని నేను స్పష్టంగా చూశాను. చూస్తున్నాను.

బొంబాయి మిల్లుల్లో పనిచేస్తున్న కార్మికులంతా కట్టుబానిసలై పోయారు. అక్కడ పనిచేస్తున్న ఆడవాళ్లను చూస్తే ఎవరైనా కంపించిపోవలసిందే. యంత్రాల వర్షం కురవనప్పుడు ఆ స్త్రీలు తిండిలేక చనిపోలేదు. యంత్రాల యీ గాలి తీవ్రంగా వీచిందంటే భారతదేశానికి దుస్థితి దాపురించినట్లే. నా మాట మీకు బరువుగా వుండి నచ్చకపోవచ్చు. నేను ఒక్క విషయం స్పష్టంగా చెప్పదలిచాను. భారతదేశంలో మిల్లుల సంఖ్యను పెంచకండి. అందుకు బదులు మాంచస్టరుకు యింకా డబ్బు పంపి అక్కడ తయారై మురిగిపోతున్న బట్టను తెప్పించుకొని వాడండి. అక్కడి బట్టను వాడటంవల్ల మన డబ్బు మాత్రమే పోతుంది. కాని భారతదేశంలో మాంచస్టరును స్థాపించితే డబ్బు భారతావనిలోనే వుంటుంది, కాని ఆ డబ్బు మన రక్తాన్ని పీల్చివేస్తుంది. మన నీతి నిజాయతీల్ని పూర్తిగా కాలరాచివేస్తుంది. మిల్లుల్లో పనిచేస్తున్నవారి నీతి నియమాలు ఎలా పనిచేస్తున్నాయో, వాళ్లనే అడగండి. వారిలో ధనం ప్రోగుచేసుకున్న వాళ్ల నీతి నిజాయతీలు, డబ్బు ప్రోగుచేసుకున్న యితరులకంటే మంచిగా వుండడానికి వీలులేదు. అమెరికాలో గల రాక్ ఫెల్లర్లకంటే భారతదేశమందలి రాక్ ఫెల్లర్లు తక్కువ అని అనుకుంటే పూర్తిగా అజ్ఞానమే. బీద భారతదేశం బానిసత్వాన్నుంచి ముక్తి పొందుతుంది, కాని అవినీతి ద్వారా ధనం సంపాదించిన భారతదేశం ఆ బానిసత్వాన్నుంచి ముక్తి పొందలేదు.

ఇంగ్లీషు వాళ్ల పరిపాలనను మనదేశంలో రక్షిస్తున్నది డబ్బు గలవాళ్లేనని నా అభిప్రాయం. అప్పుడే వాళ్ల స్వార్థాలు నెరవేరుతాయి. డబ్బు మనిషిని దీనుణ్ణి చేస్తుంది. అలాంటి మరో వస్తువు ప్రపంచంలో భోగవిలాసమే. డబ్బు, భోగ విలాసాలు రెండూ విషంతో సమానం. అవి కాటువేశాయంటే పాము కాటు కంటే తీవ్రంగా ఆ విషం పనిచేస్తుంది. పాము కాటు వేస్తే అది మన శరీరాన్ని మాత్రమే పిప్పి చేస్తుంది. కాని డబ్బు, భోగవిలాసాలు కాటు వేశాయంటే అవి శరీరం, మనస్సు, జ్ఞానం సర్వాన్ని పీల్చిపిప్పి చేస్తాయి. అయినా మనకు విముక్తి లభించదు. అందువల్ల మన దేశంలో మిల్లులు నెలకొంటే సంతోషించవలసిన అవసరంలేదు.

**పాఠకుడు** : అయితే మిల్లుల్ని మూసివేయమంటారా?

**సంపాదకుడు** : అదీ కష్టమే. బలపడి, వ్రేళ్లూనుకున్న వస్తువును పెకిలించి తీసివేయడం కూడా కష్టమే. అందువల్ల అట్టి పని ప్రారంభించకుండా వుండటం మొదటి తెలివిగలపని.

(అనారంభో హి కార్యాణామ్ ప్రథమం బుద్ధిలక్షణమ్
ఆరబ్ధ స్యాన్తగమనమ్ ద్వితీయం బుద్ధిలక్షణమ్)

మిల్లుల యజమానులను అసహ్యించుకుంటూ చూడలేము. వాళ్లమీద దయచూపించవలసిందే. హఠాత్తుగా వాళ్లు మిల్లుల్ని వదిలేయడం సాధ్యకానిపని. మీ సాహసాన్ని పెంచకండి అని వారిని ప్రార్థించవచ్చు. దేశానికి మేలు చేయదలుచుకుంటే వాళ్లు తమ పనిని మెల్ల మెల్లగా తగ్గించుకోవచ్చు. వారు పాత, గట్టి, పవిత్రమైన రాట్నాల్ని దేశంలో వేలాది గృహాలకు అందజేయవచ్చు. ప్రజలు నేసిన బట్టను తీసుకొని అమ్మవచ్చు. వాళ్లు అలా చేయకపోయినా, జనం యంత్రాల మీద తయారయ్యే బట్టను వాడటం మానవచ్చు.

**పాఠకుడు** : ఇది బట్టను గురించిన విషయం. కాని యంత్రాలతో తయారయ్యే వస్తువులు అనేకం వున్నాయి. ఆ వస్తువుల్ని విదేశాలనుంచి అయినా తెప్పించుకోవాలి, లేక మనదేశంలోనే ఆ వస్తువుల్ని తయారు చేసే యంత్రాల్ని స్థాపించుకోవాలి.

**సంపాదకుడు** : నిజంగా మన దేవుళ్లు (విగ్రహాలుగా) కూడా జర్మనీ దేశపు యంత్రాల్లో తయారై వస్తున్నారు. ఇక అగ్గిపుల్లలు, గుండుసూదులు, గాజు సామాన్లు ఒకటేమిటి ఎన్నో వస్తువులు వున్నాయి. నేనిచ్చే సమాధానం ఒక్కటే. ఈ వస్తువులన్నీ యంత్రాల ద్వారా తయారుకాక పూర్వం భారతదేశం ఏం చేసేదో, యీనాడు కూడా అలాగే చేయవచ్చు. గుండు సూదులు మనం చేతులతో తయారుచేసుకోలేనంతవరకు వాటి వాడకం మానివేద్దాం. గాజు వగైరా సామగ్రికి చిచ్చుపెడదాం. మట్టి ప్రమిదల్లో నూనెపోసి మనపొలాల్లో పండే పత్తితో వత్తులు చేసి దీపాలు వెలిగించుకుందాం. అలా చేస్తే మనకండ్లు రక్షణ పొందుతాయి. డబ్బు మిగులుతుంది. మనం స్వదేశీయులం

అవుతాం. స్వదేశీ రాగాన్ని ఆలపించి జనాన్ని మేలుకొలుపుదాం.

అయితే యీ పనులన్నీ జనమంతా ఒకే సమయంలో చేయడం. జనమంతా విదేశీ వస్తువుల్ని ఒకే సమయంలో వదిలివేయడం సంభవం కాదు. అసలు యీ భావం సరియైనదేనని భావించితే, పరిశోధనా కార్యక్రమం సాగించవచ్చు. కొద్ది కొద్దిగా వస్తువుల్ని త్యజించి వేయవచ్చు. మనం కొందరం అలా చేస్తే,మనల్ని చూచి యితరులు కూడా అలా చేస్తారు. ముందు స్వదేశీ భావం జనం మనస్సులో నాటుకోవాలి. తరువాత ఆ ప్రకారం పని జరుగుతుంది. ముందు ఒకడు యీ పనిచేస్తాడు. తరువాత ఇద్దరు, ఆరుగురు, పదిమంది, తరువాత వందమంది చేస్తారు. ఈ విధంగా సంఖ్య పెరిగిపోతూ వుంటుంది. పెద్దలు ఏపనిచేస్తే పిన్నలు కూడా అదే పని చేస్తారు. అర్థం చేసుకుంటే పని బహు తేలికగా జరుగుతుంది. ఇతరులు చేస్తారాలేదా అని మీరు, నేను ఆగకూడదు. మనం వెంటనే యీ పని ప్రారంభించాలి. చేయకపోతే నష్టపడతాము. అర్థం చేసుకొని కూడా చేయనివాడు పనికిమాలిన డాంబికుడే.

**పాఠకుడు** : మరి ట్రాము బండ్లు, ఎలక్ట్రిక్ లైట్లు ఏమవుతాయి?

**సంపాదకుడు** : ఈ ప్రశ్నఆలశ్యంగా అడిగారేం? ఇప్పుడు యీ ప్రశ్న యందుగల జీవంపోయింది. రైళ్లు వచ్చి మనల్ని నాశనం చేశాయి. ట్రాములు చేయవా? యంత్రం పాము పుట్టవంటిది. అందు ఒక్క పాముకాక, వందలాది పాములు వుంటాయి. ఒకదానివెనుక మరొకటి చొప్పున వుంటాయి. యంత్రాలున్న చోట పెద్ద పట్టణాలు వుంటాయి. పెద్ద పట్టణాలు వున్న చోట ట్రాముబండ్లు వుంటాయి. రైళ్లు వుంటాయి. ఎలక్ట్రిక్ లైట్లు అవసరంఅవుతాయి. బ్రిటన్‌లో కూడా కొద్ది పల్లెల్లో ఎలక్ట్రిక్ లైట్లు లేవు ట్రాములు లేవను విషయం మీకు తెలుసుననుకుంటాను. ట్రాములు, రైళ్లు మొదలగు సాధనాలు పెరిగిన చోట్ల ప్రజల ఆరోగ్యం తరిగిపోయిన విషయం ప్రామాణికులైన వైద్యులు, డాక్టర్లు మీకు చెబుతారు. నాకు తెలిపిన విషయం చెబుతున్నాను. యూరపునందలి ఒక పట్టణంలో జనం డబ్బుకు కటకటలాడారు.

ట్రాములు, వకీళ్లు, డాక్టర్లు అందరికీ రాబడి తగ్గిపోయింది. కాని ప్రజల ఆరోగ్యం మాత్రం బాగుపడింది. యంత్రాల సుగుణం ఒక్కటికూడా నాకు జ్ఞాపకంరావడంలేదు. కాని వాటి దుర్గుణాల్ని గురించి పెద్ద గ్రంథం వ్రాయగలను.

**పాఠకుడు** : వ్రాసిందంతా యంత్ర సహాయంతోనే ముద్రించబడుతుంది. యంత్ర సహాయంతోనే పంపిణీ చేయబడుతుంది. ఇది యత్రం యొక్క సుగుణమా? దుర్గుణమా?

**సంపాదకుడు** : "విషానికి విరుగుడు విషమే. అను సూక్తికి యిది మంచి ఉదాహరణ. ఇందు యంత్రం యొక్క సుగుణం లేదు. చచ్చిపోతూ చచ్చిపోతూ యంత్రం "నానుంచి రక్షణ పొందండి. జాగ్రత్త పడండి. నావల్ల మీకు కలిగే లాభం ఏమీలేదు" అని చెబుతున్నది. యంత్రపు జాలంలో చిక్కుకున్న వారికే అది వర్తిస్తుంది.

అయితే అసలు కీలకం మరిచిపోకండి. యంత్రం చెడ్డ వస్తువు అని మనస్సులో నిర్ణయించుకోవాలి. తరువాత దాన్ని మెల్లమెల్లగా నాశనం చేయాలి. మనం కోరుకున్న వస్తువు తక్కున మనకు దొరికేలా చేయగల తేలిక ఉపాయమేదీ ప్రకృతి సృష్టించలేదు. యంత్రం మీద మన తీయని చూపులు పడకుండా. మన విషపు చూపులు పడితే చివరికి అది తప్పక అంతరించిపోతుంది.

# 20

# ముగింపు

**పాఠకుడు** : మీ భావాలవల్ల మీరు మూడో పక్షాన్నొకదాన్ని నిలబెట్టాలని భావిస్తున్నట్లు అనిపిస్తున్నది. మీరు అతివాదులూ కాదు, మితవాదులూ కాదు. మరేమిటి?

**సంపాదకుడు** : ఇక్కడే పొరపడుతున్నారు. నా మనస్సు నందు

మూడో పక్షాన్ని గురించిన భావమే లేదు సామాన్యంగా సర్వుల భావాలు ఒకటిగా వుండవు మితవాదుల్లో కూడా అంతా ఒకే యోచన కలిగివుంటారని భావించకూడదు. సేవచేయాలని భావించే వారికి పక్షాలెందుకు? నేను మితవాదులకూ సేవచేస్తాను. అతివాదులకూ సేవచేస్తాను. వాళ్ల అభిప్రాయాలతో ఏకీభవించనప్పుడు వినమ్రంగా వారికి నచ్చ చెబుతాను. నా పని మాత్రం ఆపకుండా చేస్తూనే వుంటాను.

**పాఠకుడు** : ఇద్దరికీ చెప్పాలనుకుంటే ఏం చెబుతారు?

**సంపాదకుడు** : అతివాదులకు నచ్చచెప్పవలసివచ్చినప్పుడు "మీ లక్ష్యం భారతావనికి స్వరాజ్యం సాధించడమే కదా! మీ ప్రయత్నం వల్ల దేశానికి స్వరాజ్యం రాదు. అసలు అందరూ స్వరాజ్యం తమతమ కోసం పొందాలి. సర్వులూ దాన్ని తమదిగా చేసుకోవాలి. ఇతరులెవరో యిప్పించునది స్వరాజ్యం కాదు. అది పర రాజ్యమే అవుతుంది. కేవలం ఇంగ్లీషు వాళ్లను వెళ్లగొట్టగానే స్వరాజ్యం వస్తుందని అనుకోవడం సరికాదు. నేను వివరించిందే నిజమైన స్వరాజ్యం. దాన్ని మందుగుండు సామగ్రితో మీరు సాధించలేరు. మందుగుండు సామగ్రి భారతావనికి సరిపడదు. అందువల్ల సత్యాగ్రహాన్నే నమ్మండి. స్వరాజ్యం పొందుటకు మనకు మందుగుండు సామగ్రి అవసరమనే యోచనకు మీ మనస్సులో చోటు యివ్వకండి, అని చెబుతాను.

మితవాదులకు "మనం కేవలం ప్రార్థిస్తూ వుంటే విలువవుండదు. అది మన హీనస్థితిని తెలుపుతుంది. ఇంగ్లీషు వాళ్లతో సంబంధం పెట్టుకోవడం అవసరం అని చెప్పడం, దేవుని దగ్గర కూడా దొంగగా మసలడం వంటిదే. ఇంగ్లీషు వాళ్లు లేకపోతే మన పప్పు వుడకదు అని మనం అనడం వల్ల వాళ్లకు గర్వం పెరుగుతుంది. కనుక అలా అనవద్దు" అని నచ్చ చెబుతాను.

ఇంగ్లీషు వాళ్లు తట్టబుట్ట సర్దుకొని వెళ్ళిపోతే భారతదేశం నష్టపడిపోతుందని అనకూడదు. వాళ్లువెళ్లిపోయిన తరువాత వాళ్ల వత్తిడికి భయపడి వూరుకున్న ప్రబుద్ధులు పోరాటం సాగిస్తే సాగించవచ్చు. పుండును అణచివుంచితే లాభం ఏమిటి? అది పగలవలసిందే. కొట్టుకు చావమని మన ముఖంమీద రాసి

యుంటే కొట్టుకుచద్దాం. బలహీనులను రక్షిస్తున్నాం అను నెపంతో మూడోవాడికి చోటు యివ్వవద్దు. ఇలా జరగడంవల్లనే మనం ఎంతో నష్టపడ్డాం. బలహీనుణ్ణి రక్షించాలనుకోవడంవల్ల అతడు యింకా బలహీనుడైపోతాడు. మితవాదులు యీ విదంగా యోచించాలి. లేకపోతే స్వరాజ్యం లభించదు. అని చెప్పడమే గాక ఒక ఫాదరీ చెప్పిన "స్వరాజ్యంలో గందరగోళం జరిగినా భరించవచ్చుగాని పరాయి వాడి పరిపాలా వ్యవస్థను భరించకూడదు. అది మన దివాళాకోరుతనాన్ని సూచిస్తుంది" అను మాటలు జ్ఞాపకం చేస్తాను. అయితే ఆ ఫాదరీ సూచించిన స్వరాజ్యానికీ, భారతదేశ స్వరాజ్యానికీ అర్థంలో తేడా వున్నది. తెల్లవాడైనా సరే భారతీయుడైనా ఎవ్వరి అన్యాయమూ సహించము. మనందరం ఈదడం నేర్చుకోవాలి. ఇతరులకు నేర్పాలి. అప్పుడే నాలుగు కాలాలపాటు మనగలుగుతాము.

అప్పుడు అతివాదులు, మితవాదులు కలుస్తారు. కలియాలి. ఒకరు యింకొకరిని అనుమానించకూడదు. ఒకరికొకరు భయపడకూడదు.

**పాఠకుడు** : ఇరు పక్షాలవారికీ యిలా చెబుతారు సరే. మరి ఇంగ్లీషువాళ్లకు ఏమిచెబుతారు?

**సంపాదకుడు** : వారికి వినమ్రంగా యిలా చెబుతాను - "మీరు మాకు రాజులు. ఖడ్గరీత్యా రాజులో లేక మా యిష్టప్రకారం వున్న రాజులో చర్చించడం అనవసరం. మీరు దేశంలో వున్నందువల్ల మీ యెడ మాకు ద్వేషం లేదు. రాజులైనప్పటికీ మీరు నౌకర్లుగావుండాలి. మీరు చెప్పింది మేము చేయము. మేము చెప్పినట్లు మీరు నడుచుకోవాలి. ఎంతో డబ్బు యీ దేశాన్నుంచి మీరు తీసుకువెళ్లారు. జీర్ణంచేసుకున్నారు. మీరు యిక అలా చేయడం మాకు యిష్టం లేదు. మాతో వ్యాపారం చేయాలను పేరాశను మీరు త్యజించాలి. ఏ నాగరికతను మీరు సమర్థిస్తున్నారో, దాన్ని మేము నష్టదాయకమని భావిస్తున్నాము. మా సభ్యత, మీ సభ్యతకంటె గొప్పదని విశ్వసిస్తున్నాము. మీకు కూడా అలా అనిపించితే మీకే ఎక్కువలాభం కలుగుతుంది. అలా కలగక పోయినా, "రోము నందు రోమన్‌వై వుండు" అను

మీ సామెత ననుసరించి మా దేశంలో భారతీయులై వుండండి. మా ధర్మానికి యిబ్బంది కలిగించే పనులేమీ మీరు చేయకూడదు. రాజ్యం చేస్తున్నారు గనుక మీ బాధ్యతను గుర్తించి హిందువులకు బాధకలుగకుండా వుండుటకై మీరు గోమాంసంతినవద్దు. మహమ్మదీయులకు బాధ కలుగకుండుటకు నిమ్న జీవాల (పందులు) మాంసం తినవద్దు. మేము అణిగివున్నాం గనుక గతంలో మాట్లాడలేకపోయాం. కాని మీ ప్రవర్తనవల్ల మా హృదయాలకు దెబ్బతగలలేదని భావించకండి. స్వార్థం వల్లనో లేక మరో భయంవల్లనో యీనాటి వరకు మీకు చెప్పలేకపోయాం. కాని యిప్పుడు చెప్పడం మా కర్తవ్యంగా భావిస్తున్నాము. మీరు స్థాపించిన పాఠశాలలు, కోర్టులు కొరగానివని భావిస్తున్నాము. మా పూర్వకాలపు పాఠశాలలు, కోర్టులు మాకు కావాలి.

భారతదేశపు సామాన్య భాష ఇంగ్లీషుకాదు, హిందీ. మీరు హిందీ నేర్చుకోవాలి. మీతో యికనుంచి మేము మా భాషలోనే వ్యవహారం సాగిస్తాము.

రైళ్లకోసం సైన్యంకోసం అపరిమితంగా మీరు డబ్బు ఖర్చు చేస్తున్నారు. మేము యిక సంహించలేము. మాకు వాటి అవసరం లేదు. రష్యా అంటే మీకు భయం వుండవచ్చు, కాని మాకు లేదు. రష్యా వాళ్లు వస్తే మేము చూచుకుంటాం. మీరు వుంటే మనం యిరువురం కలిసి వాళ్లను ఎదుర్కొందాం. మాకు సీమబట్టలువద్దు. యూరపుబట్టలు వద్దు. ఈ దేశంలో తయారైనవస్తువులతో మా అవసరాలు తీర్చుకుంటాము. మీ ఒక కన్ను మాంచెస్టరు మీద, మరోకన్ను మామీద వుంచడం యిక పొసగదు. మీ స్వార్థం, మా స్వార్థం ఒకటేనని మీరు వ్యవహరిస్తేనే మన సంబంధం కొనసాగుతుంది. ఇదంతా అవిధేయతతో చెబుతున్నమాటలు కావు. మీ దగ్గర ఆయుధబలం అపారంగా వున్నది. నౌకాబలం కూడా ఎంతో వున్నది. వాటితో, అంతటిశక్తితో మేము పోరాటం సాగించలేము. అయినా మా మాటలు మీకు యిష్టం కాకపోతే మీకు మాకు యికపడదు. మీకు యిష్టమైతే కత్తులతో మమ్మల్ని నరికివేయవచ్చు. ఫిరంగులతో పేల్చివేయవచ్చు. మాకు యిష్టంలేని పనులు మీరు చేస్తే మేము మీకు సహకరించము. మా సహాయంలేని ఎడల మీరు ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేరు.

అధికారమత్తులోపడి మా మాటల్ని మీరు ఎగతాళి చేస్తేచేయవచ్చు. మీరుచేసే ఎగతాళి వ్యర్థమని, మేము యివాళ నిరూపించలేకపోవచ్చు. కాని మాకు దమ్ము వుంటే మీ అధికారమత్తు వ్యర్థమేనని మా మాటలకు ఎగతాళిగా నవ్వడం మీ విపరీతబుద్ధికి తార్కాణమని త్వరలోనే మీరు గ్రహిస్తారు.

స్వభావరీత్యా మీరు ఒక ధర్మబద్ధమైన దేశ ప్రజలని మాకు తెలుసు. మేము ధర్మస్థలియందే నివసించు ప్రజలం. మీకు మాకు సంబంధం ఎలా కుదిరిందీ అను చర్చలోపడటం వ్యర్థం. కాని మన యీ సంబంధాన్ని మంచిగా ఇరువురం ఉపయోగించుకోవడం అవసరం.

భారతదేశానికి వచ్చిన మీరు అనగా ఇంగ్లీషు వాళ్లు ఆంగ్ల ప్రజల నిజమైన ప్రతినిదులు కారు. అర్థ ఆంగ్లేయులంగా మారిన మేము కూడా భారతీయులకు నిజమైన ప్రతినిధులం కాము. ఆంగ్ల ప్రజానీకానికిమీరు చేసిన చర్యలను గురించి వాస్తవం తెలిస్తే మీకు వాళ్లు వ్యతిరేకం అవుతారు. భారతదేశ ప్రజలకు నిజానికి మీతో సంబంధమే లేదు. చెడు చేసే మీ సభ్యతను వదిలి, ధర్మరీత్యా పరిశీలించి మీరు చూస్తే మా కోరిక న్యాయబద్ధమైనదని మీరు అంగీకరిస్తారు. యీ పద్ధతిన మీరు భారతావని యందు వుండవచ్చు. అలా మీరు యిక్కడ వుంటే మీ దగ్గర నేర్చుకోవలసినదేమైనా వుంటే మేము నేర్చుకుంటాము. మా దగ్గర నేర్చుకోవలసింది ఏమైనా వుంటే మీరు నేర్చుకోవాలి. ఈ విధంగా మనం ఒకరివల్ల మరొకరు ప్రయోజనం పొందాలి. అప్పుడు మనం యావత్ప్రపంచానికి లాభం చేకూర్చవచ్చు. అయితే మనిద్దరి సంబంధం ధర్మస్థలియందు వ్రేళ్లుపాతుకుంటేనే యిది సాధ్యమవుతుంది.

**పాఠకుడు** : మరి మన దేశానికి మీరు ఏం చెబుతారు?

**సంపాదకుడు** : దేశమంటే మీ అభిప్రాయం?

**పాఠకుడు** : ఇప్పటివరకు ఏ అర్థంలో మీరు దేశం అను శబ్దాన్ని వాడారో ఆ దేశమే. అనగా యూరప్ నాగరికతలో మునిగి తేలుతున్నా,

స్వరాజ్యమను నినాదాన్ని పలుకుతున్న ప్రజల కూడలి అని నా అభిప్రాయం.

**సంపాదకుడు :** ఏ భారతీయులకు (స్వరాజ్యం) నిజమైన మత్తు లేక ఆవేశం కలుగుతుందో వారే ఇంగ్లీషు వాళ్లకు అలా చెప్పగలుగుతారు, వారి డాంబికానికి తలవంచరు. అని దేశానికి చెబుతాను. నిజమైన (స్వరాజ్యం) మత్తు ఎవరికి ఎక్కుతుంది? జ్ఞానుబలంతో, అన్ని విషయాలు బాగా అర్థం చేసుకొని, భారతీయ సభ్యతయే అన్నిటి కంటే గొప్పదని, యూరప్ సభ్యత మూడు నాళ్ల ముచ్చట యని ఎవరు గ్రహిస్తారో, సభ్యతలు అనేకం బయలుదేరి యిప్పటికే అంతరించి పోయాయని, భవిష్యత్తులో కూడా అనేకం రావచ్చు కాని అన్నీ మట్టిలో కలిసి పోతాయని ఎవరు గ్రహిస్తారో వారే అట్టి (స్వరాజ్యం) మత్తువల్ల ప్రభావితం అవుతారు. ఆత్మబలాన్ననుభవించి, శరీర బలానికి లొంగిపోని వాడిని, నిర్భయంగా ఉండగలిగినవాడిని కలలోనైనా ఫిరంగుల బలాన్ని ఉపయోగించాలని యోచించనివాడిని, నిజమైన అట్టి (స్వరాజ్యం) మత్తుప్రభావితం చేస్తుంది.

ఈనాటి పరిస్థితులవల్ల విసుగెత్తి పోయిన భారతీయుల్ని, మొదటనే విషంత్రాగి పాత్రను ఖాళీచేసిన భారతీయుల్ని, అట్టి (స్వరాజ్యం) మత్తు ప్రభావితం చేస్తుంది. అట్టి భారతీయుడు ఒక్కడు వున్నప్పటికీ, అతడు పైన చెప్పిన మాటలు ఇంగ్లీషు వాళ్లకు చెప్పితీరతాడు.

పైన తెలిపిన కోరిక నిజానికి కోరికయే కాదు. అది భారతీయుల మనస్థితికిప్రతీక. అడిగితే ఎవ్వడూ యివ్వడు. దాన్ని మనమే స్వయంగా లాక్కోవాలి. అట్టిశక్తి మనకు ఉండాలి. అట్టి శక్తి క్రింద తెలిపినట్టివాడి యందే నిండివుంటుంది.

1. గత్యంతరంలేక ఇంగ్లీషును వాడుతున్నవాడు.
2. వకీలు అయివుండి, తన వకీలు వృత్తి మానుకొని తన గృహంలో రాట్నం మీద నూలు వడికి, దానితో బట్టనేసుకొని ధరించేవాడు.
3. వకీలు అయివుండి, ప్రజలకు నచ్చచెప్పి, వారి కండ్లు తెరిపించగలవాడు.

4 వకీలు అయివుండి, వాది-ప్రతివాది, కక్షిదారు- ముద్దాయిల గొడవల్లో పడకుండా తాను కోర్టుల్ని బహిష్కరించడమేగాక, వాటిని బహిష్కరించమని యితరులకు కూడా నచ్చచెప్పువాడు.

5. వకీలు అయివుండి, తాను వకీలు వృత్తిని ఏవిధంగా వదిలవేయగలడో, అదేవిధంగా కోర్టుల్నికూడా వదిలివేయగలవాడు.

6. డాక్టరు అయివుండి, తన వృత్తిని వదిలి వేయువాడు. ప్రజల చర్మాన్ని వలిచేకంటే, వాళ్ల ఆత్మలను స్పృశించడం, మంచిదని, పరిశోధనలు చేసి వాళ్లను ఆరోగ్యవంతులుగా చేయాలని భావించి కృషిచేయువాడు.

7. డాక్టరు అయివుండి, తను ఏమతానికి చెందియున్నా, ఆంగ్ల వైద్యకళాశాలల్లో బ్రతికియున్న జీవాలపై జరుగుతున్న ప్రయోగాలకు యిష్టపడనివాడు, అట్టి జీవాల కణాలతో తయారయ్యే మందులువాడి మనిషి శరీరానికి ఆరోగ్యం కలిగించే కంటే రోగిష్టిగానే వుండనీయడం మంచిదని భావించువాడు.

8. డాక్టరు అయివుండికూడా రాట్నం మీద నూలు వడుకువాడు, రోగులకు, వారి రోగాల నిజమైన కారణాలను చెప్పి వాటిని తొలిగించుటకు ప్రయత్నించువాడు, పనికి మాలిన మందులు యిచ్చి వాళ్లను తప్పుత్రోవ పట్టించని వాడు, పనికిమాలిన మందులు వాడనందున రోగి శరీరం దెబ్బతిన్నా పరవాలేదు, ప్రపంచం అనాథగా మారదు. అని భావించువాడు.

9. తాను ధనవంతుడై వుండికూడా ధనాన్ని లెక్కచేయక, తన మనస్సు చెప్పిన విధంగా మాట్లాడువాడు, పెద్దపెద్ద పరిపాలనాధికారుల్ని సైతం లెక్కచేయనివాడు.

10. ధనవంతుడై యుండి, తన ధనాన్ని ప్రజలకు రాట్నాలు అంద జేయుటకు ఖర్చుపెట్టువాడు, స్వదేశీ వస్తువుల్నే ఉపయోగించుతూ యితరులను కూడా అందుకు ప్రోత్సహించు వాడు.

11. మిగతా ప్రతి భారతీయులవలె, యిది పశ్చాత్తాపపడవలసిన, ప్రాయశ్చిత్తం చేసుకొనవలసిన, శోకసమయమని ఎలుగెత్తి చాటువాడు.

12. మిగతాప్రతి భారతీయులవలె, ఇంగ్లీషువాళ్లను తప్పుపట్టడం వ్యర్థమని, మనం చేసిన తప్పులవల్లనే వాళ్లు మన దేశంలో ప్రవేశించారని, యిక్కడ తిష్ఠవేశారని, మన తప్పులు తొలిగిపోతే వాళ్లు యిక్కడనుంచి వెళ్లిపోతారని, లేకమారిపోతారని భావించువాడు.
13. మిగతా భారతీయులవలె, శోకసమయాలలో భోగానికి, సంతోషానికి తావువుండదని, మనకు సుఖసంతోషాలు లభించనంతకాలం మనం జైల్లో వుండటం లేక దేశ బహిష్కరణకు గురికావడం మంచిదనిభావించువాడు.
14. మిగతా భారతీయులవలె, ప్రజలకేదో బోధచేస్తున్నానని చెబుతూ, ఆ వంకతో జైలుకు పోకుండా తప్పించుకుంటూ వుండటం, మోహప్రవృత్తికి నిదర్శనమని తెలుసుకోగలిగినవాడు.
15. మిగతా భారతీయులవలె మాటలకంటే చేతల యొక్క ప్రభావం ఎక్కువగా పడుతుందని, అందువల్ల నిర్భయంగా మనసునందలి మాటయే చెప్పవలెనని, తత్ఫలితాల్ని అనుభవించగలమని, అప్పుడే తమ మాటల ప్రభావం యితరులపై బాగా పడుతుందని భావించువాడు.
16. భారతీయులవలె, దుఃఖాలు సహించినప్పుడే బానిసబంధనాల నుంచి విముక్తి పొందగలమని భావించువాడు.
17. ఇతర భారతీయులవలె, ఇంగ్లీషు వాళ్ల సభ్యతను ప్రోత్సహించి, మనం చేసిన పాపాలు కడిగివేసుకొనుటకు, తుదిశ్వాస విడుచువరకు అండమాన్ దీవుల్లోవుండవలసి వచ్చినా మంచిదేనని భావించువాడు.
18. ఇతర భారతీయులవలె ఏ దేశమూ కష్టాలు పడకుండా, దుఃఖాలు సహించకుండా పైకి ఎక్కలేదని తెలుసుకొనగలిగిన వాడు, యుద్ధరంగంలో కూడా దుఃఖ సహనమే నిజమైన ఒరిపిడిరాయియని, ఇతరులను చంపడం సరికాదని, సత్యాగ్రహ విధానం కూడా యిదేనని అర్థం చేసుకొని ఆ విధంగా ప్రవర్తించువాడు.
19. ఇతర భారతీయులవలె "అందరూ చేసినప్పుడు మేము కూడా చేస్తాము" అని చెప్పే మాట వట్టి బూటకమని, ఏమీ చేయకుండా

వుండుటకు అది కేవలం వంక మాత్రమేనని, మాకు మంచిదని తోచగానే చేసితారతాం, ఇతరులకు మంచిదని తోచగానే వాళ్లు చేస్తారు'' యిదే నిజమైన చేతల విధానమని భావించువాడు రుచికరమైన భోజనం చూచినప్పుడు అన్నీ భుజించుటకు ముందుకు వెళ్లుతాము, అప్పుడు యితరులకోసం నిరీక్షిస్తూ కూర్చోము అని తలంచువాడు. పైన చెప్పిన ప్రకారం ప్రయత్నించుట, దుఃఖాలు సహించుట, రుచికరమైన భోజనం వంటివని,తప్పని సరి అయి, గత్యంతరంలేక పనులు చేయుట, లేక దుఃఖాలు సహించుట పనికిమాలిన వ్యవహారాలని భావించువాడు.

**పాఠకుడు** : ఈ విధంగా ఎవరు చేస్తారు? ఎప్పుడు చేస్తారు? ఇదంతా ఎప్పటికి తేలుతుంది?

**సంపాదకుడు** : మళ్లీ పొరబడుతున్నారు. ఇతరుల్ని గురించి నేను యోచించను, మీరు కూడా యోచించకూడదు. మీరు మీ వ్యవహారం చూచుకోండి, మేము మా వ్యవహారం చూచుకుంటాము అనుమాట స్వార్థమయమే అయినా అందుపరమార్థం కూడా యిమిడివుంది. నాకు నేను మేలు చేసుకోకలిగితే, యితరులకు కూడా మేలు చేయకలుగుతాను. నా కర్తవ్యాన్ని నేను సవ్యంగా నిర్వర్తిస్తే, పనులన్నీ సులభంగా పూర్తి అవుతాయి.

మీ దగ్గర సెలవు తీసుకునే ముందు పై మాటల్నే మరో పర్యాయం చెబుతున్నాను.

1. మన మనోరాజ్యం స్వరాజ్యమే.
2. దానికి కీలకం సత్యాగ్రహం, ఆత్మబలం, కారుణ్యబలం.
3. అట్టి బలాన్ని పరీక్షించుటకు స్వదేశీభావన అవసరం.
4. ఇంగ్లీషు వాళ్లమీద ద్వేషంతోగాని, లేక వాళ్లకు శిక్షపడాలనే ఉద్దేశ్యంతోగాని మేము స్వరాజ్యం కోరడంలేదు. ఇది మా కర్తవ్యమని భావిస్తున్నాము. ఒక్క విషయం స్పష్టంగా చెబుతున్నాను.

''ఇంగ్లీషువాళ్లు ఉప్పుమీద విధించిన పన్ను రద్దుచేసినా, తీసుకువెళ్లిన డబ్బు తిరిగి యిచ్చివేసినా, భారతీయులందరికీ పెద్ద పెద్ద పదవులు,

హోదాలు యిచ్చినా, ఇంగ్లీషు సైన్యస్థావరాలను తొలిగించివేసినా, మేము వారిమిల్లుల్లో తయారైన బట్టలు ధరిస్తామనిగాని, ఇంగ్లీషు భాషను ఉపయోగిస్తామని గాని, వారి కళావిశేషాల్ని ఉపయోగిస్తామనిగాని భావించకూడదు. అసలు యివన్నీ చేయకూడని పనులు, గనుక వాటిని మేము చేయము.''

ఇంగ్లీషు వారియెడ గల ద్వేషంతో నేను చెప్పలేదు. ఇంగ్లీషు వారి సభ్యత యెడ గల ద్వేషంతోనే అలా చెప్పాను.

మనం స్వరాజ్యం పేరు ఉచ్చరిస్తున్నామే కాని దాని స్వరూపాన్ని మనం తెలుసుకోలేదు. నేను తెలుసుకున్న విధంగా యిక్కడ వివరించుటకు ప్రయత్నించాను.

ఇట్టి స్వరాజ్యం పొందుటకు నా యీ శరీరం సమర్పితమని నా మనస్సు సాక్ష్యం పలుకుతున్నది.

## అనుబంధం - 1

"హింద్ స్వరాజ్యం" హిందీ అనువాదమందలి తన ప్రస్తావన యందు గాంధీజీ యిలా వ్రాశారు.

"1901లో నేను యీపుస్తకం వ్రాశాను. 12 సంవత్సరాల అనుభవం గడించిన తరువాత కూడా నా భావాలు అప్పుడు ఏ విధంగా వున్నాయో, యిప్పుడూ అదే విధంగా వున్నాయి. పాఠకులు నా యీ భావాల నిజనిర్ధారణ తమ ప్రయోగాల ద్వారా కావించగలరని ఆశిస్తున్నాను.

"మిల్లుల విషయంలో నా భావాలలో యీనాటి భారతావని పరిస్థితిని గమనించి, మాంఛస్టర్ బట్టకు బదులు, భారతదేశపు మిల్లులకు ప్రోత్సాహం కల్పిస్తూనే, మనకు అవసరమైన బట్టను మనం మన దేశంలోనే ఉత్పత్తి చేసుకోవాలి అని కొద్ది మార్పు వచ్చింది. (1921)

★ ★ ★

హింద్ స్వరాజ్య ఆంగ్లానువాదానికి తమ ప్రస్తావనలో గాంధీజీ యిలా

వ్రాశారు. "ఇప్పుడు యీ పుస్తకాన్ని యీ రూపంలోనే ప్రచురించడం అవసరమని భావిస్తున్నాను కాని యిందు ఏమైనా మార్పు చేయవలసి వస్తే నేను ఒక శబ్దాన్ని మాత్రం మార్చాలని భావిస్తున్నాను. ఒక ఆంగ్ల స్నేహితురాలికి నేను యీ శబ్దాన్ని మారుస్తానని మాట యిచ్చాను. పార్లమెంటును నేను 'వేశ్య' అని అన్నాను. ఈ శబ్దం ఆ సోదరికి నచ్చలేదు. ఆమె కోమల హృదయానికి యీ శబ్దానికి గల గ్రామ్యార్థంవల్ల దుఃఖం కలిగింది." (1921)



## అనుబంధం -2

## కొన్ని ప్రామాణిక గ్రంథాలు

హింద్ స్వరాజ్య పఠనాన్ని యింకా కొనసాగించుటకు క్రింద తెలిపిన పుస్తకాలు చదవడం వల్ల ప్రయోజనం కలుగుతుంది.

1. The Kingdom of God is Within You- Tolstoy
2. What is Art? - Tolstory
3. The Slavery of Our Times - Tolstoy
4. The first Step - Tolstoy
5. How Shall We escape?- Tolstoy
6. Letter to a Hindoo - Tolstoy
7. The White Slaves of England - Sherard
8. Civilization, Its Cause and Cure - Carpenter
9. The Fallacy of Speed - Taylor
10. A New Crusade - Blount
11. On the Duty of Civil Disobedience - Thoreau
12. Life Without Principle - Thoreau
13. Unto This Last - Ruskin
14. A Joy for Ever - Ruskin

15. Duties of Man -Mazzini
16. Defence and Death of Socrates - From Plato
17. Paradoxes of Civilization - Max Nordau
18. Poverty and Un-British Rule in India - Naoroji
19. Economic History of India - Dutt
20. Village Communities - Maine

  

# అనుబంధం-3
# మహనీయుల ప్రశంసలు

శ్రీ ఆల్‌ఫ్రెడ్ వెబ్ మహాశయుల అమూల్య భాండాగారంలో లభించిన క్రింది వ్యాఖ్యల వల్ల, "ఆధునికత" నుంచి ప్రాచీన భారతీయ సంస్కృతి నేర్చుకోవలసిన దేదియు లేదని తెలుస్తున్నది.

## జె. సేమూర్ కే, యమ్.పి.

*ఇండియాలో బ్యాంకరు, ఇండియా ప్రతినిధి*

*(1883వ సంవత్సరంలో వ్రాసినది)*

ఇండియాలో మన ఉనికి ఆటవిక జాతులకు నాగరికతను ప్రసాదించిన నాగరికుల కోవకు, చెందలేదని గ్రహించుట మనకు అంత సులభంకాదు. భారతదేశంలో మనము అడుగుపెట్టే నాటికే, వివేకం వేలాది సంవత్సరాల తరబడి మలచబడిన గొప్ప నాగరికత వేళ్లూని, స్థానికుల జీవితంలో భాగమై ఉన్నదని గ్రహించాలి. రాజకీయ, సామాజిక, వ్యక్తిగత వ్యవస్థగా, వివిధ రూపాలతో, అందరికీ ఉపయుక్తంగా ఉండిన ఈ నాగరికత స్థిరమైనది. హిందూ జాతి మొత్తాన్ని తీర్చిదిద్దిన ఈ వ్యవస్థ ఔన్నత్యాన్ని అంచనా వేయడం అసాధ్యం. బహుశ ప్రపంచంలో ఏ ఇతర జాతి తమ నాగరికత యొక్క విశిష్టతను ఇంతగా "ఆత్మసాత్" చేసుకొనలేదేమో! వ్యాపారంలో మెలకువ, తర్కంలో నైపుణ్యం, పొదుపు, ధార్మిక శ్రద్ధ, ధీరోద్ధాత్తత, దానశీలత, పితరుల

యెడ భక్తి శ్రద్ధలు, బడుగువారిపై కరుణ, వృద్ధులంటే వినయం, సరసత్వం, శాసన బద్ధత, కష్టకాలంలో ఓర్పు - వీరి ప్రత్యేకతలు.

★ ★ ★

## విక్టర్ కజిన్ (1792-1867)

*అధ్యాత్మపరమైన వ్యవస్థకు నిర్దేశకుడు*

"ప్రాచ్యంలోని భక్తివేదాంతపరమైన ఉద్యమాలను శ్రద్ధతో అర్థంచేసుకోవాలి వీటి ప్రభావం ముఖ్యంగా భారతదేశ ఉద్యమాల ప్రభావం - యూరోపులో ప్రసరిస్తున్న ఈ సమయంలో వారి గాఢ, గంభీర సత్యాలను మన అభివృద్ధి నిరోధక క్షుద్ర కౌటిల్యంతో పోల్చి చూసినప్పుడు, మానవజాతి ఆధ్యాత్మిక సారము ఇక్కడే ఉన్నదని గమనిస్తాము, అంగీకరిస్తాము."

★ ★ ★

## ఫ్రెడరల్ మేక్స్‌ముల్లర్

గ్రీకులు, రోమనులు, యూదులు ఆదిగాగల జాతుల భావాలతో పెంపొందిన మనకు, ఉత్కృష్టమైన, విశ్వవ్యాప్తి గలిగిన, మానవధర్మ పరిపూరితమైన, నిత్య సత్యాలను అందించగలిగిన దేశం భారతదేశమేనని ఎలుగెత్తి చెప్పగలను. వీటిని అవగతం చేసుకొన్నయెడల, జన్మ జన్మలకు పునీతమై ఉద్ధరింపబడతాం."

★ ★ ★

## ఫ్రెడరిక్ వాన్ ష్లెజెల్

"అనాదినుండి భారతీయులకు భగవత్తత్వం యొక్క అవగాహన బాగా ఉన్నదని ఒప్పుకొని తీరాలి. పరమాత్మునియెడ భక్తిప్రపత్తులు, గాఢవిశ్వాసం, వీరి రచనలలో ప్రతిబింబిస్తూ వుంటాయి. ఆనాటి గ్రీసు, ఈనాటి జర్మనీ మనసారా నమ్మి, ఆచరించిన ఆధ్యాత్మ్యం, వేదాంతం యిమిడియున్న భావాలకు ఏ కాలంలోనైనా హిందుస్తాన్ తలమానికం.

★ ★ ★

## ఏబ్ జే.ఏ. డ్యూబాయ్

*(ఇతడు మైసూరులో క్రైస్తవ ప్రచారకుడు. ఇతడు శ్రీరంగపట్టణమునుండి, ది. 15 డిసెంబరు, 1829 నాడు వ్రాసిన ఉత్తరంలోని అంశాలు.)*

"వివాహిత స్త్రీలు కుటుంసభ్యుల మధ్య సామరస్యం నిలిచేందుకు ముఖ్యంగా తమ శక్తిని వెచ్చిస్తారు. వారి చాకచక్యము, విచక్షణ యూరోపీయ మహిళలలో మృగ్యం. నలుబది, ఏబది మంది స్త్రీ, పురుషులు - పెళ్లిళ్లై పిల్లలతో ఉన్న కుటుంబ సభ్యులు - అమ్మో, లేక అత్తగారో ఆధ్వర్యం వహించగా శాంతియుతంగా కాలం గడపడం ఎరుగుదును. వివిధ మనస్తత్వాల వారిని, లాలించి, బెదరించి ఆమె ఆడువారినందరినీ సరిదిద్ది సమన్వయ పరుస్తుంది. మన దేశాల్లో రెండు కొప్పులు ఒక ఇంట్లో ఇమడవు గదా!

ఆమాటకొస్తే భారతదేశంలో హిందూ మహిళలు పాలుపంచుకోని పనేలేదు. ఇళ్లను తీర్చిదిద్ది, పొలంలో వారు మగవారికి కూడ సహాయం చేస్తారు! వ్యాపారంలో వారికి భాగస్వామ్యం ఉంటుంది! చాలమంది మహిళలు స్వయంగా దుకాణాలు నిర్వహిస్తారు. అక్షరజ్ఞానం లేకపోయినా, వారికి తెలిసిన పద్ధతిలో లెక్కలు సరిచూసి, వ్యాపారపు లావాదేవీలలో మగవాళ్లను మించి ఉంటారు."

★ ★ ★

## జే. యంగ్

*(సేవక్ మెకానిక్కుల సమితి (ఇటీవలె కొద్ది ఏళ్ల క్రితం)*

"నైతికంగా భారతీయులు ప్రపంచంలో మేటివారు. పేదతనంలో సైతం, తమ భాగ్యాలతో తృప్తిపడి, ఆశ్చర్యకరమైన నీతి ప్రవర్తన కలిగి ఉంటారు. దైవమిచ్చిన దానితో తృప్తిచెంది ప్రకృతి సంతానమై, సాదాసీదా బ్రతుకులు సంతోషంతో గడుపుతారు: సూర్యోదయం నుంచి అస్తమయం వరకు శరీర కష్టంచేసి కూలీలు - ఆడా, మగా - ఆడుతూ, పాడుతూ చీకు చింతాలేకుండా నవ్వుతూ తుళ్లుతూ - ఇళ్లకు వస్తుంటారు. అక్కడ వాళ్ల గుడిసెల్లో గంజినీళ్లు,

మట్టినేల స్వాగతమిస్తాయి. పెద్దలు చేసిన పెళ్ళిళ్లే అయినా, వారి కుటుంబ వ్యవస్థ, సుఖశాంతులతో చల్లగా ఉంటుంది. వివాహ వ్యవస్థ ఇళ్లలో తాండవ మాడుతుంటుంది. వారి శాస్త్రాలు, పెళ్లినాటి ప్రమాణాలు దీనికి కారణాలా? భర్తలకు భార్యలయెడ అనురక్తి, భార్యలకు భర్తల సేవ అంటే ఎంతో ఆనందం ఉండడం సర్వసామాన్యం.''

## కర్నల్ థామస్ మన్రో

*(భారతదేశంలో 32 ఏళ్లపాటు ఉద్యోగం)*

``చక్కటి పంటలు, వృత్తులలో నైపుణ్యం, సుఖభోగాలను పెంచే ఉత్పత్తుల తయారీశక్తి, ప్రతి గ్రామంలో పాఠశాల, ఒకరినొకరు గౌరవించుకోడం. అన్నిటికంటె మించి మహిళల యెడ లాలిత్యం, మర్యాద, పూర్తి ఆదరణ, ఆమోదం, వారికివ్వవలసిన అధికారలనిచ్చి గౌరవించడం మున్నగునవి నాగరికతకు చిహ్నాలైతే, భారతదేశం ఈ విషయాలలో ఏవిధంగాను తీసిపోదు. రెండు దేశాలమధ్య "నాగరికత" వ్యాపార వస్తువయితే, ఇంగ్లాండుకు భారతదేశం నుంచి దాని దిగుమతి వలన లాభమే.''

★ ★ ★

## సర్ విలియం వెడ్డర్ బర్న్, బార్-ఎట్-లా

భారతదేశంలో "శతాబ్దాలనుండి, గ్రామవ్యవస్థ, రాజకీయ అస్తవ్యస్థతలను ఎదిర్చి, శాంతి సౌఖ్యాలకు దన్నుగా నిలిచింది. ఇక్కడిది సాదాసీదా గృహ జీవనము. చరిత్రకారులు, వేదాంతవేత్తలు గ్రామీణ జీవితంలో అత్యుత్తమమైన ప్రాచీనభారత వ్యవస్థను మెచ్చుకున్నారు. ఆత్మనిర్భరం, కష్టపడడం, శాంతి కాముకత, విశ్వజనీనమైన స్థితప్రజ్ఞత. భారతీయ గ్రామీణ సామాజిక, వైయక్తిక వ్యవస్థలో పేర్కొనతగినవి, ఆకర్షకమైన అనేక అంశాలు ఉన్నాయి. అది నిరపాయకరమైన, ఆనందాయకమైన మానవ అస్తిత్వ రూపంతో ఉపయుక్తతతో కూడిన వ్యవస్థ.

★ ★ ★

# యరవాడ మందిరం నుండి

(ఆశ్రమ అనుభవాలు)

తెలుగు సేత

టి.వి.ఆర్.కె. సుబ్బారావు

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ఆముఖం

యరవాడ సెంట్రలు జైల్లో నా శిక్షాకాలం 1930లో. సత్యాగ్రహా శ్రమానికి వారం వారం ఉత్తరాలు వ్రాశాను. అందులో ఆశ్రమానుభవాల స్థూల పరీక్ష ఉండేది. ఆశ్రమ ప్రభావాలు భౌగోళిక పరిమితుల నధిగమించాయి కనుక అందరికీ అందించేందుకు ఉపయుక్తంగా ఉత్తరాల సంఖ్య పెరిగింది. వీటిని గుజరాతీ భాషలో వ్రాయడం జరిగింది. హింందీ, ఇతర భారతీయ భాషలలోనికి ఆంగ్లంలోనికి వీటి అనువాదాలు కావాలని మిత్రుల పట్టుదల పెరిగింది. శ్రీ వాల్జీ దేశాయి ఆంగ్లంలో అనువాదం చేశారు. ఇటీవల నా జైలు శిక్ష పునఃప్రారంభమైన సమయంలో నా వద్దకు తన ఆంగ్ల అనువాదాన్ని చూచి సరిచేయమని పంపించారు. దాన్ని జాగ్రత్తగా పరిశీలించి, నా భావాల కనుగుణ్యంగా ఉండేటట్టు దానిలో అనేక భాగాలను సవరించాను. నేను ఆంగ్ల పాఠకుల కోసం క్రొత్తగా వ్రాసినచో, బహుశా నూతన రచన చేసి ఉందునని చెప్పను. అది నాకు అప్పగించిన పనిని మించి పోతుంది. 1930లో నేను ఆశ్రమ వాసులకు తెలియజేసిన భావాలు ఆంగ్ల పాఠకులకు తెలియడం మంచిదే. కనుక మూల స్వరూపంలో ఎక్కువ మార్పులు చేయలేదు.

యరవాడ కేంద్ర కారాగారం — మో.క.గాంధీ

మార్చి 6, 1932

# పాఠకులకు

నా రచనలను అధ్యయనం చేసే వారికి, వాటి యెడ శ్రద్ధ చూపించేవారికి ఒక్కమాట చెబుతాను.

నిత్యం స్థిరంగా ఒకే విధంగా ఉండాలనే పట్టుదలనాకు లేదు. సత్యాన్వేషణలో అనేక ఆలోచనల్ని త్యజించాను. క్రొత్తవాటిని నేర్చుకున్నాను. నా వయసు మీరినప్పుడు, అంతరంగంలో పెరుగుదల ఉండదనీ, మాంసం ఎముకలు వడిలిపోతే నా పెరుగుదల ఆగుతుందని నా ఉద్దేశంకాదు. క్షణక్షణం నా సత్యాన్ని, నాదైవాన్ని అయన పిలుపును, ఆజ్ఞలను పరిపాలించుటతోనే నాకు సంబంధం ఉంటుంది. కనుక నా రచనలలో వేటి మధ్యనైనా అంతరం కనిపిస్తే నా మీద, నా వివేకం మీద నమ్మకమున్న వారు ఆ విషయం మీద రచించిన నా తరువాతి రచనల్ని చదివి నిర్ణయానికివస్తే మంచి పని చేసిన వారవుతారు.

హరిజన్ **మో.క.గాంధీ**

29-4-33. పుట.2

ఏతద్ర్వతం నానృతం వదేన్న మాంసమశ్నీయాన్న
సత్యాషాఢశ్రౌతసూత్రే స్త్రియముపేయాత్।

*ప్రశ్న 2, పుటలు 6, సూత్రం 16*

*సత్యమయా ఉ దేవాః ॥ రకౌ.బ్రా - 2- 8।*

విధులలో ఉత్తమం. నమ్మకంతో నిరంతరం సత్యం సత్యమేదైవం, దైవభక్తి, సత్యపాలన, రెండూ ఒక్కటే పాలనం.

- సిల్వియోపెలికో

న హింస్యా త్సర్వాభూతాని శ్రుతి :
ఏకేంద్రియా సంయమో.. పి నివార్యతే ఇత్యాహ
*ఇంద్రియాణాంతు సర్వేషాం క్షరతీంద్రియమ్*
*తేనాస్య క్షరతి ప్రజ్ఞాదృతే : పాదాదిదోదకమ్।*
ఇంద్రియాణాంత్వితి సర్వేషామింద్రియాణాం
మధ్యే యద్యేకమపీంద్రియామ్ విషయ ప్రవణం
భవతి తతో స్య విషయపరస్య ఇంద్రియాంత
రైరపి తత్వజ్ఞానం క్షరతి న వ్యవతిష్ఠతే।
చర్మ నిర్మితోదక పాత్రాద్రివైకానాపి ఛిద్రేణ
సర్వస్థాన స్థమేవోదకం న వ్యవతిష్ఠతే ।
మనుస్మృతౌ కుల్లూకవృత్తిసమేతాయాం 2-99
*బ్రహ్మచర్య సకలేంద్రియసంయమః।*
విజ్ఞానేశ్వరో మితాక్షరాయామ్ ॥యాజ్ఞ. 3-312
*ఔషధవదశనమాచరేత్ । ఆరుణేయీ ఉపనిషద్॥*
*ఔషధవత్ప్రీతిమ్ వినా శరీరస్థిత్యర్థమశనం*
*భోజనమాచరేత్।*

*నారాయణోదీపికాయామ్।*

*యజ్ఞాయ సృష్టాని ధనాని ధాత్రా।*

# సత్యము

సత్యాగ్రహాశ్రమ అస్తిత్వము సత్యాన్వేషణ మరియు సత్యపరిపాలనలపై ఆధారపడి యున్నది. కనుక, సత్యాన్ని గురించి వివరిస్తాను. "సత్" నుంచి పుట్టినది "సత్యము" అంటే "ఉన్నది" అన్నమాట. సత్యము తప్ప వేరొక్కదానికి నిజమైన అస్తిత్వం లేదు. కనుకనే దైవానికి గల నామాలలో సత్ లేక సత్యం అతి ముఖ్యమైనది. సత్యమే దైవం అనుట, దైవమే సత్యమనుట కంటే ఎక్కువ సరియైన విషయము మనకి పాలకుడు, సేనానాయకుడు ఉండాలి. కనుక దైవానికి "రాజాధిరాజు" "సర్వశక్తి సంపన్నుడు" అను పేర్లున్నాయి. దీర్ఘాలోచన తర్వాత "సత్" లేక "సత్యమే' ' దైవానికి సరియైన, అర్థవంతమైన నామము.

సత్యమున్న చోట, సత్యజ్ఞానముంటుంది. సత్యములేని చోట నిజమైన సత్యమైన వివేకముండదు. అందుకనే చిత్ లేక జ్ఞానం, వివేకం అనేవి దైవ నామాలతో జత పడి ఉన్నాయి. సరియైన వివేకమున్న చోట, ఆనందమున్నది. దుఃఖానికక్కడ చోటులేదు. సత్యమెట్లు శాశ్వతమో, తత్ఫలితము ఆనందము కూడ అట్లే శాశ్వతము. అందువల్లనే దైవాన్ని సచ్చిదానంద స్వరూపునిగా, తనలో సత్యం, వివేకం ఆనందాలను సమన్వయ పరచిన వాడుగా మన మెరుగుదుము.

ఈ సత్యసంధతయే మన జీవితధ్యేయం. దీని చుట్టూ అన్నీ పరిభ్రమించాలి. సత్యమే మన ఊపిరికావాలి.

జీవన యాత్రలో ఈ మజిలీకి చేరగానే ఋజుజీవన నియమాలు అప్రయత్నంగా లభ్యమై వాటిపాలన స్వతఃప్రాప్తిస్తుంది. సత్యం వినా నియమపాలన అసాధ్యం.

సామాన్యంగా సత్యపాలన అంటే సత్యభాషణ అనుకుంటారు.

ఆశ్రమవాసులైన మనం సత్యం యొక్క విస్తృతార్థం గ్రహించాలి. మనోవాక్కాయ కర్మలలో సత్యసంధత ఉండాలి. దానిని పూర్తిగా అర్థంచేసుకుంటే, జ్ఞానమంతా ఇందులో సమ్మిళితం గనుక ఇక నేర్వవలసినది ఉండదు. అందులో లేనిది సత్యముకాదు. కనుక జ్ఞానము కాదు. జ్ఞానము లేనిదే మనశ్శాంతి కలుగదు. సత్యపరీక్షణకు గీటురాయి ఉపయోగించడం నేర్చినట్లయితే చేయవలసినది, చూడదగినది, పఠించుట కర్తవ్యమైనది ఏమిటో వెంటనే తెలుస్తుంది.

మరి గీటురాయికి, కామధేనువుకు దీటైన యీ సత్యము తెలుసుకొనుట ఎట్లు? భగవద్గీత చెప్పినట్లు ''అభ్యాస, వైరాగ్యాల సహాయంతో తెలుసుకొనవచ్చును. ఇట్టి మేటి భక్తి ఉన్నప్పటికీ, ఒకరికి సత్యమనిపించినది, వేరొకనికి అసత్య మనిపించును. అభ్యర్థికెట్టి చింతయు ఉండనక్కరలేదు. నిజాయితీతో వెతికితే వేర్వేరు సత్యరూపాలు ఒకే చెట్టు ఆకులుగా కనుపిస్తాయి. వేర్వేరుగా ఉన్నా ఆయన ఒక్కడే. సత్యమే దేవుడు. అందువలన ఎవరి రీతిలో వారు సత్యాన్ననుసరించుటలో ఎట్టి దోషమూ లేదు. అది వారి విధి కూడా. ఈ అనుసరణలో ఎవ్వరివల్లనైనా ఏదేని తప్పుజరిగినా, స్వయంగా సర్దుబాటు అవుతుంది. సత్యాన్వేషణకు జీవన పర్యంతం తపస్సు అవసరం. రస్వారర్థ గంథం ఉండేందుకు ఇసుమంతైనా చోటులేదు. ఇట్టి స్వార్థరహిత అన్వేషణలో ఎవరూ దారి తప్పరు. తప్పితే బోర్లపడతారు. తిరిగి సరియైన దారికి వస్తారు. సత్యాన్వేషణ నిజమైన భక్తి. భగవంతుని దరికిచేరు మార్గము. దీనిలో పిరికి తనానికి అపజయానికి తావు లేదు. ఈ తాకీదుతో మృత్యువు కూడా స్వర్గ ద్వారమవుతుంది.

హరిశ్చంద్రుడు, ప్రహ్లాదుడు, రామచంద్రుడు, ఇమాంహసన్, ఇమాం హుసేను, క్రైస్తవ సన్యాసులు మున్నగువారిని గుర్తుకుతెచ్చుకోవాలి. చిన్నా, పెద్దా, ఆడా, మగా - సత్యాన్వేషణకులంతా సత్యంలో లీనమైతే ఎంత హాయి. సత్యదేవుడు నాకు అనర్ఘరత్నం. అందరకూ అట్టే అగుగాక.

★ ★ ★

# అహింస లేక ప్రేమ

గతవారం సత్యమార్గం ఇరుకైనది అని గమనించాం. అహింసా మార్గం కూడా అంతే. అసిధారావ్రతం. ఏకాగ్రతతో "మోళీ" వాడు త్రాటి మీద నడుస్తాడు. సత్యాహింసలకు వలయు ఏకాగ్రత దానిని మించినది. దృష్టి చెదిరితే అధః పతనమే. నిరంతర ప్రయాసవలన ఇది సాధ్యం.

నశ్వర శరీరంతో నిత్యసత్యదర్శనం అసాధ్యం. ఊహామాత్రంగా, కల్పనలో, సాధ్యం. కనుకనే నమ్మకం అవసరం.

నశ్వర శరీరంతో సత్యాన్వేషణ అసాధ్యమని తెలిస్తే అహింస ఎదురవుతుంది. "నాకు కష్టాలను కలుగ జేసేవారితో సర్దుకుపోనా? లేకవారిని నిర్మూలించనా' ' అని అడిగిన వాడు, నిర్మూలనా కార్యనిర్వాహకుడు యథాస్థితిలో ఉంటాడు. సర్దుకుపోయి సహజీవనం చేసిన వాడు ముందుకు సాగి పోయినట్లు గుర్తిస్తాడు. నిర్మూలన మొదలు పెట్టగానే, అతనికి తాను వెదకునది, బయటలేదు, తనలోనే ఉన్నట్టు బోధపడుతుంది. కనుకనే బాహ్యనిర్మూలన, తనను సత్యానికి దూరం చేస్తుందనీ, బాహ్య శత్రువుతో తలపడి, లోనిశత్రువును మరిచానని అర్థం చేసుకుంటాడు.

దొంగను శిక్షిస్తాం. మనను వదలి, వారు ఇంకొకరికి హాని చేసేందుకు దృష్టి సారిస్తారు. ఆ  నూతన బాధితుడు కూడ మనిషే గనుక ఒక విషవలయం ఏర్పడుతుంది. దొంగలు దొంగిలించుటయే తమ పనియని, దొంగతనం చేస్తూపోతారు. చివరికి, వారిని శిక్షించుటకు బదులు, ఓర్చుకుంటే మంచిదనిపిస్తుంది. ఆ ఓరిమి వారి మనస్సులలో మార్పు కలిగించవచ్చు. దీనివలన దొంగలను మనవంటి మనుష్యులుగా గుర్తించడం జరుగుతుంది. అయితే మనకు కలిగిన బాధను ఓర్చుకోవడం పిరికితనాన్ని  సూచిస్తుంది. అప్పుడు దొంగలలో సోదర భావాన్ని కలిగించాలనే భావం వ్యక్తమవుతుంది.

ఆ పని చేయడమే అహింసామార్గము. దీనికి ఎంతో శ్రమ, క్షమ అవసరం. ఇది చేసిననాడు, దొంగ తన చెడు మార్గాన్ని వదలిపెడతాడు. క్రమంగా ప్రపంచమంతటితో అతడికి సౌహార్దృత్వం అలవడుతుంది. దైవం - సత్యం - వీటి ఔన్నత్యం అవగతమవుతుంది. బాధలో కూడ, శాంతి లభిస్తుంది. ధీరోదాత్తులమవుతారు. శాశ్వతమైనది, కానిది బాగా తెలుస్తుంది. విద్యుక్తధర్మం అవగతమవుతుంది. దంభము అంతరించి, వినీతులవుతారు. ప్రాపంచిక ఆస్తులు తగ్గి రోజురోజుకీ దౌష్ట్యం తగ్గుతుంది.

"అహింస"ను వేరే విధంగా అనుదాత్తంగా కొందరు వర్ణిస్తారు. ఏప్రాణినైనా హింసించకపోవడం మాత్రమే "అహింస" కాదు. చెడుపని, తొందరపాటు, అబద్ధమాడుట, ద్వేషం, అపకారబుద్ధి వీటన్నిటి వలన అహింసాసిద్ధాంతం దెబ్బతింటుంది. ప్రపంచానికి అవసరమైన దానిని స్వత్వం చేసుకోవడము అహింసయే. మనతిండి. మన ఉనికి ఎంతో కష్టనష్టాలను కలిగించవచ్చు. ఏంచేయాలి మనం? ఆత్మహత్యా? లాభంలేదు. మననమ్మకం ప్రకారం, పునర్జన్మ ఉన్నది. శరీరానురక్తి లేనప్పుడు ముక్తి. అదే "సత్య" తత్త్వాన్ని దైవంగా తెలుసుకోవడం. అటువంటి పరిణామం చిటికెలో రాదు. మనది కాని శరీరం మనతో ఉన్నంతవరకు దానిని మనకప్పగించిన దానంగా వాడాలి. అస్థిమాంసయుత పంజరాన్ని నిరాసక్తితో గ్రహిస్తే, మితమైన మనమనోబలంతో ఒకనాటికి దాని నుండి ముక్తి పొందగలం.

అహింస లేకుండా సత్యాన్వేషణ కుదరదు. అవి అవినాభావమైనవి. వీటిని ఒక లోహముద్రికగా ఇరుప్రక్కలు - నున్నటివిగా వర్ణించవచ్చును. అయితే ఏది ఏదో గుర్తు దొరకదు. అహింసదారి. సత్యముగమ్యము. దారితప్పక ముందుకి నడిస్తే, ఒకనాటికి ఏదో గమ్యం చేరతాం. దీనిని అర్థం చేసుకుంటే అంతిమ విజయం మనదే. ఎన్ని అవాంతరాలు వచ్చినా, సత్యాన్వేషణ చేయాలి. దైవమంటే అదే.

★ ★ ★

# బ్రహ్మచర్యం లేక పవిత్రత

మూడవది బ్రహ్మచర్యపాలన. ఇది సత్యజనితమే. సత్యభక్తుడు, తన శక్తిని ఇంకోవిధంగా వ్యయం చేస్తే, మాట తప్పిన వాడవుతాడు. ఇంద్రియాలను తృప్తి పరచడం ఎలా? సత్యప్రాప్తికి అంకితమైన వాడు, అన్ని శక్తులను స్వార్థరహితంగా, ఆపనికి ధారపోస్తాడు. ఇక సంతానానికి, కుటుంబ నిర్వహణకు సమయం ఉండదు. స్వయం తృప్తి ద్వారా సత్య ప్రాప్తి అనే వాక్యంలో విరోధాభాస ఉంది.

నిస్వార్థతతోనే అహింస సాధ్యం. అహింస అంటే విశ్వప్రేమ. వ్యక్తికి దీన్ని అర్పిస్తే, ప్రపంచానికి మిగిలేది ఏముంది? "ముందు మేమిద్దరము - తదితరులు గంగలో దిగాలి' "భార్యాభర్తలు ఒకరికొకరు తోడు" అను వారు విశ్వప్రేమ సాధించలేరు. కనుక అహింస యొక్క ఉపాసకుడు వివాహమాడరాదు. ఇతర ఇంద్రియాల తృప్తి మాట లేనేలేదు.

మరి, వివాహితులు సత్యాన్వేషణ సాధించలేరా? మానవజాతికై భోగసుఖాలు మానుకుంటే, అవివాహితులవలె మసలితే అట్టివారు సాధించగలరు. భార్యా, భర్తలు తమ్ముతాము చెల్లెలు, అన్నలుగా (సహెూదరులుగా) అనుకున్ననాడు విశ్వసేవ చేయగలుగుతారు. ప్రపంచంలోని స్త్రీలంతా సోదరీమణులు, తల్లులు, కుమార్తెలు అనుకుంటే సంకెళ్లు తెగుతాయి. ఇలా భావించిన వారికి ఏ కష్టమూ కలుగదు. ఉపకారమే జరుగుతుంది. ఇంద్రియ వాసనా రహితమై, వారి ప్రేమ భావము ఉదాత్తం, పునీతం అవుతుంది. వారి మధ్య తగవులు తగ్గుతాయి. కోరిక స్వార్థపూరితమయితే, అన్నీ జగడాలే.

పై చర్చ వంటపడితే, వాసనారాహిత్యం వలన శరీరానికి కలిగే వంచవ గౌణమవుతుంది. ఇంద్రియశక్తి వ్యర్థం కాదు. మానసిక శక్తి పెరుగుతుంది. ఇంద్రియసుఖ సంబంధములైన రోగాలు ఉండవు.

మనో వాక్కాయ కర్మేణా బ్రహ్మచర్య పాలన జరగాలి. చెడుతలపులతో కలుషితమైన బుద్ధి గలవాడు శరీరాన్ని వశంలో ఉంచలేడని "గీతా" వాక్యం మనస్సు కోరికలతో పరవళ్లు తొక్కుతుంటే, శరీరవాంఛలు అదుపు తప్పుతాయి.

ఒక గమనిక మనస్సులో చెడు ఆలోచనల్ని చేరనీయడం, ప్రయత్నరహితంగా మనస్సు అట్టి ఆలోచనల తోకలు తొక్కడం భిన్న విషయాలు. విహరించే మనస్సుతో సహాయనిరాకరణ విజయసోపానము.

శరీరం అదుపులో ఉన్నా, మనస్సు ఉండదన్నది అందరి అనుభవం. కనుక ఎల్లప్పుడూ వంటిని వంచి ఉంచి, మనస్సును ఎగురనీయరాదు. మనస్సు వెనుక మనం చలిస్తే, రెంటికి చెడ్డరేవడి అవుతాము. చెడు ఆలోచనల్ని చేరదీయరాదు. అప్పుడే భోగ నిరాసక్తి కలుగుతుంది.

బ్రహ్మ చర్యపాలన దుస్సాధ్యమనే భావన ఉంది. ఇది తప్పు. బ్రహ్మచర్యం అంటే పాశవిక వాసనను తరిమికొట్టడం మాత్రమే కాదు. ఇది అన్ని ఇంద్రియాలను అరికట్టడం అన్నమాట. శృంగార దృశ్యాలు చూడడం, అట్టి వర్ణనలు వినడం, వాసనను పెంచే తిండి తినడం, ఉద్రేక పరిచే స్పర్శలు, నిప్పులో చెయ్యిపెట్టి "కాలదు" అనుకోడం వంటివి. అన్నిటి నియంత్రణ అత్యవసరం. అన్ని పద్ధతులలో "బ్రహ్మచర్య" మార్గాన్ని అనుసరిస్తే, అది విజయసిద్ధి కలిగినది, అవుతుంది. నాలుక కూడ దోషియే. ఆశ్రమవాసులకు "నోరుకట్టుకోడం" గురించి తెలుసుకదా.

"బ్రహ్మచర్యం" అనే మాటకు ఉత్పత్తి. "చర్య" అంటే పని చేయుట. బ్రహ్మను లేక సత్యాన్ని వెదకుటకు బ్రహ్మచర్యం అవసరం. ఉత్పత్త్యర్థం నుంచి ఇంద్రియనిగ్రహం అనే అర్థం స్ఫురిస్తుంది. జననాంగాలకు పరిమితం చేసే అసంపూర్ణ నిర్వచనం వదలి, సంపూర్ణ నిర్వచనంపై మనసునిలపాలి.



# నాలుకపై నియంత్రణ

బ్రహ్మచర్యపాలనకు జిహ్వా, రసనల రుచి గ్రహణ విషయం గురించి అదుపు అవసరం. దానితో కామవాసనారాహిత్యం సుకరమవుతుంది దీన్ని గురించి ఆనాటి మహర్షులు కూడ చెప్పలేదు. కాని ఆశ్రమనియమాలలో దీని విషయమై శ్రద్ధ చూపడం జరిగింది.

"రుచి"ని తృప్తి పరిచేందుకు కాకుండా, ఔషధంలాగ శరీరావసరాలు తీర్చడానికి, రుచితో పనిలేకుండా, ఆహారం తినాలి. ఔషధం లాగానే, తగిన మోతాదు మరచి, తక్కువగా లేక ఎక్కువగా ఆహారాన్ని తీసుకుంటే, తిప్పలు తప్పవు. ప్రియమైనది ఎక్కువగా తినడం, రుచికోసం ఉప్పువేయడం మున్నగునవి నియమ భంగమే. ఆరోగ్యదృష్ట్యా కనీసపు జోడింపులు, తగ్గింపులు పరవాలేదు. అనుమిషతో రుచులకు బానిస కావడం డంబాచారం.

పౌష్టికత్వానికి అవసరం కాని అనేక తినుబండారాలను వదిలి వేయాలి. అప్పుడు స్వచ్ఛందంగా ఆత్మబలం పెరిగి సరియైన ఆహార సేవనకు దారిదొరుకుతుంది. తల్లిదండ్రులు వెర్రి ఆపేక్షతో పిల్లలకు ఏవేవో తినిపించి, వారికి అసహజమైన రుచుల ఎడ ప్రీతి కలిగిస్తారు. ఒళ్లు పాడయి, జీవితమంతా అసహజ పరిణామాలు వచ్చి, వైద్యుని చేతిలో పడి ఇల్లూ, వళ్లూ గుల్ల చేసుకుంటాము. దీన్ని గురించి ఎక్కువగా ఎవరూ దృష్టిసారించడం లేదు.

మనలో చాలమంది భోగలాలసతో ఇంద్రియాలకు బానిసలం అవుతాము. "ఆరోగ్యవంతుడు" ఒక్కడూ కనుపించడు. ఎక్కువ తిండి వలన కలిగే అసౌకర్యం 'ఉపవాసం"తో కొంత సర్దుకుంటుంది.

ఇది చదివి భయపడవద్దు. తపస్సు మానవద్దు. ప్రతిజ్ఞ చేసినవారం మనోవాక్కాయకర్మలా కష్టపడి, ఆత్మద్రోహరహితంగా ఉండి, అనుకున్నది సాధిద్దాం. ధర్మాన్ని నమ్మి మనసారా అనుసరించి మాట నిలుపుకోడం

పురుషార్థం. అట్టి పూర్ణమానవుడు "భగవానుడు", "యోగి" అనిపించుకుంటాడు. బలహీనులమైన మనం నిరంతర ప్రయాసతో ఉత్కృష్ట వస్తుజ్ఞానం వల్ల అసహజమైన జిహ్వాగుణాలను మాయం చేద్దాం.

రోజంతా తిండి ధోరణి పనికి రాదు. జాగరూకత ఉంటే, భోగ ఆస్వాదన తప్పుతుంది శరీరం కోసం మాత్రమే వలయు తిండి నిలబడుతుంది. కనుక రుచి భోగం, స్వాదు అనుభూతిని పరిహరించాలి. పాకశాల ఉంటే, ప్రతిరోజూ ఏమి తినాలి అనే చింత హరించి పౌష్టికాహారం అవసరమయినంత దొరుకుతుంది. మనస్సు తృప్తిగా సాధువాదం చేస్తుంది. పాకశాల అధికారులు మన అభిరుచులను సరియైన దారిలో ఉంచుతారు. మనను అలరించి, ఉబ్బేసే పనులు చేయరు. ఆదర్శ రాజ్యంలో సూర్యుడే వంటవాడు కావాలి. కాని ఆ రోజు చాల దూరంగా వున్నది.



# అస్తేయము (దొంగతనం చేయకుండుట)

దొంగతనం లేకపోవడం సత్యంలోని అంశం. సత్యం నుండి ప్రేమ ఉద్భవిస్తుంది లేక సత్యం, ప్రేమ తోడుగా జీవిస్తాయి. నిత్య సత్యం ఒక్కటై నిలుస్తుంది. ప్రేమ మార్గంలో-సత్యం గమ్యం. ప్రేమా హింసలు మనకు తెలిసినవి. అనుసరణలో కష్టాలున్నాయి. అందు మనకు తెలిసినది అంశమాత్రమే. పూర్ణజ్ఞానం సత్యానిది. పూర్ణానుసరణ అహింసది - ఇది దుస్సాధ్యం.

ఒకే ఒరలో చౌర్యం, సత్యాహింసలూ ఇముడవు. తెలిసీ, తెలియక మనమంతా ఎంతో కొంత వరకు చోరులమే. చౌర్యమంటే ఇతరుల వస్తువు సంగ్రహించడమే కాదు, పిల్లలకు తెలియనీయక తండ్రి దాచిపెట్టి ఉంచడం కూడ దొంగతనమే. ఆశ్రమపాకశాలలో ఒక్క పటిక బెల్లం ముక్క తీసినా చౌర్యమే. ఇతరులది, ఒప్పుదలలేకుండా, వారి ఎదుట తీసినా అది

దొంగతనమే అవుతుంది. ఎవరిదో తెలియని వస్తువు తీసినా, అది చౌర్యమే. రోడ్డు మీద ఉన్నది ప్రభుత్వానికి ఆశ్రమంలో దొరికిన దానిని, కార్యదర్శికి అందజేయాలి.

ఇదంతా బాగానే ఉంది. అస్తేయత నిర్వచనం ఇంకాలోతైనది. ఇతరుల ఆస్తిని వారి అనుజ్ఞతో తీసుకొనుట, దేనినైనా తగు అవసరం లేకుండా సంగ్రహించుట దొంగతనమే. తెలియక చేసినా ఇది తప్పే. సరిగా ఆలోచిస్తే మనకు కావలసినది ఎంత? అంతకుమించి ఉంచడం తప్పే కదా? నిజమైన బుద్ధితో, గట్టిగా, దొంగతనాన్ని పరిహరించడం, ఆవశ్యకతలను తగ్గిస్తుంది. లోకంలో గల దుఃఖకర దారిద్ర్యం అంతమవుతుంది.

బాహ్య, భౌతిక చౌర్యాన్ని మించింది మానసికంగా తనదికాని దానిని ఆశించడం, దానిని చూసి లొట్టలు వేయడం. ఆహారం వర్జిస్తే "ఉపవాసం' ' కదా! కాని ఉపవసించే వ్యక్తి తింటున్నవారిని చూసి మనసులో తిండి కోరికను పెంచుకున్నపుడు కూడా, చౌర్యం చేసినట్లే, వ్రతభంగం అయినట్లే. ఉపవాస సమయంలో తిండిని గురించి ఆలోచన తప్పు.

అస్తేయదీక్షావంతుడు భవిష్యత్తులో వలయు వాటిని సంగ్రహించడు. "రేపేమవుతుంది" అనే చింత, చౌర్యానికి మూలం. ఈ రోజు దేనినైనా కోరుకుంటాం, రేపు అదే అలవాటు వలన, ఋజుమార్గాన్నో, వక్రమార్గాన్నో అవలంభించడం ఆరంభిస్తాం.

ఇదే విధంగా బుద్ధి, జ్ఞాన తస్కరణ కూడ ఉంటుంది. "దీన్ని నేను కనిపెట్టాను" అనే ప్రబుద్ధుడి బీరాలు నమ్మవద్దు. ఆ విషయం ఎక్కడ నుంచి సంగ్రహించిందో తెలుసుకోండి. మహాపండితులు, ఇట్టి తస్కరులు, అని ప్రపంచ చరిత్ర తెలియజేస్తుంది. నేను, ఒకవేళ, ఆంధ్రలో చూసిన చరఖావంటిది ఆశ్రమంలో తయారుచేసి, దానిని నా "స్వయంభు" అంటే, అది తప్పుఅని. కనుక "తస్కరించను" అని దీక్ష పూనిన వారు, వినయశీలురు, ఆలోచనాపరులు, క్రియాశీలురు, సాదా అలవాట్లు కలవారు అయి ఉండాలి.

# స్వత్వరాహిత్యం లేక దారిద్ర్యం

"నాది" అనుకొనక పోవడం స్వత్వరాహిత్యంతో ముడిపడి ఉన్నది. ఆవశ్యకతలేనప్పుడు, దేనినైనా స్వంతం చేసుకుంటే ఆ ఆస్థిని తస్కరించబడినదని అనాలి. రేపటికి ప్రోగు చేయడం తప్పు. సత్యాన్వేషి, ప్రేమ శాసన అనుయాయి రేపటికి ఇది కావాలని సంగ్రహించడు. దైవం కూడ ఆవిధంగా చేయడు. అవసరం లేని దానిని సృష్టించడు. భగవంతుని నమ్మితే, మనకు ఏ లోటు లేకుండా చేస్తాడు. సన్యాసులు, భక్తులు ఆ విధంగా తరించారు. దైవశాసనమిది. ఇది గ్రహించక, అసమానత కొనితెచ్చుకుంటున్నారు. ధనవంతుల వద్ద, వారికవసరం లేని ఎన్నో చేరుకొని, ఉపయోగంలోకి రాక, వ్యర్థమవుతాయి. కోట్లాదిజనం మలమల మాడుతున్నారు. కనుక ఆ బాధను నివర్తించడం, కావలసిన దానికంటె ఎక్కువ ఏదీ సంగ్రహించక పోవడం వలన సాధ్యం. అందరూ ధనవంతులవుతారు. కలవారు అందరి తృప్తి కోసం పంచిపెట్టడం అలవాటు చేసుకోవాలి. "స్వత్వ" రాహిత్య భావం కలిగేందుకు, పక్షులవలె కొంపా, గోడూ, తిండీ, బట్టా లేని మనస్తత్త్వాన్ని అలవరచుకోవాలి. రోజూ తిండి కావాలి. ఆ విషయాన్ని దేవుడే చూస్తాడు. ఈ ఆదర్శాన్ని అందుకోవడం బహుకష్టం. దీని ఆలోచనతో బెదిరిపోకూడదు. కావలసిన వస్తు జాలము అట్టే పెట్టుకొని, తదితరాలను త్యాగం చేయాలి. దీనివలన సంతోషం, తృప్తి నిజంగా పెరుగుతాయి. సేవాభావం మెరుగవుతుంది. ఈ కొలబద్ధతో పరీక్షచేస్తే, ఆశ్రమంలో అక్కరలేని వస్తువులెన్నో కనబడతాయి. తస్కరణకు అనువైనవివే.

నిత్యసత్యానుసారం, ఈ శరీరం కూడా ఒక స్వత్వమే. భోగేచ్ఛవలన ఆత్మలు శరీరాలను సృష్టిస్తాయట. అదిపోతే, శరీరావశ్యకత తొలగిపోయి జననమరణాల విషవలయం నుంచి బయటపడతాం. శాశ్వతమైన అస్తిత్వం

కలిగిన ఆత్మ ఈ అస్తిపంజరం కోసం తప్పుడు పనులు చేసి, ఆ పంజరం కైదులో ఎందుకు ఉండాలి? ఇదే సన్యాసం శరీరం ఉన్నప్పుడు సేవ చేస్తాం. సంపాదన కోసం ఆర్తి చెందం. తింటాం. త్రాగుతాం, విశ్రమిస్తాం, మేలుకుంటాం. అన్నీ మానవ సేవకొరకే. ఇది నిత్య ఆనందదాయకమైన అనుభూతి. ఈ కొలబద్ద కావాలి.

"కావాలని కోరిక లేకపోవడం" ఆలోచనలకూ, భౌతిక వస్తువుల సంగ్రహణకూ వర్తిస్తుంది. అర్థరహితమైన జ్ఞాన సముపార్జన ఈ నియమాన్ని భంగపరుసున్నది. దైవపరం గాని ఆలోచనలు అవరోధాలు అవుతాయి. గీతాధ్యాయాల్లో పదమూడవది (వినయం) జ్ఞాన మనీ, తదితరం అజ్ఞానమనీ బోధించడం జరిగింది. ఈ పద్ధతిలో నేడు మన జ్ఞానము మనస్సును చెదరగొట్టి, శూన్యంచేసి, అసంతృప్తిని పెంచి అనేకములైన చెడులను చేస్తున్నది. అయితే స్తబ్ధత్వం కూడా పనికిరాదు. సాత్విక భావంతో, సేవాదృష్టితో, క్షణం తీరికలేకుండా, విచక్షణాయుత సుకార్యనిర్వహణ నిరంతరం ఏకాగ్రతతో చేస్తుండాలి.

# భయరాహిత్యం

"గీత" పదహారో అధ్యాయంలో భయరాహిత్యం దైవ గుణాలకు తలమానికమని ఉన్నది. "ఛందోపూర్తి దీనికి కారణమా? "ఇది నిజమా?' ' నాకు తెలియదు. అయితే భయరాహిత్యానికి మొదటిచోటు సరియైన నిర్ణయమే. అలాలేని నాడు ఇతర ఉదాత్తతలు అసంభవం. అభయ ప్రేమలు లేకుంటే సత్యాన్వేషణ లేదు. హరిని చేరేమార్గము, ధైర్యవంతము. పిరికి వారికి అర్థం కానిది. హరి అంటే సత్యము. ఆయుధం భయరాహిత్యం. కత్తి, తుపాకి భయగ్రస్తులకవసరం.

బాహ్యమైన అనారోగ్యం, శరీరబాధ, మరణం, "తనది ఎవరైన బలిమిని

తీసుకుంటారనే అభద్రతాభావం, ప్రియతమ బంధువులను పోగొట్టుకోడం, పేరుపోతుందని - ఎవరినైనా అసంతుష్టికి గురి చేస్తామని భయాందోళనలు - వీటన్నిటి నుంచి ముక్తి అభయ భావం. మృత్యువుకి భయపడని వాడు, తదితర భయాలకతీతుడనుకోడం తప్పు. మనలో కొందరికి చావంటే భయం లేదు. కాని అనారోగ్యమంటే భయం తాము చావగలరు, కాని తమప్రియతముల చావును భరించలేరు. లోభికి తన ఆస్థి ముఖ్యం. ఇంకొందరు మిధ్యాప్రశక్తికోసం, ఎన్ని నికృష్టకార్యాలనైనా చేస్తారు. మరి కొందరు "చెడ్డపేరు వస్తుందని భయంతో దారి తప్పుతారు. సత్యాన్వేషి హరిశ్చంద్రుడి వలె వీటన్నిటినీ అధిగమించాలి. ఈ దశలో ఎవరి అనుభూతి వారిది. అన్నీ చరిత్రలో ప్రసిద్ధిచెందినవే.

దైవాంశను గ్రహించిన వారే పూర్ణాభయాన్ని పొంది, కుహనాభావాలను త్యజిస్తారు. సాధన, ఏకాగ్రత, ఆత్మవిశ్వాసం ప్రతి . వ్యక్తిని గమ్యం వైపు తీసుకుపోతాయి.

బాహ్యమైన భయాలను విడనాడాలి. మరి ఆంతరంగిక భయాలు - వాసన, క్రోధం, కామం - వీటి నుంచి రక్షణ కల్పించుకోవాలి. లోని శత్రువులను ఓడిస్తే, బయటివి తమంత తామే హరించుకుపోతాయి. శరీరమంటే ఆసక్తిలేనినాడు దానినంటి పెట్టుకొని ఉన్నవన్నీ లుప్తమౌతాయి. బాహ్యభయం మిధ్య. ధనం, శరీరం, బంధుప్రీతి లేనినాడు, మనస్సుకి భయం ఉండదు. "భౌతికాన్ని త్యజించి ఆస్వాదించు" అనుసిద్ధాంతంతో ధనాదుల అస్తిత్వాన్ని స్వీకరిస్తూనే "అవి భగవంతునికి చెందినవి - మనవి కావు" అనుకుంటే చాలు "నేను" కూడా "ఆపరమాత్మ ఆస్థిని" అని భావించి అనుభవించాలి అనేది ఉపనిషద్వాక్యం. మనం ధర్మకర్తలం మాత్రమే. స్వంతదారులంకాము. మనకు దైవం వాటినిరక్షించేశక్తి యిస్తాడు. యజమాని సేవకుడై, కాలి క్రింద ధూళిగా మారిననాడు, భయాలన్నీ మంచులా కరిగి పటాపంచలై పోతాయి. శాంతి కలిగి సత్యనారాయణుని దర్శిస్తాం.

★ ★ ★

# 8

# అస్పృశ్యతానివారణ

నాలుకను నిగ్రహించుట వంటిదే ఈ కార్యాచరణ కూడా. అది క్రొత్తగా వున్నా, అతి ముఖ్యం. ఒక జాతి లేక కుటుంబంలో పుట్టుటవలన వారికి ఆపాదితమైన స్పర్శదోషం. ఆఖాగారి మాటల్లో అశుద్ధం. ధర్మాచరణకు అవరోధం. ధర్మానికి చెడు కలిగిస్తుంది.

అగ్ని కణాల వంటి వారము అందరము కనుక, పుట్టుకతో అస్పృశ్యుడు కావడం అసంబద్ధం. అలా వారిని దూరం చేయడం తప్పు. శవస్పర్శ గురించి మూఢ విశ్వాసాలు కూడా తప్పే. శవం దయకూ, గౌరవానికి పాత్రం. ఆరోగ్య సూత్రాలననుసరించి శవం తాకినా, తైలమర్ధన, క్షుర కర్మ తరువాత స్నానం చేస్తాము. స్నానం చేయకపోతే అశుభ్రతేగాని పాపం అంటదు. శిశువు మలమూత్రాలు తీసినతల్లి చేతులు కడుక్కోని శుద్ధి కానిదే "అస్పృశ్య" యే. ఆమెను శిశువుతాకితే, శిశువుకు అస్పృశ్యత ఉండదు.

పుట్టుకనుంచి "భంగీ, ఢేఢ్, చమార్" అనువారిని అప్పృశ్యులని హీనంగా చూస్తారు. వారు స్నానం చేసి, తిలకం ధరించి, వైష్ణవులై, గీతాపఠనం చేసినా, వారు తాకరానివారే. ఇట్టి కుమతాన్ని నిర్మూలించాలి. ఆశ్రమాచారాలలో అస్పృశ్యతానివారణను చేర్చి, అంటరానితనము హిందూధర్మములోనిది కాదనీ, ప్రతి హిందువు ఖండించవలసిన ఆచారమనీ నొక్కి వక్కాణించాం. దీనినిపాపమని భావించే ప్రతి హిందువు హిందువులు చేసిన ఇట్టి నికృష్టపరిహారార్థము, వారితో కలిసి తిరిగి, సేవచేసి పునీతుడుకావాలి. వారి బాధలు పోగొట్టి, వారికన్నీళ్లు తుడవాలి. యుగయుగాల అజ్ఞానము, బానిసత్వము వలన కలిగిన ఫలితాలను ఓపికగా అధిగమించి, ఇతర హిందువులను ఈ దారికి తేవాలి.

ఈ ఆధ్యాత్మిక దృష్టితో అంటరానితనము నిర్మూలించే ప్రయత్నాలు చేయాలి. రాజకీయ, సామాజిక కోణాలు పట్టించుకోరాదు. అస్పృశ్యులతో

కలసి మెలసి తిరిగితే కలిగే ఫలితాలు సత్యాన్వేషి దృష్టిలో అనవు. తమ జీవితం దిద్దుకునే ప్రయత్నం చేస్తూ, ఇతర విషయాలను తలపెట్టరు. ఈ ఆచరణయొక్క ఉత్కృష్టత తెలిస్తే, ఈ విచక్షణ దళితులపై మాత్రమే కాదని అవగతమవుతుంది. ఆవగింజంత పాపం మేరు పర్వతమై మట్టు పెడుతుంది. స్నానాలు, శుద్ధీకరణాలు, ప్రత్యేకమైన వంటలు - వీటితో బ్రతుకు తెల్లారి, మన గురించి మనం పట్టించుకోడానికి సమయం ఉండదు. చేసేవే దైవప్రార్థనలు కావు.

అంటరాని వారితో స్నేహం మాత్రమే సరిపోదు. ప్రతి జీవినీ స్నేహంగా చూసి, అహింసతో అవినాభావంగా ఉండి, సృష్టిలోని జీవులమధ్య అడ్డుగోడలను కూల్చి, మనదేశంలో ధర్మశాస్త్ర సమ్మతమైనదనిపించుకుంటున్న ఈ అనాచారాన్ని కోట్లకొలది మందిని బానిసల వలె మార్పు చేసిన ఈ దురాచారాన్ని సమూలంగా నిర్మూలిద్దాం.



## తిండికోసం శ్రమ

"బ్రతకాలంటే శ్రమించాలి" అనే సూత్రం టాల్‌స్టాయ్ రచనలో లభ్యమైంది. అంతకు ముందే రస్కిన్ "అన్ టు దిస్ లాస్ట్" చదివి, యీ సూత్రాన్ని ఆరాధించసాగాను. టి.యమ్. బోండరెవ్ అను రష్యను రచయిత "కండ కలిగిన నాడే తిండి కలుగును" అనే దివ్య న్యాయాన్ని మొదట పునరుద్ఘాటించాడు. టాల్‌స్టాయ్ దానికి బాగా ప్రచారం కల్పించాడు. "గీత" మూడవ అధ్యాయంలో "శ్రమదానం చేయక తింటే చౌర్యం" అన్నదానికిదే అర్థం. లక్షాధికారి శయ్యపై సమయంగడిపి, జీవితాన్ని సుఖమయం చేసుకోలేడు. పని చేయనిదే తినే తిండి వంటబట్టదు. బైబిల్ సూక్తి ఇదే. అంటే శ్రమైక జీవనమే పుష్టి, తుష్టి కలిగిస్తుంది. గొప్పవారు వ్యాయామానికి బదులు శ్రమపడితే రక్తి, ముక్తి. రైతుకు ప్రాణాయామంకావాలా? నూటికి

తొంభైశాతం భూమినిదున్నే వారే. మిగతా పదిశాతం కూడా ఒళ్లు వంచి పనిచేసి, నిండుగా తిని, మెండుగా బ్రతకాలి. దీనితో కష్టజీవుల అగచాట్లు అర్ధం అయి, అన్ని వర్ణాలవారు ఒకటై మనస్తాపాలు, బీదా, గొప్పా, అంతరాలు, పెట్టుబడిదారు, కూలివాడు అనే భేదాలు నశిస్తాయి. చేయి చేయి కలిపి కష్టం చేస్తే, గొప్పవారు తమ ఆస్థులకు తాము ధర్మకర్తలమని గ్రహించి, తమ శక్తియుక్తులు సమాజ శ్రేయస్సుకై వినియోగిస్తారు

సత్యాన్వేషి, అహింసావాదికి శరీరకష్టం ఒకవరమై బ్రహ్మచర్యపాలన సహజంగా సుకరమవుతుంది. వ్యవసాయానికి చెందినదే శరీరకష్టం. పొలంపని అందరికీ అందుబాటులో ఉండదు కనుక, దానిని ఆదర్శంగా తీసుకొని, నూలువడికి, బట్టలు నేసి, వడ్రంగి, కమ్మరి వృత్తులను అవలంబించి సుఖపడాలి. ఆహార స్వీకరణ వలెనే మలవిసర్జన కూడ ముఖ్యం. తన అశుభ్రతను తానే "పాకీ వాడై" తొలగించాలి. అధమం ప్రతి కుటుంబం ఇది అలవరచుకోవాలి. మలాన్ని తొలగించడం ఒక తెగకు చెందిన వారి పని అనడం సమాజ నికృష్టతకు నిదర్శనం. పరిశుభ్రపరిచే ఈ ఉత్తమ కార్యానికి అధమ స్థానం ఎప్పుడు, ఎవరు ఇచ్చారు? సరే, అదీ ఒక మంచికే వచ్చింది. చిన్నతనం నుంచి మనమంతా శుద్ధికారులు (పాకీవారు) అనేది మనస్సుల్లో ముద్రించుకొని, ఈ పని చేసి జీవిక నార్జించుకోవాలి. మల శుద్ధీకరణ నిస్సంకోచంగా, నిండు మనసుతో చేపట్టిననాడు, మానవ సమానత్వానికి మంచిదారి వేసిన వాళ్లమవుతాము.

★ ★ ★

# 10

# సహిష్ణుత అనగా మతాల సమానత్వం-1

"సహిష్ణుత" అనే మాట నాకునచ్చదు. ఇంతకంటె మంచి మాట దొరకలేదు. "సహిష్ణుత" అంటే తక్కువ స్థాయిగల ఇతర మతాలను ఓర్పుతో సహించడం అని అర్థం వస్తుంది. "అహింస" ఆచరణలో ఇతర మతాలకు, మన మతానికిచ్చే ఆదరణ స్ఫురించి, మనమతంలోని లోపాలను ఒప్పుకోడం

జరుగుతుంది. సత్యాన్వేషి విధి ఇదే. సత్యమంటే పూర్తి అవగాహన ఉంటే, దైవత్వసిద్ధి కలుగుతుంది. సత్యమే దైవం కనుక. కాని అన్వేషకుడిలో లోపాలుంటాయి - ప్రతిపాదించిన మతంలో అసమగ్రతలుంటాయి. ప్రతినిత్యమూ, మన మతానికి పరిణతి, సమగ్రతా సాధన ప్రయాస ఉంటాయి. సత్యప్రాప్తికి అన్ని మతాల దారి ఇదే. తరతమబేధాలు లేవు. అన్నిటిలో పొరపాట్లు ఉంటాయి. అన్య మతాలను గౌరవించడం అంటే, వాటిలో లోపాలను గురించి ఆలోచింపకపోడం కాదు. మన మతం లోపాలను గుర్తించాలి. వాటిని సవరించుకోవాలి. కాని ఆ మతాన్ని త్యజించడం సరికాదు. అన్ని మతాలలోని మంచి విషయాలను గ్రహించి మన మతంలో లీనం చేసుకోవడం మన విద్యుక్త ధర్మం.

మరి ఇన్ని మతాలు అవసరమా? ఆత్మ ఒక్కటే. శరీరాలు వేరు. అవి ఉంటాయి. "ఆత్మ" ఐక్యతా గుణం గుర్తించాలి. పెద్ద చెట్టుకు కొమ్మలూ, రెమ్మలూ ఆకులూ అనేకం వుంటాయికాని మొదలు ఒక్కటి. మతధర్మం ఒక్కటే, వివిధ మానవుల మనసులలో వేర్వేరు విధాలుగా పెరుగుతుంది. వీటిలో సరియైనది ఏది? అందరిదీ ఒప్పే. అందరిదీ తప్పే. సహిష్ణుత ఉండాలి. తనమత మంటే అశ్రద్ధ లేదు, నిజమైన అభిమానం ఉంది. సహిష్ణుత వలన అంతర్దృష్టి ఏర్పడి, మతమౌఢ్యం తొలగిపోతుంది. సహిష్ణుత, మౌఢ్యం ఉత్తర దక్షిణ ధృవాలు. మతమంటే సరియైన అవగాహన వాటి మధ్య అడ్డుగోడను కూల్చి అంతం చేస్తుంది. పరమత సహిష్ణుత మనమతాన్ని సరిగా బోధపరుస్తుంది.

సహిష్ణుత మంచీచెడూ, తప్పూ ఒప్పూ వీటి అంతరాన్ని కదిలించదు. ప్రపంచంలోని ముఖ్యమత ధర్మాలన్నీ సమమైన మూలతత్త్వాలు ఆధారంగా గలవి. అన్ని మతాలు మహనీయులను ఋషిమునులను, సాధుసన్యాసులను సృష్టించి ప్రపంచాన్ని పునీతం చేశాయి.

★ ★ ★

# 11

# సహిష్ణత అనగా సర్వమత సమభావము-2

"ఫోనిక్సు" ఆశ్రమంలో "సాబర్మతీ"లో వలెనే రోజూ ప్రార్థన చేసే వాళ్ళం. హిందువులతో బాటు ముస్లిములు, క్రైస్తవులు పాల్గొనేవారు. కీ.శే. రుస్తుంజీ సేఠ్ పిల్లలతో వచ్చేవారు. ఆయనకు "మానె, వలూన్" అనే గుజరాతీ భజన బాగా నచ్చింది. "రామనామమెంతరుచిరా!" అని దీని అర్థం. మగన్‌లాల్, యీ భజన మొదటి పాదం పాడి ముందుకుపోసాగాడు. ఆయనను "రామునికి బదులు హోర్మజద్ అను" అని ఆనందంతో అరిచారు. వెంటనే ఆ పని చేశాం. దావూద్ సేఠ్ కుమారుడు కీ.శే. హుసేన్, మధురస్వరంతో "హాయ్ బహారే బాగ్" (ప్రపంచమనే పూదోటకు క్షణికమైన వసంతం)పాడి, మాకందరకూ నేర్పాడు. భజనావళిలో దీన్ని చేర్చడం అతనికి మా శ్రద్ధాంజలి. హుసేన్‌ను మించిన యువక సత్యాన్వేషి నాకు దొరకలేదు. జోసెఫ్ రాయప్పన్ క్రైస్తవుడు. అతనికి ప్రియమైనది. "వైష్ణవ జన.." (దుఃఖితుల దుఃఖాన్ని దూరం చేసిన వాడే వైష్ణవుడు - దేవుని బంటు). ఒకసారి "వైష్ణవ' ' శబ్దానికి బదులు "క్రిష్టియన్" శబ్దాన్ని వాడాడు. అందరం అది అనుసరించగానే అతని ముఖం మీద వెల్లివిరిసిన ప్రఫుల్లత నాకు ఎప్పటికీ గుర్తుంటుంది. "సహిష్ణత" శబ్దంలో గల "సర్వజనీనత" ఇప్పటికి బోధపడిందా?

వివిధ మత గ్రంథాలను పరిశీలించిన మీదట, నాకు వలసినంత మేరకు క్రైస్తవం, ఇస్లాం, డోరాష్ట్రియానిజం, జుడాయిజం, హిందూయిజం మత ధర్మాల ఆంతర్యం అర్థం అయింది. ఈ సమయంలో అనాలోచితంగా నా మనస్సు సర్వమత సమభావనలో ఓలలాడింది. గౌరవ భావంతో అధ్యయనం చేసిన నాకు, ప్రతిదాని మౌలికనీతి ఒక్కటిగా గోచరించింది. అప్పటికీ ఇప్పటికీ కొన్ని అర్థం కాలేదు. కాని తెలియని వాటిని "తప్పు" అనుకోడం సరికాదని నిర్ణయానికి వచ్చాను. అనుభవం మీద కొన్ని అర్థమవుతున్నాయి. సమభావన అన్ని సమస్యలకు సమాధానమవుతుంది. అభిప్రాయ భేదం కూడ

సవినయంగా వివరించి, ద్వేషభావం ఉత్పన్నం కాకుండా చేద్దాం.

అన్ని మతాల యెడ సమభావన అంటే, ధర్మం అధర్మం, ఆస్తికత, నాస్తికతల మధ్య అంతరం నిర్మూలించడం కాదు. మరి సమ భావన వ్యక్తిగతమైతే ధర్మాధర్మవిచక్షణ మాట ఏమిటి? ప్రేమభావంతో, అధర్మం అనుసరించినదాని యెడ "ద్వేషం" పెంచుకోము. అనునయించి, అతని తప్పును మనముగాని, మనతప్పును అతడుగాని అర్థం చేసుకొని, సహిష్ణుతతో ఉండవచ్చును. అవతలివారితో ప్రేమభావంలేక పోతే, హింస మొదలు అవుతుంది. కాని మన సద్భావంతో ఆ అశాంతి దూరమవుతుంది. తప్పును చేశారని మనం భావించినా, వారిని ప్రేమించితే, అవసరమైతే మనకు కష్టం కలిగినా,అట్టి సదాచరణ వల్ల అన్ని అడ్డాలు తొలిగిపోతాయి.



## 12

# నమ్రత

నమ్రత సహజసిద్ధం. "అహింస" కు అసలైన పరీక్ష. అహింసాత్మకుడు నమ్రుడు. సత్యాగ్రహ ఆశ్రమ నియమ నిబంధనల ప్రారూపం అందరితో బాటు సర్ గురుదాస్ బెనర్జీకి అందించాం. ఆయన ఆశ్రమ ఆచరణాంశాలలో "నమ్రత" ను చేర్చమన్నారు. అన్ని విధులకంటె ఉత్కృష్టమైనది. నేర్చుకుంటే అది రాదు. సత్యము, ప్రేమ సాధనవల్ల సిద్ధిస్తాయి. నమ్రతను నేర్చుట, మోసాన్ని పెకలించడమే. నమ్రత అంటే మట్టూ, మర్యాదాకాదు. మనస్సులో ద్వేషంనిండినా, సాష్టాంగం చేస్తాం. ఇది నమ్రత కాదు. జిత్తులమారితనము రామనామం జపిస్తూ, తావళం త్రిప్పుతూ, మన మధ్య ద్రష్టగా, మహర్షిగా చలామణి కావచ్చును. అతని లోపల స్వార్థం ఉంటే, అతడు "వినయనటన" చేస్తున్నాడన్నమాట. నమ్రుడు కాడన్నమాట.

నమ్రత గలవానికి తన్ను గురించి తెలియదు. ఈ గుణాన్ని సత్యగుణాన్ని కొలిచినట్టు కొలవలేము. సహజాతమైన నమ్రత దాగదు. కాని ఆ వ్యక్తికి

దాని అస్తిత్వం గురించి తెలియదు. విశ్వామిత్ర, వశిష్ఠుల వృత్తాంతమొక మంచి దృష్టాంతము. వినీతుడికి "తాను ఏమీకాను" అనునది తెలుస్తుంది. "నేను" అనే ఆలోచన కలిగితే "అహంభావం" ప్రవేశిస్తుంది. సద్వర్తనుడు తన సదాచారాల గురించి గర్వపడితే, వాటి విలువనష్టమై తగ్గిపోతుంది. సద్గుణసంపన్నుడనని అతిశయం ఉన్నవాడు సమాజంలో ఒక మచ్చగా మిగులుతాడు. ఎవరూ అతణ్ణి గుర్తించరు. ఆ వ్యక్తికీ లాభముండదు. ఈ విశ్వంలో ప్రతి ఒక్కరూ "అణోరణీయాన్" అని తెలుసుకొని, క్షణికమైన అస్తిత్వం తనదని గ్రహించి, స్వాతిశయాన్ని త్యజించి, మానవ సముద్రంలో బిందువైపోతే, ఆ గౌరవంలోపాలు పంచుకుంటారు. "నేను" అనేది దైవానికి మనకూ మధ్య గోడ. ఆ ఊహ లేకపోతే, దేవునిలో ఐక్యమవుతాం. అసంకల్పితంగానే, సముద్ర జలంలోనున్న బిందువు గొప్పదై ఉంటుంది. బయట పడితే ఎండిపోయి, ఇంకి పోతుంది. జీవితం బుద్బుదప్రాయం.

సేవాతత్పరత నమ్రభావంతో నిండి ఉంటుంది. ఇతరుల కోసం బ్రతుకు త్యాగం చేసిన వానికి తన కోసం జాగా నిలిపి ఉంచేందుకు సమయం ఉండదు. హిందూ ధర్మంలో ఉన్నట్లు వినీత భావం అంటే స్తబ్ధత కాదు. సతత మానవసేవ. భగవంతుడు ఎప్పుడూ వ్యస్తుడై ఉంటాడు. ఆయన సేవలో మనమూ ఆ విధంగా ఉండాలికదా! సముద్రమునుండి వేరైన జలబిందువు క్షణ కాలం విశ్రమిస్తుందేమోగాని సముద్రంలో ఉన్న దానికి అది కూడా అసాధ్యమే. మనమూ అంతే. దైవంతో తాదాత్మ్యత కలిగితే విశ్రాంతి ఉండదు, దాని ఆవశ్యకతే ఉండదు. నిద్రకూడ పనియే. అప్పుడు కూడ మనస్సు దైవధ్యాన నిమగ్నమై ఉంటుంది. ఈ అవిశ్రాంతతయే నిజమైన విశ్రాంతికి మూలతత్త్వము. ఎడతెగని చలనము నిశ్చలశాంతికి తాళంచెవి. ఇటువంటి సంపూర్ణనమ్రత వర్ణనాతీతం. అనుభవైకవేద్యం. సిద్ధులకిది సాధ్యం. సాధన చేస్తే మనకూ అందుబాటులోకి వస్తుంది. సత్యాగ్రహాశ్రమ వాసులకిదే గమ్యం. మన ఆచార వ్యవహారాలు ఈ సిద్ధికొరకే ఏర్పడ్డాయి. మనలో "నిజం" ఉంటే, తప్పక అక్కడకు చేరుకుంటాం.

★ ★ ★

# 13

# ప్రతిజ్ఞల ప్రాముఖ్యత

ప్రతిజ్ఞలను గురించి ప్రస్తావించడం జరిగింది. పవిత్రజీవనం కొరకు వాటి ప్రాముఖ్యత గురించి తెలుసుకుందాం. నియమపాలన అంగీకరిస్తారు. కాని ప్రతిజ్ఞలు ఎందుకు అని అంటారు కొందరు. ఇది బలహీనతకు చిహ్నం అని కూడా అంటారు. ఏదేని నియమం తప్పు అనిపిస్తే, ఆ ప్రతినకు కట్టుబడటానికి వారు అంగీకరించరు. మద్యపానం మంచిదికాదు. కాని ఆరోగ్యం కోసం కొంచెం అప్పుడప్పుడు పుచ్చుకుంటే ఏమి అని వారు అంటారు. ఆ పరిస్థితిలో ప్రతిజ్ఞ ఇబ్బందిని కలిగిస్తుంది.

ప్రతిజ్ఞ అంటే నిశ్చయం. ఆకర్షణలకు తావులేని దృఢత. దృఢసంకల్పం లేనిదే ప్రగతి సాధ్యం కాదని అందరూ ఒప్పుకుంటున్నారు. పాపకార్యానికి ప్రతిజ్ఞ ఎందుకు? ప్రతినపూనిన వెనుక, ఆ పని పాపం అనిపిస్తే, దానిని త్యజించాలి. సందిగ్ధ విషయాలపై ప్రతిన పూనుట తప్పు. అందరూ "సరి' ' అన్నదాని గురించియే కదా ప్రతిజ్ఞ. అట్టివి పాపపూరితం కాజాలవు. నిజం చెప్పినప్పుడు బాధ కలిగితే, నిజానిదే దోషమా? నిజాన్ని వదలిపెట్టాలా? అదే విధంగా "మద్యపానం త్యజించాలి" అనే ప్రతిజ్ఞ హాని చేయదు. ఆరోగ్య విషయకమైన దానిలో తప్పులేదు. ఆ తర్వాత యావజ్జీవితం దానిని పాటించాలి. ఇందు ప్రాణం పోతే ఏమవుతుంది? మద్యం ఆయుస్సును పెంచుతుందా? అప్పుడు కూడా ఇంకోవిధంగా అంతం ఉండదా? అటుగాక, తన మాట కోసం త్యాగం చేసిన వాడు అనేక మంది మద్యపానప్రియులను సరిజేసి, విశ్వవిఖ్యాత స్వేచ్ఛావ్రతి కాగలడు. ప్రాణం పోయినా, మాటపోని వారే దైవదర్శనం చేయగలరు.

ప్రతినపూనుట బలహీనతకు గుర్తుకాదు. ఏ బాధ కలిగినా, మాట ఇచ్చుట గొప్ప విషయం. "శక్తిమేరకు" అనునది హానికరం. వీరు మొదటి అవకాశంలో దిగజారి పోతారు. "వీలైనంత వరకు" సత్యపాలన అంటే

ఏమిటి? ప్రోనోటులో "వీలునుబట్టి"అంటే చెల్లదు. మరి దైవము దీన్ని అంగీకరించాలా? ప్రతిజ్ఞ దైవస్వరూపం. తన నియమాలను పాటించకపోతే, తలవెంట్రుకవాసి దారితప్పినా, సూర్యుడు, దేవుడు ఉండరు. అంటే నియమపాలన అందరికీ ముఖ్యం. "మాట తప్పకు" అనేది పెద్ద వాగ్దానం. ప్రాపంచిక వ్యవహారాలకే ప్రతిజ్ఞా పాలన కావాలి. మరి ఆత్మపరీక్ష, స్థిరమైన నడవడికలకు వద్దా? ఆత్మక్షాళనకు ప్రతిజ్ఞ ఇంకా అవసరం.

★ ★ ★

# 14

# త్యాగ యజ్ఞం

యజ్ఞం, మహాయజ్ఞం అంటే ఏమిటి? పరులపాటవం గురించి, స్వార్థబుద్ధిత్యజించి, ఐహికమైనా, ఆముష్మికమైనా చేసే పని యజ్ఞం. మనసు, వాక్ కర్మలతో జీవాంశ గురించి చేసేపని. కనుక, అహింసా సిద్ధాంతం ప్రకారం మానవ కల్యాణార్థమైన జంతుబలి పనికిరాదు. వేదాలలో ఉన్నదట. అయితేనేమి? సత్యం, అహింసలు ఇట్టి హింసాత్మక యజ్ఞాన్ని అంగీకరించవు.

అందరూ కలిసి, అందరి మంచికోసం కలిసి చేసే పని యజ్ఞం. ఇతరుల హితం కోరనిదే, ఎన్నిమంత్రాలున్నా, అది యజ్ఞంకానేరదు. ఈ నిర్వచనం క్రిందకు రానివి బానిసతత్త్వాలు. త్యాగయజ్ఞం కావాలి. చేయనివాడు తస్కరుడు. "గీతా" గ్రంథం, ద్వితీయాధ్యాయంలో సద్వివేకంగురించి, మూడవ దానిలో కర్మకాండను గురించి వివరిస్తూ "యజ్ఞం" సృష్ట్యాదిలో కూడా ఉందన్నారు ఋషి మునులు. పుట్టుకతో వచ్చిన యజ్ఞాన్ని చేసి, దైవమిచ్చిన ప్రసాదం స్వీకరించి ఋణ విముక్తులు కావాలి. చట్టపరంగా బానిస బ్రతుకులకు అందరూ సాయాన్ని అందించాలి. గాఢ విశ్వాసంతో యాత్రలు చేసి ముందుకు సాగాలి. స్వార్థం తన జన్మవిశేషాలు. సరిదిద్ది, అమేయ ఆనందాన్ని పొంది దైవాన్ని అనునయించి సిద్ధి పొందడం, ఉన్నమతాల ఆదర్శం. ఈ దృఢ సంకల్పంతో ముందుకు సాగి, మానవసేవ

చేసి ఆదుకుంటే, సౌఖ్య సంతోషాలు, భోగభాగ్యాలు పెరిగి అందరికీ ఆనందకారకాలవుతాయి.

★ ★ ★

# 15

# త్యాగ యజ్ఞం (ఆవశ్యకత)

యజ్ఞాన్ని గురించి ఇంకా రాయాలి. సృష్టాదిలో మానవ సేవ కొరకు వున్న యజ్ఞం - విద్యుక్త ధర్మం. దినమంతా సేవ "పరోపకరాయ సతతాం విభూతయః" కదా! అయితే "నాకేమిలాభం" అనే మాట పనికిరాదు. అప్పుతీర్చి బరువు తగ్గించుకున్నట్లే స్వార్థరహితంగా ఋణ విముక్తి పొంది, సన్యాసి అయితే, పశుప్రవృత్తి పోయి, మానవ ప్రతిపత్తి పొందగలరు. త్యాగ నిరతి మనిషిని, పశువు ప్రవృత్తి నుంచి వేరు చేస్తుంది.

ఇటువంటి బ్రతుకు, కళావిహీనమై, క్రుంగిపోతుందని కొందరి అభ్యంతరం. సంసారికి విలువలేదా? ఉన్నది. ఎందుకంటే సంసారం వదలి అడవులకు పొమ్మని త్యాగయజ్ఞం చెప్పదు. జీవితం భోగానికి అనిగాక, త్యాగబుద్ధితో, కోట్ల రూపాయలు తనవద్ద ఉన్నప్పటికీ, చట్టం ప్రకారం తనశక్తితో ఇతరులసేవ చేయుట విధి అనుకున్నవాడు, గృహస్తుగా ఉంటూనే సన్యాసి అనిపించుకుంటాడు. ఇట్టి వర్తకుడు సాదాగా బ్రతికి, మోసాన్ని, సట్టావ్యాపారాన్ని చేయకుండా, లక్షల కొలది నష్టపోయినా, ఇతరులకు హాని తలపెట్టడు. ఇంత నీతిమంతుడు ఉండటం ఒక కల అనుకోవద్దు. అన్ని దేశాలలో ఈ నీతి ఇంకా నిలిచి ఉంది. ఇటువంటి వాళ్లను వ్రేళ్లపై లెక్కించ వచ్చు. కాని ఒక్కడున్నా చాలు. వాధ్వానులో ఒక దర్జీ, నేనెరిగిన క్షురకుడొకడు, నేతపనివాడు ఇంకొకడు, ఇలా ఎందరో త్యాగ ధనులు వున్నారు. వారు పనిచేసి జీవనాధారం ఏర్పరచుకున్నా, అది గౌణం. మోతీలాలు పనిని పూజగా భావించి, త్యాగబుద్ధితో పరుల కుపకారం చేసి, ధన్యుడయ్యాడు. ఆనందానుభూతి పొందాడు. ఇదే యజ్ఞం. భోగలాలసత సర్వనాశనానికి

దారితీస్తుంది. త్యాగి మృతజీవి అవుతాడు. సంతోషానికి వేరే అస్తిత్వంలేదు. ఒక్కొక్కరి దృక్పథాన్ని బట్టి ఉంటుంది. ఒకరికి చిత్రిత దృశ్యాలంటే యిష్టమయితే, వేరొకరికి సహజ ప్రకృతి మనోల్లాసం కలిగిస్తుంది. చిన్నతనంలో సంతోషాన్నిచ్చినవి, ఎప్పటికీ యిస్తాయి. కనుక సంతోషం వ్యక్తిగతంగా, సామూహికంగా బోధకమైనది అని దృష్టాంతాలు అనేకం ఉన్నాయి. త్యాగమూర్తులు తమకు వలసినవి, అక్కరలేనివి ప్రజల నుండి, నిస్వార్థ సేవకు ప్రతిఫలంగా గ్రహించవచ్చుననుకుంటే, నిరంకుశులవుతారు. సేవాపరుడు తన అవసరాలను తీర్చమని భగవంతుణ్ణి కూడా అడుగడు. అక్కరలేని వస్తువుల బరువు మోయక, కష్టసమయంలో కూడా క్రోధరహితంగా, శాంతియుతంగా, నిశ్చలమతియై ఉండేవానికి సేవయే తృప్తినిచ్చే బహుమతి.

ఇకపోతే, సేవా తత్పరుడు అశ్రద్ధ, అలసతకు దూరంగా ఉండాలి. వీలుంటే పరులకు సేవ చేస్తాను - నా పని నాకు ప్రథమ కర్తవ్యం" అనేవాడు త్యాగ సూత్రం గ్రహించలేడు. స్వచ్ఛందమైన పరోపకారం, స్వంతానికి చేసుకునే సేవకంటె ఉత్కృష్టం. ఇందులో మీనమీషాలు లెక్కించడం తప్పు. సంకోచం, స్వార్థం వదిలి మానవసేవ చేసేవాడు త్యాగ యజ్ఞంలో సోమయాజి.



## 16

అత్యున్నతమైన శాసనం ప్రస్తుత సమయంలో స్వదేశీ. ప్రకృతి నియమాలకువలె, ఆధ్యాత్మిక నియమాలు స్వయంభూతాలు. అజ్ఞానాది కారణాలతో వాటిని పాలించం. అప్పుడు దారి సరిచేయుటకు ప్రతిజ్ఞలు అవసరమవుతాయి. స్వబుద్ధితో శాకాహారిగా ఉన్నవాడు, శాకాహారిగా ఉంటానని ఒట్టు వేసుకోనక్కరలేదు. మాంసాహారం చూస్తే అతనికి అసహ్యం వేస్తుంది. "స్వదేశీ" భావం అంతరాంతరాల్లో ప్రతివారికీ ఉన్నప్పటికీ, నేడు అదృశ్యంగా

ఉంది. కనుక జీవాత్మ భౌతిక బంధాలను త్రెంచేందుకు, అసహజమైన యీ ఆవాసం వదిలి పోయేదారిలో అవరోధమై ఏకత్వాన్ని అందుకునే దారిని సుగమం చేసేందుకు "స్వదేశీ" ప్రతినపూనండి. అలా చేసిన ప్రతివాడు విశ్వాత్మతో నొకటై, భౌతిక బంధాలనుండి విడుదల అవుతాడు.

"స్వదేశీ" అర్థం తెలిసిన వారు, ముమ్మందు, పొరుగువారికి సేవచేయాలి. దీనిలో ఇతరులకయ్యేమంచిని విస్మరించినట్లనిపించినా, అదినిజంకాదు. సేవాదృష్టితో ప్రపంచపుటంచులకు పరుగెత్తువారు రెంటికీ చెడ్డ రేవడులవుతారు. ఉదాహరణకి నా పొరుగువారు, స్నేహితులు, బంధువులు ఆశించే సహాయాన్ని ఉపేక్షించి ఎక్కడి వారినో ఆదుకునేందుకు వెళితే, పొరుగువారికి కష్టము కలుగుతుంది. క్రొత్తచోట ఆ ప్రవేశం ఆ వాతావరణాన్ని కలుషితం చేస్తుంది. "స్వదేశీ" నియమోల్లంఘన అయిన వారికి ఆకుల్లో తిండయినా పెట్టదు, క్రొత్తవారికి అనుకున్న సాయం లభించదు.

గీతావాక్యం - "స్వధర్మేనిధనం శ్రేయః, పరధర్మం భయావహః" అని దీనినే నొక్కి చెబుతుంది. - "స్వధర్మం" "స్వదేశీ" సమానార్థకాలు. స్వదేశీ సిద్ధాంతాన్ని తప్పు అర్థం చేసుకుంటే కొంప మునుగుతుంది. నా కుటుంబ సుఖం కోసం, ఏ దారినైనా డబ్బు పోగు చేయడం "స్వదేశీ" పని కాదు. న్యాయ మార్గంలో కుటుంబ పోషణ చేస్తే, ఆ ప్రయాస కనువిప్పై నన్నుద్ధరిస్తుంది. ఇతరులకు "హాని" తలపెట్టేది ఏదీ "స్వదేశీ" కానేరదు.

విశ్వమానవ సేవలో కుటుంబాన్ని పట్టించుకునే సందర్భం రావచ్చు. ఆ స్వచ్ఛంద త్యాగం నిజమైన కుటుంబ సేవ అవుతుంది.

ఈ ధోరణితో ఆలోచించి, సమాజానికి "స్వదేశీ" వంట బట్టడానికి "ఖాదీ" ప్రముఖమైన ఉపసాధనమని గ్రహించాను. ఈనాడు, భారతదేశంలోని కోట్లాది జనానికీ ఎటువంటి సేవ అవసరం? అందరికీ సులువుగా బోధపడే సేవ ఏది? అర్థాకలితో అల్లాడే దేశ ప్రజలకు జీవానాధారమయ్యేది ఏది? అనుప్రశ్నలకు "చరఖా", "ఖాదీ"లను సర్వసామాన్యులకు అందుబాటులోకి తేవడమేనని స్ఫురించింది.

"ఖాదీ" ఉద్యమంతో "స్వదేశీ" ఉద్యమాన్ని బలపరిస్తే, దేశవిదేశాల బట్టల మిల్లుల అధిపతులకు బాధ ఏముంది? చోరుని చేత తాను కొల్లగొట్టిన పరాయి ఆస్థిని, స్వంత దారులకు ఇప్పిస్తే, చోరునికి కలిగే హాని లేదు. తెలిసిన, తెలియని, లాభమే కలుగుతుంది. నల్లమందు భాయీలను, మద్య వ్యసనం గలవారిని, ఆ తప్పుదారులనుంచి మంచి దారికి మళ్లిస్తే, నల్లమందు వ్యాపారులకు, మద్యదుకాణాల వారికి హాని, జరుగుతుందనరాదు. నిజంగా వారికిలాభమే కలుగుతుంది. పాపపుటార్జన మంచిది కాదు - వ్యక్తికీ - దేశానికి దాని నుండి విముక్తి కలగడమే నిజమైన లాభం.

నూలువడికి, ఖాదీధరిస్తే "స్వదేశీ" ఉద్యమం అయిపోదు. దీనికి అది ప్రథమ సోపానం. కొందరు ఖాదీ ధరిస్తారు కాని విదేశీ వస్తువులంటే యిష్టపడతారు. వారికి నిష్ఠలేదు. గొర్రెలమందలా "ఫ్యాషను" కోసం ఖాదీ వాడతారు. "స్వదేశీ" భక్తుడు, నాణ్యతలో లోపమున్నా, స్థానిక ఉత్పత్తులను, ఎక్కువధర గలవైనా ఎంచుకొని విదేశీ ఉత్పత్తులను స్వచ్ఛందంగా వదలి పెడతాడు. వాటియందలి లోపాలు సరిదిద్దే ప్రయత్నం చేస్తాడు కాని త్యజించడు.

ప్రదర్శన కోసం "స్వదేశీ" ఉద్యమం చేపడితే, అది అంతమవుతుంది. విదేశీ వస్తువులైనంతమాత్రాన వాటిని త్యజించి, వాటినే ఉత్పత్తి చేసేందుకు ధనాన్ని, కాలాన్ని వ్యర్థం చేయడం బుద్ధిహీనత. అటువంటి ఉత్పత్తులను సమర్థించకూడదు. ఇది స్వదేశీ ఉద్యమానికి వ్యతిరేకం. నిజమైన స్వదేశీ ఉద్యమకర్త విదేశీయులను ద్వేషించడు "స్వదేశీ" ఉద్యమం ద్వేష రహితం. ప్రేమమయమైన సాంఘికసేవ.

(స్వదేశీ ఉద్యమాన్ని గురించి 1930లో యరవాడ మందిరం నుంచి ఈ వ్యాసం వెలువడలేదు. 1931 లో జైలునుండి విడుదలై "స్వదేశీ" గురించి రాశాను. నిషిద్ధరాజకీయాల గురించి న్యాయం చేకూర్చాలని వ్రాశాను. ఇది యింకా జరగాలి.)

# గీతా ప్రసంగాలు

తెలుగు సేత

టి.వి.ఆర్.కె. సుబ్బారావు

వేమూరి శ్రీనివాసశర్మ

# అనువాదకుని ముందుమాట

1930 మార్చి 12 చరిత్రాత్మకమైన రోజు. ఆనాడు గాంధీజీ సబర్మతినుంచి దండియాత్రకు బయలుదేరారు. ఆరోజునే వారు 'గీత'కు చేసిన గుజరాతీ అనువాదం యొక్క ప్రచురణ జరిగింది. యరవాడ జైల్లో వున్నప్పుడు దానిక్లిష్టతను గురించి వారికి తెలియ జేశాను. కారాగారాన్నుంచి భగవద్గీతయందలి ఒక్కొక్క అధ్యాయం మీద గాంధీజీ ఒక్కొక్క జాబు వ్రాశారు. మొదటి జాబు పన్నిండవ అధ్యాయం మీద నవంబరు 4, 1930నాడు వ్రాశారు. ఆ ఉత్తరాల అంగ్లానువాదమే యీ కృతి.

సంవత్ 20/6 పేషవాది 3. **వి॥జి॥డి**

## పాఠకులకు

నా రచనలను శ్రద్ధగా చదివే వారికి, వాటియందు ఆసక్తి కలవారికి నేను ఒక్క విషయం చెప్పదలుచుకున్నాను. బయటికి గొప్పగా కనబడాలనే కోరిక నాకు లేదు. సత్యాన్వేషణలో నేను ఎన్నో ఆలోచనల్ని, భావాల్ని వదిలివేశాను. క్రొత్త విషయాల్ని నేర్చుకున్నాను. అంతర్ముఖంగా అభివృద్ధి ఆగిపోవుననిగాని, మరణానంతరం అభివృద్ధి పెరిగిపోవునని గాని ఆసక్తి నాకు లేదు. నేను పూర్తిగా సత్యాన్వేషిని. సత్యమే నా దైవం. ఏ సమయంలోనైనా సత్యం యొక్క పిలుపు యందే నాకు ఆసక్తి.

కాబట్టి నేను వ్రాసిన రెండు రచనల్లో వైరుధ్యం వుంటే, పాఠకునికి నా వివేకంమీద నమ్మకం వుంటే మంచిదని తోచిన విషయాన్నే గ్రహించమని నా సలహా.

హరిజన 29-4-33 పుట 2 **మో॥క॥గాంధీ**

## ౧ - 12

భక్తి పరమైన పండ్రెండవ అధ్యాయంలోని విషయం సంక్షిప్తంగా వివరిస్తున్నాను. ఆశ్రమంలో జరిగే ఏ వివాహ సందర్భలోనైనా, వధూవరుల జంటను-"ఈ అధ్యాయాన్ని కంఠస్థంచేసి, మీరు చేయవలసిన త్యాగాలలో ఒక దాన్ని గురించి అయినా ఆలోచించండి"- అని కోరతాము. భక్తి రహిత జ్ఞానం, ధూళి వంటిది. అది మనల్ని కట్టుబానిసగా చేస్తుంది.

గీతాధ్యయనం భక్తి పూర్వకంగా జరగాలి.

అర్జునుని ప్రశ్న: సాకార నిరాకార ఆరాధనలలో ఏది ఉత్తమం?

జవాబు: నన్ను నమ్మి, నాతో ఐక్యమైనవారు నాభక్తులు, ఆ విధంగానే, ఇంద్రియ నిగ్రహంతో పరమాత్మనారాధించిన వారు, జీవులనన్నిటినీ సమంగా భావించి, నన్ను చేరుకుంటారు. ఏ ఒక్కరూ, ఇతరులను మించిన వారు కారు. అయితే సశరీర ఆత్మ నిరాకార పరమాత్మను ధ్యానించడం, అసాధ్యం, వారి ఊహ కది అందదు. కనుకనే తెలిసో, తెలియకనో, ప్రతిఒక్కరూ తమ తమ దైవాలను ఆరాధించడం జరుగుతుంది. నీమనసు నాపై నిలిపి అంతా అర్పిస్తావా? ఇది సాధ్యం కాకపోతే, మనో చాంచల్యాన్ని నిరోధించు. యమ, నియమాలు, యోగ, ప్రాణాయామాలు వీటి సాయంతో, మనస్సు వశంకాకపోతే, నా పరంగా ప్రతి పనీచేస్తే, మాయ తొలగిపోయి నిరాసక్తి, భక్తి అలవడతాయి. ఇది కూడా సాధ్యం కాకపోతే నిష్కామకర్మ చెయ్యి. పని చేయడమే నావిధి అని భావించు. ఫలాపేక్ష వద్దు. నా చేతి ఆయుధమై జీవించు. ఈ చతుర్విధ ఆరాధనలు ఒకే స్థాయి గలవి. అయితే ఒక్కొక్కరికి ఒక్కొక్కటి నప్పుతుంది. కొందరికి అన్నీ అవసరం అవుతాయి. భక్తితో ఆరాధించడమే అసలు సంగతి.

నిజమైన భక్తి గలవాడు ఏ జీవినీ ద్వేషించడు "నేను" "నాది" అనేది లేకుండా, సుఖదుఃఖాలను ఒకే విధంగా చూసి, తృప్తిగలిగే, స్థిరచిత్తంతో అన్ని జీవాలపై కారుణ్యం గలిగి, తప్పు చేసిన వానిని తాను క్షమిస్తూ, తానూ ఆ విధంగానే క్షమను పొందాలని ఆశిస్తూ, నాయందు దత్తచిత్తుడై, బుద్ధిమంతుడై ఉంటాడు. ఎవరికీ ఇతనంటే జడుపు ఉండదు. నిశ్చలంగా,

కామ క్రోధ భయ భేషజాలకతీతుడై, తన కోసం ఏదీ కోరకుండా ఆచరణలో నిపుణుడై అన్నిటినీ త్యజించి, పట్టుదలతో పనిచేసినా, ఫలప్రాప్తిని గురించి పట్టించుకోకుండా, మిత్రులనూ, శత్రువులనూ, మానావమానాలనూ ఒకే విధంగా భావించి, దొరికిన దానితో తృప్తిపడి, "ఏకోవా" అనుకుంటూ, అన్నివేళలా, అన్ని చోట్లా, చెదరని మనస్సుతో నన్నారాధించేవాడు నావాడు

ప్రశ్న: భక్తుడన్నిటినీ త్యజిస్తాడు-అంటే?

జవాబు: అతడు భవిష్యత్ప్రణాళికలు వేయడు. ఉదాహరణకు ఒక బట్టల వ్యాపారి, రేపు "కట్టెలనమ్ముతాను" "ఇంకో నాలుగు దుకాణాలను తెరుస్తాను" అనుకోడం ఆరంభశూరత్వం అవుతుంది. భక్తుడికిది ఉండదు. దేశసేవలో ఇదే సూత్రము వర్తిస్తుంది. మాటవరుసకు ఖాదీ శ్రామికుడు రేపు పశుపాలనను గురించి ఆ తర్వాత వ్యవసాయాన్ని, మందుల వ్యాపారాన్ని గురించి ఆలోచించడు. ఒక్క విషయాన్ని నమ్ముకొని, అహంకారం త్యజించి, శ్రద్ధగా పనిచేసేవానికి చీకుచింతా ఉండదు-

*నూతరనే, తాంతణే, మనే హరజీఏ బాంధీ*

*జేమ తాణే తేమ తేమనీ రే, మనే లాగీ కటార్‌ప్రేమనీ!*

పరమాత్ముడు దారంతో నన్ను కట్టి, తనవాడినైన నన్ను ఎటు గొనిపోయినా చింతలేదు. ప్రేమకృపాణంతో గాయపడ్డాను నేను" అని అన్నాడు భక్తకవి. భక్తుని విధులను భగవంతుడు నిర్ధారిస్తాడు. కనుకనే 'యేనకేనచిత్' అని, శాంతంగా, సహజరీతిలో వచ్చేవాటిని స్వీకరించి ఆచరణలో పెడతాడు! "త్యజించడం" అంటే ఇదే. భక్తుడు నిత్య శ్రామికుడు. అయితే తాను చేసే శ్రమను గురించి ఆలోచించి మనస్సును పాడుచేసుకోడు. "ఇద మద్య మయా లబ్ధం ఇమం ప్రాప్స్యే మనోరథమ్" గీతా 16-13. ఈనాడు దీని ప్రాప్తి రేపింకొక దాని ప్రాప్తి అనుకోవడం "త్యజించడం" అనే భావానికి విరుద్ధం.



# అధ్యాయం - 1

కురుక్షేత్ర రణభూమిలో కౌరవ పాండవ సేనలు ఇరువైపులా మోహరించి ఉన్నపుడు, కౌరవరాజు దుర్యోధనుడు గురు ద్రోణాచార్యుణ్ణి సమీపించి, ఇరుపక్షాల మొనగాళ్లను పేర్కొన్నాడు. యుద్ధారంభ సూచకంగా శంఖధ్వానాలు చేసిన పిమ్మట, అర్జున రథ సారథి శ్రీకృష్ణుడు ఇరుసేనల మధ్యకు రథాన్ని తోలి అక్కడ దానిని నిలిపి ఉంచాడు. ఆ దృశ్యంతో మనస్సు వికలమై అర్జునుడు శ్రీకృష్ణునితో "వీరిని యుద్ధంలో ఎలా ఎదిరించగలను? పరులతో యుద్ధం చేయగలను కాని బంధుజనులతో చేయలేను. కౌరవ, పాండవులం అన్నదమ్ములబిడ్డలం. కలిసి పెరిగి పెద్దవాళ్లం అయ్యాం. ద్రోణాచార్యులు మా అందరికీ గురువు. భీష్మపితామహుడు అందరికీ ఆరాధ్యుడు. ఆయనతో యుద్ధమా? కౌరవులు తప్పుడు పనులు చేసిన దుర్మార్గులే. పాండవుల దాయభాగం వారికి అందకుండా చేశారు. మాననీయురాలైన ద్రౌపది నవమానించారు. వారిని చంపితే ఏం లాభం? వాళ్లు మూర్ఖులు. నేనూ మూర్ఖత్వంగా వ్యవహరించనా? మంచీ, చెడూ విచక్షణ ఉన్నవాడను. బంధువులతో తగాదా పాపం పాండవుల రాజ్యభాగం వాళ్లు హరించిన మాట వాస్తవమే. మమ్ములను చంపినా పట్టించు కోవలసిన పనిలేదు. వారిపై దాడిచేయగలమా? ఓ కృష్ణా, నా బంధు జనులతో యుద్ధం చేయలేను' ' అంటూ రథపీఠంమీద, దుఃఖితుడై అర్జునుడు కూలబడి పోయాడు.

అర్జున విషాదయోగమని పిలువబడు ప్రథమాధ్యాయ మిదే. జిజ్ఞాస ఉండాలి. అర్జునుని వలె బాధపడాలి. తప్పొప్పులంటే ఏవో తెలుసుకుందామనే తపన ఉండాలి. కృష్ణార్జున సంవాదానికి కురుక్షేత్రం స్థానమైనట్లు, మనమనస్సును దేవుని ఇల్లుగా భావించి, దానిని ధర్మక్షేత్రం చేయాలి. 'నీది' 'వాది' అనే తగవుతో, రాగద్వేషాలు ఉత్పన్నమవుతాయి. మనవాడు, పరుడు అను విచక్షణ ఏర్పడి, ఇష్టా యిష్టాలు రాజ్యం చేస్తాయి. దీనికతీతంగా ఉండమని ధార్మిక గ్రంథాలన్నీ బోధిస్తాయి. చెప్పడం సులువు, చేయడం కష్టం. గీతలోని బోధలతో ఈ ప్రవృత్తి సాధ్యమవుతుంది.

# అధ్యాయం - 2

అర్జునుడు తేరుకోగానే, కృష్ణుడు అతని ప్రవర్తనను అభిశంసించినా, అర్జునుడు యుద్ధవిముఖుడై "పెద్దలను, బంధువులను సంహరించాక లభించే ఈ నెత్తుటి కూడును ఆశించను, చీకటి మాయలో కొట్టాడుతున్న నాకు దారి చూపించు" అని కృష్ణుని వేడుకున్నాడు అర్జునుని సంశయాలకు జాలిపడి "నీ దుఃఖము అర్థరహితము. శరీరం, ఆత్మ వీటి తత్త్వాన్ని మరుస్తున్నావు. ఆత్మకు చావు లేదు. శరీరానికి శైశవము, కౌమార్యము, వృద్ధాప్యము ఉంటాయి అది నశిస్తుంది. ఆత్మ ఎప్పుడూ ఉంటుంది. ఎవరి కోసం నీ దుఃఖం? మాయలో పడవద్దు. కౌరవులను "నీవాళ్లు" అంటున్నావు. మరి వారి శరీరాలు, నశ్వరములు కదా! ఆత్మలను ఎవరూ నష్టపరచలేరు. వాటిని నిప్పుకాల్చలేదు, శస్త్రాలు ఖండించలేవు. గాలి ఎగురగొట్టలేదు. నీరు ముంచలేదు. ధర్మయుద్ధం చేయకుంటే, ఫలితం విరుద్ధమై నీవు అపహాస్యం పాలవుతావు. ధైర్యశాలివైన నీకు మచ్చ వస్తుంది. నిన్ను పిరికిపందవంటారు. అపాయం వచ్చినప్పుడు పారిపోయి, మచ్చవచ్చినా అర్థం ఉంది. ఇప్పుడు వెనుదిరిగితే, నీ ధర్మనిర్వహణ భంగమై, దూషణకు లోనవుతావు" అన్నాడు కృష్ణుడు.

"ఇంతవరకూ శరీరం, ఆత్మ వీటి గురించి వివరించాను. ఇప్పుడు కర్మయోగం గురించి విను. కర్మయోగికి ఏదీ అంటదు. విధినిర్వహణ ఒక గొప్ప అనుభూతి. గంటల కొలది తర్కించే కంటే, ఒక్కక్షణం చేయవలసిన పనినిచేయి. ఫలితాన్ని ఆశించవద్దు. సుఖ, లాభ, భోగాల ప్రాప్తికి వైదిక కర్మలు, ఒకదాని వెనుక నింకొక దానిని చేసేవారు మానసికంగా దెబ్బ తింటారు. కింకర్తవ్య విమూఢవు కాకుండా, ఏకాగ్రతతో ప్రతిక్షణం నీ పనిని చేయి. ఇప్పుడు యుద్ధం నీకర్తవ్యం. లాభనష్టాలు, జయాపజయాలు నీ అధీనంలో లేవు. అనవసరమైన ఆలోచనమాను. ఒక కుక్క ఒక బండి కింద నడుస్తూ బండిని లాగుతున్నది తానే ననుకొని, ఎద్దులను విస్మరిస్తున్న రీతిలో యిప్పుడు నీ పద్ధతి ఉన్నది. చక్రనేమి క్రమంలో-వీటిన్నిటినీ నిశ్చితంగా

అనుభవించాలి. ఫలాపేక్ష రహితమైన విధి నిర్వహణ యోగము అంటే మనస్సు శరీరాల కలయిక. పనిచేయుటయే జయం. ఫలితం కాదు. శాంతచిత్తంతో, ఫలాపేక్ష లేకుండా, నీ పని చేయి.

అర్జునుడు యిదంతా విని ఇలా అన్నాడు: "నీవు చెప్పినట్లు చేయడం నా చేత కాదనిపిస్తూంది. నిరాపేక్షత, నిరాసక్తత, స్థిరమైన శాంత చిత్తత సంభవమా? అట్టి పనులుచేసే వాడెలా ప్రవర్తిస్తాడు? అతనిని గుర్తించేది ఎలా?

భగవానుడు ఈ విధంగా సెలవిచ్చాడు. "ఓరాజా! మనసులోని బాధలను దూరంచేసి, తనకుతాను తృప్తిపడువాడు స్థితప్రజ్ఞడు, సమాధిస్థుడు" దురదృష్టం అతనిని కదలించలేదు. సంతోషం వెనుక పరుగులెత్తడు. సంతోషాన్ని, బాధను ఇంద్రియాలద్వారా గ్రహిస్తాడు. అపాయాన్ని గమనించిన తాబేలు తన రక్షణ కవచంలోనికి, సర్వాంగాలు లాగుకొని ఉన్నట్లు, ఇంద్రియాలను నియంత్రిస్తాడు. ఆకర్షణ ఎల్లప్పుడూ ఉంటుంది గనుక, ఇంద్రియాలను ఎప్పుడు బిగించి ఉంచాలి. ఇదీ అసలు యుద్ధం కొందరు ప్రతారణలద్వారా ఉపవాసాల సాయంతో నియమనం చేయాలనుకుంటారు. వీటి శక్తి పరిమితం ఉపవాసం చేసినంతసేపూ కోరిక అణగి ఉంటుంది. ఉపవాసం వల్ల దానియందు గల రుచి నాశనమవుతుందా? కాదు. పెరగవచ్చు కూడా. మరి భగవంతుని ఆలంబనయే, దానిని నియంత్రించగలదు. జాగరూకత తగ్గితే ఇంద్రియాలు మానవుని వశవర్తిగా చేసుకుంటాయి. అంతర్ముఖుడైన వానికి ఇంద్రియ నిగ్రహం సాధ్యం. నన్ను గమ్యంగా చేసుకొని తనదంతా నాకు సమర్పించి, ఇంద్రియ నిగ్రహపాలన చేసేవాడు స్థిరచిత్తుడైన యోగి. ఇంద్రియలోలుడు, భోగలాలసుడై, ఇతర కర్తవ్యాలను విస్మరిస్తాడు. లాలస కోరికను పెంచి, అది తీరని నాడు కోపాన్ని తెప్పింస్తుంది. కోపంవల్ల ఉన్మత్తత పెరిగి, యుక్తాయుక్త విచక్షణ నశించి, మతి చెదిరి, నశిస్తాడు. ఇంద్రియాలు చంచలమైతే, తుఫాను యందలి ఓడలాగ, ముక్కలవుతాడు. కనుక కోరికలు వద్దు. ఇంద్రియాలను కట్టి ఉంచు, మంచి పనులు చెయ్యి. కళ్లతో పవిత్ర వస్తువులను చూడు. చెవులు భగవత్ప్రార్థనను, ఆర్తుల ఆక్రందనను వినేటట్టు

చేయి. కాళ్ళూ, చేతులు సేవలో మగ్నమవుతాయి. మంచిపనులు ఇంద్రియాలు మానవుణ్ణి భగవత్కృపా పాత్రుణ్ణి చేస్తాయి. దుఃఖాలు తొలగిపోతాయి. బాధలు మంచులా కరిగి, దేవునిదయ అనే సూర్యకాంతిలో మాయమై వెలుగు వస్తుంది. స్థిరచిత్తుడవుతాడు. అప్పుడే మంచిగా ఆలోచిస్తాడు. అప్పుడు శాంతి సౌఖ్యాలు వాటంతటఅవే లభిస్తాయి. అస్థిరుడికంతా అంధకారమే. ప్రాపంచిక వ్యక్తి దృష్టిలో పవిత్రం అయినది, స్థిరచిత్తుడికి పాపపంకిలంగా కనిపిస్తుంది. నదులు ఎడతెగకుండా మాలిన్యాన్ని తెచ్చినా, సముద్రం నిర్మలంగా ఉంటుంది. యోగి వద్దకు కూడా ఇంద్రియ సుఖాలు వస్తాయి. అయినా స్వచ్ఛంగా ఉండి, సముద్రంలాగ కలతలేకుండా, స్వార్థదర్పగుణాలకు లోను గాకుండా, పూర్ణ పురుషుడై, శాంతి దూతయై, ఆఖరిక్షణంలో ముక్తి పొందుతాడు.



# అధ్యాయం - 3

ఈ విధంగా కృష్ణ భగవానుడు స్థితప్రజ్ఞుడి లక్షణాలను వివరించగా, అర్జునుడు వేరేగా అర్థంచేసుకున్నాడు. తాను చేయవలసిన పనియొక్క అవసరాన్ని గురించి ఎత్తలేదు. స్థిత ప్రజ్ఞ స్థాయి, చేతులు ముడుచుకు కూర్చుంటే వస్తుందనుకున్నాడు. కృష్ణుణ్ణి అడిగాడు - ఆచరణకంటే జ్ఞానం నీ దృష్టిలో ఉత్తమంగా ఉన్నట్లున్నది. మరి నన్నెందుకీ భయంకరమైనపని చేయమని చెప్పి, నా మనస్సును కలత పరుస్తున్నావు? నా క్షేమం ఎలా సాధ్యమో, స్పష్టంగా చెప్పు.

కృష్ణుని జవాబు : "పాపరహితుడవైన ఓ అర్జునా! అనాదినుంచీ ప్రతివాడూ ఒక దారిని ఎన్నుకున్నాడు. ఒకదానిలో జ్ఞానానికి, మరొక మార్గంలో ఆచరణకూ పెద్దపీట వేయడం జరిగింది. ఆచరణ రహితమైతే ముక్తికలుగదు. జ్ఞానము కలుగదు. అన్నీ వదలిన మాత్రాన పరిపూర్ణుడు కానేరడు. ప్రతి క్షణం పని చేస్తాం. అది సహజం. చేతులు ముడుచుకొని కూర్చొని మనస్సును ఇంద్రియాలపరం చేస్తే,అతడు డంబాచారి, మూర్ఖుడు

అనిపించుకుంటాడు. నిరాపేక్షతతో, ఇంద్రియాల నిగ్రహణంతో, ఇష్టా యిష్టాలకతీతుడై, ఆడంబరంలేకుండా పనిచేయడం అపేక్షితం. విధి నిర్వర్తించు, నిస్తబ్ధత పెంచుకోవద్దు. బద్ధకస్తుడు, ఆ దురాచారం వల్ల అతి త్వరగా అంతమయిపోతాడు, అయితే నిస్వార్థబుద్ధిలేని కార్యాచరణ బానిసత్వానికి దారితీస్తుంది. యజ్ఞమంటే మానవసేవ. నిరాపేక్షత, నిరాసక్తత, ఇష్టాయిష్టాల అభావం, నిస్వార్థస్వభావం పెంచుకొని సేవ చెయ్యి. బ్రహ్మ సృష్టితోబాటు యజ్ఞాన్నికూడా ఏర్పాటుచేసి, పరోపకారంతో ప్రగతిని సాధించమన్నాడు. దైవాన్ని మెప్పించి, అడగకుండా నీకుకావలసినవి ఏర్పాటయే పద్ధతి ఇదే. ఎవడు సేవాభావంలేకుండా, ఈ భూమిలో సౌఖ్యాలననుభవిస్తాడో అతడు 'దొంగ' అన్నమాట! అందరికీ అన్నీపంచిపెట్టివాడు పాపరహితుడై సుఖిస్తాడు. తనకోసం మాత్రమే కష్టపడేవాడు పాపి.ప్రకృతిసిద్ధ సత్యమిది - ఆహారం తీసుకొని జీవనిర్వహణసాగుతుంది. వానలపై ఆహారోత్పత్తి నిర్భరం. ఆకాశాన్నుండి వానలు అందరిశ్రమదాన యజ్ఞచలవతో కురుస్తాయి. జీవులులేని చోట వానలుండవు. అందరూ కష్టించి బ్రతకాలి. క్షుద్రజీవులకు పనిలేనిదే బ్రతుకులేదు. మరి ఉన్నత జీవులకీ సూత్రం వర్తించదా? నాశనం కాని బ్రహ్మత్త్వం యజ్ఞంలో ఉన్నది. పరస్పర సేవా భావస్నిగ్ధతంతువులను త్రెంపే వారి బ్రతుకు వ్యర్థం.

శాంతి, సంతృప్తి కలిగిననాడు, ఇంకేపని ఉండదు. నిర్వ్యాపారత్వం గాని, దానికి వ్యతిరేకస్థితిగాని అతనికి ఎక్కువతెచ్చిపెట్టవు. తనకు కావలసినది ఏదీలేకున్నా,ఇచ్చే అలవాటు ఉండాలి. కనుక నిరాసక్తంగా, ఇష్టాయిష్టాలతో కొట్టుమిట్టాడక,రోజువారీ విధులను నిర్వర్తిస్తూ, పరమానందాన్ని జనకమహారాజులా అనుభవించాలి. పరోపకారం చేయాలి. గొప్పవారి పనులను అనుకరించాలి. నన్ను చూడు.ఆచరణలో ఏ ఉద్దేశ్యమూ లాభమూ లేదు.అయినా సతతము అందులో నిమగ్నుడనై ఉంటాను. పనిచేయడం మానితే, సూర్యచంద్రులు గతి తప్పుతారు. నాకూ, ఇతరులకు భేదం నిరాసక్తి,ఆసక్తి. బుద్ధిమంతుడవు. నీవు పనిమానితే,అందరు మాని అస్థిరులవుతారు. కనుక పనిచెయ్యి.

సహజ ప్రవృత్తిని బట్టి ఆచరణ ఉంటుంది. "కర్తను నేను" అని అనుకున్నవాడు బుద్ధిహీనుడు. శ్వాస సహజప్రవృత్తి. కనురెప్పపై పురుగు వాలితే, రెప్పమూసుకుంటుంది. నేను ఊపిరి తీసుకున్నాను, నేను రెప్పమూశాను అని ఎవరైనాఅంటే, అర్థంలేదు. సహజంగా ప్రకృతి ననుసరించిఈపనులు జరిగినప్పుడు, ఇందులో "నేను" అనునది ఎక్కడ ఉన్నది? కనుక అన్నిపనులను నన్నుతలచి, నాకర్పించి ఊరుకుంటే సరి.దీనితో ఎన్ని కష్టాలువచ్చినా, ఏమీకాదు. అటువంటప్పుడు నిష్క్రియాపరత్వం అసహజం.పైకిపనిచేస్తున్నా అంతరాంతరాల్లో అన్నీ ఆలోచనలే, మతి భ్రష్టతయే.

"ఇంద్రియాలు తమ తమ ఆకర్షణలకులోనవుతాయి. చెవులు, ముక్కు,ఇతర ఇంద్రియాలుఇదేపనిచేయడంవల్ల మనిషి ఆకర్షణ,వికర్షణ అనే దొంగలకు వశమై, సతమతమయ్యే సమయంలో నిన్న, నేడు, రేపు గురించి ఆలోచనను త్యజించి, ఏ పనిని చేసినా "కృష్ణార్పణం" అనుకుంటేఅది స్వధర్మమవుతుంది. ఇంతకంటే మంచిగా ఉన్నాపరధర్మం భయావహం.తన విధి నిర్వహిస్తూ మరణించితే మోక్షమే.

ఇష్టాయిష్టరహితమైనదిత్యాగం అని కృష్ణుడంటే, అర్జునుడు "మనిషి, తన ఇష్టానికి విరుద్ధంగా ఇతర శక్తులకులోనై పాపం చేస్తాడా" అని అడిగాడు. కృష్ణుని జవాబు : కామక్రోధాలు, కోరిక తీరనప్పుడు, పెచ్చరిల్లి రజోగుణ ప్రాప్తినిస్తాయి. ధూళి అద్దాన్ని, ధూమం అగ్నిని కప్పినట్టు, క్రోధం జ్ఞానాన్ని మరుగుపరిచి, నిప్పులా ఆరని కోరిక మనస్సును బుద్ధిని కాల్చి ఓడించినపుడు మానవుడు ఆ దుమ్మును దులిపి, ఇంద్రియాలను జయించి, మనస్సును, బుద్ధిని, ఆత్మను ఉద్ధరించాలి. "ఇది సాధ్యమా"అనే సంశయం వద్దు. ఆత్మను వశపరచుకుంటే, అన్నీ సహజంగా సంభవిస్తాయి."

గీతా గ్రంథానికి ఈఅధ్యాయం తాళంచెవిలాంటిది. "జీవితం పరోపకారార్థమే, భోగం కోసం కాదు" అనేది దీని సారాంశం. త్యాగబుద్ధితో, బుద్ధిబలంతో, మనుసులోనిశంకలు తీరిపోతాయి. మరి సేవాధర్మ నిర్వచనం అంటే సూటిగా తెలియజేసి నిరాసక్తసేవ ఎట్టిదో తెలియజేస్తుంది. "నిజంగా కృష్ణుడు అర్జునుని బంధుసంహారం చేయమన్నాడా? అది ధర్మమా?" అనే ప్రశ్నలు

రావు. నిరాసక్తతతో, శత్రువును సంహరించే ఆయుధం నిరాసక్తత అవుతుంది. ఇందులో పూర్తి నమ్మకముండాలి. "నటన" పనికిరాదు. అదేరోజున, వేయేండ్ల తర్వాత ఈ మార్పువచ్చినా చీకు చింతాలేదు. అట్టిప్రయాసలో విజయ మూలకమైన విసయాలు ఉన్నాయి. తనను తాను మోసం చేసుకోకుండా, సత్యప్రయాసతో అందరం గమ్యం చేరితీరతాం.

★ ★ ★

# అధ్యాయం - 4

భగవానుడు అర్జునునితో అంటున్నాడు. - "నిస్వార్థకర్మయోగం అనాది సత్యం. నీ మనసులో అసహిష్ణతను పోగొట్టేందుకు ఈ సూత్రాన్ని- క్రొత్తదేమీ కాని దాన్ని - వివరిస్తున్నాను. ధర్మగ్లాని సంభవిచినప్పుడు నేను అవతరించి, మంచిని పెంచి, చెడును నాశనం చేస్తాను. నా మాయను, నన్నెరిగినవారి కిది అవగతమే. ఋజుమార్గంలో నడిచి, నన్ను చేరుతాడు. నాన్నారాధించి, నాలోవసించి, క్రోధ మోహాల నుంచి ముక్తుడై, తపస్సు, బుద్ధి గుణాలచే పునీతుడవుతాడు. ఏ విత్తువేస్తే, ఆ మొక్క మొలుస్తుంది. ప్రారబ్ధనియమం అనుల్లంఘనీయం. నేను వేర్వేరు విధులకు, వేర్వేరు నైపుణ్యతలు గలిగిన నాలుగు వర్ణాలు ఏర్పరిచాను. కాని నేను వాటి సృష్టికర్తను కాను. నాకు ఫలప్రాప్తిమీద ఆశలేదు. దైవమాయ ఎట్టిది? అన్ని పనులూ దైవన్యాయాలకు బద్ధం. కాని వాటి సృష్టికర్త ఆయన కాదు "అవును". కనుక, వాటి దోషాలు అతణ్ణి అంటవు. నిరాసక్తుడు ముక్తుడు. కార్యరాహిత్యము తప్పు అని తెలుసుకొని, కోరికలే మూలంగా గల చౌర్యాది తమోగుణకార్యాలను పరిహరించి, జ్ఞానాగ్నిలో పవిత్రుడవుతాడు. నిష్కామకర్మ చేయువాడు తృప్తిగా, స్వతంత్రంగా ఉంటాడు. ఆరోగ్యవంతుడై ఆనందంతో ఉంటాడు. "గర్వం' ' అతని దగ్గరకు రాదు. జయాపజయాల ప్రసక్తిలేదు. భగవంతుని చేతిలో కీలుబొమ్మనని భావిస్తాడు. దుఃఖం, సంతోషం, వీటికతీతుడతడు. విశ్వసేవా యజ్ఞకంకితమై, దైవ ధ్యానపరుడై, నన్ను చేరుకుంటాడు."

ఇంద్రియనిగ్రహం, దానం, ప్రాణాయామం వీటిమూలంలోవుండేది

సేవాభావం. మంచిగురువు వీటిని బోధిస్తాడు."యజ్ఞ" మందలి తత్త్వం తెలియక, "జ్ఞానం" అంటే గ్రంధాధ్యయనం మాత్రమే అనుకొని, తనలో దైవాన్ని,దైవంలో తనను దర్శించే అవకాశం పోగొట్టుకుంటాడు. దైవాజ్ఞతో పాపులను శుద్ధిచేసి, సంతోషిస్తాడు.

మూడవ, నాల్గవ, ఐదవ అధ్యాయాలను కలిపి చదవాలి. అనాసక్తియోగం నేర్చుకోవాలి. ఈ మూడధ్యాయాల అధ్యయనం దైనందిన సమస్యల సమాధానాలకు ఉపయుక్తమై, నిత్యసాధనతో అందరికీ ఉపయోగపడుతాయి. క్రోధపీడితుడైనపుడు, క్రోధశాంతి కలిగించే విధానం చెప్పి, శత్రువును నిర్జిస్తాడు. గీతాధ్యయనం చేసి, ద్వేషాన్ని, చాంచల్యాన్ని, తిండిపోతుగుణాన్ని, ఎలా నియంత్రణ చేయాలో తెలుసుకోవచ్చును.

ప్రతిరోజూ గీతాధ్యయనం చేసి, ఈ వివరాలను పరిశీలించడం మన విజయమార్గానికి సోపానం.



# అధ్యాయం 5

అర్జునుడన్నాడు : "బుద్ధి గొప్పదన్నావు కనుక 'పనిచేయుట' అనవరమని నా అభిప్రాయం. నిస్వార్థసేవ అత్యుత్తమమా? జ్ఞానమనగా వివేకప్రాప్తియా?' ' అంటే కృష్ణుడంటున్నాడు. "సన్యాసమంటే వివేకం. కర్మయోగమంటే నిస్వార్థసేవ. యోగము లేక నిస్వార్థసేవ" ఒక్కటే. మరి ఇందు ఏదిమంచిది?,, నిస్వార్థసేవయే. ద్వంద్వాలకతీతుడైనవాడు సన్న్యాసి. అజ్ఞాని వివేకాన్ని, కార్యాచరణను వేరు చేస్తాడు. సమర్థులు శృంఖలాలను త్రెంచి, వివేకిని, సేవాపరుణ్ణి ఒకటిగా చూసి తరిస్తారు. వివేకి ఇచ్ఛామాత్రంగా ఫలప్రాప్తిని చేరుకుంటాడు. పనిఅవసరంఉండదు. మిథిలలో మంటలు లేచినపుడు "జనకుడు" తన నిశ్చితాత్మతో, పనివారిని, మంటలను వశం చేసుకున్నాడు. నీళ్లకోసం పరిగెత్తితే, క్రొత్తఏముంది? రాజును రక్షించే ప్రయత్నంలో అనుయాయులు ఒకళ్ల కాళ్లింకొకరు త్రొక్కి అసలుకు మోసం తెస్తారు. ఆ స్థాయి ఎవరికీ లేదు. అది ముళ్ల కిరీటం "కర్మ" ఆచరణలో బలంపెరిగి,

తక్కువ సమయంలో ఎక్కువను సాధిస్తాడు. కదలిక ఉండదు కార్యసాధన ఉంటుంది. వానిని "కర్మవర్జితు" డనడం అన్యాయం. ఈ స్థాయి మాటలకతీతం కనుకనే నేను "కర్మయోగాన్ని" నెత్తిన పెట్టుకుంటాను. లక్షలాది, సన్యాస మార్గాన సిద్ధిపొందుతారు. అనాసక్తితో, నిరంతర కృషితో, ఇంద్రియనిగ్రహంతో నిలిచేవాడు నిజమైన సన్యాసి. ఆయన బంధాలనుండి విముక్తుడు. ఆరోగ్యవంతుడు సహజంగా పాచనక్రియ, శ్వాసక్రియ, నిష్కాసనక్రియ, ఆదిగాగల వాటిని ప్రయత్నరహితంగా జరుపుతాడు. ఆధ్యాత్మికంగా ఆరోగ్యవంతుడు కూడ అదేవిధంగా, బ్రహ్మార్పణమని భావిస్తూ, పనులను నిర్వహిస్తాడు. జల బిందువులంటని పద్మంవలె, గుణదోషాలు అంటకుండా, స్వాతిశయరహితుడై శాంతిగా ఉంటాడు. యోగి కానివాడు ఫలప్రాప్తి బద్ధుడై, కోరికలకు లొంగిపోయి ఉంటాడు. నవరంధ్రయుతమైన శరీరంతో, యోగి మనసారా అన్నీ త్యజించి, తాను చేయుట, చేయించుటకు అతీతంగా ఉంటాడు. అనాసక్తివంతుడుగాఉంటాడు, దేవుని చేతిలో యంత్రమై స్వాతిశయం, ఫలప్రాప్తి వర్జిస్తాడు. గుణదోషాల ప్రసక్తిలేదు. అజ్ఞాని గుణదోషాలను గణించి, క్రుంగి, కృశించి, దోషయుతుడౌతాడు. వివేకవంతుడు అజ్ఞానాన్ని పారద్రోలి, గుణవంతుడవుతాడు. సర్వసమభావనతో ఆవును, ఏనుగును, కుక్కను. మనిషిని ఒక్కలా చూస్తాడు. గౌరవించడు. అవమానించడు. అందరికీ న్యాయాన్నందించి ఋణ విముక్తుడవుతాడు. పరమాత్మ తత్వగ్రహణతో, మానావమానాల కతీతుడై, ఉంటాడు. ప్రాపంచిక సౌఖ్యం కోరేవాడు, తనలో శాశ్వతసౌఖ్యాన్ని, శాంతిని ఇచ్చే జల ప్రపాతాన్ని కనుక్కొని, ఇంద్రియ సుఖబాధలు వర్జించి జీవించే యోగితో పోలిస్తే ఎక్కడా నిలువడు. యోగి శంకారహితుడైన పరోపకారి. తామరాకు మీద నీటి బొట్టులా ఉంటూ, ప్రాణాయామంతో కోరిక, భయం, క్రోధం వీటిని జయిస్తాడు. నన్నే ధ్యానించి, గుర్తించి, స్నేహంతో యజ్ఞభర్తను గావించి, శాంతి పొందుతాడు.

★ ★ ★

# అధ్యాయం - 6

భగవానుడన్నాడు: స్వార్థరహిత సేవ చేయువాడు సన్యాసి, యోగి క్రియారహితుడు కాడు. చలచిత్తము పనికిరాదు. సమత్వబుద్ధితో యోగాభ్యాసం చేయువాడు కర్మ యోగి. సమబుద్ధి కలిగిన శాంతి కలదు. నిశ్చల చిత్తంతో నిష్కామ కర్మ చేయువాడు యోగి. ప్రతివ్యక్తి తన్ను తానుద్ధరించుకోవాలి. ఈశ్వరాయత్తమైన మనసు తన బంధువు. ఆత్మను వశంచేసుకొనని వానికి, ఆత్మయే శత్రువు. శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానావమానాలు వీటి కతీతుడైనవాని అంతరంగం శాంతియుతమై ఉంటుంది. స్థిరచిత్తుడైన వాడు స్వర్ణము, రాయి, మట్టి పెళ్ల వీటన్నిటి విషయంలో సమభావ యుక్తుడై ఉంటాడు. స్నేహితులు, శత్రువులు, సాధుజనులు, పాపులు అతనికి వేర్వేరుగా ఉండరు. స్థిర చిత్తయుతమైన పరమాత్మ ధ్యానం వలన యిది సాధ్యం. యోగాసనాల వలన మాత్రమే ఇది అలవడదు. బ్రహ్మచర్యాది వ్రత పాలన వల్ల యిది అందుబాటులోకి వస్తుంది. తిండిపోతుకు, ఉపవాసాలుచేయువానికి నిద్రాళువుకు, జాగరణ చేయువానికి ఫల ప్రాప్తిలేదు. సదోపవాసియై సత్త్వశుద్ధిని పొంది తామసికమైన నిద్రను వర్జించాలి. జీవితాన్ని కామవాసనారహితం చేసినవాడు గాలిలో నిశ్చలంగా వెలిగే దీపశిఖ వంటివాడు. అతనిని ప్రాపంచిక విషయాలు, స్వకీయాలోచనలు, చలింపజేయవు. సాధనవలన ఇట్టి స్థితి సమకూరుతుంది. చలచిత్త స్థిరత కలిగి నప్పుడే శాంతి దొరుకుతుంది. దీనికొరకు మనస్సును ఆత్మపై లగ్నంచేయాలి. అప్పుడు నన్ను తనలో, తన్ను నాలో గుర్తిస్తాడు. స్వ, పరకీయ తారతమ్యం సమసిపోతుంది. అన్నివేళలా నా ధ్యానం చేసే అతనికి పాపమంటదు.

దీనిని విని అర్జునుడిట్లన్నాడు: "కృష్ణా, యోగ పరిపుష్ట ఆత్మసామ్యస్థితి సాధ్యమని నాకుతోచడంలేదు." కోతివంటి మనస్సు, గాలివలె చంచలము. దానిని నిగ్రహించుటెట్లు?"

భగవానుడన్నాడు: " కష్టతరమైన ఈ పని చేయుట, సాధన, వైరాగ్యాలతో సులభమవుతుంది. కనుక మనో నిగ్రహం ప్రధానం."

అర్జును డడిగాడు : "శ్రద్ధాభక్తులుండినా, మనోనిగ్రహంలేక సిద్ధి పొందలేని వాని గతి ఏమి? ఆకాశంలోని ఛిన్నభిన్నమైన మేఘం వలె నశించునా?"

కృష్ణ భగవాను డన్నాడు: "అట్టివానికేమీ కాదు. మంచిపని చేయువానికి దుర్గతి ఎన్నడూ కలుగదు. మరణానంతరం యోగభ్రష్టుడు తన పుణ్యకర్మఫలాను భుక్తిని ఉత్తమలోకంలో అనుభవించి, సదాచార సంపన్న గృహమందు పునర్జన్మ నెత్తుతాడు. పూర్వజన్మాభ్యాస వాసనతో ముందుకుసాగి పరమపదవి నధిష్ఠిస్తాడు. ధ్యానయోగి, జ్ఞానులకంటెను, వేదవిహిత కర్మయోగుల కంటెను శ్రేష్ఠుడు. ఇట్టివారిలో గూడ నాపై శ్రద్ధా సక్తులు కలిగి, మనస్సు నాయందే లగ్నం చేసి, నన్ను కొలుచువాడు ఉత్తమోత్తముడు.

ప్రాణాయామము, యోగాసనాలు మంచివి. బ్రహ్మచర్యము ఇంకా గొప్పది. ఏకాగ్రతతో సాధనచేసి భగవానునికి చేరిక అవుతారు. యోగాసనాలు శరీరాన్ని ఆరోగ్యవంతం చేస్తాయి. శరీరం మొదటి ధర్మసాధనం. కాని సిద్ధుల ప్రాప్తికోసం మాయలు, మంత్రాలు నేర్చేందుకు యీ నిష్ఠను వాడు కోడం అపాయకరం. యీ అధ్యాయం గతమూడింటిసారం. కర్మ, జ్ఞాన, సన్యాస యోగాల సారం ఆత్మసంయమం.

★ ★ ★

# అధ్యాయం - 7

శ్రీ భగవాను డన్నాడు:- నన్నాశ్రయించి, నాయందు మనస్సులగ్నం చేసి ధ్యానం చేసేవారు సంపూర్ణంగా సంశయ రహితంగా నన్ను తెలుసుకుంటారు. దీన్ని తెలుసుకున్న తర్వాత, ఇంక తెలుసుకోవలసినదేదీ ఉండదు. కోటి కొకడు యోగి అవుతాడు. వేలాది యోగులలో ఒకడు సాధకుడౌతాడు. వారిలో ఏ ఒక్కడో నన్ను తెలుసుకుంటాడు. పృధివ్యాప్తస్తేజోవాయురాకాశాలు, మనో బుద్ధ్యహంకారాలు. గల నా అపరాప్రకృతి కంటె జీవులకు సంబంధించిన పరాప్రకృతి విశిష్టమైనది. ఈ రెంటి సంయోగమే సృష్టి. నేనే ఉత్పత్తి లయ స్థితులకు కారణాన్ని. దారంలో, పూసల వలె, ఇవన్నీ నాయందుంటాయి. జలమందు రుచి, సూర్య చంద్రుల ప్రకాశం, వేదాల ఓంకార ప్రణవం,

ఆకాశంలోని శబ్దం, నరుల పురుషకారం, భూమిలోని సుగంధం, అగ్నిలోని జ్వలనకాంతి, అంతటా వ్యాపించి యున్న ప్రాణశక్తి, తాపసుల తపశ్శక్తి, బుద్ధిమంతుల బుద్ధి, తేజోవంతుల తేజం, రాగద్వేషాల కతీతంగా ధర్మవర్తనలు బలం, ధర్మవిరుద్ధంకాని విధివిహిత కామం- సంక్షిప్తంగా సత్త్వ, రజ, స్తమోగుణ ప్రవృత్తులకు కారణం- నేనే. వీటి మాయలోపడి జనులు నన్ను గుర్తించలేరు. మూఢులు, పాపులు కలలోనైన నన్ను గుర్తించ ప్రయత్నించలేరు. నాశరహితుడను నేను. సత్కర్మలు చేయువారు నా వద్దకు చేరగలరు. ఆర్తులు బాధావిముక్తికి, అర్థం అంటే ధనాదులు పొందుటకోసం, జిజ్ఞాసువులు జ్ఞానమోక్ష ప్రాప్తికి, సాధనముగిసి అపరోక్షానుభూతిగల జీవన్ముక్తులకు నాఆరాధన ఉపయోగపడుతుంది. జ్ఞాని వీరిలో శ్రేష్ఠుడు. అనేక జన్మల సాధనతో వీరు నన్ను చేరుతారు. వాసుదేవుడునైన నన్ను తప్ప ఇక ఎవ్వరూ వీరికి గోచరించరు. కోరికలు తీరడానికి ఏ ఏ శక్తుల నాశ్రయించిననూ, వారి భక్తితో సరితూగే ప్రతిఫలాన్నందించేది నేనే. వారికదే తృప్తినిస్తుంది. బుద్ధిహీనులు, నాశరహితమైన నన్ను, తమ చక్షుకర్ణనాసికాది ఇంద్రియాల ద్వారా గ్రహించగలమనుకుంటారు. యోగ మాయా ప్రభావంచే నా పరతత్త్వాన్ని గుర్తించలేరు. పుణ్యాత్ములు ద్వంద్వ మోహవిముక్తులై నన్ను పరాబ్రహ్మగను, అధ్యాత్మ, కర్మ అధిభూత, అధిదైవ, అధియజ్ఞమూర్త్యాత్మకుడుగను తెలుసుకుంటారు. జనన మరణ జంజాటమునుంచి దూరమవుతారు. నియమిత మనస్కులై, నన్ను గూర్చిన జ్ఞానంతో, అన్య విషయాలను గురించి తలంపులేకుండా, పరమపదాన్ని పొందుతారు.

★ ★ ★

# అధ్యాయం - 8

అర్జును డన్నాడు: "బ్రహ్మ, అధ్యాత్మం, అధిభూతం, అధిదైవము, కర్మ, అధియజ్ఞం, అంటే ఏమిటి? మనోనిగ్రహం కలవారికి మరణ కాలంలో నీ గురించి కలిగే జ్ఞానంఎటువంటిది?"

భగవానుడన్నాడు: "నాశరహితం, సర్వోత్కృష్టం అయినా ఆత్మయే బ్రహ్మము. కర్తగా, భోక్తగా అందరి శరీరాలలో అధివసించే, ఆత్మయే

ఆధ్యాత్మము. కర్మ అనగా సృష్టి. నాశవంతమయిన నా శరీరమే అధిభూతం., యజ్ఞకర్మపరిపూరితమైన ఆత్మ అధియజ్ఞం. ఇవన్నీ నేను. ఇట్టి నన్ను ఏ విధంగానైనా మరణసమయంలో స్మరించి అన్నివిధాలా తన్ను విస్మరించినవాడు నాలో ఏకమౌతాడు. కావున అన్నివేళలా మనోబుద్ధులతో నన్నే స్మరించు. ఏకాగ్రతతో మనోనిగ్రహం కలుగుతుంది. అభ్యాసం ప్రధానం, చరమదశలో, మనస్సు, గగ్గోలంకాకుండా, నా సర్వజ్ఞత్వాన్ని, అనాది పురుషత్వాన్ని, సార్వభౌమత్వాన్ని, అంధకారాన్ని అంతంచేసే ప్రకాశతత్వాన్ని స్మరిస్తూ భక్తుడు భగవత్ స్థితిని పొందుతాడు. వేదాల అక్షర బ్రహ్మను ద్వంద్వాల కతీతులైన వారు చేరుకుంటారు. వీరు దేహం, మనస్సు, వాక్కులను సంయమనంతో అదుపుచేసి, ప్రాణోత్క్రమణ సమయంలో ఓంకార ప్రణవంతో నన్ను స్మరించి పరమపదాన్ని అధిరోహిస్తారు. అటుపై వారికి పుట్టుక, చావుల వీటి బాధ ఉండదు. నన్ను చేరుటయే విముక్తి, మోక్షం.

మానవులు శతవర్షమానంతో బ్రతికి వేలాది కార్యములు చేస్తారు. కాలమనంతం. వేయి యుగాలు బ్రహ్మకొక పగలు. దీనిముందు మానవుని దినకాలమానం, నూరేండ్ల బ్రతుకు ఎందుకు? ఇవి అనంత కాలంలో ఒకనీటి బొట్టు. బ్రహ్మమేలుకున్నప్పుడు, పగటిసమయంలో, సృష్టి నిద్రించినపుడు, రాత్రి సమయంలో, ప్రళయం, ఇదీ నియమం. ఈ అనంతకాలంలో ఒక్క క్షణం కూడా ఉండని మనం, భగవద్ధ్యానం చేయనినాడు, భోగాలను (క్షణికసుఖాలను) ఆశించిననాడు, అధోగతే కదా! నన్నుచేరినవాడు కాలాతీతుడు బ్రహ్మవలెనే అచ్ఛాదితుడు-బయటికి రాడు. ఇంద్రియాలకు అగ్రాహ్యుడు. పగలూ, రాత్రి ఇక్కడ ఉండవు. ద్వంధ్వాలు అసలే ఉండవు. అంతటా శాంతి, ఏకాగ్రత విశ్వవ్యాప్తమైన లోక కల్యాణభావన.

"జనవరినుండి జూలైవరకు సూర్యగతి ఉత్తరాయణం-శుక్లపక్షం ఈ సమయంలో గతించిన వారు-చరమదశలో నన్నుస్మరిస్తే, నన్నుచేరుకుంటారు! దక్షిణాయణంలో, కృష్ణ పక్షంలో మరణించినవారికి పునర్జన్మేగతి. ఉత్తరాయణం, శుక్లపక్షం స్వార్థరహితసేవా తత్వం ప్రవృత్తికి ప్రతీక అనుకుంటే దక్షిణాయన కృష్ణపక్షం స్వార్థానికి ఆలంబనం. మొదటిది వివేక యుతం, రెండోదివివేక

రహితం, మొదటి దారిని త్రొక్కేవాడు ముక్తుడు, రెండోరకం బానిస. ఇది తెలిసిన తర్వాత, రెండోమార్గాన పోయే అవివేకి ఉంటాడా? కావున విచక్షణ వినియోగించి, స్వలాభం మానుకొని, నిరాసక్తితో, పూర్తిగా నన్ను చేరుకునే ప్రయత్నం చేయండి.

★ ★ ★

# అధ్యాయం - 9

భగవాను డన్నాడు-

భక్తియోగోపదేశం కడు రహస్యం. యోగిజ్ఞానరహితుడుకాడు. మూఢభక్తుడు కాడు. వివేకముతో జ్ఞాని. భక్తిమార్గ దార్శనికుడు. ద్వేషరహితుడు. ఒక రహస్యం చెప్పనా? వివేకమంటే సంక్షేమానికి సంబంధించినది. దీనిసాధన ఎంతో సుకరం. ఇందు విశ్వాసం లేని వానికి నేను లేను. దొరకను. ప్రకటిత, అదృష్ట, విశ్వవ్యాప్తమైన నన్ను తెలుసుకోవాలంటే, అదృశ్యంగా అన్నీ పరికించే నన్ను తెలుసుకునేందుకు నా "మాయ"ను ఛేదించాలి.

"నేను వీటిలో లేను. గాలిలా సర్వవ్యాపిని. ప్రళయ సమయంలో గతించి, సృష్టి జరిగేనాడు పుడతారు. ఇదే నియమం. ఇదే న్యాయం. నాకు వీటిలో రక్తిలేదు, అయినా చేస్తాను. అయితే నిరాసక్తుడునయిననన్ను ఏవీ బంధించవు. నా ప్రకృతి ఇది. నమ్మలేనివారు అంగీకరించరు. నిష్కామకర్మ అంటే ఇదే. దీనిని గుర్తించని వారి కర్మ అంతే. అహంభావం, భేషజం, "నేను" అనేది వారిమార్గం. రాక్షస ప్రవృత్తియిదే. శాశ్వత రూపాన్ని, తత్వాన్ని ఆరాధించి నిశ్చల, నిరహంకార, నిరాసక్త భక్తితో నన్ను ఆరాధించు. సుఖపడు. "నేను ఎవరు? అనే ప్రశ్న వద్దు. నన్ను తెలిసికొనగోరిన వారి కందరికీ నేను బందీని" నా భక్తులు నావాళ్లు. అన్నీ నేనే కదా! "సర్వదేవనమస్కారఃకేశవం ప్రతిగచ్ఛతి" అంటే ఇది స్వార్థమార్గం. కావచ్చు. అయితే? -నాలుగువేదాల సారం నేను. సృష్టి, స్థితి కర్తల అధిశాసకుణ్ణి నేనే. అయినప్పుడు వారు నన్ను గుర్తించుట సాధ్యమా? కాదు. రాక్షస ప్రవృత్తికి కాదు. నిశ్చలబుద్ధి,

ధ్యానం, వీటి సహాయంతో నా శాశ్వతత్వాన్ని తెలుసుకొని, ఆరాధించిన వారూ, నావివిధరూపాల భ్రమలో నన్ను కొలిచినవారూ, నాకు ఆప్తులే.

"భోక్తనునేనే. యాగాన్ని నేనే మంత్రాన్ని నేనే. ఆహుతిని నేనే. తల్లీతండ్రీనేనే. ఋగ్యజుస్సామవేదాల ప్రణవాన్ని నేనే. ఇవన్నీ వేదాలలో ఉన్నాయి. అయితే ఆ ప్రకారం స్వర్గస్థులయినా, పునర్జన్మ తప్పదు. నన్ను కొలిచినవానికి అన్నీ లభ్యం అవుతాయి. ఇతర దేవతలను ఆరాధించినా, అది నాకే చెందుతుంది. పూర్తిగా నన్ను తెలియక, పరమపదం పొందలేరు వారి దారివేరు. నన్ను నమ్మిన వానికెప్పుడూ చీకూ, చింతాలేదు. నన్ను పూర్తిగా తెలియక, పరమపదప్రాప్తికి ఆలస్యం అవుతుంది. ఎవరిని ఎలా ఆరాధిస్తే, అదే ప్రాప్తిస్తుంది. దేవతల నారాధిస్తే, దేవలోకం (స్వర్గం), పితృదేవతలను పూజిస్తే, పితృలోకం, భూతాలను కొలిస్తే, భూతలోకం, సరియైన పద్ధతిలో నన్ను సదాస్మరిస్తూ, 'పత్రం, పుష్పం, ఫలం, తోయం అని ఏదైనా నాకు నివేదిస్తే నేనూ-భక్తులకు ప్రాప్తిస్తాను. పుణ్యంచేసినా, పాపమొనర్చినా, నాకు నివేదించు. నీ బాధ్యత అటుపై ఉండనే ఉండదు. ఫలప్రాప్తిని త్యజించిన వారికి జనన, మరణాలుండవు. నేనందరికీ ఒక్కటే. నాకు ఇష్టులు, అయిష్టులూ ఉండరు. భక్తితో నన్ను ధ్యానం చేసిన వారిలో నేనుంటాను. ఇది పక్షపాతదృష్టికాదు. పాపిఅయినా, నన్ను భక్తితో ఆరాధించువాడు ముక్తుడవుతాడు. నాదరికి చేరినంతనే, సూర్యుని ఎదుట చీకటివలె, దౌష్ట్యత నష్టమవుతుంది. కనుక నా భక్తునికి నాశనం లేదని గ్రహించు. ధర్మాత్ముడే శాంతితో ఉంటాడు. నిమ్న జాతులనబడే వాటిలో పుట్టినవారు, విద్యలు నేర్వని స్త్రీలు, వైశ్యులు, శూద్రులు నాశరణుజొచ్చి, నా వాళ్లవుతారు. పవిత్ర జీవనం గడిపే బ్రాహ్మణులు, క్షత్రియులు-వీరి మాట వేరే చెప్పనక్కరలేదు. ప్రతి భక్తుడికీ, భక్తి ఫలితం కనిపిస్తుంది. నశ్వరమైన ఈ ప్రపంచంలో జనించిన నీవు నన్ను భక్తితో ఆరాధించి, ముక్తి నందగలవు. నాపైదృష్టి నిలుపు. నన్ను ఆరాధించు. నీవన్నీ నాకు నివేదించు. నాముందు సాష్టాంగ ప్రణామం చెయ్యి. నన్నే తలుస్తూ, నిన్ను విస్మరించి, నాతో ఒకడవు అయే ప్రయత్నం చేయి. నన్ను తప్పక చేరుకుంటావు."

గమనిక: "భక్తి" అంటే "భగవదాసక్తి" అని గ్రహించాలి. ఆత్మోత్సర్గాని కిదే రాచబాట. కనుకనే "భక్తి"ని యోగాలకు తలమానికమనీ, భక్తిసాధన సులభమనీ అంటారు. భక్తి మీ మనసులో అంకితమయితే, సాధన సులభం. కనుక "దీని కొరకు జీవితాన్ని సమర్పించడం" అని కూడా అను వచ్చును. భక్తిరసమగ్నుని ఆనందం చేసేవారికి అర్థంకాదు. "కాగుతున్న నూనెలో సుధన్వుడు నవ్వుతుంటే, అర్థంకానిది. "అగ్నిపరీక్ష" సమయాన నందుడు సంతోషంతో నాట్యం చేశాడట. ఈ కథలు నిజమో, కావో మనకెందుకు? ఏదైనా సమాధి స్థాయి వంటి నిమగ్నత ఉన్నప్పుడు, అటువంటి శాంతపూరణ నిశ్చలత్వ ప్రాప్తి సంభవమన్నది నిజము. తన్నుతాను మరిచిపోవాలి. అది, దైవలగ్న మనసుకే సాధ్యం. చెరుకురసం ఉంటే, చేదైన వేపకాయల రసాన్ని ఎవరు కోరుకుంటారు? సూర్యచంద్రులున్నపుడు మిణుగురుపురుగెందుకు? తొమ్మిదవ అధ్యాయంలో భక్తిలేనిదే ఫలప్రాప్తి అసాధ్యం అని బోధిస్తాడు "నిన్ను నీవు నాకు, ఏ కోరికాలేకుండా, అర్పించుకో" అనన్యభక్తి యిదే, అని ఆఖరు శ్లోకంలో ఉన్నది.



# అధ్యాయం - 10

కృష్ణ భగవానుడన్నాడు: భక్తిహితార్థం నా మాటలు విను. దేవతలు, మహర్షులు నా ఉత్పత్తినెరగరు. నాకు ఉత్పత్తి లేదు. అన్నిటినీ నేనే సృష్టించాను. ఈ విధంగా నన్నెరిగిన వాడు బుద్ధిమంతుడు. తన ఉత్పత్తికి నన్ను కారణమని తెలుసుకున్నవాడు పాపాన్ని చేయడు. ఇది తెలియకపోవడమే అజ్ఞానం-పాపాచరణకుదారి.

సృష్టికర్తను నేను. ఆ జీవులకు, క్షమ, సత్యం, సుఃదుఃఖాలు, జనన-మరణాలు ఆదిగాగల నానావిధ భావాలు నా నుండియే ప్రాప్తిస్తాయి. మహిమాన్వితమైన నా యీ విభూతిని తెలుసుకున్నవాడు, నిశ్చలమనస్కుడై, స్వాతిశయంలేనివాడై, నన్నుపాసించి, సర్వము నాకు నివేదించి, నాగుణగానం కావిస్తూ, నా ప్రసంగంలో లీనమై సంతుష్టులై ఆనందం పొందుతారు. ఇట్టి

అనన్య మనస్కులైన తన్మయభక్తునకు నన్ను చేరుటకు తగు బుద్ధిని ప్రసాదిస్తాను.

అర్జును డన్నాడు. "నీవు పరబ్రహ్మావు పరమ పదమవు. మహర్షులందరు నిన్ను స్వయంభుపురాణ పురుషుడవు, సర్వవ్యాపివి అని ధ్యానిస్తారు. ఓ జగత్పితా! నిన్ను గూర్చి నీకే ఎరుక-వేరెవరికీ కాదు. నిన్ను నేనెట్లు గుర్తించగలను? ఏ విధంగా ధ్యానంచేయవలెను?'

పరమాత్మ అన్నాడు . నా విభూతులనంతాలు. ముఖ్యములైనవి ఇవి. సమస్త జీవులలోని ఆత్మను, ఆదిమధ్యావసానాలు లేనివాడను, ఆదిత్యులలో విష్ణువును, వెలుగునిచ్చువానిలో సూర్యుడను, మరుత్తులలో మరీచిని, తారకలలో చంద్రుడను. వేదాలలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియాలలో మనస్సును, జీవులలో చైతన్యాన్ని రుద్రలలో శంకరుడను (శివుడను), యక్ష, రాక్షసులలో కుబేరుడను, దైత్యులలో ప్రహ్లాదుడను, మృగాలలో సింహాన్ని, పక్షులలో గరుడుడను మోసకారులలో జూదాన్ని కూడా నేనే. మంచీ, చెడూ అన్నీ నా ఆదేశం ప్రకారం జరుగుతాయి. ఈ విషయాన్ని గ్రహించి, అహంభావం త్యజించి, మానవులు దుష్కర్మలు చేయుట మానాలి. వారి సత్కర్మ, దుష్కర్మలకు ఫలితమునిచ్చేది నేనే. ఈ విశ్వమంతా నాది అయినా ఒక్క అంశ అంటే చిన్నభాగం మాత్రమే.

★ ★ ★

# అధ్యాయం - 11

అర్జును డన్నాడు: కృష్ణా, ఆత్మవిద్యను బోధించి నా అజ్ఞానాన్ని పోగొట్టావు. సృష్టికారకుడవు, లయకారకుడవు, అన్నీ నీవే, నీవు శాశ్వతుడవు. వీలుంటే, నీదైవరూపాన్ని చూపించు.

ప్రభువిట్లు సెలవిచ్చాడు:- వివిధ వర్ణాలలో నారూపాలు వేలాదిగా ఉన్నాయి. ఆదిత్యులు(1), వసువులు(2) రుద్రులు(3), స్థావర జంగమ పదార్థాలు అన్నీనాలో ఉన్నాయి. కాని చర్మచక్షువుతో విశ్వరూప దర్శనం చేయలేవు కనుక దివ్యదృష్టి నిస్తాను."

సంజయుడు ధృతరాష్ట్రుడితో అన్నాడు· అర్జునునితో యిట్లని, ప్రభువు-వర్ణనాతీతం, సహస్ర సూర్యప్రకాశం, దివ్యాభరణ-దివ్యాస్త్రయుతం, అయిన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు.

పులకాంకితుడై, కైమోడ్చి, అర్జునుడు అన్నాడు· నీలో అన్నీ, అందరూ ఉన్నస్థితి పరికించాను. బ్రహ్మ, శివుడు, మునులు, సర్పములు, అసంఖ్యాకములైన ముఖాలు, చేతులు, ఆదిమధ్యావసానరహితమైన మూర్తి, జగజ్జాజ్వల్యమానమైన కాంతి, మండించే నిప్పు, అన్నీ ఉన్నాయి ఈ జగత్తుకు ఆదివి, అనంతకాలానివి, శాశ్వతనియమాల కర్తవు. చంద్ర, సూర్యులు నీ నేత్రాలు, రెండు లోకాలలో వ్యాపించిన నీ తేజస్సు విశ్వాన్ని వెలిగిస్తున్నది. ఆశ్చర్యం, ఆనందం ముప్పిరిగొనగా, దేవతలు, మునులు, సిద్ధులు, నిలిచి-చేతులు జోడించి, నిన్ను కీర్తిస్తున్నారు. ప్రజ్వలించే నీ ఉగ్రరూపం చూచి నాకు ఆరాటంకలిగి, గగ్గోలు పడుతున్నాను. నా శాంతి, ఓర్పు మాయమైనవి. ఓదేవా! ప్రసన్నుడవుకమ్ము. దయ చూపుము. వీరంతా నీ కోరలతోకూడిన భయంకరమైన నోటిలోనికి పోతున్నారు. నిప్పులో పడిన పురుగుల్లా నశిస్తున్నారు. నీ పళ్ల సందుల్లో పిండి పిండివుతున్నారు. నీ ప్రవృత్తి నాకు తెలియుటలేదు. నీవెవరవు?"

భగవానుడన్నాడు· "నేను కాల స్వరూపుడను. సంహారకారకుడను. నీవు యుద్ధం చేసినా, చేయకపోయినా ఇరుపక్షముల వీరులు నశిస్తారు. కనుక నీవు నిమిత్త మాత్రుడవు.

అర్జునడన్నాడు: ఓదేవా, విశ్వమూలమైనవాడా! నాశరహితుడవు నీవు. అస్తి, నాస్తి ఇంకా ఇతరములైన వాటికన్నిటికీ అతీతుడవు. ఆదిదేవుడవు; జగత్తుకు ఆశ్రయమునీవే; నిన్ను తప్ప వేరువారలను తెలియనక్కరలేదు. అనాది కాలానివి; వాయు, యమ, అగ్ని, ప్రజాపతి మున్నగుదేవతలంతా నీవే; నీకు వేయి నమస్కారాలు. నీ పూర్వరూపాన్ని చూపించు.

భగవానుడన్నాడు: నా విశ్వరూపాన్ని నీయందభిమానంతో చూపించాను. ఈ యోగము వేదాధ్యయనం, తపస్సు. దానం, కర్మకాండ సాయంతో సాధ్యంకాదు. అలజడిపడకు. శాంతచిత్తంతో నాయీ మామూలు రూపాన్ని

అవలోకించు. ఇతః పూర్వం నీవు చూసిన నారూపాన్ని చూడడం దేవతలకు కూడా సాధ్యంకాదు. పరిపూర్ణభక్తిపరులకే ఇది సాధ్యం నన్ను స్మరించువాడు, నన్ను తన అధిదైవతంగా ఎంచువాడు, జీవులన్నిటినీ ప్రేమించి, నిరాసక్తితో, నాదరికి చేరుతాడు.

కావాలనే ఈ అధ్యాయాన్ని నేను సంక్షిప్తం చేశాను. యిది కవితామయమైన అధ్యాయం తరుచు మూలాన్నిగాని, అనువాదాన్ని గాని చదివితే, భక్తివంటపడుతుంది. అలా జరిగినదో, లేదో తెలుసుకోడం సులభం. ఆత్మార్పణం, రాగద్వేషరాహిత్యం లేకుండా భక్తి లభించదు. ప్రళయకాలంలో అన్ని జీవాలను గ్రహించే ఆ పరమాత్మను ధ్యానిస్తే, అన్నీ సుళవవుతాయి. ఇట్టి పరిస్థితి ఏదో రోజున కలిగినప్పుడు, ద్వంద్వాలు, భేదాలు గతించి, లయకారకుడైన ఆ పరమాత్మనోటిలో నలుసులమైనాకాము అని తెలుసుకొని, మన స్వాభిమానం తగ్గించుకొని, వినమ్రులమై, "అహం" అన్నమాటలేకుండా చేసుకొని, అందరితో స్నేహం చేయడమే, భక్తి ఒంటబట్టిన దనడానికి తగిన పరీక్ష. అప్పుడు, భగవానుని భయంకర రూపం తలుచుకొని గజగజ వణకడం ఉండదు. మనశ్శాంతి శాశ్వతంగా లభ్యమవుతుంది.



# అధ్యాయం - 13

ప్రభువన్నాడు. ఈ శరీరం క్షేత్రం. దీని నెరుగువాడు క్షేత్రజ్ఞుడు. నేను క్షేత్రజ్ఞుడను. క్షేత్ర, క్షేత్రజ్ఞ జ్ఞానమే నిజమైన జ్ఞానం. పృథి వ్యాపస్తేజో, వాయురాకాశాలు, అహంకారం, బుద్ధి, రాగద్వేషాలు, సుఖదుఃఖాలు, జ్ఞాన కర్మేంద్రియాలు పది, మనస్సు, ఇంద్రియ భావాలు, వీటన్నిటి కలయిక సంఘాతం, సత్త్వము, స్థైర్యము-ఇవీ క్షేత్రం ఇవి ఎట్టివో గ్రహించి, వీటిని త్యజించాలి. వినమ్రత, దర్పరాహిత్యము, అహింస, క్షమ, సన్మార్గం, గురుశుశ్రూష, పవిత్రత, స్థైర్యము, ఆత్మనియంత్రణ, ఇంద్రియపదార్థాలయెడ విముఖత, అహంకారరాహిత్యం, జనన, మరణ, జరా, తత్త్వ జ్ఞానము, జబ్బులు- బాధలు అంటే తెలియుట, దారాసుతుల యెడ నిరాసక్తి, ఇల్లు,

వాకిలి, బంధు, మిత్రులంటే అనాసక్తి, సుఖదుఃఖాలలో సమభావము, ఏకాంత ప్రియత్వము, విషయాసక్తి లేకుండుట, ఆత్మజ్ఞాన పిపాస, వీటి సమాహారం బుద్ధి. ఇది సన్న్యాసానికి పునాది. బుద్ధిహీనత దృష్టిని మళ్లిస్తుంది. ముక్తి మార్గాన్ని మరుగుపరుస్తుంది. పరబ్రహ్మ అనాదిగా, ఎక్కడా, ఏదీ లేనప్పుడు "ఉన్నాడు" గనుక ఆదిరహితుడు. "సత్తు" (ఉన్నది)గాని, "అసత్తు" గాని (లేనిది) అవదు ఆరెంటికతీతమాశక్తి. అయితే శాశ్వతత్వం గలది గనుక దానిని "సత్తు" అనవచ్చును. మానవులు దానిని గుర్తించలేరు. కనుక అది "సత్తు" కతీతం. సర్వవ్యాపి వేయిచేతులున్నట్టు కనుపించును. కర్మేంద్రియాలు అక్కరలేదు. నశ్వరములివి. బ్రహ్మశాశ్వతము సర్వవ్యాపి, సర్వపోషకముగనుక, గుణయుక్తమనవచ్చు. కాని గుణరహితమా బ్రహ్మతత్త్వం గుణాలలో వికారాలుంటాయి- ఆ బ్రహ్మకు మార్పులు లేవు. అన్ని పదార్థాల బయటా (వాటికి అగ్రాహ్యంగా), అన్ని పదార్థాల లోనూ ఉంటూ, స్థావరమై, జంగమమై, సూక్ష్మమై, అదృశ్యమై, దూరమై, దగ్గరయై, నామరూపాలులేని ఆది బ్రహ్మమై, అన్నిటిలో ప్రసరించిన జీవశక్తియై అలరారుతూ ఉంటుంది. సృష్టి, స్థితి, లయ కారకము, చీకటికవతలనున్న ప్రకాశము. జ్ఞానానికంతము. ప్రతి మనసులోని బ్రహ్మం జ్ఞేయం. అన్ని మార్గాలు ఆ తత్త్వంలో ఏకమయేందుకే.

అదిలేనివి భగవానుడు, మాయయే. మాయా జనిత వికారాలు కర్మ కారకాలు. మాయ ప్రభావమే ఆత్మపొందే సుఖదుఃఖాలకూ, పాపపుణ్యాలకూ సంబంధించిన అనుభూతి కలిగిస్తుంది. ఈవిషయం తెలిసినవాడు వాడు నిరాసక్తితో ఉండి, పునర్జన్మక్తుడవుతాడు. ఆ పరమాత్మ విశ్వరూపాన్ని మనోనేత్రంతో సందర్శించి, ఆయన ఆజ్ఞలేనిదే ఏదీ జరగదని గుర్తించి అహంకార రహితుడై, శరీరానికతీతుడననీ, శరీరంలో వాసం చేస్తున్న ఆత్మస్వబుద్ధి గలదై సర్వవ్యాపియైన ఆకాశంలా ఉండుననీ అర్థంచేసుకొని, జీవన్ముక్తుడవుతాడు.

# అధ్యాయం - 14

కృష్ణభగవానుడన్నాడు. మహర్షులందరు అందుకున్న ఉత్తమ జ్ఞానం వారిని పరమపదానికి చేర్చింది. దీని నాశ్రయించినవారు జనన మరణ వలయానికి చిక్కరు. నేనే తల్లిని, నేనే తండ్రిని. ప్రకృతి గుణాలు సత్త్వ, గుణం రజోగుణం, తమో గుణం ఆత్మను బంధిస్తాయి. అత్యుత్తమ, మధ్యమ, అధమ స్థాయి గలవి ఇవి. సత్త్వగుణంపావనమై, సుఖాన్ని, ప్రకాశాన్ని ఇస్తుంది. రజోగుణము రాగరంజితమై దేహిని కర్మప్రవృత్తిలో బంధిస్తుంది. తమోగుణము దేహులను అజ్ఞానంతో భ్రమపెట్టి, సోమరితనం, పరాకుగలవిగా చేస్తుంది. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కగుణ ప్రభావము ఎక్కువైనందున ఆ అనుభూతులు దేహికి కలుగుతాయి. బుద్ధివలన సత్త్వగుణం పెరుగుతుంది. దురాశ, అశాంతి, భోగలాలసత రజోగుణప్రభావం. అజ్ఞానం, అలసత్వం, భ్రమ తమోగుణ లక్షణాలు. సత్త్వగుణప్రధానదేహి, మరణానంతరం, పుణ్యలోకాలకు పయనిస్తాడు. రజోప్రధానదేహి కర్మకాండలో చిక్కుకుంటాడు. తమోగుణయుతుడు, మందబుద్ధియై పుట్టుక, మరణాల వలయంలో భ్రమిస్తాడు.సత్త్వ రజస్తమో గుణదేహులు పైలోకాలకుపోయేవారు, ఈ భూమిపై నిలిచేవారు, అధోలోకగతులు అయి ఉంటారు.

వీటి కతీతుడనైన నన్ను తెలిసికొనినవాడు, నాచెంత చేరుతాడు. అతడు త్రిగుణాలను అనాసక్తితో వదలి, జననమరణాల నుండి తప్పించుకొని, వార్ధక్యబాధననుభవింపక, శాశ్వతత్వ-గుణసంబంధమైన అమృతపానం చేస్తాడు.

అర్జునుడంటాడు: "ఈ త్రిగుణాల నతిక్రమించిన వారి లక్షణాలేమిటి? ఈ గుణాలనతిక్రమించడం ఎలా?"

భగవానుడన్నాడు: సత్త్వగుణ లక్షణమగు ప్రకాశాన్ని, రజోగుణ ధర్మమగు కర్మప్రవృత్తిని, తమోగుణకార్యమైన మోహాన్ని భరించి, వాటిని పట్టించుకోకుండా, కార్యకారణత్వాన్ని దూరంచేస్తూ, మట్టిముద్ద రాయి, బంగారం, యెడల ఉన్నట్టు సుఖదుఃఖాలలో సమభావాన్ని కలిగి, దూషణ, భూషణలు-ప్రీతి,

అప్రీతులు-గౌరవము, అగౌరవము కలిగిన అన్ని సమయాల్లోనూ నిశ్చలంగా ఉంటున్న దేహి త్రిగుణాలను అతిక్రమిస్తాడు

నన్ను అనన్యభక్తితో సేవించినవాడు పూర్ణపురుషుడు. ఇది ప్రతివారికీ సాధ్యమే. కనుక చింతించకు. మూడవ అధ్యాయంలో నేను చెప్పినదిదే నీ పనులు నీవు నిష్కామ భావంతో నాపరంగా ఆచరించు. కర్మమార్గంలో శ్వాసించుట కూడ ఒక పని, ప్రతిదేహికీ ఇది నిత్యసత్యము. త్రిగుణాలనతిక్రమించు. నన్ను నమ్ముకో. చేసినపనికి ఫలితమేది అని దిగులుపడకు. అప్పుడు, అతని పనులు, అతని ప్రగతికి బాధకములుకావు. నేను శాశ్వతబ్రహ్మను, నిత్యసత్యాన్ని, ఎప్పటికీ తరగని ఆనందాన్ని.

తనను తాను "శూన్యం" అని భావించిన వాడు గుణాతీతుడై, ఎల్లెడలా, ఎల్లప్పుడు నన్నే దర్శిస్తాడు.

# అధ్యాయం - 15

భగవానుడన్నాడు: ఈ ప్రపంచం అశ్వత్థవృక్షమువంటిది. పైన వేళ్లు, క్రింద కొమ్మలు ఉన్న ఈ చెట్టుకు ఆకులే వేదాలు. ఈ వృక్షతత్త్వాన్నెరిగినవాడు వేదవిదుడు. సర్ ఎడ్విన్ ఆర్నాల్డు అన్నట్టు ఈ వైదిక వృక్షం "స్వర్గాధిరోహణ, భూతల ప్రవేశము" అనే గుణాలతో పుష్టిచెందుతుంది. విషయసుఖాలు దీని లేచిగుళ్లు. ఇంద్రియ వాసనలే ఇహలోకంలో ఆత్మను కర్మతో బంధిస్తాయి.

ఇక్కడ, దీని ఆది, అంతం, పునాది, అసలు తత్త్వం-ఏవీ బోధపడవు. అసహయోగాస్త్రంతో వ్రేళ్లూనిన ఈ వృక్షాన్ని మూలచ్ఛేదం చేయాలి. అప్పుడు ఆత్మ బంధ విముక్తిచెంది, తిరిగిరాకుండా పైనున్న లోకాలకు పోతుంది. ఏ పరమ పురుషుని నుండి జీవజాలం ప్రవాహగతితో వెలువడుతూందో, ఆ ఆదిపురుషుణ్ణి, రాగరహితుడై, సమభావంతో అర్చనచేస్తే ఆ బుద్ధిమంతుడు, చంద్రుడు కాంతి అవసరంలేని నా పరమపదాన్ని చేరుకుంటాడు.

ఇహలోకంలో ఆత్మగా మారిన నా శాశ్వతాంశం ప్రకృతిలోని ఇంద్రియతత్త్వాన్ని (మనస్సుతో సహా) గ్రహిస్తుంది. దేహంలోనికి ఆగమనం, దేహం బయటకు నిర్గమనం చేసే ఆత్మ తనతో ఇంద్రియతత్త్వాన్ని-వాయువు

తనతొ పరిమళాన్ని కొనిపోయినట్లు-తీసుకొనిపోతుంది. చెవి, కన్ను, స్పర్శ రసనేంద్రియాలు, ముక్కు, మనసు-వీటి సాయంతో ఇంద్రియ సుఖాలు అనుభవిస్తుంది. అజ్ఞానులకిది అర్థంకాదు. ద్రష్టలు బుద్ధితో దీన్ని గమనించి, తమ దేహంలో ఉన్నట్టు గుర్తించి జాగ్రత్త పడతారు. సమబుద్ధిలేని వారికిది చేతకాదు.

చంద్రునిలో, అగ్నిలో, సూర్యునిలో గలకాంతిని నేనే మృత్తికను ఆక్రమించి, జీవులను బ్రతికిస్తాను. జీవరసాన్నందించే చంద్రుడనై మొక్కలను పోషిస్తాను. దేహులందరిలో, శ్వాసతో కలిసి, జీవాగ్నినై నాలుగు రకాల ఆహారాన్ని జీర్ణం చేస్తాను. మనస్సులలో నిండి, స్మృతి-విస్మృతులను కలిగించి, వేదాల సారాన్ని అందిస్తాను. వేదవిదుణ్ణిఅయి, వేదాంతం ఉపదేశిస్తాను.

ఈ ప్రపంచంలో రెండు ప్రకృతులున్నాయి-క్షర (నశించునది) అక్షర (నశించనిది). మొదటిది ప్రపంచం, రెండవది శాశ్వతమైన నేను. వీటన్నిటినీ మించి మూడులోకాలలో వ్యాపించి, అందరికీ పుష్టినిచ్చే పరమాత్మ ఇదీ నేనే. నశ్వరం, శాశ్వతం వీటి నధిగమించిన వేదోక్త పరమసత్యాన్ని. బుద్ధిమంతుడు తెలుసుకొని, తగుజ్ఞానంతో సంపూర్ణమైన అర్పణా భావంతో ఆరాధిస్తాడు.

'పాపరహితుడవైన ఓ అర్జునా! అతి నిగూఢమైన తత్త్వాన్ని నీకు బోధించాను. దీనిని తెలిసినవాడు నిజంగా "తెలివి" కలవాడై ముక్తితీరాలకు చేరుతాడు.



# అధ్యాయం - 16

ప్రభువు అన్నాడు: "దైవాసుర ప్రకృతుల భేదం చెప్తాను. భయరాహిత్యం, పరిశుద్ధమైన మనస్సు, బుద్ధి, సమభావం, ఆత్మనిగ్రహం, దానం, త్యాగం, స్వాధ్యాయం, తపస్సు, ఋజుత్వము, అహింస, సత్యము, కోపం లేకుండుట, సన్న్యాసం, శాంతి, పరుల దోషము లెంచకుండుట, భూతదయ, దురాశ లేకుండుట, మృదుత్వం. అణకువ, చిత్త స్థైర్యం, తేజస్సు, ధైర్యం, క్షమ, బాహ్యాంతర పారిశుద్ధ్యం, ద్రోహ, దురభిమాన రాహిత్యం దైవీ గుణాలు.

మోసం, దంభం, దర్పం, క్రోధం, క్రూరత్వం, అజ్ఞానం అసురీగుణాలు.

దైవీ గుణాలు మోక్షానికి, అసురీగుణాలు బంధకత్వానికి దారితీస్తాయి. అర్జునా! నీది దైవీగుణసంపద కనుక చింతింప పనిలేదు.

ఆసురీతత్వాన్ని గురించి ఇంకా చెబుతాను. అందువలన జనులు దానిని త్యజించే వీలుకలుగుతుంది. వారికి చేయవలసినది. చేయకూడనిది అనువిచక్షణ లేదు. వారిలో సత్యం, పవిత్రత లోపించి ఉంటాయి. కనుక మంచి ప్రవర్తనకు వలసిన నియమాలు పాటించరు.

ప్రపంచం మూలరహితం, శాసన రహితం, అనిత్యం అని వారిభావన. కామవాసనతో ఇంద్రియసుఖాలను అనుభవించుటయే వారి ధ్యేయం

దుర్మార్గకృత్యాలు ఆచరించి, అల్పబుద్ధులై, ప్రపంచాన్ని నాశనం చేసే పనులకే అంకితమైన ఆలోచనలకు అంటిపెట్టుకొని ఉంటారు. వారి కోరికలకు అంతంలేదు. మోసం, దంభం, దర్పం వారినైజం. అసంఖ్యాకములైన చింతలతో సతమతమై ప్రతిరోజూ క్రొంగొత్త నీచబుద్ధులవలన ప్రేరితములైన వాసనా గ్రస్తులై, అర్నాల్డు మాటల్లో "వందలాది అసహజమైన కోరికలు, దురాశ అనే ఉచ్చులలో చిక్కుకొని" చట్టానికి వ్యతిరేకమైన రీతుల్లో ధన సంపాదనచేసి, అట్టి పాపధనంతో కోరికలు తీర్చుకునే ప్రయత్నాలకు బానిసలై జీవన్మరణం పొందుతుంటారు.

ఈ రోజు సంపాదించినది యిది. రేపు అది వస్తుంది. ఈ రోజు ఈ శత్రువుని అంతం చేశాను. రేపు తక్కిన వారిని సంహరిస్తాను. నేను బలవంతుడను. నాదగ్గర గొప్ప వస్తువులన్నీ ఉన్నాయి. నాకుసాటి ఎవరు? పేరు ప్రతిష్ఠ పెరిగేందుకు దానాలు, యజ్ఞాలు చేసి, భోగాలననుభవిస్తాను "అంటూంటారు. గెలిచామనుకుంటారు. భ్రమలో చిక్కి నరకానికిపోతారు.

ఇట్టివారు గర్విష్టులు, ఇతరులను గురించి చెడుగాచెప్పి, అందరి హృదయాలలోని ఆ పరమాత్మను నిరసిస్తారు. తిరిగి పతితుల ఇళ్లల్లో జన్మిస్తారు.

కామ, క్రోధ, లోభాలు నరకద్వారాలు. ఆత్మ వినాశహేతువులు, కనుక వాటిని వర్జించాలి. అప్పుడు ఋజుమార్గాన పయనించి, పరమ పదాన్ని చేరుకుంటారు.

శాస్త్ర విధులనుల్లంఘించి, కామవాసనకు బానిస అయినవాడు కార్యసిద్ధిని, ఇహలోక సుఖాన్ని, మోక్షాన్ని పొందలేడు.

కర్తవ్యాకర్తవ్య విమూఢత కలిగి నపుడు, బుద్ధిమంతులసలహా, శాస్త్రవిధి ప్రమాణము ననుసరించి పోవుట న్యాయమైన, సరియైన పని.

★ ★ ★

# అధ్యాయం - 17

అర్జునుడన్నాడు: "శాస్త్రవిధులననుసరింపక పోయినను శ్రద్ధతో సేవించువారి గతి ఏమి?"

భగవానుడన్నాడు: సాత్విక, రాజస, తామసములని శ్రద్ధ మూడు విధాలు, అతని శ్రద్ధ స్వభావానుగుణ్యమై ఉంటుంది. సాత్వికులు దేవతలను, రాజసులు యక్షరాక్షసులను, తామసులు భూతప్రేతాదులను ఆరాధిస్తారు.

అతని శ్రద్ధను అషామాషీగా కాకుండా, అతడు తిను ఆహారాన్ని బట్టి, తపస్సును బట్టి, త్యాగదానాలను బట్టి నిర్ణయించాలి.

ఆయుస్సును, తేజస్సును, మనస్సును, దేహబలాన్ని, ఆరోగ్యాన్ని పెంచేది సాత్వికాహారము. అమితముగా ఉప్పు, పులుపు, కారం కలిగి, చేదుగా ఉష్ణంగా విదాహంగానున్న ఆహారం రాజ- రోగాలు, నొప్పులూ, బాధలూ కలుగచేసే తత్వం గలది. పాసిపోయినది, చెడువాసనగలది, ఎంగిలి అయినది తామసాహారం.

ఫలాపేక్ష లేకుండా, విధిగా, శ్రద్ధగా చేసిన యజ్ఞం సాత్వికం. ఫలాపేక్షతో, ప్రదర్శనగాచేసినది రాజసం. శాస్త్రవిధులను పాటించక, దానధర్మాలు లేనిది తామసం.

జ్ఞానుల పూజ, శౌచము, బ్రహ్మచర్యం, అహింస శరీర సంబంధమైన కాయకతపస్సు. సత్యం, హితకరం, సంతోషప్రదం అయిన మాటలు వాచికతపస్సు. పవిత్ర భావాలు, ప్రసన్నత, మృదుత్వం, నెమ్మది, ఆత్మ నిగ్రహం, ఉద్దేశ్యపవిత్రత మానసిక తపస్సు. ఈ మూడింటిని సమన్వయపరచి, నిష్కామంగా, చేసినది సాత్వికము. ఆడంబరంగా, పేరుకోసం చేసినది

రాజసం. తన్నుతాను హింసించుకొని, ఇతరులను బాధించి చేయునది తామసం, బుద్ధిహీనుల ప్రవృత్తి.

దేశ, కాల, పాత్రానుగుణ్యంగా, తగిన వారికి, సద్బుద్ధితో ప్రతిఫలాపేక్ష రహితంగా ఇచ్చు మంచిదానం సాత్త్వికం. బాధపడుతూ, మనకు దీని వల్ల ప్రతిఫలమేది అనుకుంటూ చేసే దానం రాజసం. అవమాన పూర్వకంగా, నీచబుద్ధితో దేశకాలాలకు తగని అపాత్రదానం తామసం.

వేదాల్లో బ్రహ్మను "ఓంతత్ సత్" అనే శబ్దాలతో నిర్దేశిస్తారు. శ్రద్ధాన్వితులు తపో, దాన, యజ్ఞాలకు ముందు "ఓం" అంటారు. "తత్" అంటే "అది' ' (బ్రహ్మ), "సత్" అంటే సత్యం (ఉత్తమమైన, ఉపయోగకరమైన పని); భగవాను డొక్కడు, ఏకాకి అతడు, సత్యమే అతడు, విశ్వపోషకుడతడు. విశ్వోద్ధారకుడతడు. తపో, దాన, యజ్ఞాలను నిర్మమత్వభావనతో చేయుట సాత్త్విక శ్రద్ధ తెలిసియో, తెలియకనో, శాస్త్రోక్తవిధికి భిన్నంగా చేసినా, శ్రద్ధాపరమైనది దోషరహితం. తద్భిన్నమైనది "అసత్"-దోషభూయిష్ఠం. "సత్" -స్థిరనిష్ఠాప్రధానం.



# అధ్యాయం - 18

గడిచిన అధ్యాయాల సారం దొరికినా, అర్జునుని మనసులో ఒక అనుమానం ఉండిపోయింది. అన్నాడు; "గీతలో సన్న్యాసానికి, అందరూ అనుకునే త్యాగానికి భేదం ఉన్నదా?"

దీనికి జవాబుగా గీతాసారాన్ని కుదించి భగవాను డన్నాడు: కొన్ని కోరికలు తీరేందుకు కొన్ని కర్మలను చేస్తున్నారు- వీటిని కామ్యకర్మ లంటారు. శ్వాసప్రక్రియ, తినుట, త్రాగుట, శయనించుట, ఉపవసించుట మున్నగునవి దేహాన్ని ఆరోగ్యవంతంచేసి కర్మకనుగుణంగా ఉంచేందుకు ఉద్దేశింపబడినవి. పరులసేవకొరకే కొన్ని చేసేవి. కామ్యకర్మలను వర్జించుట "సన్న్యాసం". అన్నిరకాల ఫలాపేక్షను వర్జించుట "త్యాగం" త్యాగమే సర్వదా కర్తవ్యం.

ప్రతి కర్మలోనూ చెడు కొద్దో, గొప్పో ఉండి తీరుతుందని కొందరంటారు.

అయినా, పరులసేవ నిమిత్తం చేసే "యజ్ఞా" లను చేస్తూనే ఉండాలి. దానం, తపస్సు యజ్ఞంలోని అంశాలే. అయితే "అనాసక్తి" యుతం కావాలి. లేనిచో "చెడు" తో మిళితం కావచ్చు.

చేయవలసిన విధుల గురించి తెలియక ప్రభవించిన "త్యాగ" నిరతి తామస ప్రేరితం. శరీరానికి కష్టం కలుగుతుందని కర్మను వర్జించడం రాజసం. దీనిని పరోపకారార్థం చేసి తీరాలి, అనే దృఢబుద్ధితో నిరాసక్తంగా చేసే సేవ "సాత్త్విక త్యాగం" ఈ త్యాగంలో ఫలాపేక్షను వదలడమేగాని, ఏ ఇతర త్యాగాలు లేవు- కామ్య కర్మలను తప్ప. బుద్ధిమంతుడిట్లు నిస్వార్థంగా కర్మచేసినపుడు అన్ని అనుమానాలు పటాపంచలై, అతని ఆశయాలు పవిత్రమై ఉంటాయి. తన సుఖం, కష్టం గురించిన యోచన అతనికి రానే రాదు.

ఫలాపేక్షను వదలనివాడు, వాటిననుభవించడం, తత్సంబంధమైన సహజంగా తోడుగా ఉండే విషయాలను పేర్కొని, సర్వకాలాలకు కట్టుబానిస అవుతాడు. ఫలాపేక్ష త్యజించిన వానికి స్వేచ్ఛ (ముక్తి) లభిస్తుంది.

ఎందుకట ఫలాపేక్ష? తాను కర్తయా? కర్మాచరణకు ఆధారం శరీరం, కర్త (జీవుడు), ఇందుకు కావలసిన పరికరాలు, వివిధ ప్రయత్నాలు, అన్నిటికంటే ముఖ్యం దైవము (విధి).

దీనిని తెలుసుకొని, మానవుడు దంభాన్ని త్యజించాలి. అహంకారరహితుడై చేసినవాడు, కర్మబద్ధుడు కాడు కనుక. చేసినా చేయనట్టే, తన్నుతాను "శూన్యం" అనుకొన్నవాడు, చంపినా, చంపనట్లే లెక్క. అయితే చంపవచ్చునని కాదు. అతడు చేసిన కర్మలో హింసకు తావులేదు. కర్మకు ప్రాభవాలు మూడు- జ్ఞానము, కర్మము, కర్త, కర్మాచరణకు బాహ్యాక్రియా రూపాలు కారణం కర్మ, కర్త, కర్మాచరణకు మానసిక ప్రేరణ జ్ఞానము, దేనిని చేయాలో అది జ్ఞేయము. దానిని తెలిసినవాడు జ్ఞాత. మానసిక ప్రేరేపణ వలన, ఇంద్రియాల సహాయంతో పని జరిగింది. ఈ విధంగా ఆలోచన

క్రియారూపాన్ని ధరించింది. ఎడ్విన్ ఆర్నాల్డు మాటల్లో "అన్ని జీవితాలలో మారని ఒకే జీవితాన్ని మనిషికి చూపగలిగేది" ఈ ప్రక్రియ. భౌతికంగా భిన్నమైన అన్ని విషయాలలో మౌలిక ఏకత్వాన్ని గుర్తించుట సాత్త్విక బుద్ధి. వేరు జీవాలలో వేరు ఆత్మలున్నాయని అనుకోడం రాజసబుద్ధి. ఏదీ, ఎక్కడా సరిగా లేదు అంతా గజిబిజిగా కలగూరగంపగా ఉన్నదని భావించడం తామస సంప్రదాయం.

కర్మాచరణలో ఇషాయిష్టాలు, స్వలాభరాహిత్యం సాత్త్వికం. అనుభూతిపై ఆసక్తి, అహంకారం, అలజడి రాజసకర్మాచరణ. భ్రమతో, ఎవ్వరికి ఏ హానిజరిగినా పట్టించుకోని తత్త్వం తామసం.

అనాసక్తితో, అహంభావరహితంగా, దృఢచిత్తంతో జయాపజయాలతో నిమిత్తం లేనివాడు సాత్త్విక కార్యకర్త. ఫలాపేక్షతో, దురాశతో, హింసతో నిండిన ఆవేశపరుడు రాజస కార్యకర్త (ఎడ్విన్ ఆర్నాల్డు మాటల్లో- సుఖదుఃఖాల ఒడుదుడుకులకు బానిస). నియమరహితుడై, మొండితనంగా, బద్ధకంగా, కుత్సితంగా వ్యవహరించువాడు తామస కార్యకర్త-ఇతడికి ఆత్మ సంస్కృతి అంటే అర్థం తెలియదు. బుద్ధి, దృఢచిత్తం, సంతోషం మూడు విధాలు. కర్మాచరణ, కర్మరాహిత్యం తెలుసుకున్నది సాత్త్విక బుద్ధి, ఎడ్విన్ ఆర్నాల్డు మాటల్లో "చేయదగినది, చేయదగనిది భయపడతగినది, భయపడతగనిది, బంధించునది, ఆత్మకు ముక్తినిచ్చునది-సాత్త్విక బుద్ధి. రాజస బుద్ధికి ఈ విషయ వివేచన తెలిసినా, సరిగా చేయడం రాదు. తామసానికి "విపరీత బుద్ధి". అది సరియగుదానిని, సరికానిదిగా సంభావించి సత్యరహితమై ఉంటుంది.

అనుకున్నది సాధించడం దృఢత్వం. అన్నిటిలో ఇది సమజగుణం. లేనిచో ప్రపంచం ఒక్కక్షణమైనా బ్రతికి బట్టకట్టదు. మనోవాక్కాయ కర్మల సమన్వయం సాత్త్వికం. ప్రాణేంద్రియాల సమతౌల్యం ప్రధానం. రాజసంలో దృఢత్వం, భోగం, ధనం స్వార్థాభివృద్ధిముఖ్యం. తామసంలో "మొండితనం" "పట్టుదల" గట్టివి.

"అజ్ఞాని స్తబ్ధతకు, భయదుఃఖాలకు దంభానికి దయాభిక్షకు" అంటుకొని ఉంటాడు (ఎడ్విన్ ఆర్నాల్డు) సాత్త్విక ఆనందం "శాశ్వతం, బాధాముక్తం, ఆత్మకు ఆరంభంలో విషంలా చేదైనా, చివరకు అమృతా స్వాదన అనుభూతినిస్తుంది." (ఎడ్విన్ ఆర్నాల్డు) రాజసానందం ఆత్మజ్ఞానోత్పత్తి.

"ఇంద్రియభోగంలా మొదట్లో అమృతంలా తీయనై, చివరికి విషమౌతుంది" (ఎడ్విన్ ఆర్నాల్డు) తామసానందం.

"అలసత్వం, నిద్ర అవివేకజనితం" (ఎడ్విన్ ఆర్నాల్డు) అన్ని విషయాలకు ఈ త్రిగుణసూత్రం వర్తిస్తుంది.

నాలుగు వర్ణాల వారికి, వారి నైసర్గికగుణాలను బట్టి, వారివారి విధులేర్పరచడం జరిగింది.

బ్రాహ్మణునికి - "శాంతి, యమనియమాలు, తపస్సు పవిత్రత, క్షమ, ఋజువర్తనము, బుద్ధి, అనుభవము, దేవుని యందలి భక్తి విశ్వాసాలు" ఆధారంగా విధులేర్పడినవి.

క్షత్రియునికి - "పరాక్రమము, ప్రకాశము, దృఢత్వము, కార్యదక్షత, రణస్థైర్యము, దానము, నేతృత్వము" ఆధారంగా విధులేర్పడినవి.

వైశ్యుని పని -వ్యవసాయం, వాణిజ్యం, పశుపాలన (ఎడ్విన్ ఆర్నాల్డు).

సేవారూప కర్మ శూద్రునికి విధింపబడినది. వీరిలో ఒక వర్గపు వ్యక్తిలో ఇంకోవర్గపు విధులు లేవని కాదు. అవి వారి వర్ణమును గుర్తించే బండగుర్తులు. ఇవి అభ్యసింపబడినప్పుడు, ఎవరి విధులలో వారు నేర్పరులు అయినప్పుడు, అనారోగ్యకరమైన స్పర్ధ, ద్వేషం ఉండదు. వీరు ఉన్నతులు, వీరు తక్కువ వారు అను భావనలేనేలేదు. ఎంత విలువలేని దనిపించినను, ఎవరి ధర్మమును వారు చేయుట శ్రేష్ఠము. స్వాభావిక కర్మాచరణ స్వార్థరహితమగుట వలన పుణ్యమే అగును. ఇంకొక పని చేయుట అనేది స్వార్థయుక్తం కనుక పాప మయం. ఇకపోతే అగ్ని పొగ క్రమ్మినట్టు సర్వకర్మలు ఏదేని దోషయుతములై ఉండవచ్చును. పొగలేని నిప్పుండదు.

కళంకములేని కర్మ ఉండదు. స్వధర్మం ఫలాపేక్షరహితం గనుక హితకరమైన బాధ, బంధన రహితమై ఉంటుంది.

స్వధర్మాచరణతో పునీతుడైన యోగి మనోనిగ్రహం కలిగి, ఇంద్రియ భోగాలను పరిహరించి, ఇష్టాయిష్టాలను అధిగమించి, ఏకాగ్రతతో; అంతర్ముఖుడై, ఏకాంతవాసియై మనోవాక్కాయకర్మలను అదుపుచేసి, ధ్యానమగ్నుడై అహంకారం, మమకారం, కామం, క్రోధం, భోగ్యవస్తు పరిగ్రహం వీటన్నిటినీ త్యజించి పరబ్రహ్మస్థితికి చేరుకుంటాడు. సమబుద్ధితో, సంతోష-దుఃఖ రహితంగా, ఉంటూ భగవంతుని తెలుసుకొని యున్న భక్తుడై, ఆయనలో ఐక్యమవుతాడు. పరమపదాన్ని చేరుకుంటాడు.

కనుక, నీవన్నీ నాకర్పించు. నీకు అత్యంతప్రీతికరమైన వానినిగా నన్నుతలచుకో ఏకాగ్రతతో నన్నుపాసించు. దీనితో నీ కష్టాలు గట్టెక్కుతాయి. దర్పంతో నా మాటను తృణీకరిస్తే, నాశనమైపోతావు. ద్వంద్వాలకతీతంగా ఉండడం ముఖ్యం-నన్నే ఆశ్రయించు-పాపంనుండి ముక్తి పొందుతావు.

భక్తిహీనునకు, తపస్సు చేయనివానికి, నాయందు వైముఖ్యంతో, శ్రద్ధలేనివానికి ఈ ఉపదేశము చేయవద్దు. దీనిని నా భక్తులకు బోధించువాడు, నాపూర్ణ భక్తుడై నన్నే చేరుట నిస్సంశయము.

కృష్ణార్జున సంవాదాన్ని ధృతరాష్ట్రునికి వినిపించిన సంజయుడన్నాడు: యోగేశ్వరుడగు కృష్ణుడు, ధనుర్ధారి అర్జునుడును ఎచ్చట నుందురో, అచట జయం, సిరిసంపదలు, ఆనందం, మౌలికమైన నీతివర్తనము నెలకొని ఉంటాయి."

ఆధ్యాత్మికానుభూతి పరంగా పూర్ణజ్ఞానానికి ప్రతీక యోగేశ్వరుడు కృష్ణుడు. అట్టి సంపూర్ణజ్ఞానానికి అనుగుణ్యంగా జరిగే కర్మాచరణతో ఉన్నత నైతికతకు బద్ధమైయున్న ఏ అభిలాషనైనా తీర్చే సామర్ధ్యానికి ప్రతీక ధనుర్ధారి అర్జునుడు.

## అనువాదకుని గమనికలు

# అధ్యాయం - 12

గీతాపారాయణం చేసిన మాత్రాన, (వారిని నేను మనంఃపూర్వకంగా గౌరవించినా) అది చాలదు. అది గీతారహస్యం గీతోపదేశం వీటి అవగాహనకు ఉపకరిస్తుంది. ఓపికతో, చిలుకచేతకూడ, పారాయణ చేయించవచ్చును. ఏమి లాభం? గీతాభక్తుడు, గీతారచయిత యొక్క మనోభావనప్రకారం, యోగి అవ్వాలి. మనో, వాక్కర్మల సమన్వయ సాధన అభిలషితం, చెప్పేది, చేసేది, వీటికీ ఆలోచనకూ పొంతనలేని వాడు అకృతమాడు వాడు, మోసకారి. (మో. క. గాంధీ: హిందూ ధర్మం, నవజీవన్, 1950, పుట 170-1).

"భక్తి పొల్లుమాటకాదు; మరణంతో ముష్టియుద్ధం.

"అది వట్టి ఊక దంపుడు కాదు. పొంగు కాదు. మనోబలంలేని వట్టి ఆడంబరంకాదు; అంధవిశ్వాసం అసలే కాదు. బాహ్యావిషయాలతో దీనికి సంబంధంలేదు. భక్తుడు, తన కిష్టమైనట్టు, తావళాలు వేసుకోవచ్చు నుదుట విభూతిరేఖలు దిద్దుకోవచ్చు, నివేదనలూ, నైవేద్యాలూ సమర్పించవచ్చు. కాని ఇవి అతని భక్తికి సాక్ష్యాలుకానేరవు...

"భక్తి అంటే సామాన్యంగా అందరూ మెత్తటి మనస్సు, నామస్మరణ పూసల లెక్కింపు మొదలైనవి అనీ, ప్రాణప్రదమైన పనులను కూడ తృణీకరిస్తూ ఉండడం అని అనుకుంటారు-వీటివలన పూసలలెక్కింపు చెదరిపోతుందిట! ఈ భక్తుడు తన తావళాన్ని ఆహారం, నీరు తీసుకునేటప్పుడు మాత్రమే దూరంగా ఉంచుతాడు. పిండి విసరడం, రోగులకు మందివ్వడం మొదలైన (ప్రాణోద్ధారకమైన) పనులు చేస్తున్నప్పుడు మాత్రం దూరంగా ఉంచడు.

"కాని, గీతావాక్యమిది-"సరియైన కర్మాచరణ లేకుండా గమ్యం చేరలేడు"- (ఇదే గ్రంథంలో 160-1 పుటలో 9,10,13 పేరాలు)

బృందావనంలో టైఫాయిడుతో మరణోన్ముఖుడైన ఒక వైష్ణవుని, శ్రీకృష్ణప్రేమ్ చూచారు. అనేకమంది వైష్ణవులు చేతుల్లో తావళాలుపట్టుకు తిరుగుతున్నారు. ఎవ్వరూ రోగికి మంచి నీళ్లయినా యివ్వలేదు. ఇటువంటి భక్తికి విలువ ఏముంది? అని ఆయన అడిగాడు. (సత్యాన్వేషణ-పుట26-చూడుడు)

★ ★ ★

## అధ్యాయం - 1

"దుర్యోధనాదులు నీచప్రకృతి గల మానవులు, అర్జునాదులు ఉన్నత ప్రకృతి గలవారు. యుద్ధక్షేత్రము మన దేహమే. రెండు పక్షాలకు నిరంతర యుద్ధం జరుగుతూ వుంటుంది. లోపల కృష్ణుడుంటున్నాడు. పవిత్ర హృదయంతో నిశ్శబ్దంగా ఉపదేశిస్తున్నాడు. గడియారానికి "కీ" ఇచ్చినట్టే, హృదయానికి పవిత్రత అనే "కీ" యివ్వాలి. లేకపోతే లోపాలున్న హృదయవాసి మాట్లాడడం మానివేస్తాడు... (ఇదే గ్రంథంలో పు.156).

★ ★ ★

## అధ్యాయం - 2

"ఆంగ్లమిత్రులు నాచేత గీతను చదివింపజేశారు. సర్ ఎడ్విన్ ఆర్నాల్డు గారి అత్యుత్తమమైన అర్థవంతమైన అనువాదాన్ని నాముందుంచారు." గ్రంథాన్ని ఆసక్తితో పఠించి, అందలి విషయాస్వాదనతో దిమ్మెర పోయాను. రెండవ అధ్యాయంలో చివరి 19 శ్లోకాలు నా హృదయ ఫలకం మీద అప్పటినుండి లిఖింపబడి ఉన్నాయి. నాకు కావలసిన జ్ఞానమంతా వాటిలో ఉన్నది. అందలి ఉపదేశాలు "నిత్య సత్యాలు"..

ఆశ్లోకాలు గీతాధ్యయనానికి జీవగర్ర (ఈ గ్రంథమే-పుట 152).

రెండవ అధ్యాయంలో, నిశ్చలమనస్సును గురించి, సంతులత్వాన్ని గురించి, సమభావనను గురించి, కృష్ణుని ఉపదేశం సవివరంగా ఉంది. చివరి 19 శ్లోకాలలో ఈ విధి విపులంగా చెప్పడం జరిగింది. రాగమయమైన, వాసనాయుతమైన కోరికలను నిర్జీవపరిస్తే, నిశ్చలమనస్థితి కలుగుతుంది అని

వారి సందేశం. ఆవేశాలను, కామవాసనలను, సంహరించిననాడు, నీ సోదరుని చంపలేవు (ఇదే గ్రంథంలో, పుట 179).

"నిరాసక్తితో కర్మాచరణ వలన మనశ్శాంతి కలుగుతుందని గీతయొక్క ఉపదేశ సారాంశమని నేను నిరూపించడానికి పాటు పడ్డాను. రెండవ అధ్యాయంలో గీతోపదేశసారాంశము, మూడవదానిలో దానిని సాధించేమార్గము వివరింపబడినవి. తక్కిన అధ్యాయాలు తక్కువకాదు. ప్రతి అధ్యాయంలో ఏదో ఒక విశిష్టత ఉన్నది.

"గీతా జయంత్యుత్సవాల్లో పాల్గొనువారు. తగిన భావనతో, ఆ గీతోద్దేశాన్ని అమలు చేసే ఆశయంతో ఉంటారని తలుస్తాను. (పుట 182).

గీతా సిద్ధాంతాన్ని గురించిన చక్కటి వ్యాఖ్య నవంబరు 17వ తేదీ, 1956 నాటి "ది టైమ్సు" పత్రికలో ప్రచురితమైంది. ట్రినిటీ తరువాత 25-వ ఆదివారం ప్రార్థనా బృందం "సత్కర్మఫలితాన్ని" తెచ్చువారు "భగవంతునిచే పుంస్కృతులౌతారు"- ఇందులో నైతికత, మత ధర్మం మధ్య భేదాభిప్రాయం ఉన్నట్లున్నది. నైతికత సత్కర్మలకు పురస్కారమిచ్చుటను అంగీకరించదు. "విధి-విధికొరకే" అని దాని ఆదర్శం. మతధర్మం వాదన ఇది. భగవంతుడు- మంచీ చెడుల మధ్య తారతమ్యం చూపి, మొదటిదానిని పెంచి, రెండవ దానిని త్రుంచాలి-అందరికీ అర్థమయేందుకు దీనిని పురస్కారం, శిక్ష అంటారు.

"ఏసుక్రీస్తు - "విశ్వమంతాపొంది, తన ఆత్మను పోగొట్టుకుంటే లాభమేమి?' అని అడిగాడు. అయితే ఆయన జీవితం స్వార్థరహిత భగవత్సేవను అమూల్యమని భావించుటకు తార్కాణం. మిత్రులద్రోహచింత, శత్రువుల చేతిలో మృతి గురించి అవగతమయినప్పుడు కూడా, ఆయన తన విశ్వాసాన్ని సడలించలేదు. భగవద్భక్తి, మానవసేవ ఈ రెండిటికీ పురస్కారమనేది ఈ లోకంలో అందరికీ అర్థమయే రీతిగా అందరిమన్ననగా లేక వస్తురూపేణా ఉండదు. ఈ సత్యానికి ఋజువు వేరెక్కడవున్నదో ఎవరికీ తెలియదు "సిలువ".

మరి ఏ బహుమతిని గురించి ప్రార్థనా పరుల సమూహం ప్రస్తావించింది? దీనికి జవాబు ఈ వాక్యంలో ఉన్నది: పవిత్రహృదయులు అదృష్టవంతులు. వారు భగవానుని చూడగలరు. సేవకు పురస్కారము ఆ పద్ధతిలోనిదే అయి ఉంటుంది. చర్మ చక్షువులకు ధన ధాన్యవసు రూపాలలోగాని, పేరు ప్రతిష్ఠలలో గాని ఆ సేవామూల్యానికి లెక్కగట్టి కనబడదు. భగవధ్యానము, ఆత్మసమర్పణ ఆయన దరిచేరేందుకు ప్రవేశపత్రం అవుతుంది. ఆయన సాంగత్యం, ఆయన విధి విధానాల అవగాహన లభ్యమవుతుంది. దేవుడంటే ప్రేమ సారూప్యాన్నిస్తుంది. దైవ దర్శనము, ఆ జీవిని ఉన్నతుని గావించి, ఆయనతో భగవంతుని లీలలో సహకరించి పని చేశానని సంతోషాన్నిచ్చి తరింపచేస్తుంది. ఇవీ భగవానుడు తన సేవకులకు యిచ్చే పురస్కారాలు.

"ఇంతేకాదు. జీవికి ఆత్మిక పురస్కారాలు, ఆధ్యాత్మికాలు అయినా, మంచినడవడి, ఋజు మార్గము భౌతికంగా కొన్ని సౌలభ్యాలను కలిగిస్తాయి. పూర్తిగా నమ్మదగినవాడు, త్యాగి అని పేరుపడిన నాయకుని ప్రజలంతా గుర్తించి తమ నాయుకునిగా చేసుకుంటారు. అధికారం, పదవీ కట్టబెడతారు. వాటిని నీచబుద్ధులున్న వానికివ్వరు. న్యాయవంతుడై, వ్యాపారం వ్యవహారాల సందర్భంలో పూర్ణ విశ్వాసం కలుగుజేసినవానికి లాభం, పేరు ప్రతిష్టలూ లభిస్తాయి. సద్యోలాభాన్ని ఆశించిన వానికివి అందుబాటులో నుండవు.

"ఋజువర్తనం ఉత్తమ పద్ధతి" అను కొలబద్ద అపాయకరమైనది. ఋజువర్తన లాభాల నిస్తుందని, ఋజువుగా మెలిగేవాడు, నష్టాల సందర్భంలో ఆ దారిని వదిలే ఆస్కారం ఉంది. ఇది ఏమి విడంబన! సద్గుణాన్ని ఫలాపేక్షారహితంగా దానికొరకే నిర్వహిస్తే, పేరు ప్రతిష్ఠలు లభిస్తాయి. పెరుగుతాయి. దానినే పేరు ప్రతిష్ఠల కోసం అవలంభిస్తే, అవి లభ్యంకావు. నైతిక ధర్మం స్వార్థపరంగా వాడితే, నష్టమవుతుంది. పురస్కారాన్ని దేవుడు లాభనష్టాల మాట ఆలోచించని వానికి అందజేస్తాడు.

"ఇదే వింత అనుభూతి ఏసుక్రీస్తు మాటలలో ఉంది-తన జీవితాన్ని రక్షించుకోవాలనుకొనిన వాడు దాన్ని పోగొట్టుకుంటాడు. దానిని

పోగొట్టుకునేందుకు సిద్ధమైనవాడు దానిని సురక్షితమై ఉండగా చూస్తాడు- అందుకనే, స్వలాభాపేక్ష, పురస్కారమందాశలేనివాడు దైవసేవ పురస్కారాలనందుకుంటాడు. సత్యసంధులు, ఋజు వర్తనులు దేవుని కొలిచేందుకు ఎంపిక అవుతారు. ఆ కార్యాచరణ వలన కలిగే లాభంగురించి వారికి స్పృహ ఉండదు. ఇగ్నేషియస్ లయోలా మాటల్లో "వారు కష్టపడతారు ప్రతిఫలం కోరరు-వారికి తాము దేవుని కిష్టమైన దానిని గావించి ఆయన శాసనాన్ని శిరోధార్యంగా అనుసరిస్తున్నామనే విషయం పూర్తిగా తెలుసు.

★ ★ ★

## ఉపయోగపడిన గ్రంథాల పట్టిక


మో.క.గాంధీ: *ది గాస్పెల్ ఆఫ్ సెల్ఫ్‌లెస్ యాక్షన్* (నవజీవన్)

ఎడ్విన్ ఆర్నాల్డు: *ది సాంగ్ సెలెస్టియల్* (కితాబిస్తాన్)

ఆనీబిసెంటు : *ది భగవద్గీత* (నటేశన్)

స్వామిప్రభవానంద్ మరియు క్రిష్టఫర్ ఇషర్‌వుడ్ : *ది సాంగ్ ఆఫ్ గాడ్ : భగవద్గీత* (మెంటార్ బుక్స్)

యస్. రాధాకృష్ణన్: *ది భగవద్గీత* (జార్జి ఎల్విన్ అండ్ అన్విన్)

శ్రీకృష్ణ ప్రేమ్ : *ది యోగ ఆఫ్ ది భగవద్గీత* (వాట్కిన్స్)

ఆర్.సి. జహ్నార్: *అట్ సండ్రీ టైమ్స్* (ఫేబర్ అండ్ ఫేబర్)

# నిర్మాణ కార్యక్రమాలు

(వాటి అర్థం - వాటి స్థానం)

తెలుగు సేత

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ప్రస్తావన

1941లో నేను మొదటిసారి వ్రాసిన "నిర్మాణ కార్యక్రమాలు, వాటి అర్థం వాటి స్థానం" అను రచనను పూర్తిగా సవరించి తయారుచేసిన కృతి యిది. ఇందు చేర్చబడిన విషయాలు క్రమంలో లేవని చెప్పవచ్చు. పూర్ణ స్వరాజ్య ప్రాప్తికి తోడ్పడు మరికొన్ని విషయాలు యిందు చోటు చేసుకోకపోతే, ఆ విధంగా కావాలని జరగలేదన్న విషయం అందరూ గ్రహించాలి. పాఠకులు అట్టి విషయాలను క్రమంలో చేర్చుకొని నాకు తెలియజేయవచ్చు. నేను రూపొందించిన విసయసూచిక సంపూర్ణమైనదని నిర్ధారణకు రానవసరం లేదు. ఇందు ఎన్నో క్రొత్త విషయాలు చేర్చబడని విషయం పాఠకులు గ్రహింతురుగాక.

వారు కార్యకర్తలైనా, కాకపోయినా, వాలంటీర్లు అయినా కాకపోయినా, యీ నిర్మాణ కార్యక్రమాలు సమర్థవంతమైన పూర్ణ స్వరాజ్యాన్ని సాధించుటకు అహింసా సాధనాలని పాఠకులు గ్రహించాలి. ఈ కార్యక్రమాల సంపూర్ణ నిర్వహణయే, సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడమని తెలుసుకోవాలి. నలభైకోట్ల దేశ ప్రజలంతా అట్టడుగున పడియున్న దేశాన్ని పైకి తీసుకొని వెళ్లే యీ నిర్మాణ కార్యక్రమాల్ని పూర్తిగా అమలు బరుచుటకు పూనుకున్నారని ఒక్కసారి ఊహించండి. తత్ఫలితంగా విదేశీయుల పరిపాలన తొలగడంతో పాటు అన్ని రకాల సంపూర్ణ స్వాతంత్ర్యం లభించి తీరగలదని హృదయపూర్తిగా అనకుండా ఎవరైనా ఉండగలరా? నా యీమాటలు విని విమర్శకులు నవ్వితే నవ్వుదురుగాక. నలభై కోట్లమంది మీరు సూచించిన నిర్మాణ కార్యక్రమాలు చేపడతారా అని ఎగతాళి చేస్తే చేయుదురుగాక. అయితే వారి ఎగతాళిలో సత్యం కూడా వున్నది కదా! ఏది ఏమైనా యీ కార్యక్రమాలు అమలులోకి రావాలనీ, వచ్చి తీరాలనీ వారికి నేను సమాధానం యిస్తాను. స్థిరమైన నిర్ణయంతో కొంతమంది నిష్ఠాగరిష్ఠులైన కార్యకర్తలు యీ కార్యక్రమాలు అమలు చేయుటకు పూనుకుంటే తేలికగా దేశం మలుపు తిరుగుతుంది. గొప్ప ఘనకార్యం జరిగి తీరుతుంది. ఈ నిర్మాణ కార్యక్రమాలు

అహింసా విధానంతో జరగాలి. మరో మార్గం లేదు. సవినయంగా చేసే చట్ట ధిక్కారం కానీయండి లేక సత్యాగ్రహమే కానీయండి, అవి సామూహికంగా జరిగినా లేక వ్యక్తిగతంగా జరిగినా నిర్మాణ కార్యక్రమాలకు తోడ్పడుతాయి.

ఇట్టి అహింసా కార్యక్రమం సాయుధపోరాటం యొక్క స్థానాన్ని ఆక్రమిస్తుంది. సాయుధపోరాటానికి ఎంత శిక్షణ అవసరమో అహింసాయుతంగా సాగే యీ సత్యాగ్రహానికి కూడా అంత శిక్షణ అవసరమే. అయితే రెండింటి శిక్షణ విధానం వేరుగా మాత్రం వుంటుంది. అవసరమైనప్పుడే యీ రెండు రకాల పోరాటాలు ప్రారంభంఅవుతాయి. సాయుధపోరాటానికి మనమంతా ఆయుధాల ప్రయోగానికి సంబంధించిన శిక్షణ పొందాల్సివస్తుంది. చివరకు ఆటంబాంబును ప్రయోగించవలసిన అవసరం కూడా కలుగవచ్చు. నిర్మాణ కార్యక్రమాల్ని సక్రమంగా అమలు బరుచు శిక్షణ పొందవలసివస్తుంది.

కార్యకర్తలు సత్యాగ్రహం చేయుటకు లేక సవినయంగా చట్టధిక్కారం చేయుటకు పొంచి కూర్చోరు. అయితే నిర్మాణ కార్యక్రమాల్ని చేయనీయక, వాటిని ఆపివేసే ప్రయత్నం జరిగితే మాత్రం కార్యకర్తలు అట్టి చర్యను ఎదుర్కొనేందుకు సిద్ధంగా వుంటారు. ఎక్కడ సత్యాగ్రహం చేయాలో, ఎక్కడ చేయకూడదో రెండు మూడు ఉదాహరణలవల్ల స్పష్టం అవుతుంది. రాజకీయ ఒప్పందాలు ఆపివేయడం మనకు తెలుసు, ఆపివేయవచ్చు కూడా. అయితే వ్యక్తికి వ్యక్తికి మధ్య నెలకొని యుండే స్నేహాన్ని మాత్రం ఆపివేయుటకు వీలు వుండదు. ఇట్టి నిస్వార్థమైన, నిజమైన స్నేహమే రాజకీయ ఒప్పందాలకు పునాదికావాలి. ఇదేవిధంగా బాగా విస్తరించి కేంద్రీకృతమైన ఖాదీ పనిని ప్రభుత్వం ఆపివేయవచ్చు. అయితే ప్రజలు నూలువడికి, బట్టతయారుచేసి ధరించడం ప్రారంభిస్తే ఏ ప్రభుత్వమూ దాన్ని ఆపలేదు. ఖాదీ ఉత్పత్తిని, ఖాదీని ధరించడాన్ని ప్రజల మీద బలవంతంగా రుద్దకూడదు. స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా భావించి ఖాదీని అందరూ సమర్థించాలి. సంతోషంతో ధరించాలి. ఖాదీని బాగా ప్రోత్సహించాలి. ఈ పని గ్రామాల్లో సహజంగా జరగాలి. గ్రామాన్ని కేంద్రంగా తీసుకొని అక్కడ యీ కార్యక్రమం సాగాలి. ఇట్టి పనులు చేయువారికి

అనేక యిబ్బందులు తప్పక కలుగుతాయి. ప్రపంచంలో ప్రతిచోటా యిట్టి పనులకు ఆటంకాలు తప్పవు. నిప్పులతో నిండిన మార్గాన కార్యకర్తలు నడవవలసి వస్తుంది. కష్టాలు పడకుండా ఎక్కడైనా స్వరాజ్యం లభించిందా? హింసతో కూడిన సమరంలో మొట్టమొదట సత్యం బలి అయిపోతుంది. కాని అహింసతో కూడిన సమరంలో సత్యం తప్పక విజయం సాధిస్తుంది. అంతేగాక యీ నాటి ప్రభుత్వ తాబేదారులుగా పనిచేస్తున్న ప్రభుత్వ అధికారులను శత్రువులుగా భావించడం అహింసా భావానికి విధానానికి వ్యతిరేకం. వారు నుంచి మంచి స్నేహితులుగా విడిపోవాలేగాని, శత్రువులుగా విడిపోకూడదు.

నిర్మాణ కార్యక్రమాల్ని ప్రవేశపెట్టే ముందు . పైన నేను తెలిపిన విషయాలు పాఠకులకు మింగుడుపడితే, యీ కార్యక్రమాలు ఎంత మహత్తరమైనవో, వీటిని ఎంత రసవత్తరంగా అమలుబరచవలెనో తేలికగా అర్థం అవుతుంది. అంతేగాక, కుహనారాజకీయ కార్యక్రమాలలో పాల్గొంటున్నప్పుడు, రాజకీయ సభల్లో ఉపన్యాసాలు జోరుగా యిస్తున్నప్పుడు ఎంత ఆనందం కలుగుతుందో, అంత ఆనందం నిర్మాణ కార్యక్రమాలు అమలు చేస్తున్నప్పుడు కూడాకలుగుతుందని భావించవచ్చు. భావించాలి. నిర్మాణ కార్యక్రమాలు నిజంగా ఎంతో మహత్తరమైనవి. ఉపయోగకరమైనవి.

పూనా, 13-11-1945 **మోహనచంద్‌కరమ్‌చంద్ గాంధీ**

★ ★ ★

# భూమిక

నిర్మాణ కార్యక్రమాలంటే నిజమైన సత్యము, అహింసలతో కూడిన సాధనాల ద్వారా సంపూర్ణ స్వరాజ్యాన్ని సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందడం అన్నమాట.

స్వాతంత్ర్యం అనుపేరిట స్వరాజ్యాన్ని హింసద్వారా, అసత్యంతో కూడిన సాధనాల ద్వారా సాధించుటకు చేసే ప్రయత్నాలు ఎంత విషాదంగా వుంటాయో మనందరికీ తెలుసు. ఇప్పుడు జరుగుతున్న యుద్ధాల్లో ప్రతిరోజూ

ఎంత సంపద నాశనం అవుతున్నదో, ఎంతమంది జనం చచ్చిపోతున్నారో, సత్యాన్ని ఎంతగా హతమారుస్తున్నారో మనం చూస్తున్నాం.

సత్యము, అహింసల ద్వారా సంపూర్ణ స్వాతంత్ర్యం పొందడం అంటే ఏమిటి? కులం, మతం, వర్గం, వర్ణం మొదలుగా గల భేదాలు పాటించని రాష్ట్రాన్ని పొందడం అన్నమాట. అంటే అట్టి స్వతంత్ర రాష్ట్రంలో నివసించే జనం, మరియు కటిక బీదజనానికి ముక్తి లభించి వారంతా స్వాతంత్ర్యం పొందడం అన్నమాట. ఇట్టి స్వాతంత్ర్యానికి ఎవ్వరినీ ఎవ్వరూ దూరంగా వుంచలేరు. తమ స్వతంత్ర దేశాన్ని, యితర దేశాలకు దూరంగాఎవ్వరూ వుంచలేరు. దేశంలో నివసించే జనసమూహాల్ని కలువనీయకుండా వారిని దూరంగా వుంచే ప్రయత్నం కూడా ఎవ్వరూ చేయలేరు. మనం గీసిన ప్రతిగీటు, శాస్త్రీయమైన యూక్లిడ్ గీటు యొక్క నిర్వచనానికి సమంగా తులతూగనట్లే, తత్వ సంబంధమైన ఆధారభూత నిర్దిష్ట సిద్ధాంతం లేకుండా కేవలం ఆచరణకు పూనుకుంటే అది అసంపూర్ణంగా మిగిలిపోతుంది. అందువల్ల నిత్య కార్యక్రమాల్లో మనం సత్యం, అహింసలను ఏ స్థాయిలో అమలు పరుస్తామో, ఆ స్థాయిలోనే లభించిన స్వాతంత్ర్యం నాలుగు కాలాలబాటు నిలబడుతుంది.

పాఠకులు నేను సూచించిన నిర్మాణ కార్యక్రమాల వ్యాపును హృదయపూర్తిగా పరిశీలించి చూడాలి. వాటిని సక్రమంగా మనం నిర్వహించితే సాఫల్యం లభిస్తుంది. మనం కోరుకున్న, మనకు అవసరమైన స్వాతంత్ర్యం సంపూర్తిగా లభించి తీరుతుంది. భారత దేశంలోగల ముఖ్యపార్టీలు వాటిని అంగీకరిస్తామని ఒడంబడిక చేసుకుంటే చాలు. మిస్టర్ ఎమరీ చెప్పిన విషయాన్ని నా మాటల్లో చెబుతున్నాను. పలు నిర్మాణ కార్యక్రమాల్లో జాతీయ సమైక్యతకూడా ఒకటి. అట్టి జాతీయ సమైక్యతను సాధించిన తరువాత పార్టీలన్నీ పరస్పరం చేసుకునే ఒడంబడికల్ని బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరిస్తుంది. ఇదే కదా ఎమెరీ చెప్పింది? ఎమరీ నిజం చెప్పాడా లేక అబద్ధం చెప్పాడా అని మనం తర్కించుకోనవసరం లేదు. అటువంటి సమైక్యత ప్రామాణికంగా, అనగా అహింస ద్వారా లభ్యమైతే, ఆ తరువాత

జరిగే ఒడంబడికల యందు యిమిడి యుండే బలవత్తరమైన శక్తిని ఎవ్వరైనా సరే అంగీకరించక తప్పదు. కాదనగల ధైర్యం ఎవ్వరికీ వుండదు.

హింసద్వారా సంపాదించే స్వాతంత్ర్యం సంపూర్ణమైనదని ఊహించడానికైనా వీలువుండదు. అందుకు కారణం గ్రహించడం అవసరం. ఏదో ఒక పార్టీ హింసద్వారా ప్రయత్నించి స్వాతంత్ర్యం సంపాదిస్తే ఆ పార్టీ దుందుభి బిగ్గరగా మ్రోగుతుంది గదా! ఇక ఆ పార్టీ ఏం చెబితే అది జరగాల్సిందే. జరుగుతుందికూడా. అట్టి పూర్ణ స్వరాజ్యంలో ఆర్థిక సమానత్వాన్ని గురించేగాక, తదితర ఏ విషయంలోను సంపూర్ణ సమానత్వాన్ని గురించి యోచించడానికి సైతం అకాశం ఉండదు.

అందువల్ల పాఠకులకు ఒక్క విషయం స్పష్టంగా చెప్పదలుస్తున్నాను. స్వరాజ్యస్థాపనకు అవసరమైన అహింసాత్మక పురుషార్థ సాధనకై యీ నిర్మాణ కార్యక్రమాల్ని అర్థం చేసుకొని అమలు చేయండి. అయితే స్వరాజ్యసాధనకు హింసా సాధనాలు పూర్తిగా కొరగానివని మాత్రం భావించకండి. హింసాత్మక సాధనాలు కటిక బీదవారి విముక్తికి తోడ్పడుతా యనుకుంటే సంతోషంగా వాటిని అమలు చేయండి. అలాకాక వాటితోబాటు యీ నిర్మాణ కార్యక్రమాల్ని కూడా అమలు బరిస్తే తప్పక స్వాతంత్ర్యం లభించి తీరుతుంది అని అనుకుంటే, అట్టివారికి నేను చెప్పవలసింది చెప్పగలిగిందిఏమి వుంటుంది? ఇక మనం నిర్మాణ కార్యక్రమాల్ని ఒక్కొక్కటిగా సవివరంగా పరిశీలిద్దాం.



## 1. జాతీయ సమైక్యత

జాతీయ సమైక్యత లేక మత సామరస్యం అవసరమని అందరూ అంగీకరిస్తారు. అయితే యిది రాజకీయ సామరస్యంవంటిది కాదనే విషయం చాలా మంది గ్రహించలేకపోతున్నారు. రాజకీయ సామరస్యం గత్యంతరంలేని పరిస్థితుల్లోబలవంతాన ఏర్పడుతూవుంటుంది. కాని మత సమైక్యత లేక సామర్యం అనునది హృదయపూర్తిగా జరగవలసిన వ్యవహారం, అందు ఎవరి హృదయమూ గాయపడకూడదు. ఇటువంటి ఐక్యతను సాధించాలంటే

కాంగ్రెస్ వారు తమ భావాల్లో మార్పుతెచ్చుకోవాలి. వారు ఏ మతాన్నిఅనుష్ఠించేవారైనా, తాము ఆ మతానికే ప్రాతినిధ్యం వహించడంలేదని, హిందూ, ముస్లిం, క్రిష్టియన్, పారసీ, యూదు మొదలుగా గల మతాల వారందరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నామని హృదయపూర్తిగా భావించాలి. భారతదేశంలో నివసిస్తున్న ప్రతి ఒక్కరితోను సత్సంబంధాలు పెట్టుకోవాలి. వాళ్ల కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలి. వేరు మతాలవారితో స్నేహం చేయాలి. తమ మతాన్ని ఆదరించినట్లే యితర మతాల్ని కూడా ఆదరించాలి.

మనం యీ స్థితికి వస్తే రైలు స్టేషన్లలో హిందూటీ, ముస్లింటీ, హిందూజలం, ముస్లింజలం అంటూ వినబడే కేకలు యిక వినబడవు. ఇటువంటి మాటలు కేకలు వేయడం సిగ్గుచేటు. ఇటువంటి సమైక్యత స్కూళ్లలోను కాలేజీల్లోను, ఆసుపత్రుల్లోను కూడా ప్రవేశించాలి. జాతీయ స్కూళ్లు, జాతీయ కాలేజీలు, జాతీయ ఆసుపత్రులు నిర్మాణం కావాలి. గ్లాసులు, చెంబులు, కంచాల్లో గల తేడాలు సైతం పోవాలి. ఇది పెద్ద విప్లవం. ఈ విప్లవం కాంగ్రెస్ వాళ్లు సాగించాలి. ఈ విధంగా వ్యవహరిస్తూ రాజకీయంగా లాభం పొందాలని కాంగ్రెస్ వారు భావించకూడదు. అందుకోసం తాపత్రయ పడకూడదు రాజకీయ లాభాలు నిజాయితీతో కూడిన ప్రవర్తన వల్ల కలుగుతాయి.

సామాన్య ప్రజలకు అధికారం శాసనసభల ద్వారానే లభిస్తుందనే భావం చాలా కాలాన్నుంచి ఏర్పడింది. ఇది గొప్ప తప్పు భావమని, యిది కేవలం భ్రమ అని నా అభిప్రాయం. మనమే యిట్టి భావానికి మూలమని భావిస్తున్నాను. ఇంగ్లీషువారి నడవడి, వారి అలవాట్ల ప్రభావంలో మనం పడిపోయాం. ఆంగ్ల జాతి చరిత్రను బోలు బోలుగా పైపైన చదవడం వల్ల పాలనా వ్యవస్థ యొక్క కీలక అధికారం పార్లమెంటు ద్వారా వడపోత అయి ప్రజల దగ్గరికి చేరుతుందని మనం భావిస్తున్నాం. నిజానికి అధికారం ప్రజల మధ్య వుంటుంది. ప్రజల చేతుల్లో వుంటుంది. అధికారం ప్రజలదే. తన ప్రతినిధులని భావించినవారికి కొద్ది కాలం పాటు తమ అధికారాన్ని ప్రజలు అప్పగిస్తారు. అందాకా ఎందుకు? ప్రజలతో సంబంధంలేనిస్వతంత్ర

పార్లమెంటుకు అధికారం అంటూ వుంటుందా? అసలు అట్టి పార్లమెంటే వుండదు గదా! గత 21 ఏండ్ల నుంచి నేను యీ విషయం ప్రజలకు తెలియపరిచేందుకు ప్రయత్నిస్తున్నాను. అధికారం యొక్క వాస్తవిక ఖజానా సత్యాగ్రహ శక్తి, లేక సహకార నిరాకరణశక్తి యందు నిండివున్నది. ఒక దేశ ప్రజలంతా తమ శాసనసభలు చేసిన చట్టాల ప్రకారం నడుచుకోము అని ప్రకటిస్తే, అట్టి చట్టధిక్కారం వల్ల కలిగే కష్టనష్టాల్ని భరించేందుకు సిద్ధపడితే, ఏమవుతుందో యోచించండి. అటువంటి ప్రజల చేతుల్లో ప్రభుత్వాన్ని, శాసనసభను, దాని పాలనా వ్యవస్థను ఎక్కడికక్కడ పూర్తిగా స్తంభింపచేయగల శక్తి నిండి వుంటుంది. ప్రభుత్వ యంత్రాంగాలైన పోలీసులు, సైన్యాలు ఎంత బలవత్తరమైనవే అయినా ప్రజల్లో కొద్దిమందిని మాత్రమే అణిచివేయగలుగుతాయి. కాని, ప్రజలంతా అట్టి కష్టాల్ని సహించడానికి సిద్ధపడితే పోలీసుబలగం గాని, సైన్యబలగం గాని ఏమీ చేయలేదు.

పార్లమెంటు పద్ధతిలో సాగే పాలనా వ్యవస్థ, పార్లమెంటు మెంబర్లలో అధికసంఖ్యాకుల నిర్ణయాల్ని మిగతా వాళ్లు అంగీకరించడానికి సిద్ధపడితేనే సక్రమంగా సాగుతుంది. అంటే పార్లమెంటులో వుండే మెంబర్లందరి పార్టీలు ఒకదానికొకటి సహకరిస్తేనే పాలనా వ్యవస్థ సరిగా సాగుతుందన్న మాట. మన దేశంలో బ్రిటిష్ ప్రభుత్వం మతాలకు సంబంధించిన వివిధ పార్టీలను నిలబెట్టింది. అందువల్ల మన జనం మధ్య కృత్రిమమైన అడ్డుగోడలు ఏర్పడ్డాయి. ఏకాభిప్రాయం కుదరదు. ఇలాంటి పరిస్థితుల్లో మనం పార్లమెంటు విధానం వంటి పద్ధతి ప్రకారం నటిస్తున్నామన్నమాట. ఇటువంటి ఐక్యతలేని వేరు వేరు కృత్రిమ పార్టీలను ఒకే వేదిక పై నిలబడి ఒకే రకంగా పనిచేయమని పట్టుబట్టితే సయోధ్య కుదరడం సాధ్యమా? అయితే ఇటువంటి శాసనసభల ద్వారా యిప్పుడు ఏదో విధంగా పరిపాలన సాగుతూ వున్న మాట నిజమే. కాని ఈ శాసనసభల్లో నిలబడి గట్టిగా పోట్లాడుకుంటూ వుంటాము. మన మీద అధికారం చలాయించే వాళ్లు అప్పుడప్పుడు విసరివేసే అధికారపు ముక్కలకోసం తహతహలాడుతూ వుంటాము. మన యీఅధికారులు కఠినంగా మనల్ని అదుపులో పెడతారు. బద్ధశతృత్వం

కలిగిన మన వాళ్లను కొట్లాడుకోకుండా ఆపుతూ వుంటారు. ఇలాంటి సిగ్గుచేటు విధానంలో పూర్ణ స్వరాజ్యం లభించడం అసంభవమని నాఅభిప్రాయం.

శాసనసభలు వాటి ద్వారా సాగుతున్న పనుల్ని గురించి నాకు గట్టి వ్యతిరేకత వున్నది. అయినా నేను ఒక నిర్ణయానికివచ్చాను. ఎన్నకల ద్వారా ఎన్నుకోబడే ప్రతినిధుల సభలు ఏర్పడి అవి సాగుతూ వున్నంత కాలం పనికిమాలిన తప్పుడు అభ్యర్థులు ఎన్నికల్లో పోటీకి నిలబడితే, అట్టి వారిని రాజకీయ పార్టీలు నిలబెట్టకుండా చూడాలి. అయినా అట్టి వాళ్లను నిలబెడితే వారిని గెలవనీయకూడదు. వారికి పోటీగా అభ్యర్థుల్ని కాంగ్రెస్ నిలబెట్టాలి. వారిని గెలుపొందకుండా ఆపాలి.



## 2. అస్పృశ్యతా నిర్మూలన

ఇప్పుడు యీ క్షణాన హిందూమతాన్ని బాగా అంటుకొని దాన్నిమలినం చేస్తున్న అస్పృశ్యయతా శాపాన్ని, కళంకాన్ని కడిగివేయాల్సిన ఆవశ్యకతను గురించి విస్తారంగా వ్రాయవలసిన అవసరం లేదని నా అభిప్రాయం. ఇందుకోసం కాంగ్రెస్‌వారు ఎంతో కృషి చేసిన విషయం వాస్తవం. కాని చాలామంది హిందువులైన కాంగ్రెస్ వాళ్లు, హిందూమత రక్షణకోసం అస్పృశ్యతా నివారణ అవసరమనిభావించక, యిదొక రాజకీయ విషయంగా భావిస్తూ వుండటం నిజంగా విచారకరం. కాంగ్రెస్ హిందువులు అస్పృశ్యతా కార్యక్రమంవల్ల జాతి ముక్తిపొందుతుందని హృదయపూర్తిగా విశ్వసించి, యీ కార్యక్రమాన్ని నిర్వహిస్తే, సనాతనులు అయిన వారి వారి బంధువుల హృదయాలపై చెరగని ముద్ర పడుతుంది. ఇప్పటి కంటే ఎక్కువపని యీ రంగంలో జరుగుతుంది. ఘర్షణ పడేందుకై ఆవేశకావేశాలతో సనాతనుల దగ్గరికి వెళ్లకూడదు.

అహింసకు శోభకల్గించే మైత్రీభావంతో వెళ్లాలి. హరిజనుల శ్రేయస్సు కోసం ప్రతిహిందువు పనిచేయాలి. అస్పృశ్యతా నివారణా కార్యక్రమం

తమదిగా వారు భావించాలి. హరిజనులకు సహాయం చేయాలి. ఇప్పుడు గుండెల్ని కదిలించివేసే దయనీయస్థితిలో వున్నవారినికలిసి, వారితో మమేకం కావాలి. మన హరిజన సోదరీ సోదరుల్ని దగ్గరికి రానీయకుండా దూరంగా ఎడంగా వుంచి రాక్షసత్వంతో కూడిన నరకయాతన అనుభవించేలా చేస్తున్నాం. అట్టి ఉదాహరణ ప్రపంచంలో మరొకటి ఎక్కడైనా ఎంత వెతికినా కనబడదు. అస్పృశ్యతానివారణా కార్యక్రమం ఎంత కఠినమైనదో అనుభవం ద్వారా నేను తెలుసుకున్నాను. మనం స్వరాజ్యమనే భవ్యభవన నిర్మాణానికి పూనుకున్నాం. అస్పృశ్యతా నివారణ అందలిఒక ముఖ్య బాగమని అందరం గ్రహించాలి. ఆ స్వరాజ్యాన్ని చేరుకునే మార్గం ఇరుకుగా వుండి ఇబ్బంది కలిగిస్తున్నది ఆత్రోవలో ఎన్నో జారుడు మెట్లు వున్నాయి, ఎన్నో లోయలువున్నాయి. అయినా మనం పై శిఖరం అధిష్ఠించి, స్వాతంత్ర్యపు శ్వాసపీల్చి తీరాలి. అందుకోసం మెట్లన్నీ ఎక్కవలసిందే. లోయలన్నీ దాటవలసిందే. ఆటంకాల్ని అధిగమిస్తూ గట్టిగా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగవలసిందే.

★ ★ ★

## 3. మద్యనిషేధం

జాతీయ సమైక్యత, అస్పృశ్యతా నివారణ అను కార్యక్రమాల వలె మద్య నిషేధాన్ని కూడా 1920 నుంచి కాంగ్రెస్ వారు అంగీకరించి తమ కార్యక్రమాల్లో చేర్చారు. కాని సాంఘికంగాను, నైతికంగానుఅవసరమైన సంస్కరణలకు సంబంధించిన మద్యనిషేధం వంటి కార్యక్రమాన్ని గురించి అవసరమైనంతగా కాంగ్రెస్ వారు పట్టించుకోలేదు. అహింసాత్మక స్వరాజ్యం సాధించాలంటే, దాన్ని సుభిక్షంగా వుంచాలంటే, నల్లమందు, మద్యం,మొదలుగా గల మత్తు కలిగించే వ్యసనాల్లో చిక్కుకున్న మనకోట్లాది సోదర, సోదరీమణుల భవిష్యత్తును కేవలం దేశపరిపాలకుల దయాదాక్షిణ్యాలపై వదిలిపెట్టడం మంచిదికాదు.

మద్యనిషేధం వంటి దుర్వ్యసనాన్ని రూపు మాపుటకు డాక్టర్లు ఎంతో సహకారం అందించాలి. నల్లమందు, మద్యం వంటి మత్తు పదార్థాలకు

బానిసలైపోయిన వారిని వాటినుంచి రక్షించడానికి డాక్టర్లు సరియైన చికిత్సా విధానాలు కనిపెట్టి వారికి విముక్తి కలిగించవలసిన అవసరం ఎంతైనా వున్నది

స్త్రీలు, విద్యార్థులు సంస్కరణకు సంబంధించిన ఇట్టి కార్యక్రమాన్ని విజయవంతం చేయుటకు పూనుకొని పనిచేయాలి. అహింసా విధానం ప్రకారం ప్రేమతో కూడిన సేవాధర్మం ద్వారా స్త్రీలు, విదార్థులు మత్తు పదార్థాలకు బానిసలై పోయినవారికి నయానా బోధించి వారిని సన్మార్గానికి తీసుకురావాలి.

కాంగ్రెస్ సేవాసమితి మెంబర్లు, వాలంటీర్లు వినోద కేంద్రాలు, విశ్రాంతి శాలలు నెలకొల్పి యిలాంటి వారికి సేదదీర్చుకునేందుకు సౌకర్యాలు కల్పించాలి. ఆహారపదార్థాలు యీ కేంద్రాల్లో చవుకగా వారికి లభింపచేయాలి. క్రీడా వినోద కార్యక్రమాలు అక్కడ యిట్టివారికోసం ఏర్పాటు చేయాలి. ఈ కార్యక్రమాలు హృదయ మార్పుకు బాగా పనిచేసి మనిషిని ఉన్నత స్థితికి తీసుకువెళతాయి. ఇది స్వరాజ్యాన్ని అహింసా పద్ధతిన సాధించుటకు ఉత్తమ సాధనం, పాతవిలువల్ని వదిలి నూతన విలువల్ని సృష్టించాలి. స్వరాజ్యం సాధించుటకు యిటువంటి ప్రజాహృదయ సంస్కరణకు సంబంధించిన కార్యక్రమాలు ఎంతగానో తోడ్పడుతాయి. ఇటువంటి కార్యక్రమాల యెడ, శ్రద్ధకలిగిన కొంతమంది స్వరాజ్యం లభించిన తరువాత యీ కార్యక్రమాలను చేపట్టవచ్చునని అభిప్రాయపడుతూ వున్నారు. ఇది తప్పు అభిప్రాయం. అంత వరకు యిట్టి కార్యక్రమాల్ని వాయిదా వేయకూడదు. నిజానికి నిజమైన స్వరాజ్యం, ఆదర్శవంతమైన స్వాతంత్ర్యం హృదయ సంస్కరణ ద్వారానే, సేవా ధర్మం ద్వారానే లభిస్తుందన్న విషయం సర్వులూ గ్రహించాలి. స్వరాజ్యం నాలుగు కాలాలుపాటు నిలవాలంటే ప్రజల ఆత్మశుద్ధి ఎంతో అవసరం. నిర్మాణ కార్యక్రమాల్ని అమలు బరిచే కార్యకర్తలు చట్టరీత్యా మద్యనిషేధాన్నిఅమలు పరచలేకపోయినా, అందుకు మార్గాన్ని సుగమం చేసి మనిషి జీవన యాత్రను సుఖవంతం చేయుటకు కృషి చేయవచ్చుననీ

మద్యనిషేధం నూటికి నూరుపాళ్లు విజయవంతం అగుటకు అవసరమైన వాతావరణాన్ని సృష్టించవచ్చుననీ స్పష్టం చేస్తున్నాను.

★ ★ ★

# 4. ఖద్దరు

ఖద్దరు వివాదాస్పదమైన విషయమనీ, ఖద్దరును సమర్థిస్తున్న నేను గాలివాటుకు వ్యతిరేకంగా పడవనడుపుటకు మూర్ఖంగా ప్రయత్నిస్తున్నాననీ, చివరికి స్వరాజ్యమనే నావను ముంచి వేస్తాననీ, దేశాన్ని మళ్లీ ప్రాచీన చీకటి గుహల్లోకి తీసుకువెళతాననీ అభిప్రాయం వెల్లడించారు. ఈ ఆరోపణలకు సంబందించిన చర్చల్లో పడి ఖద్దరుకు అనుకూలంగావాదనలు చేయను. మరో చోట యిట్టి వాదనలు ప్రతివాదనలు గతంలో చేశాను. ప్రతి కాంగ్రెస్‌వాది, ప్రతి భారతీయుడు ఖద్దరు అభివృద్ధికి ఏమేమి చేయవచ్చునో యిక్కడ తెలియచేస్తాను. ఖద్దరంటే ఏమిటి? ఖద్దరంటే దేశప్రజలకు ఆర్థిక స్వాతంత్ర్యం లభింపచేయడమన్నమాట. సమానత్వం ఆరంభం కావడమన్నమాట. ఏ వస్తువునైనా ఉపయోగించినప్పుడే దానివిలువ తెలుస్తుంది. చెట్టుకు పండిన పండును బట్టి దానికి గుర్తింపు లభిస్తుంది. అదే విధంగా నేను చెప్పే విషయంలో సత్యం వున్నదో లేదో, ఆచరించి చూడడం అవసరం. కేవలం ఖద్దరును వాడటమే కాక, దానికి సంబంధించిన తత్వాన్నికూడా సరిగా అర్థం చేసుకోవాలి. దేశ ప్రజలంతా సంపూర్ణ స్వదేశీభావనను పెంపొందించుకోవాలి. దాన్ని నిలుపుకోవాలి. ప్రతి ఒక్కరు మన దేశంలో తయారైన వస్తువులే, ముఖ్యంగా మన గ్రామాల్లో గ్రామ ప్రజల కాయకష్టంతో తయారైన వస్తువులే వాడతామని గట్టిగా సంకల్పించుకోవాలి. ఇప్పుడు మనం చూపిస్తున్న విదేశీ వస్తువుల మోజుకు ఖద్దరు తత్వం పూర్తిగా వ్యతిరేకం. అంటే ఏమిటో యింకా చెబుతాను. ఇప్పుడు హిందూదేశమందలి ఏడు లక్షల గ్రామాల్ని పీల్చిపిప్పిచేసి, హిందూ దేశమందలి కొన్ని పట్టణాలు మరియు గ్రేట్ బ్రిటన్ దేశపు 10 లేక 15 నగరాలు సంపదలతో తులతూగుతున్నాయి. ఆ పద్ధతిని ఆపివేసి,ఏడు లక్షల గ్రామాల్ని స్వయంపోషకం

చేయాలి. ఈ ఏడు లక్షల గ్రామాలు తమ యిష్టప్రకారం తమకు అవసరమైన వస్తువుల్ని తయారుచేసుకోవాలి, ఒకదానికింకొకటి సహకరించాలి. ఇందువల్ల ఎంతో మేలు కలుగుతుంది.

అంటే మన కోరికల్ని, అభిరుచుల్ని పూర్తిగా మార్చుకోవాలన్నమాట. ఇది అహింసా విధానం. ఇందు కొన్ని మార్గాలు సులభంగా వున్నా, కొన్ని మార్గాలు కఠినంగా వుంటాయి. ఈ విధానం ప్రతి భారతీయుని హృదయం మీద చెరగని స్వదేశీ ముద్ర వేస్తుంది. మన ప్రజల హృదయంలో నిద్రపోతున్న, యీనాటి వరకు వెల్లడికాకుండా పడియున్న శక్తిని మేల్కొలుపుతుంది. ప్రజల శక్తి సామర్థ్యాలను వారికి అర్థమయ్యే పద్ధతిన ఉత్సాహపరుస్తుంది. హిందూదేశం ఒక మహామానవ సాగరం.ఇందలి కోట్లాది బిందువుల్లో నేను కూడా ఒక బిందువునన్నపరిజ్ఞానాన్నికలిగిస్తుంది. మానవ జగత్తు అనేక శక్తుల్ని పొందింది. వాటిని ఆచరణలో పెట్టింది. వాటిలో అహింస కూడా ఒక అమోఘమైన మహాశక్తి. దానిమీదనే మానవ జాతి మనుగడ ఆధారపడి వున్నది. కాంగ్రెస్ ద్వారా ఈ అహింసా శక్తిని విశ్వమానవ జగత్తు ఎదుట వుంచుటకు నేను ప్రయత్నించాను. ప్రయత్నిస్తున్నాను. నా నిశ్చితాభిప్రాం ప్రకారం ఖద్దరు భారతదేశ ప్రజల సమైక్యతకు, వారి ఆర్థిక స్వాతంత్ర్యానికి, వారి సమానత్వానికి చిహ్నం. జవహర్‌లాల్ చెప్పినట్టు కావ్యభాషలో ఖద్దరు "భారతదేశ స్వాతంత్ర్యపు ద్రస్సు."

అయితే ఖద్దరు తత్వంమంటే ఏమిటి అని మరో ప్రశ్న. జీవితానికి అవసరమైన వస్తువుల ఉత్పత్తి, వాటి వికేంద్రీకృత పంపిణీ అని అర్థం. ప్రతిగ్రామం తనకు అవసరమైనవస్తువులనన్నింటినీ తమ గ్రామంలో ఉత్పత్తి చేసుకోవాలి. పట్టణాల అవసరాలను తీర్చుటకు యింకా ఎక్కువగా వస్తువుల్ని ఉత్పత్తి చేయాలి.

అయితే పెద్ద పెద్ద పరిశ్రమల్ని ఒక చోట స్థాపించివాటిని దేశం తన ఆధీనంలో వుంచుకోవాలి. అయితే దేశమంతా కలిసి క్షుణ్ణంగా యోచించి గ్రామాల్లో స్థాపించాలనే పరిశ్రమల ఎదుట యీ పెద్ద పెద్ద పరిశ్రమలు నిలవవు అను సత్యాన్ని గ్రహించాలి.

ఖద్దరు యందు యిమిడి యున్న విషయాల్ని, విశేషాల్ని వివరించాను. కాంగ్రెస్ వాదులు ఖాదీ అభివృద్ధికి ఏమేమి చేయాలో నేను చెప్పాలి. పత్తి గింజలు నాటడం, పత్తి ఏరడం, పత్తినిఏకి శుభ్రంచేయడం, దూదిని సాఫుచేయడం, ఏకులు తయారుచేయడం, నూలువడకడం, నూలుకు గంజిపట్టడం, నూలుకు రంగు అద్దడం, పడుగు, పేక ఏర్పాటు చేయడం, బట్ట నేయడం, తయారైన బట్టను ఉతకడం యీ పనులన్నీ ఖద్దరు ఉత్పత్తికి సంబంధించినవే. ఇందు రంగు అద్దడాన్ని మినహాయించాలి. మిగతా వన్నీ ఖాదీకి సంబంధించిన ముఖ్యమైన కార్యక్రమాలే. వాటిని చేసితీరాలి ఈ పనులన్నీ గ్రామాల్లో బాగా జరుగుతాయి. అఖిలభారత చరఖాసంఘం బారతావనికి చెందిన అనేక గ్రామాల్లో యీ పనులు నిర్వహిస్తూ వున్నది. చరఖాసంఘం ప్రకటించిన లెక్కల వివరం క్రిందివిధంగా వున్నది

1940లో 13451 గ్రామాల్లో ఖాదీ కార్యక్రమం జరిగింది. మొత్తం 2,75,146 మంది గ్రామ ప్రజలకు, ఖద్దరు ఉత్పత్తికై 34,85,609 రూపాయలు మజూరీ కింద లభించాయి. వీరిలో 19645 మంది హరిజనులు, 57378 మంది ముస్లిములు వున్నారు. ఏకేవారిలో అధిక సంఖ్యాకులు స్త్రీలే.

కాంగ్రెస్ వాదులంతా హృదయపూర్తిగా యీ ఖద్దరు కార్యక్రమాన్ని నిర్వహిస్తే పైన తెలిపిన వివరాలకు వందరెట్లు ఎక్కువగా పని జరుగుతుంది. గ్రామాల్లో జరుగుతూ వుండే యిటువంటి కార్యక్రమాలు. వృత్తులు కావాలని ఆపివేయబడ్డాయి.

అందువల్ల మన గ్రామాల అభివృద్ధి సంపూర్తిగా కుంటుపడిపోయింది. గ్రామప్రజల వృత్తులన్నీ జీవంలేని పశువుల కళేబరాలైపోయాయి.

కాంగ్రెస్ వాదులు ఖాదీ కార్యక్రమాల్ని విస్తారంగా చేపట్టాలి. చరఖా సంఘంవారు అప్పుడప్పుడు సూచించే సూచనల్ని వారు అమలు పరుస్తూ వుండాలి. ఇక్కడ అందుకు సంబంధించిన కొన్ని ముఖ్య విషయాలను మాత్రం వివరిస్తాను.

1. కొద్దిగానైనా సరే పొలం వున్నకుటుంబాల వాళ్లు తమకు అవసరమైన దుస్తులకు కావలసిన పత్తిని తమ పొలంలో పండించుకోవాలి. పత్తి

పండించడం తేలికకూడా. తెల్లవారి పరిపాలనా కాలంలో బీహారు రైతుల్ని సారవంతమైన వారి పొలమునందలి 3/20 భాగంలో నీలిమందు పండించమని చట్టరీత్యా వత్తిడి తేవడం జరిగింది. అట్టి స్థితిలో మనం, మన అవసారలకు అవసరమైన పత్తిని మన పొలాల్లో పండించుకుంటే తప్పేమిటి? అసలు ఖద్దరు ఉత్పత్తికి సంబంధించిన పనులన్నీ వికేంద్రీకృత పద్ధతిలో జరుగుతాయి. ఇప్పుడు మనదేశంలో కొన్ని ప్రాంతాల్లో కొన్ని చోట్ల పత్తి పండించడం జరుగుతున్నది. దాన్ని భారతదేశ మందలి దూరదూర ప్రాంతాలకు పంపడం జరుగుతున్నది. యుద్ధానికి పూర్వం యిక్కడపండే ప్రత్తి అంతా ఇంగ్లాడుకు, జపానుకు పంపబడేది. ప్రత్తి అమ్మి, డబ్బు సంపాయించుకోవాలనే ఉద్దేశ్యంతో మన దేశంలో ప్రత్తిపండించేవారు. ఇవాళగూడా అదే జరుగుతున్నది. అందువల్లనే ప్రత్తికొనుగోళ్ల ప్రభావం రైతుల ఆర్థిక రాబడి మీద పడుతూ వున్నది. ఖద్దరు ఉత్పిత్తివల్ల యీ కార్యక్రమాలన్నింటివల్ల, పత్తికొనుగోళ్లకు సంబంధించి నడుస్తున్న జూదం ఆగిపోతుంది. ఈ ఖద్దరు ఉత్పాదనా ప్రణాళిక ప్రకారం రైతు మొదటతనకు అవసరమైనంత వరకే వస్తువుల్ని తయారుచేసుకుంటాడు. ఈ విధంగా చేసుకోవడం రైతుల ప్రథమకర్తవ్యమని వారు గ్రహించడం చాలా అవసరం. రైతులు యీ విషయం తెలుసుకొని, ఆ విధంగా తమ పనులు చేసుకుంటే, మార్కెట్ ధరల ప్రభావం వారి మీద పడదు. రైతులు నష్టపడరు.

2. రైతు తనకు అవసరమైన పత్తిని పండించుకోలేకపోతే, ఆ ప్రత్తిని యితర రైతులదగ్గర కొనుక్కోవాలి. పత్తిని ఏకడం సులభమే. ఏకుడు పరికరం లేకుండా కూడా యీ పని చేసుకోవచ్చు. పత్తిని శుభ్రంచేసుకొనుటకు ఒక చిన్నబల్ల మరియు ఇనుపకడ్డీ చాలు. ఇది సాధ్యం కాకపోతే వడికేవారు, చేతితో ఏకబడిన పత్తిని కొని దాన్ని బాగా ఏకించుకోవాలి. అవసరమైన దూదిని తేలికగా ఏకే పరికరం, తయారుచేసుకోవచ్చు. ఈ కార్యక్రమాలు ఎంత ఎక్కువమంది నిర్వహిస్తే అంత చవుకగా పనిజరుగుతుంది. అవసరమైన పరికరాలుకూడా చవుకగా లభ్యమవుతాయి. ఏకినదూదితో ఏకులు లభ్యమవుతాయి. ఇక నూలు వడుకు పని ప్రారంభించవచ్చు. వడుకుపనికి

ధనుష్ తక్లీని ప్రత్యేకించి సిఫారసు చేస్తున్నాను. నేను దాన్ని ఉపయోగించాను. రాట్నం మీద వడకగలిగినంత నూలు ధనుష్తక్లీమీద నేను వడకకలిగాను. రాట్నంమీద వడికిన నూలుకంటే ధనుష్తక్లీ మీద నేను వడికిన నూలుసన్నగాను,గట్టిగాను కూడా వున్నది. మిగతా వడికే వారికి నా వలె అనుభవం కలుగకపోవచ్చు. రాట్నం కంటే ధనుష్తక్లీని నేను సిఫారసు చేయడానికి కారణాలు వున్నాయి. ధనుష్ తక్లీ తయారుచేసుకోవడం సులభం. అది రాట్నం కంటే చవుకగా లభిస్తుంది. చరఖావలె మాటిమాటికి ధనుష్తక్లీకి మరమ్మతు చేయించుకోవలసిన అవసరంవుండదు. రాట్నంమీద నూలువడికేవారికి సన్నటినూలును లేక లావు పాటి నూలును వడకడం చేతకాకపోవచ్చు. నూలు కండె జారినా, వదులు అయిపోయినా తిరిగి దాన్నిసరిచేయడం తెలియకపోవచ్చు. అప్పుడు రాట్నం వృధాగా పడివుంటుంది. పనినడవదు. లక్షలాదిమంది జనం వడుకుపని చేయాలి. రాట్నం పని చేయకపోతే అంతావృధా అవుతుంది. ధనుష్తక్లీ అయితే తేలికగా నూలు తయారు చేసుకోవచ్చు. దాన్ని నడపడం కూడా తేలిక. అవసరానికి అది ఆదుకుంటుంది. సామాన్య తక్లీకంటే ధనుష్ తక్లీ తయారుచేసుకోవడం సులభం. తేలికగా తయారయ్యే పనిముట్లు అమర్చుకోవడం అవసరం. ఒక్క విషయం చూడండి. నూలు వడకడానికి దేశ ప్రజలంతా పూనుకుంటే ఎంతో ఐక్యత సమకూరుతుంది. పనిలో ఏకాగ్రత పెరుగుతుంది. పనిపాటవం కూడా పెరుగుతుంది. ధనికులు, పేదవారు అంతాకలిసి యిట్టి కార్యక్రమాలు సాగిస్తే వారి మధ్య ప్రేమబంధం ఏర్పడమేగాక హృదయాలు కలిసి ఏకమై దేశానికి ఎంతో మేలు చేస్తాయి. అంతా సమానమే అనుభావం అందరికీ కలుగుతుంది.

ఈ విధంగా వడికిన నూలువల్ల మూడు లాభాలు కలుగుతాయి. 1. వడికిన నూలును పేదవారికోసం చరఖాసంఘానికి అప్పగించడం, 2. తమ అవసరానికి అవసరమైనంత బట్టను నేయించుకోవడం, 3. వడికిన నూలు యిస్తేఅందుకు లభించే ఖద్దరు కొనుక్కోవడం. నూలు ఎంత సన్నగాను శ్రేష్ఠంగాను ఉంటుందో దాని ఖరీదు కూడా అంత ఎక్కువగా వుంటుంది.

అందువల్ల కాంగ్రెస్‌వారంతా ఖాదీకి సంబంధించిన వివిధ కార్యక్రమాల్లో విరివిగా పాల్గొనాలి. అప్పుడు ఖాదీ ఉత్పత్తి అధికంగా జరుగుతుంది. అందుకు అవసరమైన పనిముట్లలో మార్పులు జరుగుతాయి. అనేక క్రొత్త విషయాలు తెలుస్తాయి. ఇప్పుడు మన దేశంలో బుద్ధికి, కాయకష్టానికి మధ్యఅవాంతరం ఏర్పడింది. తత్ఫలితంగా మన జీవితాలు నీరు నిల్వ వుండే చిన్నితటాకాలుగా రూపొందాయి ఇప్పటివరకు నేను తెలిపిన ఖద్దరు ఉత్పత్తికి సంబంధించిన వివిధ కార్యక్రమాల్ని కొనసాగిస్తే బుద్ధికి, కాయకష్టానికి మధ్య ఏర్పడిన అవాంతరం తొలిగిపోతుంది. అందువల్ల సత్ఫలితాలు అపారంగా కలుగుతాయి. సేవా కార్యంగా భావించి దేశవ్యాప్తంగా అమలుబరిచే యీ నూలు వడుకుకు సంబంధించిన ప్రణాళికను విజయవంతం చేయుటకు స్త్రీలు, పురుషులు రోజూ ఒక్క గంట వెచ్చించాలి. అంతకంటే ఎక్కువసమయం వెచ్చించవలసిన అవసరంలేదు.

## 5. ఇతర గ్రామ పరిశ్రమలు

ఖద్దరుతోపాటు గ్రామాల్లో కొనసాగే యితర గ్రామ పరిశ్రమలు కూడా చాలా వున్నాయి. వాటిలో తమ యిష్టప్రకారం మజూరీ పుచ్చుకొని పనిచేసే వ్యవహారం ఉండదు. వాటిలో కొన్ని వృత్తులకు సంబంధించిన కొద్దిమందికే తగిన మజూరీ లభిస్తూ వుంటుంది. ఇట్టి చిన్న పరిశ్రమలు కొన్ని ఖద్దరు ఉత్పత్తికి కూడా ఉపయోగపడతాయి. ఖద్దరు లేని యెడల వాటికి అస్తిత్వం వుండదు. అవిలేని యెడల ఖద్దరుకు గౌరవం వుండదు. పిండి విసరడం, జల్లడం, సబ్బులు తయారుచేయడం, కాగితం తయారుచేయడం, చర్మంతయారుచేయడం, నూనెగానుగ, వంటి సమాజానికి అవసరమైన, ఉపయోగకరమైన తదితర వృత్తులు లేకపోతే గ్రామాలు ఆర్థికంగా పుంజుకోవు. అంటే గ్రామం స్వయం పోషకం కాదన్నమాట. కాంగ్రెస్‌వాది తనకు యిష్టమైన వృత్తుల్ని ప్రోత్సహిస్తాడు. గ్రామవాసి అయివుంటే గ్రామ వృత్తులకు నూతన జీవం పోస్తాడు. చేతి వృత్తులకు నూతనోత్తేజం కల్గించి వాటిని క్రొత్త

మార్గాన నడిపిస్తాడు. ప్రతి వ్యక్తి, ప్రతి భారతీయుడు దీన్ని తన కర్తవ్యమని, ధర్మమని భావించాలి. అవకాశం వున్నంతవరకు, లభించినంత వరకు గ్రామంలో తయారైన వస్తువుల్నే వాడాలి. అటువంటి వస్తువులకు గిరాకీ ఏర్పడితే గ్రామాల అవసరాలు తీరుతాయి అట్టి వస్తువుల ఉత్పత్తి పెరుగుతుంది. గ్రామ వస్తువుల్ని యిష్టపడి మనం వాటినే వాడటం మొదలుపెడితే యంత్రాలమీద తయారయ్యే వస్తువులు మనకు నచ్చవు.అప్పుడు క్రొత్త జాతీయ అభిరుచి పెంపొందుతుంది. తద్వారా పేదరికం, కరువు, సోమరితనం, నిరుద్యోగం మొదలగు చెడుగులనుంచి విముక్తి లభిస్తుంది. అప్పుడు చేతి వృత్తులతోను, గ్రామ పరిశ్రమలతోను స్వయం పోషకమైన గ్రామాలతో నిండిన ఆదర్శవంతమైన భారతావని ఆవిర్భవిస్తుంది.

★ ★ ★

## 6. గ్రామపారిశుధ్యం

కాయకష్టానికి, అభివృద్ధికి మధ్య దూరం పెరగడం వల్ల మనం మన గ్రామాల్ని గురించి పట్టించుకోవడం మానివేశాం. ఇది నిజంగా మనం చేస్తున్న పాపమే. తత్ఫలితంగా పచ్చపచ్చని గ్రామాలకు బదులు పెంటకుప్పలవంటి పల్లెల్ని చూడవలసివస్తున్నది దరిదాపుగా దేశమందలి గ్రామాలన్నింటి స్థితి యిలాగే వున్నది. గ్రామాల్లో అడుగుపెట్టగానే కనబడే దృశ్యాల్ని భరించలేకుండా వున్నాము. ముక్కులు, కండ్లు మూసుకొని గ్రామాల్లోకి ప్రవేశించవలసిన దుస్థితిలో గ్రామాలు వున్నాయి. ఎక్కడచూచినా దుర్గంధం, మురికిగుంటలు. కాంగ్రెస్‌వాదులు గ్రామవాసులై వుండాలి. అలాంటి స్థితిలో గ్రామాల్ని పరిశుభ్రంగా వుంచడం వారి కర్తవ్యం అవుతుంది. కాంగ్రెసువాళ్లు యిప్పుడు గ్రామ ప్రజలతో కలిసి మెలిసి వుండటం మానివేశారు. దేశ పారిశుధ్యాన్ని గురించిగాని, సాంఘిక పారిశుధ్యాన్ని గురించిగాని జనం పట్టించుకోవడం లేదు. అదువల్ల గ్రామ పారిశుధ్యాన్ని గురించి, గ్రామ వికాసాన్ని గురించి పూర్తిగా అంటూ మరిచిపోయారు. స్నానం మాత్రం అలవాటు అయింది

గనుక చేస్తున్నాం. ఏ నదీతీరాన, చెరువుల ఒడ్డున, ఏబావులదగ్గర శ్రాద్ధాలవంటి కార్యక్రమాలు నిర్వహిస్తూ వుంటామో, ఏ జలాశయాల్లో పవిత్రభావంతో స్నానం చేస్తూ వుంటామో, వాటి యందలి నీటిని మురికితో నింపివేయడానికి వెనకంజవేయం. మన యీ బలహీనత, పెద్ద దుర్గుణమని నా అభిప్రాయం. ఈ దుర్గుణం వల్ల మన గ్రామాలు, మన నదులు, తటాకాలు సిగ్గుతో తలవంచుకోవలసిన దుస్థితికి చేరుకున్నాయి. మురికి కూపాలుగా మారిపోయి అంటురోగాలకు నిలయాలు అయిపోయాయి. వాటి దుష్ఫలితాల్ని ప్రజలంతా అనుభవిస్తున్నారు.

★ ★ ★

## 7. పునాది లేక బేసిక్ విద్య

ఇది నూతన విషయం. కాని కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గసభ్యులకు ఇది అమితంగా నచ్చిన విషయం.ఎంతో మహత్తరమైన విషయమనివారికి తోచింది. అందువల్లనే హరిపుర కాంగ్రెస్‌లో కాంగ్రెస్‌వారు యిందుకోసం స్థాపించబడిన హిందుస్తానీ తాలీమీ (శిక్షణ) సంఘానికి తమ అంగీకారముద్ర వేశారు. అప్పటినుంచి ఆ సంఘం బాగా పనిచేస్తున్నది. ఇది ఎంతో విశాలమైన రంగం. ఈ రంగంలో ఎక్కువ సంఖ్యలో కాంగ్రెస్ వాళ్లు పనిచేయవలసిన అవసరం ఎంతైనా వున్నది. ఈ విద్యావిధానంయొక్కలక్ష్యం ఏమిటో తెలుసుకోవడం అవసరం. గ్రామ పిల్లలకు మంచి శిక్షణగరపి ఆదర్శవంతమైన గ్రామవాసులుగావారిని తీర్చిదిద్దడమే యీ విద్యా విధానం యొక్క ప్రధానలక్ష్యం. గ్రామ బాలబాలికల్ని దృష్టిలో పెట్టకొని యీ విద్యా ప్రణాళిక తయారుచేయబడింది. ఈ ప్రణాళికకు ప్రేరణ గ్రామాలనుంచే లభించింది. స్వరాజ్యభవన నిర్మాణంలో పునాదినుంచే జాగ్రత్తవహించి దాన్ని బలిష్ఠంగా నిర్మించాలని భావించేవారు వారి విద్యావిధానాన్ని గురించి పట్టించుకోక తప్పదు. పరాయి దేశపు పరిపాలకులు తెలిసియో తెలియకయో విద్యారంగంలో తమ పద్ధతిని కడు చాకచక్యంగా పసిపిల్లల స్థాయి నుంచే ప్రవేశపెట్టారు. మనదేశంలో పసిపిల్లలకు గరిపే ప్రాథమిక విద్య ఒక ఫార్సుగా మారిపోయింది.

భారతదేశమందలి గ్రామాలను గురించిగాని, వాటి అవసరాల్ని గురించి గాని అక్కడి ప్రాథమిక విద్యావిషయాల్ని గురించిగాని ఎవ్వరూ పట్టించుకోలేదు. నిజానికి పట్టణాలను గురించి కూడా ఎవ్వరూ పట్టించుకోలేదు. గ్రామలు, పట్టణాలు రెండిటిని, భారతావనియొక్క తత్వవిశేషాల్ని దృష్టియందుంచుకొని యీవిద్యా విధానం తయారుచేయబడింది. ఈ విధానంవల్ల బాలురమనస్సు శరీరం రెండిటికీ పుష్టి లభిస్తుంది. బాలురకు తమ జన్మభూమితో అవినాభావ సంబంధం యీ విద్యావిధానం వల్ల ఏర్పడుతుంది. తమ జన్మభూమియొక్క ఉజ్వల చిత్తరువును పిల్లల హృదయాలలో నిలుపుతుంది. బాలురు బాలికలు స్కూలుకు వెళ్లడం ప్రారంభించినప్పటినుంచి తమ జన్మభూమి యొక్క భవిష్యత్తును ఉజ్వలంగా తీర్చిదిద్దుటకు పూనుకుంటారు. పునాది విద్యావిధానం కాంగ్రెస్‌వారికి ఎంతో ఆచరణయోగ్యమైనది. ఈ కార్యక్రమాలన్ని నిర్వహిస్తూ బాల బాలికలకు మేలు చేయడమే గాక తమకు కూడా కాంగ్రెస్ వాదులు ఎంతో మేలు చేసుకొనగలుగుతారు. ఈ కార్యక్రమం నిర్వహించాలని భావించే కాంగ్రెస్‌వారు అఖిలభారత తాలీమీ సంఘ్, సేవాగ్రామానికి వ్రాసి వివరాలు తెలుసుకోవచ్చు.



# 8. వయోజన విద్య

కాంగ్రెసువాదులు వయోజన విద్యను గురించి శ్రద్ధ చూపడం లేదు. యీ రంగంలో కొంత పని చేస్తున్నాను, వయోజనులకు వ్రాయడం చదవడం కొద్దిగా నేర్పి తృప్తి పొందుతున్నాను. వయస్సు మళ్లిన వారికి చదువు చెప్పవలసివస్తే నేను తద్వారా వారికి దేశం యెడ శ్రద్ధకలిగేలా చేస్తాను. మన పల్లె ప్రజలు తమ పల్లెనే దేశంగా భావిస్తారు. మరో గ్రామం వెళ్లినప్పుడు తమ గ్రామమే తమ దేశమన్నట్లుగా భావించి ఆవిధంగా మాట్లాడుతూ వుంటారు. హిందూదేశమంటే భూగోళంలో వాడబడే ఒక శబ్దమని వారి భావం. మన గ్రామప్రజలలో వర్ణించడానికి కూడా వీలులేనంత అజ్ఞానం పేర్కొనిపోయింది. పరాయిదేశపు పరిపాలకుల వల్ల మన దేశానికి

ఎంతకీడు జరిగిందో మన గ్రామ ప్రజలకు నిజంగా తెలియదు. పరాయి పరిపాలకులను గురించి మిడిమిడిజ్ఞానం పొందినందున వారిహృదయాలపై వారి ప్రభావం గాఢంగా పడిపోయింది, అందువల్ల పరాయి పరిపాలకుల్ని చూచి, వారి అధికారుల్ని చూచి భయపడిపోతారు. అయితే వారిని లోలోన వ్యతిరేకిస్తు వుంటారుకూడా. పరాయివారి ప్రభావాన్నుంచి ఎలా విముక్తి పొందాలో, వారి పరిపాలనాభారాన్ని ఎలాదించుకోవాలో వారికి తెలియదు. అసలు పరాయి పరిపాలకులు యిక్కడ తిష్ఠవేయడానికి, తమ బలహీనతలే కారణమను విషయంకూడా వారికి తెలియదు అందువల్ల పెద్దవాళ్లకు అనగా వయోజనులకు చదువు చెప్పడానికి పూనుకొని మొదట వారికి దేశాన్ని గురించి పరాయి పరిపాలకుల పరిపాలనను గురించి ముఖతః తెలియజేయాలని నా అభిప్రాయం. అంటే రాజకీయ పరిజ్ఞానం వారికి కలిగించాలన్న మాట. యీ జ్ఞానం వారికి ఎలా కలిగించాలో మొదటినుంచీ ఒక ఒకప్లాను లేక ఒక పథకం తయారై వుంటుంది. అట్టి బోధకులు ఎవరికీ భయపడవలసిన అవసరం లేదు. ఇలాంటి వ్యవహారాల్లో మొదట ప్రభుత్వాధికారులు కల్పించుకునేవారు. ఇప్పుడు ఆ కాలం గతించి పోయిందని భావిస్తున్నాను. ఒకవేళ అధికారులు కల్పించుకుంటే అందుకు వయోజనులతో మాట్లాడి విరుగుడుకు సిద్ధపడాలి. ప్రాథమిక హక్కును సాధించుకునేందుకు మనం నడుంబిగించాలి. అట్టి ప్రాథమిక హక్కునైనా సాధించుకో లేకపోతే మనకు స్వరాజ్యం లభించదు, పునాదివిద్యకు సంబంధించిన వ్యవహారం బహిరంగంగా, దాపరికం లేకుండా జరగాలని నా నిశ్చితాభిప్రాయం. అహింసా విధానంలో భయానికి తావు వుండదు. అందువల్ల దాపరికం అంటూ ఏమీ వుండకూడదు. ప్రారంభంలో ముఖతః చదువుసాగుతుంది. ఆ తరువాత వ్రాయడం, చదవడం వయోజనులు నేర్చుకుంటారు. యిందుకు బోధకులకు ప్రత్యేకమైన శక్తి అవసరం. చదువు అనగా పుస్తకం చదువుకు పట్టేసమయాన్ని తగ్గించుటకు బాగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందు నిమిత్తం పలు పరిశోధనలు జరుగుతున్నాయి. ఇందు నిమిత్తం విశేష అనుభవంగల కాంగ్రెసువాదుల కమిటి ఒకటి ఏర్పాటుకావాలి. ఆ కమిటీ

సభ్యులు నేను చెప్పిన విషయాలను, నేను ప్రకటించిన భావాలను క్షుణ్ణంగా చర్చించి, వాటిని అమలుచేస్తూ ప్రణాళిక నొకదానిని సిద్ధంచేయాలి. తద్వారా కార్యకర్తలకు సరియైన మార్గం చూపించాలి. యీ చిన్న ప్రకరణంలో చేయవలసిన పనిని మాత్రమే సూచించాను. అయితే యీ పని ఎలా చేయాలో సామాన్య కాంగ్రెసు వాదులకు తెలియకపోవచ్చు. యీ పనిచేయుటకు ప్రత్యేక శక్తి అవసరమని ముందే సూచించాను. ప్రతి కాంగ్రెస్‌వాది యీ పనిచేయలేడు. విద్యారంగంలో పనిచేసే కాంగ్రెసు వాదులు, నేను సూచించిన సూచనల ప్రకారం చదువు చెప్పుటకు ఒక క్రమ పద్ధతిని రూపొందించుకోవాలి, అలా రూపొందించుకొనుట కాంగ్రెసు వాదులకు కష్టంకాజాలదని భావిస్తున్నాను.

★ ★ ★

# 9. స్త్రీలు

హిందూ దేశపు స్త్రీలు అజ్ఞానాంధకారంలో మునిగి మ్రగ్గిపోతూ సత్యాగ్రహ విధానాలవల్ల యిప్పుడిప్పుడే కొంచెం బయట పడుతున్నారు. మరే విధానాన్ని వారు అవలంభించినా యింతత్వరగా బయటపడ గలిగేవారు కారని నా అభిప్రాయం. స్త్రీల సేవాకార్యక్రమానికి నిర్మాణ కార్యాక్రమాల్లో స్థానం కల్పించాను. స్త్రీలకు పురుషులతో సమానంగా అదేస్థాయిలో, అధికారం, ఆదరం లభించాలి. ఆ స్థాయిలో స్త్రీలు స్వరాజ్య సమరంలో పాల్గొనాలి. అయితే కాంగ్రెస్‌వాదుల బుర్రలకు యీ విషయం యింకా ఎక్కలేదు. సేవాకార్యక్రమాల్లోను, ధార్మిక కార్యక్రమాల్లోను స్త్రీలే పురుషులకు నిజమైన సహాయకులని, అనుచరులని పురుషులు యింకా గ్రహించ లేదు. గతంలో అమలుచేయబడ్డ విధానాలు, చట్టాలు పురుషులు సృష్టించినవే. అందుకు బాధ్యులు పురుషులే, స్త్రీలుకారు. ఆ విధానాలు, ఆ చట్టాలు స్త్రీలను అణచివేసి వుంచాయి. వారి మీద అత్యాచారాలు పెరిగాయి. అహింసావిధానం మీద ఆధారపడినడిచే సమాజంలో పురుషులతో సమానమైన అధికారాలు స్త్రీలకు కూడా వుంటాయి. తమ భవిష్యత్తును తీర్చి దిద్దుకునే అధికారం పురుషులకు ఎంత ఉంటుందో, స్త్రీలకు కూడా అంతే వుంటుంది. అయితే

అహింసా విధానంలో లభించే అధికారాలు కర్తవ్య నిర్వహణవల్ల, ధార్మిక సేవా కార్యక్రమాల నిర్వహణ వల్ల మాత్రమే లభిస్తాయి. అందువల్ల సాంఘిక ఆచారాలను విధానాలను స్త్రీలు పురుషులు కలిసి సంతోషంతో యిరువురి యిష్ట ప్రకారం నిర్ణయించుకోవాలి. వాటిని అమలు చేయుటకు బయటిశక్తుల ప్రమేయం వుండకూడదు స్త్రీల విషయంలో ప్రస్తుతం పురుషులు తమ ధర్మాన్ని, కర్తవ్యాన్ని పూర్తిగా గ్రహించలేదు. పురుషులు స్త్రీలను తమ సహయకురాళ్లుగా పరిగణించకుండా తాము వారికి యజమానులమని భావిస్తున్నారు. ఈనాటి భారతదేశస్త్రీలను అధోగతినుంచి చేయి పట్టుకొని పైకి లాగవలసిన బాధ్యత కాంగ్రెస్ వారిపై ఎక్కువగా వున్నది. ప్రాచీనకాలంనాటి జనానికి బానిసత్వం పోగొట్టుకోవచ్చని, స్వాతంత్ర్యం పొందువచ్చునని తెలియదు. మన దేశపు స్త్రీల విషయంకూడా అలాగే వున్నది. బానిసలకు ఆ తర్వాత స్వాతంత్ర్యం లభించింది. కొంతకాలంపాటు ఆధారమే పోయినట్లు వాళ్లకు అనిపించింది. కాని తరువాత వాళ్లు తేరుకున్నారు. పురుషులకు తాము చరణదాసీలమనే భావాన్ని స్త్రీలకు పురుషులే నూరి పోశారు.

ఇప్పుడు కాంగ్రెసువాదులు ముందుకు రావాలి. స్త్రీల అధికారాలేమిటో, వారి కర్తవ్యాలేమిటో వారికి బోధించాలి. సమాజంలో పురుషులతో బాటు సమానస్థాయిలో వ్యవహరిస్తూ యిరువురు కలిసి ఏ విధంగా నడుచుకోవాలో తెలియ చేయాలి. అందుకు తగిన విధంగా స్త్రీలకు శిక్షణ యివ్వాలి.

ఒక్కసారి మనస్సును స్థిరంచేసుకొని నిర్ణయించుకుంటే యీ విప్లవం తేలికగా సాగుతుంది. అందువల్ల కాంగ్రెసు వాదులు యీ కార్యక్రమాన్ని తమ ఇండ్లనుంచే ప్రారంభించాలి. వారు తమ భార్యల్ని, మనస్సును ఆహ్లాదపరిచే ఆట బొమ్మలని, భోగవిలాసాలకు పనికివచ్చే సాధనాలని భావించ కూడదు. వారి సేవాకార్యక్రమాల ప్రకారం తమకు జీవన యాత్రలో సహకరించే అనుచరురాలని, భావించి సన్మానించాలి. స్కూళ్లలోను, కాలేజీలలోను చదువుకునేందుకు అవకాశం లభించని స్త్రీలు తమ భర్తల దగ్గర సాధ్యమైనంత శిక్షణ పొందాలి. భార్యలకు అవసరమని భావించి బోధించిన విషయాలలో కొద్ది మార్పులు చేర్పులు చేసి తమ తల్లులకు, కూతుళ్లకు కూడా తండ్రులు కొడుకులు విద్యగరపాలి.

ఇప్పటి వరకు నేను భారతదేశపు స్త్రీల వెనుకబడినతనానికి సంబంధించిన ఏకపక్ష చిత్తరువు మాత్రమే మీ ముందు వుంచాను. గ్రామాలలో స్త్రీలు పురుషులతో పోటీపడి పనిచేస్తారు. కొన్ని విషయాలలో పురుషులకంటే ముందంజవేసి పని చేస్తారు. పురుషుల మీద అధికారం కూడా చలాయిస్తారు. బైటినుంచి తటస్థంగా వుండి చూచేవారంతా ఏకగ్రీవంగా ఒక్కవిషయం చెబుతారు. మన సమాజంలో స్త్రీలకు లభించిన అధికారాలు తక్కువే. యిప్పటి ఆచారాలు, విధానాలు, చట్టాలు వాళ్లకు అనుకూలంగా లేవు. స్త్రీలకు లభించిన కొద్దిపాటి అధికారాల్లో సైతం అనేక దోషాలు, లోటుపాట్లు వున్నాయి. వాటిని సమూలంగా సరిచేయాల్సిన అవసరం ఎంతైనా వున్నది.



# 10. ఆరోగ్య నియమాల శిక్షణ

నిర్మాణకార్యక్రమాల్లో గ్రామపారిశుధ్యాన్ని చేర్చిన తరువాత ఆరోగ్య నియమాల శిక్షణను గురించి విడిగా అధ్యాయం వ్రాయవలసిన అవసరం వున్నదా అని ఎవరైనా ప్రశ్నించవచ్చు. దాన్ని గ్రామపారిశుధ్య అధ్యాయంలోనే చేర్చవచ్చుగదా అని ఎవరైనా అనవచ్చు. అయితే నిర్మాణ కార్యక్రమాలకు సంబంధించిన వివిధ అంశాలను ఒకదానితో మరొక దాన్ని కలపడం నాకు యిష్టంలేదు. గ్రామపారిశుధ్యాన్ని గురించి చెబుతున్నప్పుడు, దానితోపాటు ఆరోగ్యనియమాల శిక్షణను ఎలా చేర్చడం? శరీరాన్ని రక్షించుకోవడం మరియు ఆరోగ్య నియమాల్ని తెలుసుకోవడం ప్రత్యేక విషయం. దానికి అభ్యాసం, అభ్యాసంవల్ల కలిగే జ్ఞానాన్ని ఆచరణలో పెట్టడం అవసరం. సువ్యవస్థితమైన సమాజపౌరులంగా ఆరోగ్య నియమాల్ని తెలుసుకొని, వాటిని ఆచరిస్తూ వుండాలి. ఆరోగ్య నియమాల్ని గురించి తెలియకపోవడం వల్ల, ఆనియమాల్ని పాటించే విషయంలో నిర్లక్ష్యంగా వ్యవహరించడం వల్ల, మానవజాతి అనేక రోగాలపాలు అయిందని, అవుతున్నదని నిర్ధారణ అయింది.. ఇతర దేశాలలో కంటే మనదేశంలో మరణించేవారి సంఖ్య ఎక్కువ. అందుకు కారణం పేదరికమే. ఈ పేదరికం మన దేశప్రజల

శరీరాల్ని ప్రాణాల్ని కబళించి వేస్తున్నది. ఆరోగ్య నియమాలను గురించి ప్రజలకు బోధిస్తే మరణాల సంఖ్య తగ్గిపోయే అవకాశం వున్నది. "మనస్సు ఆరోగ్యంగా వుంటే శరీరం కూడా ఆరోగ్యంగా వుండి తీరుతుంది." యిదే సాధారణంగా మానవ జాతియొక్క ఆరోగ్యానికి సంబంధించిన మొదటి విషయం రోగరహిత శరీరంలో నిర్వికారంగా వుండే మనస్సు వుంటుంది. యిది నిర్వివాదాంశం. మనస్సుకు, శరీరానికిగల సంబంధం స్థిరమైనది. మనమనస్సు నిర్వికారంగా వుంటే రోగ రహితంగా వుంటే, వివిధరకాల హింసలకు అందు తావు వుండదు. ఆరోగ్యాన్ని తేలికగా మనం రక్షించుకోగలుగుతాం. అప్పుడు ప్రత్యేకించి కృషి ఏమీ చేయకుండానే మనశరీరం ఆరోగ్యంగా వుంటుంది. ఏ కాంగ్రెస్‌వాదీ, ఆరోగ్య రక్షణకు అవసరమైన నియమాలను పాటించే విషయంలో అజాగ్రత్తగా వుండదని నాఅభిప్రాయం. ఆరోగ్య సూత్రాలు, ఆరోగ్య శాస్త్ర నియమాలు ఎంతో సులభంగాను, సరళంగాను బోధపడతాయి. వాటిని తేలికగా నేర్చుకోవచ్చు. అయితే వాటిని అమలుపరచడం కష్టం. కొన్ని ఆరోగ్యశాస్త్ర నియమాల్ని క్రింద తెలుపుతున్నాను.

ఎల్లప్పుడు మంచిగా యోచించు. చెడ్డతలంపులను, మురికి యోచనలను మనస్సు లోనికి చొరనీయకు. రాత్రింబవళ్లు తెరపగాలిని పీల్చు. శరీరం, మనస్సు రెండింటి పనిని సమతూకంలో వుంచు. అంటే రెండిటిని విడిపోనీయకు. నిటారుగా నుంచో. నిటారుగా కూర్చో. ప్రతిపని శుభ్రంగా చేయి. మంచి అలవాట్లను నీ ఆంతరంగిక ఆరోగ్యానికి ప్రతిబింబాలుగా రూపొందించుకో. నీవంటి వారే యితర మానవులంతా వారి సేవ చేయుటకే నీవు అవసరమైన ఆహారం పుచ్చుకో. భోగాలు అనుభవించడం కోసం బ్రతకాలని, ఆహారం పుచ్చుకోవాలని భావించకు. నీ శరీరం, నీమనస్సు మంచి స్థితిలో వుండుటకు మంచిగా పనిచేయుటకు అవసరమైనంత ఆహారమే పుచ్చుకో. మనిషి ఎటువంటి తిండి తింటాడో అటువంటి జీవితం గడుపుతాడు. తాగేనీరు, తినే తిండి, పీల్చేగాలి శుభ్రంగావుండాలి. తాజాగా వుండాలి. నేను శుభ్రంగాను శుచిగాను వున్నాను గదా అని అనుకొని

అజాగ్రత్తగా మసల వద్దు. గాలి, తిండి, నీరు యీ మూడింటి విషయంలో నీవు ఎంత జాగ్రత్తగా వుంటావో, అంత జాగ్రత్తగా నీ యిరుగుపొరుగువారి విషయంలో కూడా వుండి, వారు కూడా అలా వుండేలా చూడు నీ దరిదాపుల్లో గల వాతావరణ మందంతట అట్టి శుభ్రాన్ని, శుచిని వ్యాపింపచేయి.



## 11. ప్రాంతీయభాషలు

మనం మనమాతృభాషకంటే, ఇంగ్లీషును అమితంగా ప్రేమిస్తున్నాం. తత్ఫలితంగా చదువుకున్నవారికి, రాజకీయంగా మేల్కొన్న ఉన్నత వర్గాల వారికి, సామాన్య ప్రజానీకంతో సంబంధ తెగిపోయింది యిరువురికి మధ్య అగాధం ఏర్పడింది. అందువల్ల భారతీయభాషలు బీదవైపోయాయి. వాటికి మంచిపోషణ లభించలేదు. మనమాతృభాషలో, కఠినమైన గంభీరమైన తత్వవిచారణకు సంబంధించిన విషయాల్ని ప్రకటించాలంటే నానా అవస్థపడవలసి వస్తున్నది. మనదగ్గర సైన్సుకు సంబంధించిన పారిభాషిక శబ్దాలు లేవు. తత్ఫలితంగా ప్రమాదకరమైన ఫలితం పొందుతున్నాము. మనదేశపు సామాన్య ప్రజలు అత్యాధునిక భావాల్ని తెలుసుకోలేని స్థితిలో వుండిపోయారు. మహత్తరమైన భారతీయ భాషలు పూర్తిగా నిర్లక్ష్యం చేయబడ్డాయి. అందువల్ల మనదేశానికి అపారంగా నష్టంకలిగింది. ఆ నష్టాన్ని అంచనా వేయలేము. సరిగ్గా కొలత కూడా వేయలేము. మనమంతా యీ విధానానికి బహు సమీపంలో వున్నాము. కాని ఒక్క విషయం మనం గ్రహించాలి. కలిగిన నష్టానికి సరియైన చికిత్స చేయకపోతే, జరిగిన నష్టాన్ని పూడ్చుకోడానికి కృషి చేయకపోతే మన సాధారణ ప్రజానీకానికి మానసిక విముక్తి లభించదు. ప్రజలు అంధవిశ్వాసాలతో కొట్టుమిట్టాడుతూ వుంటారు. తత్ఫలితంగా సాధారణ ప్రజానీకం స్వరాజ్య ప్రాప్తికి సాయంచేయదు. చేయలేదు అహింసాత్మక సమాజ నిర్మాణానికి మనదేశంలో జన్మించిన ప్రతి వ్యక్తీ పూర్తి సహాయ సహకారాలు అందించాలి. మన ప్రజలు స్వరాజ్యాన్ని గురించి, అందునిమత్తం జరిగే కృషిని గురించి తెలుసుకోలేకపోతే,

దానిరహస్యాన్ని గ్రహించలేకపోతే, దాని ప్రతిమెట్టును గుర్తించలేకపోతే, స్వరాజ్య నిర్మాణానికి వారు ఎలా సహకరించగలరో చెప్పండి. తమతమమాతృభాషల్లో స్వరాజ్య సమరాన్ని గురించిన వివరాలన్ని సామాన్యజనానికి క్షుణ్ణంగా తెలియకపోతే వారి సంపూర్ణ సహకారం స్వరాజ్యోద్యమానికి ఎలా లభిస్తుంది. ?

★ ★ ★

## 12. జాతీయభాష

యావద్భారతప్రజలతో వ్యవహారాలు జరుపుటకు ఒక సామాన్య భారతీయ భాష అవసరం. ఆభాష మాట్లాడేవారి సంఖ్య ఎక్కువగా వుండాలి. దాన్ని తేలికగా నేర్చుకునేందుకు వీలు వుండాలి. అటువంటి భాష హిందీయే. ఆవిషయంలో ఎట్టి సందేహానికి తావులేదు. ఉత్తరభారతదేశంలో హిందువులు, ముస్లిములు యీభాష మాట్లడుతారు. తెలుసుకుంటారు. యీ భాషను ఉర్దూలిపిలో వ్రాస్తే దాన్ని ఉర్దూ అంటారు. 1925లో కాన్పూరులో జరిగిన కాంగ్రెస్‌లో ఒకతీర్మానం అంగీకరించి యిట్టి భాషకు హిందుస్తానీ అని పేరు పెట్టారు. అప్పటినుంచి సైద్ధాంతికంగా హిందుస్తానీ మనదేశానికి జాతీయభాషగా అంగీకరించబడింది. 'సైద్ధాంతికంగా' అను శబ్దాన్ని నేను కావాలనే ప్రయోగించాను. అందుకు కారణంవున్నది. స్వయంగా కాంగ్రెస్‌వారే ఆ భాషను అవసరమైనంతగా అభ్యసించలేదు. నిజానికి భారత దేశ సాధారణ ప్రజలకు రాజకీయ శిక్షణ నొసంగుటకు భారతీయ భాషలు అవసరం అని అంతా గుర్తించారు. అందు నిమిత్తం 1920లోనే ప్రత్యేక కృషి జరిగింది. భారతదేశ ప్రజలంతా తెలుసుకోగల ఒక దేశ భాషను వ్యాప్తంలోకి తేవాలనీ, అందరూ ఆభాషను మాట్లాడగలగాలనీ, అఖిలభారతకాంగ్రెస్ మహాసభల్లో పాల్గొనే వివిధ ప్రాంతాల కాంగ్రెస్‌వారంతా ఆభాషను తెలిసుకొని వుండాలనీ నిర్ణయం జరిగింది. ఆ భాష యొక్క రెండుశైలులు (హిందీ, ఉర్దూ), రెండు లిపుల్లో (దేవనాగరి, ఉర్దూలిపి) నేర్చుకోవాలని, దేశసమైక్యతకు యిది అవసరమని కూడా నిర్ణయం జరిగింది.

అయితే అధిక సంఖ్యలో కాంగ్రెస్‌వారు యీ నిర్ణయాన్ని పాటించలేదు. ఇది విచారకరం. అందువల్ల ప్రతిచోట సిగ్గుతో తలవంచుకోవలసిన దృశ్యం చూడవలసివస్తున్నది. ఇంగ్లీషును సమర్థించేవాళ్లు. మీ భావాలు మేము తెలుసుకొనుటకు మీరు ఇంగ్లీషులోనే మాట్లాడాలని కోరేవారు కాంగ్రెసులో ఎక్కువగా వున్నారు. అంటే ఆంగ్లభాషా వ్యామోహాన్నుంచి మనం విముక్తి పొందలేదన్నమాట. యీ వ్యామోహంలో పడి భారతదేశాన్ని లక్ష్యం వైపుకు వెళ్లకుండా మనం ఆపుతూవున్నాము. ఎన్ని సంవత్సరాలు ఇంగ్లీషు నేర్చుకొనుటకు మనం వెచ్చిస్తున్నామో, కనీసం అన్ని మాసాలు వెచ్చించినా, హిందుస్తానీ భాషను తేలికగా నేర్చుకోవచ్చు. ఆ పనిచేయకపోతే మనం సామాన్యప్రజలను గురించి చెప్పే మాటలన్నీ గప్పాలే. పోసుకోలు కబుర్లే.

## 13. ఆర్థిక సమానత్వం

నిర్మాణ కార్యక్రమాల్లో ఆర్థిక సమానత్వం అనునది అహింసాత్మక స్వరాజ్యానికి మూలం. పెట్టుబడికీ, శారీరక శ్రమకు మధ్యగల వివాదాల్ని పూర్తిగా లేకుండా చేయడమే ఆర్థిక సమానత్వం యొక్క ముఖ్యలక్ష్యం. దేశంలో గల సంపదలో అధికభాగం కొంతమంది వ్యక్తుల చేతుల్లో వుండిపోయింది. వారిదగ్గరగల ఆ సంపదను తగ్గించడం, ఆర్ధాకలితో, కట్టుకోడానికి బట్టలేక విలవిలలాడిపోతున్న కోట్లాది బీదప్రజల సంపదను పెంచడం ఆర్థికసమానత్వం యొక్క లక్ష్యం. ఒకవైపున బహుకొద్ది మంది ధనికులు, మరోవైపున కోట్లాది మంది పేదలు, వీరురివురి మధ్యగల అగాధం అలాగే వుంటే అహింసా విధానంమీద ఆధారపడే శాసనవ్యవస్థ స్థిరంగా వుండదు. స్వతంత్ర భారతదేశంలో నివసించే ధనికులు, పేదలు యిరువురి చేతుల్లో దేశ స్వరాజ్యంయొక్క శాసనాధికారం సమంగా వుంటుంది. యీనాడు ఢిల్లీలోగల పెద్ద పెద్ద భవంతులు వాటి చుట్టు ప్రక్కల గల పూరి గుడిసెలు రెండిటిమధ్య గల వ్యత్యాసం తొలిగిపోవాలి. ఒక్కరోజుగూడా ఆ వ్యత్యాసం నిలిచియుండకూడదు.

ధనవంతులు తమధనాన్ని, ఆ ధనం వల్ల లభ్యమయ్యే అధికారాన్ని తమ యిష్టప్రకారం స్వేచ్ఛగా వదులుకొని, అందరిమేలు కోరుతూ, అందరితో కలిసి మెలసి వుండాలి. లేకపోతే మనదేశంలో హింసాయుత రక్తపాతంతో కూడిన విప్లవం వచ్చి తీరుతుంది.

ధర్మకర్తృత్వాన్ని గురించి, ధనవంతులు చేయవలసిన పనులను గురించి నేను వివరించిన సిద్ధాంతాన్ని చాలామంది హేళన చేశారు. అయినా నేను ఆ నా మాటమీదే నిలబడివున్నాను. దాన్ని ఆచరణలో పెట్టడం కష్టమన్న విషయం నిజమే. అయితే అహింసా విషయంకూడా అంతే. అయినా 1920లో నిటారుగా పైకి ఎక్కాలని యీ ఆర్థికసమానత్వ విధానాన్ని అంగీకరించాం. అందుకోసం మనం చేపట్టిన కార్యక్రమాలు, మన ప్రయత్నాలు అరకొరగా వున్నాయని చెప్పకతప్పదు. నిజానికి అది పూర్తి కావలసినపని. అహింసవల్ల కలిగే పరుషార్థం నిత్యాన్వేషణ, అవిరళకృషి ద్వారానే సఫలం అవుతుంది. కాంగ్రెసువాదులు చేయవలసిన పని యీరంగంలో చాలా వున్నది. అహింస ఏమిటో, దాన్ని ఎందుకు ఆచరించాలో, అది ఏవిధంగా పనిచేస్తుందో జాగ్రత్తగాను, శ్రద్ధగాను, తెలుసుకోవాలి. యీ నాటి సాంఘిక వ్యవస్థలో, మనిషికి మనిషికి మధ్య ఏర్పడిన రకరకాల వ్యత్యాసాల్ని హింసద్వారా తొలగించుకోవాలో లేక అహింసద్వారా తొలిగించుకోవాలో తీవ్రంగా యోచించాలి. హింసామార్గం ఎలాంటిదో మనందరికీ తెలుసు. హింసా విధానం వల్ల ఏ దేశంలోనైనా యీ వ్యత్యాసాలు తొలిగాయని చెప్పగల ఒక్క ఉదాహరణనైనా నేను చూడలేదు.

అహింస ద్వారా సమాజంలో మార్పు తెచ్చుటకు కృషియిప్పుడు జరుగుతున్నది. అందుకు సంబంధించిన వివరం తయారవుతున్నది. యీ విషయమై యిదుగో దీన్ని సాధించాం అని చెప్పగల ఏ ఘనకార్యాన్ని యింకా మేము చేయలేదు. నడక ఎంత నెమ్మదిగా వున్నా, యీ విధానం ద్వారా సమానత్వం కోసం కృషి ప్రారంభమైందని మాత్రం చెప్పగలను. అహింసామార్గం హృదయపరివర్తనకు సంబంధించినది. కనుక అందువల్ల కలిగే మార్పులు

స్థిరంగా వుంటాయని చెప్పవచ్చు. అహింస మీద ఆధారపడిన సమాజం లేక దేశం, తనభవనంమీద జరిగేదాడుల్ని, అవి బైటనుంచి జరిగినా, ఆంతరికంగా జరిగినా, ఎదుర్కొగల శక్తి సామర్థ్యం కలిగి వుంటుంది, జాతీయ కాంగ్రెస్‌లో ధనవంతులైన కాంగ్రెసువాదులు వున్నారు. వారు యీ విషయమై స్వయంగా పూనుకొని యితరులకు మార్గం చూపించాలి. ప్రతికాంగ్రెస్‌వాది తన హృదయాంతరాళంలోకి ప్రవేశించి తన్ను తాను పరిశీలించుకోవాలి. మనస్వరాజ్య సమరం ప్రతికాంగ్రెస్‌వాదికి అట్టి సదవకాశం కల్పిస్తున్నది. స్వరాజ్యంకోసం మన సాగిస్తున్న సమరం విజయవంతంగా ముగిసిన తరువాత మనం నిర్మించ దలుచుకున్న స్వరాజ్య సౌధంలో సమానత్వానికి పెద్ద పీట వేయాలి. అందుకోసం యిప్పటినుంచే కృషి ప్రారంభించాలి. అందుకు యిప్పుడే పునాది పడాలి. పెద్ద పెద్ద పనులు స్వరాజ్యం లభించాక జరుగుతాయని లేక జరగాలి అని భావించే వారు తప్పటడుగు వేస్తున్నారని చెప్పకతప్పదు. అహింసాత్మక స్వరాజ్యంలో పని ఎలా జరుగుతుందో వారికి తెలియదని చెప్పవచ్చు. అహింసాత్మక స్వరాజ్యం మంచి ముహూర్తం చూచుకొని ఆకాశాన్నుంచి ఊడిక్రిందపడే వస్తువుకాదు. స్వరాజ్యమనే సౌధాన్ని నిర్మించడానికి మనమంతా కలిసి ఒక్కొక్క ఇటుకను ఒకదాని మీద మరొకటి పేరుస్తూ ముందుకు సాగాలి. అప్పుడే ఆ సౌధం నిర్మాణమవుతుంది. యీ విషయంలో మనం ఎంతో శ్రమపడి యిప్పటికే ముందుకు సాగాం. అవాంతరాలను అధిగమిస్తూ మజిలీవైపు నడుస్తున్నాం. స్వరాజ్యం సౌధపు శోభను పూర్తిగా చూడగలుగుటకు మనం యిప్పటినుంచే, శ్రమతో కూడిన పెద్ద సుదూర యాత్రకు సిద్ధంకావాలి. ప్రతికాంగ్రెస్‌వాది ఆర్థిక సమానత్వ సాధనకోసం నేను ఏం చేశాను అని తన్నుతాను ప్రశ్నించుకోవాలి. అహరహం ఆ విధంగా ప్రశ్నించుకుంటూ అందుకోసం గట్టికృషి చేస్తూ ముందడుగు వేయాలి.

★ ★ ★

# 14. రైతులు

ఈ నిర్మాణకార్యక్రమాల్లో యింకా ఎన్నో అంశాలు చోటు చేసుకోలేదు. స్వరాజ్య సౌధం భవ్యమైన పెద్ద కట్టడం. దాని నిర్మాణానికి 80 కోట్ల చేతులు పనిచేయాలి. ఆవిధంగా పనిచేసే వారిలో రైతులు అనగా పొలాల్లో పనిచేసి పంట పండించేవారి సంఖ్య ఎక్కువగా వుండాలి. నిజానికి స్వరాజ్యసౌధం నిర్మించేవారిలో (సుమారు 80 శాతం) రైతులే ఎక్కువగా వున్నారు. అందువల్ల కాంగ్రెస్ అంటే రైతులే అన్న పరిస్థితి ఏర్పడాలి. యివాళ అట్టి పరిస్థితిలేదు. రైతులకు తమ అహింసాశక్తి ఏమిటో, అది ఎంత బలవత్తరమైనదో తెలిస్తే, ప్రపంచమందలి ఏ అధికారమూ వాళ్లముందు నిలబడ లేదు.

శాసనాధికారాన్ని చేజిక్కించుకోవాలని ఆడే రాజకీయపు ఆటల్లో రైతులు ఎవ్వరికీ పావులు కాకూడదు. అనవసరంగా అందుకు రైతుల్ని వాడుకోవడం అహింసా పద్ధతికి వ్యతిరేకమని నా అభిప్రాయం. రైతులను, పాలేర్లను ఎలా సంగఠిత పరచాలో, అందుకు నా విధానం ఏమిటో తెలుసుకోవాలంటే చంపారన్‌లో జరిగిన సత్యాగ్రహసమరాన్ని గురించి తెలుసుకోవడం అవసరం. భారతదేశంలో ప్రథమ సత్యాగ్రహ సమరం చంపారన్‌లో జరిగింది. ఎంతగా విజయవంతం అయిందో యావద్భారతావనికి తెలుసు. చంపారన్‌లో జరిగిన ఉద్యమం సామాన్య ప్రజానీకపు ఉద్యమంగా రూపొందింది. అది ఆరంభంనుంచి చివరి వరకు పూర్తిగా అహింసాయుతంగా సాగింది. 20 లక్షల కంటే ఎక్కువమంది రైతులకు ఆ ఉద్యమంతో సంబంధం ఏర్పడింది. 100 సంవత్సరాలనుంచి అమలులో వున్న ఒక ముఖ్యమైన కష్టానికి, బాధకు వ్యతిరేకంగా ఆ ఉద్యమం ఆరంభించబడింది. ఆ కష్టాన్ని తొలగించేందుకై అంతకు పూర్వం పలుపర్యాయాలు రక్తపాతంతో కూడిన ఉద్యమాలు జరిగాయి. అవి సఫలంకాలేదు. కాని అహింసా యుతంగా, మేము సాగించిన ఉద్యమం ఆరుమాసాల్లో విజయం సాధించింది. తిన్నగా రాజకీయాల జోలికి పోకుండానే చంపారన్ రైతుల్లో రాజకీయచైతన్యం వెల్లివిరిసింది. అహింసాయుతంగా సాగిన ఆ ఉద్యమం విజవంతం అయ్యే సరికి రైతులు

ఆనందంతో పొంగిపోయారు. వాళ్లంతా కాంగ్రెస్‌లో చేరారు. ప్రత్యక్షంగా ప్రమాణం లభించడమే అందుకు కారణం. ఆ తరువాత జరిగిన స్వాతంత్ర్యం పోరాటాల్లో పాల్గొని బాబూ బ్రిజకిషోర్ ప్రసాద్, బాబూరాజేంద్రప్రసాద్‌గారలకు వాళ్లు తమ శక్తి సామర్థ్యాలను, సంపూర్ణ సహకారాన్ని అందజేశారు.

చంపారన్‌తోబాటు ఖేడా, బార్డోలి, బోర్సద్‌ల్లో జరిగిన రైతుపోరాటాలను గుఱించి కూడా పాఠకులు తెలుసుకోవడం అవసరం. అందువల్ల లాభంకలుగుతుంది. రైతుపోరాటాల్లో విజయం సాధించుటకు ఒక రహస్యం వున్నది. రైతులు పడుతున్న బాధల్ని తొలిగించుటకు వారు ఎదుర్కొంటున్న తీవ్రమైన సమస్యల్ని పరిష్కరించి వారికి సౌకర్యాలు కలిగించుటకు పూనుకున్నవారు అంతవరకే సీమితం కావాలి, అంతేగాని వారి శక్తిని తమరాజకీయ ప్రయోజనానికి వినియోగించుకోకూడదు. అదివారి శక్తిని దురుపయోగం చేయడమే అవుతుంది. కనుక అట్టి పనిచేయకూడదు. ఒక కష్టాన్ని , ఒక బాధను తొలిగించుటకు ఒక ఉద్యమం ప్రారంభిస్తే వారు దాన్ని తేలికగా అర్థం చేసుకుంటారు. అహింసను గురించి వారికి ఉపదేశాలు యివ్వనక్కరలేదు. వారి బాధల్ని తొలిగించుటకు అహింసా విధానాన్ని వినియోగించాలి. మీ బాధల్ని తొలిగించుటకు అహింసా విధానం వినియోగించబడిందని వారికి చెప్పాలి. అప్పడు వారు వెంటనే అహింసను గుర్తిస్తారు. దాని - రహస్యాన్ని, శక్తిని తెలుసుకుంటారు.

ఈ విషయమై అభిరుచి వున్న కాంగ్రెస్‌వాదులు పైన తెలిపిన ఉదాహరణలను అధ్యయనంచేసి రైతులతో కలిసిమెలిసి వుండి వారికి ఎలా సేవచేయాలో తెలుసుకోవాలి. ఒక్క విషయం చెప్పతలుచుకున్నాను. రైతు సంఘాలను సంఘటితం చేయుటకు పూనుకున్న కొంతమంది కాంగ్రెస్ వాదుల కృషి వల్ల రైతులకు ఏమీ ప్రయోజనం చేకూరలేదు. నష్టమే కలిగియుండవచ్చు. లాభనష్టాల జోలికి పోకుండా మొత్తంమీద కాంగ్రెస్‌వారు చేపట్టిన కార్యక్రమాలు అహింసాపద్ధతిన జరగలేదని చెప్పకతప్పదు. అహింసావిధానాన్ని మేము అంగీకరించడంలేదని కొందరు కాంగ్రెస్ వాదులు స్పష్టంగా చెప్పడం జరిగింది. అలాంటి కార్యకర్తలకు ఒక్క సలహా

యివ్వాలని భావిస్తున్నాను. మీరు చేసే కార్యక్రమాలతో కాంగ్రెసు పేరును చేర్చకండి, కాంగ్రెస్‌వాదిగా అట్టి కార్యక్రమాలు నిర్వహించకండి. ఇప్పటివరకు నేను వివరించిన విషయాల వల్ల అఖిలభారతస్థాయిలో రైతులను, కార్మికులను సంఘటిత పరచాలనే కృషి పోటాపోటీగా జరిగిందని ఆ కృషికి నేను దూరంగా వున్నానని పాఠకులకు బోధపడి వుంటుంది. అందరం కలిసి ఏకోన్ముఖంగా కృషి చేస్తే ఎంతో మేలు జరుగుతుంది. అయితే విశాలమైన మన దేశంలో యిట్టి కృషి సాధ్యం కాకపోవచ్చు. ఈ విషయాల్ని యిక వదిలివేద్దాం. అహింసా పద్ధతిలో ఎవరిమీద, ఏ విధమైన వత్తిడి చేయడానికి వీలులేదనుమాట నిజం. అహింసా పద్ధతిన జరిగే కార్యక్రమాలు, తర్కానికి నిలబడే ఆధారాలు, రెండూ కలిసి సాగితే కొంతపని తప్పక జరుగుతుంది.

కాంగ్రెస్ ఆధ్వర్యంలో ఒక ప్రత్యేక శాఖను ఏర్పాటు చేసి, కార్మికులవలె రైతుల, పాలేర్ల సమస్యలను పరిష్కరించుటకు కృషి జరగాలని నా అభిప్రాయం.



## 15. కార్మికులు

అహమదాబాదులో జరిగిన కార్మిక సంఘం వారు సాగించిన ఉద్యమం అందరు అనుసరించతగినది. అది అహింసా పునాదిపై నిలబడి సాగిన ఉద్యమం. ఇప్పటివరకు ఆ ఉద్యమానికి ఎదురులేదు. వెనకంజ వేయనవసరంలేని ఉద్యమంగా అది రూపొందింది. ఏ విధమైన అలజడి, గందరగోళం ఆడంబరం, చీకటివ్యవహారాలు లేనందువల్ల ఆ ఉద్యమశక్తి ఎంతో పెరిగింది. కార్మికులకు సొంత ఆసుపత్రి ఏర్పడింది. కార్మికుల పిల్ల చదువుకోసం సొంత స్కూళ్లు వెలిశాయి. వయస్సుదాటిన కార్మికులకు చదువు నేర్పుటకు క్లాసులు సాగాయి. సొంత ప్రెస్సువున్నది. ఖాదీభండారు వున్నది. కార్మికులు నివసించుటకు ఇళ్లు కూడా నిర్మించబడ్డాయి. అహమదాబాదు నగరానికి సంబంధించిన కార్మికులందరి పేర్లు ఓటర్ల లిస్టులో చేర్చబడ్డాయి. ఎన్నికల్లో అక్కడి కార్మికులు విజృంభించి పాల్గొనడం ప్రారంభించారు. ప్రదేశ్

కాంగ్రెస్ కమిటి కోరిన మీదట కార్మికులు తమ పేర్లను ఓటర్ల పట్టికలో చేర్చారు ఈ కార్మికసంఘం, కాంగ్రెస్ కమిటీ యొక్క మురా రాజకీయల్లో పాల్గొనలేదు. పట్టణ న్యూ మునిసిపాలిటీ విధానం మీద కార్మిక సంఘ ప్రభావం పడింది. ఈ సంఘం పక్షాన అనేక సమ్మెలు విజయవంతంగా జరుపబడ్డాయి. ఈ సమ్మెలన్నీ పూర్తిగా అహింసాయుతంగా జరిగాయి ఇక్కడి యజమానులు, కార్మికులు తమ సమస్యల్ని పరిష్కరించు కొనుటకు పూర్తిగా మధ్యవర్తుల మీద ఆధారపడ్డారు. అంటే మధ్యవర్తుల తీర్పును యిరువురు సంతోషంతో అంగీకరించారన్నమాట. నాచేతనైతే భారతదేశంలోగల కార్మిక సంఘాలన్నింటిని అహమదాబాద్ కార్మిక సంఘం పద్ధతిన నడిపిస్తాను. అఖిల భారతట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ వ్యవహారాల్లో తలదూర్చుటకు అహమదాబాద్ కార్మిక సంఘం ఎన్నడూ ప్రయత్నించలేదు. దాని ప్రభావానికి కూడా ఎన్నడూ లోనుకాలేదు. అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, అహమదాబాద్ కార్మికసంఘం విధానాన్ని అనుసరించాలని, అఖిలభారతట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో, అహమదాబాదు కార్మికసంఘం కలిసిపోవాలని నేను ఆశిస్తున్నాను. అయితే యిందుకు తొందరపడనక్కరలేదు. సమయం వచ్చినప్పుడు, ఆ రోజు తనంతటతాను వచ్చితీరుతుంది.

★ ★ ★

## 16. ఆదివాసీలు

రాణీ ప్రజలు అను శబ్దంవలె ఆదివాసీలు అనుశబ్దం కూడా క్రొత్తగా ప్రయోగంలోకి వచ్చింది. రాణీ ప్రజలు అను శబ్దానికి పూర్వం కాలీ ప్రజలు (అనగా నల్ల రంగుగల అని అర్థం. వాస్తవానికి వాళ్ల చర్మంరంగు, యితర నల్లవారికంటే, ఎక్కువ నలుపు కాదు) అయినా ఆ శబ్దం ప్రచారంలో వుండేది. రాణీ ప్రజలు అను శబ్దాన్ని శ్రీ జుగతరామ్ దవే సృష్టించారని నా అభిప్రాయం. భిల్లులు, గోండ్లు మొదలగువారి పేర్లవలె వీళ్లకు అనేక పేర్లు వున్నాయి. పర్వతాల ప్రాంతాల్లోను, అడవి ప్రాంతాల్లోను వుండేవీరికి వేరువేరు పేర్లువున్నాయి. క్రొత్తగా పెట్టిన పేరు ఆదివాసీలు. అంటే

ప్రజలందరికి పూర్వం అనగా ప్రాచీన కాలాన్నుంచి యిక్కడ నివసిస్తున్నవారు అని, ఆదివాసీ అను శబ్దానికి అభిదార్థం. ఆదివాసీలు అనుశబ్దాన్ని శ్రీ రక్కర్‌బాపా సృష్టించారు

ఆదివాసీల సేవకూడా నిర్మాణ కార్యక్రమాల్లో చేర్చబడింది. నిర్మాణ కార్యక్రమాలకు సంబంధించిన వివిధ అంశాలను గురించి జరిగిన చర్చల్లో ఆదివాసీల సేవాకార్యక్రమానికి 16వ నెంబరు లభించింది. దీన్ని సాకుగా తీసుకొని ఆదివాసీల సేవ యెడ ఎవ్వరూ నిర్లక్ష్యం చూపకూడదని నా అభిప్రాయం. మనది విశాలమైన దేశం ఇక్కడ నివసించే తెగల లేక జాతుల ప్రజలు అనేక మంది వున్నారు. మన దేశంలో వుండే జనాన్ని గురించి, వారి తెగల్ని గురించి తెలుసుకోవాలని ప్రయత్నిస్తే వారు ఎంత తెలివిగల అనుభవజ్ఞులైనా సాధ్యంకాదు. వారి స్థితిగతుల్ని గురించి తెలుసుకోవడం కూడా కష్టమే. మన దేశంలో నివసించే ప్రతి తెగవారు, యితర తెగలవారిని గురించి, తెలుకొని వారి కష్టసుఖాలు కూడా తమ కష్టసుఖాలవంటివే అని గ్రహించగలిగితే, మనమంతాఒక్కటే అనుభావం కలుగుతుంది. అప్పుడు మనది ఎంత విశాలమైన దేశమో, విభిన్నత్వంతో కూడిన దేశమో బోధపడుతుంది. ఇంతమంది మధ్య జాతీయసమైక్యతను సాధించడం ఎంత కష్టమో కూడా బోధపడుతుంది.

భారతదేశమందంతట నివసిస్తున్న ఆదివాసీల సంఖ్య రెండు కోట్లవరకు వున్నది. రక్కర్ బాపా గుజరాత్ ప్రాంతంలో గల భిల్లులకు సేవచేయడం ప్రారంభించారు. 1940లో ఠాణా జిల్లా సేవా కార్యక్రమాన్ని, శ్రీ బాలాసాహబ్ ఖేర్ సహజసిద్ధంగా తనకు అలవడిన సేవాభావంతో చేపట్టారు. ఇది ఎంత ముఖ్యమైన కార్యక్రమమో వారికి తెలుసు. ఇప్పుడు వారు ఆదివాసీ సేవామండలికి అధ్యక్షులుగా వున్నారు. హిందూదేశపు యితర ప్రాంతాల్లో అనేకమంది సేవకులు సేవాకార్యక్రమాలు నిర్వహిస్తూ ఉన్నారు. అయినా అట్టివారి సంఖ్య తక్కువగానే వున్నది. సేవారూపంలో పంట అమితంగా పండిందేగాని, ఆ పంటను కోసుకునేవారు ఎక్కువమంది లేరనుమాట నిజం. అయితే యిది భూతదయ వంటి సేవా కార్యక్రమంకాదు. ఇది ప్రత్యేక

స్థాయికి చెందిన దేశ సేవాకార్యక్రమం. ఇది మన ప్రధాన లక్ష్యమైన సంపూర్ణ స్వరాజ్యం దగ్గరకు మనల్ని త్వరగా చేరుస్తుంది.

★ ★ ★

# 17. కుష్టురోగులు

కుష్టు అనునది చెడ్డ, హీన మైన శబ్దం. కుష్టుకు నిలయమని మధ్య అఫ్రికాకు ప్రథమస్థానం లభించితే, మన భారతదేశానికి ద్వితీయస్థానం లభించింది. అయినా మన దేశంలో, గొప్ప వారికి, పెద్దలని అనుకోబడే వారికి ఎంత స్థానం వున్నదో, కుష్టురోగులకు కూడా అంతే స్థానం వున్నదని, అందరూ మన సమాజానికి సంబంధించినవారేనని మనం గ్రహించాలి. కాని పై తరగతికి చెందిన కొద్దిమంది మీద మాత్రమే మనం దృష్టిని కేంద్రీకరిస్తున్నాం. కాని అట్టి వారు మాత్రం తమతోబాటు వున్నవారిని పట్టించుకోవడం లేదు. నిజానికి కుష్టురోగుల్ని గురించి పట్టించుకోవడం చాలా అవసరం. వారిని గురించి పట్టించుకోవడం లేదు సరిగదా, వారిని నిర్లక్ష్యంగాను, హృదయహీనంగాను చూస్తున్నాం. హృదయహీనంగా అను శబ్దంకంటే మించిన శబ్దం మరొకటిలేదు. మనదేశంలో క్రిస్టియన్ మిషనరీలు మాత్రమే కుష్టురోగులను గురించి పట్టించుకుంటున్నారు. వారు నిజంగా అభినందనీయులు. కుష్టురోగుల మంచి చెడులు చూచుటకు హిందూ దేశస్థుల పక్షాననడిచే ఏకైక సంస్థ వార్ధా సమీపంలో పనిచేస్తున్నది. శ్రీమనోహరదీవాన్ దాన్ని ప్రేమభావంతో నడుపుతున్నారు. ఈ సంస్థకు శ్రీ వినోబా ప్రేరణ, మార్గదర్శకత్వం లభించింది. హిందూదేశంలో నిజంగా నవజీవన సంచారం జరిగి వుంటే, యిక్కడి ప్రజలు త్వరగా పూర్తి స్వరాజ్యాన్ని సాధించాలని హృదయపూర్తిగా కోరుతూ వుంటే, మన దేశంలో ఒక్క కుష్టురోగిగాని, ఒక్క బిచ్చగాడుగాని మిగిలియుండకూడదు. అట్టివారు మిగలియుంటే మన సేవలు వారికి అందనట్లే కదా! నిర్మాణ కార్యక్రమాల్లో కొద్ది మార్పులు చేసి ప్రకటించిన యీ ప్రచురణ యందు, మన నిర్మాణ కార్యక్రమాల గొలుసులో ఒక ముఖ్యమైన భాగంగా కుష్టు రోగ నివారణకు

ప్రాధాన్యం యిస్తున్నాను. అందుకు కారణం వున్నది. మన దేశంలోగల జనాభాలో కుష్ఠురోగులకు ఎంత హీన స్థితి లభిస్తున్నదో,అభివృద్ధి చెందిన ప్రపంచదేశాలలో మన భారతదేశానికి అంత హీనస్థితి లభిస్తున్నది మన చుట్టు ప్రక్కల పరిసరాలలో గల పరిస్థితుల్ని మనం జాగ్రత్తగా పరిశీలించి చూస్తే యీ విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది. సముద్రాల ఆవలి తీరాల్లో నివసిస్తున్న మన భారతీయుల స్థితిగతుల్ని పరిశీలించి చూస్తే నేను చెప్పిన విషయం నిజమని స్పష్టంగా బోధపడుతుంది.

★ ★ ★

# 18. విద్యార్థులు

నిర్మాణ కార్యక్రమాలను గురించి చర్చ జరిగినప్పుడు విద్యార్థులకు చివరి అధ్యాయం యిచ్చాను. నేను మొదటి నుంచి విద్యార్థులతో దగ్గర సంబంధం పెట్టుకున్నాను. ఆ సంబందాన్ని పెంచుకున్నాను. విద్యార్థులు నన్ను ఎరుగుదురు. నేను వారిని ఎరుగుదును. వాళ్లు నాపనిని అమితంగా చేశారు. కాలేజీలనుంచి బయటికి వచ్చిన అనేక మంది విద్యార్థులు యివాళ నాతోబాటు పనిచేస్తున్నారు. నేటి విద్యార్థులే భవిష్యత్తులో దేశానికి ఆశాజ్యోతులని నాకు తెలుసు. సహాయనిరాకరణోద్యమం దేశమందంతటా విజృంభించి జరుగుతూ వున్నప్పుడు స్కూళ్లను, కాలేజీలను బహిష్కరించమని పిలుపు యిచ్చాను. చాలా మంది విద్యార్థులు నా పిలుపు ప్రకారం స్కూళ్లు, కాలేజీలు వదిలి బయటికి వచ్చివేశారు. స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. నాతోబాటు వివిధ దేశ సేవారంగాల్లో పాల్గొంటున్నారు. అందువల్ల ఇటువారికీ, అటుదేశానికి ఎంతో మేలు జరిగింది. నేను మళ్లీ అట్టి పిలుపు యివ్వలేదు. అనువైన గాలి, వాతావరణం లేకపోవడమే అందుకు కారణం. అయితే ఆనాడు కలిగిన అనుభవం వల్ల సూళ్లలోను, కాలేజీల్లోను మన విద్యార్థులకు లభిస్తున్న శిక్షణ ఎంత పనికిమాలినదైనా ఎంత కృత్రిమమైనదైనా దాని ప్రభావం అమితంగా పడిందని తెలుసుకున్నాను. కాలేజీలో చేరి చదివితే 'కేరియర్' మారిపోతున్నది. అంతేగాక బ్రిటిష్ ప్రభుత్వం వాళ్లు మన దేశంలో

శ్వేతదుస్తులు ధరించే తెగనొకదాన్ని సృష్టించారు. కాలేజీలో చేరితే ఆ శ్వేత దుస్తుల తెగలో చేరుటకు ప్రవేశపత్రం లభించినట్టే, సహజసిద్ధమైన, క్షమించుటకు వీలైన జ్ఞానం పొందాలనే ఆకలి సబబైనదే కదా! అందుకు తయారుచేయబడ్డ మార్గాన నడవకపోతే పని జరగదుకదా! మాతృభాష యొక్క స్థానాన్ని దిగమ్రింగి కూర్చున్న పరాయి భాషను నేర్చుకునేందుకై వ్యర్థం చేసుకుంటున్న సంవత్సరాల తరబడి కాలాన్ని చూచి శ్వేతదుస్తుల వారు బాధపడటం లేదు. అందువల్ల జరుగుతున్నద్రోహం ఏమిటో, తగిలే పాపం ఏమిటో వారు గ్రహించడంలేదు.

ఈనాటి విద్యార్థుల మనస్సుల యందు, వారికి శిక్షణగరిపే ఉపాధ్యాయుల మనస్సులయందు ఏదో ఒక రకమైన దయ్యం ప్రవేశించి వారిని ఆవహించింది. ఇట్టివారి దృష్టిలో నేటి యుగంలో నూతన భావాల్ని, ఆధునిక విజ్ఞానశాస్త్రాన్ని తెలుసుకొనుటకు తమ ఇంటి భాషలు అనగా తమ మాతృభాషలు పనికిరావని, అవి దద్దమ్మ భాషలని ఒక భావం వారి హృదయాల్లో గాఢంగా నాటుకున్నది. ఇదంతా చూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. జపానువారిని చూడండి. వాళ్లు తమ పనులు ఎలా నిర్వహిస్తున్నారో చెప్పండి! నాకు తెలిసినంతవరకు వారు శాస్త్రాలన్నింటిని స్వభాషలోనే బోధిస్తున్నారు. చైనా దేశపు అందరికంటే పెద్ద అధికారి జనరల్ స్పిమోచ్యాంగ్కై షేక్ గారికి ఇంగ్లీషు రానట్లేలెక్క.

కాని మన విద్యార్థులు మాత్రం యీ విషయంలో ఎలా వున్నారో అలాగే వున్నారు. ఈ నవయువకులే, నవయువతులే భావిభారత పౌరులవుతారు. వారి మీదపడే ప్రభావాల్ని చూచి దురదృష్టకరం అని విచారిస్తున్నాను. అహింసను గురించి వారికి ఆకర్షణ అసలు లేదు. దెబ్బకుదెబ్బ, గుద్దుకు గుద్దు, లేక ఒకదెబ్బకు రెండు దెబ్బలు,ఒక గుద్దుకు రెండు గుద్దులు అను భాష మన వాళ్లకు అర్థమవుతున్నది. తాత్కాలికమైనదే అయినా అందు ఫలితం వారికి వెంటనే కనబడుతుంది. వెంటనే అనుభవంలోకి వస్తుంది. తాత్కాలికమైనదా లేక శాశ్వతమైనదా అను విషయం వారికి అనవసరం. కొట్లాట జరుగుతున్నప్పుడు పశువుకు పశువుకు మధ్య, మనిషికి మనిషికి

మధ్య జరిగే హింసాత్మకమైన, పాశవీశక్తికి సంబంధించిన ఎన్నటికీ అంతంకాని పోటాపోటీలతో కూడిన రక్తపాతం మాత్రమే జరుగుతుంది. అదే వారికి కావాలి. కాని అహింసను సరిగ్గా అర్థంచేసుకొనుటకు ధైర్యంతోపాటు పరిశీలన, విశ్లేషణ అవసరం ధైర్యం సహనంతోకూడిన ఆచరణ ముఖ్యం. రైతుల, కార్మికుల వ్యహారాల్లో ఏ కారణంవల్ల, నేను వేరే మార్గంతొక్కానో, ఆ కారణంవల్లనే విద్యార్థుల హృదయాలపై హింసా విధానంతో ముద్రవేద్దామనుకున్న వారి మార్గాన్ని నేను అనుసరించలేదు. విద్యార్థి అను శబ్దానికి విశాలమైన అర్థం తీసుకుంటే నేను కూడా యీ నాటికీ విద్యార్థినే. అయితే నా యూనివర్సిటి మరొకరకమైనది. నేను పరిశోధన చేస్తున్న యూనివర్శిటీలో చేరమని శాశ్వత ఆహ్వానపత్రం అందరికీ అందజేస్తున్నాను. అందుచేరుటకు క్రింద తెలిపిన నియమనిబంధల్ని పాటించితీరాలి.

1. విద్యార్థులు ముఠా రాజకీయల్లో ప్రవేశించకూడదు. విద్యార్థులు విద్యార్జన చేస్తూ, జ్ఞానాన్ని గురించి పరిశోధనలు కావించునట్టివారేకాని రాజకీయ కిలాడీలు, ఆటగాళ్లు కాదు. కాకూడదు.

2. విద్యార్థులు రాజకీయ సమ్మెలుచేయకూడదు. వీరుల పూజలు చేయవచ్చు. అయితే వారి వీరులు జైళ్లకు వెళ్లినప్పుడు లేక చనిపోయినప్పుడు, లేక ఉరితీయబడినప్పుడు, వారి యెడ తమకు గల భక్తిని ప్రకటించుటకు వారి మంచి గుణాల్ని ఆచరణలో పెట్టాలి. అంతేగాని వారి కోసం సమ్మెలు చేయకూడదు. అట్టి పరిస్థితిల్లో విద్యార్థులందరికీ వారి ఎడ భక్తి శ్రద్ధలు అధికమైపోయినా, తమ స్కూళ్లు, కాలేజీలు, అందుకు సంబంధించిన అధికారుల సమ్మతితో మూసివేయుటకు న్యాయంగా వీలులేని యెడల, తగిన సక్రమ పద్ధతుల్లో సభ్యతతో, తమతమ సంస్థలనుంచి బైటికి వచ్చి వేయాలి. సంస్థల అధికారులు పశ్చాత్తాపపడి తిరిగి ఆహ్వానించనంతవరకు లోనికి అడుగుపెట్టకూడదు. తమతో ఏకీభవించని తోటి విద్యార్థుల మీద, అధికారులమీద బలవంతంగా వత్తిడి తీసుకొనిరాకూడదు. మర్యాదగా వ్యవహరిస్తూ తామంతా కలిసి ఐక్యంగావుంటే విజయం తమనే వరిస్తుందను విషయం మరిచి పోకూడదు. ఇది విద్యార్థులు గమనించవలసిన ముఖ్యమైన విషయం.

3. సేవాభావంతో శాస్త్రీయమైన పద్ధతుల్లోవిద్యార్థులు నూలుపడుకు పనిచేయాలి వడుకు పరికరాలు, తదితర పరికరాలు పరిశుభ్రంగా వుంచుకోవాలి. సాధ్యమైతే తమ పరికరాలను స్వయంగా తయారు చేసుకోవాలి. అప్పుడు వారు వడికిన నూలు మంచిగావుంటుంది. వడుకు కార్యక్రమానికి సంబంధించిన సాహిత్యాన్ని బాగాఅధ్యయనం చేయాలి. అందుకు సంబంధించిన ఆర్థిక, సాంఘిక, నైతిక, రాజకీయ విశేషాలను అధ్యయనం చేసి ఆకళింపుచేసుకోవాలి.

4. ధరించుటకు, కప్పుకొనుటకు విద్యార్థులు సదా ఖద్దరు బట్టలనే వాడాలి. గ్రామాల్లో తయారైన స్వదేశీ వస్తువులనే వాడాలి. అంతేగాని విదేశాలలో తయారైన వస్తువుల్ని, యంత్రాలపై తయారయే వస్తువుల్ని వాడకూడదు.

5. వందేమాతరం పాట పాడమని, జాతీయజండాను ఎగురవేయమని పరులపై వత్తిడి తీసుకురాకూడదు. జాతీయ జండాకు సంబంధించిన బిళ్లలు తాము అలంకరించుకోవచ్చుగాని, అలంకరించుకోమని యితరులపై వత్తిడి తీసుకొని రాకూడదు.

6. త్రివర్ణపతాకం యొక్క సందేశాన్ని ఆకళింపుచేసుకొని దాన్ని ఆచరణలో పెట్టాలి. అస్పృశ్యతాభావాన్ని, మతసమైక్యతా భావాన్ని హృదయపూర్తిగా అమలులో పెట్టాలి. ఇతర మతాలకు చెందిన విద్యార్థులతో స్నేహం చేయాలి.

7. కష్టాలలో వున్న పొరుగువారికి తోడ్పడాలి. సమీపంలోగల గ్రామాలకు వెళ్లి అక్కడ పారిశుధ్య కార్యక్రమాలు, పాకీ పని నిర్వహించాలి. గ్రామాలలో గల పెద్దలకు, పిల్లలకు చదువు చెప్పాలి.

8. ఉర్దూ, హిందీ శైలుల్లో, రెండు లిపుల్లో జాతీయ భాషయగు హిందుస్తానీ భాషను నేర్చుకోవాలి. రెండు శైలులలో మరొకరు మాట్లాడినప్పుడు తాము తెలుసుకోవాలి. రెండు లిపుల్లో వ్రాసినప్పుడు తాము చదవగలగాలి. ఆ విధంగా జాతీయ భాష నేర్చుకొని దేశ సమైక్యతకు సహకరించాలి.

9. తాము నేర్చుకున్న క్రొత్త విషయాలను తమ మాతృభాషలో వ్రాసి

భద్రపరుచుకోవాలి సమీపంలోగల గ్రామాలకు వెళ్లినప్పుడు ఆ వివరాలను వెంటతీసుకొని వెళ్లి అక్కడివారికి తెలియజేయాలి

10. రహస్యంగా వారు ఏ పనీ చేయకూడదు. బహిరంగంగా ప్రతిపని చేస్తూ వుండాలి. తాము చేసే ప్రతిపని పరిశుద్ధంగా చేయాలి. తాము పరిశుద్ధంగా వుండాలి. తమ జీవితాల్ని సంయమం గాను, నిర్మలంగాను మలుచుకోవాలి దేనికీ వారు భయపడకూడదు తమ బలహీనులైన అనుచరుల రక్షణకు పూనుకోవాలి. కొట్లాటలు జరిగినప్పుడు ధైర్యంగా ముందడుగు వేసి మృత్యువును సైతం ఎదుర్కొని అహింసాయుతంగా వ్యవహరించి శాంతిని నెలకొల్పుటకు ప్రయత్నించాలి

పూర్ణ స్వరాజ్యం కోసం జరిగేఅంతిమ పోరాటంలో పాల్గొనాలి. అవసరమైతే స్వరాజ్య సమరంలో తమప్రాణాల్ని సైతం సమర్పించేందుకు సిద్ధపడాలి.

11. తమతో పాటు విద్యార్జన చేయు విద్యార్థినులయెడ సత్ప్రవర్తనతో మెలగాలి. సభ్యతగా వ్యవహరించాలి.

పైన నేను తెలియజేసిన కార్యక్రమాలు నిర్వహించుటకు విద్యార్థులు సమయం కేటాయించాలి. విద్యార్థులు తమ అమూల్యమైన ఎంతో సమయాన్ని వ్యర్థంచేస్తూ వుంటారనే విషయం నాకుతెలుసు. అట్టి సమయాన్ని వ్యర్థం చేయకుండా కఠినంగా వ్యవహరించి నేను సూచించిన కార్యక్రమాలు సక్రమంగా నిర్వహించుటకు గంటలాది సమయాన్ని వెచ్చించుటకు సిద్ధపడాలి. ఏ విద్యార్థిపైనా అనవసర ప్రభావాన్ని మోపడం నాకు యిష్టంలేదు. అందువల్ల దేశ ప్రేమగలిగిన దేశభక్తులకు విద్యార్థులకు తమ విద్యార్జనాకాలం మొత్తంలో ఒక ఏడాదిపాటు కాలం వినియోగించమని సలహా యిస్తున్నాను. ఒకేసారి ఒక సంవత్సరం కాలం వెచ్చించమని సలహాయివ్వను. తాము వెచ్చించిన ఏడాది కాలం ఎన్నో సత్ఫలితాల నిచ్చిందని తెలుసుకొని విద్యార్థులు సంతోషించగలరని భావిస్తున్నాను. తమ యీ సేవా కార్యక్రమాలద్వారా దేశ స్వాతంత్ర్యానికి విద్యార్థులు అమోఘంగా సహకరించినవారు అవుతారని భావిస్తున్నాను. దానితోబాటు తమ శారీరిక, మానసిక నైతిక శక్తులను పెంపొందించుకొనగలరని విశ్వసిస్తున్నాను.

★ ★ ★

# సవినయ చట్ట ధిక్కారం

నిర్మాణ కార్యక్రమాల్ని అమలు చేయుటకు మనం సంపూర్ణ దేశ ప్రజల సహకారం పొందగలిగితే, పరిశుద్ధమైన అహింసాత్మక శక్తితో స్వాతంత్ర్యం పొందుటకు సహాయనిరాకరణోద్యమాన్ని గాని లేక సవినయచట్ట ధిక్కారోద్యమాన్ని గాని ఆశ్రయించవలసిన అవసరంవుండదు. వ్యక్తికి గాని, దేశానికి గాని యిటువంటి అదృష్టం అంత తేలికగా లభించదు. దేశమందంతట వ్యాప్తమైన అహింసయొక్కశక్తి సామర్థ్యాలయందు సవినయ చట్ట ధిక్కారానికి, లేకసత్యాగ్రహానికి గల స్థానమేమిటో తెలుసుకోవడం అవసరం.

సవినయచట్ట ధిక్కారానికి మూడు వేరు వేరు పనులువుంటాయి.

1. స్థానికంగా జరిగిన అన్యాయాన్ని, ఆరోపణల్ని ఎదుర్కొని వాటిని అరికట్టేందుకు విజయవంతంగా సవినయ చట్టధిక్కార విధానాన్ని ఉపయోగించవచ్చు.

2. ప్రత్యేకించి పేర్కొనతగిన అన్యాయానికి, లేక చెడుకు వ్యతిరేకంగా, దాన్ని అడ్డుకోవాలనే లక్ష్యం పెట్టుకోకుండా, స్థానిక ప్రజలను దాన్ని గురించి తెలియజేయుటకు, ప్రజల హృదయాలపై ప్రభావం పడేలా చేయుటకు ఆత్మబలిదానం చేయుభావంతో సవినయచట్టధిక్కారం చేయవచ్చు. చంపారన్‌లో జరిగింది యిదే. చేస్తున్న పని యొక్క ప్రభావం ఏమి పడుతుందోనని ఆలోచించకుండా, ప్రజలు అభిరుచి చూపించరనే పూర్తి విశ్వాసంతో చట్టాన్ని సవినయంగా ధిక్కరించాను. నేను చేసిన యీ చర్యయొక్క ప్రభావం, నేను ఊహించకుండానే అత్యధికంగా ప్రజలపై పడింది. దీన్ని మీరు మీ అభిరుచికి అనుకూలంగా దేవుని దయయనో, లేక అదృష్టం కలిసొచ్చిందనో భావించవచ్చు.

3. నిర్మాణ కార్యక్రమాలకు ప్రజల సహకారం పూర్తిగా లభించని యెడల, అందుకు బదులు 1941లో జరిపిన సత్యాగ్రహం వలె సవినయ చట్టధిక్కారోద్యమం ప్రారంభించవచ్చు. ఆ సమరం మన సంపూర్ణ స్వాతంత్ర్యోద్యమంలో ఒక భాగంగాను, మనసంపూర్ణ స్వాతంత్ర్యోద్యమానికి బలం చేకూర్చే సాధనంగాను ప్రారంభించబడింది. అయినా ఆ సమరం వాక్

స్వాతంత్ర్యంవరకే పరిమితం చేయబడింది. సవినయచట్ట ధిక్కారోద్యమాన్ని పెద్ద లక్ష్యంకోసం, అనగా పూర్ణ స్వరాజ్యంకోసం సాగించుటకు వీలులేదు. సమరం స్పష్టంగా, ఎదురుగా వున్నవారికి అర్థమయ్యేలా వుండాలి. ఆవలివారు తేలికగా ఆ పనిపూర్తి చేయుటకు అనుకూలంగా కూడా వుండాలి. ఈ విధంగా సాగే సమరం తేలికగా మనల్ని లక్ష్యానికి చేరుస్తుంది.

ఇక్కడ సవినయ చట్ట ధిక్కారోద్యమ సంపూర్ణ పరిధిని గురించి, దాని పరిణామాల్ని గురించి నేను విశదీకరించడంలేదు. నిర్మాణ కార్యక్రమాలకు. సవినయ చట్టధిక్కారోద్యమానికి గల సంబంధాన్ని పాఠకులకు తెలియజేసేందుకు అవసరమైన వివరం మాత్రమే తెలుపుతూ వున్నాను. పైన తెలిపిన రెండు ఉదాహరణలకు పెద్దపరిమాణంలో నిర్మాణాత్మక కార్యక్రమాల అవసరం వుండదు. వుండకూడదుకూడా. కాని సవినయ చట్టధిక్కారోద్యమం ద్వారా సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించాలని అనుకుంటే ముందునుంచే అందుకు ఏర్పాట్లు చేసుకోవాలి. ఇటువంటి సమరానికి జరిగే కృషికి అందుపాల్గొనే వారి పురుషార్థం కూడా ఎంతో ఉపయోగపడుతుంది. సవినయ చట్టధిక్కారోద్యమం అందు పాల్గొనేవారికి ఉత్సాహం కలిగిస్తుంది. ఎదుటిపక్షం వారికి ఛాలెంజిగా మారుతుంది. పాఠకులు ఒక్క విషయం గ్రహించాలి. పూర్ణ స్వరాజ్య సాధనకు సవినయ చట్టధిక్కారోద్యమాన్ని సాగించుటకు, నిర్మాణకార్యక్రమాల నిర్వహణకు కోట్లాదిమంది దేశ ప్రజల సమకారం ఎంతో అవసరం. అట్టి సహకారం లభించనియెడల కృషి వ్యర్థప్రేలాపన అయిపోతుంది. అప్పుడు ఉద్యమం నీరుకారిపోతుంది.

★ ★ ★

# ముగింపు

ఇది జాతీయ కాంగ్రెస్ పక్షానగాని, లేక కాంగ్రెస్ కేంద్ర కార్యాలయం సూచించినందునగాని వ్రాయబడిన, నిర్మాణ కార్యక్రమాలకు సంబంధించిన పుస్తకం కాదు. ఇది సేవాగ్రామంలో గల కొద్ది అనుచరులతో జరిగిన సంభాషణ ఫలితంగా వ్రాయబడిన నిర్మాణ కార్యక్రమాల వివరం. నిర్మాణ కార్యక్రమాలకు సహాయ నిరాకరణోద్యమానికి, సవినయ చట్టధిక్కారానికి మధ్యనగల సంబంధం ఏమిటి? నిర్మాణ కార్యక్రమాల్ని ఎలా అమలు

బరచాలి? ఈ విషయంపై నేను వ్రాసిన వ్యాసంలో వారికి కొన్ని లోట్లు కనబడ్డాయి. వాటిని తొలగించి సరిచేసేందుకు నేను యీ పుస్తకంలో ప్రయత్నించాను. నిర్మాణ కార్యక్రమాల్ని గురించి సవివరంగా వ్రాయాలనే భావంతో నేను యీ పుస్తకం వ్రాయలేదు. నిర్మాణ కార్యక్రమాల్ని ఎలా అమలు చేయవచ్చో, ఎలా అమలు చేయాలో వివరించాను.

ఈ పుస్తకంలో నిర్మాణ కార్యక్రమాల వివిధ అంశాలను గురించి వ్రాశాను. వాటిలో ప్రతి కార్యక్రమం పూర్ణ స్వరాజ్యాన్ని పొందుటకు ఒక సాధనమని పేర్కొన్నాను. అందుకుగాను పాఠకులు పరిహాసం చేసే పొరపాటుపని చేయవద్దని సూచిస్తున్నాను. అహింసతోను, పూర్ణ స్వరాజ్య స్థాపనతోను ఏమీ సంబంధంలేనివారు చాలామంది చిన్నపెద్ద పనులు అనేకం చేస్తున్నారు. వాటిని గురించి ఆలోచించిన విధంగానే అందుకు ఫలం లభిస్తుంది. ఒక సైన్యాధికారి సాధారణ పౌరుని దుస్తులు ధరించి తిరిగితే అతడు ఎవరనిఎవ్వరూ ప్రశ్నించరు. కాని అతడు తన హోదాను బట్టి డ్రస్సు వేసుకొని పెద్దవాడు అయిపోయినప్పుడు అతడి నోట వెలవడే ఒక్క మాటమీద లక్షలాది సైనికుల, ప్రజల ప్రాణాలు ఆధారపడివుంటాయి. అదే విధంగా ఒక బీద వితంతువు చేతిలో పడి రాట్నం ఆమె జీవితానికి ఒక పైసో, రెండు పైసలో అందించి రాబడికి సాధనం అవుతుంది. కాని అదే సాధనం పండిత జవహర్‌లాల్ నెహ్రూ చేతిలో పడి, హిందూదేశ స్వాతంత్ర్యానికి ఆయుధంగా మారిపోతుంది. రాట్నానికి మనం యిచ్చిన స్థానంవల్ల, దానికి అప్పగించిన పనివల్ల దాని గౌరవం పెరిగిపోయింది. నిర్మాణ కార్యక్రమాలకు అప్పగించబడిన పని వల్ల వాటికిలభించిన అధికారంవల్ల వాటికి అసాధారణమైన అధికారం లభించింది.

ఇది నా అభిప్రాయం. ఈ అభిప్రాయం ఒక పిచ్చివాడి చింతన లేక వెర్రి ఆలోచన అని అనిపించవచ్చు. కాంగ్రెస్‌వారికి నా యీ అభిప్రాయం నచ్చకపోతే వారు నన్ను వదిలి వేయవచ్చు. నిర్మాణ కార్యక్రమాలు లేకుండా నేను సహకార నిరాకరణోద్యమానికి పూనుకోవడం పక్షవాతంతో పడిపోయి పనిచేయకుండాపోయిన చేతితో చంచా ఎత్తడానికి ప్రయత్నించడమే అవుతుంది.

పూనా - 13-11-1945

## అనుబంధం - 1

# పశుసంవర్ధనం

(నిర్మాణ కార్యక్రమాల్లో గోసేవను చేర్చుటను గురించి గాంధీజీ వ్రాసిన జాబుల సారాంశం యిందు చేర్చడమైనది.)

గాంధీజీ శ్రీ జీవన్‌జీదేశాయికి వ్రాసిన జాబులో ఒక భాగం

సోదపుర్, 16-1-56

" ...... మీ మాట నిజం. గోసేవాకార్యక్రమాన్ని కూడా నిర్మాణ కార్యక్రమాల్లో చేర్చాలి. నేను దీన్ని పశుసంవర్ధనం అని అంటాను. ఇది వదిలివేయవలసిన అంశం కాదు అని నా అభిప్రాయం తరువాత ప్రచురణ సమయంలో యీ విషయాన్ని గురించి శ్రద్ధ వహిస్తాను. మీ దగ్గర ప్రతులు అయిపోతే వెంటనే అవసరమైన సంస్కరణల్ని, పొందుపరచవలసిన విషయాల్ని తెలియజేయండి .... .......... "

★ ★ ★

# కాంగ్రెస్ పరిస్థితి

భారత జాతీయ కాంగ్రెస్ అన్నిటికంటే పురాతనమైన జాతీయ రాజకీయ సంస్థ.ఎన్నో అహింసాత్మక పోరాటాలు జరిపి స్వాతంత్ర్యం సాధించింది. దాన్ని రద్దుకానీయకూడదు. దేశం సమాప్తమైనప్పుడే కాంగ్రెస్ సమాప్తం అయిపోవాలి. ఒక జీవించియున్నసంస్థ. జీవించియున్న ప్రాణివలె క్రమంగా వర్థిల్లుతుంది. లేనిచో చనిపోతుంది. కాంగ్రెస్ రాజకీయ స్వాతంత్ర్యం సాధించింది. కాని యింకా అది ఆర్థికస్వాతంత్ర్యం, సాంఘిక స్వాతంత్ర్యం, నైతిక స్వాతంత్ర్యం సాధించవలసిన అవసరం వున్నది. ఇవి నిర్మాణాత్మకమైన స్వాతంత్ర్యాలు. ఇవి ఉత్తేజపరిచే కార్యక్రమాలు కావు. మిరిమిట్లు కొలిపే కార్యక్రమాలు కావు అందువల్ల వీటిని సాధించడం రాజకీయ స్వాతంత్ర్యం సాధించడమన్నంత

సులభం కాదు. జీవిత మందలి అంశాలన్నింటెని తనలో ఇముడ్చుకోగల శక్తి కలిగిన నిర్మాణ కార్యక్రమాలు కొట్లాది మంది ప్రజల అవయవాలన్నింటి శక్తిని ఫ్షేల్కొలుపగలుగుతాయి

స్వాతంత్ర్యానికి సంబంధించిన ముఖ్యమైన తొలి అంశం కాంగ్రెసుకు లభించింది. ఇక ప్రధానమైన మజలీ ముందు వున్నది. ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పాలను తన కఠినమైన కోరికను నెరవేర్చుటకు కాంగ్రెస్ తప్పనిసరి అయిమురాలు కట్టే మురికినీటిగుంటలవంటి కొన్ని శాఖల్ని ఏర్పాటు చేసింది. వాటివల్ల లంచగొండి తనం, నిజాయితీ లేని ప్రవృత్తి వ్యాప్తి చెందాయి. పేరుకు మాత్రమే ప్రజాస్వామ్యబద్ధమైనవని, జనరంజకమైనవని చెప్పుటకు వీలున్నకొన్ని సంస్థలుయిందు ఏర్పాడ్డాయి. ఈ రకమైన చెడులతో నింపియున్న అరణ్యాన్నుంచి కాంగ్రెసును బయటకు తీసుకురావడం ఎలా అన్నదే ప్రధాన సమస్య

కాంగ్రెస్ ప్రప్రథమంగా చేయవలసిన పెద్ద పని ఒకటివుంది. తన దగ్గర గల మెంబర్ల ప్రత్యేక రిజిష్టరును తొలిగించివేయాలి. ఆ రిజిష్టరులో ఒక కోటికి మించని మెంబర్ల పట్టిక వున్నది. కోటికి మించకపోయినా ఆ మెంబర్లను గుర్తించడం సాధ్యంకాని పని. అంతేగాక కోట్లాదిమంది పేరునమోదు చేసుకోని మెంబర్ల రిజిష్టర్లుకూడా వున్నాయి. సేవచేస్తూ కూడా వాళ్లు కాంగ్రెస్‌కు దూరంగా వున్నారు ;ఇక దేశంలోగల ప్రజలందరి పేర్లు కాంగ్రెస్ రిజిష్టరులోకి వచ్చితీరాలి. భారతప్రజానీకం మొత్తం స్త్రీలు పురుషులు కాంగ్రెస్ మెంబర్లు కావాలన్నమాట. దొంగ పేర్లు రిజిష్టరులో నమోదు కాకుండాను, యోగ్యమైనపేర్లు తొలిగించబడకుండాను కాంగ్రెస్ జాగ్రత్త పడాలి. దాని సొంత రిజిష్టరులో అవసరమైనప్పుడల్లా తమకు అప్పగించబడిన కార్యక్రమాలు నిర్వహించిన సేవకుల పేర్లు మాత్రమే నమోదుకావాలి.

ఈనాడు కార్యకర్తలు కావాలంటే ఎక్కువమంది పట్టణాలలో నివసించే వారినే తీసుకోవడం జరుగుతున్నది. ఇది దేశ దౌర్భాగ్యం. వారు గ్రామాలకు వెళ్లి అక్కడ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు కాని యిది సరికాదు.

గ్రామాలనుంచి యిట్టి కార్యకర్తల్ని పెద్ద సంఖ్యలో ఎన్నుకొని వారికే యిట్టి సేవా కార్యక్రమాలు అప్పగించాలి.

ఇట్టి కార్యకర్తలు తమ తమ కేంద్రాలలో చట్టప్రకారం పట్టికల్లో చేర్చబడిన ఓటర్ల దగ్గరకువెళ్లాలి. సేవా కార్యక్రమాలు చేపట్టి నిర్వహించాలి. అనేక పార్టీల వాళ్లు ఓటర్లను ప్రలోభపెట్టడానికి కృషి చేస్తారు. వారిలో ఉత్తములకు ఓట్లు లభిస్తాయి. వారే గెలుస్తారు. ఇంతకంటే మరోమంచి మార్గంలేదు. ఓటర్ల మధ్యకు వెళ్లి కార్యకర్తలు సేవా కార్యక్రమాలు సక్రమంగా నిర్వహిస్తే తమ స్థాయిని పడిపోకుండా కాపాడకోగలుగుతారు. తెలిసియో తెలియకయో నిన్నటివరకు కాంగ్రెస్ దేశ సేవారంగంలో ముందంజవేసి మాధవసేవలో నిమగ్నమైన సేవా సంస్థగా రూపొందింది. ఇక కాగ్రెస్ దేశ ప్రజలకు, ప్రపంచ ప్రజలకు నేను మాధవసేవకే అంకితమైనానని ఎలుగెత్తి చాటాలి. అంతకంటే మించిగాని, తక్కువగాని మాట్లాడకూడదు. అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే తగాదాల్లో పడితే హరాత్తుగాఒకానొకనాడు కాంగ్రెస్ అస్తిత్వం పూర్తిగా మాసిపోతుంది. కాంగ్రెస్ ఒక్కటే ప్రజాసేవకు అంకితమైన యాజమాన్య సంస్థగా లేకపోవడం యిప్పటి విశేషం. అందుకు పరమాత్ముడికి కృతజ్ఞతలు తెలపాలి.

నేను భవిష్యత్తులో జరుగనున్న దృశ్యాన్ని మీ ముందు వుంచాను నాకు సమయం లభించి, నా ఆరోగ్యం సరిగా వుంటే యీ (హరిజనపత్రిక) కాలాల్లో, నిజంగా యజమానులైన మైనారిటీ తీరిన స్త్రీలు, పురుషులు ఉత్తమ సేవకులుగాను, దేశసేవకులుగాను ఏఏ సేవా కార్యక్రమాలు చేపట్టాలో వివరిస్తాను.

న్యూఢిల్లీ - 27-1-48 మో.క.గాంధీ

(హరిజన సేవక్, 1-2-48)

# ఆరోగ్యదీపిక

(ఆరోగ్యం తాళంచెవి)

తెలుగుసేత

వేమూరి రాధాకృష్ణమూర్తి

# ప్రకాశకుల విజ్ఞప్తి

గాంధీగారు 1942-43 మధ్య ఆగాఖాన్ మహల్‌లో నిర్బంధంలో ఉన్నారు. అప్పుడు వారు యీ ప్రకరణాలు వ్రాశారు. 28-8-1942 నాడు ప్రకరణాలు వ్రాయడం ప్రారంభించి 18-121942 నాడు పూర్తిచేశారు. ఇది మహత్తరమైన విషయం. ప్రెస్సుకు యివ్వడానికి గాంధీగారు సంకోచిస్తూ వుండేవారు తనకు సంతృప్తి పూర్తిగా కలిగేటంతవరకు యీ ప్రకరణాల్ని మాటిమాటికి చదువుతూ వుండేవారు. రోజురోజుకు తాను పొందుతున్న అనుభవంవల్ల ఏమైనా విషయంలో మార్పు చేయవలెనని ప్రేరణ కలిగితే చేస్తూ వుండేవారు. మూలం గుజరాతీలో వ్రాశారు. తన గుజరాతీ మూలాన్ని హిందీ, ఇంగ్లీషు భాషల్లోకి తమ నిరీక్షణలో డా॥ సుశీలా నాయర్ చేత అనువాదం చేయించారు. తగ్గింపులు హెచ్చింపులు చేయించి చివరి రూపం యిచ్చుటకు గాంధీగారు రెండు అనువాదాల్నీ ఓపికతో సరిచూచారు.

అందువల్ల ఆరోగ్యం వంటి మహత్తరమైన విషయాన్ని గురించి గాంధీగారు దేశప్రజలకు, ప్రపంచప్రజలకు తాను చెప్పదలచుకున్న విషయాన్ని తామే స్వయంగా అనువదించి చెప్పారని చెప్పవచ్చు. భగవంతునికి, ఆతడి జీవ కోటికి సేవ చేయడం గాంధీగారి జీవితలక్ష్యం. అది వారికి పవిత్రమైన కార్యక్రమం. ఆరోగ్యాన్ని గురించిన అధ్యయనం వారి దృష్టిలో ఆ సేవకు సంబంధించిన ఒక ప్రధాన అంశం.

అహమదాబాద్ - 2-10-48

# విషయసూచిక

(గాంధీజి గుజరాతీలో యీ పుస్తకం వ్రాసినప్పుడు అందలి ప్రకరణాలను గురించి ఎంతో శ్రద్ధవహించారు. ఆరోగ్యానికి సంబంధించిన అనేక విషయాలను జాగ్రత్తగా పరిశీలించారు. ప్రకరణల యందలి సూక్ష్మవిషయాలను గురించి కూడా జాగ్రత్త పడ్డారు. వారు పేర్కొన్న పలు విషయాలను, వాటికి సంబంధించిన పలు వివరాలను కూడా సూచికయందు చేర్చాలని నిర్ణయించి, ఆ విధంగా విషయసూచికను రూపొందించాము. ॥జి॥దే॥)

## ప్రథమభాగం

### 1 శరీరం



### 2. వాయువు

ప్రాణాయామము.

ముక్కు పారిశుధ్యము.

ముక్కు ద్వారా జలం ఎక్కించుట

ఆరుబయట నిద్రించుట.

బట్ట ఎలా కప్పుకోవాలి?

రాత్రి డ్రస్సు

పగటి డ్రస్సు

చుట్టుప్రక్కల వీచేగాలి.

స్థల ఎంపిక

## 3. నీరు

ప్రవహించే ద్రవ్యపదార్థం ఎంత కావాలి?

ఎలాంటి నీరు త్రాగాలి?

నదుల, చెరువుల యందలి నీరు.

నీరు - ఆరోగ్యము.

కాచిన నీరు

ఛర్మము - నీరు.

## 4. ఆహారము

ఆహారం మనిషికి ప్రాణం.

మూడు రకాల ఆహారం

పాలు మాంసాహారమే.

గ్రుడ్లు మాంసాహారం కాదు.

పాలు మరియు కోడిపిల్లలుగా మారలేని గ్రుడ్లు

ఆహారాన్ని గురించి డాక్టర్ల అభిప్రాయం

మనిషి స్వభావరీత్యా శాకాహారి.

ఎండిన పండ్లు, తాజాపండ్లు.

శరీరానికి పాలు, పెరుగు, వెన్న అవసరం.

పాలు మానితే శరీరానికి నష్టం.
పాలుత్రాగనని గాంధీగారి వ్రతం.
మేకపాలు.
వ్రతముయొక్క ఆత్మానుష్ఠానం
పాలు అత్యవసరం.
పాల దోషాలు.
రోగిష్టి పశువు.
రోగంలేనట్లు కనబడే రోగిష్టి పశువు.
కాచిన పాలు త్రాగాలి.
వధించబడు పశువులు.
అన్నిటికంటే మనిషిని పట్టుకున్న పెద్ద చింత.
యుక్తాహారము
మనిషి శరీరానికి అవసరమైన ద్రవ్యాలు.
నరముల నిర్మాణం చేయు ద్రవ్యాలు.
మాంసము - పాలు
వెన్నతీసిన పాలు
పాల గుణవిశేషాలు.
గోధుమ, జొన్న, సజ్జలు, ధాన్యం.
ఒక సమయంలో ఒకే రకం ధాన్యం ఆహారంగా పుచ్చుకోవాలి.
గోధుమలు ధాన్యాలకు రాజువంటివి.
పొట్టు కలిసిన పిండి.
పొట్టు యొక్క గుణాలు.
బియ్యాన్ని ఎంతవరకు దంచాలి?
బియ్యానికి పురుగు ఎందుకుపడుతుంది?
బియ్యపుపొట్టు అమూల్య మైనది.
బియ్యపు రొట్టె.

పప్పు, శాకంతో రొట్టె తిను అలవాటు.
నమిలి తినడం వల్ల కలిగే లాభాలు.
పప్పులకు గల స్థానం.
పప్పులేని ఆహారం.
మాంసాహారము - పప్పు.
పాలు, పప్పు ఎవరికి?
పప్పు బరువైన ఆహారం.
కూరలు - ఫలాలు.
ఆహారం కొరత భారతావనికి సిగ్గుచేటు.
పల్లెటూరి ప్రజలు - కూరగాయలు.
భూ వ్యవసాయానికి కఠోరమైన చట్టాలు.
ఆకుకూరలు.
ప్రధాన కూరలు
ధాన్యానికి చెందిన కూరలు.
తినతగిన పచ్చికూరలు.
పండ్లు తిను సమయము.
అరటిపండ్లు
సంపూర్ణ ఆహారం - అరటిపండ్లు, పాలు, కూరలు.
నెయ్యి - నూనె.
మనిషి ఎంత నెయ్యి వాడాలి?
నువ్వులనూనె, కొబ్బరినూనె, వేరుశనగనూనె.
బజారులో దొరికే నెయ్యి నూనెలు.
చెడిపోయిన నెయ్యి - నూనెలు
బెల్లం, చక్కెర ఎంత తీసుకోవాలి?
మిఠాయి అనవసరం.
మిఠాయి తినడం దొంగతనం.
వేయించిన పదార్థాలు.

పూరి, లడ్డూ మొదలగునవి.

ఇంగ్లీషు వాళ్ల ఆహారం - మన ఆహారం.

ఆకలి - రుచి.

ఎంత తినాలి?

ఎన్ని సార్లు తినాలి?

ఔషధం రూపంలో ఆహారం.

రసము - రుచి

పొట్టకోరేది ఏమిటి?

తల్లి, తండ్రి, సంతానము.

గర్భం ధరించిన తరువాత ఆహారం యొక్క ప్రభావం.

బుద్ధిజీవి తీసుకునే ఆహారం.

ఉప్పు - నిమ్మపండు

మాటిమాటికి తినడం వల్ల నష్టమే నష్టం

## 5. మసాలా దినుసులు

ఉప్పు - మసాలాలకు రాజు

ఎక్కువ మసాలా దినుసులు శరీరానికి అవసరం లేదు.

ఔషధరూపం లో మసాలాదినుసులు.

చవిచెడిన నాలుక,

కారం తినడం వల్ల మృత్యువు.

హబ్షీవాళ్ల మసాలాలు.

## 6. టీ, కాఫీ, కోకో

టీ- చక్కెర

టీ - నీటి పరీక్ష

టీ తయారు చేసే పద్ధతి.

టీ యందలి దోషాలు.

టీ యందు టెనీన్

ఆమాశయం మీద పడు టెనీన్ ప్రభావం.
టీ వల్ల కలిగే పలు రోగాలు.
టీ, కాఫీ, కోకోలను మానాలి.
టీకి బదులు కూరలు ఉడికించిన రసం తాగాలి.

## 7. మత్తు పదార్థాలు

కల్లు, అరకు, మద్యం
త్రాగుబోతు
త్రాగుడు - మర్యాద
నిశ్చిత పరిమాణంలో మద్యం.
త్రాగుట.
కల్లు, పారశీకులు
కల్లు ఆహార పదార్థమా?
మనిషి ఆహారంలో కల్లుకు గల స్థానం.
ఖర్జూరపు పరిశుద్ధరసం నీరా
నీరావల్ల విరోచనాలుతగ్గుతాయి.
నీరా - ఆహారపదార్థం
టీకి బదులు నీరా
నీరాతో తయారైన బెల్లం
నీరా మరియు మత్తు
తాటి బెల్లపు తీపి
బీదల చెరకుబెల్లం.
తాటిబెల్లపు చక్కెర
నీరాయందలి చక్కెర గుణాలు
సామాన్యస్థితియందు ఆహారం గుణాలు
కట్టుబానిసలు - మద్యం
ఆఫ్రికాలో మద్యపాన చట్టాలు

హబ్షీలు - మద్యం
ఇంగ్లీషువాళ్లు - మద్యం
ఒకత్రాగుబోతు ఆంగ్లేయుడు
మద్యం -రాజులు
మద్యం - ధనిక యువకులు
మద్యంవల్ల శరీరం, మనస్సు, బుద్ధిక్షీణిస్తాయి.

## 8. నల్లమందు

నల్లమందు - మద్యము
నల్లమందుజడముగా మార్చును
నల్లమందు యొక్క ప్రభావము
ఒరిస్సా, అస్సాములపై నల్లమందు ప్రభావము
నల్లమందు - పంచదార
నల్లమందు అలవాటు పాపమే
నల్లమందు వల్ల జరిగిన సంగ్రామం
భారతదేశపు నల్లమందు - చైనా
ఇంగ్లీషు వాళ్లు - నల్లమందు వ్యాపారము
ఇంగ్లాండులో నల్లమందుకు వ్యతిరేకత
ఔషధంగా నల్లమందు వాడకము
నల్లమందు వ్యసనము, ఔషధము
నల్లమందు విషము

## 9. పొగాకు

ప్రపంచము - పొగాకు
టాల్‌స్టాయి - పొగాకు
పొగాకు - రైలు యాత్ర
ఇతరులపై పడే పొగాకుపొగ యొక్క ప్రభావం
పొగాకు - ఉమ్మి వేయుట

## 10. బ్రహ్మచర్యము

బ్రహ్మచారి - నపుంసకత్వము

నపుంసకునిఆసక్తి

బ్రహ్మచర్యము - గాంధీజీ

బ్రహ్మచర్యము - గాంధీజీ చేసిన ప్రయోగములు

బ్రహ్మచర్యము - వీర్యరక్షణ

వీర్యం యొక్క శక్తి

వీర్యము - భోగము

వీర్యము యొక్క ఉపయోగము

వివాహము - స్త్రీ పురుషులు

వివాహిత బ్రహ్మచారి

స్త్రీ సంగమం ఒక కర్తవ్యము

స్త్రీ - పురుషుడు - పశువు

సంయమము-ధర్మము-సాహసవంతులైన మనుష్యులకోసం అన్వేషణ

సంయమము - ధర్మ ప్రయోగములు

వీర్య సంగ్రహము సామాన్యవిషయము

వీర్యము - ఆహారము

అల్పాహారి అయినప్పటికీ బలాఢ్యుడు

బ్రహ్మచారి - వృద్ధాప్యము

బ్రహ్మచారి బుద్ధి

బ్రహ్మచర్యము నందలి లోపములు

వీర్య సంగ్రహము ఆరోగ్యానికి తాళపుచెవి

వీర్యసంగ్రహానికి నియమములు

వికారము - తలంపులు

వీర్యసంగ్రహము - జపము

తలంపులు, వాక్కు, అధ్యయనము

ఆచితూచి మాట్లాడాలి

వికారము - నిద్ర

★ ★ ★

## ద్వితీయ భాగము

### 1. పృధ్వి లేక మట్టి

మందులపై అపనమ్మకం
కాలినడకన తిరుగుట ఒక వ్యాయామము
జుస్ట్ రచించిన "రిటర్న్ టు నేచర్"
మట్టి చికిత్స
ఆముదము
మట్టిపట్టీ కొలత
పాముకాటు - మట్టి
మట్టి - తలనొప్పి
మట్టి - పుండు
మట్టి - పరమాంగనెట్ నీరు
మట్టి కందిరీగ కాటు
మట్టి - తేలుకుట్టుట
మట్టి - జ్వరము
మట్టి -టైఫాయిడ్
మట్టి - యాంటీఫ్లోజిస్టిన్
మట్టి పప్పునూనె
మట్టిని శుభ్రపరిచే పద్ధతి
మట్టిజాతి
మట్టి - సుగంధము
మట్టి -నగరములు
చిక్కని మట్టి
మట్టి - ఎరువు
మట్టితో కాపడం పెట్టాలి
మట్టి యొక్క ఉపయోగము
యమునా నదియందలి మట్టి
మట్టి - విరోచనాలు

## 2. నీరు

**ఆకాశము**

వేడినీరు - వాపు

వేడినీరు - చెవిపోటు

అయోడీన్

వేడినీరు - తేలుకుట్టుడు

వేడినీరు - చలి

ఆవిరి - పక్షవాతము

ఆవిరిపట్టే పద్ధతి

వేడినీరు - పాదం నొప్పి

ఆవిరి - కళ్ళు

## 4. తేజస్సు

తేజస్సుకు మనిషికిగల సంబంధము

సూర్యస్నానము

సూర్యుడు - ఆరోగ్యము

సూర్యుడు - జీర్ణశక్తి

సూర్యుడు - క్షయరోగము

సూర్యుడు - మట్టి మరియు కొబ్బరి ఆకులు

## 5. వాయువు - గాలి

ప్రథమ భాగమునందలి రెండవ ప్రకరణము చూడుడు

★ ★ ★

# భూమిక

"ఆరోగ్యాన్ని గురించిన సామాన్య జ్ఞానము" అనుశీర్షికన ఇండియన్ ఒపీనియన్ పత్రికా పాఠకులకోసం 1906లో దక్షిణాఫ్రికాలో వుండి కొద్ది ప్రకరణాలు వ్రాశాను. తరువాత అవి పుస్తకరూపంలో ప్రచురితమయ్యాయి. భారతావనికి నేను తిరిగివచ్చినప్పుడు యీ పుస్తకం కావాలని చాలామంది కోరారు. స్వామీ అఖండానంద్‌జీ ఆ పుస్తక ప్రచురణకోసం నన్ను అనుమతి కోరారు. ఇతరులు కూడా ఆ పుస్తకం ప్రచురించారు. ఆ పుస్తకాన్ని అనేక భారతీయ భాషల్లోకి అనువదించారు. ఇంగ్లీషు అనువాదం కూడా ప్రచురితమైంది. ఈ అనువాదం పాశ్చాత్య దేశాలకు వెళ్లింది. యూరప్ నందలి పలు భాషల్లోకి ఆ పుస్తకం అనువదించబడింది. పాశ్చాత్యదేశాల్లోను, తూర్పు దేశాల్లోను యీ పుస్తకం విశేష ప్రజాదరణ పొందింది. ఇంత ప్రచారం నా, మరే పుస్తకానికి లభించలేదు. కారణం యీ నాటివరకు నాకు బోధపడలేదు. నేను యీ ప్రకరణాలు సహజంగా వ్రాశాను. నా దృష్టిలో వాటికి ప్రత్యేక ఆదరణ ఏమీ లేదు. అయితే నేను మనిషి ఆరోగ్యాన్ని మరో క్రొత్త రూపంలో చూచానని, అందువల్ల దాని సంరక్షణకు అవసరమైన సాధనాలను, సామాన్య వైద్యులు, డాక్టర్లు సూచించే పద్ధతిలో కాక, వేరే పద్ధతిలో వివరించానను మాట నిజం.

అదే యీ పుస్తకం బహుళ ప్రచారానికి కారణం అయివుండవచ్చు.

నా అభిప్రాయం సరికావచ్చు, కాకపోవచ్చు. కాని చాలామంది మిత్రులు ఆ పుస్తకాన్ని తిరిగి ప్రచురించాలని కోరారు. పూర్వం వ్రాసిన పుస్తకంలో నేను మార్పులు ఏమైనా చేశానా లేదా తెలుసుకోవడానికి మిత్రులు ఉత్సాహం చూపించారు. వారి కోరికను నెరవేర్చుటకు యీనాటివరకు నాకు సమయం చిక్కలేదు. అయితే యిప్పుడు అట్టి అవకాశం లభించింది. ఇప్పుడు నేను యీ పుస్తకం క్రొత్తగా వ్రాయడానికి పూనుకున్నాను. గతంలో వ్రాసిన పుస్తకం ప్రతి నా దగ్గర లేదు. ఇన్ని సంవత్సరాల అనుభవ ప్రభావం నా భావాలమీద పడకుండా ఎలా వుంటుంది? అయితే ఆ పుస్తకం

చదివినవారు యీపుస్తకం కూడా చదివితే 1906 నాటి విషయాల్లో మౌలికంగా మార్పు ఏమీ జరగలేదని గ్రహించగలరు.

ఈ పుస్తకానికి "ఆరోగ్యం తాళంచెవి" అని పేరు పెట్టాను. ఈ పుస్తకాన్ని విశ్లేషించి చదివేవారికి నేను సూచించిన నియమాల్ని అమలు చేసేవారికి, ఆరోగ్యం యొక్క తాళంచెవి దొరికి పోతుందని, వాళ్లు వైద్యుల, డాక్టర్ల యింటి తలుపులు తట్టవలసిన అవసరం వుండదని ఆశ కల్పిస్తున్నాను.

ఆగాఖాన్ మహలు

పరవడ, 27-8-42

**మో॥క॥గాంధీ**

ప్రథమభాగం

# 1

# శరీరం

శరీరాన్ని గురించి పరిచయంచేసే ముందు ఆరోగ్యం అంటే ఏమిటో తెలుసుకోవడం మంచిది. ఆరోగ్యమంటే స్వస్థతగా వున్న శరీరం అన్నమాట. ఎవరి శరీరం రోగం లేకుండావుంటుందో, ఎవరి శరీరం సామాన్యమైన పనులు చేయకలుగుతుందో, అనగా ఏ మనిషి అలిసిపోకుండా రోజూ పది - పన్నెండు మైళ్లు నడవగలడో, ఏ మనిషి అలిసిపోకుండా సామాన్యమైన కాయకష్టం చేయగలడో, సామాన్యమైన ఆహారాన్ని జీర్ణం చేసుకోగలడో, ఎవని ఇంద్రియాలు, మనస్సు స్వస్థతగా వుంటాయో, అట్టి మనిషి శరీరం ఆరోగ్యంగా వున్నదని చెప్పవచ్చు. ఇందు వస్తాదుల్ని, వేగంగా పరుగెత్తువారిని, దూకేవారిని చేర్చలేదు. అసాధారణమైన శక్తిగలఅట్టివారి శరీరాలకు కూడా రోగం రావచ్చు. అటువంటి వారి శరీర వికాసం మరో విధంగా జరుగుతూ వుంటుంది.

ఇట్టి ఆరోగ్యసాధన చేయవలసింది శరీరం. ఆ శరీరాన్ని గురించి పరిచయం చేయడం అవసరం.

ప్రాచీనకాలంలో ఎలాంటి శిక్షణ యిచ్చేవారో ఆ బ్రహ్మకే తెలుసు. పరిశోధన చేయువారికి తెలిస్తే తెలియవచ్చు. ఈ నాటి శిక్షణను గురించి కొద్దోగొప్పో మనందరికీ తెలుసు. ఇప్పటి శిక్షణకు మననిత్య జీవనంతో ఏవిధమైన సంబంధంమూ ఉండదు. శరీరంతో నిత్యమూ మనకు అవసరం వుంటుంది, కాని యీనాటి శిక్షణ ద్వారా శరీరాన్ని గురించిన జ్ఞానం కలగడంలేదని చెప్పవచ్చు మన గ్రామాల్ని గురించి, పొలం గురించి కూడా మనకు ఏమీ తెలియదు. కాని భూగోళ, ఖగోళశాస్త్రాల్ని బాగా బట్టీవేస్తున్నాము., అయితే భూగోళశాస్త్రంవల్ల, ఖగోళశాస్త్రం వల్ల ప్రయోజనం ఏమీలేదని అనుకోకూడదు. ప్రతివస్తువు దాని స్థానంలో అది వుంటే బాగుంటుంది. శరీరం ఇల్లు, గ్రామం, గ్రామానికి నాలుగువైపుల గల ప్రదేశం, గ్రామం దగ్గరి పొలాల్లో పండే పంటలు మరియు వనస్పతి, గ్రామచరిత్ర, వీటిని గురించిన

పరిజ్ఞానానికి ప్రథమస్థానం లభించాలి. ఈ పరిజ్ఞానం ఆధారంగా లభించే మిగతా జ్ఞానం జీవితానికి ఉపయోగపడాలి శరీరం పంచభూతాల సమ్మిశ్రితం. అందువల్లనే దీన్ని గురించి ఒక కవి వర్ణిస్తూ -

"వాయువు జలము పృథ్వి వెలుగు ఆకసము

పంచభూతముల ఆటరా, భావపాశమ్ముల ముప్పేటరా" అని అన్నాడు.

ఈ శరీరం పదిఇంద్రియాలద్వారా మనస్సు ద్వారా నడుస్తుంది. పది ఇంద్రియాల్లో అయిదు కర్మేంద్రియాలు. చెయ్యి, కాలు, నోరు, జననేంద్రియం, మలద్వారం. జ్ఞానేంద్రియాలు కూడా అయిదే. చర్మం, నేత్రం, చెవి, ముక్కు, నాలుక. మనస్సు ద్వారా యోచిస్తాం. కొందరు మనస్సును పదకొండవ ఇంద్రియంగా పరిగణిస్తారు. ఈ ఇంద్రియాలన్నీ సరిగా పనిచేస్తూ వుంటే శరీరం పూర్తి ఆరోగ్యంగా వుంటుంది. అటువంటి ఆరోగ్యం యిప్పుడు తక్కువగా కనబడుతున్నది.

శరీరం లోపలి అవయవాలు ఆశ్చర్యం కలిగిస్తాయి. శరీరం యీ జగత్తుకు సంపూర్ణమైన లఘురూపం. శరీరంలో లేనిది జగత్తులో కూడా లేదు. జగత్తులో వున్నదంతా శరీరంలో వున్నది. కనుకనే "యథాపిండేతథా బ్రహ్మాండే" అను సూక్తి బయలుదేరింది. శరీరాన్ని సంపూర్తిగా మనం తెలుసుకోగలిగితే జగత్తును తెలుసుకోవచ్చు. అయితే పెద్ద పెద్ద వైద్యులు, డాక్టర్లు, హకీములే శరీరాన్ని తెలుసుకోలేక సతమవుతూవుంటే, మనబోటి చిన్నవాళ్లం ఏం తెలుసుకోగలుగుతాం?

మనస్సును గుర్తించకలిగిన యంత్రం ఏదీ యీనాటివరకు ఆవిష్కరించబడలేదు. శరీరంలోపల, బయట జరిగేక్రియల్ని గురించి నిపుణులు ఆకర్షణీయమైన వివరాలు ప్రకటించగలిగారు. ఈ క్రియలు ఎలా సాగుతున్నాయో ఎవరైనా చెప్పగలిగారా? మృత్యువు ఎందుకు వస్తుందో ఎప్పుడు వస్తుందో ఎవరైనా చెప్పగలిగారా? మనిషి బాగా చదివాడు. యోచించాడు. అనుభవం పొందాడు. కాని చివరికి తన అల్పజ్ఞతను మాత్రమే అతడు తెలుసుకోగలిగాడని చెప్పవచ్చు.

శరీరంలో నడిచే అద్భుత క్రియలు సక్రమంగా సాగినప్పుడే ఇంద్రియాలు

ఆరోగ్యంగా వుంటాయి. శరీర అవయవాలన్నీ సరిగా పనిచేస్తేనే శరీర వ్యవహారాలు సరిగా జరుగుతాయి. ఒక్క అవయవం పనిచేయకపోయినా బండి ఆగిపోతుంది. అందులోనూ పొట్టసరిగా పనిచేయకపోతే నీరసపడిపోతుంది. అజీర్తిని నిర్లక్ష్యం చేసేవాళ్లు శరీరధర్మం తెలుసుకోలేదని చెప్పవచ్చు. అనేకరోగాలకు అదే మూలం.

మనం శరీరంవల్ల ఉపయోగం ఏమిటో తులుసుకుందాం. ప్రతివస్తువు సదుపయోగానికి, దురుపయోగానికి ఉపయోగపడుతుంది. ఇది మన శరీరానికి కూడా వర్తిస్తుంది. శరీరాన్ని స్వార్థానికి, స్వేచ్ఛావిహారానికి, యితరులకు చెడు చేయుటకు ఉపయోగించితే, దాన్ని దురుపయోగపరిచినట్లే. ఆ శరీరాన్ని సమస్త ప్రపంచసేవకు ఉపయోగిస్తూ, అందునిమిత్తం సంయమాన్ని పాటిస్తే దాన్ని సదుపయోగపరిచినట్లే. ఆత్మ పరమాత్మయొక్క అంశం. ఆత్మను గుర్తించుటకు మనం శరీరాన్ని ఉపయోగించితే శరీరం ఆత్మ నివసించే దేవళం అవుతుంది.

శరీరం మలమూత్రాల గని అని అన్నారు. ఈ ఉపమానంలో అతిశయోక్తి ఏమీ లేదు. కాని శరీరం కేవలం మలమూత్రాదుల నిలయం మాత్రమే అయితే, దాన్ని సంభాళించుటకు యింత ప్రయత్నం చేయడం అనవసరమే: అయితే యీ "నరక కూపాన్ని" సదుపయోగపరిచి, దాన్ని పరిశుభ్రంగా వుంచి సంభాళించడం మన కర్తవ్యం. బంగారం, వజ్రాలు వుండే గనులు కూడా పైకి మట్టి దిబ్బలుగానే కనబడతాయి. కాని వాటిలో వజ్రాలు బంగారంవుంటాయి కనుక మనిషి దానికోసంకోట్లాది రూపాయలు వెచ్చిస్తున్నాడు: వాటిమీద అనేకమంది నిపుణులు తమ బుద్ధిని ఉపయోగిస్తున్నారు.

ఆ స్థితిలో మందిర రూపంలో వున్న శరీరం కోసం మనం ఎంత వ్యయం చేసినా తక్కువేనని చెప్పవచ్చు.

ఋణం తీర్చుకొనేందుకే మనం యీ జగత్తులో జన్మిస్తున్నాం. ఈ దృష్టితోనే మనిషి తన శరీరానికి సంరక్షకుడవుతాడు. అందువల్ల సేవా ధర్మాన్ని పూర్తినిష్ఠతో నిర్వర్తించుటకు, శరీరరక్షణ కొరకు మనం కృషి చేయాలి.

★ ★ ★

# వాయువు

వాయువు శరీరానికి అన్నిటికంటే ఎక్కువ అవసరమైన వస్తువు. అందువల్లనే భగవంతుడు గాలిని సర్వత్ర వ్యాప్తం చేశాడు అది ప్రయత్నమేమీ చేయకుండానే లభిస్తుంది.

గాలిని ముక్కుద్వారా పీల్చి ఊపిరితిత్తుల్లో నింపుతాము. ఊపిరితిత్తులు గాలితిత్తి వలె పనిచేస్తాయి. అవిగాలిని లోనికి పీల్చి బయటికి వదులుతాయి. బయట వీచే గాలిలో ప్రాణవాయువు వుంటుంది. అది లభించకపోతే మనిషి జీవించలేడు. ఊపిరితిత్తులనుంచి బయటికి వచ్చుగాలి విషాక్తమై వుంటుంది. ఆ విషవాయువు బయటికి వెళ్లకపోతే మనం చనిపోతాం. అందువల్ల గాలి హాయిగా వచ్చిపోవుటకు ఇల్లు అనువుగా వుండాలి. సూర్యుని ప్రకాశంకూడా వచ్చుటకు వీలుగా వుండాలి.

రక్తాన్ని శుద్ధిచేయుట గాలిపని. ఉపిరితిత్తుల్లోకి గాలి సరిగా పీల్చుట, బైటికి ఆగాలిని సరిగా వదులుట కుదరడం లేదు కనుకనే మన రక్తశుద్ధి సరిగా జరుగటలేదు. చాలామంది నోటి నుంచి గాలిలోనికి పీలుస్తూ వుంటారు. యిది చెడ్డ అలవాటు. ప్రకృతి ఒకరకమైన జల్లెడ వంటిదాన్ని ముక్కులో అమర్చింది. తద్వార గాలివడపోత పోయబడి లోనికి వెళుతుంది. కొంచెం వేడిఎక్కి, ఉపిరితిత్తుల్లోనికి ప్రవేశిస్తుంది. నోటి నుంచి గాలి పీలిస్తే అది వడపోతపడదు, వేడెక్కదు. ప్రతివ్యక్తి ప్రాణయామం నేర్చుకోవాలి. అది ఎంతో సులభక్రియ. అవసరమైన క్రియ. ప్రాణాయామం పలురకాలు. వాటిన్నింటిని వివరించవలసిన అవసరం యిక్కడ లేదు. అయితే వాటి ఉపయోగం తక్కువని నేను చెప్పడం లేదు. ఏ మనిషి జీవితం నియమబద్ధంగా వుంటుందో, అతని క్రియలన్నీ సహజంగా జరుగుతాయి.

నడుస్తూ, తిరుగుతూ, నిద్రిస్తూ వున్నప్పుడు ప్రజలు తమనోరు మూసుకుంటే ముక్కు తన పనిని తనంతట తానే చేస్తుంది. ప్రొద్దున్నే లేచి

మనం ముఖం, నోరు శుభ్రం చేసుకున్నట్లు ముక్కుకూడా శుభ్రంచేసుకోవాలి. ముక్కులో మకిలివుంటే తొలగించివేయాలి. యిందుకు ఉపకరించే మంచి వస్తువు శుభ్రమైన నీరు. చల్లని నీటిని సహించలేని వారుగోరువెచ్చని నీటిని వాడవచ్చు. అరచేతిలో గాని లేక గిన్నెలోగాని నీటిని నింపి ముక్కుద్వారా లోనికి పీల్చాలి. ఒకముక్కురంధ్రాన్నుంచి నీటిని లోనికి పీల్చి రెండవ ముక్కు రంధ్రాన్నుంచి బయటికి వదలాలి. ముక్కు ద్వారా కూడా నీటిని త్రాగవచ్చు.

ఊపరితిత్తులను పరిశుద్ధమైన గాలితోనే నింపాలి. అందుకు ఆకాశంక్రిందగాని, లేకవరాండాలోగాని నిద్రించడం అలవాటు చేసుకోవాలి. గాలివల్ల చలివేస్తుందని భయపడకూడదు. చలివేస్తే బట్టలు కప్పుకోవచ్చు. కప్పుకున్న గుడ్డకంఠందాటి పైకి వెళ్లకూడదు. శిరస్సు చలికితట్టుకోలేకపోతే దానికి రుమాలుచుట్టుకోవాలి. గాలి వచ్చివెళ్లే మార్గమైనముక్కు రంధ్రాల్ని ఎన్నడూ కప్పివేయకూడదు.

పడుకునేటప్పుడు పగలుధరించిన బట్టలు వదిలివేయాలి. రాత్రిళ్లు తక్కువబట్టలు ధరించాలి. అవి వదులుగా వుండాలి. శరీరాన్ని దుప్పటితో కప్పినప్పటికి సాధ్యమైనంతవరకు కప్పకుండా వుండటమే మంచిది. పగలుకూడా వదులుగా వుండే బట్టలు ధరించాలి.

మన దరిదాపుల్లో గల గాలి పరిశుద్ధంగా వుంటుంది అని అనుకోకూడదు. ఆ గాలి కూడా సమానంగా వుండదు. ప్రదేశాల్ని బట్టి గాలికూడా మారుతుంది. ప్రదేశాల ఎంపిక మనచేతుల్లో వుండదు. కాని యింటి ఎంపికమాత్రం చాలావరకు మన చేతుల్లోనే వుంటుంది. గుంపులకొద్దీ జనం కూడే చోట ఇల్లు వుండకూడదు. దరిదాపుల్లో మురుగు వుండకూడదు. గాలి, వెలుగు బాగా లభిస్తూ వుండాలి.



# 3
# నీరు

మనిషి జీవించియుండుటకు గాలి తరువాత స్థానం నీటిదే. గాలిలేకుండా మనిషికొన్ని క్షణాలు బ్రతుకుతాడు. నీరులేకుండా కొద్ది రోజులు బ్రతికి వుంటాడు నీరు అవసరం అధికం కనుకనే భగవంతుడు మనకు నీటిని పుష్కలంగా యిచ్చాడు. నీరు దొరకని ఎడారిలో మనిషి నివసించలేడు. సహారా ఎడారి వంటి చోట్ల మనుష్యుల నివాసస్థలాలు ఎక్కడా కనబడవు.

ఆరోగ్యంగా వుండుటకు ప్రతిమనిషికి 24 గంటల్లో 5 పౌండ్ల నీరు గానిలేక ప్రవహించే ద్రవపదార్థంగాని అవసరం అవుతుంది. మనం త్రాగేనీరు స్వచ్ఛంగా వుండాలి. అయితే ఎక్కువ ప్రదేశాల నీరు స్వచ్ఛంగా వుండదు. బావినీరు త్రాగడంవల్ల ప్రమాదానికి అవకాశం వుంటుంది. లోతులేని నూతినీరు, దిగుడు బావులయందలినీరు త్రాగుటకు అనుకూలంకాదు. నీటిని చూచి లేక నీటిని రుచి చూచి యీ నీరు త్రాగవచ్చునా, త్రాగకూడదా అని నిర్ణయించలేము. చూచుటకు, రుచికి బాగా వున్ననీరు విషాక్తం కావచ్చు. అందువల్ల అపరిచితమైన యింటినీటిని, అపరిచితమైన నూతి నీటిని త్రాగకుండా వుండటం అలవాటు చేసుకోవాలి. బెంగాలులో చెరువులు వుంటాయి. వాటినీరు త్రాగుటకు మంచిది కాదు. పెద్దనదులు నీరు కూడా త్రాగుటమంచిది కాదు, ముఖ్యంగా పట్టణాల ప్రక్కగా ప్రవహించేనదుల నీటిని, స్టీమర్లు, పడవలు వచ్చిపోయేచోట్ల గల నీటిని త్రాగకూడదు. అయితే కోట్లాదిమంది జనం యిట్టి నీటినే త్రాగిబ్రతుకుతున్నారు. యిది మంచిది కాదు. ప్రకృతి మనిషికి జీవశక్తిని పెద్దపరిమాణంలో ప్రసాదించింది. లేకపోతే మానవజాతి తానుచేస్తున్న పొరపాట్లకు, తన వ్యతిరేకచర్యలకు ఎప్పుడో అంతరించి వుండేది. నీటికి ఆర్యోగానికి గల సంబంధాన్ని గురించి మనం యిక్కడ యోచిస్తున్నాం. నీటిని గురించి సందేహం వుంటే నీటిని కాచి త్రాగాలి. అంటే తను త్రాగేనీటిని మనిషి వెంటపెట్టుకొని తిరగాలన్నమాట.

చాలామంది యాత్రలు చేస్తున్న సమయంలో బైటనీరు త్రాగరు. మతం పేరట అజ్ఞానులు చేస్తున్న పనిని, ఆరోగ్యంపేరట, ఆరోగ్యం నియమాలు తెలిసినవారు ఎందుకు చేయకూడదు? నీటిని వడపోసే విధానం ఎంతో మంచిది. దీనివల్ల నీటిలోని మురికి తొలిగిపోతుంది. అయితే నీటియందలి సూక్ష్మజీవులుపోవు. వడపోసే గుడ్డ శుభ్రంగా వుండాలి. అందు రంధ్రాలు వుండకూడదు.



# ఆహారము

గాలి, నీరు లేకపోతే మనిషి బ్రతకలేడు. అయితే జీవితాన్ని నిలిపి వుంచేది తిండియే. అన్నం మనిషికి ప్రాణం. తిండి మూడురకాలు, మాంసాహారం, శాకాహారం, మిశ్రితాహారం. ఎక్కువమంది జనం మిశ్రితాహారులు మాంసంలో చేపలు, పక్షులుకూడా చేరుతాయి. పాలను మనం ఏ విధంగాను శాకాహారంలో చేర్చుటకువీలులేదు. నిజానికి పాలు మాంసం యొక్క రూపమే. కాని లౌకిక వ్యవహారరీత్యా దీన్ని మాంసం అని అనము. మాంసంలో వున్న గుణాలు పాలలో కూడా వున్నాయి. డాక్టర్ల భాషలో దాన్ని ఏనిమల్‌ఫుడ్-అని అంటారు. గ్రుడ్లను సామాన్యంగా మాంసాహారం క్రింద పరిగణిస్తారు. నిజానికి అవి మాంసం కాదు. యిప్పుడు గ్రుడ్లను కొత్తరకంగా తయారు చేస్తున్నారు. ఎంత పొదిగినా ఆ గ్రుడ్లు కోడిపిల్లలు కాజాలవు. కనుక పాలు త్రాగడానికి సంకోచించని వాళ్లు, యిటువంటి గ్రుడ్లు తినడానికి సంకోచించకూడదు.

డాక్టర్లు మిశ్రాహారాలవైపు మొగ్గుచూపుతున్నారు. అయితే పాశ్చాత్యదేశాలలో ఎక్కువ మంది డాక్టర్లు, మనిషి యొక్క శరీరంనిర్మాణాన్ని బట్టి అతడు శాకాహారియనుట స్పష్టమని ప్రకటించారు. అతని దంతాలు, ఆమాశయం మొదలగునవి అతణ్ణి శాకాహారిగా ప్రకటిస్తున్నాయి అని వాళ్లు

అభిప్రాయపడుతున్నారు శాకాహారంలో పండ్లు ఫలాలు వస్తాయి. పండ్లలో తాజాపండ్లు శ్రేష్టం. ఎండుపండ్లలో బాదం పిస్తా, అఖరోట్ మొదలగునవి వున్నాయి.

నేను శాకాహారపక్షపాతిని. అయితే అనుభవం మీదనేను ఒక్క విషయం అంగీకరించవలసి వచ్చింది పాలు, పాలతో తయారయ్యే వెన్న, పెరుగు మొదలగు పదార్థాలు వాడకపోతే మనిషిశరీరం పూర్తికాలం నిలవలేదు. నాభావాలలో మహత్తరమైన మార్పు వచ్చింది. నేను పాలు, నెయ్యి వాడకుండా ఆరు సంవత్సరాలు గడిపాను. అప్పుడు నాశక్తిలో ఏమీ తరుగుదల రాలేదు. కాని నా మూర్ఖత్వం వలన 1917లో విరోచనాల పాలబడ్డాను. శరీరం అస్థిపంజరం అయిపోయింది. నేను గట్టి మందుతీసుకోలేదు. మొండితనంతోనే పాలు, మజ్జిగ తీసుకోనని మొరాయించాను. శరీరం ఏ విధంగాను పుంజుకోలేదు. పాలు త్రాగకూడదని వ్రతం పట్టాను. అయితే డాక్టరు "మీరు ఆపును గేదెను దృష్టి యందుంచుకొని పాలుత్రాగనని వ్రతంపట్టారు. కాని మేకపాలు త్రాగవచ్చును. అభ్యంతరం ఎందుకు?" అని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. నా భార్య డాక్టర్ని సమర్థించింది నేను కరిగిపోయాను. నిజానికి ఆవు, గేదెపాలను త్యజించిన వాళ్లు మేక మొదలగువాటి పాలుకూడా త్రాగకూడదు. ఆపాలలో కూడా ఆ పదార్థాలే వుంటాయి కదా! కేవలం పరిమాణంలో మాత్రమే తేడా వుంటుంది. అందువల్ల వ్రతాన్ని పేరుకుమాత్రం పాటించానుకాని. దాని ఆత్మను పాటించలేదు.

మేకపాలు వెంటనే వచ్చాయి. నేను ఆ పాలు త్రాగాను. త్రాగగానే నాలో నూతన చైతన్యం వచ్చింది. శరీరానికి శక్తి లభించింది. మంచం వదలివేశాను. ఈ అనుభవం వల్ల యిటువంటి యితర పలు అనుభవాల వల్ల తప్పనిసరిఅయి నేను పాల పక్షపాతినయ్యాను. అయితే యిప్పటికీ నాకు ఒక గట్టి నమ్మకం వున్నది. అసంఖ్యాకంగా వున్న వనస్పతులలో పాల అవసరాన్ని, మాంసం అవసరాన్ని పూర్తిగా తీర్చగల, వాటి దోషాలను హరించగల వనస్పతి ఒకటి వుంటుందనే నమ్మకం నాకు ఉన్నది దాన్ని అన్వేషించి బయటికి తీసుకురావాలి.

నాదృష్టిలో పాలు, మాంసం తీసుకోవడం దోషమే. మాంసం కోసం పశుపక్ష్యాదులను మనం నాశనం చేస్తున్నాము. అమ్మపాలు తప్ప మరోపాలుత్రాగే అధికారం మనకు లేదు. నైతికంగానే కాక ఆరోగ్యదృష్ట్యాకూడా మాంసభక్షణయందు దోషం వున్నది. పెంపుడు జంతువులు పూర్తిగా ఆరోగ్యంగా వుండవు. మనుష్యులవలె పశువులకు కూడా అనేక రోగాలు వుంటాయి. అనేక పరీక్షలు చేసిన తరువాత కూడా చాలా రోగాలు పశువైద్యుల కంటపడకుండా వుండిపోతాయి, పశువులనన్నింటినీ పూర్తిగా పరీక్ష చేయించడం అసంభవమని తోస్తున్నది. నా దగ్గర ఒక గోశాలవున్నది. దానికి మిత్రులసహాయం తేలికగా లభిస్తున్నది. కాని నా గోశాలలోగల పశువులన్నీ రోగాలు లేకుండా ఆరోగ్యంగా వున్నాయని నేను చెప్పలేను. కొన్ని విచిత్ర అనుభవాలు కలిగాయి. పూర్తి ఆరోగ్యంగా వున్నది అని అనుకున్న గోవురోగిష్టిదని తేలింది. ఆ విషయం బయటపడనంతవరకు ఆగోవు యిచ్చేపాలు అంతా వాడుతూనే వున్నారు.

సేవాగ్రాం ఆశ్రమ వాసులకోసం దగ్గరే వుంటున్న రైతుల దగ్గర పాలు కొంటాము. వాళ్ల పశువుల్ని పరీక్షించేదెవరు? వాళ్ల పశువుల పాలు దోషంలేనివి అని నిర్ధారించేదెవరు? అందువల్ల పాలను బాగాకాచి అందలి దోషాల్ని తొలిగించుటకు ప్రయత్నం చేయాలి. యితర చోట్లకూడా పశువుల పరీక్ష ఆశ్రమంలో జరుగుతున్న దానికంటే తక్కువే జరుగుతూ వున్నది. పాలు యిచ్చేపశువుల విధానమే, మాంసం కోసం చంపివేయబడే పశువులకు కూడా వర్తిస్తుంది. చాలావరకు యీ వ్యవహారమంతా భగవంతుని మీదభారం వేసేసాగుతూ వుంటుంది. మనిషి తన ఆరోగ్య విషయమై కొంచెం నిర్లక్ష్యంగా వుంటాడు. అతడి రక్షణ కోసం డాక్టర్లు వైద్యులు మొదలుగా గల వారి పటాలం సిద్ధంగా వుండడమే అందుకు కారణం. ధనం, గౌరవప్రతిష్ఠలు సంపాదించుకోవాలని మనిషి తహతహలాడుతూ వుంటాడు. ఎప్పుడు అదే ధ్యాస. అదే చింత. ఆచింత మిగతా చింతలన్నింటిని మ్రింగి వేస్తుంది. అందువల్ల పారమార్థిక చింతనగల డాక్టరో, వైద్యుడో, హకీమో, పరిశోధనలు చేసి సంపూర్ణగుణములు కలిగిన వనస్పతిని కనుగొననంత కాలం మనిషి దుగ్ధాహారం, మాంసాహారం తీసుకుంటూనే వుంటాడు.

ఇక యుక్తాహారాన్ని గురించి యోచిద్దాం. మానవశరీరానికి నరాల నిర్మాణానికి ఉష్ణం కలిగించుటకు క్రొవ్వుపెంచుటకు, కొన్ని ద్రవపదార్థాలు మలమును బయటకు పంపుటకు అవసరం. పాలు, మాంసం, పప్పులు, ఎండుపండ్ల వల్ల నరాల నిర్మాణం చేయు ద్రవపదార్థం లభిస్తుంది. పాలు మాంసంవల్ల లభించే ద్రవపదార్థానికి జీర్ణంచేయగలశక్తి పప్పులకంటే అధికంగా వుంటుంది. అందువల్ల అవి ఎక్కువగా లాభం కలిగిస్తాయి. పాలు మాంసం యీ రెండిటిలో పాలకు మొదటిస్థానం లభిస్తుంది. మాంసంకంటే పాలు త్వరగా జీర్ణమవుతాయని డాక్టర్లు చెబుతారు. మాంసం తినని వారికి పాలు బాగా ఉపకరిస్తాయి. జీర్ణం దృష్ట్యా పచ్చిగ్రుడ్లు సర్వ శ్రేష్టమని భావిస్తారు.

అయితే పాలు, గ్రుడ్లు అందరికీ లభిస్తాయా? అన్ని చోట్ల అవి దొరకవు కూడా. పాలవిషయంలో ఒక విషయం చెప్పడం అవసరం. వెన్నతీసినపాలు పనికి రానివి కావు. ఎంతో అమూల్యమైన వెన్నతీసినపాలు అప్పుడుప్పుడు వెన్నతీయనిపాలకంటే అమోఘంగా పనిచేస్తాయి. పాలయొక్క ప్రధాన గుణం నరాల నిర్మాణానికి అవసరమైన పదార్థాన్ని అందించడమే. వెన్నతీసినపాలలో యీ గుణంలోపించదు. మొత్తం వెన్నను పాలనుంచి వెలికితీయగల యంత్రం యింతవరకు ఆవిష్కరించబడలేదు. అట్టి యంత్రం తయారుకాగలదనే ఆశకూడా కలగడంలేదు.

పూర్ణము, అపూర్ణము అయిన పాలతోబాటు, యితర పదార్థాలుకూడా శరీరానికి అవసరం. గోధుములు, జొన్నలు, సన్నజొన్నలు, బియ్యం మొదలగు ధాన్యాలు రెండవ తరగతిలోకి వస్తాయి. భారతదేశమందలి వివిధ ప్రాంతాలలో వేరేవేరు ధాన్యాలు లభిస్తున్నాయి. పలుచోట్ల కేవలం రుచికోసం ఒకే గుణంకలిగిన పలుధాన్యాలు తింటున్నారు. గోధుమలు, జొన్నలు, బియ్యం మూడూ కొద్దికొద్ది పరిమాణంలో తింటున్నారు. అయితే శరీరపోషణకు యీవిధమైన మిశ్రమం అనవసరం. యిందువల్ల ఆహారపరిమాణం పెరిగి ఆమాశయం మీద ఎక్కువ బరువు పడుతుంది. అంకుశం వుండదు. అందువల్ల ఒక సమయలో ఒకే ధాన్యాన్ని తినడం మంచిది. యీ ధాన్యాల వల్ల ముఖ్యంగా గంజిపదార్థం లభిస్తుంది. గోధుమలు ధాన్యాలన్నింటికి రాజు

అని చెప్పవచ్చు. ప్రపంచంలో గోధుమ భుజించేవారి సంఖ్య అధికం. ఆరోగ్యదృష్ట్యా గోధుమలు దొరికితే, బియ్యం అనవసరం. గోధుమలు దొరకక, జొన్నలు మొదలైన ధాన్యాలు మంచిగా లేకపోతేనే బియ్యం వాడాలి. వడ్లను పరిశుభ్రంచేసి తిరగలి విసరాలి. గింజల పొట్టునందు శక్తి మరియు క్షారగుణం ఎక్కువగా వుంటుంది. ఇవి రెండూ ఉపయోగకరమైన పదార్థాలు. అందుగల విశిష్టపదార్థంపొట్టు. అది జీర్ణంకావలసిన అవసరం లేకుండానే లోనికి వెళ్లి మలవిసర్జనకు తోడ్పడుతుంది. బియ్యం గింజకోమలమైనది. అందువల్ల పరమేశ్వరుడు దానిపై పొట్టు సృష్టించాడు. దాన్ని తినడానికి వీలువుండదు. అందువల్ల వడ్లను దంచవలసివస్తుంది. పై పొట్టుపోయే విధంగా వడ్లను దంచడం అవసరం. యంత్రాలలో కూడా బియ్యం పడతారు. కాని అందువల్ల ఊకతో బాటు, లోపలిపొట్టుకూడా తొలిగిపోతుంది. లోపలిపొట్టు తియ్యగా వుంటుంది. పొట్టు వుంచితే పురుగు పట్టే ప్రమాదం ఏర్పడుతుంది. గోధుమలకు, వడ్లకుగల ఊకతొలగించితే యికస్టార్చ్ మాత్రమే మిగులుతుంది. పైపొట్టును మాత్రమే ఉడకబెట్టి ఆహారంగా తీసుకోవచ్చు. దానితో రొట్టెకూడా చేసుకోవచ్చు. కొంకిణి బియాన్ని పిండిగా విసిరి, దానితో రొట్టె చేసుకొని పేదప్రజలు తింటూవుంటారు. పూర్తిగా బియ్యాన్ని ఉడకబెట్టి తినేకంటే, బియ్యాన్ని విసిరి ఆపిండితో రొట్టె చేసుకొని తింటే తేలికగా జీర్ణం అవుతుంది. తృప్తి కూడా కలుగుతుంది. మనకు పప్పు, మరియు కూరతోపాటురొట్టె తినడం అలవాటు. రొట్టెను పూర్తిగా నమలరు. స్టార్చ్‌గల పదార్థాల్ని ఎంతనమిలితే అది అంతగా లాలాజలంతో కలుస్తుంది. అప్పుడు ఎంతో ప్రయోజనం కలుగుతుంది. ఆహారాన్ని బాగా నమలకుండా తింటే అది జీర్ణంకావడానికి లాలాజలం యొక్క సాయం లభించదు. ఆహారాన్ని బాగా నమిలి భుజించడం అవసరం. అందువల్ల లాభం కలుగుతుంది.

వడ్ల గింజల తరువాత పప్పుదినుసులు, నరాలకు సత్తువనిస్తాయి. పప్పు లేని ఆహారం అసంపూర్ణమని జనం భావిస్తారు. మాంసాహారికి కూడా పప్పు అవసరమే. కాయకష్టం చేసి కూలీనాలీ చేసుకొని బ్రతికేవాళ్లకు, తగిన పరిమాణంలో త్రాగుటకు పాలు దొరకవు కనుక, పప్పుదినుసులు ఆహారంగా

తప్పక లభించి తీరాలని నా అభిప్రాయం. శారీరిక కష్టం తక్కువ చేసేవాళ్లకు అనగా గుమాస్తాలు, వ్యాపారస్తులు, వకీళ్లు, డాక్టర్లు లేక ఉపాధ్యాయులు యీ విధమైనవారికి, పెద్ద పరిమాణంలో త్రాగడానికి పాలు లభిస్తాయి. కనుక ఆహారంలో పప్పు పదార్థం అనవసరమని నా నిశ్చితాభిప్రాయం. సామాన్యంగా పప్పు పదార్థం బరువైనదని భావిస్తారు. స్టార్చ్ ప్రధానంగా వున్న ధాన్యంకంటే, దీన్ని తక్కువగా భుజిస్తారు. పప్పుల్లో, బటాణీలు, చిక్కుడుగింజలు బరువైన దినుసులు, పెసలు, మసూరీ కందిపప్పు తేలిక దినుసులు.

మూడో స్థానం ఆకుకూరలకు, పండ్లకు యివ్వాలి. నిజానికి భారతదేశంలో కూరలు, పండ్లు చౌకగా దొరకాలి. కాని అలా దొరకడం లేదు. అవి కేవలం నగరవాసుల ఆహారమని భావిస్తున్నారు. గ్రామాల్లో పచ్చని కాయకూరలు అతికష్టంమీద లభిస్తాయి. చాలా చోట్ల పండ్లు దొరకవు. ఈ ఆహారపదార్థాల కొరత భారతదేశానికి సిగ్గు చేటు. గ్రామవాసులు విపరీతంగా కాయకూరలు, పండ్లు ఉత్పత్తి చేయగలరు. పండ్ల మొక్కలు నాటాలంటే చోటు వుండదు. అవివృక్షాలవుతాయి. వ్యవసాయ భూముల విషయంలో చట్టాలు కఠినంగా వున్నాయి. పేదవారిని అవి రాచివేస్తాయి. అయితే అది వేరే విషయం కనుక యిక్కడ దాన్ని గురించి వ్రాయను.

తాజా కూరలు, ముఖ్యంగా ఆకుకూరలు అధిక పరిమాణంలో ప్రతిరోజూ ఆహారంగా తినాలి. స్టార్చ్ ప్రధానమైన కూరల్ని యిక్కడ ఆకుకూరల్లో నేను చేర్చలేదు. బంగాళాదుంప, చిలకడ దుంప, పెండలం, స్టార్చ్ ప్రధానమైన దుంప కూరలు. నిజానికి ధాన్యం గింజల స్థాయిని వీటికి యివ్వాలి. స్టార్చ్ తక్కువగా గల ఆకుకూరలు బాగా వాడాలి. దోసకాయ, టొమాటో, మొదలగువాటిని ఉడకబెట్టనవసరంలేదు. వాటిని శుభ్రం చేసి బాగా కడిగి కొద్దిపరిమాణంలో పచ్చివాటిని తినాలి.

ఋతువును బట్టి దొరికే పండ్లు తినాలి. మామిడి పండ్లకాలంలో మామిడిపండ్లు, నేరేడు పండ్లకాలంలో నేరేడు పండ్లు, యిదే విధంగా జామ, బొప్పాస, బత్తాయి, కమలా మొదలగు పండ్లను తినాలి. పండ్లుతినుటకు ఉదయం, మంచి సమయం. ఉదయంపూట పాలు, పండ్లు అల్పాహారం

భుజిస్తే తృప్తిగా వుంటుంది. త్వరగా అన్నం తినేవాళ్లు ఉదయంపూట కేవలం పండ్లు మాత్రమే భుజించడం మంచిది.

అరటిపండు ఎంతో శ్రేష్టం. కాని అందుస్టార్చ్ ఎక్కువ. అందువల్ల అదిరొట్టెవలె పనిచేస్తుంది. అరటిపండ్లు, పాలు, కూరలు, యీ మూడింటిని సంపూర్ణ ఆహారంగా భావించాలి.

మనిషి భుజించే ఆహారంలో కొద్దిజిడ్డు అవసరం నెయ్యి, నూనెవల్ల ఆలోటుతీరుతుంది. నెయ్యి దొరికితే నూనె అవసరంలేదు. నూనె కొంచెం ఆలశ్యంగా జీర్ణంఅవుతుంది. కాని శుద్ధమైన నెయ్యి వలె నూనె గుణాత్మకంకాదు. మనిషికి రోజుకు మూడుతులాల నెయ్యి సరిపోతుంది. పాలలో నెయ్యి వుంటుంది కదా! నెయ్యి దొరకని వాళ్లు నూనెవాడి క్రొవ్వుకు అవసరమైన పదార్థం పొందవచ్చు. నూనెలో నువ్వులనూనె, కొబ్బరినూనె, వేరుసెనగ నూనె శ్రేష్టం. నూనె తాజాగా వుండాలి. అందువల్ల గానుగ దగ్గర నూనె దొరికతే ఎంతో మంచిది. యిప్పుడు బజారులో దొరికే నెయ్యి, నూనెలు, దరిదాపుగా పనికిమాలినవి. ఇందుకు మనం సిగ్గుపడాలి. యిందుకు వ్యాపారంలో నీతి, నిజాయితీ అవసరం. అవి చోటుచేసుకోనంత వరకు ప్రజలు మంచి, తాజా పదార్థాలు వస్తువులు సేకరించుటకు శ్రమపడక తప్పదు. మంచి వస్తువుకు బదులు, కల్తీవస్తువు దొరికినాసరే రాజీపడుట సరికాదు. కృత్రిమమైన నెయ్యి, నూనెల్ని వాడకటంకంటే, వాటి వాడకాన్ని మానివేయడం మంచిది. ఆహారంలో కొద్ది జిడ్డు ఎంతఅవవసరమో, బెల్లం చక్కెర కూడా అంత అవసరమే. తీయని పండ్లు తినడంవల్ల తీపి లభిస్తుంది, కాని మూడు తులాల బెల్లం, లేక చక్కెర వాడితే నష్టం వుండదు. తీయనిపండ్లు దొరక్కపోతే బెల్లం లేక చక్కెర తప్పదు. కాని యిప్పుడు మిఠాయిలు తింటున్నారు. అవి తినడం మంచిది కాదు. పట్టణాలో వుండేవారు జిలేబీ, పేడా, బర్ఫీ, పాయసం మొదలుగా గల తీపి పదార్థాలు ఎక్కువగా తింటున్నారు. అవి అనవసరం. ఎక్కువగా వాటిని తింటే నష్టం కలుగుతుంది. ఏ దేశప్రజలకు కడుపునిండా గంజిఅయినా దొరకడం లేదో, ఆదేశప్రజలు కొందరు మిఠాయిలు తింటూ వుండటం దొంగిలించిన సామగ్రి

తినడంతో సమానమని నేను భావిస్తున్నాను. యిది అతిశయోక్తికాదని అభిప్రాయపడుతున్నాను.

మిఠాయిలను గురించి పేర్కొన్న విషయం నెయ్యి నూనెలకు కూడా వర్తిస్తుంది. నెయ్యి నూనెలతో వేయించిన పదార్థాలు అవసరం లేదు. పూరీలు, లడ్లు తయారు చేయుటకు నెయ్యిని వాడటం అపచారమే. అలవాటు లేనివాళ్లు వీటిని తినలేరు. ఇంగ్లీషు వాళ్లు మన దేశానికివచ్చినప్పుడు, వాళ్లు మనమిఠాయిలు, నేతిలో వేయించిన పదార్థాలు తినలేరు. తిన్న వాళ్లు వెంటనే జబ్బుపడ్డారు. అనేకసార్లు ఆంగ్లేయులు యిలా జబ్బుపడటం నేను చూచాను. రుచి అనేది అలవాటుకు సంబంధించిన విషయం. ఆకలి కలిగించే రుచి ఛప్పన్న భోగాలవల్లకూడా లభించదు. ఆకలివేసిన మనిషి ఎండిపోయిన రొట్టెనైనా సరే రుచిగా తింటాడు. పొట్టనిండిపోయినవాడు మంచి పిండివంట వడ్డించినా తినలేడు.

ఇక మనం ఎంత తినాలి, ఎన్నిసార్లు తినాలి అను విషయం పరిశీలిద్దాం. అసలు ఆహారాన్ని ఔషధంగా భావించి తీసుకోవాలి. జిహ్వారుచికోసం తినకూడదు. రుచి అనేది ఆసక్తివల్ల కలుగుతుంది. ఆసక్తి ఆకలివల్ల కలుగుతుంది. మనకు చెడ్డ అలవాట్లు బాగా అలవాటయ్యాయి. అందువల్లనే చాలామందికి పొట్టఏమి కోరుతున్నదో తెలియదు. బిడ్డలకు జన్మనిచ్చేతల్లితండ్రి త్యాగులుకారు. సంయమం పాటించరు. వాళ్ల అలవాట్లు కొద్దో గొప్పో బిడ్డలకు సంక్రమిస్తాయి. గర్భాదానం జరిగిన తరువాత తల్లి తినే ఆహారపదార్థాల ప్రభావం బిడ్డలమీద తప్పక పడుతుంది. బాల్యావస్థలో తల్లిబిడ్డకు అనేక రుచుల పదార్థాలు తినిపిస్తుంది. తాను తినే పదార్థాల్లో కొంత భాగం బిడ్డకు కూడా పెడుతుంది. తత్ఫలితంగా చిన్నప్పటినుంచే పిల్లల పొట్టలకు చెడ్డ అలవాట్లు అలవడతాయి. అలవాట్లు తొలగించుకోగల విజ్ఞులసంఖ్య బహుతక్కువగా వుంటుంది. నేను నా శరీర సంరక్షకుణ్ణి, నా శరీరాన్ని సేవకోసం అర్పించాను, అనుభావం మనిషికి కలిగినప్పుడు శరీరాన్ని ఆరోగ్యంగా వుంచుటకు అవసరమైన నియమాల్ని తెలుసుకోవాలనే కోరిక అతడికి కలుగుతుంది. ఆనియమాల్ని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నంచేస్తాడు.

పైన తెలిపిన దృక్పథంతో బుద్ధిజీవుడైన మనిషికి, 24 గంటల కాలానికి అవసరమైన క్రింద తెలిపిన ఆహారాన్ని ప్రామాణికంగా మనం భావించి అంగీకరించవచ్చు.

1. ఆవుపాలు-2పౌండ్లు
2. ధాన్యం-6 ఔన్సులు, అనగా 15 తులాలు బియ్యం, గోధుమలు, సజ్జలు మొదలగునవి కలిపి
3. కూరలు-ఆకు కూరలు 3 ఔన్సులు తదితరకూరలు 5 ఔన్సులు.
4. పచ్చికూరలు-ఒక ఔన్సు.
5. నెయ్యి-3తులాలు, లేక వెన్న-4తులాలు
6. బెల్లంలేక చక్కెర-మూడు తులాలు.
7. తాజాపండ్లు (దొరికితే) రుచినిబట్టి, ఆర్థిక శక్తినిబట్టి.

ప్రతిరోజూ రెండు నిమ్మకాయలు తీసుకుంటే మంచిది. నిమ్మకాయరసం పిండి, కూరలో కలిపిగాని లేక నీటితో గాని కలిపితీసుకోవాలి. అలాచేసినందువల్ల పులుపు ప్రభావం పళ్ల మీద పడదు.

ఉప్పు ఏపరిమాణంలో వాడాలో యిక్కడ పేర్కొనలేదు. రుచినిబట్టిదాన్ని అవసరమైనంతవాడవచ్చు.

మనంరోజుకు ఎన్ని సార్లు తినాలి? చాలామంది జనం రోజూ రెండుసార్లు భోజనం చేస్తూ వుంటారు. సామాన్యంగా మూడుసార్లుకూడా తినడం చూస్తున్నాం.

ఉదయం పనిప్రారంభించే పూర్వం ఒకసారి, మధ్యాహ్నమప్పుడు రెండోసారి సాయంత్రం లేక రాత్రిపూట మూడోసారి. యింతకంటే మించి తినవలసిన అవసరం లేదు. పట్టణాల్లో వుండేవాళ్లు అప్పుడప్పుడు ఏదో ఒకటి తింటూ వుంటారు. దీనివల్ల నష్టం కలుగుతుంది. ఆమాశయానికి అవసరమైన విశ్రాంతి యిచ్చితీరాలి.

  

# మసాలాదినుసులు

ఆహారాన్ని గురించి వివరిస్తున్నప్పుడు నేను మసాలాలను గురించి ఏమీ వ్రాయలేదు. ఉప్పు మసాలాదినుసులకు రాజు అని చెప్పవచ్చు. ఉప్పులేకుండా మనిషి ఏ పదార్థమూ తినలేకపోవడమే అందుకుకారణం. కనుకనేఉప్పును సర్వరసం అని కూడా అంటారు. శరీరానికి పలుక్షారపదార్థాలు అవసరం. వాటిలో ఉప్పుకూడా ఒకటి. క్షారపదార్థలన్నీ మనం తీసుకునే ఆహారంలో వుంటాయి. అయితే యీ పదార్థాల్ని అశాస్త్రీయ పద్ధతితో వండటంవల్ల క్షారగుణాల పరిమాణాలు తగ్గిపోతున్నాయి. అందువల్ల వాటిని అదనంగా తీసుకోవలసివస్తున్నది. ఉప్పు అత్యవసరమైన క్షారాపదార్థం. అందువల్ల దాన్ని కొద్ది పరిమాణంలో విడిగా పుచ్చుకోమని గతప్రకరణంలో చెప్పాను. యింకా చాలా మసాలాదినుసులు అవసరంలేకపోయినా, రుచికోసమో, జీర్ణశక్తికోసమో తీసుకుంటున్నాము. ఉదాహరణకు ఆకుపచ్చని లేక ఎర్రని ఎండు మెరపకాయలు, మిరియాలు, పసుపు, ధనియాలు, జీలకర్ర, ఆవాలు, మెంతులు, ఇంగువ మొదలగునవి. 50 సంవత్సరాలపాటు వాడాను. వీటి ప్రయోగాలవల్ల అనుభవం గడించి చెబుతున్నాను. శరీరాన్ని వ్యాధిగ్రస్తంకాకుండా వుంచుటకు పైన తెలిపిన వాటిలో ఒక్క దాని అవసరం కూడా లేదు. జీర్ణశక్తి మరీ తక్కువగావున్న వాళ్లు, ఔషధరూపంలో, నిశ్చిత పరిమాణంలో మసాలాదినుసులు వాడవలసివస్తే వాడవచ్చు. కాని రుచికోసం అయితే మాత్రంవీటి ప్రయోగాన్ని పట్టుదలతో నిషేధించవలసిందే. మసాలదినుసులు, (ఉప్పుతో సహాఅన్ని) ధాన్యానికి, కూరగాయలకు సహజంగా గలశక్తికి నష్టం కలిగిస్తాయి. చవిచెడని నాలుక గలమనిషి సామాన్యపదార్థాల రసాన్ని ఆస్వాదిస్తాడు. మసాలాదినుసులుగాని, ఉప్పుగాని వేసినప్పుడు అట్టిరుచిని ఆస్వాదించలేడు. కనుక నేను అవసరమైతే ఉప్పును విడిగా వాడమని సూచించాను. పొట్టను, నాలుకను కారంమండిస్తుంది. కారంతినడం

అలవాటులేని వ్యక్తిదాన్ని తినలేడు. కారం తినడంవల్ల నోరుపూసినవారిని, నోట్లో బొబ్బలుపొక్కిన వారిని చాలామందిని నేను చూచాను కారంతినడం అలవాటైన ఒక వ్యక్తి మంచి యవ్వనంలో చనిపోవడం కూడా నేను చూచాను.

దక్షిణాఫ్రికాకు చెందిన హబ్షీలు కారాన్ని ముట్టుకోరు. ఆహారంలో పసుపురంగును వాళ్లు సహించరు. ఇంగ్లీషువాళ్లు కూడా మన మసాలాదినుసులు వాడరు. భారతదేశం వచ్చిన తరువాత వాళ్లకు మసాలదినుసులు తినడం అలవాటు అయితే అదివేరే విషయం.

★ ★ ★

# టీ, కాఫీ, కోకో

ఈమూడింటిలో ఒక్కటి కూడా శరీరానికి అవసరంలేదు. టీప్రచారం చైనాదేశాన్నుంచి ప్రారంభమైందని అంటారు. చైనాలో దాన్ని ప్రత్యేకించి ఉపయోగిస్తారు. అక్కడనీరు పరిశుద్ధంగా వుండదు. నీటిని కాచితాగితే అందలి వికారాలు పోతాయి. ఒకానొక తెలివిగల చైనీయుడు టీ అనే గడ్డిని వెతికి బయటికితెచ్చాడు. మరుగుతున్న నీటిలో ఆగడ్డిని కొద్దిగా వేసినా ఆనీటికి బంగారురంగు వచ్చివేస్తున్నది. నీటికి ఆరంగువస్తే నీరు బాగా కాగినట్లేనని నిర్ధారణకాసాగింది. చైనాలో నీటిని యిలాగే పరీక్షిస్తారని, కాచిన నీటికి బంగారు రంగువస్తే ఆనీటిని తాగుతారని విన్నాను. అందు ఒకరకమైన సువాసన రావడం మరో విశేషం. పైనతెలిపిన పద్ధతిని తయారయ్యే టీని, దోషంలేనిదిగా భావించవచ్చు. అట్టి టీ తయారు చేసే పద్ధతిని వివరిస్తున్నాను. ఒక చంచాటీని చిన్న జల్లెడలో వేయాలి. దాన్ని టీపాత్రపై వుంచాలి. అందుకొద్దికొద్దిగా మరిగిన నీటిని పోయాలి. జల్లెడనుంచి క్రిందకి దిగిన నీరు బంగారురంగులో వుండాలి. అలారంగువస్తే నీరుబాగా కాగిందని భావించాలి. సామాన్యంగా అందరూ టీతాగుతారు. కాని ఆ టీవల్ల ఏ ప్రయోజనమూ

కలిగినట్లు నా దృష్టికి రాలేదు. అందులో ఒక పెద్దదోషం వున్నది. అందుటెనీన్ వుంటుంది. టెనీన్ శరీరాన్ని పక్వం చేయడానికి పనికివచ్చేవస్తువు. టెనీన్‌తో కూడిన తేనీరు, ఆమాశయంలోకి వెళ్లి చెడుచేస్తుంది. ఆమాశయంలో టెనీన్‌పేరుకుంటే అందలి జీర్ణశక్తి తగ్గిపోతుంది. అజీర్తిపట్టుకుంటుంది. ఇంగ్లాండులో చాలామంది స్త్రీలు కేవలం చురుకుగా వుండే టీని అలవాటు చేసుకొని అనేక రోగాలకు గురి అవుతున్నారని చెబుతున్నారు. టీకి అలవాటుపడ్డవాళ్లు టైముకు టీ అందకపోతే వ్యాకులపడిపోతారు. తేనీరు వేడిగా వుంటుంది. అందుకొద్దిగా చక్కెరవేసి అందులో కొద్దిగా పాలు కలుపుతారు. పాలలో కొద్దిగా నీరు కలిపి దాన్ని వేడిచేసి అందు చక్కెరగాని లేక బెల్లంగాని వేసికలిపితే అది బాగా పనిచేస్తుందికదా! మరుగుతున్న నీటిలో ఒక చంచా తేనె, అర్ధచంచాడు నిమ్మరసం కలిపితే మంచిపేయ పదార్థం తయారవుతుంది. టీని గురించి చెప్పిందంతా దరిదాపు కాఫీకి కూడా వర్తిస్తుంది. కాఫీని గురించి ఒక సూక్తి ప్రచారంలో వున్నది. కఫమును కట్టించును, వాయువును హరించును ధాతువును తగ్గించును, బలమును క్షీణింపచేయును. ఇనుమునీటి గుణములివి, తెలుసుకొమ్ముసోదరుడా అనునదే ఆసూక్తి.

నేను టీని, కాఫీలనుగురించి వెల్లడించిన విషయాలు కోకోకు కూడా వర్తిస్తాయి. జీర్ణశక్తి బాగా వున్నవారికి టీ, కాఫీ, కోకోల అవసరం వుండదు. అనేక సంవత్సరాల అనుభవం మీద చెబుతున్నాను. ఆరోగ్యవంతునికి సామాన్య ఆహారంవల్ల తృప్తిలభిస్తుంది. పైనతెలిపిన మూడు వస్తువుల్ని నేను బాగా సేవించాను. వీటిని వాడిన కాలంలో నా శరీరంలో ఏదో ఒక రుగ్మత వుంటూ వుండేది. వీటిని విరమించనందున, నేను పోగొట్టుకున్నదేమీలేదు. ఎంతో మేలు నాకు కలిగింది. టీ మొదలగు గల వాటిని తాగడం వల్ల లభించిన రుచికంటే అధికరుచి ఉడకబెట్టబడిన కూరలరసంవల్ల నాకు కలిగింది.

  

# మత్తుపదార్థాలు

భారతదేశంలో మద్యం, బంగు, పొగాకు, నల్లమందు మత్తు పదార్థాలుగా పరిగణించబడుతున్నాయి. ఈ దేశంలో తయారయ్యే తాటికల్లు, ఈతకల్లు మద్యంక్రిందకి వస్తాయి. విదేశాలనుంచి దిగుమతి అయ్యే మద్యం రకరకాలు. దానికి లెక్కే లేదు. యివి అన్నీ త్యజించవలసినవే. తాగుడుకు అలవాటు పడ్డవాడు తన తెలివిపోగొట్టుకుంటాడు. పనికిమాలినవాడు అయిపోతాడు. తాగుడు అలవాటు అయితే వాడు నాశనం కావడమేగాక, తన కుటుంబాన్ని కూడా నాశనంచేస్తాడు. గౌరవమర్యాదలన్నిటిని ఉల్లంఘిస్తాడు.

కొందరు నిశ్చిత పరిమాణంలో మద్యం తాగవలెనని, లాభం కలుగుతుందని అంటారు. నాకు యీ వాదనలో పసకనబడలేదు. ఈ వాదనను అంగీకరించినా, మర్యాదల్ని మరిచిపోయి హద్దుల్ని దాటివేసే వాళ్ల సంఖ్యయే ఎక్కువగా వుండటంవల్ల అట్టి వాదనను తిరస్కరించవలసిందే.

పారసీసోదరులు కల్లును సమర్థిస్తున్నారు. కల్లుమత్తుకలిగించినా అది ఒక ఆహారపదార్థం యితర ఆహారపదార్థాల్ని జీర్ణంచేస్తుంది, కనుక కల్లును బహిష్కరించవద్దని కొందరి వాదన. ఈవాదనపై నేను బాగా ఆలోచించాను. బాగా చదివాను కూడా. కల్లుతాగే చాలామంది పేదల దుస్థితిని కండ్లారా నేను చూచాను. కల్లును ఆహారంగా పరిగణించకూడదనే నిర్ణయానికి వచ్చాను. కల్లునందు ఏఏ విశేషాలు వున్నాయని అంటున్నారో అవన్నీ యితర ఆహారపదార్థాల్లో కూడా ఉన్నాయి. కల్లు ఈత రసంతో తయారువుతుంది. ఈత రసంలో మత్తు అసలు వుండదు. దాన్ని నీరా అనిఅంటారు. తాజాగావుండే నీరాను వున్నదున్నట్లు తాగితే చాలా మందికి విరోచనం సాఫీగా అవుతుంది. నేను స్వయంగా నీరా తాగి చూశాను. నామీద దాని చెడ్డ ప్రభావమేమీ పడలేదు. అది ఆహారం వలె పనిచేస్తుంది. ఉదయం టీ తాగకుండా నీరా తాగితే యిక ఏమీ తాగవలసిన అవసరం వుండదు. చెరకు

రసంవలె నీరాను తీసి కాగబెడితే మంచి బెల్లం తయారువుతుంది. ఈతకూడా తాడిచెట్లరకమే. మనదేశంలో రకరాల తాడిచెట్లు ప్రకృతి సహజంగా పెరుగుతాయి వాటన్నిటినుంచి నీరాలభిస్తుంది. తీయగానే తాజానీరా తాగలసిన పదార్థం. నీరాను నిల్వ వుంచితే అంధుమత్తువస్తుంది. అందువల్ల వెంటనే తాగివేయాలి. లేనియెడం దానితో బెల్లం తయారుచేయాలి. చెరకురసంతో తయారయ్యే బెల్లంవలె నీరాతో తయారుయ్యే బెల్లం గుణకారి అని చాలామంది అభిప్రాయం, అందు తీపి తక్కువగా వుంటుంది, కనుక చెరకు పాకంకంటే దాన్ని అధికంగా వాడవచ్చు. గ్రామోద్యోగ సంఘంవారి ద్వారా తాటిబెల్లం మంచి ప్రచారం పొందింది. యింకా ఎక్కువగా ప్రచారం జరగాలి. తాటిచెట్లరసంతో బెల్లం తయారుచేస్తే బెల్లం పెద్ద పరిమాణంలో చౌకగా లభిస్తుంది. చక్కెరకూడా తయారుచేయవచ్చు. అయితే చక్కెరకంటే బెల్లమే అన్ని విధాల మంచిది. బెల్లంలో వున్నంతక్షారపదార్థం ఛక్కెరలో వుండదు. పాట్టులేని బియ్యంవలె, పాట్టులేనిపిండివలె చక్కెరలో క్షారపదార్థం వుండదు.

కల్లునుగురించి చెబుతున్నప్పుడు నీరాను గురించి దానితో తయారయ్యే బెల్లాన్ని గురించి నేను చెప్పాను. అయితే మద్యాన్ని గురించి నేను చెప్పవలసింది యింకా వున్నది. మద్యంవల్ల జరిగే ఛెడుఏమిటో నేను స్వయంగా చూశాను. ప్రజాసేవారంగంలో పనిచేసే కార్యకర్తలెవ్వరూ చూడలేనంత చెడును నేను చూడవలసివచ్చింది. దక్షిణాఫ్రికాలో బానిసలుగా పనిచేసే భారతీయులలో అధికశాతం మద్యం త్రాగుతూ వుండేవారు. అక్కడ అమలులో వున్న చట్టప్రకారం భారతీయులు దుకాణంలో కూర్చొని య్థిష్టంవచ్చినంత తాగవచ్చు, కాని ఇంటికిమాత్రం మద్యం తీసుకొని వెళ్లకూడదు. స్త్రీలు కూడా మద్యానికి అలవాటుపడ్డారు. వాళ్లకరుణాజనకమైన దుస్థితిని నేను కండ్లారాచూశాను. ఆదృశ్యాలు చూచిన వాడెవ్వడూ తాగుడును ప్రోత్సహించడు.

అక్కడి హబ్షీలకు అసలు మద్యం తాగేఅలవాటులేదు. వాళ్లలో కార్మికవర్గం మాత్రం తాగుడువల్ల బాగా నష్టపడిపోయింది. చాలామంది హబ్షీకార్మికులు

తమ సంపాదనంతటినీ తాగుడుకు ధారపోస్తారని చెప్పవచ్చు. వాళ్ల జీవితం వ్యర్థమైపోతున్నది.

ఇక ఇంగ్లీషువాళ్లు. చాలామంది తాగిపడివుండటం చూశాను. యిది అతిశయోక్తికాదు. యుద్ధసమయంలో తెల్లవాళ్లు ట్రాన్సవాల్ వదలవలసివచ్చినప్పుడు, వారిలో ఒకణ్ణి నాయింట్లో వుంచాను. అతడు ఇంజనీరు. అతడికి తాగుడు అలవాటు అయింది. తాగనప్పుడు అతడి స్థితిఎంతో మంచిగా వుండేది. తాగినప్పుడు మాత్రం పూర్తిగా పిచ్చివాడువలె అయిపోయేవాడు. అతడు తాగుడు మానవలెనని ఎంతో ప్రయత్నించాడు. కాని నాకు తెలిసినంతవరకు అతడు సఫలంకాలేదు.

దక్షిణాఫ్రికానుంచి భారతదేశం వచ్చాను. యిక్కడ కూడా విచారకరమైన దృశ్యాలు చాలా చూశాను. ఎంతో మంది రాజులు మహారాజులు తాగుడుకు బానిసలై సర్వనాశనం అయిపోయారు. అయిపోతున్నారు. వాళ్లవిషయంలో ఏది యదార్థంగా జరిగిందో అది అనేకమంది ధనవంతుల బిడ్డల విషయంలోను జరిగింది, జరుగుతున్నది. యిక్కడ కార్మికుల స్థితి మరీ దయనీయంగా వున్నది. యిటువంటి ఎన్నోకటువైన అనుభవాలుపొందిన తరువాత నేను మద్యాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాను. యిందు ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

ఒక్కవాక్యంలో చెప్పవలసి వస్తే మద్యం వల్ల మనిషి తనశరీరాన్ని, మనస్సును, బుద్ధినినాశనం చేసుకుంటున్నాడు. తనడబ్బును వ్యర్థం చేసుకుంటున్నాడు.



# 8
# నల్లమందు

త్రాగుడును గురించి నేను చేసిన వ్యాఖ్య నల్లమందుకు కూడా వర్తిస్తుంది అయితే యీరెండు వ్యసనాలకు వ్యత్యాసంవున్నది. త్రాగుడు నిషా బుర్రకెక్కినంతసేపు మనిషి పిచ్చివాడిలా వ్యవహరిస్తాడు. కాని నల్లమందు మనిషిని జడపదార్థంగా మార్చివేస్తుంది. నల్లమందుకు అలవాటుపడ్డవాడు సోమరి అయిపోతాడు. ఎప్పుడు మగతలో వుంటాడు. ఎందుకూ పనిరాకుండాపోతాడు.

త్రాగుడువల్ల ఎన్ని ఘోరాలు జరుగుతున్నాయో కండ్లారా చూడవచ్చు. కాని నల్లమందుయొక్క చెడు ప్రభావం ప్రత్యక్షంగా కనబడదు. నల్లమందు ప్రభావాన్ని ప్రత్యక్షంగా చూడతలుచుకుంటే ఒరిస్సా, అస్సాంప్రాంతాలకు వెళ్లి చూడవచ్చు. అక్కడ వేలాదిమంది యీదుర్వ్యసనంలో చిక్కుకుపోయారు. దీనికి అలవాటుపడ్డ వాళ్లు స్మశానంలో కాళ్లుచాచుకొని పడుకొని వున్నట్లు కనబడతారు

నల్లమందుప్రభావం బహుచెడ్డగాపడ్డ దేశం చైనా అని చెబుతారు. భారతీయుల శరీరం కంటే చైనీయుల శరీరం బలిష్టంగా వుంటుంది. కాని నల్లమందుకు అలవాటపడ్డ వారి శరీరం శవంలా కనబడుతుంది. మనిషి దీనుడైపోతాడు. నల్లమందుకోసం ఏపాపమైనా చేయుటకు వెనుకాడడు.

చైనీయులకి, ఆంగ్లేయులకు మధ్య ఒక యుద్ధం జరిగింది. అది నల్లమందు యుద్ధం అనుపేరట చరిత్రలో ప్రసిద్ధికెక్కింది. చైనా భారతదేశపు నల్లమందు తీసుకోవవడానికి యిష్టపడలేదు. కాని ఇంగ్లీషు వాళ్లు బలవంతంగా యీనల్లమందు వ్యాపారంచైనాతో ఛేయాలని నిర్ణయానికివచ్చారు. భారతదేశంలో నల్లమందు వ్యాపారస్తులు చాలామందివున్నారు. దీనివల్ల వాళ్లకు మంచి ఆదాయంరాసాగింది. ఈ వ్యాపారంవల్ల భారతదేశానికి చైనానుంచి కోట్లాదిరూపాయలు రాసాగాయి. అనీతితోకూడిన వ్యాపారమైనా

నడిచింది. చివరకి ఇంగ్లాండులో పెద్ద ఉద్యమం బయలుదేరింది. తత్ఫలితంగా యీ నల్లమందు వ్యాపారం ఆగిపోయింది. ఈ విధంగా ప్రజానాశనానికి ఉపకరించే వ్యసనాన్ని ఒక్క నిమిషంసేపైనా సహించకూడదు.

అయినా వైద్యశాస్త్రంలోను, చికిత్సా విధానంలోను నల్ల మందుకు మంచి స్థానం లభించింది. యిది ఒకమందు. అదిలేకపోతే పని సాగదు. చికిత్సావిధానంలో నల్లమందుకు ఎట్టి స్థానంవున్నా సరే, అది ఒకచెడ్డ వ్యసనం కనుక దాన్ని సహించకూడదు. మందుగా ఉపయోగపడేవస్తువును వ్యసనంగా ఎలా స్వీకరించగలం? స్వీకరిస్తే అది విషంలా పనిచేస్తుంది. నల్లమందు నిజంగా విషమే. అందువల్ల వ్యసన రూపంలో వున్న నల్లమందు త్యజించవలసిందే.

★ ★ ★

# 9

# పొగాకు

పొగాకు ప్రభావం యింతింత కాదు. దాని కోరలో ఒక్కసారి చిక్కుకున్న వారు అదృష్టం వల్ల బయటపడవలసిందే. ప్రపంచమంతా ఒకటి రెండు రూపాల్లో పొగాకును సేవిస్తున్నది. టాల్‌స్టాయి వ్యసనాలన్నింటిలోను అధమమైన వ్యసనం పొగాకు అని అన్నారు. ఋషి వంటి అతడు చెప్పిన మాట గమనించతగినది. అతడు పొగాకును, మద్యాన్ని అతిగా సేవించాడు. రెండిటివల్ల కలిగే నష్టాలన్నీ అతడు స్వయంగా అనుభవించాడు.

మద్యం, నల్లమందు వలె పొగాకు వల్ల కలిగే దుష్ఫలితాల్ని నేను వర్ణించలేను. దానివల్ల కలిగే ఒక్క ప్రయోజనం కూడా నేనెరుగను. పొగాకును సేవించేవారి నెత్తిన ఆర్థిక భారం బాగా పడుతుంది. ఒక ఆంగ్లమేజిస్ట్రేట్ నెలకు పొగాకు కోసం 5 పౌండ్లు అనగా 75 రూపాయలు ఖర్చు పెట్టేవాడు. అతడికి నెలజీతం 25 పౌండ్లు మాత్రమే. అంటే తన ఆదాయంలో అయిదవ భాగం అంటే 20 శాతం పొగ రూపంలో ఊదేస్తున్నాడన్నమాట.

పొగాకు తాగే వాడివివేకం భాగా మందగిస్తుంది. పొగాకు తాగుతూవున్నప్పుడు ప్రక్కన వున్న వారి విషయం మరిచిపోతాడు. రైళ్లలో ప్రయాణించే వారికి యీ విషయం తేలిగ్గా అర్థమవుతుంది. పొగాకు తాగనివాళ్లు దాని పొగను భరించలేరు. కాని పొగాకు కాల్చేవాడు ప్రక్క వారు ఏమనుకుంటున్నారను విషయం గమనించడు. పొగ పీల్చేవారు మాటిమాటికి ఉమ్మివేస్తూ వుంటారు. ఎక్కడబడితే అక్కడ ఉమ్మడమే వాళ్లపని.

పొగాకు తాగే వాళ్ల నోటినుంచి ఒకరకమైన దుర్గంధం వెలువడుతూ వుంటుంది. బహుశ అతడి సూక్ష్మభావాలు చచ్చిపోతాయోఏమో. కాని అతడు యీ విషయం పట్టించుకోడు. సూక్ష్మభావాలను చంపడం కోసమే వాళ్లు పొగాకు తాగడం ప్రారంభించి కూడా వుండవచ్చు. పొగాకు తాగడంవల్ల మనిషికి ఒకరకమైన నిషా ఎక్కుతుందనడం యదార్థం. ఆ నిషాలో అతడు తన చింతల్ని, దుఖాల్ని మరిచిపోతాడు. టాల్‌స్టాయి తన ఒక నవలలో ఒక మనిషిచేత భయంకరమైన పనులు చేయిస్తాడు. ఆ పనులు చేసేముందు అతడిచేత మద్యం త్రాగిస్తాడు. అతడు ఒక భయంకరమైన హత్య చేయాలి. త్రాగుడు నిషాలో సైతం అతడు హత్యచేయుటకు సంకోచిస్తాడు. ఆలోచిస్తూ అతడు సిగరెట్టు వెలిగిస్తాడు. పొగ వదులుతాడు. పొగపైకి ఎగబ్రాకడం చూస్తాడు. చూస్తూ చూస్తూ "నేనెంత పిరికివాణ్ణి? హత్య చేయడం కర్తవ్యమైనప్పుడు యిక సంకోచం ఎందుకు? లే, పద హత్య చెయ్" అంటూ లేచి ముందుకు సాగుతాడు. హత్య చేస్తాడు. దూమపానం వల్ల చలించిన అతని బుద్ధి అతని చేత ఒక నిర్దోషిని హత్య చేయిస్తుంది. యీ వాదనవల్ల ఎక్కువ ప్రభావం పడదని నాకు తెలుసు. పొగాకుతాగే వాళ్ళంతా పాపులు కాదు. పొగాకు తాగే కోట్లాదిమంది జనం తమ జీవితం సామాన్యంగా గడుపుతూ వున్నారని చెప్పవచ్చు. అయితే యోచనాపరులైన వారు పై విషయాన్ని గురించి ఆలోచించాలి. పొగాకు తాగే మనిషి చిన్నచిన్న పాపాలు చేస్తూ వుంటాడని, అతడి వివేక బుద్ధి మందగిస్తుందని టాల్‌స్టాయి చెప్పినదానికి సారం.

భారత దేశంలో జనం పొగాకును తాగడానికే కాక, పొడుం రూపంలో పీల్చడానికి, జర్దారూపంలో తినడానికి వాడుతారు. ముక్కు పొడుంపీల్చడంవల్ల లాభం కలుగుతుందని కొందరి భావం. వైద్యుల, హకీముల సలహామేరకు కొందరు ముక్కు పొడి పీలుస్తూ వుంటారు. యిది అనవసరమని నా అభిప్రాయం. ఆరోగ్యవంతులైన మనుష్యులకు యిట్టి వస్తువుల అవసరం కలుగకూడదు. జర్దా నమిలే వాళ్లను గురించి చెప్పేదేముంది? పొగాకు తాగడం, పీల్చడం, తినడం యీ మూడింటిలో తినడంచాలా హీనం. దీనిలో సుగుణం వుందని అనుకోవడం కేవలం భ్రమ.

వీళ్లను గురించి పొగాకు తినేవాడినోటికొనలు, పీల్చేవాడి బట్టలు, తాగేవాడి ఇల్లు యీ మూడు సమానం అని ఒక సామెత ప్రచారంలో వున్నది. జర్దా నమిలేవాడు జాగ్రత్త గలవాడైతే ఉమ్మివేసే గిన్నె దగ్గిర పెట్టుకుంటాడు. కాని చాలా మంది ఆ పని చేయకుండా యింటి మూలలయందు, యింటి గోడల మీద ఉమ్ముతూ వుంటారు. అలా చేస్తున్నందుకు సిగ్గుపడరు. తాగేవాళ్లు పొగతో తమ యింటిని నింపి వేస్తారు. పీల్చేవాళ్లు తమగుడ్డలు ఖరాబు చేసుకుంటారు. కొందరు తమ దగ్గర రుమాలు వుంచుకుంటారు. కాని అట్టి వారు బహుస్వల్పం. ఆరోగ్యంగా వుండాలని స్థిరనిర్ణయం చేసుకున్న వ్యక్తి వ్యసనాలన్నింటిని త్యజిస్తాడు. అయితే కొందరు మూడు వ్యసనాలు కలిగి వుంటారు. అందువల్ల వారు వీటిని అసహ్యించుకోరు. కాని ప్రశాంత మనస్సుతో ఆలోచిస్తే పొగాకు పీల్చడం, రోజంతా జర్దా బుగ్గన పెట్టుకొని నములుతూ వుండటం, పొడుం డబ్బీ మాటిమాటికి తెరిచి పొడుంపీలుస్తూ, చీదుతూ వుండటం అసహ్యంగా వుంటుంది. యీ మూడు వ్యసనాలు చెడ్డవే.

★ ★ ★

# 10

# బ్రహ్మచర్యము

బ్రహ్మచర్యమనగా బ్రహ్మప్రాప్తికోసం చేయు చర్య అని అర్థం. సంయమంలేనిదే బ్రహ్మ లభించడు. సంయమంలో ప్రముఖం ఇంద్రియనిగ్రహం. సామాన్యంగా బ్రహ్మచర్య మంటే, స్త్రీ సంగమాన్ని మానడం, వీర్యాన్ని సమీకరించడం అని జనం భావిస్తారు. ఇంద్రియాలన్నన్నిటిని సంయమంలో వుంచుకోగలిగిన వాడికి వీర్య సమీకరణ బహుసులభం. సహజ పద్ధతిన జరిగే వీర్య సమీకరణ వల్లనే కోరిన కోరిక ఫలిస్తుంది. యిట్టి బ్రహ్మచారి క్రోధాదులనుంచి విముక్తుడై శాంతంగా వుంటాడు. బ్రహ్మచారులు కోపాన్ని అహంకారాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. వాటిని తాము గుత్తకు తీసుకున్నట్లు వ్యవహరిస్తూ వుంటారు.

బ్రహ్మచర్య పాలనకు సంబంధించిన సామాన్య నియమాలను ఉల్లంఘించినవారు వీర్య సంరక్షణను కోరడం సరికాదు. కొందరు పిచ్చిగా వ్యవహరిస్తారు. కొందరు నిస్తేజంగా వుంటారు. వాళ్లు వీర్యాన్ని నిలుపుకోలేరు. కేవలం స్త్రీ సంగమం మానినంతమాత్రాన తాము కృతార్థులమైనట్లు భావిస్తారు. అంతమాత్రాన ఎవ్వరూ బ్రహ్మచారులు కాలేరు. స్త్రీపొత్తు మీద ఆసక్తివున్నంత వరకు బ్రహ్మచర్య ప్రాప్తి జరిగిందని భావించ కూడదు. యిట్టికామాసక్తి తగ్గించుకో కలిగిన స్త్రీ పురుషులే తమ జననేంద్రియం మీద విజయం సాధించారని చెప్పవచ్చు. వారి వీర్య రక్షణ బ్రహ్మచర్యంవల్ల కలుగు ప్రధమఫలితం. అయితే దానితో సరిపోదు. నిజమైన బ్రహ్మచారి యొక్క మాటల్లోను, ఆలోచనల యందు, ఆచరణ యందు ఒక అద్భుతమైన మార్పు కనబడుతుంది.

స్త్రీలతో పవిత్ర సంబంధం పెట్టుకున్నందువల్ల, స్త్రీలను తాకినందువల్ల బ్రహ్మచర్యం భంగం కాదు. యిట్టి బ్రహ్మచారి స్త్రీ పురుష భేదం మరిచిపోతాడు. యీ వాక్యానికి వేరు అర్థం తీయకూడదు. దీన్ని స్వేచ్ఛగా

వ్యవహరించుటకు ఉపయోగించకూడదు. విషయవాంఛలు భస్మమై పోయిన వారి మనస్సుల్లో స్త్రీ పురుష భేదం తొలిగిపోతుంది. వాళ్ల సౌందర్యం మరో రూపం దాలుస్తుంది. అంటే అది వికార రహితం అయిపోతుంది. అది బయటి సౌందర్యాన్ని చూడదు. ఆచరణ సుందరంగా వున్న స్త్రీ పురుషులే సుందరులు. అందువల్ల సుందర స్త్రీని చూచి పురుషుడు విహ్వాలుడు కాడు. అతడి జననేంద్రియం మరో రూపం దాలుస్తుంది. అంటే సదా వికార రహితంగా వుంటుంది. నిజానికి అతడు వీర్యహీనుడు. అయినప్పటికి నపుంసకుడు కాజాలడు. అతడి వీర్యం మరో రూపం దాల్చినందువల్ల అతడు నపుంసకుని వలె కనబడతాడు. నపుంసకుని కోరికలు తీరనివని వింటూ వుంటాము. నాకు చాలా మంది ఉత్తరాలు వ్రాస్తూ ఉంటారు. తమ జననేంద్రియం జాగృతం కావాలని కోరికవున్నా అది కావడం లేదని, అయినా వీర్యస్ఖలనం అవుతున్నదని, తమకు ఆసక్తి వున్నదని, అందువలన తాము లోలోపున కుళ్లుతున్నామని తమ జాబుల్లో వ్రాస్తున్నారు. యిట్టి పురుషులు వీర్యక్షీణంవల్ల నపుంసకుడు అయిపోయినట్లే. లేక నపుంసకులగుటకు సిద్ధపడుతూ వున్నట్లే. యిదికడు దయనీయస్థితి. కాని ఆసక్తిరహితుడై ఊర్ధ్వరేతస్కుడైతే అతడి నపుంసకత్వం మరో విధమైనది. అది అందరికీ యిష్టమైనది. యిటువంటి బ్రహ్మచారులు తక్కువగా వుంటారు. నేను 1906లో బ్రహ్మచర్యవ్రతం పట్టాను. అంటే యీ రంగంలో 36 సంవత్సరాల ప్రయత్నం వున్నదన్నమాట. అయితే బ్రహ్మచర్యాన్ని గురించి నేను చెప్పిన వ్యాఖ్య స్థాయికి యింకా నేను చేరలేదు. అయినా యీ రంగంలో మంచి ప్రగతిని సాధించాను. భగవంతుడు దయతో చూస్తే యీ శరీరాన్ని త్యజించే పూర్వమే నాకు సాఫల్యం లభించవచ్చు. నా ప్రయత్నాన్ని నేను ఎన్నడూ విడవలేదు. బ్రహ్మచర్యము యొక్క ఆవశ్యకతను గురించిన నా భావాలు దృఢమయ్యాయని చెప్పగలను. నేను చేసిన కొన్ని ప్రయోగాలు సమాజం ముందు వుంచుటకు అవసరమైన పరిణతి సమాజం చెందలేదు. నాకు తృప్తికలిగించేటంతగా అవి సఫలం అయితే సమాజం ఎదుట వాటిని

ప్రకటిస్తాను. నా ప్రయత్నాలు సఫలం అయితే పూర్ణ బ్రహ్మచర్యం సులభం అవుతుంది.

ఈ ప్రకరణంలో వీర్యరక్షణకు సంబంధించినంతవరకు బ్రహ్మచర్యాన్ని సమర్థించదలిచాను. పూర్ణ బ్రహ్మచర్యంవల్ల కలిగే అమోఘమైన లాభం దీనివల్ల కలుగకపోయినా దీనివిలువ కూడా తక్కువేమీకాదు. యిది లేకుండా పూర్ణబ్రహ్మచర్యం సంభవంకాదు. వీర్యసమీకరణ జరుగకుండా సంపూర్ణ ఆరోగ్యరక్షణ సాధ్యంకాదు. ఏ వీర్యమునందు మరో మనిషిని పుట్టించు శక్తి నిండియుండునో ఆ వీర్యాన్ని వ్యర్థంగా స్ఖలనంకానివ్వడం నిజంగా అజ్ఞానమే. వీర్యం యొక్క ప్రయోజనం కేవలం భోగం కాదు, ప్రజోత్పత్తియే. యీ విషయం పూర్తిగా తెలుసుకుంటే విషయవాంఛలకు జీవితంలో స్థానం బహుతక్కువగా లభిస్తుంది. స్త్రీపురుషుల పొత్తుకోసం యిప్పుడు స్త్రీపురుషులిద్దరూ సర్వనాశనం అవుతున్నారు. అది తగ్గిపోతుంది. వివాహానికి అర్థమే మారిపోతుంది. యిప్పుడు కనబడే వివాహ స్వరూపంలో మార్పు వస్తుంది. దాని యెడ మనకు తిరస్కారభావం ఏర్పడుతుంది. వివాహం స్త్రీ పురుషుల మధ్య హృదయపూర్వకమైన ఆత్మిక ఐక్యతకు ప్రతీక కావాలి. స్త్రీపురుషులు వివాహం అయిన తరువాత ప్రజోత్పత్తి కోసం తప్ప విషయవాంఛలను గురించి యోచించకుండా వుంటే, వాళ్లను పూర్ణ బ్రహ్మచారులుగా భావించవచ్చు. యిలాంటివి యిరువురు అంగీకరిస్తేనే జరుగుతుంది. ఆవేశంవల్ల యీ పని జరుగదు. కామాగ్ని తృప్తికోసం అయితే సాధ్యమే కాదు. కర్తవ్యంగా భావించి అలా నడుచుకోవాలి. తరువాత భోగవాంఛ మళ్లీ కలుగకూడదు. నా మాటలు హాస్యాస్పదంగా వున్నాయని ఎవ్వరూ అనుకోవద్దు. 36 సంవత్సరాల అనుభవం పొంది నేను యీ విషయం వ్రాస్తున్నానని పాఠకులు గ్రహించాలి. యిది సామాన్య అనుభవానికి విరుద్ధమైనది. సామాన్య అనుభవాన్ని మనం అధిగమించే కొద్దీ మన ప్రగతి జరుగుతుంది. అనేక మంచిచెడులు సామాన్య అనుభవానికి విరుద్ధంగా జరిగినప్పుడే పూర్తి అవుతాయి. చకుముకి నుంచి అగ్గిపుల్ల, అగ్గిపుల్లనుంచి విద్యుచ్ఛక్తి యొక్క అన్వేషణ యీ విధంగానే జరిగింది. భౌతిక వస్తువుకు

వర్తించే విషయమే ఆధ్యాత్మికతకు కూడా వర్తిస్తుంది. ప్రాచీన కాలంలో వివాహ వ్యవస్థ లేదు. స్త్రీపురుషుల భోగానికి, పశువుల భోగానికి మధ్య తేడా వుండేది కాదు. చాలా మంది సాహసవంతులు సామాన్య అనుభవాన్ని దాటి పరిశోధనలు జరిపి సంయమమనే ధర్మాన్ని ఎంత వరకు పాలించవచ్చో మనమందరం పరిశోధించవచ్చు. అలా జరిపే అధికారం మనకు వున్నది. అది మనందరి కర్తవ్యంకూడా. అందువల్ల స్త్రీ పురుషుల సాంగత్య సంబంధాన్ని నేను ఉన్నత స్థాయికి చేర్చాలని అందరినీ కోరుతున్నాను. యిది నవ్వులాట కాదు. అసలు మానవ జీవితాన్ని మలచవలసినపద్ధతి .

నిత్యము ఉత్పత్తి అవుతూ వుండే మన వీర్యాన్ని శారీరిక, మానసిక, ఆధ్యాత్మిక వికాసానికి ఉపయోగించాలి. యిలా చేయడం నేర్చుకున్నవాడు తక్కువ ఆహారం భుజించి తన శరీర నిర్మాణం చేసుకోగలుగుతాడు. అల్పంగా భుజిస్తున్నప్పటికీ శారీరిక శ్రమలో ఎవ్వరికీ తగ్గడు. మానసిక శ్రమయందు కూడా అతడికి తక్కువ అలసట కలుగుతుంది. వృద్ధాప్యపు సామాన్య లక్షణాలు యిట్టి బ్రహ్మచారి యందు కనబడవు. పండిపోయిన ఫలం, పండిపోయిన ఆకు వృక్షపు కొమ్మనుంచి సహజంగా ఎలా రాలిపోతాయో అలాగే సమయం ఆసన్నమైనప్పుడు మనిషి శరీరం కూడా, శక్తులనేకం వుండి కూడా రాలిపోతుంది. యిలాంటి మనిషి శరీరం సమయం గడిచిన తరువాత చూచుటకు క్షీణించి కనబడినా, అతడి బుద్ధి మాత్రం క్షీణంచకుండా వికాసం పొందుతూ వుండాలి. అతని తేజస్సు కూడా పెరగాలి. యీ చిహ్నాలు బ్రహ్మచారిలో కనబడకపోతే, ఆతని బ్రహ్మచర్యంలో లోపం వున్నదని భావించాలి. అతడు వీర్య సమీకరణకళను పొందలేదని భావించాలి. యిదంతా నిజంకావాలి. . అట్టిస్థితిలో ఆరోగ్యం యొక్క తాళం చెవి వీర్య సంగ్రహము మరియు వీర్య రక్షణయందే కలదు.

వీర్య సంగ్రహాన్ని గురించి నాకు తెలిసిన కొద్ది విషయాలు యిక్కడ వ్రాస్తున్నాను.

1. వికారానికి మూలం యోచనయందు వుంటుంది. అందువల్ల యోచనలను వశంలో వుంచుకోవాలి. మనస్సును ఖాళీగా వుంచకపోవడమే

అందుకుగల ఉపాయం. దాన్ని మంచి ఉపయోగకరమైన భావాలతో నింపివుంచాలి. మనం చేస్తున్న పనిలో లీనమై అందు నిపుణత్వం ఎలా సంపాదించాలో యోచించాలి. యోచించిన దాన్ని అమలు పరచాలి. భావాలు, వాటిని అమలు పరుచుట అనునవి వికారానికి అడ్డు కట్టవేస్తాయి. అయితే అన్ని వేళలా యిది సాధ్యం కాదు. మనిషి అలసిపోతాడు. అతడి శరీరం విశ్రాంతిని కోరుతుంది. రాత్రి పూటనిద్రపట్టకపోతే వికారాలు మనమీద దాడిచేస్తాయి. అట్టి సమయంలో వాటిని కట్టుటకు జపమనే ప్రయోగం చేయాలి. జపం చేస్తున్నప్పుడు మరో ఆలోచన బుర్రలోకి రాకూడదు. యిది ఒక ఆదర్శస్థితి. అంత వరకు మనం చేరలేకపోతే పలు ఆలోచనలు పిలవకుండానే వచ్చి మన మీద దాడి చేస్తూ వుంటే, వాటికి తలవంచకూడదు శ్రద్ధగా జపం చేస్తూ వుండాలి. చివరికి యిందు మనకు విజయం లభిస్తుందని విశ్వసించాలి. అప్పుడు మనకు విజయం లభించి తీరుతుంది.

2. భావాలవలె మాటలు కూడా వికారాలను శాంత పరిచేవిగా వుండాలి. అందువల్ల మాట్లాడే ప్రతి మాట ఆచితూచి పలకాలి. బీభత్సకరమైన మాటలు మాట్లాడలేని వాడినోట బీభత్సం మాటలు రాలేవు. విషయవాంఛలను పెంచి పోషించే సాహిత్యం చాలా వున్నది. దాని జోలికి మనస్సు పోకూడదు. మంచి గ్రంథాలు గాని తన పనికి సంబంధించిన గ్రంథాలు గానిచదవాలి. యిందు గణితం వంటి వాటికి మంచి స్థానంవున్నది. వికారాలను సేవించవలెనని కోరనివాడు వికారాలను పెంచి పోషించేపనిని వృత్తిని మానుకోవాలి.

3. మనస్సును పని యందు ఎలా లీనం చేయాలో అలాగే శరీరాన్ని కూడా పనిలో లీనం చేయాలి. రాత్రి పడేంతవరకు పగలంతా మనిషి ఎంత శ్రమచేయాలంటే రాత్రి పడుకొగానే వెంటనే నిద్ర వచ్చి తీరాలి. యిలాంటి స్త్రీపురుషుల నిద్ర ప్రశాంతంగా వుంటుంది. స్వప్న రహితంగా వుంటుంది. బైట చేయగలిగినంత శ్రమ చేయాలి. అది ఎంతో మంచి చేస్తుంది. యీ విధంగా శ్రమచేశాక అవకాశం దొరకకపోతే, తప్పనిసరిగా విడవకుండా కసరత్తుచేయాలి. తెరపగాలిలో వేగంగా నడవడం అత్యుత్తమమైన కసరత్తు.

నడిచేటప్పుడు నోరు మూసి వుంచాలి. ముక్కునుంచి గాలి పీల్చాలి. నడుస్తున్నపుడు, కూర్చున్నపుడు శరీరం తిన్నగా, నిటారుగా వుండాలి. ఏదో విధంగా నడవడం, ఏదో విధంగా గాలిలో తిరగడం సోమరి తనానికి నిదర్శనం. సోమరితనం దరికి చేరిందీ అంటే వికారం మనస్సులోకి చేరిందన్నమాటే, ఆసనాలు కూడా యిందుకు బాగా ఉపయోగపడతాయి. ఎవరి కండ్లు, ముక్కు చెవులు, నోరు, కాళ్లు, చేతులు, నాలుక మొదలగు ఇంద్రియాలు తమతమ పనులు తగినవిధంగా చేస్తూ వుంటాయో వారి జననేంద్రియం ఉపద్రవం చేయదు. అనుభవంతో వ్రాసున్న నా యీ మాటల్ని అంతా అంగీకరిస్తారని విశ్వసిస్తున్నాను.

4. ఆహారాన్ని బట్టి ఆకారం వుంటుంది. అత్యాహారి మనస్సు, యిష్టంవచ్చినట్లు తింటూ వుండే వాడి మనస్సు వికారాలకు నిలయంగా మారుతుంది. జిహ్మరుచిని జయించలేనివాడు జితేంద్రియుడు కాజాలడు. అందువల్ల మనిసి యుక్తాహారి, అల్పాహారి కావాలి. శరీరం ఆహారంకోసం కాదు, ఆహారం శరీరం కోసమని తెలుసుకోవాలి. శరీరం తనను తాను తెలుసుకొనుటకు మనకు లభించింది. తనను తాను తెలుసుకొనుట అంటే భగవంతుణ్ణి తెలుసుకొనుట అని అర్థం. యిట్టి గుర్తింపుకు ఎవరు తమ జీవితంలో ప్రముఖస్థానం యిస్తారో వారు వికారాలకు లోనుకారు.

5. ప్రతిస్త్రీని తల్లిగా, సోదరిగా, బిడ్డగా చూడాలి. ఏ పురుషుడు తన తల్లిని, తన సోదరిని, తనకుమార్తెను వికారదృష్టితో చూడడు. ప్రతిస్త్రీ పరాయి పురుషుణ్ణి తన తండ్రిగా సోదరుడుగా, బిడ్డడిగా చూడాలి.

ఈ అయిదు నియమాలలో మిగతా సమస్త నియమాలు యిమిడివున్నాయి. నా వ్యాసాలు కొన్నింటిలో యింకా నియమాల్ని యిచ్చాను. అయితే అవన్నీ యీ అయిదునియమాల్లోకి వచ్చి వేస్తాయి. యీ అయిదు నియమాల్ని పాటించిన వ్యక్తికి మహాపెద్ద వికారాన్ని జయించడం సులభం కావాలి. బ్రహ్మచర్య మనువ్రతాన్ని అనుష్టించాలని భావించినవాడు, యిది అసంభవమైనపనియని, కోట్లాది మంది జనంలో కొద్దిమందే యీ పని చేయగలరని భావించి, తన ప్రయత్నాన్ని విరమించుకోడు. బ్రహ్మచర్య

పాలన యందు కలిగే సంతోషం మరే విషయంలోను కలుగదు. మరోలా చెప్పాలంటే నిజమైన ఆరోగ్యం వల్ల లభించే ఆనందం మరే వస్తువువల్ల లభించదు. వికారాలకు బానిస అయిన మనిషి శరీరం రోగం లేకుండా వుండదు. - ఇక కృత్రిమ ఉపాయాల్ని గురించి కొద్దిగా చెబుతాను. విషయవాంఛలలో లీనమై యుండి కూడా ప్రజోత్పత్తి చేయకుండా వుండే ప్రయత్నాలు ప్రాచీన కాలాన్నుంచి అమల్లో వున్నాయి. ప్రాచీన కాలంలో అవి రహస్యంగా జరుగుతూ వుండేవి. కాని ఆధునిక నాగరికతా ప్రచారం బాగా వున్నయీ కాలంలో వాటికి ప్రాముఖ్యం బాగా పెరిగింది. కృత్రిమ ఉపాయాలు వ్యవస్థిత రూపంలో చేయబడుతూ వున్నాయి. వీటికి పరమార్థమనే వేషం కూడా వేశారు. యీ ఉపాయాల్ని సమర్థించేవాళ్లు "భోగలాలసత్వం సహజమైనది. దాన్ని భగవంతుడిచ్చిన వరమని చెప్పవచ్చు దాన్ని పోగొట్టడం సాధ్యమయ్యే పనికాదు. దాన్ని సంయమంలో వుంచడం కూడా సాధ్యమయ్యే వ్యవహారం కాదు. సంయమానికి బదులు మరేదైనా అన్వేషించి కనిపెట్టకపోతే అధిక సంఖ్యలోనున్న స్త్రీలకు ప్రజోత్పత్తి పెద్ద భారం అయిపోతుంది. భోగవాంఛవల్ల ఉత్పత్తి అయ్యే ప్రజల సంఖ్య విపరీతంగా పెరిగిపోతుంది. అప్పుడు మానవ జాతికి తిండి లభించని స్థితి ఏర్పడుతుంది" అని చెబుతున్నారు.

ఈ రెండు యిబ్బందుల్ని అరికట్టుటకు కృత్రిమ ఉపాయాల ప్రణాళికను అమల్లోకి తీసుకు రావడం మానవ ధర్మం అని కూడా అంటున్నారు. కాని యీ వాదన నాకు నచ్చలేదు. యీ ఉపాయాల వల్ల మనిషి క్రొత్త కష్టాల్ని కొనితెచ్చుకుంటున్నాడు. అన్నిటికంటే పెద్ద ముప్పు కృత్రిమ ఉపాయాల ప్రచారం వల్ల సంయమం అనుకర్తవ్య నిర్వహణ తగ్గిపోతుంది. యీ రత్నాన్ని అమ్మి తాత్కాలిక లాభం ఏది లభించినా, యీ బేరం మంచిది కాదని నా ఉద్దేశ్యం. యిందుకోసం నేను వాదనలకు దిగను. జిజ్ఞాసువులకు ఒక సూచన చేస్తున్నాను. "అనీతిమార్గాన" అని నేను రచించిన పుస్తకం చదవండి. దాన్ని మననం చేయండి. (యీ పుస్తకమూలం గుజరాతీలో వున్నది. నవజీవన్ వారి ప్రచురణ. హిందీలో దీన్ని అనువదించి సస్తాసాహిత్యమండల్.

న్యూఢిల్లీ వారు ప్రచురించారు.) తరువాత మీ మనస్సు, వివేకం చెప్పినట్లు చేయండి. యీ పుస్తకం చదవాలని కోరికలేని వారు, సమయం చిక్కనివారు పారబడి కృత్రిమ ఉపయాలదరికి పోకండి విషయవాంఛలను త్యజించుటకు భగీరథ ప్రయత్నం చేయండి. దోషరహిత ఆనందం లభించేకొన్ని మార్గాలను త్రొక్కండి. నిజమైన దాంపత్య ప్రేమను శుద్ధమైన మార్గాన నడిచే ప్రవృత్తుల్ని ఎంపిక చేసుకోండి. భార్యాభర్తల ఔన్నత్యానికి కృషి చేయుటకు, భోగవిలాలసల సేవనకు అవకాశం చిక్కని విధానాన్ని ఎంచుకోండి. శుద్ధమైన త్యాగానికి అలవాటు పడితే, అందువల్ల లభించే తృప్తి, ఆనందం విషయ వాంఛలవైపు మిమ్ము పోనీయవు. ఆత్మవంచన వల్ల కష్టం కలుగుతుంది. భావ శుద్ధివల్ల యిందు త్యాగం ఆరంభం కాదు బాహ్యాచారాల్ని ఆపుటకు చేయునిష్ఫలమైన ప్రయత్నం వల్ల యిది జరుగుతుంది. భావనిష్ఠతోబాటు ఆచారవిధానంలో సంయమం ప్రారంభంకావాలి. అప్పుడు సాఫల్యం లభించి తీరుతుంది. స్త్రీ పురుషుల దాంపత్య జీవితం, భోగవిలాసాల కోసం, వాంఛా తృప్తికోసం ఏర్పడలేదు. యీ సత్యాన్ని అంతా గ్రహించాలి.

★ ★ ★

# ద్వితీయభాగం

## 1

## పృధ్వీ లేక మట్టి

ప్రకృతి చికిత్సకు మనిషి జీవితంలో గల మహత్తరమైన స్థానాన్ని గురించి, అది నాకు ఎలా ఉపకరించిందో వివరించడం నా యీ ప్రకరణానికి లక్ష్యం. యీ విషయం గత ప్రకరణాల్లో కొద్దిగా వ్రాశాను. యిక్కడ ఆ విషయాలను కొంచెం విస్తరించి వ్రాస్తున్నాను. మనిషి శరీరమనే బొమ్మ అయిదు నైసర్గికతత్వాలతో అనగా పృధ్వీ (మట్టి), నీరు, ఆకాశము, తేజము (సూర్యుడు), వాయువులతో నిర్మాణమైంది. ఆసాధనాలను గురించి యిక్కడ వివరిస్తున్నాను.

1901 వరకు నేను జబ్బు చేస్తే డాక్టర్లకు దగ్గరికి పరుగెత్తే వాణ్ణికాదు. కాని వాళ్ల మందులు కొద్దిగా వాడుతూ వుండేవాణ్ణి. రెండు మూడు విషయాలు కీ॥శే॥ డా॥ ప్రాణ్ జీవన్ మెహతా చెప్పారు. నేను ఒక చిన్న ఆసుపత్రిలో పని చేస్తూ వుండేవాణ్ణి కొద్ది అనుభవం నాకు అక్కడ కలిగింది. కొంత పుస్తకాల్లో చదివాను. తిన్న ఆహారం సరిగా జీర్ణమయ్యేదికాదు. అందుకోసం ఫ్రూట్‌సాల్ట్ వాడుతూ వుండేవాణ్ణి. కొద్దిగా నయమయ్యేది. కాని నీరసంగా వుండేది. తలనొప్పిబాధిస్తూ వుండేది. యింకా కొన్ని యిబ్బందులు కలుగుతూ వుండేవి. అందుకు డా॥ ప్రాణ్‌జీవన్ మెహతా గారు చెప్పిన డైలేజ్డ్ ఐరన్ మరియు నక్సవామికా వాడుతూ వుండేవాణ్ణి. మందుల మీద నాకు విశ్వాసంతక్కువ. అయినా గత్యంతరం లేక మందులు వాడేవాణ్ణి. కాని వాటివల్ల నాకు తృప్తి కలిగేది కాదు.

ఆ సమయంలో ఆహారాన్ని గురించి ప్రయోగాలు ప్రారంభించాను. ప్రకృతి చికిత్స మీద నాకు విశ్వాసం కలిగింది. యీ విషయంలో ఎవ్వరి సహాయం తీసుకోలేదు. చదివిన దాన్ని బట్టి ఆహార పదార్థాల్లో మార్పులు చేయసాగాను. కాలి నడకన బాగా తిరుగుతూ వున్నందున ఎన్నడూ మంచం ఎక్కలేదు. యీ విధంగా నా బండి వదులు వదులుగా కదులుతూ వుండేది. ఒకనాడు జుస్ట్ రచించిన "ప్రకృతి వైపుకు తిరుగు" అను పుస్తకం పోలక్ సోదరుడు తెచ్చినాకు యిచ్చాడు. పోలక్ ఆచికిత్స చేసుకునేవారు కాదు. కాని నా అలవాట్లను చూచి వారు ఆ పుస్తకం తెచ్చి యిచ్చారు. అందు మట్టికి ప్రాధాన్యం యిచ్చారు. మట్టిని ఉపయోగించాలని కోరిక కలిగింది. అజీర్తిగా వున్నప్పుడు మట్టిని చల్లని నీటిలో తడిపి పొట్టమీద వుంచమని జుస్ట్ వ్రాశారు. కాని నేనుక ఒక పల్చటి గుడ్డలో తడిమట్టిని వుంచి దాన్ని రాత్రంతా పొత్తికడుపు మీద వుంచాను. ప్రొద్దున లేవగానే విరోచన అనుమానం కలిగింది. దొడ్డికి వెళితే విరోచనం అయింది. తృప్తి కలిగింది. ఆనాటినుంచి నేను ఫ్రూట్ సాల్టును తాకలేదు. అవసరమని అనిపించినప్పుడు ఆముదం ఒక చిన్న చంచాడు ఉదయం తీసుకుంటూ వున్నాను. నేను వాడిన మట్టి పట్టీ మూడు అంగుళాల వెడల్పు, ఆరు అడుగుల పొడుగు, అర్థఅంగుళం

దళసరిగా వున్నది. పాము కరిస్తే అతణ్ణి గుంటతీసి అందు పడుకోబెట్టి మట్టి కప్పితే విషం తగ్గిపోతుందని జస్ట్ వ్రాశారు. యీ విషయం నిజమో కాదో నేను ప్రయోగం చేయలేదు. కాని మట్టితో నేను కొన్ని ప్రయోగాలు చేశాను వాటిని గురించి వ్రాస్తున్నాను. తలనొప్పి వస్తే మట్టి పట్టీ తలమీద పెట్టి వుంచితే ఎంతో లాభం కలుగుతుంది. యీ ప్రయోగం నేను వందలాది సార్లు చేశాను. తలనొప్పికి అనేక కారణాలున్నాయని నాకు తెలుసు. ఏ కారణం వల్ల తలనొప్పి వచ్చినా సరే వెంటనే మట్టి పట్టీ తల మీద వుంచితే తాత్కాలికంగా నొప్పి తగ్గుతుంది. కురుపులకు, పుండ్లకు మట్టి బాగా పని చేస్తుంది. కారుతున్న కురుపుమీద కూడా మట్టి పట్టీ వేశాను. యిలాంటి కురుపు మీద మట్టి పట్టీ వేసేముందు శుభ్రమైన బట్టను పరమెంగనేట్ గులాబీనీళ్లలో తడిపి, దానితో పుండును తుడిచి, దానిమీద మట్టి పట్టీ వేస్తాను. దీనివల్ల కురుపులు చాలా వరకు నయమవుతాయి. నేను చాలా మందికి యీ చికిత్స చేశాను. అన్నీ నయమయ్యాయి. కందిరీగలు కుట్టినప్పుడు కుట్టిన చోట మట్టి తగిలిస్తే నయమవుతుంది. తేలు కుట్టిన చోట కూడా మట్టి చికిత్స చేశాను. సేవాశ్రమంలో తేళ్ల బెడద ఎక్కువ. తేలు కుడితే జరుపవలసిన ఎన్నో చికిత్సలు సేవాశ్రమంలో చేశాము. ఏవీ నిష్ఫలం కాలేదు. మట్టి కూడా బాగా పని చేసింది.

బాగా జ్వరంవస్తే మట్టి పట్టీ పొత్తికడుపు మీద వుంచి, తలనొప్పి వస్తే మట్టిపట్టీ తలమీద వుంచి ఎంతో మందికి నేను చికిత్స చేశాను. జ్వరం తగ్గిపోయిందని చెప్పలేనుకాని రోగికి శాంతి మాత్రం లభించిందని చెప్పవచ్చు. టైఫాయిడ్ జ్వరంవస్తే నేను మట్టి పట్టీని అధికంగా వాడాను. అయితే గడుపు రోజులు దాటిన తరువాతనే టైఫాయిడ్ తగ్గుతూవుండేది. మట్టి చికిత్సవల్ల రోగికి శాంతి లభించేది. రోగులంతా మట్టి కావాలని, కోరుతూ వుండేవారు. 10 దాకా టైఫాయిడ్ కేసులకు చికిత్స చేశాము. అన్నీ నయమైనాయి. దానితో సేవాగ్రామంలో టైఫాయిడ్ అంటే భయం పోయింది. ఒక్కకేసులో కూడా నేను మందులు వాడలేదు. మట్టికి బదులు మరో ప్రకృతి చికిత్స చేశాను. ఆ వివరం అయా ప్రకరణాల్లో వివరిస్తాను.

సేవాగ్రాంలో జరిగిన చికిత్సల్లో ఉపయోగించిన మట్టిలో నువ్వుల నూనె, ఉప్పు కలిపేవాళ్లం. ఆ తరువాత మట్టిని ఉడకబెట్టినందున అందుగల దోషమంతా హరించుకుపోయేది.

మట్టి ఎలాంటిది కావాలో తెలుసుకుందాం. నాకు మొదట మంచి ఎర్రమట్టితో పరిచయం ఏర్పడింది. అందు నీళ్లు కలిపితే సువాసన వచ్చేది. యిటు వంటి మట్టి తేలికగా లభించడం కష్టం. బొంబాయి వంటి పట్టణంలో ఏరకమైన మట్టి దొరకలేదు. చాలా యిబ్బంది కలిగింది. మట్టి జిడ్డుగా వుండకూడదు, ఇసుకలా కూడా వుండకూడదు. ఎరువుకు వాడే మట్టిని అసలు ఉపయోగించ కూడదు. మట్టి పట్టులా మృదువుగా వుండాలి. అందుకంకర కలవకూడదు. అందువల్ల మట్టిని పల్చటి జల్లెడతో జల్లించాలి. శుభ్రంగా లేకపోతే దాన్ని వేడి చేయాలి. ఎండుమట్టి మంచిది. తడిసిన మట్టి దొరికితే దాన్ని ఎండబెట్టాలి. ఎండ లేకపోతే కుంపటిమీద పెడితే తడిపోతుంది. శుభ్రమైన చర్మం మీద వాడిన మట్టిని మళ్లీ ఉపయోగించవచ్చు. ఆ విధంగా వాడితే మట్టి గుణంపోతుందనే ఆధారమేమీ నాకు దొరకలేదు. మూసీనది ఒడ్డున దొరికే పసుపుపచ్చని మట్టి ఎంతో ఉపయోగకరమైనదని వాడిన వాళ్లు చాలా మంది నాకు చెప్పారు.

శుభ్రమైన పల్చటి సముద్రపు ఇసుకను విరోచనం కోసం తినవచ్చునని క్యునే వ్రాశారు. మట్టిని గురించి క్యునే "మట్టి జీర్ణం కాదు. దాన్నిమలిన పదార్థం వలె పొట్టనుంచి బయటికి పంపవలసిందే. అది తనతోపాటు మలాన్ని కూడా బయటికి తెస్తుంది అని వ్రాశారు. అయితే యిట్టి అనుభవం నాకు కలుగలేదు. అందువల్ల యీ ప్రయోగం చేయతలిస్తే జాగ్రత్తగా యోచించి మరీ చేయమని సలహా యిస్తున్నాను. ఒకటి రెండు సార్లు పరీక్షించి చూస్తే నష్టం ఉండదు.



# 2
# నీరు

జలచికిత్స ప్రసిద్ధికెక్కిన ప్రాచీన చికిత్స. దాన్ని గురించి చాలా పుస్తకాలు రచించబడ్డాయి. క్యునే ఉత్తమమైన జలచికిత్సను కనిపెట్టారు. క్యునే వ్రాసిన పుస్తకం భారత దేశంలో మంచి ప్రచారం పొందింది. మన భాషల్లోకి అనువదించబడింది. జలచికిత్సమ ఆచరించేవారి సంఖ్య ఆంధ్రదేశంలో ఎక్కువగా వున్నది. క్యునే ఆహారాన్ని గురించి కూడా చాలా వ్రాశారు. కాని యిక్కడ కేవలం జలచికిత్సను గురించి మాత్రమే నేను వ్రాయదలచుకున్నాను. క్యునే సూచించిన జలచికిత్సకు కేంద్ర బిందువులు రెండు. 1. కటిస్నానం 2. ఘర్షణ స్నానం. యీ స్నానాల కోసం ప్రత్యేకించిన తొట్టెను కూడా వారు తయారు చేయించారు. అయితే ప్రత్యేకించి ఆ తొట్టె అవసరం అంతగా లేదని చెప్పవచ్చు. మనిషి ఎత్తునుబట్టి 30 నుంచి 36 అంగుళాల లోతుగల తొట్టె బాగా ఉపయోగపడుతుంది. అనుభవాన్ని బట్టి యింకా పెద్ద తొట్టె అవసరమైతే ఉపయోగించవచ్చు. అందుచల్లని నీరు నింపాలి. వేసవికాలంలో నీళ్లు చల్లగా వుండటం చాలా అవసరం. నీటిని వెంటనే చల్లగా చేయడం కోసం అవసరమైతే కొద్దిగా మంచుగడ్డను ఉపయోగించవచ్చు. మట్టికుండలో చల్లబడ్డనీరు వుంటే మరీ శ్రేష్టం. ఆ నీటిని తొట్టెలో నింపాలి. తొట్టెలో గలనీటిపై ఒక గుడ్డ కప్పి ఫానువేస్తే ఆ ఫానుగాలికి నీరు చల్లబడుతుంది. తొట్టెను గోడకు ఆనించి వుంచాలి. ఆ తొట్టెలో మనిషి హాయిగా కూర్చొనుటకు వీలుగా ఒక కొయ్య పీటను వుంచాలి. ఆ పీటను ఆనుకొని మనిషి కూర్చొనుటకు వీలుండాలి. రోగి తన కాళ్లు తొట్టె బైటకు వచ్చేలా పెట్టుకొని తొట్టెలో కూర్చోవాలి. నీటిలో మిగతా బయటి శరీరం మునిగి వుండాలి. అప్పుడు చలివేయదు. తొట్టెను వుంచే గదిలోకి గాలి, వెలుతురు బాగా రావడం అవసరం. హాయిగా నీళ్లలో కూర్చొని మెత్తని తువాలుతో రోగి పొత్తికడుపును మెల్లమెల్లగా రుద్దుతూ వుండాలి. 5 నిమిషాల నుంచి 30

నిమిషాల సేపు తొట్టెలో రోగి కూర్చోవచ్చు. ఇట్టి స్నానం పూర్తి అయిన తరువాత తడిసినచోటును తుడిచి రోగిని ప్రక్క మీద పడుకోబెట్టాలి. యీ స్నానం ఎంత పెద్ద జ్వరామైనా సరే తగ్గించి వేస్తుంది. యిట్టి స్నానం వల్ల నష్టం ఏమీ వుండదు. లాభం ప్రత్యక్షంగా కనబడుతుంది. పరగడుపున యీ స్నానం చేయాలి. దానివల్ల అజీర్తి కూడా తగ్గిపోతుంది. స్నానం చేసిన వాని శరీరానికి స్ఫూర్తి లభిస్తుంది. అజీర్తి వున్నవాళ్లు స్నానం చేసిన తరువాత ఒక అరగంట సేపు పచార్లు చేయడం మంచిదని క్యునే సలహాయిచ్చారు. యీ స్నానం నేను ఎక్కువగా చేశాను. నూటికి నూరుపాళ్లు యీ స్నానం సాఫల్యం పొందిందని చెప్పలేను గాని 75 శాతం సాఫల్యం పొందిందని స్వానుభవం వల్ల చెప్పగలను. జ్వరం తీవ్రంగా వున్నప్పుడు, రోగి తొట్టెలో కూర్చొన గలిగితే, కటిస్నానం చేయించాలి. అప్పుడు రెండు మూడు డిగ్రీల జ్వరం తగ్గుతుంది. సన్నిపాతం వచ్చే ప్రమాదం తగ్గిపోతుంది. ఈ స్నానాన్ని గురించి క్యునే చెప్పిన విషయం గమనించాలి. వారు చెప్పిన ప్రకారం జ్వరం యొక్క బయటి చిహ్నాలు ఏవివున్నా, ఆంతరిక కారణం ఒక్కటే. పేగుల్లో చేరిన మలపు విషంవల్ల లేక యితర కారణాలవల్ల జ్వరం వస్తుంది. యీ పేగుల జ్వరం, లోపలివేడి పలు రూపాల్లో బయటికి వస్తుంది. కటిస్నానం వల్ల యీ లోపలి జ్వరం తగ్గుతుంది. అందువల్ల బయట కనబడే అనేక అవలక్షణాలు శాంతిస్తాయి." అయితే క్యునే చెప్పిన యీవిషయం ఎంతవరకు సత్యమో నాకు తెలియదు. అనుభవజ్ఞులైన డాక్టర్లు యీ విషయం చెప్పాలి. డాక్టర్లు ప్రకృతి చికిత్స చేస్తున్నా దాని యెడ వారు నిర్లక్ష్యంగా వున్నారని చెప్పక తప్పదు. అందుకు కారణం ఏమిటో తెలుసుకుందాం. డాక్టర్లు వైద్య కళాశాలల్లో నేర్చుకున్న విషయాల మీదనే దృష్టి కేంద్రీకరిస్తున్నారు. అది వారికి అలవాటు అయిపోయింది. కనుక బయటి చికిత్స విషయాలను అంతగా పట్టించుకోవడం లేదు. ప్రకృతి చికిత్సకులు కూడా డాక్టర్లను తిరస్కరిస్తున్నారు. ప్రకృతి వైద్యుల దగ్గర శాస్త్రీయ జ్ఞానం తక్కువగా వున్నా, మాటలు మాత్రం పెద్ద పెద్దవి చెబుతూ వుంటారు. వారి చికిత్స యందు సంఘశక్తి లోపిస్తున్నది. అంతా తమ తమ జ్ఞానంతోనే సరిపెట్టుకొని

చుట్టూ గిరిగీసు క్కూర్చుంటున్నారు. కొందరి ప్రయోగాలు లోతుకుపోవడం లేదు. చాలామంది ప్రకృతి వైద్యుల్లో వినమ్రత ఉండటం లేదు. (వినమ్రత నేర్చుకునే విషయమా?) యిలా వ్రాయడం ప్రకృతి వైద్యుల్ని తిట్టడానికి కాదు. ప్రస్తుత స్థితిని అందరి ముందు ప్రకటిస్తున్నాను. ప్రకృతి వైద్యుల్లో తేజ స్సంపన్నుడు బయలు దేరనంత వరకు పరిస్థితి యిలాగే వుంటుంది. దీన్ని మార్చవలసిన బాధ్యత ప్రకృతి వైద్యులపై వున్నది. డాక్టర్ల దగ్గర విడిగా ఒక శాస్త్రం వున్నది. ప్రత్యేక ప్రతిష్ట వున్నది. తమ సంఘం వున్నది. తమ కళాశాలలువున్నాయి. చాలావరకు వాళ్లు తమ పనియందు సాఫల్యం కూడా పొందుతున్నారు. వైద్య శాస్త్ర రూపంలో బయల్వెడలని అపరిచిత వస్తువును, ఒక్కసారిగా వాళ్లు స్వీకరిస్తారని ఆశించకూడదు.

ప్రకృతి చికిత్స యను పేరును బట్టి దాని గుణం కూడా వుంటుందని సామాన్య ప్రజలు అర్థం చేసుకోవాలి. యిది ప్రకృతి సహజమైన చికిత్స. కనుక సామాన్యమైన మనిషి కూడా నిశ్చింతగా దీన్ని ఉపయోగించుకోవచ్చు. తల నొప్పివస్తే రుమాలు చల్లని నీళ్లలో తడిపి నెత్తిమీద కప్పుకుంటే నష్టం ఏమీ వుండదని, నీటి రుమాలుకు బదులు, మట్టి నీరు రెండూ కలిపి బట్టలో చుట్టి నెత్తినపెట్టుకుంటే రెండిటి గుణాలవల్ల లాభం పొందవచ్చనీ సామాన్య జనం గ్రహించాలి.

ఇక ఘర్షణ స్నానాన్ని గురించి వివరిస్తాను. జననేంద్రియం ఎంతో నాజూకుగా వుంటుంది. దానిపైన గల చర్మం కొనయందు అద్భుతమైన పదార్థం వున్నది. దాన్ని వర్ణించలేను. దీనిలో ప్రయోజనం చూచి క్యునే యిలా వివరించాడు. "ఈ ఇంద్రియం కొనమీద మెత్తటి రుమాలును నీటిలో తడిపి రుద్దుతూ వుండాలి. దాని మీద నీరు పోస్తూ వుండాలి. చికిత్స విధానం ఎలా వుండాలో కూడా వివరించాడు. "నీటితొట్టెలో ఒక స్టూలు వుంచాలి. స్టూలు నీటి కంటె కొద్దిగా పైకి వుండాలి. పాదం తొట్టెకు బయట పెట్టి స్టూలు మీద మనిషి కూర్చోవాలి. ఇంద్రియం కొనమీద రుద్దుతూ వుండాలి. అయితే ఇంద్రియ చర్మం సున్నితమైనది కనుక దానికి కొంచెం కూడా బాధ కలుగకూడదు. రోగికి దీని వల్ల హాయి కలగాలి. దీన్ని ఘర్షణస్నానం అని

అంటారు. దీనివల్ల స్నానం చేయువానికి హాయిగా వుంటుంది. ఎలాంటి రోగం అయినా సరే, ఆ సమయంలో అతడికి శాంతి లభిస్తుంది. కటిస్నానం కంటే, ఘర్షణ స్నానం గొప్పదని క్యునే అభిప్రాయం. నాకు కటి స్నానంతో సంబంధం వుండటం వల్ల బాగా అనుభవం కలిగింది. ఘర్షణ స్నానానుభవం నాకు కలుగ లేదు. దోషం నాదే. ఘర్షణ స్నానం మీద నేను దృష్టి సారించలేదు. కొందరికి ఘర్షణ స్నానం చేయమని సలహాయిచ్చాను. కానివాళ్లు పట్టుదల వహించి యీ స్నానం చేయలేదు. స్వానుభవంలేనందువల్ల ఘర్షణ స్నానాన్ని గురించి వివరించలేను. ప్రతివారు స్వయంగా చేసి అనుభవం గడించాలి. తొట్టె దొరక్కపోతే గ్లాసుతో నీళ్ళు పోస్తూ కూడా ఘర్షణ స్నానం చేయవచ్చు. దీనివల్ల శాంతి తప్పక లభిస్తుంది. సామాన్యంగా ప్రజలు యీ ఇంద్రియ శుభ్రతపై దృష్టి కేంద్రీకరించరు. ఘర్షణ స్నానంవల్ల జననేంద్రియం శుభ్రపడుతుంది. జాగ్రత్తగా లేకపోతే చర్మంలో మురికి పేరుకోవచ్చు. అట్టి మురికిని తొలగించాలి. ఘర్షణ స్నానం చేసి, జననేంద్రియాన్ని శుభ్రం చేస్తే బ్రహ్మచర్యపాలనకు అది బాగా ఉపయోగపడుతుంది. అక్కడి నరాలు గట్టిపడతాయి. శాంతిస్తాయి కూడా. వీర్యస్ఖలనం తగ్గిపోతుంది. అక్కడ పేరుకొనే మురికి యెడ మనకు అసహ్యం వేస్తుంది. దాని తొలగించుటకు కృషి చేస్తాం.

కటిస్నానం ఘర్షణస్నానం రెండిటినీ క్యునే స్నానాలు అని అనవచ్చు. మూడో స్నానం కూడా యిలాంటిదే ఒకటి వున్నది. దీన్ని దుప్పటి స్నానం అని అంటారు. జ్వరం వచ్చినవారికి నిద్రపట్టనివారికి దుప్పటి స్నానం ఎంతో లాభం కలిగిస్తుంది. మంచం మీద రెండు మూడు కంబళ్లు పరచాలి. అవి వెడల్పుగా వుండాలి. దాని మీద దళసరి నూలుతో తయారు చేయబడిన ఖద్దరు దుప్పటి పరచాలి. యీ దుప్పటిని తడిపి బాగా పిండి కంబళ్ల మీద పరచాలి. దానిమీద బట్టలూడతీసి రోగిని వెల్లకిలపడుకో బెట్టాలి. అతడి సిరస్సును కంబళీ బయట దిండుమీద ఉంచాలి. సిరస్సు మీద తడిపిపిండిన తువాలు వుంచాలి. రోగిని పడుకోబెట్టి దుప్పటిని, కంబళీల్ని నాలుగువైపుల రోగికి చుట్టి వేయాలి. చేతులు, కాళ్లు పూర్తిగా కంబళీ లోపల వుంచాలి.

బయటిగాలిని లోనికి పోనీయకూడదు. యిలా చేస్తే రెండు నిమిషాల్లో రోగికి ఉష్ణం ఎక్కాలి. పడుకోబెడుతున్నప్పుడు కొద్ది చలివేయవచ్చు. తరువాత రోగికి హాయిగా వుంటుంది. జ్వరం లేకపోతే 5 లేక 6 నిమిషాల్లో వేడి ఎక్కి చెమట పడుతుంది. నేను పెద్ద జ్వరంలో వున్న రోగిని అరగంటసేపు యిలా వుంచగా జ్వరం తగ్గిపోయింది. అప్పుడప్పుడు చెమట కారకపోవచ్చు. కాని రోగి నిద్ర పోతాడు. నిద్రపోతే రోగిని మేల్కొలపకూడదు. నిద్రవచ్చిందంటే దుప్పటి స్నానం వల్ల రోగికి హాయిగా వున్నదని భావించాలి. దుప్పట్లో పడుకోబెట్టిన రెండు నిమిషాల్లో రెండు మూడు డిగ్రీల జ్వరం తప్పక తగ్గుతుంది.

నా (రెండవ) కుమారుడికి డబల్‌నిమోనియా వచ్చింది. సన్నిపాతం కూడా ప్రారంభమైంది. అట్టి స్థితిలో దుప్పటి స్నానం చేయించాను. చెమటతో తడిసిపోయాడు. మూడు నాలుగురోజులు యిలా చేసేసరికి అతడికి జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. చివరికి అతడికి వచ్చింది టైఫాయిడ్ అని తేలింది. 42 రోజులు గడిచిన తరువాతనే ఆ జ్వరం తగ్గింది. 106 డిగ్రీల జ్వరం వున్నంతవరకు దుప్పటిస్నానం చేయిస్తూ వున్నాను. 7 రోజుల తరువాత అంత జ్వరం రావడం తగ్గి 103 డిగ్రీల వరకు రాసాగింది. డిగ్రీల విషయమై నాజ్ఞాపకశక్తి యిప్పుడు సరిగా పనిచేసి యుండకపోవచ్చు. డాక్టర్లు వద్దని చెప్పినా వినిపించుకోకుండా నేను యీ చికిత్స చేశాను. నాకు నలుగురు కొడుకులు. వారందరిలో మా రెండవ కుమారుడే యిప్పుడు బలంగా వున్నాడు. మిగతా ముగ్గురికంటే ఎక్కువ శ్రమ చేస్తుంటాడు.

పైత్యం పెరిగినా, వాతం పెరిగినా, దురదపెరిగినా, మసూచి పోసినా, దుప్పటి స్నానం బాగా పనిచేస్తుంది. యిట్టి రోగాలకు దుప్పటి స్నానం బాగా ఉపయోగపడింది. మశూచి, ఆటలమ్మ పోసిన రోగులకు వాడిన నీటిలో పరమాంగనేట్ వేసి గులాబీరంగు వచ్చేలా చేసేవాణ్ణి. దుప్పటి పని అయిపోగానే దాన్ని మరుగుతున్న నీళ్లలో వేయాలి. దాన్ని తరువాత ఉతికి ఆరవేయాలి.

రక్తపుపోటు తగ్గినా, కాళ్ళు పడిపోతున్నట్లు అనిపించినా మంచుగడ్డ రుద్దాలి. దానివల్ల లాభం కలుగుతుంది. వేసవి కాలంలో యిది బాగా పనిచేస్తుంది. చలికాలంలో బలహీనంగా వున్న రోగికి మంచుగడ్డ చికిత్స ప్రమాదిస్తుంది.

ఇప్పుడు వేడి నీటి చికిత్సను గురించి యోచిద్దాం. వేడినీటిని తెలివిగా ఉపయోగిస్తే పలురోగాలు నయమవుతాయి. అయోడిన్ మందు చేయగల పనులు వేడినీరు చేస్తుంది. ఎక్కడైనా వాపు వస్తే అక్కడ అయోడీన్ రాస్తాం. ఆ వాపు మీద వేడినీటి పట్టీ వేస్తే వాపు బాధ తగ్గుతుంది. చెవిలోపోటు వస్తే అయోడిన్ చుక్కలు వేస్తాం. వేడినీటితో పిచకారీ చేస్తే చెవిపోటుతగ్గుతుంది. అయోడీన్ వాడకంలోగల ప్రమాదం వేడినీటి వాడకంవల్ల కలుగదు. అయోడీన్ క్రిమికీటకాదుల సంహారిణి. వేడినీరుకూడా క్రిమిసంహారియే. అంటే అయోడీన్ వల్ల ప్రయోజనం లేదని భావించకూడదు. దాని ప్రయోజనాన్ని గురించి నా మనస్సులో ఎట్టి సందేహమూ లేదు. అయితే బీదవాడి యింటిలో అయోడిన్ వుండదు కదా. దాని ఖరీదు ఎక్కువ. దాన్ని ప్రతివాడి చేతిలో వుంచుటకు వీలులేదు. కాని నీరుప్రతి చోట వుంటుంది. దొరుకుతుంది. అందువల్ల మందు రూపంలో దాన్ని విలువగా చూడలేకపోతున్నాం. ఆ భావాన్ని మనం మార్చుకోవాలి. యిలాంటి చికిత్సలు నేర్చుకొని రకరకాల భయాలనుంచి ముక్తి పొందవచ్చు.

తేలు కుడితే ఏమి చేసినా బాధ తగ్గక పోతే, కుట్టిన చోటును వేడినీటిలో పెడితే బాధ కొంచెం తగ్గుతుంది.

అకస్మాత్తుగా చలువకమ్మినా, వళ్లంతా వణుకువచ్చినా రోగికి ఆవిరిపట్టాలి. కంబళికప్పి నాలుగు వైపుల వేడినీటి సీసాలు వుంచాలి. వణుకు తగ్గుతుంది. అందరి దగ్గర వేడినీటి రబ్బరు సంచీలు వుండవు. గాజుసీసాలో వేడినీళ్లు నింపి మూత బిగించి దానితో వేడినీటి రబ్బరు సంచీవలె కాపడం వేయవచ్చు. సీసా మరీ వేడిగా వుంటే దానికి గుడ్డ చుట్టి కాపడం వేయాలి.

ఆవిరి రూపంలో నీరు ఎంతో లాభం చేకూరుస్తుంది. చెమట పట్టకపోతే ఆవిరి పట్టి చెమట పట్టేలా చేయవచ్చు. పక్షవాతంవల్ల శరీరంలో ఏ

భాగమైనా చచ్చుపడినా, స్థూలకాయం యింకా పెరిగినా, ఆవిరి పట్టి తద్వారా ఆ బాధల్ని తొలిగించవచ్చు.

ఆవిరి పట్టుటకు పాత తేలికపద్ధతి ఒకటి వున్నది. నులకమంచంగాని, నవారు మంచంగాని వేసి, దాని మీద కంబళీ పరిచి రోగిని దాని మీద పడుకోపెట్టాలి. కంబళీ మంచంనాలుగువైపులా మంచం కిందికి దిగి నేలకు ఆనాలి. అప్పుడు బయటిగాలి మంచం క్రిందకుచేరదు. అప్పుడు మంచం క్రింద వుంచిన వేడినీటి కుండలమీద మూకుడు తీసివేయాలి. అప్పుడు ఆ వేడినీటి ఆవిరిపైకి వెళ్ళి రోగికి బాగా తగులుతుంది. ఆవిరి సరిగా తగలకపోతే మరో వేడినీటి కుండను మంచం క్రిందవుంచాలి. సామాన్యంగా మన వాళ్లు మంచం క్రింద నిప్పులు వుంచి, ఆ నిప్పుల మీద నీటిపాత్ర వుంచుతారు. యిందువల్ల ఆవిరిబాగా తగులుతుంది. కాని ఆ నిప్పు అంటుకొని ప్రమాదం జరుగవచ్చు. ఒకనిప్పురవ్వలేచి కంబళీకి అంటుకుంటే భగ్గునమండి రోగి ఆ మంటల్లో చిక్కుకుంటాడు. అందువల్ల వెంటనే వేడిని పొందాలన్న కోరికను తగ్గించుకోవడం అవసరం. అందుకు నేను చెప్పిన ఉపాయాల్ని అమలు చేస్తే తేలికగా అనుకున్నపని జరుగుతుంది.

కొంత మంది ఆవిరివచ్చే నీటిలో వనస్పతులు వేస్తారు. ఉదాహరణకు వేపఆకులు. అయితే దాని ఉపయోగాన్ని గురించి నాకు అనుభవం లేదు. అయితే ఆవిరిమాత్రం ఎంతో ఉపయోగకారి. ఇది చెమట వచ్చేలా చేసే పద్ధతి.

కాళ్లు చల్లబడితే, లేక విరిగిపోతున్నట్లనిపిస్తే పెద్ద పాత్రలో గోరు వెచ్చని నీరు నింపి అందులో మోకాళ్ల వరకు నీరు వచ్చేలా కాళ్లు దించాలి. ఆనీటిలో ఆవాలపిండి కలిపి కొద్ది నిమిషాల పాటు కాళ్లు అందులో వుంచాలి. దానివల్ల కాళ్లకు వేడెక్కుతుంది. కాళ్ల బాధ తగ్గుతుంది. రక్తం క్రిందకు దిగి రోగికి ఉపశమనం కలుగుతుంది. కళ్లె వస్తున్నా, గొంతు నొప్పిగా వున్నా గిన్నెలో ఆవిరి వచ్చే వేడినీటిని నింపి ఆ ఆవిరిని గొంతుకు, ముక్కుకు జాగ్రత్తగా పట్టాలి. గిన్నెలో గొట్టం వుంచితే ఆవిరి తేలికగా పట్టవచ్చు. కొయ్య గొట్టం అయితే మంచిది. యీ గొట్టానికి రబ్బరు గొట్టం అమరిస్తే తేలికగా పని పూర్తి అవుతుంది.

  

# ఆకాశము - అవకాశము

ఆకాశాన్ని పూర్ణ పరిజ్ఞానంతో మనం ఉపయోగించడంలేదు. దాన్ని గురించి మనకు తెలియదు. ఆకాశాన్ని అవకాశమని కూడా అంటారు. పగటిపూట మేఘాలు లేనప్పుడు, పైకి చూస్తే ఒక శుభ్రమైన, స్వచ్ఛమైన అందమైన, ఆకాశపు రంగుతో ఒక డేరా కనబడుతుంది. దాన్నే మనం ఆకాశం అని అంటాము. ఆకాశమంటే యిదే కదా! యీ డేరాకు తుది మొదలు ఏమీ కనబడవు. యిది ఎంత దూరమో, అంతదగ్గరకూడా. మన నాలుగు వైపుల ఆకాశం లేకపోతే ఎప్పుడో ఎగిరిపోయే వాళ్లం. ఏమీ లేనిచోట ఆకాశం వుంటుంది. అందువల్ల దూరంగా బూడిదరంగులో కనబడేదే ఆకాశమని భావించకూడదు. ఆకాశంమన దగ్గరి నుంచే ప్రారంభమవుతుంది. ఆకాశం మన అంతరంగంలో కూడా వ్యాప్తమైవున్నది. ఖాళీ చోటును లేక శూన్యాన్ని ఆకాశం అని అనవచ్చు. కాని నిజానికి అది సరికాదు. ఖాళీగా వున్న ఆ ప్రదేశం గాలితో నిండి వుంటుంది. అయితే మనం గాలిని చూడలేము. యిది నిజం. అసలు గాలి వుండే చోటు ఏది? గాలి ఆకాశంలోనే విహరిస్తూ వుంటుంది కదూ! అందువల్ల మనం ఎట్టి స్థితిలోనూ ఆకాశానికి దూరం కాలేము. గాలిని పంపుద్వారా లాగవచ్చు కాని ఆకాశాన్ని ఎవరు లాగగలరు? అయితే మనం ఆకాశాన్ని నింపి వేస్తూ వుంటాం. ఆకాశం అంతులేనిది. అందువల్ల ఎన్ని శరీరాలైనా అందుపడతాయి.

ఈ ఆకాశాన్ని పోయిన ఆరోగ్యాన్ని తిరిగి పొందడానికి ఉపయోగించుకోవాలి. జీవించి యుండాలంటే గాలి చాలా అవసరం. కనుకనే అది సర్వత్రా వ్యాప్తమై వుంటుంది. యితర తత్వాల కంటే గాలి వ్యాప్తమై యుండే వస్తువేకాని అది అనంతం మాత్రం కాదు. భూమికి కొన్ని మైళ్ల దూరంపైకి పోతే మనకు గాలి లభించదు. అని భౌతిక శాస్త్రం మనకు బోధిస్తుంది. భూమి మీద గల ప్రాణులు లేకజీవులు గాలి ఆవరణలేని చోట వుండ

లేవని కూడా అంటారు. అది నిజమైనా, కాకపోయినా, ఆకాశం యిక్కడ ఎలా వున్నదో, అలాగే గాలివిహరించని ఆవరణయందు కూడా వున్నదని మనం గ్రహించాలి. అందువల్ల సర్వత్ర వ్యాపించి యున్నది ఆకాశమే. విజ్ఞాన వేత్తలు ఆవరణకుపైన "ఈథర్" అను పదార్థమోలేక మరేదో వున్నదని చెబుతారు. ఆ పదార్థం కూడా వున్నది. ఆకాశంలోనే కదా! మరో మాటల్లో చెప్పాలంటే, భగవంతుడు ఎవరు అను రహస్యాన్ని మనం తెలుసుకోగలిగితే, ఆకాశం అంటే ఏమిటి అనురహస్యాన్ని కూడా తెలుసుకో గలుగుతాం.

అట్టి మహత్తరమైన వస్తువును ఉపయోగించుకో గలిగితే ఆరోగ్యవంతులం కాగలుగుతాం.

మొదటి పాఠం - దూరంగాను, దగ్గరగాను వున్న ఆకాశతత్వానికి, మనకు మధ్య ఎట్టి ఆవరణకు తావు యివ్వకూడదు. అనగా ఇల్లు వాకిలి లేకుండా, లేకబట్టలు ఏమీ లేకుండా మనం యీ అనంతమైన ఆకాశంతో సంబంధం పెట్టుకో కలిగితే మన శరీరం, మన బుద్ధి, ఆత్మ పూర్తిగా ఆరోగ్యాన్ని అనుభవించగలుగుతాయి. యింత పెద్ద ఆదర్శాన్ని మనం సాధించలేకపోయినా, కోట్లమందిలో ఒక్కడు సాధించగలిగినా దాన్ని తెలుసుకొని ఆదరభావంతో చూడటం ఎంతో అవసరం. అదే మన ఆదర్శమైతే, దాన్ని పొందగలిగితే సుఖశాంతులు తృప్తి పొందుతాము. ఇట్టి అదర్శాన్ని దృష్టియందుంచుకొని, పై మెట్టు వరకు చేరగలిగితే, శరీరమనే అంతరాయాన్ని (అనగా, శరీరం వున్నా లేకపోయినా) మరిచిపోయి మనం తటస్థంగా వుండాలి. మనస్సుకు యీ విధమైన శిక్షణ యిస్తే భోగవాంఛలకు శరీరాన్ని సాధనం చేయలేము. మన జ్ఞానాన్ని, మన శక్తిని అనుసరించి మనం మన శరీరాన్ని సద్వినియోగం చేసుకోగలుగుతాము. సేవ చేయుటకు, భగవంతుణ్ణి తెలుసుకొనుటకు, అతడు సృష్టించిన జగత్తును తెలుసుకొనుటకు, అతనితో ఐక్యతను సాధించుటకు శరీరాన్ని సాధనంగా ఉపయోగించగలుగుతాము.

ఈ విచారణ సరళి ప్రకారం ఇల్లు వాకిలి, వస్త్రాదుల వినియోగ విషయమై ఎంతో అవకాశం పొందగలుగుతాము. చాలా యిండ్లలో గల అలంకరణ సామగ్రి, సామానులు వగైరా చూస్తే నా వంటి బీదవాడికి తల

తిరిగి పోతుంది. అంత సామాన్యుని జీవితానికి అంత అవసరమా? పేదవాడి దృష్టిలో సామాను చేర్చడం దుమ్ము ధూళి, పురుగు బుట్ర చేరుటకు అవకాశం కల్పించడమే. నేను వుండే చోట నన్ను నేనే మరిచిపోతున్నాను. యిక్కడ గల కుర్చీలు డ్రాయర్లు, బల్లలు, అలమారాలు, అద్దాలు అన్నీ నన్ను కరిచేందుకు ముందుకు ఉరుకుతూ వుంటాయి.

ఇక్కడ పరచబడ్డ ఈ తివాచీలు దుమ్మును ప్రోగు చేయుటకు, పురుగులు నివాసం ఏర్పరుచుకొనుటకు వీలుగా వున్నాయి. ఒక పర్యాయం తివాచీని దులపడానికి తీశారు. ఒక్కడి వల్ల ఆ పని కాలేదు. ఏడు మంది ఆ పని చేయవలసి వచ్చింది. కనీసం పది అర్ధశేర్ల దూళి బైటికి వచ్చింది. బాగా దులిపి తిరిగి పరిచారు. దాన్ని స్పర్శిస్తే క్రొత్త తివాచీని తాకినట్లు అనిపించింది. అటువంటి తివాచీలను రోజూ ఎత్త గలమా? దులపగలమా? అలా చేయడం మొదలు పెడితే వాటి వయస్సు తరిగి పోతుంది. శ్రమ పెరుగుతుంది. నాకు కలిగిన తాజా అనుభవాన్ని వ్రాశాను. ఆకాశంతో సంబంధం పెట్టుకొనుటకై నేను ఎన్నో తతంగాలను తొలగించుకొని బరువులను దించి వేసుకున్నాను. ఇంట్లో నిరాడంబరం, బట్టల్లో నిరాండబరం, నడతలోను ప్రవర్తనలోను నిరాండబరం పెంచుకొని క్లుప్తంగా చెప్పాలంటే జీవితంలో శూన్యాన్ని, రిక్తతను పెంచుకొని ఆకాశంతో తిన్నగా సంబంధాన్ని జోడించుకున్నాను. యీ సంబంధం పెరిగిన కొద్దీ శాంతి సౌఖ్యాలు, తృప్తి ఆనందాలు పెరిగిపోయాయి. ధనాశ తగ్గిపోయింది. ఆకాశంతో సంబంధం పెంచుకున్న వారి దగ్గర ఏమీ లేదు. అంతా వున్నది. అసలు మనిషికి ఎంత కావాలి? రోజూ అతడు ఎంత ఉపయోగించుకోగలడో అంతే కదా! తిన గలిగినంతే కదా అతడికి కావలసింది? అందరూ అలా చేస్తే జగత్తులో అందరికీ చోటు దొరుకుతుంది. ఎవ్వరికీ యిరకాటం వుండదు.

అందువల్ల మనిషి పడుకునే చోటు ఆకాశం క్రింద వుండాలి. మంచునుంచి, చలినుంచి రక్షణ పొందుటకు దుప్పట్లు, బట్టలు ఏర్పాటు చేసుకోవచ్చు. వర్షాకాలంలో గొడుగువంటి కప్పు ఆచ్ఛాదన వుంటుంది. మిగతారోజుల్లో నక్షత్రాలే ఆచ్ఛాదనగా ఉపయోగపడతాయి. కండ్లు తెరుపుడుబడినప్పుడు

క్రొత్త క్రొత్త దృశ్యాలు చూస్తాడు. వాటిని చూచి విసుగు చెందడు. అతడి కండ్లు మిరిమిట్లు గొలపవు. ప్రశాంతతను పొందుతాయి. నక్షత్రాల సంఘం అతడికి తిరుగుతూ కనబడుతుంది. వాటితో సంబంధ పెట్టుకొని నిద్రించిన మనిషి, వాటిని తన హృదయసాక్షిగా పెట్టుకున్నా మనిషి అపవిత్రమైన భావాలకు తన హృదయంలో చోటు యివ్వడు. ప్రశాంతంగా నిద్రిస్తాడు.

మన చుట్టూ ఆకాశం వున్నట్లే, మన హృదయంలో కూడా ఆకాశంవున్నది. చర్మంలో గల ప్రతిరంధ్రంలోను, రెండురంధ్రాల మధ్య భాగంలోను కూడా ఆకాశం వున్నది. యీ ఆకాశాన్ని, అవకాశాన్ని నింపడానికి మనం కృషి చేయకూడదు. అందువల్ల ఆహారం ఎంత అవసరమో అంతే మనం తీసుకుంటే శరీరానికి అవకాశం దొరుకుతుంది. మనం ఎప్పుడు ఎంత యోగ్యం కాని ఆహారం తీసుకుంటామో అన్న యోచన వుండదు. భయం వుండదు.

వారానికి ఒక్కసారో, పక్షంలో ఒకసారో, అవకాశం కొద్దీ ఉపవాసంచేస్తూ వుంటే శరీరసమతూకం సరిగ్గా వుంటుంది. రోజంతా ఉపవాసం వుండలేని వాళ్లు ఒక పూట ఆహారం తినడం మానుకుంటే లాభం పొందుతారు.

  

# తేజస్సు

ఆకాశము, గాలి, నీరు మొదలగు తత్వాలు లేక పోతే మనిషి శరీర నిర్వహణ సాగనట్లే, తేజస్సు అనగా వెలుగులేకుండా పని జరగదు. ప్రకాశం సూర్యుని వల్ల లభిస్తుంది. యీ ప్రకాశాన్ని మనం పూర్తిగా వినియోగించుకోవడం లేదు, కనుక మన ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగానే వుంటున్నది. నీటితో స్నానం చేసి మనం శుభ్రం అవుతూ వున్నాము. అలాగే సూర్య స్నానం చేసి కూడా శుభ్రం, ఆరోగ్యవంతులం కావచ్చు. బలం క్షీణించిన మనిషి, రక్తం ఎండిపోయిన మనిషి ప్రాతఃకాల సమయంలో సూర్య కిరణాలను తన

ఒంటిమీద ప్రసరించేలా చేసుకుంటే అతడి బలహీనత, రక్తహీనత తగ్గిపోతాయి. జీర్ణశక్తి తగ్గితే అది తిరిగి పెరుగుతుంది. ముఖం కళకళలాడుతుంది. ఎండ బాగా ఎక్కక పూర్వం యిట్టి సూర్య స్నానం చేయాలి. బట్టలు లేకుండా వట్టి శరీరంతో కూర్చున్నా, పడుకున్నా సూర్యరశ్మి తగులుతూ వున్నప్పుడు చలివేస్తే గుడ్డలు కప్పుకోవచ్చు. అయితే చలితగ్గేకొద్దీ కప్పుకున్న గుడ్డలు తొలిగించివేయాలి. ఎండలో మనం నడవవచ్చు. ఎవ్వరూ చూడని ప్రదేశంలో యీ క్రియచేయవచ్చు. కొద్ది దూరం వెళ్లవలసివచ్చినా అలా వెళ్ళి యీ క్రియచేయాలి. అంత టైము లేకపోతే లంగోటీ ధరించి మర్మస్థలాల్ని కప్పి సూర్యస్నానం చేయవచ్చు.

ఇట్టి సూర్య స్నానంవల్ల చాలా మంది లాభం పొందారు. క్షయ రోగానికి యిది బాగా పని చేస్తుంది. సూర్యస్నానం ప్రకృతి చికిత్సకులను యిప్పుడు దాటింది. డాక్టర్ల సూచనల మేరకు సూర్యస్నానానికి అనువుగా గృహాల నిర్మాణం జరుగుతున్నది. చల్లని గాలిలో సైతం గాజు పలక మాటున కూర్చొని, సూర్యకిరణాలను శరీరంపై ప్రసరించేలా చేసుకోవచ్చు.

పెద్ద కురుపులు కూడా సూర్య రశ్మి తగలడం వల్ల నయం అవుతాయి.

చెమట పట్టడం కోసం నేను రోగుల్ని 11 గంటలప్పుడు ఎండలో పడుకోబెట్టాను. దీనివల్ల రోగికి బాగా చెమటపట్టుతుంది. అంతటి ఎండలో పడుకోబెట్టినప్పుడు రోగి నెత్తిమీద మట్టి పట్టీ ఉంచడం అవసరం. రోగి శరీరం మీద అరటి ఆకులుగాని లేక మరో పెద్ద ఆకులుగాని కప్పాలి. దాని వల్ల రోగి శిరస్సు చల్లగాను, సురక్షితంగాను వుంటుంది. నెత్తి మీద మాత్రం తీవ్రమైన ఎండను సోకనీయకూడదు.

  

# వాయువు

మొదటి నాలుగు తత్వాలు ఎన్ని ఉపయోగాలు కలిగిస్తాయో, యీ అయిదవ తత్వం గాలి కూడా అన్ని ఉపయోగాలు కలిగిస్తుంది. యీ అయిదు తత్వాల సహకారం లేని యెడల మనిషి బ్రతకలేడు. అందువల్ల గాలికి ఎవ్వరూ భయపడవలసిన అవసరం లేదు. మనం గాలిని, వెలుగును లోనికి రానీయకుండా ఇండ్ల తలుపులు, కిటికీలు మూసి పెట్టుకుంటే ప్రమాదాన్ని కొనితెచ్చుకున్నట్లే. బాల్యంనుంచి గాలికి మనం అలవాటు పడితే పెద్ద అయిన తరువాత కూడా మనం గాలికి తట్టుకోవచ్చు. అప్పుడు జలుబు, కళ్లెబారి నుంచి మనకు రక్షణ కలుగుతుంది. గాలిని గురించిన ప్రకరణంలో వివరాలు వ్రాశాను. అందువల్ల వాయువును గురించి యిక్కడ ఎక్కువగా వ్రాయలేదు.

# ఎంపిక చేసిన
# మహాత్మాగాంధీ రచనలు

## సంపుటము - 4

## లేఖలు - లేఖాంశములు

సంపాదకులు

**శ్రీమన్నారాయణ్**




నవజీవన్ పబ్లిషింగ్ హౌస్

అహమదాబాద్ - 380 014

# ముందుమాట

వేరు వేరు సమయాలలో మహాత్మాగాంధీ గారు వ్రాసిన లేఖలు కొన్ని ఎన్నిక చేసి ఈ సంపుటంలో ప్రచురిస్తున్నాము. గాంధీగారు జీవించి వున్నప్పుడే కొన్ని లేఖలు ప్రచురించబడ్డాయి. వారు మరణించిన తరువాత సహకార్యకర్తలకూ, స్నేహితులకూ గాంధీగారు వ్రాసిన ఉత్తరాలు సమీకరించుటకు ప్రయత్నాలు జరిగాయి. ఈ ఉత్తరాలలోని భావాలను దృష్టిలో పెట్టుకొని వేరు వేరు శీర్షికల క్రింద ఉత్తరాలను ఎన్నిక చేసి ప్రచురించుటకు ప్రయత్నించాము.

ఈ సంపుటం మొదటి భాగంలో 100 ఉత్తరాలు చేర్చాము. ఈ ఉత్తరాలు ప్రత్యేకమైన విశేష పరిస్థితుల్లో వ్రాయబడ్డాయి. ఈ ఉత్తరాల ద్వారా గాంధీగారి వ్యక్తిత్వాన్ని వారి విలక్షణమైన అంతర్దృష్టిని, స్థిరమైన భావాలను పాఠకులు గ్రహించ గలుగుతారని భావిస్తున్నాము.

ఈ సంపుటం రెండవ భాగములో వారి ఉత్తరాలనుండి సమీకరించబడిన అంశములను, సూక్తులను, సిద్ధాంతాలను పొందుపరిచాము. వారి సూక్తులు విశ్వజనీనమైనవి. విశిష్టమైనవి. పాఠకులు వీటిని చదివి వారి గొప్పతనాన్ని దూరదృష్టిని తెలుసుకొని ఆనందించగలరని విశ్వసిస్తున్నాము.

రాజ్‌భవన్
అహమదాబాదు
అక్టోబరు 16, 1968 — శ్రీమన్నారాయణ్

# ప్రకాశకుల విజ్ఞప్తి

*మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంలో వారు స్థాపించిన నవజీవన ట్రస్టు పక్షాన వారి ఆత్మకథను భారతీయ భాషలన్నిటిలోను ప్రచురించాలని నిర్ణయించాం. ఆ ప్రకారం శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి తెలుగులోనికి అనువదించిన మహాత్ముని ఆత్మకథను ప్రచురించాం. తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించడమే కాక ఇప్పటికి 40.000 ప్రతులు కొని చదివి మమ్ము ప్రోత్సహించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ న్యాయ నిర్ణేతలు మహాత్ముని ఆత్మకథ తెలుగు సేతను 1995 వ సంవత్సరం ఉత్తమ తెలుగు అనువాదంగా నిర్ణయించి 5000/- రూపాయల పురస్కారం యిచ్చి శ్రీ రాధాకృష్ణమూర్తిని సత్కరించడం ముదావహం. గాంధీజీ ఆత్మకథను భారతీయ భాషలన్నింటిలోను ప్రచురించాం.*

మహాత్ముని ఆత్మకథకు భారతదేశ ప్రజలు చూపిన ఆదరాభిమానాలు చూచి నవజీవన ట్రస్టు మరో ప్రణాళికను చేపట్టింది. మహాత్ముడు రచించిన రచనలను విషయాన్ని బట్టి కొన్నింటిని ఎంపికచేసి కొన్ని సంపుటముల సెట్టు రూపంలో ప్రచురించి, తక్కువ ధరకు దేశ ప్రజలకు అందజేయాలనునదే ఆ ప్రణాళిక. ప్రప్రథమంగా ఇంగ్లీషు భాషలో నవజీవనట్రస్టు పక్షాన మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంలో ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలను ఆరు సంపుటముల సెట్టుగా ప్రచురించాము. ఆ సెట్లు అపరిమితంగా ప్రజల ఆదరణను చూరగొనడం వల్ల పెద్ద సంఖ్యలో అనేకసార్లు ప్రచురించి ప్రజానీకానికి అందజేశాము. భారతీయ భాషల్లో కూడా ఈ ప్రణాళికను అమలుపరచుటకు నిర్ణయించి గత సంవత్సరం మళయాళం భాషలో అయిదు సంపుటముల సెట్టుగా ప్రచురించి కేరళ ప్రదేశ్ ప్రజల మన్ననలు పొందామని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఇప్పుడు తెలుగులో 5 సంపుటాల సెట్టును నవజీవన ట్రస్టు పక్షాన సబ్సిడీ రేటుకు ప్రచురిస్తున్నాము. మహాత్మాగాంధీ సిద్ధాంతాల యెడ మక్కువ చూపే తెలుగు ప్రజలు మా యీ కృషిని అభినందించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము. ఈ అయిదు సంపుటాలను తెలుగులో ప్రచురించుటకు అయ్యే ఆర్థిక వ్యయాన్ని పూర్తిగా నవజీవన

ట్రస్టు, అహమదాబాద్ భరిస్తున్నది. ట్రస్టుకు సంబంధించిన యితర శాఖల ఆదాయాన్ని ఈ ప్రణాళికకు వినియోగించి తక్కువ ధరకు యీ సంపుటాల సెట్టును తెలుగు ప్రజలకు అందజేస్తున్నాము. యీ ప్రణాళికను తెలుగులో అమలుబరచుటకు శ్రీ బిరిధీచంద్ చౌధరి, శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తిగారలు సంపూర్తిగా సహకరించారు. వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాం. అనువాదం, టైపుసెట్టింగ్, ప్రూఫురీడింగ్, కెమెరా ప్రతులు తయారు చేయించు కృషికి శ్రీ బిరిధీ చంద్ చౌధరి సహకరించారు. యీ సంపుటముల తెలుగుసేతతోబాటు, యితర పెద్దలు చేసిన తెలుగు అనువాదాల్ని, ప్రూఫుల్ని సరిచూచి శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి సహకరించారు.

ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనల అయిదు సంపుటాల సెట్టు ప్రచురణకు సంబంధించిన మా యీ ప్రణాళికను ఆంధ్ర ప్రదేశ్ ప్రజలు హర్షించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము.

ది. 28-10-98 | **జితేంద్ర టి. దేశాయి**
అహమదాబాద్ | మేనేజింగ్ ట్రస్టీ

# విశిష్ట పదముల పట్టిక

| | |
|---|---|
| అభంగ | మరారీలో, భక్తి సంబంధము చందోబద్ధమూ అయిన పద్యాలు |
| అద్వైత | భగవంతుడు, భక్తుడు వేరు కాదని, మానవుడిలోనే దేవుడున్నాడనే వాదం |
| అద్వైతవాదులు | 'అద్వైత' సిద్ధాంతాన్ని నమ్మేవారు. |
| అమూన్ | (శాంతి) సర్వమానవ సౌభ్రాతృత్వం |
| ఆశ్రమం | హిందువుల జీవన సరళిలో నిర్దేశించబడిన నాలుగు ఆశ్రమాలలో ఒకటి. సర్వసంగ పరిత్యాగానికనువైన స్థలము |
| ఆసురీసంపద | మనసులో సహజంగా ఉండే దుష్ట ప్రవృత్తులు. ఇవి చెడు పనుల అభివృద్ధికి దారి తీస్తాయి. |
| అవతార్ | భగవంతుని అవతారము |
| భగవద్గీత | కర్మ సిద్ధాంతాన్ని, నిస్వార్థ కార్యాచరణను గురించి విస్తారంగా చెప్పే దివ్యగానం, భగవంతుని నోటినుండి వెలువరించిన హిందువులు గాఢంగా నమ్మే హిందుత్వ భావాలను ప్రతిబింబించే శ్లోకాల సంగ్రహం. |
| భాగవతం | భగవంతుని లీలలను అభివర్ణించే పురాణగాధ |
| భక్తుడు | భగవంతుణ్ణి ప్రేమతో ఆరాధించేవాడు |
| భక్తి | భగవంతుని మీద సంపూర్ణంగా మనస్సు నిలిపి ఆయన్ని ఉపాసించే తత్వము |
| బ్రహ్మ | బ్రహ్మదేవుడి సర్వోత్కృష్ట శక్తి |
| బ్రహ్మభూత | బ్రహ్మలో లీనమైనవాడు |
| బ్రహ్మచర్యము | కామ ప్రవృత్తికి దూరంగా ఉండుట. భగవంతుణ్ణి చేరుకోగల మార్గాలలో ఒకటి |
| చిత్తము | పరిణతి పొందిన మనసు |
| చర్వాక | చర్వాకముని చేత ప్రాపంచిక సుఖాలపై ప్రతిపాదింపబడిన భావములు. |
| దైవికసంపద | మానవుడిని ఉన్నత పథాలకు తీసుకు వెళ్లగలిగే మానసిక ప్రవృత్తి |

| | |
|---|---|
| దయ | : దయాగుణం |
| ధర్మము | : విధి నిర్వహణ మార్గము. మతము |
| ద్వాదశమంత్రం | : శ్రీకృష్ణ పరమాత్మను స్తుతించడానికి సమర్పింపబడిన 12 అక్షరములు |
| గాయత్రి | : పవిత్రము, మహిమాన్వితము సర్వశక్తివంతము అయిన వైదిక మంత్రము |
| గురువు | : ఆధ్యాత్మిక చింతనలో సహాయకారి, అధ్యాపకుడు |
| గురుదేవుడు | : అధ్యాపకుణ్ణి, ఎంతో గౌరవభావంతో పిలిచే పిలుపు. గురువును దైవముగా భావించే పద్ధతి |
| జైరామ్ | : శ్రీరామునకు జయము |
| ఖాదీ, ఖద్దరు | : చేతితో వడకిన మరియు చేతితో నేసిన వస్త్రము |
| క్షత్రియుడు | : (క్షాత్రగుణము గలవాడు) యుద్ధము చేయు సైనికుడు, హిందూ సమాజంలో ప్రచలితంగా ఉన్న చాతుర్వర్ణాలైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలలో రెండవ వర్ణము. |
| లోక సంగ్రహం | : సమాజాన్ని రక్షించగలుగునది |
| మంత్రము | : పవిత్రము, శక్తివంతము అయిన శ్లోకములు |
| మాయ | : ఈ ప్రపంచమంతా మిధ్యఅని చెప్పే పదం |
| మోక్షము | : ముక్తి, జనన మరణాల వలయమునుండి విముక్తి |
| ముని | : ఏకాంతంగా మౌనంగా భగవధ్యానం చేసుకొనే సన్యాసి |
| మౌనము | : మాట్లాడకుండా ఉండు స్థితి |
| పుణ్యము | : సేవ, భక్తి వల్ల సముపార్జించుకున్న యోగ్యత |
| రాక్షసులు | : దయ్యాలు, పిశాచాలు, క్రూరకర్మలు చేసేవారు |
| రామనామము | : శ్రీరాముని పేరు, శ్రీరాముని పేరు జపించుట |
| ఋషులు | : దీర్ఘమైన కఠినమైన తపస్సు చేసేవారు, దీర్ఘ దృష్టి విశాల దృక్పథం కలవారు |
| సాధన | : ఆధ్యాత్మిక, పారమార్థిక ధ్యేయాలకొరకు చేయబడు అభ్యాసము |
| సాత్విక | : దైవికమైన గుణములు కల్గి ఉండుట |
| సత్యాగ్రహం | : సత్యము కొరకు పాటుపడుట, ఆత్మస్థైర్యం (శక్తి) తో అహింసా యుద్ధంలో గాంధీగారు వాడిన అస్త్రం. |

సత్యాగ్రహి : సత్యాగ్రహ సిద్ధాంతానికి కట్టుబడినవాడు

శాస్త్రములు : మానవాళి ఋజుప్రవర్తనకు మార్గదర్శకంగా జ్ఞానులు వ్రాసిన గ్రంథాలు

శ్లోకము : భక్తి భావాన్ని సూచిస్తూ ఛందోబద్ధంగా వ్రాసిన పద్యాలు

సర్కారు : ప్రభుత్వము లేక స్థానికమైన అధికార వ్యవస్థ

స్థిత ప్రజ్ఞుడు : ద్వైదీ భావానికతీతంగా, స్థిరమైన మనస్సుగలవాడు

తామసము : స్వార్థము, క్రోధము, మదము ఆదిగాగల దుష్ట ప్రవృత్తులు

రాజసము మానవుని అధోగతికి తీసుకువెళ్లే ప్రవృత్తి.

తపస్సు : కఠోర నియమాలను పాటించుట, శరీరాన్ని కష్టపెడుతూ ప్రాయశ్చిత్తం చేసుకొనుట.

తపశ్చర్య . కఠోర నియమాలతో ప్రాయశ్చిత్తం చేసుకొనే చర్య.

థానా : పోలీస్ స్టేషను

వైష్ణవులు : విష్ణు భగవానుని భక్తులు

వేదములు : శాశ్వతమైన భావాన్ని వెదజల్లే, హిందువుల (వైదిక) గ్రంథాలు వ్రాసాను ప్రాసలలో పద్య రూపంలో ఉన్న గ్రంధాలు. వేదాలు నాలుగు : ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము మరియు అధర్వణవేదము.

యజ్ఞము : దేవుని ప్రీతికోసం చేయు సనాతనమైన ఆచార కర్మ

యోగము : మనస్సు, శరీరము, ఆత్మలను సంధించి ఆత్మజ్ఞాన ప్రాప్తికి చేయు అభ్యాసము

యోగి : యోగాన్ని అభ్యసించువాడు.



# విషయసూచిక

## మొదటి భాగము - లేఖలు



## మొదటిభాగము

అనుబంధము



## రెండవ భాగము

### లేఖాంశములు, సూత్రములు, సిద్ధాంతములు

★ *గాంధీగారి లేఖలలో కొన్నింటికి వారి సంతకంలేదు. వాటిని యథాతథంగా ప్రచురించడమైనది.*

★ ★ ★

# ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలు

## లేఖలు - లేఖాంశములు

సంపుటము - 4

# 1. దాదాభాయి నౌరోజీ గారికి

*(గాంధీగారు దాదాభాయి నౌరోజీ గారికి వ్రాసిన ఉత్తరాలలో ఇది ఒకటి. శ్రీ నౌరోజీ గారికి దక్షిణాఫ్రికాలోని భారతీయుల సమస్యలను గురించి వివరంగా తెలుసును. 1891లోనే దక్షిణాఫ్రికాలోని భారతీయులు తమ సమస్యలను గురించి నౌరోజీగారికి వివరించి వున్నారు. బ్రిటిషు ప్రభుత్వానికి సమర్పించమని తమ పలుకుబడిని ఉపయోగించి సహాయం చేయవలెనని ఒక దరఖాస్తును భారతీయులు నౌరోజీగారికి అందజేసి వున్నారు. గాంధీగారి ఉత్తరం పూర్తిగా లభించలేదు. ఇవి ఆర్.పి. మసానీ గారి దాదాభాయీ నౌరోజీ. ది గ్రాండ్ ఓల్డ్‌మాన్ ఆఫ్ ఇండియా పుస్తకం నుండి (పేజీ 468-91) ఆ ఉత్తరంలోని కొన్ని భాగాలు.)*

బాధ్యతాయుత ప్రభుత్వపరంగా ఏర్పడిన మొదటి నేటాల్ పార్లమెంట్‌ను ముఖ్యంగా ఇండియన్ పార్లమెంటు అనవచ్చును. దానిలో ముఖ్యంగా ఎక్కువ భాగం భారతీయులకు సంబంధించిన చట్టపరమైన సమస్యలు చర్చించబడినవి. ఆ చర్చలు భారతీయులకు అనుకూలంగావు. లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిళ్లను ప్రారంభిస్తూ గవర్నరు తన ఉపన్యాసంలో మంత్రులు భారతీయుల వోటు హక్కును గురించి చర్చించి నిర్ణయాలు తీసుకొంటారన్నారు. భారతీయులకు ఆ వోటు హక్కు భారతదేశంలోనే లేదన్నారు. భారతీయులకు వోటు హక్కును నిరాకరిస్తూ కారణాలను తెలియజేశారు. వారికి ఇదివరలో ఎన్నడూ వోటుహక్కు లేదన్నారు. ఆ వోటు హక్కు పొందడానికి వారు తగినవారు, సమర్థులు కాదన్నారు.

భారతీయులు సమర్పించిన దరఖాస్తు ఈ సమస్యలకన్నింటికీ సమాధాన మిస్తున్నది. చట్టంలో పొందుపరచబడిన కారణాలు ఇవి. మా దేశంలో మాకు భారతీయుల అవసరం ఏ మాత్రమూ లేదు. మాకు కూలీలు గావాలి. భారతీయులు కూలీలుగా, బానిసలుగా వుండవచ్చును. తమ దేశానికి ఎప్పుడైనా వెళ్లిపోవచ్చును. అంతే. చట్టం తాలూకు ముఖ్యమైన ఉద్దేశ్యం ఇది. అందువలన మీ దృష్టిని ఈ సమస్య వైపుకు మళ్లించమని సవినయంగా మీకు మనవి చేసుకొంటున్నాను. భారతీయులు ఎక్కడ వున్నా మీరు ఇంతవరకు వారికి మీ పలుకుబడిని ఉపయోగించి ఎనలేని సహాయం చేసివున్నారు. మీ బిడ్డలు, తండ్రిగా మీ సహాయాన్ని అర్థిస్తున్నారు. ఇక్కడి మీ బిడ్డలందరి మనో భావన ఇది.

ఇక నన్ను గురించి, నా పనిని గురించి రెండు మాటలు వ్రాస్తున్నాను. నేను యువకుణ్ణి. అనుభవంలేని వాడిని. అందువలన నేను పొరపాట్లు చేయవచ్చును. నేను తలపెట్టిన పని నా శక్తికి మించినది. ఈ పనిని నేను ఏ ప్రతిఫలాపేక్ష లేకుండా చేస్తున్నాను. భారతీయులను ఉపయోగించుకొని లాభం పొందడం నా ఉద్దేశ్యం కాదు. శక్తికి మించిన పనిని ప్రారంభించాను. ఈ సమస్యను పరష్కరించుటకు లభ్యమైన వ్యక్తిని మాత్రమే నేను. ఒక తండ్రి తన బిడ్డకు సలహాలిచ్చి నడిపించినట్లుగా తగిన సలహాలిచ్చి, తగిన మార్గాన్ని చూపించి నన్ను ఆదరించవలెనని మిమ్ము ప్రార్థిస్తున్నాను.

*(దాదాభాయీ నౌరోజీ (1825-1917) గ్రాండ్ ఓల్డ్‌మాన్ ఆఫ్ ఇండియా అని ప్రశస్తి పొందిన మహావ్యక్తి. 1886, 1893, 1906 ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకు అధ్యక్షులు. స్వరాజ్యం కాంగ్రెసు లక్ష్యమని నిర్వచించిన వ్యక్తి ఆయన. 1893 లో హౌస్ ఆఫ్ కామన్సు సభ్యుడుగా పని చేశారు.)*

★ ★ ★

## 2. జి.కే. గోఖలే గారికి

21-24 కోర్టు ఛేంబర్స్
కార్నర్ రిసిక్ & అండర్సన్ స్ట్రీట్
పి.బి. 6522
జోహాన్స్‌బర్గ్
13 జనవరి 1905

గౌరవనీయులు
గోఖలే, పూనా

ప్రియమైన గోఖలే గారికి

ఇండియన్ ఒపీనియన్ పత్రిక వివరాలు మీకు తెలిసియే వున్నవి. అది దినదినాభివృద్ధి చెందుతున్నది. పత్రికకు మీ సహాయ సహకారాలను అర్థిస్తున్నాను. నిస్సంకోచంగా, స్పష్టంగా వ్రాస్తున్నాను. నన్ను మీరు బాగా ఎరుగుదురు. కనుక నన్ను

తప్పుగా అర్థం చేసుకొనరని నాకు తెలుసును. ఆర్థిక సహాయం లేనిదే మదన్ పత్రిక నడపలేడని అర్థం చేసుకొన్నాను. అతడు కేవలం దేశభక్తితో చేస్తున్న కృషికి సహాయంగా నా సంపాదనలో నుండి కొంత డబ్బును అతనికి అందజేశాను. అయితే నా సహాయమే సరిపోదు. అనేక కారణాల వలన మూడు నెలల క్రితం ఆ పత్రిక పూర్తి బాధ్యతను నేను స్వీకరించాను. మదన్‌జీత్ నామమాత్రంగా ప్రకాశకుడుగా, పత్రికా యజమానిగా వున్నాడు. ఆయన పత్రికకు ఎనలేని సేవ చేసియున్నాడు. అందువలన ఆయనకు పత్రికతో సంబంధముంటుంది. ప్రస్తుతం నా కార్యాలయమే ఇండియన్ ఒపీనియన్ పత్రిక కొరకు పనిచేస్తున్నది. నేను పత్రిక కొరకు 3500 పౌండ్లు వెచ్చించాను. నన్ను ఎరిగిన కొంతమంది ఇంగ్లీషు స్నేహితులు నాకు సహకరిస్తున్నారు. పత్రిక బాగా నడుస్తున్నది. ఫర్గ్యుసన్ కాలేజీ పూనా స్థాపకులు చూపినంత త్యాగం చూపించలేక పోయినా మా కృషిలో మేము వెనకబడి వుంటామనుకోను. కొంతమంది ఇంగ్లీషు మిత్రులు ధైర్యంగా సాహసంగా నాకు సహాయం చేయ బూనుకొనడం నాకు చాలా ఆనందాన్ని కలగజేస్తున్నది. ఆ ఇంగ్లీషు వారు అంత పెద్ద సాహిత్యకులు గాకపోయినా మంచి వ్యక్తిత్వం, ఋజుప్రవర్తన, స్వతంత్ర్యంగా ఆలోచించ గలిగిన వారు గావడం సంతోషకారణం. వారు తాము వ్యక్తిగతంగా వ్యాపారమో, ఉద్యోగమో చేసుకొంటున్నారు. అయినా నెలకు మూడు పౌన్లు తీసుకొని చిత్తశుద్ధితో నాకు సహకరిస్తున్నారు. భవిష్యత్తులో పెద్ద లాభాలు ఆర్జిస్తామనే భావం గూడా వారికి లేదు.

ఇంతేగాక నా సంపాదన ఇదే విధంగా సాగితే ఒక పాఠశాలను కూడా ప్రారంభించవలెనని అనుకొంటున్నాను. ముఖ్యంగా భారతీయ విద్యార్థులకు ఉపయోగకరంగా భోజన సౌకర్యంతో దక్షిణాఫ్రికాలో ఆ పాఠశాల తనకు తానే సాటిగా విలసిల్లవలెనని నా కోరిక. స్కూలులో చేరేవారు స్కూలు ప్రాంగణంలోనే నివసించ వలెననీ, అందుకు ఏర్పాట్లు జరగవలెననీ నా ఆకాంక్ష. అందుకు స్వచ్ఛందంగా పనిజేసే కార్యకర్తలు కావాలి. ఇద్దరు ముగ్గురు ఇంగ్లీషు స్త్రీ పురుషులు త్యాగశీలురు వున్నా భారతీయ ఉపాధ్యాయులు వుండడం చాలా అవసరం. మంచి శీలం కలిగి, కొద్ది వేతనంతో పనిజేసే విద్యాబోధనా నిపుణులు కావాలి. అటువంటివారు స్నాతక పరీక్ష పూర్తి చేసిన వారు దొరుకుతారా? మీరు అటువంటి వారిని ప్రోత్సహించి పంపగలుగుతారా? వారు మంచి అనుభవం కలిగి ఉండాలి. కనీసం ఒకరిద్దరు

దొరికినా ప్రస్తుతానికి సరిపోతారు. ఆ స్కూలు బాగా పనిచేయడం ప్రారంభించిన తరువాత ఒక శానిటోరియం ఆరోగ్య సూత్రాలకు అనుగుణ్యంగా ఆ స్కూలుతో బాటు నడిపించవలెనని ఉద్దేశ్యమున్నది. ఏమైనా ప్రస్తుతం నా దృష్టి అంతా ఇండియన్ ఒపీనియన్ మీదనే కేంద్రీకృతమై వున్నది. మీరు దయయుంచి మమ్మల్ని ప్రోత్సహిస్తూ సంపాదకుని పేర ప్రచురణ కొరకు ఒక ఉత్తరం పంపించండి. దానిని మేము ప్రచురిస్తాము. దానితోబాటు వీలు వెంబడి మీరు కొంత సమయం వెచ్చించి చిన్నదైనా ఒక వ్యాసం పత్రికకు పంపించండి. ఇంగ్లీషు, హిందీ, గుజరాతీ, తమిళం భాషలలో కొద్ది ఆర్థిక సహాయంతో గానీ, ఉచితంగా గానీ వారం వారం పత్రికకై వ్రాసే రచయితలు కావాలి. ఎక్కువ ఖర్చు అవుతుందనుకుంటే కనీసం ఇంగ్లీషులో వ్రాసి పంపినా చాలును. మిగతా భాషలలోనికి మేము దానిని అనువదించుకొంటాము. మీరు అట్టివారి పేర్లు సూచింపగలరా?

అక్కడ మనదేశంలో జరుగుతున్న కార్యకలాపాలను ఆ రచయితలు పంపే రచనలు వివరించగలవు. భారతదేశవాసుల కొరకై మీరు చేస్తున్న కృషినీ, వివిధ పత్రికల్లో ప్రచురింపబడుతున్న వార్తలనూ అవి ప్రతిబింబించగలగాలి. దక్షిణాఫ్రికాలో నివసించే భారతీయులకవి ఉపయోగపడాలి. ఇంకా అవసరమైన సూచనలను మీరు పంపించండి.

మీరు ఆరోగ్యంగా వున్నారనీ, ఉండవలెననీ ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు

విశ్వసనీయుడు

ఎమ్.కె. గాంధీ

*(శ్రీ గోపాలకృష్ణ గోఖలే (1866-1915) సుప్రసిద్ధ శిక్షా శాస్త్రవేత్త, రాజనీతిజ్ఞుడు. ప్రారంభం నుండి ఇండియన్ నేషనల్ కాంగ్రెసుతో సంబంధం కలిగిన వ్యక్తి. 1905 బెనారస్ కాంగ్రెసు సమావేశానికి వారు అధ్యక్షత వహించారు. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ స్థాపకులు. వారు గాంధీ గారి ఆహ్వానం మీద 1912లో దక్షిణాఫ్రికాలో పర్యటించారు. )*

★ ★ ★

# 3. గోపాలకృష్ణ గోఖలే గారికి

కేప్‌టౌన్

27 ఫిబ్రవరి 1914

ప్రస్తుతం నేను జరుగుతున్న ఘటనల్ని పరిశీలిస్తూ కేప్‌టౌన్‌లో ఉన్నాను. మా ఉద్యమానికీ, సంఘర్షణకూ సంబంధించిన వార్తలు తెలియజేసి మిమ్ము బాధపెట్టదలచుకోలేదు. వీలైనంత సంక్షేపంగా వ్రాస్తున్నాను.

శ్రీ ఆండ్రూస్, ఫర్గ్యుసన్ ఇద్దరూ చాలా మంచివారు. వారంటే మాకందరికీ చాలా గౌరవం ఏర్పడింది. కాని సర్ బెంజమన్ గారు మమ్మల్ని చాలా నిరాశపరిచారు. అతడేమీ మంచి చేయలేదు సరిగదా చాలా కీడు గూడా చేయవచ్చని అనిపిస్తున్నది. అతడు బలహీనుడు. విశ్వాసపాత్రుడుగాడు. ఇప్పటికీ అతడిక్కడి పరిస్థితులను సరిగ్గా అర్థం చేసుకొనలేదు. తెలిసో తెలియకో అతడు నిస్సందేహంగా మాలో విభేదాలను సృష్టిస్తున్నాడు. ఆండ్రూస్‌గారు అన్ని వివరాలూ మీకు తెలియజేయగలరు. బెంజమన్ గారిని గురించి నా అభిప్రాయం మీకు తెలియజేస్తున్నాను.

మార్చి నెలలో ఒప్పందం కుదిరితే ఏప్రియల్‌లో. ఇండియాకు రావలెనని అనుకొంటున్నాను. నాతోబాటు దాదాపు 20 మంది ఉంటారు. స్త్రీలూ పురుషులూ. అందరూ నాతోనే ఉంటారు. వారిలో కొంతమంది పాఠశాల విద్యార్థులు గూడా ఉంటారు. పూనాలో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ వసతి గృహంలో మాకు వసతి ఏర్పాటు చేస్తారా? నా కుటుంబ సభ్యులను కలసిన తరువాత నేనా వసతి గృహంలో ఉండగలను. నా కుటుంబ సభ్యులు గూడా కలిస్తే సంఖ్య ఇంకా కొంచెం పెరగవచ్చును. ఆ వసతి గృహంలోనే ఏర్పాటు చేయమనీ, చేసి తీరవలెననీ నేను కోరుతున్నట్లు భావించకండి. నేను మీ మీద ఆధారపడతాను. మీ పాదాల వద్ద వుండి అవసరమైన అనుభవం సంపాదించవలెనని కోరుకుంటున్నాను. మీ ఆశ్రమంలో వున్నా లేకపోయినా నేను ఒక సంవత్సరం మౌనం పాటించవలెనని అనుకొంటున్నాను. దక్షిణాఫ్రికాకు సంబంధించిన విషయంలో నా వాగ్దానం, మౌనంగా ఉండదనుకొంటున్నాను. మీ కోరికతో మనిద్దరికీ సమానమైన విషయంలో మౌనం పాటించకపోవచ్చును.

నర్సుగా, సేవకుడుగా మీ సేవ చేయవలెనని నా కోరిక. నేను ప్రేమించిన, గౌరవిస్తున్న వ్యక్తి ఆదేశాలను. క్రమశిక్షణతో పాటించవలెనని నా అభిలాష. దక్షిణాఫ్రికాలో మీకు చెడు కార్యదర్శిగా పనిచేశాను. మీరు అనుమతిస్తే నా మాతృభూమిలో ఆ చెడు పేరును వదలి, మంచి పేరు తెచ్చుకొంటాను.

మార్పు వలన, శాంత వాతావరణం వలన ఆరోగ్యపరంగా మీకు కొంత ప్రయోజనం కలగవచ్చును. మార్చి నెల మధ్యభాగంలో ఈ నా వుత్తరం మీకు అందవచ్చును. ఏదైనా అవసరముంటే కేబుల్ ద్వారా నాకు తెలియజేయగలరు.

నేను ఏప్రియల్ నెలలో ఇండియాకు రాగలిగితే మీరు పంపించిన డబ్బును ఉపయోగించుకొనగలను. డెక్ మీదనే మా ప్రయాణం. నా దగ్గర డబ్బు ఏమీ లేదు. ఫొనిక్స్ ఆశ్రమం ధన సహాయం చేయలేదు. అక్కడ అంతా ఖర్చయినది. డబ్బు ఏమీ లేదు.

ఇట్లు

మీ విశ్వాసపాత్రుడు

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 4. టాల్‌స్టాయి గారికి

వెస్ట్ మినిస్టర్ పాలెస్ హోటల్

4 విక్టోరియా స్ట్రీట్

లండన్

1 అక్టోబరు, 1909

సర్,

ట్రాన్సువాలులో జరుగుతున్న ఘటనల్ని గురించి మీ దృష్టిని ఆకర్షించడానికి సాహసిస్తున్నాను. ఈ ఘటనలు మూడేళ్ళుగా జరుగుతున్నవి.

ఒక కాలనీలో 13000 మంది బ్రిటిష్ భారతీయులు నివసిస్తున్నారు. ఆ భారతీయులు ఏడేళ్ళుగా అనేకమైన బాధలకు గురి అవుతున్నారు. ఆ కాలనీలో రంగు కారణంగా ఆసియా వారికి వ్యతిరేకంగా ఏహ్యాభావం తాండవమాడుతున్నది. ఆ ఏహ్యా భావం వ్యాపార సంబంధమైనది, వృత్తి సంబంధమైనది గాదు. అది ఆసియా వారంటే ఏర్పడిన ఏహ్యా భావమే. అది మూడు సంవత్సరాల క్రితం హద్దులు దాటింది. మూడు సంవత్సరాల క్రితం ఒక చట్టం అంగీకరింపబడింది. అది మానవత్వానికే విరుద్ధమని నేనూ నా అనుచరులూ అభిప్రాయపడుతున్నాము. ఆ చట్టానికి తలవొగ్గడం ధర్మానికే విరుద్ధమని మా నిశ్చితాభిప్రాయం. అది స్వచ్ఛమైన మత ధర్మాలకూ, ఆదర్శాలకూ వ్యతిరేకం. నేనూ కొందరు నా మిత్రులూ ఆ చట్టాన్ని వ్యతిరేకించవలెనని నిశ్చయించు కున్నాము. మీ రచనలు చదివే భాగ్యం నాకు లభించింది. ఆ రచనలు నా మీద చెరగని ముద్రను వేశాయి.

భారతీయులు ఆ చట్టానికి తలవొగ్గకూడదనీ, జైలులాంటి ఏ శిక్షలకైనా సిద్ధంగా వుండవలెననీ నిశ్చయించుకున్నారు. అందుకు ఫలితంగా మొత్తం జనాభాలో సగం మంది భారతీయులు ట్రాన్స్‌వాల్ వదలి వెళ్లిపోయారు. మిగిలినవారిలో 2500 మంది ఆత్మ గౌరవ రక్షణ కొరకై జైలుకు వెళ్ళారు. నాలుగు రోజుల నుండి ఆరు నెలల వరకూ శిక్షలు విధింపబడ్డవి. బంధితులకు కఠిన పరిశ్రమ శిక్షగా విధింపబడింది. ఈ ఇబ్బందుల వలన చాలామంది భారతీయులు వినాశనం అంచులకు చేరుకొన్నారు.

ప్రస్తుతం వందకు మంది పైగా సత్యాగ్రహులు ట్రాన్స్‌వాల్ జైలులో మగ్గుతున్నారు. వీరిలో చాలామంది కడు బీదవారు. రోజువారీ కూలీతో జీవనం గడిపేవారు. జనులిచ్చే సహాయంతో, సత్యాగ్రహులు చేస్తున్న సహాయంతో వారి భార్యా పిల్లలు రోజులు గడుపుతున్నారు. అయినా వారు ఈ చెడు చట్టానికి తలవొగ్గడం లేదు. ఉద్యమం సాగుతూనే వున్నది. ఇది ఎప్పుడు అంతమవుతుందో తెలియదు. అయితే సహాయనిరాకరణ ముందు పాశవిక శక్తి నిలబడలేదని మా విశ్వాసం. మేము చాలాకాలం నిర్బంధాలను ఎదిరించి నిలవలేమని ప్రభుత్వం భావిస్తున్నది.

ప్రభుత్వం వారిని కలసి పరిస్థితిని వివరించవలెనని ఒక స్నేహితునితో కలసి ఇక్కడికి వచ్చాను. సహాయనిరాకరణ సిద్ధాంతం ప్రకారం అధికారులతో సంప్రతింపులు వుండవు. మా సముదాయం వారి బలహీనతల వలన, వారి కోరిక ననుసరించి ఇక్కడికి రావలసి వచ్చింది. దీనివలన బలహీనత ఏర్పడుతుందే గాని బలం గాదు. అది నాకు తెలుసును. సహాయ నిరాకరణ విధానం నీతిని గురించి ఒక వ్యాస రచన పోటీ పెడితే ఈ సిద్ధాంతం ప్రచారంలోకి వస్తుంది. కాని అది సహజమార్గం కాదు. దానితో అభిప్రాయాలను కొనినట్లవుతుంది. ఈ విషయంలో మీ అభిప్రాయం తెలియజేస్తారా? అభిప్రాయ సేకరణలో తప్పేమీ లేదని మీరు భావిస్తే ఎవరెవరికి వ్రాస్తే బాగా ఉంటుందో వారి పేర్లు తెలియజేయండి. వారికి నేను ఉత్తరాలు వ్రాస్తాను.

ఇంకొక విషయాన్ని గురించి గూడా మీ అమూల్యమైన సమయాన్ని వృధా చేస్తున్నాను. మిత్రుడొకడు ఒక హిందువుకు మీరు వ్రాసిన ఉత్తరం నకలును నాకు అందజేశాడు. దానిలో భారతదేశంలోని అశాంతిని గురించి చర్చించబడి వున్నది. ఉత్తరం మీ భావాలను వ్యక్తీకరిస్తున్నది. ఆ ఉత్తరం ప్రతులు 20 వేల దాకా అచ్చు వేసి పంచవలెనని నా మిత్రుని అభిప్రాయం. అది అనువదించబడుతుంది. అయితే మీ మూలప్రతి మాకందలేదు. అది మీ ఉత్తరమేననీ, దానిలోని భావాలు సరిగ్గా వున్నవనీ తెలియడం మాకు అవసరం. నా దగ్గర వున్న ఒక ప్రతిని మీకు పంపుతున్నాను. అది మీ వుత్తరమేనని భావిస్తే దానిని అచ్చు వేయించడానికి అనుమతిని ప్రసాదించండి. ఆ ఉత్తరంలో మీరింకా ఏమైనా చేర్చదలుచుకుంటే చేర్చవచ్చును. నేను మీకొక సలహా ఇవ్వడానికి సాహసిస్తున్నాను. మీ ఉత్తరం చివరి పేరాలో పునర్జన్మ విషయంలో పాఠకుణ్ణి మీరు హెచ్చరించారు. ఆ విషయాన్ని ఎత్తడం ఉచితమో కాదో నాకు తెలియదు. మీరీ సమస్యను గురించి బాగా అధ్యయనం చేసి ఉంటారు. పునర్జన్మ వుంటుందని భారతదేశంలో చాలా మందికి విశ్వాసమున్నది. చైనాలో గూడా అంతే. అది అనుభవంలో వున్నదనీ, అది కేవలం బుద్ధికి సంబంధించిన శైక్షణిక వ్యవహారం కాదనీ చాలా మంది అంటుంటారు. అది ఎన్నో జీవిత రహస్యాలను వ్యక్తీకరిస్తున్నది. జైలుకు పోయిన చాలామందికి దీని వలన ధైర్యం లభిస్తున్నది. ఆ సిద్ధాంతం తాలూకు

నిజానిజాలను గురించి మీకు నచ్చ చెప్పే ప్రయత్నం చేయడానికి నేనిది వ్రాయడం లేదు. పునర్జన్మను గురించిన విషయాన్ని మీ ఉత్తరంలో నుండి తొలగించమని చెప్పడం నా ఉద్దేశ్యం. మీ ఉత్తరంలో కృష్ణుణ్ణి గురించి ఎక్కువగా ఉటంకించారు. అది ఏ పుస్తకంలో నుండి ఉటంకించారో ఆ పుస్తకం పేరును నాకు తెలియజేయండి.

ఈ ఉత్తరం ద్వారా మిమ్మల్ని అలసిపోయేటట్లు చేశాను. మిమ్మల్ని అనుసరించేవారికి మిమ్మల్ని గౌరవించే వారికీ మీ సమయం వ్యర్థం చేయడం నచ్చదు. మీకు కష్టం కలగజేయడం న్యాయం కూడా కాదు.

నేను మీకు కొత్త అయినా సత్యం కొరకు ఇది వ్రాస్తున్నాను. మీ సలహా నాకు ఎంతైనా అవసరం. అందుకే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

ఇట్లు

మీ సేవకుడు

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 4ఏ. లియోటాల్‌స్టాయి నుండి

ఎమ్.కె. గాంధీ

ట్రాన్స్‌వాల్

మిత్రమా,

ఇప్పుడే మీ పుత్తరం అందింది. అది చాలా ఆసక్తికరమైన ఉత్తరం. అది నాకెంతో ఆనందాన్ని కలిగించింది. భగవంతుడు మీకూ మీ ట్రాన్స్‌వాల్ మిత్రులందరికీ సహాయపడు గాక! మీ పోరాటం సౌమ్యత్వానికీ పశుశక్తికీ మధ్య జరుగుతున్న పోరాటం. నమ్రత, ప్రేమ ఒకవైపూ, అహంకారమూ హింసాప్రవృత్తీ ఇంకొకవైపు వుండడం వలన ఈ పోరాటం మావంటివారి దృష్టిని ఆకర్షిస్తున్నది. మతదృష్టితో ఏర్పడిన ధార్మిక బాధ్యతలకూ, రాజకీయ చట్టాలకూ మధ్య జరుగుతున్న ఘర్షణ ఇది.

ప్రస్తుతం విశ్వమందంతటా ఇటువంటివి చాలా జరుగుతున్నవి. నా వుత్తరాన్ని ఇంగ్లీషులోనికి అనువదించారు. చాలా సంతోషం. కృష్ణునికి సంబంధించిన పుస్తకం పేరును మాస్కో నుండి పంపించే ఏర్పాటు చేస్తున్నాను. ఇక పునర్జన్మ విషయం. అది ఇంకా అంతగా వేళ్లు పాతుకొనలేదు. నేను మీ మాటను మన్నించి, మీరు కోరితే నా ఉత్తరంలో నుండి ఆ భాగాన్ని తొలగిస్తాను. నా రచనల్ని భారతీయ భాషలలో ప్రచురించడానికి సహర్షంగా అంగీకరిస్తున్నాను. మతసంబంధమైన ధార్మిక విషయాలలో "రాయల్టి" ప్రశ్న ఉండదు.

మీకు నా ధన్యవాదాలు. మీతో వ్యక్తిగతమైన సంబంధం ఏర్పడినందుకు చాలా సంతోషంగా ఉన్నది.

ఇట్లు
లియో టాల్‌స్టాయి

★ ★ ★

## 5. లియో టాల్‌స్టాయి గారికి

వెస్ట్ మినిస్టర్ పాలెస్ హోటల్
4 విక్టోరియా స్ట్రీట్
లండన్

సర్, మీరు ఒక హిందువుకు వ్రాసిన ఉత్తరం ప్రతీ, నా ఉత్తరానికి మీరు వ్రాసిన జవాబూ రెండు అందినవి. రిజిష్టరు ఉత్తరం ద్వారా అవి అందుకొన్నాను. మీ ఆరోగ్యం సరిగా లేదని తెలిసి మీ ఉత్తరం అందినట్లు నేను మీకు వ్రాయలేదు. అయినా అది ఒక శిష్టాచారమే అవుతుంది. శ్రీ అయిల్‌మర్ మాడే గారు మీ ఆరోగ్యం బాగానే వున్నట్లు ప్రతిరోజూ ఉదయం ఉత్తరాలకు జవాబు వ్రాస్తున్నారనీ తెలియజేశారు. అది నాకు చాలా సంతోషకరమైన వార్త. అందువల్లనే మీకు ఉత్తరం వ్రాయడానికి సాహసిస్తున్నాను. నా స్నేహితుడగు ఒక ఇంగ్లీషు వ్యక్తి వ్రాసిన పుస్తకం మీకు పంపుతున్నాను. ఆయన ప్రస్తుతం దక్షిణాఫ్రికాలోనే ఉంటున్నాడు. ఆ పుస్తకంలో నా

జీవితాన్ని గురించీ, నేను ప్రాణాధికంగా భావించి పాల్గొంటున్న ఉద్యమాన్ని గురించీ వివరించబడి వున్నది. మీ సహానుభూతినీ, మీ సహకారాన్నీ అర్థించడం, పొందడం నా విధి. నా అభిప్రాయంలో ట్రాన్స్‌వాల్‌లో భారతీయులు జరుపుతున్న పోరాటం ఆధునిక యుగంలో చాలా గొప్పది. ప్రముఖమైనది. ఈ పోరాట లక్ష్యమూ, లక్ష్యసిద్ధికై అవలంబించబడుతున్న సాధనాలూ రెండూ ఆదర్శప్రాయమైనవి. ఈ పోరాటంలో పాల్గొంటున్న వారికి వ్యక్తిగతమైన స్వలాభమేమీ లేదు. ఒక సిద్ధాంతం కొరకు వారు కష్టాలను సహిస్తున్నారు. ఈ పోరాటాన్ని గురించి ప్రచారం చేయడం నాకు సాధ్యం కాదు. ప్రపంచంలో చాలామంది విజ్ఞులు - బహుజనం మిమ్మి అనుసరిస్తున్నారు. డోక్‌గారి పుస్తకం చదివిన తరువాత నా నిర్ణయాలు న్యాయసంగతమని మీకు తోస్తే మీ పలుకుబడిని ఉపయోగించి మీకు తోచిన విధంగా ఈ ఉద్యమాన్ని బహుజన సమ్మతమయేటట్లు చేయగలరా? ఈ ఉద్యమం విజయవంతమైతే ధర్మానికీ, ప్రేమకూ సత్యానికీ విజయం లభించినట్లవుతుంది. ధర్మవిరుద్ధ కార్యక్రమానికీ, ఏహ్యతాభావానికీ, అసత్యానికీ పరాజయం లభించినట్లవుతుంది. ఇది ముఖ్యంగా భారతీయులలోనూ, ప్రపంచంలోని మిగతాదేశాలవారిలోనూ ఉత్సాహాన్ని రేకెత్తింపజేస్తుంది. అంతిమ విజయం మాకు లభిస్తుందనే విషయంలో నాకెటువంటి సందేహమూ లేదు. మీ ప్రోత్సాహం గూడా మాకు లభిస్తే మాకు కొండంతబలం చేకూరుతుంది.

ఒప్పందం కొరకు మేము చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఈ వారంలో నా మిత్రులతో కలసి నేను దక్షిణాఫ్రికాకు వెళుతున్నాను. అక్కడ జైలుశిక్షను ఎదుర్కొంటాను. నా కుమారుడు గూడా పోరాటంలో పాల్గొని ఆరు నెలలు కఠిన శిక్ష అనుభవిస్తున్నాడు. ఇది నాలుగోసారి అతనికి విధించబడిన శిక్ష. మీరు దయతో జవాబు వ్రాయండి.

జోహాన్స్‌బర్గ్ చిరునామా

జోహాన్స్‌బర్గ్, పోస్టుబాక్స్ 6522

మీ సేవకుడు

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 6. లియో టాల్‌స్టాయి గారికి

జోహన్స్ బర్గ్

4-4-1910

సర్,

లండను నుండి నేను మీకొక ఉత్తరం వ్రాశాను. అది మీకు జ్ఞాపకం వుండి ఉంటుంది. మీ అనుచరుడుగా నేను వ్రాసిన ఇంకొక చిన్న పుస్తకాన్ని మీకు పంపుతున్నాను. గుజరాతీలో వ్రాసిన నా పుస్తకానికి నేనే అనువాదం చేశాను. మూలంలో వ్రాసిన నా పుస్తకాన్ని భారత ప్రభుత్వం నిషేధించింది. అది విశేష విషయం. అందు వలన అనువాదాన్ని పుస్తకరూపంలో ప్రచురించుటకు నేను తొందరపడ్డాను. నేను మీకు కష్టం కలిగిస్తున్నాను. మీ ఆరోగ్యం అనుమతించి ఈ చిన్న పుస్తకాన్ని మీరు చదవగలిగితే దానిమీద మీ అభిప్రాయాన్ని తెలియజేయగలిగితే ఆ అభిప్రాయానికి నేను ఎంతో విలువ ఇస్తాను. అది మాటల్లో చెప్పలేను. మీరు వ్రాసిన (ఎ లెటర్ టు హిందూ) పుస్తకం కాపీలను పంపుతున్నాను. దాన్ని అచ్చు వేయించే అవకాశం మీరు మాకు కల్పించారు. ఆ పుస్తకం భారతీయ భాషలలోనికి కూడా అనువదింపబడింది.

ఇట్లు
గౌరవాభివందనాలతో
ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 6ఏ. కౌంట్ లియోటాల్‌స్టాయి నుండి

మిత్రమా!

మీ వుత్తరం, మీరు పంపిన పుస్తకం ఇండియన్ హోమ్ రూల్ ఇప్పుడే అందినది. ఆ పుస్తకంలో మీరు వెలువరించిన భావాలూ, ఉటంకించిన సమస్యలూ కేవలం భారతీయులకే గాక మానవ సమాజానికంతకూ ముఖ్యమైనవి.

మీ మొదటి ఉత్తరం దొరకలేదు. మీ జీవిత చరిత్రను చదివిన తరువాత మిమ్ము బాగా అర్థం చేసుకొనగలిగాను.

నా ఆరోగ్యం అంత బాగా లేదు. అందువలన పరస్పరం పెనవేసుకొని వున్న మీ కార్యకలాపాలూ, మీ జీవిత చరిత్రను గురించి వివరంగా ఉత్తరం వ్రాయలేను. మీ కార్యకలాపాలకు నేను చాలా విలువనిస్తున్నాను.

నా ఆరోగ్యం బాగుపడగానే నేను ఉత్తరం వ్రాస్తాను.

మీ మిత్రుడు, సోదరుడు

**లియో టాల్‌స్టాయి**

★ ★ ★

## 7. లియోటాల్‌స్టాయి గారికి

21-24, కోర్టు ఛేంబర్సు
జోహన్సుబర్గు
15.8.1910

సర్,

8 మే తేదీన ప్రోత్సహకరమూ, ఆత్మీయతా కలిగిన మీరు వ్రాసిన ఉత్తరం అందినది. కృతజ్ఞుణ్ణి. ఇండియన్ హోమ్‌రూల్ పుస్తకం విషయంలో మీరు ప్రకటించిన అభిప్రాయానికి నేను ఎంతో విలువనిస్తున్నాను. మీ విస్తృతమైన విమర్శ కొరకు నేను ఎదురు చూస్తుంటాను.

టాల్‌స్టాయి ఫారమ్‌ను గురించి స్నేహితుడు కాలెన్‌బెక్ మీకు ఉత్తరం వ్రాసి వున్నాడు. అతడూ నేనూ చాలాకాలంగా స్నేహితులం. మై కన్ఫెషన్స్ అనే పుస్తకంలో మీరు వెలువరించిన అనుభవాలనన్నింటినీ అతడు అనుభవించి వున్నాడు. అతణ్ణి మీ రచనలెంతో ప్రభావితం చేసినవి. మీ ఆదర్శాలకు రూపకల్పన చేయుటకై నాతో సంప్రదించిన తరువాత ఫారానికి మీ పేరు పెట్టడానికి సాహసించాడు.

మా ఉద్యమంలో పనిచేస్తున్న వారికి తన ఫారమ్‌లో ఆయన ఆశ్రయం కల్పించారు. ఇండియన్ ఒపీనియన్ ప్రతులు గూడా మీకు పంపుతున్నాను. దానితో మీకు వివరాలు తెలియగలవు.

ట్రాన్స్‌వాలులో జరుగుతున్న పోరాటాన్ని గురించి సానుభూతిని ప్రదర్శించి అభిమానం చూపినందువలన మిమ్మల్ని మరీ మరీ బాధపెడుతున్నాను.

మీ
విశ్వాసపాత్రుడు
ఎం.కె. గాంధి

★ ★ ★

## 7ఏ. కౌంట్ లియోటాల్‌స్టాయి నుండి

" కొచ్చెట్టి "
(టాల్‌స్టాయ్ పెద్ద కుమార్తె కోట)
7 సెప్టెంబరు, 1910

మో. క. గాంధీ
జోహన్స్‌బర్గ్
ట్రాన్స్‌వాల్
దక్షిణ ఆఫ్రికా

మీ పత్రిక ఇండియన్ ఒపీనియన్ నాకు చేరింది. అందులో అహింస గురించి వ్రాసినదంతా చదివి నేను సంతోషించాను. అందులోని వ్యాసాలు చదివిన వెంటనే నాలో రేకెత్తిన భావాల్ని మీకు తెలియచేయాలని కోరుతున్నాను.

నా వయస్సు పెరిగినకొద్దీ ముఖ్యంగా నేను మృత్యువును సమీపిస్తున్న ప్రస్తుత సందర్భంలో నన్ను తీవ్రంగా కదిలించివేస్తున్న భావావేశాల్ని ఇతరులకు వ్యక్తీకరించాలని నాలో కలుగుతున్న కోరిక. అది అత్యంత ప్రధానంగా నాకు తోస్తోంది. అహింస అంటే

వాస్తవానికి మొక్కవోని ప్రేమ యొక్క క్రమశిక్షణ అనే వ్యాఖ్యానం తప్ప మరేమీ కాదు. ఇతరేతర ఆత్మలతో తాదాత్మ్యత, ఐక్యతా భావమే ప్రేమగా పరిణమిస్తుంది మరియు దాని నుండి బహుశ్రేష్ఠమైన కార్యకలాపాలు రూపుదిద్దుకుంటాయి. ప్రేమ మానవ జన్మయొక్క అత్యున్నత, అతిశ్రేష్ఠ సిద్దాంతము కావడంతో బాటు ప్రతి ఆత్మ అంతరాంతరాల్లో దాగి ఉండే ఉదాత్తభావన. పసిపిల్లల ఆత్మలలో ఈ విషయం అతి స్పష్టంగా మనకు కన్పిస్తుంది. అసత్య సిద్ధాంతాల వల్ల కళ్లు మూసుకుపోనంత వరకు ఈ సత్యాన్ని మనిషి చూడగలుగుతాడు.

భారతీయ, చైనా, హిబ్రూ, గ్రీక్, రోమన్ మొదలైన అన్ని వేదాంతాలు ప్రేమ సిద్ధాంతాన్ని బహుళ ప్రచారం చేశాయి. ప్రేమ సిద్ధాంతంలో ఇటు సిద్ధాంతము అటు భవిష్యవాణి రెండిటి యొక్క రెండు పార్శ్వాలు ఇమిడిపోయిన సంగతి బహుశః ఏసుక్రీస్తే సుస్పష్టంగా వ్యక్తీకరించాడు. అంతేకాదు, అంతకంటె ఎక్కువే చేశాడు. సిద్ధాంతంలో వచ్చే వక్రతను గుర్తించి ప్రాపంచిక కోరికల కోసం మాత్రమే జీవించే వ్యక్తుల జీవితాల్లో వచ్చే కృత్రిమ పరిణామాలను గురించి ముందుగానే హెచ్చరించాడు ఏసుక్రీస్తు. మనిషి తన కాంక్షల్ని పరిరక్షించుకోవడం కోసం దౌర్జన్యం చేయడం ప్రమాద సూచిక అనీ - మరీ ప్రత్యేకంగా చెప్పాలంటే దెబ్బ మీద దెబ్బ తీయడం, తను పోగొట్టుకున్న వాటిని తిరిగి గుంజుకోవడం చాలా తీవ్రమైన విషయాలు. తర్క సంగత వ్యక్తులందరు తెలుసుకోవలసిన విధంగా హింసాయుత మార్గానికి, ప్రేమకు ఎటువంటి బాదరాయణ సంబంధం లేదనీ, ప్రేమే జీవిత మూలసిద్ధాంతమనీ ఏసుక్రీస్తుకు బాగా తెలుసును. హింసా పద్ధతుల్ని అనుమతిస్తే, ఒకే ఒక్కసారి అనుమతించినా, ప్రేమ సిద్ధాంతం నిరుపయోగమైపోతుందని ఏసుక్రీస్తు అన్నాడు. అంటే ప్రేమ సిద్ధాంతం తన ఉనికినే కోల్పోతుంది. బాహ్యంగా ఎంతో తేజోమయంగా కన్పించే క్రిస్టియన్ నాగరికత ఈ అపార్థాన్ని పునాదిగా చేసుకొని ఘోరమైన, విచిత్రమైన అంతర్ వైరుధ్యంలో ఒక్కోసారి తెలిసి, చాలాసార్లు తెలియని పరిస్థితుల్లో వృద్ధి చెందింది.

ప్రేమతో బాటు నిరోధక శక్తిని అనుమతిస్తే వాస్తవానికి ప్రేమ ఎంత మాత్రము నిలవజాలదు. ప్రేమ సూత్రానికి ఇదే నిజమైన అర్థము. ప్రేమ సూత్రము నిలవ

లేకపోయినపుడు హింసా సిద్ధాంతము తప్ప మరొక సిద్ధాంతానికి అవకాశం ఉండదు. అంటే కండబలమే రాజ్యమేలుతుంది. గత 19 శతాబ్దాలుగా క్రిస్టియన్ సమాజం ఈ విధంగానే మనుగడ కొనసాగిస్తూ వచ్చింది. హింసా సిద్ధాంతం ఆధారంగానే సమాజం మనుగడ కొనసాగిస్తూ వచ్చింది. వాస్తవానికి క్రిస్టియన్ సమాజానికీ భూగోళం మీద మనుగడ కొనసాగించిన ఇతర సమాజాలకీ మధ్య ఉన్న తేడా ఏమిటి? ప్రపంచంలో మరి ఏ ఇతర మత సిద్ధాంతంలో నిర్వచించనంత నిర్ద్వంద్వంగా క్రిస్టియన్ మత సిద్ధాంతం ప్రేమ సిద్ధాంతాన్ని సుస్పష్టంగా నిర్వచించింది. క్రిస్టియన్ సమాజం ప్రేమ సిద్ధాంతాన్ని అతి పవిత్రంగా నమ్మింది. కాని ఆ సమాజం హింసా సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొని సమస్త సామాజిక నిర్మాణాన్ని అనుమతించింది. హింసా సిద్ధాంతమే వాస్తవ జీవిత విలువల్ని శాసిస్తూ వచ్చింది. తత్ఫలితంగా క్రిస్టియన్ ప్రజా జీవనం విరుద్ధ సిద్ధాంతాల్ని ఆధారం చేసుకొని కొనసాగింది. వల్లించే సిద్ధాంతాలకు, ఆచరణలో పెట్టే సిద్ధాంతాలకూ ఎక్కడా పొంతన కుదరకపోవడం గమనార్హం. ప్రేమ సిద్ధాంతం జీవన సిద్ధాంతంగా ప్రవచిస్తూ మానవ జీవితంలో వివిధ పార్శ్వాలలో ముఖ్యంగా ప్రభుత్వం, ట్రిబ్యునల్స్, సైన్యం - హింసా సిద్ధాంతానికి ప్రోది చేయడం, కీర్తించడం ఎవరూ కాదనలేని వైరుధ్యం. క్రిస్టియన్ ప్రపంచంలో ఈ వైరుధ్యం లోలోపల పెరిగి పెద్దదై ఇటీవల కాలంలో ఘోర రూపాన్ని సంతరించుకొని పరాకాష్ఠకు చేరుకొన్నది.

ప్రస్తుత పరిస్థితుల్లో ఈ సమస్య ప్రముఖమైన సమస్యగా రూపొందింది. మత, నైతిక రంగాలతో సహా అన్ని రంగాల్లో క్రమశిక్షణా రాహిత్యాన్ని సిద్ధాంతపరంగా స్వీకరించి జీవన పార్శ్వాలన్నింటిలో హింసా సిద్ధాంతాన్ని అమలు చేస్తున్నట్లు నిర్ద్వంద్వంగా చెప్పుకోవడమో లేదా రాజ్యాంగ విభాగాలైన న్యాయ, పోలీసు వ్యవస్థలతో బాటు ముఖ్యంగా సైనిక విభాగంలో వ్యక్తిగత మనోభావాలకు విరుద్ధంగా బలవంతంగా అమలు చేస్తున్న విధానాల్ని మానుకోవడమో తప్ప మరో మార్గం లేదు.

ఈ వసంతంలో మాస్కోలో ఒక మాధ్యమిక పాఠశాలలో కాటిషిజమ్ విభాగంలో ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న ఒక బిషప్ చిన్నారి అమ్మాయిల్ని ప్రశ్నిస్తూ టెన్ కమాండ్‌మెంట్స్ గురించి, అందులోనూ ముఖ్యంగా ఆరో ఆదేశమైన "నీవు చంపకుండుదువుగాక"

గురించి ఒక్కొక్కర్ని ప్రశ్నించడం జరిగింది. మంచి మంచి జవాబులు చెపుతున్నప్పుడు బిషప్ మరికొన్ని ప్రశ్నల్ని వేస్తూ వచ్చాడు. పవిత్రమైన సిద్ధాంతం ప్రకారం చంపడాన్ని అన్ని సందర్భాల్లో, అన్ని వేళలా, నిషేధించాలా? అధ్యాపకుల వక్రబోధన కారణంగా కొందరు చిన్నారులు కాదు-కాదు అన్ని సందర్భాల్లో కాదు-యుద్ధంలోను, నేరస్థులను శిక్షించే సందర్భంలోను - ఈ సిద్ధాంతం మారుతుంది అని జవాబు చెప్పారు. ఆ దురదృష్టవంతులైన అమ్మాయిల్లో ఒకరు ఈ సంగతి నేను కల్పన చేసి చెపుతున్న విషయం కాదు, ప్రత్యక్ష సాక్షి ఒకరు నాకు చెప్పిన విధంగా చెపుతున్నాను. "చంపడం ఎల్లవేళలా నేరమేనా" అన్న అదే ప్రశ్నకు ఇతరులకంటే భిన్నంగా తీవ్రంగా స్పందించి, సిగ్గుతో తలవంచుకొని, స్పష్టంగా, నిర్ణయాత్మకంగా "అవును, ఎల్లవేళలా" అని జవాబు చెప్పింది. బిషప్ అలవాటు ప్రకారం వేసే అన్ని ప్రశ్నలకు ఎంతో దృఢంగా జవాబులు చెప్పింది. పాత నిబంధనావళి ప్రకారం చంపడాన్ని అన్ని సందర్భాల్లో నిషేధించిన సంగతి, ఏసుక్రీస్తు చంపడాన్నే కాక చుట్టుప్రక్కలవారితో క్రూర, వక్ర బుద్ధితో ప్రవర్తించడాన్ని కూడా నిషేధించిన సంగతి ఆ అమ్మాయి గుర్తు చేసింది. ఉపన్యాస దురంధరుడు, బాహ్యాడంబర ప్రియుడైన ఆ బిషప్ ఆ చిన్నారి అమ్మాయి ముందు తన ఓటమిని ఒప్పుకొని తోక ముడవక తప్పలేదు. ఆ లేత వయస్కురాలు గెలిచింది.

అవును. మనమంతా మన మన వృత్తిపరమైన పత్రికల్లో, గ్రంథాల్లో వైమానిక ప్రగతి గురించి, కొత్త కొత్త పరిశోధనల గురించి, జటిలమైన రాజ్య సంబంధాల గురించి, రకరకాల క్లబ్‌లు, రకరకాల యుద్ధ సంధుల గురించి, విఖ్యాతి చెందిన కళాఖండాల గురించి చర్చిస్తూ ఆ యువతి చెప్పిన విషయాన్ని దాటవేయడానికి శతవిధాల ప్రయత్నిస్తాము. కాని ఇటువంటి సందర్భాల్లో మౌనం వహించడం వృథా. సోషలిజం, కమ్యూనిజం, విశృంఖలతావాదం, ముక్తి వాహిని పెచ్చు పెరుగుతున్న నేరాలు, నిరుద్యోగం, ధనవంతుల అర్థం లేని భోగాలు, అద్దూ అదుపూ లేని వాంఛలు, మరోవైపు పేదవారి నికృష్ట జీవన స్థితిగతులు, పెరిగిపోతున్న ఆత్మహత్యల సంఖ్య - ఇవన్నీ సమాజంలో వేళ్లూనుకొన్న అంతర్ వైరుధ్యాలు. వీటికి పరిష్కార

మార్గం కనుగొనడం చాలా అవసరం. వీటికి పరిష్కారం ప్రేమ సిద్ధాంతం తప్ప మరేమీ కాదు. అన్ని రకాల హింసను తిరస్కరించి, ప్రేమ సిద్ధాంతాన్ని మాత్రమే అన్ని సందర్భాల్లోను అమలు చేసినపుడే ఈ వైరుధ్యాలకు పరిష్కారం సుగమం అవుతుంది. కనుకనే ట్రాన్స్‌వాల్‌లో ప్రపంచ కేంద్రానికి దూరంగా మీరు చేస్తున్న కృషి ఎంతో ప్రాధాన్యతను సంతరించుకొన్నది. ఈ మౌలికమైన, ప్రధానమైన ప్రయోగం ద్వారా ప్రపంచానికి చాలా బరువైన, బలమైన రుజువు లభిస్తుంది. ఈ ప్రయోగ ఫలితాల్ని క్రిస్టియన్ సమాజంతో సహా ప్రపంచమంతా తెలుసుకొని, అర్థం చేసుకొని అమలు చేయాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఇక్కడ రష్యాలో ఒక కొత్త ఉద్యమం రూపుదిద్దుకొంటున్న సంగతి మీరు తెలుసుకొని సంతోషిస్తారని నాకు తెలుసు. ప్రతి ఏటా సైన్యంలో చేరే వారి సంఖ్య తగ్గిపోతున్నది. ఇది ఒక ఉద్యమంగా రూపొందడం విశేషం. కొందరు దీన్ని తిరస్కరిస్తున్నారు. మీ అహింసా ఉద్యమంలో ఎంత తక్కువ సంఖ్యలో పాల్గొన్నా రష్యాలో సైన్యంలో చేరడానికి ఎంత తక్కువమంది తిరస్కరించినా - వీరంతా "భగవంతుడు మాతోనే ఉన్నాడు", 'భగవంతుడు మానవమాత్రుల కన్న శక్తి సంపన్నుడు' అన్న దృఢ విశ్వాసంతో ముందుకు సాగడం కాకతాళీయం.

క్రిస్టియన్ మతంలోని ఒప్పుకోలు విధానం, క్రిస్టియన్ మతస్థులు దీన్ని పాటిస్తున్న వక్ర విధానం, సైన్యాల్ని విపరీతంగా పెంచివేసి యుద్ధాలలో మనుషుల్ని పెద్ద సంఖ్యలో చంపివేసేందుకు పథకాలు వేయడం, ఈ ఘోరమైన అంతర్ వైరుధ్యాలు ఇప్పుడు కాకపోయినా రేపైనా నగ్నంగా ప్రపంచం ముందు నిలవాల్సి వస్తుంది. ఇందువల్ల మనమంతా క్రిస్టియన్ మతాన్ని త్యజించి ప్రభుత్వశక్తిని అజేయమైనది అని ఒప్పుకోవాల్సిరావడమో లేదా సైన్యశక్తిని దానిమీద ఆధారపడి నడుస్తున్న ప్రభుత్వశక్తిని, అన్ని హింసా పద్ధతుల్ని నిర్వీర్యం చేయడమో చేయాల్సిన పరిస్థితి రాక తప్పదు. ప్రభుత్వం తన ఆధిపత్యం కోసం అనేక మార్గాల్లో ఇటువంటి హింసాపద్ధతుల్ని, శక్తుల్ని పెంచి పోషిస్తున్న సంగతి గుర్తించి వ్యతిరేకించాల్సి ఉంటుంది. ఈ వైరుధ్యం గురించి ప్రభుత్వాలన్నిటికీ బాగా తెలుసు. అటు మీ బ్రిటిష్ ప్రభుత్వం,

ఇటు మా రష్యా ప్రభుత్వం ఈ విషయాల్ని సహజసిద్ధాంత న్యాయంగానే ఆకళింపు చేసుకొని ప్రతిపక్షాన్ని హింసించడం జరుగుతోంది. మీ వ్యాసాల్లో వ్రాస్తున్న కథనాల సారాంశం ఒకటే. ప్రభుత్వాలకు తమమీద ఎక్కుపెట్టిన అస్త్రాల గురించి బాగా తెలుసు. ఎటువైపునుండి ఎవరు ఈ అస్త్రాలు ప్రయోగిస్తారో వారిని అణచి వేసే ప్రయత్నాలు ఎంతో ఉత్సాహంగా, పకడ్బందీగా చేస్తుంటాయి. తమతమ స్వార్థాల్ని పరిరక్షించుకోవడమే కాక తమ ఉనికిని కాపాడుకోవడానికి పోరాటం చేస్తూనే ఉంటాయి.

నా పరిపూర్ణ గౌరవంతో

లియో టాల్‌స్టాయి

★ ★ ★

## 8. మగన్‌లాల్ గాంధీకి

4-3-195 తరువాత

భాయీ శ్రీ!

అహింసను గురించిన నీ ఆలోచన సక్రమమైనదే. దయ, అక్రోధము మొదలైనవి అహింసకు ముఖ్యమైనవి. సత్యాగ్రహం అహింసమీద ఆధారపడి వుంటుంది. దానిని కలకత్తాలో స్పష్టంగా చూశాము. మనం చేసే ప్రతిజ్ఞల్లో దానిని గూడా చేర్చవలెనని నిశ్చయించాను. ప్రతిజ్ఞలనన్నింటినీ పాటించి తీరాలి. అప్పుడే అహింస తాలూకు అసలు స్వరూపాన్ని దర్శించగలుగుతాము. నా ఉపన్యాసాలలో యమ నియమాదులకు అన్నింటి కంటే ప్రాధాన్యమిచ్చి మాట్లాడుతున్నాను.

"సియరామ్ ప్రేమపీయూషపూరన్ హోత జనము న భరత్‌కో
ముని మన అగమ్ యమ నియమ సమదమ్ విషమవ్రత ఆచరణ్‌కో"

కలకత్తాలో ఈ పదాన్ని పదేపదే గుర్తుచేసుకున్నాను. దానిని గురించి దీర్ఘంగా ఆలోచించాను. యమ నియమాదులను పాటిస్తేనే మనం విజయం సాధించగలం. నియమాలను పాటిస్తున్నప్పుడు అనవసరమైనదేదీ మన మనస్సులోనికి రాకూడదు.

రాదు. వ్యవసాయానికి ఎద్దులు అవసరం. వాటిని మనం ఉపయోగించి వ్యవసాయం చేస్తాము. దుర్భిక్షభయమున్నచోట తినుబండారాలను నిలవజేస్తాము. ఎద్దులను ఉప యోగించడం, తినుబండారాలను నిలవజేయడం అవసరమా కాదా అని మనల్ని మనం ప్రశ్నించుకోవాలి. నియమాలనుపాటించాలి. అవసరం లేని వాటిని త్యజించాలి. త్యజించగలగాలి. త్యాగానికి హద్దులుండవు. త్యాగం చేసిన కొద్దీ ఆత్మానుభూతిని పొందగలుగుతాము. మన మనస్సు త్యాగం వైపుకు మొగ్గిన కొద్దీ, నిలవజేసే ప్రవృత్తిని వదలిన కొద్దీ త్యాగం వైపుకు ముందుకు సాగగలుగుతాము. చేసిన ప్రతిజ్ఞలను పాటించగలుగుతాము.

చౌర్యరాహిత్యం గూడా అటువంటిదే. మనకు అవసరం లేని వాటిని నిలవ జేయడం పొరపాటు. వాటిని ఉపయోగించడం చౌర్యమవుతుంది. ఒక చొక్కా సరి పోయేవారు రెండు చొక్కాలు ఉపయోగించడం చౌర్యమవుతుంది. రెండోచొక్కా ఇంకొకరు ఉపయోగించవలసినది. అది తనదిగాదు. ఐదు అరటి పండ్లు సరిపోతే ఆరో పండును గూడా తినడం దొంగతనం చేయడమే. మన దగ్గర 50 నిమ్మకాయ లుంటవి. నాకు రెండు కాయలు అవసరం. సరిపోతవి. అక్కడ చాలా నిమ్మకాయలు వున్నవి గదా అని మూడోకాయను గూడా ఉపయోగించడం చౌర్యం.

అనవసరంగా అవసరంలేని వాటిని గూడా అనుభవించడం అహింసకు విరుద్ధం. నియమాలను దృష్టిలో పెట్టుకొని వస్తువులను అనవసరంగా ఉపయోగించడం మానివేస్తే మనం కరుణామయులం, దయార్ద్రహృదయులం కాగలము. అప్పుడు ఏ జంతువు మనల్ని చూచి భయపడదు. వాటి మీద మనకు దయ, ప్రేమ, కరుణ కలగగలవు. అట్టి ప్రేమ కలిగిన వ్యక్తి ఏ జంతువును చూచినా భయపడడు. మన శాస్త్రాలు చెప్పుతున్నదదే. నా అనుభవం గూడా అదే.

ఈ నియమాలన్నింటి లక్ష్యం సత్యమే. దానిని పాటించనివారు దోషాల పాలవుతారు. అందువలన సత్యానికి పైచేయి వుండేటట్లు ప్రతి విషయంలోనూ మనం ప్రయత్నించాలి. వస్తువులను నిలవ చేయాలా వద్దా అని సందేహం కలిగినప్పుడు

నిలవచేయకపోవడమే మంచిది. మాట్లాడడం విషయంలో సందేహం కలిగితే మౌనం వహించడం శ్రేయస్కరం.

మీరు స్వేచ్ఛగా మనస్ఫూర్తిగా అంగీకరించిన నియమాలనే పాటించండి. నియమ ప్రతిజ్ఞలు చేయడం అవసరమైనా, అంగీకరించిన నియమాలను, ప్రతిజ్ఞలను పాటించగలనా లేదా అని ఆలోచించి ప్రతిజ్ఞలు చేయాలి.

శ్రీరామచంద్రుడు మహాధీరుడు, వీరుడు. వేలకొలది రాక్షసులను సంహరించాడు. అయినా లక్ష్మణ భరతులవంటి తమ్ములు ఆయనకు లేకుంటే ఆయనను ఎవ్వరూ స్మరించేవారుకారు. ఎవడు ఎంత వీరుడైనా కాలం గడచిన కొద్దీ అతణ్ణి అందరూ మరచిపోతారు. ఇంకా ఎంతోమంది రాక్షసుల్ని సంహరించిన వీరులు మనదేశంలో చాలామంది వున్నారు. అయినా శ్రీరామచంద్రుని విషయం వేరు. లక్ష్మణ భరతులవంటి తమ్ములు ఆయనకున్నారు. ఆ ఇద్దరు సోదరులు త్యాగానికీ, తపస్సుకూ ప్రతిమూర్తులు. రామునికి లభించిన కీర్తి కంతకూ ఆ సోదరులు సంరక్షణ కర్తలు. అదే తులసీదాసు నిర్వచించిన సత్యం. లక్ష్మణుడు 14 సంవత్సరాలు నిద్రనూ ఆహారాన్నీ త్యజించాడు. ఇంద్రజిత్తు గూడా అటువంటివాడే. కాని అతనికి నిజమైన తపస్సు రహస్యం బోధ పడలేదు. తపస్సు లక్ష్యమేమిటో తెలియక ఇంద్రజిత్తు దానిని దురుపయోగం చేసి లక్ష్మణుని చేతిలో మరణించాడు. లక్ష్మణుడు తపస్సు లక్ష్యాన్ని రామచంద్రుని వలన తెలుసుకొన్నాడు. గురుదేవుడు రవీంద్రుని విషయం గూడా అంతే. ఆదర్శాలను నిత్య జీవితంలో అమలు చేసేవారు లేకపోతే అవి గుప్తంగా ఉండిపోతవి. అమలు చేసే వారుంటే అవి వెలుగులోకి వస్తవి. వాటిని అమలు చేయడమే తపస్సు. పిల్లల జీవితంలోనూ అందరి జీవితంలోనూ ఆ తపస్సును ప్రవేశపెట్టేటందుకు విశేష కృషి చేయవలసి ఉంటుంది.

ఆశీర్వచనాలతో

బాపూ

★ ★ ★

## 9. మగన్‌లాల్ గాంధీకి

నౌగాఁవ్

గురువారం, జులై 25, 1918

చిరంజీవి మగన్‌లాల్,

రామజీభాయీ మాటలకు నీవు భయపడినట్లున్నావు. నా మాటలకు అతడు చాలా అర్థాలు తీసినట్లున్నాడు.

నా భావాలు మారలేదు. భారతదేశంలో నాకు చాలా చేదు అనుభవం కలిగింది. అయినా నా నిర్ణయాలు మారలేదు. పశ్చిమదేశాల నుండి మనం నేర్చుకొనవలసిందేమీ లేదు. నాకు కలిగిన చేదు అనుభవాలు నన్ను మార్చలేదు. ఈ యుద్ధం గూడా మార్చలేదు. మొదటి నా భావాలు ఇప్పుడింకా పరిష్కృతమైనవి. అవి పరిశుద్ధమయినవి. పాశ్చాత్య నాగరికత ననుసరించవలసిన అవసరం నాకేమీ కనబడటం లేదు. మద్యపానం మాంసాహారం మనకక్కర్లేదు. శ్రీ స్వామి నారాయణ, వల్లభుడు ఇద్దరూ మన పురుషకారాన్ని బలహీనపరచినట్లు కనబడుతున్నది. వారి బోధలు ప్రజలను ఆత్మ సంరక్షణ చేసుకోలేని వారినిగా తయారు చేసినవి. ప్రజలు మద్యపానం మానివేశారు. పొగ తాగడం మానివేశారు. అది మంచిదే. ఆ క్రియలు సాధనాలు మాత్రమే. అవే లక్ష్యాలు కావు. సర్వస్వాలు కావు. ఒక పొగత్రాగేవాడు మంచి శీలం కలవాడయితే అతని సహవాసం అభిలషణీయమే. పొగత్రాగనివాడు వ్యభిచారి అయితే దాని వలన ప్రయోజనమేముంటుంది? స్వామి నారాయణ, వల్లభులు ఇద్దరూ బోధించిన ప్రేమ సిద్ధాంతం భావనాత్మకమైనది. అది మానవుణ్ణి నిజమైన ప్రేమికుడుగా మార్చలేదు. వారి బోధలు నిజమైన అహింసా స్వరూపాన్ని వ్యక్తం చేయడంలేదు. చిత్తం తాలూకు అన్ని ఆవేశాలనూ అహింస నిరోధించగలుగుతుంది. అది మానవుల పరస్పర సంబంధాలు, అవగాహన మీద ఆధారపడివుంటుంది. పరిస్థితుల ప్రభావం, అధఃపతనావస్థలో వున్న మన యుగంలో జన్మించడం వంటి వాటి ప్రభావం వారి మీద వారి బోధన మీద పనిజేసినట్లు కనబడుతున్నది. వాటి చెడు ప్రభావం గుజరాత్ మీద పడ్డది. తుకారామ్ రామదాసులు అందుకు భిన్నంగా

వున్నారు. తుకారామ్ అభంగాలూ, రామదాసుని శ్లోకాలూ పురుషునిలోని పురుషకారానికి ప్రాధాన్యతనిచ్చాయి. తుకారామ్, రామదాసులు గూడా వైష్ణవులే. వైష్ణవ పరంపరకూ స్వామి నారాయణ్, వల్లభుల ప్రబోధాలకూ ముడిపెట్టవలసిన అవసరం లేదు. వైష్ణవ ధర్మం తరతరాలకు చెందిన సత్య ధర్మం. ఇప్పుడు హింసలో అహింసను స్పష్టంగా చూస్తున్నాను. మొదట నాకా దృష్టి వుండేది కాదు. నాలో వచ్చిన పెద్ద మార్పు అది. ఒక తాగుబోతును చెడు పనిచేయకుండా ఆపడం, రాబిస్ వ్యాధిని వ్యాప్తం చేస్తున్న కుక్కను చంపడం అహింస అని నేను అర్థం చేసుకోలేదు. అలాంటి విషయాలలో జరిగే హింస అహింసయే. హింస శారీరిక క్రియ. బ్రహ్మచర్యమంటే ఏమిటి? బ్రహ్మచర్యమనగా స్త్రీ పురుషభోగం నుండి దూరంగా వుండడం. అంతే. మన పిల్లల్ని మనం నపుంసకులనుగా చేయము. మంచి పురుషత్వము వుండి గూడా బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి. భోగశక్తి వుండి గూడా దానిని సంయమనం చేయాలి మనం శారీరికంగా బలంగా వుండాలి. అదే విధంగా హింసా ప్రవృత్తిని పూర్తిగా వదలుకోని వారిని హింసను ఆచరించడానికి వారికి అనుమతినిస్తూనే వారిని నెమ్మది నెమ్మదిగా అహింసకులుగా మార్చాలి. ఒక క్షత్రియుడు ఇంకొక క్షత్రియునికి అహింసను నేర్పాలి. పశ్చిమ దేశాల నాగరికతకూ మనకూ వున్న భేదమేమంటే పశ్చిమ దేశాలవారు కేవలం స్వభోగ నిరతి మీద ఆధారపడుతున్నారు. మనం స్వనియంత్రణ, ఆత్మ నియంత్రణ మీద ఆధారపడుతున్నాము. మనం ఒక వేళ హింసకు పాల్పడినా అది లోక సంగ్రహం కొరకు విధిలేని పరిస్థితిలో జరగాలి. పశ్చిమ దేశాలు స్వలాభం కొరకు హింసను ఆశ్రయిస్తున్నవి. అదీ స్థితి. పార్లమెంటు చర్చల వంటి వాటిలో నేను పాల్గొనడం కొత్తగా ఏర్పడినది గాదు. అది పాతదే. ఆ సంస్థలను అదుపులో పెట్టడమే నా ప్రయత్నానికి పరమావధి. మాంటెస్క్యూ సంస్కరణల మీద అందుకే నేను వ్యాసం వ్రాశాను. అట్టి ప్రయత్నాలు నా భావాలను ప్రచారం చేయడానికి తోడ్పడగలవని నా విశ్వాసం. దానివలన ప్రయోజనం లేదని తెలుసుకొని ఆ తరువాత అది మానివేశాను.

నేను వ్రాసిన దానిలో నీకు సమాధానం లభించినదనుకొంటాను. మీ దగ్గర అక్కడ ఒకటి రెండు రోజులుండి అన్ని విషయాలనూ మీకు స్పష్టంగా బోధించలేను.

అందువలన నా భావాలను వ్రాసి పంపుతున్నాను. ఇంకా సందేహాలుంటే నీవు నాకు వ్రాయవచ్చును.

నేను నౌగా:వ్‌లో వుంటాను. ఇవాళే అక్కడికి బయలుదేరాలనుకొన్నాను. కాని అది సంభవం కాలేదు.

ఆశీర్వచనాలతో
బాపూ

★ ★ ★

## 10. నరహరి శంభూరావ్ భావే గారికి

అహ్మదాబాదు
7-6-1916

మీ కుమారుడు వినోబా భావే నా దగ్గర వున్నాడు. మీ కుమారుడు ఇంత బాల్యంలోనే ఉత్తమశ్రేణికి చెందిన తపస్వి. ఆ స్థితికి సంవత్సరాల తరబడి కృషి చేసినా నేనింకా చేరుకోలేదు.

ఎమ్.కె. గాంధీ

*(1. వినోబాగారు గాంధీగారిని మొదటిసారి కలిశారు*

*2. వినోబాభావే సర్వోదయ నాయకుడు. తపస్సంపన్నుడు. అపారమైన పాండిత్యం గలవాడు. భూదానోద్యమ స్థాపకుడు.)*

★ ★ ★

## 11. మిష్టర్ మాఫే వైస్‌రాయ్ కార్యదర్శిగారికి

డిస్ట్రిక్ట్ మేజిస్ట్రేటు
మోతిహారి
16.4.1917

తోటల యజమానులను గురించి ఈ జిల్లాలోని రైతులు చేసిన ఆరోపణల నిజానిజాలు తెలుసుకొనుటకు నేనీ జిల్లాకు వచ్చాను. యజమానుల సంఘ కార్యదర్శినీ,

డివిజనల్ కమీషనర్‌గారినీ కలిశాను. వారి సహాయమర్థించాను. ఇద్దరూ సున్నితంగా నా పనిని మానుకొమ్మని నాకు సలహాలిచ్చారు. వారి సలహాను నేను పాటించలేదు. నా పనిని నేను ప్రారంభించాను. జిల్లా వదలి వెళ్ళిపొమ్మని మేజిస్ట్రేటు నాకు నోటీసు పంపించాడు. అందుకు చెప్పిన కారణాలతో నేను ఏకీభవించడంలేదు. అందువలన మేజిస్ట్రేటు గారి ఆదేశాన్ని ఉల్లంఘించక తప్పటం లేదు. అందుకు తగిన శిక్షను అనుభవిస్తానని మేజిస్ట్రేటు గారికి తెలియజేశాను.

జాతికీ, బీదవారికీ సేవజేయడం నా లక్ష్యం. మానవత్వపు విలువలకు సంబంధించిన విషయాలలో సేవ చేయడం నా కర్తవ్యం. నేను దక్షిణాఫ్రికాలో చేసిన కృషి అటువంటిదే. అందుకు నాకు కైజరే హింద్ బంగారు పతకం లభించింది. ఆ పతకాన్ని మీకు వాపసు చేయమని మా వాళ్ళకు తెలియజేశాను. నా ఉద్దేశ్యాన్నీ ఆశయాలనూ శంకించకుండా దానిని తిరిగి వాపసు చేస్తే సహర్షంగా స్వీకరిస్తాను.

నాకు లభించిన సాక్ష్యాన్ని పరిశీలించి చూడగా యజమానులు సివిల్, క్రిమినల్ కోర్టులను తమకనుకూలంగా తిప్పుకొన్నట్లు కన్పిస్తున్నది. అసాంఘిక శక్తులను ప్రోత్సహించి తమ ఆర్థిక లాభాలను పెంచుకొనే ప్రయత్నం చేస్తున్నట్లు కన్పిస్తున్నది. రైతులు భయభ్రాంతులైవున్నారు. వారు యజమానుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడవలసి వచ్చినట్లు కన్పిస్తున్నది. వారి ఆస్తులకు కూడా రక్షణ వున్నట్లు కన్పించడం లేదనీ పోలీసు ఠాణాలు గూడా యజమానుల కనుసన్నల్లో పనిజేస్తున్నవనీ, ఎక్కడ చూచినా యజమానుల ప్రభావమే కన్పిస్తున్నదనీ ఒక రైతు నాకు తెలియజేశాడు. యజమానులు ఇచ్చినదానిని తీసుకోవాలి. ఎదురు ప్రశ్న వేయగూడదని యజమానులు అంటున్నారని అతని అభిప్రాయం. లోతుగా అన్ని విషయాలు తెలుసుకొనవలెనని మేము ఇక్కడికి వచ్చాము. నా పనిని నన్ను చేసుకోనిస్తే నిజాలను నివేదిక రూపంలో అధికారులకు తెలియజేసేవాణ్ణి. స్వతంత్రంగా నిష్పాక్షికంగా విషయపరిశీలన చేయవలసి వున్నదని గౌరవనీయులైన వైస్‌రాయ్‌గారికి విజ్ఞప్తి చేస్తున్నాను. విషయం గంభీరంగా వున్నది. స్థానిక అధికారులు తాము భయంకరమైన గని మీద కూర్చొని వున్నామనీ, నన్ను ఎంక్వయిరీ చేయనివ్వమనీ చెప్పుతున్నారు. నేనిక్కడ వుండడం గూడా వారు

సహించలేకపోతున్నారు. నెమ్మదిగా వారే నిజానిజాల పరిశీలన చేయిస్తారట. అంతా ఎంక్వయిరీ చేసేవారి మీద ఆధారపడి వుంటుంది. అదైనా తొందరగా జరగడం అవసరం. రైతుల అభిప్రాయం అదే. ఈ ఉత్తరాన్ని వైస్‌రాయ్ గారికి చూపించండి. ఇది ఎంతో అవసరమైన విషయంగావడం వలన ఉత్తరం వ్రాస్తున్నాను. ఎన్నో పనుల తొందరలో వున్న వారికి కష్టం కలిగించినందుకు క్షమాపణ తెలియజేయండి.

ఇట్లు
ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 12. డబ్ల్యు. బి. హికాక్ గారికి

బైట్యా
మే 20, 1917

ప్రియమైన హికాక్ గారికి

రైతుల నుండి నాకు లభిస్తున్న అర్జీలను గురించిగానీ, కోఠీ అమాలులూ, కొంతమంది కంపెనీ యజమానులూ రైతులెవ్వరూ నా దగ్గరకు రాకుండా నిరోధిస్తున్న విషయాన్ని గురించిగానీ ఇంతవరకూ మీ దృష్టికి తీసుకొని రాలేదు. కొన్ని అర్జీలను నేను తీసుకొనలేదు. కొన్నింటిని అంగీకరించాను. బెల్వాలూ, ధోక్రాహాలూ చేస్తున్న పని నిజమని విశ్వసిస్తున్నాను. స్నేహపూరిత వాతావరణంలో జరుగుతున్న దర్యాప్తును ఆపివేయవలెనని వారు ప్రయత్నిస్తున్నట్లుగా కనబడుతున్నది. స్నేహపూరిత వాతావరణం సృష్టించాలని నా అభిప్రాయం. వాతావరణం బాగుపడవలెనని నా శక్తివంచన లేకుండా నేను ప్రయత్నిస్తున్నాను. బెల్వాలూ, ధోక్రాహాలకు సంబంధించిన కొన్ని కాగితాలు మీకు పంపుతున్నాను. అవి నిజమే అయితే అధికారులకు మంచి పేరు రాదు. మిస్టర్ హోల్టమ్‌కు వ్రాసిన ఉత్తరం ప్రతిని పంపుతున్నాను. ధోక్రాహాల స్టేట్‌మెంట్లు తీసుకొనక పూర్వం వ్రాసిన ఉత్తరమిది. నిన్న సాయంత్రం 6.30 గంటలకు ఆ స్టేట్‌మెంట్లు తీసుకొన్నాను.

రైతులనుండి పెద్ద మొత్తాలను వసూలు చేస్తూ, ఇప్పుడు ఆ పరిస్థితి మారుతుంటే యజమానులకు కలిగే మనోభావాన్ని నేను అర్థం చేసుకొనగలను. తమ హక్కును రక్షించుకొనుటకు వారు న్యాయపూర్వకమైన మార్గాన్ని అనుసరిస్తే నాకేమీ అభ్యంతరం లేదు. కాని వారు ప్రస్తుతం అనుసరిస్తున్న విధానం న్యాయసంగతమైనది కాదు. నేను గానీ, నా మిత్రులు గానీ ఈ విషయంలో కల్పించుకొనడం వారికి ఇష్టం లేదు. రైతులకు జరుగుతున్న అన్యాయాల ఆపుదల జరిగితేనే గాని మేము ఈ జిల్లానుండి తప్పుకోము. అన్యాయాలను స్వయంగా చూచి కూడా మేమిక్కడి నుండి తప్పుకొంటే భగవంతుని ముందు మేము దోషులం కాగలము. అంతేగాక మమ్మల్ని మేము క్షమించుకోలేము. అది చాలా ముఖ్యమైన విషయం.

యజమానుల యెడల మాకు ద్వేషం గానీ, చెడుతలంపు గానీ లేదని ఎన్నో సార్లు మనవి చేశాము. నన్ను గురించి కాకపోయినా నా మిత్రుల విషయంలో వారు ఇంగ్లీషు వారిని ద్వేషిస్తున్నారనీ, ద్వేషపూరిత వాతావరణంతో ఇంగ్లీషు వారియెడల వారు ఉద్యమం నడుపుతున్నారనీ అనడం - ప్రచారం చేయడం సరిగాదు. అది వారి భావన మాత్రమే. అటువంటి ద్వేషాదులేమైనా వుంటే నేనే ఉద్యమం నుండి విరమిస్తాను. వారిని విరమింపజేస్తాను. అటువంటి దేమీ లేదు. కాని రైతులకు స్వేచ్ఛ, న్యాయము లభించితీరాలి.

ప్రభుత్వం కల్పించుకొని ఆ స్వేచ్ఛను, న్యాయాన్ని కల్పించలేదా? అది సహజమైన మా ప్రశ్న. మా ఆక్రందన. దానికి మా జవాబు ఒక్కటే. మీరు మా సహకారాన్ని అందుకోండి. మా సహకారాన్ని అంగీకరించండి. అంగీకరించకపోతే రైతులకు మీరు స్వేచ్ఛను న్యాయాన్ని కలుగజేయలేరు. ప్రభుత్వ యంత్రాంగం ఎక్కడ చూచినా నెమ్మదిగా పనిజేస్తుంది. అది సహజమే. వ్యతిరేకతా, నిరోధమూ లేకుండా అది పనిజేయవలెనని కోరుతుంది. పని తొందరగా జరగదు. నా వంటి వారు మార్పునూ, న్యాయాన్ని మాత్రమే ఆకాంక్షించేవారు. ప్రభుత్వానికి సహాయం చేయగలరు. వారు అత్యుత్సాహంలో ఏదైనా తప్పు చేయవచ్చును. తెలియనితనం వలన లేక సోమరితనం వలన అటువంటిది జరగవచ్చును. ప్రభుత్వం గూడా తప్పులు

చేయవచ్చును. ఆత్మ విశ్వాసం మితిమీరితే అటువంటిది జరుగుతుంది. అటువంటిది ఎవరివల్లా జరగకూడదు. నేను మీకు సమర్పించిన జరుగుతున్న అన్యాయాలను, తీర్పులను సరిదిద్దడం ఎంతైనా అవసరం. నా ఆధిపత్యంలో నడుస్తున్న స్వయం సేవకులను జూచిగానీ, వారి పనిని జూచిగానీ యజమానులు (ప్లాంటర్స్) భయపడవలసిన అవసరం లేదు. విద్య, గ్రామ పారిశుద్ధ్యము, ఆరోగ్యము వంటి పనులు వారు చేస్తారు.

తర్కబద్ధంగా పెద్ద ఉత్తరం వ్రాసినందుకు క్షమించండి. నా అభిప్రాయాలనూ, ఇక్కడి స్థితినీ స్పష్టంగా తెలియజేయడానికి ఇంత పెద్ద ఉత్తరం వ్రాయవలసి వచ్చింది. న్యాయపరమైన సౌకర్యాన్ని కలిగించమని కోరడం మాత్రమే నా ఉద్దేశ్యం. పరిపాలనాపరమైన మీ పలుకుబడిని ఉపయోగించి కోఠీలకూ మాకూ మధ్య సుహృద్భావ వాతావరణాన్ని సృష్టించడానికి ప్రయత్నించండి.

కోఠీలు దీనికి కారణమని నేననను. రైతుల మనస్సుల్లో అట్టి సందేహం ఏర్పడింది. నేను చాలామంది రైతులతో మాట్లాడాను. తాము కారణంగాదనీ, దీనికి తాము బాధ్యులం కామనీ వారంటున్నారు. హింసతో పని జరగదనీ, దానివలన కాలయాపన జరుగుతుందనీ, న్యాయం జరగడంలో ఆలస్యం అవుతుందనీ వారికి నచ్చ జెపుతున్నాను. మా మిషన్ హింసకు సంబంధించినది గాదని గూడా వారికి చెప్పాము. కోఠీలకు కూడా నచ్చచెప్పి వారు మాతో మంచి సంబంధం పెట్టుకొనేటట్లుగా చేయకపోతే వాతావరణం చక్కబడదు. ఒకరిపై ఇంకొకరు నిందారోపణ చేయడంతోనే కాలం గడచిపోతుంది.

యజమానుల ప్రాణాలకు ముప్పున్నదని కూడా ప్రచారం సాగుతున్నది. అది అంత పట్టించుకొనవలసింది కాదు. అటువంటి పనులకు మేము వ్యతిరేకులం. మేము ఎన్ని కష్టాలనైనా సహిస్తామే గాని ఇతరులకు కష్టం కలిగించమని మనవి చేస్తున్నాను. విషయాలన్నీ రైతులకు బోధిస్తున్నాము.

రైతులు గూడా చాలా భయభ్రాంతులై వున్నారు. అందుకు కారణాలు కూడా కన్పిస్తున్నవి. అది మంచిది కాదు. రైతులకు ఉపశమనం కలగాలి.

అన్ని విషయాలనూ దృష్టిలో బెట్టుకొని న్యాయం చేయడానికి ప్రయత్నించండి. మిష్టర్ లూయిస్‌కు గూడా ఉత్తరం ప్రతిని పంపుతున్నాను.

★ ★ ★

## 13. సత్యాగ్రహాన్ని గురించి శంకర్‌లాల్‌కు

సెప్టెంబరు 12, 1917

భాయీ శ్రీ శంకర్‌లాల్,

సత్యాగ్రహాన్ని గురించి నా అభిప్రాయాలు తెలుసుకొనవలెనని కోరారు. సంక్షేపంగా అవి ఇవి :

ఇంగ్లీషులోని పాసివ్ రెసిస్టెన్సు అనే శబ్దం సత్యాగ్రహం అనే శబ్దానికున్న అర్థాన్ని వెలువరించలేదు. సత్యాగ్రహం ఆత్మశక్తికి సంబంధించినది. అది ఆయుధశక్తికి వ్యతిరేకం. అది నైతికమైన ఆయుధం. నైతికమార్గానుయాయులు మాత్రమే దానిని తెలివిగా ఉపయోగించగలరు. ప్రహ్లాదుడు, మీరాబాయి వంటివారు సత్యాగ్రహులు. మొరాకో యుద్ధ సందర్భంలో అరబ్బులు ఫ్రెంచి ఫిరంగులను ఎదుర్కొన్నారు. అరబ్బులు కేవలం తమ మతం కొరకు పోరాడారు. అల్లా అని అరుస్తూ వెనకా ముందూ ఆలోచించకుండా అరబ్బులు ఫ్రెంచి ఫిరంగుల ముందుకు దూకారు. అక్కడ ఎదురు యుద్ధం ప్రసక్తే రాలేదు. ఫ్రెంచి సైనికులు ఆ దృశ్యం చూసి అరబ్బుల మీద ఫిరంగులు ఉపయోగించడానికి తిరస్కరించారు. టోపీలు తీసివేసి చేతబట్టుకొని ధైర్యవంతులై ప్రాణత్యాగం చేస్తున్న ఆ అరబ్బులను ఆలింగనం చేసుకున్నారు. అందుకు ముందుకు పరుగెత్తారు. ఇది సత్యాగ్రహానికి ఉదాహరణ. అరబ్బులు సత్యాగ్రహులు కారు. వారు మృత్యువును ధైర్యంగా ఎదుర్కొనుటకు సిద్ధపడ్డారు. వారిలో బలమైన అంతః ప్రేరణ ఉన్నది. సత్యాగ్రహి ఎవ్వరినీ ద్వేషించడు. ఎవరికీ చెడును ఆశించడు. క్రోధావేశంలో తన ప్రాణాలు వదులుతాడు కాని శత్రువుకు లొంగిపోవడం అంగీకరించడు. ఎట్టి కష్టాలనైనా సహించే శక్తి అతనిలో వుంటుంది.

అతడు ధైర్యం వహించి ప్రకృతి విడంబనలను సహించగలడు. ఇమామ్ హుసేన్, హుసేన్ ఇద్దరూ బాలురు. తమకు అన్యాయం జరుగుతున్నదని వారు భావించారు, విశ్వసించారు. లొంగిపొమ్మని శత్రువులంటే తిరస్కరించారు. తిరస్కరించడం మృత్యువు పాలపడడమేనని వారికి తెలుసును. లొంగిపోవడం వల్ల తమను తాము తన మతాన్ని అవమానపరచినట్లు భావించారు. అందువలన అన్యాయానికి తలవొంచక మరణాన్ని వరించారు. యుద్ధంలో వారి తలలు నరికివేయబడ్డాయి. ఇస్లాం మతం కత్తిబలంతో గాక ఆత్మత్యాగంతో బలిదానంతో గొప్పతనాన్ని సాధించింది. సత్యాగ్రహి ఇతరుల తలలను నరికివేయక తన పశ్చాత్తాపంతో గడుపుతాడు. సత్యాగ్రహం అహింసా విధానాన్ని అనుసరిస్తుంది. అది అహింసా మార్గానుసారి. అందువల్ల అది అన్నిచోట్లా అన్ని సమయాలలోనూ సన్మార్గాన్నే అనుసరిస్తుంది. ఆయుధ ప్రయోగాన్ని నిజానికి అని మతాలూ వ్యతిరేకిస్తున్నవి. నిందిస్తున్నవి. సత్యాగ్రహం ఒక తపస్సు. అది తనకు తాను ఎట్టి కష్టాలనైనా ఎదుర్కొంటుంది.

ఆయుధ ప్రయోగాన్ని బోధించే వారు కూడా దానికి కొన్ని పరిధులను నిర్ణయిస్తున్నారు. సత్యాగ్రహానికి అట్టి పరిధులు లేవు.

సత్యాగ్రహాన్ని గురించి ఆలోచిస్తున్నప్పుడు దాని న్యాయబద్ధత ప్రశ్న సంగతం కాదు. అసంగతం. సత్యాగ్రహియే అవి నిర్ణయించుకొంటారు. ఘటన జరిగిన తరువాత పరిశీలకులు అది నిర్ణయించవచ్చు. లోకభీతి సత్యాగ్రహిని నిరుత్సాహ పరచలేదు. సత్యాగ్రహం ప్రారంభించాలా వద్దా అనేది గణిత శాస్త్రం ప్రకారం నిర్ణయించేది కాదు. జయాపజయాలను బేరీజు వేసుకొని విజయం లభిస్తుందని విశ్వాసం కలిగినపుడే పని ప్రారంభించేవాడు తెలివిగలిగిన రాజకీయవేత్త లేక బుద్ధిజీవి కాగలుగుతారు. కాని సత్యాగ్రహి మాత్రం కాదు. సత్యాగ్రహి పరిస్థితికి స్పందించి రంగంలోకి దిగుతాడు.

*(శ్రీ శంకర్‌లాల్ బ్యాంకరు ప్రసిద్ధి చెందిన నిర్మాణ కార్యకర్త. గాంధీ సిద్ధాంతాల కనుగుణ్యంగా పనిచేసిన కార్మిక నాయకుడు.)*

సత్యాగ్రహమూ, ఆయుధాలూ రెండూ చాలాకాలం నుండి ప్రయోగంలో వున్నవి. పురాణాలలో వాటి వర్ణన కన్పిస్తున్నది. వాటిని దైవీ సంపద ఆసురీ సంపద అంటున్నాము. ఆ రెండింటిలో దైవీసంపద బలమైనదని పురాతన కాలం నుండి మనమెరుగుదుము. ఈనాటికీ మన విశ్వాసమదే. యూరపు ఆసురీ సంపదను ప్రతిబింబిస్తున్నది.

పిరికితనం కంటే ఈ రెండింటిలో ఏదైనా అనుసరణీయమే. పిరికితనం కంటే అది మేలు. అది లేకుండా స్వరాజ్య ప్రాప్తి జనజాగృతి సంభవం గాదు. ఒక వేళ లభించినా అది నిజమైన స్వరాజ్యం కాదు. బలమూ పురుషకారమూ లేనిది జన జాగృతి సంభవం కాదు. సత్యాగ్రహశక్తిని ప్రభుత్వమూ మనమందరమూ కలసి బలపరచకపోతే హింసామార్గం ప్రబలం కాక తప్పదు. హింసా కృత్యాలు ఏ భూమి మీదనైనా పెరిగే అడవిమొక్కలలాంటివి. సత్యాగ్రహపు పంట పండాలంటే పరిపక్వత గలిగిన మనఃస్థితి అవసరం. అది లేకపోతే మంచి విత్తనాలు వృథా కాగలవు. అవి నశించి అడవిమొక్కలు చిందరవందరగా అంతటా పెరగగలవు. తపశ్చర్య ద్వారా అడవి మొక్కలను పెకలించి మంచి విత్తనాలు పెరిగే అవకాశం మనం కల్పించాలి. సత్యాగ్రహం ద్వారా నిరాశా నిస్పృహలకు లోనై క్రోధావిష్టులైన వారిని మనవైపుకు తిప్పుకొని ప్రభుత్వ దమననీతిని ఎదుర్కొనేటట్లు చేసి కష్టసహిష్ణుతను వారికి నేర్పించి సత్యాగ్రహ సిద్ధాంతాలను మనం ప్రచారం చేయాలి. ఇది శాసకులకూ శాసితులకూ హితకరం. సత్యాగ్రహి ప్రభుత్వాన్ని గానీ ఇంకా ఎవ్వరినీ గానీ బాధపెట్టదలచడు. చర్చించనిది ఏదీ అతడు ప్రారంభించడు. స్వదేశీని తన కర్తవ్యంగా భావిస్తాడు. అతడు భగవంతుడు ఒక్కడికి మాత్రమే భయపడతాడు. అతణ్ణి ఇతర ఏ శక్తీ భయపెట్టలేదు. శిక్షకు వెరచి అతడెప్పుడూ తన కర్తవ్యాన్ని మరచిపోడు.

విద్యావంతురాలైన అనిబిసెంటునూ, ఆమె అనుయాయులనూ సత్యాగ్రహం ద్వారా విడిపించడం మన పరమ కర్తవ్యం. వారి పనులతో మనం ఏకీభవిస్తున్నామా లేదా. అనేది ఇంకొక విషయం. వారి పనులతో నేను ఏకీభవించడం లేదు. కాని ప్రభుత్వం వారి యెడల అనుసరిస్తున్న విధానం న్యాయసమ్మతం కాని ప్రభుత్వం పెద్ద

తప్పు చేస్తున్నది. కాని ప్రభుత్వం దానిని తప్పుగా భావించడం లేదు. ప్రభుత్వం తాను న్యాయం చేస్తున్నానని అనుకొనవచ్చును. దెబ్బతిన్న తమ భావాలను ప్రజలు ఎలా వెల్లడించాలి? బాధ సహించగలిగినదైతే అర్జీలు మొదలైనవి పనికివస్తవి. అది సహించరానిదైనపుడు సత్యాగ్రహం తప్ప వేరు మార్గం వుండదు. సర్వశక్తులూ వినియోగించి సత్యాగ్రహం ద్వారా అనిబిసెంటు గారిని విడిపించుకోవాలి. ప్రజాభిప్రాయాన్ని శక్తియుతంగా వెలువరించే మార్గం అదొక్కటే. ఒక సమ్రాటు శక్తిని కూడా ఎదుర్కొనే ఆత్మత్యాగమే అజేయమైన ఆత్మ విశ్వాసము. మాంటేగ్యూ గారి రాకను దృష్టిలో పెట్టుకొని ప్రజలు తమ భావాలను అణచుకొనవచ్చును. అతని న్యాయ దృష్టి మీద విశ్వాసం కావచ్చును. మాంటెగ్యూ రాక పూర్వం ప్రభుత్వం ఆమెనూ ఆమె అనుచరులనూ వదలకపోతే సత్యాగ్రహం తప్పదు. మేము ప్రభుత్వాన్ని రెచ్చగొట్టదలచుకొనలేదు. వారికి ఇబ్బందులు కలిగించదలచుకొనలేదు. సత్యాగ్రహం ద్వారా దెబ్బతిన్న మా భావాలను ప్రభుత్వానికి మేము తెలియజేయక తప్పదు.

★ ★ ★

## 14. వినోబా భావే గారికి

సబర్మతి
10.2.1918

ఏ మాటలతో మిమ్మల్ని ప్రశంసించాలో అర్థం గావడంలేదు. మీ ప్రేమ, మీ శీలసంపద మీ ఆత్మ పరీక్షణ నన్ను ఆనందపరుస్తున్నాయి. మీ శక్తిని నేను అంచనా వేయలేను. మీ భావాల్ని గౌరవించి మీ పితృస్థానాన్ని అంగీకరిస్తున్నాను. నా జీవిత కాంక్షను మీరు పూర్తి చేస్తున్నారు. తన తండ్రిని కుమారుడు గుణగణాలలో మించినపుడే ఆ తండ్రి తండ్రి అవుతాడు. తన తండ్రి చేసిన దానిని అభివృద్ధిపరిచినపుడే కుమారుడు నిజమైన కుమారుడవుతాడు. తండ్రి సత్యవంతుడై, దృఢ నిశ్చయుడైతే కుమారుడు అంతకంటె ఎక్కువ కావాలి. నాకు ఋణపడిలేవు. అందువలన ప్రేమ కానుకగా మీరు నాకు ప్రసాదించిన దానిని స్వీకరిస్తున్నాను. అందుకు తగినవాడుగా నన్ను నేను ఋజువు చేసుకొంటాను. నేను మరొక హిరణ్యకశ్యపుడనయితే నన్ను వ్యతిరేకించవలెను. ప్రహ్లాదుడు మనయందున్నాడు.

ఆశ్రమం బయట వున్నా అన్ని నియమాలను తు.చ తప్పకుండా పాటిస్తున్నానని అంటున్నావు. అది నిజమే. నాకు అటువంటి అవిశ్వాసం లేదు. భగవంతుడు మీకు చిరాయువును ప్రసాదించు గాక. భారత దేశ పునర్నిర్మాణానికి మీ శక్తులు ఉపయోగపడుగాక.

మీ ఆహారంలో మార్పులేమీ అవసరం లేదు. పాలు వదలవద్దు. అవసరమైతే పాల పరిమాణాన్ని పెంచవలెను.

రైల్వేలను గురించి సత్యాగ్రహం అవసరం లేదు. ప్రచారం చేయడానికి తెలివైన కార్యకర్తలు కావాలి. ఖేడా జిల్లాలో సత్యాగ్రహం అవసరం గావచ్చును. నేను ఈ రోజుల్లో ......... లో వున్నాను. రెండు మూడు రోజుల్లో ఢిల్లీ వదలుతాను.

ఎక్కువ మాటలు సమక్షంలో. అందరూ మీ రాకకు ఎదురుచూస్తున్నారు.

ఆశీర్వచనాలతో

బాపూ

★ ★ ★

*(ఉత్తరం పూర్తి చేసిన తరువాత మహదేవదేశాయి మాటల్లో - గాంధీజీ అన్నమాటలు గొప్ప వ్యక్తి. మహారాష్ట్రీయులతో, మద్రాసు వారితో వ్యవహరించడం నాకు సంతోషకరంగా ఉంటుంది. నేను అదృష్టవంతుణ్ణి. మహారాష్ట్రం వారు నన్ను ఎప్పుడూ నిరాశపరచలేదు. వారిలో వినోబా అత్యుత్తముడు.)*

## 15. సి. ఎఫ్ ఆండ్రూస్ గారికి

నడియాడ్

జులై 6, 1918

ప్రియమైన చార్లీ,

మీ ఉత్తరాలు అందినవి. అవి నాకు పాక్షికమైన ఓదార్పును కలిగించినవి. మీరు చెప్పినదానికంటే నా సమస్యలు ఇంకా లోతైనవి. మీ ప్రశ్నలకు నేను

సమాధానం తెలియజేయగలను. వ్రాయడానికి ప్రయత్నిస్తున్నాను. అవి నా మనస్సును వేధిస్తున్న ప్రశ్నలు. కొన్ని ప్రశ్నలు సమస్యలు యాంత్రికంగా వున్నవి. వాటిని గురించి గంభీరంగా ఆలోచించడం వలన నా ఆరోగ్యం కూడా కొంత చెడుతున్నది. ఎవరితోనూ మాట్లాడవలెనని నాకు కోరికగా లేదు. నా భావాలను గురించి ఎవ్వరికీ వ్రాయవలెనని కూడా లేదు. చెప్పి ఇతరుల చేత వ్రాయిస్తున్నాను. నా సమస్యల లోతులకు ఇంకా నేను చేరలేదు. వాటిని పరిష్కరించే అవకాశం ఇంకా ఉత్పన్నం కాలేదు. సమస్యల రహస్యాన్ని ఛేదించి పరిష్కారాన్ని కనుగొనాలి. అందుకు సర్వ ప్రయత్నాలూ చేస్తాను.

భారతీయులు ఒక జాతిగా రక్తదాహాన్ని సమర్థించరని మీరంటున్నారు. వారు మానవత్వపు విలువలవైపు ఎల్లప్పుడూ దృష్టి కలిగి వుంటారని మీరంటున్నారు. చారిత్రాత్మకంగా అది నిజమా? మహాభారతంలో గానీ రామాయణంలో గానీ ఆ లక్షణాలు కన్పించడం లేదు. తులసీదాసు ఆధ్యాత్మికంగా వాల్మీకి కంటె గూడా గొప్పవాడు. తులసీదాసులో కూడా అవి లేవు. అవతారాలు రక్తదాహం కలవనీ, పగ తీర్చుకునే మనస్తత్వం గలవనీ, శత్రువుల యెడల ఏ మాత్రమూ దయలేనివనీ వర్ణనలను బట్టి తెలుస్తున్నది. కొందరు శత్రువులను జయించడానికి వారు చలాకీ పనులు చేసినట్లు కూడా కన్పిస్తున్నది. యుద్ధాలు ఈనాటికంటె న్యాయబద్ధంగా వున్నట్లుగా కూడా బోధపడుతున్నది. తులసీదాసు రాముణ్ణి ఉత్తమ పురుషునిగా వర్ణించ్చాడు. ఆయన కూడా రాముడు శత్రు వినాశకుడనీ, అరి వీర భయంకరుడనీ వర్ణించ్చాడు. మహమ్మదీయుల కాలాన్ని చూద్దాము. మహమ్మదీయుల వలెనే హిందువులు గూడా ఆనాడు యుద్ధ ప్రియులే. అయితే వారు సంఘటితులుగా లేకపోవడం వలన అంతర్గత కలహాల వలన బలహీనపడ్డారు. మనువు కూడా జాతికి మీరు ఆపాదించిన గుణాల్ని గురించి ఉపదేశించలేదు. విశ్వవ్యాప్తంగా సహనానికి పేరుబడిన బుద్ధమతం గూడా వృద్ధి చెందలేదు. శంకరాచార్యులవారు భారతదేశం నుండి బుద్ధమతాన్ని బయటికి వెళ్లగొట్టడానికి చెప్పరాని క్రౌర్యాన్ని చూపించారు. చివరికి ఆయన విజయం సాధించారు. యూరోపియన్ల వలె జైనులు గూడా రక్తదాహం చూపించినవారే. అయితే వ్యక్తిగతంగా భారతీయులు అహింస విషయంలో ముందున్నారు. అహింసా సిద్ధాంతాన్ని వ్యక్తిగత జీవనంలో వ్యాప్తికి తెచ్చారు. అయినా జనసామాన్యంలో అది బాగా పాదుకొనలేదు.

ఇది తెలియకుండానే జాతిలో ఏర్పడిన ప్రవృత్తి అనీ దాన్ని ఎప్పుడైనా మేల్కొలిపి చైతన్యవంతం చేయవచ్చుననీ మీరు అభిప్రాయపడుతున్నారు. అది నిజమే. కాని ఆ ప్రవృత్తి జాగృతమవుతున్నట్లు నాకు కన్పించడం లేదు. సహాయ నిరాకరణ, సత్యాగ్రహం బలహీనుల ఆయుధమని చాలామంది అంటున్నారు. అందుకు నాకు నవ్వు వస్తున్నది. నవ్వి వూరుకొంటున్నాను. బాగా ఆలోచిస్తే వారు సత్యమార్గంలో నేను తప్పు మార్గంలో ఆలోచిస్తున్నానా అని సందేహం కలుగుతున్నది. ఏమైనా ఇది నాకూ నా అనుచరులకూ సంబంధించినంతవరకు బలవంతుల ఆయుధమే అనిపిస్తున్నది. ఏమైనా సామాన్య జనులకు ఇది సత్యాగ్రహం కాదు. కేవలం సహాయ నిరాకరణ మాత్రమే. ఎందువల్లనంటే మీరు బలహీనులు గనుకనే హింసామార్గాన్ని అనుసరించడం లేదు. బలశాలులైతే హింసను అనుసరించేవారే. హింసామార్గమే పౌరుషవంతమైన మార్గమని వారి అభిప్రాయం. చంపారన్, ఖేడాలలో అదే జరిగింది. వారి మార్గమేమిటో వారికే తెలిసినట్లు లేదు. గుండ్ల వర్షాన్ని వారు ఎదుర్కొన్నారు. ఉరికంబాలను సంతోషంగా స్వీకరించారు. ఒకవైపు పన్ను చెల్లించమని అంటున్నారు. ఇంకొకవైపు నా మార్గాన్ని అనుసరించి నాతోబాటు వుండనంటున్నారు. కనుక నాకు తోస్తున్నదేమిటంటే వారికి సరైన శిక్షణ ఇప్పించాలి. అప్పుడు గాని వారు భయం నుండి బయటపడరు. తమ రక్షణను వారు తాము చేసుకోగలగాలి. బలశాలియై, పరిణామాలను బాగా అర్థం చేసుకొన్నవాడు గాని అహింసాపరమార్థాన్ని బాగా అర్థం చేసుకోలేడు. జీర్ణం చేసుకోలేడు.

నైతిక శక్తి ఆధారంగానే భారతదేశం ఉన్నత స్థానాన్ని ఆక్రమించగలదు. అప్పుడు నలు దిశలనుండీ తూర్పు పడమర, దక్షిణం ఉత్తర దిశలనుండి వచ్చిన సేనలను ఎదుర్కొన గలదు. అయితే ఆ నైతిక శక్తిని పెంచుకొనేదెలా? అదీ సమస్య. నైతిక సిద్ధాంతం తాలూకు మొదటి పాఠాన్ని నేర్చుకొనడానికి శారీరక బలం అవసరమా? ఇలాంటి ప్రశ్నలతో వేలకొలది మంది విశ్వనాయకుణ్ణి ఉపాలంభన చేస్తుంటారు.

నేను పరివర్తనం లేని బ్రహ్మను. పంచభూతాల కలయికను కాను. నేను ప్రతిరోజూ ఉదయం నా హృదయ గర్భ గుడిలోని శక్తి స్వరూపుడైన బ్రహ్మను ఆరాధిస్తుంటాను. ఎవరి కరుణా కటాక్షం వలన వారికి ఆరాధనాశక్తి ప్రాప్తిస్తున్నదో, ఎవరిని వేదాలు నేతినేతి మంత్రంతో వర్ణిస్తున్నదో ఆ బ్రహ్మను నేను.

ఉపాలంభన చేస్తున్నామని ఎందుకంటున్నానంటే ఆ మంత్రాన్ని ఉచ్చరించి మనం చిలుక పలుకులు పలుకుతున్నాము. దాని విశేషాన్ని తెలుసుకొనడం లేదు. ఆ మంత్రంలోని పరమార్థాన్ని తనలో తాను అర్థం చేసుకొంటే పెద్ద పెద్ద సైన్యాన్ని గూడా భారతదేశపు హద్దుల నుండి పారద్రోలగలము. కాని ప్రస్తుతం అది మనలో లేదు. నిర్భయత్వం, స్వేచ్ఛా వాతావరణం ఏర్పడితేనే గాని అది మనకు లభించదు. ఆ వాతావరణాన్ని సృష్టించడమెలా? జనానీకం హింసనుంచి అది మనుష్య గతం గానీ జంతుగతం గానీ తమను తాము రక్షించుకొనగలమని భావిస్తేనే గాని వాతావరణ సృష్టి జరగదు. ఇప్పుడు నేను నా ఇబ్బందిని తెలియజేయగలను. నేను మోక్షాన్ని గురించి ఒక బాలునికి బోధించదలచుకొని అతనికి పూర్ణ వికాసాన్ని కలిగించాలి. తన శరీరాన్ని గురించి, అది తెలిసిన తరువాత తన చుట్టుప్రక్కల నున్న ప్రపంచాన్ని గురించీ అతనికి తెలిసేటట్లు చేయాలి. ఈ శరీరం నాకు స్వలాభం కొరకు గాక, దానికి స్వేచ్ఛ ప్రసాదించడానికి లభించిందని అర్థం చేసుకొనేటట్లు చేయాలి. ఆ తరువాత కూడా అహింసా సిద్ధాంతాన్ని అతనికి బోధించడానికి వేచి చూడాలి. శారీరకంగా అతడు బలిష్టుడై, పవిత్రప్రేమ భావం పెంపొందించుకొన్న దాకా వేచి వుండాలి. ఆ తరువాత ఆ భావాన్ని వ్యావహారికంగా అమలు చేయడంలో నాకు మళ్లీ సమస్య ఏర్పడుతుంది. శక్తివంతమైన బలిష్ఠమైన శరీరమంటే ఏమిటి? భారతదేశం శస్త్రాస్త్రాల ప్రయోగాన్ని ఎంతకాలం వరకు నేర్పించాలి. ప్రతి వ్యక్తీ నేర్చుకోవాలా లేక శస్త్రాలను ధరించకుండానే పరిసరాలనుంచి అవసరమైన వ్యక్తిగత ధైర్యాన్ని సంపాదించుకొంటే సరిపోతుందా? రెండో మార్గం మంచిదని నా అభిప్రాయం. నేను సేనలో చేరేవారికి చెప్పదలచుకొన్న దేమిటంటే నీవు రక్తదాహంతో సేనలో చేరడం లేదు. మృత్యుభయం నుండి విముక్తుడవు గావడానికే చేరుతున్నావు అని. సరే హెన్రీ వానె దృష్టితో గూడా దీనిని పరిశీలించండి. మోర్లీ రికలెక్షన్స్ పుస్తకం వాల్యూం 2 నుండి

"ప్రపంచ జాతులలో మృత్యువుకు గొప్ప స్థానమున్నది.... సాహసోపేతమూ, ఉదారమూ నైన మనస్సు జీవితానికి సంబంధించిన కొన్నింటికి ప్రాధాన్యత నివ్వాలి. వాటిని గురించి సందేహించగూడదు. మృత్యువుకు భయపడగూడదు.

నా వ్యక్తిగత జీవితంలో నిజమైన స్వాతంత్ర్యం కావాలంటే ఈ రాజకీయ పోరాటం తప్పనిసరి. మేంటగ్యూ అన్నట్లు "నీవు దేశ రాజకీయాల్లో పాలుపంచుకోవడం చూచి నేను ఆశ్చర్యపోయాను. నేను ఒక్క క్షణం కూడా ఆలోచించకుండా "స్వేచ్ఛలేనపుడు నేను నా ధార్మిక, సామాజిక, కార్యక్రమాల్ని నిర్వహించలేను కనుక ఇది నాకు తప్పనిసరి" అని జవాబు చెప్పాను. నా జీవిత పర్యంతం యీ జవాబు నాకు అన్వయిస్తుందనే నా విశ్వాసం.

యావత్ ప్రపంచంలో గొప్ప నాగరికతల విధాన విశేషాల్లో మృత్యువుకు అత్యున్నత స్థానం లభించింది....... జీవితానికి ముందుగానే కొన్నింటిని కోరుకోవడం ఒక సాహసిక లేదా దయార్ద్ర హృదయం కల వ్యక్తి జీవితంలో ఒక అనివార్య భాగం. అటువంటి వ్యక్తి జీవితంలో అనుమానం కాని మృత్యువు అంటే భయం కాని ఉండరాదు. వాస్తవమైన సహజమైన జీవన విధానం నేర్చుకోవడం, అలవరచు కోవడంలోనే శ్రేష్ఠమైన మృత్యువు ఒడిలో అలవోకగా ఒదిగిపోయే నైపుణ్యం సంపాదించాల్సి ఉంటుంది. ఇదే నిజానికి జీవిత లక్ష్యం కావాలి. ఎవరైతే ప్రశాంతంగా మృత్యువును కౌగిలించుకోలేరో వారు జీవితాన్ని సక్రమంగా జీవించని వారి లెక్కలోకి వస్తారు. మృత్యువు గురించి పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించడం అంటే స్వేచ్ఛను గురించి సాకల్యంగా అర్థం చేసుకోవడమే, నిజమైన స్వాతంత్ర్యాన్ని అనుభవించడమే, దేనికీ భయపడకపోవడమే, సంపూర్ణ జీవితం జీవించడమే తృప్తిగా ప్రశాంతంగా జీవించడమే ...... వరంగా రూపొందాల్సిన జీవితం భారంగా పరిణమించడం కంటె మృత్యువుకు వెంటనే స్వాగతం పలకడమే మేలు. మంచికన్న చెడుపాలు పెరిగినపుడు మృత్యువే మేలు.

"నిర్ధారించిన సమయం ఆసన్నమైనపుడు టవర్‌హిల్ మీద వేన్ రథం అతని నిర్ణయాత్మకమైన పలుకుల్లాగానే ఎంతో మహిమాన్వితంగా సాకారం చెందింది." మార్లే భాష్యం యోధుల్ని ఎంపిక చేసే సందర్భంలో చేసిన ప్రతి ప్రసంగంలో యోధుని ఈ ముఖ్యమైన కర్తవ్యాన్ని బోధించని సందర్భం ఒక్కటి గూడా లేదు. నేను ఇంతవరకు ఎన్నడూ "పదండి , జర్మన్లను చంపుదాం" అనలేదు. నేను ఎప్పుడూ ఎంతో ఆత్మ

సంయమనంతో "పదండి వెళ్లి మన భారత దేశం కోసం, మనం బ్రిటిష్ సామ్రాజ్యం కోసం ప్రాణాలర్పిద్దాము" అని మాత్రమే అంటూ వచ్చాను. నా పిలుపుకు బ్రహ్మాండమైన స్పందన లభించి మనందరం ఫ్రాన్సుకు వెళ్లి జర్మన్లకు వ్యతిరేకంగా పరిస్థితుల్ని మార్చగల్గితే, ఆ సందర్భంలో భారతదేశం చెప్పేది వినే పరిస్థితి వచ్చినపుడు శాశ్వత శాంతికోసం మనం మన పథకాన్ని ఏకపక్షంగా ప్రకటించే అవకాశం రావాలనే కోరాను. భయం అంటే తెలియని వీరుల్ని నేను సమాయత్తం చేయగలిగితే, కందకాల్లో దాగిన వీరులు తమ తుపాకుల్ని నేలమీద పెట్టేసి, ధైర్యం ఉంటే నన్ను నాతోటి వీరుల్ని కాల్చమని కోరాలనీ, అప్పుడు జర్మన్ల హృదయాలు కూడా ద్రవిస్తాయని నేను ఘంటాపథంగా చెప్పదలచుకొన్నాను. దీన్ని నేను పరమ దుర్మార్గమని చెప్పడానికి ససేమిరా ఒప్పుకోను. ఏతావాతా చెప్పదలచుకొన్నది ఏమిటి? యుద్ధమనేది అనివార్య పరిస్థితుల్లో శరీరం లాగానే తప్పని ఒక దుశ్చర్య, ఒక శాపము. లక్ష్యం మంచిది అయినపుడు అటువంటి పరిస్థితిని కూడా మానవాళి శ్రేయస్సుకు అనుకూలంగా మరల్చవచ్చును. అటువంటి పరిస్థితుల్లో అహింసావాది నిమ్మకునీరెక్కినట్లు చూస్తూ ఊరుకోకుండా క్రియాత్మకంగా పాలుపంచుకోవడమో లేదా వ్యతిరేకించడమో చేయాలి.

నేను రాజకీయ చదరంగపుటెత్తుల్లో పూర్తిగా మునిగిపోయినట్లు భావించాల్సిన భయం ఎంతమాత్రం లేదు. నాకు అది బొత్తిగా గిట్టదు, ప్రస్తుతం అటువంటి సందర్భం లేదు, దక్షిణ ఆఫ్రికాలో కూడా ఎప్పుడూ జరగలేదు. దానికి ఒక ఉత్తరం గాక ఒక వ్యాసం లాంటిదాన్ని మీమీద రుద్దుతున్నాను. నా మనస్సులో ఏమేమి ఊహలు పనిచేస్తున్నవో తెలియడానికి ఇది అవసరమైంది. ఇక మీరు మీ తీర్పును చెప్పండి. తప్పని తోచిన చోట నిర్దాక్షిణ్యంగా విమర్శించండి.

మీ ఆరోగ్యం బాగా వున్నదని భావిస్తాను. మీ రాకను కాంక్షిస్తూ

ఇట్లు

మోహన్

★ ★ ★

## 16. సి.ఎఫ్. ఆండ్రూస్ గారికి

నడియాడ్
జులై 29, 1918

ప్రియమైన చార్లీ,

ఓడిన దేశం నుండి వచ్చిన ఒక మహా వ్యక్తి సందేశాన్ని జపాను వారు వినుటకు ఉత్సాహం చూపలేదు. దాని అంతరార్థాన్ని నేను బాగా బోధపరచుకొన్నాను. యుద్ధం మనతో ఎప్పుడూ వుంటూనే వున్నది. మానవ స్వభావం మారడం అంత తేలికగాదనుకొంటాను. అది సంభవం గాదేమో. మోక్షమూ అహింసా రెండూ వ్యక్తిగతంగా సాధించవలసినవి. అహింసను పూర్తిగా అనుసరించడం, సంపద, భూములు, పిల్లలూ కలిగి వుండడం రెండింటికీ ఒకదానికొకటి పొసగదనుకొంటాను. భార్యాపిల్లల్ని రక్షించడం కొరకు ఒక దుష్టుణ్ణి శిక్షించడం అహింసయే కాని అతణ్ణి శిక్షించక అతని వలన బాధలు పడడం అహింస అవుతుంది. మనం ఒకరితో ఒకరు కలహించుకొనే పిరికివాళ్ళం. ఈస్టిండియా కంపెనీ ప్రసాదించిన వెండికి లోబడి ఆత్మలను అమ్ముకొన్నవాళ్ళం. ఇప్పటికీ మనం అదే స్థితిలో ఉన్నాము. మనలో అహింసా ప్రవృత్తి లేదు. మనలో వ్యక్తిగతంగా ధైర్యశాలురు కొందరుండవచ్చును. ఇవన్నీ ఆలోచిస్తే జపాను వారి చర్య సక్రమమైనదేమో ననిపిస్తున్నది. మన పూర్వులు ఏమి చేశారో నాకు బాగా తెలియదు. వారు కష్టాలను బలహీనత వలన గాక బలంతోనే ఎన్నుకొన్నారు. ఋషులు వారి మత క్రియలను క్షత్రియులు రక్షించవలెనని కోరుకొన్నారు. రాముడు విశ్వామిత్రుణ్ణి రాక్షసుల బారినుండి రక్షించాడు. విశ్వామిత్రునిక తపోభంగం కలగకుండా చేశారు. తరువాత వదలివేశారు. అది అంతటితో ఆగిపోయింది. ఆ క్రియలను ఎవ్వరూ వారించలేదు. అసహజమైన మృత్యుభయం నిజానికి మనదేశాన్ని నాశనం చేస్తున్నది. ప్రస్తుతం నేను హిందువులను గురించి ఆలోచిస్తున్నాను. మరి మహమ్మదీయులో? వారిలోనూ ఆత్మత్యాగం చేసినవారు అనేకులున్నారు.

నా మనోభావాలను ఈ ఉత్తరం ద్వారా తెలియజేస్తున్నాను. సొరాబ్జీ జోహన్స్‌బర్గ్‌లో మరణించారు. వికాసశీలమైన ఒక వ్యక్తిత్వం అంతరించింది.

భగవంతుని లీలలు విచిత్రాలు1

ప్రేమాదరాలతో

ఇట్లు
మోహన్

★ ★ ★

# 17. సి.యఫ్ తెంగ్రూస్ గారికి

ప్రియమైన చార్లీ,

మీరు వరుసగా నాకు ఉత్తరాలు వ్రాశారు. మీరు దేశభ్రమణంలో వున్నారు గనుక ఎక్కడికి ఉత్తరం వ్రాయాలో తెలియక నేను జవాబులు వ్రాయలేదు. మీ చివరి ఉత్తరం లోని చిరునామాకు ఉత్తరం వ్రాస్తున్నాను. మీరెక్కడున్నా బహుశా మీకు అందుతుంది.

న్యూ రిపబ్లిక్‌లో మీ వ్యాసం చదివాను. మీ కోరిక ప్రకారం ఉత్తరం బ్రెల్వీకి పంపుతున్నాను.

మనదేశంలో తొందర తొందరగా వివిధ ఘటనలు జరుగుతున్నవి. పరిస్థితులను చక్కబరచవలెనంటే హింసను అహింసాత్మకంగా ఎదుర్కొనక తప్పదనిపిస్తున్నది. ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం చాలా హింసాత్మకంగా వున్నది. అందరిమీదా కేసులు బెట్టడం, బాధించడం వంటివి ఎక్కువగా జరుగుతున్నవి. హింసకు నేను చెప్పిన అర్థం ప్రకారం హింస, దురాశ, అసత్యము, కుటిల రాజనీతి వంటివన్నీ దాని లోనే చేరి వున్నవి. హింసాపూరిత ఆలోచనలకవి పరిణామాలు. ఈ ప్రవృత్తి చదువుకొన్నవారిలో కూడా దినదిన ప్రవర్ధమానమవుతున్నది. ద్విగుణీకృతమైన హింసతో నేను వ్యవహరించవలసి వున్నది. ఏమీ చేయకుండా వుండడం పిరికితనమే గాక మూర్ఖత్వం గూడా అవుతుంది. బాగా ఆలోచించి దానిని ఎదుర్కొనడానికే నిశ్చయించాను. లాహోరు నాకు మార్గం చూపిస్తున్నది. ఏమి చేయగలనో ఇంకా నాకే స్పష్టంగా లేదు. సవినయ శాసనోల్లంఘనం వైపుకు నా దృష్టి పోతున్నది. అది ఎలా ప్రారంభిస్తామో, ఎవరెవరు నాతో వుంటారో, ఇంకా నిర్ణయం కాలేదు. సత్యం తాలూకు పైనున్న పల్చని పొరలు, మరీ మరీ పల్చనై తెగిపోవడానికి సిద్ధంగా వున్నవి.

ఉత్తరం ప్రారంభించినపుడు ఇవన్నీ వ్రాయవలెనని అనుకోలేదు. కాని వ్రాస్తున్నాను.

గురుదేవుడు రెండు గంటలు నాతో ఆనందంగా గడిపారు. వయస్సులో

ఆయన బాగా పెద్దవారైనారు. ఈసారి మేమిద్దరం మరీ దగ్గరబడ్డాము. తిరిగి కలుసుకొందామనుకొన్నాము. కాని బోమన్ గారు వారిని బరోడా తీసుకొని వెళ్ళారు.

మణిలాల్ అతని భార్యా పిల్లలు ఇక్కడే వున్నారు. రామదాసు బార్డోలీలో వల్లభభాయి గారికి సహాయం చేస్తున్నాడు. మహదేవ్ ఇక్కడే వున్నాడు.

ప్రకాశకుల నుండి మీ పుస్తకం మొదటి వాల్యూమ్ మాకు అందలేదు. యంగ్ ఇండియా వారు నా కోరిక ప్రకారం కొని తీసుకొచ్చారు. అది నా టేబుల్ మీద వున్నది. మొదటి అధ్యాయం చదివాను. నా ధార్మిక భావాలను అది వ్యక్తం చేస్తున్నది.

ప్రేమతో

మోహన్

2.2.1930.

★ ★ ★

## 18. శ్రీమతి కస్తూరిబా గాంధీ

నడియాడ్

జులై 29, 1918.

ప్రియమైన కస్తూరీ,

నాతో వుండవలెనని నీ కోరిక. అది నాకు తెలుసును. నాకూ అట్లాగే ఉన్నది. అయినా మన పనులు మనం చేయాలిగదా? ప్రస్తుతం నీవెక్కడున్నావో అక్కడే వుండడం మంచిది. అక్కడి పిల్లలందర్నీ నీ పిల్లలుగా చూసుకో. నెమ్మదిగా నీ పిల్లలు దగ్గరగా లేకపోవడాన్ని నీవు మరచిపోతావు. వయస్సు మళ్లినవారంతా అంతే చేయాలి. అందరినీ ప్రేమించి అందరికీ సేవ చేయగలిగితే నీలో నీకే మహదానందం కలుగుతుంది. ప్రతి దినం ఉదయం జబ్బుగా వున్న పిల్లలను కలసి వారికి సేవ చేయవలెను. నీవు మహారాష్ట్ర వనితలను కలుసుకొని వారి పిల్లల్ని లాలించి నడకకు తోడుగా తీసుకొనిపో. వారు క్రొత్తగా నిన్ను చూడగూడదు. నీ సాంగత్యంలో వారి ఆరోగ్యం బాగుపడాలి.

ముఖ్యంగా మత సంబంధమైన విషయాలలో నిర్మలతో చర్చించవలెను. ఆమె చేత భాగవతం చదివించుకొని వినవలెను. ఇతరుల సేవలో మగ్నురాలివి అయితే నీకు చాలా ఆనందం కలుగుతుంది. జబ్బుపడిన పిల్లలకు ప్రత్యేక భోజనం తయారు చేసి అందుబాటులో వుంచవలెను. పంజాభాయి భోజనం విషయంలో శ్రద్ధ వహించవలెను.

మోహన్

★ ★ ★

## 19. కిశోరీలాల్ మశ్రూవాలా గారికి

జులై 29, 1918

ప్రియమైన కిశోరీలాల్‌కు,

ఈ ఉత్తరం నీకూ, నరహరికీ వ్రాస్తున్నాను. మహారాష్ట్రులు గుజరాతీల మధ్య భేదం చూపుతున్నామని నారాయణరావు చేసిన ఫిర్యాదు సమంజసమైనదే. అట్టి భావాన్ని తొలగించడం మన విధి. అహింసా ప్రయోగానికి ఇది ఒక అనువైన క్షేత్రం. ఆ ఫిర్యాదులో ఎంతవరకు సత్యమున్నదో ముందు పరీక్షించు. గుజరాతీలూ, మహారాష్ట్రులూ స్త్రీలు అంతా కలసిమెలసి వుండే ప్రయత్నం చేయండి. పిల్లల్లో ఇలాంటి భావాలు ఏర్పడకుండా చూడడం చాలా ముఖ్యం. నేను వ్రాశానని దానికి శృతిమించిన ప్రాముఖ్యమివ్వవద్దు. నేను వ్రాసిన దానిని మనస్సులో బెట్టుకొని ఈ విషయంలో వ్యవహరించండి.

ఇక ప్రార్థనల గురించి నా సలహా తెలియజేస్తున్నాను. మనమేమీ చేయలేమని మీరెవ్వరూ నిరాశపడవద్దు. మనలో లోపాలుంటే నిరాశపడక వాటని సరిదిద్దుకొనే ప్రయత్నం చేయాలి. నేను సంస్కృతం నేర్పవలసి వచ్చింది. నాకు వచ్చిన సంస్కృతం సంస్కృతమే గాదు. అందువలన నేను అసమర్థుడనని భావించి మౌనంగా వుండనా? సంస్కృతం నేర్పేవారు ఎవ్వరూ లేనపుడు నేను తప్పకుండా సంస్కృతం నేర్పుతాను. నా లోటును క్రమక్రమంగా సరిదిద్దుకుంటాను. హౌస్ ఆఫ్ కామన్స్‌లో గూడా అదే

జరిగింది. నీ బలహీనతను గుర్తు చేసుకొని నిరాశపడుతుంటావు. అది మంచిది కాదు. నీ శక్తినంతా వినియోగించి ఎంతో చాకచక్యంతో పనులు సమకూర్చుకుంటే దానివలన నీకెంతో ఆనందం గూడా కలుగుతుంది.

అదేవిధంగా పిల్లలు గూడా తమ శక్తినంతా ధారపోసి పనులు నెరవేర్చుకొనడం నేర్చుకోవాలి. వారు పనిచేయడం నేర్చుకోరా? పిల్లలకు గూడా తమను తాము సంరక్షించుకోమని బోధించాలి. అది కష్టమే అయినా అసంభవం కాదు. ఎవరైనా కొడితే ఎదురు కొట్టవద్దని ఇంతవరకూ చెప్పాము. ఇంకా దానినే అనుసరిస్తామా? లేదు. అలా బోధన చేస్తే పిల్లలమీద ఎలాంటి ప్రభావం పడుతుంది? యౌవనం వచ్చేటప్పటికి వారెట్లా తయారవుతారు? అహింస విషయంలో ఈ నా ఆలోచనలు నాకు ఇంకా సమస్యలను తెచ్చిపెడుతున్నవి. ఒక దెబ్బ కొట్టితే ఎదుటివాడికి రెండు దెబ్బలు తగిలించమని పిల్లలకు నేర్పుదామా? ప్రభుత్వాధికారులు కొడుతూ వుంటే ఏమి చేయాలి? ఆ సమయంలో మిన్నకుండి సలహాకు మా దగ్గరకు రమ్మని అందామా? లేక పరిస్థితిని బట్టి మీకు తోచినపని చేసి తరువాత జరిగే దానిని ధైర్యంగా ఎదుర్కోమని చెబుదామా? రెండో చెంప చూపించే రాజమార్గాన్ని వదలిపెట్టినపుడు ఈ సమస్యలు రాక తప్పదు. హిమాలయానికి చేరే మార్గాలు వేరు వేరుగా వుంటాయి. కొన్ని మార్గాలు లక్ష్యానికి దూరంగా గూడా వుంటాయి. మార్గదర్శకుడు సరైన మార్గం ద్వారా లక్ష్యానికి చేరుస్తాడు. తిన్నగా ముక్కుకు సూటిగా వున్న మార్గంలో ఎవ్వరూ హిమాలయాన్ని అధిరోహించలేరు. అహింసా మార్గం గూడా అదేవిధంగా కఠినమైనదా? భగవంతుడు మనల్ని రక్షించుగావుత.

వందేమాతరం

మోహన్‌దాస్

★ ★ ★

## 20. సరోజనీ నాయుడు గారికి

నవంబరు 18, 1918

సోదరీ,

నీ చిన్న నోట్‌ను చూచి ఆనందించాను. శస్త్ర చికిత్సకు నీవు ఓర్చుకొన గలిగావనుకుంటాను. అది విజయవంతంగా జరిగిందనుకొంటాను. భారతదేశం భవిష్యత్తులో గూడా నీ మధుర గీతాలను విని ఆనందించగలదు. నేను ఈ జబ్బు పడకను ఎప్పుడు వదలగలనో తెలియడం లేదు. ఉన్నదానికంటే ఎక్కువ మాంసాన్ని పెంచుకొని బలవంతుడననిపించకోలేను. స్వయంగా ఏర్పర్చుకొన్న నిబంధనలతో బాధపడుతున్న నన్ను చూచి డాక్టర్లు విచారం వెల్లడిస్తున్నారు. కాని ఆ నిబంధనలే నాకు రక్షణ కవచాలు. వాటిని ఉల్లంఘించి జీవించడం నాకు ఇష్టం లేదు. అవి శారీరికంగా బలం చేకూర్చలేకపోయినా నా ఆత్మకు శాంతిని ప్రసాదిస్తున్నవి. నాలో ఒక చైతన్య శక్తిని కలిగిస్తున్నవి. భగవంతుణ్ణీ, ధనశక్తినీ ఒకేసారి సేవించడం కష్టం అనే సామెత నా యెడల బాగా వర్తిస్తున్నా, నేను విధించుకొన్న నిబంధనలు అందరికీ అవసరం లేదు. అవి నా కవసరం. వాటిని ఉల్లంఘిస్తే నేనెందుకూ కొరగాని వాణ్ణి అయిపోతాను.

ఉత్తరాలు వ్రాస్తూ వుండవలెను.

ఇట్లు
ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 21. శ్రీనివాస శాస్త్రిగారికి

బొంబాయి
18-3-1920

ప్రియమైన శాస్త్రిగారూ,

క్రిందటి సంవత్సరం కాంగ్రెసుకు సంబంధించిన కార్యకలాపాలలో పాల్గొనడం వలన కొంతమంది మిత్రులు నన్ను కాంగ్రెసులో సభ్యుడుగా చేరమని

కోరుతున్నారు. నేను కలసి పని చేసినవారు కొందరు ఆల్ ఇండియా హోమ్‌రూల్ లీగ్‌లో సభ్యునిగా చేరమంటున్నాను. నేను దేనిలో చేరినా గాని గతిని, గమనాన్ని మార్చడానికి ప్రయత్నిస్తాను. అంతేగాని దాని లక్ష్యాన్ని బట్టి నేను మారనని వారికి మనవి చేశాను. దాని కర్థం కొత్త వెలుగు నా కవసరం లేదని గాదు. ఆ కొత్త వెలుగు మిరుమిట్లు కొలిపేటట్లుగా వుండాలి.

నాకు కొన్ని గట్టి సిద్ధాంతాలున్నవి. స్నేహితులకు తెలియజేశాను -

1. జాతి రాజకీయ జీవితంలో - నిజంగా మనమొక జాతిగా మనవలెనంటే ఈమాన్‌దారీని విశ్వసనీయతను ప్రవేశపెట్టాలి. సత్యాన్ని గీటురాయిగా స్వీకరించాలి.
2. స్వదేశీ మన లక్ష్యం గావాలి. కౌన్సిల్ సభ్యత్వం కోరేవారు దేశ పరిశ్రమలకు - ముఖ్యంగా వస్త్ర పరిశ్రమకు రక్షణ కల్పిస్తామని ప్రతిజ్ఞ చేయాలి.
3. పరస్పర వ్యవహార నిర్వహణకు హిందీ ఉర్దూలు రెండూ కలిసిన హిందుస్తానీని రాష్ట్రభాషగా స్వీకరించాలి. కాబోయే సభ్యులు ఇంగ్లీషును తొలగించి ఇంపీరియల్ కౌన్సిలులో హిందుస్తానీని స్థానిక సభలలో స్థానిక భాషలకూ స్థానం కల్పించాలి. పాఠశాలల్లో హిందుస్తానీని నిర్బంధ ద్వితీయ భాషగా పాఠ్యక్రమంలో భాగంగా ప్రవేశపెట్టాలి. దేవనాగరి ఉర్దూ లిపులు వైకల్పిక లిపులుగా వుండాలి. అంతర్రాష్ట్రీయ రాజనీతి వ్యవహారాలలోనూ ఇంగ్లీషును అంగీకరించాలి.
4. వీలైనంత తొందరలో భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన జరగాలి.
5. మార్పురాని, మార్పులేని పద్ధతిలో హిందూ మహమ్మదీయ సమైక్యత లక్ష్యంగా స్వీకరింపబడాలి. పరస్పర సహకారమూ, పరస్పర సహనమూ, ఒకరి కష్టాలు ఇంకొకరి కష్టాలుగా భావించే ప్రవృత్తీ వృద్ధిపొందాలి. సహభోజనాలూ, అంతర్జాతీయ వివాహాలూ, ఖిలాఫత్ ఉద్యమానికి సహకారం వ్యాప్తం గావాలి. శాసనోల్లంఘనం తప్పక చేయమనీ, దానినొక మూలసిద్ధాంతంగా అంగీకరించమనీ నేను అందరినీ కోరను. అది నాకు సంబంధించిన

సిద్ధాంతం. ఎవరికి తోచిన పద్ధతిలో వారు అందరూ దేశసేవ చేయగలిగి వుండాలి. లీగ్ కాంగ్రెస్‌కు వ్యతిరేకం కాగూడదు. ఇప్పటిలాగానే అది కాంగ్రెస్‌తో కలసి పనిచేయాలి.

మీరు నా యోగ్యతనూ నా హద్దులనూ తెలిసిన వారు గనుక నన్ను లీగ్‌లో చేరమని సలహా ఇస్తారా?

ఇట్లు
ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 22. శ్రీనివాస శాస్త్రి గారికి

20.3.1920

ఏప్రియల్ 6 నుండి 13 వరకు సత్యాగ్రహ వారం జరుపమని నేనిచ్చిన పిలుపును గురించి మీరు చదివి ఉంటారు. ఆ వారంలో పదిలక్షలు ధనం వసూలు చేయడం కష్టసాధ్యమని నేననుకోను. గౌరవం కలిగిన, విశ్వసనీయులైన స్వయం సేవకులు పనిజేస్తే రశీదు లివ్వకపోయినా చిల్లర వసూళ్ళుగానైనా చేయవచ్చును. ధనికులైన స్త్రీ పురుషులు బయలుదేరి వారి వారికి తెలిసిన వారినుండి వసూలు చేయువచ్చును. విధానం కంటె లక్ష్యానికి నేను ప్రాధాన్యమిస్తాను. నేను చెప్పిన మార్గంలో సత్యాగ్రహ కార్యక్రమం నడిపించడంలో ఎవ్వరికీ అభిప్రాయ భేదం లేదు. 13న జరిగిన ఘోరకృత్యానికి స్మారకచిహ్నం ఏర్పర్చడంలోనూ అభిప్రాయ భేదం లేదు. ప్రజలను మనం కలుసుకొన్నప్పుడు ఇది మరణించిన త్యాగం చేసినవారి స్మారక చిహ్నమనీ. జరిగిన ఘోరకృత్యానికి నిరసన చిహ్నంగాదనీ స్పష్టం చేయాలి.

సత్యాగ్రహ విధానానికి అంగీకరించనివారు చందాలు వసూలు చేయకుండా వుండడం మంచిది. మనం నిర్మించబోతున్నది జాతీయ స్మృతి చిహ్నం. స్మారకచిహ్నం.

ఆ వారం రోజులూ ప్రార్థనలూ, ఉపవాసాలూ జరగాలి. స్మృతి చిహ్నం కంటె గూడా వాటికి నేను ఎక్కువ ప్రాధాన్యమిస్తాను. మన పని సక్రమంగా జరిగితే ఆకాశం

నుండి ధనం సమకూరగలదు. ఈ విషయం నా అనుభవం మీద చెపుతున్నాను. ప్రార్థనలనూ, ఉపవాసాలనూ ఒక విజ్ఞానంగా సైన్సుగా అవలంబించిన నా సమకాలికులెవ్వరూ లేరు. నేనీ విషయంలో చాలా అనుభవం సంపాదించగలిగాను. విశ్వసనీయంగా తెలివిగా, ప్రచండంగా జాతిని ఉత్తేజితం చేయడానికి ఈ ప్రార్థనలూ, ఉపవాసాలూ తోడ్పడగలవని నా విశ్వాసం. వాటిద్వారా ఎన్నో పనులను మనం సాధించగలము. యాంత్రికంగా జరిగే పనుల కంటే ధార్మిక క్రియలు జాతిని జాగృతం చేయగలగడంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమించగలవు. అది నాకు కలిగిన అనుభవం. జాతి జీవితంలో ఉపవాసం పవిత్రమైనది. అది ఆత్మను చైతన్యవంతం చేస్తుంది. పవిత్రమైన వాటిని ఇంకా పరమ పవిత్రం చేస్తుంది. ఇది ప్రాచీనకాలం నుండి అమలులోవున్న పవిత్ర క్రియ. మీరు దీనిని విశ్వసిస్తే మీరు గూడా ఈ కార్యక్రమంలో పాల్గొనండి. మీ మిత్రులను గూడా ప్రోత్సహించండి.

ఇక ముందు సమావేశాలను గురించి నాకు కొంత సందేహమున్నది. అవి విజయవంతంగా నడవగలవని నేను భావించడం లేదు.

ఇట్లు
ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 23. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

బొంబాయి
ఏప్రియల్, 5 1919

గురుదేవులకు,

చార్లీ ఆండ్రూస్‌గారికి వ్యతిరేకంగా మనవిని పంపుతున్నాను. జాతీయ పోరాటానికి మీ సందేశం కావలెనని అది ప్రచురించగలనని ఆండ్రూస్ గారిని కోరాను. ఈ పోరాటం ఒక్క శాసనానికి మాత్రమే సంబంధించినదైనా స్వాభిమానం కలిగిన మొత్తం జాతి జీవితానికంతకూ సంబంధించినది. నేను చాలా కాలం నుండి శాంతంగా

మీ సందేశాని కొరకై వేచి వున్నాను. మీ ఆరోగ్యం గురించి చార్లీ చెప్పిన మాటలు విని మీకు వ్యక్తిగతంగా ఏ ఉత్తరమూ వ్రాయలేదు. మీ ఆరోగ్యం జాతికి పెద్ద సంపద. చార్లీకి మీ యెడల గల ఆదరం అభిమానం అనుపమానమైనవి. మీ శాంతికి ఏ మాత్రం భంగం కలిగినా మీ విశ్రాంతికి ఇబ్బంది కలిగినా అతడు సహించడు. అందువలన ఆయన మాటను నేను మన్నించాను. అందువల్లనే మీకు వ్యక్తిగతంగా ఉత్తరం వ్రాయలేదు. బెనారస్‌లో మీ ఉపన్యాసమున్నదని తెలిసింది. చార్లీ మాటలను ఉపేక్షించి సందేశం పంపమని మిమ్మల్ని కోరుతున్నాను. మీ సందేశం ప్రజలలో ఆశను రేకెత్తించి వారికి ఎంతో ప్రేరణాదాయకం కాగలదని నా విశ్వాసం. ఇదివరలో అది నాకు లభించింది. నాకు వ్యతిరేకంగా శక్తులు చాలా వున్నవి. ఆ శక్తులు అసత్యాన్ని సమర్థిస్తున్నవి. మనం సత్యం పక్షంలో వున్నందువలన ఆ శక్తులు ఏమీ చేయలేవు. ఆ విషయంలో నాకు సంపూర్ణమైన విశ్వాసమున్నది. మానవతా మార్గంలో నేను పయనిస్తున్నాను. అందువలన ఈ పోరాటానికి సమర్థన కొరకు పెద్దలందరినీ అభ్యర్థిస్తున్నాను. దేశ రాజకీయ జీవితాన్ని పరిశుద్ధం చేయడానికి నేను చేస్తున్న ఈ ప్రయత్నంలో మీ ఆశీర్వాదం నాకు ఎంతైనా అవసరం. మీ సందేశం అందకపోతే నాకు సంతోషంగా వుండదు. నా ప్రయత్నంలో లోట్లు వుంటే మీరు స్పష్టంగా తెలియజేయండి. మిత్రులనుండి నాకు చాలా వ్యతిరేకంగా వెలువడిన భావాలను గూడా నేను గౌరవిస్తాను. అవి నా భావాలను మార్చకపోవచ్చును. కాని అవి అపాయాన్ని సూచించే, మార్గాన్ని సుగమం చేసే "లైట్‌హౌస్" లుగా హెచ్చరిక జేయగలవు. చార్లీతో నాకు గల మిత్రత్వం నాకు గల అపూర్వ సంపద. అతడు నాతో వ్యతిరేకించినా తన భావాలను స్పష్టంగా తెలియజేస్తాడు. అది నాకొక సౌభాగ్యమని నా అభిప్రాయం. ఈ క్లిష్ట సమయంలో అటువంటి సౌభాగ్యాన్ని మీరు కూడా కల్పించవలెనని కోరుతున్నాను. ప్రార్థిస్తున్నాను.

మీరు ఆరోగ్యంగా వున్నారని తలుస్తున్నాను. విసుగుపుట్టించే మద్రాసు పర్యటన బడలిక నుండి తేరుకుంటున్నారనుకొంటున్నాను.

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

# 23ఏ. రవీంద్రనాథ్ టాగూర్ నుండి

ఏప్రిల్ 12, 1919

ప్రియమైన మహాత్మాజీ,

అన్ని రకాల అధికారము తర్కాతీతంగానే ఉంటుంది. అధికారం కళ్లకు గంతలు కట్టిన గుర్రము గుర్రపు బండి లాగిన విధంగానే ఉంటుంది. గుర్రపు బండిని తోలే మనిషి మాత్రమే నైతిక ప్రతినిధిగా నిలుస్తాడు. మౌన ప్రతిరోధం తనంతట తానే నైతిక విలువ కల్గి ఉండదు. ఈ శక్తిని సత్యానికి అనుకూలంగాను, వ్యతిరేకంగానూ వాడవచ్చును. బలం ఉపయోగించినపుడు ఫలితం లభిస్తే ఆ బలం మరింత అపాయకరంగా మారే ప్రమాదం ఉన్నది. అటువంటి సందర్భాల్లో అది ఒక లాలసగా రూపొందుతుంది.

మీరు బోధిస్తున్నది చెడును మంచి ద్వారా ఎదుర్కోవడమని నాకు తెలుసు. కాని ఈ పోరాటం చేయాల్సిన వ్యక్తులు మహోన్నతులై ఉండాలి తప్ప క్షణిక ఉద్రేకాలకు లోను కాగల మామూలు వ్యక్తులకు సరిపోదు. ఒకవైపు చెడుతో ప్రారంభం అయితే మరోవైపు చెడు ప్రారంభం కావడం అధర్మం హింసకు దారి తీయడం తత్ఫలితంగా జరిగే అవమానాల వల్ల ప్రతీకార వాంఛ పెరిగిపోవడం జరుగుతోంది. దురదృష్టవశాత్తు అటువంటి బల ప్రయోగం అప్పుడే ప్రారంభం అయింది. తీవ్రమైన క్రోధం వల్లనో లేదా సంక్షోభస్థితిలో తర్కరహితంగానో చేస్తున్న చర్యల కారణంగా మనవారిలో కొందరు రహస్యంగా తమ లోలోపలే వ్యతిరేకతా భావాల్ని పెంచుకోవడము లేదా మరికొందరు హతాశులై నిర్వీర్యులు కావడం జరుగుతున్నది. ఇటువంటి సంక్షోభ పరిస్థితుల్లో కూడా మా అందరి మహానాయకులుగా భారతీయ ఆదర్శాలకు ప్రతీకగా  నిలచి మీ స్థిరమైన నమ్మకాన్ని ప్రకటించి అటు పిరికితనంతో రహస్యంగా ప్రతీకార చర్యలకు పూనుకోవడానికి, భయభ్రాంతులైపోయి తలవంచి లొంగిపోవడానికి వ్యతిరేకంగా భారతీయ ఆదర్శాలకు ప్రతీకగా నిలిచారు. తన కాలంలో భగవాన్ బుద్ధుని వలె మీరు కూడా నిరంతర సత్యాన్ని ప్రవచించారు.

"అక్కోధేన జినే కోధం, అసాధున సాధున జినే" క్రోధాన్ని అక్రోధంతోను, చెడును మంచితోను జయించాలి.

మంచి యొక్క మహత్తర శక్తి సత్యం ద్వారా, భయరహితమైన శక్తి ద్వారా వ్యక్తం కావాలి. వ్యక్తుల్ని భయకంపితుల్ని చేయడం కోసం వాడే బలానికి వ్యతిరేకంగా, ప్రజల్ని పూర్తి నిరాయుధుల్ని చేసేందుకు అధికారశక్తులు వివిధ విధ్వంసక యంత్రాల్ని ఉపయోగించడాన్ని పూర్తిగా వ్యతిరేకించాలి. నైతిక విజయం అంటే ప్రతిసారీ గెలిచి తీరాల్సిన అవసరం లేదనీ, హుందాతనాన్నీ శాశ్వత విలువల్నీ ఎటువంటి పరిస్థితుల్లోను కోల్పోరాదనీ మనం తెలుసుకోవాలి. ఆధ్యాత్మిక జీవన విధానంలో నమ్మకం ఉన్న వారందరికీ తెలుసు. నిర్ణయాత్మక స్థూలశక్తి కలిగిన వారికి వ్యతిరేకంగా నిలబడడమే నైతిక విజయం అన్న సంగతి ప్రకారం తాత్కాలిక ఓటమి చవిచూసినా ఆదర్శం దృష్ట్యా క్రియాసహిత విశ్వాసం గెలుపొందినట్లే.

నాకు ఎప్పుడూ తోచే విషయం, నేను అన్న విషయం - స్వాతంత్ర్యం అనే గొప్ప వరం ప్రజలకు ఎవరో చేసే దానం కానే కాదు. దాన్ని పొందే ముందు మనం దాన్ని గెలుచుకోవాలి. మనల్ని జయించి మన మీద ఆధిపత్యం చేస్తున్నామనుకొంటున్న వారికన్న నైతికంగా మనం శ్రేష్ఠులమని మనం నిరూపించినపుడే మనకు స్వాతంత్ర్య ఫలం లభిస్తుంది. భారతదేశం ఈ బాధల్ని ఒక తపస్సుగా స్వీకరించాలి. బాధల్ని సహించడమే మహావ్యక్తుల యొక్క నిజమైన కీర్తి కిరీటం. మంచియందు అచంచలమైన విశ్వాసంతో భారతదేశం ఆత్మశక్తితో ఢీకొనే విచక్షణా రహిత స్థూలశక్తికి వ్యతిరేకంగా అజేయంగా నిలవాలి.

మాతృభూమికి అవసరమైన సరైన సమయంలో మీరు తిరిగి వచ్చారు. దాని సమున్నత లక్ష్యాన్ని గుర్తు చేయడానికే అన్నట్లు, మాతృభూమిని విజయపథంలో నడపడానికే అన్నట్లు రాజనైతిక కపటమనే అప్పు తెచ్చుకొన్న రెక్కల్ని బిగించుకోవడంతో సరిపెట్టుకొని అంతరికశక్తి లేకుండా నిజాయితీ లేని వాగాడంబరతతో నిండిన రాజకీయ రంగాన్ని ప్రక్షాళన చేయడానికే అన్నట్లు మీరు తిరిగి వచ్చారు.

అందువల్లనే నేను గట్టిగా ప్రార్థన చేస్తున్నాను. - ఆధ్యాత్మిక స్వేచ్ఛను బలహీనపరిచే ఏ శక్తీ మీ పోరాట పథంలోకి చొచ్చుకురాకూడదనీ, సత్యం కోసం చేస్తున్న ఈ ప్రాణార్పణా పథంలో సాగిస్తున్న యాత్ర కేవలం మాటల గారడీగా మారిపోకూడదనీ, పవిత్రమైన శబ్దాల వెనక తన్ను తాను మోసం చేసుకొనే స్థాయి దిగజారకూడదనీ ప్రార్థిస్తున్నాను.

ఈ కొన్ని మాటల ఉపోద్ఘాతంతో మీ ఉదాత్తమైన గ్రంథానికి ఒక కవిగా నేను సమర్పించే అక్షర నీరాజనాన్ని స్వీకరించండి. నీవే మాకు తోడు-నీడ అన్న విశ్వాసంతో నా తలను గర్వంగా ఎత్తుకుంటాను. మిగతా భయాలన్నీ మా అపనమ్మకంతోనే పుట్టాయి.

మనిషంటే భయమా? నిజానికి ఈ భూప్రపంచంలో ఉన్న మనిషి ఎవరు? ఎవరు రాజు, ఎవరు రారాజు, నీకెవరు పోటీ? నిన్నెవరు శాశ్వతంగా వశీభూతంచేశారు? అత్యంత శాశ్వతంగా అత్యంత సత్యంగా?

నా స్వాతంత్ర్యాన్ని దోచుకోగల శక్తి ఉన్నదా ఈ ప్రపంచంలో? చీకటి గోడల మధ్య బందీలైన ఆత్మల శృంఖలాన్ని ఛేదించవే నీ కరకమలాలు?

మృత్యుభయంతో ఈ శరీరాన్ని పట్టుకు వ్రేలాడనా ఖాళీ బొక్కసం వదలని లోభిలా? నీవందించే శాశ్వత జీవన విందు భోగాలకు నాది ఒక చిరుస్వాగతాంజలి కారాదా?

సమస్తమైన బాధలు, మృత్యువులు క్షణికమైన నీడలే నన్న సత్యాన్ని నేను గుర్తించాలి. నీ, నా సత్యాల మధ్య వ్రేలాడుతున్న ఈ నల్లనల్లని ఊయలలు సూర్యోదయం ముందు గాలిలో తేలుతున్న పొగమంచని నేను గుర్తించాలి. నా మగతనాన్ని సవాలు చేసి నా అంతః శక్తిని పెంపుచేసే నీవే ఎంతో మహత్తర శక్తివనీ ఎల్లవేళలా, శాశ్వతంగా నీవే నా సొంతమనీ నేను భావిస్తున్నాను.

అత్యున్నతమైన ప్రేమ శౌర్యాన్ని ప్రసాదించు, ఇదే నా ప్రార్థన. నీ కనుసైగలే నా వాక్శక్తిగా, నా కార్యశక్తిగా, కోరినదే తడవుగా బాధలు భరించడానికి సిద్ధంగా సర్వస్వాన్నీ త్యజించి ఒక్కనిగా మిగిలిపోతాను.

అత్యున్నతమైన ప్రేమ విశ్వాసాన్ని ప్రసాదించు. ఇదే నా ప్రార్థన. మృత్యువులో జీవన విశ్వాసాన్ని, ఓటమిలో విజయ విశ్వాసాన్ని, సుకోమల సౌందర్యంలో దాగిన నిగూఢశక్తినీ దెబ్బల్నీ బాధల్నీ స్వీకరించే ఉదాత్తతనీ వాటని తిప్పి ఇవ్వడాన్ని తిరస్కరించే శక్తినీ ప్రసాదించు.

సదా మీ నిజమైన
రవీంద్ర నాథ్ టాగూర్

*(ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలు - 15వ సంపుటము పుట 495-496)*

★ ★ ★

## 24. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

యర్రవాడ సెంట్రల్ జైలు

గురుదేవులకు,

మంగళవారం తెల్లవారుజామున 3 గంటల సమయం ఇది. ఈనాటి మధ్యాహ్నం అగ్నిమయ ద్వారంలో ప్రవేశింపబోతున్నాను. మీరు నా ప్రయత్నాన్ని ఆశీర్వదించండి. అది నాకు చాలా అవసరం. మీరు నాకు నిజమైన స్నేహితులు. మీరు మీ భావాలను స్పష్టంగా వెల్లడిస్తారు. అటుగానీ ఇటుగానీ మీ విస్పష్టమైన అభిప్రాయం కొరకు ఎదురు చూచాను. మీరు విమర్శ చేయడానికి నిరాకరించారు. నేను ఉపవాసం మధ్యలో వున్నాను. మీ హృదయం నాయీ ప్రయత్నాన్ని నిందించినా మీ అభిప్రాయం నాకు అమూల్యం. నేను చేసిన పెద్ద తప్పిదాన్ని అంగీకరించనంతటి గర్వం కలవాడిని కాను. అందుకై ఎంత మూల్యం చెల్లించవలసి వచ్చినా వెనకాడను. నా చర్యను మీరు అదరణతో అంగీకరిస్తే ఆ అంగీకారం ఆశీర్వాదరూపంలో నాకు కావాలి. అది నాకు బలాన్ని ప్రసాదించగలదు.

నన్ను నేను స్పష్టం చేసుకొన్నాననుకొంటున్నాను.

**20.9.32**

సూపరింటెండెంటుకు అందించబోతున్న సమయంలో ప్రేమపూర్వకమైన, భవ్యమైన మీ టెలిగ్రాం అందింది. నేను ప్రవేశించబోతున్న పెనుతుపాను మధ్య ఆ టెలిగ్రాం నాకు అపరిమితమైన బలాన్ని చేకూర్చింది. నేను మీకు టెలిగ్రాం పంపుతున్నాను.

ధన్యవాదాలతో

ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 25. రవీంద్రనాథ్ టాగూర్ నుండి

కలకత్తా

సెప్టెంబర్ 25, 1932

మహాత్మాజీ,

ఈ కొద్ది రోజుల్లో మీరు అసంభవమైన దానిని సంభవం చేసినందుకు జనం ఆశ్చర్యచకితులైనారు. మీరు రక్షింపబడినందుకు అమితానందాన్ని పొందుతున్నాను. మాకందరికీ మీరు అవసరం. మీ కృషి వలన హిందువులు మహమ్మదీయులు ఏకం కావడానికి, అందుకై ప్రయత్నించుటకు మంచి సదవకాశం లభించింది. మీ ఆదేశాన్ని అందరూ పాటిస్తారు. లక్ష్యప్రాప్తికి అందరూ తోడ్పడతారు. అస్పృశ్యతా నివారణకు మీరు చేస్తున్న కృషి కంటే హిందు ముస్లిమ్ సమస్యా పరిష్కారం కష్టతరమైనది. ముస్లిములకంటే హిందువులలో ఒక రకమైన వ్యతిరేకత వున్నది. ముస్లిములకూ, హిందువుల మీద సద్భావం లేదు. కఠిన హృదయాలతో వ్యవహరించడం మీకు తెలుసును. ఎంతో కాలం నుండి ఏర్పడిన కరుడు గట్టిన పరస్పర విద్వేషాన్ని అంతరింపజేయగలిగిన సహనశక్తి మీకున్నది. రాజకీయ వాతావరణాన్ని, సంఘంలో జరుగుతున్న మార్పులను ఎలా అంచనావేయాలో నాకు తెలియదు. ఇద్దరి సమస్యలను దృష్టి కోణాన్నీ అర్థం జేసుకొని, ఇద్దరినీ సమాధానపరచడం ఈనాటి మన ముఖ్య కర్తవ్యం. అందుకు ఎంతమూల్యం చెల్లించవలసి వచ్చినా పరవాలేదు. వారి విశ్వాసాన్ని

చూరగొనడం ప్రధాన కార్యం. నేను మీకు సలహాచెప్పలేను. మీ నిర్ణయాన్ని ఆమోదిస్తాను. నేనొక సలహా ఇవ్వదలచుకొన్నాను. హిందూమహాసభవారిని అవతలి వారికి సమాధానాత్మకమైన సంకేతాన్ని అందించమని కోరవలెను.

మీరు బాగా బలం సంపాదించుకొంటున్నారు. బాగా పుంజుకొంటున్నారు. ప్రతిక్షణాన్ని మంచిగా ఉపయోగించుకొంటున్నారు.

శ్రద్ధాపూర్వకమైన ప్రేమాభిమానాలతో

సదా మీ

రవీంద్రనాథ టాగూర్

## 25ఏ. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

యఱ్రవాడ సెంట్రల్

గురుదేవులకు,

మీ ప్రోత్సాహకరమైన ఉత్తరం అందింది. నేను ప్రతిదినమూ జ్యోతి కొరకు ఎదురుచూస్తున్నాను. హిందుముస్లిమ్ ఐక్యత నా జీవితలక్ష్యం. చాలా అడ్డంకులు నన్ను బాధపెట్టుతున్నవి. వెలుతురు జ్యోతి దొరికితే ఈ అడ్డంకుల్ని అది తొలగించివేస్తుంది. అది నాకు తెలుసు. నేను ఉపవాసంలో లేకున్నా ప్రార్థన చేస్తున్నాను.

గ్రామస్థుల కొరకై క్రింది నెలలో మీరు చేసిన ప్రవచనోపదేశాన్ని మాకొరకు మహదేవ్ అనువదించాడు.

ప్రేమాభిమానాలతో

మీ

**ఎమ్. కె. గాంధి**

★ ★ ★

# 26. రవీంద్రనాథ్ టాగూర్ నుండి

విశ్వభారతి
శాంతినికేతనం
నవంబర్ 15, 1932

కేలప్పన్ గారికి మీరిచ్చిన వాగ్దానం తాలూకు పవిత్రతను నేను అర్థం చేసుకున్నాను. ఆత్మ శక్తి మీద ఆధారపడి మీరు బోధించిన కార్యకలాపాలను ఎవ్వరూ విమర్శించలేరు. మీరీ మధ్య చేసిన ఉపవాసం మా చైతన్యంపై కలిగించిన ఆశ్చర్యకరమైన ప్రభావం కారణంగా మళ్ళీ అటువంటి పనిచేస్తే మనో వైజ్ఞానికంగా మాకది మానవతా దృష్టితో పరిస్థితులను ఆకళింపుచేసుకొని, మదింపు వేసుకొని వ్యవహరించే శక్తిని పోగొట్టినట్లవుతుంది. మాకది భరించరానిదవుతుంది. ఉపవాసం వలన ప్రభవించిన స్వేచ్ఛాశక్తులు గ్రామ గ్రామానికి వ్యాపించి పని చేస్తున్నవి. అవి అసమానతలను తొలగించి, అణగారిన వారియెడల అపారమైన సానుభూతిని కలిగించి కఠిన చిత్తులను గూడా దయార్ద్రహృదయులుగా మారుస్తున్నవి. లోపాలను సరిదిద్దుతున్నవి. మా పాపాలకు మీ జీవితాన్నే పణంగా బెట్టి మీరు తపస్సు దృష్టితో చేసే ఎంతటి త్యాగాన్నైనా నేను ఆహ్వానిస్తాను. మా ప్రక్క గ్రామాలలో, క్షేత్రాలలో పరిస్థితిని, జరుగుతున్న కార్యకలాపాలను చూస్తే మీ ఉపవాసం నిర్మించిన శక్తి.వచ్చిన ఆటంకాలనన్నింటినీ అధిగమించి ముందుకు సాగగలదని కనిపిస్తున్నది. నా మిత్రులు అన్ని ప్రాంతాలనుండి అందిస్తున్న వార్తలు ఈ సత్యాన్ని ధ్రువీకరిస్తున్నవి. కొన్ని ప్రతిక్రియావాద శక్తులున్నవి. ఉండడం సహజమే. వాటికి కొంత సమయమివ్వాలి. జనాభిప్రాయం ముందు ఆ శక్తులు నిలవలేవు. నాకందిన సమాచారం ప్రకారం గురువాయూరులో గూడా కొంతమంది తప్ప బహుజనానీకం మార్పుకు అనుకూలంగా వున్నది. అడ్డంకులేవీ నిలవలేవు. శాసనబద్ధంగా మంచి నిర్ణయాలు జరగగలవు. ఏవో కొన్ని ప్రతీపశక్తులకు మనం భయపడాలా? జనం సత్యంవైపు వున్నారు. త్యాగానికి సిద్ధంగా వున్నారు. మీకేమి జరిగినా దేశం సహించదు. జనం సహించరు. నాకు కలిగిన భావాలను

మహదేవ్‌కు తెలియజేద్దామనుకున్నాను. ఇంతలో మీ ఉత్తరం అందినది. జరుగుతున్న ఘటనల్ని ఆకళింపు చేసుకొంటున్నాను. సత్యమార్గాన్ని వ్యతిరేకిస్తున్నవారు సన్మార్గాన్ని అనుసరించక తప్పదు. మారక తప్పదు.

గౌరవాభివందనాలతో

మీ

రవీంద్రనాథటాగూరు.

★ ★ ★

## 26ఏ. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

గురుదేవులకు,

మీ వెనకటి ఉత్తరం నాకు చాలా ఉపశమనాన్ని కలిగించింది. మీరు అన్నీ గమనిస్తున్నారు. ప్రార్థన చేస్తున్నాను. అవి చాలును.

ప్రేమతో

మీ

ఎమ్.కె. గాంధీ

## 27. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

అహమ్మదాబాదు
జులై 27, 1933

గురుదేవులకు,

యర్రవాడ ఒప్పందాన్ని గురించి.

మీ పత్రికా ప్రకటనా సందేశాన్ని చదివాను. అది నాకు చాలా బాధ కలిగించింది. మీకు విషయాలను సరిగ్గా చెప్పలేదని అనిపిస్తున్నది. మీకు నామీద అపార ప్రేమ వున్నది. నా నిర్ణయాల మీద మీకు పూర్తి నమ్మకమున్నది. నేను అంగీకరించిన ఒప్పందం బెంగాలుకు నష్టం కలిగిస్తుందని మీ భావం. మీరు ఒప్పందాన్ని గురించి స్వతంత్ర నిర్ణయం చేసుకొనగలరు. నామీది అభిమానం వలన మీరు ఆ ఒప్పందాన్ని

అంగీకరించగూడదు. మీ దయార్ద్ర స్వభావం నాకు తెలుసును గనుక బెంగాలుకు అపకారం జరిగిందని మీకు తెలిసినా సహించారు.

కానీ ఒప్పందం వలన తప్పు జరిగిందని నేను భావించడం లేదు. నేను తప్పు జరిగిందనే వాదనతో ఎంత మాత్రమూ ఏకీభవించడం లేదు. ఒప్పందంలోని సంశోధన గురించి ఆందోళన ప్రారంభంకాగానే నేను బాగా ఆలోచించాను. విషయం తెలిసిన మిత్రులతో సంప్రతించాను. బెంగాలుకు అన్యాయం జరగలేదనే నిర్ణయానికి వచ్చాను. అన్యాయం జరిగిందని అంటున్నవారితో ఉత్తర ప్రత్యుత్తరాలు చేశాను. వారెవ్వరూ శ్రీరామానందబాబు గూడా అన్యాయం జరిగిందని నాకు నచ్చజెప్పలేకపోయారు. వారి దృష్టీ మాదృష్టి వేరుగా వున్నమాట నిజమే. అసలు ఈ ప్రశ్నను గురించి వారు ఆలోచిస్తున్న విధానమే తప్పని నా అభిప్రాయం.

పరస్పరాంగీకారంతో జరిగిన ఒప్పందాన్ని బ్రిటిషు ప్రభుత్వం కూడా మార్చలేదు. ఒప్పందం కుదుర్చుకొన్న పక్షాలు పరస్పరాంగీకారంతో అంగీకరిస్తే ఒప్పందాన్ని మార్చవచ్చును. నేరారోపణ చేస్తున్నవారి వేదిక మీదకు మీరు గూడా చేరడం మంచిదే. అందుకు నా స్వాగతం. పరస్పర సంభాషణ జరగగలదు. బ్రిటిషు ప్రభుత్వానికి నేరుగా నివేదించడం వుండదు. మీరు విషయాన్ని కూలంకషంగా చదివి అర్థం జేసుకొని వుంటారు. అందువల్లనే పత్రికా ప్రకటన చేసివుంటారు. విజ్ఞులతో ఒక సమావేశం జరిపి బెంగాలుకు అన్యాయం జరిగిందని నిరూపించండి. అన్యాయం జరిగినట్లు తేలితే ఒప్పందంపై పునరాలోచన జరగవచ్చును. తప్పుజరిగితే నా సర్వ శక్తులూ వినియోగించి తప్పును సరిజేసే ప్రయత్నం చేస్తాను. నేను ఇంతవరకూ ఒప్పందాన్ని సమర్థిస్తూ బహిరంగంగా ప్రకటన చేయలేదు. అది మీకు తెలుసును. ఇక అంతా మీ చేతిలో వున్నది.

ఆశ్రమాన్ని మూసి వేయదలచుకున్నాను. జన సామాన్యంతో కలసి పనిచేస్తాను. ఈ నెలాఖరులోపల ఆ పని జరగవచ్చును.

మీ ఆరోగ్యం బాగా వున్నదని తలుస్తాను.

ఇట్లు

**ఎమ్. కె. గాంధి**

★ ★ ★

## 28. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

వర్ధా
నవంబరు 15, 1934

గురుదేవులకు,

అఖిల భారత కాంగ్రెసు యాజమాన్యాన ప్రారంభింపబడనున్న అఖిల భారత గ్రామీణ పరిశ్రమల సంఘానికి సలహా నివ్వడం కొరకు విజ్ఞుల సహకారమవసరము. సభ్యులు మాటిమాటికీ సమావేశం కానక్కర్లేదు. వారివారికి తెలిసిన విషయాలలో వారు సలహాలివ్వాలి. విశ్లేషణ, ఆహారపు విలువలు, గ్రామ పారిశుద్ధ్యము, గ్రామీణోత్పత్తుల వితరణ, గ్రామ పరిశ్రమ అభివృద్ధి వికాస పద్ధతి, సహకారము, గ్రామీణ ఎరువులు, గ్రామాలలో రవాణా సౌకర్యాలు, విద్య, శిశు సంరక్షణ వంటివి చర్చనీయాంశాలు.

ఆ సంఘం సభ్యులుగా మీ పేరును ఉపయోగించుకొనవచ్చునా? ఆ సంఘం లక్ష్యము, విధానాలూ మీకు అంగీకారయోగ్యాలనుకొంటాను.

ఇట్లు
ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 29. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

వర్ధా
19-2-1937

గురుదేవులకు,

మీరు 5న వ్రాసిన ఉత్తరం ఐదు రోజుల క్రితం అందింది. నా మీద మీకున్న విశ్వాసం, ప్రేమ మీ ఉత్తరంలోని ప్రతి పంక్తిలోనూ తొణికిసలాడుతున్నది. మరి నా అవధులో? మీరు నా మీద పెట్టనున్న భారాన్ని మోయుటకు నా భుజాలు బలమైనవి కావు. మీ యెడల నాకున్న గౌరవం ఒక వైపుకు లాగుతుంటే, కారణాలు ఇంకొక

వైపుకు లాగుతున్నవి. కారణాలకు లొంగిపోవడం మూర్ఖత అవుతుంది. నన్ను ఎదుర్కొంటున్న ప్రశ్న అది. పరిపాలన విషయాలలో పాల్గొనవలసిన అవసరం వుండదనుకొంటాను. సంస్థ ఆర్థిక స్థితికి తోడ్పడవలెను గదా? రెండు రోజుల క్రితం నాకు తెలిసిన దానినిబట్టి మీరు ఢిల్లీలో నాకు మాట యిచ్చి గూడా యాచనకై అహమ్మదాబాదు వెళుతున్నారట. అది నిజమైతే మీకు సాష్టాంగప్రమాణం జేస్తూ మీ అహమ్మదాబాదు యాత్రను రద్దు జేసుకోమని ప్రార్థిస్తున్నాను.

గౌరవాభిమానాలతో

ఇట్లు
ఎమ్.కె. గాంధి

## 30. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

వర్ధా
9-4-1937

గురుదేవులకు,

5వ తేదీన మీ ఉత్తరం అందింది. ఆ రోజునే నేను బెల్గాంవ్‌కు వెళ్లుతున్నాను. లేకపోతే మీ ఉత్సవానికి తప్పకుండా హాజరయ్యే వాణ్ణి. చాలాకాలంగా శాంతినికేతనం చూడలేదు. జవహర్‌లాల్ నెహ్రూ హాజరవుతున్నాడు గనుక నేను గూడా శారీరకంగా మీ ఉత్సవంలో వున్నట్లే. చైనా హాలు చైనా భారతదేశాల మైత్రికి చిహ్నంగా అలలారు గావుత.

క్షణికంగా ఏర్పడిన అపార్థాన్ని గురించి మీరు వ్రాసిన వుత్తరం ఒక నిధిగా నా జేబులో వున్నది. ఆ ఉత్తరం చదవగానే నా నేత్రాలు ఆనందాశ్రువులతో నిండి పోయినవి. మీ ఉత్తరం మీ గొప్పదనానికి నిదర్శనం.

గౌరవాభివందనాలతో

మీ
ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 31. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

వర్ధా

23-9-1937

గురుదేవులకు,

బహు అమూల్యమైన మీ వుత్తరం నా ముందున్నది. నీలరతన్ టెలిగ్రాం పంపగానే ఉత్తరం వ్రాయవలెననుకొన్నాను. కాని నా కుడి చేతికి విశ్రాంతి కావలసివచ్చింది. ఇంకొకరిచేత వ్రాయించడం నాకిష్టంలేదు. ఎడమచేయిగూడా నెమ్మదిగా పనిజేస్తున్నది. మీ యెడల నాకున్న గౌరవాన్ని వ్యక్తం చేయడానికి ఈ ఉత్తరం వ్రాస్తున్నాను.

మా మౌన ప్రార్థనలు మీకు వినిపించగలవు. మీరు విశ్వనాయకులే కాదు, వేల మందికి ప్రేరణాదాయకులు. సదా మీరు మాతోనే వుంటారు. మీ దీర్ఘాయువును కాంక్షిస్తూ

మీ

ఎమ్.కె. గాంధి

## 32. రవీంద్రనాథ్ టాగూర్ నుండి

ఉత్తరాయణం

శాంతినికేతనం

19-2-1940

మహాత్మాజీ,

మీరు మా విశ్వభారతి కార్యకలాపాలను విహంగవీక్షణంగా తిలకించారు. మీకు ఎటువంటి అభిప్రాయం కలిగిందో తెలియదు. ఇది ఒక జాతీయ సంస్థ. అంతర్జాతీయ సంస్థగూడా. భారతీయ సంస్కృతిని విశ్వానికి అందించే ప్రయత్నం చేస్తున్నది.

కష్టంలో వున్నప్పుడు మీరు దీనిని ఆదుకొని రక్షించారు. దీనికి బలమిచ్చారు. సహాయం చేశారు. అందుకు మీకు కృతజ్ఞులము.

శాంతి నికేతనం నుండి మీరు వెళ్లక పూర్వం నా మనవి ఒకటి వున్నది. ఈ సంస్థను మీ రక్షణలోనికి తీసుకోండి. ఇది ఒక భారతీయ సంపద అని మీరు భావిస్తే దీనికి స్థాయిత్వం కల్పించండి. విశ్వభారతి నౌక వంటిది. అది నా జీవితధనాన్ని మోస్తున్నది. నా దేశవాసులందరి ప్రత్యేక శ్రద్ధ దీనికవసరము.

మా ఆశ్రమంలోనికి మిమ్మల్ని సాదరంగా ఆహ్వానిస్తున్నాను. పెద్ద పెద్ద మాటలు చెప్పలేను. మీరు మా వారనీ, మాలో ఒకరనీ, మానవజాతికి అలంకార ప్రాయులనీ మాత్రం చెప్పగలను.

మీ మార్గంలో కొన్ని సమస్యలున్నవి. అవి మన భవిష్యత్తును అంధకారమయం చేస్తున్నవి. మీ మార్గంలోకి సమస్యలు రోజురోజుకూ గుట్టలు గుట్టలుగా చేరుతున్నవి. వాటి దెబ్బలకు ఎవ్వరమూ స్వేచ్ఛగాలేము. అశాంతినీ అల్లకల్లోలాలనూ కొద్ది సమయం దూరంగా వదిలి హృదయాలను దగ్గరకు చేర్చిన కలయికగా మన కలయికకు రూప కల్పన చేద్దాము. అలజడుల నుండి బయటపడి మన నిజమైన లక్ష్యాలను సాదిద్దాము.

ప్రేమతో

ఇట్లు

రవీంద్రనాధటాగూర్

## 32ఏ. రవీంద్రనాథ్ టాగూర్ గారికి

కలకత్తా నుండి మార్గ మధ్యంలో

19.2.1940

గురుదేవా,

నేను బయలు దేరినప్పుడు మీరు నా చేతిలో పెట్టిన విన్నపము నా హృదయాన్ని కదిలించింది. విశ్వభారతి గొప్ప జాతీయ సంస్థ అని నేను నిస్సందేహంగా

అంగీకరించగలను. అది అంతర్జాతీయ సంస్థగూడాను. నా చేతనైనదంతా దాని అభివృద్ధికి తప్పక చేస్తాను. శాంతినికేతనం నా రెండవ గృహం.

మీరు నాకు వాగ్దానం చేసినట్లుగా ప్రతిదినం పగలు ఒక గంట ధార్మికంగా నిద్రించండి.

సగౌరవంగా

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 33. జి.యస్. అరండేలు నుండి

సెకండ్‌లైన్ బీచ్

మద్రాసు

జులై 26, 1919

ప్రియమైన గాంధీ గారికి,

మీరు తాత్కాలికంగా శాసనోల్లంఘన ఉద్యమాన్ని ఆపివేశారు. అందువలన లండన్‌లో మన నాయకులు కొందరు భారతీయ స్వాతంత్ర్య సముపార్జన కొరకు ప్రారంభించిన ప్రయత్నాలను బలపరచమనీ, ఆ ప్రయత్నాలకు చేయూత నొసంగమనీ మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

రౌలట్ చట్టాన్ని రద్దు చేయించడం మీ ప్రధమ కర్తవ్యమని నాకు తెలుసును. అందుకు ఆందోళన నడిపించడం పరమావశ్యకం. ప్రెస్ చట్టానికి వ్యతిరేకంగా ఆందోళన నడిపించడం గూడా అంత అవసరమే. మీరు శాసనోల్లంఘనాన్ని విరమించారు గనుక మన మందరం కలసి ఐకమత్యంగా క్రింది వాటి కొరకై పనిచేయడం అవసరం గదా?

(1) ఇండియన్ రిఫార్మ్స్ బిల్లును తగిన మార్పులతో రూపొందిచడం.

(2) రౌలట్, ప్రెస్ చట్టాల రద్దు.

(3) మద్రాసు సమావేశంలో ప్రవేశపెట్టబడి, అఖిల భారత కాంగ్రెసు బొంబాయి

సమావేశంలో అంగీకరించబడిన, ముస్లింలీగ్ ద్వారాగూడా అంగీకరింపబడిన నాగరిక హక్కుల పరిరక్షణ కొరకు పట్టుబట్టడం.

నేను సూచించిన పద్ధతిలోనే విషయక్రమం వుండనక్కర్లేదు. ఏమైనా మనలో ఐక్యత అవసరం. దానిని పరిరక్షించడం మన ప్రథమ కర్తవ్యం.

ప్రస్తుతం రెండు మార్గాలున్నవి. ఒకటి సత్యాగ్రహ మార్గము, రెండోది ఇండియన్ రిఫార్మ్స్ బిల్లుపై ధ్యానముంచడం. రెండుమార్గాల వారూ కలిసి పని చేయడానికి మార్గం లేదా?

కొంతమంది మీ అనుచరులకు ఇండియన్ రిఫార్మ్స్ బిల్లు మీద విశ్వాసం లేదు. అది నాకు తెలుసును. అయినా ఇండియన్ రిఫార్మ్స్ బిల్లులో తగిన సవరణలు తెచ్చి దేశసేవ చేయదలుచుకొన్న మన పెద్దలను సమర్థించగూడదా?

నేను భారత దేశసేవకుణ్ణి. లభించిన ఏ చిన్న అవకాశాన్ని గూడా మనం చేయి వదలకూడదని నా అభిప్రాయం. అది మీ ప్రేరణతోనే మీ సహాయంతోనే జరుగగలదు. మీ మార్గదర్శకత్వం వుంటేనే సంభవం కాగలదు. శ్రీశంకర్ నారాయణగారు మాటల సందర్భంలో కొన్ని మార్పులతో ఇండియన్ రిఫార్మ్స్ బిల్లును ప్రయోజనకరంగా మార్చవచ్చునన్నారు. మాంటెగ్యూతో వివరంగా చర్చించిన తరువాత అనిబిసెంట్ గారు పరిస్థితి ఆశాజనకంగా వున్నదని వ్రాశారు. మన మందరం దానికి బలమివ్వడం అవసరం గాదా? అందరం కలిసి పని చేయవద్దా? మీ నాయకత్వంలో ఉద్యమం నడపడం అవసరంగాదా?

మనలో ఐకమత్యం లేకపోవడంవల్ల ఒక కార్యకర్తగా నేను విచారపడుతున్నాను. పనికిరాని ఆ రెండు చట్టాలను రద్దు చేయించడం అవసరం. ఇండియన్ రిఫార్మ్స్ బిల్లులో అవసరమైన సవరణలు చేయించుటకు కృషి చేయడం ఉద్యమించడం మన కర్తవ్యం. శాసనోల్లంఘనోద్యమాన్ని విరమించారు గనుక మీ అభిప్రాయం తెలియజేయండి.

గౌరవ పురస్సరంగా

మీ ప్రశంసకుడు
జార్జి అరండేలు

★ ★ ★

# 33ఏ. జి.యస్. అరండేలు గారికి

లక్ష్మణ ‹
బొంబాయి
4-8-1919

మిత్రులు అరండేలు గారికి,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం చదివాను. మళ్ళీ మళ్ళీ చదివాను. నా జవాబుతోబాటుగా మీ ఉత్తరాన్ని యంగ్ ఇండియాలో ప్రచురిస్తున్నాను.

మీ సలహా పాటించేవాణ్ణేగాని మీరు సూచించిన పనిని నేను చేయడం సంభవంగాదు. నా హద్దులు నాకు తెలుసును. నా పోకడ రాజకీయమైనదిగాదు. మత ప్రధానమైనది. ధార్మికమైనది. మతం నుండి వేరు చేయదగినదేమీ వుండదని నా విశ్వాసం. రాజకీయం గూడా జీవితంలోని అన్ని భాగాలనూ స్పృశిస్తూ వుంటుంది. అందువల్ల ఇంగ్లీషు వారి మధ్యా మన మధ్యా గల రాజకీయ సంబంధాన్ని మంచి ప్రాతిపదికపై నిలబెట్టవలసి వుంటుంది. ఆ మార్గంలో పయనించి సంబంధాన్ని చక్కబరచవలెనని నాశక్తి కొలదీ నేను ప్రయత్నించుచున్నాను. నాకు సంస్కరణలమీద అంత అభిరుచి లేదు. వాటిని గురించి యోగ్యులు ఆలోచిస్తూవున్నారు. నా ఉద్దేశ్యంలో సంస్కరణలు (రిఫార్మ్సు) రౌలట్ చట్టం గత్యవరోధకాలే. రౌలట్ చట్టం విషాన్ని వెళ్లగక్కుతున్నది. భారతీయుల సమ్మతి లేకపోతే ఇంగ్లీషువారు వారికి తోచిన, మనకు అంగీకారంకాని సూచనలు సంస్కరణల పేరుతో సూచించగలరు. వారు మనల్ని నమ్మడం లేదు. మనం వారిని నమ్మడం లేదు. ఒకరినొకరు బద్ధశత్రువులుగా భావిస్తున్నాము. అందుకే రౌలట్ చట్టం వచ్చింది. ఆ చట్టం మన శరీరాలమీద పాము కుండలి వంటిది. మనం ఎంత వ్యతిరేకత చూపినా ఇంగ్లీషువారు ఆ చట్టాన్ని పట్టుకొని వేలాడుతున్నారు. అది అంత మంచి విషయం గాదు. అందువల్లనే మనం వారిని అనుమానిస్తున్నాము. అందువలన నేను రాజకీయ సంస్కరణలకు అంత సుముఖత వ్యక్తం చేయడం లేదు. రౌలట్ చట్టం పూర్తిగా మార్గాన్ని అంతా అవరోధించి వున్నది. ఆ అవరోధాన్ని అధిగమించడమే నా లక్ష్యం.

అందువలన నా విషయంలో ఎట్టి పొరపాటు భావాలు వుండకూడదు. శాసనోల్లంఘన కార్యక్రమం తాత్కాలికంగా విరమించబడిందిగాని అది అమలులో వుంటుంది. జీవితంలో తెలిసీ తెలియకా ఆ మార్గాన్ని మనమనుసరిస్తూనే వున్నాం. దానిని కొత్తరూపంలో విస్తృతరూపంలో ప్రయోగిస్తున్నాము. కొంత ఉద్రేకమూ, భ్రమా ఏర్పడడంవల్ల దాని అసలు స్వరూపాన్ని ప్రజలకు తెలియజేయడం కొరకు మాత్రమే వానిని తాత్కాలికంగా రద్దు చేశాను. రౌలట్ చట్టాన్ని ఇప్పటికైనా రద్దుచేయమని బ్రిటిషు ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తగినంత తొందరగా దాన్ని రద్దు చేయకపోతే శాసనోల్లంఘనం తప్పదు. రాత్రి వెంటనే పగలు అన్నంత సత్యమది. దానిని ఏ ప్రభుత్వమూ ఏ ఆయుధశక్తీ ఆపలేదు. దాన్ని నష్టపరచలేదు. అది ఒక అమోఘమైన శక్తిగా అందరిచేతా గుర్తించబడుతుంది. అది అన్యాయాలను సరిదిద్దే ప్రమాదంలేని ఔషధము.

మీరు ఐక్యతను గురించి వ్రాశారు. మంచిదే. ఐక్యతకు ఒక లక్ష్యముండాలి. పార్టీలు వుంటవి. వాటి కన్నింటికీ వర్తించే, కొలిచే కొలబద్ద వుండడంలేదు. ఒక దానికంటే ఇంకొకటి ముందుకు పోవలెనని పార్టీలు ప్రయత్నిస్తుంటవి. అందువలన నష్టమేమీలేదు. ఒకరిని ఇంకొకరు విశ్వసించక పోవడం, ఒకరి మీద ఇంకొకరు దోషారోపణలు చేయడం తగదు. మనలోని పెద్దలోపం మనలోని విభేదాలు కావు. మనలోని తేలికతనం. మనం శబ్ద ప్రయోగాన్ని గురించి కొట్లాడుకుంటున్నాము. నీడలకై పోరాడి అసలు విషయాన్ని వదలివేస్తున్నాము. గోఖలేగారన్నట్లు మన రాజకీయాలు తీరిక సమయాలలోని మనోరంజక సామగ్రిగా మారిపోయినవి.

రాజకీయాలలో గాంభీర్యాన్ని, త్యాగాన్నీ ప్రవేశపెట్టమని మిమ్మల్ని, మిగతా వారినందరినీ కోరుతున్నాను. మనలోని విభేదాలు ముఖ్యం కాదు. వాటి వెనుకనున్న క్షుద్రత్వమే వికృతమైనది.

పంజాబు ఘటనలు రౌలట్ చట్టంతో ముడిబెట్టబడినవి. ఆ చట్టం రద్దయి తీరాలి. ప్రెస్ చట్టం గూడా పూర్తిగా మారిపోవలెననే మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రభుత్వం అన్యాయంగా అహంకారపూరితంగా రాజద్రోహాన్ని

ప్రేరేపిస్తున్నది. లార్డ్ విల్లింగ్టన్ హిందూ, స్వదేశమిత్రన్ పత్రికలకు వ్యతిరేకంగా చర్య తీసుకొన్నారు. అందుకు నా సంపూర్ణ విచారాన్ని వ్యక్తం జేస్తున్నాను. అది నా దృష్టిలో అనాలోచిత చర్య. దాని వలన పత్రికల గౌరవం, జనప్రియత్వం ఏ మాత్రం తగ్గలేదు గదా. ఇంకా పెరిగినవి. ప్రతి చిన్న విషయాన్నీ రాజద్రోహంగా భావించే న్యాయమూర్తులు ఈ దేశంలో చాలామంది వున్నారు. వారు శిక్షలు వేయగలరు. న్యాయ సంగతమైన విమర్శను గూడా వారు రాజద్రోహంగా భావిస్తారు. రాజకీయ సంస్కరణలకు అందువల్లనే నేనంత ప్రాముఖ్యమివ్వడంలేదు. మనం విశ్వాస పాత్రులమైన మిత్రులం. శత్రువులుగా గూడా వుండాలి. పరిణామాలకు భయపడగూడదు. నిర్భయంగా వుండాలి. అదే మన ధర్మం. నా దృష్టి ప్రకారం అమర్యాదలో, అగౌరవంలో హింస దాగి వుంటుంది. అందుకే నేను సత్యాగ్రహ కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టాను. వాటి వేరులు మూలలు మర్యాద గౌరవాలతో ముడిపడి వుంటవి.

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 34. ఈ దేశంలోని ఇంగ్లీషువారికందరికీ

స్నేహితులారా,

ఇంగ్లీషు మిత్రులందరూ దీనిని చదవవలెననీ, దీనిపై గంభీరంగా ఆలోచించవలెననీ నాకోరిక.

ముందుగా నన్ను నేను మీకు పరిచయం చేసుకొంటున్నాను. నా అభిప్రాయంలో 29 సంవత్సరాలు ఒకే మాదిరిగా బ్రిటిష్ ప్రభుత్వంతో సహకరించిన నావంటి వ్యక్తి ఇంకొకరుండరు. ఆనాటి పరిస్థితులు ఎవరినైనా విద్రోహిగా మార్చేవే అయినా నేను ప్రభుత్వంతో పూర్తిగా సహకరించాను. మీరేదో శిక్షవేస్తారని గానీ, నా స్వార్థచింతనతో గానీ అందించిన సహకారం కాదది. నా స్వబుద్ధితో, స్వేచ్ఛగా నేనందించిన సహకారమది. బ్రిటిషు ప్రభుత్వం మేలు చేస్తుందని విశ్వసించాను. బ్రిటిష్ సామ్రాజ్యం కొరకై నేను

ఆపదలపాలు గావడానికి గూడా వెనుదీయలేదు. బోయర్ యుద్ధంలో నేను అంబులెన్స్ విభాగంలో ముఖ్యుడుగా పనిజేశాను. దానిని గురించి జనరల్ బుల్లర్ తన నివేదికలో విశ్లేషించివున్నాడు. నేటాల్‌లో జులూ విద్రోహ సమయంలో అటువంటి పనినే చేశాను. మహాయుద్ధ సమయంలో అంబులెన్స్ సేవను సుసంఘటితం చేసి ప్లూరసీ వ్యాధి పాలయినాను. ఢిల్లీలో లార్డ్‌ఛేమ్స్‌ఫర్డ్‌కు చేసిన వాగ్దానం ప్రకారం కైరా జిల్లాలో సైనికులను పోగుచేసి పంపించాను. ఆ సందర్భంలో ప్రాణాఘాతకమైన భయంకరమైన అతిసారవ్యాధిపాలయినాను. ఇది అంతా ఎందుకు చేశాను? నా దేశానికి మీదేశంతో సమానమైన గౌరవం లభిస్తుందని విశ్వసించి చేశాను. క్రిందటి డిశంబరులో బాధ్యతాయుతమైన సహకారం ప్రభుత్వానికి అందించాను. లాయడ్ జార్జి గారు తన వాగ్దానాన్ని నిలబెట్టుకొంటారనీ, పంజాబులో న్యాయం చేస్తారనీ విశ్వసించాను. పంజాబులో జరిగిన ఘోరాలు, అత్యాచారాలు నా నమ్మకాన్ని వమ్ము చేసినవి. దానితో బ్రిటిషు ప్రభుత్వపు ఆలోచనా విధానం మీదనే నాకు అపనమ్మకం ఏర్పడింది.

మీ మీద నాకు నమ్మకం పోయినా మీరు చూపించిన సాహసాన్ని నేను ప్రశంసిస్తాను. న్యాయానికీ, తర్కానికీ లొంగని మీరు సాహసానికి లొంగుతారని నాకు తెలుసు.

మీ సామ్రాజ్యమంటే ఈనాడు భారతదేశం ఏవిధంగా భావిస్తున్నదో ఈ క్రింది విషయాలను చూడండి.

1. గ్రేటు బ్రిటన్ తన లాభం కొరకు భారతదేశంలోని ఉత్పత్తినీ, సాధనాలనూ నిరుపయోగం చేస్తున్నది.
2. దినదినం సైనిక ఖర్చులు పెరుగుతున్నవి. ప్రపంచంలో ఎక్కడా లేనంతగా సివిల్ అధికారులమీద ఖర్చు పెట్టబడుతున్నది.
3. భారతదేశంలోని బీదతనాన్ని గుర్తించకుండా ప్రతి ప్రభుత్వ విభాగంలోనూ దుబారా ఖర్చులు జరుగుతున్నవి.
4. మీ వారి మేలు కొరకు భారతీయులను నిరాయుధులను చేసి బలహీనులుగా చేయడం జరుగుతున్నది.

5. పెద్ద ఖర్చుతో కూడిన పరిపాలనా వ్యవస్థ కొరకు మద్యమూ, డ్రగ్గులూ వంటి వాటి సరఫరా జరుగుతున్నవి.
6. ప్రజా ఉద్యమాలను అణచివేయడానికి, ప్రజాభిప్రాయం వెలువరించడానికి వీలులేకుండా చేయడానికి చట్టాలద్వారా నిర్బంధాలను ఎక్కువ చేయడం జరుగుతున్నది.
7. మీ వలస దేశాలలో నివసిస్తున్న భారతీయులను అవమాన పరచడం, హింసించడం జరుగుతున్నది.

మహమ్మదీయులను రెచ్చగొట్టి పంజాబును మీరు భూతద్దంలో చూపిస్తున్నారు. ఈ పరిస్థితిలో పోరాడటం ద్వారా మీ నుండి రాజ్యాధికారాన్ని మేము మాచేజిక్కించుకొంటే మీరేమి అన్యథా భావించరని అనుకొంటున్నాను. అందుకు తగిన శక్తి లేదని మీకు తెలుసును. మమ్మల్ని ఆ విధంగా ప్రభుత్వం తయారుచేసింది. మాలో బానిసత్వం పెంచుతున్నా అడుగడుగునా బలహీనులను చేస్తున్న మీతో మేమెందుకు సహకరించాలి? సహాయ నిరాకరణ అంటే ఆత్మత్యాగానికి ప్రజలను సిద్ధపరచడమే. అందుకు తగిన ప్రశిక్షణ ఇవ్వడమే. నా పిలుపును ప్రజలు అంగీకరిస్తున్నారంటే అందుకు నా వ్యక్తిత్వం కారణంగాదు. నన్నూ, ఆలీ సోదరులనూ గూడా మీరు మరచిపోండి. ముస్లిం వ్యతిరేకతను పెంచి హిందువును గనుక అందుకు ప్రయత్నం చేసేటి మూర్ఖుణ్ణి కాదు నేను. హిందువులకు విరుద్ధంగా అలీ సోదరులను మీరు మార్చలేరు. మా మాటలు వినడానికి జనం ఎందుకు వస్తున్నారంటే మీ పాదాల క్రింద అణగి పోతున్న, మూలుగుతున్న వారి వాణికి మేము ప్రాతినిధ్యం వహిస్తున్నాము. నేను మీ స్నేహితుణ్ణి. అలీ సోదరులుగూడా నావలెనే మీకు స్నేహితులు. మీ విషయంలో ఎటువంటి చెడునూ తలంచడం నామతం నిషేధిస్తున్నది. శక్తి వున్నా నేను మీ మీద చేయి ఎత్తను. నేను బాధల్నీ కష్టాలనూ అనుభవించి మాత్రమే మిమ్ము వశం చేసుకొంటాను. నేనుగానీ, అలీ సోదరులుగానీ హిందూ ముస్లిమ్ విభేదాలను రెచ్చగొట్టే వారం కాము. అలీ సోదరులు కత్తిబట్టగలరు. తమమతాన్నీ, తమ దైవాన్నీ వారు రక్షించుకొనగలరు.

కాని వారూ నేనూ కలసి సమాన లక్ష్యం కొరకు ప్రయత్నించదలచుకొన్నాము. వారి బాధలకు ఒక పరిష్కార మార్గం చూచి వారి బాధలకు వాణిని కల్పించదలచుకొన్నాము.

మీరు ఉరకలేస్తున్న మా జాతీయ భావాన్ని అణచివేయ ప్రయత్నిస్తున్నారు. దానికి నేను సూచించదలచిన మార్గం ఒక్కటే. ఎందువలన ఇది జరుగుతున్నదో ఆ బాధను అణచివేతను తొలగించండి. మీరు అధికారంలో వున్నారు. భారతీయుల విషయంలో మీరు చేసిన పనులకు పశ్చాత్తాపపడండి. వాగ్దానం నిలుపుకోమని లాయడ్ జార్జిగారికి విన్నవించండి. తప్పుకొనే ద్వారాలను ఆయన అట్టిపెట్టుకొనే వున్నారు. వైస్‌రాయ్ గారిని తప్పుకోమని చెప్పండి. బలవంతం చేయండి. మైకేల్ ఓ డయర్, జనరల్ డయ్యర్‌ను గురించి మీ భావాలను మార్చుకోండి. ప్రజా ప్రతినిధుల సమావేశాన్ని జరిపించి, అందులో అన్ని రకాల భావాలు గలవారికీ ప్రాతినిధ్యం కల్పించి భారత ప్రభుత్వాన్ని బలవంతం చేయండి. వారికి నచ్చజెప్పండి.

భారతీయులు మీ సోదరులనీ, మీతో సమానమైనవారనీ భావిస్తేనే గాని మీరు ఈ పని చేయలేరు. మీరు కనికరించమని నేనడగడం లేదు. ఒక మిత్రునిగా ఈ పెద్ద సమస్యకు న్యాయమైన పరిష్కారాన్ని కనుగొనండని కోరుతున్నాను. అణచివేత మాత్రమే మార్గమని భావిస్తే మీ యిష్టం. కాని ఆ మార్గం విజయం సాధించలేదు. అది నా భవిష్యవాణి. దమనకాండ అప్పుడే ప్రారంభమైనది. పానిపట్‌లో ఇద్దరికి శిక్షలు విధించారు. ఇంకొకరు న్యాయవిచారణ ఫలితానికి ఎదురు చూస్తున్నారు. తమ భావాలను నిర్భయంగా ప్రకటించడమే వారు చేసిన నేరం. దమనకాండకు మేము సిద్ధంగా వుండక తప్పదు. మీరు న్యాయోచితమార్గాన్ని అనుసరించి భారతీయ ప్రజలలో ఏకీభవించగలరని భావిస్తున్నాను. మీరు ఈ దేశం ఉప్పు తింటున్నారు. ఈ దేశానికి కీడు తలపెట్టడం దేశం యెడల ద్రోహం చేయడమవుతుంది.

మీ స్నేహితుడు

ఎమ్.కె. గాంధి

★ ★ ★

# 35. వైస్‌రాయ్ గారికి

బొంబాయి

1-2-1922

హిజ్ ఎక్సలెన్సీ వైస్‌రాయ్‌గారికి,

సర్, బార్డొలీ సూరత్ జిల్లాలోని ఒక తాలూకా. అది బొంబాయి ప్రావిన్సులో వున్నది. అక్కడి జనాభా 87000 మాత్రమే.

రాబోవు 29 తేదీ నుండి ఆ తాలూకాలో శాసనోల్లంఘనోద్యమం ప్రారంభించ డానికి అఖిలభారత కాంగ్రెసు ఢిల్లీలో తీర్మానించింది. ఆ తీర్మానం ప్రకారం ఉద్యమం ప్రారంభం కాగలదు. ఆ నిర్ణయం ఎందుకు జరిగిందో మీకూ ప్రజలకూ తెలియజేయడం నా విధి. శ్రీ వల్లభభాయి పటేల్ బార్డోలీలో ఆ ఉద్యమం నడిపిస్తారు. బార్డోలీ తీర్మానం జరగడానికి నేను ముఖ్యుణ్ణి.

అఖిలభారత కాంగ్రెసు సంఘం తీర్మానం ప్రకారం బార్డోలీ మొదటిదిగా నిర్ణయించబడింది. అంటే ఇది జాతీయ స్థాయిలో భారత ప్రభుత్వానికి ఎదురు తిరగడమే. ఖిలాఫత్, పంజాబు దురంతాలు, స్వరాజ్యప్రాప్తికి సంబంధించిన కేంద్ర ప్రభుత్వ విధానాలకు నిరసన తెలపడమే దీని ఉద్దేశ్యం.

17 నవంబరు తేదీన బొంబాయిలో జరిగిన దురదృష్టకరమైన ఘటనల వలన అప్పట్లో మా కార్యక్రమం ఆపుదల జేయబడినది.

ఈ లోపల భారత ప్రభుత్వం వారి అండదండలతో బెంగాలు, అస్సామ్, ఉత్తర ప్రదేశం, పంజాబ్, ఢిల్లీలలో గూడా ఒక విధంగా బిహార్ ఒరిస్సాలలో గూడా దమన కాండ విపరీతంగా జరిగింది. మీరు దానిని దమనకాండ, అణచివేత చర్య అనరు. నా దృష్టిలో మోతాదుకు మించిన ఏ చర్య అయినా దమనకాండ అవుతుంది. ఆస్తులు లూటీలు చేయడం, అమాయకులైన జనాన్ని కొట్టి హింసించడం జైళ్ళలో ఖైదీలను కొరడాలతో కొట్టి పశుశక్తిని ప్రదర్శించడం ఏ విధమైన న్యాయబద్ధ నాగరిక చర్య కాదు. చట్టసమ్మతంగాని అరాజకచర్యను అణచివేత అనడం సమంజసం. పికెటింగు,

హర్తాల్ వంటి చర్యలు జరిగినపుడు సత్యాగ్రహులనూ వారి అభిమానులైన జనాన్నీ భయపెట్టే ప్రయత్నం చేయడం కొంతవరకు అంగీకారయోగ్యం కావచ్చును. అట్లా గాకుండా శాంతంగా వున్న స్వయంసేవకులను అంతే శాంతంగా వున్న ప్రజలనూ నిర్బంధించడం, సమావేశాలను నిషేధించడం, ప్రారంభిస్తే అది దమనకాండ అవుతుంది. పత్రికలను నిషేధించడం కూడా అటువంటిదే. ప్రస్తుతం దేశం ముందున్న సమస్య అదే. వాక్స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం సమావేశాలు జరుపుకొనే స్వాతంత్ర్యం వాటిని హరించగూడదు. ప్రస్తుతం ప్రభుత్వం అదే పనిచేస్తున్నది. మాలవ్యా సూచించిన రౌండ్ టేబుల్ సమావేశంలో అనుసరించే విధానాన్ని గురించి, చర్చించే ప్రశ్నలను గురించీ మీరు కలకత్తాలో అవి మీకు అనుకూలంగా వున్నవి గనుక అంగీకరిస్తున్నాను లేకపోతే నిరాకరించే వాడినే అన్నారు.

ఈ పరిస్థితుల్లో మేము అహింసాత్మక చర్యకు పూనుకొనవలసిందే. మాకు ఇంకొక మార్గం లేదు. అలీ సోదరులు షరతులు లేకుండా క్షమాపణ చెప్పినా పరిస్థితి మారలేదు. నిజానికి హింసాత్మక చర్యలు జరిగితే మా ఉద్యమం వుండదు ఇప్పుడట్టి పరిస్థితి లేదు. కాంగ్రెసు ఇప్పుడు హింసమీద ఆధిపత్యం కలిగివున్నది. మా స్వయం సేవకులు పరిస్థితిని బాగా అర్థం చేసుకొని వున్నారు. వారు ఉద్రేకానికి వశులు కారు. కాని చరిత్రలో ఏ దేశంలోనూ జరగని దమనకాండను ప్రభుత్వం అనుసరిస్తున్నది. మితిమీరి వున్నది. అందువలన మేము మా కార్యక్రమం ప్రారంభిస్తున్నాము. కాంగ్రెస్సు స్థలాన్ని క్షేత్రాన్ని ఎన్నుకొనే అధికారం నాకిచ్చింది. ప్రస్తుతం మా శాసనోల్లంఘనోద్యమం బార్డోలీ వరకు మాత్రమే పరిమితమై వున్నది. పూర్తిగా అహింస మీద ఆధారపడగలమని విశ్వాసం కలిగితే గుంటూరు జిల్లాలోని వంద గ్రామాల్లో ఈ కార్యక్రమం ప్రారంభిస్తారు. ఖాదీధారణ, అస్పృశ్యతా నివారణ వంటి వాటికి దేశమంతటా ప్రస్తుతం ప్రాముఖ్యమిస్తున్నాము.

బార్డోలీలో ఉద్యమం ప్రారంభంగాకపూర్వమే భారత ప్రభుత్వ అధినేతలైన మిమ్మ్ము - ఖైదీలనందరినీ వదలిపెట్టమనీ, విచారణలు ఆపుచేయమనీ, అహింసా త్మకమైన ఉద్యమాన్ని అణచివేసే ప్రయత్నం చేయవద్దనీ కోరుతున్నాను. ఖిలాఫత్,

పంజాబు దురంతాలు, స్వరాజ్యప్రాప్తి వంటి వాటికన్నింటికీ మీ ఆదేశం వర్తించాలి. పీనల్‌కోడ్ నేరాలకు గూడా ఇది వర్తించాలి. పత్రికా స్వాతంత్ర్యాన్ని పునరుద్ధరించండి. నిర్బంధ ఉత్తర్వుల నన్నింటినీ సడలించండి. వారం రోజుల లోపల మీరు వీటికి అంగీకరిస్తే వెంటనే ఉద్యమాన్ని ఆపివేస్తాను. ఖైదీలంతా విడుదల అయిన తరువాత పరిస్థితినంతా దృష్టిలో పెట్టుకొని పునర్విచారణ చేస్తాము. ప్రభుత్వం ప్రకటన వెలువడగానే రెండువైపులనుండి జరుగుతున్న చర్యలను అదులో పెట్టవచ్చును. ప్రభుత్వం తాను అనుసరిస్తున్న విధానాన్ని మార్చుకోవాలి. అందుకు మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను.

ఇట్లు
వైస్‌రాయ్ గారి స్నేహితుడు
సేవకుడు
ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 36. జవహర్‌లాల్ నెహ్రూకు

బార్డోలీ
19-2-1922

ప్రియమైన జవహర్‌లాల్‌కు,

కాంగ్రెసు వర్కింగు కమిటీ చేసిన తీర్మానాన్ని మీరంతా మరచిపోయి నట్లున్నారు. నా దృష్టి అంతా మీ తండ్రిగారి వైపుకు పోతున్నది. నా వలన వారికి ఎంత మనస్తాపం కలిగిందో నేను ఊహించుకున్నాను. ఈ ఉత్తరం అనవసరమని నేను భావిస్తున్నాను. అసలు స్థితిని అర్థం చేసుకొంటే సరిపోతుంది. దేవదాసు నవయువకుడు. అతడు కొంచెం హద్దు దాటాడు. పోలీసు జనాభాను నిర్దాక్షిణ్యంగా చంపివేయడం, అకృత్యంలో పాల్గొన్నవారందరూ మన ఉద్యమంలోని వారు గావడం, మన ఉద్యమం యెడల అభిమానం గలవారు కావడం అనేది నిజమైన విషయం. స్పష్టంగా లభించిన ఈ హెచ్చరికను గమనించకపోతే అది క్రిమినల్ చర్య అవుతుంది.

ఈ చర్య చివరి గడ్డిపరక అనుకొనక తప్పదు. నేను వైస్‌రాయ్‌కు పంపిన వుత్తరం స్పష్టంగా వున్నది. దానిలో పొరపాట్లేమీ లేవు. ఆ ఉత్తరం దాని భాష అన్ని విషయాలనూ స్పష్టం చేస్తున్నది. మద్రాసులో జరిగిన దానికి నేను విచారపడుతున్నాను. కలకత్తా నుండి హిందువులూ ముస్లిమ్‌లూ ఉత్తరాలు వ్రాశారు. గోరఖ్‌పూర్ కాండకు పూర్వమే అలహాబాదు, పంజాబుల నుండి ఉత్తరాలు వచ్చినవి. ప్రభుత్వం తరపున జరిగిన తప్పు లేదనీ ప్రజలు ఉద్రేకపూరితంగా వ్యవహరిస్తున్నారనీ అదుపు తప్పుతున్నారనీ ఆ ఉత్తరాల సారాంశం. ఫిరోజ్‌పూర్ కాండ ప్రభుత్వానికి గౌరవం తెచ్చిపెట్టేది కాకపోయినా మనం గూడా అందులో పాత్రలమే. బరేలీనుండి హకీమ్‌జీ ఫిర్యాదు చేశారు. జాజర్‌కు సంబంధించి నా దగ్గర తీవ్రమైన ఫిర్యాదులున్నవి. షాహజహాన్‌నూర్ టౌను హాలును బలవంతంగా ఆక్రమించుటకు ప్రయత్నం జరిగింది. కనౌజ్ నుండి మన స్వయం సేవకులు అదుపులో లేరనీ, హైస్కూలు వద్ద పికెటింగుకు చిన్న పిల్లల్ని సైతం స్కూలుకు వెళ్ళనీయడం లేదనీ అక్కడి కాంగ్రెసు కార్యదర్శి వ్రాశాడు. గోరఖ్‌పూర్‌లో 36,000 మంది పేర్లు స్వయం సేవకుల పట్టికలో వున్నవి. వారిలో వందమంది గూడా కాంగ్రెసు ఆదర్శాలకు చెందినవారు లేరని జమునాలాల్ గారంటున్నారు. కలకత్తాలో అంతా అరాజకంగా వున్నది. దక్షిణంలోగూడా ఇలాగే వున్నది. ఇంతలో ఈ చౌరీచౌరా ఘటన జరిగింది. పుండు మీద కారం చల్లినట్లున్నది. ఉద్యమాన్ని ఆపకపోతే మనం హింసాప్రధానమైన ఉద్యమం నడపవలసి వచ్చేది. అహింసా ప్రధానమైన ఉద్యమాన్ని కాదు అహింస తాలూకు గులాబీ పరిమళం దేశంలో విస్తృతంగా వ్యాపిస్తున్నా హింస తాలూకు దుర్గంధం గూడా దేశంలో ఎక్కువగా వ్యాపిస్తున్నది. దానిని గుర్తించకపోవడం తప్పవుతుంది. మంచి మార్గాన్ని వదలి ఉద్యమం తప్పు దోవలోకి ప్రవేశించింది. తప్పు అంచనా వేయడం గూడా తెలివైన పని గాదు. మనం వెనుకంజ వేయాలి. తరువాత తిన్నగా సరైన మార్గంలో ముందుకు సాగాలి. నీవు అననుకూల పరిస్థితిలో వున్నావు. నేను అనుకూల పరిస్థితిలో వున్నాను. నేను ఘటనల్ని సరిగ్గా అంచనా వేస్తున్నాను.

దక్షిణాఫ్రికాలో నా అనుభవం తెలియజేస్తున్నాను. జైల్లో వున్న మాకు బయటి నుండి రకరకాల వార్తలు చేరేవి. రెండు మూడు రోజులు వార్తలు అందుతున్నందుకు

సంతోషించాను. కాని దానిలోని ప్రమాదాన్ని వెంటనే గుర్తించాను. అటువంటి వార్తల్ని నమ్మి జైలులో వుండి ఉద్యమం నడపడం సంధానం కాదని గ్రహించాను. బయటివారి సమక్షంలో మాట్లాడిన దాకా, వారి అభిప్రాయాలు తెలుసుకొన్న దాకా వేచివున్నాను. ఆ తరువాత కార్యరంగంలోకి ప్రవేశించాను. జైలు వాతావరణం ఇటువంటి ఉద్యమ నిర్వహణకు అనుకూలంగాదు. బయటి ప్రపంచాన్ని నీవు మరచిపోవలెను. నీవు దానిని ఉపేక్షించవలెను. అది కష్టమే. అయినా అది తప్పదు. గ్రంథపఠనము, శారీరిక పరిశ్రమా నీకు జైల్లో ఉపయోగం కలుగజేస్తవి. నీవు ఎన్ని చేసినా రాట్నాన్ని మరచిపోవద్దు. నీవూ నేనూ ఎన్నో పనులు చేసి విసుగు చెందవచ్చును. కాని నూలు వడుకుతున్నప్పుడు, మాతృభూమికై వడకిన ఆ నూలు ఎంతో లెఖ్ఖ వేసుకొన్నప్పుడూ విసుగుజెందము. సాంగ్ సెలెస్టియల్ నీ దగ్గర వున్నది. సంస్కృతంలోని ఒక సూక్తి అనువాదం ఉటంకిస్తున్నాను.

"అక్కడ శక్తికి అపవ్యయమంటూ లేదు. దానికి నాశనం లేదు. కొద్ది ధర్మమైనా మనల్ని తప్పు చేయకుండా రక్షిస్తుంది. ఆ ధర్మమే కర్మయోగం" ఈనాటి కర్మయోగం రాట్నం. ప్యారేలాల్ ద్వారా కదలించే "డోస్" పంపించావు. నీనుండి సంతోషకరమైన ఉత్తరం కొరకు ఎదురుచూస్తుంటాను.

మీ

ఎమ్.కె. గాంధి

*(నెహ్రూ ఉత్తరం - 1921 డిశంబరు నెలలో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమై వేలకొలది మంది జనం జైలుకు వెళ్ళారు. నేనూ, మా తండ్రీ గూడా జైల్లో వున్నాము. అకస్మాత్తుగా గాంధిగారు ఉద్యమం ఆపివేశారని తెలిసింది. దానికి కారణమేమంటే గోరఖ్‌పూర్ జిల్లాలోని చౌరీచౌరాలో ప్రజలు పోలీసుఠాణా మీద దాడిచేసి కొంతమంది పోలీసుల్ని చంపి వేశారట. గాంధీగారి చర్య మాకు బాధను కలిగించింది. ఒక గ్రామంలోని కొంతమంది ప్రవర్తన వలన ఇంతటి ఉద్యమాన్ని ఆపివేయడం విచిత్రంగా ఉన్నది. గాంధీగారు జైలులో లేరు. బయట వున్నారు. మా అసమ్మతిని గాంధీగారికి తెలియజేస్తున్నాము. దానికి జవాబుగా గాంధీ గారు వ్రాసిన ఉత్తరాన్ని జైల్లో విజయలక్ష్మి చదివి వినిపించింది.)*

★ ★ ★

# 37. జవహర్‌లాల్ నెహ్రూకు

సబర్మతి ఆశ్రమం
జనవరి 17, 1928

ప్రియమైన జవహరలాల్,

నొప్పిగా వున్న నా భుజానికి విశ్రాంతినిచ్చి ఈ ఉత్తరం చెప్పి ఇంకొకరి చేత వ్రాయిస్తున్నాను. ఫెన్నర్ బ్రాక్వేను గురించి వ్రాశాను. ఆ ఉత్తరం నీకు అంది ఉంటుంది.

నీవు ఉల్లేఖించిన వ్యవహారాలకు ముఖ్య భాగస్వామివి గనుక నేను వ్యాసం వ్రాశాను. నీవు దాన్ని తీవ్రంగా విమర్శించావు. ఆల్ ఇండియా ఎగ్జిబిషన్ గురించి నీనా మధ్య గల సంబంధం వలన వేటినీ మనం అపార్థం చేసుకోము. అది మనకు రక్షణ కల్పిస్తున్నది. ఒక్కొక్కప్పుడు అవి గురి తప్పుతుంటవి. అందుకు నేను విచారించను. ఎన్నో సంవత్సరాలుగా నిన్ను నీవు అణచుకొంటున్నావు. గనుక ఇటువంటి వ్యాసాలు నీవు బయటకు రావడానికి ఉపయోగపడగలవు. ఏమైనా నీ నా అభిప్రాయాలలో వ్యత్యాసమున్నట్లు తెలుసుకొనడం ప్రారంభించాను. పరవాలేదు. వ్యత్యాసం ఎంత తీవ్రంగా వున్నా అది అంత పెద్ద విషయం కాదు. దేశం కొరకు నిన్ను నీవు అణచుకొంటున్నావు. ఆ దృష్టితో నాతో కలసి, నా ఆధ్వర్యంలో పనిచేస్తున్నావు. అందువలన నా లోపాలను ఉపేక్షిస్తున్నావు. నేను కాంగ్రెసు వర్కింగు కమిటీకి మార్గదర్శకుడుగా వున్నాను. యంగ్ ఇండియా నుండి అంతకంటే నేను తీవ్రంగా వ్రాసిన వ్యాసాలను వుంటంకించగలను. కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశాలలో గూడా తీవ్రంగా మాట్లాడివున్నాను. కాని అప్పుడవి ఇప్పటిలాగా నిన్ను బాధించినట్లు లేవు. అందువలన నీ ఉత్తరంలోని అసంగతులను చూపించడం అనవసరం. భవిష్యత్తును గురించి లక్ష్యముంచాలి.

నా నుండి నీకు స్వేచ్ఛ గావలెనంటే అది నీకిస్తున్నాను. నీవంటి విశ్వాసపాత్రుడైన వాడు దొరకడం కష్టం. ఇంతకాలం నీవు నా యెడల చూపిన సమర్పణ భావానికి ముగ్ధుణ్ణి. దానికి నేనెంతైనా విలువనిస్తున్నాను. ఇక నీవు నా భావాలకు వ్యతిరేకంగా

బహిరంగంగా ప్రకటనలు చేయవచ్చును. ఒకవేళ నేను తప్పయితే నేను దేశానికి చాలా హాని చేసినట్లవుతుంది. అది తెలిసిన తరువాత నామీద తిరుగుబాటు చేయడం నీ విధి. నీ నిర్ణయాలలో నీకేదైనా సందేహం ఉంటే నేను నీతో చర్చించగలను. నీ నా మధ్య గల విభేదాలు తీవ్రంగా వున్నట్లు కన్పిస్తున్నది. నీవంటి విశ్వాసపాత్రుణ్ణి, దూరం చేసుకొనడం నాకు సంతాపకరమే. అయినా ఒక లక్ష్యం కొరకు మిత్రత్వాన్ని కూడా త్యాగం చేయవలసి ఉంటుంది. లక్ష్యం అన్నింటికంటె ముఖ్యం. ఒకవేళ మనం వేరుగావలసి వస్తే అది మన వ్యక్తిగత సంబంధాలకు భంగం కలగనీయకూడదు. మనం చాలా కాలంగా ఒక కుటుంబ సభ్యులం. రాజకీయ విభేదాలు ఏర్పడినా అలాగే వుంటాము. చాలామందితో నాకటువంటి సంబంధాలున్నవి. శాస్త్రికీ నాకూ మధ్య గల సంబంధమటువంటిదే.

నీవు నీ జెండా ఎగరవేయవచ్చును. నీకు నాతో వున్న విభేదాలను గురించి వ్రాయవలెను. యంగ్ ఇండియాలో ప్రచురిస్తాను. జవాబు ఇచ్చిన తరువాత నీ మొదటి ఉత్తరాన్ని ఎక్కడో వదలివేశాను. నీరెండో ఉత్తరం నా దగ్గర సురక్షితంగా వున్నది. ఇంకొక వుత్తరం నీ నుండి రాకపోతే దీనినే ప్రచురిస్తాను. దానిలో అభ్యంతరకరమైనదేమీ లేదు. ఏదైనా ఉంటే తొలగిస్తాను. ఆ ఉత్తరం స్పష్టంగా ఉన్న దస్తావేజు.

ప్రేమతో

బాపూ

★ ★ ★

## 38. జవహర్‌లాల్ నెహ్రూకు

వార్ధా

జులై 29, 1939

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూకు,

థామీ మిత్రులను నీ దగ్గరకు పంపుతున్నాను. నేను వారితో ఏమీ సంప్రతించలేదు. నా ప్రమేయం లేకుండా నీవు వారితో చర్చించవలెను. ఆ స్టేటు స్థితి చిత్రంగా వున్నది. అది కాంగ్రెస్సును ఉపేక్షిస్తున్నది. మీ కమిటీకి తెలియకుండా స్టేటు స్వయంగా

వ్యవహరించగూడదని నేను హరిజన్‌లో వ్యాసం వ్రాశాను. అవసరమైతే నేను నా అభిప్రాయం తెలియజేయగలను. వర్కింగు కమిటీకి గూడా తెలియజేద్దాము. నీవు నీ కమిటీని పునర్నిర్మాణం చేయవలెను.

నేను కాశ్మీరుకు వెళ్లలేకపోయినాను. నేను స్టేట్ గెస్ట్‌గా వుండడం షేక్ అబ్దుల్లాకు ఇష్టం లేదు. షేక్ అబ్దుల్లా సమ్మతికి లోబడి అతిథిగా వుంటానని స్టేట్‌కు తెలియజేశాను. నేను పొరపాటుబడ్డట్లయింది. తరువాత అబ్దుల్లా అతిథిగా వుంటానన్నాను. దానివలన స్టేటు వారికి ఇబ్బంది కలిగింది. అందువలన కాశ్మీరు ప్రయాణాన్నే విరమించుకున్నాను. నేను రెండు మూర్ఖపు పనులు చేశాను. నీవు లేకుండా అక్కడికి పోవలెనని నిశ్చయించుకొనడం ఒకటి. అబ్దుల్లాకు చెప్పకుండా స్టేట్ గెస్ట్‌గా వుంటానని అంగీకరించడం రెండోది. స్టేటుగెస్టుగా వుంటే కాశ్మీర్‌కు సేవచేయగలనని అనుకున్నాను. ఏమైనా షేక్ అబ్దుల్లా ఆయన అనుచరుల వ్యవహారం బాగా లేదు. అది నాకంత సంతోషం కలిగించలేదు. వారి వ్యవహారం న్యాయబద్ధంగా కనిపించలేదు. ఖాన్ సాహబ్ వారికి నచ్చజెప్పడానికి ప్రయత్నించారు. ప్రయోజనం లేకపోయింది.

నీ సిలోను యాత్ర గొప్పగా జరిగింది. సాలేతయాబ్జీ నిన్ను బర్మాకు పంపమంటున్నారు. ఆండ్రూస్ దక్షిణాఫ్రికాకు పంపమంటున్నారు. సిలోనుకు కాంగ్రెసు ప్రతినిధిని పంపడం అవసరమని నాకు ఎందుకో అకస్మాత్తుగా తోచింది.

నీవు కులాసాగా వున్నావనుకొంటున్నాను.

ప్రేమతో

బాపూ

★ ★ ★

## 39. జవహర్‌లాల్ నెహ్రూకు

అక్టోబరు 5, 1945

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూకు,

చాలా రోజుల నుండి ఉత్తరం వ్రాద్దామనుకొంటున్నాను. ఈరోజు కుదిరింది. నీకు ఇంగ్లీషులో వ్రాయాలా హిందుస్తానీలో వ్రాయాలా అదిగూడా నా మనస్సులో వున్నది. హిందుస్తానీలోనే వ్రాస్తున్నాను.

మన అభిప్రాయాలు మొదటి విషయం. మన విభేదాలు సైద్ధాంతికమైనవైతే వాటిని గురించి ప్రజలకు తెలియజేయడం మంచిది. ప్రజలను అంధకారంలో వుంచడం స్వరాజ్యానికి నష్టదాయకం. హింద్ స్వరాజ్య పుస్తకం నాకు కలిగిన అనుభవాన్ని పురస్కరించుకొని వ్రాశాను. ఆ అనుభవం తాలూకు సత్యాన్ని నా అనుభవం ఋజువుచేసింది. అందువలన నా విశ్వాసాలకు నన్ను వదలడం మంచిది. నేనేమీ అనుకోను. హింద్ స్వరాజ్య పుస్తకం ఎపుడు వ్రాసిందీ నీకూ నాకూ ఇద్దరికీ అంత ముఖ్యంగాదు. ఈరోజు నాకున్న భావాలేమిటో అవి ముఖ్యం. హింద్ స్వరాజ్యంలో చెప్పిన దానిని సమర్థించడం గూడా ఇప్పటి పనిగాదు. నా అభిప్రాయం ప్రకారం జనం భారతదేశ గ్రామాలలో నివసిస్తున్నారనేది జ్ఞాపకముంచుకోవాలి. పట్టణాలలో గాదు. జనం పూరిపాకల్లో నివసిస్తున్నారు. పెద్ద పెద్ద భవనాలలో కాదు. పెద్ద పట్టణాలలోనూ, పెద్ద పెద్ద భవనాలలోనూ నివసించేవారు శాంతిగా వుండలేరు. హింస మీద వారు ఆధారపడతారు. సత్యాహింసలను అనుసరించకపోతే మానవత్వపు విలువలు నశించిపోగలవు. గ్రామాలలోని సాదాతనం మీద సత్యాహింసలు ఆధారపడతవి. దానికి అదే దారిలో నడవనక్కర్లేదు. అందువలన నా తుదిశ్వాస వుండేటంతవరకూ భారతదేశాన్నీ, దాని ద్వారా విశ్వాన్నీ సురక్షితంగా వుంచడం నా కర్తవ్యం. మానవుడు తన కనీస అవసరాలను పూర్తిచేసుకొని తృప్తిపడాలి. స్వావలంబకుడు గావాలి. ఆ తృప్తి అతనిలో లేకపోతే తనను తాను రక్షించుకోలేడు. నీటి బిందువులన్నీ కలసి సముద్రమైనట్లు ప్రత్యేక వ్యక్తులందరూ కలిస్తే విశ్వమేర్పడుతుంది. నేను కొత్త విషయమేదీ చెప్పడం లేదు. ఇది అందరికీ తెలిసిన సత్యమే.

హింద్ స్వరాజ్యలో ఇదంతా నేను చెప్పినట్లు లేదు. నేను ఆధునిక విజ్ఞానాన్ని ప్రశంసిస్తాను. కాని దానికి కొత్తవేషమూ, కొత్త దుస్తులూ అవసరం. ఈనాటి గ్రామీణ జీవితాన్ని ఉన్నదాన్ని ఉన్నదున్నట్లుగా వుంచమని నా అభిప్రాయం కాదు. గ్రామీణ జీవితానికి సంబంధించిన ఒక రూపం నా మనస్సులో వున్నది. ప్రతి వ్యక్తీ స్వప్నాలతోనే జీవిస్తాడు. నా కల్పనలోని ఆదర్శ గ్రామంలో ప్రతివాడూ తెలివిగా జీవిస్తాడు. జంతువుల వలె అంధకారం, దుమ్ము ధూళిలో అతడుండడు. పురుషులూ, స్త్రీలూ అందరూ తమ తమ స్వేచ్ఛను కాపాడుకొంటారు. ఎవ్వరూ సోమరిగా వుండరు. భోగ

విలాసాలకు లోనుగాక ప్రతి వ్యక్తీ తన వంతు పనిని తాను చేస్తాడు. గ్రామాలలో ప్లేగూ. కలరా, మశూచికం వంటి రోగాలుండవు. పెద్ద చిత్రం గీయడం నా ఉద్దేశ్యం కాదు. రైల్వేలుంటవి. తపాల శాఖ ఉంటుంది. అన్ని సోపానాలూ వుంటవి. అవసరమైన అన్ని సాధనాలు వుంటవి.

క్రిందటి కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశంలో ఈ వివరాలను సవివరంగా చర్చించవలెననీ అవసరమైతే రెండు మూడు సమావేశాలు జరపవలెననీ నిశ్చయించాము. జరగవలెనని నా కోరిక. సమావేశం జరిగినా జరగకపోయినా మనమిద్దరం ఒకరి భావాలను ఇంకొకరు అర్థం జేసుకొనడం అవసరం. దానికి రెండు కారణాలున్నవి. మనల్నిద్దరినీ కలిపిన బంధం కేవలం రాజకీయమే గాదు. రెండోది మనమిద్దరమూ పనికిరానివారము కాము. అలా మనం భావించడం లేదు. మనమిద్దరం భారతదేశ స్వాతంత్ర్యం కొరకే బ్రతికి వున్నాము. అందుకు సంతోషంగా ప్రాణాలు అర్పించగలము. ప్రపంచంలో ఎవరి ప్రశంసా మనకక్కర్లేదు. కీర్త్యపకీర్తులు మనకు ముఖ్యంగావు. సేవకు ప్రశంస వుండదు. భారతదేశానికి సేవజేస్తూ నేను 125 సంవత్సరాలు బ్రతకవలెనని అనుకొంటున్నాను. ఏమైనా నేను ముసలివాడినే. నీవు నాకంటే చిన్నవాడివి. నిన్ను నేను నా వారసుడుగా నియమించాను. మన మిద్దరిలో పరస్పరావగాహన అవసరం. ఒకరినొకరు బాగా అర్థంచేసుకొని సంతృప్తి పడగలం.

ఇంకొక విషయం. నిన్ను కస్తూరిబా నిధిలోనూ, హిందుస్తానీ ప్రచారసభలోనూ సభ్యుడిగా చేరమని కోరాను. మౌలానా సాహెబ్‌ను నిన్నూ కలసి 1942లో సభ్యుడుగా సంతకం తీసుకొన్నట్లు నానావటి చెప్పాడు. అది భూతకాలపు విషయం. హిందుస్తానీ సందర్భంలో ఈనాటి స్థితి నీకు తెలుసును. నీవు సభ్యుడిగా చేరవలెనని నా కోరిక. పని అంత పెద్దగా వుండదు. ఎక్కువ ప్రయాణాలు చేయనక్కరలేదు. కస్తూరిబా నిధి విషయం ఇంకొకటి. ఆ ట్రస్టులో నీవు సంతోషంగా ఉండలేవేమోనని నా సందేహం. నేను వుత్తరం వ్రాశాను. దానికి సమాధానం లేదు.

చివరి విషయం. నీమధ్యా, శరత్‌బాబు మధ్యా వివాదమేమిటి? అది నన్ను కలతబెట్టుతున్నది. వెనక ఇంకా ఏమైనా వున్నదా? తెలియజేయవలెను. నీ వుత్తరం గురించి నాతో మాట్లాడవలెనంటే కలుద్దాము.

నీవు చాలా కష్టపడి పనిజేస్తున్నావు. మీ క్షేమం వ్రాయవలెను. ఇందు కులాసా అని తలుస్తాను.

బాపూ

★ ★ ★

## 40. జవహర్‌లాల్ నెహ్రూ నుండి

ఆనందభవనం
అలహాబాదు
అక్టోబరు 9, 1915

బాపూజీ !

లక్నో నుండి తిరిగి వచ్చిన తరువాత 5వతేదీ మీ వుత్తరం చూచాను. అన్ని విషయాలూ స్పృశిస్తూ మీరు వుత్తరం వ్రాశారు. నాకు చాలా ఆనందంగా వున్నది. అన్నింటికీ నేను జవాబు వ్రాస్తున్నాను. కొద్ది ఆలస్యమైనందుకు క్షమించండి. వివిధ కార్యక్రమాల వలన నాకు తీరిక వుండడం లేదు. ఇక్కడ ఒకటి లేక ఒకటిన్నర రోజులు మాత్రం వుంటాను. కలసి మాట్లాడడమే మంచిది. అది ఎపుడు సంభవమవుతుందో తెలియదు. ప్రయత్నిస్తాను.

సంక్షేపంగా నా అభిప్రాయాలు

మన ముందున్న సమస్య సత్యము. అహింస, ఆధిపత్యము, హింస కాదు. నిజమైన సహకారం, శాంతియుతమైన విధానాల అనుసరణ మన లక్ష్యం. అట్టి సమాజాన్ని స్థాపించడమెలా, దానిలోని భాగాలేమిటి అదీ మన సమస్య. ఒక్క గ్రామమే సత్యాహింసలకు స్థానం ఎందుకు కావాలో నాకర్థంగావడం లేదు. నిజం చెప్పాలంటే గ్రామాలు బౌద్ధికంగా వెనకబడి వున్నవి. సాంస్కృతికంగా గూడా అంతే. వెనకబడిన వాతావరణంలో ప్రగతిని సాధించడం కష్టం. సంకుచితవాదులు అసత్యవాదులు హింసావాదులు ఎక్కువవుతారు.

తరువాత మనం ఇంకా కొన్ని షరతులు పెట్టుతాము. తగినంత ఆహారం, గుడ్డలు, నివాస సౌకర్యము, విద్య పరిశుభ్రత ఇవి ఆ షరతులు. అవి దేశానికి ముఖ్యం. ఆ సౌకర్యాలు యిందరికి ఎలా సమకూర్చగలమో, ఆలోచించాలి. అంతేగాక ఆధునిక రాకపోకల సదుపాయాలూ, ఇంకా అవసరమైన ఆధునిక సౌకర్యాలూ గూడా సమకూర్చుకోవాలి. అవి సమకూరాలంటే భారీ పరిశ్రమలూ కావాలి. అవి గ్రామీణ సమాజంలో ఎలా సాధ్యం? భారీ పరిశ్రమలనూ, లఘు పరిశ్రమలనూ వికేంద్రీకరించాలి. విద్యుచ్ఛక్తి అభివృద్ధి చెందుతున్నది గనుక అది ఇప్పుడు సంభవమే. రెండు రకాల ఆర్థిక విధానాలు అమలులో వుంటే వాటి మధ్య పోటీ అయినా వుంటుంది. లేకపోతే ఒకదాన్ని ఇంకొకటి మింగివేస్తుంది. స్వాతంత్ర్యం లభించినా విదేశీ శక్తుల దురాక్రమణ నుండి గూడా విముక్తి కావాలి. దానికి రాజకీయంతో బాటు ఆర్థికంగా గూడా ప్రగతికి మార్గాలు ఏర్పడాలి. స్వతంత్రదేశంగా మనవలెనంటే ఈనాటి పరిస్థితులలో టెక్నికల్ (యాంత్రికంగా) గా గూడా, అభివృద్ధి జరగడం అవసరం. ప్రస్తుత ప్రపంచమున్న స్థితిలో వైజ్ఞానికానుసంధానం లేనిది సాంస్కృతికంగా గూడా అభివృద్ధి చెందలేము. నేను సైనిక బలాన్ని గురించి ఆలోచించడం లేదు. వైజ్ఞానికాభివృద్ధిని గురించి ఆలోచిస్తున్నాను. విశ్వంలో ఈనాటి వ్యక్తులలో, జాతులలో ఒక విచిత్ర మనఃస్థితి కన్పిస్తున్నది. అందువల్లనే యుద్ధాలు జరుగుతున్నవి. అందువలన ఏ దేశానికీ ఒంటెత్తు తనం పనికిరాదు. పరస్పర సహకార భావం అవసరం. విశ్వంలోని ఆర్థిక విధానాన్ని వదలి ఒక్కరం వేరుగా వుండడం గూడా సంభవంగా కనబడదు. పరస్పర సహకారం లేనినాడు మనదేశం గూడా యుద్ధాలకు నిలయమవుతుంది.

లక్షల మంది జనానికి భవనాలు నిర్మించలేము. కాని వారికందరికీ సౌకర్యం కలిగిన భవనాలు ఎందుకుండగూడదు? ప్రస్తుతం అడ్డదిడ్డంగా పెరిగిన పట్టణాలు అనేకమైన "చెడు" లను సృష్టిస్తున్నవి. వాటిని కొంతవరకు ఆపుతున్నాము. అది జరగడం లేదు. గ్రామాలను సంస్కృతికి నిలయాలుగా మారిస్తే మార్పు వస్తుందేమో!!

చాలా కాలం క్రితం హింద్ స్వరాజ్య పుస్తకం చదివాను. బాగా జ్ఞాపకం లేదు. అస్పష్టంగా వున్న జ్ఞాపకంతో అది పరిస్థితిని వాస్తవికంగా చిత్రిస్తున్నట్లు నాకు

అనిపించడం లేదు. అంత స్పష్టంగా మాట్లాడలేను. మీ ఉపన్యాసాలూ, వ్యాసాలూ చదువుతుంటే మీలో మార్పు వచ్చిందనీ, ఆనాటి కంటె ముందుకు వచ్చారనీ అనుకొన్నాము. ఆధునికత విధానాలను మీరు అర్థం చేసుకొన్నారనిపించింది. కాని మీ వుత్తరంలో మీ పాత చిత్రమే మనస్సులో వున్నదని మీరు వ్రాస్తే ఆశ్చర్యం కలిగింది. కాంగ్రెస్ ఆ చిత్రాన్ని గురించి ఎన్నడూ ఆలోచించలేదు. తీర్మానాలేమీ చేయలేదు. మీరు గూడా ఆ విషయం ఎప్పుడు ఎత్తలేదు. ఈ మూల భూత విషయాలను గురించి కాంగ్రెస్సు ఆలోచించడం ఎంతవరకు సబబు? అటువంటి విషయాలలో కాంగ్రెసులో చర్చ అవసరం లేదని నా అభిప్రాయం. ఆ చర్చల వల్ల భారత ప్రజలలో అనేకమైన అపోహలు బయలుదేరగలవు. భారత ప్రతినిధులు ఎప్పుడో ఒకప్పుడు ఒక నిర్ణయానికి వస్తారు. 38 సంవత్సరాల క్రితం మీరు హింద్ స్వరాజ్య వ్రాశారు. ఇప్పటి ప్రపంచం చాలా మారిపోయింది. అనేకమైన కొత్త విషయాలు మన ముందుకు వస్తున్నవి. అన్నింటినీ దృష్టిలో పెట్టుకొని నిర్ణయం చేయకపోతే మనం ప్రపంచంలో వేరుపడిపోతాము. ప్రపంచం ఈనాడు ఆత్మహత్య చేసుకొంటున్నదని మీరడనం సత్యమే. దీనినుండి తప్పుకోవడమెలా, తనను రక్షించుకోవడమెలా, మంచిని రక్షించడమెలా ఇదీ మన సమస్య.

నాకు తోచినది తొందర తొందరలో వ్రాశాను. నా రాతలు చెడు గూడా చేయవచ్చును. నన్ను క్షమించండి. తరువాత వివరంగా వ్రాస్తాను.

ఇక హిందుస్తానీ ప్రచారసభ కస్తూరీబా నిధి సభ్యత్వం గురించి :- రెండింటి యెడల నాకు అభిమానమున్నది. అవి బాగా పనిచేస్తున్నవి. కాని వాటి కార్యపద్ధతిని గురించి నాకు బాగా తెలియదు. ప్రస్తుతం నా బాధ్యతలు ఎక్కువగా వున్నవి. అవి పెంచుకోవడం ఉచితం గాదు. సభ్యుడిగా చేరితే నామమాత్రానికే అవుతుంది.

ఇక శరత్‌బాబును గురించి. ఆయనకు నామీద అంత కోపం ఎందుకో నాకే తెలియడం లేదు. విదేశీ సంబంధాల విషయంలో భ్రమ వున్నదేమో తెలియదు. వెనకటి రోజుల్లో సుభాష్ బాబుకు కాంగ్రెసు విదేశీ నీతిని గురించి మంచి అభిప్రాయం వుండేదిగాదు. స్పెయిన్, జకోస్లోవేకియా, చైనాల విషయంలో సుభాష్ బాబు కాంగ్రెసు నీతితో విభజించారు. అది కారణమేమో తెలియదు.

మీరు నవంబరులో బెంగాలుకు వెళ్లుతున్నారు. అపుడు మూడు నాలుగు రోజులు కలకత్తాలో వుంటాను. మిమ్మల్ని కలుస్తాను.

జావా రమ్మని నాకు కొంతమంది మిత్రులకూ ఇండోనేషియా అధ్యక్షుడు పంపిన ఆహ్వానాన్ని గురించి మీకు తెలిసివుంటుంది. నేను అంగీకరించాను. అక్కడకు పోయే సౌకర్యాలు అనుకూలంగా వుంటే వెళ్లుతాను. లేకపోతే మానివేస్తాను. ఇండియా నుండి జావాకు విమాన ప్రయాణం రెండురోజులు. కలకత్తా నుండి ఒక్కరోజు. ఇండోనేషియా ఉపాధ్యక్షుడు మహమ్మద్ హట్లా నాకు పాత స్నేహితుడు.

మీరు ఇన్ఫ్యూయంజా నుండి కోలుకొని వుంటారు.

మీ ప్రేమపాత్రుడు
జవహర్‌లాల్ నెహ్రూ

★ ★ ★

## 41. జవహర్‌లాల్ నెహ్రూకు

పూనా
నవంబరు 13, 1943

ప్రియమైన జవహర్‌లాల్ !

నిన్నటి మన సంభాషణ నాకు సంతోషం కలిగించింది. అది ఎక్కువసేపు జరగలేదు. అందుకు విచారంగా వున్నది. ఒక్కసారి కలిస్తే సమయం సరిపోదు. మన మధ్య తరచు సమావేశాలు జరగాలి. శారీరకంగా బలమైన వాడినైతే నేను పూనా చేరుకొనేవాడినే. హృదయపూర్వకంగా సంభాషణ జరిపేవాడిని. ఇదివరలో అలాగే జరిగేది. మనమిద్దరం ఒకరినొకరం ఇంకా బాగా అర్థం చేసుకోవాలి. మనమిద్దరం ఎక్కడ నిలబడుతున్నామో ప్రజలకు గూడా తెలియాలి. మన దృక్పథాలలో పెద్దగా విభేదం లేదని సంభాషణ సారాంశంగా కనబడుతున్నది. నాకు అర్థమైనదానిని వ్రాస్తున్నాను. పొరపాట్లు వుంటే తెలియజేయవలెను.

1. మానవజాతిని ఆర్థికంగా, బౌద్ధికంగా, రాజనైతికంగా, నైతికంగా గూడా అభివృద్ధిపరచాలి. నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

2. అందుకు అందరికీ సమానహక్కులూ, సమాన అవకాశాలూ వుండాలి.
3. పట్టణాలలోనూ, గ్రామాలలోనూ నివసించే వారందరికీ తగిన ఆహారం, నీరు, దుస్తులూ, పరిశుభ్రమైన నివాసం వుండాలి. అందుకు ప్రజలు తమంత తాముగా ఉత్పత్తి చేయగలిగి వుండాలి.
4. మానవుడు ఒక సామాజిక ప్రాణి. అతడు సమాజానికి దూరంగా ఒంటరిగా వుండలేడు. అతడు స్వతంత్రుడు, పరతంత్రుడు గూడా. ఒకరి మీద ఇంకొకరు వీపు నెక్కి సవారీ చేయగూడదు. గ్రామం ఒక యూనిట్‌గా వుండాలి లేక వ్యవస్థీకరించబడిన జన సమూహం ఒక యూనిట్‌గా వుండవచ్చును. ప్రజలు స్వావలంబకులు గావాలి. ఒకరికొకరు పరస్పర సహకారం అందించుకోవాలి.

నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకొన్నట్లు నీవు భావిస్తే ప్రశ్న రెండో భాగాన్ని గురించి తరువాత వివరిస్తాను.

నా మొదటి వుత్తరం అనువదించమని రాజకుమారికి ఇచ్చాను. దాని ఇంగ్లీషు అనువాదం నీకు పంపుతాను.

ఇందు కు ఆశీర్వాదాలు

ఆశీర్వచనాలతో
బాపూ

★ ★ ★

## 42. కొండా వెంకటప్పయ్యా గారికి

సత్యాగ్రహ ఆశ్రమం
సబర్మతి
మార్చి 4, 1922

ప్రియమైన స్నేహితునికి,

మీ వుత్తరానికి జవాబు వ్రాస్తున్నాను.

అహింసాత్మక వాతావరణం ఎప్పుడైనా ఏర్పడుతుందా? ఏర్పడితే ఎప్పుడు? ఇది మీ మొదటి ప్రశ్న. ఇది సహాయ నిరాకరణ అంత పాత ప్రశ్న. ఇది ఏదో మన

దేశంలో కొత్త "ప్రయోగ"మని మిత్రులూ, అనుచరులూ ప్రశ్న వేస్తుంటే నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. మనకు అహింస మీద సంపూర్ణ విశ్వాసమున్న కార్యకర్తలు దొరికితే ఈ పోరాటం విజయవంతమయి తీరుతుంది. సందేహం లేదు. అసలు చాలామందికి ఇదేమిటో అర్ధమేగావడం లేదు. సివిల్ డిసొబిడియన్స్ అంటే అది అహింసాత్మక విధానం. మానసిక సంతులనాన్ని కోల్పోకుండా ఉండేటందుకు జనానికి ప్రశిక్షణ ఇవ్వాలి. అయినా 30 కోట్ల మంది ప్రజలనూ అహింసా వాదులను చేయడం కష్టమేనని నేను అంగీకరిస్తున్నాను. కాని అది అసంభవమంటే నేనంగీకరించను. విశ్వాసం లేనివారు ఇళ్ళల్లో కూర్చొనవచ్చును. పనిచేసే విశ్వసనీయులైన కార్యకర్తలుంటే అది అసంభవం కాదు. చౌరీచౌరాలో జరిగిందేమిటి? బుద్ధిపూర్వకంగా ఊరేగింపు ప్రారంభింపబడింది. ఆ ఊరేగింపును బుద్ధిపూర్వకంగా పోలీసుఠాణా వైపుకు నడిపించడం జరిగింది. ఆ ఊరేగింపు పోలీసురాణా వైపుకు నడపకుండా వుండవలసింది. అది జరగలేదు. పోలీసులను చంపవలసిన అవసరమేమున్నది? చంపివేయడం జరిగింది. స్వయంసేవకులు చౌరీచౌరా ఘటన జరగకుండా ఆపవలసింది గాదా? అయితే ఒక పథకం ప్రకారం ఈ హత్యలు జరిగినవని నేననను. జరగబోయే దానిని ముందుగా పసిగట్టవలెను గదా? బొంబాయిలో ఘటన జరిగినపుడు ప్రత్యక్ష సాక్ష్యంగా కఠినంగా చెప్పవలసివుండెను. నేను గూడా ఆపలేకపోయినాను. మద్రాసులో జరిగినదానికి కాంగ్రెసు కమిటీదే బాధ్యత అని నా అభిప్రాయం. బొంబాయిలో జరిగినదాన్ని దృష్టిలో పెట్టుకొని మద్రాసులో ఆపివేయవలసి వుండెను అంటే అహింసనూ, దాన్ని అనుసరించకపోతే కలిగే పరిణామాలను ఎవ్వరూ అర్ధం చేసుకొనలేదు. పెద్దగా జనాన్ని పోగుజేశారు. ఉద్రేకాలను రెచ్చగొట్టారు. అదే లక్ష్యమని భావించారు. న్యాయ నిర్ధారణకు సంత్ పురుషులు సాధు పురుషులు అవసరం లేదు. విశ్వాసపాత్రులైన కార్యకర్తలు గావాలి.

ఒక్క సంవత్సరంలో అంతా పూర్తి గావలెనని భావించడం జరిగిందని మీరంటున్నారు. అది నిజమే. దానిలో సత్యం లేకపోలేదు. వాళ్లు నెమ్మదిగా పనిచేస్తే మార్గం తప్పకుండా వుంటే 'ఏమి ముంచుకొనిపోయేది '!! తాత్కాలికమైనదని నేను అర్ధం చేసుకొనగలను. కాని, అదే ముఖ్యం కాగూడదు. పెద్ద జాతీయోద్యమంలో

ఆవేశం ప్రధాన భాగం కాగూడదు. స్వరాజ్య ప్రాప్తి చమత్కార క్రియ గాదు. అది నెమ్మదిగా పరిణతి చెందే పరిణామం.

హిమాలయ ప్రాంతంలోని ఒక కుగ్రామానికీ, కన్యాకుమారికీ సంబంధ ముంటుంది. ఒకదానికొకటి దూరంలో వున్నా ఉద్యమంలో అట్లా జరగదు. అవి రెండూ ఇండియాలో భాగాలేగదా !! బార్డోలీ సత్యాగ్రహ ఫలితప్రభావం భారతదేశంలో అన్నిచోట్లా పడుతుంది. గోరఖ్‌పూరు, మద్రాసు, బొంబాయిలో జరిగిన ఘటనలకు ఒకదానితో ఇంకొకదానికి సంబంధం లేదని చెప్పడానికి వీలులేదు. మలబారు ఇంకొక రకపు ఉదాహరణ. మాప్లాలు హింసకు దిగారు. మాప్లాలు ఇతర భారతీయుల వంటి వారుకారు. మాప్లాలకు అహింస తెలియదు. ఆ పోరాట ప్రభావం ఇతర ప్రాంతాల మీద పడగూడదు. మలబారు వ్యవహారం ప్రత్యేకంగా జరిగింది. కాని గోరఖ్‌పూర్ అటువంటిది గాదు. అక్కడి జనం మాప్లాలు కారు. అందువలన ఉద్యమం జరుగుతున్నప్పుడు మన జాగ్రత్తలు మనం తీసుకోవాలి. లేకపోతే హింసాప్రవృత్తి దేశమందంతటా వ్యాప్తమవుతుంది.

శాసనోల్లంఘనాన్ని విరమిస్తే జనం మనోభావాన్ని మనం తెలుసుకోలేమని మీరంటున్నారు. మనకా అవసరం లేదు. మనోభావం ఎట్లా ఏర్పడుతుంది? జనం పరిశ్రమలోనూ, నిర్మాణ కార్యక్రమంలోనూ నిమగ్నులైతే ఆవేశాలకు తావెక్కడుంటుంది? జనంలో ఆవేశం పనికిరాదు. వారు ఆవేశాన్ని ఆపుకోవాలి. అయినా అప్పుడప్పుడు తాత్కాలికంగా ఆవేశం ఏర్పడవచ్చును. ఆ పరిస్థితిని మనం నివారించే ప్రయత్నం చేసితీరాలి. నివారించాలి.

అదీగాక మనం సహాయ నిరాకరణోద్యమాన్ని రద్దుచేయలేదు. తాత్కాలికంగా ఆపుజేశాము. యంగ్ ఇండియాలో నేను స్పష్టంగా వివరించాను. ప్రజలు ఉద్రేకపూరిత కార్యక్రమానికి సిద్ధపడితే దాన్ని మనం అరికట్టాలి. దానివలన మనం జనుల దృష్టిలో తేలికపడినా సంగరితంగా పనిచేస్తే మనం సఫలత పొంది తీరుతాము. ఏదో సమయానికి తోచినట్లుగా, అస్తవ్యస్తంగా చేసిన పని సఫలం గాదు. అందువలన మీరు బాగా ఆలోచించండి. నిర్ణయానికి రండి.

మనల్ని మనం సరిదిద్దుకొనడం, ఉద్యమాన్ని సరైన మార్గంలో నడిపించటం చాలా ముఖ్యం. అహింసాత్మకంగా ఉద్యమం జయం పొందదని అపవాదు వచ్చినా నేను భయపడను. నిజంగా అహింస మీద మనకు నమ్మకం ఉండాలి. ఆ నమ్మకం గౌరవప్రదమైన నమ్మకంగా వుండాలి. హింసను నేను ప్రతిఘటిస్తాను. హింస మనకు పనికిరాదు. అది వదలివేయవలసినదే. ఎక్కువమంది జనం రాజకీయోద్యమమని భావించి దీనిలో ప్రవేశించినట్లున్నారు. వీరు నా భావాలతో ఏకీభవించకపోవచ్చును. నా భావాలను వారి మీద రుద్దను. కాని నా భావాలు నా భావాలే. నా నమ్మకాలు నా నమ్మకాలే.

మీ

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 43. టి. ప్రకాశం గారికి

సబర్మతి అశ్రమం

సబర్మతి

7-3-1922

శ్రీ టి. ప్రకాశం గారూ

నా భవిష్యత్తు కార్యక్రమం గురించి వ్రాశాను. మీకు నేనొక టెలిగ్రాం పంపించాను.

"శనివారం వరకు అహమ్మదాబాదు. సూరత్ ఆదివారం, సోమవారం, బార్డోలీ మంగళవారం".

కాని ఇదంతా ప్రభుత్వం వారిమీద ఆధారపడివున్నది. ప్రచారంలో వున్నదేమిటంటే రాబోవు వారం రోజులలో నామీద వున్న బరువంతా తగ్గుతుందట. నా సెలవు అయిపోతుందట. ఏమైనా నన్ను ప్రభుత్వం నిర్బంధిస్తే మీరంతా సంపూర్ణంగా శాంతిని వహించాలి. అదే నాకు నా దేశం చేసే గొప్ప సన్మానం. నేను ఏ జైలులో వున్నా విశేషం లేదు. ఆ కారణంగా ఎవ్వరికీ అపకారం జరగలేదనీ, ఎక్కడా హింస జరగలేదనీ, ఆస్థి నష్టం జరగలేదనీ నాకు తెలిస్తే నేను చాలా సంతోషిస్తాను. నా సలహాను పాటించి జనం

శాంతంగా వుండాలి. నా అరెస్టు జరిగిన మరునాడు దేశమందంతటా విదేశీ వస్త్ర దహనం జరగాలి. అందుకు ఎవ్వరినీ బలవంతం చేయగూడదు. ఖద్దరు ధరించగలమని ప్రజలు ప్రతిజ్ఞ చేయాలి. హిందువులూ, ముస్లిములూ తమ తమ పద్ధతిలో ఖద్దరు ధరించాలి. రాట్నానికి గిరాకీ ఏర్పడాలి. వడకటం తెలియనివారు వడకటం నేర్చుకోవాలి. మనలో హింసాప్రవృత్తి ఏర్పడుతున్నట్లు నాకు తోస్తున్నది. అది సమూలంగా పెకలించబడాలి. నిర్మాణ కార్యక్రమ నిర్వహణలో ప్రజలు లీనం గావాలి. అది అంత కష్టతరమైన పనిగాదు. నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నవారు స్వరాజ్యప్రాప్తికి గూడా తోడ్పడుతారు. అందులో అపజయం పొందితే మనం వ్యక్తిగత సత్యాగ్రహానికి గూడా పనికిరాము. అఖిల భారత కాంగ్రెసు కమిటీ, ప్రాంతీయ కాంగ్రెసు కమిటీలు అన్నీ ఇందుకు పూనుకోవాలి. కాంగ్రెసు వారి కర్తవ్యమిది. కాని వారికి గూడా ఇంకా ఏవో సందేహాలున్నట్లు తోస్తున్నది. నాకేమీ సందేహం లేదు. అవసరమైతే మార్గాలను గురించి కొద్ది మార్పులతో ఆలోచిద్దాము. కాని జరిగిన నిర్ణయాలను సంపూర్ణంగా అమలుచేయాలి.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 44. హకీమ్ అజ్మల్ ఖాన్ గారికి

సబర్మతి జైలు

మార్చి 12, 1922

ప్రియమైన హకీమ్‌జీ

నా అరెస్టు జరిగిన తరువాత జైలు నుండి మీకు మొదటి ఉత్తరం వ్రాస్తున్నాను. జైలు నుండి ఉత్తరాలు వ్రాయవచ్చని నిర్ధారణ చేసుకొన్న తరువాతనే ఈ ప్రయత్నం మీతో నేను ప్రారంభించాను.

నేను విచారణలో వున్న ఖైదీని. శంకర్‌లాల్ బ్యాంకరు గూడా నాతో ఉన్నాడు. మేమిద్దరం దగ్గరి మిత్రులం. అందువల్లనే కాబోలు ఇద్దరినీ ఒకేసారి నిర్బంధించారు.

ఇద్దరం సంతోషంగా ఉన్నాము. వర్కింగు కమిటీకి మీరు అధ్యక్షులు. మీరు హిందూ ముస్లిమ్‌ల కందరికీ నాయకులు. అందుకే ఈ వుత్తరం వ్రాస్తున్నాను.

మీరు ముస్లిం నాయకులే గాదు. నాకు ఆప్తమిత్రులు. 1915 నుండి మిమ్మల్ని నేనెరుగుదును. మీ స్నేహం నాకు నిధి వంటిది. హిందూ ముస్లిమ్ ఐక్యతకు మీరు మూర్తీభవించిన చిహ్నం. ఐక్యత అంటే ఏమిటో మీ జీవితంలో అమలుచేసి చూపించారు.

హిందూ ముస్లిమ్ ఐక్యత లేకపోతే స్వరాజ్యం రాదని ఇదివరకటి కంటే ఇప్పుడు ఎక్కువగా అర్థం చేసుకొన్నాము. ఆ ఐక్యత లేనిదే భారతదేశం ఖిలాఫత్‌కు గూడా సహాయం చేయలేదు. మనలో మనం విడివిడిగావుండి విడిపోతే మనం ఎల్లకాలం బానిసలుగానే వుండిపోతాము. అందువలన ఈ ఐక్యత మనకు ప్రాణప్రదమైనది. అల్ప సంఖ్యాకులైన పార్సీలు యహూదీలు, క్రిస్టియన్లు, సిఖ్ఖులను మనం అణచ ప్రయత్నిస్తే మనలో మనం పోట్లాడుకునే పరిస్థితి ఏర్పడుతుంది.

ఈ ఐక్యత అహింసను పూర్తిగా మనం అవలంబిస్తేనే గాని, ఏర్పడదు. ఏర్పడినా స్థిరంగా నిలబడదు. ఇది మన నీతిగా రూపొందాలి. కలిసి వున్న హిందూ ముస్లిమ్‌లు ప్రపంచంలోని ఏ శక్తినైనా ఎదుర్కొనగలరు. ఇంగ్లీషువారితో వ్యవహరించునపుడు హింసను అవలంబించడం పిరికితనమని నా భావం. వారి ఫిరంగులకు ఇదివరలో భయపడ్డాము. ఐక్యత వున్నదని భావించిన తక్షణం అటువంటి భయం మన దరికి రాదు. అందువలన, బలహీనత వలన గాక, బలం మీద ఆధారపడి అహింసను అవలంబించమని నేను అందరినీ ప్రబోధిస్తున్నాను. మనం ఇంకా అహింసను పూర్తిగా అర్థం చేసుకోలేదు. హిందూ ముస్లిమ్ ఐక్యత గూడా మనజీవితాలలో లోతుగా ప్రవేశించలేదు. ఇంకా అపనమ్మకం, భయం వ్యాపించివున్నవి. అయినా నేను నిరాశపడటం లేదు. మనం చాలా ముందుకు సాగాము.

అందుకు సంఖ్య కంటే గుణాత్మకత మీద మనం ఆధారపడాలి. మన రాజకీయ లక్ష్యాలు ప్రాప్తం కావలెనంటే నమ్మకం, విశ్వాసపాత్రత, అహింసల మీద మనం ఆధారపడక తప్పదు. అందువలన మన కాంగ్రెసు సభ్యులందరూ అందుకు తోడ్పడి పనిచేయవలెనని కోరుతున్నాను. విశ్వాసమన్నది తయారుచేసేది గాదు. అది బహు సంఖ్యాకుల బలం మీద ఏర్పడేది గాదు.

అహింసకు చిహ్నం రాట్నం. ఖద్దరు, రాట్నం మీద ఐక్యతా దారాలను వడకి మనం తయారుచేయాలి. అవి మన ఐక్యతకు, స్వరాజ్యప్రాప్తికి చిహ్నాలు.

ఇంతేగాక ఉపాధిదారులు తమ ఉపాధులనూ, వకీళ్లు న్యాయవాద వృత్తులనూ, ఉపాధ్యాయులు స్కూళ్లు, కాలేజీలనూ బహిష్కరించాలి. కౌన్సిలర్స్ మున్సిపల్ కౌన్సిళ్లనూ, సైనికులు, ప్రభుత్వోద్యోగులు తమ పదవులనూ వదలివేయాలి. ప్రాప్తించిన ఫలితాలను బేరీజు వేసుకొని తమ పనులను వ్యవస్థీకృతం చేసుకోవాలి.

మన దగ్గర కార్యకర్తలు తక్కువగా వున్నారు. అవసరమైన పనుల కొరకు వారి శక్తిని నిరుపయోగం చేయడం మంచిదిగాదు. మనకై చాలా నిర్మాణ కార్యక్రమం ఎదురుచూస్తున్నది. వినాశకరమైన ప్రచారం ఎక్కువగా జరుగుతున్నది. అసహనము హింసలో ఒక భాగమే. మన సహాయకులు మనకు దూరంగా వుంటున్నారు. మనల్ని చూచి భయపడుతున్నారు. ఉన్నదానికంటే చెడును ఇంకా మనం వ్యాప్తం చేస్తున్నామని వారి అభిప్రాయం. అందుకు గల కారణాలను మనం దూరం చేయాలి. మనం ఇంగ్లీషు వారికి నష్టం కలిగించము. వారికేమీ హాని కలగజేయము. శత్రువుల యెడల గూడా మంచి ఆచరణ మన లక్ష్యం.

నా అరెస్టు, జైలు నిర్బంధము మంచికి దోవ తీయగలదని నా విశ్వాసం. ఎవరి మీదా నాకు దుర్భావం లేదు. నా మిత్రులందరూ నావలెనే అహింసావాదులు కాలేకపోవచ్చును. ఈ ప్రభుత్వాన్ని పక్షపాతం వచ్చిన దానినిగా చేయదలచుకోలేదు. చాలామందిని జైలుకు పంపడం గూడా మన ఉద్దేశ్యం కాదు కాని పరిస్థితులు ఎలా మారుతవో తెలియదు.

జైలుకు మనం భయపడుతున్నామని నా అభిప్రాయం కాదు. ప్రభుత్వం పనిచేసే అందరు అహింసావాదులను అరెస్ట్ చేస్తే నిర్బంధిస్తే దానికి స్వాగతం చెపుతాము. జైళ్లల్లో వున్నవారి కొరకై దేశం ఏమిచేస్తుంది? స్వరాజ్య పార్లమెంటు ఏర్పడితేనే గాని ముక్తి లేదు. మనమందరం ఖద్దరు ధరించడం స్వరాజ్యమే.

అస్పృశ్యతను గురించి చెప్పలేదు. అస్పృశ్యత వుండగూడదు. హిందూ ముస్లిం సమైక్యత ఎంత అవసరమో అస్పృశ్యతా నివారణ గూడా అంత అవసరం.

మీ ముందు నేను కార్యక్రమం వుంచాను. ఖిలాఫత్‌కు గూడా ఇదే కార్యక్రమం దేశ లక్ష్యసాధనకు భగవంతుడు మీకు ఆరోగ్యాన్నీ, బుద్ధిబలాన్ని ప్రసాదించు గావుత.

మీ

ఎమ్. కె. గాంధీ

★ ★ ★

## 45. జమునాలాల్ బజాజ్‌కు

సబర్మతి సెంట్రల్ జైలు
మంగళవారం రాత్రి
16.3.1922

జమునాలాల్

సత్యం కొరకు అన్వేషిస్తున్నా నాకు అంతా సత్యం గానే కనబడుతున్నది. అది అహింసలో లేదు. అహింసయే దానిలో వున్నది. పవిత్రమైన హృదయం బుద్ధి దానిని దర్శించగలవు. అవి దర్శించినవే సత్యం. కాని అహింసను గురించి వివరించడం కొంచెం కష్టం. రోగాణువుల నాశనం హింస. కాని అది చేయక తప్పదు. ప్రపంచం హింస మధ్యన అహింసాత్మక జీవనం గడపాలి. అది మనస్థితి. ఆవిధంగా సత్యాన్నుండి అహింసను వేరుచేస్తున్నాను. సత్యం వలన ప్రేమ, సౌకుమార్యం, నమ్రత వంటివి ఏర్పడతవి. బ్రహ్మ సత్యం జగన్మిథ్య అనే సూక్తిని రోజురోజూ నేను వర్తింప జేసుకొంటున్నాను. అది మనకు సహనాన్ని బోధిస్తుంది. మనలోని కాఠిన్యాన్ని పోగొడుతుంది. మనలోని లోపాలను, చిన్న చిన్న మచ్చలను పర్వతాలుగా చూపిస్తుంది. ఇతరుల లోపాలను, పర్వతాలలాంటి వాటిని చిన్న మచ్చలుగా చూపుతుంది. అహంతో శరీరముంటుంది. దాని నాశనమే మోక్షం. అదే సత్యస్వరూపం. అదే బ్రహ్మ. అందువలన భగవంతునికి గల అత్యద్భుతమైన పేరు దాసానుదాస.

భార్య, పిల్లలు, స్నేహితులు, ఆస్తులు అన్నీ సత్యం ముందు నిలవలేవు. సత్యాన్వేషణలో వాటినన్నింటినీ విసర్జించవచ్చును. అప్పుడే వ్యక్తి సత్యాగ్రహి కాగలడు. ఆ సిద్ధాంతాన్ని అనుసరించవలెనని ప్రయత్నిస్తున్నాను. అందుకే మీ వంటివారిని

దీనిలోనికి దింపుతున్నాను. ఇది హింద్‌స్వరాజ్య ఫలితం. అట్టి సత్యాగ్రహులు ఇంకా దొరకలేదు గనుక స్వరాజ్యప్రాప్తికి ఆలస్యం జరుగుతున్నది.

నీవు నా ఐదవ కుమారుడివి. నిన్ను అందుకు తగిన వాణ్ణి చేయాలి. అది అంత తేలికగాదు. భగవంతుని సహాయం కాంక్షిస్తూ..

బాపూ

★ ★ ★

## 46. మహమ్మద్ అలీకి

పాసూన్ హాస్పిటల్
పూనా
7.2.1924

ప్రియమైన స్నేహితునికి

అకస్మాత్తుగా నన్ను జైలునుండి వదలిన తరువాత మన దేశ ప్రజలు నా నుండి ఏమి ఆశిస్తున్నారో తెలియజేయడానికి కాంగ్రెసు అధ్యక్షుడుగా వున్న మీకు ఈ వుత్తరం వ్రాస్తున్నాను. నా అనారోగ్యం కారణంగా ప్రభుత్వం నన్ను అనుకోకుండా సమయానికి ముందు జైలు నుండి విడుదల చేసింది. అది నాకు సంతోషాన్ని కలిగించలేదు. అనారోగ్యం జైలు విడుదలకు కారణం కాకూడదు.

మీ ద్వారా ప్రజలూ, జైలు అధికారులూ, ఆస్పత్రి అధికారులూ నా అనారోగ్యం విషయంలో తీసుకున్న శ్రద్ధకు నేను కృతజ్ఞుణ్ణి. యర్రవాడ జైలు సూపరింటెండెంటు కర్నల్ ముర్రే నా అనారోగ్యాన్ని గుర్తించారు. వెంటనే తగు సహాయం కొరకు కర్నల్ రుడ్డాక్‌ను పిలిపించారు. వారిద్దరూ శ్రద్ధ తీసుకొని నాకు మంచి వైద్య సహాయాన్ని అందించారు. లేకపోతే నేనీ పాసూన్ హాస్పిటల్‌కు చేరగలిగేవాడిని కాదు. కర్నల్ రుడ్డాక్ గారి అనుచరులు చాలా శ్రద్ధగా నాకు వైద్యసేవ అందించారు. నా చుట్టూ వుండి సోదరీమణుల వలె సేవజేసిన నర్సులను నేను మరచిపోలేను. ఈ హాస్పిటల్ వదలవలసి వచ్చినపుడు కర్నల్ రుడ్డాక్ వంటి వారి సహాయం ఇతర చోట్ల లభించదని గాయం మానినదాకా రుడ్డాక్ గారి ఆశ్రయంలో వుండవలెనని నిశ్చయించుకొన్నాను.

కొంతకాలం వరకు నేను ప్రజాసేవకు పనికిరానని నా మిత్రులందరికీ తెలిసివుంటుంది. నేను తొందరగా ఆరోగ్యవంతుడిని కావలెనని కోరే వారెవ్వరూ నన్ను కలుసుకునే ప్రయ్నతం చేయరని భావిస్తున్నాను. నేను మిత్రుల్ని కలుసుకోలేను. నన్ను కలుసుకోకుండా ఆ మిత్రులు ప్రజాకార్యాలు ముఖ్యంగా వడకటం చేయవలెనని నా కోరిక.

నా విడుదల నాకు ఉపశమనాన్ని కల్పించలేదు. విడుదలకు పూర్వం నాకు బాధ్యతలు లేవు. జైలు నియమాలు అవకాశం కల్పించినవి. ఇప్పుడు నా మీద బాధ్యత పడింది. అందుకు శారీరకంగా నేను తగిన స్థితిలో లేను. విపరీతంగా టెలిగ్రాములు వస్తున్నవి. అవి దేశ ప్రజలకు నామీద ఎంత అభిమానమున్నదో తెలియజేస్తున్నవి. అందువలన నాకు సంతోషం కలుగుతున్నది. నామీద పెద్ద బాధ్యత వున్నది.

ప్రస్తుతం దేశంలో వున్న స్థితి నాకు బాగా తెలియదు బార్డోలీ తీర్మానం జరిగిన నాటి స్థితి నాకు బాగా తెలుసును. అవి ఇంకా ఆ స్థితిలోనే వున్నట్లున్నవి. హిందువులు, ముస్లిమ్‌లు, క్రిష్టియన్లు, సిఖ్ఖులు మొదలైన వారందరిలో ఐకమత్యం సమైక్యత లేనిది స్వరాజ్యం అర్థరహితం. 1922లో బలహీనపడినట్లు అనిపిస్తున్నది. పరస్పర విశ్వాసానికి బదులు అవిశ్వాసం ఏర్పడినట్లున్నది. స్వాతంత్ర్యం కావాలంటే భిన్న భిన్నమతాల వారిలో సమైక్యత ఏర్పడాలి. జైలు నుండి విడుదలైనందుకు నా యెడల దేశ ప్రజలు చూపిన అభిమానం భిన్న భిన్న వర్గాల మధ్య ఐకమత్యం సాధించడానికి ఉపయోగపడుతుందా? అది నాకు ఆరోగ్యాన్ని కలిగిస్తుంది. మీరందరూ అందుకు కృషిజేయండి. భగవంతుని మీద సంపూర్ణ విశ్వాసముంటే ఏదీ అసంభవమే గాదు. బలహీనతలను మనం అర్థం చేసుకొని అతని శరణు కోరితే తప్పక సహాయం లభిస్తుంది.

బలహీనత భయానికి కారణం భయం అవిశ్వాసానికి కారణం. హిందూ ముస్లిమ్‌లమందరం భయాన్ని వదలి పోరాటాల నుండి విముక్తి పొందుదాము. మీరు అధ్యక్షులుగా వున్న కాలంలో తప్పక ఐకమత్యాభివృద్ధికి దోహదం కలగగలదని విశ్వసిస్తున్నాను. సోదరులుగా మనం ఒకరినొకరు ప్రేమించుకొంటున్నాము. నా కలవరాన్ని అర్థం చేసుకొని నాకు సహాయం చేయండి.

దేశంలోని బీదతనాన్ని చూస్తే రాట్నం ప్రస్తుత పరిస్థితుల్లో మనకు కళ్యాణ దాయకంగా కనబడుతున్నది. అది మనకు పోట్లాటల నుండి గూడా కొంత విరామాన్ని కలిగిస్తుంది. గత రెండు సంవత్సరాలుగా బాగా ఆలోచించిన తరువాత అది నాకు లభించింది. ఆ కార్యక్రమం మీద వెనకటి కంటె గూడా దృఢమైన విశ్వాసం కలిగింది. శాసనోల్లంఘనంతో అవసరం లేకుండా పోతే బాగుండునని ఆలోచిస్తున్నాను. అయితే దానిమీద విశ్వాసం మాత్రం నాలో ఏ మాత్రం తగ్గలేదు. ఆ మార్గం సరైనదే. దానిలో ప్రమాదం తక్కువ. అది ఇరుపక్షాలకూ సంతోషాన్ని కలిగిస్తుంది. యుద్ధం, హింస ఇరుపక్షాలకూ హాని కలిగిస్తుంది.

కాంగ్రెసువారు అసెంబ్లీలలోకి, కౌన్సిళ్ళలోకి పోవలెననే విషయంలో నా అభిప్రాయాన్ని తెలుసుకొనవలెనని ఆశించకండి. నా భావాలు మారలేదు. అదిగాక ఢిల్లీలో జరిగినదాని వివరాలు నాకు బాగా తెలియవు. మిత్రులందరితో చర్చించిన తరువాతగాని నేనొక అభిప్రాయానికి రాలేను.

మీ ద్వారా నా యెడల శుభాకాంక్షలు తెలిపిన వారికి ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. అందరికీ వేరువేరుగా ఉత్తరాలు వ్రాయడం పంభవం గాదు. చాలా అభినందనలు "మాడరేట్" స్నేహితుల నుండి అందినవి. వారితో నాకు గానీ, ఉద్యమానికి గానీ ఏవిధమైన వైరమూ లేదు. వారూ దేశాభిమానులే. దేశసేవకులే. వారి మార్గం తప్పు అని భావిస్తే వారిని సమాధానపరచడానికి ప్రయత్నించాలి. అంతేగాని వారిని నిందించడం మంచిది గాదు. ఇంగ్లీషు వారు గూడా మనకు స్నేహితులే. వారిని శత్రువులుగా భావించనక్కరలేదు. ప్రభుత్వ విధానంతో మనం విభేదిస్తున్నాము. వారి విధానాన్ని మనం హర్షించడం లేదు. పొరపాట్లు చేస్తే మన భవిష్యత్తును మనమే పాడుచేసుకొంటాము.

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 47. మోతీలాల్ నెహ్రూ గారికి

బొంబాయి

సెప్టెంబరు 2, 1924

మిత్రులు మోతీలాల్ గారూ,

ప్రార్థన జరిగిన తరువాత తెల్లవారుజామునే పెద్ద ఉత్తరం మీకు అందివుంటుంది. మీనుండి టెలిగ్రాం ఆశిస్తున్నాను. వ్యక్తిగతంగా ఏమి వ్రాశానో జ్ఞాపకం లేదు. సరోజినీ నాయుడు ఆ వుత్తరం చదవలేదు. ఆమె చదవక పూర్వమే తపాలా పెట్టెలోవేశాను. వ్యవహారానికి సంబంధించినంతవరకు నా దగ్గిర కాపీ వున్నది. మొదటి వుత్తరం లాగా ఇది గూడా జవహర్‌లాల్‌కు సంబంధించినదే. నా దృష్టిలో అతడు ఏకాకి అయిన నవయువకుడు. అతనిని గురించిన మీ మనోవ్యధ నాకు బాధ కలిగిస్తున్నది. యర్రవాడ జైల్లో వుండగా మంజూర్ అలీ, నేనూ జవహర్‌లాల్‌ను గురించి చర్చించాము. మీరు జీవించి వున్నారంటే జవహర్ కొరకేనని అతడు చెప్పాడు. అతని మాటలు అక్షరాలా నిజాలు. ఆ మీ పుత్ర ప్రేమ మధ్యకు ప్రత్యక్షంగా అప్రత్యక్షంగా కూడా నేను ప్రవేశించను.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 48. మోతీలాల్ నెహ్రూ గారికి

సబర్మతి ఆశ్రమం

20.4.28

మిత్రులు మోతీలాల్‌గారూ,

మీ ఉత్తరం అందింది. ప్రతిరోజూ నిశితంగా పరిస్థితిని పరిశీలిస్తున్నాను. ఫ్యాక్టరీ యజమానుల నుండి ఏమీ మేలు జరుగుతుందని తోచడం లేదు. వారు బలవంతులకు గాని లొంగరు. వారు ప్రభుత్వ వొత్తిడికి గాని లొంగరు. కాంగ్రెసు మాట వారు వినరు. మనం సహనం కోల్పోగూడదు. విదేశీ వస్త్రాలకు వలెనే భారతీయ మిల్లు వస్త్రాలను

గురించి మనం పట్టుబట్టవద్దు. మిల్లు వస్త్రాల విషయంలో నకారాత్మక విధానం పనికొస్తుంది. బహిష్కార కార్యక్రమం చెడుకు ధారి తీయవచ్చును. దానివలన విదేశీ వస్త్రాల బహిష్కరణ గూడా దెబ్బతింటుంది. పెద్ద బహు జనాందోళన జరిగితే గాని మనం సామాన్య ప్రజానీకాన్ని సమాధానపరచలేము. జనం భారతీయ మిల్లు గుడ్డలు కొంటారు. లాంకషైర్ మిల్లు గుడ్డలు, జపాను గుడ్డల మధ్య పోటీ జరుగుతుంది. భారతీయ మిల్లు గుడ్డలు ఇంకొకవైపు వుంటవి. పట్టణవాసుల ఆలోచనా విధానం మార్చడానికి మనం ప్రయత్నించాలి. గ్రామాలలో ఖాదీ ప్రచారం చేస్తూనే వున్నాము. ఇది మనం నడుపుతూ వుంటే గ్రామీణ జనంలో నెమ్మదిగా మార్పు వచ్చి తీరుతుంది. అప్పుడు గాని మిల్లు యజమానులు మన దారికి రారు. ఆ స్థితిలో విదేశీ వస్త్ర బహిష్కరణ ఆరు నెలల్లో మనం సాధించగలము. దానికి కార్యక్రమమిది.

భారతీయ మిల్లులను వొంటరిగా వదలివేద్దాము. ఖాదీని చూపించి విదేశీ వస్త్ర బహిష్కారానికి తీవ్రంగా కృషిజేద్దాము. మనమీదా మన జనం మీదా మనం విశ్వాసముంచాలి. ఖద్దరు కొరకై త్యాగం చేయమని ప్రజల్ని అర్థిద్దాము. ప్రస్తుతం బహిష్కారం ఆపుదాము. ప్రస్తుతమున్న రాజకీయ వాతావరణం పెద్ద పెద్ద పనులకు అనుకూలంగా లేదు. నిర్మాణ కార్యక్రమం మీద ఎవ్వరికీ దృష్టి లేదు. పెద్ద పెద్ద రాజకీయ ఉపన్యాసాలు చేసేవారికి గంభీరమైన పనుల మీద దృష్టి లేదు. జవహర్‌లాల్ తన వుత్తరంలో ఈ విషయాన్ని వివరంగా వివరించాడు. దానిలో హింస వున్నదని వ్రాశాడు. బెంగాల్‌లో విదేశీ వస్త్ర బహిష్కరణ గురించి చాలా విన్నాము. నిజమైన బహిష్కారం అక్కడ లేదని ఉత్తరాలు వస్తున్నవి. దానికి సరైన ఏర్పాట్లు లేవు. పనిచేయవలెననే ఇచ్ఛాశక్తి గూడా లేదు. అన్నీ ఆలోచించి ఏమి చేయమంటారో వ్రాయండి.

రొమైన్ రోలండు గారి వుత్తరం వచ్చే మంగళవారం అందవచ్చును. ఆ తరువాత నేనొక నిర్ణయానికి వస్తాను. యూరపు రమ్మని అతడంటే నేను ఏమి చేయాలి? బహిష్కారం కొరకు యూరపుకు వెళ్లకుండా మానివేయనా? మీ నిర్ణయాన్ని నేను అంగీకరిస్తాను. యూరపు వెళ్లవలెనని నాకంత ఆకాంక్ష లేదు. మన పరిస్థితులు అనుకూలంగా వుంటే రొమెన్ రోలండు ఆహ్వానం పంపితే నేను తప్పక ఆ ఆహ్వానాన్ని

అంగీకరించవలసి వుంటుంది. మీ నిర్ణయాన్ని టెలిగ్రాం ద్వారా తెలియజేయండి. జవహర్‌లాల్ మీతోనే వున్నాడు. డాక్టర్ 'అన్సారీ' ఉద్దేశ్యమేమిటో తెలుసుకోండి.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 49. సి. రాజగోపాలాచార్యులు గారికి

సబర్మతి

24.8.1924

ప్రియమైన రాజగోపాలాచారీ గారూ,

మహదేవ్ అతనికి మీరు వ్రాసిన ఉత్తరం చూపించారు. మీరు నిరాశపడగూడదు. సరోజినీ నాయుడు అభియోగకర్త. నేను ప్రతివాదినవుతాను. కొన్ని విషయాలలో నేను స్పష్టంగా నిర్ణయాలివ్వలేను. దాని అర్థమేమంటే మనం నమ్మకంలోని నీళ్లమీద ప్రయాణం చేస్తున్నాము.

మనం సత్యాగ్రహులం. జ్ఞాపకముంచుకోండి. కుటుంబ చట్టాన్ని ప్రయోగించనీయండి. ఇద్దరు సోదరులు ఆస్తికై పోట్లాడుకుంటున్నారు. ఇద్దరూ దానిని కుటుంబ క్షేమానికే ఉపయోగించదలిచారు. ఒకడికి కుటుంబ నిర్వహణకు అది అవసరం లేదని తెలుసును. ఏమి చేయాలి? సత్యాగ్రహి అయిన సోదరుడు కలహాన్ని నివారించడానికి ఆస్తిని వదలివేయాలా? దానివలన సమయం, శక్తీ వ్యర్థమవుతున్నది. అది అతనికి తెలుసును. ఇక్కడి కేసు అందుకు భిన్నంగా ఉన్నది. అయినా నేను జాగ్రత్తగా వ్యవహరిస్తున్నాను. తగాదా లేకుండా చెయ్యాలి. దేశానికి ఉపయోగకరమైతే నేను అధ్యక్షపదవి స్వీకరిస్తాను. నిర్ణయానికి ఇంకా సమయమున్నది. కాంగ్రెసు నుండి సెలవు తీసుకొని తప్పుకొనడం మంచిది గాదా? విదేశీ గుడ్డలు కట్టుకొని ఖాదీ కోసం నూలు వడికితే ప్రయోజనమేమిటి ? కాంగ్రెసును ఆక్రమించడానికి అమాయకుల్ని మోసగించాలా? పేరుకు ఏర్పడిన నోచేంజర్లు నిజంగా ఈమాన్‌దార్లుగా వుంటారా? దీనినిఎదుర్కొనలేకపోతే లొంగిపాదాము. మీ ఉత్తరాలను గురించి బాగా ఆలోచించాను.

పోటీ నుండి నేను విరమించాలి అనుకొంటున్నాను. ప్రస్తుతం నేను పరిస్థితులు గమనిస్తున్నాను. మోతీలాల్ జవాబుకై ఎదురుచూస్తున్నాను.

ఇక మలబారు చాలా మార్గాల నుండి దరఖాస్తులు వచ్చినవి. నేను ఏమిచేయాలి? ఎవరినైనా పంపి నిన్ను గూడా కలిపి నివేదిక తెప్పిద్దామనుకొంటున్నాను. నీ సలహా కావాలి. చాలా గుడ్డలు పోగుచేయబడినవి. వాటి ఉపయోగాన్ని గురించి సలహా ఇవ్వండి.

ఢిల్లీలో ఎక్కువగా పని సాధించకలేకపోయినాను. సంధికి అవకాశమున్నది. కాని స్థితి చాలా నాజూకుగా వున్నది.

అవును. మీరూహించిన విషయం నిజమే. సరళాదేవి యోగ్యురాలు. ఆమె నాకు చాలా చెప్పబోయింది. నేను అంగీకరించలేదు. మంచి వుత్తరాలున్నవి- ఒకటి ప్రకటించాను.

## 50. రాజగోపాలచార్యులు గారికి

జులై 16, 1925

మిత్రులు సి.ఆర్,

ఏదో విధంగా మీ నుండి అంతా బాగున్నదని నాకు ఉత్తరం గావాలి. నా స్థితి ఇది. నా శరీరమూ, మనస్సూ ఒక ప్రపంచంలో ఉన్నవి. అందువలన నాపై ప్రభావమేమీ వుండడం లేదు. శారీరకంగా దూరంగా వున్న ప్రపంచంలో నా ఆత్మ పని చేస్తున్నది. అది నాపై ప్రభావం చూపించగలదేమో! మీరు ఆ ప్రపంచంలో ఒక భాగం. నాకు చాలా సన్నిహితులు. నా లోపలి జీవి మీ ఆమోదాన్ని వాంఛిస్తున్నాడు. నేను ఆలోచించే దానికీ, చేసేదానికీ మీ ఆమోదం కావాలి. అది నాకు అన్ని పర్యాయాలూ లభించడం లేదు.

ఇపుడది ఎందుకు కావాలో మీరు అర్థం చేసుకొంటారు. ప్రతివారం ఒక కార్డు ముక్క వ్రాయండి. ఇక్కడ జరుగుతున్న వివరాలు మహదేవ్, దేవదాసు, ప్యారేలాల్ మీకు తెలియజేస్తుంటారు.

మీరు ఆరోగ్యంగా వుండాలి. మీరున్న స్థలంలో వడకటం గురించి సాధన చేయండి. చివరకు మన ప్రయత్నం ఫలించకపోయినా మనకుగానీ, ప్రపంచానికిగానీ జరిగే నష్టమేమీ వుండదు. అయితే మనకు ఆ కార్యక్రమంలో పూర్తి విశ్వాసమున్నది. పిట్టి గారి వుత్తరం వచ్చింది. కేలప్పన్‌గారు ఉత్తరం వ్రాశారు. మనం తూర్పు గేట్ దగ్గర పేరుకైనా ఒక సత్యాగ్రహిని అట్టిపెట్టాలి. లేకపోతే జనం అన్యథా భావిస్తారు. కేలప్పన్ గారికి ఉత్తరం వ్రాయండి. ఆయన చాలా ఉపయోగకరమైన మనిషిగా కన్పిస్తున్నారు.

ప్రేమాభిమానాలతో

మీ

బాపూ

★★★

## 51. కాకా సాహెబ్ కాలేల్కర్ గారికి

ఖాయీశ్రీ కాకా,

కేల్వాణికి వ్యాసం వ్రాసిన తరువాత పిల్లల శిక్షణా క్రమం గురించి ఎక్కువ ఆలోచనలో పడ్డాను. ఆశ్రమంలోని పిల్లలతో ప్రయోగం చేద్దామా ? పిల్లవాడు కుండను కుండ అంటాడు. కాని దాని చిత్రం గీయడం అతనికి తెలియదు. అతడు అక్షరాలు చదువుతాడు. కాని అక్షరాల బొమ్మలు గీయలేడు. ఒక బాలుడు కొత్త శబ్దం వింటాడు. చదవక పూర్వమే దాన్ని ఉచ్చరిస్తాడు. విన్నదానిని మాటిమాటికీ తిరిగితిరిగి ఉచ్చరిస్తాడు. లక్ష్మినీ, రసిక్‌నూ, ఇతర పిల్లలనూ వ్రాయడం ఆపించి బొమ్మలు, గీయమని చెప్పితే? మౌఖికంగా వారికి చాలా నేర్పవచ్చును. వారు బొమ్మలు గీయడానికి చెయ్యి ఉపయోగించాలి. అయితే ఉపాధ్యాయుడికి చిత్రలేఖన రహస్యాలు తెలిసివుండాలి. నేను విషయం లోతుల్లోకి పోతున్నాను. అందువల్ల ఆగుతున్నాను. మీరు బాగా ఆలోచించండి. కలసినప్పుడు వివరంగా మాట్లాడుదాము.

బాపూ

★★★

## 52. ఒక స్నేహితునికి

148 రూసా రోడ్డు
కలకత్తా
1-8-1925

ప్రియమైన స్నేహితునికి,

మీ వుత్తరం తందింది. వన్య జంతువులు కలిగిన తన భూమిని ఆ జంతువుల నుండి రక్షించుకొనుటకు వాటిని కాల్చివేస్తున్నాడు. అది తప్పనిసరి హింస. అవసరాన్ని, పరిస్థితిని బట్టి దానిని సమర్థించవచ్చును. కాని నిజానికి సత్యమైన అహింస మీద విశ్వాసముంటే అతడు భయంకర జంతువులకై దాన్ని వదలివేయాలి. లేక వాటిచేత తాను చంపబడాలి. అహింస యాంత్రికమైనది గాదు. అది వ్యక్తిగతమైనది. అంతేగాక ఆస్థి కలిగి వుండటం అహింసకు పొసగదు. అహింసా వ్రతునికి ఈ ప్రపంచంలో తనదంటూ ఏమీ వుండదు. అతడు అందరితో కలసిపోతాడు. ఆ అందరిలో పాములు, తేళ్లు, పెద్ద పులులు గూడా వుండవచ్చును. భయంకరమైన జంతువులు గూడా అమాయకుని అమాయకత్వాన్ని గుర్తించిన సన్నివేశాలున్నవి. ఆ స్థితిని చేరడానికి అందరం ప్రయత్నించాలి.

రెండవ ప్రశ్నకు గూడా ఇదే సమాధానం వర్తిస్తుంది. పురుగులనూ, చీమలనూ చంపడం హింసయే. కూరగాయలు, ఆకుకూరలు భోజనంగా ఉపయోగించినపుడు గూడా అది జరుగుతుంది. దానిని సమర్థించడానికి గూడా "అవసరం" అనే సిద్ధాంతాన్ని ఉపయోగించవచ్చును.

అహింసావాది గాయం కలిగించే అన్ని పనులనూ విసర్జిస్తాడు. ఇదంతా అహింసను నమ్మేవారి కొరకే వ్రాస్తున్నాను. ఆవశ్యకత అంటే నా ఉద్దేశ్యంలో విశ్వజనీనమైన ఆవశ్యకత. అందువలన అహింసను గూడా హద్దులు దాటించడానికి వీలు లేదు. కొన్ని పరిధులలో హింస హద్దులు దాటడం అన్నిచోట్లా న్యాయసమ్మతం గాదు.

మీ
ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 53. మాడ్లిన్ స్లేడ్ లేక మీరా నుండి

63. బెడ్ ఫోర్డ్ గార్డెన్స్
కాంప్టెన్ హిల్స్
29-5-1925

మాష్టరు గారికి,

నేను మీకు వ్రాసిన మొదటి ఉత్తరానికి జవాబు వ్రాసినందుకు ధన్యవాదాలు. అది జరుగుతుందని నేను ఆశించలేదు. మీరు వ్రాసిన దానినంతా హృదయానికి హత్తుకొని చదివాను. తిరిగి మీకు వ్రాయడానికి సాహసిస్తున్నాను. స్వయంగా నాకు నేనే విధించుకున్న విచారణ సగం పూర్తి అయినది.

నా మొదటి అకాంక్ష పెరిగి పెద్దదైనది. మీ సేవ చేయవలెననే కోరిక ఇనుమడించినది. నన్ను ప్రోత్సహిస్తున్న నా హృదయంలోని స్పందన నన్ను ఎంతగానో ప్రేరేపిస్తున్నది. నా హృదయంలోని ప్రేమ భావాన్ని సేవ ద్వారా, క్రియల ద్వారా చూపించే శక్తిని ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. ఇప్పుడొక మనవి చేస్తున్నాను. నూలు వడకడం, నేయడం నేర్చుకోడానికి మీ ఆశ్రమానికి రానా? మీ దైనందిన జీవితం తాలూకు సిద్ధాంతాలు, నియమాలు నేర్చుకొంటాను. భవిష్యత్తులో నేను ఏవిధంగా మీకు సేవ చేయగలను? నాకు మీ దగ్గర శిక్షణ కావాలి.

ఈ లోపల నా ప్రయత్నాలు నేను చేస్తాను. ఊలు వడకడం, నేయడం నేర్చుకొంటున్నాను. కొంతమంది భారతీయ మిత్రుల సహాయంతో హిందుస్తానీ నేర్చుకొంటున్నాను. ఇండియన్ భావాలను గురించి ఆలోచిస్తుంటే ఏనాడో పోగొట్టుకున్న నా ఇంటికి నేను చేరుతున్నట్లుంది.

నా దైనందిన జీవితాన్ని చేతనైనంతగా సరళతరం చేసుకొంటున్నాను. నేను త్రాగుడు మానివేశాను. నేను మాంసాహారం గూడా వదలివేశాను.

నాకు మనస్సులో ఎంతో ఆనందంగా వున్నది. నేను ఇండియా చేరడానికి ఇంకా ఐదు నెలల వ్యవధి వున్నది. నవంబరు ఆరో తేదీన బొంబాయి చేరుతాను. నాకు అనుమతి మీనుండి లభిస్తే ఆరోజు సాయంత్రమే బయలుదేరి రైలులో రెండో రోజు ఉదయం అహమ్మదాబాదు చేరుకొంటాను.

మాస్టరుగారూ! నేను రానా?
ఈ వుత్తరానికి జవాబు వ్రాయండి.
మీ సేవకురాలు

ఇట్లు
మాడ్లీన్ స్లేడ్

*నేను వడకిన రెండు ఊలు వస్తువులను ఇందులో పంపుతున్నాను*

*(శ్రీమతి మీరాబహన్ మిస్ మాడ్లీన్‌స్లేడ్ అడ్మిరల్ ఎడ్మరుడ్ స్లేడ్ కుమార్తె. బిథువన్ సంగీతం మీద ఆమెకున్న ప్రేమ రొమెన్ రోలండు దగ్గరకు ఆమెను చేర్చింది. రోలండ్ గారు గాంధి గారికి ఆమెనప్పగించారు. నవంబరు 1925 నెలలో ఆమె గాంధి గారి దగ్గరకు చేరింది. 1933లో గాంధీ గారితో కలసి లండన్ వెళ్లింది. 1932, 33 లో 1942లో జైలుకు వెళ్లింది. 1947లో హృషీకేశ్ దగ్గర పశులోక్ స్థాపించింది.)*

★ ★ ★

## 53 ఏ. మాడ్లీన్ స్లేడ్‌కు

జులై 24, 1925

స్నేహితురాలా,

నీ వుత్తరం అందింది. అది నా హృదయాన్ని కదలించింది. నీవు పంపిన వూలు వస్తువులు చాలా బాగున్నవి.

నీవు ఎప్పుడు రాదలచినా నీకు నా స్వాగతం. నీవు ఏ స్టీమరులో వస్తావో తెలిస్తే, నిన్ను ఎవరో హార్బరులో కలుసుకొని సబర్మతి చేరే రైలులో ఎక్కిస్తారు. ఆ ప్రయత్నం నేను చేస్తాను. ఆశ్రమంలోని జీవితం గులాబీ పూవు వంటిది కాదు. దృష్టిలో పెట్టుకొనవలెను. అది కష్టతరమైనది. అందరు ఆశ్రమవాసులూ శరీర శ్రమ చేస్తారు. ఈ దేశంలోని వేడి వాతావరణం గూడా శ్రమ కలిగించేదే. ఇదంతా నిన్ను భయపెట్టడానికి వ్రాయడం లేదు.

నీ
ఎమ్. కె. గాంధి

నా కుడి చేయికి విశ్రాంతి కావాలి. అందువలన ఉత్తరం చెప్పి వ్రాయిస్తున్నాను.

★ ★ ★

## 54ఎ. రోమన్ రోలండు గారికి

నవంబరు 13, 1925

ప్రియమైన స్నేహితునికి,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందినది. స్లేడ్ కొంచెం ఆలస్యంగా ఇక్కడికి చేరింది. ఒక వజ్రాన్ని మీరిక్కడికి పంపించారు. మీరు చూపిన నమ్మకానికి కృతజ్ఞత. తూర్పుకూ పశ్చిమానికీ వారధిగా వుండేటట్లుగా స్లేడ్‌ను రూపొందిస్తాను. శిష్యులను స్వీకరించడానికి నేనెంతవరకు యోగ్యుడనో!! సత్యాన్వేషణ రంగంలో ఆమె నాకు సహకారం అందిస్తుంది. నేను వయో వృద్ధుణ్ణి. కొంత అనుభవం కలిగినవాడిని. ఆమెకు మీ వలెనే పైత్రుక సంబంధం కలిగించగలను. కుమారి స్లేడ్ అందరితో కలసి అద్భుత గుణం కలిగివున్నది. మాలో కలసిపోయింది. మిగతా విషయాలు ఆమె స్వయంగా మీకు చెప్పగలదు. ఆమె కంటె ముందు వచ్చిన ఇంకొక ఫ్రెంచి సోదరి ఫ్రెంచిలో మీతో మాట్లాడగలదు.

★ ★ ★

## 55. రోమన్ రోలండ్ గారికి

ఆశ్రమం సబర్మతి

15.2.1928

ప్రియమైన స్నేహితులకు,

మీరా మీ చివరి ఉత్తరం అనువాదం చేసింది. మీ వుత్తరం నన్ను కఠిన హృదయుడుగా సందేహిస్తున్నట్లు తెలుపుతున్నది. నేను చేసే పనులలో, ఆలోచనలో సక్రమంగా వుండవలెనని మీరు కోరుతున్నారు. మీరు కోరినట్లుగా నిలబడతానని తెలియజేస్తున్నాను. మీ వుత్తరాన్ని రక్షించుకొనడానికి తగినట్లుగా నేనుండాలి.

మీరా వుత్తరం ఆమె భావాలను వ్యక్తం చేస్తున్నది. ఆమె భావాలతో కలుస్తున్నది. అది వేరే విషయం. ఆమెగానీ, నేనుగానీ ఆ మంచి రైతులను గురించి ఎరగము. వారు, ఆ రైతులు చేసిన పని వీరోచితమైనది. సాహసోపేతమైనది. యుద్ధాన్ని వ్యతిరేకించే

సాహసకృత్యమది. మీరు పంపిన వివరాలను బట్టి, మీరా నాకు అనువదించి చెప్పిన దానిని బట్టి అటువంటి సాహసాన్ని ఎక్కడా నేను చూడలేదు. జోన్ ఆఫ్ ఆర్క్ వీరురాలు. లోనిడన్ హొరాషియన్‌లు గూడా అటువంటి వీరులే. కాని ప్రతి వీరోచిత కృత్యమూ వేరు వేరు ప్రత్యేకత కలిగినది. ఉదాత్తమైనది. ప్రశంసనీయమైనది.

రైతులిచ్చిన జవాబులలో యుద్ధానికి వ్యతిరేకత కనబడడం లేదు. యుద్ధం యుద్ధమే. దాన్ని నిరోధించడం, దాన్ని ఎదుర్కొనడం వారిలో కనబడుతున్నది. బాధలు అనుభవించడానికి సిద్ధమైన మనస్తత్వం కన్పిస్తున్నది. వారు న్యాయపథంలో వున్నట్లు నాకు కన్పిస్తున్నది. ఆ సాహసం ప్రశంసనీయమే. ప్రతిదానినీ, వేరువేరుగా అంచనా వేస్తే ఆ వీరులు సత్యాన్ని అర్థం చేసుకొని సేవచేయగలరు. వారు గ్రామీణ పరిస్థితికి గూడా ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

క్రిందటి యుద్ధంలో నేను పాల్గొన్న విషయాన్ని ప్రశ్నారూపంలో ఎత్తారు. అది న్యాయమైన ప్రశ్న. క్రిందటి జీవన వృత్త అధ్యాయంలో ఆ ప్రశ్నకు జవాబు చెప్పాను. మీ ప్రశ్నను నేను ముందుగా పసిగట్టి వున్నానేమో తెలియదు. మీరు తీరికగా చదివి తర్కం ఎట్లా వున్నదో తెలియజేయండి. మీ అభిప్రాయాన్ని అమూల్య నిధిగా భావిస్తాను.

నేను సంపూర్ణత్వాన్ని పొందవలెనని కోరుతున్నాను. అయితే నాకు చాలా హద్దులున్నవి. అది నాకు తెలుసును. వాటిని రోజు రోజూ బాగా గుర్తిస్తున్నాను. కఠిన హృదయం వలన ఎన్నెన్ని తప్పులు ఎక్కడెక్కడ చేశానో నాకు తెలుసును అయితే అందుకు కారణం లేకపోలేదు. పాతకాలం నాటి క్రిష్టియన్లు సైతానును చెడు సిద్ధాంతమనే గాక సైతాను చెడు అవతారం అని గూడా భావించేవారు. ఆ సైతాను అన్ని మార్గాలలో మనకు అడ్డుపడుతున్నాడా. మన మీద పెత్తనం చలాయిస్తున్నాడా. మనం అతణ్ణి అధికారంలో నుండి శక్తి నుండి తొలగించాలి. మీరాకు మీరు వ్రాసిన వుత్తరం చదివిన తరువాత మిమ్మల్ని వ్యక్తిగతంగా కలుసుకోవలెనని మనస్సు ఉవ్విళ్లూరుతున్నది. ఆరోగ్యం బాగుంటే ఈ సంవత్సరం అది సంభవం గావచ్చును. నా అంతరంగం యూరపు వైపుకు నన్ను ప్రేరేపిస్తున్నది. రెండు ఆహ్వానాలను గురించి

నేను గంభీరంగా ఆలోచిస్తున్నాను. మిమ్మల్ని చూడవలెననే కోరిక ఆహ్వానాలను నన్ను అంగీకరించునట్లు చేయవచ్చును.

మీ
ఎమ్. కె. గాంధీ

*(మార్చి 7వ తేదీన రోలండు తన జవాబులో - ఆ ఇద్దరు సవాయి రైతులను గురించి మీరేమంటారు. వారు వీరపురుషులని నా అభిప్రాయం. యుద్ధ నిరోధాన్ని ఇతర భాగాలతో కలపడం సాధ్యం గాదు అని వ్రాశారు.)*

## 56. శ్రీ శంకరన్ గారికి

నంది హిల్స్
28-4-1927

ప్రియమైన శంకరన్ గారికి,

మీ ఉత్తరం నాకు ఔషధంగా పనిజేసింది. నా భావాలను మీరు బాగా అర్థం చేసుకొంటున్నారు. వంటశాల మంచి స్థితిలో ఉన్నందుకు ఆనందపడుతున్నాను. మీ కుడి చేయి ఎవరు? గిరిరాజ్ ఎలా వున్నారు? మీ ఆరోగ్యం ఎలా వున్నది? మీ వంటశాల శరీరానికీ మనస్సుకూ అహ్లాదాన్ని కలిగించి ఆరోగ్యానికి పెన్నిధి వంటిది కావాలి. అక్కడ ఎల్లప్పుడూ మధురత్వమూ, శాంతీ, విశ్రాంతీ తొణికిసలాడుతుండాలి. ఆ విషయాన్ని త్రోవనబోయే వాళ్లు సైతం గ్రహించగలగాలి. అన్ని వస్తువులూ వాటి వాటి స్థానంలో వుండాలి. అన్నీ శుభ్రంగా వుండాలి. మసాలా దుర్గంధం వుండగూడదు. మంచి సువాసనలు వెదజల్లబడుతూ ఆరోగ్యంగా, సంతృప్తిగా ఆనందంగా వుండాలి మన ఋషులు కవులుగా, వేదాంత శాస్త్రవేత్తలుగా మంచి వంటవారుగా, పాకీవారుగా గూడా వుండేవారు. అవి మీకు తెలుసును? అందరూ కలసి ఒకరుగా వుండేవారు. నల మహారాజు వంటలోనూ ఒక మహారాజుగానూ, ఆదర్శవంతుడైన భర్తగానూ, గొప్పపాక శాస్త్ర ప్రవీణుడుగానూ ఉన్నారు. అన్ని వృత్తులూ ముక్తికి సాధనాలు. ముక్తికి మొదటి మెట్లు. కాని చెడు సహవాసం ఏర్పడితే అన్ని వృత్తులూ చెడిపోతవి.

మీ
బాపూ

★ ★ ★

# 57. హెర్మన్ కాలెన్ బేక్ గారికి

(గాంధీ గారికి ఆప్తమిత్రుడు. జర్మన్. కాని సౌత్ ఆఫ్రికాలో వుండేవాడు)

మిత్రమా,

నేను మంచంమీద పడుకొని జవాబులు వ్రాయని ఉత్తరాలను చూస్తుండగా 27 ఫిబ్రవరి తేదీన మీరు వ్రాసిన ఉత్తరం కంటబడింది. మీరు ఇనాండా నుండి ఉత్తరం వ్రాశారు. మీ ఉత్తరంతో బాటు ఆండ్రూస్ గారి ఉత్తరం గూడా జతజేశారు. నాకెన్నో పాత విషయాలు, మధుర సన్నివేశాలు జ్ఞాపకానికి వచ్చినవి. క్రిందటి రెండు సంవత్సరాల నుండి మీరు వ్రాసిన ఉత్తరాలు అదో రకంగా వుంటున్నవి. వాటిలో ఏదో విచారం వ్యక్తమవుతున్నది. నేను జీవించి వున్నంతకాలం మీమీద నాకున్న విశ్వాసం సడలదు. చివరకు అలసిపోతారు. అది నిజం. పాత మిత్రుడుని కలవడానికి ఒకసారి ఇండియాకు రాగూడదా? వెనకటి జ్ఞాపకాలను ఇద్దరం కలసి నెమరువేసుకొన వచ్చునుగదా? రాబోయే సెప్టెంబరు లేక అక్టోబరులో వస్తారని మాట యిచ్చారు గదా? తప్పక ఇండియాకు వచ్చి మీ కిష్టమొచ్చినన్ని రోజులు వుండవలెను.

ఆండ్రూస్ గారి సాహచర్యంలో మీరు అనేక ఆనందానుభూతులు పొందు తుంటారు. నేను నా జీవితంలో అంత వినమ్రత కలిగిన భగవంతుడంటే భయపడే వ్యక్తిని చూడలేదు.

నా రుగ్మత గురించి మీకు వ్రాయదలచుకోలేదు. యంగ్ ఇండియా మీరు చూస్తూనే వుంటారు. అది అందుతూనే వుంటుంది. నేను ప్రస్తుతం మైసూరు స్టేటులోని ఒకకొండమీద విశ్రాంతి తీసుకొంటున్నాను. చికిత్స జరుగుతున్నది. చాలామంది నా దగ్గరే వున్నారు. మిగతా వారల పేరులు వ్రాయడం లేదు. వారిని మీరెరుగరు. మీరు వచ్చినపుడు అందరితో పరిచయం చేస్తాను.

నా శరీరంలో చాలా బలహీనత ఏర్పడింది. మెదడు మీద చాలా భారం పడింది. అది ప్రమాదానికి దారితీస్తుందనిపించింది. ఇదంతా నేనొక కార్యక్రమం ఏర్పర్చుకొనబోతుంటే దానికి ముందుగా పిచ్చి విధానాలను మానివేయి, మంచికి పనిచేస్తున్నాను గనుక ఫరవాలేదని నీవనుకొనడం సరిగాదు. నీవేదో ఆశ్చర్యకరమైన

పనులు చేయగలననుకొంటున్నావు. ఇకనైనా పారం నేర్చుకో" అని చెపుతున్నట్లని పిస్తున్నది. ఎవరిని ఎలా ఉపయోగించికొంటారో తెలియదు. నేను దండనను స్వీకరిస్తున్నాను. ఈ జబ్బు నుండి బయటపడితే, నా మార్గాలను మార్చుకొంటాననీ ఆయన అభిమతాన్ని అనుసరించి ప్రవర్తిస్తాననీ హామీ ఇస్తున్నాను.

మణిలాల్‌ను కలుసుకొంటున్నారా? దృఢమైన భావాలు గల భార్య అతనికి లభించింది. ఆమె చాలా మంచిపిల్ల. అంత కష్టం మీద ఆమెను వెదకి పెండ్లి జరిపించారు. ఆమె మంచి కుటుంబం నుండి వచ్చింది.

ఫోనిక్స్ ఆశ్రమానికి ధర్మకర్తగా వుండవలెను.

ఒక నెల లోపల శాస్త్రి దక్షిణాఫ్రికా చేరగలడు. నేను ఆయనతో వివరంగా మాట్లాడాను. మీకు గోఖలేగారితో గల సంబంధాన్ని గురించి ఆయనకు తెలియజేశాను. మన మిత్రులందరితో వారిని పరిచయం చేయండి. మీరు ఆయన సౌకర్యాలు చూడండి.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 58. గుల్జారీ లాల్ నందా గారికి

నంది హిల్స్

28.5.1927

ప్రియమైన గుల్‌జారీలాల్,

పక్కమీద పడుకొనే మిమ్మల్ని గురించి అలా ఆలోచించాను. ఇంతలోనే మీ కబురు అందింది. చాలా ఆనందం కలిగింది. మీ వంటివారి నుండి నేను చాలా ఆశిస్తున్నాను. భగవంతుడు సత్కార్యాలు చేయడానికి మీకు ఆరోగ్యం ప్రసాదించుగాక.

నిజమైన ధార్మిక జీవనాన్ని గురించీ, దాని స్వరూపాన్ని గురించీ మీరు చేసిన వర్ణన ఎంతో బాగున్నది. ఆత్మానందమూ, చింతలనుండి విముక్తీ ఇవి రెండూ పెద్ద విషయాలు. అవి చాలా గొప్పవి. కాని వాటిని సాధించటం చాలామందికి సాధ్యంగాదు.

అయినా అవి మానవుడు సాధించ లేనంతటివి కావు. అవి మానవసాధ్యాలే. నాకెట్టి సందేహమూలేదు. అయితే అవి అందరికీ సాధ్యం కావు. కొంతమందికే సాధ్యం. అయితే చరిత్రలో అటువంటి మహా పురుషుల వివరం కనబడడం లేదు. మనం అపూర్ణులం. పూర్ణ పురుషుల వివరం మనమివ్వలేమనిపిస్తున్నది. మన అనుభవాలను గురించి కూడా అదే వర్తిస్తుందనుకొంటున్నాను. మీరు వర్ణించిన పూర్ణ పురుషులను కలవడం గూడా సాధ్యం గావటం లేదు. నేనేదో పెద్ద ప్రశ్న లేవదీశానని అనుమానం వద్దు. సామాన్య మానవుడికి అది సాధ్యమా? సందేహించడం గూడా కొన్ని ప్రశ్నలను కొనితెచ్చుకొనడమే అవుతుంది. మనం విశిష్ట వ్యక్తులను గురించి ఆలోచిస్తున్నాము. అటువంటి విశేష వ్యక్తులను గురించి తెలుసుకోవలెనంటే విశేష శక్తులు గూడా కావాలి. జె.సి. బోసు లాంటివారు కనిపెట్టిన విషయాలను, ప్రయోగాలను అందరూ అర్థం జేసుకోలేరు. అందువలన వాటిని విశ్వసించడం మాత్రమే మనం చేయగలము. విశ్వసించక తప్పదు. ప్రత్యేక జ్ఞానమున్నవారు మాత్రమే వాటిని తెలుసుకొనగలరు. అర్థం జేసుకొనగలరు. సంతోషించగలరు. మన బోటి అనభవజ్ఞులకు అవి అవిశ్వసనీయాలుగా గూడా కనిపిస్తుంటవి. అయినా విశ్వాసముంచి వాటిని మనం అంగీకరిస్తున్నాము. పెద్దలు, విశేషజ్ఞులు మన విశ్వాసానికి ప్రమాణం. కనుక మీరు పెట్టిన హద్దులు, కార్యక్రమ వివరాలు ఆచరణ సాధ్యాలుగానే వున్నవి.

మీరు చాలా నిశితంగా ఆలోచిస్తున్నారు. తీవ్రంగా కృషిజేస్తున్నారు. మీరు పుస్తకాలు చదువుతున్నారు. ఎక్కువ పుస్తకాలు చదవడం వాటి మీద ఆధారపడడం గూడా మంచిది గాదేమో!! మనకు కావలసిన విషయం ఒక్క పుస్తకంతో గూడా లభించవచ్చును. చివరి స్థితిలో జీవితం శరణాగత స్థాయికి చేరుతున్నపుడు ఆ ఒక్క పుస్తకంలో గూడా అవసరముండదు. నేను చాలా పుస్తకాలు చదివాను. వాటిలో భగవద్గీత నన్ను చాలా ప్రభావితం చేసింది. అది ఒక నిఘంటువు లాగా వున్నది. దుర్మార్గాలకూ, ఆపదలకూ మూల రహస్యాలు తెలుసుకొనడానికి అందులో పరిష్కార మార్గాలు కనబడుతున్నవి. సాంగ్ సెలెష్టియల్ నేను చూచినంతలో భగవద్గీతకు మంచి అనువాదము. మీకు సంస్కృతం రాదేమో! కొద్ది సంస్కృతం తెలిసినా భగవద్గీతను బాగా అర్థం చేసుకొనవచ్చును. ఒక నెలరోజులు సంస్కృతం నేర్చుకొంటే సరిపోతుంది. హిందీ ఉర్దూలలో గూడా భగవద్గీత అనువదించబడి వున్నది. కాని

మూలంలాగా వుండవు. మూల గ్రంథం కొంచెం సంస్కృతం తెలిస్తే బాగా అర్థమవుతుంది. మీకు కావలసిన పరిష్కారాలు మీకు అందులో లభ్యం కాగలవు. ఆ పుస్తకం చరిత్ర గాదు. అది గ్రంధకర్త యొక్క అమూల్యమైన అనుభవాలకు ప్రతీక. ఆ గ్రంధకర్త ఎవరో, వ్యాసుడో కాదో నేను ఆలోచించడం లేదు. అది ఒక మహామనీషి అనుభవాల పేటిక. అది మన అనుభవాలకు ఎంతైనా దగ్గరగా వుంటున్నది. నేను నా జీవితంలో రోజూ సత్యాన్వేషణ చేస్తున్నాను. సత్యాన్ని నిశితంగా పరీక్షిస్తున్నాను. నెగ్గుతున్నాను. దాని ప్రకారం నేను సంపూర్ణత్వాన్ని సాధించగలిగానని కాదు. రెండవ అధ్యాయం చివరిలో సంపూర్ణ మానవ స్వరూప నిరూపణ వున్నది. ఆ అధ్యాయాన్ని బాగా చదివి దానిలోని వివరాలను జీవితంలో అనుభవం లోనికి తీసుకొని రాగలిగితే జీవితం సార్థకమవుతుంది.

మీ ఆరోగ్యం బాగా వుండి వుంటుంది. నేను నెమ్మది నెమ్మదిగా కోలుకుంటున్నాను.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 59. కైలాసనాథ్ కాట్జూ గారికి

గుడియాత్తం

1-9-1927

మిత్రమా,

నా శరీర బలహీనత ఈ వుత్తరం చెప్పి వ్రాయించడానికి కారణం. ఆ బలహీనత లేకపోతే నేను స్వయంగానే ఉత్తరం వ్రాసేవాడిని. మీ ఉత్తరానికి ధన్యవాదాలు. ఖద్దరు కొరకై మీరు మీ మొదటి విరాళం పంపించారు. మీ వుత్తరం ఇతరులకు గూడా ఖద్దరు మీద నమ్మకం కలిగించగలదు. మీకు అభ్యంతరం లేకపోతే మీ వుత్తరంలోని ఖాదీకి సంబంధించిన భాగాన్ని పత్రికలో ప్రచురిస్తాను. దయయుంచి అనుమతి నిరాకరించకండి.

నల్లటి అల్పక, చాఫ్కల్‌కు సంబంధించినంతవరకు మీరు ఆర్డరు (కొనుగోలుకు) పంపించండి. మీ కొరకై మంచి నల్లఖాదీతో తయారు చేయిస్తాను. అది చూడడానికి గూడా బాగావుంటుంది. మద్రాసులో చాలా మంది వకీళ్లు, లాయర్లు ఖద్దరు చాప్కల్స్‌ను ఉపయోగిస్తున్నారు. అది మీకు తెలియకపోవచ్చును. మిగతా దుస్తులకు వారు ఖద్దరును ఉపయోగించడం లేదు. చవకగా లభించడం కారణం గావచ్చును. మీకా సమస్య లేదు. మీరు కోరితే మంచి ఖరీదు గల వస్తువు పంపించే ప్రయత్నం చేస్తాను.

ఇక ఖద్దరు వడకటం గురించి ఒక్కమాట. ఖద్దరు మీది అభిమానానికీ, స్వయంగా నూలు వడకడానికీ సంబంధం లేదు. ఆ విషయంలో మీతో ఏకీభవిస్తున్నాను. ఆకలిగొని వున్న లక్షలాది ప్రజలను అభిమానించడం ప్రేమించడం అవసరం. దానికి రెండు కారణాలు. వ్యక్తిగతంగా నూలు వడికితే ఆ లక్షలమందితో సన్నిహితుల మవుతాము. అప్పుడు గ్రామాలలోని ప్రజలను నూలు వడకమని ప్రోత్సహించడం తేలిక అవుతుంది. లేకపోతే వారికి నమ్మకం ఏర్పడదు. ఇంకొక మూడో కారణం గూడా నేను చెప్పదలచుకొన్నాను. బాగా తయారైన ఖద్దరు గుడ్డ ప్రతిగజం దేశ సంపదను అభివృద్ధి చేయడానికి ఎంతగానో తోడ్పడుతుంది. లాయరు ఏమి చేస్తుంటారో మీకు తెలుసు. కోర్టులో వారి వంతుకు ఎదురుచూస్తూ పెన్సిళ్లతో ఆడుకుంటుంటారు. చిన్న కత్తితో తాము ఎదుటనున్న టేబుల్ అంచులను సరిచేస్తుంటారు. అందుకు బదులు తక్లీ అది వెండిది గానీ, బంగారపుది గానీ వారి చేతికిస్తే అది దేశ సంపద అభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతుంది. తక్లీతో నూలు వడకటం చాలా తేలిక. తక్లీని ఉపయోగించడం మీరు ప్రారంభిస్తే మొదట మిమ్మల్ని చూచి అంతా నవ్వుతారు. నెమ్మదిగా దానిని తాము గూడా ఉపయోగించడం ప్రారంభిస్తారు. ఆ తరువాత అందరూ తక్లీకి అలవాటుపడతారు. ఇదంతా మీకొరకే. చెపుతున్నానని అనుకోకండి. మీరు విరాళం పంపించి కొంచెం నాకు సందిచ్చారు. దీనితో నేనింకా కొంచెం ముందుకు సాగుతున్నాను.

లాయర్లందరూ త్యాగం చేయవలెనని నా కోరిక. 1920, 1921 లో లాగానే మిపలన అంత త్యాగం కోరడం లేదు. వృత్తిలో నా సహచరుల నందరినీ నేను త్యాగాన్ని ఆశించడం తప్పుగాదేమో! నేను గూడా లాయరునే గనుక ఆ హక్కు నాకున్నది.

వారంతా పెద్దవారు. త్యాగం చేసి వారెల్లప్పుడూ నన్ను గుర్తుంచుకోవాలని నా కోరిక.

మీ వంద రూపాయిల చెక్కును ఆల్ ఇండియా స్పిన్నర్స్ అసోసియేషన్ కోశాధ్యక్షునికి పంపుతున్నాను.

మీ
ఎమ్. కె. గాంధీ

★ ★ ★

## 60. ధనగోపాల్ ముఖర్జీ గారికి

సత్యాగ్రహాశ్రమం
సబర్మతి
7-9-1928

మిత్రమా,

మీ ఉత్తరం అందింది. టాల్‌స్టాయి రచనల నుండి గానీ ఇంకెవరి రచనల నుండిగానీ వారి అనుమతి లేకుండా, గుర్తింపును తెలియజేయకుండా ఏ అంశాన్నీ ఉటంకించడం లేదు. అలా చేసినట్లు నాకు జ్ఞాపకం లేదు. అదిగాక ఇతరుల రచనలను నేను ఉటంకించడం ఉండదు. అది తప్పు పని అనిగాదు. ఎక్కువగా చదవడం నా శక్తికి మించిన పని. చదివిన దానిని జ్ఞాపకం పెట్టుకొనడం గూడా నాకు కష్టమే.

టాల్‌స్టాయి గారి రచనలు బాగా చదివివున్నాను. గనుక వారి రచనల నుండి నా రచనల్లో ఉటంకించడం సహజమే. గీత మీద నేను ఎక్కువ ఆధారపడతాను. గీతలాగా నన్ను ఏ పుస్తకాలూ ప్రభావితం చేయలేదు.

ఇది మీ సంతృప్తికి వ్రాస్తున్నాను. ఇక మీ పెద్ద ప్రశ్నలకు యంగ్ ఇండియాలో వివరంగా సమాధానాలు వ్రాస్తాను.

మీ
ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 61. హెన్రీ. ఎస్. సాల్ట్ గారికి

క్యాంపు హర్దోయీ

12-10-1929

మిత్రమా

మీ ఉత్తరం చూచి ఆశ్చర్యపడ్డాను. శాకాహారాన్ని గురించి ఇంగ్లీషులో మీ మొదటి పుస్తకం నన్ను ఎంతగానో ఆకర్షించింది. ఆ పుస్తకం శాకాహారం మీద నా విశ్వాసాన్ని ఎంకా పెంచింది. 1907 ప్రాంతంలో థోరియా గారు వ్రాసిన పుస్తకానికి నేను భూమిక వ్రాశాను. ఆరోజుల్లో సహాయ నిరాకరణోద్యమంలో నేను పూర్తిగా మునిగివున్నాను. ఆ పుస్తక ప్రభావం నామీద బాగా పడింది. ఆరోజుల్లో ఇండియన్ ఒపీనియన్ పత్రికకు నేను సంపాదకుడుగా వుండేవాడిని. ఆ వ్యాసంలో నుండి చాలా భాగాలను ఇండియన్ ఒపీనియన్ పత్రికలో ప్రచురించాను. థోరియా గారిని గురించి చాలా విశేషాలను తెలుసుకున్నాను. వారి వాల్డెన్, తదితర వ్యాసాలను ఎంతో ఉత్సాహంతో చదివాను. వాటి వలన లాభం పొందాను.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 62. వైస్‌రాయ్ గారికి (లార్డ్ ఇర్విన్)

సత్యాగ్రహాశ్రమం

సబర్మతి

2-3-1930

ప్రియమైన మిత్రులకు

శాసనోల్లంఘనోద్యమం ప్రారంభించక పూర్వమే చాలా కాలం ప్రమాదాన్ని ఎదుర్కొనడానికి వెనుదీసిన నేను ఏదైనా పరిష్కారమార్గం దొరుకుతుందేమోనని మిమ్మల్ని కలుసుకొనే ప్రయత్నం చేశాను.

వ్యక్తిగతంగా నాకున్న విశ్వాసాలేవో అవి వున్నవి. అవి దృఢమైన విశ్వాసాలు. నేను ఏ వ్యక్తికీ బుద్ధిపూర్వకంగా హాని చేయను. చేయలేను. నా వలన ఏ ప్రాణికీ అపకారం జరగదు. మానవుల విషయంలో చెప్పవలసిందేమీ లేదు. ఎదుటివారు నాకూ. నా వారికీ అపకారం చేసినా నేను పట్టించుకోను. లెఖ్ఖచేయను. బ్రిటిషు పరిపాలన మా పాలిట ఒక శాపమని నేను భావించినా ఏ ఇంగ్లీషు వ్యక్తికీ అపకారం జరగడం నేను సహించను. ఇండియాలో వారి న్యాయబద్ధమైన ఏ సౌకర్యానికీ, ఏ హక్కుకూ భంగం కలగడం నా కిష్టముండదు.

నన్ను అపార్థం చేసుకొనవచ్చు. బ్రిటిషు పరిపాలన మాకు ఒక శాపం అని నా అభిప్రాయం. అయినా ఇంగ్లీషువారు చెడువారని నేను భావించను. రచనల వల్లనే బ్రిటిష్ ప్రభుత్వం చేస్తున్న అన్యాయాలను ఇండియా దృష్టితో అర్థం చేసుకొనగలిగాను. ఇంగ్లీషు రచయితలు ఇంగ్లీషు ప్రభుత్వం వారు ఇండియా విషయంలో అనుసరిస్తున్న చెడు విధానాలను విస్పష్టంగా తమ రచనల్లో వివరించి వున్నారు.

అయినా బ్రిటిషు శాసనాన్ని ఒక శాపంగా నేనెందుకు భావిస్తున్నాను? అని గూడా మీరడగవచ్చును. నోరు లేని లక్షలమంది భారతీయుల్ని నెమ్మది నెమ్మదిగా శోషణపాలుచేసి బ్రిటిష్ పరిపాలన వారిని పరమ బీదలుగా తయారుచేస్తున్నది. తమ పరిపాలనకనుగుణంగా సైనికశక్తినీ, పరిపాలనా వ్యయాన్నీ, పెంచుకొనిపోతున్నది. అందువలన ఏర్పడిన ఆర్థిక భావాన్ని భారతదేశం మోయలేదు. అది దాని శక్తికి మించిన పని.

ఆ పరిపాలన రాజకీయంగా మమ్మల్ని బానిసలుగా చేసింది. మా సంస్కృతిని కూకటి వేళ్లతో పెకలించడానికి ప్రయత్నం చేస్తున్నది. ఆయుధ విహీనత వలన మమ్మల్ని బలహీనులుగా తయారుచేసింది. మేము ఆత్మశక్తిని కోల్పోయి పిరికిపందలుగా తయారైనాము.

ఇన్ని ఇబ్బందులున్నా కష్టాలు అనుభవిస్తున్నా రౌండ్‌టేబుల్ సమావేశం వలన కొంతైనా ప్రయోజనముంటుందని ఆశించాను. అయినా నేనేమీ హామీలు ఇవ్వలేనని మీరు ముందుగానే ప్రకటించివేశారు. డొమినియన్ స్టేటస్ ఇవ్వడానికి గూడా

...రుగానీ, మీ ప్రభుత్వంగానీ తయారుగా లేనట్లు మీ మాటల వలన, ప్రకటనల ...లన బోధపడుతున్నది. కనుక రౌండ్ టేబుల్ సమావేశం నోరులేని మా భారతీయులకు ...హాయం చేయదు బ్రిటిష్ పార్లమెంటు మాకు సహాయం చేస్తుందనే భ్రమ గూడా నాకు లేదు.

ఢిల్లీ సమావేశం గూడా విఫలమయినట్లే. అందువలన నాకుగానీ, మోతీలాల్ నెహ్రూకు గానీ 1928లో జరిగిన కాంగ్రెసు తీర్మానాన్ని అమలుచేసే ప్రయత్నం చేయక తప్పదు. మీ ప్రకటనలో డొమినియన్ స్టేటస్ ప్రసక్తి అయినా వుంటే కొంత బాగుండేది. అర్థాలు ఎన్నైనా చెప్పవచ్చును. బాధ్యత గలిగిన బ్రిటిష్ నాయకులు డొమినియన్ స్టేటస్ అంటే స్వాతంత్ర్యం కాదంటారా? అర్థాలేమైనా ఆ డొమినియన్ స్టేటస్ గూడా ఇవ్వడం మీ కిష్టంలేదని బోధపడుతూనే వున్నదిగదా!!

బ్రిటిషు ప్రభుత్వం వారు భారతదేశంలో తమ విధానంలో ఎట్టి మార్పునూ చేయరని అర్థమయింది. అందువలన మీ దేశ వ్యాపార లాభాలు తగ్గిపోతవి, బ్రిటిషువారి లావాదేవీలలో మార్పు ఏర్పడుతుంది. వాటిని గురించి మీరు నిష్పాక్షికంగా ఆలోచించవలసి వస్తుంది. అవి మీకు ఇష్టం లేదు. ప్రస్తుతం జరుగుతున్న శోషణా విధానం మారకపోతే మాకు చాలా నష్టం కలుగుతుంది. మీరు 1/6 సూత్రం ప్రకారం ఒక్క కలం పోటుతో భారతదేశానికి కోట్లాది రూపాయలు నష్టం కలిగించగలరని ఆర్థికవేత్తలు భావిస్తున్నారు. కనుక మీనుండి మాకేమీ సహాయం లభించదు.

ఇట్టి స్థితిలో స్వాతంత్ర్యమంటే ఏమిటో, అది మాకెందుకు అవసరమో రాజకీయ పెద్దలుగా వ్యవహరిస్తున్న మేము మా ప్రజలకు వివరంగా తెలియజేయవలెను గదా? అందువలన నేను ఆ ప్రయత్నం చేస్తున్నానని, చేయగలనని మీకు విన్నవించుకొంటున్నాను.

కొన్ని మీ ముందు పెడుతున్నాను. స్వతంత్ర భారతదేశంలో భూమిశిస్తు విధానంలో పెద్దమార్పులు జరగాలి. పర్మినెంట్ సెటిల్‌మెంటు విధానం వలన జమీందారులకు లాభం చేకూరింది గాని బీదరైతులకు ఏమీ ప్రయోజనం కలగలేదు. బీదలు బీదతనంతో మగ్గిపోతున్నారు. అందువలన శిస్తులను తగ్గించడమే గాక, ఆ విధానాన్ని గూడా మార్చాలి. బ్రిటిషు పరిపాలన రైతులను అణచివేయడానికమాత్రమే ఉపయోగపడుతున్నది. ఉప్పు వంటి వస్తువుల మీద గూడా అతడు పన్ను చెల్లించవలసి

వస్తున్నది. ధనవంతుల కంటే బీదవారికి ఉప్పు మరీ అవసరం. అందులో గూడా మార్పు లేకపోవడానికి ప్రభుత్వం వారికి హృదయం లేకపోవడమే కారణమనిపిస్తున్నది. కల్లు సారాయీల మీద పన్ను వేస్తున్నారు. అది గూడా అతడినే బాధిస్తున్నది. కల్లు సారాయిలు అతని ఆరోగ్యాన్నీ నైతికస్థాయిని గూడా పాడుచేస్తున్నవి. ప్రభుత్వం వ్యక్తి స్వాతంత్ర్యం పేర దానిని సమర్థిస్తున్నది. 1919లో జరిగిన మార్పులు ద్వారా ఈ పన్ను ద్వంత్వాత్మకం చేయబడినది. ఆ పన్ను తొలగిస్తే విద్యకు డబ్బుండదు. అది తొలగించే వీలు లేదంటున్నారు. ఖాదీ మొదలైన వాటి విషయంలో గూడా అంతే. పత్రికల్లో వార్తలు, ప్రకటనలు వస్తూనేవున్నవి. ఇక ప్రభుత్వం చేస్తున్న ఋణాలను గురించి గూడా చెప్పకపోతే న్యాయం చేసినట్లుగాదు. ఋణాలు అర్థం లేకుండా వున్నవి. శక్తికి మించి వున్నవి. స్వతంత్ర భారతదేశంలో వాటిని గురించి గూడా పరిశీలన జరగాలి. న్యాయబద్ధమైన మార్పులు జరగాలి.

ప్రపంచంలో ఎక్కడా లేనంతగా అధికారుల మీద మీరు ధనం వ్యయం చేస్తున్నారు. అధికారులకు ఇంత పెద్ద జీతాలు ఏ దేశంలోనూ లేవు. పన్నుల ప్రమేయమంతా అందుకే జరుగుతున్నది. మీ జీతాన్నే చూడండి. మీ జీతం నెలకు 21000 వేలు. ఇదిగాక ఇతర భత్యాలు వగైరాలు వుండనే వున్నవి. బ్రిటిష్ ప్రధానమంత్రి జీతం సాలుకు 5000 పౌండ్లు. అంటే నెలకు ఆయన జీతం 5400లు. మీరు రోజుకు రు700 లు తీసుకుంటున్నారు. సగటు భారతీయుని ఆదాయం రోజుకు రెండు అణాలు. గ్రేట్ బ్రిటన్‌లో ప్రతి వ్యక్తి సగటు ఆదాయం రోజుకు రెండు రూపాయలు. అంటే మీరు సగటు రేటున ఆదాయం కంటే ఐదు వేల రెట్లు ఎక్కువ జీతం తీసుకొంటున్నారు. బ్రిటిషు ప్రధానమంత్రి తొంభై రెట్లు ఎక్కువ జీతం తీసుకొంటున్నాడు. ఏమిటిది? దీనిని గురించి నెమ్మదిగా ఆలోచించమని నా మనవి. నిజాన్ని స్పష్టంగా తెలియజేయటం కొరకు మీ జీతాన్ని ఉదాహరణగా తీసుకున్నాను. క్షమించండి. మీరంటే నాకు ఎక్కువ గౌరవమున్నది. మిమ్మల్ని బాధపెట్టడం నా ఉద్దేశ్యం గాదు. నిజానికి మీకు అంత జీతం అక్కర్లేదు. మీరు కోరరు గూడా. కాని విధానం అట్లా వున్నది. దానిని మార్చాలి అని మేము కోరుతున్నాము. మిగిలిన అధికారుల జీతాలు గూడా మీ జీతంలాగానే మరీ ఎక్కువగా వున్నవి.

బ్రిటిషు పాలనలో జరుగుతున్న దుబారా ఖర్చు ఇదంతా. ఆ ఖర్చును తగ్గిస్తే శిస్తులను తేలికగా తగ్గించవచ్చును. పన్నుల భారాన్ని తగ్గించవచ్చును. అంటే ప్రభుత్వ దృష్టినే మార్చాలి. స్వాతంత్ర్యం లేనిది ఇటువంటి మార్పులు చేయడం కష్టం. అందుకే మేము స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాము. అందుకే 26 జనవరి నాడు దేశమందంతటా సమావేశాలు జరిగినవి. వేలకొలది జనం ఆ సమావేశాల్లో పాల్గొన్నారు. వారి దృష్టిలో స్వాతంత్ర్యమంటే వారి నెత్తిమీదనున్న పెనుభారాన్ని తగ్గించుకొనడమే.

బ్రిటన్‌లోని ఏ రాజకీయ పక్షమూ భారతదేశం మీది అధికారాన్ని వదలుకోడానికి సిద్ధంగా లేదు. భారతదేశం స్వాతంత్ర్యం కొరకు ఉవ్విళ్ళూరుతున్నది. ఆ విషయం మీకు మాటిమాటికీ జ్ఞాపకం చేస్తూనేవున్నది.

భారతదేశం ఒక జాతిగా మనగలగాలంటే, రోజు రోజూ వెంటాడుతున్న ఆకలి బాధ నుండి జాతిని రక్షించవలెనంటే ఏదైనా ఒక ఉపాయం చేయక తప్పదు. వెంటనే ఏదో ఒక ఉపశమనం జరగాలి. సమావేశం దానికి పరిష్కార మార్గం గాదు. ఇది వాదనలతో ఉపన్యాసాలతో తేలే సమస్యగాదు. బ్రిటన్ తన వాదనను సమర్థించు కొంటుంది. మేము మా వాదనను సమర్థించుకొంటాము. ఎవరి వాదనలు వారు వినిపిస్తారు. దీనితో సమస్య పరిష్కారం కాదే! భారతదేశానికి ఇది జీవన్మరణ సమస్య.

అంత సంగరితంగా లేకపోయినా, ప్రస్తుతానికి బలహీనంగా కనబడుతున్న హింసావాదం నెమ్మది నెమ్మదిగా బలం పుంజుకొంటున్నది. హింసావాదుల లక్ష్యం గూడా మా లక్ష్యమే. కాని వారి మార్గం పరిష్కారాన్ని సాధించలేదని నా నిశ్చితాభిప్రాయం. రోజు రోజుకూ నా అభిప్రాయం బాగా బలపడుతున్నది. హింస వలన ప్రయోజనం లేదు. అహింసా మార్గం ఒక్కటే అనుసరించదగినది. బ్రిటిష్ ప్రభుత్వం హింసను అనుసరిస్తున్నది. అహింసతోనే దానిని గూడా మేము ఎదుర్కొనగలమని నా విశ్వాసం అహింసను గురించి కొంత అనుభవమున్నది. నా అనుభవం చిన్న క్షేత్రంలోనిదైనా దాని ప్రభావాన్ని నేను చూచాను. అహింస బలమైన సాధనం. అందుకు కృషిచేయడం నా బాధ్యత. అందువలన నేను ఇంకా వేచివుండదలచుకోలేదు. వేచివుండడం పాపకృత్యమని నేను భావిస్తున్నాను.

ప్రస్తుతం అహింసను శాసనోల్లంఘనానికి అనుసరిస్తాము. అందువలస దీనిని సత్యాగ్రహాశ్రమంలోని నా అనుచరుల వరకే పరిమితం చేశాను. అయినా అది అంతటితో ఆగదు. ప్రజలందరిలో వ్యాప్తమవుతుంది.

నేను ఎట్టి పరిస్థితిలో అడుగు వేస్తున్నానో అది నాకు పూర్తిగా తెలుసును.ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనకుండా సత్యం విజయం సాధించలేదు. కనుక ప్రమాదస్థితిని మేము ఎదుర్కొనక తప్పదు. ఎదుర్కొంటాము. జాతిలో మార్పు తేవడం, భావాలలో మార్పు తేవడం అంత తేలికపని గాదు.

ఇక్కడ మార్పు అనే శబ్దాన్ని బుద్ధిపూర్వకంగా ఉపయోగిస్తున్నాను. అహింస ద్వారా బ్రిటిష్ వారిని మార్చవలెనని నా కోరిక. మా విషయంలో మీరు చేస్తున్న తప్పును గుర్తించండి. వారికి నచ్చజెప్పి వారిని మార్చి వారికి గూడా సేవ జేయవలెనని నేను ఆశిస్తున్నాను. 1919 వరకు నేను బ్రిటిష్ వారికి గుడ్డిగా సేవజేశాను. కాని తరువాత నా కళ్లు తెరుపుడు పడ్డవి. ఆ తరువాత శాసనోల్లంఘనం, సహాయ నిరాకరణ వంటి కార్యక్రమాలు ప్రారంభించాను. మా సభ్యుల విషయంలో గూడా నేను ఈ ఆయుధాన్నే ఉపయోగించాను. మీ యెడల గూడా ప్రయోగిస్తున్నాను. నా వారి యెడల నాకు ఎంత ప్రేమ భావం ఉన్నదో మీ యెడల గూడా అంత ప్రేమ భావమున్నది. అది దాగి వుండదు. అది తప్పక జరుగుతుంది. రాతి గుండెలు కూడా కరగకమానవు. మా ప్రజలు నా ఉద్యమంలో చేరి కష్టాలు సహిస్తారు. బాధల్ని ఆనంతంగా ఎదుర్కొంటారు. అది చూచి బ్రిటిషువారు గూడా మారగలరని నా విశ్వాసం. భారతదేశంలో బ్రిటిషు పరిపాలన వలన జరుగుతున్న పొరపాట్లను సరిదిద్దడమే మా ఉద్యమ లక్ష్యం. జరుగుతున్న అన్యాయాలను అరికట్టడం కొరకే మీతో మాకు గల సంబంధాన్ని విడనాడ గోరుతున్నాము. అన్యాయాలు తొలగిపోతే మార్గం సుకరమవుతుంది. రాయబారాలు మిత్ర పద్ధతిలో జరగగలవు. మాకు స్వాతంత్ర్యం ప్రసాదించినందు వలన మీకు నష్టముండదు. ప్రస్తుతమున్న లోభవృత్తి మీలో నుండి తొలగాలి. మార్గం సుకరం చేయమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాము. సమానుల మధ్య సమావేశాన్ని ఏర్పాటుచేయండి. పరస్పర సహకారంతో వ్యాపారం జరుపుకొనవచ్చును. మీరు

అనవసరంగా మత సమస్యలను బలపరుస్తున్నారు. అది అంత మంచిపని గాదు. సమస్యలున్నవి. కాని పెద్ద సమస్యలు పరిష్కారమయితే చిన్నవి తేలికగా పరిష్కారం కాగలవు. మీరు అన్యాయాలను తొలగించే ప్రయత్నం చేయకపోతే ఈ నెల 11వ తేదీన నా ఆశ్రమవాసులతో కలసి నేను ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించడానికి ప్రయత్నం ప్రారంభిస్తాను. ఉప్పు చట్టం మరీ దారుణంగా ఉన్నది. చాలా అన్యాయకరమైన చట్టమది మా ఉద్యమం బీదల మేలుకు సంబంధించినది. ఉప్పు చట్ట ఉల్లంఘనతో మా ఉద్యమం ప్రారంభమవుతుంది. ఇంతకాలం అన్యాయాలనూ, దౌర్జన్యాలనూ సహించాము. ఇక సహించడం కష్టం. నన్ను నిర్బంధించి ఉద్యమాన్ని నీరు కార్చాలని మీరు ప్రయత్నిస్తారు. నాకు ఆ విషయం తెలుసును. నా తరువాత ఈ ఉద్యమంలోకి వేలాదిమంది ప్రజలు ప్రవేశిస్తారు. క్రమశిక్షణతో వ్యవహరిస్తారు. చట్టాన్ని ఉల్లంఘించి మీరు విధించే శిక్షల్ని సంతోషంగా అనుభవిస్తారు.

అనవసరంగా మీకు కష్టం కలిగించడం నా ఉద్దేశ్యం కాదు. నా వుత్తరంలో సారమేమైనా వున్నదని భావిస్తే, నాతో మాట్లాడదలిస్తే టెలిగ్రాం పంపించండి. అంతవరకు ఈ ఉత్తరాన్ని బహిరంగపరచను. నా మార్గాన్ని మార్చడానికి ప్రయత్నించి నన్ను నిరాశపరచవద్దు.

ఇది బెదిరింపు ఉత్తరం కాదు. ఇది పంపడం నా పవిత్రమైన కర్తవ్యమని భావిస్తున్నాను. అహింసావాదిగా ఇది నా కర్తవ్యం. ఈ ఉత్తరాన్ని ఒక ఇంగ్లీషు నవయువకుని ద్వారా మీకు పంపుతున్నాను. ఆ నవయువకుడు సంపూర్ణంగా అహింసావాది. భారతీయుల యెడ సానుభూతిగలవాడు.మా సమస్యలను ఆకళింపు జేసుకొన్నవాడు. విధాత అందుకే అకస్మాత్తుగా ఆయన నిక్కడకు పంపించినట్టున్నాడు.

మీ స్నేహితుడు

ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 63. లార్డ్ ఇర్విన్ గారికి

ప్రియమైన స్నేహితులు,

భగవంతుడు దయతలిస్తే .... నా అనుచరులతో కలసి అక్కడకు చేరుతాను. ఉప్పు కొఠార్లను స్వాధీనం చేసుకొనే ప్రయత్నం చేస్తాను. ధరాసన వ్యక్తిగతమైన ఆస్తిఅని మిత్రులంటున్నారు. అది కేవలం నిజాన్ని కప్పి పుచ్చే మాట. అదిపూర్తిగా ప్రభుత్వాధీనంలో వైస్రాయ్ భవనం లాగానే వున్నది. అధికారుల అనుమతి లేనిదే ఒక్క పిడికెడు ఉప్పు గూడా అక్కడ ఎవ్వరూ బయటకు తీయడానికి వీలు లేదు.

దీనిని తలచుకొంటే మీరు ఆపవచ్చును. దానికి మూడు పద్ధతులున్నవి.

1. ఉప్పు చట్టాన్ని రద్దు చేయడం
2. నన్నూ, నా అనుచరులనూ అరెస్ట్ చేయడం. కాని అది మాతో ఆగదు. మా స్థానంలోకి చాలామంది వచ్చి చేరతారు.
3. కేవలం గూండాయిజం ప్రయోగించటం. పగిలిన తలల స్థానే చాలా తలలు వచ్చి నిలబడతవి. పద్ధతిని మీరు నిర్ణయిస్తారు. ప్రభుత్వం సత్యాగ్రహుల విషయంలో నాగరికంగా వ్యవహరిస్తుందని నేను ఆశించాను. సామాన్య చట్టాలను దృష్టిలో బెట్టుకొని సత్యాగ్రహులతో వ్యవహరిస్తారనుకొన్నాను.

అప్పుడు నేననేదేమీ వుండేదికాదు. అట్లుగాకుండా చిత్రవిచిత్రంగా తోచినట్లు ప్రభుత్వం వ్యవహరిస్తున్నట్లు కనబడుతున్నది. చెదురుమదురుగా ప్రభుత్వం చెడుగా వ్యవహరిస్తే ఉపేక్షించవచ్చును. కాని బెంగాల్, బీహార్, ఒరిస్సా, యు.పి, ఢిల్లీల నుండి ప్రభుత్వ దౌర్జన్యాలను గురించి వార్తలందుతున్నవి. కరాచీ, పెషావర్. మద్రాసుల్లో జరిగినవి అవసరమైనవే గాక, అకారణమైనవి. చాలామంది జనం ఎముకలు విరగగొట్టారు. చేతుల్లో నుండి బలవంతంగా ఉప్పును లాగివేస్తున్నారు. జనం మర్మస్థలాల మీద గూడా నిర్దాక్షిణ్యంగా దాడి చేస్తున్నారు. మధురలో ఒక అసిస్టెంటు మేజిస్ట్రేటు ఒక పది సంవత్సరాల బాలుని చేతిలో నుండి జెండాను బలవంతంగా లాగివేశాడు. ప్రజల వొత్తిడి వలన ఆ జండాను తిరిగి ఇచ్చివేశాడు. జనాన్ని అన్యాయంగా కొట్టారు. ధాన్యపు పొలాలు తగలబెట్టబడినవి. తినుబండారాలు ధ్వంసం చేయబడినవి.

గుజరాత్‌లో ఒక కూరగాయల మార్కెటుమీద దాడి జరిగింది. దుకాణదారులు అధికారులకు కూరలు అమ్మలేదట. అదీ తప్పిదం. ఈ చర్యలన్నీ కాంగ్రెసు ఆదేశం ప్రకారం శాంతంగా మౌనంగా వున్న ప్రజలపై జరిగినవి. సత్యం కొరకు ప్రతిజ్ఞ చేసిన జనం తెలియజేస్తున్న దానిని మనం విశ్వసించాలి. అందుకు విరుద్ధంగా అధికారులు రకరకాల మాటలు చెపుతున్నారు. బార్డోలీలో చూశాము. అధికారులు రకరకాల మాటలు చెపుతున్నారు. అధికారులు చెపుతున్నవన్నీ అసత్యాలే. అది మన అనుభవం.

గుజరాత్‌లో కలెక్టరు ఆఫీసులోని నోటీసు మీద గల కొన్ని వివరాలు మీకు తెలియజేస్తున్నాము. వారి తరపున కరపత్రాలు గూడా ప్రచురింపబడినవి.

1. పెద్దవారు సంవత్సరానికి 5 పౌండ్లు ఉప్పుకు ఉపయోగిస్తారు. దానికి పన్ను మూడు అణాలు. చెల్లించండి. ప్రభుత్వం ఈ రంగంలో నుండి తప్పుకొంటే ప్రజలు ఉప్పుకై ఎక్కువ డబ్బు వెచ్చించవలసి వుంటుంది. దానివలన ప్రభుత్వానికే లాభం. సముద్ర తీరాన్నుండి మీరు ఉప్పు తీసుకొంటే అది తినదగినది కాదు. అందువలన ప్రభుత్వం అటువంటి ఉప్పును ధ్వంసం చేసివేస్తున్నది. ప్రజలకు ఆ ఉప్పు తినకుండా మేలు జేయడం మా ఉద్దేశ్యం.
2. గాంధిగారు చేతితో వడికే పనిని ప్రభుత్వం నాశనం చేస్తుందని దుష్ప్రచారం చేస్తున్నారు. అది నిజంగాదు. నూలు వడకే పరిశ్రమ లేని గ్రామమే లేదు. ప్రభుత్వం నూలు వడికే వారికి మంచి పనిముట్లనూ తక్కువ ధరకు అందించి ఆ వృత్తిని ప్రోత్సహిస్తున్నది.
3. ఋణంగా తెచ్చిన ప్రతి ఐదు రూపాయలలో నుండి నాలుగు రూపాయలు లాభసాటి పనులకు ఖర్చు చేయడం జరుగుతున్నది.

ఈ విషయాలు మీ ముందు పెడుతున్నాము. ఈ మూడు విషయాలు నిజంకాదు గదా? అసత్యాలే గదా? ప్రతి వ్యక్తీ ఉపయోగించే ఉప్పు ప్రభుత్వం వారు చెప్పిన దానికంటే మూడు రెట్లు ఎక్కువ. కనుక పన్ను తొమ్మిది అణాలు. ఈ పన్నును స్త్రీలు, పురుషులు, పిల్లలు అనే భేదం లేకుండా వసూలుచేయడం జరుగుతున్నది. ప్రభుత్వం వారు చెబుతున్నది అసత్యం.

ప్రతి గ్రామంలో వడికే పరిశ్రమ వున్నదనీ, దానికి ప్రభుత్వం సహకార మందిస్తున్నదనీ చెప్పడం మరీ విడ్డూరంగా వున్నది. ఋణాల నుండి ప్రతి ఐదు రూపాయల నుండి నాలుగు రూపాయలు ప్రజలకై ఉపయోగిస్తున్నామనడంలో ఎంత నిజమున్నదో ప్రజలకందరికీ తెలుసును. ప్రభుత్వం చేస్తున్న అధికారులు చెపుతున్న తప్పుడు ప్రచారానికి ఇవి మచ్చుతునకలు.

ఆ సమయంలో నేను అక్కడలేను. ఫలానాచోట నిద్రబోతున్నాను అని చెప్పినా వినకుండా గుజరాత్‌లో ఒకరిమీద ఆరోపణ చేయడం అధికారి సాక్ష్యం మీద ఆయనకు శిక్షపడడం జరిగింది.

ఇక ప్రభుత్వాధికారుల చర్యలను గురించి ఆలోచిద్దాము. కొంతమంది సారాయి దుకాణ యజమానులు పికెటింగు చేస్తున్న స్వయం సేవకుల మీద దౌర్జన్యం చేశారు. స్వయం సేవకుల తప్పేమీ లేదు. వారు శాంతంగా వున్నారని ప్రభుత్వాధికారులు అంగీకరించారు. తప్పుడుగా జరిగిన సారాయి అమ్మకాల మీదగానీ, దౌర్జన్యం చేసిన యజమానుల మీద గానీ అధికారులు ఏమీ చర్య తీసుకోలేదు. నియమ విరుద్ధంగా సారాయి అమ్మకాలు జరిగినవి గదా! ఎవ్వరూ ఫిర్యాదు చేయలేదు. గనుక వ్రాత మూలకంగా ఫిర్యాదు చేయలేదు గనుక మా బాధ్యత లేదని తప్పుకున్నారు. ఇది స్థితి.

ఇక మీరు ఒక ప్రెస్సు ఆర్డినెన్స్ జారీచేసి అందరినీ ఆశ్చర్యంలో ముంచివేశారు. భగవత్సింగ్ తదితరుల విచారణలో జరుగుతున్న జాప్యాన్ని ఉటంకించి, అమలులోనున్న సర్వసామాన్య విధానానికి స్వస్తిచెప్పి, పక్కకు నెట్టి ఈ ఆర్డినెన్స్ జారీచేశారు. ఇంతవరకు అన్నిటికంటే ఈ ఆర్డినెన్స్ దారుణమైనది. ఏవేవో ముసుగులతో వెలువడిన మార్షల్ లా ఇది. ఇంతకూ ఉద్యమం ప్రారంభమై ఐదో వారమే జరుగుతున్నది.

దేశమంతటా మీరు అమానుషాలకు వొడి గడుతున్నారు. మీకు కోపంరావచ్చు. అయినా నేను తీవ్రచర్యలు తీసుకొనక తప్పదు. నా మాటల్ని మీరు విశ్వసించడంలేదు. అయినా జాగ్రత్తగా ఆలోచించమని మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఏమైనా మీ అధికారమనే సింహం కోరల విస్తారాన్ని ప్రశ్నించకపోతే నాది పిరికితనమవుతుంది. నేను ఈ ఉద్యమానికి కారణభూతుడిని గనుక, వారికి సరైనమార్గాన్ని చూపించగలను. ఉద్యమాన్ని నడిపించడానికి ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొంటాను.

సత్యాగ్రహ సిద్ధాంతం ప్రకారం ప్రభుత్వ దౌర్జన్యం అరాజకత ఎంత ఎక్కువగా వుంటే స్వయంసేవకుల సహనశక్తి, బాధలను అనుభవించే ధైర్యం అంత ఎక్కువగా విజయానికి దారితీస్తాయి.

నా మార్గంలోని కష్టాలను నేనెరుగుదును. నా దేశప్రజలు నన్ను అపార్థం చేసుకోరు. నామాటల్ని వక్రీకరించి ఉపయోగించరు. నా అభిప్రాయాలను స్పష్టంగా వెల్లడిస్తాను. గడచిన పదిహేను సంవత్సరాలనుండీ నేను ఒకే మాట చెప్తున్నాను. ఇతర దేశంలో వుంటూ ఇరవై సంవత్సరాలనుండే చెప్పాను. హింసను జయించడానికి అహింస ఒక్కటే మార్గం. మన చేతల్లో గానీ ఆలోచనలలోగానీ హింస ప్రవేశిస్తే అది వాతావరణాన్నంతా పాడు చేస్తుంది. ఇంత చెప్పినా జనం ఇంకా హింసనే అనుసరిస్తే నేను బయటకు తప్పుకోవలసి వుంటుంది. అటువంటి స్థితి ఏర్పడుతుందనే భయంతో నా ఉద్యమాన్ని విరమించను. అహింస పని చేయదనే సందేహం నాకు లేదు.

ఏమైనా అన్నీ ఆలోచించిన తరువాతనే నేను అడుగు ముందుకు వేస్తాను. మీరు దయవుంచి ఉప్పు పన్ను రద్దు చేయండి. ఆ పన్నును దేశ విదేశాలలో అందరూ నిరసిస్తున్నారు. మాటల్లో మీరు హింసాత్మక ప్రతిఘటన కోరుకుంటున్నారా? అహింస హింసగా పరిణమిస్తుందంటున్నారు. అంటే మీకు అహింసాతత్వం అర్థంగాలేదని అనుకోవాలి. మీరు ఉప్పు పన్ను రద్దు చేసి అందరికీ ఉప్పు తయారుచేసుకొనే హక్కును ప్రసాదించకపోతే నేను నా ఉద్యమాన్ని ప్రారంభిస్తాను. ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించి తీరుతాను. అహింస విషయంలో దృఢ శక్తిని భగవంతుడు నాకు తప్పక ప్రసాదిస్తారు.

మీ
స్నేహితుడు
ఎమ్. కె. గాంధి

*(ఇది 4-5-1930వ తేదీన సత్యాగ్రహ ప్రారంభ సమయంలో గాంధీగారు వ్రాసిన ఉత్తరం.)*

★ ★ ★

# 64. రెజినాల్డ్ రేనాల్డ్ గారికి

23-2-1931

ప్రియమైన రెజినాల్డ్‌గారూ,

స్పష్టంగా నిర్మొహమాటంగా వున్న మీ వుత్తరం అందింది. ధన్యవాదాలు. గట్టిగా వుండవలసిన చోట గట్టిగా వుండడం చాలా అవసరం. మీతో నేను ఏకీభవిస్తున్నాను. అందువల్లనే దాని ప్రకారం నేను మీతో ఏ మాత్రమూ ఏకీభవించడం లేదని స్పష్టంగా తెలియజేస్తున్నాను. ముగ్గురు స్నేహితుల రాక దాకా వేచివుండడం సంభవం గాదు, సత్యాగ్రహం ఎదురుచూస్తూ కొంతకాలం ఆగగలదు. పెద్దమనిషితనం అవసరాన్నిబట్టి పెద్దమనిషితనంగానే వుండాలి. ఆ ముగ్గురు మిత్రులూ దేశభక్తులు. వారిని గురించి నిర్ణయించే అధికారం నాకు లేదు. నన్ను గురించి గూడా వారు ఒక నిర్ణయానికి రాగూడదు గదా!! పనికి ఏమాత్రం ఆటంకం కలగదు. వారి అభిప్రాయానికి నేను వ్యతిరేకంగా నడుస్తున్నానని వారికి కొంత కష్టం కలగవచ్చును. సమయం గడిచిన కొద్దీ ఇలాంటివి ఇక ముందుగూడా జరగవచ్చును. సత్యాగ్రహం విషయంలో నేను అనుభవజ్ఞుడనని నా అభిప్రాయం. ఎందుకంటే నేను పనిజేసి అనుభవం గడించివున్నాను. ఇప్పుడు గూడా చాలా క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నాను. వేచివుండడం వలన ప్రయోజనముంటుంది. అయితే సిద్ధాంతాల విషయంలో నేను తలవొగ్గడమనే ప్రశ్న వుండదు. ఇందులో కాంగ్రెసు పొరపాటేమీ లేదు. ఇతరులకు నచ్చజెప్పడం, న్యాయమైన కారణాలను చూపించడం, మానవత్వపు విలువలను గౌరవించడం సత్యాగ్రహ సిద్ధాంత మూలమంత్రాలు, సంభాషణలు ఇంకా జరుగుతున్నవి. అన్ని విషయాలూ మీకు తెలిసియే వుంటవి. ఈ ఉత్తరం మీకు అందేనాటికి నేను చెప్పినవన్నీ పాతబడి పోవచ్చును.

మీ వివాహం సంగతి ఏమయింది?

ప్రేమతో
మీ
ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 65. రిచర్డ్ గ్రెగ్‌గారికి

29-4-1933

ప్రియమైన గ్రెగ్ గారూ

మీ వుత్తరం అందింది. మీరాకు చదివి వినిపించాను. మీ వుత్తరంలో మీరు నా యెడల చూపించిన వ్యాకులత్వాన్ని నేను అర్థం జేసుకొనగలను. నేను లండన్ వెళ్లుతానో లేదో తేలలేదు. మార్గం స్పష్టం గాకపోతే నేను వెళ్లను. నా అభిప్రాయాన్ని అక్కడ నేను వివరించవలసి వున్నది. దానిని అక్కడివారు అంగీకరించక పోవచ్చును. మేమే అంగీకరించకపోతే సంభాషణలకు వ్యతిరేకమని కాంగ్రెసుపై నిందారోపణ జరుగుతుంది. అందువలన దోషం మామీద లేకుండా మేము వ్యవహరిస్తాము. సంభాషణల ద్వారా శాంతి ఏర్పడితే అంత కన్న కావలసినదేముంటుంది? అది చాలా గొప్ప విషయమవుతుంది. ఆ స్థితిని సాధించడానికి నా ప్రయత్నమంతా నేను చేస్తాను. సంభాషణలు విఫలమైనా మంచిదే. ఇండియా కష్టాలనెలా ఎదుర్కొనగలదో, బాధలు ఎలా అనుభవించగలదో చూపడానికి అవకాశం కలుగుతుంది. నేను లండన్ వెళ్లితే కేవలం పనికోసం వెళ్లుతాను. నా కొల్లాయి గుడ్డలు ప్రదర్శించడానికి గాదు. అక్కడి మిత్రుల సాంగత్యం నాకు ధైర్యాన్నిస్తుంది. ఏమి జరుగుతుందో చెప్పలేను. వెలుతురు ఎక్కడికి నన్ను పిలిస్తే అక్కడికి వెళ్లుతాను. పూర్తి విశ్వాసంతో పనిచేస్తాను.

నా అమెరికా ప్రయాణాన్ని గురించి నీలివార్తలను నమ్మవద్దు. ఆ గొప్పదేశాన్ని చూడడం నాకిష్టమే. అందుకు సమయం రాలేదు.

మీ

ఎమ్. కె. గాంధీ

*(గాంధీ గారి అమెరికన్ మిత్రుడు గాంధీ గారితో కలిసి పనిచేశాడు, 1925-27 వరకు ఇండియాలో వున్నాడు. 1930లో తిరిగి ఇండియాను సందర్శించాడు.)*

★★★

# 66. సర్ సామ్యుల్ హోర్ గారికి

యర్రవాడ సెంట్రల్ జైలు
11-3-1932

ప్రియమైన సర్ సామ్యుల్ గారూ,

రౌండ్ టేబుల్ సమావేశ సందర్భంలో నేను చేసిన ప్రసంగం చివరి భాగంలో అల్పసంఖ్యాకుల సమస్య చర్చకు వచ్చినపుడు వెనకబడిన వారి కొరకై ప్రత్యేక నియోజక వర్గాలను వేరుగా ఏర్పాటుచేయడాన్ని నేను ఎదురిస్తానని చెప్పి వున్నాను. అది మీకు జ్ఞాపకముండి వుంటుంది. అది క్షణికోద్రేకంలో, వేడిలో చెప్పిన మాట గాదు. అలంకారికంగా చెప్పిన మాటకాదు. అది నా ధార్మిక ప్రకటన.

ఇండియాకు తిరిగివచ్చిన తరువాత ఆ ప్రకటన విషయంలో ప్రజాభిప్రాయాన్ని సేకరించి ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటు వ్యతిరేకించవలెనని అనుకొన్నాను.

వార్తాపత్రికలను బట్టి ఏ నిమిషంలోనైనా ప్రభుత్వం తమ నిర్ణయాన్ని ప్రకటించవచ్చని తెలుస్తున్నది. వెనుకబడిన వర్గాలవారికి ప్రత్యేక నియోజకవర్గాల సూచనను మీరు అంగీకరిస్తే నా మాట నిలబెట్టుకొనడానికి అవసరమైన చర్యలు తీసుకొందామని మొదట అనుకొన్నాను అయితే మీకు ముందుగా సూచన ఇవ్వకుండా అటువంటి ప్రయత్నం చేయడం అనుచితమని తోచింది. నా మాటకు ప్రభుత్వం తగినంత విలువను ఇవ్వకపోవచ్చును.

నా వాదనలను తిరిగి మీకు తెలుపవలసిన అవసరం లేదు. మీకు తెలునును. నన్ను నేను వెనకబడిన వారిలో ఒకనిగా భావించుకొంటున్నాను. ఈ సమస్య మిగతా సమస్యల వంటిది కాదు. ఇది ప్రత్యేకమైన వేరు సమస్య. శాసనసభల్లో ఆ వర్గాల వారికి ప్రాతినిధ్యమివ్వడానికి నేను వ్యతిరేకిని కాను. ఆ వర్గాలలోని స్త్రీ పురుషులందరూ విద్య, ఆస్తి నిబంధనలతో సంబంధం లేకుండా వోటర్లు కావాలి. మిగతా జాతుల వారికి ఉన్నత వర్గాల వారికి ఆ నిబంధనలు అవసరం గావచ్చును.

వెనకబడిన వర్గాల పేరిట ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పడడం వారికిచాలా హానికరం. రాజకీయాలెలా వున్నా అది హిందుత్వానికి గూడా నష్టదాయకం. ప్రత్యేక

నియోజక వర్గాల ఏర్పాటు అటు హిందువులకూ, ఇటు వెనుకబడిన వర్గాల వారికీ అపార నష్టాన్ని కలగజేస్తుంది. వారంతా ఒకరిమీద ఇంకొకరు ఆధారపడివుంటారు. కొత్త మార్పులు వారిని విభజించి, వారిలో విభేదాలు పెంచగలవు. అది నా దృష్టిలో నైతిక సమస్య. ధార్మిక సమస్య. రాజకీయ సమస్య గూడా ముఖ్యమైనదే అయినా నైతిక దృష్టిలో రాజకీయాలకు అంత ప్రాముఖ్యముండదు.

నా భావాలను మీరు గౌరవించగలరని ఆశిస్తున్నాను. వెనకబడిన వారి పరిస్థితిని బాగుపరచవలెనని ప్రయత్నిస్తున్నాను. నా సర్వస్వాన్నీ అందుకై పణంగా వొడ్డదలచుకొన్నాను. శతాబ్దాలుగా వారి యెడల చూపబడిన నిరాదరణకు ప్రాయశ్చిత్తంగా ఎంత తపస్సు చేసినా సరిపోదు. హిందువులు ఆ మార్గంలో పయనించాలి. కాని దానికి ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేయడం పరిష్కారమార్గం కాదు. అది సరి కాదు.

మేమెంత చెప్పినా వినక ప్రభుత్వం ప్రత్యేక నియోజకవర్గాల నిర్మాణానికే సిద్ధపడితే, అందుకు అంగీకరిస్తే నేను ఆమరణదీక్ష వహించవలసి వుంటుందని నమ్రతగా మీకు నివేదిస్తున్నాను.

నేను ఖైదీగా వుండి ఇటువంటి పని చేయడం వలన ప్రభుత్వానికి కొంత ఇబ్బందిగా వుంటుందని బాధతో అంగీకరిస్తున్నాను. ఇటువంటి పనిని చాలామంది పెద్దలు గూడా అంగీకరించకపోవచ్చును. రాజకీయాలలో ఇలాంటివి పనికిరావని భావించవచ్చును. నేను చెప్పగలిగింది ఒక్కటే. ఇది ఒక పద్ధతి గాదు. విధానం గాదు. నా జీవితానికి - నా వునికికి - ఇది విడదీయరాని ఒక భాగం. ఇది నా అంతరాత్మ తాలూకు పిలుపు. దీనిని నేను వ్యతిరేకించను. ఎంత నష్టం కలిగినా దానిని నేను అనుసరిస్తాను. ఒకవేళ ప్రభుత్వం జైలు నుండి వదలివేసినా నానిర్ణయంలో మార్పుండదు. ఏమైనా ప్రభుత్వం ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటుకు అంగీకరించక నా సందేహాలు నిజంగాదని నిరూపించగలరని విశ్వసిస్తున్నాను.

నన్ను బాధిస్తున్న ఇంకొక విషయాన్ని గురించిగూడా మనవి చేస్తున్నాను. దానికి గూడా ఇటువంటి నిరాహార దీక్ష అవసరం గావచ్చును. దేశంలో జరుగుతున్న దమనకాండను ప్రభుత్వం ఎపుడు ఆపివేస్తుందో తెలియడం లేదు. ఇంగ్లీషు, ఇండియన్ అధికారులందరూ పాశవికంగా వ్యవహరిస్తున్నారు. అందరూ చిన్న పెద్ద భేదం

లేకుండా నీతి తప్పుతున్నట్లు కనిపిస్తున్నారు. తమ తోటి ప్రజలతో వారు వ్యవహరిస్తున్న విధానం జుగుప్సాకరంగా వున్నది. ప్రజలను భయభ్రాంతులను చేయవలెనని వారు ప్రయత్నిస్తున్నారు. వాక్స్వాతంత్ర్యం అసలే లేదు. శాంతి భద్రతల పేరుతో గుండాయిజం వ్యాప్తిలోకి వచ్చింది స్త్రీలు బయటకు రావడానికి తమ గౌరవానికి ఎక్కడ భంగం కలుగుతుందోనని భయపడుతున్నారు.

కాంగ్రెస్సుపై కక్ష దీర్చుకొనవలెనని ఈ ప్రయత్నం జరుగుతున్నది. సామాన్య చట్టాల ప్రకారం ఈ చర్యలు జరగడం లేదు. ప్రజల పీడన ముఖ్యోద్దేశ్యం. మీ పనులలో ప్రజాస్వామ్యమనేది ఎక్కడా కనబడడం లేదు. నా ఇంగ్లాండు ప్రయాణం సందర్భంలో ప్రజాస్వామ్యం సేవాబద్ధమైనదని నిర్ణయించుకొన్నాను. ఎంతో జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయాలను గూడా పార్లమెంటుకు తెలియజేయకుండానే కొందరు వ్యక్తులు నిర్ణయిస్తున్నారు. జరిగిన నిర్ణయాలను అనుమోదించడం పార్లమెంటు చేస్తున్నది. పార్లమెంటుకు విషయాలను గురించి కొంత తెలుసును. కొంత తెలియదు. ఈజిప్టు విషయంలో అంతే జరిగింది. 1914 యుద్ధం విషయంలోనూ అదే జరిగింది. ప్రజాస్వామ్యంపేరుతో ఒకే వ్యక్తి వేలకొలది జనం జీవితాలతో ఆడుకొంటున్నాడు. అందుకే నేను వ్యతిరేకిస్తున్నాను. నా దృష్టిలో మాది ప్రజాస్వామ్యం గాదు. అప్రజాస్వామ్యం.

ఈ దమనకాండను ఇంకా సాగనీయగూడదు. దాని వలన పరస్పర వైషమ్యాలు బాగా పెరిగిపోతవి. దాన్ని ఆపడం నా కర్తవ్యం గాదా? అప్రజాస్వామ్యాన్ని ఎలా ఆపివేయాలి? శాసనోల్లంఘనాన్ని విరమించను? శాసనోల్లంఘనం నా జీవిత విశ్వాసాలలో సులభమైనది. నేను ప్రజాస్వామ్యవాదిని. తమ భావాలను ఇతరుల మీద రుద్దడానికిపైశాచిక శక్తని ఉపయోగించడం ప్రజాస్వామ్యానికి విరుద్ధం. పైశాచిక శక్తిని ఆపడానికి శాసనోల్లంఘనం తిరుగులేని సాధనం. ఇది ఆత్మ త్యాగానికి, కష్టాలను సహించడానికీ ప్రాధాన్యత నిస్తుంది. సత్యాగ్రహి అన్యాయాన్ని ఎదురించడానికి ప్రాణత్యాగం గూడా చేస్తాడు అయితే ఇంకా ఆ పరిస్థితి ఏర్పడలేదు. కాని పరిస్థితి అందుకు దారితీస్తున్నది. అందువలన మీకు ముందుగానే తెలియజేస్తున్నాను.

మన ఉత్తర ప్రత్యుత్తరాలు చాలా రహస్యంగా ఉన్నవి. శ్రీ వల్లభభాయి పటేలు, మహదేవ దేశాయ్‌కి మాత్రం తెలుసును. ఈ ఉత్తరాన్ని మీరెలాగైనా ఉపయోగించుకొనవచ్చును.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 67. రామ్సే మాక్డొనాల్డ్ గారికి

యరవాడ జైలు

18-8-1932

11 మార్చి తేదీన నేను వ్రాసిన ఉత్తరాన్ని సర్ సామ్యుయల్ హోర్ గారు మీకు చూపించారు. ఆ వుత్తరంలోనిదే ఒక భాగంగా భావించి దానితోబాటు ఈ ఉత్తరాన్ని గూడా చదవండి.

అల్ప సంఖ్యాకుల విషయంలో ప్రభుత్వ నిర్ణయాన్ని గురించి నేను చదివాను. రౌండ్ టేబిల్ సమావేశంలో నేను చేసిన ప్రసంగం., హోర్ గారికి వ్రాసిన ఉత్తరం రెండింటిని బట్టి నా భావాలు మీకు తెలిసివుంటవి. ఆ నిర్ణయాన్ని నేను ప్రాణాలొడ్డి వ్యతిరేకించక తప్పదు. ఆమరణ నిరాహారదీక్ష పూనడమే నాకు శరణ్యం. ప్రభుత్వం తన నిర్ణయాన్ని మార్చుకొని ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటును విరమించుకొనే వరకు నా నిరాహార దీక్ష సాగుతుంది.

ప్రభుత్వం తన ఉద్దేశ్యాన్ని మార్చుకొనకపోతే సెప్టెంబరు 20వ తేదీ నుండి నా ఉపవాసం ప్రారంభమవుతుంది.

ఈ ఉత్తరాన్ని కేబుల్ ద్వారా మీకు పంపమని జైలు అధికారులను కోరాను. ఆలోచించడానికి మీకు కొంత సమయం లభ్యమవుతుంది.

సర్ సామ్యుల్ హోర్ గారికి వ్రాసిన ఉత్తరాన్నీ, ఈ ఉత్తరాన్ని రెండింటిని పత్రికలకు విడుదల చేయమని మిమ్ము ప్రార్థిస్తున్నాను. నేను జైలు నియమాలను తు.చ తప్పకుండా పాటిస్తున్నాను. శ్రీ వల్లభాయి పటేల్, మహదేవ దేశాయ్ గార్లకు

తప్ప ఇంకెవ్వరికీ ఈ ఉత్తరం సంగతి తెలియదు. ఉత్తరాలు ప్రచురణ పొందితే ప్రజాభిప్రాయం బోధపడుతుంది. అందుకే నా యీ ప్రార్థన

నా నిర్ణయానికి నేనే విచారిస్తున్నాను. నేను ధర్మానికి ప్రాధాన్యమిచ్చే వ్యక్తిని. నాకు ఇంకొక మార్గం లేదు. సామ్యుల్ హోర్ గారి వుత్తరంలో నేను వ్రాసినట్లుగా నన్ను జైలు నుండి వదలినా ఉపవాసం ఆగదు. జైలు నుండి విడుదలను గూడా నేను కాంక్షించడం లేదు.

ప్రత్యేక నియోజక వర్గాల సూత్రం వెనకబడిన వారికీ, హిందువులకూ అందరికీ ప్రమాదకరం. నన్ను నమ్మిన, బీద ప్రజల యెడల నేను తప్పుగా వ్యవహరించలేను. నా మృత్యువు నా తపస్సుగా పరిణమిస్తుంది. ఇంకొక విధంగా నేను ప్రవర్తించలేను. నా నిర్ణయం సరైనదని భావిస్తే - (సరైనదని నా విశ్వాసం) నా ఆలోచనా విధానానికి ఇది అనుగుణ్యమైన ఉపలబ్ధి అవుతుంది.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 68. పండిత మాలవ్యా గారికి

యర్రవాడ జైలు

24-2-1933

ఉత్తర ప్రత్యుత్తరాలను ప్రచురణకు విడుదల జేయవచ్చునా అని మీరు పంపిన టెలిగ్రాం అందింది. మీ వుత్తరం అందడానికి 48 గంటల ముందుగా ప్రచురణ సూచన పంపించాను. మీరు చూసి వుంటారు.

మీకు జవాబు వ్రాయించడానికి నాకు సమయం దొరకలేదు. గురువారం సాయంత్రం వరకు హరిజన్‌కు నా సమయం సరిపోయింది.

హరిజన్ పత్రిక మీకు అందుతున్నదనుకొంటాను. చదవడానికి మీకు సమయముంటుందో లేదో తెలియదు. ఈ బిల్లుల విషయంలో మీకూ నాకూ గల అభిప్రాయ భేదాలు లోకమంతటికీ తెలుసును. మీరు సూచించిన ప్రకారం తిరిగి స్థితినంతనూ సమీక్షించండి.

శాసనం లేకుండా సనాతనులు, అభ్యుదయవాదుల మధ్య సంభాషణలతో సమస్యను పరిష్కరించవచ్చని మీ అభిప్రాయం. ఇది నేను ఇదివరకే సూచించాను. సంధి జరిగినా దేవాలయాలు హరిజనుల కొరకై తెరవబడాలి. హరిజనులు మందిరాలలో ప్రవేశించగూడదన్న బిల్లు రద్దుగావాలి గదా?

శాసనాన్ని సవరించకపోతే నైతికంగా ఏర్పడే కష్టాల్ని గురించి ఆలోచించండి. బొంబాయి తీర్మానం ద్వారా చేసిన ప్రతిజ్ఞను మనం అమలుచేయలేము చట్టం ముందు మన అసమర్థతను మనం ప్రకటించలేము. తీర్మానం వ్రాసినపుడు ఇదంతా నాకు తెలియదు. తరువాత మనం ఎన్ని మార్పులు చేసినా అసలు మూలాన్ని మార్చలేము. మతం మనకిద్దరికీ ప్రాణ సమానమే. వ్యావహారికమైన ఇబ్బందులను గురించి ఆలోచించండి. నేను హరిజన్‌లో వ్రాసినట్లుగా మన అభిప్రాయ భేదాలు మన స్నేహ సంబంధాన్ని భగ్నం చేయలేవు.

గౌరవాభివందనాలతో

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 69. బొంబాయి ప్రభుత్వ కార్యదర్శికి
### (గృహ మంత్రాలయం పూనా)

నేను ఇండియాకు వచ్చిన తరువాత మొదటి పనిగా 1915లో సబర్మతి సత్యాగ్రహాశ్రమాన్ని ప్రారంభించాను. సత్యాన్వేషణ చేయడం, సేవ జేయడం ఆ ఆశ్రమం ఉద్దేశ్యం. ఆశ్రమవాసులు ప్రతిజ్ఞ చేస్తారు. సత్యము, అహింస, బ్రహ్మచర్యము, దారిద్ర్య నిర్మూలన, నిర్భయత్వం, అస్పృశ్యతా నివారణ, ఖాదీ ప్రధానమైన స్వదేశీ వ్రతం, సర్వ మత సమభావం ఇవి ప్రతిజ్ఞలోని ముఖ్యాంశాలు. 1916లో ఆశ్రయమున్న స్థలం కొనబడింది. ఆశ్రమవాసులు శరీర కష్టం చేస్తారు. కొంతమంది కూలీలు గూడా వారికి సహాయం చేస్తారు. మా ముఖ్య కార్యక్రమాలు ఇవి. ఖాదీ ఉత్పత్తి, విద్యుచ్ఛక్తి లేని గ్రామ పరిశ్రమలు, వ్యవసాయము, పాలపరిశ్రమ, పాకీపని, విద్య. ఆశ్రమంలో

107 మంది ఉన్నారు. (పురుషులు 42, స్త్రీలు 31, మగపిల్లలు 12, ఆడపిల్లలు 22) ఈ సంఖ్యలో జైల్లో వున్నవారు బయటి గ్రామాలలో పనిజేసేవారు లేరు. ఖాదీ పరిశ్రమలో దాదాపు 1000 మందికి శిక్షణ ఇవ్వబడింది. నాకు తెలిసినంత వరకు వారందరూ బాగా పనిజేసి భోజనానికి కావలసిన దానిని గౌరవంగా సంపాదించు కొంటున్నారు.

ఆశ్రమం రిజిష్టరు చేయబడినది. ధర్మకర్తల యాజమాన్యంలో నడుస్తున్నది. ఆశ్రమ నిధులు పనులవారీగా ప్రత్యేకించబడినవి. ప్రతి విభాగాన్నీ స్వయం పోషకంగా నిర్వహించడం మా ఉద్దేశ్యమైనా స్నేహితుల నుండి అవసరాలకు చందాలు గూడా అందుతున్నవి. అనుభవంలో విద్యాసంస్థలు పిల్లలనుండి జీతాలు తీసుకోకుండా, పిల్లలకు భోజనవసతులు కల్పించి, దుస్తులు గూడా అందించి స్వయంపోషకంగా నడపడం కష్టం అని తేలింది.

ఆశ్రమానికి 3,60,000 ల విలువ గల ఆస్తులున్నవి. నగదు 3,00,000 వున్నది. ఆశ్రమం రాజకీయాలలో పాల్గొనదు. కాని శాసనోల్లంఘనం, సహాయనిరాకరణం అవసరమని నమ్ముతున్నది. కొన్ని అవసరాలలో సత్యాహింసలకు అవి చాలా అవసరమని ఆశ్రమం నమ్మకం. అందువలన 1930లో 80 మంది ఆశ్రమవాసులు దండి యాత్రలో పాల్గొన్నారు.

ప్రస్తుతమున్న పరిస్థితులలో ఆశ్రమం ఇంకా త్యాగం చేయవలసి వున్నట్లు కనిపిస్తున్నది. ప్రభుత్వం తాలూకు దమనకాండ పెచ్చరిల్లుపోతున్నది. ప్రజలలో నిరాశ నిస్పృహలు పెరిగి అనైతికత ఏర్పడుతున్నది.

ఉపవాసం విరమించిన తరువాత వెలువడిన కొన్ని ప్రకటనలు నా దృష్టికి వచ్చినవి.

1. భారతదేశంలోని చాలా భాగాలలో పోలీసువారు సత్యాగ్రహులను భయభ్రాంతులు చేయడానికి విపరీతంగా దౌర్జన్యకాండకు పూనుకొని పీడిస్తున్నారు.
2. స్త్రీలను అవమానిస్తున్నారు

3. స్వేచ్ఛగా ప్రజలు ఎక్కడికి బడితే అక్కడికి పోవడం అసంభవమై పోతున్నది.
4. దేశంలో చాలా భాగాలలో కాంగ్రెసువారు గ్రామ సేవ జేయడం అసంభవమై పోతున్నది.
5. శాసనోల్లంఘనం చేసినవారిని అవమానించడమే గాక జైళ్లలో, లాకప్‌లలో శారీరకంగా కొట్టి హింసించడం జరుగుతున్నది.
6. పెద్ద మొత్తాలను జరిమానాలుగా విధించి ఆ మొత్తం వసూళ్లకు న్యాయవిరుద్ధమైన చర్యలు జరుపబడుతున్నవి.
7. శిస్తుల కొరకై రైతులను వేధించడం జరుగుతున్నది. వారిని భయపెట్టడం కొరకే అది జరుగుతున్నది.
8. పత్రికల మీద ఆంక్షలు విధింపబడినవి.
9. ఆత్మ గౌరవంతో కూడిన సామాన్య స్వేచ్ఛ గూడా దేశంలో నిరాకరించ బడుతున్నది

అధికారులు ఇవి జరగడం లేదని నిరాకరిస్తున్నారు. వాటిలో కొంత అతిశయోక్తి వుంటే వుండవచ్చును. కాని కాంగ్రెసు వారి యెడల ఈ కృత్యాలు జరుగుతున్న మాట వాస్తవం.

కేవలం ఆరోపణల వలన, నిరాకరణల వలన సమస్య పరిష్కారం గాదు. ఆశ్రమం తాలూకు నిర్మాణకార్యాన్ని నడిపించడం కష్టసాధ్యంగా కనబడుతున్నది. ఉద్యమంలో ఆశ్రమం సంబంధ విచ్ఛేదం చేసుకోవాలి. అది ఆశ్రమ లక్ష్యానికి విరుద్ధం. శాసనోల్లంఘనం, ఆశ్రమ వ్యవహారాలు దేనికవి జరగవచ్చునని ఇంతవరకు అనుకొన్నాను. కాంగ్రెస్సుకూ, ప్రభుత్వానికీ మధ్య శాంతి ఏర్పడుతుందను కొన్నాను. కాంగ్రెసు లక్ష్యం ఇంత తొందరలో సాధించడం జరగకపోయినా శాంతి ఏర్పడుతుందను కొన్నాను. ప్రభుత్వానికి ఆ ఉద్దేశ్యమున్నట్లు కనిపించడం లేదు. మేము లొంగిపోవలెనని వారి కోరిక. అది సంభవం గాదు. జరిగే పని గాదు. కనుక ఉద్యమం చాలాకాలం సాగుతుంది. ఇంతవరకు చేసిన దానికంటే ప్రజలు ఇంకా త్యాగం చేయవలసి వున్నట్లు కనబడుతున్నది. ఈ ఉద్యమానికి మూలం నేను గనుక నేను పెద్ద త్యాగం చేయాలి.

ఈ ఆశ్రమాన్ని గడచిన 18 సంవత్సరాలుగా ప్రాణం కంటే ఎక్కువగా పోషించుకొన్నాము. ఇక్కడ వున్న ప్రతి వృక్షానికీ, ప్రతి పశువుకూ చరిత్ర వున్నది. అందరూ ఈ పెద్ద కుటుంబం లోనివారే. కన్నీళ్లు కార్చకుండా ఆశ్రమంతో మాకున్న సంబంధాన్ని తెంచుకోలేము. ఒకప్పుడు ఇదంతా బంజరుగా వుండేది. ఇపుడు ఫలవృక్షాలతో, పూలమొక్కలతో విలసిల్లుతున్నది. నేను ఆశ్రమవాసులతో సంప్రదించాను. వారంతా ప్రస్తుత కార్యకలాపాలు ఆపుటకు ఏకగ్రీవంగా అంగీకరించారు. వారందరూ ఉద్యమంలో పాల్గొన నిశ్చయించారు.

గడచిన రెండు [illegible] పన్నులు చెల్లించడానికి ఆశ్రమం నిరాకరించింది. విలువగల [illegible] అందుకై అమ్మివేయబడినవి. జప్తు చేయబడినవి. నేను ఫిర్యాదు [illegible]. అందువలన ఈ పరిస్థితుల్లో ఇంత పెద్ద ఆశ్రమాన్ని నడపడం, [illegible]. ప్రభుత్వం న్యాయమైనదైనా కాకపోయినా, అది ప్రజల చేతిలో వున్న విదేశీయుల అధీనంలో వున్నా ప్రభుత్వంతో సంఘర్షిస్తే ప్రజల ఆస్తులను బలవంతంగా వశపరచుకొంటారు. అది నిజమే. చాలా దూరం పోయేటట్లు ఇది నాకు కన్పిస్తున్నది.

ఈ ఆశ్రమాన్ని మూసివేయడానికి నిర్ణయించిన సందర్భంలో ఈ ఆశ్రమాన్ని ప్రజల ఉపయోగానికి వినియోగించదలచాము. దీన్ని ప్రభుత్వానికి సమర్పించడం కంటే ఆశ్రమం తలపెట్టిన కార్యక్రమాల నిర్వహణకు తోడ్పడే స్నేహితులకు సమర్పించడం మంచిదనుకొంటున్నాను. ఖద్దరుకు సంబంధించిన అన్ని వస్తువులనూ, ఆల్ ఇండియా స్పిన్నర్స్ అసోసియేషన్‌కు సమర్పిస్తున్నాను. ఆవులను, పశువులను, గోసేవా సంఘానికి సమర్పిస్తున్నాను. ఆ సంఘమే పాలపరిశ్రమను నడుపుతున్నది. గ్రంథాలయాన్ని అది నడిపించే వారికి అప్పగిస్తాము. ఎవరి వస్తువులు వారికి అందజేస్తాము.

ఇక భూములు, భవనాలు మిగిలిపోతవి. వాటిని ప్రభుత్వం స్వాధీనపరచుకొనవచ్చును. వారి ఇష్ట ప్రకారం ఉపయోగించుకొనవచ్చును. వాటిని గూడా స్నేహితులకు అప్పగించేవాడినే. కాని రెవిన్యూ ఇవ్వడం నాకిష్టం లేదు. ఉన్న వస్తువుల సదుపయోగం జరగాలి. ప్రభుత్వానికి అప్పజెపుతాము.

హరిజన కుటంబాలు నివసిస్తున్న భూమీ, భవనాలున్నవి. వారు ఇంతవరకు అద్దె చెల్లించడం లేదు. వారిని ఉద్యమంలో చేరమని నేను కోరను. వారు ఆశ్రమ ధర్మకర్తలకు సంవత్సరానికి ఒక రూపాయి బాడుగ చెల్లించవలెను.

ఏ కారణం వల్లనైనా ఆస్థిపాస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకొనకపోతే ఆశ్రమవాసులు ఆశ్రమం వదలివేస్తారు. 31 చివరిరోజు. మీరు టెలిగ్రాం ద్వారా జవాబివ్వండి. మేము సామాన్లు సర్దుకొంటాము. ఆశ్రమం ఖాళీ చేస్తాము.

మీ విశ్వాసపాత్రుడు
ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 70. సర్ తేజబహాదూర్ సప్రూ గారికి

సత్యాగ్రహాశ్రమం
వార్ధా, 30-9-1933

మిత్రులు సప్రూ గారూ!

మీ వుత్తరం అందింది. మీరు నాకు ఎందుకు వ్రాయడం లేదో నాకు తెలుసును. మీనుండి ఉత్తరాలు రాకపోతే నామీద మీకు అభిమానం లేదని నేనెప్పుడూ భావించను.

నేను కుదుటబడుతున్నాను. నెమ్మదిగా బలమేర్పడుతున్నది. సనాతనులకు హరిజనుల యెడల గల అపోహలను తొలగించే ప్రయత్నం చేస్తున్నాను. వారియెడల మనం ప్రవర్తించిన తీరు మనకొక పెద్ద మచ్చ. హరిజన సమస్య వరకే పరిమితంగా మీరు వుత్తరం వ్రాయడం నాకు సంతృప్తిని కలిగించదు. మీరు రాజకీయాలలో పాల్గొనక పోవచ్చును. అంతమాత్రాన మీ మిత్రులకు సలహాలివ్వడం అవసరం గదా! మీ అనుభవాల ఫలితం సలహారూపంలో మాకందరికీ లభించాలి. మన దృష్టిలో ఎన్ని విభేదాలున్నా మీరన్నా, మీసలహాలన్నా నాకు ఎంతైనా గౌరవమున్నది. మీ లండన్ అనుభవాన్ని వివరించండి. మీకు కలిగిన అభిప్రాయాన్ని తెలియజేయండి.

సేర్ జమునాలాల్ నాతో వున్నారు. మీకు నమస్కారాలు తెలియజేస్తున్నారు.

మీ
ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 71. కార్ల్ హీత్ గారికి

వర్ధా
10-12-1934

మిత్రులకు,

నవంబరు 19 ఉత్తరం అందింది. అది నాకు అర్థం గాలేదు. ఆండ్రూస్ గారి సహాయం గూడా తీసుకొన్నాను.

ప్రస్తుతమున్న సమస్యకు పరిష్కారం న్యాయబద్ధంగా వుండాలి. అది ఫలదాయకంగా వుండాలి. దానిని బలవంతంగా రుద్దగూడదు అనే మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. సారాంశమేమంటే రెండు దేశాలకూ మధ్య గౌరవప్రదమైన ఒప్పందం కుదరాలి. ఇండియా బాధ మీకు తెలుసును. లాంక్‌షైర్ సమస్య నాకు తెలుసును. రెండింటి సమస్యలూ ఒకలాంటివే అంటే నేను ఏకీభవించను. ఇండియాలోని కష్టాలు బలవంతంగా రుద్దబడినవి. లాంక్‌షైర్ కష్టాలు కొంత ప్రపంచ పరిస్థితి కారణంగానూ, కొంత వారి సంకుచిత దృష్టి, స్వార్థం కారణంగా ఏర్పడినవి. ఇండియా సహాయంతో వారి సమస్య పరిష్కారం గావలెనంటే 1931లో నేను ఇంగ్లాండులో వున్నప్పుడు మార్గం సూచించాను. నా మార్గం రుచించలేదు - వ్యర్థమైపోయింది - నేను సూచించిన మార్గమిది. ఇంగ్లండు భారతదేశాల మధ్య ఒప్పందం కుదిరితే ఉపయోగకర మార్గాన్ని అనుసరించవచ్చును. తనకున్న గుడ్డలు గాక ఇండియాకు గుడ్డలు అవసరం కావచ్చును. ఖాదీ, ఇండియన్ మిల్లు గుడ్డలు భారతీయుల అవసరాలకు పూర్తిగా సరిపోకపోవచ్చును. రౌండు టేబుల్ సమావేశం జరిగిన తరువాత ఇండియాలో గుడ్డల ఉత్పత్తి బాగా జరుగుతున్నది అయినా ఇంగ్లండు గుడ్డలను గురించి ఒప్పదం జేసుకొనవచ్చును. ఇండియా మంచి కాలికో జపాను, ఇంగ్లండు నుండి దిగుమతి చేసుకొంటున్నది. లాంక్‌షైర్ కాలికోను ఇండియాకు ఎలా పంపించగలదనేది ప్రశ్న కాదు. ఇండియా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ఎలా సంపాదించుకొనగలుగుతుందనేది మొదటి ప్రశ్న. నాకు అర్థమైనంతవరకు అవరోధాలూ, నిర్బంధాలూ లేకపోతే ఇండియా బీదతనంలో వుండవలసిన అవసరం లేదు. అది సంపన్న దేశంగా రూపొందగలదు. అది సహజంగా జరగగలదు.

మీ పుత్తరంలోని చివరి భాగంలో ఇండియాలో అణచివేత లేదన్నట్లున్నది. అణచివేత చాలా వున్నది. అది అందరికీ తెలుసును. దమన కాండను పెంపొందించే ఒక్క చట్టం గూడా రద్దుచేయబడలేదు. ప్రెస్సు నిర్బంధం ఆలాగే వున్నది. బెంగాలులోనూ, సరిహద్దు ప్రాంతంలోనూ సంచరించే స్వాతంత్ర్యం లేదు. మీరు వినకపోవచ్చును.అన్ని అన్యాయపు చట్టాలూ, అమలులోనే వున్నవి. ఇవన్నీ ఇలా వుండగానే కొత్త సంధి విధానానికి పార్లమెంటు కమిటీ సూచనలు బయటకి వచ్చినవి. స్వాతంత్ర్య నిరాకరణకు జరుపుతున్న చేష్టలివి. నా సహన శక్తిని శృతికి మించి పరీక్షిస్తున్నది. నేను సరిహద్దు ప్రాంతానికి పోగూడదట. నిషేధం విధించబడినది.

అయినా నాకు ఎలాంటి నిరాశ లేదు. దైవశక్తి మీద నాకు పూర్తి విశ్వాసమున్నది. ఆ శక్తి మానవ శక్తులకు అతీతమైనది. అరాజకత్వంలో నుండి అది మార్గాన్ని వెదకి బయటకి తీస్తుంది. ఎవరు ఎన్ని అన్యాయాలు చేసినా ఆ అన్యాయాలను అది నిరోధిస్తుంది.

భారతదేశం స్వతంత్ర దేశమవుతుంది. భారతీయులు స్త్రీలూ పురుషులూ స్వాతంత్ర్యానికి మేము తగినవారమని నిరూపించుకోవాలి. శక్తివంచన లేకుండా పరిశ్రమించాలి. మీ అందరి సహకారం మాకు కావాలి.

మీ

ఎమ్. కె. గాంధి

* * *

## 72. కార్ల్‌హీత్ గారికి

వర్ధా

3-1-1935

21వ తేదీ వ్రాసిన మీ వుత్తరం అందింది. ధన్యవాదాలు. మీ వెనకటి వుత్తరాన్ని మీరాబహెన్, మహదేవదేశాయి, ఆండ్రూస్‌లు చదివారు. ముగ్గురూ వేరువేరుగా నా అభిప్రాయాన్నే బలపరిచారు. మీరు సరిదిద్దిన అంశాన్ని స్వీకరిస్తున్నాను. మీ వుత్తరం

మూడుసార్లు జాగ్రత్తగా చదివిన తరువాత నేను వుత్తరం వ్రాశాను. ఆండ్రూస్ నా జవాబును గూడా చదివారు. ఆయన ఏమీ మార్పులు సూచించలేదు.

మీకు భారతదేశంలో అమలులో వున్న చట్టాలు తెలుసును. వాటి దుష్ప్రభావం తెలుసును. అవి ఇంకా అమలులో వుంటే మా పరిస్థితి ఏమిటో మీకు తెలియదు. డాక్టర్ మామ్‌డే రాయ్‌డెన్ కరాచి నుండి చేసిన ప్రకటనలో ఈ వివరాలేవీ బ్రిటిషు ప్రజలకు తెలియదని వున్నది. దానితో మా అభిప్రాయం ఇంకా బలపడుతున్నది. బెంగాల్‌లో ఏమి జరిగిందో, ఏమి జరుగుతున్నదో కళ్లతో చూచిన దానిని వర్ణించి చెప్పగలరు.

రాబోయే బిల్లును వాపసు చేసుకొంటే ప్రమాదమని మీకు తోస్తున్నట్లున్నది. నా అభిప్రాయంలో ఆ బిల్లు వాపసు చేసుకొనడం ఇండియా ఇంగ్లాండు రెండింటికీ మంచిది. ఇండియా ఆ బిల్లును అన్నివిధాలా ప్రతిఘటిస్తుంది. బ్రిటిషు ప్రభుత్వం అనుసరిస్తున్న మొండి విధానం వల్లనే అది జరుగనున్నది రైట్‌ఆనరబుల్ శ్రీనివాస శాస్త్రిగారి విమర్శనను చూసివుంటారు. శ్రీనివాసశాస్త్రి గారి యెడల బ్రిటిషు ప్రభుత్వానికి చాలా విశ్వాసముండేది. ఆయనను ఆ ప్రభుత్వం తన వ్యక్తిగా భావించేది. సి.వై. చింతామణి గారి వ్యాఖ్యలు చూచారు. ఆయన మితవాదిగా ప్రసిద్ధిబొందారు. అవకాశం దొరికినపుడల్లా కాంగ్రెసును ఆయన నిందించారు.

జె.పి.సి. రిపోర్టు మీద నా అభ్యంతరాలను తెలుసుకోండి. నేను రిపోర్టు చదివాను. వైట్‌పేపరు చదివాను. ఉన్నదానికంటే ఇది అభివృద్ధిపథంలో వుండాలి. అందుకు భిన్నంగా ఉన్నది. మితవాదులను గూడా నిరాశపరచింది. వారి నడుములను విరగగొట్టింది. ఆగాఖాన్ గారి నాయకత్వంలో వారు సమర్పించిన మెమొరాండాన్ని జాయింట్ పార్లమెంటరీ కమిటీ ఆమోదిస్తుందని అనుకొన్నారు. వారి మెమొరాండంమీద దృష్టి వుంచినట్లే కనబడడం లేదు. దానిమీద శాస్త్రిగారి వ్యాఖ్య ఇది : - లిబరల్ పార్టీ సహకరించడం జరగదు. స్నేహితులతో సహకరించడమంటూ వుంటుంది. మామీద విశ్వాసముంచని వారికి, మా సూచనలను పరిగణించనైనా పరిగణించని వారికి మా కోరికలకు భిన్నంగా వ్యవహరించిన వారికి మా సహకారం ఎలా లభిస్తుంది? సహకరించడం ఆత్మహత్య అవుతుంది. ఇది శాస్త్రిగారి వ్యాఖ్య :

సంక్షేపంలో వివరం

1. జె.పి.సి నివేదికలో పూర్తి స్వరాజ్యానికి గానీ లేక ఇండియా ప్రతినిధుల సూచలను అంగీకరించుటకు గానీ సంబంధించి ఏ సూచనా లేదు.
2. ఈ రాజ్యాంగచట్టం అంగీకరింపబడితే ఇండియా ఇప్పటికంటే ఇంకా భారమైన ఆర్థిక చిక్కుల్లో కూరుకొని పోతుంది.
3. కేంద్రంలో 80 వంతుల ఆదాయ భాగం సామాన్య స్వీకృతికి దూరంగా వుంచబడింది.
4. నీతి విషయంలో గానీ, ఖర్చు విషయంలో గానీ సైన్యం మీద సామాన్య స్వీకృతి ఉండదు.
5. ద్రవ్య విధానం మీద జనస్వీకృతి వుండదు.
6. ఆర్థిక మంత్రి అధీనంలో వున్న 20 వంతుల ఆదాయం మీద గూడా గవర్నరు జనరల్ అధికారం వహిస్తారు. దానిలో మార్పుచేసే, ఆపివేసే అధికారం గవర్నర్ జనరల్‌కు ఉంటుంది.
7. నివేదికలో పొందుబరచబడిన ప్రాంతీయ స్వాయత్తతా విధానం కేవలం పేరుకు మాత్రమే. ఎప్పుడు అవసరమనుకొంటే అప్పుడు గవర్నర్లు దానిని రద్దుచేయవచ్చును. అ అధికారాన్ని గవర్నర్లు రద్దుచేయరనుకొనడం తెలివితక్కువ. అనుభవంలోఉన్నదదే.
8. మంత్రులకు కేంద్ర ప్రభుత్వంలో గానీ, ప్రాంతీయ ప్రభుత్వాల్లో గాని ఉన్నవారిని కనీసం బదిలీ చేసే అధికారం గూడా వుండదు.
9. పేరుకు ఏర్పడిన ప్రాంతీయ శాసనసభలు పోలీసు చట్టాలనుగానీ, పోలీసు నియమాలను గానీ మార్చలేవు. ఆ అధికారముండదు.
10. బ్రిటిషు వారు చేస్తున్న దోపిడి ఇంకా పెరుగుతుంది.

దీనిని బట్టి తేలుతున్న దేమిటంటే ఇప్పుడున్న దానికంటే రాబోయే చట్టం మరీ దారుణమైనది. కనుక కొత్తచట్టాన్ని అంగీకరిస్తే. ఇంకా ఎక్కువ ఆపదలు కొని తెచ్చుకొన్నట్లవుతుంది.

సారాంశమేమంటే మామీద రుద్దబడబోతున్న చట్టం బాధలతో మ్రగ్గుతున్న జన సామాన్యజనం మీద పెద్దబండలు పడవేయడమే అవుతుంది. బ్రిటిషు ఇండియా

చరిత్రలోనే జరగని కొత్త విషయమవుతుంది. పూర్తి బాధ్యతతో నేనీ విషయం చెపుతున్నాను. జలియన్ వాలాబాగ్ సంస్మరణలు ఇంకా నాకు జ్ఞాపకమున్నవి. సిపాయీ విద్రోహాన్ని గురించి కామే మాల్సన్ వ్రాసిన గ్రంథాలను చదివాను. వాటినన్నింటినీ మించిన చర్య ఇది.

ఈ ఉత్తరాన్ని మీరు ఎట్లా ఉపయోగించుకున్నా సరే, నేను వెల్లడించిన అభిప్రాయాలకు ఎవ్వరూ బాధ్యులు గారు. మహదేవ దేశాయ్‌కీ, మీరాకూ, టైపిస్టుకు ఈ ఉత్తరం తెలుసును.

నా వుత్తరం మీకు చెడుగా కన్పించవచ్చును. నా ఉత్తరం నిజాన్ని వ్యక్తీకరిస్తున్నది. ఇది నిజం. పదహారణాల నిజం. పూర్తి నిజాన్ని ఇంకా నేను వెల్లడించలేదు. అది ఇంకా భయంకరంగా వుంటుంది.

నాకు ఇంగ్లీషు వారిమీద కోపం లేదు. ద్వేషం లేదు. ఇంగ్లీషు మంత్రులు తమకు మంచిదనిపించిన దానిని అనుసరిస్తున్నారు. వారు ఇంగ్లీషు ప్రభుత్వం ఇండియా మేలు కొరకని భావిస్తున్నారు. ఇండియా ఆర్థికంగా బలపడిందనీ, రాజకీయంగా శక్తివంతమైనదనీ వారి అభిప్రాయం. ఈ రాజ్యాంగ చట్టం అమలైతే భారతదేశానికి అది మహా దుర్దినమవుతుంది. బ్రిటిషు వారి విశ్వాసాలు బ్రిటిష్‌వారివి. మా విశ్వాసాలు మావి. కోపగించి ప్రయోజనం లేదు. నేను తొందరలో అనాలోచితంగా ఏ చర్యలూ తీసుకోను.

నేను కాంగ్రెసు నుంచి అవకాశం తీసుకొన్నాను. నేను మౌనంగా వుండదలచుకొన్నాను. అహింస కోసం బంధించిన కొత్త విషయాలను అనుసంధించదలచుకొన్నాను. ఏది చేసినా ఒక లక్ష్యంతో చేస్తున్నాను. అన్నింటిలో అహింసను ప్రవేశపెట్టుతున్నాను. నన్ను గురించి నిజంగా నాకు తెలియదు తెలుసుకుందామనే కోరికగూడా లేదు. భగవంతుడు నాకు తరువాత వేయాల్సిన అడుగు చూపిస్తుంటాడు. స్నేహితులు మీరు నిండు హృదయంతో నాకు సహకరించండి. నా అన్వేషణకు మార్గదర్శకులు కండి.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 73. కార్లహీత్ గారికి

సేవాగ్రామం

వర్ధా 25-1-41

మిత్రమా,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందింది. మీ వుత్తరంలో సూచింపబడిన కేబుల్‌కు నేను కేబుల్ పంపించాను. అది అందినట్లు వ్రాయలేదు.

1940 అక్టోబరు 27వ తేదీన నేను పంపిన కేబుల్ ఇది "అన్ని ప్రయత్నాలూ విఫలమైనవి. ఇండియా స్థితి విచిత్రమైనది. అన్నింటికంటే భిన్నమైనది. ప్రెస్సు నిర్బంధించబడింది. హరిజన్ వారపత్రికలు ఆగిపోయినవి. అహింసకు కనీసావసరమైన శాసనోల్లఘనం నిషేధించబడింది.అందువలన - నేను పంపిన కేబుల్ ఇది.

ఎమ్.పిల ఉత్తరం విషయాలను ఉపేక్షిస్తున్నది. సమాచార సాధనాలు కఠినంగా ఉన్నవి. మీ అభిప్రాయాలు తెలియజేయడానికి వీలు లేదు. భగవంతుడే రక్షించాలి.

మీ వాదనను నేను అర్థంచేసుకొనగలను. కంపించిపోవడం వ్యక్తిగతం. కాంగ్రెస్సు పెద్ద సంస్థ. అది అహింస మీద ఆధారపడినది. అది తారతమ్యం తెలిసి వ్యవహరిస్తుంది. దానికి అహింస హింసల తారతమ్యం గూడా తెలుసును. జర్మన్ ఆయుధాల కంటే బ్రిటిషు ఆయుధాలు జయించినవి. దానికి కారణమేమిటి? జర్మన్ అనుసరించిన విధానం. మనిషి మనిషి మధ్యా, దేశం దేశం మధ్యా ఆయుధ నిరోధం జరిపి న్యాయానికి జయం కలిగించడం కాంగ్రెసు లక్ష్యం. అందుకే అహింసతో మేము పోరాటం సాగిస్తున్నాము. అహింస మీద పూర్తిగా అధారపడుతున్నాము. పూనా తీర్మానంలోని లోటును మీరు సరిగ్గా తెలుసుకొన్నారు. బొంబాయి తీర్మానం తప్పును సరిదిద్దుకొన్నది. ఎల్లప్పుడూ అహింస మీద కాంగ్రెసు ఆధారపడలేకపోయింది. అందుకు అది బాధపడనక్కరలేదు. అది దానికి అప్రతిష్ట తెచ్చిపెట్టదు. అది ఇప్పుడు తన అసలు స్థితికి చేరుకొన్నది. శాసనోల్లంఘనోద్యమం నడపడానికి నన్ను ఆహ్వానించింది. అందుకు నేను సంతోషంగా అంగీకరించాను. జనసామాన్యం హింసను గౌరవిస్తున్నది. పూనా తీర్మానం జరగవలసింది కాదు. అది నా బలహీనత వలన జరిగింది. అది మీరు బోధపరచుకోలేదు. హరిజన్‌లో ఆ విషయమై వ్యాసం వ్రాశాను.

కాంగ్రెసు క్రమక్రమంగా ప్రగతిపథంలో నడుస్తున్నది. అహింస దానికి ప్రధానం. నడక నెమ్మదిగా ఉన్నది. కాంగ్రెసు ద్వారా మార్గాన్ని సూచించకపోతే నేను తప్పుచేసిన వాడిని అయ్యేవాణ్ణి.

కాంగ్రెసు సామ్రాజ్యవాదానికి ఎంత విరోధియో నా జీజావికి గూడా అంత విరోధి. బ్రిటిషు ప్రభుత్వం తెలివిగా వ్యవహరిస్తే ఇవన్నీ జరిగేవి కావు. ప్రపంచం బ్రిటిషు పక్షానికి వచ్చేది. లేనిచో దాని పక్షంలో వుండేవారం. నైతికంగా దానికి బలం చేకూరేది. పొరపాట్లను ఇప్పటికైనా సరిదిద్దుకొనవచ్చును.

తప్పు సరిదిద్దుకొనబడినా లేకపోయినా కాంగ్రెసు విధానం స్పష్టమైనదే. అది నైతిక సూత్రం మీద ఆధారపడివున్నది. వెంటనే ఫలితం కనిపించకపోయినా దానివి దృఢచిత్తంతో అనుసరించాలి.

మీ

ఎమ్. కె. గాంధి

* * *

## 74. ఎమ్.ఏ. జిన్నా గారికి

సేవాగ్రామ్

3-2-1938

ప్రియమైన జిన్నాగారూ,

మీ వుత్తరానికి నానుండి జవాబు రాలేదని మౌలానా సాహెబ్ గారితో మీరు అన్నట్లు నిన్న పండిత నెహ్రూ నాకు చెప్పాడు. నేను చాలా జబ్బుగా వున్నానని కలకత్తాలో డాక్టర్లు నిర్ణయించిన సమయంలో మీ వుత్తరం అందినది.

అది అందిన మూడు రోజుల తరువాత నాకు చూపించారు. జాబు అందించినట్లయితే జబ్బుగావున్నా జవాబు పంపేవాడినే. మీ వుత్తరం చదివాను. జవాబు వ్రాయడానికి ఏమీలేదని ఊరుకొన్నాను. అయినా నానుండి మీరు జవాబు కోరుచారు. సంతోషకరమైన విషయం జవాబు పంపుతున్నాను. మీనుండి సందేశమందిందని ఖేర్ గారు చెప్పారు. నేను వొంటరిగా పంపుతున్నాను. దానిని వారు

నాకు అందజేశారు. మీకు మౌఖికంగా జవాబు చెప్పేవాడినే. కాని నా భావం స్పష్టంగా తెలియజేయడానికి మీకు ఒక "నోట్" పంపించాను. దానిలో దాచవలసినదేమీ లేదు. కాని మీ వుత్తరం నాకు కొంత బాధ కలిగించింది. ఆశ్చర్యం కలిగించింది.

నేను మౌనంగా వున్నానని మీ ఫిర్యాదు. దానికి కారణం నా నోట్‌లో తెలియజేశాను. రెండు మతాలవారినీ ఐక్యం చేయడానికి నేనేదైనా చేయగలిగితే అది చేయకుండా నన్ను ఎవ్వరూ ఆపలేరు. మీ ఉపన్యాసం యుద్ధ ప్రకటన కాదని మీరు తెలియజేశారు. తరువాత మీరు చేసిన ప్రకటనలు గూడా నాకు మొదట కలిగిన భావాన్ని మార్చలేదు. 1915లో దక్షిణాఫ్రికా నుండి నేను భారతదేశం వచ్చినప్పటి నాటి మీలోని జాతీయభావం. మీ ఉపన్యాసంలో కనిపెంచడం లేదు. మీరు సంపూర్ణమైన జాతీయవాది అని మిత్రులంతా చెప్పారు. హిందువులూ ముస్లిములూ గూడా. మీరు ఆశాకిరణమని భావిస్తున్నారు. ఇప్పటికీ మీరు ఆ జిన్నాగారేనా?

మీ ఉపన్యాసాలు వేరుగావున్నా అది నిజమేనని మీరంటే మీమాటను నేను అంగీకరిస్తాను.

నన్ను ఒక తీర్మానం (ప్రపోజల్) తో ముందుకు రమ్మంటున్నారు. మీరు వెనకటి విధంగానే వుండమని ప్రార్థించటం తప్ప ఇంకా నా ముందు తీర్మానమేమున్నది? రెండు జాతులనూ కలిపివుంచే తీర్మానాన్ని మీరే సూచించవలసి వుంటుంది.

ఇది ప్రచురణకు కాదు. నేను మీ స్నేహితుణ్ణే. శత్రువును కాదు.

మీ

ఎమ్. కె. గాంధి

* * *

## 75. ఎమ్. ఎ. జిన్నాగారికి

22-4-1944

ప్రియమైన కాయిదే ఆజమ్

నిన్నటి మీ ఉత్తరం నన్ను కలచివేసింది. మనమిద్దర్లం సమక్షంలో కలుసుకొన్న దాకా జవాబు వ్రాయగూడదనుకొన్నాను. మన కలయిక వలన పెద్దగా ప్రయోజనం

కలగకపోయినా మీ భావాలను విస్పష్టంగా అర్థంచేసుకొనగలిగాను. రెండు జాతుల సిద్ధాంతాన్ని గురించి ఆలోచించిన కొద్దీ అది చాలా ప్రమాదకరమేమోననిపిస్తున్నది దానిలో అర్ధసత్యాలున్నవి. దానిలోని ముగింపు, నిర్ణయాలూ అవసరం లేనివి. ఇండియాలోని ఇతర జాతులకంటే ముస్లిమ్‌లు ప్రత్యేక జాతి అనడాన్ని నేను అంగీకరించలేను. గట్టిగా వాదించడం ఋజువుకాదు.

ఆ సిద్ధాంతాన్ని అంగీకరించడం దేశానికే ప్రమాదకరం. ఒక్కసారి ఆ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే భారతదేశాన్నే ముక్కలు ముక్కలుగా విభజించే పరిస్థితి ఏర్పడుతుంది. భారతదేశం చిన్నాభిన్నమయిపోతుంది. దానికి నేనొక్క మార్గాన్ని సూచించాను. అది సోదరుల మధ్య పంపకంలాగా వుండాలి.

జనాభిప్రాయ సేకరణకు మీరు వ్యతిరేకంగా వున్నారు. లీగ్‌కు గల ప్రాధాన్యాన్ని గుర్తించినా ప్రజలు విభజనను కోరుతున్నారో లేదో తెలుసుకోవాలి గదా! వారు ఈ విషయమై తమ అభిప్రాయాన్ని స్పష్టం చేస్తారు. వయోజన వోటింగు మంచి పద్ధతి. మీరింకేదైనా పద్ధతి సూచిస్తే నేనంగీకరిస్తాను.

రెండు జాతుల మధ్య వున్న సమాన బాధ్యతలను గూడా మీరంగీకరించడం లేదు. సైన్యము, విదేశ నీతి వంటి సమాన విషయాలలో రక్షణ కల్పించకుండా, నేను దేశవిభజనకు అంగీకరించలేను..

మీ వుత్తరాన్ని బట్టి మన భావాలు ఒకదానికొకటి వ్యతిరేకంగా వున్నట్లు తెలుతున్నది. 1942లో చేసిన తీర్మానాన్ని మీరు ఉల్లంఘిస్తున్నారు. దాన్నికి పెద్ద ఆధారాలు కనబడడం లేదు.

మనం ఒక సుడిగుండంలో వున్నామనిపిస్తున్నది. నేనొక సూచన చేశాను. విభజనను అంగీకరించక తప్పకపోతే మధ్యవర్తుల మీద ఆధారపడదాము. వారు మనకు మార్గదర్శకత్వం వహిస్తారు. మన మధ్య అంగీకారం కుదిరిస్తారు.

ఎమ్. కె. గాంధి

★★★

# 76. ఎమ్.ఎ. జిన్నా గారికి

23 సెప్టెంబరు 1944

ప్రియమైన కాయిదే ఆజమ్

నిన్న సాయంత్రం జరిగిన సంభాషణ బాగాలేదు. మన సంభాషణలూ, ఉత్తర ప్రత్యుత్తరాలు సమాంతరరేఖలో జరుగుతున్నట్లున్నవి. ఒకదానికొకటిగా మనం దగ్గరకు రాలేకపోతున్నాము. మనం నిన్న సాయంత్రం విఫలస్థితికి చేరుకున్నాము. అయితే ఒకరికొకరం విడిపోలేదు. భగవంతునికి ధన్యవాదాలు. మీరు సంభాషణ ప్రారంభించినా నాకు ప్రార్థన సమయం గావడం వలన మన సంభాషణ ఆగిపోయింది.

ఇంత పెద్ద విషయంలో మనమేమీ పొరపాటు చేయకుండా నన్ను ఏ కాగితం మీద సంతకం చేయమంటారో మీరు తయారుచేయండి.

మీలాటివారిని పిలచి వారి సహాయం తీసుకొనడం మంచిదని ఇప్పటికీ నాకనిపిస్తున్నది.

మీ

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

# 76 ఏ. ఎమ్.ఏ. జిన్నాగారి నుండి

23 సెప్టెంబరు 1944

ప్రియమైన గాంధీ,

మీ వుత్తరం అందింది. 22వ తేదీ గల మీ వుత్తరానికి జవాబు పంపించాను. నేను కొత్తగా చేర్చేదీ చెప్పేదీ ఏమీలేదు. మిమ్మల్ని సంతకం చేయమని కోరే విషయం గాదిది. మీకు అధికారముండాలి. ఆ అధికారం మీకు లభించి వుండాలి. 1940 మార్చిలో లాహోరులో జరిగిన తీర్మానానికి మేము కట్టుబడివున్నాము. అది మీకు ఇదివరకే తెలియజేశాను. మీరు మీ నీతినీ, కార్యక్రమాన్ని మార్చుకోండి. మీరు వాస్తవాలను గుర్తించండి. శుభారంభంతో ప్రజల మేలు కొరకు ప్రయత్నించండి.

మీ

ఎమ్. ఎ. జిన్నా

★ ★ ★

# 77. ఎమ్. ఎ. జిన్నాగారికి

సెప్టెంబరు 24, 1944

ప్రియమైన క్వాయిదే అజమ్ గారికి

మీ రెండు ఉత్తరాలూ అందినవి. మీ సహాయంతో ఒప్పందానికి మార్గాలు వెదకడం కొరకు ప్రయత్నాలు ప్రారంభించాను. లాహోరులో జరిగిన ముస్లిం లీగ్ తీర్మానాన్ని గురించి న్యాయం చేయడానికి ప్రయత్నిస్తున్నాను. ఆగస్టు తీర్మానం మన మార్గానికి అంతరాయం కలిగిస్తుందని భావించకండి. ఆ తీర్మానం బ్రిటన్‌కు వ్యతిరేకంగా చేయబడినది. మన ఒప్పందానికి అది అంతరాయం కలిగించదు.

ఇండియా రెండు లేక మూడు జాతుల సమ్మేళనం కాదనే భావంతో ముందుకు సాగుతున్నాను. ఇది వివిధ సభ్యులు కలిగిన ఒక కుటుంబం వంటిది. ఉత్తర పశ్చిమంలో - బెలూచిస్తాన్, సెంధ్, ఉత్తర సరిహద్దు ప్రాంతాలలో, కొంత పంజాబులో ముస్లిమ్‌లు బహుసంఖ్యలో వున్నారు. బెంగాలు అస్సాములలో వారు బహు సంఖ్యాకులుగా వున్నారు. వారు భారతదేశం నుండి వేరుపడవలెనని కోరుతున్నారు. ఇది సమస్య.

మూల సిద్ధాంత విషయంలో మీతో విభేదిస్తూ లాహోరు ముస్లిం లీగ్ తీర్మానాన్ని అనుసరించి ముస్లిమ్ బహుళ ప్రాంతాలలో విభజనను అంగీకరిస్తూ కాంగ్రెసుకు ఈ క్రింది షరతుల మీద అంగీకరించమని సలహా చెప్పగలను.

కాంగ్రెసు ముస్లిం లీగ్ అంగీకరించిన కమీషన్ (సమితి) క్షేత్రాలను విభజించి సలహా యివ్వగలదు. ఆ విభజించిన ప్రదేశాలలో వయోజన వోటింగు ననుసరించిగానీ. ఇంకొక విధంగా గానీ ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకొనవలెను.

వోట్లు విభజనకు అనుకూలంగా వుంటే వాటిని విభజించి ప్రత్యేక ప్రాంతాలుగా గుర్తించవలెను. విదేశీ శక్తుల నుండి బయటపడిన వెంటనే వీలైనంత తొందరలో రెండు స్టేట్లుగా ఏర్పాటుచేయబడవలెను.

విదేశ వ్యవహారాలు, దేశరక్షణ, ప్రచార సాధనాలు, సుంకములు, వ్యాపారము వంటి విషయాలను దృష్టిలో బెట్టుకొని ఒప్పందం జరగవలెను. అవి రెండు దేశాలకూ సమానంగా వుండగలవు.

రెండు స్టేట్లలో అల్ప సంఖ్యాకుల రక్షణకు, హక్కులకు సంబంధించి హామీలుండవలెను.

కాంగ్రెస్సు, లీగూ ఈ ఒప్పందాన్ని అంగీకరించిన తరువాత సంపూర్ణ స్వరాజ్య సాధనకై ఇద్దరూ కలసి పనిచేయగలరు.

లీగ్ ప్రత్యక్ష చర్యకు దూరంగా వుంటుంది. కాంగ్రెస్సు ఆ చర్యకు పూనుకొంటుంది.

ఇవి మీకు అంగీకారం గాకపోతే లాహోరు తీర్మానాన్ని దృష్టిలోబెట్టుకొని మీ షరతులను తెలియజేయండి. అది మీరు చేస్తే ఎన్ని అభిప్రాయ భేదాలున్నా వాటిని కాంగ్రెసుకు సిఫారసు చేసి పంపుతాను. మీ 23 సెప్టెంబరు ఉత్తరంలో లాహోరు తీర్మానంలోని మౌలిక హక్కులను గురించి ఉటంకించి ఉన్నారు. వాటిని అంగీకరించమన్నారు. అది అవసరం లేదు.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 78. సుభాష్ చంద్రబోసు నుండి

ఫీల్గొరా

మార్చి 31, 1939

మహాత్మాజీ,

పంత్‌గారి తీర్మానాన్ని గురించి మీ అభిప్రాయం తెలియజేయండి. మీరు నిష్పక్షపాతంగా నిర్ణయాలు తీసుకొనగలరు. అయితే తిరుపతి వివరాలన్నీ మీకు తెలియాలి. పత్రికలలోని వార్తలను బట్టి ఇంతవరకు మిమ్మల్ని చూచిన వారు మరొక స్కూలుకు - పద్ధతికి చెందినవారని తలుస్తారు. పంత్ తీర్మానాన్ని సమర్థించే వర్గం వారని ఒక అభిప్రాయమున్నది. అది అంత పట్టించుకోవలసిన విషయం కాదు. మీ దగ్గరకు ఎవరు వచ్చినా కలిసినా ప్రతి విషయాన్ని మీరు సరిగ్గా అంచనా వేస్తారు.

ఆ తీర్మానం విషయంలో నా అభిప్రాయాన్ని మీరు ఊహించగలరు. నా వ్యక్తిగత విషయానికి అంత ప్రాముఖ్యత లేదు. ప్రజా జీవితంలో ప్రజల విషయాలలో

వ్యక్తిగత భావాలకు మనమంత ప్రాధాన్యతనివ్వము. నేను నా వెనకటి వుత్తరంలో తెలియజేసి నట్లుగా పంత్ తీర్మానాన్ని గురించి ఏమి ఆలోచించినా, దాన్ని కాంగ్రెసు ఆమోదించింది గనుక దాన్ని గౌరవించడం నా బాధ్యత గూడా. ఆ తీర్మానం నామీద అవిశ్వాస తీర్మానమా? నేను రాలేనట్లు చేయడం అవసరమా? మీ నిర్ణయం నాకు చాలా బాగా ఉపయోగిస్తుంది.

ఇంకొక విషయం ఈ ఉత్తరంలో ప్రస్తావిస్తున్నాను. మన కార్యక్రమం ఏమిటి? వసంతంలో యూరపులో ఆపత్కాలపు స్థితి ఏర్పడుతుందనీ, అది చాలా రోజులవరకు లాగుతుందనీ నేను మిత్రులకు చెప్పుతూ వచ్చాను. అంతర్జాతీయ పరిస్థితీ, మన దేశ పరిస్థితీ ఎనిమిది నెలల క్రితం నుండి మనం ఈ సమయంలో సంపూర్ణ స్వరాజ్యం కొరకు పనిచేయవలెనని మనకు బోధిస్తున్నవి. బ్రిటిష్ ప్రభుత్వం ముందు మన లక్ష్యాన్ని మనముంచాలి. చివరి హెచ్చరిక చేయాలి. మీరు అందుకు జనాన్ని తయారుచేస్తే మనమందరం కలిసి మన లక్ష్యాన్ని సాధించగలం. మనం పోరాడకుండానే బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించవచ్చును. ఒకవేళ పోరాటం జరిగినా అది ఎక్కువ కాలం జరపవలసిన అవసరం లేదు. 18 నెలల్లో పూర్ణ స్వరాజ్యం సాధించగలము.

అందుకు ఎట్టి త్యాగానికైనా నేను సిద్ధంగా వున్నాను. మీరు ఉద్యమం ప్రారంభిస్తే నేను మీ వెంట వుండగలను. కాంగ్రెసు ఈ పనిని సాధించగలదు అని తలిస్తే కార్యవర్గ సభ్యులను మార్చవలసి వస్తే అందుకు నేను సిద్ధమే. కాంగ్రెస్సు మీరూ మనమందరమూ కలసి పోరాటం సాగించాలి. అది నా అభిప్రాయం. నేను ఏ త్యాగానికైనా సిద్ధమే.

సంస్థానాల పోరాటం మీరు నడుపుతున్నది నాకు నచ్చడం లేదు. క్షమించండి.

రాజకోట వొప్పందం మా వంటివారికి నచ్చడం లేదు. అది మన విజయమని భావిస్తున్నాము. కాని మనం సాధించిందేమిటి? సర్ మారిస్గ్వయర్ మనవాడూ గాదు, ఎవరి ప్రతినిధీ కాడు. ఆయన ప్రభుత్వపు మనిషి. ఆయన చేతిలో పెట్టడం వలన ప్రయోజనమేముంటుంది? ఆయన మనకు వ్యతిరేకంగా తీర్పిస్తే మన పరిస్థితి ఏమిటి ?

నా ఉత్తరం పెద్దదయింది. ఆపుతున్నాను. నా వుత్తరం మీకు రుచించకపోతే నన్ను క్షమించండి. స్పష్టంగా నిర్మొహమాటంగా మాట్లాడే వారంటే మీకు ఇష్టం. అది నాకు తెలుసును. అందువల్లనే సాహసించి ఈ వుత్తరం వ్రాస్తున్నాను.

మీ

సుభాష్

* * *

## 78 ఏ - సుభాష్‌చంద్ బోసుగారికి

బిర్లా హౌస్, న్యూఢిల్లీ

2-4-1939

ప్రియమైన సుభాష్ !

31 ఉత్తరం, వెనకటి వుత్తరం అందినవి. మీ వుత్తరాలు స్పష్టంగా వున్నవి మీ భావాలను తెలుపుతున్న మీ వుత్తరాలు బాగా వున్నవి.

మీరు వెల్లడించిన భావాలకూ మిగతావారి భావాలకూ చాలా వ్యత్యాసమున్నది. వాటిని కలపడం సమన్వయంజేయడం సంభవంగా కనబడడం లేదు. ఇలాంటి వాటిని దేశం ముందు పెట్టడమే మంచిది. అది మనం గౌరవంగా చేస్తే ఇబ్బంది ఏమీ వుండదు. దానివలన పరస్పర విరోధాలు గూడా తగ్గిపోగలవు.

మనలో అభిప్రాయ భేదాలుండడం తప్పుగాదు. పరస్పర గౌరవం, విశ్వాసం లేకపోవడం తప్పు. దానిని సమయమే సరిదిద్దుతుంది. అహింసాభావం మనలోవుంటే వైషమ్యాలుండవు.

అన్ని విషయాలనూ ఆలోచించగా నాకు తోచిందేమిటంటే - మీ అభిప్రాయాలతో ఏకీభవించే వారితో మీరు మీ కార్యవర్గాన్ని నియమించండి. మీ కార్యక్రమాన్ని నిశ్చయించుకొని ఎ.ఐ.సి.సి ముందుబెట్టండి. అది ఆమోదిస్తే దాన్ని అమలుచేయండి. అల్ప సంఖ్యలో వున్న వారు ఏమీ చేయలేరు. మీ కార్యక్రమం అంగీకారం పొందకపోతే మీరు రాజీనామా చేయండి. కార్యవర్గం ఇంకొక అధ్యక్షుణ్ణి ఎన్నుకొంటుంది. మీరు స్వేచ్ఛగా మీ భావాలను దేశంలో ప్రచారం చేసుకొనవచ్చును. పంత్‌గారి తీర్మానంతో సంబంధం లేకుండా నేను మీకు ఈ సలహా యిస్తున్నాను.

నా పరపతి లెక్కకు రాదు. దానికున్న విలువ దానికున్నది. నా భావాలనే శంకించినపుడు, నా కార్యక్రమం అంగీకరించబడనప్పుడు గౌరవమంటూ ఏమీ వుండదు. పరపతికి విలువ ఉండదు. ఇండియా అశేష జనసహాయంతో నిలబడుతుంది. లేదా పడిపోతుంది. వ్యక్తులు వారెంత గొప్పవారైనా జన సామాన్యం సహాయం దొరకకపోతే ఏమీచేయలేరు.

ఇపుడున్నంత అహింసాత్మకంగా మనదేశం ఎపుడూ వుండలేదనే దానితో నేను ఏకీభవించడంలేదు. నాకు గాలిలో హింస వున్నట్లు వాసన వస్తున్నది. కాని ఆ హింస సూక్ష్మరూపంలో వున్నది. మనలో పరస్పర విశ్వాసం లేకపోవడం హింసయే. హిందూ ముస్లిముల వైమనస్యం గూడా దానినే ప్రకటిస్తున్నది. ఉదాహరణలు చాలా చూపగలను.

కాంగ్రెసులో ఏర్పడిన కుళ్లు రోజురోజుకూ నా దృష్టిలో పెరిగిపోతున్నది. చాలా నెలల నుండి పూర్తిగా క్షాళన జరగవలెనని నేను చెపుతున్నాను.

ఈ స్థితిలో అహింసాత్మకమైన జనాందోళనకు పరిస్థితి అనుకూలంగా నాకు కనబడడం లేదు. శక్తివంతమైన కార్యక్రమం లేనిది కేవలం అంతిమ హెచ్చరికల వలన ప్రయోజనముండదు.

నేను ముసలివాడిని. అందువలన అతి జాగ్రత్తపడుతున్నట్లు తోచవచ్చును. మీరు నవయువకులు. నవయువకులలో తొందరపాటు వుంటుంది. ఇపుడున్న పరిస్థితుల ప్రకారం కాంగ్రెసు విజయం సాధించగలదని నాకు విశ్వాసం లేదు. నేను తప్పుగావచ్చును.

రాజకోట విషయం గూడా మీరు ఎత్తారు. మన దృష్టి కోణం మీద ఇటువంటి వ్యవహారాలు కొంత ఆధారపడి వుంటవి. నేను వేసిన అడుగులో నాకేమీ లోపం కనిపించడం లేదు. అందుకు నాకు పశ్చాత్తాపం గూడా లేదు. దానికి చాలా రాజకీయ ప్రాధాన్యమున్నది. రాజకోట కొరకై నేను ఇతర సంస్థానాలలో శాసనోల్లంఘనోద్యమాన్ని ఆపివేయలేదు. కాని రాజకోట నా కళ్లు తెరిపించింది. అది నాకు మార్గం చూపించింది. నా ఆరోగ్యం కొరకు నేను వేచి వుండడం లేదు. వైస్‌రాయ్ గారు నాకు పంపిన టెలిగ్రాం లోని వారి నిర్ణయం ఎలా అమలుచేయబడుతుందో అందుకు ఏమిచేయాలో తెల్సుకొనుటకు ఢిల్లీలో వున్నాను. చీఫ్ జస్టిస్ సుధాకర్ సాహెబ్ చేస్తున్న వాదనపై

అభిప్రాయం చెప్పమని కోరడం తప్పేమీ కాదు. మారిస్ గ్వైరు గారు చీఫ్ జస్టిస్‌గా గాక వైస్‌రాయ్ గారికి నమ్మకం కలిగిన న్యాయ శాస్త్రవేత్తగా పనిజేస్తారు. దీనివలన వైస్‌రాయ్ బాధ్యత గూడా పెరుగుతుంది.

మనలో అభిప్రాయ భేదాలున్నా దానివలన మన పరస్పర స్నేహభావంలో మార్పుండదు.

ప్రేమతో

బాపూ

★ ★ ★

## 79. హెర్ హిట్లర్ గారికి

వార్ధా

23-7-1939

ప్రియమైన స్నేహితులకు,

మానవత్వం కొరకు స్నేహితులు నన్ను మీకు ఉత్తరం వ్రాయమని కోరుతున్నారు. నేను వారి కోరికను మన్నించలేదు. నేను మీకు ఉత్తరం వ్రాయడం అసంగతంగా వుంటుందని భావించాను. బాగా ఆలోచించిన మీదట మీకు నివేదించడం. ఉత్తరం వ్రాయడం ఉచితమేనని తోచింది.

ఈ రోజుల్లో మీరొక్కరే యుద్ధం ఆపగల శక్తి కలిగివున్నారు. యుద్ధం వలన మానవత్వం అడవి జీవిత తత్వంగా మారిపోతుంది. మీరు తలపెట్టిన కార్యం ఎంత ప్రధానమైనదైనా దానికి ఇంత మూల్యం చెల్లించాలా? బుద్ధిపూర్వకంగా యుద్ధాలకు దూరంగా వుండే నా మనవిని మీరు వింటారా? మీకు ఉత్తరం వ్రాసి నేను తప్పుచేస్తే నన్ను క్షమించండి.

మీ స్నేహితుడు

ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 80. ఇంగ్లీషు వారికందరికీ

## (1940 జులై 3న గాంధీజీ ఈ విజ్ఞప్తిని ప్రచురించారు)

ఇంగ్లీషు వారికందరికీ

1896లో దక్షిణాఫ్రికాలో వుండి ఇంగ్లీషువారికి ఒక విజ్ఞప్తి చేశాను. ఆ విజ్ఞప్తి సౌత్ ఆఫ్రికాలో వున్న కార్మికులు, వ్యాపారస్థులు, వారి సహాయకుల తరపున మా దేశం వారు వారు గావటం వలన వారందరి పక్షాన మీకు చేసివున్నాను. దాని ప్రభావం కొంత వున్నది. నా దృష్టిలో దానికి ఎంత ప్రాముఖ్యత వున్నా ఆ విజ్ఞప్తికి కారణం ఇప్పుడు నేను చేస్తున్న విజ్ఞప్తికి కలిగినంత ప్రాముఖ్యం కలిగినదిగాదు. పరస్పర సంబంధాన్ని దేశాల మధ్యా వ్యక్తుల మధ్యా ఇంకా తదితర విషయాలలోనూ పెంపొందించుట కొరకు యుద్ధానికి బదులు అహింసా విధానాన్ని అంగీకరించమని బ్రిటిషువారిని నేను ప్రార్థిస్తున్నాను. మీ నాయకులు ప్రజాస్వామ్యం తరపున ఈ యుద్ధం జరుగుతున్నదని ప్రకటించారు. ఇంకా చాలా కారణాలు గూడా చెప్పబడినవి. అవన్నీ మీకు కంఠోపాఠంగా వుండవచ్చును. ఈ యుద్ధానంతరం, ఎవరు విజయం పొందినా ప్రజాస్వామ్యాన్ని రక్షించుటకు ప్రజాస్వామ్య పద్ధతి వుండదు. ఇది నా విజ్ఞప్తి. ఈ యుద్ధం మానవజాతికి శాపంగా, ఒక హెచ్చరికగా పరిణమిస్తున్నది. ఇది ఇదివరలో ఎన్నడూ లేనంతగా మానవుడిని పశువుగా మారుస్తున్నది. యోధులూ, యోధులు కానివారూ ఇద్దరి మధ్యా విభేదాలు తొలగించబడుతున్నవి. వదలడానికి ఏమీ మిగలడం లేదు. మిథ్యా బాషణాలు కలగా మారినవి. బ్రిటన్ చిన్న చిన్న జాతీయతలను సమర్థించవలసి వస్తున్నది. ప్రస్తుతానికి ఒకటొకటిగా అవి అదృశ్యమూపోతున్నవి. అవి గూడా ఒక హెచ్చరిక. ఆ హెచ్చరికను గమనించకపోతే మనుష్యుడు పశువుగా మారిపోతాడు.

శత్రుత్వాలు మానమని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. మీరు యుద్ధానికి అలసి పోయివారని గాదు. యుద్ధమనేది చాలా చెడ్డది. అందుకే నా విజ్ఞప్తి. మీరు నాజీజంను అంతమొందించవలెనని కోరుతున్నారు. ప్రస్తుత విధానం ప్రకారం మీరెన్నటికీ దానిని అంతమొందించలేరు. మీ సైనికులు జర్మనులవలెనే విధ్వంస కార్యక్రమం నెరవేరుస్తున్నారు. జర్మన్ విధానమంతగా పరిపక్వమైన విధానం మీది కాకపోవచ్చును.

అదే భేదం. ప్రయత్నం చేస్తే మీరు గూడా ఆ స్థాయికి ఎదిగిపోతారు. అంతకు మించి గూడా పోవచ్చును. ఇంకొక మార్గంలో ఈ యుద్ధాన్ని మీరు జయించలేరు. అంటే నాజీల కంటె గూడా మించి మీరు క్రూరత్వం ప్రదర్శించాలి. నిమిష నిమిషానికి జరుగుతున్న మారణకాండ హద్దులు దాటపోతున్నది. అది ఏవిధంగానూ వాంఛనీయం గాదు. సమర్థనీయం గాదు.

బ్రిటిషువారు పడిపోవలెనని నా ఉద్దేశ్యం గాదు. పాశవిక శక్తి ప్రయోగం వలన అది విజయం పొందినా విశేషం లేదు. మీ శారీరక శక్తి ప్రసిద్ధిజెందినదే. మీ మెదడు గూడా అదే విధంగా పనిజేస్తున్నదని తెలియజేయడం అవసరమా? నాజీలతో ఈ విషయంలో మీకు పోటీ అవసరం లేదు. మీకు సాహసోపేతమైన ఉదారమైన మార్గాన్ని సూచిస్తున్నాను. దానిని ధైర్యవంతులే అనుసరించగలరు. ఆయుధాలు లేకుండా మీరు నాజీలతో పోరు సలపండి. సైనిక భాషలో అహింసాత్మక ఆయుధాలతో పోరాటం చేయండి. మీరు ఆయుధాలు విసర్జించండి. అవి మానవత్వ రక్షణకు ఉపయోగించవు. హిట్లరునూ, ముస్సోలీని పిలిచి తమకు కావలసినవి తీసుకోమనండి. వారు సుందరమైన రాజ్యాన్ని ఆక్రమిస్తారు. మీ భవనాలను ఆక్రమిస్తారు. కాని మీ ఆత్మలను ఏ పరిస్థితిలోనూ ఆక్రమించలేరు. మీ భవనాలను వారు ఆక్రమించ దలచుకొంటే మీరు వాటని ఖాళీ చేయండి. మిమ్మల్ని నాజీలు హింసిస్తారు. కాని రాజభక్తిని చూపించడానికి తిరస్కరించండి.

నేను చెప్పిన అహింసాత్మకమైన సహాయ నిరాకరణ ఇండియాలో కొంతవరకు సఫలమయింది. మీ ప్రతినిధులు నా వాదనను నిరాకరించవచ్చును. వారిని చూచి నేను జాలిపడవలసి వుంటుంది. మా సహాయనిరాకరణ పూర్తిగా అహింసాత్మకం కాదనీ, ద్వేషంతో కూడినదనీ వారనవచ్చును. ఆ ప్రమాణ పత్రం వారిస్తే నేను నిరాకరించను. ఇది పూర్తిగా అహింసాత్మకమైతే. సత్యాగ్రహులు మీ యెడల సద్భావం కలిగి వుండి వుంటే మాకు యజమానులుగా వున్న మీరు మాకు శిష్యులుగా మారేవారు. మాకంటే ఎక్కువ శక్తియుక్తులు కలిగి వుండేవారు. సరిలేని ఈ ఆయుధాన్ని జర్మన్ల యెడల ప్రయోగించి వుండేవారు. యూరపు చరిత్ర మారిపోయి వుండేది. రక్తం చిందేది కాదు.

తన పని తాను ఎరగని వ్యక్తి చేస్తున్న విజ్ఞప్తి కాదిది. 50 సంవత్సరాల నుండి దీనిని నేను అమలుచేస్తున్నాను. అన్ని జీవిత రంగాలలోనూ దీనిని ఉపయోగిస్తున్నాను. ఇది ఎక్కడా విఫలం గావడంలేదు. నా లోపం వలన అది విఫలమైతే అయివుండవచ్చును. నేను సత్యాన్వేషిని. సత్యమంటే భగవంతుడే. ఆ సత్యాన్వేషణ మార్గంలో నాకీ అహింస లభించింది. ఇది నా జీవిత సాధనంగా పరిణమించింది. నేను అందుకే జీవించి వున్నాను.

నేను బ్రిటిషువారికి వ్యతిరేకినని ప్రసిద్ధి. వారిమీద నాకు శ్రద్ధ లేదని ప్రతీతి. ఒకప్పుడు మీ సామ్రాజ్య ప్రశంసకుడను నేను. అది ఇండియాకు మేలు చేస్తున్నదనుకొన్నాను. మీ వలన మేలు జరగదని తేల్చుకొని సామ్రాజ్యవాదంతో అహింసాత్మకంగా పోరాటం జరుపుతున్నాను. మా భవిష్యత్తు ఏమవుతుందో తెలియదు. మీ యెడల నా భావాలు మారవు. నేను మీ అభిమానిని. అందువల్లనే మీకు ఈ విజ్ఞప్తి చేస్తున్నాను.

భగవంతుని పేరుతో ఉత్తరం ప్రారంభించాను. భగవంతుని పేరుతో దీన్ని సమాప్తం చేస్తున్నాను. నేను వైస్‌రాయ్ గారికి వ్రాశాను. నేను సేవకు సిద్ధంగా వున్నాను. నా విజ్ఞప్తిని గురించి ఆలోచించండి. ముందుకు సాగండి.

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 81. బ్రిటిష్ వారికందరికీ

దక్షిణాఫ్రికాలో ప్రజాసేవ ప్రారంభించినపుడు దక్షిణాఫ్రికాలో నివసించే బ్రిటిషు వారికి ఒక వుత్తరం వ్రాశాను. దాని ప్రభావం కొంత కనిపించింది. ప్రపంచంలో ఏర్పడిన క్లిష్ట పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని దక్షిణాఫ్రికాలో చేసిన పనిని ఇక్కడ తిరిగి చేయదలచుకొన్నాను. ప్రపంచంలోని బ్రిటిషు వారందరికీ ఈ నా విజ్ఞప్తి. జాతీయ కౌన్సిళ్లలో ఏమీ కాకపోవచ్చును. అహింసా సామ్రాజ్యంలో ప్రతి న్యాయమైన ఆలోచనకూ తావు వుంటుంది. దానికి పూర్తి విలువ వుంటుంది. హింస ప్రజాహాదిని నిరాశపరుస్తుంది. నేను అహింసాక్షేత్రంలో మాత్రమే పని చేస్తున్నాను. ప్రకటించిన, ప్రకటించని భావాలన్నీ నాకు ఉపయోగిస్తవి. అవి నాకు విలువైనవి.

ఈ స్థితిలో బ్రిటను, ఆసియా, ఆఫ్రికా దేశాలనుండీ, భారత దేశం నుండి గూడా తప్పుకొనడం మంచిది. అది నా ప్రార్థన. ప్రపంచరక్షణకూ ఫాసిజం నాజీజం వంటి వాటిని మట్టుపెట్టుటకు బ్రిటిషువారందరూ నా విజ్ఞప్తిని ఆమోదించి సమర్థించడం అవసరం. దానితో జపానిజంను గూడా చేర్చడం మంచిది. అది చేరి వుంటుంది ఇది ఆ రెండింటికీ నకలు.

నా ప్రార్థనను అంగీకరిస్తే ఆఫ్రికా ఇండియాలలోని మీ పరిస్థితికి ప్రయోజనానికి కలిగే హాని, యుద్ధంలో బ్రిటన్ పెట్టుతున్న ఖర్చు దృష్టిలో లెక్కించదగినది కాదు. నిజానికి బ్రిటన్‌కూ, ఇండియాకూ ప్రపంచానికీ లాభం.

ఆసియా, ఆఫ్రికాలనుండి విరమించమని చెప్పే సందర్భంలో నేను ఇండియా వరకు నన్ను నేను కుదించుకొంటాను. బ్రిటిష్ రాజకీయ నాయకులు భారతదేశాన్ని యుద్ధంలో చేరమంటున్నారు. యుద్ధాన్ని ప్రకటించినప్పుడు ఇండియాను సంప్రదించలేదు. ఎందువల్ల? ఇండియా ఇండియన్లది కాదా? కాదు. ఇది బ్రిటన్‌వారి సొత్తు. ఇండియా విషయంలో బ్రిటిష్ వారు ఇష్టమొచ్చినట్లు వ్యవహరిస్తున్నారు. యుద్ధాన్ని నిరోధించే నన్ను యుద్ధపు పన్ను చెల్లించమంటున్నారు. దానికి మార్గాలు అనేకం కనిపెట్టారు. నేను వ్రాసి పోస్టులో వేస్తున్న ప్రతి ఉత్తరానికి నేను యుద్ధపు పన్ను రెండు పైసలు చెల్లిస్తున్నాను. ఇదీ చిత్రం. ప్రతి పోస్టుకార్డుకూ ఒక పైసా, ప్రతి టెలిగ్రాముకూ రెండు అణాలు యుద్ధపు పన్ను చెల్లిస్తున్నాను. ఇదీ బ్రిటిషువారు చేస్తున్న చూపిస్తున్న తెలివి. నేను ఇటువంటివి అనేకం చూపెంచగలను. వివరాలతో బాటు ఇండియా చెల్లిస్తున్న యుద్ధపు పన్ను వివరాలు చాలావున్నవి. దీనిని స్వేచ్ఛగా చెల్లిస్తున్న మొత్తమనడానికి వీలు లేదు. బ్రిటన్ తన కుర్చీమీద తాను కూర్చొని వున్నది. ఒక ఈలవేస్తే ఇండియా దాని ప్రకారం పనిచేస్తున్నదంటే ఏమాత్రం అతిశయోక్తి లేదు. బ్రిటన్ ఇండియాతో నిత్యయుద్ధం చేస్తున్నది బ్రిటన్ జయించిన దేశం. ఈ యుద్ధంలో ప్రవేశిస్తే ఇండియాకు కలిగే లాభమేమిటి? భారతీయ సైనికులు చూపిన వీరత్వానికీ సాహసానికీ ఏమీ ప్రయోజనం లేదు.

జపాను బెదరింపులు ఇండియా మీద ప్రారంభం కావడానికి ముందు భారతీయుల నివాసాలను బ్రిటిషు వారు ఆక్రమించుకున్నారు. నివాసమున్న వారందరినీ

బలవంతంగా ఖాళీ చేయించారు. మీ నివాసాలు మీరు వెదకుకొనవలెనన్నారు. ఖాళీచేసి సామాన్లు తీసుకొని పోవడానికి ఎందుకూ చాలని కొద్దిసొమ్ము అందచేశారు. వారి వృత్తి పోయింది. వారు తమ కుటీరాలు తాము నిర్మించుకోవాలి. భోజనానికి చూచుకోవాలి. వారు దేశభక్తితో ఆపని చేయలేదు. ఈసంగతి కొద్ది రోజుల క్రితం నాకు తెలియగానే నా సహకార్యకర్తలు ఖాళీ చేయబడిన జనాన్ని ఓదార్చమని సలహా ఇచ్చారు. పత్రికలో ఈ అన్యాయాన్ని గురించి నేను వ్రాశాను. ఎవరినైనా పంపి నిర్వాసితులను ఓదార్చాలి. ఆ బీదవారిని ప్రభుత్వం మనుష్యులుగా భావించలేదు. ఖాళీచేయడానికి నిరాకరించవలసి వుండెను లేదా ప్రభుత్వం వారికి తగిన వసతి సౌకర్యం కల్పించ వలసివుండెను.

తూర్పు బెంగాలు ప్రజలను జల, స్థలచరులుగా ప్రభుత్వం భావించింది. వారు కొంత భూమిమీదా, కొంత నీటి మీదా వుంటారు. వారు డింగీలు ఉపయోగిస్తుంటారు. జపాను వారు ఆ డింగీలు ఉపయోగించుకొంటారని. వాటి నన్నింటినీ ప్రభుత్వానికి అప్పగించమన్నారు. బెంగాలీలకు డింగీని వదలమంటే ప్రాణాన్ని వదలడమే. ఎవరైనా డింగీని అపహరిస్తే వారు అతడిని శత్రువుగా భావిస్తారు.

గ్రేట్ బ్రిటన్ యుద్ధం గెలవాలి. ఇండియాను పణంగావొడ్డి ఆ యుద్ధం గెలవాలి. అది చేయదగిన పనేనా? ఆ యుద్ధం చర్యల్లో మేము పాల్గొనాలా?

ఈ అధ్యాయానికి నేను ఇంకా చేరవలసివున్నది. భారతీయ జీవితంలో ఏర్పడుతున్న ఈ తప్పుడు మారితనం ఊపిరి ఆడకుండా చేస్తున్నది. భారతీయులందరూ తీవ్రమైన అసంతృప్తితో వున్నారు. అది బహిరంగంగా చెప్పలేక పోతున్నారు. ప్రభుత్వ నౌకర్లు గూడా దీనికి అపవాదం కాదు. నేను చెప్పుడు మాటలు చెప్పడంలేదు. బ్రిటిషు అధికారుల కిది తెలుసును. దీనిని ఎదురించక తప్పదు.

నామాటలు మీరు విశ్వసించక పోవచ్చును. నాకు ప్రతి వాదం చేయవచ్చును. నేను దానిని ఎదుర్కొనగలను. నిజమని నమ్మిన దానిని మీకు తెలియజేస్తున్నాను. ఇది ముమ్మాటికీ సత్యం.

నా జనం నా మాటల్ని అంగీకరించక పోవచ్చును. నేనెవరితోనూ సంప్రదించలేదు. నా మౌనదినం నాడు ఈవిజ్ఞప్తిని వ్రాస్తున్నాను. బ్రిటిషు ప్రభుత్వ చర్యలు ఇలా వున్నవి.

అమెరికాలో బానిసత్వాన్ని నిషేధిస్తే దానిని బానిసలే ఎదిరించారు. కొంతమంది ఏడ్చారుగూడా. ఆ చట్టం రద్దయింది. దక్షిణ అమెరికా ఉత్తర అమెరికాకు మధ్య భీషణ యుద్ధం జరిగింది. నీగ్రోల స్థితి కొంత మెరుగుపడినా ఉన్నతవర్గాలవారు నీగ్రోలను ఇంకా జాతి బానిసలుగానే పరిగణిస్తున్నారు. నేనింకా పెద్ద విషయాలను ఆశిస్తున్నాను. నేను రక్తం చిందని మార్పును ఆశిస్తున్నాను. అస్వాభావికమైన అధిపత్యాన్ని వ్యతిరేకిస్తున్నాను.

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

## 82. చియాంగ్ కై షేక్ గారికి

సేవాగ్రామం

14 జూన్ 1942

మిత్రమా

మీతో జరిగిన 5 గంటల కలయికను నేను ఎన్నడూ మరచిపోలేను. మీ భార్యను కలకత్తాలో కలిశాను. స్వాతంత్ర్యం కొరకు మీరు జరిపిన పోరాటంలో నేను మీతో ఉన్నాను. మీ కలయిక మీ స్వాతంత్ర్య పోరాట వివరాలూ చైనా సమ్యలతో నాకు సన్నిహిత సంబంధాన్ని కలిగించినవి. 1905-1913 మధ్యలో జోహన్స్‌బర్గ్‌లోని చైనా కాలనీతో నాకు సన్నిహిత సంబంధముండేది. వారు నాకు సన్నిహితులు. మొదట నా కక్షిదారులు. తరువాత నా ఉద్యమంలో భాగస్వామ్యులైనారు. మారిషస్‌లో గూడా వారు నాకు సన్నిహితులైనారు. పరిశ్రమ చేస్తారు. మిత వ్యయులు. ఐక్యతా ప్రియులు. ఇండియాలో నాకు చైనా స్నేహితుడు అతి ఉత్తముడు వుండేవాడు.

మీ గొప్ప దేశం యెడల నాకు చాలా గౌరవమున్నది. మీ ఉద్యమం యెడల నాకు సానుభూతి ఏర్పడింది. మనకు సమాన స్నేహితుడు జవహర్‌లాల్ నెహ్రూ. అతనికి చైనా అంటే చాలా అభిమానం.

మన రెండు దేశాలూ పరస్పరం సంబంధమేర్పర్చుకొని దగ్గరకు చేరాలి. దానివలన రెండు దేశాలకూ లాభముంటుంది. ఇండియా నుండి బ్రిటిష్‌వారిని వెళ్లిపొమ్మని నేనంటున్నాను. దానితో జపానుకు సహాయం చేయడమనే మాట లేదు. దానివలన మీ పోరాటాన్ని బలహీనపరచడం జరగదు. ఇండియా ఏ ఆక్రమణదారునికీ లొంగదు. మీ స్వాతంత్ర్యాన్ని బలిచేసి స్వాతంత్ర్యం పొందవలెననే కాంక్ష నాకు లేదు. ఈ రకంగా ఇండియాకు స్వాతంత్ర్యం లభించదు అని నాకు స్పష్టంగా తెలుసును. జపాను ఆధిపత్యం ఇండియాకు చైనాకూ ఇద్దరికీ ప్రమాదకరమే. విశ్వశాంతికి కూడా అది నష్టదాయకం. ఆ ఆధిపత్యాన్ని వ్యతిరేకించవలసిందే. తప్పదు.

బానిసత్వంలో వున్న ఇండియా మీకు సహాయం చేయలేదు. ఏమీ చేయలేక ఇండియా దిక్కు తెలియని స్థితిలో ఉన్నది. జరుగుతున్న దురదృష్టకరమైన సంఘటనల నుండి మనం పాఠం నేర్చుకోవాలి. అట్టి ఘటనలు తిరిగి జరగకుండా చూడాలి.

మా సూచనలను బ్రిటన్ నిరాకరిస్తున్నది. క్రిప్స్ మిషన్ విఫలమైనది. దాని వలన మాకు చాలా గాయం ఏర్పడింది. అందువల్లనే బ్రిటన్ వెంటనే వెళ్ళి పోవాలి అని మేము నినాదం చేయవలసి వచ్చింది.

అహింస మీద నాకున్న విశ్వాసాన్ని గురించి మీకు తెలియజేశాను. దేశాలన్నీ దాన్ని అనుసరిస్తే విశ్వానికి చాలా మేలు కలుగుతుంది. ఇండియాలోనే ఇంకా ఆ విశ్వాసం ఏర్పడలేదు.

ఈ రోజు ఇండియా నపుంసకంగా, బలహీనంగా వున్నది. ఆర్థిక లాభాపేక్షతో చేరినవారితో సైన్యం నిండి వున్నది. సిద్ధాంతాల మీద వారికి విశ్వాసం లేదు. అది జాతీయ సైన్యం కాదు. చైనా కొరకు, ఇండియా కొరకు సిద్ధాంతాల మీద ఆధారపడి పోరాటం సలిపే మనం విదేశీయుల క్రింద ఉండము. స్వతంత్ర భారతదేశం విశ్వశాంతికి, చైనా సహాయానికి తప్పక తోడ్పడగలదు. నిస్సహాయ స్థితిలో దుశ్చర్యలను చూస్తూ మేము ఊరుకొనదలచుకోలేదు. అందుకు కృషి చేస్తాము. బ్రిటన్‌కు ఇండియాకు మధ్య గల అస్వాభావికమైన సంబంధాన్ని తెంచుకొంటాము.

మేము ప్రయత్నించకపోతే భారతీయులు తప్పు విధానాలు అనుసరించే ప్రమాదం ఉన్నది. బ్రిటన్‌ను బలహీనపరచటానికి జపాన్‌మీద అభిమానం పెరిగే

ప్రమాదం ఉన్నది. మేము స్వశక్తిమీద ఆధారపడాలి. అంతే గాని ఎవ్వరిమీద ఆధారపడకూడదు. ముందు బానిసత్వం నుండి బయటపడాలి. అది చాలా అవసరం. ఆనాడే మేము స్వాతంత్ర్యం కొరకు పోరాడే దేశాలకు, ప్రపంచానికి సహాయం చేయగలము.

జపాను ఆక్రమణను మేము వ్యతిరేకిస్తాము. మిత్రపక్షాలు ఇండియాలో తన సైనికులను నియమించి జపానుకు వ్యతిరేకంగా పోరాడవచ్చును. దానిని ఇండియా వ్యతిరేకించదు. మేము తొందరపడి ఏమీ చేయము. మా నిర్ణయం వలన చైనాకు ఏమీ అపకారం జరగదు. జపాను ఆక్రమణను మేము సమర్థించడం జరగదు. ప్రపంచంలో దేశాలు ఇండియాను, చైనాను సమర్థించేటట్లు నేను ప్రయత్నం చేస్తున్నాను. మా దేశంలో కూడా జనసామర్థ్యాన్ని అందుకు సమాయత్తం చేస్తున్నాను. నా సహచరులకు కూడా నచ్చచెప్పుతున్నాను. బ్రిటన్‌కు వ్యతిరేకంగా నా సంబంధంతో జరిగే పోరాటాలన్నీ అహింసాత్మకంగా జరగగలవు. బ్రిటిష్ వారితో పోరాటం జరగకుండా ఆపే ప్రయత్నం చేస్తున్నాను. తప్పకపోతే మేము ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కొంటాము.

మీరు 5 సంవత్సరాలనుండి జపాను ఆక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. చైనాకు చాలా కష్టాలు ఏర్పడ్డవి. నా సానుభూతి చైనా ప్రజల యెడ ఉన్నది. వారు చాలా త్యాగాలు చేస్తున్నారు. స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనాలని ప్రజలు ఆశిస్తున్నారు. మీ త్యాగాలు వ్యర్థంగా పోవు. మీ విజయానికి హృదయపూర్వకమైన నా ఆకాంక్షలు స్వీకరించండి. స్వతంత్ర్య భారతం, స్వతంత్ర్య చైనా కలసి మిత్రభావంతో వికాసపథంలో నడవగలవని నేను కాంక్షిస్తున్నాను. అపుడే విశ్వశాంతి ఏర్పడుతుంది. మీ అనుమతి లభిస్తుందని విశ్వాసంతో ఈ ఉత్తరాన్ని హరిజన్‌లో ప్రకటిస్తున్నాను.

మీ

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

# 83. జపాను వారందరికీ

మీమీద నాకు దురభిప్రాయం లేకపోయినా చైనామీద మీరుచేసిన ఆక్రమణను నేను సమర్థించను. మీరు చేసిన పని మంచిదిగాదు. మీలో సామ్రాజ్యవాదం పెరిగిపోతున్నది. మీ కోరికలు పెరుగుతున్నవి. మీ కోరికలు ఫలించవు మీరు ఆసియాకు అపకారం చేస్తున్నారు. విశ్వసౌభ్రాతృత్వానికి మీరు విఘాతం కలిగిస్తున్నారు. మానవత్వానికి మేలు కలగదు.

నా 18 సంవత్సరాల వయస్సులో 50 సంవత్సరాలకు పూర్వం నేను ఇంగ్లండులో చదువుకొంటున్న సమయంలో ఎడ్విన్ ఆర్నాల్డ్ గారిరచనల ద్వారా మీ జాతి విలక్షణతను మీకు లభించిన విజయానికి పొంగిపోయాను. 1915లో భారతదేశానికి వచ్చిన తరువాత మా 'ఆశ్రమంలో అనేక జపాను భిక్షువులతో నాకు సంబంధమేర్పడింది. వారిలో ఒకరు సేవాగ్రామంలో మా ఆశ్రమవాసులైనారు ఆయన రత్నం వంటివాడు. ఆయనలోని కర్తవ్య పరాయణతా, ఉదాత్తమైన ఆచరణా నిత్యప్రార్థన మీద ఆయన కున్న భక్తీ, పూజాతత్పరతా, ఏ పరిస్థితులలోనూ చికాకు పడకపోవడం, ఆయన ముఖం మీద తొణికిసలాడే చిరునవ్వు మాకు మరపురానివి. మాకందరికీ ఆయన తలలో నాలుకవలె వుండేవాడు. గ్రేట్ బ్రిటన్‌కు వ్యతిరేకంగా మీరు యుద్ధాన్ని ప్రకటించడం వలన ఆయనను మా మధ్య నుండి తీసుకెళ్లారు. మేము ఆయన లేకపోవడాన్ని ఎంతైనా విచారంతో భరిస్తున్నాము. తన ప్రార్థనను, ప్రార్థనకు ముందు తరువాత ఆయన వాయించే వాయిద్యమూ మాత్రం మా దగ్గర మిగిలివున్నవి.

మీరు చైనా మీద ఆక్రమణ చేయడం, ఆ గొప్పదేశంలో మీరు చేస్తున్న కృత్యాలూ నన్ను ఎంతగానో బాధిస్తున్నవి.

ప్రపంచంలోని పెద్ద శక్తులలో చేరిపోదామని మీ కోరిక అందుకు కారణం గావచ్చును. అది సమంజసం కాదు. అది అవసరం లేని క్రియ.

ప్రాచీన నాగరికత గలిగిన మీరు, ఎవరి ప్రాచీన వాఙ్మయాన్ని మీదిగా భావించారో, ఎవరు మీ పొరుగువారో వారిని గురించి తెలుసుకొని వారితో చేతులు కలిపి దేశ సౌభాగ్యానికి మీరు తోడ్పడతారని నేను ఆశించాను. పైన నేను చెప్పినదానికి మీరు గర్విస్తారనుకొన్నాను. ఈనాడు పరమ శత్రువులుగా మీరు వ్యవహరిస్తున్నారు.

నేను స్వతంత్రుడనైతే, మీ దేశానికి మీరు నన్ను రానిస్తే నా ఆరోగ్యాన్ని కూడా లెఖ్ఖచేయకుండా మీ దేశానికి వచ్చి మీరు చేస్తున్న పని మంచిది గాదనీ, అపని మానమనీ ప్రార్థించేవాణ్ణి. మీకు నచ్చజెప్పే ప్రయత్నం చేసేవాడిని.

కాని నాకు ఆ స్వాతంత్ర్యం లేదు. మేము సామ్రాజ్యవాదాన్ని ఎదురించే స్థితిలో ప్రత్యేక పరిస్థితిలో ఉన్నాము. నాజీజమునుగూడా మేము వ్యతిరేకిస్తున్నాము. బ్రిటిష్ పౌరులకు నష్టం కలిగించడం గూడా మా ఉద్దేశ్యం గాదు. వారిని మార్చవలెనని ప్రయత్నిస్తున్నాము. మాది బ్రిటన్‌కు వ్యతిరేకంగా ఆయుధాలు ఉపయోగించని పోరాటం. మా దేశంలోని ప్రధానమైన ఒక పక్షం భయంకరమైనదయినా సౌహార్ద్రపూరితమైన పోరాటంలో మునిగి వున్నది. విదేశస్థులతో పోరాడుతున్నది.

ఆ పోరాటంలో మాకు ఏ విదేశ శక్తి సహాయమూ అవసరం లేదు. మిమ్మల్ని ఎవరో తప్పు అభిప్రాయంలో పెట్టారు. మీరు మా భావాలను గురించి తప్పుగా అభిప్రాయపడినట్లున్నారు. బ్రిటన్ కష్టాలను మాకనుగుణంగా మార్చుదలచుకొంటే ఉపయోగించదలచుకొంటే యుద్ధం ప్రారంభం కాగానే ఆ పని చేసేవారము. ఆ పని మూడేళ్ల క్రితమే చేసి వుండేవారము.

మేము బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని వదలవలెనని చేస్తున్న ప్రయత్నాన్ని మీరెవ్వరూ అపార్థం చేసుకొనగూడదు. మీకు మా మీద అంత అభిమానముంటే మా మీద దాడి చేయవలసిన అవసరముండదు. చైనాలో మీరు చేస్తున దుష్కృత్యాలను మేము గమనిస్తూనే వున్నాము.

ఇండియా మీకు స్వాగతం చెపుతుందనే దురూహలో మీరుండవద్దు. బ్రిటనుతో మేము పోరాడుతున్నామంటే సామ్రాజ్యవాద శక్తులతో, ఫాసిస్ట్ శక్తులతో మేము పోరాడుతున్నామని అర్థం. ఇంగ్లీషు వారి సామ్రాజ్యవాదం, జర్మనీ నాజీజం, మీ పద్ధతి ఫాసిజం అన్నింటికీ మేము వ్యతిరేకులం. ఇండియాకు స్వాతంత్ర్యాన్ని ప్రసాదించకుండా మిత్రపక్షాలు మిమ్మల్ని ఎదుర్కొనడం నైతికంగా కొంత కష్టం. మీరందరూ హింసమీద, ఆయుధాల మీద ఆధారపడుతున్నారు. మిమ్మల్ని మిత్రపక్షాలు యుద్ధంలోనే మారణాయుధాలతో ఎదురించి జయించాలి. అదే మార్గం. ప్రజాస్వామ్యం కొరకు పోట్లాడుతున్నామన్నవారి మాటకు గూడా విలువ వుండదు.

బ్రిటన్‌నూ, మిత్రపక్షాలనూ న్యాయం పేరిట, వారి మేలు కొరకు ఇండియాకు స్వాతంత్ర్య మివ్వమని కోరాము. మానవత్వం పేర మీకు విజ్ఞప్తి చేస్తున్నాము. దయా దాక్షిణ్యాలు లేకుండా దుర్మార్గంగా ప్రవర్తించడం ఏ వొక్కరిహక్కు కాదు. మిత్రపక్షాలు గాకపోయినా ఇంకెవరైనా మిమ్మల్ని మించి యుద్ధం నడపగలరు. మీ ఆయుధాలతోనే మిమ్మల్ని నిర్జించగలరు. మీరు జయించినా మీ పౌరులు గర్వించదగినదేమీ వుండదు. ఎంత బాగా మీరు అమలుపరచినా మీ దుష్కృత్యాలు వారికి గౌరవాన్ని సంపాదించి పెట్టలేవు.

మీరు జయించినా మీరు న్యాయపక్షంలో వున్నట్లు గాదు. మీకున్న విధ్వంసక శక్తి గొప్పదనిమాత్రమే పేరు తెచ్చుకొనగలరు. మిత్రపక్షాలు జయించినా అంతే. న్యాయపక్షంలో వుండే ఆసియా ఆఫ్రికా దేశాలకు బ్రిటన్ విముక్తి కలిగించాలి.

బ్రిటన్ సైన్యాలను ఇండియాలో వుండనిస్తాము. మిత్రపక్షాలకు హాని కలిగించడం మా ఉద్దేశ్యం గాదు. బ్రిటన్ ఖాళీచేసిన దేశంలోకి మీరు ప్రవేశించడం, దానికి మేము ఆమోదించడం జరిగే పని గాదు. అటువంటి కోరిక మీకు వుంటే, అది అమలుచేయబోతే మేము మా సర్వశక్తులూ ఉపయోగించి దాన్ని ప్రతిఘటిస్తాము. విజ్ఞప్తి నేను ఎందుకు చేస్తున్నానంటే మీరు ఎటువంటి భ్రమలో వుండవద్దు అని చెప్పుటకే. మా ప్రయత్నం మీ కందరికీ మేలు చేయవచ్చును. సద్భావన కలగజేయవచ్చును. నైతికంగా మీ పతనాన్ని అది ఆపవచ్చును.

నా విజ్ఞప్తి మీకు సద్భావం కలిగించగలదని భావిస్తున్నాను. నన్ను బ్రిటిషువారు ఎరుగుదురు. మీతో నాకంతగా పరిచయం లేదు. మీరు విజ్ఞప్తులు వినరని నాకు తెలిసింది. మీకు కత్తులు ప్రధానమట. మీ హృదయంలో మార్పుతేగలిగితే నేను ధన్యుడిని. మానవత్వం మీద నాకు విశ్వాసమున్నది. భారతదేశంలో జరుగుతున్న స్వాతంత్ర్య పోరాటం నాకు చాలా విషయాలను నేర్పింది. విశ్వాసాన్ని కలిగించింది. ఆ విశ్వాసంతోనే మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

మీ మేలుగోరు
ఎమ్. కె. గాంధి

★ ★ ★

# 84. అమెరికన్ స్నేహితులకందరికీ

స్నేహితులూ,

బాగా చర్చించబడిన, అంతకంటే నిందించబడిన అఖిల భారత కాంగ్రెస్సు కార్యవర్గ సమావేశంలో జరిగిన తీర్మానానికి వెనుకనున్న వ్యక్తిని నేనని మీకు తెలుసును. నాకు అమెరికాలో ఎక్కువమంది మిత్రులున్నారు గ్రేట్‌బ్రిటన్‌లో గూడా అంతమంది వుండరు. అమెరికాలో నాయక (హీరో) పూజ అనే జబ్బున్నది. యూనిటీ చర్చి న్యూయార్కుకు చెందిన డాక్టర్ హోమ్సుకు వ్యక్తిగతంగా నేను తెలియకపోయినా నాకు ప్రచార సాధకుడయినారు. ఆయన నన్ను గురించి చెప్పిన మంచి మాటలు నాకే తెలియవు. అమెరికా నుండి ఇంద్రజాలపు పనులు చేయమని నాకు ఉత్తరాలు వస్తూ వుంటవి. బిషప్‌గారు నన్నెరుగుదురు. బిషప్‌గారి తరువాత హోమ్ గారు మంచిమాటలు నన్ను గురించి వ్రాస్తున్నారు. కాని నేను మీ దేశం ఇంతవరకు రాలేకపోయినాను. అది నా దురదృష్టం.

కాని మీ దేశం నాకొక గురువును ప్రసాదించినది. ఆయనే థోరోగారు. నేను దక్షిణాఫ్రికాలో అనుసరిస్తున్న దానికి ఆయన భాష్యాన్ని ప్రసాదించారు. గ్రేట్ బ్రిటన్ రస్కిన్ గారిని ప్రసాదించింది. వారి అన్ టు దిస్ లాస్ట్ పుస్తకం నన్ను మార్చివేసింది. రష్యా నాకు టాల్‌స్టాయిని ప్రసాదించింది. నా అహింసకు హేతుబద్ధమైన పునాదిని కల్పించారు. ప్రారంభస్థితిలో వున్న నా ఉద్యమాన్ని ఆయన ఆశీర్వదించారు. ఆయన నా ప్రయత్నం బీదలకు వరప్రసాదం గావలెననీ, అవుతుందనీ భవిష్యవాణి చెప్పారు. దీనిని బట్టి తేలుతున్నదేమంటే నేను గ్రేట్ బ్రిటన్‌కు గానీ, యూరపుకు గానీ శత్రువును కాను. అన్ టు దిస్ లాస్ట్ సందేశాన్ని అర్థంజేసుకొని నాజీజాన్నీ, ఫాసిజాన్నీ నేను వ్యతిరేకిస్తున్నాను. అవి వ్యక్తి స్వాతంత్ర్యాన్నీ, దేశ స్వాతంత్ర్యాన్నీ అణచివేస్తున్నవి.

నేను లేవదీసిన క్విట్ ఇండియా నినాదాన్ని గురించి ఈ దృష్టితో ఆలోచించండి. నేను చిన్నతనం నుండీ సత్యాన్వేషకుడను. ఇది నాకు ఎంతో స్వాభావికంగా కనిపిస్తుంది. నా ప్రార్థనతో కూడిన నా పరిశోధన సత్యమే భగవంతుడనే రహస్యాన్ని ఋజువుచేసింది.

అది నా నరనరాలలో జీర్ణించుకొని వున్నది. బ్రిటన్, మిత్రదేశాలూ ఇండియా హృదయపూర్వకంగా అహింసా కార్యక్రమంలో పాల్గొనవలెనంటే భారతదేశాన్ని స్వతంత్రదేశం చేయాలి. చైతన్యవంతమైన ప్రపంచం ముందు బ్రిటన్ తన చర్యను సమర్థించుకొనలేదు. సింగపూరు, మలేషియా, బర్మాలు అక్కడ జరిగిన పని భారతదేశంలో జరగకూడదని నాకు జ్ఞాపకం చేస్తున్నవి. బ్రిటన్ భారతదేశాన్ని విశ్వసిస్తే ఆ చర్య ఇక్కడ జరగదు. ఇండియా మిత్రదేశాల పక్షాన పనిజేస్తుంది. భారతదేశంలో ఏర్పడివున్న అసంతృప్తిని బ్రిటన్ తొలగించవద్దా? మేము అసంతృప్తిని సంతృప్తిగా మార్చగలము. మీ ఇంజనీయర్లు సృష్టించిన యుద్ధనౌకలు, యుద్ధ విమానాలు సృష్టించని వాతావరణాన్ని సృష్టించగలము.

కావలెనని దుష్ప్రచారంతో కాంగ్రెసును గురించి మీలో వ్యతిరేక భావాన్ని సృష్టించివున్నారు. నన్ను మోసగాడిననీ, బ్రిటనుకు బద్ధశత్రువుననీ వర్ణించారు. నేను నమ్మడానికి పనికిరాని, వీలులేని మనిషినట. నన్ను నేను సమర్థించుకునే విషయాలు వ్రాసి ఈ ఉత్తరాన్ని పొడిగించను. దుష్ప్రచారాన్ని తిరిగిగొట్టవలెను.

మీరు గ్రేట్ బ్రిటన్‌తో కలసివున్నారు. బ్రిటన్ ఇండియాలో చేస్తున్న పనులను మీరు నిరాకరించలేరు. కాని నిజాన్ని ఇప్పటికైనా గుర్తించకపోతే మీరు చాలా తప్పుచేసిన వారవుతారు. ఇండియా స్వాతంత్ర్యాన్ని కాంక్షించడం తప్పా? స్వాతంత్ర్యాన్ని ప్రసాదించమని అడగడం పొరపాటా? ఇది సమయం కాదంటున్నారు. ఇది సరైన సమయమని మా అభిప్రాయం. మనోవైజ్ఞానికంగా మా అభిప్రాయం సరైనది. అప్పుడే జపాను ఆక్రమణను మేము - భారతీయులం హృదయపూర్వకంగా ఎదిరించగలము. అది మిత్రపక్షాలకు బాగా ఉపయోగపడుతుంది. భారతదేశానికి గూడా ఈ మార్గంలో వున్న అవరోధాలను కాంగ్రెసు గుర్తించింది యుద్ధ ప్రాతిపదికన భారతదేశాన్ని స్వతంత్రదేశం చేసే ప్రయత్నం చేయండి.

మీ స్నేహితుడు

ఎమ్. కె. గాంధి

*(బొంబాయి వెళ్లుతూ 3.8.42 దోవలో వ్రాసినది)*

# 85. లార్డ్ లిన్‌లిత్‌గో గారికి

ఆగాఖాన్ ప్యాలెస్
యర్రవాడ
14.8.1942

ప్రియమైన లార్డ్ లిన్‌లిత్‌గో గారూ,

దేశంలో ఆపత్కాల పరిస్థితి కల్పించి ప్రభుత్వం పెద్ద తప్పిదం చేసింది. తమ చర్యను సమర్థించుకొంటూ ప్రభుత్వం చేసిన తీర్మానం తప్పుల తడిక. అసత్య నివేదిక.

భారతీయులు మిమ్మల్ని సమర్థిస్తున్నారన్నారు. అది విలువలేని మాట. మీ భారతీయ అనుచరులు ప్రజాదృష్టిలో అకించనులు. అలాంటివారు ఇండియాలో మీకు దొరుకుతూనే వుంటారు. ప్రజలకు వ్యతిరేకంగా మీకు సహాయం లభించిం దంటున్నారు. ఆ సహాయమేమిటో తెలియదు.

ప్రభుత్వం నేను ఉద్యమం ప్రారంభించేదాకానైనా వేచివుండవలసింది. ఉద్యమం ప్రారంభించడానికి మీకు వుత్తరం వ్రాస్తానని నేను తెలియజేసి వున్నాను. కాంగ్రెసు తీర్మానాన్ని నిష్పక్షపాతంగా పరిశీలించమని నేను కోరివుండేవాడిని. తన తీర్మానంలో కాంగ్రెసు చాలా సర్దుబాటులు చేసుకొన్నది. అది మీకు తెలుసును. మీరు నాకు అవకాశమివ్వలేదు. ఆలస్యం జరిగితే ప్రపంచాభిప్రాయం కాంగ్రెసుకు అనుకూల మవుతుందని భయపడి ప్రభుత్వం దారుణమైన దమనకాండకు పూనుకొన్నది. కాంగ్రెస్సు తీర్మానాన్ని నిరాకరించడంలో ప్రభుత్వం చేసిన పనిని ఇప్పటికే ప్రపంచం ఆమోదించలేదు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ తీర్మానం జరిగిన సందర్భంలో జరిగిన ఉపన్యాసాల సారాంశాన్ని, వివరాలను ప్రభుత్వం తెలుసుకొనే ప్రయత్నం చేయలేదు. ప్రభుత్వానికి అంతమాత్రం వోపిక గూడా లేదు. నేను తొందరలో చర్య ప్రారంభించనని కొంచెం వోపిక పట్టితే మీకు తెలిసేది. ఆ తరువాత మీరు జరిపిన చర్యలు మీ తేలికతనాన్ని తెలియజేస్తున్నవి.

ప్రభుత్వ తీర్మానం ఏమన్నది? ప్రభుత్వం ఎంతో సహనంతో వేచి చూచింది. మంచిబుద్ధి కలుగుతుందనుకున్నది. ప్రభుత్వం నిరాశ జెందింది. ఇవి తీర్మానంలోని మాటలు. మంచి బుద్ధి కలగడమంటే తీర్మానాన్ని కాంగ్రెసు ఉపసంహరించుకోవాలి. భారతదేశానికి స్వాతంత్ర్యం కోరుతున్న పక్షానికి నచ్చజెప్పకుండా దమనకాండకు

పూనుకోవడం మంచి బుద్ధి ఏర్పడుతుందనడం ఏమాత్రం సబబు? కాంగ్రెసు తీర్మానాన్ని సంపూర్ణంగా తిరస్కరించడం ప్రభుత్వానికీ, ప్రజలకూ అనిశ్చితస్థితిని కలుగచేసింది. కాంగ్రెసు ప్రభుత్వం మిత్రపక్షాల వాదనతో ఏకీభవించి వారి పక్షాన నిలవవలెనని ప్రయత్నిస్తున్న సమయమది.

ప్రభుత్వ తీర్మానం ఇంకా ఏమంటున్నది? వైస్‌రాయ్‌కి కొంతకాలం క్రితమే - కాంగ్రెస్సు న్యాయవిరుద్ధమైన, కొన్నిచోట్ల హింసాత్మక చర్యలు నడిపించడానికి పథకం తయారుచేసిందని తెలుసును. కాంగ్రెసు కార్యక్రమంలో సంచార సాధనాలు భగ్నం చేయడం, సమ్మెల ఏర్పాటు, ప్రభుత్వోద్యోగులలో ప్రభుత్వం యెడల అవిశ్వాస ప్రకటన సైనిక వ్యవహారాలలో జోక్యం అన్నీ చేరివున్నవి. ఇది పూర్తిగా పచ్చి అబద్ధం. నిజాన్ని తమకనుకూలమైన పద్ధతిలో వక్రించడం. హింసను ఏ స్థితిలోను ప్రబోధించలేదు. అహింసాత్మక విధానంలో ఏవేవి చేర్చబడివుంటవో కాంగ్రెస్సు స్పష్టీకరించింది. కాంగ్రెసు హింసాత్మక చర్యలకు పాల్పడుతున్నదనడం సత్యదూరం. అన్ని విషయాలూ కాంగ్రెసు సమావేశాలలో వివరంగా చర్చించబడినవి. రహస్యంగా ఏమీ జరగలేదు. ప్రభుత్వం యెడల అసంతోషాన్ని పెంపొందించడం అంటే ఏమిటి? ఉద్యోగం వదలమని నేను ఎవరికైనా సలహా చెప్పితే అది బ్రిటిషువారికి హాని కలిగించడమా? పథకాలు ఏర్పడుతున్నవని తెలిస్తే మొదటనే ఆపడానికి ఎందుకు ప్రయత్నించలేదు? ఆపగలిగేవారు గదా? అది సక్రమమనిపించుకునేది. తమ తీర్మానం ద్వారా తమ ప్రవర్తననే వారు బహిరంగపరచుకొనగలిగారు. వెంటనే వారు చర్యకు ఎందుకు దిగలేదు? అంతా అసత్యారోపణ.

కాంగ్రెసు కార్యక్రమమంతా ప్రజలను కష్టాలు ఎదుర్కొనమని ప్రబోధించడమే గాని ఇంకేమీ కాదు. ప్రజల మనోభావాన్ని ప్రకటించడమే దాని లక్ష్యం. అహింసాత్మకంగా పనిజేసే పక్షాన్ని అణచివేయ ప్రయత్నించడం న్యాయసంగతమా?

ప్రభుత్వ తీర్మానం ఇంకా ఏమంటున్నది? - కాంగ్రెసు భారతదేశానికి ప్రతినిధి గాదు. దేశం తరఫున మాట్లాడే హక్కు కలిగిలేదు. అక్కడి ప్రతినిధులు వారిలో వారే కొట్లాడుకొంటుంటారు. స్వాతంత్ర్య మార్గానికి వారే అవరోధం. భారతదేశంలోని ప్రాచీనతరమైన కాంగ్రెసును నిందించే మార్గం ఇది కాదు. ప్రభుత్వం నోట వెలువడిన భాషయే చాలా చెడుగా వున్నది. స్వాతంత్ర్యం కొరకు జరిగిన ప్రయత్నాలనన్నింటినీ

ప్రభుత్వం వమ్ముజేసే ప్రయత్నంజేసింది. అది సాక్ష్యాధారాలతో ఋజువు కాగలదు. కాంగ్రెస్సును నిరోధించడానికి ప్రభుత్వం చేయని ప్రయత్నం లేదు.

ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని ప్రకటించిన వెంటనే కాంగ్రెసును విశ్వసించకపోతే ముస్లిం లీగ్‌ను మంత్రివర్గాన్ని స్థాపించమని అడిగివుండవచ్చును. లీగ్ స్థాపించిన ప్రభుత్వాన్ని కాంగ్రెసు అంగీకరించి వుండేది. కనుక ఈ దోషారోపణలో సారం లేదు.

ప్రభుత్వం వారు చెప్పినదానిని గురించి ఆలోచిద్దాము - 'దౌర్జన్యాలు తగ్గగానే ఇండియా తన స్వాతంత్ర్యంలో అన్ని పక్షాలనూ కలుపుకొనే ప్రయత్నం చేస్తుంది. ఒక్క పార్టీ ప్రభుత్వాన్ని స్థాపించదు. తనకు కావలసిన ప్రభుత్వాన్ని నిర్మించుకొంటుంది' దీనిలో ఏమైనా వాస్తవికత ఉన్నదా? ఇప్పుడు అన్ని పార్టీలూ ఏకంగా లేవు యుద్ధం పూర్తి అయిన తరువాత ఏకం కాగలవా? యుద్ధానికి పూర్వం పార్టీలు కలసి పనిచేయాలి. అది వారి చేతుల్లో ఉన్నదా? పార్టీలు కుక్కగొడుగుల్లాగా పుడుతుంటవి. వాటికి జనానికి ప్రాతినిధ్యం వహించే శక్తి వుండదు. ప్రభుత్వం అటువంటి వారికందరికీ స్వాగతం చెపుతున్నది. వెనక జరిగిన తంతు గూడా అదే. కాంగ్రెసును వ్యతిరేకిస్తే చాలు. ప్రభుత్వం వారి ఆదరణ లభిస్తుంది. గవర్నమెంటు చెపుతున్న పథకంలోనే లోపమున్నది. ముందు భారతదేశాన్ని మీరు వదలండి. ఇండియాకు బానిసత్వం నుండి స్వాతంత్ర్యం లభిస్తుంది. అపుడే మంత్రివర్గ స్థాపన. ప్రభుత్వ స్థాపన సాధ్యం. అనవసరంగా సమస్యలను, విభేదాలను పెంచే ప్రయత్నమిది.

తీర్మానం అంటున్న దానిని చూడండి - కాంగ్రెసు లక్షలాది జనం స్వాతంత్ర్యం కోరుతున్నారంటున్నది. భవిష్యత్తు అనిశ్చితంగా వున్నది. ఇతర దేశాలెన్నో ఆక్రమణదారుల చేతుల్లో పడిపోయినవి. ఇది లక్షలాదిమంది జనుల అభిప్రాయం. ఆ లక్షల సంగతి నాకు తెలియదు. కాంగ్రెసు మాటలు నమ్మకపోవచ్చును. ఏ సామ్రాజ్యవాద శక్తీ తాను కష్టంలో వున్నానని అంగీకరించదు. ఇతర సామ్రాజ్యవాద శక్తులకు పట్టిన గతి బ్రిటిషు వారికి పట్టగూడదని కాంగ్రెస్సు అభిమతం. అందుకే గౌరవంగా మీరు భారత దేశానికి స్వాతంత్ర్యమివ్వమని కాంగ్రెస్సు కోరింది. కాంగ్రెసు స్నేహంగానే వ్యవహరిస్తున్నది. బ్రిటిషు ప్రజల కొరకు విశ్వశాంతి కొరకు, మానవత్వం కొరకు సామ్రాజ్యవాదాన్ని అంతమొందించడం మంచిదని తెలుపుతున్నది. మాకు ఇతరమైన కాంక్షలు ఆకాంక్షలు ఏమీ లేవు.

తీర్మానంలోని ఈ భాగం మరీ చిత్రంగా ఆశ్చర్యజనకంగా వున్నది. "ప్రభుత్వం మీద ఇండియాను సంరక్షించే బాధ్యత వున్నది. ఇండియా యుద్ధం చేయగలగాలి. భారతదేశం లోని వివిధ జాతుల మధ్య నిర్భయత్వం వుండేటందుకు సమతూకాన్ని కలగజేయాలి" ఇది సత్యాన్ని పరిహసించటం మాత్రమేనని నిస్సంశయంగా చెప్పగలను. సింగపూరు, మలేషియా, బర్మాలను చూసిన తరువాత బ్రిటిషువారి హాస్యాస్పదం. సమతూకం లేకపోవడానికి బ్రిటిషువారే కారణం గదా!!

ఇంకొక విషయం. ప్రకటించబడిన కారణం భారత ప్రభుత్వం. మేము ఇద్దరి విషయంలోనూ సమానము. సరియైన మాటల్లో చెప్పవలెనంటే చైనా రష్యాల స్వాతంత్ర్య రక్షణే అది. ప్రభుత్వం స్వాతంత్ర్యం విజయానికి అవసరం కాదని భావిస్తున్నది. నేను అందుకు విరుద్ధంగా ఆలోచిస్తున్నాను. నెహ్రూను కొలబద్దగా తీసుకొంటున్నాను. చైనా రష్యాలను గురించి జవహర్ లాల్ నెహ్రూకు నాకంటె ఎక్కువగా తెలుసును. మీరంటె గూడా నెహ్రూకు తెలుసును. తనకున్న సామ్రాజ్యవాద వ్యతిరేకతను గూడా మరచిపోతున్నాడు. నాజీజం ఫాసిజం విజయం పొందడం అతనికి సుతరామూ ఇష్టముండదు. నేను చాలాకాలం ఆయనతో చర్చించాను. ఇండియాకు స్వాతంత్ర్యం లేకపోతే ఆ రెండు దేశాల స్వాతంత్ర్యం గూడా ప్రయోజన రహితమని ఆయన అభిప్రాయం. మిత్రపక్షాల మిత్రుణ్ణి మీరు బంధించారు.

కాంగ్రెసును అణచివేయడమే మీ జవాబు అయితే మిత్రపక్షాల విజయం కంటే మీకు భారతదేశాన్ని బానిస దేశంగా ఉంచడమే యిష్టమని నేను భావించవలసి వస్తుంది. మీరు కాంగ్రెసు కోరికను మన్నించకుండా దమనకాండకు పాల్పడ్డారు.

ప్రస్తుతం జరుగుతున్న ఊచకోత ఇదివరకెప్పుడూ జరగలేదు. ఈ ఊచకోత కార్యక్రమం, సత్యాన్ని హత్యచేయడం. అసత్య ప్రచారం కాంగ్రెసునే బలపరుస్తున్నవి.

ఇంత పెద్ద వుత్తరం వ్రాస్తున్నందుకు చింతిస్తున్నాను. మీ చర్యలను సమర్థించక పోయినా మీకు స్నేహితుడనే. ఇప్పటికైనా ఆలోచించమని కోరుతున్నాను. బ్రిటన్ మేలు కోరే వారి మాటల్ని ఉపేక్షించడం మానండి భగవంతుడు మీకు మార్గాన్ని చూపించు గావుత.

మీ

ఎమ్. కె. గాంధి

*(1942లో ఉద్యమం ప్రారంభంగానున్నప్పుడు గాంధీగారు వైస్‌రాయ్‌కి ఉత్తరాలు వ్రాశారు. ప్రభుత్వం దేశంలోనూ విదేశాలలోనూ తప్పునంతా కాంగ్రెసు మీదకు రుద్దవలెనని దుష్ప్రచారం చేసింది. కాంగ్రెసు ప్రభుత్వం దమనకాండ దానికి కారణమని చెప్పింది. డూ ఆర్ డై అది కాంగ్రెసు కార్యక్రమం. ప్రభుత్వం ఏవిధంగానైనా ఉద్యమాన్ని ఆపివేయాలని ప్రయత్నించింది. ఆ స్థితిలో గాంధీగారు ఈ ఉత్తరం వైస్‌రాయ్‌కి వ్రాశారు. దీనిలో ప్రభుత్వ చర్యలను నిశితంగా విమర్శించడం జరిగింది. హింసాత్మక చర్యలు జరిగినా ఒక పథకం ప్రకారం ఆ చర్యలు జరగలేదు.)*

★ ★ ★

## 86. లార్డ్ లిన్‌లిత్‌గో గారికి

డిటెన్షన్ క్యాంపు
కొత్త సంవత్సరం 1942

ప్రియమైన లిన్‌లిత్‌గో గారికి,

ఇది వ్యక్తిగతమైన ఉత్తరం. బైబిల్ చెప్పిన దానికి విరుద్ధంగా మీకు వ్యతిరేకంగా చాలామందిని మీతో పోరాటానికి తయారుచేశాను. మిమ్మల్ని గురించి నా హృదయంలో బాధిస్తున్న దానిని బయటకు చెప్పి నన్ను నేను తేలికపరచుకొంటాను. మనం స్నేహితులమనీ పరస్పర ప్రేమభావంతో ఉన్నామనీ అనుకొన్నాను. ఆగస్టు 9వ తేదీ నుండి జరుగుతున్న దానిని చూస్తుంటే మీరు నన్ను స్నేహితునిగా భావించడం లేదని అర్థమవుతున్నది. వైస్‌రాయ్ పదవిలో వున్న ఎవరితోనూ మీతో మెలగినంత సన్నిహితంగా నేను మెలగలేదు.

నా అరెస్టూ, తరువాత మీరు వెలవరించిన ప్రకటన, కారణాలు చెపుతూ రాజాజీకి మీరు వ్రాసిన జవాబూ, అమెరీగారు నామీద చేసిన దాడి, ఇంకా తదితర విషయాలూ మీరు నా నిజాయితీనే శంకిస్తున్నట్లనిపిస్తున్నది. మిగిలిన కాంగ్రెసు వారిని పేరుకు ఉదహరిస్తున్నారు. కాంగ్రెసు మీద ఏవేవో ఆరోపణలు చేస్తున్నారు. చేశారు. నిజంగా నన్ను మీ స్నేహితుడుగా భావిస్తే తీవ్రచర్యలు తీసుకొనక పూర్వం నన్ను పిలిచింది మీ మనస్సులోని సందేహాలను వెల్లడించి వివరాలను సేకరించేవారు ఈ విషయంలో నేను విఫలుడనైనాను. ప్రభుత్వ రంగంలో నన్ను గురించి చేసిన

వ్యాఖ్యలు, ప్రకటనలు సత్యదూరాలు. మా దృష్టిలో నేనెంతగా పడిపోయానంటే మరణోన్ముఖుడైన స్నేహితుడిని గూడా నేను చూడలేకపోయాను. ప్రొఫెసరు భన్సాలీగారు చిమ్మూరు విషయంలో ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్నారు. వారే నా ఆ స్నేహితులు.

కొంతమంది చేసిన హింసాత్మక చర్యలను నేను నిందిస్తానని తలచారు. ఆ చర్యలు కాంగ్రెసు వారికి అంటగట్టబడినవి. మీరు వార్తల్ని విపరీతంగా సెన్సారు చేసి పత్రికల్లో ప్రకటించనిస్తున్నారు. నా దగ్గర వివరాలు లేవు. ఏది నిజమో ఏది కాదో తెలియదు. నేను ఆ నివేదికలను, వార్తలను ఏవిధంగానూ నమ్మడం లేదు. నేను చాలా వ్రాయగలను. ఉత్తరం పెద్దదవుతుంది. నేను నా ప్రతిజ్ఞను ఉల్లంఘించదలచు కోలేదు. నేను చెప్పినది చాలుననుకుంటాను.

నేను దక్షిణాఫ్రికా నుండి 1914 చివరిలో భారతదేశానికి వచ్చాను. 1916లో సత్యాహింసలకు కట్టుబడి వుంటానని ప్రతిజ్ఞ చేశాను. హింసనూ, అసత్యాన్నీ జీవితంలోని అన్ని రంగాలనుండి పోగొట్టదలచాను. సత్యాగ్రహం ఓటమి నెరగదు. సందేశాన్ని వ్యాప్తం చేయడానికి జైళ్లు ఉపయోగపడతవి. కాని వాటికి కొన్ని హద్దులున్నవి. నన్ను ఒక పెద్ద భవనంలో పెట్టారు. అమాయకులైన ప్రజలను బాధపెట్టామని అధికారులు ఏనాటికైనా తెలుసుకొనకమానరని భావించాను. నాకు నేను ఆరు నెలలు నిర్ణయించు కొన్నాను. అవధి పూర్తి కావస్తున్నది. నా సహనం గూడా తగ్గిపోతున్నది. అటువంటి సమయాలలో సత్యాగ్రహం ఒక పరిష్కార మార్గాన్ని సూచిస్తున్నది. ఒక్క వాక్యంలో ఉపవాసం చేసి నీ శరీరాన్ని త్రాసు మీదకు చేర్చు అనే చెప్పవచ్చును. చివరి సాధనంగా దానిని ఉపయోగించాలి. దానిని ఉపయోగించదలచలేదు. వీలైనంతవరకు దానిని దూరంగా వుంచవలెనని ప్రయత్నిస్తున్నాను.

నా తప్పు ఏమిటో చెప్పండి. సరిదిద్దుకొంటాను. నన్నుపిలిచి మాట్లాడవచ్చును. ఎవరినైనా నా దగ్గరకు పంపవచ్చును. అతనికి మీ అభిప్రాయం తెలిసి వుంటే అతడు నాకు స్పష్టంగా తెలియజేస్తాడు. కోరిక వుంటే మార్గాలు చాలా వున్నవి. మీరు జవాబు పంపుతారా? కొత్త సంవత్సరం శాంతిని స్థాపిస్తుందా!!

మీ స్నేహితుడు
ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 86ఏ. లార్డ్ లిన్‌లిత్‌గో నుండి

వైస్‌రాయ్ హౌస్
13-1-1943

ప్రియమైన గాంధీగారూ,

మీరు వ్యక్తిగతంగా వ్రాసిన ఉత్తరాలకు ధన్యవాదాలు. ఇపుడే మీ ఉత్తరం అందింది. మీ ఉత్తరంలోని వ్యక్తిగతతత్వాన్ని గుర్తించాను. మీరు స్పష్టంగా నిర్మొహమాటంగా వ్రాసినందుకు సంతోషపడుతున్నాను. నా జవాబు గూడా స్పష్టంగా వ్యక్తిగతంగా వుంటుంది.

మన సంబంధాలు ఎంత మంచివో అంత నిర్మొహమాటంగా మీరు ఉత్తరం వ్రాశారు. నేను సంతోషించాను. గడచిన నెలలో నేను చాలా నిరాశపడ్డాను. ఆగస్టులో కాంగ్రెసు చేసిన తీర్మానమూ, దానివలన ఆశిస్తున్నట్లుగానే దేశమందంతటా జరిగిన హింస, నేరాలూ నన్ను బాధపెట్టినవి. (బయటి ఆక్రమణల సంగతి నేను వ్రాయడం లేదు) మీ నుండిగానీ, మా కార్యవర్గం నుండిగానీ ఆ చర్యలను గర్హిస్తూ ఒక్క వాక్యం వెలువడలేదు. మీరు పూనాలో వున్నపుడు మీకు పత్రికలు అందడం లేదనుకొన్నాను. అందలేదు. అదే మీ మౌనానికి కారణమనుకొన్నాను. మీకూ, వర్కింగు కమిటీ సభ్యులకూ పత్రికలు అందే ఏర్పాటు చేశాను ఆ పత్రికల్లో ప్రచురింపబడిన వార్తలు మిమ్మల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయని అనుకొన్నాను. మీరు ఆ చర్యలను ఖండిస్తారనుకొన్నాను. అందుకు ఎదురుచూచాను. అది జరగలేదు. నాకు చాలా అసంతృప్తి కలిగింది. జరిగిన హత్యలూ, పోలీసుల సజీవ దహనాలూ, రైళ్ల విధ్వంసం, ఆస్తి నష్టమూ, విద్యార్థుల ఆగడాలూ, భారతదేశానికున్న మంచిపేరును చెడగొట్టినవి. కాంగ్రెసు పార్టీ పేరు కూడా చెడింది. వార్తా పత్రికలో పడిన వార్తలు నిజమైన వార్తలే. అంతా చెడుగా జరిగింది. కాంగ్రెస్సులో మీకున్న ప్రతిష్ఠను నేనెరుగుదును. మీకున్న స్థానాన్ని గూడా నేనెరుగుదును. అంత బాధ్యతనూ మీ మీదకు నేను నెట్టను ప్రారంభంలో జరిగిన దాని బాధ్యత నాయకులకు వుంటుంది. దాని పరిణామాలను మిగిలిన వారు భరించాలి.

మీ వుత్తరం చదివిన తరువాత జరిగిన దానిని బట్టి మీరు మీ కార్యక్రమాన్ని మార్చుకొంటే ముందు సంగతి ఆలోచించవచ్చుననిపించింది. మీరు తెలియజేయండి. మీ అభిప్రాయాన్ని నేను సరిగా అర్థం చేసుకొనకపోతే మీరు మీ లక్ష్యాన్ని స్పష్టం చేయండి. నన్ను ఏమి చేయమంటారో సూచించండి. మీనుండివచ్చిన ప్రతి సలహానూ, సూచననూ, సందేశాన్నీ శ్రద్ధగా పరిశీలిస్తాను. దానికి పూర్తి విలువనిస్తాను. మీ భావాలను అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తాను.

మీ
లిన్‌లిత్‌గో

★ ★ ★

## 87. లార్డ్ లిన్‌లిత్ గో గారికి

డిటెన్షన్ క్యాంపు
19-1-1943

ప్రియమైన లార్డ్ లిన్‌లిత్‌గో,

13న మీరు దయతో వ్రాసిన ఉత్తరం నిన్న సాయంత్రం 2.30 ని.లకు అందింది. మీ నుండి ఉత్తరం రాలేదని కొంత కలవరపడ్డాను. అందుకు క్షమించండి. నా సహనశక్తి లోపం వలన అది జరిగింది.

మీ వుత్తరాన్ని బట్టి నామీద మీ అభిమానం తగ్గలేదని తెలుసుకొని ఆనంద భరితుడనైనాను.

నా 31వ తేదీ ఉత్తరం మీ యెడల నాకు కలిగిన గుర్రును వెలిబుచ్చుతున్నది. మీరు మీ గుర్రును వెలిబుచ్చారు. అంటే మీ అభిప్రాయంలో నన్ను అరెస్టుచేయడం న్యాయమే. నేను అపరాధిని.

నా ఉత్తరానికి మీరు తీసిన అర్థం సరిగాదు. మీ వ్యాఖ్య ననుసరించి నా వుత్తరాన్ని నేను మళ్లీ చదివాను. మీరు తీసిన అర్థం దానిలో లేదు. మన ఉత్తర ప్రత్యుత్తరాల వలన ఫలితమేమీ లేకపోతే నిరాశగా వుండక ఉపవసిద్దామనుకొన్నాను. ఇపుడూ అదే అభిప్రాయంలో ఉన్నాను.

నన్ను సలహా చెప్పమని మీరు వ్రాశారు. సూచన పంపమన్నారు. కార్యవర్గ సభ్యులతో సంప్రదించి గాని మీకు సలహా-సూచన-పంపలేను.

నా వొక్కరి చర్య వలన పొరపాటు ఏర్పడితే తప్పు జరిగితే అయినా నేను తప్పు చేసినట్లు నాకు కనబడడం లేదు. సెప్టెంబరు 23న భారత ప్రభుత్వ కార్యదర్శికి వుత్తరం వ్రాశాను. దానిలో వ్రాసిన దానికి నేను కట్టుబడి వున్నాను. 14 ఆగస్టున మీకు వ్రాశాను.

9 ఆగస్ట్ తరువాత జరిగిన ఘటనలకు విచారం ప్రకటిస్తున్నాను. అయితే తప్పు ప్రభుత్వం మీద పెట్టవద్దా? నా అధీనంలో లేని, నేను నియంత్రించలేని విషయాలను గురించి నా భావాలను నేను వ్యక్తీకరించగూడదు. అది ఒకవైపు విషయమవుతుంది. మీ విభాగాలవారు మీ ముందుంచిన నివేదికల వాస్తవికతను మీరు అంగీకరించక తప్పదు. అదే పని చేయమని మీరు నన్నడగరు. ఆ నివేదికలు విశ్వసించదగినవి కావని ఇదివరలో మనకు అనుభవమయింది. అందువల్లనే నా వుత్తరంలో వార్తల వాస్తవికత విషయం వ్రాశాను. వాటిమీద మీరు అభిప్రాయం ఏర్పర్చుకొన్నారు. నేను ఎందుకు ప్రకటన చేయలేదో మీరు అర్థం చేసుకొని వుంటారనుకొంటాను.

అయితే నేను అహింసావాదిని అని మాత్రం ఢంకా బజాయించి చెప్పగలను. కాంగ్రెసువారు హింసకు పాల్పడితే నేను అనేకసార్లు వారిని ఖండలించాను. వారిని బహిరంగంగా నిందించాను. అనేకసార్లు ప్రాయశ్చిత్తం చేసుకొన్నాను. ఉదాహరణలు ఇక్కడ వ్రాయనక్కరలేదు. అటువంటి స్థితి వచ్చినపుడు నేను స్వతంత్రుడిని.

ఈసారి వాపసు చేసుకొనడం ప్రభుత్వపు పని. మిమ్మల్ని వ్యతిరేకిస్తూ వ్రాసినందుకు క్షమించండి. ఆగస్టు 8వ తేదీన నేను కోరినట్లుగా నాకు మీతో కలిసే అవకాశం కల్పించి వుంటే ఏమీ మించిపోయేదిగాదు. అది మీరు చేయలేదు.

ఇదివరలో ప్రభుత్వం చేసిన పొరపాట్లను అంగీకరించండి. పంజాబులో డయ్యర్ విషయంలో అదే జరిగింది. యు.పి లో మసీదు నిర్మించబడింది. బెంగాలు విభజన వాపసు తీసుకొనబడింది. అవన్నీ పెద్ద హింస జరిగిన తరువాత జరిగిన పనులు.

సారాంశంగా -

1. నేను వ్యక్తిగతంగా వ్యవహరించవలెనంటే నేను తప్పు చేశానని నాకు నచ్చజెప్పండి. దిద్దుకొంటాను.
2. కాంగ్రెసు పక్షాన నిర్ణయం పంపకుండా, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులతో చర్చించే అవకాశం కల్పించండి.

మీరు నిర్ణయానికి రండి.

మీ వుత్తరానికి పూర్తిగా జవాబు నేను వ్రాయకపోతే లోట్లను తెలియజేయండి. మీకు సంతృప్తికరంగా జవాబు వ్రాయడానికి ప్రయత్నిస్తాను.

నాకు అభ్యంతరాలేవీ లేవు.

బొంబాయి ప్రభుత్వం ద్వారా నా వుత్తరాలు మీకు పంపుతున్నాను. అందువలన కొంత ఆలస్యం గావచ్చును. సమయం ఈ విషయంలో చాలా ముఖ్యం. సూపరింటెండెంట్ తిన్నగా నా వుత్తరాలను మీకు పంపించే ఏర్పాటు చేయండి.

మీ

ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 87ఏ. లార్డ్ లిన్‌లిత్‌గో నుండి

వైస్‌రాయ్ హౌస్, న్యూఢిల్లీ

25-1-1943

ప్రియమైన గాంధిగారు,

19న వ్రాసిన మీ వ్యక్తిగత వుత్తరం అందింది. మీ వుత్తరాన్ని జాగ్రత్తగా ధ్యానముంచి చదివాను. అయినా అంధకారంలోనే వున్నది. నేను నా వెనకటి వుత్తరంలో జరిగిన ఘటనలను బట్టీ వాతావరణాన్ని బట్టీ కాంగ్రెసు మీద బాధ్యత వేయక తప్పదని వ్రాశాను. ఆగస్టు తీర్మానానికి మీరు ముఖ్యులు గనుక మీకు భారతదేశం గౌరవం పాడయిందని వ్రాశాను. అహింసను గురించి మీరు చెప్పినదానిని నేను గుర్తించాను. హింసను మీరు నిందించారు. నాకు సంతోషం కలిగింది. వెనక ఆ

సిద్ధాంతానికి మీరిచ్చిన ప్రాధాన్యతను నేనెరుదుగను కాని జరిగిన, జరుగుతున్న ఘటనల విషయంలో మీ అనుచరులు మీ సిద్ధాంతాన్ని తు.చ తప్పకుండా పాటిస్తున్నారని పించడం లేదు. ఏమైనా దీనివలన నష్టపడినవారికీ, ప్రాణాలు పోగొట్టుకొన్నవారికీ ఈ సిద్ధాంతాలతో పని ఏమిటి? తప్పంతా మీరు ప్రభుత్వం మీద వేస్తున్నారు. అది నేనంగీకరించలేను. జరిగిన ఘటనల్ని దృష్టిలో పెట్టుకొని మేము వ్యవహరిస్తున్నాము. వాటిని దృష్టిలో పెట్టుకొనక తప్పదు. ఏమైనా అందుకు మీ సూచన ఏమిటని అడిగాను. ప్రభుత్వానికి గాక మీకూ కాంగ్రెసుకు సంబంధించి విషయమంతా ఆధారపడి వున్నది.

మీరు ఈ ఉద్యమానికి దూరంగా ఉండి, 9 ఆగస్ట్ తీర్మానాన్ని వాపసు తీసుకొని భవిష్యత్తును గురించి నాకు హామీ యిస్తే ఈ విషయాన్ని గురించి ముందు ఆలోచన చేయగలను. ఇది స్పష్టమైన విషయం. నా అభిప్రాయం విస్పష్టంగా మీకు తెలియ చేస్తున్నాను.

మీ వుత్తరాలను స్వయంగా పంపమని బొంబాయి గవర్నరుకు తెలియచేస్తున్నాను. ఉత్తరాలు రావడంలో ఆలస్యం జరగదు.

మీ

లిన్‌లిత్‌గో

★ ★ ★

## 88. లార్డ్ లిన్‌విత్‌గో గారికి

డిటెన్షన్ క్యాంపు

29-1-1943

ప్రియమైన లార్డ్ లిన్‌విత్ గో,

నా ఉత్తరానికి వెంటనే జవాబు పంపినందుకు ధన్యవాదాలు.

మీ వుత్తరం స్పష్టంగా వున్నది. మీతో ఏకీభవించవలెనని కోరుతున్నాను. మీ భావాలు దృఢమైనవి. మీ అభిప్రాయాన్ని చెప్పి నాకు నచ్చేటట్లు చేయ్యమని అందుకు ప్రయత్నించమని మళ్లీ కోరుతున్నాను. ఆగస్టు తీర్మానం హింసకు కారణమని

మీరంటున్నారు. నిజానికి అది కాంగ్రెసు వారినందరినీ అరెస్ట్ చేసిన తరువాత జరిగింది. ప్రభుత్వం బాధ్యతారహితంగా చేసిన అరెస్ట్‌లు హింసాకాండ జరగడానికి కారణాలు గావా? ఆగస్టు తీర్మానం ఏవిధంగా చెడ్డదో, మీరు తెలియజేయలేదు. ఆ తీర్మానం వలన కాంగ్రెసు తన అహింసా విధానాన్ని మార్చుకోలేదు. అది ఫాసిజానికి వ్యతిరేకం. అది యుద్ధానికి సహాయం చేయవలెనని కోరుతున్నది. దానిని సమర్ధవంతంగా చేయడానికి అవకాశాన్ని కోరింది.

ప్రభుత్వం నిరాకరించింది. ఉపేక్షించింది. కాంగ్రెసు ఏమి చేసింది? అది తనకేమీ కోరలేదు. అది ప్రజలందరి మేలు కోరింది. క్వాయిదే ఆజమ్ జిన్నాను పిలిచి ఆయనకు ప్రభుత్వాన్ని అప్పగిస్తే కాంగ్రెసు పూర్తిగా సహకరిస్తుంది. యుద్ధ సమయంలో కావలసిన ఏర్పాట్లను గురించి ముందే చర్చించి నిర్ణయించుకొనవచ్చును. ఆ ప్రభుత్వం ఎన్నుకోబడిన శాసన సభలకు బాధ్యత వహిస్తుంది. వర్కింగు కమిటీ సభ్యులకు దూరంగా వుండడం వలన వారి అభిప్రాయం నాకు తెలియదు. సరోజినీదేవి గారు నాకు సన్నిహితంగా వున్నారు. ఆ కమిటీ తన భావాలను మార్చుకొన్నదనుకోను.

శాసనోల్లంఘనమనే వాక్యానికి వ్యతిరేకత వుండవచ్చును. కాని అది అంత వ్యతిరేకతమైనది కాదు. గాంధి ఇర్విన్ సంధిలో శాసనోల్లంఘన సిద్ధాంతాన్ని అంగీకరించడం జరిగింది. అది గూడా నేను మీతో కలసిన తరువాత గాని చర్చకు రాదు. నేను మీనుండి సమయం కోరాను.

ఋజువు కాని, నా అభిప్రాయంలో ఋజువు లేని నాకు వ్యతిరేకంగా కాంగ్రెసుకు వ్యతిరేకంగా బాధ్యత గలిగిన మినిష్టరు నాపై చేసిన దోషారోపణలున్నవి. ఆ మినిష్టరు ఇండియాకు ప్రభుత్వంలో స్టేట్ సెక్రటరీ.

ప్రభుత్వం తాను చేసిన ఆరోపణలను తాను ఋజువుచేయాలి. వట్టి పైపై కల్లబొల్లి మాటల వలన ప్రయోజనం లేదు.

కాంగ్రెసు వారు చేసిన హత్యలను గురించి వివరాలను నా ముఖం మీద మీరు కొట్టవచ్చును. మీరు ఆ పని చేశారు. నా జవాబు ఏమిటంటే ప్రభుత్వం ప్రజలను పిచ్చి వాళ్లు అయేటట్లు వ్యవహరించింది. జరిగిన అరెస్టులు కారణంగా ప్రజలు ఆ పని చేశారు. దెబ్బకు దెబ్బ అనే పిచ్చి భావంతో జరిగిన హింసాకాండ అది. మీరు అవలంబించిన విధానమేమిటి? సర్వశక్తివంతమైన ప్రభుత్వం గదా మీది?

ఇటువంటి చర్యలను ఎన్నుకొనబడిన శాసనసభకు బాధ్యత వహించే ప్రభుత్వం ఆపివేయగలదు.

నా బాధకు ఉపశమనం కలిగించండి. లేనియెడల సత్యాగ్రహులకు ఏర్పడిన చట్టాన్ని - సాధనాన్ని నేను ఉపయోగించవలసి వస్తుంది. ఫిబ్రవరి 9వ తేదీ ఉదయం 21 రోజుల ఉపవాసాన్ని ప్రారంభిస్తాను. అది మార్చి 2వ తేదీ వరకు జరుగుతుంది. నా ఉపవాసాలలో ఉప్పు కలిపిన నీళ్లు నేను తీసుకొంటుంటాను. ప్రస్తుతం నా శరీరానికి నీళ్లు పడడం లేదు. అందువలన నీరు తాగడానికి అనుకూలంగా వుండడం కొరకు సైట్రన్ పండ్లరసం నీటితో కలిపి తాగుతాను. ఆమరణ నిరాహార దీక్ష బూనడం నా ఉద్దేశ్యం కాదు. ప్రభుత్వం అవసరమైన ఉపశమనం కల్పిస్తే ఉపవాసం విరమిస్తాను.

ఇది వ్యక్తిగతమైన ఉత్తరం కాదు

మీ మిత్రుడు
ఎమ్. కె. గాంధి

★ ★ ★

## 88ఏ. లార్డ్ లిన్‌లిత్‌గో నుండి

వైస్‌రాయ్ భవనం, న్యూఢిల్లీ
5-2-1943

మీ ఉత్తరం అందింది. ధన్యవాదాలు. జాగ్రత్తగా మీ ఉత్తరం చదివాను. దేశంలో జరిగిన అల్లర్ల గురించి మీ యెడలా, కార్యవర్గ సభ్యుల యెడలా నా భావాలు మారలేదు. ఇదివరలో నేను మీకు తెలియచేసిన భావాలను నేను మార్చుకొనడం లేదు.

కిందటి ఉత్తరంలో - నాకు తెలిసిన దానిని బట్టి కాంగ్రెసు, తీర్మానానికి బాధ్యులైన మీరు హింసకూ, తరువాత జరిగిన అల్లర్లకూ కారణమని నా అభిప్రాయం. మీ అభిప్రాయం సరైనదని నాకు నచ్చజెప్పమని మీరు వ్రాశారు. అందుకు అంగీకరించేవాడినే. మీ వుత్తరాలలో మీ సూచన ఏమీ లేదు. మీరు మనస్సు విప్పి వ్రాశారనుకొన్నాను. మీ ఉత్తరాలలో ప్రభుత్వ నివేదికల మీద మీ అపనమ్మకాన్ని

స్పష్టంగా వెలిబుచ్చారు. మీ చివరి వుత్తరంలో ఆ దోషాన్నంతా ప్రభుత్వం మీద తోసివేయడానికి వెనకాడలేదు. నేను ఆధారపడిన నివేదికల మీద మీకు విశ్వాసం లేదు. ఇక మిమ్మల్ని సమాధానపరచడమెలా? కనుక తేలిందేమంటే మిమ్మల్ని సమాధానపరచడానికి మార్గం లేదు. నిజానికి ప్రభుత్వం కారణాలను రహస్యంగా వుంచవలెను. కాంగ్రెసు ఆగస్టు తీర్మానానికి కారకులైన బాధ్యులైన మీరు అంతకూ కారణమని మా అభిప్రాయం. కాంగ్రెసు మిమ్మల్ని ఉద్యమానికి నాయకులుగా నియమించింది. కాంగ్రెసు తీర్మానం ద్వారా ఉద్యమాన్ని ప్రారంభించింది. నాయకులు ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు వ్యవహరించమని పిలుపు నిచ్చింది. అలాంటి సూచన లిచ్చిన పార్టీ బాధ్యత నుండి తప్పుకోలేదు. ఆ తరువాత జరిగిన చర్యలకు గూడా దానిదే బాధ్యత. మీరూ మీ సహచరులూ ఈ నీతి హింసకు దారితీస్తుందని ఎరిగినట్లుగా మా దగ్గర సాక్ష్యాధారాలున్నవి. ఈ హింస అల్లర్లు ఒక పథకం ప్రకారం సృష్టించబడినవి. మీరు దానిని ఉపేక్షిస్తున్నారు. కాంగ్రెసు నాయకులను అరెస్ట్ చేయక పూర్వమే ఈ పథకం ప్రచారంలోకి వచ్చింది. దీనినంతా హోమ్ మినిష్టరు సెంట్రల్ శాసనసభలో వివరంగా తెలియజేశాడు. మీకు వివరాలు కావలెనంటే నేను పంపించగలను. నేను పూర్తి వివరాలు, పత్రికల కట్టింగులూ పంపుతున్నాను. ఉన్న సాక్ష్యాధారాలన్నీ మా అభిప్రాయాన్ని బలపరుస్తున్నవి. రహస్య సూచనల ద్వారా హింసాత్మక కార్యక్రమం నడిపించిందని మా దగ్గర పూర్తి ఆధారాలున్నవి. ఎ.ఐ.సి.సి పేరుతో కరపత్రాలు, సూచనలు వెలువరించబడినవి. పేరు పొందిన కాంగ్రెసు నేతలు ఈ చర్యల్లో పాల్గొన్నారు. (అండర్ గ్రౌండ్‌లో) కాంగ్రెసు రహస్యంగా పనిచేసింది. కాంగ్రెసులో కార్యవర్గ సభ్యుని భార్య అందు ప్రధాన భూమిక వహించింది. బాంబు కార్యక్రమాలలో పాల్గొని, సంఘటితపరచి దేశాన్ని నవ్వులపాలు చేసింది. అవన్నీ మేమింకా బయటపెట్టలేదు. మా దగ్గర అన్ని ఆధారాలూ వున్నవి. సమయం వచ్చినపుడు ఆ పనిచేస్తాము. ఇంకా సమయం రాలేదు. కాంగ్రెసు మీద జరుగుతున్న ఆరోపణలను ఎదుర్కొనక తప్పదు. మీరూ మీ సహచరులూ ఆ ఆరోపణలకు జవాబు చెప్పవలసి వుంటుంది. మీరు సూచిస్తున్నట్లుగా ఈ లోపలే మిమ్మల్ని మీరు తప్పించు కొనడానికి ప్రయత్నించినా తీర్పు మీకు అనుకూలంగా ఉండకపోవచ్చును.

గాంధి ఇర్విన్ సంధిలో శాసనోల్లంఘన ప్రసక్తి వున్నదని వ్రాశారు. చాలా ఆశ్చర్యం కలిగింది. నేను మళ్లీ దస్తావేజును చూశాను. దానిలో వున్న దేమిటంటే - శాసనోల్లంఘనోద్యమం విరమింపబడుతుంది. గవర్నమెంటు పరస్పర ఉపయుక్త చర్య తీసుకొంటుంది. అంటే అటువంటిది ఒకటుంటుందని స్వీకరించడమే. దానిని గుర్తించడమనేది అందులో లేదు. దానిని మా ప్రభుత్వం గుర్తించదు.

మీ దృష్టిని అంగీకరిస్తే దేశం యొక్క అధీకృతమైన ప్రభుత్వాన్ని అంగీకరించాలి. ఆ ప్రభుత్వం మీద శాంతి సంరక్షణ, మంచి పరిపాలనా వ్యవస్థ ఆధారపడివుంటుంది. మీరు చెపుతున్నది ఎదురు తిరగడమవుతుంది. విద్రోహమవుతుంది. మీ మీదా, కాంగ్రెసు మీదా చర్య తీసుకొనే అధికారం మాకున్నది. కాని ముందుగానే అట్టి చర్య తీసుకొన్నామని మీ రంటున్నారు. మీకు తప్పు చర్య తీసుకోకుండా కావలసినంత అవకాశమిచ్చాము. జూన్ జులై నెలలో ఈ ప్రకటనా, 14 జులై తేదీన జరిగిన కాంగ్రెసు కార్యవర్గ తీర్మానమూ, ఆరోజునే సంప్రదింపులకు అవకాశం దానిని ప్రోత్సహించడమే. తరువాత డూ ఆర్ డై తీర్మానం వచ్చింది. అంతవరకూ ప్రభుత్వం సహనం వహించింది. అది తప్పయింది. మీ డూ ఆర్ డై నినాదంతో ఇక సహించగూడదను కొన్నాము. ప్రభుత్వం తన బాధ్యతను నిర్వహించాలి. అందుకే చర్య తీసుకున్నాము.

ఈ ఉత్తరం ముగిస్తూ మీ వయస్సునూ, ఆరోగ్యాన్నీ దృష్టిలో పెట్టుకొని మీ నిర్ణయానికి చింతిస్తున్నాను. మీకు మంచి సలహా లభించగలదని ఆశిస్తున్నానని తెలియజేస్తున్నాను. మీరు నిర్ణయం తీసుకొంటే ఆ బాధ్యత మీదే అవుతుంది. తదుపరి జరిగే పరిణామాలకు గూడా మీరే బాధ్యులవుతారు. నేను వ్రాసిన దానిని బట్టి మీరే ఆలోచించి నిర్ణయం తీసుకోగలరని భావిస్తున్నాను. రాజకీయాల కొరకై ఉపవాసం చేయడం దురుద్దేశ్యపూరితము (బ్లాక్‌మైల్) అవుతుంది. అది గూడా హింసయే. దానికి నైతిక విలువ ఏమీ వుండదు. అది మీ అభిప్రాయమే.

మీ

లిన్‌లిత్‌గో

★ ★ ★

# 89. లార్డ్ లిన్‌లిత్‌గో గారికి

డిటెన్షన్ క్యాంపు
7-2-1943

ప్రియమైన లార్డ్ లిన్‌లిత్‌గో,

5 తేదీ గల మీరు పంపిన పెద్ద ఉత్తరానికి ధన్యవాదాలు. 29 జనవరినాడు నేను వ్రాసిన ఉత్తరానికి జవాబుగా ఈ ఉత్తరం వ్రాశారు. మీ చివరి విషయాన్ని ముందు తీసుకొంటాను. మీ ఉత్తరం సత్యాగ్రహికి ఒక ఆహ్వానంగా ఉపవాసం చేయడానికి ప్రేరేపిస్తున్నది. బాధ్యత అంతా నాదే. ఏమీ సందేహం లేదు. మీరు జారుకొన్న విధానాన్ని నేను ఊహించలేదు. చివరిలో మీరు ఇది తప్పించుకోడానికి మార్గమన్నారు. మీ నుండి ఇటువంటి వాక్యాలు నేనాసించలేదు. స్నేహితుడు వ్రాసిన వాక్యమిది. నాకు అర్థమే గావడం లేదు. ఇది రాజకీయంగా "బ్లాక్‌మైలు" చేయడమని గూడా వ్రాశారు. నా రచనల్ని నాకే వ్యతిరేకంగా ఉపయోగించారు. నేను వ్రాసిన దానికి నేను నిలబడతాను. దానిలో వ్యత్యాసాలేమీ లేవు. ఒకదానికొకటి సంబంధంలేనివేవీ లేవు. అసలు మీరు నా రచనలు చదివారా? లేదని అనిపిస్తున్నది.

నేను నా తప్పు ఏమిటో చెప్పండని మీకు వ్రాసిన మాట నిజమే. అది విశాలభావంతో వ్రాసిందే. మీ నివేదికలను నమ్మకపోడానికీ నేను సంకుచిత దృష్టితో వ్యవహరించడానికీ సంబంధమేమీ లేదు.

హింసాత్మకంగా పథకం ప్రకారం మేము వ్యవహరించామని వ్రాశారు. ఇది హింసకు దారి తీస్తుందని గూడా ముందరే ఊహించారు. కాంగ్రెసు నాయకులను నిర్బంధించడానికి ఈ పథకం రూపొందించబడిందంటున్నారు. చాలా సాక్ష్యాధారాలు ప్రకటించబడనున్నవన్నారు. హోమ్ మినిష్టరు గారి ఉపన్యాసం కాపీ పంపించారు. ప్రాసిక్యూషన్ కౌన్సిల్ వారి మొదటి ఉపన్యాసమిది. అంతకంటే అందులో ఏమీ లేదు. ఆ ఉపన్యాసంలో ప్రమాణాలు లేని ఆరోపణలు కాంగ్రెసు వారిమీద ఉన్నవి. హింసాత్మకమైన దానిని తనదైన భాషలో చెప్పాడు. అది ఎందుకు జరిగిందీ ఎపుడు జరిగిందీ చెప్పలేదు. అది ఎందుకు జరిగిందో నేను చెపుతున్నాను. ఎదుటివారి వాదం

వినకుండానే తెలుసుకోకుండానే స్త్రీలనూ పురుషులనూ మీరు నిందించివేశారు. ఏ సాక్ష్యాధారాల ఆధారం మీద మీరు వారినందరినీ దోషులుగా పరిగణిస్తున్నారో అవి చూపించమని అడుగుతున్నాను. దానిలో తప్పు ఏమీ లేదు. మీరు ఉత్తరంలో వ్రాసిన దానిలో సారమేమీ లేదు. న్యాయశాస్త్రంలో ప్రమాణాలు చూపించడం అవసరం.

కార్యవర్గ సభ్యుని భార్య బాంబుల వ్యవహారంలో పాల్గొని వుంటే మీరు విచారణ జరిపి వుండవలసింది. ఆమె హింసాత్మక చర్యల్లో పాల్గొన్నదన్నారు. అందరినీ ఇష్టమొచ్చినట్లుగా మీరు అరెస్టు చేస్తే మీరు ఆరోపిస్తున్న పనులు ఆమె చేసిందేమో తెలియదు. ఆగస్టు 9వ తేదీ తరువాత జరిగిన హింసను గురించి నా అభిప్రాయం మీకు తెలుసును.

కాంగ్రెసు మీద నేరారోపణ చేసి సాక్ష్యాధారాలు చూపించడానికి ఇంకా సమయం రాలేదన్నారు. అవి నిరాధారాలయి వుండవచ్చునని మీరు ఆలోచించారా? నిష్పక్షపాతంగా ట్రిబ్యూనల్‌కు ముందు ఈ కేసులు పోతే విచారణ పూర్తి అయ్యే నాటికి కొంతమంది చనిపోతారు. మీరనుకొన్న సాక్ష్యాలు చెప్పేవారు అందుబాటులో లేకుండా పోవచ్చును.

గాంధీ ఇర్విన్ సంధిలో శాసనోల్లంఘన ప్రసక్తి వున్నదనీ నేను చెప్పినది సత్యమనీ తిరిగి వక్కాణిస్తున్నాను.

ఆ సంధి విషయమై ఆలోచించకపూర్వమే అపుడు ప్రధాన కాంగ్రెసు నాయకులందరూ విడుదలయినారు. కాంగ్రెసు వారికి కొన్ని రాయితీలు కల్పించబడినది. ప్రభుత్వం ఆ షరతులను నెరవేర్చిన తరువాతనే ఉద్యమం ఆపివేయబడింది. అదే నా దృష్టిలో సేవాకృతి. మీ ప్రభుత్వం గుర్తించలేదని మీరనడం నిజం కాదు. విచిత్రం మీరు పూర్వాపర సందర్భాలు అర్థం చేసుకోండి.

నేను చెప్పినదానికి భిన్నంగా నా ఉత్తరాలకు మీరేవేవో అర్థాలు కల్పిస్తున్నారు. నా దృష్టిని అంగీకరిస్తే హింసాత్మక చర్యలను ప్రోత్సహించినట్లేనని అంటున్నారు. అటువంటి పనులను న్యాయబద్ధంగా అంగీకరించమని కోరేవాళ్ళలో నన్ను జమకట్టారు.

నాపైన ఆరోపించబడిన ఆరోపణలకు పూర్తిగా జవాబిచ్చే ప్రయత్నం చేయడం లేదు. వెంటనే జవాబు అవసరమనుకొన్న వాటికి జవాబిస్తున్నాను. సంపూర్ణంగా

అంతరాత్మ ప్రబోధాన్ని గుర్తించి నేను 9 ఆగస్టు నాడు నా కార్యక్రమాన్ని ప్రారంభించాను. మీరు బ్లాక్ మెయిల్ చేస్తున్నానని నిందించినా న్యాయం కొరకు మీకు విజ్ఞప్తి చేశాను. అది మీరు నిరాకరించారు. నా నిర్దోషిత్వాన్ని ప్రమాణీకరించుటకు పూర్తి విశ్వాసంతో న్యాయాన్ని అర్థిస్తాను. భావి తరాలవారు మన మధ్య గల విభేదాలను పరిష్కరిస్తారు. మీరు బలమైన ప్రభుత్వానికి ప్రతినిధులు. నేను దేశసేవ చేస్తున్న సామాన్య వ్యక్తిని.

నా వెనకటి ఉత్తరం తొందరలో వ్రాశాను. ప్యారేలాల్ టైపు చేసిన కాపీ దీనితో పంపుతున్నాను.

మీ
విశ్వాసపాత్రుడైన స్నేహితుడు
ఎమ్ కె. గాంధి

★ ★ ★

## 90. అగతా హారిసన్ గారికి

దిల్‌కుష్
పంచగని
13, జులై 1944

ప్రియమైన అగతా,

14 జూన్ ఉత్తరం అందింది. అన్నింటినీ నేను మట్టిపాలు చేస్తాను. నేను విశ్వాసపాత్రుడుగా లేకపోతే అంతే జరుగుతుంది. దోషినని నిరూపిస్తే వెంటనే సరిదిద్దుకుంటాను. విశ్వాసం కోల్పోయే పని నేనేమీ చేయలేదు.

కార్యవర్గ సభ్యులను కలవవలెనని నేను చేసినది విఫలమయింది. వైస్రాయ్‌ను కలవడం కూడా అంతే అయింది. చర్చిల్ గారికి నా యెడల గల భావమే దానికి కారణం కావచ్చును. నా మీద చేసిన ఆరోపణ సరిగాదు. ఈ దిగంబర ఫకీరును అణచివేస్తానని చర్చిల్‌గారు అంటున్నారట. శరీరాన్ని అణచివేయవచ్చును. ఆత్మను ఎవరూ అణచలేరు. అది నిజమయితే (నిజంగాదని ప్రతివాదం జరగలేదు) నా విఫలతకు కారణాలు బోధపడగలవు.

ఇటువంటి పనులు, మాటలు నన్ను నిరాశపరచలేవు. నేను సత్యానికి ప్రాతినిధ్యం వహిస్తే భగవంతుడు చెప్పినదాన్ని చేస్తుంటే అన్ని సందేహాలు దోషారోపణలు దూరం కాగలవు. మీవంటి మిత్రులు ఉండగా నాకు ఏమి కొదవ?

అమెరికానుండి పోలక్ ఒక ఉత్తరం పంపించారు. అతణ్ణి కలిస్తే ఆ ఉత్తరం నన్ను బాగా బాధపెట్టిందని చెప్పండి. అతడు అసత్యాలను నమ్ముతాడని నేను అనుకోలేదు. నిజం అతడు తెలుసుకోలేదు. ఇది నీకు అందేలోపల రాజాజీతో కలిసి మతసామరస్యం కొరకు నేను చేసిన పనిని పత్రికల్లో చదవగలరు. రాజాజీ కొద్దిరోజులు నాతో ఉన్నారు.

మిత్రులందరికీ ప్రేమాభివందనాలు. మురియల్‌కు ఉత్తరం వ్రాశాను.

మీ

బాపూ

★ ★ ★

## 91. విన్‌స్టన్ చర్చిల్ గారికి

దిల్‌కుస్ పంచగని

17 జులై 1944

ప్రియమైన ప్రైమ్ మినిష్టర్,

మీరు దిగంబర ఫకీరును అణచివేస్తామన్నారని పత్రికలు ప్రచురించినవి. ఇది నన్ను గురించి మీ వర్ణన. ఫకీర్‌గావలెనని చాలా కాలంనుండి ప్రయత్నిస్తున్నాను. దిగంబరుడు గావడం ఇంకా కష్టం. ఇది నాకు ప్రశంసావాక్యం. మీరు ఆలోచించకుండా ఆ శబ్దం ఉపయోగించి ఉంటారు. అదేవిధంగా మీ దగ్గరకు వస్తాను. నన్ను విశ్వసించ మంటాను. మీ ప్రజలకొరకై నన్ను ఉపయోగించుకొనమంటాను. మీవారికి కూడా నేను ఉపయోగపడాలి. ప్రపంచంలోని జనులందరికీ నేను ఉపయోగపడాలి.

మీ

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 92. శ్రీమన్నారాయణకు

కలకత్తా వెళుతూ
రైల్లో
1-12-1945

భాయీ శ్రీమన్,

ఈ రోజు మీ వ్రాత ప్రతికి నా భూమిక పంపుతున్నాను. నిన్న రాత్రి 9.30 గంటలకు పని పూర్తి చేశాను. భోజనానికి, రాట్నానికి కొంచెం సమయం ఉపయోగించాను. మిగతా సమయమంతా ఈ పనే సరిపోయింది. నా భూమికలో ఏమైనా మార్పులు కావాలా? నాతో చర్చించవలెను.

మీ వ్రాత ప్రతిలో రెండు మార్పులు చేశాను. అది మీకు అంగీకారం కాకపోతే నాతో చర్చించండి.

తాలూకాలను, డిస్ట్రిక్టు పంచాయితీలను వదిలివేశాను. అవి సలహా సంఘాలు. వాటికి సంవిధానంలో ప్రత్యేక స్థానమెందుకు? వాటి అవసరం నాకు కనబడలేదు. గ్రామాలు శక్తివంతంగా ఉంటే సలహా సంఘాలు అవసరం లేదు. ప్రావిన్షియల్ పంచాయితీలు ఆపని చేయగలవు. అవసరమైతే వాటి సలహాలను తీసుకొనవచ్చును. నా ఆలోచనలో పొరపాటు ఉంటే నాకు తెలియజేయండి.

పాకిస్తానుకూ, స్వదేశసంస్థానాలకూ స్థానముంటుందా? ఆలోచించాలి. అహింస ద్వారా ఆ స్థితికి చేరితేనే గాంధియన్ కాన్సిస్ట్యూషన్ అవసరం.

బాపూ ఆశీర్వచనాలు

★ ★ ★

## 93. లార్డ్ పెథిక్ లారెన్స్ గారికి

వాల్మీకి మందిరం
న్యూ ఢిల్లీ
2 ఏప్రియల్ 1946

లార్డ్ లారెన్స్ గారూ,

మీ మధ్యా, సర్ స్టాఫర్డ్ మధ్యా నా మధ్యా జరిగిన సంభాషణల్లోని ముఖ్యాంశాలను వ్రాయమని మీరు చెప్పినట్లుగా సుధీర్ ఘోష్ తెలియజేశారు.

కాంగ్రెసు వారైనా ఇంకొకరైనా స్వాతంత్ర్య ప్రియులైన వారందరినీ నోరులేని జనాన్నుండి వేరు జేయకుండా హింస అహింసలతో సంబంధం లేకుండా రాజకీయ ఖైదీలను విడుదల చేయుట అవసరం. వారు ప్రభుత్వానికి ప్రమాదకారులు కారు. పరిస్థితి మారింది. జయప్రకాశనారాయణ, డాక్టర్ రామమనోహర లోహియావంటి బుద్ధిజీవులను విద్వాంసులను, సంస్కారవంతులను భూమిగత వ్యక్తులుగా భావించడం ఆవిధంగా వారితో వ్యవహరించడం ఉచితం గాదు. ఇదంతా రాబోవు జాతీయ ప్రభుత్వానికి వదలడం అనేదాన్ని ఎవ్వరూ అంగీకరించరు. స్వాతంత్ర్యానికున్న గౌరవమే దీనితో పోయింది.

ఇంకొకటి సామాన్య జనానికి సంబంధించినది. ఉప్పు పన్నును నేను ప్రస్తావించాను. అది ఆదాయాన్ని పెంచుతున్నదంటున్నారు. ఆ ఆదాయం లెఖ్ఖకు రానిది. ప్రజలను పీడించడానికి అది ఒక సాధనమై కూర్చున్నది. ఉప్పు పన్ను నెత్తిమీద ఉంటే సామాన్య ప్రజలు స్వాతంత్ర్యం వచ్చినదనేదాన్ని అర్థం చేసుకోలేరు. ఈ రెండూ అవసరం. ఆనాడే స్వాతంత్ర్య వాతావరణమున్నట్లు ప్రజలు భావిస్తారు. ఈ పనులు చేయడం వలన మనోవైజ్ఞానికమైన ప్రభావం జనం మీద పడుతుంది.

కేసీ గారితో వీటి విషయం మాట్లాడాను. బెంగాల్ గవర్నరుతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాను. ఈ రోజు ఉప్పు పన్ను రద్దుకు ప్రభుత్వం అంగీకరించదని మిష్టర్ అబెల్ గారు చెప్పారు.

మీ

ఎమ్. కె. గాంధీ

★ ★ ★

## 94. సర్దారు వల్లభబాయి పటేల్ గారికి

శ్రీరాంపూర్

25-12-1946

శ్రీ వల్లభభాయీ

నీవు ప్యారేలాల్‌కు వ్రాసిన ఉత్తరం నిన్ననే అందినది. ప్యారేలాల్ మొదలైన వారంతా తమతమ పనులలో నిమగ్నులై వున్నారు. ప్రాణాలు వొడ్డి వున్నారు.

ప్యారేలాల్‌కు ఈ ఉత్తరం సంగతి తెలియదు. అప్పుడప్పుడు వస్తుంటారు. వచ్చినప్పుడు ఈ ఉత్తరాలు చదువుతాడు.

తెల్లవారుఝామున 3 గంటలకు ఈ ఉత్తరం చెప్పి వ్రాయిస్తున్నాను. 4 గంటలకు స్నానం చేసి తరువాత ప్రార్థన చేస్తాను. ఇది నేను ప్రస్తుతమనుసరిస్తున్న విధానం. భగవంతుని కోరిక అది అనుకుంటున్నాను. నీవు బాధపడవలసిన పని లేదు. నా ఆరోగ్యం బాగానే ఉన్నది. శరీరం మన అవసరాన్ని బట్టి పనిచేస్తుంది. నా సత్యాహింసలు ముత్యాల వర్తకుని కంటే కూడా సరిగ్గా తులతూగుతున్నవి. తూనిక బాగా ఉన్నది. వెంట్రుక వాసి తేడా కూడా లేదు. నా కొరకై ప్యారేలాల్ చేసిన పనిని నేను చేయలేను. మిగిలిన ఇద్దరినీ నాకుపయోగించేటట్లు ఇంకా తయారు చేయలేదు. కాని ఇద్దరూ తెలివైన వారు. మూడు నాలుగు రోజుల క్రితం మన్‌సుఖ్‌లాల్ మనను ఆమె కోరిక మీద వదలి వెళ్ళారు. ఆమె నాతో వుండదలచుకొన్నది. ఆమెను నేను అంగీకరించాను. ఆమె చేత ఉత్తరం వ్రాయిస్తున్నాను. కళ్ళు మూసుకొని ఆ పని చేస్తున్నాను. దానవలన నా అలసట కొంత తగ్గుతున్నది. సుచేలా కృపలానీ కూడా ఈ గదిలోనే ఉన్నది. ఆమె నిద్రబోతున్నది.

నీవు పంపిన టెలిగ్రాం చెత్తబుట్టలో వేయదగినది. అతిశయోక్తులకు హద్దులుండవు. జనం బుద్ధిపూర్వకంగా అతిశయోక్తులల్లరు. అతిశయోక్తి అంటే వారికి తెలియదు. నలువైపులా కొబ్బరి చెట్లు, పోకచెట్లు కనిపిస్తున్నవి. వాటి నీడలో గడ్డి పెరుగుతున్నది. మొక్కలు పెరుగుతున్నవి. నదులన్నీ సింధు, గంగ, యమున, బ్రహ్మపుత్ర వంటివే. అవి తమ నీటిని సముద్రంలో వదలుతున్నవి. నా సలహా ఏమిటంటే - నీవు ఇంతవరకు జవాబు పంపకపోతే టెలిగ్రాం పంపినవాడిని ఋజువులు తీసుకొచ్చి చూపించమను. కేంద్ర ప్రభుత్వం ఏమైనా చేస్తుంది. చట్టం ప్రకారం ప్రభుత్వానికి ఆ అధికారం లేదు. గాంధీ ఉన్నాడు. అతడు మిమ్మల్ని కలుసుకొంటాడు. మీ మాటలు వింటాడు అని చెప్పు. గాంధీ మిమ్మల్ని నిరాశ పరిస్తే ఆయన శిష్యులం మేము ఏం చేయగలం గాంధీ ఉన్నాడు గనుక మీ సమస్యలు నాకు చెప్పవద్దని ఎవరితోనూ అనకు. నీకు వ్రాయమను. నాకు వ్యతిరేకంగా కూడా అతనికి సాయం చేయడం నీ విధి. అదే మీ అందరికీ నేర్పుతున్నది స్థితి విషమంగా ఉన్నది. సత్యమెక్కడా కనిపించడం లేదు. హింస అహింసను మింగి వేస్తున్నది. మతం లేకపోవడమే మతం. ఆ స్థితిలోనే సత్యాహింసలను మనం పరీక్షించాలి. అందుకే

నేనిక్కడ ఉన్నాను. నన్ను ఇక్కడనుండి పిలవకు. భయం వలన నేను ఇక్కడనుండి పారిపోతే అది దురదృష్టకరమైన విషయం అవుతుంది. భారతదేశం అంత దురదృష్టకరమైన దేశం కాదు. నేనిక్కడ మరణించడానికే ఉన్నాను. జవహర్‌లాల్ కృపలానీ, దేవ్ నన్ను కాపాడటానికి వస్తున్నారని రేడియోలో వార్త వచ్చింది. అది చాలు. అందరినీ నేను కలసి ఏమిటి ప్రయోజనం?

అస్సామ్‌ను గురించి నేను వ్రాసింది వెంటనే ప్రచురించడానికి కాదు. కాని ఆ విషయంలో నా దృష్టి సరియైనది.

బీహార్ లీగ్ రిపోర్టు నీవు చూసే వుంటావు. రాజేంద్ర బాబుకు వ్రాశాను. నా అభిప్రాయాన్ని అందరికీ తెలియజేయమన్నాను. బీహార్ ముఖ్యమంత్రికి కూడా వ్రాశాను. ఆ రిపోర్టు సగం నిజమైనా చెడు వ్యవహారమవుతుంది. ఒక్కరోజు ఆలస్యం లేకుండా నిష్పక్షపాతంగా ఉంటే సమితిని నియమించాలి. ఎవ్వరూ వేలెత్తి చూప కూడదు. దానిలో నిజం ఉంటే దాన్ని అంగీకరించాలి. కేబినెట్‌లోని మీ ముస్లింలీగ్ మిత్రులతో కూడా సంప్రతించి చూడు. సుహ్రావర్దీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతున్నవి. అవి పూర్తి కాగానే నీకు పంపిస్తాను. జవహర్‌లాల్ గూడా చూస్తాడు.

వెంటనే ఇది నీవు చేసి వుండకపోతే పత్రికల్లో ప్రచురణ పొందుతున్న నా ప్రార్థనానంతరం నేను చేస్తున్న ఉపన్యాసాల సారాంశాన్ని చూడు. నీవు ఎంత వొత్తిడిలో పనిచేస్తున్నావో నాకు తెలుసును. కాని ఎంత ఒత్తిడిగా వున్నా చేయక తప్పదు.

నీ ఆరోగ్యం అంత బాగా ఉన్నదని నేననుకోను. పని చేయడానికి అది ఆటంకం కలిగించదు. కొంత బాగుపడిందనుకొంటాను. దిన్షా గారి చికిత్సను వదలవద్దు. సుశీలను గురించి అడిగావు. బాగా ఆరోగ్యంగా వున్నదని చెప్పలేను. బాగా పనిచేస్తున్నది. ఆమె సహాయం ఇక్కడ బాగా అవసరం. మమ్మల్ని గురించి నీవు వ్యధ చెందవద్దు. అందరూ మృత్యువును ఎదుర్కొంటున్నవారే. వారు జబ్బుపడడం సహజమే. వారు మరణిస్తే వారిని మనం అభినందించాలి. అయితే వారి మృత్యువు మహా పవిత్రంగా ఉండాలి.

ఆశీర్వచనాలు
బాపూ

★ ★ ★

## 95. వైస్‌రాయ్ గారికి

పాట్నా రైలులో
8.5.1947

ప్రియమైన స్నేహితులకు.

క్రిందటి ఆదివారం సమావేశంలో సమయం చాలక మిగిలిన విషయాలను, మాట్లాడిన విషయాల సంక్షిప్త రూపాన్నీ మీకు పంపుతున్నాను.

1. దేశంలో ఎవరేమన్నా ఏమి చెప్పినా భారతదేశ విభజనకు బ్రిటన్ పార్టీ గావడం పెద్ద తప్పు అవుతుంది. విభజన ఒకవేళ జరగవలసి ఉంటే బ్రిటన్ వెళ్లిపోయిన తరువాత ఇక్కడివారు తమలో తాము సంప్రదించుకొని నిర్ణయిస్తారు. సాయుధ పోరాటం జరుగుతుందని జిన్నా అనడం సరిగాదు. అల్ప సంఖ్యాకుల రక్షణకు హామీ ఇవ్వవలసిందే. అభిప్రాయ భేదాలు ఏర్పడితే మధ్యవర్తిత్వం నడిపి పరిష్కరించడానికి అవకాశం ఏర్పాటు గావాలి.

2. కాంగ్రెసు వారు సూచించిన కాంగ్రెసు వారితోనూ, ముస్లింలీగ్ సూచించిన ముస్లింలీగు వారితోనూ ఆంతరిక ప్రభుత్వం ఏర్పడాలి. కలసి పనిచేయడం, కలసి వ్యవహరించడం లేని ఈనాటి ద్వంద్వం ప్రభుత్వం దేశ క్షేమానికి హానికరం. ప్రభుత్వం పటిష్టవంతంగా నడవవలెనంటే కలసి పనిచేసే మనస్తత్వం అవసరం.

3. ప్రజాభిప్రాయ సేకరణ (రిఫరెండం) ఈ స్థితిలో సరిహద్దు ప్రాంతం (ఏ ప్రాంతంలోనైనా) లో ప్రమాదకరమైనది. మీరు దానిని ఎదుర్కోవాలి. డాక్టర్ ఖాన్ సాహెబ్‌కు తెలియకుండా ఏమీ జరగగూడదు. ఇది ముఖ్యమైన విషయం.

4. పంజాబు బెంగాలు విభజన అనవసరమని నా అభిప్రాయం. అది లీగ్‌కు ఇష్టముండదు. ఏమైనా ఇవన్నీ బ్రిటిష్ వారు వదలి వెళ్లిన తరువాతనే జరగాలి. ముందు కాదు. పరస్పర సహకారంతో జరగాలి. బ్రిటిషు వారు ఉన్నంత కాలం దేశంలో శాంతి రక్షణకు వారు బాధ్యత వహించాలి. ఏవేవో కోర్కెల వలన ఆ యంత్రాంగం విఫలమవుతున్నది. ఆ కోర్కెలవైపు దృష్టి వుంచగూడదు. మిగిలిన 13 నెలలలో ఇటువంటి వాటికి తావుండకూడదు. బ్రిటిష్ వారు వెళ్లిపోవడం మీద దృష్టి

ఉంచి పని చేస్తే 13 నెలల కాలవ్యవధిని ఇంకా తగ్గించవచ్చు. ఈ విషయంలో మీరు శ్రద్ధ వహించాలి.

5. నౌకా యుద్ధంలో మీరు సాటిలేని ప్రావీణ్యం కలవారు. దాని ముందు ఈ పనికి ప్రాముఖ్యమేమీ లేదు. ఏకాగ్రత ఆలోచనలలో విస్పష్టత ఉండడం అవసరం. అది మీరు సాధించగలరు.

6. అరాజకత్వాన్ని వారసత్వంగా మీరు వదలదలచకపోతే స్వదేశీ సంస్థానాలతో కూడా కలిపి దేశ ప్రభుత్వాన్ని సమర్థించండి. ముస్లింలీగ్ ప్రాతినిధ్యం లేని ఇండియాలో కూడా కాన్స్టిట్యూయంట్ అసెంబ్లీ రక్షణ విధిని కల్పించగలదు.

7. పంజాబ్ బెంగాల్ విభజన జరగగూడదదంటే అక్కడ అల్ప సంఖ్యాకులకు అన్యాయం జరగడమని కాదు. వారు ఉపేక్షించబడకూడదు. ఆ రెండు ప్రాంతాలలో వారు తగినంత బలం కలిగివున్నారు. వారు ఉపేక్షించబడితే గవర్నరు కలుగజేసుకోవచ్చును.

8. సార్వభౌమాధికారం (ఇంట్రాస్మిసిబిలిటీ) ఒక చెడు సిద్ధాంతం. దానివలన స్వదేశీ సంస్థానాలు స్వతంత్ర్య రాజ్యాలై స్వతంత్ర్య భారతదేశానికి ఇబ్బంది కలగజేయగలవు. ప్రస్తుతం బ్రిటిషు ప్రభుత్వానికున్న అన్ని అధికారాలనూ తరువాత వచ్చే ప్రభుత్వానికి సంక్రమింపచేయాలి. అవి బ్రిటిష్ ఇండియాలోని ప్రజలవలె సంస్థానాల ప్రజల కూడా స్వతంత్ర్య భారత పౌరులు కాగలరు. ప్రస్తుతమున్న సంస్థానాధీశులంతా కీలుబొమ్మలు. సంస్థానాలవారు వ్యక్తిగతంగా సైన్యాలను ఆయుధ కర్మాగారాలను స్థాపించగూడదు. ఉన్నవాటిని రిపబ్లిక్ ప్రభుత్వానికి అందజేయాలి. సంస్థానాల విషయంలో చేయవలసినది తెలియజేశాను. ఎలా చేయాలో మీరు ఆలోచించాలి.

9. సివిల్ సర్వీస్ ఉద్యోగుల సమస్య ఒకటి ఉన్నది. క్రొత్త ప్రభుత్వానికి సహకరించమని వారికి తెలియజెప్పాలి. వారు పక్షపాతంగా వుండగూడదు. వారిలో మతపక్షపాతం ఉంటే దాన్ని వెంటనే తొలగించాలి. వారు గ్రేట్‌బ్రిటన్‌కు కాక క్రొత్త ప్రభుత్వానికి బాధ్యులు కావాలి. ప్రజాసేవ వాళ్ళ లక్ష్యం కావాలి.

10. మంగళవారం నాడు రెండు గంటలు జిన్నాగారితో కలసి వున్నాను. అహింసకు సంబంధించి ఇద్దరం సంయుక్త ప్రకటన చేయవలెననుకున్నాము. ఆయన అందుకు అంగీకారం తెలిపారు. తాను వ్రాసిన పత్రికా ప్రకటనలో ఆ విషయం ఉటంకించారు.

11. పాకిస్తాన్ విభజన గురించి మేము మాట్లాడుకున్నాము. పాకిస్తాన్‌కు నేను వ్యతిరేకినని చెప్పాను. శక్తిని ఉపయోగించి గాక నచ్చజెప్పమని జిన్నాగారిని నేను కోరాను. పాకిస్తాన్‌ను గురించి చర్చించడం అనవసరమని ఆయన దృఢంగా వున్నారు.

రాజకుమారి అమృతకౌర్ మొదటి ఎనిమిది అనుచ్ఛేదా (పారాగ్రాఫ్) లను చూచింది. పండిట్ నెహ్రూకు వివరం తెలియజేస్తుంది. ఢిల్లీలో ఈ ఉత్తరం పూర్తి చేయలేకపోయాను. రైల్లో పూర్తి చేశాను.

మీరు అతికష్టంమీద దొరికిన విశ్రాంతిని ఉపయోగించుకొంటున్నారను కుంటున్నాను.

మీ

ఎమ్.కె. గాంధీ

★ ★ ★

## 96. వైస్‌రాయ్ గారికి

న్యూఢిల్లీ

10,11 జూన్, 1947

ప్రియమైన స్నేహితులకు,

మీతో జరిగిన సంభాషణ సారాంశాన్ని రాజకుమారి అమృతకౌర్ తెలియజేసింది.

మీరు ఎప్పుడైనా కలవవచ్చని అన్నప్పటికీ నేను దానిని ఉపయోగించుకొన లేకపోయినాను. కొన్ని విషయాలు వ్రాస్తున్నాను.

1. ప్రజాభిప్రాయ సేకరణ (రిఫరెండం) సరిహద్దు ప్రాంతం విషయంలో నా అభిప్రాయం నెహ్రూ, వారి అనుచరులకు నచ్చినట్లులేదు. ఇక నేను ఆ విషయం పట్టించుకోను.

2. సరిహద్దు ప్రాంతంలో రిఫరెండం జరగకపూర్వం జిన్నా అక్కడకు వెళ్లి బాద్‌షాఖాన్ వగైరాలకు నచ్చచెప్పి వారిని సంతృప్తిపరిస్తే బాగా ఉంటుంది. వారు చెప్పే విషయాలను జిన్నాగారు సానుభూతి పూర్వకంగా వినాలి. బాద్‌షాఖాన్‌గారూ వారి అనుచరులు ఖుదాయీఖిద్‌మత్ గారూ అక్కడ చాలా పనిచేసి వున్నారు.

3. పాకిస్తాన్ అంటే ఏమిటో సరైన స్వరూపాన్ని జిన్నా గారిని చెప్పమని అడగాలి. హిందుస్తాన్ లేక పాకిస్తాన్‌లో వుంటారా అని అవి ఏమిటో తెలియకుండా వారిని అడగడం నాకు న్యాయంగా కనబడడం లేదు. పాకిస్తాన్ అంటే ఏమిటో వివరించడం అవసరం గదా?

4. సరిహద్దు ప్రాంతంలో ఇప్పటికీ శాంతి లేదు. రిఫరెండం అక్కడ శాంతిపూర్వకంగా జరుగుతుందా? అక్కడ శాంతి లేకపోతే చేసిన పనులన్నీ వ్యర్థం కాగలవు.

5. మీరు ఏకాభిప్రాయం గల మంత్రివర్గాన్ని నియమించడం అవసరం. లీగ్ మంత్రులు స్వతంత్ర్యంగా వ్యవహరించడం ప్రారంభిస్తే వాతావరణమంతా చెడుగా మారిపోతుంది. ఎవ్వరికీ ఏమీ బాధ్యత వుండదు.

6. సమయాన్ని బట్టి అనుకొన్న సమయంలో పని జరగవలెనంటే కార్యకర్తల నందరినీ పని చేయమని సన్నద్ధులను చేయాలి. ఇది మంత్రివర్గానికి తెలియజేస్తే ప్రయోజనముండదు. సమయమొచ్చినపుడు చేర్పులు కూర్పులకై వివిధ పార్టీలను సంప్రదించవచ్చును.

7. ఆలోచించిన కొద్దీ సంస్థానాల సమస్య చాలా సమస్యలను సృష్టించేటట్లు కనపడుతున్నది. ఇప్పటి నుండీ జాగ్రత్తపడడం అవసరం.

8. సివిల్ సర్వీస్ సమస్య అంత క్లిష్టం గాకపోయినా ఉపేక్షించదగినది గాదు. జాగ్రత్తగా దానిని పరిష్కరించడం అవసరము.

9. అన్ని పార్టీలనూ సంతృప్తిపరచడం జరిగే పని కాదు. వ్యర్థం గూడాను. జాగ్రత్తగానే మీరు వ్యవహరిస్తారు

10. నాకు జ్ఞాపకమున్నది వ్రాశాను. ఏ విషయంలోనైనా వ్యక్తిగత సంభాషణ అవసరమైతే తెలియజేయండి నేను సిద్ధంగా వుంటాను.

11. మీ నోట్ అందింది. సంపూర్ణంగా వున్నది. నేను చదివాను. జవాబు వ్రాయవలసిన అవసరం లేదు.

9.25 గంటలకు ఇది పూర్తి అయింది. రేపు ఉదయం టైపు చేయిస్తాను.

మీ

ఎమ్.కె గాంధి

★ ★ ★

## 96ఏ. లార్డ్ మౌంట్ బాటెన్ నుండి

వైస్‌రాయ్ భవనం

12 జూన్ 1947

ప్రియమైన గాంధీజీ,

మీ ఉత్తరం అందింది. ధన్యవాదాలు. సమస్యలపై మీ వ్యాఖ్యలను దృష్టిలో పెట్టుకొని పనిచేస్తాను.

మీ ఆఫీసు కార్యకర్తలచేత పని చేయించడం ఉచితమో కాదో ఆలోచిస్తున్నాను. భారత ప్రభుత్వం తాలూకు కార్యకర్తలను గూడా విభజించవలసి ఉంటుంది. అది సమస్య. పని చాలా పెద్దది. నిశ్చితతిథి ముందు పనులు పూర్తి కాగలవో లేదో తెలియదు. పూర్తి చేసే ప్రయత్నంలో వున్నాను.

మీ సలహాలకూ, సహకారానికీ కృతజ్ఞుణ్ణి

మీ

మౌంట్‌బాటెన్

★ ★ ★

# 97. అబ్దుల్ గఫార్‌ఖాన్ గారికి

భంగికాలనీ

5 జులై, 1947

ప్రియమైన బాద్‌షా,

ఖుదాయీ ఖిద్‌మత్ గార్ ఆజమ్‌ఖాన్ 12 గంటలకు పూర్వం నన్ను కలిశాడు. ఈరోజు రాత్రి పెషావర్ వెళ్లుతున్నానని చెప్పాడు. అతని ద్వారా నేను ఉత్తరమేమీ పంపలేదు. ముస్లిం లీగ్‌కు వ్యతిరేకంగా ప్రదర్శనలు చేయవద్దని అతనితో చెప్పి పంపాను. ఖుదాయి ఖిద్‌మత్‌గార్లు ఎటూ వోటు చేయకుండా వుండడం మంచిది. ఉద్రేకాలు ఎక్కువగా వున్నవి పాకిస్తాన్ నుండి యూనియన్ నుండి ఒత్తిడి సమావేశాలలో గాని చివరి నిర్ణయం జరగదు. ముస్లిం లీగ్ సభ్యులతో పోరాటాన్ని ఏ పరిస్థితులలోను పరిహరించడం మంచిది. పఠాన్ శౌర్యం పరీక్షలో పడనున్నది. విరోధుల చేతుల్లో దెబ్బలు తిని, మరణించి అయినా ఎదురు దెబ్బ తీయవద్దు. మీరు అటువంటిదేమి చేసినా పాకిస్తాన్ బలపడుతుంది. అలా కాక మీరు సహనం చూపితే వైధానికంగా పాకిస్తాన్‌కు విజయం కలిగినా నైతికంగా ఓటమి ఏర్పడుతుంది. పఠాన్లు రిఫరెండంలో పాల్గొనకండి.

మీ వుత్తరం అందగానే నేను వెంటనే ప్రయత్నం చేశాను. వైస్‌రాయ్ గారికి ఉత్తరం వ్రాశాను. ఆయన చర్య తీసుకొన్నారు. ప్రార్థనా సమావేశాలలోని నా ఉపన్యాసంలో సరిహద్దు ప్రాంతం విషయం వివరించాను. వైస్‌రాయ్ గారికి నేను వ్రాసిన ఉత్తరం కాపీని మీకు పంపుతున్నాను. వైస్‌రాయ్ గారికి ఖుదాయీ ఖిద్‌మత్ గార్లు దౌర్జన్యం చేస్తారని ఉత్తరం వచ్చింది. అందుకే ఇది వ్రాస్తున్నాను.

మీ ఆరోగ్యం సరిగా చూసుకోండి.

ప్రేమతో

బాపూ

★ ★ ★

# 97ఏ. అబ్దుల్ గఫార్‌ఖాన్ నుండి

జులై 12, 1947

ముస్లింలీగ్ వారు ఎంత ఉద్రేకపూరితంగా వ్యవహరించినా శాంతంగా వుండాలని గ్రామగ్రామాలకు బోయి మేము ప్రజలకు నచ్చజెపుతున్నాము. ముస్లిం లీగు తరపున రోజూ ర్యాలీలు జరుగుతున్నవి. మనస్సును బాధించే నినాదాలు చేస్తున్నారు. మమ్మల్ని కాఫిర్లు అంటున్నారు. తిట్లు ఉపయోగిస్తున్నారు. నన్ను వ్యక్తిగతంగా అవహేళన చేస్తున్నారు. ముస్లిం లీగ్ వారూ, రిఫరెండం నడిపించే అధికారులూ కలిసి పనిచేస్తున్నట్లు, అంతా కుతంత్రంగా వున్నట్లు తోస్తున్నది. అధికారులు దొంగవోట్లను ప్రోత్సహిస్తున్నారు. కొన్ని చోట్ల 80, 90 వంతులు వోట్లు పడినవి. అలా ఏ ఎన్నికలోనూ జరగలేదు. రెండు సంవత్సరాల క్రితం తయారైన వోటర్ల పట్టికను బట్టి వోటింగు జరుగుతున్నది.

మేము చాలా కఠిన పరిస్థితుల్లో పనిచేస్తున్నాము. కాని ఆలోచనలో క్రియలో అహింసను పాటిస్తున్నాము. ఇలా ఎంతకాలం జరుగుతుందో. చెప్పడం కష్టం. సారాంశంగా అధికారులు ముస్లిం లీగ్‌తో కలసి అల్లర్లను ప్రోత్సహిస్తున్నారు. దానిని ఆపడానికి శక్తివంచన లేకుండా మేము పాటు బడుతున్నాము.

రెండో ప్రమాదకరమైన స్థితి ఏమిటంటే పెద్దసంఖ్యలో పంజాబీలు ఇక్కడకు వచ్చి హింసను ప్రేరేపిస్తున్నారు. అంతేగాక ఎర్ర చొక్కాల వారి నాయకుల్ని అంతం చేయండని తమ ఉపన్యాసాలలో పేలుతున్నారు. పాకిస్తాన్ ఏర్పడిందనీ నూరెంబర్గ్ పద్ధతిలో విచారణ జరుగుతుందనీ, ద్రోహులంతా ఉరితీయబడతారనీ ప్రచారం చేస్తున్నారు. జలాలుద్దీన్ ఎమ్.ఎల్.ఏ మంత్రులు ఎవరు హజారా వచ్చినా వారు చంపివేయబడతారని సభల్లో ఉపన్యాసాలు చేస్తున్నారు.

మీ

గఫార్‌ఖాన్

★ ★ ★

## 98. ఒక స్నేహితునికి

భంగికాలనీ, న్యూఢిల్లీ
జులై 26, 1947

మిత్రమా,

19న వ్రాసిన మీ వుత్తరం నన్ను కదలించివేసింది. ఎన్నో సంవత్సరాలు నిష్క్రియంగా జీవించడం కంటే మానవసేవ చేస్తూ ఒక్క రోజు జీవించినా చాలుననే దానితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఆశ, విశ్వాసము రెండూ ఒకే అర్థాన్ని బోధించే శబ్దాలు కావు. దానితో గూడా ఏకీభవిస్తున్నారు. మంచి శాశ్వతము, చెడు క్షణికము.

నా మాటమీద నేను నిలబడతాను. దుఃఖాలతో కూడిన సమాజంలో శాంతికామునికి స్థానంలేదు. నా తప్పుల ఇంగ్లీషు మీద దృష్టి వుంచకండి. దానిలోని అర్థం వైపుకు దృష్టిని సారించండి. మీరు చెప్పినది నిజమే. శాంతి కామునికి స్థానం లేదు. అది తెలిసి గూడా అతడు సమాజం కొరకు పనిజేయాలి. నా భావాన్ని స్పష్టం చేశాననుకొంటాను. చెడుకు తలవొంచడమనేది నాలో లేదు.

మీ శారీరిక అనారోగ్యం అదుపులో వున్నదనుకొంటాను.

ప్రేమతో
మీ
బాపూ

★ ★ ★

## 99. మేడమ్ ఎడ్మండ్ పినాట్ గారికి

బిర్లా భవనం, న్యూఢిల్లీ
నవంబరు 29, 1947

భక్తి,

27 ఆగస్టున వాదనా పటిష్టత గలిగిన మీ వుత్తరం అందింది. శాసనోల్లంఘనం, అహింసాత్మక నిరాకరణలో గల విభేదాన్ని మీరు బాగా గుర్తించారు. రెండూ నిరాకరణ,

ఉల్లంఘన ఒక్కటే. మీరు ఒకదానికి మరీ ఎక్కువ మూల్యం చెల్లించాలి. ఏసుక్రీస్తు చేసిన దానిలో గొప్ప మహత్తత్వమున్నదని యూరపువారు పొరపాటుపడ్డారు. నేను న్యూటెస్టమెంటు చదివాను. మొదట నాకేమీ నిరాకరణ కనబడలేదు. టాల్‌స్టాయి గారి హార్మనీ ఆఫ్ గొస్పెల్స్ చదివినపుడు అంతా స్పష్టంగా బోధపడింది. దానికి పశ్చిమం చాలా నష్టపడింది. క్రిష్టియానిజం యుద్ధాలకు కారణమయింది. ఓల్డ్ టెస్ట్‌మెంటు ఉన్నా దానికి గూడా అది అవమానం తెచ్చిపెట్టింది. నాకున్న చరిత్రజ్ఞానం తక్కువ అయినా విషయాన్ని అర్థం చేసుకొనగలను.

నా వ్యక్తిగతమైన అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని మీ అందరి సహకారంతో నిరాకరణతో స్వాతంత్ర్యం సంపాదించుకోగలిగాము. మీ భర్తగారు మాకు సహకరించారు. మేము చేసిన కొన్ని పొరపాట్లకు ఇంకా మూల్యం చెల్లిస్తూనే వున్నాము. లేకపోతే కొన్ని అనర్థాలు జరిగేవి. బలహీనుడు బలహీనుడిని హింసిస్తున్నాడు. అది ఈనాటి స్థితి.

రక్తదాహం తగ్గిపోవాలి అని మీరూ మేమూ అందరం ప్రార్థించాలి. పశ్చిమాన్ని అనుకరిస్తే యుద్ధం వంటిది కాకపోయినా హింస జరిగి తీరుతుంది. పశ్చిమ దేశాలు ఈ రహస్యాన్ని గ్రహించాలి. అనాడే ఆసియా ఆఫ్రికా దేశాలకే గాక విశ్వానికే శాంతి కలుగుతుంది.

ఆశకు వ్యతిరేకంగా ఆశిస్తూనే ఈరోజు సైనికశక్తిని పెంచుకొని పశుశక్తికి బలం చేకూరుస్తున్నాము. మన నాయకులు రెండు తరాల నుండి యుద్ధశక్తిని, ఖర్చును తగ్గించమంటున్నారు. తగ్గించమన్నాము. స్వాతంత్ర్యం వచ్చింది. సైనికశక్తి పెరిగింది. పెరుగుతున్నది. అందుకు మనం గర్వపడుతున్నాము. మన శాసనసభలు నోరెత్తడం లేదు. పశ్చిమాన్ని అనుకరిస్తున్నాము. మృత్యు నాట్యం ఆగేదెపుడో తెలియడం లేదు. ఇండియా దాని నుండి తప్పుకోవలెనని ఆశిస్తున్నాము. 1915 నుండి అహింసను ఆరాధిస్తున్నాము.

మీ ఉత్తరం చివరి అనుచ్ఛేదం లో వ్రాసిన మనోవిజ్ఞాన విశ్లేషణ నాకు తెలియదు.

అమెరికాకు చెందిన రిచర్డ్ గ్రెగ్‌గారు ఈ సమస్యను గురించి మీకంటె ఎక్కువ ఎరుగుదురు. వారి ఉత్తరాన్ని, దానికి నా జవాబునూ హరిజన్‌లో చూచి వుంటారు.

నాతో మీరు ఇండియాలో గడిపిన నాటి శౌర్యం మాలోనూ, మీ ఇద్దరిలోనూ పూర్వంలాగానే ఉన్నదని భావిస్తాను. మీరు ఒక్కసారి ఇండియాకు రండి.

మీ ఇద్దరికీ ప్రేమతో

బాపూ

★ ★ ★

## 100. గుజరాత్ వాసులందరికీ

గుజరాత్‌లోని సోదర సోదరీమణులకు,

బుధవారం ఉదయం పక్కమీద నుండి ఈ వుత్తరం చెప్పి వ్రాయిస్తున్నాను. నా ఉపవాసానికి ఇది రెండో రోజు. 24 గంటలు ఇంకా పూర్తి కాలేదు.ఈ వారం హరిజన్‌ను పోస్టు చేసే రోజు. అందువలన గుజరాతీలో గుజరాత్ సోదర సోదరీమణులకు విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈ ఉపవాసం సామాన్యమైన ఉపవాసం కాదు. బాగా ఆలోచించి ఈ ఉపవాసం ప్రారంభించాను. తర్కబద్ధంగా ఇది ప్రారంభం కాలేదు. ఇది ప్రత్యేక వరం కొరకు, ప్రత్యేక వ్యక్తుల కొరకు నేను వ్రాయడం లేదు. అసహనం అంతకంటే లేదు. ప్రతిదానికీ ఒక సమయముంటుందనీ ఈ సమయంలో మన కర్తవ్యమేమిటనీ అందరూ ఆలోచించాలి. గుజరాతీలు భారతీయులు. గుజరాతీలకు వ్రాసినా భారతీయులందరి కొరకు ఇది వ్రాసినట్లే.

ఢిల్లీ రాజధానీ నగరం. రెండు జాతుల సిద్ధాంతాన్ని మనం అంగీకరించకపోయినా, హిందువులు ముస్లిములు రెండు వేరు వేరు జాతులని అంగీకరించకపోయినా

ఈనాడు ఢిల్లీ మన ముందుంచిన చిత్రం మనమనుకొన్నది గాదు. మన పెద్దల తాటాకు శిథిల గృహాలు ఢిల్లీలో వున్నవి హృదయస్థానంలో వున్నవి. ఇది హిందువుల నగరమనీ, సిఖ్ఖుల నగరమనీ ఎవ్వరూ అనరు. అంగీకరించరు. ఇది కఠినంగా తోచవచ్చును. కాని ఆసామ్‌లోని డిబ్రూగఢ్ వరకూ హిందువులు, ముస్లిములు, సిఖ్ఖులు, పార్సీలు, క్రిష్టియన్లు యూదులు అందరూ - ఈ భూభాగంలో నివసించే వారందరూ దీనిని మాతృభూమిగా భావించినవారందరికీ ఇది రాజధాని. ఈ భూభాగంలో నివసించే వారందరికీ ఇక్కడ హక్కులున్నవి. ఇది బహు సంఖ్యాకులకు చెందినదని అనే అధికారం ఎవ్వరికీ లేదు. అల్ప సంఖ్యాకులు గౌరవంగా బ్రతకాలి. ఎవరు ఈ దేశాన్ని భక్తి శ్రద్ధలతో గౌరవిస్తారో వారిది మొదటి అధికారం. కనుక ఢిల్లీ నుండి ముస్లిమ్‌లను బయటకు నెట్టి పారవేస్తామనేవారు ఈ దేశానికి మొదటి శత్రువులు. ఈ వినాశనం వైపుకు మనం ముందుకు సాగుతున్నాము. అటువంటి పని జరగకుండా మీరందరూ మనమందరమూ శ్రద్ధ తీసుకోవాలి.

మనమేమి చేయాలి? పంచాయతీ రాజ్యం కొరకు కలలు గన్నాము. ధనవంతులూ బీదవారు అందరూ సమానమన్నాము. తెలివి పవిత్రత రెండూ సమానంగా నడవాలి. ఎవ్వరినీ అస్పృశ్యులుగా భావించకూడదు. ప్రతివాడూ గౌరవంగా సంపాదించుకొని బ్రతకాలి. నల్లమందు, సారాలు మొదలైన మాదకద్రవ్యాలను ఉపయోగించకూడదు. అందరూ స్వదేశీ వ్రతధారణ చేయాలి. స్త్రీలనందరినీ తల్లులుగా చెల్లెళ్లుగా చూడాలి. భార్యలను గౌరవించాలి. తన జీవితాన్ని త్యాగం చేయవలెనే గాని ఇంకొకరిని హింసించగూడదు. సిఖ్ఖులు గురు బోధనల ననుసరించి వీరత్వంగా జీవనం గడపాలి. ప్రస్తుత స్థితిలో బాధ్యతలను గురించి ఎవరికీ చెప్పనక్కరలేదు. అందరికీ తెలుసును.

మీ

ఎమ్.కె. గాంధి

★ ★ ★

# అనుబంధము - 1

*ఎవరు ప్రాంతీయ గవర్నర్లు?*

శ్రీమన్నారాయణ గారి ఉత్తరం హిందుస్తానీ నుండి అనువాదం. కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీ తయారు చేస్తున్న రాజ్యాంగ చట్టంలో ప్రాంతాలలో గవర్నర్లను వయోజన వోటు ప్రకారం ఎన్నుకోవాలి. కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు సభ్యులు ఎన్నుకొనబడాలి. ముఖ్యమంత్రులు కాంగ్రెసు పార్టీ నుండి వస్తున్నారు. గవర్నర్లు ఏ పార్టీవాడూ కాకూడదు. అతడు నిష్పాక్షికంగా వ్యవహరించాలి. ముఖ్యమంత్రి గవర్నరును తన వశంలో పెట్టుకొనే ప్రయత్నం చేయకూడదు. ముఖ్యమంత్రి గవర్నర్ల మధ్య వివాదాలుండగూడదు.

నా అభిప్రాయంలో గవర్నరు అవసరం లేదు. ముఖ్యమంత్రి ఆ పని చేయవచ్చును. 5500లకు మించి ముఖ్యమంత్రి జీతముండదు. గవర్నరు జీతం మిగిలిపోతుంది. ఏ గవర్నరూ తన ప్రాంతం వాడు కాగూడదు.

అపుడు ఎన్నికల తతంగం ఖర్చు వుండదు. అన్ని నియమాలనూ పాటించి రాష్ట్రపతి గవర్నర్లను ఎన్నిక చేస్తే సరిపోదా? ఆ స్థితిలో గవర్నర్లు స్వతంత్రంగా వ్యవహరిస్తారు. ప్రస్తుతం మంత్రివర్గం గవర్నర్లను నియమిస్తున్నది. అందువల్లనే పక్షపాతాలు ఏర్పడుతున్నవి. అందుకు తగిన ఏర్పాట్లు జరగాలి.

గ్రామ పంచాయితీల విషయం రాజ్యాంగ చట్టంలో లేదు. అవి వికేంద్రీకరణకు మూలాధారాలు. ఇంకా చాలా లోట్లున్నవి. అదంతా ఏకరువు పెట్టడం అనవసరం. ఉన్నలోట్లను మీ దృష్టికి తెచ్చాను. మీ మార్గదర్శకత్వం కావాలి.

అగ్రవాల్ సూచించిన గవర్నర్ల నియుక్తి విషయం ఆలోచించదగినది. కాన్‌స్టిట్యూయంట్ అసెంబ్లీలో జరిగిన చర్చలను నేను సరిగా తెలుసుకోలేదు. ఏ పునాదుల మీద చర్చ జరిగిందో తెలియదు. విశ్లేషించి ఆలోచిస్తే విమర్శకు తావుంది. ముఖ్యమంత్రులను గవర్నర్ల స్థానంలో చేర్చడం కూడా ఎంతవరకు సమంజసమో

తెలియదు. ఏమైనా గవర్నర్లు ఎక్కువగా కలిగించుకొనడం మంచిది కాదు. రబ్బరు స్టాంపులుగా వుండడం గూడా మంచిది కాదు. మంత్రివర్గ నిర్ణయాలకు అనుకూలంగా ప్రజల అభివృద్ధిని మలచగలిగి వుండాలి. తప్పులు సరిదిద్దే అధికారం వారికి వుండాలి. పంచాయితీలకు ఎక్కువ అధికారాలిస్తే ప్రజలకు మంచిది. సైనికాధికారులకు ఎక్కువ అధికారాలు అవసరం లేదు. నయీ తాలీమ్‌కు నా వోటు.

## అనుబంధము - 2

*మనో వైజ్ఞానికమైన వివరణ*

ఈ క్రింది విషయాలు రిచర్డ్ బి గ్రేగ్ గారివి. హరిజన్ పాఠకులకు ఆయన తెలుసును. ఆయన అమెరికా వాస్తవ్యుడు. శాంతినికేతనంలోనూ సబర్మతి ఆశ్రమంలోనూ కొంతకాలం వున్నాడు.

నాకు తెలియక నేను తటపటాయించాను. ఇండియాలో జరిగిన మత కలహాలు, భవిష్యత్తులో వాటి నివారణకు నా అభిప్రాయం తెలుపుతున్నాను. మతాల యెడల గల సందేహాల కంటే అణచివేతకు ఎంతో కాలం లోనైన ప్రజల వ్యతిరేకత ప్రధానమైనదని అనిపిస్తున్నది. అణచివేత విదేశీశక్తుల వల్లనేగాదు, విదేశీ ఆర్థిక, సాంఘిక విధానాల వల్ల కూడా జరిగింది. అవి మన ధర్మానికి అనుకూలమైనవి గావు బ్రిటిషు వారు దిగుమతి చేసిన భూస్థితి, తాకట్టు ఋణాలు పద్ధతి, వస్తువులలో గాక నగదు రూపంలో చెల్లింపబడే పన్నుల విధానం వలన గూడా జనం అణచివేత అనుభవిస్తున్నారు.

"మనో విజ్ఞాన శాస్త్రంలో బాల్యంలో అనుభవించిన నిరాశా నిస్పృహలు కోరికలను నియంత్రించుకొనడం వలన ఏర్పడిన పరిస్థితులూ తదితరమైన కారణాలూ వ్యాకులత్వానికి కారణమై, ఇతరులను హింసించే మనఃప్రవృత్తిని మనుష్యులలో రేకెత్తింప చేస్తాయి. అట్టిస్థితిలో రాజకీయ పరివర్తన కూడా హింసకు దారి తీస్తుంది. దానిని స్వార్థపరుల నాయకులు ఉపయోగించుకొంటారు.

ఇది నిజమైతే మత ద్వేషాలు అంత లోతైనవి కావు. మతపరంగా తిరిగి ప్రజలు పాతపద్ధతులకు చేరుకుంటే పరిస్థితులు మారిపోతవి. పంచాయితీలు వంటివి మానవ మనస్తత్వాన్ని మార్చగలవు. ఖాదీపనిలాంటివి అందుకు ఉపయోగ పడగలవు.

ఇవన్నీ ఊహలు. బయటివారి ఊహలివి. ఏమైనా నేను భారతదేశాన్ని ప్రేమిస్తున్నాను.

మరో విజ్ఞానశాస్త్రాన్ని అధ్యయనం చేయమని మిత్రులు చెప్పినా సమయం లేక నేను దానిని చదవలేకపోయినాను. గ్రెగ్ గారి ఉత్తరం నాలో మార్పు తీసుకొని రాలేదు. పెద్ద ఉత్సాహం నాలో కలిగించలేదు. గ్రెగ్‌గారు చెప్పిన విషయాలు విషయాన్ని ఇంకా క్లిష్ట పరిస్థితికి చేరుస్తున్నవి. భవిష్యత్తు మీది ఆశ నాలో తగ్గిపోవడం లేదు. అహింసను ఆరాధించడమే దానికి కారణము. బ్రిటిష్ వారితో పోరాడుతున్నప్పుడు భారతీయులు చూపిన సహనం ప్రశంసనీయమైనది. అందువల్ల నా విశ్వాసం రోజురోజుకూ పెరుగు తున్నది.

## అనుబంధము - 3

### *గాంధియన్ కాన్స్టిట్యూషన్ భూమిక*

అగ్రవాల్ గారి పుస్తకానికి పెట్టిన గాంధియన్ కాన్స్టిట్యూషన్ పేరు సరిగాదు. అగ్రవాల్ గారు నా రచనల మీద ఆధారపడ్డారు. నా రచనల్ని ఆయన బాగా అధ్యయనం చేశారు. వాటిని విశ్లేషించి వివరించారు. ఇది చాలా రోజుల నుండి జరుగుతున్నది. వాటికి అపార్థాలు కల్పించడం ఆయనకిష్టం లేదు. అందువలన నాకు చూపించకుండా వాటిని ప్రచురించదలచుకోలేదు. దానిలో సౌకర్యమన్నది లేదు. అసౌకర్యమేమిటంటే ప్రతిదీ నా అభిప్రాయమని పాఠకుడు భ్రమపడతాడు. అందువల్ల తప్పు చేయవద్దని నేను చెప్పవలసి వున్నది. దీనిలో ప్రతిదానికీ నేను బాధ్యత వహిస్తే అంతకంటే నేనే వ్రాయవచ్చును గదా. దీనిని రెండు పర్యాయాలు చదివాను. నాకు ఇతర బాధ్యతలున్నా, సమయం లేకపోయినా ఓపికగా అంతా చదివాను. అన్ని

అభిప్రాయలనూ, అన్ని మాటలనూ నేను పూర్తిగా సరిదిద్ద లేకపోయినాను. అటువంటి పని చేయడం గూడా న్యాయం కాదు. రచయిత చాలా జాగ్రత్త వహించాడని నేను చెప్పగలను. నా సిద్ధాంతాలకు వ్యతిరేకత నాకు కన్పించలేదు.

రచయిత మార్పులు గూడా చాలా చేశాడు. కాన్స్టిట్యూషన్ అనగానే రాజ్యాంగ చట్టం తయారు చేశారనుకొనగూడదు. నా దృష్టిలో వుండవలసిన విధంగా నా సిద్ధాంతాల కనుగుణంగా ప్రధానమైన విషయాలను మాత్రం అగ్రవాల్ చర్చించాడు. అగ్రవాల్ గారి చర్య ప్రశంసనీయమైనది. సమయం లేక నేను చేయలేకపోయిన దానిని ఆయన చేసి చూపించాడు.

# ఎంపిక చేసిన
# మహాత్మాగాంధీ రచనలు

సంపుటము - 4

రెండవ భాగము

(లేఖాంశములు. సూత్రములు. సిద్ధాంతములు

తెలుగు సేత

కె.వి. రవిశంకర్

వేమూరి రాధాకృష్ణమూ

# 1. భగవంతుని మీద విశ్వాసము

ఈ ప్రపంచం క్షణభంగురం. అందువల్ల యీ ప్రపంచాన్ని త్యజిస్తాను. దానికోసం బాధపడటం ఎందుకు? బ్రతికి వున్నంత వరకు నా వల్ల ఎటువంటి అనుచితమైన పని జరుగకూడదని అనుకుంటేచాలు. పొరపాటున కూడా మనం అనుచితంగా ప్రవర్తించకూడదు. నేను యింకా నిర్యాణం పొందగల స్థితిలో లేనిమాట నిజం. కాని నా ప్రస్తుత మనస్థితిని బట్టి నడుచుకుంటే యీ శరీరాన్ని వదిలి మళ్లీ జన్మించి ఆ మరు జన్మలో మోక్షస్థితిని పొందుతాను.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంకలనం 8, పుట 254, 21-5-1908.*

★ ★ ★

శరీరం ఆత్మ కంటే ప్రియమైనదికాదు. ఆత్మ గురించి తెలుసుకున్నవారు, శరీరం కంటే ఆత్మ వేరని భావించినవారు, కష్టపడి శరీరాన్ని రక్షించుకునేందుకు ప్రయత్నించరు. యిది ఎంత కష్టమైనా, ఉన్నత భావాలను మనస్సు ద్వారా గ్రహించగలవారు సులభంగా అర్థం చేసుకొని ఆ ప్రకారం ప్రవర్తించగలుగుతారు. శరీరంలోవున్నప్పుడే ఆత్మ చెడు చేయగలదని భావించడం సరిగాదు. దానివల్ల భయంకరమైన పాపాలు జరుగుతున్నాయి. వృద్ధాప్యంలోనే ఆత్మను గురించి తెలుసుకోగలుగుతారనే సిద్ధాంతం ఏమీ లేదు. చాలామంది వృద్ధులు ఆత్మను గురించి తెలుసుకోకుండానే మరణిస్తారు. రాయ్‌చంద్ భాయి వంటి వారు ఎనిమిది సంవత్సరాల వయస్సులోనే ఆత్మను గురించి తెలుసుకోగలిగారు. పొరపాట్లు పాపాలు జరుగుతాయి. అట్టి జ్ఞానం వున్నప్పుడే జాగ్రత్తగా యోచించి వాటిని ఛేదించవచ్చు. అటువంటి వాటిని త్రుంచివేసేందుకే మనకు శరీరం ప్రాప్తించింది.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 9, పుట 418, 17-9-1908.*

★ ★ ★

భగవంతుడు లేకుండా మోక్షం ఎలా అని అడగటం మోక్షాన్ని గురించిన అవగాహన లేదనుటకు నిదర్శనం. మోక్షాన్ని గురించి కొంత అర్థం చేసుకోగలం. మిగతా భాగం అనుభవైకవేద్యం. దాన్ని మాటల్లో వర్ణించలేము. దాన్ని వర్ణించడానికి మన దగ్గర ఎటువంటి సాధనాలు లేవు. మనం అర్థం చేసుకోగలిగినంతవరకు అది అంతం లేని శరీరమార్పిడి. అందువల్ల కలిగే బాధల్ని చూచి భగవంతుని యొక్క

ఉనికిని గురించి నిరాకరించవలసిన అవసరం లేదు. మనం భగవంతుని గురించి మన పరిధిలో వివరించవచ్చు.

భగవంతుడు ఫలితాల రూపంలో శిక్షలు విధించే వ్యక్తి కాదు. అతడు చైతన్యవంతుడు లేక చురుకుదనం గలవాడు కాకపోయినా ఆత్మను గురించి ఊహించినప్పుడు స్వేచ్ఛ పొందిన ఆత్మయే భగవంతుడు అని చెప్పవచ్చు. అతడు ఒక ఐహిక పదార్థం కాదు. శుద్ధమైన ఆత్మయే వివేకం. ఏ కాలంలోను, ఏ పరిస్థితుల్లోను, మనం చేస్తున్నామని తలంచడం వల్ల మన అనంతమైన శక్తికి మనం పరిధి నిర్ణయిస్తున్నామన్నమాట.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 92, 30-5-1913.*

★ ★ ★

మనం ఆత్మ సంరక్షణకు సంబంధించిన కార్యక్రమాలకే మనల్ని పరిమితం చేసుకోవాలి. ఆరోగ్యం కూడా దాని తరువాతనే. ఎవరైతే ఆత్మ సాక్షాత్కారం కోసం చింతన చేస్తారో వారికి అన్నీ లభించాయనుట నిశ్చయం.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 125, 2-7-1913.*

★ ★ ★

భగవంతుడు ఉన్నాడు. లేడు. సరిగా చెప్పాలంటే లేడు. మోక్షాన్ని పొందిన ఆత్మయే భగవంతుడు. అందువల్ల అతడు సర్వవ్యాప్తుడు. భక్తికి నిజమైన అర్థం ఆత్మశోధన. ఆత్మ తనను తాను తెలుసుకున్నప్పుడు భక్తి జ్ఞానంగా మార్పు చెందుతుంది. నరసింహ మెహతా (గుజరాతీ కవి, ఋషి), మరి కొంతమంది ఆత్మశోధనకి తమను అర్పితం చేసుకున్నారు. రాముడు, కృష్ణుడు మిగతా వారందరూ అవతార పురుషులు. భగవంతుని అన్వేషణలో మనం కూడా వారివలె వుండవచ్చు. అతడి అపరిమిత దయా పుణ్య సంపద లభించినప్పుడు మోక్షాన్ని పొందబోయే ఆత్మలన్నీ దైవావతారాలు అవుతాయి. మనం వారి పరిపూర్ణత్వాన్ని గ్రహించలేము.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 126, 2-7-1913.*

★ ★ ★

రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తులలో ఎవరు గొప్పవారో చెప్పుట కష్టమైన విషయం. వారి వారి ఘనకార్యాలు వేరు వేరుగా ఉన్నాయి వారు వివిధ కాలాలకు చెందినవారు. వివిధ పరిస్థితుల్లో వున్నవారు. మిగతా వారికన్నా గుణాలలో బుద్ధుడు గొప్పవాడని ఎవరు చెప్పగలరు? భక్తులు తమ భావాలనుబట్టి వర్ణించారు. వైష్ణవులు కృష్ణునకు సంపూర్ణత్వాన్ని ఆపాదించారు. ఎవరైనా ఆవిధంగానే చెప్పవలసి వుంటుంది. లేకపోతే అంకిత భక్తి సాధ్యం కాదు. క్రైస్తవులూ అదేవిధంగా చేస్తారు. భారతదేశంలో కృష్ణావతారం చివరికి రావడంవల్ల ఆయనకు ప్రత్యేకమైన గొప్పతనం ఆపాదించబడింది.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 126, 2-7-1913.*

★ ★ ★

భగవంతుని అస్తిత్వాన్ని కాదనేవారు చివరకు తప్పు త్రోవన తేలుతారు. వారు ఆత్మను కూడా నిరాకరించవలసి వస్తుంది. అవతారాలను ఎప్పుడు నమ్ముతారు? ప్రజలు పూర్తిగా నిస్పృహలో పడినప్పుడు, పతనమై విలువలు తగ్గినప్పుడు కొద్దిమంది నీతిపరులు ఆశ్రయం కోసం వెతుకుతారు. యిటువంటి పరిస్థితుల్లో గొప్ప నడవడిక (సత్ప్రవర్తన) గల చెడుకు భయపడని, వ్యక్తుల కోసం చూస్తారు. వారు జీవించియున్నా, మరణించియున్నా వారినే అవతారంగా భావిస్తారు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 126 2-7-1913.*

★ ★ ★

తామసగుణంతోబాటు రజోసత్వ గుణాలు కూడా ఉన్నాయి. మొదటి గుణం మనిషిని గుడ్డివాణ్ణి, అవివేకిని, బద్ధకస్తుణ్ణిగా చేస్తుంది. రెండవ గుణం అతణ్ణి దుడుకు స్వభావిగా, సాహసవంతునిగా చేస్తుంది. రాజసగుణం యూరప్ దేశాల్లో ఎక్కువగా వుంటుంది. మన చర్యలు కూడా చాలావరకు అటువంటివే. సత్య గుణంకలవారు శాంతులై , నిగ్రహంతో, వివేచనాపరులై వుంటారు. వారు ప్రాపంచిక విషయాలపై శ్రద్ధ వహించక, భగవంతునిపై మనస్సును లగ్నం చేసియుంటారు. సత్వ గుణాన్ని శాంతము అని కూడా అనవచ్చును. మనస్సు శాంతంగా వున్నప్పుడే భగవంతుని గుర్తించగలగుతాము. ఏ స్థితి భగవంతుణ్ణి గుర్తించడానికి ఉపయోగడుతుందో అదే సాత్వికస్థితి. భగవంతుని యందు యీ మూడుగుణాలు అతిశయించి వుంటాయి. అయితే మంచి, చెడు కాని మాయ (వేదాంత భావన. విచిత్రమైన అస్తిత్వ భావన)

ద్వారా అతడు చైతన్యవంతు (జీవన సూత్రము. స్పృహ) డవుతున్నాడు. అతడు యీ మూడు గుణాలకు అతీతుడు. ఎప్పుడైనా తనను తాను ఏదైనా కార్యంలో నిమగ్నం చేసుకున్నప్పుడు అర్జునునకు బోధచేయటం వంటివి జరుగుతాయి. దాని వెనుక గల ప్రేరణ సాత్వికమే. చైతన్యం ఒక విధమైన యోగ్యత కావడంవల్ల సత్వ గుణ యోగ్యత కలిగివుండటం వల్ల అతడు భగవంతుడుగా చెప్పబడ్డాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 188-189, 2-7-1913.*

★ ★ ★

శరీరం నశించవలసిందే. దానికి నిర్ణయించబడిన రోజున ఔషధాలు దాని ప్రకారమే లభిస్తాయి. ఆత్మ అవినాశి. మనం మన శరీరాన్ని గురించి దిగులు పడతాము. కాని అది ఆత్మ కోసం ఉంటుంది. నిజానికి ఆత్మ నిర్గమించిన తరువాత శరీరాన్ని ఎంత మాత్రం ఉంచము.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 373, 5-3-1914.*

★ ★ ★

సత్యం తప్ప భగవంతుడు లేడు. గుణాలు మరణించేవి కావు. మొత్తం అంతా జీవతత్వమే.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 14, పుట 385, 1-5-1918.*

★ ★ ★

భగవంతుని పద్ధతుల్ని తెలుసుకోలేము. కర్మనుంచి తప్పించుకోలేము. చర్యలన్నింటికి ఫలం వుంటుంది. మంచి అయినా, చెడు అయినా, మనం హఠాత్సంఘటనగా భావించే ఘటాత్సంఘటన నిజానికి మనకు ఆవిధంగా కనబడుతుంది. ఎవ్వరూ వారి కాలానికి ముందు మరణించరు. మరణం అనేది బదిలీ మాత్రమే. పూర్తి వినాశనం కాదు. ఆత్మ అవినాశి. యిది కూడా శారీరకమైన బదిలీ మాత్రమే. స్థితి మారవచ్చును కాని ఆత్మ మారదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 14, పుట 502, 24-7-1918.*

★ ★ ★

మనం ఒక యింటి నుంచి వేరొక యింటికి మారినప్పుడు ఏవిధంగా సంతోషంగా వుంటామో అదేవిధంగా శిథిలమైపోయిన శరీరాన్నుంచి కొత్త శరీరం లోకి ఆత్మ వెళ్లినప్పుడు చింతించవలసిన పని లేదు. చనిపోయిన వ్యక్తి తక్కువ వయస్సు వాడైనా, వృద్ధుడైనా ఎప్పుడు శరీరం పనికిరాదో, అప్పుడు దాని నిర్మాత మాత్రమే ఆ విషయం తెలుసుకొనగలడు. దాన్ని ఆక్షేపించకూడదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 15, పుట 313, 19-5-1919.*

★ ★ ★

గొడ్డళ్లు నూరడానికి నా దగ్గర ఏమీ లేవు. తీర్చుకోవడానికి నాకు ప్రాపంచికమైన కోరికలు ఏమీ లేవు. జీవిత పరమార్థం భగవంతుణ్ణి ముఖాముఖి దర్శించడమే. జీవితాన్ని చూచిన కొద్దీ దాని అనుభవాల్ని పొందిన కొద్దీ అందరూ ఒకే విధంగా ప్రకాశాన్ని పొందలేరని తెలుస్తున్నది. ప్రకాశించే సూర్యుడు ఒక్కడే అయినా భూమధ్యరేఖ ప్రాంతంవారు, సమోష్ణమండలి ప్రాంతంవారు, ధృవప్రాంతాలవారు, వివిధ విధాలలో అతణ్ణి చూడగలుగుతున్నారు గదా !

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 24, పుట 267, 18-3-1924.*

★ ★ ★

నా భావంలో భగవంతుని నామం, భగవంతుని పని రెండూ ఒకదాని కొకటి సంబంధం కలిగివున్నాయి. రెండిటికీ ఎక్కువ తక్కువలు లేవు. రెండూ అభిన్నమైనవి. చిలుకవలె నామాన్ని వల్లించడం వ్యర్థం. వివేకంతో భగవంతుని పేరట, భగవంతుని కోసం చేయు పని అమూల్యం. మనం భగవంతుని నామాన్ని ఉచ్చరించడం ఆత్మార్పణం అలవరచుకోడానికే. అది భగవంతుని పేరట, భగవంతుని కోసం చేసే సేవ. శ్రుతి చేసినప్పుడు భగవంతుని నామాన్ని ఉచ్చరించినట్లే మన సమయంలో కొంత సమయాన్ని ప్రార్థన కోసం కేటాయించడం అవసరం. నాకు తెలిసినంతవరకు అన్ని శాస్త్రాలు ముఖ్యంగా భారతీయ శాస్త్రాలు గురువు అవసరమని చెప్పాయి. నిజమైన గురువులు లభించినప్పుడు మోసపు గురువులు వ్యర్థం. వాళ్ల వల్ల ప్రమాదం కూడా. అందువల్లే పదవ గురువు గ్రంథ సాహెబ్‌ను చివరి గురువుగా నిర్ధారించారని అనుకుంటాను.

నాకు ఆధ్యాత్మిక గురువు లేరు. కాని నమ్మకం వుండటం వల్ల ముప్పది సంవత్సరాలుగా గీతను పఠిస్తూ గురువు కోసం వెతుకుతున్నాను. ఆ అన్వేషణే గొప్ప ఓదార్పు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 23, పుట 289. 21-3-1924.*

★ ★ ★

భగవంతుడు అందరికీ రక్షకుడని తెలిసినవారు యిక భయపడట మెందుకు? భగవంతుడు మనకు రక్షకుడు అని అనడంలో నా ఉద్దేశ్యం ఎవ్వరూ మన నుంచి దొంగిలించలేరనీ, ఏ జంతువూ మనకు హాని చేయలేదనీ కాదు. అటువంటిదేమైనా జరిగితే భగవంతుని మీద నిందవేయకూడదు. అది మన అవిశ్వాసం వల్ల జరిగినదేనని గ్రహించాలి నది అందరికీ నీరు యివ్వడానికి సిద్ధంగా వుంటుంది. ఎవరైనా కుండతో నీళ్లు తెచ్చుకుంటే, అదివిషతుల్యమైతే, తప్పు ఆ నదిది కాదు కదా ! విశ్వాసం లేకపోవడం వల్లనే భయం కలుగుతుంది. తర్కం వల్ల విశ్వాసం బలపడదు. అది నిశ్శబ్ద యోచనల వల్ల, ధ్యానం వల్ల, అభ్యాసం వల్ల అలవడుతుంది. అటువంటి విశ్వాసం కలగడం కోసం మనం భగవంతుణ్ణి ప్రార్థిస్తాము. గ్రంథ పఠనం చేస్తాము. మంచివారి సాంగత్యం కోరుకుంటాము. సమర్పిత భావంతో రాట్నం మీద దారం వడుకుతాము. విశ్వాసం లేనివాడు కనీసం రాట్నాన్ని ముట్టుకోకూడదు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 28, 16-5-1927.*

★ ★ ★

సత్యం అంటే భగవంతుడు. యీ శరీరంలో నన్ను వుంచాలి అని అనుకున్నంత వరకు నన్ను రక్షిస్తాడు. ఆయన అవసరం లేదనుకున్నప్పుడు నేను ఎన్ని జాగ్రత్తలు వహించినా నన్ను నేను రక్షించుకోలేను.

*మీరాకు బాపూ లేఖలు - పుట 91 , 8-4-1929.*

★ ★ ★

భగవంతుని మార్గం మీద విశ్వాసం వున్నవారు తమ శక్తినిబట్టి చేస్తారు. విచారించరు. సూర్య భగవానుడు ఎప్పుడూ పనిభారంతో బాధపడినట్లు వినలేదు.

క్రమపద్ధతిన ప్రతిరోజు ఉదయిస్తాడు. అస్తమిస్తాడు. మనం సూర్యుణ్ణి జీవం లేనివాడని ఎందుకు అనుకుంటాము? ఆయనకు మనకు ఉన్న భేదం ఆయనకు మరొక మార్గం లేకపోవడం, మనకు కొంత పరిధి వుండటం కావచ్చు. అది ఎంత ప్రమాదభరితం అయినప్పటికీ యిటువంటి చర్చ వ్యర్థం. మనకు కావలసింది విశ్రాంతినెరుగని ఆయన శక్తియే. పూర్తిగా మనం ఆయనకు లోబడిపోతే, అనామకులంగా మారిపోతే, మనకున్న అవకాశాన్ని మనం స్వయంగా వదులుకున్నట్లే. మనకు కష్టనష్టాలు ఏమీ వుండవు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 171, 11-2-1932.*

★ ★ ★

మనకు భగవంతుని మీద విశ్వాసం వుంటే బాధపడవలసిన అవసరం లేదు. ఒక నమ్మకస్తుడైన ద్వారపాలకుడినో లేక రక్షకుడినో వుంచుకున్నట్లే. భగవంతుని కన్న మంచి రక్షకుడు ఎవరు? ఎప్పుడు తప్పిపోవని మనం అటువంటి విషయాలను గానం చేయడంతో సరిపెట్టుకుంటే చాలదు. మనం మన మనస్సులో అనుభవించాలి. అనుభవం అంటే బాధని, దు:ఖాన్ని అనుభవించుటయే. అది ఎటువంటి చర్చలకు తావీయదు. మన అనుభవాన్ని గురించి ఎవరు చర్చించగలరు? యిది నేను నీకు ఎందుకు వ్రాస్తున్నానో తెలుసా? నీవు పూర్తిగా స్వేచ్ఛగా వుండాలని, ఆందోళనలన్నిటినుంచి విముక్తం కావాలని.

*మై డియర్ చైల్డ్ - పేజీ 89, 13-4-1932.*

★ ★ ★

మానవుని తర్కానికి అందేవిధంగా భగవంతుని ఉనికికి రుజువు లుండకపోవచ్చు. భగవంతుడు తర్కానికి అతీతుడు కావడమే అందుకు కారణం. మనం తర్కమే అన్నిటికంటే గొప్పది అని అనుకుంటే పెద్ద యిబ్బందుల్లో పడతాము. మానవుని ఆత్మ తర్కానికి అతీతం. అనేకమంది ఆత్మ ఉనికిని, భగవంతుని ఉనికిని తెలుసుకోవడానికి ప్రయత్నించారు. అయితే తను విజ్ఞత వల్ల వారికేమీ తెలియలేదు. తెలివితేటలు కొన్ని సమయాలలో జ్ఞాన సముపార్జనకు ఉపయోగించవచ్చు. దానిమీదే ఆధారపడే మానవుడు తనను గురించి తెలుసుకోలేడు. ఆహార పదార్థం తినడం వల్ల కలిగే ప్రయోజనాలు తెలిసిన వ్యక్తి తన తెలివితేటలతో తాను తిన్న ప్రయోజనాన్ని నిజంగా

పొందలేడు. ఆత్మ పరమాత్మ జ్ఞానకారకాలు. అంతర్లీనం. అందువల్ల తెలివితేటలు వ్యక్తపరచలేవు. భగవంతుని తెలుసుకోవడంలో రెండు స్థాయిలున్నాయి. (1) విశ్వాసం (2) విశ్వాసం వల్ల కలిగిన అనుభవం. గొప్ప గురువుగా పేరు పొందినవారు తమ అనుభవాల ద్వారానే భగవంతుని తెలుసుకున్నారని చెప్పవచ్చు. ప్రపంచం చాలావరకు వివేకహీనులమయం. అయినా విశ్వాసం నుంచే ఉత్పన్నమవుతారు. మనం వారి విశ్వాసాన్ని పంచుకుంటే భగవంతుని గురించిన అనుభవాన్ని పంచుకున్నట్లే. బధిరుడు తన తోటి మానవుని కళ్లతో చూడగలడేగాని, వినలేడు. కాని అవతలవాడు వినేటట్లుగా చెప్పగలిగితే తేలిక అవుతుంది. అదేవిధంగా భగవంతుడు తర్కానికి అందడు అని చెప్పడం కూడా అజ్ఞానాన్ని మరచిపోవడమే. భగవంతుణ్ణి మనం ఇంద్రియాలతో గ్రహించలేము. తెలివితేటలతో అర్థం చేసుకోలేము. మన కళ్లతో వినలేము కదా ! అసలు భగవంతుణ్ణి గుర్తించుటకు మనశ్శక్తి అవసరం. ఆ మనస్సుకి విశ్వాసం అవసరం. ప్రతిక్షణం జ్ఞానం వక్రీకరించబడవచ్చు. కాని నిజమైన విశ్వాసం త్రోవ తప్పదు.

*ఎంపికచేసిన లేఖలు - 2 పుట 11-12, 5-5-1932*

★ ★ ★

జీవన్మరణాలు ఒకే నాణెము యొక్క రెండు ముఖాలు. అదేవిధంగా మనం ఎంత సంతోషంగా జీవించగలమో, అంతే సంతోషంగా మరణించవలసి యున్నప్పటికి, ప్రాణం వున్నంతకాలం శరీరానికి అవసరమైనదంతా యివ్వ వలసిందే. అది భగవంతుని నిర్దేశం. దాన్ని గురించి మనం శ్రద్ధ వహించ వలసియున్నది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 124, 22-5-1932.*

★ ★ ★

ప్రారంభంలో నాలో విశ్వాసం లేదు నేను మతాల్ని అధ్యయనం చేసి, ధ్యానించి దాన్ని సాధించుకున్నాను. భగవంతుడు నా హృదయంలో వున్నాడనే విషయాన్ని గుర్తించిన కొద్దీ నా హృదయంలో విశ్వాసం రోజు రోజుకు అధికమవుతుంది. కాని నా అనుభవం యింకొకరికి ఉపయోగించదు. నిరంతరం ప్రయత్నిస్తేనే విశ్వాసం కలుగుతుంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 125, 23-5-1932.*

★ ★ ★

భగవంతుడు అంటే సత్యం. గత కొన్ని సంవత్సరాలుగా నేను భగవంతుడే సత్యమను విషయానికి బదులు సత్యమే భగవంతుడు అని చెబుతూ వస్తున్నాను. సత్యమే భగవంతుడు అను ప్రకటనలో యదార్థం వున్నది. యీ ప్రపంచంలో సత్యందప్ప మరొకటి లేదు. యిక్కడ సత్యమను శబ్దానికి విస్తృతార్థం అన్వయించడం అవసరం. యిందు పూర్తి జ్ఞానం వున్నది. భగవంతుడు సత్యంవలె, సిద్ధాంతం వలె భిన్నం కాదు. రెండూ ఒకటే. అందువల్ల అందులోనే పూర్తి జ్ఞానం వున్నది. నిజానికి ప్రపంచం సత్యం యొక్క కార్యమే. విధి యొక్క శాసనమే. ఈ సత్యంలో అనంతమైన శక్తి నిండివున్నది భగవద్గీత భాషలో (10వ అధ్యాయం) సత్యము యొక్క అంశ వల్లే విశ్వం నిలచివున్నది. అందువల్ల భగవంతుడు అను శబ్దం యొక్క స్థానంలో సత్యం అనే శబ్దాన్ని ప్రతిచోట పెట్టినట్లయితే నేను అనేకునేది కొంత నీకు అర్థం కావచ్చు.

భగవంతుడు వుంటే మన ధర్మం అతణ్ణి ఆరాధించటమే. మనం అతణ్ణి సత్యంగా గుర్తించినప్పటికీ మనం దేనిని ఆరాధిస్తామో అందు పరివర్తన తప్పదు. అదే ప్రార్థన యొక్క విస్తారమైన సంపూర్ణ అర్థం. సత్యం మానవుని హృదయంలో స్థిరంగా వుంటుంది. కాని మనం దానిని వేరే విధంగా గుర్తిస్తాము. లేదా అసలు గుర్తించము కూడా. నిజమైన ప్రార్థన అటువంటి సాక్షాత్కారానికి మార్గం చూపుతుంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటి 1, పుట 160. 13-6-1932.*

★ ★ ★

జీవిత పరమార్థం ఆత్మ సాక్షాత్కారమే. మనలను మనం మిగతా అన్ని జీవులనుంచి విడిగా గుర్తించగలిగినప్పుడు ఆత్మ సాక్షాత్కారాన్ని పొందగలం. జీవితమే భగవంతుడు. అందువల్లనే మనం మన పరిధిలోని భగవంతుని గుర్తించుట అవసరం. మన ఈ వివేకమే అవధుల్లేని స్వార్థరహిత సేవ.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటి 1. పుట 184, 21-6-1932.*

★ ★ ★

నా ఆత్మ చింతన యొక్క వృద్ధి మన తల మీది జుట్టులాగా వృద్ధి పొందుతున్నట్లు కనపడదు.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటి 3, పుట 275, 7-8-1932.*

★ ★ ★

భగవంతుని సేవకుల కష్టములు వారికి ఆనందమే కలిగిస్తాయి. భగవంతుడు వారిని పరీక్షించి పవిత్రీకరించడానికి ఉపకరించునవి ఆ కష్టములు. భూమి మీద కష్టాలు లేని ఆనందం మన ముక్కుపుటాలకు అడ్డుపడి బాధ కలిగిస్తుంది. కష్టములు అను ప్రాణవాయువును అందనీయక మరణించేలా చేస్తుంది.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 34, 9-10-1932.*

★ ★ ★

భగవంతుడు మన రక్షకుడు అయినప్పుడు మనం భారం వహించడం ఎందుకు ? మనకు కేటాయించిన పని చేయుటయే మన విధి.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 35, 22-10-1932.*

★ ★ ★

మనం ఉంటే భగవంతుడు కూడా ఉన్నట్లే. సూర్య కిరణాల సముదాయమే సూర్యుడు. అదేవిధంగా జీవులందరూ కలిసి భగవంతుడు. ఈ భగవంతుని మీద విశ్వాసం ఉండాలంటే నీ మీద నీకు విశ్వాసం ఉండాలి. అట్టి విశ్వాసం ఉండాలంటే స్వలాభాపేక్ష లేని మానవసేవ అవసరం. లేదంటే మొత్తం ప్రపంచం విశ్వసిస్తున్నది కనుక మనం కూడా భగవంతుని విశ్వసించాలి.

*ఎంపిక చేసిన లేఖలు - 2 పుట 32, 19-12-1932.*

★ ★ ★

భగవంతుని మీద పరిపూర్ణ విశ్వాసం ఉండటం ఆయనను దర్శించుటకే. నాలుగో కోణాన్ని అన్వయించడం ఏ మాత్రం సహాయకారి కాదు. అది చివరగా చూపించేటటువంటిది. మొదట భగవంతుని రాజ్యమును కోరు. అన్నీ దానంతట అవే నీకు లభిస్తాయి. మనం భగవంతుని కలుసుకోగలిగితే ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తాం. అటువంటి స్థితిలో సర్పభయం గాని, దగ్గరవారు మరణించారనే దు:ఖం కాని ఉండవు. భగవంతుని సమక్షంలో మరణము, పాము కాటు ఉండదు. పూర్తి నిర్భయత్వం లేకపోవడం లేక ఆత్మ శరీరగతం కావటం ఒక ఆటంకం. అది ఒక విభజించే గోడవంటిది. అందువల్ల మనం మన భయాన్ని వదిలించుకొనుటకు ప్రయత్నించాలి. అంటే మన విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి.

*మీరాకు బాపూ లేఖలు - పుట 31, 22-12-1932.*

★ ★ ★

మనమే ప్రపంచం. మనం అందులో ఉన్నాం. అది మనలో ఉన్నది. భగవంతుడు కూడా మనలో ఉన్నాడు. మన కళ్ళు, మన ఊపిరిని చూడలేవు. కాని దానిని గ్రహించే శక్తి మనలో ఉన్నది. భగవంతుని గ్రహించగల శక్తిని అభివృద్ధిపరచుకొనుట సాధ్యమే. మనం అందులో సఫలం అయినచో, మనం భగవంతుని గుర్తించగలం.

*ది గాంధియన్ కాపిటలిస్టు - పుట 150, 11-1-1933.*

★ ★ ★

నీలో భగవంతుని యెడల విశ్వాసం జీవించేయుంటే ఎప్పటికీ విఫలం కాని ఎల్లప్పుడూ రక్షించే భగవంతుని ఉనికిని నీవు గుర్తించగలవు. ఆ స్థితిని చేరుకునేదాకా రక్తమాంసాలు కలిగిన వ్యక్తులపై నమ్మకం కూడా వ్యర్థమే. అది విరిగిపోయిన వెదురు బొంగు సహాయం తీసుకోవడం వంటిది. మొట్టమొదట దీన్ని గురించి కూలంకషంగా యోచించి హృదయాన్ని వివేకంతో సహకరించేలా చేసుకోవాలి.

*మీరాకు బాపూ లేఖలు - పుట 260, 4-5-1933.*

★ ★ ★

మనకు భంగవంతుడు చిత్రవిచిత్రంగా తోచినప్పుడు అయన చేసిన కార్యాలు మనల్ని ఎందుకు గందరగోళపరచాలి ? ఆయన మనం కోరుకున్నట్లు చేసేటట్లయితే లేదా ఆయన మనలాగా వ్యవహరించినట్లయితే మనం ఆయన చేత, సృజింపబడిన వారమూ కాదు, ఆయన చుట్టూ ఉన్న చీకట్లు మనకు శాపమూ కాదు, వరమే. ఆయన మన ముందు ఉన్న సోపానాలను గ్రహించే శక్తి యిచ్చాడు. భగవత్ప్రకాశం మనకు ఆ సోపానాలు కనిపించేటట్లు చేస్తే చాలు. మనం న్యూమాన్‌తోపాటు "ఒక సోపానం నాకు చాలు" అని గానం చేయవచ్చు. దానివల్ల మనం తప్పకుండా పాత అనుభవాలను బట్టి తరువాతి సోపానం కనపడుతుందనే నిర్ధారణకు రావచ్చు. వేరే మాటల్లో చెప్పవలెనంటే మనం అనుకునే చీకటి విచ్ఛిన్నం చేయలేనిది కాదు. మనం మన అసహనంతో మొదటి మెట్టును వదిలి పై మెట్టు చూడడానికి ప్రయత్నించినప్పుడు అట్లా అనిపిస్తుంది. భగవంతుడు ప్రేమస్వరూపుడు కావడంవల్ల ఆయన పెట్టే శారీరిక బాధలన్నీ ఆశా కిరణాలవంటివే. అవి చింతనకు, స్వపవిత్రీకరణకు హెచ్చరికలుగా భావించే వారికి అనిపించుతాయి.

*మైడియర్ చైల్డ్ - పుటలు 104-05, 31-3-1934.*

★ ★ ★

భగవంతుడు మనల్ని శిక్షించటానికి చూడడు. సక్రమ మార్గంలో పెట్టటానికి ప్రయత్నిస్తాడు.

ఎంపికచేసిన లేఖలు - సంపుటి 1, పుట 17.

★ ★ ★

మనల్ని కదిలించు శక్తి భగవంతుడే. ఏవిధంగా 'కీ' అయిపోయినపుడు వాచీ ఆగిపోతుందో అదేవిధంగా మన 'కీ' అయిపోయినపుడు మన బండి ఆగిపోతుంది. అది కదిలేటప్పుడు మనకు కొంత స్వతంత్రం వున్నదని భావిస్తూ ఉంటాము. ఆ స్వాతంత్ర్యాన్ని మనం భగవంతునియొక్క ఉద్దేశ్యాన్ని నెరవేర్చడానికి ఉపయోగించుదాము.

*ఎంపిక చేసిన లేఖలు - 2, పుట 23.*

★ ★ ★

నాకు భగవంతుడు సత్యమనే తెలుసు. కొన్ని సమయాల్లో నీకు భగవంతుని ఉనికి గురించి సందేహం ఉండేది. కాని సత్యము యొక్క ఉనికి గురించి నాకు సందేహం ఎప్పుడూ లేదు. ఈ సత్యము అనునది భౌతికమైనది కాదు. పూర్తిగా జ్ఞానమే. అది విశ్వాన్ని పరిపాలించగలది. అందువల్లనే అది ఈశ్వరుడు లేదా భగవంతుడు .....

ఇది నాకు పూర్తిగా అనుభవంతో తెలిసిన విషయం.

*ఎంపిక చేసిన లేఖలు-1. పుట 38.*

★ ★ ★

భగవంతునకు, సత్యమునకు రెండింటికీ స్వరూపం లేకపోవడం వలన సత్యమే భగవంతుడని నేను చెప్పటం లేదు. కాని సత్యమే భగవంతుని స్థూల సంపూర్ణ లక్షణము అగుటవలన అట్లా చెపుతున్నాను. మిగతా లక్షణాలన్నీ అసంపూర్తి ప్రకటనలే.

*ఎంపిక చేసిన లేఖలు - 1, పుట 5.*

★ ★ ★

సత్యమును చూచుట వలన మనం చాలావరకు ప్రమాదాలను అధిగమించ గలుగుతాము. భగవంతుని దర్శించటం, అర్థం చేసుకోవడం కష్టం. కాని సత్యాన్ని చూచుటకు అటువంటి ఇబ్బంది ఉండదు. సత్య దర్శనం కష్టతరమైన విషయమే.

కాని, మనం సత్యానికి దగ్గరవుతున్న కొద్దీ చూచాయగా భగవంతుడనే సత్యాన్ని దర్శించగలుగుతాము. దాంతో ఆయన యొక్క సత్ స్వరూపాన్ని పూర్తిగా దర్శించగలమనే ఆశ ఉత్పన్నమవుతుంది. దాంతో విశ్వాసం అధిక మవుతుంది.

*ఎంపిక చేసిన లేఖలు - 1, పుట 56*

★ ★ ★

మనకు ఎంతమంది సహ కార్యకర్తలున్నప్పటికీ భగవంతుడు ఒక్కడే మన స్నేహితుడు కాగలడు. భగవంతునితో మన స్నేహం ఏర్పడితే, అనేకమంది మనుష్యులతో స్నేహం ఏర్పడవచ్చు. యిది నా అనుభవం.

*ఎంపిక చేసిన లేఖలు - 1, పుట 43.*

★ ★ ★

మానవుడు అధీశ్వరుని దర్శించటం పూర్తిగా యిష్టానిష్టాల నుంచి విడుదల కావడం వల్లనే సాధ్యం. నా ఉద్దేశ్యంలో ఎవరు భగవత్ సాక్షాత్కారం పొందాము అని చెపుతారో వారు తమ గమ్యానికి చాలా దూరంలో వుంటారు. సాక్షాత్కారం అనుభవైకవేద్యమే గాని భాషకు అందునది కాదు.

నేను భగవంతుని మీద గల విశ్వాసంతోనే జీవించగలను. నా ఉద్దేశ్యంలో భగవంతుడు, సత్యం. భిన్నం కాదు. సత్యమే భగవంతుడు.

*ఎంపిక చేసిన లేఖలు - 1, పుట 51.*

★ ★ ★

మనలో మనం ఎంత విశ్వాసంతో ఉంటామో అంతే విశ్వాసం భగవంతుని ఉనికియందు కలిగి ఉండాలి. ప్రాణులు ఏవిధంగా నిజమో అదే విధంగా మొత్తం జీవ సముదాయం కలిగిన భగవంతుడు కూడా నిజం.

మనలో మనకు అవిశ్వాసం ఉంటే ఎంత ప్రమాదమో అంతే ప్రమాదం మనకు భగవంతుని మీద అవిశ్వాసం వుంటే కలుగుతుంది. అంటే భగవంతుని మీద విశ్వాసం లేకపోవడం ఆత్మహత్యా సదృశం అన్నమాట. భగవంతుని మీద నమ్మిక ఒకటి, అట్టి నమ్మకంతో జీవించుట రెండవది. నిజానికి ప్రపంచంలో నాస్తికుడు లేడు.

*ఎంపిక చేసిన లేఖలు -1. పుట 51.*

★ ★ ★

## 2. మతము - గ్రంథములు

భగవద్గీతలో ఎక్కడా చర్మాంగాలను నిరోధించ గలిగి, మనస్సును నిగ్రహించలేకపోయినా మనస్సుని గ్రహించగలిగే దాకా శరీర అవయవాలను ఉపయోగించవచ్చునని లేదు. అట్లా ఉపయోగించటాన్ని యధేచ్ఛా విహారం అంటారు. మన శరీరాన్ని నిరోధించగలిగితే మనస్సు బలహీనమయినా, మనస్సును బలపర్చుకోవలెనని కోరుకుంటే తప్పక సాధించగలుగుతాము.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 10, పుట 248, 10-5-1913.*

★ ★ ★

ప్రపంచం మొత్తంలో ఒకే మతం లేదు. ఆ విధంగా ఉండాలని కూడా లేదని నా వ్యక్తిగతాభిప్రాయం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 12, పుట 94, 30-5-1913.*

★ ★ ★

మతములను పోల్చుట అనవసరం. ముందు తమ మతాన్ని అర్థం చేసుకొని ఇతరమతాల్ని అధ్యయనం చేయవలసి ఉంటుంది.

జీవనసూత్ర లక్షణంగా దయాగుణాన్ని తీసుకోవచ్చు. జీవనపథంలో ఎంత ఎక్కువ దయకు అవకాశం ఉంటుందో అంతగా మతం అందుబాటులో ఉన్నట్లు లెక్క. ఆస్తికత్వపు వ్రేళ్ళు దయాగుణంలో ఉంటాయి. అదే ప్రతివారికి ఉపదేశించవలసిన మొదటి సూత్రం. రెండోది బ్రహ్మమే వాస్తవము. కనపడే ప్రపంచమంతా అవాస్తవమే. ఏ ఒక్క సూత్రమూ అందరికీ వర్తించదు. ఎవరు ఆత్మాన్వేషణలో ఉంటారో వారికి సరైన సూత్రం దానంతట అదేసరైన సమయంలో పెదవులతో పెనవేసుకుపోతుంది.

నిజానికి మనుషులు ఎంతమంది వున్నారో అన్ని మార్గాలు ఉన్నాయి. మనుష్యులలో భేదాలు (లక్షణాలు) ఉన్నంతవరకు వారి మార్గాలూ వేరుగానే ఉంటాయి. ఎవరు తనలోని ఆత్మకు ఇతరులలోని ఆత్మలకు అభేదాన్ని గుర్తించగలరో వారు మతాలలోని అభేదాన్ని కూడా చూడగలుగుతారు.

ఆత్మ శరీరం నుంచి విడిపోతే మోక్షాన్ని పొందినట్లే. ఆ స్థితి వర్ణించటానికి కుదరనిది. అది అనుభవైకవేద్యము. దయ్యాలు, భూతాలు మనుషుల యొక్క చెడు నడతయే. ఎవరు చెడు పనులు చేస్తారో వారు [illegible] పొందుతారు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12 పుట 127, 2-7-1913.*

★ ★ ★

దావీదు కీర్తనలు అర్థం చేసుకోదగినవి. అందులో అతడు చెడు యొక్క నాశనాన్ని కోరుకుంటాడు. అతడు వాటిని భరించలేకపోయాడు. అదే విషయం రామాయణంలో గూడా కనపడుతుంది. దేవతలు, రాక్షసుల[2] సంహారం కోసం ప్రార్థిస్తారు.

జయరామ రామ[1] అనే ప్రార్థనకు ఆ భావమే ప్రేరణ. ఆ కీర్తన యొక్క ఆముష్మిక సంబంధీకులు దావీదు, అర్జునుడు. భగవల్లక్షణాల ప్రతీకలు. దుర్యోధనాదులు (రాక్షసాంశలు) నాశనమును కాంక్షించువారు. సాత్విక భావన. భక్తిలో ఉన్నప్పుడే కలుగుతుంది. జ్ఞానస్థితిక చేరుకున్నప్పుడు మిగతా రెండు గుణాలు అణగారిపోయి నిజమైన స్పృహ కలుగుతుంది. నిజమైన జ్ఞానమే మిగులుతుంది. ఈ స్థితి బైబిలు నందు కనపడదు. దావీదు సంపూర్ణుడు కాకపోయినప్పటికీ అతడు (దాస) భక్తుడు. ఆయన కీర్తనలలో ఆయన భావనలు సులభమైన భాషలో వ్యక్తీకరించబడ్డాయి. గొప్పవాడైనప్పటికీ భగవంతుని ముందు తనని తాను గడ్డిపోచగా భావించుకున్నాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 407, 12-4-1914.*

★ ★ ★

జీవితంలో నిజమైన గమ్యం తన స్వాభావిక ప్రేరణల మీద నియంత్రణాధికారాన్ని సంపాదించడమే. అదే ధర్మం.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 14, పుట 385, 1-5-1918*

★ ★ ★

నా అభిరుచి మతసంబంధమైనదే తప్ప రాజకీయ సంబంధితం కాదు. నేను రాజకీయాలలో పాల్గొంటున్నానంటే మతంతో సంబంధం లేనిదేదీ జీవితంలో లేదని

భావించటం వల్లనే. అదీకాక రాజకీయాలు ప్రతి విషయంలో కీలకమై భారతదేశ అస్థిత్వానికి సంబంధించినవి కావడం వల్లనే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 16, పుట 5, 4-8-1919.*

★ ★ ★

నన్ను నేను హిందువుగా భావించుకుంటూ ఉంటాను. నాకు హిందూ ధర్మంలోని సత్యాన్ని గురించి నిజమైన గ్రహింపు ఉన్నట్లు నమ్ముతాను. నేను నేర్చుకున్న అమూల్యమైన పాఠం ఎదుటి వారు హిందువులుగా మారాలని కోరుకొనకపోవుటయే. అయితే వారు వారి వారి విశ్వాసాలకు మంచి ఉదాహరణలుగా ఉండాలని మాత్రం కోరుకుంటాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 16, పుట 477, 13-1-1920.*

★ ★ ★

గాయత్రీమంత్రాన్ని రోజూ నియమిత కాలంలో హృదయపూర్వకంగా పఠించినట్లయితే వచ్చే ఫలితం రోజూకానీ, అప్పుడప్పుడు గాని నియమరహితంగా చేస్తే పొందలేరు. జీవితంలో అభివృద్ధి నియమం ప్రకారం జీవితాన్ని నియంత్రించు కుంటేనే సాధ్యపడుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 17, పుట 526, 13-2-1920.*

★ ★ ★

గొప్ప తపోధనులు[2] చెప్పినట్లుగా వేదాలు అధ్యయనం చేసి ధర్మాన్ని ఆచరణలో పెట్టలేనివారు విద్యా గర్వితులే కాని వారు తమను తాము ఉద్ధరించుకోలేరు. మనకు సహాయపడలేరు. నేను ఎప్పుడూ కూడా వేదాలు వేదార్థాలు వల్లె వేసుకొనే వారి వల్ల ప్రభావితం కాలేదు. వారి విద్వత్తుకు ఆశ్చర్యపడలేదు. దాని కంటె విలువగలది నా అల్పజ్ఞానమేనని భావిస్తాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 19, పుట 98, 11-12-1920.*

★ ★ ★

నిజమైన మతం ప్రపంచంలో జీవితమందు ఒక గొప్ప విషయం కావడం వల్ల దానిని అతి ఎక్కువగా ఉపయోగించుకోవడం జరిగింది. ఉపయోగించుకొనే వారిని

ఉపయోగించుకోవటాన్ని గమనించి నిజాన్ని కోల్పోయిన వారు దానితో పూర్తిగా విసిగిపోతారు. కాని మతం ప్రతివారికి అవసరమైన విషయం కాని ఏ పేరుతో పిలిచినప్పటికీ తీవ్రమయిన బాధలలో కూడా హృదయానికి సాంత్వన కలిగించువాడు భగవంతుడు ఒక్కడే.

*లేఖా గుచ్ఛము, పుట 43, 25-4-1925.*

★ ★ ★

మానవుడు చెడ్డ పనులు చేసినంత కాలం అపవిత్రుడని, భగవంతుని ముందు నిలుచుటకు, అనర్హుడని మతము ప్రకటిస్తుంది. కాబట్టి మీలో ప్రతివారి మొదటి విధి చెడును అంగీకరించి, మారతానని ప్రమాణం చేసి, తమని తాము ఆ చెడుమార్గం నుంచి సంస్కరించుకోవడమే.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 47, 26-9-1927.*

★ ★ ★

సత్యం కోసం, పవిత్రత కోసం మనం ఇతరులను చంపకూడదు. మనం సత్యం కోసం మరణించుటకు సిద్ధపడాలి. పిలుపు వచ్చినప్పుడు మన జీవితాన్ని త్యాగం చేసి మన సత్యం మీద మన రక్తపు ముద్రవేయుటకు సిద్ధపడాలి. నా ఉద్దేశ్యంలో అన్ని మతాలసారమూ యిదే.

*రాజకుమారి అమృతకౌరుకు లేఖలు - పుట 223.*

★ ★ ★

పునర్జన్మ గురించి చెప్పేది నిర్దుష్టము. మనకు పూర్వజన్మ స్మృతి లేకపోవుట ప్రకృతి ధర్మం. మన అసంఖ్యాక జన్మలను తెలిసిన భగవంతుడు ఎక్కడ? మనకు ఆ పూర్వ జన్మ స్మృతులన్నీ తెలిసి ఉంటే భరించడం చాలా కష్టము తెలివిగలవాడు అనేక విషయాలను మరిచిపోతాడు. ఒక న్యాయవాది తను వాదించిన అన్ని కేసులను వాదనలు అయిపోయిం తరువాత మరచిపోయినట్లుగా. "మరణం ఒక నిద్ర. ఒక మరుపు".

*మీరాకు బాపూ లేఖలు - పుట 154, 25-1-1931.*

★ ★ ★

పిండమే మన శరీరం. బ్రహ్మాండం విశ్వం. మన శరీరంలో ఉన్న ప్రతిదీ విశ్వంలో కూడా ఉంటుంది. శరీరంలో లేనిది విశ్వంలో లేదు. మన శరీరం మట్టి. భూమి మీద పంచభూతాలున్నాయి. (పృథ్వి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము) అదేవిధంగా భూమిమీద అనేక రకాలైన ప్రాణులున్నాయి. అదేవిధంగా అనేక కణాలు శరీరంలో ఉన్నాయి. శరీరం మరణిస్తుంది. మళ్ళీ జన్మిస్తుంది. అదేవిధంగా భూమి కూడా రూపాంతరం చెందుతుంది. దీనిని బట్టి నిజమైన జ్ఞానం మన శరీరాన్ని గురించి ఉన్నట్లయితే మనకు విశ్వాసాన్ని గురించి కూడా జ్ఞానమున్నట్లే. దాని కోసం దూరప్రాంతాలకు పోయి అన్వేషించనవసరం లేదు. శరీరం మన చేతుల్లోనే ఉంది. మనం దాన్ని పట్టుకున్నట్లయితే, మన లక్ష్యాన్ని చేరినట్లే. అదే మనం విశ్వాన్ని గురించి తెలుసుకోవాలనుకుంటే పొందే జ్ఞానం. అసంపూర్తిగా మిగిలిపోతుంది. అందువల్ల తెలివైనవారు ప్రపంచంలో శరీరంలో లేనిదేదీ లేదనీ. మనం మనల్ని గురించి తెలుసుకున్నట్లయితే, ఆ జ్ఞానమే ప్రపంచంలోని మొత్తం జ్ఞానాన్ని కలిగిస్తుందని చెపుతారు. కాని మనలను మనం తెలుసుకోవడంలో కొన్ని ఇతర విషయాలను కూడా తెలుసుకొనవలసి వస్తుంది. ఆ తెలుసుకొన్న విషయాలలో మనకు ఆనందాన్ని ఇచ్చే వాటిని వుంచుకొనే హక్కు మనకు ఉంటుంది. అది కూడా మనలను మనం తెలుసుకొనుటలో భాగమే.

మనం చారిత్రక కృష్ణుని, గీతలోని కృష్ణుని కలుపకూడదు. చారిత్రక కృష్ణుడు హింస అహింసలను చర్చించడు. అర్జునుడు చంపటానికి వ్యతిరేకం కాదు. కాని తన సొంత బంధువులను చంపుటకు మాత్రమే వ్యతిరేకం. అందువలన కృష్ణ భగవానుడు మన విధి నిర్వర్తించడంలో మన బంధువులైనప్పటికీ బయటివారుగానే భావించాలని చెప్పారు. గీతాకాలంలో యుద్ధం చెయ్యాలా వద్దా అనే మీమాంస ఎవరికీ ఉత్పన్నం కాలేదు. ఈ మధ్య కాలంలో ఉత్పన్నం అయింది. హిందువులు అందరూ అహింసాపరులే. ఏది హింస? ఏది అహింస? అనునదే చర్చ. చాలా విషయాలు మనం అహింస అనుకొనునవి తరువాతి తరాల వారికి హింసగా అనిపించవచ్చు. మనం పాలను. ధాన్యాలను ఆహారంగా తీసుకొనునప్పుడు జీవిని నాశనం చేస్తున్నాము.

అందువల్ల తరువాత తరం వారు పాల ఉత్పత్తిని ధాన్యాల ఉత్పత్తిని ఆపివెయవచ్చు. పాలను, ధాన్యాలను తీసుకొంటూ మనల్ని మనం అహింసా వాదులంగా ఎలా భావిస్తున్నామో అదేవిధంగా గీతా కాలంలో యుద్ధం గురించి భావించారు. అంటే అది అహింసకు వ్యతిరేకమని ఎవ్వరూ భావించలేదన్నమాట. అందువల్ల గీత యుద్ధాన్ని ఉదాహరణగా తీసుకోవడంలో తప్పు కనపడటం లేదు. మనం భగవద్గీతను మొత్తాన్ని అధ్యయనం చేసి, స్థిత ప్రజ్ఞుడు, బ్రహ్మ, భూతము, భక్తుడు, యోగి మొదలయిన పర్లసలను గమనించినప్పుడు గీతాకృష్ణుడు అహింసావాదిగానే మనకు కనబడతాడు. అర్జునునకు యుద్ధం చేయమనే ఉపదేశం ఆయన గొప్పదనాన్ని ఏమాత్రం తగ్గించదు. రెండోవిధంగా ఆయన అర్జునుని యుద్ధ విముఖునిగా చేసినట్లయినచో మనం ఆయన జ్ఞానం అసంపూర్ణమయిందని నిర్ధారణ చేసుకొని వుండేవారం. అంతేగాక ఆయన యోగీశ్వరేశ్వరుడు గాను పూర్ణ అవతారుడు గాను పిలువ బడుటకు అర్హుడుగా ఉండి ఉండేవాడు కాడు.

*మహదేవదేశాయ్ డైరీ - సంపుటి 1, పుట 93-94, 28-4-1932.*

★ ★ ★

తులసీదాసు యొక్క అభిప్రాయంలో రామనామము రాముని కంటె ఉన్నతమైనది. రామ శబ్దానికి దాని అర్థానికి సంబంధం లేదు. దాని అర్థం భక్తుని యొక్క దీక్ష మీద విశ్వాసం మీద ఆధారపడి ఉంటుంది. అదే ఆ పునశ్చరణ యొక్క సౌందర్యం. లేనిచో అవివేకి కొత్తమనిషిగా మారునని ఋజువు పరుచుట అసాధ్యం. భక్తుడు ఒకే నియమాన్ని పాటించాలి. నామపునశ్చరణ కోసమో లేక యితరులను మోసగించుటకోసమో కాకుండా అకుంఠిత దీక్షతో విశ్వాసంతో చేయాలి. ఎవరైనా పట్టుదలతో పునశ్చరణ చేసేటట్లయితె ఫలితం పొందుతారు. నాకు లేశమాత్రం సందేహం లేదు. ఓర్పుగల ప్రతివారు దీన్ని గుర్తించగలుగుతారు. మనస్సు వికలమైపోవచ్చు. అశాంతగా వుండవచ్చు. శరీరం నిద్రను కోరవచ్చు. ఈ పునశ్చరణ చేసేవాళ్ళలో నిజానికి యింకా బాధాకరమైన లక్షణాలు కనపడవచ్చు. అయినా

అన్వేష యింకా పట్టుదలతో పునశ్చరణ జరిపినట్లయితే తప్పక సాఫల్యం పొందవచ్చు. వడుకుట పూర్తిగా ఐహిక విషయమైనప్పటికీ అది ఓర్పుతో ప్రయత్నించినప్పుడే సాధ్యపడుతుంది. రాట్నం వడకటం కంటే కష్టమైన పనులు గట్టి ప్రయత్నం వల్లనే సాధ్యపడతాయి. సర్వోన్నతుని చేరుకోవడానికి అన్వేషించే వారు అవసరమైన క్రమశిక్షణను చాలాకాలం అవలంబించవలసి ఉంటుంది. నిస్పృహకు లోనుకాకూడదు.

*మహదేవదేశాయ్ డైరీ - సంపుటి 1, పుట 120-121 20-5-1932.*

★ ★ ★

ఆరో అధ్యాయంలో చెప్పినట్లుగా ఏ కొంచెం ఆధ్యాత్మిక ప్రయత్నం వృధా కాదు. అన్వేషకులు, జన్మలో యీ సాధనను మూలంగా తీసుకొని ముందుకు పోతారు. అదేవిధంగా పట్టుదల ఉండి శక్తి లేకపోయినట్లయితే మరుజన్మలో వాతావరణం యీ పట్టుదలను పెంచేదిగా ఉంటుంది. ఈ విషయం యీ జన్మలో విశ్రాంతి తీసుకొనమని కాదు. ఒకవేళ అట్లాచేస్తే. అది బాహ్యమైనదే తప్ప మానసికమైనదిగా భావింపబడదు. బాహ్యామైన నిశ్చయాలు మరణం తర్వాత ఉండవు. అందువల్ల అవి పనికిరావు. నిశ్చయం హృదయగతమైతే అది ప్రయత్నంలో ప్రతిబింబించాలి. వ్యక్తిగత శారీరిక బలహీనతలు నిరోధించేందుకు ప్రయత్నిస్తాయి. అయినప్పటికి ఆత్మ ఈ శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళినప్పుడు ఆ మంచి నిశ్చయాన్ని తీసుకొనిపోయి, పునర్జన్మయందు కార్యరూపం దాల్చేటట్లు చేస్తుంది. అందువల్ల మంచి చేసినవాడి అభివృద్ధి తప్పక జరుగుతుంది.

జ్ఞానేశ్వరుడు (మధ్యయుగ ప్రవక్త. 16 సంవత్సరాల వయస్సులో జ్ఞానేశ్వరి గ్రంథకర్త) నివృత్తిని తన జీవితకాలంలో ధ్యానించి వుండవచ్చు. మనం ఆ ఉదాహరణ తీసుకొనరాదు. మనం ఎవరిని ధ్యానిస్తామో వారు పరిపూర్ణ వ్యక్తియై ఉండాలి. అటువంటి పరిపూర్ణత్వాన్ని జీవించియున్న వ్యక్తులకు ఆపాదించుట అసంగతం. అనవసరం కూడా. జ్ఞానేశ్వరుడు నివృత్తిని ధ్యానించడంలో ముఖ్యంగా నివృత్తి ఎట్లా ఉన్నదని కాక ఎట్లా ఉండాలి అనే విషయం అయి వుండవవచ్చును. అటువంటి శక్తి మనవంటి వారికి ఉండదు. జీవించియున్న వ్యక్తులందు ధ్యానించాలనే కోరిక ఉత్పన్నమైనపుడు మన మనస్సులో ఆ వ్యక్తి ముద్రకు అవకాశం ఉండదు. ఒకవేళ

ఆ ప్రశ్నకు సమాధానం దొరికిన యెడల అటువంటి ముద్రను దృష్టిలో ఉంచుకొని అటువంటి పరిస్థితి పృచ్ఛకుని మానసిక గందరగోళానికి దారితీస్తుంది.

గీత యొక్క మొదటి అధ్యాయంలో యివ్వబడిన పేర్లన్నీ నా ఉద్దేశ్యంలో గుణాల నామధేయాలే తప్ప విశేషణాలు కావు. దైవీ గుణాలకు. రాక్షస గుణాలకు మధ్య సంగ్రామాన్ని తలపింపచేయడానికి కవి వాటిని వ్యక్తీకరించి మహాభారతంలో పాత్రలుగా వ్రాయటం జరిగింది. అంటే నిజంగా హస్తినాపురంలో పాండవులకు, కౌరవులకు మధ్య జరిగిన యుద్ధాన్ని నిరాకరించుటకు అలా కవి చేశాడని భావించకూడదు. నా అభిప్రాయంలో కవి అటువంటి దారపు పోగు నొకదాన్ని ఆధారం చేసుకొని యీ ఉపదేశాన్ని పేనుట జరిగింది. నేను తప్పు కావచ్చును. ఒకవేళ ఆ పాత్రలన్నీ నిజమయిన నాయక పాత్రలే అయినా ప్రారంభంలో కవి యివ్వటంలో అనౌచిత్యం ఏమీ లేదు మొదటి అధ్యాయం గీతా విషయం యొక్క ప్రధాన భాగం అవటం వల్ల ఆ భాగాన్ని కూడా గీతా పఠనంలో పునశ్చరణ చేయవలసి ఉంటుంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటి 1, పుట 171-72. 18-6-1932.*

★ ★ ★

నామజపము పాపాల్ని పరిహరిస్తుంది. నిర్మల హృదయంతో పునశ్చరణ చేసేవారు పాప పరిహారం తప్పక జరుగుతుందని విశ్వసిస్తారు. నామస్మరణ చేసేవారు అలసిపోరు. మొదట నాలికమీద ఉన్న నామము హృదయగతమై దాన్ని పవిత్రీకరిస్తుంది. ఇది ప్రపంచానుభవం. మానసిక శాస్త్రవేత్తల అభిప్రాయం కూడా యిదే. ఏ విధంగా ఆలోచిస్తారో ఆ విధంగా మనిషి పరివర్తన చెందుతాడు. ఈ సూత్రం నామస్మరణకు అన్వయిస్తుంది. నాకు నామజపము నందు అకుంఠిత విశ్వాసం. దానిని కనుగొన్న వ్యక్తి అనుభవం గలవాడు. ఈ అన్వేషణ చాలా ముఖ్యమైనదని నా దృఢ విశ్వాసం. పవిత్రీకరణ నిరక్షరాస్యులలో కూడా సాధ్యమే. ఇక్కడే నామజపము యొక్క ఆవశ్యకత కనబడుతుంది. (గీత, 2, 22; 10) అక్షరమాల త్రిప్పడం మానసిక ఏకాగ్రత కుదురుట కోసమే.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 275. 7 8 1932.*

★ ★ ★

నిశ్శబ్దం అనేది మనలో ఒక ముఖ్య విషయం. సమాధికి అర్థం నిశ్శబ్దం. ముని (సన్యాసి) మౌనము (సన్యాసత్వము, నిశ్శబ్దము) అనే పదాలకు మూలం ఒకటే. మనం మొదట్లో నిశ్శబ్దమును ఆచరణలో పెట్టినప్పుడు అనేక ఆలోచనలు మనస్సులోకి వస్తాయి. ఒక్కొక్కప్పుడు నిద్ర గూడా రావచ్చు. నిశ్శబ్దమే యిటువంటి లోపాలకు విరుగుడు. మనం ఎక్కువగా మాట్లాడటానికి పెద్ద పెద్ద శబ్దాలు వినుటకు అలవాటుపడ్డాము. అందువల్ల నిశ్శబ్దం చాలా కష్టమనిపిస్తుంది. కొంచెం అలవాటు చేసుకొంటే దానిని యిష్టపడతాము. మనం దానిని యిష్టపడినప్పుడు మనకు అవధుల్లేని శాంతి కలుగుతుంది. మనం సత్యాన్వేషకులం. అందువల్ల మౌనం అంటే ఏమిటో అర్థం చేసుకొని దాన్ని ఆచరణలో పెట్టాలి. మనం తప్పకుండా మౌనంలో రామనామాన్ని ఆశ్రయించవచ్చు. నిజానికి మనం మన మనస్సును అందుకు సిద్ధం చెయ్యాలి. మనం కొంచెం ఆలోచించినట్లయితే దాని విలువ గుర్తించగలుగుతాము.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటి 1, పుట 313, 28-8-1932.*



నీవు రహస్య శాస్త్రాలను గురించి నా ఉద్దేశ్యం కోరావు. నాకు వాటిఎడ అభిరుచి లేదు. జీవిత పుస్తకం సాధారణ మనస్సుల కోసం కూడా తెరచి ఉంటుంది. అట్లాగే ఉండాలి కూడా. భగవంతుని పథకంలో ఎటువంటి రహస్యం లేదు. మంత్రతంత్రాలు, రహస్య పద్ధతులు నా మీద ప్రభావం చూపించలేవు. సత్యానికి రహస్యాలు లేవు. సత్యమే భగవంతుడు.

*ఎంపిక చేసిన లేఖలు 2 - పుట 27, 30-10-1932.*



నాకేదయినా సహాయపడకపోతే యితరులకు ఉపయోగపడుతుందేమో నన్న ఆలోచనలేకుండా ముభావంగా ఉండలేను. విగ్రహారాధన లక్షలమందికి సహాయపడుతోందనుకోవడం వారు నాకంటె వెనుకబడినవారు గావడం వల్లనే నా కంటె వారియొక్క ఆలోచనా ధోరణి వేరు. నేను విగ్రహారాధనను పాపమని భావించను.

అదేకాక ఒక విధంగానో మరోవిధంగానో మన ఉనికి అందులో ఉంది. భగవంతుని ఆరాధనలో భేదం స్థాయిలోనే కాని వస్తువులో కాదు. మసీదుకు వెళ్ళటమో చర్చికి వెళ్ళటమో ఒకవిధమైన విగ్రహారాధనే. బైబిల్‌ను, ఖురాన్‌ను, గీతను గౌరవించడం విగ్రహారాధన వంటిదే. పుస్తకాన్నో. భవనాన్నో ఉపయోగించకపోయినా మనోపథంలో ఒక చిత్రాన్ని గీసి దానికి కొన్ని లక్షణాలను ఆపాదించడం కూడా విగ్రహారాధనే. రాతి విగ్రహాన్ని పెట్టుకొని ఆరాధించడం ఒక ముతక పద్ధతి అని నేను అంగీకరించను. విద్వాంసులైన న్యాయాధికారుల యిండ్లలో కూడా అటువంటి విగ్రహాలుండటం నాకు తెలుసు. మదనమోహన మాలవ్యాలాంటి వారు కూడా యింటి దేముని కొలువంది భోజనం చేయరు. అటువంటి ఆరాధనను తక్కువ చేసి మూఢనమ్మకంగా కొట్టిపారవేయడం, అజ్ఞాన గర్వంతో కూడిన పని. ఆరాధించేవాడి భావనలో భగవంతుడు పవిత్రీ కరించబడిన రాతి విగ్రహంలో ఉన్నాడు. కాని ఎక్కడ పడితే అక్కడ లేడు. చర్చిలో ఉన్న గర్భాలయ ప్రదేశం మిగతా అన్ని ప్రదేశాల కంటే పవిత్రమైనది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నయినా ఎవరికి వారే ఊహించుకోవచ్చు. ఈవాదం అంతా ఆరాధనలలో సడలింపులకోసం కాదు. కాని నిజాయితీతో చేసే ఆరాధనలన్నీ మంచివే. ప్రభావవంతమైనవే. ఏ ఒక్కరికో ఏ ఒక్క సముదాయానికో చెందిన హక్కులు అనుభవించే కాలం తీరిపోయింది. భగవంతుడు రూపాలకు శబ్దాలకు విలువనివ్వడు. ఆయన మన చర్యల్లోకి మాటల్లోకి వెళ్ళి మనకు అర్థం కాకమునుపే అర్థం చేసుకుంటాడు. అందువల్ల మన ఆలోచనలే ఆయనకు కావలసినవి.

*ఎంపిక చేసిన లేఖలు 2 - పుట 29-30. 29-11-1932.*

★ ★ ★

నిర్వాణము అని అంటే నేను అనే అహంభావాన్ని లుప్తం చేయడం. అది అనుభవేకవైద్యమే కాని వర్ణించవీలులేనిది. అది మనం ఊహించలేనంతగా భూమిమీద లభించే సర్వోత్తమమైన వరం.

*మీరాకు బాపూ లేఖలు - పుట 233, 29-12-1932.*

★ ★ ★

అత్యంత చెడు యీ ప్రపంచంలో ఏదీ లేదు. అయినప్పటికీ నేను మతాన్ని, హిందుత్వాన్ని విడువలేను. హిందుత్వం ఓడిపోయినట్లయితే నా జీవితమే నాకు భారమైపోతుంది. నేను క్రైస్తమతాన్ని, మహ్మదీయమతాన్ని అనేక ఇతర విశ్వాసాలను హిందూధర్మం ద్వారా ప్రేమిస్తాను. నాకోసం ఏమీ ఉండకుండా అన్నీ తీసుకుపోయినా నేను భరించగలను గాని అంటరానితనాన్ని భరించలేను. అదృష్టవశాత్తు హిందూ ధర్మంలో ఆ చెడుకు సర్వోత్కృష్టమైన విరుగుడు ఉన్నది. నేను అదే చేశాను.

*లేఖల గుచ్ఛము - పుట 113, 2-5-1933.*

★ ★ ★

మహాభారతం పద్య కావ్యమే కాని చరిత్ర కాదు. మనిషి హింసకు పాల్పడితే అసత్యము తప్పకుండా ప్రవేశిస్తుంది. దాన్ని కృష్ణుని వంటి వ్యక్తులే తప్పించుకోలేరని పద్యకర్త నిరూపించటానికి ప్రయత్నించాడు. తప్పు చేసినవారు ఎవరయినప్పటికీ తప్పు తప్పే.

*ఎంపిక చేసిన లేఖలు 1 - పుట 41.*

★ ★ ★

## 3. ప్రార్థన వల్ల ప్రయోజనము

భగవంతుని సహాయం కోసం గర్వంతో అహంభావంతో ప్రార్థించకూడదు. తనని తాను నిస్సహాయుడుగా భావించి తప్పులు ఒప్పుకొని ప్రార్థించాలి. ప్రక్కలో పడుకున్నప్పుడు మనం ఎంత ప్రాముఖ్యంలేనివారమో ప్రతిరోజూ నేను గుర్తిస్తాను. అదేవిధంగా ఎన్ని బంధాలు, ద్వేషాలు, చెడు కోరికలు మనల్ని వశం చేసుకుంటాయో తెలుస్తుంది. నా మనస్సు యొక్క విలువలేనితనానికి నాకు ఎంతో సిగ్గువేస్తూ ఉంటుంది. నా శరీరం యొక్క వేడికోలు, కోరికలు నశించి పోవాలని గమనించినప్పుడు నేను నిస్పృహకు లోనవుతాను. నా స్థితినిబట్టి ఇతరులయొక్క స్థితిని నిర్ణయించగలను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 65, 26-11-1918.*

★ ★ ★

మీరు రోజూ ఏదో ఒకటి క్రమం తప్పకుండా చదువుతారా? మీరు మంచం నుండి లేవగానే ప్రార్థిస్తారా? మీరు అనుమతించి నట్లయితే నాకు తెలిసినంతవరకు ప్రార్థన ఎంతమంచి చేస్తుందో చెప్పలేను. బాధలలో దాని విలువ నీవు గుర్తిస్తావు. ప్రతిరోజూ లేచింది మొదలు ఆలోచనతో చేస్తే మంచిది. ప్రార్థన మనస్సుకు ఆహారం. ఆహారం కోసం శరీరం ఎట్లా వెంపర్లాడుతుందో అదేవిధంగా మనస్సు (ఆత్మ) కూడా దాని ఆహారం లేకపోతే వాడిపోతుంది.

*ఎంపిక చేసిన లేఖలు 2 - పుట 19, 2-6-1919.*

★ ★ ★

మనస్సు స్వేచ్ఛా విహారాన్ని కోరినా ప్రార్థనా సభలకు హాజరుకండి. మనం మన మనస్సులను అవసరమైన ఒకే విషయం మీద ఏకాగ్రం చేయమని ప్రార్థిస్తాం. ఎవరు ఈ ఏకాగ్రత సాధిస్తారో వారు ఈ ప్రార్థనా సమావేశములకు హాజరపనవసరం లేదు. హాజరయినా అవకపోయినా అటువంటి వారికి సమానవే. మనస్సును యిష్టంవచ్చినట్లుగా పోనీయకూడదు. ఈ విధంగా ప్రయత్నించినట్లయితే ఏదో ఒకరోజున అన్ని సమయాలలో భగవంతుడున్నాడనే భావన కలుగుతుంది. (భక్తకవి తులసీదాసువలె)

*ఎంపిక చేసిన లేఖలు 2 - పుట 9.*

★ ★ ★

ప్రార్థనకు రోజూ హాజరవగలమని ప్రమాణం చేసిన వారు, తమని మించిపోయే పరిస్థితులుత్పన్నమయితేనే తప్ప, ప్రార్థనకు హాజరుకావాలని నిర్ణయించుకోవాలి.

*ఎంపిక చేసిన లేఖలు 1 - పుట 4, 6-12-1926.*

★ ★ ★

మనం మన జీవితంలో అనేక విషయాలు కోల్పోవచ్చు. కాని ప్రార్థనను మాత్రం వదలకూడదు. అది భగవంతునికి మనకు మధ్య సహకారాన్ని సూచిస్తుంది. ప్రార్థన మానవుని ఆత్మను పవిత్రీకరించే స్నానం అవ్వాలి. మన శరీరాల్ని శుభ్రం చేసుకోనట్లయితే

ఏవిధంగా అభ్యాసం దెబ్బతింటుందో అదేవిధంగా ఆత్మ ప్రార్థనతో శుద్ధి చేయబడకపోతే అపరిశుభ్రమవుతుంది. అందువలన ప్రార్థన ఎడల నిర్లక్ష్యం వద్దు.

*ఎంపిక చేసిన లేఖలు 1 - పుట 5, 31-12-1926.*

★ ★ ★

విధి ఎడల దీక్షయే ప్రార్థన. మనం నిజమైన సేవ చేయుటకు అర్హత సంపాదించటానికి ప్రార్థిస్తాము. కాని విధిని ఆచరించడంలో లీనమైపోయినప్పుడు ప్రార్థనే విధియై ఆచరణలో కలిసిపోతుంది. ప్రార్థనలో లీనమైనప్పుడు ఎవరికైనా తేలుకుట్టిన అరుపు వినపడితే వారు తప్పక వారికి సహాయం చేయడం కోసం పరిగెత్తి వెళ్ళాలి. అణగారిపోయిన వారి సేవలోనే ప్రార్థనకు సిద్ధి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 79, 23-9-1929.*

★ ★ ★

ఉదయ ప్రార్థన యొక్క మొదటి చరణము ఈ విధంగా ఉంది. -

"ప్రాతఃకాలంలో నా హృదయంలో భావించిన దానిని మనస్సుకు తెచ్చుకుంటూను. అదే సత్ (నిత్యమైనది) చిత్ (జ్ఞానము), సుఖము (ఆనందము). ఆస్థితి సంపూర్ణులైన వ్యక్తులు అందుకొన్నది. సర్వోత్కృష్టమైనది. నేను స్వప్న, జాగృత, సుషుప్తావస్థలను వ్యాఖ్యానించే నిత్యమైన బ్రహ్మని. అంతేకాని పంచభూతాలతో తయారైన శరీరాన్ని కాను."

నేను ఆలోచించిన కొద్దీ యింకా యింకా స్పష్టంగా అర్థం చేసుకోగలుగుతాను. ఇంతకు ముందు దీనిని ఉచ్చరించటానికి గర్వమే అర్హతగా భావించి వణికిపోయేవాడిని. కాని దాని అర్థం యింకొంచెం స్పష్టంగా తెలుసు కున్నప్పుడు రోజు ప్రారంభించడానికి యింతకంటే మంచి యోచన లేదని గ్రహించాను. అది ఒక నమ్రతతో చేసిన ప్రకటన. మనం నిద్రాదులు కోరే మార్పులు చెందే శరీరం మాత్రమే కాదు. మన ఉనికి అసంఖ్యాక శరీరాలకు సాక్షీభూతం. మొదటిభాగం ప్రాణాధారమైన సూత్రం. ఉనికని

మనస్సుకు జ్ఞప్తికి తెచ్చుకోవడం. రెండవభాగం మనస్సే ప్రాణాధార సూత్రం అనుటకు నిరూపణ. జీవి బ్రహ్మవర్ణన కూడా యుక్తమైనదే. అది అంతా జ్ఞానమె లేదా ప్రకాశమే (చిత్) అందువల్ల అదంతా బ్రహ్మానందమే. సాధారణంగా ఉపయోగించే శబ్దము ఆనందం.

*మీరాకు బాపూ లేఖలు - పుట 143. 20-12-1930.*

★ ★ ★

ప్రాతఃకాలాన్నే ఆలోచనలకు అందని, మాటలకు అలవిగాని ఎవని దయతో వాక్కు సాధ్యమో, అతనిని ఆరాధిస్తాను. ఎవరినైతే వేదాలు 'నేతి నేతి' (ఇదికాదు, ఇదికాదు) అని వర్ణించినవో, ఎవరిని మహర్షులు దేవుళ్ళకే దేవుడుగా కొలుస్తారో, ఎవరికి జనన మరణాలు లేవో, ఎవరు అన్నిటికీ మూలమో అతనిని ఆరాధిస్తాను.

*మీరాకు బాపూ లేఖలు - పుట 145. 30-12-1930.*

★ ★ ★

ఎవరు చీకట్లను తొలగించగలరో, ఎవరైతే సూర్య సమానమో, ఎవరు పరిపూర్ణులో. సనాతనులో, ఎవరు పురుషోత్తముడుగా పిలువబడుతున్నారో ఎవరిలో సర్వ ప్రపంచం నిబిడీకృతమై ఉన్నదో, ఎవరు (చీకట్లో) తాడునే పాముగా భ్రమింపచేస్తారో అటువంటి వానికి నేను ప్రాతఃకాలంలో వినమ్రుడనై వంగి నమస్కరిస్తాను.

ప్రపంచం శాశ్వతమైనది కాదు. భయపడేది కాదు. అది భగవంతుని సృష్టి. నిజానికి అది మనయొక్క ఊహాసృష్టి. తాడులో పాముందని భ్రమించినట్లుగా (మాయ) ప్రపంచం నిజమయిన తాడులాగే ఉంది. మనం తెర తొలగినప్పుడో లేక అంధకారము తొలిగినప్పుడో దానిని గ్రహించ గలుగుతాము. నా ఊహలో ఇది శంకర్ రచించిన పద్యం.

*మీరాకు బాపూ లేఖలు - పుట 146. 3-1 1931.*

★ ★ ★

ఓ భూమాతా! మహా సముద్రాలే వస్త్రములుగా గలదానా! పర్వతాలే నీ వక్షస్థలం. ఓ విష్ణుపత్నీ! నేను నీకు వంగి నమస్కరించుచున్నాను. నిన్ను స్పృశిస్తున్నాను నన్ను క్షమించ వేడుచున్నాను.

భూమికి వినమ్రంగా నమస్కరించడంలో మనం వినమ్రత నేర్చుకుంటాం లేదా నేర్చుకోవడానికి ప్రయత్నిస్తాం. భూమాత ఎంతో వినమ్రతగలది. ఆమె తన మీద ఉన్న జీవులందరికీ ఆధారభూతమవుతున్నది. అందువల్ల ఆమె విష్ణుపత్నే. ఈ భావం నా ఉద్దేశ్యంలో సత్యానికి హాని చేయదు. అది అంతర్యామిగా భగవంతుడు సర్వవ్యాపి అనే విషయానికి అనుగుణమైనది. ఆయనకు మనం ఆయనకు సంబంధించినవారం. భూజనితులం. భూమి లేకుంటే మనం లేము. నాకు భగవంతుడు దగ్గర అని అనుభూతి పొందుతాను. భూమినుంచి వారి అనుభూతి పొందినపుడు. భూమికి వందనం చేస్తాను. తద్వారా ఆయనకు నా కృతజ్ఞత తెలుపుతాను. నేను ఆ తల్లికి పుత్రుణ్ణయితే నన్ను నేను దుమ్ముగా, అతి అల్పమానవునిగా, సృష్టియందలి అతి చిన్న జీవులతో సంబంధమేర్పరచుకొని ఆనందిస్తాను. దుమ్ముగా మారినా లోపం చూచుకోవాలి. జీవితం క్షణభంగురం కాకపోయినచో నన్ను నేను అవినాశిగా భావిస్తాను. అదేవిధంగా అత్యల్ప సృష్టి గూడా నా ఆత్మలాగానే అవినాశి.

*మీరాకు బాపూ లేఖలు - పుట 147. 12-1-1931.*

★ ★ ★

"అజ్ఞాన అంధకారమును తొలగించే సరస్వతీ దేవి నన్ను రక్షించుగాక! కలువపూవు లాంటి చంద్రునివంటి మంచుదండలాంటి, తెల్లని వస్త్రములు ధరించిన తల్లి చేతుల్లో వీణ ధరించిన బ్రహ్మ, విష్ణు మహేశ్వరాది దేవతలచే పూజించబడు తల్లి నన్ను రక్షించుగాక".

నాకు ఈ భావం చాలా నచ్చింది. అధ్యయనం అంటే జ్ఞానమే. చంద్రుడు. పువ్వు మరియు తెలుపు వస్త్రములు, తెలుపు ఆసనము మొదలైనవి అధ్యయనము నందు జ్ఞానమునందు పవిత్రతను చూపును. ఈ చరణాలను లోతుగా పరిశీలించి నట్లయితే జీవం పోసినట్లుగా ప్రతిచరణం ఉంటుంది. ఈ ఊహా దేవత మన

పంచేంద్రియాలతో గ్రహించే అనేక విషయాలకన్నా సత్యమైనది. నేను ఈ చరణాన్ని పునశ్చరణ చేసినపుడు ఊహాజనిత దేవతను సంబోధిస్తున్నట్లు భావించను. నేను నా తెలివితేటలతో విశ్లేషించినప్పుడు, ఆ దేవత ఏవిధంగాను ప్రార్థనా సమయంలో యీ పునశ్చరణ యొక్క విలువను తగ్గించదు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 151. 14-1-1931*

★ ★ ★

గురువే బ్రహ్మ, విష్ణువు. ఆయనే మహాదేవుడు. ఆయనే తనంత తాను గొప్ప బ్రహ్మ. అటువంటి గురువునకు వంగి నమస్కరించుచున్నాను. ఇది ఆధ్యాత్మిక గురువునకు వర్తిస్తుంది. ఇది ఒక యాంత్రిక, కృత్రిమ సంబంధం కాదు. గురువు నిజంగా యివన్నీ కాదు. కాని పూర్తి తృప్తిని అతనిలో పొందిన, సంపూర్ణత్వమును ఆపాదించుకొని భగవంతుని మీద విశ్వాసం కలిగేట్లు చేసిన అతని శిష్యునకు యివి అన్నీ విశేషములే. అటువంటి గురువులు ఈ కాలంలో అరుదు. అందువల్ల భగవంతుణ్ణే తమ గురువుగా భావించి జ్ఞాన ప్రకాశం కోసం విశ్వాసంతో ఎదురుచూచుటయే మంచిపని.

*మీరాకు బాపూ లేఖలు - పుట 153, 25-1-1931.*

★ ★ ★

నిజానికి మనం చేయగల ప్రార్థన ఒక్కటే. నీవు ఏమి చేయాలనుకుంటే అది జరుగుతుంది. కొంతమంది అటువంటి ప్రార్థనల వల్ల ఉపయోగం ఏమిటి అంటారు. దానికి సమాధానంగా ప్రార్థనను మొరటు అని భావించకూడదు. భగవంతుడు మన హృదయంలో ఉన్నట్లు మనకు తెలుసు. బంధాలను వదిలించుకొనుట కొరకు మన నుంచి విడిగా ఉన్నట్లు భావించి ప్రార్థిస్తాము. మన అనిశ్చిత మనస్సు ఎక్కడికి దారితీస్తే అచటికి పోకుండా భగవంతుడు ఎక్కడికి తీసుకునిపోతే అక్కడికి పోయేటట్లు వుండాలి. జీవన్మరణాలలో ఏది మంచో మనకు తెలియదు. అందువల్ల జీవించడంలో ఆనందం పొందకూడదు. మరణం చూచి భయం పొందకూడదు. మనం

రెండింటియందు సమభావన కలిగి ఉండాలి. అదే ఆదర్శం కావాలి. అది చాలా దూరం కావచ్చు. మనలో కొంతమందే దాన్ని సాధించగలరు. అయినప్పటికీ మనం దాన్ని దృష్టిలో ఉంచుకోవాలి. దానిని సాధించడం కష్టతరమైనకొద్దీ మన ప్రయత్నం కొంచెం ఎక్కువ కావాలి.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 118-119. 19-5-1932.*

★ ★ ★

ప్రార్థనయందు నేను విగ్రహాలను నిషేధించలేదు. నేను ఆకార రహితుని ఆరాధనకు యిష్టపడతాను ఈ యిష్టం లేదా ప్రాముఖ్యం సరైనది కాదు. ఒకటి ఒకనికి సరిపోవచ్చు. యింకొకటి ఇంకొకరికి సరిపోవచ్చు. అయితే ఆరెండింటిని పోల్చుట సరికాదు.

నీవు శంకరులను గురించి, రామానుజులను గురించి సరిగా అర్థం చేసుకోలేదు. ఆత్మానుభవం పరిస్థితుల ప్రభావం కంటె ఎక్కువ ప్రభావవంతమైనది. సత్యాన్వేషకుడు పరిస్థితుల వల్ల ప్రభావితం కాకూడదు. వాటికి అతీతంగా ఉండాలి. పరిస్థితులపై ఆధారపడిన అభిప్రాయాలు ఎల్లప్పుడూ తప్పుగానే ఉంటాయి. ఉదాహరణకు శరీరాన్ని ఆత్మను తీసుకుంటే ఆత్మ శరీరంలో కలిసి ఉంటుంది. దాన్ని మనం శరీరం నుంచి వేరుగా గుర్తించలేము. అందువల్లే ఒక గొప్ప వ్యక్తి తన పరిస్థితులను అధిగమించి అది (ఆత్మ) ఇది (శరీరం) కాదు అని చెప్పారు. తుకారామ్ వంటి ప్రవక్తల భాషను సాహిత్యపరంగా అర్థం చేసుకొనకూడదు. 'నీవు అతని అభంగం' 'కౌలామతీ చాపనుపతి' ...." పఠించమని సలహా యిస్తున్నా. యిందుగల నీతిని, ఉద్దేశ్యాన్ని గ్రహించాలి. వారు రూప రహితుడైన భగవంతుణ్ణి ఆరాధించి ఉంటారు. వారు భగవంతుని స్వరూపాన్ని వర్ణించారు. మనలాంటి సాధారణ అశాశ్వతులకు యిది సాధ్యం కాదు. అందువలన కొంచెం లోతుకు వెళ్లి వారి భావాలను అర్థం చేసుకోకపోయినచో యిబ్బందులుపడతాము.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1. పుటలు 168-169.*

★ ★ ★

ఈ విశ్వచైతన్యము ఒక సిద్ధాంతం ద్వారా పాలించబడతున్నదనుటలో సందేహం లేదు. నీవు సిద్ధాంతం గురించి దాన్ని యిచ్చిన వాడిని వదిలివేసి ఆలోచించినట్లయితే ఆ సిద్ధాంతం చేసినవాడు భగవంతుడని చెప్పగలను. మనం సిద్ధాంతాన్ని ప్రార్థించినప్పుడు సిద్ధాంతాన్ని తెలుసుకొని అందుకు అణకువగా నడుచుకోవాలి. మనం ఆపేక్షించిన విధంగానే తయారవుతాము. అందుకే ప్రార్థన అవసరం. మన ప్రస్తుత జీవితం మన పాత జీవితం వల్ల ప్రభావితమైనట్లు మన భవిష్యత్ జీవితం మనకు తెలిసిన కార్యకారణ సిద్ధాంతం వల్ల ప్రభావితం అవుతుంది. అందువల్ల మనం అనుకొనే వాటి కంటే ఎక్కువ మార్గాలను ఎంపిక చేసుకోవాలి.

*మనదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 227, 13-7-1932.*

★ ★ ★

వ్యక్తి తన యొక్క ఆత్మ సంబంధ విషయాలనన్నింటినీ ప్రార్థనా సమయంలో వదిలించుకోవాలి. అవినీతి పనులు చేయుటకు యితరుల సమక్షంలో ఏవిధంగా సిగ్గుపడతామో, అదేవిధంగా భగవంతుని సమక్షంలో సిగ్గుపడాలి. భగవంతునకు మన ప్రతి ఆలోచన తెలుసు. ఏక్షణంలోను మనం ఆయనకు తెలియకుండా ఏ ఆలోచనా చేయలేము. ఏ పనీ చేయలేము. హృదయం యొక్క అట్టడుగు పొరల నుంచి ప్రార్థించినవారు సరైన సమయంలో భగవదాత్మతో నిండి పరహితులైపోతారు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 232, 17-7-1932.*

★ ★ ★

ప్రార్థన ఒక వ్యక్తి కోసం చేయవచ్చు. ఆ ప్రార్థన సఫలీకృతం కావచ్చు. కాని లక్ష్యం లేదా ఆలోచనతో చేసినట్లైతే ప్రపంచానికి మనకీ కూడా ప్రయోజనం కలుగుతుంది. ప్రార్థన మన మీద ప్రభావం చూపిస్తుంది. మన ఆత్మ అప్రమత్తమవుతుంది. అప్రమత్తత పెరిగినకొద్దీ ప్రభావం యొక్క పరిధి పెరుగుతుంది. ప్రార్థన హృదయం యొక్క పని. మనం హృదయాన్ని మేల్కొలుపుటకు గట్టిగా ప్రార్థిస్తాము. ఈ ప్రపంచాన్ని పరిపాలించే శక్తి మానవ హృదయంలో కూడా ఉన్నది. శరీరం దానికి ఎటువంటి నిరోధం కల్పించదు. ఆ నిరోధం మన కల్పనే. అది ప్రార్థన వల్ల తొలగిపోతుంది. ప్రార్థన వల్ల కోరుకున్న ఫలితం వచ్చిందా లేదా అనే విషయం మనకు తెలియదు. ... ప్రార్థన

ఎప్పటికీ నిష్ఫలం కాదు. ఆ ఫలం ఏమిటో మనకు తెలియదు. మనం కోరుకున్న ఫలితం వస్తే మంచిదని ఊహించ కూడదు. ఇక్కడ కూడా గీతా ప్రవచనాన్ని ఆచరించాలి. మనం ప్రార్థించాలి గాని ఫలితంతో సంబంధం పెట్టుకోకూడదు. మనం ఎవరి ముక్తి కోసమో ప్రార్థించవచ్చు గాని ఆయనకు ముక్తి లభించిందో లేదోనని ఆందోళనపడకూడదు. వ్యతిరేక ఫలితం కనపడినప్పటికీ ప్రార్థన నిష్ఫలం అనే నిర్ణయానికి రాకూడదు.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటము 1. పుట 233, 17-7-1932.*

★ ★ ★

ఆహారం అత్యావశ్యకమే గాని మొత్తం అదే కాదు. ముఖ్య భాగం ప్రార్థనయే. భగవంతునితో సహసంబంధం. అది భౌతికమైన ఆహారం కంటే గొప్పది.

*మీరాకు బాపూ లేఖలు. పుట 263, 8-5-1933.*

★ ★ ★

## 4. సత్యము – అహింస

లక్ష్యంలో పవిత్రత ఉన్నంత మాత్రం చేత అసత్యం సత్యంగా మారదు. ధనవంతుడైన వ్యక్తికి విషయ పరిజ్ఞానమునకై ఒకటే కన్ను ఉన్నట్లుగా సత్యము నకు ఒకటే మార్గం ఉంటుంది. అదేవిధంగా చోరునకు నాలుగు కళ్ళు ఉన్నట్లు అసత్యానికి అనేక దారులు ఉంటాయి. పరుల చిక్కుల్లో చిక్కుకున్న వ్యక్తి నశించిపోతాడు. అతడు ఎవరికైనా సంరక్షకుడుగా ఉన్నచో ఎవరికి సంరక్షకుడుగా ఉన్నాడో వారియొక్క ఆశయాలు నాశనమైపోతాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 15. పుట 23. 17-9-1918.*

★ ★ ★

అజ్ఞానం ఒక విధమైన అంధకారం. అసత్యం. అందువల్ల అది జ్ఞానాన్ని సత్యాన్ని తట్టుకోలేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 16. పుట 87. 3-9-1918.*

★ ★ ★

సత్యాన్ని అన్వేషిస్తూ, ఆచరిస్తూ, ఆలోచిస్తూ జీవితాన్ని ముగించాలని నా కోరిక. అందువల్ల నా కోరిక తీరాలని జాతి యొక్క ఆశీస్సులు కోరుతున్నాను.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 6, పుట 175. 28-9-1919.*

★ ★ ★

సత్యమునకు రూపం లేదు. అందువల్ల ప్రతివారు వారి వారికి యిష్టమైన రూపాన్ని కల్పించుకోవచ్చు. మనుష్యులు ఎంతమంది ఉంటారో అన్ని ప్రతిరూపాలు సత్యానికి ఉన్నాయి. అవి అన్నీ సాగినంత కాలం సత్యమే. అవి మానవుణ్ణి అతడు కోరుకున్నవన్నీ సంపాదించుకోనిస్తాయి. నిజానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, భగవంతుడు వంటి నామాలన్నీ అర్థం లేనివి. లేకపోతే కనీసం ప్రాముఖ్యతలేనివి. కాని సత్యము భగవంతుని యొక్క సంపూర్ణ నామం. ఒక వ్యక్తి నేను భగవంతుని కొరకు మరణిస్తాను అన్నప్పుడు ఆ వ్యక్తి దాన్ని విడమరిచి చెప్పలేడు. అట్లాగే వినేవారు. దాన్ని అర్థం చేసుకోలేరు. ఆ మాట చెప్పే వ్యక్తికి తను చెప్పేది తెలుసు. అతను చెప్పే శబ్దాలు సాధారణ రీతిలోనే వినేవారికి అర్థమవుతాయి.

*మహాదేవ దేశాయి డైరీ - సంపుటము 1. పుట 120, 20-5-1932.*

★ ★ ★

నా ఉద్దేశ్యంలో మనం చెడు చేసేవారిని వదిలి వేయవచ్చు. చెడుని నిర్భయంగా ఖండించాలి. సంపూర్ణ మృదుత్వం కూడా సాధ్యమైనంత అభిశంసనకు గురి కావాలి. ఆ జ్ఞానం నిలచి ఉన్నంతవరకూ, మన భూతకాలము యొక్క నిర్ణయాలు తప్పయినంత మాత్రం చేత పశ్చాత్తాపపడవలసిన పని లేదు. సంపూర్ణ సత్యాన్ని చేరే ప్రయత్నంలో ఆ యా సమయాల్లో మనం సాపేక్ష సత్యం సంపూర్ణ సత్యమంత మంచిది. అంత నమ్మకం లేకపోయినట్లయితే, అభివృద్ధి సాధ్యం కాదు. మన స్థితిని గురించి మనకు సందేహం ఉన్నట్లయితే భాషలో కొంచెం జాగ్రత్తపడాలి.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1. పుట 129. 25-5-1932.*

★ ★ ★

పూర్తి యిష్టాయిష్టాలతో ఏదో గమ్యాన్ని మనస్సులో పెట్టుకొని అసత్యాన్ని ఆశ్రయించేవారు సర్వేశ్వరుని చేరుకోలేరు.

*మహదేవ దేశాయి డైరీ- సపుటము1 , పుట 250. 24-7-1932.*

★ ★ ★

సత్యపథాన్ని అల్లడం అంటే మనుష్య ప్రపంచంలో చురుకైన జీవితమే అటువంటి చురుకుదనం లేకపోయినచో సత్యం అనుసరించుటకుగాని, సత్యం నుండి వైతొలగుటకు గాని అవకాశం ఉండదు. మానవుడు ఒక క్షణం కూడా జడత్వంతో ఉండడని గీత స్పష్టపరిచింది. భక్తుడు యితరులకు సేవ చేయుటలో చురుకుగా ఉంటాడు. అట్టి కార్యక్రమంలో నిమగ్నుడై ఉన్నప్పటికీ సత్యాన్ని వదలకుండా క్రమంగా యిష్టాయిష్టాలను అధిగమిస్తాడు. రెండవ వ్యక్తి తన స్వలాభం కోసం ఎటువంటి పనులైనా, పద్ధతులనైనా అవలంభిస్తాడు. ఈ ప్రపంచంలో చురుకైన పాత్ర భగవత్సాక్షాత్కారమనే లక్ష్యాన్ని చేరుకోవడానికి సహాయపడుతుంది. స్వార్థపర కార్యక్రమం నిందార్హం. అందువల్ల దానిని వదిలివేయాలి.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 251, 24 7 1932*

★ ★ ★

ఏ పరిస్థితులలోనైనా సరే అవసరమైతే సత్యాన్ని చెప్పితీరాలి.

*ఎంపిక చేసిన లేఖలు - పుట 45.*

★ ★ ★

సత్యాన్ని ప్రేమించే వ్యక్తి సక్రమంగా తీర గల కోరికలనే కోరుకుంటాడు. ప్రార్థనలు సత్యంలో మన ఆత్మ మునిగేదాకా సత్ఫలితాలనే యిస్తాయి. ప్రపంచం మన నుంచి భిన్నం కాదు. మనం ప్రపంచం నుంచి భిన్నం కాము.

*ఎంపిక చేసిన లేఖలు -1, పుట 55.*

★ ★ ★

అహింస, సత్యాలు రెండూ ఒకదానికొకటి పూరక పదాలు. " ప్రతివాడూ సత్యాన్నే పలకాలి. ఆమోద యోగ్యమైన సత్యాన్నే పలుకువాడి భావం యిదే. నిజమైన సత్యం బాధ కలిగించదు. అందువల్లనే అది అహింస. సత్యం కష్టం అనిపించినప్పటికీ అది బాధ కలిగించదు. మనం సత్యాన్ని వినియోగించినప్పుడు, ఎదుటి వ్యక్తికి బాధ కలుగవచ్చు. కాని అతని అంతరాత్మ అతణ్ణి గురించి చెప్పింది సత్యమేనని, మంచి ఉద్దేశ్యంతో చెప్పినదేనని తెలియచేస్తుంది. మనం సత్యాన్ని దాని యొక్క విస్తృతార్థంలో వ్యాఖ్యానిస్తున్నాము. సత్యమంటే మాటలో పలకటం కాదు. సత్యమంటే బ్రహ్మ ఒక్కడే సత్యము అని అర్థం. ఆంగ్ల భాషలో ట్రూత్‌కు కూడా అదే అర్థం.

*మహాత్మాగాంధి సంగ్రహరచనలు - సంపుటము 14. పుట 97, 22-11-1917.*

★ ★ ★

సత్య అహింసలు రెండూ ఒకటే. ఒక దాంట్లో రెండోది యిమిడి ఉంటుంది. ఎవరైనా అహింసా ప్రమాణం తీసుకొని అసత్యాన్ని పలకడమో, ఆచరించడమో చేస్తే అతడు తన ప్రమాణాన్ని ఉల్లంఘించినట్లే. అదేవిధంగా సత్యానికి అంకితమైన వ్యక్తి హింస చేస్తే అతడు సత్యాన్ని త్యజించినట్లే. ఒక వ్యక్తి భయంతో సమాధానమిచ్చుటకు నిరాకరించినా అతడు అహింసా ప్రమాణమును ఉల్లంఘించినట్లే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 157, 17-2-1918.*

★ ★ ★

చంపలేనివాడికి అహింసా బోధ ఎందుకు? మూగవానికి నిశ్శబ్దం యొక్క గొప్పతనాన్ని గురించిన బోధ ఎందుకు? నాకు మోసం గొప్పదని తెలిసినా, మూగవాడిని మాట్లాడించే పద్ధతి తెలిస్తే దాన్ని ఉపయోగించడానికి వెనుకాడను. నేను ఏప్రభుత్వాన్ని నమ్మను. కాని చపలచిత్తుని పాలనకన్నా, ప్రజాప్రభుత్వపాలన మిన్న.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 444, 23-6-1918.*

❊ ❊ ❊

చంపేశక్తి కోల్పోయిన వ్యక్తి చంపకపోవడం అను సూత్రాన్ని ఆచరించలేడు. అహింస త్యాగానికి చెందిన గొప్ప విషయం. ఒక బలహీనమైన పిరికి జాతి త్యాగాన్ని

ఎలా ఆచరణలోకి తెస్తుంది? ఒక చుంచు, పిల్లిని చంపగలదా? అందు త్యాగానికి ఏం చోటు వుంటుంది? అహింసా శక్తిని స్పృహతో కూడిన తీవ్ర ప్రయత్నం ద్వారానే పొందగలం. అప్పుడే ప్రపంచాన్ని హింసోన్మాదాన్నుంచి బయటపడవేయగలం. మన ఆశ్రమవాసులకే అహింస యందు నమ్మకం కలిగించలేనందుకు నేను అనుభవించే దుఃఖాన్ని మాటల్లో వర్ణించలేను. వారికి సత్యాన్ని అర్థం చేసుకోగల సమర్థతలేదని గ్రహించాను. యిది సంగీత మంటే ఏమిటో తెలియని చెవుకు అద్భుత సంగీతం వినిపించుట వంటిది. ఆశ్రమవాసులు అనుభవం వల్ల యీ విషయం తెలుసుకోగలరని భావిస్తున్నాను. శక్తి నుంచి వచ్చేది అహింస. బలహీనత నుంచి రాదు. ఉన్నత స్థాయికి చెందిన యోధుడు ఎవరు అని అడిగితే, యోధానుయోధుల మధ్య ధైర్యంగా అహింసా శక్తితో నిలబడ గలిగిన వాడే అని చెప్పకతప్పదు. పారిపోయి జీవితాన్ని రక్షించుకోగల శక్తి వున్నా, మరణించడానికి సిద్ధపడే జ్ఞాన సముపార్జన కలిగినవాడు విజయం సాధించినట్లే. మన పిల్లలకు యిట్లి శిక్షణ యివ్వడం అవసరం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 485, 17-7-1918.*

★ ★ ★

అహింసా సిద్ధాంతము యొక్క శుద్ధతను గురించి యింకా నమ్ముతున్నాను. క్రూరుని శక్తి ఎక్కువైన కొద్దీ ఆ వ్యక్తి యింకా పిరికివాడవుతాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట58, 22-8-1919*

★ ★ ★

మనం మన పనిలో సఫలమైనా విఫలమైనా పట్టించుకోకుండా అహింసా వాదులుగానే ఉండాలి. ఇదే అహింసా సూత్రాన్ని ఆచరించి చూపే పద్ధతి. అహింసా సిద్ధాంత ఫలం ఎప్పుడూ మంచిదే అని చెప్పుట సరియైనది. అటువంటిదవటంవలన వెంటనే ప్రయత్నాలు ఫలించినా, కొన్ని సంవత్సరాల తరువాత ఫలించినా మనం పట్టించుకోకూడదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 24, పుట 273, 21-6-1924.*

★ ★ ★

ప్రపంచం తప్పుగా భావించినప్పటికీ కష్టతరమైన ఆత్మశోధనవల్ల తెలుసుకున్న సత్యాన్నే చెప్పటం ప్రతి ఒక్కరి విధి. ఇంకా ఏ విధంగాను నిర్భీతి కలుగదు. నాకు మోక్షం కంటే ఎక్కువ ప్రీతికరమైనది లేదు. అయినప్పటికీ దానికీ సత్యమునకు అహింసకు మధ్య స్పర్థ కలిగితే నేను మోక్షాన్ని త్యజిస్తాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 127, 2-8-1924.*

★ ★ ★

శుద్ధమైన మాలిన్య రహితమైన అహింస ద్వారానే హింసను జయించగలం. ప్రతి హింసా కార్యం, శబ్దం ఆలోచనకూడా అహింసా కార్యక్రమానికి అడ్డంకి అని నేను చెప్పాను. మళ్ళీ మళ్ళీ అటువంటి హెచ్చరికలు ఎన్ని చేసినప్పటికీ ప్రజలు హింసకు పాల్పడుతున్నారు.

*మహాత్మాగాంధీ లేఖలు - పుట 74.*

★ ★ ★

సాధారణ వ్యక్తి, తప్పు చేసిన వ్యక్తిని భగవంతుడు శిక్షించమని కోరుకోవడంలో తప్పు లేదు. అహింస అనేది నూతన విషయం. ఒక అహింసా యుతుడైన వ్యక్తి యింకో మానవుని కోపాన్ని గాని, భగవంతుని ఆగ్రహాన్నిగాని, కోరడం తప్పు. కాని ఒక అహింసావాది విడవకుండా బాధించే వ్యక్తి మీద తిరగబడకుండా యితరుల సహాయాన్ని అర్థిస్తే తప్పు పట్టకూడదు.

*రాజకుమారి అమృత కౌర్‌కు లేఖలు - పుట 247.*

★ ★ ★

## 5. సత్యాగ్రహ శాస్త్రము

మన అహింసాయుత ఉద్యమం ధార్మికులు, నిజమైన దేశభక్తులు, లౌకికులు నీతిపరులైన వారందరి మెప్పుపొందింది. కష్టాలకు సంసిద్ధత. సహిష్ణుత మొదలగు గుణాలవల్ల మన విమర్శకుల యొక్క గౌరవాన్ని కూడా పొందగల శక్తి ఉద్యమానికి చేకూరింది. యింకా దృఢంగా అకుంఠిత దీక్షతో ఉన్నాం. ఉద్యమం ఎంత తక్కువ స్థాయిలో ఉన్నప్పటికీ, సఫలమైనా అసఫలమైనా, అణగారిన ప్రజలకు, అణగారిన

వ్యక్తులకు ఆధారపడదగ్గ గౌరవనీయమైన ఆయుధంగాక తప్పదు. ఇది చట్టాలకు వ్యతిరేకంగా న్యాయమైన పరిష్కారాన్ని సాధించటానికి ఉపయోగిస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 7, పుట 333-34, 4-11-1907.*

★ ★ ★

నిజమైన సత్యాగ్రహి ఎవరు? దయ మొదలయిన గుణములుగల వారు అని చెప్పవచ్చు. ఎక్కడా కష్టాలు అనుభవించవలసిన అవసరం లేదని చెప్పలేదు. అసలు కష్టాలు అంటే ఏవి? గీతావచన ప్రకారం మనస్సే మన బంధనాలకు కారణం. సుధాన్వుని మరిగేనూనెలో పడవేశారు. అందు పడవేయించిన వాడు సుధాన్వునికి బాధలు కలిగించాననుకున్నాడు కాని సుధాన్వునికి తనయొక్క అకుంఠిత భక్తి భావాన్ని చూపించుకోవటానికి గొప్ప అవకాశం కలిగింది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 206, 2-4-1910.*

★ ★ ★

బాహ్యంగా పరివర్తన తీసుకొని రావడం హింస యొక్క పని. అహింసాయుత ఉద్యమం ఆత్మబలం యొక్క పని లోపలినుంచి అభివృద్ధిచేయుట. అంటే కష్టాలద్వారా వ్యక్తి పవిత్రీకరణ. అహింసాయుత ఉద్యమం ఎల్లప్పుడూ సఫలమే. అహింసాయుత ఆందోళనాకారుని యొక్క పోరు ఆత్మ సంబంధమైనది ఎందువల్లనంటే అతడు గెలుచుటకోసమే పోరు సాగిస్తాడు. నిజానికి అతడు గెలవటానికి పోరుచెయ్యటానికి బద్ధుడై ఉన్నాడు. అంటే తన మీద తాను అధికారం సంపాదించుటకోసం పోరుతున్నాడన్నమాట. అహింసాయుత ఉద్యమం నీతివంతమైనది. ఎప్పటికీ క్రూరం కాదు. ఎటువంటి చర్య అయినా మానసికంగా కాని వేరే విధంగా కానీ పరీక్షలో అసఫలమైతే. అది అహింసాయుత ఉద్యమం కాదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 248, 10-5-1950.*

★ ★ ★

అహింసాయుత ఉద్యమం రాజకీయాలతోను, మతంతోను సంఘటిత మవుతుంది. జీసస్ క్రీస్తు తన ఆత్మ బలంతో రాళ్ళను రొట్టె ముక్కలుగా మార్చుటకు

నిరాకరించాడనే విషయం నా తర్కానికి ఆధారం. నూతన సంస్కృతి అసాధ్యపడని కార్యం చేయడంలో నిమగ్నమై ఉంది. ఆత్మబలాన్ని రాళ్ళను రొట్టెలుగా మార్చుటకు ఉపయోగించితే దాన్ని ఒక విద్యగా భావించి ఉండేవారు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 248, 10-5-1910.*

★ ★ ★

ఒక అమాయకురాలైన తల్లి పవిత్రమైన మంచి ఉద్దేశ్యంతో తన నల్లమందు మాత్ర యివ్వవచ్చు. ఆమె అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని ఎలా పోగొట్టడం? ఈ నీతివంతమైన ప్రపంచం బిడ్డను చంపిన నేరం నుంచి ఆమెను పరిశుద్ధం చేయదు. అహింసాయుత ఉద్యమకారుడు ఎవరైనా ఈ సూత్రాన్ని గుర్తించి తెలుసుకొని కూడా తన లక్ష్యాలు పవిత్రమైనవే అయినప్పటికి తన చర్యలు తప్పయి నప్పుడు న్యాయనిర్ణయాన్ని భగవంతునికి వదిలిపెట్టి తాను ఏ తప్పు చేశాడో దానిని వ్యతిరేకిస్తూ వ్యక్తిగతంగా బాధపడతాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 248, 10-5-1910.*

★ ★ ★

శుద్ధమైన అహింసాయుత ఉద్యమకారుడు తనని తాను ఆత్మార్పణము చేసినవాడుగా పిలచుటకు అంగీకరించడు. జైలులో కష్టాలను గురించి గాని లేదా మరే కష్టాలను గురించి చెప్పడు. తనపై జరిగిన దౌర్జన్యాల నుంచి అన్యాయాలనుంచి ప్రయోజనం పొందడు. అంతేగాక అహింసాయుత ఉద్యమాన్ని గురించి ఎటువంటి ప్రచారం చేయుటను సహించడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 8, పుట 249, 10-5-1910.*

★ ★ ★

గుజరాతీలో అహింసాయుత ఆందోళనము అంటే సత్యముయొక్క శక్తి అని అర్థం. నేను అనేక విధాలుగా దానిని సత్యబలము, ప్రేమశక్తి, ఆత్మబలము అని నిర్వచించాను. కాని నిజానికి మాటలలో ఏమీలేదు. మనం ప్రతి చోటా ఏహ్యా భావం మధ్య ప్రేమ భావంతో జీవించాలి. రెండు మూడు వందల సంవత్సరాలకు పూర్వం

మీరాబాయి అనే రాణి ఉండేది. ఆమె తన భర్తను, తన సర్వస్వాన్ని త్యజించి పూర్తి ప్రేమైక జీవితం గడిపింది. చివరకు ఆమె భర్త ఆమెకు దాసుడైనాడు.

*మైడియర్ చైల్డ్ - పుట 13, 11-6-1917.*

★ ★ ★

నేను యువకులకు ముఖ్యంగా భారతీయులకు వినమ్రంగా ఒక మంచి ప్రభావవంతమైన పద్ధతిని బహూకరించాను. ఆ పద్ధతి ఆత్మబలం, సత్యబలం, ప్రేమ బలం. మంచి పదాలు దొరకక నేను దాన్ని అహింసాయుత ఉద్యమం అని అన్నాను. ఈ కఠిన పరిస్థితులలో యీ పద్ధతిని అనుసరించమని నాయకులను కోరుతున్నాను. అందులో వ్యక్తిగత కష్టాలు చివరి వరకు ఉంటాయి. ప్రపంచంలోని ఏ ప్రభుత్వము వరుసగా అమాయక ప్రజలను జైళ్ళలో పెట్టలేదు. అవమానించ లేదు. ఆంగ్ల ప్రభుత్వం దాన్ని భరించలేదు. అందులోని రహస్యం, లక్షణం ఒక్కటే. చెడుచేసినా ప్రపంచముందు నీతితో నిలబడుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 13, పుట 465, 7-7-1917.*

★ ★ ★

సత్యాగ్రహం అంటే ఎవరికి వారు స్వయంగా తమను తాము బాధకు గురిచేసుకొని అన్యాయాన్ని ఎదిరించుట.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 172, 24-1-1918.*

★ ★ ★

సత్యాగ్రహం యొక్క ఉద్దేశ్యం మనల్ని మనం రక్షించుకొనుట కాదు. ప్రజలలో ధైర్యాన్ని నూరిపోసి వారిని ఆత్మనిర్భరులుగా తయారుచేయుట. భయంవల్ల గాని, మనమీద అపనమ్మకంతో గాని నిస్పృహకు గురై, వదిలేస్తే వదిలి వేయవచ్చు. మనం యింకొంచెం శ్రమతో ప్రయత్నించి వారి విశ్వాసం గెల్చుకోవాలి. ఇది సత్యాగ్రహానికి రాజమార్గం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 179, 31-1-1918.*

★ ★ ★

అణచివేత ప్రజలను భయపెట్టగలిగినంతవరకే ఫలితమిస్తుంది. కాని పిరికవారు కూడా అసాధారణ ధైర్యాన్ని చూపించటం అహింసా ఉద్యమంలో మనం చూస్తాం. సత్యాగ్రహం యొక్క అర్థం వ్యక్తిగత బాధను కష్టాన్ని సహించడం నిస్పృహకు లోనుకాకపోవడం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 106, 25-2-1919*

★ ★ ★

సత్యాగ్రహం తెలియచేసే అర్థాన్ని అహింసాయుత ఉద్యమం చాలా తక్కువగా వ్యక్తీకరిస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 96, 23-2-1919*

★ ★ ★

సత్యాగ్రహం రాజకీయ రంగంలో ఒక కుటుంబ సభ్యులను పాలించే చట్టం యొక్క విస్తృతరూపము.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 176, 3-4-.1919*

★ ★ ★

భగవద్గీత యొక్క ఉద్దేశ్యం ప్రతివారూ పనియొక్క ఫలితంతో సంబంధం లేకుండా పని చేయమని చెప్పటమే. నేను సత్యాగ్రహ సూత్రాన్ని దీని నుంచే రాబట్టాను. ఎవరైతే అటువంటి బంధాలనుంచి స్వేచ్ఛ పొందుతారో అటువంటివారు శత్రువును చంపరు. తమనే బలి చేసుకుంటారు. శత్రువును చంపటం అనేది అసహనం నుంచి వస్తుంది. అసహనానికి మూలం బాంధవ్యం, బంధం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 15, పుట 312, 19-5-1919*

★ ★ ★

దాదాపు 1889 ప్రాంతంలో నేను మొదట భగవద్గీతను చూచినపుడు అది నాకు సత్యాగ్రహాన్ని గురించి ఒక సూచన చేసింది. దానిని పరిగణించిన కొద్దీ ఆ సూచనే పూర్తి సత్యాగ్రహంగా అభివృద్ధి చెందింది. కృష్ణుని వంటివాడు, రక్త మాంసాలతో కూడిన అర్జునుడి ప్రయోజనం కోసం గీతజ్ఞానాన్ని ప్రవచించారని అనడం, ఆయన అట్లా చేశాడని నమ్మడం, ఆయనకు కళంకం ఆపాదించుటయే. కృష్ణుడు సర్వోత్కృష్టుడైన

భగవంతుడైతే, అర్జునుడు అనుభవజ్ఞుడైన విచక్షణాపరుడైన వీరుడైతే వారిద్దరికీ అన్యాయం చేయడమే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు సంపుటము15, పుట 313. 19-5-1919.*

★ ★ ★

ఒకసారి సత్యాగ్రహాన్ని మొదలుపెడితే దాని లక్ష్యం పూర్తయినప్పుడే ఆగుతుంది. అప్పుడప్పుడు ఆగిపోయినట్లుగా కనబడుతుంది. నిజానికి ఆగదు. సత్యాగ్రహం దురాగ్రహంగా భ్రమ కలిగించినప్పుడు దానిని ఆపివేయడమే నిజమైన సత్యాగ్రహాన్ని ప్రారంభించడం. అది ఒక చమత్కారమైన విషయం. అనుభవం ద్వారా నిరంతర చింతన ద్వారా దాన్ని కొద్దిగా అర్థం చేసుకోగలం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 15, పుట 314, 20-5-1919*

★ ★ ★

సత్యాగ్రహం ఎప్పటికీ తనకు తానే యజమాని. ఒక సంస్థ సత్యాగ్రహాన్ని చేస్తున్నప్పుడు వ్యక్తులు తమకు తాము ఆ సంస్థ యొక్క క్రమశిక్షణకు లోబడి ఉండాలి. కాని ఒకసారి సత్యాగ్రహిగా మారిన తర్వాత సత్యాగ్రహం చేయటం కోసం సమయాన్ని కనుగొంటాడు. సత్యాగ్రహిగా ఉండటం కత్తి పదును మీద నడుచుటయే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 15, పుట 315, 20-5-1919*

★ ★ ★

ఒక నిజమైన సత్యాగ్రహి విజయం సాధించటానికి చాలు అని నేను చెప్పాను. ఇది రోజు రోజుకు స్పష్టమవుతోంది. నిజమైన నాణెం ఎట్లాగైతే పూర్తి విలువ యిస్తుందో అదే విధంగా నిజమైన సత్యాగ్రహి కూడా పూర్తి విలువ పొందుతాడు. అంటే అనుకున్న ఫలితాన్ని పొందటం అన్నమాట.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 15, పుట 389, 25-6-1919*

★ ★ ★

చట్ట వ్యతిరేకత నిలిచిపోయింది. అది ఒక శాశ్వతమైన జీవన సిద్ధాంతం మనకు తెలిసో తెలియకో జీవితంలో మనం దాన్ని అనుసరిస్తూ ఉంటాము.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 6, 4-8-1919*

★ ★ ★

ప్రభుత్వ ఆయుధాగారంలోని ఆయుధాలన్నీ అనిత్యమైన శక్తియే. ఆత్మ బలాన్ని నశింపచేయలేవు. శాసనోల్లంఘన ఎక్కువ ప్రభావవంతమైనదని గుర్తింపబడుతుంది. అన్ని సమస్యలకు ప్రమాదము లేని విరుగుడుగా రూపొందుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 6, 4-8-1919*

★ ★ ★

సత్యాగ్రహం ఎదిగే తరానికి ఒక ఆశ. ఒక తెరిచిన రహదారి. అనేక జీవిత జాడ్యాలకు అమోఘమైన విరుగుడు. యీ తరాన్ని ఎంతో శక్తివంతం చేసింది. నశింప చేయని, హాని కలుగచేయని అహింసా ఆయుధం. సత్యాగ్రహం యువకులకు భారత దేశాన్ని గురించి చెబుతుంది. వ్యక్తిగత బాధల, కష్టాల ద్వారా ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక సమస్యలను పరిష్కరిస్తుంది. సత్యాగ్రహం చెడుకు వ్యతిరేకి. అప్పుడప్పుడు అది శాసనోల్లంఘన రూపం దాలుస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 50. 20-8-1919.*

★ ★ ★

సత్యపాలన విశేషించి నా దేశం సొత్తు అని భావిస్తాను. అహింస శక్తి వంతమైన సాధనం. యీ రెండిటి కలయిక వల్ల పుట్టిన సత్యాగ్రహం నిజంగా వర్ణనకు అతీతమైనది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 147. 15-5-1919.*

★ ★ ★

శాసనోల్లంఘనం కావించిన వ్యక్తి దాని పర్యవసానాలను అనుభవిస్తాడు. డేనియల్ మడ్స్ పర్షియన్ చట్టాల్ని ఉల్లంఘించినప్పుడు చేసింది యిదే. భారతదేశంలో రైతులు పూర్వకాలంలో చేసిందీ యిదే. హింస మనయందలి పశు ప్రవృత్తి. వ్యక్తిపరంగా బాధలు సహించి, శాసనోల్లంఘనం చేయుట సత్యాగ్రహి సిద్ధాంతం. అది అతడి విధిగా మారుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 16, పుట 5, 20-6-1919.*

★ ★ ★

బయటివారికి బలహీనంగా కనపడిన సత్యాగ్రహి నిజానికి చాలా బలవంతుడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 249, 20-10-1919.*

★ ★ ★

అహింసాయుత ఆందోళనకు సత్యగ్రహ సిద్ధాంతానికి గల తేడాను తార్కిక, ఆధ్యాత్మిక భావంతో పరిణామం చెందకముందు నేను గుర్తించాను. నేను తరచుగా అహింసా ఆందోళనకు సత్యాగ్రహమును పర్యాయపదంగా వాడాను. కాని సత్యాగ్రహ సిద్ధాంతము అభివృద్ధి చెందినపుడు, అహింసా ఆందోళనము పర్యాయపదంగా పనికిరాలేదు. అహింసా ఆందోళన విశ్వవ్యాప్తంగా బలహీనుల యొక్క ఆయుధంగా గుర్తింపబడింది. అదేకాక అహింసా ఆందోళనము పూర్తిగా సత్యానికి కట్టుబడి ఉండదు. అన్ని పరిస్థితులలో అది సత్యాగ్రహం నుంచి భిన్నమైనది. మూడువిషయాలలో – సత్యాగ్రహం బలవంతుల ఆయుధం. ఎటువంటి పరిస్థితులలోనూ అది హింసను ఆమోదించదు. ఏమైనప్పటికీ అది సత్యాన్ని బలపరుస్తుంది. నేను తేడాను సంపూర్ణంగా స్పష్టపరచానని అనుకుంటున్నాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16. పుట 509, 25-1-1920.*

★ ★ ★

మనం హింసకు పాల్పడకుండా సహాయనిరాకరణ చేయగలిగితే మనకు అట్లా చేయుటకు సర్వహక్కులూ ఉన్నవి. నిజానికి అట్లా చేయడం మన విధి కూడా.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 17, పుట 368-69, 1-5-1920.*

★ ★ ★

ఉద్దేశించిన వారియందు ప్రతీకార భావన కలుగకపోయినపుడు హింస తగ్గిపోతుంది. అణిగిపోతుంది. సహాయనిరాకరణమనే భవనానికి మూలస్తంభం అహింసయే.

*మహాత్మాగాంధీ ప్రముఖ లేఖలు. పుట 42, 20-6-1921.*

★ ★ ★

అసహనం ఒక విధమైన హింస. అది మన విశ్వాసానికి వ్యతిరేకం. అహింసాయుత సహాయనిరాకరణ ప్రజాస్వామ్యంలో ఉండవలసిన పారం. ఏ క్షణాన మనం అహింస అని నిశ్చయం చేసుకుంటామో, అదే క్షణంలో మనం మనగమ్యాన్ని సాధించినట్లే. ఆ క్షణం నుంచే మనం పూర్తి సహాయనిరాకరణం చేస్తాము.

*మహాత్మాగాంధీ ప్రముఖ లేఖలు, పుట 42, జనవరి 1921.*

★ ★ ★

బార్డోలీ శాసనోల్లంఘనం నేరమైన లక్షణాలతో జరిగినప్పుడు అదే పద్ధతిన యితర ప్రాంతాలలో శాసనోల్లంఘనం జరిగినప్పుడు అది ఎక్కువ ప్రభావాన్ని చూపలేదు. మొత్తం శాసనోల్లంఘనం అహింసా భావంతో పనిచేస్తుందని భావించడం జరిగింది. విశాల భారతదేశంలో అటువంటి పరిస్థితులు తీసుకురాలేమనే భావం తెలుసుకోగల విద్యార్థిని నేను కాకపోయివుండవచ్చు. సగం హింస, సగం అహింసతో కూడిన అటువంటి ఉద్యమంలోనే నేను భాగస్వామిని కాలేను. ఆ ఉద్యమం విజయం సాధించినప్పటికీ అది నిజమైన విజయం కాదని భావిస్తున్నాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు, సంపుటము 22, పుట 350-351, 8-2-1922*

★ ★ ★

సాధించే పద్ధతికి, గమ్యానికి మధ్య సంబంధం ఆ రెండింటిలో ఏది ముఖ్యమో చెప్పలేనంతగా వుంటుంది. పద్ధతిని, శరీర రూపంలో, గమ్యాన్ని ఆత్మ రూపంలో పేర్కొనవచ్చు. పద్ధతి గోచరం అగమ్యం అగోచరం. యీ సత్యాన్ని రుజూచేసి ఆనందం పొందుదాము.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు, సంపుటము 28, పుట 69, 1922.*

★ ★ ★

సత్యాగ్రహంలో ఎక్కడైనా తప్పుచేశాడని తెలిస్తే అడుగు వెనక్కి తీసుకోవచ్చు. నీవు ఒక వివేకం గల హిందువుగా ఒక హిందూ దురభిమానంగల వారితో పోట్లాడుతున్నప్పుడు, యితరుల సహాయాన్ని ముఖ్యంగా హిందువులు కాని వారి సహాయాన్ని అడగకూడదు. గౌరవంగా తిరస్కరించాలి. యిందలి సత్యాన్ని నేను నిరూపించనవసరంలేదని అనుకుంటున్నాను నాకు తెలిసినంతవరకు సత్యాగ్రహ ఉద్దేశ్యాన్ని వినమ్రతతో మీముందు వుంచాను. నేను దాని రచయితను గనుక దాని అర్థాన్ని నన్నే చెప్పనీయాలి. యిది సాంకేతిక విషయం. రచయితకు కూడా తాను ఉపయోగించిన శబ్దాల మీద, వాటి అర్థాల మీద హక్కుఉండదు. ఒకసారి శబ్దం పెదిమలు దాటినా, పెన్నుతో వ్రాసినా, అవి అతని సొంత ఆస్థి కాజాలవు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు, సంపుటము 24, పుట 544-545, 6-5-1924*

★ ★ ★

ఎవరైనా సత్యం కాలి కింద అణిచి వేయబడుతున్నదని భావించినప్పుడు సత్యాగ్రహాన్ని అవలంబించవచ్చు. అతను భగవంతుడుతోడుగా చెడుతో పోరు సలుపుతాడు. అతడు ఎటువంటి యితర సహాయాన్ని ఆశించడు. అది సమయానికి అందుతుంది. అది న్యాయ సమ్మతమైతే అతడు స్వీకరిస్తాడు. సత్యాగ్రహి తానొక్కడే పోరుతానని, ప్రతిజ్ఞ చేస్తాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు, సంపుటము 23. పుట 544, 6-5-1924*

★ ★ ★

సత్యాగ్రహం మీద, అహింస మీద నా విశ్వాసం ఎన్నటికీ వాడనిది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 26, పుట 208, 28-2-1925*

★ ★ ★

## 6. సత్యాగ్రహము – ఉపవాసము

సత్యాగ్రహాన్ని శాస్త్రంగా అభివృద్ధి చేసి దాని ద్వారా నేను పొందినంత ప్రతిఫలం సమకాలికులెవ్వరూ పొందలేదు. నిజాయితీగా, తెలివిగా ఉపవాస వ్రతాన్ని, ప్రార్థనను దేశప్రజలందరూ చేసేలా కృషి జరగాలని కోరుకుంటున్నాను. సంస్థల పర్యవేక్షణలో యీ పని జరగాలంటే అసాధ్యమని అనిపిస్తుంది. అయినా దేశానికి సంబంధించిన లక్షలాది పనులు మనం చేయవలసివుంది. ఉపవాసం, ప్రార్థన యాంత్రికం కాదని, ఆధ్యాత్మికాలని నాకు తెలుసు. ఉపవాసం ఆత్మకు స్వేచ్ఛ ప్రసాదిస్తుంది. ప్రార్థన ఆత్మ యొక్క పవిత్రతను కాపాడుతుంది. తద్వారా లక్ష్యసాధన సులభమవుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 17, పుట 104, 20-3-1920*

★ ★ ★

సత్యాగ్రహంలో ఉపవాస పరిధి నిర్వచించబడింది. క్రూరుడైన రాజు చేసిన శాసనాన్ని ధిక్కరించినందుకు జరిమానా వేయించుకో. అయితే అతడికి జరిమానా విధించే అవకాశం లేకుండా చేయగలగాలి. ఉపవాసవ్రతం ప్రేమించే వ్యక్తికి వ్యతిరేకంగా చేయాలి. మన హక్కుల కోసంగా కూడా అతనిలో పరిశుద్ధత తెచ్చుటకు చేయాలి. బొంబాయిలోను, బార్డోలీలోను నేను ఉపవాస వ్రతం నన్ను ప్రేమించే వారిలో మార్పు తేవడం కోసం చేశాను. నన్ను ప్రేమించని తనకు తనను శత్రువుగా భావించుకొనే జనరల్ డయ్యర్ వంటి వాడిలో మార్పు కోసం ఉపవాసం చేయను.

మహాత్మాగాంధీ సంగ్రహరచ్ననలు. సంపుటము 18, నుట 420, 12-4-1924.

★ ★ ★

ఉపవాస వ్రతాన్ని గురించి నీవు చెప్పేది నిజం. దాని లక్ష్యం ఆత్మసంబంధమైనది. కాకపోతే అది సంపూర్ణమైన విలువలు కలిగి వుండదు. ఏ కొంచెం ప్రభావమూ ఆత్మ మీద చూపదు. మిశ్రమ యోచనలతో కూడిన ఉపవాసవ్రతం ఐహికమైన ఫలితంతో సమాప్తమవుతుంది. ఏదో ఒక స్థాయిలో వ్యక్తి పరిణతికి, ఆత్మవికాసానికి ఉపవాసవ్రతం

అవసరం. ప్రాముఖ్యం వున్నా ప్రతి మతం ఉపవాసవ్రత విలువలను గుర్తించింది. ఎవరికి వారు క్షుద్బాధను అనుభవిస్తే తప్ప శరీరానికి శిలువ వేయడం అర్థం లేని మాట. ఉపవాసవ్రతం సంపూర్ణ సత్యం చేత, సంపూర్ణ అహింస చేత ప్రేరేపించబడాలి. దాని పిలుపు లోపల్నుంచి రావాలిగాని అనుకరణ కారాదు. దాన్ని స్వార్థప్రయోజనాలకు ఉపయోగించుకోకూడదు. ఇతరుల కోసమై మాత్రమే ఉపయోగించుకోవాలి. ద్వేష భావం ఉన్న చోట ఉపవాస వ్రతం ప్రశ్నే తలెత్తదు. కాని అంతర్వాణి ఏమిటి? ప్రతివారూ దానిని వినగలరా? యివి పెద్ద ప్రశ్నలు. ఈ అంతర్వాణి అందరిలోనూ ఉన్నది. చెవిటివారు ఎంత మధురమైన పాటనైనా వినలేనట్లుగా, దానికోసం చెవులు తెరిచి ఉంచుకోని వారు వినలేరు. భగవంతుని వాణి వినుటకు మన చెవులను సరిచెయ్యాలంటే తనను తాను నిరోధించుకొనుట అత్యవసరం.

*ఎంపిక చేసిన లేఖలు - 2/4, పుట 46-47, 30-10-1932.*

★ ★ ★

ఉపవాసం నా జీవితంలో సాధారణమైపోయింది. అది ఆత్మ సంబంధమైన ఔషధం. సమయ సమయానికి రోగములకు ఉపయోగించేది. ఒక్కసారిగా ప్రతివారు ఆ శక్తిని పొందలేరు. నేను సాధించాను. ఎంతో విచక్షణ తర్వాత సాధించిందే.

*మీరాకు బాపూ లేఖలు, పుట 228, 8-12-1932*

★ ★ ★

## 7. ఈ చివరకు

నాకు భారత దేశం యొక్క పేదరికం మీద వైవిధ్యభరితమైన అనుభవం ఉంది. అనవసరంగా ఖర్చవుతున్న ధనం పేదవారి దగ్గర తీసుకున్నదే. నాకు పంపే టెలిగ్రాముల మీద ఖర్చు పెట్టిన డబ్బుతో స్వదేశీ ఖద్దరు కొని అవసరమైన వారికి యిస్తే పేదవారికి ఆహారం యిస్తే వారు ఆ యిచ్చిన వారిని మనస్సులో ఆశీర్వదించరా?

పేదవారి శాపం, దేశాలను నాశనం చేసింది. రాజులకు రాజ్యం పోగొట్టింది. ధనవంతులను ధనహీనులన్ను చేసింది. శిక్షవేసే న్యాయం దయలేనిది. పేదల యొక్క ఆశీర్వచనం రాజ్యాలను వికసింపచేసింది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 174, 28-9-1919*

★ ★ ★

నాకు తోటి జీవుల యెడ ఏదైనా కర్తవ్యం వున్నదా అనుకుంటే చర్మం, ఎముకలుగా ఉన్నవారి గురించి తప్పక ఆలోచించాలి. దయ, జాలి, ప్రేమలాంటి లక్షణాలు ఏవైనా ఉన్నవా? ఉంటే ఆకలితో అలమటించే వారందరూ తమ కర్మ యొక్క ఫలాన్ని అనుభవిస్తున్నారని అననా? నాకు వారి యెడల ఎటువంటి పూచీలేదా? నేను ఈమాటలు వ్రాసేటప్పుడు వణికిపోతున్నాను. కర్మ సిద్ధాంతం యొక్క అర్థం అదే. అయితే నేను దానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలి. అదృష్టవశాత్తు అది నాకు వేరే పాఠాన్ని బోధిస్తుంది. ఒకవైపు అది ఓర్పుకోసం పట్టుబడుతుంది. రెండోవైపు వర్తమానాన్ని సరిచేయమని దృఢంగా ఆజ్ఞాపిస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 24, పుట 422, 12-4-1924*

★ ★ ★

లక్షలమంది పేదరికంలో ఉన్నారని నీవు గుర్తించటం నాకు సంతోషాన్నిస్తోంది. కృష్ణభగవానుని ప్రార్థించే సరైన పద్ధతి ఆయన పేరుమీద మనకంటే దురదృష్టవంతులకు కొంచెమైనా సేవచేయుటయే. మన జీవితంలో సేవాభావాన్ని అలవరుచుకుంటే అంతకు ముందు నమ్మని పొరుగు వారు కూడా భగవంతుణ్ణి నమ్మటం మొదలు పెడతారు.

*ఎంపిక చేసిన లేఖలు - 2. పుట 24, 14-11-1932.*

★ ★ ★

# 8. ఖాదీ గ్రామపరిశ్రమలు

నా అభిప్రాయం ప్రకారం స్వదేశమంటే భారత దేశ అవసరాలకు సరిపడినంత బట్టను ఉత్పత్తి చేయడం, దానిని సరఫరా చేయడం. గృహాలలో ఉత్పత్తిని పెంచాలనే ఉద్దేశ్యంతో ప్రజలను స్వదేశీ బట్టను ఉపయోగించమని ప్రోత్సహించాలి. అవసరమైన చోట విదేశీవస్త్రాన్ని ఉపయోగించవచ్చు. కాని స్వదేశీవ్రతం ఆర్థిక అవసరంగా భావించడింది. అందరూ భాగస్వాములు రాజకీయంగా కాగలిగినా స్వదేశీవ్రతం ఆర్థిక విషయాల పూరణకు ఉపయోగపడుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 16, పుట 60, 25-8-1917*

★ ★ ★

వందల సంవత్సరాలకు పూర్వం ఎక్కువమంది భారత స్త్రీలు లాభం కోసమో, సంతోషంకోసమో, సరదా కోసమో, నూలువడికేవారు. వేలాది మంది చేనేత పనివారు గృహావసరాలకు బట్ట నేసేవారు. ఆ పని యీనాడు చేయవచ్చా లేదా అను విషయం అనవసరం. మిలియన్ల కొద్దీ గల మన దేశగ్రామీణులకు వడకడం, నేయడం నేర్పితే, అది ఆర్థిక మాంద్యాన్ని తొలగించి, వారి సంపాదనకు సహాయకారి కాగలదనటంలో సందేహం లేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 16, పుట 60, 25-8-1919*

★ ★ ★

రాట్నాలు లేకుండా బీదవారికి లాభం కలిగించలేము. మనం వారిని వారు పోషించుకోవటానికి, బట్ట కట్టు కోవడానికి తప్పక సహాయపడాలి. మనం మళ్ళీ రాట్నాన్ని ప్రవేశపెడితే తప్ప అందు సఫలం కాలేము. ఇంకా ఏ పరిశ్రమా భారత దేశంలోని బీదరికాన్ని పోగొట్టలేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 19, పుట 395, 2-3-1920*

★ ★ ★

రెండువందల ఏళ్ళ క్రితం భారతదేశపు స్త్రీలు తమ గృహావసరాలకే కాక విదేశాల కోసం కూడా బట్ట నేసేవారు. ముతక బట్టనే కాక ప్రపంచంలో ఇంక ఎవరూ నేయని అత్యున్నత బట్టలను కూడా నేశారు. మన పూర్వీకులు నేసిన శ్రేష్ఠమైన బట్టను ఇప్పటి వరకూ ఏ యంత్రమూ నేయలేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 20, పుట 496, 11-8-1921*

★ ★ ★

భారతదేశం ఉత్పత్తి చేసే వస్త్రంతో తృప్తి పడటానికి మనం సిద్ధం కావాలి. కృతజ్ఞతా పూర్వకంగా భగవంతుడిచ్చిన పిల్లలతో ఏవిధంగా తృప్తిపడతామో, ఆ విధంగా తృప్తిపడాలి. నాకు తెలిసినంతవరకు తన బిడ్డ బాగా లేదని బయటవారెంతమంది అన్నా పారవేసే తల్లి ఉండదు. దేశభక్తులైన భారతీయులు మన ఉత్పత్తులను గురించి అదే విధంగా భావించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 20, పుట 496, 11-8-1921*

★ ★ ★

ఉపయోగం ఏమాత్రం లేదని విదేశీ వస్త్రాలను బీదవారి ముందు పడవేయుట నాకు చాలా చిన్నతనం అనిపిస్తుంది. ఆ వస్త్రమే యీ భూమిని దివాళా తీయించి, వేలమంది జీవితాలను సిగ్గుతో నింపివేసింది. బీదవారు కూడా యీ దయను, సిల్కురుమాళ్ళు, మెత్తని చీరలు, అతిమెత్తని చొక్కాలు, దుర్గంధం కొట్టే టోపీల రూపంలో అర్థం చేసుకొనలేరు. మనలో మనం అసహ్యించుకొని మనం ఏవిధంగా బీదవారిని పణంగా పెట్టి అనాలోచితంగా అలంకరించుకుంటున్నామో మీరు తెలుసుకోవడం ముఖ్యం. భారతదేశాన్ని తక్కువ చేసి బానిస స్థాయికి తీసుకొనిపోవుటకు ఉద్దేశించిన వస్త్రాన్ని ధరించడం ఒక పాపంగా భావించాలి. కదిలించ చేత్తో శస్త్ర చికిత్స చేయడానికి ప్రయత్నిస్తున్నాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 20, పుట 499, 13-8-1921*

★ ★ ★

నవీన అర్థంలో భారతదేశాన్ని పారిశ్రామికీకరించవలసిన అవసరంలేదు. అందు 7,50,000 గ్రామాలు 1900 మైళ్ళపొడవునా 1500 మైళ్ళ వెడల్పునా ఉన్నాయి. ప్రజలు భూమిని నమ్ముకున్నవారు. అందువల్ల ఎక్కువమంది చేతికీ, నోటికీ సరిపుచ్చుకుంటూ జీవితం గడుపుతున్నారు. భారతీయ గ్రామీణులకు ఒక అనుబంధ పరిశ్రమ కావాలి. అతిసాధారణమైన పరిశ్రమ రాట్నాన్ని ప్రవేశ పెట్టుటయే. చేనేత పనికాదు. చేనేత పని ప్రతి ఇంటిలో ప్రవేశపెట్టడం సాధ్యం కాదు. కాని రాట్నం వడకటం సాధ్యం. ఒక వందేళ్ళ క్రితం అదే ఉండేది. అది ఆర్థిక పరిస్థితుల వల్ల కనుమరుగైంది. స్పష్టమైన ఋజువుల ద్వారా నిరూపించ వచ్చు. రాట్నాలను పూర్వస్థితికి తీసుకువచ్చినట్లయితే భారతదేశం యొక్క ఆర్థిక సమస్యలు ఒక దెబ్బతో పరిష్కారం అవుతాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 22, పుట 401, 15-2-1922*

★ ★ ★

బాహ్య కార్యక్రమాలన్నింటిలోకీ రాట్నం శాశ్వతమైంది. ప్రయోజనకరమైంది అని నమ్ముతున్నాను. లక్షలకొద్దీ భారతీయుల యిళ్ళలోని ఆర్థిక నిస్పృహను అది తొలగిస్తుందని, కరువులకు వ్యతిరేకంగా ఒక ప్రభావవంతంగా పనిచేస్తుందని భావిస్తున్నాను. బలపరచుకోవటానికి నా దగ్గర కావలసిన ఋజువులున్నాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 22, పుట 40, 15-2-1922*

★ ★ ★

యంత్రాలతో నడిచే ఇతర పరిశ్రమల అభివృద్ధి గురించి నేను చెప్పగలిగినది ఏమీలేదు. కాని భారతదేశానికి లోపల బయట పెద్ద పెద్ద మిల్లులు కర్మాగారాలు స్థాపించి తయారైన వస్త్రాలను సరఫరా చేయడం గొప్ప పొరపాటు. చవకబారు రొట్టెను పెద్ద పెద్ద బేకరీలలో ముఖ్యమైన భారతీయప్రాంతాలలో తయారు చేసి సరఫరా చేసి కుటుంబాలలో పొయ్యిని నాశనం చేసినట్లవుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 22, పుట 401, 15-2-1922*

★ ★ ★

రాట్నము యొక్క సత్యాన్ని నీవు గ్రహించాలని అనుకుంటున్నాను. అది మనసులో మానవజాతి ఎడల కలిగే భావాలను బయటికి కనపడునట్లు వ్యక్తీకరించగలదు. పస్తులుండే భారత ప్రజల గురించి నీవు ఆలోచిస్తే మనం తప్పక వారి ఇండ్లలో రాట్నాన్ని ప్రవేశపెట్టాలి. అందువల్ల నిపుణులుగా మారాలి. మనం ప్రతిరోజూ పవిత్రకార్యంగా భావించి తప్పకుండా వడకాలి. నీవు రాట్నం యొక్క రహస్యాన్ని అర్థంచేసుకొన్నట్లయితే దానిని జాలికి, ప్రేమకు గుర్తుగా గ్రహిస్తే ఇంకా ఎటువంటి బాహ్యకార్యక్రమాల్లో పాల్గొనలేవు. చాలామంది ప్రజలు నిన్ను అనుసరించకపోతే నీకు యింకా ఎక్కువ సమయం వడకడానికి కండెలు పోయడానికి సేయుటకు దొరుకుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 23, పుట 99, 17-3-1972*

★ ★ ★

ఆర్థిక కోణం నుంచే మాట్లాడాలంటే విదేశీనూలు, వస్త్రాల వ్యాపారం చేసే వ్యాపారులు వాని వ్యాపారాన్ని మానివేయాలి. అట్లాగే ప్రజలు కూడా విదేశీ వస్త్రంపై తమకున్న మోజును వదిలివేయాలి. లేకపోతే దేశం యొక్క పెద్ద మహమ్మారి పస్తులుండటం తప్పదు. అందరు వ్యాపారులు ఖాదీ వ్యాప్తికి, రాట్నానికి తమ యొక్క పూర్తి సహకారం అందించగలరని విశ్వసిస్తున్నాను.

*గాంధీయన్ కాపిటలిస్టు, పుట 50, 18-3-1922*

★ ★ ★

ఈ వడుకుట నా మీద యింకా ప్రభావం చూపిస్తున్నది. నేను రోజు నిరుపేదలకు దగ్గరవుతున్నట్లుగా, తద్వారా భగవంతునికి దగ్గరవుతున్నట్లుగా అనిపిస్తుంది. ఆ నాలుగు గంటలూ నా జీవితంలో ఎంతో లాభకరమైనవిగా నేను తలుస్తున్నాను. నా శ్రమకు ఫలితం నాముందు కనబడుతున్నది. ఎటువంటి అపవిత్రమైన ఆలోచనలు ఆ నాలుగు గంటలలో కలగవు. గీతను, ఖురాన్‌ను, రామాయణాన్ని చదివేటప్పుడు నా మనస్సు అటూ యిటూ పోతుంది. కాని వడుకుతున్నప్పుడు నా మనసు స్థిరంగా

ఉంటున్నది. ఇదే విధంగా అందరికీ ఉండదని నాకు తెలుసు. రాట్నాన్ని భారతదేశం యొక్క ఆర్థిక నిర్వాణం కోసం నేను అన్వేషించాను.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 23, పుట 134, 14-4-1922*

★ ★ ★

అస్పృశ్యత అనే శాపాన్ని తొలగించటానికి తమలోనే 5 వవంతు మందిని అవమానపరచిన హిందువుల యొక్క పాపాన్ని కడగటానికి తపస్సు చేయాలి. మత్తుపానీయాలు, మందుల చెడును తొలగించాలి. అలా చేస్తే అవినీతికరమైన ప్రభుత్వ వ్యవస్థకు అవినీతి పరంగా లభిస్తున్న 25 కోట్లరూపాయలు లభించకుండా పోతాయి. రాట్నాన్ని పునరుద్ధరింపచేస్తే లక్షలాది భారతీయ గ్రామ్యగృహాలకు ఉపాధి లభిస్తుంది. భారతీయ ప్రాచీన కళలకు వికాసం కలుగుతుంది. దరిద్రం తొలుగుతుంది. కరువులు రావు. భారతీయుల్ని దోచుకుంటున్న గ్రేట్ బ్రిటన్ జేబుకు దెబ్బ తగులుతుంది. విదేశీ వస్త్రాన్ని దిగుమతి చేసుకోకుండా, మనబట్ట మనమే కుట్టుకుంటే గ్రేట్ బ్రిటన్‌కు భారతదేశానికి మధ్య సంబంధాలు సాధారణంగాను ఆదర్శవంతమైనవిగాను వుంటాయి. అవి స్వచ్ఛందభాగస్వామ్య స్వరూపాన్ని సంతరించుకొని ఇరువురకు లాభకరంగా, మొత్తం మానవజాతికే లాభకరంగా పరిణమిస్తాయి. తమ విభజించి పాలించే అవినీతికర సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టకుండా నిరోధం కలుగుతుంది. దోపిడీని అవమానాన్ని అహింసయొక్క ఆచరణ నిరోధిస్తుంది. అది సఫలమైతే ప్రపంచానికి ఒక గొప్ప ఉదాహరణ లభిస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 24, పుట 244, 14-3-19?4.*

★ ★ ★

సంసిద్ధంగా ఉంటే చేతులూ, కాళ్ళూ తమకు తామే తయారు చేసుకొనగల కొన్ని చెక్క పనిముట్లు తప్ప మన గ్రామీణులకు ఏ యంత్రాలూ అవసరం లేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 22. పుట 327. 28-3-1924.*

★ ★ ★

నేను ఖాదీని. రాట్నాన్ని నమ్ముతున్నాను. దానిలో రెండు విషయాలు ఉన్నాయి. మొదటిది భయంకరం. రెండవది కనికరంతో నిండినది. స్వతంత్ర దేశానికి అవసరమైన విదేశీవస్తు వస్త్రాలు బహిష్కరణ అను ప్రవృత్తి లభించడం విదేశీయులకు భయంకరమే. గ్రామీణులకు జీవితం మీద ఆశలు చిగురించడం అందలి రెండవకనికరంతో నిండిన విశేషం అదే గొప్ప జీవితాన్ని అందించగల విద్య.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 24. పుట 286, 26-6-1924*

★ ★ ★

మనకాలంలో భగవంతుడు రాట్నంలో నివసిస్తాడు. క్షుద్బాధ దేశాన్ని దావానలం వలె చుట్టుముట్టుతోంది. దానికి వ్యతిరేకంగా నాకు రాట్నం తప్ప ఎటువంటి సహాయమూ కనిపించుటలేదు. భగవంతుడు ఏదో ఒక రూపంలో తనను తాను వ్యక్తం చేసుకుంటాడు. అందువల్లనే మనం ప్రార్థనలో భగవంతుడు వస్త్రరూపం ఎవరి కోసం ధరించాడో ఆమెను అనగా ద్రౌపదిని తలుచుకుంటాము. భగవంతుని చూడాలనుకున్నవారందరూ రాట్నంలో ఆయనను దర్శించవచ్చు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు. పుట 7, 20-12-1926*

★ ★ ★

నా యాత్రలో, ప్రతి క్షణమూ దేశానికి మంచి నడవడికతో రాట్నంలో శిక్షణ నివ్వగల ఎక్కువ మంది స్త్రీ బోధకుల అవసరాన్ని గుర్తించాను.

*మణిబెన్‌పటేలుకు లేఖలు. పుట 31, 6-7-1927*

★ ★ ★

రాట్నము యొక్క నెమ్మదితనం మీద కలిగిన మోహం పోవటానికి నాకు కొన్ని జన్మలు పట్టవచ్చును. రాట్నము యొక్క నెమ్మదితనమే నన్ను ఆకట్టుకొనే విషయం. నాకు ఎప్పటికీ తరిగిపోని ఆకర్షణలు అందులో ఉన్నాయి. దానియందు నాకు శాశ్వతమైన అభిరుచి కలిగింది. దాని యొక్క ప్రభావం నామీద అవుతున్నది

అందుచేత రోజురోజుకు దాని సౌందర్యాన్ని అన్వేషిస్తున్నాను.

*మహదేవదేశాయి డైరీ. పుట 154, 8-6-1932*

★ ★ ★

నా ఆర్థిక శస్త్ర పుస్తక పఠనం భారతదేశంలో పేదరికాన్ని తొలగించుటకు, వారు చెప్పిన పద్ధతుల్ను ఫలవంతంగా వినే నమ్మకాన్ని దృఢతరం చేసింది. నిజమైన విరుగుడు ఉత్పత్తిని వినియోగాన్ని వాటంతట అవే జరిగిపోయేటట్లు చూడటమే. అంటే గ్రామీణ పరిశ్రమల పునరుద్ధరణయే.

*మహదేవదేశాయిడైరీ. సంపుటము 1. పుట 214.*

★ ★ ★

పనికి వచ్చే పనులన్నీ ఒకే స్థాయికి చెందినవి. తోలుపరిశ్రమ, వడ్రంగి పని, వంటచేయుట, గోవులను కాయడం, అటువంటి యితరపనులన్నీ కూడా సమాన విలువ కలిగినవే. నా పరిధిలో ఆలోచిస్తే చదువుకున్నవాడు, చదువుకోనివాడు, ఉపాధ్యాయుడు, పాయఖానాలు కడిగేవాడు తమతమ పనులకు సమాన ప్రతిఫలం పొందాలి.

*మహదేవదేశాయి డైరీ. సంపుటము 1, పుట 277, 4-8-1932*

★ ★ ★

గ్రామంలో తయారైన కాగితం ఉపయోగించలేకపోతున్నానను విషయం నీకు బాధ కలిగించనవసరం లేదు. అట్టి భావం కలిగి యుండాలి. పేదల యెడ సానుభూతి కలగాలి. నీ ప్రవృత్తిలో అది భాగమైతే అటువంటి వాటిని ఉపయోగించడానికి అలవాటు పడతావు. నీ యందలి తపనకు అనుగుణ్యంగా నీవు చేసినదే నిఖార్సయినది. అదే నీకు ఫలవంతం అవుతుంది. అక్కడవున్నప్పుడు అక్కడి వస్తువులు ఆంగ్లేయులవా, కావా అని భేదం చూపించకూడదు. అట్లా చూపించడం మంచిది కాదు.

*ది గాంధియన్ కాపిటలిస్ట్. పుట 142, 4-9-1935*

★ ★ ★

దుస్తుల విషయంలో నేను ఒక్క విషయం స్పష్టం చేయాలని అనుకుంటున్నాను. నీకు వీలుగా దుస్తుల్ని సరిగా నిర్వహించుకోలేదని భావిస్తే ఖాదీని వదిలి వేయవచ్చు. నీకు అవసరమైన బట్టను సమకూర్చుకునే స్వతంత్రం నీకు వున్నది. నీ ప్రశ్నలన్నింటికి జవాబు యిందులో వున్నదని అభిప్రాయపడు తున్నాను. నీవు ఇష్టపడితే ఓవర్‌కోటును, మేజోళ్ళను, బనీన్లను, విదేశీ లేక భారతీయ బట్టతో తయారైన వాటిని వాడవచ్చును. అవన్నీ చేతితో వడికినవి, నేసినవి అయితే మంచిది. అలా చేయకపోయినా దోషం కాదు.

*టు ఏ గాంధియన్ కాపిటలిస్ట్. పుట 143. 4-7-1935*

★ ★ ★

నూటయాభై సంవత్సరాల క్రితం మనకు కావలసిన వస్త్రాలనన్నింటిని మనమే తయారుచేసుకునేవారం. మన మహిళలు తమ గృహాలలో నాణ్యమైన నూలువడికి తమ భర్తల సంపాదనకు తోడుగా వుండేవారు. ఆ నూలుతో గ్రామమందలి నేతవాళ్ళు బట్టనేసేవారు. పెద్ద వ్యవసాయ ప్రధానమైన మనదేశంలో అటువంటి వృత్తులు ఆర్థికంగా ఎంతగానో వృద్ధి చెందాయి. ప్రజలు విశ్రాంతి సమయాన్ని అందుకు వినియోగించేవారు. కాని యిప్పుడు మహిళలు తమ చేతి శక్తిని పోగొట్టుకున్నారు. బలవంతపు విశ్రాంతి దేశాన్ని పేదనొనరించింది. చేతి వృత్తులవాళ్ళు చాలా మంది వీధులు ఊడ్చేవారయ్యారు. కొంతమంది జీతం మీద సైనికులయ్యారు. సగం మంది నేతకళాకారులు నశించారు. మిగతా సగం చేతితో వడికి సన్నని నూలు, లేక విదేశీనూలుతో బట్ట నేస్తున్నారు.

*మహాత్మాగాంధీ లేఖలు. పుట 36*

★ ★ ★

# 9. తూర్పు – పడమర

నేను నూతన నాగరికతను ఖండించడానికి సాహసిస్తున్నాను. అందు చెడు వుందని నా భావం. అందలి కొన్ని విషయాలు మంచివి వున్నా నీతి అను ఒరిపెడి రాయి మీద పరీక్షించాను. తమ తమ వాతావరణంలో వుంటూ ఉన్నతస్థాయికి ఎదిగిన వ్యక్తుల ఆదర్శాల్ని గ్రహించాను. క్రైస్తవమతానికి నూతన నాగరికతకు మధ్య వున్నట్లుగా దాని ప్రభావం యూరప్‌కు మాత్రమే పరిమితం కాలేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 10. పుట 247. 10-5-1910*

★ ★ ★

ఈ సంస్కృతి, నాగరికతల్లో మునిగిన మనం మునిగివున్నన్నాళ్ళు తపాలా మరియు యితర సౌకర్యాల్ని ఉపయోగించుకుందాం. వివేకంతో అర్థంచేసుకొని వాటి వెనుక పడవలసిన అవసరం వుండదు. వాటి వాడకం పెంచుకునే బదులు క్రమంగా తగ్గించివేయాలి. దీన్ని అర్థంచేసుకున్నవారు యీ తపాలా, రైల్వేలను గ్రామాలకు తీసుకు వెళ్ళేందుకు అర్రులు చాచరు.అందరూ వదిలి వేయలేరని, ముందుకూడా యిలాగే సాగుతుందని భావించి భయంతో స్టీమర్లను, యితర చెడు సాధనాలను ఉపయోగిస్తూ స్తబ్ధుగా వుండిపోలేము. నీవు, నేను వ్యక్తి పరంగా వాటిని వదిలినా మిగతావారు కూడా ఆవిధంగా చేయగలుగుతారు. ఆవిధంగా చేయడం మంచిదని నమ్మి మిగతావారితో సంబంధం లేకుండా అలా చేస్తూనే వుండాలి. ఆవిధంగా సత్యాన్ని వ్యాప్తం చేయాలి. యింతకంటే మించిన పని ప్రపంచంలో ఏదీ లేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 10. పుట 204. 2-4-1910*

★ ★ ★

యూరప్‌వాసుల చర్యల ప్రభావం భారతదేశానికి మంచి చేయునది కాదు. భారతదేశానికి వచ్చిన యూరోపియన్ల సముదాయం అక్కడి నాగరికతా దుర్గుణాలకు లోబడిపోతున్నది. ఆ ప్రభావం ప్రాచ్యం మీద పూర్తిగా పడి వుంటే పరిస్థితులు

మరోరకంగా వుండేవి. ప్రస్తుత పరిస్థితుల్లో నిరూపితమైనట్లుగా మతం వారిమీద చెరగని ముద్ర వేయలేదు. నూతన నాగరికత క్రైస్తవ వ్యతిరేకమని నా అభిప్రాయం. యూరోపు వాసులు క్రైస్తుయొక్క జీవితానికి బదులు, అక్కడి నాగరికతను తీసుకువచ్చారు. కొందరు దానికి ప్రతీకలుగా నిలువాలని ప్రయత్నిస్తున్నారు. భూమి కూడా తన ముద్ర వేస్తుంది కదా. భగవంతుని యంత్రాలు నెమ్మదిగా కదులుతాయి. నీవు నీవంటివారు కొట్టవచ్చినట్లు కనబడే చెడువల్ల ప్రభావితం కారు. దాని వెనుకనే వెళ్ళి అందలి మంచిని అన్వేషించి జమచేసుకొని, మిశ్రమఫలితాన్ని తయారుచేసుకోవాలి. చాలామంది తమ ఆచార వ్యవహారాలు తెలిసినా, యీ భూమి యిచ్చేదాన్ని స్వీకరిస్తారు. విశాల దృక్పథం కలిగిన అనేక మంది యూరోపియన్ స్నేహితుల్ని ఆహ్వానించాను.

*మైడియర్ చైల్డ్.* పుట *11, 9-2-1917*

★ ★ ★

అమెరికా యందలి వ్యాపారస్థులకు నా సందేశం ఒక్కటే. రాట్నం యిచ్చే ౦ందేశాన్ని అర్థం చేసుకోండి. అప్పుడు మీరు మనస్ఫూర్తిగా కోరుతున్న ప్రపంచశాంతికి ౦రిష్కారం కనుక్కోగలుగుతారు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 23, పుట 362, 5-4-1924.*

★ ★ ★

బలవంతంగా రుద్దబడిన పాశ్చాత్యనాగరికతా వ్యామోహంవల్ల, మన భారతదేశప్రాచీన నాగరికత నశించిపోకుండా. నా శక్తినంతా ధారపోసి రక్షించడానికి ప్రయత్నిస్తాను. అది నా లక్ష్యంగా భావిస్తున్నాను. భారతీయ ప్రాచీన సంస్కృతి పూర్తిగా అహింసమీద ఆధారపడివున్నది. సర్వులమంచి, సర్వులక్షేమం దాని లక్ష్యం. ప్రాణకోటి అంతా సుఖంగా శాంతిగా వుండాలని దాని ఉద్దేశం. కాని పాశ్చాత్య సంస్కృతి నిర్మొహమాటంగా హింసమీద ఆధారపడి వున్నది. అది జీవరాశినంతటినీ గౌరవించడం లేదు సరిగదా, దాని అభివృద్ధికి మానవ జీవితాలను నాశనం చేయడానికి కూడా సంశయించడం లేదు. దానిది శక్తికే అధికారం అను నినాదం. అది వ్యక్తికి

సంబంధించినది. పాశ్చాత్య దేశాలనుంచి భారతదేశం నేర్చుకోవలసింది ఏమీ లేదని నేను అనను. వ్యక్తి స్వేచ్ఛకు ప్రాధాన్యం యిచ్చినా మానవకోణం పూర్తిగా పాశ్చాత్యుల కనుమరుగుకాలేదు. సత్యమని భావించిన తప్పుడు ఆదర్శం యొక్క విశ్రాంతి నెరుగని ఆచరణ పాశ్చాత్యుల కళ్ళు తెరిపించిందని చెప్పవచ్చును. సంప్రదాయాన్ని ప్రశ్నించకుండా తృప్తిపడే భారతదేశం సత్యాన్వేషణలో దానిని గ్రహించి అనుసరించాలి. తన సంస్కృతి సభ్యతలకు ప్రపంచంలో ప్రముఖస్థానం వున్నదని, దాన్ని గుర్తిస్తేతప్ప భారతదేశం పాశ్చాత్య పద్ధతిని అనుసరించకూడదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 23. పుట 243, 14-3-1924*

★ ★ ★

శస్త్ర చికిత్సా పద్ధతుల పరిశోధనలకు, వారి బహుముఖవికాసానికి, తత్సంబంధిత తదితర విషయాలకు, పాశ్చాత్యదేశాలు నామెప్పును సదా పొందాయి.

*మీరాకు బాపూ లేఖలు. సంపుటము 10, పుట 112, 7-7-1930*

★ ★ ★

## 10. హిందూ ముస్లిం సమైక్యత

భగవంతుడు తన యిష్టం వచ్చినట్లు ఉపయోగించుకునేందుకై మనుష్యుల్ని తక్కువస్థాయిలో సృష్టించలేదని భావిస్తున్నాను. మనిషి తన ఉన్నత స్థితిని నిలుపుకోవడం కంటే విడుచుకోవడానికే ప్రయత్నిస్తున్నట్లుంది. కాయకూరలు తిని ఆరోగ్యంగా వుండగలిగినప్పుడు జంతువుల ప్రాణాలు తీయడం ఎందుకు? అట్టి హక్కు మనిషికి ఎక్కడిది? కొన్ని జంతువుల్ని చంపడం అవసరం అని అనుకుంటే వాటిని చంపే హక్కు నాకు లేదు. అందువల్ల మేకల్ని, చేపల్ని, కోళ్ళను ఉపయోగించుకొని హాయిగా ఆరోగ్యంగా వుండగలిగినప్పుడు నా జీవనం కోసం గోవుల్ని చంపడం పాపం. అటువంటిదే ఏదో జరిగినందువల్లనే కాబోలు ప్రాచీన ఋషులు ఆవుల్ని పవిత్రమైన జంతువులుగా నిర్ణయించి వుంటారు. జాతీయ జీవనంలో ఆవును గొప్ప ఆర్థిక సాధనంగా గుర్తించడం జరిగియుండవచ్చు. గోవులాంటి ఎంతో సేవ చేసే జంతువును ఆరాధించడం

తప్పుగాను, నీతిబాహ్యమైనదిగాను, పాపంగాను, అది సృష్టికర్తతో సమానంగా భావించబడనంతవరకు నాకు అనిపెంచడం లేదు. ప్రత్యేకమైన ఆరాధన సృష్టకర్తకే వుండాలనే భావం వున్నది. (ఇస్లాం మతంలో యీ విషయం నొక్కి చెప్పబడింది) దాన్ని నేను ఎంతో మెచ్చుకుంటాను. అయితే నేను గోవును ఆరాధించడాన్ని, వధించడాన్ని కలపను. కలపకూడదని భావిస్తున్నాను. నీతి సూత్ర ప్రకారం గోవధ సమాధానం చెప్పుటకు వీలులేనిది.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటం 16, పుట 508, 25-1-1920.*

★ ★ ★

వ్యక్తిగతంగా బాగా ఆలోచించి నేను నిర్ణయానికి వచ్చిందేమంటే, హిందూ ముస్లిముల ఐక్యతకు స్పష్టమైన ప్రభావవంతంగా పనిచేయగల దేదైనా ఉందీ అంటే అది చరఖా మీద చేత్తో వడికిన నూలుతో చేసిన శుద్ధ ఖద్దరు మాత్రమే. ఈ విషయాన్ని అందరూ ఆమోదిస్తే మనకు ఒక సాధారణమైన ఐక్యభావనను అందించగలదు. మన కార్యక్రమాలకు ఒక ఆధారం లభించగలదు. ఇరుమతాల వారు అంగీకరించి వినియోగిస్తేనే ఖద్దరు వినియోగం విశ్వజనీనం అవుతుంది. ఈ విశ్వజనీన చరఖా, ఖద్దరు భారతదేశాన్ని మేల్కొలపగలుగుతాయి. అది మన అవసరాలను తీర్చగల శక్తిని రుజూ చేయగలదు. ఈ ఉద్యమం ప్రారంభం కాగానే విదేశీ వస్త్ర బహిష్కరణను అందరం గుర్తించాము. ఖద్దరును విశ్వజనీనం చేయగలిగితే విదేశీ వస్త్ర బహిష్కరణ జరిగి తీరుతుంది. నా వరకు నాకు చరఖా, ఖద్దరు రెండూ మతమంత ప్రాముఖ్యాన్ని కలిగివున్నాయి. అది ఇరు మతాలవారికి ఆకలిగొన్నవారికి, అనారోగ్యం పాలబడ్డవారికి మధ్య సంబంధాన్ని కలుగచేస్తుంది. అందువల్లనే ఖద్దరు ఉద్యమం నీతివంతమైనదని, ఆర్థిక రాజకీయపరమైనదని వర్ణించబడుతున్నది. ఈ చిన్న విషయాన్ని మనం సాధించలేకపోతే, నిజమైన సాఫల్యం లభించదని నా భావన. మనం స్వరాజ్యాన్ని ఖిలాఫతును సాధించడానికి అహింస ముఖ్యమైనదని గుర్తించితే ఖద్దరు ఉద్యమం సఫలమవుతుంది. అందువల్ల ప్రస్తుతానికి దేశం ఎదుట నేను ప్రతిపాదించగల ప్రతిభావంతమైన కార్యక్రమం ఖద్దరు కార్యక్రమమే.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 23, పుట 92, 12-3-1922.*

★ ★ ★

గోసంరక్షణ నాకు ఒక్క గోరక్షణే కాదు, దానికంటే ఉన్నతమైనది. మిగతా జప్తులన్నింటితోపాటు ఆవుకూడా ఒక జీవి. గోసంరక్షణకు అర్థం బలహీనుల, నిస్సహాయుల, మూగ చెవిటి వారల రక్షణయే. దానివల్ల మానవుడు గొప్పవాడు, భగవంతుడుగా మారడు. వాటి సేవకుడు అవుతాడు. గోవు దయ బహు గొప్పది. ఈ నిజాన్ని మనం త్వరగా తెలుసుకోవాలి.

*లేఖా గుచ్ఛము - పుట 43, 25-4-1925.*

★ ★ ★

## 11. స్త్రీ జనోద్ధరణ

స్త్రీ సేవకు మరోరూపం. అయితే ప్రస్తుతం స్త్రీలు తమ కుటుంబాలకే సీమితమైనారు. వారు తమ పరిధిని ఎందుకు విస్తరించుకోకూడదు? నిజమైన మతవాది ప్రపంచ పౌరుడు కాగలడు. కాని దేశ సేవ మానవజాతికంతటికి సేవ చేయుటకు ఉపయుక్తపడుతుంది. ప్రపంచ క్షేమాన్ని కాంక్షించి, దేశానికి సేవ చేస్తే చివరికి అది ఆత్మ సాక్షాత్కారానికి (మోక్షం) దారితీస్తుంది.

*ఎస్సెన్ వివిధ లేఖలు 1 - పుట 6. 12-12-1926*

★ ★ ★

చాలామంది స్త్రీలు చురుగ్గా వుండరు. వారిని కష్టపడేవారుగా చేసేదెవరు? పుట్టినప్పటినుంచి తల్లులు. తమ పిల్లలను పాడు చేస్తూ ఉంటారు. వారిని ఎవరు ఆపగలరు? పిల్లల్ని బాల్యం నుంచే ఆభరణాలతోను, దుస్తులతోను తల్లులు నింపివేస్తారు. ఆడపిల్లలకు బాల్యంలోనే వివాహాలు జరిపిస్తారు. వయస్సుపైబడ్డ వారికి యిచ్చి తమ ఆడ పిల్లల వివాహాలు చేస్తూ ఉంటారు. నేను స్త్రీలను ఆభరణాలతో చూచినప్పుడు నిస్పృహకు లోనవుతాను. నిజమైన సౌందర్యం యీ ఆభరణాలలో లేదను హృదయఘోషను ఎవరు విశదీకరించ గలరు? యిలాంటి విషయాలు నేను ఎన్నైనా వ్రాస్తూ పోవచ్చు. కాని దీన్ని యింతటితో సరిపుచ్చేదెట్లా? స్త్రీలలో నుంచి తీవ్ర ప్రకాశం కలిగిన ద్రౌపది వంటి వారు తలెత్తితేనే యిది సాధ్యం.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 19, 28-2-1927*

★ ★ ★

పురుషులు స్త్రీలను నిస్సహాయస్థితిలోను, యితరులపై ఆధారపడే స్థితిలోను ఉంచారు. అందువల్ల ఆమెను రక్షించే బాధ్యత అతని మీద పడింది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 27, 9-5-1927.*

★ ★ ★

అత్యాచార ప్రమాదానికి లోనైన స్త్రీ ఆత్మహత్య చేసుకునే హక్కు కలిగివుంటుంది. ఒక ధర్మకర్త తన అధీనంలో గల ఆస్థి అంతా పోయినప్పుడు చేయగలిగింది అదే. అయితే అలా చేసేముందు ఏం చేయాలో సరిగా యోచించాలి. ఒక స్త్రీ అత్యాచారానికి గురి అయి ఆత్మహత్యకు సిద్ధపడితే ఆమె తప్పు చేసిందనే హక్కు మనకు లేదు. మరోవైపున తన రక్షణ క్రింద వున్న ఆస్థి పోతే ధర్మకర్త ఆత్మహత్య చేసుకొని సరియైన పనిచేశాడని చెప్పలేము. ఆ సమయంలో ఆ వ్యక్తియొక్క మానసిక స్థితిమీద అది ఆధారపడియుంటుంది. ఒక స్త్రీకి ధైర్యం ఉంటే ఆమె తన ప్రాణాలనైనా ధారపోస్తుంది కాని, తన మానాన్ని పోగొట్టు కునేందుకు సిద్ధపడదని నా నమ్మకం. ఆ విషయం స్త్రీల మధ్య ప్రసంగిస్తూ చెబుతాను. తాము ఆధారపడతగినవారు దగ్గర లేనప్పుడు కత్తిని, రివాల్వరును ఉపయోగించడం తెలియనప్పుడు దౌర్జన్యకారునికి లొంగిపోవడం తప్ప ఏమి చేయగలమని చాలామంది స్త్రీలు తప్పుగా భావిస్తుంటారు. కత్తిమీదనే ఆధార పడనవసరం లేదని నా అభిప్రాయం. వారి శీలమే పెద్దరక్ష. అట్లా కానప్పుడు కత్తివంటి వాటిని ఉపయోగించుటకు బదులు ఆత్మహత్యను ఆశ్రయించవచ్చు. అందువల్ల స్త్రీలు తాము బలహీనుల (అబల) మని భావించనవసరం లేదు.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 210, 3-7-1932.*

★ ★ ★

ఆడంబరాలంటే ఆకర్షణ ఏ మూలో ఉన్నప్పటికీ దానిని వదులుకోవడం లేదా ఇతరులను చూచి మార్చుకోవడం. వ్యర్థం. మోహం తొలగినప్పటికీ మన మనస్సు లాగుతూ ఉంటే మనం అవసరమైన బాహ్యమార్పులు చేసుకోవచ్చు. అపరాధ భావంతోనో, ఇతరులను నిరోధించడం ద్వారానో వాంఛను పారద్రోలవచ్చు. మోహము

వంటివి మన శత్రువులు. అవి మనలను బాధిస్తాయి. ఎంత బాధిస్తాయంటే వాటినుండి మనల్ని మనం రక్షించుకోవడానికి, ఎవరినుంచైనా ఎక్కడి నుంచైనా వచ్చే సహాయాన్ని స్వీకరించాలి. నేను యిదంతా నిజాయితీపరులు, నిష్కపటులు అయిన వారికోసం వ్రాస్తున్నాను.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 59, 19-12-1927.*

★ ★ ★

పురుష వైద్యులు తమను పరీక్షించటానికి తమకు శస్త్ర చికిత్స చేయటానికి స్త్రీలు ఒప్పుకోరు. ఇది అనవసరమైన లజ్జా స్పృహ. దాని వ్రేళ్ళు లింగ వివక్షలో ఉన్నాయి. ఈ విషయంలో పాశ్చాత్యుల పద్ధతి. నాకు ఎన్నుకోదగినదిగా ఉంటుంది. అప్పుడప్పుడు దానివల్ల అవాంఛనీయ పరిణామాలు కలగడం నాకు తెలుసు. విలువలు లేని వైద్యులు వల్ల స్త్రీలు సులభంగా లొంగిపోయేవారైతే అటువంటి నీతిబాహ్య చర్యలు జరుగుతాయి. అట్టి విషయాలు ఏ పరిస్థితులలోనైనా ప్రపంచంలో జరుగుతూనే ఉంటాయి. అందువల్ల మంచి కార్యక్రమాలను, పనులను ఆపుట సరికాదు. మనకు మనయందు విశ్వాసం ఉండాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 88, 9-12-1929.*

★ ★ ★

పురుషుని యొక్క మోహం తరచు స్త్రీలను దిగజార్చింది. వారే స్త్రీలకు దుస్తులు ధరించే పద్ధతులను ప్రవర్తనను నేర్పారు. దానివల్ల స్త్రీలు, పురుషులకు ప్రేరణ ఉద్రేకం కలిగించగలుగుతారు. ఈ విషయాన్ని స్త్రీలు బానిసత్వంగా దిగజార్చుకోవడంగా భావించరు. ఆమెకీ మోహమే. అందువల్లనే ఆమె ముక్కు కుట్టించుకొని, చెవులు కుట్టించుకొని పాదాలకు పట్టాలు, గజ్జెలు పెట్టుకున్నది. బానిసగా మారిపోయింది. ఒక నీతి లేని పురుషుడు ఒక ముక్కుపుడకతోనో, చెవిపోగుతోనో స్త్రీని ప్రేరేపించగలుగుతాడు. నేను ఎప్పటికీ అర్థం చేసుకోలేక పోతున్నది. యిదే. ఎందుకు ఇవన్నీ పెట్టుకొని వారిని వారు బలహీనులుగా

చేసుకొంటున్నారో అర్థం కాదు. నిజమైన సౌందర్యం హృదయంలోనే ఉంది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 90. 9-12-1929.*

★ ★ ★

చెడుపేరు గల వనితలకు పునరావాసం కల్పించినట్లైతే పురుషుల పశుప్రవృత్తి తగ్గుతుంది. జంతురూపంలో పురుషులున్నంత వరకూ స్త్రీలలో కూడా జంతువులుంటాయి. అటువంటి స్త్రీలు తమ నీచవృత్తి మానివేసి, కొత్త జీవితం ప్రారంభిస్తే గౌరవనీయులైన పురుషులు తప్పక వారిని వివాహం చేసుకుంటారు. ఒకనాటి వేశ్య ఎప్పటికీ వేశ్యే అనేది సరైన యోచన కాదు.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1. పుట 315, 28-3-1932.*

★ ★ ★

అందమైన విషయాల కోసం అర్రులు చాచడం ప్రకృతి ధర్మం. సౌందర్యానికి సంపూర్ణ స్థాయి లేదు. అందువల్ల అట్టి వాంఛకు తృప్తి వుండదు.

కనుక సౌందర్యాన్ని లోపల నుంచి చూడటం నేర్చుకోవాలి. ఆ పని చేయగలిగితే సౌందర్యమంతా మనకు దొరికినట్లవుతుంది. అప్పుడు ఆ సౌందర్యం తనది కావాలనే వాంఛ తగ్గిపోతుంది.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 7. పుట 184. 21-6-1932.*

★ ★ ★

పురుషుల స్త్రీల మధ్య పని విభజన తప్పుడు అభిప్రాయాల వల్ల జరిగిందని భావిస్తున్నాను. విభజన వుండవలసిందే కాని ఇంటిని సరిదిద్దడంలో పురుషుని నిస్సహాయత, పాశ్చాత్య దేశాల్లో కంటే స్త్రీ తనను తాను తక్కువగా చూచుకునే నిస్సహాయత మన పాలనా లోపం వల్లే కలిగింది. స్త్రీ లేకపోతే పురుషుడు ఇంటిని శుభ్రంగా వుంచుకోవడానికి అంత బద్ధకంగా ఎందుకు ఉండాలి? స్త్రీ ఎల్లప్పుడూ తనను రక్షించే పురుషుడు అవసరమని ఎందుకనుకుంటుంది? స్త్రీ యిల్లు

ఒక్కడి సుఖకోసానికేనని పురుషుడు భావిస్తూ ఉండటం, తన రక్షకుడు పురుషుడేనని స్త్రీ భావిస్తూండడం వల్లనే యీ తేడా వస్తున్నది. ఇందుకు భిన్నమైన వాతావరణాన్ని ఆశ్రమంలో కల్పించుటకు ప్రయత్నిస్తున్నాము. అది కష్టమైన పని అయినా అది చేయవలసిన పని అని నా భావన

*మైడియర్ చైల్డ్ - పుట 92, 10-7-1932.*

★ ★ ★

స్త్రీలుగా మీరు మీ గౌరవాన్ని, హక్కుల్ని గుర్తించి, వాటిని మానవజాతికి ఉపయోగిస్తే వాటి ప్రయోజనం అధికంగా వుంటుంది. కాని పురుషులు మిమ్మల్ని బానిసలుగా మార్చి సంతోషపడితే, మీరు వారికి బానిసలుగా మారితే, మీరు, మీ యజమానులు కలిసి మానవత్వాన్ని దిగజార్చే నేరాన్ని చేస్తున్నారన్నమాట. స్త్రీలు తమ గౌరవాన్ని గుర్తించేటట్లు చేయడమే చిన్నతనం నుంచి నేను చేస్తున్న పని యని నీవు చెప్పవచ్చు. అయితే నేను కూడా ఒకప్పుడు స్త్రీని బానిసగా భావించినవాణ్ణే. కాని కస్తూరిబా తాను బానిసత్వానికి సిద్ధంగా లేనని రుజూ చేసి నా కళ్ళు తెరిపించింది. నా పనిని గుర్తించేటట్లు చేసింది. ఆమె పని పూర్తి అయింది. ఆమె వదిలిన పనిని గుర్తించి నిర్వహించగల స్త్రీ కోసం అన్వేషిస్తున్నాను. నీవు అట్టి స్త్రీవా? అట్టి స్త్రీగా ఉండాలని అనుకుంటున్నావా?

*రాజకుమారి అమృతకౌర్‌కు బాపూ లేఖలు - పుట 100. 21-10-1936.*

★ ★ ★

నాకు 30 సంవత్సరాలు నిండక ముందు నుంచే నేను స్త్రీలతో కలిసి పనిచేయడం మొదలుపెట్టాను. దక్షిణాఫ్రికాలో నాకు తెలియని మహిళ లేదు. కాని గర్భ దరిద్రుల మధ్య నేను పని చేస్తున్నాను. నేను మేధావుల్ని ఆకర్షించ లేకపోయాను. నా విజ్ఞప్తులన్నీ హృదయాన్నుంచి హృదయాలకే. మేధావి వర్గ సమక్షంలో నా పని నీటి నుంచి బైటపడ్డ చేపవలె వుండేది. నీవు ఊడ్చి శుభ్రం చేసే పని ఎక్కువగా చేసి పొరబడ్డావు. మహిళా మేధావులను సంఘటితపరచలేదని నన్ను నిందించలేవు. నాకు ఆ అదృష్టం లేదు. సంఘటితపరిచే నా పద్ధతి సామాన్యమైనదే. ఉన్నతమైనది

కావాలని నాకు లేదు. నేను పేద స్త్రీల వద్దకు వెళ్ళినప్పుడు భయపడను. వారికి నాకు మధ్య కనపడని బంధమేదో వున్నది. వారికి ఎక్కువగా సేవ చేసి తద్వారా మానవజాతికి సేవ చేయుటకు అవసరమైన పవిత్రత కోసం నా ఆత్మ ఘుంటికలను మ్రోగిస్తున్నాను. నాయందు గల ఏదో పెద్ద లంగరు దీన్ని కోరుతున్నది.

*రాజకుమారి అమృత కౌర్‌కు లేఖలు - పుట 146, 8-7-1938.*

★ ★ ★

తమ శక్తివంచన లేకుండా పనిచేసేవాళ్ళు వారి పని పూర్తి చేయగలుగుతారు. గీతలో చెప్పినట్లు నీ పనిని నీవు మనస్సులో గుర్తించాలి. అంతా భగవదర్పితమని భావించాలి. భగవంతుని కోసం చేయాలి. అప్పుడు భగవదర్పితమైన పని చేస్తున్నాననే భావన నీకు వుండదు. అందువల్ల ఎవ్వరి యెడ నీకు చెడు భావన కలుగదు. యితరుల యెడల ఎక్కువ దయ గలిగి ఉంటావు. నా ప్రతి చిన్నపనీ యీ సూత్రానికి అనుగుణంగా వున్నదా లేదా అని నిన్ను నీవే ప్రశ్నించుకుంటూ ఉండాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 16.*

★ ★ ★

## 12. అందరికీ మేలు

భారతదేశ దాస్య విమోచనా భారాన్ని దయచేసి అనవసరంగా నీతలకెత్తుకో వద్దు. నిన్ను నువ్వు విడిపించుకో. ఆ భారమే చాలా ఎక్కువ. ప్రతిదాన్ని నీకు అన్వయించుకో. ఆత్మకు ఔన్నత్యం నీకు నువ్వే భారతదేశంగా గుర్తించుటయందే ఉంది. మిగతాదంతా అపనమ్మకమే. నీకు అభిరుచి ఉంటే పట్టుదలతో ఉండు. నీవూ నేనూ ఇతరుల కొరకు బాధపడనవసరం లేదు. ఇతరులను గురించి బాధపడటం మొదలు పెడితే మన పనే మర్చిపోయి సర్వం కోల్పోతాం. దయచేసి దీనిని పరోపకార బుద్ధితో స్వార్థం లేకుండా మరోసారి యోచించు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 10, పుట 206, 2-4-1910.*

★ ★ ★

నిజమైన ప్రజాసేవ, గౌరవం, డబ్బు, కులము, భార్య, కుటుంబం, చివరికి జీవితం ఎడల సిర్ఫీకత సాధించినప్పుడే చేయగలుగుతాము. అప్పుడే జీవితం యొక్క చివరి గమ్యమైన మోక్షాన్ని పొందగలుగుతాము.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 350, 11-11-1910.*

★ ★ ★

అన్ని తరగతులకు చెందిన పనివారికీ సహాయం చేయుట మన విధి. దానిలో నాకు సందేహం లేదు. సహకారం పేరు మీద జరిగే దాని యందు నాకు విశ్వాసం లేదు. పనివారి యొక్క పరిస్థితులను జాగ్రత్తగా పర్యాలోచన చేయుటయే మన మొదటి పనిగా నేను భావిస్తున్నాను.

పనివాడు ఏమి సంపాదిస్తాడు? ఎక్కడ నివసిస్తాడు? ఏ పరిస్థితుల్లో ఎంత ఖర్చు చేస్తాడు? ఎంత పొదుపు చేస్తాడు? ఏం అప్పులు చేస్తాడు? ఎంతమంది పిల్లలు? వారిని ఏ విధంగా పైకి తీసుకొనివస్తాడు? అంతకు ముందు ఏం చేసేవాడు? అతని జీవితంలో ఏ విషయం మార్పు తీసుకొని వచ్చింది? అతని ప్రస్తుత పరిస్థితులు ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోకుండా ఒక సహకార సంఘాన్ని వెంటనే మొదలుపెట్టుట సరియైన పనిగా కన్పించడం లేదు. మనం వారి మధ్యకు వెళ్ళవలసి ఉంటుంది. మనం అట్లా చేస్తే తక్కువ వ్యవధిలోనే చాలా సమస్యలను పరిష్కరించగలుగుతాము.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 14, పుట 147, 13-1-1918.*

★ ★ ★

నేను ప్రకటనలకు (అడ్వర్టైజ్‌మెంట్లు) వ్యతిరేకం. అవి అసత్యాలతో కూడినవి కావడమే నా వ్యతిరేకతకు కారణం. మర్యాదగల ప్రతి పత్రిక ప్రజలు చదవాలని తాను అనుకునే పుస్తకాలను గురించి ప్రకటనలివ్వాలి. యిది నా ఉద్దేశ్యంలో ప్రతి వార్తాపత్రిక యొక్క కర్తవ్యం. పనికివచ్చే విషయాల నన్నింటిని డబ్బు తీసుకొని ప్రకటించే ప్రత్యేక ప్రకటనా సంస్థ వుంటే బాగుంటుందని భావిస్తున్నాను. కాని

ప్రకటనల ద్వారా వార్తా పత్రికలు డబ్బు చేసుకోవడం చాలా అసహ్యమైన పని. అది ప్రజలను మోసగించడమే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 16, పుట 250. 22-10-1919.*

★ ★ ★

చట్ట సహాయంతో ప్రజలు తమ అలవాట్లు మార్చుకునేలా చేస్తే అది పశుబలాన్ని ఉపయోగించడం కాదు. హింస కాదు. చట్టం ద్వారా మద్యం అమ్మకాలను ఆపించి దానివల్ల మద్యప్రియులను వారి అలవాటు మానుకునేలా చేయడం హింస కాదు. వాళ్ళను కొరడా దెబ్బలు కొట్టమని సలహా యిస్తే అది పశుబలమే. మద్యం అమ్మడం ప్రభుత్వం పని కాదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 24, పుట 274, 21-6-1924.*

★ ★ ★

సత్యానికి మాత్రమే బద్ధుడై ఉండు. మనం చేసే ప్రతిపనిలోనూ మనం అహింసాయుతంగానే వ్యవహరించాలి. దేశం కోసం మన కోసం మనం చరఖాను తిప్పాలి. ఖాదీ ధరించాలి. హిందువులు మహమ్మదీయులు సామరస్యంతో జీవించాలి. అంటరానివారిని మన సోదరులుగా భావిస్తూ హిందువులు అస్పృశ్యతను వదిలివేయాలి. మద్యపానం వదలివేయాలి. చెడు అలవాట్లకు బానిసలైన వారు వాటిని వదిలివేయాలి. ఇది మనందరి విధి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 25, పుట 256, 22-10-1924*

★ ★ ★

"ఆత్మవత్ సర్వభూతేషు" అనే శ్లోకం మనం పఠిస్తాము. మనం జీవులన్నింటనీ మనలానే చూడాలి అంటే సమాన భావంతో చూడాలి. మనం యీ విధంగా ఆలోచిస్తే ఎవరి పిలలయినా ముద్దుగా ఉండటం మనం చూస్తే మనం మన పిల్లలనే ముద్దుగా

ఉన్నట్లు భావించి సిగ్గుపడాలి. ఎవరైనా బాధాగ్రస్తులై ఉండటం కనపడితే మనమే బాధాగ్రస్తులమైనట్లు భావించుకొని ఆ బాధ తొలగించుకోవటానికి మార్గం వెతకాలి

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 13, 17-1-1927.*

★ ★ ★

సేవ చేయుటకు ఉన్నత యోగ్యతలు సంపాదించినప్పుడే ప్రభువు యొక్క ఆజ్ఞల్ని అమలు చేయగలుగుతాము. ఆజ్ఞలు, అభిరుచులు, ఉద్దేశ్యాలు, రుద్దడానికి కాక, సంఘ శ్రేయస్సును కాంక్షించేవిగా వుండాలి. యీనాటి ప్రభువులు తమ విధుల యెడ దృష్టిని పోగొట్టుకున్నారు. అందువల్ల వాళ్ళు స్వార్థరాహిత్యానికి, దీక్షకు ఉదాహరణలుగా నిలవాల్సిందిపోయి తమ సంతోషాలకు, తమ స్వేచ్ఛా ప్రవర్తనకు అధికారాన్ని ఉపయోగిస్తున్నారు.

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 8, జనవరి 1927.*

★ ★ ★

గీతలో చెప్పినట్లుగా అందరినీ సమానంగా చూడగల లక్షణాలను మనలో మనం వృద్ధి చేసుకోవాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూలేఖలు - పుట 42, 22-8-1927.*

★ ★ ★

అభిప్రాయ భేదాలు, తొందరపాటు, ఆగ్రహాలు ఉన్నప్పటికీ, ఎంత పని చేయాలో అంత పనిచేసి తీరాలి. మిగతావారు చేసినదానికన్న తక్కువ చేయ కూడదు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 52, 31-10-1927.*

★ ★ ★

ఈ ప్రపంచంలో ఎప్పటికీ కొంతమంది చోరులు ఉండనే ఉంటారు. వారి నుంచి కాపాడుకోటానికి మూడు పద్ధతులున్నవి. (1) మన దగ్గర ఏదీ ఉంచు కోకూడదు. ఈ ఆదర్శం ఏమాత్రం ఆచరణ యోగ్యం కాదు (2) మన దగ్గర ఏదైనా

ఉంచుకుంటే అంతవరకూ మనం మెలకువగా ఉండాలి (3) మనం ఆ దొంగను చట్టం యొక్క శిక్షతో భయపెట్టాలి, శిక్షించాలి. ఈ చివరి విరుగుడును యిప్పుడు వదిలివేశాము. మొదటిది మన ఆదర్శం. రెండోదాన్ని యిప్పటికీ ఆచరణలో పెడుతున్నాము. సాధ్యమైనంత తక్కువ ప్రోగుచేయుట, మన దగ్గర అత్యవసరమైన దాన్నే ఉంచుకొని దాని ఎడల మెలకువగా ఉండటం మనం అలవరచుకోవాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 85, 11-11-1929.*

★ ★ ★

మనం నైపుణ్యం సంపాదించిన కొద్దీ, మన శరీరంతోను మనస్సుతోను తక్కువ ప్రయాసతో ఎక్కువ పనిచేయగలుగుతాము.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 13, 8-5-1932.*

★ ★ ★

ఎక్కువ మంచి ఎక్కువ మందికి చెయ్యమనే సిద్ధాంతానికి అర్థం. 51 శాతం మందికి మంచి చెయ్యటానికి, 49 శాతం మందిని త్యాగం చెయ్యమనా? అది ఒక హృదయం లేని సిద్ధాంతం. మానవజాతికి ఎంతో హాని చేసింది. నిజమైన గౌరవనీయమైన మానవతా సిద్ధాంతం అందరికీ మంచి చేయడమే. ఇది పూర్తిగా వ్యక్తిగత త్యాగం వల్లనే సాధ్యం.

*మహదేవ దేశాయి డైరీ, సంపుటము 1, పుట 149, 466-1932.*

★ ★ ★

"ఎక్కువ మందికి ఎక్కువ మంచి" అను మాటను నేను నమ్మను. దానితో ఏకీభవించలేను. మానవులకు కనపడవలసిన లక్ష్యం అందరికి మంచి చేయడం బలహీనులకు సేవ చేయడం కావాలి. మనం రెండు కాళ్ళ మనుష్యులం. కాని యింకా నాలుగు కాళ్ళ జంతువు లక్షణాలను వదిలించుకోవాల్సి ఉంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 22, 10-7-1932.*

★ ★ ★

జైలు అనేది సక్రమ మార్గంలో పెట్టే యిల్లులాగా ఉండాలి గాని, శిక్షించే ప్రదేశంగా ఉండరాదు. అదే నిజమైతే తప్పుడు దస్తావేజులు పుట్టించేవాడి కాళ్ళకు జైల్లో సంకెళ్లెందుకు? సంకెళ్ళు వాడి లక్షణాల్ని మార్చలేవు. పారిపోవటానికి ప్రయత్నించని వాడికి లేదా పారిపోలేనివాడికి నిభాయించలేనివాడికి ఎవరికైనా సంకెళ్ళు వేయటం నా మనస్సుకు నచ్చదు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటి 1. పుట 170, 17-6-1932.*

★ ★ ★

మంచి ఫలితాలు హింసను ఆమోదించవు. అవి హింస చేసిన చెడును కూడా తీసివేయలేవు. హింస చేసిన చెడుమీద ఎల్లప్పుడూ చేయి వేయటానికి అవకాశం ఉండదు. హంతకుణ్ణి ఉరి తీసినందువల్ల వాడు చేసిన చెడు పనిని కొలవడం మనవల్ల గాదు. వాడు చనిపోయినప్పుడు మనం ఒక నిట్టూర్పు విడచినప్పటికీ మనం ప్రతిదానికీ లెక్క వేసుకుంటే విశ్వాసానికి అర్థం ఉండదు.

*రాజకుమారి అమృతకౌర్‌కు లేఖలు - పుట 116. 2-6-1937.*

★ ★ ★

నిస్పృహ కలిగించే విషయాలలో కూడా నిస్పృహ చెందని వ్యక్తులుండటం భగవంతుని ప్రసాదమే. అందరూ నిస్పృహలో ఉంటే సేవ చేసేవారికి సేవ చేసేవారెవరు? మనం సేవ చేయుటకు బయటికి వెళ్ళినపుడు మనలను మనం కాచుకోవాలి. మనం యితరుల మీద ఆధారపడకూడదు. కాని చేయగలిగిన వారి సహాయానికి వారికి మనం కృతజ్ఞులమై ఉండాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 22.*

★ ★ ★

## 13. భారత దేశ స్వాతంత్ర్యము

ప్రతినిధుల (పార్లమెంటు) సభ, మద్యం ప్రీతిని వదిలించుకోవడం కష్టం. ప్రజల శరీరాల్ని చీల్చివేసి, మనుష్యుల్ని సజీవంగా కాల్చి వారి ముక్కు చెవులు కోసినప్పుడు అది అనాగరిక చర్యయే కదా! ప్రతినిధి సభ క్రూరత్వం చంగిజ్‌ఖాన్, మొదలగు వారి కంటే కూడా క్రూరమైనది కాకూడదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 10, పుట 204, 2-4-1910.*

★ ★ ★

అర్థం చేసుకునే వారికే స్వరాజ్యం. నీవు నేను కూడా దాన్ని అనుభవించగలం. మిగతావారు కూడా ఆ విధం నేర్చుకోవాలి. యితరులు మనకు సాధించి పెట్టేది స్వరాజ్యం కాదు. పరరాజ్యం. అంటే విదేశీ పాలన. వాళ్ళు భారతీయులైనా లేక ఆంగ్లేయులైనా ఒకటే.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 10, పుట 205, 2-4-1910.*

★ ★ ★

నేను అనుభవం పొందిన కొద్దీ యంత్రాలు మనల్ని శాశ్వత బానిసత్వంలో ఉంచుతాయనే విషయాన్ని ఎక్కువగా గుర్తిస్తున్నాను. నేను హింద్ స్వరాజ్యలో చెప్పింది అక్షర సత్యం. సత్యాగ్రహాన్ని గురించి కూడా నేను కొత్త సత్యాలను అన్వేషిస్తున్నాను. బలహీనులకు, అతి బలవంతులకు కూడా అది పవిత్రమైన ఆయుధమని భావిస్తున్నాను.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 15, పుట 340. 1-6-1919.*

★ ★ ★

ఒకజాతిగా ముద్రవేయుటకు దేశరాజకీయ జీవితంలో ఉన్నతమైన నీతి నిజాయితీలను ప్రవేశ పెట్టాలి. అవి సత్యవ్రతాన్ని దృఢంగా, నిర్భయంగా యీ క్షణం

నుంచే అంగీకరించి అవలంబించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 17. పుట 97. 18-3-1920.*

★ ★ ★

స్వరాజ్యం అధ్యయనం వల్ల రాదని, జీవితంలో సుగుణాలను చూపించడం వల్ల వస్తుందని, అర్థం చేసుకోవాలి. అహింసా శక్తి, నిష్కపటం, నిజాయితీ, ధైర్యం, పొందిక, సాహచర్య గుణం, వ్యక్తిగత త్యాగం (ఆత్మార్పణం) యీ లక్షణాలు మనలో ఉంటే వాటిని గ్రామాలకు తీసుకుపోయి అక్కడ వ్యాప్తం చేయాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 19, పుట 292, 29-1-1921.*

★ ★ ★

నా ఉద్దేశ్యంలో భారతదేశం పవిత్రీకరించబడిన మరు క్షణం స్వతంత్రం మవుతుంది. అందుకు ఒక్క క్షణం ముందైనా కాదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14. పుట 15. 23-9-1920.*

★ ★ ★

నేను అన్ని ద్వేష భావాలను ప్రోగు చేసి వాటిని సరైన దారిలో పెడుతున్నాను. ద్వేషం బలహీనతకు గుర్తు. అవమానకర శక్తి యొక్క లక్ష్యం అదే. మనం ఆంగ్లేయులకు భయపడనవసరం లేదని రుజూ చేసి చూపించగలిగితే ప్రజలు వారిని ద్వేషించరు. ఒక ధైర్యవంతుడైన, పురుషుడుగాని, స్త్రీగాని ఎవరినీ ద్వేషించరు. ద్వేషం అనేది పిరికి వాళ్ళ దుర్గుణం. వ్యక్తి పవిత్రీకరణ అవసరం. చక్కెరను శుభ్రం చేసినప్పుడు మురికి ఏవిధంగా పైకి తేలుతుందో, అదేవిధంగా మనల్ని మనం పవిత్రీకరించుకొనేటప్పుడు మన బలహీనతలు పైకి తేలుతాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 137, 17-12-1920.*

★ ★ ★

ఆర్థికపరమైన, నీతివంతమైన విధానం, మంచి నడవడిక భారతదేశానికి అవసరం. భారతదేశం యొక్క అట్టి ఉజ్వల భవిష్యత్తును తీర్చిదిద్దే శక్తి భారతీయుల చేతుల్లోనే ఉన్నది. భారత దేశపు పిల్లల్ని దైవ చింతనగల, నిరాడంబరులు దైర్యవంతులైన స్త్రీ పురుషులుగా పెంచవచ్చు లేక వారిని గారాబం చేసి, జీవితంలో కుపానుల్ని ఎదుర్కోలేని బలహీనులుగా తయారు చేసి, విదేశీ ఆడంబరాలకు అలవాటు చేసి పనికిమాలినవారు గానూ పెంచవచ్చు. ఏది సరియైన మార్గమో స్పష్టమే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 20, పుట 497, 11-8-1921*

★ ★ ★

భారతదేశానికి ప్రజా ప్రభుత్వం సాధించడం నా లక్ష్యం. దాన్ని సాధించుటకు ఉపయోగించే పద్ధతి సత్యం, అహింస. అందువల్ల భారతదేశ ప్రజా ప్రభుత్వానికి అర్థం ప్రపంచాన్ని బెదిరించడం కాదు. యీ పద్ధతి ద్వారానే లక్ష్యాన్ని చేరుకోగలిగితే మానవజాతికి అది గొప్ప వరం అవుతుంది. రాట్నం హృదయ పరివర్తనకు ప్రతీక. భారతదేశంలో ప్రజలంతా దాన్ని పునఃస్వీకరిస్తే దేశానికి ఆర్థికంగా మోక్షం లభిస్తుంది. లక్షలాది మంది భారతీయులు దారిద్ర్యాన్నుంచి ముక్తి పొందుతారు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 28, పుట 361. 5-461924.*

★ ★ ★

ప్రతి వ్యక్తీ నిజాయితీగా వ్యవహరిస్తూ, నా వల్ల ఏమీ జరగలేదని, అంతా నిజాయితీవల్లనే జరిగిందని భావిస్తే అంతకంటే మంచి విషయం స్వరాజ్య సంపాదన యందుగాని, స్వరాజ్య రథాన్ని నడపడం విషయంలో గాని మరొకటి ఉండదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 24, పుట 330, 28-3-1924.*

★ ★ ★

నా దృష్టిలో దేశ పతాకానికి వందనం చేయడంలో ఆక్షేపణ ఏమీ లేదు. అందు తప్పు ఏమీ కనపడదు. దేశ మనుగడకు జాతీయ భావం అవసరం. జాతి మనుగడకు

పత్రాకం. అట్టి భావాన్ని వృద్ధిపరచుటకు ఉపయోగపడే ఒక భౌతిక వస్తువు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 26, పుట 544, 25-4-1925.*

★ ★ ★

## 14. విద్య

విద్య అంటే కేవలం అక్షర జ్ఞానం కాదు. మన నడత, స్వభావం మరియు ప్రవర్తన యొక్క అభివృద్ధి అని అర్థం. విధుల, కర్తవ్యాల జ్ఞానం అన్నమాట. భాషాపరంగా విద్య అను శబ్దానికి "శిక్షణ" అని అర్థం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 11, పుట 208, 25-3-1919.*

★ ★ ★

ప్రతి పిల్లవాడు ఇంగ్లీషు భాష ఎందుకు నేర్చుకోవాలి? కొంతమందిని ఎంపిక చేసి వారికి ఆంగ్లంలో శిక్షణ యిప్పించాలి. ప్రతి రాష్ట్రంలోను, దేశమందంతట ప్రాంతీయ భాషల్లో క్రొత్త అన్వేషణల్ని, పరిశోధనల్ని వ్యాప్తి చేస్తే సరిపోదా? అట్లా చేస్తే మన పిల్లలందరూ విజ్ఞానాన్ని సముపార్జిస్తారు. గత 60 సంవత్సరాలలో రానటువంటి పునరుజ్జీవనాన్ని వారి నుంచి ఆశించవచ్చు కదా! అనేక శాస్త్రాలయందలి విషయాలను మన పిల్లలు జీర్ణించుకోవాలి అని అనుకుంటే వారికి వారి వారి మాతృభాషల్లోనే శిక్షణ యివ్వాలి అని నా అభిప్రాయం. సగం మంది ఆశించిన ఫలితాల్ని సాధించలేరు. ఆ స్థాయిక చేరుకునే దాకా మనం ఆంగ్లేయులను బానిసలుగా అనుకరిస్తూ వుంటామనే నా భయం. యీ విధమైన మార్పు చేయకపోతే ప్రజా ప్రభుత్వం యొక్క ఏ పథకమూ యీ విపత్తునుంచి మనల్ని రక్షించలేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 14, పుట 153, 16-1-1918.*

★ ★ ★

నా ఉద్దేశ్యంలో దేవనాగరిలిపి ప్రపంచమందలి గొప్ప శాస్త్రీయమైన సంపూర్ణ లిపి. ఆ దృష్ట్యా అది జాతీయ లిపి యగుటకు అర్హమైనది. ప్రస్తుత పరిస్థితుల్లో మహ్మదీయులు దాన్ని అంగీకరించడం కష్టం అనిపిస్తున్నది. అందువల్ల చదువుకున్నవారంతా రెండు లిపులనూ నేర్చుకోవాలని నా అభిప్రాయం. ముఖ్యంగా హిందువులు, మహమ్మదీయులు మరియు యితరులు తమలో తమకు గల అవిశ్వాసాల్ని పోగొట్టుకొని మతాలకు సంబంధించిన విషయాల నన్నింటిని, జాతీయత మీద ఆధారపడి పరిష్కరించుకోగలిగినప్పుడు జీవంతమైన సులభలిపి జాతీయలిపి అవుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటి 14, పుట 1, 19-11-1920.*

★ ★ ★

మన సేవాభావాన్ని త్వరితపరిచేందుకు ఉద్దేశించినది అక్షరవిద్య. నీకు సేవ చేసే సదవకాశం లభించినందువల్ల దానియందు మనస్సును, లీనం చేసి పూర్తిగా సంతోషించడం నేర్చుకో. నీవు సేవ చేసేటప్పుడు, నేను చేస్తున్నాననే మానసిక గర్వానికి గురి కావద్దు. గర్విష్టి సేవ విలువలేనిది. మనం చేసేదీ చేయగలిగేదీ ఏదీ లేదని గీత బోధిస్తున్నది. మనం భగవంతుని చేతిలోని పరికరాలము మాత్రమే.

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 23.*

★ ★ ★

## 15. కులవ్యవస్థ - అస్పృశ్యత

ఒక తరగతికి చెందిన వారిని అస్పృశ్యులుగా భావించి మనం గొప్ప పాపం చేస్తున్నామని నా భావన. ఈ తరగతి వారున్న కారణం చేతనే మనలోనే తిరుగుబాట్లు జరుగుతున్నాయి. ఒకరితో కలిసి భోజనం చేయకపోవడం ఒకరిని స్పృశించకపోవడం అనేవి రెండు విభిన్న విషయాలు. ప్రస్తుతం ఎవరూ అస్పృశ్యులు కారు. ఒక క్రైస్తవుణ్నో, మహమ్మదీయుణ్నో అంటుకొనుటకు అభ్యంతరం లేకపోయినట్లైతే, మన మతానికే

చెందిన వ్యక్తిని అంటుకోటానికి అభ్యంతరం ఏమిటి? న్యాయపరమైన విషయంగా గాని, ఆచరణాత్మక దృక్పథంతో గాని అస్పృశ్యతకు తావులేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 13, పుట 120, 26-7-1915*

★ ★ ★

అస్పృశ్యులకు సేవ చేయుట నా జీవితంలో భాగమైపోయింది. హిందూమతంలో అస్పృశ్యత భాగముపడం. నేను హిందువుగా ఉండలేనని భావించడమే అందుకు కారణం.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 21, పుట 289, 29-1-1921.*

★ ★ ★

అస్పృశ్యుల యెడల తప్పు చేయడం లక్షలమంది మూగజీవులను దోపిడీ చేయడం వంటిదని భావిస్తాను. మనకంటె తక్కువ స్థాయికి చెందిన జంతువుల పట్ల మన విధిని గుర్తించామా? బుద్ధ భగవానుడు గొర్రెపిల్లను భుజం మీద మోసి బ్రాహ్మణులను శిక్షించినప్పుడు, ఆయన అత్యున్నతమైన ప్రేమను చూపించాడు. హిందూ మతంలో గోవు యొక్క ఆరాధన ఆప్రేమకు ప్రతీక.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటి 21, పుట 395, 2-3-1921.*

★ ★ ★

నియమములను ఉల్లంఘించినందుకు ఒక వ్యక్తిని వెలివేసే హక్కు కులానికి ఉంది. ఇప్పటివరకు నీవు చేసిన దాంట్లో సిగ్గు పడటానికి, పశ్చాత్తాపపడటానికి ఏమీ మిగలలేదు. నీ యొక్క పట్టు కులంలో తగ్గవచ్చు. అది నిన్ను బాధించటం లేదు. ఈ కారణం వల్ల నీవు దరిద్రుడుగా మారినా బాధపడవలసింది గాని పశ్చాత్తాపం చెందవలసింది గాని ఏమీ లేదు. ఒక సిద్ధాంతానికి కట్టుబడి ఉన్న పర్యవసానంగా దరిద్రం కలిగినట్లైతే దానిని కోరవలసిందే. చివరికి ఆ కులమే నీ దృఢత్వాన్ని, నీ సౌజన్యాన్ని గురించి పశ్చాత్తాపపడి వినమ్రత చూపిస్తుంది. కులాల్లో మార్పు రావలసిన

ఆవశ్యకత ఉంది. అస్పృశ్యతయే దానికి దారి కావచ్చును.

*టు ఎ గాంధీయన్ కాపిటలిస్ట్ - పుట 64. 16-7-1926.*

★ ★ ★

అస్పృశ్యత ఒక ఆత్మ వినాశకరమైన పాపం. ఒక సాంఘికమైన కీడు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 31, 10-10-1932*

★ ★ ★

పవిత్రత మనసునకు సంబంధించినది. అందరిలోను ఉంటుందనుట యుక్తము. వివేకం ఉన్న యీ రోజుల్లో ఒక మహిళ తన ధర్మం యెడ పట్టుదల గలిగి ..పాలంచే దరిద్ర నారాయణుల సేవ చేయాలి. ఆ విధంగా సేవ చేసి తనకు తానే ఒప్పుదు నిచ్చుకోవాలి. దరిద్ర నారాయణుల సేవ యొక్క అర్థం ఖాదీ రాట్నం వడుకుటయే. వాటి యొక్క ప్రచారమే హరిజనుల సేవకు అర్థం అస్పృశ్యత అనే మచ్చను తొలగించుటయే. ఈ రెండు విషయాలు భగవంతుని సొంత పనులు. ఘోషా పద్ధతి మరియు విద్య రెండూ పొసగిన విషయాలు.

*టు ఎ గాంధియన్ కాపిటలిస్ట్ -, పుట 139, 25-10-1933.*

★ ★ ★

వ్యక్తిగత పవిత్రీకరణ పాటించే ఈ రోజుల్లో, హిందూ కులంలో ఉన్న దురాచారాలన్నింటినీ వదిలివేయాలని తెలుసుకొనుట యుక్తము. అందువలన వారు బాల్య వివాహాలు జరుపరాదు. మార్పు కోరే వారికి అసహనం పనికి రాదు. నా ఉద్దేశ్యంలో శారదా చట్టం ఒక తెలివైన అడుగు. కాని హిందూ కులానికి చెందినవారి మీదే దృఢంగా అమలు జరుగని చట్టం హరిజనుల మీద దృఢంగా అమలు జరగకపోవచ్చు ఈ దురాచారాన్ని గురించి శారదా చట్టం యొక్క శిక్షల గురించి హరిజనులే హరిజనులలో ప్రభావవంతంగా, వివేకంతొ వ్యాప్తి చేయాలి. కొంతమంది కావాలని దాన్ని ఉల్లంఘిస్తున్నారనే నిర్ణయానికి వస్తే ఒకటి, రెండు వ్యాజ్యాలు

వేయాలి అయినప్పటికీ హరిజనులను గురించే యోచించాలి. హిందువుల వద్ద ఆర్థిక సహాయం కోరుట గాని పుచ్చుకొనుట గాని చేయకూడదు. కనీసం ఒక సంవత్సరం బాగా ప్రచారం చేయాలి.

*రాజకుమారి అమృతకౌర్‌కు లేఖలు - పుట 2. 2-2-1935*

★ ★ ★

కులాలు అసంఖ్యాకంగా వెలిసి హిందూమతాన్ని పట్టి పీడిస్తున్నాయి వర్ణం అను శబ్దానికి అర్థం వేరు. దానికి అర్థం వృత్తి. అంతర్ భోజనాలతోను, అంతర్ వివాహాలతోను దానికి సంబంధం లేదు. ప్రాచీనకాలంలో ఈ నాలుగు వృత్తుల వారు కలిసి భోజనం చేసేవారు. వివాహాలు జరుపుకొనేవారు. అలా చేసిన వారు తమ వృత్తులు మానుకోలేదు. భగవద్గీత యందలి వర్ణముల నిర్వచనాన్ని బట్టి యిది స్పష్టం. తన వారసత్వపు వృత్తిని వదిలివేసినప్పుడు ఒక వ్యక్తి తన వర్ణాన్నుంచి బయటపడినట్లే. ఈనాడు వర్ణాశ్రమ ధర్మం కోల్పోయిన ధనంలా వున్నది. అందు పూర్తి గందరగోళమే మిగిలింది.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 40.*

★ ★ ★

## 16. బ్రహ్మచర్యము

బ్రహ్మచర్య వ్రతం కాని, మిగతా వ్రతాలు కాని దైవ సంబంధమైనవి. ఆత్మను క్రమశిక్షణగా భావించినప్పుడే అవి సంతోషాన్ని కలిగిస్తాయి. అవి పిశాచం ఎల్ల ఆచరించబడితే కష్టాలు కలిగిస్తాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 9. పుట 117. 28-12-1908.*

★ ★ ★

నీతికి సంబంధించిన సమస్యల విషయంలో నేను బ్రహ్మచర్యాన్ని అవలంబించాలని భావిస్తే నా తల్లితండ్రులు అందుకు వ్యతిరేకిస్తే నేను వినమ్రంగా వారిని త్రోసిపుచ్చాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 10. పుట 406. 8-2-1911.*

★ ★ ★

విషయ సుఖాలలో మునిగిన వాడు ఏమి చేస్తాడు? ఇంద్రియాలు వాటి యిష్టం వచ్చినట్లు పోతాయి. అట్టి స్థితిలో నేను కేవలం ద్రష్టను, పరిశీలకుణ్ణి అని మాటలు చెబితే అవి పనికిమాలినవే. ఎవరు తమ ఇంద్రియాలపై పూర్తి అధికారం కలిగివుంటారో, ఎవరి ఇంద్రియాలు శరీరాన్ని బ్రతికించుటకు మాత్రం పనిచేస్తాయో వారు మాత్రమే యీ విషయమై వాదించవచ్చు యీ విధంగా చూస్తే మనలో ఒక్కరికి కూడా దీనిని గురించి మాట్లాడుటకు అర్హత లేదు. నిజమైన పేదరికాన్ని సాధించినప్పుడే మనకు అర్హత కొద్దిగానైనా లభిస్తుంది. పుణ్యం వల్ల రాజులు రాజులేనని అనడానికి వీలులేదు. వారు చేసే పనుల వల్లనే వారు రాజులుగా రాణిస్తారు. ఆత్మ ప్రకృతిని పరిగణనలోకి తీసుకుంటే, ఈ పనులన్నీ మంచివేనని అనడానికి వీలు లేదు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 11. పుట 150. 23-8-1911.*

★ ★ ★

పూర్తిగా ప్రయత్నం చేసి కోరికలను అణచివేయాలి అసంగతమైన కోరికలు ఎల్లప్పుడూ పుడుతూనే వుంటాయి. ప్రతిసారీ వాటిని అణచివేసుకోగలిగితే మన మనస్సు దృఢపడుతుంది. ఆత్మబలం పెరుగుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 12. పుట 389. 17-3-1914*

★ ★ ★

ప్రతిదీ నశించేదే, కాని ఆత్మ నశించదు. మనం దీన్ని జ్ఞప్తి చేసుకోవడమే కాక, ఆ విధంగా నడుచుకోవాలి. నేను ఆలోచించినకొద్దీ సత్య బ్రహ్మచర్యం వీటి యొక్క

ప్రాముఖ్యం పెరుగుతున్నది. బ్రహ్మచర్యం మిగిలిన అన్ని నీతి సూత్రాలతో కలిసి సత్యమునందు అర్థవంతమవుతున్నది నేను ఆలోచనలను ఆపలేను. అయినప్పటికి సత్యంతోపాటు ఆ స్థానంలో బ్రహ్మచర్యం కూడా ప్రముఖమైనదే. ఈ రెండూ ఎటువంటి అవాంతరాలొచ్చినప్పటికీ విజయం సాధించగలవని నాకు విశ్వాసం. నిజమైన అడ్డంకులు మనస్సు యొక్క చెడు తలంపులు మిగతావారిలో గల మన బాహ్య సంబంధాలపై మన సంతోషం కోసమై ఆధారపడకపోయినట్లైతే మనం ఏం చేయాలో యితరులు చెప్పే కంటే మనమే ఆలోచించుకోగలుగుతాము.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 396, 22-3-1914.*

★ ★ ★

సత్యవాదిత్వము, బ్రహ్మచర్యము అహింస, దొంగతనం చేయకపోవుట, కూడబెట్టకపోవుట అనే యీ అయిదు జీవిత నియమాలు ప్రతివారు పాటించవలసినవి. మానవుని యొక్క నడవడిక క్రమశిక్షణ అనే పునాది మీదే నిర్మించబడుతుంది. నిస్సందేహంగా యివ్వన్నీ ప్రపంచంలో అందరూ పాటించవలసినవే. వ్యాపారస్తుడైనప్పటికీ అసత్యం పలుకగూడదు. ఆచరించగూడదు. వివాహితుడైనప్పటికీ అస్ఖలితుడుగానే ఉండాలి. తాను జీవిస్తూనే అహింసను ఆచరించాలి. ప్రాపంచికంగా ఉంటూ డబ్బు గాని ఇంకేదైనా వస్తువు గాని దొంగిలించకూడదు. బ్రహ్మచర్యాన్ని ఆచరించుటకు క్రింద తెలిపినవన్నీ అవసరం. (1) ఏకాంతం (2) మితాహారం (3) మంచి గ్రంథాలు (4) క్రమమైన ధ్యానం (5) తగిన మానసిక శారీరిక శ్రమ (6) సువాసనలు విరజిమ్మే, మత్తు కలిగించే ఆహార పానీయాలను విసర్జించుట (7) అశ్లీల విషయాల, ప్రదర్శనల విసర్జన (8) సంభోగ వాంఛను విడనాడుట (9) స్త్రీలతో ఒంటరిగా గడపకుండుట (10) రామనామ జపం లేదా యితర మంత్ర జపం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు-సంపుటము 25, పుట 133-134, 13-9-1924.*

★ ★ ★

అన్ని వాంఛల ముందు అన్ని పరిస్థితులలోను నిలబడగలిగిందే బ్రహ్మచర్యం. ఒక అందమైన స్త్రీ ఒక పాలరాతి పురుష విగ్రహం దగ్గరకు పోతే, ఆ విగ్రహం ఏ మాత్రం

చలించదు. బ్రహ్మచారి అంటే ఆ రాతి విగ్రహంలాగా ఆ పరిస్థితులలో చలించని వాడు అన్నమాట. ఆ పాలరాతి విగ్రహం తన కళ్ళనూ, చెవులను ఏ విధంగా ఉపయోగించలేదో అదే విధంగా మనిషి పాపం విషయంలో వ్యవహరించాలి.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 80, 19-4-1932.*

★ ★ ★

సేవ చేయుటకు నియమించిన స్త్రీలను తప్పించుకొని తిరుగుట బ్రహ్మచర్యం కాదు. అట్లా తప్పించుకొని తిరిగితే అది భౌతికమైన పరిత్యాగమే కాని అత్యావశ్యకమైన మనఃసంబంధిత చర్య కాదు. క్లిష్ట సమయాలలో అది మనకు ఉపయోగించదు. ఒకని ప్రాపంచిక సుఖాలకు అర్రులు చాచటం పరమానందకరమైన దృష్టితో తగ్గుతుంది. కాని మరేవిధంగాను తగ్గదని గీతా ప్రవచనం ఈజిప్టుయందలి మంచి ఆహారం, పానీయం లభించే ప్రదేశాలను పొందే దాకా సాక్షాత్కారాన్ని ఆశించకూడదు అని ఒక సూక్తి ఉన్నది. ఆ రెండు విషయాలు కలిసేయుంటాయని ఉన్నత లక్ష్యం నెరవేరితే అపేక్ష పోతుంది అని దాని తాత్పర్యం. ఇంద్రియ విషయాలు కనబడకపోయినా వాటి మీద అపేక్ష వెల్లడికాలేదు. అందువల్ల భగవంతుని దర్శించనంత వరకు అవి మళ్ళీ తల ఎత్తే అవకాశం వుంటుంది. ఆయనను దర్శించిన తరువాత యితర కోరికలు వుండవు. నిజానికి అతడు పురుషుడుగా వుండడు. లింగరహితుడైపోతాడు. స్త్రీ పురుష భేదం లేకుండా పోతుంది. అతడు శూన్యమైపోతాడు. అతని మూర్తి భగవంతునిలో కరిగిపోతుంది. ఈ భావాన్ని పరమ భగవంతుడు, బ్రహ్మ అను శబ్దాలకు బదులు, సత్యం అను శబ్దానికి ఉపయోగించితే మరింత స్పష్టమవుతుంది. ఇచ్చట తనను తాను మోసగించుటకు అవకాశం లేదు. ఆశ్రమంలో ఎవరైనా ప్రపంచమంతా తన కుటుంబంలా భావిస్తూ మాట్లాడుతూ మనస్సులో చెడు ఆలోచనలకు తావిచ్చేవాడుంటే అతడు భగవద్గీత ప్రకారం మిధ్యాచారియే. మనం సత్యవాదిని గురించి అతడు ఏవిధంగా ప్రవర్తించాలి అనే విషయాన్ని గురించి ఎప్పుడూ యోచించాలి.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 80-81, 19-4-1932.*

★ ★ ★

ఎవరైనా మనకంటే గొప్పవారని లేక తక్కువవారనీ భావించటం పాపం. అందరం సమానమే. మనల్ని పాపపు స్పర్శయే మలినం చేస్తుంది. మానవుని స్పర్శ మలినం చేయదు. సేవకు అంకితమైన వ్యక్తికి ఎవ్వరూ ఎక్కువ తక్కువలు కారు. ఎక్కువ తక్కువల గుర్తింపు హిందూమతమునందలి మచ్చ. దాన్ని మనందరం చెరిపి వేయాలి.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 286-287, 14-8-1932.*

★ ★ ★

స్వేచ్ఛగా విహరించే ఆలోచనలు ఆధ్యాత్మిక అభివృద్ధికి ఉపకరించవు. అవి మనలో చాలా మందిని బాధిస్తాయి. అందువల్ల మానసిక కేంద్రీకరణను గురించి నొక్కి చెప్పడం జరిగింది. మనం మనస్సులో పెట్టుకోవలసింది యిదే. మనం అనేక ఆలోచనలు చేస్తాం. వాటివల్ల ఎంతో మానసిక శక్తి వృధా అవుతుంది. విషయాసక్తి వల్ల జీవశక్తి నశించినట్లే అవుతుంది. శారీరిక అంగవైకల్యం మనస్సును ప్రభావితం చేసినట్లుగానే మానసిక అంగవైకల్యం శరీరాన్ని ప్రభావితం చేస్తుంది. అందువల్లనే బ్రహ్మచర్యాన్ని సంపూర్ణ జ్ఞానంగా అర్థం చేసుకొని వృథా ఆలోచనలకు తావు యివ్వను.

సంకుచిత దృష్టితో చూచుటవల్లనే మనం బ్రహ్మచర్యాన్ని సాధించడం కష్టమని భావించాం. కాని దాని విస్తృత నిర్వచనాన్ని అంగీకరించి మన పదకొండు ఇంద్రియాలను నిరోధించుటకు ప్రయత్నిస్తే పశుప్రవృత్తిని అదుపులో పెట్టడం సులభతరం అవుతుంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 305, 23-8-1932.*

★ ★ ★

బ్రహ్మచర్యాన్ని గురించిన నా నిర్వచనాన్ని జ్ఞప్తికి తెచ్చుకోండి. దాని అర్థం ఒకటో రెండో ఇంద్రియాలను అణచివేయడం కాదు. మొత్తం ఇంద్రియాలన్నింటిపై అధికారం సంపాదించుటయే. ఈ రెండు స్థితులు ప్రథమంగా భిన్నమైనవి. నేను నా

ఇంద్రియాలనన్నింటిని ఈ రోజున అణచివేయగలను. కాని వాటిమీద విజయం సాధించటానికి చాలా కాలం పడుతుంది. విజయానికి అర్థం వాటిని నాకు బానిసలుగా చేసుకోవడమే. నేను నా చెవులకు వృధా మాటలు వినకుండా, కామాతురమైన మాటలు, దైవదూషణ వినకుండా స్వర్గసంగీతాన్ని వినుటకు శిక్షణ ఇవ్వాలి. ఎన్నో వేల మైళ్ళ నుంచి అయినా సహాయం కోసం అరిచే అరుపును వినుటకు శిక్షణ ఇవ్వాలి.

*మీరాకు బాపూ లేఖలు - పుట 257, 27-4-1933.*

★ ★ ★

బ్రహ్మచర్యం అనునది ఒక మనఃస్థితి. అన్ని విషయాలయందు మితంగా వుండటం సహాయకారి అవుతుంది. అట్టి మానసిక స్థితికి ఆహారం అవసరం తక్కువగా ఉంటుంది. అంటే చెడు ఆహారం అభివృద్ధిని కుంటుబరచదని కాదు. సరైన ఆహారం మితంగా తీసుకోవడం ఒక్కటే బ్రహ్మచర్య ఆచరణకు సరిపోదని చెప్పక తప్పదు. అయితే అది కూడా అవసరమైన వాటిలో ఒకటి. జిహ్వాచాపల్యం బలహీన మానసిక స్థితికి, బ్రహ్మచర్య అనిచ్ఛకు గట్టి గుర్తు. బ్రహ్మచర్య వ్రతాచరణకు సర్వోన్నతమైన ఔషధం ఏమిటి అని అడిగితే, ఆత్మ భగవంతునిలో భాగమనీ, భగవంతుడు మనలోనే వున్నాడనీ గుర్తించడమేనని నా సమాధానం. యీ విషయాన్ని హృదయపూర్వకంగా గుర్తించగలిగితే అదే మానసిక పవిత్రతను, మానసిక శక్తిని కలుగజేస్తుంది.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 3.*

★ ★ ★

## 17. నిర్భయము

భయం అనేది నీతి బలహీనత యొక్క ప్రవృత్తి. మనం దానికి లొంగినంత కాలం ఎల్లప్పుడూ అటువంటి దురదృష్టాన్ని ఎదుర్కోవలసి వస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు, సంపుటి 121, పుట 93, 30-5-1912.*

★ ★ ★

మరణం మన కర్తవ్యాన్ని గురించి యోచింపచేస్తుంది. అప్పుడు మనిషి స్మృతి కోల్పోతాడు. మరీ శరీరానికి అంటిపెట్టుకొన్నవాడే ఎక్కువగా బాధపడతాడు. ఆత్మ గురించి సత్యం తెలిసినవాడు మరణమంటే భయపడడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు-సంపుటము 12, పుట 365-66, 1-3-1914.*

★ ★ ★

ఎంత ఆలోచించినప్పటికీ నేను మరణ భయాన్ని వదిలించుకోలేక పోతున్నాను. ఏదో ఒకరోజు ప్రయత్నం చేస్తూ పోతూ, దాన్ని వదలించుకోగలను. మనం ప్రయత్నం చేయగలం. ఏ ఒక్క అవకాశమును విడుచుకోకూడదు. అది మన విధి. ఫలితాన్ని యివ్వటం భగవంతుని వంతు. బాధపడుట దేనికి? తల్లి బిడ్డకు పాలు ఇచ్చేటప్పుడు దాని ఫలితం గురించి ఆలోచించదు. దాని ఫలితం దానంతట అదే కలుగుతుంది. మరణభయాన్ని వదిలించుకొనుటకు కోరికలను తరిమివేయుటకు ప్రయత్నం చేయి. సంతోషంగా ఉండు. అవే కనుమరుగయి పోతాయి. లేకపోయినచో కోతి గురించి ఆలోచించకూడదని నిర్ణయించుకున్న మనిషి దాన్ని గురించే ఆలోచించినట్లుగా అవుతుంది.

మనం పాపంలో పుట్టి, పాపకార్యాల వల్ల శరీరంలో బంధింపబడ్డాము. ఈ మలినాలనన్నింటినీ ఒక్క క్షణంలో కడగగలనని ఎట్లా భావిస్తున్నావు?

"నీవు నీ యిష్టం వచ్చినట్లు జీవించు
ఏదో విధంగా భగవంతుని దర్శించు.
ఇది అభా భగత్ బోధన".

(అభాభగత్ గుజరాతీ పద్యకారుడు, 17వ శతాబ్దంలో జీవించాడు. భక్తుడు. వేదాంతి)

నీవు కష్టాలలో ఉన్నా సుఖాలలో ఉన్నా రామనామాన్ని ఉచ్చరిస్తూ ఉండు. నీవు సాధించదలచినదాన్ని సాధిస్తావు. ఇది తులసీదాసు బోధ.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 375, 7-3-1914.*

★ ★ ★

ఒక్క క్షణం కూడా ఎవ్వరూ నా మరణాన్ని శీఘ్రం చేయలేరు. ఆలస్యం చేయలేరు. మరణం నుంచి మనల్ని రక్షించుకొనే పద్ధతి దాన్ని అన్వేషించుటయే. మన జీవితం గురించి సాధారణమైన పద్ధతిలో మనం శ్రద్ధ తీసుకొనుట మన కర్తవ్యం ఇంతకంటె ఎక్కువ మనం చేయకూడదు. దాని సమయం ఆసన్నమైనపుడు దాన్ని ఆహ్వానించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 386, 14-3-1914.*

★ ★ ★

దైవచింతన కలిగి యుండి, మనస్సాక్షికి వ్యతిరేకంగా ఏమీ చేయనప్పుడు మరణం మనలో భయాన్ని కలిగించదు. నిజానికి మరణం మంచి కోసం మార్పువంటిది. అందువల్ల ఆహ్వానించదగిన మార్పు బాధను రేపదు. రేపకూడదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 12, పుట 390, 18-3-1914.*

★ ★ ★

ఈ అశాశ్వతమైన ఆకారం ఏ క్షణంలోనైనా నశించవచ్చు అని హృదయ కుహరంలో తెలిసిన వ్యక్తి, మరణ సమయం కోసం ఎల్లప్పుడూ సంసిద్ధంగా ఉంటాడు. అతడట్లా ఉన్నప్పటికీ గృహస్థు అతని బాహ్యచర్యలన్నింటినీ కట్టడి చేసుకొని అంతర్ చర్యలను విస్తృతపరచుకొని దాని ప్రకారం జీవిస్తాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 13, పుట 30, 27-2-1915.*

★ ★ ★

విడిపోవటంలోనూ మరణంలోనూ ఉన్న బాధ నేను విషయాలను పరిశీలిస్తున్న కొద్దీ పరిస్తున్న కొద్దీ గొప్ప భ్రాంతి అని నిశ్చయమవుతున్నది. దాన్ని భ్రాంతిగా గుర్తించుట స్వేచ్ఛ పొందుటయే. పదార్థానికి విడిపోవటం, మరణం రెండూ లేవు. అయినప్పటికీ అందులో నాటకం ఒకటి వున్నది. మన స్నేహితుల లోని పదార్థాన్ని గుర్తించి, వారిని ప్రేమిస్తాము. వారిలోని పదార్థాన్ని కప్పి ఉంచే పదార్థం కాని దాని

నాశనాన్ని కాని తాత్కాలికంగా భరించలేము. నిజమైన స్నేహం అను ముక్కనుంచి ముత్తాన్ని చేరుకోవడానికి ఉపయోగించుకోవాలి. నీవు ప్రస్తుతానికి నిజాన్ని గ్రహించగలిగావనుకుంటున్నాను. అది శాశ్వతంగా ఉండిపోవుగాక.

*మీరాకు బాపూ లేఖలు - పుట 41. 27-4-1927.*

★ ★ ★

మనకు ప్రియమైన వారిని సాధ్యమైనంతవరకు శరీరంతో చూడాలను కోవడం స్వార్థపరమైన కోరిక. అది బలహీనతల వల్ల కలుగుతుంది. శరీరం నాశనమైన తరువాత గూడా ఆత్మ మిగిలి ఉంటుందనే విషయంలో అపనమ్మకం కలుగుతుంది. రూపం ఎప్పుడూ మారవచ్చు. నాశనం కావచ్చు. రూపం లేని ఆత్మ మారదు. నాశనం చెందదు. నిజమైన ప్రేమ శరీరం లోపల ఉండే ఆత్మకు చేరుకొని ఆ తర్వాత అసంఖ్యాక శరీరాలలో ఉన్న జీవంలో గల ఐక్యతను గుర్తించగలుగుతుంది.

*మీరాకు బాపూ లేఖలు - పుట 156. 6-7-1931.*

★ ★ ★

మరణం నా మీద ఎటువంటి ముద్ర వేయదు. నేను ఆ దుఃఖంతో బంధువుల కోసం శోకించడం కన్న అజ్ఞానం మరొకటి లేదు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 213, 5-7-1932.*

★ ★ ★

మనం యీ మట్టి వస్త్రాన్ని ధరించినంత కాలం. దాన్ని శుభ్రంగా పవిత్రంగా మరియు ఆరోగ్యంగా ఉంచుకుందాం. దానిని వదిలివేయవలసి వచ్చినప్పుడు ఎటువంటి దుఃఖం లేకుండా వదలివేద్దాం. అది మనం ఉపయో గించుకొనుటకు యివ్వబడింది. ఆ యిచ్చినవాడు కావాలనుకున్నప్పుడు తీసికోనిద్దాం. దాన్ని మనం సేవకోసమే ఉపయోగించాలి కాని ఆనందం కోసం ఉపయోగించుకోకూడదు.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1. పుట 276. 7-8-1932.*

★ ★ ★

ఈ మానవ శరీరం గాజుకన్నా కూడా తక్కువ మన్నిక గలది. మనం జాగ్రత్తపరిస్తే గాజుముక్క వందల సంవత్సరాలు చెడిపోకుండా ఉండగలదు. కాని యీ మన శరీరం ఎంత జాగ్రత్తగా ఉంచినప్పటికీ కొంత సమయం తరువాత దాన్ని జాగ్రత్తపరచలేము. ఆ సమయంలోనే అది నశించిపోవచ్చు కూడా. మనం దానిని నమ్ముకోలేము.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1. పుట 276-77, 7-8-1932.*

★ ★ ★

నీవు ప్రేమించే ఆత్మ ఎల్లప్పుడూ నీతోనే ఉన్నది. ఏ శరీరం ద్వారా ఆత్మను ప్రేమించడం నేర్చుకున్నావో, ఆ శరీరం ఆ ప్రేమను నిలుపుకొనుటకు ఏ మాత్రం అవసరం లేదు. అది అవసరం ఉన్నంతకాలమే ఉండటం, అవసరం లేకపోయినప్పుడు నశించడం ఆశ్చర్యం. మనకు ఎప్పుడు దాని అవసరం తీరిపోతుందో తెలియదు. కాబట్టి ఏ విధంగా మరణం సంభవించినప్పటికీ. ఈ శరీర ఉపయోగం యికలేదని నిర్ణయించుకోవచ్చు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 210. 20-9-1932.*

★ ★ ★

నేను వ్యక్తిగతంగా కొన్ని సంవత్సరాలుగా మరణం గురించి దుఃఖించటం మానుకున్నాను. ఒక యోధుడు నానుంచి వెళ్లిపోయినప్పుడు నాకు ఒక అఘాతం తగిలినట్లు భావించాను. కాని అది నా వ్యక్తిగత అనుబంధం వల్లనే జరిగింది. యింకోమాటలో చెప్పాలంటే స్వార్థమన్నమాట. మరణం ఒక విధమైన ముక్తి లేక విడుదల అనీ, అందువల్ల దానికి స్వాగతించాలనీ, ఒక స్నేహితునివలె అది శరీరం యొక్క నాశనమే తప్ప లోపలి ఆత్మకు కాదని నేను వెంటనే తేరుకొని తెలుసుకున్నాను.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 28. 24-11-1932.*

★ ★ ★

మనం జన్మించేది మరణించటానికే. మనం మరణించేది జన్మించటానికే. ఇది ఒక ప్రాచీన వాదం. అయినప్పటికీ మనం ఆలోచించవలసిందే. మనం పుట్టుకను ఆహ్వానించినట్లుగా మరణాన్ని ఆహ్వానించలేము. ఆత్మ లేకుండా మనం శరీరాలతో సంబంధం పెట్టుకోలేమని మన యింద్రియాలు మనకు రుజువులు చూపిస్తున్నా, మనం నమ్మడం లేదు. అదే విధంగా మన ఆత్మ శరీరంతోబాటు నాశనమైపోతుందనటానికి కూడా రుజువు లేదు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 260, 4-5-1933.*

★ ★ ★

ఒక వ్యక్తి తాను నిర్మోహమాటంగా, నిస్సహాయుడను అని నిరూపించుకున్నప్పటికీ అది ఆ వ్యక్తిని పిరికివాణ్ణి చేయదు. కాని అదే ధైర్యానికి ప్రారంభం కావచ్చు.

*రాజకుమారి అమృతకౌర్‌కు లేఖలు - పుట 29, 19-6-1935.*

★ ★ ★

భూమి మీద ఈ శరీరంతో పని చేయాలని భగవంతుడు అనుకున్నంత కాలం అతడే దాన్ని గురించి శ్రద్ధ వహిస్తాడు. సమయం వచ్చినప్పుడు దేశమందలి వైద్యులందరూ కూడా నన్ను రక్షించలేరు.

*రాజ్‌కుమారి అమృత కౌర్‌కు లేఖలు - పుట 99, 16-10-1936.*

★ ★ ★

మళ్లీ ఒకసారి జీవించటానికి మనం చనిపోతాం. మనం జీవించేది చివరికి చనిపోవటానికే. అందువల్ల జీవితం సంతోషించవలసిన వస్తువు కాదు. లేదా మరణం దూషించవలసిన వస్తువు కాదు. ఇందు అవసరమైన ఒక విషయం వున్నది. మనం మన జీవితంలో మన విధుల గురించి తెలుసుకొని వాటిని మరణించేదాకా నిర్వహించాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 18.*

★ ★ ★

మరణానికి భయపడుట, పాత చిరిగిన దుస్తుల్ని విసర్జించుటకు భయపడుట వంటిది. మరణాన్ని గురించి తరచు ఆలోచించి మన అజ్ఞానం వల్ల భయపడుతూ వుంటామనే నిశ్చయానికి వచ్చాను.

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 24.*

★ ★ ★

జీవితంలో అత్యవసరమైనవని భావించడం వల్ల ప్రస్తుత కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాను. నా కార్యక్రమాల్లో పాల్గొంటున్నప్పుడు మధ్యలో మరణాన్ని ఎదుర్కోవలసి వస్తే నేను నిశ్చింతగా ఎదుర్కొంటాను. భయపడటానికి అది నాకు క్రొత్త కాదు గదా!

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 32.*

★ ★ ★

మరణం అనునది ఒక నిద్ర వంటిది. అది ఒక మరుపు వంటిది. శరీరం మళ్లీ లేవనవసరం లేని దీర్ఘ నిద్ర అన్నమాట. అలాగే మోయలేనన్ని స్మృతుల బరువులను దించుకొని వాటిని వదిలించుకునేటటువంటి హాయినిచ్చే నిద్ర అన్నమాట.

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 5.*

★ ★ ★

పుట్టుక కంటే మరణం ఎక్కువగా ఉత్సవాలు చేయవలసిన సమయం. పుట్టుకను ముందు ఒంటరిగది (గర్భం)లో తొమ్మిది నెలలు వుండి, పుట్టిన తరువాత అనేక బాధలు పడవలసివస్తుంది. కాని మరణం జీవిత గమ్యాన్ని చేరుటయే. అటువంటి మరణానికి అర్హత సాధించాలంటే ఏ బంధమూ లేకుండా జీవిత కాలమంతా పనిచేయాలి.

*ఎన్నిక చేసిన లేఖలు 2 - పుట 49.*

★ ★ ★

# 18. ఆరోగ్యము - పరిశుభ్రత

ఈ వైద్యబృందాలన్నీ దేశానికి ఏమి సేవ చేయగలుగుతాయో! శవాల శరీరాలను కోసి జంతువులను చంపి, ఐదు నుంచి ఏడు సంవత్సరాలు అతిగా వ్యర్థమైన సిద్ధాంతాలను మననం చేసుకొని ఏ గొప్ప విషయాలు సాధించ గలుగుతారు? భౌతికమైన రోగ నిదానం వల్ల దేశం ఏం సామర్థ్యాన్ని పొందగలుగుతుంది? మన శరీరాలతో అనుబంధాన్ని పెంచుతుందే తప్ప మరేం చేస్తుంది? వైద్య శాస్త్రంలో జ్ఞానం లేకపోయినా, రోగాలు అభివృద్ధి చెందకుండా మనం పథకాలు తయారు చెయ్యగలం. దానర్థం అసలు వైద్యులే అవసరం లేదని కాదు వారు ఉండవలసిందే. చాలామంది యువకులు యీ వృత్తికి అనవసరమైన ప్రాధాన్యం యిచ్చి, వందల, వేలాది రూపాయలు పోసి ఎన్నో సంవత్సరాలు వృధా చేసి, అర్హత సాధిస్తారు. అట్లా చేయకూడదు. ఈ అలోపతి వైద్యుల వల్ల ఎటువంటి ప్రయోజనం పొందలేము. పొందము అనే విషయాన్ని గుర్తించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 10, పుట 206.*

★ ★ ★

పాలు యింకోరకమైన మాంసాహారమే. మానవునికి దాన్ని తీసుకోటానికి ఎటువంటి హక్కు లేదు. పిల్లవాడు తల్లి దగ్గర పాలు త్రాగటల్లేదా? అట్లాగే మనం ఆవుపాలు తాగుతున్నాము అనే వాదం అజ్ఞానానికి పరాకాష్ఠ.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 12, పుట 127, 2-7-1913.*

★ ★ ★

మనకు అత్యవసరమైన శరీరానికి సరిపడేటంత సాధ్యమైనంత తక్కువ రకాలు, తక్కువ పరిమాణంలో తీసుకోవాలి. ఈ సూత్రాన్ని మనస్సులో పెట్టుకొని ఆహార నియమాలు తయారు చేయుట మంచిది

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 12, పుట 387, 17-3-1914.*

★ ★ ★

రోగ నిదానం చేయలేని వైద్యులను చూచినప్పుడల్లా నాకు బాధ కలుగుతుంది. వైద్యశాస్త్రం ఎంత అసంపూర్ణమైనదో, ఎంత ఆధారపడదో, ఎంత అశాస్త్రీయమైనదో, నిరంతరం జ్ఞప్తి చేస్తూవుంటుంది. మనం మన అనుబంధాన్ని వదులుకొని ఆలోచించితే, సంపూర్ణమైన నిదానం ఏదీ లేదని అర్థం చేసుకొని దానిలో ఉన్న లోపాలు గ్రహించగలుగుతావు. అతిశక్తివంతమైన ఔషధాలకు గూడా ఎన్నో మినహాయింపులున్నాయి. ఎంతో జయప్రదమైన శస్త్ర చికిత్స కూడా మచ్చను విడిచిపెడుతుంది.

*మైడియర్ చైల్డ్ - పుట 84, 20-8-1926.*

★ ★ ★

ప్రతి జబ్బు మనకు తెలియని ప్రకృతి సూత్రం యొక్క ఉల్లంఘన వల్ల వచ్చేదేనని, ఆ సూత్రాలు తెలుసుకొని, వాటిని పాటించుటకు తగిన శక్తి నివ్వమని భగవంతుని ప్రార్థించుట మంచిది.

*మీరాకు బాపూ లేఖలు, పుట 58, 9-7-1927.*

★ ★ ★

మనం రుచికరమైన ఆహారాన్ని యిష్టపడితే దాన్ని దాచడం ఎందుకు మంచి ఆహారాన్ని కోరుకోవడం పాపం కాదు. ఆ వాంఛను దాచుకోవడం రహస్యంగా దాన్ని చేయటం పాపం. ప్రతి వ్యక్తీ పురుషుడు గాని, స్త్రీ గాని తను కోరుకున్న ఆహారాన్ని తినే స్వేచ్ఛ కలిగి ఉంటారు. సాధారణంగా మనం వండుకొనే వాటిని వండుకొని తన ఆహారం యెడ గల వాంఛను తృప్తిపరచు కోవచ్చు. తమ ప్రత్యేకమైన కోర్కెలు తీర్చుకోవటానికి ప్రత్యేక రకాలేవీ ఆశ్రమ గదులలో రహస్యంగా గాని, బహిరంగంగా కాని వండుకోకూడదు.

ఎవరైనా బయటికి వెళ్ళి తన స్నేహితుని గదిలో భోజనం చేయవచ్చు. యిందులో దాచవలసింది ఏమీ లేదు. ఒకరు యిదే తినాలి అనే నియమము లేదు. తమ గదులలో కావలసినవారు ఎండిన పళ్ళు లాంటి తినుబండారాలు ఉంచుకోవచ్చు.

కాని అట్టి స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకోకపోవుటయే మంచిది. అయితే అది నియమమేమీ కాదు. నా మనఃపూర్వక విన్నపం ఏమంటే, నీవు ఎట్లాంటివాడవో అట్లాగే కనపడు. నువ్వు ఏంచేసినా బహిరంగంగానే చెయ్యి. ఎప్పుడూ అనవసరంగా బయటివారి వల్ల ప్రభావితం కాకు. కాని నీవు ఏదైనా చేస్తానని చెపితే మాత్రం అవమానమైనా సరే, ఆ తర్వాత దానికి భిన్నంగా వ్యవహరించకు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 64, 10-12-1928.*

★ ★ ★

బిడ్డకు పడిశం పడితే సూర్యరశ్మి తగిలేటట్లు చూడు. (సూర్య స్నానము) ఇది కాపడం లాగా పనిచేసి శరీరాన్ని గట్టిపరచి జలుబును తగ్గించివేస్తుంది.

*ఎన్నిక చేసిన లేఖలు 2 - పుట 21, 28-11-1930.*

★ ★ ★

ప్రతి రోగమూ సరి అయిన విశ్రాంతినిచ్చి, మనస్సును ఆందోళన నుంచి తొలగించకపోతే, బలహీనత కలుగజేస్తుంది. నా ఊహలో మనస్సును నిరోధించడం చాలా కష్టమైన పని. దీనికి సర్వోన్నత ఔషధం భగవద్గీతను ప్రయోగించుటయే. మనస్సుకు ఆఘాతం తగిలిన ప్రతిసారీ మన ప్రయోగంలో లోపం ఉన్నట్లే భావించాలి. ప్రయోగించుటలో విఫలమైనట్లే. బాతు శరీరం మీద నీటిబొట్ల లాగా మంచినీ చెడునీ నీ మీద పడనియ్యి. మనం ఏదైనా విన్నప్పుడు, మన అవసరం ఏదన్నా ఉందా లేదా అని చూచి, అవసరం ఉన్నట్లైతే ప్రకృతి చేతిలోని పనిముట్ల వలె ఏమాత్రం అనుబంధం పెంచుకోకుండా ప్రభావితం కాకుండా ఆ పని చేయుటయే నీ విధి.

ఒక ఫలితాన్ని సాధించడంలో ఒకటి కన్న ఎక్కువ పనిముట్లు ఉపయోగించబడ్డాయి. అదే విషయాన్ని మనం జ్ఞప్తి ఉంచుకుంటే, ఈ అనుబంధ రాహిత్యం ఒక శాస్త్రీయ అవగాహనగా కనపడుతుంది. నేను యీ పని చేశానని ఎవరు చెప్పగలుగుతారు?

మెదడు గ్రహించిన ప్రతి సత్యాన్ని హృదయంలోకి పంపివేయాలి. అట్లా పంపకపోతే అది నిష్ఫలమైపోయి మెదడునందే విషపదార్థంగా ఉండిపోతుంది. శరీర వ్యవస్థనంతా విషతుల్యం చేసేస్తుంది. అందువల్లనే మెదడును విషయాలను పంపే కేంద్రంగా ఉపయోగించవలసిన అవసరం వున్నది. మెదడు గ్రహించిన విషయాలను క్రిందికి హృదయానికి పంపివేయాలి. లేదా అక్కడే అప్పుడే అవి క్రిందికి పంపటానికి పనికి రావని నిర్ణయించి నిరాకరించాలి. మెదడు ఈ విధి నిర్వర్తించలేకపోవుటయే శరీరంలోని దాదాపు అని రుగ్మతలకు కారణం. అదే మనో విహ్వలతకూ కారణం. మెదడు అలసిపోయి దుర్బలపడదు. అందువల్ల మనం ఎప్పుడు రుగ్మతకు గురయినప్పటికీ, ఆహారం విషయంలోనే గాక మెదడు యొక్క పనితీరులో కూడా తేడా ఉన్నట్లు లెక్క. గీతాకారుడు యీ విషయాన్ని రుజువులతో గ్రహించి యీ మహోన్నత ఔషధాన్ని సాధ్యమైనంత స్పష్టమైన భాషలో ప్రపంచానికి అందించాడు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 139. 13-12-1930.*

★ ★ ★

కూరగాయల్లో పాలకు బదులు వాడతగిన ప్రభావవంతమైన, పాలయందుగల లోపాలు లేని కూరగాయ వున్నదని నా దృఢ విశ్వాసం. అట్టి పరిశోధనలు చేయగలిగిన అర్హతలు వున్న వారెవ్వరూ యీ విషయాన్ని గురించి యోచించలేదు.

*టు ఎ గాంధీయన్ కాపిటలిస్ట్ - పుట 75. 9-4-1932.*

★ ★ ★

... నీ శరీరం నీదని ఆలోచించటం నీవు మానుకోవాలి. అది భగవంతునిది. భగవంతుడు దానిని పరిశుభ్రంగాను ఆరోగ్యంగాను ఉంచి, తన సేవకు ఉపయోగించమని నీకు యిచ్చాడు. నీవు దానికి ధర్మకర్తవే కాని యజమానివి కావు. యజమాని తన ఆస్థిని పాడుచేసుకోవచ్చు, చెడుపనులకు విని యోగించవచ్చు. కాని ధర్మకర్త తనవద్ద ఉంచబడిన ఆస్థిని, జాగ్రత్తగా ఉపయోగకరంగా వాడవలసి వుంటుంది. కాబట్టి నీవు ఆ శరీరము కొరకు ఆందోళనపడకుండా దాన్ని రక్షించుటకు అన్ని

జాగ్రత్తలు తీసికోవాలి. భగవంతుడు కోరుకున్నప్పుడు దానిని తీసికొనిపోతాడు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 27. 5-11-1932.*

★ ★ ★

చాలామంది జనం మితిమీరిన ఆహారం వల్లనో, సరిఅయిన ఆహారం లేకపోవటం వల్లనో బలహీనులు అవుతున్నారు. తక్కువ ఆహారం తీసుకోవడం వల్ల బలహీనులు కావడం లేదు. మనం మంచి ఆహారాన్ని తీసుకోగలిగే కంటే కావలసిందేముంది? అది ఎంత కొంచెమైనప్పటికీ సరిపోతుంది.

*మీరాకు బాపూ లేఖలు - పుట 254, 13-3-1933.*

★ ★ ★

ఆకుకూరలు, రొట్టె, చపాతి, పాలు, పండు కలిపితే సంపూర్ణ ఆహారం పాలు కనుక తీసుకుంటె పప్పు హాని చేస్తుంది. పాలలో మనకు సరిపోయిన మాంసకృత్తులన్నీ ఉంటాయి.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 24, 21-3-1933.*

★ ★ ★

ప్రకృతి చికిత్సా పద్ధతులలో నమ్మకం ఉన్నవారుగా మనం మన అస్తవ్యస్థ శరీరాలను ప్రకృతిసూత్రాలను అవలంబించటం ద్వారా సరిచేసుకోవచ్చునని నేను నమ్ముతాను. నాకు తెలిసిన వైద్య సహాయం వల్ల చాలామంది జబ్బు నయం కాని వారు ఈ పద్ధతి వల్ల కోలుకోవడం నాకు తెలుసు. ఇది మన సోదర వైద్యులను విమర్శించటం కాదు.

*రాజకుమారి అమృత్‌కౌర్‌కు లేఖలు - పుట 10, 17-1-1935.*

★ ★ ★

శారీరకమైన కష్టాన్ని బాధను ఆత్మసంతోషంగా భావించాలి. ఇది చాలా కష్టమైన

పని. అయినప్పటికీ నిజంగా ఎవరైనా సంపూర్ణుడుగా మారాలంటే ఇట్లా చేయకతప్పదు. ఈ బలవంతపు రుగ్మతను తన ఆలోచనలను పరిపుష్టం చేసుకొనుటకు ఉపయోగించుకోవాలి.

*రాజ్‌కుమారి అమృత్‌కౌర్‌కు లేఖలు - పుట 232, 21-10-1946.*

★ ★ ★

జిహ్వను సంతృప్తి పరచటానికి కాక మందు తీసుకున్నట్లుగా ఆహారాన్ని తీసుకోవాలి. మనస్సును శరీరాన్ని సేవా కార్యక్రమాలలో పూర్తిగా మునిగి ఉండేలా చేయాలి. భగవంతుడే సత్యమని ధ్యానం చేయాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1. పుట 37.*

★ ★ ★

ఆత్మ సంబంధమైన శారీరక రుగ్మతలు తగ్గించుకోవటానికి మందులు ఉపయోగించకూడదని నేను నా బాల్యం నుంచి నేర్చుకున్నాను. నా అనుభవం కూడా దాన్ని ధృవపరచింది. మందులు మొదలయిన వాటిని వాడగూడదు. అని నా నమ్మకం. ఇది పూర్తిగా శారీరిక రుగ్మతల విషయంలోను, పరిశుభ్రత విషయంలోను, భగవంతుని మీద భారం వేయటాన్ని విశ్వసిస్తాను. కాని అవి నాకు ఏదో సమకూర్చవలెననే ఆశతో కాదు. కావాలనుకున్నప్పటికీ వైద్య సహాయం పొందలేని కొన్ని లక్షల మంది గతి ఏమిటి? వాళ్ళ అదృష్టంలో భాగం పంచుకోవాలని మాత్రమే నా కోరిక.

*ఎన్నిక చేసిన లేఖలు - 1. పుట 45.*

★ ★ ★

నీ యొక్క వైద్య పరిజ్ఞానాన్ని బీదవారికి బాధితులకు ఉచితంగా యివ్వు. వారికోసం ఉపయోగించు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 31.*

★ ★ ★

భగవంతుని ఆస్తిగా భావించి శరీరాన్ని గురించి శ్రద్ధ వహించు. దానికి బాగా క్రొవ్వు పట్టించకు దాన్ని పాడు చేయకు. ధూళిధూసరితం చేయకు. దానిమీద అతి బరువు మోపకు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 33.*

★ ★ ★

## 19. ఆత్మ నిర్బంధము

జరిగిపోయిన వాటి గురించి బాధపడవలసిన అవసరం లేదు. కాని దాని నుంచి ఏదో కొంత నేర్చుకోవడం ప్రతి వ్యక్తికీ అవసరం.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటి 12, పుట 420, 28-5-1914.*

★ ★ ★

అన్ని మంచి పనులూ ఏ భావాల చేత ప్రేరేపింపబడినప్పటికీ ఏదో కొంత ఫలితాన్నిస్తాయి. ఒక వ్యక్తి భయం వల్లనో, అవమానానికి వెరిచో సత్యాన్ని అనుసరించినా, ఆత్మ నిర్బంధాన్ని సాధన చేసినా ఆ విధంగా చేయటం వల్ల కలిగే ఫలితాన్ని బాహ్యంగానే పొందుతాడు. మంచి పనుల యొక్క శక్తి అట్టువంటిది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 17, పుట 369, 1-5-1920.*

★ ★ ★

అసహనంతో ప్రక్కమనిషితో భోజనం చేయకపోవడం పాపం. ఆత్మ నిర్బంధం వల్ల అతనితో భుజించకపోవడం సన్మార్గం.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు - సంపుటము 17, పుట 500, 20-6-1920.*

★ ★ ★

ఆత్మ నిర్బంధాన్ని సాధించడం ఒక్కటే శాంతి కోసం స్వేచ్ఛ కోసం పోరాడుటకు

★ ★ ★

ఉన్న ఒకే ఒక షరతు. దాన్ని సాధించడం కోసం బాహ్యంగా ఆత్మ నిర్బంధాన్ని ఆచరించి. ఆలోచనలలో ఇంద్రియ సుఖాలకు అర్రులు చాచేవారు. తెలివితక్కువ వారు మోసగాళ్ళు అని గీతలో ఎక్కడో చెప్పబడింది. ఈ సందేశం ముఖ్యంగా కపటులను దృష్టిలో ఉంచుకొని చెప్పబడింది. నిజాయితీపరులు నిష్కపటులు తమను కల్లోలపరిచే పశు బుద్ధిని ప్రకృతిని నిరంతరంగా అదుపులో వుంచుకోవాలని గీత బోధిస్తుంది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 59, 19-12-1927.*

★ ★ ★

చిన్న స్పర్శ ద్వారానే ఉద్రేకపడతామనే భయం ఉన్నవారు యదార్థాన్ని ఒప్పుకొని తమ పరిధులలోనే ఉండాలి. అటువంటి ఉద్రేకపరమైన ప్రకృతి ఒక విధమైన రుగ్మత. అందువలన ఇటువంటి వ్యక్తులు మరో వ్యక్తి పురుషుడైనా స్త్రీ అయినా వారి స్పర్శను విసర్జించాలి. ఈ రోగం కొంతకాలం తర్వాత దానంతట అదే పోతుంది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 89, 9-12-1929.*

★ ★ ★

కొంతమంది పురుషులు స్త్రీని స్పృశించగానే ఉద్రేకపడిపోతారు. అదే విధంగా కొందరు స్త్రీలు పురుషుని స్పర్శకే ఉద్రేకపడతారు. అటువంటి వ్యక్తులు మానవస్పర్శను విసర్జించాలి. పరిహరించాలి. అది నిర్బంధమైనప్పటికీ రుగ్మత కలిగించినప్పటికీ తప్పదు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 89, 9-12-1929.*

★ ★ ★

ఒక నేరస్థునికి అతని స్నేహితులకు, అతని బంధువులకు ఆత్మ నిరోధం చాలామంచిది. కాని ఆత్మ నిరోధం అంటే నిజంగా ఆత్మాలింగనం చేసుకోవడమే. అది

ఒకరిని నిష్ఫలునిగా చేసి బాధ కలిగించేటట్లు చేసినప్పుడు ఆ ఆత్మ నిర్బంధం [illegible] అర్థపారదర్శకంగా తయారవుతుంది.

*మీరాకు బాపూ లేఖలు - పుట 170, 4-2-1932.*

★ ★ ★

మానవుని జీవితకాలం వందేళ్ళు ఉండవచ్చు లేదా యింకొంచెం ఎక్కువ ఉండవచ్చు. అతడు ఎంత కాలం జీవించినప్పటికీ అతని జీవితకాలం అనంత కాలమనే మహా సముద్రంలోని బిందువు వంటిది. అయినా దాని కోసం ఎన్నో బంధాలు, లెక్కలు. తెలివి మాలిన పనులు. మన లెక్కలు అనిశ్చితమైనవి. ఒక మనిషి ఎంత కాలం జీవిస్తాడు అనే విషయం కేవలం ఊహయే. ఆరోగ్యంగా ఉన్న చిన్న పిల్లలే మరణానికి లోబడిపోవటం మనం చూస్తూ ఉన్నాము. మనం ఒక మనిషి జీవితంలోని ఆనందాలు. జీవిత సుఖాలు అనుభవించటానికి అలవాటు పడితే లేక లోబడిపోతే ఎక్కువ కాలం జీవించలేడని నిర్ణయించలేము. నిరాడంబరంగా పవిత్రంగా జీవించే వ్యక్తి ఎక్కువ కాలం జీవించవచ్చు అని చెప్పవచ్చు. కాని ఎక్కువ కాలం జీవించటానికి ఆత్మ నిర్బంధమనే ఆచరణకు పూనుకుంటే కొండను తవ్వి ఎలుకను పట్టినట్లే అవుతుంది. ఆత్మ సాక్షాత్కార సాధన కోసం ఉద్రేకాలను అణచివేయాలి. క్రమశిక్షణతో మన జీవితకాలం పెరగటానికి బదులు తగ్గినట్లు మనం గుర్తిస్తే దాన్ని గురించి తొందరపడగూడదు. ఆతురత పడకూడదు. ఆరోగ్యం, ఆయుస్సు అనేవి ఆత్మ నిర్బంధం యొక్క ప్రాముఖ్యత లేని ఫలాలు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 119, 19-5-1932.*

★ ★ ★

మన జీవితం రోజు రోజుకీ నిరాడంబరం కావాలి. అంతేకాని చిక్కు ముడి కాకూడదు. మనం క్రమక్రమంగా భగవంతుడు మనతో వున్నాడని మనకు యింకొకరి రక్షణ లేదని భావించి, ఆ విషయాన్ని రూఢిగా గుర్తించినప్పుడే ఆత్మ నిర్బంధం అలవడుతుంది. అది ఎట్లా సంభవమో నాకు తెలియదు. కాని సంభవమేనని మాత్రం

తెలుసు. అట్టి విశ్వాసం ఎవరికి వుంటుందో వారు తమ రక్షలన్నింటిని భుజాలపై నుంచి దించివేస్తారు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 267, 5-6-1933.*

★ ★ ★

స్వచ్ఛంద విధేయత తన సొంత నిశ్చయాన్ని కలిగి ఉంటుంది.

*రాజకుమారి అమృత్ కౌర్‌కు లేఖలు - పుట 85, 30-8-1936.*

★ ★ ★

ఆత్మ నిర్బంధం కోసం పథకాలు ఆచరిస్తున్నప్పుడు మనం భగవంతుని అంశ అని, అందువలన ఆయన ప్రకృతిలో కొంత భాగం పుచ్చుకొన్నవారమని, భగవంతునిలో కోరికలను నియంత్రించకుండా వదిలివేసి ఆనందించే గుణం లేదు కనుక అది మానవ ప్రకృతికన్నా భిన్నమైనదన్న విషయంపై నుంచి ఒక్క క్షణం కూడా మన దృష్టిని, ధ్యానాన్ని మరల్చకూడదు.

*ఎన్నిక చేసిన లేఖలు 1 - పుట 35.*

★ ★ ★

## 20. ఆత్మాభివృద్ధి

కడపటికి మన పెట్టుబడి ఏమిటీ అంటే మనకున్న ధనం కాదు. మన ధైర్యం, మన విశ్వాసం, మన సత్యవాదిత్వం మన సామర్థ్యం మాత్రమే.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు - సంపుటము 6, పుట 302, 28-1-1907*

★ ★ ★

భగవంతుని దయ గెలుచుకోవటానికి ఒకే ఒక నిరాడంబరమైన త్రోవ సత్యాన్ని యితర సుగుణాలను క్రమంగా ఆచరణలో పెట్టటమే. మరియు ఒకే ఒక బంధం క్రమంగా సర్వోన్నతునితో పెట్టుకోవడమే.

ఓవాయసమా! నాశరీరం మొత్తాన్ని తిని వేయి.!

నా మాంసాన్ని పొడిచి పొడిచి తిను.

నా రెండు కళ్ళను మాత్రం తినివేయవద్దని ప్రార్థిస్తున్నాను.

వాటితో నా ప్రియురాలిని చూడగలనని ఆశ.

ఇది ఒక ప్రియుడికి ఒక ప్రియురాలికి సంబంధించి చెప్పిన కవిత నిజానికి ఇది భగవంతుని స్వరూపంలో ఉన్న ప్రియుణ్ణి (ప్రియురాలిని) చూడాలనే ఆత్మ యొక్క కోరికను సూచిస్తుంది. అతడు తన శరీరం నాశనమైనా పట్టించుకోడు. ఉద్రేకమనే కాకి జ్ఞానమనే కళ్ళను తిని వేయకపోతే, అతడు తన ప్రియురాలిని తెలుసుకోగలుగుతాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 10. పుట 31. 31-8-1910.*

★ ★ ★

మన నీతివంతమైన జీవితానికి అడ్డురానంతవరకు మన పెద్దలను మన్నించడం మనవిధి. అందులోనే మన మంచి ఉన్నది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 10, పుట 406, 8-2-1911*

★ ★ ★

ఇతర జీవులమీద చూపించిన విధంగానే మనం మనమీద కూడా జాలి, దయ చూపించుకోవాలి. వాటిని, మనల్ని ఒకటిగా చూచుకోవాలి. మన ప్రయోజనాల కోసం జీవులను నాశనం చేయటానికి వెనుకడుగు వేయాలి.

మనం మన శరీరంతో ఎటువంటి ప్రేమను బంధాన్ని పెట్టుకోకూడదు. మరణానికి భయపడకూడదు. మన శరీరం మనల్ని క్రిందవేయటానికి కాచుకొని కూర్చుందని గుర్తించి మోక్షసాధన కోసం ఇప్పుడే ఉద్యమించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 12, పుట 306, 1-3-1914*

★ ★ ★

హృదయం పవిత్రంగా ఉంటే శరీరపు నీచపు ఆలోచనలకు అవకాశం ఉండదు. కాని హృదయం అంటే అర్థం ఏమిటి? హృదయం పవిత్రంగా ఉందని

ఎప్పుడు నమ్మగలం? హృదయం అంటే మరేదో కాదు, ఆత్మ లేదా ఆత్మ యొక్క నివాస స్థానం. అది పవిత్రంగా ఉందని ఆలోచించుటయే ఆత్మ యొక్క సంపూర్ణ సాక్షాత్కారంగా భావించాలి. అటువంటి సాక్షాత్కారమైనప్పుడు ఇంద్రియవాంఛలను ఊహించలేము. మనం అటువంటి పవిత్రత కోసం ప్రయత్నించినపుడే సామాన్యంగా హృదయానికి పవితత్ర లభిస్తుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 12. పుట 376, 7-3-1914*

★ ★ ★

తరిగిపోని ప్రేమ నాకు ఉంటే నేను సంపూర్ణ జ్ఞానం గల వ్యక్తిని కాగలను. కాని అది నిజానికి నాకు లేదు. నాకు నిజమైన ప్రేమ ఎవరి మీద ఉందో వారందరూ నామాటలను ఉద్దేశ్యాలను తప్పుగా అర్థం చేసుకోకూడదు. అట్లాగే నాకు పగను ద్వేషాన్ని ఆపాదించకూడదు. మనల్ని ఎవరైనా తమ శత్రువులుగా భావిస్తే తప్పు ప్రధమంగా మనదే అను మాటలు వచ్చాయి. ఇది తెల్లవారితో మనకు గల సంబంధం విషయంలో కూడా నిజమే. హృదయం యొక్క సంపూర్ణ పవిత్రత చివరి స్థితి. మనం ఆ స్థితికి చేరకముందు మనం ఎక్కువ పవిత్రత కోసం ముందుకు పోతున్న కొద్దీ విషయ వాంఛలు అదే ప్రమాణంలో అణిగిపోతాయి. వాంఛలు ఇంద్రియాలలో తల ఎత్తవు. మనస్సే మనిషి యొక్క బంధనాలకు, స్వేచ్ఛకు కారణం.

మనస్సుయందలి ప్రేరణలకు మూలం ఇంద్రియాలు. వాటి ద్వారా ప్రేరణలు ఫలానా అని గుర్తించగలుగుతాము.

అందువల్ల ఈ ఇంద్రియాలను ఆత్మాభివృద్ధి నాశనం చేయుట వలన మనస్సులోని ప్రేరణలు వదలవు. నపుంసకులకు అనేక కోరికలుండటం మనం చూస్తూనే ఉన్నాం. పుట్టుకతోనే అటువంటివారు వాటితో నిండిపోయి, అసహజమైన పనులు చేసి నేరస్థులు కావడం మనకు తెలుసు. నాకు ఘ్రాణశక్తి తక్కువ. అయినప్పటికీ సువాసన పీల్చాలని కోరిక కలుగుతుంది. ఎవరైనా గులాబీపూల వాసన గురించి గాని. యింకేపూల వాసన గురించి గాని మాట్లాడు కునేటప్పుడు, మనస్సు గాడిదలాగా వెంటనే దాని వెనుకపడిపోతుంది. అతి కష్టం మీద దానిని వెనక్కి మరలించగలుగుతాము.

ఉద్రేకులైన వ్యక్తులు మనస్సును నిరోధించడం అసాధ్యమై అంగాలను కోసు[illegible]పడం. ఖండించుకోవడం మనం వింటున్నాము. అటువంటి పరిస్థితుల్లో అట్లాచెయుటమే అతని యొక్క విధి. ఉదాహరణకు నా మనస్సు కోరికకు లొంగకపోతే నేను నా సోదరిని చెడుదృష్టితో చూస్తే, నేను కోరికతో దహించుకుపోతున్నప్పటికీ దానిచేత సంపూర్ణంగా గుడ్డివాణ్ణి కాలేదు. అటువంటి పరిస్థితుల్లో ఇంకే విరుగుడూ లేకపోయినట్లయితే అంగాన్ని ఖండించుకోవడమే అతని పవిత్రవిధి అని నా ఉద్దేశ్యము. ఇది క్రమంగా అభివృద్ధి చెందే వ్యక్తికి సంభవించదు. ఇది బహుశా ఒక్కసారిగా కోరికలు చచ్చిపోయి, అంతకుముందు జీవితం అంతప్రశస్తం కాకపోయిన వ్యక్తులలో జరగవచ్చు. కోరిక నుంచి స్వేచ్ఛనివ్వగల, ఇంద్రియాల ఆత్రుతను తగ్గించగల, తక్షణ ప్రభావంగల పద్ధతిని కోరటం, వంధ్య అయిన స్త్రీని కొడుకును కనమని అడగటం లాంటిది. ఫలితం ఎంతో ఓర్పుతోనే సాధ్యమవుతుంది. ఇంద్రజాలం సృష్టించే మామిడి చెట్టుకూ అదేవిధంగా హఠాత్తుగా వచ్చిన మానసిక పవిత్రతకూ ఇట్లా అప్పుడప్పుడు జరుగుతూ ఉంటుంది. మనస్సు పవిత్రీకరణకు సిద్ధంగా ఉండి ఉన్నతమైన వ్యక్తుల కోసం అన్వేషిస్తూ ఉంటుంది. యిది ఒక విధమైన పరుసవేది రాయి లాంటిది. ఇది లభించగానే తక్షణమే దాని పవిత్రతను గుర్తించగలుగుతుంది. అంతకు ముందు లేకపోవడమనేది కలగా ఉంటుంది. కాని తక్షణం వచ్చింది కాదు. కాని సులభమైన అతి చిన్న అతిత్వరితమైన పద్ధతి.

ఒంటరి తనాన్ని కోరుకోవడం, గొప్పవారితో సాంగత్యాన్ని కాంక్షించడం, భగవంతుని నామాలను గానం చేయడం, పవిత్రమైన కథలు చెప్పటం, జ్ఞానవర్ధకమైన పుస్తకాలు చదవటం, ఎడతెగని శరీర శోషణ, మితాహారము, పండ్లతోనే జీవించటం, తక్కువ నిద్ర, సంతోషాలను వదులుకోవటం, ఇవి ఆచరించే వ్యక్తులకు ఎవరికైనా మనస్సును నిరోధించటం అరచేతిలో ఉసిరికాయ వంటిది. వీటిని ఆచరించి మిగతా వానిని ధ్యానించాలని మనస్సులో ఎప్పుడైనా కోరికతో కలగితే, ఉపవాసంలాంటివి ఆచరించాలి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 12. పుట 376-77. 7-3-1914.*

★ ★ ★

ప్రతిరోజూ తొందరగా నిద్రలేచే వ్యక్తి ఆదివారానికి మినహాయింపు యివ్వకూడదు. అట్లా చేస్తే మనం ఆదివారం కోసం ఆత్రుతగా ఎదురుచూడటం ప్రారంభిస్తాం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 12, పుట 409, 17-4-1919.*

★ ★ ★

దృఢమైన శరీరంలో దృఢమైన మనస్సు ఉంటుంది అనటం సత్యమైనప్పటికి దానిని జాగ్రత్తగా వ్యాఖ్యానించాలి. ఒక పే ున్న మల్లయోధుణ్ణి తీసుకుంటే, అతడిది నీవు అనుకున్నట్లుగా ధృఢమైన శరీరమే. అయితే దృఢమైన శరీరం అంటే ఆత్మకు లోబడి ఉండేది అని నా భావన అటువంటి శరీరాలు ఫుట్‌బాల్ మైదానంలో తయారుకావు. అటువంటివి జొన్న చేలల్లో వ్యవసాయక్షేత్రాలలో తయారవుతాయి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 13, పుట 49, 17-4-1915*

★ ★ ★

మనం చేయవలసిన మొదటి చివరి పని మనం పరివర్తన చేసుకోవడం. ఆ పరివర్తన కోసం ప్రయత్నించడం అవసరం. దానితో అడుగు ముందుకు సాగుతుంది.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 13. పుట 452, 30-6-1917.*

★ ★ ★

అనవసరమైన లజ్జ మాటున నీ అజ్ఞానాన్ని దాచకు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 18, 2-6-1919.*

★ ★ ★

నీవు ఒక అవివేకిని గుర్తించటంలో పొరపాటుపడితే బాధపడవలసిన పని లేదు. కాని నీ అజ్ఞానం వల్ల తప్పుకు గురి అయ్యే సాహసం చేయకు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 19, 2-6-1919.*

★ ★ ★

పవిత్రమైన ప్రేమను వ్యక్తీకరించుట కత్తిపదును మీద నడచుట వంటిది. మనం ఎంత ప్రేమైకజీవులం అని చెప్పుకున్నా ఎప్పుడు స్వార్థంతో లేమో మనకే

తెలియదు. ఆలోచించిన కొద్దీ నేను తరచుగా చెప్పిన దాంట్లో నిజం అవగతం అవుతుంది. ప్రేమ, సత్యం ఒకే నాణానికి రెండుముఖాలు. రెండూ జీవితానికి ఎంతో విలువైనవి. ఆచరణలో పెట్టుటకు అంతకష్టమైనవి. భగవంతుని చేత సృష్టింపబడిన జీవులనన్నింటినీ ప్రేమించలేనప్పుడు మనిషి సత్యవాదికాలేడు. అసత్యం, ప్రేమలు సంపూర్ణత్యాగానికి ప్రతీకలు. నీవు నేను యీ సత్యాన్ని సంపూర్ణంగా గ్రహించాలని ప్రార్థిస్తున్నాను.

*మైడియర్ చైల్డ్. పుటలు 53-54.*

★ ★ ★

శరీరం పవిత్రతకు దేవాలయం అయితే దాన్ని రక్షించుటకు పూర్తి శ్రద్ధ అవసరం. పాడుచేయకపోవడమే గాక దాని ఎడల ఎటువంటి అగౌరవం, వ్యతిరేకభావం చూపించకూడదు.

*మైడియర్ చైల్డ్. పుట 57.*

★ ★ ★

క్రమశిక్షణాయుతమైన మనస్సాక్షిని మన్నించాలి. అది భగవంతుని వాణి. క్రమశిక్షణ లేని మనస్సాక్షి మనిషిని అధోగతిపాలు చేస్తుంది. దాని ద్వారా పిశాచం మాట్లాడుతుంది. కనుక దానికి దూరంగా ఉండాలి.

*మైడియర్ చైల్డ్. పుట 56.*

★ ★ ★

ఆత్మ నివేదనకు అర్థం వివేకాన్ని వదలి వేయటంకాదు. నిజమైన ఆత్మ నివేదన జడత్వాన్ని కలిగించదు. శక్తి కలిగిస్తుంది. మనం చేరవలసిన వ్యక్తి ఒకరున్నారనే జ్ఞానంతో తన పరిధులను తెలుసుకొని ఒక దాని తరువాత మరో ప్రయోగానికి మనిషి పూనుకుంటాడు. వాటన్నింటినీ వినయంగా వివేకంతో విచక్షణతో చేస్తాడు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 20, పుట 500-501, 13-8-1921.*

★ ★ ★

నిస్పృహలోగూడా తన శక్తి సామర్థ్యాల మీద నమ్మకం సడలకపోవడమే ఆత్మ విశ్వాసం. సత్యం అహింసలయందు నాకు విశ్వాసం ఉంటే ఆపద సమయంలో కూడా నేను వాటికే కట్టుబడి ఉంటాను.

*మణిబెన్ పటేల్‌కు లేఖలు - పుట 2, 11-5-1924.*

★ ★ ★

గర్వము, దృఢత్వము సాధారణంగా కలిసే ఉంటాయి. మనలో సాత్విక భావనలు అభివృద్ధి చేసుకొన్న కొలదీ మొదటిది నెమ్మదిగా క్రింది స్థానానికి చేరుతుంది. రెండో స్థానం ఆక్రమిస్తుంది. వ్యతిరేకతకు ప్రతిచర్య చేయకుండా హద్దులో ఉండటమే గర్వాన్ని అధిగమించగల మంచి పద్ధతి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 24, పుట 87, 20-5-1924.*

★ ★ ★

పవిత్రత, నిరోధకశక్తి దాచుకొనవలసిన గుణాలు.

*మీరాబెన్ పటేల్‌కు లేఖలు - పుట 12. 20-5-1924.*

★ ★ ★

మన మనస్సే మనకు స్నేహితుడు శత్రువు కూడా. దానిని మన అధీనంలో ఉంచుకోవడం మన విధి. దాని కొరకు వైద్యుని వద్ద ఏ ఔషధమూ ఉండదు.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 24, పుట 284, 23-6-1924.*

★ ★ ★

నిజమైన బలం హృదయానిదే. బుద్ధి ప్రాముఖ్యత లేనిదిగా కనపడుతుంది. బుద్ధి "నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అని చెప్పినప్పుడు, హృదయం నివారిస్తే. బుద్ధి తను అదే చేస్తాననటం మంచిదా?

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 25, పుట 257, 22-10-1924.*

★ ★ ★

మనం కొన్ని అలవాట్లు చేసుకుంటాం. వాటికి భిన్నంగా చేయటానికి యిష్టపడం. ఈ గుణం మంచి అలవాట్ల విషయంలో మంచిదే. నిజాయితీతో అహింసకు అంకితమైన వ్యక్తి చివరకు హింస చేయగల శక్తి కోల్పోతాడు. చేతల్లోనే కాకుండా ఆలోచనలలో కూడా. ఆలోచన చర్యకు పితృస్థానం. ఆలోచనపోయినప్పుడు చర్య దానంతట అదే ఆలోచన వెనుక పడుతుంది.

*మణిబెన్ పటేల్‌కు లేఖలు - పుట 25. 1926.*

★ ★ ★

భక్తి ఒక విశ్వాసం. భగవంతుని మీద గల విశ్వాసం అటువంటిదే. అది అన్ని త్యాగాలకు దారి తీస్తుంది. త్యాగం చాలా కష్టమైందే కాని అది యితరుల కోసం అయితే చాలా సులభం. ఏ తల్లీ తన బిడ్డను తడి ప్రదేశంలో పడుకోబెట్టుటకు యిష్టపడదు. పొడి ప్రదేశమైతే పడుకోబెడుతుంది. తాను కూడా అక్కడ నిద్రిస్తుంది.

*ఆశ్రమ సోదరీమణులకు లేఖలు - పుట 14, 24-1-1927.*

★ ★ ★

మనల్ని మనం ఎంత గౌరవించుకుంటామో అదే విధంగా యితరులనూ గౌరవించాలి. మనం అలా చేస్తే యితరుల పిల్లలు మురికిగా ఉండటం చూచినప్పుడు మన పిల్లలైతే ఎంత అవమానంగా భావిస్తామో అంత అవమానంగా భావించాలి. అదేవిధంగా మనం యితరులు నిస్పృహలో ఉన్నప్పుడు మనం నిస్పృహలో ఉన్నట్లుగా భావించుకొని దానిని తొలగించుటకు ప్రయత్నించాలి. మనం ఎప్పటికీ ఆత్మహత్య చేసుకోకూడదు. ఆత్మహత్య చేసుకొనేవారు ప్రాపంచిక విషయాల గురించి ఎక్కువగా ఆందోళన పడతారో లేక తమ లోపాల్ని ప్రపంచం నుంచి దాచాలనుకుంటారో తెలుసుకోవాలి. మనం ఎప్పటికీ మనలాగానే కనపడుటకు ప్రయత్నించాలి గాని, భిన్నంగా కనపడాలని ప్రయత్నించకూడదు. లేదా మన పరిధికి మించిన విషయాలను చేయటానికి ప్రయత్నించకూడదు.

*ఆశ్రమ సోదరీమణులకు లేఖలు - పుట 39, 1-8-1927.*

★ ★ ★

ఎదుటివారి గురించి మనకున్న చెడ్డ భావాలను ఒప్పుకొని పోగొట్టుకోవడమే మనని మనం శుద్ధి చేసుకోవటానికి మొదటి మెట్టు. చెడు ఉద్దేశ్యాలను ఎదుటి వారి మీది అనుమానాలను వదిలించుకోనంత వరకు, వారియెడ నిజమైన ప్రేమ కలిగి ఉండాలి అను మొదటి పాఠాన్ని కూడా నేర్చుకోలేము.

*ఆశ్రమ సోదరీమణులకు లేఖలు - పుట 40, 3-10-1927.*

★ ★ ★

మనల్ని మనం యితరుల్ని ప్రపంచాన్ని మోసగించాలని భావించకూడదు. మన మనస్సులో ఉన్నదాన్ని బహిరంగపరచాలి. ఒకసారి హృదయ శుద్ధి కలిగితే అది మళ్ళీ మలినం కావటానికి చాలాకాలం పడుతుంది. కాని ఎటువంటి మలినం ఉన్నా మంచి ఆలోచనలు కూడా మలినమైపోతాయి. మలినంగా ఉన్న పాత్రలో పోసిన నీరు మలినమైపోయిన విధంగానే జరుగుతుంది. మనం ఎవరి మీదనైనా ఒకసారి అనుమానపడితే చివరికి అది ఆ వ్యక్తిని గురించిన ప్రతి విషయం మీద కనపడేటట్లు చేస్తుంది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 49, 10-10-1927.*

★ ★ ★

తప్పు చేసిన వాని ఎడల కోపంగా ఉండకుండా అతనిని ప్రేమించి అతనికి సేవ చేయడమే ఔదార్యం. మన ఆలోచనలు చర్యలు ఒకటిగా ఉన్నప్పుడే వారి ఎడల మంచి ఉద్దేశ్యాలతో ఉండవచ్చు. దానిని స్నేహమని వాత్సల్యం అని అనవచ్చు. అటువంటప్పుడు ప్రేమ అనే శబ్దాన్ని ఉపయోగించ కూడదు. ప్రేమ అంటే శత్రువు పట్ల కూడా స్నేహభావం కలిగి వుండటం అన్న మాట.

*ఆశ్రమ సోదరీమణులకు లేఖలు - పుట 50, 17-10-1927.*

★ ★ ★

ధైర్యం లేని చోట సత్యం ఉండదు. తప్పు చేయటం పాపమే కాని దానిని దాచటం యింకా ఎక్కువ పాపం. తన తప్పు ఒప్పుకుని పవిత్రమైన హృదయంతో కడిగేసుకుంటే అతడు మళ్ళీ మంచి పథం వైపు పయనించవచ్చు. అవమానమనే

తప్పుడు భావం వల్ల తన తప్పు పనిని దాచి ఉంచే వాడు యింకా లోతైన గోతిలో పడతాడు. ఇది మనం ప్రతిసారీ చూస్తూనే ఉన్నాము. అందువలన నేను మిమ్మల్నందరినీ అటువంటి తప్పుడు భావం తొలగించుకోవలసిందిగా కోరుతున్నాను. నీవు తెలిసి తప్పు చేసినా తెలియక చేసినా వెంటనే దాన్ని బహిరంగపరచి మళ్ళీ అది చేయను అని తీర్మానించుకోవాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు - పుట 71, 8-11-1929.*

★ ★ ★

ఎన్నిసార్లు నిరాశ ఎదురైనా యింకా ఆశావహ దృక్పథంతో ఉండేవాడే ఆశావాది. ఇతరులు చెప్పే మాటలు విని సత్యం మీద తనకున్న విశ్వాసాన్ని పోగొట్టుకొనేవాడు చెప్పుడు మాటలు వినేవాడు. ఈ చెప్పుడు మాటలు వినే గుణం మంచి లక్షణం కాదు. ఆశావహ దృక్పథం అంతర్వాణి మీద ఆధారపడితే, చెప్పుడు మాటలు వినే స్వభావం బాహ్య పరిస్థితుల మీద ఆధారపడి హర్మ్యాలు నిర్మించుకుంటుంది.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1. పుట 133, 27-5-1932.*

★ ★ ★

భావన హృదయానికి సంబంధించినది. మనం హృదయాన్ని పవిత్రంగా ఉంచుకోనట్లయితే మనల్ని అది తప్పు దారి పట్టిస్తుంది. మన ఇంటిని ఇంటిలోని అన్నింటిని శుభ్రంగా ఉంచుకున్నట్లుగా, హృదయాన్ని శుభ్రంగా ఉంచాలి. అది భగవంతుని గురించి, జ్ఞానాన్ని వికసింపచేసే మూలకేంద్రం. అసలు మూలమే మలినమైపోతే ప్రతిమందూ వృథాయే గదా. దాని యొక్క పవిత్రత స్థిరమైతే యింక ఏమీ అవసరం లేదు.

*మైడియర్ ఛైల్డ్ - పుట 91, 29-5-1932.*

★ ★ ★

నీవు ఎప్పటికీ ఆత్మ విశ్వాసం కోల్పోకూడదు. చెడు ఆలోచనలు మనస్సులో ప్రవేశించవచ్చు. మనం యింటిలో నుంచి అప్పుడప్పుడు శుభ్రపరిచి చెత్తను

తొలగించిపారవేస్తున్నట్లుగా, మనస్సు తనలో ప్రవేశించే చెడు ఆలోచనలను నిరాకరిస్తుంది. ఆత్మ పవిత్రీకరణ చేసుకొనే ప్రయత్నంలో అది విజయం సాధించగలగుతుంది. అందువలన జాగరూకుడై ఉన్న వానిని కపటిగా భావించకూడదు. ఈ జాగరూకతకు మోక్షం కలగటానికి ఈ క్రింది సూత్రం ఉపయోగపడుతుంది. చెడు తలంపులను దాచకుండా బహిరంగంగా ఒప్పుకోవాలి. ఒప్పుకోవడమంటే ఢంకా బజాయించి చెప్పనక్కరలేదు. ఆ తప్పులు స్నేహితునికి చెప్పవచ్చు. ఆ విషయం అందరికీ తెలుస్తుందని బాధపడవలసిన పనిలేదు.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుటలు 169-170, 17-6-1932.*

★ ★ ★

తప్పు అనేది ఒక చెడ్డ విషయం. అందువలన మనం సిగ్గుపడాలి. తప్పును అంగీకరించి క్షమాపణ కోరుకోవడం మంచిది. అట్లా చేయటానికి సిగ్గు పడరాదు. తప్పుకు క్షమాపణ కోరడానికి అర్థం అది మళ్ళీ చేయము అని నిశ్చయించు కోవడమే. అటువంటి నిశ్చయానికి సిగ్గు ఎందుకు? సత్యానికి అహింసకు పోలిక తేకూడదు. అటువంటి పోలిక తెచ్చినట్లయినచో సత్యమే అహింసకంటే ఉన్నత మైనదని నేను చెపుతాను. అసత్యం హింసతో సమానమైనది. సత్యాన్ని ప్రేమించే వ్యక్తి ముందో తరువాతో ఎప్పటికైనా అహింసను తెలుసుకోగలుగుతాడు.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 177, 19-6-1932.*

★ ★ ★

తన పని మీద తరగని విశ్వాసం కలిగియుండుటయే ఆత్మ విశ్వాసం. ఒక్కసారి యీ విశ్వాసాన్ని సాధించగలిగితే మనం తెలియక చేసే అసంఖ్యాకమైన తప్పులను గురించి ఆందోళన పడవలసిన అవసరం ఉండదు. మనం తప్పు మార్గంలో వున్నామని మనమే భయంతో స్తంభించి పోకూడదు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 178, 19-6-1932.*

★ ★ ★

మనం వ్యక్తుల మీద వాత్సల్యం చూపించకూడదు. అతని గుణాల యెడ చూపించాలి. ప్రతి వ్యక్తి గుణాలు అతడి ఏదో ఒక చర్యకు కారణాలవుతాయి. మనం ఎవరి గుణాలనైనా అభిమానించితే ఆ గుణాలను వ్యక్తీకరించే అతని కార్యాలను, చర్యలను వృద్ధి చేయాలి.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 262, 31-7-1932.*

★ ★ ★

సేవ చేయటం కోసమే అధ్యయనం చేయాలి, సేవ తరిగిపోని ఆనందంతో నిండి ఉంటుంది. అందువల్ల ఆశీర్వాదం పొందుటకు అధ్యయనం తోడ్పడుతుంది. సేవలేని అధ్యయనం, భగవంతుని బ్రహ్మానందాన్ని కలిగించి నట్లుగా మనం వినియుండలేదు.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము 1, పుట 276, 7-8-1932.*

★ ★ ★

నాకు అంతకు ముందు విరోధులుండేవారు. ఇప్పుడూ ఉన్నారు. నాకు ఎప్పుడూ వారిమీద కోపం లేదు. స్వప్నంలో కూడా వారిని గురించి చెడుగా తలచలేదు. అందువల్లనే చాలామంది విరోధులు స్నేహితులుగా మారారు. అందువల్లనే యీ రోజు వరకూ నా మీద జరిగిన మూడు హత్యా ప్రయత్నాల తరువాత కూడా నా విరోధులు తమ గమ్యాన్ని సాధించలేదని చెప్పటం కాదు. వారు సఫలం కావచ్చు కాకపోవచ్చు. దాంతో నాకు సంబంధం లేదు. అతను క్షేమంగా ఉండాలని కోరడం అవసరమైతే అతనికి సేవ చేయడమే నా ధర్మం. నా శక్తికొలదీ యీ సిద్ధాంతాన్ని ఆచరించాను. అది నా మనస్సులో అంతర్భాగమని నా నమ్మకం. వేలమంది నాకు వందనం చేస్తున్నప్పుడు నేను ఆందోళనపడతాను. యీ గౌరవాన్ని అందుకొనుటకు నేను అర్హుడనని ఏనాడూ భావించలేదు. అందువలన నా కాళ్ళు చల్లబడతాయి. నాకు తెలిసినంతవరకు యీ గౌరవాన్ని నేను కోరుకోలేదు. నేను ఎల్లప్పుడూ పనినే అపేక్షించాను. నాతో సహ కార్యకర్తలుగా ఉండుటకు వారిని మార్చాలని ప్రయత్నించాను. వారు యీ మార్పును వ్యతిరేకించినప్పుడు నేను వారి యొక్క చనువును నిరాకరించాను. పక్షివలె నా గమ్యాన్ని చేరుకొనగలిగితే సంతోషిస్తాను. అది నా ఆకాంక్ష.

*మహదేవ దేశాయి డైరీ - సంపుటము-1, పుట 284, 12-8-1932.*

★ ★ ★

ప్రపంచాన్ని ఎదిరించుటకు అహంకారాన్ని మొండితనాన్ని అభివృద్ధి చేసుకోకూడదు. క్రీస్తు, బుద్ధుడు, ప్రహ్లాదుడు వంటివారు ప్రపంచాన్ని ఎదిరించారు. కాని వారందరూ వినయం గూడు కట్టినవారు. ఆత్మ విశ్వాసం, భగవంతునియందు నమ్మకం గలవారు. కాని గర్వంతో ప్రపంచాన్ని వ్యతిరేకించినవారు చివరకు కూలి పోయారు.

*మహదేవదేశాయ్ డైరీ - సంపుటము 1. పుట 284, 12-8-1932.*

★ ★ ★

తప్పు అని నీ హృదయం చెప్పేవరకూ తప్పు అని అనుకోవద్దు. అదే మనయొక్క సక్రమమైన వివేకం. అందువలన మనం మన హృదయాలను పవిత్రంగా ఉంచుకోవాలి. ఒక పాపి పాపాన్ని ఉన్నతమైన విషయంగా భావిస్తాడనుటకు కారణం అతని హృదయం మలినంగా ఉండటమే. ఏమయినా అతడు జ్ఞానం సంపాదించుకో నంతవరకూ ఆ తప్పులోనే ఉండిపోతాడు. అందువలన ఎవ్వరూ నీకు మంచి సూచించరు. సత్యము అహింసల పథాన్ని మనమే అల్లుకొని ఆ గమ్యం వైపే మన దృష్టిని ఉంచాలని మాత్రం చెప్పగలను.

*మహదేవదేశాయి డైరీ - సంపుటము 1, పుట 286, 14-8-1932.*

★ ★ ★

మనకు ఎప్పుడూ కోపం రాకుండా ఉండాలంటే ఏం చేయాలి? దీని కోసం అందరితోనూ ఉదారంగా ఉండాలి. మనం అందరితో ఉన్నామని, అందరూ మనతో ఉన్నారను విషయాన్ని హృదయపూర్వకంగా నమ్మాలి. ప్రతి బిందువు ఎంత చిన్నదైనప్పటికీ సముద్రమైనట్లు యీ ప్రపంచం కూడా ఏర్పడింది. అప్పుడు ఒకరు ఇంకొకరిమీద కోపగించడమనే పరిస్థితి ఉండదు.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటము 1, పుట 286. 14-8-1932.*

★ ★ ★

మానసిక పవిత్రత లేకుండా స్వార్థచింతన లేకుండా బాహ్యామైన చర్యలు చేయబడవు. అందువలన మానసిక పవిత్రతను బాహ్య చర్యల యందలి పవిత్రతతో కొలవవచ్చు. బాహ్యచర్యలను పవిత్రీకరించుకోకుండా మానసిక పవిత్రత సాధించాలని ప్రయత్నించే వాడు తప్పు దోవపట్టే ప్రమాదం ఉంది.

*మహదేవ దేశాయ్ డైరీ - సంపుటము 1. పుట 305, 23-8-1932.*

★ ★ ★

ఆలోచనలు ఏ విధంగా పనిచేస్తాయో రుజువు పరచటానికి ప్రయత్నించకు. అవి పనిచేసి శక్తివంతమైన ఫలితాలను యిస్తాయని నీవు నమ్మితే చాలు. అందువల్ల హృదయంలో పవిత్రతను వృద్ధిపరచుకుంటూ శాంతిగా ఉండాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 2. పుట 26, 20-10-1932.*

★ ★ ★

శుభ్రమైన గాలి, శుభ్రమైన నీరు, సామాన్యమైన భోజనం, నిర్మలమైన ఆలోచనలు యివే భగవంతుని సాంగత్యాన్ని కలిగించే నాలుగు సూత్రాలు. మొదటి మూడూ కూడా నాలుగో దానివల్లే కలుగుతాయి. సామెత చెప్పినట్లుగా నిరాడంబర జీవనము ఉన్నతమైన ఆలోచనలు కావాలి. నేను దానిని యింకొంచెం సరళం చేసి నిర్మలమైన ఆలోచనలు, నిర్మలమైన జీవనం''గా క్లుప్తపరుస్తాను. పుండ్లు అపరిశుభ్ర జీవనానికి గుర్తు అని నా భావానికి అంతర్యం.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 25, 13-11-1932.*

★ ★ ★

నిర్మల భక్తి బంధాలను దూరం చేసి (అనాసక్తి) జ్ఞానాన్ని కలిగించాలి. ఆ విధంగా కలిగించకపోతే ఆ భక్తి భక్తి కాదు. మనోవికారమే జ్ఞానం. అంటే మంచి చెడు గ్రహించగలశక్తి అన్నమాట. సాహిత్యపరమైన అధ్యయనం చేసే వ్యక్తి యీ శక్తి యివ్వలేకపోతే అతనిదంతా డాంబిక పాండిత్యమే.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 52, 6-12-1932.*

★ ★ ★

జ్ఞానమును పొందాలనుకునేటప్పుడు కారణాలు వెతుకకుండా ఓర్పుగా వేచి ఉండాలి. అంతే కాని 'రాదు' అని ఊహించకూడదు. భగవంతుడు దయాస్వరూపుడు కాబట్టి మనం మంచిగా ఆలోచించటమే మంచిది. ఏమైనా గీతోపాసకుడు ఎప్పుడూ ఏదీ ఊహించడు. మంచి చెడు అనేవి సాన్వయమైన పదాలు. అతడు విషయాలు ఎట్లా జరిగాయి అని ఆలోచించడు. వాటికి ప్రతిచర్య చూపుతాడు. ఒక గొప్ప మెకానిక్ (యంత్రములు బాగు చేయువాడు) ఒక మంచి స్థితిలో ఉన్న యంత్రం విషయమై తన వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తాడు. ఒక బుద్ధి జీవి ఒక యంత్రంలాగా ఉండటం ఎంతో కష్టం. అయినప్పటికీ ఎవరైనా తాను శూన్యం కావాలనుకుంటున్నప్పుడు అంటే క్లుప్తంగా సంపూర్ణత్వాన్ని సాధించాలనుకుంటున్నప్పుడు ఆ విధంగా మారక తప్పదు ముఖ్యమైన భేదం యంత్రానికీ మనిషికీ వున్నది. యంత్రం జడం. మనిషి జీవం కలవాడు. కాని అద్భుతమైన పనివాడి (భగవంతుడు) చేతుల్లో గల యంత్రం వలె తయారవుతాడు.

*మీరాకు బాపూ లేఖలు - పుట 238, 19-1-1933.*

★ ★ ★

నీవు నీ మానసిక, శారీరిక కష్టాలలో ఆనందించాలి. సంతోషించాలి. నీవు ప్రస్తుతం నీ అంతర్వాణిని సంతోషపరిచే దానినే చేయాలి. అందువల్ల గమ్యం సరైనదిగా ఉంటుంది. మనందరమూ భగవంతుని చేతిలో ఉన్నాము. ఆయన ఆజ్ఞ లేకుండా గడ్డిపరక కూడా కదలదు. మనందరికీ మన మన పద్ధతులున్నట్లైతే ప్రపంచం ముక్కలైపోతుంది. అందువల్లనే కావచ్చు. మన కోరికలు తరచు భంగపడుతూ ఉంటాయి. ఆయన మన కోరికలు తీర్చనప్పుడు మనం ఆయనను నమ్ముతామో లేదోనని మన అంకిత భావానికి భగవంతుడు పరీక్ష పెడతాడు. అందువల్లనే విషయాలు అన్నీ తప్పుగా పరిణమిస్తున్నాయని అనిపిస్తున్నప్పటికీ సంపూర్ణ శాంతిని అనుభవించమని నేను కోరుతున్నాను.

*మై డియర్ చైల్డ్ - పుట 102, 15-12-1933.*

★ ★ ★

ఈ మధ్య "ఎ థాట్ ఫర్ ది డే" అనే పుస్తకాన్ని ఆంగ్లంలో చదివాను. అందులో మానవుడు తన గుణాలను గురించే దీర్ఘంగా ఆలోచించాలని తన యొక్క తప్పులను గురించి ఆలోచించకూడదని, మానవుడు ఏది ఆలోచిస్తే అదే అవుతాడని ఉంది. దాని అర్థం వ్యక్తి తన తప్పులను గురించి తను ఆలోచించ కూడదని కాదు. వాటిని గురించి ఆలోచించాలి. కాని వాటి గురించే ఆలోచిస్తూ పిచ్చివాడుగా మారకూడదు. మన శాస్త్రాలలో గూడా యిటువంటి సిద్ధాంతం ఉంది. అందువలన ఆత్మ విశ్వాసంతో మంచి పనులు నీ వల్ల చేయబడతాయనే దృఢమైన భావం నీకు కలిగేటట్లు చూసుకోవాలి.

*టు ఎ గాంధియన్ కాపిటలిస్ట్, పుట 105, 26-12-1938.*

★ ★ ★

బుద్ధి యొక్క బలం వల్ల విశ్వాసం సాధించలేము. అది నెమ్మదిగా, ధ్యానం వల్ల క్రమమైన ఆచరణ వల్ల ఏర్పడుతుంది. మనం ప్రార్థన చేస్తాం. శ్లోకాలు పఠిస్తాం. పుస్తకాలు చదువుతాం. భగవంతుని మనుష్యులు అనుకునే వారి సాంగత్యాన్ని కోరతాం. రాట్నం వడుకుతాం. యిదంతా ఎందుకు? విశ్వాసాన్ని సాధించటం కోసమే.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 12.*

★ ★ ★

తృప్తి అన్ని ధనాలలోను గొప్పది.

*ఎన్నిక చేసిన లేఖలు 2 - పుట 42.*

★ ★ ★

అహంకారము ఏమీ లేనిదానికి గుర్తు. ఆత్మ గౌరవం ఉన్న మంచి పదార్థానికి గుర్తు దెబ్బ తగలకపోవడమే. అహంకారానికి బయటి నుంచి ఎప్పుడూ దెబ్బలు తగులుతూ ఉంటాయి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 42.*

★ ★ ★

అసత్యంతో కలిసిపోయిన వారికి వంచన సులభంగా జరుగుతుంది. వంచన లాంటి ప్రమాదకరమైన విషయం ఏదీ నాకు తెలియదు.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 46.*

★ ★ ★

మనందరం ఒకరి కొకరం దగ్గర వాళ్ళం. మన చర్యల వల్ల ఒకరినొకరిని ప్రభావితం చేస్తాం. ఆ చర్యల్లో ఆలోచన కూడా కలిసి ఉంటుంది. అందువలన ఒక్క ఆలోచన కూడా దాని ప్రభావం చూపకుండా ఉండదు. కాబట్టి ఎల్లప్పుడూ మంచిగా ఆలోచించగల అభిరుచిని వృద్ధి చేసుకోవాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 55.*

★ ★ ★

కవిత్వశైలి యొక్క విశేషం దయ భక్తి పట్టు. అది అసంగతమైనది కాదు. అది అవసరమైనదే. సైన్సు నీళ్ళను ఒక రసాయనిక పదార్థమని, ఉదజని, ఆమ్లజని యొక్క సంయోగ పదార్థమని తెలియజేస్తుంది. కవిత్వ భాషలో నీరు దేవుని వరప్రసాదం. అటువంటి కవిత్వాన్ని అర్థం చేసుకోవడం జీవితంలో పెద్ద విశేషం. నీళ్లు రసాయనిక పదార్థమని తెలియకపోయినా కలిగే నష్టం ఏమీ ఉండదు. జరిగేదంతా చర్యల ఫలితమని చెప్పడం తార్కికమైనదే కాని చర్యల రహస్యం అభేద్యమని గీత చెబుతుంది. ఒక సామాన్య విషయం యొక్క కారణభూతమైన యదార్థాన్ని కూడా తెలుసుకోలేని పద్ధతిలో మనం తయారు చేయబడ్డాం. అందువల్ల దైవేచ్ఛ లేనిదే ఏ పనీ జరుగదని మనం చెప్పడంలో సబబు వున్నది. ఒక జాడీలో వుండే గాలివలె, ఆత్మకు శరీరం ఒక కారాగారం వంటిది. సహజ వాతావరణంకన్న భిన్నమైన దాన్ని అని జాడీయందలి గాలి భావించినంత కాలం అది నిష్ఫలం అవుతుంది. అదే విధంగా శరీరంలో బంధింపబడిన ఆత్మ తనే కర్తను అని అనుకున్నంత కాలం శక్తి కేంద్రాన్నుంచి అనగా భగవంతుని నుంచి ఏమీ పొందలేదు. అందువల్ల ఏమి జరిగినా దైవేచ్ఛ వల్లనే అని చెప్పడం వాస్తవాన్ని చెప్పడమే. అటువంటి వినమ్రత సత్యాన్వేషకునికి ఉపయుక్తమైనది.

*ఎన్నిక చేసిన లేఖలు - పుట 54.*

★ ★ ★

మనకు అప్పగించని విషయాన్ని గురించి మనం ఆందోళన పడకూడదు. అది ఎంత ముఖ్యమైనదైనా, లేక ఎంత లోతుగా, స్పృశించినప్పటికీ మనం ఉద్వేగపడకూడదు. ఇది ముఖ్యంగా గీత చేసిన బోధ. మనం దేనినీ వ్యక్తిగత మైనదిగా భావించకూడదు. అన్ని వ్యక్తిగతమైనవిగా భావించేటట్లు మనకు శిక్షణ నిచ్చుకోవాలి. వ్యక్తిగతమైనదిగా భావించి అందులోనే లీనమైపోవునట్లుగా మనకి మనం శిక్షణ యిచ్చుకోవాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 20.*

★ ★ ★

నీవు మంచిగా ఉండుటకు ఒక స్థిరమైన నిర్ణయం చేసుకోవాలి. ఎల్లప్పుడూ నిన్ను మంచివాడుగా తయారుచేయమని ప్రార్థించు. నీవు మంచివాడివవుతావు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 31.*

★ ★ ★

మిగతాదంతా వదిలేసి మనకు మనం మంచిగా ఉంటే మన వెనుక ఉన్న ప్రపచం అంతా అట్లాగే ఉంటుంది. నీకు చాలా తక్కువ మంది చెప్పేవారుగా కనపడతారు. అది యదార్థం కూడా. ప్రకృతిలో ఏదీ చెడ్డది కాదు. మనకు వాటిలోని మంచిని గుర్తించే దృష్టి లేదు. కాబట్టి చాలా విషయాలు చెడుగా కనపడతాయి.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట 33.*

★ ★ ★

తుపాను లేకుండా ప్రశాంతత లేదు. జగడం లేకుండా శాంతి లేదు. శాంతిలోనే జగడం ఉంది. లోపల బయట చెలరేగే పోరాటంతో ఎడతెగని పెనుగులాటయే జీవితం. అందువల్లనే జగడాల మధ్య శాంతిని గుర్తించవలసిన ఆవశ్యకతవున్నది.

*మైడియర్ చైల్డ్. పుట 90.*

★ ★ ★

## 21. నిస్వార్థసేవ

యజ్ఞాలు చేయకపోతే ప్రపంచం నాశనమైపోతుంది అని నిజంగా చెప్పబడిందా? యజ్ఞం అంటే చెక్కలను మంట పెట్టి నెయ్యి, మిగతా పదార్థాలు అందులో పోయుటయే కదా! ఇది వాతావరణాన్ని శుభ్రపరచవచ్చు. కాని ఆత్మను పవిత్రపరచదు. మనం మన ఎముకలను చెక్కల వలె మంట బెట్టటానికి అర్పించి మన రక్తాన్ని నెయ్యిలాగా పోసి మన మాంసాన్ని మంటలకు బలి యిస్తే అది మాత్రమేనిజమైన యజ్ఞము. అటువంటి సమర్పణ వల్లే యీ భూమి నిలుస్తుంది. అదే ఆత్మ సమర్పణం. ఆత్మ లేకుండా దాన్ని కాపాడలేము.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు సంపుటము 12, పుట 319, 5-1-1914*

★ ★ ★

పని యే ప్రార్థన అది పిచ్చి కూడా కావచ్చు.

*మహాత్మాగాంధీ సంగ్రహ రచనలు, సంపుటము 25, పుట 38, 25-8-1924.*

★ ★ ★

ప్రయత్నం చేయటమే మన చేతుల్లో ఉంది. కాని ఫలితాన్ని శాశించలేము. మనం పూర్తిగా మనశక్తి సామర్థ్యాలను ఉపయోగించిన తరువాత, తృప్తితో విశ్రాంతి తీసుకోవచ్చు. కాని ఓటమిని ఎన్నటికీ అంగీకరించకూడదు.

*మణిబెన్ పటేల్‌కు లేఖలు. పుట 23, 11-1-1926.*

★ ★ ★

నిజానికి మనం మన పనిలో జీవిస్తాం. మన శరీరాలను తాత్కాలిక పనిముట్లుగా ఉపయోగించుకొనక వాటిలో మనల్ని గుర్తించుకుంటే, మనం నశించుచున్న శరీరాలతో పాటు నశించిపోతాము.

*మీరాకు బాపు లేఖలు. పుట 41, 27-4-1927.*

★ ★ ★

ఉన్నదాంతో సేవచేయడం వల్ల మనం ప్రయోజనం పొందుతామో లేక నష్టపడతామో ఎవ్వరికి తెలుసు? ఏదిరక్షించబడిందనుకుంటామో, నిజానికి అది పోయినట్లు. దేన్ని పోగొట్టుకుంటామో నిజానికి అది రక్షింపబడినట్లు. కాని ప్రతివారు రక్షించబడాలని కోరుకుంటారు. మనం రక్షించబడినపుడు భగవంతునికి కృతజ్ఞులుగా ఉంటాము. వాస్తవానికి ఏమైనప్పటికీ, ఏంజరిగినప్పటికీ భగవంతునికి కృతజ్ఞతలు చెప్పాలి. దానినే నిర్వికారస్థితి అంటారు.

*ఆశ్రమసోదరీమణులకు బాపూలేఖలు. . పుట 39. 1-8-1927.*

★ ★ ★

ఎల్లపుడూ తన విధులను నిర్వర్తించుటలో లీనమై ఉండేవాడు మిగతా విషయాలలో ఉదాసీనతతో ఉండవచ్చు. మనతో పోలిస్తే రాయి జీవం లేనిది. అది ఉదాశీనంగా వుండవచ్చు. మనం జీవం ఉన్న వ్యక్తులం. కాబట్టి మన యొక్క తక్షణావసరమైన విధులలో పూర్తిగా లీనమవటం వలన మాత్రమే మిగతా విషయాల ఎడల ఉపేక్షభావంతో ఉండవచ్చు. అటువంటి వ్యక్తులు జయప్రదంగా జీవిస్తారు. అటువంటి నిశ్చలత్వం మనస్సుకు ఆకస్మాత్తుగారాదు.

*ఆశ్రమ సోదరీమణలకు బాపూ లేఖలు. పుట 40, 8-8-1927.*

★ ★ ★

పూర్తి సామర్థ్యంతో పని చేసే వ్యక్తి తననుంచి ఆశించిన విధులన్నింటినీ నిర్వహించగలుగుతాడు. మన పనిలో భగవద్గీతా భావాలను అభివృద్ధి చేసుకోవాలి. మనం ఏపని చేసినా దాన్ని స్వార్థరహితంగా సేవాభావంతో చెయ్యాలి. సేవాభావానికి అర్థం భగవంతునికి అంకిత భావన. అది ఉన్న వ్యక్తి "ఇది నేనే చేస్తున్నాను." అనే ఆలోచన చేయడు. ఇతరుల పట్ల ఎటువంటి దురభిప్రాయాలు కలిగి ఉండడు. ఇతరులపట్ల ఎంతో ఉదారంగా ఉంటాడు. నీవు చేసే అతి చిన్న సేవలో కూడా యీ ఆదర్శాలను పాటిస్తున్నానా లేదా అని నిన్ను నీవు ప్రశ్నించుకుంటూ వుండాలి.

*ఆశ్రమ సోదరీ మణులకు బాపూ లేఖలు. పుట 46. 19-9-1927.*

★ ★ ★

సాఫల్యత ప్రయత్నంలో దాగి ఉంటుంది. మంచి కోసం చేసే ప్రయత్నం ఎప్పటికీ విఫలం కాదు అని భగవంతుడు ప్రమాణపూర్వకంగా చెప్పి ఉన్నాడు. మనందరం అటువంటి అనుభవాన్ని కొద్దో గొప్పో పొంది ఉన్నాం.

*ఆశ్రమసోదరీమణులకు బాపూ లేఖలు. పుట 52, 31-9-1927.*

★ ★ ★

మన విధి పట్ల దీక్షతో సంతోషంగా ఉండాలి. పరిస్థితుల వల్ల లేక ప్రయత్నాల సాఫల్యంగా ఉండకూడదు. నరసింహ మెహతా చెప్పినట్లు "మనిషికి అన్నీ చేయగలశక్తి ఉంటే, ఎవరూ అసంతుష్టిగా ఉండరు. అతడు తన శత్రువులనందరినీ నాశనం చేసి తన స్నేహితులను మాత్రం జీవించనిస్తాడు. మనిషి అణకువగలజీవి. తన యొక్క గర్వాన్ని వదిలివేసి భగవంతునితో ఒకటైనపుడు మాత్రమే గొప్పవాడవుతాడు. ఒక్కనీటి చుక్కే అయినపుడు అది దేనికీ పనికి రాదు. కాని అదే సముద్రంలో అంతర్భాగంగా ఉంటే పెద్ద ఓడలను భరించగలిగే గొప్ప శక్తిలో భాగం పంచుకోగలుగుతుంది. అదే విధంగా మనం మనయొక్క ఉనికిని ఆశ్రమంలో కలిపి వేసుకొని తద్వారా ప్రపంచంలో భగవంతునిలో లీనమైనపుడు, మనం ప్రపంచభారాన్ని మోస్తున్నట్లు భావించవచ్చు. ఆ స్థితిలో 'నేను' 'నీవు' అనేది విసర్జించబడి 'అతడె' అనేది మిగులుతుంది.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు. పుట 53, 7-11-1927.*

★ ★ ★

జ్ఞానంతో దృఢంగా ఉండుటను గురించి గీతా శ్లోకాలు పఠించే వ్యక్తులు నిశ్శబ్దంగా పని చేసుకోవటం అలవాటు చేసుకోవాలి. మనం చపాతీలు వొత్తేప్పుడు, బియ్యం ఏరేటప్పుడు మనస్సును మరల్చుకోకుండా పూర్తిగా మన పనిలోనే లీనమై వుండాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు. పుట 60, 6-8-1928.*

★ ★ ★

ఎటువంటి కార్యమైనా నీవు ఒకసారి చేపట్టిన తరువాత దాన్ని పూర్తిగా చెయ్యి. మధ్యలో నీకు యిష్టంగా లేదని దాన్ని వదలివేయకు. ఎప్పుడైనా నీవు గైర్హాజరు కావాల్సివస్తే నీకు కేటాయించబడిన పని చేయటానికి ఏదైనా ఏర్పాటు చెయ్యి. ఒకవేళ ఆవిధంగా చేయడం సాధ్యం కాకపోతే దాన్ని నీవే నిర్వర్తించాలికాని ఎప్పటికీ మానకూడదు.

*ఆశ్రమసోదరీమణులకు బాపూ లేఖలు. పుట 61, 26-11-1928.*

★ ★ ★

మనం ఏదయినా పని చేయుటకు అంగీకరించకూడదు. ఒకవేళ అంగీకరిస్తే మాత్రం చివరి వరకూ దానికే కట్టుబడి ఉండాలి. ఇటువంటి భావంతో దృఢంగా పని చేసేవారికి భగవంతుడు ఎప్పుడూ సహాయపడతాడు.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు. పుట 85, 11-1-1929.*

★ ★ ★

తమను గురించి తమ యిష్టానిష్టాలను గురించి ఆలోచించేవారు తప్పక దెబ్బతింటారు. తమ విధులకే అంకితమైన వారికి దెబ్బతినే సమయం కూడా ఉండదు. సత్యం ఎడల అయిష్టత ఉన్నవారో లేదా సత్యం వల్ల అయిష్టతకల వారుగా మారే వారో మాత్రమే దెబ్బ తింటారని నేను గమనించాను. ఒక పాప భూయిష్టమైన పనికే రహస్యం అవసరం. అది సాధారణంగా రహస్యంగా చేయబడుతుంది. కొంత మంది సిగ్గు వదిలివేసి బహిరంగంగానే పాపపుపనులు చేయటం మనం చూస్తూనే ఉంటాం. ఇంకా కొంతమంది వంచన చేయటాన్ని, కపటాన్ని గొప్పలక్షణంగా భావిస్తూ ఉంటారు. మనం ప్రస్తుతానికి అటువంటి దాన్ని గురించి మాట్లాడటం లేదు. పైన చెప్పిన వారి వంటి వారి ఎడల మన గౌరవమే మన చాలా కార్యక్రమాలు విఫలంకావటానికి కారణం. దీన్ని గురించి లోతుగా ఆలోచించి, మీ జీవితాలను యీ కోణంతో పరీక్షించుకోవాలి.

*ఆశ్రమ సోదరీమణులకు బాపూ లేఖలు. పుట 92, 23-12-1929*

★ ★ ★

శరీరాన్ని సేవకు పనిముట్టుగా భగవంతుని దేవాలయంగా భావించి ఉపయోగించటం నేర్చుకోవాలి. అప్పుడు ముసలితనం అన్ని గుణాలను పూర్తిగా కలిగిన ఫలంగా వుండి వుండేది. నేను ఈ వైకల్యం నుంచి తప్పించుకోగలిగితే అది నా గొప్ప అదృష్టమే.

*మీరాకు బాపూ లేఖలు. పుట 177, 8-4-1932.*

★ ★ ★

ఔదార్య సాహసాదిగుణాలు దృఢమైన పదార్థంతో తయారయ్యాయి. ఏమాత్రం పరిచయం లేని, అవసరం. ఉన్నా ఏమాత్రం ప్రతిఫలం యివ్వలేని, కనీసం కృతజ్ఞతాపూర్వకమైన కొన్ని మాటలు గూడా మాట్లాడలేని వారి ఎడల కూడా, ప్రశస్తమైన సరియైన ప్రవర్తన చూపించగలవాడే ఔదార్యసాహసాది గుణములుగల రాజు.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటి 1, పుట 102, 6-5-1932.*

★ ★ ★

మనుష్యుల చేత వారి సామర్థ్యాన్ని పూర్తిగా ఉపయోగించేటట్లు చేసి పని చేయించగలననే భావన నాకు ఉన్నది. ఒకవేళ అదే నిజమైతే నేను ఎవ్వరినీ అనుమానించకపోవడం, వారు చేసిందే వారి పూర్తి సామర్థ్యం అని తృప్తి పడటమే అందుకు కారణం. జనం నన్ను మోసగిస్తున్నారని, నన్ను తప్ప వారు ఇంకెవరినీ మోసం చేయలేరని కొంతమంది చెబుతున్నారు. వారు చెప్పేది సరైనదైతే దానికి నేను చింతించను. నేను ఎవరినీ మోసగించనని నాకు ప్రశంసాపత్రం యిస్తే చాలు. అటువంటి ప్రశంసాపత్రం యివ్వటానికి బయటివారెవరూ యిష్టపడకపోతే, నాకు నేనే యిచ్చుకుంటాను. అసత్యం బాధించినట్లుగా నన్ను యింకేదీ బాధించదు.

*మహదేవదేశాయి డైరీ, సంపుటి 1, పుట - 220. 10-6-1932.*

★ ★ ★

ఎక్కడ ప్రజలు కుటుంబభావనతో పని చేస్తారో, ఎక్కడ మిగతావారిలాగే వారుకూడా వ్యక్తిగత బాధ్యతా స్పృహకలిగి ఉంటారో, అటువంటి చోట అందరికీ కాల వ్యవధి నిర్ణయించడం అసాధ్యం. ఆ సంగతి కూడా ఒకవ్యక్తి శారీరకంగా తగి ఉండి, మానసికంగా తయారుగా ఉండి సేవచేయటానికి యింకే పనిలేక ఎక్కువకాలం పని చేయాలనుకుంటే, మనం అతనికి నిబంధనలు ఎట్లాపెట్టగలం? వివేకం గలిగి పనిలో సరైన భావం ఉండి, ఎటువంటి సందడి లేకుండా ఉంటే, ఎవరూ పనిని భారంగా తలంచరు. మనమీద బయటివారెవరైనా బలవంతంగా రుద్దినప్పుడే మనకు భారం అనిపిస్తుంది. స్వయంగా సంతోషంగా చేయబడే పని ఎప్పటికీ ఉపద్రవకరమైనది కాదు. రాక్షసభావనతో ఎవరు పనిచేస్తారో, వారు స్వార్థంతో, భరించలేని భారం తయారు చేసుకొని తరువాత విఫలమైపోతారు. అటువంటివారిని ఎప్పటికీ ఆదర్శవంతంగా తీసుకోలేము.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుటలు 166, 16-6-1932.*

★ ★ ★

ఎంత వినమ్రంగా వినయంగా ఉన్నప్పటికీ నిత్యం చేసేపనిలో సంపూర్ణ తృప్తి అనేది ఉండదు. ఓర్పుతో ఉండి, ప్రార్థన చేసేవారికి భగవంతుడు ఎల్లప్పుడూ యింకా పెద్ద పనులు బాధ్యతలు అప్పగిస్తాడు.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 167, 11-6-1932.*

★ ★ ★

భగవంతుని ప్రేమించేవ్యక్తి తన పనిని ఎనిమిది గంటల పనిగా కొలుచుకోడు. అతడు అన్ని గంటలూ పని చేస్తూనే ఉంటాడు. ఎప్పుడూ విధి నుండి తప్పుకోడు. అవకాశం వచ్చినప్పుడల్లా మంచి చేస్తూనే ఉంటాడు. ప్రతిచోటా అన్ని సమయాలలో అన్ని ప్రదేశాలలో భగవంతుని కొరకు పనిచేసే అవకాశాన్ని వెతుకుతూ ఉంటాడు. తాను వెళ్ళిన ప్రతిచోటుకు తనతో పాటు సువాసనను తీసుకొని వెళతాడు.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 169, 17-6-1932.*

★ ★ ★

ఒక వ్యక్తి తన పనిలో మునిగి ఉంటే దాని బరువు తెలియదు. అందువల్ల అది అతనిని అలసిపోనివ్వదు. అతను ఆ పనిలో సంతోషాన్ని పొందలేక పోయినప్పుడు ఒక చిన్న పనికూడా ఎంతో భారం అనిపిస్తుంది. జైలు యందు ఉన్న వ్యక్తికి ఒకరోజు ఒక సంవత్సర కాలంగా అనిపిస్తుంది. అదే ఒక విషయాశక్తి గల వ్యక్తికి ఒక సంవత్సరకాలం ఒక్కరోజుగా గడిచిపోతుంది. అంతకు ముందు నేను పాశ్చాత్య సంగీతాన్ని విననప్పుడు తొందరగా విసుగుపుట్టేది. కాని ఇప్పుడు దానిని కొంత ఆస్వాదించగలుగుతున్నాను.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 169, 17-6-1932.*

★ ★ ★

ఒక శాస్త్ర పరిశోధకుడు అంతులేని ఆత్మ విశ్వాసం కలిగి ఉంటాడు. ఎప్పటికీ నిస్పృహకు గురికాడు. అదేసమయంలో మరో వినయవంతుడుంటే ఎప్పటికీ తృప్తి చెందడు. త్వరితమైన నిర్ణయాలు తీసికోవటాన్ని దోషంగా భావించడు. తన అభివృద్ధిని అప్పుడప్పుడు అంచనా వేసుకొని ఫలాన దాని ఫలితం ఫలానా అని ప్రకటించుతాడు. మన కార్యకర్తలలో నిజమైన శాస్త్రజ్ఞుడి కుండే యీ వినయం సాధారణంగా కొరతగా ఉన్నది.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 178, 19-6-1932.*

★ ★ ★

బాహ్యసంబంధాలనుంచి విడివడిన కార్యకర్త, విడవడని కార్యకర్తకంటె ఎక్కువగా కష్టపడగలుగుతాడు. అతుడు ఇంక చేయవలసింది ఏమీ లేదన్నట్లుగా కనబడతాడు. అంతతొందరగా విసుగు చెందడు. నిజానికి అతడు విసుగును జయించాలి.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 189, 22-6-1932.*

★ ★ ★

మన తత్వజ్ఞానమంతా పనికిరానిదిగా మారిపోతుంది. మనం దాన్ని వెనువెంటనే ప్రేమభావంగల సేవగా మార్చుకోవడం అవసరం.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1, పుట 261, 31-6-1932.*

★ ★ ★

సత్యమైనవ్యక్తికి చెబుతున్నాను. నీ శక్తికి మించిన దాన్ని ఎప్పుడూ అంగీకరించవద్దు. నీవు చేయగలిగిన దాన్ని తగ్గించు. అదేవిధంగా కావాలని ప్రయత్నించకు. శక్తికి మించిన పనులు తీసుకొనేవాడు గర్వి. బాహ్యసంబంధాలున్న వ్యక్తి అదే తను చేయగలిగినంత చేయనివాడు చోరుడు. ఒక కాలానుసరణపట్టిక టైంటేబులు పెట్టుకొని దాన్ని అనుసరిస్తే పైన చెప్పిన పాపం నుండి మనల్ని మనం రక్షించుకోగలుగుతాము. ఆ టైంటేబుల్‌ను ఉత్సాహంతో వివేకంతో పాటించని ఎడల రక్షిస్తుంది అని చెప్పక, రక్షించవచ్చు అని చెబుతున్నాను. అది అత్యధిక ఫలం యివ్వదు కాబట్టి. అలా చెబుతున్నాను.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1. పుట 221, 10-7-1932.*

★ ★ ★

ఒక్క సోదరీమణి అయినా నాపని చేస్తున్నంత కాలం నేను తప్పక బతికే ఉంటాను. నేను మరణించానని చెప్పగలవారెవరు? ఆత్మయొక్క శాశ్వతత్వాన్ని గురించిన గీతా తత్వాన్ని మనకిష్టమైనచో పక్కన పెట్టవచ్చు. నేను యిక్కడ ఉదహరించే శాశ్వతత్వము శారీరకమైన కండ్లకు కనపడేది. అందువలన నీవు స్థిమితాన్ని పోగొట్టుకోనక్కర లేదు. ఆందోళన చెందనవసరం లేదు. నీ కోసం నీతోపాటు ఉన్నవారికి కూడా మంచిని అందివ్వగలవని ఆశిస్తున్నాను. నీ శరీరాన్ని, మనస్సును భగవంతుని పాదాల దగ్గర పెట్టి నీవు ప్రశాంతంగా ఉండు.

*టు ఏ గాంధియన్ కాపిటలిస్ట్. పుట 137, 1932.*

★ ★ ★

మన శరీరంతోనే మనం సేవ చేయగలమని ఎందుకు భావిస్తున్నావు? మనస్సు ఇంకా శక్తివంతమైన పనిముట్టు. సంపూర్ణమైన పవిత్రమైన హృదయంతో ఉన్నవాడు ఎంతో బాగా సేవ చేయగలరు. నిజానికి మనం సేవ చేసేది హృదయ పవిత్రతకోసం. పవిత్ర హృదయంతో చేయగలిగిన పని మలినమైన హృదయంతో ఉన్న శరీరం ఎప్పటికీ చేయలేదు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుట - 26*

★ ★ ★

వ్రాయటాన్ని అలవాటుగా పెట్టుకొని వ్రాస్తూ ఉండు. నీ వ్రాతను అభివృద్ధి పరచుకొనుటకు ప్రయత్నించు. యివన్నీ గమ్యాలు కావు. గమ్యాలకు పద్ధతులు మాత్రమే. తనకు కేటాయించబడిన విధిని ఆచరించటమే గమ్యం. మనిషి యొక్క మొత్తం విధి మంచి కోరుకోవడం. ఇతరులకు మంచి చేయడం. దానిని నిర్వర్తించటంలో మొదటి మెట్టుగా రక్తసంబంధీకులైన సోదరీ మణుల వలె ప్రేమించుకోవడం అలవరుచుకోవాలి

*ఎన్నిక చేసిన లేఖలు - 1, పుట 5.*

★ ★ ★

మంచిని మంచి కోసమే చేద్దాం. ఏదో ప్రతి ఫలం కోసం వద్దు.

*ఎన్నికచేసిన లేఖలు - 1, పుట 56.*

★ ★ ★

గీత మొట్టమొదట జీవిత గమ్యాన్ని పరమార్థాన్ని చెబుతుంది. తరువాత దాన్ని సాధించటానికి ఏవిధంగా మనం జీవితం గడపాలో చెబుతుంది. ఈ విధంగా లభించిన అన్ని విధులను పూర్తిగా నిర్వర్తించు. నీ చర్యల ఫలితంతో సంబంధం పెట్టుకోకు. ఆశ్రమంలో ఎదుర్కొనే సమస్యల పరిష్కారంలో మనం ఉపయోగించే సూత్రం యిదే. ఇక చోరుల విషయంలో మనం తప్పక వారిని కూడా ఆశ్రమంలో ఉండమని ఆహ్వానించాలి. మనం ఆహ్వానించగలిగితే కాని, మనం యింకా అటువంటి వారిని జీర్ణించుకునే స్థితికి రానందువలన మన యొక్క భావదారిద్ర్యాన్ని దృష్టిలో వుంచుకొని మనం ఏది మంచిదనుకుంటామో ఆ విధంగా చేస్తున్నాం. తప్పించుకు వచ్చిన పశువుల విషయంలోనూ, మన పంటలను పాడుచేసే కీటకాల విషయంలోనూ, మనం యింకా అహింసా మార్గాలను కనుగొనలేదు. మన నిస్సహాయత వలన వాటిని కొంత హింసిస్తున్నాము. తప్పిపోయిన పశువులను అదిలించటం లేదా కొట్టి తోలివేయటం, పక్షులను రాళ్ళువేసి భయపెట్టి పారద్రోలడం, భూమిని దున్నేటప్పుడు కీటకాలను నాశనం చేయడం లేదా ఆ విధంగా చేయటం సాధ్యం కానప్పుడు

చంపివేయుటం మొదలైనవన్నీ మన ఆశ్రమ ఆదర్శాలకు వ్యతిరేకం అని నాకు తెలుసు. కాని ఆశ్రమం, ఆశ్రమ సభ్యులు సంపూర్ణత్వానికి యింకా చాలా దూరంలో ఉన్నారు. అందువల్లనే అది తప్పని తెలిసినా ఆ చర్యలను వారు చేస్తూవుంటారు. దాని వల్ల వారు స్వర్గానికి దారి కనుగొనగలుగుతారా? మనం ఆశ్రమంలో చేస్తున్న దానికంటే చర్యలు ఏవీ తీసుకొనకపోవడం చాలా పనికి మాలిన పని అనటంలో నాకు ఏమాత్రం సందేహంలేదు. గీతాకారుడు ఏవిధంగా పొగచేత నిప్పు ఆవరింపబడి ఉంటుందో ఆ విధంగా అన్ని చర్యలూ లోపాల చేత కప్పివేయబడివున్నాయి అని చెప్పారు. అందువలన మనం వినయంతో సేవ చెయ్యాలి. అంతేకాక గొప్ప వడ్రంగి అయిన భగవంతుని చేతిలో మనం సాధారణ పనిముట్టు అని గ్రహించాలి.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుటలు 16.*

★ ★ ★

ప్రయత్నించుటయే మనిషి యొక్క విధి. మన శక్తి కొద్దీ మనం ప్రయత్ని స్తున్నప్పుడు మన శత్రువులు మనను క్రింద పడవేస్తే మనం ఏమాత్రం నిస్పృహచెందకూడదు. మన కాళ్ళమీద మనం నిలబడి ప్రయత్నాన్ని కొనసాగించాలి. మన అపజయం పొందనంత కాలం సిగ్గుపడటం అవమానపడటం అనవసరం. నిజానికి అది ఓటమి కాదు.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుటలు 32.*

★ ★ ★

విశ్వాసం అవేది లోపలనుంచి పొందునట్టిది. ఎటువంటి మినహాయింపు లేకుండా అందరు అధ్యాపకులనుండి అన్ని దేశాలకు చెందిన మతా చార్యులనుండి, దేశాలనుండి, కాలాలనుండి లభించిన ప్రమాణములనుండి, నీవు దాన్ని పొందాలి. నిజమైన ప్రార్థన పెదిమల నుంచి వచ్చేమాట కాకూడదు. స్వార్థరహిత సేవయే ప్రార్థన.

*ఎన్నిక చేసిన లేఖలు - 2, పుటలు 33.*

★ ★ ★

## 22. స్వచ్ఛందంగా స్వీకరించే పేదరికము

దయచేసి గుర్తుంచుకోండి. ఇకనుంచి పేదరికమే మన అదృష్టం. నేను ఆలోచించినకొద్దీ ధనవంతునిగా ఉండటం కంటే పేదవాడుగా ఉండటం యింకా ఎక్కువ ఆశీర్వదించబడటంగా భావిస్తున్నాను. పేదరికం యొక్క ప్రయోజనాలు ధనవంతునిగా ఉన్నప్పటి ప్రయోజనాలకంటే ఎంతో మధురమైనవి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 9. పుట 206, 25-3-1919*

★ ★ ★

అందరూ సమానంగా ధనవంతులుగా ఉండటమో, అందరూ మౌనంగా పేదవారుగా ఉండటమో ఎప్పటికీ జరుగదు. మనం మంచి చెడులను పరిగణనలోకి తీసుకుంటే ప్రపంచం రైతులవల్లనే పోషింపబడుతున్నది. కాని రైతులు పేదవారు. ఒక న్యాయవాది తన పరోపకార పరాయణత్వాన్ని గురించి తన ఆధ్యాత్మిక చింతన గురించి దంబాలు పలికినచో అతని జీవనాన్ని శారీరిక శ్రమతో సంపాదించుకొని న్యాయవాదిగా ఉచితంగా పనిచేయమనండి.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటి 10, పుట 206, 2-4-1910*

★ ★ ★

మంచి మనుష్యులకు ప్రాపంచిక వ్యాపారాల మీద కోరిక ఉండదు. వారు వాటిని విసర్జించాలని కోరుకుంటారు. అదే మోక్షం.

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 13. పుట 34, 4-3-1915.*

★ ★ ★

దేశం కోసం దారిద్ర్యాన్ని వరించి తనను తాను యితరుల సేవకు అంకితం చేసుకున్న వ్యక్తి, తన తల్లిని మరణం ద్వారా ఎప్పటికీ కోల్పోడు. ఎందువల్ల నంటే అందరు స్త్రీలూ, దానికి తగిన వారందరూ అతనికి తల్లులే. అతని తండ్రి గూడా మరణించాడు. పెద్దవారందరూ అతని తండ్రివంటివారే. సేవే అతని భార్య. ఆమెకు మరణం ఉన్నదా? మిగతా ప్రపంచం అంతా అతనికి సోదరులు, సోదరీమణులు. ఒకరి తల్లి మరణిస్తే శోకంతో పలుకరించటానికి వెళ్ళడం ఒక ఆచారం. ప్రపంచానికి భిన్నంగా కనబడటానికి అందుకోసం ధనం వృథా చేయాలా?

*మహాత్మాగాంధీ సంగ్రహరచనలు. సంపుటము 14. పుట 466, 2-7-1918.*

★ ★ ★

రాట్నం వడకటం నాకు దేశంలో గల అతి పేదవారితో సహవాసంలాంటిది. దాని నిత్యాచరణ వారికీ మనకు ఉన్న బంధాన్ని పునరుద్ధరించుకోవడమే. అది నాకు ఒక సౌందర్యకరమైన సదా సంతోషం కలిగించే విషయం. ఒకరోజు రాట్నం లేకుండా ఉండటం కంటే ఒకరోజు భోజనం లేకుండా ఉండటమే నాకు యిష్టం. అందుచేత నేను రాట్నం యొక్క అంతరార్థాన్ని గ్రహించమని నిన్ను కోరుతున్నాను.

*మైడియర్ చైల్డ్. పుట 79, 10-2-1926.*

★ ★ ★

స్వచ్ఛంద పేదరికమనే ఆదర్శం చాలా ఆకర్షణీయమైనది. మనం పురోభివృద్ధి సాధించాం. కాని నా జీవితంలో దాన్ని పూర్తిగా గుర్తించలేని దౌర్బల్యం, మిగతావారు ఏదైనా చేయటాన్ని ఆశ్రమంలో కష్టతరం చేసింది. వారికి సంకల్పం ఉంది. కాని గమ్యం అనే పాఠం నేర్చుకోవాలి. యింకా పూర్తి కాలేదు.

*మీరాకు బాపూ లేఖలు. పుట 182, 6-5-1932.*

★ ★ ★

ప్రకృతి ప్రతిక్షణానికి ఎంత అవసరమో అంతే ఉత్పత్తి చేస్తుందని, అంతకంటే ఎక్కువ ఉత్పత్తి చేయదనే విషయాన్ని నేను రోజురోజుకీ గుర్తించగలుగుతున్నాను. ఈ విషయాన్ని మనం స్పృహలో వుండియెూ లేక స్పృహలో లేకుండియెూ గుర్తించలేకపోతున్నాము. విశ్వవ్యాప్తంగా మానవుడు ఎక్కువ తక్కువలతో బాధపడుతున్నాడు. అట్లా బాధపడటం గుర్తించలేక పోవడమనే కారణం వల్లనే జనం ఒక ప్రక్క పస్తులు పడుతుంటే ఎక్కువ ఉన్న గోధుమలను ఉత్పత్తి చేసే రైతులే అమెరికాలో వాటిని మరో ప్రక్క భస్మం చేస్తున్నారు. ప్రస్తుత పరిస్థితుల్లో దీన్ని సరిచేసే పధకాన్ని తయారు చేస్తున్నారు. ప్రకృతి యొక్క సూత్రాలను పూర్తి వినమ్రతతో నిజానికి అంగీకరిద్దాము. అది మనకు ఆందోళన కలిగించదు.

*మహదేవదేశాయ్ డైరీ. సంపుటము 1. పుట 168, 17-6-1932.*

★ సమాప్తం ★

# ఎంపిక చేసిన
# మహాత్మాగాంధీ రచనలు

## సంపుటము - 5
## సత్యవాణి


సంపాదకులు

శ్రీమన్నారాయణ్





నవజీవన్ పబ్లిషింగ్ హౌస్

అహమదాబాద్ - 380 014

# ముందు మాట

ఎంపికచేసిన మహాత్మాగాంధీ రచనల సంపుటాల పెట్టులో యిది అయిదవది, చివరిది. మహాత్ముని చరిత్రాత్మకమైన ఉపన్యాసాల నుంచి అత్యుత్తమమైన వాటిని ఈ సంపుటం మొదటి ఖండంలో చేర్చాము. రెండవ ఖండంలో వేదాంతం, మతం, సంస్కృతి, కళ, సాహిత్యం, విజ్ఞానం, ఆర్థికశాస్త్రం, రాజకీయాలు, సాంఘికశాస్త్రం, విద్య వంటి విషయాలపై మహాత్ముని భావాలను, యోచనలను చేర్చాము. పాఠకుల సౌకర్యం కోసం వేరు వేరు విషయాలకు తగినట్లు వేరు వేరు అధ్యాయాలు విభజించాము. శైలి ఒకే విధంగా ఉండటం కోసం కొన్ని చోట్ల కర్మ ప్రధాన వచనాలను కర్త ప్రధాన వచనాలుగా మార్చాము.

వ్యక్తిగతంగాను, జాతిపరంగాను, సామూహిక పరంగాను జీవితాలను ప్రభావితం చేసే ముఖ్య విషయాలన్నింటిపై మహాత్మాగాంధీగారి అభిప్రాయాల్ని తెలుసుకునేందుకు వీలుగా రూపొందించబడిన వారి ఈ ప్రసంగాల కూర్పు మానవాళికి ఎంతగానో ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము.

రాజభవన్
అహమదాబాద్
అక్టోబర్ - 16-'68

శ్రీమన్నారాయణ్

# ప్రకాశకుల విజ్ఞప్తి

మహాత్మాగాంధీ శతజయంతి ఉత్సవాల సందర్భంలో, వారు స్థాపించిన నవజీవన ట్రస్టు పక్షాన వారి ఆత్మకథను భారతీయ భాషలన్నిటిలోను ప్రచురించాలని నిర్ణయించాం. ఆ ప్రకారం శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి తెలుగు లోనికి అనువదించిన మహాత్ముని ఆత్మకథను ప్రచురించాం. తెలుగు ప్రజలు మా ఈ కృషిని అభినందించారు. ఇప్పటికి 40,000 ప్రతులు కొని చదివి మమ్ము ప్రోత్సహించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ న్యాయ నిర్ణేతలు మహాత్ముని ఆత్మకథ తెలుగుసేతను 1995వ సంవత్సరం ఉత్తమ తెలుగు అనువాదంగా నిర్ణయించి 5000 రూపాయల పురస్కారం ఇచ్చి శ్రీ రాధాకృష్ణమూర్తిని సత్కరించడం ముదావహం. గాంధీజీ ఆత్మకథను భారతీయ భాషలన్నింటిలోను ప్రచురిచాం.

మహాత్ముని ఆత్మకథ ఎడ భారతదేశ ప్రజల ఆదరాభిమానాలు చూచి నవజీవన ట్రస్టు మరో ప్రణాళికను చేపట్టింది. మహాత్ముడు రచించిన రచనలలో నుంచి విషయాన్ని బట్టి కొన్నింటిని ఎంపికచేసి, సంపుటముల సెట్టు రూపంలో భారతీయ భాషల్లో ప్రచురించి తక్కువ ధరకు దేశ ప్రజలకు అందజేయాలనేదే ఆ ప్రణాళిక, ప్రధమంగా ఇంగ్లీషు భాషలో నవజీవన ట్రస్టు పక్షాన ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనలను ఆరు సంపుటాల సెట్టుగా ప్రచురించాము. ఆ గ్రంథాలు అపరిమితంగా ప్రజల ఆదరణను చూరగొనడం వల్ల పెద్ద సంఖ్యలో అనేకసార్లు ప్రచురించి ప్రజానీకానికి అందజేశాము. భారతీయ భాషల్లో కూడా ఈ ప్రణాళికను అమలుపరుచుటకు నిర్ణయించి గత సంవత్సరం అయిదు సంపుటాల సెట్టుగా మళయాళం భాషలో ప్రచురించి కేరళ ప్రదేశ్ ప్రజల మన్ననలు పొందామని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఇప్పుడు తెలుగులో 5 సంపుటాల సెట్టును నవజీవన ట్రస్టు పక్షాన సబ్సిడీ రేటుకు ప్రచురిస్తున్నాము. మహాత్మాగాంధీ సిద్ధాంతాల ఎడ మక్కువ

చూపే తెలుగు ప్రజలు మా ఈ కృషిని అభినందించి ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము.

ఈ అయిదు సంపుటాలను తెలుగులో ప్రచురించుటకు అయ్యే ఆర్థిక వ్యయాన్ని పూర్తిగా నవజీవన ట్రస్టు, అహమదాబాద్ భరిస్తున్నది. ట్రస్టుకు సంబంధించిన ఇతర శాఖల ఆదాయాన్ని, ఈ ప్రణాళికను వినియోగించి తక్కువ ధరకు ఈ సంపుటాల సెట్టును తెలుగు ప్రజలకు అందజేస్తున్నాము. ఈ ప్రణాళికను తెలుగులో అమలుపరచుటకు శ్రీ బిరిధీచంద్ చౌధరి, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి గారలు సంపూర్తిగా సహకరిస్తున్నారు. వారికి కృతజ్ఞతలు తెలుపుతున్నాం. అనువాదం, టైపు సెట్టింగ్, ప్రూఫ్‌రీడింగ్, కెమేరా కాపీలు తయారు చేయించు కృషికి శ్రీ బిరిధీచంద్ చౌధరి సహకరించారు. ఈ సంపుటాల తెలుగు సేతతో బాటు ఇతర పెద్దలు చేసిన తెలుగు అనువాదాల్ని మరియు ప్రూఫులను సరి చూచి, శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తి సహకరించారు.

ఎంపిక చేసిన మహాత్మాగాంధీ రచనల అయిదు సంపుటాల సెట్టు ప్రచురణకు సంబంధించిన మా ఈ ప్రణాళికను ఆంధ్రప్రదేశ్ ప్రజలు ప్రోత్సహిస్తారని విశ్వసిస్తున్నాము.

ది. 28.10.98

అహమదాబాద్

**జితేంద్ర టి. దేశాయి**

మేనేజింగ్ ట్రస్టీ

# విశిష్ట పదముల పట్టిక

అద్వైత ఏకత్వం। ద్వైతానికి వ్యతిరేకం। ఆత్మ, పరమాత్మల సాయుజ్యం।

అద్వైతం : "రెండు కావు" అనే సిద్ధాంతం

అద్వైతి : ఆత్మ, పరమాత్మలు వేరు కావు అని నమ్మేవాడు

అహింస : హింసారాహిత్యము, ప్రేమ

ఆనందం : సంతోషం, ఆనందం

అనేకతావాది . ఒక విషయమందలి వైవిధ్యాన్ని నమ్మినవాడు

అపరిగ్రహం : స్వీకరించి, సత్వాన్ని పెంచుకోకపోవడం

ఆశ్రమం : హిందూమతం ప్రకారం జీవితంలో నాలుగు మజిలీలు, క్రమశిక్షణతో, సంఘంలో జీవన యాపన సాగించే ప్రదేశం

అస్తేయత : దొంగిలించకుండుట

ఆత్మ : ఆత్మ, అంతరంగం

అవతారం : అవతారం

భజన : మతపరమైన పాట

భక్తి : భక్తి

భక్తియోగం : భక్తిమార్గం

భంగీ : ఊడ్చేవాడు, పాకీపనివాడు

బ్రహ్మ : దివ్యతత్త్వము; విశ్వాత్మ

బ్రహ్మచారి : బ్రహ్మచారి

బ్రహ్మచర్యం : అస్ఖలితత్వం; భగవంతుని వెదకుటలో మగ్నత

చపాతీ : గోధుమపిండి రొట్టె

చర్ఖా : నూలు వడకు చక్రయంత్రం

చిత్ : భగవత్ జ్ఞానము

దరిద్రనారాయణ: బీదల రూపంలో దైవం

| | | |
|---|---|---|
| ధర్మం | : | మతం |
| గూండా | : | ధృష్టుడు |
| గూండాయిజం | : | ధృష్టత్వం |
| గురువు | : | ఉపాధ్యాయుడు, ఆధ్యాత్మిక మార్గదర్శి |
| హరిజనులు | : | "హరి" అనగా భగవంతునికి చెందిన వారు; గాంధీజీ అస్పృశ్యులను ఈ విధంగానే పేర్కొనెడివారు |
| హఠయోగం | : | శరీరంలో అవయవాల కదలికతో, ప్రాణాయామం (నియమిత ఉచ్ఛ్వాస, నిశ్వాసాల)తో మనస్సును శరీరాన్ని నియంత్రించి ఆత్మబోధ కలుగుజేయు "యోగ" పద్ధతి. |
| హిజారత్ | : | జన్మభూమిని వదలివెళ్లుట |
| హింస | : | హింస |
| జాం-ఇ-జాం | : | అందరికీ పోషకుడు |
| కల్మా | : | ముసల్మానులు చేసే విశేష ప్రార్థన |
| కల్పద్రుమం | : | అన్ని కోరికలను దీర్చు కల్పవృక్షము |
| కామధేవును | : | అన్ని కోర్కెలను తీర్చు ఆవు (దేవతా గోవు) |
| కన్యాదానం | : | కుమార్తెకు వివాహము చేసి, ఆమెను అత్తగారింటికి పంపుట |
| కర్మ | : | చేయు పని |
| ఖద్దరు, ఖాదీ | : | చేతితో వడకి, చేతి మగ్గంపై నేసిన వస్త్రము |
| కిసాన్ | : | రైతు |
| మహాత్మా | : | మహత్తరమైన ఆత్మగలవాడు |
| మంత్రం | : | "పవిత్రమైన శబ్ద సముదాయం". (పునశ్చరణకు, ధ్యానానికి ఉపయుక్తం) పవిత్రమైన ఉచ్చారణకు పనికివచ్చు మత సంబంధమైన పలుకు. |
| మోక్షం | : | జనన, మరణ రాహిత్యము |
| ముక్తి | : | విడుదల |

సమాజ్ . ముస్లిముల ప్రార్థన
నేతి, నేతి : "ఇది కాదు", "ఇదికాదు"
నిర్వాణం : మోక్షస్థితి. బౌద్ధుల సిద్ధాంతం ప్రకారం సంపూర్ణమైన శాంతి, తుష్టి
నియమాలు : నియమాలు
పంచ్ : మధ్యవర్తి
పంచముడు : ఐదవ వర్ణపు వ్యక్తి, అస్పృశ్యుడు
పంచాయత్ : ప్రజలు ఎన్నుకొన్న అయిదుగురు ప్రతినిధుల మండలి
పంచాయత్ : ప్రజాప్రతినిధుల మండలి ద్వారా జరుగు పరిపాలన
పరియా : వెలివేయబడిన వాడు
పూర్ణస్వరాజ్ : పూర్తి స్వాతంత్ర్యంతో కూడిన రాజ్యము
రాజ్ : రాజ్యం. పరిపాలన
రామనామం : రాముని పేరు (రాముడు భగవంతుని అవతారం) అట్టి రాముని నామోచ్చారణ
రామ రాజ్యం : రాముని రాజ్యం. ప్రజలను పట్టించుకొనే రాజ్యం
ఋషి : ద్రష్ట
సద్వ్రతం : అన్నదానం
సమాధి : పరమానందమయ స్థితి
సత్ : నిజము
సత్యాగ్రహం : శబ్దార్థం - "నిజాన్ని పట్టుకొని వేళ్లాడుట" సత్యశక్తి. ఆత్మశక్తి
సత్యాగ్రహి : సత్యాగ్రహం చేయువాడు
సవర్ణుడు : నాలుగు వర్ణాలలో ఒకదానికి చెందినవాడు
శాస్త్రము : పవిత్ర గ్రంథము
స్థితప్రజ్ఞుడు : నిశ్చలమైన, నిరంతరమైన వివేకం గలవాడు
స్వదేశి : తన దేశానికి చెందిన (శబ్దార్థం). స్వదేశంలో తయారైన వస్తువులను అందునా చేతితో తయారు చేయబడిన

| | | |
|---|---|---|
| | | వస్తువులను - ముఖ్యంగా పొరుగువారు చేసిన వస్తువులను వాడవలెనని పట్టు పట్టుట. |
| స్వరాజ్ | : | స్వపరిపాలన. స్వాతంత్ర్యము |
| స్యాద్వాద్ | : | జైనమతంలో "ఉండవచ్చు; కావచ్చు" అను సిద్ధాంతం. ఆధ్యాత్మ పద్ధతిలో "బహుశః" అనే సిద్ధాంతం. |
| స్యాద్వాది | : | స్యాద్వాదంలో నమ్మకం ఉన్నవాడు |
| తబ్లిగ్ | : | మత ప్రచారం, తద్వారా మతం మార్పిడి |
| తపస్, తపస్యా | : | తపస్సు, ధార్మికమైన నిరాడంబరత్వం |
| ఉపనిషత్తులు | : | పురాతనమైన, అధ్యాత్మికమైన హిందూ గ్రంథాలు |
| వైష్ణవుడు | . | విష్ణు భగవానుని భక్తుడు |
| వర్ణము | : | హిందూ సమాజంలో వృత్తిపరమైన విభాగము |
| వర్ణధర్మము | : | వర్ణ విభాగపు విధులు |
| వర్ణాశ్రమాలు | : | సమాజంలో వృత్తిపరంగా నాలుగు విభాగాలు. విద్యార్థులు, గృహస్థులు, ఆశ్రమవాసులు, సన్యాసులు |
| వేదాలు | : | హిందూ ధర్మ గ్రంథాలు |
| యజ్ఞం | : | త్యాగబుద్ధితో ఆచరించబడు ధార్మిక కార్యము |
| యోగి | : | మనస్సు సంబంధమైన నియమాలను నియమిత రూపంలో పాలించే వ్యక్తి. రాగరహితుడు |
| జమీందారు | : | భూస్వామి |

# విషయానుక్రమణిక



## ప్రథమ ఖండము

### కొన్ని ప్రసిద్ధ ఉపన్యాసములు



## ద్వితీయ ఖండము

### భాగము – 1

### అధ్యాయములు

### ఎంపిక చేసిన అంశములు, భావములు, సిద్ధాంతములు

## భాగము - 2

## మార్గాలు - గమ్యాలు

### అధ్యాయములు



## భాగము - 3

## సిద్ధాంతాల తారతమ్యాలు

## భాగము - 4
## ఒకే ప్రపంచం



## భాగము - 5
## మతం - సంస్కృతి



## భాగము - 6
## కళ - సాహిత్యము - విజ్ఞానశాస్త్రము



## భాగము - 7
## ఆర్థిక విషయాలు

భాగము - 8

## శ్రామిక సంబంధాలు



భాగము - 9

## రాజకీయాభిప్రాయాలు

# సత్యవాణి

ప్రథమ ఖండము

ఎంపిక చేసిన ఉపన్యాసములు

తెలుగు సేత

టి.ఎ.ఆర్.కె. సుబ్బారావు

జి. వెంకటేశ్వరరెడ్డి

వేమూరి రాధాకృష్ణమూర్తి

''సత్యం బ్రూయాత్ ప్రియంబ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియమ్''

అను సంస్కృతోపదేశం యొక్క ఉద్దేశం ''సత్యమైన విషయాన్ని సమరసమైన, బాధపెట్టని మాటల్లో చెప్పాలి'' అని అయి ఉంటుందని నా అభిప్రాయం నెమ్మదిగా, చక్కగా చెప్పలేని వారు ఆ విషయాన్ని పలకకుండా ఉండటమే మంచిదని అంటాను. తన నాలుకను అదుపులో పెట్టుకోలేని వానిలో ''సత్యం'' ఉండదు అని భావం.

యంగ్ ఇండియా 17.9.25, పుట 318 **మో.క. గాంధీ.**

# బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం (4-2-1916)

*(బెనారస్ హిందూ విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవ సందర్భంలో గాంధీజీని ఉపన్యసించమని పండిత మదనమోహన మాలవీయ కోరారు. ఈ విశ్వవిద్యాలయం శంకుస్థాపనకు వైస్రాయి లార్డ్ హార్డింజ్ ప్రత్యేకంగా విచ్చేశారు. ఆయన రక్షణకు పోలీసులు ప్రత్యేక శ్రద్ధతో ఏర్పాట్లు చేశారు. ఎక్కడ చూచినా పోలీసులే. ఆ మార్గాన గల ఇళ్లన్నీ బంధనంలో చిక్కుకున్నాయి. ముట్టడి పరిస్థితి ఏర్పడింది. దేశం నాలుగు చెరగుల నుంచి అనేక మంది పెద్దలు అక్కడికి విచ్చేశారు. అందరూ ఉపన్యాసాలిచ్చారు.*

*1916వ సంవత్సరం ఫిబ్రవరి నాల్గవ తేదీన ఉపన్యాసం ఇవ్వవలసిన వంతు గాంధీజీది. సభలో ఉన్నవారిలో చాలా మంది ఉపదేశాలకర్హులైన యువకులు. అమూల్య వస్త్రాభరణధారులు, రాజకుమారులు దర్పంగా మహారాజా సభాధ్యక్షులుగా ఉన్నారు. చిన్న ముతక పంచెను, కఠియావాడ్ అంగీ, టోపీని ధరించిన గాంధీగారు ఉపన్యాసం ఇచ్చేందుకు లేచారు. పోలీసుల పకడ్బందీ ఏర్పాటు, తన చుట్టూ ఉన్న ఆడంబరం అట్టహాసం ఆయనకు క్షోభను కలిగించాయి. సభాసదుల వైపు తిరిగి గాంధీజీ, తన స్ఫుటమైన అభిప్రాయాలను స్పష్టంగా దాపరికం లేకుండా తెలియచేస్తాను అని చెప్పి ఉపన్యాసం ప్రారంభించారు.)*

నేను ఇక్కడకు ఆలస్యంగా చేరినందుకు క్షమార్పణ కోరుకుంటున్నాను. అయితే దీనికి కారణం నేను గాని, ఏ ఇతర మానవ యంత్రాంగం కాని కాదని తెలిస్తే, మీరు నన్ను తప్పక క్షమిస్తారని నమ్ముతున్నాను. నన్ను ప్రదర్శనార్హునిగా ఎంచి, ఎంతో దయతో ప్రభుత్వ అధికారులు నేను ఇక్కడకు చేరుకోవలసిన సమయం మాటను అనాలోచితంగా విస్మరించారు. దారిలో నాకు, నన్ను తీసుకుని వచ్చిన వారికి, వారి

వాహనాలకూ అనుకోకుండా సంభవించిన ఆటంకాలను గురించి ఎవ్వరూ ముందు ఆలోచించలేదు. పట్టించుకోలేదు. అదీ ఆలస్యానికి కారణం.

ఇప్పుడే పూర్తయిన శ్రీమతి బిసెంటు ఉపన్యాసాన్ని విని, ఈ విశ్వవిద్యాలయం పరిపూర్ణ పదార్థమని, ఇందులో చదువబోయే విద్యార్థులు, ఒక మహాసామ్రాజ్యంలో నిష్ణాతులైన నాగరికులు అయిపోగలరనీ, అప్పుడే నమ్మకండి. ప్రపంచంలో సాటిలేని ఆధ్యాత్మికతకు స్థావరమైన ఈ దేశపుతత్త్వం, శ్రోతలందరకూ, ముఖ్యంగా విద్యార్థి లోకానికి మాటలు విన్నంత మాత్రాన అవగతమై పోతుందనుకోవడం భ్రమ. సత్యదూరం. భారతదేశం, ప్రపంచానికేదో ఒకనాడు ఇవ్వగలిగిన సందేశం, మాటలతో ఈనాడు చేరదు. ఉపన్యాసాలంటే నాకు పెద్ద తలనొప్పి. గత రెండు రోజులగా సాగిన ప్రసంగాలు ఆ తరగతికి చెందినవి కావు. అవి అవసరమైనవి. ఉపన్యాసాలకు కావలసిన విషయాలన్నీ పూర్తయిపోయాయి. కళ్లు. చెవులు తృప్తిచెందాయి. అయితే హృదయం, చేతులు, కాళ్లు ప్రభావితం కావాలి గదా!

నిన్ననూ, మొన్ననూ జరిగిన ఉపన్యాసాల ప్రకారం భారతీయాత్మ, నిరాడంబరత్వం మీద పట్టు సాధించాలంటే, మనస్సుతోపాటు చేతులు, కాళ్లు కూడా కదలాలి. ఈనాడు ఈ పవిత్ర స్థలంలో, నా దేశస్థులకు విదేశీ భాషలో ఉపన్యసించవలసి వచ్చినందుకు సిగ్గుపడుతున్నాను. ఈ ఉపన్యాసాలన్నీ విన్న వాళ్లకు విషయం బోధపడిందా అని పరీక్షిస్తే, చాలామంది ఆ పరీక్షలో నెగ్గరు. ఎందుకని? అది వారికి సరిగా అర్థం కాలేదు గనుక.

డిసెంబర్ నెలలో జరిగిన బొంబాయి కాంగ్రెస్ సభలో శ్రోతల మనస్సుకు హత్తుకున్నవి, హిందూస్తానీ భాషలో ఇచ్చిన ఉపన్యాసాలే అంటే నమ్మండి. అది బొంబాయి. అందరూ హిందీలో మాట్లాడే కాశీ కాదు. ఆంగ్ల భాషకూ, భారతీయ భాషలకూ గల అంతరం, బొంబాయి క్షేత్ర భాషలకూ హిందీకి మధ్య ఉండదు. కాంగ్రెస్ సభల శ్రోతలు హిందీ ప్రసంగాలకు బాగా స్పందించారు. ఈ విశ్వవిద్యాలయంలో చేరే విద్యార్థులకు బోధన తమ తమ మాతృభాషలలో జరిగే ఏర్పాట్లుంటాయని ఆశిస్తున్నాను. మన

భాషలు మనకు ప్రతిబింబాలు. మంచి విషయాల వ్యక్తీకరణ మన భాషల వల్ల కాదని మీరంటే, అటువంటప్పుడు మనం ఎంత త్వరగా నశిస్తే అంత మంచిదని అంటున్నారన్న మాట. ఆంగ్లభాష మన జాతీయ భాష ఎన్నటికైనా కాగలదని కలలు గనే వారెవరైనా ఉంటారా? ఎందుకీ అవిటితనం? ప్రతి ఆంగ్ల బాలునితో మన పిల్లలు ఎటువంటి అవకతవకలతో నిండిన పోటీలో పాల్గొనవలసి వస్తున్నదో, ఒక్కసారి కళ్లు మూసుకుని ఆలోచించండి.

పూనాలో కొందరు ఆచార్యులతో నేను చర్చించే సౌభాగ్యం కలిగింది. ప్రతి ఒక్కరూ ఒకే అభిప్రాయం వెలిబుచ్చారు. ఏమని? ఆంగ్లభాషలో విద్యా సముపార్జన కోసం ప్రతి యువకుడు, తన జీవితంలో ఆరు అమూల్యమైన సంవత్సరాలను పోగొట్టుకుంటున్నాడు అని. పాఠశాలలో, కళాశాలలో చదివి బయటపడుతున్న విద్యావంతుల సంఖ్యను ఆరుతో గుణిస్తే భారతదేశం యువతకు ఎన్ని వేల ఏండ్లు వ్యర్థమై పోతున్నాయో అర్థమవుతుంది. మనకు ఉత్సాహం కొరవడిందంటారు. విదేశీ భాషలో ప్రజ్ఞ సాధించేందుకు ఎన్నో ఏండ్లు వెచ్చిస్తే, ఏమవుతుంది? పోనీ, ఆంగ్లంపై పట్టు దొరుకుతుందా, అంటే అదీ లేదు. మిష్టర్ హిగ్గిన్ బాథమ్ ఇచ్చిన ఉపన్యాసానికి వచ్చిన స్పందన, తక్కినవారి ప్రసంగాలకు వచ్చిందా? ఇది ఆ ఉపన్యాసకుల లోపం కాదు. వారి మాటల్లో ఎంతో శక్తి ఉంది. కాని అది మన మనస్సుల్లో ప్రవేశించలేదు. ఆంగ్ల భాషలో విద్యనభ్యసించిన భారతీయులే దేశానికి చేయవలసినవన్నీ చేస్తున్నారట. అలా కాకపోతే, అంతా భ్రష్టేనట. మనం నేర్చే విద్య ఆంగ్లంలో నేరుస్తున్నాం. మరి దాని ఫలితం కనుపించాలి కదా. కాని, గత ఏభై ఏండ్లుగా మనం మాతృభాషలో విద్యాభ్యాసం చేసి ఉంటే, ఈ నాటికి దేశం స్వతంత్రమై ఉండేది. మన దేశస్థులకు మన మనస్సులోని మాట అందించలేక, మన దేశంలోనే విదేశీయుల వలె ఉండి ఉండేవారం కాము. దరిద్ర నారాయణుల సేవచేసి తరించడం వల్ల ఈ ఏభై ఏండ్ల సంపద దేశ పరం అయి ఉండేది. ఇప్పుడో! మన ఉత్తమ ఆశయాల అంతర్యం ఇంట్లో ఆడువారికి కూడ అర్థంగాదు. ఆచార్య బోసు, ఆచార్య రాయ్‌ల పరిశోధనల, ఆనందం అందరికీ దొరకటం లేదు.

ఇంకో విషయం - కాంగ్రెస్ "స్వపరిపాలనను హోంరూల్" గురించి ఒక ప్రతిపాదనకు స్వీకృతి నిచ్చింది. అఖిల భారత కాంగ్రెస్ సమితి, ముస్లిం లీగ్ తమ సూచనలు అందిస్తాయి. నాకు వాట గురించి ఎక్కువ పట్టింపు లేదు. యువశక్తి, జనశక్తి నాకు ముఖ్యం. వారేమి సాధిస్తారో అని ఉత్కంఠతతో ఎదురు చూస్తూ ఉంటాను. "స్వపరిపాలన" అనేది ఉపన్యాసాల వల్ల, వ్యాసాల వల్ల రాదు. మన నడవడిక మాత్రమే మనల్ని అపనికి ఉపయుక్తులుగా తీర్చిదిద్దుతుంది. మనల్ని మనం ఏ విధంగా పరిపాలించుకోగలం? ఇదీ ప్రశ్న.

నా ఆలోచనలు ఈ సమయాన శ్రవ్యరూపంలో వెలువడుతున్నాయి. ఏ మాత్రము జంకు, గొంకు, అనే శంకను వదిలి, మాట్లాడుతున్నాను. మన్నించండి. నిన్న సాయంత్రం కాశీవిశ్వనాథుని ఆలయం దర్శించి వస్తుంటే ఇలా అనిపించింది.

"అపరిచితుడొకడు ఈ దివ్యాలయాన్ని చూచి హిందువులను విమర్శించడా?" ఈ దేవాలయం మన జీవిత విధానానికి ప్రతీక కాదా? చుట్టూ ఇళ్లు అడ్డదిడ్డంగా కట్టారు. సందులు ఇరుకుగాను మురికిగాను ఉన్నాయి. మన దేవాలయాలే ఇరుకుగా ఉంటే, మన "స్వపరిపాలన" ఎలా ఉంటుంది? స్వయంగానో, ఒత్తిడికి తలవొగ్గియో ఆంగ్లేయులు మన దేశాన్ని వదలి వెళితే, మన దేవాలయాలు పవిత్రతకు, శుచికి, శాంతికి నిలయాలై ఉంటాయా?

మనం, "స్వపరిపాలన"ను గురించి ఆలోచించే ముందు, మనల్ని మనం తరచి చూచుకోవాలి" అనే కాంగ్రెస్ అధ్యక్షుల వాదనతో నేను ఏకీభవిస్తాను. ప్రతీ పట్టణంలో పట్టణ ప్రాంతం, సైనిక నిలయం (కంటోన్మెంట్) అని రెండు విభాగాలున్నాయి. పట్టణ ప్రాంతం దాదాపు ఒక మురికి కూపం. మనం నగర జీవిత విధానానికి అలవాటుపడని మాట నిజమే. కాని నగర జీవితాన్ని ఎన్నుకుంటే, నగరంలోకి అవ్యవస్థితమైన పల్లె జీవితాన్ని దిగుమతి చేయకూడదు. బొంబాయి నగర వీధుల్లో, పై అంతస్థులలో నుంచి ఏ ఉమ్ములు వగైరాలు వచ్చి ఎక్కడ మీద పడతాయో, అనే నిరంతరమైన

జంకుతో నడవడం అసౌకర్యం కాదా? నేను రైళ్లలో ఎక్కువగా ప్రయాణం చేస్తాను. మూడవ తరగతి ప్రయాణీకుల అవస్థ గమనించాను. ఈ కష్టాలకి రైల్వే పరిపాలకులే బాధ్యులు కారు, శుచి, శుభ్రత, మౌలిక సూత్రాలు మనకు తెలియవు. రైలు పెట్టెను నేలవలె నిద్రించేందుకు వాడుతున్నారని తెలుసుకోవాలి. ఉమ్మడంలో ఏ మాత్రం జాగ్రత్త తీసుకోకపోవడం, ఫలితంగా వర్ణించుటకు అలవికానంత అపరిశుభ్రత ఏర్పడుతుంది. పైతరగతి ప్రయాణీకులు తక్కువ తరగతి వారిని బెదిరించడం పరిపాటి. యువతరం వారూ ఇంతే. ఆంగ్లం మాట్లాడుతారు. విదేశీ సూటూ, బూటూ వేసి రైలు పెట్టెలో బలవంతంగా ప్రవేశించి కూర్చుంటారు.

కాగడాతో మూలలన్నీ వెదికినా ఎక్కడా మార్పులేదు. బరువెక్కిన హృదయంతో ఈ మాటలంటున్నాను. ఇవన్నీ ముందు సరిదిద్దుకుంటే గాని. "స్వ-పరిపాలన"లో ప్రగతి ఉండదు. ఇంకొక దృశ్యాన్ని మీకు పరిచయం చేస్తాను. నిన్నటి సభకు అధ్యక్షులైన మహారాజా వారు మన దేశపు దారిద్ర్యాన్ని గురించి ప్రస్తావించారు. తక్కిన ఉపన్యాసకులు ఆ విషయానికి ప్రాముఖ్యం ఇచ్చారు. చక్రవర్తి ప్రతినిధి (వైస్రాయి) శంకుస్థాపన గావించిన పర్ణకుటీరంలో, ధగధగ మెరిసే నగలు ధరించిన వారు, ప్యారిస్ నుంచి వచ్చిన నగల వ్యాపారికి కన్నులపండువగా కన్పించారు. వీరంతా తమ సంపదను బీదల కోసం, ధర్మకర్తలై వాడే వరకు భారతదేశానికి ముక్తి కలుగదు. చక్రవర్తికి "వారి ప్రతినిధికి, వారి పట్ల వినయ విధేయతలు గలవారమని" పించుకోడానికి "ఆపాదమస్తకం నగలు దిగవేసుకోవలసిన కోరిక" అక్కరలేదని నా గట్టి నమ్మకం. జార్జి ప్రభువులకిట్టి ఆడంబరాలు గిట్టవని మనవి చేస్తున్నాను.

బ్రిటిషు ఇండియాలో గాని, దళాధినేతలచే శాసింపబడుతున్న రాజ్యాల్లోగాని, ఒక్కొక్క భవ్య భవన నిర్మాణం చూస్తూ, "దీని నిర్మాణానికయ్యే ధనం కర్షకులిచ్చినదే కదా!" అని అసూయపడతాను. తన అభినందనలో హిగ్గిన్ బాధమ్" మన దేశంలో 75 శాతం ఉన్న కర్షకుల చేతుల్లో, ఒక గడ్డి పరకకు ఇబ్బడిగా పంటలు పండుతాయి" అని అన్నారు. వారి కష్ట

ఫలితాన్ని వారి నుంచి మనం దూరం చేస్తే "స్వ-పరిపాలన" ఆశయం సిద్ధించదు. కర్షకుడే ముక్తిదాత. అంతేగాని న్యాయవాది, పాశ్చాత్య వైద్యనిపుణుడు, భూస్వాములు, ముక్తిదాతలు కారు.చివరికి గత రెండు రోజులుగా మనసు కలవరపెట్టిన అంశాన్ని ప్రస్తావిస్తాను. చక్రవర్తి ప్రతినిధి (వైస్రాయి) పునవీధుల్లో ఊరేగినప్పుడు, మన అందరి మనస్సులలో భయోత్కంఠలతో నిండిన క్షణాలు చోటుచేసుకున్నాయి. అంతటా గూఢచారి పోలీసులే. "ఎందుకీ అపనమ్మకం?" అని అంతా బాధపడ్డాము. లార్డు హార్డింజి ప్రభువు ప్రతిక్షణం మృత్యువును సంభావించుకొనుట కంటె, ఒక్కసారి చస్తే చాలదా? అయితే గొప్ప సామ్రాజ్యాధినేత ప్రతినిధికీ పటాటోపం తప్పదు కాబోలు. సరే, అడుగడుగునా, మనమీద, పోలీసు గూఢచారులెందుకు చెప్పండి? నోటి నుండి తుప్పరలు పడేవరకు అరిచి అరిచి కేకలు వేస్తాం. అశాంతియుతమైన నేటి మనదేశం అనేకమంది చట్టాన్ని అతిక్రమించే విఘ్నకారులను (అనార్కిస్టులను) సృష్టించింది. నేనూ శాసనోల్లంఘనం చేస్తున్నాను - నాదైన దారిలో విద్రోహచింతన కలిగిన వారిని నేను కలుసుకుంటే, వారితో "మీకు ఈ దేశంలో చోటులేదు. విజేతలను జయించి వెళ్లగొట్టే దారి యిది కాదు" అని చెబుతున్నాను. దైవాన్ని నమ్ముకోండి. అప్పుడు ఈ మహారాజులు, చక్రవర్తి ప్రతినిధి, పోలీసులు, జార్జి ప్రభువు సైతం ఏమీ చేయలేరు.

విద్రోహికి గల దేశాభిమానం గౌరవనీయమైనది. దేశం కోసం ప్రాణాలు ధారపోసే ఆ ధైర్యాన్ని అభినందిస్తాను. కాని "చంపడం" గౌరవాన్ని కలిగిస్తుందా? హంతకుని చేతిలోని చాకు, గౌరవనీయ మృతికి దారితీయదు. ఏ పురాణాల్లోనూ ఎవ్వరూ దీనిని సమర్థించలేదు. దేశ బానిసత్వ విముక్తికి, 'ఇంగ్లీషు వారి నిష్క్రమణ' అవసరం అనుకుంటే, అలా ఘంటాపథంగా చెప్పి, ఆమాట నిలబెట్టుకునేందుకు ప్రాణాలు ధారపోస్తారు. అది "గౌరవనీయమైన చావు". బాంబు వేసేవాడు, కుట్రలు పన్ని, చాటు మాటున దాగి, పట్టుబడిననాడు, తన తప్పుకి ఫలితమనుభవిస్తాడు. "మనం ఇలా ప్రవర్తించి, బాంబులు వేయకపోతే, ఉద్యమంలో మనం ఏమీ సాధించగలిగే

వాళ్లము కాము'' అని వాళ్లు నన్ను హెచ్చరించారు. (శ్రీమతి బిసెంటు:- ''దయచేసి ఆపండి'') బెంగాలులో శ్రీ లయన్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ఇదే మాట అన్నాను. ఇది అవసరం. (అధ్యక్షుని వైపు తిరిగి) - ''ఆపమంటే, ఆజ్ఞాపాలన చేస్తాను''- ఈ ధోరణిలో మాట్లాడితే సామ్రాజ్యానికి, దేశానికి సేవచేయడం అనిపించుకోదు అని మీరు భావిస్తే, ఆపేస్తాను. (''మాట్లాడండి'' అని కేకలు). (అధ్యక్షుడు: మీ ఆశయాన్ని వివరించండి). ''నేను మామూలుగా - మిత్రులారా! ఈ అవరోధాలను లెక్కచేయవద్దు. శ్రీమతి బిసెంటు నన్ను అగమని అనడానికి కారణం, ఆమెకు గల దేశాభిమానమే. యువతరం ముందు ఇటువంటి విస్పష్టతకు గల ఇబ్బందులను గురించి ఆమెకు గల అవగాహనయే. అయినా కూడా ''గమ్యం చేరాలంటే ఇరుపక్షాల వారికి ఒకరి మీద ఇంకొకరికి ఉన్న అపనమ్మక ధోరణి నుంచి బయటపడాలి'' అని నా గట్టి నమ్మకం. పారస్పరిక విశ్వాసం, అభిమానం పునాదులుగా గల సామ్రాజ్యం ఏర్పడాలి. మన ఇళ్లల్లో బాధ్యతారహితంగా చెవులు కొరుక్కునే కంటె, బహిరంగంగా ఈ కళాశాల ప్రాంగణంలో చర్చించడం మంచిది కాదా? ఇట్టి చర్చలు ఫలప్రదం అవడం నా అనుభవం. విద్యార్థులకు తెలియనిది లేదు. వారు చర్చించనిది లేదు. మనవైపు కాంతికిరణాన్ని ప్రసరింపచేసుకుందాం. మన దేశం మనకు అతి ప్రియమైనది. దాపరికం లేకుండా చెప్తున్నాను వినండి - భారతదేశంలో విఘటన కార్యాలకు తావులేదు. స్పష్టంగా, శాసకులకు చెప్పదలచుకొన్నది చెబుదాం అది వారికి కోపం తెప్పిస్తే, ఫలితాలను అనుభవిద్దాం. కాని దొడ్డిదోవలు మాత్రం వద్దు. అపనిందలు భరిస్తున్న సివిలు సర్వీసు గురించి మీకు తెలిసినదే గదా? ఇటీవలనే ఆ సర్వీసుకు చెందిన ఒక అధికారితో మాట్లాడాను. నాకు వారంటే మంచి అభిప్రాయం లేకపోయినా, అతని మాటల తీరు నచ్చింది. ''గాంధీగారూ! మేమంతా చెడ్డవాళ్లమని మీరనుకుంటున్నారా? మేము పరిపాలితులను అణగదొక్కాలనుకుంటున్నామా?'' అని ఆయన అడిగాడు. ''లేదు'' అని నేను అన్నాను. ''అయితే అవకాశం దొరికినప్పుడల్లా అపనిందల పాలవుతున్న మమ్మల్ని గురించి ఓ సరియైన మాట చెప్పరేమి?'' అని అభ్యర్థించాడు.

ఇప్పుడదే పని చేయదలిచాను. ఇండియన్ సివిలు సర్వీసు వారు నిస్సందేహంగా అధికార మదాంధులు, నిరంకుశులు. ఆలోచనారహితులు ఇంకా ఎన్నెన్నో అవగుణాలు ఉన్నవారే కొన్నేళ్లు ఈ దేశంలో ఉండి కొంచెం పతితులయ్యారు. దీని అర్థం ఏమిటి? ఇక్కడకు రాక పూర్వం వారు పెద్ద మనుషులే. మరి, వారి నైతిక పతనం. మనవైపు వ్రేలెత్తి చూపుతున్నది.

కొంచెం ఆలోచించండి. నిన్న సరిగా ఉన్నవాడు నా సంపర్కంలో చెడ్డవాడయాడంటే, తప్పంతా అతనిదేనా? నా తప్పు లేదా? వాళ్లు దేశంలో దిగేసరికి, వారిని పరివేష్టించిన బూటకపు పొగడ్తలు, వారి దయ సంపాదించేందుకు మనవారు చేసే బానిస పనులు వారి మతులను చెడగొట్టవా? ఒకప్పుడైనా తప్పు ఒప్పుకోవాలి. స్వపరిపాలన కావాలంటే, ఈ పని చేసి తీరాలి. మనకు స్వపరిపాలన ఇవ్వబడదు. బ్రిటిషు సామ్రాజ్య చరిత్ర, బ్రిటిషు దేశస్థితి గమనించండి. వారు పుచ్చుకోలేని (లాగుకోలేని) జనులకు, స్వాతంత్ర్య దానం చేయరు. బోయరు యుద్ధం నుంచి పాఠం నేర్చుకోండి. కొద్ది ఏండ్ల క్రితం ఆ సామ్రాజ్య శత్రువులు, ఇప్పుడు వారికి మిత్రులయ్యారు.

(ఈ సమయంలో అవరోధం కలిగింది. వేదికను విడిచి కొందరు వెళ్లడం ప్రారంభం అయింది. ఆ కారణం చేత, ఉపన్యాసం అర్థాంతరంగా ముగిసింది.

*(మహాత్మా - పుటలు 179-84 ప్రచురణ 1960)*

★ ★ ★

## 1922 నాటి ప్రసిద్ధ న్యాయవిచారణ సందర్భంలో గాంధీజీ చేసిన ప్రకటనా ప్రసంగం '18-3-1922)

*(శనివారం, మార్చి 18వ తేదీ, 1922 సంవత్సరం. అహమదాబాదు జిల్లా, సెషన్సు జడ్జి మిష్టర్ సి.యన్.బ్రూం ఫిల్డు, ఐసియస్ దొరగారి సమక్షంలో, ఇండియన్ పీనల్ కోడ్ (శిక్షాసంహిత) 124-ఎ సెక్షను క్రింద, 'యంగ్ ఇండియా' పత్రిక ముద్రాపకుడు, ప్రకాశకుడు శ్రీ శంకర్‌లాల్*

ఘెలాభాయి బ్యాంకరు మీద సంపాదకుడు మహాత్మాగాంధీపైన. మోపబడిన నేరాలపై చరిత్రాత్మక న్యాయవిచారణ జరిగింది.

*అడ్వొకేటు జనరల్/ - సర్. జె. టి. స్ట్రాంగ్‌మెన్ - అహ్మదాబాదు పబ్లిక్ ప్రాసిక్యూటరు రావు బహదూర్ గిరిధరలాల్ ఉత్తమ రాం - ఇద్దరూ ప్రభుత్వం పక్షాన వాదించారు. న్యాయ విషయాల పరిశీలకుడు, మిష్టర్ ఏ.సి. వైల్డు కూడా కోర్టుకు హాజరయ్యాడు. మహాత్మాగాంధీ, శ్రీ శంకర్‌లాల్ బ్యాంకర్ల తరఫు/న డిఫెన్సు (ప్రతివాదం) చేసేవారు ఎవ్వరూ లేదు.*

*కోర్టులో ఉన్న ఇతరులు: కస్తూరిబా గాంధీ, సరోజినీనాయుడు, పండిట్ మదన్ మోహన్ మాలవీయ, శ్రీ యన్. సి. కేల్కర్, శ్రీమతి జే. బి. పెడిట్, శ్రీమతి అనసూయాబెన్ సారాభాయి గారలు.)*

మధ్యాహ్నం 12 గంటలకు జడ్జి పీఠంమీద ఆసీనుడై నేరారోపణలో తప్పులున్నాయని, వాటిని సరిచేశాడు. రిజిస్ట్రారు వాటిని చదివాడు, చట్టబద్ధమైన బ్రిటిషు ప్రభుత్వం యెడల ద్వేషం, అసహ్యం, జుగుప్స కలిగించేటట్టు, రెచ్చగొట్టేటట్లు చేసే ప్రయత్నాలు ఇండియన్ పీనల్ కోడ్ 124 - ఏ సెక్షను క్రింద శిక్షార్హమైన నేరాలు. సెప్టెంబరు 29, డిసెంబరు 15 - 1921వ సంవత్సరం 1922వ సంవత్సరంలో ఫిబ్రవరి 23వ తేదీన వెలువడిన "యంగ్ ఇండియా" పత్రికలో వచ్చిన మూడు వ్యాసాలు - "విధేయతను భంగ పరుచుట", "సమస్య సమాధానం", "జూలు విదల్చుట" యిటువంటివేనని, వాటిని కోర్టులో చదివి వినిపించారు.

చట్ట ప్రకారం "చదివినంత మాత్రాన సరిపోదు - వివరించాలి" అని అంటూ, జడ్జిగారు, యీ సందర్భంలో ఆ అవసరంలేదని, వ్యాసాలలో నేరాలు స్పష్టమయ్యాయని అన్నారు. "మీరు ఏమంటారు? నేరస్థుడనని ఒప్పుకుంటారా, విచారణ జరగాలంటారా?" అని గాంధీజీని అడిగారు. గాంధీజీ : "నేరాలను అంగీకరిస్తున్నాను". ప్రభువు పేరు "నేరారోపణలో లేకపోవడం సరియైనదే" అన్నారు. శ్రీ బ్యాంకరు అదే ప్రశ్నకు అదే సమాధానం యిచ్చారు. వెనువెంటనే జడ్జి తీర్పు యివ్వదలిచినా, సర్ స్ట్రాంగ్ మ్యాన్ పూర్తి విచారణ జరగాలన్నారు. అడ్వొకేట్ జనరలు బొంబాయి,

మలబారు, చౌరీ చౌరాలలో జరిగిన తిరుగుబాటును గుర్తుచేశారు. "ఈ వ్యాసాలలో విధాన ప్రస్తావన జరిగింది. అయినా మోసకారి ప్రభుత్వాన్ని కూలద్రోయమని రెచ్చగొట్టినందువల్ల, దాని విలువ నశించింది" అని వాదించారు. తీర్పును వీటిని ఆధారంగా చేసుకొని యివ్వాలన్నారు.

బ్యాంకరు చేసిన నేరం అంత పెద్దది కాదంటూ, ఆయన వాటిని రాయలేదు, కాని ముద్రించారు, అయినా ధనవంతుడు కనుక, శిక్షతో పాటు దండిగా జరిమానా వేయాలని సర్ స్ట్రాంగ్ మ్యాన్ వాదించాడు.

కోర్టు : మిష్టర్ గాంధీ, శిక్ష విషయమై మీరు ఏదైనా చెప్పదలిచారా?
గాంధీజీ : నేనొక స్టేట్‌మెంటు యిస్తాను.
కోర్టు : రికార్డు కొరకు, దానిని వ్రాసి యిస్తారా?
గాంధీజీ : పూర్తికాగానే యిస్తాను

అటు తర్వాత, గాంధీజీ మొదట మౌఖికంగాను, పిమ్మట వ్రాత పూర్వకంగాను తన స్టేటుమెంటు యిచ్చారు.

దానిని చదివేముందు, అడ్వొకేటు జనరలు నన్ను గురించి ప్రస్తావించిన దాన్ని పూర్తిగా సమర్థిస్తున్నాను. ప్రభుత్వం పట్ల అయిష్టం 'యంగ్ ఇండియా' తో సాంగత్యానికి ముందే నాలో కలిగింది. బొంబాయి, మద్రాసు, చౌరీ చౌరాలలో తిరుగుబాట్లకు బాధ్యుడను నేనే. రాత్రింబగలు వీటిని గురించి తలుచుకొని, నేను వాటికి కారకుడననే విషయం అంగీకరిస్తున్నాను. నేను నిప్పుతో ఆడుతున్నానని తెలుసుకున్నాను. ఇప్పుడు నన్ను విడుదలచేస్తే, మళ్లీ అలాగే చేస్తానని చెప్పడం నా విధి అనుకుంటున్నాను.

నేను హింసను అంగీకరించను. నా జీవిత ధ్యేయం అహింసయే. కాని - నాదేశానికి అపకారం చేసిన వ్యవస్థకు తలవంచడమా, లేక ఆ నిజాన్ని తెలుసుకొని ఆవేశపడిన వారిని అంగీకరించడమా? దేనినెన్నుకోవాలి? వారు ఆవేశంతో చేసిన ధ్వంసానికి నాకు పెద్ద శిక్షవేయమని కోరుతున్నాను. నాకు, "సరిఅయిన పని", అనిపించింది, ప్రస్తుతం ఉన్న చట్టం ప్రకారం నేరం అయితే, ఓ జడ్జిగారూ! నాకు శిక్ష విధించండి. ప్రస్తుత వ్యవస్థ, యీ దేశ ప్రజలకు అపకారం చేస్తుందని, నాలాగే మీరూ భావిస్తే మీ పదవికి

రాజీనామా యివ్వండి. నాస్టేటుమెంటు పూర్తిగా విని, నా గుండెల్లో మంట అర్థం చేసుకుంటే విద్యావంతుడిట్టి పని చేశాడా అని చులకన చేయరు.

*(తాను వ్రాసిన స్టేటుమెంటును చదివారు.)*

ప్రభుత్వానికి విధేయుడనై, సహకారాన్ని అందించిన నేను ఇంత. బద్ధశుత్రువునెందుకయ్యానో నా దేశ ప్రజలకు, ఇంగ్లాండు దేశవాసులకు వివరించడం నా కర్తవ్యం. వారి మెప్పుకోసమే గదా యీ న్యాయవిచారణ ఏర్పాటయింది. దీనితోబాటు కోర్టువారికి కూడా నేరారోపణ నేనెందు కంగీకరిస్తున్నానో బాగా అర్థమవుతుంది.

1893వ సంవత్సరం, దక్షిణాఫ్రికాలో నా జనజీవితం బ్రిటిషువారితో తగాదాతో మొదలైంది. భారతీయుడిగా, గాని, మనిషిగా గాని నాకేహక్కులేదని గ్రహించాను. నేను భారతీయుడను గనుక మనిషిగా ఉండవలసిన హక్కులను కోల్పోయానని అర్థం చేసుకున్నాను.

నాకు ఏ సంశయమూ గలుగలేదు. వస్తుత: మంచిదైన వ్యవస్థకు, భారతీయుల యెడల యిటువంటి ప్రవర్తన, మచ్చ తెస్తుందని భావించలేదు. స్వేచ్ఛతో, మనసారా ప్రభుత్వానికి నా సహకారాన్ని అందించాను. "తప్పు" అనిపించినప్పుడు విమర్శించాను. అయినా దాని నాశనాన్ని ఎప్పుడూ కోరలేదు.

తత్ఫలితంగా, 1899లో బోయర్ల తిరుగుబాటు సమయంలో, సామ్రాజ్యానికి ముప్పు ఏర్పడినప్పుడు, నా అంతట నేను "అంబులెన్సు దళాన్ని ఏర్పాటుచేసి, "లేడి స్మిత్" యుద్ధరంగాల యందు బాధానివారణ సేవల్లో పాల్గొన్నాను. 1906లో "జూలూ" తిరుగుబాటు సందర్భంగా అది ఉపశమించేవరకు, సేవాదళాలతో, శ్రమించాను. నాకు పతకాలు, మన్ననలు, కైజర్-ఇ-హింద్ బంగారు పతకం (లార్డు హార్డింజ్ దీన్ని ప్రదానం చేశారు) ఇంకా ఎన్నో లభించాయి. 1914లో ఇంగ్లాండు, జర్మనీల మధ్య యుద్ధం మొదలైనప్పుడు లండనువాసులైన భారతీయ విద్యార్థుల సేవాదళాన్ని ఏర్పాటుచేశాను. అధికారులు దాన్ని ప్రస్తుతించారు. 1918లో ఢిల్లీ యుద్ధ సమావేశంలో లార్డు ఛెల్మ్సుఫర్డు "స్వచ్ఛంద సేవకుల" కొరకు అర్థించినపుడు,

అవసరం తీరిన తరువాత ``ఇక వద్దు'' అనేవరకు, ఖేడానుంచి, అస్వస్థతతో ఉంటున్నా, అనేకమందిని తయారుచేశాను.

``నా దేశస్థులకు సామ్రాజ్యంలో పూర్ణ నాగరికుల హోదా, హక్కు'' లభించాలన్నదే నా కోరిక. ప్రజల హక్కులకు రౌలట్ చట్టం ద్వారా మొదటి దెబ్బ తగిలింది. దీనికి వ్యతిరేకంగా అలజడి చేయాలి అనిపించింది. జలియన్‌వాలా బాగ్ దురంతాలు - కాళ్ళమీద ప్రాకమని ఆదేశాలు, బహిరంగంగా కొరడా దెబ్బలు, వర్ణించనలవికాని యితర అకృత్యాలు - రెండవ ఆఘాతం భారత ముస్లిములకు టర్కీ, వారి పుణ్యక్షేత్రాలకు సంబంధించిన వాగ్దానాలు ప్రధానమంత్రి నిలబెట్టుకుంటారని నమ్మకం కలుగలేదు ఇంతయినా, 1919 అమృత్‌సర్ కాంగ్రెసు సమావేశంలో, మాంటేగూ - ఛెల్మ్స్‌ఫర్డు సంస్కరణలు స్వీకారం గురించి, నా మిత్రులు వద్దంటున్నా, భారతీయ ముస్లిములకు ప్రధాన మంత్రి చేసిన వాగ్దానాలను నిలబెట్టుకుంటారనీ, పంజాబుకు తగిలిన గాయాలు మానుతాయనీ, సంస్కరణలు అసంతృప్తికరమైనవి అయినా, భారతదేశపు చరిత్రలో ఒక ఆశాకిరణం ఏర్పడుతుందనీ - గట్టిగా వాదించాను.

అంతా వ్యర్థం అయింది. ఖిలాఫత్ వాగ్దానం నిలబడలేదు. పంజాబు కిరాతకులకు శిక్షపడలేదు. సరికదా, పదోన్నతులు, పతకాలు, కితాబులు లభించాయి. సంస్కరణల వల్ల లాభం జరుగకపోగా, దేశసంపద కొల్లగొట్టబడటం, జరుగుతూనే ఉన్నది. బానిసత్వం కొనసాగుతూనే ఉన్నది.

బ్రిటిషు వారి సాంగత్యం, రాజకీయంగా, ఆర్థికంగా, భారతదేశాన్ని ఎంతో బలహీనపరుస్తున్నదనే నిర్ధారణకు, అయిష్టంగా రావడం జరిగింది. ఆయుధరహిత భారతం, విదేశీదాడులను, ఎదుర్కోలేదు. మాలో ఉత్తములు కూడా, భారతదేశం ``డొమినియన్ హోదా'' పొందేందుకు, ఎన్నో తరాలు గడవాలి అని అంటున్నారు. పేదరికం వల్ల యీ దేశం ``కరువు కాటకాలను'' తట్టుకోలేదు. ఇండియాలో బ్రిటిషువారు రాక పూర్వం తన వ్యవసాయపు పంటల ఆదాయంతోపాటు, సముపార్జనా సాధనాలుగా ఇంటింటా కదుర్లు, మగ్గాలు కదలాడుతూ వుండేవి. ఈ గృహ పరిశ్రమలను, అనేకమంది

పక్షపాతంలేని పరిశీలకులు వర్ణించినట్టుగా, నిర్దయతో కాలరాయడం, పీక పిసికి చంపడం జరిగింది. జానపదులు మల మల మాడి నిర్జీవంగా తయారవడం నగరవాసులకు తెలియదు. తమ భోగాలకు కావలసిన సంపద, పల్లెలో ఉండే వారి నెత్తురు పిండి, దళారీలకు యివ్వబడే రుసుము మాత్రమే అని అర్థం కాదు. చట్టబద్ధమైన బ్రిటిషు ప్రభుత్వమే యిట్టి రాక్షసకృత్యం చేస్తుందని వారికి తట్టనే తట్టదు. ఒక్కసారి బక్కచిక్కిన పల్లెలను పరికించండి. మానవ చరిత్రలో ఎన్నడూ లేని ఈ అకృత్యాలకు అటు ఇంగ్లాండు ఇటు భారతదేశంలోని నగరవాసులు జవాబు చెప్పితీరాలి. ఇక్కడి చట్టంవిదేశీ దోపిడీదారుకి సాయపడుతున్నది. పంజాబులో మార్షల్ చట్టం విధించిన జిఓలలో 95 శాతం క్షమించరానివి. న్యాయస్థానాల్లో నూటికి 99 శాతం భారతీయులకు యూరోపియన్లతో పోలిస్తే, అన్యాయం చేశారు. అనుభవపూర్వకంగా ప్రతి భారతీయుడు తెలుసుకున్న నిజం యిదే. దోపిడీదారునికి సాయం చేసేందుకు చట్టం, బుద్ధిపూర్వకంగానో, అనుకోకుండానో, కలుషితమవుతూ వున్నదన్నది అతిశయోక్తి కాదు.

ఈ దేశంలోని ఇంగ్లీషు అధికారులకు, వారిసహచరులకు, యిట్టి నికృష్టానికి తాము సాయం చేస్తున్నామని తెలియకపోవడం పెద్ద దురదృష్టం. వారంతా తమ సువ్యవస్థిత పాలనలో దేశంఎంతో ప్రగతిని సాధిస్తూందని, నమ్ముతున్నారు. తెరమరుగు బెదరింపులు, బహిరంగంగా శక్తి ప్రదర్శనలు చేయడంవల్ల ఆత్మరక్షణ, తిరుగుబాటు ధోరణి అణచబడి, బానిసత్వం, కుట్రలు పెరుగుతున్నాయి. స్పష్టతారాహిత్యం శాసకుల అజ్ఞానాన్ని, మిథ్యాభిమానాన్ని పెంచుతున్నది. నాపై నేరారోపణకై వాడిన 124 ఏ. సెక్షను, ప్రజల స్వేచ్ఛను అణచేందుకు ఇండియన్ పీనల్‌కోడ్ ఏర్పాటుచేసిన బ్రహ్మాస్త్రం. హింసకు పురికొల్పకుండా, ప్రతి వ్యక్తీ, తనకు నచ్చని విషయాన్ని, నిర్మొహమాటంగా, వ్యక్తీకరించగలగాలి. నన్నూ బ్యాంకరుగారినీ, అయిష్టతను ప్రకటించినందుకు, శిక్షిస్తామంటున్నారు. ఈ విధంగా అనేకమంది దేశభక్తులు శిక్షలనుభవిస్తున్నారు. వారితోబాటు నన్ను చేర్చడం నాకు ఎంతో గౌరవప్రదం. నా అయిష్టతకు కారణం సంక్షిప్తంగా వివరించాను. శాసకుల పట్లగాని,

వ్యక్తిగతంగా ప్రభువు పట్లగాని, ఏ ద్వేషమూ నాకు లేదు. మొత్తం మీద తదితర వ్యవస్థల కంటె ఎన్నోరెట్లు హాని కలిగించిన ప్రభుత్వమంటే అయిష్టత, ఒక మంచి గుణం. బ్రిటిషు పరిపాలనలో ఇండియా అన్నివిధాలా చచ్చుబడింది. అటువంటి నేను, ఈ వ్యవస్థ పట్ల యిష్టం చూపడం, పాపం, సాక్ష్యంగా నిర్దేశించిన వ్యాసాలను వ్రాయగలగడం నా అదృష్టం.

నిజానికి ఇండియా, ఇంగ్లాండు దేశాలకు మధ్యగల, అసహజ సంబంధాలను, నా సహాయ నిరాకరణ ద్వారా, ఎత్తిచూపించి - ఎంతో మేలు చేశాను. మంచికి సహకరించాలి. చెడుకి సహకరించకూడదు. అయితే, సహాయనిరాకరణలో, ఇంతవరకూ, తప్పుచేయని వారిని హింసంచడం జరిగింది. నా దేశ ప్రజలకు - హింస, హింసను పెంచుతుందనీ, చెడును కూడా పోషిస్తుందనీ, దుష్టత్వానికి సహాయనిరాకరణ అహింసతోనే సాధ్యమనీ - నచ్చచెబుతున్నాను. ఇట్టి అహింసాయుత సహాయనిరాకరణ వలన కలిగే ఫలితాన్ని స్వచ్ఛందంగా ఆహ్వానించాలి. అందుకని నేను చట్టం దృష్టిలో నేరానికి, నాదృష్టిలో అది ప్రతి నాగరికుని పరమ కర్తవ్యమయినప్పటికీ, సహర్షంగా తలవంచుతున్నాను. ఓ జడ్జిగారూ! మీరు న్యానిర్ణేతలు, దౌష్ట్యబుద్ధితో నిండిన ప్రస్తుత చట్టాన్ని అమలుపరచడం సరికాదనే భావన మీకు కలిగితే. వెంటనే రాజీనామా యిచ్చి మంచిని పెంచండి. నన్ను నిర్దోషిగా ఉద్ఘోషించండి. లేదా ప్రస్తుత చట్టం ప్రజలకుపకరించేదనీ, దానిని ఎదిరించే, నా పని, సామాన్యులకు జరిగే మేలును వ్యతిరేకిస్తుందనీ భావిస్తే, నాకు కఠినాతి కఠినమైన శిక్షను విధించండి.

*(మహాత్మా - 2 సంపుటము (1951). పుటలు 129 - 33)*



# చరిత్రాత్మకమైన దండీ యాత్రకు పూర్వసంధ్యాసమయమునందు గాంధీజీ చేసిన ప్రసంగం (11-3-1930)

*(1930 సంవత్సరం, మార్చి నెల 11వ తేదీన అహ్మదాబాదులోని సబర్మతీ ఆశ్రమంలో ఇసుక తిన్నెలపై ప్రార్థనా సభ జరిగింది. 10, 000 మందికి పైగా జనం సభలో పాల్గొన్నారు. ఆ చరిత్రాత్మక దండీ యాత్రకు అది పూర్వ సంధ్యాసమయం. ఆ సభలో గాంధీగారు యిచ్చిన ఉపన్యాసం)*

ఇవి బహుశా సబర్మతీ పుణ్యతీరంలో నా జీవితపు ఆఖరుమాటలేమో, నిన్ననే చెప్పవలసింది చెప్పాను. నేను, నా సహచరులు జైలుకు వెళితే మీరేం చేయాలి అనేది నేటి విషయం. మొదట అనుకున్నట్లు జలాల్పూరు యాత్రా కార్యక్రమం జరిగిపోవాలి. స్వచ్ఛంధ సేవకులు గుజరాతు నుంచి మాత్రమే రావాలి. నేనుగత పక్షంరోజులుగా ఈ యాత్ర నిరంతరంగా సాగుతుతండటం గమనించాను. మా నిర్బంధం తర్వాత కూడా శాంతికి భంగం కలుగకూడదు. మన శక్తినంతా పణంగా పెట్టి ఈ అహింసాయుత పోరాటం చేస్తున్నాం. కోపం, ఆవేశంలో ఒక్క తప్పైనా జరుగకూడదు. ఇదీ నాకోరిక నా ప్రార్థన.

ఇందులో నేనూ, నా సహచరులూ గతించినా, కాంగ్రెసు కార్యసమితి మీరు చేయవలసిన పని ఏమిటో తెలియజేస్తుంది. నేను జలాల్పూరు చేరేవరకు, నాకు కాంగ్రెసు అప్పగించిన బాధ్యత నిర్వహిస్తాను. నా నిర్బంధం తరువాత కాంగ్రెసు బాధ్యత వహిస్తుంది. "అహింస" ను పూర్తిగా నమ్మేవారు ఊరికే ఉండవద్దు, నా నిర్భంధంతో కాంగ్రెసుతో నేను చేసుకున్న ఒప్పందం పూర్తి అవుతుంది. స్వచ్ఛంద సేవకులను చేర్చుకోవడం మానవద్దు. ఎక్కడ వీలైతే అక్కడ "ఉప్పు చట్టా"న్ని ప్రతిఘటించాలి. సహాయ నిరాకరణ చేయాలి. ఇది మూడు విధాలు, లైసెన్సు లేకుండా, ఉప్పు తయారుచేయడం, అట్టి ఉప్పును దాచడం, అట్టి ఉప్పును కొనడం, సముద్ర తీరాన

పేరుకొనిపోయి ఉన్న ఉప్పు కొఠారులను తొలగించడం, అటువంటి ఉప్పు అమ్మడం అన్నీ చట్టవిరుద్ధాలే. మీకిష్టమైన దానిని ఎంచుకొని ఉప్పుమీద సర్కారుకు ఉన్న ఏకాధిపత్యాన్ని ప్రతిఘటించండి.

ఇంతేకాదు, ఆత్మవిశ్వాసంతో యితర చట్టవిరుద్ధ కార్యక్రమాలు చేపట్టండి. ఒక్కటే షరతు - సత్యాహింసల పాలనా ప్రతిజ్ఞకు కట్టుబడి ఉండండి. తక్కినది స్వేచ్ఛగా చేయండి. అయితే మీమీద అనవసరమైన బాధ్యతలు పెట్టుకోవద్దు. స్థానిక నాయకుల ఆదేశాలను శిరసావహించండి. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగండి. అది మీ హక్కు. మీ విధి. ఈ ప్రపంచంలో ప్రతిచోటా, పోరాటం, ఆత్మ విశ్వాసం మీద ఆధారపడివుంటుంది. ధైర్యం, పట్టుదల ముఖ్యం. "స్వరాజ్యం" కావాలనుకుంటే, యిలాగే చేయాలి. జైళ్లు నింపుతూపోయినా, స్వతంత్రతా సేనానులకు కొరత ఉండదు.

ఇంకా చాల పద్ధతులున్నాయి. మద్యాన్ని, విదేశీ వస్తువులు అమ్మే దుకాణాలను వెలివేయండి. పన్నులు చెల్లించడం మానండి. న్యాయవాదలు తమ వృత్తిని వదలిపెట్టాలి. తగాదాలు మాని, ప్రజలు కోర్టులను వెలివేయాలి. అధికారులు తమ ప్రభుత్వోద్యోగాలు త్యజించండి. మళ్లీ యివి దొరకవేమో అని దిగులు వద్దు. అప్పుడే స్వరాజ్యం వస్తుంది. దేశ జనాభాలో వీరి సంఖ్య ఏ మాత్రం? తక్కిన వారు ఏమంటున్నారు? రేపు స్వాతంత్ర్యం వచ్చినా, అందరికీ ప్రభుత్వోద్యోగాలు సాధ్యమా? అప్పుడు కలెక్టరు తన పని తానే చేసుకుపోతాడు. మన బీద ప్రజలు యీ దుబారా ఖర్చులను భరించలేరు. ఏమాత్రం వివేకం ఉన్నా, జడ్జిలేక ప్యూను - ఏ ఉద్యోగాన్నైనా త్యజించండి. ఇదే సహాయనిరాకరణం. పన్నులు కట్టం, ఉద్యోగాలు చెయ్యం. ఆ స్కూళ్లలో చదివేందుకు పిల్లలను పంపం అని చెప్పండి. ఇందు పురుషులతో భుజం కలిపి స్త్రీలు కూడా పోరాడాలి.

ఇదే నా వీలునామా, ఈ యాత్రకు బయలుదేరుటయో లేక జైలు యాత్రయో - వీటికి ముందు మీతో మనసు విప్పి మాట్లాడుతున్నాను. రేపు ఉదయం ప్రారంభం కావలసిన స్వతంత్ర సంగ్రామం - ఎట్టి పరిస్థితులలోనూ

- నేను జైలుకు పోయినా సరే - ఆగకూడదు. నా బృందం "అరెస్టు" కాగానే, పది బృందాలు తయారుగా ఉండాలి. నేను మొదలు పెట్టిన యీ మహత్కార్యాన్ని నడిపించేవారు మీరేనని నాకు తెలుసు. మన ధ్యేయం న్యాయబద్ధం మన ఆయుధాలు పవిత్రమైనవి. ఇట్టి స్వచ్ఛమైన ఉద్యమాన్ని దేవుడు తప్పక ఆశీర్వదిస్తాడు. ఇక ఓటమికి తావు లేదు. సత్యాగ్రహి - నిర్బంధంలో ఉన్నా, స్వేచ్ఛగా ఉన్నా - ఎప్పుడూ విజేతయే. అతను ఓడిపోయేదెప్పుడు? సత్యాహింసలను వదలి, ఆత్మ ప్రబోధాన్ని అలక్ష్యం చేసినప్పుడే, సత్యాగ్రహికి అపజయం కలిగిందంటే, దానికి అతడే స్వయంగా బాధ్యుడు. పరమాత్ముడు మిమ్మలను రక్షించుగాక, రేపు ప్రారంభం అయ్యే సంగ్రామానికి అవరోధాలు ఏవీ లేకుండా చేయండి.

*(మహాత్మా వాల్యూం (1952) పుటలు 28 - 30)*

★ ★ ★

## రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులో గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం (30 - 11 - 1931)

*(1931వ సంవత్సరం నవంబరు 30వ తేదీన లండన్‌లో రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సు జరిగింది. ప్లీనరీ సభలో మహాత్మాగాంధీ యిచ్చిన ఉపన్యాస పాఠం)*

### బహు సంఖ్యాకుల రాజ్యం

నేనేమి చెప్పినా మంత్రివర్గ నిర్ణయంలో మార్పు ఉండబోదని నేననుకుంటున్నాను. బహుశ నిర్ణయం తీసుకోవడం జరిగిపోయి ఉంటుందని భావిస్తున్నాను. ఒకద్వీప ఖండానికి స్వాతంత్ర్యం లభించాలంటే అది సంప్రదింపులు, వాదవివాదాలతో సిద్ధించదని భావిస్తున్నాను.కొన్ని పరిస్థితుల్లో సంప్రదింపుల వల్ల పని సాధ్యమవుతుంది. అది లేనప్పుడు అంతా వృధాయే యిప్పుడు వాటి జోలికి నేను పోను.

ప్రధానమంత్రివర్యా! సమావేశ ప్రారంభంలో మీరు చదివిన నియమాల

పరిధిలో నేనుంటాను మొదటి మీకు సమర్పింపబడిన రిపోర్టులను గురించి ముచ్చటిస్తాను. "చాలామంది యిలా అనుకుంటున్నారు. కొద్దిమంది వ్యతిరేకులు" అనే పద్ధతి అధికంగా సాగింది. ఎవరు వ్యతిరేకించారో, వారి వివరాలు ఏమీ లేవు. ఇండియాలోను, ఇక్కడా యీ రిపోర్టులు చాలా మందికి ఆమోదయోగ్యమైన పద్ధతిలో తయారయ్యాయి అని విన్నాను. ఇది నా కంప్లైంటు కాదు. వీటిని గురించి భేదాభిప్రాయం ఉన్నది. ప్రధానంగా నాకే భేదాభిప్రాయం ఉన్నది. నా సహచరులతో విభేదించడం నాకు సుతరామూ ఇష్టంలేదు. కాని కాంగ్రెస్ ప్రతినిధిగా నేను యీ విషయం చెప్పక తప్పదు. కాంగ్రెస్ యొక్క భేదాభిప్రాయం అంటే అర్థం ఏమిటి? కాంగ్రెస్ భారతదేశమందలి 35 శాతం ప్రజానీకానికి ముఖ్యంగా అమాయక పేద ప్రజలకే కాక, భూస్వాములు, సామంతరాజులు, విద్యావంతులు అందరికీ ప్రాతినిధ్యం వహిస్తున్నది. ఈ విషయం ఇప్పుడు ఇక్కడ మళ్ళీ నొక్కి మరీ చెబుతున్నాను.

## కాంగ్రెస్ భారతదేశానికి ప్రతినిధి

ఇక్కడ ఉన్న అన్ని సంస్థలు ఆయా వర్గాల అవసరాలను వివరిస్తాయి. కాంగ్రెసు మాత్రం అందరికీ కావలసినది చెప్తుంది. అది మతపరమైన సంస్థ కాదు. తద్వ్యతిరేకం. జాతి, వర్ణ వర్గ తారతమ్యాలను పెట్టుకోదు. కొన్ని సమయాలలో పొరపాట్లు జరిగాయి. కాని కాంగ్రెసు దేశవ్యాప్తమైన దృష్టిగలది. భారత జాతీయ కాంగ్రెసు దేశంలోని మారుమూల ప్రాంతాలకు, ఏడులక్షల గ్రామాలకూ తనమాట, వినిపింపజేసే సంస్థ. దీనిది దినదినాభివృద్ధి గల చరిత్ర.

ఇక్కడ కాంగ్రెసును ఒక కక్షిదారు (పార్టీ)గా చూస్తున్నారు. నాకేమీ బాధ లేదు. కాంగ్రెసుకూ బాధ లేదు. కాని యీ సమావేశ నిర్ణయాలకి మాత్రం బాధ కలుగుతున్నది. ఇంగ్లీషు వారందరికీ, కాంగ్రెసు సఫల సశక్త కార్యకర్తలు గలది అని చెప్తున్నాను. మత రాజకీయాలు లేవు - అల్ప సంఖ్యాకులందరికీ ప్రతినిధిత్వం వహిస్తున్నది. (వీరి శాతం 46 అంటున్నారు. నేనంగీకరించను) అయినా కాంగ్రెసే వారందరికీ ప్రతినిధి.

కాంగ్రెసు వాదన అంగీకరిస్తే ఎంత బాగుండును? ఇరు దేశాలలో శాంతి సౌఖ్యాల కోసం యిక్కడ సమావేశమవుతున్న మన కోసం యిది పనికివస్తుంది. కాంగ్రెసు సంస్థయే దేశపరిపాలన చేయగలదు. ఎట్టి ప్రతికూల వాతావరణంలోనైనా, ఈ స్వచ్ఛంద సంస్థ మాత్రమే, సమరస భావంతో బలప్రయోగం ఏమాత్రం చేయకుండా, దేశపరిపాలనను సమర్థంగా నిర్వహించగలదు.

బ్రిటిషు ప్రజలకూ, బ్రిటిష్ మంత్రులకూ ఒక్క విషయం తెలియడం అవసరం. మనం చర్చించి నిర్ణయం చేసే విషయాలను, నిర్ణయాలను కాంగ్రెసు ఒక్కటే అమలుచేసి ఫలితాలను సాధించి అందించగలదు. శాంతిస్థాపన కోసం, మనందరికీ కావలసిన దాన్ని అమలుజరుపుటకు కాంగ్రెస్ ఒక్కటే సమర్థత కలిగిన సంస్థ. అది ఎంతో శక్తిగల సంస్థ. సమాంతర ప్రభుత్వాన్ని నడుపుటకు ప్రయత్నం చేస్తున్నది కాంగ్రెస్ మీద అభియోగం మోపుతున్నారు.మీకు కాంగ్రెస్ పనిచేసే తీరు తెలిస్తే సమాంతర ప్రభుత్వాన్ని నిర్వహించగలదని అంగీకరిస్తారు. అది ఒక స్వచ్ఛంద సంస్థ. ఏ శక్తియుక్తులు లేకున్నా ప్రతికూల వాతావరణంలో కూడా ప్రభుత్వ యంత్రాంగాన్ని నడపడం సాధ్యమని ఒప్పుకొని అట్టిసంస్థకు స్వాగతం చెబుతారు. చెప్పాలి. కానీ మీకు కాంగ్రెస్ అంటే నమ్మకం లేదు. ఆహ్వానం అయితే పంపారు కాని దేశానికంతటికీ ప్రతినిధి అనే సత్యాన్ని మీరు ఒప్పుకోవడం లేదు. నేను మిమ్మల్ని ఒప్పించనూ లేను. అయినా నా భుజస్కంధాలపైనున్న భాద్యతను నిర్వహిస్తాను.

## సంప్రదింపులు

కాంగ్రెస్‌లో తిరుగుబాటు ధోరణి ఉన్నది. అందరూ సమావేశమై ఒక సమాధానంకోసం చేసే ప్రయత్నానికిది అడ్డు. ఇక్కడి ఉపన్యాసాలన్నీ గ్రేటు బ్రిటను యొక్క పెద్దమనసును శ్లాఘించాయి. ఇచ్చిపుచ్చుకోవడం, సర్దుకుపోవడం వంటి ఉదాత్తత ఎవరికీ అర్థం కాదు. కాని కాంగ్రెసు స్పష్టవాది. ఇంకొక విపర్యయాన్ని మీకు రుచించనిదాన్ని కాంగ్రెస్ సూచించగలదు.

## పురాతన పద్ధతి

అందరి ఉపన్యాసాలలో భారతదేశంలో తిరుగుబాటు, శాసనోల్లంఘనం వగైరాల వల్ల కలిగే నష్టం వివరించడం జరిగింది. నేనూ దేశ చరిత్రను చదివిన వాడనే. స్వేచ్ఛకొరకు పోరాడిన వారి రక్త బిందువులు చిందనిదే ఏ దేశానికీ ముక్తి దొరకలేదు. కత్తి, తుపాకి, బల్లెం, చివరకు విషం కూడా వాడడం కద్దు. ఈ స్వాతంత్ర్య యోధులను ఏ చరిత్ర కారుడూ అభిశంసించలేదు. భయోత్పాదకత, ఉన్మాదం, ఆతంకవాదం అంటే నాకు పడదు. కలకత్తా కార్పొరేషనులో గల భావోద్రిక్తతను గురించి మిష్టర్ గజనవీ ప్రస్తావించారు. కొందరు కాంగ్రెస్ ఉద్రేకపరులు చేసిన పనుల వల్ల భంగపడ్డ మేయరు గారు కాంగ్రెస్ వారి సలహా ననుసరించి నష్టపరిహారమిచ్చిన మాట చెప్పలేదు. ఆ విధంగా యీ సంఘటన జరిగిన తరువాత కాంగ్రెస్ వారు దానిని సరిదిద్దడం మొదలుపెట్టారు.

మేయరుగారిని కలిసి, జరిగినదాని వివరణ అడిగారు, ఆయన పెద్దమనిషి. వెంటనే తప్పు జరిగిందని తెలుసుకొని, చట్టప్రకారం చేయవలసినది చేసి తప్పుకు పరిహారం జరిగేటట్టు ఏర్పాటుచేశాడు. కలకత్తా కార్పొరేషన్ వారి నలభై స్కూళ్ళలోని బాల బాలికలు చదివినట్టు కట్టుకథలు మిష్టర్ గజనీవీ చెప్తున్నాడు. ఇంకా ఏవేవో జరిగినవని ప్రచారం చేస్తున్నాడు. పిల్లలకు ఆ పద్యాలు నేర్పారు అనడం అందులో ముఖ్యమైన అభాండం, శ్లాఘనీయమైన కలకత్తా కార్పొరేషను కోసం, జరిగినది జరిగినట్లు నిజం మీకు తెలియడం కోసం, ఇక్కడ ఈనాడు తమ వాదాన్ని వినిపంచలేని ఆ అమాయకుల రక్షణకోసం, ఈ ఉదంతాన్ని నేను ప్రస్తావించాను. ఇంకా ఎన్నో విషయాలు చెప్పవలసినవి ఉన్నాయి. కలకత్తా కార్పొరేషను వారి ద్వారా ఈ పద్యాలు నేర్పించిన విషయంగాని, కావాలని ఇది ఆచరించబడినదనిగాని నేను అనుకోను. ఆ పెద్ద మనిషి ఉపన్యాసంలో ఇంకా చాలా అసత్యాలు ఉన్నాయి - వాటిని వివరించి, మీ కాలం వ్యర్థం చేయడం నాకు సమ్మతం కాదు. సత్యనిష్ఠతో, ఇక్కడ తమ వాదం వినిపించలేని వారికోసం, ఈ విషయాలు చెప్పాను. తప్పులు జరిగాయి. దిద్దుకోడం జరిగింది. మిష్టర్

గజనవీ తాను ఇక్కడ చదివిన పద్యాలు అక్కడ నిజంగా పిల్లలకు నేర్పిస్తే తప్పే. కాని అలా జరగలేదే. ఇటువంటి అభూత కల్పనలు సామరస్య వాతావరణాన్ని కలుషితం చేస్తాయి. ఇట్టి కల్పనలు - వాటి ఖండనలు వాటిని గురించి మీకందరికీ తెలియాలనే నేను చెప్తున్నాను.

## నూతన పద్ధతి

కాంగ్రెసు ఇప్పుడు క్రొత్త పద్ధతిలో అహింసాయుతమైన శాసనోల్లంఘనం చేస్తున్నది. దీన్ని కూడా ప్రపంచంలోని ఏ ప్రభుత్వమూ సహించదట. నిజమే, తన మాటను కాదంటే ఎవరికి కోపం రాదు? రాతిగోడ కదా ప్రభుత్వం! అందులోనూ శక్తియుక్తులున్న ప్రభుత్వానికి కోపం రాదా? కాని అంతిమ విజయం మాదే! ఎనిమిదేళ్ళ తర్వాత డచ్చివారికి వలెనే, బ్రిటిషువారు కూడా యీ క్రొత్త శక్తికి జోహారు పలుకవలసి వస్తుంది. తమ ఆత్మగౌరవార్థం పోరాడే అమాయకులను చంపేందుకు తయారైన వారిని గట్టి శాసకుడు, గొప్ప రాజకీయవేత్త, సాహసి అయిన జనరల్ స్మట్సు గర్జించాడు. 1908లో తాను "లొంగను" అన్నవాడు, జనరల్ బోథా యొక్క దన్ను, ఉన్నప్పటికీ ఎన్నో విధాల ప్రయత్నించి చూసిన తర్వాతనే 1914లో యీ వీరులకు తలయొగ్గి వారిని మన్నించాడు.

ఇండియాలో బొంబాయి గవర్నరు లార్డ్ షెల్మ్‌ఫర్డ్ బొర్సాద్, బార్డోలీలలో యిదే విధంగా చేశారు. ప్రధానమంత్రి గారూ! ఈ చివరి ఘడియలలో స్వతంత్ర వీరుల కోరికలను తృణీకరించే ప్రయత్నం చేయకండి అది అసాధ్యం. మనం విడిపోవలసి వస్తుందనే నా చింత. నా దేశవాసులకు అగ్నిపరీక్షలేకుండా సమాధానం దొరికేందుకే శతథా ప్రయత్నం చేస్తున్నాను. నా దేశవాసులను దీనికి ప్రేరేపించడం, బాధలు పడేటట్టు చేయడం నాకు సంతోషమా? కాని, తప్పనిసరి అయితే మాత్రం మంచి పనిచేస్తున్నామని సంతోషంతో చిరునవ్వులు చిందిస్తూ ప్రాణాలర్పిస్తాం అంతేగాని ప్రాణాలు తీయం. ఆ తృప్తి నాకూ నా దేశానికీ ఉంటుంది. ప్రొఫెసర్ గిల్బర్టు ముర్రే నాతో అన్నట్టు : "వేలాది మీ వాళ్లు బాధపడితే, ఇంగ్లీషు వారికి, బాధ

కలుగదా! వారికి హృదయం లేదా?'' - అదీ. సరిమైన స్పందన! బ్రిటిషు వారిని బాధపెట్టే తలంపే మాకు లేదు. మేము ఎన్ని కష్టాలైనా అనుభవిస్తాం. దీనితో మీ మనస్సులు కదలాలి. కరగాలి, అప్పుడే సంప్రదింపులకు సరిమైన ముహూర్తం వస్తుంది. ఇన్నివేల మైళ్ళు నేను ప్రయాణం చేసి వచ్చింది మీకు లార్డ్ ఇర్వన్ గారి ఆర్డినెన్సు, మేము పడిన బాధలను గురించి సాక్ష్యాధారాలు తెలియబరచి, లాఠీలున్నా, లేకపోయినా, ఉరకలు వేస్తున్న యీ తుఫాను తాకిడినీ, "స్వతంత్ర్య పిపాసులైన, భారతీయుల భావోద్రేకపుటలలనీ ఆపడం అసాధ్యం'' అని స్పష్టం చేసేందుకే.

## దీనికి మూల్యం

ఆలస్యం అయిపోతున్నది కాని ఇంకా సమయం మించిపోలేదు. కాంగ్రెసు ధ్యేయం చెపుతున్నాను. నా ప్రాణం మీ చేతుల్లో ఉంది. మా అందరి జీవితాలూ మీ చేతుల్లో ఉన్నాయి. కాని వాటిని పణంగా పెట్టకుండా, గౌరవనీయమైన ఒప్పందం కుదిరేందుకు, ఏ త్యాగానికైనా, నేను సిద్ధం. "దేశానికి స్వాతంత్ర్యం రావాలని'' కాంగ్రెసు కోరిక. మిమ్మల్ని కదిలించడమే దాని లక్ష్యం. దానికేదైనా పేరు పెట్టండి. కృతకం కాని స్వాతంత్ర్యం కావాలి. మనందిరితో యీ భూమి అంతా ఒకటే అయితే ఆఘనత ఈ సమావేశానిదా, బ్రిటిషు ప్రజలదా అనే భావన కలుగుతుంది. ఒప్పందాలకు కొదువ ఉండదు. అది లేనినాడు అంతా మరుభూమిగా మారిపోతుంది. "ఇచ్చి పుచ్చుకోవడమనే'' మాట ఉండదు. ఒక వాక్యానికి మా నిర్వచనం, మీ నిర్వచనం భిన్నముగా ఉండకూడదుగదా! ఇంతవరకూ జరిగిన సమాలోచనలలో ఆ సమ్యక్దృష్టి కొరవడింది. ఇదే నా మనసులోని బాధ. నిజాయితీగా, భారతీయుల స్వాతంత్ర్య వాంఛ, సముచితం అని ఒప్పుకోండి.

ఒక నిత్యశంకితుడు "వెస్టు మినిస్టరు స్టాట్యూట్'లో "డొమినియన్' ' అనే దానికి "నిర్వచనం'' గ్రహించావా? అని అడిగాడు. అంతా చదివితే, అందులో "డొమినియన్''లో ఆస్ట్రేలియా, సౌత్ ఆఫ్రికా, కెనడా మొదలైనవీ, చివరికి ఐరిష్ ఫ్రీ స్టేటు కూడా ఉన్నాయి. ఈజిప్టు ఉన్నట్టు లేదు. నాకేమీ

గాబరా కలగలేదు. నా దేశం ఆ లిస్టులో లేదు అని సంతృప్తి మిగిలింది. నిర్వచనాలు సరిగా లేక వేరుగా ఉంటే "డొమినియన్" అంటే ఏమిటి? "పూర్ణ స్వాతంత్ర్యం' అంటే ఏమిటి? ఏదైనా సరే, కావలసింది స్వేచ్ఛ అంటాను. "పూర్ణస్వాతంత్ర్యం' అంటే ఏమిటి అనే సందేహం మీ దేశపు రాజకీయవేత్తకు కలిగినప్పుడు "సామ్రాజ్యంలో ప్రస్తుతం భాగస్వామిని కాను కాని కావాలని కోరుతున్నాను." అని నేను సమాధానం చెప్పాను.

నా అంతట నేను "భాగస్వామిని" అనుకోగలగాలి. ఇంగ్లీషు వారికి గల స్వేచ్ఛను అనుభవించాలి - అది ఉభయతారకం". దీనివల్ల ఈ ప్రపంచానికి స్వేచ్ఛ లభిస్తుంది. ఆయనకు స్వాతంత్ర్యమంటే నా ఉద్దేశ్యం ఇదీ అని తెలియలేదు. అతనికి తెలియని దానిని చెప్పాను. పది, పండ్రెండు రోజుల నాటి మాట. ఇంకొక మహాశయుడు "మానవజాతికి శాంతి, సౌఖ్యాలు మన - అంటే మీ దేశవాసుల, మా దేశవాసుల - (నాకు అది తెలియదా!) స్నేహం మీదనే ఆధారపడి ఉంటుంది" అంటూ, ఇంకా ఆయన యిలా అన్నారు - "భారతీయులందరిలో నీవంటేనే నిజమైన ఇంగ్లీషువాడు యిష్టపడతాడు - నిన్నే అర్థం చేసుకుంటాడు. ఇంకా ఎనెన్నో అన్నారు. వాటిని మీరంతా గ్రహించగలరు. అయితే అన్నిటికంటే ప్రధానం సమస్య గుర్తింపు. ఇది పొగడ్త కానే కాదు. నేను పొగడ్త అనుకోటం లేదు. జరిగింది నన్ను వ్యక్తిగా ఆయన గుర్తించడం కాదు. నేను ఏ ఆశయానికి ప్రతినిధిగా ఉన్నానో, ఆ జాతిని, ఆ సంస్థను గుర్తించాడాయన. ప్రధానమంత్రి సత్తమా! ప్రాథమిక సత్యం గుర్తించబడితే, సయోధ్య వెంటనే సాధ్యపడుతుంది. నాకు కావలసింది మీ స్నేహం నా పని నిరంకుశుడైన, యజమానిని బానిస వెళ్ళగొట్టడం కాదు. నా సిద్ధాంతం కాంగ్రెసు ఆలోచన - 35 కోట్ల భారతీయుల సుఖశాంతులు కలగడం. వాటి కోసం, మనం సంప్రదింపులు జరపాలి.

## మా ఆయుధం

కత్తులు, కటార్లు, తుపాకి గుండ్లు అక్కరలేదు. "వద్దు" అనగలిగే శక్తి కావాలి. అది మా జాతి చేస్తున్నది. ఏమిటి మా జాతి ఆశయం? ఇంగ్లీషు వారిని వెళ్ళగొట్టమా? కాదు. ఇంగ్లాండు, ఇండియా బంధాన్ని త్రెంచాలని

కోరను. ఆ బంధంలో మార్పు కోరుతున్నాను. బానిసత్వపు బంధం కాకుండా నా దేశానికి పూర్ణ స్వాతంత్ర్యం కావాలి. ఈ అర్థం స్ఫురించే "పేరు" మీరేదైనా సరే, పెట్టండి. నాకు సమ్మతమే. అప్పుడు మా దేశంలో విమర్శకులకు సమాధానం చెప్పగలం. మీరు సూచించిన "రక్షణ అంశాలు" మాకు పూర్తిగా తృప్తినీయవు. ఇండియా అవసరాలను తీర్చవు.

## ఆర్థిక దుస్థితి

కామర్సు, ఇండస్ట్రీ (వ్యాపారం, పరిశ్రమలు) ఫెడరేషను నిపుణులు, "30 శాతం వనరులు తాకట్టులో ఉంటే, పరిపాలనలో కలిగే ఇబ్బందులను గురించి వివరించారు. రక్షణాంశాలు - ఆర్థికపరంగా - ఎంత అవసరమో తెలియజేశారు. అయితే అవి ఇండియాను క్రుంగదీస్తాయి. చర్చలోని ఆర్థికాంశాలు, వారి ఉద్దేశం ప్రకారం దేశరక్షణ, సైనిక అవసరాలను గురించి కూడా మిళితం చేసుకొని ఉంటాయి. అవి మాకు సంతృప్తిని కలిగించటం లేదు. నేను గాని, కాంగ్రెసు గాని, ఇండియా అవసరాలను పూర్తిగా తీర్చి దుస్థితి లేకుండా ఆదుకునే రక్షణాంశాలు (సేఫ్ గార్డ్స్) సమకూరుస్తాయని ప్రతిజ్ఞ చేశాం. చర్చల సందర్భంగా, నేను యీ అంశాలు, గ్రేటు బ్రిటనుకు కూడ, లాభదాయకంగా ఉండాలన్నాను. ఇండియాలో "గాలి మేడలు" పనికి రావు. ఇండియాకు మాత్రం లాభదాయకమై, బ్రిటనుకు నష్టం కలిగించేవి కూడా కాకూడదు. అదే విధంగా, గ్రేటు బ్రిటను "అసంబద్ధ కోరికలు" కోరరాదు. ఇండియా కూడా తనకు మాత్రం పనికివచ్చే సూచనలు చేస్తే - అది ఏవిధంగానూ, సమర్థనీయం కాదు. కనుక ఉభయత్రా పనికి వచ్చే అర్థం అన్వయించి, మిష్టర్ జయకర్, సర్‌తేజ్ బహదూర్ సప్రూల, యితరుల సూచనలను పరిగణిస్తాం. ఒక వాక్యానికి ఒకే నిర్వచనాన్ని, అర్థాన్ని ఏర్పరుచుదాం. అప్పుడే నిజాయితీ నిలబడుతుంది.

ఇన్ని చర్చలు జరిగాయి, మిష్టర్ జయకర్ సూచనల అంతరార్థం నాకు అంగీకారం కాదు. మాటల గారడీ వద్దు. అందరమూ అనుకున్న వాటిని. అందరమూ అంగీకరిద్దాం. సర్ శామ్యూల్ హోర్ మాటలకు మా మాటలకు పొంతన లేదు అనిపిస్తున్నది. ఆయన మనసులో ఏమున్నదో

అర్థం కావటం లేదు. అసలు వ్యవహారంలోకి యింకా దిగనే లేదు. ఉపన్యాసాల కసరత్తు, మాటల చాకచక్యం మన మనస్సులలోని భావాలను సమన్వయపరచవు. ఇక ఎందుకీవిధంగా సమయం వ్యర్థం చేయడం? అని నాకు అనిపిస్తున్నది. "మా దేశ సమస్యలు" అందిరికీ అర్థం కావు. ఇతర దేశాల వాటికీ, వీటికీ భేదం ఉన్నది. నా మాటే చర్చలలో నెగ్గాలని, నాకెప్పుడూ లేదు. స్వాతంత్ర్యమన్నది ద్వ్యర్థి వాక్యాలతో ఛలోక్తులతో, చమత్కారాలతో రాదు. మనసారా నిండు మనసుతో నిర్ణయాలు జరగాలి. మా వాతావరణంలో పెరిగిన వారికే అవి బోధపడతాయి. ప్లేగు వేరు, మలేరియా వేరు. మాకు తేళ్ళు, పాములు, కోతులు, పులులు, సింహాలు ఉన్నాయి. వాటినన్నిటినీ శాంతింపచేసి, దారికి తేవాలి. ఇది మాకు మామూలే. ఈ గండాలు గడిచి గట్టెక్కుతాం. ఈరోజు, ఈ రౌండ్‌టేబులు దగ్గర ఒక సమాన సూత్రాన్ని కనుక్కోవాలి. కాంగ్రెసు ప్రతిపాదనలలో మినహాయింపులుండవు. నేనన్నదానిని ఎప్పుడూ వెనుకకు తీసుకోను. ఇంతవరకూ నేను వెలిబుచ్చిన గట్టికోరికలు తీరేవరకూ శ్రమిస్తూనే ఉంటాం. ఏ ఒప్పందానికి అయినా వెనుదీయం. బ్రిటిషువారి కుశల బుద్ధి, రాజ్యాంగ నిపుణులు మిష్టర్ శాస్త్రి, డాక్టర్ సర్ తేజ్ బహదూర్ సప్రూ, మిష్టర్ జయకర్, మిష్టర్ జిన్నా, సర్ మహమ్మద్ షఫీ కలిసి పేనిన సూత్రాన్ని పరిశీలిస్తాను.

## పారస్పరిక విశ్వాసం

నేను, మళ్లీ, శాసనోల్లంఘనను కోరటం లేదు. ఓపికగా, ఢిల్లీలో మొదలైన తాత్కాలిక విరామం శాశ్వత ఒప్పందంగా మారేందుకు శ్రమిస్తాను. 62 ఏళ్ళ ఈ బక్క ముదుసలికి, అతని సంస్థకూ అవకాశం ఇవ్వండి. ఒక మూల వాకూ, నేను ప్రతినిధిత్వం వహించే సంస్థకు తగిన స్థానం ఇవ్వండి. నన్ను నమ్ముతున్నా మంటారు - నా సంస్థను నమ్మరు. బిందుమాత్రమైన నన్ను వేరు చేయకండి. సంస్థకూ, నాకూ అభిన్నత్వం ఉన్నది గనుక, నన్ను వలెనే కాంగ్రెసును నమ్మండి. అట్లుకాని యెడల, నేను గడ్డిపోచలా, శక్తిహీనుడిగా మిగిలిపోతాను. కాంగ్రెసును తృప్తిపరచండి - ఆతంకవాదానికి

తావే లేదు. ఇప్పుడు జరుగుతున్నది అవ్యవస్థిత, సువ్యవస్థి ఆతంకవాదాల మధ్య తుముల సంగ్రామం రక్తాక్షరాలతో వారు గోడ మీద వ్రాసే వ్రాతలను గమనించి, ముందుగానే జాగ్రత్త వహించండి. "తిండి" కంటే "స్వేచ్ఛ" ముఖ్యం, స్వేచ్ఛలేనివారు వేలాదిమంది తమకు, దేశానికి శాంతి లేకుండా చేస్తారు. దానిని గమనించండి.

ఓరిమి ఎంత ఉన్నా, అది నశిస్తున్నది. అదే నేను చెప్పదలచినది. హిందువు, ముసల్మాను, ఇద్దరూ సాత్వికులే. ముసల్మాను అనగానే అల్ప సంఖ్యాకుల విషయం గుర్తుకు వచ్చింది. ఈ సమస్య తీరనిదే, "స్వరాజ్యం" రాదు. ఇండియాలో కూడా ఇదే మాటను అంటూ ఉంటాను. అయినా "ఏదైనా దారి దొరకకపోతుందా" అని ఆశతో వచ్చాను. "విదేశీయుల పాలన' అనే "మేకు' దిగి ఉన్నంత వరకూ ఈ మతావలంబులు సన్నిహితులు కారు. సమాధానం కుదిరితే, మాటవరసకైనా సరే, ఈ మేకు ఉండదు. ఒకే దేశం సోదర భావం, అభిమానాలు - ఇవి ఐక్యతను తెచ్చిపెడతాయి. బ్రిటిషు పరిపాలన లేనప్పుడు సిక్కులు, హిందువులు, ముసల్మానులు కొట్టుకొని చచ్చేవారా? హిందూ, ముస్లిం ఇతిహాసకారులు ఆ సుఖ శాంతులను అభివర్ణించారు. ఈ రోజున కూడా గ్రామాలలో మత కలహాలు లేవు. తగాదాలు ఉండేవి కాదు. కీ. శే మౌలనా మహమ్మదు అలీ "నాకు అల్లా" దీర్ఘాయువునిస్తే, ఇండియాలో ముస్లిము శాసనకాలాన్ని గురించి వ్రాసి, బ్రిటిషు వారు దాచి ఉంచిన సాక్ష్యాధారాల ద్వారానే "బ్రిటిషు చరిత్రకారులు చిత్రీకరించినంత చెడ్డవాడు - ఔరంగజేబు - కాడు" అనీ - "బ్రిటిషు వారు వ్రాసినట్టు మొగలాయీ పరిపాలన అంధకారయుగం కాదు" అనీ - చరిత్రను తిరిగి వ్రాస్తాను." అని నాతో అనేవారు. అదే మాటను, హిందూ చరిత్రకారులు కూడ ధృవపరిచారు. బ్రిటిషువారి "విభజించు, పాలించు" అనే సూత్ర ప్రయోజనం కోసం జరిగిన ఈ కుటిల బుద్ధి అంతరించిననాడు, గ్రేటుబ్రిటను, ఇండియా మధ్య అవిశ్వాసం లేనినాడు, ఇండియా, సమాన హోదాగల భాగస్వామి అయిననాడు కలిసి ఉండినా, వేరుగా ఉండినా స్వేచ్ఛాపూరితం అయిననాడు, హిందూ, ముసల్మాను, సిక్కు, ఐరోపీయులు,

అంగ్లో - ఇండియన్లు; క్రిష్టియన్లు, అంటరానివారు కలసిమెలసి జీవిస్తారు. సామంతరాజుల విషయం గురించి ఎక్కువగా చెప్పదలచుకోలేదు కాని దానిని ప్రస్తావించకపోతే, వారికి అన్యాయం చేసినట్లవుతుంది. వారికిష్టమైన షరతులతో ఫెడరేషనులో చేరచ్చును. నేను వారి దృష్టికి కొన్ని విషయాలు తెస్తాను. ఇతర ప్రాంతాలలోని దేశవాసుల మార్గం సుగమం చేయమని సూచిస్తాను. దేశీయులందరికీ సమానహక్కులు, ఆస్థి విషయమై న్యాయస్థానాలలో నిలిచే చట్టాలు, సంస్థానాల కొలువులో ఉన్న వారికి తగు స్వేచ్ఛ, మున్నగు వాటిని గమనిస్తే చాల ఉపయోగం ఉంటుంది. వారి సంస్థానాలలో గల ప్రజలను దగ్గర చేసుకోగలుగుతారు. ప్రజాస్వామ్య దేశంలో కల్తీలేని నిరంకుశులు అనిపించుకొనే ప్రమాదం తప్పుతుంది. స్వాతంత్ర్యం కోసం పోరాడే వారిలో సైనికులలో ఒకరుగా లెక్కింపబడతారు. గ్రేట్ బ్రిటనులో "కింగ్ జార్జి" వంటి వారనిపించుకుంటారు.

## సర్వసత్తాకమైన రాజ్యం

ఇండియాకు లభించవలసినది ఎప్పుడు లభించినా సరిహద్దు రాష్ట్రం సర్వసత్తాకమైన రాజ్యం, భారతదేశానికంతటికీ అది ఆదర్శం అవుతుంది. కాంగ్రెసు తన వోటు దానికి వేస్తుంది. ప్రధానమంత్రిగారూ! మీరు ఈ ప్రస్తావనను మన్నించి, ఒప్పుకొని ప్రకటన చేయండి. అక్కడి జన జాతులను కూడగట్టి బయటివారు మా దేశానికి ఎట్టి హాని తలపెట్టినా, అడ్డుకొనేందుకు వారిని సంఘటితపరుస్తాను.

## ధన్యవాదాలు

సంప్రదింపులలో నేను పాల్గొనడం యిదే ఆఖరు కావచ్చు. నేను అలా కోరుకోవడం లేదు. మీ ముందు నతమస్తకుడనై బ్రతిమాలుకుంటున్నాను. విన్నపాలు చేస్తున్నాను. ఇంకా సంప్రదిస్తాను. అనుకున్నది కాకపోతే ఆఖరి పోరాటం ఉండనే ఉన్నది.

నా సహకారం అందించేదీ, లేనిదీ, నా చేతిలో లేదు. అది మీపై ఆధారపడి ఉన్నది. ఇంకా మన చేతిలోలేని ఇతరములైన పరిస్థితులపై ఆధారపడి యుంటుంది. కనుక గౌరవనీయులైన రాజదంపతులు మొదలుకొని,

నేను నివాసం చేస్తున్న ఈస్టు ఎండ్ ఇలాకా పేదలతో సహా అందరికీ ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

లండనులోని "ఈస్ట్ ఎండ్ ఇలాకా" లో "పేదల పేదరికానికి" ప్రతినిధిత్వం వహించే ఆ ప్రదేశంలో వారితో నాకు మమైక్యత ఏర్పడింది. నన్ను వారు తమ కుటుంబ సభ్యునిగా భావిస్తున్నారు. అది యిక్కడి నుండి నేను నా దేశానికి కొనిపోయే బహుమూల్యమైన అనుభవం. అందరూ నన్ను మర్యాదగా, అభిమానంతో చూస్తున్నారు. చాలామంది ఇంగ్లీషు వారి పరిచయం ఏర్పడింది. వారు నావల్ల విన్నది "చెడు" "బాధాకరమైన" సత్యాలు. అయినప్పటికీ ఎప్పుడూ వారు విసుక్కోలేదు. చికాకు పడలేదు. నేను వివరించిన కష్టాలను సానుభూతితో, స్పందనతో మనం ఇటువంటివి చేస్తున్నామా అనే బాధాతప్త హృదయంతో విన్నారు. ఈ రౌండు టేబుల్ సమావేశ ఫలితాలు ఏమైనా, నాకు ఏమి జరిగినా, పెద్దలు, పిన్నలు అందరూ నన్న గౌరవించారు. అభిమానంతో చూచారు. నాకు ఈ మానవత్వపు పరాకాష్ఠ యొక్క అనుభూతి చాలు. నా ఇంగ్లాండు యాత్ర సఫలమైంది.

ఇంగ్లీషు స్త్రీ, పురుషులు వార్తా పత్రికలలో ప్రచురితమైన అసత్యాల తాకిడికి లోనైనా వారి మానవత నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నాలో మొక్కవోని విశ్వాసం పెంచింది. "ల్యాంకషైరు" ప్రజలకు, నాపై చికాకు కలగడానికి కారణాలున్నాయి. అయినా శ్రామికులలో కూడా ఏమీ కోపం కనబడలేదు. స్త్రీలు, పురుషులు నన్ను ఆలింగనం చేసుకొని వారిలో నొకనిగా చూచుకున్నారు. నేనెన్నటికీ వారిని మరువలేను.

నాతో వేలాది ఇంగ్లీషు వారి స్నేహాన్ని తీసుకొని వెళుతున్నాను. మీ వీధులలో నేను నడిచేటప్పుడు, వారి కళ్ళల్లో నాపై నిజమైన ఆపేక్షను గమనించాను. ఈ మర్యాద, ఈ ఆతిథ్యము, ఈ అపార కరుణ, ఈ అంతులేని అభిమానం నా స్మృతిపథం నుంచి ఎన్నడూ చెరిగిపోవు. నా దేశం గతి ఏమైనా కానీ మీరు ఇంతసేపు ఓపికతో నన్ను భరించారు. అందుకు నా కృతజ్ఞతలు, హృదయ పూర్వకమైన ధన్యవాదాలు.

*దినేషన్స్ వాయిస్, (1948) పుటలు 74 - 88)*

★ ★ ★

# "క్విట్ ఇండియా" (8-8-1942) (భారతదేశాన్ని వదలిపో) ఉద్యమ సందర్భంలో ఇచ్చిన ఉపన్యాసాలు

## 1

*(బొంబాయిలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ మహాసభలో 8-8-42 నాడు హిందుస్తానీ భాషలో కార్యప్రణాళికలను వివరిస్తూ గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం)*

ఈనాటి తీర్మానాన్ని గురించి చర్చ జరిగే ముందు, రెండు విషయాలను గురించి నేను అనుకున్నది చెబుతాను - గమనించండి. ఇది ఒక పెద్ద బాధ్యత. ఈ తీర్మానాన్ని, నా పద్ధతిలో మీరు ఆమోదిస్తే నేనన్నట్లు చేయాలి. నేను 1920 నాటి వాడినేనా? నాలో మార్పు వచ్చిందా? అని నన్ను నేను ప్రశ్నించుకోవడం సముచితం. నేను 1920 నాటి గాంధీనే. నాలో ఏ మార్పు లేదు. అహింస నాకు ఇప్పుడూ ఆనాటివలెనే ప్రధానం. ఇంకా దాని ప్రాముఖ్యత ఎక్కువ అయింది. నా వ్రాతలకూ, నా మాటలకూ ఈనాటి తీర్మానానికీ ఏమీ భేదం లేదు. ఇటువంటి అవకాశం ఎన్నటికో గాని రాదు. నేనిప్పుడు చేసే ప్రతిచర్య 'అహింసా' యుతమే. తీర్మానానికి, తలపెట్టిన పోరాటానికీ మూలాధారం అహింసయే. మీలో అహింసపైన నమ్మకం లేనివాళ్ళు. అహింసామార్గమంటే విసుగెత్తిన వాళ్లు యీ తీర్మానానికి ఆమోదం తెలుపవద్దు. స్పష్టం చేస్తున్నాను. అహింసనే అమూల్యమైన పరమాయుధంగా ఆ పరమాత్మ నాకు నిర్దేశించాడు. నాకు, అహింసకు యిది ఒక పరీక్ష. ఈ భూవలయమంతా హింసవలన భస్మీపటల మవుతున్న ఆర్తి సమయంలో దైవదత్తమైన ఈ శక్తిని వినియోగించకుంటే నేను అభిశప్తుడనవుతాను. రష్యా, చైనాలు బెదరింపులకు లోనవుతున్న ఈ క్షణంలో నేను ఈ పనిని చేసి తీరాలి.

మనం పోరాడుతున్నది అధికారం కోసం కాదు. భారత స్వాతంత్ర్యాన్ని తెచ్చేందుకు చేసే అహింసా పోరాటం, హింసాయుతమైన పోరాటంలో,

సేనాని యుద్ధతంత్రంతో, నిరంకుశాధికారం కోసం, ముందుకు పోతాడు. వస్తుత: అహింసయే మూలాధారం గల కాంగ్రెస్ ప్రణాళిలో నిరంకుశత్వానికి తావు లేదు. అహింసా సైనికుడు తన కోసం ఏమీ కోరడు. అతనికి కావలసింది దేశ స్వాతంత్ర్యం మాత్రమే. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ప్రజలు ఎవరికి అధికారం అప్పగించాలో నిర్ణయిస్తారు. ఉదాహరణకి నేను మనసు పడుతున్న విధంగా, ఎవరి చేతికైనా పగ్గాలు పోవచ్చును. అప్పుడు మనం -"ఇది అల్ప సంఖ్యాకవర్గం; వీరు స్వతంత్ర పోరాటంలో పాల్గొనలేదు"- అని అభ్యంతరం పెట్టరాదు. మొదటినుంచి కాంగ్రెసు మతాతీతంగా వున్నది.

మన "అహింస" అసంపూర్ణం అనీ, గమ్యానికీ అతి దూరం అనీ తెలుసు. అయితే అంత్యసమయంలో అహింసా పోరాటం విజయాన్ని సాధించి తీరుతుంది. గత 22 ఏండ్లుగా చేసిన మన సాధనకు భగవంతుని మౌన ఆశీర్వాదం వల్లనే లోపభూయిష్టమైన మనకు ఆ మహత్తర విజయప్రాప్తి ఉంటుందని నా విశ్వాసం.

ప్రపంచ చరిత్రలో మన ప్రజాస్వామిక పోరాటాన్ని మించినది మరొకటి లేదు. నా కారాగారవాస సమయంలో కార్లైల్ వ్రాసిన "ఫ్రెంచి విప్లవం" అనేగ్రంథాన్ని చదివాను. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ రష్యన్ విప్లవాన్ని గురించి కొంత చెప్పాడు. ఈ విప్లవాలు హింసాయుతాలు కనుక అనుకున్న ప్రజాస్వామ్యంలో సాధించలేకపోయాయి. నేను భావిస్తున్న అహింస వల్ల లభించే ప్రజాస్వామ్యంలో అందరికీ సమాన స్వేచ్ఛ ఉంటుంది. ఎవరూ బానిసలుగా ఉండరు. అటువంటి పోరాటాన్ని చేద్దామని బాస చేసిననాడు అందరికీ అవసరమైన స్వాతంత్ర్యం కోరే భారతీయులుగా మిగులుతాం. హిందూ, ముస్లిం విభేదాలను విస్మరిస్తాం.

బ్రిటిషువారి పట్ల మన ధోరణి ఎలా ఉండాలి? ప్రజలు బ్రిటిషు వారిని అసహ్యించుకుంటున్నారు. వారి ద్వేషం బ్రిటిషు సామ్రాజ్యతత్వం పట్ల మాత్రమే అయితే వారు ఈ తేడాను గుర్తించక జపాను వారికి స్వాగతం చెప్పే వరకు పోతున్నారు. అంటే ఒకరి బానిసత్వం నుంచి ఇంకొకరి బానిసత్వం లోనికి మారడం అన్నమాట, ఇది తప్పు. మన పోరాటం బ్రిటిషు

సామ్రాజ్యతత్వంతో మాత్రమే. బ్రిటిషు ప్రజలతో కానే కాదు. బ్రిటిషు వారిని పొమ్మంటున్నది వారి మీద కోపంతో కాదు ఈ సంక్లిష్ట సమయంలో ఇండియా తన పాత్ర తగు విధంగా నిర్వర్తించాలి. అదే మన గమ్యం. అర్థబలం, అంగబలం విచక్షణారహితంగా యుద్ధం చేస్తున్న సంయుక్త రాజ్యాలకు సమర్పించడం సంతోషం కలిగించే మాటకాదు. స్వేచ్ఛ లేనిదే, యిది మన పోరాడవలసిన యుద్ధమే అనుభావం లేనిదే, మన నిజమైన శక్తి, సామర్థ్యాలు బయటపడవు. మనం యింతవరకూ చేసిన ఆత్మత్యాగం ముందు బ్రిటిషువారు తలవంచి, మన స్వాతంత్ర్యాన్ని మనకు సమర్పించక తప్పదు. కనుక ద్వేషాన్ని పరిత్యజించండి. నాకు "ద్వేషం" అనేది ఏకోశానా లేదు. నిజం చెప్పాలంటే ఇప్పుడు నేను నన్ను యిదివరకు కంటె ఎక్కువగా బ్రిటిషు వారి స్నేహితుడనని అనుకొంటున్నాను వారికి కష్టకాలం. వారు చేసిన తప్పులనుండి వారిని రక్షించడం స్నేహితుడుగా నా కర్తవ్యం. అగాధం అంచున ఉన్న వారిని నేను హెచ్చరించాలి. వారు దీన్ని అపర్థం చేసుకొని నేనుచాచిన స్నేహ హస్తాన్ని కోపంతో ఖండించినా సరే. అందరూ నవ్వినా పరహసించినా, నామాట అదే. నా జీవితంలో అతిపెద్ద పోరాటాన్ని ఆరంభించే ఈ సమయంలో నాకు ఎవరి యెడల ద్వేషం ఉండరాదు. ఉండదు.



*(బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటి సమావేశంలో 8-8-42 నాడు చేసిన ఉపన్యాసం)*

తీర్మానాన్ని అంగీకరించినందుకు అభినందనలు. తమకు జనం అనుకూలం కారని తెలిసినా సవరణలు ప్రతిపాదించిన ముగ్గురు మిత్రులను తీర్మానాన్ని వ్యతిరేకించిన పదుముగ్గురు స్నేహితులను కూడా అభినందిస్తున్నాను. వారు చేసిన దానికి సిగ్గుపడవలసిన పనిలేదు. గత ఇరవై ఏండ్లుగా, అల్ప సంఖ్యాకులమైనప్పుడు అందరూ మనను అపహాస్యం చేసినప్పుడు కూడా మన ధైర్యం చెడలేదు. "సరియైన దారి మనది" అని దృఢంగా విశ్వసించాం.

అదే సూత్రం ప్రకారం దృఢ విశ్వాసం చూపించి, ఏభై ఏండ్ల నుండి నేననుసరించిన మార్గాన్నే వీరుకూడా అనుసరించారు.

వారు కోరిన సవరణలు యిప్పటి పరిస్థితికి అనుగుణంగా లేవు. మౌలానా చేసిన అనునయపూర్ణమైన అభ్యర్థననూ, జవహర్‌లాల్ నెహ్రూ వివరణను అర్థం చేసికొని ఉంటే వారు అడిగినవి కాంగ్రెసు ఏనాడో ఒప్పుకున్నది. అనే విషయం వారికి అవగతమై వుండేది.

ఒకానొకప్పుడు, మమహ్మదీయులు యాపద్భారతాన్ని తన జన్మభూమిగా భావించడమనేది ఉండేది. అలీ సోదరులతో నేను కలిసి ఉన్నప్పుడు వారు మనసా వాచా ఇండియా మీద హిందువుల కెంత స్వత్వం ఉన్నదో ముస్లిములకు కూడా అంతే ఉన్నదని నమ్మేవారు. ఇది ఒక నటన కాదు. హృదయపూర్వకమైన ఇచ్ఛ. ఈ సంగతిని రాత్రింబవళ్ళు వారితో కలిసి సంచరించిన నేను గుర్తించాను. నేను సుళువుగా అందరినీ నమ్మేస్తానని కొందరంటారు. నేనంత దద్దమ్మను కాను. దద్దమ్మనైనా అవడానికి యిష్టపడతాను. కాని మోసకారిననిపించుకోదలచను.

కమ్యూనిస్టు స్నేహితుల సవరణల భావం క్రొత్తది కాదు. "హిందూ - ముస్లియుల సమస్యకు, నేను బ్రతికి ఉన్నప్పుడే, సమాధానం దొరకాలి" అని ముస్లిములంటారు. మంచిదే. నాకు నచ్చని సమాధానాన్ని ఎలా అంగీకరిస్తాను? చిన్నతనం నుండి హిందూ - ముస్లిముల ఐక్యత కోసం పాటుపడుతున్నాను. అందరికీ అదే కావాలి. విద్యార్థిగా ఉన్నపుడు, ముస్లిము, పార్సీ విద్యార్థుల స్నేహం కోసం శ్రమించేవాడిని. "పొరుగువారి పచ్చదనాన్ని మెచ్చుకొనే తత్వమే ఎప్పటికైనా మనకు రక్ష." హిందూ మిత్రుల కోసం కంటే, ఏ కొద్దిమందివున్నా ముస్లిము మిత్రుల కోసం ఎదురు చూసేవాడిని, దక్షిణాఫ్రికాకు ముస్లిం వర్తకుని న్యాయవాదిగా వెళ్లాను. అతని ప్రతివాదులైన ముస్లిములతో కూడా స్నేహపూర్వకంగా మసలి, వారి విశ్వాసాన్ని చూరగొన్నాను. నా సహచరులలో ముస్లిముల, పార్సీలు ఉన్నారు. ఇండియాకు తిరిగి వచ్చే ఆఖరు క్షణాల్లో వారు నన్ను విడిచి ఉండలేక దుఃఖాశ్రువులు రాల్చారు. ఇండియాలో కూడా నా కృషి అదే. ఖిలాఫతు ఉద్యమానికి పూర్తి సహకారాన్ని అందించాను.

మరి ఇప్పుడు అంత కానివాడను ఎందుకు అయ్యాను? ఖిలాఫతు ఉద్యమ సహకారంలో నా స్వార్థం ఏముంది? గోమాతను పూజించాను, గో రక్షణ కొరకు నా ప్రాణాన్ని కూడా త్యాగం చేస్తాను. ఆవూ, నేను మేమిద్దరమూ - దేవుని సృష్టియే కదా. అదేవిధంగా, ఖిలాఫత్ ఉద్యమ సహకారంతో, పొరుగు వారిని దుఃఖ సమయంలో ఆదుకోవాలి అనే ఆదుర్దా తప్ప, వేరే స్వార్థం, ఏకోశానా నాకు లేదు. అలీ సోదరులు బ్రతికి ఉంటే, నేను చేసిన పనిలో 'గోసేవ' ప్రతీకగా గల హిందూత్వ రక్షణకు, ముస్లిములను మచ్చిక చేసుకొనే ప్రయత్నం లేదని సాక్ష్యం చెప్పి ఉందురు. దేని విలువ దానిదే. హిందువులకు పవిత్రమైన గోమాత సేవ వలెనే, పొరుగువారికి తోడ్పడటం నాకు ముఖ్యమని తెలిసినవారు గ్రహిస్తారు.

ఆ రోజుల్లో ముసల్మానులతో కలిసి భుజించడం, హిందువులలో సంచలనం కలిగించింది ఇప్పుడంత లేదు లెండి. మౌలానా బారీ మాత్రం భవిష్యత్తులో "నన్ను తాను మచ్చిక చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు" అనే అపయశస్సు రాకుండా, "ఫిరంగీమహల్" అనే ఆయన భవనంలో, వేరే బ్రాహ్మణుని చేతి వంటకాలే, తనకు అసౌకర్యం కలిగినా, వడ్డింపజేసేవారు. నేనూ ఆయన మనోభావాన్ని అర్థం చేసుకున్నాను అందులో తప్పు లేదు. గౌరవభావం, హుందాతనం, గొప్ప మనసూ మాత్రమే ఆనాటి మర్యాద. ఎవరి ధార్మిక నమ్మకాలనైనా గౌరవించడం ముఖ్య విషయంగా ఉండేది. ఈ రోజున అవి ఏవీ? ముసల్మానులందరినీ, ఖాయిద్ - ఏ - అజమ్ గారిని, ఆ ఉజ్జ్వల కాలాన్ని, గుర్తుచేసుకొమని కోరతాను. ఖాయిద్ - ఏ- అజమ్ ఒకనాడు కాంగ్రెసు వాదియేకదా. ఈనాడు అనుమాన పిశాచం, ఆయన మనస్సును తొలిచి, "కాంగ్రెసు అంటే కోపం" ఆయనకు కలిగేట్టు చేస్తున్నది. భగవంతుడాయనకు దీర్ఘాయువు నొసంగు గాక! నేను పోయిన తర్వాతనైనా, ఆయనే "నాకు, ముసల్మానులను మోసం చేసే దృష్టి లేదనీ, ఎప్పుడూ వారి కోరికలను, అవసరాలను, తిరస్కరింపచేయడం నా ద్వారా జరగలేదనీ, గుర్తిస్తారు. ఒప్పుకుంటారు. వారికి హాని కలిగిస్తే, నాకు ముక్తి మార్గం దొరుకుతుందా? నా జీవితం వారి చేతుల్లో ఉంది. నన్ను చంపదలిస్తే

చంపండి. ఎన్ని ప్రయత్నాలు జరిగినా, భగవంతుడు నేటివరకు దయదలిచాడు. ఆ ప్రయత్నం చేసినవారు పశ్చాత్తాపం పొందారు. ఎవరైనా ఒక దుష్టుని అంతం చేయాలని, నన్ను గురిచేస్తే, మరణించేది నిజమైనగాంధీ కాదు, వారికి దుష్టుడనిపించిన వాడు మాత్రమే.

చెడు పేరు కలిగించేందుకు ప్రయత్నం చేసేవారికి నా సమాధానం- "ఇస్లాము ధర్మం శత్రువునైనా అపయశం పాలుచేయవద్దంటుంది. ఇస్లాం మత ప్రవక్త కరుణతో నిజాయితీతో ఉదాత్తతతో శత్రువులను కూడా తనవాళ్లను చేసుకున్నాడు. నిజమైన ఇస్లాము మతావలంబులైన మీరు, తన నమ్మకాన్ని బహిరంగంగా ప్రకటించినవాని మాటను నమ్మకపోవడం న్యాయమా? మీకు చాల విశ్వసనీయుడైన, నిజమైన నమ్మకస్తుడిని అంతం చేశారని బాధపడే రోజు వస్తుంది. నావీ మరియు మౌలానావీ అభ్యర్థనలు - వీటిని తిరస్కరించి మాకు అపయశం తేవాలనే మాటలు నన్ను తుపాకి గుండ్లలా గాయపరుస్తున్నాయి. ఇంకా తుపాకి గుండ్లే నయం. ఒక్కసారి ప్రాణంతీసి ఊరుకుంటాయి. మీ సూటీ పోటీ మాటలు ఇస్లాము మతానికే చెడ్డపేరు కలిగిస్తాయి. మీ ధర్మ సంరక్షణార్థమైనా, మీ ప్రయత్నాలు మానుకోమని నా విన్నపం. మౌలానా సాహెబ్, తన స్నేహంతో మీ కనుకూలంగా మారటం లేదని, ఆయన మీద మీ విసుర్లు. తాను నిజమని నమ్మిన దానిని, నిజమని నమ్మించే ప్రయత్నం చేయడం స్నేహాన్ని దురపయోగం చేయడమేనని ఆయనకు బాగా తెలుసు.

ఖాయిద్ - ఇ - ఆజమ్ గారికి నామాట- "పాకిస్తాన్ కోరికలలలో సంగతమైనవి మీ చేతుల్లో ఉండనే ఉన్నవి. అసంగతమైనవి యివ్వడం అసాధ్యం. బలవంతం చేసి ఒప్పించినా, అది కలకాలం నిలవదు. భగవంతుడుకి అహంకారం అంటే అయిష్టం బలవంతంగా అసత్యాన్ని ఆయన సహించడు."

ఖాయిద్ - ఇ - ఆజమ్ గారికి తన భావాలు ప్రకటించడం తప్పనిసరి అవుతూందట. నేను అదే పద్ధతిలో యిలా అంటాను - "నన్ను ముసల్మానుల మిత్రుడననుకుంటున్నాను. వారికి అప్రియమైన, నా మనస్సులోని మాట చెప్పాలి కదా. దాన్ని దాచిపెట్టేదెలాగ? ఖాయిద్ - ఇ-

అజమ్‌గారు కూడా మనసులోనిది ఇతరులకు అప్రియమైనా స్పష్టంగా చెప్పినందుకు నా అభినందనలు. మీ మాటను అంగీకరించని వారిని అభిశంసించడంతగదు. లక్షలాది ముసల్మానులు మీ పక్షాన ఉన్నారు. మీ అభిప్రాయాలను అంగీకరించని కొద్దిమంది ముసల్మానులను దుయ్యబట్టాలా? మిమ్ములను ఇంతమంది బలపరుస్తున్నారు. బహు సంఖ్యాకులు అంటే అల్ప సంఖ్యాకులకు భయం ఎందుకు? మునిగిపోతామనా? ప్రవక్త అరబ్బులు, ముసల్మానుల మధ్య ఎలా మనగలిగాడు? ఇస్లాము మతాన్ని ఎలా ప్రబోధించాడు? బహు సంఖ్యాకులు అంటే అల్ప సంఖ్యాకులకు భయం ఎందుకు? నేను చెప్పేది, ఇస్లాము కోసమేనని, గమనించండి. తనకు నమ్మకం లేకపోయినా, తన సిద్ధాంతాలకు వ్యతిరేకంగా ఉన్నా, కాంగ్రెసు ఒప్పుకు తీరాలని పట్టుబట్టడంలో న్యాయం, ధర్మం లేదు.

రాజాజీ "నాకు పాకిస్తాన్ అంటే నమ్మకం లేదు, ముసల్మానులు, జిన్నా దానిని కావాలంటున్నారు. అది వారికి "తీరవలసిన కోరిక" అయినప్పుడు, యిప్పుడే "అవును" అంటే ఏం పోయింది? ఆ జిన్నాయే రేపు పాకిస్తాన్ వల్ల ఇబ్బందులు గ్రహించి తన కోరికను వదులుకుంటాడు" అని అన్నారు . ఇది "సరియైనది కాదు". అనుకున్న విషయాన్ని, "చివరికి పట్టు పట్టరనే' ' నమ్మకంతో, ప్రస్తుతానికి "సరిమైనది" అని ఒప్పుకోడం మంచిపద్ధతి కాదు' ' అని చెప్పాను. జిన్నా సాహెబ్‌ను మంచి చేసుకోడం కోసం యిప్పుడు పై మాటగా "సరే" అనడం తప్పు. వారి కోరిక సమంజమైతే యీ రోజే దానిని అంగీకరించవచ్చు. ప్రస్తుతానికి "సరే" నన్నట్లు నటించి, జిన్నా గారి వాదాలను వమ్ముచేసి, ఆయన ఎలా ప్రవర్తిస్తాడో చూడమంటున్నారు. అటువంటి అసత్య వాగ్దానాలు చెయ్యడం నా పద్ధతి కాదు.

నిర్ణయాలను అమలుపరిచే నైతిక అధికారం కాంగ్రెసుకు ఉన్నది. నిజమైన ప్రజాస్వామ్యం అహింసతో సాధ్యమని కాంగ్రెస్ నమ్ముతూంది. ప్రపంచ సమాఖ్య అహింస పునాదిగా మాత్రమే సాధ్యం. ప్రపంచంలో అన్ని విషయాల సందర్భంలో హింసను త్యజించాలి. అటువంటప్పుడు హిందూ - ముస్లిము సమస్య కూడా హింసతో పరిష్కరింపబడదు. హిందువులు,

ముసల్మానులపై నిరంకుశత్వం చలాయిస్తే, ఏ ముఖం పెట్టుకొని ప్రపంచ సమాఖ్యను గురించి మాట్లాడుతారు? ఆ కారణం వల్లనే, ఇంగ్లీషు, అమెరికను రాజకీయవేత్తలు ఆలోచిస్తున్నట్లు, హింసతో ప్రపంచశాంతిని సిద్ధింపచేయగల అవకాశం ఉందని నేను నమ్మను. తన విభేదాలను పక్షపాతరహిత న్యాయకూటమికి (ట్రిబ్యునల్) నివేదించి, దాని నిర్ణయాలను, కాంగ్రెసు శిరసావహిస్తుంది. ఈ ప్రస్తావన పనికిరాకపోతే, హింసామార్గమే శరణ్యం. అసాధ్యాన్ని అంగీకరించలేను. జీవిని ముక్కముక్కలు చేసి ప్రాణాలు తీయలేను. అలా చేస్తే, అది యుద్ధ ఘోష అవుతుంది. అట్టి సర్వనాశనానికి కాంగ్రెసు అంగీకరించదు. డాక్టరు మూంజే, శ్రీ సవర్కారు వంటి హిందువులు, ఖడ్గ సిద్ధాంతంతో ముసల్మానులను హిందువుల కాళ్ల క్రింద తొక్కి ఉంచే కోరికను కోరవచ్చు. నేను గాని, కాంగ్రెసు గాని ఆ వర్గానికి చెందము. బంగారు గ్రుడ్లను పెట్టగలిగిన కాంగ్రెసును చంపిననాడు, హిందూ-ముసల్మానుల శాశ్వత యుద్ధం మొదలై, దేశంలో నెత్తుటేరులు పారతాయి. అదే జరిగితే, చూసేందుకు నేను బ్రతికి ఉండను.

అందుకే జిన్నా సాహెబ్‌తో "న్యాయ సంగతమైన, సమంజసమైన, పాకీస్తానుపరమైన, కోరికలు మీ జేబులో ఉన్నాయి. కాని వాటిని పొందాలంటే ఖడ్గ ప్రయోగం తప్ప వేరే మార్గం లేదు" అని అన్నాను. ఇంకా ఏవేవో చెప్పాలని ఉంది. ప్రధానమైన విషయాన్ని వివరించాను. నాకిది జీవన్మరణ సమస్య. హిందువులు, ముసల్మానులు, మానసిరమైన పట్టింపులు విస్మరించి, ఏకం కావాలనుకుంటే, ముందు బ్రిటిషు సామ్రాజ్య బంధాలనుంచి బయటపడాలి. పాకిస్తాన్, భారతదేశంలో, భాగంగా ఉండాలనుకుంటే, దేశస్వాతంత్ర్య సమరంలో పాల్గొనేందుకు ముసల్మానులకు ఆటంకమేముంది? కనుక, మొదట, స్వేచ్ఛా పోరాటం విషయంలో ఏకమై కదలాలి. ఈ యుద్ధం చాలకాలం జరగుతుందని జిన్నా సాహెబ్ అనుకుంటున్నారు. నేనలా అనుకోను. ఇంకో ఆరునెలలు యుద్ధం సాగితే, చైనాని రక్షించేదెలాగ?

నాకు వెంటనే, వీలయితే, ఈ రాత్రి తెల్లవారక మునుపే స్వాతంత్ర్యం సిద్ధించాలి. మన సామరస్యం సమకూడేవరకు, స్వాతంత్ర్య సముపార్జన

ఆగడం అసంభవం. సమైక్యత సమకూడని పరిస్థితిలో, త్యాగాలు యింకా ఎక్కువ చేయాలి. కాంగ్రెసు స్వాతంత్ర్యాన్ని తెచ్చుకోవాలి, లేదా, ఆ ప్రయత్నంలో భస్మమై పోవాలి. ఈ స్వేచ్ఛా వాయువులు కాంగ్రెసువాదులు మాత్రమే గాక, 40 కోట్ల భారతీయులు పీల్చాలి. ప్రజాసేవకై సర్వదా సన్నద్ధమై కాంగ్రెసు వుండాలి.

ముస్లిముల నుండి బ్రిటిషువారు శాసనాధికారం అంది పుచ్చుకున్నారు గనుక, అదేవిధంగా బ్రిటిషు వారినుండి ముస్లిం లీగు శాసనాధికారం స్వీకరించడానికి సిద్ధమేనని కాయిద్ -ఇ -ఆజమ్ సెలవిస్తున్నారు. అయితే, అది ముస్లిము రాజ్యమవుతుంది. నేనూ, మౌలానా సాహెబ్ చేసిన ప్రస్తావనలో, ముస్లిం రాజ్, ముస్లిం ఆధిక్యత ఏమీ లేదు. అందులో ముస్లిములు, హిందువులు, క్రిస్టియన్లు, పార్సీలు, యూదులు, అందరూ కలిసిమెలిసి బ్రతికే ప్రజాస్వామ్య ప్రస్తావన ఉంది. ముస్లిం రాజ్ తప్పనిసరి కావచ్చు. కాని దానికి మా ఆమోదముద్ర ఉండదు. ఒక మతం వారు యితర మతాల, వర్గాల, వర్ణాల జనులపై ఎలా అధికారం చలాయిస్తారు?

ఈ దేశంలో లక్షలాది ముసల్మానులు హిందూ సంతతి వారే. ఇండియాతప్ప వారికి వేరే మాతృ భూమి లేదు. మా పెద్దబ్బాయి కొన్నేళ్లక్రితం ఇస్లాం మతాన్ని స్వీకరించాడు. అతని జన్మభూమి పోర్‌బందర్ అవుతుందా లేక పంజాబ్ అవుతుందా? ముసల్మానులను నేనడిగే ప్రశ్న ఇదే - "ఇండియా మీ మాతృభూమి కాకుంటే, మీ దేశమేది? ఇస్లాం మతం పుచ్చుకున్న నా కుమారుణ్ణి ఏ జన్మభూమిలో ఉండమంటారు? ఇస్లాం మతం స్వీకరించాక, నా కుమారునికి వాళ్ల అమ్మ "నీవు మద్యపానం వదిలిపెట్టావా? ఇస్లాము మతస్థుల కది నిషిద్ధం కదా" అని ఉత్తరం వ్రాసింది. మతం మార్చుకున్నాడని వెక్కిరించిన వారికి ఆమె జవాబు - "వాడి మద్యపానం అంటే నాకు వున్న అభ్యంతరం వాడి మతం మార్పిడి అంటే లేదు. మీరు పవిత్రమైన ముసల్మానులు - మతం మార్చుకున్న తర్వాత కూడా, వాడు త్రాగి తందనాలాడడం ఎలా సహిస్తున్నారు? వాడిని మళ్లీ మనిషిని చేయగలిగితే, ఈ మతాంతర గ్రహణానికి ఉద్ధరణ జరగుతుంది. కనుక వాడిని నిజమైన

ముసల్మానుగా మద్యాన్ని, మగువను త్యజించేటట్టుగా చేయాలి. అది కానివాడు, వాడు మతాన్ని మార్చుకోడం వ్యర్థం వాడి పట్ల మా సహాయ నిరాకరణం సాగుతూనే ఉంటుంది."

ఇక్కడ నివసించే ముసల్మానులందరి మాతృభూమి నిస్సంశయంగా భారతదేశమే. కనుక ప్రతి ముస్లిమూ, భారత స్వాతంత్ర్య పోరాటంతో విధిగా సహకరించాలి. కాంగ్రెసు ఏ మతానికీ, ఏ జాతికీ, ఏ వర్గానికీ, ఏ తెగకూ, ఏ వర్ణానికి చెందదు. సమన్వయమైన దేశానికంతకూ చెందుతుంది. ముసల్మానులు కాంగ్రెసును కైవసం చేసుకోవచ్చు. వాళ్లు తలచుకుంటే, తమ సంఖ్యాబలంతో కాంగ్రెసును నింపి వేయవచ్చు. తమ కిష్టమైన దారిన దాన్ని నడిపించవచ్చు. కాంగ్రెసు హిందవుల కోసం పోరాడటం లేదు. దేశస్థులందరి తరపునా ముఖ్యంగా అల్ప సంఖ్యాకుల హితం కోసం శ్రమిస్తున్నది. కాంగ్రెసువాది ఒక ముసల్మానుకైనా అసౌకర్యం కలిగిస్తే నేను బాధపడతాను. భవిష్యత్కాలంలో కాంగ్రెసువాదులు ముసల్మానులను హిందువుల దాడి నుంచి, హిందువులను ముసల్మానుల దాడి నుంచి ప్రాణాలొడ్డి రక్షిస్తారు. అదే వారి అహింసా సిద్ధాంతం. ఇటువంటి సమయంలో సమ్యజ్ఞానం లోపించకూడదు. హిందువు కానీ ముస్లిము కానీ - కాంగ్రెసువాది అయిననాడు - సంస్థ ఎడల తన విధిని నిర్వర్తించాలి పోరాటానికి విజయం కలగాలంటే పరస్పర విశ్వాసం ప్రధానం.

ఈ సమయంలో, ఇంగ్లీషువారు, ముస్లిం లీగు, వ్యతిరేకంగా ఉన్నారు. కనుక మనం ఇతోధిక త్యాగాలకు తయారుగా ఉండాలి. సర్ ఫ్రెడరిక్ పకిల్ పంపించిన రహస్య సర్క్యులర్ చూచారా? కాంగ్రెసును వ్యతిరేకించేందుకు, కుక్కగొడుగుల్లా పుడుతున్న సంస్థలను రెచ్చగొట్టే ప్రయత్నమది. కుటిల తంత్రాలకు వెనుదీయని సామ్రాజ్యంతో మనం తలపడాలి. సత్యాగ్రహ పథంలో కళ్లు మూసుకొని ధర్మయుద్ధం చేసే అలవాటు మనది.

సత్యాగ్రహంలో మోసం, అసత్యం, కుట్ర - వీటికీ తావులేదు. ఇట్టి విపర్యయం నేను చూస్తూ ఊరుకోలేను. ప్రస్తుత సమయంలో ఎవ్వరూ

దేశంలో తిరగని ప్రదేశాలన్నీ చుట్టి వచ్చాను. కోట్లాది మూగ మానవులు నాలో తమ హితుని, ప్రతినిధిని దర్శించారు. నేనూ వీలైన మేరకు వారితో మమేకమై స్పందించాను. వారి కళ్లలోని నిజాయితీని విశ్వాసాన్ని అవినీతి నిలయమైన సామ్రాజ్యంతో పోరాట సమయంలో నేను సొమ్ము చేసుకుంటాను. కాగడా వెలుగును పొదలో దాచి, మౌనంగా మాయమవడం నాకు చేతకాదు. జపాను వారిని కొంతకాలం ఆగమంటే ఆగుతారా? ప్రపంచ యుద్ధకీలలు అందరినీ చుట్టుముట్టాయి. ఇప్పట్లో చేతులు ముడుచుకొని కూచుంటే, యీ అవకాశాన్ని జారవిడిస్తే, దేవుడు నా పని పడతాడు. పరిస్థితులు వేరుగా ఉంటే, కొంతకాలం ఆగమని అనేవాడినే, కాని సహించలేని యీ పరిస్థితిలో కాంగ్రెసుకు వేరు దారి లేదు.

అయినా, అసలు సంఘర్షణ, యీ క్షణంలో జరగదు. నా చేతికి అధికారం అప్పగించారు. నేను వైస్రాయిని కలిసి, కాంగ్రెసు వారి వాదాన్ని అంగకీరించి, వారి ప్రస్తావనను అమలు చేయమని కోరతాను. దీనికింకో రెండు మూడు వారాలు పట్టవచ్చు. ఈలోగా, మనమందరమూ పాల్గొనగలిగే కార్యక్రమమేది? చరఖా మొదటిది. మౌలానా దీని ప్రాముఖ్యత మొదట గ్రహించకపోయినా, యిప్పుడు అర్థం చేసుకున్నారు. పదు నాలుగు అంశాల నిర్మాణ కార్యక్రమాలు ఉండనే ఉన్నాయి. ఇంకొక్క విషయం ఈ క్షణం, ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు తాను బ్రిటిష్ సామ్రాజ్యపు బానిసను అనుకోవడం మానేసి స్వేచ్ఛగా మెలగాలి.

ఆషామాషీ కబుర్లు వద్దు. ప్రతి వ్యక్తీ తాను ముక్తుడను అనుకుంటే బానిసత్వపు సంకెళ్లు తెగిపోతాయి. తన యజమానితో "ఇంతవరకూ నీ బానిసను. ఇప్పుడు గాను. నన్ను చంపినా ఒక్క సలహా - నీ అంతట నీవే, నన్ను విడుదల చేస్తే, వేరేమీ నాకు వద్దు. శ్రమ శక్తితో తిండీ, బట్టా నేను సమకూర్చుకోగలను. ఇంతవరకు భగవంతునికి బదులు నీపై ఆధారపడ్డాను. ఇక ముందు అలా చేయను. నాకాళ్లమీద నేను నిలబడతాను." అని అనాలి.

వైస్రాయిని అభ్యర్థించాను. పూర్ణ స్వాతంత్ర్యమే నా ధ్యేయం ఆయన "ఉప్పు పన్ను రద్దు", "మద్యపాన నిషేధం" మున్నగు వాటితో నన్ను

సముదాయించాలని చూడవచ్చు. కాని నా మంత్రం మాత్రం "సంపూర్ణ స్వరాజ్యమే."

ఒక చిన్న మంత్రాన్ని ఉపదేశించనా? దానిని హృదయాలలో ముద్రించి ప్రతి శ్వాసతో బాటు ఉచ్చరించండి - విజయమో - వీరస్వర్గమో! దేశాన్ని స్వతంత్రం చేస్తాం - లేదా ఆ ప్రయత్నంలో ప్రాణాలర్పిస్తాం. శ్వాశత బానిసగా ఉండే బ్రతుకు మనకు వద్దు. ప్రతిజ్ఞ పూనండి. కారాగారాల సంతతి అటు తర్వాత నేను బయట ఉన్నన్నాళ్లూ, మిమ్మల్ని బయటే ఉంచాలని చూస్తాను. ప్రభుత్వానికి ఉండే గడ్డు పరిస్థితులలో కారాగాల నిర్వహణ కష్టసాధ్యం. ప్రాణాలు కాపాడుకునే ప్రయత్నంలో జీవన్మృతులై దేశం కోసం మరణిస్తారా, ప్రాణాలొడ్డి, మృతజీవులౌతారా? పిరికివానికి, గుండెబలం స్వేచ్ఛ ఉండదు.

పత్రికా విలేఖరుల కొకమాట - జాతీయోద్యమాలకు మీరింతవరకు యిచ్చిన ప్రోత్సాహానికి అభినందనలు. మీ పరిమితులు నాకు తెలుసు, కాని, ఆ బంధాలు త్రెంచుకొని బయటపడి, ప్రాణాలు ధారపోయడం అనేది ప్రతి పత్రిక ప్రజలకు చూపవలసిన దారి కావాలి. మీ కలాన్ని ఎవరూ, ప్రభుత్వమైనా, నిరోధించదు. మీ ముద్రణా యంత్రాలు, కార్యాలయాలు అమూల్యమైనవి. వాటిని ప్రభుత్వం వశపరచుకోవచ్చు. మీ అంతట మీరు అది కొని తెచ్చుకోవద్దు. నా కలం ఆగదు. నా ప్రెస్సును మూసివేసినా సరే అని పంతం పట్టండి. మధ్యే మార్గం ఉన్నది. ప్రస్తుతం ఉన్న కట్టుబాట్లతో ప్రెస్సును నడపలేమనీ, ఆదేశాలు మిమ్మలను కట్టి ఉంచలేవనీ సర్ ఫ్రెడరిక్ పకిల్‌కు తెలియచేయండి. ఆయన ప్రెస్సు ప్రకటనలను ముద్రించకండి, కాంగ్రెసు పక్షంలో ఉన్నామని ప్రకటించండి. దీనితో పోరాటానికి ముందే మా సంఘర్షణకు అనుకూల వాతావరణం ఏర్పడుతుంది.

సామంతరాజుల కొకమనవి. నేను వారి హితైషిని. నేనొక సామంతరాజ్యంలో పుట్టి, పెరిగినవాడను. తన ప్రభువుకుతప్ప. ఇంకే రాజుకు మా తాతగారు కుడిచేతితో "శాల్యూట్" చేయనని చెప్పారు. ఆయన తన ప్రభువుతో కూడా "నా మనస్సు కిష్టంలేని పనిచేయనని తెగేసి చెప్పకుంటే

బాగుండేది`` అని నా భావన. వారి ఉప్పు తిన్నవాడిని వారికి హాని తలపెట్టను. నా జీవిత సమయంలో, వారు మంచి పనిచేస్తే స్వతంత్ర భారత దేశంలో గౌరవనీయమైన స్థానం పొందుతారు. జవహర్ లాలు దృష్టిలో ``ప్రత్యేక హక్కులు గల వర్గాలు ఉండవు. ఆస్థి అంతా ప్రభుత్వానిది. ఆర్థిక ప్రణాళిక ప్రకారం, ఇండియా యొక్క పునర్నిర్మాణం జరగాలి. నా ప్రణాళిక ప్రకారం, సామంతరాజులకు, భూస్వాములకు, తగు ప్రాముఖ్యం ఉంటుంది. సన్యాసం ద్వారా సుఖం పొందండి. ధర్మకర్తలై మెలగండి. ప్రజలను మీ ప్రభువులుగను, మిమ్మలను వారి సేవకులుగను ప్రకటించండి. వారికి మీరు చేసిన సేవలు సాఫల్యంగా తెలియజెప్పండి. సామ్రాజ్యం మీకు కొన్ని అధికారాలను దత్తత చేసినా ప్రజల నుండి పొందిన అధికారాలనే ఎక్కువగా మన్నించండి. ప్రజా సేవకులై భోగాలను అనుభవించండి. వారికి సూటిప్రశ్న. ఎప్పటికీ బానిసలుగా ఉండదలిచారా? పరాయి ప్రభువుకి సలాము చేసేకంటే మీ ప్రజల స్వామ్యత్వం యొక్క గౌరవాన్ని అర్థం చేసుకోండి`` మీరు పొలిటికల్ విభాగానికి ఇలా వ్రాయండి ``ప్రజలు మేలుకొన్నారు. పెద్ద సామ్రాజ్యాలు ముక్కలవుతున్నాయి. ఆ హిమఖండం ముందు మేము నిలవము. ఈ రోజునుండి మేమూ ప్రజలతొ మునుగుతాం, తేలుతాం.'' ఇందుళ్లో రాజ్యాంగరమైన యిబ్బందులు లేవు. రాజులను అణచి ఉంచే ``సంధులు'' ఏవీలేవు. మా రాజ్యాలలో ప్రజలు కూడా. ``తామూ సామంత రాజ్యాల ప్రజలే అయినా, రాజులతో పాటు తామూ భారతదేశ వాసులమే`` అని ఉద్ఘోషించాలి. ఈ విషయంలో సామంత రాజ్యాల ప్రజలు. అవసరమైతే తమ రాజులు పెట్టే హింససలు భరించి, చివరకు మృత్యువునైనా ఎదుర్కోవాలి. మాట మాత్రం వెనుకకు తీసుకోకూడదు.

ఏ పనైనా రహస్యంగా, చాటుమాటుగా చేయకూడదు. ఇది బహిరంగమైన తిరుగుబాటు, ఇందులో దాపరికం పాపకృత్యం. స్వేచ్ఛాజీవి రహస్యపు కుట్రలలో పాల్గొనడు. స్వాతంత్ర్యానంతరం. రహస్య పోలీసులను, నేను వద్దన్నా నియమించకుంటారేమో. ప్రస్తుతం తుపాకులనైనా ఎదిరించి పోరాడాలి. పలాయనం పనికిరాదు.

ప్రభుత్వోద్యోగుల కొకమాట. ఇష్టం లేనివారు, రాజీనామా

లివ్వనక్కరలేదు. కీ శే. జస్టిస్ రానడే తాను కాంగ్రెసువాదినని ప్రకటించారు. కాని రాజీనమా యివ్వలేదు. "కాంగ్రెసు సమావేశాలకు హాజరవుతారు. కాని, న్యాయపీఠం వద్ద నా రాజకీయ సిద్ధాంతాలు నిష్పక్షపాతమైన న్యాయ నిర్ణయాలను ప్రభావితం చేయవు" అనేవారు. అయన కాంగ్రెసు సమావేశపు పెండాలులోనే సాంఘిక ఉద్ధరణ సభను నిర్వహించారు. సర్ ఫ్రెడరిక్ రహస్య పత్రానికి జవాబుగా ప్రభుత్వోద్యోగులంతా రానడే గారి అడుగుజాడల్లో నడిచి, కాంగ్రెసుకు తమ విధేయతను ప్రకటించాలి.

ప్రస్తుతానికింతే. ఇప్పుడు నేను వైస్రాయి గారికి వ్రాస్తాను. మా ఉత్తర ప్రత్యుత్తరాలను, వైస్రాయి గారి అంగీకారం తీసుకొని, నేను ప్రచురించినపుడు, మీరు చదవవచ్చు. నా ఉత్తరంలో విషయాన్ని సమర్థించవచ్చు. "రహస్య పత్రాలు, ప్రభుత్వం నుంచి వచ్చినపుడు ఏం చేయాలి" అని ఒక న్యాయాధీశుడు అడిగారు. "మీ స్థానంలో నేను వాటిని పట్టించుకోకుండా - నేను కాంగ్రెసువాదిని, జీవికోపార్జన కోసం ప్రభుత్వోద్యోగం చేస్తున్నా, రహస్యమైన ఆదేశాలను, కుట్రల నిర్వహణను అంగీకరించను" అని వ్రాస్తానని ఆయనకు చెప్పాను. సైనికులకో సందేశం - ఈ కార్యక్రమం వారికీ వర్తిస్తుంది. రాజీనామా చేసి రమ్మని వారికి నేనుచెప్పను. నన్నూ, జవహర్‌లాల్, మౌలానాలను కలిసి, సైనికులు - "ప్రభుత్వం నుండి నిర్వంకుశత్వం భరిపంరానిదవుతున్నది. మేము మీ పక్షమే" అని చెప్పారు. సైనికులకు కూడా నా సలహా యిదే . 'ప్రభుత్వాని, జీతం తీసుకుంటున్నాం - సేవచేస్తాం. మా విధులు నిర్వహిస్తాం. ఆదేశాలు విధేయతతో పాలిస్తాం - కాని మావాళ్ళ మీద తుపాకీ గుండ్ల వర్షం కురిపించము' అని ప్రభుత్వానికి చెప్పండి.

ఇలా చేసే ధైర్యం లేని వారి విషయం వేరు. కాని నేను చెప్పినట్లు చేస్తే, వాతావరణం మారిపోతుంది. ప్రభుత్వం మనమీద బాంబులు వేసినా చలించం.

విద్యార్థులు తమ చదువులను తరువాత సాగించాలి, అని అనుకుంటే ఉద్యమంలో చేరమని అనను. వారికోసం వేరే కార్యక్రమం తయారవుతున్నది. వారు తమ ప్రొఫెసర్లతో "మేం కాంగ్రెసువాదులం. మీరూ కాంగ్రెసు

వాదులైతే, ఉద్యోగాలను త్యజించక, మమ్ములను స్వాతంత్ర్య సమరోన్ముఖులను చేయండి' అని అనాలి. ప్రపంచంలోని ప్రతి స్వాతంత్ర్య పోరాటంలోనూ విద్యార్థుల దాయిత్వం ప్రముఖమైనదిగా ఉంటూ వచ్చింది.

ఈ క్షణం నుంచి, అసలు పోరాటం మొదలయ్యేదాకా నా సూచనల ప్రకారం కార్యనిమగ్నులు కండి. దానితో మార్పు వచ్చి, తరువాత జరిగే ఘట్టానికి భూమిక ఏర్పడుతుంది.

ఇంకా చాలా చెప్పాలి. కాని మనసు బాగాలేదు. మీరు ఇచ్చిన యీ సమయంలో, అక్కడక్కడ ఇంగ్లీషు మాటలు వాడుతూ, నా భావాలు వెలిబుచ్చాను. ఆలస్యమైనా శ్రద్ధగా సైనికుల వలె విన్నారు. గత 22 ఏండ్లుగా నేను మాటలను, వ్రాతలను నియంత్రించి, శక్తిని పొదుపు చేశాను. తన శక్తి సామర్థ్యం వ్యర్థం చేయనివాడే నిజమైన బ్రహ్మచారి. ఇన్నేళ్ల నా సాధన యిదే. ఇవాళ నా మనసులోని బరువును దింపుకున్నాను. మీకు విసుగు వచ్చిందేమో, కాని నాకు చింత లేదు. నా సందేశాన్ని, మీ ద్వారా, యావద్భారతావనికీ అందించాను.

*(అ.భా.కాం. కమిటీ సమవేశంలో, 8-8-42నాడు, గాంధీజీ యిచ్చిన ఉపన్యాసమందలి చివరి భాగం - ఇంగ్లీషులో యిచ్చినది)*

నా మనసులోనిది మీ ముందు ఉంచాను. కాలతీతమైంది. నన్ను ఎన్నుకున్నారు గనుక నేను దళపతిని అయాను. నిజంగా నేను అలా కాలేను. ప్రేమ తప్పించి వేరే శస్త్రం నా వద్ద లేదు. అధికార దుర్మదాంధత నాకు అసహజమైన విషయం. నాచేతికర్రను ఒక్కక్షణంలో ఎవరైనా విరిచివేయగలరు. దీనిని ఊతగా చేసికొని నడుస్తాను. ఇటువంటి బలహీనుడికి, ఇంత పెద్ద బరువు వల్ల ఉల్లాసం ఎక్కడ ఉంటుంది? మీ ముందు దళపతిగా కాక, సేవకుడిగా నిలిచినపుడే, యీ బరువును మోయడంలో మీరూ భాగస్వామ్యం వహిస్తారు. మంచి సేవకుడే మంచి నాయకుడు. ఇప్పుడు మొదటిమెట్టుగా

మీరు చేయవలసిదేమిటో క్లుప్తంగా చెబుతాను. అంతిమ పోరాటానికి యింకా సమయం ఉన్నది. ఈలోగా, నన్ను సరిగ్గా అర్థం చేసుకోని వారితో చర్చించి, నా వివేకాన్ని, నిజాయితీని , నిరూపించుకునే ప్రయత్నం చేస్తాను. వివేకహీనుడనని పించుకున్నా ఫరవాలేదు నిజాయితీ లేనివాడు అనే మాట రాకూడదు. నా మిత్రులకు నా నిజాయితీపై అనుమానం కలిగినట్లు

## సామ్రాజ్య స్నేహితులు

సత్యాన్వేషి జీవితంలో, భయరహితంగా, చెప్పేది, చేసేది వేరుగా ఉండే ద్వంద్వత్వాని కతీతంగా, దేశసేవ చేసినంత మేరకు చేసే ఉద్దేశ్యంతో, గత ఏభై ఏండ్లుగా, ప్రతిఫలాపేక్ష లేకుండా సామ్రాజ్యానికి కూడా హితవుగా మెలిగే ప్రయత్నం చేశాను. లార్డ్ లిన్‌లిత్‌గో వ్యక్తిగతంగా, హితుడిగా గుర్తించారు. ఆయన యీ మాటను ఒప్పుకుంటారో, లేదో, నాకు తెలియదు. ఆయన భార్యకు నన్ను పరిచయం చేశారు. ఆయన అల్లుడు. అంగరక్షకుడితో వచ్చి నన్ను కలిశారు. అతనికి మహదేవ్ అంటే అభిమానం. నేనంటే అభిమానం. ఆమె ఆయనకుచాల ఇష్టురాలు. విధేయురాలు. నాకూ వారంటే అభిమానం. ఈ విషయాల్ని మీకు వివరించింది మా మధ్య గల సన్నిహితత్వం తెలియజేసేందుకే అయినా బ్రిటిషు సామ్రాజ్య ప్రతినిధి అయిన లార్డు లిన్‌లిత్‌గోకు వ్యతిరేకంగా గట్టిగా పోరాటం చేసేందుకు, యిది అడ్డుగా నిలవదు. అంతులేని అహింసాశక్తితో, కోట్లాది మూక ప్రజల కోరికతీరేందుకు, నన్ను ఇంత అభిమానంతో చూసే వైస్రాయిని ఎదిరిస్తాను నా మాటను ఆయన నమ్ముతాడు. మన సమస్యలను నిజాయితీగా ఆయనకు తెలియజేస్తాను. ఆయన నా మాటను కాదనడని నమ్ముతున్నాను. సామ్రాజ్యం తన నిజాయితీని పోగొట్టుకున్నది. అయినా దాని హితుడను అనేది ఆయనకు తెలుసు. ఛార్లీ ఆండ్రూస్ ఔన్నత్యానికి. ప్రతీక. అనేకముంది భారతీయుల కంటె ఆయనతో సన్నిహితంగా ఉండేవాడిని. మాకు రహస్యాలు లేవు. మనస్సులు విప్పి, మాట్లాడుకునేవాళ్లం. గురుదేవ్ రవీంద్రనాథ్ టాకూర్

స్నేహితుడేగాని, నాతో ఉన్న చనువు ఆయనతో అతనికి లేదు. గోఖలే గారి పరిచయం పత్రం తీసుకొని, నా వద్దకు ఆయన మొదట సారి వచ్చారు. ఆయనా పియర్సన్ ఇంగ్లీషు వారిలో అత్యుత్తమ పురుషులు. కలకత్తా మేయరు గారు అభినందన పత్రం పంపారు. ఈనాడు ఆయన నన్ను వ్యతిరేకిస్తున్నాడు.

పాశ్చాత్య మిత్రుల అభిమానం, లుప్తమైనా ఫరవాలేదు. వీటికోసం, నా అంతర్వాణి పీక నొక్కను. మానవత, మానసిక దర్శనం వగైరాలకు అలవాటుపడిన నేను, నా అంతర్వాణిని, నియంత్రించను. ఒక్కడనై కోపదృష్టితో పరికించే ప్రపంచాన్ని ఎదిరించవలసి రావచ్చు. నా అంతర్వాణి నన్ను బలపరుస్తుంది. స్నేహితులు, దారాసుతులు, పరిత్యజించినా, దేనికోసం బ్రతుకుతున్నానో, దానిని వదలను, నేను పూర్ణాయుష్కుణ్ణి. 120 సంవత్సరాలలు జీవించాలని అనుకుంటున్నాను భారతదేశానికి స్వేచ్ఛ దొరికే నాటికి ప్రపంచమంతటికీ కూడా, స్వేచ్ఛ లభిస్తుంది అని ఆశిస్తున్నాను.

## నిజమైన స్వేచ్ఛ, స్వాతంత్ర్యం

నా దృష్టిలో ఇంగ్లాండు, అమెరికాలు స్వతంత్ర దేశాలు కావు. ఈ భూమిమీద ఉన్న నల్లవారిని, ఇతరులను బానిసత్వంలో మగ్గజేయడంలో వారికి స్వేచ్ఛ ఉన్నది. అంతే, ఈ బానిసల కోసం ఆదేశాలు పోరాటం జరుపుతాయా? అలా అవి, చేయనివాడు. యుద్ధ సమాప్తివరకు నేను ఆగను. స్వేచ్ఛా వాయువులను సరిహద్దులతో గిరిగీసి, కొందరికే పరిమితం చేయమని - ఇంగ్లీషు, అమెరికను అధ్యాపకులు, వారి చరిత్ర, వారి అందమైన సాహిత్యం- అనటం లేదు. స్వాతంత్ర్యంఅనే మాటకు అర్థం తెలియాలంటే, భారతదేశానికి, సత్యాన్వేషకులుగా, పొగరుబోతుతనం లెకుండా రావాలి. గత 22 ఏండ్లుగా భారతదేశం యీ మౌలిక సత్యాన్ని గురించి అన్వేషిస్తూనే ఉన్నది.

## కాంగ్రెసు - అహింస

రాజ్యాంగచట్టబద్దమైన పద్ధతుల ననుసరించి అనాలోచితంగా, కాంగ్రెసు అనాదినుంచి, తన సృష్టి మొదలు పెట్టి, యీ నిర్మాణాన్ని కొనసాగిస్తూ వున్న దాదాభాయి, ఫిరోజ్‌షా మొదలైన ప్రజారంజకులు కాంగ్రెసును తీర్చిదిద్ది, విద్రోహులనే ముద్ర వేయించుకున్నారు. మనవారు యజమానులు సేవకులు, వారిలో ఎట్టి దాపరికం ఉండేది కాదు. కాంగ్రెసువాదులలో కొందరు హానికారకులు. అహింసాయుత పోరాటానికి యావద్భారతం ఆయత్తమైంది. సహజంగా నేను అపత్కాలంలో. సత్యావాదులైన మానవుల జన్మసిద్ధమైన మంచితనం అంటేనమ్మకం ఉన్నవాడిని. ఇది జరుగకపోయినా, నా దారిని విడవను. కంగారుపడిన కాంగ్రెసు, పుట్టిన దాది, శాంతియుత మార్గాలనే అనుసరించింది. అనుభవంతో యిప్పుడు అహింసను కూడా జోడించింది. స్వరాజ్య మంత్రాన్ని జపిస్తున్నది. దాదాభాయి, బ్రిటిషు పార్లమెంటు మెంబరైనపుడు శాలిస్బరీ దొర ఆయనను "నల్లవాడ" న్నాడు. కాని ఆ తెల్లవాని నోడించి పార్లమెంటులో ప్రవేశించాడు. ఇండియా ఆనందించింది. ఆ రోజులు గడిచిపోయాయి. ఇండియా ఒక వ్యక్తిత్వాన్ని సంతరించుకున్నది.

## నేను ముందుకే సాగుతాను

ఈ విషయాలనిన్నటినీ గమనించి, నేను యిప్పుడు ఇంగ్లీషువారిని, యూరోపియన్లను సంయుక్త రాష్ట్రాల సమాఖ్యను ఆత్మ విశ్లేషణతో, స్వాతంత్ర్యమిమ్మని అడిగి, ఇండియా చేసిన ఘోరతప్పిదాన్ని, వివరించమంటున్నాను. దీనికోసం అర్థశతాబ్ద్యాదిగా, సంప్రదాయాలను గౌరవించి, న్యాయబద్ధమైన ప్రయత్నాలు చేస్తూ వచ్చిన వ్యవస్థను చిన్న చూపు చూసి తమకు లభ్యమైన నూతన పద్ధతులలో ప్రపంచమంతటా అపయశస్సు పాల్జేయడం న్యాయమా? అమెరికా ప్రెసిడెంటు ఇంకా గద్దెనెక్కని చైనా జనరలిసిమో వగైరా పెద్దల మద్దతుతో ఏదో సాకులతో, విదేశీ పత్రికలలో ఇండియా స్వతంత్రపోరాటానికి మసి పూయ చూడడం భావ్యమా? మదామ్‌షేక్ దుబాసీగా వ్యవహరించి, నన్నూ జనరలిస్సిమోను

కలిపారు. ఆయన నాకు అర్థం కాలేదు. కానిమదాం షేక్ ద్వారా తన భావాలను వ్యక్తీకరించారు. ప్రపంచమంతటా మన మీద నిప్పులు చెరగడం జరుగుతున్నది. మనం యీ సమయంలో పెద్ద తప్పు పని చేస్తున్నామట. బ్రిటిషు సామ్రాజ్యాన్ని శతాబ్దాలుగా పెంచి పోషించిన దాని రాజకీయ చాతుర్యాన్ని మెచ్చేవాడిని. ఇప్పుడది కంపు కొడుతున్నది. తక్కినవారు ఆ మార్గాన్ని అనుసరిస్తున్నారు. కొంతకాలం వరకు, ప్రపంచదేశాల సమ్మతి, వారికి లభించవచ్చు. కాని ఇండియా ఆ భావాన్ని ఖండించి, ఆ ప్రచారాన్ని అడ్డుకొంటుంది. నేనూ, ఆపనే చేస్తాను. అందరూ వ్యతిరేకులైనా, ఇండియా కూడా సమ్మతించకపోయినా, నేను వారిది తప్పనీ, ఇష్టపడని వారి చేతుల్లోంచి స్వాతంత్ర్యాన్ని, బలిమితనైనా, లాక్కుంటుందనీ, అంటాను. "ఇండియ కొరకు" మాత్రమే కాక, ప్రపంచమంతటి కొరకు, అహింసద్వారా, స్వాతంత్ర్య సముపార్జన శ్రేయస్కరమని నిరూపిస్తాను. స్వాతంత్ర్య సిద్ధికి పూర్వమే నేను కన్నుమూసినా, అహింస యొక్క కన్ను మూతపడదు. అంజలి ఘటించి న్యాయ సంగతమైన కోర్కెను మా పాత దాకని తీర్చమని అడుగుతాము. కాదంటే చైనా, రష్యాల గతి అధోగతి అవుతుంది. మనస్సాక్షి గలవాళ్లము. ధర్మయుద్ధమే చేస్తాము. అహింసా మార్గావలంబనే మా ధ్యేయం. ఇతరులను చికాకు పెట్టని పద్ధతిని ప్రవేశపెట్టిన నేను, ఇప్పుడు మీతో కఠినంగా మాట్లాడుతున్నాను. నా జుట్టు పట్టుకొని, నన్ను ముంచినవాడి చేతినుంచి "గిజగిజ" లాడుతూ తప్పించుకోడం బహిరంగంగా జరుగుతున్నది. కనుక మా విధానంలో సామంజస్యం నిండి వుంది. సంయుక్త రాష్ట్రాలకు, రాజ్యాలకు ఒక్క విజ్ఞప్తి.

విదేశీ పత్రకారులు కూడా ఈ సభను అలంకరించారు. వీరి ద్వారా "ఇండియా అవసరం మాకున్నద"ని చెప్పే సంయుక్త సమాఖ్యను, ఇన్నాళ్లు సహాయం చేసి మీ నిజాయితీని నిరూపించు కొమ్మంటాను. అలా చేయకపోతే, తమ జీవితకాలంలోని అవకాశాన్ని పోగొట్టుకొంటారు. చరిత్ర వారి పాత్రను దూషిస్తుంది. వారి శుభ చింతనయే మాకు శ్రీరామరక్ష. వారికున్న పరిమితిలోనే, అహింస, నిరాయుధీకరణలను వదలి, మనుష్యుల్ని

దీవించమంటాను. నేనెదిరిస్తున్న సామ్రాజ్యవాదానికీ, నిరంకుశత్వానికి మౌలికమైన తేడా ఉన్నది. బ్రిటిషు వారికి భారతదేశం నుంచి అవసరాలు లభ్యమవుతున్నాయా? లేదు. బలిమిని దోచుకున్నదే వారికి దక్కుదల. స్వేచ్ఛతో, స్నేహంతో ఉద్భవించే భారతదేశపు సదవగాహన వారికి మేలు చేస్తుంది. స్వాతంత్ర్యం యిప్పుడే యిక్కడే రావాలి. సాయపడే శక్తి ఉండి కూడా దానిని వాడటం లేదు. స్వేచ్ఛగా వాడితే, నేడు కనుచూపుమేరలో లేని స్వాతంత్ర్యం కరతలామలకం అవుతుంది. ఇండియా, స్వేచ్ఛాస్వాదన చేసి, చైనావారికి స్వేచ్ఛను "ఇవ్వాలి" అని అంటుంది. రష్యాకు పోవు దారి నిష్కంటకం అవుతుంది. ఇంగ్లీషువాడు తన దేశంలోనే చావును కోరుకుంటాడు. బర్మాలో, మలయాలో, మృతిని యిష్టపడడు. నేనూ, నా 40 కోట్ల మందీ ఎక్కడకు పోతాం? తాను స్వతంత్రం గాకుండా, ఇతరుల ముక్తికి భారతదేశం ఏవిధంగా పోరాడుతుంది? వాళ్లు జీవచ్ఛవాలైయున్నారు. పిండివేయబడ్డారు. వాళ్లకళ్లలో జ్యోతి వెలగాలంటే, స్వతంత్రం రేపు గాదు నేడే లభించాలి. విజయమో, వీరస్వర్గమో.

నా కాంగ్రెసు ప్రతిజ్ఞ చేసింది. కాంగ్రెసుకు లభించేది విజయమో వీరస్వర్గమో!

*(నా అహింస (1960) పుటలు 183-205.)*

★ ★ ★

# 6

# ఆసియా దేశాల సంబంధాలను గురించిన సమావేశంలో గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం (2-4-1942)

*(పదిరోజులు జరిగిన ఆసియాదేశాల సంబంధాలను గురించిన సమావేశపు అంతిమ ఘట్టం. 1947 సంవత్సరం ఏప్రిల్ 2వ తేదీన 20,000 మంది కార్యకర్తలు, ప్రేక్షకుల సమక్షంలో గాంధీజీ ఈ ఉపన్యాసం ఇచ్చారు. ఇండోనేసియా ప్రధాని, డా॥ పెరియార్, శ్రీమతి నాయుడు 'ఈ యుగంలో ఆసియాదేశపుమహత్తర వ్యక్తులలో ఒకరు' గా గాంధీజీని పరిచయం చేశారు.)*

విదేశీ భాషలో ఉపన్యసిస్తున్నానని క్షమార్పణ అడుగనక్కర లేదనుకుంటాను. ఆ చివర ఉన్నవారికి నా మాట వినపించకుంటే, ఆ తప్పు ధ్వని యంత్రానిదే.

నా మాతృభాష గుజరాతీ. హిందూస్తానీ దేశ భాష అయ్యేందుకు సమయం పడుతుంది. అంతర్జాతీయంగా భావాల వినిమయానికి ఉత్తమ వాహిక ఇంగ్లీషు భాషయే. జనం చాలమటుకు ఫ్రెంచి భాషను అర్థం చేసుకుంటారని విన్నాను.నేను ఫ్రెంచి భాష నేర్చే ప్రయత్నం చేశాను. కాని మొదటినుంచి ఇంగ్లీషు అలవాటు కావడంవల్ల ఈ భాషలకు గల పోటీలో ఇంగ్లీషు గెలిచింది.

నేను ఏం మాట్లాడాలి? ఇక్కడికి వస్తూ, బాద్‌షాఖాను కనబడితే, విషయాలు గుర్తుంచుకునేందుకు వ్రాయడం నిమిత్తం పెన్సిలు, కాగితం తీసుకొని, ఏదో గిలికాను. సమయాభావం కదా. ఇప్పుడు నా దగ్గర ఆ పత్రం కూడా లేదు. గుర్తు చేసుకొని చెబుతాను.

మిత్రులారా, ఢిల్లీ బొంబాయి, మద్రాసు, కలకత్తా, లాహోరు నగరాలపై పాశ్చాత్యుల ప్రభావం అధికం. మీరు నిజమైన ఇండియాను చూడలేదు.

నాకొక ఘట్టం గుర్తుకు వస్తున్నది. దక్షిణాఫ్రికాలో, చులకనగా చూడబడే అల్ప సంఖ్యాకుల న్యాయవాదిగా నేనున్నప్పుడు ఒక ఫ్రెంచి కథను, ఒక ఆంగ్లో - ఫ్రెంచి పండితుడు ఇంగ్లీషులో చెప్పాడు.

ముగ్గురు ఫ్రెంచి శాస్త్రజ్ఞులు సత్యాన్వేషణకై బయలుదేరారట. ఒకరు ఇండియాకు వచ్చి, పట్టణాలన్నీ గాలించగా సత్యం ఒక కుగ్రామంలో ఒక 'భంగీ' (పాకీ పనివాడు) పాకలో అవగతమయిందిట. అవి బ్రిటిషువారు, మొగలాయీల పాలనకు పూర్వపు రోజులు.

ఈదేశంలో ఏడు లక్షల గ్రామాలున్నాయి. జనాభా 38 కోట్లు, అసలైన సత్యం కుగ్రామంలో, పేదల ఇంట కన్నులకు కట్టినట్టు కనిపిస్తుంది.

ప్రస్తుత గ్రామాలు మురికి కూపాలు. జ్యోతి విహీనమైన కళ్లతో

చూసే జనం ఉన్న పేదల ఇళ్లు ప్రస్తుత పరిస్థితులను వివేకవంతంగా కళ్లకు గట్టినట్టు చూపిస్తాయి.

మా దేశ చరిత్రను, మేము, ఇంగ్లీషు వారు వ్రాసిన ఇంగ్లీషు పుస్తకాలను చదివి నేరుస్తున్నాము. ఇదీ యిప్పటి మా సంస్కృతి ప్రవక్తలలో మొదటివాడు జోరాస్టరు. తరువాత, పూర్వ భారతదేశానికి చెందిన బుద్ధుడు. అటు పిమ్మట మోజెస్. ఈజిప్టులో పుట్టినా, ప్రాచ్య దేశస్థుడె జీసస్, మహమ్మద్ ఉద్భవించారు రాముడు, కృష్ణుడు యిక్కడ అప్రస్తుతం. వీరంతా ఆసియా ఖండపు వారే. క్రైస్తవ ధర్మం, పాశ్చాత్య దేశాలలో వన్నెను కోల్పోయింది ఇలా అనడం బాగుండదు. ఇంక ఏమీ అనను

నిన్నటి "మారణహోమం" ఇండియా యొక్క అసలు స్వరూపం కాదు. ఇది గమనించవలసిన విషయం

ఆసియావాసులు, పాశ్చాత్యుల కళ్లద్దాలతో యిక్కడ సంస్కృతిని గుర్తించలేరు మా జీవన విధానం శాంతిమయమయమని మాత్రం తెలియజేయడం అవసరమని భావిస్తున్నాను

మేలుకొన్న పేదల యుగంలో, ప్రజాస్వామ్యంలో యీ సందేశాన్ని గట్టిగా చెప్పాలి. దీని పునరుత్థానం అవసరం పాశ్చాత్యుల మనస్సులను ప్రేమతో జయించగలము. ద్వేషంతో, పగ - కక్షలతో ఎప్పటికీ జయించలేము. వివేకవంతులైన, ప్రాచ్య ప్రవక్తల సందేశంలోని మూలతత్వాన్ని గ్రహించి, తద్వారా పాశ్చాత్యులను జయించాలి.

పాశ్చాత్యులు దీనినె మనసారా కోరుతున్నారు. అణుబాంబుల సంఖ్య పెంచాలని కోరడం లేదు. దానివల్ల సర్వనాశనమే కదా బైబిలులో చెప్పినట్లు ప్రళయం వస్తుంది. ప్రపంచంలో ఉన్న దుష్టత్వాన్ని గురించి, పాపం గురించి అంతా యోచించాలి. ఆసియాలోని మహనీయులైన ప్రవక్తల సందేశాల పునస్మరణ జరగాలి. దానిని యిష్టపూర్వకంగా అమలు చేయండి

*(హరిజన్ 20-4-1947 పుట 116-17)*

★ ★ ★

# చివరి ఉపవాస వ్రతమప్పుడు గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం (12-1-1948)

నా అయిష్టతను సూచించే పద్ధతి-నా ఉపవాస దీక్ష

ఆరోగ్య కారణంగా ఒకరు ఉపవాసంచేస్తారు ఇంకొకరు చేసిన తప్పుకు ఉపవాసం చేస్తారు. ఈ ఉపవాసాల విషయంలో ఉపవాసం చేసేవానికి అహింసలో విశ్వాసం ఉండనక్కరలేదు ఒక సందర్భంలో, అహింసా, పూజారి, సమాజం చేసిన తప్పుకు, తన అయిష్టతనూ, అభ్యంతరాన్ని తెలియజేసేందుకు, ఆఖరు పద్ధతిగా, ఉపవాసం చేస్తాడు అటువంటి పరిస్థితి నాకు వచ్చింది

సెప్టెంబరు 9 - వతేదీన, కలకత్తా నుండి ఢిల్లీకి, పశ్చిమ పంజాబుకు వెళ్లబోతూ, చేరుకున్నాను. కళకళలాడె ఢిల్లీ మృతప్రాయమై పడి ఉన్నది. అందరి ముఖాలపై దుఃఖం తాండవిస్తూ కనిపించింది ఎప్పుడు హాస్యమిశ్రితమైన చిరునవ్వులు చిందించె సర్దారు కూడా అపవాదంగా లేడు. కారణం నాకు తెలియదు అతడు నన్ను ఆహ్వానించి తీసుకొనిపోడానికి స్టేషనుకు వచ్చాడు. భారతదేశపు రాజధానిలొ కలిగిన కలతలను గురించి వివరించాడు. 'అమీ', 'తుమీ' తెల్చుకునేందుకు ఢిల్లీలో నేనుండడం అవసరం అనిపించింది. సైన్యం, పోలీసు చర్య వలన కృతకమైన ప్రశాంతత ఏర్పడింది. కాని లోపలి తుఫాను అలాగే ఉంది.

ఎప్పుడైనా అది ఉబికి బయటపడవచ్చు నాకు కావలసింది యిది కాదు. హిందువులు, ముస్లిములు, సిక్కులు వీరి సామరస్యమే నాకు కావాలి. నిన్న అది ఉన్నది. నేడది లేదు ఏ దేశ భక్తునికైనా యిది కలత కలిగించే విషయం. నా అంతరాత్మ ఘోషను. నాబలహీనతగా భావిస్తూ, పెడచెవిని పెట్టాను. ఏ సత్యాగ్రహికైనా ''చేయలేని పని'' అంటూ ఉండకూడదు. తనది కాని, పరునిది కాని ఖడ్గానికి బదులు ఉపవాసమనే ఆఖరి ఆయుధం అతని వద్ద ఉంటుంది. నన్ను రోజూ కలుసుకునే ముస్లిము సోదరులకిచ్చే జవాబు

నా వద్ద లేదు. ఈ అశక్తత నాకు బాధాకరం. ఉపవాసంతో యిది మాయమవుతుంది. మూడు రోజులుగా ఆలోచిస్తున్నాను. ఆఖరికి నాలో జ్యోతి వెలిగింది. పవిత్రాత్మ గలవాడు తన ప్రాణానికంటే విలువైనదేది అర్పించలేడు. నాలో, యీ పద్ధతి ననుసరించడాన్ని బలపరిచే పవిత్రత ఉందని భావిస్తున్నాను. దానికోసం ధ్యానం చేస్తున్నాను.

## మీ ఆశీస్సులకర్హమైనది

మీరంతా నా ప్రయత్నాన్ని ఆశీర్వదించి, నాకు విజయం కలగాలని ధ్యానం చేయండి. రేపు ఉదయమే నా ఉపవాసం ప్రారంభమవుతుంది. ఈ దీక్షకు మితి లేదు. లవణసహిత, లేక, లవణరహిత, జలం నిమ్మరసంతో పుచ్చుకుంటాను, అన్ని మతవర్గాలలో, ఏ విధమైన బలవంతం లేకుండా స్వచ్ఛందంగా తమ విధి అనే నమ్మకంతో, మనసుల కలయిక ఏర్పడిందని, నాకు తృప్తికలిగితే యీ దీక్ష ముగిస్తాను.

అప్పుడు దిగజారుతున్న ఇండియా యొక్క ప్రతిష్ఠ ప్రపంచంలో పునరుద్ధరింపబడుతుంది. ఇండియా ''ఆత్మ'' అంతమవటం అంటే, బాధాగ్రస్తమై, తుఫానులో చిక్కి, ఆకలిగొని, బక్కగా ఉన్న ప్రపంచంయొక్క ఆశ అడుగంటడమే అనే అభిజాత్యం నాది. ఎవరైనా మిత్రుడు గాని, ఎవరైనా శత్రువు గాని ఉంటే, ఆ శత్రువు నన్ను తప్పు పట్టవద్దు. మానవుని మనస్సును ఉపవాస దీక్షతో జయించడం జరుగదు అని కొందరి భావన. దయయుంచి వారు కూడా నన్ను స్వేచ్ఛగా ఉండనీయాలి. నాకు దేవుడే దిక్కు. ఎవరి సలహా అక్కలేదు. నేను తప్పు, చేసినట్టు గ్రహిస్తే, ఆ నిజాన్ని కూడా ఉచ్చ స్వరంతో ఘోషిస్తా. అయితే దానికి ఏమాత్రం - అవకాశం లేదు. నా అంతరాత్మ వాణినిఅణచిపెట్టను. దీన్ని గురించి వాద వివాదాలు వద్దు. యావత్తు దేశం లేక అధమం ఢిల్లీ ప్రాంతం స్పందిస్తే, దీక్ష త్వరలో ముగుస్తుంది.

## మెతకతనం వద్దు.

దీక్ష మాట అటుంచి, విపత్తు నివారణలో తాత్సారం, మెతకతనం వద్దు. ఇదివరలో కొందరు నా ఉపవాసాల బలవంతం వల్ల, తీసుకోదలచిన

కఠిన నిర్ణయాలు, చచ్చుబరచడమో లేక మూర్ఛడమో, జరిగిందని విమర్శించారు. అటువంటి విపర్యయానికి విలువేముంటుంది? పవిత్ర ఉపవాస దీక్షకు బహుమతి, విధి నిర్వహణయే. ఫలితం కోసం ఉపవాసం చేయను. చేవలసింది చేస్తాను. దయయుంచి, దీనిని గమనించి, అలా జరగవలసి ఉంటే, నన్ను శాంతంగా చనిపోనీయండి. హిందూ, సిక్కు, ఇస్లాం మతాలు, భారతదేశం, నాశనం కావడం చూస్తూ ఉండే కంటే, నా చావే నాకు ఉజ్జ్వలమైన విముక్తి కలిగిస్తుంది. అందరకూ అన్నిమతాల వారికీ సమాన హోదా ఇవ్వకుండా ఆస్థి, ప్రాణ నష్టాలను కలిగిస్తూ పాకిస్తాను ఉండి, భారతదేశం కూడా దానినే అనుకరిస్తే, నాశనం తథ్యం. అప్పుడు "ఇస్లాము" ఇండియా, పాకిస్తానులలో అంతమైనా, తక్కిన ప్రపంచదేశాల్లో ఉంటుంది. కాని హిందూ, సిక్కు ధర్మాలు ఇండియాకు బయట బ్రతుకలేవు. మనల్ని వ్యతిరేకించిన వారిని, నేను మెచ్చుకుంటాను. నా దీక్ష అంతరార్థాలను ప్రబోధించాలి. ఇండియాకు పట్టిన యీ భ్రష్టతను నిర్మూలించేందుకు, ఆ దేశంలోని ఒక బక్కవాడు పూనుకున్నాడని సంతోషించండి. ఆ బక్కవాడు అందుకు తగినవాడు కాకపోతే, వాడు పోవడమే అందరికీ మంచిది.

బిర్లా హౌస్‌కు వచ్చి, నాకు నచ్చచెప్పవద్దు. దేవుని రక్షణలో తమలోని వెలుగును, చూడవలసిన సమయమిది. పరీక్షా సమయం, నాకు కావలసింది తమ తమ విధులను సక్రమంగా నిర్వర్తించడమే. ఉపవాసం ద్వారా ఆత్మక్షాళనయే మార్గం.

*(హరిజన్ 18-1-47, పుట 523.)*

★ ★ ★

# సత్యవాణి

## ద్వితీయ ఖండము

(ఎంపిక చేసిన అంశములు,
సూక్తులు, సిద్ధాంతములు)

నేనేమి క్రొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలేదు. దైనందిన జీవితంలోని సమస్యలకు నిత్యసత్యాలను అనుసంధానం చేసేందుకు ప్రయత్నం చేశాను... నా తత్వం, నా ఆధ్యాత్మం (అడంబరమయమైన ఆ పేరు కావాలంటే వాడండి) నేను చెప్పబోయే సత్యవాణిలో ఉన్నది. దానిని మీరు "గాంధీజం" అని పిలువవద్దు. ఇందులో ఏ "ఇజమూ" లేదు. దీనికోసం, విస్తృతమైన సాహిత్యం, ప్రచారం అక్కరలేదు.

హరిజన్ 28 -3-19 36. పుట. 49 **ఎం.కె. గాంధీ**

# భాగము -1

## సత్యము, ప్రపంచము, దేవుడు

### అధ్యాయము - 1

## సత్యము - దేవుడు

సత్యం సర్వోపరి. అందు అన్నీ ఇమిడి ఉన్నాయి. మనసా, కాయా, వాచా ఉండే సత్యానికి మూలం నిత్యసత్యం అనగా దేవుడు. ఆయన రూపాలు. వ్యక్తీకరణాలు అనేకం, అద్భుతం. ఆయన యింతవరకు నాకు దొరకలేదు. అన్వేషిస్తున్నాను. సత్యధర్మం కోసం అన్నీవదులు కొంటాను. నా ప్రాణమైనా సరే త్యజిస్తాను. అట్టి నిత్యసత్యం నాకు దొరికేంతవరకు, నాకు సత్యమనిపించిన దాన్ని అనుసరిస్తాను. అదే నాకు కవచం. ఖడ్గధారవలె పదును కలిగియున్నా ఋజూమార్గమే అనుసరణీయం. సుగమమైనదికూడా. పెద్ద తప్పులు చేసినప్పుడు కూడా యీ జ్యోతి రక్షించి, నాకు దారిని చూపించింది. అప్పుడప్పుడు మిణుకుమిణుకు మని నిత్యసత్యం గోచరమవుతూ ఉంటుంది.

*(ఆత్మ కథ, పరిచయం నుండి (1966) పుటలు -11)*

★ ★ ★

'సత్' అను శబ్దాన్నుంచి 'సత్య' అను శబ్దం పుట్టింది. సత్ అంటే ఉన్నది అని అర్థం. కనుకనే యిది దైవానికి ప్రతీక. మరో మాటలో దైవమే 'ఇది'. అందరికీ తెలిసేందుకు "పరమాత్మ ప్రభువులకు ప్రభువు" అని అంటున్నాము. అంతే.

సత్యమున్న చోట జ్ఞానమున్నది. అది లేనిదే ఇది లేదు. అందువల్ల చిత్ లేక జ్ఞానము భగవత్స్వరూపము. జ్ఞానమున్నచోట ఆనందమున్నది. ఇవి నిత్యములు. కనుక దేవుడు "సత్, చిత్, ఆనంద స్వరూపుడు. అనగా సత్య జ్ఞాన, ఆనంద భావాల సమన్వయమన్నమాట.

*(యరవాడ మందిర్ నుండి .(1957) పుటలు 1-2)*

★ ★ ★

సర్వవ్యాప్తం, స్వయంభువు, సర్వాధారం, శాశ్వతం, వివేకం, ఆనందం ఏటిని ఈశ్వరశక్తి శాసిస్తుంది ఈశ్వరుడు. ఈశ్వరాజ్ఞ ఒక్కటే ప్రపంచమంతటినీ నడిపేశక్తి అదే

*(ఆశ్రమ ఉపదేశాలు (1959) పుట 37)*

★ ★ ★

'సత్' అంటే సంస్కృత శబ్దం సత్యానికి మారుపేరు దేవుడె 'సత్' అనగా అస్తిత్వం ఉన్నవాడు తక్కినదంతా మాయ అశాశ్వతం అదేవిధంగా అస్తిత్వం ఉన్నది. 'సత్యం' మాత్రమే కనుక సత్యమే దేవుడు సత్యమంటే ఏమిటి? మనది ప్రాపంచిక సత్యం. "నిత్య సత్యం" దేవుడే అదే మనకు జీవగర్ర. శాశ్వత జీవనాధారం

సత్యం మనకు శాశ్వతమైన సంతోషాన్నిస్తుంది సంస్కృతంలో సత్ + చిత్ + ఆనంద అను మాటలను ఒకే మాటగా "సచ్చిదానంద" అని వాడి భగవంతుణ్ణి తలచుకుంటారు. సత్యమే జీవితం. సత్యమే చైతన్యాన్ని, సంతోషాన్ని యిస్తుంది. శాశ్వతమైనది. దొంగిలించబడదు. శిరచ్ఛేద సమయంలో కర్కశాఘాత ప్రతాడన సమయంలో కూడా నీ యందలి సత్యం, నీకు అంతరంగికమైన ఆనందాన్ని కలిగిస్తుంది.

*(గాంధీజీతో సంభాషణలు (1949) పుటలు 35, 36)*

★ ★ ★

పెద్దలు చెప్పినట్లు, నా చిన్నతనంలో, దేవుని సహస్రనామస్మరణ చేసేవాడిని. ఇవిగాక, యింకా ఎన్నో పేర్లున్నాయట. ధార్మిక గ్రంథాలు ఈ మాటనే ధృవీకరిస్తాయి. మన అందరిలో దేవుడున్నాడు. కనుక అతడు నామరహితుడు, రూపరహితుడు, వాగ్రహితుడు అయి ప్రత్యేకత లేకుండా ఉంటాడు. అన్నీ ఆయనే. ఇదే విధంగా "ఇస్లాము" లో దేవునికెన్నో పేర్లున్నాయి. కొందరు "ప్రేమ దైవం" అంటారు. లోలోపల నేను సత్యమే దైవం అనుకుంటూ ఉంటాను. ఒక్కమాటలో దేవుని గురించి పూర్తిగా వర్ణించదలిస్తే "సత్యం" అనేమాట తప్ప వేరేదీ దొరకదు.

రెండు సంవత్సరాల క్రితం. ఏబది ఏండ్ల సాధనతో, "సత్యమే"

దేవుఁడని కనుగొన్నాను "దేవుడే - సత్యం" "సత్యమే - దేవుడు" రెండు వాక్యాలలో గల తేడాను గమనించండి. సత్యానికి చేరే మార్గం "ప్రేమ". ప్రేమ అనే మాటలో కామం అనే అర్థం రావచ్చు. కాని అహింసా పూజారికి అటువంటి అర్థం స్ఫురించదు "సత్యం" అనె మాటకు, ఎటువంటి నాస్తికులైనా వేరే అర్థం చెప్పలేరు. అయితే సత్యాన్వేషణలో నాస్తికుడు "దేవుడే లేడు" అంటాడు అందుకని, సత్యమే "దేవుడు" అనడం సరియైనదని గోచరించింది

చార్లెస్ బ్రాడ్లా అనె ఆయనను అందరూ నాస్తికుడనేవారు నేనతని ఎరుగుదును. అతనిని ఒప్పించేందుకు - 'మీకు సత్యమంటే వెరపు ఉన్నది సత్యమే దేవుడు కనుక, మీకు దేవుడంటే కూడావెరపు ఉంది అని నిరుత్తరుణ్ణి చేశాను ఇటువంటివెన్నో ఉన్నాయి అయితే, "దేవుని పేర క్రూరకృత్యాలు చేసేవారు" సత్యం పేరిట జంతువులను పీడించి ఖండించు ప్రయోగాలు చేసె శాస్త్రజ్ఞులు ఉన్నారు. వీరి మాట ఏమిటి? సత్యాన్వేషణలో ఎదురయ్యే కష్టాలిటువంటివే ఎన్నో ఉన్నాయి

హిందూ సిద్ధాంతాలు "దేవుడు తప్ప వేరేది లేనె లేదు. అంతె ఇస్లాం కల్మా (ముస్లిముల మౌలిక ప్రార్థన) యీ సిద్ధాంతాన్నే పెంచి పెద్ద చేస్తుంది. సత్ అనే సంస్కృత శబ్దానికర్థం ఉన్నది అని ఈ వైవిధ్యాల జోలిక పోకుండా "సత్యమే దేవుడు" అనే భావన తృప్తి కలిగిస్తుంది సత్యాన్ని దేవునిగా అర్థం చేసుకునేందుకు అహింసా పూజారులకు నిష్కామ ప్రేమయే దగ్గర దారి.

*(యంగ్ ఇండియా 31/12/31 - పుటలు 427-1928)*

★ ★ ★

ఇది కాదు (నేతి. ఇది కాదు (నేతి) అని, ద్రష్టలు భగవంతున్ని వర్ణించారు. సత్యం [illegible] దానికోసం అన్వేషిస్తాను

(గాంధీజీ నాస్తికుడు 1958, పుట 30)

★ ★ ★

దైవమొక వ్యక్తి కాదు. శక్తి, శాశ్వతమైన పవిత్రమైన, పరమాత్మ సర్వవ్యాపి. ఆయన రక్షణ అందరికీ లభ్యం కాదు. ఏమిటో యీ వింత

*(హరిజన్, 22-6-1947, పుట 200)*

★ ★ ★

సర్వ శక్తిమంతుడు, సర్వవ్యాపి భగవంతునికి పొగడ్తలు, మహజరులు అక్కరలేదు. మనలో ఉండి (వ్రేళ్లకు గల గోళ్ల కంటె దగ్గరగా) అన్నీ విని గ్రహిస్తాడు.

*(ఆశ్రమ ఆచరణలు, 1959, పుట 36)*

★ ★ ★

ఆయనది సర్వోత్తమ ప్రజాస్వామ్య పద్ధతి. మంచీ, చెడూ ఏదైనా ఎంచుకునే అధికారం మనకే యిచ్చాడు కదా. అలాగే గొప్ప నిరంకుశుడు. 'స్వేచ్ఛ' పేరిట మనకు రావలసినది పోగొట్టుకునేటట్టు చేసి, ముసి ముసి నవ్వులు నవ్వుకుంటాడు. దీనినే 'లీల', 'మాయ' అని హిందువులు అంటారు. మనము లేము, ఆయనే ఉన్నాడు. మనం 'ఉండాలి' అంటే, ఆయన స్మరణ చేస్తూ, ఆయన చెప్పినట్లు ప్రవర్తించాలి. అతని 'వేణు' నాదానికి నాట్యంచేస్తూ పోతే, అంతా శుభమే.

*(యంగ్ ఇండియా, 5-3-1925, పుట 81)*

★ ★ ★

దేవుడు 'మంచివాడు' అంటే మామూలు అర్థంలో 'చెడ్డ' వానికంటే మంచి వాడని కాదు. ఆయన పూర్తిగా మంచివాడు. ఆయనలో 'చెడు' లేదు కాని, దేవుణ్ణి చేసినది నేనే అని మానవుడు అనుకోవడంతో కష్టాలు మొదలయ్యాయి. దేవుని చేతిలో మట్టి కూడా బంగారమవుతుంది. అదేవిధంగా చెడు అంతా మంచిగా మారిపోతుంది.

దేవుడు మన వలె బ్రతికి, చావడు. నిత్యమూ జీవిస్తాడు. మంచి తనమే దేవుడు దైవత్వం లేని మంచితనం నేతిబీరకాయ వంటిది. అన్ని ధర్మపన్నాలూ అలాంటివే. అంటే దైవ సాన్నిధ్యంకోరి, ఏది చేసినా, ఫలిస్తుంది.

*(హరిజన్, 24 8-47, పుట 289)*

★ ★ ★

దేవుడు వర్ణనాతీతుడు. నాకయితే దేవుడే సత్యం. ప్రేమా, సచ్ఛీలత, సదవగాహన, నిర్భీకత, జీవనజ్యోతికి మూలాధారం - ఇవన్నీ కలిపి, యింకా అధిగమించి ఉంటాడు. వివేకం, నాస్తికత్వం (మరి అనంతమైన వాత్సల్యంతో నాస్తికుణ్ణి బ్రతకనిస్తున్నాడు కదా) ఆలోచన, తర్కం వాక్కు, అన్నీ అతడే తెలిసియో, తెలియకనో మనం అన్నది నమ్మడు (మన ద్వంద్వం ఆయన కవగతమే). చూడాలనుకున్నవానికి కనుపిస్తాడు. స్పృశించాలనుకున్న వానికి అందుబాటులో ఉంటాడు. అన్ని గుణాల ముద్ద (సమన్వయం) అయిన ఆయన నమ్మినవానికి ఉన్నాడు. అందరికీ అన్ని విధాలా లభ్యమవుతాడు. మళ్ళీ అన్నిటికీ అతీతుడు. దేవుడు అనేమాటను బహిష్కరించినా, ఆ వస్తువును బహిష్కరించే శక్తి ఎవ్వరికీ లేదు.

*(యంగ్ ఇండియా, 5-3-25, పుట 80-81)*

★ ★ ★

అనిర్వచనీయమై అన్నిటా వ్యాపించిన శక్తిని ఊహిస్తాను. నాకది కనుపించదు. అది ఇంద్రియాలకతీతమైనది.

దేవుని అస్తిత్వాన్ని కొంతవరకు తర్కంతో నిరూపించవచ్చు. మామూలుగా, శాసకులెవరో, ఎందుకు ఎలా శాసిస్తున్నారో, సామాన్యంగా అందరికీ తెలియదు. క్రిందటేడు, మైసూరు పర్యటనలో, మైసూరు రాజ్యపాలకులెవరో గ్రామస్థులకు తెలియదని మాటల్లో తేలింది. ఎవరో దేవుడు అని వారన్నారు. మరి దేవుని విషయంలో నాకున్న జ్ఞానం అంత మాత్రమే కదా. అయితే వారికి సృష్టిలో క్రమగతిని గురించి తెలుసు. దానికి గల సూత్రాలను సర్ జే.సీ. బోస్ గారి ప్రయోగాల వలన నిరూపించడం జరిగింది. సూత్రమూ సూత్రకారుడూ ఒక్కటే. నేను ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, సూత్రబద్ధుడనై బ్రతుకుతున్నాను. కనుక అట్టి మహత్తర శక్తి యొక్క అస్తిత్వాన్ని అంగీకరిస్తే, జీవనయానం సుగమమవుతుంది.

నిత్యమై నశించే, మార్పు చెందే ప్రతివిషయంలో ఒక నిత్యసత్యం ఉన్నది. అది వీటిని క్రమబద్ధం చేసి, సమన్వయపరచి, పునఃసృష్టి చేస్తుంది. అదే ఇంద్రియాల కతీతమైన దైవశక్తి.

ఈ శక్తి శుభాన్ని కలుగజేస్తుందా? అశుభకారకమా? శుభకరమే అనిపించింది. చావులో పుట్టుక. అసత్యంలో సత్యం చీకటిలో కాంతి ఉంటుంది కనుక దేవుడే జీవితం, సత్యం కాంతి, ప్రేమ, అత్యుత్తమమైన సాత్వికతత్త్వం

*(యంగ్ ఇండియా 11-10-28, పుట 340)*

★ ★ ★

వివేకాన్ని మాత్రం తృప్తిపరచడం దైవత్వం కాదు. మనస్సును మార్చాలి. ప్రతి పనిలో భక్తునికి దివ్యత్వం గోచరించాలి. దీనికి పంచేంద్రియాల అనుభూతికి మించిన (దివ్యానుభూతి) జాగృతికావాలి. (దివ్యానుభూతి) జాగృతి అప్రతిహతం. అది ఆత్మైక వేద్యం.

ప్రతి దేశంలో అన్ని కాలాలలో ద్రష్టలూ ప్రవక్తలూ దివ్యానుభూతిని పొందారు. ఈ సాక్ష్యం కాదంటే తన్ను కాదన్నట్లే.

సరియైన నమ్మకం ఉంటే, దివ్యానుభూతి కలుగుతుంది. దీనికి ఋజువులూ, సాక్ష్యాలూ దొరకవు. అనుభవమే శరణ్యం. సత్యమూ, ప్రేమా మూలసూత్రాలుగా విపరీత ధోరణులను వెలివేసి, ఆరాధనాభావంతో పూనికగల నమ్మికతో జీవించడం సురక్షాప్రదం.

తర్కంతో ... నమ్మించగలిగే ఆధారసూత్రం ఏదీ లేదని... నేను అంగీకరిస్తున్నాను.

*(యంగ్ ఇండియా, 11-10-28, పుట 340-41)*

★ ★ ★

మనం ఉన్నాము. మన మాతా పితరులు ఉన్నారు. మరి ఆ సృష్టికర్త ఉన్నాడని అనడమే సమంజసం. అతడు లేడు అంటే, మనమూ లేము.... (అణోరణీయాన్, మహతో మహీయాన్' (చీమ కంటె చిన్న పర్వతం కంటె పెద్ద) ఒక్కడే అనేకులే. సముద్ర జలబిందువులో అణువైన అతనిని సప్తసముద్రాలు తమలో ఇముడ్చుకోలేవు. ఇన్ని మాటలెందుకు? నమ్మకం ముఖ్యం తర్కం అసంగతం. ఏ నాస్తికుడైనా, తర్కంతో నన్ను జయించవచ్చు. కాని ఆస్తిక భావన. ప్రపంచానికి దేవుడున్నాడు. ఉండేవాడు, ఎప్పటికీ

ఉంటాడు" అని ఎలుగెత్తి చాటుతుంది.

*(యంగ్ ఇండియా 21-2-26, పుట 30)*

★ ★ ★

తర్కం యొక్క సరిధి, పరిమితి నాకు అనుభవైక వేద్యం. అయితే అనియత తర్కం ఉన్మాదమే.

బుద్ధివాదం, సర్వశక్తివంతం అనుకుంటే తప్పు. అది ఒక శిలాఖండంలో దైవత్వాన్ని ఆపాదించి ఆరాధించడం వంటిది.

తర్కం అణిగిపోకూడదు. తర్క ప్రాశస్త్యం యొక్క నిర్మాణాత్మకత గుర్తింప బడాలి.

*(యంగ్ ఇండియా, 14-10-26. పుట 259)*

★ ★ ★

కొన్ని విషయాలలో తర్కం పని చెయ్యదు. నమ్మకమే వెన్నుదట్టి నిలబెడుతుంది. కనుక నమ్మకం తర్కాన్ని మించిన తత్వం. అది ఆరవ ఇంద్రియ శక్తి వలె, తర్కాతీతమైన సందర్భాలలో ఉపకరిస్తుంది.

*(హరిజన్ 6-3-37, పుట. 26)*

★ ★ ★

## అధ్యాయము - 2

# జీవితము - దేవుడు

నేనద్వైతిని, కాని ద్వైతాన్ని బలపరుస్తాను. నిత్యమూ మార్పుచెందే నశ్వర ప్రపంచం శాశ్వతమైన అస్తికత్వం లేనిది. అయినా, అందులో నిలిచి ఉండేది ఉన్నది కనుక అంతవరకూ దానిలో నిజం ఉన్నది. ఉన్నదానిని లేదు అనడంలో అభ్యంతరం లేదు. అనేకతావాది స్యాద్వాది అనిపించుకోడానికి అభ్యంతరం లేదు. నా స్యాద్వాదం ప్రత్యేకత కలది. వాద వివాదాలకు (అందులోనూ స్యాద్వాద పండితులతో) దిగను. నా దృష్టికి నేను సరి. నా విమర్శకుల దృష్టికి అందుకు వ్యతిరేకం ఇదే నా అనుభవం. మేమిద్దరమూ మా మా దృష్టి కోణాల ననుసరించి, సరిగానే ఉన్నాము. ఇందువల్ల నాకు

విమర్శకులకు దోషాలంటగట్టే బెడద తప్పుతుంది. ఏడుగురు గ్రుడ్డివారు. ఏనుగును గూర్చి చేసిన వర్ణనలు వారి వారి అనుభూతులను బట్టి సరియైనవే. ఇంకొకరి మాట ప్రకారం గాని, ఏనుగును కళ్లారా చూసిన వాని దృష్ట్యా గాని, సరికానివి. ఈ అనేకతావాదం నన్ను ముసల్మానులను, క్రిష్టియనులను దగ్గర చేసింది. ఇతఃపూర్వం నాలోని అసహిష్ణుతను పోగొట్టింది. ఇప్పుడు వారి యెడల నాకు ప్రేమభావం ఉంది. సత్యాహింసల సాధన ఫలితమే ఈ సమన్వయ భావం.

*(యంగ్ ఇండియా, 21-2-26, పుట 30)*

★ ★ ★

దైవజ్యోతికణమైన జీవితం సత్యం

*(ఆర్ట్ ఆఫ్ లివింగ్ (1961) పుట 53)*

★ ★ ★

ఈ ప్రపంచం దేవుని ఆటస్థలము, ఆయన ఉజ్జ్వలతకు ప్రతిబింబము

*(ఆత్మకథ - 1966, పుట 153)*

★ ★ ★

అనేక రూపాలతో అవతరించిన నా దైవం నాకెప్పుడూ ఎక్కడైనా ఆరాధ్యుడే.

*(యంగ్ ఇండియా 26-9-1929, పుట 320)*

★ ★ ★

తన ఆత్మ ఆ పరమాత్మలో అణువని గ్రహించి, అన్నీ అతనికి అంకితం చేయాలి.

*(గాంధీ గీత, 1956, పుట 186)*

★ ★ ★

ప్రపంచంలో, అనశ్వరం, అగోచరం నుంచి నశించే అణువు వరకూ అంతా ఆ మహనీయుని మహనీయమైన అవతరణయే.

*(గాంధీ - గీత, 1956, పుట 254)*

★ ★ ★

ఇంద్రియ గోచరమైన ప్రపంచం ... ప్రతీ క్షణం కదిలిపోతుంది. కాని, దాని మూలం ఆ పరబ్రహ్మయే కనుక అది అనశ్వరం.

*(గాంధీ - గీత, 1956, పుట 337)*

★ ★ ★

ఆత్మ యొక్క శాశ్వతత్వాన్ని నమ్ముతాను. ఉదాహరణకు సముద్రంలో జలకణాలున్నాయి. ప్రతి కణం సంపూర్ణం అయినా మొత్తంలో ఒక భాగం. అనేకుల్లో ఒక్కటి. జీవిత సముద్రంలో, మనమూ చిన్న బిందువులం. నా ప్రతిపాదన యిది - జీవితంతో కలిసిపోవాలి. ప్రతి ప్రాణితో ఏకం కావాలి. ఆ సర్వ శక్తిమంతుని సమక్షంలో జీవిత సామ్రాజ్య భాగస్వామ్యాన్ని పంచుకోవాలి. జీవితమే దైవం.

*(హరిజన్ 15-2-48, పుట 33)*

★ ★ ★

## అధ్యాయము - 3

# ప్రకృతి - దేవుడు

హృషీకేశ్ లక్ష్మణఝూలాల ప్రకృతి దృశ్యాలు చూచి ముగ్ధుడనయ్యాను. మన పూర్వీకుల ప్రకృతి సౌందర్యాభిరుచికి, ప్రకృతి దృశ్యాలకు ధార్మిక ప్రాముఖ్యత కలిగించడంలో వారి దూరదృష్టికి తలవంచి నమోవాకాలు అర్పించాను. ఆ ప్రకృతిలోని సుందర దృశ్యాలలో మిణుకు మిణుకుమంటున్న నక్షత్రాలున్న ఆకాశం ఏ కుంచెకారుడి కుంచెకు ఒదుగుతుంది?... అసాధ్యం.

*(యంగ్ ఇండియా, 13-11-24, పుట 377)*

★ ★ ★

సూర్యాస్త సమయంలో రాత్రి నక్షత్రాల మధ్య మెరిసే చంద్రవంకలో గల సత్యమెంత? అవును. ఇవి ఆ సృష్టికర్త యొక్క అద్భుత శక్తిని గుర్తుచేస్తాయి. సత్యభావన వల్లనే యిది సాధ్యం. ఆయన అపార కరుణకు కరువు లేదు.

*(యంగ్ ఇండియా, 13-11-24, పుట 373)*

★ ★ ★

వృక్షారాధనలో కవిత్వం, ఆంతరిక ఆవేదన, సహజత్వం ఉన్నాయి. వనౌషధుల ఔన్నత్యం, సుందర రూపాలు, మనోహరమైన ఆకారాలు, అటవీ సామ్రాజ్యం ముందు మనల్ని ప్రణమిల్లచేసి, వేనోళ్లతో దేవుని మహిమను కీర్తింపచేస్తాయి

*(యంగ్ ఇండియా, 26-9-29, పుట 320)*

★ ★ ★

## అధ్యాయము - 4

# మానవుడు - ప్రారబ్ధము

మానవుడు భగవంతుని ప్రత్యేక సృష్టియా? ఇతరముల కంటె భిన్నమైనంత వరకు మాత్రమే ప్రత్యేకత.

*(యంగ్ ఇండియా, 13-2-30 పుట 56)*

★ ★ ★

ఆహారం, నిద్ర, ఇతర భౌతిక విషయాల్లో, మనిషి పశువే. అయితే భిన్నత్వం, ఆ స్థితి నుండి పైకి రావడానికిచేసే నిరంతర ప్రయత్నంలోనే ఉంది.

*(హరిజన్, 7-4-46, పుట 74)*

★ ★ ★

మానవుడు లెక్కకు మించిన జన్మలెత్తి, పశుత్వం లోంచి బయట పడుతున్నాడు. నిలబడగలడు. చతుష్పాత్తు కాదు. శరీరం, ఆత్మ వలెనే పశువూ, మానవుడు భిన్నములు.

*(యంగ్ ఇండియా, 29-4-26 పుట 157)*

★ ★ ★

పశువులో, సహజంగా, ఆత్మ నియంత్రణ లేదు. మానవుడు తలుచుకుంటే తనను తాను అదుపులో ఉంచుకోగలడు.

*(ఆత్మకథ - 1966 పుట 238)*

★ ★ ★

పశుత్వం నశించిన నాడే, మానవత్వ సిద్ధి

*(హరిజన్, 8-10-38, పుట 282)*

★ ★ ★

మానవుడు పశువు కంటె నైతికతలో ఉన్నతుడు. ప్రకృతి సహజంగా యీ రెండింటి తత్త్వాలు, వేరుగా ఉంటాయి. తర్కం, విచక్షణ, స్వేచ్ఛ మానవునిలో ఉన్నాయి. పశువులో లేవు. గుణం. అవగుణం, మంచీ చెడూ, పశువుకు పట్టవు. మానవునిలో సిద్ధించిన యీ ఉత్తమత్వాన్ని వినియోగిస్తే ఉత్తముడవుతాడు. లేనినాడు, పశువుకంటె హీనుడవుతాడు. అనాగరిక జాతుల్లో కూడ యౌన సంబంధమైన నియమాలు, కట్టుబాట్లు ఉన్నాయి. కట్టుబాట్లు అనాగరికత అనుకుంటే, యౌన స్వేచ్ఛ ఉండియుండాలి. కట్టుబాట్లు లేకపోతే 24 గంటల్లో గందరగోళం ఏర్పడుతుంది. మానవునిలో కామ ప్రకోపం పశువులను మించి ఉంటుంది కట్టుబాట్లు లేని సమాజం నాశనమవుతుంది. త్యాగనిరతి, నియంత్రణ పశువులో లేవు, మానవునిలో ఉన్నాయి.

*(యంగ్ ఇండియా 3-6-26, పుట 204)*

★ ★ ★

మానవునికి ప్రగతి ఉన్నది - విచక్షణ, తర్కము వున్నాయి. తిండి కొరకు పశువువలె మానవుడు జీవించడు. జ్ఞాన సముపార్జనయే, మానవుని ధ్యేయం.పశువులో దైవభక్తి ఉన్నదనిపిస్తే అది సహజాతమై ఉంటుంది. భగవంతుని సేవ అసంకల్పితంగా పశువు చేయవచ్చు. మానవుడు సంకల్పించితే సైతానును కూడ ఆరాధించగలడు. కనుక మానవుని ధ్యేయం దైవారాధన అయి ఉండాలి. మనిషికి, పశువుకి గల భేదం తెలియని వానిని ఏమీ చేయలేము. అతనికి మంచి పని - చెడు పని రెండూ ఒకటే. భగవంతుని సిద్ధింపచేసికోవాలని కోరిన వానికి, ఆహార - పానీయాలలో కూడ, నియమపాలన అవసరం. అతడు తినేందుకు బ్రతకడు, బ్రతికేందుకు మాత్రమే తింటాడు.

*(యంగ్ ఇండియా 24-6-26, పుట 229-30)*

★ ★ ★

ప్రతిజీవిలో ఆత్మ ఉన్నది. ఆత్మ శక్తి అందరిలో ఒక్కటే కొందరిలో అది నిద్రాణం. ప్రయత్నించి దానిని మేలుకొలపాలి.

*(నవజీవన్, 25-5-24, పుట 306)*

★ ★ ★

మనలోని దైవశక్తులనంతం.

*(ఆత్మకథ, 1966 పుట 206)*

★ ★ ★

మానవుడు తెలివితేటలు మాత్రమే గాని భౌతిక శరీరం మాత్రమే గాని హృదయం (ఆత్మ) (బుద్ధి) మాత్రమే గాని కాదు. బుద్ధి, శరీరం, ఆత్మ వీటి సమన్వయ సమిష్టియే పూర్ణ మానవుడు.

*(హరిజన్, 8-5-37, పుట 104)*

★ ★ ★

తన పనులను పరిపూర్ణమైనవిగా చేయుటకు బదులు, దైవపరమైన శక్తుల పరిపూర్ణ సిద్ధి కోసం, అట్టి పనులను బలహీనపరచే ధోరణిని శక్తిహీనం చేయుట మానవుని విధి.

*(యంగ్ ఇండియా 24-6-26 పుట 229)*

★ ★ ★

బుద్ధిబలం, శరీర శక్తి, ఆత్మను గూర్చిన అవగాహన, ఇవి మూడూ కలిస్తే గాని మానవ సేవకు పూర్తిగా తగియుండవు. వీటి సమన్వయం అవసరం. అందుకని ప్రగతి పవిత్రత సర్వశక్తుల కేంద్రీకరణ కలిసి ముందుకు సాగాలి.

*(గాంధీ-గీత, 1956, పుట 208)*

★ ★ ★

జీవితధ్యేయం సృష్టికర్త ఆజ్ఞ ప్రకారం ఆ సృష్టిని సేవించడమే. అంటే అంతటా ప్రకటితమైన ప్రేమయే - ద్వేషం కాదు.

*(హరిజన్ 6-4-77, పుటలు - 98-99)*

★ ★ ★

ఆత్మోత్సర్గం, పవిత్రత, ఆత్మకు గమ్యస్థానం

*(గాంధీ-గీత. 1956 పుట 202)*

★ ★ ★

భగవత్ప్రాప్తి, మానవుని అంతిమ ధ్యేయం. మానవుని సామాజిక రాజకీయపరమైన ధార్మిక ఆచరణలు ఆ ధ్యేయ పూర్తికి దోహదం చెయ్యాలి. భగవదాజ్ఞకు బద్ధమై ఉండాలి. తోటి వారి సేవ చేసి, వారిలో దైవాన్ని చూసి వారిలో లీనమవాలి.

*(హరిజన్, 29-8-36, పుట 226)*

★ ★ ★

భగవంతుని వలె ఉండనంతవరకు మానవునికి శాంతి లేదు.

*(గాంధీ - గీత, 1956 పుట 128-29)*

★ ★ ★

ప్రతి జీవితో తాదాత్మ్యత కలిగిననాడే, తన్ను తాను తెలుసుకోడం జరుగుతుంది. ఇదే కదా అందరికీ కావలసింది. తనలో పొరుగువారిని గుర్తించి బంధవిముక్తి పొందాలి. దీనికి నిష్కామసేవ ఒక్కటే మార్గం.

*(మహదేవ దేశాయి డైరీ 1953, పుట 184)*

★ ★ ★

సృష్టియందలి జీవులందు, మానవునికి సృష్టికర్తను గుర్తించేశక్తి ఉన్నది. కనుక ప్రతిరోజూ భౌతిక విషయాలు పెంచుకోడం కట్టిపెట్టి, ఆ పరమాత్ముని దరికి చేరే ప్రయత్నం చెయ్యాలి.

*(యంగ్ ఇండియా 20-10-27, పుట 355)*

★ ★ ★

మానవుని పుట్టుక ప్రాపంచిక వైభవాన్ని పెంచుకునేందుకు కాదు. తన శక్తిలోని ప్రత్యణువునూ ఆ పరమాత్ముని తెలుసుకునేందుకే వినియోగపరచాలి.

*(యంగ్ ఇండియా 27-10-27 పుట 357)*

★ ★ ★

# అధ్యాయము - 5
# ఆత్మ నియంత్రణ

**విశ్వాసము**

విశ్వాసమే మనలను దరికి చేరుస్తుంది. తనలోని దైవశక్తిని గుర్తించడమే విశ్వాసము (నమ్మకము). ఇది కలిగినవాడు, శారీరకంగా రోగగ్రస్తుడైనా, పేదవాడైనా మానసికంగా ఆరోగ్యవంతుడు ధనవంతుడు.

*(యంగ్ ఇండియా 24-9-25 పుట 231)*

★ ★ ★

విశ్వాస రాహిత్యం శూన్యస్థితి, తపోధ్యాన సంపత్తితో వర్థిల్లిన అనుభవాన్ని స్వంతం చేసుకోడమే. విశ్వాసం (నమ్మకం). కావున ప్రవక్తలు, మునులు అంటే నమ్మిక అంధ విశ్వాసం కాదు. అంతరాత్మకు తృప్తి కలిగించడమే.

*(యంగ్ ఇండియా, 14-4-27 పుట 120)*

★ ★ ★

నమ్మిక సుకుమార పుష్పంలా వాడిపోదు. హిమాలయ పర్వతంలా గట్టిది. చలించదు... అందరూ దైవం, మతం, వీటిపట్ల విశ్వాసంతో ఉండండి.

*(హరిజన్, 26-1-34. పుట 8)*

★ ★ ★

నమ్మిక లేనివాడు, సముద్ర బిందువు వలె, బయటపడినప్పుడు. ఇంకిపోతాడు. ప్రతి ఒక్కడు సముద్రమందే ఉండి, ప్రాణదాయి అయిన సముద్రజల బిందువు అవాలి.

*(హరిజన్ 25-4-36. పుట 84)*

★ ★ ★

అనుకూల పరిస్థితులలో పెరిగే విశ్వాసం విలువ లేకుండా ఉంటుంది. పరీక్షలకు తట్టుకునే విశ్వాసమే అసలైనది. తిరస్కారానికి దిమ్మెరపోయే

నమ్మకం, వెలిసి పోయిన అస్థిపంజరం వంటిది.

(యంగ్ ఇండియా 25-4-29, పుట 134)

★ ★ ★

**భగవత్ప్రార్థన**

దేశ స్వాతంత్ర్య రక్షణకు, ప్రతివారు చేసే త్యాగంలో నేర్వదగిన ముఖ్య విషయం, ఆద్యంతాలలో ప్రార్థన. దీనికి భగవద్భక్తి అవసరం.

(హరిజన్. 14-4-46, పుట 80)

★ ★ ★

అంతరంగమందలి ఆ పరమాత్మ పట్ల శ్రద్ధాభక్తులు లేని యెడల, ప్రార్థన అసాధ్యం.

(యంగ్ ఇండియా 20-12-28, పుట 420)

★ ★ ★

ప్రతి మతం ప్రార్థనాపరమైన ఆత్మ గలది. మతం లేని మానవుడు ఉండడు, కనుక మానవునిపరము జీవిత సత్యం ప్రార్థన. కుతర్కంలో పడి కొందరు, తమకు మతధర్మాలతో పని లేదు అని అంటారు. కాని ఏదోవిధంగా మానవాతీత శక్తి అస్తిత్వాన్ని ఒప్పుకుంటారు. తాను పరమ నాస్తికుడనని అనుకునే బ్రాడ్లే కూడా నైతికత ప్రాముఖ్యతనూ, అంతరాత్మ ప్రబోధాన్నీ ఒప్పుకొని, సత్యపాలన వల్ల కలిగే అనుభూతిని ఆస్వాదిస్తాడు. అయితే, ఈ అనుభూతి, దైవ యోగ జనితం. గనుక మత, ధర్మాలను తిరస్కరించేవాడు కూడా, ఏదో నమ్మకం మత విశ్వాసం లేకుండా బ్రతుకలేడు.

(యంగ్ ఇండియా 23-1-30, పుట 25)

★ ★ ★

మానవునికి జీవగర్ర ప్రార్థన. మత, ధర్మాలకు కూడాఅది ప్రధానం. విన్నపం చేసే ప్రార్థన గాని, అంతరాత్మతో జరిపే సరస సల్లాపముగాని, ఏదైనా ప్రార్థనే. తన ఆత్మనావరించిన అజ్ఞానపు తెరలను తొలగించమని చేసే విన్నపమది. తనలో దైవాన్ని జాగృతం చేయాలి అంటే ప్రార్థించాలి.

అది రామ నామ మంత్రోచ్చారణ మాత్రమే కాక, అంతర్యాన్ని కదిలించాలి. మనసులేని మంత్రోచ్చారణ కంటె, మాటలు లేని మౌన మనస్సు శ్రేష్టము. ఆకలిగొన్నవాడు ఆహారాన్ని ఆస్వాదించినట్లు, ఆత్మచింతన కొరకు తహతహ, ఆత్మకు తృప్తిని కలిగిస్తుంది. తిండి లేకుండా ఉంటాను గాని, ప్రార్థన చింతన లేకుండా ఉంటే నాకు శాంతి ఉండదు.

*(యంగ్ ఇండియా, 23-1-30 పుట 25)*

★ ★ ★

ధ్యాన తత్త్వం మానవునికి మేలుకొలుపు. మనసులోని చీకటి, వెలుగుల ద్వంద్వయుద్ధంలో ధ్యానమార్గంలోనే వెలుగు జయిస్తుంది. శాంతి కూడా లభిస్తుంది. ధ్యానం చేయనివాడు తాను దుఃఖితుడై, ఇతరులకుకష్టం కలిగిస్తాడు. కనుక మరణోపాంతంలో మేలు మాట అటుంచి, బ్రతికియున్న వారికి కూడ ధ్యానమే తరుణోపాయం. దినచర్యలో ధ్యానమే క్రమశిక్షణను నేర్పుతుంది. ఆశ్రమవాసులకు యిది అవగతమైనా, దీని ప్రాముఖ్యాన్ని ఇంకా ఒంట పట్టించుకోలేదు. ఇది నా తప్పే అని తెలుసుకొని, దిద్దుబాటును సూచించాను. మూలతత్త్వాన్ని గ్రహిస్తే తక్కినవి అందుబాటులోనికి వస్తాయి. చతురస్రంలో ఒక్క కోణాన్ని సరిచేస్తే, తక్కినవి సరి అవుతాయి.

*(యంగ్ ఇండియా 23-1-30 పుట 26)*

★ ★ ★

ధ్యానం చేయాలంటే, మాట అనవసరం. ఇంద్రియ నిగ్రహానికి కూడా యిది ముఖ్యం. వినీతుడై ధ్యానం చేయాలి.

*(ఆత్మకథ - 1966 - పుట 54)*

★ ★ ★

మౌన ధ్యానం అత్యుత్తమమైన శక్తి. దీనిని అనవరతం చేస్తూ పోతే వ్యర్థం కాదు.

*(యంగ్ ఇండియా 22-9-27 పుట 321)*

★ ★ ★

దైవధ్యానం, హృదయాన్ని పునీతం చేస్తుంది.

*(హరిజన్. 20-4-47. పుట 118)*

★ ★ ★

ధ్యానం పిరికితనాన్ని, ఇతర వ్యసనాలను, దూరం చేస్తుంది.

*(యంగ్ ఇండియా, 20-12-28, పుట 420)*

★ ★ ★

శరీరానికి ఆహారం వలెనే. ఆత్మకు ధ్యానం అవసరం. మ్యాక్స్వనీ వలె 70 రోజులైనా నిరాహారులై ఉండవచ్చు. గాని ఆస్తికులు ఒక్క క్షణమైన దైవధ్యానం మానరాదు.

*(యంగ్ ఇండియా 15-12-27. పుట 424)*

★ ★ ★

ధ్యానమంటే, కళ్లూ, చెవులు మూసుకొని భౌతికంగా మాత్రమేకాక మానసికంగా కూడా శ్రద్ధాస్పదమైన విషయంపై ఏకాగ్రతతో మనస్సును, తనకు నచ్చిన విధంగా, లగ్నం చేయడమన్నమాట. ఇందు పవిత్రతా భావం ప్రధానం.

*(హరిజన్18-8-46. పుట 265)*

★ ★ ★

నా కఠిన కారాగారవాస సమయాల్లో. కష్టాల నుంచి సేద తీర్చుకొనేందుకు దైవాన్ని ప్రార్థించినపుడెప్పుడూ నాకు నిరాశ కలుగలేదు.

*(హరిజన్ 24-12-38. పుట 395)*

★ ★ ★

ఆయన సహాయాన్ని అర్థించేటప్పుడు. నిశ్శంకగా. నిర్భీకతతో. మనసారా దాపరికం లేకుండా ఉండి. "నా వంటి నిర్భాగ్యుడిని ఉద్ధరిస్తాడా అని అనుమానం పెట్టుకోకుండా ఉంటే, నీవు కోరినది లభిస్తుంది. కోట్లాది మందిని కష్టాలలో ఆదుకున్న ఆ మహనీయుడు, నిన్ను దయదలచడా? ఆఖరికి, ఎంత పాపినైనా నీ అర్థింపులను కూడ దయతో విని ఆదరిస్తాడు.

స్వానుభవం మీద చెప్తున్నాను నరకయాతన నుంచి బయటపడ్డాను. అడిగినది కాదనడు ఆ దయాసముద్రుడు.

*(యంగ్ ఇండియా 4-4-29, పుట 111)*

★ ★ ★

24 గంటలూ ధ్యానమగ్నుడైన వానికి, ప్రార్థనా సమయం నిర్దిష్టమై ఉండనక్కరలేదు. చాలమందికి వ్యస్తత వలన యిది కుదరదు గనుక రోజుకి కొన్ని నిముషములైనా ఏకాగ్రతతో భగవద్ధ్యానం చేయడం, వారికి ఎంతో మంచిది. మౌన ధ్యానం, శాంతిని కలిగించి, కోపాన్ని తగ్గించి, ఓర్పును పెంచుతుంది.

*(హరిజన్ 28-4-46, పుట 109)*

★ ★ ★

ఉదయం తలుపును తెరిచే తాళపుచెవి, సాయంత్రం ద్వారాన్ని మూసి ఉంచే లోహ శలాక, ధ్యానమే.

*(యంగ్ ఇండియా 23-1630 పుట 25)*

★ ★ ★

ప్రతి వ్యక్తీ, రోజూ ధ్యానం చేసి, జీవితంలో అనన్యమైన ఏదో లబ్ధిని పొందుతాడనీ, ఢంకా మోగించి చెప్పగలను.

*(యంగ్ ఇండియా, 24-9-31, పుట 274)*

★ ★ ★

ప్రార్థించకుండా, ఏ పనీ చేయను. అపజయమన్నది లేకుండా ఉండాలంటే, అదే సరియైన దారి. చెడు, మాయ లేని మనసుంటే ధ్యానం సఫలమవుతుంది. కొందరు 'తమ ప్రార్థనలు ఫలించి తీరుతాయి అను అహంభావంతో గొప్పలు చెప్పుకుంటారు. నేనది చేయలేను. తప్పులు చేస్తూ, తడబడుతూ, క్రిందమీదవుతూ ప్రయాసపడే, అపరిపక్వమైన ఆత్మ నాది.

*(యంగ్ ఇండియా, 29-9-24 పుట 313)*

★ ★ ★

నేను నమ్మికతో ధ్యానం చేస్తాను. నన్ను ఖండ ఖండాలుగా చేసినా,

ఆయన అస్తిత్వాన్ని చాటి చెప్పే శక్తి భగవంతుడు నాకిస్తాడు.

*(యంగ్ ఇండియా, 8-12-27. పుట 413)*

★ ★ ★

నేను చంపబడినా, భగవన్నామాలైన 'రాం' 'రహీం' లను విడువను.

*(హరిజన్, 20-4-47 పుట 118)*

★ ★ ★

మన ప్రార్థనలను, దేవుడు తన ప్రత్యేక విధానంలో వింటాడు. నిజమైన ధ్యానం ఎప్పుడూ వమ్ముకాదు. ఇతర కార్యాచరణ ఫలితం కంటె, ధ్యానఫలితం ఎక్కువ శక్తివంతం.

*(హరిజన్, 29-6-47. పుట 215)*

★ ★ ★

దుష్టునికి పరమాత్ముని యెడల పవిత్ర భావన కలుగదు.

*(హరిజన్ 29-6-47, పుట 209)*

★ ★ ★

పరమాత్మునితో నిండిన హృదయంలో ద్వేషానికి తావులేదు. తత్ఫలితంగా శత్రు దృక్పథం మారి, మిత్రులవుతారు. చాలవరకు ఇలా నా విషయంలో సంభవించింది. దయామయుని స్మరణతోహృదయాలు పునీతమై నీచ భావాలు అంతరిస్తాయి.

*(హరిజన్ 28-4-46. పుట 109)*

★ ★ ★

**ఆత్మక్షాళన**

సత్యాన్ని మించిన దైవం లేదు .. అహింస సహాయంతో సత్యం వశమౌతుంది. సూర్యకాంతిని మించిన సత్యజ్యోతి కాంతిరేఖలు స్పష్టాస్పష్టంగా నాకప్పుడప్పుడు గోచరిస్తాయి. ఆదమ్ దేవుడు కాడు. కాని ఆయన శక్తిలో ఒక రేణువు. అందువల్ల ధార్మిక ప్రవృత్తి గల వానిలో దైవశక్తి యొక్క అంశం తప్పక ఉంటుంది.

*(గాంధీ గీత, 1956. పుట - 128)*

★ ★ ★

**అహింసా మార్గమే సత్యపథం**

ఈ మహత్తర తత్త్వాన్ని బోధపరచుకోడానికి నీచాతినీచమైన జీవాన్ని ప్రేమించడం నేర్వాలి. (తనతో సమంగా) అప్పుడన్నీ ఆ మానవునికి కరతలామలకాలే.

ఈవిధమైన మమేకత్వం సాధించాలంటే, పరిశుద్ధాత్మ మరియు మంచి మనసు అవసరం తద్వారా పరిసరాలన్నీ శుభ్రమవుతాయి.

మనసా, కాయా, వాచా నిర్మోహత్వం లేనిదే, క్షాళన జరుగదు. భవబంధాలకతీతం కావాలి. ఈ క్షాళన జరిగేందుకు ఎంత ప్రయత్నం చేసినా, ఇంకా నేనీ త్రిగుణాత్మకమైన తత్త్వాన్ని వశపరచుకోలేకపోతున్నాను. అందువలననే పొగడ్తలు నన్ను అలరించవు సరికదా అవమానిస్తున్నట్లుంటాయి. ఆయుధాలతో విజయం సిద్ధింప చేసుకోడం ఇంద్రియాలపై విజయప్రాప్తి కంటె సులభం. ఇండియాకు తిరిగి వచ్చిన నాటి నుంచి ఇంద్రియాలతో పోరాడుతున్నాను గెలుపు సిద్ధించలేదు. అలా అని నేను ఓడిపోయాననీ అనుకోడం లేదు. కొంచెం అవమానంగా అనిపిస్తున్నది. దీనికై చేసిన ప్రయోగాలు నన్ను ప్రోత్సహించి సంతోషం కలిగిస్తున్నాయి. కాని ముందు దారి ఇంకా కంటకమయమై ఉందని నాకు తెలుసు. నేను నన్ను 'శూన్యత్వ' స్థాయికి తెచ్చుకొని, స్వేచ్ఛగా జీవులన్నిటి కంటె అధమాధముణ్ణి (తక్కువైనవాడిని) అని అనుకోకపోతే అహంకారం నుంచి 'విడుదల' లేదు. అహింస అంటే ఇదే.

*(ఆత్మకథ 1966 పుటలు 382-83)*

★ ★ ★

సత్యాన్వేషణకుపకరించే పరికరాలు, సుకరాలు, దుష్కరాలు, అహంకారికి దుష్కరములై, అమాయకునికి సుసాధ్యములై ఉంటాయి. సత్యాన్వేషి సదా వినీతుడై ఉండాలి. మట్టి వలె అణిగి, మణిగి ఉండాలి. అప్పటివరకూ సత్యకాంతి రేఖ యొక్క మెరుపు కళ్ల ముందు ఆడదు.

*(ఆత్మకథ పరిచయం 1966 పుట 11)*

★ ★ ★

శరీర నశ్వరత్వం తెలిసినవాడు నియంత్రణ, నియమపాలన లేకుండా ఆత్మావగాహన అసాధ్యమని సహజంగా గ్రహిస్తాడు. శరీరం, వాసనావాసం అయినా అవుతుంది. ఆత్మావగాహనా లయమైనా అవుతుంది. ఆలయమైనపుడు వాంఛ వాసన ఉండవు. శరీరావసరాలను కోరికలను హృదయాన్ని పగ్గంతో బిగించాలి.

*(యంగ్ ఇండియా 3-6-26 పుట 205)*

★ ★ ★

మనసు పవిత్రమైనపుడు వాంఛలు ఉండవు. వీటి నిర్వచనం ఎట్టిది? ఆత్మ స్థానమే హృదయం. ఆత్మావగాహనతో అపవిత్రమైన ఆలోచనలు పుట్టవు. నీవంటే నాకిష్టం అన్నపుడు ఆ భావాన్ని పెంచుకొంటున్నానని అర్థం. ఎడతెగని ప్రేమ పూర్ణమానవుని బుద్ధికే తెలుస్తుంది. అటువంటి వారిని ఎవ్వరూ ద్వేషించరు. ఎవ్వరూ తప్పు పట్టరు. ఎవరైనా మన మీద పగపట్టారంటే, లోపం మనదే. ఆ లక్ష్యాన్ని చేరుకొనే సందర్భంలో కోరికలు క్రమంగా లోపించిపోతాయి.

*(మహాత్మాగాంధీ రచనల సంకలనం - వాల్యూం 11, పుట 376)*

★ ★ ★

మనసు మనం శూన్యత్వ భావానికి కుదించుకోనంత వరకు, మనలోని దుష్టత్వం అంతం కాదు. నిజంగా ఉండదగిన ఉండవలసినది స్వేచ్ఛ. ముక్తి. మననుంచి భగవంతుడు, సంపూర్ణ ఆత్మార్పణ కోరుతాడు.

*(యంగ్ ఇండియా, 20-12-28, పుట 420)*

★ ★ ★

**సత్యసంధత**

వీలైనంతవరకు అబద్ధం ఆడరాదు. అన్న వాక్యంలో సత్యసంధత మీద పూర్తి అయిన ధారణ లేదు. 'చేయగలిగినంతలో' అనుట సర్దుబాటు బలహీనత, లక్ష్యశుద్ధిరహితంగా మెలగుట అవుతాయి. ఏది ఏమయినా మాట తప్పను. అనే పట్టుదల లేదు. ఉదాహరణకు ప్రహ్లాదుడు తండ్రి పెట్టిన కర్కశయాతనలకు తనదైన సౌమ్య మార్గంలో ఓపికతో సమాధానం

యిచ్చాడు. తన తండ్రి గాని, అతని అనుచరులు గాని కొట్టిన దెబ్బలక్కు, నిశ్చలంగా శరీరాన్నిచ్చి భగవంతుడు ఉన్నాడు అని తాను నమ్మిన సత్యాన్ని చాటి చెప్పాడు. చావుకైనా సిద్ధమయ్యాడు. గాని తన మాట తప్పలేదు చివరకు సత్యమే జయించింది సత్యమార్గం సర్వసత్తాకమనే భావన నిరూపించాలి. తాను చచ్చినా సత్యము చావదు అటువంటి సత్యానుసరణ నా గమ్యం.

ఒక సంఘటన గురించి చెప్తాను. నేనూ నా మిత్రుడు మాట్లాడు కుంటున్నాం. ఏదో వ్యక్తిగత విషయం చెప్పేందుకు నన్ను అతడు ప్రక్కకు పిలిచాడు. ఇంకో మి...డు అప్పుడే లోనికి వచ్చి, మేము ప్రక్కకు పోబోవడం గమనించి వ్యక్తిగతంలో అడ్డువచ్చానా? అన్నాడు. నా మిత్రుడు వెనుదిరిగి అబ్బే అదేంలేదు అన్నాడు. నేను తెల్లబోయాను. మర్యాద పురస్సరంగా అతడు ఆ విధంగా అన్నప్పటికీ అది అసత్యమే. అవును కొంచెం సేపు వ్యక్తిగతమే అని వుండవలసింది. అవతల మిత్రుడికి కూడా అతడు పెద్దమనిషి అయితే (అందరినీ వేరొక విధంగా ఋజువయేవరకూ పెద్ద మనుష్యులుగానే భావించాలి) దీనివలన ఏ అసౌకర్యం కలుగదు. నొచ్చుకోడు కూడా. ఇటువంటి కుహనాభావాలు, అసహజ ప్రవర్తనలు నాకు నచ్చవు. నాకు పరిచయమైన ఒక ఆంగ్లేయుడు భారతీయులు మావలె స్పష్టంగా లేరు. ఒప్పుకుంటారా అని అడిగాడు. నేను అవును అని అన్నాను. ఈ మితిమీరిన మర్యాద చేసే ప్రవృత్తి మనని అబద్ధాలకోరుగా చేస్తుంది. ఈ ఆశ్రమంలో ఇటువంటి మిధ్యాచరణ నిషేధాన్ని నియమంగా పాటిద్దాం.

*(ఆశ్రమం ఆచరణలు 1959, పుటలు 127-30)*



**అహింస**

అహింసకు శబ్దార్థము చంపకపోవుట. నాకయితే ఇంకా ఎంతో ఉన్నతార్థం స్ఫురిస్తుంది. శత్రువు ఎడలనైనా దురూహలేకపోవుట, ఎవరినీ నొప్పించకపోవుట అహింసా ప్రవృత్తియే. అహింసా పూజారికి శత్రువుండడు. ఎవరైనా నీ పట్ల శత్రుభావం వహిస్తే, వారిని కూడా అభిమానంగా చూడు.

'దెబ్బకు దెబ్బ గాని మీకు నచ్చని పనిని చేసిన వారిపట్ల చిరాకు గాని, అహింస కాదు. చిరాకు అంటే అతనికి తగిన శాస్తి అవాలి అని మనసులో అనుకోడం కూడా హింసయే. ఆశ్రమంలో చేరగోరువారు అహింస విస్తృత పరిధిని గ్రహించి మసలాలి. ఇది మన ఆదర్శం. ఇది వెంటనే సంభవం కాదు. రేఖామితిగణితం కాదు. సద్యో నిర్ణయం. సద్యో ఫలితం సాధ్యం కాదు. దీనిని చేరడానికి ఎంతో మననం అవసరం కాని, దీనిని సాధించిన వానికి ప్రపంచం ప్రణమిల్లుతుంది. అహింసావలంబకుని కోరిక అది కాదు. అయినా జరిగేది అదే. శత్రువు అనుకొనబడిన వాడైనా, మీ నుంచి లభించిన ప్రేమను తిరిగి ఇవ్వాలి. దీని విస్తృత వివరణలో హత్యలు, దేశం కోసం హింసాకాండ నీవారి మాన, ప్రాణాల రక్షణకు ఆయుధీకరణ, వీటికి చోటు లేదు. మనని హింసించదలచుకొన్న వాని చేతిలోనికి స్వయంగా శరణు పోతే, హింస ఉండదు. ఆ పని చేయాలంటే మనోధైర్యం కావాలి. బలప్రయోగంలో పరిమితి ఉన్నది. అటు తర్వాత? అనే ప్రశ్న ఉంది. ఎదురు దెబ్బతీసి, నిన్నూ, నీవారినీ అంతం చేస్తాడు. దెబ్బకు దెబ్బ తీయకపోతే, దెబ్బలు తింటూ, మౌనంగా ఉండిపోతే ఇక ప్రతి క్రియ ఎక్కడ? యుద్ధాలు ఎక్కడ?

*(ఆశ్రమ ఆచరణలు, 1959 పుటలు 130-134)*

★ ★ ★

## బ్రహ్మచర్యం

దేశ సేవకులు, మతసేవకులు, వివాహితులైనా, కాకపోయినా కామ వాంఛ, వాసన త్యజించి, బ్రహ్మచర్య దీక్షను పాటించాలి. వివాహము స్త్రీ పురుషులను సన్నిహితపరచి, జీవితాంతం వచ్చే జన్మలలో కలసి ఉండాలనే వ్యవస్థ. ఇందులో భావుకత లేదు. దీన్ని ఆశ్రమవాసులకు స్పష్టంచేయాలి.

*(ఆశ్రమ ఆచరణ 1959 పుట 134)*

★ ★ ★

నశ్వర పదార్థాల గురించి పాటుపడటం బుద్ధితక్కువ. కొంచెం ఆగి, దీర్ఘంగా ఆలోచిస్తే, శాశ్వతత్వం వైపు మొగ్గు ఉంటుంది.

బ్రహ్మచర్యమంటే బ్రహ్మ వద్దకు చేర్చునది. సంతానోత్పత్తి క్రమబద్ధత కూడా ఇందులో ఒక భాగము. త్రివిధ నియమబద్ధత నిష్టగా ఆచరించాలి. మనసు చెదిరితే, తక్కిన వాటిది అధోగతియే. మంచివాని ఇంటి ముంగిట గంగ పారుతుందట. మనసును చెదరనీయవద్దు. తక్కసవన్నీ అదుపులో ఉంటాయి. ఆరోగ్యంతో, దీర్ఘాయుష్కుడై ఉంటాడు. తలనొప్పి కూడా దరిచేరదు. శ్రమపడినా అయాసం రాదు. ఎప్పుడూ నవ్వుతూ బద్ధకపడకుండా గీతా వాక్యంలో చెప్పినట్టు ధీరోదాత్తుడై ఉంటాడు. ఇట్టి గుణాలు కలవాడు ఒక్కడు లేకపోయినా, చింత వద్దు. బ్రహ్మచారి అంతరంగం, బహిరంగం ఒకేవిధంగా పరిశుద్ధి చెంది ఉంటాయి.

పునరుత్పత్తి సామర్థ్యం గల వీర్యాన్ని కూడబెట్టి, ఊర్ధ్వరేతస్కుడైన వాడు, పైన చెప్పిన శక్తి సామర్థ్యాలు కలిగి ఉండటంలో వింత లేదు. పతంజలి ప్రవచించిన పంచ నియమాలను, వేరుచేసి, అమలు పరచకూడదు. బహుశా, సత్యపాలనలో, తక్కిన నాలుగు ఇమిడి ఉన్నాయి గనుక అది పటిష్టం. ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా వీటిని పదకొండు నియమాలుగా రూపొందించారు. వినోబా భావే మాటల్లో అవి : అహింస, సత్యం, అస్తేయం (దొంగతనం చేయకుండుట), బ్రహ్మచర్యం, అపరిగ్రహం, శ్రమశక్తి జిహ్వాచాపల్య నియంత్రణ, నిర్భీకత, పరమత సహిష్ణుత, స్వదేశీ, అనగా - ఈ దేశపు వస్తువు అని - మనదేశంలో తయారయిన వస్తువులనే (అందునా చేతితో చేసినవి, ముఖ్యంగా పొరుగువారు చేసినవి) వాడుక చేయగలమని ప్రతిజ్ఞ చేయడం, అస్పృశ్యతా నివారణ.

వీటిని సత్యపాలనతో సాధించగలం. కాని జీవితం తిన్నగా ఉండదు. ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించి ఊరుకుంటే చాలదు. సిద్ధాంతానికి ఉపసిద్ధాంతాలను జోడించి అనుకున్నది అయ్యే వరకు, వెంటపడాలి.

ప్రతీ నియమం, ప్రధానమయినదే. ఒకటి భంగమయితే, సమతౌల్యం చెడుతుంది. సత్యాహింసలకు గండికొట్టినా క్షయమే అని జనరంజకమైన విశ్వాసం. అస్తేయం, అపరిగ్రహం అనేవి ఎవ్వరికీ తెలియవు. అందుకని ఆ నియమాలను పాటించం. బ్రహ్మచర్య నియమాన్ని సరదాగా, పాటించీ

పాటించనట్లుండడం కోపాన్ని తెప్పిస్తుంది. విలువలను ఇష్టం వచ్చినట్టు పెంచి, తగ్గించి ఆటాడే సమాజం, లోపభూయిష్టం. బ్రహ్మచర్యం అనేదాన్ని సంకుచితంగా తీసుకోడం, దాన్ని భంగపరచడమే. దీనివల్ల నిజంగా నిష్ఠతో బ్రహ్మచర్యపాలన చేసేవారు. హాస్యాస్పదులై అవమానితులౌతారు. కనుక నియమాలనన్నిటినీ ఒక్క అంశంగా తీసుకోవాలి. అప్పుడే బ్రహ్మచర్యానికి సార్ధకత.

*(హరిజన్ 8-6-47, పుట 180)*

★ ★ ★

**జిహ్వా చాపల్యాన్ని అరికట్టుట**

కామ ప్రకోపాన్ని అరికట్టడం జిహ్వాచాపల్యం లేకుంటే చాలా సులువు. విక్టోరియా వసతిగృహంలో ఎవరి జిహ్వకు ఎలా కావాలో అలా మసాలాలు వాడి వండి వడించేందుకు, అనేక వంటశాలలున్నాయి. అంటే మనము మన జిహ్వా చాపల్యానికి బానిసలమవుతూ వున్నాం. తినేందుకే బ్రతుకుతున్నాం. ఇది పాశవికత. చివరకు, మన రుచికి అనువుగా పదార్థాల తయారీకి సూత్రాలనిచ్చే ప్రకటనలను వెతుక్కుంటూ పోయే పరిస్థితికి దిగజారుతున్నాం. ఇది సరికాదు. ఆలోచించండి.

*(ఆశ్రమంకట్టుబాట్లు అచరణలు, 1959 పుటలు 134-35)*

★ ★ ★

**అస్తేయం**

మనమంతా ఏదోవిధమైన దొంగతనానికి పాల్పడుతున్నాం. ప్రస్తుతం, అవసరం లేని పదార్థాలను సంగ్రహించి ఉంచడం దొంగతనమే. దాని అవసరం ఉన్న వాళ్ళకి అది లభ్యం కాదు గదా! ప్రకృతి మన అవసరాలకు సరిపడేటంత ఉత్పత్తిని, ఎల్లప్పుడు, సమకూరుస్తుంది. అంతకుమించి, ఏ ఒక్కరూ సంగ్రహించక పోతే దారిద్ర్యం ఉండదు. నేను సామ్యవాదినికాను. ఎవరి హక్కునూ హరించమనను. అయితే దానివల్ల కాంతిరేఖ కనుపించదు. అహింస బ్రతుకదు. కనుక ఎవరికి వారే ఆత్మపరీక్ష చేసుకొని. స్వంతలాభం కొంత మానుకు, పరుల కోసం పాటుపడితే, మంచిదికాదూ? మనదేశంలో కోట్లాదిమందికి ఒక్క పూటయినా కడుపునిండా సరి అయిన తిండిలేదు.

వారి కడుపులు నిండేంత వరకు, అవసరానికి మించి ఉంచుకునే హక్కు మనకెవరికి లేదు. అంతేకాదు వారి తృప్తికోసం స్వచ్ఛందంగా మనం మాడినా మంచిదే.

*(ఆశ్రమం కట్టుబాట్లు 1959 - పుటలు 136, 7)*

★ ★ ★

**అపరిగ్రహం**

అస్తేయతలోనిదే అపరిగ్రహం. కావలసిన దానికి మించి తీసుకోరాదు. దాచిపెట్టుకోరాదు. ఆహారం, వస్త్రాలు, గృహ పరికరాలు. ఏవైనా సరే మాట వరసకి, అక్కరలేని ఒక్క కుర్చీ అయినా అట్టిపెట్టుకోగూడదు. దీనితో బ్రతుకు సుకరమవుతుంది.

*(ఆశ్రమం కట్టుబాట్లు - 1959 పుట 113)*

★ ★ ★

**శరీర శ్రమ**

అస్తేయం, అపరిగ్రహం అనుసరించాలి అంటే శరీర పరిశ్రమ ముఖ్యం. కష్టపడి, శరీరారోగ్యం కాపాడుకుంటే, తమను, సమాజాన్ని ఉద్ధరించవచ్చును. తమ పని తామే చేసుకుంటే, అన్నీ లాభాలే. అయితే, శిశువులకు అస్వస్థులకు, అంగవికలులకు, వృద్ధులకు ఈ నియమం లేదు.

*(ఆశ్రమ నియమాల అనుసరణ - 1959 పుట 113)*

★ ★ ★

**స్వదేశీ**

ఇది అత్యావశ్యకం. అందరూ మనసారా ఈ పద్ధతిని అనుసరించాలి. పొరుగువారికి సహాయపడు అనే కట్టుబాటును గాలికి వదలి, ఎవరినో ఉద్ధరించ పూనుకుంటున్నాం. మీకు కావలసిన పదార్థాలను మీరున్నచోటనే పొరుగుపరిచితుడే సమకూరుస్తున్నప్పుడు ఏ బొంబాయి వర్తకుడో మిమ్ములను మభ్యపెడితే, దానికి ఒడంబడుట న్యాయమా? స్వదేశీ అన్న పదంలో నా ఉద్దేశ్యం అది. మీ ఊరి మంగలిని గాలికి వదలి ఏ సెలూన్ నో పోషించడం తప్పు. మీ ఊరి మంగలిని తన కౌశల్యం పెంచుకొనేటట్టు ప్రోత్సహించండి.

పట్టణాలకు పంపి ట్రైనింగు ఇప్పించండి. అంతవరకు ఇంకొకరి వెంటపడరాదు. అదీ స్వదేశీ. ఇండియాలో లభ్యంకాని వస్తువులు వాడటం మానేయండి. అలా ఆలోచించి చేసినపుడు పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్" అనే గ్రంథంలో యాత్రికుడి బరువు దించుకొని సుఖపడిన విధంగా హాయిగా ఉంటారు. భవబంధాల నుంచి బయటపడి హాయిగా ఊపిరి పీల్చుకుంటారు. స్వదేశీ నియమాన్ని అమలు పరచి, స్వేచ్ఛగా ఉండండి.

*(ఆశ్రమ నియమాల అనుసరణ 1959 పుట 137-39)*

★ ★ ★

## నిర్భీకత (భయరాహిత్యం)

నా పర్యటనలో చదువుకున్నవారు భయగ్రస్తులై ఉన్నట్టు గ్రహించాను. నోరు విప్పినపుడు మన అంతర్యాన్ని బయట పెట్టం. గుసగుసలు పోతాం. కాని అందరిముందూ మనసులో ఒకటి, బయటకు వేరొకటి ఇలా బ్రతుకుతున్నాం. మరి పెద్ద మనుషులనిపించుకునే వారందరు ఇంతేనా? ఈ ద్వంద్వం అవసరమే. అనుకున్న దానిని స్పష్టంగా చెప్పడానికి భయమెందుకు? భయమంటూ ఉండాలంటే ఆ పరమాత్మంటే భయపడాలి. సత్యమార్గంలో నడిచేందుకు భయరాహిత్యం ముఖ్యం. గీతా వాక్యం కూడా ఇదే. ఫలితము ఎలా ఉంటుందోనని నిజం చెప్పడానికి వెరుస్తాం. దేవుడంటే భయమున్నవానికి, ఇక వేరేదానిపట్లనూ భయం అక్కరలేదు. మతం, ధర్మం తెలుసుకోవాలంటే, దేశాన్ని ప్రగతిపథంలో నడిపించాలంటే, నిర్భీకత అవసరం. ఇంకొకరు మనను భయపెట్టి లొంగదీసినట్టే మనమూ మనదేశవాసులను చేయచూడటం అనాగరికత. కనుక భయం లేకుండా బ్రతకండి.

*(ఆశ్రమ నియమాల అనుసరణ, 1959 పుటలు 139-40)*

★ ★ ★

## అస్పృశ్యతా నివారణ

హిందుత్వానికి అస్పృశ్యత ఒక మాయని మచ్చ. ఇది ఆది నుండి లేదు. మనం బానిసత్వపుబ్రతుకుల అధమస్థితిలో ఉన్నప్పుడు ఆవరించి, అంటిపెట్టుకొని, నిలిచి ఉంది. అభిశప్తులమైన మనకు, ఇది ఉన్నన్నాళ్లూ

శాపవిముక్తిలేదు. కష్టాలు ఇలాగే ఉంటాయి. మన తప్పులకు శిక్షననుభవిస్తూనే ఉంటాం. ఏదో వృత్తిని అవలంభించిన వాడు అస్పృశ్యుడా? చదువుకున్నవారు కూడా దీనిని సమర్థిస్తే, వారికంటె చదువులేనివారు లక్ష రెట్లు నయం. ఆ చదువెందుకు? తగలెట్టడానికా? ఆలోచించండి.

*(ఆశ్రమ నియమాల అనుసరణ 1959 పుట 140-141)*

★ ★ ★

మౌన వ్రతం

సత్యాన్వేషి మౌనంగా ఉంటే మంచిదనిపించింది. దీని సామర్థ్యంఅవర్ణనీయం. ఆఫ్రికాలో ఒక మిషనరీల ఆశ్రమానికి వెళ్ళినప్పుడు వారు మౌనవ్రతం పాటించడం గమనించి, మౌనవ్రతం ఆశయం ఏమిటని అడిగాను. ఆశ్రమానికి పెద్ద ఇలా సెలవిచ్చారు. "మనం బలహీనులం. అంతరాత్మ మాట వినలేకపోతున్నాం. చెకచెక వాగడం తగ్గించినా కట్టిపెట్టినా, ఆ అంతరాత్మవాణిని విని, బాగుపడతామేమో" అని మా భావన. అప్పుడు నాకు మౌనవ్రత మహిమ తెలిసింది.

*(యంగ్ ఇండియా 6-8-25 పుటలు 274-5)*

★ ★ ★

అతిశయోక్తి, మాట మార్చడం వగైరాల బారి పడకుండా ఉండాలంటే (అసంకల్పితంగానైనా సరే) మౌనమే. సత్య మార్గగామికి శరణ్యం. తక్కువ మాట్లాడేవాడు తూచితూచి అవసరమైనంత వరకే మాట్లాడుతాడు.

*(ఆత్మకథ 1966 పుట 46)*

★ ★ ★

మౌనం, నాకు భౌతికంగా, మానసికంగా, లబ్ధిని చేకూరుస్తుంది. ఒత్తిడిని తగ్గించి, వ్రాత సమయాన్ని పెంచి, మానసికంగా దైవ సాన్నిధ్యాన్ని అనుభవిస్తూ, నేను అన్నివిధాలా బాగుపడుతున్నాను. నేను "మౌనధారణ' ' కొరకు జన్మించినట్టు అనిపిస్తుంది.

*(హరిజన్ 10 - 12 - 38, పుట 373 - 47)*

★ ★ ★

పెదవులు కుట్టుకుని మౌనం వహించడం, మౌనమే కాదు. అలాగైతే, నాలుకను, తెగకోసినా, అదే ఫలితం కలుగుతుంది. మాట్లాడగలిగి, అనవసరంగా మాట్లాడకపోవడమే మౌనవ్రత దీక్ష

*(హరిజన్, 24 6 - 33, పుట 5)*

★ ★ ★

**వినమ్ర భావము**

వినీతుడు కానివాడు, సత్యవాది కాలేడు. సత్య సముద్రం అలల మీద ఈదాలంటే, నీ బరువు శూన్యం కావాలి. ఆవిధంగా కుంచించుకుపోవడమే వినమ్ర భావం.

*(యంగ్ ఇండియా, 31 - 12 - 31, పుట 428)*

★ ★ ★

అహింసాభావము, వినమ్రతకు దారితీస్తుంది. అహింస అంటే నిశ్చలతత్త్వమైన భగవంతుని పట్ల అచంచం విశ్వాసం అతని దయ కావాలంటే, వినమ్రంగా, పశ్చాత్తప్త హృదయంతో, ఆయనను వేడుకోవాలి... పండ్ల భారంతో వంగిపోయిన వృక్షంలా, మనం వంగిపోయి ఉండాలి ఆ ధీరోదాత్త వినమ్రతలో ఎంతో గొప్పతనం యిమిడి ఉంది.

*(యంగ్ ఇండియా, 12 - 1 - 21, పుట 13)*

★ ★ ★

వినీత భావానికి, లోక పరిపాటిగా ఉండే ప్రవర్తనకూ అంతరం తెలుసుకోవాలి. మనసారా కాకున్న ప్రణామం చేయడం, వినమ్రత కాదు, జిత్తులమారివాడు రామనామాన్ని, జపమాల తీసుకొని, జపిస్తూ, సమాజంలో ఋషి, ముని వలె మెలగుతూ, స్వార్థపూరితమైన మనస్సుకలవాడు, వినమ్రుడు కాడు.

వినయశీలుడు తన వినయాన్ని గురించి ఎరుగడు. సత్యానికు మానదండం ఉన్నది. వినయశీలతకు లేదు. పుట్టుకతో వచ్చినవినయం దాగదు. కాని ఆ వ్యక్తికి తనను గురించి తెలియదు. వశిష్ఠ, విశ్వామిత్రులే దృష్టాంతం తాను "శూన్యం" అనిపింపచేసేదే వినమ్రం. "నాకు తెలియును" అనే

భావం రాగానే, అహంభావం ప్రవేశిస్తుంది. వ్రతాలు, దీక్షలు, చేస్తున్నామని అహంకరిస్తే, వాటి విలువ చాలమటుకు హరించపోతుంది. తన గుణగానం, తానే చేయువాడు సమాజానికి ఒక అభిశాపం. సమాజం మెచ్చుకోదు కనుక, అతడికి ఏ లాభమూ చేకూరదు. ఈ బృహత్ప్రపంచంలో, మనం అణువులము. మన అస్తిత్వం క్షణికం. అనంతకాంలో నూరేళ్లనగా ఎంత? ఈ అహంభావాన్ని మట్టుపెట్టి, ఆ అనంత తత్త్వంలో లీనమవడం, అదే ఒక గౌరవం. "నేను ఇది" అనేది నీకూ, దేవునికీ, మధ్య అడ్డుగోడ, ఆగోడ తీసెయ్యి. ఆ పరమాత్మలో సముద్రంలో జలబిందువు వలె ఒక అంశమవుతావు. వేరుగా వుంటే బిందువు ఇరిగిపోతుంది. కలిసిపోతే ఆ బిందువే సముద్రం అయిపోతుంది. జీవితం బుద్బుదప్రాయం అన్న వాక్యంలోని భావమిదే.

సేవావ్రతం, వినమ్రతతో, జత పడి ఉంటుంది. ఇతరులకు సేవచేసేవాడికి, తనను గురించి ఆలోచించేందుకు తీరక చిక్కదు. హిందువులు అలసత్వాన్ని, బద్ధకంగా వుండే ప్రవర్తనను వినమ్రతతో నిరాకరించాలి. పొరపడకూడదు. సర్వకాల సర్వావస్థలలో పరుల సేవచేస్తూ సతమతమవుతూ వుండటమే నిజమైన వినయం. దేవుడు క్షణమైనా తీరిక లేకుండా నిరంతరం పనిచేస్తూ ఉన్నాడు. మనం అతని సేవ చేయాలన్నా, అతనిలో ఐక్యం కావాలన్నా, విశ్రాంతి లేకుండా అతనివలెనే పనిచేయాలి. సముద్రం నుండి వేరయ్యే జలబిందువుకి అవిరి అయిపోయేలోగా, క్షణకాలం విశ్రాంతి దొరుకుతుందేమోగాని, సముద్రంలో గల జలబిందువు నిర్విరామంగా అలలతో చలిస్తూ ఉంటుంది. తప్పదు అదేవిధంగా భగవత్స్వరూపమనే జల సముద్రంలో నిమగ్నులమైతే మనకు విశ్రాంతి ఉండదు. విశ్రాంతి యొక్క అవసరమూ ఉండదు. నిద్ర కూడా ఒక పనియే. అప్పుడు కూడా మనస్సునందు భగవంతుని యోచన మెదులుతూ ఉంటుంది. ఈ అవిశ్రాంతియే నిజమైన విశ్రాంతి. ఇదియే నిశ్చలమైన శాంతికి రాజమార్గం సంపూర్ణమైన ఆత్మ సమర్పణ అవర్ణనీయం. కాని అనుభూతికి మాత్రం అది సాధ్యమే. పరిణతులైన, సమర్పితులైన ఆత్మలకు యిట్టి శాంతి లభిస్తుంది.

మనకూ లభిస్తుంది. అయితే దానికోసం తపస్సు చేస్తూ ఉండాలి.

*(యరవాడ మందిరం నుంచి, 1957, పుటలు 45 - 48)*

★ ★ ★

## అధ్యాయము - 6

# ఆదర్శ మానవుడు

మనస్సును చెదరగొట్టే కోరికలను అణచి తృప్తిగా వున్నవాడు స్థితప్రజ్ఞుడు. సమాధిష్ఠుడు అని అనిపించుకుంటాడు. కష్టాలు వచ్చినప్పుడు చలించడు. ఆనందం కోరడు. పంచేంద్రియాల ద్వారా సుఖదుఃఖాలు, అనుభవానికి వస్తాయి. తాబేలు అపాయ సమయంలో తన తలను అవయవాలను లోనికి ముడుచుకున్నట్లు వివేకవంతుడు ఇంద్రియాలను భోగ వస్తువులను దరికి చేరనీయడు. ఈ అపాయం సదా సర్వదా ఉంటుంది. కనుక శాశ్వతంగా భోగవిలాసాలను బహిష్కరిస్తాడు. ఇది సతతమూ సాగే సంగ్రామం. తపస్సుతో కృశించుట, ఉపవాసదీక్షను ఆయుధంగా వాడి కొందరు పరిమితమైన ఫలాన్ని పొందుతారు. దీక్షానంతరం జాగ్రత్తగా వుండకపోతే ఇంద్రియాలు గెలుస్తాయి ఉపవాస దీక్షలో ఉన్నపుడు, నిగ్రహంతో, ఇంద్రియాలు బంధింపబడి ఉంటాయి. అయితే ఉపవాస మొక్కటే ఇంద్రియాల భోగలాలసతను శాశ్వతంగా దూరం చేయదు. దీక్షను చాలించిన తరువాత ఇంద్రియేచ్ఛ ఉధృతమవుతుంది. అప్పుడు దేవుని దయవల్లనే, మనకు నిగ్రహం అలవడి శాంతి లభిస్తుంది. ఇంద్రియాలు చాలాశక్తివంతమైనవి. జాగరూకుడు కాని వానిని అవి దిగజారుస్తాయి. కనుక వాటిని ఎప్పుడూ అణచిపెట్టి ఉంచాలి. అంతర్ముఖుడై దైవాన్ని కొలిచే వానికి ఈ బాధ తప్పుతుంది. అంటే 'నేను' అనే భావాన్ని త్యజించి "నీవే దిక్కు" అని ధ్యానిస్తే ఇంద్రియాలు గతి తప్పవు. ఆ యోగికి అట్టి ఏకాగ్రత లేనినాడు అంతా వ్యర్థమే. అతనికి భోగలాలసత పెరిగి, అది తీరకపోతే కోపం వచ్చి, ఉన్మాదియై విచక్షణను కోల్పోయి నశిస్తాడు. ఇంద్రియాలు మానవుని తమ యిష్టం వచ్చినట్లు నడిపించి, చుక్కాని లేని పడవను చేస్తాయి. తుఫానులో

కొట్టుకొని పోయి కొండను ఢీకొని పడవ తునాతునకలైపోతుంది కనుక మానవుల అవాంఛితమైన ఆచరణను అభ్యాసం చేసుకోకుండా ఉండటానికి తమ వాంఛలు వదులుకొని ఇంద్రియాలను నిగ్రహించుకొవాలి. కళ్లతో, చెవులతో, కరచరణాదులతో భగవంతుని ధ్యానించాలి. అప్పుడు అవే ఇంద్రియాలు సహకరించి ఏకాగ్రతను కలిగిస్తాయి. భగవంతుని దయవల్ల కష్టాలు తీరుతాయి. మంచులా కరిగి బాధలు, నొప్పులు ఇక్కట్లు కలిగించవు. ఏకాగ్రత లేనివాడు అంధుని వలె తడబడతాడు. ప్రాపంచిక సుఖాల అనుభవం గలవాని తెలివితేటలు 'మంచివి' అనుకున్నవి జ్ఞానికి ''మంచివి'' కావు. నదుల యందలి బురద నీరు సముద్రంలో కలిసినా సముద్రం నిర్మలంగా, నిశ్చలంగా ఉన్నట్లు, యోగిని ఇంద్రియ సుఖాలు కదిలించవు. కొరికలను త్యజించినవాడు స్వార్ధగుణం, గర్వము లేనివాడై శాంతి పొందుతాడు. అతడు పూర్ణ మానవుడు. ఆ దయాసముద్రుడు అతనిని ఆఖరు క్షణంలో కూడా రక్షిస్తాడు.

*(గీతోపన్యాసాలు. 1960, పుటలు 11 - 13)*

★ ★ ★

భగవద్గీత రెండవ అధ్యాయంలో పేర్కొనబడిన ఆ స్థితప్రజ్ఞుడే నాకు ఆదర్శం. ఇతరులు నన్ను గురించి ఏమి చెప్పినా, నేను యింకా ఆ స్థితికి ఎంతో దూరంలో ఉన్నాను. ఆ స్థితికి చేరినవారిలో దైవీశక్తి వ్యాప్తమై అతని ప్రతి చర్యా అందరిని ప్రభావితం చేసి, మంచి మార్పు కలిగిస్తుంది. అట్టి ఆదర్శ సిద్ధి కొరకే నా ప్రయత్నం సాగుతున్నది. అందరివలెనే నేను మట్టి మనిషిని. నిరంతర ప్రయాసతో గమ్యం చేరుతాననే ఆశ నాకు ఉన్నది.

*(హరిజన్ 23, పుట 74)*

★ ★ ★

సతతము వివేకవంతుడుగా వుండే స్థిత ప్రజ్ఞుడగు సత్యాగ్రహి ఎవ్వరినీ శత్రువుగా భావించడు. ఇది మునులకు, యోగులకు మాత్రమే పరిమితమైన పదవి కాదు. ఫోనెక్స్ ఆశ్రమంలో శారీరకంగా భంగీ (పాకీ) నైనాను. చీపురు, బకెటు చేతబట్టాను. ఇప్పుడూ నన్ను నేను

అధమాధముడననుకుంటున్నాను. అంటే భంగీ అధమాధముడు కాదు సుమా! మాటవరుసకి అందరి దృష్టిలో అతనిని అలా పరిగణించడం జరుగుతున్నది. కనుక అందరికీ అర్థంకావడానికి ఆ శబ్దం వాడాను. అట్టి వానికి కూడా నిరంతరం ప్రయత్నం చేస్తే 'స్థితప్రజ్ఞత' సాధ్యమే.

మనకందరికీ, ఎప్పుడో ఒకప్పుడు మతిభ్రష్టత, ఉన్మాదం రావచ్చు. స్థితప్రజ్ఞునికి మాత్రం, కోపం, ద్వేషం ఉండవు. శాంతి, సహనం ఉంటాయి. స్వధర్మాన్ని ఓపికగా అనుసరిస్తాడు. అయితే ఆ అనుసరణ మరో మెట్టు అందుకునేందుకు ఉపకరిస్తుంది అనే భావన లేకుండా చేస్తాడు. అదేదో ఒక అర్హతగా భావించిననాడు, మత ధర్మాలకు ప్రతిష్ఠ కలిగిస్తాడు. దానితో దిగజారడం ప్రారంభమవుతుంది.

*(హరిజన్, 14 - 4 - 46, పుట 78)*

★ ★ ★

భగవద్గీత సందేశం సన్యాసులకు కాదు, గృహస్థులకే, నిర్భయంగా తన ధర్మం నిర్వహిస్తే, ఇది సాధ్యమవుతుంది.

*(హరిజన్, 5 - 1 - 47, పుట 479)*

★ ★ ★

ఈ ఆదర్శాన్ని అనుసరించడం అసాధ్యమా? కాదు, కానేకాదు. అందులో చెప్పిన నడవడిక, మానవులకు గౌరవప్రదమైనది.

*(హరిజన్, 28 - 4 - 46, పుట 111)*

★ ★ ★

సమతౌల్య స్థితిని చేరుకునేందుకు ఇంకా చాలా దూరంలో ఉన్నాను. నా ప్రయత్నాలింకా ఫలించలేదని ఒప్పుకొంటున్నాను.

*( హరిజన్, 10 - 8 - 47,పుట 270)*

★ ★ ★

శరీరధారి భవబంధితుడై "అహంకారం" నుంచి ముక్తుడు కాజాలడు. ఆ ముక్తి లభించనంత కాలం పరిపూర్ణతా సిద్ధి కలుగదు.

*(యంగ్ ఇండియా. 20 - 9 - 28. పుట 319)*

★ ★ ★

ఈ దేహ పంజరంలో బందీలై ఉన్నంతవరకు, సంపూర్ణ సత్యవగాహన అసాధ్యం.

*(యరవాడ మందిర్ నుంచి, 1957. పుట 5)*

★ ★ ★

గమ్యం దూరంగా జరిగిపోతున్నా ఆ దూరం ఎంత ఎక్కువ అయితే, మన అనర్హత కూడా అంతదేనను గుర్తింపు కలుగుతుంది. ప్రయత్నంలో ఉండే తృప్తి, సాఫల్యంలో ఉండదు. పూర్తి ప్రయత్నమే పూర్ణ విజయం.

*(యంగ్ ఇండియా. 9 - 3 - 22, పుట 141)*

★ ★ ★

# భాగము - 2

## అధ్యాయము - 7

## మార్గాలు - గమ్యాలు

నాకు మార్గం తెలిస్తే చాలు. మార్గమూ, గమ్యమూ నాకు ఒక్కటే.

*(యంగ్ ఇండియా. 26 - 12 - 24, పుట 424)*

★ ★ ★

మార్గం బీజమైతే, గమ్యం వృక్షం. రెండిటికీ అదే అవినాభావసంబంధం.

*(హింద్ స్వరాజ్. 1962, పుట - 71)*

★ ★ ★

మార్గమే కదా అని పెదవి విరుస్తారు. మార్గమే సర్వస్వమంటాను నేను. మార్గం ఎటువంటిదైతే, గమ్యం అటువంటిదే అవుతుంది. వాటిమధ్య అడ్డుగోడ లేదు. దారి మీద మనకు కొంచెం పట్టు ఉన్నది గాని ఫలితం మీద లేదు. గమ్యం చేరుకోవడం, దారికి సరియైన అనుపాతంలో ఉంటుంది. ఈ ప్రతిపాదనకు అపవాదం లేదు.

*(యంగ్ ఇండియా. 17 - 7 - 24, పుట 236)*

★ ★ ★

సరియైన నడవడి, యూక్లిడ్ ప్రవచించిన సరళరేఖగాదు. వేరు వేరు ఆకులున్న చెట్టు అది. ఒకే బీజానికి పుట్టినా చెట్టుభాగాలన్నీ తమతమ ప్రత్యేకతలను సంతరించుకున్నాయి. పువ్వులతోనున్న చెట్టు యొక్క అందమే వేరుగా ఉంటుంది.

*(యంగ్ ఇండియా. 14 - 8 - 24, పుట 267)*

★ ★ ★

దీర్ఘ చతురస్రపు ఫలకంలో ఏకొంచెం గడబిడ జరిగినా, అన్ని లంబకోణాలుగా ఉండే బదులు, తక్కువ, ఎక్కువ కోణాలవుతాయి. ఫలకాన్ని సరిచేస్తే మళ్ళీ అన్నీ లంబకోణాలవుతాయి.

*(హరిజన్, 30 - 11 - 47, పుట 447)*

★ ★ ★

అపవిత్ర మార్గాన, అపవిత్రగమ్యం సిద్ధి అవుతుంది. అసత్యమార్గంలో సత్యమును చేరలేము. దానికి సత్యమార్గమే గతి. అహింస. సత్యం కవలల జంట అన్న దానికి జవాబు "కాదు" అహింస, సత్యంలో నిబిడీకృతం, సత్యం కూడా అహింసతో అలాగే వుంది. ఒక నాణెపు రెండు వైపులవి. నాణెంపై లిపి వేరైనది. కాని విలువ ఒక్కటే. పూర్ణపవిత్రత లేకపోతే ఆశీస్సులందుకున్న పావన ప్రదేశం అందదు, మనస్సులో కక్ష, కార్పణ్యం ఉంటే, అసత్యం హింస మీలో ఉన్నట్లు అనుకోవాలి.

*(హరిజన్, 13 - 7 - 47, పుట 232)*

★ ★ ★

"కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన" అనే గీతా వాక్యంలో పని చేయడమే నీ కర్తవ్యం, ఫలాపేక్ష కాదు. అని చెప్పారు.

*(హరిజన్, 18 - 8 - 40, పుట 254)*

★ ★ ★

మనం ఆ పరమాత్మ చేతిలో బొమ్మలం, ఏది మనను ప్రగతి

పథంలో తీసుకుపోతుందో, ఏది మనకవరోధమో తెలియదు. కనుక మార్గం సవ్యంగా ఉండేటట్టు చూసుకుంటేచాలు. గమ్యం సరి అవుతుంది.

*(దక్షిణాఫ్రికా సత్యాగ్రహం, 1950, పుట 318)*

★ ★ ★

సరియైన గమ్యాన్ని ఎంచుకొని ఏర్పాట్లుచేసుకున్నా, అది అమలు అయే మార్గం తెలియకపోతే పనికాదు. అందుకని నేనుపథకం సఫలమయే మార్గాన్ని జాగ్రత్తగా అనుసరిస్తాను. ఆ దారిన ముందుకు సాగే ఏర్పాట్లు సరిగా ఉంటే, గమ్యం నిశ్చితం. దారిలో ముళ్ళు లేకుండా చూసుకుంటే, దరిని చేరి తీరతాం.

*(గాంధీ రచనల నుంచి 1957, పుట 36 - 37)*

★ ★ ★

ఆశయాల గురించి సానుభూతి ఉన్నా వాటి సిద్ధికి హింసావలంబనను తీవ్రంగా ప్రతిఘటిస్తాను... అసత్యం, హింస, వీటి సాయంతో శాశ్వతమైన మంచి లభ్యం కాదు, నా అనుభవం మీద గ్రహించిన ఈ సూత్రాన్ని "కల' ' అనుకుంటే "అందమైన కల" అంటాను.

*(యంగ్ ఇండియా, 11 - 2 - 24, పుట 406)*

★ ★ ★

దారి సరిగా వుంటే, అంతం సరిగానే ఉంటుంది. అహింసామార్గంలో పూర్ణస్వాతంత్ర్యం లభించడం ప్రతిదేశానికి సాధ్యమే.

*(హరిజన్, 11 - 2 - 39, పుట 8)*

★ ★ ★

ఖడ్గంతో సిద్ధించే లబ్ధి ఖడ్గంతోనే పోతుంది అనే నా నమ్మకం ఎప్పటికీ నశించదు.

*(హరిజన్, 2 - 9 - 39, పుట 260)*

★ ★ ★

ఆశయపవిత్రత ఉన్నప్పుడు అనుకున్న ఫలితం వచ్చినా రాకపోయినా, చింతంచకుండుట. "సరిమైన దారిని పోవాలి. ఫలితం దైవాధీనం అనాలి,

అన్నీ సరిగ్గా ఉంటాయి."నిస్సంగత్వమంటే విశ్లేషణ యిది.

*(హరిజన్, 7 - 4 - 146. పుట 72)*

★ ★ ★

జయం, అపజయం మన చేతుల్లో లేదు. మన పాత్రను సరిగా నిర్వహిద్దాం... సాధన మాత్రమే మనది. సిద్ధి ఆ పరమాత్మ ఇచ్చు ప్రకారమే లభించగలదు.

*(హరిజన్, 12 - 1 -47, పుట 490)*

★ ★ ★

**అధ్యాయము - 8**

# అహింస నిర్వచనం

భౌతికమైనది కాక పారమార్థికకమైన ప్రేమ దేవుని చూపుతుంది.

*(హరిజన్, 23 - 11 - 47, పుట 425)*

★ ★ ★

ప్రేమలో దేవుడున్నాడు.

*(దక్షిణాఫ్రికా సత్యాగ్రహం, 1950, పుట 237)*

★ ★ ★

అహింస అంటే అందరి పట్ల విశ్వవ్యాప్తమైన ప్రేమ.

*(యరవాడ మందిరం నుండి, 1957.పుట 10)*

★ ★ ★

సెయింట్ పాల్ నిర్వచించినట్లు మాత్రమే కాక అంతకుమించినది ప్రేమ. "అహింస"లో "మానవులు" మాత్రమే కాదు. జీవకోటి అంతా ఉంది. ఇంగ్లీషు మాట "లవ్" అంటే వాసనాది అర్థాలు కూడా స్ఫురిస్తాయి. కనుక హింసకు వ్యతిరేకమైన అహింస అనే నిషేధాభిధనాన్ని ఉపయోగించాను. అయితే ఇందులో వ్యతిరేకమైన శక్తి లేదు. అన్ని శక్తులకతీతమైన యోగశక్తియిది.

*(హరిజన్, 14 - 3 - 36,పుట 39)*

★ ★ ★

అహింస దైవిక శక్తి. మనం అహింసను ఎంతనేరిస్తే, అంతగా దేవుని వలె అవుతాము.

*(హరిజన్, 12 - 11 - 38, పుట 326)*

★ ★ ★

అహింస అంటే అపాయం కలిగించకుండటం మాత్రమే కాదు. అపకారికి కూడా ఉపకారం చేయమని ఉద్బోధించే సకారాత్మక ప్రక్రియ అహింస. అయితే పాపి పాపాలు చేస్తూంటే చూస్తూ ఊరుకోవడం సరి కాదు. పాపకర్ముడికి దూరంగా ఉండడం, దానివల్ల పాపికి కష్టం, నష్టం కలిగినా సరే - అహింసలో ముఖ్యాంశం. నా కుమారుడు పాపి అయితే నేను వానిని సమర్థించను. నాకు వాని పట్ల నిజంగా ప్రేమ ఉంటే అతనికి చావు మూడినా అతనికి నాసహాయము లభించదు. ఆ ప్రేమ మూలంగానే, పశ్చాత్తప్తుడైననాడు అతనిని నా అక్కున చేర్చుకొని సేద దీరుస్తాను. "దారి తప్పిన కుమారుడు" అనే కథలో కూడా ఇదే ఉన్నది. బలవంతంగా హింసతో, అతనిని మంచివాణ్ణిగా మార్చేందుకు ప్రయత్నించను.

*(యంగ్ ఇండియా, 25 - 8 - 20 పుట 2)*

★ ★ ★

సకారాత్మకార్థంలో "అహింస" అంటే నా శత్రువును కూడా ప్రేమించగలుగుట అను ఔదార్యము, నా తండ్రి, నా కుమారుడు వీరి యెడల ఏ నియమాలు పాటిస్తానో, నా శత్రువు యెడల కూడా అవిధంగానే మెలగవలెను. దీనిలో సత్యం భయరాహిత్యము ఉంటాయి. తమకిష్టమైన వానిని మోసగించలేరు. కనుక అతనంటే భయముండదు. అతనిని భయపెట్టరు. ప్రాణదానం అత్యుత్తమం. ఆ దానం నిజంగా చేస్తే ఎవరూ శత్రువులుండరు. గౌరవనీయమైన అవగాహన కుదురుతుంది. భయగ్రస్తుడే దానాన్నివ్వలేడు. కనుక తాను నిర్భీకుడై ఉండాలి.

*(మహాత్మాగాంధీ రచనలు, ఉపన్యాసాలు, నాల్గవ కూర్పు, పుట 346)*

★ ★ ★

మనను ప్రేమించే వారిని తిరిగి ప్రేమించుట అహింస కాదు. మనను ద్వేషించే వారిని ప్రేమించుటయే అహింస. ఈ మహత్తర ప్రేమ

సూత్రాన్ని అనుసరించుట ఎంత కష్టమో, నేనెరుగుదును, అన్నీ మంచి పనులు, గొప్ప పనులు, వీటి సంగతి అంతే కదా. ద్వేషించిన వానిని ప్రేమిచండమనేది, దుష్కరతమము, కాని పూనికతో ఆచరిస్తే, ఈ విషయం కూడా భగవంతుని దయవలన ఆచరణ సాధ్యమే.

*(గాంధీ రచనల నుండి ఎన్నిక చేయబడినది, 1957, పుట 17)*

★ ★ ★

## అధ్యాయము - 9

# మానవజాతి నియమము (విధానము)

హింసతో నిండియున్న ఈ ప్రపంచంలో "ప్రతి పంటిలోనూ, ప్రతి గోటిలోనూ, రక్తవర్ణం" గోచరిస్తుంది. మానవుడు పశువు కంటె ఉత్తమజాతికి చెందినవాడు. మానవునిలో దైవాంశమే అహింస, హింసావృతమైన పరిసరాల్లో, మానవుడు తాను అహింసావ్రతుడైనంత వరకే తన అస్తిత్వమని చాటిచెప్పాలి. తన సహజప్రవృత్తి అహింస అనీ, తన శరీరాన్ని ఈ ఆత్మ బోధను వ్యక్తీకరించేందుకు మాత్రమే ఉపయోగిస్తానని చెప్పాలి. కోప, ద్వేషాది, ఇంద్రియ ప్రవృత్తులు పరిహరించి తన విధిని నిర్వర్తిస్తానని చెప్పాలి. పిరికితనాన్ని బలహీనతను, నిగ్రహించి, మానవ స్వభావమైన అహింసను పెంపొందించగలనని విశ్వాసంతో వక్కాణించాలి.

*(యంగ్ ఇండియా, 24 - 6 - 26, పుట 230)*

★ ★ ★

అహింస పర్వత గుహలలో నివసించే ఋషులకు మాత్రమే పరిమితం కాదు. అందరికి ఇది సాధ్యమే. మానవజాతికిది సహజం. తనలో పశుత్వాన్ని వర్జించాలి. దీని కోసం అహింస పట్ల నమ్మకం మాత్రమే చాలదు. అహింసావ్రతి కావాలి. నేను మనసారా నమ్మినప్పుడు, ద్వంద్వం ఉండదు, ధైర్యంగా అనుకున్నది చేయుట ఉంటుంది. నిప్పు, నీరు వలె అహింస, భీరుత్వం ఒకదాని కొకటి ఘాతుకాలు.

*(హరిజన్, 4 - 11- 39,పుట 331)*

★ ★ ★

నేను స్వాప్నికుడను కాను. నేను ఆదర్శాలను అమలుపరుస్తాను. హింస పశుసహజమైన విధంగానే అహింస మానవులకు జన్మసిద్ధమైన సహజగుణం. పశువులోని ఆత్మసుప్త స్థితిలో ఉండి. దేహబలాన్ని, తప్ప వేరెట్టి అంశాన్ని తెలుసుకొనలేదు. హింసావృతమైన సృష్టిలో ఆత్మబలం పరిపుష్టమైన అహింసను గుర్తించిన మహర్షులు, న్యూటనును మించిన వివేకం గలవారు. వెల్లింగ్టనును మించిన వీరులు, ధీరులు, వారు ఆత్మ బోధను కలిగించారు.

*(యంగ్ ఇండియా. 11- 8 - 20.పుట 3)*

★ ★ ★

1. అహింస మానవ జాతికి సహజ ప్రవృత్తి. పశుబలాన్ని మించినది.
2. దేవుని ఆదేశమైన ప్రేమను నమ్మనివారికి, ఆఖరు దశలో అహింస అక్కరకురాదు.
3. ప్రతివ్యక్తికీ ఉన్న అభిమానం అతని ఆదర, గౌరవాలను పరిరక్షిస్తుంది. కాని ఆస్థి హక్కులను మాత్రం రక్షించలేదు. అయితే ఆ పనికి కూడా అహింస, ఇతరములైన శస్త్రాస్త్రముల కంటే ఎక్కువ ఉపయుక్తం.
4. తమ గౌరవాన్ని తప్ప, తక్కువ వాటినన్నిటినీ, అహింసా వ్రతులు త్యాగం చేయాలి. ఆధునిక సామ్రాజ్యవాదం, తన రక్షణకు హింసావలంబి కనుక, పరదేశాల ఆక్రమణతో ముడిపడినచో అహింసతో, పొత్తుకుదరదు.
5. దేవుని ప్రేమసిద్ధాంతాన్ని నమ్మి మానవులనందరినీ అభిమానించే ప్రతి వ్యక్తీ (చిన్నా, పెద్దా, ఆడా, మగా, ఆబాలగోపాలం) అహింసను అనుసరిరంచగలరు. అహింసను బ్రతుకుటకు స్వీకరించాక, అర్థాంగీకారాలకు అర్థం లేదు.
6. వ్యక్తికి మంచిదైన అహింస, మానవజాతికి మంచిదా కాదా అను మీమాంస అనుచితం.

*(హరిజన్. 5 - 9 - 36. పుట 236)*

★ ★ ★

దైనందిన జీవితంలో, అసంకల్పితంగా, ఒకరితోనొకరు, పారస్పరికంగా, అహింసా మార్గాన్నే అవలంభిస్తున్నాం. విధ్వంసక విషయాల మధ్య ఇంకా ఉన్నాం. అంటే విధ్వంసాన్ని మించిన సంగతి ఉన్నట్టే కదా. ఆ మహత్తర సూత్రాధీనమై మనం ప్రగతి పథంలో పయనిస్తున్నాం. బ్రతుకుబాట అదే అయితే ఇంక ఆలొచన ఎందుకు? ప్రత్యర్థిని ప్రేమతో పరిచయం చేసుకో నా బ్రతుకు ఇట్టే గడిచింది. నా సమస్యలన్నీ తీరినట్టు కాదు కాని ప్రేమసూత్రం విధ్వంసం చేయనంత మేలు చేసింది.

*(యంగ్ ఇండియా, 1 - 10 - 31,పుట 286)*

★ ★ ★

సమాజ నిర్మాణం, అహింసను మనసారా అంగీకరించడం ద్వారా, జరుగకపోయినా, తమ తమ సత్యాలను పారస్పరిక ఆమోదంతోనే నిలుపుకోగలుగుతున్నారు. అలా కానినాడు మహాక్రూరులు కొద్దిమంది మిగిలి ఉండేవారు. కుటుంబాలు, సమాజాలు, దేశాలు ఈ ప్రేమబంధంతోనే మనగలుగుతున్నాయి. అయితే దీన్ని శ్రద్ధగా పరిశీలించే వివేక బుద్ధి అలవడలేదు.

*(హరిజన్. 22 - 42 - పుట 48)*

★ ★ ★

అణువులలో సంయోగశక్తి ఉన్నది. కనుకనే కణాల నిర్మితి అయినా ఈ విశ్వం ముక్కలు కాకుండా ఉన్నది. జీవపదార్థాలకు సహజమైన ఈ శక్తి ప్రేమ. తండ్రి కొడుకూ, సోదరసోదరీమణులు, మిత్రులు, వీరిని ఈ శక్తిపట్టి ఉంచుతుంది. ఈ శక్తిని సర్వజీవులకు సర్వాంగీణం చేయాలి. అంటే భగవత్ జ్ఞానం ఉండాలి. ప్రేమ ఉన్నచోట జీవం ఉన్నది లేనిచోట వినాశానికి దారి తీస్తుంది.

*(యంగ్ ఇండియా, 5 - 5 - 20 పుట 7)*

★ ★ ★

మన ఆస్తిత్వానికి మూలధారమైన ప్రేమ సూత్రానికి ప్రతీకలు మహర్షులు, మునులు, సత్పురుషులు, పశుత్వపు కోపానికి లోనవుట తథ్యమే అయినా, ప్రేమ సూత్రం లేదు అనలేము. అహింసావ్రత దీక్షకరినం.

అహింస, ప్రేమమార్గం విశ్వవ్యాప్తం అయిననాడు, దేవుడు స్వర్గంలో వలె, భూమిమీద కూడా రాజ్యంచేస్తాడు. భూమి మనది, మనమెరిగినది. మరి మనలో స్వర్గమో? కొందరికి పనికి వస్తుంది.

*(హరిజన్, 26 - 9 - 36, పుట 260)*

★ ★ ★

ఈ ప్రేమ మార్గ ప్రతిపాదనను నిరూపించిన వాడు, ఆధునిక శాస్త్రజ్ఞులను మించిన వాడు. మన ప్రయోగాలు ఇంకా అందరికీ అందుబాటులో లేవు అని ఒక భ్రమ నాకు ఉన్నది. అమలులో ఈ విషయం నన్నెంతో తృప్తిపరుస్తుంది.

*(యంగ్ ఇండియా, 1 - 10 - 31, పుట 287)*

★ ★ ★

మొత్తం మీద బ్రతుకుతున్నారు. అన్న నిజం ప్రేమ సూత్రప్రేరణను ధృవపరుస్తూంది. ద్వేషాలదులది పైచేయి అయి ఉంటే, మనం మిగిలి ఉండి ఉండము. కాని, "హింస" యే మూలాధారం అనే భావనతో, దేశాలుబ్రతుకును ఈడుస్తున్నాయి. కాని ఇది సరికాదని నా ప్రయోగాలు నిరూపిస్తున్నాయి.

*(హరిజన్, 13 - 4 - 40, పుట 90)*

★ ★ ★

ఈ విశ్వంలో శాశ్వతమైనది ప్రేమబంధమే. చరిత్ర, తగవులు, యుద్ధాలనే క్రోడీకరిస్తుంది. స్నేహబంధాన్ని కాదు. అనేక గ్రామాలు పట్టణాలు ప్రేమ బంధంవల్లనే తగవులు మాని నిలిచి ఉన్నాయి.

*(ఆశ్రమ సోదరీమణులకు బాపూలేఖలు, 1960, 113)*

★ ★ ★

చరిత్రను జాగ్రత్తగా పరిశీలిస్తే, మానవుడు అహింస వైపు అగ్రసరుడు కావడం కనిపిస్తుంది. మన పూర్వీకులు మానవ మాంస భక్షకులు. తరువాత "వేట" మొదలయింది. సతతం పరిభ్రమించే వేటకాని బ్రతుకుపై విసుగు కల్గింది. వ్యవసాయ ప్రారంభం పుడమితల్లి కరుణతో పొట్టపోసుకోవడం

మొదలయింది. పరిణామదశలో మనిషి సంచారియై స్థిరపడి, నాగరికుడై, దేశాలను, జాతులను ఏర్పరచుకొని, "హింస" కు ప్రతిగా "అహింస"ను నిలబెట్టి ఉద్ధరింపబడ్డాడు

*(హరిజన్, 11 8 - 40. పుట 245)*

★ ★ ★

అసాధ్యమైనవి సాధ్యం కావడం సంభవమేనని అనేక దృష్టాంతాలు నిరూపిస్తున్నాయి. విజ్ఞాన శాస్త్ర విజయాలు, మన మనుగడకు సంబంధించిన ప్రేమ సూత్రం ముందు దిగదుడుపు. వాద వివాదాల వలన దీని నిరూపణ జరుగదు. త్యాగపూర్ణమైన జీవితాలు గలవారే నిరూపించగలరు. అందుకు అందరం సిద్ధం కావాలి.

*(హరిజన్, 26 - 9 - 36.పుట 260)*

★ ★ ★

అహింసవైపు పురోగతి ఉందని ఒప్పుకుంటే, ఇంకా కావలసినది ఉన్నది అనికూడా గ్రహించాలి. ఏదీ స్థాణువుకాదు. ప్రతిదీ జంగమమే. ముందుకో వెనకకో కదలడం జరుగుతూనే ఉంటుంది. దేవుడు తప్ప వేరెవ్వరు చక్రనేమి క్రమ బారినుంచి బయటపడలేరు.

*(హరిజన్, 11 - 8 - 40.పుట 245)*

★ ★ ★

## అధ్యాయము - 10

# అహింసా శక్తి

భూమిపైనా, ఆకాశంలోనూ అహింసయే మానవజాతిని ఉద్ధరిస్తుంది. హింస తాత్కాలికంగా ఫలప్రదం అయినట్లు కనిపించినా చివరికి అది చేసేది కీడేనని, అందరూ తెలుసుకోవాలి.

*(యంగ్ ఇండియా, 21 - 5 - 25, పుట 178)*

★ ★ ★

అహింస అప్రతిహతమైన ఆయుధం. వినాశంధ్యేయం కాదు.

మానవుడు చచ్చి బ్రతుకుతాడు. ఇతరులను చంపి బ్రతుకడు. కనుక ఏ విధమైన హింస కాని చంపుట గాని మానవజాతికి తలపెట్టిన పెద్దనేరము.

*(హరిజన్. 20 - 7 - 35. పుట. 180)*

★ ★ ★

గత ఏబది ఏండ్లుగా, ఎంతో జాగ్రత్తతో, పటిష్టంగా అహింసాసిద్ధాంతాన్ని అనుసరించాను. ఇంట్లో, సంస్థలో ఆర్థిక, రాజకీయ రంగాలలో దానినమలు పరిచాను. దానికి నా పొరపాట్ల వలన తప్ప ఎక్కడా అపజయం లేదు. దేవునికి మారుపేరైన సత్యాన్ని అన్వేషిస్తున్నాను. ఈ అన్వేషణలో "అహింస' ' నాచేతికి చిక్కింది. నా ధ్యేయం అయింది దాని కొరకే నేను బ్రతుకుతున్నాను.

*(హరిజన్. 6 - 7 - 40. పుట 185 - 86)*

★ ★ ★

అద్భుతాల యుగంలో, క్రొత్తసిద్ధాంతాన్ని ఎప్పుడూ తృణీకరించడం జరుగదు. కష్టసాధ్యం, అసాధ్యం అవదు. అన్నీ సాధింపబడుతున్నాయి. 'అహింసా' మార్గంలో అనేక విషయాలను కనిపెట్టడం జరుగుతుందని నేను గట్టిగా చెప్పగలను.

*(హరిజన్, 25 - 8 - పుట 260)*

★ ★ ★

"అహింస" ఒక విజ్ఞానమే. అంధవిశ్వాసం గాదు, కనుక అహింసకు అపజయం అన్నది లేదు. అపజయం కలిగితే అది జయం కలిగేందుకు మొదటి మెట్టు.

*(హరిజన్. 6 - 5 - 39, పుట 113)*

★ ★ ★

అహింస, రేడియం వలె, దుష్టత్వాన్ని రూపుమాపి సతతం ఆరోగ్యాన్ని నిలబెట్టి పెంచే గుణం కలది.

*(హరిజన్. 12 - 11 - 38. పుట 327)*

★ ★ ★

జీవాన్ని తినే జీవమై, రక్తంచిందించే తగాదాల మయమై జీవిస్తున్నాం.

సత్యమూలకాన్ని తెలుసుకున్న మహర్షులు. "తోటి వారికి సాయపడి తన బ్రతుకును ఉద్ధరించునది. అహింసా వ్రతంతోనే. ఇంకో విధంగా కాదు, విద్యుచ్ఛక్తిని ఈధరును మించినదీ శక్తి. అహింసా వ్రతం కేంద్రబిందువుగా స్వయంకృషి ఉంటుంది.

*(హరిజన్, 14 - 3 - 36, పుట 39)*

★ ★ ★

## అధ్యాయము - 11

# అహింసా పూజారుల గుణగణాలు

మరణశయ్యపై నుండి కూడా చిరునవ్వు చిందిస్తారు. అహింసాయుధంతో మాత్రమే, శత్రువులను నిర్జించి వారిని దగ్గరకు తీస్తారు.

*(హరిజన్, 2 - 8 - 1940, పుట 19)*

★ ★ ★

అహింస బలవంతుల ఆయుధం. బలహీనుల వద్ద అది మిథ్యా ప్రదర్శన. భయం, ప్రేమ వ్యతిరేకభావాలు ప్రతిఫలాపేక్ష లేకుండా, ఉన్నది ఇవ్వడమే ప్రేమ, ప్రేమ తనతోనూ, ప్రపంచంతోనూ పోరాడి విజయాన్ని సాధిస్తుంది. సత్యమార్గంలో, అహింసను అనుసరిస్తే బ్రతుకు తిన్ననై, సమస్యలు సమసిపోతాయి.

*(యంగ్ ఇండియా, 1 - 10 - 1931, పుట 287)*

★ ★ ★

వ్యతిరేక శక్తుల మేళవింపు శక్తి నష్టం కాదు. ఇది యంత్రాలకు మాత్రమేగాక, మానవుల చర్యలకు కూడా వర్తిస్తుంది. యంత్రాల విషయంలో గణించి, గుణించి, ఫలితం ఎలా ఉంటుందో చెప్పగలం. మనంచేసే పనుల విషయంలో అది సాధ్యం గాదు. మన అజ్ఞానం "ఇవి లేవు" అనే నిర్ణయానికి, దారితీయరాదు. అజ్ఞానంలో ఉన్నాము గనుక, నిస్సంకోచంగా దేవుని నమ్మాలి.

*(హరిజన్, 7 - 1 - 1939, పుట 417)*

★ ★ ★

అహింసా పూజారి పిరికివాడు గానేరడు. ధైర్యం సాహసం విషయంలో సైనికుని అధిగమిస్తాడు.

*(ది మోడర్న్ రివ్యూ. అక్టోబరు, 1916)*

★ ★ ★

అహింస జీవికి అనన్యశక్తివంతమైన ఆయుధం. పిరికివాని దరికి రాదు. జీవంతమైన శక్తి, నిర్జీవ సిద్ధాంతం గాదు. అందుకనే, ''అహింసాపరమో ధర్మః'' అన్నారు.

*(యంగ్ ఇండియా. 6 - 9 - 1928. పుట 301)*

★ ★ ★

నా అహింసకు నిర్బలత్వం, అంగవైకల్యం లేదు. సర్వశక్తివంతమిది. అహింస ఉన్నచోట సత్యం ఉంది. సత్యమే దైవము. సర్వాంతర్యామి. ఆయన ఎక్కడ, ఎలా ప్రకటితమవుతాడో, ఎవరికీ తెలియదు. సత్యాహింసలు రాజ్యం చేసే చోట, శాంతి సౌఖ్యాలుంటాయి. అవి కనుపించలేదనవద్దు. విశ్వాసమున్న వారి పట్ల ప్రకటితమౌతాయి.

*(హరిజన్, 29 - 8 - 1946, పుట 33)*

★ ★ ★

సత్యాహింసలు ఖడ్గధార వంటివి. సరిగా వాడితే, ఆహారం వలెనే, లబ్ధిని కలిగిస్తాయి. ఆహారాన్ని మోతాదుగా, తీసుకోవాలి. సత్యాహింసలను మాత్రం నిరంతరం ఆశ్రయించాలి. గమ్యం చేరేవరకు విశ్రాంతి లేదు. ఆగకూడదు.

*(హరిజన్. 2 - 4 - 1938. పుట 65)*

★ ★ ★

మనోవాక్కాయ కర్మల అహింసా పూజారిశ్రమించి, జాగరూకుడై, నిరంతరం ఆత్మ నియంత్రణతో ఉండాలి.

*(హరిజన్. 6 - 5 - 1939. పుట. 113)*

★ ★ ★

నిత్య జీవితంలో, సత్యసంధత, వినమ్రత, సహిష్ణుత, వీటి సాధన

మొదటి మెట్టు. నిజాయితీ మంచి సిద్ధాంతం అంటారు సిద్ధాంతాలు మారవచ్చు. అహింస ఎప్పటికీ మారని నిత్య సత్యమార్గము. చుట్టూ పరివేష్టించి యున్న హింసా వాతావరణంలో కూడా, దీని ననుసరించాలి. అహింసా పూజారి పట్ల "అహింసతో" మెలగడంలో గొప్పలేదు. అది అహింసయే కాదు, హింసతో తలపడినప్పుడే , ఆ భేదం అర్థమవుతుంది. సదా జాగరుకులమై, సతర్కతతో, నిరంతరం కృషి చేసినప్పుడే దీని లబ్ధి.

*(హరిజన్, 2 - 4 - 1938, పుట 65)*

★ ★ ★

అహింస తన లోపాలను పెద్దచేసి, ఇతరుల లోపాలను తక్కువచేసి, చూపుతుంది. తన కంటిలో నలుసు దూలమై ఇతరుల కంటిలోని దూలము నలుసై ఉండేడట్లు అనిపింపచేస్తుంది.

*(హరిజన్, 13 - 5 - 1939, పుట 121)*

★ ★ ★

అహింసా పూజారి నిష్కల్మషుడై, ఋజుమార్గాన, స్వార్థరహితంగా, వినయశీలుడై సాగిపోవాలి.

*(హరిజన్, 20 - 5 - 1939, పుట 133)*

★ ★ ★

సుగమమనిపించే వాని అనుసరణ దుర్గమం. పదార్థాలలో నిశ్చలత, సమతౌల్యాన్ని పరిరక్షిస్తుంది. అదే మానసికమైతే మాత్రం, ముప్పు, ఈ జడత్వాన్ని వదిలించుకోవాలి. హింస, అసత్యం, నిషిద్ధం కావాలి. వీటి ఫలితం మేలిమై ఉండినా, పొట్ట విప్పి చూడ పురుగులుండు. నిశ్చలత్వం, నిర్మలత్వం, నిర్మమత్వం ఉంటే సత్యాహింసలు వశమవుతాయి.

*(హరిజన్, 21 - 7 - 1940,పుట 215)*

★ ★ ★

హింసామార్గాన్ననుసరించడానికి ఎంతో శిక్షణ అవసరం. అహింసా మార్గావలంబన కంతకంటే, ఎన్నోరెట్లు అవసరం. దేవునియెడల నిజమైన భక్తిగల వాళ్లు పాపం చేయలేరు. పిరికివాడు కూడా, హింసను వర్జించాడు

గనుక, దైవభక్తిగలవాడు అనడం తప్పు. నిజమైన దైవభక్తుడు, చేతిలో కత్తి ఉన్నప్పటికీ, పరులందరిలో దైవాన్ని చూడగలడు గనుక ఆ కత్తిని, పరుల మీద ప్రయోగించడు.

*(హరిజన్, 14 - 5 - 1938, పుట 110)*

★ ★ ★

"అహింస సమ్ముఖంలో శత్రుత్వము అదృశ్యం అవుతుంది" అంటే, రెండిటి అనుపాతం సమంగా ఉన్నపుడే, ఇది సంభవం అని తెలుసుకోవాలి. అనేక జన్మలెత్తినా, అహింసావ్రతఫలం తోడుగా ఉండి నిర్వాణ ప్రాప్తినికలిగిస్తుంది.ఈ యాత్రికుడికి, దారిలో ముళ్లున్నా, సుగంధపుష్పాలు ఉన్నా, ఏకాగ్రత, మనోనిగ్రహం ఉంటాయి.

*(హరిజన్, 14 - 12 - 1947, పుట 468)*

★ ★ ★

మానసికంగా కూడా సాధన చేయకపోతే, శారీరికమైన అహింసలో పటుత్వం ఉండదు. కడుపులో కుళ్లు పెట్టుకొని పెదవికి తేనె పూసుకున్నట్లుగా ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 2 - 4 - 1931, పుట 58)*

★ ★ ★

మానసికమైన అహింసను సిద్ధింపచేసుకోవాలి అంటే, ప్రశిక్షణ కావాలి. సైనికుని కవాతు వలె, మనస్సు ప్రవర్తించాలి. అలా కాని రోజున, అహింస ఒక ముఖాచ్ఛాదనమాత్రమై అందరికీ హాని కలిగిస్తుంది. వాఙ్మనో శరీర సంయోగము సర్వ శ్రేష్ఠము.

*(యంగ్ ఇండియా, 1 - 10 - 1931, పుట 287)*

★ ★ ★

అహింస, నిర్వ్యాపారులకి, లభ్యం కాదు. కష్టాల నెదుర్కొనే సత్తువ ఉండాలి. ఇద్దరు కొట్లాడుతూ ఉన్నపుడు, దానిని చూసి పలాయనం చేసేవాడు, శుద్ధ పిరికివాడు. అహింసావాదికి గల ధైర్యం, హింసావాదికంటే ఎన్నోరెట్లెక్కువ ఉంటుంది. హింసావాదికి ఆయుధం (కత్తి, బల్లెం, తుపాకి

వగైరా) రక్షక కవచమైతే, అహింసావాదికి దేవుడే రక్షకకవచం.

*(హరిజన్. 1 - 9 - 1940. పుట 268)*

★ ★ ★

అహింసావాదికి యీ విశ్వమంతా తన కుటుంబమే. అయితే యింట గెల్చి రచ్చగెలవాలి.

*(హరిజన్. 21 - 7 - 1940. పుట 214)*

★ ★ ★

అహింస నిరాయుధీకరణ కాదు. బలహీనుని చేతిలోనిఆయుధం కానేకాదు. బరువైన ఖడ్గాన్ని ఎత్తలేని బాలుని చేతిలో, ఆశస్త్రం ఉపయోగపడదు. పాశవిక శక్తిని మించిన అహింస సహజగుణాన్ని అర్థం చేసుకోవాలి. చెబితే తెలియదు. దైవబలంతో, హృదయాంతరాల్లో, ప్రతిష్ఠితమవుతుంది.

*(హరిజన్. 10 - 2 - 1938.పుట 377)*

★ ★ ★

"అహింస" ఉపన్యాసాలు వింటే, రాదు, అనుసరిస్తే, అమలుపరిస్తే, అందుబాటులో ఉంటుంది.

*(హరిజన్. 20 - 3 - 1937, పుట 42)*

★ ★ ★

మనిషి వేరు; తాను చేసిన పనివేరు: మంచిపనిని అభినందించాలి; చెడ్డపనినితెగడాలి: అయితే ఆ మనిషిని మాత్రం గౌరవంతోగాని, సానుభూతితోగాని చూడాలి. "పాపాన్ని పరిహరించు, పాపిని కాదు" అను సూత్రం జటిలం. అనుసరణలో దుష్కరం; కనుక అది ద్వేషాన్ని రగులుస్తూ ఉంటుంది. జాగ్రత్త అవసరం.

*(ఆత్మకథ. 1966. పుట 206)*

★ ★ ★

"చిన్న చిన్న వ్యక్తిగత వ్యవహారాలలో కాక; పెద్దవైన వాటిలో అహింసను పాటిస్తాను" అనువాడు అవివేకి. స్వార్థపరుడు, వ్యక్తికి ఏ నియమం వర్తిస్తుందో, అదే నియమం సమిష్టికి కూడా వర్తిస్తుంది. తన వారి

మధ్య అహింసావాదియై, పరుల వద్ద హింసావాది కాలేదు

*(హరిజన్, 28 - 1 - 1939, పుట 441)*

★ ★ ★

అహింసను రోజువారీ జీవితంలో, అనుసరించి, ఒంటికిపట్టిన తర్వాత ప్రతిజ్ఞ పూని, అందరకూ నేర్పవచ్చును.

*(శాంతియాత్ర, 1950, పుట 90)*

★ ★ ★

అహింస వ్యక్తిగత సద్గుణం మాత్రమే కాదు. సామాజికంగా కూడా, అహింస, సద్గుణమే. దీనిని దేశానికి, అంతర్రాష్ట్రీయ వ్యవహారాలకు ఉపయోగించాలి.

*(హరిజన్, 7 - 1 -1939, పుట 417)*

★ ★ ★

"సత్యాహింసలు సార్వజనీనం కావాలి" అనునది నా కల. నిత్య ప్రయోగాలలో, ఆత్మాభివృద్ధి కోసం, ఇదే చేస్తున్నాను. సమవేత ప్రయత్నమైన నాడే, దీని పూర్తి ఫలితం లభిస్తుంది.

*(హరిజన్, 2 - 3- 1940, పుట 23)*

★ ★ ★

ఒకచోట, సత్యాహింసల ప్రతిష్ఠ జరిగితే, వాటి ప్రభావం అంతటా వ్యాప్తం అవుతుంది. ఒకరికీ చెందిన నియమం, అందరిదీ అవుతుంది.

*(హరిజన్, 12 - 11- 1938, పుట 327)*

★ ★ ★

ఏకాంతంగా అహింసను అనుసరిస్తే, సమాజానికి ఉపయోగం లేదు. దానిని అహింసా రేణువు అనవచ్చును.

*(హరిజన్, 14 - 12 - 1947,పుట 468)*

★ ★ ★

దినచర్యలో అహింస, స్వర్గాన్ని భూమిపై స్థాపించడం అన్నమాట. వేరు వేరు లోకాలు లేవు. "ఇక్కడా" "అక్కడా" అనేది లేదు. జీన్సు

మహాశయుని మాటల్లో, ఈ లోకాలన్నీ ఒక అణువు నుంచి ఉద్భవించినవే. ముక్కు మూసుకొని, తపస్సు చేసి, పరలోక సుఖాల కొరకు ఆయాసపడటం తప్పు. అందరికీ ఉపయోగపడని వస్తువు శుద్ధదండుగ

*(హరిజన్, 26 - 7 - 1942, పుట 248)*

★ ★ ★

సుకరమైనవి, దుష్కరమైనవనిపిస్తాయి. హృదయగతమైన అహింస, బుద్ధివివేకాల కసాధ్యం. తనకు దైవాంశ కలదను నమ్మకం ఉన్నపుడు దైవం పట్ల నమ్మకం సత్యం. సముద్ర జలబిందువు, వేరైనపుడు, గుర్తుచేస్తేగాని, మహాసముద్రాంశ తానేనని, తెలుసుకొనలేదు. అహింస విషయంలోనూ వ్యష్టి, సమిష్టి అంతే.

*(హరిజన్, 3 - 6 - 1939, పుట 141)*

★ ★ ★

అహంభావిలో అహింస ఉండదు. వినమ్రునికి, దైవసాన్నిధ్యం అనుభూతిగా గలవానికి, దేవుడు దారిచూపుతాడు.

*(హరిజన్, 28 - 1 - 1939,పుట 442)*

★ ★ ★

మానవునికసాధ్యమైనది దేవుని లీలామాత్ర కార్యం అల్పాత్యల్ప బుద్ధి, శక్తి, గలవానినికూడ ఉద్ధరించువాడు దేవుడే.

*(యంగ్ ఇండియా, 19 - 11- 31, పుట 361)*

★ ★ ★

దారి, తిన్నదైనా, ఇరుకైనా: ఖడ్గధార వంటిది. దానిమీద నడవడమే నాకిష్టం. దిగజారినపుడు బాధ కలుగుతుంది. "ప్రయత్నశీలికి పతనం లేదు" అనే దైవ వాక్యాన్ని స్మరించుకొని, ముందుకు సాగుతాను. దృఢవిశ్వాసమే నాకేడుగడ.

*(యంగ్ ఇండియా, 17 - 6 - పుట 215)*

★ ★ ★

అధ్యాయము - 12

# అహింస - పిరికితనం

హింసయా, భీరుత్వమా అని మీమాంస కలిగితే, హింసకే నీ ఓటు.. అహింస, హింస కంటే, చాల గొప్పది. శిక్షించుట కంటే క్షమాగుణం ఎంతో ఉన్నతమైనది; శిక్షించే అధికారం లేనిచోట, "క్షమ" ఒక విడంబన మాత్రమే.

*(యంగ్ ఇండియా 11 - 8 - 1920. పుట 3)*

★ ★ ★

అహింస, బలహీనుల చేతిలో, కొంతవరకు పనిచేస్తుందన్నది నిజమే. మేముబలహీనులమే. అది, ఒక తొడుగయితే మాత్రం, సరికాదు, అంతకంటె హింస నయం; పలాయనం కంటె వీరమరణం ఉత్తమం; పశు ప్రవృత్తి నుంచి, పరివర్తనశీలురమై, ఎంతో కాలానికి మానవులుగా ఎదిగాం. మనలో దైవాన్ని, గుర్తించే శక్తి మన ప్రత్యేకత. గుర్తించిన దైవాన్ని అందరిలో దర్శించడానికి, జీవైక్యతను అవగతం చేసుకోడానికి, పశుప్రవృత్తిని త్యజించి, నిద్రాణమైన అహింసను మేల్కొలపాలి. బలవంతులకే, ఇది సాధ్యం.

*(హరిజన్. 2 - 8 - 1940. పుట 19)*

★ ★ ★

అహింసం, భీరుత్వం, వ్యతిరేక పదాలు, మొదటిది అత్యుత్తమ సద్గుణం, రెండవది అతిహీనమైన దుర్గుణం. మొదటిది ప్రేమనుంచీ, రెండవదిద్వేషంనుంచీ ఉద్భవిస్తాయి. అహింస బాధపడుతుంది. భీరుత్వం బాధను కలుగచేస్తుంది.

*(యంగ్ ఇండియా, 31 - 10 - 1929. పుట 356)*

★ ★ ★

అహింస భీరుత్వము తోడుగా చరించవు. ఆయుధ ధారికి మనసులో భయం ఉంటుంది. స్వచ్ఛమైన భయరాహిత్యం వినా, నిజమైన అహింస గగన కుసుమం.

*(హరిజన్. 15 - 8 - 1939.పుట 201)*

★ ★ ★

బలము భౌతికంకాదు - ఇచ్ఛాశక్తి మానసికమైనది

*(యంగ్ ఇండియా, 11- 5 - 1920, పుట 3)*

★ ★ ★

అంతులేని శ్రద్ధా విశ్వాసాలతో నిండిన మనోబలం, దాని ఫలితంగా సంభవమైన ఆత్మ శక్తి, చరిత్ర దిశను మారుస్తుంది.

*(హరిజన్, 19 - 11- 1938, పుట 343)*

★ ★ ★

భయమున్న చోట, మత ధర్మాలుండవు

*(యంగ్ ఇండియా, 2 - 9 - 1926, పుట 308)*

★ ★ ★

భగవంతునికి భయపడదాం. అప్పుడు మానవుడికి భయం నుంచి ముక్తి లభిస్తుంది.

*(మహాత్మాగాంధీ రచనలు 1933, పుట 330)*

★ ★ ★

ధర్మగ్రంథాల పాండిత్యం, ఆధ్యాత్మిక చర్చలు - వీటిలో ఆత్మశక్తి లేదు. అనంతమైన శక్తి కలిగిన హృదయ సంస్కృతి నిర్భీకత. ఆత్మశక్తికి మొదటి మెట్టు. పిరికివారు ధర్మాత్ములు కానేరరు.

*(యంగ్ ఇండియా, 13 - 10 - 1921,పుట 323)*

★ ★ ★

**అధ్యాయము - 13**

# సత్యాగ్రహం అంటే ఏమిటి?

విశ్వమిత్రత (ప్రపంచమంతటితో స్నేహం) నాధ్యేయం. అన్యాయాన్ని ఎదిరించడం, అమితమైన ప్రేమభావం, యోగిస్తే (కలిపితే) చూడగలను.

*(యంగ్ ఇండియా, 10 - 3 - 1920,పుట 5)*

★ ★ ★

అహింస అంటే దుష్టశక్తులకు వ్యతిరేకంగా పోరాటం నుంచి

విరమించడం కాదు. దుష్టత్వాన్ని హింసతో, ప్రతిఘటిస్తే, దుష్టత్వం ఎక్కువవుతుంది. అధర్మాన్ని, మనోధర్మంతో వ్యతిరేకించాలి. నిరంకుశుడు, ఎదురుచూసే, భౌతిక ప్రతిఘటనను, పరిహరించి, అతని శస్త్రాలను నిర్వీర్యం చేస్తాను. మానసికమైన నా ప్రతిఘటన అతనికి అర్థం కాదు. మతి చెదరి, అతడు నా అదృశ్యశక్తిని గుర్తిస్తాడు. దానివలన అతనికి అవమానం లేదు. అతడు ఉద్ధరింపబడతాడు.

*(యంగ్ ఇండియా, 8 - 10 - 1925,పుట 346)*

★ ★ ★

శస్త్రరహితునికి, నన్నెదిరించిన వారికి ప్రేమ పాత్రను మాత్రం అందించగలను. దానితో వారు నాకు సన్నిహితులౌతారని నా ఆశ.

*(యంగ్ ఇండియా, 2-4-1931, పుట 54.)*

★ ★ ★

గత ముప్పది ఏండ్లుగా నేను సత్యాగ్రహాన్ని గూర్చి క్రమపరిణామ దశలో, చెప్పి, ఆచరిస్తున్నాను. క్రమపరిణామ దశలో సత్యాగ్రహి సిద్ధాంతాలు, నేడు ఉన్నాయి.

సత్యాగ్రహం, మౌన ప్రతిఘటన, ఇవి రెండు ఉత్తమ సాధనాలు. రెండవది బలహీనుల ఆయుధం. ఆశయ పరిపూర్తికి, హింస, శారీరకశక్తి వాడుకను పరిహరించదు. మొదటిది బలవంతుల ఆయుధం, ఏవిధమైన హింసనైనను నిరాకరిస్తుంది.

దక్షిణాఫ్రికాలో, ఎనిమిదేండ్లు, అక్కడిభారతీయులు చూపిన శక్తికి, తత్పూర్వం పేరిందినమౌన ప్రతిఘటనకు భిన్నంగా సత్యాగ్రహం అనే పేరు పెట్టాను.

దాని మూలం సత్యం, కనుక సత్యశక్తి ఇది. ప్రేమ లేక ఆత్మ శక్తి అని కూడా దీనిని పిలువవచ్చును. ఎదిరించిన వారిని, హింసతో అణగద్రొక్కే బదులు, ఓపికగా సానుభూతితో, అతని తప్పునతడు తెలుసుకొనేటట్లు చేయవచ్చును. ఒకరికి తప్పు అనిపించినది. ఇంకొకరికి ఒప్పుగా ఉండవచ్చు.

ఓపిక అంటే ఆత్మ పీడన. సత్య ప్రతిపాదన పరుని పీడిచడం కాదు. ఇందు తనను తానే బాధించుకొని, సాధించడం జరుగుతుంది.

రాజకీయ రంగంలో, ప్రజల పోరాటం, అన్యాయమైన చట్టాలతో ఉంటుంది. అనునయ పద్ధతులు ఫలించని రోజున, శారీరికంగా దెబ్బతీసిగాని శాసనోల్లంఘన చేసి శిక్షననుభవించిగాని, అన్యాయాన్ని ఎదిరించవచ్చును. కనుక సత్యాగ్రహం అనగానే శాసనోల్లంఘన, నాగరికుల ప్రతిఘటనలుగా ప్రజలకు అర్థం అవుతాయి. క్రిమినలు కానిది సివిల్ గనుక దీనిని సివిల్ ప్రతిఘటన అంటున్నారు.

చట్టాన్ని అతిక్రమించేవాడు, ఆ ఉల్లంఘనను చాటుమాటుగా చేస్తాడు. శిక్షను తప్పించుకునే ప్రయత్నం ఉంటుంది. 'సివిల్' ఉల్లంఘన వేరుగా ఉంటుంది. ప్రజాహితం ఉన్నట్టి శాసనాలకు తలవంచుతాడు. కొన్నిటికి అట్లు తలవంచుట అతనికి అగౌరవనీయమైన విషయంగా ఉంటుంది. ఆ శాసనాలను ఉల్లంఘించి సంతోషంతో శిక్షననుభవిస్తాడు. తన వ్యతిరేకతను వ్యక్తీకరిస్తూ అనైతికం కాని ఉల్లంఘన చేస్తూంటాడు.

సత్యాగ్రహి సిద్ధాంతం పిల్లలకు కూడా బోధపడుతుంది. అలా నేను చేశాను. ఫలితం బాగుంది.

*(యంగ్ ఇండియా. 14-20-. పుట 5)*



సత్యాగ్రహం అంటే సత్యశక్తి లేక ఆత్మశక్తి. అసలు నిజం తెలియదు కనుక శిక్షించడం తప్పు కావచ్చు. అందుకని హింసాయుత రాక్షసశక్తిని వాడేందుకు అది అంగీకరించదు.

ఛాందసప్రవృత్తిగా "సఫ్రాజెట్" "నాన్-కన్ఫార్మిస్టు" ఇంగ్లీషు ఉద్యమాలు మౌన (జడప్రవృత్తిగల) ప్రతి ఘటనను అవలంభించాయి. ఆశయసిద్ధికి, శస్త్ర ప్రయోగం ఇందులో నిషిద్ధం కాదు. ఒకప్పుడు ఈ ప్రతిఘటన బాధితులైన క్రిస్టియమ ధర్మావలంబులకే పరిమితమై ఉండేది.

ధర్మ విరుద్ధమైన శాసనాలు, చట్టాలు - వీటిని ఉల్లంఘించడమే సివిల్ ఉల్లంఘన. బానిస రాజ్య శాసనాలకు వ్యతిరేకంగా థోరో మహాశయుడు

దీనిని ప్రతిపాదించి, ఒక పెద్ద గ్రంథాన్ని రచించి, "అహింస" కూడా అవసరమే అన్నాడు థోరో "పన్నులను చెల్లించవద్దు" అని మాత్రమే అన్నాడు. 1919 లో "నాగరిక అవిధేయుత" (సివిల్ డిజ్ఒబీడియన్స్) ఉద్యమం సందర్భాన, అధర్మం అనిపించిన శాసనాలు అన్నిటికీ అవిధేయతను సూచించాం. అట్టి ధిక్కారానికి శిక్షలు సంతోషంగా అనుభవించాం. అది "సత్యాగ్రహ" ఉద్యమ విభాగం.

సహాయ నిరాకరణోద్యమం అంటే కలుషితమైన ప్రతి ప్రభుత్వ చర్యకూ సహాయం నిరాకరించడం. దీనిని చిన్న పిల్లలతో సహా అందరూ అనుసరించ వచ్చును. "నాగరిక అవిధేయతా ఉద్యమం" లో చట్టాలను మన్నించి, ఉల్లంఘన వలన వచ్చే శిక్షలను కూడా మన్నించడం ఉన్నది కనుక అందరూ ఆ ఉద్యమాన్ని చేపట్టలేరు. దీనిని ఆఖరి ఆయుధంగా వాడాలి. "సహాయ నిరాకరణ" కూడా "సత్యాగ్రహ" ఉద్యమ విభాగం. అది సత్యమార్గాన్ని అనుసరిస్తుంది.

*(యంగ్ ఇండియ, 23-3-21, పుట 90)*



సత్యాగ్రహ ఉద్యమానికి, ధన సహాయంగాని, ఏ యితర సహాయంగాని అక్కరలేదు. "హింస" మాటే వద్దు. వ్యక్తులకు, వర్గాలకు ఇది ఉపయుక్తం రాజకీయరంగంలో గాని, గృహరంగంలో గాని దీనిని ప్రయోగించవచ్చును. అందరికీ ఉపయుక్తం గనుక, అపజయమన్నది లేదు. స్త్రీలు పిల్లలు, అందరూ దీనిని అనుసరించవచ్చును. హింసను హింసతో ఎదుర్కోలేని బలహీనులకు ఇది పనికివస్తుంది అనడం భ్రమ. బలహీనులు దీనిని తలపెట్టనే లేరు. పశు ప్రవృత్తిని మించినది మానవునిలో ఉన్నదనీ, దానితో పశుత్వాన్ని నిరోధించవచ్చుననీ, నిజంగా నమ్మేవారే సత్యాగ్రహోద్యమకారులు. కాంతి, చీకటికెట్లో ఇది కూడ నిరంకుశత్వం, అన్యాయ్యం మున్నగువాటికి కుఠారాఘాతం. రాజకీయంగా, దీనిని మౌలిక సిద్ధాంతం. (ప్రజలు అంగీకరిస్తేనే ప్రజా ప్రభుత్వం)గా మలచవచ్చును. ట్రాన్స్‌వాల్‌లో 1907 చట్ట ప్రకారం జరుపబడే పరిపాలన మాకు సమ్మతం కాలేదు. ఆ చట్టం రద్దు కావాలి.

రెండేదారులున్నాయి. దెబ్బకు దెబ్బ తీసి ప్రతిఘటించడమో లేక శిక్షలననుభవంచి చట్టాన్ని చేసిన వారి మనసులో మార్పు వచ్చేదాక ఓర్పుతో ఉండడమో అనుకున్నది అయేందుకు చాలకాలం పట్టింది. సత్యాగ్రహ విధానాలు సరిగా అర్థం చేసుకోకుండా, ఓర్పు తగ్గినపుడు శిక్షల ననుభవించే బదులు, దెబ్బ తీయడం వగైరా తప్పులు జరిగాయి. ప్రధానంగా పేదరికం ఓర్చుకోడంలో మహాకష్టం. ఉన్నది తిని, లేకుంటే మాడి ఉండడం ప్రజ్ఞులకు తప్ప అన్యులకు చేతకాదు. సరి అయిన ఆత్మ నిగ్రహముంటే అలసత్వం ఉండదు. ప్రశిక్షణ ఉండాలి. ఆషామాషీగా వ్యవహరించకూడదు. అయినా, ఈ ఉద్యమం జనసామాన్యానికి నచ్చింది. దీనితో సేనలు, యుద్ధాలు, పాత మాటలు అవుతాయి. సత్యాగ్రహోద్యమకారులు, తమకు తాము మాత్రమే కాదు, ఇతరులకు కూడా పనికివస్తారు. ఈ విద్య మహోన్నతమైనది, ప్రారంభిక శిక్షణ దీనితోనే ఆరంభం కావాలి. పిల్లలకు కూడా ఆత్మ శక్తిని గురించి బోధ జరగాలి. దీనివలన, జీవిత సంగ్రామంలో వారు తడబడరు. కోపాన్ని, ద్వేషాన్ని ప్రేమతో జయించగలిగే అలవాటు వారికి అబ్బుతుంది.

*(యంగ్ ఇండియా, 3-11-27, పుట 369)*

★ ★ ★

నిరంతర సత్యాన్వేషణ, స్థిరమైన నిశ్చయం సత్యాగ్రహం.

*(యంగ్ ఇండియా, 19-3-35, పుట 369)*

★ ★ ★

అహింస చైతన్యరూపం, తెలిసి బాధకు లోనగుట. పాపాత్మునికి, నిరంకుశునికి ఎదురు నిలిచి పోరాడుట. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి, అన్యాయం చేసిన మహా సామ్రాజ్యాన్ని ఒక్క సత్యాగ్రహి అయినా ఎదిరించి కూలద్రోయగలడు.

*(యంగ్ ఇండియా, 27-4-21, పుట 129)*

★ ★ ★

సత్యాగ్రహ విజయానికి కావలసిన షరతులు: (1) సత్యాగ్రహి, ప్రత్యర్థిని ద్వేషించరాదు. (2) సత్యాగ్రహ సమస్య సత్యమై, నిండుగా

ఉండాలి. (3) సమస్యకు సమాధానం కోసం చివరివరకూ కష్టాలనుభవించేందుకు సిద్ధమై ఉండాలి.

*(హరిజన్, 31-3-46, పుట 64)*

★ ★ ★

సత్యాగ్రహం ఆఖరి ఆయుధం కావాలి. అందరికీ నచ్చచెప్పినా పనికాని సందర్భంలో సత్యాగ్రహాన్ని చేపట్టాలి.

*(యంగ్ ఇండియా, 20-10-27, పుట 353)*

★ ★ ★

ప్రత్యర్థికి తన శరీరాన్ని, ఆస్తులను శాసించే అధికారం ఉండవచ్చునేమో గాని, తన ఆత్మను మాత్రం కాదని సత్యాగ్రహి పూర్తిగా గ్రహించాలి. సత్యాగ్రహ సిద్ధాంతం ఈ మూలసూత్రం మీద ఆధారపడి ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 21-5-31, పుట 118)*

★ ★ ★

తన్ను తాను తుడిచివేయుట, గొప్ప ఓర్పు, ఉజ్వల విశ్వాసం, అవమానం కలిగినా వినమ్రత మొదలైన వాటి సమన్వయమే సత్యాగ్రహం.

*(యంగ్ ఇండియా, 26-2-25, పుట 73)*

★ ★ ★

సత్యాగ్రహం మృదువైనది, హానిని కలిగించదు. కోప, ద్వేషాల ఫలితం కాదు. ఆడంబరం, ఉచ్చ స్వరం, తొందరబాటు ఇందుండవు. బలత్కారం లేనే లేదు. హింసకు యిది నిజమైన సరియైన జవాబు.

*(హరిజన్, 15-4-33, పుట 8)*

★ ★ ★

అధ్యాయము 14

# సత్యాగ్రహికి ఉండవలసిన యోగ్యతలు

సత్యాగ్రహి అంటే సత్యం కోసం పట్టుపట్టువాడు అని అర్థం. అందువల్ల అద్వితీయమైన శక్తి లభిస్తుంది. దాని పేరే సత్యాగ్రహం. దీనిని

తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, శాసకులు, తోటి పౌరులు, సర్వ ప్రపంచం పట్ల ప్రయోగించవచ్చు.

అటువంటి విశ్వశక్తి, బంధువులు, బయటివారు, చిన్న పెద్ద పురుషుడు, స్త్రీ, స్నేహితుడు, శత్రువు అని అంతరం పాటించదు. శారీరకమైన శక్తికి గాని, హింసకు గాని తావు లేదు. అది ప్రేమ అహింసలతో ప్రోది చేయబడిన ఆత్మశక్తి. ప్రేమ తనకు తానే భస్మమవుతుంది. సత్యాగ్రహి కూడ అంతే.

కనుక, సత్యాగ్రహి, శాసకుల నిష్క్రమణ కోసం ఏమి చేసినా, ఒక ఇంగ్లీషువానినైనా కోరి, బాధించడు. నియమాలు గమనించండి.

1. సత్యాగ్రహి మనసులో కోపం ఉండరాదు.
2. ప్రత్యర్థి యొక్క కోపాన్ని సహిస్తాడు.
3. ప్రత్యర్థి చేతిలో దెబ్బలు తినినా, తిరిగి దెబ్బతీయడు.
4. అధికారి, సంకెళ్ళు వేయడానికి, శిక్షగా ఆస్థి వగైరాలను సంగ్రహించడానికి, వచ్చినపుడు స్వచ్ఛందంగా ఒప్పుకొని, లొంగిపోతాడు.
5. తన ధర్మకర్తృత్వంలో (ట్రస్టీగా) ఉన్న ఆస్థిపాస్తులను, ప్రాణమిచ్చి కాపాడుతాడు, ఎదురుదెబ్బ మాత్రం కొట్టడు.
6. ప్రతిగా తిట్టనైనా తిట్టడు.
7. ప్రత్యర్థిని అవమానించడు. అతనిని దూషించే అరుపులు వాడడు. అహింసా సిద్ధాంతానికి అవి మచ్చలు కనుక వాటిని వినియోగించడు.
8. బ్రిటిషువారి జెండాకు వందనం చేయడు. ఇండియన్లయినా, ఇంగ్లీషువారయినా, అధికారులను అవమానించడు.
9. పోరాట సమయంలో, ఎవరైనా అధికారిని దూషించినా, కొట్టినా, సత్యాగ్రహి తన ప్రాణాలనయినా పణంగా పెట్టి, రక్షిస్తాడు.

*(యంగ్ ఇండియా. 27-30-పుట 69)*



సత్యాగ్రహుల సంఖ్య ముఖ్యం కాదు. వారి నిశ్చలత్వం (హింస పెచ్చుమీరిన సమయమందు కూడా) ప్రధానమైనది.

తప్పు చేసే వానిని ఇరుకు పరిస్థితుల్లో పడవేయని వాడే నిజమైన సత్యాగ్రహి. అతని హృదయాన్ని జయించే ప్రయత్నం చేస్తాడు. ''మనసు మారాలి'' అను ఆదర్శమతనిది. బలవంతంగా మాత్రం అది 'కా', కూడదు కృత్రిమత్వం పనికిరాదు. సహజసిద్ధమైన ఆత్మ విశ్వాసంతో పని చేస్తాడు.

పై వాటిని దృష్టిలో ఉంచుకొని, దిగువనుదహరించిన యోగ్యతలు, సత్యాగ్రహికి ముఖ్యం అనుకుంటున్నాను.

1. శిలాసదృశుడైన భగవంతుతని ఎల్లప్పుడూ నమ్మాలి.
2. సత్యాహింసలను మనసారా నమ్మి, మానవ నైజంలో సహజసిద్ధమైన మంచితనాన్ని గుర్తించి, దానిని తన యాతన ద్వారా వెలువరించాలనుకుంటాడు.
3. పవిత్రమైన జీవితయానంలో, తనకున్న వాటిని ప్రాణంతో సహా - తన ధ్యేయం పరిపూర్తికి - అర్పిస్తాడు.
4. భారతదేశంలో అతిముఖ్యం - ఖాదీ ధారణ, నూలు వడకుట.
6. సమయానుసారం విధించబడు నిబంధనలను మనసారా పాటిస్తాడు.
7. తన ఆత్మగౌరవాన్ని కించపరచని జైలు నియమాలను శిరసావహించాలి.

ఇంతవరకు చెప్పిన అర్హతలు, కొన్ని ఉదాహరణకు మాత్రమే ఎప్పటి కప్పుడు వాటిలో మార్పులు, చేర్పులు ఉంటాయి.

*(హరిజన్. 25-3-39, పుట 64)*

★ ★ ★

మతకలహాల సమయంలో పని చేసేందుకు ప్రత్యేకంగా శాంతిదళాన్ని తయారు చేయమని సూచించాను. ఈ దళం సైనికుల, పోలీసుల పని చేయాలి. పెద్ద కోరిక. కష్ట సాధ్యం అయినా, కాంగ్రెసు అహింసా పోరాటంలో విజయం సాధించాలి అంటే శాంతి రక్షణ కోసం, ఈ ఏర్పాటు చేసి తీరాలి.

**శాంతిదళం సభ్యుడికి వలసిన యోగ్యతలు**

1. **అహింసలో అచంచల విశ్వాసం:** దైవం పట్ల భక్తి లేనిదే ఇది అసాధ్యం. దేవుని దయలేనిదే, అహింసావాది, దేనినీ చేయలేడు: కోపం, భయం ప్రతీకారేచ్ఛ లేని మృతికి సిద్ధపడతాడు. దేవుడు హృదయంలో ఉంటే,

భయం ఉండదు. దేవుడు సర్వాంతర్యామి అని తెలిస్తే, ప్రత్యర్థులు, గూండాలలో కూడా ఆ దేవుడే ఉంటాడని తెలుస్తుంది. దీనివలన తనలో అనుకోకుండా విజృంభించే పశు ప్రవృత్తిని అణచిపెట్టి ఉంచగలుగుతాడు.

2. ఈ శాంతిదూతకు ప్రపంచలోని అన్ని ప్రధాన ధర్మాల పట్ల గౌరవాదరాలు ఉంటాయి. హిందువయితే, ఇండియాలోగల తక్కిన మత, ధర్మావలంబులను గౌరవించాలి కనుక ధర్మాలలోని ప్రధానాంశాలను తెలుసుకొని ఉండాలి.
3. ఈ శాంతి రక్షణ, సామాన్యంగా, అక్కడి స్థానికులే, బాగా నిర్వహించగలుగుతారు.
4. ఇది ఒక్కరు గాని, అందరూ గాని చేయవచ్చును ఒకరి కోసం ఇంకొకరు వేచియుండే పనిలేదు. అయినా స్థానికుల సహాయంతో దళం ఏర్పాటు అయితే సహజసిద్ధమైన మంచి ఫలితం ఉంటుంది.
5. స్థానికులకు సేవ చేస్తూ, పరిచయాలు పెంచుకుంటే ఆపత్కాలంలో అల్లరి మూకలను చెదరగొట్టడం సుకరమౌతుంది. పరిచితుడు కనుక ఇతని మంచి మాటలు, అనునయాలు, సత్ఫలితాన్నిస్తాయి.
6. శాంతి దాయకుడు నిష్పక్షపాతంగా వ్యవహరించి, వివాదాలకతీతుడై ఉండాలి.
7. సామాన్యంగా, ముందు సూచనలుంటాయి. తుఫానును చెదరిగొట్టేందుకు ముందుగానే ప్రయత్నం చేయవచ్చు.
8. వీలయినంతమంది స్త్రీ, పురుషులు శాంతిదళ సభ్యులు కావాలి. అన్ని పక్షాలకు చెందిన వారైతే, ఇంకా బాగుంటుంది. పూర్తి సమయాన్ని ఇవ్వగలిగే వారు ఎక్కువగా లేకపోతే తీరిక సమయాలు వినియోగించేవారిని, పాక్షికంగా నియుక్తి చేయాలి.
9. ఒకే రకం దుస్తులు దళ సభ్యులు ధరిస్తే, జనం సులభంగా గుర్తించి, మాట వింటారు.

ఇవి సామాన్య సూత్రాలు మాత్రమే. ప్రతి కేంద్రం తనకు అనువైన నియమావళిని, పైన చెప్పిన సూత్రాలకు అనుగుణ్యంగా, కొద్ది మార్పులు చేర్పులు చేసుకొని, వాడుకొనవచ్చును.

*(హరిజన్, 18-38-, పుట 152)*

★ ★ ★

సత్యాగ్రహం కోసం, సత్యాగ్రహి చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి. ఏసమస్యను తీసుకొని ఆందోళనను తలపెట్టారో, దాని వివరాలు ప్రజలకు తెలియజెప్పాలి. ప్రజలకు ఈ సామాజిక అన్యాయాన్ని గురించి తెలిసినపుడు, ఎంతమొనగాడైనా, దానిని అందరి ముందూ చేయడు. సమర్థించడు. సత్యాగ్రహికిది, శక్తిగల ఆయుధం. ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా అన్యాయాన్ని సమర్థిస్తే, అతణ్ణి వెలివేయడం జరగుతోంది. వెలివేసిన వ్యక్తికి ఎవరూ ఏమీ చెయ్యరు. ఇది చాలు కదా. ఇంకా కావాలంటే, ప్రత్యేక పరిస్థితుల్లో, మార్పులు చేర్పులు చేర్చి ఆ సందర్భంలో ఆచరించవచ్చును. ప్రతివిషయంలోను ప్రత్యేకత ఉండనే ఉంటుంది. చేసిన వారికి, చేసిన దానికి, తగు మర్యాదను ప్రజలే చేస్తారు. చట్టాలు తమ విధి నిర్వర్తిస్తాయి.

*(యంగ్ ఇండియ, 8-8-29, పుట 263)*

★ ★ ★

శరీర దార్ఢ్యం కలవారు చేసేపనులు కొన్ని ఉన్నాయి. అహింసా పాలనలో అహింసావాదికి శరీర వ్యాయామాదుల ప్రశిక్షణ ఎందుకు అని ఆలోచించి చేయవలసినది చేయండి.

సైన్యం నియమాలు, అహింసా సంస్థకు అక్కరలేదు. సైనికులకు తుపాకులు అలంకరణగా యివ్వరు. అవి ఎదుటి వారిని మట్టు పెట్టేందుకు యిస్తారు. అహింసా సైనికులు, కత్తులను నాగళ్ళుగా, బల్లెములను కొక్కెములుగా మార్చి సంతోషిస్తారు. సైనికున్ని ప్రశిక్షణ "కాల్చు, చంపు" అని ఉంటుంది. అహింసా సైనికుల ప్రశిక్షణ "ఆర్తత్రాణపరాయణుడు తనకప్పగించిన వాటిని తన ప్రాణాలతోనైనా రక్షించుట, దొంగలను, బందిపోటులను, అనునయ వాక్యాలతో స్పందింపచేసి వారి మనసులను

మార్చుట'' వగైరాలతో జరుగుతుంది. దుస్తులు కూడా వేరుగా వేరుగా ఉంటాయి. సైనికునిది భయపెట్టేది; అహింసావాదిది భయాన్ని పోగొట్టేది. పేదల సేదదీర్చేది. సైనికుని వద్ద అస్త్రపుష్కలంగా ఉంటాయి. అహింసావాదికి దేవుడే దిక్కు. ఉత్తర దక్షిణ ధృవాలు వారి దృష్టి కోణాలు. సైనికుడు తన విజయం కోసం, ప్రత్యర్థుల ఓటమి, మరణం కోసం, రాజు కలకాలం ఉండాలని దేవుని ప్రార్థిస్తాడు. బ్రిటిషువారి జాతీయ గీతంలో ఇదే ఉన్నది. దయా సముద్రుడగు భగవంతుడు వీరి కోర్కెలను తీర్చడు. రోషం పెరిగే ప్రక్రియ లేనిదే సైనికుడు సరిగా పనిచెయ్యడు.

అహింసావాదికి శత్రువేలేడు. శత్రువు ఉండినా అతని పట్ల కరుణభావం ఉంటుంది. కావాలని ఎవరూ దుష్టులుకారు, కనుకమంచీ చెడూ వీటిగురించి విచక్షణ పెరిగితే, అహింసాసిద్ధి కలుగుతుంది. భగవంతుణ్ణి ఇతడు ప్రత్యర్థికి సద్బుద్ధికలుగజేయమని ప్రార్థిస్తాడు. నైతికంగా, ధార్మికంగా, ఎదిగి చిరునవ్వుతో మృత్యువు నెదుర్కోవాలని ఇతని ప్రార్థన.

ఇంత భేదం ఉన్నది. కనుక ప్రశిక్షణ వేరుగా ఉంటుంది. సైనిక శిక్షణ గురించి విన్నాము. అహింసా వాదికి ప్రశిక్షణ ఎలా ఉండాలి. అనే ప్రశ్న ఇప్పుడే పుట్టింది. ఇదివరలో హఠయోగ వ్యాయామాలు, శ్వాసప్రక్రియను నియమితం చేసి, కరచరణాద్యవయవాలను కొన్ని భంగిమలలో త్రిప్పి, మనస్సులోని ఆత్మ శక్తిని యోగం ద్వారా క్రమబద్ధం చేసి, మానవుని ఉద్ధరించేవి. ఈ ప్రక్రియను అహింసావాదికనువుగా చేయవచ్చును. ముక్తి, శరీర శుద్ధి, మనోనిగ్రహం, వీటి ధ్యేయాలు అన్ని మతధర్మాలవారికి అనువుగా ఉండే విధంగా మలచాలి. సత్యాగ్రహికి ఆరోగ్యవంతమైన శరీరం మనసు ఉన్నప్పుడే నిర్భీకుడవుతాడు. రాత్రింబగళ్ళు కాపలాకాయాలి. శీతోష్ణాలకు తట్టుకోవాలి. అపాయకర ప్రదేశాలకు, మంటలులేచిన చోట్లకు, దట్టమైన మృత్యుగహ్వారాలైన అడవులకు, ఆకలి మంటకు, జైలుశిక్షకు పోయి, కష్టాలను ఓర్చుకొని, కొట్లాడే చోట్ల చొరబడి, మంటలలో చిక్కిన భవంతులలోని ప్రాణులను రక్షించి నూతిలో దుమికి మునిగే వానిని కాపాడి, తన విద్యుక్తధర్మాలను నిర్వహించాలి.

ఇతరుల రక్షణకు పరుగెత్తి, యాతనలను సహించి సంతోషపడు గుణవంతుడే సత్యాగ్రహి. ఇవి తెలిసినవాడు శరీర వ్యాయామ సూత్రాలను రూపొందించగలడు. ఈ ప్రశిక్షణకు మూలం దైవభక్తి. అది లేనివాడికి ఏ ప్రశిక్షణ అయినను వ్యర్థం. సమయానికి అక్కరకు రాదు.

కాంగ్రెసులో దేవుని పేరు ఉచ్చరించేందుకు సిగ్గుపడేవారున్నారని, నన్ను దెప్పవద్దు. సత్యాగ్రహి సిద్ధాంతాన్ని వివరిస్తున్నాను. సత్యాగ్రహి చేతుల్లో ఉండే పెద్ద ఆయుధం దైవనామం. అది లేకుంటే శస్త్రధారుల ముందు యితని గతి ఏమి? అందరూ శారీరక దార్ఢ్యం ఎదుట మోకరిల్లుతారు. కాని దేవుడే రక్షకుడని నమ్మినవాడు భూమిపై ఎట్టి మహత్తర శక్తి ఎదుటనైనా వంగడు.

భగవద్భక్తి వలెనే, బ్రహ్మచర్యం కూడా అవసరం, తేజస్సు కలిగి ఉండాలి. అంటే, బ్రహ్మచర్యం పాటించాలి. తన వీర్యాన్ని నష్టపరచకుండా, ఊర్ధ్వ రేతస్కుడు కావాలి. అత్యంత మూల్యవంతమీ ధనం. కంటితో చూచి, వంటితో స్పృశించి, స్ఖలించువాడు ఉన్నతుడు కాలేడు. స్ఖలనం ఉన్నా జయిస్తాను అన్నవాడు, ప్రవాహానికెదురీదుతాడు. శారీరికంగా నిష్ఠావంతుడై, మానసికంగా - బౌద్ధికంగా పాపం చేసేవాని స్థితి మరీ ఘోరం. బౌద్ధికంగా కామించువానికి తృప్తి కలుగదు. అట్టివాడు పూర్ణ సత్యాగ్రహికాజాలడు. ధనం, యశం వెంటపడే వాని గతి కూడా యింతే.

సత్యాగ్రహి ప్రశిక్షణకిదే పునాది. ఈ భావాలు దృష్టిలో పెట్టుకొని, భవన నిర్మాణం చేయండి.

సత్యాగ్రహికి శారీరిక ప్రశిక్షణతో, ఆయుధాలతో పనిలేదు. కత్తులు, కటారులు అనవసరం. ఆయుధోత్పత్తికి అంతం లేదు. భయం లేనివానికి కత్తి అంటే భయముండదు. మహావీరుడు, ఇతరులు, ఈ విషయాన్ని తెలుసుకొని, అహింసను జీర్ణించుకొని, ఆయుధాలను పరిహరించి, ఉత్తీర్ణులైనారు.

ఖడ్గమే ఆధారముగా ఉన్నవానికి, దానిని త్యజించుట సాధ్యము కాదు. స్వచ్ఛందంగా దానినతడు త్యజించి, అహింసను మించిన రక్షణాస్త్రము

లేదని గ్రహిస్తాడు. అహింసావాదిని మించిపోయిన నిర్భీకుడు అవుతాడు. దొంగలోని నిజాయితీ, రోగగ్రస్తుని ఆరోగ్యం, విషయాసక్తుని బ్రహ్మచర్యం ఎక్కువ పటిష్టాలు. (అలా అని అహింసావాది, ఆయుధాలను వాడి, త్యజిస్తేనే మంచిదని నా భావం కానే కాదు) అలవాటు ప్రకారం చేస్తూ, దాని నుంచి బయట పడటంలోని ఆనందం, అట్టి ముక్తి సమయంలో గాని అవగతం కాదు.

*(హరిజన్. 13-10-40. పుటలు 318-19)*

★ ★ ★

మన ప్రయత్నం, సర్వదా, అనునయంతో, మనసులో మార్పు కల్గించడానికి సాగాలి. ప్రత్యర్థులతో శాంతంగా, ఓపికగా మెలగాలి.

*(యంగ్ ఇండియా. 29-9-21. పుట 306)*

★ ★ ★

సత్యాగ్రహి భయముక్తుడు. ప్రత్యర్థిని ధైర్యంగా విశ్వసిస్తాడు. ఇరవైసార్లు మోసపోయినా, ఇరవై ఒకటోసారి నమ్మి, మానవ ప్రకృతి యెడల తనకు గల పునీత భావాన్ని ప్రకటిస్తాడు.

*(మహాత్మాగాంధీ మనస్సు. 1967. పుట 170)*

★ ★ ★

సత్యాగ్రహి యుద్ధానికి సిద్ధమైనట్లే, శాంతికి సిద్ధం కావాలి. అటువంటి అవకాశానికి స్వాగతం చెప్పాలి.

*(యంగ్ ఇండియా, 19-3-3-31, పుట 40)*

★ ★ ★

సత్యాగ్రహి, గౌరవప్రదమైన శాంతినిచ్చే అవకాశాన్ని వదలడు. అవకాశం విఫలమైనా పోరుకతడు తయారయే ఉన్నాడు. స్పష్టత, అతని ముఖ్యాస్త్రం.

*(యంగ్ ఇండియా. (16-4-31. పుట 77)*

★ ★ ★

మన ప్రత్యర్థుల వలెనే, మనము కూడా విషయాలను గూర్చి సత్వరం ఆలోచిస్తే, న్యాయం చేకూరుతుంది. దీని కొరకు మనసు

రాగరహితమై ఉండాలి. కష్టసాధ్యమిది, కాని సత్యాగ్రహికి అత్యావశ్యకము. ప్రత్యర్థుల పక్షంగా ఆలోచించగలిగితే, ప్రపంచంలోని దుఃఖాలు, కష్టాలలో నాల్గింట మూడు వంతులు మాసిపోతాయి అప్పుడు సంప్రదింపులు వేగాన్ని పుంజుకుంటాయి. వాటిని గురించి పెద్ద మనసుతో ఆలోచించగలము.

*(యంగ్ ఇండియా, 19-3-25, పుట 95)*

★ ★ ★

తన తప్పులు భూతద్దంతో చూసి, ఇతరులవి తక్కువగా గమనిస్తే, ఇద్దరి దృష్టికోణాలు సరిగా బోధపడతాయి. సత్యాగ్రహికి ఇట్టి సమ్యక్ దృష్టి తప్పక ఉండాలి.

*(ఆత్మకథ, 1966, పుట 356)*

★ ★ ★

యాతనలను ఓర్చే సత్యాగ్రహ శక్తికి అంతంలేదు. కనుక సత్యాగ్రహంల' అపజయమన్నది లేదు.

*(యంగ్ ఇండియా, 19-2-25, పుట 61)*

★ ★ ★

సత్యాగ్రహం పుష్టిని గ్రహిస్తే, దీర్ఘయాతనలో సుఖం ఉంటుంది. మండే ఎండలో, రోజూ కూర్చుంటే, బాగానే ఉంటుంది. సమస్య, పోరాడే మార్గం, దైవం - వీటిలో విశ్వాసం ఉంటే సూర్యరశ్మి చల్లగా ఉంటుంది. "అబ్బ! ఎంతసేపు" అని అనుకోకూడదు. చిరాకు పనికిరాదు.

ఒక్క క్షణమైనా కబుర్లతో వ్యర్థం చేయకూడదు. మన ముందున్న పనిని చేసుకుంటూ ప్రతివారు కాలం గడిపితే ఆ పనిలో ఆనందం కరతలామలకం అయి తీరుతుంది. ధాన్యపు గింజను పొల్లుపోనీయడం గాని, ఒక్క కాగితాన్ని వ్యర్థం చేయడం గాని ఏవిధంగా తప్పో, ఒక్క, క్షణం పోగొట్టుట కూడా అంతే తప్పు. దేశానికి చెందిన ఈ ఆస్థులకు మనం ధర్మకర్తలం మాత్రమే.

*(యంగ్ ఇండియా - 19-3-25, పుట 95)*

★ ★ ★

స్వేచ్ఛా స్వాతంత్ర్య ప్రాప్తికి మొదటిది సత్యాగ్రహం. ఆఖరి సాధనం కూడా సత్యాగ్రహమే.

*(హరిజన్, 15-9-46, పుట 312)*

★ ★ ★

ప్రజలు మౌలిక ప్రాముఖ్యత గల విషయాలను తర్క బద్ధంగానే గాక, యాతనా రీతిలో గ్రహించాలి. యాతన మానవులకు, యుద్ధం అటవికులకు సూత్రం, యాతన విలువ, ప్రత్యర్థిలో మానసిక స్పందన కలుగజేయుటలో ఉన్నది. ఆటవిక సూత్రాలు ఈ పనిని చేయలేవు. ముకుళితమైన మనసును, మానవయాతన తర్కంతో వికసింపజేయగలదు.

*(యంగ్ ఇండియా, 5-11-31, పుట 341)*

★ ★ ★

నిజమైన యాతన తనను గుర్తించదు. లెక్క పెట్టదు. తద్వారా కలిగే సంతోషం. సంతోషాలన్నిటినీ మించి ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 19-3-31, పుట 41)*

★ ★ ★

విజయాన్ని గురించి సత్యాగ్రహి పట్టించుకొనడు. అది దైవం ద్వారా వచ్చి తీరుతుందని అతడెరుగును. అతని పాత్ర, యాతనానుభూతి మాత్రమే.

*(యంగ్ ఇండియా, 13-10-27, పుట 345)*

★ ★ ★

అమాయకుని ఆత్మ సమర్పణ, ఇతరులను చంపే లక్షల మంది త్యాగం కంటే మహోన్నతం. నిర్దాక్షిణ్యతతో కూడిన నిరంకుశత్వం. అమాయకుని ఆత్మ సమర్పణ లనే శక్తివంతమైన ఎదురు దెబ్బతో, తల బొప్పికట్టి, పతనమవుతుంది. దైవంగాని మానవుడు గాని, ఇంతకంటే గట్టి వేరేదేని ఎదురు దెబ్బను కనపరచలేరు.

*(యంగ్ ఇండియా, 12-2-25, పుట 60)*

★ ★ ★

## అధ్యాయము - 15

# సహాయ నిరాకరణము

సహాయ నిరాకరణ జడత్వము కాదు. హింసను మించిన చైతన్యం. చైతన్యం లేని ఘర్షణకు అర్థంలేదు. నేను అనుకొన్న సహాయ నిరాకరణ, అహింసాత్మకం, కనుక మాత్సర్యరహితం, రాగద్వేషాల కతీతం. కక్ష తీర్చుకునే ధోరణిలేనిది.

*(యంగ్ ఇండియా. 25-8-1920. పుట 2)*

★ ★ ★

సహాయ నిరాయకరణ అహింసాత్మకం కావున ప్రేమపూరితం, ప్రేమాయుతం కావచ్చు. కాకపోవచ్చు. శస్త్ర చికిత్సలో, ఆ వైద్యునికి రోగి పట్ల ప్రేమ ఉండదు. తన విధినిర్వహణ మాత్రమే ఉంటుంది.

సహాయ నిరాకరణ వినమ్రతకు స్ఫూర్తిదాయకము. నిశ్చల దైవధ్యానంతో ఫలవృక్షం వలె వంగి ఉండాలి.

సహాయ నిరాకరణోద్యమకారి, ఎవరికీ కనుపించనంత వినమ్రతతో ఉండి, తన తత్వాన్ని తెలియజేసి, ఋజుమార్గంలో, అతివాగుడు కట్టిపెట్టి, తను చేయదలచుకొన్నది, తెలియజేస్తాడు.

*(హరిజన్. 2-4-1938. పుట 65)*

★ ★ ★

తండ్రి పనిని వ్యతిరేకించనపుడు, కుమారుడు మొదట నయాన ఒప్పించడానికి చూసి, బ్రతిమాలి, అదీ ఫలప్రదం కానినాడు. ఇంటిని వదలిపెడతాడు. అనాగకరికులు తగవులతో రోడ్డెక్కుతారు. విధేయుడైన కుమారుడు, అభిమానంతో, గౌరవపురస్సరంగా, నిరాడంబర ప్రవర్తనతో, చేయు సహాయ నిరాకరణను తండ్రి అర్థం చేసుకొని, పశ్చాత్తప్తుడౌతాడు.

అదేవిధంగా, ప్రజ, పాలకుల సందర్భంగా సహాయ నిరాకరణ సాధ్యం. సహజ ధైర్యం, స్వాతంత్ర్యేచ్ఛ గల ప్రజల విధి అదే. తర్క సంగతమైన చట్టాల పట్ల విధేయత వారి ఋజుత్వానికి మచ్చుతునక.

కొన్ని అసంబద్ధమైన చట్టాల పట్ల, సహిష్ణుత రెండవది. ఇష్టంలేని వాటిని, కుమారుడు, అవి అధార్మికమైనవి. సహిష్ణుతకు తగనవి కానంతవరకు, ఓర్చుకొని, సహాయ నిరాకరణ చేస్తే, దానిని తండ్రి అర్థం చేసుకున్నట్లే, సహాయ నిరాకరణ చేసేందుకు అర్హులు.

యాతనలకు సిద్ధపడడం మూడవ విషయం. అట్టి త్యాగాలు చేయగలిగిన వారే సహాయ నిరాకరణ చేసేందుకు అర్హులు. శాసకులు పెట్టే కష్టాలను ఓర్పుతో సహించగలిగే ధైర్యవంతులు ఒకరిద్దరుంటే, సహాయ నిరాకరణ ఉద్యమం అసాధ్యం. బహు జనసమాఖ్య లేనిదే, తొందరపడి, ఉద్యమానికి పూనుకుంటే, అపాయం. దేశభక్తులైన యువకులకు నా మాటలు చిరాకు కలిగిస్తాయి. ఊరికే సహాయనిరాకరణకారుడవతానంటే వీలు లేదు. అన్ని ఏర్పాట్లు సవ్యంగా ఉండాలి. క్రమశిక్షణ మరీ ముఖ్యం.

*(యంగ్ ఇండియా, 8-1-25, పుట 14)*

★ ★ ★

హద్దులు మీరితే, సహాయ నిరాకరణ, నేరమవుతుంది. ఈ సన్నని ధారను గుర్తించడం కష్టం - పెళుసుగా ఉంటుంది - కోసి పారేస్తుంది.

మరి మంచి పోరాటం చేసి, స్వేచ్ఛగా (స్వచ్ఛందంగా) కారాగారవాసం చేసేవారికి, నేరాలు చేసి జైలుకి పోయే వారికి తేడా ఏమిటి? అందరికీ అదే వేషం, అదే తిండి, అదే శిక్ష. మొదటి వర్గంవారు సంతోషంగా, క్రమశిక్షణతో ఉంటారు. రెండోవర్గం వారు, తిరుగుబాటు ధోరణిలో, రహస్యంగాగాని, బహిరంగంగా గాని, క్రమశిక్షణను భంగపరుస్తారు.

ఇదే రహస్యం శాసనోల్లంఘనోద్యమంలో నిండు మనసుతో, శాసనల్లోంఘనకై, తాము ప్రతిఘటిస్తున్న శాసనం విధించే శిక్షలను, చిరునవ్వుతో, స్వీకరిస్తారు. ఆదర్శంతమైన తమ ప్రవర్తనతో, జైలు బయట చేసిన ఉల్లంఘనను, జైలులో ప్రవేశించగానే, కట్టిపెట్టి, క్రమశిక్షణతో మెలగి, తమ సహచరులను (నేరస్థులను కూడా) సంస్కరిస్తారు. అంతతోగత్వా, మనోనిగ్రహజనితమైన ఈ ఉద్యమ ప్రభావం శాసకుల నిరంకుశత్వాన్ని

కూడా జావగారుస్తుంది. అందుకనే, స్వచ్ఛందమైన యాతన ఒక్కటే అన్యాయాలను, అత్యాచారాలను అరికట్టే దివ్యౌషధము.

*(యంగ్ ఇండియా, 29-12-1921. పుట 343)*

★ ★ ★

అహింస, సహాయ నిరాకరణోద్యమానికి గుండెకాయ. గెలుపు లభించకపోయినా, పోరాటం సాగించగలుగతాం. బుద్ధిహీనత, అజ్ఞానము, అసమర్థత, ఉద్యమకారుని క్రూరాతి ప్రతాడనలోనూ ఓరిమి అవసరం. ప్రత్యర్థి కొట్టే చాటుమాటు దెబ్బలను తప్పించుకోవాలి కదా?

*(యంగ్ ఇండియా, 28-7-1921. పుట 237)*

★ ★ ★

సహాయ నిరాకరణ అనే అయుధంలో, భగవంతుని సామ్రాజ్యాన్నే గెలిచి, ఆయన సాన్నిధ్యానికి పోవచ్చును. తక్కిన వాటి మాట వేరే చెప్పవలెనా? జనానికి క్రమశిక్షణ, ఆత్మ సంయమనం, సామూహిక చర్య, అహింస వ్యవస్థ సమకూడినప్పుడు. తమ శక్తి అర్థమవుతుంది. ఆ జాతి మంచిది, గొప్పది అవుతుంది. (యంగ్ ఇండియా, 2-6-1920, పుట 3)

★ ★ ★

**అధ్యాయము - 16**

## శాసనోల్లంఘనము

సత్యాగ్రహ వృక్షానికి రెండు శాఖలు - సహాయ నిరాకరణము, శాసనోల్లంఘనము.

*(యంగ్ ఇండియా, 26-12-1924, పుట 429)*

★ ★ ★

శాసకులు ప్రజాభిప్రాయాన్ని మన్నించునట్లు చేయుటకు, ప్రతి సత్యాగ్రహి తనకు అన్యాయమనిపించినా శాసనాలను ధిక్కరించాలి.

*(యంగ్ ఇండియా, 21-1-1920, పుట3)*

★ ★ ★

నా తండ్రి అయినా, నాకు నచ్చని ఆదేశమిచ్చినపుడు, నా తిరస్కారాన్ని తెలియజేడయం. నా కనీస ధర్మం.ఆయనకు అప్పుడే న్యాయం చేకూర్చిన వాడినవుతాను ... నేను ఇట్లే చేసి, మంచి ఫలితాన్ని పొందాను తండ్రికి. స్నేహితుడికి. ఈ విధంగా చెప్పడంలో వారిని, అగౌరవపరచడం లేనపుడు. ప్రభుత్వానికి తిరస్కారం తెలియజేయడంలో ఏవిధమైన తప్పులేదు.

*(యంగ్ ఇండియా. 21-12-1920. పుట 4)*

★ ★ ★

సామూహిక శాసనోల్లంఘనం సంగతి వేరు. శాంతంగా, స్వార్థరహితంగా జరిగినప్పుడే దీని విలువ. వ్యక్తి శాసనోల్లంఘనలో స్వార్థము లేకున్నా, సామూహికంగా జనం, దీనివలన తమకేమి లాభమని అడుగుతారు. లాభాన్ని ఆశిస్తారు. దక్షిణాఫ్రికాలో తమపైనను, తమ పరివారం పైననూ వేసిన పన్నును తొలగించే నిమిత్తమై, శాసనోల్లంఘనం చేశారు. కనుక పెద్ద ఆశలు పెట్టకోకుండా, సామూహికోల్లంఘనకారులు. మూలతత్త్వాన్ని గ్రహిస్తే చాలు.

ప్రతిసారీ, ఎవరినైనా కారాగారానికి పంపినపుడు, ఆందోళన జరిపినందు వల్ల, ప్రభుత్వం జడిసిపోదు. కారాగారవాసం మన లక్ష్యం కావాలి. (సైనికునికి మరణం అయినట్లు) వేలాదిమంది సామూహికంగా ఇందుకు తయారయితే, ఆశయం నేరవేరుతుంది. ఈవిధంగా జైళ్లను నింపితే, అమాయకులపై ఆ అమానుషకృత్యం, మనకు బలాన్నిచ్చి, విజయాన్ని చేకూరుస్తుంది.

మనలో భయంలేనినాడు, కారాగారాన్ని ఆరోగ్యకేంద్రంగా భావించిననాడు, దక్షిణాఫ్రికావాసులన్నట్లు జైళ్లను సర్కారు వారి హోటళ్లు అనుకున్ననాడు, ఈ పెరికి ప్రభుత్వం మట్టి కరుస్తుంది.

ఇది శాంతియుతమైన తిరుగుబాటు, సశస్త్ర పోరాటాన్ని మించినది. శాసకుని అత్యాచారాలను అలసిపోయేటట్టు చేస్తుంది. ఈ కిటుకును గ్రహించి. ఓరిమితో అమలుపరిస్తే, అందలి అపాయాలను అధిగమించవచ్చును.

*(యంగ్ ఇండియా. 4-8-1921. పుట 244)*

★ ★ ★

సామాన్య శాసనోల్లంఘనం, ప్రతి వ్యక్తి యొక్క జన్మహక్కు. దీనివలన శాసనరాహిత్యం గాని, గందరగోళం గాని ఏర్పడదు. నేరసహితమైతే, ఇష్టారాజ్యం అయి, అంతరించిపోతుంది. ఆయుధరహితమైన పోరాటం, నిరంకుశ రాజ్యానికి ముప్పు. ప్రభుత్వం విచక్షణ లేనిదైనపుడు, శాసనోల్లంఘనమే కర్తవ్యం.

శాసనోల్లంఘనం ఏదేని ఒక్కశాసన తిరస్కారమైతే, ఆలోచించి ముందుకు సాగాలి. దానిని "చేయరాదు" అనడం అన్యాయం, అసంగతం. ఈ హక్కును దుర్వినియోగపరచరాదు. ఎట్టి అల్లరి జరుగనీయరాదు. దీనిని నియమానుసారం వాడాలి.

*(యంగ్ ఇండియా, 5-1-1922, పుట 5)*

★ ★ ★

శాసనోల్లంఘన మాత్రమే చాలదు. మాటిమాటికీ దీనిని ప్రయోగిస్తే, కత్తిపదును వలె, ప్రభావం తగ్గి, మొద్దుబారుతుంది. తక్కిన అభివృద్ధి నియమాలకు బద్ధులమై ఉంటే, దీని ఉపయోగం ఆరోగ్యకరం. ఆవశ్యకం, ఫలప్రదం అవుతుంది. ఇందులో ప్రధాన పదం "సివిలు" - అంటే నాగరికత, క్రమశిక్షణ, విచక్షణ, అహింస, ఇవిలేనిచో, నష్టమే ఫలితము. ఉల్లంఘనతోబాటు ప్రేమను జోడించడం వలన "బంగారానికి తావి" అబ్బినట్లు అవుతుంది. అది జీవనం. సదావృద్ధికాంక్షి. అసంగతమైనది, మరణకారకమైనది కాదు.

*(యంగ్ ఇండియా, 561-1922, పుట 3)*

★ ★ ★

నేరాలు లేని శాసనోల్లంఘనం పైసా సహాయాన్ని కోరదు. దృఢచిత్తమే దీనికి ఏడుగడ. ఎట్టి కష్టాలనైనా భరించగలదు, ప్రేమ హృదయంలో పుష్టి చెందుతుంది. పవిత్ర విదివిధానమవుతుంది.

*(యంగ్ ఇండియా, 1-4-1926, పుట 122)*

★ ★ ★

సామూహికమైనదీ, నేరరహితమైనదీ, అయిన శాసనధిక్కారం, మన

సుందరమూ కోరుకుంటున్నాం. ఇది అసంకల్పితం అయితే గెలుస్తుంది. సరియైన భూమిక ఏర్పాటు కాకపోతే, మందికి ఇది పట్టదు. హింసలేకుండా చూసుకోవాలి హింస ఉన్నా ఈ ధిక్కారము జరుగుతుందని అన్నాను. అయితే దాని ప్రగతి కుంటుపడుతుంది. ఎదురెదురుగా ఉండే శక్తులు గలిసి పనిచేయవు; పరస్పరం సహాయం చేయలేవు. హింసకు బదులు అహింసను, ద్వేషం బదులు ప్రేమను, అనైక్యతకు బదులు ఐక్యతను ప్రతిపాదించడమే నేరరహిత శాసనోల్లంఘనము, శాసనధిక్కారముల ఆశయం.

*(యంగ్ ఇండియా, 27.3-1930, పుట 109)*

★ ★ ★

ఎంత రెచ్చగొట్టినా ఓరిమితో ఉండడంవల్ల విజయం తథ్యం. సైనికునిలా శాసల్లోంఘనకారుడు కూడా స్థిరంగా ఉండాలి.

*(యంగ్ ఇండియా, 25-8-1921, పుట 268)*

★ ★ ★

జనులందరికీ అనుసరణ సులభమైనదని కనుక్కున్నాను. సత్యాగ్రహ ప్రయోగం ఆరోగ్యకరం కనుక, అమ్మను శిశువు కరుచుకొని ఉన్నట్లు, ఈ ప్రయోగంలో ప్రతి అంశాన్ని గట్టిగా పట్టుకొని నడిపిస్తున్నాను.

*(యంగ్ ఇండియా, 22-9-1927, పుట 317)*

★ ★ ★

సత్యాగ్రహి జైలు నియమాలను భంగపరచి, తద్వారా జైలు ఉద్యోగులను బాధపెట్టడు. జైలు నియమాలను భంగపరచడు. జైలులో మనకు, బయటి ప్రపంచం అందుబాటులో ఉండదు. కాని జైలు అధికారుల మనసులను మార్చడం వగైరా పోరాటాలు మొదలవుతాయి.

అహింస ప్రత్యేకత దాని నిరంతర పయనం, కత్తిలోనూ, తుపాకి గుండులోనూ, ఈ సత్తాలేదు. తుపాకి చంపుతుంది. శాసన ధిక్కారం చేయువారు, జైలు అధికారుల మనసులలో మార్పు తెచ్చి తామూ, వారూ ఒకటైపోతారు.

*(యంగ్ ఇండియా, 21-1-1920, పుట 3)*

★ ★ ★

## అధ్యాయము - 17

# సత్యాగ్రహ సమయంలో ఉపవాస దీక్ష

సత్యాగ్రహ సమరాయుధాగారంలో ఉపవాదీక్షకు ప్రత్యేకత ఉన్నది. దీనినందరూ అవలంబించలేరు... శరీరదార్ఢ్యం ఒక్కటే చాలదు. భగవద్భక్తి కూడా ఉండాలి. అనుకరణ గాకుండా, మనసు లోతుల్లోంచి చెయ్యాలి.

*(హరిజన్. 18-13-1939. పుట 56)*

★ ★ ★

స్వార్థం, రోషం తొందరబాటు, నమ్మకం లేకపోవడం, పనికిరావు... ఓటమి, దృఢచిత్తం ఏకాగ్రత, శాంతస్వభావం, ఇవన్నీ ఒకరిలో ఉండవు కనుక అహింసా సాధన లేనిదే సత్యాగ్రహోపవాస దీక్షకు పూనుకోరాదు.

*(హరిజన్. 13-10-1940. పుట 322)*

★ ★ ★

ఆమరణ నిరసన దీక్ష సత్యాగ్రహ సమరంలో ఆఖరి ఆయుధం. ఈ పవిత్రాయుధాన్ని, పరిణామ రహితంగా తలపెట్టాలి. దీక్ష వెనుకనున్న భావం ముఖ్యం అని గమనించాలి.

*(హరిజన్. 18-8-1946. పుట 262)*

★ ★ ★

ఈ దీక్షను ఆషామాషీగా తీసుకుంటే అపాయకరం. పవిత్ర హృదయంతో చేసిన ఒక్క ఉపవాదీక్ష. ప్రపంచానికంతకీ, ఉద్ధారకము. జీసస్ క్రైస్తు దీనికి దృష్టాంతము.

*(హరిజన్ 27-10-1946. పుట 372)*

★ ★ ★

ఉపవాసాలు, ఇతరులను ఇరుకున పెడ్తాయి. ధనం కోసం. కార్యార్థమై చేసే ఉపవాసాలు స్వార్థపూరితాలు. అవి మనకు వద్దు. నా చేత ఎలాగైనా తమ మాటను ఒప్పింపచేసేందుకు, ఉపవాసం ఉంటే, నేను లొంగను. ప్రాణం పోయినా, ఈ లక్ష్మణరేఖను దాటవద్దు. స్వార్థసహితమైన

వాటిని మనస్సులో పెట్టుకుంటే అట్టి వారి పరువుపోతుంది

*(హరిజన్. 9-9-1933. పుట 4)*

★ ★ ★

సద్ధర్మరహితంగా, ఉపవాసం ఉండేవారిని, ఎంత గొప్పవారైనా సరే మరణం అసన్నమైనా, సమర్థించవద్దు.

*(హరిజన్. 17-3-1946. పుట43)*

★ ★ ★

అహింసాయుద్ధంలో, అన్నీ వ్యర్థమైనపుడు, ఉపవాసాన్ని సమ్మోహనాస్త్రంగా వాడి, నిద్రాణమైన మానవత్వాన్ని మేలుకొలపాలి. ఆత్మప్రబోధం ద్వారా చేసిన ఉపవాస దీక్ష, నిరాసక్తమై ఉంటుంది.

*(హరిజన్. 21-12-1947. పుట 476)*

★ ★ ★

ఆమరణ నిరాహార దీక్ష, ప్రత్యేక పరిస్థితులలో, అనుకున్న దానిని సాధిస్తుంది. దీనికి సరియైన ప్రశిక్షణ కావాలి

*(హరిజన్ , 26-7-1942. పుట 248)*

★ ★ ★

## అధ్యాయము - 18

# నాయకుడు సత్యాగ్రహి

ప్రతి ఉద్యమంలో, సదాచార సంపన్నులు ఉండాలి.

*(దక్షిణాఫ్రికా సత్యాగ్రహం. 1950. పుట 139)*

★ ★ ★

దైవచింతనతో, అంతర్వాణి మార్గదర్శకత్వంతో, సత్యాగ్రహ నాయకుడు ముందుకు సాగుతాడు.

*(యంగ్ ఇండియా. 2-8-1928. పుట 260)*

★ ★ ★

నాయకులమనేవారు, గుంపుల అరుపులకు దడిసిపోరాదు. తమకి

అభ్యంతరం ఉండినా ప్రజల కోరిక, అని సరిపెట్టుకుంటే చాలదు కొన్ని సందర్భాలలో, తర్క సంగతం కాని ప్రజల కోరికలను తిరస్కరించాలి.

*(యంగ్ ఇండియా 14-7 1920, పుట 4)*

★ ★ ★

ధార్మిక సత్యాగ్రహంలో, ఆడంబరత్వానికి, దూకుడు స్వభావానికి చోటులేదు. ప్రత్యర్థుల భావాలను గౌరవించాలి. తనలోని నలుసు, ఎదుటివాడికి కొండంతై కనుపిస్తుంది.

*(హరిజన్, 27-5-1939, పుట 144)*

★ ★ ★

సత్యాగ్రహ సమరానికి, పెద్ద సైన్యం అక్కలేదు. అంత ఖర్చు ఉండదు.

*(హరిజన్, 22-10-1938, పుట 298)*

★ ★ ★

మానవులందరూ సామూహికంగా సత్యాగ్రహం చేయలేరు. ఇక సైనికునికి, దళపతికి తెలిసినట్టుగా, యుద్ధ ప్రయోజనం తెలియదు గదా! అవేవిధంగా నాయకుడి ఆదేశాలను పాటిస్తే చాలు.

*(హరిజన్, 22-10-1938, పుట 298)*

★ ★ ★

అందరికీ పూర్తిగా అర్థం అయేటట్టు చేసిననాడే, తిరిగి శాసనోల్లంఘనం మొదలు పెట్టాలి.

*(ఆత్మకథ, 1966,పుట 357)*

★ ★ ★

సైనికుల ప్రశిక్షణకీ, అహింసా సంగ్రామ సైనికుల ప్రశిక్షణకీ ప్రాథమిక క్రమశిక్షణలో తప్ప వేరు సామ్యం లేదు. అహింసావాదుల దైవభక్తి, నాయకుని పట్ల విధేయతా, పరస్పర సహకారం మౌలికాలు.

*(హరిజన్, 12-5-1946, పుట 128)*

★ ★ ★

1 సత్యాగ్రహికి నిజాయితీ ముఖ్యం
2. నాయకుని పట్ల నిస్సంకోచంగా విధేయత కనుపరచాలి
3. తమ సర్వస్వం, పరివారాలతో సహా త్యాగం చేయాలి. అన్ని బాధలూ, మరణమైనా, సంతోషంగా సహించాలి.
4. తమలో తాము, ప్రత్యర్థులు, ఎవరి విషంలోనైనా మనోవాక్కాయ కర్మేణా హింసను పరిహరించాలి.

*(హరిజన్, 22-10-1938, పుట 298)*

★ ★ ★

సత్యాగ్రహ సమరంలో ఎల్లప్పుడూ ముందుకుపోవడమే. గాని వెనుదిరగడము లేదు. గడిచిన కొద్దీ అందరూ దీన్ని సమర్థిస్తారు. ఇందు పెద్దమాటలు, చిన్న చేతలూ ఉండవు.

*(మహాత్మాగాంధీ - సంకల్పం, 1967, పుట 174)*

★ ★ ★

## అధ్యాయము - 19

# అల్లర్లు, దాడులు, సత్యాగ్రహం

అల్లర్లను అహింసతో అణచాలంటే మనస్సులో నిజమైన అహింస ఉండాలి. అట్టి అహింస తప్పుచేసే ఆకతాయిని కూడా తన ప్రేమాలింగనంలోకి తీసుకోగలదు. ఈ మనఃస్థితి పుట్టుకతో రావాలి. ఏదోవిధంగా తంటాలు పడితే కృతకంగానే ఉంటుంది. శాంతి సమయాలలో ఎంతో కాలం ఓరిమితో చేసిన ప్రయత్నంతో యిట్టి శక్తి వస్తుంది. శాంతిదళ సభ్యులు, గూండాలుగా పేర్కొన బడుతున్న వారితో దగ్గర సంబంధం పెట్టుకొని వారితో పరిచయం పెంచుకోవాలి. తన నడవడితో స్వార్థరహిత సేవతో వారి మనసులను జయించి, తాను వారిని గుర్తించి వారు తనను గుర్తించేటట్లు చేసుకోవాలి. ఆకతాయి మూకలు ఆకాశం నుండి ఊడిపడవు. దయ్యాలవలె భూతాలవలె భూమిలోంచి పుట్టుకొని రావు. సామాజిక అసామంజస్యమే దీనికి మూలం కనుక ఇటువంటి పరిస్థితులకు జవాబు దారీ, మరోమాటలో, మన

సమాజంలోని కుళ్ళిపోయిన పరిస్థితికి, ఆకతాయి మూకలే ప్రతీకలు ఈ జాడ్యాన్ని పోగొట్టాలంటే ముందు దానికి గల కారణాలను కనుక్కోవాలి. అప్పుడు వాటి నివారణకు తగిన ఉపాయం కొంత మేరకు సులభం అవుతుంది.

*(హరిజన్ 15-9-40, పుట 285)*

★ ★ ★

గత యుద్ధంలో సరిహద్దుల్లో మన సైన్యం సిద్ధంగా లేకపోతే ఏమయ్యేది? ఆసైన్యమే మన దేశాన్ని రక్షించింది. నిరాయుధమైన తటస్థదేశం ఇతర దేశాలను నాశనం అవుతూవుంటే చూస్తూ ఎలా ఊరుకోగలదు? స్వాప్నికుడు అనిపించుకున్నా యిందుకు నేను యిచ్చే సమాధానం యిది. "తటస్థదేశం యుద్ధ సైనికులకు దారి యివ్వకూడదు. దారి యివ్వడం పిరికితనం. మనుష్యులే అడ్డుగోడగా నిలిచి వారిని ముందుకు సాగనీయకుండా, కొల్లగొట్టనీయకుండా ఆపాలి. గుజరాతులోను, పెషావరులోను లారీలను, తుపాకీ గుండ్లను ఎదుర్కొని నిలచి, అహింసావాదులు హింసకు పూనుకోకుండా యీ పని చేశారు. యుద్ధసైనికులకూ, అహింసావాద సైనికులకు రెండే మార్గాలు ఉన్నాయి. నేను స్విట్జరులాండు పౌరుణ్ణిగాని, లేక తటస్థ ఫెడరల్ దేశపు అధ్యక్షుణ్ణి గాని అయివుంటే దండెత్తే సైన్యానికి సౌకర్యాలన్నింటిని ఆపి ఏమీ వాళ్ళకు సమకూర్చకుండా, ఆ సైన్యానికి వెళ్ళడానికి దారి కూడా లేకుండా చేసేవాణ్ణి, రెండోమార్గం, స్విట్జరులాండు థెర్మోపైల్ కథను పునరావృతం చేసి అడ్డుగా స్త్రీ పురుషులను నిలిపి, దాడి చేసేవాళ్లను, వారి శవాల మీదుగా మాత్రమే వెళ్ళమని అనేవాడిని, ఇటు వంటిది మానవసహనానికి అతీతమైనది. యిది ఒక క్రొత్త అనుభవం అని మీరన్నా నేను అంగకీరించను. ఇది పూర్తిగా సాధ్యమే. ఆ స్త్రీ పురుషులు పొరుగుదేశానికి దారి కావాలని కోరే సైన్యం ముందు నిలచి ఉండటం ఊహించండి. వారందిరి పై నుంచి నడచిపోవచ్చునని మీరనవచ్చు. నేను యిలా అంటాను. "మీరైతే మిమ్ము మీరు అంతం చేసుకొని అయినా మీ విధిని సరిగా నిర్వర్తించారు. అమాయక అహింసావాదులైన స్త్రీ పురుషుల శవాల మీద నడిచి పోయే సాహసం చేసిన

ఆసేన మళ్ళీ ఎన్నడూ అటువంటి పనిని, అటువంటి ప్రయోగాన్ని చేయతలపట్ట నేరదు. మీరు సామాన్యజనులైన స్త్రీ పురుషులలో యిటువంటి ధైర్యం ఉంటుందని నమ్మకపోవచ్చు కాని అహింస అనేది గట్టి పథార్థంతో శక్తి మంతంగా నిర్మితమైనది. అది బలహీనుల ఆయుధం కాదు, గుండెబలమున్న వారి సాహసచర్య.

*(యంగ్ ఇండియా, 31-12-31, పుట 427)*

★ ★ ★

హెర్ హిట్లర్, సైనోర్ ముస్సోలినీలతో మిష్టర్ ఛాంబర్లేను స్వదేశలబ్ధి, కష్టనివారణకై చేసుకున్న ఒడంబడికను గౌరవరహిత శాంతి ఒప్పందం అని అన్నాను. వారికి మరో మార్గం లేదు. అంతేగాని వారిని గురించి విమర్శకాదు. యుద్ధోన్మాదుల దృష్టిలో యిది పిరికతనం, మిష్టర్ ఛాంబర్లేను, మిష్టర్‌డలాదియర్ ప్రజాస్వామ్య దేశాల ప్రధానులు ఎట్టి పరిస్థితులలోను రక్తపాతాన్ని కోరరు. యుద్ధమే కావాలని కోరుకోరు ఎలాగైనా సరే శక్తి మేరకు యుద్ధాన్ని నివారించాలనే భావంతో జక్కుల పక్షం వహించారు. హింసాయుతంగా జరిగే యుద్ధపద్ధతిలో నిరంకుశలతో వ్యవహారం యిలాగే ఉంటుంది. హింసాయుతంగా జరిగే యుద్ధపద్ధతి నిరంకుశానికి దారితీస్తుంది. అహింసా విధానం ప్రజాస్వామ్యానికి తొలిమెట్టు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికాలు దేన్ని ఎన్నుకోవాలో నిర్ణయించుకోవడం అవసరం. ప్రస్తుతం తటస్థంగానే ఉన్న రష్యా నిరంకుశపాలనలో ఉన్న రష్యా ఏమి చేయబోతుందో తెలియదు. రక్తపుటేరులు పారించడం, అక్కడ మామూలే. ఈ పూర్వరంగ పరిచయం చిన్నవైన, బలహీనమైన దేశాలకు నేనిచ్చే సలహాకు దోహదం చేస్తుంది. జెకోస్లొవేకియా దుర్దశ నన్ను కదిలించింది. నిరంకుశుల కాళ్ళ క్రింద నలిగి పోవడమే వాళ్ళ గతి. రక్తపాతం లేకుండా వుండాలంటే, దాడి చేసిన వారికి లొంగిపోవడమే మంచిది. నేను బానిసగా వుండను. కాని ఆ కోరిక తీరే వరకు జీవించి యుండాలిగనుక ప్రస్తుతం పెనుతుపానుకు తలవంచితే తప్పు లేదు. ఆయుధాలకు బలి అయిపోకుండా ఓరిమితో, సహనశక్తిని పెంచుకొని శరీరం పోయినా ఆత్మను రక్షించుకోవాలి. ఈ గౌరవశూన్యమైన

శాంతిని అవకాశంగా తీసుకొని స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవాలి. ''హిట్లరుకు కరుణలేదు. నీ అధ్యాత్మిక చింతన ఎందుకూ కొరగాదు.'' అని అనేవారికి నా సమాధానం యిది. ''అహింసా విధానం క్రొత్తది, యిందు నేను మట్టిలో కలసిపోయినా నాకిష్టమే. అయినా నిబ్బరమైన గుండెతో ఎదిరిస్తే ఆబాలగోపాలం ద్వేషాన్ని పరిహరించి నిలిస్తే ఈ క్రొత్త అనుభవం, ధీరోదాత్తత ముందు అ నిరంకుశులు తలలు వంచుతారేమో, వాళ్ళ హృదయాలు స్పందిస్తాయేమో, అలాజరగదని నిశ్చితమైన అభిప్రాయం ఏర్పరచుకొని దాన్ని పెంచుకోవడం మంచిదా? ఎంత సద్భావం ఉన్నా, ఇంగ్లాండు, ఫ్రాన్సు వారి దాడినుండి అమాయకులను రక్షించలేరు. వారి మధ్యపడితే, మునుపెన్నడూ కనీవినీ ఎరగని రక్తపాతమే జరుగుతుంది. కనుక నేను జెక్కునయితే నా దేశాన్ని రక్షించే బాధ్యతనుంచి, ఈ రెండు దేశాలను తప్పిస్తాను. అయినా నేను బ్రతకాలి కనుక, నేను ఏదేశానికి, ఏసంస్థకూ కట్టుబానిసను కానప్పటికి, ఏదో మార్గాన్ని అన్వేషించాలి. నాకు సంపూర్ణ స్వాతంత్ర్యమైనా ఉండాలి. లేదా నాశనమైనా అయిపోవాలి. ఆయుధ యుద్ధంలో గెలిచేందుకు ప్రయత్నించడం దంభం మాత్రమే అవుతుంది. నా స్వాతంత్ర్యాన్ని హరించేందుకు ప్రయత్నించే వారి ముందు తలవంచక, నిశ్శస్త్రంగా ఎదురునిలిచి, ఆ ప్రయత్నంలో ఆహుతైపోతాను. ఈ విధానంలో శరీరం నశించినా, ఆత్మ గౌరవం నిలిచి వుంటుంది అవమానాన్ని ప్రతిఘటించి, నిజమైన స్వాతంత్ర్యాన్ని పొందుతాను.

అహింసాయుతమైన తిరుగుబాటును ఏదేశమైనా అవలంబించిన దాఖలా, చరిత్రలో కానరాదు. నిరంకుశుడు నా బాధను గమనించినా స్పందించకపోతే, ఏమీ పరవాలేదు. దాని వలన నాకు ఏమీ నష్టము కలుగదు. నిలిచి ఉండవలసినది నాగౌరవము. అది నిరంకుశుని దయా దాక్షిణ్యాల మీద ఆధారపడిఉండదు. అహింసా పూజారిగా, భవిష్యత్తులో ఏమీ జరగనున్నదో, దానికి పరిమితులు విధించను. ఇంతవరకూ ఆ యుద్ధోన్మాదులకు ఒకే అనుభవం, అది ఏమి? మానవులు శక్తినీ, జబ్బ సత్తువనూ చూపితే నిస్సంశయంగా లొంగిపోతారు అని. ఆయుధాలు

ధరించని స్త్రీలు, పురుషులు, బాల బాలికలు, ఏవిధమైన ద్వేషము, కోపము. ఉద్విగ్నత లేకుండా, అహింసా పద్ధతిలో వారిని ఎదిర్చి నిలుచుట వారికొక నూతనమైన అనుభవం. వారిలో కూడా నాలో ఉన్న ఆత్మ ఉన్నది గనుక వారిలో మార్పు రావచ్చు. ప్రథమ దక్షిణాఫ్రికా సత్యాగ్రహ సమరంలో 13000 మంది అహింసావాదులు, తమను నిర్మూలించగలిగిన ఆయుధాలతో సన్నద్ధులైయున్న సైన్యాన్ని ఎదిరించి నిలిచినప్పుడు, హింసను వదిలి అహింసావాదులై మూక పోరాటం చేసినప్పుడు దేశగౌరవం నిలబడింది. కనుక ప్రజల యుద్ధమనీ, శాంతి కొరకు చేస్తున్న సంగ్రామమనీ చెప్పి తాము వెనుక వుండి చిన్న చిన్న దేశాలను నిరంకుశరాక్షసుల ముందుకు ఎరగా త్రోసి, తమాషా చూడటం నాకు సమ్మతం కాదు. ఎవరికి వారు సమానమైన వ్యూహాలతో సంసిద్ధతతో, నిశ్చలంగా నిలబడితే నిరంకుశులను నిలువరించవచ్చు. నేను ఒంటరిగా, ఎవరైనా, నన్ను అనుసరిస్తారో లేదో తెలియనప్పుడు, హఠాత్తుగా నా మదిలో అహింసా పోరాటం మెదిలినప్పుడు సత్యాగ్రహమనేది దక్షిణాఫ్రికాలో ఉద్భవించి క్రొత్త చరిత్రను లిఖించింది.

మరో దృష్టాంతం చెబుతాను దేవుని సేవకుడనని (ఖుదాయీఖిద్మత్‌గార్) చెప్పుకునే ఖాన్ సాహెబ్ అబ్దుల్ గఫార్ ఖాన్ గారిది. ఆయనను పఠానులు "అఫ్ఘనుల గౌరవం" అని పిలిచి సంతోషిస్తారు. ఇది రాస్తున్నప్పుడు వీరు నా ఎదుటనే కూర్చొని వున్నారు. వీరు వేలాది మంది ప్రజలు తమ ఆయుధాలను క్రింద పడవేసి త్యజించేటట్టు చేశారు. ఆయన అహింసా సిద్ధాంతాన్ని అర్థం చేసుకున్నాను అని అంటారు. తనవాళ్ళు ఏమి చేస్తారో కచ్చితంగా వారికి తెలియదు. తమ నాయకుని పట్ల వారికి గల సంపూర్ణ విశ్వాసమే వారి సంపద. "శాంతి మార్గంలో తన సహచరులను నడిపించేందుకు ఒక శాంతి సైనికుడు నిజాయితీగా చేసిన ప్రయత్నం యిది అని నాకు అనిపించింది. కనుక యీ విషయం చెబుతున్నాను. భవిష్యత్తులో సత్యాగ్రహవీరులకిది మార్గదర్శకంగా ఉంటుంది. కనుక దీన్ని పేర్కొంటున్నాను. ఖాన్‌సాహెబ్ అబ్దుల్‌గఫార్‌ఖాన్ అహింస అంటే ఏమిటో తెలియని తన అనుచరుల విధేయతను తెలియజేయడం కోసం సరిహద్దు

రాష్ట్రానికి నన్ను తీసుకొని వెళ్ళారు. వారు పరిణతులైన శాంతి సైనికులు కాకపోయినా ఆ దిశలో శ్రద్ధగా శ్రమించి పయనిస్తున్నారు. విజయం తరువాతి సంగతి. మీరు అహింసా పోరాటం సాగించండి. దానివల్ల మీరనుకున్నది సాధ్యం కాకపోతే మీకు అలవాటైనా సాయుధపోరాటమే తిరిగి మొదలు పెట్టండి. ద్వంద్వం వద్దు అని చెప్పాను. మనస్ఫూర్తిగా, నిండు మనస్సుతో, ఏ నిరంకుశశక్తి ఎదుట తలవంచవద్దు. ద్వేషరహితంగా, ఆత్మబలంతో తలపెట్టినప్పుడు ఏదైనా సాధ్యమే'' అని, యిది బలవంతుల ఆయుధం, బలహీనులది కాదు కనుక అహింసాయుధ సంగ్రామాన్ని సమర్పిస్తున్నాను అని చెప్పాను.

*(హరిజన్ 15-10-38. పుట 290-91)*

★ ★ ★

మనుష్యజాతిది ఒకే కుటుంబం ఇందులో ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ శారీరికంగా బలహీనులైనా, ఆత్మగౌరవం, స్వాతంత్ర్య రక్షణలకు బాధ్యులు అని వారిని సమాధానంపరచగలిగితే నా పని పూర్తి అవుతుంది. ప్రపంచమంతా దండెత్తి వచ్చినా యీ పద్ధతి రక్షణనిస్తుంది.

*(గాంధీ రచనలనుండి ఎంపిక చేసినవి - 1957. పుట 43).*

# భాగము 3

# సిద్ధాంతాల తారతమ్యాలు

## అధ్యాయము 20

## సర్వోదయం

నేను చదువుకునే రోజుల్లో తరగతికి సంబంధించిన పాఠ్య పుస్తకాలు తప్ప వేరేవేటినీ పట్టించుకోలేదు ఆ తరువాత బ్రతుకు తెరువు తాపత్రయంలో పడినందున చదువేందుకు సమయం దొరకలేదు. కనుక నేను చాలా పుస్తకాలు చదివానని చెప్పలేను. అయితే యీ విధమైన వాటివల్ల నాకు పెద్ద నష్టం కలగలేదని చెప్పగలను. నేను చదివిన కొద్ది పుస్తకాలలో, నన్ను ప్రభావితం చేసి, జీవితంలో నాకు ఉపయోగపడినదీ తక్షణమేనన్ను స్పందింప చేసినదీ, అన్‌టు దిస్ లాస్ట్' అనే ఇంగ్లీషు పుస్తకం. ఒక కవి మనిషిలో నిద్రాణమై యున్న సద్గుణాలను, ఉత్కృష్టతను వెలికి తీయగలడు. అయితే అందరినీ అతడు ఒకే విధంగా స్పందింప చేయలేడు. అందరి సృష్టి ఒకే విధంగా వుండి, అందరు ఒకే స్వభావం కలిగి వుండరు కదా!

''అన్ టు దిస్ లాస్ట్'' (ఈ చివరికి) అను పుస్తకంలో గొప్ప సత్యాలు పొందు పరచబడివున్నాయి. నిజానికి వర్గాల భేదాలు, మత, వర్ణ విబేధాలు వుండవనీ, ప్రతి ఒక్కరు ఇంకొకరిని తనతో సమానమని భావించి స్నేహ బంధంతో కట్టి వేస్తారనీ, ఏ ఒక్కరూ మరొకరిని అస్పృశ్యులుగా భావించరనీ, శ్రమజీవి, ధనవంతుడు సమానంగా చూడబడాలనీ, చెమటోడ్చి పని చేసి జీవనాదాయం సమకూర్చుకునే సందర్భంలో కాయకష్టం, బుద్ధిబలం మధ్య తరతమ బేధాలు పాటించడం తప్పని, ఇట్టి సమాజ నిర్మాణ కార్యంలో అందరి భాగధేయం వుండాలనీ చెప్పారు. దానిని గుజరాతీలోనికి సర్వోదయము అను శీర్షిక పెట్టి అనువదించాను. రస్కిన్ మహాశయుడు దీన్ని రచించారు. నా భావాలు, నా గట్టి నమ్మకాలు యీ పుస్తకంలో ప్రతిబింబించి, నన్ను ప్రభావితుణ్ణి చేశాయి. ఇందలి ఉపదేశాలు క్రింద తెలుపుతున్నాను.

1. వ్యక్తి బాగుంటే అంతా బాగుంటారు.
2. జీవికొపార్జనకు ఏ వృత్తి అయినా (క్షురకునిదైనా, న్యాయవాదిదైనా) ఒక్క స్థాయి గలదే.
3. శ్రమశక్తితో (భూమి దున్నిగాని, చేతి పనులు చేసి గాని) గడుపు బ్రతుకు విలువైనది.

మొదటిది నాకు తెలిసినదే. రెండవది స్పష్టాస్పష్టంగా అనుభవం ద్వారా తెలిసినది. మూడవది పూర్తిగా క్రొత్తది. వాటిని జీవితంలో స్వయంగా అమలు పరచదలిచాను.

*(ఆత్మ కథ 1966 పుట 224)*

★ ★ ★

అహింసావాది బహుజనహితాయ అనే సామాన్య సూత్రం కోసం మాత్రమేగాక సర్వజనహితాయ అనే ధ్యేయం కోసం ప్రాణాలు అర్పిస్తాడు. తాను హుతమై ఇతరులకు హితము చేస్తాడు. మొదటి వర్గం ఆత్ ం చేయదు. రెండవ వర్గం చేస్తుంది. మొదటి పర్గం వారికి, రెండవవర్గం వారికి సామాన్య గుణాలు వున్నా కొంత దూరం వెళ్లాక వేరై పోతారు.

*(యంగ్ ఇండియా. 9-12-26, పుట 432)*

★ ★ ★

పంచాయతీరాజ్ మన స్వప్నం. అందు రాజుదీ, పేదదీ ఒకటే స్థాయి. వివేకంతోపాటు, పవిత్రతత కలిగి ప్రేమ సూత్రంతో బంధితులు గనుక పేదా, పెద్ద (గొప్ప) అనే అంతరాలు వుండవు. శ్రమశక్తి, బుద్ధిశక్తి సమానం. దానికోసం భంగీ (పాకీ) పని అయినా చేపట్టుట, మాదక ద్రవ్యాల విసర్జన, స్వదేశీ ఉద్యమం, పరాయిస్త్రీని తల్లిగా, చెల్లిగా, కుమార్తెగా భావించుట, ఇతరులను హింసించకుండుట, దీని మొదటి పని. అందుకోసం అవసరమైనప్పుడు ప్రాణం ధారపోస్తాడు.

*(హరిజన 10-1-48, పుట 517)*

★ ★ ★

# అధ్యాయము -21
# సమాజవాదం

సమాజవాదం (సోషలిజం) ఒక అందమైన మాట. నాకు తెలిసినంత వరకూ, సోషలిజంలో సమాజానికి చెందిన మానవులందరూ సమానము. ఎవరూ తక్కువకారు, ఎవరూ ఎక్కువకారు. ప్రతి శరీరంతో, శరీరంపై భాగంలో ఉన్నందున తల ఎత్తైనది (ఉత్తమమైనది) కాదు. అదేవిధంగా, భూమిని స్పృశించి ఉంటాయి గనుక, అరికాళ్లు క్రిందివి (తక్కువ) కావు. ప్రతి శరీరంలో అంగాలు (భాగాలు) సమానమైనట్లే, సమాజంలో సదస్యులంతా సమానులే. ఇదీ సోషలిజం (సమాజవాదం).

ఇందు రాజురైతు, ధనవంతుడు - ధనహీనుడు, యజమాని-పనివాడు, అందరిస్థాయీ ఒక్కటే. ధార్మిక విషయంలో, సోషలిజంలో ద్వంద్వం లేదు. అంతా ఏకత్వమే. ప్రపంచమంతటా, సమాజాన్ని పరికిస్తుంటే, ద్వంద్వం, బహుత్వం తప్ప వేరేమీ గనుపించదు. ఏకత్వం కళ్ళకు కనిపిస్తుంది. ఈ మానవుడు ఉన్నతుడు, అతడు తక్కువవాడు, ఆ ఒక్కడు ఒక హిందువు, ఇంకొకడు ఒక ముస్లిము, మూడవవాడు ఒక క్రిస్టియన్, నాలుగవవాడు ఒక పార్శీ, ఐదవవాడొక సిఖ్ఖు, ఆరవ వాడొక యూదుడు. వీరిలో ఇంకా ఉపభాగాలున్నవి. నా ఊహకు అందిన ఏకత్వం ప్రకారం బహుభంగులలో పరిపూర్ణమైన ఏకత్వం ఉన్నది.

ఈ స్థితిని చేరుకోవాలంటే, మనం జరుగుతున్న విషయాలను, ఏదో మనకు సంబంధించినవి గావని, నిరామయంగా చూస్తూ, ఊరకొని ఉండరాదు. అందరూ సోషలిజంలోనికి పరివర్తన చెందేవరకు, చేతులు ముడుచుకొని ఏ చర్యాతీసుకోవలసిన పని లేదు అని అనరాదు. మన జీవిత విధానాన్ని మార్చుకోకుండా, మనము, పరిచయాలు పెంచుకుంటూ, పార్టీలు ఏర్పాటు చేసుకుంటూ, మనకు అవకాశం చిక్కినప్పుడు గ్రద్ధలాగ దానిని తన్నుకుపోవచ్చును. ఇది సోషలిజం కాదు. ఏదో, చేజిక్కించుకోవలసినదిది అని భావిస్తూ పోతూంటే, మన నుండి అది ఇంకా దూరమై పోతూనే ఉంటుంది.

మొదటి పరివర్తనతో సోషలిజం మొదలవుతుంది. అటువంటివారు ఒక్కరూ, ఆ ఒకటి ప్రక్క ఒక సున్నాను చేరిస్తే పది మందీ, ఆ విధంగా ఒక్కొక్క సున్నాను చేరుస్తూ పోతే, ప్రతిసారీ, ఇదివరకటి కంటె, పది రెట్లు అవుతూ పోతారు. అయితే మొదటిది సున్నా అయితే, అనగా, ఎవ్వరూ ప్రారంభించకపోతే, సున్నాలు ఎన్ని పెంచినా, ఫలితం పెద్ద సున్నా మాత్రమే. ఆ సున్నాలు వ్రాసేందుకు పట్టిన సమయం, కాగితం అంతా వ్యర్థమే.

ఈ సోషలిజం, స్ఫటికంలా, స్వచ్ఛంగా ఉంటుంది. కనుక, దానిని సాధించడానికి, స్వచ్ఛమైన పద్ధతులు కావాలి. మురికి (అపవిత్ర) పద్ధతులు, అపవిత్రమైన అంతానికి దారి తీస్తాయి. రాజు తలతీస్తే, రాజూ, రైతూ, సమంకారు, అదేవిధమైన కత్తిరింపు (ఖండన), యజమానినీ, పనివానినీ సమం చేయదు. అసత్యంతొ సత్యాన్ని చేరలేరు. అహింస, సత్యంలో ఇమిడి ఉంది. కావుననే, వాటిని ఒకే నాణేనికి రెండు ప్రక్కలు అని అంటారు. ఏ ఒక్కదానినీ, రెండవ దాని నుండి విడదీయలేము. నాణేన్ని రెండు ప్రక్కలా పరికించి చదవండి. మాటల గుణింతం వేరుగా ఉన్నా, విలువ ఒక్కటే. పరిపూర్ణమైన పవిత్రత లేకుండా, ఈ అందమైన స్థాయి లభించదు. అపవిత్రమైన మనసుగాని, శరీరంగాని కలిగియున్న వారిలో అసత్యం, హింస చోటు చేసుకుంటాయి.

అందుచేత, పవిత్ర హృదయులైన అహింసాయుత సత్యసంధులు మాత్రమే ఇండియాలోనూ ప్రపంచంలోనూ సోషలిస్టు సమాజాన్ని స్థాపించ సమర్థులు. నాకు తెలిసినంతవరకూ, ఈ ప్రపంచంలో పరిశుద్ధమైన సోషలిస్టు దేశం ఏదీ లేదు. పైన వివరించిన పద్ధతులు లేకుండా, అటువంటి సమాజపు అస్తిత్వం అసాధ్యం.

(హరిజన్, 13-7-47, పుట 232)

★ ★ ★

సోషలిజంలో సత్యాహింసలు అవతరించాలి. అలా, అవగలగడానికి వ్యక్తి పరమాత్మునియందు, జీవంతమైన నమ్మకం కలిగిఉండాలి. యాంత్రికమైన సత్యాహింసలఅనుసరణ, ఆపత్కాలంలో భంగం అవుతుంది. అందుకనే

సత్యమే దైవమని నేను అన్నాను. ఈ దైవం చైతన్యశక్తి. అదేమన జీవచ్ఛక్తి. ఆ శక్తి అంతరంగంలో ఉంటుంది గాని శరీరం అదికాదు. ఆ శక్తి అస్తిత్వాన్ని గుర్తించని వాడు, తనకు దాని అనంతశక్తియొక్క ఉపయుక్తతను గ్రహించలేడు. నిర్వీర్యుడై ఉండిపోతాడు. చుక్కానిలేని ఓడలా ఉండి, ఇటూ అటూ ఎగురగొట్టబడి, ఎత్తి వేయబడి, ముందుకు పోవడమనే ప్రగతి ఉండక, నష్టమైపోతాడు. అటువంటి వారి సోషలిజం వారిని ఎక్కడికి తీసుకొని పోదు, వారు జీవించే సమాజాన్ని గురించి ఇంకేమి అనాలి.

అలా అయితే, సోషలిస్టుకు భగవంతునిలో నమ్మకం ఉండదని అర్థమా? ఉంటే, కంటికి కనిపించే ప్రగతిని ఎందుకు సాధించలేదు? అదీగాక, ఇంతకుముందు అనేకమంది దైవశక్తి సమన్వితులు జీవించి యున్నారు మరి వారు సోషలిస్టు రాజ్యాన్ని స్థాపించడంలో ఎందుకు సఫలులు కాలేదు?

ఈ సంశయాల్ని పూర్తిగా సమాధాన పరచడం కష్టమే. అయితే, సోషలిజాన్ని నమ్మిన వ్యక్తికి తన సోషలిజానికి భగవంతునిలో నమ్మకానికీ, ఏదైనా సంబంధం ఉందని అనిపించి ఉండకపోవచ్చు. దైవశక్తి సమన్వితులు ఎప్పుడూ సామాన్యజనానికి సోషలిజమే దిక్కు అని ఉండలేదని కూడా చెప్పడంలో, అసామంజస్యం కనుపించదు.

దైవశక్తి సమన్వితులైన స్త్రీ పురుషులు ఉన్నప్పటికీ అంధవిశ్వాసాలు ప్రపంచంలో ప్రబలుతూనే ఉన్నాయి. హిందూయిజంలోనే అస్పృశ్యత, దాదాపుక నిన్నటివరకూ రాజ్యమేలింది.

అసలు విషయం ఈ మహత్తర శక్తినీ, దానిలో దాగియున్న ప్రశస్తినీ అర్థం చేసుకోడం ఉధృతమైన పరిశోధనకు సంబంధించినది.

ఈ అన్వేషణలోనే నేను సత్యాగ్రహ జ్ఞానం ఉందంటాను. సత్యాగ్రహసూత్రాలు, నియమాలు అన్నీ అవగతం అయ్యాయి అనికాదు. ధైర్యంగా, దృఢంగా నేను ఈ మాటను చెప్పగలను : "సత్యాగ్రహాన్ని ఉపయోగించి, ఎట్టి విలువైన ఆశయాన్నయినా అందుకోగలము". మహోన్నతమైన, తిరుగులేని గొప్పశక్తి అది. ఇంకేవిధంగానూ, సోషలిజాన్ని

చేరుకోలేము. కల్మషాలనన్నిటినీ - రాజకీయములైనా, ఆర్థికములైనా, ధార్మికములైనా - వీటన్నిటినీ సమాజంనుండి సత్యాగ్రహం తొలగించగలదు.

*(హరిజన్, 20-7-47, పుట 240)*

★ ★ ★

ఇండియాలో నాకు తెలిసిన వారు సోషలిజాన్ని తమ విధానం అని ప్రతిజ్ఞ చేయకముందే, నేను సోషలిస్టుని అని చెప్పుకున్నాను. కాని, నా సోషలిజం, నాకు సహజంగా అబ్బింది. ఏ పుస్తకాల నుంచి, ఆకళింపు చేసుకున్నది కాదు. అహింస యందు నాకు గల అకుంఠిత విశ్వాసంవల్ల ఇది సంభవించింది. సక్రియాత్మకుడైన అహింసాపూజారి సమాజంలోని అన్యాయాన్ని అది ఎక్కడ జరిగినా ప్రతిఘటించకుండా ఉండలేడు. దురదృష్టవశాత్తు పాశ్చాత్యసోషలిస్టులు నాకు తెలిసినంత వరకు, సోషలిస్టు సిద్ధాంతాలను అమలు పరచడానికి, హింసామార్గం అవసరమని నమ్ముతారు.

అధ మాధములకైనా, సమాజన్యాయాన్ని హింసామార్గంలో చేకూర్చడం సాధ్యంకాదని కూడా నేను నమ్ముతాను. వీరికి అహింసా పద్ధతిలో ప్రశిక్షణ జరిగితే వారు అనుభవించిన బాధల నుంచి ముక్తి దొరుకుతుందని (బాధలను సరిచేయడం జరుగుతుందని) కూడా నేను విశ్వసిస్తాను. ఆ పద్ధతి ఆ విధానం అహింసాయుతమైన, అసహాయోగం. ఒకానొకప్పుడు అసహాయోగం కూడ సహకారము వలెనే విధి అవుతుంది. తనను విధ్వంసం చేయడంలోనూ, తనను బానిసగా చేయడంలోనూ, ఎవ్వరూ సహకరించవలసినపని లేదు. ఇతరుల ప్రయత్నం (అదెంత దయాసమన్వితమైనా) వలన సాధ్యమైన స్వాతంత్ర్యం ఆప్రయత్నంగా దూరం అయినప్పుడు, నిలిచి ఉండదు. ఇంకోమాటలో అట్టి స్వాతంత్ర్యం నిజమైన స్వాతంత్ర్యం కాదు. అహింసాయుత, అసహాయోగ మార్గాన దానిని పొంద గలిగే కళను నేర్చిన అధములు కూడ ఆ జ్యోతిని అనుభవించగలరు (చూడగలరు).

*(హరిజన్ 20-4-40, పుట 97)*

★ ★ ★

పెట్టుబడిదారులు పెట్టుబడిని దురుపయోగపరచిన సోషలిజం పుట్టలేదు. సోషలిజంగాని, కమ్యూనిజంగాని ఈశోపనిషత్తు యందలి నేను చెప్తూనే వచ్చినట్టు మొదటి శ్లోకంలోనే వివరించబడింది. కొందరు సంస్కర్తలకు (మానసికమైన) మార్పిడి పద్ధతిలో నమ్మకం నశించినపుడు సైంటిఫిక్ శాస్త్రీయమైన) సోషలిజం అనేది పుట్టింది. ఈ శాస్త్రీయసోషలిస్టుల, (సమసమాజవాదుల) వలెనే, నేనూ అదే సమస్యను పరిష్కరించడంలో మునిగి ఉన్నాను. (పూర్తిగా నిమగ్నమైయున్నాను). నా మార్గం ఎల్లప్పుడూ నిష్కల్మషమైన అహింసతో కూడి ఉంటుందనే మాట నిజం. అది అసఫలం కావచ్చు. అలా అయితే, అహింసావిధానాన్ని గురించిన నా అజ్ఞానమే దానికి కారణం అయి ఉంటుంది. ప్రతిరోజూ అందులో నా విశ్వాసం దృఢమవుతున్నది. అయినా ఆ సిద్ధాంతానికి నేనొక చెడు (అసఫలమైన) అనుయాయిని అయి ఉంటాను.

*(హరిజన్, 20-2-37, పుట 12)*

★ ★ ★

సోషలిజానికి పునాది ఆర్థిక సమానత. అసంబద్ధమైన అసమానత గల ప్రస్తుత పరిస్థితులలో కొందరు భోగభాగ్యాలలతో ఓలలాడుతున్నారు. సామాన్యులకు తినేందుకు సరియైన తిండి అయినా దొరకని ఈ రోజులలో సిద్ధాంతాన్ని అంగీకరించాను. సోషలిస్టులతోనూ, ఇతరులతోనూ, నాకు అభిప్రాయభేదము ఉన్నది. (విరోధము) ఏ శాశ్వత సంస్కరణనైనా తెచ్చిపెట్టాలి అంటే హింసావిధానము పనికిరాదు అని నేను ఎదిరిస్తున్నాను.

*(హరిజన్ 1-6-47, పుట 172)*

★ ★ ★

"దీని అంతం వరకూ" - ఇదే నా సోషలిజం యొక్క అర్థం. పరిగ్వంధబధిరుల శ్మశాన ధూళిపై నేను ఎదగ దలచుకోలేదు. వారి సోషలిజంలో బహుశా వీటికి తావులేదు. భౌతిక ప్రగతియే వారిధ్యేయం. ఉదాహరణకు ప్రతీ నాగరికునికీ కారు ఉండాలని అమెరికా ఆశయం. నాది అదికాదు. నా వ్యక్తిత్వపు పూర్ణవికాసానికి నాకు స్వాతంత్ర్యం కావాలి అని

నేను కోరుకుంటాను. స్వేచ్ఛ నాకు కావలసివస్తే ఉండాలి. నేనలాంటి పనిని దేనినీ చేస్తానని కాదు. సోషలిజంలో వ్యక్తి స్వాతంత్ర్యంలేదు. నాదంటూ ఏదీ కూడా లేదు

*(హరిజన్ 4-8-46, పుట 246)*

★ ★ ★

## అధ్యాయము 22

# సామ్యవాదం

ఆధునిక భౌతిక నాగరికత వలన కలిగిన అవసర ఫలితమే 'బోల్షివిజం''. విచక్షణారహితమైన భౌతికతారాధన ఫలితంగా భౌతిక ప్రగతియే గమ్యం అనే విచారధారను పోషించడం జరిగింది. జీవితానికి అంతమందు కావలసిన విషయాలతో సంబంధం తెగిపోయింది.

*(మహాత్మాగాంధీ రచనల సంపుటి15, పుట 168)*

★ ★ ★

బోల్షివిజమంటే సరిగ్గా ఏమిటో నాకు తెలియదు. నేను బోల్షివిజాన్ని అధ్యయనం చేయలేకపోయాను. కాలగతిలో చివరకు అది రష్యాకు మేలు కలిగిస్తుందో, లేదో నాకు తెలియదు. భగవంతుడు లేడని, హింసా మార్గానుసరణమే శరణ్యమని అన్నసందర్భాలునాకు అసహ్యం కలిగిస్తాయి. విజయప్రాప్తికి హింసాయుతమైన దగ్గర దారులంటే, నాకు నమ్మకం లేదు. నా గురించి పట్టించుకుంటున్న బోల్షివిక్ మిత్రులు దీనిని గ్రహించాలి. వారి గొప్ప ఆశయాల పట్ల సానుభూతి, మెప్పు నా మనసులో ఉన్నప్పటికీ, ఎంతో ఉన్నతమైన విషయాలను సాధించేందుకు హింసాప్రయోగాన్ని మాత్రం నేను ఏమీ సర్దుబాటుకి ఒప్పుకోకుండా వ్యతిరేకిస్తాను.

*(యంగ్ ఇండియా 11-2-24, పుట 406)*

★ ★ ★

చివరి విశ్లేషణలో కమ్యూనిజం అర్థం ఏమిటి? దాని అర్థం ఒక వర్గ రహిత సమాజం - ఈ ఆదర్శం, పాటుపడేందుకు తగినది. దాని సాధనకు సహాయకారిగా శక్తిని ప్రయోగించడం దగ్గర నా దారి వేరవుతుంది...

అసమానత అనే భావం పెద్ద, చిన్న అనే భావం దుష్టంకాని తుపాకి ఎక్కుపెట్టి, మానవుని గుండెల్లోని దుష్టత్వాన్ని పెకలించడమంటే నాకు నమ్మకం లేదు.

*(హరిజన్ 13-3-37 పుట 40)*

★ ★ ★

కమ్యూనిజాన్ని గురించి మీ అభిప్రాయమేమి? అది ఇండియాకు మంచిదనుకుంటున్నారా?''

రష్యా మార్కు కమ్యూనిజం, ప్రజల మీద రుద్దిన కమ్యూనిజం, ఇండియాకు అసహ్యకరం. అహింసాయుత కమ్యూనిజాన్ని నేను నమ్ముతాను. ... ''కాని రష్యాలో కమ్యూనిజం వ్యక్తిగత సంపదకు వ్యతిరేకం. మీరు వ్యక్తి సంపద కావాలంటారా?''

హింసారహితంగా వచ్చిన కమ్యూనిజానికి స్వాగతం. అప్పుడు ఎవరి వద్దనూ ఆస్థి, సంపదలుండవు. ప్రజలతరపున ప్రజలకొఱకు ఉంటాయి. కోటీశ్వరుడు తన సంపదను, తనవద్దనే ఉంచుకోవచ్చు కాని ప్రజల కొఱకు మాత్రమే. అందరికీ ఉపయోగపడే నిమిత్తం ఎప్పుడైనా వాటిని వశపరచుకోవచ్చును.

మీకూ, జవాహర్లాలు గారికీ, సోషలిజం సందర్భంగా అభిప్రాయ భేదమేదైనా ఉన్నదా?''

ఉన్నది. కాని ప్రాధాన్యతలోని భేదం మాత్రమే. ఆయన ఫలితాన్ని ప్రధానం అంటే, నేను విధానాన్ని ప్రధానం అంటాను. ఆయన దృష్టిలో, బహుశా అహింస పట్ల, నేను ఎక్కువ ప్రాధాన్యతను ప్రదర్శిస్తున్నానని ఉన్నట్లున్నది. ఆయనకు అహింసలో నమ్మకం ఉన్నది. అయినా, సోషలిజం ఆ మార్గాన రానినాడు, ఇంకేమార్గాన అయినా దానిని సాధించాలని ఉంది. నాకు అహింసపై ప్రాధాన్యత, సిద్ధాంత పరమైనది. హింసామార్గంలో స్వాతంత్ర్యం సాధించగలమని, ఎవరైనా, నాకు గట్టిగా నచ్చ చెప్పినా, దానిని నేను స్వీకరించను. అది నిజమైన స్వాతంత్ర్యము కాదు.

*(హరిజన్ 13-2-37, పుట 6)*

★ ★ ★

"బోల్షివిజం" అర్థాన్ని పూర్తిగా గ్రహించలేకపోతున్నానని, నేను ఒప్పుకుంటున్నాను. నాకు తెలిసినది - అది వ్యక్తిగత సంపదను రద్దు చేస్తుంది" అని మాత్రమే. అపరిగ్రహము అనే ధార్మిక సిద్ధాంతాన్ననుసరించిన ఆదర్శమే ఇది. దీనిని ప్రజలు స్వచ్ఛందంగా అనుసరించినా లేక వారిని అనునయంతో అనుసరింప జేసినా, దివ్యంగా ఉంటుంది. అయితే నాకు తెలిసినంత మట్టుకు, బోల్షివిజం వ్యక్తుల ఆస్థిసంగ్రహణలో శక్తి వాడుగను పరిహరించదు సరికదా. ఆదేశాలతో అటువంటి సంగ్రహణను ప్రభుత్వం ఉమ్మడి ఆస్థిగా పరిగణించడాన్ని 'అంగీకరిస్తుంది. అదే అయితే, ప్రస్తుత రూపంలో, బోల్షివిక్కురాజ్యం ఎక్కువ కాలం ఉండదని చెప్పడంలో నాకు సందేహం లేదు. హింసను పునాదిగా చేసి, దేనిని నిర్మించినా ఎక్కువ కాలం ఉండదని నా గట్టి నమ్మకం. ఏది ఏమయినా బోల్షివిక్కు సిద్ధాంతం వెనుక తమకున్నదంతా, ఆదర్శంకోసం వదలుకొని అనేక మంది స్త్రీపురుషుల పవిత్రత్యాగం ఉన్నది. లెనిను వంటి మహితాత్ముల త్యాగంతో పునీతమైన ఆదర్శం వ్యర్థంకాదు. కాలక్రమేణ, తపోనియతమైన ఆ ఉన్నతమైన దృష్టాంతం కలకాలం జ్యోతులీని, దానిని శుద్ధి చేసి, త్వర పరుస్తుంది.

*(యంగ్ ఇండియా 15-11-28, పుట 381)*

★ ★ ★

ఈ యువకమ్యూనిస్టులు పుట్టక మునుపే కార్మికుల సమస్యను నాదానిగా భావించాను. నా జీవిత కాలంలో ఉత్తమాంశాన్ని దక్షిణాఫ్రికాలో వారి కోసం పనిచేస్తూ గడిపాను. వారి మధ్య బ్రతికి, వారితో సుఖదుఃఖాలు పంచుకున్నాను. నేను కార్మికుల గురించి ఎందుకు మాట్లాడుతానో, మీకు అర్థమయింది కదా! మీ నుండి నాకింకేమీ వద్దు. గౌరవ, మర్యాదలు చాలు. నావద్దకు రండి - దాపరికం లేకుండా అన్నిటినీ చర్చించమని నేను మిమ్ములను ఆహ్వానిస్తున్నాను.

మిమ్ములను మీరు "కమ్యూనిస్టులము" అంటారు. కాని మీరు కమ్యూనిజం జీవితాన్ని గడిపినట్లు లేదు. ఆ మాటకు చక్కటి అన్వయమిచ్చి, కమ్యూనిజం ఆదర్శానికి అనుగుణ్యంగా జీవించడానికి ప్రయత్నిస్తున్నాను.

కమ్యూనిజం గౌరవ మర్యాదలను, పరిహరించదు అనుకుంటున్నాను. మీ మధ్య నేడున్నాను, కొద్ది నిమిషాలలో మిమ్ములను వదలి వెళ్లిపోతాను. దేశాన్ని మీతో తీసుకుపోవాలంటే, దానితో తర్కించి, ప్రతిస్పందించాలి. బలవంతపెట్టి దీనిని చేయించలేరు. మీ దృక్పథానికి అనుగుణంగా, దేశాన్ని మరల్చడానికి మీరు నాశకతత్వాన్ని పంచవచ్చును. ఎంతమందిని చంపుతారు? లక్షలూ, కోట్లూ కాదు గదా! మీతో లక్షలాది మందిజనం ఉంటే, వేలమందిని చంపవచ్చును. కాని మీరు గుప్పెడుమంది లేరు. చేయగలిగితే కాంగ్రెసును పరివర్తితంచేసి, దాని బాధ్యతను తీసుకోండి. కాని సామాన్య గౌరవమర్యాదలను గాలికి వదలిపెట్టి, ఆ పనిని చేయలేరు. ఇండియా, సహిష్ణుతతో, ఓపికగా అర్థమయ్యేటట్టు చేప్పే అన్ని మాటలను వింటూ మీ అభిప్రాయాలను సంపూర్ణంగా వివరించవచ్చును. మరి సాధారణ మర్యాద లేకుండా ఉండటానికి ఏదీ కారణం కాదు.

*(యంగ్ ఇండియా, 26-3-31, పుట 53)*

★ ★ ★

కష్టాలు కొని తెచ్చుకోవడం, కమ్యూనిస్టులకు వృత్తిగా మారినట్లున్నది. వారిలో నాకు స్నేహితులున్నారు. వారిలో కొందరు నా కుమారుల వంటి వారు. అయితే, వారు మంచీ చెడూ సత్యం అసత్యం మధ్యగల అంతరాన్ని పట్టించుకోనట్లున్నారు. ఈ అభియోగాన్ని వారు తిరస్కరిస్తున్నారు. కాని మాకు అందిన రిపోర్టుల ప్రకారం, వారి చర్యలు ఈ అభియోగాన్ని బలపరుస్తున్నాయి. ఇండియా కంటె ఎక్కువగా, తమ ధార్మిక గృహమని వారు భావిస్తున్న రష్యానుండి ఆదేశాలను గ్రహిస్తున్నట్లున్నారు. బయటి వారి అధికారాన్ని ఆమోదించి, దానిపై ఆధారపడడం నేను చూడలేను. ప్రస్తుతమున్నటువంటి ఆహార సమస్య సందర్భంలో కూడ రష్యను గోధుమపై ఆధారపడకూడదని కూడా, నేనన్నాను. మన మట్టిలో పుట్టిన పంటలపై బ్రతికే ధైర్యం, మెలకువ కావాలి. విదేశీ దాతృత్వంపైన ఆధారపడరాదు. కానిచో, స్వతంత్ర దేశంగా బ్రతకడానికి పనికిరాము. ఇదే నియమం, విదేశీ సిద్ధాంతాలకు వర్తిస్తుంది. ఇండియా పరిప్రేక్ష్యంలో వాటిని గ్రహించి, సరిదిద్ది,

ఆకళించే వరకు మాత్రమే వానిని నేను గ్రహిస్తాను అంగీకరిస్తాను. కాని వాటి క్రింద పడి నలిగిపోయేందుకు విధిగా తిరస్కరిస్తాను.

అందువలన, కమ్యూనిస్టులకు నా సూత్రమిది : "నేను వారి చేతులలో మరణించనైనా మరణిస్తాను కాని ఎదురు దెబ్బ తీయను"

*(హరిజన్ 6-10-46, పుటలు 338-39)*

★ ★ ★

## అధ్యాయము 23

# మార్క్సు మహాశయుడు

మన సిద్ధాంతాలు, సంస్థలూ, నైతిక రీతులూ, నడవడిక ప్రమాణాలు సాహిత్యం కళలూ, సంప్రదాయాలూ, చివరికి మత ధర్మాలు కూడా ఆర్థిక పరిస్థితుల సృష్టి అని మార్క్సు మహాశయులు చూపించారు.

మనసిద్ధాంతాలూ, నైతిక ప్రమాణాలూ, విలువలూ, భౌతిక పరిస్థితుల వలన మాత్రమే ఇతర బహిరంగ విషయాలకతీతంగా ఉద్భవించాయి అంటే, నేను అంగీకరించను.

క్రమబద్ధమైన చేతిపనులు, మన ఆలోచనలనేకాక, పూర్ణ వ్యక్తిత్వాన్ని కూడా తీర్చిదిద్దుతాయనే వాదము మీద మౌలికవిద్యావిషయిక వర్ధాయోజన, ఆధార పడలేదా? ఇది, మార్క్సు ప్రతిపాదించిన, భౌతిక జ్ఞాన సిద్ధాంతానికి దగ్గరగా రావడం లేదా?

కాని మార్క్సువాది కష్టపడే (కార్మికుని) చేతిని, పూర్తిగా పరిహరించి, దాని స్థానంలో యంత్రాన్ని ప్రవేశపెట్టాలనుకుంటున్నాడు. ఆయనకు చేతితో పనిలేదు. కాయకష్టంమీద ఆధారపడడం, మార్క్సు మహాశయుని ప్రకారం, కార్మికుని ఉద్ధరిస్తుంది. దీనికి విరుద్ధంగా "యంత్రము బానిసను చేస్తుంది. తెలివిగా చేతితో పని చేయుట మాత్రమే కార్మికునికి స్వాతంత్ర్యాన్నీ, సంతోషాన్నీ కలిగిస్తుంది" అని నేను అంటున్నాను.

మార్క్సువాది ఆలోచనలను ప్రోగుబడిన బుద్ధి గాను మనస్సును భౌతిక పరిస్థితుల ప్రతిబింబంగాను భావిస్తాడు. నేను దానిని ఒప్పుకోను.

భౌతిక తత్త్వం, మనస్తత్వం వీటినధిగమించి భగవంతుడున్నాడు. నాకు ఆ జీవత్సిద్ధాంత జ్ఞానము ఉంటే, నన్ను ఎవ్వరూ బంధించలేరు. శరీరము నశించినా, ఆత్మశక్తి స్వేచ్ఛను ప్రకటిస్తుంది. ఇది సిద్ధాంతం మాత్రేమే కాదు. అనుభవ సిద్ధమైన సంగతి.

''వ్యక్తి భౌతికపరిసరాలను అధిగమించవచ్చునని, మార్క్సవాది అంగీకరిస్తూ వర్గ జీవనము మాత్రం (వేగ నడవడిక) భౌతిక పరిసరాలను అనుసరించి నిర్ణయింప బడుతుంది అంటాడు. ఆర్థిక పరిసరాలు మారనిదే, అది మారదు. పెట్టుబడిదారుల్లో పరివర్తనము తేవాలి అంటే, పెట్టుబడి - దారీతనాన్ని నాశనం చేయాలి''.

వ్యక్తి చేయగలదానిని, ఒక సంపూర్ణవర్గం, (సమూహం) చేసేటట్టు ఒప్పించవచ్చు. సరియైన టెక్నికును (పద్ధతి) కనుక్కోవాలి. ఈ ప్రతిపాదనపైననే, మా అహింసాయుత అసహయోగ ఆందోళన ఆధారపడి ఉన్నది. దాని (ఆ ఉద్యమం) ధ్యేయం బ్రిటిషు పరిపాలకవర్గంలో మార్పు తేవడం. వర్గ సంఘర్షణకు బదులు (జవాబు) ధర్మ కర్తృత్వం నెలకొల్పడం.

''పెట్టుబడి దారీ విధానంలో ''వ్యక్తిగత సంపద'' అనే సిద్ధాంతంవలన కలిగిన, ఫలితాలే యుద్ధాలు''.

కాదు. ఆర్థికతత్త్వం మాత్రమే కాదు. ఆ పనులను చేసిన మానవుల మనసులలో కూడా కార్యాచరణ ప్రక్రియను శాసించే అదృశ్యశక్తి, యుద్ధాలకు కారణమని చివరకు తేలుతుంది. హిట్లరు, ఈ రోజు చనిపోయాడనుకోండి నడుస్తున్న చరిత్ర గతి మారుతుంది. అదేవిధంగా భూకంపమో, ప్రళయమో, ఇతర ఉత్పాతమో, వచ్చి పెట్టుబడి దారులనందరినీ మట్టు పెట్టిన నాడు, చరిత్ర ఆర్థిక విశ్లేషకులు కనీవినీ, కలలో కూడ ఊహించని రీతిగా వర్గకలహాల చరిత్ర మారిపోతుంది. ఛాంబర్లేన్‌కు బదులు ఇంకో చైతన్యవంతమైన ప్రధాన మంత్రి, ఇంగ్లాండులో ఉండి ఉంటే ప్రస్తుత యుద్ధగతి వేరై ఉండదా? లేక చివరి క్షణంలో ఛాంబర్లేను రాజకీయ చాతుర్య ధైర్య రాహిత్యాన్ని చూపకుండా ఉండి ఉంటే?

''యుద్ధాన్ని నిర్మూలించాలంటే, ''వ్యక్తిగత సంపద'' అనే సంస్థను

నిర్మూలించితీరాలి అంటారు. మార్క్సువాదులు. మరి మీరు కూడ అహింసాయుత జీవన విధానానికి ఆస్థి అనేది అతకదు (సరికాదు) అన్నారు కదా!"

ఇది పాక్షిక సత్యం. ట్రోజను యుద్ధానికి, హెలెన్ ఆఫ్ ట్రాయ్ కారణం కాదా? రాజపుత్రుల యుద్ధాలు వ్యక్తిగత సంపద అనే సిద్ధాంతంతో ముడిపడి ఉన్నవా? లేదు. యుద్ధ నిర్మూలనకు మనం ఇంకా ఎంతో చేయాలి. మన హృదయాల నుండి, దురాశ భోగలాలస, అహంభావము మున్నగువాటిని తొలగించాలి. మన అంతరంగంతో పోరాడి గెలిచిన తర్వాత సమాజంలో యుద్ధాలను నిర్మూలించ గలుగుతాం.

మార్క్సు మహాశయుని మనము విమర్శించవచ్చును. కాని ఆయన గొప్పవ్యక్తి అనే విషయాన్ని ఎవరు కాదనగలరు? సామాజిక రుగ్మతలు, లేక వాటికి అతడు ప్రతిపాదించిన చికిత్సలూ - వీటి గురించి ఆయన విశ్లేషణ సరికావచ్చు. సరికాకపోవచ్చు. ఆయన ఆర్థిక సిద్ధాంతాలను నేను అంగీకరించను. అయితే పేదలు అణగద్రొక్క బడుతున్నారని నాకు తెలుసును. దీనిని గురించి ఏదైన చేయబడాలి.

*(మహాత్మాగాంధీ - ఆఖరు ఘట్టం- )(2) (198 పుట)*

★ ★ ★

# భాగము 4

## ఒకే ప్రపంచం

### అధ్యాయము 24

## జాతీయత - అంతర్జాతీయత

మానవుడను, సౌహార్ధత గలవాడను. అందుచేతనే మానవతావాది అయిన దేశభక్తుడను. ఇండియాకోసం, ఇంగ్లాండు, జర్మనీ దేశాలను బాధించను. సామ్రాజ్యతత్వం నాకు సరిపడదు. వ్యక్తికీ, రాజనీతికి సూత్రాలు భిన్నంగా వుండవు.

*(యంగ్ ఇండియా, 16-3-21, పుట 81)*

★ ★ ★

జాతీయత ఉంటేనే అంతర్జాతీయతకు అస్తిత్వం ఉంటుంది. నేటి దుస్థితికి కారణం స్వార్థపరత్వం సంకుచితత్వం. ప్రతి వాడూ, ఎదుటి వాడేమైనాసరే నేను మాత్రం బాగుపడితే చాలును అని అనుకోడం మంచి పద్ధతికాదు. "సర్వేజనాస్సుఖినోభవంతు".

*(యంగ్ ఇండియా 18-6-25, పుట 211)*

★ ★ ★

నాకు కావలసింది మానవుని స్వేచ్ఛ. ఇండియా స్వాతంత్ర్యం దానికి దోహదం చేస్తుంది. ఇతర దేశాల ఆర్తి మనకు చేటు తెస్తుంది. మానవజాతి మనుగడ ముఖ్యం. ప్రతిజీవజంతువూ సుఖంగా ఉండాలి. దేవుని సృష్టిలో అందరమొక్కటే.

*(యంగ్ ఇండియా, 4-4-29, పుట 107)*

★ ★ ★

ఇతర దేశాల హానిని కోరని మన "స్వరాజ్" ప్రపంచానికంతటికీ మేలు చేకూరుస్తుంది.

*(యంగ్ ఇండియా 16-4-31, పుట 79)*

★ ★ ★

వ్యక్తి కుటుంబంకోసం, కుటుంబం గ్రామంకోసం, గ్రామంజిల్లా కోసం, జిల్లా - మండలంకోసం, మండలం - రాష్ట్రంకోసం, రాష్ట్రం - దేశంకోసం అవసరమైతే అంతిమయాత్రకు సిద్ధమైనట్లే, దేశం - విశ్వం (ప్రపంచం)కోసం చావుకైనా సిద్ధపడాలి. ఇదీ మన దేశభక్తి యొక్క తత్త్వం.

*(భారతదేశపు గ్రామం - గాంధీజీ 1927, పుట 170)*

★ ★ ★

## అధ్యాయము 25

# భిన్నజాతులు ఒకే వృక్షపు శాఖలు

భగవంతుని దృష్టిలో అంతాసమానులే. ఏనుగూ, చీమా ఆ భగవంతుని సృష్టియే. వాటిలో అరమరికలులేవు. మానవులందరిదీ ఒకే ఆకారం. ఒకేరకమైన జీవలక్షణం.

*(హరిజన్, 22-12-33 పుట 2)*

★ ★ ★

మన కంటే ఇతరులు తక్కువ అనుకోడం, సహజత్వానికి వ్యతిరేకం. తల్లి తండ్రులకు సంతానం అంతా ఒక్కలాంటిదే కదా!

*(హరిజన్ 5-1-34, పుట 8)*

★ ★ ★

భిన్నత్వంలో ఏకత్వం భగవంతుని విధానం. మానవ జాతి అనే మహావృక్షపు శాఖలన్నిటిలో అదే జీవతత్త్వం ఉన్నది.

*(హరిజన్ 1-12-33, పుట 6)*

★ ★ ★

రెండు జాతుల సంబంధాలు స్నేహపూరితమై ఉండాలి.

*(హరిజన్ 18-2-39, పుట 12)*

★ ★ ★

వ్యక్తి ఉద్ధరణ, చుట్టూ ఉండేవారి పతనం నాకు ఆలోచనకైనా అందదు. ఒకరికి లాభం కలిగితే, అందరికీ లాభమే. నా వాళ్లకు సాయం చేసి, పరులకు చేయకపోడం నా ఊహకతీతం.

*(యంగ్ ఇండియా 4-12-24, పుట 398)*

★ ★ ★

జీవితం అవిభాజ్యం.

*(యంగ్ ఇండియా 27-1-27, పుట 31)*

★ ★ ★

దక్షిణాఫ్రికాలో శ్వేత జాతీయుల నీతిలో ప్రపంచ యుద్ధానికి బీజం ఉన్నది.

*(హరిజన్, 24-3-46, పుట 52)*

★ ★ ★

శ్వేత జాతీయుల నిజమైన ఔన్నత్యాన్ని నిలబెట్టేందుకు శాసనాలు కావాలా?

*(హరిజన్ 24-3-46, పుట 52)*

★ ★ ★

శాసనాల బలంతో నిలిచే సంస్కృతి ఉండటం అవసరమా?

*(హరిజన్, 30-6-46, పుట 204)*

★ ★ ★

"సత్యాగ్రహం" లేకపోతే, నల్లజాతుల వారు, తెల్లవారిని విజృంభించి మట్టుపెడతారు.

*(హరిజన్ 19-5-46, పుట 134)*

★ ★ ★

దక్షిణాఫ్రికాలోని "లించ్ చట్టం" (రాళ్లతో కొట్టి చంపడాన్ని) బలపరిచే శాసనం, ఒక మాయనిమచ్చ. మానవ సంస్కారం దీన్ని రూపుమాపాలి.

*(హరిజన్ 30-6-46 పుట 206)*

★ ★ ★

ఇండియాలో నశిస్తున్న వర్ణాశ్రమ ధర్మాల సంప్రదాయం కంటే దక్షిణాఫ్రికాలోని ఆధునికమైన నల్లజాతి వారిని పీడించే చట్టం, అసహ్యకరమైనది.

*(హరిజన్, 2-6-46, పుట 157)*

★ ★ ★

జాతి భేదాలు పోవాలి అంటూ చేతులు ముడుచుకొని కూర్చునే వారు నపుంసకులు. అణగద్రొక్కబడిన వారు... పైకి తప్పక లేస్తారు...

ఇండియా సంక్షుభితం కాకుంటే, ఏదో ఒక ఉద్ధరణ మార్గాన్ని అనుసరిస్తుంది. సంయుక్తరాజ్య సమితి, దక్షిణాఫ్రికన్ ఇండియన్ జగడంలో

న్యాయం చేకూర్చకపోతే దాని పరువుపోతుంది.

(హరిజన్ 26-10-47 పుట 204)

★ ★ ★

విశ్వవిఖ్యాత ధర్మ ప్రవర్తకులు ఆసియావారే అన్న విషయం గ్రహించాలి. వేర్పాటు వాద చట్టాలను మట్టు పెట్టాలి.

(హరిజన్. 30-6-46. పుట 204)

★ ★ ★

## అధ్యాయము 26

## అణుబాంబు

అణుబాంబు పేల్చిన సందర్భంగా సత్యాహింసల గతి ఏమిటి? వాటి ప్రాముఖ్యత పెరిగింది. ఆత్మ శక్తి అనంతము. అందరిలో ఉన్న ఈ శక్తి, నిద్రాణమై ఉన్న ఈ శక్తి, మేలుకొని చేయవలసిన దానిని చేస్తుంది.

అయితే, దీనిని తెలుసుకొని పాటించాలి. కనుక ప్రతి ఒక్కరూ స్వచ్ఛందంగా సత్యాహింసలను అనుసరించాలి.

(హరిజన్ 10-2-46 పుట 8)

★ ★ ★

ఆటంబాబు, అహింసను గుర్తు చేసుకునేటట్లు చేస్తుంది. అయితే చిరుతిళ్లతో మొహం మొత్తి అభావం పోగానే ఇతోధికంగా వాటిని అస్వాదించే వారి పద్ధతిలో అణుబాంబు మీది అసహ్యత గతించగానే హింసవైపు మనిషి మొగ్గడా అనునది ప్రశ్న.

సమాధానం - ఆ భగవంతునికే ఎరుక. వినాశాత్మకంగా వాడబడిన అణుబాంబు నిర్మాణాత్మకంగా కూడ పనికి వస్తుంది. అణుబాంబు వినాశకశక్తి. జపాను వారిని కాళ్లబేరానికి తెచ్చింది. కాని, అక్కడివారి గతి ఏమిటి? బానిసను లొంగ దీయడానికి, యజమానికూడా పంజరబద్ధుడు కావాలి. నేను జపాను వారి దౌష్ట్యాన్ని సమర్థించను. అణుబాంబు దౌష్ట్యం అంతకంటే ఒకమెట్టు దిగువన ఉన్నది.

హింసను హింస పెంచినట్లే, అణుబాంబులు ఏదో రూపంలో ప్రతీకారతత్త్వాన్ని పెంచుతాయి. హింసను అహింసతో ద్వేషాన్ని ప్రేమతో నిర్జించాలి.

నా మాటలను పునశ్చరణ చేస్తున్నాను. గ్రంథాలలోని సూక్తులు కావు ఇవి. అనుభవంతో రంగరించి అరిగించుకున్న సత్యాలు. "మాక్స్‌మూలర్' మహాశయుడు చెప్పినట్లు, నిజాన్ని - నమ్మినివారు ఉన్నంతకాలం - పునశ్చరణచేస్తూనే ఉండాలి.

*(హరిజన్ - 7-7-46, పు 212)*

★ ★ ★

మానవజాతి మారణ హోమానికి అణుబాంబును వాడడం విజ్ఞానశాస్త్రపు రాక్షసత్వం.

*(హరిజన్ 29-9-46, పుట 335)*

★ ★ ★

సత్యాహింసల ఎదుట, విధ్వంసకశక్తి అణుబాంబు ఆత్మపరంగా నిర్వీర్యమై తలవంచింది. ఆధ్యాత్మికం ముందు, భౌతికం గతి అంతే. ఆత్మకు గలశక్తి అనంతం. నేనేమీ క్రొత్త విషయాన్ని చెప్పటం లేదు. సాక్షీభూతమైన సత్యాన్ని వివరిస్తున్నాను. ఈ శక్తి, రంగురూపాలతో నిమిత్తం లేకుండా ప్రతిస్త్రీ ప్రతిపురుషుడూ, ప్రతి శిశువూ యొక్క అంతరంగంలో పనిచేస్తూ ఉంటుంది. ఈ సత్యాన్ని విస్మరిస్తే నాశనమే శరణ్యం.

- "ఏమిటి బురదలోంచి పద్మం ఉద్భవిస్తుంది? అని ఒక్కోసారి అనిపిస్తుంది. కాని అది భగవంతుని దయ. మానవుని క్రియాసిద్ధికాదు. మానవునికైతే చెడునుంచి చెడు, మంచి నుంచి మంచీ వస్తుందనే తెలుసు. అదేవిధంగా, విధ్వంసక శక్తి కలిగిన అణుబాంబు వలన "ఒక విధంగా అదుష్టశక్తి ప్రతాపమే సత్యాహింసల ఔన్నత్యాన్ని తెలియజెప్పింది" అనే విషయం మాత్రమే కాకుండా 'ఆ అణుబాంబుకు గల శక్తి, నిర్మాణాత్మక కార్యాలకు పనికి వస్తుందనే" విషయం కూడా అవగతమవుతుంది. ఇది సాధ్యం. కాని యుద్ధోన్మాదులకు, అధికార దుర్మదాంధులకు, ఇది గుర్తుకురాదు. వచ్చినా, దాన్ని అణగద్రొక్కుతారు.

పూర్వకాలంలో ధర్మయుద్ధమని, యుద్ధసంప్రదాయాలనీ ఉండేవి. ఇప్పుడవేమీ లేవు. "ఏ విధంగానైనా, గెలుపు సాధించు" అని నేటి సూత్రాన్ని అనుసరించి, మిత్రరాజ్యాలు చేసిన రాక్షస కృత్యం, జపానుదేశపు ఆత్మను అంతం చేయబూనింది. ముందు ముందు ఏమవుతుందోగాని, (భగవదిచ్ఛ, ఊహకు, అందదు కనుక) ప్రస్తుతం మన కళ్లముందు, ఆబాలగోపాలం ఆదేశంలోని ఒకానొక ప్రాంతంలో అట్టుడికిపోయారు.

దీని నీతి ఏమిటి? "బాంబును బాంబుతోనూ, హింసను హింసతోనూ మట్టు పెట్టడం సాధ్యం కాదు". మానవజాతి అహింసామార్గాన్ని (శరణుజొచ్చి) అవలంబించి మాత్రమే హింసను ఎదిరించగలదు. హింసారోగవిముక్తికి అహింసయే ఔషధం. ద్వేషాన్ని ప్రేమతో మాత్రమే జయించవచ్చును. ద్వేషం, ఆద్వేషభావగాఢత్వాన్ని వైశాల్యాన్ని ఎక్కువచేసి మరింత ద్వేషం కలిగేటట్టు చేస్తుంది.

నేను ఈ మాటలను పునశ్చరణచేస్తున్నాను. ఎన్నో మారులు చేశాను. స్వయంగా ఆచరించి, అనుభవంతో చెప్తున్నాను. ఇదేమీ క్రొత్తది కాదు. ఆ భూమ్యాకాశాలు, పర్వతం ప్రకృతీ అంతాపురాతనమైన సత్యం. నరనరాల్లో, నాలో ఇదిజీర్ణించి పోయింది.

*(హరిజన్ 10-2-46, పుట 9, 10)*

★ ★ ★

## అధ్యాయము 27

# నిరాయుధీకరణ

★ ★ ★

ఈ రోజున, జర్మనీ, తన స్వాతంత్ర్యాన్ని, బలహీనదేశాలను రక్షించేనిమిత్తం, వాడదలచుకుంటే, ఆయుధాలు లేకుండా, నైతికబలంతో చేయవచ్చు. అదిసాధ్యమే. యూరోపులోని ఏ దేశమైనా, ఆపదలను లెక్కచేయక, అహింసామార్గాన్ని అనుసరిస్తే ఆదేశపు పరువు, ప్రతిష్టలు పెరుగుతాయి. ఆదేశం చెప్పే హితోక్తుల్ని తక్కిన దేశాల వారు తలదాలుస్తారు.

*(యంగ్ ఇండియా, 8-10-25 పుట 345)*

★ ★ ★

శాశ్వత శాంతి అంటే నమ్మకం లేకపోవడం, మానవుని దైవశక్తిని సందేహించడం అసంబద్ధం. షరతులను పూర్తిగా పాటించకపోతే, శాంతి లభించదు. పెద్ద దేశాలు తమ సామ్రాజ్యవాద ధోరణిని నిజాయితీతో వదలిపెట్టాలి. భౌతికావసరాలను తగ్గించుకోవాలి. మహత్వాకాంక్షను మట్టుపెట్టాలి. భగవద్భక్తిని పెంచుకోవాలి. శాంతిదూత అయిన జీసస్ క్రైస్తు అనుయాయులు, యుద్ధ సంరంభంలో అగ్రగాములై ఉండడం ఒక విడంబన త్యాగనిరతి ఉండాలి.

*(హరిజన్, 16-5-36, పుట 109)*

★ ★ ★

పెద్ద దేశాలవారు అహింసామార్గాన్ని అనుసరించి, రాబోయే తరాల వారి అభినందనలను అందుకోవచ్చును. సామ్రాజ్యవాదాన్ని వదలాలి. అది జరిగితే ఒక గొప్ప విప్లవం వచ్చినట్టే. ఈ వింత భగవంతుని చేతిలో లీలమాత్రమే. ఆయుధాల పోటీ ఇలాగే ఉంటే, సర్వనాశనమే. విజేత స్మశాన సామ్రాజ్యాన్ని ఏలుకోవాలి.

*(హరిజన్ 12-11-38 పుట 328)*

★ ★ ★

## అధ్యాయము 28

# విశ్వసమాఖ్య

స్వచ్ఛందంగా పరస్పరం ఆధారపడి వ్యవహరించడం విశ్వసమాఖ్యా ధ్యేయం.

*(యంగ్ ఇండియా, 17-7-24, పుట 236)*

★ ★ ★

దేశస్వాతంత్ర్యాన్ని మించినది, దేశాలమధ్య పారస్పరిక సహకారం. ఇది ఎప్పుడు సాధ్యమో తెలియదు. దానికి తయారు కావడంలో తప్పు లేదు.

*(యంగ్ ఇండియా 26-12-24) పుట 425)*

★ ★ ★

సరిహద్దులు, పొరుగువారితో సహకరించడానికి, అడ్డు కాకూడదు. భగవంతుడు ఈ సరిహద్దుల్ని నిర్ణయించలేదు.

*(యంగ్ ఇండియా 31 12-31, పుట 427)*

★ ★ ★

స్వాతంత్ర్యేచ్ఛ, స్వచ్ఛందమైన భాగస్వామ్యానికి అడ్డుచెప్పదు. సామ్రాజ్య వాదం ఇటువంటి భాగస్వామ్యాన్ని ఒప్పుకోదు.

*(హరిజన్ 3-7-37, పుట 165)*

★ ★ ★

విశ్వ సమాఖ్య అనే భావన నిర్మాణానికి అహింసయే పునాది ప్రపంచ వ్యవహారాలలో హింస అనే దాన్ని పూర్తిగా పరిహరించాలి.

*(ప్రభుత్వంతో గాంధీగారి ఉత్తర ప్రత్యుత్తరాలు, 1942-44 1957, పుట 143)*

★ ★ ★

స్వతంత్ర దేశాల ఔన్నత్యం విశ్వ సమాఖ్య ఏర్పాటులో ఉన్నది. తమ స్వార్థాన్ని తమదేశస్వాతంత్ర్యాన్ని మాత్రమే చూసుకోకుండా, జయింపబడిన దేశాల స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షిస్తూ విశ్వసమాఖ్యకు బాటను వేయాలి అదే అత్యున్నతమైన ఆదర్శం.

*(హరిజన్ 9-8-42, పుట 265)*

★ ★ ★

దేశీయతను సమర్థించడం అంటే, దేశ వాసులను బలవంతంగానైనా ఒప్పించి వ్యాపారాన్ని పెంచుకోడంకోసం హింసామార్గంకూడా అవలంభిస్తున్నారు. ఈ కొల్లగొట్టడంలో దేశాలన్నీ భాగస్వాములై ఉంటున్నాయి. మానవ కళ్యాణానికి శాంతియుతంగా స్త్రీపురుషులు పని చేయవలసి ఉన్నది. తుపాకులను వాడడం అనే ఈ జాడ్యం తగ్గితే, నైతిక బలం పెరుగుతుంది.

*(యంగ్ ఇండియా, 21-10-26, పుట 366)*

★ ★ ★

## అధ్యాయము 29

# రేపటి ప్రపంచం

రేపటి ప్రపంచం ఎలా ఉంటుంది? హింస, పేదరికం, ఆకలి, దుఃఖం, దైవభక్తిలేమి, యుద్ధాలు ఇంతేనా గతి? శాంతికి అవకాశం ఉందా? అందుకు అహింసావిధానమే శరణ్యం అప్పుడే శాంతి ఆకాశహర్మ్యం అనిపించినా అది అసాధ్యం కాదు. వ్యక్తి చేసినది, సమాజాలు, దేశాలు చేయలేవా? పూర్తి విజయం కలుగదేమోననే సందేహాన్ని పరిహరించి, ముందుకు సాగాలి

రేపటి ప్రపంచానికి రెండవ సూత్రం అహింసామార్గంలో ఉన్నదాన్ని అందరికీ న్యాయంగా పంచాలి. ఎవరికి ఎంత కావాలో అంతకు మించి ఉండరాదు. ఒకరికి పావుకిలో అవసరం. ఇంకొకరికి ఐదుకిలోలు అవసరం. పిడుగుకి బియ్యానికి ఒకే మంత్రం పనికిరాదు. ఎవరికి కావలసినంత వారికి దొరికే ఏర్పాటుండాలి.

ఇది ఎలా సాధ్యం? ఉన్న వారి దంతా తీసుకోవాలా? అహింస ''అలాకాదు'' అంటుంది. హింసతో చేస్తే ఏదీ నిలవదు. ధనవంతుని వద్ద గల అతని ధనంలో తనకు కావలసినది తీసుకొని, మిగతా దానికి ధర్మకర్తగా ఉండమనాలి. అలాటి వారు ఉన్నారు. ఉంటారు.

ఈ ఉత్కంఠ ప్రస్తుత సమయంలో ఇది వరకెన్నడూ లేనంతగా ఉన్నది. సమాజంలో మార్పు రావలసి ఉంటే అది ఏవిధంగా వస్తుంది? యుద్ధం వల్లనా? విప్లవం వల్లనా? లేకశాంతి పథంలోనా? ఈ ప్రశ్నలకు అనేకులు వివిధములైన సమాధానాలు యిస్తున్నారు. ప్రతివ్యక్తీ తను ఆశించిన విధంగా రేపటి ప్రపంచ ప్రణాళికను తయారు చేస్తున్నాడు. నేను మాత్రం నమ్మకంతో మాత్రమే కాకుండా దృఢచింతనతో చెబుతున్నాను. మొదటి సూత్రం ప్రకారం రేపటి ప్రపంచం విధిగా అహింస ప్రాతిపదికగా గల వ్యవస్థ, సమాజము అయి ఉండాలి. ప్రతివ్యక్తీ ఇంకొకరి కోసం ఎదురు చూడకుండా అహింసా మార్గాన జీవనయాపన చేసేందుకు ఆయత్తుడై ఉండాలి. సందేహం లేకుండా, తటపటాయింపు వదలి ప్రారంభం చెయ్యాలి.

ఈ సంశయాత్మకత అనే అవరోధాన్ని ప్రగతిశీలురందరూ ధృఢ దీక్షతో తొలగించి వేయాలి

దేశానికి సంబంధించిన ఆస్తులను, సంపదలను, అవసరానికి తగ్గట్టుగా పంచుకోవాలి. హింసను త్యజించి అహింసామార్గంలో పయనించాలి బలవంతంగా గ్రహించడం వలన సమాజానికి కావలసిన మంచిపనులు జరుగవు. ధనవంతునికి ఆదాయం పెంచడం తెలుసు. ఆయన కౌశల్యము ఉపయోగపడాలి నష్టమైపోగూడదు తనకు కావలసినది ఉంచుకొని, తక్కినది పంచమనాలి సమాజసేవకుడనని భావించడం మొదలైతే, సమాజశ్రేయస్సు కొరకు పాటుబడి, ధనార్జనచేసి ఖర్చు చేస్తాడు. అప్పుడు అతని ఆదాయం శుభకరం. అతని వ్యాపారం నిర్మాణాత్మకం అవుతుంది.

ఈ అహింసా పద్ధతి, మొత్తంగా, మానవుని ప్రకృతిని మార్చే ప్రయత్నమే కాదా? చరిత్రలో అటువంటి మార్పు జరిగిన దృష్టాంతాలు ఉన్నాయా? ఉన్నాయి, చాలా ఉన్నాయి. ఎందరో తమ వ్యక్తిగతమైన నికృష్టమైన పరిగ్రహదృష్టిని సమాజకళ్యాణం కోసం పని చేసే నిర్మాణాత్మక దృష్టిగా మార్చుకొని లోక కల్యాణకారకులైనారు. ఒకరిలో ఇది వచ్చిన రోజున అనేకులలో కూడ వచ్చితీరుతుంది. ఈ పని సరిగా జరుగుతుందని వారికి నమ్మకం ఏర్పడినప్పుడు వారే స్వచ్ఛందంగా ముందుకు వస్తారు. ఇది నిర్మాణాత్మక ధోరణి. ఇందుకు మానవ ప్రకృతి మారాలి. చరిత్రలో ఏవైనా దాఖలాలు ఉన్నాయా? ఉన్నాయి. రేపటి ప్రపంచంలో యుద్ధాలు, విప్లవాలు, రక్తపాతాలు ఉండవు. సహజీవనం, సహకారం దైవభక్తి, దివ్యానుభూతి ఉంటాయి.

*(మహాత్మాగాంధీయోచనలు 1967, పుట 458-60)*

  

# భాగము 5

# మతము - సంస్కృతి

## అధ్యాయము 30

## అన్ని మతాల ముఖ్య సారాంశము ఒక్కటే

నిజాన్ని పాటించుట నైతిక ప్రవర్తనను కలిగియుండుట వీటికి మించిన మతమే లేదు.

*గాంధీ రచనలు (1957) పే. 254*

★ ★ ★

మతమంటే నా దృష్టిలో అర్థమేమిటో వివరించనివ్వండి. హిందూమతం అన్ని మతాలకంటే ఉన్నతమైందని నేను పొగడడం లేదు. కాని ఏమతమైతే హిందూయిజాన్ని కూడా అధిగమిస్తుందో ఏదైతే ఒక మనిషి స్వభావాన్ని మారుస్తుందో ఏదైతే ఒక మనిషిని ఏ మాత్రం వైఫల్యం చెందకుండా నిజానికి కట్టుబడి ఉండేలా చేసి ఆ మనిషిని అంతర్గతంగానూ, బాహ్యంగానూ పరిశుద్ధం గావిస్తుందో ఆమతం గొప్పది. ఆత్మ తనను తాను తెలుసుకోవడం అంటే తన సృష్టికర్తకూ తనకూ మధ్య గల అవినాభావ సంబంధాన్ని గుర్తెరగడం కోసం నిరంతరం అవిశ్రాంతంగా శ్రమించడమన్నమాట దాని కోసం సత్వాన్ని త్యాగం చేయగలిగే విధంగా ఒక వ్యక్తి స్వభావంలో ఎల్లప్పుడూ పెనవేసుకొని ఉండే ఒక అంశమే మతం.

*(యంగ్ ఇండియా 12-5-20 పే. 2)*

★ ★ ★

మతానికి మూలం "ఒకదానికి కట్టుబడి ఉండేలా చేయడం". మూలమునకు సంస్కృతంలో సమానమైన శబ్దం "ధర్మ" అంటే పట్టి ఉంచగలగేది. అని అర్థం. మిగతా ఏదీ చేయలేని విధంగా యిది మనిషిని నిలబెట్ట గలుగుతుంది. ఇది అతిక్రింది స్థాయిదాకా ఉండే ప్రాథమిక నైతికత. సజీవుడైన మనిషి యందలి మానవత్వంతో ఈ నైతికత సంలీనం చెందగా

ఏర్పడేదే మతం. అది పరీక్షా సమయంలో మనిషిని నిలబెట్టి ముందుకు నడిపిస్తుంది.

మతం భగవంతునితో మనిషికి అదేవిధంగా మనిషికీ మనిషికి మధ్య అనుసంధానకర్తగా ఉంటుంది.

*(హరిజన్ 4-5-40 పే. 117)*

★ ★ ★

ఏ మతమైనా వాస్తవ సమస్యలను పరిగణలోకి తీసుకోకుండా వాటి పరిష్కారంలో సహాయపడ కుండా ఉంటే అది మతమే కాదు.

*(యంగ్ ఇండియా 7-5-25, పే. 164)*

★ ★ ★

సహేతుకతకు నిలబడకుండా నైతికతకు విరుద్ధంగా వ్యవహరించే ఏ మత సిద్ధాంతాన్నైనా నేను వ్యతిరేకిస్తాను. ఏమత విశ్వాసమైనా అనైతికతతో కూడినది కానట్లయితే అది ఎంత అహేతుకంగా ఉన్నా నేను సహిస్తాను.

*(యంగ్ ఇండియా 21-7-20 పే. 4)*

★ ★ ★

నిజమైన నైతికత నిజమైన మతం - ఈ రెండూ విడదీయడానికి వీలులేనంతగా పెనవేసుకొని ఉంటాయి. భూమిలో నాటిన విత్తనానికి నీరు ఎంత అవసరమో నైతికత్వానికి మతం కూడా అంతే అవసరం.

*(గాంధీరచనలు 1957 పే. 254.)*

★ ★ ★

ప్రపంచంలో ఉన్న అన్ని గొప్పమతాల ప్రాథమిక విశ్వాసాలలో నాకు నమ్మకముంది. ఆ విశ్వాసాలన్నీ భగవంతుడు యిచ్చినవనీ, ఆ మతాలు ఏ ప్రజలకోసం ఉద్దేశించబడ్డాయో వారికి ఆ విశ్వాసాలు అవసరమనీ నేను నమ్ముతాను. ఆ యా మత విశ్వాసాలను పాటించే వారి కోణంలో నుంచి ఆ యా మత గ్రంథాలను చదివితే ప్రాథమిక స్థాయిలో అవన్నీ ఒకే సత్యాన్ని బోధిస్తాయనీ అవన్నీ ఒక దానికి మరొకటి సహాయకారిగా ఉంటాయనీ నా నమ్మకం.

*(హరిజన్ 16-2-34 పుట 5-6)*

★ ★ ★

ప్రపంచంలోని అన్ని మతాల విశ్వాసాల మీద నాకు నమ్మకముంది. ప్రపంచంలోని అన్ని మతాల విశ్వాసాలను అర్థం చేసుకోవడానికి ఆ మతాల యందలి అత్యున్నత విలువలను నా ఆలోచనల్లో ఆచరణల్లో సమ్మిళితం చేసుకోవడానికి నా చిన్నప్పటి నుంచి నేను అవిరళ కృషి జరిపాను. ఏ మార్గం నుంచి వచ్చినా సరే - అత్యున్నత విలువలను స్వీకరించడానికి నేను పాటిస్తున్న నమ్మకం నాకు అనుమతినిస్తోంది. అంతేకాదు ఆ విధంగా స్వీకరించ వలసిందేనని గట్టిగా నొక్కి వక్కాణిస్తోంది.

*(హరిజన్ 16-2-34. పుట - 7)*

★ ★ ★

నా దృష్టిలో వేర్వేరు మతాలు ఉద్యానవనంలో వికసించిన సౌందర్యవంతమైన పుష్పాల్లాగా లేదా ఒకే అద్భుత వృక్షం యొక్క వేర్వేరు శాఖలుగా కన్పిస్తున్నాయి. అసంపూర్ణమైన మానవులు వేర్వేరు మతాలను ఏ విధంగా ఆదరించి ఆచరించినా అర్థాలు చెప్పినా నాదృష్టిలో అవ్వన్నీ ఒకే విలువలను ప్రతిబింబిస్తాయి.

*(హరిజన్ 30-1-37. పుట 407)*

★ ★ ★

మానవ పరిణామ వికాసానికి ప్రతిమతమూ తనవంతు తోడ్పాటు నందించింది. ప్రపంచంలోని గొప్ప విశ్వాసాలన్నింటికీ ఒకే ఆధారం ఉన్నా అవన్నీ విడివిడిగా ఉండే చెట్టు కొమ్మలని భావిస్తాను.

*(హరిజన్ 28-1-39. పుట 448)*

★ ★ ★

అన్ని ప్రార్థనలూ అవి ఏ భాషలోనైనా ఏ మతంలోనైనా సరే - ఒకే భగవానుణ్ణి ఉద్దేశించినవే. మనుషులంతా ఒకటేనని ఒకరి పట్ల మరొకరు ప్రేమతో దయతో మెలగాలని మానవులకు ఉద్బోధించేవే.

అన్ని మతాలూ సర్వాంతర్యామి అయిన భగవంతుణ్ణి ప్రార్థించేవే.

ఆ భగవంతుడు నీటిబిందువులోనూ, ధూళికణంలోనూ కూడా ఉన్నాడు.

వివిధ మతాలు ఒకే చెట్టుకు ఉండే ఆకులవంటివి. ఏ రెండు ఆకులూ ఒకే విధంగా ఉండవు. అయినప్పటికీ వాటి మధ్య గల తేడా వల్ల అవి పెరుగుతున్న కొమ్మల మధ్య ఎలాంటి శత్రుత్వానికి తావు ఉండదు. అదేవిధంగా భగవంతుని సృష్టి యందలి ఈ వైవిధ్యంలో కన్పించని ఐక్యత దాగి ఉంటుంది.

*(హరిజన్ 26-5-46, పుట 154)*

★ ★ ★

నీ మతం అన్ని మతాల సారాంశమేనని చెప్పగలవా? అవును - నీవు ఆ విధంగా అనుకుంటే ఆ సారాంశాన్ని నేను హిందూమతం అంటాను నీకు అది క్రైస్తవం కావచ్చు. నేను ఆ విధంగా అనకపోతే నీవు చాలా మంది యితర క్రైస్తవుల్లాగే గాంధీ క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తే ఎంత బాగుండేది. అనుకొంటావు. అదేవిధంగా ముస్లింలు కూడా గాంధీ ఇస్లాంను ఆచరిస్తే ఎంత బాగుండేది. అనుకుంటారు. అది వెంటనే మన మధ్య అగాధాన్ని సృష్టిస్తుంది. అవునా కాదా?

*(హరిజన 6-3-37 పుట 27)*

★ ★ ★

తన మత గ్రంథాలను మాత్రమే కాక యితర మతాల గ్రంథాలను కూడా చదవడం ప్రతి ఒక్కరి విధి. ఈ విధంగా చేస్తే ప్రజలు తన మతాన్ని దోషాల నుంచి కాపాడుకొని పరిశుద్ధంగా ఉంచుకోవడానికి వీలవుతుంది. అంతేకాక మన మధ్య క్రైస్తవులు, ముస్లింలు, పార్శీలు యింకా యితర అనేక మత విశ్వాసాలను పాటించే వ్యక్తులున్నారు. హిందువులు వారిని సోదరులుగా భావిస్తున్నట్లయితే వారి గ్రంథాలను చదవడం వారికి తప్పనిసరి.

*(హరిజన్ 25-5-47, పుట 166)*

★ ★ ★

నా దృష్టిలో అన్ని ప్రధానమతాల సారాంశం ఒకటే. అందువల్ల అవన్నీ నా దృష్టిలో సమానమే. అంధువల్ల ముస్లిం, క్రైస్తవ, పార్శీ పిల్లలను వారి

వారి విశ్వాసాల కనుగుణంగా-పెంచడంలో నాకెలాంటి యిబ్బందీ కలుగలేదు. వారి తల్లిదండ్రులు ఆ పిల్లలకు ప్రత్యేక పుస్తకాల కనుగుణంగా దైవ ప్రార్థనా రూపాలను నేర్పించమని అడిగినప్పుడు నాకు కొంత ఆ సాహిత్యాన్ని చదివే అదృష్టం కలిగింది.

*(హరిజన్ 6-4-34 పుట 59)*

★ ★ ★

ప్రపంచంలోని పవిత్ర గ్రంథాలన్నింటిని చదవడం ప్రతీ సంస్కారవంతులైన స్త్రీ పురుషుల విధి అని నేను భావిస్తాను. మన మతాన్ని యితరులు గౌరవించినట్లుగానే మనం యితరుల మతాన్ని గౌరవించాలంటే ప్రపంచ మతాలను స్నేహపూర్వకంగా అధ్యయనం చేయడం మన పవిత్ర కర్తవ్యం

*(యంగ్ ఇండియా 2-9-26, పుట 308)*

★ ★ ★

మనుషులంతా సమానంగానే పుడతారు. కాని కొంత మంది మరికొందరి కంటే మానసికంగానూ శారీరికంగానూ బలంగా లేదా బలహీనంగా ఉంటారు. కాబట్టి పైపైన చూసినపుడు యిద్దరి మధ్య సమానత్వం కనబడదు. అయితే నిగూఢమైన సమానత్వం దాగి ఉంది. మనల్ని భగవంతుడు అంతర్గతంగా చూసేటప్పుడు నేను గాంధీనని నీవు కీథస్‌వని చూడడు. అనంతమైన ఈ విశ్వంలో మనమెంత? పరమాణువుల కంటే తక్కువ. పరమాణువుల్లో ఏది చిన్నది, ఏది పెద్దదని అడిగితే ఉపయోగమేముంది? అందుకే అనివార్యంగా మనమంతా సమానమే. ఈ తారతమ్యాలు - జాతి, చర్మం, తెలివితేటలు శరీరం, వాతావరణంఅన్నీ తాత్కాలికమే. అదేవిధంగా మతాలన్నీ సమానమే.

*(హరిజన్ 13-3-37, పుట 38)*

★ ★ ★

అవ్వన్నీ సత్యమైనవే అసంపూర్ణాలే. రేఖను నీవు సాధ్యమైనంత చక్కగా గీచే కొలదీ అది యూక్లిడ్ నిజ సరళరేఖకు దగ్గర అవుతుందే తప్ప అది వాస్తవానికి నిజమైన సరళరేఖ మాత్రం కాలేదు. మతవృక్షం ఒక్కటే.

మతాలనే కొమ్మలు సమానంగా లేకపోయనాసరే అవన్నీ వికసించేవే. అందువల్ల ఈ వికసించే శాఖకు చెందిన వ్యక్తి "నాదే గొప్పదని" ఉప్పొంగి పోకూడదు. ఒకదానికి యింకొకటి ఎక్కువా కాదు, తక్కువా కాదు

*(హరిజన 13-3-37, పుట. 38)*

★ ★ ★

ఒక వృక్షానికి లక్షలాది ఆకులు ఉన్నట్లే భగవంతుడు ఒకడే అయినప్పటికీ మతాలు మాత్రం ఈ ప్రపంచంలో ఎంతమంది స్త్రీ పురుషులు ఉన్నారో అన్ని ఉన్నాయి.

*(హరిజన్ 16-3-47 పుట 63)*

★ ★ ★

ప్రపంచంలోని అన్ని గొప్ప మతాల విశ్వాసాలను నేను నమ్ముతాను. ఇతర మత విశ్వాసాలను సహించడమే గాక వాటిని గౌరవించడం కూడా మనం నేర్చుకోనట్లయితే ఈ భూమ్మీద ప్రశాంతత మిగలదు. వివిధ మత గురువుల బోధనలను గౌరవ పూర్వకంగా అధ్యయనం చేయడమనేది ఈ దిశలో ఒక ముందడుగు అవుతుంది.

*(ఇన్‌సెర్చ్ ఆఫ్ సుప్రీమ్ వాల్యూమ్ 3, 1963, పుట 10)*

★ ★ ★

ఒక దేవుని పట్ల నమ్మకం కలిగి ఉండడమే అన్ని మతాల సారాంశం. అయితే ఆచరణలో ఈ భూమ్మీద ఒకే మతం ఉండే అవకాశం ఉంటుందని నేను అనుకోవడం లేదు. సైద్ధాంతికంగా చూస్తే భగవంతుడు ఒక్కడే అని చెబుతున్నప్పుడు ఒకే మతం ఉండాలి. కాని ఆచరణలో నాకు తెలిసిన ఏ యిద్దరు మనుష్యులూ భగవంతుని రూపాన్ని ఒకే విధంగా చూడడం లేదు అందువల్ల వివిధ రకాల పరిస్థితులకు, మనస్తత్వాలకు సరిపడా వివిధ రకాల మతాలు ఎల్లప్పుడూ ఉంటాయి. అయితే వేర్వేరు విశ్వాసాలను ఆచరించే వ్యక్తులు తమ విశ్వాసం పట్ల ఎంత గౌరవాన్ని కలిగి ఉంటారో అంతే గౌరవం యితర విశ్వాసాల పట్ల కూడా చూపే రోజు మాత్రం వస్తుంది. భిన్నత్వంలో ఏకత్వాన్ని మనం చూడగలగాలి.

... మనందరమూ ఒకే ఒక భగవంతుని బిడ్డలం, అందువల్ల మనందరమూ పూర్తిగా సమానులమే.

*(హరిజన్ 2-2-34, పుట. 8)*

★ ★ ★

పైకి కనిపించే ఈ భిన్నత్వంలో అంతర్లీనంగా యింత ఏకత్వం ఉండగా, యింక ఎక్కువ తక్కువ అనే ఆలోచనకు స్థానమెక్కడ? రోజువారీ జీవితంలో మనకు కనిపించే స్వరూపాన్ని సంగ్రహించడమే.

అన్ని మతాల సారాంశామూ ఒక్కటే. వాటి మార్గాలు మాత్రమే వేర్వేరుగా ఉంటాయి.

*(జీవితం పట్ల గాంధీ దృక్పథం 1954 పుట. 150)*

★ ★ ★

సత్యం అహింసల గురించి పుస్తకాల్లో చెప్పడం కన్నా ఆచరించి చూపడం మిన్న. సత్యంగా జీవించే జీవితం పుస్తకాలకంటే ఎంతో గొప్పది.

*(హరిజన్ 13-5-39, పుట 122)*

★ ★ ★

ఎంతో అధ్యయనం చేసి మరియు అనుభవం పొందిన తర్వాత నేను ఈ క్రింది నిర్ణయాలకు వచ్చాను.

1. అన్ని మతాలూ సత్యమే, 2. అన్ని మతాల్లోనూ ఎంతో కొంత దోషముంది, 3. మనిషికి తన దగ్గరి బంధువులు ఎంత ప్రేమ పాత్రులో యితర మానవులందరూ కూడా అంతే ప్రేమ పాత్రులు. అదేవిధంగా నాకు నా హిందూమతం ఎంత ప్రేమ పాత్రమైనదో యితర మతాలు కూడా అంతే ప్రేమ పాత్రమైనవి. నా మత విశ్వాసాల పట్ల నాకెంత గౌరవముందో యితర మత విశ్వాసాల పట్ల కూడా నాకు అంతే గౌరవముంది. అందువల్ల మార్పిడి ఆలోచనకు స్థానమే లేదు. సోదరత్వం యొక్క ఉద్దేశ్యం హిందువు మరింత మంచి హిందువుగా ముస్లిం మరింత మంచి ముస్లింగా క్రైస్తవుడు మరింత మంచి క్రైస్తవునిగా తీర్చిదిద్దడానికి ఉపయోగపడేదిగా ఉండాలి. తానే ఎక్కువ అయినా యితరుల పట్ల తనకే సహనముందనే భావన అంతర్జాతీయ సోదర

భావనకు విరుద్ధం. "నా మతం సుమారుగా అంతా ఒప్పే కాని యితర మతాలు అంతా ఒప్పుకాదు తప్పే" అనే భావన నా మనసులో ఉంటే, అప్పుడు యితరుల పట్ల నాకు కొంత సోదరత్వం ఉన్నా, అంతర్జాతీయ సోదరత్వానికి అది సరి కాదు. ఇతరుల కోసం మన ప్రార్థన ఎపుడూ 'భగవంతుడా నాకు యిచ్చిన విచక్షణా జ్ఞానాన్ని వారికి కూడా ప్రసాదించు' ' అనిగాక వారి అత్యున్నతాభివృద్ధికి ఉపయోగపడే జ్ఞానాన్ని వారికి ప్రసాదించు స్వామీ అని ఉండాలి. నీ స్నేహితులు వారు ఏ మతస్థులైనా సరే - మరింత మంచి మనుషులుగా వృద్ధి చెందాలని కోరుకో.

*(గాంధీరచనలు (1957) పుట 258-259)*

★ ★ ★

ఇతరులను తన విశ్వాసాల కనుగుణంగా మార్చాలని వారికి తన విశ్వాసాల గురించి చెప్పే వ్యక్తుల మీద నాకు నమ్మకం లేదు. విశ్వాసాలను యితరులకు చెప్పినంత మాత్రాన సరిపోదు. వాటిని ఆచరించాలి. అపుడు అది ఆదర్శపాత్రమవుతుంది.

*(యంగ్ ఇండియా, 20-10-27, పుట. 352)*

★ ★ ★

నన్ను విమర్శించకుండా నన్ను పొగిడే వారి ఉద్దేశ్యాలను నేను శంకిస్తాను. ఎప్పుడూ పొగడకుండా తన విశ్వాసాలకనుగుణంగా జీవించే వారిని నేను అభిమానిస్తాను. వారి జీవితాలు నిశ్శబ్దంగా ఉంటాయి. కాని ఎంతో గొప్ప ఆదర్శంగా కూడా ఉంటాయి. అందువల్ల ఏది గొప్పతనమో చెప్పడం గాక, ఒక సరళమైన జీవన విధానాన్ని అవలంభిస్తూ సేవ చేయడమే ఒక గొప్పతనమని మాత్రం చెప్పగలను. అందువల్ల ప్రజలకు సేవచేస్తూ వారిని సేవ చేయమంటే వారు అర్థం చేసుకోగలరు. అంతేకాని నీవు అధ్యాయాలను గురించి చెప్పి ప్రజలను నమ్మమంటే మాత్రం వారు నమ్మరు. కేవలం ఉపన్యాసాల ద్వారా క్రీస్తు జీవితం గొప్పదనం గురించి ఎవరినైనా ఒప్పించగలిగితే దానిలో ఏదో స్వప్రయోజనం యిమిడి ఉంటుందని నా అనుమానం.

గులాబీ గొప్పదనాన్ని చెప్పాల్సిన పని లేదు. అది సువాసనను వెదజల్లుతుంది. ఆ సువాసనే గులాబీ గురించి చెబుతుంది. గులాబీకి మనిషిలాంటి ఆలోచన ఉంది అది తన గొప్పదనం గురించి ప్రచారం చెయ్యడానికి అనేకమంది ప్రచారకులను నియమిస్తే ఆ ప్రచారకులందరూ కలిసి అమ్మినా ఆసువాసన మూలంగా అమ్ముడుబోయే గులాబీలకంటే ఎక్కువ అమ్మలేరు.

మత ధర్మం, దైవిక చింతనతో కూడిన జీవిత పరిమళం గులాబీ సువాసన కంటే కూడా ఎక్కువగా గుబాళిస్తుంది.

*(హరిజన్ 29-3-35, పుట. 50)*

★ ★ ★

ఆచరణ ఎలా ఉండాలో చెప్పడానికి జీవితాచరణ సరిపోదని దాన్ని ఉపన్యాసాల ద్వారా చెప్పాలంటే నేను ఒప్పుకోను. మానవులు జంతువుల దగ్గరికి వెళ్ళి "మేము మనుషులం" అని చెప్పనవసరం లేదు. వాటికి మనం మనుషులమని తెలుసు. అంతరాత్మ తనను బయటికి చెప్పుకోవడానికి అవకాశమివ్వదు. అది శరీరంకంటే ఎపుడూ ఉన్నత స్థానంలోనే ఉంటుంది. విశ్వాసాన్ని కుదించేది భాష. ఆ విశ్వాసాన్ని ఆచరణలో మాత్రమే ఋజువు పర్చుకోగలగాలి.

*(హరిజన్ 12-12-36, పుట 351)*

★ ★ ★

భావ వ్యక్తీకరణకు సందర్భమే అవసరం లేదు. జీవన విధానమే ఒక వ్యక్తీకరణ. సంవత్సరాల క్రితం నేను చెప్పిన గులాబీ ఉదహరణనే తీసుకొందాం. గులాబీ తను వెదజల్లే పరిమళం గురించి లేదా తన అందం గురించి ఒక పుస్తకం వ్రాయవలసిన అవసరం లేదు. దైవిక చింతనతో కూడిన జీవితం గులాబీ పరిమళానికంటే లేదా దాని అందానికంటే ఎన్నో రెట్లు గొప్పది. జీవితంలో దైవచింతన. సాత్విక భావన మొదలైతే దాని ప్రభావానికి తన చుట్టూ ఉన్న పరిస్థితులు తప్పకుండా స్పందిస్తాయని నేను ధైర్యంగా చెప్పగలను. బైబిల్, గీత, భాగవతం, ఖురాన్ - వీటన్నింటిలోనూ ఈ విషయాన్ని గురించి పేర్కొనబడింది. కృష్ణుడు కనిపించిన చోటల్లా ప్రజలు

కృష్ణుడు తన వాడేనన్నట్లుగా ప్రవర్తించారని మనం చదువుతాము. అదే విధంగా క్రీస్తు కూడా. వర్తమాన కాలంలో జవహర్‌లాల్ వెళ్ళిన ప్రతిచోటా ప్రజలు ఎందుకు మంత్ర ముగ్ధులవుతున్నారు? ఆయన వచ్చాడని కూడా కొన్ని సార్లు వారికి తెలియదు కాని ఆయన వస్తున్నాడనే ఆలోచనే వారిని శక్తిమంతుల్ని గావిస్తుంది. అయితే యిందులో తాత్విక చింతన ప్రభావం ఉందని చెప్పలేము కాని ఏ పేరుతో పిలిచినా అందులో ఏదో ఊహాతీతమైన శక్తి ఉందని మాత్రం ఘంటాపథంగా చెప్పవచ్చు. ఆయన చెప్పేది వినడానికి కాదు, కనీసం ఆయన్ని చూస్తే చాలని ప్రజలు అనుకొనేవారు. అది సహజం కూడా. లక్షలాది మంది ప్రజల్ని మరేరకంగానూ కలుసుకోలేము.

మార్కోనీ తరంగాల కంటే శక్తివంతమైనది దైవ చింతనతో కూడిన జీవితం. నాకూ, నా భగవంతునికి మధ్య ఎలాంటి వారధి లేనపుడు తన ప్రభావాన్ని నాలోపల ప్రవహించేందుకు నేను సిద్ధమయినపుడు నేను గంగానదీ జలాలను కూడా ముంచెత్తగలను. స్వచ్ఛమైన జీవితాన్ని గడిపే వ్యక్తి తాను మాట్లాడవలసిన అవసరం లేదు. నిజాన్ని పాటించడమంటే పదాలను పొదుపు చేయడమే అవుతుంది. జీవితాన్ని మించిన సత్యంగాని సిద్ధాంతాలు గాని మరేమీ లేవు.

*(హరిజన్ 12-12-36, పుట 353.)*

★ ★ ★

మా మతమే గొప్పదని మిగత మతాలన్నీ శుద్ధ తప్పుడువని ఏ మతస్థులైనా చెప్పే రోజులు చెల్లిపోయాయి. వచ్చేకాలంలో అన్ని మతాల పట్ల సహనాన్ని కలిగిఉండాలనే భావన వెల్లి విరియబోతోంది.

*(మహాత్మాగాంధీ రచనలు - వాల్యూమ్ 5, పుట 49)*

★ ★ ★

ఇతర మతాలపట్ల హృదయపూర్వక సానుభూతి యితర మత విశ్వాసాలను గౌరవించడం వల్ల ఐక్యతా బంధాన్ని మరింత పెంపొందించవచ్చు. సహన భావం పెరిగిన కొద్దీ మన రోజు వారీ సంబంధాలలో సోదర భావన మరింతగా పెంపొందుతుంది మన మధ్య ఉన్న స్పర్థలు కొట్టుకుపోతాయి.

*(మహాత్మాగాంధీ రచనలు వాల్యూమ్ - 5, పుట 50)*

★ ★ ★

అన్ని మతాలు నిజమేనని నమ్మడం నీకెలా సాధ్యమయింది?

సంవత్సరాల తరబడి అది నా స్థిరమైన అభిప్రాయం. ఈ ప్రపంచంలోని మంచి చెడులను నిర్ణయించే న్యాయమూర్తివి నీవు కాదన్న ఆలోచన అంతర్లీనంగా ఉండడం కూడా ఆ విధంగా నమ్మడానికి తోడ్పడ్డ ఒక అంశం. ఈ ప్రపంచంలో విభేదాలు ఉంటూనే ఉన్నాయి. ఉంటాయి కూడా. భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు. ఆయన అనేక రూపాల్లో మనకు దర్శనమిస్తాడు. మనం పరిశీలిస్తే ఎంతమంది మనుష్యులు ఉన్నారో అన్ని మతాలు మనకు కన్పిస్తాయి. వందలాది మంది ప్రజలు కేవలం నిజాన్ని తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. వారు ఆ నిజాన్ని వేర్వేరు రూపాలలో వారికి తోచిన విధంగా చెబుతారు. ఏ యిద్దరూ ఒకే ఒక రకంగా చెప్పరు. ప్రతిఒక్కరిలోనూ ఆ సర్వశక్తి సంపన్నుడైన భగవంతుడు ఉంటాడని నాకుతెలుసు. అయినా మనం అసంపూర్ణులమే. మనం వేర్వేరు వ్యక్తులం. ఏ రెండు శరీరాలు ఒకే విధంగా వుండవు. ఎంతో కొంత భేదం ఉండి తీరుతుంది. ఒక్కొక్కరూ తన విచక్షణ ప్రకారం భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. నీకంటే బాగా నేనే ప్రార్థించానని చెప్పడానికి నేనెవర్ని? ముస్లింలను, పార్శీలు, క్రైస్తవులు యూదులను గురించి నేనెలా నిర్ణయించి తీర్పు చెప్పగలను? నేను నిజాన్ని నమ్ముతుంటే చాలు. నేను ఈ రూపంలో భగవంతుణ్ణి దర్శించాను. కాబట్టి ప్రపంచమంతా ఆ రూపంలోనే చూడాలని నేనెలా చెప్పగలను? అన్ని మతాలు సమానమే. అదే విధంగా అన్ని మతాలు నిజమైనవే. అంటే దానర్థం మతాలన్నీ అన్ని ధార్మిక విషయాల్లో సమానమని అర్థం కాదు. నా మతం నాకెంత నిజమో, మరొక మనిషికి అతని మతమూ అంతే. ఆయన మతం గురించి నిర్ణయించే న్యాయమూర్తిని నేను కాను గదా. ఇదీ నా గట్టి అభిప్రాయం.

*(కన్వర్సేషన్స్ ఆఫ్ గాంధీజీ 1949, పుట. 85)*



ఇప్పటి అవసరం ఒకే మతం గురించి కాదు, వేర్వేరు మతస్థుల పట్ల సహనభావం, గౌరవం కలిగి ఉండడమే తక్షణ కర్తవ్యం. భిన్నత్వంలో

ఏకత్వం సాధించడమే గాని, తెగేదాకా లాగడం మన అభిమతం కాదు సాంప్రదాయాలను వారసత్వాన్ని సమూలంగా నాశనం చేయాలనే ప్రయత్నం తప్పనిసరిగా విఫలం చెంది తీరుతుంది. అంతేగాక అది సత్సంప్రదాయాలను దురుపయోగ పరిచినట్లు కూడా అవుతుంది.

అన్ని మతాలలోని పరమాత్మ ఒక్కటే. కాకపోతే అది విభిన్న రూపాల్లో ప్రదర్శితమవుతుంది. ఆ రూపం కొంత కాలం వరకే ఉంటుంది. తెలివైన మనుష్యులు పైకి కనిపించే రూపాన్ని వదిలేసి వాటిలో ఉన్న ఒకే ఒక ఆత్మను చూడగలుగుతారు.

*(యంగ్ ఇండియా 25-9-24, పేజీలు 317-18)*

★ ★ ★

## అధ్యాయము 31

# నాగరికత మరియు సాంప్రదాయము

ప్రాచీనకాలంలో విద్య మీద ఎలాంటి నిబంధనలూ ఉండేవికావు. దాన్ని రాజ్యం నియంత్రించడం గాకుండా బ్రాహ్మణులు ప్రజాసంక్షేమార్థం ఉపయోగ పడే విధంగా మలిచేవారు. బ్రహ్మచారులకు అనుగుణ్యంగా కొన్ని హద్దులకు లోబడి ఆవిద్య ఉండేది. అలాంటి విద్యావిధానం మూలంగానే భారతీయ నాగరికత వేలాది సంవత్సరాలుగా అనేక పరీక్షలకు తట్టుకొని నిలబడ గలిగింది. అదే సమయంలో అలాంటి సనాతన నాగరికతలైన గ్రీస్, రోమ్ మరియు ఈజిప్టు నాగరికతలు తుడిచిపెట్టుకు పోయాయి. నూతన నాగరికతా తరంగాలు భారతదేశమంతటా ప్రవహిస్తున్న మాట నిజం. అయితే యిది సంధికాలం మాత్రమేనని త్వరలోనే యిది సమసిపోయి భారతీయ నాగరికత పునరుద్ధరించ బడుతుందని నా గట్టి విశ్వాసం. పూర్వకాలంలో జీవితానికి పునాదిగా స్వయం నిబంధనలు ఉండగా నేడు విలాసమే జీవితానికి ప్రమాణం అయింది. దీని ఫలితంగా ప్రజలు శక్తిహీనులుగా బుద్ధిహీనులుగా తయారయ్యారు. నిజాన్ని పలకడం మర్చిపోయారు. వేరొక నాగరికతా ప్రమాణానికి గురయిన కారణంగా నూతన పరిస్థితులకు

అనుగుణంగా కొన్ని సార్లు మననాగరికతను మలుచుకొనే అవసరం ఉంటుంది గాని, పాశ్చాత్య పండితులే అత్యున్నతమైదని మెచ్చుకొన్న మన సంస్కృతిని మనం సంపూర్ణంగా మార్చకూడదు. పాశ్చాత్యనాగరికతలోని కొన్ని భౌతిక అవసరాలకు అనుగుణంగా కొన్ని పద్ధతులను ఆనాగరికతలో పాటించ వచ్చునేమో గాని భారతీయ సాంప్రదాయానికి ప్రామాణికమైన తాత్విక చింతనా శక్తులు, పాశ్చాత్య నాగరికతలోని భౌతిక శక్తులకంటే ఎంతో ఉన్నతమైనవి. భారతదేశం ప్రథమంగా మతాల నిలయం. దాన్ని ఆ విధంగానే ఉండేటట్లు చూడడం ప్రతి భారతీయుని ప్రథమ తుది కర్తవ్యం కూడా. వారు శక్తిని భగవంతుణ్ణుంచి సమకూర్చుకోవాలి. వారు ఆ మార్గానికి కట్టుబడి ఉంటే తాము కోరుకొనే స్వరాజ్యం వారికి యిట్టే దక్కుతుంది.

*మహాత్మాగాంధీ · హిజ్ లైఫ్, రైటింగ్స్ అండ్ స్పీచెస్ (గణేశ్ 450) పుట 194-95.*



బ్రహ్మచర్యం అనేది హిందూ నాగరికతలో ఒక అంతర్గత భాగం. పాశ్చాత్య నాగరికతలో అది లేదు. పాశ్చాత్య ప్రజలు సంపన్నులని అంటారు గాని వాళ్ళ నాగరికత ఎంత పురాతనమైనదని నేను అడుగుతున్నాను. ఈజిప్టు బాబిలోన్, గ్రీసు వంటి గొప్ప నాగరికతలు పతనం చెందగా భారతీయ నాగరికత నేటికీ వర్ధిల్లుతూనే ఉంది. ఆ నాగరికతల్లో లోపించిన "బ్రహ్మచర్యం' ' మన నాగరికతలో ఉండడమే దానికి కారణం.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 25, పుట 32.)*



ఆసియావాసికి తనలోనూ తన నాగరికతలోనూ నమ్మకముంటే తన నాగరికతను చిన్నచూపు చూడడని మన నమ్మకం. ఈ నాగరికత తరాల తరబడి అనేక అగ్ని పరీక్షలకు తట్టుకొని నిలబడింది గనుక ప్రస్తుతం ఈ ఉపఖండంలో వస్తున్న పరీక్షలను తట్టుకొని విజయవంతంగా నిలవగలదన్నది మన విశ్వాసం. ఈ దక్షిణాఫ్రికాలో ఉన్న కొద్ది మంది ఆసియా వాసులు గుర్తించాల్సిన విషయం వారు తన మాతృభూమిని తమ జీవన విధానాన్ని కించపరచదల్చుకోకపోతే వారు దానికి గట్టిగా ప్రాతినిధ్యం వహించాలి.

తరాలతరబడి తమకు వారసత్వంగా వస్తున్న నైతిక విలువలకు వారు కట్టుబడి ఉండాలి. నిజాయితీ అన్నింటిని మించిన గొప్ప విధానం" అన్న సూత్రంకేవలం తాము లాభపడే సందర్భాల్లోనే కాక ఎన్ని కష్టాలు ఎదురైనా వారుదాన్ని అన్ని సందర్భాల్లోనూ ఎన్ని త్యాగాలకైనా ఓర్చి ఆచరించాలి. వారికి బలవంతుడిదే రాజ్యం కాకుండా నిజాయితీదే రాజ్యం" అన్న ఆదర్శం ఉండాలి. బలవంతుడే ఈ భూమ్మీద బ్రతగ్గలడు అనే సిద్ధాంతంతో వారికి ఏ సంబంధమూ ఉండకూడదు. వారు తాము జీవిస్తూ యితరులను జీవించనివ్వాలి. ఈ ఆధునికపు పోటీ తత్వానికి అలవాటు పడి, ఈ అరాచక నాగరికతలోని లక్షణాలను అలవర్చుకుంటే వారు వెంటనే దిగజారి పోతారు.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 11 పుట 193.)*

★ ★ ★

ఈ ఆధునికపు నాగరికతకు నేను పూర్తిగా వ్యతిరేకిని. ఈ రోజున ఐరోపాలో ఏమి జరుగుతోందో మీరంతా కళ్ళు తెరిచి చూడాలని నా కోరిక. ఈ ఆధునిక నాగరికత పాదాలకింద ఐరోపా ఏ విధంగా నలిగిపోతుందో మీరు గమనిస్తే, మీరూ, మీ పెద్దలు నాగరికతను మన మాతృభూమిలో కొనసాగించాలంటే ఒకటికి రెండు సార్లు ఆలోచించుకోవలసి వస్తుంది.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 13 పుట. 65)*

★ ★ ★

ఐరోపాలోనూ మరియు భారతదేశంలో కూడా ఆధునిక నాగరికత ఒక పెనుభూతం వంటిది. ఈ ఆధునిక నాగరికత ప్రత్యక్ష పలితం యుద్ధమే.

*(ద కలెక్టెడ్ ఆఫ్ మహాత్మాగాంధీ, వాల్యూమ్ 13, పుట 80 )*

★ ★ ★

ఆధునిక నాగరికత నంతటినీ రెండు అంశాలుగా మనం పేర్కొనవచ్చు. ఒకటి అది నిరంతరాయంగా జరిగే పనిని ప్రతిబింబిస్తుంది. రెండవది అది సమయాన్ని స్థలాన్ని మింగేయడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. ఈ రోజుల్లో ప్రతివాడూ ఏదో ఒక పనిలో నిమగ్నమైనట్లు కన్పిస్తాడు. కానీ అది నా దృష్టిలో ఒక ప్రమాదకరమైన సూచిక. వారు చేసే పనంతా కేవలం సంపాదనకోసమే

తప్ప అందులో మరింక ఏ యితర ధ్యాసా లేదు. ఆధునిక నాగరికత మనుషులను భౌతిక వాదులుగా మార్చి వారి ఆలోచనల్ని శరీరాల మీదకు, శరీర సౌఖ్యాల మీదకు మళ్ళిస్తున్నది. పురాతనమైన మనిషి సరళ జీవనానికి భిన్నంగా ఆధునిక మనిషి క్లిష్టతరమైన జీవనాన్ని కొనసాగిస్తున్నాడని హెర్బర్ట్ స్పెన్సర్ పేర్కొన్నాడు. ఐరోపా వాసుల జీవనం క్లిష్టమైనది, ఖర్చుతో కూడుకున్నది కాగా ఆసియా వాసుల జీవనం సరళమైనది కావడం వల్ల ట్రాన్స్‌వాల్ లో సమస్యలకు మూలకారణమైంది. ఆధునిక నాగరికతా ప్రభావం ముఖ్యంగా స్థానికుల జీవనాలు క్లిష్టంగా తయారవుతున్నాయి. ఈ నాగరికతా ప్రభావం మూలంగా ఎన్నో అందాలు కావలసి వచ్చాయి. అందువల్ల మరింత ధనం అవసరం అయింది. ఎప్పుడైతే అంత డబ్బుని నిజాయితీగా సంపాదించలేమని వారు గుర్తించారో అప్పుడు వారు అవినీతికి అలవాటు పడుతున్నారు. 18 సం॥ల పాటు ఈ సమస్యపై సుదీర్ఘ అధ్యయనం చేసిన తరువాత నేను ఈ ఆధునిక నాగరికత వల్ల మెరుగైన జీవనం వైపు సాగే బదులు, మరింత వినాశనం వైపు ప్రయాణిస్తున్నామని తెలుసుకున్నాను. క్లిష్టమైన జీవితం కంటే సరళమైన జీవితం ఎల్లప్పుడూ మెరుగైనదని - సరళ జీవనంలో మరింత ఉన్నతమైన విషయాలపై కేంద్రీకరించడానికి సమయం దొరుకుతుందని కూడా తెలుసుకున్నాను. పురాతన నాగరికతలో ఏ విషయంలో కూడా పరుగులు పెట్టడం అనేది లేదు. ఇపుడు ప్రజలు తలలు వంచి నేలవైపు చూస్తున్నారు. అపుడు ప్రజలు తలలు ఎత్తి స్వర్గం వైపు చూసేవారు.

కేవలం ఆహారమే జీవితంకాదు. అదే జీవిత సర్వస్వమూ కాదు. ఇప్పుడు స్వసేవ సరిపోతోంది. అప్పుడే భగవంతునిసేవ జరిగేది. ఆత్మ అనేది ఒకటి ఉండేదని, అన్ని జీవుల్లోనూ అదేరకమైన ఆత్మలున్నాయని నేను గుర్తించకపోతే నా కోసం తప్ప నేను ఈ భూమ్మీద జీవించాలని అనుకోను. నేను చనిపోవాలనుకుంటాను. ఈ శరీరం ఆత్మకు లోబడి ఉండే ఒక సాధనం మాత్రమే. ఈ శరీరం కేవలం ఒక మట్టి ముద్ద నిరుపయోగమైనది మరియు ఎందుకూ కొరగానిది.

పురాతన నాగరికత ప్రజలను ఉన్నత విలువలకోసం పాటుపడే వారిగా, భగవంతుని పట్ల ప్రేమ, పరులపట్ల గౌరవము, ఆత్మ అనేది ఒకటి ఉందనే వివేచన కలవారుగా తయారు చేసింది. ఎంత త్వరగా అలాంటి సరళమైన జీవితానికి తిరిగి మళ్ళగలిగితే అంతమంచిది.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్‌మహాత్మాగాంధీ వాల్యూమ్ 10, పుట 279-280)*



పాశ్చాత్య నాగరికతలో రెండు సూత్రాలు మనకు కన్పిస్తున్నాయి నేను వాటిని తప్పుడు సూత్రాలనే అంటాను. రాజ్యం మరియు యోగ్యుడే జీవించగలుగుతాడు' అనేవి ఆ సూత్రాలు. ఎవరైతే ఈ సూత్రాలను వల్లిస్తున్నారో వారే వాటికి అర్థాన్ని కూడా చెప్పారు. బలవంతుడిదే రాజ్యం అంటే కేవలం శారీరిక శక్తే నిజమైనదని, శారీరిక పటుత్వమే గొప్పది, ఉన్నతమైనదని అర్థం కదా! కొంత మంది మేధాశక్తిని శారీరక శక్తితో కలిపారు కాని ఈ రెండిటికంటే మానసిక శక్తి గొప్పదని నేను అంటాను. మానసిక శక్తిని కేవలం మేధాశక్తి లేదా శారీరిక శక్తి జయిస్తుందని ఎన్నటికీ చెప్పలేము. ఈ మానసిక శక్తినే రస్కిన్ సాంఘిక ప్రేమ అంటాడు. హృదయ పూర్వక శక్తికే ఆత్మ త్వర త్వరగా ప్రతిస్పందిస్తుంది.

*(వ కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 8 పుట 243-44)*



పాశ్చాత్య నాగరికత వినాశనం గావించేదని ప్రాచ్య నాగరికత నిర్మించేదని అనిపిస్తుంది పాశ్చాత్య నాగరికత తన కేంద్రస్థానం నుంచి విషయాన్ని వెదజల్లుతుంది. ప్రాచ్య నాగరికత నలువైపుల నుంచి విషయాన్ని గ్రహిస్తుంది. అందువల్ల పాశ్చాత్య నాగరికత సహజంగానే దెబ్బతీస్తుంది. ప్రాచ్య నాగరికత విషయాన్ని శక్తిమంతం చేస్తుంది. నాకు తెలిసినంతవరకు పాశ్చాత్య నాగరికతకు ఒక లక్ష్యం లేదు. ప్రాచ్య నాగరికతకు ఎల్లప్పుడూ ఒక లక్ష్యం ఉంది. పాశ్చాత్య నాగరికతను క్రైస్తవ అభివృద్ధితో కలపడంగాని, లేక రెండూ ఒకటేనని పొరపాటు పడడం గాని నేను చేయడం లేదు. ప్రపంచ మంతటా టెలిగ్రాఫ్ విధానం ఉండడం, టెలిఫోన్లు, సముద్ర దళాలు ఉండటం గంటకు 50 లేక 60 మైళ్ళ వేగంతో పరిగెత్తే రైళ్ళు - యివన్నీ

క్రైస్తవ అభివృద్ధి అని నేను అంగీకరించను అది అంతా పాశ్చాత్య నాగరికత అని నేను అంటాను. పాశ్చాత్య నాగరికత అనంతమైన కార్యకలాపాలకు చిహ్నం ప్రాచ్య నాగరికత ఆధ్యాత్మిక చింతనతో కూడినది. కొన్నిసార్లు యిది అలసత్వంతో కూడి ఉన్నది. భారతదేశ ప్రజలు చైనా ప్రజలు - ప్రస్తుతానికి జపాన్‌ను వదిలేద్దాం - ఆధ్యాత్మిక చింతనలో మునిగిన వారై వారు అత్యంత అవసరమైన విషయాలను కూడా మర్చిపోయారు. జీవితంలో ఒక కొన నుంచి మరొక కొనకు వారి కార్యక్రమాన్ని మార్చే విషయాన్ని వారు మరిచిపోయారు. ఫలితంగా వారి మార్గంలో వెంటనే అడ్డంకి ఏర్పడింది. అందువల్ల వారు ఖాళీగా కూర్చుండి పోయారు. ఈ నాగరికత పాశ్చాత్య నాగరికతతో సంబంధాన్ని కలిగి ఉండడం పాశ్చాత్యుల వేగాన్ని తాను కూడా అనుకరించడం చేయగలగాలి. ఈ ఒక్క విషయాన్ని పరిపూర్తి చేయగలిగితే ప్రాచ్య నాగరికత ప్రథమస్థాయిలో ఉంటుందని చెప్పడానికి ఎలాంటి అనుమానం ఉండనక్కరలేదు. దానికొక లక్ష్యం ఉన్నది కదా. ఏదైనా నాగరికత గాని మరేదైన స్థితిగాని - ఎక్కడైతే శక్తులన్నీ ఒక కేంద్రస్థానానికి చేరుతుంటాయో వాటికి ఒక లక్ష్యం ఉందని, ఎక్కడైతే శక్తులన్నీ ఒక స్థానం వైపు నుంచి నలువైపులా వెళుతుంటాయో వాటికి ఒక లక్ష్యం లేకుండా ఉండడాన్ని మనం చూడవచ్చు. అందువల్ల ఈ రెండు నాగరికతలు ఒక చోట కలుసుకోవడం ఎంతో అవసరం. అందువల్ల మనకు పూర్తిగా విభిన్నమైన మరో శక్తి - విచ్ఛిన్నతా శక్తి కాకుండా ఐక్యతా శక్తి - ఏర్పడుతుంది. ఈ రెండు శక్తులు ప్రతికూల శక్తులుగా ఉండవచ్చు గాక, అయినా సరే, ప్రకృతి అవసరాల రీత్యా ఈ రెండూ అవసరమే.ఈ శక్తులు ఏమిటి? వాటిని ఎలా ఉపయోగించాలి? గుడ్డిగా కాకుండా యుక్తిగా ఏదో లక్ష్య రహితంగాగాక ఒక లక్ష్యానికి అనుగుణ్యంగా ఉపయోగించడం తెలివైనవారుగా హృదయం ఆత్మకలిగిన మానవులమైన మనం చేయగలగాలి. ఆ విధంగా చేయగలిగినప్పుడు ఈ రెండు సంస్కృతులు ఒక మంచి లక్ష్యం కోసం కలుసుకోవటంలో ఎలాంటి యిబ్బందీ ఉండదు

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 8 పేజీలు 244-45)*

★ ★ ★

నేడు ఐరోపాలో కొనసాగుతున్న అరాచక పరిస్థితులను చూస్తూ ఉంటే ఆధునిక నాగరికత దుర్మార్గపు చీకటి శక్తులను ప్రతిబింబిస్తుండగా, పురాతన భారతీయ నాగరికత దానిస్థానంలో భగవంతుని శక్తులను ప్రతిబింబిస్తున్నట్లు మనకు అర్థమవుతుంది. ఆధునిక నాగరికత ప్రధానంగా భౌతిక వాదికాగా మన నాగరికత ప్రధానంగా ఆధ్యాత్మికవాది ఆధునిక నాగరికత ప్రకృతి సిద్ధాంతాలను పరిశీలించడానికి మానవ శక్తియుక్తులను ఉత్పత్తి కారకాలను కనుగొనడానికి, వినాశకరమైన ఆయుధాలను తయారు చేయడానికి ఉపయోగించబడగా, మన నాగరికత ప్రధానంగా ఆధ్యాత్మిక నియమాలను వృద్ధి చేయడంలో నిమగ్నమైంది. నిజాయితీ, దానగుణం. అన్ని జీవుల పట్ల అపారమైన గౌరవం, యితరుల వస్తువులను ఆక్రమించుకోకుండా ఉండడం, దేనిని దాచి పెట్టకుండా ఉండడం, మన అవసరాలకు తగినంత మాత్రమే నిల్వ చేసుకోవడం అనే విషయాలు ఒక సక్రమ జీవన విధానానికి మైలు రాళ్లని మన శాస్త్రాలు నిష్కర్షగా ఘోషిస్తున్నాయి. ఈ జీవన విధానం లేకుండా భగవంతుని సాన్నిధ్యం పొందడం సాధ్యం కాదని కూడా మన శాస్త్రాలు చెబుతున్నాయి. అహింసను అంటే దాని సరియైన రూపంలో పవిత్రమైన ప్రేమ, సానుభూతి కలిగి ఉండడం - ఒక సరియైన మార్గంలో సమర్థంగా ఆచరించడం ద్వారా ఈ ప్రపంచాన్ని ఖచ్చితంగా తన కాళ్ళ దగ్గరకు తెచ్చుకోవచ్చని మన నాగరికత చెబుతోంది. ఈ సత్యాన్ని కనుగొన్న రచయిత ఈ విషయాన్ని నిరూపించడానికి అనేక ఉదాహరణలు యివ్వగలడు

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 13, పుట 261-62)*



ఆధునిక నాగరికత ప్రధాన గమ్యనిర్దేశం చెడ్డదని నేను భావించడం వల్లనే దాన్ని ఖండించడానికి ధైర్యం చేయగలుగుతున్నాను. ఎక్కడైనా కొన్ని సంఘటనలు దా... బాగున్నాయని నిరూపించవచ్చు గాక, కాని నేను నైతిక విలువలను ప్రామాణికంగా తీసుకొని ఈ ఆధునిక నాగరికత పోకడను పరిశీలించాను. తమచుట్టూ ఉన్న పరిస్థితుల మధ్య గల ఉన్నత స్థాయికెదిగిన వ్యక్తుల విలువలను, క్రైస్తవ మతం, ఆధునిక నాగరికతల మధ్య బేధాన్ని

నేను గమనించాను. దాని కార్యాచరణ కేవలం ఐరోపాకే పరిమితంకాలేదు. దాని యొక్క పూర్తి ప్రభావం నేడు జపాన్‌లో సంపూర్ణంగా కనిపిస్తున్నది. అదినేడు భారత దేశాన్ని కూడా తుడిచి పెట్టే ప్రమాదం ఉన్నది. సుడిగుండంలో ఉన్న మనుషులు ఏదో కొందరు వ్యక్తులుగా తప్ప సాధారణంగా దానిలోనే తమ విధిని నిర్దేశించుకోవల్సి వస్తుంది. కనీసం దాని ప్రభావానికి దూరంగా ఉండి, సరైన నాగరికతా మార్గదర్శకత్వం కలిగిన ప్రజలనైనా ముందు జాగ్రత్తగా వారు ఎక్కుడున్నాడో అక్కడే ఉంచడానికి వారికి సహాయ పడాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఆధునిక నాగరికత ఎలాంటి జీవితాన్ని ప్రసాదిస్తుందో, పురాతన నాగరికత ఏ జీవితాన్ని యిస్తుందో అనుభవించిన వాణ్ణి నేను. అందువల్ల భారతీయ ప్రజానీకానికి పోటీ తత్వం, మేధాశక్తి సంపన్నతతో కూడిన భౌతిక జీవన విధానం ఎంతో అవసరమని సాగుతున్న వాదనను నేను నిష్కర్షగా వ్యతిరేకిస్తున్నాను. ఈ విధమైన జీవనం నైతిక విలువల పెంపుదలలో ఒక్క అంగుళమైనా తోడ్పడలేదని నేను చెప్పగలను.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ వాల్యూమ్ 10, పుట 247)*



పాశ్చాత్య నాగరికత యింకా కుర్రతనంలో ఉన్నది. కాగా, పరిస్థితులు ఏ స్థాయికి చేరుకొన్నాయంటే ఆ మొత్తం వ్యవస్థను సముద్రంలోకి విసిరి వేయవలసిన తరుణం ఆసన్నమయింది. లేకపోతే మనుషులు పురుగుల్లాగా మాడిపోయే సమయం దగ్గర పడింది. ఈ రోజున కూడా నానాటికి పెరుగుతున్న ఆత్మహత్యలను మనం గమనించవచ్చు.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ, వాల్యూమ్ 9, పుట 389.)*



నేనొక వాస్తవాన్ని ఒప్పుకోవాలి. నేను ఈ రోజున ఈ సామ్రాజ్యం స్థిరంగా ఉంటుందా లేదా అనే విషయం గురించి ఆలోచించడం లేదు. నేను బాధ పడేదల్లా ప్రపంచంలోనే అత్యున్నతమైన పురాతన భారతీయ నాగరికత స్థిరంగా ఉంటుందా లేదా అని మాత్రమే. సైతానుల సామ్రాజ్యమైన ఆధునిక నాగరికతకు భగవంతుని రాజ్యమైన పురాతన నాగరికతకు మధ్య

భారతదేశంలోని ఆంగ్లేయ ప్రభుత్వం పోరాటాన్ని నడుపుతున్నది ఒకటేమో యుద్ధ దేవత కాని మరొకటి ప్రేమ దేవత.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ, వాల్యూమ్ 10, పుట 189 )*

★ ★ ★

వారితో (గ్రామీణులతో) నీవు మాట్లాడిన మరుక్షణం వారి పెదాల నుంచి విజ్ఞానం జలజలా ప్రవహించడాన్ని గమనిస్తావు. పైకి అనాగరికంగా కన్పించే వారి మధ్య అనంతంగాఉండే ఆధ్యాత్మిక చింతనా నిధిని నీవు గమనించవచ్చు. దాన్నే నేను సంస్కృతి అంటాను. అలాంటిది పాశ్చాత్య దేశాల్లో నీకు కనిపించదు. ఒక ఐరోపా రైతుతో నీవు మాట్లాడడానికి ప్రయత్నిస్తే ఆధ్యాత్మిక విషయాల్లో అతనికేమీ శ్రద్ధలేనట్లు మనకు అర్థమవుతుంది. అదే భారతీయ గ్రామీణుల్ని తీసుకుంటే బయటకు కనిపించే అనాగరికత మధ్య తరాల తరబడి పోగుపడ్డ సంస్కృతిమనకు కన్పిస్తుంది. పైకి కనిపించే ఆ ముసుగును తొలగిస్తే, ఆ అజ్ఞానాన్ని పారద్రోలితేఒక నాగరికమైన విజ్ఞానయుతమైన స్వేచ్ఛాయుతమైన మనిషికి నమూనా మనకు ఆగ్రామీణుడిలో కన్పిస్తాడు.

*(మహాత్మ వాల్యూమ్ 5 (1952) పుట. 11)*

చైనా సంస్కృతి చెదలు తినే సమాధుల్లోను యిటుకల్లోను మరల్లోనూ నిక్షిప్తమైందని చెప్పడానికి నేను విచారిస్తున్నాను. ఒక జాతి సంస్కృతి మానవ ఆత్మల్లోనూ మానవ హృదయాల్లోనూ ఉండాలి. చైనా సంస్కృతి అది చైనీయుల జీవనంలో భాగం కాగలిగినంత వరకే చైనా సంస్కృతి అనిపించుకుంటుంది.

*(మహాత్మ వాల్యూమ్ 5, (1952) పుట. 12)*

★ ★ ★

పాశ్చాత్య నాగరికత అని ఐరోపా నాగరికత అని వేర్వేరుగా ఏమీలేదు. ఉన్నదల్లా పూర్తిగా భౌతికవాదంతో కూడుకున్న ఆధునిక నాగరికతమాత్రమే.

*(ద కలెక్టెడ్ వర్క్స్ ఆఫ్ మహాత్మాగాంధీ, వాల్యూమ్ 9, పుట 279.)*

★ ★ ★

పాశ్చాత్య దేశాలు ఆధునిక నాగరికతను సంపూర్ణంగా విసర్జించిన నాడే తూర్పు పశ్చిమ రాజ్యాలు కలుసుకోగలుగుతాయి. ఆధునిక నాగరికతను తూర్పు దేశాలు అవలంభించిన నాడు కూడా అవి కలుసుకోవచ్చు. కాని అలాంటి కలయిక ఇంగ్లాండు, జర్మనీ కలయిక మాదిరిగా ఒకరినొకరు చంపుకొనే ఆయుధాల కలయికగా మాత్రమే మిగిలిపోతుంది.

*(ద కలెక్టెడ్ వర్క్స్ఆఫ్ మహాత్మాగాంధీ, వాల్యూమ్ 9, పుట. 479)*

★ ★ ★

మన కాలంలోని భారతీయ సంస్కృతి పరిణామ దశలో ఉంది. ఒక దానితో ఒకటి పోటీ పడుతున్న వివిధ సంస్కృతుల సమ్మిళితంగా భారతీయ సంస్కృతిని అభివృద్ధిగావించే కృషిలో మనము నిమగ్నమై ఉన్నాము ఒంటరిగా ఉండడానికి ప్రయత్నం చేసే ఏ సంస్కృతి కూడా రాణించలేదు. నేడు భారత దేశంలో శుద్ధఆర్యన్ సంస్కృతి అనేదిఏదీ లేదు. ఆర్యులు వాస్తవంగా భారతీయులం లేక దురాక్రమణ చేసి భారతదేశంలోకి ప్రవేశించారా అనే విషయంలో నాకు ఆసక్తి లేదు. తరతరాల నుండి మన పూర్వీకులు సంపూర్ణమైన స్వేచ్ఛతో ఒకరితో మరొకరు కలిసి మెలిసి జీవనం కొనసాగించారని మన తరం అలాంటి సమ్మేళనానికి ప్రతీక అను విషయమందే నాకు ఆసక్తిఉంది. మన మాతృభూమికీ, మనను భరిస్తున్న ఈ చిన్ని భూ ప్రపంచానికి మనం ఏదైనా మంచి చేస్తున్నామా లేక మనం ఈ భూమికి భారంగా మారుతున్నామా అన్నది భవిష్యత్తు మాత్రమే నిర్ణయిస్తుంది.

*(హరిజన్ 9-5-26, పుట 100)*

★ ★ ★

నా యింటి చుట్టూగాఢతకట్టుకోవాలని నా కిటికీలన్నీ మూసుకొని కూర్చోవాలని నేను కోరుకోవటం లేదు. అన్నిదేశాల సంస్కృతులూ నాయింటి గుండా సాధ్యమైనంత స్వేచ్ఛగా ప్రవహించాలనే నేను కోరుకుంటాను. అయితే ఆగాలిలో నాపునాది కొట్టుకు పోవడాన్ని నేను అంగీకరించను. ఇంకొకరి యింటిలో బానిసగా లేదా ఒక బిచ్చగాడిగా బ్రతకదల్చుకోలేదు. అనవసరమైన తప్పుడు పేరు ప్రఖ్యాతులకోసం, సందేహాస్పదమైన సాంఘిక

ఆధిక్యత కోసం నా సోదరీ సోదరులను ఆంగ్లము నేర్చుకోమని నేను ఒత్తిడి చేయలేను. భాషాభిరుచితో ఇంగ్లీష్‌ను మరియు యితర ప్రపంచ భాషలను ఎంతైనా నేర్చుకోమనే మన యువతీయువకులను నేను ప్రోత్సహిస్తాను. తదనంతరం వారు నేర్చుకొన్న దాని ఉపయోగాన్ని భారతదేశానికి మరియు ప్రపంచానికి ఒక బోస్‌లాగా, ఒక రాయ్ మాదిరిగా లేదా ఒక కవిలాగా ఉపయోగించాలని నేను ఆశిస్తాను. అయితే అదే సమయంలో ఒక్క భారతీయుడు కూడా తన మాతృభాషను మర్చిపోవడం గాని నిర్లక్ష్యం చేయడంగాని, లేదా దాన్ని తలుచుకొని సిగ్గు పడడంగాని లేదా తన మాతృభాషలో తన భావాన్ని వ్యక్తపరచలేనని అనుకోవడాన్ని గాని నేను సహించలేను. నాది చెఱసాల వంటి మతం కాదు.

*(యంగ్ ఇండియా 1-6-21, పుట 170.)*

★ ★ ★

పురాతన సంస్కృతినే ప్రజల కెక్కించాలని దానిని మాత్రమే పునరుద్ఘాటిస్తూ ఉండాలని గుజరాత్ విద్యా పీఠం ఉద్దేశ్యంకాదు. పాత సాంప్రదాయాలు పునాదిగా నేటికాలమందలి అనుభవాల ఆధారంగా ఒక క్రొత్త సంస్కృతిని అభివృద్ధి పర్చాలనేది దాని లక్ష్యం. ఈ దేశంలోకి వచ్చి స్థిరపడి యిక్కడి ప్రజలను ప్రభావితం చేసి ఈ గడ్డమీద లక్షణాలతో ప్రభావితమైన భిన్న సంస్కృతుల సమాహారంగా ఉండే సంస్కృతికోసం గుజరాత్ విద్యాపీఠం కృషి చేస్తుంది. ఈ సమాహారం సహజంగానే స్వదేశీ విధానంగా ఉంటుంది. ఇక్కడ అమెరికాలో మాదిరిగా వివిధ సంస్కృతుల మధ్య బలవంతమైన కృత్రిమమైన ఐక్యత కాకుండా ఒక బలమైన సంస్కృతి యితర సంస్కృతులను తనలో కలుపుకోవడం ప్రతి సంస్కృతికీ న్యాయమైన స్థానం లభించడం జరుగుతుంది.

*(యంగ్ ఇండియా 17-11-20 పుట. 6)*

★ ★ ★

జ్ఞానం గురించి పశ్చిమ దేశాల గురించి చూచే అలవాటు గురించి ఒక్క మాట. తూర్పు దేశాలనుంచి జ్ఞానం వెళ్ళడానికి నా జీవితమంతా ఉపయోగపడకపోయినా ఒక్కచిన్న సలహా మాత్రం చెప్పగలను. ఒకవేళ

తూర్పు దేశాల జ్ఞాన నిధి ఖాళీ అయిపోతే మనం పశ్చిమ దేశాల నుంచి అదుపు తెచ్చుకోవాల్సిందే. నిజంగా జ్ఞానం అనేది పొగమాదిరి కాకుండా నిజమైన జ్ఞానమైతే అసలు అది అయిపోవడమనే ప్రశ్న తలెత్తదు గదా. పంచుతున్న కొద్దీ జ్ఞాన సంపద పెరుగుతూనే ఉంటుందని నా చిన్నప్పటి నుంచి నేను నేర్చుకొన్నాను. ఏమైనా అదే నమ్మకంతోనే పురాతన పెట్టుబడిపై వ్యాపారం సాగించాను. అది ఎప్పుడూ విఫలం చెందలేదు. అంటే దానర్థం నేను బావిలో కప్పమాదిరిగా వ్యవహరించాలని మాత్రం కాదు పాశ్చాత్య దేశాల జ్ఞానాన్ని గ్రహించి లాభం పొందడం నుంచి నన్నే శక్తీ అడ్డుకోలేదు నేను తీసుకోవలసిన జాగ్రత్తల్లా పాశ్చాత్య తళుకుబెళుకులు నన్ను మ్రింగి వేయకుండా చూసుకోవడమే. తళుకు బెళుకులను చూచి నిజమైన జ్ఞానమని పొరపడే తప్పు నేను చేయకూడదు.

*(హరిజన్, 13-1-40 పుట 414)*

★ ★ ★

# భాగము - 6

# కళ, సాహిత్యము మరియు విజ్ఞానశాస్త్రము

## అధ్యాయము 32

## కళ గురించి

ప్రతి అంధానికి రెండు ముఖాలు ఉంటాయి. ఒకటి ఆంతర్యంలోనిది, రెండవది బాహ్యంగా కనిపించేది. ఇదే నేను నొక్కి ఒక్కాణించేది. అంతర్గతమైన దానికి సహాయపడటానికి మించి, బాహ్యంగా ఉండే అంశానికి ఎలాంటి అర్థమూ లేదు. నిజమైన కళ అంతా ఆత్మను గురించిన భావవ్యక్తీకరణే. అంతర్గతంగా ఉండే మనిషి గొప్పదనాన్ని తెలియచెప్పేందుకు ఉపయోగపడినపుడే బాహ్య ముఖానికి విలువ కలుగుతుంది.

చాలామంది తాము కళాకారులమని చెప్పుకొంటారు. ఆ విధంగా గుర్తించబడతారు కూడా. కాని వారి కృషిలో మాత్రం అంతరాత్మ గురించిన తపన గాని అభిలాష గాని గోచరించవు.

ఉదాహరణకు ఆస్కార్‌వైల్డ్‌నే తీసుకోండి. ఆయన గురించి పెద్ద చర్చ జరుగుతున్నప్పుడు నేను ఇంగ్లాండులోనే ఉన్నందున ఆయన గురించి నేను మాట్లాడ గలను .. బహిర్గతంగా కనిపించే దానిలోనే అత్యున్నత కళారూపాన్ని వైల్డ్ చూశాడు గనుకనే విజయం సాధించాడు నిజమైన కళ ఆత్మ తనను తాను గుర్తించడంలో తొడ్పడేదిగా ఉండాలి. నా స్వవిషయంలో నేను బయటి అంశాల సహాయం లేకుండానే నా ఆత్మను నేను పరిశీలించుకోగలను. అందువల్ల నా గురించి కళాత్మక రూపం మీరు చూడలేకపోయినా నా జీవితంలో నిజమైన సంపూర్ణమైన కళ ఉందని నేను చెప్పగలను. ఏనీలాకాశాన్ని చూస్తూ ఆ అనంతమైన అందాన్ని వీక్షించడం కోసం తలుపులే కాదు, చివరికి పైకప్పు కూడా ఉండదు. ఎంతో కృషిచేసి తయారు చేసిన ఏ కళారూపమైనా నా తలపైకెత్తి చూసినపుడు మెరుస్తున్న నక్షత్రాలతో కనిపించే ఆకాశం అందచందాలతో సమానమవుతుందా? దీని అర్థం కళారూపాల విలువను నేను గుర్తించక పోవడం కాదు. అయితే ప్రకృతిలో ఉండే కళా సంపదతో పోల్చినపుడు యివి ఎంత అసంపూర్ణమైనవో మనకు అర్థమవుతుందని నా వ్యక్తిగత అభిప్రాయ ప్రకారం మనిషి తయారు చేసే కళాత్మక రూపాలు మనిషి తన ఆత్మను గుర్తించడానికి ఉపయోగపడినపుడే వాటి విలువ పెరుగుతుంది.

సత్యాన్ని పలకడంలో నేను అందాన్ని చూస్తాను. అన్ని సత్యాలు - అవి సత్యమైన ఆలోచనలే కావచ్చు. సత్యమైన ముఖ రూపాలే కావచ్చు, లేదా సత్యమైన బొమ్మలు లేదా పాటలు ఏవైనా కావచ్చు. వీటన్నింటిలోనూ నేను అత్యంత సుందరత్వాన్ని చూడగలుగుతాను. సామాన్యంగా ప్రజలు సత్యంలోని అందాన్ని గుర్తించడంలో విఫలం చెందుతారు. సామాన్యుడు సత్యం నుంచి దూరంగా పారిపోయి అందులోని సత్యాన్ని చూడడంలో గుడ్డివాడు అవుతున్నాడు. ఎపుడైతే మనుష్యులు సత్యంలో సౌందర్యాన్ని చూడగలరో అపుడే నిజమైన కళ ఉద్భవిస్తుంది. కేవలం పైకి కనిపించే రూపమే ఆ వస్తువును అందంగా ఉంచలేదు. నిజమైన కళాకారుడికి కేవలం బాహ్యరూపం కూడా అంతర్గతంగా ఆత్మలో ప్రకాశిస్తున్న సత్యమే నిజమైన

కళగా కన్పిస్తుంది. అందువల్ల నేను గతంలోనే చెప్పినట్లుగా సత్యాన్ని మించిన సౌందర్యం లేదు. మరోవైపు పైకి ఏ మాత్రం అందంగా కన్పిపించని అనేక అంశాలలో సత్యం దాగి ఉండవచ్చు. సోక్రటీస్ తన కాలంలో అందరికంటే ఎక్కువగా సత్యాన్ని పాటించే వ్యక్తి అని మనకు తెలుస్తోంది. అయితే ఆయన రూపాలు ఆనాటి గ్రీస్‌లో అత్యంత అందవిహీనమైనవని జమ కట్టడం జరిగిందని తెలుస్తోంది నా దృష్టిలో ఆయన జీవితమంతా సత్యం కోసం కృషి చేసినందున ఆయన అత్యంత సుందరమైన వ్యక్తి క్రిందే లెక్క. ఫిడియస్ (అథెన్స్ సామ్రాజ్యంలో క్రీస్తు పూర్వం 5వ శతాబ్దంలో జీవించినగొప్ప శిల్పి) ఒక కళాకారుడిగా బాహ్యమైన అందాన్ని కూడా చూడడానికి అలవాటు పడినప్పటికీ ఆయనకి సోక్రటీస్ యొక్క అంతర్గత అందాన్ని గుర్తించడానికి బాహ్యరూపం ఏ మాత్రం ఆటంకం కాలేదన్న విషయం మనం గుర్తుంచుకోవాలి.

సత్యాసత్యాలు సాధారణంగా కలిసే ఉంటాయి. అదేవిధంగా మంచి, చెడులు కూడా సాధారణంగా కలిసే ఉంటాయి. ఒక కళాకారుడిలో కూడా విషయం పట్ల సదవగాహనతో పాటుగా చెడుకూడా కలిసే ఉంటుంది. తన పని పట్ల సరియైన దృక్పధాన్ని కలిగి ఉన్నప్పుడు నిజమైన అందాలు తయారవుతాయి. అయితే ఈ క్షణాలు జీవితంలో ఎంత తక్కువగా ఉంటాయో, కళలో కూడా అంతే తక్కువగా ఉంటాయి.

*(యంగ్ ఇండియా. 13-11-24 పే. 377)*



సత్యం కోసం మనం మొదట అన్వేషించాలి. ఆ సత్యానికే అందం, మంచితనం తరువాత కలుస్తాయి. సత్యాన్ని చూసి దాన్ని వ్యక్త పరిచిన ఏసుక్రీస్తు నా దృష్టిలో పెద్ద కళాకారుడు. అదేవిధంగా ఖురాన్, నాటి అరబిక్ భాషాశాస్త్రంలో సంపూర్ణమైన గ్రంధంగా పండితులు పేర్కొంటున్నందున మహమ్మద్ కూడా నా దృష్టిలో గొప్ప కళాకారుడే. వారిద్దరూ కూడా మొదట సత్యం కోసం అన్వేషణ కొనసాగించి అతి సహజంగా దాన్ని వ్యక్త పరిచిన వారే అయినప్పటికీ వారు కళను గురించి ఎలాంటి అభిప్రాయాన్ని గ్రంథస్థం

చేయలేదు. అలాంటి సత్యం కోసమే అందం కోసమే నేను జీవిస్తున్నది, అన్వేషిస్తున్నదీ మరియు మరణించేది కూడా దానికోసమే.

కొంత మంది కళాకారులు సౌందర్యంలోని సత్యాన్ని లేదా సౌందర్యం ద్వారా సత్యాన్ని గ్రహించలేక పోవచ్చు.

కొంతమంది గమనించవచ్చు. లక్షలాది మంది గురించి మనం మాట్లాడుతున్నపుడు అందరికీ శిక్షణ యిచ్చి ఆరకంగా సౌందర్యంలో వాస్తవాన్ని చూసే విధంగా వారి దృక్పథాన్ని మార్చడం సాధ్యం కాదు. వారికి సత్యాన్ని చూపిస్తే, తదనంతరం అందాన్ని వాళ్ళే గ్రహిస్తారు. ఆకలితో అలమటిస్తున్న లక్షలాది జనానికి ఏది ఉపయోగమో నా దృష్టిలో అది సౌందర్యమైనది. ఈ రోజున జీవితానికి అత్యంత అవసరమైనది మనం యిద్దాం. అప్పుడు జీవితంలో అందచందాలు వాటంతట అవే వస్తాయి.

*(యంగ్ ఇండియా 20-11-24, పే. 386.)*

★ ★ ★

పైకి ఎంతో అనాగరికంగా కనబడే శీలమే పురుషునికి అందాన్నిస్తుంది. అదే ఒక ఆవును తీసుకుంటే దాని చర్మం, కేశాలు, కాళ్ళు యిలాంటి వాటిని చూసి ఆ ఆవు అందంగా ఉందని చెప్పవచ్చు. అదే ఒక పురుషుని విషయంలో మాత్రం అతను ఐదున్నర అడుగులున్నాడని అతను మంచి వాడని, నాలుగున్నర అంగుళాలు ఉన్నాడని అతను చెడ్డవాడని అనలేము. ఐదున్నరకి యింకొక అరఅడుగు ఎక్కువ ఉంటే మరింత మంచి వాడని మనం చెప్పలేము. ఒక మనిషి విషయంలో మంచి తనానికి చెడ్డతనానికి పునాది అతని హృదయంలో ఉంటుందితప్ప అతని శరీరంలోనూ పోగుబడ్డ సంపదలోనూ ఉండదు.

*(ఆశ్రమ సోదరీమణులకు బాపు వ్రాసిన ఉత్తరాలు (1952) పే. 102)*

★ ★ ★

స్వచ్ఛమైన హృదయంలోనే నిజమైన అందం ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 20-10-27 పే. 350)*

★ ★ ★

ఒక కళారూపాన్ని వివరించడానికి ఒక కళాకారుడి అవసరం ఏముంది? ఏ కళా రూపమైనా దాన్ని గురించి అది ఎందుకు వివరించుకోలేదు? నేను అనుకునేదేమిటో మీకు చెబుతాను. వాటికన్ కళా కేంద్రంలో శిలువపైన చెక్కిన ఏసుక్రీస్తు విగ్రహాన్ని ఒకసారి నేను చూశాను. అది నన్ను విపరీతంగా ఆకర్షించింది. దాన్ని చూసి ఐదు సంవత్సరాలు గడిచిపోయాయి. అయినా అది యిప్పటికీ నా మనోఃఫలకంపై చెక్కు చెదరకుండా ఉంది. దాని అందాన్ని వివరించడానికి అక్కడ అపుడు ఎవ్వరూ లేరు మైసూర్‌లోను బెలూన్‌లో ఒక పురాతనమైన గుడిలో రాతితో తయారైన ఓ విగ్రహాన్ని చూశాను. దాన్ని గురించి ఎవ్వరూ వివరించకుండానే దానిభావన అంతా నాకు అర్థమయింది. తన చేతుల్లో ఓడిపోయి తనను కొండచిలువ రూపంలో బంధించిన క్యూపిడ్ కబంధ హస్తాల నుంచి బయట పడడానికి విశ్వ ప్రయత్నం చేస్తున్న ఒక అర్ధనగ్న స్త్రీ స్వరూపమది. ఆ రూపంలో ఆ కొండ చిలువ విషపు పడగల క్రింద ఆ స్త్రీ అనుభవిస్తున్న బాధను నేను ప్రత్యక్షంగా గమనించగలను.

లక్షలాది మందిని ప్రతిబింబించ గలిగే సాహిత్యము, కళారూపాలు రాయాలని నేను ఆశిస్తాను.

*(హరిజన్ 14-11-36, పే. 315)*



కళ కళ కోసమేనని చెప్పేవారు తమ వాదనను నెగ్గించుకోలేకపోయారు. కళ అంటే ఏమిటనే ప్రశ్నను ప్రక్కన పెడితే ప్రతివారి జీవితంలోనూ కళకు స్థానం ఉంటుంది. కాని కళ మనం సాధించాల్సిన లక్ష్యానికి ఒక మార్గం మాత్రమే. ఎపుడైతే కళే ఒక లక్ష్యంగా మారుతుందో అపుడది మానవత్వాన్ని కించపరిచి మనిషిని బానినగా మారుస్తుంది.

*(మహాదేవ్ దేశాయ్ డైరీ - 1 (1953) పే. 160)*



కళ కోసమే జీవితాన్ని అంకితంచేసిన కొంతమంది తమ కళాజీవితాన్ని స్వచ్ఛమైన మచ్చలేని జీవితంతో సమ్మిళితం గావించడంలో విజయవంత

మయ్యారని చెప్పబడుతున్నది. కళ అనేది స్వచ్ఛమైన వ్యక్తిగత జీవనంతో సంబంధంలేని అంశమని నమ్ముతూ ఉండడానికి మనం అలవాటు పడ్డాము ఇంతకు మించిన అసత్యం మరొకటి ఉండదని నా అనుభవంతో నేను చెబుతున్నాను. నేను ఈ జీవిత చరమాంక దశకు చెరుకొంటున్నాను. స్వచ్ఛమైన జీవితమే అత్యున్నతమైన నిజమైన కళ అని మాత్రమే ఈ వయస్సులో కూడా నేను చెప్పగలను చాలామంది సాధన ద్వారా మంచి సంగీతాన్ని సమకూర్చగలరు. కాని స్వచ్ఛమైన నిర్మలమైన జీవనంలో ఆ సంగీతాన్ని అందించే కళ అతి కొద్ది మందికి మాత్రమే ఉంటుంది.

*(హరిజన్ 19-2-38 పే. 10)*

★ ★ ★

పైకి కనిపించే రూపమే గాకుండా దాని వెనుక ఏమి దాగి ఉన్నదనే దాన్ని కూడా నిజమైన కళ గుర్తిస్తుంది. ఒక కళ మనిషిని హతమారుస్తుంది. మరొక కళ జీవితానికి పునర్జన్మను ప్రసాదిస్తుంది. తనను సృష్టించిన వారికి సంతోషాన్ని సౌభాగ్యాన్ని కలిగించేదే నిజమైన కళ.

"అతికొద్ది స్థలంలో అయినాసరే పుష్పాలను పూయించమని అడగలేని శరీరానికి ఆహారం ఎంత అవసరమో ఆత్మకు అందం, రంగు అంత అవసరం."

నేను అడగను. కూరగాయల్లో రంగు యొక్క అందాన్ని ఎందుకు గుర్తించలేవు? అని. మచ్చలేని ఆకాశంలో కూడా అందం ఉంది. కానీ కేవలం ఊహారూపమైన ఇంద్ర ధనుస్సు రంగులే నీకు కావాలి. అందమైనదేదీ ఉపయోగపడేది కానక్కరలేదని ఉపయోగపడే ప్రతిదీ అందమైనది కాలేదని మనం నమ్మే విధంగా మనకు బోధనలు గావించబడ్డాయి. ఉపయోగకరమైనది అందంగా కూడా ఉంటుందని ఋజువు చేయాలని నా కోరిక.

*(హరిజన్ 7-4-46. పే. 67)*

★ ★ ★

"ఉపయోగం" అనే పదాన్ని విస్తృతార్థంలో తీసుకుంటే ఉపయోగంతో సంబంధంలేని ఏ అందాన్ని మనం ఊహించలేము. 40 కౌంట్‌తో నేసిన

బట్ట మనం ధరించడానికి ఉపయోగపడక పోవచ్చు. కాని అంత సున్నితమైన నాణ్యమైన దారాన్ని తయారు చేయాడానికి చేసిన కృషి ఆ నేతలో ఆ వ్యక్తికే తెలిసిన మెళకువలు, ఆశ్రమంలో వచ్చే సమస్యలూ, సమాధానాలూ అన్నీ ఆ దరిద్ర నారాయణునికి ఉపయోగపడేవే.

వాటికన్ ప్రదర్శనలో నన్ను సమ్మోహపరిచిన చిత్రాల శిల్పాల మాటేమిటి? వాటి అందాన్ని అభినందించ గలిగిన శక్తి గలవారు చాలా తక్కువ మందే ఉన్నారు. కాని ఆ చిత్రకారులు శిల్పులు. మానవులకు సేవ చేయాలనే తలంపుతోనే వాటిని తయారు చేశారు. ఏ చిత్రమైనా మనిషిలో దురాలోచనను సృష్టిస్తే, ఆ చిత్రం కళాత్మకమైనదిగా వర్ణించబడడానికి అర్హతను కోల్పోతుంది. కళ అనేది మనిషిని నైతిక విలువల మార్గంలో మరొక అడుగు ముందుకు తీసుకువెళ్ళి అతని ఆలోచనలను మరింత పెంచేదిగా ఉండాలి. అలా కాకుండా మనిషిని నైతికంగా పతనం గావించే ఏదైనా అది కళగాదు. కేవలం అసహ్యమైనదిగానే మిగిలిపోతుంది.

*(మహాదేవ్ దేశాయ్ డైరీ -1 (1953) పేజీలు - 224-25)*

★ ★ ★

నేడు సైన్సు కళ అనే పేరు మీద జరుగుతున్న ప్రచారం ఆత్మను ముందుకు తీసుకెళ్ళడానికి బదులు దాన్ని నాశనం చేయడానికే ఉపయోగపడుతుందన్న వాస్తవాన్ని ఎవరు కాదన గలరు? అదేవిధంగా ఆ ప్రచారం మనలో ఉన్నతమైనదాన్ని బయటకు తీసే బదులుగా నైతిక విలువలు మృగ్యమైన కోర్కెలకు మనల్ని బందీలను కావిస్తున్నదంటే ఎవరైనా కాదన గలరా?

*(యంగ్ ఇండియా, 11-8-27, పే 255)*

★ ★ ★

తనలోనే సంగీత లక్షణాలు లేనివాడు మూర్ఖుడైనా కావాలి లేదా జంతువైనా కావాలి, అని ఒక ప్రముఖ సామెత ఉంది. మనలో సంగీతాభిరుచి ఉండనంతవరకు మనం మూర్ఖులతో లేదా జంతువులతో సమానమే. జీవితానికి అనుసంధానించడం వల్లనే మనం సంగీతాన్ని నేర్చుకోగలము.

దాన్ని వదిలెయ్యడమే ఈ రోజున మన ఈ విచారకరమైన జీవితానికి కారణం.

ఎప్పుడైతే దాన్ని వదిలేసి ప్రతిఒక్కరూ తనకు తోచిన విధంగా మద్దెల వాయిస్తే మిగితాది దుర్భర పాలన లేదా అరాచకం మాత్రమే. ఎక్కడైతే అరాచకం, అసహ్యం తాండవిస్తుందో అక్కడ సంగీతానికి స్థానమే లేదు. అంటే యిందుకు భిన్నమైన వాతావరణం ఉండాలని దాని అర్థం. సంగీతాన్ని మనం విస్తృతార్థంలో చెప్పాల్సివస్తే మన జీవితంలోని ఏ భాగాన్ని కూడా దాని నుంచి వేరు చేసి చూడలేము. సంగీతమంటే ఒక పాటపాడే పిల్ల చేసే సాధనగా నేడు భావించబడుతున్నది. మనసోదరీమణుల్ని కుమార్తెలను సంగీత పాఠశాలలకు పంపిచడానికి సిగ్గుపడే తత్వంపై మనం పోరాడాలి. తియ్యదనం లేకుండా ఉన్నపుడు వారి గొంతు చాలా బాగుంటుందనే ఒక మూఢ విశ్వాసం ఉన్నట్లుంది.

నిజంగా చెప్పాలంటే సంగీతం అనాదిగా వస్తున్న ఒక పవిత్రమైన కళ. సామవేదంలోని చరణాలు సంగీతానికి గని వంటివి. అదే విధంగా ఖురాన్‌లోని ఏ ఆయత్ కూడా సంగీతం లేకుండా పాడడానికి సాధ్యపడదు. డేవిడ్ క్రైస్తవ పద్యాలు మనకు ఎంతో శ్రద్ధ కలిగేలా చేసి మనకు సామవేదంలోని చరణాలను జ్ఞప్తికి తెస్తాయి. ఆ కళను మళ్ళీ పునరుద్ధరిద్దాం.

ఇంకొక అడుగు ముందుకేద్దాం. లక్షలాది పేద గృహాల్లో మనం ఆ సంగీత కళను చూడగలిగితే మనం తప్పని సరిగా ఖాదీని వడికి ధరించాలి. ఆ చరఖా సంగీతం మనందరికి ఉచిత బహుమతి కాబట్టి అది ఎంతో తియ్యగా ఉంటుంది. అది లక్షలాది మందికి ప్రధాన జీవన లక్షణం. మరియు అత్యంత విశ్వసనీయం. కాబట్టి అదే నిజమైన సంగీతం అని నాకు అనిపిస్తుంది.

*(యంగ్ ఇండియా, 15-4-26 పే. 140)*



సంగీతం నాకు మనశ్శాంతినిస్తుంది. ఏదో విషయం గురించి నేను తీవ్రంగా ఆందోళన చెందుతున్నప్పుడు సంగీతం తక్షణమే ప్రశాంతతను తను సమకూర్చిన సంఘటనలు నాకిప్పటికీ జ్ఞాపకమున్నాయి. కోపాన్ని

అధిగమించడంలో కూడా సంగీతం నాకు సహాయపడింది. ఒక విషయాన్ని మామూలుగా గద్యరూపంలో చెబితే నా బుర్రకెక్కనిది ఒక శ్లోక రూపంలో చెబితే యిట్టే మనస్సుకు హత్తుకున్న సంఘటనలను నేను యిప్పటికీ జ్ఞప్తికి తెచ్చుకోగలను. అదేవిధంగా సరియైన రీతిలో పాడినపుడు అవి సరిగ్గా నా మనస్సులో కూర్చుండిపోవడమూ, ఆ విధంగాపాడనపుడు నా బుర్రకెక్కకపోవడం కూడా జరుగుతుంది.

హృద్యంగా వినిపించే గీత పద్యాలను ఎంతసేపు వింటున్నా యింకా వినాలనే అనిపిస్తుంది తప్ప బోరుకొట్టదు. అంతేకాక ఎంత ఎక్కువగా వింటే అంత లోతుగా దాన్ని అర్థము నా హృదయంలో స్థిరపడి పోతుంది. నా చిన్నతనంలో రామాయణంలో కొన్ని అంశాలను సంగీతాత్మకంగా వినడం జరిగింది. అవి సంవత్సరాల తరబడి నా మనస్సులో అలాగే నిలిచిపోయాయి తప్ప ఏ మాత్రం చెదిరిపోలేదు. భగవంతుని మార్గం సన్మార్గమే తప్ప దుర్మార్గంకాదు" అంటూ ఎంతో తియ్యని స్వరంతో వినిపించిన ఒక శ్లోకం నన్ను అపుడెంతగా కదిలించిందో నాకిప్పటికీ చెరగని గుర్తుగా ఉండిపోయింది. 1907లో ట్రాన్స్‌వాల్‌లో నా మీద తీవ్రమైన హత్యాప్రయత్నం జరిగింది. అపుడు నా కోరిక మీద ఆలివర్ డోక్ దయచేసి విచక్షణతో ముందుకు సాగండి అనే పాటను పాడి వినిపించినపుడు ఆ గాయాల బాదనుంచి నాకు కొంచెం తెరిపి కలిగింది.

అయితే నాకేదో సంగీత పరిజ్ఞానం ఉందని ఎవ్వరూ అనుకోవద్దు. అందుకు భిన్నంగా నా సంగీత పరిజ్ఞానం అత్యంత ప్రాథమికమైనది. సంగీతాన్ని నేను విమర్శనాత్మకంగా పరిశీలించలేను. ఒక మంచి సంగీతాన్ని విని ఆస్వాదించగలనని మాత్రమే నేను నా గురించి చెప్పుకోగలను.

అంతేకాక, నా మీద సంగీత ప్రభావం ఎపుడూ ఒకే విధంగా ఉందని అందరికీ అలాగే ఉంటుందని చెప్పడం కూడా నా ఉద్దేశ్యం కాదు. అందుకు విరుద్ధంగా తమ దేహ సంబంధమైన కోర్కెలను తీర్చుకోవడం కోసం సంగీతాన్ని వాడుకొనే ప్రజలు కూడా ఉన్నారు. కాబట్టి వ్యక్తిత్వాలపై ఆధారపడి సంగీతం ప్రభావం మారుతూ ఉంటుందని మనం దీన్ని ముగించవచ్చు.

అయిన భగవంతుడు ఈ సృష్టిలో ప్రతిదాన్నీ మంచీచెడుల సమాహారంగా సృష్టించాడు'' అయితే మంచి మనిషి మాదిరిగా నీళ్ళను వదిలి క్షీరాన్ని ఆరగించే హంస మాదిరిగా మంచిని మాత్రం గ్రహించి చెడును వదిలేస్తాడు. అని తులసీదాస్ పాడుతూ ఉండటం మనకు తెలుసు

*(యంగ్ ఇండియా 10-1-29, పే 15)*

★ ★ ★

మనమీద సంగీతం చాలా గొప్ప ప్రభావాన్ని చూపిస్తుంది. ఇంత ముఖ్యమైన విషయానికి మనం తగినంతగా ప్రాధాన్యతను యివ్వలేదు యిచ్చి ఉంటే మన పిల్లలకు మనం సంగీతాన్ని నేర్పించి ఉండే వాళ్ళమే. సంగీతం ఆధారంగానే వేదశ్లోకాలు వ్రాయడం జరిగిందని చెబుతారు. తియ్యనైన సంగీతానికి మనసులోని బాధను తొలగించే శక్తి ఉంటుంది. అనేక పెద్ద పెద్ద సభల్లో తీవ్ర అశాంతి ఉన్నట్లుగా కొన్నిసార్లు మనం గమనిస్తాము. ఒక జాతీయ గీతాలాపన ద్వారా ఈ అల్లరిని తగ్గించి ప్రశాంతతను నెలకొల్పవచ్చు. ఒక పెద్ద ప్రజాసమూహము కలిసి కట్టుగా జాతీయ గీతం ఆలాపిస్తుంటే అది ఎంతో ఉత్సాహాన్నిస్తుంది. వందలాది మంది బాలురు ధైర్య సాహసాల గురించి ఒక పాట పాడుతుంటే ఆ దృశ్యాన్ని తిలకించవలసిందే. పని చేస్తున్నపుడు తమ పడవల్లో ప్రయాణిస్తున్నపుడు హరిహరా అల్లాబేలీ అంటూ తమ దేవుణ్ని గురించిఅరవడం మత్స్య కార్మికులకు అలవాటే. అది వాళ్ళ పని సులభంగా అయ్యేందుకు తోడ్పడుతుంది. సంగీత శక్తి ఎంత గొప్పదో ఈ ఒక్క ఉదాహరణ చాలు. పాటలు పాడుకుంటూ చలిని వదిలించుకోవడానికి అనేక మంది ఆంగ్ల మిత్రులు ప్రయత్నం చేస్తూ ఉండడాన్ని నేను చూశాను. బాగా ప్రాచుర్యం పొందిన నాటకాల్లోంచి మన పిల్లలు తేలికగా కొన్ని పాటలు గ్రహించి హార్మోనియం వంటి సంగీత సాధనాలపై నేర్చుకొనేందుకు ప్రయత్నిస్తూ ఉంటారు. ఈ పద్ధతి మంచి సంగీతాభిరుచిని వృద్ధి చేసుకొనేందుకు అడ్డు పడుతుంది. దానికి బదులుగా వారికి శాస్త్రీయ సంగీతం నేర్పిస్తే, చిల్లర పాటలు పాడుతూ సమయాన్ని వృథా చేసుకోకుండా ఒక మంచి అభిరుచి

పిల్లల్లో వృద్ధి చెందుతుంది. ఒక శిక్షణ పొందిన గాయకుడు మాదిరిగానే అదేవిధంగా ఒక సరియైన సంగీతాన్ని అభ్యసించే వ్యక్తి కూడా సమయాన్ని మార్చి లయ తప్పి చెత్తపాట పాడడు. మన విద్యా విధానంలోనూ, ప్రజామోదం పొందిన సాంస్కృతిక చైతన్యంలోనూ సంగీతానికి తప్పని సరిగా స్థానం కల్పించాలి.

నీవు నిజంగా సంగీతం పట్ల శ్రద్ధ చూపుతున్నావా?" ఏమి ప్రశ్న! నా బాల్యం నుంచి కూడా సంగీతాన్ని ప్రత్యేకించి భక్తి పాటలను ఎంతో ప్రేమించాను. అయితే నేనేదో గొప్ప ప్రముఖుణ్ణని ఆ విద్యలో విశ్లేషణాత్మక పరిజ్ఞానమున్న వాణ్ణని మాత్రం చెప్పుకోలేను. కాకపోతే మంచి సంగీతాన్ని ఆస్వాదించినపుడల్లా అది నన్ను ఎంతగానో ప్రభావితం చేస్తుందని మాత్రం చెప్పగలను. కావల్సింది అదే కదా.

"ఒక కళగా సంగీతాన్ని అభిమానించడంలో అలాంటి విశ్లేషణాత్మక పరిజ్ఞానం ఎంతో ఉపయోగపడుతుందని మీరు అనుకోవడం లేదా?" కావచ్చు కాని యిపుడే చెప్పినట్లుగా నేనెపుడూ ప్రత్యేక నైపుణ్యం గురించి ఆలోచించలేదు. నా వరకూ నాకు సంగీతమంటే విని ఆనందించేది. ఆ విధంగా నాకు అది లభిస్తున్నంతకాలం నేను తృప్తిగానే ఉంటాను.

దక్షిణాఫ్రికాలోని ఒక వైద్యశాలలో ఉన్నప్పుడు నాకు సంగీతం ఎంత ప్రశాంతతను సంతోషాన్ని కల్గించిందో నాకు యిప్పటికీ చాలా బాగా జ్ఞాపకం ఉంది. అక్కడ నా మౌన పోరాటం విజయవంతం అయినందుకు కొంతమంది గూండాలు దాడి చేయగా తగిలిన గాయాలనుండి అపుడు నేను కోలుకొంటున్నాను. నా కోర్కెమీద నా స్నేహితుని కూతురు జ్ఞానంతో ముందుకు సాగిపో అనే ప్రముఖ గీతం తరచుగా పాడుతుండేది. ఆ పాట నా గాయాల్ని మాన్పించే మందులాగా పని చేసింది. నేనీ పాటను యిప్పటికీ ఎంతో కృతజ్ఞతతో గుర్తు పెట్టుకొన్నాను. మరినేను సంగీతమంటే ఎంతో శ్రద్ధ చూపుతానని యిప్పటికైనా మీరు నమ్ముతారా? లేక మరికొన్ని సాధికారిక ఋజువులు కావాలా?

మీరా పాటలు ఎల్లప్పుడూ అందంగానే ఉంటాయి. అందులో చాలా

మంచి పాటలు నాకు తెలుసు. నిజాయితీలో ఎంత హృద్యంగా కవితాత్మక ధోరణిలో కొనసాగే ఆ పాటలను నాకోసం పాడాలని నా ఆశ్రమ సభ్యులను నేను కోరుతుంటాను.

ఎంతో చిత్తశుద్ధితో కోరుకున్నది కాబట్టి ఆ పాటలు మనల్ని కదిలిస్తుంటాయి. పాడకుండా ఉండలేదు కాబట్టి మీరా పాడేది. ఆమెపాటలన్నీ హృదయంలో నుంచి వెలువడుతున్నట్లుగా ఉంటాయి. అవి కొంతమంది ఇతరుల పాటల మాదిరిగా ఏదో పేరు ప్రఖ్యాతులకోసం లేదా చప్పట్ల కోసం పాడిన పాటలు కావు.

ఎంతో సౌందర్య వంతమైన మన సంగీతం కేవలం ప్రజాదరణ లేక వారినిర్లక్ష్యానికి నిరాదరణకి బలయితే అంతకంటే విచారకరమైన విషయం మరొకటి ఉండదు. నేను ఎల్లప్పుడూ ఈ మాట చెబుతూనే ఉన్నాను.

"నిజంగా చెప్పాలంటే, కఠోరమైన నైతిక జీవితంలో కళకెలాంటి స్థానమూ లేదనే అభిప్రాయంతో ఉండేవాడిని. అంతేకాక సంగీతంపట్ల కొంచెం అభిమానం లేకుండా ఉన్న నిన్ను చూసి నేను తిక్క సన్యాసి అంటూ ఉండే వాణ్ణి".

మ్యూజిక్‌కి వ్యతిరేకంగానా? నేనా?...-ఎంతో నైతిక నిబద్ధతో కూడిన నీ స్వభావమే అలాంటి తప్పుడు అభిప్రాయాలకు కారణం కాదా? ఆ స్వభావాన్ని కళాత్మకమని అనుకోలేక పోతే ప్రజల్ని మనం తప్పు పట్టలేము కదా!"

అయితే నైతిక నిబద్ధత అన్ని రకాల కళల్లోకి గొప్పదని నేను అంటాను. సరళంగా ఉండే అందమే కళగదా. తెచ్చిపెట్టుకున్న నమ్మకాల్లోంచి, కృత్రిమత్వంనుంచి బయటపడి రోజువారీ జీవితాన్ని నియమబద్ధంగా సరళంగా గడపడమే నిబద్ధత. అందువల్లే నిజమైన నిబద్ధుడెపుడూ కళను ఆచరించడమే గాక అందులోనే జీవిస్తాడని నేను ఎప్పుడూ చెబుతుంటాను. సంగీతంతో సంబంధం లేకుండా భారతదేశంలో మత పరిణామక్రమాన్ని నేను ఊహించలేను.

"మరి అలాంటపుడు కళ పట్ల నీకే మాత్రం దయలేదని ప్రజలు ఎందుకు అనుకుంటున్నారు?"

దానికి కొన్ని కారణాలను నేను ఊహించగలను. ఒకటి, ఈ రోజున కళ అనే పేరు మీద ప్రచారం జరుగుతున్న దానిలో నేను ఎలాంటి కళను చూడలేక పోతున్నాను. మరో మాటలో చెప్పాలంటే నా విలువలు వేరు. ఉదాహరణకి దేన్నైనా అభినందించడానికి దానికి సంబంధించిన లోతైన పరిజ్ఞానం అవసరమైతే అలాంటి దాన్ని నేను కళ అని అంగీకరించను. నా దృష్టిలో నిజంగా గొప్ప కళ అంటే ప్రకృతి అందం మాదిరిగా సహజ సిద్ధంగా ఉండాలి. వెంట్రుకవాసి తేడా గమనించే శక్తిని నేను కళాత్మకమని చెప్పలేను. నిజమైన కళ, దాని విలువకు ఆధునిక ప్రచార ఆర్భాటంతో పని లేదు. సహజ సిద్ధమైన భాష మాదిరిగా నిజమైన కళ సరళంగా కన్పిస్తూ, భావాన్ని సూటిగా వ్యక్త పరచ గలిగి ఉండాలి.

"మీ గది గోడల మీద ఎలాంటి చిత్రాలు వుంచడానికి మీరు వ్యతిరేకమని విన్నాను"

గోడలు మనకి నీడను యివ్వడానికి ఉన్నాయని నేను భావిస్తున్నప్పుడు వాటిని చిత్రాలతో ఎందుకు కప్పి వేయాలి? వాటిని నేను ఎందుకు యితర ప్రయోజనాలకు ఉపయోగించుకోకూడదు? కాని యితరులు గోడల మీద చిత్రాలను ఉంచుకోవాలను కుంటే?" అది వారి వ్యవహారం. నాదికాదు. వారికి వారి గోడలపై చిత్రాలను పెట్టుకొంటే ఆనందంగా ఉంటే వారి యిష్టమొచ్చినన్ని చిత్రాలను ఉంచుకోనివ్వండి. నా ఉత్సాహం కోసం నాకు అవి అవసరం లేదు. అంతే. ప్రకృతి ఉంది కదా! అదే సరిపోతుంది నాకు.

నక్షత్రాలతో మెరిసిపోతున్న అవధులు లేని ఆ ఆకాశపు కప్పుని ఎలాంటి అలుపూ, సొలుపూ లేకుండా చూస్తూ ఉండిపోవడం లేదా? సౌందర్యంకోసం నేను పడే తపనను సంతృప్తి పరుచుకోవడానికి నాకు అడవులు, సముద్రాలు, నదులు, పర్వతాలు, పచ్చని పొలాలు లేవా? నక్షత్రాలతో మిలమిల మెరిసే ఆకాశంతో గాని గొప్ప పర్వాతాలతోగాని పోల్చదగిన చిత్రాలు ఉంటాయని ఎవరైనా ఊహించగలరా? ఉదయిస్తున్న

సూర్యుని రంగు, లేదా సూర్యుడు అస్తమించేటప్పుడు కనిపించేబంగారు రంగుతో పోల్చదగిన రంగు ఏ కళాకారుడి దగ్గరైనా ఉందా? లేదు మిత్రమా, ప్రకృతి తప్ప నన్ను ఉత్సాహ పరిచేందుకు నాకు మరేదీ అక్కర లేదు. ప్రకృతి యింతవరకు విఫలం చెందలేదు. అది నన్ను గందర గోళ పరుస్తుంది. ఉత్సాహపరుస్తుంది. ఉన్నతమైన ఆనందాన్ని కలిగిస్తుంది. అలాంటపుడు చిన్న పిల్లల మాదిరి మనుషులు వేసే రంగులతో నాకు పనేమిటి? దేవుని సృష్టి ముందు మనిషి సృష్టి పేలవంగా ఉండదా? ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మనకు ఆనందం పంచడానికి ప్రకృతికారుడు ఉండగా మనకు ఏ యితర కళైనా ఆనందాన్ని ఎలా ఇవ్వగలదు?

జీవితం అన్ని కళలు కలిపినా వాటన్నింటిని అధిగమించగలగాలి. ఒక విలువైన జీవితం మరియు జీవాత్మ లేకుండా ఈ యిల్లూ వాకిలీ ఎందుకు? ఇదంతా పైకి ప్రదర్శించడానికి గొప్పగా కనిపించవచ్చుకాని జీవితానికి ఒక అర్థాన్ని కల్పించడానికి బదులు దాన్ని ఎందుకూ కొరగానిది చేసేటప్పుడు ఎంత కళాత్మకమైనది అయితే మాత్రం ఉపయోగం ఏముంది? సృష్టి యొక్క అత్యున్నత రూపం కళ అని, గుర్తింపుకి అదే తుది అర్థమని - యితర అనేక మంది కళాకారుల మాదిరిగా చెప్పడం దారుణం కాదా?

కళ జీవితంకంటే గొప్పది అంటూ ఆ నినాదం క్రింద ఆత్మను బ్రతికించగలమా? కళ పేరు మీద ఈ దేశంలో యిలాంటి ప్రచారాలు జరుగుతున్నప్పుడే నేను పెద్ద ఎత్తున ఘర్షణ పడేది. ఎవరైతే ఉన్నతమైన జీవనాన్ని గడుపుతారో వారే నాదృష్టిలో నిజమైన కళాకారులు. కాబట్టి నేను తిరస్కరించేది కళను కాదు, కళ పేరు మీద జరుగుతున్న ప్రచార ఆర్భాటాన్ని. మరొక మాటలో చెప్పాలంటే, నా విలువలు వేరు, అంతే... జీవితమంటే నా దృష్టిలో భగవంతుడు ప్రసాదించిన ఒక గొప్ప వరం. అది అన్నింటి కంటే గొప్పది. అందుకే ఉన్నత జీవనాన్ని కొనసాగించే వ్యక్తే అత్యున్నతమైన కళాకారుడని నేను స్పష్టంగా చెబుతాను.

*(గొప్పవారితో (1950) పేజీలు 61-67)*

కళలను సంపూర్ణంగా అందరూ తిరస్కరించాలని చెప్పడం నా ఉద్దేశ్యం కాదు ప్రజలకు రకరకాల అభిరుచులు ఉంటాయని నాకు తెలియదా? నాకు సంబంధించినంతవరకు నన్ను ఉత్సాహపరచడానికి ఎలాంటి కళలూ అవసరం లేదని చెప్పడమే నా ఉద్దేశ్యం. మెరిసే ఆకాశాన్ని చూసినప్పుడల్లా నాకు సంపూర్ణమైన ఆనందం కలుగుతుంటుంది. బహుశా తాను తృప్తి చెందాలంటే ఐరోపాకి బొమ్మలు కావాలేమో. దానికి మన ఆకాశం లేదేమో.

వేరే కారణాల వల్ల ఐరోపాకి బొమ్మలు అంటే ప్రేమ ఉండవచ్చు. బొమ్మల్ని నేను వ్యక్తిగతంగా పైపై మెరుగులుగా భావిస్తానని నీకు విశదీకరించడమే నా ఉద్దేశ్యం.

బొమ్మలపై నాకంత శ్రద్ధ లేదని నేను మరొక సారి పునరుద్ఘాటిస్తున్నాను.

నాకు సంబంధించనంతవరకు ప్రకృతి సరిపోతుందని నేను మీతో చెప్పాను. కాని మానవ సమాజానికి చిత్రలేఖనం నిజంగా మేలు చేస్తుందని యితరులు గట్టిగా నమ్మితే అది వారి యిష్టం. స్వయం ఆకర్షణకు గురికాకుండా కళాకారుడు తనను తాను కాపాడుకుంటే చాలు. ప్రజాస్వామ్యానికి తాను చేయవలసిన విధి నిర్వహణ గురించి తాను ఎల్లప్పుడూ చైతన్యవంతుడై ఉండాలి. ప్రజాస్వామ్యానికి కళలు ఉపయోగపడినంత వరకు మనం వాటిని అంగీకరించవచ్చు. అలా ఉపయోగపడనిదాన్ని మనం తిరస్కరించాల్సిందే.

ప్రత్యేక నైపుణ్యం గలవారితో నేను ముఖాముఖి పోటీ పడను. నిజమైన కళారూపం అందరికీ నచ్చేదిగా ఉండాలి.

"ప్రత్యేక నైపుణ్యానికి మీరెందుకు అంత వ్యతిరేకులు?" నేను మీకే ప్రశ్న వేస్తాను. కళను విశ్వవ్యాప్తంగావించడానికి, సహజసిద్ధమైన సంపదనుండి కళ ఉత్సాహంపొందేటందుకు తోడ్పడడానికి యింకా ఒక్క మాటలో చెప్పాలంటే మానవ సమాజానికి ఉపయోగ పడేందుకు వీలుగాకళను విస్తృత పరచడాన్ని మీరెందుకు వ్యతిరేకిస్తారు? అన్ని కళలకు అత్యున్నతమైన స్ఫూర్తి నిచ్చే ప్రకృతి ఎన్నటికీ తరగదన్న వాస్తవాన్ని మీరెందుకు గమనించరు? మానవుల్ని వదిలేసి అతికొద్ది మంది నాగరికులు మాత్రమే అనుభవించే

విధంగా ప్రకృతి ఎప్పటికీ ప్రత్యేక నైపుణ్యాన్ని కలిగి ఉండదు. అలాంటపుడు కళను అతికొద్దిమంది విలాసవంతుల చేతి పని ముట్టుగా ఎందుకు తయారు చేస్తారు? ఏ కొద్ది మంది సమూహాన్నో, నిపుణులైన న్యాయమూర్తులనో ఆకర్షించడం మాత్రమే నిజమైన కళ యొక్క లక్ష్యంగాదు. ఈ దేశ జీవన విధానంతో కళ ఎందుకు తన సంబంధాన్ని కోల్పోవాలి? ప్రజల యొక్క విస్తృతమైన డిమాండ్ల ఆధారంగా స్ఫూర్తిని పొందితే తప్ప ఆకళ ప్రజావిశ్వాసాన్ని ఎలాపొందగలుగుతుందో నాకర్థం కావడం లేదు. జీవితానికి ప్రధానమార్గమైన ఈ దేశ జీవనాన్ని అంతర్గత పొరల్లోంచి బయటకు లాగకపోతే ఆ కళా రూపాల్ని నీవు ఎలా బ్రతికించుకోగలవు? కేవలం కొద్ది మంది ఉన్నత వర్గాల ఆట వస్తువుగాకళను ఎందుకు తయారు చేయాలి?

ప్రతీ తత్వ శాస్త్రంలోనూ లేదా మతంలోనూ గొప్ప వ్యక్తులు చెప్పినట్లుగా గొప్ప కళ తప్పనిసరిగా అందరితో సమానంగా ఆమోదించబడాలి. విస్తారమైన ప్రజానీకానికి ఏ మాత్రం ఉపయోగం లేని ఎలాంటి నైపుణ్యతను నా జీవనం కోసం నేను అంగీకరించను. అందరి పట్ల సానుభూతి అందరినీ అర్థం చేసుకోవడం మాని వారిని తిరస్కరించి అతికొద్ది మందికి పెద్ద తలకాయలకు పంచిపెట్టడమే ఈ నైపుణ్యత యొక్క స్థిర లక్ష్యం. అలాంటి వినాశకర పోకడలో గొప్ప విషయం ఏదైనా ఉందా? మనుషుల్ని కలిపే బదులుగా విడదీసే ఏ కార్యక్రమమైనా ఈ సృష్టికర్త యొక్క గొప్పతనాన్ని ప్రతిబింబించగలదని మీ ఉద్దేశ్యమా? అలాంటి లక్ష్యం కోసం పని చేసే బదులు మనుషుల్ని పట్టి పీడిస్తున్న దురాచారాలను రూపుమాపడానికి, ఈ భూమాతను పట్టి ఊపుతున్న కన్నీళ్ళను రూపుమాపడానికి జ్ఞానకాంతితోనూ, సానుభూతి మందుతోనూ ముందుకొచ్చి కృషి చేయడం వేయిరెట్లు మేలు కాదా?

*(గొప్ప వారితో (1950) పేజీలు 78-82)*

★ ★ ★

## అధ్యాయము 33

# సాహిత్యము, పత్రకారిత

ఎవరి కోసం ఈ సాహిత్యం? కడుపునిండినవారి కొరకే గదా! మరి అట్టి పోషకులు కానేరని పేదల గతి ఏమిటి? నేనిప్పుడున్న సేవాగ్రాంలో 90 శాతం నిరక్షరకుక్షులు. ఒక గ్రంథాలయాన్ని (వారూ, వీరూ ఇచ్చిన పుస్తకాలతో) స్థాపించాను. కాని వారికి చదువు చెప్పాలి.

ఇక్కడికి వారి ప్రతినిధిగా వచ్చాను. డీను ఫర్రార్, ఏసుక్రీస్తు జీవిత కథను సామాన్యులకు తెలిసే భాషలో వ్రాశాడు. మన సాహిత్యవేత్తలు కూడ, గ్రామీణులను కలిసి, వారి వాడుక భాషలో వ్రాసి, విజ్ఞానాన్ని పంచిపెట్టాలి.

*(హరిజన్ 14-11-36, పుటలు 314 -15)*

★ ★ ★

నా గుజరాతీ భాషలో నవలలు, కావ్యాలూ, ఉన్నా లేకపోయినా, ప్రజాసాహిత్యం ఉండాలి. గుజరాతీ భాష సంస్కృతోద్భవము. టైలరు మహాశయులన్నట్లు గుజరాతీ భాషలో, ఏవిషయాన్ని గురించి అయినా, విపులంగా వివరించే పదజాలం ఉంది. సింహాసన బత్తీసీ వంటివేకాక, ఆరోగ్యం గురించి, ఆకాశంలో గ్రహనక్షత్రముల గురించి, గ్రామీణుల వాడుక భాషలో పుస్తకాలు వ్రాయబడాలి. మనదేశ వ్యవహారాలు ఇంగ్లీషులో నడుపబడుతున్నాయి. ఏ విదేశీ భాషా గ్రంథమైనా క్షణాలలో ఇంగ్లీషులోకి తర్జుమా అవుతుంది. పిల్లల కథలు, స్త్రీలకు పనికి వచ్చే పుస్తకాలు, చవకధరకి, ఇంగ్లీషులో దొరుకుతాయి. మనదేశంలో ఈ విషయాన్ని గురించి, పట్టించుకోటం లేదు. మన విద్యావేత్తలు, హర్మ్యాలలో ఉంటూ, పెద్ద, పెద్ద మాటలాడుతూ, పల్లెలకు పోవడం పరువుతక్కువ అనుకుంటారు. ఇది సరికాదు. పల్లెలకు పోతే వీరి మనసులలోని సాలె గూళ్లు, శుభ్రంగా తొలిగిపోతాయి.

*(హరిజన్ 21-11-36, పుట 326-27)*

★ ★ ★

స్త్రీలను గురించి మన సాహిత్యంలో అవాకులూ, చవాకులూ అనేకం ఉన్నాయి "అమ్మ" అనుకొని స్త్రీ గురించి వ్రాయండి. మీ కలం నుండి జాలువారే ప్రతి అక్షరం పునీతమౌతుంది. అంగాంగ వర్ణనలు అవసరమా? ఉపనిషత్తులు, ఖురాన్, బైబిలులో ఇట్టివిలేవు. ఇంగ్లీషు, అరబిక్ భాషలు ధర్మ గ్రంథాలవలన పుష్టి చెందాయి. తులసీ దాస్ లేకుండా హిందీ సాహిత్యం ఉన్నదా! నేటి సాహిత్యంలో వలె, వీటిలో స్త్రీల గురించి అసభ్యకరమైన వ్రాతలు ఉన్నాయా?

*(హరిజన్ 21-11-36 పుట 327)*

★ ★ ★

భాష ద్వారా జాతి ఆచార వ్యవహారాలు బోధపడతాయి నేటి మన సాహిత్యం, మనను గురించి ఇతరులు, చాల హీనంగా అనుకునేటట్లు ఉన్నది. ఇంగ్లీషులో నౌకాదళ శబ్దాలు మెండు. గుజరాతీలోకి వాటి ననువదించడం వ్యర్థం. గుజరాతులో నౌకాదళ నిర్మాణం జరిగినపుడు, ఆసాహిత్య సృష్టిజరుగుతుంది.

*(మహాత్మాగాంధీ రచనలు, 14, పుటలు 11-12)*

★ ★ ★

హిందుస్తాన్ పత్రిక ఒక వ్యాసం రాయమని, నన్ను అడిగింది. నా భావాలను ఇందులో పొందు పరుస్తున్నాను.

పత్రికారచనను జీవిక సముపార్జన కోసం చేయరాదు. (దక్షిణాఫ్రికాలో ఉన్నపుడు నేనొక వార్తా పత్రికలో పని చేశాను). బ్రతుకుతెరువుగానే కాకుండ, సౌకర్యాలను సమకూర్చే యంత్రంగా, పత్రకారిత ఉంటే, ప్రజా సంక్షేమం అసాధ్యం. ఆశలకు అమ్ముడు పోడం .చూస్తూనే ఉన్నాం.

ప్రజలకు సమాచారాన్నందించి, మేలు కొలపడం పత్రకారిత ధ్యేయం. ముద్రించబోయే అంశం సరిఅయినదా, కాదా, సరిగా చూచుకోవాలి. వారికి పని ఎక్కువ. సమయాభావం. అయినా, జాగ్రత్త కావాలి.

ఉపన్యాసాలను శీఘ్రలేఖనం ద్వారా వ్రాసి ప్రచురించడం, ఎక్కడో గాని ఉండటంలేదు (మన దేశంలో) ముద్రించిన చిత్తుప్రతిని (ప్రూఫ్‌ను)

ఉపన్యాసకునికి పంపి, సరిద్దిమనడం శ్రేష్టం. ఖాళీలను నింపేందుకు, అంశాలను, ఎన్నుకోరాదు. లాభాపేక్ష ఉండకూడదు. పత్రికలు ప్రజలకు ఎంత మేలును చేశాయో, అంత హాని కూడా చేశాయి. వర్గవైషమ్యాలను రెచ్చ గొట్టే వ్రాతలు అమానుషాలు.

ప్రకటనల ద్వారా ఆదాయం ఇంకో ఇబ్బంది మద్య నిషేధాన్ని సమర్థిస్తూ సంపాదకీయం వ్రాసి, ఆ పత్రికలోనే మద్యం అమ్మకాల గురించి ప్రకటన వేయడం హాస్యాస్పదం. మందుల ప్రకటనలు కూడ సాక్ష్యాధారాలు లేకుండా వేస్తే, అమాయకులకు ఆపాయం కలుగుతుంది పుంసత్వం, బలం, వీర్యవృద్ధి వగైరాలకు సంబంధించిన అతిశయోక్తులుగల ప్రకటనలు, నిస్సారాలు.

చివరగా, చట్టవ్యతిరేక వ్యాసాల గురించి చెప్పకుందాం. రాజ ద్రోహరచనల చట్టము, దేశరక్షణ చట్టము, విచక్షణారహితంగా ప్రభుత్వానికి తొత్తులుగా ఉండే వారికి, చాలా ఉపయోగపడుతున్నాయి. వీటి నుంచి తప్పించుకునేందుకు, ద్వంద్వం ఉండి, స్పష్టత లేనివి ప్రచురితమవుతున్నాయి. ప్రజలను మభ్యపెట్టి, మీమాంసలో పడవేసేవి ఇవి హానిని కలిగిస్తాయి, స్టీవెన్‌న్యాయాధీశుడు స్పష్టతను అభినందించాడు. అలా చెప్పే ధైర్యం లేకపోతే, పత్రికారచనను చేయకండి.

*(నిజమైన విద్య, 1962, పుట 171-73)*

★ ★ ★

పత్రకారిత సేవాభావాన్ని పూర్తిగా కనపరచాలి.

*(ఆత్మకథ, 1966, పుట 215)*

★ ★ ★

ప్రజల మనసు తెలిసికొని, ప్రోత్సాహకంగా ఉండడం, ప్రతిపత్రిక యొక్కవిధి.

*(హింద్ స్వరాజ్, 1962, పుట 19)*

★ ★ ★

జరిగే అత్యాచారాలను ఎండగట్టడం పత్రికల విధి. దీనివలన ప్రజాభిప్రాయం బలపడుతుంది. అందుకని, నేను పత్రకారుణ్ణి అయ్యాను.

సత్యాహింసల ఉపసిద్ధాంతమైన సత్యాగ్రహాన్ని గురించి తెలియజెప్పడం, నా కర్తవ్యం. కోపరాగ ద్వేషాలకతీతంగా వ్రాస్తున్నాను. ఒక పరుష వాక్యం కొంప ముంచుతుంది. "యంగ్ ఇండియా"ను అలంకరించి, అందరూ మెచ్చేటట్లు చూస్తున్నాను. ఇది బాగా అలవాటై, నా నోట, నాకలం నుండి ఏ అపశబ్దం రానినాడు, నా అహింసనఫలం అన్న మాట.అందరూ స్పందిస్తారు. ఇది దుస్సాధ్యమేమోగాని, అసాధ్యం మాత్రం కాదు.

*(యంగ్ ఇండియా 2-7-25, పుట 232)*

★ ★ ★

దురదృష్టవశాత్తు, ధర్మ గ్రంథాలకంటె, వార్తా పత్రికలు, సామాన్యునికి ముఖ్యం అయ్యాయి. వారికి అసలు పదార్థం ఎక్కడ ఉన్నదో, తెలియదు (వార్తా పత్రికలు) ప్రెస్, శక్తి గలది. ఆశక్తిని దురుపయోగం చేయరాదు. నా సహచరులకు, సత్యమార్గాన్ని వదలవద్దనినామనవి.

*(హరిజన్ 27-4-47 పుట 128)*

★ ★ ★

లాభాపేక్షలేని పత్రికలు మూతపడవచ్చును. ప్రజాహితవాక్యాలను ప్రభుత్వానికి విరుద్ధంగా ఉన్నవాటిని ప్రచురించిన వార్తా పత్రికలు, మూసివేతకు సన్నద్ధమై ఉండాలి. అట్టి సమయం వచ్చినపుడు, సంపాదకుడు క్షమాపణ కోరరాదు. అట్టి వార్తను ప్రచురించవలసిన ఆవశ్యకతను గురించి యోచించాలి. ప్రచురణ తర్వాత వెనుదీయరాదు.

అసంకల్పితమైతే, ఈ సూత్రం వర్తించదు. అయినా మరోదారిలేదు. పత్రిక మూత పడడంతోబాటు, ఆస్థులు కూడ జప్తు అయితే, ఆ పత్రకారుడు కష్టపడతాడు.

ఆ సమయంలో ప్రజలు పత్రికాధిపతి పట్ల సానుభూతితో అయినా శాసనాన్ని గర్హిస్తారు. క్షమాపణ కోరితే మాత్రం, ప్రజల దృష్టిలో చులకన అయి, ఇకముందు ఎవ్వరూ నమ్మరు. ప్రజలలో కూడ దిశాహీనత కలిగి, ఉద్యమం పరువుపోతుంది.

*(మహాత్మా గాంధీ రచనలు. 10, పుట 226-27)*

★ ★ ★

## అధ్యాయము - 34

# విజ్ఞానశాస్త్రము

నేనెక్కడి నుంచి వచ్చానని నాకు ఆశ్చర్యం కలుగుతుండేది. భయభక్తులతో ఆశ్చర్యంతో మాటా మంతీ లేకుండా నిలబడే నాలాంటి గ్రామీణునికి యిక్కడ స్థలం లేదు. ఎక్కువగా మాట్లాడే ఉద్దేశ్యంగాని ధ్యాసగాని నాకు లేవు. నేను చెప్పదల్చుకున్నదల్లా ఒక్కటే - మీరు యిక్కడ చూస్తున్న పెద్ద, పెద్ద ప్రయోగశాలలు, విద్యుత్ సామగ్రి యిష్టం లేకున్నా బలవంతంగానైనా సరే, చేసిన లక్షలాది మంది శ్రమ ఫలితం. టాటాల యొక్క ముప్పై లక్షల రూపాయలు ఎక్కడో బయట నుంచి రాలేదు. అలాగే మైసూర్ వాటాధనం కూడా ఎక్కడో వేరే చోటు నుంచి రాలేదు. ఈ బానిసల శ్రమవల్లే వచ్చింది. ఇపుడు గ్రామీణులను కలిసి వారి ధనాన్ని మనం భవనాలు యంత్ర సామగ్రిపై ఏ విధంగా ఉపయోగిస్తున్నామో. అది వారికి గాక వారి మనుమలకు మనిమనుమలకు ఏ విధంగా సంపదను సమకూర్చుతుందో చెబితే వారు అర్థం చేసుకోలేక పోవచ్చు. వారు ఈచెవిని విని ఆచెవిన వదిలేస్తారు. అయితే వారిని మనమెప్పుడూ పరిగణలోనికి తీసుకోకుండా దాన్ని మనమొక హక్కుగా పరిగణిస్తాము. ప్రాతినిధ్యం లేనపుడు పన్ను కట్టేది లేదన్న నిబంధన వారి విషయంలో కూడా వర్తిస్తుందన్న విషయాన్ని మర్చిపోతాము. ఈ సూత్రం వారికి కూడా వర్తిస్తుందని వారికి కూడా మీరు బాధ్యత వహించాలని భావించినట్లయితే ఈ నియామకాలన్నింటి వెనుక రెండవ ముఖాన్ని మీరు గమనించగలిగే వారు. అపుడు మీరు వారికోసం హృదయంలో ఏదో ఒక మూల కాకుండా, ఒక పెద్ద విభాగాన్ని వారి కోసం కేటాయించేవారు. దాన్ని మీరు సరైన స్థితిలో ఉంచితే, అపుడు మీరు మీ చదువులు ఎవరి కష్టార్జితం మీద ఆధారపడ్డాయో, అలాంటి లక్షలాది ప్రజానీకం ప్రయోజనార్థం మీరు మీ విజ్ఞానాన్ని ఉపయోగించేవారు. మీరు యిచ్చిన ఈ నిధిని నేను దరిద్రనారాయణుల కోసం ఉపయోగిస్తాను. నిజమైన దరిద్రనారాయణున్ని నేను కూడా చూడలేదు. కానీ నేను ఊహించగలను. సుదూర గ్రామాల్లోని మారుమూల ప్రాంతాల్లో

ఉండే నూలు వడికే వారికి ఈ డబ్బు అందుతుంది. అయితే వారు కూడా నిజమైన దరిద్ర నారాయణులని చెప్పలేము. కొన్ని రసాయన ధర్మాలను అన్వేషించడానికి సంవత్సరాల సమయం పడుతుందని మీ ప్రొఫెసర్ నాతో చెప్పారు. కాని ఈ గ్రామాలను అన్వేషించడానికి ఎవరు ప్రయత్నం చేస్తున్నారు? మీ ప్రయోగశాలల్లో కొన్ని ప్రయోగాలు ఇరవై నాలుగ్గంటలూ జరుగుతున్నట్లే - మీ హృదయంలో గ్రామీణులకోసం కేటాయించిన పెద్ద విభాగాన్ని శాశ్వతంగా ఉండనివ్వండి. తద్వారా లక్షలాది పేద ప్రజానీకానికి తోడ్పాటు నివ్వండి

వీధిలోని ఒక వ్యక్తి వద్ద కంటే మీ వద్ద నుంచి నేను ఎంతో ఎక్కువగా ఆశిస్తున్నాను. మీరు యిచ్చిన ఈ కొద్ది మొత్తంతో సంతృప్తి చెందకండి. "మనం చేసే ఏ కొద్ది కృషో చేసాము. యిక పదండి టెన్నిస్ లేదా బిలియర్డ్స్ ఆడుకుందాం" అని అనుకోవద్దు. రోజు రోజుకు మీ మీద పెరిగిపోతున్న ఋణభారాన్ని బిలియర్డ్స్ గదిలోనూ, టెన్నిస్ కోర్టులోనూ తలుచుకోమని మిమ్మల్ని నేను కోరుతున్నాను. అయితే అడుక్కొనే వారెప్పుడూ ఎన్నిక చేసుకోగలిగేవారు కాలేరు. నాకు మీరు యిచ్చిన దానికి మీకు నా ధన్యవాదాలు. నా ప్రార్థన గురించి ఆలోచించేదాన్ని ఆచరణలో పెట్టే ప్రయత్నం చేయండి. పేద స్త్రీలు మీకోసం తయారు చేసిన బట్టను కట్టుకోవడానికి మీరు భయపడవద్దు. ఖాదీ ధరించినంత మాత్రాన ఉద్యోగాలనుంచి బయటకు పంపే యజమానులను గురించి భయపడవద్దు. మీ ఆశయాల పట్ల ధృడ చిత్తంతో ప్రవర్తించి ఈ ప్రపంచం ముందు మగధీరులుగా వ్యవహరించండి. సంపద గురించి సాగే మీ అన్వేషణలో లక్షలాది మూగవారి పట్ల మీకుండే తృష్ణని మసి బారనీయకండి. బయటి పరిశోధనతో సంబంధం లేకుండానే అంతర్గతంగానే రేపు మీరు ఒక పెద్ద తీగలేని ఒక వస్తువుని కనిపెట్టవచ్చు. అయితే లక్షలాది ప్రజానీకం హృదయాలను మీ హృదయాలతో ముడిపెట్టకుండా కొనసాగే ఏ పరిశోధన వల్లయినా ఎలాంటి ఉపయోగం ఉండదు. మీరు కనుగొనే వస్తువులకు కూడా అంతిమంగా పేద ప్రజల సంక్షేమమే ధ్యేయంగా ఉండకపోతే

రాజగోపాలాచారి చెప్పినట్లుగా మీ ప్రయోగశాలలన్నీ దయ్యాల ప్రయోగశాలల కంటే ఏమాత్రం మెరుగైనవి కాలేవు. మంచిది మీరు అందరు పరిశోధన విద్యార్థుల మాదిరి గ్రహించే స్థితిలో ఉన్నట్లయితే మీరు ఆలోచించడానికి కావల్సినంత సరుకును అందించాననే అనుకొంటాను.

*(యంగ్ ఇండియా 21-7-27 పే. 235)*

★ ★ ★

ఎంతో ఘనమైన చేనేత పరిశ్రమను పునరుద్ధరించడమే నా దృష్టిలో మానవత్వంతో కూడిన పారిశ్రామిక విధానమవుతుంది. ఈ ఒక్క కార్యక్రమం మాత్రమే లక్షలాది మంది ప్రజానీకాన్ని పీల్చి పిప్పి చేస్తున్న దారిద్ర్యాన్ని పారద్రోలగలదు. దేశంలో ఉత్పాదకతను పెంచడానికి మనం తర్వాత దేన్నైనా జతచేయవచ్చు. అందువల్ల చరఖాను ఉపయోగించే విధానం గురించి శాస్త్రీయ శిక్షణ పొందాలని నేను యువతీ యువకులను కోరుతున్నాను. ఇంకా వీలైతే భారతీయ కుటీరాల్లో ఉత్పత్తిని పెంచేందుకు మరింత నాణ్యమైన పనిముట్లను వాడవచ్చు. సైన్సు అభివృద్ధికి నేను వ్యతిరేకిని కాను. అందుకు విరుద్ధంగా పాశ్చాత్య దేశాల శాస్త్రీయ స్ఫూర్తి -దృక్పధం అభిమానాన్ని ఎపుడూ చూరగొంటూనే ఉంటాయి. భగవంతుని సృష్టిని తక్కువగాచేసి చూసే అలవాటు పాశ్చాత్య శాస్త్రవేత్తకు లేక పోవడమే ఈ నా అభిమానానికి కారణం. శాస్త్రీయ పరిశోధనల పేరుతో పశుపక్ష్యాదులను వధించడాన్ని నేను తీవ్రంగా ద్వేషిస్తాను సైన్సు మిషతో క్షమార్హంగాని విధంగా అమాయకపు జీవితాలను బలి చేయడాన్ని నేను సహించలేను. ఆ విధంగా చేసి అభివృద్ధి చేసే ఏ ప్రక్రియకైనా నా దృష్టిలో విలువలేదు. పశుపక్ష్యాదులను బలిచేయకుండా రక్త ప్రసరణ సిద్ధాంతాన్ని కనుగొన లేకపోయినట్లయితే ఆ సిద్ధాంతం లేకుండానే మానవ సమాజం ముందుకు వెళ్ల గలిగేది. ఈ రోజున విజ్ఞానం కొఃసం అవలంబించే మార్గాల మీద నిజాయితీపరులైన పాశ్చాత్య శాస్త్రవేత్తలు కొన్ని నిబంధనలు విధించుకోవడాన్ని మనం గమనిస్తాము. హిందువులు తమవారే అయిన పంచములను కించపరచడం లేదా పాశ్చాత్యులు తూర్పు మరియు ఆఫ్రికా దేశాలను దోచుకొని కించపరచడం

ద్వారా అభివృద్ధి చెందుతారనుకోవడం శుద్ధ తప్పు. అదేవిధంగా క్రింది పొరల మీద మన ఆధిపత్యం మనం వాటిని వధించడానికి గాక మనతో సమానంగా వాటి లాభాన్ని శ్రేయస్సుని కాంక్షించేదిగా ఉండాలని మనం అర్థం చేసుకొనే రోజు త్వరలోనే వస్తుంది. భవిష్యత్తులో మానవకుటుంబమేగాక, మనతో జీవించే అన్నిరకాల జీవరాశులను మనం పరిగణలోకి తీసుకోవలసి వస్తుంది. మనకు ఆత్మ ఉన్నట్లే అవికూడా ఆత్మలను కలిగి ఉన్నాయని నా ప్రగాఢ నమ్మకం.

*(యంగ్ ఇండియా 17-12-24 పే. 440)*

★ ★ ★

# భాగము - 7

## అధ్యాయము 35

## ఆర్థిక శాస్త్రము మరియు నైతిక శాస్త్రము

నేటి మానవుని కార్యకలాపాలన్నీ అవిభాజ్యమైన ఏకమొత్తంగా కొనసాగుతున్నాయి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ లేదా కేవలం మత సంబంధమైన కార్యకలాపాలను ప్రత్యేకంగా విడగొట్టి చూడడానికి నేడు వీలులేదు. మానవకార్యకలాపాలు చేపట్టని ఏ మతాన్ని నేనింత వరకూ చూడలేదు.

*(హరిజన్ 24-12-38, పే. 393)*

★ ★ ★

ఆర్థిక శాస్త్రము మరియు నైతిక శాస్త్రాల మధ్య నేను ఎలాంటి తారతమ్యాలను గుర్తించడం లేదని ఒప్పుకోవాలి. వ్యక్తి లేదా సమాజం యొక్క నైతిక విలువలను గాయపరిచే ఏ ఆర్థిక శాస్త్రమైనా అనైతికమైనది మరియు పాప పంకిలమైనది. ఒక దేశాన్ని మరోదేశం వేటాడడానికి అనుమతించే ఏ ఆర్థిక శాస్త్రమైనా అనైతికమైనదే. వెట్టిచాకిరీతో తయారైన ఏ వస్తువులనైనా కొనడం, ఉపయోగించడం పాపకార్యం. నా పక్క ధాన్యం

వ్యాపారి ఆహారధాన్యాలు కొనేవారు లేక అల్లాడుతుంటే అమెరికన్ గోధుమలను ఆరగించడం పాపకార్యమే అవుతుంది. నా ప్రక్కచేనేత వారి బట్ట నేను కొంటే నాకు బట్ట లభించడంతో పాటు వారికి యింత తిండీ బట్ట దొరుకుతాయని తెల్సికూడా నేను రీజెంట్ వీధి యొక్క ఆధునిక బట్టను కట్టడం పాపకార్యమే అవుతుంది

*(యంగ్ ఇండియా 13-10-21 పే 325)*

★ ★ ★

పేరుకు తగ్గట్లుగా ఉంటే ఏ నిజమైన నైతిక శాస్త్రమైనా ఆర్థిక శాస్త్రమే అవుతుంది. అదే విధంగా నిజమైన ఆర్థిక శాస్త్రం ఉన్నతమైన నైతిక విలువలతో ఎన్నడూ ఘర్షణ పడదు. బలహీనుడిని దోచుకొని సంపద పోగేసుకోవడాన్ని సమర్థించే ఏ అర్థశాస్త్రమైనా తప్పుడు శాస్త్రమే. అది వినాశనకారే అవుతుంది. మరో ప్రక్క నిజమైన అర్థశాస్త్రమెప్పుడూ సాంఘిక న్యాయం కోసం నిలబడుతుంది. అది బలహీనులతో సహా అందరి క్షేమాన్ని కోరుకొంటుంది. సత్క్రమమైన జీవితంతో అవిభాజ్యంగా ఉంటుంది.

*(హరిజన్ 9-10-37 పే. 292)*

★ ★ ★

నైతిక విలువలను పట్టించుకోకుండా వాటిని విస్మరించే ఏ అర్థశాస్త్రమైనా తప్పుడు అర్థశాస్త్రమే అవుతుంది. అర్థ శాస్త్ర పరిధిలో అహింసా సిద్ధాంతం అంటే అంతర్జాతీయ వాణిజ్యంలో నైతిక విలువలను ఒక భాగంగా గుర్తించేలా చేయడమే.

*(యంగ్ ఇండియా 26-12-24, పే. 421)*

★ ★ ★

ఆర్థిక శాస్త్రంసిద్ధాంతాలమీద ఆధునిక అచ్చు పుస్తకాల కంటే ప్రపంచ మతగ్రంథాలు ఎంతో ఉన్నతమైనవి. విలువైనవని చెప్పడానికి సాహసిస్తున్నాను.

*(మహాత్మ వాల్యూమ్ 1, (1951) పే. 238 )*

ఆడమ్‌స్మిత్ 'వెల్త్ ఆఫ్ నేషన్స్' అను తన గ్రంథంలో ఆర్థిక స్థూలపట్టిక ఏయే నిబంధనలకు అనుగుణంగా ఎలా కదులుతుందో పేర్కొంటూ దాన్ని అస్థిరపరిచే మరికొన్ని అంశాలను కూడా పేర్కొన్నాడు. అందులో ముఖ్యమైంది 'మానవాంశ'. ఇదిగో సరిగ్గా ఈ మానవాంశ మీదనే ఖాదీ అర్థశాస్త్రము ఆధారపడింది. ఆడమ్‌స్మిత్ దృష్టిలో ఒకే ఒక ఆర్థిక కాంక్ష మానవ స్వార్థమే. అదే ఈ ఖాదీ అర్థశాస్త్రాన్ని అస్థిరపరుస్తుంది. దీన్ని మనం అధిగమించ గలగాలి.

*(హరిజన్ 21-9-34 పే. 253)*

★ ★ ★

సామాన్యమైన ఆర్థిక శాస్త్రంకంటే ఖద్దరు అర్థశాస్త్రం పూర్తిగా భిన్నమైంది. ఈ సామాన్య అర్థశాస్త్రం మానవాంశను పరిగణలోనికి తీసుకోదు. అదే సమయంలో ఖద్దరు అర్థశాస్త్రం కేవలం మానవాంశనే ప్రధాన అంశంగా తీసుకొని తిరుగుతుంది.

*(హరిజన్ 16-7-31, పే. 181)*

★ ★ ★

అధ్యాయము 36

# మానవుని ఔన్నత్యం - పరిపూర్ణ వ్యస్తత

అన్నింటికంటే సర్వోన్నతుడు మనిషే

*(యంగ్ ఇండియా 13-11-24, పే. 378)*

★ ★ ★

ప్రతీ మనిషికీ జీవించే అధికారం ఉంది. అందువల్ల తనను పోషించుకోవడానికి ఆహారాన్నీ, తను నివసించడానికి ఒక యింటిని కట్టుకోవడానికింత బట్టను సంపాదించుకోవాలి. ఈ చిన్న విధినిర్వహణ కోసం మనకు ఆర్థిక వేత్తల లేదా వారి సిద్ధాంతాల అవసరం లేదు.

*(మహాత్మాగాంధీ రచనలు మరియు ఉపన్యాసాలు (4వ ఎడిషన్) పే. 350)*

★ ★ ★

ఈ ఖాదీద్వారా మేము విద్యుత్‌తో నడిచే యంత్రాలకంటే మనిషే సర్వోన్నతుడని నిరూపించేందుకు కృషి చేస్తున్నాము

(హరిజన్ 21-12-47, పే 476)

★ ★ ★

యంత్రశక్తిని ఉపయోగించాలని ఆలోచించే దానికి ముందు మనకు అందుబాటులో ఉన్న మానవ శ్రమను మనం తప్పనిసరిగా ఉపయోగించుకోవాలి.

(హరిజన్ 25-8-46 పే. 281)

★ ★ ★

ఎంతో శక్తిమంతమైన మానవ శక్తిని నిర్లక్ష్యం చేసి ఈ దేశంలోని ముడి సంపదను ఉపయోగించుకొనే ఏ ప్రయత్నమైనా సమతూకాన్ని కోల్పోతుందని అది ఎప్పటికీ మానవుల మధ్య సమానత్వాన్ని సాధించలేదనే అభిప్రాయంతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను.

ముడి పదార్థాలను బయటకు పంపి తయారైన వస్తువులను అధిక ధరలకు తిరిగి కొనే బదులుగా, ఆ ముడిపదార్థాలను లక్షలాది గ్రామాలకు తరలించి, అక్కడ ఉండే సంపూర్ణ మానవ శక్తిని పరిపూర్ణంగా ఉపయోగించుకోవడం నిజమైన ప్రణాళిక అవుతుంది

(హరిజన్ 23-3-47 పే. 79)

★ ★ ★

అమెరికా ప్రపంచంలోనే గొప్పదైన పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశం. కానీ అక్కడ యిప్పటికీ దారిద్రం హీనత్వాలను రూపుమాప లేకపోయింది. విశ్వవ్యాప్తమైన మానవ శక్తిని అది నిర్లక్ష్యం చేసి, వేలాదిమంది జీవితాలను నాశనం చేసి తమ పబ్బం గడుపుకొనే అతికొద్ది మందిపై దృష్టిని కేంద్రీకరించడమే దానికికారణం.

(హరిజన్ 23-3-47, పే. 79)

★ ★ ★

పారిశ్రామికంగా సర్వోన్నత స్థితికి చేరిన రష్యావైపు చూసినపుడు అక్కడి జీవితం నాకేమీ సంతోషాన్ని కలిగించలేదు. బైబిల్ భాషలో చెప్పాలంటే "ప్రపంచాన్నంతా జయించిన మనిషి తన ఆత్మను కోల్పోయినపుడు మనిషికి మిగిలేదేమిటి?" ఆధునిక యుగంలో సాంఘికంగాతన వ్యక్తిత్వాన్ని కోల్పోయి ఒక యంత్రంలోని చిన్నపనిముట్టుగా మారిపోవడం సాధారణమైంది. ప్రతి వ్యక్తీ సంపూర్ణ మానవుడుగా తనకాళ్ళపై తాను నిలబడేటట్లుగా సమాజంలో తయారు కావాలని నేను ఆశిస్తున్నాను.

*(హరిజన్ 28-1-39, పే.438)*

★ ★ ★

ప్రతీ మానవుడూ ఒక యంత్రం వంటివాడే. దానికి కొంచెం ఇంధనం వేసి, దాన్ని సరైన రీతిలో ఉంచాలి. ఆ విధంగా చేయడానికే నేను ప్రయత్నిస్తున్నాను.

*(హరిజన్ 25-1-35, పే. 399)*

★ ★ ★

పోషకాహారం కావాలని లక్షలాది అన్నార్తులు ఒకే పద్యంపాడుతారు. వారు దాన్ని కాదనుకోలేరు. వారు తప్పనిసరిగా దాన్ని సంపాదించాల్సిందే. అయితే దాన్ని వారు చెమటోడ్చి సంపాదించాలి

*(మహాత్మాగాంధీ ఉపన్యాసాలు మరియు రచనలు (4వ ఎడిషన్) పే. 593.)*

★ ★ ★

పనిలేక ఆకలితో అలమటించే ప్రజానీకానికి పని కల్పించడం తద్వారా వేతనాలుగా ఆహారాన్ని అందించడమనే రూపంలో భగవంతుడు వారికి ప్రత్యక్షమయ్యే సాహసం చేయగలడు.

*(యంగ్ ఇండియా, 13-10-21, పే. 325)*

★ ★ ★

భగవంతుని సందేశాన్ని వారి దగ్గరకు తీసుకెళ్ళే ధైర్యాన్ని నేను చేయడం లేదు. తమ కళ్ళలో కాంతి లేక, ఆహారమే దైవంగా భావించే లక్షలాది అన్నార్తుల ముందుకు దేవుని సందేశం గొనిపోవడం, కుక్కముందుకు

తీసుకెళ్ళినట్లుగానే ఉంటుంది. పవిత్రమైన పనిని వారికి కల్పించడంద్వారానే భగవంతుని సందేశాన్ని వారికి నేను అందించగలను.

*(యంగ్ ఇండియా 15-10-31 పే. 310)*

★ ★ ★

పని చేయగలిగే ప్రతీ స్త్రీ లేదా పురుషునికి పని లేక తిండిలేక ఉన్నంత కాలం మనం రెండు పూటలా భోజనం చేయడానికీ విశ్రాంతి పొందడానికీ సిగ్గు పడాలి.

*(యంగ్ ఇండియా 6-10-21, పే. 314)*

★ ★ ★

నా లెక్క ప్రకారం భారతీయ ఆర్థిక వ్యవస్థ, ఆ మాటకొస్తే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కూడా ఏ ఒక్కరూ కూడా ఆహారం వస్త్రాదుల గురించి బాధపడే విధంగా అవి ఉండరాదు. ఇంకొక మాటలో చెప్పాలంటే రెండుపూటలా తన తిండికి సరిపడా ప్రతీ మనిషికి పని లభించాలి. జీవితానికి కావలసిన కనీస అవసరాలను ఉత్పత్తి చేస్తే ఉత్పత్తి సాధనాలు సామాన్య మానవుల ఆధీనంలో ఉన్నపుడే ఈ ఆదర్శం వాస్తవరూపం దాల్చగలుగుతుంది. ఇవి ప్రతీ ఒక్కనికీ భగవంతుని గాలి, నీరు మాదిరిగా ఉచితంగా లభించాలి. ఇతరులను దోచుకోవడానికి వీటిని ఒక ఆయుధంగా వాడుకోకూడదు. ఏ దేశము, జాతీ లేక వర్గం ఈ ఉత్పత్తి సాధనాలను ఒక వర్గానికే కట్టబెట్టడం జరిగితే లేదా ఏక స్వామ్యంగావిస్తే అది అన్యాయమే అవుతుంది. ఈ చిన్ని సూత్రాన్ని నిర్లక్ష్యం గావించడమే ఈ దేశంలోను, అదే విధంగా ప్రపంచంలోని యితర ప్రాంతాలలో కూడా నేడు మనం చూస్తున్న అసంతృప్తికి కారణభూత మవుతున్నది.

***(యంగ్ఇండియా15-11-28 పే. 381)***

★ ★ ★

## అధ్యాయము 37

# సాదా జీవనము మరియు ఉన్నతాశయము

ఒక స్థాయి వరకూ భౌతిక సుఖమూ, సంపదా అవసరమే. కాని ఒక స్థాయికి మించితే మాత్రం అది ఆదుకొనే బదులు అడ్డుగోడగా మారుతుంది. అందువల్ల అనంతమైన కోర్కెలను సృష్టించి వాటిని సంతృప్తి పరచడానికి చేసే ప్రయత్నం ఒక భ్రమ మాత్రమే.

ఒకని భౌతికావసరాలు లేదా మరొకనికి వ్యక్తిగతమైన మేధాపరమైన అవసరాలు అవుతాయి. అవి ఒక వెర్రిగా మారక ముందే ఏదో ఒక చోట సంపూర్ణంగా ఆగిపోవాలి. ఎక్కడైతే తన పూర్తి శక్తియుక్తులు కేటాయించాలో అక్కడ, మానవ సేవకు అడ్డురాకుండా మనిషి తన భౌతిక సాంప్రదాయిక పరిస్థితులనుసృష్టించుకోవాలి.

*(హరిజన్ 29-8-36, పే. 226)*

★ ★ ★

కోర్కెలను అనేకరెట్లు పెంచడంలోనూ, వాటిని తీర్చే సాధనాలు ప్రపంచాన్ని తన లక్ష్యం వైపుగా మరొకడుగు ముందుకు తీసుకెళ్తాయని చెప్పడంలోనూ నాకు నమ్మకం లేదు. కాలాన్ని దూరాన్ని వినాశనం గావించే వెర్రి కోర్కెలను ఈ పశుకోర్కెలను విపరీతంగా పెంచి వాటిని సంతృప్తి పరచడం కోసం భూమి అంతం వరకూ వెళ్ళడాన్ని నేను తీవ్రంగా వ్యతిరేకిస్తాను. ఆధునిక నాగరికత వీటన్నింటికి ప్రతిబింబమైతే నేను దాన్ని భూతమనే పేర్కొంటాను.

*(యంగ్ ఇండియా 17-3-27, పే. 85)*

★ ★ ★

ప్రతి ఒక్కనికీ తినే తిండి, త్రాగే నీరు కట్టే బట్ట లభిస్తే, అవి ఆ మనిషికి విజ్ఞానాన్ని, శిక్షణను కల్పిస్తే నేను తప్పనిసరిగా సంతృప్తి చెందాలి. అంతేకాని, నేను జీర్ణం చేసుకో గలిగే దానికంటే ఎక్కువగా తినడం, నేను నిజంగా ఉపయోగించే వాటికంటే ఎక్కువగా కోరుకోవడం చేయకూడదు.

అదే సమయంలో భారతదేశంలో నేను దారిద్ర్యాన్ని అశాంతిని అపరిశుభ్రతలను కోరుకోవడం లేదు.

*(హరిజన్ 12-2-38 పే. 2)*

★ ★ ★

తనకున్న అత్యున్నత శాస్త్ర పరిజ్ఞానంతో ఐరోపా నైతిక విలువలు అడుగంటిన ఈ పారిశ్రామికీకరణనుంచి త్వరలోనే బయట పడుతుందని తనకు తాను సరైన మార్గాన్ని కనుగొంటుందని విశ్వసించవచ్చు. అది సరిగ్గా తన పాత మార్గమైన సరళ జీవనానికీ తిరిగిరాక పోవచ్చు కానీ దైవ చింతనకు భౌతిక శక్తులు లోబడే విధంగా గ్రామీణ జీవితాధిపత్యం ఉండే విధంగా అది తన మార్గాన్ని మార్చుకుంటుంది.

*(యంగ్ ఇండియా 6-8-25, పే 273)*

★ ★ ★

ఈ అధునిక సుందర భౌతిక వాదాన్నే మనలక్ష్యంగా ఎంచుకున్నామని మన పురోగమనం అధోముఖంగా సాగుతున్నదని నేను విశ్వసించక పోయినట్లయితే నేను యిపుడు చేసినంత కృషి చేసేవాడిని కాను.. మన సంపదను పెంపొందించుకోవడంలో మన ప్రాచీన ఆదర్శాలే మనకు సరిహద్దుగా ఉండాలి. ఇది భౌతికమైన కోర్కెలన్నింటిని తిరస్కరించదు. మనకు ఎల్లప్పుడూ ఉన్నట్లుగానే యిప్పటికీ డబ్బు సంపాదించడమే జీవిత లక్ష్యంగా కల మనుషులు మన మధ్య ఉంటారు. అయితే అది మన ఆదర్శాన్నుంచి మనం దిగజారడమేనని మనం ఎల్లప్పుడూ గుర్తించాము. డబ్బు సంపాదన భగవంతుని సేవ - రెండూ సాధ్యం కావన్నది ఆర్థిక శాస్త్రం ఒప్పుకున్న సత్యం. ఏదో ఒక దాన్ని మనం ఎంచుకోవాలి పాశ్చాత్య దేశాలు నేడు భౌతిక వాదమనే పిశాచం కాళ్ళ క్రింద పడి నలిగి పోతున్నాయి. వారినైతికాభివృద్ధి ఒక గారడీ విద్యగా మారిపోయింది. వారు వారి అభివృద్ధిని పౌండ్లలోనే కొలుస్తారు. అమెరికా సంపద వారికి గీటురాయి అయింది. మనం అమెరికా మాదిరి సంపద సమకూర్చుకుందామని, కానీ దాని పద్ధతులను వదిలివేద్దామని మన వారు చెబుతూంటారు. అయితే అలాంటి

ప్రయత్నమేదైనా చేస్తే అది తప్పని సరిగా విఫలం చెందుతుందని చెప్పడానికి నేను సాహసిస్తున్నాను. తన్ను తాను ప్రేమించుకొన్న దానికంటే ఎక్కువగా దానగుణాన్ని ప్రదర్శించిన నాడు సంపదకు అధికారం ఆడంబరాలకు భయపడని నాడు బంగారం కంటే మిన్నగా నిజాన్ని పలికిన నాడు మాత్రమే మనది నిజమైన దైవ చింతన కలిగిన దేశమని నిరూపించుకోగలము. మన గృహాలను, రాజ ప్రసాదాలను, గుడిగోపురాలను సంపద లక్షణాలనుంచి పరిశుభ్రపరచి నైతిక విలువలతో వాటిని నింపిననాడు. మనం ఎలాంటి ప్రతికూల శక్తులనైనా ఎలాంటి ఆయుధ సహాయం అవసరం లేకుండానే ప్రతిఘటించవచ్చు. మొదట మనం భగవంతుని సామ్రాజ్యాన్ని ఆయన దయను కోరుకుందాం. తర్వాత మిగిలిన విషయాలన్నీ వీటికి తప్పని సరిగా జత కలుస్తాయి. ఇదీ నిజమైన అర్థశాస్త్రం. మీరూ, నేనూ మన నిత్య జీవితంలో వాటిని ఆచరించి వాటిని సంపద్వంతం గావిద్దాం

*(మహాత్మాగాంధీ ఉపన్యాసాలు, మరియు రచనలు (4వ ఎడిషన్) పేజీలు 353-55)*

★ ★ ★

నీవు ఎంత తక్కువ సంపదను కలిగి ఉంటే ఎన్ని తక్కువ కోర్కెలు కలిగి ఉంటే అంత మంచిగా ఉంటావు. దేనిలో మంచిగా ఉండేది? ఈ జీవితాన్ని ఆనందంగా సౌఖ్యంగా గడపడానికి గాదు. నీ సహోదరులకు వ్యక్తిగతమైన సేవ చేయడానికి. ఏదైతే సేవ చేయాలని నీవు మనసా వాచా కర్మణా కోరుకున్నావో, ఆ సేవ చేయడానికి.

*(మహాత్మ వాల్యూమ్ 3, (1952) పే. 157.)*

★ ★ ★

తన వేలాది కుటీర పరిశ్రమలను అభివృద్ధి గావించడం మిగతా ప్రపంచంతో శాంతియుతంగా జీవించడం ద్వారా ఒక సరళమైన అదే సమయంలో ఉన్నతమైన జీవనాన్ని గడిపేందుకు భారతదేశానికి వీలవుతుంది. అలాంటి స్వతంత్ర భారతదేశమే ఈ బాధామయ ప్రపంచం పట్ల తన బాధ్యతను నెరవేర్చగలదని నేను విశ్వసిస్తున్నాను. డబ్బే ప్రధానంగా అత్యంత వేగంగా గడిచే భౌతిక జీవనంలో ఉన్నతమైన ఆలోచనలకు అవకాశం

చిక్కదు. గౌరవప్రదంగా బ్రతకడం మనం నేర్చుకొన్నపుడే జీవితంలోని అన్ని ప్రార్ధనలు నెరవేరుతాయి.

*(హరిజన్ 1-9-46, పే 285)*

★ ★ ★

తన రోజువారీ కోర్కెలను ఎపుడైతే అనేక రెట్లు పెంచుకోవాలని కోరుకుంటాడో అపుడే మనిషి ఉన్నతంగా ఆలోచించడు. సరళంగా జీవించడం అనే ఆదర్శాల నుంచి క్రిందకు దిగజారి పోతాడు. చరిత్రలో దీనికెన్నో సాక్ష్యాలున్నాయి. మనిషి సంతోషమెప్పుడూ ఆవ్యక్తి సంతృప్తిలో ఉంటుంది. ఎవరైతే అసంతృప్తవాదిగా మారతాడో ఆ వ్యక్తి దాన్ని ఆస్థిపాస్తులను కలిగి ఉన్నప్పటికీ అతను తన కోర్కెలకు బందీ అవుతాడు. కోర్కెలకు మించిన బానిసత్వం మరొకటి లేదు. మనిషి తనకుతానే వినాశకరమైన శత్రువూ మరియు అత్యున్నతమైన స్నేహితుడూ అవుతాడని అనేకమంది ప్రముఖులు అనేక సార్లు ఉద్ఘాటించారు. స్వేచ్ఛగా జీవించాలా లేక బానిసగా బ్రతకాలా అన్నది ఆవ్యక్తి చేతుల్లోనే ఉంటుంది. అదే విధంగా మనిషికి ఏది నిజమో సమాజానికి కూడా అదే నిజమవుతుంది.

*(హరిజన్ 1-2-42, పే. 27)*

తాము తుది లక్ష్యాలుగా నిర్ణయించుకొన్న ఈ భౌతిక కోర్కెలన్నీ ఈ భూమ్మీదే తీరినప్పటికీ అది మనుషులందరికీ సంతోషాన్ని గానీ, ప్రశాంతతను గానీ అందించదు.

*(మహాత్మాగాంధీ - ది లాస్ట్ ఫేజ్, వాల్యూమ్ -2 (1958) పే. 139)*

★ ★ ★

ఈ శరీరమున్నది సంపూర్ణంగా సేవ చేయడానికే తప్ప తప్పుడు పనులకు పాల్పడడానికి కాదు. సుఖభోగలాలసత మనిషి జీవితాన్ని నాశనం చేస్తుంది.

*(హరిజన్ 24-2-46 పే. 19)*

★ ★ ★

## అధ్యాయము 38

# గౌరవమైన శ్రమ : తిండికోసం శ్రమ

తన ఆహార సంపాదన కోసం పని చేసుకోవడానికి భగవంతుడు మనిషిని సృష్టించాడు. పనిలేని వాళ్లంతా దొంగలేనని కూడా భగవంతుడు అన్నాడు.

*(యంగ్ ఇండియా, 13-10-21. పే. 325)*

★ ★ ★

శారీరిక శ్రమ మూలంగా శరీరం బ్రతకగలిగి ఉండాలి. మేధోశ్రమ మేధోవికాసానికి తోడ్పడాలి. అందువల్ల శ్రమ విభజన అవసరమే. అయితే ఆ విభజన శారీరిక శ్రమ యొక్క వివిధ విభాగాలుగా ఉండాలి. మేధోశ్రమ ఒక వర్గానికి శారీరకశ్రమ మరొక వర్గానికి మాత్రమే పరిమితమయ్యే విభజన మాత్రం జరగకూడదు.

*మహాత్మ వాల్యూమ్ 3 (1952) పే. 349)*

★ ★ ★

చేతులతో శ్రమ చేయమని తద్వారా కలిగే గౌరవాన్ని అనుభవించమని మీరు ప్రజలకు ఉద్బోధించాలి.

*(మహాత్మా వాల్యూమ్ 5, (1952) పే. 185)*

★ ★ ★

ప్రతీ వ్యక్తి తాను చెమటోడ్చి జీవిస్తే ఈ భూమండలం ఒక స్వర్గ ధామమవుతుంది. ప్రత్యేక శక్తియుక్తులను ఉపయోగించడమనే ప్రశ్న చాలా అరుదుగా తలెత్తుతుంది. ప్రతీ వ్యక్తీ ఆహారం కోసం శారీరికంగా శ్రమించినపుడు కవులు, న్యాయవాదులు, వైద్యులు తదితరులు తమ నైపుణ్యాలను మానవసేవ కోసం ఉపయోగించడాన్ని తమ విధిగా భావిస్తారు. ఏ మాత్రం స్వార్థం లేకుండా వారు చేసే సేవనుంచి వచ్చే ప్రతిఫలం ఎంతో ఎక్కువగానూ, మంచిగానూ ఉంటుంది.

*(మహాత్మ వాల్యూమ్ 6 (1953) పేజీ 389)*

★ ★ ★

విశ్రాంతి ఒక స్థాయి వరకూ మంచిదేగాక అవసరంకూడా. చెమటోడ్చి సంపాదించిన దాన్ని తినేందుకు భగవంతుడు మనిషిని సృష్టించాడు. మన ఆహారంతో పాటుగా మన అవసరాలన్నీ మంత్రగాని టోపీలో నుంచి తయారు చేయగలమా అని నాకు భయంగా ఉంది.

*(హరిజన్ 16-5-36, పే 111)*

★ ★ ★

ఉదాహరణకి కొద్ది మంది కోటీశ్వరులు అమెరికానుంచి మన దగ్గరకు వచ్చి మనలను పనిచేయవద్దని మనకు కావలసిన ఆహారమంతా యిస్తామని వారు తమ దయాదాక్షిణ్యాలను మనపై చూపడానికి అనుమతించమని కోరితే వారి సానుభూతి ఆహ్వానాన్ని నేను నిర్ద్వందంగా తిరస్కరిస్తాను. ఆ ఆహ్వానం ప్రత్యేకించి మన ప్రాథమిక సూత్రాల వేళ్ళను పెకిలించేది కావడమే అందుకు కారణం.

*(హరిజన్ 7-12-35, పే 341)*

★ ★ ★

చిట్టచివరిది అయినా ముఖ్యమైనది. తన ఆహారాన్ని తానే శ్రమ చేసి సంపాయించికోవాలని ప్రకృతి మనకు నిర్దేశించిందని అనిపిస్తోంది. తన మేధాశక్తిని తన భౌతిక కోర్కెలను మరెన్నో రెట్లు పెంచుకోవడానికీ, ఆత్మను చూపే సౌకర్యాలు చుట్టూ అల్లుకోనివ్వడానికి గాకుండా ఈ సృష్టికర్త అభిమతమైన మానవ సేవ గావిస్తూ తద్వారా నిజంగా తనకు తాను సేవచేసుకోవడానికి ఉపయోగించాలని ప్రకృతి మనలను నిర్దేశిస్తున్నది.

*(మహాత్మాగాంధీ సంకలనం వాల్యూమ్ 10, పే. 130)*

★ ★ ★

ప్రతి ఒక్కరూ తన ఆహార సంపాదనకోసం కష్టించి పని చేస్తే మనందరికీ సరిపడా ఆహారమూ, విశ్రాంతి దొరుకుతాయి. అపుడుఅధిక జనాభాను గురించి, జబ్బులను గురించి, మనచుట్టు ఉండే ఈతిబాధలను గురించి విచారించాల్సిన అవసరమే ఉండదు. అలాంటి శ్రమ త్యాగానికి అత్యున్నత రూపమవుతుంది. మనుష్యులు తమ ఆలోచనల ద్వారా లేదా

చేతల ద్వారా అనేక యితర పనులు చేస్తుంటారు. కాని అవన్నీ సమిష్టి ప్రయోజనాన్ని ఆశించే ప్రేమ కృషిగా ఉండాలి. అపుడు పేదా గొప్ప ఎక్కువ తక్కువలు అంటుకొనేవారు అంటరాని వారు అనే తారతమ్యాలకు స్థానం ఉండదు. ఇది అందుకోలేని ఆదర్శం కావచ్చు. అంతమాత్రం చేత దానికోసం మనం చేసే కృషిని ఆపుకోవలసిన అవసరం లేదు. మన సిద్ధాంతమైన సర్వం త్యాగం చేయడమనే దాన్ని పాటించకుండానే మనరోజు వారీ ఆహారం కోసం, మనం మన శారీరిక శ్రమను ఉపయోగించ గలుగుతున్నాము. కాబట్టి ఈ ఆదర్శంవైపుగా మనం సుదూర ప్రయాణం కావించాల్సి ఉంది.

ఆ విధంగా మనం చేసినట్లయితే మనకోర్కెలు చాలా తక్కువగా ఉంటాయి. మన ఆహారం చాలా సరళంగా ఉంటుంది అపుడు మనం తినడానికి జీవించడం గాక జీవించడానికి తినాలి. ఈ వాదనను ఎవరైనా శంకించినట్లయితే వారి ఆహారం కోసం వారిని చెమటోడ్చమనండి. అపుడు తన శ్రమతో తయారైన వస్తువుల్ని చూసుకొని ఎలాంటి తృప్తి చెందుతాడో అతని ఆరోగ్యం ఎంత బాగుంటుందో తను యింత కాలం ఎంత పైపైన ఆలోచించాడో అర్థమవుతుంది.

మేధాశక్తి ద్వారా మనుషులు ఆహారాన్ని సంపాదించుకోలేరా? సంపాదించుకోలేరు. శరీరావసరాలను శరీరమే సమకూర్చాలి. మేధోపరమైన శక్తి కేవలం ఆత్మానందం కోసమే. అది ఎప్పుడూ ప్రతిఫలాన్ని ఆశించకూడదు ఆదర్శ రాజ్యంలో వైద్యులు, న్యాయవాదులు వంటి వారు సమాజ ప్రయోజనాల కోసమే పని చేస్తారు. తప్ప స్వప్రయోజనాల కోసం పని చేయరు. ఆహారం కోసం పని చేయడమనే నిబంధనకు కట్టుబడి ఉంటే అది వ్యవస్థ స్వభావంలో మౌనంగా విప్లవాత్మక మార్పుని తెస్తుంది. తన ఉనికికోసం పోరాటం చేయడంకన్నా పరస్పర సేవకోసం పోరాటం చేయడంపైనే మనిషి విజయం ఆధారపడి ఉంటుంది. రాక్షసన్యాయాన్ని మానవ న్యాయం ఆక్రమిస్తుంది.

*(హరిజన్ 29-6-35, పే. 156)*



నన్ను అపార్థం చేసుకోకండి. నేను మేధాశక్తిని తక్కువ చేసి చెప్పడంలేదు. కాని ప్రజలందరి సమిష్టి సంక్షేమాన్ని కోరి శ్రమశక్తిని ధార పోయడానికి పుట్టిన మన శారీరిక శక్తితో ఏ మేధాశక్తీ సమానంకాదు. తరుచుగా మేధాశక్తి శారీరక శ్రమకంటే విలువైనది కావచ్చు. కాని అది ఎప్పటికీ శారీరిక శ్రమకు ప్రత్యామ్నాయం కాలేదు. మనం తినే ఆహారధాన్యాల కంటే మేధావుల ఆహారం విలువైనదే గావచ్చుగాని ఈ ఆహార ధాన్యాలకు అది ప్రత్యామ్నాయం కాలేదు. అంతేగాక ఈ భూమ్మీద వస్తువులు లేకుండా మేధావుల సృష్టిని ఊహించడం కూడా సాధ్యం కాదు

*(హరిజన్ 15-10-25 పే. 335)*

★ ★ ★

తెలివైన శారీరిక శ్రమ ఏరోజునైనా సాంఘిక సేవకు ఉన్నత రూపమే అవుతుంది. శ్రమ సంఘసేవగా ఉండాలంటే దానికొక ప్రత్యేకమైన ఉద్దేశ్యం ఉండాలన్న కారణం చేతనే శ్రమ కు తెలివైన అనే విశేషణాన్ని జోడించడం జరిగింది. లేనట్లయితే ప్రతీ శ్రామికుడు తాను సంఘ సేవ చేస్తున్నానని చెప్పవచ్చు. అతనూ ఒక రకంగా చేస్తున్నట్లే. అయితే యిక్కడ దానికి మించిన అర్థంలో ఈ శ్రమను గురించి చెప్పడం జరిగింది. సమిష్టి ప్రయోజనం కోసం ఓ వ్యక్తి శ్రమిస్తే అది సమాజానికి ఉపయోగపడుతుంది. అపుడు ఆ శ్రమకు విలువ కలుగుతుంది. అందువల్ల అలాంటి ఆహారం కోసం చేసే శ్రమనుసంఘసేవనుంచి వేరు చేసి చూడలేము.

*(హరిజన్ 1-6-35, పే. 125)*

★ ★ ★

గ్రామాలకు తిరిగి రావడమంటే ఆహారశ్రమ విధిని స్వచ్ఛందంగా అంగీకరించడమే. "లక్షలాది మంది బాలలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. వారు అర్థాకలితోనే జీవిస్తున్నారు. అని ఒక విమర్శకుడు అంటాడు. ఇది పచ్చి నిజమని చెప్పక తప్పదు. అయితే వారిది స్వచ్ఛందమైన అంగీకారం కాదని మనకు తెలుసు. వారికి వీలు చిక్కితే శారీరిక శ్రమ నుంచి తప్పుకోవడానికి ప్రయత్నిస్తారు. అవకాశముంటే దగ్గర్లోనే ఉన్న పట్టణానికి

వలస పోతారు. యజమానికి బలవంతపు విధేయత గలిగి ఉండడం బానిసత్వం అవుతుంది. కానీ స్వచ్ఛంద విధేయత కుమారుడు తండ్రికి యిచ్చే విధేయత వంటిది. అదే విధంగా శారీరిక శ్రమకు బలవంతపు విధేయత దారిద్ర్యానికి రోగాలకి అసంతృప్తికి దారి తీస్తుంది.అదిబానిసత్వమే. (శారీరక శ్రమకు) స్వచ్ఛంద విధేయత మనిషికి సంతోషాన్ని ఆరోగ్యాన్ని సమకూరుస్తుంది. ఆరొగ్యమే నిజమైన సంపద అంతే కాని బంగారము, వెండి ముక్కలు నిజమైన సంపదకాదు.

*(హరిజన్ 29-6-35, పే. 156)*

★ ★ ★

ఆరోగ్యంగా ఉండే మనిషి నిజాయితీతో కూడుకున్న ఏదో ఒక పని చేయకుండా అతనికి ఉచిత భోజనం పెట్టాలనే ఆలోచనను నా 'అహింస' సహించలేదు. నాకే అధికారం ఉండి ఉన్నట్లయితే ఉచితంగా ఆహారం పంచే ప్రతీ సదావర్తనను ఆపు చేయించే వాణ్ణే. అది జాతినికించ పరిచి బద్ధకాన్ని సోమరిపోతుతనాన్ని చివరికి నేరాలను కూడా పెంచుతుంది. అలాంటి దారితప్పిన దానం దేశానికి భౌతికమైన లేదా ఆధ్యాత్మికమైన ఎలాంటి సంపదను సమకూర్చక పోగా దాతకు తప్పుడు పేరు ప్రఖ్యాతులను కలిగిస్తుంది. అదే దాతలు కొన్నిసంస్థలు స్థాపించి వాటి ద్వారా ఆరోగ్యవంతులైన స్త్రీ పురుషులకు పని కల్పించి తద్వారా ఆహారాన్ని అందిస్తే ఎంత బాగుంటుంది? ఎంత తెలివైన పని అవుతుంది? చరఖాగాని లేదా ప్రత్తికి సంబంధించిన మరే పనైనా చాలామంచివృత్తి అని నా వ్యక్తిగత అభిప్రాయం. ఒక వేళ వారిదగ్గర అది లేకపోతే మరే పనైనా వారు చేయవచ్చు. పని చేయకపోతే తిండి లేదు. అనునదేపాటించవలసిన నియమం.

*(యంగ్ ఇండియా 13-8-25, పే. 282)*

★ ★ ★

యాచకత్వాన్ని ప్రోత్సహించడం తప్పని నేను భావిస్తాను. అయినా ఏ యాచకునికయినా పనిని ఆహారాన్ని కల్పించకుండా నేను అతణ్ణి వెనక్కు పంపించను. అతను పని చేయక పోతే ఆహారం తీసుకోకుండా వెళ్ళాల్సిందే.

ఎవరైతే శారీరికంగా పనిచేయలేని స్థితిలో ఉంటారో వారిని ప్రభుత్వమే ఆదుకోవాలి. అయితే న్యాయమైన అంధత్వం లేదా తెచ్చి పెట్టుకున్న అంధత్వం పేరుతో చాలా మోసాలు జరుగుతున్నాయి. అనేక మంది అంధులు అక్రమ సంపాదనతో ధనవంతులయ్యారు. ఇలాంటి దుర్బోధనలను వారికి కల్గించడంకంటే వారిని ఏదైనా అనాధాశ్రమానికి తరలించడం మంచిది.

*(హరిజన్ 11-5-35 పే. 99)*

★ ★ ★

## అధ్యాయము 39

# స్వదేశీ

ఎక్కడో సుదూర ప్రాంతాల్లో ఉన్న సేవలను గాకుండా తన చుట్టు ప్రక్కల ఉండే సేవలను ఉపయోగించుకొనేలా మనలను నియంత్రించే స్ఫూర్తే "స్వదేశీ". అందువల్ల మతానికి సంబంధించినంతవరకు పై నియమాన్ని పాటించాలంటే నేను నా వంశ పారంపర్యమైన మతానికి కట్టుబడి ఉండాల్సిందే. అంటే నా దగ్గర చుట్టుప్రక్కల ఉన్న మత వాతావరణాన్ని ఉపయోగించడమన్న మాట. అది లోప భూయిష్టమైనదని నేను గమనిస్తే ఆలోపాలను సరిచేయడం ద్వారా దాన్ని మరింత పటిష్టం గావించే సేవ నేను చేయాలి.

రాజకీయాలకు సంబంధించినంతవరకు నేను దేశవాళీ సంస్థలను ఉపయోగించుకుంటూ వాటిలో బయటపడ్డ దోషాలను సరిదిద్దే సేవ చేయాలి. ఆర్థిక శాస్త్రంలో అయితే నా దగ్గరి, చుట్టు ప్రక్కల వాళ్ల తయారు చేసిన వస్తువులను వాడుకుంటూ అవసరమైన చోటల్లా వాటిని మరింత సంపూర్ణంగానూ సమర్థవంతంగానూ తీర్చి దిద్దడం నా కర్తవ్యం. ఈ విధమైన స్వదేశీని అమలు పరచగలిగితే అది మనకు సుఖసంతోషాలను అందించి తీరుతుంది. ఆర్థిక మరియు పారిశ్రామిక జీవనంలో ఈ స్వదేశీ నుంచి వినాశనకరమైన రీతిలో వేరు పడడమే మన ప్రజానీకంలోని ఈ కటిక

దారిద్ర్యానికి కారణం. ఏ వాణిజ్య వస్తువునూ బయటినుంచి భారతదేశంలోనికి తీసుకురానట్లయితే ఈ రోజు భారతదేశంలో పాలూ తేనె ప్రవహిస్తుండేవి. అయితే అది జరగలేదు. మనమూ మరియు ఆంగ్లేయులు దురాశ పరులంగా ఉండే వాళ్ళము. భారతదేశము మరియు ఇంగ్లాండు మధ్య సంబంధం స్పష్టంగా తప్పుడు దృక్కోణంతో ఏర్పడింది.

స్వదేశీ సిద్ధాంతాన్ని మనం పాటించినట్లయితే మన చుట్టు ప్రక్కల మన అవసరాలను తీర్చగలిగిన వారు ఎవరున్నారో గుర్తించి, వారికి మన అవసరాలు ఏ విధంగా తీర్చాలో తెలియకపోతే తెలియపర్చడం మన విధి. అప్పుడు భారత దేశంలోని ప్రతీ గ్రామం స్వయం సంపదను కలిగి ఉండి, కేవలం తన వద్ద లభ్యం కాని వస్తువులనే యితర గ్రామం నుంచి తెచ్చుకొనే ప్రయత్నం చేస్తుంది. ఇదంతా అర్థరహితంగా కన్పించవచ్చు. భారతదేశమే ఒక అర్థరహిత దేశం. స్వచ్ఛమైన మంచినీరు త్రాగడానికి యిస్తుంటే యిచ్చేవాడు ముస్లిం అని దాహమవుతున్న గొంతును కోసుకోవడం మూర్ఖత్వం కాక మరేమవుతుంది? వేలాది మంది హిందువులు ముస్లింల యిళ్ళలో నీళ్ళు త్రాగడం కంటే మరణించడానికే సిద్ధపడతారు. భారతదేశంలో తయారైన బట్టనే ధరించాలని ఈ దేశంలో పండిన పంటనే తినాలని తన మతం ఆదేశిస్తుందని వీరు నమ్మితే యిక యితర వస్త్రాలనుగాని ఆహారాన్ని గాని ఉపయోగించకుండా ఉండడానికి కూడా ఈ అర్థరహితమైన మనుషులు సిద్ధపడతారు.

ఆర్థికరంగంలో భారతదేశంలో స్వదేశీని ఆచరించడం సాధ్యంకాదని కొందరు తరచుగా చెబుతుంటారు. ఇలాంటి అభ్యంతరాలు లేవనెత్తేవారు స్వదేశీని జీవితంలో అంతర్భాగంగా పరిగణించరు. వారికి అదొక దేశభక్తి కొరకు చేసే ప్రయత్నమే తప్ప దాన్ని ఆచరించడం వలన తమకేదైనా నష్టం జరుగుతుందంటే దాన్ని పాటించడానికి సిద్ధపడరు. వ్యక్తుల భౌతిక సుఖాలకు కలిగే కష్టాలను ఏ మాత్రం పట్టించుకోకుండా ముందుకు సాగే మతక్రమశిక్షణే స్వదేశీ అని నిర్వచించవచ్చు. ఈ రోజు తాను అవసరాలుగా భావిస్తున్న కొన్ని వందలాది వస్తువులు లేకుండానే జీవించడానికి స్వదేశీవాది అలవాటు పడాలి.

స్వదేశీ సిద్ధాంతం మాత్రమే ప్రేమ అభిమానాలను ఎల్లకాలం కొనసాగించుతుంది. నా కుటుంబాన్నే నేను పోషించుకోలేనప్పుడు భారతదేశం మొత్తానికి సేవచేయగలనని భావించడం దుస్సాహసమే అవుతుంది. కుటుంబంపై శ్రద్ధ పెంచి తద్వారా జాతికి సేవచేయడం మంచిది. అదే ప్రేమ. అదే గౌరవం. ఆ ఆశయమే పనియొక్క నాణ్యతను పెంచుతుంది. ఇతరులకు ఎలాంటి యిబ్బందులు కలిగించైనా నా కుటుంబాన్ని నేను పోషించవచ్చు. ఉదాహరణకి ప్రజల దగ్గరనుంచి డబ్బులు గుంజే ఉద్యోగాన్ని ఏదైనా నేను చేయవచ్చు. ఆ విధంగానేను ధనవంతుడనై నా కుటుంబం యొక్క అక్రమమైన కోర్కెలను తీర్చవచ్చు. ఇక్కడ నేను కుటుంబానికి గాని, రాజ్యానికి గాని సేవ చేస్తున్నది ఏమీ లేదు. నాకోసం, నాపై ఆధారపడిన వారి కోసం, మా జీవన భృతి సంపాదనకీ దేవుడు నాకు ఈ కాళ్ళు చేతులు యిచ్చాడని నేను అనుకోవచ్చు. అపుడు నేను ప్రత్యక్షంగా ప్రభావితం చేయగల వారి జీవితాన్ని మరియు నా జీవితాన్ని సరళతరం గావించుకోవచ్చు. ఇక్కడ ఇతరులు ఎవ్వరికీ హాని కలుగకుండా నా కుటుంబానికి సేవ చేస్తూ ఉండవచ్చు. ప్రతి ఒక్కరూ ఈ విధమైన జీవనాన్ని గడిపితే మనకు ఒక ఆదర్శ రాజ్యం ఏర్పడుతుంది. అందరూ ఒకేసారి ఆ స్థాయికి చేరుకోలేరు. కానీ ఈ సత్యాన్ని అర్థం చేసుకొని ఆచరణలో పెట్టే అలాంటి సుదినం వస్తుందని ఆశించవచ్చు. దాని రాకను మరింత వేగవంతం చేయవచ్చు.

*(మహాత్మాగాంధీ ఉపన్యాసాలు మరియు రచనలు (4వ ముద్రణ) పేజీలు 336-44)*



దాన్నొక ఉత్సవ విగ్రహంగా మారిస్తే ఇతర అనేక మంచి పనుల మాదిరిగానే స్వదేశీకూడా అంతమవుతుంది. ఆ ప్రమాదం నుంచి స్వదేశీని కాపాడుకోగలగాలి. కేవలం విదేశీయులైనందుకే విదేశీ తయారీ దారులను తిరస్కరించి, తన దేశానికి సరిపడని వస్తువుల తయారీ కోసం సమయాన్ని ధనాన్ని దుర్వినియోగం చేయడం స్వదేశీ స్ఫూర్తికే విరుద్ధం. నిజమైన స్వదేశీ వాదికి విదేశీయుల పట్ల ఎలాంటి ద్వేషమూ ఉండదు. అతనికి ఈ భూమ్మీద ఉన్న ఏ ఒక్కరి పట్ల కూడా ఎలాంటి ద్వేషభావమూ ఉండదు. స్వదేశీ

సిద్ధాంతం ద్వేషానికి ప్రతిరూపం కాదు. అది పవిత్రమైన అహింస అంటే ప్రేమలోంచి పుట్టిన నిస్వార్థసేవా సిద్ధాంతం.

*(యరవాడ మందిర్ నుంచి (1957) పే. 66)*

★ ★ ★

## అధ్యాయము - 40

# ఆర్థిక సమానత్వము

అందరికీ సమానావకాశాలు ఉండాలి. అవకాశం లభిస్తే ప్రతి మనిషికీ ఆధ్యాత్మిక భావన పెరిగే అవకాశం సమంగా ఉంటుంది.

*(హరిజన్, 17-11-'46, పే. 404)*

★ ★ ★

ఒకరిని మించి మరొకరు ధనవంతులు లేని కాలమెప్పుడు వస్తుందో నేను చెప్పలేను. కానీ పేదవారిని బలి చేసి మరింత బలవంతులు కావడానికి ఇష్టపడని ధనికులు, ధనికులను చూసి ఈర్ష్యపడని సమాజం ఏర్పడుతుందని మాత్రం చెప్పగలను. అత్యంత ఉన్నత ప్రపంచంలో కూడా అసమానతలను తొలగించడంలో మనం విఫలమయ్యాము. అయితే కనీసం అసూయ, ద్వేషాలనైనా మనం దూరం చేయగలం. చేయాలి కూడా. పేదా గొప్ప మనుషులు ఎంతో స్నేహ పూర్వకంగా ఉండే సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి. అలాంటి సంఘటనలను మనం మరిన్నో రెట్లు పెంచాలి.

*(యంగ్ ఇండియా, 7-10-'26, పే. 348)*

★ ★ ★

నిర్జీవమైన ఐక్యత మీద నాకు నమ్మకం లేదు. మనుషులంతా సమానంగా స్వేచ్ఛగా పుట్టారు అనే సిద్ధాంతం ప్రకృతి న్యాయం ప్రకారం చూస్తే అది అన్ని వేళలా నిజం కాదు. ఉదాహరణకి మనుషులందరూ ఒకే తెలివి తేటలతో పుట్టడం లేదు. అయితే ఈ ఎక్కువ తెలివి తేటలు గలవారు తమ పరిజ్ఞానాన్ని ఇతరులను దెబ్బగొట్టి తమ స్వప్రయోజనాలను పెంపొందించుకోవడం కోసం గాక, తమకంటే తక్కువ పరిజ్ఞానమున్న వారి

కోసం ఉపయోగించినపుడు ఈ సమానత్వ సిద్ధాంతం వాస్తవరూపం దాల్చుతుంది.

*(హరిజన్, 6-10-'46, పే 338)*

★ ★ ★

ఆర్థిక సమానత్వం అంటే ప్రపంచంలోని వస్తువులని ప్రజలందరూ సమానంగా పంచుకోవాలని అర్థం కాదు. కాకపోతే, ప్రతి ఒక్కరికీ తలదాచుకోవడానికి ఇల్లు, తింటానికి సరిపడా సమతుల్య ఆహారము, కట్టుకోవడానికి ఇంత ఖద్దరు బట్ట ఉండాలని దాని అర్థమని చెప్పగలము. నేడున్న క్రూరమైన అసమానత్వాన్ని అహింసాయుత పద్ధతుల్లో నిర్మూలించుకోవాలని కూడా దాని అర్థం.

*(హరిజన్, 18-8-'40 పే 253)*

★ ★ ★

ప్రతి ఒక్కరూ అక్షరాలా ఒకే మొత్తాన్ని కలిగి ఉండాలనేదే ఆర్థిక సమానత్వమని నా ఉద్దేశ్యం కాదు. ప్రతి ఒక్కరికీ తన అవసరాలకు సరిపడినంతగా ఉండాలన్నదే దాని అర్థం. చీమకంటే ఏనుగు ఆహారం వేయిరెట్లు ఎక్కువ కావచ్చు, దానర్థం అక్కడ అసమానత్వం ఉన్నట్లు కాదు. అందువల్ల ఆర్థిక సమానత్వం అంటే "తన అవసరాలకు సరిపడినంతగా" అని నిజమైన అర్థం. అదీ మార్క్స్ నిర్వచనం. భార్య, నలుగురు పిల్లలు ఉన్న వ్యక్తి అడిగినంతగా, ఒకే వ్యక్తి కూడా అడిగితే అది ఆర్థిక సమానత్వ సిద్ధాంతాన్ని ఉల్లంఘించడమే అవుతుంది.

కులీన వర్గానికీ, సామాన్యులకి, అదే విధంగా రాజులకు, బిచ్చగాళ్లకు మధ్య కళ్లకు కట్టినట్లు కనిపిస్తున్న తేడాలను కులీనులకు, రాజులకు ఎక్కువ అవసరమనే వాదనతో కప్పిపుచ్చటానికి ఎవ్వరూ ప్రయత్నించలేదు. అది నా వాదనలను వక్రీకరించడమే అవుతుంది. ధనికులు - పేదల మధ్య తేడాలు నేడు బాధాకరంగా గోచరిస్తున్నాయి. గ్రామీణ పేదలను విదేశీ ప్రభుత్వంతో పాటు దేశీయులైన పట్టణ వాసులు కూడా దోచుకుంటున్నారు. ఆ గ్రామీణులు ఆహారాన్ని పండించి పస్తులుంటున్నారు. వారు పాలు ఉత్పత్తి చేస్తారు. కానీ వారి పిల్లలకు త్రాగడానికి పాలు ఉండవు. ఇది అన్యాయం. ప్రతి ఒక్కరికీ సమతుల్య ఆహారం, నివసించడానికి ఒక మంచి గృహం,

ప్రతి వారి పిల్లలకు మంచి విద్య, ఆరోగ్య సహాయం తప్పనిసరిగా అందాలి. నా దృష్టిలో ఆర్థిక సమానత్వం అంటే అదీ. తక్షణావసరాలకు మించిన సౌఖ్యాలను నేనేమీ నిషేధించాలని అనుకోవడం లేదు. అయితే ఆ సౌకర్యాలు పేదవాని కనీసావసరాలు తీరిన తర్వాతే రావాలి. మొదటి అవసరాలు మొదటిగా తీరాలి.

*(హరిజన్, 31-3-'46, పే. 63)*

★ ★ ★

నీ శక్తియుక్తుల్ని పౌండ్లుగా మార్చుకొనే బదులు ఈ దేశ సేవకి ఉపయోగించు. నీవు వైద్యుడివైతే, నీ వైద్య పరిజ్ఞానమంతా ఉపయోగించడానికి భారతదేశంలో కావలసినన్ని జబ్బులు ఉన్నాయి. నీవు న్యాయవాదివి అయితే భారతదేశంలో కావలసినన్ని విభేదాలు, జగడాలు ఉన్నాయి. మరిన్ని సమస్యలకు దారి తీయకముందే ఆ జగడాలను రూపుమాపి, ఆ వ్యాజ్యాలను ఆపుచేయవచ్చు. నీవు ఒక ఇంజనీరు అయితే శుభ్రమైన గాలి, ఆరోగ్యం ఉండేలా మన ప్రజల ఆదాయాలకనుగుణంగా మంచి ఇళ్లను కట్టించు. నీవు నేర్చుకొన్న దేన్నయినా నిరుపయోగంగా ఉంచాల్సిన పనిలేదు. (గాంధీ గారిని ఒక చార్టెడ్ ఎకౌంటెంట్ మిత్రుడు ప్రశ్నించినపుడు ఆయన ఈ విధంగా చెపుతున్నారు.) కాంగ్రెస్ మరియు దాని అనుబంధ సంఘాల లెక్కలను ఆడిట్ చేయడానికి అకౌంటెంట్ల అవసరం ఎంతగానో ఉన్నది. భారతదేశానికి రా! నీకు కావలసినంత పని ఇస్తాను. అదే విధంగా ఈ దేశంలోని లక్షలాది మంది ప్రజలకంటే ఎక్కువ ఆదాయం ఉండే విధంగా రోజూ నాలుగు అణాల వేతనం ఇస్తాను.

*(యంగ్ ఇండియా, 5-11-'31 పే. 384)*

★ ★ ★

నా ఆదర్శం ప్రతి ఒక్కరికీ సమానంగా పంచడం, కానీ నేను చూసినంత వరకూ అది సాధ్యమయ్యేలా కనిపించడం లేదు. అందుకే నేను న్యాయమైన పంపిణీ కోసం కృషి చేస్తున్నాను.

*(యంగ్ ఇండియా, 17-3-'27, పే. 86)*

★ ★ ★

ప్రతీ మనిషి ఏ మాత్రం ఎక్కువ లేకుండా తన అవసరాలకు సరిపడా మాత్రమే సంపదను కలిగి ఉండడమే సమాన పంపిణీ అనే దాని నిజమైన అర్థం. ఉదాహరణకి ఒక వ్యక్తికి జీర్ణం తక్కువగా ఉండి తను తినడానికి రొట్టె కోసం పావు కేజీ పిండి సరిపోతే, మరొకరికి కేజీ పిండి అవసరమైతే, వారిద్దరూ ఆ అవసరాన్ని తీర్చుకోగలిగి ఉండాలి. ఈ ఆదర్శాన్ని ఆచరణలో పెట్టడానికి ఈ సాంఘిక వ్యవస్థ మొత్తాన్ని పునర్నిర్మించాలి. అహింస మీద ఆధారపడిన వ్యవస్థ మరే ఆదర్శాన్ని పాటించలేదు. మనం మన లక్ష్యాన్ని సాధించలేకపోవచ్చు. కాని ఎల్లప్పుడూ మనం దాన్ని దృష్టిలో ఉంచుకొని దాన్ని చేరుకోవడానికి నిరంతరం కృషి చేయాలి. మన లక్ష్యాన్ని మనం అందుకో గలిగినంత వరకూ మనకు సంతోషం, సంతృప్తి కలుగుతుంటాయి. కనీసం ఆ మేరకు శాంతియుత సమాజ స్థాపన కోసం మనవంతు కృషి మనం చేసిన వారమవుతాము.

*(హరిజన్, 25-8'40, పే. 260)*

★ ★ ★

## అధ్యాయము 41

# ఆర్థిక వికేంద్రీకరణ

భారతదేశం శాంతి యుత పద్ధతుల ఆధారంగా ముందుకు సాగాలంటే అది అనేక విషయాల్లో వికేంద్రీకరణ సాధించాలి. అమలు చేయడానికి సరైన శక్తి లేకుండా కేంద్రీకరణ నిలబడదు. తీసుకెళ్ళడానికి ఏమీ లేని చిన్న గృహాలకు ఎలాంటి పోలీసు రక్షణ అవసరం లేదు. ధనికులు తమ యిళ్ళను బందిపోటుల బారి నుంచి కాపాడు కోవడానికి బలమైన సాయుధులు ఉండాలి. అలాగే పెద్ద పెద్ద పరిశ్రమలు కూడా. గ్రామీణ భారతదేశం కంటే ఎంతో సైనిక శక్తి గలిగిన పట్టణ భారతదేశానికి విదేశాల బెడద ఎక్కువగా ఉంటుంది.

*(హరిజన్, 30-12-39, పే. 391)*

★ ★ ★

పారిశ్రామిక నాగరికత మీద నీవు అహింస నిర్మించలేవు. కాని స్వయం సమృద్ధితో కూడిన గ్రామాల్లో అది సాధ్యమవుతుంది. దోపిడీయే హింసకు మూలం. నేను వీక్షించే గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో దోపిడీకి స్థానమే లేదు.

*(హరిజన్ 4-11-39, పే. 331)*

★ ★ ★

ప్రణాళిక యొక్క ఉన్నత దశ కేంద్రీకరణే అనే అభిప్రాయంతో నేను విభేదిస్తున్నాను. వికేంద్రీకరణే ప్రణాళికీకరణకు మరియు వికేంద్రీకరణకు ఎందుకు దారి తీయకూడదు?

*(ది హిందూ, 28-6-46)*

★ ★ ★

నైతిక మేధోపరమయిన అభివృద్ధితో పాటు మానవ సంతృప్తిని సాధించాలని మాత్రమే నేను ఆశిస్తున్నాను. నేను నైతికమనే విశేషణను ఆధ్యాత్మిక మనే దానికి పర్యాయపదంగా ఉపయోగిస్తున్నాను. ఈ చివరి దశను మనం వికేంద్రీకరణ ద్వారానే సాధించగలము. కేంద్రీకరణను ఒక విధానంగా చూసినపుడు దానికి శాంతియుత సామాజిక వ్యవస్థ పొసగదు.

*(హరిజన్, 18-1-42 పే. 5)*

★ ★ ★

**అధ్యాయము 42**

# గ్రామ సమాజాలు

అహింసాయుత సమాజంలో ప్రజలు సమూహాలుగా గ్రామాలలో నివసిస్తూ ఉంటారు. అక్కడ ప్రచలితమైన గౌరవనీయమైన జీవనానికి స్వచ్ఛంద సహాయం ఒక షరతుగా ఉంటుంది. హింసను హింసతోనే ఎదుర్కొవాలని ఆలోచించే సమాజం ప్రమాదకరమైన జీవితాన్ని గడుపుతుంది, లేదా రక్షణ కోసం పెద్ద పెద్ద ఆయుధ గిడ్డంగులను, మహానగరాలను నిర్మించుకోవలసి ఉంటుంది. నేడు ఐరోపాలో ఉన్న పరిస్థితిని గమనిస్తే దాని నగరాలు, పెద్ద పెద్ద పరిశ్రమలు విపరీతమైన ఆయుధ సామగ్రి

కలిగిఉన్నాయి. ఒక దాన్ని వదిలి మరొకటి ఉండడం అసాధ్యమని ఊహించడం అహేతుకమేమీ కాదు.

*(హరిజన్ 13-1-40 పేజీలు 410-11)*

★ ★ ★

భారతదేశానికి నిజమైన స్వాతంత్ర్యం సిద్ధించాలంటే అదే విధంగా భారత దేశం ద్వారా ప్రపంచానికి నిజమైన స్వాతంత్ర్యం రావాలంటే యిపుడు కాకపోతే తర్వాత రోజుల్లోనైనా ప్రజలు పట్టణాల్లో గాక గ్రామాల్లో రాజప్రసాదాల్లో గాక గుడిసెల్లో జీవించాలనే వాస్తవాన్ని గుర్తించాల్సి ఉంటుందని నేను నమ్ముతున్నాను. పట్టణాల్లోనూ, రాజభవనాల్లోనూ నివసించే కోట్లాది ప్రజలు ఎప్పుడూ శాంతియుత జీవనాన్ని గడపలేరు. అపుడు వారికి హింసకు పాల్పడడం అబద్ధాలాడడం తప్ప వారికి మరో మార్గం లేదు. సత్యం, అహింస లేనట్లయితే సమాజం వినాశనం గాక తప్పదని నేను చెబుతున్నాను. ఈ సత్యం, అహింసలను గ్రామీణ జీవితంలోని సరళత్వం ద్వారానే సాధించగలం. ఈ సరళత్వాన్ని చరఖాలోనూ చరఖా ప్రతిబింబించే వస్తువుల్లోనూ ఎక్కువగా ఉంటుంది. ప్రపంచం తప్పుడు మార్గంలో పయనిస్తుందని నేనుభయపడనవసరం లేదు. జ్వాలచుట్టూ తిరుగుతూ నాట్యమాడే చిమ్మట పురుగు చివరికి ఆ జ్వాలలో కాలిపోయినట్లు భారతదేశం కూడా అదే మార్గంలో ప్రయాణించవచ్చు. అయితే నా చివరి శ్వాస వరకూ భారతదేశాన్ని తద్వారా ప్రపంచాన్ని రక్షించేందుకు కృషి చేయడం నా విద్యుక్త ధర్మం.

*(పాఠ ఉత్తరాల కట్ట (1958) పేజీలు 506-07)*

★ ★ ★

గ్రామీణ స్వరాజ్యమంటే నా దృష్టిలో తన విస్తృతమైన కోర్కెలను తీర్చుకోవడం తన చుట్టు ప్రక్కల గ్రామాలతో సంబంధం వున్నా స్వతంత్రంగా వ్యవహరిస్తూ, అదే సమయంలో ఎక్కడ పరస్పర సహాయం అవసరమో అక్కడ యిచ్చి పుచ్చుకుంటూ గడిపే సంపూర్ణ సర్వసత్తాక రాజ్యం. అందు వల్ల ప్రతి గ్రామం యొక్క తక్షణ కర్తవ్యం తనకు అవసరమైన ఆహారం కోసం తన బట్టకోసం పంటను ప్రత్తిని తానే ఉత్పత్తి చేసుకోవడం కావాలి.

పశువులకు కొట్టాలు, పిల్లలకు యువకులకు ఆటస్థలాలు విహారస్థలాలు ఉండాలి. తదనంతరం కూడా యింకా ఎక్కువగా స్థలం ఉంటే అపుడు ఉపయోగపడే వాణిజ్య పంటలు పండించాలి. అయితే గంజాయి, పొగాకు ఓపియం వంటి పంటలను పండించకూడదు. ఆ గ్రామమే ఒక గ్రామ నాటక శాలను, పాఠశాలను మరియు ఒక ప్రజాభవనాన్ని నిర్వహించాలి. పరిశుభ్రమైన నీటిని సరఫరా చేయడానికి తన స్వంత నీటి వ్యవస్థ ఉండాలి. దీన్ని బావులు, ట్యాంకులను నియంత్రించడం ద్వారా సాధించవచ్చు. ప్రాథమిక విద్య తుదిస్థాయి వరకు విద్యను తప్పనిసరిగా గరపాలి. సాధ్యమయినంత వరకు ప్రతీ కార్యక్రమం కోపరేటివ్ పద్ధతి ద్వారా జరగాలి. ఈ రోజు మనం చూస్తున్నట్లు అంటరాని తనం వంటి కులాల ప్రసక్తే ఉండకూడదు. సహాయ నిరాకరణ మరియు సత్యాగ్రహమనేవి ఆగ్రామం యొక్క అహింసాయుధాలుగా ఉంటాయి. గ్రామం నిర్వహించే ఒక పుస్తకం ద్వారా వంతులవారీగా నియమించబడే గార్డులు గ్రామానికి కాపలా కాస్తారు. ఐదుగురు వ్యక్తులతో కూడిన పంచాయతీ ద్వారా గ్రామ పాలనను నిర్వహించాలి. ఈ పంచాయితీని కొన్ని కనీసార్హతలు కలిగిన స్త్రీ, పురుషులందరూ కలిసి సంవత్సరానికొకసారి ఎన్నుకోవాలి. ఈ పంచాయితీకి అవసరమైన అన్ని అధికారాలు ఉంటాయి. నిజమైన అర్థంలో శిక్షలంటూ ఏమీ ఉండవు కాబట్టి ఈపంచాయితీలో శాసన వ్యవస్థ న్యాయ వ్యవస్థ మరియు కార్యనిర్వాహక వ్యవస్థ కలిసి పాలన చేస్తాయి.గ్రామాల నుంచి శిస్తులు వసూలు చేయడమే లక్ష్యంగా పెట్టుకున్న ప్రస్తుత ప్రభుత్వ సహాయం కూడా లేకుండానే ఏ గ్రామమైనా ఆ విధమైన సర్వసత్తాక రాజ్యంగా నేడు కూడా ఉండగలదు. తన చుట్టు పట్ల గ్రామాల తోనూ కేంద్రంతోనూ సంబంధాలు ఎలా ఉండాలనే విషయాన్ని నేనిక్కడ పరిశీలించలేదు. గ్రామీణ ప్రభుత్వాన్ని రేఖా మాత్రంగా స్పృశించడమే నా ఉద్దేశ్యం. వ్యక్తిగత స్వేచ్ఛపై ఆధారపడ్డ సంపూర్ణ ప్రజాస్వామ్యం యిక్కడ ఉంటుంది. వ్యక్తి తన నవ ప్రభుత్వానికి రూపశిల్పి. అహింసయే చట్టం అతణ్ణి, అతని ప్రభుత్వాన్ని పాలిస్తుంది. అతనూ మరియు అతని గ్రామం కలిసి ఈ ప్రపంచాన్నే ఎదిరించగలిగే స్థితిలో ఉంటారు. తన మరియు తన గ్రామం గౌరవం కోసం ప్రాణ త్యాగం చేయడానికైనా ఆ గ్రామీణుడు సిద్ధంగా ఉంటాడు.

ఇక్కడ గీచిన ఈ చిత్రంలో అసాధ్యమయినదేదీ లేదు. ఇలాంటి గ్రామాన్ని నిర్మించడం ఒక జీవిత కాలంలో చేసే పనే కావచ్చు. నిజమైన ప్రజాస్వామ్యాన్ని గ్రామీణ జీవితాన్ని యిష్టపడే ఏ వ్యక్తి అయినా ఓ గ్రామాన్ని తీసుకొని అదే అతని ప్రపంచంగా ఏకైక ధ్యేయంగా భావించి పని చేస్తే అతను బ్రహ్మాండమైన ఫలితాలు చూపగలడు. అతను ఒక పారిశుధ్య కార్మికుడుగా, ఒక నేతవానిగా ఒక కాపలాదారునిగా ఒక వైద్యునిగా, ఒక పాఠశాల ఉపాధ్యాయునిగా అన్నింటిలోనూ ఒకనిగా పని చేయవచ్చు. ఎవ్వరూ తన దగ్గరకు రాకపోతే గ్రామాన్ని పారిశుధ్య పరచడంతోనూ, నేతపని చేయడంతోనే అతను సంతృప్తి పడగలడు.

*(హరిజన్ 26-7-42 పే. 238)*

★ ★ ★

నా గ్రామంలో మనుషులు తెలివిగల వారై ఉంటారు. పశువుల్లాగా వారు చీకటిలోనూ, అపరిశుభ్రంగానూ జీవించరు. స్త్రీపురుషులు స్వేచ్ఛగా ఉండి, ప్రపంచంలో ఏ ఒక్కరికి వ్యతిరేకంగానైనా తన అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించరు. ప్లేగు, కలరా, తట్టు వ్యాధులేమీ ఉండవు. ఏ ఒక్కరూ సోమరిపోతులుగా ఉండరు. ఏ ఒక్కరూ సౌకర్యాలతో తులతూగరు. ప్రతి ఒక్కరూ తన వంతు శ్రమ చేయాల్సి ఉంటుంది. రైళ్ళు, తంతి తపాలా వంటి వాటిని ఊహించే అవకాశం కూడా ఉంటుంది.

*(పాత ఉత్తరాల కట్ట (1958), పేజీలు 505-06)*

★ ★ ★

**అధ్యాయము 43**

# స్వయం సమృద్ధి

ఒంటరిగా జీవించడానికి మనిషి జన్మించలేదు. మనిషి ముఖ్యంగా స్వతంత్రంగా జీవనం గడుపుతూ యిరుగుపొరుగులకు చేదోడు వాదోడుగా ఉంటూ జీవించే సంఘజీవి. ఏ ఒక్కరూ కూడా మరొకని భుజాలపైకి ఎక్కలేరు. ఎక్కే ప్రయత్నం కూడా చేయకూడదు. ఆ విధమైన జీవితం కోసం పని చేయడానికి ప్రయత్నిస్తే సామాజిక పొందిక ఎల్లప్పుడూ ఒక గ్రామంగా

ఉండాలని లేదా కొద్దిమంది వ్యక్తుల సమూహంగా ఉండాలనే ముగింపుకు వస్తాము. ఆ గ్రామం లేదా సమూహం. స్వయం సమృద్ధిని గలిగి పరస్పర సహాయం చేసుకొంటూ చేదోడు వాదోడుగా ఒక యూనిట్‌గా మసలుతుంది.

*(మహాత్మాగాంధీ - చివరి దశ, సంపుటి 2 (1958) పే. 548.)*

★ ★ ★

మరొకరకంగా చెప్పాలంటే, పట్టణవాసుల మధ్య గ్రామీణుల మధ్య ఆహారము, త్రాగేనీరు, కట్టేబట్ట మరియు యితర జీవితావసరాల ప్రమాణంలో సమానత్వం ఉండాలి. నేడు ఈ విధమైన సమానత్వాన్ని సాధించడానికి ప్రజలు తమ అవసరాలైన బట్టలు ఆహారధాన్యాలు యిల్లు నీరు వంటి వాటిని వారే సమకూర్చుకోగలగాలి

*(మహాత్మాగాంధీ - చివరిదశ సంపుటి 2 (1958) పే. 547)*

★ ★ ★

నేనూహించే స్వరూపంలో సత్యము అహింస పునాదులుగా ఉంటాయి. సమాజానికి భారం కాకుండా తనను తానే పోషించుకో గలగడం మన ప్రథమ కర్తవ్యం. ఈ కోణంలోంచి చూసినపుడు స్వయం సమృద్ధి అనేదే ఓ రకమైన సేవ అవుతుంది. మనం స్వయంసమృద్ధి సాధించిన తర్వాత మిగిలే సమయాన్ని యితరుల సేవకి కేటాయించవచ్చు. అందరూ స్వయం సంపన్నులైతే ఎవ్వరికీ సమస్యలు ఉండవు. అలాంటి సమాజంలో ఎవరికీ సేవ చేయవలసిన అవసరం ఉండదు. కానీ మనం యింకా ఆ దశకు చేరుకోలేదు. కాబట్టి మనం సంఘసేవ గురించి ఆలోచించాలి. సంపూర్ణంగా స్వయం సమృద్ధిని సాధించడంలో మనం విజయం సాధించినప్పటికీ మనిషి సంఘజీవి కాబట్టి ఏదో ఒక రూపంలో ఈ సేవను మనం అంగీకరించక తప్పదు. అంటే మనిషి తాను ఎంత స్వయం పోషకుడో అంతే పరస్పర సహాయకుడుగానూ ఉంటాడు. సమాజాన్ని సక్రమ స్థితిలో ఉంచడానికి యితరుల మీద ఆధారపడాల్సి వస్తే అది వారిపై ఆధారపడడం గాక పరస్పర సహాయం అవుతుంది. ఆ సహాయంలో తియ్యదనం ఉంది. సహాయపడే వారిలో బలవంతులు, బలహీనులు అంటూ ఎవరూ ఉండరు. ఒకరికి

మరొకరు సమానులే. ఆధారపడి జీవించడంలో నిస్సహాయ భావన ఉంటుంది. కుటుంబ సభ్యులంతా ఎంత స్వతంత్రులో అంత పరస్పర ఆధారితులు కూడా నాదీ, నీది అనే భావనకు చోటే లేదు. వారంతా సహాయకారులు. అదే విధంగా మనం సమాజాన్ని, జాతిని లేదా మనుష్యులందర్నీ ఒక్కటిగా చూసినపుడు ఒక కుటుంబం మాదిరిగా వారంతా ఒకరికొకరు సహాయకులుగా ఉంటారు. అలాంటి తోడ్పాటు చిత్రాన్ని మనం [illegible]చినట్లయితే మనకు జీవంలేని ఏ యంత్రం యొక్క అవసరమూ ఉండదు. వాటిని పెద్ద ఎత్తున ఉపయోగించే బదులు మనం దాన్ని తక్కువగా ఉపయోగించ వచ్చు. అపుడే జీవితానికి రక్షణ, ఆత్మరక్షణ కలుగుతాయి.

*(చరఖా సిద్ధాంతం (1951) పే. 86-88)*

★ ★ ★

నా దృష్టిలో స్వయం సమృద్ధి అంటే గ్రామాలు ఆహారం, బట్ట మరియు యితర కనీసావసరాలను తీర్చుకోవడంలో స్వయం సంపద్వతం గావించబడాలి. అయితే దీన్ని కూడా ఎత్తి వేయవచ్చు. అందుకే మీరు నా సలహా జాగ్రత్తగా వినాలి. నా ఆలోచనను మీరు స్పష్టంగా గ్రహించాలి. స్వయం సమృద్ధి అంటే యిరుకు గదిలాగా యిక్కడ ఉన్నట్లు ఉంటుందా? స్వయం సమృద్ధిగా ఉండడమంటే సంపూర్తిగా ఆత్మ తృప్తితో ఉండడంకాదు. ఎట్టి పరిస్థితుల్లోనూ మనకు కావల్సిన వస్తువులన్నింటిని మనమే తయారు చేసుకోలేము. అందువల్ల మన తుదిలక్ష్యం సంపూర్ణ స్వయం సమృద్ధే. అయినా, మనగ్రామంలో దొరకని దాన్ని బయటి గ్రామాలనుంచి తెచ్చుకోవలసి వస్తుంది. మనం తయారు చేయగలిగిన దాన్ని మరింత ఎక్కువగా తయారు చేయడం ద్వారా మనం తయారు చేయలేని దాన్ని పొందడం కోసం. మారకంగా ఉపయోగించ వచ్చు.

*(ఖాదీ - ఎందుకు మరియు ఎలా (1959) పే. 166)*

★ ★ ★

ఆహారానికి సంబంధించి భారతదేశానికి అనంతమైన సారవంతమైన భూమి ఉంది. కావలసినంత నీరు ఉంది. మానవ శక్తికి కొదవే లేదు. తన కాళ్ళపై తానే నిలబడేటట్లు ప్రజలను చైతన్య పరచాలి. వారి కాళ్ళమీద

వారు నిలబడగలరని తెలుసుకొన్నారంటే అది యిక వాతావరణాన్ని ఎన్నో రెట్లు బలోపేతం గావిస్తుంది.

*(హరిజన్ 19-10-47 పే. 379)*

★ ★ ★

స్వయం సమృద్ధి అనేది చాలా పెద్ద పదం తన ప్రాథమిక అవసరాలను తీర్చుకోవడంలో గ్రామాలు స్వయం సంపన్నంగా ఉండలేకపోతే అంతర్గత కొట్లాటలు, అసంతృప్తి వల్ల జరిగే తిరుగుబాట్ల నుంచి రక్షించుకోలేకపోతే, బందిపోటు దొంగతనాలనుంచి స్వీయరక్షణ కల్పించుకోలేకపోతే అవి తుడిచి పెట్టుకపోతాయి. అందువల్ల స్వయం సమృద్ధి అంటే మనుషులకు ఆహారం పండించడం పశువుల మేత లభించేలాచూసుకోవడం, ప్రత్తిని పెంచడమని అర్థము. ఈ పని చేస్తే తప్ప లేకపోతే క్షుద్బాధ తాండవిస్తుంది. స్వయం సంపన్నం కావడమంటే అంతర్గత విబేధాలను గ్రామాలలోని పెద్దమనుషుల ద్వారా పరిష్కరిస్తూ పారిశుధ్యం అంటు వ్యాధులను నివారించి పరిశుభ్రతను కాపాడే వ్యవస్థను కలిగి ఉండడమే. ఏ ఒక్క వ్యక్తిగత కృషి ఈ యజ్ఞానికి సరిపోదు. అన్నింటికీ మించి, తమ సమిష్టి కృషితో దొంగలు, బందిపోట్ల బారినుంచి గ్రామాలను కాపాడుకోవడం గురించి తమ శక్తి సామర్థ్యాలను గుర్తించేలా గ్రామ వాసులకి తెలియచెప్పాలి. ఇది వ్యవస్థాగతమైన అహింస ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. అయితే, అహింసకు మార్గం కార్మికులకు స్పష్టంగా తెలియకపోతే మాత్రం హింసద్వారా వ్యవస్థాగతమైన రక్షణకు పూనుకోవడానికి వారు సందేహించరు.

*(హరిజన్ 5-4-42, పే. 107)*

★ ★ ★

అవసరమైతే సమస్త ప్రపంచాన్ని ఎదిరించి తన్ను తాను కాపాడుకొనే విధంగా తన వ్యవహారాలను సరిదిద్దుకొనే శక్తి ప్రతీ గ్రామానికీ ఉండాలి.

*(హరిజన్, 28-7-46, పుట 236)*

## అధ్యాయము 44

# సహకారం

సరియైన నడవడిక సహకారానికి నాంది.

*((మహాత్మాగాంధీ ప్రసంగాలు, రచనలు, 4వ కూర్పు, పుట 356) )*

★ ★ ★

వ్యక్తి స్వేచ్ఛ, పారస్పరిక ఆధారం, రెండూ సమాజానికి కావాలి. తన అవసరాల నిమిత్తం చేయగలిగినదంతా చేసి, పిదప ఇతరుల సహకారాన్ని అర్థించాలి. ఒంటిపిల్లి రాకాసిగా ఉండరాదు.

*(హరిజన్, 31-3-46, పుట 59)*

★ ★ ★

స్వావలంబనం వలెనే, సహకారం, మానవుడికి ఆదర్శం కావాలి. విశ్వసౌభ్రాతృత్వానికి అది ప్రథమ సోపానం. అహంకారాన్ని అంతం చేస్తుంది. సత్యం అనే గీటురాయిపై తన శక్తిని, విశ్వాస పరీక్షానంతరం, సిద్ధపరిచేటట్లుచేస్తుంది. అంతటాతానే సర్వశకిమంతుడననే భావన ఆత్మ ఘాతము. సమాజంపై ఆధారపడడం అనునది వినమ్రతను నేర్పి, వసుధైక కుటుంబకం అన్న సత్యాన్ని తెలియజేస్తుంది.

*(యంగ్ ఇండియా, 13-5-26 పుట 179)*

★ ★ ★

చేతిని చిన్నచూపు చూసే కన్ను గర్విష్ఠి, అది నష్టపోతుంది. శరీరావయవాల వలెనే, పరస్పర సహాయం లేనిది, సమాజజీవనం ముందుకుసాగదు. అట్టి సహకారబుద్ధిగలవారే, దేశాన్ని ఉద్ధరిస్తారు.

*(యంగ్ ఇండియా 13-5-36, పుట 179)*

★ ★ ★

నీటిబిందువులు స్నిగ్ధభావంతో, సముద్రం అవుతాయి.

*(హరిజన్, 7-9-47, పుట 311)*

★ ★ ★

వ్యక్తి ఏకకం; అయినా అందరితో కలిసిపోవాలి.

*(హరిజన్ 28-7-46 పుట 236)*

★ ★ ★

మానవులు పరస్పరం సహకరించుకొని, అందరిమంచి కోసం పాటు పడాలి.

*(హరిజన్ 2-2-47 పుట 3)*

★ ★ ★

బ్యాంకులోని, లక్షల రూపాయలు, ఒక బాంబుతో మసి అవుతాయి. ఆ ద్రవ్యరాశిని భాగస్థులకు పంచితే, అంతా సంతోషిస్తారు. సహకారం స్వచ్ఛందంగా ఉంటే, నాజీలు, రష్యనుల విధానం కంటే మెరుగై ఉంటుంది.

*(మహాత్మా, 6, 1953, పుట 120)*

★ ★ ★

బలవంతంగా సహకారాన్ని కోరితే, నిష్ఫలం. ఇట్టిచోట్ల ఆదేశాలు పనిచేయవు. వ్యక్తిత్వం నశిస్తుంది. బుజ్జగింపుతో సత్ఫలితాలు కలుగుతాయి.

*(హరిజన్ 9-3-47 పుట 58)*

★ ★ ★

సహకారరంగం, నిజాయితీ మీద, నిలకడగా ఉంటుంది.

*(హరిజన్ 6-10-46, పుట 344)*

★ ★ ★

నాకు, సహకారరంగంలో 'అ,ఆ'లు రావు. ఇతరులపనిని చూసి, వ్యక్తిత్వం మీదనే సిద్ధాంత సాఫల్యం ఆధారపడి ఉంటుందని గ్రహించాను. ప్రయోగాలు చేయడంలో జాగ్రత్త పాటిస్తాను. గొప్పలు చెప్పి, పేరుతెచ్చుకునే ప్రయత్నం చేయను. క్రమశిక్షణస్థానం, కర్కశమైనదైనా గట్టిది.

బ్యాంకులలో పరపతి విధానము నాకు సరిపడలేదు. "ఎంత పెద్ద మోసకారి అయితే, అంత ఎక్కువ పరపతి ఉంటుంది బ్యాంకులలో" అన్నమాట ఛలోక్తికాదు. ఈ కొండచిలువ చుట్టలలో ఊపిరి ఆడనీయక, ఆర్థిక ఇబ్బందులుఅంతిమ శ్వాసకు చేరుస్తాయి. యుద్ధంలో వలెనే,

ఎంతకాలమైనా, ఎవడు నిలబడతాడో, వాడేవిజయాన్ని, ఆర్థికంగా సాధిస్తాడు. సహకారరంగంలో అప్పులు దొరికితే అధర్మ ప్రవర్తన ఆగిపోదు. అయితే ఋజుమార్గంలో పోయే ప్రయత్నం చేయువారికి, సాయాన్ని అందిస్తుంది. సంపద కలిగిన వాడు ధర్మవర్తనుడనే ఊహ పూర్తిగా నిజంకాదు. ఎంత వ్యాపారం చేశాము. ఎన్నిశాఖలు ఉన్నాయి అని అంచనావేస్తే, తప్పు కావచ్చు. నిజాయితీగా ఇచ్చిన అప్పుసరిగా వినియోగమయినదా, లేదా గమనించి, తిరిగి వసూళ్లు చేయుట బ్యాంకు విధి.

నేత పని వారికి సాయం చేస్తున్నవారు ధన్యులు. ఈ కుటీరపరిశ్రమ, తీరిక సమయాల్లో గ్రామీణులకు ద్రవ్యార్జన విధానమై ఉండేది. సంస్కరణ రావాలి. చదువుకున్నవారు ప్రభుత్వోద్యోగాల కొరకు వెంపర్లాడక, స్వయం ఉపాధి పథకాలను చేపట్టాలి. స్వచ్ఛంద సంస్థలు, వృత్తి విద్య మరచిన వారిని, మేలుకొల్పి, వారి విద్యలను పునరుజ్జీవింపచేయాలి. ఆశ్రమంలో జరిగిన ప్రయోగాలు సఫలం అయ్యాయి. ఆదర్శవంతమైన సహకారరంగం ముందు, 'మోసకారులు పరస్పరం సహకరించుకునే ఏర్పాట్లు' దెబ్బతింటాయి (రస్కిన్ మాటల్లో)

*((మహాత్మాగాంధీ రచనలు, ప్రసంగాలు 4వ కూర్పు, పుటలు 356-63)*



పాడిపరిశ్రమ, సహకారరంగంలో, పుష్టి చెందుతుంది. ప్రపంచంలో ప్రతిచోటా సహకారరంగం బాగా పనిచేస్తున్నా, ఇండియాలో ఇంకా ప్రేళ్లూనలేదు. ఎండిపోయిన ఆవులను, పశువులను కసాయి వాడికప్పగించే కంటె కట్టుగా ఉండి వాటిని పోషించడం సత్కార్యం.

1. పశువుల కొట్టాలు ఒక చోటనే ఉంచి సహకార రంగంలో ఆధునిక పద్ధతులలో పాడి పరిశ్రమను పెంచాలి. ప్రతిరైతూ తనభాగం తాను పనిచేసి తీసుకుంటాడు. ప్రతి ఇంట్లో రొచ్చుగుంటలు ఉండవు. ఉండకూడదు.
2. పశువుల పోషణ బాగా ఉంటుంది.
3. వైద్యం జరుగుతుంది.
4. గర్భధారణ సరిగా చేయించవచ్చు.

5. మేతకు బీడు దొరుకుతుంది.

6. పశుగ్రాసం సరసమైన ధరకు దొరుకుతుంది.

7. పాల అమ్మకంసరిగా జరిగిపాలలో నీళ్లు కలపడం ఆగుతుంది.

8. ప్రయోగాలు - వైజ్ఞానికంగా - సాధ్యం.

9. వ్యక్తిగతంగా పడినపాట్లు అంతరిస్తాయి.

అదే విధంగా, వ్యవసాయరంగంలో కూడ, సహకారం మేలు చేస్తుంది. భూమిని ముక్కచెక్కలుగాకుండా చేస్తుంది.

మంది మనసులలో ఆలోచనావిధానంలో మార్పు రావడానికి సమయం కావాలి.

*(హరిజన్ 15-2-42. పుట 39)*

★ ★ ★

రైతులు, తమ పొలాలను కలిపి సేద్యం చేసి పంటను పొలవిస్తీర్ణం అనుపాతంలో పంచుకోవాలి. దీనివలన చాలా కలిసి వస్తుంది. అభివృద్ధి ఉంటుంది. వర్గ సంఘర్షణలు ఉండవు.

*(హరిజన్ 9-3-47. పుట 59)*

★ ★ ★

కర్షకులకు సహకారరంగం ఒక వరం.

*(హరిజన్ 9-3-47, పుట 59)*

★ ★ ★

**అధ్యాయము 45**

# ధర్మకర్తృత్వం

భగవద్గీతలో అపరిగ్రహము సమభావము అందరికీ ముఖ్యం అని చెప్పబడినది. ఆస్థి తగవులకు, మూలం. దీనిని 'ధర్మకర్త'గా వాడితే సమస్యలు తీరిపోతాయి. ఇంగ్లీషు చట్టాలలో కూడ దీనినిగురించి అవగాహన ఉంది. మనస్సును మార్చుకొని ధర్మకర్తృత్వ మార్గాన్ని అవలంబిస్తే చాలు.

*(ఆత్మకథ 1966 పుట 198)*

అంతా దేవునిదే. పంచిపెట్టి జాగ్రతగా కాపాడమన్నాడు. సర్వశక్తి మంతునికి, తన దగ్గర దాచవలసిన పనిలేదు. ధర్మకర్తలనుగా చేసి మనదగ్గర ఉమ్మడి ఆస్థిని పదిలపరిచాడు. ఈధర్మకర్తృత్వ భావనను అందరూ సమ్మతిస్తే, అది చట్టబద్ధమవుతుంది. ఇండియా ప్రపంచానికి దారి చూపగలదు. సంగ్రహించి దాచడం, పంచిపెట్టకపోవడమే యుద్ధాలకు దారి తీస్తుంది.

*(హరిజన్ 23-2-47 పుట 39)*

★ ★ ★

పుట్టుకలో అందరమూ సమానమే. కాని కృషిలో వ్యత్యాసం ఉంది. ఆకారం, బరువు, అలవాట్లు భిన్నములే. బుద్ధిమంతులు సమష్టికోసం తమ శక్తి యుక్తులను వినియోగించాలి. వారు ధర్మకర్తలుగా ఉండాలి. తండ్రి సంపాదన సంతానానికెట్లో, ధర్మకర్తల వలన కలిగిన లబ్ధి, సమాజానికి చెందుతుంది. 'ఇంతవరకూ కొల్లగొట్టారు. ఇప్పుడైనా ఇచ్చివేయండి అంటాను స్వంత లాభం కొంతమానుకొని పరులకోసం పాటుపడమని అంటాను

*(యంగ్ ఇండియా. 26-11-31, పుటలు 368-69)*

★ ★ ★

ఎంతచెప్పినా మార్పురాకపోతే అహింసాత్మక సహాయనిరాకరణ అనె రామబాణం ఉండనే ఉన్నది. 'చతుష్పాత్తుగా' ఉండేస్థితి నుంచి 'ద్విపాత్తుగా' అయిన పరిణామ దశలో అహింస అతని ఆత్మకు అలవడింది. దీనిని పేదవారు తెలిసికొని అమలు పరిస్తే విజయం తథ్యం. బానిసత్వం పరాన్నభుక్కుగా ఉండడం, కాళ్లా, వేళ్లా పడి దేబిరించడం అంతమైపోతాయి. మాడ్చి చంపే అసమానతలు అంతరిస్తాయి.

*(హరిజన్ 25-8-40. పుటాలు 260-61)*

★ ★ ★

వారసత్వంగా లభించిన అంతులేని ధనం అపరిగ్రహ విధానంలో అందరికీ చెందుతుంది. ఆస్థిపరులు ధర్మకర్తలవుతారు. పేద కార్మికులు తమ శ్రమ శక్తికి యజమానులవుతారు.

ఎంతమంది దీనిని అంగీకరిస్తారు అనేది అనవసరం. సిద్ధాంతం సరి

అయితే అహింసలో పూర్తి నమ్మకం ఉంటే విజయం లభించగలదు ఆలస్యం అయినా చింతలేదు.

*(హరిజన్ 3-6-39, పుట 145)*

★ ★ ★

ఇది 'గాలిమేడ'కాదు. 'యూక్లిడ్' జ్యామితివలె, నిఖార్సయినది. ఇతరవిధానాలకంటె, ధర్మకర్తృత్వ సిద్ధాంతం మెరుగైనది. ప్రభుత్వం దమనశక్తితో పెట్టుబడిదారీ విధానాన్ని అణచడానికి ప్రయత్నిస్తే అది తాత్కాలికమే అవుతుంది. మొదట అనునయం, దారికి రాకపోతే, దమనం (అతి తక్కువ హింసతో) వలసినచోట కనిష్ట ప్రతి ఫలం ముట్టచెప్పడం (రౌండ్ టేబుల్ కాన్ఫెరెన్సులో నేనన్నట్లు..) అన్ని పద్ధతులలో పని జరపాలి.

*(మోడర్న్ రివ్యూ 1935 పుట 412)*

★ ★ ★

ఈ ధర్మ కర్తృత్వ విధానంలో మోసం దాపరికం ఇవేవీ లేవు. ఆధ్యాత్మికం ధార్మికం గనుక పాపరహితం కూడా ఇందులో ప్రత్యర్థులు తాము తీసిన గోతులలో తామే పడతారు. ఒంటరియై చిక్కినగమై బిక్కుబిక్కుమంటాడు.

*(హరిజన్ 16-12-39 పుట 376)*

★ ★ ★

ధనార్జనలో తప్పుత్రోవలు తొక్కడం సామాన్యం. అయినా వారిలోని మానవత్వాన్ని మేల్కొల్పితే అందరికీ మంచి సిద్ధిస్తుంది. ఈ విషయమే స్వార్థపరులకు 'కనువిప్పు'. అందరిచేతనూ 'మంచివాడు' అనిపించుకోడం ఎవ్వరికి ఇష్టమైన విషయంకాదు? తేన త్యక్తేన భుంజీథాః' అనుమంత్రసారం ఇదే.

ప్రస్తుతం ఆస్థిపరులై ఉన్నవారు వర్గపోరాటమో ధర్మకర్తృత్వమో దేనినో ఒక దానిని ఎంచుకోవాలి. రెండవ మార్గంలో వారే మార్గదర్శకులై ఆస్థిని పెంచి, స్వప్రయోజనాలను త్యజించి సమాజపరం చేస్తారు. ప్రభుత్వం వారిసేవలనుగుర్తిస్తుంది. వారి సంతానం ఏలోటూ, ఏతగాదా లేకుండా,

సుఖంగా ఉంటుంది. ఇండియాకు స్వాతంత్ర్యం లభించినపుడు ఈత్యాగధనులు ప్రజలకోరిక మేరకు ధర్మకర్తలై కొనసాగుతారు. గ్రామపంచాయితీలలో వారి మాటకు నిజమైన విలువ ఉంటుంది.

*(హరిజన్ 31-3-46 పుట 63-64)*

ధర్మకర్తృత్వ భావనవృద్ధి చెందనపుడు, దాన ధర్మాల ప్రసక్తి ఉండదు.

*(హరిజన్ 12-2-42, పుట 116)*

★ ★ ★

తరతరాల అనుభవం వ్యాపారులను, వర్తకులను వారి పనులలో నిష్ణాతులను చేసింది. దాని లాభం సామాన్యులకు కలగాలి. హృదయ పరివర్తన వచ్చిన తర్వాత చట్ట బద్ధత నిర్మాణాత్మకము. ఉదాహరణకు, పరిసరాల శుచి, శుభ్రతలు ప్రజలు పూనుకొననిదే, ఎన్ని శాసనాలు చేసినా అమలుకావు.

హృదయ పరివర్తన అందరిలోనూ కలగాలి. ఆస్థిపరులు, ప్రజల ఇచ్ఛాశక్తివలన మారిపోతారు. ప్రజలకు గల వోటు అధికారం విస్తృతం. శాసన సభల ఆమోదంతోబాటు అన్యాయాన్ని నిలువరించి ఎదిరించే ప్రజల అహింసాయుత అసహాయోగ విధానం అన్ని పరివర్తనలనూ గలుగజేస్తుంది.

*(క్రొత్త దిగంతాలకు 1959, పుట 90-9)*

★ ★ ★

(ఆగాఖాన్ ప్యాలెస్ నుంచి కారాగార వాసం నుంచి గాంధీజీ విడుదలైనారు) శ్రీ కే.జీ. మశ్రూవాలా శ్రీమాన్ డి. పారిఖ్ మహాశయులు ధర్మకర్తృత్వ విధానం చిత్తు ప్రతిని గాంధీజీ ఎదుట ఉంచారు. మహాత్మాగాంధీ దానిని కొద్దిగా సవరించారు. దిగువనిచ్చినది దాని అంతిమ రూపం.)

1. ధర్మకర్తృత్వ విధానం, పెట్టుబడిదారులలో హృదయపరివర్తనకోసం వారికొక అవకాశాన్నిస్తుంది.
2. ఆస్థిపై హక్కు సమాజానిదే
3. దీనికై చట్ట నిర్మాణం చేయవచ్చును.
4. వ్యక్తి, తన ఆస్థిని తనకోసం మాత్రమే వాడుకోరాదు.

5. కనీసవేతనం వలెనే, గరిష్ట ఆదాయం కూడా ఉండాలి. ఈ పరిమితులు చట్టబద్ధంగా ఉంటాయి. చివరికి వీటిమధ్య అంతరం అంతమయ్యే ఏర్పాటు ఉండాలి.
6. ఆర్థిక ప్రణాళిక ప్రకారం అవసరాలను బట్టి ఉత్పత్తులు జరగాలి. ఇష్టారాజ్యం పనికిరాదు.

*(హరిజన్ 25-10-52, పుట 301)*

★ ★ ★

ధర్మకర్తృత్వ విధానంలో వ్యక్తి పరమైన ఆస్థి సమాజపరమైనపుడు, ఆస్థిమీద హక్కు ప్రభుత్వానికి గాని స్వచ్ఛంద సంస్థలైన గ్రామ పంచాయితీ వగైరాలకు గాని ఉండదు. ఆ హక్కు ధర్మకర్తకే ఉంటుంది. అప్పుడే ధర్మకర్త తనకౌశల్యాన్ని ఆస్థిని పెంచడానికివినియోగించి సమాజశ్రేయస్సుకు కారణభూతుడౌతాడు.

ధర్మకర్త తన వారసుని నిర్ణయిస్తాడు. దానిని ప్రభుత్వం ధృవీకరిస్తుంది. ఇది ఉభయత్రా మంచిది. అంతవరకూ పెట్టుబడిదారుల దోపిడీ విధానానికి తలొగ్గము. అనునయం అహింసాయుత అసహాయోగం వారిని దారికి తేలేని నాడు వారు మట్టిలో కలిసి పోతారు.

*(క్రొత్త దిగంతాలకు 1957, పుటలు 86-87)*

★ ★ ★

## అధ్యాయము 46

# పారిశ్రామికీకరణం వల్ల కలిగే కీడు

పెద్ద ఎత్తున పారిశ్రామికీకరణ అమలు జరిపితే పోటీతత్వం మార్కెటింగ్ సమస్యలు వచ్చి తద్వారా గ్రామీణులను ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ దోచుకోవడానికి దారితీస్తుంది. అందువల్ల గ్రామాన్ని ప్రధానంగా తన ఉపయోగంకోసం వస్తువులను తయారు చేసే ఒక యూనిట్‌గా తీర్చిదిద్దేవైపుగా మనం కృషి చేయాలి. గ్రామీణ పరిశ్రమ ప్రధానంగా ఈ లక్షణాన్ని నిలబెట్టుకో గలిగినంతకాలం, గ్రామీణులు తమకున్న కొనుగోలు

శక్తి పరిధిలో ఆధునిక యంత్రాలపై తయారైన వస్తువులను ఉపయోగించడానికి వారికి ఎలాంటి అభ్యంతరం ఉండదు. కాకపోతే ఈ వస్తువులను యితరులను దోచుకొనే సాధనాలుగా వాడరాదు.

*(హరిజన్ 29-8-36 పే. 226)*

★ ★ ★

ప్రస్తుతం దుర్భర పరిస్థితి నిస్సందేహంగా భరించలేనిదిగా తయారైంది. భిక్షమెత్తుకోవడం రూపుమాసి పోవాలి. అయితే దానికి పారిశ్రామికీకరణ మార్గం కాదు. భూతం ఎద్దుల బండిని ఉపయోగించడంలో లేదు. అది మన స్వార్థంలోనూ, యితరులనుకొని పరిహారాన్ని ఆశించడంలోనూ ఉంది. మనకు మనతోటి వారి పట్ల ప్రేమ లేకపోతే ఎంతటి విప్లవకరమైన మార్పు అయినా మనలో ఎలాంటి మార్పును తీసుకరాలేదు.

పాశ్చాత్య దేశాలు యిప్పటికీ అతి పారిశ్రామికీకరణను దోపిడీని చవిచూశాయి. ఈ పారిశ్రామిక నాగరికత ఒక పెనుభూతం. అందువల్ల అది ఒక జబ్బుగా మారుతుంది. పైపై ఆకర్షణీయమైన పదబంధాలకు మనం మోస పోకూడదు. టెలిగ్రాఫ్‌లతోనూ ఆవిరియంత్రంతోనూ నాకు ఎలాంటి తగాదా లేదు. పారిశ్రామికీకరణ మరియు దాని అనుయాయుల మద్దతులేకుండా అవి నిలబడగలిగితే నిలబడవచ్చు. అయితే అవి మాత్రమే లక్ష్యంకాదు. మానవ జాతి దీర్ఘకాలిక సంక్షేమానికి అవి తప్పనిసరి వస్తువులేమీ కాదు. ఇపుడు మనకు విద్యుత్తు ఆవిరి ఉపయోగం తెలిసింది కాబట్టి పారిశ్రామికీకరణను పూర్తిగా వదిలించుకున్న తర్వాత అవసరమైన సందర్భాలలో మనం వాటిని ఉపయోగించుకోవచ్చు. ఇపుడు ఏ రకంగానైనా సరే ఈ పారిశ్రామికీకరణను ధ్వంసం చేయడం గురించే మనం ఆలోచించాలి.

*(యంగ్ ఇండియా 7-10-26. పే. 348)*

★ ★ ★

"నేటి అరాచకానికి మూల కారణమేమిటి?" బలహీనమైన దేశాలను బలమైన దేశాలు దోచుకోవడం కాదు. సోదర దేశాన్ని మరో సోదర దేశం దోచుకోవడమే దీనికి కారణం. యంత్రాలే ఈ విధంగా ఒకదేశాన్ని మరో

దేశం దోచుకోవడానికి కారణ భూతమవుతుందన్నదే ఈ యంత్రాల పట్ల నా ప్రాథమిక అభ్యంతరానికి కారణం. వాస్తవానికి అది కర్రవస్తువే అయినా ఉపయోగించే దాన్ని బట్టి అది మంచిగా లేదా చెడుగా తయారవుతుంది. అయితే మనందరికీ తెలిసినట్లుగా దీన్ని తేలికగా చెడుగా మార్చవచ్చు.

*(యంగ్ ఇండియా 22-10-31, పే. 318)*

★ ★ ★

ఈ పారిశ్రామికవాదం మానవజాతి వినాశనానికి దారి తీస్తుందని నాకు భయంగా ఉంది. ఒక జాతిని మరొక జాతి దోచుకునే పద్ధతి ఎల్లకాలం కొనసాగదు. పోటీదారులు లేకపోవడం విదేశీ మార్కెట్ల తలుపులు నీ కోసం తెరచి ఉంచడం నీ దోపిడీ శక్తి మీద ఆధారపడి ఉంటుంది. ఈ పారిశ్రామిక వాదం. ఈ పై కారణాలు ఇంగ్లాండులో రోజురోజుకి తగ్గుముఖం పట్టడంవలన ఆదేశంలో నిరుద్యోగం దిన దినాభివృద్ధి చెందుతున్నది. భారతీయ బహిష్కరణ ఒక దోమకాటు వంటిది. అంతేగాక భారతదేశం యితర దేశాలను దోచుకోవడం ప్రారంభిస్తే భారతదేశం పారిశ్రామికరించబడితే తప్పకుండా దోచుకొని తీరుతుంది. అది యితర దేశాల వినాశనానికి ప్రపంచానికి ప్రమాదకారిగా మారుతుంది. అందువల్ల యితరులను దోచుకోవడానికి భారతదేశం పారిశ్రామికరించబడాలని నేను ఎందుకు కోరుకోవాలి? మనం ఒక వైపు 30 కోట్ల మందికి పని కల్పిస్తుండగా ఇంగ్లాండు 30 లక్షల మందికి కూడా పని కల్పించలేక మేధావులను సైతం ఆందోళన పరుస్తున్న విషాద పరిస్థితిని మనం కళ్ళారా చూడడం లేదా? అందువల్ల పారిశ్రామిక వాదం యొక్క భవిష్యత్తు చీకటిమయమే. ఇంగ్లాండుకు అమెరికా, జపాన్, ఫ్రాన్స్, జర్మనీ వంటి విజయవంతమైన పోటీదారులున్నారు. అలాగే భారతదేశంలోని మిల్లులలోనూ ప్రకృతి సంపదలతో కూడిన మానవ, ఖనిజ సంపద్వంతమై నేడే జాగరూకమవుతున్న దక్షిణాఫ్రికాలో కూడా ఇంగ్లాండుకు పోటీదారులున్నారు. ఆఫ్రికాలోని బలమైన జాతులముందు బలమైన ఆంగ్లేయులు పిగ్మీల మాదిరిగా కనబడుతున్నారు. ఆఫ్రికన్లు నైతికత్వంతో కూడిన అనాగరికులని మీరు చెప్పవచ్చు. వారు నిశ్చయంగా నైతికులేగాని అనాగరికులు మాత్రం

కారు. మరి కొద్ది సంవత్సరాల్లోనే ఈ పాశ్చాత్య దేశాలవారు ఈ ఆఫ్రికా దేశాల మార్కెట్‌ను కోల్పోకతప్పదు. మరి పాశ్చాత్య దేశాలకే పారిశ్రామికీకరణం భవిష్యత్తు అంధకార మయమవుతుండగా భారతదేశానికి మరింత అంధకారం కాదా?

పండిట్ నెహ్రూ పారిశ్రామికీకరణ కావాలని కోరుకుంటున్నాడు. దాన్ని సామాజికీకరణ గావిస్తే అది పెట్టుబడిదారీ విష ప్రభావాన్నుంచి దూరమవుతుందని ఆయన ఆలోచన. నా అభిప్రాయంలో పారిశ్రామికీకరణ వల్ల దుష్ప్రభావాలు అనివార్యంగా ఉంటాయి. అందువల్ల ఎంత సామాజికీకరణ గావించినా వాటిని నిర్మూలించడం సాధ్యపడదు.

*(హరిజన్ 29-9-40 పే. 299)*

★ ★ ★

పాశ్చాత్య దేశాల తరహాలో భారతదేశం పారిశ్రామికీకరణ వైపు సాగరాదని భగవంతుడు నిర్దేశిస్తున్నాడు. ఒక చిన్న ద్వీపరాజ్యం (ఇంగ్లాండు) యొక్క ఆర్థిక సామ్రాజ్యవాదంనేడు ప్రపంచాన్ని బందీలను గావించింది. 30 కోట్ల జనాభా కలిగిన ఒక సంపూర్ణ జాతి కూడా ఆ విధమైన దోపిడీకి పాల్పడితే యిక ప్రపంచం సర్వనాశనమవుతుంది.

*(హరిజన్ 20-12-28 పే. 422)*

## అధ్యాయము 47

# యంత్రాల స్థాపన

యంత్రాలు ఉండటానికి వచ్చాయి. అయితే వీటికొక స్థానం ఉండాలి. అవసరమైన మానవ శ్రమను కూడా తొలగించి అస్థానంలో యంత్రాలను ప్రవేశ పెట్టకూడదు. అభివృద్ధి పరచిన నాగలి చాలా మంచిది. అయితే ఏదో ఒకరకంగా ఒక్క మనిషి భారతదేశంలోని భూమి మొత్తాన్ని దున్నే యంత్రం ఏదైనా వచ్చిందనుకోండి, దాని ఫలితంగా యిక లక్షలాది మంది నిరుద్యోగులుగా మారి చేయడానికి పనిలేక అర్ధాకలితో అలమటిస్తూ

పనికి రాని వాళ్లుగా తయారవుతారు. ఇప్పటికే చాలా మంది ఆవిధంగా తయారయ్యారు. భవిష్యత్తులో మరింత మంది ఆ విధంగా తయారయ్యే ప్రమాదం పొంచి ఉంది. కుటీర పరిశ్రమలో అభివృద్ధిని నేను ఆహ్వానిస్తాను. అయితే చేతి పనికి బదులుగా విద్యుత్‌తో నడిచే కండెలను ప్రవేశపెట్టడం ఈ మార్పు మూలంగా ఉపాధి కోల్పోయే లక్షలాది రైతులకు వారి యిళ్ళలోనే మరేదైనా వృత్తి కల్పించాలి. లేకుంటే క్రూరాతి క్రూరమైన నేరమవుతుందని నాకు తెలుసు.

*(యంగ్ ఇండియా, 5-11-25, పే. 377)*

★ ★ ★

ప్రజలందరి సంక్షేమానికి ఉపయోగపడే విధంగా యంత్రాలను ఉపయోగించడం చట్టబద్ధమే.

*(యంగ్ ఇండియా, 15-4-26, పే. 142)*

★ ★ ★

విస్తృతంగా యంత్రాలను ఉపయోగించి భారతదేశంలోని దారిద్ర్యాన్ని, దాని ఫలితంగా కలిగే సోమరిపోతుతనాన్ని పారద్రోలగలిగితే అపుడు ఆ ఉపయోగాన్ని నేను ఆహ్వానిస్తాను. చేయడానికి పని లేకపోవడాన్ని నిర్మూలించి దారిద్ర్యాన్ని పారద్రోలేందుకు నేడు అందుబాటులో ఉన్న ఏకైక పని చేనేత అని భావిస్తున్నాను. చరఖా అతి విలువైన యంత్రం. నాకు చేతనైనంతగా భారతదేశ పరిస్థితుల కనుగుణంగా దాన్ని అభివృద్ధి పరచడానికి నా కృషి నేను చేస్తున్నాను.

*(యంగ్ ఇండియా 3-11-21, పే. 350)*

★ ★ ★

"మీరు అన్ని యంత్రాలను వ్యతిరేకిస్తున్నారా?"

'కాద'నే నాగట్టి సమాధానం. అయితే విచక్షణారహితంగా దాన్ని ఉపయోగించడానికి నేను వ్యతిరేకం. పైపైకి కనిపించే యంత్ర విజయాలను గాంచి విభ్రాంతుణ్ణి కావడానికి నేను సిద్ధంగా లేను. వినాశానికి దారితీసే అన్ని యంత్రాలకు నేను నిస్సందేహంగా వ్యతిరేకినే. అయితే మానవశ్రమను

పొదుపు చేసి లక్షలాది కుటీర పరిశ్రమల భారాన్ని తేలిక పరచగల సరళమైన చిన్ని వస్తువులు తయారుచేసే యంత్రాలను నేను ఆహ్వానిస్తాను.

*(యంగ్ ఇండియా 17-6-26, పే.218)*

★ ★ ★

యంత్రాలను కాదు, యంత్రాలపట్ల మోజును నేను వ్యతిరేకిస్తున్నాను. శ్రమనుపొదుపు చేస్తాయని వారు చెప్పుకొనే యంత్రాల మీద చాలా మోజుఉంది. వేలాది మందికి పని లేక వీధుల్లోకి నెట్టబడి అర్ధాకలితో అలమటించే వరకూ వీరు మానవ శ్రమను పొదుపుచేస్తూనే ఉంటారు. ఏ అతికొద్ది మందికో కాదు సమస్త ప్రజానీకానికి సమయాన్ని శ్రమను ఆదా చేయడాన్ని నేను కోరుకుంటాను. సంపద ఏ కొద్ది మంది చేతుల్లోనో ప్రోగు పడకుండా సమస్త ప్రజానీకానికి చెందాలని నేను కోరుకుంటాను. లక్షలాది మంది వీపు మీద కొద్ది మంది స్వారీ చేయడానికి నేడు యంత్రాలు ఉపయోగపడుతున్నాయి. దీని వెనుక ఉన్న అసలైన రహస్యం శ్రమను పొదుపు చేయడం కాదు కేవలం దురాశ మాత్రమే. ఇదిగో ఈ విధమైన చర్యలకు వ్యతిరేకంగానే నా శక్తికొద్దీ నేను పోరాడుతున్నాను.

"అంటే మీరు యంత్రాలకు వ్యతిరేకంగా గాక నేడు సర్వత్రా కన్పిస్తున్నట్లుగా వాటి దుర్వినియోగానికి వ్యతిరేకంగా పోరాడుతున్నారా?"

నిస్సందేహంగా అవుననే నాసమాధానం. అయితే శాస్త్ర సాంకేతిక విజయాలెప్పుడూ దురాశా పరులైన కొద్దిమంది చేతుల్లో కీలుబొమ్మలుగా ఉండే విధానం నిర్మూలించబడాలి. అపుడు శ్రామికులు అధిక పని చేయవలసిన అవసరం ఉండదు. అపుడు యంత్రాలు అడ్డుగోడలుగా గాక సహాయకులుగా ఉపయోగపడతాయి. అందువల్ల సమస్త యంత్రాలను నిర్మూలించడానికి గాక వాటిని నియంత్రించడానికీ నేను పూనుకొంటున్నాను.

"అన్ని సంక్లిష్టమైన శక్తితో నడిచే యంత్రాలు నిర్మూలించబడాలని మీ భావన అని అర్థం చేసుకోవచ్చా?"

వాటిని నిర్మూలించవలసి రావచ్చు. అయితే యిక్కడొక విషయం మీకు స్పష్టంగా చెప్పాలి. అన్నింటికంటే సర్వోన్నతుడు మనిషి. మానవశక్తిని

నిరుపయోగపరిచే విధంగా యంత్రం ఉపయోగం ఉండకూడదు. ఉదాహరణకి మీకు కొన్నింటిని సోదాహరణంగా చెబుతాను. కుట్టు యంత్రాన్నే తీసుకొండి. ఇప్పటి వరకూ కనుగొన్న వాటిలో యిదొకటి బాగా ఉపయోగ పడేది. దీన్ని కనుక్కోవడం వెనుక ఒక ప్రేమ కథ కూడా ఉంది. తన భార్య విపరీతంగా కష్టపడుతూ చేతితో కుట్టుడు పనినిచేస్తుండడాన్ని గమనించిన సింజర్, ఆమె పై ప్రేమకొద్ది ఆమెశ్రమను తగ్గించడంకోసం అయిన ఆ కుట్టు యంత్రాన్ని కనిపెట్టాడు. అయితే ఆయన తన భార్య శ్రమనే కాక ఆ కుట్టు యంత్రాన్ని కొనుక్కో గలిగి ప్రతి ఒక్కని శ్రమనూ తగ్గించగలిగాడు. అయితే ఈ విషయంలో సింజర్ కుట్టు యంత్రాలను తయారు చేయడానికి ఒక పరిశ్రమ ఉండాలి గదా. దానియందు శక్తితో నడిచే యంత్రాలు కూడా ఉండాలిగదా."

అవును, అయితే అలాంటి పరిశ్రమలను జాతీయం చేయవచ్చు. లేదా ప్రభుత్వాధీనంలోనే నడపవచ్చు. అవి లాభాలకోసంగాక తప్పనిసరిగా మానవ కళ్యాణంకోసమే ఆదర్శంగా నడపబడాలి. దురాశ స్థానంలో ప్రేమచోటు చేసుకోవాలి. నేను కోరుకొనే శ్రమశక్తికిప్రత్యామ్నాయమది. సంపదకోసం పరుగులెత్తే ఈ వెర్రినశించాలి. కార్మికులకు జీవించేటందుకే వేతనం మాత్రమేకాక బానిసత్వాన్ని తొలగించే విధంగా పని కల్పించబడుతుందని హామీ యివ్వాలి. ఈ పరిస్థితుల్లో యంత్రం రాజ్యానికి మాదిరిగానే ప్రతిఒక్కరికీ సహాయకారిగా ఉంటుంది. ప్రస్తుతం ఉన్న ఈ వెర్రి నశిస్తుంది. నేను యిపుడే చెప్పినట్లుగా కార్మికులు ఆకర్షవంతమైన, ఆదర్శమైన పరిస్థితులలో పని చేస్తుంటారు. ఇది నాకున్న ఆలోచనల్లో ఒకటి. కుట్టు యంత్రం వెనుక ప్రేమ దాగిఉంది. వ్యక్తియే అన్నింటికి మించిన సర్వోత్తముడు. శ్రమశక్తిని పొదుపు చేస్తూ దురాశతోగాక నిజాయితీతో కూడిన మానవసేవే లక్ష్యంగా కొనసాగాలి. దురాశస్థానంలో ప్రేమను పంచితే మిగతావన్నీ సక్రమంగానే సాగుతాయి.

*(యంగ్ ఇండియా 13-11-24, పే. 378)*

★ ★ ★

"ఓహో! మీరు ఈ యంత్ర యుగానికి వ్యతిరేకమన్నమాట" చెప్పాలంటే అది నా అభిప్రాయాలను వక్రీకరించడమే నేను యంత్రాలకి వ్యతిరేకంగాదు. కాని యంత్రం మనకు యజమానిగా మారడాన్నే నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను.

మీరు భారత దేశాన్ని పారిశ్రామికీకరణ గావించరా?"

నేను చేస్తాను, అయితే ఆ పని నా అర్థం ప్రకారం మాత్రమే చేస్తాను. గ్రామీణ వ్యవస్థలని పునరుద్ధరించాలి. భారతీయ గ్రామాలు భారతీయ పట్టణాలకి నగరాలకి కావలసిన వన్నీ పండించి సరఫరా చేస్తాయి. మన పట్టణాలు ఎపుడైతే విదేశీ మార్కెట్లుగా తయారయ్యాయో, ఎపుడైతే విదేశాలనుంచి నాసిరకమైన వస్తువుల్ని తెచ్చిగ్రామాల్లో గుట్టలుగా పడవేసి గ్రామాలను పీల్చి పిప్పి చేయసాగాయో అపుడే భారతదేశం దరిద్ర దేశంగా తయారయింది.

"మరి మీరు సహజ ఆర్థిక వ్యవస్థ వైపుగా వెనుకకు మరలుతారా?"

అవును. లేకపోతే నేను పట్టణానికి వెనుదిరిగి వెళ్ళాలి. ఒక పెద్ద పరిశ్రమను నడిపించగల సామర్థ్యం నాకు ఉండికూడా నేను కావాలనే ఆ ఆశను త్యాగం చేశాను. ఎందుకంటే కేవలం త్యాగం చేయడం కోసమే కాదు. నా హృదయం దాన్ని వ్యతిరేకించింది. రోజురోజుకి కొనసాగుతున్న జాతి పీడనలో నాకు ఎలాంటి వాటా ఉండరాదని నా భావన. అయితే గ్రామాన్ని నేను వేరే పద్ధతిలో పారిశ్రామికీకరిస్తాను.

*(హరిజన్, 27-2-37 పే. 18)*



ఒక వేళ మానవుని అవసరాలన్నింటినీ యంత్రం తీర్చగలదని అనుకున్నా. అది ఉత్పత్తిని కొన్ని ప్రాంతాల్లోనే చేస్తుంది కాబట్టి వాటిని పంపిణీ గావించడానికి మళ్ళీ మనం చుట్టూ తిరగాలి. ఎక్కడైతే వస్తువులు అవసరమో అక్కడే వాటి ఉత్పత్తి జరిగితే పంపిణీ దానంతటఅదే నియంత్రించబడుతుంది. అపుడు మోసం దగాలకు స్థానం చాలా తక్కువగా ఉంటుంది.

ఎప్పుడైతే ఉత్పత్తి మరియు పంపిణీ రెండూ స్థానికం గావించబడతాయో ఏ విధంగానైనా సరే నిరంతరంగా ఉత్పత్తిని వేగిర పరచాలనే దురాలోచన నశిస్తుంది. నేడున్న మన ఆర్థిక వ్యవస్థలో మనకు కన్పిస్తున్న అనంతమైన సమస్యలు కష్టాలు కూడా అపుడు పరిష్కారమవుతాయి.

"అంటే భారతదేశ భవిష్యత్తుకి అధికస్థాయిలో ఉత్పత్తి పనికిరాదని మీరు భావిస్తున్నారా?"

భారీ ఉత్పత్తి తప్పని సరిగా అవసరమే, అయితే అది బలవంతంగా మాత్రం జరగకూడదు. చరఖా సందేశం అదే. అది భారీ ఉత్పత్తే అయితే ఆ భారీ ఉత్పత్తి ప్రజల స్వగృహాల్లో జరుగుతుంది. వ్యక్తిగత ఉత్పత్తిని నీవు కొన్ని లక్షలసార్లు రెట్టింపు చేయగలిగితే అది అత్యంత భారీస్థాయిలో భారీ ఉత్పత్తికి దారితీయదా? అయితే "భారీ ఉత్పత్తి" అంటే అత్యంత సంక్లిష్టమైన యంత్ర సహాయంతో అతికొద్ది మందితో సాగే ఉత్పత్తి అనే సాంకేతికార్థంలో మీరు ఆ పదాన్ని వాడుతున్నారని నాకు తెలుసు. అయితే అది తప్పని నాకు నేను చెప్పుకొంటున్నాను. లక్షలాది మంది యిళ్ళలో ప్రవేశపెట్టగలిగే విధంగా నా యంత్రాలు అత్యంత ప్రాథమికమైనవిగా ఉంటాయి.

*(హరిజన్, 2-11-34, పే. 301-02)*



పరిశ్రమలు లేకుండా మనిషి జీవించలేడని నాకు తెలుసు. అందువల్ల పారిశ్రామికీకరణను నేను వ్యతిరేకించను కాకపోతే యంత్ర పరిశ్రమ ప్రవేశం పట్లనే నేనుతీవ్ర ఆందోళన చెందుతున్నాను. యంత్రం అత్యంత వేగంగా ఉత్పత్తి చేస్తుంది దానితో పాటు నేను జీర్ణించుకోలేని అదోరకమైన ఆర్థిక వ్యవస్థను తెస్తుంది. ఏదైనా ఒకటి తాను చేసే మంచికంటే దుష్ప్రభావాన్నే ఎక్కువగా కల్గిస్తున్నపుడు అలాంటి దాన్ని నేను అంగీకరించలేను. నా దేశానికి చెందిన లక్షలాది మంది నోరులేని అమాయకులు ఆరోగ్యంగా సంతోషంగా ఉంటూ ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందాలని నేను కోరుకుంటాను. అయితే ఈ పనికోసం మనకు ఏ యంత్రమూ అవసరము లేదు. ఇక్కడ ఎన్నో మరెన్నో ఖాళీచేతులున్నాయి. అయితే మనం పరిస్థితులను అర్థం చేసుకున్నకొద్దీ,

అప్పటికీ మనకు యంత్రాలు అవసరమని భావిస్తే తప్పనిసరిగా మనం వాటిని కలిగి ఉండవచ్చు. మనకు పరిశ్రమ కావాలి. మనం పారిశ్రామికంగా తయారు అవుదాం. మనం మరింత స్వయం సమృద్ధి సాధిద్దాం. అపుడు మనం యితరులను అంతగా అనుకరించవలసిన అవసరం ఉండదు. మనకి ఒక వేళ ఎపుడైనా అవసరమైతే, యంత్రాలను ప్రవేశ పెడదాం. ఒకసారి మనం మన జీవితాన్ని అహింస ఆధారంగా రూపుదిద్దుకోగలిగితే యంత్రాన్ని ఎలా నియంత్రించాలో మనకు తేలికగానే బోధపడుతుంది.

*(నూతన అవకాశాలవైపు (1959) పే. 45-46.)*

★ ★ ★

## అధ్యాయము 48

# - చేనూలు

ఆర్థిక స్వాతంత్ర్యం, సమానత, ఖాదీ వల్లనే సాధ్యం. "స్వదేశీ" భావనతో, గ్రామీణ వనరులతో, ఖాదీ నిండి ఉన్నది.

హృదయ పరివర్తన ముఖ్యం. వ్యక్తి ప్రాముఖ్యత పెరగాలి.

ఇందియాలోని మానవత్వానికి ప్రతీక ఖాదీ. జవహర్‌లాల్ నెహ్రూ అన్నట్లు "ఇండియా స్వాతంత్ర్యం దుస్తు" ఖాదీ. వికేంద్రీకరణ ఖాదీ.

*(నిర్మాణాత్మక కార్యక్రమాలు, 1961, పుట 12-13)*

★ ★ ★

రాట్నం సందేశం విస్తృతం. సేవాభావం, వినమ్రత, పేదల ధనికుల స్నేహసంబంధం, పెట్టుబడిదారుల కార్మికుల మైత్రీ బంధం, రాజూ, రైతుల ఆత్మబంధం ఖాదీ.

*(యంగ్ ఇండియా, 17-7-'25, పుట 321)*

★ ★ ★

నూలు వడుకుట శరీర శ్రమలలో ఉత్తమం. ఆస్థిని అందరకూ సమానంగా పంచాలన్న సందేశానికి ప్రతీక రాట్నం.

*(యంగ్ ఇండియా, 20-10-21 పుట 329)*

★ ★ ★

రాట్నం, మగ్గం, ఇండియాలో ఆర్థిక పునరుత్థానానికి ప్రతీకలు. సాలె వానికే కాదు, మనకందరికి గుడ్డనిచ్చి, ఆ పరిశ్రమలోని వారికి కూడు పెడుతున్నది.

*(యంగ్ ఇండియా, 21-7-'20 పుట 4)*

★ ★ ★

ఇండియాలో కర్షకునికి, ఏడాది పొడుగునా చేతినిండా పనిలేక, ఆకలి దప్పులకు నకనకలాడుతున్నాడు. వారి తీరిక సమయాలలో రాట్నం ఉపాధి కల్పించితే వారి కడుపు నింపుతూంది.

*(యంగ్ ఇండియా, 3-11-21, పుటలు 350-51)*

★ ★ ★

కుటీర పరిశ్రమల ఉత్పత్తుల ధరలు, గ్రామీణులకు అందుబాటులో ఉంటాయి.

*(యంగ్ ఇండియా, 8-12-'21, పుటలు 350-51)*

★ ★ ★

1. ఉపాధి కల్పన.
2. అందరికీ తెలిసిన విద్య.
3. దీనిని నేర్చుట సులభం
4. పెట్టుబడి నామమాత్రం లేదు అనవచ్చును.
5. రాట్న చక్రం తయారీ సుళువు. కదురుతో, తొడపై వడికి, ప్రత్తి నుంచి, దారాన్ని తీయవచ్చు.
6. ప్రజలకు వైముఖ్యత లేదు.
7. కరువు, కాటకాలతో ఏడుగడ.
8. విదేశీ వస్త్ర బహిష్కారానికి, తద్వారా దేశంలోని ధనం, విదేశాలకు పయనించకుండా ఉండేందుకు, అత్యవసరం.
9. ఆ పొదుపైన ధనము, లక్షలాదికి పంపకం అవుతుంది.
10. స్వల్ప సాఫల్యత, ప్రజలకు, సత్వరమే లబ్ధిని చేకూరుస్తుంది.

11 ప్రజలలో సహకారాన్ని పెంచేందుకు సశక్తమైన పరికరం.

*(యంగ్ ఇండియా, 21-8-'24, పుట 277)*

★ ★ ★

ధన రాహిత్యం కాదు. ఉపాధి రాహిత్యం ప్రధాన సమస్య. రాట్నం పనిలేని వారికి పనిని కల్పిస్తుంది.

*(యంగ్ ఇండియా, 18-6-25, పుట 211)*

★ ★ ★

పనిలేక ఊరికే తిరగడం, అన్ని బాధలకూ మూలం. అట్టి వారికి రాట్నం ఆశాకిరణం.

*(యంగ్ ఇండియా, 27-8-'25, పుట 299)*

★ ★ ★

రాట్నం, శూన్యంలోంచి ఉత్పత్తిని సాధించే పరికరం. దీని వల్ల 60 కోట్ల రూపాయల దేశ సంపద ఆదా అవుతుంది.

*(యంగ్ ఇండియా, 17-2-'27, పుట 52)*

★ ★ ★

ఒకచోట హరిజనులు రాట్నం వడుకుతున్నారు. ఈ విధంగా ఇంకో ఉపాధి దొరకని వారికి రాట్నం అన్నం పెడుతూంది.

*(హరిజన్, 27-4-'34, పుట (85)*

★ ★ ★

రాట్నం, వ్యక్తుల శక్తిని సమీకరిస్తుంది. మన దేశ బలాన్ని వృద్ధి చేస్తుంది

*(యంగ్ ఇండియా, 27-5'26, పుట 190)*

★ ★ ★

లక్షలాదికి రాట్నం కొంగుబంగారం. ఆదాయం తక్కువే గాని అందరికీ అందుబాటులో ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 30-9-'26, పుట 34)*

★ ★ ★

రాట్న పునరుత్థానానికి, దేశభక్తులంతా పూనుకోవాలి. ముస్లింలకు,

హిందువులకు, ఇది తిండి బెట్టింది. అందరూ కోరుకొనే "స్వరాజ్" రాట్నం. మగ్గాల ద్వారా సాధ్యం.

*(హరిజన్, 13-4-'40, పుట 85)*

★ ★ ★

ఇందువలన వ్యాపార పోటీ పెరగదు. సామరస్యం ఎక్కువ అవుతుంది స్వావలంబన సాధ్యమై, శాంతి సందేశం వినిపిస్తుంది.

*(యంగ్ ఇండియా, 8-2-'21. పుట 406)*

★ ★ ★

జన జీవితం కుదుటబడి, ఆధునిక నాగరికత బారిన పడకుండా, శాంతి సౌఖ్యాలను ప్రపంచానికి, ఇండియా, రాట్నం - మగ్గాల వాడుకవలననే, అందచేయగలుగుతుంది.

*(యంగ్ ఇండియా 29-6-'21, పుట 206)*

★ ★ ★

ఖాదీ పునరుద్ధరణ జరిగితే, అన్ని పరిశ్రమలు నడిచివస్తాయి.

*(యంగ్ ఇండియా, 21-5-'25, పుట 177)*

★ ★ ★

*చేనూలుకు బదులుగా ఖాదీని ఇస్తే, ఖాదీ సర్వవ్యాపకమౌతుందని నా* అనుభవం. "స్వరాజ్" రావాలంటే ఇది ఒక్కటే మార్గం.

*(రాట్నం ద్వారా స్వరాజ్, 1945, పుట 5)*

★ ★ ★

మన అహింసాయుత ఆర్థిక, ఆత్మ నిర్భరతకు రాట్నం ప్రతీక. దాన ధర్మాలు వద్దు. ఉపాధి కోసం పాట్లుపడవద్దు. భారతదేశానికి ఇట్టి 40 కోట్ల సర్వసత్తాక గ్రామాల వలన గుర్తింపు లభిస్తుంది. జాతి, మత, వర్గ, వర్ణ ద్వేషాల నిర్మూలన జరిగితీరుతుంది. సంఘ (అఖిల భారత, పద్మశాలి సమితి) ఆశయం ఫలిస్తుంది.

*(ఖాదీ - ఎందుకు, ఎలా, 1959. పుట 150)*

★ ★ ★

ఖాదీతోపాటు కుటీర పరిశ్రమ ఉద్ధరణి (పునరుత్థానం) జరగాలి

*(ఖాదీ - ఎందుకు, ఎలా. 1959. పుట181)*

★ ★ ★

ప్రజల స్తబద్ధత, తంద్ర పోవాలంటే ఖాదీ, ఇతర కుటీర పరిశ్రమలు తిరిగి బ్రతకాలి.

*(ఖాదీ - ఎదుకు, ఎలా - 1959. పుట 185)*

★ ★ ★

అహింసాయుత గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పునరావిర్భావానికి, ఖాదీ స్థాపనే ముఖ్యమని నిరూపించాలి

*(ఖాదీ - ఎందుకు, ఎలా 1959, పుట 189)*

★ ★ ★

300 కోట్ల రూపాయల ఎలువల గల ఖాదీ ఉత్పత్తిని, అన్ని గ్రామాలూ నిరంతరం చేస్తే దారిద్ర్య నిర్మూలనం అనే అద్భుతం, చేనేత పనివారు చేసినదే అని చెప్పుకుంటారు. ముతకగా ఉన్నా ఖద్దరు అందాన్ని గ్రహించి, విదేశీ మిల్లు వస్త్రాలను బహిష్కరించాలి. వారి తిండిని పండించుకొని, బట్టను నేసుకుంటే, వారి ఆత్మబలం పెరిగి కళ్లల్లో జ్యోతి వెలుగుతుంది. ఆ వెలుగు జిగేలు మంటూ ఉంటే, ప్రపంచమంతా, నిస్ఫారిత నేత్రాలతో భారతదేశాన్ని చూసి, దిమ్మెరపోతుంది.

*(హరిజన్, 22-9-'46, పుట 322)*

★ ★ ★

## అధ్యాయము 49

# గ్రామీణ పరిశ్రమలు

గ్రామీణ అర్థవ్యవస్థ మన దేశంలో ఒకప్పుడు వారి హక్కులను బట్టి కాక, విధులను బట్టి రూపొందేదిట. వడ్రంగి ఊరందరి పనులు చేసిపెట్టే వాడు. ధనరూపేణా కాకుండా, వస్తురూపంలో ప్రతిఫలం ముట్టేది. అప్పుడు అందరూ ఆరోగ్యంగా, చిందులూ గెంతులూ వేస్తూ, ఉల్లాసంగా ఉండేవారు.

అసంకల్పితంగా అహింసా విధానాన్ని అనుసరించే వారు

(హరిజన్, 1-9-'40, పుట 271172)

★ ★ ★

క్రమంగా భూమి దున్నుకొని, కడుపునిండా తిండి దొరకని పరిస్థితి వచ్చింది. వ్యవసాయం లాభసాటిదనే భావం ప్రబలింది

పనిచేసే వారు లేనిచోట, యంత్రాలు ఉండాలి. ఇందియాలో కాదు ..

మిల్లు వస్త్రాలు, మిల్లు బియ్యం వచ్చి, వీరినోట దుమ్ముపోశాయి. తెల్లటి బియ్యంలో పుష్టిలేదని వైద్యులు నచ్చచెప్పాలి. యంత్రాలను పరిహరించి, కుటీర పరిశ్రమలను పునరుద్ధరించాలి. చేనేతకు ప్రోత్సాహం కావాలి.

(హరిజన్, 16-11'34, పుట 316)

★ ★ ★

గ్రామీణులు సర్వసమృద్ధి గలవారైన తరువాతనే, నగర వాసుల అవసరాలను గూర్చి పట్టించుకోవాలి.

(హరిజన్, 7-12-'34, పుట 341)

★ ★ ★

నగరవాసులు పల్లెలకు పోయి ఉండనక్కర లేదు. వారి కుటీర పరిశ్రమలను ప్రోత్సహిస్తే చాలు.

గ్రామీణులలో, అసంకల్పిత, కల్పిత, స్తబ్ధత, తంద్ర, నిరుద్యోగం మున్నగునవి ఇరతుల బారిని, వారిని, పడవేసి వారికి "స్వరాజ్" రాకుండా చేస్తున్నాయని తేలుతున్నది. ఖాదీ కాకపోతే, తమ పూర్వీకుల వృత్తిని దేనినైనా వీరు చేపట్టి, నగరవాసులకు పంపి, ద్రవ్యార్జన చేయాలి. అప్పుడు గ్రామాలు, పట్టణాలు, ఒక స్నేహ సూత్రంలో బంధింపబడతాయి.

(హరిజన్, 7-12-'34, పుట 340)

★ ★ ★

గ్రామానికి ఖాదీ సూర్యుడైతే, కుటీర పరిశ్రమలు చంద్రునివంటివి.

పరస్పరావలంబనం తీరికవేళలు సదుపయోగం కావాలి.

*(హరిజన్. 16-11-'34. పుట 317)*

★ ★ ★

తిరగలితో పిండి విసరడం, దంపుళ్లు, సబ్బు, కాగితం తయారీ, అగ్గిపుల్లల తయారీ, తోళ్లపని, నూనెగింజలను గానుగలో ఆడి, నూనె తీయడం వగైరా పనుల పునరుద్ధరణ కాంగ్రెస్ వారి స్ఫూర్తితో పెరుగుతుంది. పాశ్చాత్యుల అనుకరణను త్యజించాలి.

*(నిర్మాణాత్మక కార్యక్రమాలు. 1961. పుటలు 16-17)*

★ ★ ★

ఖాదీ ఉద్యమానికి ఆనుషంగికమే కుటీర పరిశ్రమలు. విదేశాలలో కూడ కుటీర పరిశ్రమలకు విలువ ఉన్నది మనకైతే అవి, "ప్రాణదాతలు".

*(హరిజన్. 4-1-'35. పుట 372)*

★ ★ ★

రాట్నంతో బాటు ఇతర గ్రామీణ కార్యకలాపాలు నయీతాలీం - వంటివి (కొత్త విద్యావిధానం; మౌలిక విద్య) వర్ధిల్లాలి.

*(ఖాదీ - ఎందుకు. ఎలా - 1959, పుట 151)*

★ ★ ★

రాట్నం మగన్‌వాడీలో క్రొత్త రూపాన్ని సంతరించుకుంది. చేతి కాగితం తయారీ కూడ ప్రధాన పరిశ్రమ. దంపుళ్లు, తిరగలి, గానుగ - మొదలైనవి కూడా తిరిగి మొదలు కావాలి.

*(ఖాదీ ఎందుకు. ఎలా, 1959, పుటలు 161-62)*

★ ★ ★

గ్రామాల సర్వతోముఖాభివృద్ధికి, రాట్నం ప్రాణం. తప్పులుంటే సరిచేసుకుందాం నగరవాసులను కూడా "ఖాదీని ఉత్పత్తి చేయండి" అందాం. వికేంద్రీకరణతో, తీరిక దొరికినపుడు మనం గ్రామాలలో పని చేయాలి మనం.

*(ఖాదీ. ఎందుకు. ఎలా. 1959. పుట 177)*

★ ★ ★

గ్రామ వాసుల జీవన స్థాయిని పెంచేందుకు వ్యవసాయం, పశుపాలన, కుటీర (గ్రామ) పరిశ్రమలు పూర్వస్థాయికి చేరేందుకు, ప్రత్యామ్నాయాలను చూడాలి. అరడజను గ్రామాలలో, నా యీ ప్రయోగం సఫలమైతే, అన్నిటికీ వ్యాపింపచేయవచ్చును.

*(ఖాదీ ఎందుకు, ఎలా (1959) పుట 181)*

★ ★ ★

# భాగము - 8

## కార్మిక సంబంధాలు

### అధ్యాయము 50

## కార్మిక సంబంధాల ఆదర్శం

కార్మికులంతా ఒక్కటే. యజమాని కూడా ఆ వ్యవస్థలో ఒక అంశం అంతా సమానులు: పరస్పరం సహకరించి, పనిచేయవలసిన వారు

యజమానులు, కార్మికుల సంక్షేమాన్ని కాపాడాలి. తండ్రీ, కొడుకుల బాంధవ్యాన్ని అనుకరించాలి.

*(యంగ్ ఇండియా. 3-5-'28. పుట 139)*

★ ★ ★

పెట్టుబడి, శ్రమశక్తి పరస్పరావలంబనం గలవి.

*(యంగ్ ఇండియా, 4-8-'27, పుట 248)*

★ ★ ★

పాశ్చాత్య దేశాల్లో, యజమానులు ఒక వర్గం, కార్మికులు వేరొక వర్గం. అహమ్మదాబాద్‌లోనూ ఇదే గమనించాను. అహింసా కార్యక్రమానికి జన్మస్థానం ఇది. కార్మికులను సహచరులుగా చూడండి (కూలి వారుగా కాదు) ధర్మకర్తలై మెలగండి. లేకుంటే విప్లవం వస్తుంది. మీరు, వారిని, ప్రేమతో చూస్తే "యూనియన్లు" ఉండవు.

*(యంగ్ ఇండియా, 10-5-'28. పుట 145-146)*

★ ★ ★

చెమటోడ్చి పనిచేసే వారు, భాగస్తులు కారా? ఇద్దరి హోదా ఒక్కటే. యజమాని ధనమొక్కటే విలువైనదా? ఇది గ్రహించి, కలసి మెలసి ఉండాలి. షేర్లు గల వారికి వలె, కార్మిక ప్రతినిధులకు అన్నీ తెలియజెప్పాలి.

*(హరిజన్. 13-2-'37. పుట 5)*

★ ★ ★

ఒకే కుటుంబంలాగ, యజమానులూ, కార్మికులూ ఉండాలి. కార్మికుల సంక్షేమంతోబాటు, ధార్మిక సంక్షేమాన్ని కూడా యజమానులు కాపాడాలి.

*(యంగ్ ఇండియా. 20-8-'25. పుట 285)*

★ ★ ★

యజమానులు తమను తాము ధర్మకర్తలుగా భావించాలి. పెట్టుబడిదారు, కార్మికులు ఎడముఖం, పెడముఖంగా ఉన్నారు. పరస్పర విశ్వాసం, గౌరవంతో ఉండాలి)

*(యంగ్ ఇండియా. 20-8-'25, పుట 291)*

★ ★ ★

## అధ్యయము 51

# కార్మికుల హక్కులు - విధులు

యజమానులు, కార్మికులను సోదర భావంతో చూస్తే మీకూ దేశా[illegible] మంచిది. ఆత్మ ప్రక్షాళన కోసం, మాదక ద్రవ్యాలనూ మాంస భక్షణనూ. జూదాన్ని. అప్పులనూ వర్జించండి.

ముస్లిం కార్మికులను గౌరవంతో అభిమానంతో చూడాలి. కార్మికులు కూడా, పరిశ్రమను తమదిగా భావించి పనిచేయాలి. జీతాలు, సౌకర్యాలు. కోరే హక్కుతోబాటు. నిజాయితీగా, చెమటోడ్చి. జీతానికి తగిన పనిని చేసే విధి కూడా మీది. పరిశ్రమ అభివృద్ధికి, భాగస్వాములమనుకొని పాటు పడాలి. శ్రమశక్తి కూడా ద్రవ్యమే. మీ పెట్టుబడి అదే. పెట్టుబడి లేనిదే శ్రమశక్తి ఉపయోగం ఏమిటి? అదే విధంగా శ్రమశక్తిలేనిదే, పెట్టుబడికి విలువ లేదు.

*(హరిజన్. 2-2-'34. పుట 6)*

★ ★ ★

నేనూ కార్మికుల మధ్య బ్రతికాను, కాయకష్టం చేసి, భాగస్వాములైన మీరు, మిమ్ములను గురించి తక్కువ అంచనా వేసుకో కూడదు. మీరు దేశ ప్రగతికి ధర్మకర్తలే. దేశానికి, ధనవంతులు, పెట్టుబడి లేకపోయినా, మీ శ్రమశక్తి లేనిదే అస్తిత్వం లేదు. నేను నా కోసం పాటుబడుతున్నాననుకుంటూంటే, మీరు ఇంకొకరి కొసం పాటు పడుతున్నామనుకొని, నిరుత్సాహంగా ఉంటున్నారు. ఇదీ తేడా. "నాది" అని అనుకుంటే "నేను యజమానిని" అనే భావన కలుగుతుంది.

తన కొరకైనా, ఇతరుని కొరకైనా, శ్రమ విలువ ఒక్కటే.

మీ విధులేమిటి? హక్కులెట్టివి? పనికి తగిన ప్రతిఫలం మీ హక్కు. కష్టించి, పనిచేసే మీరు, యజమానిని, ఏ విధంగా మీ మాట వినేటట్టు చేస్తారు? తగిన ప్రతిఫలాన్ని కొలిచి, తూచి, ఎవరు చెప్పగలరు? మీరే. దానికి తగిన ప్రశిక్షణ, విద్య కావాలి. మీ నాయకులు, మీకు, వీటిని నేర్పాలి. విద్య అంటే "అ, ఆ"లు మాత్రమే కాదు. మానవత, పరస్పర సామాజిక అనుబంధాలు. వీటిని అర్థం చేసుకోవాలి.

*(మహాత్మాగాంధీ ప్రసంగాలు, రచనలూ, 4వ కూర్పు, పుట, 1045)*

★ ★ ★

## అధ్యాయము 52

# సమ్మెలు

ప్రజాస్వామ్యం, క్రమబద్ధంగా ఉన్న సమాజంలో అశాంతి, సమ్మెలు ఉండేందుకు అవకాశం ఉండదు. కాపలసినంత చట్టబద్ధమైన ఏర్పాట్లు ఉంటాయి. హింస, చాటుమాటున గాని, బహిరంగంగా గాని అక్కడ నిషిద్ధమై ఉంటుంది.

*(హరిజన్, 1-2-48, పుట 15)*

★ ★ ★

నాకు తెలుసు. సమ్మెలు, తమకు న్యాయం చేకూర్చడానికి, కార్మికులకు గల సహజసిద్ధమైన హక్కు. అయితే పెట్టుబడిదారులు ఈ

సందర్భంలో రకరకాల పద్ధతులలో సమ్మెను అణిచేందుకు ప్రయత్నిస్తారు ఆ విషయమే ప్రస్తుతం చాలా క్లిష్టంగా తయారై, ఎంతో ప్రాధాన్యాన్ని వహిస్తున్నది బలాన్ని ఉపయోగించి, హింసా మార్గంలో, సమ్మెలను భంగం చేసి, ఏ విధంగానైనా, తమ అధికారాన్ని దర్పాన్ని, లాభాపేక్షను సంకోచం లేకుండా ప్రదర్శించడానికి చేసే ప్రయత్నాలు హేయమైనవి. ఇక్కడ ప్రాధమికంగా ఆలోచించవలసినంది, సమ్మెకు దారితీసిన పరిస్థితుల మాట ఏమిటి అని నియమానుసారంగా వ్యవస్థ ఉంటే ఈ ఇబ్బంది ఉండదు యజమానులు, కార్మికులు పరస్పర అవగాహనతో, మర్యాదతో మెలుగుతూ సమానత్వ పద్ధతిని గుర్తించే ప్రయత్నం జరిగిన చోట సమ్మెలు అసంభవం.

న్యాయసమ్మతమైన కోరికలు తీరడానికి, సమ్మెలు, సహజమైన హక్కు. కాని యజమానులు మధ్యవర్తిత్వాన్ని అంగీకరిస్తే సమ్మె చేయడం నేరం.

*(యంగ్ ఇండియా, 5-5-'20, పుట 6)*

★ ★ ★

యజమానులు సమ్మె కాలంలో ఎలా మెలగాలి? అమెరికను విధానంలో, కార్మికులను, గూండాల సహాయంతో, అణచివేయడం. తప్పు. వినాశకరం. న్యాయసమ్మతమైన కార్మికుల కోర్కెలను, యజమానుల ఇష్ట ప్రకారం కాకుండా, పెద్ద మనుషులు న్యాయసంగతమన్న వాటిని తీర్చడం అనువైన పరిష్కారం.

సమ్మె ఎందుకు చేయవలసి వచ్చింది? అభిప్రాయం భేదం వలననే. ఆ సందర్భంలో, మధ్యవర్తిత్వమే పరిష్కారం. ప్రస్తుతం, ఆవేశంతో, కార్మికులు, సద్యోపరిష్కారాలను అభిలషిస్తున్నారు. దానికోసం ఎంతటి పనినైనా చేస్తున్నారు.

అప్పుడు యజమానులు ఏం చేయాలి? యజమానులు సువ్యవస్థితంగా ఉంటారు; కార్మికులట్లుగాదు. సరియైన అవగాహన లేక, వారిని రెచ్చగొట్టి, బాగుపడేందుకు చూసే కార్మిక నాయకుల చేతుల్లో కీలు బొమ్మలై, కొన్ని తప్పులు చేస్తున్నారు.

అటువంటప్పుడు, యజమానులు, సౌమ్యతతో వారిని అనునయించి,

పరిస్థితులను తెలియజేయాలి. సమ్మె చేసే వారికి, పరిశ్రమను అప్పగించండి నీటముంచినా, పాల ముంచినా కార్మికులదే భారం అనాలి ఇది దయాభావన కాదు. వివేకంతో కూడిన పెద్ద అడుగు.

*(హరిజన్, 31-3-'46, పుట 60)*

★ ★ ★

తమ పరిసరాల నుంచి, ధార్మిక సంప్రదాయాల నుంచి వేరైన కార్మికులు, డబ్బు కోసం దేనినైనా చేస్తున్నారు.

*(హరిజన్, 22-9-'46, పుట 321)*

★ ★ ★

ఇటీవల సమ్మెలు చాలా జరుగుతున్నాయి. కాని సరైన నాయకత్వం లేక, తమ కోర్కెల సామంజస్యాన్ని వివరించలేక, విఫలమవుతున్నాయి. నష్టాన్ని కలగుజేస్తున్నాయి. సమ్మె కాలంలో, ధనంలేక, చాలా కాలం సమ్మెను సాగించలేక, వీగిపోతున్నాయి. కనుక సమ్మెను తలపెట్టుటకు ముందు, స్వావలంబన సాధ్యమా అని ఆలోచించాలి. మన కోర్కెలు న్యాయ సంగతమా అనితర్కించాలి.

*(మహాత్మాగాంధీ ప్రసంగాలు, రచనలు, 4వ కూర్పు పుటలు 1045, 48)*

★ ★ ★

నా దృష్టిలో, యజమానులు, కార్మికులు సమాన భాగస్వాములు (కార్మికుల భాగస్వామ్యం ఉన్నతమైనదని భావించి అనుకరించాలి.) ప్రస్తుతం మనం విపరీత పరిస్థితిని చూస్తున్నాం. యజమానులు కార్మికుల పరిస్థితిని లోని గుట్లను సేకరిస్తున్నారు. పోగుబడిన ధనరాశి (పెట్టుబడి) తెచ్చిపెట్టగల శక్తివంతమైన ఉపలబ్ధి వారికి ఉంది. దానిని ఎలా ఎప్పుడు వాడుక చేయవలెనో, వారికి తెలుసు. ఒక్క రూపాయలో శక్తి తక్కువ. అదే రాశి రూపంలో పెట్టుబడిగా ఏకత్రితమైతే, అప్పుడు లభించే శక్తి వేరుగా ఉంటుంది. అది ఎంతో శక్తిమంతమైనది. ఒక్కొక్క రూపాయకు గల శక్తి కంటె ఎన్నోరెట్లు మిన్నగా ఉంటుంది. జలబిందువులు, వేరువేరుగా, ఎన్ని ఉన్నా ఏమీ లెక్కలేదు. అవే సంయుక్తంగా ఉండి, సముద్రాన్ని ఏర్పరుస్తాయి.

ఆ సముద్ర జలంలో నౌకాబలం చక్కగా ప్రయాణం చేస్తుంది ఇండియాలో పెట్టుబడిదారులు, చక్కగా వ్యవస్థీకృతులై ఉన్నారు కార్మికులకు యూనియన్లు. సమాఖ్యలు ఎన్ని ఉన్నా అంతకంటె తక్కువైన వ్యవస్థగానే పనిచేస్తున్నాయి. కనుక సంఘటితశక్తి బాగా కరువయింది.

ఇంతేకాదు. వివెకం కూడా ఉండదు. వ్యక్తులు వ్యక్తులతో, యూనియన్లు యూనియన్లతొ తగాదాలు పడతాయి. వివేక శూన్యత వల్ల స్వార్థపరులు, దీన్ని అవకాశంగా తీసుకొని, అల్లరులు రేకెత్తిస్తారు. అహింస అంటే తెలియని, వారు ఇంకేమంచి పనిని చేయజాలరు. ఫలితంగా కార్మికులు బాధపడతారు కార్మికులు, అహింసా పద్ధతిని తెలుసుకొని పనిచేస్తే, ఆ సంఘటిత శక్తి, కొద్ది మంది పెట్టుబడిదార్ల చేతిలో తుపాకుల శక్తిని మించి ఉంటుంది

కనుక పెట్టుబడిదారులకు తమ సృష్టి అని అనుకుంటున్న సంస్థల అసలు యజమానులు (సామ్యత్వం కలవారు) కార్మికులేనని గుర్తించమని సలహా ఇస్తున్నాను. వారికి, తగు విద్యను నేర్పి, వారిలో దాగియున్న నిర్మాణాత్మక శక్తిని పెంచి, ఈ కార్మికుల సంఘటిత శక్తిని పెంపొందించాలి.

ఒక రోజులో, దీనిని, పెట్టుబడిదారులు సాధించలేరు. మరి సమ్మెల వల్ల తమ సంస్థలకు కలిగే నష్టాన్ని ఎదుర్కొంటున్న వారు ఏమి చేయాలి. నా సలహా ఇది: సంస్థను, వెంటనే, కార్మికులకు అప్పగించండి (సంస్థ వారికి చెందినది కూడా గనుక) మనోవైకల్యాన్ని విడిచిపెట్టి, కార్మికులకు, సాంకేతికంగాసాయపడండి.ఈ పని సరి అయినది. దీనితో ప్రతిపక్షాల వారి నోరుమూత పడుతుంది. కార్మికుల ఆశీస్సులు లభిస్తాయి. పెట్టుబడి వినియోగం సరిగా జరుగుతుంది. ఇది ధర్మ కార్యము కాదు. తమ వనరులను తెలివిగా వినియోగించడం, తమ భాగస్వాములుగా చేయదలచిన కార్మికులతో నిజాయితీగా ఉండడం అన్నమాట.

సమ్మెలు విశ్వవ్యాప్తంగా ముప్పును తెచ్చిపెడుతున్నాయి. అమెరికా, ఇంగ్లాండ్‌లతోసహా, అన్ని చోట్లా సమ్మెలు జరుగుతున్నాయి. ఇండియాలొ వాటి ప్రాముఖ్యత మరింతగా ఉన్నది. మూలాన్ని మూయగానే, సందులలోంచి

స్వాతంత్ర్య వాయువులు చొరబడి, సమ్మెల సంఖ్యను పెంచుతున్నాయి. దీనికి ముఖ్యంగా జీవితాలలో, పురాతన సంప్రదాయాలు, ధార్మికమైన కట్టుబాట్లు లుప్తమై, బ్రతుకు అస్తవ్యస్తమై, ధనదాహం పెరుగుటయే కారణం. ఇది చాలా బలహీనమైన బంధం. ధార్మికత ఉన్నప్పటికి, ప్రతివారికీ ఇది ఆదార భూతం కాజాలదు. ఒక వంక కొల్లగొట్టడం, ఇంకొక వంక సమ్మెలు - ఇదీ నేటి దృశ్యం. అయితే ధార్మికత పట్ల మర్యాద ఉన్నచోట సమ్మెలు అహింసా పూర్వకమై ఉంటాయి. వాని వలన ఎవరికీ నష్టం లేదు.

సమ్మె మొదలయేందుకు ఒక చిన్న కారణం చాలు. నా అనుభవం ప్రకారం వీని వలన కార్మికులకు మంచి కంటె చెడే జరుగుతుంది. బొంబాయిలో జరిగిన సమ్మెను, టాటాలో జరిగిన దానిని పంజాబులో రైల్వే కార్మికుల సమ్మెలను, వీలయినంత మేరకు పరిశీలించాను. కార్మికులు తమ కోర్కెలను పూర్తిగా బోధపరచలేకపోయారు. కారణమేమిటి? నాయకత్వం సరిగాలేదు. నాయకులు రెండు రకాలు: మీలో కొందరు నాయకులవుతారు. వారికి సలహాలిచ్చే వారు స్వయంగా కార్మికులు కారు. సానుభూతి కలవారో, సానుభూతితో ఉంటారని అనుకున్న వారో అయి ఉంటారు. వీరందరి మధ్య సమన్వయం లేనిదే, సమ్మె సఫలం కాదు. పైన ఉదహరించిన సమ్మెలన్నిటిలోను, ఇదే సంభవించింది. ఇంకో ముఖ్య కారణం, నా దృష్టికి వచ్చింది. ధనసహాయం లేనిదే, చాలా కాలం సమ్మె సాగదు. యూనియన్లు ధనరాశి మీద ఆధారపడితే, సమ్మె సాగదు. నేను నడిపిన సమ్మెలలో, కార్మికులను ఆత్మనిర్భరత్వం సాధించమని, ఉద్బోధించే వాడిని. అదే విజయం, అదే విద్య. ఒక యజమాని వద్ద దొరికిన జీతాన్ని, ఇంకే చోటనైనా తెచ్చుకోగలమనే ధీమా ఉండాలి. కనుక, అలసత్వం వలన, సమ్మె భంగమవుతుంది. న్యాయంగా ప్రవర్తించాలి. సమ్మెకు వ్యతిరేకులపై వత్తిడి తెకూడదు. దాని ఫలితం మీ మీదే ప్రసరిస్తుంది. ఈ మూడు సూత్రాలను పాటిస్తే ఏ సమ్మె కూడా ఓటమిని చూడదు. సమ్మె చేసేముందు, ఎన్నోసార్లు, [illegible]. తరచి ఆలోచించాలి. సరే మీ హక్కులను సాధించడం గురించి ఇంత [illegible] ముచ్చటించాం. కార్మికులు సంఘటితులయితే, సమ్మెలు ఎప్పుడో.

ఎక్కడో జరుగుతాయి. వాటి అవసరం ఉండదు. మీ మానసికశక్తి, సంఘటిత శక్తి పెరిగిన కొలదీ, మధ్యవర్తిత్వం సమ్మెల స్థానాన్ని గ్రహిస్తుంది. అటువంటి పరిస్థితులను అమలుపరచే సమయం ఆసన్నమైంది.

**సమ్మె సాఫల్యతకు కావలసినవి**

1. కోర్కె న్యాయసమ్మతము
2. కార్మికుల ఏకాత్మకత
3. సమ్మెలో చేరని వారిని హింసించక పోవడం
4. సమ్మె కాలంలో ఆత్మనిర్భరత
5. సమ్మె చేసే వారి స్థానంలో ఇతర కార్మికులు వచ్చి చేరే అవకాశం ఉంటే, సమ్మె వద్దు. రాజీనామా చేయాలి. ఇదే తగిన మందు
6 ఇన్ని జాగ్రత్తలు లేకున్నా, సమ్మె జయప్రదం అగుట యజమానుల బలహీనతయే. తప్పులు చేయవద్దు. తెలియని వాటిని అనుకరించవద్దు. తెలిసిన పద్ధతిలో పయనించండి. విజయాన్ని సాధించండి.

*(యంగ్ ఇండియా, 16-2-'21, పుటలు 52-53)*

★ ★ ★

ఎక్కడో ఏదో జరిగిందని సానుభూతిగా సమ్మె చేయడం, (మీకే సమస్యాలేక పోయినా) నేరం. హింసాయుతం

★ ★ ★

సమ్మె "గూడు పుఠాణీ'గా ఉండరాదు కార్మికులు సహకరిస్తారు. సమ్మె చేసే వారు ఏదో విధంగా కష్టపడి, సమ్మె కాలంలో సంపాదన చేయాలి.

*(హరిజన్, 2-6-'46, పుట 158)*

★ ★ ★

సమ్మె న్యాయసంగతమై ఉండాలి. నిష్పక్షపాతంగా, అనుభవజ్ఞులు ఒప్పుకుంటేనే, ప్రజల సానుభూతి ఉంటుంది. మధ్యవర్తిత్వం చట్టానికి, నియమాలకు విరుద్ధం కారాదు. యజమాని కూడ, అహంభావంతో, ప్రవర్తించరాదు. నిష్పక్షమైన నిర్ణయానికి బద్ధుడు కావాలి.

ఆర్థిక విషయాలకు సంబంధించిన సమ్మెలకు రాజకీయ పరిణామం ఉద్దిష్టమై యుండరాదు. అటువంటప్పుడు. సమ్మె చేసిన వారు ఓడిపోతారు

రైల్వే పోస్టలు సమ్మెల సందర్భంలో ప్రజలకు కలిగే అసౌకర్యం గురించి గమనిక ఉండాలి పరిష్కార మార్గాలనన్నింటినీ తడిమి చూచిన తర్వాత, పని కాకపోతే, సానుభూతి సమ్మెలు, కూడా సరియైనవే.

ఆర్థిక సమస్యలు, రాజకీయ పరిణామాలతో సంబంధం కలిగి ఉండరాదు. దేనికి అది వేరు. అహింసా ఉద్యమంతో, రాజకీయ సమ్మెలు ఉంటాయి. వాటిని అషామాషీగా చేయకూడదు. బహిరంగంగా ఉండాలి. కుట్రలు, చాటు మాటు వ్యవహారాలు గూండాలచేత, హింసా కార్యాలూ నిషిద్ధం. హింస పనికిరాదు.

*(హరిజన్, 11-8-46, పుట 256)*

★ ★ ★

శాంతిపూర్వకమైన సమ్మె, బాధితులకు పరిమితమై ఉండాలి. తమకు సంబంధించని చోట (టింబక్టూలో అగ్గిపెట్టెలు తయారు చేసే కార్మికులు) వారికి ఏ సమస్యా లేనప్పుడు, ఎక్కడో కార్మికులకు తగినంత జీతాలు లేవని, సానుభూతి సమ్మె చేయకూడదు. అది హింసాత్మకం అవుతుంది. ఆ పరిశ్రమతో సంబంధాలు త్రెంచుకోవచ్చు. అంతేగాని తాము స్వయంగా సమ్మెను తలపెట్టకూడదు. పై ఉదాహరణలో, రెండింటి యజమానులు ఏకమై, కార్మికులను బాధపెడితే, అప్పుడు సానుభూతిగా సమ్మె చేయవచ్చును. కనుక ఎక్కడికక్కడే పరిస్థితిని సరిగా అంచనా వేసుకొని ముందుకు సాగాలి. హింస చాపక్రింద నీరులా తెలియకుండా వచ్చి, క్రమ్ముకుంటుంది.

సమ్మె సమయంలో ధనార్జన కొరకు చేయవలసినది ముందే ఏర్పాటు చేసుకోవాలి. శాంతిపూర్ణమైన అట్టి సమ్మె కారులను ఎవరు చెదరగొట్టలేరు. ఇది ఆకాశహర్మ్యం కాదు. నేనెరిగిన జీవిత సత్యం.

ప్రజల భావాలు తెలిసిన, నిష్పాక్షిక న్యాయనిర్ణేతలు చెబితే తప్ప, వారికి దాని సూక్ష్మాలు తెలిసే అవకాశం లేదు. ఆ చర్యలో భాగదేయం కలవారు. నిష్పక్షపాతంగా ఉండజాలరు.

మధ్యవర్తిత్వం ఉంటే, (ప్రజలకు ఈ సమ్మెను గురించి, తెలియనే తెలియదు.) తీర్పును పాటించని యజమానులు, కార్మికులు ఉన్నచోట, బలవంతంగా తమమాటనే నెగ్గించుకోవాలనే భావం చోటు చేసుకుంటుంది

అన్ని సమన్వయ మార్గాలూ మూసుకుపోయిన తర్వాతనే, సమ్మెను గురించి ఆలోచించాలి. ఆర్థిక రంగానికి చెందిన సమ్మెలు, రాజకీయ రంగానికి చెందిన సమ్మెలు, పూర్తిగా భిన్నమైనవి. రాజకీయ సమ్మెలకు, అహింసాయుత పోరాటంలో సముచితమైన స్థానం ఉన్నది.

తమ జీవితాల పెంపు, హింసామార్గంలో సాధ్యమైతే కార్మికులు దానిని చేపట్టవచ్చునా? కూడదు. తమ కోర్కెలు ఎంత సమంజసమయినవి అయినా, హింసకు దిగరాదు. ఈ బాటలో ముళ్ళు ఉంటాయి. కత్తితో బ్రతికే వారు కత్తితోనే అంతం అవుతారు. బలిసిన ఎద్దులవలె పోట్లాడకూడదు. చైతన్యం అంతా ప్రగతి కాదు. "ధన మాత్రమిదం జగత్" అనే వారి వద్ద ఆత్మకు చెందిన ఆధ్యాత్మికత, సమాజానికి, మనసుకు పనికివచ్చే ధార్మికత కరువు అవుతాయి.

కనుక, "కిం కర్తవ్యమ్?" బొంబాయిలో కార్మికులు చక్కగా పోరాడారు. వివరాలు నాకు తెలియవు. కాని మంచి మార్గంలో పోరాటం జరిగిందని నాకు కనిపిస్తుంది. మిల్లు యజమానులు పూర్తిగా తప్పుచేసి ఉండవచ్చు. కార్మికులూ యజమానులూ వీరి పోరాటంలో, సామాన్యంగా, యజమానులు తప్పు చేస్తున్నారనడం కద్దు. అయితే, కార్మికులు తమ సంఘటిత శక్తిని పూర్తిగా గుర్తించిన నాడు, వారు యజమానులను మించిన నిరంకుశులవుతారు. యజమానుల వద్దనున్న వివేకాన్ని కార్మికులు కూడా అలవరచుకంటే, కార్మికులు చెప్పినట్లు వారు ఒప్పుకోవలసి వస్తుంది. అయితే కార్మికులు సాధారణంగా ఆ స్థాయిని చేరుకోలేరు చేరుకోగలిగితే కార్మికులు కార్మికులవడం మాని, యజమానులై కూర్చుంటారు. పెట్టుబడిదారులు ధన బలంతో మాత్రమే, పోరాటం సాగించరు. వారికి యుక్తి వివేకం చాకచక్యం మెండుగా ఉంటాయి.

కార్మికులు, తమ జడత్వాన్ని వదలి, కొంత జాగరూకతను

పెంచుకున్నపుడు, వారు ఎంచుకోవలసిన మార్గం ఎలా ఉండాలి అనునది ఇప్పటి ప్రశ్న. తమ పశుబలం, సంఖ్యాబలం, తద్వారా హింసామార్గం - వీటినే వారు నమ్ముకుంటే, ఆత్మహత్యా సదృశం అవుతుంది అటువంటి చర్యవలన వారికి, పరిశ్రమలకు, దేశానికి, తీరని నష్టం కలుగుతుంది ఓరిమితో, సమన్వయ మార్గంలో అహింసాయుత పోరాటాన్ని జరిపితే, యజమానులలో స్పందన సాధ్యం. ఇది నిర్మాణాత్మకమైన మార్గం.

ఇంతాచేసి, అటు పరిశ్రమకు, యజమానులకు, ఇటు తమకు కొందరు ఆవేశపూరితులై నష్టం కలిగిస్తారు. చివరికి, పెరిగిన తమ జీతాలను కూడ, సరిగా వినియోగపరచక, గెలిచాం అని మదంతో మెలుగుతారు.

కనుక, పాఠకులారా, మీకు, కార్మిక సంక్షేమం ధ్యేయమయితే, వారి తీరును మెరుగుపరిచే కోరిక ఉంటే, కార్మికునితో స్నేహం చేసి, అతనికి సేవ చేయాలని ఉంటే, రాజమార్గం ఉన్నది. సత్యమార్గంలో ఇరుపక్షాలు, ఒకే భావైక్యతను, సాధించాలి.

ఇండియాకు రెండు మార్గాలున్నాయి. పాశ్చాత్యుల హింసామార్గం, ప్రాచ్యుల సత్యమార్గం. కార్మికులతో ఇది మొదలు కావాలి. హింసామార్గం దగ్గర దారి కావచ్చు. కాని కలకాలం ఉండదు. తృప్తి అసలే ఉండదు. యూరోపును పరికించండి. యజమానిని, కార్మికుడు నమ్మడు. కార్మికుని యజమానీ నమ్మడు. పశుబలంతో తలపడి, తలలు బొప్పికట్టించుకున్నా, శాశ్వత పరిష్కారం ఉండదు.

రెండవది ఆత్మోత్సర్గం. స్పందించి, యజమాని, దారికి వచ్చే అవకాశాలెక్కువ. సామరస్యతకు షరతులు:

1. పనిచేసే గంటలలో, విశ్రాంతికి అవకాశం ఉండాలి.
2. చదువుకు సౌకర్యం ఉండాలి.
3. దుస్తులు, తిండి, పిల్లల చదువుకు ఏర్పాట్లు కావాలి.
4. శుభ్రమైన, స్వచ్ఛమైన గృహ వసతి లభ్యమవాలి.
5. వృద్ధాప్యంలో వినియోగానికి, భవిష్యనిధి ఉండాలి. పొదుపు చర్యలు చేయగలిగి ఉండాలి.

పైన చెప్పినవి లేకపోవడానికి ఇద్దరూ బాధ్యులే. తక్కువ ఇచ్చి, ఎక్కువ పని కోరతారు యజమానులు. విపర్యయంగా, వీలైనంత తక్కువ శ్రమతో గరిష్టరాశి కోసం తగాదా పడతారు. కార్మికులు ఫలితం, జీతం పెరిగినా, కార్మికుడు నిండు మనసుతో పనిచేయడు

కార్మిక వర్గంతో స్నేహం చేసే మూడో రకం అవిర్భవిస్తున్నది కార్మికులను పావుగా వాడుకొనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అవకాశవాదం వీరిది. కార్మిక సంక్షేమం ఒక ముసుగు. కనుక కార్మిక వర్గానికి సమర్థ నాయకత్వం కావాలి.

సమ్మె, పనిమాని కూర్చోడం, హర్తాళ్ అన్నీ మంచివే. వీటి దురుపయోగం సామాన్యమై పోతున్నది. అది పనికిరాదు. యూనియన్లుగా ఏర్పడి, వాటి అనుమతి లేనిదే సమ్మెలను తలపెట్టకూడదు.

యజమానులతో చర్చించనిదే సమ్మెకు దిగరాదు మధ్యవర్తిత్వానికి సానుకూలత కలిగితే, పంచాయతీ పద్ధతిని ఎన్నుకోవాలి. వారి నిర్ణయాలు అందరికీ శిరోధార్యాలు కావాలి.

కార్మికులూ యజమానులూ ఒకే కుటుంబ సభ్యులవలె మెలగాలి. ఇది తప్ప వేరే దారిలేదు. సత్యమార్గమే శరణ్యం. జీతాలు పెంచడమే కాదు, వాటి వినియోగం కూడా అందరూ (ముఖ్యంగా) యజమానులు పట్టించుకోవాలి.

*(యంగ్ ఇండియా, 11-2-'20, పుట 7-8)*

★ ★ ★

**అధ్యాయము 53**

# భూస్వామి - కౌలుదారు

భూమి కర్షకుడిది ఎక్కడో ఉండే జమీందారుది కాదు.

*(ది బాంబే క్రానికల్, 20-10-'44)*

★ ★ ★

దున్నేవాడిదే భూమి. ఇది వానికి తెలియనీయరు

*(హరిజన్, 2-1-'37. పుట 375)*

★ ★ ★

నీవు దున్నే భూమి నీదే. కాని దానిని ఒక్కసారిగా జమీందారునుంచి లాక్కోలేవు. అహింస, నీశక్తిని నీవు గుర్తించడం; ఇదేదారి.

*(హరిజన్, 20-5-'39, పుట 133)*

★ ★ ★

అవసరానికి మించిన భూమి ఉండకూడదు. తమదైన పొలంలేకనే, దరిద్ర నారాయణులవుతున్నారు. కలవారిని లేని వారిని ఒప్పించి, అహింసాయుతంగా, భూసంస్కరణలు జరగాలి.

*(హరిజన్, 20-4-'40, పుట 97)*

★ ★ ★

నీ భూమి మీద నీకున్నంత హక్కు, ఆ దున్నే వానికీ ·ఉంది.

*(అమృత బజారు పత్రిక, 2-8-'34)*

★ ★ ★

మీ ఆస్థికి ధర్మకర్తగా ఉండి, దానిని వారి సంక్షేమం కోసం ఉపయోగించాలి. సోషలిస్టు పార్టీ ఒకటి కాంగ్రెస్‌లో పుట్టింది. ఎన్ని చెప్పినా, ప్రజలు, ఆస్థి గలవారి నుండి, వారి ఆస్థిని గుంజుకోమనరు.

*(అమృత బజారు పత్రిక, 2-8-'34)*

★ ★ ★

ఒక్క విషయాన్ని గమనించండి. మిల్లు యజమానులు, కార్మికులను, తమ సహచరులుగా తీసుకోవలసి వచ్చినట్లే, రైతులను, మీ మిత్రులను కొని, బంధువులుగా భావించి, వర్గవైషమ్యాలను పరిహరించండి.

*(అమృతబజారు పత్రిక, 2-8-'34)*

★ ★ ★

జమీందార్లు తమ వసూళ్లను చేసే పనినేగాక, ధర్మకర్తలై, కర్షక మిత్రులై మెలగడం కూడా నేర్చుకోండి. రైతుల నుండి నజరానా (బహుమతులు)

తీసుకోకండి వారి కుటుంబాల సంక్షేమం చూడండి. అదేవిధంగా, కర్షకులు తమ విధులను పాటించాలి. జమీందారుతో, కుటుంబ సభ్యునివలె, స్నేహ భావం, ఆదరం చూపండి. రాముడు, జనకుడు, ఓమర్ ఖలీఫా, నిరాడంబరంగా, ప్రజల మధ్య జీవించారు. ధర్మకర్తలై మెలిగారు. ప్రజాధనం దుర్వినియోగం చేసిన వారిని చీల్చి చెండాడారు.

*(యంగ్ ఇండియా, 28-5-'31) పుటలు 120-21)*



అయితే మార్పును త్వరిత పరచకూడదని గ్రహించాలి. అహింసా మార్గానుసరణ కావాలంటే, కలవారిని, లేనివారిని సమావేశపరచి, సత్యమార్గాన్ని తెలియచెప్పి, వారిని విద్యావంతులను చేయాలి. ధనవంతులకు, వారిపై బలప్రయోగం జరగదని, నచ్చ చెప్పాలి. లేని వారికి, ఏ నిర్ణయాన్ని వారిపైన, వారి అంగీకారం లేకుండా, ఏ అంశాన్ని వారిపై రుద్దడం జరుగదనీ, అహింసా మార్గంలోనే, ఆత్మోత్సర్గం ద్వారానే, స్వాతంత్ర్యం తెచ్చుకోగలరనీ బోధపరచాలి.

మిమ్ములను ఒప్పించి, మీ మనసులను కరిగింపజేసి, మీ ఆస్థి, సందపలను ధర్మకర్తగా కౌలుదారుల సంక్షేమం కోసమే వినియోగించాలని, మీరు భావించేటట్లు మిమ్ములను మార్చడమే, నా ఆశయం. కాంగ్రెస్‌లో, సోషలిస్టు పార్టీ ఏర్పడిందని నాకు తెలుసు. ఆ పార్టీ, కాంగ్రెస్‌ను లోబరచుకుంటే, ఏం జరుగుతుందో, స్పష్టంగాలేదు. అయితే, నిష్పక్షపాతంగా, ఒత్తిడి తేకుండా, అభిప్రాయ సేకరణ చేస్తే, ప్రజలు, ఆస్థి కలవారి నుండి, వారి ఆస్థులను గుంజుకొమ్మని అనరు. ఆ సమన్వయ, సహకారాల కోసమే నేను పాటు పడుతున్నాను.

అయితే ధర్మకర్తలైన మీరు గాని మిల్లు యజమానులు కాని, సంపదను, విచ్చలవిడిగా స్వంతానికి వాడుకోరాదు అని హెచ్చరిస్తున్నాను. వారి సంక్షేమం కోసమే వినియోగించాలి. వారిలో, ఒక విధమైన భద్రతా భావాన్ని, ఒకే కుటుంబ సభ్యులమనే స్నేహ ధర్మాన్ని, బంధుప్రీతిని, కలుగజేసినపుడు మీ మధ్య తగాదాలుండవు. వర్గ సంఘర్షణ ఉండదు.

జమీందారులు దుర్వ్యయం తగ్గించుకోవాలి కౌలు మిత్తి స్పష్టంగా ఏర్పరచాలి. వారి సంక్షేమం కోసం శ్రద్ధ వహించాలి. వారి పిల్లలకు స్కూళ్లు, పెద్దలకు రాత్రి పాఠశాలలు, చికిత్సాలయాలు స్థాపించాలి. మురుగునీటి పారుదలకు ఏర్పాట్లు చేయాలి. జమీందారులు వారి స్నేహితులనీ, తాము చేసే పనులకు నిశ్చితమైన రుసుము మాత్రమే తీసుకుంటారనీ, వారిని గ్రహింపచేయాలి. తమ ఉనికిని, లాభప్రదం చేయాలి. రైతులు కూడ జమీందారుల పట్ల తమ విధులను, నిస్సంకోచంగా, నిర్వర్తించాలి. చేస్తామని మనసారా ఒప్పుకున్న పనులను చేసితీరాలి. తాము అనుభవిస్తున్న పొలం, జమీందారులకు లేకుండా తమదేనని భావించరాదు. వారొక పెద్ద కుటుంబంలో సభ్యులమనీ, జమీందారు ఆస్తికి రక్షకుడుగా ఉంటాడనీ, మరచిపోరాదు. చట్టంలో ఏ విధంగా ఉన్నప్పటికీ జమీందారీ పద్ధతిని కొనసాగించాలి అంటే, సంయుక్త కుటుంబ సభ్యుల పరిస్థితి తమదిగా భావించాలి

జనరంజకులైన రాజులు, ప్రజలలో కలిసి, మెలసి బ్రతికేవారు. ఇందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే, వారి రోజులు దగ్గర పడ్డట్లేనన్న మాట. ధర్మకర్తలై జీవిస్తేనే, వారికి మంచి భవిష్యత్తు ఉంటుంది. పేరుకు మాత్రమే గాక, నిజంగా ధర్మకర్తలై మెలగాలి. తమ హోదా, తమ ఉన్నత భావాలు, తమ విద్య, కౌలుదారుల సంక్షేమం కోసం, విధిగా వాడుక చేయాలి. కరుణా హృదయంతో, మనసునిండా సానుభూతితో, వారి కష్టసుఖాలలో పాలు పంచుకొని, వారిని సేదతీర్చాలి. ఇదే సరియైన సార్థకత.

భూస్వాములు నిరంకుశులైతే, కాలగతిలో నశిస్తారు. ధర్మకర్తలై, కర్షకుల మేలు తలపెట్టండి. మీ కష్టానికి తగిన ఫలం తీసుకోండి. చట్టం మిమ్ములను ముట్టదు. కర్షకులు మీ హితం కోరుకుంటారు.

*(హరిజన్ 4-5-'47. పుట 134)*



## అధ్యాయము 54

# వర్గ పోరాటం అనివార్యమా?

స్వతంత్ర భారతదేశంలో, వర్గ వైషమ్యం ఉండదు. చెట్ల ఆకులు వలె, వైవిధ్యం ఉంటుంది. ఈ నాటి తరతమ భేదాలు ఉండవు. ఆకలి బాధ ఉండదు. నిరుద్యోగం ఉండదు. అహింసా విధానంలో ప్రభుత్వం నడిపితే, అల్లర్లు, అలజడులు అసలే ఉండవు.

*(హరిజన్ 27-4-'40, పుట 108*

★ ★ ★

హృదయ పరివర్తన, అనునయంతో, సాధించగలిగితే, బుద్ధిమంతుల కౌశల్యం, దేశానికి, ఉపయోగపడుతుంది. దానిని కార్మికులను వశపరచుకునేందుకు ఉపయోగించకూడదు "భగవంతునిదె సర్వస్వం, అని మన సాంప్రదాయ నిర్వచనం. హింసావిధానంతో, భూస్వాములు, రైతులు (కౌలుదారులు) అందరూ నశిస్తారు వివేకంగా, యజమానులు ప్రవర్తిస్తే దేశం అంతటా ముఖ్యంగా కార్మిక వర్గాలకు మేలు జరుగుతుంది.

*(హరిజన్ 9-3-'47, పుట 59)*

★ ★ ★

అహింసామార్గంలో పెట్టుబడిదారీ మన స్తత్వం అంతరిస్తుంది. ధనవంతుడు, ధర్మకర్తగా, తన ఆస్థిని పెంచి, ప్రజోపయోగం నిమిత్తం వినియోగిస్తాడు. కార్మికుడు వేచి యుండనక్కరలేదు. పెట్టుబడి అధికారాన్ని ఇస్తుంది శ్రమ శక్తి కూడ అధికారాన్ని ఇస్తుంది. అధికారాన్ని నిర్మాణాత్మకంగా గాని, విధ్వంసాత్మకంగా గాని వాడవచ్చు. పరస్పరం ఆధారంగా దేశప్రగతిని, సౌభాగ్యాన్ని పెంచుకోవాలి. సమానత్వం, సౌమ్యతతో, సాధిస్తే, శాశ్వతంగా నిలుస్తుంది. కనుక హృదయపరివర్తనయే కర్తవ్యం. సహజీవనమే బ్రతుకుబాట.

*(యంగ్ ఇండియా, 26-3-'31, పుట 49)*

★ ★ ★

కార్మికుడు తన శక్తిని గుర్తిస్తే, పెట్టుబడిదారుతో బాటు భాగస్వామి అవుతాడు. బానిసగా ఉండడు. తానే పూర్తి యజమాని అయేందుకు ప్రయత్నిస్తే బంగారు గ్రుడ్లను పెట్టే బాతును చంపినట్లు అవుతుంది. తెలివి తేటలు, అవకాశాలు - వీటిలో అసమానతలు ఎప్పటికీ ఉంటాయి. ఎడారిలో ఉండే వ్యక్తి కంటె, నడి ఒడ్డున ఉన్న వానికి, పంటను పండించే అవకాశం ఎక్కువ. అసమానతలు ఉన్నా, ముఖ్యాంశాన్ని మరువరాదు పక్షులు, జంతువులకు వలెనే. ప్రతివ్యక్తికీ జీవితాలసరాలను తీర్చుకునే స్వేచ్ఛ, హక్కు ఉంటాయి. ప్రతి హక్కుతోబాటు, ఒక విధి, ఆ సందర్భాలలో అపాయం నుంచి తన్ను తాను రక్షించుకునే ఏర్పాటు ఉంటాయి. కనుక మౌలికమయిన సాధారణ సమానతను పరిరక్షించుకునే విధులూ, విచికిత్సలూ కూడా ఉంటాయి. నా అవయవాలతో కష్టించి పనిచేయడం నా విధి, నా కష్ట ఫలాన్ని నాకు అందకుండా చేసే వానితో అసహాయోగం, దానికి తగిన చికిత్సా ఉంటుంది. పెట్టుబడిదారు, కార్మికుడు వీరిద్దరి మౌలిక సమానతను గుర్తించగలిగితే, వారిని నష్టపరిచేందుకు ఆశించరాదు. పరివర్తన కోసం ప్రయత్నించాలి. నా అసహాయోగం, అతడు చేసే తప్పుల సందర్భంగా, అతడికి కనువిప్పు కలిగిస్తుంది. నేను సహకరించనప్పుడు, వేరొకరు నా చోటు నాక్రమిస్తే దిగులు పడరాదు. నా సహచరులను, యజమాని అన్యాయాలతో, అసహాయోగాన్ని అవలంభించమని ఒప్పించగలనని నా ధైర్యం. పెట్టుబడిదారు, కార్మికుడు, శత్రువులగానే ఉండనక్కర్లేదు.

*(యంగ్ ఇండియా, 7-10-'26, పుట 384)*

★ ★ ★

దోపిడీ, ధనవంతులను, చంపితే, నశించదు. పేద వారికి, సరిగా నచ్చచెప్పి తయారు చేస్తే, వారే దోపిడీ జరుగనీయరు. సహాయ నిరాకరణ చేస్తారు. వారు ఇద్దరూ భాగస్వాములవుతారు.

*(హరిజన్, 28-7-'40, పుట 219)*

★ ★ ★

నా "స్వరాజ్"లో పెట్టుబడి, రాజరికము ఉంటాయి. అయితే ధర్మకర్తృత్వ విధానంలో ఉంటాయి. సామరస్యం నా ధ్యేయం. ఉన్నవారు, లేనివారు, సఖ్యంగా ఉంటారు. లంచగొండి తనం, అన్యాయం, అవినీతి, ప్రపంచమంతటా వేరు వేరు పేర్లతో ఉన్నాయి. కనుక, సత్యాహింసలే అందరికీ శరణ్యం.

*(యంగ్ ఇండియా 8-1-'25, పుట 10)*

★ ★ ★

"ఈశావాస్యమిదం" కనుక, సమాజవాదం మనకి క్రొత్తది కాదు. ప్రజలదే రాజ్యం అనేది నేటి మాట అందరికీ అనటంలో ఎవరికీ స్వంతం లేదు అని స్ఫురిస్తుంది. హింసారహితంగా సమ సమాజ నిర్మాణం, మనకు కరతలామలకం.

*(హరిజన్, 2-1-'37 పుట 375)*

★ ★ ★

క్రొత్త వ్యవస్థలో రాజులు, జమీందారులు ఉంటారు. బుద్ధిగా మసలుకుంటారు. లేకుంటే, ప్రజలే వారిని వెలివేస్తారు. (సహాయనిరాకరణ) పంచాయతీ ఆదేశాలను అందరూ శిరసావహిస్తారు.

*(హరిజన్, 1-6-'47, పుట 172)*

★ ★ ★

జమీందారు అస్తిత్వానికి, అతని అనివార్యత అవసరంలేదు అనడానికి, నేను సిద్ధం. హృదయ పరివర్తన మాత్రం అనివార్యం. వర్గ పోరాటం అనివార్యమా అన్న ప్రశ్న ఉండదు. కర్షకులు తమ అధికారాలను చేపట్టిననాడు, జమీందారు ఉండడు. కర్షకులు ఏకమైతే, అద్భుతమైన అధికారం వారికి వస్తుంది. అప్పుడు వర్గ పోరాటం అనే సమస్యే ఉండదు.

*(హరిజన్, 5-12-'36, పుట 338-39)*

★ ★ ★

మందికిది అలవడేందుకు చాలా సమయం పడుతుంది. కాని ఇది, త్వరితమైన, నిశ్చితమైన దారి. పెట్టుబడిదారుని నాశనం చేయడం; కార్మికుని

కూడా నాశనం చేయడమే. ఎవరూ, తప్పు చేయని వారు కారు. తప్పుచేసి దిద్దుకోలేని వారు కారు. కనుక తప్పు చేసిన వారి తలదీయడం, ఏ విధంగానూ సమర్ధనీయం గాదు

నాకు పెట్టుబడి అంటే అయిష్టం లేదు. పెట్టుబడి దారుల మనస్తత్వము పడదు. పాశ్చత్యులు, పెట్టుబడిని ఒకేచోట ప్రోగుచేసి ఉంచవద్దని, వర్గ సంఘర్షణకు మరో రూపాన్ని తప్పించుకోమని, ఉపదేశిస్తారు.

ధనవంతులతో అసహాయోగం అవలంబించి, వారిని దారికి తీసుకురావచ్చును. ఈ ప్రశిక్షణ, వారిని అంతం చేయమని చెప్పే మాట కంటె ప్రశస్తమైనది. అంతంలో ఇద్దరూ సమాన భాగస్వాములవుతారు. పెట్టుబడి చెడ్డది కాదు; దాని దురుపయోగం చెడ్డది. ఏదో ఒక రూపంలో పెట్టుబడి ఉండనే ఉంటుంది. ధన సంగ్రహణతో చర్య అనగా అధికార వినియోగం ఉంటుంది. కనుక ధనం, పని వీటి సంబంధాలు సరిగా ఉండాలి. ఏ ఒక్కటీ, రెండో దానిని మించరాదు. సమతౌల్యం కావాలి. వాటి మధ్య సహజ శత్రుత్వమేమీ లేదు. గొప్పవారు, పేదవారు ఎప్పుడూ ఉంటారు. వారి పారస్పరిక సంబంధాలు మారుతూ ఉంటాయి. ఫ్రాన్సు ప్రజాస్వామిక రాజ్యము అయినా అన్ని వర్గాల ప్రజలూ అక్కడ ఉన్నారు. పడికట్టు పదాలపై మోజు వద్దు. భారతదేశంలోని అన్ని రకాల భ్రష్టత్వం, ఏదో ఒక విధంగా, ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నది. దూరపు కొండలు నునుపు. పాశ్చాత్య రూపమేదైనా, మన కళ్లను జిగేలుమనిపిస్తుంది అక్కడ కూడ పాలకుల - పాలితుల మధ్య ఎన్నో సంఘర్షణలున్నాయి. అక్కడ కూడ ప్రజలు సౌఖ్యాన్ని కోరుకుంటూ వెంటపడి, ప్రతిఫలంగా దుఃఖాన్ని అనుభవిస్తూవుంటారు.

నిజమైన సోషలిజం, మన దేశంలో అనాదిగా ఉన్నది. అంతా దేవుని సొత్తు అయిన నాడు, సరిహద్దు రేఖలు దేనికి? మానవుని కల్పితమైన ఈ గీతలను, అతడే చెరుప గలడు. దేవుడనండి, నాయకుడనండి, ప్రభుత్వమనండి, ప్రజలు అనండి - అంతా ఆ సృష్టిలో అంశాలే. ప్రస్తుతం భూమి ప్రజలకు

చెందినదై ఉండలేదు. మనకు వారసత్వంగా వచ్చిన ఉపదేశాల దోషం కాదు. మనమే వాటి ప్రకారం బ్రతుకును వెళ్లదీయలేక పోతున్నాం.

మనము, రష్యాతోసహా, ఆ సర్వసమానత్వం, అపరిగ్రహం దిశలో సాగవచ్చును. హింసాయుత పరిగ్రహానికి రాట్నమూ, దాని వేదాంతమూ, దాని సిద్ధాంతమూ, జవాబు. ఎవరు కష్టపడతాడో, అతనిదే భూమి, ఆస్థి, సంపద. పనివారికి ఈ విషయం తెలియదు. తెలియజెప్పడం జరుగలేదు. పంచాయతీ రాజ్యంలో, ప్రజాశక్తి, అధికారంలోకి వస్తుంది. విషయం పూర్తిగా అమలు అయే అంత వరకే, రాజులు, పెట్టుబడిదారులు వారి రాజ్యం, చెల్లుతుంది. ప్రజలు జాగరూకులై, ఆతతాయిలతో సహకరించని రోజున, ఆతతాయితనం చస్తుంది పంచాయత్ చట్టాలను చేసుకొని, అమలు చేస్తారు. "తప్పనిసరిగా ఉండాలి" అను అనివార్యతను అంగీకరించను. అహింసా మార్గాన ధనవంతులలో మార్పుతెస్తాను. "మాకు కావలసినవి మాకు దొరికితేనే పని చేస్తాం" అని పనివారంటే, యజమానుల గొంతుకలో వెలక్కాయ పడ్డట్టే. కాయకష్టం చేసే వానికే, ఉత్పత్తి దక్కాలి. (చెందాలి) ఐక్యతతో శ్రమికులు సాధించలేనిది ఏదీ లేదు. వర్గ సంఘర్షణకు అవసరమే లేదు. ఒక వేళ అది అవసరమైతే, దానిని గురించి బోధించి, అనుసరింప చేసేందుకు వెనుదీయను. ఆదర్శ మూర్తి అయిన జమీందారు రైతుపై భారాన్ని వెంటనే తగ్గిస్తాడు

రైతులతో దగ్గరై. వారి కష్టాలను తీర్చి, వారిలో ఆశాజ్యోతిని వెలిగిస్తాడు. అవిద్యను తొలగిస్తాడు. శుచి, శుభ్రతలను నేర్పుతాడు. తన అవసరాలను తగ్గించుకొని. రైతును సుఖపెడతాడు. వారి ఆర్థిక పరిస్థితులను అధ్యయనం చేసి, స్కూళ్లు స్థాపించి, వాటిలో తన పిల్లలను కూడ, రైతుల పిల్లతోపాటు చదివిస్తాడు. గ్రామంలోని బావి, చెరువులను పూడిక తీయించి, శుభ్రపరుస్తాడు. రోడ్లను ఊడుస్తాడు. పాకీ దొడ్లను తానే కడుగుతాడు. తన తోటలను, దొడ్లను, వారి కోసం తెరచి ఉంచుతాడు. తనవైన హర్మ్యాలను, తాళం వేసి ఉంచకుండా, సార్వజనికమైన పనులకు, స్కూలుగా, ఆస్పత్రిగా, ఉపయోగపరుస్తాడు. ధనవంతులు, కాలగతిని గమనించి, భగవద్దత్తమని విన్న వాక్యాలకు సరియైన భాష్యం చెప్పి, అతి తక్కువ సమయంలో

గ్రామాన్ని, స్వర్గధామంగా చేస్తాడు. దీనితో పెంట కుప్పలపలె ఉన్న నేట గ్రామాలు ఆరోగ్యం, శాంతి, సౌఖ్యాలకు అవాసాలవుతాయి.

ధనవంతులు, సామాన్యుల సేవ చేయాలి. సామాన్యుల భాగదేయం వారికే దక్కాలి. వారిని నమ్మి, తమ లాభాలను, సామాన్యులకై త్యాగం చేసేట్లు చెయ్యాలి సరిగా నచ్చ చెపితే, అనునయ వాక్యాలకు స్పందించే ధనవంతులు, తమ భోగభాగ్యాలను సామాన్యులతో పంచుకుంటారు.

సామాన్యులతో మనం మాత్రం ఎంతగా కలిపిపోయాము? సేతుబంధం జరిగిందా? గండి పూడిందా? గాజు ఇళ్లలో ఉండి, రాళ్లు విసరకూడదు. నా మట్టుకు నాకు, ఆ కలయిక స్వప్నతుల్యంగానే ఉంది.

హృదయ పరివర్తన చెందిన రాజు, రైతులలో ఒకడై, వాళ్ల సుఖ దుఃఖాలను పంచుకుంటూ, మానవుడు అవతాడు. స్కూళ్లు, ఆసుపత్రులు, శుచి, శుభ్రత, తోటలు, దొడ్లూ - వీటన్నిటిని తన కౌశలంతో తన సహచరులకు ఉపయుక్తంగా అమరుస్తాడు.

*(యంగ్ ఇండియా 5-12'29 పుట 396)*

★ ★ ★

భూస్వాములు, ధనవంతులు, సామాన్యులకు తమ సేవలనందించాలి. వారిని నమ్మి, పూచీ ఇస్తే తప్పకుండా నిర్వహిస్తారు. మంచి మాటలకు స్పందిస్తారు.

మరో మాట! వాళ్లని తెగడిన, మనసంగతి ఏమిటి? ఎంత వరకు మనం పేదలతో కలిసి ఒకటి అయిపోయాం?

కనుక, వర్గ పోరాటం పేరెత్తకుండా, మంచి అనునయ వాక్యాలతో, మనస్సులను మార్చే ప్రయత్నం చేద్దాం.

*(అమృత బజారు పత్రిక, 3-8-'34÷*

★ ★ ★

వర్గ పోరాటం ఎప్పుడూ ఉంటూనే ఉన్నది. తన రెండు చేతులలో సత్యాహింసలు ధరించిన కార్మికుని సాఫల్యం, ధనవంతుడెంతో బంగారం వెచ్చించి సాధించగలడా?

కార్మికులు - ధనవంతులు, కాయకష్టం పెట్టుబడి అనాది నుంచి ఉన్నవే కార్మికులకు వారి మార్గదర్శకులకు, కార్మికుల శక్తి తెలియక, కుంటివాడు, గుడ్డివానిని తీసుకుపోయినట్లు తప్పుదారిని పోతున్నారు.

కార్ల్ మార్క్స్ మహాశయుడు హింసా మార్గాన పోయి, సమానతను సాధించాలి అంటాడు. విశ్వవిద్వాంసులందరూ, ఈ భావనను దాటి ముందుకు పోయి, సఫలులౌతున్నారు. కాని ఆయన శక్తియుక్తులకు నా నమోవాకాలు.

*(హిందూస్తాన్ టైమ్స్, 5-1-'46)*

★ ★ ★

ఇండియాకు వర్గపోరాటమంటే తెలియదు. రామరాజ్యంలో పేదా, సాదా, కలిసి ఉంటారని వారికి తెలుసు.

*(అమృత బజారు పత్రిక 2-3-'34)*

★ ★ ★

# భాగము 9

## రాజకీయ ఆలోచనలు

### అధ్యాయము 55

## రాజకీయాలు మరియు మతము

జీవితాన్ని నేను కొన్ని విభాగాలుగా విడగొట్టడం లేదు. వ్యక్తుల జీవితం మాదిరిగానే జాతి జీవితం కూడా విడదీయడానికి వీలుపడని ఏకమొత్తము (Indivisible Whole)

నా దృష్టిలో మతం లేకుండా రాజకీయాలు లేవు. మతం అంటే ద్వేషాన్ని పెంచుకొని, పోట్టాటలాడే మూర్ఖుల, గుడ్డివాళ్ల మతం గురించి కాదు నేను చెప్పేది - నేను చెబుతున్నది సహనంతో కూడుకున్న వసుధైక మతం గురించి. నైతిక విలువలు లేకుండా రాజకీయాలను చేయడాన్ని తప్పించాలి.

*(యంగ్ ఇండియా, 27-116'24, పే. 391)*

★ ★ ★

నా దృష్టిలో మతం లేని రాజకీయాలు పూర్తిగా మలినమైనవి వాటిని విసర్జించాలి రాజకీయాలు జాతిని గురించి శ్రద్ధ వహిస్తాయి. జాతి సంక్షేమాన్ని కాంక్షించే దేనికైనా మత సంబంధమైన మనిషి - అంటే భగవంతుని గురించి, సత్యం గురించి తెలుసుకోవాలనే మనిషి - యొక్క సంక్షేమాన్ని కూడా ఆలోచించాలి... అందువల్ల రాజకీయాల్లో కూడా మనం స్వర్ణధామాన్ని నిర్మించాల్సి ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 18-6'25, పే 214)*

★ ★ ★

## అధ్యాయము 56

# ప్రబుద్ధ అనియమిత స్థితి

రాజ్యాధికారం ప్రజల అభివృద్ధికీ, ప్రజాప్రతినిధుల ద్వారా రాష్ట్ర జీవనాన్ని క్రమబద్ధం చేసేది రాజ్యాధికారం. జన జీవితం, స్వనియమితమై, పటిష్టంగా ఉంటే, ప్రతినిధులెందుకు? అప్పుడు ప్రతివ్యక్తీ స్వ-శాసకుడే. ఆ స్థితి వెలిగించిన దీపం వంటి ఆదర్శ స్థితిలో రాజ్యం లేదు. రాజ్యాధికారం లేదు. థోరోమహాశయుడన్నట్లు "అత్యల్ప శాసనం చేసే ప్రభుత్వమే ఉత్తమోత్తమం.

*(యంగ్ ఇండియా 2-7'31 పుట 162)*

★ ★ ★

తమ వీలు మేరకు, ప్రజలు తమపై విధించుకున్నదే చట్టం, అహింసాయుతమైన అట్టి సమాజం, ఉత్తమోత్తమమైన నియమరహిత స్థితిలో ఉంటుంది.

అహింసాయుత ప్రజాస్వామ్యంలో శాసనాలు నియమాలు ఉండవు. వాటి అవసరం ఉండదు.

*(హరిజన్ బజార్ పత్రిక 21-7-'40 పుట 211)*

★ ★ ★

అటువంటి ఆదర్శ రాజ్యం అసంభవం కాదు. అహింస ఏ మేరకు సిద్ధిని పొందగలదో, "జాగృత అనియమితత" కూడా ఆ మేరకు, ఫలిస్తుంది. ఏ ప్రభుత్వము, ప్రజలను అతి తక్కువ నియమాలతో, ఉండీ ఉండని చట్టాలతో, అత్యల్పమైన ప్రతిబంధకాలతో పరిపాలిస్తుందో, అది అత్యున్నతమైన, అత్యుదాత్తమైన ప్రభుత్వం. అహింస అనే పునాదిపై నిర్మింపబడిన ప్రజాప్రభుత్వం ఈ ఆదర్శ స్థితికి అతి దగ్గరకు వస్తుంది

ప్రస్తుతం ఇది పగటి కల అనిపించినా. ప్రధానంగా అహింసాయుత సమాజం యొక్క అస్తిత్వంలో నాకు గట్టి నమ్మకం ఉంది. నా శ్రమంతా దాని కోసమే.

తరతరాల ఓరిమి, వివేకము, ఇటువంటి ఆదర్శవంతమైన రాజ్యాన్ని తయారు చేసి, నిలబెడుతాయి. మున్ముందు సంపూర్ణమైన చైతన్యం, శక్తియుతమైన జాగృతి ఎంతైనా అవసరం. తక్కువ విషయాలు వెనువెంట త్రోసుకొని వస్తాయి.

అటువంటి ఆదర్శవంతమైన రాజ్యము సాధ్యమేనా? అవును. నిరంతరం అటువంటి సమాజాన్ని నిర్మించేందుకు ప్రయత్నిస్తే, కొంత కాలం తర్వాత, నెమ్మదిగా, కొంత వరకు ఏర్పడి, ప్రజలకు ఉపకరించే విధంగా నిలిచి ఉంటుంది. అయితే అన్ని రకాలకు సంబంధించినది ప్రభుత్వం, ప్రజలందరదీ; కనుక పూర్తిగా అహింసాయుతం, కానేరదు. కాని సమాజం ఆ విధంగా ఉండవచ్చు.

*(హరిజన్ బజార్ పత్రిక 9-3-'40 పుట 31)*

★ ★ ★

విద్యుచ్ఛక్తి అందరికీ లభించేందుకు కొన్ని తరాలు గడిచాయి. ఆదర్శ రాజ్యాన్ని పరిపాలించేందుకు అట్టి రాజ్యం ఏర్పడిన తర్వాత ఉత్తమోత్తమ శాసకుడు అనివార్యం కాడు.

*(కొత్త దిగంతాలవైపు 1959, పుట 93)*

★ ★ ★

యాక్లిడు జ్యామితిలో సరళరేఖకు వెడల్పు లేదు (సిద్ధాంతం

ప్రకారం) కాని అట్టి రేఖ ఊహలో మాత్రమే ఉన్నది. అదేవిధంగా ఆదర్శ సమాజానికి ప్రభుత్వం అవసరమా, కాదా అనే ప్రశ్నకు, జవాబు ఉన్నప్పటికీ "కృషి చేద్దాం, ఆ ప్రశ్న ఎందుకు?" అని నా జవాబు

*(హరిజన్ బజార్ పత్రిక 15-9-'46 పుట 309)*

★ ★ ★

## అధ్యాయము 57

# వ్యక్తి సర్వోపరి

టాల్‌స్టాయి మహాశయుల ఆశయం ఇది "ఏ నాటికైనా, అనియమితమైన, ఆధ్యాత్మికమైన ప్రపంచం సంభవం". తన అంతరాత్మ ప్రబోధాన్ని అనుసరించిన వానికి భగవద్రాజ్యం లభిస్తుంది. అతడు ప్రభుత్వ శాసనాలకు, నియమాలకు అతీతుడు.

*(మహాత్మా గాంధీ రచనలు శ్రీ, పుట 249)*

★ ★ ★

వ్యక్తి స్వేచ్ఛ ప్రగతికి మూలం. దానిని నష్టపరిచే ప్రభుత్వాధికారమంటే నాకు భయం.

*(గాంధీ రచనలు 1957, పుట 41)*

★ ★ ★

వ్యక్తి స్వేచ్ఛ అనియమితమైతే, అది ఆటవిక స్థితి అవుతుంది; మధ్యేమార్గం అటు వ్యక్తినీ, ఇటు సమాజాన్నీ బాగు చేస్తుంది.

*(హరిజన్ బజార్ పత్రిక 27-5-'39, పుట 144)*

★ ★ ★

ప్రతి వ్యక్తి తన ఆత్మ ప్రబోధాన్ని అనుసరించాలి. దీనినే ప్రపంచంలోని ప్రవక్తలంతా నొక్కి వక్కాణించారు. తనలోని దైవ సామ్రాజ్యానికై వెదుకులాడాలి. ప్రభుత, తన అధికార బలంతో, కొల్లగొట్టడాన్ని నియంత్రిస్తుంది. అయితే వ్యక్తిత్వాన్ని కూడా నియంత్రించడం అసహనీయం.

వ్యక్తి స్వేచ్ఛకు విలువ కట్టలేము. కాని వ్యక్తి మూలతః సమాజానికి

చెందిన వాడని మరువరాదు. తన వ్యక్తిత్వాన్ని, సమాజ ప్రగతికి వలసినట్టుగా సరిదిద్దుకుంటూ, ప్రస్తుతం, ఈ ఉన్నత స్థితికి ఎదిగాడు. ఆటవికమైన అనియమితతను పరిహరించి, సంఘపరంగా నియంత్రణను సహించి, ముందుకు సాగుట వలన అందరికీ మేలు జరుగుతుంది

సత్యాహింసల ద్వారా పూర్ణ స్వాతంత్ర్యమంటే, ప్రతి విభాగంలోనూ స్వేచ్ఛ - (ఆ విభాగము అత్యల్పమైనది అయినా సరే) - జాతి, వర్ణ విభేదాలు ఉండవు. సత్యాహింసల అనుసరణ ఎంత మేరకు జరిగితే, అంత మేరకు స్వాతంత్ర్యం.

తన బుద్ధి బలాన్ని, చాకచక్యాన్ని, ప్రతివ్యక్తీ. పొరుగు వారికి ఉపయోగపడేటట్టు చేసే, స్వేచ్ఛ, కలిగి ఉంటాడు. అయితే ఆ కౌశల్యం వలన కలిగే లాభాలను తామొక్కరే అనుభవించ కూడదు. దేశంలో అతడొక భాగం. పరిసరాలలోని సమాజంలో అతడొక అంశం. కనుక తన పటిమను అందరికీ ఉపయోగపడేటట్టు చేయాలి. తనకొక్కడికే కాదు. సంపూర్ణ స్వాతంత్ర్యం అంటే ప్రతి ఒక్కరికీ స్వేచ్ఛ మన ఆచరణలో అందినంత మేరకు, అది ఉంటుంది.

*(నిర్మాణాత్మక కార్యక్రమం, 1961, పుట7)*

★ ★ ★

స్వేచ్ఛారహితమైన బ్రతుకు కంటే, చావు మేలు.

*(యంగ్ ఇండియా 5-1-'22, పుట 5)*

★ ★ ★

ప్రతి వ్యక్తీ తన తెలివిని, సమాజ శ్రేయస్సు కొరకు వినియోగించాలి.

*(హరిజన్ పత్రిక 1-8'42,)*

★ ★ ★

వ్యక్తి స్వేచ్ఛ నశిస్తే అంతా నశించినట్టే

*(హరిజన్ జబార్ పత్రిక 1-2-'42, పుట 27)*

★ ★ ★

## అధ్యాయము 58

# స్వరాజ్యము

"స్వరాజ్" శబ్దానికి స్వ-పరిపాలన, స్వ-నియంత్రణ అని అర్థం. స్వాతంత్ర్యం అంటే స్ఫురించే విశృంఖలత మాత్రం కాదు

*(యంగ్ ఇండియా 19-3-'31, పుట 38)*

★ ★ ★

ప్రతిదేశం, ఆహార, వ్యవహారాలలో స్వాయత్తత కలిగి ఉండడం వల్ల, తనను తాను పరిపాలించుకో గలదు. ఎంత నికృష్టంగానైనా సరే!

*(యంగ్ ఇండియా, 15-10-'31, పుట 305)*

★ ★ ★

స్వ-పరిపాలన ఆత్మబలం మీద ఆధారపడి ఉంటుంది.

*(యంగ్ ఇండియా 1-12-'27, పుట 402)*

★ ★ ★

అంతరంగంలో స్వేచ్ఛావాయువుల నిష్పత్తిలో మాత్రమే, బయట కూడా స్వాతంత్ర్యం లభిస్తుంది.

*(యంగ్ ఇండియా, 1-11-'28, పుట 363)*

★ ★ ★

"స్వరాజ్"లో ప్రజలు, ప్రతి విషయానికీ, ప్రభుత్వ శాసనాల కొరకు ఎదురు చూడరు.

*(యంగ్ ఇండియా 6-8-'25, పుట 276)*

★ ★ ★

అహింసాయుతమైన "స్వరాజ్"లో, శత్రుత్వం ఉండదు: ప్రతి వ్యక్తి కృషి చేస్తాడు జ్ఞానవృద్ధి, ఆరోగ్యసిద్ధి, ప్రతి వానికీ చేసేందుకు పని, ఉంటాయి. జూదం, త్రాగుడు, వాసనాదోషాలు, వర్గ వైషమ్యాలు ఉండవు. ధనవంతులు, తమ ధనాన్ని ప్రజల కోసం ఉపయోగిస్తారు. ఉండవలసిన హక్కులుంటాయి.

*(హరిజన్ పత్రిక, 25-3-'39, పుట 65)*

★ ★ ★

స్వ-పరిపాలన అనేది, కష్టసమయాల్లో, స్థిరంగా నిలబడి, అవాంతరాలను అధిగమించడమే. నిరంతర కృషితో దానిని అందుకోగలగడం, దానిని నిలుపుకోవడం అన్న సంగతి అవసరం లేని స్వపరిపాలనకు విలువలేదు. అధిక సంఖ్యలో స్త్రీ పురుషులకు ఉపయోగపడే స్వపరిపాలన, వ్యక్తి పరమైన స్వ-పరిపాలనను మించి ఉండదని నేను, నా మాటలలో, చేతలలో నిరూపించేందుకు ప్రయత్నించాను వ్యక్తిపరమైన స్వపరిపాలన (సెల్ఫ్-రూల్) సంపాదించే పద్ధతులలోనే, బహు సంఖ్యాక స్వ-పరిపాలనను సాధించవచ్చును.

మన ఆత్మలోని స్వాతంత్ర్యం మేరకు, బయటి స్వేచ్ఛను సాధించగలం. ఇదే సరియైనదైతే, ఆత్మ సంస్కరణ కొరకు, మన శక్తిని పూర్తిగా వినియోగించాలి. స్వపరిపాలన అంటే ప్రభుత్వ నియమాలకు, నియంత్రణకు అతీతంగా (అది విదేశీ ప్రభుత్వమైనా, స్వదేశీ ప్రభుత్వమైనా) ఉండేందుకు నిరంతర ప్రయత్నమే. దీనినే స్వరాజ్ అంటాను. స్వరాజ్‌లో రుగ్మతలు అత్యల్పంగా ఉంటాయి. ఎవరూ దరిద్రుడై ఉండడు. కార్మికులందరికీ పని దొరుకుతుంది. దురాచారాలు, దుర్వ్యయాలు ఉండవు. కొద్ది మంది ధనికులు రాజ భవనాలలోనూ, కోట్లాది మంది, గుడిసెలలోనూ నివసించరు. న్యాయ సమ్మతమైన హక్కులను కాలరాయరు. విపర్యయంగా ఎవ్వరికీ న్యాయ సమ్మతంగాని హక్కులు ఉండవు. ఈ ఆదర్శ రాజ్యంలో పొరుగు వాని ఆస్తికాజేయడం అసంభవం, కనుక ఆ దుష్టుని నుండి అతడు అన్యాయంగా కూడబెట్టిన సంపదను రాబట్టడానికి శక్తి ప్రయోగం చేయనక్కరలేదు.

ఇంగ్లీషు వారి నిరంకుశత్వం నుండి మాత్రమే గాక, ఏ నియంతృత్వము లేని స్వేచ్ఛ అది. 'స్వరాజ్'లో విధులకు సంబంధించిన హక్కులు మాత్రమే ఉంటాయి. తమ ప్రభుత్వానికి సేవ చేసే వారికే హక్కులు ఉంటాయి. వారే, ఆ హక్కులను సద్వినియోగం చేస్తారు. అసత్యభాషణ, హింసాయుత ప్రవర్తనకుతా వుండదు. సత్యాహింసలు పాటించే వానికి గౌరవం కలుగుతుంది. గౌరవం హక్కులను తెస్తుంది. తమ విధులను నిర్వహించడం వలన లభించిన హక్కులను, వారు సమాజ సేవకొరకే వినియోగిస్తారు. తమ కోసం

ఎన్నటికీ వాడరు. ప్రజల 'స్వరాజ్' అంటే, (స్వ-పరిపాలన అంటే) అట్టి వ్యక్తులకందరికీ మొత్తంగా లభించిన 'స్వరాజ్' (స్వ పరిపాలన) అన్నమాట.

మన నాగరికతను నిలబెట్టుకోవాలి నేను ఏమి వ్రాయదలచినా నా 'స్వరాజ్'లో పలకల మీదనే వ్రాస్తాను

*(యంగ్ ఇండియా. [illegible]. పుట 210)*

★ ★ ★

'స్వరాజ్' అంటే అల్పులతోసహా అందరికీ, పూర్తి స్వేచ్ఛ

*(యంగ్ ఇండియా. 12-6-'24, పుట 195)*

★ ★ ★

అహింసాయుత 'స్వరాజ్'లో విధులు గుర్తించుకుంటారు. హక్కులు సంక్రమిస్తాయి.

*(హరిజన్ పత్రిక, 25-3-'39. పుట 64)*

★ ★ ★

విధులు సరిగా నిర్వహిస్తే, హక్కులు సమకూడుతాయి. గీతా వాక్యం. "కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన" అమలులో ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 8-1-'25, పుట 15-16)*

★ ★ ★

నీ హక్కులను, ఇతరుల హక్కులను భంగపరచకుండా వాడుకోవాలి.

*(యంగ్ ఇండియా. 30-1-'30. పుట 37)*

★ ★ ★

వర్గ, ధర్మభేదాలుండవు. పండితులు, ధనవంతులు ప్రత్యేకతనాశించరు.

*(యంగ్ ఇండియా, 1-5-'30, పుట 149)*

★ ★ ★

స్వంతలాభం చూసుకోకుండా, అందరూ 'స్వరాజ్'లో పరుల కోసం పాటుపడే దేశ భక్తులే

*(యంగ్ ఇండియా, 28-7-'21, పుట 238)*

★ ★ ★

పూర్ణ స్వరాజ్ అంటే, అందరికీ స్వేచ్ఛ

*(యంగ్ ఇండియా, 16-4-'31, పుట 77)*

★ ★ ★

మనకు అనువైన ఏర్పాట్లు, రామరాజ్యంలోవలె, ఉంటాయి.

*(హరిజన్ బజార్ పత్రిక, 2-1-'37, పుట 374)*

★ ★ ★

'స్వరాజ్' బహుసంఖ్యాకులైన హిందువుల రాజ్యం అనడం తప్పు.

*(హరిజన్, 16-4-'31, పుట 78)*

★ ★ ★

అన్ని వర్గాలకు సమానత్వం ఉంటుంది.

*(యంగ్ ఇండియా, 14-5-'31, పుట 108)*

★ ★ ★

పూర్ణస్వరాజ్ అందరిదీ. హిందువులు, ముస్లింలు, పార్శీలు, క్రిస్టియన్లు, జైనులు, యూదులు, సిక్కులు అందరూ ఇక్కడ సమానులు.

*(యంగ్ ఇండియా, 19-3-'31, పుట 42)*

★ ★ ★

స్వరాజ్యం ఎలా వస్తుంది? నాగరికులుగా తమ విధులను వ్యక్తులు నిర్వహించినపుడు వస్తుంది. అటువంటి దానిలో, ఎవ్వరూ హక్కులను గురించి ఆలోచించరు. ఆ హక్కులు, వారికి, తమ విధులను ఇంకా బాగా నిర్వహించేందుకు కావలిస్తే వస్తాయి.

మనమంతా మన విధులను సరిగా నిర్వహిస్తే, హక్కులను గురించి వెదకవలసిన పనిలేదు. విధులను సరిగా నిర్వహించక, హక్కుల వెంట పరిగెడితే, అవి మననుంచి తూనీగల్లా తప్పుకొని పోతాయి. ఎంత దూరం వాటి వెనుకపడితే, అంత ఎక్కువ దూరానికి ఎగిరిపోతాయి.

రాష్ట్రానికి స్వాతంత్ర్యం అనేది స్వకపోల కల్పన కాదు. వ్యక్తికి స్వేచ్ఛ ఎట్లు ఆవశ్యకమో, దేశానికి, రాష్ట్రానికి కూడా అంతే. కాని ఏదీ కూడా, అహింసా విధానం పునాదిగా గలదైతే, దేశానిది వ్యక్తికి గాని, వ్యక్తిది, దేశానికి

గాని, ఏ విధంగానూ ముప్పై, బాధను కలిగించదు. వ్యక్తిదీ, దేశానిదీ వలెనే అంతర్జాతీయానిదీ అదే పద్ధతి. చట్టానికందరూ సమానులు. నీ హక్కులను, ఇతరుల హక్కులకు భంగకరం కాని విధంగా అమలు పరచు. విశ్వమంతా అణువులో నిక్షిప్తమైందని, చక్కగా చెప్పారు. అణువునకొక సూత్రము, విశ్వానికింకొక సూత్రమూ ఉండదు.

'స్వరాజ్' - విద్యావంతులు, ధనవంతులు, వీరి, ఏకైక సొత్తుకాదు. 'స్వరాజ్' అందరిదీ. ఇప్పుడే పైన చెప్పిన వారిది, వికలాంగులది, అంధులదీ, ఆకలిగొన్న వారిదీ, కష్టజీవులదీ, దృఢచిత్తుడు, నిజాయితీపరుడు, వివేకవంతుడు, విద్యావిహీనుడు రాష్ట్రానికి ప్రథమ సేవకుడు కావచ్చును.

'స్వరాజ్' అంటే బహు సంఖ్యాకుల ప్రభుత్వం వీరు దేశభక్తులై, దేశ శ్రేయస్సే, తన శ్రేయస్సు కంటే ఎక్కువ అని భావిస్తారు. ఎక్కడైతే, బహు సంఖ్యాకులు అవినీతిపరులూ, స్వార్థపరులూ అయి ఉంటారో, అక్కడ ఆ ప్రభుత్వం అల్లర్లకు, గందర గోళానికి, లోనవుతుంది. అంతా శూన్యమే అవుతుంది.

"పూర్ణ స్వరాజ్" అంటే... కష్టజీవులకు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని, కష్టజీవులను కొల్లగొట్టే గూడుపుఠానీ కాదు. అటువంటి సంఘటిత ప్రయత్నమేదైనా, వారి విడుదల కొరకే అయి ఉండాలి.

రాజకీయ స్వాతంత్ర్యమంటే, నా అభిప్రాయం బ్రిటిషు పార్లమెంటు, రష్యాలోని సోవియట్ రాజ్యం, ఇటలీలోని ఫాసిస్టుల అధికారం, జర్మనీలోని నాజీల నియంతృత్వమని మాత్రం కాదు. వారికి తగిన ఏర్పాట్లు వారివి. మనకు తగిన ఏర్పాట్లు మనవి. అవి ఎట్లుండగలగాలి అనేది నేను చెప్పలేను. ప్రజల ధార్మిక ప్రభుత్వం కావచ్చు. ఇదే "స్వరాజ్"

హింద్ స్వరాజ్ అంటే నా దృష్టిలో అందరి ప్రభుత్వం, న్యాయ ప్రభుత్వం బహుసంఖ్యాకులది అంటే, అది తప్పు అంటున్నాను. ప్రతి వర్గం, ఇతరులతో సమానము. సత్యాహింసలు పునాదిగా నిర్మితమైన 'స్వరాజ్' పక్షపాత రహితం. ఆశబ్దార్థమూ, దానిని సాధించేందుకు ఎంచుకున్న మార్గమూ, ఇంకే అర్థానికి, పాక్షికతకు దారితీయవు. కొందరి పట్ల సౌమ్యంగా,

మరి కొందరి పట్ల క్రూరంగా ఉండదు. 'స్వరాజ్' సత్యాహింసలు మోసం, అసత్యాలను లోనికి రానీయవు.... ఈ విధానంలో 'స్వరాజ్' ఒక వర్గం హక్కులను భంగం చేయదు. (చిన్నవైనా, పెద్దవైనా) బడుగు జీవులకు, బలహీనులకు, న్యాయ పూరితమైన ప్రభుత్వాన్ని, సమాన గౌరవాన్ని కలుగజేస్తుంది.

మన అందరిలోనూ భూమిపై "దేవుని రాజ్యం" నా ఆదర్శం. ఓరిమితో శాంతంగా దీనికై వేచి ఉంటాను. స్వాతంత్ర్యమంటే నా దృష్టిలో ఇదే. ఈ కల పండేందుకు నా ప్రాణాలనైనా ఇస్తాను. అంతులేని ఓరిమి నాది.

*(హిందూస్తాన్ స్టాండర్డ్, 1-4-40)*

★ ★ ★

## అధ్యాయము 59

# నిజమైన ప్రజాస్వామ్యం

"అహింస", అధికారం చేపట్టకుండానే, అధికారాన్ని నియంత్రించి, దారి చూపుతుంది. సహజంగా అహింస అధికారాన్ని కైవసం చేసుకోదు. అది దాని లక్ష్యం కాదు.

*(కొత్త దిగంతాలవైపు, 1959, పుట 91-92)*

★ ★ ★

అహింసయే, ప్రజాస్వామ్యానికి దారి చూపిస్తుంది.

*(యంగ్ ఇండియా, 30-6-'20, పుట 3)*

★ ★ ★

ప్రజాస్వామ్యంలో, అందరి శక్తులు మేళవించి, అన్ని వర్గాల ప్రజల శారీరిక, ఆర్థిక ఆధ్యాత్మిక, తత్వాలను సమీకరిస్తుంది.

*(హరిజన్, 27-5-'39, పుట 143)*

★ ★ ★

క్రమశిక్షణ గల ప్రజాస్వామ్యం ఉత్తమోత్తమం. కల్మషమైనది అంధవిశ్వాస పూరితమైన, అజ్ఞాన భరితమైనది నశిస్తుంది.

*(యంగ్ ఇండియా, 30-7-'31, పుట 199)*

★ ★ ★

నిజమైన ప్రజాస్వామ్యంలో ప్రతి వ్యక్తీ స్వబుద్ధితో ఆలోచించాలి. ఈ విప్లవం ఎలా సాధ్యమవుతుందో తెలియదు. అది కల్తీలేని అహింస వలననే సాధ్యం.

*(హరిజన్, 25-5-'39, పుట 143)*

★ ★ ★

హింస వలన 'స్వరాజ్' ఎప్పటికీ సిద్ధించదు. ప్రతి హక్కులను అణగద్రొక్కి, నాశనం చేస్తే వ్యక్తి స్వాతంత్ర్యం రాదు. అది కల్తీలేని అహింసవలననే సాధ్యం.

*(హరిజన్, 12-11-'38, పుట 328)*

★ ★ ★

సహిష్ణుత గొప్ప నియమం ఎవరినీ ఏమీ అనవద్దు.

*(యంగ్ ఇండియా, 23-9-'26, పుట 334)*

★ ★ ★

అభిప్రాయ భేదం, శత్రుత్వం కాదు. నాకు అట్టి వారు మిత్రులు.

*(యంగ్ ఇండియా, 17-3-'27, పుట 82)*

★ ★ ★

"స్వరాజ్"లో, స్వ-రక్షణ పెంపొందించుకుంటాం.

*(యంగ్ ఇండియా, 22-9-'20, పుట 1)*

★ ★ ★

మనమంతా ఒకే విధంగా ఆలోచించము. సత్యా[illegible] పరికించే దృష్టికోణాలు కూడా ఖండఖండాలుగా ఉంటాయి. కనుక పరస్పర అభిప్రాయాలను, సహిష్ణుతతో గౌరవించడం సరియైన పద్ధతి. అందరి ఆత్మశక్తి కూడా ఒకే విధంగా ఉండదు. కనుక ఒక వ్యక్తికి పనికి వచ్చునది, అందరూ అనుసరించాలి. అనడం వారి ఆత్మస్వాతంత్ర్యానికి భంగకరం.

అభిప్రాయ భేదాలంటే శత్రుత్వము కాదు. అది నిజమయితే, నేనూ నా భార్యా బద్ధశత్రువులం అయి ఉండాలి. ప్రపంచంలో, అభిప్రాయ భేదం లేని ఏ ఇద్దరినీ, నేను ఎరుగను. నేను గీతానుయాయిని గనుక, నన్ను ఖండించిన వారిని కూడా, నా సన్నిహితులకు వలె అభిమానిస్తాను.

ప్రపంచమంతా ఎదురెత్తి వచ్చినా, మనని మనము రక్షించుకోగలిగిన సామర్థ్యమే, "స్వరాజ్" సాధనకు కావలసిన ప్రశిక్షణ. ఇది మొదలయితే, అన్నీ అనుసరిస్తాయి. దోషపూరితమైన, మన జీవితాలను స్వేచ్ఛగా గడుపగలగటం కూడా ఎంతో ముఖ్యం. మనతప్పులను మనమే అనుభవం మీద సరిదిద్దుకోగలము. స్వపరిపాలన, మంచి పరిపాలన కంటే మేలు. కనుకనే "స్వరాజ్"ను సాధిద్దాం.

*(యంగ్ ఇండియా, 30-7-'31, పుట 199)*

★ ★ ★

## అధ్యాయము 60

# వికేంద్రీకరణము

కేంద్రీకరణను ఒక వ్యవస్థగా చూసినపుడు అది శాంతియుత వ్యవస్థ విధానంతో పొసగదు.

*(హరిజన్, 18-1-'42, పే.5.)*

★ ★ ★

కేంద్రాధికారమంతా నేడు మహానగరాలైన ఢిల్లీ లేదా కలకత్తా మరియు బొంబాయిలో కేంద్రీకరించబడి ఉంది. ఈ అధికారాన్ని 7 లక్షల గ్రామాలకు పంపిణీ గావించాలని నా కోరిక.

*(మహాత్మాగాంధీ - 4వ సంపుటి 1958), పే.614.)*

★ ★ ★

అసంఖ్యాకమైన గ్రామాలను కలిగి ఉన్న ఈవ్యవస్థలో సమూహాలు ఎల్లప్పుడూ విస్తృతమవుతాయే తప్ప ఊర్ధ్వ ముఖంగా పయనించవు. జీవితం కొనభాగపు పునాదిపై నిలబెట్టిన పిరమిడ్ వంటిదికాదు. గ్రామం కోసం సర్వం త్యాగం చేయడానికి సిద్ధపడ్డ వ్యక్తే కేంద్రంగా ఉన్న ఒక మహా సమూహమే జీవితం. తాము భాగస్వాములుగా వున్న ఆ మహా సమూహంలో గంభీరత్వాన్ని పంచుకుంటూ, ఎపుడూ దురుసుగా గాకుండా వినయంగా ప్రవర్తిస్తూ ఒకే జీవితంగా మార్పుచెందే దశవైపుగా గ్రామాల సమూహము ఏర్పడడానికి ఆ గ్రామం సర్వం త్యాగం చేయడానికి సిద్ధపడాలి.

అందువల్ల బాహ్య పరిధికి, లోపలి సమూహాన్ని నాశనం చేసేందుకుగాక, లోపలివాటి అన్నింటికిశక్తిని ప్రసాదించి వాటి నుంచి తాను శక్తివంతం అయ్యేటట్లుగా అధికారం ఉంటుంది. అవ్వన్నీ ఒట్టిభ్రమలేనని ఒక్కటి కూడా ఉపయోగపడే ఆలోచన కాదని నన్ను ఎవరైనా దూషించవచ్చు. మానవు లెవరికీ గీచే శక్తి లేకపోయినా యూక్లిడ్ గ్రీకు గణితవేత్త; రేఖాగణితంలో విశేష కృషి సల్పిన వ్యక్తి సరళరేఖకు అవినాశనమైన విలువ ఉన్నపుడు, నా చిత్రానికి కూడా మానవ సమాజ జీవన గమనానికి సంబంధించి దాని విలుప దానికి ఉంటుంది. ఏనాటికీ దాని సమగ్రరూపంలో ఈ చిత్రాన్ని అందుకోలేకపోయినప్పటికీ ఈ చిత్రంకోసమే భారత దేశాన్ని జీవించనివ్వండి. మనం దేన్నైనా సాధించాలనుకొన్నపుడు, ఏమి సాధించాలని అనుకొంటున్నామో దానిపై స్పష్టమైన అవగాహన ఉండాలి. భారతదేశంలో ప్రతీ గ్రామం ఒకసర్వసత్తాక రాజ్యంగా ఎపుడైనా ఉంటే ఆరోజున ముందూ, వెనుక అంతా సమానంగానే ఉంటారనే భావచిత్రాన్ని నేను ఊహించకోగలను. ఇంకో మాటలో చెప్పాలంటే నా ఊహా చిత్రంలో ఎవరూ ముందు పడడం కావి మరెవరూ వెనుకబడటంగాని జరగదు.

*(హరిజన్ 28-7-'46. పుట 236)*

★ ★ ★

### అధ్యాయము 61

## గ్రామపంచాయితీలు

కేంద్రీకరణలో ప్రజాస్వామ్యం ఉండదు..గ్రామంకేంద్రంగా, పంచాయితీలు అధికార కేంద్రాలుగా, ప్రజలు కోరిన చోట, పరిపాలన సాగుతుంది.

*(హరిజన్, 18-1-'48, పుట 519)*

★ ★ ★

అయిదుగురు ఊరిపెద్దలున్న అధికార పీఠం పంచాయితీ. ఇది వరకు ఉండేవి.బ్రిటిషువారు వాటిని అంతం చేశారు.

*(యంగ్ ఇండియా, 28-5-31. పుట 123)*

★ ★ ★

ఇతర దేశాలనుండి, చైనానుండి విదేశీయులు, ఇండియాకు వచ్చి, చూసి, దొంగతనం, అసత్యం, దేశంలో లేవని చెప్పారు. తలుపులకు తాళాలు లేవట! ఆ నిజాయితీ, శ్రమశక్తి తిరిగి కలగాలి. తగాదాలు పంచాయితీలో తీరిపోవాలి.పంటలు పెంచాలి. శుభ్రత,ఆరోగ్యం పెరగాలి. చదువు, ఆటలుప్రోత్సహింపబడాలి. మద్యం,మాదకత, నిషిద్ధం కావాలి. అస్పృశ్యత ఉండకూడదు. హిందువులు, ముస్లిములు, సిక్కులు,పార్శీలు, క్రిస్టియనులు సోదరభావంతో ఉండాలి.

*(హరిజన్, 4-1-48, పుట 499-500)*

★ ★ ★

పంచాయితీకెన్ని అధికారాలుంటే, ప్రజలకంత మంచిది. పంచాయితీ స్థాయి పెరగాలంటే, ప్రజలు విద్యావంతులు కావాలి. ధార్మిక చింతన ఎక్కువ కావాలి. ఆయుధ శక్తి అక్కరలేదు.

*(హరిజన్, 21-12-'47 పుట 473)*

★ ★ ★

ఈ నిర్మాణంలో, లెక్కలేనన్ని గ్రామాలుంటాయి. వీటి కేంద్రం ఒక్కటే. క్రింది భాగం ఆధారంగా ఉన్న శంకువు వంటిది కాదు జీవితం. అయితే అదిఒక సముద్రకెరటం. వలయాకారంగా, అర్ధచంద్రాకారంగాఒక దానికోసం ఇంకొకటి విరిగి పడుతుంటాయి. త్యాగనిరతిని ప్రదర్శిస్తాయి. గ్రామాలు కూడా ఒకదానికోస మింకొకటిలయమై, చివరకు ప్రత్యేక వలయాల సమన్వయమై, దర్పాన్ని ప్రదర్శించక, వినీత భావంతో, సముద్ర వలయపు ధీరత్వాన్ని పంచుకుంటూ, అందులో ప్రత్యేక అంశాలై ఉంటాయి.

అన్నిటికంటె పెద్దదైన వలయం, తన శక్తితో లేని వలయాన్ని అణచివేయదు. లోనివాటి అన్నిటికీ బలాన్నిస్తుంది. ఇది "గాలిమేడ" అని నన్ను అభిశంసించకండి. ఏ మానవుడూ చిత్రించలేని బిందువు సర్వశక్తి సమన్వితము, శాశ్వత విలువ కలది అయి ఉంటుంది. భారతదేశం ఈ నిజమైన చిత్రంకొరకు జీవించవచ్చును. దీనిని పూర్తిగా అందుకోడం ఎన్నటికీ సాధ్యం కాకపోవచ్చు. దానికి దగ్గరగా ఉండే చిత్రాన్ని గీసే ముందు,

మనవద్ద, మన ఊహల కనుగుణ్యమైన చిత్రం ఉండాలి. ఇండియాలోని ప్రతిగ్రామము రిపబ్లిక్ (సర్వసత్తాకరాజ్యం) అయితే, నా చిత్రం సత్యమైనదేనంటాను. చిట్టచివరిది మొట్టమొదటి దానితో సమానమైనదిగా ఉంటుంది. అంటే ఎవ్వరూ మొదటివారు కారు, ఎవ్వరూ ఆఖరివారుకారు.

(హరిజన్, 28-7-'46, పుట 236.)



ఇరవైమంది కేంద్రంలో కూర్చొని, ప్రజాస్వామ్యాన్ని నడుపలేదు. అది ప్రతిగ్రామంలోంచి పెరగాలి...

ప్రజలకు వలసిన చోట పంచాయితీ నడపడానికి అడ్డు చెప్పే చట్టం లేదనుకుంటాను. దేశంలో తతిమా భాగం ఎలా ఉన్నా, ఏ మూలనైనా పంచాయితీ ఉండవచ్చు. విధి నిర్వహణతో హక్కు సంక్రమిస్తుంది. ఎవరూ దానిని తీసివేయలేరు. పంచాయితీ ప్రజాసేవకై ఉన్నది. నిజమైన ప్రజాస్వామిక ఇండియాలో (భారతదేశంలో) గ్రామమొక్క ఏకాంశ. ఒక్కగ్రామం పంచాయితీరాజ్ (రిపబ్లిక్) కావాలన్నా, ఎవరూ దానిని ఆపలేరు.

పంచాయత్ శబ్దం పురాతనం. తమ స్వార్థానికి, విదేశీయులు ఈ రిపబ్లిక్‌లను ధ్వంసం చేశారు. ప్రతీ పంచాయితీకి పూర్తి అధికారాలు ఉండాలి. ప్రతి గ్రామం, తన పనులను చక్కదిద్దుకొని, ప్రపంచానికి సరియైన జవాబు చెప్పగలగాలి. పైనుంచి ఎవరైనా దాడి చేస్తే ప్రతిఘటించి, వీరస్వర్గాన్నైనా పొందేందుకు ప్రశిక్షణ నివ్వాలి. పరస్పర సహకారంతో, ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడూ, తనకు కావలసినది తెలుసుకొని, కష్టపడకుండా సంపాదించలేని వస్తువును ఇంకెవరూ అట్టి కష్టంలేకుండా, అడుగ కూడదని తెలుసుకుంటారు.

జ్ఞాన సముపార్జనకై ఇండియాకు వచ్చిన విదేశయాత్రికులు, తమ ప్రయాణాల్లో ఎన్నోప్రయాసలకోర్చారు. ఇప్పటివలె, వర్గాలు, వర్ణాలు, ఇన్ని లేవట. ఆ నిజాయితీ, ఆ శ్రమశక్తి. పునరుద్ధరింపబడాలి. పంచాయితీలు త్వరగా, చవుకగా, న్యాయాన్ని అందించగలగాలి. పశువులు, పాలు. పంటలు,

పొలాలు, ఎరువులూ వీటినన్నిటినీ సరిగా ఉండేటట్లు చూడాలి. వారి మనసులు ఆరోగ్యంగా, స్వచ్ఛంగా ఉండాలి. సినిమావల్ల విద్యవస్తుందంటారు. అది ఎప్పటి మాటోగాని, ప్రస్తుతం సినిమావల్ల ఎంతో హాని కలుగుతూంది. ఈ విధంగా సర్వాంగ సుందరంగా గ్రామాలను పంచాయితీలు తీర్చి దిద్దాలి. అప్పుడే భారతదేశం, తన ప్రాచీనవైభవాన్ని సంతరించుకుంటుంది.

*(హరిజన్, 28-7-46, పుట 236.)*

★ ★ ★

**అధ్యాయము 62**

## పార్లమెంటరీ ప్రజాస్వామ్యం

బానిసత్వాన్నుంచి, పరాయి పీడననుంచి విముక్తి చేసి, అవసరమైతే పాపం చేసే హక్కును కూడా కలిగి ఉండే రాజ్యాంగం కోసం నేను కృషిచేస్తాను. ఇది తమ దేశమని ఈ దేశంలోనేతమ మాటకువిలువ ఉంటుందని పేదలుభావించేభారతదేశ నిర్మాణానికి నేను కృషిగావిస్తాను. ఉన్నత వర్గాలు, అథమ కులాలు లేని భారతదేశం కోసం:అన్ని కులాలు, మతాల వారు అత్యంతసామరస్యంగా జీవించేభారతదేశంకోసం నేను పనిచేస్తాను. అలాంటి భారతదేశంలో అంటరాని తనానికి, త్రాగుడు-మత్తు మందులకీ స్థానమే ఉండదు. ఎలాంటి దోపిడీలు లేకుండా (దోచుకోవడం-దోచుకోబడడం రెండూ లేకుండా) మిగతా ప్రపంచంతో శాంతియుత జీవనం కొనసాగిస్తూ ఉంటాము కాబట్టి వీలైనంత తక్కువ సైన్యం మనకు సరిపోతుంది. విదేశీ లేదా స్వదేశీ ప్రయోజనాలు అన్నీ లక్షలాది అమాయకుల ప్రయోజనాలకు అడ్డుకానంతవరకూ సముచితంగా గౌరవించబడతాయి. విదేశీ, స్వదేశీ అనే తేడాలను వ్యక్తిగతంగా నేను ద్వేషిస్తాను. ఇదీ నేను కలలుగనే నా సుందర భారతదేశం. దీనికంటే తక్కువైన దేనితోనూ నేను సంతృప్తి పడలేను.

*(యంగ్ ఇండియా, 10-9-'31, పే. 255)*

★ ★ ★

స్వరాజ్యమంటే విస్తృతమైన వయోజనుల ఓటు హక్కుతో ఎన్నుకొబడిన భారతీయ ప్రభుత్వము. ఆ ప్రజలు ఆడా, మగా; స్థానికంగా జన్మించిన వారు లేదా నివసిస్తున్న వారు - ఎవరైనా కావచ్చు; కానీ అది రాజ్యం కొసం తమ శారీరిక శ్రమ ద్వారా సేవ చేస్తూ, ఓటర్ల జాబితాలో పేరు నమోదు చేయించుకున్న ప్రజలే ఎన్నుకొన్న ప్రభుత్వమై ఉండాలి ఏ కొద్ది మందో అధికారాన్ని హస్తగతం చేసుకోవడం ద్వారాగాక, అధికారం దుర్వినియోగం గావించబడినపుడు దాన్ని ఎదుర్కోగల సత్తా ప్రతీ ఒక్కరూ కలిగి ఉండడం ద్వారా ఈ నిజమైన స్వరాజ్యాన్ని స్థాపించవచ్చని నా నమ్మకం. వేరే రకంగా చెప్పాలంటే, అధికారాన్ని నియంత్రించే విధంగా తమ సత్తాను పెంపొందించుకొనే విద్యను జనసామాన్యానికి బోధించడం ద్వారా ఈ స్వరాజ్యాన్ని సాధించవచ్చు.

*(యంగ్ ఇండియా, 29-1-'25, పే. 40.)*

★ ★ ★

ఆంగ్లాన్ని ఉపసంహరించడమే స్వాతంత్ర్యం కాదు. తన కర్మకు తానే బాధ్యుడనని, తానుఎన్నుకొనే ప్రతినిధుల ద్వారా తానే నిజమైన శాసన కర్తనని ఒక సాధారణ గ్రామీణునిలో చైతన్యం కలగడమే నిజమైన స్వాతంత్ర్యానికి సరైన అర్థం.

*(యంగ్ ఇండియా, 13-2-'30, పే.52.)*

★ ★ ★

## అధ్యాయము 63

# ఓటర్లు మరియు ఓటు హక్కు

సంపద ఉన్నవాడికే ఓటు హక్కు ఉండాలని, శీలం ఉండి కూడ సంపద, చదువులేని వానికి ఓటు హక్కు వుండకూడదని, పేదవాడైన పాపానికినిత్యమూ చెమటోడ్చి జీవించే మనిషికి ఓటు హక్కు ఉండరాదనే ఆలోచనను నేను భరించలేను. ఓటర్లు తప్పనిసరిగా విద్యావంతులై ఉండాలని చెప్పే సిద్దాతం పట్ల నేను అకర్షితుణ్ణి కాలేను. నా ప్రజలు విద్యావంతులు కావాలని నేను కోరుకొంటాను. అయితే వారు విద్యావంతులు

-య్యేవరకు ఓటు హక్కు వినియోగించుకోకుండా ఉండాలంటే శతాబ్దాల కాలం పడుతుందని నాకు తెలుసు: అంతకాలం నిరీక్షించడానికి నేను సిద్ధంగా లేను

*(యంగ్ ఇండియా. 8-10-'30. పే.297.)*

★ ★ ★

నేను వయోజన ఓటింగ్ హక్కుకోసం గట్టిగా నిలబడతాను. అనేక కారణాలరీత్యా వయోజన ఓటింగ్ అవసరం. వాటిలో ముఖ్యమైన కారణం అది ముస్లింలు, అంటరాని వారని చెప్పబడేవారు. క్రైస్తవులు యింకా అన్ని వర్గాల శ్రామికుల న్యాయమైన కోర్కెలను సంతృప్తి పరుస్తుంది.

*(యంగ్ ఇండియా. 8-10-'31. పే. 297)*

★ ★ ★

అభ్యర్థుల అర్హతలకంటే అభ్యర్థులతో ఓటర్ల కుండే వ్యక్తిగత సంబంధాలే ఎక్కువ ప్రభావాన్ని కలిగిస్తున్నాయి శాసన సమితి ఎన్నికలకోసం ఒక మంచి ప్రమాణాన్ని నిర్ణయించడం మంచిది. అప్పుడే మనం ఆ సమితులను సక్రమంగా వినియోగించకోగలుగుతాము. ఏ (రాజకీయ) పార్టీతోగాని దాని గొడవలతో గాని ఓటర్లు సంబంధం కలిగి ఉండకూడదు. వారు అభ్యర్థుల అభిప్రాయాలనే పరిగణలోకితీసుకోవాలి గాని వారి పార్టీ అభిప్రాయాలకు కాదు. వారి అభిప్రాయాల కంటే వారి వ్యక్తిత్వానికి విలువనివ్వాలి. వ్యక్తిత్వమున్న మనిషికి ఏ పదవి నిచ్చినా దాన్నిసద్వినియోగపరుస్తాడు. చివరికి ఆయన తప్పులు కూడా పెద్ద సమస్య కాదు. వ్యక్తిత్వం లేని మనుషులు ఉన్నతమైన జాతీయ సేవ చేస్తారని నేను విశ్వసించలేను. అందువల్ల నేనే ఓటరునైతే అభ్యర్థుల వ్యక్తిత్వాన్ని ముందు పరిశీలించి తదనంతరమే వారి అభిప్రాయాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను.

*(యంగ్ ఇండియా. 9-6-'20. పే. 7.)*

★ ★ ★

## అధ్యాయము 64

# నిజమైన అధికార స్థానం

ఈ సమితిలో ప్రవేశించడం మూలంగా దేశానికి కొంత సేవ చేసే అవకాశముంటుందని ఒప్పుకోవచ్చు అయితే వాటికి బయిట ఉండి కూడా చాలా మంది మరింత మెరుగైన సేవ అందించ వచ్చునని నానిశ్చితాభిప్రాయము. నిజమైన క్రైస్తవుడు బ్రిటిష్ పార్లమెంట్‌లో ఉండడం అసాధ్యమని కీర్తిశేషులు కైర్ హార్టి చెబుతుండేవారు. అది ఒక కబుర్లు చెప్పుకొనే దుకాణమని పిలిచేవాడు. చాలా మంది అభ్యర్థులు ఉన్నప్పుడు నిజంగా దేశ సేవ గావించాలని నమ్మినవారు అధికార స్థానాల వెలుపల ఉండి ఓటర్లను విద్యావంతులను గావిస్తూ, ఎన్నికైన వారు తమ వాగ్దానాలు నిలబెట్టుకొనేందుకు పని చేసే విధంగా కృషి చేస్తారు.

*(యంగ్ ఇండియా, 19-5-20 పే. 5)*

★ ★ ★

శాసనసభ్యులు ప్రజలకు మార్గదర్శులవుతారని ఆశించడం భ్రమ మాత్రమే అవుతుంది. తమ ప్రతి నిధులచేత మార్గదర్శకత్వం నెరపించుకోవడానికి ఓటర్లు వారిని అసెంబ్లీకి పంపించారు. ప్రజాకాంక్షలను వినయ పూర్వకంగా నెరవేర్చడానికి వారిని శాసనసభలకు పంపుతారు. అందుచేత ప్రజలే మార్గదర్శకులు గాని శాసన సభ్యులు కారు ప్రజలే యజమానులు. శాసనసభ్యులే సేవకులు ప్రపంచాన్ని మనం గమనించినట్లయితే ఈ శాసనసభల బయట ఉన్నవారే ఉన్నత మార్గదర్శకత్వాన్ని వహించారని మనకు అర్థమవుతుంది. ఆ విధంగా కానట్లయితే ప్రభుత్వాలు మూర్ఖంగా తయారయ్యేవి. ఎందుకంటే మార్గదర్శకత్వం వహించాల్సింది ఎంతో ఉండగా శాసన సభ అందులో అణుమాత్రమే. జాతీయ జీవన సముద్రంలో ఈ పార్లమెంటు ఓ నీటిచుక్క వంటిది.

*(హరిజన్ 28-4-46 పే. 112)*

★ ★ ★

స్వేచ్ఛాయుత ప్రభుత్వంలో ప్రజలే నిజమైన అధికారాన్ని కలిగి ఉంటారు. నిజంగా ప్రజలు తమ అధికారాన్ని గుర్తించి దాన్ని క్రమశిక్షణా యుతంగా సమిష్టి ప్రయోజనానికి ఉపయోగించితే ఎంత బలమైన ప్రభుత్వాలైనా చేతగానివిగా తయారవుతాయి. లక్షలాది మంది ప్రజల్లో పరమాణు భాగమంత మంది మాత్రమే దేశ ప్రభుత్వాధికారాన్ని బాధ్యతయుతస్థానాల్ని పొందుతారన్న విషయాన్ని మనం గుర్తుంచుకోవాలి. ప్రభుత్వ పగ్గాలను స్వీకరించిన సమూహం నుంచి దూరంగా ఉన్న ప్రజలే నిజమైన అధికారాన్ని సంపదను కలగి ఉన్నారన్నది ప్రపంచవ్యాప్తంగా చూస్తున్నాము. అదే మనకు కలుగుతున్న అనుభవం.

*(యంగ్ ఇండియా 24-4-30 కపే. 137)*

★ ★ ★

## అధ్యాయము 65

# శాసనసభలు

వినమ్రులు, నిర్భీకులు, దేశభక్తులు, ధీరోదాత్తులు, తమ పనిని తెలిసిన వారు, శాసనసభ్యులైతే, మనకు లాభం.

*(యంగ్ ఇండియా, 19-5-'20, పుట 5)*

★ ★ ★

250 మంది ప్రజలపై స్వారీ చేయడం ఎందుకు? ఇందు కోసమేన వారంతంత త్యాగాలు చేసినది? తెల్లదొరల బదులు, నల్లదొరలు రాజ్యమేలెదరా? 50 మంది దిగువ సభలో, 25 మంది ఎగువ సభలో చాలు.

*(మహాత్మా జుIII, 1954, పుట 292)*

★ ★ ★

శాసనసభలు, ప్రజలకుపయుక్తమైన చట్టాలు చేసి నిర్మాణాత్మకంగా ఉండాలి. ఉపయుక్తం కాని చట్టాలను ఆపివేయాలి.

*(హరిజన్, 17-12-'46, పుట 13)*

★ ★ ★

ఎన్నికలలో, కాంగ్రెస్ వారు, ధనాన్ని ఖర్చుపెట్ట కూడదు. ప్రజాహిత సంస్థల ప్రతినిధులను, వారి ప్రయత్నం లేకుండా ఎన్నుకోవాలి. ప్రతి విషయానికి డబ్బు కావాలని కోరే సంస్థ, ప్రజాసేవ చేయలేదు.

*(హరిజన్, 17-2-'46, పుట 13)*

★ ★ ★

ప్రజారంజకత గల సభలు అనాలోచిత చర్యలను చేపట్టవు. పేద దేశంలో ఖర్చు తగ్గిస్తే మంచిది.

*(స్వతంత్ర భారతదేశానికి గాంధియన్ రాజ్యాంగం, పుట 93)*

★ ★ ★

నిర్మాణాత్మకంగా. అస్పృశ్యతా నిర్మూలన, ఐక్యత, మద్యపాన నిషేధం వగైరాలతో సత్యాహింసల అనుసరణ జరుగుతుంది.

సత్యాహింసలు, శాసనసభలలో ప్రవేశించాలి.

*(హరిజన్, 8-5'37, పుటలు 97-98)*

★ ★ ★

శాసనసభా ప్రవేశంచేసిన కాంగ్రెస్‌వాదులు కానీ, సభ్యులు కానీ, మంత్రులు కానీ, సభాపతిగానీ సత్యాహింసలను పాలించాలి. ప్రధాన మంత్రి కంటే, సభాపతి ఉన్నతమైన పదవిలో ఉన్నాడు. అతడి నిర్ణయాలు అందరికీ శిరోధార్యం. అతడే సభా మర్యాదలను పరిరక్షించాలి. ఓరిమితో అన్ని అలజడులను తట్టుకోవాలి. ప్రతిపక్షంలోని వారిని అనునయంగా మార్చే అవకాశం అతనికి ఉన్నది.

*(హరిజన్, 16-7-'38, పుట 184)*

★ ★ ★

## అధ్యయము 66

# బహుసంఖ్యాకత: అల్పసంఖ్యాకత

*అసహిష్ణుత పనికి రాదు*

*(యంగ్ ఇండియా 2-2-'21, పుట 33)*

★ ★ ★

స్వేచ్ఛమనకు కావాలని కోరుతున్నాము. అదే విధంగా ప్రతిపక్షాల వారికీ, ఇవ్వాలి బహుసంఖ్యాకుల పాలన, ఇతరులను అణగద్రొక్కినట్లుండరాదు. ప్రతి పక్షం వారిని సామరస్యంగా, అనునయంతో ఒప్పించాలి.

*(యంగ్ ఇండియా. 26-1-'22. పుట 54)*

★ ★ ★

అల్ప సంఖ్యాకులు, తమకు నచ్చినది స్పష్టంగా చెప్పి, తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలి. బహుసంఖ్యాకుల వత్తిడికి లొంగిపోకూడదు. భిన్నాభిప్రాయాలకు తావుండకపోతే, ప్రజాస్వామ్యానికి అర్థం లేదు.

*(యంగ్ ఇండియా. 2-3-'22. పుట 129)*

★ ★ ★

ఆత్మ ప్రబోధ సమయాన, బహుసంఖ్యాకతకు అర్థం లేదు.

*(యంగ్ ఇండియా. 4-8-'20. పుట 3)*

★ ★ ★

బహుసంఖ్యాకత అంటే, సత్యమైన మాటను, చెప్పనీయక పోవుట కాదు. పసగల అభిప్రాయాలకు తావీయడమే సరియైన ప్రజాస్వామ్యం.

*(మహాత్మా జు౹ 1953. పుట 354)*

★ ★ ★

"చాలా మందికి, ఎక్కువ మంచి" దయిన విషయాన్ని ఆసియా వారి సందర్భంలో అమలు చేయాలి అన్నారొక సభ్యుడు. ఈ సూత్రాన్ని గ్రుడ్డిగా అనుసరించలేము.

*(మహాత్మా గాంధీ రచనలు, ౹జు , పుట 237)*

★ ★ ★

## అధ్యాయము 67

# గవర్నర్లకు, మంత్రులకు, వ్యవహార సంహిత

1. వీలైనంత మేరకు గవర్నర్లు, మినిష్టర్లు (ఇండియన్లు) స్వదేశీ ఉత్పత్తులను వాడాలి. ఖాదీని ధరించాలి. రాట్నం వడకాలి.

2. హిందీ, ఉర్దూ లిపులను నేర్చి ఉండాలి. ఇంగ్లీషులో మాట్లాడరాదు ప్రాంతీయ భాషలను వాడవచ్చును. ప్రభుత్వ వ్యవహారాలు హిందూస్తానీలో జరగాలి. దాని వలన ప్రజలు ఆ భాషను స్వీకరిస్తారు. తద్వారా అది రాష్ట్ర భాష అవుతుంది.
3. జాతి, మతాలను ద్వేషరహిత దృష్టితో చూదాలి. బంధు జనప్రీతి ఉండరాదు. సామాన్య కార్మికుడు, హస్తశిల్పి, నాగరికుడు వీరి కంటే తన కుమారుడు సోదరుడు "ఎక్కువ" కాకూడదు.
4. తాను మంచి దష్టాంతంగా ఉండాలి. రాట్నం వడకవచ్చు; పంటను, పండ్లను, పూలను పెంచవచ్చు.
5. కార్లను, అత్యవసరమైనప్పుడు వాడవచ్చును. బంగళాలు పనికిరావు. కారు అవసరం ఉండవచ్చుననుకుంటాను.
6. సహచరులందరూ ఒకే కాలనీలో కాపురం చెయ్యాలి. స్నేహం పెరుగుతుంది.
7. పనివారు ఉండరాదు. భార్య, బిడ్డలు స్వయంగా అన్నీ చేసుకోవాలి.
8. ఆఫీసులో (కార్యాలయంలో) సోఫాలు, కుర్చీలు ఉండరాదు. దేశ ప్రజలకు ధోవతి, దుప్పటి కూడా లేవని గుర్తించాలి.
9. మద్యపానం, ధూమపానం చేయరాదు.

*(బిహార్నీ కౌమీ అగమ్మాన్ - గుజరాతీ - పుటలు 227-28)*



1. ఇండియన్ గవర్నరు మద్యపానం చేయరాదు. లేకుంటే మద్యనిషేధం అమలు కాదు.
2. చేనేత వస్త్రాలనే వాడుక చేయాలి. పేదల దుస్తులననుకరించాలి.
3. పర్ణ కుటీర వాసం చెయ్యాలి. విదేశీ అతిథులకు కనీస సౌకర్యాలు (వారికి కావలసినవి) సమకూర్చాలి. ఇది కూడ ఆడంబరంగా ఉండకూడదు. సర్వసమాన సూత్రం ప్రకారం ఆచరించాలి.
4. కుల, మత భేదాలు అస్పృశ్యత ఉండరాదు. జనకుని వలె ఒమర్ ఖలీఫా వలె సాదాజీవనం సామరస్యతతో చేయాలి.

ఏ ప్రాంతంలో ఉంటే, ఆ ప్రాంతీయ భాషను, హిందీ (నాగరీలిపితో) ఉర్దూ (అరబ్బీలిపి) వాడాలి. వింధ్యకు ఉత్తరంలో కోట్లాది జనం హిందూస్తానీ భాషను ఉపయోగిస్తారు

పైన చెప్పినవి సంహితలోని అంశాలు. (ఉదాహృతాలు)

*(హరిజన్, 24-8-'47, పుట 289)*

★ ★ ★

## అధ్యాయము 68

# జనరంజకులైన మంత్రులు

చేసిన సేవలకు ప్రతిఫలంగా మంత్రి పదవులు ఉండరాదు. నేను ప్రధానమంత్రినైతే, అలా కోరిన వారిని తప్పించి, ఇంకొకరిని ఎన్నుకోమని ప్రజలకు చెబుతాను. పదవులు ముళ్ల కిరీటాలు. గమ్యం చేర్చేందుకు దోహదపడాలి.

*(హరిజన్, 7-8-'37, పుట 204)*

★ ★ ★

నేడు ముళ్ల కిరీటాన్ని ధరించావు. మెలకువతో ఉండు. బ్రిటిషు వారి నాటి, పరీక్షలలో నెగ్గారు కాని ముందున్నది ముసళ్ల పండగ. డబ్బు ఉచ్చులో పడవద్దు. బీదలకూ, గ్రామాలకూ సేవచెయ్యి.

*(కలకత్తా వింత, 1959, పుటలు 32-33)*

★ ★ ★

మంత్రులు, వారు గాని, వారి బంధువులు గాని, పదవి వలన, పలుకుబడి వలన, సమకూడే లబ్ధిని ఆశించరాదు.

*(హరిజన్, 28-4-'38, పుట 88)*

★ ★ ★

మంత్రులు విమర్శలకు చలించిపోరాదు. ప్రజా ప్రతినిధులనుండి విమర్శకులు, , ధైర్యాన్ని, నిజాయితీని శ్రమను ఆశిస్తారు.

*(హరిజన్, 21-9-'47, పుట 325)*

★ ★ ★

మంత్రులు ప్రజాప్రతినిధులు తమను మించిన అనుభవజ్ఞులను

చులకన చేయరాదు.

*(హరిజన్, 16-11-'47 పుట 409)*

★ ★ ★

ప్రజలకు చేసిన వాగ్దానాలను విధిగా పాటించాలి. వినీతులై జాగరూకులై ప్రజాధనాన్ని వాడాలి

*(హరిజన్, 14-12-'47, పుట 467)*

★ ★ ★

పన్నుల వలన సమకూడిన ధనరాశి, సమాజ కల్యాణానికి ఉపయోగపడాలి. ఓటరు మహాశయులు కూడ, "నేను ఇచ్చిన పన్ను వలన, నాకు పూర్తి లాభం చేకూరలేదు: కాన, పన్నులు చెల్లించను" అన కూడదు. పన్నుల వలన ప్రజలకు కలిగిన లాభాలు కోకొల్లలు. ప్రతి వారికీ అనుకున్నంత సౌకర్యం కలుగక .పోయినా, అసంతృప్తి పనికిరాదు.

*(హరిజన్, 8-9-'46, పుట 293)*

★ ★ ★

శాసన సభలే చట్టాలను చేయాలి. మంత్రుల నిర్ణయాలు, న్యాయస్థానాలలో నిలవాలి. న్యాయం అందరికీ సులభంగా, చవుకగా, లభ్యం అయేటట్లు చూడాలి. పంచాయతీరాజ్‌లో న్యాయ సౌలభ్యం కూడ వికేంద్రిత మౌతుంది. కార్యనిర్వాహక వర్గము శాసనసభల కతీతమై ఉండరాదు.

*ఎహరిజన్, 19-10-'47, పుటలు 377-78)*

★ ★ ★

### అధ్యాయము 69

# పోలీసులు - నేరాలు - జైళ్లు

నాగరికుల స్వేచ్ఛ, నేరస్తుల స్వేచ్ఛ, వేరు వేరుగా ఉంటాయి.

*(హరిజన్, 23-10-'37, పుట 308)*

★ ★ ★

నేను అహింసా పూజారిని (సిద్ధి గలుగలేదు) కనుక, ప్రభుత్వం పోలీసు వ్యవస్థను ఉంచాలి. దాని అవసరం లేని రోజు రాకపోదు.

అయితే, నా దృష్టిలో, పోలీసులు, అహింసలో నమ్మకం ఉన్న వారై యుండాలి. ప్రజల సేవకులము అనుకోవాలి. అప్పుడు ప్రజలు వారికి మనస్ఫూర్తిగా సహకరిస్తారు.

*(హరిజన్ 1-9-'40, పుట 265)*

★ ★ ★

స్వతంత్ర భారతదేశంలో నేరాలుంటాయి. నేరస్తులుండరు. శిక్షలుండవు. నేరం చేయడమనే వ్యాధికి, సమాజ వ్యవస్థలోని లోటుపాట్ల వలన గలిగిన ఈ రుగ్మతకు, చికిత్స జరుగుతుంది.

*(హరిజన్, 5-5-'46, పుట 124)*

★ ★ ★

జైళ్లు (కారాగృహాలు), స్వతంత్ర భారతదేశంలో ఎలా ఉండాలి? నేరస్తులు వ్యాధిగ్రస్తులు గనుక కారాగారము, వారికి తగిన చికిత్సాలయమై ఉండాలి. జైలు భవనాలెందుకు? జైలు ఉద్యోగులు, కారాగార వాసుల మనసులలో, స్నేహ భావాన్ని కలిగించే విధంగా, మెలగాలి. నేరస్తులు మానసికంగా, కోలుకునేటట్లు చేయాలి. బాధించరాదు. ప్రభుత్వాలు ఆదేశాలు పంపే లోపల, జైలు ఉద్యోగులు, తమ శాసన కార్యకలాపాన్ని ఎంతో సంస్కరించాలి.

*(హరిజన్, 2-11-'47, పుట 395)*

★ ★ ★

# భాగము - 10

## సమాజపరమైన అభిప్రాయాలు

### అధ్యాయము 70

## సాంఘిక ఆదర్శము

మానవ సమాజం ఆధ్యాత్మిక చింతనలో ఎల్లప్పుడూ అనంతంగా పెరుగుతూనే ఉంటుంది.

*(మహాత్మా, రెండవ సంపుటి. (1951( పే 296)*

★ ★ ★

భూమ్యాకర్షణతో భూమి నిలబడినట్లుగానే - అహింసతోనే సమాజం కలిసి మెలసి స్థిరంగా ఉంటుంది. అయితే భూమ్యాకర్షణ సిద్ధాంతం కలిపెట్టబడినప్పుడు మన ముందు తరాల వారికి తెలియని ఫలితాలను అది అందించింది. అదే విధంగా అహింసా సిద్ధాంతం ప్రకారమే ఉద్దేశ పూర్వకంగానే సమాజం నిర్మితమైనప్పటికీ భౌతికంగా దాని స్వరూపం నేడు ఉన్నదాని కంటే భిన్నంగా ఉంటుంది.

*(హరిజన్, 11-2-'39, పే. 8)*



1896లో నేను ఒకసారి ఆగ్రా కోటనో, ఢిల్లీ కోటనో సరిగ్గా గుర్తు లేదు గాని, సందర్శించినపుడు ఒక ద్వారంపైన ఈ విధంగా ఒక పద్యాన్ని చదివినట్లు గుర్తు: "ఈ భూమ్మీద స్వర్గమేదైనా ఉందంటే అది ఇక్కడే, ఇక్కడే, ఇక్కడే". నా అంచనాలో అద్భుతమైన ఆ కోట స్వర్గం కాదు కానీ పాకిస్తాన్‌లోని అన్ని ద్వారాలపైన చెక్కిన ఆ గీతాన్ని నేను ఇష్టపడతాను.

అది పాకిస్తానే గానివ్వండి, భారతదేశమే గానివ్వండి - అలాంటి స్వర్గధామ సమాజంలో అనాధలు, బిచ్చగాళ్లు, కులీన వర్ణాలు, అధములు, అంటరాని వారు, కోటీశ్వరులైన యజమానులు, అర్ధాకలితో అలమటించే ఉద్యోగులు, త్రాగుబోతులు, మత్తుపదార్థాలకు బానిసలైన వారూ - ఎవ్వరూ ఉండరు. అక్కడ పురుషులతో సమానంగా స్త్రీలకు గౌరవం దక్కుతుంది స్త్రీ పురుషుల నిర్మలత్వమూ, గౌరవమూ కాపాడబడుతుంది. అక్కడ ఒక్క వ్యక్తి భార్య తప్ప ప్రతి స్త్రీని అన్ని కులాల వారూ ఆమె వయస్సుని బట్టి తల్లిగా, సోదరిగా, కుమార్తెగా భావిస్తారు. అన్ని మత విశ్వాసాల పట్ల సమగౌరవం కలిగి ఉంటారు. అంటరాని తనం నిర్మూలించబడుతుంది. అక్కడ అందరూ సగర్వంగా, సంతోషంగా, స్వచ్ఛంగా తమ ఆహారాన్ని శ్రమచేసి సంపాయించుకుంటారు. నా సంతోషం కోసం ఈ మాటల ద్వారా మిమ్మల్ని ఏమైనా కష్టపెట్టినట్లయితే ఈ మాటలు విన్నవారు లేదా ఈ వాక్యాలు చదివిన వారూ నన్ను క్షమిస్తారని ఆశిస్తాను.

*(హరిజన్, 18-1-'48, పే. 526.)*



పుట్టుకతో వచ్చిన వర్ణవిభాగము, విధి నిర్వహణ వలననే స్థిరపడుతుంది. సిద్ధిస్తుంది. పుట్టుకతో బ్రాహ్మణుడైన వాడు వయసు వచ్చిన తర్వాత బ్రహ్మజ్ఞానోపదేశము చేయనివాడు, బ్రాహ్మణత్వాన్ని పోగొట్టుకుంటాడు. పుట్టుకతో బ్రాహ్మణుడు కాకపోయినా, క్రియలో బ్రాహ్మణుడైన వాడు, "బ్రాహ్మణుడు"గా గుర్తింపు పొందుతాడు. అతడు దానిని పరిగ్రహించడు.

ఇదే సూత్రము తక్కిన వర్ణ విభాగాల వారికి వర్తిస్తుంది.

ఇకపోతే, వర్ణ విభాగము, చేయవలసిన పనిని నిర్దేశిస్తుంది తప్ప, ఇంకే విధమైన హక్కునూ (ఔన్నత్యము, నీచత్వము వగైరా) కలుగజేయదు. అట్టి తారతమ్యాలంటే ఈ వ్యవస్థకు అసహ్యం. వేదాలలో, అన్ని వర్ణ విభాగములు సమమైన ప్రాధాన్యం గలవేనని చెప్పబడింది. పరస్పరం ఆశ్రయం పొంది, సమతౌల్యంతో మెలగాలని నిర్దేశము ఉన్నది

వర్ణాశ్రమ విధాన రహితమయితే, హిందూమతం శూన్యమని ప్రతీవారూ ఒప్పుకుంటారు. వర్ణాశ్రమ ధర్మాల వివరణ ఉండని "స్మృతి" ఉండదు. దీనికి మూలం ప్రాచీన వేదగ్రంథాలు. "హిందువు" అనిపించుకోబడువాడు, వీటిని తూష్ణీ భావంతో చూడడు. ప్రతి హిందువూ, పూర్తి అవగాహనతో, వ్యర్థమనుకుంటే త్యజించాలి: ఈ విధానం సర్వాంగీణం అని భావిస్తే దానిని అనుసరించి, ఉజ్జ్వలం చేయాలి.

ఈ నాలుగు ఆశ్రమాలు, ప్రతి హిందువు జీవితంలో నాలుగు దశలు. వాటి పరిధిలో తన కర్తవ్యాన్ని, ప్రతి హిందువూ నిర్వర్తించాలి. బ్రహ్మచారి (విద్యార్థి దశ) గృహస్థు (సంసారదశ), వానప్రస్థం (విశ్రాంతి దశ), సన్న్యాసము (అన్నిటినీ అనుసరింపబడుతున్నది. మొదటిది, మూడవది, పాటింపబడనవి (ప్రస్తుతం). నాలుగవది - పేరుకు మాత్రం. కన్నీటి తుడుపుగా పాటించబడుతున్నది. తిని, త్రాగి సంతానం ఉత్పత్తి చేసే గృహస్థు, పశువు వంటి వాడు. నేడు గృహస్థులు భోగలాలసలో మునిగియున్నారు. ప్రగతికి సోపానాలివి. పరస్పరాశ్రితాలు. బ్రహ్మచర్య, గృహస్థాశ్రమాలను పాటించకుండా, వానప్రస్థాశ్రమం, సన్న్యాసాశ్రమం లోనికి గెంతి వెళ్లకూడదు. ఏతా వాతా, ఆశ్రమ విధానం, నేడు, మృతాక్షరం. దీని సంబంధం "వర్ణ" విధానంతో

ముడిపడి ఉన్నది. "వర్ణ" విధాన పునరుజ్జీవనం జరిగితేనే, ఆశ్రమ ధర్మాలు తిరిగి బ్రతికి బట్టకడతాయి.

మౌలికంగా సంభవించే "వర్ణ" విధానంలో లభించిన వారసత్వంగా తండ్రి తాతల వృత్తులను, సంప్రదాయ సిద్ధంగా, "విధి" యని భావించి అనుసరించాలి. అలా చేస్తున్న వారిని వ్రేళ్లపై లెక్కించవచ్చు. జీవనోపాధి దొరికే సౌకర్యం ఉన్నప్పటికీ, మొక్కుబడిగా చేస్తే, ఉపయోగపడదు.

మానవ జాతిని చక్కదిద్దే జీవిత విధానమైన "వర్ణ" పద్ధతి, మానవ "కృతి" కాదు. దీనిననుసరిస్తే, జీవితం సుఖమయమై పోతుంది; శాంతి, తృప్తి విస్తరిస్తుంది. తగాదాలు, జగడాలు ఉండవు. ఆకలి బాధ, దారిద్ర్యం సమసిపోతుంది. జనాభా సమస్యకు సమాధానం, రుగ్మత నివారణ, బాధల నుంచి విముక్తి లభిస్తాయి.

మన పూర్వీకులు ఎంతగా ఆలోచించి, తపించి "వర్ణ" పద్ధతిని ఉపపాదించారో అర్థం చేసుకుంటే, నేడు వాటిని మనం అనుసరిస్తున్న రీతి, హాస్యాస్పదం అని అర్థం అవుతుంది. హిందువులలో ఒక వర్గం, వారి భావనలో, హిందువులకు అనర్థం తెచ్చే ఈ వ్యవస్థను కూలద్రోయడానికి, తమ శక్తినంతా ధారపోస్తున్నదంటే, ఆశ్చర్యం లేదు. కనుక, కురూపమైన ఈ వక్రీకరణ హిందూయిజం అస్తిత్వానికి గొడ్డలి పెట్టు అని గ్రహించి, దీని పట్ల ఏ మాత్రం దయచూపకూడదు.

*-(హరిజన్, 28-9-'34, పుట 162-63)*

★ ★ ★

మానవ జన్మ ఎత్తినది, మానవుడు తన శక్తిలోని ప్రతీ అణువునూ, సృష్టికర్తను గురించి తెలుసుకునేందుకు మాత్రమే. ఏ విధంగా, ఏ ఉపాధులలో, ధన సంగ్రహం, ధనార్జన చేయడం అని ఆలోచించ కూడదు. శరీరాన్ని, ఆత్మను, తండ్రి తాతల వృత్తిలో, వాడుక చేయాలి గాని, వేరే పని చేయరాదు. అదీ వర్ణాశ్రమ ధర్మం.

*(యంగ్ ఇండియా, 27-10-'27, పుట 358)*

★ ★ ★

"వర్ణ" విధానం, ఏ హిందూ "ద్రష్ట" ధర్మనమో కాని, అందరికీ పనికి వస్తుంది. ప్రతి మత ధర్మంలోనూ, సార్వజనీనమైన సూత్రాలే ఆదరణకు నోచుకుంటాయి. "వర్ణం" అంటే అటువంటిదేనని నా భావన. ఈ రోజున, ప్రపంచం దానిని తృణీకరించినా, భవిష్యత్కాలంలో దానిని గ్రహించి తీరుతుంది.

శరీరావయవాలతో, వర్ణాలను, పోల్చడం, ఎంతో సుందరమైన ఆలోచన. ఒక శరీరంలో, ఏ అంగమూ, ఏ అవయవమూ - వీటి మధ్య ఎక్కువ తక్కువలు లేవు ప్రతీ అవయవమూ, "నేను గొప్ప, నేను తక్కిన వాటి కంటె మిన్న" అని అనటం ప్రారంభిస్తే (ఊహామాత్రం యోచన) శరీరం, ముక్కలై పోతుంది. అదేవిధంగా సమాజం కూడా, పెద్దా - చిన్నా అనే తారతమ్యాన్ని పాటించి, స్థిరపరిస్తే, ఖండఖండాలై పోతుంది.

ఈ కంటకమే, వర్గ సంఘర్షణలకూ, అలజడులకూ మూలం మౌలికమైన "వర్ణ" వ్యవస్థా పాలన వల్ల తప్ప, ఇంకే విధంగానూ, ఈ యుద్ధాలు, తగాదాలు తగ్గవని, అత్యల్ప బుద్ధికి కూడ అర్థమవుతుంది.

*(హరిజన్, 28-9-'34, పుట 263-264)*



నేను భాష్యం చెప్పినట్లుగా వర్ణాశ్రమాలు సమాజం యొక్క ధార్మిక, సాంఘిక, ఆర్థిక అవసరాలను తృప్తి పరుస్తాయి. ఆ విధానాన్ని ఒప్పుకొన్న జాతి మొత్తం, తన ఆధ్యాత్మిక సంపూర్ణతకు, చాలా సమయాన్ని వాడుకునే స్వేచ్ఛ ఉంటుంది. కనుక, అది ధార్మిక అవసరాలను తృప్తి పరుస్తుంది. ఆ విధానం ప్రకారం నడుచుకుంటే, సాంఘిక దురాచారాలు మాయమౌతాయి. ఆర్థిక రంగంలో మారణాంతకమైన పోటీని అడ్డుకుంటుంది. దానిని సమాజం, విధుల శాసనము అనీ, హక్కులు, సౌకర్యాల శాసనము కాదనీ, భావిస్తే సంపద పంపకం చక్కగా జరుగుతుంది - అయితే, సర్వులకూ సమానంగా విభజన అనే ఆదర్శం కాక పోవచ్చు. కనుక జనులు దీని నియమాలను గుర్తించక, విధులను సౌకర్యాలుగా అనుకొని స్వంత లాభం, అభిరుచి కోసం, వేరే వృత్తులను అవలంబిస్తే, వర్ణ ధర్మాలు గజిబిజి అయి, సమాజం

చెదిరిపోతుంది దీనిని అమలు పరచడం "తల్లిదండ్రుల వృత్తులను వారి అభిరుచికి వ్యతిరేకంగా అనుసరించమని" బయటి వారు బలవంతం చేయడం ఉండదు. ఈ అలవాటు అనాది కాలం నుంచీ అనుస్యూతంగా వస్తున్నదే. అయినా నిర్బంధ రహితంగా, స్వచ్ఛందమైన అనుసరణ, వేలాది ఏండ్లనాటిది. నిరంతరాయమై, వర్ణ ధర్మాలు అనుపాలన జరిగింది. ప్రశిక్షుతులై, అనుశాసనతో, జనులు, తమ విధులను విస్మరించక న్యాయచ్ఛత్రం నీడన, స్వేచ్ఛగా జీవించారు ఈ రోజుల్లో అవిద్య, శాసనధిక్కారము ఎక్కువ కావడం వల్ల, బాధపడుతున్నారు. నాగరిక దేశాలు అనిపించుకుంటున్నవి, శాంతి, తృప్తి ప్రాప్తించిన ఒక స్థాయిని ఇంకా చేరలేదు.

మనం, వర్ణ ధర్మాలనుల్లంఘించడం వల్లనే ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా నాశనమై పోయాము. నిరుద్యోగం, దారిద్ర్యం, అస్పృశ్యత, ధర్మ పరివర్తనలు వీటికి, ఇదే మూల కారణం.

వర్ణం, వర్గం ఉన్నచోట దైవసంకల్పితమైన, సహజమైన కుటుంబ వాతావరణం లోపిస్తుంది. పటిష్టత ఉండదు.

సామాజిక సద్గుణాలను వర్గం, వర్ణం గట్టిపరుస్తుంది. వర్ణ వ్యవస్థలో ధన ప్రసక్తి లేదు. దానితో ముడిపడి ఉన్న తారతమ్యాలు లేవు. ధనమన్నది, ప్రధానమైన విభాజక శక్తి. ప్రపంచ చరిత్రలో ఎన్నో సాక్ష్యాలు ఉన్నవి. కుటుంబంలోని పవిత్ర బంధాలు కూడ, సంపద ఎదుట సురక్షితం కావని శంకరాచార్యులు అన్నారు. "వర్ణము" అన్నది కుటుంబం లేక పరివారం లోని సూత్రాల విస్తృతీకరణ. రెండింటిలో, రక్త సంబంధం, వారసత్వం, రాజ్యం చేస్తాయి. పాశ్చాత్యులు, వారసత్వం ప్రభావాన్ని గుర్తించటం లేదు. వారు "మీలో" మాత్రమే నిత్యసత్యమని అంటారు. కాని చాలా దేశాల కఠోరమైన అనుభవం, వీరి సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఉన్నది. "మీలో" సిద్ధాంతాన్ని అంగీకరించినా, అది కూడా, వర్ణ వ్యవస్థ కంటె, ఆ వ్యవస్థలో సురక్షితమై పెరిగి పెద్దదవుతుందని నిరూపించవచ్చు.

*(యంగ్ ఇండియా. 22-12-'20 పుట 5)*



ప్రస్తుతం దీనిని వక్రీకరించడం జరుగుతున్నది. మూల నిర్దేశాలకు వ్యతిరేకంగా ఉన్నది గనుక ఈ వక్రీకరణ గర్హించదగినది

*(హరిజన్, 28-9-'34, పుట 260-61)*

★ ★ ★

వర్ణాశ్రమ ధర్మాలు, భూమిపై మానవుని విధులను నిర్దేశిస్తాయి. ధనార్జన మార్గాలను కాదు.

*(యంగ్ ఇండియా 27-10-'27, పుట 359)*

★ ★ ★

వర్ణము అనేది ఎవరు సూత్రీకరించినా, దాని అనుసరణ, సర్వాంగీణ ప్రభావము కలది. అందరికీ ఉపయోగపడే సూత్రాలను, సంప్రదాయాలను, అనుసరించడం మంచిది.

వేదాలు, వర్ణములను, శరీరావయవాలని వర్ణించాయి. తర తమ భేదాలు లేనేలేవు. సరియైన, వర్ణధర్మ పరిపాలన, కల్యాణకారి.

*(హరిజన్, 28-9-'34, పుట 261-62)*

★ ★ ★

వక్రీకరించి, స్వార్థంతో, వర్ణధర్మాలను భ్రష్టుచేస్తే, నేటి పరిస్థితి నిలిచిపోతుంది.

*(హరిజన్, 4-3-'33, పుట 5)*

★ ★ ★

వర్ణము పేరిట, గంతులు వేసే రాక్షసికి, మతానికి ఏమీ సంబంధంలేదు.

*(యంగ్ ఇండియా, 24-11-27, పుట 290)*

★ ★ ★

సమాజ వ్యవస్థీకరణ కోసం, మనం "వర్ణం" "మతం" ఏర్పరచుకున్నాం. పాశ్చాత్యులు "వర్గం" అంటున్నారు. రెండూ దోషభూయిష్టాలే.

"వర్ణ" విభజనలో ధన ప్రసక్తి లేదు. మతమన్నది, "పరివార" భావనను విస్తృతం చేసినప్పుడు, ఏర్పడినది. పాశ్చాత్య శాస్త్రజ్ఞులు "వారసత్వాన్ని"

ఎండమావి అంటున్నారు. తక్కిన వారెవ్వరూ దీనిని ఒప్పుకోటం లేదు పాశ్చాత్యుల "మిలో" కూడా, వర్ణ వ్యవస్థలో, పుంజుకుంటుంది.

*(యంగ్ ఇండియా. 29-12-'20. పుట)2*

★ ★ ★

## అధ్యాయము 72

# స్త్రీల పాత్ర - స్త్రీల హోదా

మౌలికంగా స్త్రీలు, పురుషులూ మానవులే. కాని ఎందుకనో, కాలగతిలో స్త్రీ హీనతా భావాన్ని సంతరించుకొని, వెనుకబడింది. పురుషులలో ద్రష్టలూ - మునులూ మాత్రం స్త్రీకి, పురుషునితో సమాన హోదానే ఇచ్చారు

అయితే, శరీరధర్మాలను బట్టి, వ్యావృత్తులలో వ్యత్యాసం తప్పనిసరి అవుతుంది. పురుషుడు సంపాదించి తేవడంతో సృష్టికర్తననుకొని స్త్రీకి తాను తెచ్చిన ద్రవ్యాన్ని రక్షించమని, పంచిపెట్టమని అప్పజెప్పాడు. న్యాయంగా రెండు పనులూ ప్రధానమైనవే. దానితో బాటు మాతృత్వం, స్త్రీలో శాంత స్వభావాన్ని, ఓరిమిని పెంచి "స్తబ్ధత" అనిపించేటట్టు చేసింది. సత్యాహింసల పరిపాలనలో స్త్రీ తననాయకత్వంతో సాఫల్యం తెచ్చి, అగ్రగామి అవుతుంది స్త్రీ మూర్తీభవించిన అహింసారూపం. సృష్టిప్రక్రియలో మాతృస్థానం - స్థాయీభావం కష్టపడి, నవమాసాలు మోసి, పిల్లలను కని, వారిబోసి నోటి నవ్వుతో తన శ్రమను మరచిపోతుంది. ఆశిశువు ఎడలగల ప్రేమను, మానవులందరికీ పంచి పెట్టగల ఆ మాతృమూర్తిని మించిన అహింసాపూజారి వేరెక్కడా లేదు.

*(హరిజన్ 24-2-40, పుటలు 13-14)*

★ ★ ★

స్త్రీ, పురుషుడు స్వాభావికంగా సామ్యతగల వారు గనుక వారి సమస్య, వారి ఆత్మశక్తి ఒక్కటే అని నా అభిప్రాయము. వారి జీవితాలు, భావాలు ఒక్కటే ఒకరికొకరు పూరకాలు. ఒకరిసాహచర్యంలేక ఇంకొకరు (బతుకరు... అనాది నుంచి పురుషునిది పైచేయి అయింది. పురుషుని

స్వార్థపూరిత ఉపదేశాన్ని (స్త్రీకి తనతో సమానతలేదు) నమ్మింది. కాని ఎక్కడో ఒకచోట విభజన తప్పలేదు రూపసామ్యం ఉన్నా, ప్రధానమైన భిన్నత్వం ఉంది మాతృవిధికి వలసిన గుణాలు పురుషునికి లేవు. చాలమంది స్త్రీలు ఆ విధిని స్వీకరిస్తారు. ఆమెలో జడత్వం, అతనిలో చైతన్యం, ఆమె గృహస్వామిని కావడం, ఇల్లు తీర్చిదిద్దడం, మానవ జాతి శిశువుల పాలన (ఆమె ప్రత్యేక గుణము, హక్కు) ఇవి నైజంగా ఉన్నవే. ఆమె లేనిదే జాతి లేదు. ఇట్టి వాతావరణంలో వారు తమ ధర్మాలను మార్చుకోడం వగైరా ఇద్దరికీ గౌరవహీనమైనది. చరిత్రను తిరగదోడి, ఆటవికతను కొని తెచ్చుకోడమంటాను నేను. అశ్వాన్ని అధిరోహించబోయి, అతడిని కూడా, తనతోబాటూ క్రిందకు తెస్తే ఏమవుతుంది. అట్టి ప్రోత్సాహము కలిగించడం, పురుషుని తప్పు. ఎవరి పనులు వారివి. చక్కగా చేసుకుంటే బాగుంటుంది. గ్రామాలలో సేవాగాం లో అడకమ్మరులు వడ్రంగులు లేరు. ఈ శాంతమయ వాతావరణాన్ని ఎందుకు పాడు చేయాలి? పొలాల్లో ఇద్దరూ కలిసి పని చేసినా, బరువు పని మగవారు చేస్తారు. ఆడవారు ఉన్న దానిని జాగ్రత చేస్తారు. కుటుంబం ఆదాయాన్ని తమ శక్తిమేరకు కొద్దిగా పూరిస్తారు. పని విభజన జరిగింది గనుక స్త్రీ పురుషుల సాంస్కృతిక ప్రమాణాలు సమానములు. వ్యక్తులైనా, దేశాలైనా, ప్రతిమార్గంలో సత్యాహింసలను గ్రహించమని ప్రతిపాదించడమే, ఈ సమస్యకు నా ఉడతాభక్తి పరిష్కారం. అహింస అంటే అంతులేని ప్రేమ, కష్టాలను భరించగలిగిన, అనంతమైన శక్తి. మానవుని తల్లి అయిన స్త్రీ తప్ప ఇంకెవరు దానిని వహించగలరు? తొమ్మిది నెలలు మోసి, తినిపించి, ఆ బాధలో సుఖాన్ని చూస్తుంది. శిశుజననంలో నొప్పులను మించిన బాధ వేరే ఏముంది? కాని వాటినన్నిటినీ సృష్టి ప్రక్రియలో కల్గిన సంతోషంలో మరచి పోతుంది. రోజుకి రోజు శిశువును పెంచి పెద్ద చేసే విధానంలోని పాట్లు చాలా ఉన్నవి. తన ప్రేమను మానవాళిపై గురిపించి పురుషుని కామానికి బలియైన లేక బలి కాగలవస్తువునని మరచిపోవాలి స్త్రీ. పురుషుని ప్రక్క, తల్లిగా, తీర్చిదిద్దిన సృష్టికర్తగా, మౌన నాయకురాలైనిలుస్తుంది. యుద్ధాలతో అతలాకుతలమై, శాంతి అనే

అమృతంకోసం పరితపిస్తున్న ప్రపంచానికి, శాంతిసందేశాన్ని ఉపదేశించగలిగినది ఆమె మాత్రమే సత్యాగ్రహ నాయకురాలు కాగలదు. బాధ, విశ్వాసంతో గట్టి గుండె గలదామె. సత్యాగ్రహానికి పుస్తకాల జ్ఞానం అవసరం లేదు.

ఎన్నో ఏళ్ళ క్రితం, పూనా, ససూన్ హాస్పిటల్లో చికిత్స కొరకు ఉండడం సంభవించింది. జబ్బుతో, ప్రక్కమీద ఉన్న నాకు, కడుపులోని శిశువుకు ప్రమాదమేమోనని క్లోరో ఫారం వద్దని శిశువు పట్ల ప్రేమ, తాను పడే బాధ మత్తుమందుగా ఆపరేషను (శస్త్రచికిత్సను) చేయించుకున్న ఒక ముద్దరాలి త్యాగ శీలతను గురించి, నర్సు చెప్పింది. ''మగవాళ్ళైపుట్టలేదే' ' అనుకుంటూ, తమ స్త్రీత్వాన్ని ఎప్పుడూ నిరసించవద్దు. వారిలో వీరవనితలెందరో ఉంటారు. దాన్ని గురించి ఆలోచించినపుడు, ఆమె హోదా చూసి, అసూయకలుగుతుంది. అది ఆమె గ్రహించాలి. పురుషుడు తాను స్త్రీనైతే బాగుండుననీ, స్త్రీ దీనికి విపరీతంగానూ కోరుకోడం కద్దు. కాని అది ఫలించదు. ఏ స్థితిలో జన్మించామో, దానికి ప్రకృతి సహజంగా నిర్దేశించిన విధులను నిర్వర్తించి సంతోషంగా బ్రతుకుదాం.

*(హరిజన్ 24-2-40 పుటలు 15-16)*



ప్రకృతి స్త్రీ, పురుషులను భిన్నంగా చేసింది. వారి విద్యలో కూడా భిన్నత్వం అవసరం. జీవితంలో సమానులే కాని పనులు వేరు, స్త్రీ గృహస్వామిని పురుషుడు బయట యజమాని. పురుషుడు ఆర్జిస్తాడు, స్త్రీ పొదుపుగా ఖర్చు చేస్తుంది. పిల్లలకు ఆహారం తినిపిస్తుంది. ఆశిశువు భవిష్యత్తును తీర్చి దిద్దుతుంది. శిశువు నడవడికను క్రమబద్ధం చేస్తుంది. శిశువుకు ప్రథమ గురువు తల్లియే. కనుక ఆమె దేశానికి తల్లి. కొంత కాలం తర్వాత కొడుకుమీద తండ్రి ప్రభావం అంతరించిపోతుంది. తల్లి మాత్రం తన స్థానాన్ని త్యాగం చెయ్యదు. పెద్దవాడైనా కొడుకు, శిశువు వలెనే తల్లితో మారాము చేసి ఆడుకుంటాడు. తండ్రితో అలా చేయలేడు. ఇది కదా ప్రకృతినియమం. ఆమె ధనార్జనకు పూనుకోరాదు. ఆడువారు టెలిగ్రాఫ్ క్లర్కులుగా, టైపిస్టులుగా కంపోజిటర్లుగా పనిచేయవలసిరావడం మంచిదికాదు.

కొడుకులను, కూతుళ్లను సమానంగా పరిగణిస్తాను. వారిపట్ల జరిగే అన్యాయాలను అసమానతలను గర్హిస్తాను. చట్టంలో అసమానతలను తొలగించడం, కొండనాలికకు మందు వేయడం వంటిది. అందరూ అనుకొనే కంటే లోతైనదీ దుష్టత్వానికి మూలం. అధికార వాంఛ, ప్రతిష్ట కోసం ప్రాకులాడుట, భోగలాలసత వగైరాలు పురుషుని మనసులోని కోరికలు. ఆస్థికి యజమాని అయితే అధికారం చేతికి వస్తుంది. ఈ అధికారం వల్ల లభించు మరణోపాంత యశోభిలాషి పురుషుడు సంతానం అందరికీ ఆస్థి పంచితే, ముక్కలయి పోతుంది. కనుక జ్యేష్ఠపుత్రునికే జ్యేష్ఠునికే ఆస్థి హక్కు. చాలవరకు స్త్రీలు వివాహితలు. చట్టం వారికి వ్యతిరేకమయినా, భర్తకు గల అధికారం సౌకర్యాలు వీటిలో వారు సహబాధ్యులు. ఇక స్త్రీలు - భద్ర మహిళలై ఫలానా వారి భార్యగా - ఆనందిస్తారు. స్త్రీల హక్కుల కోసం ఉద్యమం నడిపితే, అసమానతలను గూర్చి చర్చలలో ఎంతగట్టిగా మాట్లాడినా, క్రియ దగ్గరకు వచ్చే సరికి, తమ సౌకర్యాలకు భంగం కలిగే చర్యకు, స్త్రీలు పూనుకోరు. శాసనంలోని అనర్థతలను తొలగించమని వాదిస్తూ, మూలకారణమైన దానిని సరిదిద్దే వివేకవంతులు కావాలి అంటాను. ఆమె త్యాగమూర్తి, పోతపోసిన ఓరిమి, ప్రజాజీవనంలోకి ఆమె రాక పవిత్రతను తెచ్చి, దురాశలకు, ఆస్థి ప్రోగుచేసే యత్నాలకు, కళ్లెం వేస్తుంది. కోట్లాది పురుషులకు ఆస్థులే లేవు. దీని నుంచి మనం కొద్ది మందికి అసలు తండ్రి తాతలిచ్చిన ఆస్థి లేకుండుటయే శ్రేయస్కరం. అని గ్రహించాలి... మేలు కొన్న స్త్రీలు, అనాదిగా ఉన్న దురాచారాలను గుర్తించి రూపుమాపాలి. శాసన కర్త, పురుషుడు, అబల అనబడే స్త్రీకి చేసిన దురన్యాయాలకు, అవమానాలకు, తగిన శిక్ష అనుభవించవలసి ఉంది. పురుషుల ఉచ్చులలోంచి బయల్పడి, పూర్తిగా లేచి పురుషుని చట్టాలను చట్టబద్ధ సంస్థలను ఎదిరించే రోజు దగ్గర పడింది.

స్త్రీల పాత్ర కుటుంబంలో తక్కువైనది కాదు. అందుకనే జన్మభూమిని జనని అంటారు. పిల్లలకు అమ్మ అంటే చమువు స్నేహం. వారు చాల సన్నిహితులు. తండ్రి వారికి కొంచెందూరమే.

ప్రకృతి సహజమైన ఈ కార్యవిభజనను త్రోసి పుచ్చి, స్త్రీలను ద్రవ్యార్జన కోసం, ఉద్యోగినిగా చేయడం, (సేవాపరమైతే అభ్యంతరం లేదు. డబ్బు ప్రసక్తి ఉండకూడదు) ఏటికి ఎదురీదడం అవుతుంది. కనుక స్త్రీని అణగద్రొక్కి ఉంచడం తప్పు. పురుషులు చేయవలసిన దాన్ని వారిచేత చేయించడం నిరంకుశత. అధఃపతనం.

*(మహాత్మాగాంధీ రచనలు, 14, పుట 31)*

★ ★ ★

స్త్రీపై జరిగిన అత్యాచారాన్ని ఖండించేందుకు నేను "స్త్రీ"ని కానక్కరలేదు. వారసత్వంలో స్త్రీకి గల ఆస్తి హక్కు గురించి, ఎంత తక్కువ మాట్లాడితే అంతమంచిది. శారదా బిల్లు వంటిది బాల్య వివాహం వంటి ఇంకా పెద్ద సమస్యలకు సమాధానం చెప్పినా, స్త్రీల హక్కులు గురించి అందరూ గట్టిగా న్యాయం చేయాలి. స్త్రీ పురుషులకు చట్టాలలో భిన్న విషయాలు పనికిరావు. చట్టాలు, ఎన్ని వచ్చినా పురుషుని అధికారపిపాస దుర్మదాంధత నశించనిదే స్త్రీకి న్యాయం కలిగి సమాజంలో సముచిత స్థానం హోదా లభించదు. ఆడవారు కూడ దీనిని గురించి ఉద్యమించాలి.

*(యంగ్ ఇండియా 17-10-29 పుట 340)*

★ ★ ★

జాగృత స్త్రీ యొక్క అహింసాత్మక విప్లవం ముందు పురుషుని స్వార్థచింతన నిలువదు.

*(యంగ్ ఇండియా 16-4-25 పుట 133)*

★ ★ ★

పురుషుడు స్త్రీని ఒక పనిముట్టుగా వాడుకున్నాడు. స్త్రీ కూడ ప్రతిఘటించలేదు. అలా ఉండటంలో ఆనందించింది. దిగజారడం ప్రారంభంఅయితే ఇక దానికి అడ్డేమీ ఉండదు.

*(హరిజన్ 25-1-36, పుట 396)*

★ ★ ★

భగవంతుని సృష్టిలో స్త్రీకి గల స్థానం, ఉన్నతం. అట్టి ఔన్నత్యాన్ని సౌహార్ద్రాన్ని సాత్వికతను అలుసుగా తీసుకొని పురుషుడు చేసినది అతి హేయమైనది. తనలో శ్రేష్టమైన అర్ధభాగాన్ని, పాశవికంగా వాడుకోడం అతి జుగుప్సాకరం. పురుషుని పాపాలకిది తలమానికం.

*(యంగ్ ఇండియా 15-9-21. పుట 292)*

★ ★ ★

స్త్రీని 'అబల' అనడం అవమానకరం. హృదయాన్ని జయించడంలో స్త్రీని మించిన వారు లేరు. త్యాగం, మౌన సహకారం, వినమ్రత వివేకం, విశ్వాసం మొదలైన గుణాలను బట్టి స్త్రీల పాత్ర 'సాటిలేనిది' 'మేటి అయినది' పశుబలమే బలమనుకుంటే, స్త్రీ అబలయే. కాని ధార్మిక నైతిక సామాజిక పారివారిక బలము విషయంలో స్త్రీ ముందు పురుషుడు ఎందుకూ కొరగాడు. ఆమె లేనినాడు, అతడు లేడు. అహింస మనవిధానమైతే, స్త్రీదే భవిష్యత్తు. ..

*(యంగ్ ఇండియా 10-4-30 పుట 121)*

★ ★ ★

స్త్రీకి తగిన విద్య గరపడం అవసరం. పురుషుని అనుకరిస్తే స్త్రీకి గలవ్యక్తిత్వము తక్కువవుతుంది. ప్రపంచానికి ఆమె ఇచ్చేది తక్కువ అవుతుంది. కనుక అనుకరణ వద్దు. స్త్రీ - పురుషుడు ప్రపంచ సమాజ కల్యాణంలో సంపూరకాలు కావాలి.

*(హరిజన్ 27-2-37. పుట 19)*

★ ★ ★

టాల్‌స్టాయ్ మాటల్లో, స్త్రీ పురుషుని ఛత్రఛాయలో మగ్గిపోడం మాని త్యాగనిరతితో వెలుగొందాలి. స్త్రీమూర్తీభవించిన ఆత్మత్యాగం దురదృష్టవశాత్తు ఆమె పురుషునికంటె ఎంత ఉన్నతంగా ఉన్నదో ఆమె గుర్తించటం లేదు.

*(యంగ్ ఇండియా 14-1-32, పుట 19)*

★ ★ ★

పురుషుడు, నిన్ను బుట్టలో వేసుకునేందుకు చెప్పే మెరమెచ్చు మాటలు, పైపూతలు, తళుకు బెళుకులు పట్టించుకోవద్దు. నీ శక్తిని నీవు గ్రహించు. నా హృదయమందలి త్యాగమనే సువాసనను ప్రపంచానికి పంచిపెట్టు. నీ పురుషుని మెప్పుకోసమేగాక, మానవత మెప్పుకోసం పాటుపడు. నీజన్మ హక్కు అది. పురుషుడు స్త్రీ నుంచి జన్మించాడు. ఆమెలో భాగము. ఆదిశక్తివై విజృంభించి ఉపదేశాన్నందించు.

*(యంగ్ ఇండియా 8-12-27, పుట. 406)*

★ ★ ★

పురుషుని చేతిలో ఆట బొమ్మవు కావద్దు

*(యంగ్ ఇండియా 21-7-21 పుట 229)*

★ ★ ★

ఇంటిలో కూడ స్త్రీ రాణి. కట్టుబానిస కాదు. తనవిధిని నిర్వర్తించడం తెలుసుకుంటే ఆమెకు తనహోదా అర్థమవుతుంది.

*(హరిజన్ 12-10-34, పుట 277)*

★ ★ ★

పురుషుల సమానత అంటే వృత్తి వ్యాపారాలలో సమానత మాత్రమే కాదు. ఎవరు చేయవలసిన పనిని వారే నిర్వహించాలి. ఒకరికొకరు పూరకమై ప్రకృతి సహజంగా జీవించాలి. ఎవరి రూపం వారిది.

*(హరిజన్ 2-12-39, పుట 359)*

★ ★ ★

స్త్రీ పురుషుడు - ఇద్దరూ సమానులు, స్త్రీ పురుషునితో సమానంగా స్వేచ్ఛను అనుభవించాలి. ధీరత్వము పురుషుదొక్కడిసొత్తుకాదు.

*(హరిజన్ 5-1-47, పుట. 478)*

★ ★ ★

రాజకీయరంగంలో కూడా స్త్రీ పురుషుని వెనుక దాగి ఉండడం మానివేయాలి. సాటి స్త్రీలకు ధైర్యం చెప్పి వారిలోని ముగ్ధత్వం మొదలైన

వాటిని పోగొట్టి, వారి విధులను గూర్చి వారికి తెలియజెప్పి వారిని స్త్రీలే విద్యావంతులను చేయాలి.

*(హరిజన్ 21-4-46, పుట 96)*

★ ★ ★

స్త్రీలు అవాంఛితమైన అసభ్యకరమైన చవుకబారు సంప్రదాయాలను ప్రతిఘటించాలి ఈ విప్లవం హాని చెయ్యదు. పవిత్రమైన ఆశయసిద్ధి తర్కపూరితమైన విప్లవమిది

*(హరిజన్ 23-3-47 పుట 80)*

★ ★ ★

స్త్రీలు పురుషులపై ఆధారపడరాదు.దైవ సహాయం వారికి సహజంగా ఉన్నది. దానితోబాటు వారికి పవిత్రాశయబలం నిజాయితీ అయిన నడవడిక వెయ్యి ఏనుగుల బలాన్ని కలిగిస్తుంది.

*(హరిజన్ 15-9-46, పుట. 312)*

★ ★ ★

"యత్ర నార్యస్తు పూజ్యంతే" అన్నట్టు, స్త్రీలు గౌరవింప బడినచోట దేవతలుంటారట.

*(హరిజన్ 11-1-46, పుట 508)*

★ ★ ★

పవిత్ర పాతివ్రత్యం పర్దాతో రాదు. మనసులో ఉండాలి.

*(యంగ్ ఇండియా 3-2-27, పుట 37)*

★ ★ ★

ధార్మిక జీవనం స్త్రీల సొత్తు. అంధవిశ్వాసాలను వదలిపెట్టి, వారు కాంతియుగంలో అడుగు పెట్టాలి.

*(హరిజన్ 25-3-33 పుట 2)*

★ ★ ★

అహింసావిధానంలో ఉత్తమోత్తమ ప్రయోగాలను స్త్రీలే చేయగలరు.

వారి ఓరిమి, సాత్వికత, మాతృత్వం, సహిష్ణుత, వారికి ఈ స్ఫూర్తిని సహజంగా కలిగిస్తుంది. పశుబలంలో పురుషుడు స్త్రీకంటె మిన్న. అయితే ఆత్మ త్యాగం, మనోనిబ్బరం, క్షమాగుణం, దైవబలం, అహింసావిధానం, వీటన్నిటిలో స్త్రీ పురుషుణ్ణి చిత్తుగా ఓడిస్తుంది

*(హరిజన్ 5-11-38, పుట 317)*

★ ★ ★

తన శక్తిని గ్రహించి, స్త్రీ తనభర్తతోసహా, పురుషుడిని రంజింపజేసే చవుకబారు చేష్టలు మానాలి. ఇది ఆమె చేతిలోనే ఉన్నది. ఆనాటి సీత ఆ రాముని భౌతికంగాఆకర్షించేందుకు ఒక్క క్షణమైనా వ్యర్థం చేయలేదు. స్త్రీ బల్లెంపట్టుకొని వేటాడడానికి ఏచట్టమూ అడ్డుపడదు. పురుషుడు చేసే పనిని చేసేందుకు సహజంగా సంకోచించి వెనక్కుతగ్గుతుంది. స్త్రీలు కొద్దిమంది రాజకీయాల్లో ప్రవేశిస్తున్నారు. వారు స్వయంగా తలల నాడిస్తున్నారు. ఈ ఆధారపడడం గిట్టని మరుక్షణం. స్త్రీలు హక్కుల కోసం ఇళ్లెక్కి కేకలు వేస్తున్నారు. ఇంతకంటే తోటి స్త్రీలకు స్వంతంగా ఆలోచించడం నేర్పి, వారి సంకెళ్లను త్రుంచి తద్వారా వారిలో మార్పు తెచ్చితీర్చిదిద్దడం మంచిది. దీనివలన పురుషులు స్త్రీల శక్తిని త్యాగనిరతిని గ్రహించి, ఆమెకు గౌరవస్థానాన్ని కలుగజేస్తారు. మంచిని తెచ్చే నియంత్రణలు స్వచ్ఛందమైనవి అయి ఉండితీరాలి. పవిత్రత, మొక్కలా దొడ్లో పెరగదు. పై నుంచి రుద్దితే రాదు. అది అంతరంగంలోంచి వచ్చినదైనపుడు, దాని విలువ ఎక్కువ. ఆకస్మిక ఆకర్షణలకు లోనుకాకూడదు. జీవితంలో పవిత్రమైనవి, ధార్మికమైనవి వీటి ప్రత్యేక రక్షకులు స్త్రీలు. సంప్రదాయ బద్ధత వీరి నైసర్గికగుణం. తమ అంధవిశ్వాసయుక్తమైన అలవాట్లను త్యజించడంలో ఆలస్యం చేసిన విధంగానే జీవితంలో పవిత్రమైన, ఉన్నతమైన వాటిని త్యజించడంలో కూడా ఆలస్యం చేస్తారు.

*(హరిజన్ 21-6-46, పు. 98)*

★ ★ ★

## అధ్యాయము 73
# ఆదర్శ వివాహం

పూర్ణ బ్రహ్మచర్యం, పూర్ణ సన్యాసం, ఆదర్శస్థితి. అది చేయలేనినాడు, వివాహం చేసుకున్నా ఆత్మ నిగ్రహంతో ఉండు.

*(హరిజన్ 7-9-35, పుట 234)*

★ ★ ★

తల్లిదండ్రులు ఆడపిల్లలకు బలవంతంగా పెళ్లి చేయరాదు.

*(హరిజన్ 15-9-46, పుట 311-12)*

★ ★ ★

ప్రకృతి సహజమైన వివాహబంధం, ఆత్మనిగ్రహంతో పునీతమౌతుంది.

*(హరిజన్ 23-2-42 పుట 88)*

★ ★ ★

శారీరిక సంయోగంతో మొదలై, ఆత్మ సంయోగంలో సిద్ధిపొందే, ఆదర్శ వివాహం, విశ్వాత్మకమైన దైవ సంయోగం చెంది పునీతమవుతుంది.

*(యంగ్ ఇండియా 21-5-31 పుట 115)*

★ ★ ★

ఆదర్శ వివాహం ధ్యేయం స్త్రీపురుషుల సాహచర్యంతో కూడి యుండాలి. ఆత్మార్పణ యౌన సంబంధమే ధ్యేయమైతే, స్నేహం కొరవడుతుంది.

*(హరిజన్ 7-7-46 పుట 214)*

★ ★ ★

సీతా రాముల ప్రణయం ఆత్మార్పణం. తననుతాను రక్షించుకోలేని అబలకాదు సీత.

*(హరిజన్ 2-5-36, పుట 93)*

★ ★ ★

స్త్రీ పురుషుని కట్టుబానిస కాదు. సహచరి, కష్ట సుఖాల్లో భాగస్వామిని. జీవవిధానాన్ని ఎన్నుకోడంలో పురుషునికి గల స్వేచ్ఛ స్త్రీకి కూడా ఉన్నది.

*(ఆత్మకథ 1966. పుట 18).*

★ ★ ★

స్త్రీకి సరియైన విద్య నేర్పి భర్తకు కూడా తాను ఆట బొమ్మను కానని చెప్పగలిగి తనకూ హక్కులూ విధులూ ఉన్నాయని తెలుసుకొనేలా చేయాలి.

*(హరిజన్ 2-5-36, పుట 93)*

★ ★ ★

వివాహమునకు ఆవశ్యకమైన అంశములు : 1. పరస్పర ప్రేమ 2. ఈడూ -జోడూ 3. తల్లిదండ్రుల అనుమతి, సంప్రదాయాల అనుసరణ 4. ఆధ్యాత్మిక పరిణతి అని ఒక మిత్రుడు లేఖద్వారా తెలియజేశాడు. నా భావన ఇది : 1. అధ్యాత్మిక పరిణతి, 2. సేవాభావం 3. పెద్దల అనుమతి 4. ప్రేమ. ప్రేమ ఉండని వివాహం ఎంత అసమంజసమో ప్రేమలేని పెళ్లి కూడా అంతదండుగే.

*(హరిజన్, 5-6-37, పుటలు 33-34)*

★ ★ ★

ఆడపిల్లలను కట్టిపడేసి తమ జీవనోపాధి ప్రయత్నాన్ని నిరోధిస్తూ, బలవంతం పెళ్లికి ఒప్పుకొననినాడు బయటకు పంపించరాదు. వివాహమనేది జీవితానికి నైసర్గికం. ఏవిధంగానైనా, దానిని తక్కువ చేయడం పూర్తిగా తప్పు. వివాహబంధంలో యౌన సంబంధమే ప్రముఖమైతే ఆత్మ బంధంకరువై స్నేహం దూరమవుతుంది. సీతా, రాములు ఆదర్శదంపతులు, సీతను రాముని కట్టుబానిసగా భావించేవారికి ఆమె స్వాతంత్ర్యంలోని అతనికి ఆమెపట్లగల అభిమానంలోని ఔన్నత్యం అర్థంకావు. వివాహబంధంలో ఆత్మప్రగతి ప్రథమం. సేవానిరతి తరువాత వస్తుంది. పారివారిక సామాజిక ప్రతిపాదనలు మూడోస్థానంలో ఉంటాయి. ప్రేమకు నాల్గవదీ, ఆఖరుదీ

అయిన స్థానం. అంటే తక్కినవి లేనప్పుడు ప్రేమ యాత్ర బలం పెళ్లికి కారణం అవదు. అదే విధంగా తతిమ్మా మూడు కలిసి వచ్చిన ప్రేమ లేనప్పుడు పెళ్ళి ప్రశ్నతలఎత్తరాదు. శరీరారోగ్యం మాట ఎత్తను సంతాన ప్రాప్తి కొరకే వివాహం కనుక, శరీరారోగ్యం పెళ్లికి తలమానికమైన అర్హత. షరతుగా పరిగణించడం తప్పు. ఇంద్రియ భోగాలు విధులుకావు. అదేవిధంగా ఆత్మానుభూతిని కలిగించే పవిత్రతను తాదాత్మ్యాన్ని అందుకున్నదే నిజమైనపెళ్ళి భార్యాభర్తలు, పరస్పరం ఆత్మలకు శరీరాలకు రక్షకులై ఉండాలి. యజమానులు కాకుండా, స్నేహితులై ఉండాలి. కామేచ్ఛ తీరే కొరకుఆటబొమ్మలు కారాదు. దీనికి ధ్యానం సమర్పితభావం అవసరం. భార్య భర్తల మధ్య రహస్యాలుండరాదు. ఒకరిలో నొకరు ఐక్యమైపోవాలి. శిశువులను కన్యాదానం చేయుటయా? ఆమె తండ్రి ఆస్థికాదు. అట్లా చేసే వీలులేదు. రక్షకుడే యజమాని కాడు. కన్యాదానం చేస్తే, ఆ రక్షకుని స్థాయి కూడ అంతరిస్తుంది. తల్లిదండ్రులు, ధనం నిమిత్తం పెళ్ళి చేయడం ఆగిపోవాలి. ఇది వర్ణధర్మమేమో, ఆ వర్ణపు యువతీ యువకుల సంఖ్య తక్కువగా ఉంటే, ఇదిసాధ్యమే. కనుక వర్ణబంధాలుత్రెంచాలి. దేశంలో యువతీయువకుల మనోభావాలలో విప్లవం రావాలి. ప్రజానిరసనతో కట్న దురాచారాన్ని కట్టడి చేయవచ్చు. యువతులు, తల్లి దండ్రులు డిగ్రీలపై సంఘంలో హోదాలపై మోజు తగ్గించుకొని అంతర్వర్ణ అంతర్రాష్ట్ర అంతర్దేశీయ వివాహాలను ప్రోత్సహించాలి.

*(హరిజన్ 5-6-37 పుట 135 136)*

★ ★ ★

మొదటి సంతానాన్ని ధర్మజ అనీ తతిమావారిని ''కామజ' అని మనువు అన్నాడు. యౌనసంబంధాలకు నిర్వచనం అది.

*(హరిజన్ 24-4-37, పుట 83)*

★ ★ ★

రసనాతృప్తికి తినడం తప్పు. బ్రతికేందుకు తినడం ఒప్పు. వివాహప్రక్రియకూడా కామేచ్ఛతీరడం కోసం మాత్రమే కాదు.

*(హరిజన్ 7-7-46, పుట 214)*

★ ★ ★

కామేచ్ఛను తృప్తి పరచడం కోసం మాత్రం అయితే పెళ్ళి వ్యర్థం.

*(యంగ్ ఇండియా 2-2-28, పుట 35)*

★ ★ ★

భార్యాభర్తలు ద్వయమేవైకం (టు ఇన్‌వన్)

*(హరిజన్ 9-3-40 పుట. 30)*

★ ★ ★

బాల్య వివాహం చేసి, బాలికను ఒకవృద్ధునికి కన్యాదానం చేసిన త్వాష్టుడు, కనీసం విధవా వివాహం చేసి (ఆమె అలా అయినప్పుడు) తన పాపాన్ని కొంతమేరకు క్షాళన చేసుకోవాలి. ఆడపిల్ల అతని ఆస్తికాదు. దానం చేయరాదు

*(యంగ్ ఇండియా 11-11-26. పుట 288)*

★ ★ ★

కన్యాదాన ప్రథ కట్నాలు తీసుకునే అలవాటు అంతం కావాలి. యువతీ, యువకులు ఈ దుష్టాచారాన్ని రూపుమాపేందుకు నడుము కట్టాలి.

*(హరిజన్ 23-5-36, పుట 117)*

★ ★ ★

కట్నాలు తీసుకునే దురాచారం మంట గలవాలి.

*(యంగ్ ఇండియా 21-6-28 పుట 207)*

★ ★ ★

విధవావివాహాలను ప్రోత్సహించాలి. పునర్వివాహం కాదది. బాల్య వివాహమూ, ఒక వివాహమేనా?

*(యంగ్ ఇండియా 5-8-26, పుట 276)*

★ ★ ★

## అధ్యాయము 74

# సంతానము

బాలనేరస్తులున్నారు. వారలా అయేందుకు మనమే బాధ్యులం.

*(యంగ్ ఇండియా, 3-12-25, పుట 422)*

★ ★ ★

తల్లిదండ్రుల పోలికలు, ఆకారం, గుణ, గణాల విషయంలో సంతానానికి ఉంటాయి. పరిసరాల ప్రభావంతోపాటు ఆత్మసౌందర్యమనే వారసత్వం, పిల్లలను తీర్చిదిద్దుతుంది.

*(ఆత్మకథ 1966, పుట 234)*

★ ★ ★

సంతానాన్ని ఆత్మ నిర్భరులుగా తలిదండ్రులు చేయాలి.

*(యంగ్ ఇండియా 17-10-29, పుట 340)*

★ ★ ★

పిల్లలే మన ఆస్థి. వారు బుద్ధిమంతులైతే, ప్రపంచంలో శాంతి, సౌఖ్యం, విస్తరిల్లి, మరోప్రపంచం ప్రభవిస్తుంది.

*(యంగ్ ఇండియా 19-11-31 పుట 361)*

★ ★ ★

ఇండియాలో అత్యల్పంగా ఉన్నవారి దుఃఖంతో ఏకం కావాలంటే నాకే ఆశక్తి ఉంటే స్వల్పం అయినా సరే నా సంరక్షణలో ఉన్న చిన్న వారి పాపాలతో నన్ను ఏకంగానీయండి. వినీత భావంతో ఇది చేయుటచేత, ఏదో ఒకనాడు నేను దేవుని - సత్యాన్ని ముఖాముఖి చూడగలను. బాలబాలికలకు వారి పెద్దల నుంచి వచ్చిన వారసత్వమే మొదటి పెట్టుబడి. దానితో వారు బ్రతుకు మొదలు పెడతారు. ఆ వారసత్వం సరియైనది కాక, దుష్టపూరితమయినా, ఎట్టిదైనా, కొందరు పిల్లలు దానిని అధిగమించి సఫలులు అవుతున్నారు. ఆత్మకు గల సహజసిద్ధమైన పవిత్రతయే దీనికి మూల కారణం. తలిదండ్రులు తమ సంతానానికి సమానంగా పంచి ఇచ్చే ఆస్థి, ఆబాలబాలికల నడవడిక (ప్రవర్తన) విద్యావిధానం. పెద్దలు, కొడుకులను

కూతుళ్లను స్వయం శక్తిమంతులుగా ఆత్మ నిర్భరులుగా చేయాలి. చెమటోడ్చి నిజాయితీతో నిండిన జీవనోపాధి ద్వారా ధనార్జన చేసుకొనగలిగేటట్లు చేయాలి. ఈ ప్రపంచంలో నిజంగా శాంతిని చేరుకొని యుద్ధం మీద యుద్ధాన్ని సాగించాలంటే పిల్లలతో మొదలుపెట్టాలి. వారు నిష్కల్మషులయితే మనకు చింత ఉండదు. నిష్ఫలమైన ప్రతిపాదనలను చేయనక్కరలేదు. ప్రపంచమంతా సంకల్పితంగానో అసంకల్పితంగానో తహతహలాడే శాంతి, ప్రేమను నలుచెఅగులా పరచేంతవరకు మన ప్రేమ, శాంతి అంచెలంచెలుగా ఎదుగుతూ ఉంటాయి.

*(ఆత్మకథ - 1966 పు. 245)*

★ ★ ★

## అధ్యాయము 75

# కుటుంబ నియంత్రణ

ఆహార నిద్రాదుల వలె, సృష్టి కార్యం ప్రత్యేకం అనుకుంటే, అది సరికాదు. భగవదిచ్ఛప్రకారం ప్రపంచ ప్రగతికి సృష్టికార్యం, సహకరిస్తుంది. కనుకకన్నవారు సంతానాన్ని కనిపారేయకుండా, వారిని సరిగా పెంచి పెద్ద చేయవలసిన బాధ్యత తీసుకోవాలి.

*(ఆత్మకథ 1966 పు. 153)*

★ ★ ★

"ప్రజాయై గృహమేధి" అన్న సూత్రం పాటించి కామేచ్ఛ కోసమే జీవించడం మానుకోవాలి. అలా జీవించడం చాల పెద్ద హీనమైన నీచమైన నేరము.

*(యంగ్ ఇండియా 12-3-25 పుట 88)*

★ ★ ★

సంతానార్థమే సంయోగం అని తెలిసిన తలిదండ్రులు తమశక్తినీ కాలాన్నీ వ్యర్థకామేచ్ఛ తృప్తి కోసం వ్యర్థం చెయరు

*(హరిజన్ 21-3-36, పుట. 48)*

★ ★ ★

కామేచ్ఛ సహజం. సిగ్గుపడవలసినదికాదు గాని సంతానం కోసమే దానిని ప్రయోగించాలి ఇంకే విధంగానైనా ఉపయోగించడం దైవకారం, మానవత్వకారం

(హరిజన్ 28-3-36. పుట 53)

★ ★ ★

తిండిఎక్కువయినప్పుడు ఆరోగ్యం చెడుతుంది. అప్పుడు చికిత్స జరగాలి. అదేవిధంగా కామేచ్ఛ తృప్తి విశృంఖలంగా జరిగితే అనారోగ్యం వస్తుంది. తస్మాత్‌జాగ్రత్త జాగ్రత.

(యంగ్ ఇండియా 12-3-25. పుటలు 88-89)

★ ★ ★

కుటుంబ నియంత్రణ అత్యావశ్యకం. సందేహం లేదు. దీనికై పెద్దలు బ్రహ్మచర్యంలో భాగమైన ఆత్మనిగ్రహాన్ని పాటించమన్నారు. నేడు దీనికి బదులుగా కృత్రిమ వ్యవస్థతో కుటుంబ నియంత్రణ కోసం, ప్రయాస పడుతున్నారు శాస్త్రజ్ఞులు ఇందు ఆత్మనిగ్రహానికి చోటుండదు. విచ్ఛృంఖలత, విచ్చలవిడిగా పెరిగి. స్త్రీ పురుషులను నిర్వీర్యులుగా చేస్తుంది. ఇది మంచిది కాదు.

(యంగ్ ఇండియా 12 3 25. పుటలు 88-89)

★ ★ ★

ప్రపంచం భగవంతుని ఆటస్థలం. ఆయన ఔదార్యతకు ప్రతిబింబం కనుక ప్రపంచం పెరగటానికి సృష్టికార్యం నియంత్రితం కావాలి. అప్పుడే క్రమాభివృద్ధి సాధ్యం. దీనిని అర్థం చేసుకున్నవాడు, తన వాసన ను అదుపులో ఉంచి తన సంతానం యొక్క శారీరిక మానసిక బౌద్ధిక ఆరోగ్యానికి కావలసిన జ్ఞానాన్ని పెంచుకుంటాడు. దానిలాభం సంతానానికి కలిగిస్తాడు. సంతానం కోసం మాత్రమే యౌనాంగప్రక్రియ అనేది స్త్రీ పురుషుల మనసులో నాటుకున్నపుడు ఇంకేవిధంగానూ సంభోగ ప్రక్రియలో పాల్గొనడం అమూల్యమైన జీవరసాన్ని వ్యర్థం చేయడమనీ అనవసరమైన ఆయాసయనీ తెలుసుకుంటారు తప్పుచేసి. దాని ఫలితాన్ని అనుభవించకుండా తప్పించుకునే ప్రయత్నం చేయడం. తప్పు. అమితంగా భుజించిన వాడు కడుపు నెప్పితో బాధపడి. లంఖనం ఉంటాడు. ఆరుగ్మతను మందుల

తగ్గించుకునే ప్రయత్నం అధర్మం. అదేవిధంగా, పశుప్రాయంగా వాసనా పూర్తిని చేసుకొని ఆ పని వల్ల కలిగే ఫలితాలనుంచి తప్పించుకో చూడడం ఇంకా భయంకరమైన అధర్మం. అతిసర్వత్ర వర్జయేత్ అని అందుకే అన్నారు. ప్రకృతిలో సహజమైన బ్రహ్మచర్యాన్ని పాటించే వారికి, అది దివ్యౌషధం. ఆ మనశ్శక్తిని పెంచే మందులుంటే ఎంతోమేలు. అప్రాకృతిక విధానాల వలన రుగ్మత కంటె మందే చెడ్డదని తేలుతుంది. జనాభా పెరుగుదలను పరిహరించ వలసినంత ఆపదగా పరిగణించరాదు. మనకు అర్థమయినా కాకున్నా కృత్రిమ విధానాలతో దానిని నిలుపుచేయడం, మొదటి దానిని మించిన ఆపద. అదిజాతిని, హీనపరుస్తుంది. అక్కరలేని పిల్లలనిచ్చే అవాంఛిత భోగలాలసతకు విరుగుడు. అంటువ్యాధులు, యుద్ధం, కరువుకాటకాలు మొదలయిన ప్రాకృతిక యోజనలే. జనాభా పెరిగింది. కనుక కుటుంబ నియంత్రణను పాటించాలి అంటే నేను అంగీకరించను. సరియైన, వ్యవసాయపుటేర్పాట్లతో, పంటభూమి పంటలు పెరిగితే ఇంతకు రెట్టింపు జనాభానైనా పోషించగలము.

*(యంగ్ ఇండియా 2-4-25, పు. 118)*

★ ★ ★

కుటుంబ నియంత్రణకై, కృత్రిమ విధానాలను అనుసరించడం ఒక అభిశాపం. అతిశయించిన కామేచ్ఛ వలన పెరిగిన జనాభా, కరువుకాటకాలతో తగ్గుతుంది. కనుక, ఆత్మనిగ్రహాన్ని పాటించడం అన్నివిధాలా ఆరోగ్యకరం.

*(హరిజన్ 31-3-46, పుట 66)*

★ ★ ★

మానవుడు సులభమార్గాన్ని ఎంచుకుంటాడు.

*(హరిజన్ 1-2-35, పుట 410)*

★ ★ ★

భూగోళంఇంతకాలం జనాభాతో బరువెక్కలేదు. ఒక్కసారి పెరిగిన జనాభాకి తిండి ఉండదనే భయం ఎందుకు కలిగింది?

*(హరిజన్ 14-9-35 పుట 244)*

★ ★ ★

కృత్రిమ సాధనాలను ప్రతిపాదించేవారికి నామనవి. విశృంఖలతతో వివాహబంధం విడిపోయే ప్రమాదం గలదని గమనించండి.

*(యంగ్ ఇండియా 2-4-25, పుట 118)*

★ ★ ★

స్త్రీలకు కృత్రిమ సాధనాలను ఇవ్వడం, ముందు కాళ్లకు బంధం వేయడం వంటిది. ఆత్మఘాతుకం.

*(హరిజన్ 2-5-36, పుట 93)*

★ ★ ★

ఈసాధనాల ప్రచారానికి పరుగిడువారి ఆశయంలో ఏ విధమైన తృటీ లేదు శారీరికంగా నైతికంగా ఈ సాధనాలు సరియైనవని ఋజువు చేసి అటు తర్వాత వాడుక చేయండి. ఇంకొక విషయం. ఎవరి కోసం వీటిని తలపెట్టారో వారు వీటిని వాడరు. వీటి అవసరం లేని వారు వాడుక చేసి తాము తమ సహచరులు స్వేచ్ఛాప్రేమ సమాజపు సదస్యులై, చేటు తెచ్చుకుంటారు.

*(హరిజన్ 12-9-36, పుట 244)*

★ ★ ★

స్త్రీలకు తమ స్వేచ్ఛను గురించి తెలియచెబితే శిశుజననంలో బాధలు తెలిసిన వారు ఆత్మ నిగ్రహంతో పురుషులను నిరోధించి కుటుంబనియంత్రణ ఆవశ్యకత లేకుండా చేస్తారు. ప్రస్తుతం స్త్రీ తనకిష్టం లేనప్పుడు పురుషుణ్ణి తనవద్దకు రావద్దు అనే హక్కులేదు అనుకుంటుంది.

*(హరిజన్ 25-1-36, పుట 396)*

★ ★ ★

కృత్రిమ సాధనాల వాడుక వలన కలిగే ఫలితాలు, వివేకవంతులకు ఇప్పుడే అవగతం అవుతున్నాయి. ధార్మిక తర్కంలోనికి పోకుండా, కుందేళ్ల వలె జాతిని పెంచడం ఆపవలసిందే, అయితే ఈ చర్యలో ఇంతకంటె పెద్ద దోషాలను చేయరాదు. విద్యతో వివేకంతో కుటుంబనియంత్రణకు జాతికి వన్నె దెచ్చే పద్ధతిని - అదెంత కష్టసాధ్యమైనా సరే - నిటారు కొండనెక్కడం

వంటిది అయినా సరే అవలంబించి సఫలులు ' కావాలి. మానవునికి ఉన్నతమైన ప్రగతి అనగానే ఎప్పుడు పెరిగే కష్టమే దీనికి స్వాగతం చెప్పాలి. పైకి పోవడమా, క్రిందకు పోవడమా అనే ప్రశ్న ఎదురయినపుడు సామాన్యంగా మనిషిలోని పశు ప్రవృత్తి అందమైన తొడుగులో అందించిన దిగజారుడు కోసమే ఆయాసపడుతుంది. సద్గుణరూపంలో పాపాన్ని అందిస్తే మనిషి సులువుగా లొంగిపోతాడు. మేరీ స్టోప్సు మున్నగువారు చేస్తున్నదిదే. కృత్రిమ సాధనాల ప్రవర్తకులకు నా విన్నపమిదే అతిగా వీటిని ఉపయోగిస్తే, వైవాహిక బంధాలు తెగిపోయి, విచ్ఛృంఖలతతో నిండిన ప్రేమ పెరుగుతుంది. పశువు వలె తనలో కామ ప్రవృత్తిని పెంచుకుంటే సైనికుడు యుద్ధభూమిలో ఇల్లు విడిచి చాలకాలం ఉన్నప్పుడు గాని, విధురుడైన నాడు గాని తన భార్య అనారోగ్య సమయాలలోగాని కృత్రిమ సాధనాలు ఉండినా, ఏమి చేయగలడు? ఇండియాలోని స్త్రీలు మొదట మానసిక బానిసత్వం పోగొట్టుకొని తన శరీర పవిత్రతను గ్రహించి మానవసేవ, రాష్ట్రసేవలో గల గౌరవాన్ని తెలుసుకోవాలి. కృత్రిమ సాధనాల ప్రచారకుల మనస్సులో కుటుంబ నియంత్రణ ఆవశ్యకతను గూర్చిన పట్టుదల సరిఅయినదే. వారు ఒక్కసారి కృత్రిమ సాధనాలను వాడుకచేసి కుటుంబనియంత్రణను పాటించమని, అనునయించడం ఒప్పించండంలో గల నష్టాలు గమనించాలి. స్త్రీగాని పురుషుడుగాని భగవద్దత్తమైన బీజరూప ప్రాణిని హత్య చేయరాదు. పిల్లలు కలుగకపోవడంతోపాటు, ఊర్జావీర్యశక్తులు, లుప్తమై నష్టం కలుగుతోంది. చాల మంది స్త్రీలు ఈ విధమైన నిరోధాన్ని గర్హిస్తారు. పురుషుల ప్రేరేపణతో కష్టపడుతున్నారు. ఆత్మ సంకల్పం, ఆత్మశక్తి, ఇచ్ఛాబలం పట్టుదల ఉన్నప్పుడు కుటుంబనియంత్రణకు కృత్రిమ సాధనాల సహాయం అనవసరం.

అక్కరలేని పిల్లలను కనడం పెద్దపాపం. గర్భస్రావం ఇంకా పెద్ద పాపం.

*(హరిజన్ 7-9-35 పుట 234)*



స్త్రీ కూడా, తానుమోయలేని బరువును ఎత్తుకోకూడదు. దించుకోకూడదు

*(హరిజన్ 28-3-36, పుట 53)*

★ ★ ★

గర్భనిరోధ ప్రక్రియలు నేర్చిన తర్వాత, ఆత్మ నిగ్రహం ఉండదు. దాని ఆవశ్యకత ఉండదు.

*(హరిజన్ 17-4-37, పుట 77)*

★ ★ ★

ఈ దుష్ట సంప్రదాయంతో విద్యార్థులు విద్యార్థినులు గర్భనిరోధ ప్రక్రియకు బానిసలై, దానిని ప్రవేశపెట్టిన పెద్దల (సమాజంలోని) సహకారంతో శృంగారం వెలగబెట్టుతున్నారు. ఇటు సంఘసంస్కర్తలు సామాజిక జీవనంలో పవిత్రతను నిలబెట్టడం ఎలా అని తలలు పట్టుకుంటున్నారు.

*(హరిజన్ 28-3-36, పుట 53)*

★ ★ ★

ఆధునిక వనితలు వీటిని సమర్థిస్తున్నారు. కాని బహుసంఖ్యాకులకు ఏవగింపు ఉన్నది. పురుషుడు ఆమెహితాన్ని కోరేవాడైతే నిగ్రహంతో ఉండవచ్చు స్త్రీలు మేము ప్రేరేపించం అంటున్నారు. పురుషుడే నిగ్రహశూన్యుడై స్త్రీని ప్రేరేపించి బాధిస్తాడు.

*(యంగ్ ఇండియా 2-4-25, పుట 118)*

★ ★ ★

సత్యాహింసలెట్లో, ఆత్మ నిగ్రహంకూడా అట్లే. అది ఋషిమునులకొరకు మాత్రమే కాదు. అసత్యం, హింస వీటితో సతమతమయేవారు చాలా మంది ఉన్నప్పటికీ మానవత •తన ఔన్నత్యాన్ని దిగజార్చదు. ఆ విధంగానే ఆత్మనిగ్రహ సందేశం బహుసంఖ్యాకులను ప్రభావితులను చేయకపోయినా, మనము మానదండాన్ని తగ్గించకూడాదు.

*(హరిజన్ 30-5-36, పుట 126)*

★ ★ ★

# భాగము 11

# మౌలిక విద్య - విద్యార్థులు

## అధ్యాయము 76

## మౌలిక విద్య

"సావిద్యాయావిముక్తయే" విద్య స్వేచ్ఛను ఇస్తుంది. ధార్మికార్థంలో కాదు. మానవసేవకు ఉపయోగపడే ప్రశిక్షణ, బహిరంగ, అంతరంగ స్వాతంత్ర్యం ఇస్తుంది. (బానిసత్వం నుంచి విడుదల నిత్యావసరం. ఈ ఆదర్శాను సంధానమైనదే సత్యమైన విద్య.

*(హరిజన్ 10-5-46 పుట 38)*

★ ★ ★

జిజ్ఞాస ప్రశ్నోత్తరాలు, జ్ఞాన సముపార్జనకు ముఖ్యం. వినయం గురువు పట్ల గౌరవం, ఉండాలి. అవినయం, అశ్రద్ధతో చదువురాదు.

*(హరిజన్ 18-9-40, పుట 306)*

★ ★ ★

క్రొత్త ప్రపంచసృష్టికి క్రొత్తరకం విద్యకావాలి.

*(హరిజన్ 19-1-47 పుట 494)*

★ ★ ★

మానవులలోని మంచిని వెలికి తీసేనిపుణులుంటారు. వారు పవిత్రులై క్రొత్త విషయాలను నేరుస్తూ సాఫల్యాన్ని క్రమంగా సాధిస్తారు.

*(హరిజన్ 7-11-36, పుట 309)*

★ ★ ★

ఉపయోగం గల శరీరశ్రమ బుద్ధిని పెంచుతుంది. దీనితో శరీరం, బుద్ధి, ఆత్మల సమతౌల్యం ఉంటుంది. పెడదారులను పట్టదు. సేవారతమై ఉంటుంది.

*(హరిజన్ 8-9-46, పుట 306)*

★ ★ ★

'నయీతాలీం' - నూతనవిద్యా విధానంలో వృత్తి కళ, ఆరోగ్యం, విద్య సమావిష్టమై ఉంటాయి. పుట్టిన దాది చచ్చేవరకు .. వృత్తి, శ్రమ విద్యకు భిన్నాలుకావు కదా విద్యా మాధ్యమాలు ఇవేనని అంటాను

*(హరిజన్ 10-11-46, పుట 394)*

★ ★ ★

బుద్ధి శరీరం ఆత్మ నూతనవిద్యావిధానంలో పరిణతిని చెందుతాయి. సామాన్య విధానంలో బుద్ధికి మాత్రమే పెద్దపీట.

*(హరిజన్ 9-11-47, పుట. 401)*

★ ★ ★

విద్యాధ్యయనంలో ఉపాధ్యాయుడూ విద్యార్థీ ఉత్పత్తి చేసి జీవించాలి. దీనివలన ఆదినుంచి జీవితం జ్యోతిమయమై దేశంలో ఉద్యోగాన్వేషణలేకుండా చేస్తుంది.

*(హరిజన్ 11-5-47, పుట 145)*

★ ★ ★

జీవితమనే పుస్తకం నుండి, సత్యం ప్రేమల మేళవింపుతో వృత్తి విద్యల సహాయంతో ఈ విధానం పెరిగింది. ఏ శక్తి దీనిని గుంజుకోలేదు.

*(హరిజన్ 21-12-47, పుట 480)*

★ ★ ★

చిన్నప్పటి నుంచీ పిల్లలు కాయకష్టాన్ని ప్రేమించడం నేర్వాలి.

*(యంగ్ ఇండియా 1-9-21, పుట 277)*

★ ★ ★

చదువను, వ్రాయను నేర్చుట చేతి విద్యను నేర్చిన తర్వాతనే.

*(హరిజన్ 8-3-35, పుట 28)*

★ ★ ★

కాళ్లూ చేతులను వాడుకచేసి వివేకంపెంచి బుద్ధి, మనసు, ఆత్మలను కేంద్రీకృతం చేసేది నయీతాలీం.

*(హరిజన్ 8-5-37, పుట 104)*

★ ★ ★

ప్రతిచేతిపనిలో వాడేపని ముట్లను గురించి చెప్పి, నిష్ణాతుణ్ణి చేయాలి.

*(హరిజన్ 31-3-37, పుట 197)*

★ ★ ★

మంచి గురువుతో విద్యార్థి చేతిపని ద్వారా కష్టపడి ప్రయోజకుడౌతాడు.

*(హరిజన్ 11-9-37 పుట 256)*

★ ★ ★

విద్య ముఖ్యోద్దేశం విద్యార్థిని మంచి నాగరికుని చేయడం కనుక సద్గుణాలు కల ఉపాధ్యాయునికి చింత ఉండదు.

*(హరిజన్ 1-12-33, పుట 3)*

★ ★ ★

నేను ప్రతి పారశాలలో అన్ని విషయాలతో బాటు, వృత్తి విద్య ఉండాలంటాను. అక్కడ విద్యార్థులకు వలసిన విషయాలు - ఇంగ్లీషు మినహా - డ్రిల్లు సంగీతం చిత్రకారిత కూడా ఉంటాయి.

*(హరిజన్ 18-9-37, పుట. 265)*

★ ★ ★

ఈ విద్యావిధానాన్ని హస్తకళల విద్య, అనడం సబబు. అందరికీ అర్థమై అందరూ గుర్తించే ఈ నిర్వచనం పాక్షికమే. దీనికి మూలం ఇంకా లోతులో ఉన్నది. ఏరకమైన వ్యక్తి లేక సంస్థ పరమైన మానవకార్యకలాపాలకైనా, సత్యం, ప్రేమను సంధించ గలగడమే ఈ సూత్రం. నిజమైన విద్య అందరికీ అందుబాటులో ఉండాలనీ, దైనం దిన జీవితంలో గ్రామీణుడి కుపకరించాలనీ ప్రేమ మార్గం నిర్దేశం. అట్టి విద్య, పుస్తకాలనుంచి రాదు. పుస్తకాలపై ఆధారపడి ఉండలేదు. వర్గధర్మాలతో సంప్రదాయాలతో దీనికి నిమిత్తం లేదు. ఇది అన్ని వర్గధర్మాల సమాహారమైన విశ్వవ్యాప్తమైన ధర్మం దీనిది అని చెప్పవచ్చును. జీవితంలో ఎక్కువ భాగం జీవనోపాధి ఆర్జనకే. కాయకష్టం విలువలను తెలుసుకొని యున్న రైతుబిడ్డ, స్కూలుకు పోయి వచ్చిన తర్వాత వ్యవసాయకూలీగా ఎందుకువిఫలుడౌతున్నాడో నాకు అర్థం

కావటం లేదు. చేతిపనులు మానవుని పశువు నుండి వేరు చేస్తాయి చదువను వ్రాయను నేర్వనిదే మనిషికి ప్రగతి లేదు అనునది అంధవిశ్వాసం. ఆ జ్ఞానం ఉంటే మంచిదే, లేకపోయినా మానవుని బౌద్ధికము, శారీరికము, ఆర్థికము, అయినవృద్ధికి అనివార్యంగానే కాదు. శరీరావయవాలను సరిగావాడి, బుద్ధిబలాన్ని విద్యను పొందవచ్చును. అయితే, ఆత్మవికాసంతోడ్తోడుగా జరగాలి. అంటే ధార్మిక జ్ఞానాభివృద్ధి అన్నమాట. ఇది శారీరిక మానసిక వికాసాన్ని కలిగించే విద్యవలననే సాధ్యం. ఇది అవిభాజ్యం, సర్వాంగీణం. ఈ సిద్ధాంతం ప్రకారం దేనికి దానిని వేరుగా వికసింపజేయడం పరస్పరంగాక వైయక్తికంగా వికసింప చేయడం సాధ్యమనే ఆలోచన భ్రష్టత్వానికి అవసరం. విద్య అంటే నాదృష్టిలో మానవుని నుండి, శిశువునుండి శరీర, మనోబుద్ధుల అత్యుత్తమత్వాన్ని వెదకి వెలికితీయడమే అవుతుంది. సాక్షరత విద్యకు ఆది, అంతం కాదు. స్త్రీపురుషులకు విద్యను నేర్పు విధానాల్లో ఒకటి మాత్రమే అది. సాక్షరత మాత్రమే విద్య కాదు. కనుక పిల్లలకు పనికి వచ్చే చేతిపనులను నేర్పి, వస్తూత్పత్తిని ఆక్షణం నుంచి ప్రారంభింప చేయడమేవిద్య ప్రభుత్వం ఉత్పత్తులను తీసుకుంటే ప్రతీబడీ స్వయంపోషకమవుతుంది. అటువంటి విద్యా విధానంలో బుద్ధి, ఆత్మల పరిపూర్ణ వికాసం సాధ్యం. అయితే ప్రతి చేతి వృత్తినీ, ప్రస్తుత పద్ధతిలో వలె గుడ్డి అనుసరణగా కాకుండావిజ్ఞాన వర్ధకంగా నేర్పాలి. పిల్లలకు ప్రతివిషయాన్నీ ఎందుకు, దేని నిమిత్తం ఏ పద్ధతికి ఏది కారణం అనే వారి జిజ్ఞాసను తీర్చగలగాలి. అనుభవ పూర్వకంగా నేనుచెప్తున్న మాటలివి. పనివారికి రాట్నంమీద నూలు వడకడం నేర్పేచోట్ల, దాదాపుగా ఈ పద్ధతిలో విద్యను నేర్పడం జరుగుతున్నది. చెప్పులతయారీ, నూలు వడకడం, నేనే నేర్పాను. ఫలితాలు బాగున్నాయి. దీనిలో చరిత్ర, భూగోళం, అధ్యయనం విస్మరింపబడదు. అయితే మౌఖికంగా నేర్పితే బాగా అలవడుతుంది. పుస్తకాల చదువుకు పదిరెట్లు ఎక్కువగా చక్కగా చదువు సాగుతుంది. గింజ నుండి ఊకను గుర్తించడం నేర్చిన తర్వాత అక్షరాలను నేర్పవచ్చు. విద్యాధ్యయనంలో అభిరుచికలుగుతుంది. ఇది విప్లవాత్మకమైన ప్రతిపాదన. కాని, పనిని తగ్గించుకొని ఒక్క ఏడాదిలో

ఇంకెంతో సమయం పట్టే చదువును విద్యార్థి నేర్వవచ్చును. సార్వత్రికమైన ఆర్థికసౌకర్యం ఉన్నది. చేతి పనిని నేరుస్తూ విద్యార్థి గణితాన్ని నేర్చుకుంటాడు. గురువు సరియైన వాడయితే, పిల్లలు కాయకష్టంలోని ఉదాత్తతను తెలుసుకొని తమ బౌద్ధికవికాసానికి ముఖ్యాంశమనీ తమ ప్రశిక్షణకు తమ శ్రమ ద్వారా చెల్లింపు దేశభక్తి అనీ గ్రహిస్తారు. చేతివృత్తులను ఉత్పత్తి కార్యంగానే కాకుండా, విద్యార్థుల బుద్ధివికాస కారకాలని నాసూచనలోని అంతరార్థం. ప్రభుత్వం ఏడుసంవత్సరాలనుంచి పదునాలుగేండ్లవరకు వయసు గల విద్యార్థులను సమీకరించి, వారిశరీరాలను బుద్ధిని ఉత్పత్తితో ముడిపడియున్న శ్రమద్వారా వికసింపచేసే శిక్షణను గరిపిన యెడల స్వయంపోషకం గాని పబ్లికుస్కూళ్లు మోసాలకు నిలయాలు. ఉపాధ్యాయులు బుద్ధిహీనులు అని రుజువవుతుంది. ఉపయోగించే, వృత్తి విద్యను నేర్పి, తద్వారా వారి బౌద్ధిక, శారీరిక ఆధ్యాత్మిక గుణాలను వికసింపచేయాలి. విద్యనేర్పే సందర్భంలో ఈ ఆర్థిక చర్చలు అసందర్భమైన వికృతాలు అనుకోవద్దు. ఆర్థికమైన అంకణాలు ఎప్పుడూ వికృతం కాజాలవు. విశ్వవిద్యాపీఠాలను గ్రామీణుల అవసరాల సందర్భంలో ఉపాధ్యాయుల శిక్షణాకేంద్రాలుగా చేయాలి. ఇంకో చోట (గ్రామాలను పరిహరిస్తే) వారికి ఈ దృష్టినిలవదు. వారి గ్రామనివాసం సుకరం కాదు. సేవాగాంలో నా అనుభవమిదే. ఒక ఏడాది పాటు గ్రామనివాసం, మమ్ములనుగ్రామవాసులుగా చేయలేదు సరికదా, సంయుక్త వికాసానికి వారిలో ఒకరము అయాము అని చెప్పలేను. ఇకపోతే, ప్రశిక్షణను, అక్షరాలను చదువను వ్రాయను నేర్పడంతో ప్రారంభింపరాదని నా గట్టినమ్మకం. చరిత్ర, భూగోళం మౌఖిక గణితం (నోటిలెక్కలు) చేతిపని (రాట్నం వడకుట అనుకోండి) వీటి ప్రాథమిక జ్ఞానంలేనిదే అక్షరాలు అనవసరం. కదురు ఎలా తయారయింది తెలియజెప్పండి. పిల్లలకు ప్రతి మాట వెనుక తర్కం బోధపడితే, అన్నీ అర్థం అవుతాయి. ఉదాహరణకు కదురుతో మొదలై రాట్నం చక్రం తయారీ, ప్రత్తిపంట చరిత్ర, విశ్వనాగరికతతో దానికిగల అనుబంధం, వగైరాలను తెలియజెప్పిన తర్వాత పాలానికి వెళ్ళి, 'తక్లీ'కి (రాట్నరహితమైన కదురు) చుట్టుకున్న దారాలలెక్కలు, దారం గట్టితనం సమతౌల్యం గుర్తించడం

నేర్పినపుడు, ఏకాగ్రతతో చూడడం వినడంతో బాటు చేతులు కూడా ప్రశిక్షితాలు అవుతాయి. దీనికి ఆరునెలలు చాలును. ఇప్పుడు అక్షరాలు తరువాత చిత్రాలను గీయడం నేర్చుకుంటాడు. నా చిన్నతనంలో అక్షరాలను నేర్చుకోడంలో నాకు కలిగిన బెడదను ఇంకా గుర్తుంచుకుంటాను. వ్రాయుట ఒక కళ. చదువుకు ప్రారంభంలో వీటిని పెట్టి, వారి సృజనాత్మకతను అంతం చేస్తున్నాం. ఇదీ అసమయంలో అక్షరాలను దిద్దమని పిల్లలను బలవంత చేస్తే కలిగే పరిణామం.

నగర పాఠశాలల సంగతి ఆలోచించాలి. గ్రామాల పునరుజ్జీవనం జరగాలి. అవి పట్టణాలకు తోకలై ఉండరాదు. నగరాలు వాటిని కొల్లగొట్టి వికసిస్తున్నాయి. నగరాలు, పల్లెల నుండి తాము పొందిన సౌకర్యాలకు తగిన చెల్లింపులు చేసిననాడు, రెండూ ఆరోగ్యంగా ఉంటాయి. నగరవిద్యార్థులు ఈ సద్భావనా ప్రక్రియలో పాల్గొనేందుకు తగిన విద్యాబుద్ధులునేర్చి ఉండాలి. గ్రామీణులకుపయుక్తమైన వృత్తులు నేర్చుకోవాలి. నాకు తెలిసిన మేరకు, ప్రత్తి (నూలు) మిల్లుల విషయాలు గింజలు తీయడం, ప్రత్తిని శుభ్రం చేయడం నూలు ఉత్పత్తి, ఈ పరీక్షలో తక్కిన వాటితో పోలిస్తే మిన్నగా నిలబడతాయి. గ్రామాలలో ప్రత్తి ఉత్పత్తి జరుగుతుంది. పట్టణాలలో బట్టతయారవుతుంది. మిల్లులలో ఆది నుంచి అంతం వరకూ ప్రత్తిని మార్చే విధాన శృంఖలాలు, మానవుల పదార్థాల యాంత్రిక శక్తిపరమైన వ్యర్థ పరత్వానికి ప్రతీకలై నిలుస్తాయి. అందుచేత ప్రాథమిక విద్య గ్రామాలలోని చేతి పనులతో (వడకుట, చుట్టుట, ఏకులు చేయుట మొదలైనవి) ఆరంభిస్తే, సామాజిక విప్లవం సాధ్యమవుతుంది. దీని శుభకర ఫలితాలు అనంతం. గ్రామాలకూ, పట్టణాలకు మధ్య నున్న, నేటి వైమనస్యాలు అంతమై, ఆరోగ్యకరమైన వాతావరణం ఏర్పడుతుంది. కలిమి, లేముల అంతరాలు గతించి అందరికీ కూడూ, గుడ్డా దొరుకుతాయి. వర్గవైషమ్యాలు రక్తపాతాలు సంపత్తి వినియోగాలు (యుద్ధాలకు) గత చరిత్రగా మారి, అందరికీ స్వేచ్ఛ, సుఖం, శాంతీ దొరుకుతాయి. యాంత్రిక వికాసంతో ఇది సాధ్యంకాదు. ఇట్టి విద్యావిధానంవలన విదేశాల సాంకేతిక సహకారం కొరకు

ఎదురుచూడడం తగ్గుతుంది. ఎంతో వికసించిన బుద్ధిమంతులు ఎప్పుడు వస్తారా అని కనిపెట్టుకొని ఉండడంతగ్గి, గ్రామీణులు స్వావలంబులౌతారు. మరి మార్గమేది? ఎలా ప్రారంభించాలి? నగర వాసులు నా సలహాను పాటిస్తారా? లేక అడవిలో అరుపులేనా నావి? నగరాలలో ఉండే విద్యావేత్తలు దీనికి సరియైన సమాధానం చెప్పి, మార్గ దర్శకులుకావాలి. నేను కాదు. నిర్బంధ ప్రాధమిక విద్యతోబాటు వృత్తివిద్య ఉండాలి.

*(హరిజన్ 9-10-37. పుట 292)*

★ ★ ★

విశ్వవిద్యాలయ విద్యాపీఠాలు, గ్రామాలకు వెళ్లి ఉంటే వారి సమస్యలు వీరికి తెలుస్తాయి. గురువు కూడ ప్రశిక్షితుడయి,సేవాగ్రాంలో వలె, గ్రామీణులతో కలిసి మెలిసి ఉంటాడు. నగరాలలో ఇది జరుగదు. గిరిగీసుకొని ఉంటే ఏమీ తెలియదు.

ప్రాధమిక విద్యలో ముందు వృత్తి విద్య (-రాట్నం. కదురు) (ఉలి, అంపం- వీటి తయారీ వగైరా ప్రత్తి ఎలా ఉత్పత్తి అవుతుంది. వగైరా) నేర్పి. వ్రాయను, చదువను తరువాత నేర్పాలి. నోటి లెక్కలు చెప్పాలి. బాలుని సర్వతోముఖ పరిజ్ఞానాన్ని ప్రశ్నలు జవాబుల ద్వారా పెంచాలి.

*(హరిజన్ 5-6-37. పుట 130)*

★ ★ ★

ఏ వృత్తి విద్య మంచిది అనే ప్రశ్న లేదు. ప్రత్తిపంట గింజలు తీయడం, ఏకులు చేయడం, రాట్నం, కదురు, మగ్గం, బట్టలనేత, అన్నీ ముఖ్యమే. తమ పరిసరాల జ్ఞానం ఏర్పడిన తర్వాత రాష్ట్రం, దేశం, దేవుడు, ధర్మం అన్నీ క్రమంగా వస్తాయి.

ఇది ఒక నిశ్శబ్ద సంస్కరణ. వర్గ, వైషమ్యాలు కలవారు లేనివారు వంటి తారతమ్యాలు గత చరిత్ర అవాలి.

*(హరిజన్ 9-10-37. పుట 293)*

★ ★ ★

వృత్తి విద్య నేర్చిన వాడు, స్వావలంబన కలిగి బ్రతుకగలడు.

*(హరిజన్ 5-6-37 పుట 131)*

★ ★ ★

పనిముట్లు వాడిన చేయి, బాగుగా వ్రాయగలదు.

*(హరిజన్ 28-8-37 పుట 225)*

★ ★ ★

నయీతాలీం ఆశయం పిల్లలను ఆదర్శ గ్రామీణులుగా చేయడమే దానిని వారి కోసం తయారుచేశాం. శరీరం, బుద్ధి రెంటినీ వికసింపజేసి, తన ప్రదేశాన్ని నందనవనం చేయాలనే కోరిక వారిలో కలుగజేయడం. దాని లక్ష్యం.

*(నిర్మాణాత్మక కార్యక్రమం 1961 పుట 18)*

★ ★ ★

పుస్తకాల వలననే బుద్ధి వికాసం కలుగుతుంది అనుకోడం భ్రమ.

*(హరిజన్ 9-1-37, పుట 386)*

★ ★ ★

పనిముట్లను చూపి వాటి ఉపయోగం, తయారీ గురించి చెప్పి వృత్తి విద్య నేర్పిన తర్వాత ఆ విద్యార్థి రాణిస్తాడు ఆ విద్యలో తక్కిన జ్ఞానం అంతా ఆనుషంగికంగా వస్తుంది.

*(హరిజన్ 18-9-37. పుట 261)*

★ ★ ★

పుస్తకాల చదువు నైతికతను పెంచదు. ధార్మికతకు నైతికతకు సాక్షరతకు సంబంధంలేదు.

*(యంగ్ ఇండియా. 1-6-21, పుట 172)*

★ ★ ★

విద్యార్థులు మనోబలంకలిగి విద్యను నేర్చుకోవాలి. లేనినాడు మైనపు బొమ్మలై కరిగిపోతారు.

*(యంగ్ ఇండియా 12-7-28. పుట 236)*

★ ★ ★

విద్యావిధానకేంద్ర బిందువు గ్రామాల్లోని చేతి పనులలో ప్రశిక్షణ కావాలి. ఇప్పటి చదువు బుద్ధిని భ్రష్టు చేస్తున్నది. ఏదో విధంగా విద్యను బుర్రలో క్రుక్కడం, సరియైన పద్ధతికాదు ఆది నుంచి వృత్తి విద్యలను నేర్పి తద్వారా క్రమబద్ధమైన బుద్ధివికాసం కలుగుజేస్తే బౌద్ధిక ఆధ్యాత్మిక బలం నిలుస్తుంది. నా పద్ధతి ప్రకారం కళ్లు అక్షరాల ఆకారాలను గమనిస్తాయి. చెవులు ఆపేర్ల ఉచ్చారణని వింటాయి. అర్థాలను గ్రహిస్తాయి. ఈ విధంగా ఇది చాల చవకైన విద్యావిధానం. పిల్లలు వ్రాసే ముందు త్వరగా చదువుతారు నేను ఇప్పటికీ చేస్తూన్న అక్షరాల వికృత శిల్పాలు (మాగురువులదయ) వారికి ఉండవు. నా మదిలో రూపొందిన పాఠశాలలు ఇప్పటి వాటి కంటే ఎన్నో రెట్లు మెరుగై త్వరగా చదివే సామర్థ్యాన్ని వ్రాయగలిగే పటిమను విద్యార్థులకు చేకూరుస్తాయి. ఇట్టి విద్యా విధానానికి స్ఫూర్తి గ్రామాల నుంచి వచ్చింది. స్వరాజ్ ఏర్పాటు చేయదలచిన కాంగ్రెస్ వాదులు తమ పిల్లల భవిష్యత్తును గాలికి వదలరు. అనాలోచితంగా విదేశీయుల పాలన పిల్లల చదువును స్పృశించింది. ప్రాధమిక విద్య, గ్రామాలకు పట్టణాలకు సంబంధంలేకుండా తయారుచేశారు. బేసిక్ (మౌలిక) విద్య ఈ సంబంధాలను జోడిస్తుంది. తన మట్టిని ప్రేమించేటట్టు, దేశభవిష్యత్తును ఉజ్జ్వలం చేసేటట్టు విద్యార్థులను తయారు చేస్తుంది. చేతిపని వారి వృత్తులను విజ్ఞానాత్మకంగా నేర్పిస్తే విద్యార్థులకు బుద్ధి వికాసం త్వరగా కలుగుతుంది. పరికరాల వాడుకగురించి చెప్పిన వెంటనే వారు అల్లుకుపోతారు. బుద్ధి వికసించి నిరుద్యోగ సమస్య తీరి సుఖపడాలంటే విద్యార్థులు సామాన్య కార్మికుల (పనివారు) తో మమేకం కావాలి. ఎన్నో విషయాలను కూరిపెడితే, బుద్ధివికసించదు. కాయకష్టాన్ని పిల్లలు ముఖ్యాధ్యయన విషయం చేసుకొని, బుద్ధిని పెంచుకోవాలి ఏదైనా వృత్తి విద్యను నేర్పాలి. దాని చుట్టూ బుద్ధి, శరీరం చేతి వ్రాత, కళాత్మకత వగైరాలు పరిభ్రమిస్తాయి గొంతు శ్రుతికలపడం, చేతిని చక్కబరుస్తుంది. వ్యాయామం చేతిపనులు డ్రాయింగు, సంగీతం కలిసి ఉంటే విద్యార్థుల ఉత్తమత ఉబికి వస్తుంది. చదువులో వారికి అభిరుచి కలుగుతుంది. ఈనాటి విద్యార్థులు

తాము నేర్చినదంతా మరచిపోతే కలిగే నష్టం, కోట్లాది మందిని ఆవరించి ఉన్న అజ్ఞానాంధకారం ముందు చాలతక్కువ. దీనితో స్వావలంబులై సరియైన విద్యను నేర్చి ఉంటారు. ఈ విద్యావిధానంలో స్వయం పోషకత్వం అప్రధానం. పిల్లలు స్వావలంబులైతే అది ఆనుషంగికం. రోజుకి మూడు గంటలు పని చేస్తే స్వయం పోషణ సాధ్యమైననాడు, వికసిత మనోవృత్తి ఇంకెంతో మేలును చేకూరుస్తుంది. ఇంగ్లీషు భాషవిశ్వవిఖ్యాతం. కనుక దాని చోటు ఐచ్ఛిక భాషగా విశ్వవిద్యాలయలలో మాత్రమే. ఇంగ్లీషులేనిదే బ్రతుకలేము అన్నది, మానసిక బానిసత్వం. ఇంగ్లీషు సాహిత్యం లోని అందాలు మనకు వద్దు. మనకావ్యాలు మన ప్రకృతి వర్ణనలు మనకూ ఉన్నాయి. (గొప్పవయినా, తక్కువయినా) మన వారసత్వం మనది. మన భాషాంతరీకరణలతో ఆయా సాహిత్యాల అందాలను ఆస్వాదించుదాం. రవీంద్రకవి, అనుపమేయకావ్యధార అవగతం కావాలంటే బెంగాలీ నేర్చుకోవాలా? టాల్‌స్టాయి కధానికలు అర్థం కావడానికి రష్యను భాషలో ప్రావీణ్యం ఎందుకు? ప్రపంచంలోని ఉత్తమ, ఉత్కృష్ట సాహిత్యాలు వారంరోజులలో ఇంగ్లీషులోనికి అనువదింపబడతాయట. మిల్టన్ షేక్స్‌పియర్ ఆలోచించినది, వ్రాసినది తెలిసేందుకు ఇంగ్లీషు నేర్వడమెందుకు? ధార్మికత, నైతికత, భిన్నములు. అన్ని ధర్మాల నైతికత ఒక్కటే. నామరహిత ధార్మికత నా ఆశయం. పేర్లలో ఏమీలేదు. ప్రభుత్వ పరమైన ధార్మికత మనకు వద్దు. అటువంటిధార్మికత నేతిబీరకాయ ధార్మిక బోధన. ప్రభుత్వపరమైన పాఠ్యాంశంగా ఉండవచ్చునా? భిన్న ధర్మాల బోధనకు వేరువేరు పాఠశాలలు ఉండాలా? లేక ఈ అంశముధార్మిక సంస్థల చేతిలో ఉండవలెనా? ప్రభుత్వం వారికి సహాయం చేయవచ్చునా? ధర్మమనేది వ్యక్తిగతం గనుక ప్రభుత్వం దీనికి దూరంగా ఉండాలి. అయితే ప్రభుత్వ పాఠశాలలో సర్వ సమానమైన నైతిక బోధన ఉండవచ్చు. విద్యార్థులకు అన్ని ధర్మాల పట్ల గౌరవం ఉండాలని బోధించాలి. దీనితో వారికి తమ ధర్మం పట్ల అభిమానం పెరుగుతుంది. ఈ సందర్భంగా భాష్యాలు సమతౌల్యంగా ఉన్నవి. నిష్పక్షపాతమైన వాటినే అధ్యయనం చేయడం ఉత్తమం.

నిజమైన విద్య పిల్లల ఔన్నత్యాన్ని వెలికితీయాలి. అనవసరమైనవి చొప్పించకూడదు. వారి వ్యక్తిత్వం నశించి యాంత్రికత ఏర్పడుతుంది. స్వయం పోషకత్వానికి పారిశ్రామిక విద్య మొదటి మెట్టు దీనితో స్వావలంబులౌతారు. కాయకష్టం అవమానకరం అనే ఆలోచనను అంతం చేసి శ్రమశక్తినిగుర్తించి తమ చదువుకు చెల్లింపులను (ఎంతోకొంత) కష్టపడి చేసిన సంపాదనతో అమెరికాలో వలె చేయాలి. ... అమెరికా ఇలా చేస్తున్నదీ అంటే మనకు ఈ పద్ధతి అవసరం. బీదవిద్యార్థులకు ఉపాధి కల్పన చేయాలి. దానధర్మాలు చేయరాదు. తమ చేతితోపని చేసుకుంటే అవమానం అనే భావన పూర్తిగా నశించాలి. దీనివలన భౌతికమైన దానికంటె మానసిక నష్టం ఎక్కువ. ఉపకారవేతనాలతో చదువుసాగింది అని గుర్తుకురావడం, మనోవేదనను కలిగిస్తుంది. దీనికి విపర్యయంగా ఈ విద్యా విధానం మేము కష్టించి ధనార్జన చేసిన నాడులభ్యమయితే ఎంత బాగుండి ఉండును అని తలచుకోడం గర్వకారణం. కాలేజీ విద్యను సంస్కరించి జాతీయావసరాలకు తగినట్లుగా తీర్చి దిద్దాలి. మెకానికల్ ఇంజనీర్లు ఇతర ఇంజనీర్లు, ఆయా పరిశ్రమలకు సంబద్ధులై ఉంటారు. ఆ సంస్థలు వారి చదువుకి అయ్యే ఖర్చును భరిస్తాయి. ప్రభుత్వాధీనంలో టాటాసంస్థ ఇంకా ఇతర మిల్లు బృందాలు తమ కాలేజీలను నడుపవచ్చును. కామర్సు కూడ ఆ విధంగా చేయవచ్చును. కళలు - సాహిత్యం, వైద్య విద్య (మెడిసిన్) వ్యవసాయం మిగిలి ఉంటాయి. అనేకములైన సాహిత్య కళాశాలలు వ్యక్తిపరమైనవిస్వయం పోషకాలు. ప్రభుత్వపరంగా ఏకాలేజీలు ఉండవు. వైద్య కళాశాలలు, వైద్య శాలలకు అనుబంధితాలవుతాయి. ధనికుల సహాయంతో నడిపించబడుతాయి. వ్యవసాయ కళాశాలలు కూడ నిజంగా తలుచుకుంటే, స్వయం పోషకాలు కాగలవు. కొందరు వ్యవసాయ విద్యా పట్టభద్రుల్ని గమనించాను. వారికి వచ్చినది దాదాపు శూన్యం. అనుభవం అసలే లేదు. కొర్రు, కంపలకుతేడా తెలీదు. వ్యవసాయ ఫారములకు అనుబంధంగా వీరు పని చేస్తే, ఉభయత్రా ఉపయోగం. ఆఫారములు స్వయం పోషకాలు అయి ఉండాలి. ఈ పట్టభద్రులకు అనుభవం వస్తుంది.

రాష్ట్రాలకు తమ విశ్వవిద్యాలయాలు, ఉండాలని గట్టి కోరిక ప్రాంతీయ భాషలకుఒక్కొక్క దానికి ఒక్కొక్కటి ఉండాలిట. ఈ ప్రాంతాల ప్రజలు పూర్తిగా విద్యావంతులైన నాడు, ఈ కోరిక సమంజసమే. అనుకున్నది తక్షణం కావాలనే తపన మనది భాషారాష్ట్రాల ఏర్పాటు మొదటి మెట్టు. ఆయా ప్రభుత్వాలు అంతకు ముందు లేని ప్రదేశాల్లో విశ్వవిద్యాలయాలను ప్రారంభించవచ్చును. వాటికి ఆధారంగా పాఠశాలలు కాలేజీలు ఉండాలి. వాటిలో విద్యాబోధన ఆయా భాషలలో జరగాలి. అక్కడ నుంచి విశ్వవిద్యాలయాల్లోకి ప్రవేశం ఉండాలి. అది సరియైన నిర్మాణం. గట్టిపునాది ఉంటే కట్టడం పది కాలాల పాటు నిలిచి ఉంటుంది.

రాజకీయంగా స్వతంత్రులమైనాము. కాని పాశ్చాత్య ధోరణులు వెన్నాడుతున్నాయి. పాశ్చాత్య దేశాలనుండి మాత్రమే విద్య లభిస్తుంది అనే వారితో నేను వాదించను. అదేవిధంగా పాశ్చాత్యులలో ఏదీ మంచిది కాదు అని కూడా అంగీకరించను. సరియైన నిర్ణయాన్ని తీసుకోవాలి. విదేశీయుల నుండి విముక్తి లభించినది కనుక, విదేశీభాష విదేశీ ఆలోచనలనుండి కూడ విముక్తిలభించిందని ఎవరూ అంటారనుకోను. క్రొత్త విశ్వవిద్యాలయాలను ప్రారంభించేముందు కొంచెం ఆగి పూర్తిగా శ్వాస తీసుకొని ప్రాణవాయువుతో నింపి, అప్పుడు ముందుకి అడుగేస్తే బాగుంటుంది? విశ్వవిద్యాలయాలకు భవంతులు వెండి, బంగారాలు, సంపదలు ఎందుకు? వీటిని చేర్చడం అనవసరం. దానికి కావలసినది వివేకవంతమైన ప్రజాభిప్రాయం. కావలసినంత మంది ఒజ్జలు ఉండాలి. దాని సంస్థాపకులు భవితలో ద్రష్టలై ఉండాలి.

నా అభిప్రాయంలో ప్రజాస్వామ్య ప్రభుత్వం విశ్వవిద్యాలయాల స్థాపనకు ఖర్చు చేయరాదు. ప్రజలకు కావలిస్తే వాళ్లే ధనం సమకూరుస్తారు. అట్లు స్థాపితమైన విశ్వవిద్యాలయాలు దేశానికి వన్నె తెస్తాయి. విదేశీయుల పరిపాలనలో ప్రతిదీ పైనుండి రావాలి గనుక క్రమంగా ఆధారపడడం అనే దానికి అలవాటు పడతారు. ప్రజల అభీష్టం ప్రకారం ఏర్పడినవి క్రిందనుంచి పైకి వెళతాయి గనుక స్థిరంగా ఉంటాయి. బాగుంటాయి. బలాన్నిస్తాయి. మంచి మట్టిలో పడిన గింజ ఎలా ఫలిస్తుందో, ప్రజాస్వామ్య పద్ధతిలో

ఖర్చయిన ప్రతిపైసకు పదిరెట్లు ఫలితం ఉంటుంది. విద్యాభివృద్ధి ఇతోధికంగా జరుగుతుంది. విదేశీయులు స్థాపించినవి విపరీత దిశలో వెళ్లాయి. ఇంకో పద్ధతి అనూహ్యం కదా కనుక క్రొత్త విశ్వవిద్యాలయాలను స్థాపించడంలో ఆచితూచి అడుగు ముందుకు వేయాలి. విశ్వవిద్యాలయ విద్యను నయీతాలీంతో సమన్వయ పరచి దేశసేవను చేయగల వారిని తయారు చేయాలి.

*(హరిజన్ 25-8-46 పుట 283)*

★ ★ ★

విశ్వవిద్యాలయ పాఠశాలల విద్యను సంస్కరించాలి. ఇంజనీరింగు కామర్సు, మెడికలు, అగ్రికల్చర్ వగైరా కాలేజీలను ఆయా పరిశ్రమాధిపతులు సంరక్షించాలి. ఆర్ట్స్ కాలేజీలు ప్రైవేటు రంగంలోనే ఉండాలి.

*(హరిజన్ 31-7-37 పుట 197)*

★ ★ ★

దేశంలో ఇన్ని విశ్వవిద్యాలయాలున్నాయి. ప్రతి ప్రాంతీయ భాషకీ ఒకటి కావాలి అంటున్నారు. అయితే విశ్వవిద్యాలయము శిఖరాగ్రం. అడుగున తగినన్ని విద్యాలయాల బలం ఉండాలి.

మనకింకా విదేశీయమంటే మోజు పోలేదు. పెద్ద హర్మ్యాలు లేకుండా ప్రజాశక్తితో తగుమంది ఉపాధ్యాయులతో ఇవి శోభిల్లాలి. ప్రభుత్వం వీటికి ద్రవ్యం సమకూర్చదు. విదేశీ పాలనలో పైనుంచి క్రిందికి దిగిన నిర్ణయాలు మన వారి పాలనలో క్రిందనుంచి పైకి జరగాలి. దీని ఫలితం పదిరెట్లు ఉంటుంది. కనుక జాగ్రత్తగా ఆలోచించి ముందుకు పోవాలి.

*(హరిజన్ 2-11-47, పుట 392)*

★ ★ ★

మన పిల్లలు విదేశాలకు పోయి తిరిగి వచ్చిన తర్వాత మనతో ఇమిడిపోలేరు. కనుక ఇక్కడే ఉండి అన్నీ నేర్చుకోవాలి. ఇదే వారికి బలవర్ధకం.

*(హరిజన్ 8-9-46, పుట 308)*

★ ★ ★

చదువుట, వ్రాయుట, గ్రామీణులకక్కరలేదు. వారి దైనందిన జీవితాల్లో ఉపయోగపడే విషయాలు చెప్పాలి. వారు వాటి నుపయోగించాలి. వారు స్వేచ్ఛగా, నచ్చినతర్వాత వాటిని వాడుక చేయాలి. నేడు వారి వద్దనున్నది ఏమిటో వారికి తెలియదు. వారికది నచ్చదు. గ్రామానికి సంబంధించిన భూగోళము, గణితము, చరిత్ర సాహిత్యంలోని వాడుక భాగము (అంటే ఉత్తరాలు వ్రాసేందుకు చదివేందుకు ఉపయుక్తమైనది) గా పాఠాలు చెప్పాలి. దైనందిన కార్యకలాపాలకు ఉపయోగపడని పుస్తకాలు వాళ్లకు అక్కర లేదు

*(హరిజన్ 22-6-40 పుట 173)*

★ ★ ★

సంగీతం ప్రాథమిక విద్యలో భాగం కావాలి. పనిముట్ల క్రమబద్ధమైన కదలికలో సంగీతం ఉంది.

*(హరిజన్ 11-9-37 పుట 250)*

★ ★ ★

వివేకవంతుడైన తండ్రి అప్పుడప్పుడు పిల్లలు తప్పు చేసి దిద్దుకుంటే మంచిది అంటాడు. ఒకసారి కాలితే ఆ అనుభవం గుర్తుంటుంది

*(మహాత్మాగాంధీ ఆఖరు ఘట్టం 1, (1956) పుట 44)*

★ ★ ★

నేటి హైస్కూలు విద్య (ఇంగ్లీషును మినహాయించి) కు సమానమైన నయీతాలీం మనకు అవసరం .

*(హరిజన్ 31-7-37 పుట 197)*

★ ★ ★

నయీ తాలీం నేర్చినవాడు ఆత్మనిర్భరత కలిగి ఉంటాడు.

*(హరిజన్ 11-6-38, పుట 143)*

★ ★ ★

ఇంగ్లీషును విశ్వవిద్యాలయాలలో నేర్పండి

*(హరిజన్ 25-8-46 పుట 284)*

★ ★ ★

ఇంగ్లీషు అంటే నాకు చాల ఇష్టం. 'హరిజన్' పత్రికయే దృష్టాంతం. కాని మనకు దాని అవసరం లేదు.

*(హరిజన్ 9-7-38, పుట 177)*

★ ★ ★

ప్రభుత్వం ధార్మిక విద్యను నేర్పలేదు. అది మత సంస్థలపని మనకు కావలసినది నైతిక సంపద.

*(హరిజన్ 23-3-47 పుట 76)*

★ ★ ★

ధార్మిక విద్యకు ప్రభుత్వం సహాయం చేయరాదు. ఆదేశంలో ఒకే మతం ఉన్నా నానిర్ణయమదే.

*(హరిజన్ 16-3-47, పుట 63)*

★ ★ ★

ఇతర ధర్మాల మూలసూత్రాలను పాఠ్యాంశం చేయడం వలన పరమత సహిష్ణుత ఏర్పడి, సద్ధర్మ బోధ కూడ ఎక్కువవుతుంది.

*(యంగ్ ఇండియా 6-12-28 పుట 406)*

★ ★ ★

రాశిని పెంచి వాసిలేకుండా విద్యను చేయవద్దు.

*(హరిజన్ 1-12-33 పుట 3)*

★ ★ ★

పాఠశాలలు స్వయంపోషకాలు కావాలి. పారిశ్రామిక సంస్థలు అమెరికాలో వలె విద్యార్థుల కౌశల్యాన్ని ఆదుకోవాలి. అంతటి అభివృద్ధి చెందిన దేశంలో విద్యార్థులకు ఆత్మ నిర్భరతను నేర్పుతున్నారు. దాన, ధర్మాలు ఉపకారవేతనాలు గుదిబండలై ఉండిపోతాయి. నయీతాలీంలో వృత్తి విద్యావిధానంవగైరా ఈ దిశలో మొదటి మెట్టు.

*(యంగ్ ఇండియా 2-8-28. పుట 259)*

★ ★ ★

## అధ్యాయము 77

# విద్యామాధ్యమం

మన విద్యా విధానము లోపభూయిష్టము. ఇంగ్లీషు రానిదే గుర్తింపు లేదు అనుకోడం తప్పు. విద్యను నేర్పేమాధ్యమం ప్రాంతీయ భాష అయి ఉండాలి.

*(హరిజన్ 9-7-38, పుట 177)*

★ ★ ★

విదేశీ భాషలో చదువు మన పిల్లలను బౌద్ధికంగా శారీరికంగా క్రుంగ దీస్తున్నది. అలసి, ఎందుకూ పనికిరాకుండా ఉన్నారు. ఇంగ్లీషులో విద్య నేర్చిన మనకు వారి కష్టం తెలియదు. సమన్వయం కుదరదు. చదివిన వారికీ చదువని వారికీ మధ్య పెద్ద అగాధం ఏర్పడుతుంది.

*(విద్య 1962 పుటలు 12-13)*

★ ★ ★

మన పిల్లలను అయ్యవార్లను చేయబోతే కోతులు అనే పరిస్థితులలో చూస్తున్నాము. రామమోహన్ రాయ్, లోకమాన్యతిలకు ఇంగ్లీషులో ఆలోచించి వ్రాయవలసిన పరిస్థితిలేకుంటే ఇంకా ఎంత గొప్ప వాళ్లు అయ్యే వారో

*(యంగ్ ఇండియా 27-4-21, పుట 130)*

★ ★ ★

యువకులు ఉద్యోగాల నిమిత్తం యువతులు పెండ్లిండ్ల కోసం ఇతరులు సమాజంలో హోదా పేరు ప్రఖ్యాతుల కోసం ఇంగ్లీషు వెంటపడుతున్నారు.

*(యంగ్ ఇండియా 1-6-21 పుట 177)*

★ ★ ★

ఇంగ్లీషు మాధ్యమంలో విద్య నేర్చినవారు, అటు విదేశాలలో చెల్లరు, ఇటు తమ వారిలో ఇముడరు.

*(యంగ్ ఇండియా 1-9-21 పుట 277)*

★ ★ ★

విదేశీ పాలన వలన కలిగిన నష్టాలలో ఇది చాల పెద్దది. శక్తినశించి తన వారికి దూరమై విద్యను అందరికీ అందుబాటులో లేనంత వ్యయం చేస్తే గాని, రానిదిగా చేసింది. దీనితో భారతీయాత్మ చచ్చిపోతున్నది. ఈ మంత్రజాలం నుంచి తప్పుకోకపోతే ప్రజలు బాగు పడరు.

*(యంగ్ ఇండియా 5-7-28 పుట 224)*

★ ★ ★

విద్యను మన దేశానికి సంబంధించన దానినిగా చేయడంలో దోషాలు రోజురోజుకీ బయట పడుతున్నాయి. ఇంగ్లీషురానిదే బోసుగారు కాలేరు అని దురభిప్రాయం మనలో బలపడుతున్నది. దీనిని మించిన అంధవిశ్వాసం మరొకటి లేదు. ఏ జపానీయుడూ మన వలె ఇటువంటి అసహాయతను పెంచుకోటం లేదు. బోధనా మాధ్యమం వెంటనే మారాలి. ఏమైనా సరే ప్రాంతీయ భాషనే మాధ్యమంగా చేయాలి. ఉన్నత విద్యలో అలజడి వచ్చినా ఫరవాలేదు. రోజూ పెరిగే వ్యర్థం ఘోరమైన నేరం అవుతుంది. విదేశీభాషలో విద్యను అభ్యసించడం పెద్ద భారం. దానిని మోసిన తర్వాత విద్యార్థులు తోటకూర కాడల్లా జవసత్వాలు లేకుండా వాలిపోతున్నారు. అటు తర్వాత అలసిన వారు మౌలికంగా ఏమీ పరిశోధించలేకపోతున్నారు. ఆలోచన కూడా కుంటుపడుతున్నది. అనుకరణతో హాస్యాస్పదులౌతున్నారు. కనుకనే క్రొత్త ప్రణాళికలు మనసమస్యలకు పరిష్కారం కనబడుట లేదు. ఓపిక, ధైర్యం, పట్టుదల, భయరాహిత్యం అన్నిటికీ కొరత ఏర్పడింది. ఎలాగో తంటాలు పడి ప్రణాళికను తయారు చేసినా అమలు పరచటం లేదు.

కొద్దిమంది బుద్ధిమంతులు, చిన్నతనంలో చనిపోతున్నారు...ఆంగ్ల మానసపుత్రులమైన మనము ఏ మేరకు దేశవాసులను అర్థం చేసుకొని ఆదుకుంటున్నాం అంటే జవాబు దొరకదు. విద్యాలయం అనేది ఇంటి తర్వాత ఇల్లు కావాలి. రెండుచోట్లా చెప్పిన వానిలో సమన్వయం ఉండాలి. అప్పుడే ఫలితాలు శ్రేష్ఠంగా ఉంటాయి. విదేశీ భాషలో చదువు ఈ సమన్వయాన్ని భంగపరుస్తుంది. ఈ సంబంధసమన్వయం చెడగొట్టేవారి

అభిప్రాయాలు ప్రగతి కారకాలేమోగాని అవి ప్రజలకు హానికారకాలు ఈ పద్ధతిలో స్వయంగా చిక్కి ఊయలలూగే అభాగ్యులు. మాతృద్రోహం చేసిన వారితో సమానులు. ఈ హాని ఇంతటితో ఆగదు. ఇంకా ముందుకు పోయి మనలో వైమనస్యాలను సృష్టిస్తుంది. మనకు అబ్బిన ఇంగ్లీషు విద్య అట్టి వారిని కుంఠితులుగను క్షుభితులుగను శక్తిహీనులుగను అనుకరణ ప్రియులుగను చేస్తున్నది. ప్రాంతీయ భాషలనుతృణీకరించి బ్రిటిషు వారు జన్మజన్మలకు తీరని అపకారం చేశారు. ఇంగ్లీషురచనలలోని ప్రత్యేకతలు మనకు ప్రాంతీయభాషల ద్వారా లభ్యం అయితే మనకు ఎంతో గౌరవం. ఏ దేశమూ అనుకరణ చేసే వారి దేశము అనిపించుకోడానికి ఇష్టపడదు. ఇంగ్లీషు చదువెందుకు? వ్యాపార, రాజకీయ లబ్ధికి యువతులు ఇంగ్లీషు వారితో ఇంగ్లీషులో మాట్లాడాలని ఇంగ్లీష్‌ను నేరుస్తున్నారు. అనేక మంది భర్తలు ఇంగ్లీషులో తమ భార్యలు మాట్లాడలేరని కించపడుతున్నారు. కొన్ని కుటుంబాలు ఇంగ్లీషునే తమ మాతృభాషగా చేసుకుంటున్నాయి. అనేకమంది యువకులు, ఇంగ్లీషు నేర్వనిదే దేశ స్వాతంత్ర్యము మృగ్యమనుకుంటున్నారు. ఈ రుగ్మత ఇంగ్లీషు కానిది విద్య కాదు అనే వరకువచ్చింది. ఇది బానిసత్వానికి దిగజారుడుకి గుర్తు. ప్రాంతీయ భాషల అణచివేతను నేనుచూడలేను. భర్తలు భార్యలకు తలిదండ్రులు పిల్లలకు తమ మాతృభాషల్లో గాక ఇంగ్లీషులో వ్రాయుట భరించలేకున్నాను. విదేశీమాధ్యమం బుద్ధికి బాధకలిగిస్తుంది. పిల్లలను కలవర పెడ్తుంది. బట్టీరాయుళ్లు అనుకరణచేసే వారు అయిపోతున్నారు వాళ్లు. వారు నేర్చినది వారి మౌలికత్వానికిగాని సామాన్యజనులకు గాని పనికిరాదు. మనదేశంలో వారు విదేశీయులయినారు. ప్రస్తుత విధాన స్వారస్యమిదే. మన భాషలు పెరుగవు. నేనే నిరంకుశుడనైతే ఈ రోజుననే విద్యార్థులకు విదేశీ మాధ్యమంలో విద్యాబోధనను ఆపి ప్రొఫెసర్లను ఉపాధ్యాయులను వెంటనే మార్చకపోతే బర్తరఫు అవతారని హెచ్చరిస్తాను. పాఠ్య పుస్తకాల తయారీకోసం ఆగను. ఆ మార్పును వారే గ్రహిస్తారు. దానిని అనుసరించి ముందుకు పోతారు. ఈ రుగ్మతకిదే కుఠారచికిత్స. చరిత్రలో ఈ మచ్చ శాశ్వతంగా ఉండకుండా పోడానికి

జీవనకాలం పెరుగుదలకు చెప్పలేనంత ఎక్కువైన అపవ్యయానికి ఇదే చికిత్స. ఎంత త్వరగా విదేశీమాధ్యమం ద్వారా విద్య మానివేస్తే అంత దేశానికీ ప్రజలకూ, విద్యార్థులకూ మంచిది.

*(యంగ్ ఇండియా 5-7-28 పుట 226-228)*

★ ★ ★

## అధ్యాయము 78

# విద్యార్థులకు

మీ వ్యక్తిత్వము మీలో నుంచి ఉత్పన్నమవాలి.

*(గాంధీజీతో 1928, పుటలు 89-90)*

★ ★ ★

సత్యం, పవిత్రత తక్కినవాటికన్నిటికంటె జ్ఞానము, వివేకము విద్వత్తు విద్యాకౌశల్యము మిన్న. నేడు కలుషితమైన వాతావరణము మీ ముందు రాజ్యం చేస్తున్నది. మీ చదువును జీవితంలో వాడుకొననినాడు అది వ్యర్థం.

ఉపాధ్యాయులు చదువుతో బాటు సత్యం, పవిత్రత గురించి తెలియజెప్పాలి.

*(యంగ్ ఇండియా 21-2-29 పుట 58)*

★ ★ ★

**విద్యార్థులు సెలవుల్లో చేయవలసినవి :**

1. పగటి, రాత్రి పాఠశాలలు ప్రారంభించండి.
2. హరిజనుల ఇళ్లకు పోయి వాటిని శుభ్రం చేయండి.
3. హరిజనుల పిల్లలను మీతో త్రిప్పి, విద్యావంతులను చేయండి.
4. వారికి రామాయణ, భారతాలు చదివి వినిపించండి.
5. వారికి భజనలు నేర్పండి
6. పిల్లలను స్నానం చేయించి, పెద్దవాళ్లకు శుభ్రత నేర్పండి.
7. హరిజనుల పరిస్థితులు గమనించి రిపోర్టు తయారు చేయండి.

8. రోగ గ్రస్తులైన హరిజనులకు చికిత్స చేయించండి.

*(హరిజన్ 1-4-33, పుట 5)*

★ ★ ★

రాళ్లూ, సున్నమూ, వ్యక్తిత్వాన్ని నిర్మించవు. మీ చేతులతో (ప్రొఫెసర్ల పుస్తకాల ద్వారా అది లభించదు గనుక) మీ జీవితాల నుండి, మీ అంతర్యంలో నుండి మీ వ్యక్తిత్వం పెరగాలి. మీ జ్ఞానం, చదువూ, విద్వత్తూ ఒకవైపు సత్య, పవిత్రతలొకవైపు ఉంటే రెండో దానిదే బరువు. ధార్మిక కాలుష్యం మన విద్యార్థుల ముందు వ్యాపించి ఉంది అంటువ్యాధిలా విస్తరిస్తూంది. మీ విద్వత్తు మీ మత గ్రంధాలు ఆచరణలోకి రాకుంటే అంతావ్యర్థం. అన్నీ ఉపదేశించి సత్యం పవిత్రత గురించి చెప్పకపోతే పైకి పోరు, దిగజారిపోతారు. నిజ వ్యక్తిత్వం లేని చదువు దుష్టబుద్ధి ప్రేరేపకం. ప్రపంచంలో ఎంతోమంది ఘరానా దొంగలు ఉన్నారు. సెలవులను సద్వినియోగం చేయాలి. నేను అన్నీ వివరంగా చెప్పలేను కనుక బుద్ధిమంతులు తాము చేసేసేవలు చేయాలి. చదువు పూర్తిచేసి పేదలసేవచేయండి. "వట్టిమాటలు కట్టిపెట్టోయ్, గట్టి మేల్ తల పెట్టవలెనోయ్" అన్నట్టు ఆచరణ చేయండి. ద్రవ్యార్జనే ముఖ్యంకాదు. ఇది మీ తప్పుకాదు. విధానం లోప భూయిష్టం. పేదదేశమైన ఇండియా అవసరాలకిది అనుగుణ్యంకాదు. చదువుకీ ఇంట్లో జీవితానికి దేశంలో పరిస్థితులకూ, ఎక్కడా పొంతనలేదు. అవసరంకానివి వాడవద్దు. ఏదో ఊసు పోక కాలం వెళ్లదీయడం కోసం, ఇతరులను అనుసరించి మీకు బాధను కలిగించేవి చేయవద్దు. టీ, కాఫీ, సిగరెట్లు విదేశీ అనుకరణ; వీటిని పరిహరించండి. సిగరెట్లు, మీలో నరాల సత్తువను తగ్గిస్తాయి. మిమ్ములను ఆ అలవాటుకు బానిసగా చేస్తాయి. నోటిని పొగగొట్టంగా చేసుకొని కష్టాలు కొని తెచ్చుకోవద్దు. దీనివలన మీ ఆత్మ సంతులనం లోపిస్తుంది. మొండి తనంతో అన్ని మంచి నియమాలను ఉల్లంఘిస్తారు. నిషిద్ధ కార్యాలు అనాలోచితంగా చేసి తర్వాత చిక్కుల్లో పడతారు. తప్పుడు పని చేయవద్దని నీ ఆత్మ నిన్ను ప్రబోధిస్తుంది. ఆ ప్రబోధాన్ని పాటించవద్దని ఈ అలవాట్లు నిన్ను ఆపివేస్తాయి. తమ

బానిసనుగా చేసుకున్న ఈ నికృష్ట వ్యసనాలు నిన్ను జడుడిగా చేస్తాయి. కొందరి అభిప్రాయం ప్రకారం మద్యపానం కంటె, దూమపానం చెరుపు చేస్తుంది. కాని దీనిని ఆసరాగా తీసుకొని ప్రవర్తించకండి. ఒకటి గొయ్యి అయితే, ఇంకోటి నుయ్యి కనుక మన ఆత్మ ప్రబోధాలను వమ్ముచేసి మనలను దిగజార్చే అలవాట్లు వ్యసనాలు త్యజించండి. మహనీయులంతా కావాలని వినమ్రులై ఉంటారు. విద్యాభ్యాసం పూర్తయే వరకు మీరు సన్న్యాసివలె జీవించాలి. క్రమశిక్షణను పాటించి వ్యక్తిత్వాన్ని పెంచుకొని మీకూ మీ దేశానికీ వన్నెతెండి.

*(యంగ్ ఇండియా 22-9-27 పుట 342)*

★ ★ ★

ఈ దేశభవిష్యత్తుమీరు. బాధ్యతను నేర్చుకోండి. చాలమంది చదివేటప్పుడు పెద్దకబుర్లు చెప్పి తరువాత మరిచి పోతారు. విద్యా విధానం లోపభూయిష్టం. చదువుకు బ్రతుకుకూ లంకె లేదు.

*(యంగ్ ఇండియా 8-9-27, పుట 297)*

★ ★ ★

టీ, కాఫీలకు బానిసలు కావద్దు. ధూమపానులవద్దకు పోవద్దు నల్లమందు వాడవద్దు. పొదుపు చేయండి. టాల్‌స్టాయి కథలో హంతకుడు తటాపటా యిస్తూ ఉన్నవాడు ధూమపానంతో ధైర్యం చేసి హత్యకు పాల్పడ్డాడు

*(యంగ్ ఇండియా, 15-9-27, పుట 315)*

★ ★ ★

వినయశీలురై సన్న్యాసివలె జీవించండి. క్రమశిక్షణతో ఉండండి. వివాహము చేసుకోరాదు. ఇతర వ్యవహారాలు నడుపరాదు. మద్యపానం చేయవద్దు. స్వయం నియంత్రణకు మీరు గొప్ప దృష్టాంతమై చెప్పుకోదగిన వారు అనిపించుకోవాలి.

*(హరిజన్ 7-8-47, పుట 314)*

★ ★ ★

# భాగము 12

## ఈ చివరికి

### అధ్యాయము 79

### ఈ చివరికి

"అన్ టు దిస్ లాస్ట్" అనుగ్రంథం నన్ను అమితంగా ప్రభావితుణ్ణి చేసింది. నా జీవితాన్ని మార్చింది. మనకు ఇతరులు ఏమి చేయవలెనని కోరుకుంటామో చివరకు మనము దానినే చేయాలి.

*(హరిజన్ 17-11-46 పుట 404)*

★ ★ ★

భగవంతుడు అధమాధములలో ఉంటాడు. వీరిని చేరేందుకే నా ప్రయాస. వారి సేవ లేనిదే నాకు గడవదు. కనుక నేను వారిసేవ చేయాలి. రాజకీయాల్లో చేరనిదే సేవ చేయలేను గనుక వారిలో నన్ను చూసుకుంటున్నాను. నేను స్వతంత్రుడను గాను. ఇండియా సేవకుణ్ణి. పడుతూ లేస్తూ తప్పులు చేస్తూ తడపడుతూ ఉండే వినీతుణ్ణి. తద్వారా మానవతకు కూడా సేవకుడిని.

*(హరిజన్ 11-9-24, పుట 298)*

★ ★ ★

వినీతులు అధములు దారితప్పినవాళ్లు ఉండేచోట ఆయన పీఠం వేసుకొని కూర్చుంటాడు. వడకుతూ ఉండటమే గొప్ప ప్రార్థన. అదే మహత్తరమైన భగవద్భక్తి, మహోన్నత త్యాగము అని అంటాను.

*(యంగ్ ఇండియా 24-9-25 పుట. 331)*

★ ★ ★

భగవంతుని మ్రోల మనం ధూళి కణాలము. వినమ్రులమై ఆయన సృష్టిలో అధములను గుర్తిద్దాం. చింపిరి గుడ్డలలోని కుచేలుణ్ణి (సుదాముడిని) కృష్ణుడు ఎవరినీ చేయనంతగా గౌరవించాడు అభిమానించాడు.

*(యంగ్ ఇండియా 26-12-24. పుట 423)*

★ ★ ★

నామరహితుడు మానవబుద్ధికతీతుడు అయిన భగవంతునికి గల లెక్కలేనన్ని పేర్లలో 'దరిద్రనారాయణుడ'న్నది ఒకటి. అనగా పేదలదేవుడు, పేదల మనసుల్లో కనిపించే దేముడు అని అర్థం.

*(యంగ్ ఇండియా 4-4-29, పుట 110)*

★ ★ ★

డర్బనుకు రైలులో వెళుతూ రస్కిన్ మహాశయుని 'అన్‌టుదిస్ లాస్ట్' అను గ్రంధాన్ని చదివి అబ్బుర పడ్డాను. నన్నది ఆకట్టుకుంది. మానవజాతి ప్రగతి పధంలో సమానత సౌభ్రాతృత్వము అనే ఆదర్శాలను అందుకోవాలంటే ఈ గ్రంథంలోని సూత్రాలను గ్రహించి ఆఖరుక్షణం వరకూ అనుసరించి (అంతం వరకూ) అమలు పరచాలి. అని గ్రహించాను. దానితో కుంటి మూకను ఇతర వికలాంగులను సైతం కొనిపోవాలి.

*(25-8-46, పుట 281)*

★ ★ ★

సామాజిక న్యాయం హింసామార్గంలో చేకూరదు. ఆ అధములు కూడా తమకు జరిగిన అన్యాయాలనుండి సరియైన అహింసా ప్రశిక్షణ ద్వారా ముక్తిని పొందెదరు.

*(హరిజన్ 20-4-40 పుట 97)*

★ ★ ★

నేను పాటుపడుతున్నాను "స్వరాజ్" కోసం ఒక పాసిపోయిన రొట్టెముక్కగాని ఉప్పుగల్లు గానిలేక ఒక పూటైనా కడుపు నిండా తిండిలేని ఆ బడుగు జీవుల, కోట్లాది నిరుద్యోగుల కోసం ప్రయాస పడుతున్నాను.

*(యంగ్ ఇండియా 26-3-31 పుట. 53)*

★ ★ ★

రాట్నం మీద వడికి దారం తీసినప్పుడు ప్రతిసారీ దేశంలోని బీదవారు గుర్తుకువస్తారు. నేడు వీరికి దేవునిలో నమ్మకం నశించింది. ఆకలిగొన్న వానికి ఆహారమే దేవుడు. తిండినిచ్చిన వాడే యజమాని. అతని ద్వారా భగవంతుని కూడా చూడగలడు. పుష్టిగా ఉన్న వానికి ముష్టివేయడం యాచకునికి దాతకీ

ఇద్దరికీ అవమానమే. అతనికి తిండి పెట్టే ఉద్యోగం కావాలి అటువంటిది చేనేత. ఈ పని లక్షలాదికి ఉపాధిని కల్పిస్తుంది. నా పని నూలు వడకుట అది ఒక తపస్సు. బీదలంటే దాక్షిణ్యం ఉన్న చోట దేవుడుంటాడు. రాట్నం నుంచితీసే ప్రతి దారంలోనూ నాకు దేవుడు కనుపిస్తాడు.

*(యంగ్ ఇండియా 20-5-26, పుట 187)*

★ ★ ★

నేనొక యంత్రాన్ని (మంత్రపూతమైనది) ఇస్తాను అది బీదవాడిని దిక్కులేని వానిని ఊహించుకొని మీరు చేయబోయే పని అతనికి ఉపయుక్తమా? అని ప్రశ్న వేసుకోండి. అతనికి లాభము కలుగుతుందా? దానివలన అతనికి తన జీవిత ప్రారబ్ధాలపై నియంత్రణ వస్తుందా? ఆకలి గొన్న వారికి స్వ పరిపాలన స్వరాజ్ లభిస్తుందా? ఆత్మ దాహపీడితులైన కోట్లాది వ్యక్తుల సేద తీరుస్తుందా?

అప్పుడు మీకుశ్శంకలు మీ ఆత్మాభిమానము కరిగిపోతాయి.

*(బాపూ వాణి 1959, పుట 46)*

★ ★ ★

## అధ్యాయము 80

# ఆదివాసులు

హరిజనుల వలెనే ఆదివాసులు దరిద్రులు. దేశంలో మౌలిక వాసులైన వారు కూడ ఉన్నతులచేతిలో పీడితులై ఉన్నారు. నిర్మాణ కార్యక్రమాలలో వారికి ప్రత్యేకస్థానం ఉండాలి. అలా లేకపోవడం పొరపాటు..

క్రిష్టియను మిషనరీలు ఒక్కరే, ఈ రంగంలో ఉన్నారు. వారు చాల శ్రమపడ్డారు. కాని మతం మార్పిడి వారి అంతిమ ధ్యేయం కనుక వారి శ్రమకు తగిన ఫలితం దక్కలేదు. అభారతీయులనుగా ఆదివాసులను చేయాలని వారి ఆశయం. అహింసామార్గంలో స్వరాజ్ నిర్మించాలనుకొనేవారు అల్ప సంఖ్యాకులను కూడ ఉద్ధరించాలి. ఆదివాసులు అల్పసంఖ్యాకులుకానే కారు. కనుక వారిని ఉద్ధరించి తీరాలి.

*(హరిజన్ 18-1-42 పుట 5)*

★ ★ ★

నిర్మాణ కార్యక్రమంలో పదునాల్గవ అంశం ఆదివాసులు. ప్రాముఖ్యతలో వారు ఆఖరు వారు కారు. ఈ విశాల దేశంలో ఈ వివిధ జాతులలో మనలో అతిజాగ్రత్త గల ఉత్తములు కూడం వారిని గురించి పూర్తిగా తెలుసుకోలేకపోతున్నాము పొరలు పొరలుగా ఉన్న వారిని జాగ్రత్తగా గమనించే దేశ సేవకునికి కూడా అందరితో నేనున్నానని నాకు అందరిని గురించి తెలియునని చెప్పుకోగలుగుట చాలకష్టము.

*(హరిజన్ 15-2-42, పుట 38)*

★ ★ ★

## అధ్యాయము 81

# స్వంత భూమిలేని కూలీలు, హరిజనులు

రైతు స్వంతభూమిలేని కూలీ అయినా కాయకష్టంచేసే భూస్వామి అయినా భూమి అతనిదే కావాలి. - జమీందారుకి చెందదు. అహింసా మార్గంలో దూరప్రాంతీయుడైన (అక్కడనివసించని) భూస్వామిని వెళ్లగొట్టలేడు. (బలవంతంగా) భూస్వామి దోపిడీనుంచి నష్టం కలుగకుండా అతడు సర్వ ప్రయత్నాలు చెయ్యాలి.

*(మహాత్మా 6, 1953 పుట 364)*

★ ★ ★

హరిజనుడంటే దేవుని మనిషి. ప్రపంచంలోని అన్ని మతధర్మాలు దిక్కులేని వారికి దేవుడే దిక్కని నొక్కి వక్కాణిస్తున్నాయి. ఇండియాలో అస్పృశ్యులు దిక్కులేని వారు. వీరే దేవుని బిడ్డలు. (హరిజనులు)

*(హరిజన్ 11-2-33 పుట 7)*

★ ★ ★

'స్వరాజ్'లో అందరికీ స్వేచ్ఛ ఉంటుంది. మనమంతా బాధలో నున్నపుడే 'పంచముని' (అయిదవ వర్ణం వానిని) గతి మెరుగుకానినాడు, "స్వరాజ్ వచ్చిన మత్తులో మెరుగవుతుందా?

*(యంగ్ ఇండియా 12-6-24, పుట 195)*

★ ★ ★

ఏ ఒక్క బలహీనుడు, దిక్కులేనివాడు రక్షణ పొందకపోయినా ఏ ఒక్కస్వరాజిస్టు ఏ వ్యక్తికి బాధ కలిగించినా స్వరాజ్ మాట ఎత్తడం వ్యర్థం స్వరాజ్ లో బలవంతుడెవ్వడూ బలహీనునెవ్వనినీ హిందువునైనా ముస్లిమునైనా అణగద్రొక్కగలనని దర్పంతో అనజాలడు. ఇది సరికాకపోతే స్వరాజ్ వచ్చినట్టేవచ్చి చేజారిపోతుంది. బలహీనులైన సోదరుల పట్ల చేసిన అత్యాచారాలకు పరిహారం చెల్లించి క్షమార్హులు కానిదే మనకీ పశువులకూ వ్యత్యాసం లేదు.

హిందువులు అస్పృశ్యతను పాటిస్తూ తమ సోదరులను తాకడం తప్పనీ పాపమనీ అనుకున్నంతకాలం 'స్వరాజ్' లభించదు.

*(యంగ్ ఇండియా 4-5-21 పుట 143)*

★ ★ ★

అస్పృశ్యత ధార్మికం కాదు. రాక్షసం. తర్క, సత్యాలను మత గ్రంథాలు అధిగమించలేవు. మత గ్రంధాలు తర్కాన్ని శుద్ధిచేసి సత్యానికి వెలుగునిస్తాయి.

*(యంగ్ ఇండియా 19-1-21 పుట 22)*

★ ★ ★

తాను చేసిన కర్మఫలితమే తన ఉనికి అని అంటారు. కాని నా కర్మ పాపిని రాళ్లతో కొట్టమనదు. మత ధర్మాలు మనిషిని ఉద్ధరించాలి గాని కర్మ భారం క్రింద అణగద్రొక్కరాదు.

*(యంగ్ ఇండియా 22-9-21, పుట 302)*

★ ★ ★

గోసేవచేయమనిన ధర్మశాస్త్రం, మానవులను వెలివేయమని చెప్పదు. నన్ను ఖండించినా నేనట్టి పనిని చేయను. అస్పృశ్యత అనే మచ్చను ఉంచినంత కాలం తమ గొప్పమతం ఈ పని వలన చెడ్డపేరు తెచ్చుకున్నంత కాలం హిందువులు స్వాతంత్ర్యానికి అర్హులు కారు. నాకు హిందూత్వమంటే ఎంతో యిష్టం. కనుక ఈ మచ్చను మరీ భరించలేకపోతున్నాను. జనాభాలో

అయిదవవంతు జనాన్ని సమాన హోదాలో ఉంచేందుకు అంగీకరించక మనము దేవుని అస్తిత్వాన్ని కూడా అంగీకరించడం లేదు.

*(యంగ్ ఇండియా 6-10-21, పుట 319)*

★ ★ ★

మానవుల మధ్య సమానత్వాన్ని పునరుద్ధరిస్తే మానవునికీ సృష్టికీ గల సమానత్వాన్ని స్థాపించ గలుగుతాం. ఆ రోజున భూమిపై శాంతి, మనుషులకు సద్భావన కలుగుతుంది.

*(హరిజన్ 28-3-36, పుట 51)*

★ ★ ★

భంగీలు (పాకీపనివారు) ఏమీ అనకుండా ఇన్నాళ్ళూ వారి పని వారు చేస్తూ వచ్చారు. కనుక ఉన్నత జాతులవారు, ఇన్ని శతాబ్దాల కాలం వారెలా సమాజానికి సేవ చేశారో గమనించలేకపోయారు. వారిని 'అస్పృశ్యులుగా' భావించకపోతే ఇట్లు వారిని గురించి కళ్లు మూసుకొని ప్రవర్తించి ఉందుమా? ప్రతిరోజూ ఆ నరకంలో వారుంటే మనము రోజూ ఆ పనిలో పాల్గొనినప్పటికీ ఆ మలాన్ని గాని ఆ దుర్వాసనను గాని పట్టించుకోలేదు.

*(హరిజన్ 18-3-33, పుట 4)*

★ ★ ★

ఆదర్శవంతుడైన భంగీ' బ్రాహ్మణుని మించి ఉంటాడు. బ్రాహ్మణుడు ఉన్నా లేకపోయినా భంగి ఉండితీరతాడు. తల్లివలె సాకి, సమాజాన్ని బ్రతికిస్తున్నాడు భంగీ. శిశు మలాన్ని తుడిచి శుచి, ఆరోగ్యం తల్లి పరిరక్షిస్తుంది. భంగీ కూడ సమాజాన్ని పరిసరాలను శుభ్రంగా ఉంచుతున్నాడు. బ్రాహ్మణుడు విధి నిర్వహణలో సరిగా ఉండడు. భంగీ తనవిధిని పూర్తిగా నిండుగా నిర్వహిస్తాడు. సమాజానికి కావలసిన సేవలకు మూలధారం భంగీ చేస్తున సేవయే.

అయినా మన ఇండియాను సమాజం భంగీని వెలివేసింది. అట్టడుగున ఉంచి తన్నులనూ, తిట్లనూ బహుమతిగా ఇచ్చింది. ఉన్నత వర్ణాల జనుల మలరాశుల మధ్య నివసించమన్నది. ఇది సహించరాని విషయం. వానికెవరూ

సొంత భూమిలేని కూలీలు. హరిజను

మిత్రులు లేరు. వాని పేరు ఒకతిట్టుగా మారింది. ఎందుకు ఎప్పుడు ఎలా ఇది జరిగిందను మీమాంస అనవసరం. భంగిని నీచంగా భావించి మనం (హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు) ప్రపంచమంతటిధిక్కారాన్ని కొని తెచ్చుకున్నాము. గ్రామాలు పరిశుభ్రతలేక మరణాసన్నమై ఉన్నాయి. బ్రాహ్మణుని కిచ్చిన హోదాను భంగికి యిచ్చి ఉంటే (అది న్యాయసమ్మతంకూడా) మన గ్రామాలు శుచి శుభ్రతలతో పులు గడిగిన ముత్యాలవలె మెరిసి పోతూ మిలమిలలాడేవి. అపరిశుభ్రతవల్ల వచ్చిన వ్యాధులకు లోనై ఉండకపోయేవాళ్ళం.

బ్రాహ్మణునకు భంగికిగల వ్యత్యాసం తొలగనంతవరకూ మనసమాజం ఆరోగ్యం ప్రగతి, శాంతి, సౌఖ్యం అన్నింటిని కోల్పోయి ఉంటుంది. నేనీ మాటను నిస్సందేహంగా చెప్పగలను.

*(హరిజన్ 28-11-36 పుట 336)*

* * *